## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120004205,2020120034652,2020050092750,2990100051663/4



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# జాతక కథలు

పాలి భాషనుండి ఆంధ్రీకరించినది

స్వామి శివ శంకర శాస్త్రి

ప్రథమ సంపుటి

సాహితీ సమితి . రేపల్లె

# ప్రస్తావన

జాతక మనగా జన్మమునకు సంబంధించిన దని అర్థము. ఈ గ్రంథము గౌతమ బుద్ధుని జన్మలనుగూర్చి చెప్పిన దగుటచే దీనికి జాతకము, జాతక కథలు అని పేరు పెట్టిరి. పుష్పము సంపూర్ణముగా వికసింపవలె నన్నను, జాతి చిరస్థాయి కావలె నన్నను పరిణామమునకు బహుకాలము పట్టును. మానవుడు సంబుద్ధుడు కావలెనన్నచో, ఒక్కజన్మము చాలక బహుజన్మములు కావలసి వచ్చును. (గౌతమ సిద్ధార్థుడు బుద్ధ డగుటకు అనేకజన్మ లెత్తవలసివచ్చెను. 547 జన్మములకు ఆయన బుద్ధు డయ్యెను. సంబుద్ధి కలుగుటకుపూర్వ మాయనకు తథాగతు డనియు బోధిసత్త్వు డనియు సంజ్ఞలు. బోధిశబ్దమునకు బుద్ధత్వ మనియు, సత్త్వశబ్దమునకు సంబుద్ధికై ప్రయత్నించువా డనియు తాత్పర్యము.)

బౌద్ధులు ఆత్మ నంగీకరింపరు. అట్టియెడ జన్మాంతరవాద మెట్లు పొసగును? ఆత్మ లే నపుడు పునర్జన్మ మెట్లు సంభవించును? అబౌద్ధదర్శనము లన్నియు ఆత్మ వాదమును ప్రాయికముగా నంగీకరించినవి. జన్మాంతరవాదము సమ్మత మయినపుడే జన్మపరంపరను గూర్చి చెప్పనొప్పును. భగవద్గీతలలోని జన్మాంతరవాదమునకు ఆత్మవాదము పునాది.

ఆత్మ శాశ్వత మని బౌద్ధధర్మ మంగీకరింపదు. క్రీ. శ. నాలు గైదు శతాబ్దులలో ఆచార్య వసుబంధువు రచించిన అభిధమ్మకోశమున ఈకారిక కలదు:

> నా త్మా స్తి; స్కంధమాత్రం తు
> కర్మ క్లేశాభి సంస్కృతమ్
> అ న్తరా భవ సంతత్యా
> కుక్షి మేతి ప్రదీపవత్ ......3...౧౮

ఆత్మ అనెడి పేరు కల నిత్య, ధ్రువ, విపరిణామి పదార్థ మేదియు లేదు. కర్మము వలనను అవిద్యాది క్లేశమువలనను అభిసంస్కృత మైన పంచస్కంధము మాత్రము కలదు. పూర్వజన్మసంతతి క్రమముగా ఒకప్రదీపమునలన వేరొకప్రదీపము వెలిగినట్లు గర్భమున ప్రవేశించును.

బుద్ధుని యుపదేశానుసారముగా రూప, వేదన, సంజ్ఞ, సంస్కార, విజ్ఞానము లను పంచస్కంధముల సంస్కారమే వ్యక్తికి సంసారము కల్పించును. ఈపంచ స్కంధవాహిని సత్కర్మ దుష్కర్మములుగా సాగుచు, వ్యక్తికి తృష్ణ సంపూర్ణముగా క్షయించినపుడు తానుగూడ ఆగిపోవును.

ఇంచుమించుగా అన్ని భారతీయధర్మములు పునర్జన్మము నంగీకరించినవి. అనాత్మ వాదముతోపాటు పునర్జన్మము నంగీకరించుటయే బుద్ధుని యుపదేశ విశిష్టత. జనన మరణములనుండి విముక్తి పొందుటయే నేటిభారతీయ దార్శనికుల లక్ష్యము.

పాలిభాషలోని త్రిపిటకములలో జాతకకథ లంతర్గత మయినవి. సుత్త పిటకము అయిదు నికాయములుగా విభక్త మయినది:

(1) దీఘ నికాయము; (2) మజ్ఝిమ నికాయము; (3) సంయుక్త నికాయము (4) అంగుత్తర నికాయము; (5) ఖుద్దక నికాయము.

ఖుద్దక నికాయములో 5 గ్రంథము లున్నవి : (1) ఖుద్దక పాఠము; (2) ధమ్మపదము; (3) ఉదానము; (4) ఇతివుత్తకము; (5) సుత్త నిపాతము; (6) విమాన వత్థు; (7) పేత వత్థు; (8) థేరగాథ; (9) థేరీగాథ; (10) జాతకము; (11) నిద్దేశము; (12) పటిసంభిదా మగ్గము; (13) అవదానము; (14) బుద్ధవంసము; (15) చరియా పిటకము.

వినయ పిటక విభాగము : మహావర్గ; క్షుద్ర వర్గ; పారాజికా; పాచిత్తియాది; పరివార పాఠ.

అభిధమ్మ పిటకములో ఏడుగ్రంథము లున్నవి : ధమ్మ సంగణి; విభంగ; ధాతు కథా; పుగ్గల పఞ్ఞత్తి; కథా వత్థు; యమక పట్ఠాన.

బుద్ధఘోషుని సమయమువరకును ఈగ్రంథము లన్నిటిని, వీనిలోని భాగములను పాలి శబ్దముతో వ్యవహరించుచుండిరి. ఆయన ఉద్ధరించినభాగములను, "అయమేత్థ, పాలి" (ఇచ్చట ఇది పాలి); పాలియం వుత్తం (పాలియందు చెప్పబడినది) అని ప్రయోగించినాఁడు. పాణిని మహర్షి ఛందసి అని వేదములను, భాషాయాం అని తత్కాలప్రచలితభాషను నిరూపించినాఁడు. అట్లే బుద్ధఘోషుడు పాలియం అని త్రిపిటక మూలవచనములను అట్ఠకథాయం అని తనకాలమున సింహళములో లభించు అట్ఠకథలను జ్ఞాపకము చేసినాడు.

అట్ఠకథ అనగా అర్థముతో గూడినకథ. త్రిపిటకములను గ్రహించుటకు భాష్యము లావశ్యకములు. మహేంద్ర స్థవిరుడు క్రీస్తుకు పూర్వము నాల్గవ శతాబ్దిలో బుద్ధశాసనమును స్థాపించుటకై సింహళమునకు పోయినపుడు త్రిపిటకములతోపాటు వానిఅట్ఠకథలనుగూడ కొనిపోయె నని తెలియుచున్నది.

అర్థకథలు సింహళమున గ్రంథస్థము గావింపబడియుండవచ్చును. కాని వానికి విశేషప్రాచీనతను ఆపాదించుటకై మహేంద్రుడు వానిని వీనితో జోడించియుండును. తొలుత త్రిపిటకముల సూత్రములను బోధించుటకును వానిఅర్థములను బాగుగా స్పష్టపరచుటకును వానితో పాటు కథలు చెప్పుటకూడ పరిపాటి అయియుండును. క్రమముగా పలుకులు లిపిబద్ధములు కానోపును.

సింహళకథలను అనంతరము ఆచార్య బుద్ధఘోషుడు పాలిభాషలోనికి అనువాదము చేసెను. సింహళములో ఉన్నంతవరకు ఆకథలు వారికే ఉపయోగించెను. పాలిలోనికి మారినపిమ్మట సర్వదేశవాసులకుగూడ ఉపయుక్తము లయ్యెను. పాలి భాషాంతరము మహాసుందరముగా నుండుటచే దానికి త్రిపిటకములతో సమాదరము లభించెను.

మొదట పాలి అనునది ఏభాషకును పేరుకాదు. ఆ భాషానామము మాగధి. పాలి అనునది మూలవచనములకు పర్యాయవాచకము.

# ప్రస్తావన

పాలి భాషలోని గ్రంథవర్గీకరణము పరిశీలింపబడినది. త్రిపిటకవర్గీకరణము రాజగృహమున జరిగిన ప్రథమసంగతి ననుసరించినది. అట్టకథాచార్యులు ఇట్లు చెప్పినారు: "బుద్ధభగవానుడు పరినిర్వాణము చెందిన పిమ్మట సుభద్ర భిక్షువు తక్కిన భిక్షువుల తోడాడుచు "ఆయుష్మంతులారా, విచారింప రాదు. మనము ముక్తుల మయినాము. ఆమహాశ్రమణుడు ఇది చేయుడు, అది చేయవద్దు అని పీడించెడివాడు. ఇప్పుడు ఇష్టము వచ్చినది చేయవచ్చును, ఇష్టములేనిది చేయవక్కరలేదు" అన్నాడు. అప్పుడు మహాకస్సప స్థవిరుడు సద్ధర్మము అంతర్ధాన మగు నని భయపడినాడు. దానిని రక్షించుటకు 500 మంది అర్హత భిక్షువులను పిలిపించినాడు. ఆసమ్మేళనములో మహాస్థవిర ఉపాలి ప్రశ్నించి, వినయమును సిద్ధము చేయించినాడు. అవల ఆనందమహాస్థవిరునిచే సుత్త అభిధమ్మ పిటకములు ప్రశ్నింపబడెను. ఒకమతప్రకారము జాతకము, మహానిద్దేశము, క్షుద్రనిద్దేశము, పటసంభిదామగ్గము, సుత్తనిపాతము, ధమ్మపదము, ఉదానము, ఇతివుత్తకము, విమానవత్థు, పేతవత్థు, థేరగాథ, థేరీగాథా, అభిధమ్మపిటకమున అంతర్గతములై సుగృహీతము లైనవి. రెండవమతప్రకారము ఈగ్రంథములును, చరియాపిటకము, అవదానము, బుద్ధవంశము కలిసి ఖుద్దకనికాయము అనుపేర సుత్తపిటకములో అంతర్గతము లైనవి.

కాని ప్రథమసమ్మేళనములో క్షుద్రవర్గము చేసినవర్ణనములో త్రిపిటకముసంగతి లేదు, పిటకసంగతి కూడలేదు. ఆ కాలమున ధర్మవినయములు కలిసిపోయి ఉండెను. ధర్మ వినయములలో అంతర్గతమైన టీకావాఙ్మయము ఎంత ఉండెడిదో తెలియదు. అయినను క్షుద్రవర్గమున ద్వితీయ సమ్మేళనములో ఉన్న త్రిపురవర్ణనముబట్టి ప్రథమసమ్మేళనములో క్షుద్రవర్గము క్రోడీకరింపబడలే దని తెలియుచున్నది. అశోకుని కాలమువరకును బుద్ధవచనములు రెండువిభాగములుగా ఉన్న వని తెలియుచున్నది. ధర్మము, వినయము. అంతవరకును త్రిపిటకములను వ్రాయుచునేయున్నారు. అభిధమ్మపిటకములోని కథావత్థు అనుగ్రంథము రచించిన మొగ్గలిపుత్త స్థవిరుడు అశోకునికి గురు వని తెలియుచున్నది.

త్రిపిటక మంతటిలో నవాంగములతో గూడిన బుద్ధవచనములు ఎంతవరకు ఆయనచెప్పినవో, అనంతరము అన్యులు పూర్తిచేసినవో చెప్పుట కష్టము. అశోకుని భాబ్రశిలాశాసనమున 7 బుద్ధోపదేశముల నామము కలదు. బుద్ధుని నవాంగముల ప్రాచీనవర్గీకరణమున, జాతకములను చేర్చుటచే అవి ప్రాచీనము లనియు, మహత్త్వపూర్ణము లనియు స్పష్ట మగుచున్నది.

సాంచి భరహుత స్తూపములమీద జాతకకథలు చెక్కబడియున్నవి. ఇందువలన వాని ప్రశస్తి హెచ్చు ననవచ్చును.

జాతకముల అట్టకథలలో మూడుభాగము లుండును. దూరే నిదాన, అవిదూరే నిదాన, సంతికే నిదానము అని.

బోధిసత్త్వుడు సుమేధ తపస్విగా జన్మించి భగవాన్ దీపంకరుని చరణములకడ

జీవితమును అర్పించినప్పటినుండియు వేస్సంతరుడు శరీరము విడిచి తుషితస్వర్గములో జన్మించువరకు కలకథ దూరే నిదానకథ. బోధిసత్వుడు తుషితస్వర్గమునుండి వచ్చ్యుతుడై మాయాదేవిగర్భమున జన్మించి బుద్ధగయలో బుద్ధత్వము పొందువరకును అవిదూర నిదానము. బుద్ధభగవానుడు ఎచ్చ టెచ్చటనో విహారము చేయుచున్నప్పుడు జాతకముచెప్పి ఆస్థానమును ఉల్లేఖించినపుడు సంతిక నిదానము. అం దున్న జాతక కథలు దూరేనిదానమున అంతర్గతములు.

జాతక కథ నాల్గుభాగములుగా విభజింపబడి యుండును. ప్రత్యుత్పన్న వస్తువు, అతీతవస్తు, అర్థవర్ణన, సమోధానము అని. ప్రత్యుత్పన్నవస్తు విధానము బుద్ధభగవానుడుండగా జరిగిన ఏదోసంఘటన; అతీతవస్తువిధానము ఏదోఅవసరము వచ్చినప్పుడు భగవానుడు చెప్పిన పూర్వకథావిధానము. అర్థవర్ణనము ఈగాథల వాక్య, శబ్దార్థములు, విశేషార్థముల వివరణము, వ్యాకరణము. సమోధానము, ఆయన పూర్వజన్మములో ఎవరో, ప్రధానపాత్ర లెవరో, ఎచ్చ టెచ్చట పుట్టిరో వానిసమ్మేళనము. కొందరు జాతక కథ అయిదు విభాగము లన్నారు.

సంస్కృత బౌద్ధ సాహిత్యమున జాతకమాల అను గ్రంథమును ఆర్యశూరుడు రచించినాడు. చరిత్రకారు డగు తారానాథుడు, అశ్వఘోష, ఆర్యశూరు లొకరే అన్నాడు; కాని యిది సమ్మతము కాదు.

సింహళ, శ్యామ, బ్రహ్మ, హిందు, చీన, ఆదిదేశములలోని థేరవాద బౌద్ధుల లెక్కప్రకారము జాతకములు 550. ఈసంఖ్యను జ్ఞప్తిలో నుంచుకొనుటకు వీ లగు నని అట్లు అని ఉండవచ్చును. కాని నికరముగా 547 జాతకములే కలవు. ఈకథలు 22 నిపాతములు, అనగా పరిచ్ఛేదములుగా విభక్తము లయినవి. ప్రథమనిపాతములో 150 కథలు కలవు. ఒక్కొక్కకథలో ఒక్కగాథ గాని శ్లోకము గాని ఉండును. రెండవ నిపాతములో ఉన్న 150 కథలలో ఒక్కొక్క దానిలో రెండుగాథ లుండును. 3, 4 నిపాతములలో ఏబదేసికథ లున్నవి. వానిలో ఒక్కొక్కదానిలో క్రమముగా 3, 4 గాథ లుండును. 5 నుండి 13వ నిపాతమువరకు ఈక్రమము మొత్తముమీద కానవచ్చును. ఈతొమ్మిది నిపాతములలో జాతకకథల మొత్తము 133. ఒక్కొక్క నిపాతములో ఎక్కువకథ లుండును. 14వ నిపాతమునకు ప్రకీర్ణకనిపాత మని పేరు. ఇందులో పద్యసంఖ్య అనియతము. నిపాతమునుబట్టి ఒక్కొకకథలో 14 గాథ లుండవలెను; కాని ఇంచుమించు పదిగాథ లుండును. ఒకదానిలో 47 కలవు. దీని తరువాత వానిలో గాథలసంఖ్య ఎక్కువ. చివరి రెండునిపాతములలో 90 కాక 100 కన్న ఎక్కువ. 22వ నిపాతమునకు మహానిపాత మని పేరు. దానిలో 10 కథలు కలవు. కాని ఒక్కొక్కజాతకములో వందలకొలది గాథ లున్నవి. చివరి వేస్సంతర జాతకములో 500 పైగా గాథ లున్నవి.

కాబట్టి జాతకములు 547. జాతక అట్ఠకథావర్ణనములో మహాగోవింద జాతకము ఉల్లేఖించినారు. కాని అది వీనిలో కానరాదు. సూత్రత్రిపిటకములో మహా

గోవిందుని జన్మకథ కలదు. అది ఈసంగ్రహమునకు సంబంధించినది కాదు. దీన్నిబట్టి ఒకప్పుడు జాతకసంఖ్య 547 కన్న ఎక్కువ ఉండవచ్చును. వీనిలో కొన్ని జాతకములను వేరుగా ఎంచవచ్చును. కాని అవి ఏదో పెద్దజాతకములో అంతర్గతము లయినవి. పంచపండితజాతకము, దసరక్కస జాతకము, మహాఉమ్మగ్గ జాతకములో కలిసి ఉన్నవి. ఒక్కొక్క జాతకము భిన్నభిన్ననామములతో కానవచ్చును. ప్రథమనిపాతములో మణికజాతకము ద్వితీయనిపాతములో సాలూకజాతకము ఉదాహరణములు. రెండుకథలు ఒక్కొక్కప్పుడు ఒక్క పేరుతోనే ఉండును. ప్రథమ ద్వితీయనిపాతములలో మత్స్యజాతకము కలదు. కాని కథలు భిన్నములు. ఒకనిపాతములోనే జాతకములకు పునరుక్తి కలదు. అక్కడక్కడ కథ ఒకటే అయినను నామము మాత్రము భిన్నము. జాతకకథలను లెక్కింపగా అంతర్గతకథలు రమారమి వేయి ఉండును.

జాతకసందోహము ప్రపంచసాహిత్యములో ప్రాచీనతయును, మహాకృతియు కలది.

కథలలో విషయక్రమములేదు. జాతకమునకు పేరుపెట్టుట గాథలోని తొలిమాటనుబట్టి ఏర్పడినది.

బోధిసత్త్వుడు సామాన్యముగా తపస్వి, రాజు, వృక్షదేవత, బ్రాహ్మణుడు మొదలగునవి అగుచుండును. అప్పుడప్పుడు సింహము, ఏనుగు, అశ్వము, నక్క, కుక్క, అగును. 3 సార్లు చండాలజన్మ మెత్తెను. ఒక్కసారి కాపు అయినాఁడు.

ఈ సంగ్రహకర్త లేక రచయిత ఎవరు? మహావంశగ్రంథమునందు ఇట్లున్నది; "ఆచార్య బుద్ధఘోషుడు అభిధమ్మ పిటకములోని ప్రథమగ్రంథమగు ధమ్మసంగణికి వ్యాఖ్యఅర్థశాలినీ టీక రచించినతర్వాత సింహళమునకు పోయెను. సింహళభాషలో సురక్షితముగానున్న అట్ఠకాలను పాలిభాషలోనికి అనువదించవలె నని ఆయన ప్రధానాశయము. మహేంద్రుని వెంట ఈ కథలు సింహళమునకు పోయెనని ప్రతీతి. అనురాధపురములో మహావిహారములో మహాస్థవిరసంఘపాలునికడ బుద్ధఘోషుడు ఈకథలు పఠించెను. విసుద్ధి మగ్గ మను గ్రంథము రచించినపిమ్మట అట్ఠకథలను పాలిలోనికి అనువదించుటకు సింహళభిక్షుసంఘము ఆజ్ఞ నొసంగెను. ఇప్పుడు లభించు అట్ఠకథలు ఆచార్యబుద్ధఘోషుడు రచించినవే అనుటకువీలులేదు. ఖుద్దకనికాయములోనికొన్నిగ్రంథములను, థేరగాథ, థేరీగాథా, ఉదాన, విమాన, పేతవత్థు, ఇతివుత్తక, చరియాపిటకములకు, మహాస్థవిరధర్మపాలుడు అట్ఠకథలు రచించినాడు. వాని కాలనిర్ణయము కాలేదు. కాని అవి బుద్ధఘోషుని తరువాత రచించినవే. వినయపిటకమునకును సుత్తపిటకములోని నాలుగు నికాయములకును, అర్థకథలను వ్రాయుటచే ఆచార్య బుద్ధఘోషుడు సమస్తఅర్థకథలు రచించినట్లు పరిగణన ఏర్పడినది.

క్రీ. శ. ప్రథమశతాబ్దిలో సింహళము నేలిన వట్టగామణి ప్రభుసమయమున అట్ఠకథలతో పాటు త్రిపిటకము లన్నియు లిపిబద్ధములయ్యెను. త్రిపిటక స్వరూపము అప్పుడే స్థిరీకృత మయ్యెను. కాని అర్థకథలు క్రీ.శ. 5 వ శతాబ్ద్యాంతమున తుదిరూప

ముడు పొందెను. కాని ద్వితీయశతాబ్దిలో చాలకథలు భరహుత స్తూపముల రాతిపై లతోగూడ చెక్కబడినవి. స్పష్టముగా నిర్ధారణ చేయలేకున్నను ఈకథలు క్రీస్తు పూర్వము 5వ శతాబ్దినుండి, క్రీ.శ. ప్రథమ ద్వితీయ శతాబ్దుల వరకును రచితములు కావచ్చును. ఈజాతక సంగ్రహము కనీసము రెండువేలసంవత్సరముల నాటిది.

ఇయ్యది శుద్ధ భారతీయ సాహిత్య మగుటచే అబౌద్ధ సాహిత్యములమీదకూడ దీనిప్రభావము పడుట సహజము. ప్రాచీనకాలమున కథాసాహిత్యము బౌద్ధ - అబౌద్ధ విభాగము లేకుండెను. ఒక కథే ఆయారచయితల మతములనుబట్టి మారుచుండెను!

జాతకకథలు వివిధదేశవాఙ్మయములలో కథలకు అధారభూతమని వేత్తలునిర్ణయించినారు. ప్రాచీనకాలములోనే ఈకథలు ఆసియా ఐరోపాఖండములలోనికి వ్యాపించినవి. గ్రీసుదేశసాహిత్యములో 'ఈసప్' కథానికరచనలో పేరుగాన్నాడు. ఆయన కథలప్రభావము ఐరోపాదేశములమీద వ్యాపించినది. ఆయన ప్రతికథకును ఆధారము జాతకకథ కావచ్చునని 'రిస్ డేవిడ్స్' మహాశయుడువ్రాసినాడు. HERODOTUSకు కూడ ఆధారము జాతకకథలే. బైబిల్ లోను, సంత జాన్ సువార్తలోను చాలకథలు, ఉపమానములు నయితము విశేషించి జాతకకథలలోనుకలవని విద్వాంసులు సరిపోల్చి చెప్పినారు. క్రైస్తవధర్మముమీద బౌద్ధధర్మ ప్రభావము విశేషముగా కనబడును. బర్లామ్ & జోసఫత్ కథలోని 'జోసఫత్' శబ్దము భోధిసత్వ శబ్దమునుండి వెలువడినది. జోసఫత్ శబ్దము అరబీభాషలోని 'ముద స్తఫ్' శబ్దమునకు రూపాంతరము. అది సంస్కృతమునుండి బోధిసత్వశబ్దమునకు అనువాదము. ఇయ్యది ఇతిహాసిక రూపమైన సత్యము. వీనిప్రభావము అలీఫ్ లైలామీదకూడ పడినది. సముగ్గ జాతక (436) సంబాధము నూటిగాఉన్నట్లు అందులోని ఒక కథవలనస్పష్టమగుచున్నదని హేమచంద్రరాయి లిఖించినాడు. వింటర్ నిజ్ మొదలైనవిద్వాంసులు అనేకకథలను సరిపోల్చిచూపినారు. ఎనిమిదవ శతాబ్దిలో అరబ్బులు ఐరోపా ఆక్రమించి స్పెయిన్, ఇటలి మొదలైనదేశములమీద తమ ప్రభావముచూపినారు. వారివెంట జాతకకథలుగూడ ఆయాదేశములలో ప్రవేశించినవి. ఫ్రాన్సుదేశమధ్యకాల సాహిత్యములో పశుపక్ష్యాదుల కథలు విశేషముగాగలవు. జాతకకథలప్రభావము వానిపై నున్నదని ఫ్రెంచివిద్వాంసులు అంగీకరించినారు.

Chaucer తన కథలలో ఒకదానియందు Pardoner నోట జాతకకథ పలికించినాడు. పదునాల్గవ శతాబ్దిలోని ఇటాలియన్ కవిశేఖరుడు 'దాంతే' రచించిన జగత్ప్రసిద్ధ మహాకావ్యమునకు Divine Comedy కి జాతకకథ ఆధారము అని భిక్షుశీలభద్రుడు ఉదాహరణపూర్వకముగా నిరూపించినాడు. 'నిమి' జాతకము(551) చూడదగినది. Shakespeare, Merchant of Venice లోనూ, As You Like It లోను బౌద్ధకథావిషయములు పలికించినాడు.

పాలి సంస్కృతమునకు ప్రాకృతమునకును మధ్యరూప మని చాలమంది వైయాకరణుల యభిప్రాయము. పాలివర్ణమాలలో ఋ, ౠ, ఌ, ఐ, ఔ, శ, ష, లు

లేవు. విసర్గ లేదు. ళకారము కలదు. తక్కినదంతయు సంస్కృత వర్ణమాలతో సరి పోలును. ద్వివచనముకూడ లేదని గమనింపవలెను. పాలికిని సంస్కృతమునకును గల భేదసాదృశ్యములను ఈజాతకకథలో చూడవచ్చును.

## వానరిన్ద జాతకము

అతీతే బారాణసియం బ్రహ్మదత్తే రజ్జం కారేన్తే బోధిసత్తో కపియోనియం నిబ్బత్తిత్వా బుద్ధిం అన్వాయ అస్సపోతప్పమాణో థామసమ్పన్నో ఏకచరో హుత్వా నదీతీరే విహరతి. తస్సాపన నదియా వేమజ్ఝే ఏకో దీపకో నానప్పకారేహి అమ్బ పనసాదీహి ఫలరుక్ఖేహి సమ్పన్నో. బోధిసత్తో నాగబలో థామసమ్పన్నో నదియా ఓరిమ తీరతో ఉప్పతిత్వా దీపకస్స ఓరతో నదీమజ్ఝే ఏకో పిట్ఠిపాసాణో అత్థి. తస్మిం నిపతతి, తతో ఉప్పతిత్వా తస్మిం దీపకే పతతి. తత్థ నానప్పకారాని ఫలాని ఖాదిత్వా సాయం తేనేవ ఉపాయేన పచ్చాగన్త్వా అత్తనో వసనట్ఠానే వసిత్వా పున దివసేపి తథేవ కరోతి. ఇమినా నియామేన తత్థవాసం కప్పేసి, తస్మిం పనకాలే ఏకో కుమ్భీలో సపజాపతికో తస్సా నదియా వసతి. తస్స సా భరియా బోధిసత్తం అపరాపరం గచ్ఛన్తం దిస్వా బోధిసత్తస్స హదయమంసే దోహళం ఉప్పాదేత్వా కుమ్భీలం ఆహ - "మయ్హంఖో అయ్య, ఇమస్స వానరిన్దస్స హదయమంసే దోహళో ఉప్పన్నో"తి. కుమ్భీలో "సాధు హోతి, లచ్ఛసీ"తి వత్వా, "అజ్జ తం సాయం దీపకతో ఆగచ్ఛన్తమేవ గణ్హిస్సామీ"తి గన్త్వా పిట్ఠిపాసాణే నిపజ్జి. బోధిసత్తో దివసం చరిత్వా సాయణ్హ సమయే దీపకే ఠితోవ పాసాణం ఓలోకేత్వా "అయం పాసాణో ఇదాని ఉచ్చతరో ఖాయతి, కిన్ను కారణం"తి చిన్తేసి. తస్సకిర ఉదక ప్పమాణంచ పాసాణ ప్పమాణంచ సువవత్థాపితమేవ. తేనస్స ఏతదహోసి—"అజ్జ ఇమిస్సా నదియా ఉదకం నేవ హాయతి న వడ్ఢతి, అథచ పనాయం పాసాణో మహా హుత్వా పఞ్ఞాయతి, కచ్చిను పద్ధమయ్హంగణ్హనత్థాయ కుంభీలో నిపన్నో"తి"

సో వీమంసామి తావ నంతి — తత్థేవ ఠత్వా పాసాణేన సద్ధిం తథేన్తో వియ భో పాసాణ తి వత్వా పటివచనం అలభన్తో యావ తతియం పాసాణాతి ఆహ. పాసాణోకిం పటివచనం న దస్సతీతిపన పి నం వానరో కింభో పాసాణ, అజ్జ మయ్హం పటివచనం న దేసీతి ఆహ. కుంభీలో అద్ధా అఞ్ఞేసు దివసేసు అయం పాసాణో వానరిందస్స పటివచనం అదాసి, దస్సామి దానిస్స పటివచనం తి చింతేత్వా కింభో వానరిందా తి ఆహ. కోసిత్వంతి. అహం కుంభీలోతి. కిమత్థం ఏత్థ నిపన్నోసీతి. తవ హదయమంసం పత్థయమానోతి. బోధిసత్తో చిన్తేసి. అఞ్ఞోమే గమన మగ్గో నత్థి, అజ్జ మయాఏస కుంభీలో వంచేతబ్బోతి. అథ నం ఏవ మాహ —సమ్మకుంభీల, అహం అత్తానం తుయ్హం పరిచ్చజిస్సామి, త్వం ముఖం వివరిత్వా మం తవ. సన్తికం ఆగతకాలే గణ్హాహీతి. కుంభీలానం హి ముఖ వివటే అక్ఖీని నిమీలన్తి. సో తం కారణం అసల్లక్ఖేత్వా ముఖం వివరి. అథాస్స అక్ఖీని పిథీయింసు.

సో ముఖం వివరిత్వా అక్షీని నిమీలేత్వా నిపజ్జి. బోధిసత్తో తథా భావం జ్ఞత్వా దీపకా ఉప్పతితో గంత్వా కుంభీలస్స మత్థక అక్కమిత్వా తతో ఉప్పతితో విద్యు-జ్జులతా వియ విజ్జోత మానో పరతీరే అఠాసి. కుంభీలో తం అచ్ఛర్యం దిస్వా ఇమినా వానరిందేన అతి అచ్ఛేరకం కతం తి చిన్తేత్వా భో వానరిందా ఇమస్మిం లోకే చతూహి ధమ్మేహి సమన్నాగతో ఉగ్గలో పచ్చామిత్తో అభిభవతి, తేసబ్బేపి తుయ్హం అబ్భంతరే అత్థి. మఇజే తి వత్వా ఇమం గాథ మాహ;

యస్సేతే చతురోధమ్మా వానరింద యథాతవ సచ్చం ధమ్మో ధీతీ. చాగో దిట్ఠం సో అతి వట్టతీ తి. ఏవం కుంభీలో బోధిసత్తం పసంసిత్వా అత్తనో వసనతాణం గతో:

జాతకకథల భాషలో కొన్ని తెలుగుపదములవంటివి, అందందుకానవచ్చుచున్నవి. గారవము, కిసటాని (ఫలాని), బొంద, శతవాలిక, సహస్రవాలిక, అయ్య, అప్ప, అక్క, సామి; కొన్నిపదబంధములుకూడ గలవు. తేత్వాత్వా-తడిపి; కొమిట్టే = కొట్టి; లంచంఖాదిత్వా = లంచముతిని; కాలంకత్వా-కాలముచేసి, చనిపోయి. ఆంధ్రులలో కాలముజేయుటఅనునది మరణించుటకుపర్యాయము. ఇది పాలిభాషలో విశేషముగా కనబడుచుండును. సంస్కృతములో ఈ ప్రయోగము విరళము. ప్రాకృతభాషా గ్రంథములలోకూడ తెలుగు పదములవంటివి కలవు. ఆచార్యబుద్ధఘోషులు ఆంధ్రులతోనేకాక తెలుగువారితో పరిచయము కలవాడై ఆ తెలుగుమాటలు తన రచనలో సందర్భానుసారముగా ప్రయోగించి ఉండవచ్చును. ఇక పాలి ప్రాకృత భాషాభవమైతెలుగుబాసక్రమముగా విస్తరిల్లిఉండవచ్చును. ఆంధ్రులు ప్రాకృతములోనే మాటాడెడివారు. కాలక్రమమున తెలుగుతోసమ్మేళనముగలిగి తెలుగుమాటలుగా కలిసిఉండవచ్చును.

ఆంధ్రదేశ మాఖిక కథలు తొలుత సామాన్యముగా అనగనగా ఒకరాజు అని కాని అనగనగా ఒకపేదరాశిపెద్దమ్మ అనికాని ప్రారంభమగును. అట్లే ఇందులోని చాలకథలు వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా అని ప్రారంభమగును. ఈ బ్రహ్మదత్తుడు వ్యక్తియా, జాతియా అను సంశయము కలుగును. మహాభారతమును బట్టియు, మత్స్యపురాణమును బట్టియు బ్రహ్మదత్తుడను పేరు కలరాజులు నూరుగురున్నారు. ఇందలి బ్రహ్మదత్తు డొకడే యగుపక్షమున ఆయన వేలకొలది సంవత్సరములు జీవింపవలసి యుండును. ఇంతేకాక వావివరుసలు కూడ తారుమారగుచుండును. బ్రహదత్తునిలో జాతివ్యక్తులు కలిసిపోయిన వని విజ్ఞులు నిర్ణయించినారు. వెనుకటి జన్మములలోను, తుదిజన్మములో సంబుద్ధి పొందువరకును బుద్ధుడు బోధిసత్త్వుడే. ఆయన ప్రతిజన్మలో ఏదో ఒక సుగుణములలో కాని, కొన్ని సుగుణములలో కొన్ని పారమితత్త్వము కాంచుచుండును.

ప్రతికథలోను ధర్మబోధకలదు. కథలతత్త్వమును గూర్చియు, సాంకేతిక విషయములనుగూర్చియు ఇందులో అవకాశము లేక వివరింపలేదు. అవి యన్నియు

ద్వితీయ సంపుటి ప్రస్తావనలో కానవచ్చును.

Vincente Fausboll అను డెన్మార్కు దేశీయ విద్వాంసుడు పాలి భాషలో సంపాదించి ప్రకటించిన జాతకాట్ఠకథా అనుమాత్రక ననువదించినాను. నారచన యథామాత్రకము. అబౌద్ధుల కనుపయుక్తము లయిన శబ్దార్థవివరణములను, వ్యాకరణ విషయములను విడిచినాను. కథలకు వలసిన సమగ్రసామగ్రిని అనువదించినాను. ఇది సరలగ్రాంథికశైలి. వేలకొలదిగా నున్న పద్యములభాషకును వచనభాషకును ప్రగాఢభేదము లేకుండ సరళగ్రాంథిక శైలిని అవలంబించినాను.

అనువాదములో అర్థస్ఫూర్తికై బహువిద్వాంసుల గ్రంథములను తిరగవేయ వలసి వచ్చినది. Oldenburg, Winternitz, Rhys Davids దంపతులు, విధుశేఖరశాస్త్రి, ధర్మానంద కోశాంబీ, భదంత ఆనంద కౌసల్యాయన్, విమలచరణ లాహా, భరతసింహ ఉపాధ్యాయ ప్రభృతుల రచనలు చదివినాను. Rhys Davids, Childers, Petė, Chalmers చెప్పినవానికన్న బౌద్ధు డయిన కౌసల్యాయనుని తాత్పర్యమునకే హెచ్చువిలువ యిచ్చినాను.

ఈ కథాసందోహమును క్రీ. శ. 1951–52 లలో ఆంధ్రీకరించినాను. దైవికముగా Central Govt. తాలూకు Ministry Of Scientific Research & Cultural Affairs వారు సాహితీ సమితికి బహూకరించిన ధనముతో ఈసంపుటి ముద్రించుట సంభవించినది. వారికే సాహితీ సమితి కృతజ్ఞతావందనము లర్పించుచున్నది.

శ్రీ జంధ్యాల వేంకటప్పయ్య శాస్త్రి గారు ఈ సంపుటి సకాలములో చక్కగా ముద్రించినారు. శ్రీ ఆమంచర్ల గోపాలరావుగారు ముఖచిత్రము లిఖించినారు. శ్రీ బుజ్జాయి [దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి], హంస చిత్రము రచించినాడు. వీరికందరికిని శుభం భూయాత్!

—శివ—

సాహితీ సమితి,

శార్వరి, వైశాఖ, పూర్ణిమ.

నమో తస్స భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స!

# 1 అపణ్ణక జాతకము

**ఈధర్మకథ భగవాన్ శ్రావస్తిలోని జేతవన మహావిహారములో నుండుసమయమున చెప్పినది. ఏకారణముచే ఈకథ చెప్పవలసివచ్చెను? ఒకానొక శ్రేష్ఠికి సంబంధించిన అయిదువందల తైర్థిక మిత్రులమూలమున.**

## వర్తమాన కథ

ఒకనాడు అనాథ పిండిక శ్రేష్ఠి తన అయిదువందల అన్యతైర్థిక మిత్రులను వెంట బెట్టుకొని, విశేషముగా గంధము, మాల్యములు, లేపనములు, తైలములు, మధువు, నవనీతము, వస్త్ర-ఆచ్ఛాదనాదులు పట్టించుకొని జేతవనమునకు పోయెను. అక్కడ భగవానునకు వందనము చేసి, మాల్యాదులతో పూజించి, భిక్షుసంఘమునకు భైషధములు, వస్త్రాదులు ఇచ్చి కూర్చుండుటలో ఆసుదోషములను విడిచి, ఒక ప్రక్కగా కూర్చుండెను. రెండవమతమునకు సంబంధించిన శిష్యులు కూడ తథాగతునకు వందనము చేసి, పూర్ణచంద్రుని శోభతో వెలుగొందుచున్న శాస్తముఖమును - లక్షణములతో, అనులక్షణములతో ప్రకాశించుచు, నలువంకల నాలుగుమూరల దూరమువరకు కాంతితో నొప్పుచున్న సుందరశరీరమును చూచుచు, అనాథపిండికుని సమీపమున నే కూర్చుండిరి. శాస్తశరీరమునుండి నడుమ నడుమ పుంజములుగ జ్ఞానబుద్ధికిరణములు వెలువడుచుండెను.

అప్పుడు బుద్ధుడు మనశ్శిలాతలమున గర్జించు తరుణసింహము వలెను, వర్షాకాలమున గర్జించు మేఘమువలెను, ఆకాశమునుండి అవతరించు గంగవలెను, రత్నముల మాలిక చక్కగా కూర్చినట్లును, అష్టవాక్కులతో కూడి శ్రవణయోగ్యమై కమనీయమైన ఉత్తమ స్వరముతో వివిధవిధముల విచిత్రధర్మకథలు చెప్పుచుండెను. వారు బుద్ధునియుపదేశములు విని, ప్రసన్నచిత్తులై లేచి బుద్ధునకు వందనము చేసి, అన్యశరణము మాని బుద్ధుని శరణుజొచ్చిరి. ఆనాడు మొదలు కొని వారు ప్రతిదినము అనాథపిండికుని వెంట గంధమాల్యాదులు చేత గొని విహారమునకు పోయి ధర్మప్రసంగము వినుచు దానధర్మములు చేయుచు సదాచారము (శీలము) పోషించుకొనుచు వ్రతము (ఉపోసథ కర్మ) చేయుచుండిరి.

మరునాడు భగవాన్ శ్రావస్తినుండి రాజగృహమునకు పోయెను. బుద్ధు డరిగినతరువాత వారు అన్యతైర్థిక శ్రావక తథాగత శరణము విడిచి, మరల అన్యమతశరణము చొచ్చి, మొదటిచోటికే పోయిరి. భగవాన్ ఏడెనిమిది మాసములు గడపి మరల జేతవనమునకు వచ్చెను. అనాథపిండికుడు మరల వారలను వెంటగొని, బుద్ధసన్నిధికి జేరి, గంధాదులతో పూజించి, ప్రణామము చేసి, ఒకప్రక్క కూర్చుండెను. తైర్థికులు కూడ భగవానునకు వందనము చేసి ఒకప్రక్క కూరుచుండిరి. అప్పుడు అనాథపిండికుడు బుద్ధునితో ఆయన పర్యటనకేగిన పిమ్మట ఆతైర్థికులు తథాగతునిశరణము వదలుకొని అన్యమతముల గ్రహించి తమప్రథమస్థానమునకు పోయినసంగతి విన్నవించెను.

భగవాన్ అనంతకోటి కల్పములవరకు నిరంతరము వాక్కునకు సంబంధించిన సదాచారమును పాలనము చేయ కలిగిన ప్రతాపముతో, దివ్యసుగంధవాసితమై, నానావిధపరిమళభరితమైన రత్నకరండమును తెరచునట్లు తనముఖపద్మమును విప్పి మధురస్వరముతో "ఉపాసకులారా, మీరు నిజముగా త్రిశరణములను విడిచి అన్యమతమును ఆశ్రయింపబోయితిరా?" అని ప్రశ్నించెను.

వారు రహస్యము దాచుకొన లేక "భగవన్, నిజమే" అన్నారు.

అప్పుడు బుద్ధుడు ఇట్లు పలికెను: "ఉపాసకులారా, క్రింది అవీచి నరకమునుండి పైన భవాగ్ర నామక సర్వోపరి దేవలోకమువరకును అప్రమాణలోకధాతువులు ఎన్ని కలవో అన్నిటియందు సదాచారము మొదలగు గుణములయందు బుద్ధునికి సమాన మగు నరుడు ఎవడును లేడు. అంతకన్న ఎక్కడనుండి రాగలడు? భిక్షువులారా, పాదములు కల ప్రాణులు ఎన్ని కలవో, పాదములు లేని ప్రాణులు ఎన్ని కలవో బుద్ధుడు వాని అన్నిటికన్నను సర్వశ్రేష్ఠుడని చెప్పబడుచున్నాడు. ఈ లోకమున కాని పరలోకమున కాని అన్నిటను తథాగతులు శుద్ధచిత్తులయందు శ్రేష్ఠులు. ఇత్యాది సూత్రములయందు త్రిరత్నములగుణములు ప్రకాశితములైనవి. ఇట్టి గుణములతో కూడిన త్రిరత్నములను శరణము పొందు నుపాసకులు నరకాదులయందు జన్మింపరు. వారు నరకములోని పుట్టువునుండి రక్షితులై దేవలోకమున నుత్పన్నులై మహాసంపత్తి అనుభవింతురు. ఈకారణములచే మీరు ఇట్టి శరణము

లను విడిచి అన్యమతములలోని శరణములను ఆశ్రయించుట అనుచిత మైనపని."

త్రిరత్నములు మోక్షదాయకము లని బాగుగా ఆదరించి శరణములను ఆశ్రయించువారు నరకాదులలో జన్మింప నక్కరలే దను విషయము నిరూపించుటకై ఈసూత్ర ముద్ధరింపబడినది.

ఎవరు బుద్ధుని శరణు జొత్తురో వారు నరకమునకు పోవరు; మనుష్య దేహమును విడిచి వారు దేవలోకము చేరుదురు."

"ఎవరు ధర్మమును శరణు జొత్తురో వారు నరకమునకు బోవరు; మానవ దేహమును విడిచి దేవలోకమును జేరుదురు."

"ఎవరు సంఘమును శరణు జొత్తురో వారు నరకమునకు బోవరు; మానవ దేహమును విడిచి దేవలోకము చేరుదురు."

భయభీతులై మనుజులు పర్వతములను, వనములను, ఆరామములను, వృక్షములను, చైత్యాదులను అనేకస్థానములందు దేవతలనుగా భావించి శరణు జొత్తురు. అది మంగళదాయకము కాదు. ఉత్తమము కాదు. ఈశరణములవలన సమస్తదుఃఖ నివారణము సంభవింపదు.

ఎవరు బుద్ధ ధర్మ సంఘములను శరణు జొత్తురో వారు నాలుగు ఆర్యసత్యములను బాగుగా ప్రజ్ఞతో చూచినవా రగుదురు. దుఃఖము తదుత్పత్తి, దుఃఖనాశము, దుఃఖమును నశింపజేయు ఆర్య అష్టాంగ మార్గము-ఇవి ఆర్యసత్యములు. ఇవి మంగళప్రదము లైనశరణములు. ఉత్తమశరణములు. వీనిని పొంది మానవుడు సమస్తదుఃఖములనుండి విముక్తు డగును.

శాస్త పిదప ఈధర్మోపదేశము చేయుటయే గాక ఇదికూడ చెప్పెను: "ఉపాసకులారా, బుద్ధానుస్మృతి కర్మస్థానమును, ధర్మానుస్మృతి కర్మస్థానమును, సంఘానుస్మృతి కర్మస్థానమును, శ్రోత-ఆపత్తిమార్గమును, శ్రోత-ఆపత్తిఫలమును, సకృదాగామిమార్గమును, సకృదాగామిఫలమును, అనాగామిమార్గమును, అనాగామిఫలమును, అర్హత్ మార్గమును అర్హత్ ఫలమును ఆర్యసత్యములు ఇచ్చును. ఆప్రకారముగా ధర్మోపదేశముచేసి, ఇట్లనెను. "ఈప్రకార మైనశరణములను విడిచి, మీరు అనుచితకార్యముచేసినారు."

బుద్ధానుస్మృతి శ్రోతాపత్తిమార్గాదుల నొసగును. భిక్షువులారా!

ఒక్కధర్మము నభ్యసించినచో అభివృద్ధిచేసినచో సంపూర్ణనిర్వేదము (విరాగము, నిరోధము, ఉపశమనము, అభిజ్ఞ, సంబోధి) లభించి నిర్వాణము ప్రాప్తించును. ఆ యేకధర్మ మేది? బుద్ధానుస్మృతి ప్రభృతి సూత్రములచే అది ప్రతిపాదితము కావలెను.

ఇట్లు భగవానుడు బహుప్రకారముల ఉపాసకుల కుపదేశ మిచ్చి "ఉపాసకులారా, పూర్వము మానవులు తర్కవితర్కములతో అయోగ్యశరణములను శరణములుగా పరిగ్రహించి, భూతములకు మరుభూమిలో గ్రాసమై నశించిరి. ఆమరుభూమిలో నిర్దోష (అపణ్ణక) శరణమును అనుకూలతతో సంపూర్ణముగా గ్రహించిన మానవులకు కల్యాణము సంప్రాప్త మయ్యెను" అనిచెప్పి మౌనమువహించెను.

అంతట అనాథపిండిక గృహపతి ఆసనమునుండి లేచి భగవానునికి వందనము చేసి, ప్రశంసించి, రెండుచేతులు జోడించి శిరసుపై నుంచికొని ఇట్లు చెప్పెను :

"భన్తే, ఈయుపాసకు లీసమయమున ఉత్తమశరణము విడిచి వితర్కమున వెనుకకు పోవుట మాకు తెలియును. కాని పూర్వకాలమున భూతముల మరుభూమిలో వితర్కానంతరము వెనుకకు పోవువారికి వినాశము కలుగుట, నిర్దోషగ్రహణము చేయువారికి కల్యాణము లభించుట మాకు తెలియదు. అది తమకే తెలియును. భగవన్, సుఖముగానున్నచో మాకు దానిని ఆకాశమున నుదయించిన చంద్రునివలె ప్రకటనచేయుడు."

అప్పుడు భగవాన్ "గృహపతీ, నేను అనంతకాలమువరకును "దశపారమితలను" పూర్తి చేసికొని లోకుల సంశయములను నివారించుటకై, బుద్ధ (సర్వజ్ఞత) జ్ఞానము పొందితిని. బంగారుగొట్టములో సింహాతైలము నుంచినరీతిగా ఉత్తమధ్యాన ముంచి వినుడు" అని శ్రేష్ఠిని ఉత్సాహపరచి మేఘములను చీల్చుకొని వెలువడు చంద్రునివలె పూర్వజన్మమున మరుగుపడి యున్న వృత్తాంతమును ప్రకటీకరించెను.

## అతీత కథ

పూర్వకాలమున కాశీ రాష్ట్రములోని వారణాసీ నగరమున బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచున్నపుడు బోధిసత్త్వుడు సార్థవాహ

కులమున జన్మించి, పెరిగి పెద్దవా డయిన పిమ్మట వ్యాపారముమీాద అయిదువందల బండ్లతో విచరించుచుండెను. ఒకప్పు డతడు తూర్పు నుండి పడమరకును (అపరాంతమునకు), వేరొకప్పుడు పడమరనుండి తూర్పునకును ప్రయాణము చేయుచుండెను. వారణాసిలోనే వేరొకవణి క్పుత్రుడు మందమతి ఉపాయవిహీనుడు నగువా డుండెను. బోధిసత్త్వుడు కాశీలో విలువగల సరకులు 500 బండ్లలో నింపి ప్రయాణమునకు సిద్ధముగా నుండెను. మందమతి యగువర్తకుడుకూడ అట్లే చేసెను. "ఈబాలసార్థవాహపుత్రుడు నా వెంట వచ్చునేని వేయిబండ్లును కలిసి ప్రయాణము చేసినచో త్రోవ నలిగిపోవును. వంటచెరకు, జలము, పశువులకు పచ్చిక దుర్లభమగును. అతడో నేనో ముందు ప్రయాణము చేయవలెను" అని యోచించి వానికి వార్త పంపి పైసంగతులు తెలిపి, "మన మిరువురము ఒక్కసారిగా పోజాలము. నీవు ముందు పోవుదువా? ఆవల పోవుదువా?" అని యడిగెను.

వా డాలోచించి "ముందు నేను పోయినచో బహులాభము లుండును. మార్గము త్రెక్కుడు పడదు. వృషభములకు మంచిపచ్చిక లభించును. నా పరివారమునకు మంచి కూరగాయలు లభించును. నిర్మలోదకము దొరకును. నా యిచ్చవచ్చిన విలువకు వస్తువులు విక్రయింపవచ్చును" అనుకొని "ఆర్యా, నేనే ముందుపోవుదును" అని చెప్పెను.

ఆవల పోవుటవలన చాలలాభములు కలుగు నని బోధిసత్త్వు డిట్లు తలపోసెను : "ముందు పోవువారు మార్గములో విషమస్థానము లను సమానము చేయుదురు. వారు చన్నత్రోవను నేను పోవుదును. వారి వృషభములు ముదురుగడ్డి తినును. బాగుగా పెరిగిన మెత్తని గడ్డి నాయెద్దులు మేయును. ప్రాతకూరాకులు వారు కోసికొనగా క్రొత్తగా మొలచిన తీయనికూరలు మావారలు తిందురు. నీరు లేని చోట వారు నూతులు త్రవ్వవలసి యుండును. వారు త్రవ్విన బావుల లోని నీరు మేము త్రాగుదుము. వెల నిర్ణయించుటయన్న మిక్కిలి కఠినకార్యము. ముందు పోయినవారు నిర్ణయించిన విలువలకు నేను సులభముగా సరకు లమ్ముకొందును." ఈలాభము లాలోచించి బోధి సత్త్వుడు "బాబూ, నీవు ముందుపొమ్ము" అనెను. మంచిదని ఆ వెర్రి

వాఁడు బండ్లు కట్టించి బయలుదేరెను. క్రమముగా నతఁడు మానవ నివాసములు దాటి కాంతారముఖము చేరెను.

కాంతార మయిదువిధములు: చోరకాంతారము, వన్యమృగ కాంతారము, నిర్జలకాంతారము, నిర్మానుష్యకాంతారము, నిరాహార కాంతారము అని. నీ రుండ దేమో అని సార్థవాహకుమారుఁడు శకటములపై పెద్దభాండములలో నీరు నింపించి, అఱువదియోజనముల కాంతారమున పయనము చేయసాగెను. తన్మధ్యభాగమును జేరునప్పటికి అధివాసి యగుయక్షుఁడు "వీరిచే నీరు పారబోయించి, అందఱను బలహీనులయినపిమ్మట భక్షింతును" అని యోచించి, నిజప్రభావముచే ఉత్తమశ్వేతవృషభములు పూన్చిన మనోహరయానమును సృజించెను. విల్లంబులు, కత్తి, డాలు ధరించిన పరిజనముతో, తడిసిన వెంట్రుకలపై కుముదోత్పలమాలికలు చుట్టుకొని, ఆర్ద్రవస్త్రములతో అధిపతివలె బండిలో గూర్చుచుండెను. బండిచక్రములకు బురద అంటుకొని యుండెను. అతని ముందు వెనుకల నడచుచున్న పరివారజనులు తడిసినతలలకు నల్ల తెల్ల కలువదండలు చుట్టుకొని, తెల్లతామరల గుత్తులు చేతబట్టుకొని, రుచ్యములైన తామరతూండ్లు నములుచుండిరి.

గాలి యెదురుగా కొట్టుచున్నప్పుడు వెనుకను, వెనుకనుండి గాలి కొట్టునపుడు ముందరను వర్తకుఁడు చనుచుండును. ఆసమయమున ముందరిభాగమున నతఁడు పోవుచుండెను. అతనిని చూచి యక్షుఁడు తనబండి ప్రక్కకుతప్పించి "ఎక్కడికి పోవుచున్నారు?" అని యడిగెను. తనశకటమును ప్రక్కకు తప్పించి, తక్కినబండ్లు పోవుట కవకాశము కల్పించి యువకుఁడు యక్షునితో ని ట్లనెను. "ఆర్యా, మేము వారణాసి నుండి వచ్చుచున్నాము. ఉత్పలములను కుముదములను మీరు తలకు చుట్టుకొని, కొన్ని చేత బట్టుకొని, తామరతూండ్లు నములుచు, శరీరము బురద కొట్టుకొని, బట్టలు నీరు కారుచుండగా వచ్చుచున్నారు. మీ త్రోవలో వర్షము కురిసినదా? తామరలు కలువలు నిండిన సరోవరము లున్నవా?"

అతనిమాటలు విని యక్షుఁడు "ఆర్యా, ఏ మంటివి? ఎదురుగా కనబడుచున్న పచ్చనివనరాజి కావల సర్వము ఏకజలారణ్యమే. అచ్చట వర్షము కురియుచున్నది. గుంటలలో నీరు నిండియున్నది. అక్క

డక్కడ సరస్సులలో పద్మములు, కలువలు నిండుగా నున్నవి" అని పలికి, వరుసగా బోవుచున్న బండ్లనుచూచి "ఇవి యెచ్చటికి బోవును?" అని యడిగెను.

"ఆజనపదమునకు."

"ఈబండ్లలో ఏమి సరకు లున్నవి?"

"ఈయాసరకులు."

"భారముగా కదలుచున్న యీబండిలో నేమి కలదు?"

"ఉదకము."

"ఇంతవరకును మీవెంట నీరు తెచ్చికొనుట మేలే. ఇక అవసరము లేదు. ఆవల కావలసినంత జల మున్నది. నీరు పారబోసి భాండములు పగులగొట్టి వేయుడు. సులువుగా ప్రయాణము చేయవచ్చును. ఇక పొండు. ఇప్పటికే మిమ్ము చాలసేపాపితిని" అని యక్షుడు కనుచూపు మేర దాటి చని, నిజనివాస మగు యక్షనగరమునకు మరలిపోయెను.

ఆబుద్ధిహీనుడు యక్షునిమాటలు నమ్మి, భాండములు పగుల గొట్టించి, పుడిసెడు నీరుకూడ లేకుండ పారబోయించి, బండ్లు నాగిపోవ నాన తిచ్చెను. ముందరికి బోవగా జలబిందువుకూడ కానరాలేదు. దప్పికవలన పరివారజనులు బడలిక జెందిరి. సూర్యాస్తమయము వర కును వారు ప్రయాణము చేసి, బండ్లు విప్పి, వృషభములను చక్రములకు గట్టివేసిరి. మనుష్యులకు పశువులకు వంటకును నీరులేదు. బడలి వారు నేలపై బరుండిరి. రాత్రివేళ యక్షులు నగరమునుండి బయలుదేరి వచ్చి, మనుష్యులను పశువులను వధించి, మాంసము తిని, అస్థికలు మాత్రము విడిచిపోయిరి. ఒక్కమూర్ఖునివలన నెల్లరు వినాశము చెందిరి. 500 బండ్లలోని సరకు లట్లే యుండెను. అస్థికలు చెల్లాచెదరై పడినవి.

బుద్ధిహీన సార్థవాహ పుత్రుడు బయలుదేరిన మాసము పదునైదు రోజులకు బోధిసత్త్వుడు 500 బండ్లలో సరకులు నింపి, నగరము వెలు వడి, క్రమముగా కాంతారము చేరెను. అచ్చట కుండలతో నీరు నింపించి, బాగుగా కూడబెట్టి, స్కంధావారమున భేరి మ్రోయించి, యత డందరను సమావేశ పరచి "నాకు తెలుపకుండ పుడిసిలినీరుకూడ వాడకూడదు. అరణ్యములో విషవృక్షము లుండును. ఇంతకుముందు

మీరు తినియుండని పర్ణము గాని ఫలము గాని నాకు తెలుపకుండ తిన రాదు" అని బోధించి, శకటములతో నడవిలో ప్రవేశించెను. సగము దూరము పోవునప్పటికి యక్షుడు వెనుకటివలెనే బోధిసత్త్వునికి మార్గ మున కానవచ్చెను. "దీనిపేరు నిర్జలకాంతారము. నిర్భయుడైన యీరక్తనేత్రుడునీడ నేలపై బడుటలేదు. ఇతడు మందమతి యగు వర్తకకుమారునిచే నీరు పారబోయించి యుండును. బడలిక చెంది ఎల్లరు నిద్రించినపిమ్మట నందరను భక్షించి యుండును. ఇతడు నాబుద్ధి కుశలతను, ఉపాయకౌశలమును గ్రహింపలేదు" అని తలపోసి బోధి సత్త్వుడు "మీరు పొండు. మేము వర్తకులము. వేరొకచోట నీరు చూడకుండ ఉన్ననీరు పారజల్లము. ఉదకము కానబడినచోట ఈనీరు పారబోసి, భారము తగ్గించుకొందుము" అని పలికెను.

చూపుమేర దాటిపోయి యక్షుడు నిజనగరమునకు మరలెను. అనంతరము పరివారజనులు బోధిసత్త్వునితో "ఆర్యా, ఈజనులు నీల వనరాజి బాగుగనే వర్ణించుచుండు నని చెప్పినారు. శిరసులచుట్టును పుష్పమాలికలు చుట్టుకొని, చేతులలో నల్లగలువలు పట్టుకొని, తామరతూండ్లు నములుచు, తడిపెండ్రుకలతో, తడిబట్టలతో కానవచ్చి నారు. కాబట్టి మనము నీరు పారబోసి, బండ్ల బరువు తగ్గించి త్వరిత ముగా ప్రయాణము చేయుదము" అని చెప్పిరి.

బోధిసత్త్వుడు వారి మాటలకు శకటము లాపి, జనులను సమావేశ పరచి "ఈయడవిలో సరస్సు కాని, పుష్కరిణి కాని ఉన్నట్టు మీ రెన్నడైన విన్నారా?" అని యడిగెను.

"ఆర్యా, వినలేదు. నిర్జలకాంతార మని దీని పేరు."

"నీలవనరాజి కావల వర్షించుచుండు నని వా రన్నారు. వర్ష వాయువు లెంతిదూరము వీచును."

"యోజనమాత్ర మార్యా!"

"మరి యీవర్షవాయువు మీలో నెవరిశరీరము నైన తాకినదా"?

"లేదు."

"మీరు మేఘశీర్ష మెంతదూరము చూడగలరు?"

"యోజనదూర మయ్యా!"

"మీలో నెవరి కయినను మబ్బుకోవు కనబడుచున్నదా?"

"లే దయ్యా!"

"ఎంతదూరమున మెరపు కనబడును?"

"నాలుగైదు యోజనము లయ్యా!"

"ఇం దెవ రైన మెరుపు చూచినారా?"

"లే దయ్యా!"

"ఉరు మెంతదూరము వినబడును?"

"రెండుమూడు యోజనము లయ్యా!"

"ఇం దెవరైన ఉరుము ధ్వని విన్నారా?"

"లే దయ్యా!"

"వారు మానవులు కారు, యక్షులు. వారు చెప్పినట్లు నీరు పారబోసి బడలిక చెందినపిమ్మట మనలను భక్షించు కోరికతో మరలి వత్తురు. ఉపాయశాలి కాని సార్థవాహ కుమారుడు నీరు పారబోసి, క్షీణించిన పిమ్మట యక్షులు సపరివారముగా నతనిని భక్షించి యుందురు. అతని 500 శకటములను సరకులనుగూడ మన మీనాడు చూడగలము. జలబిందు వయినను చింద నీయక త్వరితముగా పోవుదము."

వారు ప్రయాణము చేయగా నొకచోట 500 సరకుల బండ్లు కాన వచ్చినవి. మనుజుల యస్థికలు, పశువుల బొమికెలును చెల్లాచెదరై యుండెను. బోధిసత్త్వుడు తనశకటములను విప్పించి చక్రాకారముగా నిలిపి, మనుజులు సాయంసమయముననే భుజించునట్లు చేసి, పశువులకు మేత వేయించి, వాని చుట్టును జనులను పరుండబెట్టి, బలనాయకులతో గూడ ఖడ్గహస్తుడై నిలిచి, రాత్రి మూడుయామములు కావలి కాచి, అరుణోదయమున కెదురు చూచెను.

ఉదయము బోధిసత్త్వుడు సర్వకార్యములు నిర్వర్తించి, వృషభము లకు మేత వేయించి, ఓటిబండ్లను విడిచిపెట్టి, మంచివానిని పూన్చి, చెడినసరకులు వదలి, మంచిసరకులు ఎత్తి, ఉద్దిష్టస్థానమునకు జేరెను. అచ్చట తనవస్తువులను రెండుమూడురెట్లు విలువ కమ్మి, పరివారములో నొక్కనిగూడ కోల్పోవక, నిజనగరమునకు మరలి వచ్చెను.

పలికెడువారు యథార్థంబు కొలది మంది;
తార్కిక జనంబు రెండవదాని సత్య
మనియె; గ్రహియించి ధీమంతు డైనవాడు
ఇద్ది, సత్యమునే స్వీకరించు టొప్పు.

బుద్ధుడు ఈ ధర్మోపదేశము చేసి రెండు కథలను చెప్పి సరి పోల్చి జాతక సారాంశమును వెలువరించెను. "ఆ కాలమున మూర్ఖవర్తకుడు దేవదత్తుడు. అతని పరివారము దేవదత్తుని పరివారము. ఈసమయమున బుద్ధుని మండలి బుద్ధిమంతు డగు వర్తకుని మండలి. బుద్ధిమంతు డైనవర్తకుడు నేనే" అని భగవాన్ ధర్మోపదేశము ముగించెను.

## 2 వణ్ణుపథ జాతకము

ఈధర్మకథ భగవాన్ శ్రావస్తిలో విహరించుసమయమున చెప్పినది. ఎవరికొరకు? శిథిలప్రయత్ను డగు నొకానొక భిక్షుకొరకు.

### వర్తమాన కథ

బుద్ధుడు శ్రావస్తిలో విహారము చేయునపుడు శ్రావస్తినివాసి యగు కులపుత్రు (ప్రాబల్యము కల) డొకడు జేతవనమునకు జని, శాస్తను సమీపించి, ధర్మోపదేశము విని, ప్రసన్నచిత్తుడై, ఇంద్రియ సంబంధమైన సుఖములయందు దోష ముండుట గ్రహించి, సాధువయి, భిక్షుదీక్ష (ఉపసంపద) గైకొనెను. అయిదుసంవత్సరములు గడిచిన పిమ్మట అతడు రెండుమాత్రికలను, విదర్శనక్రమమును నేర్చి, బుద్ధుని తనచిత్తమున కనుకూలయోగక్రియ (కర్మస్థానము)గా గ్రహించెను. అనంతరము అరణ్యములో ప్రవేశించి, వర్షాకాలమున మూడుమాసములు సాధన చేసినను అవభాసమాత్రము కాని, నిమిత్తమాత్రము కాని ఉత్పన్నము కాలేదు.

అప్పు డతడు ఇట్లు యోచించెను: "బుద్ధుడు నాలుగువిధములవ్యక్తులనుగురించి చెప్పినాడు. నేను నాలుగవవిధ మైనవ్యక్తిని (తుదివాడను) కావచ్చును. ఈజన్మములో మార్గము కాని ఫలము కాని యేమాత్రము లభింపదు. అరణ్యములో నుండి నేను చేయగలుగున దేమి? కావున బుద్ధునికడకు జని, తదీయమహాసుందర దేహమును చూచుచు, ఆయనమధుర ధర్మోపదేశమును వినుచు విచారణ చేయుదును." ఇట్లు తలపోసి అతడు మరల జేతవనము చేరెను.

పరిచితులు, మిత్రులు నప్పు డతని ని ట్లడిగిరి: "ఆయుష్మన్, నీవు యోగాభ్యాసము (ప్రమాణధర్మము) చేయుటకై భగవానునికడ యోగవిధిని (కర్మస్థానమును) గ్రహించి పోతివి. కాని యిప్పుడు మరలి వచ్చి సంఘములో జేరితివి. నీవు సాధువు (ప్రవ్రజ్య) కావలె నను నుద్దేశము పూర్తి అయినదా? నీవు పునర్జన్మనుండి విముక్తుడ వయితివా?"

"ఆయుష్మంతులారా, నాకు మార్గము కాని ఫలము కాని, లభింప లేదు. నేను బహుశః యోగ్యుడను కానేమో అని యోచించి, అభ్యాసము విడిచి వచ్చినాను."

"ఆయుష్మన్, దృఢమై శక్తివంత మైన ఉపదేశమున సాధువు వయి ఆప్రయత్నమును విడుచుట ఉచితముగా లేదు. రమ్ము, తథాగతుని సన్నిధికి తీసికొని పోవుదుము" అని వా రతనిని శాస్తవద్దకు గొని పోయిరి.

శాస్త అతనిని చూచి "భిక్షుకులారా, ఇష్టము లేని ఈ భిక్షువును గొనివచ్చితిరి. ఈ భిక్షు వేమి యపరాధము చేసినాడు?" అనెను.

'భన్తే, ఈ భిక్షువు నైర్యాణికధర్మమున సాధు వయి, యోగాభ్యాసము చేయుచు, ఆయత్నము మాని తిరిగి వచ్చినాడు.'

భగవాన్ అప్పు డతనితో 'ఏమి? నిజమేనా? నీవు ప్రయత్నము సడలించినావా?' అనెను.

'అవును, సత్యమే, భగవన్!'

"భిక్షూ, ఇట్టిధర్మమున సాధువు వయి, అల్పేచ్ఛువు సంతుష్టుడు ఏకాంతప్రియుడు ప్రయత్నవాన్ కాకుండ ఏల అలసభిక్షువు అని బయలుపడినావు? నీవు పూర్వజన్మములో యత్నపరాయణుడవు

కాలేదా? పూర్వజన్మలో నీ వొకడవే అయిదువందలబండ్ల జంతువులకు మనుజులకు జల మొసగి మరుభూమిలో సౌఖ్యము కలిగింపలేదా? ఇప్పుడు విశ్వాస మేల కోలుపోయితివి?"

భగవానుని యీవాక్కులవలన ఆభిక్షువు భద్రత నొందినాడు.

ఈమాటలు విని భిక్షుకులు భగవాను నిట్లు ప్రార్థించిరి: "భన్తే, ఇప్పు డీభిక్షువు విశ్వాసము కోలుపోయి యుండుట ప్రకట మయినది. కాని పూర్వజన్మములో ఇతని ఒక్కనియత్నముచేతనే మరుభూమిలో మనుజులు వృషభములు నీరు త్రాగి సుఖించుట మాకు తెలియదు. తమసర్వజ్ఞతవలన అది ప్రకట మయినది. మాకుగూడ ఆవిషయము వినిపింపుడు."

"అట్లగుచో భిక్షువులారా, వినుడు" అని భగవాన్ ఆభిక్షువుకు చైతన్యము కలిగించి, పూర్వజన్మములోని అజ్ఞాతవిషయమును ప్రకటీకరించెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా, బోధిసత్త్వుడు సార్థవాహ కులమున పుట్టి పెరిగి పెద్దవాడయి, 500 బండ్లతో వ్యాపారార్థము 60 యోజనముల యెడారిభూమి చేరెను. అందలి సన్నయిసుక గుప్పిట బట్టినచో వ్రేళ్ళసందులనుండి జారిపోవును. సూర్యోదయానంతర మామరుభూమి వేడి యెక్కి, అంగారసదృశమై యెవరును నడచుటకు వీలు లేకుండును. కావున పాంథులు బియ్యము, నూనె, వంటచెరకు, నీరు మొదలగునవి బండ్ల కెత్తి రాత్రివేళనే ప్రయాణము చేయుదురు. తెల్లవారు జామున నే శకటములను వలయాకారముగా నుంచి నడుమ మంటపమువలె నేర్పాటు చేసి, పైన చాందినీ కట్టి, ప్రొద్దెక్కకముందే భోజనాదికము ముగించి, మంటపమునీడలో పగలు గడపెడివారు. సూర్యాస్తమాన మయినంతనే భోజనములు చేసి, నేల చల్లబడగానే బండ్లు కట్టి పయనము చేసెడివారు. ఆయిసుక యెడారిలో ప్రయాణము

సముద్రప్రయాణమువలె నుండును. నక్షత్రజ్ఞానమునుబట్టి స్థలనియామకుడు వారిని నడపుకొని పోవలసియుండును. సార్థవాహుడు కాంతారమున నీప్రకారముగా పయనము చేయుచుండెను.

ఇక యోజనమాత్ర దూరము పోవలసి యుండెను. ఆరాత్రి మరు కాంతారము దాటి పోవచ్చు నని తలచి యతడు సాయంసమయమున భోజనానంతరము వంటచెరకు, నీరు పారవేయించి బండ్లు కట్టించెను. నియామకుడు మొదటిబండిలో ఆసందిపై కూరుచుండెను. ఆకసమున తారల నవలోకించుచు ఇటు పొం డనుచు త్రోవ చూపుచుండెను. కాని అంతదూర మతడు నిదుర లేకుండుటచే బడలిక చెంది నిద్రించెను. వృషభములు వచ్చినత్రోవనే వెనుకకు మరలిపోయినవి. అరుణోదయమున నియామకుడు నిద్ర లేచి, నక్షత్రములను పరికించి బండ్లు వెనుకకు త్రిప్పు డని యరచెను. వారు బండ్లు మరలించి సరిదిద్దునప్పటికి తెల్లవారెను. “నిన్న మనము విడిచిన స్కంధావార మిదే. వంట చెరకు, నీరు లేవు. దుర్గతి పట్టినది!” అని బిడారులోని జనులు బండ్లు విప్పి, వలయాకారముగా నేర్పరించి, ఒక్కొక్కడును నిరాశతో తన బండిక్రింద చదికిల పడెను.

తా నధైర్యము చెందినచో నందరును నశింతు రని బోధిసత్త్వుడు తలపోసి, చల్లనివేళ నటు నిటు దిరుగుచు దర్భలదుబ్బు చూచెను. అడుగున నీ రుండుటచేతనే దర్భలు పెరిగిన వని భావించి అయన పలుగు తెప్పించి యచట త్రవ్వించెను. అరువదిమూరలలోతు త్రవ్వినపిమ్మట పలుగునకు పాషాణము తగిలెను. అందరును ధైర్యము కోల్పోయిరి. రాతిక్రింద నీ రుండు నని బోధిసత్త్వుడుమాత్రము విశ్వసించి, గుంటలోనికి దిగి రాతిపై నిలుచుండి క్రమముగా వంగి చెవి యొగ్గి వినెను. నీటి చప్పుడు చెవికి తగిలినంతనే ఆయన పైకి వచ్చి, పని చేయుబాలునితో “బాబా, నీ వధైర్యపడినచో అందరు నశింతురు. ధైర్యము పూని, ఈ యినుపగూటముతో గుంటలోనికి దిగి పాషాణమును భేదింపుము” అని చెప్పెను.

తక్కినవారికి ధైర్యము లేకున్నను ఆయన మాటచొప్పున బాలుడు దిగి పాషాణమును బ్రద్దలు చేసెను. ఉదక ప్రవాహమున కడ్డముగా నున్న బండ పగిలి ముక్కలయ్యెను. తాళప్రమాణమున

నీరు పై కెగసెను. ఎల్లరును దప్పి తీర్చుకొని స్నానములు చేసిరి. అనంతరము ప్రాతవడిన బండిచక్రములు మొదలగునవి నరకి వానితో నిప్పు చేసి, వంట లయినపిమ్మట భుజించి పశువులకు మేత నీరు పెట్టి సూర్యు డస్తమించినపిదవ నూతికడ ధ్వజస్తంభము ప్రతిష్ఠించి వారు గమ్యస్థానము చేరిరి. అచ్చట సరకులు రెండుమూడురెట్లు విలువకు విక్రయించి లాభము తీసి, నిజనివాసములకు మరలి చనిరి. అచ్చట జీవితాంతమువరకు కాలము గడిపి, కర్మానురూప మైనగతిని పొందిరి.

బోధిసత్త్వుడుకూడ దానాదిపుణ్యకార్యములు చేయుచు తుదకు కర్మానుగుణ మగు పదవిని పొందెను.

శ్రవ్యకము పెట్టి యిసుకమార్గమ్మునందు
పడసిరి ప్రయత్నశీలురు బహుళజలము.
వీర్య బలములు కూడి యీవిధిని యత్న
శీలు డగుముని కాంచును చిత్తశాంతి.

శాస్త రెండుకథలు వినిపించి, సరి పోల్చి, జాతకసారాంశమును చూపెను. "ఆకాలమున విశ్వాసము కోలుపోవక, పాషాణమును లాగి, జనసమూహమునకు జలము నొసగినవాడు నాచిన్నసేవకుడు (చులుపస్థాపకుడు) ఈభిక్షువే. మిగిలినమండలి నేటి బుద్ధమండలియే. ప్రధానవర్తకుడను నేనే" అని ధర్మోపదేశము ముగించెను.

## 3 సేరివాణిజ జాతకము

ఈ ధర్మోపదేశమును భగవాన్ శ్రావస్తిలో నున్నపుడు విశ్వాసము కోలుపోయిన భిక్షుకునిగూర్చి చెప్పినది.

పూర్వోక్తప్రకారముగా భిక్షువులు అతనిని బుద్ధునికడకు గొని వచ్చిన పిమ్మట శాస్త యిట్లనెను : "భిక్షూ, అట్టి మార్గ ఫల

దాయక మైనధర్మమును సాధువు వయ్యును, నీవు విశ్వాసము కోలు పోయి యున్నచో లక్ష మూల్యము గల సువర్ణస్థాలిని పోవిడిచిన సేరి వాన్ వణిక్కువలె విచారము నొందుదువు.'' ఆవిషయము ప్రకటీకరింప భగవానుని భిక్షువులు ప్రార్థించిరి. ఆయన పూర్వజన్మమున మరుగు పడిన విషయము నిట్లు ప్రకటించెను.

## అతీత కథ

అయిదుకల్పములనాడు బోధిసత్త్వుడు సేరివ రాష్ట్రమున సేరివ నామముతో కచ్ఛపుట వణిజుడై యుండెను. అతడు సమాన నామధారి యగు లోలకచ్ఛపుట వణిజునితో గలిసి తేలివాహ నామక మగు నదిని దాటి, ఆంధ్రపురము ప్రవేశించి నగరవీథులను విభాగించి, తనవంతు వీథులలో సరకు లమ్మకము చేయుచు తిరుగుచుండెను. రెండవయుత డును తనవంతు వీథులలో సరకు లమ్ముకొనుచుండెను.

ఆపట్టణములో బ్రతికి చెడిన శ్రేష్ఠికుటుంబము కలదు. ఒకప్పుడు వారు ధనికులు; కాని యందలి కుమారులు, సోదరులు, సంపదయు నశిం చెను. ఒక్కకన్యయు, అవ్వయు మిగిలియుండిరి. వారిరువురు కూలి చేసి జీవించుచుండిరి. కుటుంబయజమాను డగుశ్రేష్ఠి పూర్వ ముపయో గించిన సువర్ణపాత్ర మాత్రము తక్కినపాత్రలనడుమ పడియుండి, బహుకాలము వాడుక లేక మలినమై యుండెను. అది బంగరుపాత్ర యని వారికి తెలియదు లోభివర్తకుడు "పణికలు (దండలు) కావలెనా, మణికలు కావలెనా?'' అని కేకవేయుచు, వారిగృహద్వారము చేరెను. కుమారి వానిని జూచి అవ్వతో "అమ్మా, నా కేమైన కొనిపెట్టవా?" అనెను. "తల్లీ, మనకు దుర్గతి పట్టినది. ఏ మిచ్చి కొనగలము?'' అని అవ్వ యనెను. "నిరుపయోగ మైన పాత్ర ఉన్నది కదా-అది యిచ్చి కొందము" అని కుమారి పలికినది.

అవ్వ ఆవర్తకుని లోనికి రప్పించి కూర్చుండబెట్టి, ఆపాత్రయిచ్చి "అయ్యా, ఇది తీసికొని నీచెల్లెలి కేమైన ఈయవలెను'' అనెను. వణిక్కు పాత్రను గైకొని, అది సువర్ణపాత్రిక కావచ్చు నని భావించి,

తిరుగ బోర్ల వేసి చూచి, శలాకతో దానిపై గీసి, సువర్ణమని గ్రహించి, వీరి కేమియును ఈయకుండ దీనిని హరింతు ననుకొని "దీని కేమి విలువ? అర్ధమాషముకూడ చేయదు" అని గిన్నె నేలపై బడ వేసి, లేచి వెడలిపోయెను.

నిర్ణయప్రకారము ఒకవర్తకుడు మొదట వెళ్ళిన వీథికి రెండవవర్తకుడు తరువాత వెళ్ళవచ్చును. కావున బోధిసత్త్వుడు కొంతతడవునకు వారిద్వారముకడకు బోయి, మణికలు కావలెనా అని కేకవేసెను. కుమారిక వెనుకటివలెనే అవ్వ నడిగెను. "తల్లీ, ఆవర్తకుడు పాత్ర నేలపై గొట్టి వెడలినాడు. కొనుటకు మనకడ ఏమున్నది?" అని అవ్వ యనెను.

"అమ్మా, ఆవర్తకుడు దుడుకువాడు. ఈయన యోగ్యుడు. వాక్కు మంచిది. ఈయనను లోనికి బిలువుము."

అతడు లోనికి వచ్చినంతనే కూర్చుండబెట్టి వారు పాత్ర చేతి కిచ్చినారు. అయ్యది సువర్ణపాత్ర యని గ్రహించి "అమ్మా ఈపాత్ర లక్ష చేయును. దీనికి తగిన వస్తువులు నావద్ద లేవు" అని యతడనెను.

"అయ్యా. వేరొకవర్తకుడు వచ్చి, ఇది అర్ధమాషముకూడ చేయదని నేలమీాద కొట్టి వెడలినాడు. మీాపుణ్యవశమున ఇది సువర్ణపాత్రిక కానొప్పను. దీనిని మీా కిత్తును. దీనికి బదులుగా మూా కేదైన ఇచ్చి, దీనిని కొనిపొండు". అని అవ్వ పలికెను.

తనకడ నున్న 500 కార్షాపణములను, 500 కార్షాపణముల విలువ గలసరకులను బోధిసత్త్వుడు వారి కిచ్చి, "త్రాసు, సంచి, ఎనిమిది కార్షాపణములు మాత్రము నన్నుంచుకొననిండు" అని, సువర్ణపాత్ర తీసికొని పోయి, ఎనిమిది కార్షాపణములు నావికున కిచ్చి పడప మెక్కెను.

ఇంతలో లోభివర్తకుడు మరల వారింటికి వచ్చి "పాత్ర ఇండు. ఏదో యొకటి దానికి బదులుగా ఇత్తును" అని పలికెను. వృద్ధురాలు కోపముతో "లక్ష విలువ గలమాపాత్ర అర్ధమాషము చేయదంటివి. కాని ఒక ధర్మాత్ముడు వచ్చి వేయి యిచ్చి దానిని కొనిపోయినాడు" అని చెప్పెను. అది విని లోభివర్తకుడు "లక్ష చేసెడి సువర్ణపాత్ర వాడు హరించినాడు! నన్నెంతో నష్టపరచినాడు!" అని మహా దుఃఖ

ముచే నిగ్రహాము కోల్పోయి, పెఱ్రివాడయి, సరకులు, చేతనున్నడబ్బు వారిగుమ్మమున బడవేసి, ఉత్తరీయముకూడ జారవిడిచి, తులాదండము చేబూని, బోధిసత్త్వుని యనుగుజాడలనుబట్టి నదీతీరము చేరెను. బోధిసత్త్వుడు పడవపై బోవుచుండుట చూచి వాడు పడవను వెనుకకు మరల్పు మని నావికుని కేక వేసినాడు. బోధిసత్త్వుడు వల దన్నాడు. ఆవలియొడ్డు చేరుచున్న బోధిసత్త్వుని గాంచి వాడు దుఃఖోపహతు డయినాడు. వానిగుండె వేడి యెక్కెను, నోట నెత్తురు వెలువడెను. ఎండిన చెరువున కడుగుభాగమువలె వానిగుండె బ్రద్ద లయ్యెను. బోధిసత్త్వునియెడ ద్వేషముచే వా డచ్చటనే ప్రాణములు విడిచెను.

బోధిసత్త్వుడు దానాది పుణ్యకార్యములు చేయుచు, జీవితము గడిపి తుదకు కర్మానురూప మైనపదవిని పొందెను.

నీవు సద్ధర్మాన నిర్లక్ష్యవశత
గమ్యమ్ము ప్రాపింపగా నేరవేని
చిల్లరసర కమ్ము సేరివాన్ వలెనె
చిర మనుతాపమ్ము చెందంగ వలయు.

ఈ విధముగా శాస్త్ర అర్హత్వప్రాప్తికి సర్వోచ్చస్థాన మిచ్చి ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములు నాలుగింటిని వ్యాఖ్యానించెను. సత్యవ్యాఖ్య సమాప్తము కాగానే, భిక్షువు విశ్వాసముద్వారా అర్హత్వనామక మైన సర్వోత్తమ పదవియందు సుస్థిరు డయ్యెను. బుద్ధుడు రెండుకథలు చెప్పి సరిపోల్చి జాతకసారాంశమును వెలిబుచ్చెను. ఆసమయమున మూర్ఖవణిక్కు దేవదత్తుడు; బుద్ధిమంతు డైన వర్తకుడు నేనే అని శాస్త్ర ఉపదేశసమాప్తి కావించెను.

## 4 చిన్నిసెట్టి జాతకము

ఈధర్మోపదేశము భగవాన్ రాజగృహామ్రపక్క జీవకుని ఆమ్రవనమున విహారము చేయుచున్నప్పుడు క్షుద్రపంథక స్థవిరుని ఉద్దేశించి చెప్పినది.

ఇచ్చట క్షుద్రపంథకుని ఉత్పత్తికథ అవసరము. రాజగృహములో గొప్ప శ్రేష్ఠి పుత్రికకు తన సేవకునితో సంబంధ మేర్పడెను. తన యీ కృత్యము రెండవవారికి తెలియకుండ మరగుపరచుటకై ఆమె భయముతో నొకరునుచూచి "ఇక మన మిచ్చట నుండలేము. ఈదోషము నాతల్లిదండ్రులకు తెలిసినచో వారు నన్ను ముక్కలు ముక్కలు చేయుదురు. పద, మనము విదేశమునకు పోవుదము" అని చెప్పెను.

అంతట ఉభయులు చేతబట్టుకొని పోదగిన విలువగల వస్తువులు తీసికొని, నగర ప్రధానద్వారము వెంట వెలువడి, అపరిచితస్థానమున నెక్కడ నయినను నివసింపదలచి త్వరితముగాజనిరి. వా రిరువురు కూడియుండ, నొకచోట నామెకు గర్భ మేర్పడెను. నెలలు నిండిన పిమ్మట ఒకనా డామె స్వామితో "గర్భము పరిపక్వ మయినది. కులమువా రెరుగని చోట ప్రసవ మయిన పిదప మనకు చాల శ్రమ కలుగును. మా నాయన గారింటికే పోవుదము" అని చెప్పెను.

"నేడు పోవుదము, రేపు పోవుదము" అని వాడు కాలము గడపజొచ్చెను. ఆమె తనలో యి ట్లనుకొన్నది : "ఈమూర్ఖుడు తన అపరాధమూలమును గ్రహించుటవలన భయపడుచున్నాడు. తల్లిదండ్రులు బహువిధముల హితైషులు. వీడు ఇష్టపడి వచ్చినను రాకున్నను నేను పోవకతప్పదు." ఆమె భర్త యిల్లు విడిచి ఎచ్చటికో పోయినప్పుడు ఇంటిలోని సామానులు బాగుగసర్ది యుంచెను. తాను తండ్రికడకు పోవువార్త ఇరుగు పొరుగువారలకు చెప్పి, త్రోవను బడెను. వాడు ఇంటికి మరలి వచ్చి భార్యను కానక ఇరుగు పొరుగువారల నడిగెను. ఆమె తండ్రియింటికి పోవుచున్న దను వార్త విని శీఘ్రముగ ప్రయాణము చేసి ఆమెను మార్గమున కనుగొనెను. ఆమె అచ్చట ప్రసవించుచుండ "భద్రే, ఏ మైనది?" అని అడిగెను. "స్వామీ, మగబిడ్డడు కలిగినాడు. ఇప్పుడు ఏమి చేయవలయును? మనము ఏవిధానమును అనుసరించి తండ్రియింటికి పోవుచుంటిమో ఆపని మార్గమధ్యముననే జరిగినది. ఇప్పుడు అక్కడికి పోయి ఏమి చేయుదుము? పద, మరలి పోవుదము" అని యామె పలికెను.

ఇరువురు ఏకాభిప్రాయులై మరలి వచ్చిరి. ఆచిన్ని బిడ్డడు పథమున జన్మించుటచే వానికి పంథకుడు అని పేరు పెట్టిరి.

కొంతకాలము గడచిన పిమ్మట ఆమె మరల గర్భము ధరించెను. ఇదివరలోవలెనే ఇప్పుడుకూడ కథ నడచినది.

మార్గమున ఉత్పన్నుడగుటచే మొదట పుట్టిన బిడ్డనికి మహాపంథకుడనియు, రెండవమారు జన్మించిన వానికి క్షుద్రపంథకుడనియు పేర్లు వచ్చినవి. బిడ్డలిరువురను వెంటకొని ఆమె నిజనివాసస్థానమునకు మరలి వచ్చెను. పంథక బాలకులు ఇతరబాలకులనెడి చాచా, నానా, నానీ, అను మాటలు విని తల్లితో "ఆపిల్లలు చాచా, నానా, నానీ అనుచున్నారు. అమ్మా, మనకు బంధువులు ఎక్కడ నున్నారు? కాక మనకు బంధువులు లేరా?" అని అడిగిరి.

"ఔను, నాయనలారా, ఇక్కడ బంధువులు లేరు. కాని రాజగృహనగరములో గొప్పశ్రేష్ఠి తాత అగును. అక్కడ మీకు చాలమంది బంధువు లున్నారు."

"అమ్మా! మనము ఎందుచేత అక్కడకు పోవుటలేదు?"

ఆమె బిడ్డలు మాటిమాటికి అడుగుచుండుటచే స్వామితో "ఇక్కడ బిడ్డలు బాధపడుచున్నారు. తల్లితండ్రులు మనలనుచూచి చంపివేయరు కదా. ఈబిడ్డ లిరువురకు మానాయనగారి ఇల్లు చూపుదము" అన్నది.

"నేను ఆయన ఎదుటకు పోలేను. నిన్ను అచ్చటకు కొనిపోయెదను."

"ఆర్యా, మేలు కలుగునప్పుడు బిడ్డలకు మానాయనగారి యిల్లు చూపుము."

ఉభయులు బిడ్డలను వెంట బెట్టుకొని క్రమముగ రాజగృహము చేరిరి. నగరద్వారము ప్రక్కన ధర్మశాలలో దిగి ఆమె తన తల్లితండ్రులకు సందేశము పంపినది— "బిడ్డలతల్లి వచ్చినది" అని.

వారీసందేశము విని ఇట్లు వార్త పంపిరి: "లోకములో జననమరణ చక్రములో పడి ఎప్పుడో ఒకప్పుడు కొడుకునుగాని కూతురునిగాని కనని వాడు లేడు. అందుచే మాకన్నుల బడుటకు వీలు లేదు. ఇంతధనము తీసికొని తమకు సుఖముగా నుండుచోట నుండవచ్చును. బిడ్డలను మాత్ర మిచ్చుట విడిచి వెళ్ళవచ్చును."

తల్లిదండ్రులు పంపినధనము స్వీకరించి ఆమె వచ్చిన దూతలద్వారా బిడ్డలను పంపెను. వారు మాతామహునియింట పెరుగ జొచ్చిరి.

వారిలో క్షుద్రపంథకుడు చాలచిన్నవాడు. మహాపంథకుడు మాతామహునితో బుద్ధుని ధర్మోపదేశములు వినుటకు పోవుచుండెడివాడు. నిత్యము భగవానుని సన్నిధికి బోయి ధర్మోపదేశములు వినుటచే అతడు సాధువు కాగోరెను. "మీరు ఆనతిచ్చినచో నేను భిక్షువు నగుదును" అని అత డొకనాడు తాతతో అన్నాడు.

"నాయనా, ఏ మన్నావు? అందరప్రవ్రజ్యముకంటె నీ ప్రవ్రజ్యము శ్రేష్ఠ మయినది. నీవు నిభాయించుకొన గలిగినచో సాధువు కమ్ము" అని ఆయన వానిని బుద్ధునికడకు గొనిపోయెను.

"ఏమి మహాశ్రేష్ఠీ, పుత్రుడు లభించెనా?" అని బుద్ధు డడిగెను.

"చిత్తము భన్తే! ఈబాలకుడు నామనుమడు. తమ సన్నిధిలో సాధువు కాగోరుచున్నాడు."

బాలుని ప్రవ్రజితుని చేయు మని బుద్ధుడు ఒకానొక పిండపాతిక భిక్షువున కాన తిచ్చెను. స్థవిరు డాబాలునకు త్వచ్ - పంచక - కర్మ స్థానము తెలిపి ప్రవ్రజితుని చేసెను.

అతడు బుద్ధునివలన ఎన్నో యుపదేశములు గ్రహించి ఇరువది సంవత్సరముల వయస్సుననే ఉపసంపద పొందెను. పిమ్మట బాగుగా మనసు నిలిపి అభ్యాసము చేయుచు అర్హత్త్వము పొందెను. ధ్యాన సుఖములోను, మార్గసుఖములోను కాలము గడపుచు "ఈసౌఖ్యము క్షుద్రపంథకునకుగూడ కల్పింపగలనా?" అనుకొని, మాతామహు డగు శ్రేష్ఠికడకు బోయి "మహాశ్రేష్ఠీ, మీకు సమ్మతమగుచో ఈబాలుని కూడ ప్రవ్రజితుని చేయుదును" అని చెప్పెను.

"భన్తే, ప్రవ్రజితుని చేయుడు."

స్థవిరుడు క్షుద్రపంథకుని ప్రవ్రజితుని చేసి, దశశీలములలో స్థాపించెను. అతడు శ్రమణప్రవ్రజ్య పొందిన పిదప మందబుద్ధి యయ్యెను.

**పద్మములు, కోకనదములు, పరిమళించు**
**వికసనము నొందునో లేనివీక్షణమున**
**ఆకసంబున వెలుగొందు నట్టిసూర్యు**
**బోలు అంగీరసుని జూడు బుద్ధదేవు.**

ఈగాథను నాలుగు మాసములలోగూడ నేర్చికొనలేక పోయెను. ఈభిక్షువు పూర్వము కాశ్యపసమ్యక్ - సంబుద్ధుని సమయమున ప్రవ

జితుడై, తాను బుద్ధిమంతు డనుగర్వముచే, మందబుద్ధి యగుభిక్షువునకు బుద్ధవచనములు నేర్పునపుడు హేళన చేసెను. పరిహాసముచేత ఆ భిక్షువునకు చాల సిగ్గు తోచెను. ఆయనకు పాఠము జ్ఞప్తి లేకుండ పోయెను. ఆతడు స్వాధ్యాయము చేయజాలకుండెను. ఆకర్మకు ఫలితముగా ఈజన్మలో ఆభిక్షువు ప్రవ్రజితు డయినతోడనే మందబుద్ధి యయ్యెను. జ్ఞప్తియందుంచికొన్న పదము రెండవ పదము నేర్చునపుడు మరచిపోవు చుండెను. అప్పుడు ఒక్కగాథ నోట బట్టుటకు నాలుగుమాసములుగడిచెను. అప్పుడతనితో మహాపంథకుడు "పంథకా, నీవు ఈ ధర్మమునకు తగవు. నాలుగు నెలలకుగూడ నీకు ఒక్కగాథ నోట రాలేదు. ప్రవ్రజ్య- ఉద్దేశము నీ వేరీతిన పూర్తి చేయుదువు? ఇక్కడి నుండి పో" అని విహారము నుండి వెడల గొట్టెను.

బుద్ధ శాసనముమీది ప్రీతిచే క్షుద్రపంథకుడు గృహస్థు డగుట కిష్ట పడలేదు. మహాపంథకు డా కాలమున భోజనప్రబంధకుడుగా (భక్త-ఉద్దేసక) నుండెను. ఒకనాడు కౌమారభృత్య జీవకుడు (బుద్ధుని కాలమున ప్రసిద్ధ వైద్యుడు) చాల సుగంధమాల్యాదులతో తన – ఆమ్రవనమునకు బోయి, అక్కడ బుద్ధుని పూజించి, ఆయన ధర్మోపదేశము వినెను. ఆసనము నుండి లేచి, బుద్ధునకు ప్రణామము చేసి, మహాపంథకుని కడకు బోయి "భన్తే, ఈ రోజులలో భగవాన్ వెంట ఎందరు భిక్షుకు లున్నారు" అని యడిగెను.

"అయిదువంద లున్నారు."

"భన్తే, భగవానునితో అయిదు వందలమంది రేపు మా యింట భిక్ష స్వీకరింతురు గాక."

"ఉపాసకా, క్షుద్రపంథకు డను భిక్షువు మందబుద్ధి, మూఢుడు. అతనిని విడిచి. మిగిలినవా రందర నిమంత్రణము నేను స్వీకరించుచున్నాను" అని స్థవిరుడు పలికెను.

క్షుద్రపంథకు డిట్లు యోచించెను. స్థవిరుడు ఇందరు భిక్షుకుల నిమంత్రణమున కంగీకరించి, నన్ను మినహాయించుచున్నాడు. నిస్సందేహముగా నా సోదరుని మనస్సు నా యెడ విముఖమై యున్నది. ఇక నే నీ శాసనమున నుండుటవలన లాభ మేమి? గృహస్థుడనై దానాది పుణ్యకార్యములు చేయుచు జీవితము గడపుదును.

అత డొకనాడు గృహ స్థగుకోరికతో వెడలిపోయెను. బుద్ధుడు ప్రాతఃకాలమే లోక విషయమై విచారించు నపుడు దివ్యజ్ఞానము వలన ఈ విషయము గ్రహించి, ముందుగానే పోయి క్షుద్రపంథకుడు పోవు మార్గములో (ఇంటివసారాలో) పచారు చేయుచుండెను. అతడు ఇలు వెడలి, బుద్ధుని గాంచి, దగ్గరకు బోయి వందనము చేసెను. క్షుద్రపంథకా, ఇప్పు డెక్కడికి బోవుచున్నావు?" అని ఆయన యడిగెను.

"భ న్తే, నాసోదరుడు నన్ను వెడలనడిచినాడు. కావున గృహస్థును కాబోవుచున్నాను."

"క్షుద్రాపంథకా, నీవు నాకడ ప్రవ్రజితుడ వయినావు. సోదరుడు నిన్ను వెడలగొట్టినప్పుడు నీవు నాకడ కేలరాలేదు? గృహస్థువై యేమి చేయుదువు? నాకడనే యుండుము" అని చెప్పి, అతనిని వెంట గొని, గంధకుటీ ద్వారమున గూరుచుండబెట్టి "ఓయీ, తూర్పు దిక్కుగా ముఖము పెట్టి, ఈవస్త్రఖండముమీద "రజోహరణం రజో హరణం" అని పలికి పరిమార్జనము చేయుచు, ఇక్కడనే కూరు చుండుము" అని పలికెను. తన బుద్ధిబలముచే నిర్మిత మైన పరిశుద్ధ వస్త్రఖండమును అతని కిచ్చి, ఉచిత సమయసూచన లభించిన పిదప, భిక్షు సంఘముతో పాటు జీవకుని యింటికి జని, పరచిన యాసనముపై గూరుచుండెను.

క్షుద్రపంథకుడు సూర్యుని కేసి చూచుచు, ఆ వస్త్రఖండమును రజోహరణం, రజోహరణం అని తుడుచుచు కూరుచుండెను. అట్లు తుడుచుచుండగా ఆ వస్త్రము మలిన మయ్యెను. "మొదట ఈ వస్త్రము పరిశుద్ధముగా నుండెను. నా శరీరస్పర్శ వలన ఇట్లు మలిన మయినది" అని యోచించి, సర్వసంస్కారములు అనిత్యములు అని భావన చేసి, సంస్కారక్షయ వ్యయములను విచారణ చేయుచుండగా నిదర్శన భావన (సమాధి) అతిశయించెను.

క్షుద్రపంథకుని చిత్తము సమాధిపై ఆరూఢ మైన దని బుద్ధుడు గ్రహించి "నీవు ఇట్లే యోచింపుము. నీ లోపల నున్న రాగాది మాలిన్యములను తొలగించు కొనుము" అని ఎదుట గూరుచుండి కాంతిని వెదజల్లుచున్నట్లు దర్శన మిచ్చి ఈ గాథలు పలికెను:

రజమన్నచో రాగరజ మగు గాని
ప్రబల ధూళీ రేణు పటలంబు కాదు,
రజ మన్న రాగ పర్యాయ వాచకము:
విహరింత్రు రజమును వీడి భిక్షుకులు
క్షపిత రజస్కుని శాసనమందు.

నిజముగా క్రోధమే రజ మగు గాని
ప్రబల ధూళీ రేణు పటలంబు కాదు,
రజమున కద్ది పర్యాయవాచకము:
విహరింత్రు క్రోధంబు వీడి భిక్షువులు
క్షపిత రజ్జస్కుని శాసనమందు.

నిజముగా మోహమే రజ మగు గాని
ప్రబల ధూళీ రేణు పటలంబు కాదు,
రజమున కద్ది పర్యాయ వాచకము:
విహరింత్రు మోహమున్ వీడి భిక్షువులు
క్షపిత రజస్కుని శాసనమందు.

గాథలు పూర్తి యయిన పిమ్మట, ప్రతిసంభిదా జ్ఞానముతో గూడ అర్హత్వము క్షుద్రపంథకునికి సంప్రాప్త మయ్యెను. తోడనే త్రిపిటక జ్ఞానముకూడ కలిగెను.

అతడు పూర్వజన్మమున రాజయి, నగర ప్రదక్షిణము చేయుచు, శిరసునుండి చెమట కారుటచే శుద్ధవస్త్రముతో తుడిచి 'కొనెను. వస్త్రము మలిన మయినది. ఈశరీరస్పర్శవలన పరిశుద్ధవస్త్రము తన పూర్వ స్వరూపమును గోలుపోయి, మలిన మయ్యె నని తలపోయగా అన్ని సంస్కారములు (నిర్మాణము) అనిత్యము లనియెడి అనిత్యబుద్ధి ఆతనికి కలిగెను. ఇందుచే ఈజన్మమున అతనికి అర్హత్వ ప్రాప్తిసాధన 'రజోహరణం' అయ్యెను.

కౌమార భృత్య జీవకుడు దక్షిణాజలము తెచ్చినాడు. బుద్ధుడు "జీవకా, ఇంకను విహారములో భిక్షు వున్నాడు" అని, చేతితో పాత్రను మూసెను. అప్పుడు మహాపంథుడు "భన్తే, ఇప్పుడు విహార ములో భిక్షు వెవ్వడును లేడు" అని పలికెను.

"ఉన్నాడు జీవకా!" అన్నాడు శాస్త.

"భన్తే, పోయి, విహారములో భిక్షు వున్నాడో లేడో చూడు" అని జీవకుడు ఒకనిని బంపెను.

"విహారములో భిక్షు వెవ్వడును లేడని నా సోదడు పలికినాడు. కాబట్టి విహారములో భిక్షువు లుండుట అతనికి చూపుదును" అని క్షుద్రపంథకుడు తలపోసి, ఆమ్రవన మంతయు భిక్షువులతో నింపెను. అందులో కొందరు భిక్షువులు చీవరకర్మ చేయుచుండిరి. కొందరు చీవరములకు రంగు వేయుచుండిరి. కొందరు చేరి పాఠము చదువు చుండిరి. ఈవిధముగా ఒకనివలె రెండవవాడు లేకుండ వేయిమంది భిక్షువులు నిర్మితు లయిరి. వచ్చినవాడు అనేక భిక్షువులను జూచి, తిరిగిపోయి, జీవకునితో "ఆర్యా, ఆమ్రవనమునిండ భిక్షువు లున్నారు" అని చెప్పెను.

**బహువిధంబుల తన్ను భాగించికొనుచు**
**పంథక భిక్షువు బహురూపములను**
**నింపియున్నా డామ్రవ నిష్కుటమందు.**

ఆ పురుషునితో బుద్ధుడు "విహారమునకు పోయి, శాస్త క్షుద్ర పంథకుని పిలుచుచున్నా డని చెప్పు" మనెను.

అతడు వెళ్ళి అట్లే చెప్పిన పిమ్మట, వేయికంఠముల నుండి నేను క్షుద్రపంథకుడను, నేను క్షుద్రపంథకుడను అను ధ్వనులు వినబడెను.

పురుషుడు తిరిగి వచ్చి "భన్తే, అందరును క్షుద్రపంథకులే" అని చెప్పినాడు.

"మంచిది, నీవు పోయి, ముందు క్షుద్రపంథకుడ నన్నవాని చేయి పట్టుకో. మిగిలినవారు అంతర్ధానము చెందుదురు."

పురుషు డాప్రకారమే చేసెను. అందరును అంతర్ధాన మొందిరి. స్థవిరునిమాత్ర మతడు వెంట గొని వచ్చెను. భోజనానంతరము బుద్ధుడు జీవకుని బిలిచి "జీవకా, క్షుద్రపంథకుని పాత్ర పట్టుకొమ్ము. అతడు నీ దానము నామోదించును" అని చెప్పెను.

జీవకు డావిధముగనే చేసెను. స్థవిరుడు సింహానాదము చేయుచు సింగపు కొదమవలె త్రిపిటక సారమును వెలువరించి అనుమోదించెను. బుద్ధుడు భిక్షు సంఘముతోపాటు ఆసనమునుండి లేచి, విహారము

నకు బోయెను. అక్కడ భిక్షువుల మాధ్యాహ్నిక సన్మానము ప్రదర్శించిరి. భగవాన్ ఆసనమునుండి లేచి గంధకుటీ ద్వారము నెదుట నిలిచి భిక్షుసంఘమునకు సుగతోపదేశ మిచ్చి, కర్మస్థానము (యోగ విధులను) చూపి భిక్షుసంఘము నుత్సాహపరచి, సువాసిత మైనగంధ కుటిలో ప్రవేశించి, దక్షిణపార్శ్వమున సింహశయ్యామీద పరుండెను. సాయంకాలము ధర్మసభలో భిక్షువులు గుమిగూడిరి. పరచిన యెఱ్ఱ బనాతువస్త్రముపై కూరుచుండి భగవాన్ బుద్ధగుణములను వర్ణించుచు ఇట్లు చెప్పెను: "ఆయుష్మంతులారా, క్షుద్రపంథకుని ప్రవృత్తి మహాపంథకునకు తెలియలేదు. అతడు నాలుగుమాసములలో ఒక్కగాథ యైనను కంఠస్థము చేయలేక పోయె నని మూఢు డని తలచి, విహారము నుండి ఇతనిని వెలుపలికి పంపినాడు. కాని సమ్యక్ సంబుద్ధుడు అతుల నీయ ధర్మరాజగుటచే ప్రాతఃకాల మధ్యాహ్న భోజనముల నడుమ అతనికి ప్రతిసంభిదాజ్ఞానముతో అర్హత్త్వమును ప్రసాదించినాడు. వానితోపాటు త్రిపిటక జ్ఞానముకూడ సంక్రమించినది. ఆహా! బుద్ధుల శక్తి ఎంతగొప్పది!"

అప్పుడు భగవాన్ ధర్మసభలో ఈవిధముగా సంభాషణ జరుగుట తెలిసికొని తానుగూడ నచ్చటికి బోవలె నని శయ్యామీదినుండి లేచి, నిండు ఎరుపు గల సంఘాటీ ధరించి, మెరపువలె మిలమిలలాడు పట్టీ కట్టుకొని, ఎఱ్ఱని కంబళివంటి చీవరముతాల్చి, సువాసిత మైనగంధకుటి నుండి వెలువడెను. మత్తమాతంగమును పరుగెత్తించు సింహమువలె, అనంతబుద్ధలీలతో గూడి శాస్త ధర్మసభలో ప్రవేశించెను. అక్కడ అలంకృత మండపమధ్యమున ఏర్పరచిన శ్రేష్ఠ బుద్ధాసనముపై కెక్కి, షడ్వర్ణముల బుద్ధకాంతులు ప్రసారించుచు సముద్రగర్భమును ప్రకాశింపజేయు యుగంధరపర్వత శిఖరస్థిత బాలసూర్యునివలె పీఠమధ్యమున విరాజిల్లెను. సమ్యక్ సంబుద్ధుడు వచ్చినంతనే భిక్షువులుసంభాషణలు మాని, మౌనము వహించిరి.

శాస్త మార్దవముతో మైత్రి పూర్ణచిత్తముతో పరిషత్తును చూచి యిట్లు తలపోసెను: "ఈపరిషత్తు చాల సుందరముగా దోచుచున్నది. ఎవరిచేతిలోను చాంచల్యము లేదు. ఊపిరి విడుచు చప్పుడు గాని తుమ్ము సవ్వడి కాని లేదు: ఎల్లరును బుద్ధుని యెడల సమాదరము

కలవారు; ఎల్లరును బుద్ధతేజః ప్రభావితులే. నేను కల్పము వరకును మౌనము వహించి యున్నచో, ఎవరును ముందుగా నోరెత్తరు. నేనే తొలుత సంభాషణ ప్రయత్నము చేయవలెను." ఇట్లు తలపోసి, తానే ప్రథమమున పలుక నిశ్చయించి, భగవాన్ మధుర బ్రహ్మస్వరమున భిక్షుకులను సంబోధించి "భిక్షుకులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు? ఏ మేమి నడచుచున్నది?" అని యడిగెను.

"భన్తే, ఇచ్చట మేము తలక్రిందులు సంగతులు ఏమియు మాటాడుట లేదు. మే మిచ్చట కూరుచుండి తమ గుణానువాదమే చేయుచున్నాము. క్షుద్రపంతకుని విషయము........" అని వా రనిరి. శాస్త వారిమాటలు విని "భిక్షుకులారా, ఈ జన్మములోనే నా వలన ధర్మమున మహత్త్వము క్షుద్రపంథకునికి కలగలేదు. పూర్వజన్మములో కూడ నావలన అతనికి భోగములలో (ఐశ్వర్యమున) మహత్తము లభించినది" అని పలికెను.

ఆ విషయము ప్రకటీకరింపు డని భిక్షువులు భగవానుని ప్రార్థించిరి. అప్పుడు భగవాన్ పూర్వజన్మమున మరుగుపడిగిన వృత్తాంతము నిట్లు ప్రకటీకరించెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠికులమున పుట్టి చుల్లక (చిన్ని) శ్రేష్ఠి యనుపేర పెరిగి పెద్దవాడయి శ్రేష్ఠిపదవిని పొందెను. ఆయన బుద్ధిమంతుడు, శకునశాస్త్రజ్ఞుడు. ఒకనా డాయన రాజసన్నిధికి బోవుచు త్రోవలో చచ్చిన యెలుకను జూచి నక్షత్రస్థానము గుణించి తెలివితేటలు గల యువకుడు దీనిని గొనిపోయి వ్యాపారము సాగించి వివాహితుడు కావచ్చు ననెను. అప్పుడు పేదరికములో నున్న మంచియింటిబిడ్డ డొకడు శ్రేష్ఠివాక్యము విని ఆయన తెలిసి మాటాడు వా డని తలచి, మూషికమును దీసికొని పిల్లికై ఒకానొక కొట్టులోవానికి విక్రయించినాడు. ఆ కానికి వచ్చిన బెల్లపుగడ్డను తీసికొని కుండెడు మంచినీరు పట్టుకొని పోయి అడవినుండి మరలి వచ్చు మాలాకారులను

జూచి ఒక్కొక్కనికి కొలదిగా బెల్లపుముక్క పెట్టి మంచినీరు పోసెను. ఒక్కొక్కడు గుప్పెడు పూవులు వాని కిచ్చినాడు. పుష్పము లమ్మి మరునాడు వాడు మరింత బెల్లపుగడ్డ కొని మంచినీటికుండ పట్టుకొని వెనుకటిచోటికి బోయెను. ఆనాడు మాలికాకారులు వానికి పూల మొక్క లిచ్చినారు. ఈప్రకారముగా వాడు ఎనిమిది కార్షాపణములు త్వరలో సంపాదించినాడు.

తరువాత నొకనాడు గాలి కొట్టి, వాన కురిసినది. రాజోద్యానములో ఎండుకొమ్మలు ఆకులు గాలికి రాలి నిండినవి. వానిని తొలగించు నుపాయ ముద్యానపాలకునకు తోచలేదు. ఈయువకుడచటికి బోయి కర్రలు కంప తన కిచ్చుపక్షమున తోట బాగు చేయుదు నని చెప్పెను. వాడు తోడనే సమ్మతించెను. చిన్నిసెట్టి శిష్యు డైనయీయువకుడు బాలు రాడుకొను చోటికి బోయి బెల్లపుముక్కలు పెట్టి వారిని తోటలోనికి గొనిపోయి తుక్కు ప్రోగు చేయించి ఉద్యానద్వారముకడకు జేర్పించెను. ఆసమయమున రాజ కుంభకారుడు భాండాదుల కాల్పునకై కట్టెలకొరకు పోవుచు ఆకుప్ప చూచి కొనిపోయెను. దాని విక్రయమువలన చిన్నిసెట్టి శిష్యునకు 26 కార్షాపణములు, కొన్ని చట్లు లభించెను. ఈప్రకారముగా క్రమేణ వానికి 24 కార్షాపణములు సమకూడెను. అప్పుడు వాని కుపాయము తోచెను. నగరద్వారమున కనతిదూరమున ఉదక భాండము లుంచి పానీయశాలలో 500 మంది తృణహారులకు వాడు నీరు పోసినాడు. "నీవు మాకు చాల మేలు చేసినావు. నీకు మేమేమి చేయుదుము?" అని వా రనిరి. "మీ తోడ్పాటు కావలసి వచ్చినప్పు డడుగుదును" అని యువకు డనెను.

అనంతరము చిన్నిసెట్టిశిష్యు డిటు నటు దిరుగుచు ఒకస్థలపథ వర్తకునితోను, ఒకజలపథ వర్తకునితోను పరిచయము సంపాదించినాడు. "రేపు 500 గుర్రములతో అశ్వవర్తకు డీనగరమునకు వచ్చును" అని స్థలపథ వర్తకుడు చెప్పగా చిన్నిసెట్టి శిష్యుడు తృణహారులవద్దకు బోయి "రేపు మీరు నాకు ఒక్కొక్కరు ఒక్కొక్క గడ్డిమోపు వేయవలెను. నామోపులు అమ్ముడుపోవువరకును మీరు సరుకు విక్రయింపరాదు" అని చెప్పెను. మంచి దని వారు 500 గడ్డి

మోపులు వాని యింటికడ బడవేసిరి. గుఱ్ఱాలవర్తకుడు గడ్డి యెచ్చటను లభ్యము కాకపోవుటచే చిన్నిసెట్టిశిష్యునికడ 500 గడ్డిమోపులను 1000 నాణెములకు కొనిపోయెను.

తరువాత కొలదిరోజులకు జలపథ వర్తకుడు వానితో "గొప్ప నావ రేవులోనికి వచ్చినది." అని చెప్పినాడు అప్పుడతనికి ఉపాయము తోచినది. ఎనిమిది కార్షాపణములకు చక్కగా నలంకరించిన బండిని గంట కింత యని బాడుగకు పుచ్చుకొని, వైభవముతో నౌకాశ్రయమునకు బోయి, అంగుళీయ ముద్రికను న్యాస ముంచి, నావను కొని, సమీపములో మంటపము నిర్మించి, లోపల కూర్చుండి తనపరివారముతో "బయటనుండి వర్తకులు వచ్చినపుడు వరుసగా మువ్వురు ప్రతీహారులు వారిని నాకడకు గొని రండు" అని చెప్పెను. నౌక రేవులోనికి వచ్చిన దని విని వారాణసినుండి 100 మంది వర్తకులు సరకులు కొనిపోవ వచ్చిరి. అంతకు మున్నే సర కంతయు యువకుడు విలిచినాడని విని యతనికడ కావర్తకులు పోయిరి. వెనుకటి సూచనచొప్పున వారిని మువ్వురుప్రతీహారులు లోపలకు గొనిపోయిరి. ఒక్కొక్క వర్తకుడు నౌకలో భాగమునకు వేయి చొప్పునను, యువకుని సరకునకు వేయిచొప్పునను ఇచ్చినాడు. ఈ ప్రకారముగా చిన్నిసెట్టిశిష్యుడు రెండులక్షలతో వారాణసికి మరలి వచ్చినాడు.

అనంతర మతడు లక్షముద్రలుకొని కృతజ్ఞతతో చిన్నిసెట్టి సన్నిధికి బోయెను. శ్రేష్ఠి "నాయనా, నీ కీధన మెట్లు లభించినది?" అని యడిగెను. "తమ రిచ్చిన యుపదేశమువలన నాలుగుమాసములలో లభించినది" అని యువకుడు మృతమూషికమును తీసికొన్నది మొదలు నాటి వరకును నడిచిన వృత్తాంత మంతయు తెలిపెను. సెట్టి అంతయును విని "వీని నితరులచేతులలో బడనీయ రాదు" అని తలచి ఎదిగియున్న తన పుత్రిక నతని కిచ్చి వివాహము చేసి, తన సర్వస్వమునుగూడ నొసగెను. చిన్నిసెట్టిమరణానంతరము యువకుడు శ్రేష్ఠి పదవి నొందెను. బోధిసత్త్వుడు తుదకు నిజకర్మానుసార మగు పదవిని పొందెను.

**చాల నల్పంబ యయ్యు మూలధనమ్ము**
**మతిమంతు డగువాడు, చతురు డౌవాడు**

స్వీయసంపద వృద్ధి చేసికొం జాలు,
ఊది రవ్వను జ్వాల యొనరించినట్లు.

భగవాన్ “భిక్షువులారా, ఈ జన్మమున క్షుద్రపంథకుడు నావలన ధర్మమున మహత్త్వము గాంచినాడు. పూర్వజన్మమున ఐశ్వర్యమును పొందినాడు” అని చెప్పి, ఈ ధర్మోపదేశమును స్పష్టపరచి, రెండుకథలు చెప్పి, పరిపోల్చి జాతకసారాంశ మును వెలువరించి చూపినాడు. ఆసమయమున క్షుద్రాంతేవాసి ఇచ్చటి క్షుద్ర పంథకుడు. క్షుద్రక మహాశ్రేష్ఠి నేనే” అని ముగించినాడు.

## 5 తండులనాలి జాతకము

ఈయుపదేశమును బుద్ధుడు జేతవనమున విహరించునపుడు లాల్ - ఉదాయీ స్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

మల్లపుత్రుడు ఆయుష్మాన్ దబ్బ ఆకాలమున సంఘభోజన ప్రబంధకుడుగా నుండెను. ప్రాతఃకాలమున భోజనమునకై యతడు శలాకలు పంచుటలో లాల్ ఉదాయీ స్థవిరునకు ఒకనాడు మంచి భోజనము, ఒకనాడు చచ్చుతిండి దొరకుచుండెను. మంచిభోజనము దొరకనినాడు ఆయన భోజనశాలలో భాగములు పంచుస్థానమున గడబిడ చేయును. “శలాక యిచ్చుట దబ్బనికే తెలియునా? మాకు తెలియదా?” అనును. శలాక లిచ్చుచోట అతడు కోలాహలము చేయుచుండుటచే శలాక లిచ్చుపని ఆయనకే యిచ్చి “అబ్బా, నీవే శలాకలు పంచుము” అనిరి. నాటినుండి యతడే సంఘమువారికి భోజనశలాక లిచ్చుచుండెను. ఇది మంచిభోజనార్థ మిచ్చు శలాక యని కాని ఇది సామాన్యభోజనార్థ మిచ్చు శలాక యని కాని ఆయనకు తెలియదు. ఇన్ని సంవత్సరముల భిక్షువులకు మంచిభోజనము

ఇన్ని వర్షముల భిక్షువులకు సామాన్యభోజన మిత్తు రను విషయము కూడ ఆయనకు తెలియదు. ఈస్థానమున ఈభిక్షు వుండును, ఈసీమలో ఈభిక్షువుండును అని నేలమీద కాని గోడమీద కాని ఆయన గీత గీయుచుండును. మొదటినా డిచ్చిన శలాకాస్థానమున మరునాడు భిక్షువులు హెచ్చుగా గాని, తక్కువగా గాని యుందురు. వారిసంఖ్య తగ్గినప్పుడు రేఖ క్రిందికి దిగును, అధిక మయినపుడు పైకి పోవును. ఆయన సీమను గమనింపక రేఖానుసారముగా శలాకలు పంచు చుండును. అప్పు డాయనతో భిక్షువులు "ఆయుష్మన్, లాల్ ఉదాయి రేఖ పైన ఉండనీ, క్రింద ఉండనీ. ఇన్ని వర్షముల భిక్షువులకు ఉత్తమ భోజనము, ఇన్ని వర్షములవారికి సామాన్యభోజనము అని ఏర్పాటు చేయుము" అందురు. "ఇట్లగుచో ఈ రేఖ అక్కడ నుండ నేల? నేను మిమ్ములను కొలదిగా విశ్వసింతును, ఈ రేఖనే విశ్వసింతును" అని లాక-ఉదాయీ కోపముతో ప్రత్యుత్తర మిచ్చుచుండును.

అంతట నూతనభిక్షుకులు శ్రమణులు ఆయనతో "ఆయుష్మన్, లాక్-ఉదాయీ, నీవు శలాకలు పంచుటవలన భిక్షువులకు లాభహాని కలుగుచున్నది. నీవు పంపకమునకు తగినవాడవు కావు. ఇచటినుండి కదలిపొమ్ము" అని ఆయనను అవలకు బంపిరి. అంతట శలాకాస్థాన మున కోలాహలము పుట్టెను.

విని బుద్ధుడు ఆనంద స్థవిరునితో "ఆనందా, శలాకాస్థానమున చాల కోలాహలముగా నున్నది. ఏమి యీసందడి?" అనెను. స్థవిరు డావిష యము తథాగతునకు తెలిపెను.

"ఆనందా, తనమూర్ఖతవలన లాల్ ఉదాయీ ఇప్పుడే కాదు, పూర్వముకూడ అన్యులలాభమును చెడగొట్టుచుండెను" అని శాస్త చెప్పగా, ఈవిషయమును స్పష్టము చేయు డని ఆనందుడు ప్రార్థించెను. భగవాన్ పూర్వజన్మమున మరుగుపడిన కథను ప్రకటీకరించెను.

## అతీత కథ

పూర్వము కాశీరాష్ట్రమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డాయన కర్ఘకారకు డయ్యెను. అతడు గుఱ్ఱములు, ఏనుగులు మొద లగువానికిని, నగలు బంగారము మొద

లైనవానికిని ధరలు కట్టుచుండును. తాను నిర్ణయించిన విలువప్రకారము సరకు లమ్మినవారి కిచ్చుచుండెను.

రాజు లుబ్ధు డగుటచే "అర్ఘకారకుడు విలువ కట్టుపద్ధతివలన త్వరలోనే నాసర్వస్వము క్షీణించిపోవును. కావున వేరొకనిని నియమింతును" అని తలపోసి, వాతాయనము తెరచి అంగణములోనికి జూచెను. మందమతి, లుబ్ధుడు నగు గ్రామీణు డాసమయమునకు గానబడెను. రాజు వానిని బిలువ నంపి, వస్తువులకు ధరలు కట్టగలవా? అని యడిగెను. చిత్తము, దేవా, అని వాడు విన్నవించెను. నిజధనరక్షణార్థము రా జామూఢుని అర్ఘకారకునిగా నియమించెను.

ఏనుగులకు, గుర్రములకు, తదితరవస్తువులకు ఆమూఢుడు యుక్తమైనవిలువ కాక తనకు తోచినవిలువ కట్టజొచ్చెను. అర్ఘకారకపదవియం దుండుటచే వానిమాటకే విలువ.

ఆరోజులలో ఉత్తరాపథమునుండి అశ్వవర్తకు డయిదువందల గుర్రములతో నచ్చటికి వచ్చెను. అర్ఘకారకుని రాజు పిలువ నంపి, గుర్రములకు ధర కట్టు మనెను. అయిదునూర్ల గుర్రములకు మానెడు బియ్యము ధర కట్టి వాడు అశ్వవణిజునకు వార్త పంపి, గుర్రాలను శాలలోనికి తోలించెను. ఆవర్తకుడు పూర్వ మర్ఘకారకు డైన బోధిసత్త్వుని కడకు జని, జరిగిన దంతయు వివరించి "ఏమి చేయుదు?" ననెను. ఆయన యిట్లు బోధించెను: "వానికి లంచ మిచ్చి, ఈసంగతి యడుగుము. మాగుర్రముల ధర మానెడుబియ్యము కదా? దానివిలువ యెంతో తెలిసికొన కుతూహలము కలదు. దానివిలువ యెంత యుండునో రాజసన్నిధానమున వివరింతురా? ఆత డంగీకరించినపక్షమున వానిని రాజసన్నిధికి గొనిపొమ్ము. నేనుగూడ నచ్చటనే యుందును."

బోధిసత్త్వునియుపదేశము ననుసరించి వర్తకుడు తోడనే చని, ఉక్తప్రకారముగా నడిగెను. వాడు సమ్మతించుటచే నిరువురు రాజప్రాసాదమునకు జనిరి. అచటికి బోధిసత్త్వుడు అమాత్యులును చనిరి. వర్తకుడు రాజుకు నమస్కరించి, "దేవా, 500 గుర్రములకు విలువ మానెడుబియ్య మనుమాట నేను కాదనను. అర్ఘకారకుని మానెడు బియ్యపుధర యెంతో దేవరవారు కనుగొందురు గాక" యని విన్న

వించెను. జరిగిన సంగతి యెరుగని రాజు అర్ఘకారకునితో "500 అశ్వముల మూల్య మెంత?" యనెను.

"మానెడుబియ్యము దేవా!" అని వాడు బదులు పలికెను.

"మంచిది. 500 గుర్రములు మానెడు చేయుచో మానెడుబియ్యపు ధర యెంత?" అని రాజడిగెను.

"వారాణసియు, తత్పరిసరములును" అని మూర్ఖుడు ప్రత్యుత్తర మిచ్చెను.

అమాత్యులు చప్పటులు చరచి వినోదముగా నవ్వి "పృథివియు, రాజ్యమును అమూల్యము లని నేటివరకును వినుచున్నాము. ఇప్పుడు వారాణసియు ప్రభువును మానెడుబియ్యము విలువ చేయుదు రని తెలిసికొన్నాము. అర్ఘకారకుని ప్రతిభ మహాద్భుతము! ఇంతకాలము వదలి యెట్లు నిలుపుకొన్నాడు! మనప్రభువున కతడు నిక్కముగా తగినవాడు!" అని పరిహాసము చేసిరి.

బోధిసత్త్వు డీగాథ పలికెను :

**పృచ్ఛ చేయుదుదొకో బియ్యపుగింజ**
**విలువ? వారాణసి విలువతో సమము.**
**ఐదునూర్ల హయమ్ము లాశ్చర్యముగను**
**ఈతండులకణమ్ముతో తుల్య మగును.**

అప్పుడు రాజు లజ్జ చెంది, ఆమూర్ఖుని పంపివేసి, బోధిసత్త్వునకు మరల నార్ఘకారపదవి యొసగెను. బోధిసత్త్వుడు కాలక్రమమున కర్మోచిత మగుపదమునకు బోయెను.

**ధర్మోపదేశానంతరము శాస్త రెండుకథలు చెప్పి, సరి పోల్చి, జాతకసారాంశము వెలువరించి, పాత్రలను నిరూపించి, ప్రసంగము ముగించెను.**

# 6 దేవధమ్మ జాతకము

**భగవాన్ జేతవనములో నుండగా ఒకానొక ధనిక-ఉపాసకుని గూర్చి చెప్పినకథ.**

## వర్తమాన కథ

ఇరువురు రాజకుమారులు జలపానార్థము సరోవరమునకు బోవగా, ఉదకరక్షస్సు వారిని పట్టుకొనును. మూడవయాతడు పోయి, దేవ ధర్మము నిరూపించి, సోదరులను రక్షించును.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డాయన పట్టమహిషి కడుపున బుట్టి, నామకరణోత్సవము నాడు మహీంశాసకు డని పేరు పొందెను. బాలు డటు నిటు పరుగిడు నాటికి రాజు కింకొక కుమారుడు కలిగెను. అతనికి చంద్రకుమారు డని పేరు పెట్టిరి. వా డాటలాడునాటికి తల్లి చనిపోయెను. అగ్రమహిషీ స్థానమున వేరొకయువతిని రాజు ప్రతిష్ఠించెను. ఆమెయెడ రాజుకు మిక్కిలిప్రీతి. వారియనురాగఫలితముగా మగశిశువు గలిగెను. వానికి సూర్యకుమారు డని పేరు పెట్టిరి. బిడ్డని జూచి రాజు సంతుష్టచిత్తుడై భార్యను "భద్రురాలా, నీ కేమివరము కావలెను?" అని యడిగెను. తనకు నలసినప్పుడు వర మడుగుదు నని యామె చెప్పెను. పుత్రుడు పెరిగి పెద్దవా డయిన పిమ్మట రాజుతో నామె "దేవా, పుత్రజననా నంతరము మీరు నాకు వర మిచ్చినారు. అతనికి రాజ్య మనుగ్ర హింపు" డనెను. "అగ్నివలె ప్రకాశించుకుమారు లిరువు రున్నారు. నీపుత్రునకు రాజ్య మె ట్లిత్తును?" అని రాజు పలికెను. కాని ఆమె మాటిమాటికిని వేడుచున్నందున అనుమానించి "ఈమె నాకుమారుల కపకారము చేయు" నని యూహించి, కుమారులను బిలువ నంపి "నాయనలారా, సూర్యకుమారుడు పుట్టినప్పుడు వానితల్లికి వర మిచ్చి నాను. ఇప్పు డామె వానికై రాజ్యము కోరుచున్నది. నేను ఈయ దలపలేదు. సవతితల్లులు స్వభావసిద్ధముగా మంచివారు కారు. ఆమె

మీా కపకారము తలపెట్టును. కావున మీా రరణ్యమునకు బోయి, నాయనంతరము వచ్చి కులక్రమాగతమైన రాజ్యమును పరిపాలింపుడు" అని కన్నీరు విడుచుచు, పుత్రుల శిరస్సు మూర్కొని పంపెను.

వారు తండ్రికి నమస్కరించి ప్రాసాదమునుండి వెడలునప్పటి కంగణములో నాడుచున్న సూర్యకుమారుడు వారిని జూచి, సంగతి తెలిసికొని తానుకూడ వెంట వత్తు నని వారివెంట జనెను. ముప్పురును హిమవత్ప్రదేశమును జేరిరి. బోధిసత్త్వుడు మార్గముప్రక్కన వృక్షచ్ఛాయలో గూరుచుండి సూర్యకుమారునితో "బాబా, ఆసరోవరమునకు బోయి స్నానపానములు కానిచ్చి, పద్మపత్రములో మాకు పానీయము తెమ్ము." అని చెప్పెను.

ఆసరస్సు ననుగ్రహించినప్పు డుదకరక్షస్సునకు వైశ్రవణు డిట్లు చెప్పెను. "దేవధర్మ మెరిగినవాడు తప్ప ఇతరులు సరస్సులో దిగినచో నీవు వారిని భక్షింపవచ్చును. నీటిలో దిగనివారిని భక్షింపలేవు." నాడుమొదలు ఆసరస్సులో దిగినవారిని దేవధర్మమును గూర్చి యడిగి, తెలియ దన్నచో రాక్షసుడు భక్షించుచుండెను. ఇప్పుడు సూర్యకుమారుని సరసులో రాక్షసుడు పట్టుకొని, దేవధర్మము తెలియునా యని యడిగెను. 'దేవధర్మ మనగా సూర్యచంద్రు' లన్నాడు రాజకుమారుడు. నీకు తెలియ దని రాక్షసు డతనిని నీటిలో నిజనివాసమున బంధించినాడు. ఎంతకును సూర్యకుమారుడు రాలే దని బోధిసత్త్వుడు చంద్రకుమారుని బంపినాడు. రాక్షసు డతనిని బట్టుకొని, 'నీకు దేవధర్మము తెలియునా?' అని యడిగెను. 'ఆ, తెలియును. దేవధర్మ మనగా నాలుగుదిక్కులు' అన్నాడు కుమారుడు. నీకు దేవధర్మము తెలియ దని రాక్షసు డతనిని నిజనివాసమున బంధించినాడు.

ఎంతసేపటికిని వా రిరువు రాకుండుటచే బోధిసత్త్వుడు లేచి ఏదో యంతరాయము ఘటిల్లియుండు నని సరస్సుకడకు బోయి, వారికాలి యడుగుజాడలు నీటివరకును కనబడుచుండుటచే ఉదకరక్షస్సు వారిని బట్టుకొని యుండు నని యూహించి, ఖడ్గము దూసి, ధనుస్సు పట్టుకొని నిలిచెను. ఆయనకు నీటిలో దిగునుద్దేశము లే దని రక్షస్సు గ్రహించి వనకర్మకారుని రూపమున "ఏ మయ్యా, నీవు మార్గశ్రమ చెందినావు. సరస్సులో దిగి, స్నానము చేసి, నీరు త్రాగి, బిసనాలములు తిని,

పుష్పములు దాల్చి, యథాసుఖముగా వెళ్ళ వేమి?" అని యడిగెను. బోధిసత్త్వు డతనిని పరికించి, యక్షుడు కావచ్చు నని తలచి, 'నీవు నాసోదరులను బంధించినావు' అన్నాడు.

"అవును"

"ఎందుచేత?"

"ఈసరస్సులో దిగువా రందరు నాసొత్తు."

"ఎల్లరునా?"

"దేవధర్మము తెలిసినవారు తప్ప తక్కినవా రెల్లరు."

"దేవధర్మ మెరుగ గోరుదువా?"

"అవును."

"అట్లయినచో నేను చెప్పెదను."

"చెప్పుము, విందును"

"దేవధర్మములను వివరింతును. కాని ప్రయాణపుబడలిక చెంది యున్నాను."

అప్పుడు యక్షుడు బోధిసత్త్వునికి స్నానము చేయించి, అన్నపానము లొసగి, పుష్పములతో నలంకరించి, గంధ మలది, అలంకృత మండల మధ్యమున పర్యంకముమీద గూరుచుండ బెట్టెను. యక్షుని తన పాదములకడ గూరుచుండ బెట్టుకొని బోధిసత్త్వుడు "వినుము. నీకు నిజముగా దేవధర్మములు వినిపింతు" నని యీగాథ పలికినాడు:

**స్వచ్ఛాంతరంగులు, శాంతమానసులు**
**పాపభీతులు నగు పావనజనులె**
**స్తవము గాంతురు దేవధర్ము లటంచు.**

యక్షుడు విని సంప్రీతుడై "పండితోత్తమా, ప్రసన్నుడ నైతిని. నీసోదరులలో నొకని నిత్తును. ఎవనిని తెత్తును?" అనెను.

"చిన్నవానిని తెమ్ము."

"పండితోత్తమా, నీకు దేవధర్మము మాత్రము తెలియును, కాని ఆప్రకారము ఎందువలన ప్రవర్తింపవు" అన్నాడు యక్షుడు.

"పెద్దవా డుండగా చిన్నవానిని తె మ్మన్నావు."

"నాకు దేవధర్మము తెలియుటే కాదు, ఆచరించుచున్నాను.

ఈ చిన్నవానికోసమే అరణ్యములో ప్రవేశించినాము. ఇతనికొరకే ఈతనితల్లి మాతండ్రిని రాజ్యమడిగినది. ఆయన అంగీకరింపక మే మరణ్యములో నివసించుట కంగీకరించినాడు. ఈబాలుడు మావెంట వచ్చినాడు, వెనుకకు పోవడు. యక్షు డితనిని భక్షించినా డని చెప్పినచో ఎవ్వరు నమ్మరు. కావున నితనినే విడిపింపుము. మా కప వాదభయ ముండదు.''

''పండితోత్తమా, బాగు బాగు! దేవధర్మము తెలిసియుండుటయే కాక ఆచరించుచున్నావు'' యని యక్షు డాయనను ప్రశంసించి యిరు వురు సోదరులను తెచ్చి యిచ్చెను. బోధిసత్త్వుడు యక్షునితో ''మిత్రమా, నీవు పూర్వము చేసిన పాపకర్మవలన యక్షుడవై యిప్పుడు మరల పాపకర్మలు చేయుచున్నావు. పాపవిముక్తుడ వగు టకు యత్నింపకున్నావు. నేటినుంటి పాపకృత్యములు మాని కుశల కర్మలు చేయుము'' అని బోధ చేసి మార్పు కలిగించి తత్పరిపాలిత ప్రదేశమున సోదరులతో నివసించుచుండెను.

అత డొకనాడు నక్షత్రములు చూచి, తండ్రి మరణించుట గ్రహించి యక్షుని గొని వారణాసికి జని, రాజ్యము స్వీకరించి చంద్రకుమారుని యువరాజును, సూర్యకుమారుని సేనాపతిని చేసెను. యక్షునకు రమ ణీయస్థానమున ఆయతనము కట్టించి, పుష్పములు, భోజనపదార్థములు తగినవి లభించునట్లు ఏర్పాటు చేసినాడు. బోధిసత్త్వుడు ధర్మ మార్గమున పరిపాలనచేసి తుదకు యథా కర్మం గతో.

**ధర్మోపదేశము చేసి, సత్యములను బోధించి, సోదరులు ప్రథమమార్గఫలము పొంది రని చెప్పి, సర్వజ్ఞుడైన బుద్ధుడు రెండుకథలను తెలిపి, సరి పోల్చెను. ధనిక-ఉపాసకుడు ఉదకరక్షస్సు, ఆనందుడు సూర్యకుమారుడు, సారిపుత్రుడు చంద్రకుమారుడు, నేను మహీశాసకుమారుడను అని ముగించెను.**

# 7 కట్ఠహారి జాతకము

**శాస్త జేతవనమున నుండగా వాసభఖత్త్య కథనుగూర్చి చెప్పినది. ఆకథ వింశతి నిపాతములో భద్దశాల జాతకమున (465) కానవచ్చును.**

## వర్తమాన కథ

యాదృచ్ఛికముగా కలిగిన కుమారుని రాజు గుర్తింపడు. తల్లి బిడ్డని ఆకసమున కెగుర వేయును. అతడు రాజపుత్రుడు కానిచో క్రింద బడి చనిపోవు నని చెప్పును. బాలుడు అంతరిక్షమున నిలిచియుండగా, అతనిని రాజు తన కుమారునిగా నంగీకరించును.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచు, ఒకనా డుద్యానమునకు బోయి ఫలపుష్పములకయి విచరించుచు, పుల్లలేరుచు పాట పాడుచున్న యువతిని జూచి, ప్రతిబద్ధచిత్తుడై ఆమెతో కాల క్షేపము చేసెను. తక్షణమే బోధిసత్త్వు డామెకడుపున బడినాడు. వజ్రాయుధభార మంతభారము తోపగా నామె గర్భవతి యయినట్లు గ్రహించి ఆవిషయము రాజుతో జెప్పెను. రాజు అంగుళీయముద్రిక నిచ్చి "ఆడుబిడ్డ పుట్టినచో దీనితో దానిని పోషింపుము. కుమారుడు పుట్టినపక్షమున ముద్రికాసహితముగా నాకడకు గొనిరమ్ము" అని చెప్పి పంపెను.

యుక్తసమయమున బోధిసత్త్వుడు జన్మించెను. అతడు పెరిగి యటు నిటు పరుగెత్తుచు ఆట లాడుకాలమున కేళీమండలములో "తండ్రి లేనివాడు కొట్టినాడు" అని కేకలు బయలుదేరెడివి. ఒకనాడు బోధి సత్త్వుడు తల్లికడకు పరుగెత్తి "అమ్మా, నాయన యెవరు?" అని యడిగెను.

"నీవు కాశీరాజు కుమారుడవు"

"దీనికి నిదర్శన మేమున్న దమ్మా!"

"నాయనా, రాజు వెడలిపోవుచు ఈయుంగర మిచ్చి, ఆడుబిడ్డ యయినచో దీనితో పోషణ చేయుము. కుమారు డయినచో ముద్రికా

సహితముగా నావద్దకు గొనిరమ్ము అని చెప్పినాడు."

"అయినచో, నన్ను తండ్రివద్ద కేల తీసికొని పోవు తల్లీ?"

కుమారుని పట్టుదలను గ్రహించి యామె బాలునితో రాజ ద్వారము జేరి ప్రభువునకు తనరాక తెలియపరచెను. రాజు తనను లోనికి బిలిపించిన తర్వాత నామె నమస్కారము చేసి, "దేవా! ఇతడు మీకుమారుడు" అని విన్నవించెను.

ఆవాక్కు సత్యమని తెలిసినను పేరోలగమున నున్నరాజు సిగ్గు పడి "ఇతడు నాకుమారుడు కాడు" అనెను. "ఇదిగో, మీముద్రిక, దీనిని గుర్తింపుడు" అని యామె పలికెను. "ఇది నాముద్రిక కాదు" అని రాజు పలుకగా నామె "ఋజువు చేయుటకు నాకు సాక్షులు లేరు. సత్యముననే విన్నవించుకొందును. ఇతడు మీబిడ్డ డయినచో ఆకస మున కూరుచుండును. కానిచో క్రింద బడి మరణించును" అని బోధి సత్త్వునికాలు పట్టుకొని గాలిలోని కెగురవేసెను. బోధిసత్త్వుడాకాశ మున పర్యంకబంధమున కూరుచుండి, మధురస్వరమున తండ్రికి ధర్మము బోధించు నీగాథ పలికినాడు :

**నీతనూజాతుండనే మహారాజ,**
**పోషింపుమా నన్ను! భూనాయకుండు**
**అన్యుల రక్షించు ననుకంపతోడ**
**పోషింప దగు నిజపుత్రు మరింత.**

బోధిసత్త్వు డాకాశమున నిషణ్ణు డయి బోధించిన ధర్మమును విని రాజు "నాయనా, నేనే పోషింతును, నేనే పోషింతును" అని చేతులు చాపెను. అన్యులు చాపినచేతులలోనికి బోవక, రాజుచేతులలోనికే దిగి, అంకమున బాలుడు కూరుచుండెను. రా జతనిని యువరాజు గాను, వానితల్లిని అగ్ర మహిషిగాను గ్రహించినాడు. తండ్రి మరణా నంతరము బోధిసత్త్వుడు కాష్ఠవాహన రా జనుపేర ప్రసిద్ధి చెంది, న్యాయపరిపాలనము చేయుచు తుదకు కర్మానుసార మగుపదవిని జేరి నాడు.

**ధర్మోపదేశము చేసి (కోసలరాజునకు) శాస్త రెండుకథలు చెప్పి, పరిపోల్చి, జాతక సారాంశమును స్పష్టపరచెను. మహామాయ ఆరోజులలో బాలునితల్లి, సిద్ధార్థుడు తండ్రి, నేను కట్టవాహన రాజును అని ముగించెను.**

# 8 గామని జాతకము

**భగవాన్ జేతవనమున నుండగా శ్రద్ధాళువు కాని సోదరుని గూర్చి చెప్పినది. ఈజాతకమున ప్రత్యుత్పన్నవస్తువు, అతీతవస్తువు ఏకాదశ నిపాతమున సంవరణ జాతకములో (462) కానవచ్చును. రెండిటిలోను వస్తువులు సమానము, గాథలు మాత్రము భిన్నములు.**

## వర్తమాన కథ

గామని రాజకుమారుడు చిన్నవాడయినను సోదరసహస్ర పరివృతుడై, రాజలాంఛన మైన శ్వేతాతపత్రముక్రింద కూరుచుండి, తన వైభవమును తలపోసి, విభవ మంతయును నాగురువువలన లభించినది అని భావించి, ఆనందముతో మనఃపూర్వముగా ఈవాక్కు లన్నాడు. అతడు రా జయిన సప్తాహమునకు సోదరులు తమతమనివాసములకు జనిరి. గామని ప్రభువు న్యాయపరిపాలనము చేయుచు తుదకు యథాకస్మం గతో. బోధిసత్త్వుడుకూడ యథా కస్మం గతో.

## అతీత కథ

శ్రద్ధ లేని సోదరునిగూర్చి శాస్త జేతవనమున చెప్పినకథ. ఈజాతకములోని యుపోద్ఘాతకథ, పూర్వజన్మకథ పదునొకండవ నిపాతములోని సంవరణ జాతకమున (462) చెప్పబడును. రెండిటిలోని కథలు సమానములే, గాథలలో మాత్రము భేదము కలదు.

బోధిసత్త్వుని యుపదేశప్రకారము ప్రవర్తించుచు గామని రాజకుమారుడు నూర్గురిలో చివరవాడైనను శ్వేతచ్ఛత్రముక్రింద సింహాసనాసీనుడై, తనవైభవమును గమనించి, అది యంతయు ఆచార్యుని యనుగ్రహమువలన లభించిన దని తలపోసి, నిండుహృదయముతో ఈగాథ పలికినాడు:

**త్వర పడకుండెడి వారల హృదయ**
**కాంక్ష పూర్ణం బగు గ్రామణీ, నిన్ను**
**గ్రహించుమో నిండుబ్రహ్మచారినిగ.**

ఆతడు రా జయినపిదప సప్తాహమునకు సోదరు లందరు తమతమ నివాసములకు వెడలిపోయిరి. గామని ప్రభువు ధర్మమార్గమున పరిపాలన చేసి, నిజకర్మానుసార మగుపదవిని పొందెను.

**ధర్మోపదేశము చేసి శాస్త్ర సత్యములు నిరూపించి, రెండుకథలు చెప్పి, పరిపోల్చి జాతకసారాంశము తెలిపి, పాత్రలను నిరూపించినాడు,**

## 9 మఖాదేవ జాతకము

**శాస్త్ర జేతవనమున విహారము చేయు సమయమున మహానిష్క్రమణమును గూర్చి చెప్పినది.**

### వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు కూరుచుండి గృహత్యాగమునుగూర్చి ప్రశంస చేయుచుండిరి. శాస్త్ర ధర్మసభకు వచ్చి, బుద్ధాసనముపై గూరుచుండి, భిక్షువులను సంబోధించి "భిక్షుకులారా, కూరుచుండి సంభాషించుచున్నారా?" అని యడిగెను.

"భన్తే, మ రేమియు లేదు. తమ-అభినిష్క్రమణమును ప్రశంసించు చున్నాము."

"భిక్షుకులారా, తథాగతుడు ఇప్పుడే అభినిష్క్రమణము చేయలేదు; పూర్వముకూడ చేసియున్నాడు."

ఈవిషయము స్పష్టము చేయుటకై వారు ప్రార్థన చేసిరి. పూర్వజన్మమున మగుపడి యున్నవృత్తాంతమును భగవాన్ ఇట్లు స్పష్టీకరించాడు :

### అతీత కథ

పూర్వము విదేహరాజ్యములోని మిథిలానగరమున మఖాదేవు డను ధార్మిక ప్రభువు న్యాయపరిపాలనము చేయుచుండెను. 84000 సంవత్సర

ములలో కొన్నాళ్ళతడు రాజకుమారుడుగను, కొంతకాలము యువ రాజుగను, పిమ్మట మహారాజుగను కాలము గడపెను. ఒకనాడాయన అంబష్ఠునితో "సౌమ్యా, నాశిరసున తెల్లవెండ్రుక కనబడినపుడు తెలుపుము" అనెను. బహుకాలమున కొకనాడా మంగలి రాజుగారి నల్ల వెండ్రుకలలో నొక తెల్లని వెండ్రుక చూచి "దేవా, మీశిరస్సున శ్వేత కేశము కానవచ్చినది" అని విన్నవించెను. "దానిని లాగి నాయర చేతిలో పెట్టు" మని రాజుపలికెను. మంగలి బంగరుతంటసముతో ఆప లితకేశమును లాగి రాజుచేత బెట్టెను. ఇంకను రాజు 84000 సంవత్స రములు జీవింపవలసియుండెను. అయినను మఖాదేవుడు పలితకేశమును జూచి, యుద్వేగము చెంది, మృత్యుదేవత వచ్చి సమీపమున నిలిచి నట్లును, మండుచున్న పర్ణశాలలో తాను ప్రవేశించినట్లును బాధపడి, "ఓయి మూర్ఖమఖాదేవా, పలితము ప్రారంభించినను మాలిన్యము విడువలేకున్నావు!" అని తనను తాను మందలించుకొనుచుండగా నతని కంఠగ్రాహము పుట్టెను, మేన చెమటలు పోసెను, వస్త్రములు భార ముగా దోచెను. "ఇక నేను సంసారము త్యజించి, పరివ్రాజకుడ నయ్యెదను" అని తలపోసి, లక్ష ఆదాయము వచ్చు గ్రామము మంగలి కిచ్చి, పెద్దకుమారుని బిలిపించి, "నాయనా, నాతల నెరయుచున్నది, వృద్ధుడ నయినాను, లౌకికభోగము లన్నియు ననుభవించినాను. ఇక దివ్యభోగము లనుభవింప గోరుదును: నిష్క్రమించు సమయము వచ్చినది. నీవు రాజ్యమును స్వీకరింపుము. నేను పరివ్రాజకుడనై మఖా దేవ - ఆమ్రవనమున నివసించుచు, శ్రమణధర్మము నిర్వర్తింతు" నని చెప్పెను.

ప్రవ్రజింపదలచిన రాజును అమాత్యులు సమీపించి, "దేవా, మీరు శ్రమణధర్మము నవలంబించుటకు కారణ మేమి?" అని యడి గిరి. రాజు తెల్లవెండ్రుక చేత బట్టుకొని, అమాత్యుల కీగాథ చెప్పెను:

**ఆయువు హరియించు నట్టికేశములు**
**దేవదూతలవలె తెల్లవర్ణమున**
**ఉత్తమాంగముమీద నుదయించె తాత,**
**ప్రాప్త మయ్యెను వేళ ప్రవ్రజింపంగ.**

ఇట్లు పలికి, ఆనాడే రాజ్యము విడిచి, పరివ్రాజకుడై యాతడు

ఆమ్రవనములో నివసించుచు 84000 సంవత్సరముల కాలము, నాలుగు బ్రహ్మవిహారములను భావించుచు, అపరిహీనజ్ఞానముతో కాలము గడిపి బ్రహ్మలోకమున జన్మించెను.

అక్కడనుండి చ్యుతి పొంది, మరల నతడు మిథిలలోనే నిమి యను పేర రాజయి, చెదరియున్న తనవంశము నేకీభూతము చేసి, క్రమ్మర పరివ్రాజకుడై, బ్రహ్మవిహారములు భావించి, ఆమ్రవనములోనే నివసించి తుదకు బ్రహ్మలోకము పొందెను.

**"భిక్షుకులారా, తథాగతుడు కేవల మీజన్మలోనే మహాభినిష్క్రమణము చేయలేదు; పూర్వముకూడ అభినిష్క్రమణము చేసినాడు" అని శాస్త్ర ధర్మోపదేశము చేసి నాలుగు ఆర్యసత్యములను ప్రకాశింపజేసెను. అప్పుడు కొందరు స్రోతాపన్నులయిరి; కొందరు సకృదాగాములు, మరికొందరు అనాగాములు నయిరి. ఈవిధముగా భగవాన్ రెండుకథలను చెప్పి, సరి పోల్చి, జాతకసారాంశము వెలువరించెను. ఆకాలపుమంగలి ఇప్పటి ఆనందుడు, పుత్రుడు రాహులుడు, మఖాదేవ రాజు నేనే.**

## 10 సుఖవిహారి జాతకము

**అనూపియ నగరసమీపమున నున్న అనూపియ ఆమ్రవనమున విహరించుచున్న సమయమున భగవాన్ సుఖపూర్వక విహారము చేయు భద్దియ స్థవిరుని గూర్చి చెప్పినది.**

### వర్తమాన కథ

సుఖపూర్వకముగా విహరించు భద్దియ స్థవిరుడు ఆరుగురు క్షత్రియులు, ఏడవ ఉపాలి ప్రవ్రజించుసమయమున ప్రవ్రజితు డయ్యెను. ఆయేడుగురిలో భద్దియ స్థవిరుడు, కింబిల స్థవిరుడు, భృగు స్థవిరుడు, ఉపాలి స్థవిరుడు అర్హత్వము పొందిరి. ఆనంద స్థవిరుడు స్రోతాపన్నుడయ్యెను. అనిరుద్ధ స్థవిరునకు దివ్యచక్షువు లభించెను. దేవదత్తునకు

ధ్యానలాభము కలిగెను. అనూపియ నగరపు క్షత్రియు లారుగురికథ ఖండహాల జాతకమున (542) వచ్చును. ఆయుష్మాన్ భద్దియ రాజ్యము చేయు సమయమున తనరక్షణకొరకు రక్షకులను, కొందరు ఆరక్షకులను వెంట నుంచికొనెడువాడు. సౌధమున మీాదియంతస్తులో పెద్దశయన మున దొరలునపుడు కూడ తాను భీతు డగుసంగతి స్మరించి, ఇప్పుడు అర్హత్త్వము పొంది అరణ్యములలో ఎచ్చట నైనను విహరించుచు నున్నను భయము లేకుండుట చూచికొని, ప్రసన్నతతో అహో సుఖం అహో సుఖం అనుచుండెడివాడు.

ఇది విని భిక్షువులు భగవానునితో "ఆయుష్మాన్ భద్దియ అర్హ త్త్వము పొందుట చెప్పియున్నాడు" అన్నారు.

భగవాన్ "భిక్షువులారా, భద్దియ కేవల మిప్పుడే సుఖప్రాప్తక ముగా విహరించువాడు కాడు; పూర్వకాలమున కూడ నింతే" అన్నాడు. ఆవిషయము స్పష్టము చేయు డని భిక్షువులు ప్రార్థింపగా, పూర్వజన్మమున మరుగుపడి యున్నవిషయమును భగవాన్ స్పష్టీక రించినాడు.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఉదీచ్యబ్రాహ్మణుడై పుట్టినాడు. కామములవలని దోష ములను, త్యాగములవలని శుభములను గ్రహించి యాతడు కామము లను విసర్జించి, హిమవంతమునకు జేరి, ప్రవ్రజించి, అష్టసమాపత్తులను సంపాదించెను. ఆయన కయిదువందల తాపస పరివార మేర్పడెను. ఆయన వర్షాకాలమున హిమవంతమునుండి వెలువడి తాపసగణపరి వృతుడై భిక్షాటనము చేయుచు గ్రామములు, నగరములు దాటి, తుదకు వారాణసికి వచ్చి రాజాదరము పొంది రాజోద్యానమున నివాస మేర్పరచుకొనెను. చాతుర్మాస్య లచ్చట గడిపి, ఆయన బయలుదేరునపుడు రాజుతో చెప్పబోయెను. "ఆర్యా, మీారు వృద్ధులు. హిమాలయమునకు బోవ నేల? అంతేవాసుల నచటికి బంపి, మీా రిచటనే నిలువుడు" అని రాజు కోరెను. బోధిసత్త్వుడు

తాపసపంచశతమును జ్యేష్ఠాంతేవాసి కప్పగించి "వీరితో నీవు హిమవంతమునకు బొమ్ము. నే నిచటనే నిలుతును" అని అచటనే నిలిచెను.

ఆ జ్యేష్ఠశిష్యుడు పూర్వము రాజు; కాని రాజ్యము విడిచి పరివ్రాజకు డయి, క్రమసాధనవలన అష్టసమాపత్తులను పొందినాడు. ఒకనా డాయన ఆచార్యదర్శన కుతూహలియై తాపసులను బిలిచి "ఉత్కంఠ లేకుండ మీ రిచటనే యుండుడు. ఆచార్యునకు నేను వందనము చేసి వత్తును" అని చెప్పి, ఆచార్యునిసన్నిధికి బోయి, వందనము చేసి, ఇష్టాగోష్ఠి చేసి, ఆచార్యునిపార్శ్వమున చాపమీద పండుకొనెను.

ఆసమయమున రా జుద్యానమునకు బోయి, ఆచార్యునకు నమస్కరించి, ఒకప్రక్కన గూరుచుండెను. శిష్యతాపసుడు రాజును జూచియు లేవక, పండుకొనియుండి, అహో సుఖ మహో సుఖ మని ఆవేశముతో బలికెను.

తనను జూచియు తాపసుడు లేవలే దని రాజు దుర్మనాయితు డయి, బోధిసత్త్వునితో "భదంతా, ఈతాపసు డిచ్చ వచ్చినట్లు భుజించి యుండును. సుఖశయనమున ఆవేశముతో పలుకుచున్నాడు" అనెను.

"మహారాజా, ఈతాపసుడు మీవలెనే పూర్వము రాజు. మున్ను గృహస్థుగా నుండి, రాజ్యశ్రీ ననుభవించుచు, ఆయుధహస్తు లగు రక్షకు లనేకులు పరివేష్టించి యున్నపుడు గూడ ఇట్టిసుఖము పొందనైతిని అని తనప్రవ్రజ్యాసుఖమును స్మరించి, ఉత్సాహవాక్యములు పలికినాడు" అని బోధిసత్త్వుడు రాజునకు ధర్మము బోధించుటకై యీగాథ పలికెను:

ఎవ్వని రక్షింప రితరులు, తానో
యితరుల రక్షింప డెవ్వాడో, రాజ,
ఆతడు భోగమ్ములందు నాసక్తి
విడిచి, సుఖమ్ముగా పడయును నిద్ర.

రాజు ధర్మబోధ విని సంతుష్టుడై, నమస్కరించి, వెడలిపోయెను. అంతేవాసియు ఆచార్యునకు నమస్కరించి హిమవంతమున కేగెను.

బోధిసత్త్వుఁ డచటనే విహరించుచు, అపరిహీన ధ్యానముతో కాలము గడపి, బ్రహ్మలోకము పొందెను.

**శాస్త్ర ధర్మోపదేశము చేసి, రెండుకథలు చెప్పి, సరి పోల్చి, జాతకసారాంశమును స్పష్టీకరించినారు. ఆకాలమున శిష్యుఁడు భద్దియ స్థవిరుఁడు, గణ-శాస్త నేనే.**

## 11 లక్షణ జాతకము

**రాజగృహ సమీపమున వేళువనములో విహారము చేయుసమయమున, దేవదత్తుని గురించి భగవాన్ చెప్పినది.**

### వర్తమాన కథ

దేవదత్తుఁడు భగవానుని సంహరించు ప్రయత్నము చేయువరకు కలవృత్తాంతము ఖండహాల జాతకమున (542) కానవచ్చును. ధన పాల కుంజరమును పంపువరకును కలవృత్తాంతము క్షుద్రహంస జాతక మున (533) పృథ్విలో ప్రవేశించు వృత్తాంతము పదునారవ నిపాత ములో సముద్దవాణిజ జాతకమునను (466) వచ్చును.

ఒకప్పుడు దేవదత్తుఁడు భగవానుని పంచవస్తు స్వీకారము చేయు డని ప్రార్థించెను. అవి స్వీకృతములు కాని తరువాత అతఁడు సంఘ ములో చీలిక పుట్టించి, అయిదువందలమంది భిక్షుకులను వెంటఁగొని, గయా-సీసమున నివసింప జొచ్చెను. కాలము గడచినపిమ్మట ఆభిక్షు వులకు బుద్ధి వచ్చినది. ఈవిషయము గ్రహించి, భగవాన్ తన ప్రధానశిష్యు లిరువురితో నిట్లు పలికెను:

"సారిపుత్రా, నీసహవాసు లగు అయిదువందల భిక్షుకులు దేవ దత్తునిమతము నంగీకరించి ఆతనివెంట వెడలిపోయినారు. ఇప్పుడు వారికి తెలివి వచ్చినది. నీవు చాలమంది భిక్షువులతో నచటికి బోయి,

ధర్మోపదేశము చేసి, మార్గఫలమును బోధించి. వారిని వెంట గొని రమ్ము."

అప్పుడు సారిపుత్రుడు గయా-సీసమునకు బోయి ధర్మోపదేశద్వారమున మార్గఫలమును చూపించి, ఒకనాడరుణోదయమున వారందరతో గూడ వేళువనమునకు మరలివచ్చెను. వచ్చి, సారిపుత్ర స్థవిరుడు భగవానునకు ప్రణామము చేసి, ఒకప్రక్క నిలుచుండెను. అప్పుడు భిక్షువు లాయనను ప్రశంసించుచు భగవానునితో "భన్తే, మాజ్యేష్ఠ భ్రాత, ధర్మసేనాపతి అయిదువందల భిక్షువులనడుమ నుండుట ఎంత సుందరముగా నున్నది! కాని దేవదత్తునికి మాత్రము పరివారము లేకుండపోయినది!" అనిరి.

"భిక్షువులారా, జాతిసంఘమునడుమ సారిపుత్రుడు మనోహరముగా నుండుట ఇప్పుడే కాదు; పూర్వముకూడ నిట్లే యుండెను. మరి దేవదత్తుడు ఇప్పుడే కాదు, మునుపుగూడ గణవిహీనుడయి యుండెను" అని భగవాన్ చెప్పునప్పటికి భిక్షువు లావృత్తాంతము వివరింపుడని ప్రార్థన చేసిరి. భగవాన్ పూర్వజన్మమున మరుగుపడిన విషయమును ఇట్లు స్పష్టీకరించెను.

## అతీత కథ

పూర్వము మగధరాష్ట్రములో రాజగృహనగరమున మగధరాజు పరిపాలనము చేయుచుండ బోధిసత్త్వుడు మృగగర్భమున జన్మించి, పెరిగి, మృగసహస్ర పరివారముతో నరణ్యమున నివసించుచుండెను. ఆయనకు లక్షణుడు, కాలుడు అను నిరువురుపుత్రు లుండిరి. తనకు వార్ధకము వచ్చినపుడు బోధిసత్త్వుడు పుత్రుల నిరువురకును చెరి 500 మృగముల సంరక్షణ మప్పగించెను. ఈరెండుమృగములు మృగగణ పరిపాలన మారంభించినవి.

మగధరాష్ట్రమున పంటలకాలమున పొలములలో సస్యములు నిండుగా నున్నపుడు అరణ్యమృగముల కపాయము కలుగుచుండును. సస్యములు మేయు జంతువులను సంహరించుటకై జను లక్కడక్కడ గుంటలు త్రవ్వి, వానిలో కర్రలుపాతి, పాషాణయంత్రము లమర్చి, కూటపాశాదులు పన్నుదురు. వీనిలో బడి బహుజంతువులు ప్రాణ

ములు కోల్పోవుచుండును. బోధిసత్త్వుడు పంటకారు వచ్చుట గ్రహించి, యిరువురుకుమారులను బిలిపించి "నాయనలారా, ఇది పంటకారు. బహుమృగములు నసించును. వృద్ధు లయినవార మేదో యుపాయమున నొకేచోట నుందుము. మీరు మీమీమందతో పర్వతపాదమునకు బోయి పంటకారు గడచినతరువాత మరలిరండు" అని బోధించెను. మంచి దని వారు తండ్రిమాటప్రకారము సపరివారముగా వెడలిపోయిరి. మృగము లెప్పుడు పర్వతముమీదికి పోవునో, యెప్పుడు దిగునో మార్గవాసులకు తెలియును: వారు కొన్ని రహస్య ప్రదేశములలో దాగియుండి మృగములను కొట్టి చంపుదురు. ప్రయాణ కాలము, ఆగవలసిన సమయము తెలియక కాలమృగము నిజగణముతో త్రికాలములందు గ్రామసమీపముగా బోవుచుండ గ్రామీణులు బహిరంగముగాను, రహస్యముగాను ఆగుంపులోని మృగముల నెన్నిటినో సంహరించిరి. తన బుద్ధిమాంద్యముచే బహుజంతువులను గోల్పోయి కాలమృగము కొలది పరివారముతో నరణ్యము చేరెను.

లక్షణమృగము ఉపాయకుశల మయి, తెలివి కల దగుటచేత, ఈ సమయమున పోవచ్చును, ఈసమయమున పోరాదు అని గ్రహించి, గ్రామసమీపమునకు బోవక, ప్రత్యూషమున గాని, ప్రదోషమున గాని, పగటివేళ గాని బయలుదేరక అర్ధరాత్రమున ప్రయాణము చేయుటచే నొక్కజంతువునుగూడ కోల్పోవక, సురక్షితముగా నరణ్యము చేరెను.

నాలుగు నెల లరణ్యములో నుండి పంటలు నూర్చినతరువాత అవి కొండలు దిగినవి. మాంద్యవశమున కాలమృగగణ మంతయు నశించినది. కాలమృగము మాత్రము తప్పించుకొని తండ్రికడ కొంటరిగా వచ్చెను. లక్షణమృగము 500 గణముతో తండ్రిసన్నిధికి మరలి వచ్చెను.

వచ్చుచున్న పుత్రద్వయమును జూచి బోధిసత్త్వుడు మృగగణముతో నీగాథ పలికెను.

**జీవిత మెవ్వండు శ్రేష్ఠమార్గమున**
**సాగించుచుండునో సద్వృత్తితోడ**
**అట్టివానికి సంపదభివృద్ధి యగును.**

కనుగొమ్మ లక్షణు జ్ఞాతిసంఘంపు
టగ్రభాగమ్మున నరుదెంచువాని।
జ్ఞాతిహీనుం డయి చనుదెంచువాని
నేకాకి కాలు నాలోకింపు మదిగొ!

ఇట్లు బోధిసత్త్వుడు పుత్రు నభినందించి, జీవితాంతమున యథాకర్మం గతో.

**ధర్మోపదేశానంతరము శాస్త రెండుకథలు చెప్పి సరిపోల్చి, జాతకసారాంశమును వెలువరించి, "అప్పటి కాలమృగము ఇప్పటి దేవదత్తుడు. దానిసంఘము దేవదత్తుని పరిషత్తు. లక్షణమృగము సారిపుత్రుడు. అతనిమండలి బుద్ధమండలి. తల్లి ఇప్పటి రాహులమాత. తండ్రి నేనే.**

## 12 నిగ్రోధ మృగ జాతకము

**బుద్ధుడు జేతవనమున కుమార కాశ్యప స్థవిరుని తల్లిని గూర్చి చెప్పినది.**

### వర్తమాన కథ

రాజగృహ నగరమున మహాసంపన్ను డైన శ్రేష్ఠిపుత్రిక ఆమె. అతిస్వచ్ఛవిచారము, పరిమార్జితసంస్కారము కల ఆమెహృదయమున ఘటములో ప్రదీపమువలె మోక్షేచ్ఛ వెలుగుచుండెను. తెలివి కలిగినప్పటినుండియు ఆమెకు సంసారముపై నిచ్ఛ నిలుచుట లేదు. ప్రవ్రజింపవలె ననుకోరికతో నామె తలిదండ్రులతో "అమ్మా-నాయనలారా, నామనస్సు గృహస్థాశ్రమముపై లగ్న మగుట లేదు. మోక్షమువైపు కొనిపోవు బుద్ధధర్మప్రకారము ప్రవ్రజింప గోరుచున్నాను. మీరు నాకు ప్రవ్రజ్య చేయింపుడు" అనెను.

"అమ్మా, ఏ మనుచున్నావు? మనది సంపన్నవంశము. నీ వొకతెవే మాబిడ్డవు. నీవు ప్రవ్రజించుటకు వీలు లేదు."

ఆమె తలిదండ్రులను మాటిమాటికిని ప్రార్థించినను అనుజ్ఞ లభింపలేదు. ఆమె తనలో "అత్తవారింటికి బోయి, భర్తను ఒప్పించి, ప్రవ్రజింతును" అనుకొని పెద్ద దయినపిదప అత్తవారింటికి జని, భర్తను దేవతగా జూచుచు, శీలవతియు, సదాచార సంపన్నురాలునయి, ఇంట నివసించుచుండెను. భర్తతో కలిసియుండుటచే ఆమె గర్భవతి యయ్యెను. ఆమె కీ విషయము తెలియదు.

అప్పు డానగరములో ఉత్సవము చాటించిరి. నగరవాసు లెల్లరును ఉత్సవమున పాల్గొనజొచ్చిరి. నగరము దేవనగరమువలె అలంకృతమయ్యెను. గొప్పయుత్సవము జరుగుచున్నను ఆమె ఒడలిపై చందనము రాచుకొన లేదు, అలంకారములు ధరింప లేదు; సామాన్య వేషముతోనే సంచరించుచుండెను.

భర్త ఆమెతో "భద్రే, నగర మంతయు పండుగ చేసికొనుచుండగా నీవు అలంకరించుకొన లే దేమి?" అన్నాడు.

"ఆర్యా, ఈశరీరము ముప్పదిరెండు మలములతో నిండియున్నది. దీని నలంకరించిన ఫల మేమి? ఈశరీరము దేవతానిర్మితము కాదు, బ్రహ్మనిర్మితము కాదు, స్వర్ణమయము కాని, మణిమయము కాని హరిచందనమయము కాని కాదు. పుండరీక, కమల, ఉత్పలాదిగర్భము నుండి జన్మించినది కాదు, అమృతౌషధపూర్ణము కాదు. ఇది మలము నుండి పుట్టినది, తల్లితండ్రుల యునికివలన వచ్చినది. అనిత్యత, మర్దనాదుల యావశ్యకత, విరుగుట, ధ్వస్తమగుట — దీని స్వభావము. శ్మశానమును వృద్ధి చేయు నీశరీరము తృష్ణచే నుత్పన్న మయినది. ఇయ్యది శోకములకు నిదానము, విలాపమునకు కారణము, రోగములకు ఆలయము, దుష్కర్మఫలము ననుభవించునది. లోపల మాలిన్యము, వెలుపల సర్వదా మాలిన్యము. దేహము క్రిమికీటకముల కావాసము, శ్మశానయాత్రి. మరణమే దీనికి అంతము. ఈశరీరము ఎల్లరదృష్టిలో నున్నను —

ఏర్పడిన దస్థినరముల నీశరీర
మసల త్వఙ్మాంసలేపము కలదు, పైన
నిండుగా చర్మపిహితమై యుండుకతన
కానబడదు నిజమ్ముగా గలుగురూప;

మాంత్రములును, యకృత్తు, ఆమాశయంబు
నుండె, వృక్కయు, ప్లీహము నిండి యుండు-
శ్లేష్మమును, పిత్తమును, లాల, స్వేద, ముండు.

ఇందు తొమ్మిది నిత్యవాహినుల వెంట
తప్పకుండగ పూతిగంధంబు మలయు.
అక్షి, కర్ణ, నాసాదులయందు మలము!
అపు డపుడు నోట వమనమ్ము లగుచునుండు.

ఇట్టిదేహమ్ము బుద్ధివిహీనజనుల
కగుచునుండు నాకర్షక; మఖిలదోష
పూర్ణమై విషవృక్షము బోలియుండు;
నిఖిలరోగాకరము దుఃఖనిలయ మగును.

లోనిభాగమె వెలుపల కానబడిన
కర్రతో తోలవలయును కాకములను
భక్షకముల; ఇట్టిదానిని పండితజను
లేవగింతురు, మూర్ఖులో ఇచ్ఛగింత్రు.

"ఆర్యపుత్రా, ఈశరీరము నలంకరించుకొని యేమి చేయుదును? ఈ దేహము నలంకరించుకొనుట మురికితో నిండిన ఘటము వెలుపల బొమ్మలు వేయుటవంటిది కాదా?"

శ్రేష్ఠిపుత్రు డీవాక్కులు విని యి ట్లనెను: "భద్రే, నీకు ఈశరీరమున ఇన్నిదోషములు కనబడుచున్నప్పుడు ఏల నీవు ప్రవ్రజింపవు?" "ఆర్యపుత్ర, నాకు అనుజ్ఞ లభించినచో నేనే ప్రవ్రజింతును." మంచిదని శ్రేష్ఠిపుత్రుడు మహాదానము లిచ్చి, మహాసత్కారములు చేసి, విశేషపరివారముతో ఆమెను భిక్షుణీవిహారమునకు గొనిపోయి. అక్కడ దేవదత్తుని కూటములోని భిక్షుణులలో జేర్చెను. ఆమె ప్రవ్రజించినపిమ్మట సంకల్పసిద్ధి యగుటవలన సంతుష్టి కలిగెను. అంతట గర్భము పరిపక్వ మగుటవలన ఆమెయాకారప్రకారములందు పరివర్తనము కలిగినది. కాలుసేతులు, పృష్ఠము, బరు వెక్కినవి. ఆమెగర్భము ఎత్తుగా నుండుట కాంచి భిక్షుణులు "ఆర్యా, నీవు గర్భవతి వనిపించుచున్నది. ఏ మిది?" అన్నారు.

"ఆర్యులారా, ఇది యేమో తెలియదు. కాని నాశీలము పరిపూర్ణముగానే యున్నది."

అంతట భిక్షుణులు ఆమెను దేవదత్తునికడకు తీసికొనిపోయి ఆయనతో "ఆర్యా, ఈకులపుత్రి అతి కష్టముమీద భర్తను ఒప్పించి ప్రవ్రజ్య గ్రహించినది. కాని ఇప్పు డీమె గర్భవతియై నట్లు కానవచ్చుచున్నది. ఈగర్భము ఈమెగృహస్థాశ్రమములో ఉండగనే కలిగెనో, ప్రవ్రజించిన పిమ్మట కలిగెనో మాకు తెలియదు. మేము ఇప్పు డేమి చేయవలెను?" అనిరి.

దేవదత్తుడు బుద్ధుడు కాకుండుటచేతను, క్షాంతి, మైత్రి, కరుణ లేనివా డగుటచేతను ఇట్లు యోచించెను : "నేను ఈమె చీవరమును మార్పించక తప్పదు. అట్లు చేయనిచో నా కూటములో నొకభిక్కుని గర్భవతియై తిరుగుచున్న దనియు, నేను ఉపేక్షించుచున్నా ననియు నింద బయలుదేరును."

అంతట ఆతడు విచారణ చేయకుండనే రాతిగుండు దొరలించినట్లు వారితో, "పొండు, ఈమెను అప్రవ్రజితను చేయుడు." అని ఆనతి యిచ్చెను. వా రాయన వాక్కులు విని లేచి ప్రణామము చేసి విహారమునకు పోయిరి.

చిన్నవయస్సు గల ఈభిక్కుని తక్కినవారితో ని ట్లనెను: "ఆర్యులారా, దేవదత్త స్థవిరుడు బుద్ధుడు కాడు. నేను వారిని అనుసరించి ప్రవ్రజింప లేదు. లోకాగ్ర, సమ్యక్—సంబుద్ధు లైనవారి అనుచారిణిగా ప్రవ్రజించినాను. మరి ఈప్రవ్రజ్య చాలకష్టముమీద లభించినది: కాబట్టి మీరు నాకు దీనిని తొలగింపకుడు. రండు, వెంట గొని శాస్త సన్నిధికి జేతవనమునకు తీసికొనిపొండు."

వా రామెను వెంట బెట్టుకొని రాజగృహమునుండి 35 యోజనముల త్రోవ క్రమముగా గడిచి జేతవనము చేరిరి. బుద్ధునకు ప్రణామము చేసి వారు విషయము విన్నవించిరి. శాస్త ఇట్లు యోచించెను: "ఈమెకు గృహముననే గర్భ మేర్పడినను, దేవదత్తుడు వెడలగొట్టెను. భిక్కునిని వెంటబెట్టుకొని గౌతముడు తిరుగుచున్నా డని తైర్థికులు అపవాదు వేయవచ్చును. ఇందుచే ఈసంగతి శమింపజేయుటకై రాజసహితముగా పరిషత్తులో ఈ అభియోగమునకు తీర్పు పొందవలెను."

ఆవల నొకనాడు కోసల నరేశుడు ప్రసేనజిత్తు, వృద్ధ అనాథపిండికుడు, యువ అనాథపిండికుడు, మహాఉపాసిక విశాఖ, మొదలగు ప్రసిద్ధులను పిలిపించి, సాయంసమయమున చతుర్విధ పరిషత్తులు ఏకత్ర సమకూడిన పిదప ఉపాలి స్థవిరుని సంబోధించి, "పొమ్ము, చతుర్విధ పరిషత్తులనడుమ ఈతరుణ భిక్షుని కర్మను పరీక్షింపుము" అని శాస్త ఆన తిచ్చెను.

"చిత్తము, భన్తే," అని స్థవిరుడు పరిషన్మధ్యమునకు జని తన పీఠముపై గూర్చుండి, రాజసమ్ముఖమునకు ఉపాసిక విశాఖను పిలిపించి ఆమె కీయభియోగమును తెలిపి, "విశాఖా, ఈతరుణి ఫలాని మాసమున ఫలాని దినమున ప్రవ్రజించినది. నీవు పోయి ఈమెగర్భము పూర్వము కలిగినదో అనంతరము కలిగినదో తెలిసికొని రమ్ము" అని చెప్పెను.

ఉపాసిక మంచి దని స్వీకరించి తెర అడ్డు కట్టించి లోపలకు తరుణ భిక్షునిని గొనిపోయి, ఆమె చేతులు, పాదములు, నాభి, ఉదరము వరకు పరీక్షించి, నెలలు, రోజులు లెక్కించి, ఆమె గృహస్థాశ్రమమున ఉండగానే గర్భము ధరించినట్లు నిర్ణయించి, స్థవిరుని సన్నిధికి పోయి ఈవిషయము నివేదించెను. స్థవిరుడు చతుర్విధ పరిషన్మధ్యమున ఆ భిక్షునిని విడుదల చేసెను. ఆమె విడుదల పొంది భిక్షుసంఘమునకు, శాస్తకు ప్రణామముచేసి భిక్కుణులతో వారి విహారమునకు పోయెను. నెలలు నిండిన పిమ్మట ఆమె మహాప్రతాపశాలి యగు పుత్రుని ప్రసవించెను. ఆమె పద్మోత్తర (బుద్ధ) చరణములకడ ప్రార్థించినట్లే కుమారుడు కలిగెను.

అనంతర మొకనాడు రాజు భిక్షుణుల విహారమునకు సమీపములో పోవుచు బాలకుని కంఠధ్వనివిని మంత్రులతో, ఏమి ఇది అనెను. అమాత్యులు సంగతి తెలిసికొని "దేవా, తరుణభిక్షుణికి పుత్రుడు కలిగినాడు. ఇది వాని కంఠధ్వని" అని విన్నవించిరి.

"భణే, బిడ్డలను పోషించుట భిక్షుణులకు కష్టము. కావున బాలకుని మేము పోషింతుము" అని రాజు ఆబిడ్డని నటీజనమున కిప్పించి, రాజకుమారునివలె పోషణ చేయించెను. నామకరణమునాడు బిడ్డనికి కాశ్యపు డనుపే రుంచిరి. అతడు రాజకుమారునివలె పెరుగుటచే

అతడు కుమార కాశ్యపు డని ప్రసిద్ధి బడసెను. ఏడుసంవత్సరముల యీడున బాలుడు శాస్తసన్నిధిలో ప్రవ్రజించెను. ఇరువది సంవత్సరములు దాటినతరువాత ఉపసంపద పొంది అతడు కాలక్రమమున మంచిధర్మోపదేశకు డయ్యెను. "భిక్షువులారా, నాచిత్రధర్మోపదేశకులలో కుమారకాశ్యపుడు శ్రేష్ఠుడు" అని అతనికి సర్వోచ్చపదవి శాస్త యొసంగెను. క్రమముగా వమ్మిక సూత్రము (మఝ్ఝిమ నికాయము లోనిది) వినినపిమ్మట అతనికి అర్హత్-పదవి యొసగెను. ఆతని భిక్షుణి మాత కూడ దర్శన-భావన (యోగాభ్యాసము) ద్వారా అగ్రఫలము (అర్హత్వము) పొందెను. కుమార కాశ్యప స్థవిరుడు బుద్ధులశాసన-ఆకాశమున పూర్ణచంద్రునివలె ప్రకాశించెను.

ఒకనాడు తథాగతుడు భిక్షాటనమునుండి మరలి వచ్చి భోజనానంతరము భిక్షువుల కుపదేశ మిచ్చి, గంధకుటిలో ప్రవేశించెను. భిక్షువులు ఉపదేశము విని తాము నిలువవలసిన స్థానములం దుండి, సాయంకాలము ధర్మసభలో సమావిష్టులై "ఆవుసో, దేవదత్తుడు బుద్ధుడు కాకపోవుటచే క్షమా, మైత్రి, దయ, లేనివా డగుటచే కుమార కాశ్యప స్థవిరుని, స్థవిరను క్షణములో కోల్పోయినాడు. సమ్యక్-సంబుద్ధుడు ధర్మరా జగుటచేతను, క్షమా, మైత్రీ, దయా రూప సంపత్తి కలవా డగుటచేతను వారి కిరువురకును ఆశ్రయ మిచ్చినాడు" అని పలుకుచు బుద్ధగుణములను ప్రశంస చేయుచుండిరి.

శాస్త బుద్ధలీలతో ధర్మసభకు వచ్చి, పరచిన ఆసనముపై గూర్చుండి, "భిక్షువులారా, ఈసమయమున కూరుచుండి, యేమి సంభాషించుచున్నారు?" అని యడిగెను.

"భన్తే, తమగుణకథనములో నున్నాము" అని యెల్లరు బదులు పలికిరి.

"భిక్షువులారా, తథాగతుడు ఇప్పుడు మాత్రము కాక పూర్వము కూడ వీరికి ఆశ్రయదాతయు, సహాయుడు నయి యుండెను" అని శాస్త చెప్పగా ఆవిషయములను స్పష్టము చేయ భిక్షువులు ప్రార్థన చేసిరి. పూర్వజన్మమున మరుగుపడియున్న వృత్తాంతములను భగవాన్ స్పష్టీకరించినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు మృగ మయి జన్మించెను. పుట్టుకతోడనే వానిశరీరము బంగారమువలె నుండెను. నేత్రములు గుండ్రని వజ్రములవలెను, కొమ్ములు వెండికొమ్ములవలెను, నోరు అరుణకంబలపుంజమువలెను ఉండెను. కాలిడెక్కలు లక్కరంగు వేసిన ట్లుండెను. తోక చమరీ వాలమువలెను, రూపము అశ్వపోతకమువలెను కానవచ్చెను. పంచ శతమృగములు సేవించుచుండ బోధిసత్త్వు డరణ్యములో న్యగ్రోధ మృగరాజ మనుపేర చరించుచుండెను. సమీపముననే పంచశతపరి వారముతో మరియొక మృగము సువర్ణచ్ఛాయ కలిగి శాఖమృగ మనుపేర నివసించుచుండెను.

ఆకాలమున వారాణసిప్రభువు మృగయాలోలుడై మాంసప్రియుడై యనుదినము మాంసభోజనము చేయుచుండెను. ప్రతిదిన మాతడు పుర జనులను గ్రామీణులను వారివారిపనులు మాన్పి వేటకై తనవెంట గొనిపోవుచుండెను. జను లోకనాడు సమావిష్టులై యిట్లు చింతించిరి : “అనుదినము రాజు మనను వెంటగొనిపోవుచు మనకార్యవిఘాతము చేయుచున్నాడు. కావున ఆయన యుద్యానమృగములకు ఘాసమును, సలిలముడు మనము సమకూర్చి, బహుమృగములను లోనికి జేర్చి, ద్వారములు బంధించి రాజునకు సమర్పింతము.”

వా రిట్లు చింతించి. ఉద్యానములో ఘాససలిలములు కల్పించి ద్వారములు బాగుగా తెరచియుంచిరి. అంతట వారు కర్రలు, కత్తులు, బాణములు మొదలగు నాయుధములు చే బూని, యోజనమాత్ర ప్రదేశము చుట్టు ముట్టి, మృగములను తరుముచు ముందుకు చొచ్చు కొని పోవుచుండిరి. ఆమృగసమూహములో నిగ్రోధమృగము, శాఖ మృగముకూడ చిక్కుపడినవి.

పిమ్మట వారు మృగగణమును తరుముచు, తుప్పలు, చెట్లు మొద లగువానిపై కర్రలతో గొట్టుచు, జంతువులను బెదరించి లేపుచు, ఆయుధము త్రిప్పి ధ్వనిచేయుచు, మృగసమూహమును తుద కారా మములోనికి ద్రోలి, ద్వారములు బంధించి, రాజును సమీపించి,

"దేవా, తాము వేటకై మమ్ములను దీసికొనిపోవుచుండుటచే మాపనులకు నష్టము కలిగెడిది. అరణ్యమునుండి మేము మృగములను తోలుకొని వచ్చి మీయుద్యానములో నింపినాము. నేటినుండి వాని మాంసము భుజింపుడు" అని విన్నవించి వెడలిపోయిరి.

వారిమాటలు విని రాజుద్యానమునకు బోయి, జంతువులను గనుగొని, సువర్ణమృగద్వయమును జూచి వాని కభయ మిచ్చెను. స్వయముగా జని రాజొక్కమృగమును దెచ్చుకొనువాడు; ఒక్కొక్కప్పుడు వంటవానిని బంపి తెప్పించుకొనుచుండువాడు.

ధనుస్సును చూచి మృగములు ప్రాణభయమున పరుగెత్తును; రెండుమూడు ప్రహారములు తగిలిన పిమ్మట బడలి మూర్ఛిల్లును. అనంతరము మానము పొందును. ఒకనాడు మృగగణ మావిషయము బోధిసత్త్వునకు దెలిపెను. న్యగ్రోధమృగము శాఖమృగమును బిలువ నంపి "మిత్రమా, అనేక మృగములు నిహతము లగుచున్నవి. వీని మరణము ఘనము తప్పింప లేకున్నను బాణపాతము తప్పించిన చాలును. దినమున కొకమృగము చొప్పున రాజునకు బంపుచుందము. ఒకనాడు నాసంఘమునుండియు, మరునాడు నీసంఘమునుండియు ఒక్కమృగము పోయి, ధర్మగండికమీాద మెడ నిలిపి, తక్కినమృగములకు వ్రణములు తగులకుండ తప్పించును గాక" అని చెప్పెను. శాఖమృగము మంచిదని అంగీకరించెను.

నాడు మొదలు వంతుచొప్పున ఒక్కొకమృగము పోయి, ధర్మగండికమీాద మెడ యుంచి పండుకొనుచుండెను. వంటవాడు వచ్చి దానిని తీసికొని పోయెడివాడు. ఈనిర్ణయప్రకార మొకనాడు శాఖమృగసమూహములో గర్భవతి యైన లేడివంతు వచ్చెను. అది శాఖమృగమును సమీాపించి "స్వామీా, నేను గర్భవతిని. ప్రసవ మైన పిమ్మట వంతు తీర్చుకొనుటకు ఇద్దరము పోవుదుము. ఇప్పుడు నావంతు తప్పింపుడు" అని యడిగెను. ఆతడు నీవంతు తప్పించి, వేరొకరిని బంపజాలను. నీయదృష్టము తెలిసికొమ్ము. నీవే పొమ్ము" అని పలికెను. అక్కడ అనుగ్రహము కాంచక లేడి బోధిసత్త్వుని కడకు బోయి వృత్తాంతము తెలిపెను. ఆయన విని "మంచిది, నీవు పొమ్ము. నీవంతు తప్పించినాను" అని పలికి, తానే పోయి, ధర్మగండికపై

మొద పెట్టి పండుకొనెను. వంటవాడు వచ్చి చూచి "అభయము పొందిన నిగ్రోధ మృగరాజు గండికమీద పండుకొన్నా డేమి? దీనికి కారణ మేమో" అని, వేగముగా జని రాజునకు దెలిపెను.

వెంటనే రాజు రథ మెక్కి బహుపరివారముతో వచ్చి, బోధి సత్త్వుని జూచి "మిత్రమా, మృగరాజా, నీ కభయ మిచ్చినాను కదా? నీ వీస్థానమున కేల చేరితివి?" అని యడిగెను. "మహారాజా, గర్భవతి యగు లేడి వచ్చి, తనవంతు తప్పింపు మనియు, వేరొకరికి వేయవలె ననియు అడిగినది. ఈమరణదుఃఖమును మరియొకరికి కలిగించుటకన్న నిజప్రాణముల నొసగి దానిమరణము తప్పింప దలచితిని. వేరుగా శంకింప వలదు మహారాజా!"

"స్వామీ, సువర్ణమృగరాజా, నీవంటి క్షాంతి, మైత్రి దయాసంపన్నుని మానవులలోగూడ ఇంతవరకు నేను చూడలేదు. ప్రసన్నుడనైతిని. నీకును ఆలేడికిని అభయ మిచ్చినాను. లెమ్ము"

"మాయిరువురకు అభయ మిచ్చినారు. తక్కినమృగములు ఏమి చేయును నరేంద్రా!"

"మిగిలిన జంతువులకుగూడ అభయ మిచ్చినాను స్వామీ!"

"మహారాజా, ఈవిధముగా ఉద్యానములోని జంతువులు అభయము పొందినవి, తక్కినజంతువు లేమి చేయును?"

"వానికిగూడ అభయ మిచ్చినాను స్వామీ!"

"మహారాజా, చతుష్పాత్తులకు అభయము లభించినది. పక్షు లేమి చేయును?"

"వానికిగూడ అభయ మిచ్చినాను స్వామీ!"

"మహారాజా, పక్షిగణమున కభయము లభించినది. మరి జలజంతువు లేమి చేయును?"

"వానికిగూడ అభయ మిచ్చినాను స్వామీ!"

మహాసత్త్వు డిట్లు సమస్తసత్త్వములకు అభయ మడిగి లేచి, రాజును పంచశీలముల బ్రతిష్ఠించి "మహారాజా, ధర్మ మనుష్ఠింపుము. తల్లి దండ్రులయెడ, బిడ్డలయెడ, బ్రాహ్మణులయెడ, గృహపతులయెడ, నగర జనపద నివాసులయెడ ఋజుమార్గమున వర్తింపుము. నీవు స్వర్గలోకమును పొందుదువు" అని రాజునకు బుద్ధలీలాప్రకారము ధర్మ

ముపదేశించి, కొలదిరోజు లుద్యానమున నివసించి, రాజు కుపదేశ మిచ్చి, మృగగణపరివృతుడై అరణ్యమునకు బోయెను.

గర్భవతి యైనయా లేడి పుష్పకర్ణికా సదృశు డగు పుత్రుని గనెను. బిడ్డడు ఆటలలో శాఖమృగసమీపమునకు బోవుచుండ తల్లి చూచి "నేటినుండి ఆయనకడకు బోవలదు. నిగ్రోధమృగ సన్నిధికి బోవుచుండుము" అని యుపదేశించుచు ఈగాథ పలికెను:

> మే లగు నిగ్రోధ మృగము సేవింప
> చనకు శాఖామృగ సవిధభాగమున
> శామృగాశ్రయమునం దభివృద్ధికంటె
> మృతి మేలు న్యగ్రోధమృగ సేవలోన.

అభయము పొందినమృగములు నాటినుండి లోకులసస్యములు మేయసాగెను. అభయము పొందిన వగుటచే వానిని కొట్టుటకు గాని తరుముటకు గాని లోకులు జంకుచుండిరి. తుదకు వారు రాజాంగణమున కేగి సంగతి ప్రభువునకు విన్నవించిరి. "నేను ప్రసన్నుడనై నిగ్రోధ మృగమునకు వర మిచ్చితిని. రాజ్యము నైన విడుతును; కాని మాట తప్ప లేను. పొండు. రాష్ట్రములో మృగములను కొట్టుటకు వీలు లేదు" అని రాజు పలికెను.

జరిగిన సంగతి విని నిగ్రోధమృగము మృగగణమును బిలిపించి "ఇకమీద మీరు అన్యులసస్యములను మేయరాదు" అని శాసించి, జనుల కిట్లు వార్త పంపెను:

"ఇకముందు కృషీవలులు పొలములకు కంచెలు వేయవలదు. పొలములు దున్ని, పర్ణములు గురుతుగా కట్టుడు."

అప్పటినుండి క్షేత్రములకు పర్ణబంధిసంజ్ఞ కలిగెను. గురుతు మీరి పోయినమృగము లేదు.

మృగగణముల కిట్లుపదేశ మిచ్చి, బోధిసత్త్వుడు జీవితాంతమున మృగములతో కూడ యథా కమ్మం గతో. రాజు బోధిసత్త్వునిమాట అనుసరించుచు, పుణ్యకార్యములు చేయుచు, యథా కమ్మం గతో.

**"భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వము కూడ స్థవిరకును, కుమారకాశ్యపునకును ఆశ్రయ మిచ్చితిని" అని ధర్మోపదేశము చేసి నాలుగు ఆర్యసత్యములను బోధించి,**

రెండు కథలను చెప్పి, సరి పోల్చి, జాతకసారాంశమును శాస్త్ర వెలువరించెను.

అప్పుడు సాఖమృగము ఇప్పటి దేవదత్తుడు; దాని పరివారము దేవదత్తుని పరివారము. లేడి ఇప్పటి స్థవిర. పుత్రుడు ఇప్పటి కుమార కాశ్యపుడు. రాజు ఇప్పటి ఆనంద స్థవిరుడు. నిగ్రోధమృగరాజా నేనే.

## 13 కండిన జాతకము

ఇందలిగాథ బుద్ధుడు జేతవనమున విహారము చేయునపుడు పూర్వభార్య లోభమును గూర్చి చెప్పినది. ఆకథ ఎనిమిదవ నిపాతమున ఇంద్రియ జాతకమున (423) వచ్చును.

### వర్తమాన కథ

ఆభిక్షువుతో భగవాన్ "భిక్షూ, పూర్వకాలమున గూడ నీవు ఈస్త్రీమూలమున చాల బాధ పడితివి" అనెను.

ఆవిషయమును స్పష్టము చేయ భగవానుని భిక్షుకులు ప్రార్థించిరి. పూర్వజన్మమున గుప్త మైనవిషయమును భగవాన్ స్పష్టీకరించెను.

భిక్షువులు ప్రార్థించుట, పూర్వజన్మమున విషయము మరుగుపడి యుండుట చెప్పక, కేవలము అతీతకథ చెప్పెను. ఇంతే! ఇంతవరకు చెప్పినవిమ్మట ప్రార్థన జరుగగా, మబ్బులలోనుండి చంద్రుడు వెలువడి నట్లు పూర్వజన్మమున గుప్త మైనవిషయము ప్రకట మగుట మొదలగునవి పూర్వోక్త ప్రకారముగా అను సంధానము చేసి గ్రహింప వలెను.

### అతీత కథ

పూర్వము మగధరాష్ట్రములో రాజగృహమున మగధరాజు రాజ్యము చేయుచుండెను. పంటకారున మృగములకు మగధ వాసులచే మహాపద కలుగుచుండెను. జంతువు లడవులలో కొండల

మీాదికి బోవును. ఒకసారి కొండదుప్పి సమీాపగ్రామమునుండి వచ్చు మృగపోతికను వలచి, అది యడవినుండి మరలునపుడు దానివెంట బోవుచుండెను. లేడి యొకనాడు "ఆర్యా, నీవు పర్వత బాలమృగ మవు. గ్రామసమీాపభాగములలో నపాయముండును. కావున నా వెంట రావలదు" అనెను. ప్రతిబద్ధచిత్తమగుటచే బాలమృగ మాగక దాని వెంట జనెను.

ఈ కాలమున మృగములు పర్వతపాదమునుండి యీవలకు వచ్చునని మగధవాసులు తెలిసికొని, మార్గములో మాటున దాగియుందురు. ఒకానొక వేటకాడు ఈరెండుమృగములును వచ్చుమార్గము ప్రక్కన పొంచియుండెను. మనుష్యవాసన తగులుటచే వేటకాడాప్రాంతములలో నుండవచ్చునని లేడి యూహించి బాలమృగమును ముందు పెట్టుకొని తాను వెనుక నడచుచుండెను. వేటకాడొక్కయంబుతో దుప్పిని పడగొట్టెను. అది చూచి లేడి వాయువేగమున బరుగెత్తెను.

రహస్యస్థానమునుండి వేటకాడీవలకు వచ్చి దుప్పిచర్మము నొలచి, మంటచేసి, వంటచేసి, మధురమాంసమును తిని, నీరు త్రాగి మిగిలిన మాంసపుంజమును కఱ్ఱకు వ్రేలాడగట్టి, తన బిడ్డలకొఱ కింటికి గొని పోయెను.

ఆ రోజులలో బోధిసత్త్వు డాతోటలో వనదేవతగా నుండువాడు. అత డదియంతయుచూచి "ఈ బాలమృగమరణము తల్లికొరకు కాదు. తండ్రికొరకును కాదు. కామమువలననే. కామోదయము సుఖకరమైనను అంతముమాత్రము దుఃఖదాయకము. చేతులు పోవును. దెబ్బలుతగులును. పంచవిధబంధములు తగులుకొనును, అన్యులమరణదుఃఖోత్పాదనము లోకమున గర్హితము. స్త్రీపరిపాలన కలదేశము, స్త్రీకి లోపడియుండు ప్రదేశము గర్హితములు. స్త్రీప్రభావమునకు లోపడి యుండు మానవులు గర్హితులు" అను భావము నొక్కగాథలో వనదేవతల కుపదేశించి, వారు పుష్పఫలాదులతో నర్చింపగా, వనమున మధురస్వరము ప్రతిధ్వనించునట్లు ధర్మము నీగాథలో నుపదేశించెను.

**కామబాణమ్ము చే గాటమ్ము గాను**
**విద్ధు డౌపురుషుండు శుద్ధనీచుండు.**
**చాన లెవ్వానిని శాసించుచుందు**

రా జనపదములు నధికనీచములు.
స్త్రీల కెవ్వారు వశీభూతులగుదు
రాప్రాణు లెల్లరు నతితుచ్ఛ జనులు.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు ఒక్క గాథలో మూడుగర్హణములు చూపి బుద్ధుని శక్తిమాధుర్యములతో వనము ప్రతిధ్వను లీనునట్లు చేసెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి సత్యములను ప్రకటించినపిదప ఉత్కంఠితచిత్తు డయిన భిక్షువునకు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠ లభించెను. శాస్త రెండుకథలను చెప్పి, పరిపోల్చి, జాతకసారాంశము వెలువరించెను.
ఆకాలమున పర్వతమున నివసించు మృగము నేటి ఉత్కంఠిత భిక్షువు. మృగపోతము నేటి పూర్వభార్య. కామకత్వమున దోషము చూపి ఉపదేశము చేసిన దేవత నేనే.

## 14 వాత మిగ జాతకము

ఇందలిగాథ శాస్త జేతవనమున విహరించుచుండగా క్షుద్ర పిండపాతిక తిష్య స్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త రాజగృహసమీపమున వేలువనమున విహరించు సమయమున మహాసంపన్నుడగునొకానొక శ్రేష్ఠికులమునకు సంబంధించిన తిష్యకుమార నామకపుత్రుడు, ఒకనాడు వేలువనమున కేగి శాస్త చేయు ధర్మోపదేశము విని, ప్రవ్రజింప కోరిక కలిగి, ప్రవ్రజ్యకై ప్రార్థించెను. తలిదండ్రుల యనుజ్ఞ లభింపకపోవుటచే రట్ఠపాల స్థవిరుని వలె పూర్తిగా సప్తాహ ముపవసించి, తలిదండ్రుల యనుమతి పడసి, బుద్ధునికడ ప్రవ్రజ్య పరిగ్రహించెను. అనంతరము బుద్ధుడు పక్షకాలము వేళువనమున విహరించుచు జేతవనమునకు బోయెను. అచ్చట ఆ కుల పుత్రుడు పదుమూడు ధుతాంగవ్రతములను గ్రహించి, శ్రావస్తిలో

భిక్షాటనము చేయుచు కాలము గడపుచుండెను. క్షుద్ర పిండక పాతిక తిస్స స్థవిరనామము గ్రహించిన తరువాత ఆయనకు బుద్ధసంఘములో ఆకాశతలమున చంద్రునికి వలె ప్రసిద్ధి కలిగెను. ఆసమయమున రాజ గృహమున ఉత్సవము జరుగుచుండెను. స్థవిరుని తలిదండ్రులు అతడు గృహస్థుగానున్నపుడు ధరించుచుండిన ఆభరణములన్నిటిని వెండి తట్టలో ఉంచి దానిని తమ రొమ్ముపై నుంచుకుని "ఇతర ఉత్సవ సమయములలో మా బిడ్డడు ఈ ఈ ఆభరణములు ధరించి సంబరము లోనికి పోవుచుండెడివాడు. మా ఏక పుత్రుని శ్రవణగౌతముడు వెంట గొని శ్రావస్తికిచనినాడు. ఈవేళ అతడు ఎక్కడకూర్చుండియుండును? ఎక్కడ నిల్చుండియుండును" అని చెప్పుకొనుచు దుఃఖించుచుండిరి. అప్పుడు వేశ్య యొకతె యాయింటికి జని, శ్రేష్ఠి భార్య కన్నీరు విడుచు చుండుట చూచి "ఆర్యా, ఏల దుఃఖించుచున్నావు?" అని యడిగెను.

ఆమె విషయమంతయు తెలిపినది. "ఆర్యా, ఆర్యపుత్రునకు ఏమేమి రుచించెడివి?" అని వేశ్య అడిగెను. "ఫలాని ఫలాని వస్తువులు." "మీరు ఈ ఇంటిలోని సంపద అంతయు నాకిచ్చిన పక్షమున ఆర్యపుత్రుని నేను తీసికొని రాగలను."

శ్రేష్ఠి భార్య మంచిదని అంగీకరించి ఖర్చులిచ్చి, చాలమంది పరివార జనులను ఇచ్చి "పొమ్ము, నీ శక్తి వలన నా కుమారుని తీసి కొని రమ్ము" అని చెప్పిపంపెను.

అంతట నామె తెరలువేసిన బండిలో కూర్చుండి శ్రావస్తిచేరెను. స్థవిరుడు తరుచుగా భిక్షాటనము చేయువీధిలో ఇల్లు తీసికొనెను. శ్రేష్ఠి పరివారమును స్థవిరుని కంట బడకుండ నుంచి తన పరిజనులతో స్థవిరుడు భిక్షాటనము చేయు సమయమున ముందుగా మూకుడు నిండుగను పిమ్మట గిన్నె నిండుగను బిక్ష మీయసాగెను. ఈవిధ ముగా రసతృష్ణ పెరిగించి క్రమక్రమముగ ఇంటిలోనికి పిలిచి కూర్చుండ బెట్టి భిక్ష మిచ్చుచుండెను. స్థవిరుడు తనకు వశంవదుడైనాడని గ్రహిం చినప్పుడు ఆమె ఒకనాడు రోగగ్రస్తురాలివలె నటించుచు ఇంటిలోనికి పోయి పండుకొనెను. స్థవిరుడు భిక్ష మడుగుచు క్రమముగ గృహ ద్వారము చేరెను. పరిజనులు స్థవిరుని పాత్ర పుచ్చుకొని ఆయనను ఇంటిలో కూర్చుండ బెట్టిరి.

"ఉపాసిక ఎచట నున్నది?" అని స్థవిరుడు కూరుచున్నతోడనే అడిగెను.

"భన్తే, ఆమెకు జబ్బుగా నున్నది. ఆమె తమ దర్శనము కోరుచున్నది" అని వారు విన్నవించిరి.

రసతృష్ణచే బద్ధుడై ఆయన తన ప్రతిజ్ఞ (వ్రతసమాదానము) విడనాడి, ఆమె పండుకొని యున్న ప్రదేశమునకు చనెను. వేశ్య ముఖ్యకారణము తెలిపి ఆయన చిత్తమును ప్రలోభపెట్టి, రసతృష్ణలో బంధించి, ఆయన చీవరమును మార్పుచేయించి (సన్యాసము తొలగించి) తన వశమునం దుంచుకొని బండిలో కూర్చుండబెట్టుకొని, బహు పరివారముతో రాజగృహమునకు వెడలిపోయెను. ఆవార్త వ్యాపించినది. ధర్మసభలో కూర్చుండి, భిక్షుకులు "ఒకానొక వేశ్య క్షుద్ర పిండపాతిక తిస్స స్థవిరుని రసతృష్ణతో బంధించికొని వచ్చినది" అని చెప్పుకొనిరి. బుద్ధుడు ధర్మసభకు పోయి అలంకృతపీఠముపై కూర్చుండి, "భిక్షువులారా, విషయ మేమి?" అని అడిగెను. వారు వృత్తాంతము విన్నవించిరి. అంతట భగవాన్ "భిక్షువులారా, ఈతడు కేవల మిప్పుడే రసతృష్ణచే బద్ధుడై ఆమెకు వశీభూతుడు కాలేదు; పూర్వముకూడ ఇట్లే అయినాడు" అని అతీత వృత్తాంతమును ప్రకటీకరించెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఆయనకు సంజయు డను ఉద్యానపాలకు డుండెను. రాజోద్యానము లోని కొకనాడు వాతమృగము జొరబడి సంజయుని జూచి పరుగెత్తిపోయెను. అతడు దానిని బెదరింపలేదు. ఆవల వాతమృగము చాల సారు లుద్యానములోనికి వచ్చి విహరించుచుండెను. వనపాలకు డుద్యానములోని వివిధఫలపుష్పములను ప్రతిదినము ప్రభువునకు సమర్పించుచుండును. ఒకనాడు రాజు వానితో "ఉద్యానమున విచిత్ర మేమైన గమనించితివా సౌమ్యుడా?" అనెను. "విశేష మేమియు లేదు. వాతమృగము మాత్రము వచ్చిపోవుచున్నది. ఈవిషయము గమనించినాను దేవా!" "దానిని పట్టుకొనగలవా?" "తేనె యున్నచో దానిని దేవర వారి సౌధములోనికి తేగలను."

రాజు మధు విప్పించినాడు. వాడు చని, వాతమృగము మేయు చోట పచ్చికకు తేనె పూసి సమీపమున దాగినాడు. వాతమృగము వచ్చి తేనె పూసినగడ్డి మేసి, రుచి మరగి, ఉద్యానమునకు తప్ప మరి యొక ప్రదేశమునకు పోవుట మానుకొనెను. ఉద్యానపాలకు డది గ్రహించి క్రమముగా కనబడసాగినాడు. అది వానిని చూచి రెండు మూడుసారులు పరుగెత్తినను అభ్యాసవశమున విశ్వాసము కలిగి, క్రమక్రమముగా వానిచేతిలోని గడ్డిపరకలు తినజొచ్చినది. దాని విశ్వాసమును గ్రహించి వాడు మార్గములో మండలు విరిచివేసి, తేనె కాయ బుజమున వేసికొని, తృణపూలకమును నడుమునకు కట్టుకొని, తేనెరాచిన గడ్డిపరకలు నడుమనడుమ జారవిడుచుచు, తుదకు వాత మృగమును రాజనివేశమున కెలయించుకొని పోయెను. అది లోనికి జేరగానే అచ్చటివారలు తలుపులు మూసిరి. జనమును జూచి మృగము ప్రాణభయముచే వణకుచు, అంతర్నివేశనములో నటు నిటు పరుగెత్త జొచ్చెను. రాజు పైగదినుండి దిగి వచ్చి, వణకుచున్న వాత మృగమును జూచి "వాతమృగము మానవుని గాంచినచోటికి సప్తా హామువరకును బోవదు. గహనములో నుండుసీమృగము రసతృష్ణచే నిట్టిప్రదేశమునకు వచ్చినది. కావున లోకములో రసతృష్ణకంటె చెడ్డది లేదు" అనుకొని యీగాథ పలికినాడు :

ఆవాసమునకన్న ఆప్తులవాక్కు
కన్నను రుచియె ఆకర్షక మగును.
వన నివాసము చేయు వాత మృగంబు
సంజయు వశ మయ్యె స్వాదుత్వమున నె.

ఇట్లు పలికి వాతమృగమును మరల గహనమునకు బో విడిచినాడు.

శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ ఆ వేశ్య ఇతనిని రస తృష్ణా బద్ధుని చేసి తన వశమునం దుంచుకొన్నది" అని ధర్మోపదేశము చేసి జాతక సారాంశమును వెలువరించెను.

"ఆకాలమున సంజయుడు ఇప్పటి వేశ్య. వాతమృగము ఇప్పటి క్షుద్ర పిండపాతి కుడు. వారణాసీప్రభువు నేను" అని శాస్త సమాప్తి చేసెను.

# 15 ఖరాదియ జాతకము

ఇందలి గాథ బుద్ధుడు జేత వనమున విహారము చేయుసమయమున పరుషవాక్కు-లాడు భిక్షువునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

పరుష వాక్యములాడు భిక్షువు ఎవరి యుప దేశమును గ్రహించెడి వాడు కాడు. బుద్ధుడు అతనితో "భిక్షువూ, నీవు కటుభాషి వగుట నిజమేనా? ఎవరి యుపదేశమును గ్రహింపకుందువా?" అనెను.

"భగవన్, సత్యమే."

అప్పుడు బుద్ధుడు "పూర్వముకూడ నీవు కటుభాషిగా నుండుటకు కారణము పండితుల యుపదేశము గ్రహింపకుండుటయే. పాశ బద్ధుడవై ప్రాణములను కూడ కోల్పోయితివి" అని అతీత కథను ప్రకటీకరించెను.

## అతీత కథ

పూర్వము బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు జింకయై పుట్టి, మృగగణపరివృతుడై యరణ్యములో నివసించుచుండెను. ఒకనా డాయనసోదరి తనపుత్రుని గొని వచ్చి "అన్నా, వీడు నీమేనల్లుడు. వీనికి మృగమాయలు బోధింపు" మని యప్పగించెను. "నీవు నిర్దిష్టసమయమునకు రమ్ము. నీకు బోధ చేసె దను" అని బోధిసత్త్వుడు చెప్పెను. వా డాసమయమునకు బోవలేదు. తరువాత ఏడుదినములు బోధ చేసినను వాడు మృగమాయలు గ్రహింపలేదు. ఒకనాడు వా డటు నిటు దిరుగుచు పాశములో తగు ల్కొనగా తల్లి చూచి అన్నవద్దకు బోయి, "అన్నా, నీమేనల్లునికి మృగమాయలు నేర్పలేదా?" అని యడిగెను. "ఆబుద్ధిహీనుని విష యమై చింతింపకు. వాడు మృగమాయలు గ్రహింప లేకపోయినాడు". అని పలికి అప్పటికిని వానికి నేర్పెడితలపు లేక బోధిసత్త్వు డీగాథ పలికి నాడు :

ఎద్దాని కుండునో యెనిమిది డెక్క
లెవ్వాని కమరు ననేక శృంగములు,
ఏడు జిత్తులతోడ నెగురు నెవండు,
అతనికి బోధింప నభిలాష లేదు.

మతి లేని యామృగమును వేటకాడు సంహరించి, దాని మాంసమును గొని చనెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాతకసారాంశమును వెలువరించెను. అప్పటి మృగము ఇప్పటి పరుషభాషి యగు భిక్షువు. సహోదరి ఇప్పటి ఉప్పలవర్ణ. ఉపదేశ మిచ్చిన మృగము నేనే.

## 16 తిపల్లత్థ మిగ జాతకము

శాస్త కోసాంబీ బదరికారామములో విహరించు చుండగా శిక్షాకామి యగు రాహుల స్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు శాస్త ఆలవి నగరముకడ అగ్గాలవ చైత్యమున విహరించుచుండ, ఉపాసికలు భిక్షునులు ధర్మోపదేశము వినుటకై విహారమునకు బోవుచుండిరి. ధర్మశ్రవణము పగటివేళ జరుగుచుండెడిది. కాలక్రమమున ఉపాసికలు, భిక్షునులు పోవుట మానుకొనిరి. భిక్షుకులు, ఉపాసకులు మాత్రము ధర్మశ్రవణార్థ ముండిపోయిరి. అటుపిమ్మట ధర్మశ్రవణము రాత్రివేళ జరిగెడిది. శ్రవణానంతరము స్థవిర భిక్షుకులు తమ తమ నివాసస్థానములకు పోయెడివారు. దహరభిక్షుకులు (కొద్ది వయసు వారు) ఉపాసకులతో పాటు ఉపస్థానశాలకు (దానశాలకు) పోయి పండుకొనెడివారు. వారు శయనించిన పిమ్మట కొందరు కొందరు బిగ్గరగా గుర్రు పెట్టెడివారు; కొందరు పండ్లు పట పట కొరికెడివారు; కొందరు కొలదిసేపు నిద్రించి లేచెడివారు. ఈవికార

ములను గమనించి కొందరు. బుద్ధునకు విన్నపము చేసిరి. "ఏ భిక్షువు అనుపసంపన్నతతో నిదురించునో అతడు పాచిత్తియము (ప్రాయశ్చిత్తమునకు తగినదోషము) నకు గురి యగు" నని భగవాన్ శిక్షాపద మును చాటింపించి కోసాంబికి వెడలెను.

భిక్షువులు ఆయుష్మాన్ రాహులునితో "ఆయుష్మన్, రాహుల, భగవాన్ శిక్షాపదమును చాటింపించినారు. ఇప్పుడు నీవు నీకొరకు నివాసస్థానము నన్వేషించుకొమ్ము" అని చెప్పిరి. ఇంతకు ముందు భగవానునియెడ గౌరవముచేతను, ఆయుష్మాన్ రాహులుడు శిక్షా కామి యగుటచేతను భిక్షువు లతడు తమ నివాసస్థానములకు వచ్చి నప్పుడు అతని నెక్కువగా సత్కరించెడివారు. ఆయనకు చిన్న మంచము వేసెడివారు; తలక్రింద పెట్టుకొనుటకు చీవరము లిచ్చెడి వారు; కాని శిక్షాపద ఘోషణ జరిగినపిమ్మట భయముచే నివాసస్థాన ముకూడ ఈయలేదు. నాతండ్రి దశబలధారి యని కాని, ధర్మసేనా పతి సారిపుత్రుడు నాయుపాధ్యాయు డని కాని, మహామొద్గల్యా యనుడు నాయాచార్యు డని కాని, ఆనంద స్థవిరుడు నాపినతండ్రి యని కాని రాహులభద్రుడు భావించి వారిలో నెవరికడకును జనక, దశబలధారికి ఉపకరించు శౌచాగారములో బ్రహ్మవిమానమున ప్రవే శించునట్లు ప్రవేశించి అచ్చటనే యుండెను.

బుద్ధుల శౌచాగారద్వారములు బాగుగా మూసివేయుదురు. నేల మీద సుగంధము చల్లుదురు; పరిమళముతో గూడిన మాలికలను గూడ వేలాడదీయుదురు. రేయి యంతయు దీపము వెలుగు చుండును. రాహుల భద్రు డచ్చట ఈవస్తువు లుండు నని కుటీర ములో ప్రవేశింపలేదు; 'ఇప్పుడు నీవు నిజస్థానమునకు పొమ్ము' అని భిక్షువు లనుటచే వారియెడ గౌరవము కలవాడును, శిక్షాకామియు నగుటచేత నందులో నివసించెను. నడుమ నడుమ భిక్షువులుకూడ ఆయుష్మాన్ దూరమునుండి వచ్చుచుండుట చూచి పరీక్షింప దలచి, కస వూడ్చుచీపురు కాని, తట్టకాని వెలుపల బడవేయుచుండిరి; ఆయన వచ్చినపిమ్మట "ఆయుష్మన్, ఎవడు వీనిని వెలుపల బడవేసినాడు?" అని యడిగెడివారు. ఒకానొకడు "రాహులుడు ఈమార్గము వెంట వెళ్ళినాడు" అన్నప్పుడు రాహులుడు "నా కిది తెలియదు" అనక

వానిని తగినచోట నుంచి "భ న్తే, నను క్షమింపుడు" అని వేడు చుండెడివాడు. ఆయన ఇట్టిశిక్షాకామి కావుననే ఆయన కుటీరములో నివసించుచుండెను.

శా స్త అరుణోదయమునకు పూర్వమే శౌచాలయ ద్వారముకడ నిలిచి దగ్గెను. ఆయుష్మంతుడుకూడ దగ్గెను. "ఎవ రక్కడ?" అని బుద్ధు డనగా "నేను రాహులుడ" నని యతడు వెలుపలికి వచ్చి ప్రణామము చేసెను. "రాహులా. నీ వేల యిక్కడ నున్నావు?" "నివసించుటకు చోటు లేకపోవుటచే భ న్తే, భిక్షువులు పూర్వము నన్ను సత్కరించెడివారు; కాని యిప్పు డాప త్తిభయముచే నాకు నివాసస్థానమిచ్చుట లేదు. కాబట్టి ఈస్థానమున నెవ్వరు లేరని యిక్కడనే విశ్రమించుచున్నాను?"

భగవాన్ తనలో "ఈవిధముగా రాహులుని నిర్లక్ష్యము చేసిన భిక్షువులు ప్రవ్రజించిన అన్యకుల పుత్రుల నేమి చేయుదురో!" అని యోచింపగా ధర్మసందేశ ముత్పన్న మయ్యెను. కావున భగవాన్ ప్రాతఃకాలముననే భిక్షువుల నెల్ల ర నొకచోట సమావిష్టులను కావించి ధర్మసేనాపతితో "సారిపుత్రా, రాత్రి రాహులు డెక్కడ నుండెనో నీకు దెలియునా?" అనెను. "భ న్తే, తెలియదు." "సారిపుత్రా, రాత్రి రాహులుడు శౌచాలయములో పండుకొన్నాడు. సారిపుత్రా, నీవు రాహులుని ఈవిధముగా విడిచిపెట్టి, బాలకులను ప్రవ్రజింప జేసి, ఏమి చేయుదువు. ఈస్థితి ఏర్పడినచో ఈశాసనమున ప్రవ్రజితులు ప్రతిష్ఠితులు కానేరరు. ఇక ముందు అనుపసంపన్నులను ఒకటి రెండు దినములు నీవద్ద నుంచికొని, మూడవనాడు వారికి నివాసస్థానము తెలియపరచి వారిని వెలుపల నిలుపుము," అని ఈయుపశాసనము చేసి మరల శిక్షాపదమును శా స్త చాటింపించెను.

ఆసమయమున ధర్మసభలో కూరుచున్న భిక్షువులు రాహులుని ప్రశంస చేయుచుండిరి. "ఆయుష్మంతులారా, చూడుడు. ఈరాహులు డెంత శిక్షాకామియో! నీనివాసస్థానమునకు పొమ్ము అన్న తరువాత, 'నేను దశబలుని పుత్రుడను. శయనాసనములను నిర్ణయించుటకు మీ రెవరు? పొండు, మీరే వెడలిపొండు' అని యే భిక్షుకునకు ప్రత్యుత్తర మీయక, శౌచస్థానమునకు బోయి పండుకొన్నాడు!"

ఈప్రకారముగా వా రనుచుండునపుడు శాస్త ధర్మసభలోనికి వచ్చి, అలంకృతాసనముపై గూరుచుండి, "భిక్షువులారా, కూరుచుని యిప్పు డేమి సంభాషించుచున్నారు?" అని యడిగెను. "భన్తే, మ రేమియును లేదు. రాహులుడు శిక్షాకామి యగుటను గురించి మాటాడుచుంటిమి." "భిక్షువులారా, రాహులుడు కేవల మిప్పుడే శిక్షాకామి కాలేదు; పూర్వము పశువుకడుపున బుట్టినప్పుడుకూడా శిక్షాకామియే" అని శాస్త పలికి, అతీతకథ తెలిపెను.

## అతీత కథ

పూర్వము మగధరాజు రాజగృహమును పరిపాలన చేయుచున్నపుడు బోధిసత్త్వుడు లేడికడుపున పుట్టి, మృగగణపరివృతుడై అరణ్యమున నివసించుచుండెను. ఒకనా డాయనసోదరి తనపుత్రుని దీసికొని వచ్చి "అన్నా, నీమేనల్లునికి మృగమాయలు నేర్పుము" అని కోరెను. బోధిసత్త్వుడు మంచి దని అంగీకరించి "నీవు నిర్దిష్టసమయమునకు రమ్ము" అని వానితో జెప్పెను. మాతులుడు చెప్పినసమయమునకు వాడు వచ్చి, మృగమాయలు గ్రహించెను.

వా డొకనా డరణ్యములో సంచరించుచు పాశమున జిక్కుకొని, పెద్దపెట్టున నరచెను. మృగగణ మాతనితల్లివద్దకు బరువెత్తి వృత్తాంతము తెలిపెను. ఆమె సోదరుని కడకు జని "అన్నా, నీమేనల్లుడు మృగమాయలు నేర్చినాడా?" అని యడిగెను. "నీవు కుమారుని విషయమై కీడు శంకింపవలదు. వాడు మాయలు బాగుగా గ్రహించినాడు. నవ్వుచు ఇప్పుడే మరలిరాగలడు" అని బోధిసత్త్వు డీగాథ చెప్పెను.

భాగి నేయుడు మూడు భంగులలోన
శయనింప గలవాడు; సకల మాయలను
ఎరిగినవా, డష్టఖురములవాడు
త్రాగెడివా డర్థరాత్రమ్మునం దె
సలిలమ్ము; నాసికా శ్వభ్రము నుంచి
పృథ్విపై శ్వాసమ్ము పీల్చెడివాడు
శత్రువుం గికురించు షట్కళల్ చూపి.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు భాగినేయుని శిక్షాగ్రహణమును జూపి, సోదరి నూరడించెను.

అక్కడ పాశములో జిక్కుకొన్నమృగపోతము నిష్పందముగా భూమిమీద నొకప్రక్కగా బండుకొని, కాళ్ళు చాపి, గట్టిగా బిగబట్టుకొని యుండెను. తనగిట్ట ప్రక్కన నేల రాచి, ధూళి గడ్డి రాలిచి, పురీషము వేసి, తల వాల్చి, నాలుక ఆడించుచు, ఒడ లెల్ల దుమ్ము గ్రమ్మ, ఊపిరి బిగబట్టి, పొట్ట ముక్కలించి, గ్రుడ్లు తేలవేసి, మరణావస్థ ప్రదర్శించెను. నీలమక్షికములు గూడ చుట్టు మూగినవి. అక్కడక్కడ కాకులు వాలినవి.

లుబ్ధకుడు వచ్చి, చేతితో దానిపొట్టమీద కొట్టి, "ఉదయమే పాశములో బడిన ట్లున్నది. చచ్చిన ట్లున్నది" అని పాశము వదలించి "దీని నిక్కడనే కోసి మాంసము కొనిపోవుదు" నని భావించి, ఆకులు కట్టెలు నిస్సంశయముగా ప్రోగు చేయుచుండెను. మృగపోతము లేచి, నాలుగుకాళ్ళు జాడించి, ఒడలు విరిచి, మెడ సారించి, మహావాతమున ఛిన్నవలాహకమువలె వేగముగా తల్లికడకు బరుగెత్తెను.

**«భిక్షువులారా, రాహులు డిప్పుడే కాదు, పూర్వము కూడ శిక్షాకామి» యని చెప్పి శాస్త్ర ధర్మోపదేశము చేసి, రెండు కథలను సరి పోల్చి, జాతక సారాంశమును వెలువరించెను. ఆకాలమున భాగినేయ హరిణపోతము ఇప్పటి రాహులుడు; తల్లి ఇప్పటి ఉత్పలవర్ణ; మాయామృగము నేనే.**

## 17 మారుత జాతకము

**శాస్త జేతవనమున విహరించుచుండగా ఇరువురు వృద్ధ ప్రవ్రజితులను గూర్చి చెప్పినది.**

### వర్తమాన కథ

వా రిరువురు కోసల జనపదమునకు సంబంధించిన ఒకానొక అరణ్యావాసమున నుండిరి. ఒకని పేరు కాలుడు, రెండవయతని పేరు

జుణ్హా స్థవిరుడు. ఒకనాడు జుణ్హుడు కాలస్థవిగునితో "భన్తే, కాల, శీతము ఎప్పుడు వచ్చును?" అనెను. "కాలమున (కృష్ణపక్షమున)" అని యతడు చెప్పెను. ఒకనాడు కాలుడు "జుణ్హా, ఎప్పుడు శీతము వచ్చును?" అనెను. "జుణ్హాలో (జ్యోత్స్నలో) శుక్లపక్షములో" అని యతడనెను. వారుసంశయము తీరక శాస్తకడకు జని, ప్రణామము చేసి, "భన్తే, శీత మెప్పుడు వచ్చును?" అని యడిగిరి. వారిమాటలు విని శాస్త "భిక్షువులారా, నేను పూర్వమే మీయీప్రశ్నకు సమాధాన మిచ్చినాను. కాని, పూర్వజన్మమున మరుగుపడి యుండుటచే మీకాసమాధానము జ్ఞప్తిలో లేదు" అని, పూర్వజన్మకథ వివరించినాడు.

## అతీత కథ

పూర్వకాలమున నొకానొక పర్వతపాదమున నొకే గుహలో సింహము పులియు మైత్రితో నుండెను. ఆపర్వతపాదముననే బోధిసత్త్వుడు నివసించుచుండెను.

చలినిగూర్చి యొకనాడామిత్రులనడుమ వివాద ముత్పత్తిల్లెను. కృష్ణపక్షముననే చలి యుండు నని పులి యనెను. శుక్లపక్షముననే చలి యుండునని సింహము పలికెను. అవి రెండును వివాదము పరిష్కరించుకొనజాలక బోధిసత్త్వుని వేడుకొన్నవి. ఆయన యీగాథ పలికినాడు.

పక్షద్వయమ్మున పవనమ్ము వీచు
చున్నవేళల చలి యుద్భూత మగును;
ఉభయుల కథనంబు యుక్తి యుక్తంబె.

ఈవిధముగా బోధిసత్త్వు డామిత్రద్వయమునకు శాంతి సమకూర్చెను.

శాస్త "భిక్షువులారా, నేను పూర్వమే మీయీప్రశ్నకు సమాధాన మిచ్చినాను" అని ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రకటించిన పిదప ఇరువురు స్థవిరులు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు లయిరి. శాస్త సభ చేసి, జాతకసారాంశము వెలువరించెను. అప్పటి వ్యాఘ్రము ఇప్పటి కాలస్థవిరుడు; సింహము ఇప్పటి జుణ్హ స్థవిరుడు. ప్రశ్నోత్తరము లిచ్చిన తపస్వి నేనే.

# 18 మతకభత్త జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా శ్రాద్ధమును గురించి చెప్పినది.

## వర్తమాన కథ

ఆకాలమున మానవులు గొర్రెలు మేకలు మొదలగువానిని చంపి చనిపోయిన బంధువుల స్మరణార్థము శ్రాద్ధములు పెట్టుచుండిరి. లోకు లట్లు చేయుచుండుట చూచి భిక్షువులు శాస్తతో "భన్తే, జనులు జంతువులను వధించి శ్రాద్ధములు పెట్టుచున్నారు. దీనివలన భన్తే, వారికి ఉన్నతి కలుగునా?" అనిరి. "భిక్షువులారా, శ్రాద్ధములు పెట్టవలె ననువిచారముకన్న ప్రాణహాని చేయువానికి ఏమాత్రము లాభ ముండదు. పూర్వకాలమున పండితులు ఆకసమున కూరుచుండి ధర్మోపదేశము చేసి, ప్రాణహాని దోష మని నిరూపించి, సకలజంబూ ద్వీప వాసులను ఈకర్మనుండి నివారించిరి. ఇప్పు డావిషయము పూర్వ జన్మమున మరుగుపడి యుండుటచే మరల ఆకర్మ ప్రాదుర్భవించినది" అని పలికి, శాస్త పూర్వకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా వేదత్రయపారంగతు డగుబ్రాహ్మణు డొకడు జగద్విఖ్యాతాచార్యు డయి, మరణించిన పితృపితామహాదులకు పిండప్రదానము చేయబూని, మేకను తెప్పించి, శిష్యులతో "నాయనలారా, ఈమేకను నదికి గొని పోయి, స్నానము చేయించి, మెడలో పూలదండ వేసి, తినుటకు ధాన్యము పెట్టి పంచాంగుళిచిహ్నము లుంచి, తీసికొని రండు" అనెను. మంచిదని వారు దానిని నదికి గొనిపోయి కడిగి, తుడిచి, తీరమున నిలిపిరి. మేక తన పూర్వకర్మమును విచారించి, యిట్టి దుఃఖము నేటితో తొలగిపోవు నను సౌమనస్యమున కుండ బ్రద్దలు చేసినధ్వని వలె బిగ్గరగా నవ్వి యీబ్రాహ్మణుడు నను బట్టుకొని నావలన వ్యథ నొందు నని పెద్దపెట్టున నేడ్చెను. అంతట మాణవకులు మేకతో

"మిత్రమా, నీవు బిగ్గరగా నవ్వితివి, బిగ్గరగా నేడ్చితివి. ఏల నవ్వితివి, ఏల యేడ్చితివి?" అనిరి. "మీయాచార్యుని సన్నిధిలో నన్ను ప్రశ్న నడుగుడు" అని అజము పలికెను.

వారు దానిని గొనిపోయి ఆచార్యునితో ఆసంగతి చెప్పిరి. వారి పలుకులు విని ఆచార్యుడు మేకను జూచి "నీ వేల నవ్వినావు, ఏల యేడ్చినావు? అని యడిగెను.

పూర్వజన్మ జ్ఞానముచే మేక బ్రాహ్మణునితో నిట్లు చెప్పెను: "బ్రాహ్మణోత్తమా, నేను నీవలెనే పూర్వజన్మమున మంత్రములలో ఆరితేరిన బ్రాహ్మణుడనై పుట్టి, పితృపితామహులకు పిండప్రదానము చేయుదు నని మేకను కోసి పెట్టితిని. ఒక్క మేకను కోయుటచే నాకు 500 పర్యాయములు శిరశ్ఛేదము సంభవించినది. ఇది తుదిజన్మ. ఈనాడే నాదుఃఖవిమోచన మగు నని తెలిసికొని నవ్వినాను. ఒక్క మారు నే నజవధ చేయుటచే పంచశతవారములు తల తెగిననాకు నేటితో దుఃఖవిమోచన మగుచుండగా, నీవు నన్ను వధించి ప్రతి ఫలముగా నేనూరుమార్లు శిరశ్ఛేదము పొందుదు వనుజాలిచే దుఃఖించితిని."

"అజమా, భయపడకుము, నిన్ను చంపను."

"బ్రాహ్మణోత్తమా, ఏ మనుచున్నావు? నీవు నన్ను చంపినను చంపకున్నను మరణమునుండి తప్పించుకొన జాలను".

"అజమా! నీకు భయము లేదు. నిన్ను రక్షించుటకు నీవెంట వత్తును".

"బ్రాహ్మణోత్తమా, నీసంరక్షణశక్తికన్న నాపాపము మహాబల వత్తరము".

బ్రాహ్మణుడు మేకను విప్పి, దీని నెవ్వరును చంపకుండ జూడవలె నని అంతేవాసులను దీసికొని దానివెంట తిరుగజొచ్చెను. ఒకానొక పాషాణోపరి భాగమున మొలచిన మొక్కలను ఆకులను తినుటకై మేక మెడ చాపెను. ఆక్షణమున పాషాణముమీద పిడుగు పడెను. శిలాశకల మెగిరి వచ్చి మేక మెడను ఖండించెను. జనులు గుమి గూడిరి.

అచ్చట వృక్షదేవతగా నివసించుచున్న బోధిసత్త్వుడు నిజప్రభావ

ముచే ఆకాశమున బ్రహ్మపీఠము వేసికొని కూరుచుండి చూచువారితో "ఈజీవు లెల్లరు పాపఫలమును గుర్తెరింగినవారు, ప్రాణిహింస చేయ కుందురు గాక" అని మధురస్వరమున ధర్మము నుపదేశించుచు ఈగాధ పలికెను:

ప్రాణిజాతంబు గ్రహియించు పక్షమందు
జన్మము వ్యర్థా కరం బని, చంపలేదు
ప్రాణి వేరొక ప్రాణిని—ప్రాణఘాత
చేయువారలు దుఃఖంబు చెందవలయు.

ఈప్రకారముగా మహాసత్త్వుడు నిరయభయము చూపి, ధర్మము నుపదేశించెను. ఆధర్మసందేశమును విని మానవులు నిరయభీతులై ప్రాణహింస మానిరి. బోధిసత్త్వుడు ధర్మము బోధించి, మహాజనమును సుశీలమున ప్రతిష్ఠించి, నిజకర్మానుసార మగుపదవిని జెందెను. మహా జనము బోధిసత్త్వుని యుపదేశము ననుసరించి దానాదిపుణ్యకార్య ములు చేయుచు దేవనగరము జేరెను.

ఈప్రకారముగా మహాసత్త్వుడు నిరయభయము నిరూపించి, ధర్మోపదేశము చేసెను. లోకు లాయుపదేశము విని, నిరయభయము పొంది, జీవహింస మానిరి. బోధిసత్త్వ డుపదేశ మిచ్చి, మానవులను శీలమున ప్రతిష్ఠించి, నిజకర్మానుసారముగా పరలోక మునకు బోయెను.

జనసమూహముకూడ బోధిసత్త్వుని యుపదేశానుసారముగా నాచరించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు, దేవనగరమునకు బోయిరి.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకసారాంశమును వెలువరించి "ఆకాలమున నేను వృక్షదేవతగా నుంటి" ననెను.

# 19 ఆయాచితభత్త జాతకము

**శాస్త జేతవనమున విహారము చేయుచు, దేవతాప్రీతికై చేయు బలి కర్మలను గురించి చెప్పినది.**

## వర్తమాన కథ

ఆకాలమున వర్తకులు వ్యాపారార్థము పోవు సమయమున జంతువులను దేవతలకు బలి ఇచ్చి "మేము విఘ్నబాధ లేకుండ ధనము సంపాదించి తిరిగి వచ్చుపక్షమున మఱల మీకు బలి సమర్పింతుము" అని మ్రొక్కుకొని పోవుచుండెడివారు. ఆతంకములు లేకుండ ధనము పూర్ణముగా సంపాదించి మరలి వచ్చి ఇది దేవతానుగ్రహముచే జరిగినది అని భావించి అనేక జంతువులను బలి యిచ్చుచుండెడివారు. అయ్యది గమనించి భిక్షువులు భగవానునితో "భన్తే, ఈ బలికర్మ వలన ఏమైనను ప్రయోజనమున్నదా?" అనిరి. భగవాన్ అతీతకథ ఇట్లు చెప్పెను.

## అతీత కథ

పూర్వము కాశీరాజ్యమున నొకానొక గ్రామములోని కుటుంబి యొకడు ఊరిమొగదల నున్న వటవృక్షముమీది దేవతకు బలి యొసగుదు నని ప్రతిజ్ఞ చేసినాడు. అనంతర మాతడు బహుజంతువులను వధించి ప్రతిజ్ఞావిముక్తు డగుటకై వృక్షమూలమునకు జనినాడు. వృక్షదేవత చెట్టుపంగలో నిలిచి, యీగాథ పలికెను :

> మోక్షకామము కలదేని మొదటి నుండి
> ముక్తుడవు కమ్ము; చేయుచో మోక్షయత్న
> మంత కంతకు బద్ధుడ వగుదువు సుమి;
> ధీరు లగువార లీగతి కారు ముక్త,
> లలసులకు ముక్తి బంధన మగును కాదె!

వాటినుండి మనుజులు ప్రాణివధ విరమించి, ధర్మమార్గమున చరించి దేవనగరము జేరిరి.

ఆ సమయము నుండియు మానవులు ఈ ప్రకారముగా జీవహింస నుండి తొలగి ధర్మానుసారముగ ప్రవర్తించుచు దేవగరమునకు పోయిరి. శాస్త్ర ధర్మోపదేశము చేసి, జాతక సారాంశమును వెలువరించి ‹‹ఆ కాలమున నేనే వృక్షదేవతగా నుంటిని›› అని సమాప్తి చేసెను.

## 20 నలపాణ జాతకము

శాస్త్ర కోసల జనపదమున పర్యటన చేయు సమయమున నలక-పాన గ్రామముచేరి, నలక-పాన పుష్కరణికడ కేతకవనమున విహారముచేయుచున్న సమయమున నళ దండమునుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆ కాలమున భిక్షువులు నలక-పాన పుష్కరణిలో స్నానము చేసి సూదులు పెట్టు గొట్టములు శుద్ధము చేయుటకై నాళములు తెండని శ్రమణులతో చెప్పి దండములకు అడ్డుగా ఛేదములుండుట చూచి శాస్త్ర కడకు చని "భన్తే, మేము సూది గొట్టములు తయారు చేయుటకై నాళములు తెప్పించితిమి. అవి క్రింది నుండి పై వఱకును పగుళ్ళతో నున్నవి. దీనికి కారణమేమి?" అనిరి. "భిక్షువులారా, ఇది నా పురాణ నిశ్చయ ఫలితమని శాస్త్ర అతీత కథ చెప్పినాడు:

### అతీత కథ

పూర్వ మిచ్చట సాంద్రారణ్య ముండెడి దని ప్రతీతి. పుష్కరిణి లోనికి దిగినవారి నందరిని జలరాక్షసుడు భక్షించెడివా డట. ఆకాలమున బోధిసత్త్వుడు రోహితమృగప్రమాణము కల కపిరా జయి, 80 వేలవానరముల కపాయము కలుగనీకుండ వానికి నాయకు డయి యరణ్యమున నివసించుచుండెను. ఆయన వానరవర్గమున కిట్లుపదేశించెను: "నాయనలారా, ఈయరణ్యమున విషవృక్షములు, రాక్షసా

ధిష్ఠితము లయిన సరస్సులు కలవు. ఇదివరలో మీరు తిననిపండ్లు కన బడినను, మున్ను త్రాగనిజలము కానవచ్చినను నాకు దెలుపకుండ నారగింపపద్దు." వానరములు సరే అన్నవి.

ఒకనాడు నూతనస్థానమునకు జేరి పగ లంతయు పయనించుటచే వానరములు దప్పిగొని, నీటికై వెదకుచుండగా సరస్సు కానవచ్చినది. అవి నీరు త్రాగక బోధిసత్త్వుడు వచ్చువరకును వేచియుండెను. ఆయన చేరవచ్చి నీరు త్రాగ రేమి అన్నాడు. "మీరాక కెదురు చూచుచున్నాము" అని వానరము లన్నవి. మంచి దని బోధిసత్త్వుడు పుష్కరిణి చుట్టును తిరిగి, అడుగు జాడలు నీటిలోనికి బోవుటే కాని పైకి రాకుండుట కనిపెట్టి అది రాక్షసాధిష్ఠిత మని తలచి, "మీరు నీరు త్రాగకుండుట మే లయ్యెను. ఇది రాక్షసపరిగ్రహీతము" అని పరివారముతో బలికెను.

వానరములు నీటిలోనికి దిగ వని ఉదకరక్షస్సు గ్రహించి, నీలో దరము, పాండురముఖము, సురక్తవర్ణ హస్తపాదములు, భీభత్సదర్శ నము నగునాకృతి దాల్చి, యుదకములోనుండి యీవలకు వచ్చి, "ఏల యిక్కడ గూరుచున్నారు? దిగి నీరు త్రాగ రేమి? అనెను".

"నీవు జలరక్షస్సువు కావా?"

"అవును."

"ఈనీటిలో ప్రవేశించినవారి నందరిని నీవు మ్రింగుదువు కాదా?"

"అవును, చిన్నిపిట్టలు మొదలు పెద్దజంతువులవరకు దేనిని విడ వను. నీటిలోని కెవరు వచ్చినను భక్షింతును. మిమ్ములనందరను మ్రింగుదును."

"మమ్ము భక్షింపలేవు."

"నీరు త్రాగి చూడుడు."

"ఉదకము త్రాగుదుము, కాని నీకు వశము కాము."

"అగుచో జల మెట్లు త్రాగుదురు?"

"దిగి నీరు త్రాగుదు మనుకొంటివా? నీటిలోనికి మేము దిగనే దిగము. నాళదండములు కొని, తామరతూడునుండి సలిలము త్రాగు నట్లు నీసరోవరజలము త్రాగివేయుదుము. నీవు మమ్ము భక్షింపలేవు" అని తెలిపి, శాస్త్ర అభిసంబుద్ధు డగు స్థితిలో ఈగాథలో మొదటి

రెండుచరణములు పలికెను.

లోనికిం బోవు చిన్నెలే కాని, పైకి
చిహ్నములు కానరాకుంటచేత మేము
నాళములతోడ నీరమ్ము గ్రోలువార,
మీరు మమ్ముల నింక హింసింప లేరు.

ఇట్లు పలికి బోధిసత్త్వుడొక నాళదండము తెప్పించి, దశపారమితలను స్మరించి, ప్రతిజ్ఞ చేసి, నోటితో బెత్తములోని కూదెను. తోడనే నాళము కణుపులు వీడి సుషిరమయ్యెను. ఈప్రకారముగా ఆయన అన్నిటికిని బెజ్జము లేర్పడునట్లు చేసెను. అనంతరము పుష్కరిణిచుట్టును తిరిగి, ఈప్రాంతములలో మొలచు నళము లన్నియు సుషిరము లగుగాక యని యాన తిచ్చెను. బోధిసత్త్వుల హితభావనలు మహత్తరము లగుటచే నాజ్ఞలు నెరవేరును. సరోవరము చుట్టును పెరిగిన నళము లన్నిటికిని ఛిద్రము లేర్పడెను,

ఇట్లాన తిచ్చి, బోధిసత్త్వుడు నళదండము చేత బట్టుకొని కూర్చుండెను. 80 వేల వానరములును చేతులలో బెత్తములు పట్టుకొని సరోవరముచుట్టును గూర్చుండెను. బోధిసత్త్వుడు బెత్తపు గొట్టముద్వారా నీరు త్రాగునపుడు వానరములుగూడ నీరు త్రాగినవి.

ఉదకరక్షస్సున కేదియు లభింప లేదు. వాడు కోపముతో నిజనివాసమునకు బోయెను. బోధిసత్త్వుడు సపరివారముగా నరణ్యమున బ్రవేశించెను.

“భిక్షువులారా, ఈకాండములకు రంధ్రములుండుట నా పురాణ నిశ్చయఫలితము” అని శాస్త ధర్మోపదేశముచేసి రెండు కథలు సరిపోల్చి జాతక సారాంశమును వెలువరించెను.

ఆకాలమున ఉదక రక్షస్సు దేవదత్తుడు 80 వేల వానరములు బుద్ధ పరిషత్తు. ఉపాయకుశలు డైన కపిరాజు నేనే.

## 21. కురుంగ మిగ జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచుండగా దేవదత్తునిగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకానొక సమయమున ధర్మసభలో కూర్చుండి భిక్షువులు దేవదత్తుని నింద చేయుచుండిరి. "ఆయుష్మంతులారా, దేవదత్తుడు తథాగతుని వధార్థము ధానుష్కులను నియోగించి, శిలలు విసిరించి, ధనపాల కుంజరమును మీాదికి విడిచి, బహువిధముల తథాగతుని వధించుటకై ప్రయత్నము చేయుచున్నాడు" అనిరి. బుద్ధుడు అటుగు దెంచి పరచిన ఆసనముపై కూర్చుండి వారిని చూచి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అని యడిగెను. "భన్తే, దేవదత్తుడు తమ సంహారము కొరకు ప్రయత్నించుచున్నాడు. కావున మేము వానిని నిందించుచున్నాము" అని విన్నవించిరి. "భిక్షువులారా, దేవదత్తుడు కేవలము ఇప్పుడే కాదు, పూర్వముకూడ నన్ను వధించుటకై యత్నము చేసినాడు; కాని కృతార్థుడు కాలేక పోయినాడు" అని శాస్త అతీత కథను వివరించెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కురంగ మయి, అరణ్యాయతనమున ఫలములు తినుచు నివసించుచుండెను. ఒకనొకసమయమున కురంగము సేపణ్ణి వృక్షఫలములు తినుచుండెను. ఒక గ్రామవాసి యగుమృగయుడు వృక్షమూలమున మృగపాదచిహ్నములు చూచి, వృక్షముపై అట్టకము కట్టి, యచట కూరుచుండి, ఫలములు తిని వచ్చుజంతువులను శూలముతో పొడిచి చంపి, మాంస మమ్మి జీవించుచుండెను. ఒకనాడు బోధిసత్త్వుని పాదచిహ్నములు వృక్షముక్రింద జూచి, పైన అటక కట్టి, ఉదయమే భోజనము చేసి, బల్లెము పట్టుకొని పోయి, చెట్టుమీాది యటకపై గూరుచుండెను. బోధిసత్త్వుడు ఫలములు తినవచ్చెను. కాని త్వరపడి

చెట్టువద్దకు బోవక "అట్టకలుబ్ధకులు చెట్లమీద అటకలు కట్టుదురు. ఇట్టి యుపద్రవ మిచట సంభవించు నేమో" యని పరిశీలించుటకై దూరముగా నిలిచెను. పైనుండి వేటకాడు సేవణ్ణి ఫలములను కోసి, బోధిసత్త్వుని వద్దకు విసరెను. "ఈపండ్లు వచ్చి నాముందు పడినవి. పైన మృగయుడు లేడు కదా!" అని మాటిమాటికిని చూచుచు, వేట కానిని గనిపెట్టియు చూడనట్లు నటించి "వృక్షరాజమా, ఇదివరలో నీవు లంబమానలతికవలె ఫలములను సూటిగా నేల రాల్చుచుంటివి. ఇప్పుడో వృక్షధర్మమును విడిచినావు. కావున నేను వేరొకవృక్షమూల మునకు జేరి, ఆహారము వెదకికొందును" అని యీగాథ పలికెను :

నీవు వృక్షమ, మెందుగ నేలమీద
రాల్చుచున్న ఫలాలు కురంగ మెరుగు.
పోవుదును నేను వేరొక భూరుహమ్ము
జేర, నీపండ్లు నాకు రుచింప లేదు.

అంతట లుబ్ధకు డట్టకమునుండియే బల్లెము విసరి "పో, నేటికి తప్పించుకొన్నావు" అనెను. బోధిసత్త్వుడు వెను దిరిగి యాగి "సరి తప్పిపోయినావు. అష్టమహానిరయములు, షోడశోపనరకములు, పంచ బంధనములు తప్పవు" అని పలికె, వేగముగా జనెను. వేటకాడు తన యిచ్చ వచ్చిన చోటికి బోయెను.

"భిక్షువులారా, దేవదత్తుడు కేవల మిప్పుడే కాదు, పూర్వము కూడ నావధ కోసమై ప్రయత్నించినాడు. కాని కృతార్థుడు కాలేదు" అని బుద్ధుడు ధర్మోప దేశము చేసి రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశమును వెలువరించెను. ఆకాల మున మంచెపై నుండి వేటాడు వాడు ఇప్పటి దేవదత్తుడు. కురంగమృగము నేనే.

# 22 కుక్కుర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుండగా జ్ఞాతులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆకథ పంద్రెండవ నిపాతమున మద్రసాల జాతకమున (465) వచ్చును. ఇక్కడ వర్తమాన కథాస్థాపన మయినపిమ్మట అతీత కథ చెప్పబడినది.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు పూర్వకర్మవలన కుక్కకడుపున పుట్టి, అనేకశతకుక్కుర పరివృతుడై మహాశ్మశానమున నివసించుచుండెను. ఒకనాడు శ్వేత సైంధవయుక్తము, సర్వాలంకార పరిమండితము నగురథ మెక్కి రాజు ఉద్యానమునకు బోయి, అచ్చట పగలు క్రీడించి, సూర్యుడస్తమింం చినపిదప నగరిలో బ్రవేశించెను. సేవకులు రథవర్తము విప్పకుండ రథ మును రాజాంగణముననే యుంచిరి. రాత్రి వర్షము కురియుటచే సామా నులు తడిసినవి. రాజుగారి శునకములు పైనుండి దిగి సామానుల చర్మము నమలి మ్రింగినవి. మరునాడు సేవకులు రాజుతో "దేవా, నిర్గమనముద్వారా జలదారివెంట శునకములు ప్రవేశించి, రథచర్మ మును నమలినవి" అని చెప్పిరి. రాజు కోపించి, "కనపడిన ప్రతిశునక మును కొట్టివేయుడు" అని యానతిచ్చెను. నాటినుండి శునకముల కాపద యేర్పడెను. కుక్కలు మహాశ్మశానమునకు బోయి బోధిసత్త్వుని సన్నిధికి జేరుకొన్నవి. "ఇందరు వచ్చినారు, కారణ మేమి?" అని ఆయన యడిగెను. "రాజాంగణమున రథచర్మాదులను కుక్కలు నమలిన వని కుపితుడై రాజు శునకవధ కాజ్ఞ యిచ్చినాడు. అనేక శునకములు నశించినవి. మహాపద్రవము బయలుదేరినది" అని యవి చెప్పినవి.

బోధిసత్త్వుఁ డిట్లు యోజించెను: "రాజాంగణములోనికి బోవుటకు బయటికుక్కల కవకాశము లేదు. లోపల రాజనివేశములోని కుక్కలే యీపని చేసి యుండవచ్చును. నిజ మైనచోరులకు దండన లేదు; అన్యులకు మరణము సిద్ధించుచున్నది, కావున నిజ మైనచోరులను రాజుకు జూపి, జ్ఞాతిసంఘమునకు ప్రాణదానము చేయుదును గాక."

బోధిసత్త్వుఁడు శునకముల నోదార్చి "మీరు భయపడవలదు. మీకు నే నభయము తెత్తును. నేను రాజును చూచి వచ్చువరకును మీ రచ్చటనే యుండుఁడు" అని బయలుదేరి దశపారమితలను స్మరించి, మైత్రిభావ పురస్సరముగా ఏకాకిగా పోవుచు "నాపై కర్రగాని, రాయి గాని, వేయనున్నహస్తము పైకి లేవకుండుఁగాక" అని నగరములోనికి జేరినప్పు డెవ్వఁడును కోపింపలేదు.

శునకవధ కానతిచ్చి రాజు న్యాయసభలో గూరుచుండెను. బోధిసత్త్వుఁడు సూటిగా నచ్చటికే పోయి రాజపీఠముక్రింద దూరెను. రాజపురుషులు శునకమును బయటికి తరుమ నుద్యుక్తు లయిరి. రాజు వారిని వారించెను. బోధిసత్త్వుఁడు సమాశ్వాసము చెంది, పీఠముక్రింది నుండి యీవలకు వచ్చి రాజుకు నమస్కరించి "దేవా, కుక్కలను హతము చేయించుచున్నది మీరేనా?" అనెను. "అవును నేనే." "నరేంద్రా, వానియపరాధ మేమి?" "నారథ పరివారచర్మమును వారలను కుక్కలు నమిలివేసినవి." "నమలినవానిని మీరు గురుతించితిరా?" "నాకు తెలియదు." "దేవా, ఇవి ఈపని చేసిన వని తెలియనప్పుడు, కనబడినవాని నెల్ల సంహరించుట యుక్తము కాదు." "కుక్కలాపని చేయుటచే అన్ని శునకములను సంహరింపవలసి వచ్చినది." "మీపరిజనులు అన్నిటిని చంపుదురా, కొన్నిటినే చంపుదురా?" "మాయింటి కుక్కలను మాత్రము చంపరు." "మహారాజా, అన్నిటిని వధింతు రని ఇప్పుడే తమరు సెల విచ్చినారు. కాని తమయింటి కుక్కలను మాత్రము చంప రనుచున్నారు. కావున తాము 'అగతి గమనము' చేయుచున్నారు. అది న్యాయము కాదు. రా జనగా తులాదండమువలె నుండవలెను. ఇప్పుడు రాజశునకములు దండనము తప్పించుకొన్నవి. దిక్కు లేనిశునకములు చచ్చినవి. ఈన్యాయము సర్వకురుకురములకును వర్తించుట లేదు" అని మహాసత్త్వుఁడు మధురస్వరమున

"దేవా, మీరు చేయునది ధర్మసమ్మతము కాదు" అని రాజున కుపదేశపూర్వకముగా నీగాథ పలికెను:

రాజకుల మందు నెయ్యవి రక్షితములు
వర్ణము బలంబు గలిగినవాని విడిచి
మమ్మె చంపుట కుక్కుర మారణంబె?
అధిక దుర్బల పశువధ మగును గాని.

బోధిసత్త్వుని వాక్కులు విని రాజు "పండితోత్తమా, ఇవి రథచర్మములను కొరికిన వని మీకు తెలియునా?" అనెను. "తెలియును." "ఏవి?" "మీయింట నుండు శునకములు." "అవి నమలినట్లు మీ కెట్లు తెలియును?" "మీకు ఋజువు చేయుదును." "పండితోత్తమా, ఋజువు చేయుడు." "మీ కుక్కలను బిలువనంపుడు. మజ్జిగ, దర్భాంకురములు తెప్పింపుడు."

అవి వచ్చినంతనే బోధిసత్త్వుడు "ఈగడ్డి రుబ్బించి, మజ్జిగలో కలిపి, మీకుక్కలచే త్రాగింపుడు" అని పలికెను.

రాజాప్రకారమే చేయించెను. అది త్రాగి కుక్కలు కక్కుకొన్నవి. అందు చర్మపుముక్కలు కానవచ్చెను. రాజు సంతుష్టుడై "ఇది సంపూర్ణబుద్ధుని తీర్పువలె నున్నది" అని బోధిసత్త్వునకు శ్వేతచ్ఛత్ర మిచ్చి పూజించెను. మహాసత్త్వుడాయనకు తేసకుణజాతకము (521) లోని ధర్మములు చెప్పి, పంచశీలము లిచ్చి శ్వేతచ్ఛత్రమును తిరుగ నిచ్చివేసెను.

రాజు మహాసత్త్వుని ధర్మకథనము విని సమస్తజంతువులకు నభయ మిచ్చి, బోధిసత్త్వుడు మొదలు సర్వశునకములకు తన భోజనమువంటి నిత్యభోజన మేర్పాటు చేసి, ఆయన యుపదేశముల ప్రకారము సిద్ధుడై, దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు దేవలోకము నొందెను.

కుక్కురోపదేశము పదివేల సంవత్సరములవరకును ప్రవర్తిల్లెను. బోధిసత్త్వుడు జీవితాంతమున యథాకర్మం గతో.

**"భిక్షువులా, తథాగతుడు కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ జ్ఞాతుల కుపకారము చేసియుండెను" అని బుద్ధుడు ధర్మోపదేశము చేసి కథలు సరి పోల్చి, జాతకసారాం**

శమును వెలువరించెను. ఆకాలమున రాజు ఇప్పటి ఆనందుడు. మిగిలినవార లెల్ల బుద్ధపరిషత్తు. కుర్కురము నేనే.

## 23 భోజాజానీయ జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచుండగా హీనప్రయత్నుడగు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆకాలమున శాస్త్ర ఆభిక్షువును పిలువ నంపి "భిక్షూ, పూర్వసమయమున పండితులు సామర్థ్యముచే బాహ్యాకార్యములందు గూడ శ్రద్ధావంతు లయియుండిరి; నష్టములు వచ్చినను, ప్రయత్నము విడిచెడివారు కారు" అని అతీతకథ వివరించినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు భోజాజానీయనేయకులమున బుట్టి, సర్వాలంకార సంపన్నమై వారణాసీ ప్రభువునకు మంగళాశ్వ మయ్యెను. లక్షనాణెముల విలువ గల బంగరుపళ్ళెములో మూడుసంవత్సరముల నాటి శాలితండులములతో రససంపన్న మగుభోజన మాయశ్వమునకు బెట్టెడివారు. చతుర్విధ సుగంధద్రవ్య పరివిప్త మైనశాలలో అశ్వము నిలిచెడిది. అశ్వశాలచుట్టును రక్తకంబళములు, తెరలు వేసి, పైభాగమున సువర్ణతారకాఖచిత మైన చాందినీ కట్టిరి. గోడలమీద పరిమళ పుష్పదామములు వ్రేలాడదీసిరి. సుగంధతైల ప్రదీపములు నిరంతరము వెలుగు చుండెడివి. కాశీరాష్ట్రమును వాంఛింపని రాజు లేడు. ఒకసమయమున ఏడుగురురాజులు వారాణాసిని చుట్టుముట్టి "మాకు రాజ్య మిత్తువా, యుద్ధము చేయుదువా?" అని వారాణాసి

ప్రభువునకు సందేశ మంపిరి. అమాత్యులను సమావేశపరచి రాజు "ఇప్పు డేమి చేయుదు?" మని యడిగెను. "దేవా, మీరు యుద్ధము లకు ముందుగా పోవరాదు. ఆయశ్వారోహిని తొలుత పంపుడు. అతనికి శక్తి లేనిచో తరువాత యోచింతము" అని వారు చెప్పిరి.

అశ్వారోహిని బిలిపించి రాజు "బాబా, ఏడుగురు రాజులతో నీవు యుద్ధము చేయగలవా?" అని యడిగెను.

"దేవా, తమసైంధవము నిచ్చినచో ఏడుగురు రాజులతోనే కాదు—సకలజంబూద్వీప రాజులతో యుద్ధము చేయగలను."

"బాబా, సైంధవమే కాదు—నీ యిచ్చవచ్చిన యేయశ్వము నైనను తీసికొని యుద్ధము చేయుము."

"చిత్తము, దేవా!"

అతడు ప్రాసాదము దిగి, సైంధవము నీవలకు రప్పించి, సన్నాహము చేయించి, తానుగూడ సంసిద్ధుడై, గుఱ్ఱ మెక్కి, నగరము వెలుపడి, మెరపువలె ప్రథమస్కంధావారమును భేదించి మొదటి రాజును సజీవముగా పట్టుకొని వచ్చి, నగరమున సైనికుల కప్పగించెను. అశ్వారోహి మరల జని రెండవస్కంధావారమును భేదించి, క్రమ క్రమముగా నలుగురు రాజులను పట్టుకొన్నాడు. అయిదవరాజును అరవరాజును పట్టుకొను నప్పుడు సైంధవమునకు ప్రహారము తగిలెను. రక్తము కారి బాధ పుట్టెను. అశ్వారోహి సైంధవమును రాజ ద్వారముకడ పండుకొనబెట్టి, సన్నాహము సడలించి, వేరొక యశ్వ మును సన్నద్ధము చేయసాగెను.

బోధిసత్త్వుడు నేలమీద నొకప్రక్కన బండుకొని యుండి, కన్నులు తెరచి, అశ్వారోహి చేయుచున్నపని గ్రహించి, "ఈతడు సన్నాహము చేయుచున్నయశ్వము ఏడవ స్కంధావారమును భేదింపలేదు. నేను సాధించినదానిని పాడుచేయును. అప్రతిము డైనయీరాతు చని పోవును. రాజు పరహస్తగతు డగును. నేను తప్ప వేరొకయశ్వము ఏడవ శిబిరమును పడద్రొక్క లేదు, ఏడవరాజును పట్టలేదు" అని ఆలోచించి, "ఆర్యా, అశ్వికా, నేను నెరవేర్చినదానిని నాశము కానీయకుము. నన్ను పాదములమీద నిలిపి, కవచాదులు సంధిం పుము" అని యీగాథ పలికెను:

బాణములు గ్రుచ్చుకొని నేల బడిన గూడ
మంగళాశ్వమె అన్నితురంగములకన్న శ్రేష్ఠము సారధి, కాన నన్ను
సొంపు మీరగ సజ్జీకరింపవలయు.

అశ్వమును లేవనెత్తి రాతు గాయమునకు కట్టు కట్టి, సుసన్నద్ధము చేసి, ఆరోహించి, యేడవశిబిరమును భేదించి, ఏడవ రాజును సజీవముగా పట్టుకొని నిజస్సైనికుల కప్పగించెను. రాజు వచ్చినపుడు బోధిసత్త్వుడు "దేవా, ఏడుగురు రాజులను సంహరింపవలదు. ప్రమాణము చేయించి పంపుడు. మాయిరువురి గౌరవములను అశ్వారోహిని పొందనిండు. రాజస్తకమును పట్టుకొన్నవాడు తక్కువస్థితిలో నుండరాదు. మీరు దానధర్మములు చేయుడు, శీలములు రక్షింపుడు, సమత్వముతో ధర్మపరిపాలన చేయుడు" అని బోధించిన పిమ్మట సన్నాహము తొలగించిరి. బోధిసత్త్వుడు దేహము చాలించెను. రాజు కళేబరమునకు ఉచిత సంస్కారములు చేయించి, అశ్వారోహిని విశేషముగా గౌరవించి, ఏడుగురు రాజులచేత ప్రమాణములు చేయించి నిజస్థానములకు పంపెను. ధర్మమార్గమున సమభావముతో రాజ్యము చేసి, జీవితాంతమున యథా కర్మం గతో.

"భిక్షూ, పూర్వము పండితులు సామర్థ్యముచే బాహ్యకార్యములందు కృషి చేయుచుండిరి. ఇట్టినష్టములు వచ్చినను ప్రయత్నము సడలించెడివారు కారు. నీవు ఇట్టి నైర్యాణిక (మోక్షదాయక) శాసనమున ప్రవ్రజితు డయ్యును ప్రయత్నము నేల సడలించితివి?" అని బుద్ధుడు నాలుగుసత్యములను ప్రకాశింప జేసినంతనే ఆభిక్షువు అర్హత్త్వఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశమును వెలువరించెను. ఆకాలమున రాజు ఇప్పటి ఆనందుడు; అశ్వారోహకుడు సారిపుత్రుడు; భోజాజానీయ సైంధవము నేనే.

# 24 ఆజఞ్ఞ జాతకము

బుద్ధుడు జేతవనమున నుండగా శిథిలయత్నుడగు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శాస్త్ర ఆభిక్షువును బిలిపించి "భిక్షూ, పూర్వకాలమున పండితులు నష్టములు వచ్చినను బాహ్యాకార్యములయందు శ్రద్ధ వహించి యుండిరి" అని అతీతకథ వివరించెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఏడుగురు రాజులు వచ్చి నగరమును చుట్టుముట్టిరి.

ఒకానొక రథికయోధుడు రెండు సైంధవములను రథమునకు పూన్చి, నగరమునుండి బయలువెడలి, ఆరుస్కంధావారములను భేదించి, ఆరుగురు రాజులను పట్టుకొనెను. ఆతరుణమున పెద్దగుర్రము నకు ప్రహారము తగిలెను. రథమును రాజద్వారమువరకును తోలుకొని పోయి, రథికుడు పెద్దగుర్రమును విప్పి, సన్నహనమును వదలించెను. ఆయశ్వ మొకప్రక్క కొరిగినపిమ్మట రెండవయశ్వమున కతడు సన్నాహము చేయనారంభించినాడు. బోధిసత్త్వుడది చూచి తనలో వెనుకటి కథలోని భావములే కలుగగా రథికుని సంబోధించి యీగాథ పలికినాడు:

ఏవేళ నేగాని ఎచటనే కాని
సత్వర గతిని ఆజానేయ మేగు
ఆయెడ పడియుండు నన్నిహయాలు.

సారథి బోధిసత్త్వుని (పెద్దయశ్వమును) లేవనెత్తి, కవచాదులు తొడిగి, ఏడవస్కంధావారమును భేదించి, యేడవరాజును చెరపట్టి, రథమును రాజద్వారమునకు గొనిపోయి, సైంధవమును విడిచినాడు. బోధిసత్త్వుడొకప్రక్క కొరిగి, రాజు కుపదేశ మిచ్చి, ప్రాణములు విడిచినాడు. ప్రభువు సైంధవకళేబరమునకు సాదరముగా కర్మ చేయించి

రథికుని సమ్మానించి, ధర్మమార్గమున రాజ్యపాలనము చేసి, నిజకర్మో చితస్థానమునకు బోయినాడు.

**బుద్ధుడు** ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములను ప్రకాశింపజేసి జాతకసారాంశ మును వెలువరించెను. అనంతర మాభిక్షువు అర్హత్వమున ప్రతిష్ఠితు డయ్యెను. **అప్పటిరాజు** ఇప్పటి ఆనందుడు; అశ్వము సమ్యక్-సంబుద్ధుడు.

# 25 తిత్థ జాతకము

**బుద్ధుడు** జేతవనమున విహారము చేయుచు, ధర్మసేనాపతి యగు సారిపుత్రుని **శిష్యుడు-** స్వర్ణకార పుత్రుడైన భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఇతరుల ఆశయములను గ్రహించు జ్ఞానము బుద్ధులకు మాత్రము కలదు; ఇతరుల కుండదు. ఇందుచేతనే సారిపుత్రుడు తనవారిలో చిత్తావస్థ గ్రహింపచాలినవాడు కాడు; తనవెంట నుండువాని మానసిక స్థితి గ్రహింపనేరక ఆతనికి "అశుభకర్మస్థానము" నిర్దేశించినాడు. ఆకర్మస్థాన మాతనికి సరిపడలేదు. ఎందుచేత? అయిదువందల జన్మలలో నియమానుసారముగా నాతడు స్వర్ణకారుల గృహములలో జన్మించుచుండెను. చిరకాలము పరిశుద్ధ స్వర్ణము చూచు నభ్యాసము కలవాడగుటచే ఆతనికి అశుభకర్మస్థాన మనుకూలింపలేదు. ఆతడు నాలుగుమాసములు అభ్యాసము చేసినను "నిమిత్తమాత్రము" కూడ వ్యుత్పన్నము కాలేదు. ధర్మసేనాపతి తన తోడివానికి అర్హత్వము నొసగజాలనందులకు చింతాక్రాంతుడై, ఇతడు నిశ్చయముగా బుద్ధ-వైనేయుడు అని తలచి, ఇతనిని తథాగతుని సన్నిధికి కొనిపోవుదు నని తలపోసి, ప్రాతఃకాలముననే అతనిని వెంట బెట్టుకొని తథాగతుని సన్నిధికి జనెను.

శాస్త చూచి "సారిపుత్రా, ఒక్క భిక్షువునే వెంటబెట్టుకొని ఏల వచ్చితివి?" అనెను. "భన్తే, ఇతనికి నేను కర్మస్థానము నిర్దేశించినాను. నాలుగుమాసములు గడచినను నిమిత్తమాత్రముకూడి వ్యుత్పన్నము కాలేదు. ఇతడు బుద్ధ-వైనేయుడు కా వచ్చునని తలచి ఇతనిని తమ సన్నిధానమునకు కొనివచ్చినాను." "సారిపుత్రా, నీవు నిజ శిష్యునకు ఏ కర్మస్థానము నిర్దేశించినావు?" "భగవన్, అశుభకర్మస్థానము."

"సారిపుత్రా, నీచిత్తసంతతియందు ఆశయానుశయజ్ఞానము లేదు. పొమ్ము, సాయంకాలము రమ్ము; శిష్యుని వెంట బెట్టుకొని రమ్ము."

'ఈప్రకారముగా స్థవిరున కనుజ్ఞ యొసగి శాస్త ఆభిక్షువునకు సుందరనివాస స్థానమును, చీవరమును ఇప్పించి మరల అతనిని వెంట బెట్టుకొని భిక్షాచారమునకు ప్రవేశించి ప్రణీత భోజనము నిప్పించి మహాభిక్షుసంఘముతో విహారమునకు మరలి గంధకుటిలో ప్రవేశించి పగటివేళ గడపెను. సాయంకాలము ఆభిక్షువును వెంటగొని విహారము చేయుచు ఆమ్రవనములో దివ్యశక్తిచే పుష్కరిణిని, అందులో పద్మగుచ్ఛమును, అందు విశాలకమలమును నిర్మించి, ఆభిక్షువుతో "భిక్షూ, నీవు ఈపుష్పమును చూచుచు కూరుచుండుము" అని కూర్చుండ బెట్టి, తాను గంధకుటిలో ప్రవేశించెను.

ఆభిక్షువు ఆపుష్పమును మాటి మాటికిని చూచుచుండెను. భగవాన్ ఆపుష్పము వాడిపోవునట్లు చేసెను. భిక్షువు దానిని చూచుచుండగనే ఆపుష్పము క్రమముగా వాడిపోయి కురూపము తాల్చెను. దాని శీర్షముపై నున్న పత్రము మొదలు అన్ని రేకులును రాలిపోయినవి. అనంతరము పరాగము పడినది. తుదకు కాడ మిగిలినది. భిక్షువు దానిని చూచుచు "ఈపుష్పము సుందరమై దర్శనీయమై యుండెను. ఇంతలోనే దీనిరంగు మారిపోయినది; రేకులు పరాగము రాలిపడినవి. కాడమాత్రము మిగిలినది. ఈవిధముగా పుష్పము శుష్కించిపోయినపుడు నాశరీరము మాత్రము ఏల శుష్కించిపోవదు? అని యోచించుచుండగనే సమస్త సంస్కారముల అనిత్యత మనసున కెక్కి యాతడు విదర్శనలో స్థాపితు డయ్యెను. శాస్త గ్రహించి వాడు చిత్త విదర్శనారూఢుడైనా డనుకొని గంధకుటిలోనే కూర్చుండియుండి నిజ తేజమును ప్రసారించి ఈగాథ పలికెను:

రాగమూలమ్ము లాగి శరమ్ముతోడ
శారదీయ సరోజంబు చందమునను;
ఉన్నతిం బొందవలె సుగతోపదిష్ట
మైన నిర్వాణరూప శాంత్యర్థ్వమందె.

గాథ విన్నపిమ్మట ఆభిక్షువు అర్హత్వమును పొంది, నేను అన్ని పుట్టువులనుండి విముక్తుడనైనాననుకొని ఈగాథలు ఉదానరూపమున పాడినాడు :

పరిపూర్ణచిత్తుండు, పసితవాసుండు,
క్షీణాస్రవుండు, లెక్కింపగాతనువు
చివరివారంబు తాల్చినవాడు, శుద్ధ
శీలుండు, సంయతచిత్తుండునైన
యర్హతుండు వెలుంగు అలరాహుముఖము
నుండి ముక్తుండైనయుడుపతి రీతి.

అతివిస్తృతంబు మోహాంధకారంబు
తొలంగిపోయెను; నాదుమలినములెల్ల
క్షాళితంబులు కాంతి జనియించునట్లు
ఆకాశతలమున అర్కోదయాన.

ఈ విధముగా ఉదానము పాడి ఆతడు పోయి భగవానునకు వందనము చేసెను. స్థవిరుడుగూడ వచ్చి శాస్తకు ప్రణామము చేసి నిజ శిష్యుని వెంటగొని చనెను. ఈవిషయము భిక్షుసంఘమున వ్యాపించినది. వారు ధర్మసభలో కూర్చుండి దశబలధారి యగు బుద్ధుని గుణానువాదము చేయుచు "ఆయుష్మంతులారా, సారిపుత్రస్థవిరుడు ఆశయానుశయజ్ఞానము లేనివాడగుటచే తనకడ నున్నవాని చిత్తస్థితి గ్రహింపలేదు. శాస్త గ్రహించి ఒక్కరోజులోనే ఆభిక్షువునకు ప్రతిసంభిద-జ్ఞానముతోపాటు అర్హత్వముగూడ నొసగినాడు. ఓహో, బుద్ధులశక్తి ఆశ్చర్యకరము!" అనుచుండిరి.

బుద్ధుడు వచ్చి పరచిన ఆసనముపై కూర్చుండి "భిక్షువులారా, ఇచ్చట కూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అనెను. "భగవన్, మరేమియును లేదు. తమ ధర్మసేనాపతి శిష్యుని ఆశయానుశయజ్ఞానమును గూర్చి సంభాషించుచున్నాము."

"భిక్షువులారా, ఇందులో నేమియు ఆశ్చర్యము లేదు. ఈసమయము న నేను బుద్ధుడనై అతని ఆశయము గ్రహించినా నన్నుచో ఆశ్చర్యము లేదు. పూర్వముకూడ నేను ఆతని ఆశయము గ్రహించియే యుంటిని" అని శాస్త్ర అతీత కథ చెప్పినాడు.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు రాజున కర్థధర్మానుశాసకుడై యుండెను. ఒకనాడు రాజుగారి మంగళాశ్వమును కడుగు రేవున వేరొకతట్టు నెవరో కడిగిరి. గుఱ్ఱపువాడు మంగళాశ్వమును స్నానార్థము ఘట్టమున దింప యత్నింపగా అశ్వము దిగలేదు. అశ్వగోపకుడు రాజసన్నిధికి జని "దేవా, మంగళాశ్వము తీర్థమున దిగ నిచ్ఛగింపకున్నది" అని విన్నవించెను. రాజు బోధిసత్త్వుని బిలువ నంపి, "పండితోత్తమా, అశ్వము తీర్థమున నేకారణమున దిగకున్నదో కనుగొనుము" అని చెప్పెను. మంచిది దేవా, అని బోధిసత్త్వుడు నదీతీరమునకు బోయి గుఱ్ఱమును జూచి, అనారోగ్యము లే దని గ్రహించి, యేకారణమున నశ్వము తీర్థమున దిగకున్న దని యాలోచించి, "ఇచ్చట వేరొకగుఱ్ఱమును ముందుగా కడిగియుందురు. కావున మంగళాశ్వము జుగుప్సచే నీటిలోనికి దిగకున్న దని తోచుచున్నది" అని తలపోసి "అశ్వగోపకులారా, ఇక్కడ ముందుగా గుఱ్ఱము నెద్దాని నయిన కడిగినారా?" అని యడిగెను. "మరియొకగుఱ్ఱమును కడిగినాము స్వామీ!" అని వారు చెప్పిరి. "ఆత్మప్రీతిచే జుగుప్స చెంది మంగళాశ్వ మిందు స్నానమున కిచ్ఛగింపకున్నది. కావున దీనిని మరియొక రేవున కడుగవలసి యుండును" అనుకొని "అశ్వగోపకా, సర్పి, మధువు మొద లగువానితో గూడిన పాయస మయినను మాటిమాటికి భుజించువారికి విసుగు పుట్టును. మంగళాశ్వము బహుపర్యాయము లిచట జలక మాడినది. ఇప్పుడు దీనినే వేరొకతావునకు గొనిపోయి, నీరు పట్టి, స్నానము చేయింపుము" అని, యీగాథ పలికెను :

తీసికొనిపోయి వేరొకతీర్థమునకు
సారథీ, ఘోటకమునకు జలము పట్టు;

మతిమధుర మైనపాయస మయిన తుదకు
జగతిలో పెట్టివానికి వెంగము మొత్తు.

ఆయనవాక్కులు విని, వా రశ్వమును మరియొకచోటికి గొని పోయి, నీరు పట్టి స్నానము చేయించిరి. తనకడకు వచ్చిన బోధిసత్త్వునితో రాజు "బాబా, అశ్వము నీరు త్రాగినదా? స్నానము చేసినదా?" యనెను. "చిత్తము దేవా!" "ఏల తొలుత నిచ్చగింపలేదు?" ఇందుచే, అని బోధిసత్త్వుడు జరిగిన దంతయు నివేదించెను. చతుష్పాత్తుల యాశయములుగూడ గ్రహింపగలిగినా డని రాజు బోధిసత్త్వుని మిక్కిలి బహూకరించి, జీవితాంతమున కర్మానుసారగతికి బోయెను. బోధిసత్త్వుడుగూడ యథా కర్మం గతో.

భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ నేను అతని ఆశయము గ్రహించియుంటి నని బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాకత సారాంశము వెలిబుచ్చెను. ఆకాలమున మాంగళికాశ్వము ఇప్పటి భిక్షువు; రాజు ఇప్పటి ఆనందుడు. పండితామాత్యుడు: నేనే.

## 26 మహిలాముఖ జాతకము

బుద్ధుడు వేళువనమున విహారము చేయుచుండగా దేవదత్తునిగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అజాతశత్రువు తనయెడ శ్రద్ధాళు వగు నట్లు దేవదత్తుడు చేసికొని లాభసత్కారములు పొందుచుండెను. రాజకుమార అజాతశత్రువు గయాశీర్షమున దేవదత్తునికై విహారము కట్టించి, అచ్చటికి ప్రతిదినము వివిధరసభరితముగా, మూడేండ్లనాటి పాతబియ్యము, సుగంధభరితమై యుండునట్లు వండించి 500 పాత్రలలో పంపుచుండెను. లాభము సత్కారము లభించుచుండుటచే దేవదత్తుని అనుయాయుల

సంఖ్య పెరుగుచుండెను. అనుయాయులతో పాటు దేవదత్తుడు విహార మున నే నివసించుచుండెను. ఆకాలమున రాజగృహ నివాసు లగు మిత్రు లిద్దరు గలరు. అం దొకడు శాస్త కడను, రెండవవాడు దేవ దత్తుని కడను ప్రవ్రజితు లైరి. వారు ఈవల గాని విహారమున గాని కలిసికొనుచుండిరి.

ఒకనాడు దేవదత్తుని ఆశ్రయమున నుండువాడు రెండవవానితో, ఇట్లనెను: "ఆయుష్మన్, నీవు అనుదినము చెమట కారుచుండగా బిచ్చ మెత్తుచున్నావా? దేవదత్తుడు గయాశీర్ష విహారమున కూరుచుం డియే వివిధరసభరితము లైన సుందరభోజనములు ఆరగించుచున్నాడు. నీకు ఇట్టి ఉపాయము లేదా? నీ వేల కష్ట మనుభవించుచున్నావు? నీవు ప్రాతఃకాలమున నే గయాశీర్ష మునకు వచ్చి ప్రాతర్భోజనముతో జావ త్రాగి పదునెనిమిది విధముల ఖాద్యములు భుజించి వివిధరస సంభరిత మైన సుభోజనము చేయుట బాగుగానుండదా?"

మాటి మాటికిని ఆత డిట్లు చెప్పుటవలన రెండవవానికి పోవ బుద్ధి పుట్టెను. నాటినుండి అతడు గయాశీర్ష మునకు పోవుచు భోజన సమ యమునకు వేళువనమునకు మరలి వచ్చుచుండెను. చాలకాలమువరకు ఈవిషయము కప్పిపుచ్చనేర డయ్యెను. త్వరలోనే ఈవార్త వ్యాపిం చెను. ఆతని తోడివారు "ఆయుష్మన్, నీవు దేవదత్తుడు సమకూర్చిన భోజనము ఆరగించుచుండుట నిజ మేనా?" అనిరి. "ఎవరు ఇట్లన్నారు?" "ఫలాని ఫలానివా రన్నారు." "ఆయుష్మంతులారా, నేను నిజముగా గయాశీర్ష మునకు పోయి భుజించుచున్నాను. కాని నాకు దేవదత్తుడు కాక ఎవ్వరో ఆహారము పెట్టుచున్నారు." "ఆయు ష్మన్, దేవదత్తుడు దుర్మార్గుడు, బుద్ధునకు విరోధి. అజాతశత్రు వును ఎట్లో తన యెడ శ్రద్ధాళు వగు నట్లు చేసికొని అన్యాయ ముగా తనకై లాభసత్కారములు పొందుచున్నాడు. కళ్యాణ ప్రద మగు ఇచ్చటి శాసనమున నీవు ప్రవ్రజితుడ వయ్యు అధర్మముగా పొందు దేవదత్తుని ఆహారమును పరిగ్రహించు చున్నావు. రమ్ము, నిన్ను బుద్ధుని సన్నిధానమునకు గొనిపోవుదుము" అని వారు అతనిని వెంటగొని ధర్మసభ చేరిరి.

శాస్త చూచి "భిక్షువులారా, ఇష్టములేని ఈభిక్షువు నేల కొని

వచ్చితిరి?" అనెను.

"భన్తే, ఈభిక్షువు తమకడ ప్రవ్రజితుడై 'ఆవల అన్యాయమార్గమున లభించు దేవదత్తుని అహారమును పరిగ్రహించుచున్నాడు."

"భిక్షూ, అన్యాయముగా లభించు దేవదత్తుని భోజనము నీవు పరిగ్రహించుచున్నావా?"

"భన్తే, దేవదత్తుడు నాకు భోజనము పెట్టుట లేదు; ఎవరో తెచ్చి యిచ్చుచున్నారు; నేను దానినే పరిగ్రహించుచున్నాను."

"భిక్షూ, సాకు చెప్పకుము, దేవదత్తుడు అనాచారుడు, దుశ్శీలుడు. నీ విచ్చట ప్రవ్రజితుడవై నాసంఘమున (శాసనమున) నుండి ఎట్లు దేవదత్తుని భోజనము పరిగ్రహించుచున్నావు? నీవు ఎల్లప్పుడు ఇట్లే సంగతి కాముడవై వచ్చుచున్నావు. ఎక్కడ సంగతి లభించునో అందు పడిపోవుచుందువు" అని బుద్ధుడు అతీత కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వ డాయన కమాత్యు డయ్యెను. రాజుకు మహిళాముఖమను మంగళహస్తి యుండెను. అది యెవ్వరిని బాధింపక సదా యోగ్యముగా ప్రవర్తించుచుండును. ఒక రాత్రివేళ శాలలోనికి చోరులు వచ్చి యిట్లాలోచింప దొడగిరి. "సొరంగ మీవిధముగా త్రవ్వవలెను. ఈప్రకారముగా సంధిచ్ఛేదము చేయవలెను. గోడలోని సందు రాజమార్గమువలె గాని తీర్థమువలె కాని అడ్డు లేకుండ జేసి, భండారము హరింపవలెను. హరించునప్పుడు ప్రాణివధకు వెనుదీయగూడదు. అప్పు డెవ్వారు నడ్డుపడ జాలరు. శీలము, యోగ్యత, దయ విడిచి చోరులు క్రౌర్యము, సాహసము నవలంబింప వలెను." ఇట్టియాలోచనలు చేసి తస్కరులు కొంతతడవునకు తరలిపోయిరి. మరునాడును, తరువాత కొన్నిసారులును వారు వచ్చి పైవిధముగా యోచనలు చేసిరి. తనకు బోధ చేయుటకే వారు వచ్చుచుండి రని యేనుగు తలచి, వారి వాక్కులు విని విని, క్రూరము సాహసికము నయి, ఒకనాడు ప్రాతఃకాలమున మావటివాడు వచ్చినంతనే వానిని తొండముతో పట్టి నేలపై గొట్టి చంపెను. తనదగ్గరకు వచ్చినవారి

నెల్ల అట్లే చంపెను. పిచ్చి యెత్తిన మహిళాముఖము తనవద్దకు వచ్చిన వారిని చంపుచున్న దని రాజుకు తెలిసెను. రాజు బోధిసత్త్వునితో "పండితోత్తమా, నీవు పోయి యేను గేల దుష్ట మయినదో కను గొను" మని పంపెను. బోధిసత్త్వుడు చని, హస్తిశరీరమున రోగ చిహ్నములు లేకుంకుట గ్రహించి, ఏల యేనుగు దుష్ట మైనదో అని తలపోయుచు, సమీపమున నెవరిమాటలో విని, హస్తి దుష్టమై పోయె నని యూహించి గోపకులతో "రాత్రివేళ హస్తిశాలలో నెవ రైన మాటాడు చుండిరా?" యని యడిగెను. "చిత్తము, స్వామీ, చోరులు వచ్చి మాటాడిరి" అని వారు చెప్పిరి. ఆయన వెడలి పోయి రాజుతో "దేవా, హస్తిశరీరమున రోగచిహ్నములు లేవు. చోరులవాక్కులు విని యేనుగు చెడిపోయినది" అని చెప్పెను. "ఇప్పు డేమి చేయవలెను?" "శీలవంతు లైన శ్రమణులను బ్రాహ్మణు లను హస్తిశాలలోనికి బంపి, ఆచార శీలములనుగూర్చి మాటాడింప వలెను." "మంచిది, పండితోత్తమా, అట్లే చేయింపుము."

శీలవంతు లగు శ్రమణులను బ్రాహ్మణులను హస్తిశాలకు బంపుచు బోధిసత్త్వుడు "మీరు ఆచారమును శీలమును గూర్చి విశేషముగా ప్రసంగింపవలెను" అని చెప్పెను. వారు హస్తిశాలవద్ద గూరుచుండి "ఎవరిని కొట్టరాదు, ఎవ్వరిని సంహరింపరాదు. ఎల్లరు యోగ్యులై క్షాంతితో, ప్రీతితో, దయతో వర్తింపవలెను" అని సంభాషించిరి. ఏనుగు ఆవాక్కులు విని "వీరు నా కుపదేశము చేయుచున్నారు. కావున నేను యోగ్యముగా ప్రవర్తిపలెను" అని యోగ్య మయ్యెను.

రాజు బోధిసత్త్వునితో "బాబా, ఏనుగు శీలవంత మయినదా?" అనెను. "చిత్తము దేవా, దుష్టహస్తి పండితుల పురాణధర్మముల వలన మరల యోగ్య మయినది" అని బోధిసత్త్వు డీగాథ పలికినాడు:

ప్రాత చోర జనమ్ముల భాషణముల
నాలకించుచు వాని నే యనుసరింప
చంప నుద్యుక్త మయ్యెను జనుల హస్తి;
అవల సంయమి వాక్కుల నాలకింప
నురల మహిళాముఖము చేరె మంచిత్రోవ.

ఈయన తిర్యగ్జంతువుల యాశయములను గూడ గ్రహింపగల డని

బోధిసత్త్వుని రాజు విశేషముగా గౌరవించి, జీవితాంతమున ఆయనతోగూడ కర్మానుగుణ మగుపదవిని పొందెను.

"భిక్షూ, తొలుత నీవు ఎవ రెవరిని చూతువో వారి ధ్యానములో పడి పోవుదువు. నలుగురి మాట విని నీవు వారి అనుయాయి వగుదువు. ధార్మికుల వాక్కులు విని వారి అనుచరుడవైనావు అని శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతక సారాంశమును వెలువరించెను. ఆకాలమున మహిళాముఖము ఇప్పటి ప్రతిపక్షుదళములోనికి పోవుచుండు భిక్షువు; రాజు ఇప్పటి ఆనందుడు; ఆమాత్యుడను నేనే.

## 27 అభిణ్హ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచుండగా ఒకానొక ఉపాసకుని గూర్చియు వృద్ధస్థవిరుని గూర్చియు చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో నిరువురు మిత్రు లుండిరి. అందులో నొకడు ప్రవ్రజించి, ప్రతిదినము రెండవవాని యింటికి పోవుచుండును. అతడు భిక్షువునకు భిక్ష మిడి తాను భుజించి, ఆయనతోనే విహారమునకు పోవుచుండును; సూర్యాస్తమానమువరకును సంభాషించుచు, అనంతరము నగరమునకు మరలి వచ్చుచుండును. భిక్షు వతనిని నగరద్వారము వరకును సాగ నంపును. వారిపరస్పర విశ్వాసవిషయము భిక్షువులకు తెలిసినది. ఒకనాడు భిక్షువులు ధర్మశాలలో సమావిష్టులై వారిపరస్పర ప్రేమవిషయమై భాషించుచుండిరి. బుద్ధు డరుదెంచి, "భిక్షువులారా, ఇక్కడ గూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అనెను. "భన్తే, ఫలాని విషయము మాటాడుచున్నాము" అని భిక్షువులు చెప్పగా, శాస్త్ర "భిక్షువులారా, వీరికి ఇప్పుడే కాదు, పూర్వముకూడ పరస్పరప్రీతి కలదు" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడాయన కమాత్యుడాయెను. ఆరోజులలో నొకశునకము మంగళహస్తిశాలకు బోయి, యేనుగు భుజింపగా క్రింద రాలిన యన్నపుముద్దలు తినుచుండెను. తిండికై యచటికి బోవుచు శునకము మంగళహస్తికి విశ్వాసపాత్రమై దానిదగ్గరనే భుజించుచుండెను. ఒక దాని నొకటి విడువలేకుండెను. కుక్క యేనుగు తొండమును బట్టుకొని యిటు నటు నూగుచు క్రీడించుచుండెను. ఒకనాడు గ్రామీణు డొకడు హస్తిగోపకునకు మూల్యమిచ్చి, కుక్కను తన గ్రామమునకు గొని పోయెను. కుక్క కానబడనందున ఏనుగు స్నానపాన భోజనములు మానుకొనెను. ఈసంగతి రాజుకు దెలిసెను. ఆయన బోధిసత్త్వుని బిలిపించి, "పండితోత్తమా, ఏకారణమున మంగళహస్తి యిట్లున్నదో కనుగొనుము" అనెను. ఆయన హస్తిశాలకు బోయి దాని విచారము గమనించి "శరీరమున రోగము లేదు. దేనితోనైన మైత్రి కలిగి, విడిపోవుటచే నిట్లయి యుండును" అని యూహించి, హస్తి పాలకునితో "దీనికి దేనితోనైన మైత్రి, విశ్వాసాదు లుండెనా?" అనెను. "చిత్తము స్వామీ, దీనికి శునకముతో గాఢస్నేహ ముండెను" అని వాడు చెప్పెను. "ఇప్పు డాకుక్క యెక్కడ నున్నది?" "ఒకా నొకడు దానిని గొనిపోయినాడు." "అతని నివాసము నీకు తెలియునా" "తెలియదు స్వామీ."

బోధిసత్త్వుడు రాజసన్నిధికి బోయి "దేవా, హస్తికి శరీరమున బాధ లేదు. కాని కుక్కతో దీనికి మైత్రి. అది కనబడకుండుటచే భోజనము మానుకొన్న దని తోచుచున్నది" అని యీగాథ పలికి నాడు :

> తినదు కబళము, పిండంబు, తృణము కాని,
> కాయమును స్నానవేళల కడగ నీదు,
> సతత సాంగత్యవశమున శ్వానమునకు
> హస్తికిని ప్రీతి యేర్పడె నంచు తోచు.

విని రాజు "పండితోత్తమా, ఇప్పు డేమి చేయవలెను?" అనెను.

"దేవా, మంగళహస్తికి సహాయశునకము ఎవనియింట గాంచబడునో వానికి శిక్ష అని భేరి వేయింపుడు" అని బోధిసత్త్వుడు చెప్పెను. రాజట్లే చేయించెను. ఆప్రకటన విని శునకము గొన్నపురుషుడు దానిని విడిచిపెట్టెను. శునకము వేగముగా ఏనుగుసన్నిధికి జేరెను. హస్తి దానిని తొండముతో బట్టుకొని కుంభస్థలముపై నెక్కించుకొని, కన్నీరు విడిచి, దానిని క్రిందికి దింపి, అది భుజించినపిమ్మట తాను భుజించెను.

తిర్యగ్జంతువుల యాశయమునుగూడ గ్రహింపగల డని బోధిసత్త్వుని రాజు విశేషముగా గౌరవించెను.

బుద్ధుడు వారితో «భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వజన్మములో గూడ వీరు పరస్పరప్రీతి కలవారు» అని, ఆర్యసత్యములను తెలిపి జాతకసారాంశమును వెలువరించెను. అప్పటి కుక్క ఇప్పటి ఉపాసకుడు; ఏనుగు ఇప్పటి వృద్ధస్థవిరుడు; అమాత్యపండితుడు నేనే.

## 28 నన్దివిసాల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, వర్గీయ భిక్షువు లార్వుర కఠోరవాణినిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆకాలమున వర్గీయభిక్షువు లారుగురు కలహించుచు, శాంతిప్రియులైనభిక్షువులను కలవరపెట్టుచు, నిందించుచు, విసిగించుచు, దశ-ఆక్రోశ-వస్తువులను దూషించుచుండిరి. భిక్షువులు భగవానునితో ఈవిషయము చెప్పిరి. ఆరుగురు వర్గీయభిక్షువులను పిలిపించి, భగవాన్, "భిక్షువులారా, ఇది నిజమేనా?" అని యడిగెను. వారు నిజమే అని చెప్పగా భగవాన్ వారిని చీవాట్లు పెట్టి "భిక్షువులారా,

[illegible] పశువ్రాతమునకు [illegible] [illegible] నొకపశువ్రాతమును [illegible] బిలుచు [illegible] [illegible] కలిగించినది" అని పూర్వకథను జెప్పెను:

### అతీత కథ

పూర్వమున గాంధారదేశమున తక్షశిలలో గాంధారరాజు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు గోవుకడుపున బుట్టెను. బ్రాహ్మణు డొకడు బోధిసత్త్వుడు వత్సముగా నున్నపుడే ఒకరికడ దక్షిణగా గొని నందివిశాల నామ ముంచెను. [illegible] పుత్రునివలె పెంచుచు గంజి, అన్నము పెట్టి పోషించుచుండెను. ఒక్కనాడు బోధిసత్త్వుడు తనలో 'బ్రాహ్మణుడు శ్రమపడి నన్ను పెంచినాడు. నావలె బరువు లాగగల వృషభము జంబూద్వీపములో లేదు. స్వబలము చూపి బ్రాహ్మణునకు పోషణసమర్థమైనధన మిచ్చిన నెట్లుండును?' అనుకొని, బ్రాహ్మణునితో "బ్రాహ్మణోత్తమా, నీవు పోయి గోసంపద కలిగిన శ్రేష్ఠిని కలిసికొని, నావృషభము వంద నిండుబండ్లు లాగగలదు అని పందెము వేయుము" అని చెప్పెను. బ్రాహ్మణుడు శ్రేష్ఠికడకు బోయి ప్రస్తాపన తెచ్చి "ఈనగరములో నెవరివృషభములు బలిష్ఠ మయినవి?" అని ప్రశ్న వేసెను. వారివి అని శ్రేష్ఠి చెప్పి, "నాబలీవర్దములతో [illegible] లేవు అని పలికెను. "నావృషభ మొక్కటే నూరు నిండుబండ్లు లాగగలదు" అని బ్రాహ్మణుడు పలుకగా శ్రేష్ఠి నవ్వి, "అట్టివృషభ మెచ్చట నున్నది?" అనెను.

"మాయింటనే." "అట్లయిన పందెము వేయుము."

"మంచిది. వేయినాణెములు [illegible]"

బ్రాహ్మణుడు నూరుబండ్ల ఇసుకతో కంకరరాలతో నింపి, ఒకదాని కొకటి త్రాటితో గట్టి, నందివిశాలుని స్నానము చేయించి, మానెడు పరిమళతండులములు పెట్టి, పుష్పమాలిక మెడలో వేసి, మొదటిబండి తొట్టిలో తాను కూరుచుండి కొరడా పైకెత్తి "ఓ కూటా, లాగు ముదా!" అని యదలించెను. 'ఈతడు నన్ను [illegible] దూషించుచున్నాడు' అనుకొని బోధిసత్త్వుడు నాలుగు పాదములను స్తంభములవలె నిశ్చలముగా నుంచెను. శ్రేష్ఠి బ్రాహ్మణునికడ [illegible]

నాణెములు పుచ్చుకొనెను. బ్రాహ్మణుడు వృషభమును విడిచి, యింటికి బోయి, శోకాభిభూతుడై పండుకొనెను. నందవిశాలుడు ఆయనకడకు వచ్చి, "బ్రాహ్మణోత్తమా, నిద్రించుచున్నావా?" అనెను. "వేయినాణెములు కోలుపోయిన వానికి నిద్ర యెక్కడిది?" అని యాతడనెను.

"బ్రాహ్మణోత్తమా, నేను నీయింట నున్నకాలమున భాండము పగుల గొట్టితినా? ఎవరినైన త్రొక్కితినా? ఏ మయిన పాడు చేసితినా?" "లేదు నాయనా." "అట్లయిన నన్నేల దూషించితివి? దోషము నీదే కాని నాది కాదు. పోయి, రెండువేలు పందెము వేయుము. నన్ను నిందింపగూడదని మాత్రము జ్ఞప్తి యుంచుకొనుము."

ఈమాటలు విని బ్రాహ్మణుడు లేచి శ్రేష్ఠికడకు బోయి రెండువేలు పందెము వేసెను. వెనుకటి వలెనే బండ్లు నింపి, నందివిశాలుని అలంకరించి, మొదటిబండికి పూన్చి తాను తొట్టిలో గూరుచుండి వృషభము వీపు తట్టి, "లాగు, నాయనా, లాగు" అని ప్రోత్సహించెను. ఒక్కయూపులో బోధిసత్త్వుడు బండ్లవరస లాగి, తుదిబండిని తొలిబండి తావునకు జేర్చెను. గోసంపద గలశ్రేష్ఠి పందె మోడిపోయి బ్రాహ్మణునకు రెండువేలనాణెము లిచ్చెను. అన్యులు గూడి బోధిసత్త్వునికి భూరిదానము లిచ్చిరి. అవి యన్నియు బ్రాహ్మణునకు ముట్టెను. ఈ విధముగా బోధిసత్త్వుని మూలమున బ్రాహ్మణునకు భూరిధనము లభించెను.

వల్లువాక్కులనే పల్కవలయు నెపుడు
బ్రాహ్మణు మనోజ్ఞ వాక్కులన్ భార మెంతో
అనడుహము లాగి సమకూర్చె ధనముకూడ.

ఈప్రకారముగా శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. ఆ కాలమున బ్రాహ్మణుడు ఇప్పటి ఆనందుడు; నందివిశాలుడు నేనే.

## 29 కణ్హ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు యమకప్రాతిహార్యమును గురించి చెప్పినది. అది పదమూడవ నిపాతములో ఈ దేవారోహణముతో పాటు సరభమిగ జాతకమున వచ్చును.

### వర్తమాన కథ

సమ్యక్ సంబుద్ధుడు యమకప్రాతిహార్యము చేసి, దేవలోకమున నుండి మహాపవారణ తరువాత సంకిస్స నగరద్వారమునదిగి, చాలమంది అనుయాయులతో జేతవనమున ప్రవేశించినపిదప, ధర్మసభలో సమావిష్టులైన భిక్షువులు తథాగతుని గుణకథనము చేయుచు, "ఆయుష్మంతులారా, తథాగతుడు అసమధురుడు తథాగతుడు కాడి లాగినట్లు మరియెవ్వరు లాగ లేరు. మిగిలిన ఆరుగురు శాస్త్రలు మేమే ప్రాతిహార్యము చేయుదుము, మేమే ప్రాతిహార్యము చేయుదు మని ఒక్క ప్రాతిహార్యముకూడ చేయలేక పోయిరి. ఆహా! మనశాస్త్ర అసమధురుడు" అనుచుండిరి.

శాస్త్ర అరుగుదెంచి "భిక్షువులారా, ఇచ్చట సమావిష్టులై ఏమి సంభాషించుచున్నారు?" అనెను. "భన్తే, మ తేమియును లేదు. ఈ ప్రకారముగా తమ గుణగానము చేయుచున్నాము." "భిక్షువులారా, ఇప్పుడు నేను లాగుచున్న బరువు ఎవరు లాగగలరు? పూర్వజన్మమున నేను పశువుకడుపున పుట్టినప్పటికిని నాతో సమధురులైనవారు ఎవరును లభింపలేదు" అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు గోగర్భమున బుట్టెను. అతడు తరుణవత్సకముగా నున్న రోజులలోనే ఒకవృద్ధయింట నివసించుచున్న యాతని యజమానులు వృద్ధురాలి కతనిని విక్రయించిరి. దూడ నామె బిడ్డవలె పెంచెను. 'అయ్యకా కాళకము' వయసు వచ్చి, అంజనవర్ణము కలదై, గ్రామ గోగణములో గలిసి చరించుచు శీలసంపన్నమై, యుండెను. బాలకులు

దానికొమ్ములు, చెవులు, కంఠము పట్టుకొని వ్రేలాడుచు, వీపుమీద కూరుచుండి క్రీడించుచుందురు. అయ్యకా కాళక మొకనా డిట్లు చింతించెను: "నాతల్లి బీదది. నన్ను తనబిడ్డవలె కష్టపడి పోషించు చున్నది. ఈమె దుర్గతి తప్పించుటకై నేను భృతి సంపాదించెదను." నాటినుండి కోడెదూడ పనికొరకు తిరుగుచుండెను.

ఒకనాడు సార్థవాహపుత్రుడు 500 శకటములతో విషమతీర్థమునకు వచ్చెను. ఆతని వృషభములు శకటములను లాగ లేకుండెను. అతడు 500 జతల యెడ్లను యుగపరంపరగా కట్టించినను ఒక్కబండినిగూడ ఆవలకు లాగలేదు. బోధిసత్త్వుడు గ్రామగోవులతో గలిసి తీర్థ సమీపమున నుండెను. సార్థవాహపుత్రుడు గోశక్తి నెరిగినవా డగుటచే గోగణములో నేదేని శకటమును లాగగల దేమో యని వాని వైపు చూచి, అయ్యకా కాళకమును గాంచి, తన కుపకరించు నని తలచి దీనియజమాను లెవ్వ రని గోపాలకుల నడిగి, 'దీనిని నాశకటములకు బూన్చి, వానిని దాటవేసిన పిదప వేతన మిత్తు' ననెను. 'దీనియజమాను లిక్కడ లేరు. బండ్లకు గట్టుడు' అని వారు చెప్పిరి.

ముక్కుత్రాడు వేసి లాగుకొనిపోవ యత్నింపగా, అయ్యకా కాళకర్ణకము కదలలేదు. భృతి నిర్ధారణ కాకుండ బోధిసత్త్వుడు కదల డని వదంతి. వర్తకుడు దానియభిప్రాయము గ్రహించి, "స్వామీ, 500 బండ్లను దాటవేయుదువేని బండికి రెండు చొప్పున వేయి కార్షాపణములు భృతి యిత్తును" అని పలికెను. అంతట బోధిసత్త్వుడు స్వయముగా కదలెను. వర్తకుని పరివారజనులు బోధిసత్త్వుని బండికి బూన్చిరి. వృషభ మొక్కపట్టున బండి నావలకు జేర్చెను. ఇట్లే క్రమముగా అన్నిబండ్లను తీరమునకు జేర్చెను.

సార్థవాహపుత్రుడు 500 నాణెములు వేసిన సంచిని బోధిసత్త్వుని మెడలో గట్టినాడు. "అన్నప్రకార మితడు భృతి నీయలేదు. ఇతనిని కదలనీయను" అని బోధిసత్త్వుడు బండ్లవరుసకు ముందు నిలిచెను. జను లెంత యత్నించినను వృషభమును తొలగింప లేకపోయిరి. "తక్కువభృతి యిచ్చినా నని దీనికి తెలియును" అని సార్థవాహుడు తలంచి, వేయినాణెములు సంచిలో వేసి "ఇదిగో నీసంపూర్ణభృతి" అని దాని మెడలో గట్టెను. ఇట్లు సహస్రభాండికముతో బోధిసత్త్వుడు

తల్లిని చేరబోయెను.

“అత్యుత్సాహా శకటము మెడతో నిది తేలునే” అని గోపాలబాలకులు దానిని చేరబోయిరి. బోధిసత్త్వుడు దూరమునుండియే వారిని బెదరించి పాఱద్రోలి తల్లివద్దకు జేరెను. 500 శకటములను దాటు చేయుటచే కన్నుల రక్తము గ్రమ్ముట తప్ప వృషభమునకు వేరుబడలిక లేదు. మెడలోని సంచిలో వేయినాణెములు చూచి వృద్ధురాలు “నాయనా, నీ కిది యెట్లు లభించెనో” అని గోపాలదారకుల వలన సంగతి విని “నాయనా, నీ శ్రమవల్ల వచ్చిన భృతితో నేను జీవింపదలచితినా? ఏల నీ వింత శ్రమపడినావు?” అని బోధిసత్త్వుని ఉష్ణోదకముతో కడిగి ఒడలినిండ నూనె మర్దించి, నీరు పెట్టి, మంచియాహారము పెట్టెను. వృద్ధురాలు జీవితాంతమున బోధిసత్త్వునితో గూడ యథాకర్మం గతా.

ఎపుడు భారము హెచ్చునో ఎచ్చటచట
అధ్వ మగుచుండు కర్కశ మపుడు కృష్ణు
బండికిం గట్ట నాతండు బరువులాగు.

ఈ ప్రకారముగా భగవానుడు “భిక్షువులారా, కృష్ణవృషభమే ఆ బరువు మోసినది.” అని జాతకసారాంశమును వెలువరించెను. ఆ కాలమున వృద్ధురాలు ఇప్పటి ఉత్పలవర్ణ; ఆర్యకకాలకము నేనే.

## 30 మునిక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఒకానొక ప్రౌఢకుమారి యెడ ఆసక్తిని గూర్చి చెప్పినది. అది పదమూడవ నిపాతమున క్షుద్రనారద కశ్యప జాతకమున (477) వచ్చును.

### వర్తమాన కథ

బుద్ధుడు ఆ భిక్షువుతో “భిక్షూ, నీవు ఉద్రిక్తత నైనమాట నిజమేనా?” అనెను.

ఉల్లమున శాంతితో నీవు పొల్లె తినుము
అద్ది చిరకాలమునకె చిహ్నంబె యగును.

అతిథులు వచ్చినపుడు పెండ్లివారు మునికను సంహరించి వివిధ ప్రకారములుగా వంటలు చేసిరి. బోధిసత్త్వుడు తమ్మునితో "బాబా, చూచితివా?" అనెను. "అన్నా, చూచితిని, మునికె బాగుగా భుజించిన ఫలితమును. దానియాహారముకన్న మనయాహారమే నూరు రెట్లో వేయిరెట్లో యుత్తమము. తృణము గాని, గడ్డి గాని, పొల్లు కాని మనయాహారము హాని చేయదు; పైగా దీర్ఘాయు విచ్చును' అని పలికెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకాశింప జేసిన పిదప ఉత్కంఠతు డైనభిక్షువు శ్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త జాతక సారాంశమును వెలువరించెను. ఆసమయమున మునిక నూకరము నేటి ఉత్కంఠిత భిక్షువు; తరుణకుమారి యీ ప్రౌఢకుమారి, క్షుద్రలోహితుడు ఆనందుడు; మహాలోహితుడు నేనే.

## 31 కులాపక జాతకము

శాస్త ఈగాథ జేతవనమున విహరించుచుండగా వస్త్రము నడ్డము వేయకుండ నీరు త్రాగు భిక్షువునుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తినుండి ఇరువురు మిత్రులు, తరుణభిక్షువులు కోసలజనపదమున సుఖముగా నివసించుటకు తగిన ఒకచోట ఇష్టానుసారముగా నివాసము చేసిరి. పిమ్మట సమ్యక్-సంబుద్ధుని దర్శించు కోరిక కలుగుటచే అచ్చటినుండి వారు బయలువెడలి జేతవనమువైపు పయనము చేసిరి. ఒకనికడ నీరు వడపోయు వస్త్రము కలదు. రెండవవానికడ లేదు. ఇందుచే ఒకవస్త్రఖండముతోనే వారు పని గడుపుకొనుచుండిరి. ఒక నాడు వారికి వివాదము కలిగినది. వస్త్రమున్నవాడు వస్త్రము

లేనివానికి ఈయక జలపాన సమయమున తానే వినియోగించు కొను చుండెను. రెండవయాతడు దాహాతిశయముచే వస్త్రాచ్ఛాదనము లేకుండనే నీరు త్రాగెను. క్రమముగా వారిరువురు జేతవనము చేరి బుద్ధునికి ప్రణామము చేసి కూరుచుండిరి. బుద్ధుడు కుశలప్రశ్నలడుగుచు "మీరు ఎచ్చటినుండి వచ్చుచున్నారు?" అని అడిగెను.

"భన్తే, మేము కోసలజనపదమున ఒకానొక గ్రామమునుండి తమ దర్శనార్థము వచ్చినాము."

"మీరు మైత్రిపూర్వకముగా వచ్చితిరా?"

వస్త్రము లేనిభిక్షువు "భన్తే, ఈతడు మార్గమున నాతో వాదము పెట్టుకొని వస్త్రము నాకీయలేదు" అనెను.

రెండవయతడు "భన్తే, ఈతడు తెలిసియు వస్త్రాచ్ఛాదనము లేకుండ జీవములతోపాటు నీరు త్రాగినాడు" అనెను.

"భిక్షూ, నీవు తెలిసియు జీవములతోసహా నీరు త్రాగినావట, నిజమేనా?"

"నిజమే, భన్తే."

"భిక్షూ, పూర్వకాలమున దేవనగరమందు రాజ్యము చేయుచు విబుధులు యుద్ధమున పరాజితులై సముద్రప్రదేశమునకు పరుగెత్తుచు మేము ఐశ్వర్యముకొరకు ప్రాణహాని చేయము, అనుకొని మహైశ్వర్యమును వదలుకొని గరుడపక్షులపిల్లలకు ప్రాణదానము చేసి రథములను ఆపిరి." అని శాస్త పూర్వజన్మకథ తెలిపెను.

## అతీత కథ

పూర్వము మగధరాజొకడు మగధరాష్ట్రమునందలి రాజగృహ నగరమును పాలించుచుండెను. సక్కుడు పూర్వజన్మమున మగధ రాష్ట్రములోని మచలగామమున జన్మించినట్లే మగధరాజు తద్రాజ్య పాలనము చేయుచున్నపుడు బోధిసత్త్వుడు సామంతప్రభువై జనియించెను. నామకరణసమయమున నతనికి తలిదండ్రులు మఘకుమారుడని పేరు పెట్టిరి. పెరిగి పెద్దవాడయిన పిమ్మట నీతనిని లోకులు మఘ మాణవకుడని పిలుచుచుండిరి. సమానప్రతిపత్తి కల కుటుంబములోని

కన్యను వాని కిచ్చి వివాహము చేసిరి. బోధిసత్త్వుడు సిరిసంపదలతో తులదూగుచు, పంచవిధుల నాచరించుచు, దయాళువు దాతయు నయి యుండెను.

ఆ గ్రామమున ముప్పదికుటుంబములవా రుండిరి. ఒకనాడు గ్రామీణులు వ్యవహారములు పరిష్కరించుకొనుచు గ్రామమధ్యమున నుండిరి: ధూళి మొదలగు నవి లేకుండ శుభ్రపరచి బోధిసత్త్వుడు నిలుచున్న ప్రదేశమును ఒకడు వచ్చి యాక్రమించెను, ఆయన యింకొకతావు శుభ్రముచేయగా వేరొకడు వచ్చి యాక్రమించెను. ఈ విధముగా బోధిసత్త్వు డెల్లరకును శుభ్రప్రదేశములు సమకూర్చెను.

ఒకసారి బోధిసత్త్వుడు మండపము నిర్మించెను: కొంత కాలమునకు దానిని బడగొట్టి ఉదకుంభ పలకయుక్త మగు శాలను నిర్మించెను. బోధిసత్త్వునితోపాటు గ్రామవాసులు ఉదయముననే లేచి, సత్కర్మలు చేయుచు, చురకత్తులు గండ్రగొడ్డళ్ళు కర్రలు పట్టుకొని బయలుదేరి కర్రలతో చతుష్పథములలోని రాళ్ళను తొలగద్రోయుచుందురు. బండిచక్రములకు రాచుకొనుచెట్లను ఛేదించుచు, గుంటమెట్టలు సమము చేయుచుందురు. వంతెనలు కట్టుచు, చెరువులు త్రవ్వుచు విశ్రాంతిశాలలు నిర్మించుచుందురు. వారు బోధిసత్త్వుని యుపదేశము ననుసరించి దయాళువులై, తమవిధులు నిర్వర్తించుచుందురు.

ఆ గ్రామాధికారి యిట్లనుకొనెను. "నే నీగ్రామవాసులకు సుర విక్రయించియు, సురాపానమత్తులై వారు చేయునకృత్యములకు దండనము విధించియు, బహువిధముల ధనము సంపాదించుచుంటిని. ఇప్పు డీబ్రాహ్మణయువకుడు వారిచే ధర్మకార్యములు చేయించుచున్నాడు. వీనిని శిక్షింపవలెను." ఇట్లు తలపోసి అతడు రాజుకడ కేగి "దేవా, చోరులగుంపు విజృంభించి గ్రామము దోచుకొనుచు వివిధాపరాధములు చేయుచున్నది." అని విన్నవించెను. రాజు విని "నీవు పోయి వారిని పట్టితెమ్ము" అని యాన తిచ్చెను. గ్రామాధికారి పోయి ఆ ముప్పదుగురు గ్రామవాసులను బట్టుకొని నేరము మోపి, రాజుకడకు గొనివచ్చెను. విచారణ చేయకయే రాజు వారిని ఏనుగుకాళ్ళక్రింద వేయుమని మరణదండన విధించెను. బోధిసత్త్వుడు వారలతో మీ విధులు విస్మరింప వలదని చెప్పెను. వారిని త్రొక్కించుటకై ఏనుగును

దీసికొని వచ్చిరి. మావటివాండ్రు ఎంత ప్రేరేచినను వారిదరికి ఏనుగు పోవలేదు. అనంతరము క్రమక్రమముగా కొన్ని యేనుగులను దీసికొని వచ్చిరి. అవియును వారిని త్రొక్కలేదు. రాజు గమనించి వారలకడ మూలిక లున్న వని యూహించి వారిని బాగుగా శోధింపు డని పరిజనుల కాన తిచ్చెను. వారు వెదకి ఏమియు కాన రాలే దని రాజుతో జెప్పిరి. మూలిక లేకున్న మంత్ర ముచ్చరింతు రేమో కనుగొను డని రాజు మరల నాన తిచ్చెను. వారు పోయి అడుగగా బోధిసత్త్వుడు మంత్ర మున్న దనెను. పరిచారకులు పోయి మంత్ర మున్న దని చెప్పిరి. అప్పుడు రాజు వారి నెల్లరను రప్పించి, మీ మంత్ర మేమి అని యడిగెను. బోధిసత్త్వుడు. "దేవా, జీవహింస చేయకుండుట, అనుచితముగా ప్రవర్తింపకుండుట, అనృత మాడకుండుట తప్ప వేరుగా మంత్ర మేదియు లేదు. మేము సురాపానము చేయము. ఎవ్వరిని ద్వేషింపము. దయతో ప్రవర్తింతుము. చెరువులు త్రవ్వి త్రోవలు బాగుచేసి జనోపయుక్తముగా విశ్రాంతిగృహములను నిర్మింతుము. ఇదియే మా మంత్రము. ఇదియే మాకు రక్ష, ఇదియే మా శక్తి" అని వివరించెను.

రా జది విని పరమానందభరితుడై కొండెగా డయిన గ్రామాధికారి ధన మంతయు వారల కిచ్చి, వానిని వారికి బానిసను జేసెను. రాజు ఏనుగును మొఖాసా గ్రామమునుగూడ నిచ్చెను. వారు చిత్తశుద్ధితో పనులు చేయుచు వడ్రంగిని రప్పించి చతుష్పథమున పెద్ద భవనము కట్టించిరి. స్త్రీవాంఛ లేకుండుటచే వారు చేయుసుకృత్యములలో స్త్రీలకు భాగ మీయలేదు.

ఆరోజులలో బోధిసత్త్వుని యింట సుశీల, విచారశీల, ఆనంద, కులీన అను నలుగురు స్త్రీ లుండిరి. వీరిలో సుశీల వడ్రంగితో రహస్యముగా గృహనిర్మాణములో ప్రధానురాలిని జేయు మని కోరెను. అత డంగీకరించి, తొలుత ప్రాసాద శృంగమునకు ఉపయుక్త మగు శుష్కదారువును శిఖరముగా జెక్కి దానికి వస్త్రము చుట్టి మూల నుంచెను. గృహనిర్మాణమున శిఖరారోపణ ముహూర్తము వచ్చినంతనే రథకారుడు "యజమానులారా, మనము చేయవలసినపని ఒకటి యున్నది" అనెను. "ఏ మది?" "గృహమునకు శిఖరము కావలెను." "సంపాదింపుము." "ఇందులకు పచ్చికఱ్ఱ పనికి రాదు.

కొంతకాలముక్రిందట చేసిన శిఖరము కావలెను.” “ఇప్పు డేమి చేయనగును?” “అట్టిది యెవరికడనైన విక్రయమున కున్న దేమో కనుగొనుడు.” వారు ప్రయత్నింపగా సుశీలయింట అట్టిది దొరకెను. ఎంతధన మైన ఇత్తు మన్నను దాని నామె విక్రయింపలేదు. తుద కామె “మీసుకృతములో భాగ మిచ్చినయెడల దీని నూరక మీ కిత్తు” ననెను. “స్త్రీలను సుకృతభాగినులము చేయుము” అని యజమాను లనిరి. అప్పుడు సూత్రధారుడు “యజమానులారా, అట్లనెద రేమి? బ్రహ్మలోకమునతప్ప స్త్రీల కెచ్చటను బహిష్కారము లేదు. శృంగమును పరిగ్రహింపుడు: మనపని నెరవేరును” అని చెప్పెను:

వా రంగీకరించి, శృంగమును స్వీకరించి గృహనిర్మాణము పూర్తి చేసిరి. అచ్చట ఫలకము స్థాపించి, ఉదకకుంభము లుంచి నిత్యాన్న ప్రదానము కావించుచుండిరి. భవనముచుట్టును, సద్వారావరణకుడ్య విధానము నెరపి, అంగణమున నిసుక చల్లిరి. ఆవరణ బహిర్ద్వారమున తాడిమొక్కలు నెలకొల్పిరి.

విచారశీల ఆరామము నిర్మించెను. అచ్చట అన్నివిధముల ఫల వృక్షములు కలవు. అయిదురకముల తామరలు కల సరస్సు త్రవ్వించెను. కులీన ఏసత్కార్యము చేయ లేదు. పితృసేవయు వృద్ధజన సేవయు, సత్యవాక్యపరిపాలనము, పరుషవాక్యపరిహారణము, అపవాద పరిత్యాగము కార్పణ్యావర్జనము అను నేడు విధముల నియమములను బోధిసత్త్వుడు పాటించుచుండెను.

పితరులకు సేవ చేయుచు, పెద్దవారి
నాదరించి మృదుప్రియ మాడుచుండి,
ఒరుల నిందింపకుండి, మత్సరము లేక
యుండు నక్రోధనుని, సత్యసూక్తియుతుని
ముప్పదియు మూడు నౌ లోకముల విబుధులు
సజ్జనుం డని యందురు సంతసమున.

బోధిసత్త్వుడు దేహము చాలించి దేవలోకమున సక్కుడై పుట్టెను. ఆయనమిత్రులుకూడ దేవలోకమునకే పోయిరి. సురలు కూడ నచటనే యుండిరి. పరభోక్తవ్య మగుచిలోకమున మన కేమి

శ్రేయ మున్నది? అని సక్కుడు పలికెను. సురలు దివ్యసురాపానమున ప్రమత్తులై యుండ సక్కుడు పాదములు పట్టి వారిని సినేరు పర్వత ప్రాంతమునకు విసరివైచెను. దేవలోకము మొదలుకొని వారు పడి పోయిన ప్రాంతమువరకు అసురలోక మని పేరు వచ్చెను. దేవతల విద్రుమవృక్షమువలె నొకతరువు జన్మించి ఒక్కయుగముపాటు జీవముతో నుండి, "కిమ్మీరపాటల" మనుపేర నొప్పెను. ఈతరువున బుట్టినపుష్పములవలన "విద్రుమదేవలోకము" కాగల దని వారు గ్రహించి "ఈవృద్ధసక్కుడు మనలను సురాపానమత్తులను జేసి, మన నగర మాక్రమించి, మనల నీయగాథమున ద్రోసినాడు. బయలు దేరుడు. యుద్ధయున నతనిని జయించి మరల మనలోకము చేరుదము" అని యుద్ఘోషించి, చీమలు స్తంభముపైకి బ్రాకునట్లు సినేరు పర్వతపార్శ్వము నెక్కసాగిరి.

అసురులు విజృంభించి రని విని వారితో యుద్ధము చేయుటకై అగాధములోనికి బోయి, పరాజితుడై నూటయేబదిక్రోశముల పరిమాణము కల జయద్రథమున దక్షిణాఖాత పర్వతశిఖరమునకు సక్కుడు బరుగెత్తెను.

పోయిపోయి ఆయనరథము శాల్మలీవనమున బ్రవేశించెను. రథమార్గములో వృక్షములు నలిగి అగాధమున బడిపోవుచుండెను. గరుడ శాబకము లగాధములో బడుచు విలాపధ్వనులు చేసెను. సక్కుడు సూతునితో "మాతలీ! ఈధ్వని యేమి? ఎంత హృదయవిదారకముగా వినవచ్చుచున్నది!" అనెను. "దేవా, తమరథగమనమున వృక్షములు నలిగిపోవుచుండ గరుడశాబకములు భయాతిరేకముచే నాక్రోశించుచున్నవి" అని చెప్పెను. "మాతలీ, నావలన వానికి బాధ కలుగరాదు. రాజ్యముకై జీవహింస చేయరాదు. వానిని రక్షించుటకై అసురులకు నాప్రాణముల నొసగెదను. రథము మరల్పుము" అనుచు సక్కు డీ గాథ పలికెను.

సింబలివనమ్ములోని పక్షివ్రజంబు
రథపుటలుగుల నుండి సంరక్షణంబు
నందని, మ్మసురాలికి నసువు లిచ్చి
వార్చము; కులాయ పక్షులనష్టి వలదు.

మాతలి రథమును త్రిప్పి యింకొకమార్గమున దేవలోకమునకు జేర్చెను. రథపరిక్రమణము గాంచిన తోడనే సక్కు లితర లోకముల నుండి వచ్చుచున్నా రని అసురులు విలపించి "బల మభివృద్ధి యగుట చేతనే సక్కుడు రథపరిక్రమణము చేసెను" అనుకొని ప్రాణభయమున వణకుచు అసురలోకము చేరుకొన పరుగెత్తిరి.

సక్కు డట్లు దేవలోకమున బ్రవేశించి నిజదేవతాగణముతోడను, బ్రహ్మలోక సురగణములతోడను గూడి, నగరమధ్యమున నివసించెను. అప్పుడు భూమిని జీల్చుకొని జయప్రాసాదము సహస్రక్రోశములవరకు బయలువెడలెను. జయసమయమున లభించుటచే దాని కాపేరు వచ్చెను. దానింగూర్చి యీగాథ చెప్పబడినది:

అసురులవలన మరల బాధ కలుగకుండ సక్కుడు పంచప్రదేశములలో రక్షకభటులను నియోగించెను. అట్లు సక్కుడు రక్షితుడై అమర్త్యలోకసౌఖ్యము నొందుచుండ, సుశీల దేహము చాలించి, సక్కునిభార్యగా జన్మించెను. ఆమె శృంగదానము చేసినందులకు ఫలితముగా పంచశతక్రోశోన్నతమై దివ్యమణివిరాజితమైన సుశీల నామక ప్రాసాదము ఆమెకొరకుద్భూత మయ్యెను. అందు ధవళ రమ్యవితానముక్రింద సింహాసనముపై సక్కుడు దేవరాజుగా దేవమానవ పాలనము చేయుచుండెను.

పిమ్మట విచారశీల కాలము చేసి సక్కునిదాసియై జన్మించెను. ఆరామనిర్మాణఫలితముగా నామె విచారశీలా లతావనరాజి యను నారామ ముద్భవించెను. మరణానంతరము ఆనంద సక్కునిదాసిగా పుట్టినది. తటాకఖననఫలముగా నామెకై ఆనందతటాక ముద్భవించినది. పుణ్యము చేయనందున కులీన వనకందరమున బకమై పుట్టెను.

"కులీనజాడ తెలియదు. ఆమె యెక్కడ జన్మించెనో" యని సక్కుడు యోజించి తుద కామె నివాసము గ్రహించి, అచ్చటికి బోయి ఆమెను చూచి, తనవెంట దేవలోకమునకు గొనిపోయి రమ్యమగు దేవనగరమును, సుశీలాప్రాసాదమును, విచారశీలాలతావనరాజిని, ఆనందతటాకమును జూపి, "వీ రందరును పూర్వజన్మ ఫలానురూపముగా నాకు పరిచారిక లయినారు. నీవు సుకృతము చేయకుండుటచే జంతులోకములో జన్మించినావు. ఇకనైనను విధుల ననుసరిం

ప్రము" అని బోధించెను. ఇట్లామెతో మధురవాక్యములు పలికి, పంచవిధుల నుపదేశించి నిజనివాసమున విడిచిపెట్టెను. అప్పటినుండి యామె విధులు నిర్వర్తించుచుండెను.

కొంతకాలమునకు సక్కుడామెను (బకమును) పరీక్షింప గోరి మాత్స్యరూపమున నామెయెదుట బడియుండెను. చేప చచ్చిన దను భ్రమచే బకము దానిని ముక్కున గరచుకొనెను. ఇంతలో చేప తోక కాడింపగా, ఏమి! చేప బ్రదికి యున్నదే! అని దానిని విడిచిపెట్టెను. "మేలు మేలు! నీవు విధులు చక్కగా నిర్వర్తించుచున్నావు!" అని సక్కుడటనుండి వెడలిపోయెను.

అనంతరము కులీన వారాణసిలో కుంభకారుని కూతురుగా పుట్టెను. ఆమె యే మయ్యెనో యని సక్కుడు యోజించి తుదకామె జన్మస్థానము దెలిసికొని, వృద్ధవేషము దాల్చి, బండిలో బంగరుగుమ్మడికాయల నుంచి, ఈ కూష్మాండములు కొనుడు, ఈ కూష్మాండములు కొనుడు" అనుచు గ్రామమధ్యమున గూరుచుండెను. జనులు వచ్చి కొనగోరిరి. పంచవిధు లాచరించువారికే విక్రయింతును. మీరావిధులు నిర్వర్తించుచున్నారా?" అని వృద్ధు డడిగెను. "నీ విధులేవో మాకు తెలియవు. గుమ్మడికాయ లమ్ముము" అని వా రడిగిరి. "నాకు క్రయధన మక్కరలేదు. విధులు నిర్వర్తించువారి కొరకే యిత్తును. అన్యుల కీయను" అని యత డనెను. వీ డెవడో పరిహాసకు డని యెవరితోవను వారు పోయిరి.

కులీన విని కూష్మాండములు తనకొరకే వచ్చిన వని గ్రహించి, వృద్ధునియొద్దకు బోవగా నాతడు "అమ్మా, విధులు నిర్వర్తించుచున్నావా?" అని యడిగెను. "అవును, ఆచరించుచున్నాను" అని యామె పలుక, నీ కొరకే వీనిని దెచ్చితిని" అని కూష్మాండములతో గూడ బండిని కులీనయింటకడ విడిచిపోయెను.

కులీన పంచవిధుల నాచరించుచు మరణానంతరము వేపచిత్తియుడను నసురరాజ పుత్రికయై జన్మించెను. పెరిగి పెద్దదయి మహాసౌందర్యవతి యైన యామెకు స్వయంవరార్థము తండ్రి రాజకుమారులను బిలిపించెను. ఇంతలో సక్కుడావార్త విని అసురకుమారవేషము ధరించి స్వయంవరణ సమయమున కచ్చటికి కరిగెను.

అలంకృత యైన కులీనను తండ్రి సభాభవనములోనికి గొనివచ్చి "అమ్మా, వీరిలో నీకు నచ్చినవానిని వరింపుము" అని పలికెను. ఆమె నలుదిక్కులు కలయ చూచి ఒకచో సక్కుని గాంచి పూర్వజన్మప్రీతిచే ప్రేరితయై వరించెను. సక్కు డామెను దేవనగరమునకు గొని చని రెండున్నరకోటుల దాసీజనమునకు ప్రధానురాలిని జేసెను. మరణానంతర మతడు యథా కమ్మం గతో.

రెండుపురము లభేద్యమై యుండు, కలవు
నడుమగా నైదుసంరక్షణములు రాజ
గరుడ, కుంభాండ, నాగ, యక్షవ్రజంబు.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి "భిక్షూ, పూర్వకాలము దేవరాజ్య పరిపాలన చేసియు విబుధులు ఈవిధముగా తమప్రాణములను పరిత్యజించి, జీవహింస మానిరి. నీవు కల్యాణకర మైనశాసనమున ప్రముజితుడ వయ్యు వస్త్రాచ్ఛాదనము లేక జీవకోటి సహితముగా నీరు త్రాగినావురా." అని ఆభిక్షువును చీవాట్లు పెట్టి జాతకసారాంశము వెలువరించినాడు. ఆకాలమున మాతలి అను పేరు గలసారధి ఇప్పటి ఆనందుడు; శక్రుడు నేనే.

## 32 నచ్చ జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుసమయమున ఎక్కువ సామగ్రులను పెట్టుకొను భిక్షువుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

బుద్ధుడు ఆభిక్షువుతో "నీకు నిజముగా చాలసామాను లున్నవా?" అనెను.

"చిత్తము, భన్తే."

"ఏల నీవు బహుభాండికుడ వయినావు?"

ఈమాటలకే ఆభిక్షువు కోపించి కట్టుబట్టలు విడిచి, "ఈవిధముగా విచరింతును" అని బుద్ధుని సమక్షముననే నగ్నుడయి నిలిచెను.

అప్పుడు అచటివారు ఛీఛీ యనిరి. అతడు పరుగెత్తి పోయి, సన్యాసము విడిచెను. ధర్మసభలోని భిక్షువులు "వీడు బుద్ధుని సమక్షము ననే యిట్లు చేయునా!" అని వానిని నిందించిరి.

బుద్ధుడు వచ్చి "భిక్షువులారా, కూరుచుండి యేమి భాషించుచున్నారు?" అనెను.

"భన్తే, ఆభిక్షువు తమయెదుటనే, చతుర్విధ పరిషన్మధ్యముననే లజ్జా భయములు విడిచి, పల్లెటూరి పిల్లలవలె వివస్త్రుడై నిలిచి, లోకులు నిందించిన పిదప గృహస్థుడై బుద్ధశాసనమునుండి భ్రష్టుడైన వానిని నిందించుచున్నాము."

"భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ లజ్జా భయములు లేక శాసనరూప రత్నము నాభిక్షువు జారవిడిచినాడు. స్త్రీ రత్నలాభముచేత నిరాశ చెందవలసి వచ్చెను" అని శాస్త పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున ప్రథమకల్పములో చతుష్పాజ్జంతువులు సింహమును, చేపలు ఆనందమత్స్యమును, పక్షులు సువర్ణహంసను రాజుగా నెన్నుకొన్నవి. సువర్ణహంసకు చక్కని కూతురు కలదు. ఆమె అడిగిన దెల్ల తండ్రి యిచ్చుచుండును. ఆమె తనకిష్టుడైనవానిని భర్తగా పడయగోరెను. హంసరాజు హిమవంతమున పక్షుల నన్నిటిని సమావేశపరచెను. నానావిధ శకుంతములు—హంసలు, మయూరములు మొదలగునవి వచ్చి, విశాల పాషాణముపై సమావేశ మయ్యెను. "నాబిడ్డ తనచిత్తము వచ్చిన స్వామిని వరించుగాక" అని హంసరాజు తనపుత్రికను బిలువనంపెను. ఆమె పక్షిసంఘమును పరిశీలించి, మణిగణవర్ణగ్రీవము, చిత్రపుచ్ఛము కల మయూరమును విలోకించి, ఇతడు నాస్వామి యగుగాక అని వరించెను. శకుంతములు నెమలికడకు బోయి "మిత్రమా, ఈ రాజపుత్రిక నిన్ను వరించినది" అని పలికినవి.

మయూరము సంతోషాతిశయముచే "నేటివరకును మీరు నా బలము చూడలేదు" అని ఔచిత్యము విడిచి, రెక్కలు విప్పి, మహా పక్షిసంఘమునడుమ నాట్యము చేయసాగెను. ఆసమయమున నెమలి

బయటుబడెను.

హంసరాజు సిగ్గుపడి "ఇతనికి లోపల వినయము కాని, బహిరంగముగా ఔచిత్యము కాని లేదు. సిగ్గుమాలిన వీనికి నాకుమారిక నీయను" అని పక్షిసంఘము నెదుట నీగాథ పలికెను:

స్వరము హృదయంగమమ్ము, పృష్ఠమ్ము రమ్య
మిరుదెసల పక్షముల్ బారెడేని కలవు.
గళము మణిగణవర్ణంబు, కాని నీవు
నాట్య మాడుటచే నీయ నాదుహితను.

ఆపక్షిసంఘము నెదుటనే హంసరాజు తన భాగినేయు డగు హంసపోతకమునకు తనపుత్రిక నిచ్చెను. హంసపుత్రిక తనకు లభింపకపోవుటచే మయూర మచటినుండి సిగ్గున లేచి, పలాయనము చేసెను. హంసరాజుకూడ నిజనివాసమునకు జనెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, జాతకసారాంశమును వెలువరించెను. అప్పటి మయూరము ఇప్పటి బహుభాండారి భిక్షువు; హంసరాజు నేనే.

## 33 సమ్మోదమాన జాతకము

శాస్త కపిలవస్తు సమీపమున న్యగ్రోధారామమున ఉన్నసమయమున ధూర్తకలహమును గూర్చి చెప్పినది. ఆకథ కుణాల జాతకమున (536) వచ్చును.

### వర్తమాన కథ

ఆసమయమున బుద్ధుడు జ్ఞాతులను బిలిపించి "మహారాజులారా, జ్ఞాతులు పరస్పరము కలహించుట ఉచితము కాదు. పూర్వకాలమున పశుపక్ష్యాదుల గర్భముల బుట్టి ప్రాణు లొకభావముతోనే ప్రవర్తించుటచే శత్రువులను జయించిరి. వివాదము కలిగినప్పుడు మహావినా

శము పొందిరి" అని, జ్ఞాతిరాజులు వేడినపిదప బుద్ధుడు పూర్వజన్మ కథ చెప్పినాడు.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజుగా నుండగా బోధి సత్త్వుడు తిత్తిరిపిట్ట యయి, వేలకొలది తిత్తిరిపిట్టలు పరివేష్టించి యుండ, అరణ్యమున నివసించుచుండెను. ఆరోజులలో పిట్టలను పట్టువాడచ్చ టికి వచ్చి, ఆపిట్టకూత ననుకరించి, పిట్టలు గుమిగూడగనే వల పైన వేసి, త్రాళ్ళు లాగి, అన్నిటి నొక్కచో జేర్చి, గంపలో నింపి, అమ్మి జీవించుచుండెను.

ఒకనాడు బోధిసత్త్వుడు పక్షులతో నిట్లనెను: "ఈ పిట్టలవాడు మనజ్ఞాతుల ననేకుల నాశము చేయుచున్నాడు. నా కొకయుపాయము తోచుచున్నది. వీడు మనలను నిక పట్టుకొన లేడు. వీడు మీాపయి వల వేయగనే, జాలరంధ్రములలో తలలు పెట్టి, ఒక్కమారుగా వల యెత్తుకొని, ఇచ్చవచ్చినచోటి కెగిరిపోయి, కంటకముల పొదమీాద విడువవలెను. మన మప్పు డాయాసందులనుండి తప్పించుకొని యెగిరి పోవుదము." అందరును మంచి దని యంగీకరించిరి.

మరునాడు తమపై జాలము పడినపుడు పిట్టలు బోధిసత్త్వుని యుప దేశప్రకారముగా వల యెత్తుకొని, ముండ్లపొదపై వ్రాలి, క్రిందనుండి తప్పించుకొని పోయినవి. వ్యాధుడు పొదమీాదనుండి వలను తప్పించి లాగునప్పటికి సాయంకాల మయ్యెను. వాడు రిక్తహస్తములతో వెడలి పోయెను.

మరునాడును, తరువాతరోజులలోను పక్షు లట్లే చేసినవి. సాయం సమయమువరకును వల ముండ్లపొదనుండి వదలించుకొనుచు వేట కాడు రిక్తహస్తములతో నింటికి మరలిపోవుచుండెను. వానిభార్య కోపించి "నానాటికి నీవు వట్టిచేతులతో నింటికి వచ్చుచున్నావు. నీవు పోషింపవలసిన యింకొక తా వున్న దని తోచుచున్న" దనెను.

"భద్రురాలా, వే రొక పోష్యస్థానము లేదు. ఆ తిత్తిరి పిట్టలు సంఘముగా చరించుచున్నవి. నేను వల వేయగానే ఒకసారిగా అన్నియు నెగిరిపోయి ముండ్లపొదమీాద వలను విడుచుచున్నవి. కాని యెల్లకాల

మవి సంక్షుభావముతో నుండలేవు. నీవు విచారింపవద్దు. వివాదము పుట్టినప్పుడు వానిని బుట్టలో బెట్టవచ్చును. అప్పుడు నీ ముఖమున హాస మంకురించును'' అని వా డీగాథ పలికెను:

పక్షు లెల్ల నొకేయభిప్రాయమునను
ఎగురదన్నక వలతోడ నేగుచున్న,
వయిన నెప్పుడో నావళ మగుట నిజము—
వానిలోన వివాదంబు వర్తిలు నెడ.

తరువాత కొలదిరోజులకే ఒక తిత్తిరిపిట్ట ఆహారభూమిమీద వ్రాలుచు పొరపాటున వేఱక తిత్తిరితలమీద త్రొక్కినది. "ఎవరు నాశిరసు త్రొక్కినారు?'' అని ఆపిట్ట కోపముతో న నెను. "నేను ప్రమాద వశమున త్రొక్కినాను. కోపము వలదు'' అని మొదటి తిత్తిరి పలికెను. అయినను రెండవదాని కోపము తగ్గలేదు. మాటలు పెరిగి అవి పరస్పరము "నీవే వల యెత్తినా వనుకొందును'' అని హేళన చేసుకొన్నవి. బోధిసత్త్వుడు తనతో "కలహించువారివలన భద్రము లేదు.. ఇక నివి వల యెత్తుకాలము గడచినది. మహావినాశము ప్రాప్తింపనున్నది. వ్యాధున కవకాశము లభించును. ఇక నే నిక్కడ నుండజాలను'' అని నిజపరివారమును దీసికొని, స్థానాంతరమునకు జనెను.

అనంతరము కొలదిదినములలో వ్యాధుడు వచ్చి, తిత్తిరికూత నను కరించి, అవి గుమిగూడినంతనే వానిపై వల విసిరివేసెను. అప్పు డొక తిత్తిరిపిట్ట "నీ వొక్కడవే వల యెత్తునపుడు నెత్తిమీది రోమములు రాలిన వట. ఇప్పు డెత్తు'' మనెను. "నీవు జాలము నెత్తునపుడు నీ రెక్కలలోని యీకలు రాలిన వట. ఇప్పు డెత్తు'' మని వేరొకపిట్ట యనెను.

ఈవిధముగా నీ వెత్తుము, నీ వెత్తుము అని అవి వివాదపడుచుండగా వ్యాధుడు జాలము పట్టి లాగి, అన్నిటి నొకచో జేర్చి బుట్టలో వేసి, భార్యముఖమున హాస మంకురించునట్లు లింటికి జేరెను.

**"మహారాజులారా, జ్ఞాతులలో కలహ ముచితముకాదు. కలహము వినాశకారణ మగును" అని చెప్పి బుద్ధుడు ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. అప్పటి మూర్ఖ మైనతిత్తిరిపిట్ట ఇప్పటి దేవదత్తుడు వివేకము కలపిట్ట నేనే.**

# 34 మచ్ఛ జాతకము

**బుద్ధుడు జేతవనమున విహారము చేయుచుండగా పూర్వభార్యపై లోభము కలవానిని గూర్చి చెప్పినది.**

## వర్తమాన కథ

అప్పుడు బుద్ధుడాభిక్షువుతో "భిక్షూ, నీవు ఉత్కంఠితుడ వగుట నిజమేనా?" అనెను.

"భగవన్, సత్యమే."

"ఏల నీవు ఉత్కంఠితుడ వయినావు?"

"భగవన్, నాపూర్వభార్య చేతులలో మాధుర్య మున్నది. దానిని విడువజాల కున్నాను."

"భిక్షూ, ఈస్త్రీ నీ కనర్థదాయిని, పూర్వజన్మమున కూడ నీ వీమె మూలమున చచ్చుటకు సిద్ధమై నన్ను శరణు జొచ్చుటచే బ్రతికితివి" అని బుద్ధుడు పూర్వజన్మగాథ చెప్పినాడు.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఆయన పురోహితు డయ్యెను. ఆరోజులలో కొందరు చేపలవాండ్రు నదిలో వల వేసిరి. మహామత్స్య మొకటి తన భార్యతో క్రీడించుచు వచ్చెను. వల వాసనపట్టి ఆడుచేప తప్పించుకొనిపోయెను. కామముచే కన్ను గానని మగచేప జాలములోనికే బోయెను. అది వలలో పడినట్లు కైవర్తులు గ్రహించి, వల యెత్తి, చేపను పట్టుకొని ఇసుకదిబ్బమీదికి విసరి వేసిరి. 'దీనిని నిప్పులమీద కాల్చి యిచ్చటనే తిందము' అని వారు నిప్పు చేసి, శూలము తెచ్చుటకై యత్నించుచుండిరి. "అగ్నితాపమునకు గాని, శూలవేధకు గాని దుఃఖింపను, ఇంకొకచేపవెంట బోయియుందు నని నాభార్య అసుఖముగా నుండు ననుభావము వేధించుచున్నది" అని మగచేప పరిదేవనము చేయుచు ఈగాథ పలికెను:

చలిపీడ లేద ఉష్ణముబాధ లేద
జాలబంధమున కష్టముకూడ లేద
అన్యకామినిమీది యభిలాషచేత
చనియుండు నని నాదుజాయ తలంచు
నను సంశయం బెంతో వ్యథ కలిగించు.

ఆసమయమునకు రాజపురోహితుడు దాసపరివృతు డయి స్నానార్థము నదీతీరము జేరియుండెను. మత్స్యపరిదేవనము విని "ఈచేప కామముచే పరిదేవనము చేయుచున్నది. ఆతురచిత్తముతో నిట్లు మరణించునేని నిరయమునకు బోవును. దీనిని రక్షింపవలె" నని ఆయన భావించి జాలముకడకు బోయి "ఏమోయి, మాకు మీరు ప్రతిదినము వ్యంజనార్థము మత్స్యమును బంపుటలేదా?" అనెను. "స్వామీ, ఏ మంటిరి? మీకు నచ్చినయేచేప నైనను తీసికొనిపొండు" అని జాలరులు పలికిరి. "ఇది చాలును. అన్యము వలదు. దీనినే యిండు." "తీసికొని పొండు స్వామీ."

బోధిసత్త్వుడు దానిని రెండుచేతులతో బట్టుకొని, తీరమున గూరుచుండి, "మత్స్యమా, నిన్ను నేను చూడకున్నచో నీవు ప్రాణములు కోల్పోయి యుందువు. నేటినుండి కామమునకు లోను గాకుము" అని యుద్బోధించి, దానిని నీటిలో విడిచెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకాశింపజేసి నంతనే ఉత్కంఠిత భిక్షువు శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. బుద్ధుడు కథలు సరి పోల్చి జాతక సారాంశమును వెలువరించెను. అప్పటి మత్స్యాంగన ఇప్పటి పూర్వభార్య మత్స్యము; ఇప్పటి ఉత్కంఠిత భిక్షువు; పురోహితుడను నేనే.

# 35 వర్తక జాతకము

**బుద్ధుడు** మగధదేశమున పర్యటనము చేయుచుండగా దావాగ్ని చల్లార్పుటను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకప్పుడు బుద్ధుడు మగధదేశములో సంచారము చేయుచు ఒకానొక గ్రామమున భిక్షాటనము చేసి మరలి వచ్చి, భోజనానంతరము భిక్షుకగణముతో త్రోవబట్టెను. ఇంతలో దావానలము ప్రజ్వరిల్లెను. శాస్తకు వెనుకను ముందరను చాలమంది భిక్షువు లుండిరి. దావాగ్ని, ఒకేపోగ ఒకేమంటగా వ్యాపించి వచ్చుచుండెను. మరణభీతు లైన భిక్షువులు కొందరు, "మేము అగ్నికి ప్రతిగా అగ్ని ముట్టింతుము. అందువలన మొదటియగ్ని ఈస్థానమునకు వ్యాపింపదు" అని తలపోసి, అరణులు తీసి, నిప్పు చేయసాగిరి. కొందరి ట్లన్నారు: "ఆయుష్మంతులారా, ఏమి చేయుచున్నారు? గగనమధ్యమున నున్న చంద్రుని, తూర్పున నుదయించు సహస్రమయూఖుని, సముద్రతటమున నిలిచి రత్నాకరుని, సుమేరు పర్వతమువద్ద నిలిచి సుమేరుపర్వతమును, చూడనట్లు లోకమున సదా అగ్రగణ్యు డగువ్యక్తి సమ్యక్-సంబుద్ధుని చూడక మేము ప్రతిగా అగ్నిని వెలిగింతు మనుచున్నా రేమి? మీకు బుద్ధబలము తెలియదా? నడువుడు, బుద్ధునిసన్నిధికే పోవుదము" అని ముందు వెనుకల నున్నభిక్షువు లందరు ఏకముగా దశబలధారికడ కరిగిరి.

ఆమహాభిక్షుసంఘమును వెంట నిడుకొని బుద్ధు డొకచో నిలిచెను. దావానల మెల్లర నలముకొనునట్లు భగభగలాడుచు వచ్చుచుండెను.

తథాగతుడు నిలిచినస్థానమునకు వచ్చి దానికి నలుమూలల పదునారుమూరల దూరమున దావాగ్ని గడ్డిపోచల కాగడా నీట ముంచినట్లు చల్లారిపోయెను. బుద్ధునకు ముప్పదిరెండు మూరల దూరము అగ్ని ఆరిపోయెను.

భిక్షువులు బుద్ధునిగుణగానముల చేయసాగిరి. "ఓహో! బుద్ధుల సామర్థ్యము! అచేతన మైనయీయగ్నికూడ బుద్ధులు నిలిచిన ప్రదేశ

మునకు వ్యాపించజాల దయ్యెను. నీటిలో ముంచిన గడ్డిపరకల కాగడా వలె ఆరిపోయినది. ఓహో! బుద్ధుల ప్రతాపము!

శాస్త వారల సంభాషణములు విని యిట్లనెను: "భిక్షువులారా, ఇది యిప్పటి నాబలమే కాదు; ఇది నాపురాణ సత్యక్రియా బలము. ఈప్రదేశమున ఈకల్పాంతమువరకు నిప్పు మండనేరదు. కల్పాంతము వరకు స్థిరముగా నుండు ప్రాతిహార్యము (అలౌకిక క్రియ)."

ఆయుష్మాన్ ఆనందుడు శాస్త కూర్చుండుటకై వస్త్రము పరచెను. శాస్త దానిపై కూరుచుండెను. భిక్షుసంఘముకూడ తథాగతునకు ప్రణామము చేసి, చుట్టును కూరుచుండెను. భిక్షువులు ప్రార్థించిన పిదప బుద్ధుడు పూర్వజన్మ కథ స్పష్టీకరించెను.

## అతీత కథ

పూర్వము మగధరాష్ట్రమున ఆ ప్రదేశమునందే బోధిసత్త్వుడు టిట్టిభపక్షి కడుపున పుట్టి, అండము భేదించుకొని యీవలకు వచ్చి, పెద్దబంతియంత పరిమాణము కల టిట్టిభపోత మాయెను. తలిదండ్రులతనిని గూటిలోపల నుంచి, ముక్కులతో ఎర తెచ్చి పెట్టుచుండిరి. రెక్కలు విప్పి గాలిలో నెగురుటకు గాని పాదము లెత్తి నేలపై నడచుటకు గాని, అతనికి శక్తి కలుగలేదు. ప్రతి సంవత్సరము దావాగ్ని యీ ప్రాంతమును దగ్ధము చేయుచుండును. మహాధ్వనితో నిపుడు నిప్పు ముట్టుకొన్నది. పక్షిసంఘములు తమతమ గూళ్ళు విడిచి, మరణ భయమున విరావములతో నెగిరిపోయినవి. బోధిసత్త్వుని తలిదండ్రులు కూడ మరణ భీతిచే నెగిరిపోయిరి. అతడు గూటిలోనుండి మెడ రిక్కించి, అగ్నిజ్వాలలు తనవైపు వచ్చుచుండుట చూచి యిట్లు తలపోసెను: "రెక్కలు చాపి ఆకాశమున పోవు బలము నా కున్నచో వేరొక చోటికి కెగిరిపోయి యుందును. పాదము లెత్తి పోవు శక్తి యున్నచో నింకొక చోటికి నడచి పోవుదును. మరణ భయమున నా తలిదండ్రులు నన్ను విడిచి, నిజరక్షణార్థము పోయినారు. ఇప్పుడు నాకు వేరు దిక్కులేదు. అగతికుడను. ఇప్పు డేమి చేయవలెను?"

పిమ్మట ఆతని కిట్లు తోచినది: "ఈ లోకములో శీలగుణమున్నది, సత్యగుణ మున్నది. పూర్వము పారమితలనుపొంది, బోధివృక్షతలమున

గూరుచుండి అభిసంబుద్ధిని పొంది, శీల సమాధి ప్రజ్ఞావిముక్తి విముక్తి జ్ఞానదర్శన సంపన్నులు, సత్య దయా శాంతి సమన్వితులు, సర్వభూతములయెడ సమాన మైత్రిభావన కలవారు, సర్వజ్ఞులు సమబుద్ధులు కలరు. వారు సముపార్జించిన ధర్మగుణములు కలవు. నాయందును ఒక సత్యము స్ఫురించుచున్నది. కావున వెనుకటి బుద్ధులును వారి యను భూతగుణములను స్మరించి, నాయందలి స్వాభావిక సత్యధర్మమును పురస్కరించుకొని, సత్యకార్యము (ప్రతిజ్ఞ) చేసిరి. అగ్నిని వెనుకకు బంపి, మిగిలిన పక్షులను, నన్ను రక్షింపవలసి యున్నది. కావుననే యిట్లు చెప్పబడినది:

జగతి సదాచార శౌచముల్ దయయు
సత్యంబు కల; వల్లసత్యసంతతుల
ఉత్తమసత్యంబు నొగిని సాగింతు
ధర్మంపుబలమును దరి గన్నజనుల
గాంచి, సత్యక్రియ కడగితి చేయ.

అప్పుడు బోధిసత్త్వుడు పూర్వకాలమున పరినిర్వాణమును వెనుకటి బుద్ధుల గుణములను స్మరించి, తనయందు విద్యమాన మగు సత్యభావమును పురస్కరించుకొని, సత్యకార్యము చేయుచు ఈ గాథ పలికినాడు:

ఉన్నవి పక్షంబు లుడ్డీన మెరుగ
కాళు లున్నవి కాని కదలగా లేను
నను విడనాడిరి నా తల్లితండ్రి:
వెనుకకు పో జాతవేదుడా, పొమ్మ!

ఈ ప్రతిజ్ఞ చేయగానే జాతవేదసుడు పదునారు కరీషముల (బారల) దూరము వెనుకకు పోయెను. పోవునపుడు దహించుచు పోవలేదు; నీటిలో ముంచిన కాగడావలె వెంటనే ఆరిపోయెను. కావున నిట్లు చెప్పబడెను:

అధికమ్ముగా వెల్గు నగ్నిహోత్రుండు
నాడు సత్యక్రియ గాంచినతోనె
పదునారు బారలు వడగొత్తి పోయె—
జలములలో బడ్డ జ్వాలనుని రీతి!

ఆప్రదేశము కల్పాంతమువరకు దగ్ధము కాక తప్పించుకొనుటచే కల్పస్థిరప్రాతిహార్యము అనుపేరు వచ్చెను. ఇట్లు బోధిసత్త్వుడు సత్య కార్యము చేసి, జీవితాంతమున యధా కర్మం గతో.

«భిక్షువులారా, ఈయరణ్యమగ్నిదగ్ధము కాకుండుట నాయిప్పటి బలమువలన కాదు; పూర్వజన్మములో తిత్తిరిపిట్టనై యున్నప్పటి నాసత్యబలము వలన» అని బుద్ధుడు ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రకటించెను. అనంతరము కొందరు స్రోతాపన్ను లయిరి; కొందరు సకృదాగాము లయిరి; కొందరు అనాగాము లయిరి; కొందరు అర్హతు లయిరి. బుద్ధుడు జాతక సారాంశమును వెలువరించెను. అప్పటి మాతాపితలు ఇప్పటి మాతాపితరే; పక్షిరాజు నేనే.

## 36 సకుణ జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుసమయమున దగ్ధపర్ణశాలా భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకానొకభిక్షువు శాస్తకడ కర్మస్థానము గ్రహించి జేతవనము నుండి వెలువడి, కోసలజనపదమున ఒకానొక సీమాంత గ్రామ సమీపమందలి అరణ్యములో నివసించుచుండెను. వర్షాకాలమునకు ముందే అతనిపర్ణశాల దగ్ధ మయ్యెను. అతడు లోకులతో "నాపర్ణశాల దగ్ధ మయినది. నేను కష్టపూర్వకముగా నివసించుచున్నాను" అనెను. "మా పొలము లిప్పు డెండిపోయి యున్నవి. వానికి నీరు కట్టి, మీకు పర్ణశాల కట్టి యిత్తుము." వారు నీరు కట్టినపిదప విత్తులు చల్లి గొర్రెలను కట్టివేసి పైరు కోసి కాపలాకాచి ఈప్రకారముగా ఇక్కడ పని అక్కడ పని చూపుచు మూడునెలలు గడిపిరి. ఆభిక్షువు మూడుమాసములు అనాచ్ఛాదికముగా నివాసము చేయుటచేత కర్మస్థాన-అభ్యాసమున ఉన్నతి చెందక, అర్హత్వము పొందలేక పోయెను. పవారణ (వర్షాకాల సమాప్తి) తరువాత ఆతడు బుద్ధు సన్నిధికి

చేరి, ప్రణామము చేసి ఒకప్రక్కన గూరుచుండెను. శాస్త్ర అతనితో సంభాషించుచు "భిక్షూ, వర్షావాసము సుఖముగా జరిగినదా? కర్మ స్థానము సఫల మయినదా?" అనెను. అతడు జరిగిన దంతయు తెలిపి నివాసస్థానము అనుకూలముగా లేకుండుటచే కర్మస్థానము సఫలము కాలే దని చెప్పెను. "భిక్షూ, పూర్వము తిరశ్చీన జంతువులు కూడ అనుకూలతను, అసౌకర్యమును గమనించినవి. నీ వేల గమనింప లేదు?" అని శాస్త్ర పూర్వజన్మ వృత్తాంతమును స్పష్టీకరించెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు పక్షిగర్భమున బుట్టి, పక్షిసంఘపరివృతుడై అరణ్యాయతనమున శాఖాసంపన్న మగు మహావృక్షముపై నివసించుచుండెను. ఒకనా డావృక్షశాఖలు రాచుకొనుచుండ, ధూళి రేగి ధూమముకూడ బయలు వెడలినది, అని చూచి బోధిసత్త్వుడు తనలో "ఈరెండు కొమ్మ లీ విధముగా రాచుకొనుచుండ అగ్ని బయలు వెడలును. అగ్ని జీర్ణపర్ణములపై బడి దగ్ధము చేయును. ఈవృక్షము నావల ముట్టుకొనును. కావున మే మిక్కడ నివసింపలేము. అన్యప్రదేశము నకు శీఘ్రముగా బోవుట యుక్తము" అనుకొని పక్షిసంఘమున కీగాథ చెప్పెను:

ఆశ్రయం బిచ్చిన యననీరుహంబె
నీడోద్భవములార, నిప్పులు కురియు
కావున వేరొండు కడలకు బొండు:
శరణ ప్రదేశాన జనియించె భీతి.

బోధిసత్త్వుని యుపదేశము ననుసరించి వివేకముగల పక్షులు వెంటనే ఆయనతోపాటు లేచి వేరొకచోటికి బోయినవి. మూర్ఖశకుంతములు "ఎప్పుడు నీయన ఇంతే. జలబిందువులో మొసళ్ళను జూచును" అని ఆయనమాట వినక యచ్చటనే యుండెను. బోధిసత్త్వుడు తలంచినట్లే అగ్ని త్వరలోనే లేచి చెట్టు నంటుకొనెను. ధూమాగ్నులు బయలు

చేరగా పక్షులు ధూమాంధములై ఒక్కటొక్కటే అగ్నిలో బడి వినాశము చెందెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి.......జాతక సారాంశమును వెలువరించెను. ఆకాలమున బోధిసత్త్వుని మాట విన్నపక్షిసంఘము ఇప్పటి బుద్ధపరిషత్తు; వివేకము కలపక్షి నేనే.

## 37 తిత్తిర జాతకము

బుద్ధుడు శ్రావస్తికి పోవునపుడు సారిపుత్ర స్థవిరునికై శయనాసనములు లభింపక పోవుటను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అనాథ పిండికుడు విహారము కట్టించి, దూతలను పంపిన పిమ్మట బుద్ధుడు రాజగృహమునుండి వెలువడి వైశాలి చేరి అచ్చట ఇష్టాను సారముగా విహారించి శ్రావస్తి పోవలె ననుతలపుతో పర్యటన మారంభించెను. ఆసమయమున ఆరువర్గముల భిక్షుల శిష్యులు ముందు ముందుగా పోయి, స్థవిరులు శయనాసనములు పరిగ్రహించుటకు పూర్వమే 'ఈ శయనాసనములు మాయుపాధ్యాలకు, ఇవి మాఆచార్యులకు, ఇవి మాకు' అని వానిని భుక్తము చేసికొనుచుండిరి. పిదప నరుదెంచిన స్థవిరులకు శయనాసనములు లభించెడివి కావు. సారిపుత్రుని శిష్యులు తమస్థవిరునికై అన్వేషించినను శయనాసనములు లభింపలేదు. శయనాసనములు లభింపకపోవుటచే స్థవిరుడు బుద్ధుని శయనమునకు కొలది దూరములో వృక్షము క్రింద కూరుచుండి కొంతసేపటునిటు తిరిగి రాత్రిగడిపెను. తెల్లవారు జామునకే బుద్ధుడు లేచి దగ్గెను. స్థవిరుడుకూడ దగ్గెను. "ఎవరు?" అని బుద్ధుడడుగగా "భన్తే నేను సారిపుత్రుడను" అని యాతడనెను. "సారిపుత్రా, ఈ సమయమున నీ విక్కడ నేమి చేయుచున్నావు?" ఆయన వృత్తాంత మంతయు

తెలిపెను. బుద్ధుడు స్థవిరునివాక్కులు విని తనలో "నేను జీవించి యుండగానే ఒక భిక్షువు ఇంకొక భిక్షువునెడ ఆదరపూర్వకముగా వర్తించుట లేదు. నాపరినిర్వాణానంతరము ఏమి యగునో" అనుకొని, ధర్మసంవేగ ముత్పన్న మయ్యెను. ప్రభాత మయినంతనే ఆయన భిక్షువులను సమావేశ పరిపించి వారితో "భిక్షువులారా, షడ్వర్గ భిక్షువులు ముందుగా జని స్థవిరుల శయనాసనములను స్వాధీనము చేసికొన్నసంగతి సత్యమేనా?" అనెను. "భగవన్, సత్యమే."

అప్పుడు భగవాన్ షడ్వర్గభిక్షువులను చీవాట్లు పెట్టి ధర్మకథ చెప్పి "భిక్షువులారా, ప్రథమమున ఆసనము జల భోజనములకు ఎవరు యోగ్యులు?" అని ప్రశ్న చేసెను.

కొలదిమంది భిక్షువులు "క్షత్రియకులమున ప్రవ్రజితు లయినవారు" అనిరి. "బ్రాహ్మణకులమున జన్మించినవా" రని కొంద రనిరి. గృహపతి (వైశ్య) కులమున పుట్టినవా రని కొంద రనిరి. వినయధరుడు కథితధర్ముడు, ప్రథమధ్యానలాభము కలవాడు, ద్వితీయ, తృతీయ, చతుర్థ, ధ్యానలాభము కలవాడు అనికొంద రనిరి. స్రోతాపన్నుడు, సకృదాగామి, అనాగామి, అర్హతుడు, త్రివిద్యావేత్త, ప్రాప్తషడభిజ్ఞుడు అని మరికొంద రనిరి.

ఈప్రకారముగా తమతమ అభిరుచినిబట్టి భిక్షువులు అగ్రసనాదులకు యోగ్యులను నిరూపించుచుండ, బుద్ధు డిట్లనెను. "భిక్షువులారా, నాశాసనమున అగ్రాసనాదులు పొందుట కర్హులు మీరు చెప్పిన గుణములు కలవారు కారు. భిక్షువులారా, ఈశాసనమున ప్రణామము, సేవ, చేతులు జోడించుట, తక్కిన ఉచితక్రియలు అన్నియు పెద్దరికమును బట్టియే చేయవలెను. అగ్రాసనము, అగ్రజలము, అగ్రభోజనము పెద్దరికమునుబట్టియే లభింపవలెను. ఇదియే ఇక్కడ ప్రమాణము. ఇందులో అందరికంటె పెద్ద (ముందు ప్రవ్రజించినవాడు) యోగ్యుడు. భిక్షువులారా, ఇప్పుడు సారిపుత్రుడు నాఅగ్రశ్రావకుడు; నాయనంతరము ధర్మచక్రము త్రిప్పవలసినవాడు; నాతరువాత శయనాదుల కధికారి. అట్టివాడు శయనము లభింపనందున రాత్రి వృక్షముక్రింద గడిపినాడు. ఇప్పటినుండి మీ రీప్రకారముగా అగౌరవము, అసమ్మానముతో కూడియున్నచో కాలక్రమమున ఎట్లు విచరింతురో?" వారి

మపదేశ మిచ్చుటకై మరల బుద్ధుడు "భిక్షువులారా, పూర్వకాలమందు తిరశ్చీనజంతువులుకూడ మంచిరీతిని ప్రవర్తించుచుండెడివి. తమలో పెద్ద యగుదానిని గమనించి ప్రణామము చేసెడివి. అవి మంచివిధానములో పరీక్ష చేసి తమలో పెద్దను తెలిసికొనెడివి. ప్రణామాదులు చేయుచు తుదకవి దేవలోకమునకు బోయినవి" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము హిమవత్పార్శ్వమున మహాన్యగ్రోధ వృక్షసమీపమున ముగ్గురు మిత్రులు — తిత్తిరి, మర్కటము, ఏనుగు — నివసించుచుండిరి. అన్యోన్య గౌరవము, వినయము కోలుపోయి యవి కలుపుగోలుతనము విడిచి విహరించుచుండగా, ఒకనాడు వాని కిట్లు తోచెను: "మన మిట్లు విహరించుట యుక్తము కాదు. మనలో జ్యేష్ఠుడయిన వానికి అభివాదనము చేయుచు ప్రవర్తింతము."

ఎవరు పెద్ద యని యాలోచించి యొకనాడు ముగ్గురు న్యగ్రోధ మూలమున గూరుచుండి "మిత్రమా, హస్తి, నీవు మొదట చూచినప్పు డీవృక్ష మెంతదో జ్ఞప్తి యున్నదా?" అని తిత్తిరి మర్కటములు హస్తి నడిగెను.

ఏనుగిట్లనెను: "నాచిన్నతనమున ఈచెట్టు చిన్న పొదవలె నుండెను. దీనిమీదుగా నడిచిపోవుచుండెడి వాడను: నేను నిలుచున్నపుడు దీని కొనకొమ్మలు నాభికి తగులుచుండెడివి. ఇది పొదవలె నున్నప్పు డెరుగుదును."

తక్కిన రెండును పూర్వమువలెనే అడుగగా మర్కట మిట్లనెను: "నేను కిశోరముగా నున్నపుడు నేలపై గూరుచుండి, మెడయెత్తి తుది కొమ్మల నున్న అగ్రాంకురములను తినుచుందును. దీని పసితనము నుండియు నెరుగుదును."

తక్కిన రెండును పూర్వమువలెనే ప్రశ్నింపగా తిత్తిరి యిట్లు చెప్పెను: "మిత్రులారా, పూర్వ మొకచోట మహావటవృక్ష ముండెడిది. నేను దానిపండ్లు తిని యచ్చట గింజలు విడిచితిని. వానివలన

ఈవృత్తము మొలిచినది. దీనిపుట్టుకకు పూర్వముకూడ ఈప్రదేశ మెరుగుదును. కావున నేను మీకంటె పెద్దవాడను."

అప్పుడు హస్తి మర్కటము లిట్లు పలికినవి: "మిత్రమా, నీవు మాకంటె పెద్దవాడవు. నేటినుండి ప్రత్యుత్థానము, అంజలి, సత్కారము చేయుదుము. నీవు మాకు వలయు నుపదేశము లిచ్చుచుండుము, మే మనుసరింతుము."

నాటినుండియు తిత్తిరి వాని కుపదేశ మిచ్చుచు, శీలములు ప్రతిష్ఠించుచు, స్వయముగా ననుష్ఠించుచుండెను. ఆముగ్గురును పంచ శీలములందు ప్రతిష్ఠితులై పరస్పర గౌరవ వినయములతో సహభాగ వృత్తులై జీవిత పర్యవసానమున దేవలోక పరాయణు లయిరి.

వృద్ధజనుల గౌరవించి ధర్మాత్ములౌ
వార లిహమునందు భూరికీర్తి
పడయుచుందు, రటులె పరమున సద్గతి
నందుచుందు రన్న నబ్బురంబె!

ఈవిధముగా బుద్ధుడు జ్యేష్ఠులను సత్కరించు కర్మను ప్రశంసించి, జాతకసారాంశమును వెలువరించెను. అప్పటి హస్తి నేటి మొగ్గలాన స్థవిరుడు. వానరము సారిపుత్రుడు. తిత్తిరి పండితుడు నేనే.

## 38 బక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండ చీవరములను చేయుభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

జేతవాసి యగుభిక్షు వొకడు వస్త్రములు కత్తిరించుటలో, రప్పు తీయుటలో కుట్టుటలో కడు నేర్పరి. అతనికి చీవరవర్ధకు డను పేరు

వచ్చెను: కాని అతడు చేయున దేమి? చినిగిన పాతవస్త్రములను నేర్పుతో సుందరచీవరములను చేసి, రంగు వేసి, గంజి పెట్టి, శంఖముతో రుద్ది ధగధగలాడు నట్లు చేయుచుండెను. చీవరములను సిద్ధము చేయ జాలనిభిక్షువు లతనివద్దకు నూతనవస్త్రములు కొనిపోయి, "మేము చీవరములను సిద్ధము చేయలేము. మాకు తయారు చేసిపెట్టుము" అనెడివారు, అతడు "ఆయుష్మంతుడా, చీవరములు సిద్ధము చేయుటకు కాలము పట్టును. నావద్ద చీవరములు సిద్ధముగా నున్నవి; ఈవస్త్రము నుంచి చీవరములు కొనిపొమ్ము" అని తెచ్చి చూపెడివాడు. వాడు దాని తళుకుబెళుకు చూచి లోపలిసంగతి గ్రహింపక, వస్త్రము గట్టిదని తలచి, చీవరము తీసికొని నూతనవస్త్ర మిచ్చి పోయెడివాడు. కొంచెము మురికి పట్టిన తరువాత వేడినీటిలో వేసి ఉదికిన పిమ్మట ఆచీవర నిజస్వరూపము బయలుపడుచుండెడిది. త్వరలో పాతసరకు కనబడెడిది. ఆభిక్షువు విచారపడెడివాడు. వచ్చెడివారిని ఈప్రకారముగా భిక్షువు మోసగించుటచే అతనిపేరు మ్రోగినది. జేతవనమున ప్రవర్తించినట్లే ఒకభిక్షువొక గ్రామములో చీవరవర్ధకుడు, లోకమును మోసగించుచుండెడివాడు. వానికి కానవచ్చిన భిక్షువులతో, "భన్తే, జేతవనమున ఒకానొక చీవరవర్ధకుడు ఈవిధముగా సంసారులను మోసగించినాడు" అని చెప్పెడివారు.

"ఆ జేతవన భిక్షువును మోసగింతును" అని ఆ భిక్షువు తలపోసి, చినిగిన వస్త్రములను బాగుచేసి రంగులో ముంచి వానిని ధరించి జేతవనమున జరిగెను. ఆ జేతవనభిక్షువు చూచి లోభ ముత్పన్న మగుటచే "భన్తే, ఈ చీవరములు మీరు తయారు చేసినవేనా?" అని అడిగెను.

"ఆయుష్మన్, అవును."

"భన్తే, ఈ చీవరము నాకీయవలెను. మీకు వేరొకటి లభింపగలదు."

"ఆయుష్మన్, మేము గ్రామవాసులము. మాకు చీవరములు మొదలగునవి సులువుగా లభింపవు. ఈ చీవరము నీ కిచ్చి, నేనేమి ధరింతును?"

భన్తే, నాకడ నూతనవస్త్ర మున్నది. దానిని గొనిపోయి చీవర

ముగా తయారు చేసికొనుడు."

"ఆయుష్మన్, దీనిలో నాచేతి పరిశ్రమ కలదు. అయినను, నీ విట్లు పలికినపిదప నే నేమి చేయఁగలను! తీసికొమ్ము," అని యతడు పాత వస్త్ర మిచ్చి నూతనవస్త్రమును దీసికొని చనెను. జేతవనవాసి యగు భిక్షు వాచీవరమును ధరించి, కొలది దినముల కావల వేడినీట ఉదుకగా దాని నిజస్వరూపము బయలుపడెను. గ్రామవాసి యగు చీవర నిర్మాత జేతవనవాసి యగు భిక్షువును మోసగించె నని యతడు సిగ్గు పడెను. ఆ మోసము భిక్షుసంఘమునకు దెలిసెను.

ఒకనాడు ధర్మసభలో భిక్షువు లావిషయమును గూర్చి ముచ్చటించు చుండిరి. బుద్ధు డరుదెంచి, భిక్షువులారా, ఇక్కడ గూరుచుండి ఏమి మాటాడుచున్నారు?" అని యడిగెను. వా రావిషయము చెప్పిరి.

"భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, ఆ భిక్షువు పూర్వము కూడా ఇంతే" అని పూర్వజన్మకథ చెప్పినాడు.

## అతీత కథ

పూర్వకాల మొకవనములో పద్మసరోవర తీరమున వృక్షముపై వృక్ష దేవతగా బోధిసత్త్వుడు జన్మించెను. ఆకాలమున ఒకానొక చిన్న సరస్సులో గ్రీష్మఋతువు వలన నీరు చాల తగ్గిపోయెను. అందు చేప లెన్నో కలవు. ఒకకొంగ వానిని జూచి, ఏదోయుపాయమున వీనిని మ్రింగెదను అని యోచించి నీటివద్దకు బోయి ఆలోచనలో నిలిచెను. చేపలు కొంగను జూచి "ఆర్యా, ఏమో యోచించుచు నిలుచు న్నారు" అన్నవి. "మిమ్ము గూర్చియే చింతించుచున్నాను" అని కొంగ పలికెను. "ఆర్యా, మాకొరకు చింతయేమి?" "ఈసరస్సులో నీరు చాల తగ్గిపోయినది. నిదాఘము తీవ్రముగా నున్నది. ఇప్పుడు మిమ్ము ఏమి చేయుదును? అని మీవిషయమే చింతించుచున్నాను." "మే మేమి చేయుదుము ఆర్యా!" "నామాట విన్నచో ఒక్కొక్క రిని ముక్కున గరచుకొని మి మ్మందరను క్రమముగా పంచవర్ణ పద్మ సంయుత మగు మహాసరోవరమునకు గొనిపోయి నీటిలో విడుచుదును." "ఆర్యా, ప్రథమ కల్పమునుండి నేటివరకును చేపల మేలుకోరెడి బకము లేదు. ఒక్కొక్కరి చొప్పున మమ్మందరను నీవు మ్రింగ

గోరుచున్నావు.'' "మీకు నామాటపై లక్ష్య మున్నపక్షమున నిమ్ము నమ్మింగను. సరోవర మున్నదో లేదో యను సంశయ మొదవినచో ఒకచేపను నావెంట బంపుడు. అది సరస్సు చూచివచ్చును.'' దానిపై నమ్మకము కుదిరి చేపలు ఒక కాణీ మహామత్స్యమును జూపి "దీనికి నీటిలోను నేలమీదను శక్తికలదు. దీనినికొనిపొమ్ము'' అని కొంగతో చెప్పెను. సరోవరమును పరికించి చూపి, కొంగ దానిని గొనివచ్చి చేపలకడ విడిచెను. సరోవరసంపత్తిని ఆమత్స్యము తక్కినవానికి వర్ణించి చెప్పెను. ఆకథ విని చేప లచ్చటికి బోవ కోరికకలవై కొంగతో "ఆర్యా, మంచిది. మమ్ములను ముక్కున బట్టుకొని తీసి కొనిపొమ్ము'' అని పలికెను. బకము కాణీ మహామత్స్యమునే ప్రథమ మున గొనిపోయి సరస్తీరముచేరి, నీరుచూపి అచటనున్న వరుణ వృక్షముపై నుంచి, ముక్కుతో బొడిచి, చంపి, తిని, కంటకములు చెట్టుమొదట బడవైచి, మరల వెనుకటి తావునకు బోయి, "ఆచేపను నీటిలో విడిచినాను. మిగిలిన చేపలు వచ్చుగాక'' అని పలికెను. ఈ ప్రకారముగా ఒక్కొక్క చేపచొప్పున అన్నిటిని క్రమేణ భక్షింపగా ఒక్క కర్కటకము మాత్రము మిగిలియుండెను. బకము దానినిగూడ భక్షింపగోరి "కర్కటకమా, చేప లన్నిటిని గొనిపోయి పంచవర్ణ పద్మసంయుత మగు మహాసరస్సున విడిచినాను. రమ్ము, నిన్నుగూడ తీసికొని పోవుదును'' అని చెప్పెను. "ఎట్లు నన్ను పట్టుకొని పోవు దువు?'' "ముక్కున గరచుకొని పోవుదును.'' "నీవిట్లు పట్టుకొని పోవుచు నన్ను జారవిడుతువు. నీవెంట రాను.'' "భయపడకు. నిన్ను గట్టిగా బట్టుకొని పోవుదును.''

"ఈ బకము చేపలను గొనిపోయి సరస్సున విడచుట వట్టిది! నన్ను సరస్సులో విడిచిన మేలే, విడువని పక్షమున దీనిగొంతు పట్టుకొని కొరికి, ప్రాణములు తీయుదును.'' అని తలపోసి కర్కటకము "మిత్రమా, బకమా, నీవు నన్ను గట్టిగా బట్టుకొనలేవు. నేను నిన్ను గట్టిగా పట్టు కొనగలను. గిట్టలతో నీగొంతు పట్టుకొననిత్తువేని నీవెంట వత్తును'' అని చెప్పెను. తనను అది వంచించు నని తలపక బకము మంచిదని సమ్మతించెను. కర్కటకము తన గిట్టలతో బకముగొంతు కర్మకారుని పట్టుకారవలె గట్టిగా పట్టుకొని "యిక పొమ్ము'' అనెను. బకము

దానిని దీసికొనిపోయి సరస్సు చూపి, వరుణ వృక్షాభిముఖముగా చనుచుండెను. "మామా, సరస్సు ఇటు కలదు. నీవు నన్నిటు కొనిపోవుచున్నావు" అని యెండ్రి పలుకగా, "నీవు మంచి మేనల్లుడవు, ప్రియ సోదరీ పుత్రుడవు! నామీద నెక్కి నన్ను దాసునిగా నెంచుచున్నావు. వరుణ వృక్షముక్రింద కంటకరాశిని జూడుము. చేపల నెట్లు భక్షించితినో, నిన్నుగూడ అట్లే భక్షింతును" అని చెప్పెను.

ఎండ్రి తనలో "బుద్ధిమాంద్య మున్న చేపలను భక్షింప గలిగితివి. నన్ను భక్షింప జాలవు. నిన్ను సంహరింతును. బుద్ధిహీనతచే నా మోసము నీవు గ్రహింపలేదు. మరణింపవలసినచో నుభయులము సమముగా మరణింతము. నీగొంతు కొరికి నేలపై బడుదును" అని అలోచన చేసి, పట్టుకారవంటి గిట్టలతో కొంగగొంతు గట్టిగా నొక్కెను. బిగిసిన కంఠముతో, కన్నుల నీరు కారుచుండగా కొంగ మరణభయము చెంది "స్వామీ, నిన్ను భక్షింపను. నాకు ప్రాణభిక్ష పెట్టుము" అని యాచించెను. "క్రిందికి వాలి నీవు నన్ను సరసులో విడుచు పక్షమున" అని యెండ్రి పలుకగా బకము వెనుకకు మరలి సరస్సులో పంకపృష్ఠమున నిలిచెను. కత్తెరతో కుముదనాళమును కత్తిరించినట్లు కర్కటము దానిగొంతు కొరికి ఉదకములో ప్రవేశించెను.

ఆ వింత చూచుచు వరుణ వృక్షము నధివేశించి యున్న వృక్షదేవత సాధుకారముచేసి, వనము మార్మ్రోగునట్లు మధురస్వరమున ఈ గాథ పాడెను:

> ధూర్తబుద్ధి తనదు ధూర్తత చేతనే
> అన్ని వేళలందు నందడు సుఖ;
> మెండ్రకాయవలన నేమి లభించెనో
> కొంగ, కల్లె శఠుడుకూడ పొందు.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. ఆకాలపు కొంగ నేటి జేతవన చీవరభిక్షువు; ఎండ్రి నేటి గ్రామవాసి చీవరకుడు; వృక్షదేవత నేనే.

## 39 నంద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు సారిపుత్ర స్థవిరుని శిష్యునివిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆభిక్షువు సుభాషి; మిక్కిలి ఉత్సాహముతో స్థవిరుని సేవ చేయు వాడు. ఒకప్పుడు సారిపుత్రస్థవిరుడు బుద్ధుని యానతి గొని, పర్యట నము చేయుచు, దక్షిణాగిరి జనపదము చేరెను. ఆ భిక్షు వచ్చుటికి జేరినతోడనే అభిమానగ్రస్తుడయ్యెను. ఆయుష్మన్, ఇది చేయుము. అని స్థవిరుడు చెప్పినప్పుడు అతడు వైరము వహించెడివాడు. స్థవిరున కతనియాశయము తెలియలేదు. అత డచట పర్యటనము చేసి, జేత వనమునకు మరలివచ్చెను. స్థవిరుడు జేతవన విహారము చేసినప్పటి నుండి ఆభిక్షువు పూర్వమువలె నుండెను. స్థవిరుడు శాస్తతో "భన్తే, నాశిష్యు డొకడు ఒకచోట నున్నప్పుడు శతముద్రలకు కొనిన బానిసవలె నుండెడివాడు, వేరొకచోటికి జేరినప్పుడు ఇదిచేయుము అని నే ననగా అభిమానపూరితుడై వైరభావముతో నుండెడివాడు." అని నివేదించెను. "సారిపుత్రా, ఈ భిక్షువునకు ఇట్టిస్వభావ మిప్పుడే కాదు, పూర్వముకూడ నింతే" అని శాస్త స్థవిరుని ప్రార్థనమీద పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డొకానొక కుటుంబికులమున బుట్టెను. ఆయన మిత్రమైన మఱియొక కుటుంబి వృద్ధుడు. ఆయన భార్యమాత్రము తరుణి. ఆమె యందు పుత్రుడు కలిగినాడు. ఆ వృద్ధుడు తనలో "ఈమె తరుణి. నేను మరణించిన పిదప ఏపురుషునైన చేపట్టి, ధనము నాకుమారు నకు దక్కనీయక పాడుచేయునేమో! ఈ ధనమును భూస్థాపన చేయుదును" అనుకొని, గృహదాసుడు నందు డను వానిని వెంట బెట్టుకొని అరణ్యమునకు జని, ఒకచోట ధనమును నిక్షేపించి, వానితో "నాయనా, నందా, నేను పోయినతరువాత ఈ ధనమును

వా కుమారునికి జూపుము, వనభూమిని విక్రయింపనీయ వలదు'' అని చెప్పెను.

ఆవల వృద్ధుడు చనిపోయినాడు. కుమారుడు పెరిగి పెద్దవా డయి నాడు. తల్లి వానితో ''నాయనా, నీతండ్రి ధనము నిక్షేపించినాడు. నందునకు తెలియును. దానిని తెప్పించి, కుటుంబస్వాత్వమును సరి చూడుము'' అని చెప్పెను. ఒకనాడు కుమారుడు నందునితో ''మామా, నాకోసము మానాయన నిక్షేపించిన ధన మున్నదికదా?'' అనెను. ''ఉన్నది స్వామీ.'' ''ఎక్కడ పాతిపెట్టినారు?'' ''అడవిలో స్వామీ.'' ''మంచిది. అక్కడకే పోవుదము'' అని కుమారుడు పలుగు, తట్ట, తీసికొని నందుని వెంట బెట్టుకొని చని, ''మామా, నిధి యెక్కడ?'' అని యడిగెను. నందుడు ధనమున్న దిబ్బమీద కెక్కి, మదోన్మత్తు డయి ''అరే దాసీపుత్రా, ఈచోట నీధన మేదిరా!'' అని కుమారుని తూలనాడెను. వాని పరుషవాక్కులు వినియు విన నట్లే నటించి, అట్లయిన పోవుదము అని వానిని వెంట బెట్టుకొని యింటికి బోయెను. రెండు మూడు రోజుల తరువాత వారు మరల నిధి కడకు జనిరి. నందుడు వెనుకటి వలెనే పలికెను. కుమారుడు బదులు పలుకక యింటికి బోయి తనలో ''బయలు దేరునపుడు నందుడు ధనము చూప నెంచును. అక్కడికి చేరగానే పరుసము లాడును. కారణము తెలియకున్నది. నాతండ్రికి మిత్రము కుటుంబి ఉన్నాడుగదా. ఆయన నడిగినచో తెలియవచ్చును'' అని చింతించి, బోధిసత్త్వుని సన్నిధికి బోయి అంతయును నివేదించి ''బాబయ్యా, దీనికి కారణ మేమి కానోపు?'' నని యడిగెను.

''ఏచోట నందుడు నిలుచుండి నిన్ను తూలనాడుచున్నాడో ఆ చోటనే నీతండ్రి నిధియున్నది. ఈసారి నిన్ను వాడు దూషింప దొడగి నపుడు, ఏమిరా దాసా, కూయుచున్నావు! అని నీవు గద్దించి వానిని నెట్టి, కుద్దాలముతో త్రవ్వి, ధనమును పైకితీసి, వానిచే మోయింపుము'' అని బోధిసత్త్వు డీ గాథ పలికెను.

నీచ దాసీ కుమారుడు నిలిచి యెచట
నందకుడు మెండుగా వాగు, నంద కలవు
నగల ప్రోవు, మాలిక లని నాతలంపు.

కుమారుడు బోధిసత్త్వునకు నమస్కరించి, ఇంటికి పోయి, వండుని వెంట బెట్టుకొని నిధికడ కరిగి, ఆయన చెప్పినట్లు చేసి, ధనమును గొనివచ్చి, కుటుంబపోషణము చేసెను. బోధిసత్త్వుని యుపదేశాను సారముగా కుమారుడు దానాది పుణ్యకార్యములు చేయుచు జీవితాంతమున యథా కర్మం గతో.

పూర్వముకూడ ఈ భిక్షువుస్వభావ మిట్టిదే అని బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాతక సారాంశము వెలువరించెను. ఆకాలమున వండుడు ఇప్పటి సారిపుత్ర శిష్యుడు. పండితకుటుంబి నేనే.

## 40 ఖదిరంగార జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు అనాథపిండికుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

కేవలము విహారము నిర్మించుటకే అనాథపిండికుడు ఏబదినాలుగు కోట్లధనము వ్యయము చేసెను. ఆయన త్రిరత్నములనే (బుద్ధ ధర్మ సంఘములనే) రత్నములుగా మన్నించి, తక్కిన రత్నములను లెక్క చేయలేదు. శాస్త జేతవనమున విహరించుకాలమున ఆయన ప్రతి దినము మూడుసారులు బుద్ధదర్శనార్థము పోయెడివాడు. ప్రాతఃకాలమున మొదటిసారి, భోజనానంతరము రెండవసారి, సాయంకాలము మూడవసారి విహారమునకు వెడలుచుండువాడు. ఇంతే కాక, నడుమ నడుమకూడ పోవువాడు. బ్రహ్మచారులు కాని, ఇతర బాలురు కాని నే నేమి తెచ్చితినో యని నాచేతులకేసి చూచుచుందు రని ఆయన తలపోసి, ఎన్నడును రిక్తహస్తములతో పోయెడివాడు కాడు. ఉదయము యవాగువును, భోజనసమయమునకు వెన్న, తేనె, గుడము మొద లగునవియు, సాయంసమయమున గంధము, మాల్యములు,

వస్త్రాదులును పట్టించుకొనిపోవును. ఈవిధముగా దానధర్మములు ఎంత చేయుచుండునో ఆయనకు తెలియదు. చాలమంది వ్యాపారులు పత్రములు వ్రాసి, పదునెనిమిది కోట్లధనము అప్పుతీసికొనిరి. ఆమహాశ్రేష్ఠి వారలను అప్పు తీర్చుడని అడిగెడివాడు కాడు. మొత్తము పదునెనిమిది కోట్ల ధనము నదీతీరమున పాతరలో నుండెను. వాయువువలన, జలమువలన నదీకూలము విరిగి పడిపోవుటచే ఆధనము సముద్రమునకు కొట్టుకొనిపోయినది. మూతలు బిగిసినకొన్ని యినుపబిందెలు మాత్ర మెట్లో సముద్రముమీాద తేలియాడుచుండెను. శ్రేష్ఠియింట అను దినము అయిదువందల భిక్షువులకు భోజనముల యేర్పాటు కలదు. శ్రేష్ఠిభవనము భిక్షువులకు శృంగాటకమున త్రవ్వినపుష్కరిణి వలె నుండెను. వారికి శ్రేష్ఠియే మాతాపితలతో తుల్యముగా నుండెను. ఆయనయింటికి సమ్యక్-సంబుద్ధుడు, అశీతిమహాస్థవిరులు, పోవుచుందురు. మిగిలిన భిక్షువులసంఖ్య అగణ్యము. ఆసౌధమునకు ఏడంతస్తులు, ఏడుద్వారములును కలవు, నాలుగవద్వారమున నుండు దేవి సద్ధర్మమును విశ్వసించునది కాదు. సమ్యక్-సంబుద్ధుడు సౌధము లోనికి వచ్చునప్పటికి ఆమె తనయంతస్తులో నుండలేక బిడ్డలతో క్రిందికి దిగివచ్చి నేలపై నిలుచుండెడిది. అశీతిమహాస్థవిరులు కాని, అన్యస్థవిరులు కాని వచ్చినప్పుడు కూడ ఆమె నేలమీాద నిలుచుండెడిది. వారు వచ్చునప్పుడు పోవునప్పుడును ఆమె అటులే చేయుచుండెను. శ్రమణగౌతముడు కాని, ఆయన శ్రావకులు కాని ఈయింటికి రాకపోకలు చేయుచున్నంతవరకు నాకు సుఖము లేదు. ప్రతిదినము పైనుండి దిగి నేలమీాద నిలుచుండలేను. ఈసౌధమునకు మీా రెవ్వరును రాకుండునట్లు నేను కట్టుదిట్టము చేయవలెను" అని యామె యోజించి, ఒకనాడు మహాకర్మచారికడకు బోయి నిలిచెను. ఎవరు? అని అత డడుగగా "నేను నాలుగవద్వారమున (హవేలీలో) నుండు దేవిని" అని యామె చెప్పెను.

"ఏమిపనిమీాద వచ్చినారు?"

"నీవు శ్రేష్ఠి చేయుపనులు చూచుట లేదా? ఆయన భావికాలము మీాద దృష్టి నిలుపక కేవలము శ్రమణగౌతముని పూజలు చేయుచున్నాడు. ధనము వ్యాపారమున కుపయోగించుట లేదు; సేద్యమున

నుపయోగించుట లేదు. ఆయన నిజకార్యములమీద మనసు నిలుపు నట్లును, శ్రావకులతో శ్రమణగౌతము డీయింట ప్రవేశింప కుండు నట్లును నీ వాయనకు సలహా ఈయవలెను.”

మహాకర్మచారి ఆమెతో “వెర్రితల్లీ, కళ్యాణకరమైనబుద్ధశాసన ముకై శ్రేష్ఠి ధనము ఖర్చు పెట్టుచున్నాడు. ఆయన నాజుట్టు పట్టు కొని తన్నినను నే నేమియు చెప్పలేను. నీవు పొమ్ము” అనెను.

ఒకనా డామె శ్రేష్ఠికుమారుని వద్దకు పోయి ఇట్లే పలికెను. అతడు పూర్వోక్తప్రకారముగా పలికెను. శ్రేష్ఠితో ఆమె యేమియు చెప్ప జాల కుండెను.

శ్రేష్ఠి నిరంతరము దానధర్మములు చేయుచు వ్యాపారము చేయ కుండుటచే ఆదాయము లేక ధనములో తరుగుకూడ ఏర్పడెను. ఇట్లు జరుగుచుంకుటచే శ్రేష్ఠికి భోజనభాజనాదులు పూర్వమువలె లభించుట లేదు. అప్పటికిని ఆయన భిక్షుసంఘమునకు దానధర్మములు చేయు చుండెను. కాని వండినయాహార మీయజాలకుండెను. శ్రేష్ఠి యొక నాడు వందనము చేసి కూరుచున్నపిదప శాస్త “గృహపతీ, మీయింట దానధర్మములు నడచుచున్నవా?” అనెను.

“చిత్తము, భక్తే, కాని నూకలు, మజ్జిగ మాత్రము ఇచ్చు చున్నాను.”

“గృహపతీ, నేను రుచిపచి లేనివస్తువు లిచ్చుచున్నా నని సంకో చింపవద్దు. ప్రసన్నచిత్తముతో బుద్ధులకు ప్రత్యేకబుద్ధులకు బుద్ధ శ్రావకులకు నిచ్చుదానములు శుష్కములు కావు, విశేషఫలప్రదము లగును. చిత్తము పవిత్రముగా నుంచుకొన్నవారి దానములు శుష్క ములు కానేరవు. ఇట్లు గ్రహింపవలెను” అని బుద్ధుడు ఈవిషయములు తెలిపెను.

చిత్తము ప్రసన్న మైన, దక్షిణలు కావు
స్వల్పముల్, తథాగతునకు శ్రావకులకు.
భక్తితో బుద్ధసేవ అల్పంబు కాదు:
మాపపింక దానఫలము మాడ్కి పెచ్చు.

“గృహపతీ, నీవు ‘శుష్క’ దానమున అష్ట-ఆర్య పుద్గలములు నిచ్చినావు. కాని వేలామ (బ్రాహ్మణ)జన్మ మెత్తినప్పుడు సమస్త జంబూ

ద్వీపమందలి హాలముల నాపి, సప్తరత్నముల నిచ్చుచు, పంచమహా నదులను ఏకప్రవాహముగా జేసినట్లు (చిత్తమును ప్రసన్నతా పూర్ణము చేసికొని) మహాదానము లిచ్చునపుడు త్రిశరణగతుడు కాని, పంచశీలరక్షకుడు (సదాచారుడు) కాని లభింపలేదు. ఇట్లు దానాధి కారి పుద్గలుడు దుర్లభుడయ్యెను. కావున నీవు శుష్కదానము చేయు చున్నట్లు సంకోచింపకుము" అని చెప్పి వేలామ సూత్రము పలికెను.

ఆ దేవి తొలుత శ్రేష్ఠితో మాటాడలేక పోయినను, ఇప్పుడు శ్రేష్ఠి అధోగతిలో నుండుటచే బహుశః తనమాట వినవచ్చు ననుకొని, అర్ధరాత్రమున ఆయనశయనాగారమున ప్రవేశించెను.

శ్రేష్ఠి "ఎవరు?" అనెను.

"నేను నాలుగవహావేలీలో నుండు దేవిని."

"ఏల వచ్చితివి?"

"నీకు మంచిసలహా యిచ్చుకోరికతో."

"మంచిది, చెప్పుము."

"మహాశ్రేష్ఠీ, నీవు భవిష్యత్తును గూర్చి చింతించుటలేదు. బాల బాలికలవైపు దృష్టి లేదు. శ్రమణగౌతముని శాసనార్థము విశేష ధనము వ్యయము చేసితివి. బహుకాలమునుండి ధనము వ్యయమగుట వల్లను, నూతనముగా సేద్యము మొదలగునవి చేయింపకుండుట చేతను, శ్రమణగౌతమునివలనను నిర్ధనుడవైతివి. ఇట్లయ్యును, శ్రమణగౌతముని విడవకున్నావు. శ్రమణులు నేటికిని నీయింటికి వచ్చు చున్నారు. ఇదివరలో ఆయన తీసుకొన్నది తిరుగ పంపనక్కర లేదు; ఉంచికొనవచ్చును. కాని నేటినుండి నీవు శ్రమణగౌతముని కడకు బోవుట, ఆయనశ్రావకుల నీయింటికి రానిచ్చుట కట్టిపెట్టవలెను: పోవు నపుడుకూడ ఆయనను చూచుట మాని, నిజవ్యాపారము చేసికొనుచు కుటుంబమును పోషింపుము."

"నీవు నాకు చెప్పగోరిన మంచిసలహా ఇదియేనా?"

"అవును — ఇదే."

నీవంటి వందల వేల లక్షల దేవతలవల్ల ఏమాత్రము చలింపను. దశబలధారివిషయమున నాకు కలశ్రద్ధ సుమేరుపర్వతమువలె అచలము, అప్రతిహతము! కళ్యాణకారక మగు త్రిరత్న శాసనముకై ధనవ్యయము

చేయుట అనుచిత మంటివి. నీవు బుద్ధశాసనమును నిందించినావు. ఇట్టి దురాచారిణితో, దుశ్శీలతో, అశుభదాయినితో ఒకేయింట నివసింపలేను. పద, నాయింటినుండి; శీఘ్రముగా వేరొకచోటికి వెడలిపొమ్ము."

శ్రోతాపన్నుడు, ఆర్యశ్రావకుడు నగు అనాథపిండికుని మాటలు విని, ఉండుటకు వీలు లేక, ఆమె నిజనివాసస్థానమునకు బోయి, బిడ్డలను చేత బట్టుకొని, అక్కడనుండి బయలుదేరినది. అన్యనివాసస్థానము దొరకనందున శ్రేష్ఠికి క్షమాపణ చెప్పి ప్రార్థించి ఇంటనే యుందు నని యోచించి, నగరరక్షకు డగు దేవపుత్రునివద్దకు బోయి అతనికి నమస్కారము చేసి నిలిచెను.

"ఏల వచ్చితిరి?" అని ఆయన అడిగినపిదప ఆమె "స్వామీ, నేను ఆలోచింపకుండ శ్రేష్ఠిగారితో కొన్నిమాట లాడితిని. కోపించి ఆయన నివాసస్థానమునుండి వెడలగొట్టినారు. నన్ను మీరు శ్రేష్ఠి సన్నిధికి దీసికొనిపోయి, క్షమార్పణ చేయించి, నాకు నివాసస్థానమిప్పింపుడు" అని చెప్పెను.

"మీరు శ్రేష్ఠితో ఏ మన్నారు?"

"స్వామీ, శ్రేష్ఠితో బుద్ధసేవ, సంఘసేవ వల దని శ్రమణగౌతముని ఇంటికి రానీయవల దని అన్నాను."

"అనుచితము చేసినావు. బుద్ధశాసనమును నిందించినావు. నిన్ను శ్రేష్ఠికడకు దీసికొనిపోవు ధైర్యము నాకు చాలదు."

అక్కడ నేమియు తోడ్పాటు లభింపక పోవుటచే ఆమె నలుగురు మహారాజులసన్నిధికి బోయెను. అక్కడకూడ అంగీకారము దొరకక, శక్ర-దేవేంద్రునికడ కేగి చాలనమ్రతతో నిట్లు ప్రార్థించెను: "దేవా, నివాసస్థానము దొరకక బిడ్డలను చేత బట్టుకొని దిక్కు లేక తిరుగుచున్నాను. దేవర అనుగ్రహించి నాకు నివాసస్థానము నిప్పింపుడు."

"నీవు బుద్ధశాసనమును నిందించుట చాల అనుచితము. నీపక్షమున నేను శ్రేష్ఠితో నేమియు చెప్పజాలను. కాని, శ్రేష్ఠి క్షమించు నుపాయము మాత్రము తెలుపుదును."

"చిత్తము, దేవా! తెలుపుడు."

"లోకులు ఋణపత్రములు వ్రాసి, శ్రేష్ఠికడనుండి పదునెనిమిది కోట్లు ధనము తీసికొన్నారు. నీవు శ్రేష్ఠి లెక్కలగుమాస్తా వేషము

ధరించి, ఎవరికిని తెలుపకుండ, ఆకాగితములు పట్టుకొని కొలదిమంది యక్షయువకులను వెంటబెట్టుకొని ఒకచేత కాగితములు ఒకచేత కలము పట్టుకొని వారలయిండ్లకు బొమ్ము. పోయి యింటిలో నిలువబడి యక్షబలముతో వారిని బెదరించి, "ఇది మీ ఋణపత్రము. మా శ్రేష్ఠి ఐశ్వర్యయుక్తుడై యున్నప్పుడు మి మ్మడుగలేదు, ఇప్పుడాయనధనము తరిగిపోయినది. మీరు తీసికొన్న కార్షాపణములు ఇచ్చివేయుడు" అని మీశక్తిసామర్థ్యములుచూపి, ఆపదునెనిమిదికోట్ల సువర్ణము వసూలుచేసి, ఖాళీగా ఉన్న శ్రేష్ఠి కొట్లలో నింపుము. అచిరవతీ నదీతీరమున పాతిపెట్టినధనము నదీకూలము విరిగిపడుటచే సముద్రమునకు కొట్టుకొనిపోయినది. దానిని నిజసామర్థ్యముచే తెచ్చి ఖాళీకొట్లలో నింపుము: మరి ఫలానిచోట దిక్కులేకున్న పదునెనిమిది కోట్లధనముకూడ తెచ్చి కొట్లలో నింపవలెను. ఈయేబదినాలుగుకోట్లు కొట్లలోనింపి, దండకర్మ చేసి శ్రేష్ఠిని క్షమాపణ అడగవలెను."

"దేవా! చిత్తమని యామె శక్రునిమాట కంగీకరించి, తదనుసారముగా ధన మంతయు సంగ్రహించి, అర్ధరాత్రమున శ్రేష్ఠిశయనాగారమున ప్రవేశించెను.

ఎవరని శ్రేష్ఠి యడుగగా నామె "శ్రేష్ఠీ, నేను నీనాలుగవ హావేలీలో నుండు వెర్రిదేవిని. నేను మహామౌఢ్యముచే బుద్ధగుణములు గ్రహింపనేరక వెనుకటిరోజులలో మీతో ఏమో అంటిని. నాదోషమును క్షమింపుడు. శక్రదేవేంద్రుని మాటచొప్పున మీకు రావలసినఋణములు పదునెనిమిదికోట్లు, నదీతీరమునుండి కొట్టుకొనిపోయిన పదునెనిమిదికోట్లు, ఒకచోట దిక్కులేకున్న పదునెనిమిది కోట్లు, మొత్తము ఏబదినాలుగుకోట్లు వసూలు చేసిఖాళీకొట్లలో నింపినాను. దీనివలన ప్రాయశ్చిత్తము చేసుకొన్నాను. జేతవనవిహార నిర్మాణమునకు వ్యయ మయినధన మంతయును ఏకత్రచేర్చినాను. నివాసస్థానము దొరకకపోవుటచే కష్టముగా నున్నది. శ్రేష్ఠీ, నేను అజ్ఞానవశమున చేసినదోషమును క్షమింతురుగాక!" అని పలికెను.

అనాథపిండికు డామెవాక్కులు విని తనలో "ఈమె శిక్ష ననుభవించినా నన్నది. నిజదోషము నంగీకరించుచున్నది. కావున ఈమెను సమ్యక్-సంబుద్ధునికడకు తీసుకొనిపోవలెను. ఈమెయభిమతమునుబట్టి

తథాగతుడు నిజగుణములను తెలియపరచును" అనుకొని, "అమ్మా, దేవి, నీవు నన్ను క్షమాపణకోరినచో శాస్తసముఖములో కోర వలెను" అని చెప్పెను.

"సరే, అట్లే చేసెదను. నన్ను శాస్త సన్నిధికి గొనిపోవలెను" అని ఆమె పలుకగా శ్రేష్ఠి సరే అని ప్రాతఃకాలముననే ఆమెను శాస్త కడకు గొనిపోయి, ఆమె చేసిన దంతయు తెలిపెను.

"గృహపతీ, పాపకర్మ చేయువారి పాపము పండనంతవరకును వారు సుఖము నొందుచుందురు. పరిపక్వమైనంతనే దుఃఖ మనుభ వింతురు. పుణ్యకర్మలు చేయువారు శ్రమ లనుభవించుచు పుణ్యము పరిపాకము నొందినంతనే సౌఖ్యమే అనుభవింతురు" అని శాస్త ధమ్మపదములోని రెండుగాథలు పలికినపిమ్మట దేవి శ్రోతాప త్తిఫల మున ప్రతిష్ఠితురా లయ్యెను. చక్రాంకితము లైన శాస్తచరణములపై వ్రాలి యామె భన్తే, నేను రాగభూయిష్ఠనై దోషదూషితనై మోహ విమూఢనై అవిద్యచే అంధీభూతనై తమగుణగణమును గ్రహింప కుండుటచే అపశబ్దములు ప్రయోగించితిని. శ్రేష్ఠి నన్ను క్షమించు గాక!" అని శాస్తను క్షమాపణ వేడి శ్రేష్ఠినిగూడ క్షమాపణ వేడెను.

ఆసమయమున అనాథపిండికుడు తననుగూర్చి శాస్తతో ఇట్లు చెప్పుకొనెను: "భన్తే, ఈ దేవి బుద్ధసేవాదులు చేయవద్దు అని నిషే ధించినప్పటికిని నన్ను నివారింపలేకపోయినది. దానము చేయవలదు అని నిషేధించినను నేను దానము చేయుచుంటిని. భన్తే, ఇది నాగుణము కాదా?"

శాస్త యిట్లనెను: "గృహపతీ, నీవు శ్రోతాపన్నుడవు, ఆర్య శ్రావకుడవు, అచంచలశ్రద్ధావంతుడవు, విశుద్ధదృష్టివి. ఈచిన్న శాక్య దేవి నిన్ను నిషేధించినను నీవు మానకుండుట ఆశ్చర్యకరము కాదు. పూర్వకాలమున మారుడు ఆకాశమున నిలిచి దానమిచ్చినచో నరక మున కుమిలిపోవుదు వని బెదరించి, ఎనుబదిమూరల దూరము కణకణ లాడు అంగారములవ్యాప్తి చూపినను, దాన మీయవలదు అని నిషేధించిన పిమ్మటను పండితుడు పద్మకోరకమున నిలిచి దాన మిచ్చుట ఆశ్చర్యకరము" ఇట్లు చెప్పి, అనాథపిండికుడు ప్రార్థించినపిదప శాస్త అతీతకథ చెప్పెను:

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వారాణసీ శ్రేష్ఠి వంశమున బుట్టి, రాజకుమారునివలె నానా ప్రకారసుఖములలో సంవర్ధితుడై, పదునారు సంవత్సరముల వయస్సున సర్వవిద్యలలో నిపుణు డయ్యెను. తండ్రి కాలము చేసిన పిమ్మట నొకడు శ్రేష్ఠి పదవి నొంది, నాలుగు నగరద్వారములలో నాలుగు, నగరము నడుమ నొకటి, నిజనివేశనికటమున నొకటి – మొత్త మారు దానశాలలు కట్టించినాడు. అతడు భూరిదానము లిచ్చుచు, శీలములను రక్షించుచు, ఉపవాసవ్రత మనుష్ఠించుచుండెను.

ఒకనాడు పూర్వాహ్ణమున బోధిసత్త్వునికై నానారస సంభరితమగు విశిష్టాహారమును పరిజనము గొని వచ్చుచుండగా, నొక ప్రత్యేక బుద్ధుడు – ఏడు దినముల తరువాత ధ్యానమునుండి లేచి, భిక్షాచార వేళ గమనించి 'నేడు నేను వారాణసీ శ్రేష్ఠి గేహద్వారమునకు పోవలయు' ననుకొని, నాగలతా దంతకాష్ఠముతో పలుదోమి, 'అనోతత్త' కాసార జలములతో ముఖ ప్రక్షాళనాదికముచేసి, మన శ్శిలా' తలమున నిలిచి, కాయబంధనము (పటకా) కట్టుకొని, చీవరము కట్టుకొని, కోరినంతనే వచ్చిన మృత్తికా పాత్ర చేతబట్టి, ఆకాశగమ నమున బోధిసత్త్వుని గృహద్వారముకడ నిలిచెను. అప్పు డాయన భోజనము చేయ సిద్ధముగా నుండెను.

ఆయన ప్రత్యేక బుద్ధుని జూచినంతనే పీటమీదినుండి లేచి సత్క రించి, సేవకునివంక జూచెను. "ఏమి చేయుదును స్వామీ?" అని వా డనగా, "ఆయనకు భోజన భాజనము గొనిరమ్ము" అని యజ మానుడు పలికెను.

ఆ క్షణములో మారుడు మహోద్రేకముతో లేచి, "ఈ ప్రత్యేక బుద్ధుడు భుజించి సప్తాహమయినది. నేడాహారము లభింపనిచో ఈతడు నశించును. ఇతనిని నాశము చేయుదును. శ్రేష్ఠి దానమున కంత రాయము కలిగింతును" అని తోడనే శ్రేష్ఠి గృహములో 80 మూరల పొడవున అగ్నిమండలము నిర్మించి, చండ్ర నిప్పులతో నింపి, అవీచి మహానిరయమువలె మండలము కణకణ భగభగ లాడుచుండగా, తా

నాకాశమున నిలిచెను.

భోజన భాజనముకొరకు పురుషుడు దానిని గమనించి మహాభయమున వెనుకకు మరలెను. "బాబా, వెనుకకు మరలినావేమి?" అని బోధిసత్త్వుడు పలికెను. "స్వామీ, గృహామునడుమ అగ్నికుండము భగభగ మండుచున్నది" అని వాడు చెప్పెను. అట్లే ఒకనితరువాత నింకొకడు పోయెను. తుదకందరును భీతచిత్తులై వెనుకకు పరుగిడి వచ్చిరి.

అప్పుడు బోధిసత్త్వు డిట్లు చింతించెను. "నేడు నా దానమున కంతరాయము కల్పించుటకై మారుడు ఉద్యుక్తుడు కానోపును, మారశతము, మారసహస్రము కాని నన్ను చలింపజేయలేదు. నేడు మా యిరువురలో నెవడు శక్తిమంతుడో, ప్రతాపవంతుడో తేలవలెను."

పళ్ళెరము చేతబూని, బోధిసత్త్వు డగ్నికుండము నొడ్డున నిలిచి, ఆకసము వంక జూచి, మారుని గాంచి "ఎవరు నీవు?" అని యడిగెను. "మారుడను." "ఈయగ్నికుండము నీవు నిర్మించినదా?" "అవును." "దేనికొరకు?" నీ దానమున కంతరాయము కల్పించుటకు, ప్రత్యేకబుద్ధుని ప్రాణములు తీయుటకు." "నా దానకార్యమున కంతరాయము కలుగ నీయను. ప్రత్యేక బుద్ధుని ప్రాణములు తీయ నీయను. నేడు నీబలమో, నాబలమో తేలవలెను" అని పలికి బోధిసత్త్వుడు "భదంతా, ప్రత్యేక బుద్ధా, ఈ యగ్ని కుండలములో నేను తలక్రిందులుగా పడవలసివచ్చినను వెనుకకు మరలను. మీరు మాత్రము నే నొసగు భోజనము పరిగ్రహింపుడు" అని యీ గాథ పలికెను.

నేను స్వచ్ఛందముగనె యీనిరయమందు
పడుదు తలక్రిందుగా నూర్ధ్వపాదముగను.
కాని చేయజాల ననార్యకార్య మార్యః,
స్వీకరింపుడు భిక్ష నాచేతినుండి.

ఇట్లు పలికి బోధిసత్త్వుడు భోజనపు పళ్ళెరము పట్టుకొని స్థైర్యముతో అగ్నికుండలముమీదికి నడచెను, ఆక్షణముననే 80 మూరల

లోతునుండి మహాపద్మము పైకిలేచి బుద్ధుని పాదములను స్పృశించెను. పద్మమునుండి రేణువులు లేచి మహాసత్త్వుని శిరస్సు మీదికి బోయెను. ఆయన దేహము స్వర్ణసూర్య సమాకీర్ణమైనట్లు కానవచ్చెను. బోధి సత్త్వుడు పద్మకర్ణికపై నిలిచి ప్రత్యేక బుద్ధుని పాత్రలోని కాహారము వంచెను.

ఆయన దానిని ప్రతిగ్రహించి, ఆమోదించి, పాత్ర నాకాశము లోని కెగురవైచి, మహాజనము చూచు చుండగా విహాయసమున కెగిరి, వివిధ మేఘ పంక్తులను మర్దించునట్లు నడచి, హిమవంతమున కేగెను.

మారుడు పరాజితుడై దౌర్మనస్యమున నిజ నివాసమున కేగెను. బోధిసత్త్వుడు పద్మ కర్ణికమీదనే నిలిచియుండి, మహా జనమునకు దాన శీలవర్ణమున ధర్మము బోధించి, పరివారసమేతుడై గృహము లోని కేగెను. ఆయన యావజ్జీవము దానాది పుణ్యకార్యములు చేసి, యథా కర్మంగతో.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశమును వెలువ రించెను. ఆకాలమున ప్రత్యేకబుద్ధుడు అక్కడనే పరినిర్వాణముచెందెను. మారుని జయించి పద్మకర్ణికమీద నిలిచి ప్రత్యేకబుద్ధునకు భిక్ష యిడిన వారాణసీశ్రేష్ఠినేనే.

## 41 లోసక జాతకము

శాస్త జేతవనమున విహారముచేయుచు లోసకతిస్స నామక స్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

లోసకతిస్స నామక స్థవిరుడెవడు? కోసలరాష్ట్రమున స్వకీయకుల నాశకుడు, నిష్ప్రయోజకుడు అగు మత్స్యపుత్ర భిక్షువు. అతడు తన పూర్వజన్మ స్థానమునుండి భ్రష్టుడై కోసలరాష్ట్రమున వేయిపల్లె

కారుల గడప ఉన్న గ్రామమున పల్లెకత్తెకడుపున బడెను. వాడు తల్లి కడుపున బడునాడు వేయిమంది జాలరులు చేపలు పట్టుటకు వలలతో జనిరి. వారికి నదిలో కాని, తటాకాదులలో కాని ఒక్క చిన్న చేప కూడ దొరకలేదు. నాటినుండి జాలరులపని తరిగిపోయినది. నాటినుండి గ్రామము ఏడుసారు లగ్నిదగ్ధ మయ్యెను; ఏడుసారులు గ్రామము రాజ దండనపొందెను. ఈవిధముగా ఆనాటి కానాడు దుర్గతి ప్రాప్తించు చుండగా వారు యోచించి "పూర్వ మిట్లుండెడిది కాదు. కాని యిప్పు డానాటి కానాడు తీసికట్టుగా నున్నది. మనలో నెవడో దుర దృష్టవంతు డుండును. మనము రెండువర్గములుగా చీలిపోవుదము" అని అయిదువందలు ఒకే తెగగా మిగిలిన అయిదువంద లింకొక తెగగా విడివిడిగా నుండ జొచ్చిరి. లోసకతిస్సుని తలిదండ్రు లున్న తెగకు దౌర్భాగ్యము, రెండవవర్గమునకు ఉన్నతియు నాటినుండి కలుగ సాగెను. మరలవారు ఈవర్గమును రెండుచేసి, మరల ఆవలివర్గమును రెండుచేసి, ఈప్రకారముగా చివరకు లోసకతిస్సుని కుటుంబమును వేరు పరచి జాలరులు ఆకుటుంబము అదృష్టహీన మని గ్రహించి, నెట్టి వేసిరి.

వానితల్లి చాలకష్టముతో దినములు గడుపుచుండ నెలలు నిండుటచే ఒకచోట ప్రసవించెను. అంతిమశరీరధారి యగు వ్యక్తిని కోలుపోవ వీలు లేదు. వాని హృదయమున అర్హత్వ ఉపనిశ్రయము (కారణము) ఘటములో దీపమువలె నుండెను. ఆమె బిడ్డను పెంచుచు, వాడు ఆట లాడుచు పరుగెత్తునపుడు వానిచేతికి కొబ్బరి చిప్ప ఇచ్చి "ఇంటిలో ప్రవేశింపుము" అని చెప్పి, వాడు ఒకయింటిలో ప్రవేశించినపిదప తాను పలాయనము చేసెను. వాడే కాకియై ముష్టి యెత్తుచు ఒకచోట పడియుండ సాగెను. స్నానము లేదు, శరీరము శుభ్రము చేసికొనుట లేదు; వాడు ధూళిపిశాచమువలె మహాకష్టముతో జీవనము చేయు చుండెను. ఈ విధముగా ఏడుసంవత్సరములు గడచినతరువాత ఒక ద్వారమువద్ద బియ్యము కడగగా రాలినగింజలను కాకివలె ఏరి తినుచుండెను.

శ్రావస్తిలో భిక్షాటనము చేయుసమయమున ధర్మసేనాపతి సారి పుత్రులు చూచి "ఈప్రాణిదశ చాల జాలి గొలుపుచున్నది. వీడు

ఏగ్రామమువాడో?" అనుకొని వానియెడ దయదలచి, "అబ్బాయీ, రా" అని పిలిచెను. వాడు వచ్చి ప్రణామము చేసి నిలిచినాడు. "నీవు ఏగ్రామమున నుండువాడవు? నీతల్లిదండ్రు లెచట నున్నారు?" అని సారిపుత్రుడు వాని నడిగెను.

"భన్తే, నా కేమియు లేవు. నీనివలన కష్టములు పొందుచున్నాము అని నాతలిదండ్రులు నన్ను విడిచి పలాయనము చేసినారు."

"నీవు ప్రవ్రజింతువా?"

"భన్తే, నేను ప్రవ్రజింతును. కాని దరిద్రుడను నన్ను ఎవ్వరు ప్రవ్రజింప జేయుదురు?"

"నేను చేయుదును."

"చిత్తము."

స్థవిరుడు వానికి భోజనాదులు పెట్టించి విహారమునకు గొనిపోయి, స్వహస్తములతో స్నానము చేయించి, ప్రవ్రజ్య యిచ్చి, ఏండ్లు (ఇరువది) నిండినతరువాత ఉపసంపన్నుని చేసెను. అతడు వృద్ధుడైనపిదప లోసకతిస్స స్థవిరు డని పేరు కాంచెను: అతడు అపుణ్యవంతుడు, అల్పలాభుడు నయ్యెను. అసాధారణ దానమునగూడ అతనిపొట్టనిండునట్లుగా లభించెడిది కాదు: అతని పాత్రలో ఒకముద్ద ఆహారము పడవేసినను ఆపాత్ర అంచులవరకు నిండినట్లు కానవచ్చెడిది. కావున లోకులు ఇతనిపాత్ర నిండిపోయినది అనుకొని ఇతరులకు ఆహారము పంచిపెట్టెడివారు. ఆయనపాత్రలో అహారము వేయునప్పుడు అన్నదాతలతో కూడ ఆహారము అంతర్ధానమయ్యెడి దని చెప్పుకొనెడివారు. కాలక్రమమున విదర్శనా-భావన (యోగము) వృద్ధిపొంది అర్హత్వమున అగ్రఫలమున ప్రతిష్ఠితుడు అయినను ఈఅల్పలాభము తప్పలేదు. ఈవిధముగా ఆయన ఆయుర్దాయ సంస్కారములు క్షీణించిపోవుటచే పరినిర్వాణదివసముకూడ ప్రాప్తమయ్యెను.

ధర్మసేనాపతి ధ్యానబలమున ఆయన పరినివృత్తి అగు సంగతి గ్రహించి, ఈ లోసకతిస్స స్థవిరుడు నేడు పరినిర్వాణము పొందును; కావున నేను ఈయనకు కడుపునిండ భోజనము పెట్టవలెను, అని యోచించి ఆయనను వెంటగొని భిక్షార్థము శ్రావస్తిప్రవేశించెను. ఆ స్థవిరుడు వెంట నుండుటచే శ్రావస్తిలో అనేకులు ఉన్నను చాలమంది

చేతులు జోడించి ప్రణామము చేయలేదు. ధర్మసేనాపతి స్థవిరునితో ఆయుష్మన్ నీవుపోయి ఆసనశాలలో కూరుచుండుము. అని పంపి, తనకు లభించిన ఆహారమంతయు లోసకతిస్సకునకు పెట్టబంపెను. ఆహారము కొనిపోవు వారు లోసకతిస్సకుని సంగతి మరచిపోయి అది అంతయును తామే భుజించిరి.

స్థవిరుడు లేచి విహారమునకు పోవునపుడు లోసకతిస్సకుడు పోయి ఆయనకు వందనము చేసెను. ఆయన ఆగుచు "ఆయుష్మన్, భోజనము లభించినదా?" అని అడుగగా లోసకుడు భన్తే, లభింపలేదు అని చెప్పెను. స్థవిరుడు సంవేగము పొంది కాలము కనుగొనెను. భోజన కాలము దాటిపోయినది. ఆయుష్మన్, ఇచ్చటనే కూరుచుండుము, అని స్థవిరుడు లోసకతిస్సుని ఆసనశాలలో కూరుచుండపెట్టి తాను కోసల నరేశుని సౌధమునకు పోయెను. రాజు స్థవిరుని చేతిలోనుండి పాత్ర తీసుకొని భోజనసమయము చూచి అకాల మగుట గమనించి పాత్ర నిండ చతుర్విధ మధురపదార్థములు నింపించి స్థవిరునకు పంపెను.

అయన దానిని కొనిపోయి, ఆయుష్మన్, తిస్సా, ఈనాలుగు మధుర పదార్థములను ఆరగింపుము అని పాత్ర తనచేతిలోనే ఉంచుకొని నిలుచుండెను. లోసకుడు స్థవిరునిపై గౌరవము చేతను, సిగ్గుచేతను భుజింపలేదు. స్థవిరుడు "ఆయుష్మన్, తిస్సా, రమ్ము, నేను ఈపాత్ర పట్టుకొని నిలుచుందును. నీవు కూరుచుండి భోజనముచేయుము. నేను ఈపాత్రను చేతిలోనుండి విడిచినచో ఏమియు మిగలక పోవచ్చును" అనెను. లోసకతిస్సుడు అగ్రేశ్వర ధర్మసేనాధిపతి చేతిపాత్రనుండి చతుర్విధ మధుర పదార్థములు భుజించెను. స్థవిరుని బుద్ధిబలముచే భోజనము సమాప్తి కాలేదు. ఆసమయమున లోసకతిస్సకుడు కడుపునిండుగ కావలసినదంతయు భుజించెను. ఆనాడే అతడు ఉపాధిరహిత నిర్వాణధాతువును పొందెను. సమ్యక్ సంబుద్ధుడు దగ్గర నిలుచుండి తిస్సుని శరీరమునకు దాహక్రియ చేయించి శరీరధాతువులు సేకరించి చైత్య నిర్మాణము చేయించెను.

ఆసమయమున భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై "ఆయుష్మంతులారా, లోసకతిస్సస్థవిరుడు పుణ్యహీనుడు, అల్పలాభుడు అయినను ఈ విధముగా ఆర్యధర్మము (అర్హత్వము) పొందినాడు" అనుకొనుచుండిరి.

బుద్ధుడు ధర్మసభలో ప్రవేశించి "భిక్షువులారా, కూరుచుండి ఏమో మాటాడుచున్నారు?" అనెను. వారు భన్తే, ఈవిషయము, అని చెప్పిరి. బుద్ధుడు "భిక్షువులారా, ఈభిక్షువు స్వయముగా అల్పలాభుడు అయినాడు, అర్హత్వము కూడ పొందినాడు. పూర్వజన్మములో ఇతరులకు వచ్చు లాభమునకు బాధ కలిగించుటచే ఈజన్మలో అల్పలాభుడయి అనిత్య దుఃఖ అనాత్మకు నిదర్శనాయుక్త భావన (యోగాభ్యాసం) కు ఫలస్వరూపముగా ఆర్యధర్మలబ్ధి పొందినాడు" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము కశ్యప సమ్యాసంబుద్ధునికాలమున ఒకానొక భిక్షువు ఒక కుటుంబి నాశ్రయించి గ్రామమున నివసించుచుండెను. అతడు మంచి నడవడికలిగి, యోగ్యుడై యోగాభ్యాస సక్తుడై యుండెను. ఒకానొక క్షీణాసవ స్థవిరుడు, ఒక అర్హతుడు - అందరితో సమముగా మెలగువాడు-కూడ ఆగ్రామమునకు వచ్చిరి. స్థవిరుని యాకృతికి ఆయన సంప్రీతుడై, ఆయన పాత్ర తాను పుచ్చుకొని, ఇంటికి గొని పోయి సగౌరవముగా భోజనముపెట్టి, కొంచెము ధర్మకథనము విని ధేరునికి నమస్కరించి "భన్తే, మావిహారముదాటి ఆవలకు పోవలదు. నేను సాయంకాలమువచ్చి దర్శించెదను" అని పలికెను. స్థవిరుడు విహారమునకుబోయి అక్కడ నివసించు ధేరునికి నమస్కరించి అను మతిపొంది కూరుచుండెను. నివాసిస్థవిరు డాయనను ప్రీతితో ఆమంత్రించి "ఆర్యా భిక్షాహారము లభించినదా?" అని యడిగెను. "ఆ లభించినది". "ఎచ్చట?" "సమీపగ్రామములో కుటుంబి యింట" అని శయనాసనాదిక మడిగి, గది చూపు మనెను. అంతట తన వల్కలమును పాత్రను ప్రక్కనుంచి కూర్చుండి ధ్యానమగ్నుడయ్యెను.

సాయంకాల మాకుటుంబి గంధమాల్యములను తైల దీపమును పట్టించుకొని విహారమునకుబోయి నివాసిస్థవిరునకు నమస్కరించి "భన్తే ఒకానొక స్థవిరుడు వచ్చినాడు. ఇచ్చట నున్నాడా?" అని అడిగెను. "అవును, వచ్చినాడు". "ఇప్పు డెక్కడ నున్నాడు?"

"ఆగదిలో నున్నాడు."

కుటుంబి ఆయన సన్నిధికి జని నమస్కరించి ప్రక్కనగూరుచుండి ధర్మ కథనము విని, చల్లని సాయంసమయమున చైత్యమునకు బోధి వృక్షమునకు పూజలుచేసి, దీపము వెలిగించి, ఇరువురు స్థవిరులను మరునాడు భిక్షకు బిలిచెను. నివాసిస్థవిరుడు తనలో "ఈకుటుంబికి నాపై ఆదరము తగ్గినట్లున్నది. ఈ భిక్షువు ఈ విహారమున నివసించు పక్షమున కుటుంబి నన్ను కొంచెమైన గౌరవింపడు" అని భావించి అసంతుష్టిచెంది ఉపాయ మాలోచించి "ఈవిహారములో ఈభిక్షువు నిలవకుండ చేయవలెను" అని నిశ్చయించెను. "ఉదయము అర్హంతుడు భిక్షకు వచ్చినపుడు నాతో మాటాడలేదు. తన గుణవిషయమయికాని కుటుంబివిషయమైకాని నాకు దుర్భావము లేదని ఈయనకు తెలియదు అనుకొని స్థవిరుడు తనగదిలోనికి బోయి ధ్యానసుఖమగ్నుడయ్యెను.

మరునాడు నివాసి స్థవిరుడు తొలుత జాగరూకతతో గంట మ్రోగించి తన వ్రేలితో ఆతని తలుపు తట్టి, కుటుంబిగృహమునకు వెడలిపోయెను. ఆయన భిక్షుకుని పాత్ర మందుకొని ఆసనమున గూరుచుండబెట్టి "భదంతా, ఆగంతుక స్థవిరుడు ఎచ్చట నున్నాడు?" అని అడిగెను:

"మీ మాప్రుని సమాచార మెరుగను. నేను గంటవాయించి తలుపు తట్టినను ఆయన లేవలేదు. నిన్న ఇచ్చట రుచ్యమైన భోజనముచేసి, జీర్ణముకాక నిద్రించుచుండ వచ్చును. ఇట్టిస్థానములందు ప్రసన్నులగుచుందురు" అని పలికెను. క్షీణాసవ స్థవిరుడు తన భిక్షాచార వేళకు ప్రతీక్షించుచున్నవాడై స్నానముచేసి, పట్టుచీవరము ధరించి భిక్షాపాత్రిక పట్టుకొని ఆకాశగమనమున అన్యస్థానము చేరినాడు.

కుటుంబ స్థవిరునకు సర్పి, గుడశర్కర కలిపిన పాయసము త్రావనిచ్చి, పాత్రమును సువాసనగల సున్నముతో తోమించి, ఆహారముతో నింపి, "భన్తే ఆ స్థవిరుడు మార్గాయాసము నొందియుండవచ్చును. దీనిని కొనిపొమ్ము" అనెను. సరే అని వాడు పాయసపాత్ర అందుకొని, పోవుచు తనలో "ఆ భిక్షువు దీనిని రుచిచూచినచో, మెడబట్టి వీధిలోనికి నెట్టినను విడువడు. కాని దీనినెట్లు వినియోగింతును? ఎవరి

నైన ఇత్తునేని సంగతి బయటబడును. నీటిలో విసరి వేతునేని నేయి పైకి కానబడును. నేలమీద పారబోతునేని కాకులు గుమిగూడును అని తలపోయుచుండ దగ్ధ భూభాగము గానబడెను. అగ్నితో గాలిన బొగ్గులుతీసి, అచ్చట పాయసముంచి దానిపై బొగ్గులుకప్పి విహారము నకు బోయెను. అచ్చట భిక్షువుడు లేడు. నా ఆశయముగ్రహించి అన్యత్ర చనియుండును. అయ్యో, నా పేరాసవలన అయుక్త కార్యము చేసితినే'' అని యాతడనుకొనెను.

అప్పటినుండి యతనికి మిక్కుటముగా దౌర్మనస్య ముద్భూత మయ్యెను. నాటినుండి యతడు క్షీణించి ప్రేతమువలెనయి, చని పోయి, నిరయము పొందెను. వానిపాపము పండుటచే 500 జన్మలలో వాడు వరుసగా యక్షుడై తినుటకు తిండిజాలక, ఒకనాడుమాత్రము గర్భమలము మెండుగా తినెను. అనంతరము 500 పుట్టుకలలో శునకమై ఒకనాడు కక్కినకూడు కడుపునిండ తినెను. ఎన్నడును వానికి పూర్ణాహారము లభింపలేదు. శునక జన్మానంతరము వాడు కాశీ రాష్ట్రములో కుగ్రామమున ముష్టివానియింట బుట్టెను. వాడు పుట్టి నప్పటినుండి ఆయింటివారికి మరింత దుర్గతిపట్టెను. వాని కెన్నడును కడుపునిండ గంజియైన దొరకలేదు. వానికి మిత్రవిందకుడు అని పేరు పెట్టిరి. వాని తలిదండ్రులు ఆకలిబాధపడజాలక, పో, మాడు మొగమువాడా అని నెట్టివేసిరి.

తిరిగితిరిగి వాడు వారాణసికి వచ్చినాడు. ఆకాలమున బోధి సత్త్వుడు విఖ్యాతాచార్యుడై 500 మాణవకులకు విద్య చెప్పుచుండెను. వారణాసీ నివాసు లారోజులలో బీదవిద్యార్థులకు అన్నముపెట్టి ఉచితముగా చదువు చెప్పించుచుండిరి. మిత్రవిందకుడు బోధిసత్త్వుని కడ విద్యలు నేర్చుకొనుచుండెను. వాడు పరుష స్వభావుడు, కలహ ప్రియుడు నగుటచే లోనివారలను కొట్టుచు తిరుగుచుండెను. గురువు వానికి బుద్ధిచెప్పినను వాడు వినెడివాడుకాడు. కావున వానివలన ఆదాయము మందగించెను. వాడు పోరాడుచు మాణవకులను బంధిం చుచు గురువు మందలింపు వినక ఒకనాడు పారిపోయి ప్రత్యంత గ్రామముచేరి కూలికి కుదిరి జీవించుచుండెను. వానికొక బీదదానితో సంబంధము కుదిరెను. దానివలన ఇరువురుబిడ్డలు కలిగిరి. అనంతరము

గ్రామవాసులు "సుశాసన మేదో దుశ్శాసనమేదో మాకు దెలుపు చుండు"మని మిత్రవిందమునకు భృతిఇచ్చి, నివాసార్థము గ్రామము మొగను కుటీరము నిర్మించి యిచ్చిరి. వా డచ్చట నివసించుటవలన గ్రామమునకు ఏడురెట్లు రాజదండము పడెను. ఏడుసారులు వారి గృహములు దగ్ధములయ్యెను. ఏడుసార్లు రాజభటులు తటాకము లెండబెట్టిరి. "ఈ మిత్రవిందకుడు రాకపూర్వము మనకిట్లు జరుగ లేదు. ఇతడు వచ్చినప్పటినుండియు స్థితిగతులు మరింత చెడిపోయినవి. అని గ్రామవాసు లతనిని నెట్టివేసిరి. తన బిడ్డలను దీసికొని అతడు స్థలాంతరమునకు బోవుచు యక్షగ్రస్తమైన కాననములో జేరెను. అక్కడి యక్షులతని భార్యను బిడ్డలను భక్షించిరి. అత డచటినుండి పలాయనముచేసి అటునిటు తిరుగుచు గంభీరమను పేరుగల సముద్ర తీర గ్రామము చేరెను. ఆనాడు పడవ బయలుదేరుచుండెను. అతడు నౌకలో కర్మకారుడుగా కుదిరి, అందులో నెక్కెను. ఆరురోజులు పడవ సరిగా ప్రయాణముచేసి ఏడవనాడు ఆగిపోయెను. పడవలోని వారు అదృష్టహీనుని సూచించు శలాక తీసి గురి చేసినారు. అది ఏడు పర్యాయములు మిత్రవిందకునిపైపే వచ్చెను. అంతట పడవవారు వెదురు తెప్పయిచ్చి వానిని సముద్రములోనికి నెట్టిరి. పడవ సాగినది.

మిత్రవిందకుడు వేణుకలాపక మెక్కి నీటిపై తేలిపోయెను. కశ్యప బుద్ధుని కాలమున నతడు శీలము రక్షించిన కారణమున వానికి సముద్ర మధ్యమున స్ఫటిక విమానము నలుగురు దేవపుత్రికలు లభించిరి. వారితో నతడు సప్తాహము సుఖ మనుభవించుచుండెను. విమాన ప్రేతలు ఒక పట్టున సప్తాహకాలమే సుఖ మనుభవింతురు, ఏడవనాడు దుఃఖ మనుభవింప బోవుచు తమరాక కెదురు చూచు చుండుమని ఆదేశించిరి. వారు వెడలిపోవగానే మిత్రవిందకుడు తెప్ప యెక్కి పోయి, రజత విమానమున నున్న అష్టదేవతా పుత్రికలను ప్రాపించెను. వారిని విడిచి పోవగా మణి విమానమున షోడశ దేవతా కన్యలు లభించిరి. అనంతరము కనక విమానమున ముప్పది యిద్దరు దేవకన్యలు లభించిరి. వారి మాటలు వినక అతడు యక్షనగరమున్న అంతర్ద్వీపము చేరెను. అందు యక్షిణి యొకతె అజరూపమున విహా రించుచుండును. అది యక్షిణి యని తెలియక మిత్రవిందకుడు అజి

మూంగులుద్ధుడై దాని కాలు పట్టుకొనెను. అది వాని నెత్తి త్రోసి వేయగా నతడు వారాణసిలో పరిఖోపరి భాగమున కంటక గుల్మము మీాద పడి, నేల మీాది కొంగెను.

ఆరోజులలో చోరులు పరిఖకు వచ్చి మేత మేయు రాజుగారి మేక లను తరచుగా సంహరించుచుండిరి. అజగోపకులు చోరులను పట్టుకొన వలెనని పార్శ్వమున నే దాగియుండిరి.

మిత్రవిందకుడు లేచి నిలిచి మేకలను జూచి, "నేను సముద్రమున నొక మేక కాలు పట్టుకొంటిని. అది తన్నగా వచ్చి యిచ్చట పడితిని. ఇప్పు డొక మేక కాలు పట్టుకొంటినేని అది నన్ను సముద్రమున జల దేవతా పుత్రికల సన్నిధికి నెట్టివేయును" అనుకొని అనాలోచితముగా నొక మేక కాలు పట్టుకొనెను. తోడనే యది ఆక్రందనముచేయ, అన్ని దిక్కులనుండి అజపాలకులు వచ్చి వానిని పట్టుకొని "ఇంతకాలము రాజుగారి మేకలను అపహరించి భక్షించుచున్న చోరుడు వీడే" యని అతనిని తన్ని, కట్టి, రాజుసన్నిధికి లాగుకొనిబోయిరి.

ఆసమయమున బోధిసత్త్వుడు 500 మాణవకులతో స్నానార్థము వచ్చుచు మిత్రవిందకుని జూచి, గురుతించి అజపాలకులతో "వీడు మాశిష్యుడు, వీని నేల కట్టి తీసికొని పోవుచున్నారు?" అని యడిగెను. ఆర్యా, ఈదొంగ మేకను పట్టుకొనుటవలన బంధించినాము." "మంచిది. దాసునిగా నిచ్చినచో వీడు మా సన్నిధిలో జీవించుచుండును." "చిత్తము ఆర్యా." అని వారు వానిని విడిచి పోయిరి.

మిత్రవిందకా, ఇంతకాల మెచ్చట నుంటివి?" అని బోధిసత్త్వు డడిగెను, తాను చేసినదంతయు వాడు చెప్పెను.

"మేలు కోరువారి ఉపదేశప్రకారము చేయనందున ఇట్లు సంభవించినది" అని బోధిసత్త్వు డీ గాథ పలికెను:

> మేకకాళ్ళు పట్టు మిత్రవిందకువలె
> శోకమునను కుందు జూడె, ఎవడు
> మేలు కోరునట్టి మిత్రులయుపదేశ
> మనుసరింప కన్య మాచరించు.

మరణానంతరము వా రిరువురు యథా కర్మంగతా.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆసమయమున మిత్రవిందకుడు నేటి లోసకతిస్స స్థవిరుడు; లోకప్రసిద్ధుడైన ఆచార్యుడు నేనే.

## 42 కపోత జాతకము

శాస్త జేతవనమున విహరించునపుడు లోభి యగు నొకానొక భిక్షువునుగూర్చి చెప్పినది. అతనిలోభిత్వమునకు సంబంధించినకథ నవమ నిపాతమున కాకజాతకమున కానవచ్చును. ఆసమయమున బుద్ధునితో భిక్షువులు «భన్తే, ఈభిక్షువు లోభి» అని చెప్పిరి. అంతట బుద్ధ డాభిక్షువుతో «భిక్షూ, నీవు నిజముగా లోభివా?» అనెను. «భన్తే, అవును.” «భిక్షూ, నీవు పూర్వజన్మములో కూడ లోభివే. లోభముచేతనే నీవు ప్రాణములు కోలుపోయితివి; నీవలన పండితులు తమనివాసస్థానములు కోలుపోవలసి వచ్చెను» అని బుద్ధుడు పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కపోతము కడుపున పుట్టెను. ఆదినములలో వారాణసి నివాసులు పుణ్యావాంఛచే నక్కడక్కడ పక్షుల సుఖ నివాసార్థము గడ్డితో అల్లిన బుట్టలు వ్రేలాడ దీయుచుండిరి. వారాణసీ శ్రేష్ఠి కడ నున్న వంటవాడు కూడ తన వంటయింట బుట్ట వ్రేలాడ దీసెను. అందు బోధి సత్త్వుడు (కపోతము) నివాస మేర్పరచుకొనెను. ఆయన ఉదయమే లేచి, ఆహారార్థము చరించి, సాయంకాలమునకు మరలి వచ్చుచు, అచ్చట కాలక్షేపము చేయుచుండెను.

ఒకనాడు కాకి వంటయింటి మీదుగా నెగిరిపోవుచు పులుపు, తీపి ఉప్పుచేపలు, మాంసము మొదలగువాని వాసన తగులుటచే లోభము జనింప, నాకీమత్స్యమాంసము లెట్లు లభించును అని యోచించి, సమీపమున వాలి, సాయం సమయమున కపోతము పాకశాలలో ప్రవేశించుట చూచెను. ఈ పారావతమూలమున నాకు మత్స్య

మాంసములు లభించును అని తలచి, కాకి మరునాడు ప్రాతఃకాలమే వచ్చి కపోతము మేతకై బయలుదేరునపుడు తాను కూడ దాని వెనువెంట బోవుచుండెను. పావురము చూచి "మిత్రమా, ఏల నావెంట చరింతువు? "అనెను. "స్వామీ, మీ చర్య నాకు నచ్చినది. నేటి నుండి మిమ్మనుసరించెదను". "మిత్రమా, నీయాహారము వేరు, నా యాహారము వేరు, నీవు నన్ననుసరించుట దుర్ఘటము." "స్వామీ, మీరు ఆహార మన్వేషించునపుడు నేను మీవెంట ఆహారార్థము వత్తును." "మంచిది. అప్రమత్తతతో నుండవలెను." కాకమునకు బోధిసత్త్వుడి ట్లుపదేశించి, మేతకై తిరుగుచు తృణ బీజాదులు తినుచుండెను. కాకము వెంట బోవుచు పేడలో పురుగులను గాలించి తినుచు, కడుపు నింపుకొనుచు, బోధి సత్త్వుని సన్నిధికి వచ్చి "స్వామీ, మీరు హెచ్చుగా తిరుగుచున్నారు. అతి భుక్తము కూడదు" అని పలికెను. కపోతము సాయంసమయమున ఇంటికి మరలి వచ్చినప్పుడు కాకికూడ పాకశాలలో ప్రవేశించెను. "మన కపోతము వేరొక పక్షిని వెంటగొని వచ్చినది" అని పాచకుడు కాకికి గూడ బుట్ట వ్రేలాడదీసెను. నాటినుండి యుభయులు నచ్చటనే నివసించుచుండిరి. ఒకనాడు శ్రేష్ఠి కోసము బహు మత్స్యమాంసములు తెచ్చినారు. పాచకుడు వానిని వంటయింటిలో నక్కడక్కడ వ్రేలదీసినాడు. వానిని జూడ కాకమునకు నో రూరెను. "మేతకు బోవక నే నిక్కడనే యుండి వీనిని మెక్కవలెను" అని తలపోసి కాకి రాత్రి వేళ మూలుగుచు పండుకొనెను. మరునాడు బోధిసత్త్వుడు మేతకు బోవుచు "మిత్రమా, కాకమా, రమ్ము" అని పిలిచెను. "స్వామీ, మీరు పొండు. నాకు కడుపునొప్పి!" "మిత్రమా, కాకులకు కడుపునొప్పి పుట్టునని ఇంతకుమున్ను విని యుండలేదు. రాత్రి జాముజామునకు కాకికి మూర్ఛ వచ్చును. దీపపువత్తి మ్రింగినచో తాత్కాలికముగా తగ్గును. ఈ మత్స్యమాంసములను తిన కోరిక నీకు కలిగి నట్లున్నది. మానవ భోజనము నీకు పడదు. దీనికి లోపడక నావెంట రమ్ము." "రాలేను స్వామీ." "నీ నడవడియే తెలుపును. లోభవశము కాక అప్రమత్తతతో నుండుము" అని ఉపదేశించి కపోతము వెడలిపోయెను.

వంటవాడు నానావిధ మత్స్యమాంసములు వండి పోగుపెట్టి, భోజ

నములపైని మూత కొంచెము తెరచిపెట్టి, ఆవలకు బోయి చెమట తుడుచుకొనుచుండెను. కాకి బుట్టలోనుండి తల పైకెత్తి వంటయిల్లు పరికించి, పాచకుడావలకు బోవుట గ్రహించి "నేటికి నా మనోరథ మీడేరు కాలము వచ్చినది. మాంస ఖండము తిందునా, క్షుణ్ణ మాంసమును తిందునా" అని చింతించి, క్షుణ్ణమాంసమును వేగముగా తినలేను. కావున పెద్ద ముక్క తెచ్చి బుట్టలో బెట్టుకొని తిందును అని లేచి, రసకరండము మీద వాలెను. గరాటి జారుటచే టక్ అని చప్పుడయ్యెను.

వంటవాడా చప్పుడు విని ఏమిది యని పరుగెత్తుకొని వచ్చి కాకిని చూచి "శ్రేష్ఠికై వండిన మాంసమును ఈ చెడుగాకి మ్రింగ గోరు చున్నది. శ్రేష్ఠికై చేసినాను కాని ఈబుద్ధి లేని దానికోసము కాదు. దీనితో నాకేల" అని తలుపులు మూసి, కాకిని పట్టుకొని, ఒంటిమీది రెక్కలు లాగి అల్లము వుప్పు నూరి, పులి మజ్జిగలో కలిపి, దాని యొడలినిండ బూసి, దానిని బుట్టలో బడవేసెను. మంటకు తాళలేక కాకి మూలుగుచుండెను. బోధిసత్త్వుడు సాయంకాలము వచ్చి కాకి యవస్థ చూచి "లోభికాకమా, నా మాట వినక, పేరాసవలన మహా యాతన చెందుచున్నావు" అని యీగాథ పలికెను.

ఎవడు తనహితైషు లిచ్చిన యుపదేశ
మన్యథాకరించు నట్టివాడు
పావురమ్ము మాట పాటింప కరిచేత
భంగ పడిన కాకి భంగి జెడును.

ఈగాథ చెప్పి బోధిసత్త్వుడు "ఇక నేనిచ్చట నిలువరాదు" అని అన్యస్థానమునకు బోయెను. కాక మచ్చటనే చచ్చెను. వంటవాడు బుట్టతో గూడ దానిని పెంట పోగుపై బారవేసెను.

బుద్ధుడు ధర్మబోధ చేసి ఆర్యసత్యములను ప్రకాశింప జేయునప్పటికి ఆభిక్షువు అనాగామిఫలము పొందెను. శాస్త జాతకసారాంశము వెలిబుచ్చెను. ఆకాలమున కాకి నేటి లోభిభిక్షువు; పావురము నేనే.

# 43 వేణుక జాతకము

**శాస్తా జేతవనమున నివసించునపుడు ఒక్కమాట కూడ లెక్కచేయని భిక్షువును గూర్చి చెప్పినది.**

## వర్తమాన కథ

అప్పుడు భిక్షువుతో "భిక్షూ, నీవు నిజముగా చెప్పినది లెక్కచేయనివాడవేనా?" అనెను. "భన్తే, చిత్తము." "భిక్షూ, నీవు కేవలముప్పుడు కాదు. పూర్వజన్మమున గూడ ఇట్లేయుంటివి. ఈస్వభావముచే నీవు పండితులమాట వినక పామువాత బడి ప్రాణములు కోలుపోతివి" అని భగవాన్ పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో నొక సంపన్నవంశమున జన్మించెను. క్రమముగా నీతడు పెద్దవాడయి, కామమువలన బాధ జనించుటయు, నిష్కామమువలన సుఖము కలుగుటయు గ్రహించి, కామము విడిచి, ప్రవ్రజించి, పంచశీలములను అష్టసమాపత్తులను పొంది, ధ్యానసుఖమున నుండి, అనంతరము 500 తాపససంఘమున కాచార్యుడై యుండెను.

ఒకనాడు సర్పపోతకము స్వభావానుసారముగా మసలుచు, ఒక తాపసుని కుటీరము జేరెను. దానియెడ పుత్రప్రీతి కలుకగా తాపసుడు దానిని వెదురుగొట్టములో నుంచి, పోషించుచుండెను. వేణువునం దుండుటచే దానికి వేణుక మని పేరు వచ్చెను. తాపసునకు వేణుకపిడను పేరు వచ్చెను. తాపసుడు పామును పెంచుచుండె నని బోధిసత్త్వుడు విని, అతనిని బిలిపించి, "నీవు ఆశీవిషమును బెంచుచున్నావట నిజమా?" అని యడిగెను.

"సత్యమే." "పాము నెన్నడును విశ్వసింపరాదు. ఇక దానిని పెంచవద్దు." "శిష్యు డాచార్యునకువలె నా కది ప్రీతిపాత్రము. దానిని

విడిచి యుండజాలను." "అట్లయిన దానివలననే నీవు ప్రాణములు కోల్పోవుదువు."

తాపసుడు బోధిసత్త్వుని మాట వినలేదు, పామును విడిచిపెట్టలేదు.

తరువాత కొలదిరోజులకు తాపసు లందరు ఫలాహారణార్థము బయలు దేరి, ఒకచోట పండ్లు సులభ మగుట గ్రహించి, రెండుమూడురోజు లక్కడనే యుండిరి. వేణుకుడు వెదురు గొట్టములో సర్పము నుంచి, వారి వెంట వెడలెను. మరలివచ్చిన తరువాత నీతడు సర్పమున కాహార మిచ్చు తలపున వెదురుగొట్టము మూత తీసెను; నాయనా, ఆకలి గొన్నావా?" అనెను. రెండుమూడు రోజులు నిరాహార ముగా నుండుటచే పాము కుపితమై, ప్రసారిత హస్తమును కరచి, తాపసుని ప్రాణములు తీసి, అడవిలోనికి ప్రాకిపోయెను.

తాపసు లది చూచి బోధిసత్త్వునితో జెప్పిరి. ఆయన శవమునకు దహనసంస్కారము చేయించి, ఋషిగణమును రప్పించి, తన్మధ్యమున నుపవిష్టుడై, వారల కుపదేశ పూర్వకముగా నీ గాథ పలికెను:

తన మేలు కోరి హితమ్ము వచించు
నాప్తుల యుపదేశ మనుసరింపండో
ఆతండు వేళుకు డను పాముతండ్రి
పోలిక నాశమ్ము పొందుట నిజము.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు ఋషిగణమున కుపదేశ మిచ్చి, నాలుగుబ్రహ్మ విహారములను తనలో భావించి, ఆయువు ముగిసిన వెనుక బ్రహ్మలోకమును జేరెను.

**బుద్ధుడు ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చి సారాంశము వెలువరించెను. ఆజన్మములో వేళుకుని తండ్రి ఇప్పటి భిక్షువు; మిగిలిన సంఘము బుద్ధపరిషత్తు; గణశాస్త నేనే.**

# 44 మకస జాతకము

శాస్త మగధదేశములో విహరించుచుండగా ఒకానొక గ్రామములోని మూర్ఖులను గురించి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకప్పుడు బుద్ధుడు శ్రావస్తినుండి మగధరాష్ట్రమునకు జని, అచ్చట విచరించునపుడు ఒకానొకగ్రామము చేరెను. ఆగ్రామమునిండ మహామూర్ఖు లుండిరి. వా రంద రొకనాడు గుమిగూడి తమలో నిట్లు నిర్ణయించుకొనిరి. "అడవిలోనికి బోయి పని చేయునపుడు దోమలు మనలను కుట్టుచున్నవి. అందువలన మనపనులకు విఘ్నము కలుగుచున్నది. ఎల్లరము విండ్లు ఆయుధములు కొనిపోయి, వానితో తలపడి అన్నిదోమలను చీల్చి నరికివేయుదము." అనంతరము వా రడవికిబోయి మశకములను బాణములతో గొట్టుతలంపుతో ఒకరిపై నొకరు అలుగులు విడుచుకొని ప్రహారముల చేసికొని బాధతో వచ్చి గ్రామము మధ్యను వెలుపలను అన్నిచోట్లను పడియుండిరి. భిక్షుసంఘముతో శాస్త భిక్షార్థ మాగ్రామమున ప్రవేశించెను. గ్రామములో శేషించిన బుద్ధిమంతులు భగవానుని చూచి, గ్రామద్వారమున మండప మేర్పాటు చేసి, బుద్ధసహితముగా భిక్షుసంఘమునకు మహాదానములిచ్చి, శాస్తకు ప్రణామము చేసి, కూరుచుండిరి. అక్కడ నిక్కడ బడియున్నజనులను జూచి శాస్త ఉపాసకులతో "ఇచ్చట చాలమంది రోగు లున్నారు. వీ రేమి చేసినారు?" అనెను.

"భన్తే, వీరు దోమలతో పోరాడవలె నని పోయి, ఒకరి నొకరు గాయపరచుకొన్నారు" అని వా రనిరి. శాస్త "కేవల మిప్పుడే వీరు మహామూర్ఖులుగా లేరు; పూర్వముకూడ ఇట్లే చేసినవారు" అని, అక్కడివారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు వాణిజ్యమున జీవయాత్ర చేయుచుండెను. నాడు కాశీ

రాష్ట్రపు సరిహద్దు గ్రామములో వడ్రంగు లనేకులు నివసించుచుండిరి. అందొక వృద్ధ వర్ధకుడు చెక్క చెక్కుచుండెను. తామ్రపాత్రవలె తళ తళలాడు వాని బట్టతలమీద దోమవాలి ముక్కుతో పొడిచెను.

సమీపమున కూరుచున్న కుమారునితో వడ్రంగి "నాయనా, దోమ నాతలమీద కుట్టుచున్నది. దానిని తోలివేయుము" అని చెప్పెను. "సరే నాయనా, నీవు కదలకు. ఒక్కదెబ్బతో దీని తుద ముట్టించెదను" అని కుమారుడు పలికెను.

వ్యాపారార్థ మాగ్రామముచేరిన బోధిసత్త్వుడు ఆసమయమునకు వడ్రంగిశాలలోనికి వచ్చి కూరుచుండియుండెను.

"ఈ దోమను తోలు" అన్నాడు తండ్రి.

"సరే నాయనా" అని కుమారుడు వెనుకనుండి పలికి వాడిగల గొడ్డలియెత్తి దోమపై గొట్టగా, తల రెండు చెక్కలయి, వృద్ధుడు నేలగూలెను. అదిచూచి బోధిసత్త్వుడు తనలో "వివేకముకల ప్రత్యక్ష శత్రువయినను మేలే. దండన భీతివలన నయినను వాడు పరులను సంహరింపడు" అనుకొని యీగాథ పలికినాడు.

మూర్ఖ మిత్రునికన్న బుద్ధిమంతుండు
శాత్రవు డగుటయే సముచిత మగును.
జడమతి యైన పుత్రుడు తండ్రి జంపె
మశకమ్మును వధించు మాంద్యమునందు.

ఇట్లు పలికి బోధిసత్త్వుడు వెడలిపోయెను. వడ్రంగి కళేబరమునకు జ్ఞాతులు తగిన కర్మ చేసిరి.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. ఆసమయమున గాథ పలికి చనుచున్న వర్తకుడు నేనే.

# 45 రోహిణీ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు అనాథపిండిక శ్రేష్ఠి దాసినిగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అనాథపిండికునకు రోహిణి యనుదాసి కలదు. ఒకనాడు దాని వృద్ధ మాత కూతురు ధాన్యము దంపుచోటికి బోయి పండుకొన్నది. మక్షికములు దానిని చుట్టుముట్టి సూదులతో పొడిచినట్లు కుట్టినవి. అది కుమారికతో "అమ్మా, నన్ను ఈగలు కుట్టుచున్నవి. వీనిని తోలుము" అనెను. "అమ్మా, తోలెదను" అని తల్లియొడలిపై గూరుచుండి, రోకటితో ఈగలను చంపదలచి, తల్లిపై రోకటితో కొట్టెను. తల్లి మరణించుట చూచి అమ్మ చచ్చిపోయిన దని దాసి రోదనము చేయ సాగెను. ఈ సంగతి శ్రేష్ఠికి తెలిసినది. ఆయన వృద్ధురాలికి దహన సంస్కారాదులు చేయించి, వృత్తాంత మంతయు శాస్తకు నివేదించెను. "గృహపతీ, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ ఇట్లే చేసినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠికులమున జన్మించి, తండ్రి మరణానంతరము శ్రేష్ఠిస్థానము నొందెను. ఆయనకు రోహిణి యను దాసి యుండెను. కుమారిక బియ్యము దంపుచోటికి తల్లి వెళ్ళి, క్రిందబండుకొని, ఈగ మీద వ్రాలగా "అమ్మా ఈగను తోలవే" అన్నది. కూతురు రోకలితో ఈగను కొట్టునప్పటికి తల్లి తలపగిలి మృతి నొందెను. రోహిణి రోదనము చేయ నారంభించినది. జరిగిన సంగతివిని బోధిసత్త్వుడు "ఈలోకమున బుద్ధికల శత్రువయినను మేలే" అని తలపోసి ఈ గాథ పలికెను:

ఛీ, మూర్ఖమిత్రుని చెలిమికి మించి
తెలివి కల్గిన శాత్రవులం మేలం చూాదె.

తల్లిని జంపి శోషిల్లుచు నున్న
మూర్ఖాత్మ రోహిణి మోమును గనుము.

ఈ గాథలోని పండిత ప్రశంసామూలమున బోధిసత్త్వుడు ధర్మము నుపదేశించెను:

శాస్త్ర ధర్మోపదేశము చేసి రెండుకథలు సరిపోల్చి, జాతకసారాంశము వెలువరించెను. అప్పటి తల్లి ఇప్పటి తల్లియే, కూతురు ఇప్పటి కూతురే, మహాశ్రేష్ఠి నేనే.

## 46 ఆరామదూసక జాతకము

శాస్త్ర కోసలదేశమున ఒకానొక గ్రామమందలి ఆరామ నాశకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త్ర కోసలమున విచరించుచు నొకానొక గ్రామము చేరెను. గృహస్థొకడు భగవానుని నిమంత్రించి ఉద్యానమున దింపి, బుద్ధసహితముగా భిక్షుసంఘమునకు భోజనము పెట్టి "భన్తే ఈ యుద్యానమున విహరింపుడు" అని చెప్పెను.

భిక్షువులు లేచి తోటమాలిని వెంట బెట్టుకొని ఉద్యానమున విహరించుచు ఒకయంగణము చూచి, "ఉపాసకా, ఈయుద్యానములో అన్నిచోటులలో చిక్కని నీడయున్నది కాని యీయంగణములో వృక్షము కాని మొక్క కాని లేదు. దీనికి కారణ మేమి?" అనిరి.

"భన్తే, ఈతోట పెంచుసమయమున పల్లెటూరి కుఱ్ఱడు నీరు చల్లుచు, ఈప్రాంతమున మొక్కలను పెల్లగించి వానివ్రేళ్ళ లోతును బట్టి నీరు చల్లుచుండెడివాడు. ఆమొక్కలు వాడి నశించిపోయినవి. అందుచే ఈప్రాంతము మైదాన మయిపోయినది" అని వారు చెప్పిరి.

భిక్షువులు శాస్త్రకడ కేగి ఈవిషయము తెలిపిరి. శాస్త్ర "భిక్షువు

లారా, ఇప్పుడే కాదు; పూర్వముకూడ ఈగ్రామబాలుడు ఆరామ నాశకుడే" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా, వారాణసిలో ఉత్సవము జరుగునని ఘోషన జరిగెను. ఉత్సవ భేరీ శబ్దము వినినంతనే నగరవాసులు వేడుక చూడ బయలు వెడలిరి.

ఆసమయమున రాజోద్యానములో మర్కటము లనేక ముండెను. ఉద్యానపాలకుడు "నగరమున వేడుకలు జరుగుచున్నవి. మీరు మొక్కలకు నీరు చల్లు డని వానరములతో జెప్పి పోయి, ఉత్సవములో నేనుకూడ పాల్గొందును" అని తలచి, వానర జ్యేష్ఠుని సమీపించి "బాబా, వానరజ్యేష్ఠా, ఈయుద్యానము మిక్కిలి యుపయోగకారి. ఇందలి పుష్ప, పల్లవ, ఫలములు మీకు పనికివచ్చును. నగరములో వేడుక జరుగుచున్నది. నేను పోయివత్తును. నేను వచ్చులోగా మీ రందరు నుద్యానములోని చిన్ని మొక్కలకు నీరు పోయగలరా?" అని యడిగెను. "పోయగలము". అట్లయిన భద్రముగా నీరు పోయవలెను" అని తోటమాలి తోలు తిత్తులు, కొయ్య బొక్కెనలును ఇచ్చి పోయెను.

వానరములు మొక్కల మొదళ్ళలో నీరు పోయుచుండగా వానర జ్యేష్ఠుడు వానితో ని ట్లనెను: వానరములారా, ఉదకమును మనము వృథా చేయరాదు. తొలుత మీరు చిన్నమొక్కలను పీకి, వాని వేళ్ళు ఎంతయుండునో గమనింపుడు. లోతుగా నున్నవేళ్ళకు ఎక్కువ నీరు, తక్కువలోతున నున్నవానికి తక్కువనీరు పోయుడు. ఈ యుదక మయిపోయినపిమ్మట మరల నీరు దుర్లభము".

మంచిదని వానరము లాప్రకార మేచేసెను. ఆ సమయమున బుద్ధిమంతుడొకడు రాజోద్యానములో వానరములు చేసినపనిచూచి "వానరములారా, ఏల చిన్నమొక్కలనుపీకివేసి, మూలప్రమాణమును బట్టినీరుపోయుచున్నారు?" అని యడిగెను.

"మావానరజేష్ఠుడిట్లుచేయుడని ఆనతిచ్చినారు" అనియవి చెప్పగా

బుద్ధిమంతుడు తనలో" వీరుమూర్ఖులు: మూర్ఖులర్థమును గ్రహింపక అనర్థకారకులగుదురు" అనుకొని, బహిరంగముగా ఈగాథపలికెను :

ఉపకార మొనరింప నొగి నేర్పు లేని
యట్టిడి యుపకృతి హర్షదం బగునె?
చెరచును పని మూర్ఖనరుడు, వనమ్ము
గాపాడుచుండెడి కపివిధమ్మునను.

ఆ బుద్ధిమంతుడు వానరజ్యేష్ఠునిమందలించి, నిజపరివారముతో నుద్యానమునుండి వెడలిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుకథలు పరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి వానరముల నాయకుడు ఇప్పటి గ్రామబాలుడు; బుద్ధిమంతుడు నేనే.

## 47 వారుణీ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు, మద్యము చెడగొట్టువానిని గూర్చి చెప్పినది.

### *వర్తమాన కథ*

అనాథపిండికుని మిత్రమయిన మద్యవ్యాపారి యొకడు తీక్ష్ణ మైన మద్యము తయారుచేయించి, బంగారమునకు, వెండికి, విక్రయించు చుండెను. ఒకనా డతడు మద్య మమ్ముచు చాలమంది మద్యపాయు లున్న వేళ తనశిష్యునితో "నాయనా, వీరికడనుండి మూల్యము స్వీక రించి మద్య మిమ్ము" అని స్నానార్థము వెడలిపోయెను. మద్యపానము చేయువారు నడుమ నడుమ లవణఖండములు తెప్పించుకొని తిను చున్నట్లు ఆశిష్యుడు చూచి, మద్యము ఘాటుగా నున్న దని తలచి, మద్యపాత్రములో గొట్టము నిండులవణము వేసి, జనుల కీయసాగెను. ఉమ్మివేసి వారు "ఇందులో ఏమి వేసినావు?" అని అడిగిరి.

"మీరు త్రాగినపుడు నడుమ నడుమ ఉప్పు తినుచుండుట చూచి దీనిలో ఉప్పు కలిపినాను."

"ఇంత మంచిమద్యమును పాడుచేసినావు?" అని నిందించి వారు లేచిపోయిరి.

వ్యాపారి వచ్చి ఒక్కడును లేకుండుట గమనించి, "త్రాగువారెచటికి బోయినారు?" అని కుర్రవాని నడిగినాడు.

వాడు జరిగిన దంతయు చెప్పినాడు. యజమానుడు "ఓరీ మూర్ఖుడా, ఇంతమంచి మద్యము చెరిపినావే!" అని మందలించి, ఆవిషయము అనాథపిండికునితో జెప్పెను. అది చెప్ప దగినవిషయమని అనాథపిండికుడు తలపోసి, జేతవనమునకు జని, శాస్తకు ప్రణామము చేసి, ఆసంగతి చెప్పెను. "గృహపతీ, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ వీ డీప్రకారమే చేసినాడు" అని శ్రేష్ఠిమీద పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు వారాణసిలో శ్రేష్ఠి యయ్యెను. ఆయన నాశ్రయించి వారుణి వణిజుడు జీవించుచుండెను. వాడు తీక్ష్ణ సురను సంపాదించి దానిని విక్రయింపు మని యనుచరునితో జెప్పి స్నానమునకు బోయెను. వాడు వెడలి పోవగానే యనుచరుడు సురలో లవణము కలిపి విరిచి వేసెను. సురావణిక్కు తిరిగి వచ్చి తన శిష్యుడు చేసిన పని గ్రహించి శ్రేష్ఠితో జెప్పుకొనెను. "మూఢులు, అనర్థ కుశలురు మంచికి బోయి చెడు తెత్తురు" అని శ్రేష్ఠి యీ గాథ పలికెను.

ఉపకార మొనరించు నోరుపుఁ సేర్పు
చాలని మూర్ఖుని మే లశుభంబె :
కొండన్న శిష్యుడు కుండెడాసవము
విరిచిన రీతిని వికళంబు చేయు.

బోధిసత్త్వు డీగాథతో ధర్మము బోధించినాడు.

శాస్త జాతకసారాంశము వెలిబుచ్చెను. ఆకాలమున మద్యము విడిచినవాడు ఇప్పటి కుర్రవాడు; వారాణసీ శ్రేష్ఠి నేనే.

# 48 వేదబ్భ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మాట వినని భిక్షువుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శాస్త ఆభిక్షువుతో "నీవు కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ మాట వినువాడవు కావు. అందుచేతనే బుద్ధిమంతులమాట వినక వాడికత్తివలన రెండుముక్కలై వీధిలో పడినావు. నీయొకనిమూలమున వేయిమందిజనులు ప్రాణములు కోలుపోయిరి" అని పూర్వజన్మకథ చెప్పినాడు.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, ఒకానొక కుగ్రామములో నొక బ్రాహ్మణుడు వేదబ్భనామక మంత్రము నెరిగియుండెను. ఆ మంత్రము మహార్ఘము, అనర్ఘము. నక్షత్ర యోగము ఘటిల్లినపుడా మంత్రమును పునశ్చరణ చేసినచో ఆకాశమునుండి సప్త రత్న వర్షము కురియు నట.

ఆ కాలమున బోధిసత్త్వు డా బ్రాహ్మణుని కడ విద్య లభ్యసించు చుండెను. ఒకనాడు బ్రాహ్మణుడు బోధిసత్త్వుని వెంటబెట్టుకొని ఏదో పనిమీద స్వగ్రామము నుండి బయలుదేరి చేది రాష్ట్రము ప్రవేశించెను. మార్గ మధ్యమున నడవిలో పేసనక చోరు లనువారు 500 మంది దోపిడులు చేయుచుండిరి. వారు బోధిసత్త్వుని వేదబ్భ బ్రాహ్మణుని పట్టుకొనిరి.

ఎందుచే వారిని పేసనక చోరు లందురు? వారు ఇరువురను పట్టుకొని అందులో నొకరిని ధనము తెమ్మని పంపుదురు. కావున వారికా పేరు వచ్చిన దట. వారు తండ్రి కొడుకులను బట్టుకొని, మాకు ధనము తెచ్చి నీ కుమారుని కొని పొమ్మందురు. తల్లి కూతుళ్ళను బట్టుకొని తల్లిని విడిచి పెట్టుదురు. గురు శిష్యులు దొరికినచో శిష్యుని విడుతురు.

వారు వేదబ్భ బ్రాహ్మణుని పట్టుకొని బోధిసత్త్వుని విడిచిరి.

ఆయన ఆచార్యునకు నమస్కరించి "ఒకటి రెండు రోజులలో మరలి వత్తును: మీరు భయపడ వలదు. నేను చెప్పినట్లు చేయుడు. నేటి రాత్రి ధనవర్షము కురుపించుయోగమున్నది. మీరు మంత్రోచ్చారణము చేసి ధనవర్షము ఘటింపవలదు. అట్లు చేసినచో మీరును 500 చోరు లును వినాశము నొందుదురు" అని ఆచార్యునకు బోధించి ధనా ర్థము వెడలిపోయెను. సాయం సమయమున చోరులు బ్రాహ్మణుని కట్టి పడవైచిరి. అప్పుడు తూర్పుదిక్కున పరిపూర్ణ చంద్రబింబ ముద యించెను. బ్రాహ్మణుడు నక్షత్రములు గుణించి, ధనవర్షపు నక్షత్ర యోగము సంభవించు నని గ్రహించి, 'నేను శ్రమపడ నేల? మంత్ర ముచ్చరించి రత్నములను కురిపించి చోరుల కిచ్చి, యథాసుఖము పోవుదును' అని తలచి 'చోరులారా, న న్నేల పట్టుకొంటిరి?' అని యడిగెను. 'ఆర్యా, ధనార్థము.' 'అ ట్లయినచో నా బంధనముల నూడదీసి, శిరఃస్నానము చేయించి, గంధానులేపనము చేసి, నూతన వస్త్రము లిచ్చి, పుష్పమాలిక వేసి, నన్ను విడిచి పెట్టుడు' అని పలి కెను. చోరు లట్లే చేసిరి. బ్రాహ్మణుడు నక్షత్రయోగము తెలిసి కొని, మంత్ర ముచ్చరించి, ఆకాశము వంక జూచెను. తోడనే ఆకసమునుండి రత్నములు రాలెను.

చోరు లా ధనము పోగు చేసికొని, ఉత్తరీయములలో మూటలు కట్టుకొని బయలు దేరిరి. బ్రాహ్మణుడు కూడ ననుస రించెను. ఆ చోరులను వేరొక చోర పంచశతము వచ్చి పట్టుకొనెను. "మ మ్మేల పట్టుకొంటిరి?" "ధనార్థము." "మీకు ధనము వలయునేని ఈ బ్రాహ్మణుని పట్టుకొనుడు. ఇత డాకసమువంక జూచి ధనము కురిపింపగలడు. ఈ ధనము మా కీవిధముగానే లభించినది."

నూతన చోరులు వారిని విడిచి బ్రాహ్మణుని పట్టుకొని, మాకు గూడ ధన మి మ్మనిరి. "నేను మీకు ధన మిత్తును. కాని ధనవర్ష యోగము నేటినుండి సంవత్సరమునకు గాని సంభవింపదు. మీకు ధన మవసర మేని అంతవరకును వేచి యుండుడు. అప్పుడు ధనవర్షము కురిపింతును" అని బ్రాహ్మణుడు చెప్పెను.

చోరులు కోపించి "ఓయి దుష్ట బ్రాహ్మణుడా, ఇంతకు ముందే అన్యులకు ధన మిచ్చి మమ్ము మాత్రము సంవత్సరము వరకు వేచి

యుండవుందువా!" అని పదును గల కత్తితో వతనిని రెండు ముక్కలుగా నరకి, త్రోవలో బారవైచి, వేగముగా బోయి వెనుకటి చోరులతో పోరి, వారిని సంహరించి రత్నములు సంగ్రహించిరి. ఆవల వారు రెండు పక్షములుగా విడివడి, పరస్పరము యుద్ధము చేయుగా ఇరువురు మాత్రము మిగిలిరి. ఈ విధముగా వేయిమంది నిహతులయిరి.

వా రిరువురు ధనమును గొనిపోయి, ఒకానొక గ్రామ సమీపమందలి గహనస్థానమున ధనమును దాచి పెట్టి, అం దొకడు ఖడ్గహస్తుడై కనిపెట్టుకొని యుండెను. రెండవవాడు బియ్యము తీసికొని అన్నము వండుటకై గ్రామములోనికి బోయెను. లోభము వినాశమునకు మూలము కదా? ధనముకడ గూరుచున్నవాడు తనలో "వాడు వచ్చి దీనిని రెండు భాగములు చేసి సగము తీసికొనును. కావున వాడు వచ్చినంతనే వాని నీ ఖడ్గముతో ఖండింతును" అనుకొని కత్తి సిద్ధముగా నుంచి వానిరాక కెదురు చూచుచుండెను.

రెండవవాడుకూడ నిట్లు చింతించెను: "ఆధనము రెండుభాగములు చేయవలెను. అన్నములో విసము కలిపిపెట్టి, వానిని చంపి ధన మంతయు నేనే హరింతును." ఇట్లు తలచి వాడు అన్నము వండి, తిని, మిగిలినదానిలో విష ముకలిపి, వానికడకు బోయెను. వాడు గిన్నె నేలపై బెట్టుచుండ మొదటివాడు వానిని ఖడ్గముతో రెండుతుండెములు చేసి, భోజనము చేసి, ప్రాణములు విడిచెను. ఆధనమువలన నెల్లరు నీ ప్రకారముగా వినాశనము పొందిరి.

బోధిసత్త్వుడు రెండురోజులలో ధనము తీసికొని వచ్చెను. ఆచార్యుడు కనబడలేదు. ధనము నిక్షిప్తమైయుండెను. "ఆచార్యుడు నామాట వినక ధనవర్షము కురిపియుండును. అందరును నశించియుందురు" అనుకొని, మహామార్గము వెంట పయనించెను. పోవుచుండగా మార్గములో ద్విధాఖండిత మైన ఆచార్యుని దేహము కనబడగా, నామాట వినక ఆచార్యుడు మరణించినాడు, అనుకొని బోధిసత్త్వుడు కట్టెలుప్రోగుచేసి, చితి పేర్చి, అడవి పూవులతో ఆచార్యునికళేబరము పూజించి, దహనసంస్కారములు చేసెను. మరికొంతదూరము పోవునప్పటికి పంచశత చోరులశవములును, అనంతరము రెండువందలయేబది కళేబరములును

(రెండుతక్కువగా) కనబడినవి. వానిని చూచి "వేయిమందిలో నిరువురు తప్ప అందరు నాశనము పొందినారు. ఉభయులు నెచటికి బోయి యుందురు?" అని భావించి పోవుచుండగా అరణ్యమార్గము కనబడెను. ఆ త్రోవనుజనుచుండగా మూటకట్టినధనరాశియు తలక్రిందుగా బడి యున్నయన్నపుగిన్నెయు, సమీపముననే మృతకళేబరమును కానబడి యెను. వీరిపనిచేసియుందు రనిభావించి, బోధిసత్త్వుడు సర్వముగ్రహించి ఇంకొకడేడియని వెదకుచుండ రహస్యప్రదేశమున శవముకనబడెను. "ఆచార్యుడు నామాటవినకపోవుటచే తాను నశించుటేకాక వేయి మందికిగూడవినాశము కల్పించెను. ఉపాయమెరుగక నిష్కారణముగా తమలాభముకొరకు యత్నించువారు మా యాచార్యునివలె ఇట్లే సంపూర్ణనాశముచెందుదురు" అనుకొని ఈగాథ చెప్పినాడు :

అనుచిత మార్గాన నర్థంబు నెవడు
వాంఛించు, చెడిపోవు వాడు నిక్కముగ.
చేతి దేశమునకు చెందిన చోర
సంఘంబు వైదర్భు, శాస్త్రపండితుని
జంపి, యావల తానె చచ్చినయట్లు.

వనము మారుమ్రోగునట్లు బోధిసత్త్వుడు ఈప్రకారముగాపలికి, దేవతలు సాధువాదముచేయుచుండగా ఈగాథారూపమున ధర్మ ముపదేశించి, ఆధనమునుగొని, ఇంటికిబోయి, దానాదిపుణ్యకార్య ములు చేయుచు, జీవితాంతమున యథాకర్మంగతో.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. అప్పటి వైదర్భ బ్రాహ్మణుడు ఇప్పటి మూర్ఖభిక్షువు; శిష్యుడు నేనే.

# 49 నక్షత్ర జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండ ఒకానొక ఆజీవకుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తిలోని యొకకన్యను జనపదములోని యొకకులపుత్రుని కిచ్చి వివాహము చేయుటకు నిర్ణయము జరిగినది. "ఫలాని రోజున వచ్చి పిల్లను తీసికొని పోవుదుము" అని తిథికూడ నిశ్చయమయినది. ఆరోజున మగపెండ్లివారు తాము విశ్వసించిన ఆజీవకునికడకు బోయి "భదన్తే, మే మీనాడు శుభకార్యము చేయుదుము. నక్షత్రము బాగున్నదా?" అని అడిగిరి. "వీరు నన్ను ముందుగా నడుగక తిథికూడ నిర్ణయించు కొని వచ్చి, ఇప్పుడు న న్నడుగుచున్నారు" అనుకొని కోపించి "సరే, పాఠము నేర్పెదను" అనుకొని "నేడు నక్షత్రము బాగుగా లేదు. నేడు మంగళకార్యము చేయవద్దు. చేసితిరేని చాలనష్టము సంభవించును" అని చెప్పెను.

ఆవంశములోని పెద్ద ఆజీవకునిమాట నమ్మి ఆనాడు శ్రావస్తికి పోవలేదు. నగరవాసులు (ఆడపెండ్లివారు) మంగళక్రియ లన్నియు ముగించి పెండ్లివారు రాలేదని "వారు నేడు నిర్ణయము చేసి వచ్చి నారుకాదు. మనకు చాల ధనవ్యయ మైనది. వారితో మన కేమి? మన బిడ్డను మరి యొకనికిచ్చి వివాహము చేయుదము" అని తలంచి వేరొక నికి పిల్లనిచ్చి వివాహము చేసినారు.

మరునాడు పల్లెటూరివారు వచ్చి 'పిల్లనిండు' అని అడిగిరి. శ్రావస్తి వాసులు వారితో మీ పల్లెటూరి గృహస్థులు మహాదుర్మార్గులు. లగ్నము నిర్ణయించి, రాక మమ్ముల ననాదరించినారు. మీరు ఏత్రోవ వెంట వచ్చితిరో ఆత్రోవనే మరలి పొండు. మాబిడ్డను వేరొకనికిచ్చి పెండ్లిచేసినాము" అని వారు జగడమాడ వారు వచ్చిన త్రోవనే మరలి పోయిరి.

ఆజీవకునివలన శుభకార్యమునకు విఘ్నము కలిగిన దని భిక్షువు లకు తెలిసినది. వారు ధర్మసభలో కూరుచుండి 'ఇష్టాగోష్ఠి' చేయు చుండిరి. శాస్త అరుగుదెంచి "భిక్షువులారా, కూరుచుండి ఏమి సంభా

పించు చున్నారు?" అన్నాడు. వారు ఫలాని విషయము అని చెప్పి నారు. అప్పుడు శాస్త్ర "భిక్షువులారా, ఆజీవకుడు ఇప్పుడే కాదు, పూర్వ కాలమున గూడ కుపితుడై వారి మంగళకార్యమునకు విఘ్నము కలిగించినాడు" అని పూర్వ జన్మ కథ చెప్పినాడు.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా పల్లెటూరివారిపిల్లను నగరవాసి తన కుమారున కిమ్మని కోరి, తిథి నిర్ణయించి తమ కులగురువగు ఆజీవకునితో "భదంతా, నేడు మా ఇంట శుభకార్యమునకు నక్షత్రము శుభ ప్రదమా?" అని యడి గెను. "తమ ఇచ్ఛ వచ్చినట్లు తిథి నిర్ణయించుకొని నగరవాసులు నన్ని ప్పుడడుగు చున్నారు" అనుకొని, ఆయన యోజించి "నేడు నక్షత్రము శుభప్రదము కాదు. శుభకార్యము చేసిన చో వినాశము సంభవించును" అని చెప్పెను. ఆయన వాక్కుల యెడ విశ్వాసముచే నగర వాసులు బయలు దేర లేదు. "ఈ ముహూర్తము నిర్ధారణ చేసినవారు నగర వాసులే. వారే రాలేదు. ఎట్టివారు!" అనుకొని గ్రామవాసులు తమ పిల్లను వేరొకనికిచ్చి పెండ్లి చేసిరి.

మరునాడు నగరవాసులు గ్రామమునకు బోయి పిల్ల నడిగిరి. "మీరు నగరవాసులు. గృహపతుల మర్యాదలతో మీకు పని లేదు. మీరే వారము నిర్ణయించితిరి. కాని పెండ్లికుమార్తెను తీసుకొని పోవ రారైతిరి. మీరు రానందున పిల్లను వేరొకని కిచ్చి పెండ్లి చేసి తిమి" అని గ్రామవాసులు చెప్పిరి.

"ఆజీవకుని మే మడిగినాము, నక్షత్రము మంచిది కా దని ఆయన చెప్పుట వలన నిన్న మేము రాలేదు. పిల్లను మా కిండు."

"మీరు సకాలమునకు రాలేదు. ఇప్పు డామె అన్యునిది, పెండ్లి మీద పెండ్లి యెట్లు చేయగలము?"

ఈ విధముగా వారు వివదించుచుండగా, ఏదో పనిమీద ఆ గ్రామ మునకు వచ్చిన బుద్ధిమంతు డొకడు నగరవాసులు చెప్పిన దంతయు విని "నక్షత్రములతో నేమి పని? బిడ్డ లభ్య మగుట శుభప్రదము కాదా?" అని ఈ గాథ పలికెను:

తారాజాలము చూచి తరలు మూర్ఖునకు
ఫలసిద్ధి కలుగ దేపనియందు గాని
శ్రీరమ్య ఫలసిద్ధి తార యాగాదె!
ఫలసిద్ధి తార లేపగిది పొందించు?

తాము కలహించినను బిడ్డ లభింపక పోవుటచే నగరవాసులు తమ నివాసమునకు వెడలి పోయిరి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి రెండు కథలు సరిపోల్చి జాతకసారాంశమును వెలువరించెను. ఆకాలమున ఆజీవకుడు నేటి ఆజీవకుడే! అప్పటి వంశములు ఇప్పటి వంశములే. ఆకాలమున గాథ పలికి నిలువబడిన బుద్ధిమంతుడు నేనే.

## 50 దుమ్మేధ జాతకము

శాస్త జేతవనమున విహరించు సమయమున లోకోపకారమును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

ఆకథ పండ్రెండవ నిపాతమున మహాకణ్హ జాతకమున (469) వచ్చును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డాయన యగ్రమహిషి కడుపున బుట్టినాడు. నామకరణము నా డతనికి బ్రహ్మదత్తకుమారు డని పేరు పెట్టినారు. పదునారు సంవత్సరముల వయసున నతడు తక్షశిలలో విద్యాభ్యాసము చేసి, మూడు వేదములలోను అష్టాదశ విద్యలలోను నిష్ణాతు డయినాడు. తండ్రి యుతనిని యువరాజును జేసినాడు. ఆ కాలమున వారాణసీ ప్రజలు దేవతలను పూజించువారు. దేవతలకు గొఱ్ఱెలు, మేకలు,

కుక్కుటములు, సూకరములు మొదలగునవి బలి యిచ్చి, పుష్ప గంధములతో పూజించుచుండెడి. బోధిసత్త్వు డిట్లు భావించెను: "నేడు జనులు మూఢ విశ్వాసమున బహు ప్రాణివధ చేయుచున్నారు. మహాజన మధర్మ మార్గమున ప్రవర్తించుచున్నది. నేను రాజ్యము నకు వచ్చినతరువాత జంతు వధ మాన్పించు నుపాయము చూతును."

ఆత డొకనాడు రథమెక్కి నగరము దాటిపోయి, మార్గములో మహావటవృక్షముక్రింద జనము గుమిగూడి, కొడుకులను కొమార్తె లను కీర్తిని సంపదను అనుగ్రహింప వృక్ష దేవతను ప్రార్థించుచుండిరి. బోధిసత్త్వుడు రథము దిగి, చెట్టు దరికి పోయి, ఆరాధకునివలె నుద కముతో నభిషేకించి, పుష్ప గంధములతో నర్చించి, ప్రదక్షిణము చేసి, దేవతలకు నమస్కరించి, రథ మెక్కి, నగరములో ప్రవేశించెను. నాడు మొద లాయన అప్పు డప్పు డారాధకునివలె నియమముగా పూజలు చేయుచుండెను.

తండ్రి పోయినతరువాత బోధిసత్త్వుడు రాజ్యమునకు వచ్చి, నాలు గగతులను వర్జించి, దశరాజ ధర్మము లభ్యసించుచు, ధర్మమార్గమున పరిపాలన చేయుచుండెను. ఒకనా డాయన తనలో "రాజ్యమునకు వచ్చినాను. వెనుక నేను తలపెట్టినదాని నిప్పుడు నెరవేర్పవలెను." అని చింతించి అమాత్యులను రావించి, బ్రాహ్మణులను, గృహపతు లను సమావేశపరచి, "ఆర్యులారా, ఏకారణముచే నాకు రాజ్యము వచ్చినదో మీకు తెలియునా?" అని యడిగెను. "మాకు తెలియదు దేవా!" అని వారు పలికిరి. "నేను వటవృక్షమును గంధాదులతో అర్చించి, అంజలి పట్టి నమస్కరించుట మీరు పూర్వము చూచి నారా?" "చిత్తము, దేవా;" "అప్పుడు నేను ప్రతిజ్ఞ చేసినాను– "నేను రాజ్యమునకు వచ్చినతోడనే నీకు బలిపూజ చేయుదు నని". ఆ దేవతాను గ్రహము వలన నా కీ రాజ్యము లభించినది. ఇప్పుడు బలి యిత్తును. బలిపూజకు మీరు త్వరగా సమస్తము సిద్ధము చేయవలయును." "దేవా, ఏమేమి సిద్ధము చేయవలెను?" "నారాజ్యములో పంచదుశ్శీ ల కర్మలను, దశవిధ అమంగళ కర్మలను చేయువారిని సంహరించి, వారి ప్రేగులు రక్త మాంసములు తీసి బలి యిత్తు నని ప్రతిజ్ఞ చేసినాను యువరాజుగా నున్నప్పుడు. ఇప్పు డట్టివారిని వేయిమందిని పట్టించి

వాది రక్తమాంసాలు బలి యీయవలెను. ఇట్లని జనులు తెలిసికొందురు గాక! నేడు మొదలు దుష్కర్మలు చేయు వారిని వేయి మందిని బలి ఇచ్చి, ప్రతిజ్ఞా మోచనము చేసికొందును గాక.” ఈ యర్థమును స్పష్టీకరించుటకై రాజు ఈగాథ పలికినాడు.

బలి యీయగా నేను ప్రతిన పట్టితిని
యజ్ఞాన దుష్ట సహస్రమ్మతోడ:
ఇట నధార్మిక సంఖ్య హెచ్చిపోయినది !

అమాత్యులు బోధిసత్త్వుని వాక్కులు విని, చిత్తము దేవా, యని ద్వాదశ యోజన విస్తీర్ణము కల వారాణసిలో భేరి వేయించిరి. భేరీ భాంకారము విన్న జనులలో నొకడును దుష్కర్మ చేయువాడు లేడాయెను.

బోధిసత్త్వుడు రాజ్యము చేయు కాలమున పంచ దశ దుశ్శీల కర్మలలో నొక్కటికూడ ఆచరించు వాడు లేడు. ఒక్కనికి కూడ బాధ లేకుండ బోధిసత్త్వుడు శీల రక్షణము చేసి, స్వయముగా దానాది పుణ్య కార్యములు చేయుచు, జీవితాంతమున నిజపరివారముతో దేవనగరము జేరెను.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటిపరిషత్తు ఇప్పటి బుద్ధపరిషత్తు; వారాణాసీ రాజు నేనే.

## 51 మహాసీలవ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, విశ్వాసము కోలుపోయిన భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

“భిక్షూ, నిజముగా నీవు విశ్వాసము పోయినదా?” అని బుద్ధుడడిగెను.

"భన్తే. నిజమే" అని అత డన్న పిదప బుద్ధుడు "భిక్షూ, కల్యాణ కారి యగు నిట్టి శాసనమున ప్రవ్రజితుడవై, ఏల విశ్వాసము కోలు పోయినావు? పూర్వము బుద్ధిమంతులు రాజ్యము కోలుపోయియు, తమ ప్రయత్నమున నుండి, పోయినకీర్తిని మరల సృజించుకొన్నారు" అని పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడాయన పట్టపుదేవికడుపున బుట్టెను. నామకరణమునా డతనికి శీలకుమారుడని పేరుపెట్టిరి. షోడశవర్షమున నే యతడు సకల కళలలో నిపుణుడై తండ్రిమరణానంతరము మహాసీలవరాజ నుపేర రాజ్యమునకు వచ్చి ధర్మపరిపాలనము చేయుచుండెను. అతడు నగరమునకు నాలుగుప్రక్కలను, ఒకటి మధ్యప్రదేశమునను, ఒకటి నివేశనద్వారమునను–మొత్తము ఆరుధర్మశాలలు నిర్మించి, కృపణులకును పాంథులకును దానమిచ్చుచు, తొంత మైత్రి దయాసంపన్నుడై యుండెను. ఒడిలోని బిడ్డనివలె నెల్లరను పరితుష్టులను చేయుచు ధర్మమార్గమున పాలనము చేయుచుండెను.

అతని యమాత్యులలోనొకరు అంతఃపురమున అవినయ మాచరించెను. అమాత్యులు రాజున కీవిషయము తెలిపిరి. రాజుస్వయముగా విచారణ సలిపి "కన్నుగానని మూఢుడా, అకార్యము చేసినావు. ఈ రాజ్యమున నుండదగవు. నీ సర్వస్వమును దారపుత్రాదులను దీసికొని యెక్కడికైన బొమ్ము" అని నిష్కాసశిక్ష విధించెను. వాడు కాశీ రాష్ట్రము దాటి, కోసలరాజ్యము చేరి క్రమముగా రాజుకు విశ్వాస పాత్రుడయ్యెను. వాడొకనాడు రాజుతో "దేవా, వారాణసీరాజ్యము తేనె టీగలు లేని తెనెపెరవలె నున్నది. రాజుమృదుస్వభావుడు. కొలదిసైన్యముతో వారాణసీరాజ్యమును పట్టుకొన వచ్చును" అని బోధించెను.

రాజు వాని మాటలు విని "వారాణసీ రాజ్యము చాల గొప్పది. అల్ప బలముతో పట్టు కొనుటకు వీలగు ననుచున్నాడు. ఇతడు ప్రయుక్త చారు డగునా!" అని తలపోసి బహిరంగముగా "నీవు గూఢ

చారుడ వని తోంచుచున్నది" అనెను.

"దేవా, గూఢ చారుడను కాను. సత్యము చెప్పుచున్నాను. నా మాట నమ్మరేని ప్రత్యంతగ్రామమును కొల్లగొట్టుటకు జనులను పంపుడు. వారు పట్టుపడి, ఆయన కడకు గొనిపోబడినపుడు రాజు ధన మిచ్చి వారిని విడిచి పుచ్చును."

"ఇతడు సాహసముతో పలుకుచున్నాడు. ఇతనిని పరీక్షించెదను" అని రాజు తలపోసి, సరిహద్దు గ్రామమును కొల్ల బెట్టుటకు జనులను బంపెను. శత్రు భటులు వారిని బట్టుకొని వారాణసీ ప్రభువు కడకు బంపిరి. రాజు వారిని జూచి "నాయనలారా, గ్రామము నేల కొల్ల గొట్టినారు?" అని యడిగెను. "జీవనము జరుగక దేవా!" "అట్లయిన మీరు నాకడ కేల రాలేదు? ఇకముం దిట్లు చేయవలదు" అని రాజు వారికి ధన మిచ్చి పంపివేసెను.

చోరులు పోయి కాశీరాజుతో జరిగిన సంగతి చెప్పిరి. అప్పటికి ధైర్యము చాలక కోసల రాజు శత్రు రాష్ట్రమధ్యమున జన పదమును కొల్ల బెట్టించెను. అచ్చట పట్టుబడిన చోరులకు కాశీరాజు ధనమిచ్చి విడిచి పుచ్చెను. అప్పటికిని ధైర్యము చాలక కోసలరాజు వీధిలోని జనులను దోపిడి చేయించెను. కాశీరాజు వెనుకటి వలెనే చేసెను. కాశీరాజు మిక్కిలి ధార్మికు డని గ్రహించి వారాణసీ రాజ్యమును పట్టుకొందు నని సైన్యముతో బయలు దేరెను.

ఆ కాలమున వారణసీ రాజుకడ వేయిమంది వీరు లుండిరి. వారు మత్తవారణము నెదుర్కొన గలరు, పిడుగు నెత్తిపై బడుచున్నను వణకరు. సీలవ మహారాజు కోరినచో వారు సమస్త జంబూద్వీపము లోని యే రాష్ట్ర మయినను జయింప గలరు. కోసల రాజు సైన్య ముతో వచ్చుచున్నా డని వారు విని తమ రాజును సమీపించి "దేవా, కోసలరాజు మన రాజ్యము నాక్రమించుటకై వచ్చుచున్నాడు. ఆయన మన సరిహద్దు దాటక పూర్వమే ఆయన నోడించి బంధించి తెత్తుము" అని విన్నవించిరి. "నాయనలారా, నా కొరకు మీరు శ్రమ పడ వలదు. కోరిక యున్న వానిని రాజ్యము తీసికొన నిండు. మీరు పోవలదు" అని నివారించెను.

కోసలరాజు సీమ దాటి జనపద మధ్యమున ప్రవేశించెను. ఆమా

త్యులు మరల రాజుకడకు బోయి వెనుకటివలెనే చెప్పిరి. రాజు వెను కటి వలెనే వారిని నివారించెను. కోసల రాజు నగర బాహ్యమున నిలిచి "రాజ్య మిమ్ము, యుద్ధ మయిన చేయుము" అని సందేశ మంపెను. సీలవ మహారాజు విని "నాతో యుద్ధ ముండదు. రాజ్యము తీసికొన వచ్చును" అని ప్రతి సందేశ మంపెను. అమాత్యులు మరల రాజు సన్నిధికి జని "దేవా, కోసల రాజును నగరములోనికి రా నీయము. నగర బాహ్యముననే ఆయనను జయించి బంధింతుము" అని చెప్పిరి. రాజు వెనుకటి వలెనే వారిని నివారించి నగర ద్వార ములు తెరపించి, సహస్రామాత్య పరివృతుడై మహాతలమున పర్యంక ముపై గూరుచుండెను.

కోసలరాజు మహాసైన్యముతో నగరములో ప్రవేశించెను. ఎదిరించువా రెవ్వరును కనబడకపోవుటచే ప్రాసాద ద్వారమును జేరి లోనికి బోయి అమాత్యగణపరివృతు డైన రాజును తలుపులు తెరచిన మహా తలమున పర్యంకముపై చూచి, తన పరివారముతో "పోండు, ఈ రాజును అమాత్యసహితముగా చేతులు వెనుకకు గట్టి, శ్మశానము నకు గొనిపోయి, గోతులు త్రవ్వించి, చేతు లెత్తుటకు వీలు లేకుండ మెడవరకును పూడ్చివేయుడు. రాత్రివేళ నక్కలు వచ్చి, కర్తవ్యము నెరవేర్చును" అని యాజ్ఞాపించెను.

చోరరాజు నానతి చొప్పున భటులు మహాసీలవరాజును అమాత్యు లను చేతులు కట్టి తీసికొని పోయిరి. ఆసమయమున సీలవమహారాజు చోరరాజునెడల విరుద్ధ భావముతో లేడు. రాజానుచరులు సువినీతు లగుటచే ఒక్కడును బంధనకాలమున రాజాజ్ఞను ధిక్కరింపలేదు.

చోరరాజపురుషులు సీలవమహారాజును అమాత్యులను శ్మశానము నకు దోడ్కొనిపోయి రాజును నడుమగాను అమాత్యులను చుట్టును మెడవరకు పాతిపెట్టి వెడలిపోయిరి. సీలవరాజు అమాత్యులతో "మిత్రులారా, చోరరాజునెడ కోపము వలదు, మైత్రియే తలపెట్టుడు" అని పలికెను. రాత్రివేళ నక్కలు వచ్చి మానవమాంసమును భక్షింప నున్నవి. వానిని జూచి రాజు అమాత్యులు నొక్కపెట్టున కేక వేసిరి. సృగాలములు భయపడి పరుగెత్తినవి. అవి వెనుదిరిగి చూడగా నెవ్వ రును కానరాలేదు. అంతట నక్కలు మరలి వచ్చినవి. వెనుకటివలెనే

వా రందరును పెద్దపెట్టున కేకలు వేసిరి. ఇట్లు వచ్చుచు పోవుచు నక్కలు తెదకు ఎవరును వెనుదరుమకుండుట చూచి వారు వధ్యులు కానోపు నని ధైర్యము తెచ్చుకొని వారు కేకలు వేసినను పరుగెత్తక జ్యేష్ఠ సృగాలము రాజును, తక్కిన నక్కలు మిగిలిన వారిని సమీపించినవి.

ఉపాయ కుశలు డగు రాజు పెద్దనక్క వచ్చుట గ్రహించి కరచుట కవకాశ మిచ్చిన వానివలె మెడపైకెత్తి, దాని దౌడలు యంత్రమున పట్టినట్లు పండ్లతో గట్టిగా బట్టుకొనెను. నాగబలు డగు రాజు పట్టిన పట్టు విడిపించుకొన నేరక సృగాలము పెద్దపెట్టున ఊలపెట్టెను. దాని యార్తనాదము విని తక్కిన నక్కలు ఎవరో పట్టుకొన్నా రని భయ పడి, పలాయనము చేసెను.

రాజు పట్టు పట్టిన నక్క మరణ భయముతో గిజగిజ కాళ్ళతో తన్నుకొనుచుండ చుట్టు ప్రక్కల మన్ను రేగెను. మన్ను బిగువు తప్పినదని రాజు గ్రహించి నక్కను విడిచి పెట్టెను. నాగ బలుడగు రాజు ఇటునటు బాగుగా కదలి చేతులు పైకి లాగుకొని గుంటయంచు తోడ్పాటున వాయు చాలితమైన మేఘమువలె పైకి లేచెను. రాజు తన వారి నోదార్చి, మన్ను తొలగించి, అందర నుద్ధరించి అమాత్యు లతో ఆమక శ్మశానము చేరెను.

ఎవరో చచ్చినవాని నచ్చట బడవేసి పోయిరి. ఆ శవము ఇరు వురు యక్షుల సరిహద్దు మీద బడినది. భాగము కుదరక వారు "ఈ సీలవరాజు ధార్మికుడు. దీనిని మనకు సమముగా విభాగించి యిచ్చును. ఈయన సన్నిధికి బోవుదము" అని శవమును కాళ్ళు పట్టి యీడ్చుకొని రాజు కడ కేగి, "దేవా, దీనిని మాకు విభాగించి యిమ్ము" అని యడిగిరి.

"యక్షులారా, విభజించి యిత్తును. కాని నేను పరిశుభ్రముగా లేను. ముందు స్నానము చేయవలెను" అని రాజు చెప్పెను.

చోర రాజుకై యుంచిన సుగంధి సలిలమును ప్రాసాదమునుండి తమ ప్రభావముచే యక్షులు కొని వచ్చి రాజుకు స్నానము చేయించిరి. రాజసౌధమునుండి వస్త్రములు తెచ్చి యిచ్చిరి. చతుర్విధ ద్రవ్యము లున్న సముద్గకమును గొనివచ్చిరి. అనులేపన మైన పిమ్మట బంగరు

పూల సెజ్జలో మణితాళవృంతములమీద పుష్పములు పెట్టి తెచ్చి యిచ్చిరి. ఇంకేమి కావలె నని యడిగిరి. రాజు ఆకలి లక్షణములను సూచించెను. చోర రాజుకు సిద్ధము చేసిపెట్టిన నానావిధ రుచ్య భోజన పదార్థములను పళ్ళెరములలో తెచ్చి పెట్టిరి. సువర్ణ కలశముతో సలిలమును, బంగరు గిన్నెను తెచ్చి యిచ్చిరి.

పానీయముతో రాజు ముఖ హస్త ప్రక్షాళనము చేసికొనిన పిదప పంచ సుగంధ ద్రవ్య సంయుత మగు తాంబూలము తెచ్చిరి. ఇంకేమి కావలెను అని వా రడిగిరి. "పోయి చోర రాజు తలక్రింద నుంచు కొన్న మంగళ ఖడ్గమును కొనిరండు" అని రాజు చెప్పగా వా రట్లే చేసిరి.

రాజు శవమును నిలువుగా నుంచి ఖడ్గముతో శిరమునుండి క్రిందికి సమానముగా రెండు భాగములు చేసి యక్షులకు సరిగా పంచి యిచ్చి కత్తికడిగించి, నడుమునకు కట్టుకొనెను.

యక్షులు మానవ మాంసము భుజించి సంతుష్ట చిత్తులై "మహా రాజా, ఇంకేమి చేయుదుము?" అని యడిగిరి. "నిజప్రభావముచే మీరు నన్ను చోరరాజు శయనాగారమున నిలుపుడు. ఈయమాత్యు లను వారి వారి గృహములలో విడిచిపెట్టుడు" అని రాజు చెప్పగా చిత్తము దేవా, అని వా రాప్రకారమే చేసిరి.

అలంకృత శయనాగారములో చోరరాజు ఆసమయమున నిద్రించు చుండెను. కత్తి వెనుక భాగముతో వాని యుదరముపై సీలవమహారాజు తట్టెను. వాడులికిపడి లేచి భీతచిత్తుడై సీలవమహారాజును దీప కాంతిలో గురుతించి, లేచి ధైర్యము తెచ్చుకొని "మహారాజా, ఇట్టి రాత్రివేళ భటరక్షితపిహిత కవాటమయిన యీ భవనములోనికి ఖడ్గ హస్తులై యెటులీ శయనపార్శ్వమునకు రాగలిగితిరి?" అని యడిగెను.

రాజు సవిస్తరముగా నంతయు జెప్పగా చోరరాజు విని ఉద్విగ్న చిత్తుడై "నేను సామాన్య మానవుడను. నీగుణమును గ్రహింపనైతిని, రక్తమాంసముల మీద జీవించు యక్షులు కూడ నీగుణము గ్రహింప గలిగినారు. నరేంద్రా, శీలసంపన్నుడ వగు నీతో విరోధింపను" అని ఖడ్గము దీసి దానిపై శపథము చేసి, రాజును సమాధాన పరచి, మహాశయ్యపై పండుకొమ్మని తాను చిన్న మంచముపై బండుకొనెను.

సూర్యోదయ మయిన వెంటనే కోసలరాజు భేరి వేయించి సర్వ శ్రేణులను అమాత్య బ్రాహ్మణులను గృహపతులను సమావేశపరచి, వారి సమక్షమున సీలవమహారాజు గుణములను ప్రస్తుతించి, పరిషన్మధ్యమున రాజును క్షమాపణ వేడి, రాజ్యము తిరుగ నిచ్చుచు "నేటి నుండి మీకు గలుగు చోరోపద్రవమునకు నేను బాధ్యుడను. నా సంరక్షణలో మీరు పరిపాలన చేయుడు" అని పలికి, కొండెగానికి శిక్ష విధించి, ససైన్యముగా నిజరాజ్యమునకు బోయెను.

సీలవమహారాజ లంకృతుడై ధవళ వితానము క్రింద శరభ పాదముల కాంచన పల్యంకికపై గూరుచుండి నిజవైభవమును గూర్చి యిట్లు తలపోసెను: "నేను దృఢవ్రత మవలంబింపనిచో నిట్లు జరిగెడిది కాదు. అమాత్య సహస్రమునకు ఉజ్జీవము కలిగినది. ఎవరైనను నిరుత్సాహము చెందక దృఢవ్రతమే అవలంబింపవలెను. నిజపరిశ్రమచే ఫలితము కలుగును." ఇట్లు తలపోసి బోధిసత్త్వుడు నిజోత్సాహము సూచించు ఈగాథ పలికినాడు:

పురుషు డౌవా డాశ పొందియే యుండు
పొంద డెందు నిరాశ బుద్ధిమంతుండు.
నన్ను నే జూచుకొన్నాడ— లభించె
వాకోర్కె యెట్టిదో నా కట్టిఫలము.

ఇట్లు చెప్పి, యావజ్జీవము దానాది పుణ్యకార్యములు చేయుచు తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుకథలు సరిపోల్చి, జాతకసారాంశము వెలువరించెను. అప్పటి దుష్టామాత్యుడు దేవదత్తుడు; సహస్రామాత్యులు నేటిబుద్ధపరిషత్తు; సీలవమహారాజు నేనే.

## 52 చూలజనక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా స్థైర్యము కోల్పోయిన భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతని విషయమై చెప్పదగినది అంతయు మహాజనక జాతకమున (539) వచ్చును.

### అతీత కథ

జనకరాజు శ్వేతచ్ఛత్రము క్రింద గూరుచుండి యీ గాథ చెప్పెను.

పురుషుండు యత్నంబు పోలి పోలి జేయు
పొందజెందు నిరాశ బుద్ధిమంతుండు
నన్ను నే జూచుకొన్నాను—నిక్కముగ
ఎక్కగల్గితి నొడ్డు నే నీటినుండి.

స్థైర్యము కోలుపోయిన భిక్షువు అంతట అర్హత్వము పొందెను. జనకరాజు సమ్యక్-సంబుద్ధుడే.

## 53 పుణ్ణపాతి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండ విషాక్త మద్యమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకసారి శ్రావస్తిలో మద్యపాయులు ఒకచో జేరి ఇట్లాలోచించిరి. "మద్యము కొనుటకు మనచేత పైసాకూడ లేదు, ఇప్పుడు పైసా యెక్కడ లభించును?" మహాధూర్తు డొకడిట్లనెను. "విచారింప

వలదు. ఉపాయ మున్నది. అది యెట్టిది? అనాథ పిండికుడు వ్రేలికి ఉంగరము పెట్టుకొనును; సన్నని వలిపములు కట్టుకొనును; అనంతరము రాజసేవార్థము పోవును. మద్యభాండములో మనము అపస్మారక ఔషధము కలిపి దుకాణము పెట్టి, అనాథపిండికుడు త్రోవన వచ్చునపుడు "మహాశ్రేష్ఠీ, దయచేయుడు" అని ఆహ్వానించి, ఆయనకు మద్య మిచ్చి, ఆయనకు స్మృతి తప్పినపిదప వ్రేలియుంగరము తీసి వస్త్రములు మార్చివేసి అవి అమ్మి పైసలు జమ చేయుదుము." వారందరును సరే అని ఆప్రకారముగా ఏర్పాటు చేసి, ఆయన వీధి వెంట వచ్చుచుండగా దగ్గరకు బోయి, "స్వామీ, కొంచె మీటు దయచేయుడు, మాకడ చాల చక్కని మద్య మున్నది. కొంచెము పుచ్చుకొందురు గాని" అని పలికిరి. స్రోతాపన్న ఆర్యశ్రావకు డైన అనాథపిండికుడు మద్యము త్రాగునా? అవసరము లేకున్నను ఈధూర్తులను పరీక్ష చేయ దలచి దుకాణములోనికి బోయి, వారి విధానము గమనించి, సంగతి గ్రహించి వారి నక్కడనుండి పారద్రోలనెంచి "అరే, దుష్ట ధూర్తులారా, మీరు సురాభాండములో మందు కలిపి, వచ్చువారలచే త్రాగించి, వివశులను జేసి, వారిని దోచుకొను తలపుతో ఈదుకాణము పెట్టినారా? ఎవడును లేచి త్రాగుటకు స్థైర్యము లేదే. ఇందులో మందు కలపనిచో ముందు మీరే త్రాగుదురు" అనెను: ఆయన ధూర్తులను నిందించి ఇంటికి పోయి, ఈ విషయము తథాగతునకు నివేదింతును అనుకొని జేతవనమువకు జని, తథాగతునకు విన్నవించెను. బుద్ధుడు "గృహపతీ, ధూర్తు లీనాడు నిన్ను వంచింప నెంచిరి; పూర్వము పండితులను గూడ మోసగింప తలపెట్టిరి" అని ఆయన వేడినపిమ్మట పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డానగరమునకు శ్రేష్ఠి యయ్యెను. ధూర్తులు కొందరు గుమిగూడి సుర సమకూర్చి, శ్రేష్ఠి కెదురు పోయి విన్నవము చేసిరి. శ్రేష్ఠి సుర త్రాగ నిచ్చలేనివా డయ్యును వారివ్యవహారము బట్ట

భయులు చేయు తలపున జని, వారి కుట్ర కనిపెట్టి, "ధూర్తులారా! మరి త్రాగి రాజకులమునకు బోవుట యుక్తము కాదు. రాజదర్శనము చేసి తిరిగి వత్తును. మీ రిక్కడనే యుండుడు. అప్పు డాలోచింత" మనెను.

ఆయన రాజకులమునుండి మరలి వచ్చి "ధూర్తులారా, మీరు చేసినపని నాకు నచ్చలేదు. మీ సురాపాత్రలు యథాపూర్ణముగా నున్నవి, మీరు సురను వర్ణించినారే కాని త్రాగలేదు. ఇది మంచి దైన పక్షమున మీరు త్రాగియుందురు. ఇయ్యది విషాక్తము కానోపు" నని వారి మనోరథము భగ్నముచేసి ఈ గాథ పలికెను:

ఆదిలో నున్నట్లె ఆసవపాత్ర
లున్నవి నిండు ; వే రొండు తోచినది
వీక్షింప నాసవవిధము, రూపంబు
మంచిది కా దని మది జనించినది.

ఆయన యావజ్జీవము దానాది పుణ్యకార్యములు చేయుచు నిజకర్మోచితముగా వెడలిపోయెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువ రించెను. అప్పటి ధూర్తులు ఇప్పటి ధూర్తులే. వారాణసీశ్రేష్ఠి నేనే.

## 54 ఫల జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుచుండ పండ్లు గురుతించు ఉపాసకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలోని గృహస్థొకడు బుద్ధప్రముఖ భిక్షుసంఘమును నిమంత్రించి, తన యారామములో కూరుచుండబెట్టి యవాగు పానీయ

మిచ్చి, తనతోటమాలితో "నీవు భిక్షువుల వెంట తిరుగుచు, ఆర్యు లకు మామిడి మొదలగు ఫలములు ఇచ్చుచుండుము" అని ఆన తిచ్చెను. వాడు సరే అని భిక్షుసంఘమును వెంట గొని ఉద్యానమున తిరుగుచు వృక్షమును చూడగానే ఇవి పచ్చికాయలు, ఇవి దోర కాయలు, ఇవి పండినవి, అని గ్రహించుచుండెను. వాడు చెప్పినట్లే సరిపోవుచుండెను. భిక్షువులు పోయి తథాగతునితో "భన్తే, ఈమాలి పండ్లను గురితించుటలో ప్రవీణుడు. నేలమీద నిలుచుండి చెట్టుకేసి చూడగానే ఇవి పచ్చికాయలు, ఇవి దోరకాయలు, ఇవి పండినవి అని గ్రహించుచున్నాడు. ఇతడు చెప్పినట్లే సరిపోవుచున్నది" అని విన్న వించిరి. బుద్ధుడు "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ బుద్ధిమంతు లగువారు ఫలములు గురుతించుచుండిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠి కులమున బుట్టి, ప్రాప్తవయస్కుడై 500 శకటము లతో వ్యాపారము చేయుచు, ఒకప్పుడు మహాపథమున జనుచు అటవీ ముఖమున ఆగెను. తనపరిజనము నొకచో జేర్చి "ఈయడవిలో విష వృక్షము లున్నవి. ఇదివరలో మీరు మూచూడని ఫల, పుష్ప, పత్ర, మేది కానవచ్చినను నన్నడుగకుండ భుజింపవలదు" అని యాతడు చెప్పెను. సరే అని వారు కానలో బ్రవేశించిరి. అటవీముఖమందలి యొకానొక గ్రామద్వారమున కింపాక ఫలవృక్షము కలదు. బోదె, కొమ్మలు, ఆకులు, పూవులు, పండ్లు — అన్నిటిలో కింపాకము ఆమ్ర వృక్షమును పోలియుండును. కేవలము రంగే కాక రస గంధములు కూడ సమానములే. పచ్చి కాయలుకూడ అంతే. తినువారి ప్రాణ ములను హాలాహలమువలె హరించును.

ముందు సాగిపోవుచున్న కొందరు చపలచిత్తులు "ఇది ఆమ్రవృక్ష" మని పండ్లు కోసి తినిరి. కాని కొందరు "సార్థవాహుని అడిగిన పిమ్మట తిందము" అని చెట్టుకడ పండ్లు చేత బట్టుకొని ఆయన వచ్చువరకును నిలిచి యుండిరి. ఆయన రాగానే "ఆర్యా, ఈ మామిడిపండ్లు మేము

తినవచ్చునా?" అనిరి. ఆమ్రవృక్షము కా దని బోధిసత్త్వుడు గ్రహించి "ఇది ముసిడిచెట్టు, కాని మామిడిచెట్టు కాదు. తినవలదు" అని వారిని నివారించి, తిన్నవారిచేత కక్కించి, చతుర్మధురములు త్రాగించి నీరోగుల జేసెను.

పూర్వ మీవృక్షముక్రింది నిలిచి, పండ్లు తిని, జనులు మరణించెడి వారు. గ్రామవాసులు వచ్చి శవముల కాళ్ళుపట్టి యీడ్చి, మాటున బారవేసి, బండ్లలోని సరకులు కొనిపోయెడి వారు. అరుణోదయ కాలముననే గ్రామవాసులు చెట్టుకడకు బోయి బండ్లు, వృషభములు, సరకులు తమ కని నిర్ణయించుకొనిరి. కాని అందరు ఆరోగ్యవంతులుగా నుండుట గ్రహించి "ఇది మామిడిచెట్టు కా దని మీ కెట్లు తెలిసినది?" అని వారి నడిగిరి. "మాకు తెలియదు. సార్థవాహజ్యేష్ఠునకు తెలిసినది" అని వారు చెప్పిరి. గ్రామవాసులు బోధిసత్త్వుని సమీపించి "పండితోత్తమా, ఇది ఆమ్రవృక్షము కా దని మీ కెట్లు తెలిసినది?" అనిరి. "రెండు కారణములవలన తెలిసినది" అని ఆయన ఈ గాథ పలికినాడు :

ఎక్కుటలో కష్ట మేమియు లేక
ఊరికి చెంగట నున్న దీతరువు
ఈ రెండు విషయమ్ము లెంచగా దోచు
అస్వాదు ఫలముల యవనీజ మనుచు.

బోధిసత్త్వుడు మహాజనమునకు ధర్మ ముపదేశించి, సుఖముగా ప్రయాణము చేసినాడు.

శాస్త ధర్మోపదేశము చేసి, కథలు సరిపోల్చి, జాతకసారాంశము వెలువరించెను. అప్పటి పరిషత్తు ఇప్పటి బుద్ధపరిషత్తు; సార్థవాహుడు నేనే.

## 55 పంచాయుధ జాతకము

బుద్ధుడు జేతవనమున విహరించుచున్నపుడు ధైర్యము కోల్పోయిన భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆభిక్షువును బిలిపించి బుద్ధుడు "భిక్షూ, నీవు నిజముగా స్థైర్యము కోలుపోయినావా?" అని అడుగగా, అతడు "భగవన్, నిజమే" అన్నమీద, "భిక్షూ, పూర్వము బుద్ధిమంతులు స్థైర్యముతో నుండ వలసినచోట అట్లే యుండుటచే రాజసంపత్తి పొందిరి" అని, పూర్వ జన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడా రాజు పట్టపుమహిషి కడుపున బుట్టినాడు. అతని నామ కరణమునాడు 800 బ్రాహ్మణులను సంతృప్తులను జేసి, బాలుని భవి ష్యత్తు ప్రభు వడిగెను. లక్షణకుశలు లగు బ్రాహ్మణులు లక్షణములు చూచి పుణ్యసంపన్ను డగు మహారాజ కుమారుడు మీ యనంతరము రాజ్యమునకు వచ్చును. పంచాయుధకర్మలలో ప్రతిష్ఠితుడై జంబూ ద్వీపమున అగ్రగణ్యు డగును" అని వివరించిరి. బ్రాహ్మణవచనమును బట్టి పసివానికి పంచాయుధ కుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగిన పదునారవయేట రాజు పిలిచి "నాయనా, శాస్త్ర మభ్యసింపుము" అని చెప్పెను. "ఎవరి సన్నిధిలో అభ్యసింతును దేవా?" అన్నా డతడు. "గాంధార రాష్ట్రమున తక్షశిలా నగరమునకు బొమ్ము. అక్కడ జగద్విఖ్యాతాచార్యు నొద్ద చదువుము. ఇదిగో గురుదక్షిణ" అని రాజు వేయినాణెము లిచ్చి కుమారుని బంపెను.

రాజకుమారుడు తక్షశిలకు బోయి చదివి, ఆచార్యు డిచ్చిన పంచాయుధములను గ్రహించి, ఆచార్యునకు నమస్కరించి, తక్షశిల

నుండి బయలు వెడలి, సన్నద్ధ పంచాయుధుడై వారాణాసీమార్గము పట్టెను.

శివేశలోమ యక్షాధిష్ఠిత మైన యడవి మార్గములో ప్రాపించిన యతనికి అటవీముఖమున కొందరు మనుజులు కానబడి, "మాణావకా, ఈ యడవిలో బ్రవేశింపవలదు. శివేశలోమ నామక యక్షుడు ఇం దున్నాడు. చూచీ చూడకముందే మానవ ప్రాణములు హరించును" అని వారించిరి. సింహమువలె నిర్భీత చేతస్కుడై బోధిసత్త్వుడు అటవిలో జొచ్చి తన్మధ్యమున యక్షుని సమీపించెను. తాళమాత్ర ప్రమాణుడు, కూటాగార మాత్రమ స్తకుడు, భాజనప్రమాణ నేత్రుడు, కందమూలప్రమాణ దంష్ట్రాద్వితయుడు, శ్యేననాసుడు, కిమ్మీరకుక్షి, నీలహ స్తపాదుడు నగు యక్షుడు బోధిసత్త్వుని జూచి "ఎక్కడికి పోవు చున్నావు? ఆగు, నాకు భక్ష్యమవు" అనెను. "యక్షా, ఆలోచిం చియే నే నిచ్చటికి వచ్చినాను. అప్రమత్తుడవై నన్ను సమీపింపుము. విషదిగ్ధశరము విడిచి ఇక్కడ నుండియే నిన్ను పడగొట్టగలను" అని పలికి ఆయన హాలాహలమున ముంచిన బాణము ధనుస్సున సంధించి విడిచెను. అది యక్షుని రోమములలో చిక్కుకొనెను. వరుసగా నతడు 50 బాణములు విడిచెను. అన్నియు యక్షుని రోమములలోనే చిక్కుకొనెను. యక్షుడు విదిలింపగా ఆ బాణము లన్నియు పాదముల కడ బడినవి. యక్షుడు బోధిసత్త్వుని మీదికి బోయెను. ఆయన తర్జించి క త్తి దూసి, వానిని గొట్టెను. ముప్పదిమూ డంగుళముల క త్తి బాణములవలెనే వాని రోమములలో జిక్కుకొన్నది. ఆవల బోధి సత్త్వుడు బల్లెము విసరెను. అదియు రోమములలో జిక్కుకొనుటచే ముద్గరము విసరినాడు. అదియును రోమములలోనే చిక్కుకొన్నది. బోధిసత్త్వుడు "యక్షా, పంచాయుధ కుమారుని పేరు నీవు వినలేదను కొందును. నీ వధిష్ఠించిన యటవిలో బ్రవేశించునపుడు ధనురాదులను నమ్మక, ఆత్మవిశ్వాసముతో బ్రవేశించినాను. ఇప్పుడు నిన్ను పొడి పొడి చేయుదును" అని కుడిచేతితో యక్షుని ప్రహరించెను. హ స్తము రోమములలో జిక్కుకొన్నది. ఎడమచేతితో కొట్టగా అదియును చిక్కుకొని పోయెను. కుడికాలితోను, ఎడమకాలితోను తన్నినాడు. అవియు అంటుకొని పోయినవి. శిరస్సుతో పోటు పొడిచినాడు.

అడ్డయు అంటుకొని పోయినది. ఏదుతావ్రుల అంటుకొని పోయినను ఆయన నిర్భయుడుగాను, సారభూతుడుగాను ఉండెను. యక్షు డిట్లు చింతించెను: "ఇతడు పురుషసింహుడు, అసమాన వీరుడు. మానవ మాత్రుడు కాడు. నావంటి యక్షునిచే జిక్కినను సంత్రాసము చెంద లేదు. ఈమార్గమున బాటసారుల ననేకుల సంహరించినాను. కాని ఇట్టి పురుషు నింతవరకు జూడలేదు. ఇతడేల భయపడడో?" ఇట్లు తలచి ఆయనను మ్రింగక "మాణవకా, ఏల నీకు మరణభయము లేదు?" అని యడిగెను.

"ఏల భయపడ వలెను? యక్షా, ఒక్క పుట్టుకకు ఒక్కమరణము నిర్ణీతముకదా? అంతే కాక నా కడుపులో వజ్రాయుధ మున్నది. నీవు నన్ను మ్రింగినయెడల జీర్ణించుకో లేవు. ఆయుధము నీ పేగులను ఖండించును. నీ ప్రాణములు హరించును. ఇట్లు ఉభయులము నశింతుము. కావున నాకు భయము లేదు." దీని వలన బోధిసత్త్వుడు తనలో నున్న జ్ఞాన బలమును అనుసంధించి చెప్పియుండును.

అది విని యక్షు డిట్లు తలచెను. "ఈ మాణవకుడు సత్యమే పలికినాడు. ఈ పురుషసింహుని శరీరమునుండి సర్షపమాత్రము మాంస ఖండమును నాకుక్షి జీర్ణించుకొన జాలదు. ఇతనిని విడిచిపెట్టెదను" అని మరణ భయముచే యక్షుడు బోధిసత్త్వుని విడిచిపెట్టి, "మాణవకా, నీవు పురుష సింహుడవు. నీ మాంసము తినను. నేడు నీవు రాహు ముఖమునుండి విడివడిన చంద్రబింబమువలె నా చేతులలో నుండి విమోచనము పొందినావు. పోయి జ్ఞాతిమిత్రసంఘమునకు హృదయానందము కూర్పుము" అని పలికెను.

"యక్షా, నేను పోవుదును. నీవు పూర్వము దుష్కర్మలు చేసి, మానవ రక్త మాంసములు భుజించి లుబ్ధ యక్షుడవై పుట్టినావు. ఇప్పుడు కూడ దుష్కర్మము చేయుచున్నచో అంధకారమునుండి అంధకనరకమునకు బోదువు. కాని నన్ను జూచిన దాదిగా నీవు పాప కర్మలు చేయలేవు. ప్రాణి వధవలన నిరయము, తిర్యగ్యోనిలో పుట్టువు గాని అసుర కాయము గాని కలుగును. ఒకవేళ మానవ జన్మ మెత్తినచో అల్పాయుర్దాయము కలుగును" అని నయమార్గమున బోధించి, పంచ దుర్మార్గములు, పంచ సన్మార్గములు వివరించి, వివిధ విధముల

యక్షుని బెదరించి, ధర్మము బోధించి, ధర్మ పంచశీల ప్రతిష్ఠాపన చేసెను.

అనంతరము యక్షుని అడవిలో బలిప్రతిగ్రహీతగా నియోగించి, దేవతగా జేసి, అప్రమాదముతో నుండుమని యుపదేశించి, బోధిసత్త్వ డీవలకు వచ్చి, అటవీ ముఖమున పరివారమును కలిసికొని, పంచాయుధములతో వారణాసికి బోయి, తల్లి దండ్రులను దర్శించెను. అనంతరము రాజు దానాది పుణ్య కార్యములు చేయుచు యథా కర్మంగతో.

ఉత్సాహియై యెవ్వ డుత్సాహబుద్ధి
నిర్వాణసిద్ధి గాంక్షించి, కావించు
శుభకర్మ, మాతండు సుక్రమంబుగను
సర్వసంయోజన క్షయమును గాంచు.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రకటించినపిదప ఆభిక్షువు అర్హత్త్వము పొందెను. శాస్త రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి యక్షుడు ఇప్పటి అంగులిమాల; పంచాయుధ కుమారుడు నేనే.

## 56 కంచనక్ఖంధ జాతకము

శాస్త శ్రావస్తిలో విహరించుచు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తి నివాసి కులపుత్రు డొకడు శాస్త చేసిన ధర్మోపదేశము విని త్రిరత్న శాసనమున అత్యంత శ్రద్ధచే ప్రవ్రజితు డయ్యెను. అతని ఆచార్య ఉపాధ్యాయుడు "ఆయుష్మన్, శీలము (సదాచారము) ఒక విధముగాను, రెండువిధములుగాను, నాలుగు విధములుగాను, ఐదు విధములుగాను, ఆరు విధములుగాను, ఏడు విధములుగాను, ఎనిమిది

విధములుగాను, తొమ్మిది విధములుగాను, పది విధములుగాను——ఇట్లు బహువిధములుగా నుండును. ఇది గౌణశీలము, ఇది మధ్యమశీలము, ఇది మహాశీలము, ఇది ప్రాతిమోక్షసంవరశీలము, ఇది ఇంద్రియ సంవర శీలము, ఇది ఆజీవికా పరిశుద్ధ శీలము, ఇది ప్రత్యయ ప్రతిసేవన శీలము, దీనిని శీల మందుము" అని చెప్పిరి. అతడు ఇట్లు తలపోసెను: "శీలములు అనేకముగా ఉన్నవి. నేను ఇన్ని శీలములను నాపై పెట్టుకొని వాని కనుగుణముగా ఆచరింపలేను. శీలముల కనుగుణముగా ఆచరణము లేనిచో ప్రవ్రజించి ప్రయోజన మేమి? నేను గృహస్థుడనై దానాది పుణ్యకార్యములు చేయుదును, భార్యను, బిడ్డలను పోషింతును." ఇట్లు యోచించి అతడు "భన్తే, నేను శీలమును పాలింపజాలను. శీలము పాలింపలేనివానికి ప్రవ్రజ్యవలన ఫల మేమి? నేను గృహస్థు నగుదును. నాపాత్రలు, చీవరములు కొనిపోవుదును" అనెను.

"ఆయుష్మన్, అట్లగుచో, బుద్ధునకు ప్రణామము చేసి పొమ్ము" అని వారు అతనిని ధర్మసభలో నున్న బుద్ధుని కడకు కొనిపోయిరి. బుద్ధుడు చూడగనే "భిక్షువులారా, ఇష్టములేని ఈభిక్షువును ఏల కొనివచ్చితిరి?" అనెను.

భన్తే, ఈభిక్షువు, "నేను శీలములను పాలింపలేను; పాత్రములు చీవరములు కొనిపోవుదు" నన్నాడు. కావున మేము ఈతనిని కొని వచ్చినాము."

"భిక్షువులారా, మీరు ఈభిక్షువుకు ఎక్కువ శీలము లిన్ని ఏల చెప్పితిరి? ఇతడు పాలింప కలిగినన్ని పాలింపవచ్చును. నేటినుండి ఇతని కేమియును చెప్పవద్దు. చేయదగిన దేదో దానిని చూతును" అని బుద్ధుడు "భిక్షువూ, రమ్ము, నీకు ఎక్కువ శీలములు ఎందుకు? కేవలము మూడు శీలములను పాలింపగలవా?" అనెను.

"భన్తే, పాలింపగలను."

"అట్లయినచో నీవు నేటినుండి కాయద్వారము, వచోద్వారము, మనోద్వారము——ఈమూడు ద్వారములను రక్షింపుము. శారీరకముగా వాచికముగా, మానసికముగా, పాపకర్మము చేయవలదు. పొమ్ము, గృహస్థుకాకుము. ఈశీలములను రక్షింపుము."

అంతటి నుండి భిక్షువు సంతుష్టచిత్తుడై, "భన్తే చిత్తము. నేను

యీామూడు శీలములను రక్షింతును" అని శాస్తకు ప్రణామము చేసి ఆచార్య ఉపాధ్యాయునితోపాటు కదలి పోయెను.

ఆమూడు శీలములను పూర్తిచేయునప్పటికి ఆచార్య ఉపాధ్యాయుడు చూపిన శీలములు ఇవియే అనియు కాని ఆచార్యుడు బుద్ధుడు కాకపోవుటచే తనకు చక్కగా తెలుప లేకపోవుట అతనికి విదితమయ్యెను. సమ్యక్-సంబుద్ధుడు సుబుద్ధుడు అగుటచే ధర్మరాజు అగుటచే అంత శీలమునే మూడు ద్వారములలో ఇమిడ్చి నాచే స్వీకరింప చేసినాడు. శాస్త నాభాధ్యత వహించినాడు" అని విదర్శనా భావన వృద్ధి చేసికొని కొలదిరోజులలోనే అర్హత్వము నొందెను.

ఆసమాచారము విని భిక్షువులు ధర్మసభలో కూరుచుండి ఇష్టాగోష్ఠి చేయుచు "ఆయుష్మంతులారా, శీలమును రక్షింపలేను అని గృహస్థుడగుటకు సిద్ధపడిన భిక్షువును శాస్త సర్వశీలములను మూడు భాగములు చేసి అతనిచే స్వీకరింపచేసి, అతనికి అర్హత్వ పదవి లభింప చేసినాడు! ఓహో! బుద్ధులు ఆశ్చర్యకారకులు'. అనుచు బుద్ధ గుణములను ప్రశంసించుచుండిరి. శాస్త అరుగుదెంచి "భిక్షువులారా, ఇచ్చట గూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అని అడిగెను. ఫలాని విషయము అని వారు చెప్పగా శాస్త "భిక్షువులారా, విశేష భారమును విభాగము చేసి యిచ్చినచో తేలికగా దోచును. పూర్వకాలమున కూడ బుద్ధిమంతుడు సువర్ణనిధి దొరకగా ఎత్తలేక, విభాగములు చేసి ఎత్తుకొనిపోయెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచున్నపుడు బోధిసత్త్వుడు ఒక గ్రామములో కర్షకుడై జన్మించెను. పాడుపడిన గ్రామములోని యొక పొలమున నొక నాడాయన దున్నుచుండి వెనుకటి రోజులలో మహావిభవ సంపన్నుడైన శ్రేష్ఠి తొడయంతటి లావును, నాలుగు మూరల పొడవును గల బంగరు కడ్డీ భూమిలో పాతిపెట్టి కాలధర్మము చెందెను. బోధిసత్త్వుని నాగలి దానికి తగులు కొన్నది. అది ప్రాకిన చెట్టు వేరేమో యని భావించి యాయన త్రవ్వి, దాని స్వరూపము గ్రహించి మన్ను దులిపెను.

ఆనాటికి పని పూర్తి యయిన పిదప నాగలి ఆవల నుంచి, సూర్యాస్తమయ మయినంతనే కాంచన ఖండమును గొనిపోవుదు నని తలచి యతడు దాని నెత్తబోవగా శక్తి చాల దయ్యెను. అతడు కూరుచుండి దీనినేమి చేయుదునని భావించి "ఈ భాగము జీవనార్థము, ఈ భాగము నిక్షేపార్థము, ఈ భాగము వ్యాపారార్థము, ఈ భాగము దానాది పుణ్య కార్యార్థము" అని కాంచన ఖండమును నాలుగు భాగములు చేసెను. విభాగము వలన నతని భారము తగ్గెను. వాని నతడు విడివిడిగా నింటికి గొని పోయెను. దానాది పుణ్య కార్యములు చేసి యాతడు కాలక్రమమున కర్మానుగుణ మగుపదవిని పొందెను.

ఎవ్వడు ప్రసన్నహృదయుడై, హృష్టచిత్తు
డగుచు నిర్వాణకాంక్ష కల్యాణధర్మ
భావన మొనర్చు, క్రమముగా వాడు కాంచు
అక్షయము సర్వసంయోజన క్షయంబు.

ఈ ప్రకారముగా బుద్ధుడు అర్హత్వ భారము వహించి ఉపదేశము సమాప్తము చేసి రెండు కథలను సరిపోల్చి జాతక సారాంశము వెలువరించెను. ఆకాలమున బంగారపు గని లభించినవాడను నేనే.

## 57 వానరిన్ద జాతకము

బుద్ధుడు వేళువనమున విహరించునపుడు దేవదత్తుడు వధార్థమై చేయు ప్రయత్నమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున బుద్ధుడు దేవదత్తుడు చేయుచున్న వధప్రయత్నము విని, "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ నా వధార్థమై దేవదత్తుడు యత్నించినవాడే. కాని బెదురుమాత్ర కలిగింప లేకపోయినాడు" అని పూర్వజన్మ కథ చెప్పెను :

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కపి గర్భమున బుట్టి, బుద్ధిమంతుడై అశ్వపోతక ప్రమాణము కలిగి క్షేమ సంపన్నుడై ఒంటిగా నదీతీరమున విహరించుచుండెను. నదీమధ్యమున లంక కలదు. అందులో మామిడి, పనస మొదలగు వివిధ ఫలవృక్షములు కలవు. బోధిసత్త్వుడు నాగబలుడు, దృఢగాత్రుడు నగుటచే నదీతీరమునుండి యెగిరి, లంకకు, నదికిని నడుమ నున్న పెద్ద పాషాణముమీదికి దుమికి, అచ్చటినుండి యెగిరి లంక జేరెడివాడు. అక్కడ వివిధ ఫలములను భుజించి వెనుకటి మార్గముననే మరలివచ్చి నిజనివాసమునకు సాయంసమయమున చేరుచుండు వాడు. ఈ ప్రకారముగా వానరేంద్రుడు కాలము గడపుచుండెను.

ఆకాలమున నొకానొక మొసలి భార్యతోగూడ నీటిలో నివసించుచుండెను. బోధిసత్త్వు డనుదినము వచ్చుచు పోవుచుండుట చూచి గర్భవతి యగు మొసలిభార్య బోధిసత్త్వుని గుండె తినగోరి భర్తతో "ఆర్యా, ఈ వానరేంద్రుని హృన్మాంసముమీద కోరిక పుట్టినది" అని చెప్పెను. "మంచిది, లభించును. నేటి సాయంకాలము వానరేంద్రుడు లంకనుండి మరలి వచ్చునప్పుడు పట్టుకొందును" అని పోయి మొసలి చట్టుబండపై పండుకొని యుండెను.

బోధిసత్త్వుడు పగ లంతయు తిరిగి సాయంసమయమునకు లంక యొద్దు చేరి, పాషాణమువైపు చూచి, "ఈబండ యెత్తుగా కానబడుచున్నది. కారణమేమో" అని యోచించెను. ఉదక ప్రమాణము పాషాణ ప్రమాణము స్పష్టమే. ఈనాడు నదీజలము హెచ్చలేదు, తగ్గలేదు. పాషాణము మాత్రము వర్ధిల్లినది. నన్ను పట్టుకొనుటకై మొసలి బండమీద పండుకొని యుండలేదుకదా? అని భావించి, పరీక్షింతునుగాక యని, అచ్చటనే నిలిచియుండి బిగ్గరగా "ఓ పాషాణమా!" అని కేక వేసెను. ప్రతివచనము రానందున, ఓ పాషాణమా యని మరల కేక వేసెను. అప్పటికిని బదులు రాలేదు. "పాషాణమా! ఈనాడు నాతో మాటాడవేమి?" అనెను. "వానరేంద్రునితో పాషాణము ప్రతిదినము మాటాడుచుండును కాబోలును" అనుకొని మొసలి

"వానరేంద్రా, ఏమి?" అనెను.

"ఎవరు నీవు?"

"నేను మొసలిని."

"ఎందుల కిచ్చట పండుకొన్నావు?"

"నీ గుండెకాయ వేడుటకై."

బోధిసత్త్వుడు తనలో "నేడు నాకు మార్గాంతరము లేదు. మొసలిని మోసగింపక తప్పదు" అనుకొని, "మిత్రమా, కుంభీలా, ఈనాడు నన్ను నీకు సమర్పించికొందును. నీవు నోరు తెరచుకొనియుండి నేను నీ సమీపమునకు వచ్చినంతనే నన్ను పట్టుకొనుము" అని పలికెను. నోరు తెరచినప్పుడు కన్నులు మూతపడునని యెరుగక, మకరము నోరు తెరచికొని యుండెను. తోడనే దానికన్నులు మూతలు పడినవి. బోధిసత్త్వుడు స్థితిగతులు గ్రహించి ద్వీపముమీది నుండి యెగిరి మొసలిమీదికి దుమికి, అక్కడనుండి విద్యుద్వేగమున నదీతీరమునకు లంఘించెను.

మకర మాశ్చర్యపడి "ఈ వానరేంద్రుడు అద్భుతకార్య మాచరించినాడు" అనుకొని, "ఓ వానరరాజా, ఈలోకములో నాలుగు ధర్మములతో గూడినవాడు ప్రతిపక్షులను పరిభవింపగలడు. ఆధర్మములన్నియు నీయందు కలవని తోచుచున్నది" అని పలికి, ఈగాథ చెప్పెను.

వానరనాథ, నీవలెనె సత్యంబు
ధర్మమ్ము ధృతియును, త్యాగమ్ము, కలుగు
నాతండె తప్పక అరుల జయించు.

ఈవిధముగా మకరము బోధిసత్త్వుని ప్రశంసించి, నిజనివాసమునకు బోయెను.

శాస్త్ర ధర్మోపదేశముచేసి, రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున మొసలి ఇప్పటి దేవదత్తుడు; దానిభార్య ఇప్పటి చించామాణవిక; వానరేంద్రుడు నేనే.

# 58 తయోధమ్మ జాతకము

బుద్ధుడు వేళువనమున విహరించుచుండ వధప్రయత్నము చేయువానిగూర్చి చెప్పినది.

## అతీత కథ

పూర్వము బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండగా దేవదత్తుడు వానరగర్భమున బుట్టి, హిమవత్ప్రదేశమున యూథ నాయకుడై యుండెను. తన మగబిడ్డలు నాయకత్వము నుండి తనను తొలగింతు రను భయముచే దంతములతో కరచి బీజములను లాగి వేయుచుండెను.

కొంతకాలమునకు బోధిసత్త్వుడు ఒకానొక వానరి కడుపున బడి నాడు. తన గర్భమును రక్షించుకొను తలపున ఆ వానరి పర్వతపాద మందలి యడవులలో జేరెను. మాసములు నిండిన పిమ్మట బోధిసత్త్వుని కనెను. అతడు ప్రాప్తవయస్కుడై మహాబలసంపన్నుడయ్యెను. అత డొకనాడు తల్లితో "అమ్మా, మానాయన యెక్కడ?" అన్నాడు.

"నీ తండ్రి ఆపర్వతమున యూథనాయకుడై యున్నాడు", "అమ్మా, ఆయనవద్దకు నన్ను తీసికొనిపొమ్ము". "నాయనా, నీతండ్రి వద్దకు తీసికొని పోలేను. తన బిడ్డలే తన నాయకత్వము హరింతు రను భయమున చాల బిడ్డల బీజములు కొరికి తీసివేసినాడు." "అమ్మా, భయములేదు. నన్నక్కడకు తీసికొని పొమ్ము."

ఆమె కుమారుని వెంట బెట్టుకొని తండ్రివద్దకు తీసికొని పోయెను. కుమారుని జూచి తండ్రి తనలో "వీడు నన్ను పదభ్రష్టుని జేయును. ఇప్పుడే వీనిని సంహరింపవలెను. వీనిని ఆలింగనము చేయునట్లు నటించి కంఠము నులిమివేయ వలెను" అని తలచి, "నాయనా, ఇంతకాల మెక్కడ నున్నావు?" అని కౌగలింతలో గట్టిగా నొక్కెను. నాగ బలుడు, క్షేమ సంపన్నుడు అగు బోధిసత్త్వుడు తండ్రిని గట్టిగ కౌగ లించుకొనెను. వృద్ధుని బొమికలు విరుగున ట్లయ్యెను. "ఈనాపుత్రుడు పెరిగి పెద్దవా డయినచో నన్ను వధించును. ఏయుపాయమున వీనిని సంహరింతును!" అని యోచించి, "రక్షః పరిగృహీతమైన సరస్సు దగ్గరలోనే యున్నది. అక్కడి రక్షస్సు వీనిని మ్రింగునట్లు చేసెదను"

అనుకొని "నాయనా, నేను వృద్ధుడను. ఈ రాజ్యమును నీవశము చేసెదను. నేడే నిన్ను రాజును చేతును. అచ్చట సరస్సు కలదు. అందు రెండురకముల కుముదములు, మూడువిధముల ఉత్పలములు, అయిదురకముల పద్మములు పూయును. అచ్చటికి బోయి పూవులు కొనిరమ్ము" అని చెప్పెను. బోధిసత్త్వుడు సరే, నాయనా, తీసికొని వత్తును అని చని, త్వరపడక, కాలి యడుగుజాడలు పరీక్షించి, లోనికి బోవునవే కాని పైకి వచ్చునవి కానక "ఈసరస్సు రాక్షసునిది కావలయును. స్వయముగా అశక్తుడై మానాయన రక్షస్సు చేత నన్ను సంహరింపచేయ దలచిన ట్లున్నాడు" అని భావించి, పాడిచోటికి బోయి, గప్పున నెగిరి, నీరు తగులకుండ ఆవలికి దుమికి, నీటిపై దేలు చున్న రెండుపూవులను లంఘనములో లాగెను. వెనుకకు దుముకుచు మరిరెండు పుష్పములు లాగెను. ఇట్లే పూవు లన్నియు గోసి, ఇరు ప్రక్కల కుప్ప వేసెను. నీరు తగులలేదు. ఉన్న పూవులు రాసి చేయు చున్న బోధిసత్త్వుని చూచి రక్షస్సు తనలో "ఇచ్చట నేను బహు కాలమునుండి నివసించుచున్నాను. ఇట్టి ప్రజ్ఞావంతుని, ఆశ్చర్యకర్ముని ము న్నెన్నడు చూడలేదు. కావలసినన్ని పుష్పములు కోసినాడు. నాకు పట్టుపడలేదు" అని తలపోసి ఉదకము రెండుపాయలు చేసి, బోధిసత్త్వు డున్నచోటికి వచ్చి, "వానరేంద్రా, ఈలోకమున ధర్మత్రయ మెవనికి గలదో అతడు శత్రువులను జయించును. నీలో యీమూడు గుణము లున్నవని తలతును" అని పలికి, స్తుతిచేయుచు ఈగాథ పలికినాడు :

వానరనాథ, నీవలెనె దక్షతయు
ప్రజ్ఞయు, శౌర్యము, బలిమియు కలుగు
నాతండె తప్పక అరుల జయించు.

ఉదక రక్షస్సు బోధిసత్త్వుని ఈ విధముగా స్తుతించి "పుష్పము లెందులకు గోనిపోవుచున్నావు?" అని యడిగెను. "నాతండ్రి నన్ను రాజును జేయ దలచినాడు. ఆ కారణముచే కొనిపోవుచున్నాను." "నీవంటి ఉత్తమ పురుషుడు పుష్పములు మోసికొని పోవరాదు" అని రక్షస్సు పూవుల నెత్తుకొని ఆయన వెంట జనెను.

బోధిసత్త్వుని తండ్రి దూరమునుండి చూచి "వీనిని రాక్షస భోజ

నముగా బంపినాను. కాని వీడు రక్షస్సుచే పుష్పములు మోయించు కొని వచ్చుచున్నాడు. నాపని అయినది!" అని చింతించుచుండ వాని గుండె ఏడు వక్కలయినది. వాడు ప్రాణములు తక్షణమే విడిచెను. మిగిలిన వానరము లన్నియు సమావేశము చేసి, బోధిసత్త్వుని రాజుగా ఎన్నుకొన్నవి.

శాస్త ధర్మోపదేశము చేసి, కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి వానరయూధపతి దేవదత్తుడు; యూధపతికుమారుడు నేనే.

## 59 భేరివాద జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా మాట వినని భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త ఆభిక్షువుతో "భిక్షూ, నీవు సత్యముగా ఎవరిమాట వినకున్నావా?" అనిన అతడు "భగవన్, సత్యమే" అన్నమీాద, "భిక్షూ, కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ ఎవరిమాట వినువాడవు కావు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు భేరీవాదన కులమున పుట్టి, కుగ్రామమున నివసించుచుండెను. వారాణసిలో ఉత్సవము జరుగుచున్న దని విని యాతడు సమాజమండలములో జేరి భేరి వాయించి, ధనము సమకూర్తునని తలచి, పుత్రుని వెంటబెట్టుకొని చని, యచ్చట బహుధనము సంపాదించెను. దొంగ లున్న యడవివెంట నాతడు మరలి రావలసి

యుండెను. ప్రయాణములో బాలుడు నిరంతరము భేరీ వాయించు చుండ బోధిసత్త్వుడు "నాయనా, ఎడతెగక వాయింప వలదు. ప్రభువుల భేరివలె నడుమ నడుమ వాయించు చుండు" మని చెప్పెను. "భేరీధ్వానముతో చోరులను పారద్రోలుదు" నని తలచి బాలుడు విడువక వాయించు చుండెను.

తొలిసారి భేరీ ధ్వని విని, యెవరో ప్రభువు పోవుచున్నా డని తలచి దొంగలు తొలగి చనిరి. కాని నిరంతర భేరీ ధ్వనివలన తమ భ్రాంతిని విడిచి, ఇరువురే యుండుట చూచి, కొట్టి, ధనము దోచు కొని పోయిరి. "ఆపక భేరీ వాయించి మనధనము నాశము చేసినావు" అని బోధిసత్త్వుడు ఈగాథ పలికెను.

ద్రోయింపు మోయి, భేరిని—
ద్రోయింపకు విడువకుండ ద్రోయించుటచే
ఆయత యత్న ప్రాప్తము
లై యొసగిన నూరుముద్ర లన్నియు పోయెన్.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుకథలు సరిపోల్చి, జాతకసారాంశము వెలువ రించెను. అప్పటి పుత్రుడు ఇప్పటి భిక్షువు; తండ్రి నేనే.

## 60 సంఖధమన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మాట వినని భిక్షువును గూర్చి చెప్పినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శంఖధమన కులమున బుట్టి, ఉత్సవమునకు తండ్రితో వారాణసికి బోయెను. అచ్చట వారు ధనము సంపాదించి యింటికి

మరలి వచ్చుచుండగా చోరు లున్న యడవిలో నిరంతరము తండ్రి శంఖ మూదుచుండగా కుమారుడు వారించెను. 'శంఖధ్వనిచే చోరులను పారద్రోలుదు' నని తలచి తండ్రి విడువక శంఖ మూదుచుండెను. చోరులు వచ్చి వారి ధనము దోమకొనిపోయిరి. అప్పుడు బోధిసత్త్వుడీగాథ పలికెను:

ఊదు శంఖము; తగుమాత్ర మొత్తదగును.
శంఖరవమున కూర్చిన సర్వధనము
కోలుపోయెను తండ్రి యెక్కువగ నూది.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున తండ్రి ఇచ్చటి యొండిభిక్షువు; పుత్రుడు నేనే.

## 61 అసాతమంత జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆసక్తచిత్తుడైనభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆభిక్షువుకథ అస్మదంతి జాతకమున (527) వచ్చును. బుద్ధుడా భిక్షువుతో "భిక్షూ, స్త్రీలు అసాధ్యులు, అసతులు, నికృష్టులు, నీవీప్రకారముగా పాపస్త్రీజాతియెడ ఏల ఆసక్తుడ వయియున్నావు?" అని పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు గంధార దేశములోని తక్ష శిలలో బ్రాహ్మణ వంశమున బుట్టి, పెద్దవాడయి మూడు వేదములు, సకల విద్యలు అభ్యసించి,

జగద్విఖ్యాతాచార్యు డయ్యెను.

వారాణసిలో బ్రాహ్మణ కుటుంబమున పుత్రుడు పుట్టగానే అగ్న్యాధానము చేసి, బాలునికి పదునారు వర్షములు వచ్చు వరకును అగ్నిని నిలిపి, తలిదండ్రులు కుమారునితో "నాయనా, నీవు పుట్టినప్పుడే, జాతవేదసుని ప్రతిష్ఠించినాము. నీవు బ్రహ్మలోక పరాయణుడవు కా దలచినచో, అగ్నిని గొని, అడవికి జని, అగ్ని భట్టారకుని సేవించుచు బ్రహ్మలోక పరాయణుడవు కమ్ము. ఇంట నుండదలచినచో తక్ష శిలలో విఖ్యాతాచార్యునికడ విద్య లభ్యసించి, గృహస్థువు కా వచ్చును" అని చెప్పిరి. మాణవకుడు 'అరణ్యములో అగ్ని దేవుని పరిచర్య చేయజాలను. గృహస్థునే అయ్యెదను' అని తల్లిదండ్రులకు మ్రొక్కి, ఆచార్యునికి దక్షిణ క్రింద సహస్రము (నాణెములు) తీసికొని తక్షశిలకు బోయి, విద్యలు నేర్చిన పిమ్మట ఇంటికి మరలి వచ్చెను.

ఆతడు లోకము విడిచి అగ్ని భట్టారకుని సేవించుచు అరణ్యములో నివసింపవలె నని తలిదండ్రుల కోరిక. తల్లి స్త్రీ జాతి లోపములను జూపదలచి వనవాసమునకు అతనిని బంపగోరినదై "నాయనా, నీవు అన్ని విద్యలు నేర్చినావా"? అని యడిగెను. "అవును తల్లీ." "అసాతమంతము (దుఃఖస్వరూపము) కూడ నేర్చితివా?" "లేదు" "అట్లయిన నీ వేమి నేర్చినట్లు? పోయి అదికూడ గ్రహించి రమ్ము."

సరే అని యతడు తక్షశిలా నగరమునకు జనెను. ఆచార్యుని తల్లి 120 వత్సరములది. కుమారుడు స్వయముగా ఆమెకు స్నానము చేయించి, భోజనము పెట్టి, ఉపచారములు చేయుచుండెను. అత డట్లు చేయుట లోకులకు రోతగా నుండెను. అరణ్యమునకు బోయి అచ్చట నా తల్లి కుపచారములు చేయుదును అని తలచి ఆచార్యుడు వివిక్తము, రమణీయము, జలసమృద్ధము అగు ప్రదేశమున పర్ణశాల నిర్మించి, బియ్యము నెయ్యి మొదలగునవి సంతరించుకొని, తల్లిని దీసికొని పోయి నివసించుచుండెను.

మాణవకుడు మరల తక్షశిలకు బోయినపుడు ఆచార్యుని కానక, ఇతరుల నడిగి తెలిసికొని, ఆయన యునికికి జని, నమస్కరించి నిలిచెను. 'నాయనా, త్వరలోనే మరలి వచ్చినా వేమి? అని ఆచార్యు డడిగెను. "తమకడ నేను అసాతమంత శాస్త్రము నేర్చికొనలేదు.

"అది గ్రహింపుము అని యెవ్వరన్నారు?" "నా తల్లి ఆచార్యా." అంతట బోధిసత్త్వు డాలోచించి "అసాతమంతమను గ్రంథము లేదు. తల్లి యితనికి స్త్రీ లోపములను దెలుపగోరి యుండును" అనుకొని, "మంచిది నాయనా, నేటి నుండి నీవు నాకు ప్రతినిధిగా నుండి, నా తల్లికి నీ చేతులతో స్నానము చేయించి భోజనము పెట్టి, హస్త, పాద, పృష్ఠ, శీర్షాదిక సంవాహనము చేయుచు 'ఆర్యే, ఇంతటి వార్ధకములోగూడ నీ శరీర మిట్లున్నది! యౌవన కాలములో ఎట్లుండెనో' అనుచుండుము. ఆమె హస్తములు పాదములు కడిగి గంధలేపము చేయునపుడు వాని సౌందర్యమును వర్ణింపుము. నా తల్లి నీతో ననెడి మాటలు, సిగ్గు మర్మము లేకుండ నాతో జెప్పుము. ఇట్లు చేయుదువేని అసాతమంతము తెలియును. కాదేని తెలిసికొనలేవు" అని చెప్పెను.

చిత్తము ఆచార్యా, అని మాణవకుడు నాటినుండి గురువు చెప్పినట్లు చేయుచుండెను. మాణవకుడు తనను తరచుగా వర్ణించుచుండుటచే వృద్ధురాలు తనలో 'వీడు నాతో రమింపగోరుచున్నాడు' అని తలపోసెను. గ్రుడ్డిది, ముసలిది అయ్యును ఆమెకు కామ ముద్భవించెను. తన శరీరమును వర్ణించు యువకునితో నామె యొకనాడు "నాతో అభిరమింప గోరుచున్నావా?" అని యడిగెను.

"ఆర్యే, అవును. కాని ఆచార్యుడు చండశాసనుడు."

"నన్ను నీవు నిజముగా వాంఛింతువేని వానిని సంహరింపుము."

"ఇంతకాలము ఆయనవద్ద విద్య లభ్యసించి, కామవశమున నేనాయన నెట్లు సంహరింతును?" "నీవు నన్ను త్యజింపవేని వానిని నేనే సంహరింతును."

యువకు డాచార్యున కీమాట లన్నియు జెప్పెను. ఆచార్యుడు వానిని ప్రశంసించి, నాడు తనతల్లికి మృత్యువని గ్రహించి, 'మాణవకా, ఈనా డామెను పరీక్ష చేయుద' మనెను. అంజీరచెట్టు కొమ్మనరకి, దానిని తన ప్రమాణమున బొమ్మగాజేసి, దానికి సూత్రముకట్టి, వస్త్రములుకప్పి, తన పడకపైనుంచి "ఈగొడ్డలి నాతల్లికిచ్చి, త్రోవ తెలియుటకై ఈసూత్ర మామె చేతి కందింపుము" అని చెప్పెను.

యువకుడు పోయి వృద్ధురాలితో "ఆర్యే, ఆచార్యుడు ఇంటిలో పడకమీద నిద్రించుచున్నాడు. మార్గము తెలియుటకై ఈత్రాడు

కట్టినాను. ఈగొడ్డలి తీసికొనిపోయి, చేతనైనచో ఆయనను సంహరింపుము” అని పలికెను. “నీవు నన్ను విడిచిపెట్టవుకదా?” “నే నటులేల చేయవలెను?” వణకుచున్న చేతులతో వృద్ధురాలు పరశువు పట్టుకొని త్రాడు తడవుకొనుచు బోయి, కుమారు డనుకొని, కొయ్యబొమ్మ కంఠముమీది వస్త్రము తొలగించి గొడ్డలితో నొక్క పెట్టు పెట్టెను. దాని పరుషధ్వని బయలువెడలెను. అది కొయ్యబొమ్మయని యామె గ్రహించెను. ఇంతలో కుమారుడు వచ్చి అమ్మా, ఏమి చేయుచున్నావనెను. ముసలిది ‘అయ్యో, వంచన జరిగినది’ అని బావురుమని నేలపైబడి, ప్రాణములు విడిచెను. ఆక్షణమున వృద్ధురాలికి మృత్యువు విధించి యున్నదట.

బోధిసత్త్వు డామెకు సంస్కారములు చేసి, ప్రేతాగ్ని చల్లార్చి, అడవిపూవులు బూడిదపై జల్లి, యువకునితో పర్ణశాల వాకిట గూరుచుండి, “నాయనా, అసాతమంతమని వేరుగా శాస్త్రములేదు. వృద్ధ జనని ఏమి చేసెనో చూచితివా? కాబట్టి యువతు లెట్టి దుశ్శీలలో నీవు తెలిసికొనగలవు” అని యుపదేశించి, నిజగృహమునకు బొమ్మనెను.

ఆచార్యునికడ సెలవు తీసికొని అత డింటికి జనగా, తల్లి “దుఃఖతత్త్వమును గ్రహించితివా?” అనెను. “గ్రహించితిని.” “నాయనా, నీవు అగ్ని దేవు నర్చనకై సంసారము త్యజింతువా, గృహస్థువై యుందువా? ఏది పరిగ్రహింతువు?” “నేను స్త్రీల దుశ్శీలము గ్రహించినాను. సంసారము వలదు. పరివ్రాజకుడ నగుదును” అని యత డీ గాథ పలికెను.

స్త్రీలు మాయావినులు, మరీచికలు, దుఃఖ
హేతువు, లుపద్రవమ్ములు, మృత్యుపాశ
సదృశ దృఢబంధనములు, పోల్చంగ రాని
గూఢభావలు, వారల గోరి యెదను
నమ్ము జను డధమాధమ నరుడు జగతి!

అతడు గృహస్థాశ్రమము నొల్లక, సన్యసించి, అభీష్టశాంతి పడసి, బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, నాలుగు సత్యములను ప్రకాశింప జేసినపిమ్మట ఆభిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త కథలు సరిపోల్చి జాతక సారాంశము వెలువరించెను. అప్పటి తల్లి ఇప్పటి కాపిలాని; తండ్రి ఇప్పటి మహా కాశ్యపుడు; శిష్యుడు ఇప్పటి ఆనందుడు; ఆచార్యుడు నేనే.

## 62 అండభూత జాతకము

జేతవనమున బుద్ధుడు విహారము చేయుచు ఆసక్తచిత్తుడైనభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త అతనితో "భిక్షూ, నిజముగా నీవు స్త్రీయెడ ఆసక్త చిత్తుడవై యున్నావా?" అనెను, అతడు నిజమే అన్నపిమ్మట శాస్త "భిక్షూ, స్త్రీలను అదుపులో నుంచుట కష్టము. పూర్వసమయమున బుద్ధిమంతులు స్త్రీలను పుట్టుకనుండి ఆజ్ఞలో నుంచజాలరైరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడాయన పట్టమహిషి కడుపున బుట్టి పెరిగి పెద్దవాడయి అన్నివిద్యలు నేర్చి తండ్రియనంతరము రాజ్యమునకు వచ్చి ధర్మపది పాలనము చేయుచుండెను. అతడు తన పురోహితునితో జూద మాడుచు——

వంకరల్ తిరుగని వాహినుల్ కలవె?
కాష్ఠముల్ లేనట్టి కాడులు కలవె?
అవకాశమే వలె; అది లభ్యమైన
అఘ మొనరింపని అంగనల్ కలరె?

అని జయార్థము గీతము పాడుచు, రజతఫలకముపై బంగారు

ధూళిని కొనిపోవు తట్టలుకూడ పరీక్షించి లోనికి బోనిచ్చుచుండును. పురోహితుడు మాత్ర మాకన్యను చూడగలడు. ఆమె కొక్కతియే పరిచారిక. యీ పరిచారిక గంధ మాల్యాదులు కొని ఆధూర్తుని దుకాణము ప్రక్కగా పోవుచుండెడిది. అది కన్యకా పరిచారిక అని వాడు బాగుగా తెలిసికొన్న తరువాత ఒకనాడు ఆమె వచ్చుచుండగా దుకాణమునుండి లేచిపోయి ఆమె పాదములు గట్టిగా బట్టుకొని "అమ్మా, ఇంతకాల మెక్కడకు పోతివి?" అని దుఃఖింపసాగెను.

ప్రక్కనే నిలిచియున్న యతని తోడి ధూర్తులు "చేతులు, కాళ్ళు, ముఖము, ఆకారము, వస్త్రములు అన్నియు తల్లి కొడుకులు ఒకే పోలిక" అన్నారు. వారు పలుకుచుండగా నేమియు తోపక ఆమె "వీడు నాకుమారుడు కావచ్చును" అనుకొని ఆమెకూడ ఏడవ జొచ్చెను. కన్నీళ్ళతో ఉభయులు పరస్పరము కౌగలించుకొనిరి. "అమ్మా, నివాస మెక్కడ?" అని వా డడిగెను.

'నాయనా, పురోహితుని యింట. ఆయనకు మహాసుందరి పదుచు పెండ్లము కలదు. ఆమె దేవతా స్త్రీ వలె నుండును. ఆమె కొలువులో నున్నాను" అని యామె చెప్పెను.

"అమ్మా, ఇప్పు డెక్కడికి పోవుచున్నావు?" "ఆమెకై గంధ మాల్యములు కొనుటకు." "వానికై వేరొకచోటికి బోవనేల? నేటి నుండి నా కడనే తీసికొమ్ము." అని వాడు డబ్బు తీసికొనకుండ ఆమెకు తాంబూల తక్కోలకాదులు, వివిధ పుష్ప మాల్యములు నిచ్చెను. మాణవిక బహుగంధ ఫల పుష్పాదులను జూచి, "అమ్మా, బ్రాహ్మణుడు నేడు మనయెడ ప్రసన్నుడైనాడు" అనెను. "ఏల ఇట్లను చున్నావు?" "ఇన్ని నీవు తెచ్చుటవలన." "బ్రాహ్మణుడు హెచ్చు మూల్య మీయలేదు. నా కుమారునికడ నుండి తెచ్చినాను."

నాటి నుండి యీ పరిచారిక బ్రాహ్మణు డిచ్చిన మూల్యమును దాచుకొని ధూర్తునికడనుండి గంధ పుష్పాదులు తెచ్చుచుండెను. కొలది దినములకు ధూర్తుడు రోగము నటించి పండుకొనెను. దుకాణము వాకిటికి వచ్చి వాడు కనబడక పోవుటచే నామె బిడ్డ డెక్కడ అని అక్కడి వారి నడిగెను. "నీ కుమారునకు జబ్బు చేసినది" అని వా రనిరి. వాడు పండుకొన్న చోటికి బోయి యామె కూరుచుండి

వీపు నిమురుచు "నాయనా, ఏమి జబ్బు?" అనెను. వాడు మాటాడ లేదు. "చెప్పవేమి నాయనా?" "అమ్మా, ప్రాణములు పోవుచున్నను నీతో చెప్పలేను." "నాతో గాక మరి యెవరితో జెప్పెదువు నాయనా!" "అమ్మా, నాకు మరేమియు జబ్బు లేదు. ఆ మాణవిక వర్ణనము విని ప్రతిబద్ధ చిత్తుడ నయినాను. ఆమె లభించినచో జీవింతును, లభింపనిచో ఇక్కడనే ప్రాణములు విడుతును" "నాయనా, ఈ భారము నాది. దీని విషయమున చింత పెట్టుకొన వద్దు." అని వాని నోదార్చి పరిచారిక బహుగంధ పుష్ప ఫలములను దీసికొని మాణవిక వద్దకు బోయి "నా కుమారుడు నా వలన నీ వర్ణనము విని ప్రతిబద్ధ చిత్తుడైనాడు. ఏమి కర్తవ్యము?" అనెను. "అతని నిచ్చటికి తేగలిగితివేని అవకాశ ముండును." నాటినుండి పరిచారిక యింటిలో మూలమూలల నున్న దుమ్ము తుడిచి ప్రోగు చేసి పూవులు తెచ్చు గంపలో బోసి, వెలుపలికి గొనిపోవ యత్నించునపుడు కావలిది పరీక్షింప గోరెను. ఆ తరుణములో పరిచారిక గంప కావలిదానిమీదికి జారవిడిచెను. తక్కిన ఆరక్షికల విషయమై గంపలో ధూళి జార్చెను. అప్పటినుండి యామె లోపలికి కాని వెలుపలికిగాని యేమి తీసికొనిపోయినను పరీక్షించు నుత్సాహము ఎవ్వరికిని లేకుండెను. ధూర్తుని పూలగంపలో దాచి పరిచారిక మాణవిక కడకు జేర్చెను. ధూర్తు డామె శీల భ్రంశము చేసి, రెండు రోజులు మేడలోనే యుండెను. పురోహితుడు వచ్చినప్పుడు వాడు దాగియుండును. ఆయన వెడలి పోయినంతనే వారిరువురు సుఖముగా కాలము గడపుదురు. "స్వామీ, మీరు పోవలెను." అని మాణవిక పలికెను: "బ్రాహ్మణుని ఒక్క దెబ్బ కొట్టి పోవలెను" అని ధూర్తుడు కోరగా సరే అని మాణవిక వానిని దాచిపెట్టి పురోహితుడు రాగానే "ఆర్య, మీరు వీణ వాయించుచుండ నేను నాట్యము చేయ గోరుదును" అనెను. "సాధు, భద్రే," అని బ్రాహ్మణుడు పలికెను." మీరు చూచుచున్నచో సిగ్గుగా నుండును. మీ దివ్యవదనము తొలుత శాటికలో బంధించినచో నాట్యము చేయ గలను." "అట్లయిన బంధింపుము." మందమైన శాటితో మాణవిక ఆయన కన్నులకు గంతకట్టి, ముఖమున కప్పెను. బ్రాహ్మణుడు వీణా వాదనము ప్రారంభించెను. మాణవిక కొంత తడవు నాట్యముచేసి,

"ఆర్యా, ఒక్కసారి మీ శిరముపై దెబ్బ కొట్ట కోరికయున్నది" అనెను. స్త్రీలోలుడైన బ్రాహ్మణుడు కారణ మెరుగక సరే' అనెను. ఆమె ధూర్తునకు సైగ చేసెను. వాడు బ్రాహ్మణుని వెనుక నిలిచి శిరస్సుపై గట్టిగా మోదెను. బ్రాహ్మణునకు కన్నులూడునట్లయ్యెను? తలమీద బుడిప కట్టెను. ఆయన బాధచెంది "నీ హస్తము నిటు తెమ్ము" అనెను. ఆమె తన హస్తము ఆయన చేతిలో బెట్టెను. "హస్తము మృదువయినదే. కాని గట్టిదెబ్బ కొట్టినావు!" అన్నాడు బ్రాహ్మణుడు. ధూర్తు డాయనను కొట్టి దాగుకొనెను. వాడు దాగిన పిమ్మట మాణవిక బ్రాహ్మణుని ముఖవస్త్రము విప్పి, తైలము తెచ్చి తలమీద రుద్దెను. ఆయన వెలుపలికి వెడలిన తరువాత ధూర్తుని పూల గంపలో పరిచారిక వెలుపలికి జేర్చెను. తోడనే వాడు రాజు కడకు బోయి జరిగిన వృత్తాంతము వివరించెను.

పురోహితుడు తన సన్నిధికి వచ్చినప్పుడు రాజు "బ్రాహ్మణోత్తమా, జూదమాడుదమా?" అనెను. "మంచిది మహారాజా."

రాజు ద్యూతమండలము సిద్ధము చేయించి పూర్వమువలెనే ద్యూతగీతము పాడి పాచికలు దొరలించెను. మాణవికా శీలభంగము సంగతి నెరుగని బ్రాహ్మణుడు యథాప్రకారముగా 'మా . మాణవిక తప్ప' అనెను. కాని పరాజయము నొందెను. విషయ మెరిగిన రాజిట్లనెను: "ఆమెను మాత్రము తప్పింపనేల? ఆమె శీలము చెడినది బ్రాహ్మణోత్తమా! పుట్టినబిడ్డను తెప్పించి మీరు రక్షించుచు సప్తస్థానములలో ఆరక్షికల నుంచి సంరక్షింపగల ననుకొంటిరి. కాని స్త్రీని కడుపులోపెట్టుకొని తిరుగుచున్నను రక్షింప శక్యముకాదు. ఏక పురుషిక యగు స్త్రీ లేదు. మీ మాణవిక నాట్యము చేయుగోరి వీణావాదనము చేయుచున్న మీ ముఖమునకు గుడ్డకట్టి, తన జారునిచే మీ శిరసుపై మోదించి వానిని దాట వేసినది. ఇంకను మీ ప్రతిషేధ మెందులకు?"

ఇట్లు పలికి రాజీగాథ చెప్పినాడు :

కడుపులో పెట్టి విప్రుండు కాచె దీని
కన్నులకు—భర్త నొప్పించి గంత కట్టి
వీణ వాయించుచు నటించె విటుని కీమె.

తెలివి కలదాంగ లమ్మయో! తీవబోండ్లు
దుర్లభ మసత్య మన్నది దొరకు నచట!
వారిలో బారుచేపల పాదచిహ్న
లెటులు దుర్జ్ఞేయములో అట్లె యిగురుబోండ్ల
భావసరణులు: చూప నేర్పరులు వారు
నిజ మబద్ధం బబద్ధంబు నిజముగాను.

ఈవిధముగా బోధిసత్త్వుడు బ్రాహ్మణునకు ధర్మ ముపదేశించెను. అది విని యతడింటికి బోయి మాణవికతో 'నీ విట్టి పాపకర్మ చేసినా' వనెను. "ఆర్యా, ఎవరన్నారు? నే నే మెరుగను. నాచేతితో నే మిమ్ము కొట్టినాను. అన్యుడు కొట్టలేదు. మీరు నమ్మని పక్షమున 'సత్య కార్యము' చేసి, అగ్నిలో ప్రవేశించి మీకు విశ్వాసము కలిగించెదను" అని యామె వక్కాణించెను.

సరే అని బ్రాహ్మణుడు కట్టెలు పేర్పించి, నిప్పు ముట్టించి, ఆమెను బిలిపించి "నీకు ధైర్యమున్నచో అగ్నిలో ప్రవేశింపుము" అనెను. తొలుతనే మాణవిక తన పరిచారికతో "అమ్మా, నీపుత్రుడు డచ్చటికి వచ్చి, నేను అగ్నిప్రవేశము చేయబోవునపుడు నాచేయి పట్టుకొని ఆప వలెనని చెప్పుము" అని బోధించెను. పరిచారిక పోయి చెప్పెను.

ధూర్తుడు వచ్చి జనసమూహములో నిలిచెను. మాణవిక బ్రాహ్మణుని వంచింపదలచి మహాజన సమూహమున నిలిచి "బ్రాహ్మణోత్తమా, మీహస్తముతప్ప అన్యపురుష హస్త మెరుగను. ఈప్రతిజ్ఞ ఈయగ్ని నన్ను దహింపకుండుగాక" అని అగ్నిప్రవేశము చేయ బోయెను. ఆక్షణమున ధూర్తుడు పోయి "చూడుడు. ఈపురోహితబ్రాహ్మణుని పని! ఈకన్యచే అగ్నిప్రవేశము చేయించుచున్నాడు!" అని చూ మాణవిక చేయిపట్టి లాగెను. ఆమె చేయి వదలించుకొని పురోహితునితో "ఆర్యా, నాసత్యక్రియ భగ్నమయినది. అగ్నిలో ప్రవేశింపలేను" అనెను. "ఎందుచేత?" "ఈ పురుషుడు నాచేయి పట్టుకొనుటవలన." "ఈమె నన్ను వంచించినది" అని బ్రాహ్మణుడు తెలిసికొని ఆమెను తన్ని వెడల నడచెను.

ఈవిధముగా స్త్రీలు దుర్మార్గగాము లగుదురని తెలియుచున్నది. భర్తలను వంచించుటకు స్త్రీలు మహాపాపకర్మమైనను చేసి, చేయలే

దని శపథము చేయుదురు. ఎంత చపలచిత్తలు? అందులకే యిట్లు చెప్పినాయి:

కడుపు నిండునట్లు కసవు మేసియు గోవు
క్రొత్తశాద్వలముల గోరునట్లు
క్రొత్తవారి స్త్రీలు కూడి రమింతురు
నిత్యనూత్న విషయ నిరత లగుట.

చోరలు, కఠోరచిత్తలు, క్రూరజంతు
సదృశ, లస్థిరబుద్ధులు, శర్కరవలె
మానవుల మోసగించు విధానములను
పూర్ణముగ నేర్చికొన్నట్టి ప్రౌఢలు సుమి!

బుద్ధుడు ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములను ప్రకాశింప జేసినపిమ్మట ఆభిక్షువు శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి వారాణసీ నరేశుడు నేనే.

## 63 తక్క జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఆసక్తచిత్తుడగు నొకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతనితో శాస్త "భిక్షూ, నీవు నిజముగా ఉత్కంఠితుడవై యున్నావా?" అనెను. అతడు నిజమే అన్నపిమ్మట శాస్త "భిక్షూ, స్త్రీలు కృతఘ్నలు, మిత్రులలో భేదము కల్పించువారు. వారియెడ ఏల నీకు చాంచల్యము కలిగెను?" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా

బోధిసత్త్వుడు ప్రవ్రజించి గంగాతీరమున ఆశ్రమము నిర్మించుకొని, సమాపత్తిని అభిజ్ఞను పొంది ధ్యానరతసుఖమున విహరించుచుండెను. ఆకాలమున వారాణాసి శ్రేష్ఠి కూతురు ధూర్తకుమారి యనునది చండి, పరుషస్వభావ, దాసీజనమును, కర్మకారులను ప్రహరించు చుండును. వారామె నొకనాడు జలకేళికై గంగానదికి గొనిపోయిరి. నీటిలో వారు క్రీడించుచుండ సూర్యు డస్తమింప నుండెను. మేఘ ముప్పతిల్లెను. దానిని జూచి జనులు పరుగెత్తిరి. శ్రేష్ఠి కుమారీ దాసీ జనము, నేడీమె పీడ వదలించుకొనవలె నని ఆమెను నీటిలోనికి ద్రోసి వెడలిపోయిరి. వర్షము కురిసెను, చీకటు లావరించెను. కుమారి వెంట లేకుండ నింటికి బోయినపుడు అమ్మాయి యేది అని యజ మాను లడిగిరి. గంగాజలమునుండి యీవలకు వచ్చినది. కాని యెటు పోయినదో మాకు కనబడలేదు అని వారు చెప్పిరి. జ్ఞాతు లెంత వెదకినను ఆమెజాడ కానరాలేదు.

అక్కడ ధూర్త కుమారి పెద్దపెట్టున అరచి ప్రవాహమున కొట్టు కొనిపోయి తుదకు బోధిసత్త్వుని పర్ణశాలదరికి జేరినది. ఆయన దాని కంఠధ్వని విని, స్త్రీకంఠమువలె నున్నది, రక్షింపవలెను. అని కాగడా వెలిగించి, నదీతీరమునకు బోయి ఆమెను జూచి, భయపడకు, భయ పడకు అని ఓదార్చి నాగబలు డగుటచే నదిలో ఈది, అమెనెత్తుకొని ఆశ్రమపదమునకు వచ్చి మంటచేసి, చలి తీరినపిమ్మట ఆయన 'నీ వెక్కడ నుండు దానవు; గంగాజలములో ఎట్లు పడితివి?' అని యామె నడిగెను. జరిగిన దంతయు నామె చెప్పెను. ప్రస్తుత మిచటనే యుండుము' అని ఆమెను పర్ణశాలలో పండుకొను మని తాను వెలు పల పండుకొనెను. మూడునాళ్ళ తరువాత ఆమెను వెడలిపొమ్మనెను. ఈతాపసుని శీలము భేదించిపోవుదు నని తలపోసి యామె అచటినుండి కదలలేదు. వెడలిపోవలసిన సమయమునకు విలాసములు చూపి, అత నిని శీలభ్రష్టుని జేసి, లుప్తధ్యానుని గావించెను. తుద కాత డామెను స్వీకరించి, అరణ్యములోనే నివసింపసాగెను. ఆమె యొకనాడు "ఆర్యా, అడవిలో నుండుటవలన ఫలమేమి? మానవ నివాసములకు బోవుదము" అనెను. ఇరువురు ప్రత్యంత గ్రామమునకు జనిరి. అత డక్కడ (తక్క) ఖర్జూర మమ్మి రాబడితో భార్యను పోషించుచుండెను.

లోకు లాయనను తక్క పండితు డనుచుండిరి. గ్రామవాసు లాయ నకు భృతి యిచ్చి 'మాకు కాలములో మంచి చెడుగులు చెప్పు చుండుడు.' ఇక్కడనే ఉండుడు అని గ్రామ కంఠమున కుటీరము వేసిరి.

ఆకాలమున చోరులు పర్వతము దిగి ప్రత్యంత గ్రామములను కొల్లగొట్టుచుండిరి. వా రొకనాడు ఈ గ్రామమును దోచుకొని, గ్రామవాసులచే సామానులు కట్టలు కట్టి మోయించికొని పోవుచు శ్రేష్ఠి కుమారికను గూడ పట్టుకొని తమ నివాసమునకు గొనిపోయి, తదితరులను విడిచి పెట్టిరి. ఆమె రూపమునకు ముగ్ధుడై చోరజ్యేష్ఠు డామెను భార్యగా చేపట్టెను.

బోధిసత్త్వుడు తన స్త్రీ యెక్కడ నున్నదని లోకుల వలన తెలిసి కొని, నన్ను విడిచి ఆమె యుండనేరదు. తప్పించుకొని వచ్చును అని ఆమె రాక కెదురు చూచుచు ఆ గ్రామముననే యుండెను.

అక్కడ శ్రేష్ఠి కూతురు "ఇక్కడ సుఖముగా నున్నాను. తక్క పండితుడు వచ్చి నన్ను బలవంతము చేయునేమో. ఈ సుఖము కోల్పోవుదును. ఆయనను బిలిపించి సంహరింతును" అని తలపోసి వార్తావహుని బిలిచి, "ఇక్కడ నేను కష్టపడుచున్నాను. తక్కపండి తుడు వచ్చి నన్ను కొనిపోవును గాక" అని సందేశ మంపెను.

బోధిసత్త్వు డాసందేశము విశ్వసించి, బయలుదేరి చోరగ్రామము మొగదల నిలిచి వార్త పంపెను. ఆమె బయలు వెడలి వచ్చి 'స్వామీ, ఇప్పుడే మనము పోవుదు మేని చోరనాయకుడు వచ్చి మన లను బంధించి ఖండించును. రాత్రివేళ పోవుదము' అని చెప్పి, అతనికి భోజనము పెట్టి, కోష్ఠమున పండుకొ మ్మని చెప్పి, చోరనాయకుడు సురాపాన మత్తుడై యున్నసమయమున సమీపించి 'స్వామీ, ఈవేళ నీసపత్నుడు కనబడినచో ఏమిచేయుదువు?' అని యడిగెను. 'ఇది, ఇది చేయుదును' అని వా డనెను. 'అతడు దూరమున నున్నా డనుకొంటి వేమో. ప్రక్క కొట్టములో పండుకొనియున్నా' డని యామె చెప్పెను. వాడు కాగడా తీసికొనిపోయి చూచి, అతనిని బంధించి, యింటినడుమ బడవేసి, తనివితీర తన్నెను. దెబ్బలు తినుచున్న బోధిసత్త్వుడు "కోధనా అకతన్నూచ పిసుణా మిత్తభూభికా" అని మాత్ర మను

చుండెను. వాఁ డాయనను కొట్టి, భోజనము చేసి పండుకొనెను. మైకము తగ్గగా ఉదయముననే లేచి వాఁడు మరల బోధిసత్త్వుని కొట్ట జొచ్చెను. ఆయన ఆనాలుగు పలుకులే పలుకుచుండెను. చోరుఁ డాలోచనలో పడి 'ఇట్లు దెబ్బలు తినుచున్నను నీవు ఈనాలుగు మాటలు తప్ప వేరేమియు పలుక వేమి?'' అని యడిగెను.

అట్లయిన వినుము అని ఆయన కథ మొదటి నుండియు చెప్పెను. తొలుత నేను అరణ్యవాసిని, తాపసుడను, ధ్యానశీలిని. ఈమెను ప్రవాహమునుండి రక్షించితిని. ఈమె నన్ను ప్రలోభపెట్టి ధ్యానభంగము చేసినది. అనంతర మరణ్యము విడిచి, ఈమె పోషణకై ప్రత్యంతగ్రామమున నుంటిని. చోరు లీమె నిచ్చటికి దెచ్చిరి. నేను కష్టపడుచున్నాను; వచ్చి నన్ను తీసికొనిపొమ్ము అని నాకు సందేశ మంపగా నేను వచ్చితిని. నన్ను నీ కప్పగించినది. ఇందుచే నే నట్లు పలికితిని' అని బోధిసత్త్వుడు వివరించెను.

చోరుఁ డాలోచించి ''ఇట్టి గుణసంపన్నుడైన ఉపకారిని విపత్తుపాలు చేసిన ఈ యాఁడుది నన్ను ఎట్టి యుపద్రవముపాలు చేయునో. దీనిని సంహరింపవలెను'' అనుకొని, తక్క పండితుని ఓదార్చి, పోయి ఆమెను లేపి, ఖడ్గము తీసికొని యావలకువచ్చి, ఈపురుషుని గ్రామము మొగదల హరింతును అని పలికి, ఆమెతో బయటికి జని, ఈ పురుషుని పట్టుకో అని పట్టించి, కత్తిదూసి, తక్క పండితుని కొట్టబోయినట్లు నటించి, ఆమెను రెండు తుండెములుగా నరికెను. అనంతరము చోరనాయకుఁడు ఆయనకు స్నానము చేయించి, భోజనము పెట్టించి, కొన్ని దినములపాటు సంతుష్టచిత్తునిజేసి, ఇప్పు డెక్కడకు బోవుదువు?' అనెను. 'గృహనివాసముపై నా కిచ్ఛ లేదు. ప్రవ్రజించి, వెనుకటి యడవిలో నుందును' అని ఆయన చెప్పినాడు.

'నేనుగూడ సన్న్యసింతును' అని చోరనాయకు డనియెను. ఉభయులును వెనుకటి యడవికి బోయిరి. క్రమముగా వారు పంచాభిజ్ఞలను, అష్టసమాపత్తులను పొంది జీవితాంతమున బ్రహ్మలోకమున కర్హులయిరి.

నీకు నాసక్తి పుట్టించు నీరజాక్షి
కోపన, కృతఘ్న, మిత్రఘ్న కొండెకత్తె

భిక్షువా, బ్రహ్మచర్యంబు విడువ కోయి!
దాన భంగము కాదు నీధ్యానసుఖము.

శాస్త ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములు ప్రకాశింప జేసినపిదప ఆభిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త జాతకసారాంశము వెలువరించెను. అప్పటి చోరనాయకుడు ఇప్పటి ఆనందస్థవిరుడు; తక్క పండితుడు నేనే.

## 64 దురాజాన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక ఉపాసకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తి నివాసి యగు ఉపాసకు డొకడు త్రిశరణములందు పంచ శీలములందును ప్రతిష్ఠితు డయ్యెను. ఆతనికి బుద్ధునియందు ధర్మము నందు సంఘమునందు శ్రద్ధకలదు. కాని అతని భార్య దుర్మార్గురాలు. ఏనాడు ఆమె పరపురుష సేవ చేయునో ఆనాడు నూరు ముద్రలకు విలిచి తెచ్చినదాసివలె ప్రవర్తించును. తిన్నగా ఉన్ననాడు యజమానురాలివలె చండ కఠోరముగా ప్రవర్తించును. అతడు ఆమె ప్రవర్తనను గ్రహింపలేకుండెను. ఆమెవలన అతడు చాల క్లేశము చెంది నడుమ నడుమ బుద్ధసేవకు కూడ పోయెడివాడు కాడు. ఒక నాడతడు గంధ మాల్యాదులు చేకొని పోయి బుద్ధునకు వందనముచేసి కూరుచుండెను. శాస్త అతనితో "ఉపాసకా! ఏడెనిమిది దినములనుండి నీవు బుద్ధసేవకు వచ్చుట లేదేమి?" అనెను.

"భన్తే, మాయింటి ఆవిడ ఒకనాడు నూరు ముద్రలకు విలిచి తెచ్చిన దాసివలె ప్రవర్తించును, ఇంకొకనాడు చండ కఠోరముగా ప్రవర్తించును. ఆమె మనోగతి ఏమో నాకు తెలియుటలేదు. కావున అందువల్ల క్లేశము చెంది బుద్ధసేవకు కూడ వచ్చుటలేదు." అని

విన్నపము చేసెను.

అతని మాటలు విని శాస్త "ఉపాసకా, స్త్రీల మనోగతి దుర్జ్ఞేయము. పూర్వజన్మమున కూడ నీవు పండితుల నీ విషయ మడిగితివి. అది జన్మాంతర విషయ మగుటచే నీవు గ్రహింపలేవు." అని అతడు ప్రార్థించిన పిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు విఖ్యాతాచార్యుడై 500 మాణవకులకు విద్యలు నేర్పుచుండెను. అందులో నొక్క డన్యరాష్ట్రమునుండి వచ్చినవాడు చదువుచు, ఒకానొక యువతి యెడ ప్రతిబద్ధచిత్తుడై, ఆమెను పెండ్లియాడెను. అతడు వారాణసిలో నివసించుచున్నను ఆచార్యుని సన్నిధికి రెండుమూడు దినములు రాలేదు. అతని భార్య దుశ్శీల. పాపకర్మురాలు. దురాచార మవలంబించిననాడు దాసివలె నుండును, అవలంబింపనినాడు స్వామినివలె చండముగా పరుషముగా నుండును. ఆమె భావము గ్రహింపలేక యితడు వ్యాకుల చిత్తుడయి, ఆచార్యుని సన్నిధికి బోవుట లేదు. ఏడెనిమిది దినముల తరువాత తనకడకు వచ్చిన శిష్యునితో ఆచార్యుడు "బాబా, వచ్చుట లే దేమి?" అనెను "ఆచార్యా, నా భార్య ఒకనాడు దాసివలె సౌమ్యముగా వర్తించును; ఒక నాడు స్వామినివలె చండముగా ప్రవర్తించును. ఆమె భావము గ్రహింపలేక వ్యాకుల చిత్తుడనై తమ సన్నిధికి వచ్చుట లేదు." అని యతడు విన్నవించెను.

"మాణవకా, ఇంతే. ఒకనాడు స్త్రీలు స్వామి నను వర్తింతురు; వేరొక నాడు అభిమానవశమున స్వామిని పరిగణింపరు. స్త్రీలు దురాచారలు, దుశ్శీలలు; వారి యిష్టా నిష్టములను లక్ష్యము చేయ నక్కర లేదు" అని, ఆచార్యు డీ గాథ పలికెను.

ఆమె వలచు నంచు నానంద పడబోకు !
వలవ దయ్యో యనుచు వగవ బోకు !
చేపనడక వలెనె స్త్రీల మన స్సోయి !
దుర్ఘటంబు దాని త్రోవ గనుట.

ఈ విధముగా బోధిసత్త్వుడంతేవాసి కుపదేశ మిచ్చినాడు. నాడు మొదలతడు భార్యయెడ తాటస్థ్యము వహించెను. తన దుశ్శీల మాచార్యునకు తెలిసెనని వాని భార్య సిగ్గు పడి, దుర్మార్గము విడిచి పెట్టెను.

శాస్త ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములను ప్రకాశింప చేసినపిదప ఆయుతపాదుడు స్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితుడయ్యెను. శాస్త రెండుకథలు పరిపోల్చి జాతక సారాంశము వెలువరించెను. ఆకాలమున భార్యాభర్తలు నేటి భార్యాభర్తలే. ఆచార్యుడు నేనే.

## 65 అనభిరత జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, అట్టి యుపాసకుని గూర్చియే చెప్పినది.

### వర్తమాన కథ

ఆయుపాసకుడు వెదకి ఆమె దుశ్శీలతకు కారణము కనుగొని, కలహించి, వ్యాకులచిత్తుడగుటచే ఏడెనిమిది దినములు బుద్ధసేవకు పోవలేదు. ఒకనాడతడు విహారమునకు జని తథాగతునికి ప్రణామము చేసి కూరుచుండెను. "ఏడెనిమిది దినములు నీ వేల రాలేదు?" అని తథాగతుడడుగగా "భన్తే, నాభార్య దుర్మార్గురాలు. దానివలన వ్యాకులచిత్తుడనై రాలేదు" అని యాతడు పలికెను.

శాస్త "ఉపాసకా, స్త్రీలు దుశ్శీల లని వారిపై కోపింపక, తటస్థ భావము వహింపవలెను. ఈవిషయము పూర్వమే నీవు పండితులతో జెప్పినావు. అది జన్మాంతరమున మరుగుపడి యుండుటచే నీ కది గోచరింపలేదు" అని అతడు ప్రార్థించినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు జగత్ప్రసిద్ధుడైన యాచార్యుడుగా నుండెను. ఆయన శిష్యులలో నొకడు తన భార్యా దోషమునుగాంచి వ్యాకులచిత్తుడై కొన్ని రోజులు గురువుకడకు బోవలేదు. వచ్చిన తరువాత నొకనాడు గురువు వాడు కొంతికాలము కనబడకుండుటకు కారణమేమని యడుగగా, వాడు జరిగిన సంగతి నివేదించెను. అప్పు డాచార్యుడు "నాయనా, స్త్రీ లనగా సర్వసామాన్యలు. వారి దుశ్శీలమును గ్రహించి పండితులు కోపము చెందరు" అని చెప్పి, ఉపదేశరూపముగా ఈగాథ పలికెను:

ఎట్లు ధర్మశాల, లెటు నదీ మార్గముల్
ద్యూత పానశాల లుండు నెట్లు
అట్ల యెల్ల రడుగ నబలలు సామాన్య
లగుట యెఱిగి జ్ఞాని వగపు గనడు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వు డిచ్చిన యుపదేశము విని వా డుదాసీను డయ్యెను. వాని భార్యయు ఆచార్యునకు తన వృత్తాంతము తెలిసిన దని పశ్చాత్తాపము చెంది, పాపకర్మమునుండి విరతి చెందెను.

శాస్త ధర్మోపదేశము చేసి, నాలుగుసత్యములును ప్రకాశింప జేసిన పిదప, ఉపాసకుడు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త రెండుకథలు సరిపోల్చి, జాతక సారాంశము వెలిబుచ్చెను. అప్పటి భార్యాభర్త లిప్పటి భార్యాభర్తలే; ఆచార్య బ్రాహ్మణుడు నేనే.

# 66 మృదులక్షణ జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండ చిత్తవికారమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తినివాసి యగు కులపుత్రు డొకడు శాస్త చేయు ధర్మోప దేశము విని, త్రిరత్న శాసనమున శ్రద్ధాపూర్వకముగా ప్రవ్రజితు డయ్యెను. ఆతడు శిక్షలను ఆచరణమున జేర్చి, యోగాభ్యాసము చేయుచు, కర్మస్థానములందు యోజనము చేయుచుండెను. ఒకనాడు శ్రావస్తిలో భిక్షార్థము తిరుగుచు, అలంకృత యగుయువతిని జూచి సుందరి యని భావించినాడు. ఆతని యింద్రియములు చాంచల్యము వహించినవి. హృదయమున వికార ముదయించినది. ఆసమయము నుండి వికారవశంవదుడై శారీరకసుఖమును మానసికసుఖమును కోలుపోయెను. అతనిస్థితి భ్రాంతమృగస్థితివలె నయ్యెను. అతని యాచరణము బుద్ధశాసనమున కనుకూలముగా లేదు. కేశములు, నఖ ములు, రోమములు, పెరిగినవి. చీవరములు మలినము లయ్యెను. అతని యాకృతిలో వికారము కనుగొని మిత్రులు "ఆయుష్మన్, ఏమి జరిగి నది? నీయాకృతి వెనుకటివలె లేదు" అనిరి.

"ఆయుష్మంతులారా, శాసనమున నాకు రుచిలేదు."

అప్పుడు వా రతనిని శాస్తకడకు గొనిపోయిరి. శాస్త చూచి "భిక్షువులారా, ఇచ్ఛలేని యీ భిక్షువు నేల కొనివచ్చితిరి?" అనెను.

"ఈభిక్షువునకు శాసనమున రుచి లేదు. భన్తే!"

"భిక్షూ, సత్యమేనా?"

"భగవన్, సత్యమే."

"భిక్షూ. ఏల నీవు ఉత్కంఠితుడ వయినావు?"

"భన్తే, భిక్షార్థము నేను పర్యటించుచుండగా ఒకానొక స్త్రీవలన నాయింద్రియములు చంచలము లయినవి. మనసులో వికార ముత్పన్న మయినది. అందుచే ఉత్కంఠితుడ నయియున్నాను."

"భిక్షూ, ఇందులో నేమియు ఆశ్చర్యము లేదు. ఇంద్రియములు చంచలములై విపక్షఆలంబనము (స్త్రీ) సుందరి.గా గానబడి చిత్తమున

వికారము కలుగుచున్నది. పూర్వకాలమున, పంచ-అభిజ్ఞలు, అష్ట సమాపత్తులు పొంది, ధ్యానబలమున చిత్తమాలిన్యమును క్షాళితము చేసి, విశుద్ధచిత్తుడై, గగనతలమున విహరించు బోధిసత్త్వుడుకూడ ఇంద్రియములు చంచలములై విపక్ష-ఆలంబనమును జూచినంతనే, ధ్యానభ్రష్టుడై, వికారవికృతుడై చాలశ్రమ పడెను. నీవు సిగ్గుపడ నక్కరలేదు. విశుద్ధసత్త్వముకూడ వికృత మగుచుండును. యశస్వి యగు నాతడు అయశము పొందెను" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున ఒకానొక విభవ సంపన్న బ్రాహ్మణ కుటుంబమున బుట్టి, పెరిగి, పెద్దవాడయి, సర్వవిద్యాపారముగాంచి, కామములు విడిచి, ప్రవ్రజించి, అభిజ్ఞ, సమాపత్తులుపొంది, ధ్యాన సుఖ నిమగ్నుడై హిమవత్ప్రదేశమున నివసించుచుండెను. అతడొక పర్యాయము చింతపండు, ఉప్పుకొరకు హిమవంతము దిగి, వారాణసి చేరి, రాజోద్యానమున విడిసి, మరునాడు రక్తవల్కలములు మడత వేసి, ఒక బుజముపై అజినము దాల్చి, జటామండలము బంధించి, జోలె తీసికొని, వారాణసిలో భిక్షార్థము చరించుచు, రాజ ద్వారముకడకు జేరెను. ఈయన చర్యకు సంప్రీతుడై రాజు ఆహ్వానించి, అనర్ఘాసనమున గూరుచుండబెట్టి, ఘనముగా అన్నపానీయము లిచ్చి, సంతుష్టునిజేసి, ఉద్యానమున నుండవేడెను. ఆయన అంగీకరించి, రాజగృహమున భుజించుచు పదునారు వత్సరములు ఉద్యానమున గడపెను.

ఎదురు తిరిగినవాని నణచుటకై యొకనాడు రాజు సరిహద్దు కరుగుచు, మృదులక్షణ యను తన పట్టమహిషితో "అప్రమత్తురాలవై ఆర్యునకు ఉపచర్యలు చేయుచుండు" మని చెప్పి వెడలిపోయెను. రాజు వెడలిననాటి నుండియు బోధిసత్త్వుడు తన యిచ్ఛవచ్చిన వేళకు రాజమందిరమునకు బోవుచుండెను.

ఒకనాడు మృదులక్షణ బోధిసత్త్వున కాహారము సమకూర్చి "నే

డార్యు డాలసించుచున్నాడు" అని గమనించి, అంతలో గంధోదక మున స్నానముచేసి, సర్వాలంకార మండితయై మహాతలమున చిన్న శయనముపై వాలి, ఆయన యాగమనమున కెదురు చూచుచుండెను.

బోధిసత్త్వుడు ధ్యానమునుండి లేచి, ఆలస్య మయినదని ఆకాశ మార్గమున రాజనివేశమునకు జనెను. పల్కాల స్వనితము విని మృదు లక్షణ వేగముగా లేచెను. త్వరలో ఆమె మేలిముసుగు జారిపడెను. జాలమార్గమున ప్రవేశించునప్పటికి ఆమె సౌందర్య మింద్రియములను భేదింప స్వభావసిద్ధముగా నత డామెను విలోకించెను. తోడనే యత నిలో మోహ ముదయించెను. అతని స్థితి గొడ్డలిపెట్టున పడిన వృక్షమువలె నయ్యెను. వెంటనే యతని ధ్యానశక్తి నశించెను. భిన్న పక్షమైన కాకమురీతి నయ్యెను. నిలుచుండియే యతడు భోజన భాజ నమును గ్రహించి, భుజింపక, కాంక్షతో కంపించుచు, ప్రాసాదము నుండి యుద్యానమునకు బోయెను. అచటి పర్ణశాలలో ప్రవేశించి, పళ్ళెరము కొయ్యమంచము క్రిందనుంచి, సౌందర్యముగ్ధుడై, కాంక్షా గ్నిలో దందహ్యమాన మానసుడగుచు, నిరాహారుడై, సప్తాహము కొయ్యపలకపై బరుండి యుండెను.

శత్రువును జయించి, ఏడవనాడు రాజు మరలి వచ్చెను. నగర ప్రదక్షిణముచేసి, నివేశమునకు మరలివచ్చి, ఆర్యుని దర్శింతునను భావ ముతో రాజు ఉద్యానములోని పర్ణశాలలోనికి జని, పండుకొనియున్న వానిని జూచి, వ్యాధిగ్రస్తుడయ్యెనని తలచి, పర్ణశాల బాగుచేయించి, తాపసుని పాదము లొత్తుచు "ఆర్యా, ఏమి అసుఖము?" అని యడి గెను. "మహారాజా, వేరుగా వ్యాధిలేదు. కామమువలన ప్రతిబద్ధ చిత్తుడ నయినాను" అని పలికెను. "మీచిత్త మెచ్చట ప్రతిబద్ధ మయినది?" "మృదులక్షణయందు మహారాజా!"

"మంచిది. ఆర్యా. మీకు మృదులక్షణ నిచ్చెదను" అని రాజు తాపసుని తనవెంట గొనిపోయి, దేవిని సర్వాలంకార భూషితను జేయించి, ఆతనికి సమర్పించెను. సమర్పించెడి వేళ రాజు రహస్యముగా భార్యతో "ఆర్యుని నీ యాత్మ బలముచే రక్షించుటకు యత్నింపుము" అని మెల్లగా జెప్పెను. "చిత్తము, దేవా, రక్షించెదను" అని యామె మృదువుగా బదులు పలికెను.

తాపసుడు దేవిని వెంట బెట్టుకొని రాజ నివేశమునుండి వెడలెను. వారు మహాద్వారము దాటునప్పుడు రాణి "ఆర్యా, మనకు గృహము కావలెను. కావున పోయి రాజును యాచింపుము." అని చెప్పెను. తాపసుడు వెడలి గృహము యాచించెను. బాటసారులు విశ్రమించు ప్రాతయిల్లు తీసికొమ్మని రాజు చెప్పెను. అతడు దేవి నచటికి గొని పోయెను. అందామె ప్రవేశించుట కిచ్ఛగింపలేదు.

"ఏల ప్రవేశింపవు?" "అపరిశుభ్రముగా నుండుట చేత". "ఇప్పుడేమి చేయుదును?" "రాజసన్నిధికి బోయి కుద్దాలమును తట్టను దీసికొని రమ్ము" అని చెప్పి దేవి అతనిచే వానిని దెప్పించి, ఇల్లు శుభ్రము చేయించి, గోమయముతో గోడ లలికించెను. అనంతరము ఒక్కటొక్కటిగా మంచము, పీఠము, ఆస్తరణము, భాండము, గిన్నె, తెప్పించెను. పిమ్మట నీరు తెమ్మనెను. అతడు భాండము గొనిపోయి నీరు తెచ్చెను.

పిదప నామె స్నానార్థము నీరు తెప్పించెను. పక్క వేయించెను. అంతట వారు మంచముమీద గూరుచుండిరి. రాణి అతని మీసములు పట్టి లాగి, "నీవు శ్రమణుడవనియు, బ్రాహ్మణుడ వనియు, మరచితివా?" అని మందలించి, తన కభిముఖముగా నతనిని లాగెను.

అప్పు డతనికి జ్ఞానోదయ మయ్యెను. "ఈ తృష్ణ వృద్ధి పొంది, నన్ను నాలుగపాయములలో తలక్రిందుగా బడవేసినది. తక్షణమే యీమెను రాజు కప్పగించి, హిమవంతమునకు బోవుదును" అని భావించి బోధిసత్త్వుడు తోడనే యామెను రాజుకడకు గొనిపోయి "మహారాజా, నీ దేవితో నాకు పనిలేదు. ఈమెవలననే నాకు తృష్ణ వృద్ధి చెందినది" అని ఈగాథ పలికెను.

కేవలం బొక్క వాంఛయే కేరుచుండె
మున్ను మృదులక్షణం గాంచు పూర్వమందు.
అవిశాలాక్షి లభియించి నంత విపుడు
కోర్కె వెనువెంట కోర్కె యుతోక్క చ మొందు.

నష్టమయిన ధ్యానముతోడనే యుప్పతిల్లినది. బోధిసత్త్వు డాకసమున నుపవిష్టుడై ధర్మమును వివరించుచు, రాజున కుపదేశమిచ్చి, హిమవంతమునకు గగనమార్గమున జని, మరల మానవమార్గమునకు

రాలేదు. బ్రహ్మ విహారము భావించి, అపరిహీణధ్యానముతో బ్రహ్మ లోకమున జన్మించెను.

శాస్త ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకాశింప జేసినంతనే ఆభిక్షువు అర్హత్వమున ప్రతిష్ఠితు డయ్యెను. శాస్త కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున రాజు ఇప్పటి ఆనందుడు; మృదులక్షణ ఇప్పటి ఉత్పలవర్ణ; ఋషి నేనే.

## 67 ఉచ్ఛంగ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక జానపదస్త్రీని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు కోసల రాష్ట్రమందలి ముప్పురుజనులు అడవికి సమీపములో పొలము దున్నుచుండిరి. అరణ్యములోనుండి వచ్చిన చోరులు కొందరు లోకులను దోచుకొని పలాయనము చేసిరి. వారు దాగియుండుటచే చోరగ్రాహకులు వారిని పట్టుకొనలేక భూమిదున్నుచున్న వారు దొంగలని తలచి "మీరు దోపిడి చేసి, ఇప్పుడు సేద్యము చేయుచున్నారు" అని వారిని బంధించి కోసల నరేశునికి సమర్పించిరి. ఆసమయమున ఒకానొక స్త్రీ "నాకు ఆచ్ఛాదన మిండు, వస్త్రమిండు" అనుచు వచ్చి ఏడ్చి మొత్తుకుని మాటిమాటికి రాజభవనము కడ కాలము గడుపుచుండెను. రాజు ఆరోదవిని దీనికి వస్త్రమిండు అనెను. లోకులు వస్త్రములు పట్టుకొని పోయిరి. ఆమె చూచి నాకు వస్త్రమక్కర లేదు. నాకు స్వామి రూపమైన వస్త్రము కావలయును అనెను. రాజు దానిని పిలువనంపి "నీకు స్వామిరూపమైన ఆచ్ఛాదనము కావలెనా?" అనెను.

"దేవా, ఆడుదానికి ఆచ్ఛాదనము స్వామియే. స్వామి లేకుండ వేయినాణెముల విలువగల వస్త్రము ధరించినను స్త్రీ నగ్నయే"

అను అర్థమును సమర్థించు ఈసూక్తి చెప్పెను.

నది జలంబు లేక నగ్న; నగ్నము భూమి
రాజు లే; కనాథరమణి నగ్న.

రాజు ప్రసన్నుడై "ఈముగ్గురిలో నీ కెవరు నచ్చినాడు?" అనెను.

"దేవా, ఇందులో ఒకరు నాస్వామి. ఒకరు నాసోదరుడు. ఒకడు నాపుత్రుడు".

"నేను నీయెడ ప్రసన్నుడనైనాను. ఈముగ్గురిలోనుండి ఒకరి నిత్తును. నీ కెవరు కావలెను?"

"దేవా, నేను జీవించియున్నచో నాకు భర్త లభింపగలడు, పుత్రుడు లభింపగలడు; కాని నా తలిదండ్రులు పోయినపిమ్మట సోదరుడు లభింపడు".

రాజు సంతుష్టచిత్తుడై ముగ్గురను విడిపించి ఇచ్చెను.

ఆమె యొక్క తెవలన ముగ్గురు జనులు దుఃఖ విముక్తులైరి అను విషయము భిక్షుసంఘమున ప్రకటిత మయ్యెను. వా రొకనాడు ధర్మ సభలో సమావిష్టులై "ఆయుష్మంతులారా, ఈమె యొక్క తె వలన ముగ్గురు జనులు దుఃఖ విముక్తులైనారు" అని ప్రశంస చేయుచుండిరి. శాస్త ప్రవేశించి "భిక్షువులారా, ఇచ్చట కూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అనెను. భిక్షువులు ఫలాని విషయము అని చెప్పిన పిదప శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; ఈమె పూర్వముకూడ ఆముగ్గురు జనులను విడిపించినది" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా అటవీముఖమున ముగ్గురు నేల దున్నుచుండిరి. అంతయు పైజెప్పి నట్లే జరిగెను.

"ముగ్గురిలో నెవ్వరిని కోరుకొందువు?" అని రాజు ప్రశ్నింపగా ఆమె "దేవా, ముగ్గుర నీయ జాలరా?" అనెను. "వీలు లేదు" అని రాజు చెప్పెను. "అట్లయిన నా సహోదరు నిండు. తక్కిన

యిరువురస్థానములను పూరింప గలను. సోదరుడు మాత్రము లభింపడు" అని యామె యీ గాథ పలికెను.

పుత్రు డుత్సంగమున నుండు; పోవు దారి
నొందగా వచ్చు పతి; నెందు పొందదగునొ
ప్రియసహోదరు నొకని నావెర వెరుంగ

అప్పుడు రాజు "ఈమె సత్యము చెప్పిన" దని సంతుష్టచిత్తుడై ముగ్గురను బంధనమునుండి విడిపించి యిచ్చెను. ఆమె ముగ్గురను వెంటగొని చనెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చి జాతకసారాంశమును వెలువరించెను. పూర్వజన్మమునందలి జనులు నలుగురు ఇప్పటి నలుగురు జనులు; రాజు నేనే.

## 68 సాకేత జాతకము

శాస్త సాకేతమునకు సమీపమున అంజనవనములో విహరించుచు ఒకానొక బ్రాహ్మణుని గూర్చి చెప్పినది:

### వర్తమాన కథ

భిక్షుసంఘముతో భగవాన్ సాకేతమునకు సమీపమున నున్న అంజనవనమున ప్రవేశించు సమయమున సాకేతనగర వాసి యగు వృద్ధబ్రాహ్మణుడు నగరమునుండి వెలువడుచు నగరద్వారము వెలుపల బుద్ధుని చూచి, ఆయన పాదములపై వాలి గట్టిగా పట్టుకుని "తండ్రీ, తలిదండ్రులు వృద్ధులైనపిదప పుత్రుడు వారిసేవ చేయనక్కర లేదా? అట్లగుచో ఇంతకాలమువరకు నీవు మాకు కానబడకుండ ఏల మరుగుపడి యుంటివి? నేను గుర్తించినాను. రా, ఇప్పుడు నీ తల్లిని చూతువుగాని" అని, శాస్తను నిజగృహమునకు గొనిపోయెను. భిక్షుసంఘముతో శాస్త అచ్చటికి పోయి వేసిన ఆసనముపై కూరుచుండెను. బ్రాహ్మణి కూడ వచ్చి శాస్త పాదములపై బడి ఏడ్చుచు, "నాయనా, ఇంతకాల మెచట నుంటివి? తలిదండ్రులు ముదుసలులైన

పిదప వారిసేవ చేయగూడదా?" అని తన బిడ్డలతో "రండు. సోదరు నకు ప్రణామము చేయుడు" అని ప్రణామము చేయించెను. ఇరువురును సంతుష్టచిత్తులై భూరిదానము యిచ్చిరి. భోజనానంతరము శాస్త వారిరువురకు జరాసుత్తము ఉపదేశించెను. సూక్తోపదేశాంతమందు వారు అనాగామి ఫలమున ప్రతిష్ఠితులైరి. శాస్త పీఠమునుండి లేచి అంజనమునకు మరలిపోయెను. ధర్మసభలో సమావిష్టులైన భిక్షువులు "ఆయుష్మంతులారా, తథాగతుని తండ్రి శుద్ధోదనుడు, మాత మహా మాయ అను విషయము తెలిసియు బ్రాహ్మణుడు బ్రాహ్మణి తథా గతుని మాపుత్రుడు అన్నారు. శాస్త కూడ దీనిని సహించినాడు. దీనికి కారణ మేమి?" అనుకొనిరి. శాస్త వారి వాక్కులు విని "భిక్షువు లారా, వారిరువురు తమ పుత్రునే పుత్రు డందురు" అని పూర్వ జన్మకథ చెప్పెను.

## అతీత కథ

భిక్షుకులారా, ఈ బ్రాహ్మణుడు వరుసగా 500 జన్మలలో నాకు తండ్రి, 500 జన్మలలో నా పినతండ్రి, 500 జన్మలలో నాకు తాత. ఈ బ్రాహ్మణియు 500 జన్మలలో నాతల్లి, 500 జన్మలలో నా పినతల్లి, 500 జన్మలలో నా పితామహి. కావున 1500 జన్మలలో ఈయన చేతులలో పెరిగినాను. 1500 జన్మలలో ఈ బ్రాహ్మణి చేతులలో పెరిగినాను. ఇట్లు 3000 జన్మలు చెప్పి, అభిసంబుద్ధుడై యీ గాథ చెప్పినాడు:

ఎవనిమీద చిత్త మెంతయు లగ్నమౌ  
ఎవనియెడ ప్రసన్న మవును మనసు  
ఎవనియెడల ప్రీతి యొసగునో చూడకే  
వాని విశ్వసింప వలయు నెపుడు.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆనాటి బ్రాహ్మణదంపతులు ఈనాటి బ్రాహ్మణ దంపతులే. పుత్రుడు నేనే.

# 69 విసవన్త జాతకము

శాస్త జేతవనమున విహారముచేయుచు ధర్మసేనాపతి అగు సారిపుత్రుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

స్థవిరుడు తినుబండములు తిను రోజులలో సంఘముకొరకు మిఠాయి చాల పట్టించుకొని లోకులు విహారమునకు వచ్చిరి. భిక్షుసంఘము భుజించిన పిమ్మట మిఠాయి మిగిలిపోయెను. "భన్తే, గ్రామములోనికి పోయి యున్న భిక్షువుల భాగముగూడ వారి కిచ్చివేయుడు" అని వారు చెప్పిరి. అప్పుడు స్థవిరుని బాల శిష్యు డొకడు గ్రామములోనికి పోయి యుండెను. అచ్చటివారు అతని వంతు మిఠాయిని ఆతడు ఎంత సేపటికిని రాకుండుటచే స్థవిరున కిచ్చిరి. ఆయన దానిని భుజించిన తరువాత బాలశిష్యుడు వచ్చెను. స్థవిరుడు వానితో, "ఆయుష్మన్, నీ కొరకుంచిన ఖాద్యము నేను తింటిని" అనెను.

"భన్తే, మధురపదార్థము ఎవరికి అప్రియమగును?" అని వా డనెను.

మహాస్థవిరునకు చాల ఖేదము కలిగెను. నేటినుండి ఇక మిఠాయి తినను అని నిశ్చయించుకొని సారిపుత్ర స్థవిరుడు మరి యెన్నడు మిఠాయి తినలేదు. ఈవిషయము భిక్షుసంఘమునకు తెలిసినది. వారు ధర్మసభలో కూర్చుండి ఆవిషయము చర్చించుచుండిరి. శాస్త వచ్చి "భిక్షువులారా, ఇప్పుడేమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పగా శాస్త "భిక్షువులారా, ఒకపర్యాయము విసర్జించిన వస్తువును సారిపుత్రుడు ప్రాణములు పోయినను మరల పరిగ్రహింపడు" అని పూర్వజన్మకథ చెప్పెను:

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు విషవైద్యకులమున బుట్టి వైద్య వృత్తిచే జీవించుచుండెను.

ఒక గ్రామవాసి నొకనాడు సర్పము కరచినది. కాని జ్ఞాతులు వెంటనే బోధిసత్త్వుని గొనివచ్చిరి. ఆయన యిట్లనెను: సామాన్యము లైన విరుగుడు లిచ్చి, విషము లాగి వేయమందురా? కరచిన పామును రప్పించి కాటు వేసిన తావునుండి దానిచేతనే విషము పీల్పించ మందురా?"

"పామును తెప్పించి, దానిచే విషము లాగింపుడు" అని వాడు చెప్పగా, ఆయన సర్పమును తెప్పించి "నీవు ఇతనిని కరచితివా?" అని యడిగెను. అవునని ప్రత్యుత్తరము వచ్చెను.

"నీవు కాటు వేసిన చోటినుండి నీ విషమును పీల్చి వేయుము."

"ఒకసారి విడిచిన విషమును మరల నింతకుముందు గ్రహింపలేదు. ఇప్పుడును గ్రహింపను."

అప్పుడు వైద్యుడు కాష్ఠములు పేర్పించి, అగ్ని రవులు కొలిపి, "ఈ యగ్నిలోనైన ప్రవేశింపుము, విడిచిన విషమునైనను పీల్చి వేయుము" అని సర్పముతో పలికి ఈ గాథ చెప్పినాడు:

ఏవిష మ్మొక్కతడవ నే జీవితార్థి
నై త్యజించియు, మ్రింగద నదియె ఇట్టి
జీవితముకంటె ఛీ, ఇసీ, చావు మేలు.

ఈవాక్కులకు సర్ప మగ్నిలో ప్రవేశింప యత్నించెను. వైద్యుడు దానిని వారించి, ఓషధులతోడను మంత్రములతోడను విషమును విరిచి నిర్విషము చేసి, గ్రామీణున కారోగ్యము సమకూర్చెను. అనంతరము సర్పమునకు శీలముల ననుగ్రహించి "నేటినుండి యెవ్వరికిని హాని చేయకు" మని దానిని విడిచి పుచ్చెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆనాటి సర్పము సారిపుత్రుడు; వైద్యుడు నేనే.

# 70 కుద్దాల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు సారిపుత్రస్థవిరుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

అతడు శ్రావస్తిలో ఒకానొక కులపుత్రుడు. ఒకనాడతడు నేల దున్ని తిరిగి వచ్చునపుడు విహారములోని స్థవిరుని పాత్రలో స్నిగ్ధ మధుర భోజనము చూచి తనలో "మేము స్వహస్తములతో రాత్రిం బగళ్ళు బహువిధముల పనులు చేయుచున్నను ఇట్టి భోజనము లభింప కున్నది. మేము కూడ ప్రవ్రజింపవలెను." అనుకొని ప్రవ్రజించెను. పక్షమురోజులలోనే అనుచిత విధముగా ఆలోచనము చేయుచుండుటచే అతడు క్లేశములకు లోనై భిక్షు-ఆశ్రమమును విడనాడెను. భోజనము లభింపకుండుటచే చాల శ్రమపడి మరల వచ్చి ప్రవ్రజించి అభిధర్మము అభ్యసించెను. ఈ విధముగా ఆరుపర్యాయములు భిక్షు ఆశ్రమము విడిచి ప్రవ్రజించెను. ఏడవపర్యాయము ప్రవ్రజించినపిదప అభిధర్మము లోని ఏడు ప్రకరణములు గ్రహించెను, చాలమంది భిక్షువులకు ధర్మము నేర్పి అతడు అర్హత్వము పొందెను. అప్పుడు మిత్రులు నవ్వి "ఆయుష్మన్ చిత్తా, పూర్వమువలెనే నీచిత్తమున వికారము పొందలేదా?" అనిరి.

"ఆయుష్మంతులారా, ఇకముందు నేను గృహస్థుడనగు సంభావన లేదు." అని అతడనెను. అతడు అర్హత్ అయిన విషయము ధర్మ సభలో భిక్షువులు ముచ్చటించుచు "ఆయుష్మంతులారా, ఈ ప్రకారముగా అర్హత్వమునకు యోగ్యత కలిగి నప్పటికిని ఆయుష్మాన్ చిత్త హత్త సారిపుత్రుడు ఆరు పర్యాయములు గృహస్థాశ్రమమును స్వీక రించెను. ఓహో! పృథక్ జనుడు అగుట వలన ఎంత లోప మున్నది!" అనిరి. శాస్త అరుగుదెంచి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పి నంతట శాస్త "భిక్షువులారా, పృథక్ జనుని చిత్తము లఘు వగును. దానిని నిగ్రహించుట దుష్కర మగును. అది ఏదో విషయమున ఆసక్త మగును. ఒక పర్యాయము ఆసక్తమైనపిదప దానిని మరల్చుట

కష్టము. ఇట్టి చిత్తమును దమించి యుంచుట మంచిది. సంయుతమైన పిదప అది సుఖ కారణ మగును.

ఇచ్చి వచ్చినయెడ నెల్లెడ వ్రాలు
చిత్తమ్మును దమింప శ్రేయస్కరంబు.
సుఖహేతు వగు జుమీ చులకని దైన
చిత్తమ్ము నిగ్రహించిన పక్షమందు.

నిగ్రహము దుష్కరమగుట చేతనే పూర్వకాలమున పండితు డొకడు కుద్దాలము మీది లోభముచే దానిని విడువలేక ఆరు పర్యాయములు గృహస్థుగా మారి, ఏడవసారి ప్రవ్రజించి, ధ్యానోత్పత్తి వలన లోభమును నిగ్రహింపగలిగెను." అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు తోటమాలి కులమున బుట్టి పెరిగినాడు. కుద్దాలక పండితు డని ఈయన పేరు. కుద్దాలముతో నేల త్రవ్వి, ఆనప, గుమ్మడి, దోస మొదలగు కూరలు కాపించి వానిని విక్రయించి, కృపణ జీవితము నిర్వహించుచుండెను. కుద్దాలము తప్ప అతనికి వేరు ధనము లేదు. "ఈ గృహస్థ జీవితమువలన ఫలమేమి? వెడలిపోయి ప్రవ్రజింతును" అని యతడొకనాడు కుద్దాలమును రహస్యస్థానమున దాచి, సన్యసించెను. కాని నిరంతరము దానిని గూర్చి చింతించుచు ఆశ త్రెంపుకొనలేక కుంఠితమైన కుద్దాలముకొరకు మరల గృహస్థు ఆయెను. ఈవిధముగా ఆరు పర్యాయములు సన్యాసము, మరల ప్రవృత్తిమార్గము ననుసరించెను. ఏడవసారి యాతడు "ఈ మొండి కుద్దాలము కొరకు మాటిమాటికిని ప్రవృత్తిపరుడ నగుచున్నాను. ఈసారి దానిని మహానదిలో బారవైచి ప్రవ్రజింతును" అని యతడు నదీతీరమునకుబోయి ఇది పడినచోటు చూచితినేని మరల వచ్చి ఉద్ధరింప బుద్ధి పుట్టునేమో అని కుద్దాల దండము పట్టుకొని మూడు మారులు తలచుట్టు గిరునద్రిప్పి, కన్నులు మూసికొని, నాగబలముతో దానిని నదీప్రవాహమధ్యమునకు విసరివేసి జయించినాను, జయించినాను అని సింహనాదము చేసెను.

వారాణసీ రాజు శత్రువులను జయించి వచ్చుచు అతఃణమున నదిలో స్నానముచేసి, సర్వాలంకార సంయుతమగు హ స్తిస్కంథమున స్వారిచేయుచు, బోధిసత్త్వుని కంఠధ్వని విని 'జయించినా నను చున్నాడు. ఎవరిని జయించినాడో, వానిని కొనిరండు' అని అను చరుల కానతిచ్చి, పిలిపించి, 'ఏమోయీ, నేను యుద్ధమున శత్రువు లను జయించి ఇప్పుడే మరలి వచ్చుచున్నాను. నీ వెవరిని జయించి నావు?' అని ప్రశ్నించెను. "మహారాజా, మీరు కాంక్షలను జయింప నిచో ఇట్టి జయములు-సహస్రముకాని, శతసహస్రముకాని- నిరుప యోగములు. నేనో ఆంతరంగిక లోభమును నిగ్రహించి, కామము లను జయించినాను'' అని పలికి, మహానదిని వీక్షించి, ఉదకముమీాద ధ్యానముంచి సంప దను భూతిచే నాకసమునకు లేచి కూర్చుండి, రాజుకు ధర్మ ముపదేశించి, యీగాథ చెప్పెను :

ఏజయమ్ము తుది బరాజయమ్ముగ మారు,
అట్టిజయము విజయ మనగ రాదు.
ఏజయమ్ము తుది బరాజయ మ్మందదో
అట్టిజయమె విజయ మనగ జెల్లు.

ధర్మమును గూర్చి విన్నంతనే అజ్ఞానము తొలగి, వాసనలు క్షాళిత ములై రాజుకు సన్యాసముమీాద మనసు పుట్టెను. రాజ్య పరిపాలన కాంక్ష తోడనే అవగత మయ్యెను. 'మీారిప్పు డెక్కడకు బోవుదురు?' అని రా జడుగగా బోధిసత్త్వుడు 'మహారాజా, హిమవత్ప్రదేశమునకు బోయి ప్రవ్రజింతును' అనెను. 'అట్లయిన, నేనుకూడ సన్యసింతును' అని రా జాయన వెంట జనెను. అక్కడ జేరియున్న సైనికులు, బ్రాహ్మణులు, సంసారులు, తదితరులును రాజు వెంటనే వెడలిరి. "మన రాజు కుద్దాలక పండితునివలన ధర్మమునుగూర్చి విన్నంతనే ప్రవ్రజింప బలసమేతముగా నిష్క్రమించెను. మన మిక్కడ ఏమి చేయగలము?" అని వారాణసీవాసు లెల్లరు ద్వాదశయోజన విస్తీర్ణముకల నగరము నుండి బయలు వెడలిరి. వారిని వెంటగొని బోధిసత్త్వుడు హిమవం తము ప్రవేశించెను.

దేవరా జగు శక్రుడు కూరుచున్న సింహాసనము వేడియెక్కెను. ఆయన సమీాక్షించి "కుద్దాలక పండితుడు మహాభి నిష్క్రమణము

మొదలిడినాడు. మహాజన మున్నది. వీరికి నివాసస్థానములు లభింపవలెను” అని విశ్వకర్మను బిలిపించి, “నాయనా, కుద్దాలపండితుడు మహాభి నిష్క్రమణము మొదలిడినాడు. నివాసస్థానములు చూడవలెను. నీవు హిమవత్ప్రదేశమునకు బోయి, సమభూభాగమున ముప్పది యోజనముల పొడవునను, పదునైదు యోజనములు వెడల్పునను ఆశ్రమపదమును నిర్మింపుము” అని చెప్పెను. “చిత్తము దేవా” అని యతడు బదులుపలికి, వెడలిపోయి ఆజ్ఞ నిర్వర్తించెను. విశ్వకర్మ ఆశ్రమ పదమున పర్ణశాల నిర్మించెను. ధ్వనులుచేయు జంతువులను, పక్షులను, రాక్షసులను తరిమివేసి, ఆ యా భాగములలో ఏకపదికా మార్గములు నిర్మించి, నిజనివాసమునకు జనెను.

కుద్దాలక పండితుడు నిజపరివారముతో హిమవంతము ప్రవేశించి, శక్రు డిచ్చిన యాశ్రమ పదమునకు బోయి, విశ్వకర్మ నిర్మితములను పరివ్రాజక పరికరములను గ్రహించి, తాను తొలుత సన్యసించి, అనంతరము తక్కినవారిని సన్యాసులను జేసెను. ఆశ్రమపదము విభాగించి అందర కిచ్చెను. ఆశ్రమపదము ముప్పది యోజనముల పొడవయి, శక్రుని నగరమును మీరిపోయెను. ఆయన పరికర్మము కావించి, బ్రహ్మవిహారము భావించి, ఎల్లరకును కర్మస్థానము బోధించెను. అందరును సమాపత్తిపొంది, బ్రహ్మలోక పరాయణు లయిరి. వారికి పరిచర్య చేసినవారు దేవలోక పరాయణు లయిరి.

వేలకొలది జనులు వెంట రా; రణమున
వేయి జనులగెలుపు విజయ మగునె?
తానె యొంటి నిలిచి తన్నొంటి నిర్జించు
నతడె అసమవీరు, డతడె జేత!

శాస్త్రకథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున రాజు నేటి ఆనందుడు! పరిషత్తు ఇప్పటి పరిషత్తు; కుద్దాల పండితుడ నేనే.

# 71 వరణ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు కుటుంబియపుత్రుడు తిస్సస్థవిరుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు మిత్రులు ముప్పదిమంది కుల పుత్రులు గంధమాల్యా వస్త్రాదులు చేకొని శాస్త చేయు ధర్మోపదేశము విందమని చాల మందిని వెంట బెట్టుకొని జేతవనమునకు పోయిరి. అచ్చటి నాగ మాలక, శాల మాలక, మొదలగు శాలలలో కొంతతడవు కూర్చుండిరి. సాయంకాలము శాస్త సువాసిత గంధకుటి నుండి వెలువడి ధర్మ సభకు జని అలంకృత బుద్ధ పీఠముపై కూర్చుండెను. అప్పుడు కుల పుత్రులు అనుయాయులతో ధర్మసభలో ప్రవేశించి శాస్తను పరిమళ కుసుమములతో పూజించి, చక్రాంకితములు వికసితపద్మశోభితములు అగు బుద్ధ చరణములకు ప్రణామముచేసి యొకప్రక్కన కూరుచుండి ధర్మోపదేశము విని "భగవానుని వలన మనము విన్న ధర్మముల ప్రకారము మనము ప్రవ్రజించుట ముఖ్యము" అని తలపోసి, తథాగతుడు ధర్మసభనుండి వెడలి పోవునపుడు సమీపమునకు జని ప్రణామము చేసి ప్రవ్రజ్యకై ప్రార్థించిరి. శాస్త వారికి ప్రవ్రజ్యయొసగెను.

వారు ఆచార్యులను సంతుష్టపరచి ఉపసంపద పొంది, అయిదు సంవత్సరములవరకును సన్నిధిలో నుండి, రెండు మాతృకలను కంఠస్థము చేసి, పవిత్ర-అపవిత్రతలను గ్రహించి త్రివిధము లైన అనుమోదనములను నేర్చిరి. చీవరములు కుట్టి రంగు వేసి, యోగాభ్యాసము (శ్రమణధర్మము) అభ్యసించు కోరికతో ఆచార్యుని యానతి పొంది శాస్త కడ కరిగి, ప్రణామము చేసి, ఒకప్రక్కన గూరుచుండి "భన్తే, సంసారమునెడ విరక్తులము: జాతి జరా వ్యాధి మరణభయభీతులము; మేము సంసారమునుండి ముక్తుల మగుటకు కర్మస్థానములను (యోగ సాధనను) ఉపదేశింపుడు" అని ప్రార్థించిరి. శాస్త వారికి ముప్పది యెనిమిది (40) కర్మస్థానములలో నుండి వారికి తగినవి ఏరి ఉపదేశించెను.

వారు శాస్తకడనుండి కర్మస్థానములు గ్రహించి ఆయనకు వంథ

నము ప్రదక్షిణము చేసి, ఆచార్యుని కలిసికొని, పాత్ర చీవరములు గ్రహించి యోగాభ్యాసమునకై బయలుదేరిరి.

వారిలో కుటుంబియపుత్ర తిస్సస్థవిరు డనుభిక్షువు కలడు. ఆయన ఆలస్యము చేయుచు, పని చేయక, జిహ్వాచాపల్యముతో నుండును. ఆయన తనలో "అడవిలో నుండజాలను: యోగాభ్యాసము చేయలేను; భిక్షాటనము చేసి నిర్వహింపలేను. నేను పోయి యేమి చేయగలను?" కావున ఇచ్చటనే ఆగిపోవుదును. అనుకొని, స్థైర్యములేక కొద్ది దూరము వారితో జని ఆగిపోయెను. తక్కిన భిక్షువులు కోసల జన పదమున విచరించుచు సరిహద్దుగ్రామము చేరిరి. సమీపమున అడవిలో వర్షాకాలము గడపపలసి వచ్చెను. ప్రయత్నము చేసి మూడుమాసము లలో విదర్శనా-జ్ఞానముపొంది, పృథివి దద్దరిల్లునట్లు అర్హత్వము పొందిరి. వర్షాకాలము గడిపి శాస్తకు తమ గుణములను తెలుపు కోరికతో బయలుదేరి క్రమముగా జేతవనమున చేరిరి. అనంతరము వారు పాత్రచీవరములను భద్రపరచి, ఆచార్యులను జేరి, పిదప శాస్త సన్నిధి కేగి ప్రణామముచేసి, ఒకప్రక్కన గూరుచుండిరి. శాస్త వారితో మధురముగా సంభాషించెను. పిదప వారు తథాగతునకు తమగుణములను విన్నవించిరి. శాస్త ఆభిక్షువులను ప్రశంసించెను.

శాస్త వారిని ప్రశంసించుట చూచి కుటుంబియ పుత్రతిస్సస్థవిరుడు యోగాభ్యాసము చేయగోరెను. ఆభిక్షువులు శాస్తతో "భన్తే, మే మాయడవికి బోయి యుందుము" అని యనుజ్ఞ గొని, వెడలిపోయిరి. ఆస్థవిరుడు రాత్రివేళ ఉత్సాహముతో చాలతీవ్రముగా యోగా భ్యాసము చేయ నారంభించెను. అర్ధరాత్ర మయినపిదప బల్ల పట్టు కొని నిలుచుండి యుండి, కునికిపాట్లు పడి క్రిందికి పడెను. దానివలన ఆయన తొడయెముక విరిగెను. చాల బాధ కలిగినది. అయనకు సేవా శుశ్రూషలు చేయుటలో లగ్నులగుటచే వారు పోజాలరైరి. తర్వాత ధర్శనార్థము వారు వచ్చినపుడు శాస్త "భిక్షువులారా, మీరు నిన్న వెడలుట కాజ్ఞ గైకొనలేదా?" అనెను.

చిత్తము, భన్తే! కాని మా సహచారి కుటుంబితిస్స స్థవిరుడు ఆసమ యమున తీవ్రముగా యోగాభ్యాస మారంభించి, కునికిపాట్లు పడి

తలక్రిందులుగా పడుటలో తొడయెముక విరిగిపోయినది. అందుచే మేము కదలజాలమైతిమి."

భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వము కూడ నితడు తీవ్రముగా యోగాభ్యాసము చేయుచు, మీగమనమునకు బాధ కలిగించినాడు" అని, వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము గాంధార దేశమున తక్షశిలా నగరములో బోధిసత్త్వుడు జగద్విఖ్యాతుడైన ఆచార్యుడై 500 శిష్యులకు విద్యలు నేర్పుచుండెను. ఒకనాడు మాణవకులు కట్టెలు తెచ్చుటకై అడవికి బోయి పుల్ల లేరిరి. అందొక సోమరి పెద్ద కరణవృక్షమును జూచి, ఎండిపోయిన చెట్టని భావించి, ముహూర్తమాత్రము విశ్రమించి, తరువాత చెట్టెక్కి, మండలు రాల్చి తీసికొని పోవచ్చునని యెంచి, ఉత్తరీయము నేలపై బరచి గుర్రుపెట్టి నిద్రించెను. తక్కిన బ్రాహ్మణ మాణవకులందరును ఇంధనములు మోపులుకట్టి మరలివచ్చుచు నిద్రపోవుచున్న బ్రాహ్మణ కుమారుని జూచి, వాడు నిద లేచువరకును కాళ్ళతో వీపున తన్ని, వెడలిపోయిరి. వాడు లేచి, నిలుచుండి కన్నులు నులుముకొని, నిద్రమత్తుతోనే చెట్టెక్కెను. వాడు పట్టుకొన్నకొమ్మ రివ్వున లేచి కొనకంటికి తగిలెను. దెబ్బ తగిలిన కంటిని ఒకచేతితో నొక్కిపట్టి, రెండవ చేతితో పచ్చికొమ్మలు విరిచి, మోపుకట్టి, వేగముగా ఇంటికి బోయి కట్టెమోపులపై తన మోపు పడవేసెను.

మరునాడు గ్రామాంతరమునుండి గృహస్థు వచ్చి "రేపు తమకు బ్రాహ్మణవాచనకము చేయుదుము" అని ఆచార్యుని ఆమంత్రించిరి. ఆయన మాణవకులతో "నాయనలారా, రేపు నే నొక గ్రామమునకు బోవలెను. మీరు నిరాహారులై చనలేరు. ప్రయాణమునకు ముందే ఉదయమున గంజి కాచి త్రాగుడు. అచ్చట వారు నాకొర కిచ్చు ఆహారపదార్థములను కొనిరండు" అని చెప్పెను.

మరునాడుదయమే మాణవకులు లేచి, గంజి కాచుటకై దాసిని లేపి, "వేగముగా మాకు గంజి కాయవలెను" అని చెప్పిరి. పైనున్న పర్ణదారువులను పదింటిని తీసి దాసి నిప్పుముట్టించి మంటచేయుటకై

మాటి మాటికి నోటితో ఊదుచున్నను నిప్పు అంటుకొనలేదు. సూర్యోదయ మయినది. "ప్రొద్దెక్కినది. ఇప్పుడు ప్రయాణము చేయజాలము" అని మాణవకులు ఆచార్యుని సన్నిధికి జేరిరి.

"నాయనలారా, మీరు పోలేదేమి?"

"చిత్తము, ఆచార్యా, పోలేదు."

"ఎందుచేత?"

"సోమరిపోతు మా వెంట వంటచెరకుకై బయలుదేరి అడవిలో చెట్టుక్రింద నిద్రించినాడు. అయిన ఆలస్యమును సరిపుచ్చుటకై, త్వరితముగా చెట్టెక్కి, కంటికి దెబ్బ తగిలించుకొని, పచ్చికట్టె లింటికి దెచ్చి, యెండుపుడకల మోపులమీద పడవేసినాడు. ఎండుపుల్లలనుకొని తెచ్చి, దాసి నిప్పంటించినది. కాని మంటకాలేదు. సూర్యోదయ మయినది. అందుచేత మా ప్రయాణమున కంతరాయము కలిగినది."

సోమరి చేసిన పని విని ఆచార్యుడు వారితో "మందమతి వలన ఇట్టి చిక్కు సంభవించును" అని, ఈగాథ చెప్పినాడు:

ముందుగ జేయం దగుపని
మందుండై వెనుక చేయ మసలెడునాతం
డొందును పశ్చాత్తాపము
కుందు వరుణకాష్ఠ భంజకునకున్ సరిగా.

బోధిసత్త్వు డంతేవాసుల కీ వివరణము చెప్పి, దానాది పుణ్యకార్యములు చేసి, యథా కర్మం గతో.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి విద్యార్థి ఇప్పటి భిక్షువు; మిగిలిన మాణవకులు ఇప్పటి బుద్ధపరిషత్తు; ఆచార్యబ్రాహ్మణుడు నేనే.

# 72 సీలవ నాగరాజ జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు దేవదత్తుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై "ఆయుష్మంతులారా, దేవదత్తుడు అకృతజ్ఞుడు; తథాగతుని గుణముల నెరుగనివాడు" అనుచుండిరి. శాస్త అచటికి బోయి, "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అని, ఈవిషయము అని వారు చెప్పిన పిదప "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడేకాదు; పూర్వముకూడ నింతే; అత డెన్నడును నాగుణములను గ్రహింపలేదు" అని వారిప్రార్థనపై పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు హిమవంత ప్రదేశమున ఏనుగుకడుపున బుట్టినాడు. అతడు తల్లి కడుపులోనుండి యీవలకు రాగానే తెల్లగా రజతపుంజసన్నిభుడై యుండెను. నేత్రములు మణిగుళికా సదృశములు, ప్రతీయమాన పంచ ప్రసాదములు. ముఖము రక్తకంబళ సదృశము, తుండము రక్త సువర్ణ బిందు మండిత రజత దామతుల్యము, పాదచతుష్టయము కృతలాక్షా పరికర్మ సంకాశము. ఇట్లు దశపారమితాలంకృతమై ఆయన రూపము సుందరముగా నుండెను. అతడు పెరిగి పెద్దవాడయినపుడు హిమవంతములోని వారణము లన్నియును గూడి ఆయన ననుసరించి విచరించుచుండెను. 80 వేల గజములు పరివేష్టించియుండ, హిమవంతమున నివశించుచు బోధిసత్త్వుడు వారణగణమున దోషము గ్రహించి, గణమునుండి విడివడి, ఏకాకిగా అరణ్యమున చరించుచుండెను. శీలవంతుడై యుండుటచే ఈయనకు సీలవ నాగరాజు అను పేరు వచ్చెను.

ఒకనాడు వారణాసీ నివాసియగు వనచరుడు హిమవంతము ప్రవేశించి, తనపనిముట్లు వెదకువాడై త్రోవ తప్పి, అటు నిటు దిరుగుచు

మరణ భయమున బాహువు లెత్తి పరిదేవనము చేయుచు చరించు చుండెను. బోధిసత్త్వుడు జాలి చెంది, ఈ పురుషుని కష్టమును తొలగింతును అని కారుణ్య బోధితుడై వానియొద్దకు బోయెను. చూచి వాడు భయపడి పరుగెత్తెను. వాడు పరుగెత్తుట చూచి బోధిసత్త్వుడాగగా వాడును ఆగినాడు. బోధిసత్త్వుడు ముందరికి జనగా వాడు మరల పరుగెత్తి బోధిసత్త్వు డాగినప్పుడు తాను ఆగుచు, ఆలోచించి "ఈ వారణము నా పలాయన కాలమున ఆగుచు, నే నాగినప్పుడు వచ్చుచున్నది. కావున అనర్థకామము కాదు. పైగా నా కష్టమును తొలగింపవచ్చును" అనుకొని ధైర్యము వహించి నిలిచెను. బోధిసత్త్వుడు సమీపించి "ఓయి మానవా, ఏల దుఃఖించుచు తిరుగుచున్నావు?" అని యడిగెను. "స్వామీ, దిక్కు తెలియక మార్గ మూఢుడనై, మరణ భయమున దుఃఖించుచున్నాను" అని వాడు చెప్పెను.

అంతట బోధిసత్త్వుడు వానిని నిజ నివాసమునకు గొనిపోయి వివిధ ఫలము లిచ్చి, కొలది దినములపాటు సంతృప్తుని జేసి, "మానవా, భయపడకు. నిన్ను మరల మానవపథమునకు గొని పోవుదును" అని వానిని తన వీపుపై నెక్కించుకొని జననివాసమునకు గొం పోయెను. ఆ మిత్ర ద్రోహి "నన్నెవరైన అడిగినచో చెప్పవలసివచ్చును" అని తలచి బోధిసత్త్వుని వీపుమీద గూరుచుండియే వృక్షాదులను, పర్వతమును గురుతు పెట్టుకొను చుండెను. బోధిసత్త్వుడు వానిని అడవి దాటించి వారాణసీ మార్గమున దింపి, "ఓయీ, అదే నీమార్గము. ఎవరైన నిన్ను అడిగినను అడుగకున్నను నా నివాసమునుగూర్చి చెప్పవలదు" అని వీడ్కొని నిజనివాసమునకు బోయెను.

అంతట వాడు వారాణసికి బోయి తిరుగుచు, దంతకారుల వీధికి జని రకరకముల దంతపు వస్తువులు చూచి, బ్రతికియున్న యేనుగు దంతము కొందురా ? అని యడిగెను. "ఏమంటివి? బ్రతికియున్న యేనుగు దంతము చచ్చిన యేనుగు దంతము కన్న హెచ్చు విలువ కలది" అని వారు చెప్పిరి. అట్లయిన జీవనాగదంతము తీసికొని వత్తును" అని వాడు పాథేయము పుచ్చుకొని, పదను గల రంపము కొని, బోధిసత్త్వుని నివాసమునకు బోయెను. 'ఏల వచ్చినా' వని బోధి

సత్త్వుడడెను. 'నేను దుర్గతుడను, స్వామీ. కృపణ జీవితము గడప లేకున్నాను. మిమ్ము దంత ఖండము యాచించుటకై వచ్చినాను" అని వాడు పలికెను. మంచిది. నీకు దంత మిచ్చెదను. రంప మున్నదా?" "రంపము తీసికొనియే వచ్చినాను. స్వామీ." "అట్లయిన క్రకచముతో దంతములు కోసికొని పొమ్ము" అని బోధి సత్త్వుడు, వృషభమువలె కాళ్ళు వంచి, నేలమీద పండుకొనెను. అంతట వాడు బోధిసత్త్వుని అగ్రదంతములు కోసెను. "ఓయీ, ఈ దంతములు నాకప్రియము లని కాని విలువ లేని వని కాని ఇచ్చు చున్నానని తలపకుము. వీని కన్న సహస్రగుణములు, శత సహస్ర గుణములు, ప్రియకరములైన సర్వజ్ఞాన దంతములు, సర్వధర్మ ప్రతి వేదన సమర్థము లైనవి కలవు, కావున నే నిచ్చు దంతద్వయము వలన నీకు సర్వజ్ఞత కలుగును గాక" అని బోధిసత్త్వుడు తదావాసము చేసి, దంత యుగళ మిచ్చెను.

వాడు దానిని గొనిపోయి విక్రయించి, తన్మూల్యము క్షీణింపగా మరల బోధిసత్త్వుని సన్నిధికి వచ్చి "స్వామీ, మీదంతములు విక్ర యించి, వచ్చిన ధనము ఋణము తీర్చుటకు సరిపోయినది. మిగిలిన దంతములను దయ చేయుడు" అని వేడెను. మంచిది అని బోధి సత్త్వుడు పూర్వమువలెనే మిగిలిన దంతముల నిచ్చెను. వాడు వానిని విక్రయించి మరలవచ్చి "స్వామీ, జీవితము గడచుట కష్ట ముగా నున్నది. మిగిలినదంత భాగములను దయచేయుడు" అని యడిగెను. బోధిసత్త్వుడు పూర్వమువలెనే పరుండెను. మహాసత్త్వుని రజతదామ సదృశమగు తుండమును మర్దించి, కైలాసకూట సంకాశ మగు కుంభముపై నెక్కి, మాంసము తొలగునట్లు దంత మూలము లను తన్ని, ఖరక్రకచముతో కోసి తీసికొని పోయెను. ఆ దురాత్మ గ్గుడు బోధిసత్త్వుని చూపు మేర దాటినంతనే శృంగములతో మేరువును వహింపగల మహా విశాల దృఢ భూమి అన్నియమేధ్యము లను మోయగలిగిన దయ్యును, ఆ మహాపాపి భారమును వహింప జాలదో యనునట్లు బీట వారెను.

తోడనే అవీచీ మహా నిరయమునుండి జ్వాలలు వెలువడి ఆ కృత ఘ్నుని వినాశ కంబళమున చుట్టు కొన్నట్లు చుట్టుకొనెను. ఆపాపి

భూ గర్భములో లీనమైనపుడు అచ్చటి వృక్షదేవత వనము మార్మ్రోగునట్లు "మహాసామ్రాజ్య మిచ్చినను మిత్రద్రోహి కృతఘ్నుడు నగువానిని సంతుష్టుని జేయుట వట్టిది!" అని ధర్మ ముపదేశించు నీగాథ పాడెను :—

చేసిన, మేళ్ళను మరచుచు
దోసంబే యెల్లయెడల తోచునతనికిన్
ఈసర్వంసహ నిచ్చియు
వీసంబును వాని దృష్టి పెట్టగ వశమే !

ఇట్లా వనదేవత కాననము ప్రతిధ్వను లీనునట్లు ధర్మము బోధించెను. బోధిసత్త్వుడు యావజ్జీవ ముండి, తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, కథలు సరిపోల్చి జాతకసారాంశమును వెలువరించెను. అప్పటి మిత్రద్రోహి ఇప్పటి దేవదత్తుడు; వృక్షదేవత సారిపుత్రుడు; సీలవనాగ రాజు నేనే.

## 73 సచ్చంకిర జాతకము

శాస్త జేతవనమున విహరించుచు వధప్రయత్నము విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

భిక్షువులు ధర్మసభలో కూరుచుండి "ఆయుష్మంతులారా, దేవదత్తుడు శాస్తగుణముల నెరుగడు; ఆయనను వధించుటకై యత్నించుచున్నాడు" అని, దేవదత్తుని అవగుణములను గూర్చి పలుకుచుండిరి. శాస్త వచ్చి, "భిక్షువులారా, ఇచట ఏమి సంభాషించుచున్నా?" రనగా వారు ఈవిషయము అని చెప్పినపిదప "భిక్షువులారా కేవల మిప్పుడే కాదు; నన్ను వధించుటకై దేవదత్తుడు పూర్వముకూడ ప్రయత్నము చేసినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఆయనకు దుష్టకుమారు డను పేరుకల పుత్రు డుండెను. వాడు క్రూరుడు, దుష్కర్ముడు. పరుషవాక్యము కాని తాడనము కాని లేకుండ ఎవరితోడను సంభాషించెడివాడు కాడు. కంటిలోని యిసుక రేణువువలెను, ఉన్మత్త పిశాచమువలెను వాడు యింటిలోని వారలకును అన్యులకును భీకరుడై యుండెను.

కొలది పరివారముతో వా డొకనాడు క్రీడార్థము నదీతీరమునకు బయలు దేరి పోవగా ప్రచండవాతము చెలరేగెను. చీకటి క్రమ్మెను. నన్ను నదిలోనికి గొనిపోయి స్నానము చేయించి, ఒడ్డునకు జేర్పుడు. అని వాడు సేవకుల నాజ్ఞాపించెను. వానిని నీటిలోనికి గొనిపోయి వాని నంత మొందింపదలచి, "లోకకంటకా, జలములో మునిగిపొమ్ము" అని నీటిలో ద్రోసివేసిరి.

కుమారుడు వెంటలేకుండ వారు వచ్చుట గమనించి రాజకుమారు డేడి అని ప్రభు వడుగగా "దేవా, మాకు తెలియదు. కుమారుడు కనబడలేదు. పెనుగాలికి ముందుగా యింటికి వచ్చియుండును" అని చెప్పిరి. రాజు వెంటనే ప్రాసాదద్వారములు తెరపించి నదీతీరమునకు జని కుమారునికై వెదకించెను. కాని వానిజాడ కనబడలేదు.

అక్కడ రాజకుమారుడు ప్రవాహవేగమున కొట్టుకొనిపోవుచు దొరకిన చెట్టుబోదె మీదికెక్కి కూరుచుండి, మరణభీతిచే రోదనము చేయుచు పోవుచుండెను.

వారాణసిలో ధనికు డొకడు మరణించి తాను నదీతటమున పూర్వము పాతిపెట్టిన నలువదికోట్ల నాణెముల మీది ఆశచేత సర్పమై పుట్టి ఆప్రదేశమున నివసించుచుండెను. ఇంకొక ధనికుడు ముప్పది కోట్లు ఆప్రాంతముననే నిక్షిప్తము చేసి, మూషికమై అచ్చటనే నివసించుచుండెను. నదీజలము పాము పుట్టలోనికి ఎలుక కలుగులోనికి ప్రవహింపగా, అవి ప్రవాహమున కొట్టుకొని పోవుచు రాజకుమారు డెక్కియున్న చెట్టుబోదెకిటునటు నెగబ్రాకి పట్టుకొని యుండెను. నదీతీర మందలి శాల్మలీ వృక్షముపై నున్న శుకశాబకము నీటి తావున

చెట్లు పడిపోవుటచే దానిపై నుండి యెగిరి, వానతాకున రాజకుమారుని వృక్షస్కంధముపై వ్రాలెను. ఈ జంతువులతో వాడు నీటిలో బోవుచుండెను.

బోధిసత్త్వుడు ఆకాలమున వాయవ్యదేశమున బ్రాహ్మణ కుటుంబమున బుట్టి, వయసు వచ్చిన పిమ్మట సంసారము నొల్లక, మునివృత్తి నవలంబించి నదీతీరమున పర్ణశాలలో నివసించుచుండెను. ఆతడు పచారు చేయుచుండగా రాజకుమారుని రోదనము వినెను: తోడనే ఆయన నదీజలములో దిగి భయము వలదు అని కేకవేసి నాగబలుడగుటచే చెట్టుబోదెను తీరమునకు నెట్టి, నేలపై నిలిపి సర్ప మూషిక శుక శాబకములను పర్ణశాలలోనికి గొనిపోయి దుర్బలములై యున్నవానికి చలిమంట వేసి, పిమ్మట రాజకుమారుని అగ్నివద్ద కూరుచుండబెట్టెను. వివిధఫలములను దెచ్చి ముందు జంతువులకు, అనంతరము రాజకుమారునకు పెట్టెను. "ఈ మూర్ఖ తాపసుడు రాజజన్మమును పరిగణింపక బుద్ధిలేని జంతువులను ప్రధానముగా జూచుచున్నాడు" అని వాడు మాత్సర్యము వహించెను.

కొంతతడవునకు సత్తువ వచ్చుటచే సర్ప మాయనవద్ద సెలవు తీసికొనుచు "నాయనా, నీవు నాకెంతో మేలు చేసినావు. వలయుచో నా ధనరాశి నీదేయగును. నా నెలవునకు నీవు వచ్చి సర్పమా అని పిలుతువేని నీ కోరిక నెరవేరును. నలువదికోట్ల ధనము ఒకచో దాచినాను" అని చెప్పెను. మూషికము కూడ తన ధనమువిషయమై అటులే చెప్పెను. శుకశాబకము మాత్రము "నాయనా, రజతసువర్ణములు నాకడ లేవు. కాని యెన్నడైన నీకు మంచిబియ్యము వలయునేని నా నెలవునకు వచ్చి శుకమా, అని పిలువుము. నాబంధుజనముతో బండ్లకొలది తండులములు నీకు సమర్పించెదను" అని పలికెను. కృతఘ్నుడగుటచే రాజకుమారుడు పైకేమియు ననక 'తాపసి నాకు గనబడినచో అంత మొందింతును' అని తనలో ననుకొని, ప్రకటముగా "తాపసోత్తమా, నా రాజ్యాభిషేక సమయమున నీవు వచ్చితివేని నాలుగుకోరికలు నెరవేర్తును" అని పలికి సెలవు తీసికొనెను.

తరువాత కొలదికాలమునకు వాడు రాజ్యాభిషిక్తుడయ్యెను.

బోధిసత్త్వుడు వారి సత్యాసత్యములు పరీక్షింప గోరి, మొదట

సర్పబిలము కడకు బోయి సర్పమా అని పిలిచెను. తోడనే సర్పము వెలుపలకు వచ్చి ఆయన నర్చించి 'తండ్రీ, ఇచ్చట నున్న నలువదికోట్ల ధనమును దీసికొనుము' అని చెప్పెను. అనంతర మాయన మూషిక బిలము వద్దకు జని మూషికమా అని పిలిచెను. అదియు సర్పమువలె ప్రవర్తించెను. పిమ్మట ఆయన శుక ముండు చోటికి బోయి, శుకమా అని కేకవేసెను. చిలుక చెట్టుదిగివచ్చి నాయనా, హిమాలయ ప్రదేశమునకు బోయి నాబంధువులతో గూడి తండులములు తెమ్మందువా? అనెను. "అవసరము వచ్చినప్పుడు మరవక అడిగెదను" అని చెప్పి, ఆయన రాజకుమారుని పరీక్షించుటకై వెడలెను.

ఆనాడు బోధిసత్త్వుడు రాజోద్యానమున విడిసి, మరునాడు మేలి వస్త్రములు దాల్చి భిక్షార్థము నగరములోనికి బోయెను. ఆసమయమున కృతఘ్నుడగు రాజు నగరములో భద్రగజముపై జనుచు బోధిసత్త్వుని దూరమునుండి చూచి "ఇతడు నాకు చేసిన యుపకారము జనులకు తెలియక ముందే శిరస్సు ఖండింపవలెను" అనుకొని, సమీప పరిచారకులకు సైగచేసి "ఆసన్యాసి దుర్మార్గుడు. నన్ను యాచింపవచ్చుచున్నాడు. వానిని పట్టి కట్టి, వీధివీధి మూలలను కొట్టి, నగరము వెలుపల వధ్యస్థానమున శిరస్సు ఖండించి శూలారోపము చేయవలెను" అని యానతిచ్చెను.

రాజాజ్ఞ చొప్పున సేవకులు మహాసత్త్వుని బంధించి, వధ్యస్థానమునకు దీసికొనిపోవుచు మార్గములో అన్ని వీధిమూలల ప్రహరించుచుండిరి. వారితాడనము లెంత గాఢమయినను మహాసత్త్వుడు అమ్మా, నాయనా, అని ఆక్రోశింపక, ఈగాథమాత్రము పలికినాడు:

> వెలువరించుకంటె జలమున కొందర,
> నుత్తమంబు దుంగ నుద్ధరింప-
> యెంత యనుభవజ్ఞు లీసూక్తి పలికిరి,
> ఎవరో బుద్ధిమంతు లెంతయేని!

వారు తన్ను ప్రహరించిన తావు లన్నిటను బోధిసత్త్వుడీ గాథయే పలుకుచుండుటచే కొందరు బుద్ధిమంతు లాయనను సమీపించి, "ఆర్యా, తాము మారాజుకు చేసిన యుపకార మేమి?" అని యడిగిరి. ఆయన జరిగిన దంతయు జెప్పి "నాకీవ్యథ వానిని ప్రవాహము

నుండి రక్షించుటవలన కలిగినది. పెద్దల వివేక వాక్యములకు లక్ష్యము నైతినని గ్రహించుటచే మీరు వినుటకై యీ గాథ పాడుచుంటిని” అని చెప్పెను.

ఈవృత్తాంత మంతయు విన్న చాతుర్వర్ణ్యము వారు కోపించి “తన ప్రాణ రక్షణము చేసిన యీ సత్పురుషుని మేలు గణింపక కృతఘ్నుడైన మన రాజువలన లోకమున కేమి శ్రేయము కలుగును; లోకోపద్రవ కారకుడైన యితనిని బట్టుకొనుడు” అని యేకగ్రీవముగా నాక్రోశించిరి. ఏనుగుపై గూరుచున్న రాజును చుట్టు ముట్టి, అన్ని వైపులనుండి బాణశూలశిలా కాష్ఠాదులు విసరి సంహరించి, బోధిసత్త్వుని గొనిపోయి పట్టము కట్టిరి.

ఆయన ధర్మమార్గమున పరిపాలన చేయుచు సర్ప, మూషిక శుకములను పరీక్షింప దలచి ఒకనాడు పరివారసమేతముగా ఆస్థలమునకు జని సర్పమా అని పిలువగానే సర్పము బిలమునుండి వెడలి వచ్చి సాదరముగా “దేవా, ఇదిగో ధన రాశి. స్వీకరించి అనుగ్రహింపుడు” అనెను.

రాజు నలువది కోట్లను పరివారమున కప్పగించి, మూషిక నివాసమున కరిగి మూషికమా యనెను. తోడనే మూషికము వెలుపలికి వచ్చి సగౌరవముగా ముప్పదికోట్ల ధనరాశిని సమర్పించెను. దానిని పరివారమున కప్పగించి రాజు శుక నివాసమున కరిగి, శుకమా యని పిలిచెను. వెంటనే శుకము వచ్చి, సమాదరమున “దేవరకు తండులములు సమకూర్తునా?” అని పలికెను.

“అవసరము వచ్చువరకును నీకు శ్రమ కలిగింపను. పోవుదము రమ్ము” అని డెబ్బదికోట్ల సువర్ణరాశితోడను, సర్ప మూషిక శుకములతోడను రాజు నిజనగరమునకు మరలిపోయి, ధనరాశిని ధనాగారమున బెట్టించి, ప్రాసాదము మీదికి బోయెను. సర్పనివాసార్థము బంగారు గొట్టమును, మూషిక నివాసమునకు స్ఫటిక పేటికయు, శుకమునకు బంగరు పంజరమును చేయించెను. రాజాజ్ఞానుసారముగా మూడు జంతువులకును బంగరు పళ్ళెరములో ఉచితాహారము పెట్టుచుండిరి.

యావజ్జీవము దానాది పుణ్యకార్యములు చేయుచు రాజు తక్కువ

చిలుకమిత్రులతో సుహృద్భావమున మెలగుచుండెను. ఐకమత్యముతో కాలము గడపుచు అంతమున నందరును యథా కర్మం గతా.

శాస్త ధర్మోపదేశముచేసి కథలు సరిపోల్చి - జాతకసారాంశము వెలువరించెను. అప్పటి దుష్టరాజు ఇప్పటి దేవదత్తుడు; సర్పము నేటి సారిపుత్రుడు; ఎలుక మౌద్గల్యాయనుడు; చిలుక ఆనందుడు; ప్రాప్తరాజ్య ధర్మరాజు నేనే.

# 74 రుక్ఖధమ్మ జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండెను. ఆసమయమున నీటికొరకు జ్ఞాతులకు (శాక్య కోలియులకు) జగడము జరిగెను. వారికి వినాశము సమీపించిన దని భగవాన్ తెలిసికొని ఆకాశమార్గమున జని, రోహిణీనదిపై కూరుచుండి, శరీరమునుండి నీలకాంతులు ప్రసారింపజేసి, ఆకాశమార్గమున దిగి వచ్చెను. నదీతీరమున గూరుచుండి వారి జగడమునుగూర్చి గాథ పలికెను. ఇది దాని సంగ్రహము. సవిస్తరముగా కుణాల జాతకమున (536) కానవచ్చును.

## వర్తమాన కథ

ఆసమయమున శాస్త తన జ్ఞాతులను సంబోధించి "మహారాజులారా, మీరు బంధువులు చుట్టములు పరస్పరము కలసిమెలసి ప్రసన్నముగా నుండవలెను. జ్ఞాతులైకమత్యముతో నున్నచో శత్రువుల కవకాశముండదు. మానవులమాట అటుండనిండు. స్థావరములైన వృక్షములుకూడ కలిసియుండక తప్పదు. పూర్వకాలమున హిమవంతమున సాలవనముమీదుగా మహావాతము చెలరేగెను. కాని సాలవనములో వృక్షములు, మొక్కలు, తీగెలు కలిసియుండుటచే ఒక్కచెట్టు కూడ పడిపోలేదు. పైగాలి పైనపోయినది. కాని మైదానమున మహావృక్ష మొకటి గాలికి సమూలముగా పెల్లగిలి నేల కొరిగెను.

ఈప్రకారముగా మీరుకూడ కలిసి మెలిసి శాంతముగా నుండవలయునో అని వారు ప్రార్థించినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ప్రథమ వైశ్రవణుడు మరణించెను. శక్రుడు రెండవ వైశ్రవణుని ప్రతిష్ఠించినాడు. పరివర్తన మైన పిమ్మట నూతనవైశ్రవణుడు మీమీ యిష్టస్థానమున నివసింపవచ్చునని వృక్షదేవల కనుజ్ఞ యిచ్చెను.

ఆకాలమున బోధిసత్త్వుడు సాలవనమున వృక్షదేవతగా నుండెను. "మీరు విమానముల నేర్పరచుకొన్నప్పుడు వెలుపల ఒంటిగా నున్న చెట్లను విడిచి, ఈసాల వనమున నా నివాసస్థానము చుట్టును చేరుడు" అని జ్ఞాతిజనమున కుపదేశించెను. బుద్ధికలవారు ఆయన నివాసము చుట్టును స్థావరము నేర్పరచుకొనిరి. బుద్ధిలేనివారు "మే మడవిలో ఏల యుండవలెను? మానవ నివాసములకు సమీపముగా గ్రామముల, పట్టణముల నగరముల వెలుపలమార్గములలో నుందుము. అట్టిచోట్ల నిలుచు వన దేవతలకు పూజలు, బహుమూల్యములగు బలులు లభించును" అని మానవ నివాసముల యంగణములలోని వృక్షముల నాశ్రయించెను.

ఒకనాడు ఝంఝూవాతము చెలరేగగా లోతుగా వ్రేళ్ళు ప్రాతు కొన్న మహావృక్షములు కూడ పెల్లగిలి పడిపోయినవి. కొమ్మలు విరిగినవి, మండలు రాలినవి, ఎన్నో చెట్లు సమూలముగా నేలపై నొరగినవి. ఝంఝూవాతము సాలవనమున ప్రవేశించినపుడు ఏమియు నష్టము కలుగలేదు. అచ్చట చెట్లు దట్టముగా పెనవేసికొని యున్నవి. భగ్న విమానము లగు వృక్షదేవతలు తమతమ బిడ్డలను చేతులలో వేసికొని హిమవంతమునకు బోయి సాలకవన దేవతలతో జెప్పుకొన్నవి. ఈవిషయము వారివలన బోధిసత్త్వునకు దెలిసెను.

"మంచిమాటలు వినకపోవుటచే మీ రీస్థితికి వచ్చినారు" అని బోధిసత్త్వుడు ధర్మము నిర్దేశించుచు ఈగాథ పలికినాడు:

కలిసి యుండుటే మేలు జ్ఞాతులకు గూడి
చేరియుండు నడవిలో చెట్లుకూడ

మింటిగా నున్నతరువు వాయువులం బీది
పెల్లగింపవె కూకటి వ్రేళ్ళతోడ!

బోధిసత్త్వుఁ డిట్లుచెప్పి, జీవితాంతమున యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుకథలు కలిపోల్చి, జాతకసారాంశము తెలుపరించెను. ఆసమయమున దేవతలు చేటిబుద్ధపరిషత్తు; పండితదేవత నేనే.

## 75 మచ్ఛ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు తాను కురిపిన వర్షమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు కోసల దేశమున వర్షము పడలేదు. పొలములు మాడి పోయినవి. అక్కడక్కడ నున్న తటాకము లెండిపోయినవి. జేతవన ద్వారమువద్ద పుష్కరిణిలో నీరు తగ్గిపోయెను. కాకులు గ్రద్దలు మొద లగుపక్షులు లోతుబురదలోనికి జని చేపలను తాబేళ్ళను బాణాగ్రము వంటి తమ తీక్ష్ణచంచువులతో పొడిచి చంపి కొనిపోయి అరచుచు భక్షించుచుండెను. చేపలకు తాబేళ్ళకు గలుగుచున్నకష్టమును జూచి, మహాకరుణాళువైన బుద్ధునిహృదయము ద్రవీభూత మయ్యెను. అయన తనలో "నేడు నేను వర్షము కురుపక తప్పదు" అనుకొని, తెల్లవార గనే కాల్యకృత్యములు నిర్వర్తించి, మహాభిక్షుసంఘమును వెంటగొని బుద్ధలీలాప్రకారము శ్రావస్తిలో భిక్షాటనార్థము ప్రవేశించెను. ఆహా రముతో మరలి వచ్చుచు శ్రావస్తినుండి విహారమునకు జనునప్పుడు జేతవన పుష్కరిణీ సోపానముమీద నిలిచి ఆనంద స్థవిరుని బిలిచి, "ఆనందా, స్నానము చేయుటకు వస్త్రములు తెమ్ము. జేతవనపుష్క రిణిలో స్నానము చేయుదును" అని చెప్పెను.

"భన్తే, పుష్కరిణిలో జలము పూర్తిగా ఇగిరిపోలేదా? కేవలము బురదమాత్రము మిగులలేదా?"

"ఆనందా, బుద్ధబలము గొప్పది. నీవు పోయి స్నానార్థము వస్త్రములు తెమ్ము."

స్థవిరుడు వస్త్రములు తెచ్చి యిచ్చెను. శాస్త వస్త్రపుఅంచు మెడకు చుట్టుకొని రెండవకొన ఒడలిచుట్టు చుట్టుకొని జేతవనపుష్కరిణిలో స్నానేచ్ఛతో సోపానముపై నిలుచుండెను.

అప్పుడు శక్రుని పాండుర శిలా పీఠము వేడియెక్కెను. ఏమయి యుండునని ఆయన ఆలోచించి కారణము గ్రహించి పర్జన్య దేవపుత్రుని పిలువనంపి "నాయనా, శాస్త జేతవనపుష్కరిణిలో స్నానము చేయుకోరికతో ప్రథమసోపానముమీాద నిలిచియున్నాడు. నీవు శీఘ్రముగా వర్షము కురిపి కోసలదేశ మంతయు జలమయము చేయుము" అని ఆదేశించెను. పర్జన్యకుమారుడు సరే అని, ఒక మేఘమును మెడపై నుంచుకొని, ఒక మేఘమును ఒంటికి తొడుగుకొని మేఘగీతము పాడుచు తూర్పుదిక్కున దుమికి, మేఘఖండము నెత్తి దానిని వేయిరెట్లు వ్యాపింపజేసి, మెరవులు మెరయుచుండ, క్రిందికి మూాతి త్రిప్పి యుంచిన ఘటమువలె వర్షము పడుచుండ, కోసలరాష్ట్ర మంతయు సముద్రమువలె నగపడునట్లు, సలిలముతో నింపెను. దేవపుత్రుడు అఖండముగా వర్షము కురియించుచు త్వరలోనే జేతవన పుష్కరిణి నింపెను, ఉదకము పై మెట్టువరకు లేచెను.

శాస్త పుష్కరిణిలో స్నానము చేసి రక్తవర్ణ వస్త్రము ధరించి కాయబంధనము ధరించి మహాచీవరమును బుజముపై నుంచుకొని భిక్షుసంఘముతో గంధకుటీ ప్రాంగణమునకు బోయెను. శ్రేష్ఠబుద్ధాసనముపై గూరుచుండి భిక్షువులు సమ్మానములు చేసినపిమ్మట లేచి, మణిమయసోపానముల పలకపై నిలిచి భిక్షుసంఘమున కుపదేశ మిచ్చి ఉత్సాహము కూర్చి నుపాసిత గంధకుటిలో ప్రవేశించెను. అచ్చట శాస్త దక్షిణపార్శ్వమున సింహాశయ్యపై శయనించెను. సాయంకాలము ధర్మసభలో సమావిష్టులైన భిక్షువులు "ఆయుష్మంతులారా, దశబలధారి క్షాంతి, మైత్రి, దయారూపసంపత్తి చూడుడు. శాస్త అనేక క్షేత్రములు వాడిపోయినపిదప నానాజలాశయములు శుష్కిం

చిన పిదప, మత్స్య కచ్ఛపములు మిక్కిలి బాధనొందిన పిదప భగవాన్ దయార్ద్రచిత్తు డయి జనసమూహమును బాధా విము క్తులను చేయుకోరికతో స్నానవస్త్రములు చేకొని, జేతవనపుష్క రిణిలో పై మెట్టుమీద నిలిచి, త్వరలోనే కోసలదేశ మంతయు మహా సముద్రమువలె నగునట్లు వర్షము కురిపించి, జనసమూహము శారీరక మానసిక శ్రమలనుండి విముక్త మగునట్లు కావించి, విహారములో ప్రవేశించినాడు'' అని ప్రశంసించుచున్న సమయమున భగవాన్ గంధ కుటి వెలువడి, ధర్మసభలోని కరుదెంచి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అని యడిగెను.

ఈవిషయము అని వారు చెప్పిన పిదప శాస్త "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ తథాగతుడు పశువుకడుపున బుట్టి మత్స్యరాజుగా నున్నప్పుడు కూడ వర్షము కురిపించెను'' అని పూర్వ జన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము కోసలరాజ్యములో శ్రావస్తి నగరమున జేతవనములో పుష్కరిణీస్థానమున వల్లీగహన పరివృత మైన కందరముండెను. బోధి సత్త్వు డారోజులలో చేపకడుపున బుట్టి, మత్స్యగణ పరివృతుడై అందు నివసించుచుండెను. ఇప్పటి వలెనే అప్పుడును రాష్ట్రమున వర్షము కురియలేదు. సస్యములు మాడిపోయినవి. గుంటలలోను, చెరువులలోను, నీర మెండిపోయెను. చేపలు, తాబేళ్ళు బురదలో ప్రవేశించినవి. ఈ కందరములో చేపలు బురదలో ప్రవేశించిన పిమ్మట కాకులు మొదలగునవి వానిని ముక్కులతో బొడిచి, వెలు పలికి లాగి, మ్రింగుచుండెను. జ్ఞాతి సంఘమునకు కలిగిన యాపద చూచి బోధిసత్త్వుడు "వీనిని ఆపదనుండి తప్పించుటకు నేను తప్ప అన్యులు లేరు. సత్యకార్యము చేసి, వర్షము కురిపించి, జ్ఞాతులను మరణబాధనుండి తప్పింతును'' అని, నల్లని బురదతో భేదించుకొని, అంజనము పూసిన ఘనసార పేటిక వలె పైకి వచ్చెను. ధౌతలోహిత మణి సదృశమైన నేత్రములు తెరచి, ఆకాశము నవలోకించి, పర్జన్య ప్రభువు నుద్దేశించి, "పర్జన్యా, జ్ఞాతులవిషయమై విచారించుచున్నాను,

శీల వంతుడను కదా? నీ వేల వర్షియవు? మత్స్యాదులను తండులమాత్ర మైన నేను భుజింపలేదు. ఏ ప్రాణి జీవితమును హరింపలేదు. ఈ సత్యము గమనించి, నీవు వర్షించి, మా జ్ఞాతి సంఘమునకు కష్టము తొలగింపుము" అని పిలిచి, పరిచారకు నాజ్ఞాపించు విధముగా ఈ గాథ పలికినాడు :—

గర్జింపు పర్జన్య, గర్జింపు మయ్యా,
కాకుల నిధిని చీకాకు కావింపు.
కాకుల ముంచెత్తు శోకపూరమున
నాకు గావింపుము శోకవిముక్తి.

ఇట్లు బోధిసత్త్వుడు పర్జన్యున కాజ్ఞయిచ్చి, సకల కోసలరాజ్యమున ఘనవర్షము కురియునట్లు చేసి, మహాజనమునకు మరణదుఃఖము తొలగించి, జీవితాంతమున యథా కమ్మం గతో.

శాస్త్ర ధర్మోపదేశము చేసి, కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి మత్స్యమండలి ఇప్పటి బుద్ధపరిషత్తు; పర్జన్యదేవత ఇప్పటి ఆనంద స్థవిరుడు; మత్స్యరాజు నేనే.

## 76 అసంకియ జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుచు శ్రావస్తి నగరవాసి యగు ఉపాసకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆయుపాసకుడు స్రోతోపన్న ఆర్యశ్రావకుడు. ఒకపర్యాయ మతడు ఎద్దుబండ్ల బిడారు వెంట యాత్ర చేసెను. అరణ్యమున బండ్లయెడ్లను విడిచి, గుడారము వేసినపిదప అతడు కారవానునకు కొంచెము దూర ములో చెట్టునీడలో విచరింపసాగెను. తమపీలు చూచుకొని చోరులు 500 మంది బిడారు దోచుకొనుటకై ధనస్సులు, ముద్గరములు పొంద

లగువస్త్రములతో ఆప్రదేశము చుట్టుముట్టిరి. ఉపాసకుడు తిరుగుచుండెను. చోరులు చూచి “ఇతడు బిడారు కాపలాకాయువాడు అయి యుండవలెను, నిద్ర పోయిన తర్వాత దోచుకొందము” అని యోజించి, ముట్టడించుట కవకాశము దొరకక పోవుటచే అచ్చటచ్చట నిలిచిరి. ఆయుపాసకుడు ప్రథమ ద్వితీయ తృతీయ యామములలో అట్లే తిరుగుచుండెను. తెల్లవారినపిదప చోరులు చేతులలోని ఆయుధములను జారవిడిచి పలాయనము చేసిరి. ఉపాసకుడు తనపని ముగించుకొని శ్రావస్తికి మరలివచ్చి శాస్తకు ప్రణామము చేసి “భన్తే, తనను రక్షించుకొనువాడు అన్యులకు గూడ రక్షకుడు కాగలడా?” అనెను.

“ఉపాసకా, అగును. ఆత్మరక్షకుడు అన్యరక్షకుడగును. అన్యరక్షకుడాత్మరక్షకుడగును”.

“భన్తే, తమరు సెల విచ్చినది యదార్థము. నేను ఒకానొక యాత్రికులసంఘము వెంట మార్గమున పోవుచు, వృక్షముక్రింద తిరుగుచు ఆత్మరక్షణేచ్ఛతో కారవానును సంరక్షించితిని”,

ఉపాసకా, పూర్వకాలమున గూడ నీ విట్లే చేసితివి; నిన్నే కాక బుద్ధిమంతులను గూడ రక్షించితివి” అని, ఉపాసకుడు ప్రార్థించినపిదప పూర్వజన్మకథ చెప్పెను:

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు బ్రాహ్మణ కుటుంబమున బుట్టి పెరిగి పెద్దవాడయి కామముల వలని నష్టములను గ్రహించి, ప్రవ్రజించి, హిమవంతమున నివసించుచుండెను. ఒకసారి ఉప్పు చింతపండుకొరకు బోయి యాతడు సంచారము చేయుచుండగా ఒకానొక సార్థవాహుడు తగిలెను. అతనితో గలసి ప్రయాణము చేయుచు అడవిలో బిడారు ఆగినపుడు దానికి సమీపమున చెట్టుక్రింద ధ్యానము చేయుచు బోధిసత్త్వుడు పచారు చేయుచుండెను.

రాత్రి భోజనానంతరము 500 చోరులు బిడారుచుట్టు మూగి, దోచుకొన తలచి, ఆతాపసుని జూచి “ఆయన మనను జూచినచో బిడారును లేపును” అనుకొనిరి. తాపసుడు రాత్రియంతయు పచారు

చేయుచునే యుండెను. వారి కవకాశము లభింపలేదు. వారు తెచ్చిన కర్రలు, రాలు అచ్చటనే పడవేసి బిడారులోని వారిని కేకవేసి "సార్థవాహులారా, చెట్టు మొదట తాపసుడు పచారు చేయుచుండని పక్షమున సరకులు దోచుకొని పోయెడివారమే. రేపు తాపసునకు భూరి సత్కారము చేయుడు" అని పలికి వెడలిపోయిరి. తెల్లవారిన పిమ్మట బిడారులోనివారు కర్రలు, రాలు చూచి భయపడి, బోధిసత్త్వుని సన్నిధికి బోయి నమస్కరించి, "భదంతా, తమరు చోరులను చూచితిరా?" అని యడిగిరి. "బాబులారా, చూచినాను." "భదంతా, చోరులను జూచినప్పుడు మీకు భయముగాని వణకుగాని పుట్టలేదా?" "బాబులారా, చోరులను జూచిన ధనవంతులకు భయము కలుగును. నేను నిర్ధనుడను. ఏల భయపడవలెను. గ్రామమునగాని అరణ్యములో గాని నాకుభయములేదు, వణకు లేదు." అని బోధిసత్త్వుడు వారికి ధర్మముపదేశించుచు ఈగాథ పలికినాడు:

శంక వీడి యుంటి జనపదమ్మున నైన,
అడవియందు భయము నందనైతి
మైత్రి కలిగి, కరుణ మానక ఋజుమార్గ
మెడప కెల్లయెడల నడచువాడ.

ఇట్లు బోధిసత్త్వుడు ధర్మము నిర్దేశింపగా వారు సంతుష్టచిత్తులై ఆయనను పూజించిరి. ఆయన యావజ్జీవము నాలుగు గుణములను వృద్ధి చేసికొని, తుదకు బ్రహ్మలోకమున జన్మించెను.

శాస్త ధర్మోపదేశము చేసి రెండు కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. నాటి కారవానులు నేటి బుద్ధపరిషత్తు; తపస్వి నేనే.

# 77 మహాసుపిన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, షోడశ మహాస్వప్నములను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకప్పుడు కోసల మహారాజు నిద్రించుచుండ తెల్లవారుజామున పదునారు మహాస్వప్నములు చూచెను. అందువలన బెదరి భయపడి ఈకలలు కనుటవలన నే నేమి అనుభవింప వలసియున్నదో అనుకొని, మరణభీతిచే శయ్యపై గూరుచుండి రాత్రి గడపెను. తెల్లవారినపిదప బ్రాహ్మణపురోహితు డాయనకడకు వచ్చి "మహారాజా, సుఖనిద్ర పట్టెనా?" అని అడిగిరి.

"ఆచార్యులారా, నాకు సుఖ మెక్కడిది? తుదియామమున పదునారు కలలు కంటిని. అప్పటినుండి భయము పట్టుకొన్నది. ఆచార్యులారా, ఏమయిన నాకు బోధింపుడు" అని మహారా జడిగెను. స్వప్న విషయములు విని మీకు విశదీకరింతు మని వారు కోరగా మహారాజు తెలిపి, కలలు కనుటవలన నే నేమి అనుభవింపవలసి యుండును?" అని యడిగెను.

బ్రాహ్మణులు చేతులు నులుముకొనిరి?

"మీరు చేతు లేల నులుముకొన్నారు?"

"మహారాజా, అవి దుస్స్వప్నములు."

అయినచో ఏమి ఫల మనుభవింపవలెను?"

"రాజ్య నాశము, ప్రాణనాశము, భోగ్యసంపన్నాశము–వీనిలో ఏదో యొకటి సంభవించును."

"ఆస్వప్నములకు నివారణ మున్నదా? లేదా?."

"కఠినములు, నిరుపాయములు అయినను మేము వీనికి ప్రతిక్రియ చేయుదుము; చేయలేనిచో మావిద్యలవలన ప్రయోజన మేమి?"

"ఎట్లు చేయుదురు?"

"మహారాజా, నాలుగు పదార్థములతో యజ్ఞము చేయుదుము".

"మంచిది. అయినచో ఆచార్యులారా, నాప్రాణములు మీచేతు

లలో నున్నవి. నా కుపద్రవము లేకుండ త్వరలోనే యత్నింపుడు."

తమకు విశేషధనము, ఖాద్యములు లభించునని బ్రాహ్మణులు ప్రసన్నచిత్తులై "మహారాజా, చింతింపకుడు" అని ఓదార్చి, రాజ భవనమునుండి వెలువడిరి. నగరము వెలుపల యజ్ఞకుండము నిర్మింప జేసి వారు అనేకపశువులను యూపస్తంభములకు కట్టివేయించి, పక్షులను తెప్పించి, ఇది అది కావలెను అని మాటిమాటికిని రాకపోకలు చేయుచుండిరి. మల్లికాదేవి ఆసంగతి తెలిసికొని రాజుకడకు బోయి "మహారాజా, బ్రాహ్మణు లెందులకు రాకపోకలు చేయుచున్నారు?" అని యడిగెను.

"నీ వేమో సుఖముగా నున్నావు. మాచెవులవద్ద విషసర్పము తారటలాడుచున్నది."

"మహారాజా, ఏ మిది?"

"నేను దుస్స్వప్నములు చూచినాను. బ్రాహ్మణులు మూడునష్టము లలో ఏదోయొకటి సంభవించు నని చెప్పిరి. నివారణార్థము యజ్ఞము చేయుచున్నా మని మాటిమాటికిని రాకపోకలు చేయుచున్నారు."

మహారాజా, దేవతలతోకూడ సమస్తలోకమున అగ్రబ్రాహ్మణునే స్వప్నప్రతీకార మడిగినారా?"

"భద్రే, అగ్రబ్రాహ్మణు డెవరు?"

"దేవతలతో సహ సమస్తలోకమున పురుషోత్తముడు, సర్వజ్ఞుడు, విశుద్ధుడు, క్లేశ (వికార) రహితుడు, అగు మహాబ్రాహ్మణుని మీ రెరుగరా? మహారాజా, పొండు ఆభగవానునికి స్వప్నరహస్యము తెలియును; ఆయన నడుగుడు."

"దేవీ, మంచిది" అని రాజు విహారమునకు జని, శాస్తకు ప్రణామము చేసి కూరుచుండెను.

మధురవాక్కుతో శాస్త "ఏమి మహారాజా, నేడు తెల్లవారగనే వచ్చినారేమి?" అనెను.

"భస్తే, నేను నేటి తెల్లవారుజామున పదునారు గొప్పకలలు కని భీతచిత్తుడనై బ్రాహ్మణుల నడుగగా, వారు ఇవి అశుభస్వప్నము లనియు, వీనికి ప్రతీకారముగా నాలుగువస్తువులతో యజ్ఞము చేయుదు మనియు యజ్ఞములకు సిద్ధ మయినారు. పశువులు ప్రాణభీతితో

మున్నవి, తాము సర్వశ్రేష్ఠులు; తమ కగోచర మగువిషయము భూత భవిష్యద్వర్తమానకాలములలో లేదు. భగవన్, ఈస్వప్నములకు ఫలము నాకు తెలుపుడు.''

"మహారాజా, నన్ను విడిచి, దేవతలతోఁ గూడ సమస్తలోకమున ఈస్వప్నముల మర్మము కాని, ఫలముకాని చెప్పగలవాడు లేడు. నేను నీకు వివరింతును; కాని ముందుగా నీవు చూచినవి చూచినట్లే వర్ణింపుము''.

రాజు పదునారుస్వప్నములను వర్ణించెను. బోధిసత్త్వుడు వానిఫలితములు చెప్పి "మహారాజా, నీవే కాదు, పూర్వము రాజులుకూడ ఈస్వప్నములు చూచిరి" అని, రాజు వేడినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఉదీచ్యబ్రాహ్మణ కుటుంబమున బుట్టి పెరిగి పెద్దవాడయి, ప్రవ్రజించి అభిజ్ఞను సమాపత్తులను పొంది, హిమవంతమున ధ్యానకేళిలో నుండెను. ఆసమయమున వారాణసిలో బ్రహ్మదత్తుడు ఇదేవిధముగా కలలు కాంచి బ్రాహ్మణులను ప్రశ్నించెను. ఇప్పటివలెనే బ్రాహ్మణులు యజ్ఞ మారంభించిరి. అందు పురోహితుని శిష్యుడు విద్యావంతుడు గురువుతోఁ "ఆచార్యా, మీరు నాకు మూడు వేదము లధ్యాపన చేసినారు. ఒకదానిని సంహరించుటవలన ఇంకొక దానికి స్వస్తి కానేరదని అందులో లేదా?'' అనెను. "నాయనలారా, ఈ యుపాయముచే మనకు బహుధనము లభించుచున్నది. చూడగా నీవు రాజభవనమును రక్షింప నెంచుచున్నావు'' అని ఆచార్యుడు పలికెను. "కావున ఆచార్యా, మీచిత్తము వచ్చినపని చేయుడు. నేను మీకడ నేమి చేయుదును!" అని మాణవకుడు ఆలోచనాపరుడై రాజోద్యానమునకు బోయెను.

బోధిసత్త్వు డంతయును గ్రహించి "నేడు నేను మానవపథమునకు జన్నచో మహాజనమునకు బంధమోక్ష మగును'' అని ఆకాశమార్గమున ఉద్యానములో నవతరించి మంగళశిలాతలమున సువర్ణప్రతిమ

వలె నుపవేశించెను. మాణవకుడు ఆయనను సమీపించి నమస్కరించి, ప్రక్కన గూరుచుండి ప్రీతితో మాటాడెను. బోధిసత్త్వుడు వానితో మధుర సంభాషణచేసి, "మాణవకా, రాజు ధర్మపరిపాలన చేయుచున్నాడా?" అనెను.

"భన్తే, రాజు ధార్మికుడే. కాని బ్రాహ్మణులాయన నొక పక్షమునకు జేర్చినారు. రాజు పదునారు స్వప్నములుగాంచి బ్రాహ్మణులకు దెలిపినాడు. వారు యజ్ఞ మారంభించినారు. భన్తే, మీరు రాజుకీస్వప్నముల నిజస్వభావము దెలిపి మహాజనమునకు భయవిమోచనము చేయదగును" అని విన్నవించెను. "నేను రాజు నెరుగను, నన్ను రా జెరుగడు. అయినను, ఆయన యిచ్చటికి వచ్చి న న్నడిగిన పక్షమున చెప్పుదును." "భన్తే, నేను రాజును తీసికొనివత్తును. మీరు నారాకకై ముహూర్తమాత్రము వేచియుండుడు" అని ఆయన సమ్మతిపొంది మాణవకుడు రాజు సన్నిధికి బోయి "మహారాజా, ఆకాశగామి యగు తాపసుడు ఉద్యానమున అవతరించినాడు. మీస్వప్నములను విశదీకరింతు నన్నాడు. దేవరవారు ప్రశ్నింతురా?" అనెను.

రాజు సపరివారముగా తోడనే తోటలోనికి బోయి తాపసునకు నమస్కరించి, పార్శ్వమున గూరుచుండి, "భన్తే, నేను గాంచిన స్వప్నముల నిష్పత్తిని తెలుపుదురా?" అనెను. "ఆ, మహారాజా, మీస్వప్నము లెవ్వియో తొలుత తెలుపుదురా?" "చిత్తము, భదంతా," అని రాజు ఇట్లు చెప్పెను:

ఎడ్లు, గోవులు, లేగలు, వృక్షములును,
అశ్వమును, కంచమును, కుంభ, మాడునక్క,
సరసు, వండనిబియ్యము, చందనంబు,
మునిగిపోయెడి సొరకాయ బుర్ర నీట,
తేలుచున్నవి శిల లవి తెప్పలవలె.
కాలసర్పమ్ము లను మ్రింగు కప్పలగమి,
అనుసరించెడి కాకుల నంచపిండు,
వెరచు మేకల గాంచిన వృకచయంబు.

అని, ప్రసేనది ప్రభువు వర్ణించినట్లు తన స్వప్నములను వర్ణించెను.

"చాలును. వీనివలన మీరు భయపడనక్కరలేదు" అని బోధి

సత్త్వుడు రాజుకు ధైర్యము పురికొల్పి, మహాజనమునకు బంధవిముక్తి చేసి, ఆకసమున నిలిచి, రాజు కుపదేశమిచ్చి, పంచశీలములను ప్రతిష్ఠించి, "నేడుమొదలు మహారాజా, పశుఘాతి యజ్ఞములలో బ్రాహ్మణులతో నీవు కలియవలదు" అని ధర్మముచూపి, గగనమార్గముననే నిజనివాసమునకు బోయెను.

ఉపదేశమును నిశ్చలముగా ననుసరించుచు, రాజు దానాది పుణ్యకార్యములు చేసి, యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశముచేసి, కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలిబుచ్చెను. అప్పటి రాజు ఇప్పటి ఆనందుడు; మాణవకుడు ఇప్పటి సారిపుత్రుడు; తపస్వి నేనే.

# 78 ఇల్లీస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, మచ్ఛరియ కోసియ శ్రేష్ఠినిగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

రాజగృహ నగరసమీపమున నక్కర నామక గ్రామముకలదు. అందు మచ్ఛరియ కోసియ నామక శ్రేష్ఠి, ఎనుబదికోట్ల సంపద కలవాడు నివశించుచుండెను. అతడు అన్యులకు గడ్డి పరక కొనపైన నిలుచు తైల బిందువు కూడ ఇయ్యక సమస్తము తానే అనుభవించుచుండును. ఆతని ధనము తన భార్యాపుత్రుల కొరకే గాని శ్రమణ బ్రాహ్మణులకు వినియోగించువాడు కాడు: రాక్షస-అధిష్ఠితమైన పుష్కరిణి వలె అతని సంపద వ్యర్థముగా నుండెను.

ఒకనాడు బుద్ధుడు ప్రాతఃకాలముననే కరుణాసమాపత్తితో లేచి సకలలోక ధాతువులయందు ఆనాడు అవబోధము పొందగలిగిన ఆప్తులను చూచుచు, 45 యోజనముల దూరమున నున్న శ్రేష్ఠికి, అతని

భార్యకు శ్రోతాప త్తిఫలము సమకూర్చు అవకాశము కనుగొనెను. ఒకనాడు ముందుగా శ్రేష్ఠి రాజును కొలుచుటకై రాజభవనమునకు పోయెను. రాజును కొలిచి తిరిగి వచ్చునపుడు ఆకలిబాధ పడుచున్న ఒకానొక నాగరకుడు ఉలవలతో నిండిన పూరీలు తినుచుండగా చూచి దానిమీద ఆసక్తికలిగి ఇంటికిపోయి "నేను పూరీలు తిందుననిముందుగా చెప్పినచో చాలమంది నావెంట తినుటకు ఎగబడుదురు. ఈవిధముగ చాల బియ్యము నెయ్యి బెల్లము మొదలగునవి వ్యయమగును. కావున ఎవరితోడను చెప్పను" అనుకొనెను.

అతడు తనలోనే దాహమును సహించుచు కొంతసేపు గడచిన పిమ్మట పాలిపోయినాడు. పొట్ట లోపలికి ఒంచుకు పోయినది. దాహమాపుకొనలేక అతడు ఇంటిలోదూరి మంచముమీద ముసుగుపెట్టుకుని పండుకొనెను. ఇంత జరిగినను ధనహాని అగు నను భయముచే ఎవరితో నేమియు చెప్పలేదు.

అతని భార్య సమీపించి వీపు నిమురుచు, "స్వామీ, ఏమిజబ్బు?" అనెను.

"నాకు జబ్బేమియు లేదు".

"రాజుగారికి కోపము వచ్చినదా?"

"రాజు నాపై కోపింపలేదు".

"అయినచో మీపిల్లజెల్లలు గాని నౌకర్లుగాని అపరాధము చేసినారా?"

"లేదు".

"ఏదో పదార్థముమీద మీకు తృష్ణ కలిగినదా?"

ఆమె ఇట్లడిగిన పిమ్మట గూడ ధనహాని అగునను భయముచే నతడు నిశ్శబ్దముగా పండుకొని యుండెను. అపుడు భార్య "స్వామీ, మీకు దేనిమీద ఆసక్తి?" అన్నది.

"పూరీలు తినవలెనని కోరిక".

"అయినచో ఏల చెప్పలేదు? మీరు దరిద్రులా? ఇప్పుడే సక్కర నిగమ వాసులకు సరిపోవు నన్ని పూరీలు చేసి ఇచ్చెదను".

"అన్ని ఎందులకు?"

"మంచిది, అట్లయినచో ఒక గల్లీలో వారికి సరిపోవు నన్ని

చేయించెదను".

"నీవు చాల ధనము కలదానవని తెలియును".

"మంచిది. ఇంటిలోనున్న వారి కందరకును సరిపోవునన్ని చేయింతును".

"నీవు చాల ఉదారురాలవని నాకు తెలియును."

"మంచిది, మీభార్యకు, బిడ్డలకు సరిపోవునన్ని చేయింతును."

"ఇన్ని ఎందులకు?"

"మంచిది మన ఇరువురకు సరిపోవునన్ని చేయింతును",

"ఏమి చేయుదువు?"

"అయినచో మీకుమాత్రము సరిపోవునన్ని చేయింతును".

"ఇచ్చట వంట చేయించినచో జనులకు ఆశ పుట్టును. నీవు బియ్యము మాని నూకలు, ప్రొయ్యి, కటాహము, కొంచెము పాలు, నెయ్యి, బెల్లము, తీసికొని, ఏడవయంతస్తుమీదికి పోయి వండుము. అక్కడ నేను ఒంటిగా, కూరుచుండి భుజింతును."

మంచి దని యామె తీసికొని పోదగినవి తీసికొనిపోయి మేడమీది కెక్కి దాసీజనముచే శ్రేష్ఠిని బిలువనంపెను. మొదటిద్వారముకడకు బోయి, పిదప మూసి ఏడుదర్వాజాలు ఈవిధముగా మూయుచు తుద కాతడు పై మేడమీద కూరుచుండెను. ఆయన భార్యకూడ ప్రొయ్యిలో నిప్పు చేసి, దానిమీద బాణలి పెట్టి, పూరీలు వండ నారంభించెను.

బుద్ధుడు ప్రాతఃకాలమే మహామొగ్గల్లాన స్థవిరుని బిలిచి "మౌద్గల్యాయనా, రాజగృహమునకు సమీపములో సక్ఖర నిగమమున మచ్ఛరియ కోసియ శ్రేష్ఠి పూరీలు తినవలె ననుకోరికతో ఎవ్వరైన చూతు రేమో అనుభీతిచే ప్రాసాదమున ఏడవయంతస్తుమీద పూరీలు వండించుచున్నాడు. నీ వక్కడికి బోయి ఆశ్రేష్ఠిని నిగ్రహించి భార్యభర్తలను ఖాద్యవస్తువులను జేతవనమునకు నీశక్తిచే కొనిరమ్ము. నేడు నేను 500 భిక్షువులతో గూడ విహారముననే యుందును; పూరీలతో భోజనము చేయుదును" అని చెప్పెను.

స్థవిరుడు "భన్తే, మంచిది" అని స్థవిరుడు శాస్తయానతిప్రకారము బుద్ధిబలమున ఆనిగమము చేరి సౌధపైభాగమున మణిమూర్తివలె నిలిచెను.

స్థవిరుని జూడగానే శ్రేష్ఠిగుండెలు దడదడలాడెను. ఇటువంటి [illegible] భయము వల్లనే నేను ఇక్కడికి వచ్చితిని. ఈయన వచ్చి ద్వారము కడ నున్నాడు అనుకొని చేతితో పట్టుకొందగినది ఏదియు తీసికొన జాలక, నిప్పులపై ఉప్పు చల్లినట్లు మండిపడి "శ్రమణా, ఆకాశమున నిలిచి యుండుటచే నీకేమి లభించును? పాద చిహ్నములు పడని ఆకసమున ఇటునటు తిరిగినను ఏమియును లభింపదు." అనెను. స్థవిరుడు అచ్చటనే ఇటునటు పచారు చేయజొచ్చెను.

"పచారు చేయుటవలన ఏమి లభించును? ఆకసమున మఠము వేసికొని కూర్చున్నను ఏమియు లభింపదు." అని శ్రేష్ఠి పలికెను. స్థవిరుడు మఠము వేసికొని అచటనే కూర్చుండెను.

"కూరుచుండుటవలన ఏమి లభించును? వచ్చి గుమ్మముమీద నిలుచున్నను ఏమియు దొరకదు." అన్నాడు శ్రేష్ఠి. స్థవిరుడు వచ్చి గుమ్మము మీద నిలిచెను.

"నిలుచుండుటవలన ఏమి లభించును? పొగ లేపుటవలన ఏమియు లభింపదు." అన్నాడు. శ్రేష్ఠి.

స్థవిరుడు ధూమ్రము లేపెను. సౌధమంతయు పొగతో నిండి పోయెను. శ్రేష్ఠి కన్నులు సూదులు పొడిచినట్లయ్యెను. గృహము తగులబడిపోవు నను భయముచే "తగుల పెట్టినను ఏమియు లభింపదు". అని "ఈశ్రమణుడు వెంట బడినాడు. వట్టిచేతులతో పోవడు కావున ఈయనకు ఒక్క అపూపము ఇప్పింతును" అనుకొని భార్యతో "భద్రే, చిన్న పూరీవండి శ్రమణున కిచ్చి పంపివేయుము" అన్నాడు.

ఆమె బాణలిలో కొద్దిగా పిండివేసెను. తోడనే అది పెద్ద అపూపమై బాణలి నిండిపోయెను. శ్రేష్ఠి చూచి "నీవు చాల పిండి వేసి యుందువు." అని పళ్ళెములో ఒక్కకొస నుండి కొద్దిపిండి తీసికొని బాణలిలో వేసెను. అది పెద్ద అపూపమై బాణలి నిండిపోయెను. ఈప్రకారముగ ఆయన ఏది వండినను అది వెనుకటి వలెనె చాల పెద్ద దగుచుండెను.

అతడు విచారపడి "భద్రే, ఈయన కొక అపూపమిమ్ము". అనెను. ఆమె తట్టలో ఒక్క అపూపమును ఎత్తినపుడు అన్నియును ఒక్కసారిగా లేచినవి. ఆమె శ్రేష్ఠితో "స్వామీ, [illegible]

అన్నియు అంటుకొనిపోయినవి. వీనిని వేరు చేయలేకున్నాను" అనెను. నేను చేయుదునని శ్రేష్ఠి యత్నించి కృతకృత్యుడు కాలేదు. ఇరువురు రెండుప్రక్కల పట్టుకుని లాగినను అపూపములు విడివడలేదు. ఈప్రకారముగా శ్రమపడుటచే అలిసి శరీరమునుండి చెమట కారజొచ్చెను. అతనికి దాహాము హెచ్చెను.

"భద్రురాలా, నాకు పూరీ అక్కరలేదు. ఆయనకు బుట్టతో కూడ నిచ్చివేయుము" అనెను. ఆమె తట్ట తీసుకొని స్థవిరునికడకు పోయెను. స్థవిరుడు ఉభయులకును ధర్మోపదేశము చేసి త్రిరత్నగుణములను తెలిపెను. యజ్ఞదానాది ఫలములను స్పష్టీకరించెను. విని ప్రసన్నచిత్తుడై శ్రేష్ఠి "భన్తే, దయచేసి ఈమంచముపై కూరుచుండి పూరీలు భుజింపుడు" అనెను.

"శ్రేష్ఠి, పూరీలు భుజింతును. 500మంది భిక్షువులతో సమ్యక్ సంబుద్ధుడు ఉపవిష్టుడై యున్నాడు. నీకు ఇష్టమైనచో భార్యాసహితుడవై అపూపములు దుగ్ధము మొదలగునవి పట్టించుకొని రమ్ము. మనము బుద్ధుని సన్నిధికి పోవుదము" అని స్థవిరుడు చెప్పెను.

"భన్తే, ఈసమయమున శాస్త ఎచట నున్నాడు?" "శ్రేష్ఠి, ఇక్కడకు యోజనముల దూరమున జేతవనములో నున్నాడు."

"భన్తే, భోజనసమయము అతిక్రమింపక మనము ఇంతదూరమునెట్లుపోగలము?"

"శ్రేష్ఠి. నీకు ఇష్టమున్నపిదప నేను బుద్ధిబలముచే తీసుకొని పోవుదును. నీప్రాసాదము మొదటి మెట్టునుండియే జేతవనద్వారమున దిగగలవు. మేడపైనుండి క్రిందికి దిగునంతలో జేతవనమునకు గొనిపోవగలను."

"భన్తే, మంచిది." అని శ్రేష్ఠి అంగీకరించెను. స్థవిరుడు అధిష్టానము (దృఢనిశ్చయము) చేసెను. శ్రేష్ఠిని భార్యను క్షణములో జేతవనమునకు చేర్చెను. వా రిరువురును బుద్ధుని కడకు బోయి భోజనమునకు వేళ అయిన దని విన్నవించిరి. భిక్షుసంఘ సహితుడై బుద్ధుడు దానశాలలో ప్రవేశించి శ్రేష్ఠాసనముపై కూరుచుండెను. శ్రేష్ఠి బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు దక్షిణ జలమిచ్చెను. భార్య తథాగతుని పాత్రలో అపూపము లుంచెను, ఆయన తనకు కావలసినవి మాత్రము

తీసికొనెను. 500 భిక్షువులుకూడ ఎవరికి కావలసినంతమట్టుకు వారు తీసికొనిరి. శ్రేష్ఠి పాలు, నెయ్యి, తేనె, చక్కెర పంచిపెట్టెను.

500మంది భిక్షువులతో కూడ బుద్ధుని భోజనము సమాప్తమయ్యెను. శ్రేష్ఠి భార్యతో కూడ వలసినంతవరకు భుజించెను. అప్పటికిని పూరీలు మిగిలియుండుట చూచి భగవానునితో శ్రేష్ఠి "భన్తే ఇవి ఇంకను మిగిలి యున్నవి." అని తెలిపెను. "అయినచో వానిని జేతవనద్వారముకడ కొట్టులో పడవేయుము."

ఆతడు ద్వార సమీపమందలి గోతిలో వానిని బడవైచెను. నేటికిని ఆప్రదేశమును కపల్లపువ్వ - పబ్భారమని అందురు. మహాశ్రేష్ఠి భార్యతోగూడ భగవానుని సన్నిధికి జని ప్రక్కన నిలుచుండెను. భగవాన్ దానానుమోదనము చేసెను. ఇరువురును శ్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితులై బుద్ధునకు ప్రణామముచేసి ద్వార కోష్ఠ సోపానమెక్కి తమ ప్రాసాదము చేరిరి.

ఆ సమయమునుండి ఆతడు 80 కోట్ల ధనము బుద్ధ శాసనమునకే శ్రేష్ఠి వ్యయము చేయసాగెను. ఒకనాడు సమ్యక్ సంబుద్ధుడు శ్రావస్తిలో భిక్షాటనము చేసి, జేతవనమునకు వచ్చి, భిక్షువులకు సుగతోపదేశముచేసి, గంధ కుటిలో ప్రవేశించి ధ్యానావస్థితుడై, సాయంకాలము ధర్మ సభలోనికి బోయెను. అప్పుడు సమావిష్టులైన భిక్షువులు మొగ్గల్లాన స్థవిరుని ప్రశంసించుచు "ఆయుష్మంతులారా, మహామొగ్గల్లాన స్థవిరుని ప్రతాపము చూడుడు. ఆయన మచ్ఛరియ శ్రేష్ఠిని త్వరితముగా లోబరుచుకొని, అపూపములు పట్టించుకొని జేతవనమునకు వచ్చి బుద్ధుని దర్శనము చేయించి శ్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితుని చేసెను. "ఓహో! ఏమి స్థవిరుని మహాప్రతాపము!" అనుచుండిరి. ఇంతలో బుద్ధుడువచ్చి "భిక్షువులారా, ఈ సమయమున ఏమి సంభాషించుచున్నారు?" అనెను. ఈ విషయము అనివారు చెప్పినపిమ్మట, బుద్ధుడు "భిక్షువులారా, ఆ స్థవిరుడు శ్రమ లేకుండ, పుష్పముల నుండి భ్రమరములు రేణువులు గ్రహించునట్లు సుగమముగా అచటికిపోయి బుద్ధ గుణముల పరిచయము చేయుదునని అని స్థవిరుని ప్రశంసచేయుచు ధర్మపదములోని గాథ పలికెను.

స్థవిరుని ఇంకను ప్రశంసించుచు "భిక్షువులారా, కేవలము ఇప్పుడే

కాదు, పూర్వముకూడ మొగ్గల్లాన స్థవిరుడు శ్రేష్ఠిని లోబరుచుకొని కర్మ ఫలజ్ఞానము కలిగించెను.'' అని పూర్వజన్మకథ బుద్ధుడు చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, అచట ఇల్లిసకు డను శ్రేష్ఠి యుండెను. అతనికి 80 కోట్ల సంపద కలదు. పురుషున కుండదగు లోపములన్నియు వానికి గలవు. అతడు పొట్టివాడు, గూనివాడు, మెల్లకన్నువాడు, శ్రద్ధలేనివాడు, అప్రసన్నుడు, మాత్సర్యవంతుడు, లోభి. ఇతరులకు పెట్టడు, తా ననుభవింపడు. యక్ష పరిగృహీతమగు పుష్కరణివలె వానిగృహ ముండెను. కాని పూర్వు లేడుతరములు దానశీలురు. అతడు శ్రేష్ఠి పదవి పొందినంతనే వంశసంప్రదాయము భిన్నముచేసి, దానశాలను తగులబెట్టి, యాచకులను కొట్టి తరిమివేయుచు, ధనము కూడబెట్టుచుండెను.

ఒకనా డతడు రాజదర్శనము చేసి, నిజగృహమునకు మరలి వచ్చుచుండగా మార్గాయాసము చెందిన పల్లెటూరివాడు బల్లలమీద కూరుచుండి, సురావారకమునుండి అంబలిసుర ముంతనిండ పోసికొని త్రాగుచు కుళ్ళుచేప నంజుకొనుచుండెను. చూడగా శ్రేష్ఠికి సుర త్రాగకోరిక పుట్టెను. "నేను సుర త్రాగుదునేని అన్యులుకూడ సుర త్రాగగోరుదురు. దానివలన ధనక్షయ మగును'' అని చింతించి యతడు దాహ మోర్చుకొనుచు నిటు నటు తిరుగుచుండెను. కొంత కాలమున కతడు ప్రాతదూదివలె పచ్చబడెను. శుష్కశరీరముమీద నాడులు కానవచ్చుచుండెను. ఒకనా డతడు గదిలో మంచమునకు కరచుకొని పోయెను. భార్య దగ్గరకుబోయి వీపు నిమిరి, స్వామీ, ఆరోగ్యము చెడినదా? అని అడిగెను.

అంతయు గ్రహించి ఆమె "మీకు సరిపోవు సుర కాచి యిచ్చెదను'' అనెను. "మనయింట సుర కాచినచో అనేకులు కనిపెట్టుకొని యుందురు. సుర కొరకుపంపి యిచ్చట త్రాగుట వట్టిది'' అని యతడు మాషకము నిచ్చి, దుకాణమునుండి ముంతెడు సుర తెమ్మని దాసుని బంపెను. అది వచ్చిన పిమ్మట పట్టనము వెలుపల నదీతీరమున ఒక పొదలో పెట్టించి, దాసుని కొంతదూరములో కాచుకొని యుండుమని

చెప్పి తాను త్రాగఁజొచ్చెను.

ఇతనితండ్రి దానాది పుణ్యకార్యములు చేయుటచే దేవలోకమున శక్రుఁడై పుట్టి, ఆక్షణములో తనసంపద యెట్లున్నదో, కుమారుఁడెట్లు ప్రవర్తించుచుండెనో చూడఁదలచెను. పుత్రుఁడు వంశమర్యాద విడనాడి, ధర్మశాల తగులబెట్టించి, యాచకులను మెడబట్టి నెట్టుచు, ఇతరుల కీయవలసివచ్చునని అన్నియును దాచుచు, ప్రకృతమున ఒంటిగా త్రాగుటకై పొదలో కూర్చుండుట చూచెను. చూచినదానికి విచారముచెంది ఆతఁడు "నాకుమారునికడకు బోయి, బోధచేసి, కర్మఫలమునుగూర్చి చెప్పి, వానిచే దానాది ధర్మకార్యములు చేయించి, దేవలోకమున పుట్టుట కర్హుని జేసెదను" అనుకొని, మానవలోకమునకు వచ్చి, కుంటివాఁడు, గూనివాఁడు, మెల్లకంటివాఁడునయి, రాజగృహనగరమున కేగెను. అంతట రాజద్వారమునకు బోయి తనరాక రాజున కెరింగించి, అనుమతిపొంది, లోనికిజని, రాజుకు నమస్కరించి నిలిచెను.

"ఏమి మహాశ్రేష్ఠి, అకాలమున వచ్చినావు?"

"వచ్చినాను దేవా. మాయింట 80 కోట్ల ధనమున్నది. దానిని దేవరవారు స్వీకరించి భాండాగారమున జేర్పింపుఁడు."

"వలదు, మహాశ్రేష్ఠీ, నీధనముకంటె ఎక్కువధనము మాయింట నున్నది." "తమకు అక్కరలేని పక్షమున దానధర్మములు చేసెదను." "మహాశ్రేష్ఠీ, అటులే చేయుము." "చిత్తము దేవా" అని యతఁడు రాజుకు నమస్కరించి, కుమారునియింటికి బోయెను. పరివారజనులతని చుట్టును చేరిరి. అతఁడు ఇల్లిసకుఁడు కాడని ఒకఁడును తలపలేదు. అతఁడు ద్వారముకడ నిలిచి, నాయాకృతి కలవాఁడెవఁడైనను వచ్చి నేను గృహయజమానుఁడను అని లోనికిరా యత్నించినచో మెడబట్టి నెట్టివేయుఁడు అని ఆనతిచ్చెను. ఆవల మేడమీఁదికి జని మహార్హమగు పీఠముపై గూరుచుండి, శ్రేష్ఠిభార్యను బిలిపించి, భద్రే, దానము చేయుదమా? అనెను.

ఈమాటలకు ఆమెయు బిడ్డలు, దాసులు, కర్మకారులు తమలో "నేటివరకును దానము అన్నమాట లేదు. నేఁడు సురాపానముచేసి, మైమరచి యితఁడు దానశీలుఁడయినట్లు తోచుచున్నది" అనుకొనిరి.

శ్రేష్ఠి భార్య తన చిత్తము వచ్చినట్లు చేయుడనెను. "అట్లయిన, రజత, సువర్ణ, మణి, ముక్తాదులు వలసినవారు ఇల్లీస శ్రేష్ఠి యింటికి పొండు అని భేరీ వారకునిచే చాటింపుడు" అని యాయన చెప్పెను. అట్లే చాటింపు జరిగెను. త్వరలోనే బుట్టలు, సంచులు పట్టుకొని అనేకులు గుమిగూడిరి.

శక్రుడు సప్తరత్నపుర గర్భమును తెరపించి, "మీ కిచ్చుచున్నాను. వలసినవి కొనిపొండు" అని పలుకగా మహాజనము ధనమును వెలువరించి, కుప్పలుపోసి, వారు తెచ్చిన బుట్టలలో సంచులలో నింపుకొని వెడలిపోయిరి. అందులో ఒక గ్రామీణుడు ఇల్లీసకుని బండికి ఎద్దులు కట్టి, వివిధవస్తువులను అందుంచుకొని, నగరము వెలువడి, మార్గమున ఇల్లీసకుడు సురాపానము చేయుచున్న పొదదగ్గరగా పోవుచు "ఇల్లీస శ్రేష్ఠి శతాయువగుగాక! యావజ్జీవము కష్టపడకుండ ఆయన వలననే సుఖముగా జీవింపగలను." అనుకొనుచుండెను. "ఈబండి యెవరిది?" "నీదే." "ఈయెద్దు లెవరివి?" "నీవే." "ఇందలి సంపద యెవరిది?" "నీదే." "ఇదియిచ్చినవా రెవరు?" "తల్లి కాదు, తండ్రికాదు, నీవే స్వామీ!"

ఆమాటలు విని శ్రేష్ఠి భీతచిత్తుడై, "వీడు నా పేరుచ్చరించుచున్నాడు. రాజు నాధనము జనులకు దానమిచ్చెనా యేమి?" అనుకొని, పొదలోనుండి యీవలకు దుమికి, బండిని ఎద్దులను గురుతుపట్టి, ఎడ్ల త్రాడుపట్టుకొని, "ఎవరురా నీవు? ఈబండి నాది, ఎద్దులునావి" అనెను. వాడు బండిపైనుండి క్రిందికి దుమికి, "ధూర్తచేటకా, ఇల్లీస శ్రేష్ఠి తన సంపద యంతయు నగరవాసుల కిచ్చినాడు. నీ కేమి వచ్చినది?" అని కోపముతో వీపుపై చరచి, బండి తోలుకొని పోయెను. ఇల్లీసకుడు లేచి వణకుచు దుమ్ము దులుపుకొని వేగముగాబోయి బండిని పట్టుకొనెను. గ్రామీణుడు దిగి, ఇల్లీసుని జుట్టుపట్టుకొని వంచి నెత్తిపై మోది, మెడపట్టి, వచ్చినత్రోవ కెదురుగా త్రోసి వెడలిపోయెను.

అంత మత్తు విడిపోయి ఇల్లీసకుడు వేగముగా నింటికిజేరి తన ధనమును జనులు కొనిపోవుచుండుట చూచి ఇక్కడ నొకనిని, అక్కడ నొకనిని కొట్టుచు "అమ్మో, ఇదియేమి? రాజు నాధనమును నాశము చేయుచున్నాడు" అనుచుండ, అతడు పట్టుకొన్న ప్రతిపురుషుడును

అతనిని నేలమీదికి ద్రోయుచుండెను. అతడు దెబ్బలుతిని బాధపడుచు నిజగృహములోనికి బోవనుండగా, ద్వారపాలకు లాపి "ఓరీధూర్తా, ఎక్కడికి బోవుచున్నావు?" అని వెదురుకర్రలతో కొట్టి, మెడపట్టి వెలుపలికి నెట్టిరి. రాజుతప్ప నాకు వేరుశరణము లేదు అనుకొని ఇల్లీసకుడు రాజసన్నిధి కరిగి, "దేవా, నాయిల్లు కొల్లగొట్టినారు!" అనెను. "శ్రేష్ఠి, నేను కొల్లగొట్టింపలేదు. నీవే వచ్చి సాధనము స్వీకరింపుడు. స్వీకరింపని పక్షమున దానము చేయుదును అంటివి. నగరమున చాటించి నీవే ధర్మము చేసితివి కాదా?" అని రాజనెను. "దేవా, మీసన్నిధికి వచ్చినది నేనుకాను. నేను లోభినని తమకు తెలియును. గడ్డిపరక కంటుకొన్న నూనెబొట్టుకూడ అన్యుల కీయనని తమ రెరుగుదురు. సాధనమును దానము చేసినవానిని పిలిపించి పరీక్ష చేయింపుడు దేవా" అని విన్నవించెను.

రాజు వార్త పంపగా శక్రుడు వచ్చెను. ఇరువురు ఇల్లీసకులును సమానముగానే యుండిరి. రాజు కాని, అచ్చటివారుకాని భేదము గుర్తింపలేదు. లోభియగు ఇల్లీసకుడు "దేవా" నేనే శ్రేష్ఠిని. ఇతడెవడు?" అనెను.

"నిజముగా శ్రేష్ఠి యెవరో తెలియకున్నది. వీరిలో భేదము నిరూపించగల వారున్నారా?" అని రాజనెను. "నాభార్య" అని ఇల్లీసడనెను. వార్త పంపగా ఆమెవచ్చి, నీ భర్త యెవరు అన్నప్పుడు ఈయన అని శక్రుని ప్రక్కకు బోయి నిలిచెను. అంతట ఇల్లీసుని బిడ్డలను పరిచారకులను బిలిపించి రా జడుగగా వారెల్లరు శక్రుని ప్రక్కనే నిలిచిరి. అప్పుడు ఇల్లీసునకు ఒకతలపు కలిగెను. నాశిరస్సున వెంద్రుకలమాటున పులిపిరి కాయ ఉన్నట్లు జ్ఞప్తికి వచ్చినది. దానిని మంగలిమాత్రమే ఎరుగును. కావున వానిని బిలిపించిరి. ఆకాలమున బోధిసత్త్వుడు ఇల్లీసునకు మంగలి. "శ్రేష్ఠిని గురుతు పట్టగలవా?" అని రాజు ప్రశ్న చేసెను. "శిరస్సును చూచి గురుతింపగలను దేవా" అని మంగలి పలికెను. "అట్లైనచో ఇరువురి శిరస్సులు పరీక్షింపుడు" అని రాజనెను. అంత శక్రుని శిరస్సున కాయ మొలిచెను" బోధిసత్త్వుడు పరిశీలించి "మహారాజా, ఇరువురి తలలమీద పిటక మున్నది. శ్రేష్ఠి యెవరో గురుతింపజాల కున్నాను". అని యీ గాథ పలికెను:

కుంటివా రిద్ద, రిద్దరు గూనివారు,
ఇరువుర శిరస్సులను పులిపిరులు కలవు.
ఇల్లీసుని వీరిలోన గుర్తించు టెట్లు ?

బోధిసత్త్వుని మాటలు విని శ్రేష్ఠి వణకుచు ధననాశము సహింప లేక అచ్చటనే పడిపోయెను. అంతట శక్రుడు "మహారాజా, నేను ఇల్లీసకుడను కాను. శక్రుడను" అనెను.

నిజశక్తివలన శక్రు డాకసమునకు లేచి యీ మాటలు చెప్పెను. అచ్చటివారు ఇల్లీసకుని ముఖము తుడిచి నీరు చల్లిరి. అతడు లేచి దేవరాజుకు శక్రునకు ప్రణమిల్లి నిలిచెను. అప్పుడు శక్రు డిట్లనెను. "ధనము నాది కాని నీదికాదు. నేను నీతండ్రిని. నా జీవితములో బీదలకు దానధర్మములు చేసి పుణ్యకార్యము లొనర్చి శక్రపదవి పొందినాను. నీవు నామార్గ మనుసరింపక లోభి వయినావు. దానశాల తగుల బెట్టించినావు. పేదలను మెడబట్టి నెట్టించినావు. ధనము మిక్కిలి కూడబెట్టినావు. నీ వనుభవింపలేదు, వేరొకరి ననుభవింప నీయలేదు. నీ ధన సంచయము పిశాచ గృహీతమైన పుష్కరిణివలె నున్నది. అయినను ధర్మశాలను మరల కట్టించి బీదలకు దానధర్మములు చేసినచో పుణ్యకార్యముగా పరిగణింపబడును. అట్లు చేయ వేని నీకున్నదంతయు హరించి వజ్రాయుధముతో నీ శిరస్సు ఛేదించును"

ఈ వాక్కులకు ఇల్లీస శ్రేష్ఠికి వణకు పుట్టి "నేటి నుండి దానము చేయుదు" నని ప్రతిజ్ఞ చేసెను. శక్రు డంగీకరించి ఆకాశమున గూర్చుండియే ధర్మ ముపదేశించి, శీలమును ప్రతిష్ఠించి స్వస్థానమునకు బోయెను. ఇల్లీసకుడు దానాది పుణ్యకార్యములు చేసి స్వర్గపరాయణు డయ్యెను.

బుద్ధుడు ధర్మోపదేశముచేసి రెండు కథలు సరిపోల్చి జాతక సారాంశమును వెలువరించెను. అప్పటి ఇల్లీసుడు ఇప్పటి మచ్ఛరియ శ్రేష్ఠి; దేవేంద్ర శక్రుడు ఇప్పటి మొగ్గల్లానుడు; రాజు ఇప్పటి ఆనందుడు; మంగలి నేనే.

# 79 ఖరస్సర జాతకము

బుద్ధుడు జేతవనమున విహరించుచు, ఒకానొక అమాత్యుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

కోసలనరేశుని అమాత్యు డొకడు రాజును ప్రసన్నుని జేసి సరిహద్దుగ్రామముల పన్ను గ్రహించి, చోరులతో కలిసి, "నేను జనులను తీసికొని అడవిలోనికి బోవుదును. మీరు గ్రామము దోచుకొని, సగము నాకీయవలెను" అని జనులను గుమి గూర్చి అడవిలోనికి బోయెను. చోరులు వచ్చి గోవులను వధించి మాంసము తిని గ్రామము దోచుకొని వెడలిపోయినపిమ్మట అమాత్యుడు జనులతో మరలివచ్చెను. తరువాత కొలది దినములకు ఈరహస్యము బయలుపడెను. జనులు వెళ్ళి రాజునకు విన్నవించిరి. రా జతనిని పిలువనంపి అపరాధము నిర్ణయించి, అతనిని బాగుగా నిగ్రహించి, అతని యుద్యోగము నింకొక గ్రామభోజకున కిచ్చి, తాను జేతవనమున కేగి భగవానున కాసమాచారము తెలిపెను. "మహారాజా, అతడు కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ నిట్లే చేసెడివాడు" అని, రాజు వేడినపిమ్మట పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచు, ఒకానొక యమాత్యుని సరిహద్దు గ్రామమునకు భోజకునిగా నియమించెను. అంతయు పై జెప్పినట్లే సంఘటిల్లెను. ఆ సమయమున బోధిసత్త్వుడు వాణిజ్యవృత్తితో సంచరించుచు, ఆ కుగ్రామమున నుండెను. సాయంసమయమున ఆభోజకుడు భేరీవాద్యసహితముగా మహాపరివారముతో మరలి వచ్చుచుండగా బోధిసత్త్వుడు చూచి "ఈ దుష్టభోజకుడు చోరులను ప్రోత్సాహించి, గ్రామము దోచి, వారు అరణ్యములో జేరినపిమ్మట ఏమియు నెరుగనట్లు భేరి భాంకారములతో గ్రామమునకు దరలి వచ్చుచున్నాడు" అని ఈగాథ పలికెను :

గోవుల హరించి వధియింప క్రూరబుద్ధి
అగ్ని ముట్టించి యిండ్లకు, నటవిజనుల

కట్టె కొంపోవు చోట టీకశివజుద్ది
డిండిమమ్ము మ్రోయించుచునుండె; వీడు
కాడు మిత్రుడు— చచ్చినవాడు కాని!

ఈ విధముగా బోధిసత్త్వుడు వానిని బయట బెట్టినాడు. అచిర కాలముననే వానిపని బహిరంగ మయ్యెను. వానికి రాజు దోషానుగుణ మైన శిక్ష విధించినాడు.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి అమాత్యుడు ఇప్పటి అమాత్యుడే; గాథారూపమున ఉదాహరణ మిచ్చిన పండితుడు నేనే.

## 80 భీమసేన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, ఆత్మస్తుతి చేసికొను భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకభిక్షు వి ట్లనెను: "మాజాతివంటి జాతి, మాగోత్రమువంటి గోత్రము, మరియెచ్చటను లేవు. మేము ఇట్టి మహాక్షత్రియ కులమున పుట్టినాము. గోత్ర దృష్టితో గాని, కుల దృష్టితో గాని చూచినచో మాకు సమానులు లేరు. మాస్థానమున వెండిబంగారములకు అంతము లేదు. మానౌకరులు చాకరులు మాంస శాల్యోదనము భుజింతురు; కాశీవస్త్రములు కట్టుకొందురు; కాశీచందనమే అలరుకొందురు. ప్రవ్ర జించుటచే మే మిప్పుడు రుచిపచి లేని భోజనము చేయుచున్నాము; ముతుగుచీవరములు కట్టుకొనుచున్నాము". ఈప్రకారముగా సతతము వృద్ధ-మధ్యమ తరుణ భిక్షువులనడుమ బడాయి కొట్టుచు, జాతి-ఆది-

అభిమానము చూపుచు, కొందరిని మోసగించుచు తిరుగుచుండెను.

ఒకభిక్షు వాతనికుల మున్న ప్రదేశమును పరీక్షించి ఆతడు బడాయి కొట్టినట్లు తక్కిన భిక్షువులతో, జెప్పెను. ధర్మసభలో సమావిష్టులైనభిక్షువులు అతనిని నిందించుచు "ఆయుష్మంతులారా, ఫలాని భిక్షువు కళ్యాణకరమైన యిట్టిశాసనమున ప్రవ్రజించియు బడాయి కొట్టుచు, ఆత్మస్తుతి చేసుకొనుచు, మోసగించుచు తిరుగుచున్నాడు" అనిరి.

బుద్ధుడు వచ్చి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అని యడుగ, ఈవిషయము అని వారు చెప్పిరి: అప్పుడు శాస్త "భిక్షువులారా, ఇప్పుడే కాదు; పూర్వముకూడ అత డిదేవిధముగా ప్రవర్తించెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ ఉదీచ్య రాజధానిలో బోధిసత్త్వుడు యుక్తవయస్కుడై తక్షశిలా నగరమునకు జని విఖ్యాతాచార్యునికడ వేదత్రయము, అష్టాదశ విద్యలును పూర్తి చేసెను. విద్వాంసుడై యతడు అల్పధనుర్ధనుడను నామము వహించి తక్షశిల విడిచి వ్యవహారానుభవమునకై ఆంధ్ర దేశమున (నగర) కరిగెను. ఈపుట్టువులో వామనుడగుటచే బోధిసత్త్వుడు "రాజదర్శనము చేసినచో నీవంటి పొట్టివానివలన నేమి లాభమగును? కావున ఆజానుబాహుడు మహోన్నత శరీరుడు గంభీరాకారుడు నగు వాని నాశ్రయించి నేర్పున కాలక్షేపము చేయవలెను" అని యోజించి సాలి వీధికి జని అచ్చట మహోన్నత కాయుని జూచి నమస్కరించి, నీ పేరేమని యడిగెను.

"భీమసేనుడు."

"నీవంటి బలిష్ఠుడు ఈవృత్తిలో నుండనేల?"

"మరియొక విధమున జీవిక కనబడక ఈవృత్తిలోనున్నాను."

"నేటితో నీవృత్తి మానుకొనుము. నావంటి ధనుర్ధనుడు జంబూ ద్వీపములో లేడు. కాని నేను పొట్టివాడను. రాజులకు నాయెడల లక్ష్య ముండదు. నీవు ధనుర్విద్యలో ప్రవీణుడ వని ప్రగల్భవాక్య

ములు పలుకుము. రాజు నిన్ను కొలువులో జేర్చుకొనును. వెనుక నుండి నేను నీపనులు నెరవేర్చెదను. ఈవిధముగా ఉభయులము బాగు పడ వచ్చును. నీవు మాత్రము నేనుచెప్పినట్లు చేయుచుండుము".

"నాకు సమ్మతమే"

ఈప్రకారముగా బోధిసత్త్వుడు భీమసేనుని వెంటబెట్టుకొని వారణాసికి బోయి, వాని సేవకునివలె నటించుచు, రాజద్వారముచేరి, తమ రాక రాజునకు దెలిపి, అనుమతిపొంది రాజసమక్షమునకు జనెను. ఇరువురు ప్రభువుకు నమస్కరించి నిలిచిరి.

"ఏల ఇచ్చటికి వచ్చితిరి?" అని రాజనెను.

"బాణప్రయోగములో నాయంతటి నేర్పరి జంబూద్వీపములో లేడు",

"నాకొలువులో నుండుటకు నీ కెంత వేతనము కావలెను?"

"పక్షమునకు వేయిరూపాయలు దేవా!"

"ఇత డెవడు?"

"దేవా. ఇతడు నా బాల్యానుచరుడు",

"మంచిది. నీవు నాయాశ్రయమున నుండుము.

భీమసేనుడు రాజుకొలువులో నుండెను. బోధిసత్త్వు డాతని పను లన్నియు తాను జేయుచుండెను. ఆరోజులలో కాశీ రాష్ట్రమందలి యడవిలో పెద్దపులి జనులను చంపి, తినుచు రాజమార్గము నరికట్టుచుండెను. ఈవార్త తెలియగనే రాజు భీమసేనుని బిలిపించి, పులిని పట్టుకొనగలవా" అనెను. "దేవా, పులిని పట్టుకొనలేనిచో ధనుర్ధనుడ నని యెట్లు చెప్పుకొనగలను?" రాజు వానికి బహుమాన మిచ్చి పులిని పట్టుకొన బంపెను. భీమసేను డింటికి బోయి యీవార్త బోధిసత్త్వునకు జెప్పెను.

"మంచిది. మిత్రమా, నీవు పొమ్ము".

"నీవు నావెంట రావా?"

"రాను, కాని చిన్నయుపాయము చెప్పెదను".

"అనుగ్రహించి చెప్పుము".

"పులియుండు చోటికి నీవు త్వరపడి పోవలదు. రెండువేలమంది గ్రామీణులను గుమిగూర్చికొని, బాణములు కొని వారిని తీసికొని

పొమ్ము. వారు పులిని రెచ్చగొట్టిన పిమ్మట నీవు పొదరింటిలోనికి బోయి నేలపై ముఖముపెట్టి, పరుండుము: జానపదులు పులిని కొట్టి చంపినపిదప నీవు పండ్లు కల తీగెను త్రెంపి, చచ్చినపులి కడకు బోయి కోపముతో, ఎవ రీపులిని కొట్టినవారు? ఈతీగతో పులిని కట్టివేసి వృషభమువలె రాజసన్నిధికి తీసికొని పోదలచితిని. తీగ కొరకు నేను పొదలోనికి బోయి మరలి రాకపూర్వమే నాకు దెలియకుండ పులిని జంపిన వా రెవరు? అని నీవు గంభీరముగా బలికిన యెడల పల్లెలవారు భయపడి, ఈవివరము రాజుకు తెలుపకుండుటకై నీకు బహుమాన మిత్తురు. పులిని చంపిన పేరు నీకు దక్కును. రాజు నీకు బహుమాన మిచ్చును".

మంచిదని భీమసేనుడు పోయి చెప్పినచొప్పున ప్రవర్తించెను. పులి చచ్చిన పిమ్మట భీమసేనుడు బహుజనపరివృతుడై వారణాసికి వచ్చి రాజ సన్నిధిజేరి, దేవా, వ్యాఘ్రమును సంహరించి, అడవిలో బాట సారులకు భీతిలేకుండ జేసినాను" అని విన్నవింపగా రాజు సంతుష్ట చిత్తుడై వానికి బహుమాన మిచ్చెను.

వనమహిషము మార్గము నరికట్టుచున్నదని మరియొకనాడు రాజు విని, దానిని జంపుటకై భీమసేనుని బంపెను. బోధిసత్త్వుడు చెప్పినట్లే వాడు వనమహిషమును జంపించి, మరలివచ్చి రాజువలన ధనము బహుమానరూపముగా బడసెను.

భీమసేనుడు ధనాధికుడై నూతన గౌరవాదులచే మదోన్మత్తుడై బోధిసత్త్వుని లెక్కింపక, ఆయన యుపదేశములను చెవిబెట్టక "నీ సాయము లేకుండ నేను జీవింపలేననుకొకు. నీకంటె వేరెవడును లే డనుకొంటివా?" అని పరుషవాక్కు లాడెను.

తరువాత కొలదిదినములకు శత్రురాజు దండెత్తివచ్చి, వారాణసిని ముట్టడించి, రాజ్యము తన కప్పగింపవలసిన దనియు, అట్లు చేయనిచో యుద్ధమునకు రమ్మనియు సందేశ మంపెను. రాజు భీమసేనుని బిలిచి యుద్ధమునకు పొమ్మని యానతిచ్చెను. వాడు యోధునివలె ఆపాద మస్తకము కవచముధరించి, ఆయుధములు పట్టుకొని కవచరక్షితమైన యుద్ధహస్తిపై నెక్కెను. భీమసేనుడు నిహతుడగునని భీతిచే బోధి సత్త్వుడు, కవచము తొడిగికొని, ఆయుధములు ధరించి, వానివ్రక్కన

వినయముతో ఏనుగుపై గూరుచుండెను. ఆయేనుగు సేనతో గూడి నగరద్వారము వెలువడి, రణరంగమున ప్రవేశించెను. రణదుందుభి ధ్వని వినినంతనే భీమసేనుడు వణకుచుండెను; క్రింద బడినచో వాని ప్రాణములు పోవునని భీమసేనుని బోధిసత్త్వుడు పాశములతో గట్టివేసి, వానిని గట్టిగా బట్టుకొనియుండెను. రణభూమిని చూచినంతనే భీమసేనుడు ధైర్యము కోల్పోయెను. ఏనుగు మీదనే మలమూత్రములు విసర్జించెను.

"ఆహో, ప్రకృతమునకు గత కాలమునకును పోలిక లేదు. అప్పుడు నీవు మొనగానివలె నటించితివి. నీ పరాక్రమ మేనుగుపై మలమూత్రములు విడుచుట కుపకరించినది" అని బోధిసత్త్వుడు వానిని క్రిందికి దింపి ఈగాథ పలికెను.

> చెప్పవె ప్రగల్భములు భీమసేన, మున్న—
> పోరుకొనుచుంటి విట సంప్రహారమందు:
> ముందు మాట కీచేతకు పొందు కలదె!

నేడు కీర్తి గాంచవలెను అని బోధిసత్త్వుడు యుద్ధఘోష చేయుచు, శత్రువ్యూహములను తాకి, శిబిరమునుండి శత్రురాజు నీడ్చుకొనివచ్చి వారణాసికి గొనిపోయెను. కాశీరాజు మహానంద భరితుడై బోధిసత్త్వుని పరాక్రమము మెచ్చుకొని, విశేషధన మొసంగెను. నాటి నుండి అల్పధనుర్ధనుని కీర్తి జంబూద్వీపమున వ్యాపించెను.

బోధిసత్త్వుడు భీమసేనునకు ధనమొసగి వానిని నిజనివాసమునకు బంపివేసెను. తాను యావజ్జీవము దానాది పుణ్యకార్యములు చేయుచు యథా కమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి భీమసేనుడు ఇప్పటి కోతలరాయుడు; క్షుద్ర ధనుర్గ్రాహి పండితుడు నేనే.

## 81 సురాపాన జాతకము

శాస్త కోసంబీ సమీపమున ఘోసితారామమున విహరించుచు సాగత స్థవిరుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

భగవాన్ శ్రావస్తిలో చాతుర్మాస్య గడిపి పర్యటనము చేయుచు భద్రవతి యను నిగమము చేరెను. గొల్లలు, పసులకాపరులు, బాటసారులు శాస్తను జూచి ప్రణామము చేసి "భన్తే, అంబతీర్థమునకు భగవాన్ వెళ్ళరాదు. అచ్చట తపస్వి ఆశ్రమమున అంబతీర్థక మను నాగము మహావిషపూరిత మైనది కలదు. భగవానున కచట కష్టము కలుగునేమో" అనిరి. వారు మూడుమారులు వారించినను వారి మాటలు విననియట్లే యుండి భగవాన్ అచ్చటికే బయలుదేరెను.

భద్రావతికి కొలది దూరములో నొకవనఖండమున భగవాన్ విహరించునపుడు అప్పటి బుద్ధ-ఉపస్థాపక సాగత నామక స్థవిరుడు లౌకికబుద్ధితో కూడియున్నను ఆయాశ్రమములోనికి బోయి నాగరాజ నివాసస్థానమున తృణాసనము పరచుకొని పర్యంకబంధమున గూరుచుండెను. ఈర్ష్యచే నాగరాజు ధూమము వెలువరింప నారంభించెను. స్థవిరుడుకూడ ధూమమును వెలువరించెను. నాగరాజు నిప్పులు గ్రక్కెను. స్థవిరుడుకూడ అటులే చేసెను. నాగరాజు తేజమువలన స్థవిరునకు కష్టము కలుగ లేదు. స్థవిరుని తేజమువలన నాగరాజుకు శ్రమ కలుగుచుండెను. ఈవిధముగా క్షణములో నాగరాజును దమించి స్థవిరుడు అతనిని త్రిశరణములలోను పంచశీలములలోను ప్రతిష్ఠితుని జేసి శాస్తకడకు గొనిపోయెను.

బుద్ధుడు భద్రవతికలో ఇచ్ఛవచ్చిన న్నాళ్ళు విహరించి, కోశాంబికి చనెను. సాగతస్థవిరుడు నాగరాజును దమించినవార్త జనపద మంతటను వ్యాపించెను. కోశాంబీనివాసులు బుద్ధునికి స్వాగతము చెప్పి ప్రణామము చేసి సాగతస్థవిరునికడకు బోయి ప్రణామము చేసి, ఒక ప్రక్కన గూరుచుండి "తమకు దుర్లభ మైన దేదో మాకు తెలుపుడు, దానిని సిద్ధము చేసి యిత్తుము" అనిరి. స్థవిరుడు మాటాడలేదు, కాని షడ్వర్గీయభిక్షువులు "ఆయుష్మంతులారా, ప్రవ్రజితులకు పారావత

మద్యము దొరకుటలేదు. అది చాల బాగుండును. మీకు స్థవిరునియెడ ప్రసన్నత యున్నచో ఆసవము తయారు చేసి పంపుడు" అనిరి. జనులు సరే అని అంగీకరించి, బుద్ధుని వేరొకనాటికి నిమంత్రించి నగరములో ప్రవేశించి తమతమగృహము స్థవిరునకు చూపదలచి ఆసవము సిద్ధము చేసి, స్థవిరుని నిమంత్రించి ఒకరియింట ఆసవ మిచ్చిరి. ఆయన ఆసవము పుచ్చుకొని, కైపు తల కెక్కగా నగరము వెలువడుచు ద్వారదేశమున పడిపోయి ఎమేమో పలక జొచ్చెను.

బుద్ధుడు భోజనము చేసి నగరము వెలువడుచు స్థవిరుని జూచి "భిక్షువులారా, సాగతుని లేవనెత్తుడు" అని ఆరామమునకు బోయెను. భిక్షువు లాతనిని దెచ్చి స్థవిరునితల బుద్ధుని పాదములవైపు నిలిపిరి. ఆతడు తిరుగబడి తథాగతునివైపు పాదములు పెట్టి పండుకొనెను. బుద్ధుడు "భిక్షువులారా, సాగతునకు పూర్వము నాయెడ ఆదరముండెడిది. ఇప్పు డది యున్నదా?" అనెను.

"భన్తే, లేదు." "భిక్షువులారా, అంబతీర్థమున నాగరాజును నిగ్రహించిన దెవరు?" "సాగతుడు". "భిక్షువులారా. సాగతుడు ఇప్పుడు నీటిపామునైన నిగ్రహింపగలడా?" "నిగ్రహింపలేడు". "కాబట్టి, భిక్షువులారా, దేనిని త్రాగినచో మైకము పుట్టునో దానిని త్రాగవచ్చునా?" "భన్తే, అనుచితము".

భగవాన్ స్థవిరుని నిందించి, భిక్షువులను పిలిచి, "సురాపానము దుష్టము" అని శిక్షాపదము (నియమము) ఏర్పాటు చేసి, పీఠముపై నుండి లేచి గంధకుటిలోనికి బోయెను. భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై "ఆయుష్మంతులారా, ఆసవ మెంత చెడ్డది! ప్రజ్ఞావంతుడు, బుద్ధిమంతుడు నగు సాగత స్థవిరు డిట్లాయెను.! తథాగతుని గుణము గ్రహింపలేక పోయెను,!" అనుకొనుచుండిరి.

ఇంతలో బుద్ధు డచటికి బోయి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిమ్మట శాస్త "భిక్షువులారా, ఈప్రవ్రజితుడు ఇప్పుడే కాదు. పూర్వము కూడ ఆసవము పుచ్చుకొని ఇట్లే అయ్యెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశిలో ఉదీచ్య బ్రాహ్మణవంశమున బుట్టి పెద్దవాడయి, ప్రవ్రజించి, అభిజ్ఞలు, సమాపత్తులు పొంది, ధ్యానకేళిలో క్రీడించుచు హిమవంతమున నివసించుచుండెను. ఆయనకు 500 శిష్యులుండిరి. వర్షాకాలమున నొకసారి అంతేవాసులు "ఆచార్యా, మేము మానవ నివాసములకుబోయి, లవణము, చింతపండు తెచ్చుకొన వచ్చునా?" అనిరి. "నేనుమాత్ర మిచటనే యుందును. మీరుపోయి ఆరోగ్యము సరిచేసికొని, వర్షాకాలమున రండు" అని ఆయన చెప్పెను. మంచిది అని వారు ఆచార్యునకు నమస్కరించి, వారాణసికి బోయి, రాజోద్యానమున విడిసి, మరునాడు వెలుపలిద్వారము కడ గ్రామమునకు భిక్షార్థము చని, సుష్టుగా భుజించి, ఆమరునాడు మరల నగరమున ప్రవేశించిరి. జనులు సంప్రీతులై భిక్షలు పెట్టిరి. "హిమవంతమునుండి 500 ఋషులు వచ్చి రాజోద్యానమున నివసించుచున్నారు. వారు ఘోరతపోవ్రతులు, జితేంద్రియులు, శీలవంతులు దేవా!" అని రాజుకు తెలియజేసిరి. వారిగుణములను గూర్చి విని రాజు ఉద్యానమునకు జని నమస్కరించి చాతుర్మాస్యలు అక్కడనే గడపు డని సాదరముగా ఆమంత్రించెను. ఉండుటకు వారు సమ్మతించి, నాటినుండి రాజభవనమున భుజించుచు, ఉద్యానమున నివసించుచుండిరి.

ఒకనాడు నగరమున పానగోష్ఠి మహోత్సవము జరిగినది. తాపసులకు సుర దుర్లభమని రాజు అత్యుత్తమ సుర వారికి హెచ్చుగా పంపినాడు. తాపసులు సుర త్రాగి, ఉద్యానమునకు బోయి, మత్తెక్కుటచే కొందరు నాట్యము చేసిరి, కొందరు పాడిరి. నాట్యముచేసి, పాటలుపాడి, విసిగినవారు భోజన సామగ్రులు మొదలగునవి తల క్రిందులుచేసి, నిద్రించిరి. సురామదము తగ్గిన పిమ్మట లేచి, తాము చేసిన పనులకు దుఃఖించి "మన మకార్యము చేసినాము. ఆచార్యులు దగ్గర లేకుండుటచే నిట్టి పాపకర్మ చేసితిమి" అని పరిదేవించి, తత్క్షణామే ఉద్యానము విడిచి, హిమవంతమునకు జనిరి; చని భాజనాదులావలనుంచి ఆచార్యునకు నమస్కరించి కూరుచుండిరి.

"నాయనలారా, మానవ నివాసములలో భిక్షార్థము శ్రమ చెందక సుఖముగా నుంటిరా? సంఘీభావముతో నుంటిరా?" అని ఆచార్యుడు ప్రశ్నింపగా, వారు "ఆచార్యా, సుఖముగా నుంటిమి. కాని నిషిద్ధ సుర గ్రోలి, ఒడలు మరచి, గంతులు వేసితిమి, పాటలు పాడితిమి అను విషయములను స్పష్టీకరించుటకై ఈగాథ రచించి పలికినారు:

తందనా లాడినాము మద్యమ్ము గ్రాగి,
పాడితిమి పాట, లేడ్పులుకూడ వచ్చె
ఆత్మ మరపించు మద్యమ్ము నాన, దైవ
వశమునన్ మారిపోలేదు వానరులుగ!

"గురువు కనిపెట్టి యుండనివారు ఇట్లే యగుదురు" అని బోధిసత్త్వుడా తాపసులను మందలించి, "మరల ఎన్నడు నిట్లు చేయవలదు" అని యుపదేశించి, అపరిహీన ధ్యానమున బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి ఋషి గణము ఇప్పటి బుద్ధపరిషత్తు; గణగురువు నేనే.

## 82 మిత్తవింద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, మాట వినని భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కాశ్యప సమ్యక్ సంబుద్ధుని కాలమునకు సంబంధించిన యీకథ దశమ నిపాతములో మహామిత్తవిందక జాతకమున (439) వచ్చును.

### అతీత కథ

ఆసందర్భమున బోధిసత్త్వు డీగాథ పలికినాడు:

స్ఫాటికము, రాజతము, మణిస్థగితము నగు
రమణకము, సదాము త్తము రమ్య మైన
దూధకం బను సౌధ సందోహ సుఖము
విడిచి వూనితి పాషాణ వేష్టనంబు :
అది కదలబోదు ప్రాణ మున్నంతవరకు.

ఈ ప్రకారము పలికి బోధిసత్త్వుడు తన దేవస్థానమునకు జనెను. మిత్రవిందకుడు 'ఉరచక్రమును' శరీరము చుట్టును ధరించి, మహాదుఃఖ మనుభవించుచు, పాపకర్మ పరిక్షీణమయిన పిమ్మట నిజ కర్మోచిత పదమును జెందినాడు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. నాటి మిత్రవిందకుడు నేటి మూర్ఖభిక్షువు; దేవరాజు నేనే.

## 83 కాలకణ్ణి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు అనాథపిండికుని మిత్రులలో నొకనిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

గోచి పెట్టిననాటనుండియు అతడు అనాథపిండికుని మిత్రము. ఉభయులు నొకే యాచార్యునికడ విద్యలు నేర్చిరి. అతని పేరు కాలకణ్ణి. కాలక్రమమున నతడు దుర్గతిపాలయి, అశ్రమముగా జీవింపలేక శ్రేష్ఠి కడకు బోయెను. శ్రేష్ఠి అతని నోదార్చి, ధన మిచ్చి కుటుంబమును పోషించెను. అతడు కృతజ్ఞతతో శ్రేష్ఠి కార్యములు నిర్వర్తించు చుండెను. శ్రేష్ఠికడ కాతడు పోయినపుడెల్ల "కాలకణ్ణి, ఆగు; కాలకణ్ణి కూర్చుండుము; కాలకణ్ణి, భుజింపుము" అనుచుండెడివాడు. ఒకనాడు మిత్రులు శ్రేష్ఠితో "ఇతనిని మీకడ ఉండనీయవద్దు. కాలకణ్ణి శబ్దము వినబడుచున్నంతవరకు యక్షులుకూడ భయపడుదురు. ఇతడు నీకు

తగినవాడు కాడు; దరిద్రుడు, కురూపి, ఇతనితో మీ కేమి పని?"
అనిరి.

అనాథపిండికుడు వారితో "నామము వ్యవహారమాత్రము. పండితులు దానిని లక్ష్యము చేయరు. శ్రుతమాంగలికము కా నక్కరలేదు. నామమాత్రము చేతనే చిన్ననాటిమిత్రుని విడిచిపెట్టలేను" అన్నాడు. వారిమాట వినక శ్రేష్ఠి ఒకనాడు తనమొఖాసాగ్రామమునకు బోవునపుడు కాలకణ్ణిని తనయింట నుంచెను.

"శ్రేష్ఠి గ్రామాంతరము వెళ్ళినాడు. ఇల్లు దోచుకొందము" అని చోరులు వివిధాయుధములు పట్టుకొని రాత్రివేళ వచ్చి యిల్లు చుట్టుముట్టిరి. చోరులు వత్తురేమో అను సంశయముతో అతడు మెలకువతో కూరుచుండి యుండెను. చోరులు వచ్చుట గ్రహించి కాలకణ్ణి ఇంటిలోని పరిజనముతో "నీవు, శంఖమూదుము; నీవు డోలువాయింపుము" అని యింటిలో మేజువాణీజరుగుచున్నట్లు ఘోషను పుట్టించెను. "ఇల్లు ఖాళీగా ఉన్నది అనువార్త అసత్యము; శ్రేష్ఠి ఇంటిలోనే యున్నాడు" అనుకొని చోరులు పాషాణ ముద్గరాదులచటనే విడిచి పారిపోయిరి.

అన్నియెడల పడియున్న పాషాణాదులు మరునాడు లోకులు చూచి సంక్షుబ్ధచిత్తులై "ఈప్రకారముగా బుద్ధిమంతుడైన గృహరక్షకుడు లేనిచో, చోరులు గృహములో ప్రవేశించి, ఇచ్చవచ్చినట్లు దోచుకొనిపోయియుందురు. ఈ గాఢమిత్రమువలన శ్రేష్ఠికి హాని జరుగక ఉన్నతి సంభవించినది" అనిరి.

శ్రేష్ఠి వారితో "ఇట్టి గృహరక్షకమిత్రుని పంపివేయు మంటిరి. నేను మీమాట విని ఇతనిని పంపివేసినచో నేడు నా కేమియు మిగిలియుండెడిది కాదు; కావలసినది పేరు కాదు-హితైషిచిత్తము" అని పలికి, కాలకణ్ణికి మరింతధన మొసగి ఈనాడు నే నీవిషయము చెప్పదగినది అని యెంచి బుద్ధునిసన్నిధికి బోయి, మొదటినుండి తుదివరకును జరిగిన దంతయు తెలిపెను.

శాస్త విని "గృహపతీ, కాలకణ్ణిమిత్ర మిప్పుడే కాదు, పూర్వము కూడ గృహమును సామానులను సంరక్షించినవాడే" అని, శ్రేష్ఠి ప్రార్థించినపిమ్మట పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ప్రసిద్ధశ్రేష్ఠిగా నుండెను. అంతయు వెనుకటి కథలోవలెనే జరిగెను. బోధిసత్త్వుడు తన గ్రామమునుండి మరలి వచ్చి, జరిగిన వృత్తాంతము విని, తన మిత్రులతో "మీ మాటలు విని, యిట్టి మిత్రుని తొలగించినచో నా కుటుంబమున కేమియు మిగిలియుండెడిది కాదు" అని పలికి, యీ గాథ చెప్పినాడు :

అడుగు లే డేయగా మిత్రు డగు నరుండు,
పదియు రెం డహస్సుల సహవాసమునను
అగును సాహాయ్యకుడు, పక్షాంతమందు
గాని, మాసాంతమున గాని జ్ఞాతి యగును,
అంత కధికమయే నగు నాత్మసముడు.
వెంట గొంటిని నాకయి వీనిని చిర
కాల, మెట్లు త్యజింతు నీకాలకణ్ణి?

శాస్తృ ధర్మోపదేశము చేసి జాతకసారాంశమును వెలువరించెను. అప్పటి కాలకణ్ణి ఇప్పటి ఆనందుడు; వారాణసీ శ్రేష్ఠి నేనే.

## 84 అత్థస్స ద్వార జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుచు, ఒకానొక అర్థకుశల పుత్రుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో మహావైభవశాలి యగుశ్రేష్ఠి కాతడు పుత్రుడు. బాలునికి ఆయుస్సు ఏడుసంవత్సరములు. అతడు చాలప్రజ్ఞావంతుడు, అర్థకుశలుడు. అత డొకనాడు తండ్రికడకు జని అర్థద్వారమును గూర్చి ప్రశ్నించెను. తండ్రికి దానిసమాధానము తెలియదు. ఆయన ఆలో

-చించి సమ్యక్-సంబుద్ధుడు తప్ప మరెవ్వడు ఈసూక్ష్మప్రశ్నకు ఉత్తర మీయ జాలడు'' అని తలపోసి కుమారుని వెంటబెట్టుకొని, విశేష మాల్యాలేపనములు కొని జేతవనమునకు బోయి బుద్ధునకు పూజా ప్రణామములు జేసి, "భన్తే ఈ బాలకుడు బుద్ధిమంతుడు, అర్థకుశలుడు. ఇతడు నన్ను అర్థద్వారవిషయమున ప్రశ్నించినాడు. దీనికి ఉత్తరము తెలియక తమ సన్నిధికి వచ్చినాను. తమకు విశ్రాంతిగా నున్నచో, భగవన్, దీనికి సమాధాన మనుగ్రహింపవలెను'' అని విన్నవించెను. "ఉపాసకా, ఈకుమారుడు పూర్వముకూడ నన్ను ఈప్రశ్న మడిగి నాడు; సమాధానము చెప్పినాను: అది జన్మాంతరవిషయ మగుటచే నితనికి జ్ఞప్తిలేదు'' అని, తండ్రి ప్రార్థించినపిదప బుద్ధుడు పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయు చుండగా బోధిసత్త్వుడు మహావిభవముకల శ్రేష్ఠియయ్యెను. ఆయన కేడేండ్ల కుమారుడు కలడు. వాడు ప్రజ్ఞావంతుడు, అర్థకుశలుడు. ఒక నాడు వాడు తండ్రిని సమీపించి, "నాయనా, అర్థమునకు (నిర్వాణము నకు) ద్వారమేది?'' అని యడిగెను. వానికి ప్రత్యుత్తరముగా బోధి సత్త్వుడీగాథ పలికినాడు :

పరమలాభకర మ్మిది, భద్రపరచు
ఆరువిషయము లన్నతిద్వారము లగు;
జ్ఞానవృద్ధుల సదుపదేశం బొకండు,
శీలము, బహుశ్రుతత్వ, మెవ్వేళ ధర్మ
సహిత మాచరణం బనాసక్తియు నగు.

ఈ ప్రకారముగా పుత్రుని ప్రశ్నమునకు సమాధానము చెప్పినాడు. నాటనుండి బాలుడు ఆరు ధర్మమార్గముల ననుసరించువాడు. బోధి సత్త్వుడు దాన ధర్మాదులు చేయుచు తుదకు నిజ కర్మోచిత పదవిని పొందినాడు.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. నాటి పుత్రుడు ఇప్పటి పుత్రుడే; మహాశ్రేష్ఠి నేనే.

# 85 కింపక్క జాతకము

**బుద్ధుడు జేతవనమున విహరించుచు, ఆసక్తచిత్తుడైన భిక్షువును గూర్చి చెప్పినది.**

## వర్తమాన కథ

కులపుత్రు డొకడు బుద్ధశాసనమున అత్యంతశ్రద్ధచే ప్రవ్రజించి, ఒకనాడు శ్రావస్తిలో భిక్షాటనము చేయుచు అలంకృతస్త్రీని వీక్షించి ఆసక్తచిత్తు డయ్యెను. అతనిని ఆచార్యుడు బుద్ధునిసన్నిధికి గొనిపోయెను.

"భిక్షూ, నీవు సత్యముగా ఉత్కంఠితుడ వయినావా?" అని భగవాన్ అడుగగా "సత్యమే" అని భిక్షువు చెప్పినాడు. అప్పుడు భగవాన్ "భిక్షూ, ఈపంచకామగుణములు (భోగములు) అనుభవించునపుడు చక్కగానే తోచును. కాని, భోగము నిరయాదులలో నుత్పత్తికి కారణము లగుటచే కింపాకఫలముతో సమాన మయినది. కింపాకఫలము వర్ణగంధరస సమాయుక్త మయినను భక్షించిన పిదప పేగులను ముక్కలు ముక్కలు చేసి ప్రాణములు హరించును. తొలుత అనేకులు దానిగుణ మెరుగక, దాని వర్ణగంధరసములయం దాసక్తులై దానిని భక్షించి ప్రాణములు కోలుపోయిరి" అని, పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సార్థవాహు డయ్యెను. ఆయన యొకసారి 500 బండ్లతో తూర్పునుండి పశ్చిమమునకు ప్రయాణము చేయుచు, అటవీముఖము సమీపించి, తన పరివార జనుల నొకచోజేర్చి "ఈయడవిలో విషఫల వృక్షములు కలవు. ఇదివరలో మీరు తినని పండ్లు కనబడినచో నాకు దెలుపకుండ తినవలదు" అని చెప్పెను. వారా యడవి కడచి వేరొక యటవీముఖమునకు జేరి, ఫల భారముతో నిండిన కింపాక వృక్షమును సమీపించిరి. దాని బోదె, కొమ్మలు, ఆకులు, పండ్లును మామిడిని బోలి యుండెను. వన్నెలోను, వాసనలోను, రుచిలోను ఆమ్రఫల

సమానములైన దాని పండ్లను కొందరు కోసి తినిరి. కొందరు పండ్లు కోసి "సార్థవాహునితో జెప్పి తిందము" అని ఆయన రాకకై వేచి యుండిరి. బోధిసత్త్వుడు వచ్చి, కోసినపండ్లు పారవేయుడని చెప్పి, పండ్లు తిన్నవారికి వమన మగుటకు మందిచ్చెను. వీరిలో కొందర కారో గ్యము కలిగెను. మొదట తిన్నవారు మరణించిరి. బోధిసత్త్వుడు గమ్య స్థానమును సురక్షితముగా జేరి, లాభము గడించి, స్వస్థానమునకు మరలివచ్చి, దానాది పుణ్యకార్యములు చేసి తుదకు నిజకర్మోచిత మగు పదవిని పొందెను.

కామభోగాల దుష్పరిణామములను
తలప కెవ్వడు సేవించు, ఫల మొసంగు
నట్టిచో భోగములె వాని హత మొనర్చు,
అల్ల విషముష్టి ఫలము తిన్నతనిబోలె.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రవేశింప జేసిన తరువాత ఉత్కం ఠితభిక్షువు స్రోతాపత్తిని పొందెను. కొందరు స్రోతాపన్నులు, మరికొందరు సకృదా గాములు, వేరొకకొందరు అనాగాములు నయిరి. కొలదిమంది అర్హతు లయిరి. బుద్ధుడు జాతకసారాంశము వెలువరించెను. నాటి పరిషత్తు నేటి బుద్ధపరిషత్తు. సార్థ వాహుడు నేనే.

## 86 సీలవీమంస జాతకము

శాస్త జేతవనమున విహరించుచు శీలవిమర్శక బ్రాహ్మణుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆయనజీవిక కోసలరాజుపై నాధార పడియుండెను. ఆయన త్రిశరణ గతుడు, అఖండపంచశీలి, వేదత్రయపారంగతుడు. ఈశీలవంతుని రాజు విశేషముగా సమ్మానించుచుండెను. బ్రాహ్మణు డిట్లు తలపోసెను:

"ఈరాజు తక్కిన బ్రాహ్మణులకంటె నన్ను హెచ్చుగా నాదరించు చున్నాడు. విశేషముగా గౌరవము ప్రదర్శించుచున్నాడు. నాజాతి, గోత్ర, కుల, ప్రదేశ, విద్యలను బట్టియా, శీలసంపదను బట్టియా? మంచిది, దీనిని పరీక్షింతును".

ఒకనా డాయన రాజుకొలువునకు బోయి, తిరిగి వచ్చునపుడు షరాబు దుకాణములో పలకమీద నున్న కార్షాపణములలో నొకదానిని చెప్పకుండ తీసికొని పోయెను. బ్రాహ్మణునియెడ గౌరవ ముండుటచే షరాబు మాటాడక కూరుచుండి యుండెను. మరునాడు బ్రాహ్మణుడు రెండుకార్షాపణములు తీసికొనిపోయెను. షరాబు వెనుకటివలెనే సహించి యుండెను. మూడవనాడు బ్రాహ్మణుడు గుప్పెడు కార్షాపణము లెత్తుకొనెను. "రాజకీయవస్తువు లెత్తుకొనిపోవుట నీ కిది మూడవనాడు" అని షరాబు "రాజకీయపదార్థము హరించు చోరుడు పట్టుపడినాడు" అని బిగ్గరగా గడబిడ చేసెను. జను లిటునుండి అటు నుండి వచ్చి, "నీవు చాలకాలమునుండి సదాచారుని వేషమువేసి తిరుగుచున్నావు!" అని ఒకటిరెండు దెబ్బలు కొట్టి, రాజుకడకు గొనిపోయిరి.

రాజు విచారపడి "బ్రాహ్మణా, ఏల యీపాపకార్యము చేసినావు?" అని "ఈయనకు రాజదండ మిండు" అని ఆజ్ఞ యిచ్చెను.

"మహారాజా, నేను చోరుడను కాను".

"అయినచో, రాజకీయవస్తువుల అధికారిపలకపైనుండి కార్షాపణము లేల తీసితివి?"

"మీరు నన్ను మిక్కిలి గౌరవించుచున్నారు. నామనసులో సందేహ ముదయించినది. నాజాత్యాదులను బట్టియా, శీలమును బట్టియా ఈగౌరవము? అని పరీక్ష చేయదలచి యిట్లు చేసితిని. మీరు నాకు చేయుసమ్మానము జాత్యాదులను బట్టి కా దనియు, శీలమును బట్టియే యనియు సంపూర్ణముగా విశ్వాసము కలిగినది. దీనినిబట్టి శీలమే ఉత్తమము, ప్రముఖము అని నిశ్చయించినాను. నేను గృహాస్థుగా నుండి శీలము ననుసరించి వర్తించుట కష్టము. కావున నేడే జేతవనమునకు బోయి బుద్ధుని సన్నిధిలో ప్రవ్రజితుడ నయ్యెదను. దేవా, నా కనుజ్ఞ యిండు" అని, రాజానుమతి పొంది బ్రాహ్మణుడు

జేతవనమునకు బోయెను.

అతని కులములోని బంధువులు, మిత్రులు ఆయనను నివారింప యత్నించిరి; ఆపలేక మరలి వచ్చిరి.

బుద్ధసన్నిధికి జని ఆయన ప్రార్థించి, ప్రవ్రజించి, ఉపసంపద పొంది, కర్మస్థానము (యోగాభ్యాసము) నందు నిలిచి, విదర్శనబుద్ధిచే అర్హత్వము పొందెను. అంతట బుద్ధునికడకు బోయి ఆయన అర్హత్వ ప్రకాశనము చేసి "భన్తే, నాప్రవ్రాజ్య- ఉద్దేశము పరిపూర్ణ మయి నది" అని పలికెను.

ఆయన-అర్హత్వ-ప్రకాశనము భిక్షుసంఘమున వ్యాప్త మయ్యెను: వారు ధర్మసభలో నొకనాడు సమావిష్టులై ఆయనను ప్రశంసించుచు ఆయుష్మంతులారా, రాజుగారి ఉపస్థాయక బ్రాహ్మణుడు నిజశీలమును విచారించి రాజు నడిగి, ప్రవ్రజించి, అర్హత్వమున ప్రతిష్ఠితు డయి నాడు," అనుచుండిరి.

ఇంతలో శాస్త అచ్చటికి బోయి "ఏమి సంభాషించుచున్నారు?" అని యడిగి, ఈవిషయము అని వారు చెప్పినపిదప "భిక్షువులారా. ఈబ్రాహ్మణు డిప్పుడే కాదు, పూర్వముకూడ, పండితుల నడిగి, శీల విచారము సలిపి, ప్రతిష్ఠ పొందినాడు" అని, పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడాయన పురోహితుడయ్యెను. ఆయన దానాది పుణ్య కార్యములుచేయుచు, ధర్మనిరతుడై, అఖండ పంచశీలములు పొందెను. అందరకన్న రాజు ఆయనను హెచ్చుగా గౌరవించుచుండెను. అంత యును వెనుక చెప్పినట్లే యయ్యెను.

బోధిసత్త్వుని బంధించి రాజుకడకు భటులు కొనిపోవుచుండగా పాములవాడు తోక పట్టుకొని పాము నాడించుచుండెను. చూచి బోధి సత్త్వుడు "వలదు, వలదు. పామును మెడలో వేసికొన్నాడు. ఇది మిమ్ము కరచి ప్రాణములు హరించును" అనెను. "బ్రాహ్మణోత్తమా, పాము శీలము కలది, ఆచారసంపన్నమైనది; నీ వలె దుశ్శీలముకాదు. నీవు దుష్టకార్యము చేయుటవలన రాజకుటుంబ విలుంపక జోరుడవని

కట్టి తీసికొని పోవుచున్నారు" అని అహితుండికులు పలికిరి.

బోధిసత్త్వుడు తనలో "పాములు కరవని పక్షమున మంచిపేరు పొందుచున్నవి, ఇట్టి స్థితిలో మనుష్యభూతులైన వారి విషయమున చెప్పవలసిన దేమి ? లోకమున శీలమే ఉత్తమము. దానికన్న ఉత్తమ మయినది లేదు" అనుకొనెను. ఇంతలో ఆయనను రాజుకడకు గొని పోయిరి. "ఏమిది బాబులారా?" అని రాజు పలికెను. "ధనాగారము నుండి అపహరించుచున్న చోరుడితడు." "అట్లయిన శాసనము నిర్వర్తింపుడు." బ్రాహ్మణుడు "రాజా, నేను చోరుడనుకాను" అనెను. "అట్లయిన కార్షాపణములేల తీసికొంటివి?" అని రాజడుగగా బోధి సత్త్వుడు పైన చెప్పినట్లే చెప్పి "ఈ కారణముచే లోకములో శీలమే ఉత్తమము. శీలము ప్రముఖస్థానము పొందినది. అది యట్లుండనిండు. కరవకుండుటచే సర్పము మంచిదను పేరు పొందుచున్నది. ఈ కారణ ముచే శీలమే ఉత్తమము, ప్రవరము" అని శీలము వర్ణించుచు ఈ గాథ చెప్పినాడు:

శీలమే సర్వకల్యాణ సిద్ధికరము,
ధాత్రి శీలమ్ముకంటె నుత్తమము లేదు,
చూడు మీసర్పమ్ము శుద్ధబుద్ధి
చావు తప్పించుకొని మనజాలె సుమ్ము!

బోధిసత్త్వుడీ గాథవలన ధర్మముపదేశించి, కామము విడిచి, సన్యసించి, హిమవంతము ప్రవేశించి, పంచాభిజ్ఞలను, అష్టసమా పత్తులను పొంది, బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున ఆపరిషత్తు ఇప్పటి బుద్ధపరిషత్తు: పురోహితుడు నేనే.

# 87 మంగళ జాతకము

బుద్ధుడు వేళువనమున విహరించుచు, వస్త్రమున మంచి చెడు లక్షణములు కనుగొను బ్రాహ్మణుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

రాజగృహ నివాసియగు బ్రాహ్మణుడొకడు శకునములందు విశ్వాసముకలవాడుండెను. అతడు త్రిరత్నములను అప్రసన్నములు చేసికొని మిథ్యావిచారము చేయుచుండును. ఆయన చాలధనవంతుడు, భోగి. పెట్టెలోపెట్టిన వస్త్రముల జంటను ఎలుకలు కొట్టినవి. ఆయన స్నానము చేసి వస్త్రములు తెండు అనెను. చూచునప్పటికి అవి ఎలుకలు కొట్టినవి.

ఆత డిట్లు యోచించెను. "ఎలుకలు కొట్టిన ఈవస్త్రముల జంటను ఈఇంట నుండనిచ్చినచో మహావిపత్తు కలుగును. ఇయ్యది అమాంగలికము, అదృష్టహీనము, దీనిని బిడ్డలకు గాని, పరిచారకులకు గాని ఇచ్చుటకు వీలులేదు. ఎవరికైన ఇచ్చినచో వారికి ఉన్నదంతయు పోవచ్చును. ఈవస్త్రములను శ్మశానములో పారవైతును. వీనిని పరిచారకుల చేతికి ఈయజాలను. ఇచ్చినచో వారు లోభవశమున వీనిని దాచిపెట్టుకొని నష్టము పొందవచ్చును. వీనిని నా కుమారుని చేతికిత్తును".

ఆయన కుమారుని పిలిచి విషయము తెలిపి "నాయనా, నీవు వీనిని చేతితో తాకవద్దు. కర్రమీద వేసి పట్టుకొనిపోయి శ్మశానమున పారవైచి, తలనిండ స్నానముచేసి మరలిరమ్ము" అని చెప్పెను.

బుద్ధుడు ఆనాడు ప్రాతఃకాలమే ఆర్యమార్గమునకు వచ్చు నవకాశము గల అప్పులకై చూచుచు, ఈతండ్రికొడుకులను శ్రోతాపత్తి ఫలమున నిలుపుటకు అవకాశము గ్రహించి, మృగముల వేటకై అవి యున్నచోటికి పోవునట్లు శ్మశాన ద్వారమునకు పోయి, షడ్వర్ణరశ్ములను వ్యాపింప జేసి కూరుచుండెను. మాణవకుడు తండ్రిమాట ననుసరించి ఆవస్త్రముల జంటను ఇంటిలోనుండి కర్రమీద పాములను పడవేయునట్లు పడవేసి శ్మశానద్వారమునకడకు కొనిపోయెను.

"మాణవకా, ఏమిచేయున్నావు?" అని భిక్షువు డడిగెను.

"గౌతమా, ఇవి ఎలుకలు కొట్టిన వస్త్రములు, దురదృష్టదాయకములు, విషసమానములు. మానాయనగారు ఈభయముచేతనే మరి ఎవరికైన నిచ్చినచో లోభవశమున దాచికొందురేమో అని నాచేతికే ఇచ్చినారు. నేను వీనిని పారవైచి తలనిండ స్నానము చేయుదును"

మంచిది. అయినచో పారవేయుము". మాణవకుడు, వస్త్రములను పారవైచెను. ఇవి నాకు తగినవి అని శాస్త వానినెత్తెను. మాణవకుడు గౌతమా! వలదు వలదు, ఇవి దురదృష్టదాయకములు. వీనిని తియ్య వలదు అని నివారించుచున్నను శాస్త వానిని తీసికొని వేళువనము వైపు పంచనెను. మాణవకుడు శీఘ్రముగా చని తండ్రితో "నాయనా, నేను పారవైచిన వస్త్రముల జంటను నిషేధించుచున్నను శ్రమణ గౌతముడు నాకు తగిన వని కొని వేళువనమునకు పోయినాడు" అని చెప్పెను.

బ్రాహ్మణు డాలోచించుచు, "ఆవస్త్రముల జత అమాంగలికము, అశుభదాయకము. వానిని ధరించుటవలన గౌతముడు నష్టపడును, విహారముకూడ నష్టము పొందును. అందువలన నాకు నిందరావచ్చును, కావున శనికమణగౌతమునకు వేరొకవస్త్రముల జత ఇచ్చి ఆవస్త్రముల జత పారవేయింతును." అనెను.

ఆయన అనేక వస్త్రములు పట్టించుకొని పుత్రసహితముగా వేళువనమునకు జని శాస్తను చూచి ఒక ప్రక్క నిలిచి "భోగౌతమా, శ్మశానమునుండి వస్త్రముల జంట నిజముగా తెచ్చితివా?" అనెను.

"అవును, బ్రాహ్మణా, నిజమే".

"భో గౌతమా, ఆవస్త్రముల జంట అమాంగలికము. దానిని తాల్చుటవలన నీకు నష్టము కలుగును. విహారమున కంతకును నష్టము కలుగును. కట్టుకొనుటకు పక్కకు వలయుచో ఈవస్త్రములను తీసికొని ఆజంట పారవేయుము".

"బ్రాహ్మణా, మేము ప్రవ్రజితులము. శ్మశానమున, గల్లిలో చెత్త చెదారము మీాద స్నానఘట్టములో, మహామార్గములో-ఇట్టి స్థానము లందు పారవైచినవి మాకు తగినవే. నీవో ఇప్పుడే కాదు పూర్వము కూడ ఈఅభిప్రాయముతోనే ఉండెడి వాడవు అని ఆయన వేడిన

పిమ్మట బుద్ధుడు పూర్వజన్మకథను చెప్పెను.

## అతీత కథ

పూర్వము మగధరాష్ట్రమున రాజగృహములో ధార్మికు డగు మగధరాజు పాలనము చేయుచుండెను. ఆకాలమున బోధిసత్త్వు డుదీచ్యబ్రాహ్మణ వంశమున బుట్టి, పెద్దవాడయి, సన్యసించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, హిమవంతమున నివసింపబోయెను. ఒకసారి ఆయన యచటినుండి దిగి, రాజగృహములో రాజోద్యానమున ప్రవేశించి ఆయన మరునాడు భిక్షకై నగరములోనికి బోయెను. రాజు చూచి, ఆయన నాహ్వానించి, రాజభవనములో భోజనము పెట్టి, ఉద్యానమునందు నివసించునట్లు మాట తీసికొనెను. బోధిసత్త్వుడు రాజనివేశములో భోజనము చేయుచు, ఉద్యానమున నివసించుచుండెను.

ఆకాలమున రాజగృహనగరములో దుష్టలక్షణ బ్రాహ్మణు డుండెను. ఎలుకలు కొట్టిన ప్రాతగుడ్డలను బట్టి ఆయన శుభాశుభములు చెప్పుచుండును. అంతయు వెనుకటి కథలోవలెనే జరిగెను. మాణవకుడు శ్మశానమునకు బోవుచుండగా బోధిసత్త్వుడు ముందు పోయి, వాకిట గూర్చుండి, మాణవకుడు పారవైచిన వస్త్రములజంట గైకొని, ఉద్యానమునకు వచ్చెను. కుమారుడు చని తండ్రికి సంగతి చెప్పగా నతడు "రాజతాపసుడు నశించునే" అనెను. అనంతరము బోధిసత్త్వుని సన్నిధికి జని, "తాపసా, నీవు తీసికొనివచ్చిన వస్త్రములను పారవేయుము. అట్లు చేయవేని వినాశము సంభవించును" అనెను. తాపసుడు "శ్మశానమున పారవేసిన వస్త్రములు మాకు చాలును. నాకు మంగళమునెడ కుతూహలము లేదు. బుద్ధులు, ప్రత్యేకబుద్ధులు, బోధిసత్త్వులు నంగీకరింపని మంగళమునెడ కుతూహలము యుక్తము కాదు. కావున బుద్ధిమంతు లదృష్ట చిహ్నములను విశ్వసింపరాదు" అని బ్రాహ్మణునకు ధర్మము బోధించెను. బ్రాహ్మణుడు ధర్మము విని, భ్రమ విడిచి, బోధిసత్త్వుని శరణు జొచ్చెను. బోధిసత్త్వు డపరిహీన జ్ఞానముచే బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

స్వప్నలక్షణ మంగళోత్పాతములను
నమ్మకమ్ముల విడనాడు నరు డెవండు,
వాడు నిర్జించి యెల్లద్వంద్వములు మరల
లోకమున జన్మ మెత్తగా లోపడండు.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకాశింప జేసినపిమ్మట ఆ బ్రాహ్మణుడు పుత్రుడు శ్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితులైరి.

బుద్ధుడు జాతకసారాంశము వెలువరించెను. అప్పటి తండ్రి కొడుకులు ఇప్పటి తండ్రి కొడుకులే; తపస్వి నేనే.

## 88 సారంభ జాతకము

బుద్ధుడు శ్రావస్తిలో విహారము చేయుచు, నిందకు సంబంధించిన శిక్షాపథము (నియమము) విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

రెండుకథలును పూర్వోక్త నందివిశాల జాతకముతో (28) సమానములు. కాని ఈజాతకమున బోధిసత్త్వుడు గాంధారరాష్ట్రములోని తక్షశిలా నగరమున ఒకానొక బ్రాహ్మణుని వృషభముగా సారంభ నామముతో నున్నాడు.

### అతీత కథ

పలుకు కల్యాణవాక్కులే పవలు రేలు
పాపవాక్కులు రానీయ వలదు నోట
శుభవచస్సులె సతతమ్ము శుభము గూర్చు
పాపవాక్కు పశ్చాత్తాప ఫలము నొందు.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి బ్రాహ్మణుడు ఇప్పటి ఆనందుడు; బ్రాహ్మణి ఇప్పటి ఉత్పలవర్ణ; సారంభము నేనే.

# 89 కుహక జాతకము

బుద్ధుడు జేతవనమున విహరించుచు, ఒకానొక పాషండుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

కుహక జాతక ఉద్దాలక జాతకమున (487) వచ్చును.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఒకానొక గ్రామము ప్రక్కన పటజటిలుడు నివసించుచుండెను. ఒక కుటుంబి ఆయనకై అరణ్యములో పర్ణశాల వేయించి, తనయింటి నుండి అతని కాహారము పంపుచుండెను. ఆకపటయతి శీలవంతుడని కుటుంబి విశ్వసించి, చోరభయముచే తన సువర్ణ నిష్కశతమును పర్ణశాలకు గొనిపోయి, అచట పాతిపెట్టి, దీనిని కనిపెట్టి యుండుమని యతితో జెప్పెను. "యతుల కీ విషయము చెప్పనక్కరలేదు. మాకు పరద్రవ్యముపై కాంక్ష యుండదు" అని యతడు పలికెను. భదంతా, చిత్తమని కుటుంబి వాని మాట నమ్మి వెడలిపోయెను. కొలది దినములు గడవనిచ్చి, ఆ దుష్టతాపసుడు వానితో జీవనము చేయవచ్చునని ఆనాణెములను వేరొకచోట పాతిపెట్టి, వచ్చి, పర్ణశాలలో నివసించుచుండెను. ఒకనాడు కుటుంబి యింట భోజనముచేసి ఆదుష్టతాపసుడు "ఆర్యా, చాలరోజులనుండి నీ పోషణలోనున్నాను. ఒకచోటనే బహుకాల ముండుట సంసర్గ మగును. లోకసంసర్గము యతులకు నిషిద్ధము. కావున నే వెడలిపోవుదును" అని పలికి, ఆకుటుంబి మాటిమాటికిని బ్రతిమాలినను నిలువ నిచ్చగింపలేదు.

"భదంతా, అట్లయిన దయచేయుడు" అని కుటుంబి అతనిని ఊరి వెలుపలకు సాగనంపెను. తాపసుడు కొంత దూరము పోయి కుటుంబిని వంచింపదలచి, తన జటలలో గడ్డిపరక గూర్చి మరలి వచ్చెను. "భదంతా, మరలివచ్చినా రేల?" అని కుటుంబి యడిగెను. "ఆర్యా, మీ యింటి కప్పులోని గడ్డిపరక నాజడలో చిక్కుకొన్నది. ఈయని దానిని మేము కొనిపోవరాదు. కావున దానిని తెచ్చినాను.

"భదంతా, దానిని పారవేయుము" అని కుటుంబి పలికి, తృణము కూడ పరులవస్తువును గ్రహింపడు. ఆహా ఎంత
ఈ యార్యుడు" అని భావించి, సంతోషించి, నమస్కరించి జటిలుని వీడుకొల్పెను.

ఆసమయమున బోధిసత్త్వుడు వ్యాపారార్థము తిరుగుచు, రాత్రి అక్కడ విడిసెను. తాపసుని మాటలు విని ఆయన "అద్దా! ఈదుష్ట తాపసు డితనిని మోసగించి యుండును" అనుకొని, కుటుంబితో "మిత్రమా, మీరు తాపసునికడ ఏమైన దాచిపెట్టినారా?" అని యడిగెను.

"ఆ, సువర్ణనిష్కశతము దాచిపెట్టినాను."

"అట్లయిన, భద్రముగా నున్నదేమో పోయి చూడుడు."
అంతట కుటుంబి పర్ణశాలకు బోయి చూడగా సువర్ణము కానరాలేదు. అతడు శీఘ్రముగా మరలివచ్చి ధనము కనబడలేదని చెప్పెను. "నీధన మన్యులు హరింపలేదు. ఆ కూటతాపసుడే హరించినాడు. రమ్ము, వానిని వెంబడించి పట్టుకొందము" అని బోధిసత్త్వుడు కుటుంభి వెంట జని, తాపసుని పట్టుకొని కాలుసేతుల మర్దించి, బంగారము తెప్పించెను. సువర్ణమును జూచి ఆయన "నిష్కశతమును హరించు నీవు తృణమాత్రమైనను ధర్మమునుగూర్చి తలంప లేదు" అని పలికి, నిందాపూర్వకముగా ఈ గాథ చెప్పినాడు.

ఓయి ప్రియభాషి, నీవాక్కు తీయ నగును
పూర్ణముగ, నీవు తృణమునే పోల్చి చూతు
వేరికొనవు సువర్ణమ్ము లెన్ని యున్న!

బోధిసత్త్వుడ డీ ప్రకారముగా వానిని గర్హించి, "కూట జటిలా, మరల నెన్నడు నిట్లు చేయకుము" అని యుపదేశించి, యథా కర్మం గతోః.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి, కథలు సరిపోల్చి జాతకసారాంశము వెలువరించెను. నాటి కుటిల తపస్వి నేటి పాషండ భిక్షువు; పండితపురుషుడు నేనే.

# 90 అకతజ్ఞ జాతకము

**బుద్ధుడు జేతవనమున విహరించుచు, అనాథపిండికుని విషయమై చెప్పినది.**

## వర్తమాన కథ

సరిహద్దు దేశమున నివసించు ఒకానొక శ్రేష్ఠి ఆయన మిత్రుడు. శ్రేష్ఠి ఆయనను ఎప్పుడు చూడలేదు. సరిహద్దుప్రదేశమున పండిన పంట 500 బండ్ల కెక్కించి ఆ శ్రేష్ఠి తన మనుష్యులతో "పొండు, దీనిని శ్రావస్తికి కొనిపోయి మామిత్రుడైన మహాశ్రేష్ఠి అనాథపిండికుని సన్నిధిలో విక్రయించి, దీనికిబదులు సరకులు కొనిరండు" అని చెప్పెను.

వారు మంచి దని శ్రావస్తికి పోయి మహాశ్రేష్ఠిని కలుసుకొని విషయము విన్నవించిరి.

మహాశ్రేష్ఠి స్వాగతము పలికి వారికి ఉండుటకు చోటు, ఖర్చులు ఇప్పించి, మిత్రుని కుశలవార్త అడిగి సరకులు అమ్మించి దానికి తగిన సామాను లిప్పించెను. వారు తమ ప్రాంతమునకు మరలిపోయి, విషయ మంతయు తమ శ్రేష్ఠికి తెలిపిరి.

అనంతరము అనాథపిండిక శ్రేష్ఠి కూడ అదేవిధముగా 500 బండ్ల సరుకు సరిహద్దు ప్రదేశమునకు పంపెను. ఆయన పరిజనులు అచటికి పోయి, ఆ శ్రేష్ఠిని కలిసికొనిరి. ఆయన "ఎచ్చటనుండి వచ్చినారు?" అనెను. "శ్రావస్తినుండి; మీ మిత్రులు అనాథపిండికశ్రేష్ఠిగారి వద్ద నుండి" అని వారు చెప్పిరి.

"ఎవరి పేరో అనాథపిండికుడు కావచ్చును." అని ఆ శ్రేష్ఠి నవ్వెను. మీరు పొండు, అని వెడలిపోయెను; వారికి నివాసస్థానము చూపలేదు. ఖర్చు లీయలేదు. వారు తమంతటనే సరుకులు విక్రయించి వానికి బదులు వచ్చిన సరకులను బండ్లలో నింపి శ్రావస్తికి తిరిగి పోయి ఈ వృత్తాంత మంతయు అనాథపిండికునకు తెలిపిరి.

కొన్నాళ్ళకు ఆసరిహద్దు శ్రేష్ఠి ఒకపర్యాయము వెనుకటివలెనే 500 బండ్లలో సామాను నింపి శ్రావస్తికి పంపి మహాశ్రేష్ఠిని కలిసికొన వలసిన దని తన వారితో చెప్పెను. వారిని చూచి అనాథపిండికుని పరి

జనులు "మీకు నివాస భోజనాదికము లన్నియు మేము కను గొందుము" అని చెప్పి నగరము వెలుపల ఏదో ఒకచోట బండ్లు దింపించి "మీరు ఇచ్చటనే నిలువుడు. మీకు యగు భోజనము మొదలగునవియు, ఖర్చులును ఇక్కడికే వచ్చును" అని చెప్పి పోయిరి. అర్థరాత్రమున పరిజను లందరును గుమికూడి 500 బండ్లను కొల్లగొట్టి, వారి వస్త్రములను పక్కచుట్టలను చింపి, ఎద్దులను పార ద్రోలి, బండిచక్రములను ఊడదీసి, నేలపై బడవైచి, వానిని కూడ గొనిపోయిరి. సరిహద్దువాసులు భయపడి కట్టుబట్టలతో తమ ప్రాంత మునకు శీఘ్రముగా పలాయనము చేసిరి. శ్రేష్ఠిపరిజనులు మహాశ్రేష్ఠితో ఈవిషయము చెప్పిరి. ఇది చెప్పదగిన దని తలపోసి ఆయన బుద్ధుని సన్నిధికి జని తొలినుండి తుదవరకును వృత్తాంతము విన్నవించెను.

బుద్ధుడు "గృహపతీ, కేవలము ఇప్పుడే కాదు. పూర్వము కూడ సరిహద్దు నివాసి ఇట్టులే చేసెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వ డానగరములో మహావిభవ సంపన్ను డైన శ్రేష్ఠి యయ్యెను. సరిహద్దు గ్రామనివాసియగు వర్తకు డొక డాయన సహాయుడు. ఆయన యితని నెన్నడు చూడలేదు. అంతయును పైన జెప్పినట్లే జరిగెను. తనవారు చేసిన దంతయు విని బోధిసత్త్వుడు "చూపిన దయకు బదులు కృతఘ్నత" అని పలికి, సమావిష్టుల కుప దేశపూర్వముగా నీగాథ పలికెను:

ఎవడు పూర్వోపకారమ్ము లెల్ల మరచు,
దొరక రతనికి నుపకారపరులు మరల.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు ధర్మము బోధించి, జీవితము దాన ధర్మాది పుణ్య కార్యములతో గడపి, కర్మోచిత పదవిని పొందెను.

బుద్ధుడు ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున సరి హద్దు నివాసి ఈకాలపు సరిహద్దు నివాసి; వారాణసీ శ్రేష్ఠి నేనే.

# 91 మిత్త జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుచు, ఆలోచింపకుండ పదార్థముల నుపయోగించుటను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు చీవరాదులను అనాలోచితముగా ఉపయోగించుచుండిరి. ఈసంగతి తెలిసి భగవాన్ "భిక్షువులారా, నాలుగుప్రత్యయములను అనాలోచితముగా నుపయోగింపరాదు. యోచన లేకుండ ఏ దయిన నుపయోగించుట విషము వాడుట వంటిది. పూర్వము కొందరు జనులు తెలియక విషము తిని చాల బాధపడినారు" అని, పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడొకానొక సంపన్న కుటుంబమున జన్మించి పెరిగి పెద్దవాడయి అక్షద్యూతకారు డయ్యెను. ఒకానొక ధూర్తుడు బోధిసత్త్వునితో పాచిక లాడుచు తాను గెలుచు చున్నంతసేపు కేళి మండలము కట్టివేయక, ఓడిపోయినపుడు పాచిక నోట దాచి, పోయినట్లు నటించుచు, పాచిక పోయినది అని ఆట మాని వెడలి పోయెడివాడు. బోధిసత్త్వుడు గ్రహించి, దీని సంగతి చూచెద నని యింటిలో కొన్ని పాచికలకు హాలాహలము పూసి, బాగుగా నెండబెట్టి, అవి కొనిపోయి ధూర్తునితో "మిత్రమా, రమ్ము, పాచిక లాడుదము" అనెను. "మంచిది మిత్రమా," అని వారు కేళిమండలము సిద్ధము చేసి, ఆయనతో ఆడుచు ఓడిపోయి, పాచిక నోట బెట్టుకొనెను. బోధిసత్త్వుడు అది చూచి "మ్రింగుము. తర్వాతనే నిజము తెలిసికొందువు గాని" అని యీగాథ పలికెను:

విసము పూసిన పాచిక వీడు మ్రింగె
రూ పెరుంగక: యిప్పు డోపాపి, ధూర్త,
మ్రింగరా దాని! బాగుగా మ్రింగు మోరి!
కఠినఫలితము న్నావల గాంచెదు గాక!

బోధిసత్త్వుడు మాటాడుచుండగనే విషవేగముచే వాడు కన్నులు త్రిప్పుచు వంగిపోయి మూర్ఛిల్లెను. "ఇక వీనికి ప్రాణదానము చేయవలె" నని బోధిసత్త్వుడు ఔషధ పరిభావితమైన వమన యోగముచే వానిని తెప్పరిల్లజేసి, నెయ్యి, తేనె, చక్కెర మొదలగునవి నాకించి, ఆరోగ్యము సమకూర్చి, ఎన్నడు మోసము చేయకు మని యుపదేశించి, దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు యథా కర్మం గతోం.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి పండిత ధూర్తుడు నేనే.

## 92 మహాసార జాతకము

బుద్ధుడు జేతవనమున విహారము చేయుచు ఆయుష్మాన్ ఆనందుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు కోసల నరేశుని భార్యలు ఇట్లు తలపోసిరి. "లోకములో బుద్ధుడు అవతరించుట దుర్ఘటము. అట్టి మానవుడు జన్మించుటకూడ సంభావ్యము. సంపూర్ణేంద్రియములు కలవారై పుట్టుట దుర్ఘటము. మాకు ఇట్టి దుర్లభమైన అవకాశము లభించినను, మాఇచ్ఛానుసారముగా విహారమునకు పోయి ధర్మమువినుట, పూజచేయుట, దానమిచ్చుట మొదలగునవి సంభవింపలేదు. పెట్టెలో పెట్టిన వస్తువులవలె ఉన్నాము. కావున రాజుగారితో చెప్పి మాకు ధర్మోపదేశము చేయదగిన స్థవిరుని పిలిపించి ఆయనకడ ధర్మమును విందుము. గ్రహణయోగ్యములగు వానిని స్వీకరించి దానాది పుణ్యకార్యములు చేయుదుము. ఈవిధముగా మా సదవకాశము సఫలమగును."

వారందరును రాజుకడకుపోయి తమ ఆలోచన విశదపరచిరి. రాజు మంచిదని అంగీకరించెను.

ఒకనాడు ఉద్యానములో క్రీడింప తలపుకలిగి రాజు తోటమాలిని పిలిచి, ఉద్యానము బాగుచేయుమని చెప్పెను. తోటమాలి ఉద్యానము బాగుచేయుచుండ ఒకానొక వృక్షముక్రింద బుద్ధుడు కూర్చుండి యుండుట కానవచ్చి మాలి రాజుకడకు పోయి "దేవా, ఉద్యానవనము పరిశుభ్రమైనది. వృక్షము క్రింద భగవాన్ ఉపవేశించి యున్నారు" అని విన్నవించెను.

"సౌమ్యా, మంచిది. బుద్ధుని సన్నిధికి పోయి ధర్మోపదేశములను విందము" అని రాజు సుసజ్జితమైన రథమెక్కి, ఉద్యానముచేరి బుద్ధుని సన్నిధికి జనెను.

ఆసమయమున ఛత్రపాణి యను అనాగామి-ఉపాసకుడు బుద్ధునికడ కూరుచుండి ధర్మము వినుచుండెను. అదిచూచి రాజు కొంచెముసేపు సందిగ్ధచిత్తుడై నిలిచియుండి, "ఈతడు చెడ్డవాడు కానోపడు; అగుచో బుద్ధుని కడ కూరుచుండి ధర్మములు వినడు. కావున ఇతడు యోగ్యుడై యుండును" అనుకొని బుద్ధుని కడకు జని ప్రణామము చేసి యొక ప్రక్క కూరుచుండెను. ఉపాసకుడు బుద్ధునకు అగౌరవము జరుగునేమో యను భయముచే రాజు వచ్చినంతనే లేచి ప్రణాదులేమియును చేయలేదు. ఇందువలన రాజు ఉపాసకుని యెడ అసంతుష్టచిత్తుడయ్యెను.

బుద్ధుడు గ్రహించి ఉపాసకుని ప్రశంసించుచు "మహారాజా, ఈ ఉపాసకుడు బహుశ్రుతుడు, ధర్మవేత్త, భోగములమీద వాంఛలేనివాడు" అని చెప్పెను.

"ఇతడు బుద్ధుని ప్రశంసకు తగిన వాడు కాడు" అనుకుని రాజు "ఉపాసకా, నీకే వస్తువు కావలసినను చెప్పుము అనెను." ఉపాసకుడు మంచిదనెను. రాజు బుద్ధుని కడ ధర్మోపదేశము విని ప్రదక్షిణము చేసి వెడలిపోయెను.

ఒకనాడు ప్రాసాదము మీద తెరచి యున్న ద్వారము కడ రాజు నిలిచి యుండెను. ప్రాతఃకాల భోజనము చేసి ఆయుపాసకుడు ఛత్రము చేత బట్టి జేతవనమునకు బోవుచుండెను. రాజు చూచి ఆయనను

రప్పించి "ఉపాసకా, నీవు బహుశ్రుతుడవు. మా స్త్రీలు మీకడ ధర్మములు విని గ్రహింపగోరుచున్నారు. మీకు విశ్రాంతి యున్నచో నీవు వారికి ధర్మ శ్రవణము చేయింపుము" అనెను. "దేవా, రాజాంతః పురమున గృహస్థులు ధర్మోపదేశము చేయుట కాని, చరించుటకాని ఉచితము కాదు. ఆర్యులకు (భిక్షువులకు) మాత్రము తగును" అని ఉపాసకుడు పలికెను.

ఇతడు సత్యమే చెప్పినాడు అనుకొని రాజు ఆయనను పంపి స్త్రీలను పిలువ నంపి "భద్రలారా, మీకు ధర్మోపదేశము చేయుటకై నేర్పుటకై బుద్ధుని కడకు పోయి భిక్షువును పంపుమని వేడుదును. ఎనుబదిమంది మహాస్థవిరులలో నుండి ఒకరిని పంపుమని కోరుదువా?" అనెను. వారందరు ఆలోచించి ధర్మ భాండాగారికుడగు ఆనంద స్థవిరుని నిర్ణయించుకొనిరి.

రాజు బుద్ధుని కడకు పోయి ప్రణామముచేసి యొక ప్రక్క కూరుచుండి "భన్తే, మాఇంటి ఆడువారలు ఆనందస్థవిరునికడ ధర్మము విని అభ్యసింప గోరుచున్నారు. సమ్మతమగు నేని స్థవిరుడు మాఇంట ఉపదేశము చేసి విద్య నేర్పునుగాక" అని విన్నవించెను.

బుద్ధుడు సమ్మతించి ఆనంద స్థవిరుని కాదేశమిచ్చెను.

నాటి నుండి రాజస్త్రీలు స్థవిరునికడ ధర్మములు విని అభ్యసించుచుండిరి. ఒకనాడు రాజుగారి చూడామణి కానబడలేదు. రాజు మణి పోయినట్లు విని అమాత్యులను పిలిపించి, అంతః పురములోని జనుల నందరను పరీక్షించి చూడామణిని వెలువరింప వలెను. అని ఆనతిచ్చెను. స్త్రీలతో ఆరంభించి వెదికి మణి దొరక నందున జనులను శ్రమపెట్ట జొచ్చిరి. ఆనాడు ఆనంద స్థవిరుడు రాజ భవనమునకు బోయెను. తొలినాడు స్థవిరుని జూచి స్త్రీలు హృష్ట తృష్ట చిత్తములతో ధర్మోపదేశమునకు పోయినట్లు పోవక విచారముతో నుండిరి.

"నేడు మీరు ఆ దేదో విధముగా నున్నారేల?" అని స్థవిరు డడుగగా వారు "భన్తే, రాజుగారి చూడమణి పోయినది. అమాత్యులు రాజ భవనములోని స్త్రీలు మొదలుకొని లోపలనున్నవారి నెల్లరను శ్రమపెట్టుచున్నారు. ఏమగునో మాకు తెలియకున్నది. కావున

విచారముతో నున్నాము'' అని చెప్పిరి.

స్థవిరుడు చింతింప వలదని వారి నోదార్చి రాజు కడకు జని పరచిన ఆసనముపై కూరుచుండి "మహారాజా, మీ మణి పోయినదా?" అనెను.

"భన్తే, అవును."

"మహారాజా, దానిని పట్టింప గలిగినారా?"

"భన్తే, లోపలివారల నెల్లరను పరిశీలించి శ్రమ ఇచ్చినను మణి లభింపలేదు." "మహారాజా, జనులకు క్లేశము కలిగింపకుండగనే మరుగు వడిన మణిని వెలువరించుట కుపాయ మున్నది."

"భన్తే, ఏ మా యుపాయము?"

"మహారాజా, పిండదానము?"

"భన్తే, ఎట్టి పిండదానము?"

"మహారాజా, ఎవ రెవరిపై అనుమాన మున్నదో వారిని పిల్చి కూర్చి ఒక్కొక్కసారి చేతులో మట్టిముద్దకాని, ఎండుగడ్డిఉండగాని ఇచ్చి ప్రాతఃకాలముననే ఈ ఉండలను తెచ్చి ఫలాని చోట ఉంచవలెనని ఆజ్ఞాపింపుడు. చూడామణిని హరించినవాడు దానిని ఆయుండలో నుంచి నిర్దిష్టస్థానమునకు గొని పోగలడు. మొదటినాడే తేగలిగినచో మంచిదే. అట్లు కానియెడల రెండవనాడు, మూడవనాడు—ఈవిధముగా కొన్నాళ్ళు ఈపని చేయింపవలయును. ఇట్లు చేసినచో జనులకు కష్టముండదు. మణియును లభించును." అని చెప్పి స్థవిరుడు వెడలి పోయెను.

రాజు స్థవిరుని ఉపదేశానుసారము మూడురోజు లాపని చేయించెను. మణి లభింపలేదు. స్థవిరుడు మూడవనాడు వచ్చి "మహారాజా, మణిని ఎవరైన పడవైచినారా?" యనెను.

"భన్తే, లేదు".

"అట్లగుచో మహారాజా, ప్రాసాదము మీది పై అంతస్తులో మారుమూల పూర్ణకుంభమునుంచి వానిపై బనాత్ గుడ్డలు మూతలు వేసి రాజభవనములోని స్త్రీ పురుషు లందరితో, ఆవస్త్రము లన్నియు ఒక్కొక్కటిగా మూతక్రిందనుంచి చేతులు కడుగుకొని రావలెను, అని ఆజ్ఞాపింపుడు." స్థవిరు డుపాయము చెప్పి వెడలిపోయెను. రాజు

ఆప్రకారమే చేయించెను.

మణి నపహరించినవాడు తనలో "ధర్మభాండాగారికుడు ఈఅభియోగము చేపట్టి, మణిని వెలువరించువరకును ఊరకుండుట అసంభావ్యము, కావున ఇక మణిని విడిచి వేయవలెను." అనుకొని, మణిని గూఢము చేసి పట్టుకొని పోయి మూత అడుగునుండి భాండములో బడవేసెను. అందరును ఈవలకు వచ్చినపిదప నీరు పారజల్లింపగా మణి లభించెను.

స్థవిరునివలన ఎవరికిని క్లేశము కలుగకుండ మణి దొరకిన దని రాజు సంతుష్టచిత్తు డయ్యెను. సౌధము లోనివారును స్థవిరుని మూలమున మహావ్యధనుండి తప్పించుకొంటి మని ప్రసన్నచిత్తు లయిరి. స్థవిరుని శక్తిచే రాజునకు మణి మరల లభించిన దని నగర మంతటను భిక్షుసంఘమునను వ్యాపించెను. భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై ఆయనను ప్రశంసించువారై "ఆయుష్మంతులారా, ఆనందస్థవిరుడు తన బహుశ్రుతత్వముచే, పాండిత్యముచే, ఉపాయ కుశలతచే లోకులకు శ్రమ కలుగకుండ మరుగుపడియున్న మణిని వెలువరించినాడు" అని చెప్పుచుండిరి.

బుద్ధుడు వచ్చి "ఏల సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పగా, బుద్ధుడు "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ ఉపాయమున తిరశ్చీన జంతువుల చేతులలో బడిన వస్తువును గూడ వెలువరించినాడు." అని పూర్వజన్మ కథ చెప్పినాడు.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు విద్యాపారంగతుడై అమాత్యు డాయెను. ఒకనాడు రాజు భూరిపరివారముతో ఉద్యానమునకు బోయి వనాంతరములలో విహరించి, జలక్రీడ చేయు కుతూహలము కలిగి, మంగళ పుష్కరిణిలో దిగి, రాణివాసమునకు వార్తపంపెను. స్త్రీలు తమ శిరోభూషణములను గ్రీవాలంకారములు మొదలగువానిని దీసి, ఉత్తరాసంగములను ఊడదీసి, పెట్టెలలో పెట్టి దాసీజనమున కప్పగించి పుష్కరిణిలో

దిగిరి. అప్పుడొక ఉద్యానమర్కటి శాఖాంతరమున గూరుచుండి దేవి ఆభరణములను ఉత్తరీయమును పెట్టెపై బెట్టుట చూచి, ఆమె ముత్యాలసరమును తాను ధరింపదలచి, దాసి అజాగ్రత్తకై యెదురు చూచుచుండెను. దాసి మొదట జాగరూకతతో నుండి, క్రమముగా కునికిపాట్లు పడ నారంభించెను. మర్కటిచూచి వాయువేగమున చెట్టు దిగివచ్చి, ముక్తాహారమును మెడలో వేసికొని, తిరిగి వాయు వేగమున చెట్టెక్కెను. తక్కిన కొమ్మలపై నున్న కోతులు చూచు నను భయముచే మర్కటి ముత్యాలదండను చెట్టుతొర్రలో దాచెను. ఏమియు ఎరుగనిదానివలె నటించుచు దండను కనిపెట్టియుండెను. మెలకువ వచ్చి దాసి చూచునప్పటికి ముత్తెముల దండ కనబడలేదు. దాసి భయపడి ఉపాయము కానక "దేవీ, ముక్తాహారము నెవ్వడో యెత్తుకొని పరుగెత్తి పోయినాడు" అని బిగ్గరగా అరచెను.

ఆ రక్షకు లచ్చటికి జేరి దాసి మాటలు రాజుకు విన్నవించిరి. రాజభటులు చోరుని కొరకు ఉద్యానము గాలించిరి. పల్లెటూరి మందమతి యొకడు ఆశబ్దము విని భయమున పరుగెత్తెను. దొంగ కావచ్చు నని వానిని పట్టి బంధించి కొట్టి, "ఓరీ ధూర్త చోరా, ముత్యాల దండ నేల అపహరించితివి?" అని యడిగి ప్రహరించిరి.

నేను తీయలేదన్నచో నా ప్రాణములు తీయుదురు. దెబ్బలతో ప్రాణములు పోవును. తీసినా ననుటయే మేలు" అని వాడు భావించి, "చిత్తము స్వామీ, తీసికొన్నాను" అని పలికెను. వానిని బంధించి భటులు రాజసన్నిధికి గొనిపోయిరి. "అమూల్యాభరణమును హరించితివా?" అని రాజడిగెను. "చిత్తము దేవా." "ఇప్పుడెక్కడ నున్నది?" "దేవా, బీదవాడను. నా జీవితములో మంచము కాని కుర్చీ కాని విలువగల వస్తువేది కాని యెరుగను. శ్రేష్ఠి నాచేత ఈపని చేయించినాడు. ఆయనకే యిచ్చినాను. అంతయు ఆయనకు దెలి యును."

రాజు శ్రేష్ఠిని బిలిపించి "వీనికడనుండి అమూల్యా హారమును దీసికొంటివా!" అనెను. "చిత్తము దేవా." "ఇప్పుడది యెక్కడ నున్నది?" "పురోహితున కిచ్చినాను." అంతట రాజు పురోహితుని బిలువ నంపి వెనుకటివలెనే ప్రశ్నించెను. ఆయన ఆలోచించి "తమ

ఆస్థాన గాయకున కిచ్చినాను." రా జతనిని బిలిపించి "పురోహితుని కడనుండి హారము తీసికొంటివా?" అని యడిగెను. "చిత్తము దేవా." "ఎక్కడ నున్నది?" "మోహావశమున గణిక కిచ్చినాను."

రాజు గణికను బిలిపించి యడుగగా గణిక "నేను తీసికొన లే" దన్నది. ఈ యయిదుగురను ప్రశ్నించునప్పటికి సాయంకాల మయ్యెను. "ఇప్పుడు ప్రొద్దు క్రుంకినది. రే పీసంగతి విచారింతుము" అని రాజు అయిదుగురను అమాత్యుల కప్పగించి రాజనగరులోనికి బోయెను.

అప్పుడు బోధిసత్త్వు డాలోచనలో పడెను. ఈ యాభరణ ముద్యానములో పోయినది. గ్రామీణు డాసమయమున వెలుపల నున్నాడు. ద్వారములను బలవంతులు రక్షించుచున్నారు. కావున లోపలివారు వెలుపలికి బోలేదు. లోపలివారు కాని, వెలుపలివారు కాని దండ నెట్లు హరింపగలరు? ఈ దౌర్భాగ్యుని మూర్ఖతవలన శ్రేష్ఠి కిచ్చితినని చెప్పియుండును - ప్రహారణములు తప్పించు కొనుటకు శ్రేష్ఠి పురోహితుని కిచ్చితినన్నాడు. తా నొక్కడే కాని పురోహితునిగూడ కలిపినచో మే లని చెప్పియుండును. పురోహితుడు గాయకుని కిచ్చితి ననుటలో చెరసాలలో గాయకునితో సుఖముగా కాలము గడపవచ్చునని చెప్పియుండును. గాయకుడు గణిక కిచ్చితి ననుటలో నిర్విచారముగా నామెతో కాలము గడపవచ్చునని, చూడగా వీరిలో నొక్కరును దండ హరింపలేదు. ఉద్యానమున కోతు లనేకము కలవు. అం దాదు కోతి హారము తీసియుండ నోపును.

ఇట్లు తలపోసి బోధిసత్త్వుడు రాజును సమీపించి, "మహారాజా, చోరులను నా కప్పగింపుడు. నే నాకృత్యమును విచారింతును" అనెను. "మంచిది, పండితోత్తమా. శోధింపుడు" అని రాజు సమ్మతించెను.

బోధిసత్త్వుడు తనదాసులను బిలిచి, "ఆయయిదుగురను ఒకేచోట నుంచి భద్రముగా కనిపెట్టియుండి వారు రహస్యముగా చెప్పుకొను మాటలు నాకు దెలుపుడు" అని వెడలిపోయెను. వా రట్లే చేసిరి. అందరు నొకచోట గూరుచున్న తరువాత శ్రేష్ఠి గ్రామీణునితో "ఓరి దుష్టసంసారీ, ఇంతకుముందు మన మెన్నడైన కలిసితిమా?"

అనెను. "మహాశ్రేష్ఠి, నేను కొయ్యమంచముకూడ ఎరుగను. కాని మీతోడ్పాటుతో తప్పించుకొనగలనని అట్లు పలికినాను. స్వామీ, కోపింపవలదు" అని వాడు పలికెను. పురోహితుడు శ్రేష్ఠితో "వీడు నీకీయనిదానిని నాకిచ్చినట్లు చెప్పితి వేమి?" అనెను. "ఉద్యోగుల మిరువురము కలిసినచో త్వరలో కార్యము నెరవేరునని చెప్పితిని" అని శ్రేష్ఠి పలికెను. "బ్రాహ్మణోత్తమా, హారము నా కెప్పుడిచ్చితిరి?" అని గాయకుడనెను. "మనము కలసియున్న పక్షమున కాలము సుఖముగా గడచునని అట్లు చెప్పితిని" అని బ్రాహ్మణుడనెను. పర్ణదాసి (గణిక) గంధర్వునితో "ఎన్నడైన నేను నీకడకుగాని, నీవు నా కడకుగాని వచ్చుట సంభవించెనా?" అని గాయకునడిగెను. "సోదరీ! ఏల కోపించెదవు? మన మయిదుగురము కొంతతడవొకచోట నుండినచో నిర్విచారముగా కాలము గడపవచ్చునని అట్లు చెప్పితిని" అని గాయకుడనెను.

దాసులు వచ్చి బోధిసత్త్వునకు సంగతులు విన్నవించిరి. వారు చోరులు కారని స్పష్టమయ్యెను. మర్కటి హారమును హరించి యుండునని యూహించి "మర్కటి హారమును క్రిందికి విడుచునట్లు ఉపాయ మాలోచింపవలెను" అని బోధిసత్త్వుడు సేవకులను బిలిచి "పూసలదండలు సిద్ధము చేయించి, ఉద్యానములోని సర్వ మర్కటములను బట్టుకొని ఆ దండలు మెడలలో వేసి విడిచిపెట్టుడు" అని చెప్పెను. వా రాప్రకారమే చేసిరి.

ఆకోతులు సంతోషముతో ఉద్యానములో విహరించుచుండగా, ముక్తాహారమును దాచిన మర్కటి "పూసల దండలతోనేమి? మంచి ముత్తెముల దండనే ధరింపవలె"నని అహంకారమువలన దండను బయటికి దీసెను. భటులు ఉపాయముగా ఆదండను మర్కటి క్రిందికి జార విడుచునట్లు చేసి, దానిని గొనిపోయి బోధిసత్త్వున కిచ్చిరి. ఆయన దానిని రాజుకు జూపి, "దేవా, ఇదిగో ముక్తాహారము. ఆ యయిదుగురును నిర్దోషులు. ఉద్యానములోని మర్కటి దీనిని తీసినది" అని చెప్పెను. "పండితోత్తమా, ఎట్లు మీరు గ్రహించితిరి? ఎట్లు తెప్పించితిరి?" అని రా జడిగెను. ఆయన సమస్తము వివరించెను. రాజుసంతుష్టుడై "మీరు పదవికి తగినవారు" అని ప్రశంసించి

ఈగాథ పలికెను:

రణమువేళను శూరు, మంత్రమ్ము వేళ
గోపనసమర్థు, విందులు కుడుచువేళ
ఇష్టబంధుల, చిక్కు సాధించువేళ
బుద్ధిమంతుని గోరుట పొసగుచుండు.

ఇట్లు రాజు బోధిసత్త్వుని ప్రశంసించి, మహామేఘము ఘనవర్షము కురియునట్లు ఆయనను సప్తరత్నములతో పూజించి, ఆయన యుపదేశము ననుసరించి, దానాది పుణ్యకార్యములు చేయుచు యథాకర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి స్థవిరుని ప్రశంసించి జాతక సారాంశము వెలువరించెను. ఆ కాలమున రాజు ఇప్పటి ఆనందుడు; బుద్ధిమంతుడైన అమాత్యుడు నేనే.

## 93 విస్సాస భోజన జాతకము

శాస్త, జేతవనమున విహరించుచు జ్ఞాతి భోజనమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున కొందరు భిక్షువులు తరచుగా "ఇది మాతల్లి యిచ్చినది; ఇది మాతండ్రి యిచ్చినది; ఇది మాసోదరు డిచ్చినది; ఇది పినతల్లి; ఇది పినతండ్రి, ఇది అత్త ఇచ్చినది, ఇది మామ యిచ్చినది" అనుచు, జ్ఞాతులవిషయమై పలుకు చుండిరి, శాస్త భిక్షువుల కుపదేశింప దలచి, వారిని సమావేశ పరచి, "భిక్షువులారా, ఆలోచింపక జ్ఞాతులవిషయమై వినియోగము చేయు భిక్షువులు మరణించినపిదప యక్షయోని గాని, ప్రేతయోనిగాని పొందక తప్పదు. ఆలోచింపక చేయుపని విషపానమువంటిది. నమ్మదగినవా రిచ్చినను

నమ్మదగనివా ర్చినను, విషము చంపితీరును. పూర్వకాలమునగూడ విశ్వాసపాత్రు లిచ్చిన విషముతిని కొందరు మరణించిరి" అని, వారు వేడిన పిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు మహావిభవ సంపన్నుడైన శ్రేష్ఠి యయ్యెను. ఆయనకు గోపాలకుడు కలడు. పంటకాగున వాడు గోవులను తీసికొని యడవి లోనికి బోయి, యచ్చట గోకుల మేర్పాటుచేసి పశువులను కాపాడుచు శ్రేష్ఠికి అప్పుడప్పుడు పాలు నెయ్యి తెచ్చి యిచ్చుచుండెను. ఆ గోకు లమునకు సమీపమున సింహము నివసించుచుండెను. సింహభయము వలన గోవులు తక్కువ పాలిచ్చుచుండెను. ఒకసారి గోపాలకుడు నెయ్యి తెచ్చి యిచ్చినపుడు శ్రేష్ఠి "ఏమోయి గోపాలా, నెయ్యి యింతతక్కువ తెచ్చినావేమి?" అనెను. వాడు కారణము చెప్పెను. "సింహమునకు దేని మీదనైన ప్రీతి యేర్పడెనా?" "స్వామీ, సింహమునకు ఒకానొక లేడిమీద ప్రీతి." "ఆలేడిని పట్టుకొనగలవా?" "చిత్తము స్వామీ." "మంచిది. దానిని పట్టుకొని శరీరముమీది రోమములపై విషము, చక్కెర తరచుగా పూసి, ఆరనిచ్చి, ఒకటి రెండు రోజులుంచి, విడిచిపెట్టుము. దానిమీది ప్రీతిచే సింహము దాని యొడలు నాకి, ప్రాణములు విడుచును. పిమ్మట సింహముగోళ్ళు, దంత ములు, క్రొవ్వు, చర్మము తీసికొనిరమ్ము" అని శ్రేష్ఠి గోపాలకునకు హాలాహల మిచ్చి పంపెను. వాడు వలపన్ని, ఉపాయమున లేడిని పట్టుకొని, బోధిసత్త్వుడు చెప్పినట్లు చేసెను.

సింహము లేడిని చూచి మహాప్రీతిచే దానియొడలు నాకి ప్రాణ ములు విడిచెను. గోపాలకుడు సింహ చర్మాదులు తీసికొని బోధి సత్త్వుని సన్నిధికి బోయెను. ఆయన "అన్యప్రీతి మానవలెను. బల సంపన్నమైన మృగరాజు అతిప్రీతిచే సంసర్గము చెంది, లేడియొడలు నాకి, విషవశమున ప్రాణములు విడిచెను" అని, అచ్చట జేరిన వారికి ధర్మము బోధించుగాథ పలికెను:

విశ్వసింపగ రాని విషయమ్మునందు
విశ్వసింపగ దగు విషయమ్మునందు
విశ్వాస ముంచుట వీరిడితనము
విశ్వాసవశమున భీతి జనించు
మృగమాతవలన ఆమృగ రాజునకును
జరిగిన చందాన జరుగుట నిజము!

ఇట్లు బోధిసత్త్వుడు సమావిష్టులకు ధర్మము నుపదేశించి, దానాది పుణ్యకార్యములు చేసి, తుదకు యథా కర్మం గతో.

శాస్త యీవిధముగా పరిషత్తుకు ధర్మోపదేశము చేసి, జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున మహాశ్రేష్ఠి నేనే.

## 94 లోమహంస జాతకము

శాస్త వైశాలీనగర సమీపమున పాటికారామమున విహారము చేయుచు సునక్షత్రుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు సునక్షత్రుడు అను భిక్షువు శాస్తకు ఉపస్థాపకుడై, పాత్రలు, చీవరములు పట్టుకొని ఆయన వెనువెంటనే తిరుగుచు, కోరక్షత్రియుని ధర్మము అంగీకరించి బుద్ధుని పాత్ర చీవరాదులను ఆయనకే సమర్పించి, కోరక్షత్రియునికడ నివసింప జొచ్చెను. ఆవల నతడు కాలకంజక—అసురయోనిలో నుద్భవించు సమయమున సునక్షత్ర గృహస్థు అయి, వైశాలికి మూడుప్రాకారములలోపల తిరుగుచు, ఏదో ఒకటని శాస్తను నిందించుచుండెడివాడు.—శ్రమణ గౌతమునికడ లోకోత్తరమైన విషయము లేదనియు విశేష ఆర్యజ్ఞానము లేదనియు వాని నింద. "శ్రమణగౌతముడు తర్కసిద్ధ మగు ధర్మోపదేశము చేయును. ఆలోచనసిద్ధము, ఆత్మానుభవసిద్ధము అగు ఉపదేశము చేయును. దుఃఖ

క్షయము జేయు నుద్దేశ్యముతో ధర్మోపదేశము జరుగును. ధర్మము ననుసరించువానిని దుఃఖముల-పూర్ణక్షయమువరకు కొనిపోవును".

ఆయుష్మాన్ సారిపుత్రుడు భిక్షార్థము పర్యటించు సమయమున ఆతడు ఆప్రకారముగా నిందించు చుండుట విని తిరిగి వచ్చిన తరువాత భగవానునకు విన్నవించెను. "సారిపుత్రా, కుపితుడైన మూర్ఖ సునక్షత్రుడు క్రోధవశమున ఇట్లు చేయుచున్నాడు. క్రోధమునకు లోబడి అతడు ధర్మానుసారముగా చరించు వానిని దుఃఖక్షయమువరకును కొనిపోవుచున్నాడు అనుటలో అతనికి తెలియకుండనే నాప్రశంస యున్నది. మూర్ఖుడు నాగుణములను గ్రహింపలేదు. సారిపుత్రా, నాకు పడభిజ్ఞలు లభించినవి. ఇదియును లోకోత్తర ధర్మము (దశబలము). నాలుగు వైశారద్యజ్ఞానములున్నవి. నాలుగువిధముల యోని పరిచ్ఛేదకజ్ఞాన మున్నది. ఇది కూడ లోకోత్తర ధర్మమే నన్ను ఎవరైనను శ్రమణగౌతముడు లోకోత్తర ధర్మములు పొందలేదని అన్నచో, అట్లు పలుకుట మానవిచో, అట్టి ఆలోచనను విడవనిచో ఆమతమును విడనాడనిచో ఆతడు నరకమున కూలద్రోయ బడును. నాయందునుగల లోకోత్తర ధర్మ మిట్టిది. సారిపుత్రా, సునక్షత్రుడు కోరక్షత్రియుని దుష్కర క్రియచే, మిథ్యా తపస్సుచే ఆకృష్టుడైనాడు. అట్టివాడుకూడ నావైపు మొగ్గక తప్పదు. ఇప్పటినుండి తొంబదియొకటవ కల్పము మొదట 'దీనియందు కొంచెమైన సార మున్నదా లేదా?' అని చూడవలెనను కోరికచే నేను పంద్రెండు మిథ్యాతపస్సులను పరిశీలించుచు చతురంగ యుక్తమైన బ్రహ్మచర్యవాసము చేసినాను. ఆసమయమున తపస్వుల యందు పరమ తపస్వినై, శుష్కజీవితమును గడుపు వారిలో పరమశుష్కజీవితమును గడపు వాడనై, జుగుప్సితులలో పరమ జుగుప్సితుడనై, ఏకాంతవాసులలో పరమ-ఏకాంతసేవినై ఉంటిని" అని బుద్ధుడు చెప్పగా, సారిపుత్ర స్థవిరుడు ప్రార్థించిన మీదట పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము 91 యుగములకు వెనుక బోధిసత్త్వుడు కపట పరివ్రాజనమును పరీక్షింతునని తలచి, ఆజీవికపరివ్రాజనము నవలంబించి,

దిగంబరుడై ధూళిధూసరితాంగుడై ఏకాకిగా విహరించుచు, మానవులు కానబడినచో మృగమువలె పరుగెత్తుచు, గోమయాదులు భక్షించుచు, అప్రమాద విహారారణ్యము అడవిలో పొదలో నివసించుచుండెను. చలిగాలి కొట్టినపుడు రాత్రివేళ నీవలకు వచ్చి బహిరంగప్రదేశమున దిరుగుచు, సూర్యోదయ మయినంతనే నతడు పొదలో ప్రవేశించును. రాత్రివేళ మంచులో తడియునట్లు పగటివేళ కొమ్మలనుండి రాలు నీటిబిందువులతో తడియుచుండును. దివారాత్రము లతడు చలిబాధ సహించుచుండెను. వేసవికాలము పగటివేళ ఎండలోను, రాత్రివేళ చల్లని గాలిలేనిచోటను కాలము గడపుచుండెను. అశ్రుతపూర్వమగు నీగాథ యొకనాడాయనకు గోచరించెను:

అడవుల వసించి, వానకు తడిసిపోయి,
ఎండ కెండి నగ్నమ్ముగా నుండి, భీతి
హోత్రునకు దూర మయ్యు నోహో యతండు
సత్య మన్వేషణమ్ము నే సలుపుచుండె.

ఇట్లు చతురంగ బ్రహ్మచర్య మనుష్ఠించిన బోధిసత్త్వునకు మరణకాలమున నిరయదర్శనము కాగా నతడు "ఈవ్రత నిర్వాహణము నిరర్థకము" అనిగ్రహించి, ఆక్షణముననే భ్రమను భేదించి, సత్యమును గ్రహించి, దేవలోకమునకు జనెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున ఆజీవకుడు నేనే.

# 95 మహాసుదస్సన జాతకము

శాస్త పరినిర్వాణశయ్యపై పండుకొని యుండ ఆనంద స్థవిరుడు "భన్తే, భగవాన్ ఈచిన్న నగరమున పరినిర్వాణము పొందకుండు గాక" అను వాక్కుల విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

తథాగతుడు జేతవనమున విహారము చేయుసమయమున సారిపుత్ర స్థవిరుడు కార్తిక పూర్ణిమనాడు నాలకగ్రామమున ఉత్పన్న మగుకోష్ఠమున నే పరినిర్వాణము పొందెను. మహామౌద్గల్యాయనుడుకూడ కార్తిక మాసమున అమావాస్యనాడు పరినిర్వాణము పొందెను. ఈవిధముగా ప్రధానశిష్యు లిరువురును పరినిర్వాణము పొందినపిదప, "నేనుగూడ కుసీనగరమున పరినిర్వాణము పొందుదును" అని తలచి భగవాన్ పర్యటనము చేయుచు, క్రమముగా కుసీనగరము చేరి, సాలవృక్షముల జంట క్రింద ఉత్తర దిక్కుగా పరచిన శయ్యపై మరల లేవకుండు సంకల్పముతో పండుకొనెను.

ఆయుష్మాన్ ఆనందుడు ఇట్లనెను: "భన్తే, భగవాన్ విషమ మయిన ఇట్టిచిన్ననగరమున అడవిలో సాలవృక్షములక్రింద నిర్వాణము పొందకుండు గాక! భగవాన్, చంపా రాజగృహ ప్రముఖ మహానగరములలో ఏదో ఒకదానియందు పరినిర్వాణము పొందు గాక!" అనెను.

భగవాన్ ఇట్లు పలికెను: ఆనందా, దీనిని అడవిలో నున్న ఇట్టి చిన్న శాఖానగర మనవలదు. నేను పూర్వము సుదర్శన చక్రవర్తిగా నున్నప్పుడు ఈనగరముననే యుంటిని. అప్పు డిది ద్వాదశయోజన విస్తీర్ణము; రత్నఖచిత మైననాలుగు ద్వారముల నడుమ నున్న మహా నగరము".

స్థవిరుడు ప్రార్థించినపిదప పూర్వజన్మకథ చెప్పి మహాసుదర్శన సూక్తము పలికెను.

## అతీత కథ

ఆసమయమున సుదర్శనుడను రాజు సుధర్మప్రాసాదము దిగి సమీపమున సప్తరత్నమయ మగు శయ్యపై కుడిప్రక్కన బరుండియుండెను. ఆయనకు మరల లేచు సంకల్పము లేదని గ్రహించి సుభద్రాదేవి "మీ 84 వేల నగరములలో ఈ కుశావతి ప్రముఖ రాజధాని. దీనిపై మన సుంప్రుడు" అని పలికెను. "దేవీ, ఇట్లు చెప్పకుము. దీనిపై ప్రీతి లేకుండునట్లు ఉపదేశింపుము." "ఎందుచేత?" "నేడు మరణ

దినము." దేవి రోదనముచేయుచు కన్నులు తుడిచికొని కష్టముమీాద ఆమాటలు పలికి, మరల పెద్దపెట్టున ఏడ్చి మొత్తుకొనుచుండెను. మిగిలిన 84 వేలమంది స్త్రీలు ఏడ్చి మొత్తుకొనిరి. ఓర్చుకొనలేక అమాత్యాదులు కూడ దుఃఖించిరి. "ధ్వనిచేయకుడు" అని బోధి సత్త్వుడు పలుకునప్పటికి అందరును శాంతించిరి. రాణివైపు తిరిగి ఆయన "దేవీ, దుఃఖింపకుము. తిలమాత్రము కూడ నిత్యమను సంస్కారము లేదు. అన్నియును అనిత్యములే. అన్ని సంస్కారములు కూడ నశించిపోవునవే, అని ఆమె కుపదేశపూర్వకముగా ఈగాథ పలికెను.

నిఖిలసంస్కారముల్ నిత్యముల్ కావు;
పుటుక నిరోధమ్ము పొందించు టగును
వానిధర్మమ్ము, లవ్వానిశమమ్మె
ఎంతేని సౌఖ్యమ్ము నిచ్చును కాదె?

ఈప్రకారముగా మహాసుదర్శనుడు అద్భుతప్రాయమైన మహా నిర్వాణము లక్ష్యమని చెప్పి, మిగిలిన మహాజనముతో, దానము చేయుడు, శీలము రక్షింపుడు, ఉపవాసము చేయుచుండుడు అని యుప దేశించి, దేవలోకపరాయణు డయ్యెను.

భగవాన్ ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి సుభద్రా దేవి ఇప్పటి రాహులమాత; ప్రధానామాత్యుడు రాహులుడు; పరిషత్తు బుద్ధపరిషత్తు; మహాసుదర్శనుడు నేనే.

## 96 తేలపత్త జాతకము

శ్రావస్తి సుమ్భరాష్ట్రమున సేతక నిగమమునకు సమీపమున వనఖండమున విహరించుచు జానపద-కళ్యాణీ-సూత్రమును గురించి చెప్పినది.

## వర్తమాన కథ

ఆసూత్రమున భగవాను డిట్లు చెప్పెను: "భిక్షువులారా, జనపద కళ్యాణి పేరు విని జనసమూహము ఒకచో జేరినది. కల్యాణి నృత్యమునకు గానమునకు తగినది. జనపదకల్యాణిగానము జరుగుచున్న దని విని జనులు గుమి గూడిరి. అందులో నొకడు జీవితముమీద ప్రీతి కలవాడు. మరణ మన్న నిచ్చగింపనివాడు, సుఖము కోరువాడు, దుఃఖ మసహ్యించుకొనువాడు–వచ్చెను. అతనితో "ఓయీ, ఈపాత్ర అంచులవరకు తైలపూర్ణము. దీనిని జనసమూహములో జనపద-కల్యాణినడుమకు గొనిపొమ్ము. నీవెనుక నొకడు కత్తి యెత్తి నడచు చుండును. నూనెబొట్టు పడినచోట నతడు నీశిరస్సు ఖండించును! అని చెప్పవలెను. అప్పుడు భిక్షువులారా, తైలపాత్రధారి ప్రమత్తతతో, ప్రమాద పూర్వకముగా కొనిపోవు ననుకొందురా"?

"భన్తే, అట్లు కొనిపోవడు".

"అర్థవివరణమునకై నేను ఉపమానము చెప్పితిని. భావార్థ మిది. తైలముతో అంచులవరకును నిండినపాత్ర భిక్షువులారా, కాయాను స్మృతికి రెండవ పేరు. ఇందుచే భిక్షువులారా, మన కాయానుస్మృతి-భావన చక్కగా వృద్ధిపొంద వలె నని గ్రహింపవలెను".

ఈవిధముగా శాస్త జనపద-కల్యాణి-సూత్రమున శబ్దములకు అర్థములకును వ్యాఖ్యానముచేసెను. "పూర్వకాలమునగూడ బుద్ధిమంతులు స్మృతిని కోలుపోవక, నిర్వాణ మగుచున్న దివ్యరూపములను చాంచల్యముతో జూడక రాజ్యము పడసిరి. ఇది కఠినకార్యము" అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు రాజకుమారశతములో కనిష్ఠుడై పుట్టి, యుక్తవయస్సు వచ్చినపిమ్మట రాజప్రాసాదములో ప్రత్యేక బుద్ధులకు భోజనాద్యతిథి సత్కారములు చేయుచుండెను. భిక్షుగణమును జూచి యత డొకనాడు తనలో "కులక్రమాగత మగు రాజ్యమునకు పట్టాభిషిక్తుడ నగుదునా?

కాకుందునా?" అని యోచించెను. మరునాడు ప్రత్యేకబుద్ధులు వచ్చి దేవకార్యములకై యుంచిన కలశములలోని నీరు వడకట్టి పాద ప్రక్షాళనము చేసికొని, తుడుచుకొని భోజనార్థము కూరుచుండిరి. అప్పుడు బోధిసత్త్వుడు వారికి నమస్కరించి "మానాయనగారి యనంతరము నేను రాజ్యమునకు వత్తునా?" అని సవినయముగా నడిగెను. వారు విని, కుమారా, నీ వెన్నడును ఈనగరమున అభిషిక్తుడవు కావు. రెండువేల క్రోశముల దూరమున గాంధార దేశములో తక్షశిలా నగర మున్నది. ఏడురోజులలో నీ వానగరము చేరగలిగితి వేని అక్కడ రాజ వగుదువు. కాని అచటికి బోవు మార్గమున కాంతారములో అపాయము కలదు. చుట్టి పోవుద మన్న దూరము మిక్కుటము. అటవీమార్గమున బోవుచో పిశాచములు మార్గ పార్శ్వమున గంధర్వ నగరములు నిర్మించుకొని యుండును. తారకలు చిత్రించిన వితానము క్రింద అద్భుత వర్ణశోభితము రమణీయమునకు ఆవరణ పటసంయుత పర్యంకములను మాయచే నిర్మింతురు. అతి మానుషప్రభ కలిగిన రాక్షసాంగనలు పథికులను జూచి మృదుమధుర సల్లాపముతో "ఆర్యా, బడలిన ట్లున్నారు. పయనము సాగింపక పూర్వము మాయాతిథ్యమును స్వీకరింపుడు" అని తియ్యగా పలుకుదురు. అంగీకరించి పథికులను లోనికి గొనిపోయి తమసౌందర్య ప్రభావమున ముగ్ధులను జేసి, వారు కామ విహారము సలిపినచో ఆడు దయ్యములు వారిని సంహరించి రక్తమాంసము లారగింతురు. అసమాన సౌందర్యముచే పథికుల నేత్రములను అవ్యక్తగాన మాధుర్యముచే శ్రవణములను అతి స్వాదు భక్ష్యములచే వారి జిహ్వలను మృదుశరీరములచే త్వగింద్రియమును జయింతురు. కాని ఇంద్రియ నిగ్రహముతో నీవు వారిని జూడకుండ సూటిగా మార్గమున బోవుచో ఏడురోజులలో తక్షశిలానగరము చేరగలవు; అచట అభిషిక్తుడవు కాగలవు" అని చెప్పిరి.

"భదంతులారా, మీరు చెప్పిన మీదగూడ దయ్యములు నాకు కనబడునా!" అన యతడు పయనమున తన కపాయము వాటిల్లకుండ రక్షావస్తువును దయచేయు డని ప్రత్యేక బుద్ధులను ప్రార్థించెను. మంత్రించిన సూత్రసైకతములను వా రతని కిచ్చిరి.

బోధిసత్త్వుడు వారలకడను, తలిదండ్రుల వద్దను సెలవు తీసికొని "రాజ్యాభిషిక్తుడ నగుటకై నేను తక్షశిలకు బోవుచున్నాను. మీ రిచ్చటనే యుండుడు" అని తనవారలతో జెప్పెను. "మమ్ము కూడ రానిమ్ము" అని అయిదుగురు ప్రార్థించిరి. నా వెంట మీరు రావలదు. తమ సౌందర్య ప్రభావముచే బాటసారుల మనసులు హరించి తమ వశము చేసికొని వారిని సంహరించి భక్షించు రాక్షస జన మా త్రోవలో నున్నది. వచ్చినచో మీకు హాని కలుగును. ఆత్మ విశ్వాసముచే నేను పోవుచున్నాను" అని బోధిసత్త్వుడు చెప్పగా, వారు "కుమారా, మేము దుష్టసుందర విగ్రహములను చూడము. మమ్ము నీవెంట రానిమ్ము" అని వేడుకొనిరి. బోధిసత్త్వుడు "సరే, ఇంద్రియ నిగ్రహముతో బయలుదేరుడు" అని అయిదుగురను వెంట దీసికొని పోయెను.

తమ గ్రామసమీపముగా బోవుచున్న బోధిసత్త్వుని తదనుచరులను ఆడుదయ్యములు చూచుచుండెను. అనుచరులలో నొకడు దుష్టపిశాచీ లావణ్యాపహృత చేతస్కుడై వెనుకడుగు వేయుచుండగా "నీవేల వెనుకబడు చున్నావు?" అని బోధిసత్త్వు డనెను. "కుమారా, పాదములు నొప్పు లెత్తుచున్నవి. ఈ లతా వితానముక్రింద కొంతసేపు విశ్రాంతి తీసికొందును" అని వాడు పలికెను. "ఓయీ, ఇవి పిశాచ ములు, వీని నాశింపకుము". "కుమారా, ఏమయినను సరే, ఇచ్చట విశ్రమింపక ఒక్క యడుగైనను వేయలేను. "మంచిది. నీ నిజస్వరూ పము త్వరలోనే బయలు బడును" అని బోధిసత్త్వుడు మిగిలిన నలుగురితో పయనము సాగించెను.

విషయ లోలుడు కామాంధుడు నగు వాడు పిశాచముల వద్దకు బోయి వానికి లోపడగా, నవి వానిని చంపి భక్షించెను. ఆపిశాచ ములు బాటసారుల కన్న ముందుగా బోయి మార్గములో తమ మాయా ప్రభావముచే చాందినీ నిర్మించి నానావిధ వాద్యములతో అవ్యక్త మధురముగా గానము చేయుచుండెను. అనుచరులలో గాన లోలు డగు వాడు వెను కడుగు వేయగా మొదటివాని దుర్గతియే వానికిని పట్టెను. పిశాచములు పథికుల కన్న ముందుగా బోయి సుగంధ ద్రవ్యాభరితమైన దుకాణము పెట్టినవి. గంధలోలుడు వెనుకకు

తగ్గగా ముందరి యిరువురగతియే వానికిని పట్టెను. పిశాచములు పాంథులకంటె ముందుగాబోయి స్వాదుభక్ష్యముల దుకాణము పెట్టి నవి. భోజనప్రీయు డచటి పిశాచములకు భోజన మయ్యెను. పిమ్మట పిశాచములు ముందుగాబోయి త్రోవలో తమ మాయాప్రభావముచే రమ్యశయ్యలు రచించి వానిపై గూరుచుండి యుండెను. సుఖాసక్తుడు వానినిజూచి ఆగి, దుర్గతి చెందెను.

తుదకు బోధిసత్త్వుడొకడే మిగిలెను. పిశాచములలో నొకతె మాత్రము మొండిపట్టు పట్టి ఆయన నెట్లయిన సంహారింపవలె నని వెంట బోవుచుండెను. వనవాసులు చూచి, ముందు పోవుచున్నవా డెవ రని దాని నడిగిరి. "సజ్జనులారా, ఆయన నాభర్త" అన్నది. బోధిసత్త్వునితో ఆటవికులు "స్వామీ, పుష్పమువలె కోమలి, తరుణి అయిన భార్య నిన్ను నమ్ముకొని యిలు విడిచి వచ్చుచుండగా తోడ గొనిపోవక, ఆమె కాళ్ళీడ్చుకొని వచ్చునట్లు చేయు చున్నా వేమి?" అని యడిగిరి. ఈమె నా భార్య కాదు, పిశాచము. నా యనుచరుల నయిదుగురను మ్రింగినది" అన్నా డాయన. "అయ్యో, సజ్జనులారా, పురుషులు కోపావేశమున భార్యలను దయ్యము లని పిశాచము లని నిందించుచుందురు" అని పిశాచము పలికెను.

అంతట పిశాచి శిశువును ప్రసవించినట్లు నటించుచు, బిడ్డను వీపుపై గట్టుకొని ఆయన వెంట బోవుచుండెను. మార్గ మధ్యమున కానబడిన వా రందరును వెనుకటివలెనే అడిగిరి. బోధిసత్త్వుడు వెనుకటివలెనే బదులు చెప్పుచుండెను.

చివర కాయన తక్షశిల చేరెను. శిశువు నంతర్ధానము చేసి పిశాచి ఆయన ననుసరించుచునే యుండెను. నగరద్వారము చేరి ఆయన విశ్రాంతి మందిరమున గూరుచుండెను. ఆయన మహత్త్వముచే దయ్య మాయింట ప్రవేశింపనేరక సౌందర్య మొలకబోయుచు ప్రాంగణమున నిలిచి యుండెను.

తక్షశిలా పాలకు డుద్యానమునకు బోవుచు పిశాచిని గాంచి మోహించి పరిచారకునితో "ఆమె భర్త యున్నాడో లేడో కనుగొని రమ్ము" అని పంపెను. "అమ్మా, నీభర్త యెక్కడున్నాడు?" అని వాడు ప్రశ్నింపగా "అయ్యా, నాభర్త విశ్రాంతి గృహములో

నున్నాడు" అని యామె చెప్పెను. "ఆమె నాభార్య కాదు. నా సహచరు లయిదుగురను మ్రింగిన దయ్యము" అని బోధిసత్త్వుడు పలికెను. "పురుషులు కోపావేశమున తమ భార్యలను దయ్యము లనియు పిశాచము లనియు నిందింతురు." అని యామె చెప్పెను. ఈ విషయము లన్నియు పరిచారకుడు ప్రభువునకు నివేదించెను. అనాయకమగు నిధి ప్రభువులకు చెందవలెను." అని రా జామెనురప్పించి, ఏనుగుపై గూరు చుండబెట్టుకొని, ఊరేగి, ప్రాసాదము చేరి, ఉచితగృహములో బ్రవేశ పెట్టెను. రాజు స్నానము చేసి, సుగంధాది లేపనము చేసికొని భోజనానంతరము శయ్యపై బరుండెను.

పిశాచి కూడ భోజనము చేసి మోహనరూపము ధరించి సంతుష్ట చిత్తుడైన రాజు ప్రక్కన బండుకొని రోదనము చేయసాగెను. రాజు కారణ మడుగగా ఆమె యి ట్లనెను. "మీరు నన్ను త్రోవలో చూచి కుల గోత్రములు కనుగొనకుండ అంతఃపురస్త్రీలు పెక్కు రున్నను నా కున్నత పదవి నొసగ నున్నారు. నేను వీరి నడుమ నివసించుచున్నను నీ కుల గోత్రములు తెలియవు. తలిదండ్రు లెవరో తెలియదు. మార్గ మధ్యమున లభ్య మయిన దానవు, అని వీరు నన్ను హేళన చేయు చున్నను సహించి యుండవలెను. మీరు నా కున్నతాధికార మిచ్చి నచో ఆక్షేపింప వెరతురు".

"భద్రే, నాకు నిరంకుశాధికారము లేదు. నేను రారాజునుకాను. నన్ను ధిక్కరించు వారిమీదను, నేరములు చేయువారిమీదను నాయధికారము చెల్లును. సమస్తరాష్ట్రముపై నీకు సర్వాధికార మీయజాలను" అని రాజు పలికెను.

"దేవా, నాకు రాష్ట్రముమీదగాని, నగరముమీదగాని అధికార మీయలేనిచో నగరి మీదనైన దయచేయుడు, నేను వారిని పాలించెదను." అని యామె వేడెను.

మోహాంధుడై యుండుటచే రా జామెప్రార్థన మంగీకరించి ప్రాసాద నివాసి జనముపై నధికార మిచ్చెను. ఆమె సంతుష్టచిత్తయై రాజు సుఖనిద్ర చెందువరకును వేచియుండి, పిమ్మట పిశాచ నగరమునకు జని పిశాచములను తోడ్కొనివచ్చి, రాజును తానే సంహరించి తిని, అస్థికలు మాత్రము విడిచెను. పిశాచములు ప్రాసాదములోని

కుక్కుటములను, శునకాది జంతువులను జనమును తమ పొట్టన బెట్టు కొన్నవి.

మరునాడు ప్రాసాదద్వారములు మూసి యుండుటజూచి జనులు బిగ్గరగా కేకలువేసిరి. ప్రతివచనము రానందున తలుపులు పగుల గొట్టి లోనికి బోయిరి. నేల నలుమూలలను అస్థికలు విరజిమ్మి యుండెను. అప్పుడు జను లిట్లుయోచించిరి?'' ఆ పెద్ద మనుష్యుడు తన వెంట వచ్చు తరుణి తన భార్య కాదనియు, పిశాచ మనియు జెప్పినాడు. సంశయములేదు. మోహవశమున రాజు దానిని ప్రాసా దములోనికి గొనిపోయి, భార్యగా స్వీకరించి యుండును. అది తక్కిన పిశాచములను బిలిచి సర్వనాశనము చేయించి యుండును.''

నాటిరాత్రి బోధిసత్త్వుడు మంత్రించిన యిసుక శిరముపై నుంచుకొని, మంత్రపూతమైన సూత్రము లలాటము మీదుగా తలకు జుట్టుకొని, ఖడ్గహస్తుడై సూర్యోదయమున కెదురు చూచు చుండెను. పౌరులు ప్రాసాదాంగణమును బాగుచేసి, కప్పులనుండి పుష్పగుచ్ఛములు వ్రేలాడ దీసి, సుగంధమాలికలతో గోడల లంకరించి ధూపము వేసి యిట్లు చింతించిరి: "సుందరి తన్ననుసరించినను ఒక మారుకూడ కన్నెత్తిచూడక, ఇంద్రియ నిగ్రహము కలిగి జ్ఞాన సంపన్నుడైనవాడు ప్రభు వగుచో రాష్ట్రము సుఖముగా నుండును. ఆయనను రాజును చేయుదము.''

రాష్ట్ర జనులు రాజవల్లభులును ఏకాభిప్రాయులై బోధిసత్త్వుని రాజుగా నెన్నుకొని నగరమునకు గొనిపోయి, పట్టాభిషిక్తుని జేసిరి. బోధిసత్త్వుడు దుష్టమార్గ చతుష్టయమును వర్జించి, దశప్రకార రాజ విధులు నిర్వర్తించుచు, ధర్మపరిపాలనము చేయుచు, దానాది పుణ్య కార్యము లాచరించుచు, తుదకు యథా కర్మంగతో.

బుద్ధు డయిన శాస్త కథ చెప్పి, ఈగాథ పలికినాడు:-

అంచులవరకును నించిన తైల
పాత్ర భద్రమ్ముగా పట్టెడునట్లు,
నిర్వాణమున నిచ్చ నిలిపినవాడు
చిత్తంబు మిగుల రక్షించుకో వలయు.

శాస్త ఈవిధముగా ఉపదేశించి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి రాజ పరిషత్తు ఇప్పటి బుద్ధపరిషత్తు; రాజ్యము పొందిన కుమారుడు నేనే.

# 97 నామసిద్ధి జాతకము

**శాస్త జేతవనమున విహారము చేయుచు నామసిద్ధి భిక్షువును గూర్చి చెప్పినది.**

## వర్తమాన కథ

ఒకానొక యువకుని పేరు పాపకుడు. అతడు శ్రద్ధతో బుద్ధశాసనమున ప్రవ్రజించెను. భిక్షువు లతనితో "ఆయుష్మన్, పాపకా, రమ్ము; ఆయుష్మన్, పాపకా, రమ్ము" అని పిలిచెడివాడు. అతడు తనలో "పాపకనామము లోకములో చాలచెడ్డది, అదృష్టహీన మయినది. నేను వేరొక పేరు పెట్టుకొందును" అనుకొనెను.

అతడు ఆచార్యులకడకు జని "భన్తే, నాపేరు అమాంగలిక మయినది. నాకు వేరొకపేరు పెట్టుడు" అని కోరెను.

"ఆయుష్మన్, నామము సంకేతమాత్రము; కేవలము పిలుచుటకే ఉపయోగించును. నామమువల్ల అర్థసిద్ధి యేమియును లేదు. ఉన్న పేరుతో సంతుష్టి నొందుము" అని చెప్పెను.

అతడు మాటిమాటికిని పట్టుపట్టెను. ఈసంగతి భిక్షుసంఘములో తెలిసిపోయెను.

ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై "ఆయుష్మంతులారా, ఆభిక్షువు నామములో సిద్ధి గ్రహించి, మంచిపేరుకోసము వెదకుచున్నాడు" అనిరి. అప్పుడు శాస్త ధర్మసభలోనికి వచ్చి "భిక్షువులారా, ఏమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పిన పిదప శాస్త "భిక్షువులారా, ఇత డిప్పుడే కాదు, పూర్వముకూడ నామసిద్ధి" అని పూర్వజన్మకథ చెప్పినాడు.

## అతీత కథ

పూర్వము తక్కశిలలో బోధిసత్త్వుడు విఖ్యాతాచార్యుడై, 500 శిష్యులకు వేదాధ్యాపనము చేయుచుండెను. అందులో నొక మాణవకుని పేరు పాపకుడు. పాపకా, రమ్ము, పాపకా, పొమ్ము. అని తరచుగా నందరు ననుచుండుటచే వాడు విసిగి తన పేరు అమంగళకరముగా నున్నదని తలచి, గురువు సన్నిధికి బోయి "ఆచార్యా,

నా పేరు అమంగళకరముగా నున్నది. వేరొక పేరు అనుగ్రహింపుడు" అని యడిగెను. "నాయనా, పొమ్ము. దేశాటనములో నీకు మంగళ కర మని రుచించిన పేరు తెలిసికొని వచ్చినపిమ్మట నీపేరు మార్చి, ఆపే రుంచెదను" అని యాచార్యుడు పలికెను.

చిత్త మని శిష్యుడు పాథేయము తీసికొని బయలుదేరి గ్రామములు దాటి నగరము చేరెను. అచ్చట జీవకు డను పురుషుడు చనిపోయెను. జ్ఞాతు లతనిని శ్మశానమునకు మోసికొని పోవుచుండగా పాపకుడు చూచి "ఈయన పే రేమి?" అని యడుగగా వారు జీవకు డని చెప్పిరి.

"జీవకుడు కూడ చనిపోవునా?"

"జీవకుడు చనిపోవును; అజీవకుడును చనిపోవును. పేరు సంజ్ఞా మాత్రము. నీవు బుద్ధిహీనునివలె నున్నావు".

అత డంతట తన నామ విషయమున నుదాసీనుడై నగరములో ప్రవేశించెను. ఇంటికి భత్యము కొని రాలే దని వాకిట బడవైచి యజమానుడు యజమానురాలిని త్రాటితో గొట్టుచుండెను. దాని పేరు ధనపాలి. దానిని పాపకుడు చూచి "ఈమె నేల కొట్టుచున్నారు". అని యడుగగా, వాడు "ఇది భత్యము తేలేదు." అని చెప్పెను. "ఈమె పే రేమి?" "ధనపాలి". "ధనపాలి యను పేరు గలది ఒకనాటి బత్తెమును సంతరించలేదా?"

"ధనపాలి గాని నిర్ధనపాలి గాని దుర్గతి పొందవచ్చును. పేరు సంజ్ఞా మాత్రమే. నీవు బుద్ధిహీనుని వలె నున్నావు".

అతడు నామము విషయమై మరింత యుదాసీను డాయెను. నగరము విడిచి మార్గమున బోవుచుండగా విచారగ్రస్తుడు కానబడెను. "ఆర్యా, ఏల విచారపడుచున్నావు?" అని యాతడు ప్రశ్నింపగా "మార్గము తప్పినాను స్వామీ" అని వా డనెను. "నీ పే రేమి?" "పాంథకుడు" "పాంథకుడు కూడ త్రోవ తప్పునా?" "పాంథకుడు గాని అపాంథకుడు గాని త్రోవ తప్పును. నామము సంజ్ఞా మాత్రము, నీవు బుద్ధిహీనుని వలె నున్నావు."

పాపకుడు తన పేరు విషయమై మిక్కిలి ఉదాసీనుడై బోధిసత్త్వుని సన్నిధికి వచ్చెను. ఆచార్యు డతనిని జూచి "నాయనా, మంచిపేరు

దొరకినదా? తిరిగి వచ్చినావు" అనెను.

"ఆచార్యా, జీవకుడుగాని అజీవకుడుగాని మరణించును. ధనపాలి యయినను నిర్ధనపాలియయినను దుర్గతి జెందును. పాంథకుడును అపాంథకుడును త్రోవ తప్పుదురు. పేరు సంజ్ఞా మాత్రము. నామము వలన సిద్ధిలేదు. కర్మమువలననే సిద్ధి. ఇంకొక పేరు వలదు. ఉన్న పేరే ఉండనిండు" అని శిష్యుడు విన్నవించెను.

శిష్యుడు చూచినవియు విన్నవియు కలిపి బోధిసత్త్వు డీగాథ పలికెను.

జీవకుడు పోయె, ధనపాలి జెందె లేమి,
అకట, పాంథకుడును గూడ నడవి బట్టె.
వారి నందర వీక్షించి వచ్చె మరలి
పాపకుడు నామమందలి భ్రాంతి విడిచి.

శాస్త జాతకసారాంశము వెలువరించెను. అప్పటి నామసిద్ధి ఇప్పటి నామసిద్ధి; ఆచార్యపరిషత్తు నేటి బుద్ధపరిషత్తు; ఆచార్యుడు నేనే.

## 98 కూటవాణిజ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు టక్కరి వర్తకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో నిరువురు ఉమ్మడివ్యాపారము చేయుచుండిరి. వారు బండ్లలో సరకులు గొని గ్రామములకు గొనిపోయి లాభము తీసి మరలి వచ్చిరి. అందులో మోసగా డిట్లు తలపోసెను: "ఈవర్తకుడు చాల రోజులు భోజనశయనములు లేక కష్టపడుచుండెను. ఇప్పు డింటిలో నానావిధములగు స్వాదిష్ఠ పదార్థములు నిండియుండుటచే కడుపునిండ

తిని అజీర్ణమువలన మృతి చెందును. కావున సరకులు మూడుభాగములు చేసి ఒకభాగ మతనిబిడ్డల కిచ్చి రెండుభాగములు నేను తీసికొందును."

నేడు పంచెదను, రేపు పంచెదను అనుచు వాడు సరకులు పంపిణీ చేయకుండెను. బుద్ధిమంతుడగు వర్తకుడు బలవంతముగా వానిచే సరకులు విభాగము చేయించెను. అంతట విహారమునకు పోయెను. అచ్చట శాస్తకు ప్రణామము చేసి కుశల మడిగినపిదప శాస్త అతనితో "చాల ఆలస్యము చేసినావు. కొంతకాలము క్రిందట వచ్చియు బుద్ధసేవకు ఇంతజాగయిన దేమి?" అనెను.

అతడు జరిగిన సంగతి అంతయు విన్నవించెను.

"ఉపాసకా, కేవల మిప్పుడే కాదు, ఆవర్తకుడు పూర్వముకూడ మోసకాడే; వెనుకకూడ నిన్ను మోసగింపయత్నించినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వారాణసిలో వణిక్కులమున బుట్టినాడు. నామకరణము నాడు అతనికి పండితుడని పేరు పెట్టిరి. అతడు పెద్దవాడయిన పిదప వేరొక వణిజునితో కలిసి వ్యాపారము చేయసాగినాడు. వాని పేరు అతిపండితుడు. వారు వారాణసినుండి 500 బండ్లతో సరకులు వేసి జనపదమునకు బోయి వ్యాపారముచేసి, లాభముతో తిరిగి వచ్చిరి. వారు ధనము పంచుకొనుకాలమున అతిపండితుడు "నాకు రెండువంతులు రావలె" నన్నాడు. "ఎందుచేత?" "నీవు పండితుడవు, నేనో అతిపండితుడను. పండితు డేకభాగమునకు అతిపండితుడు రెండు భాగములకు నర్హులు"

"సరకులలోను ఎద్దులలోను మనకు సరిసమాన భాగములు కదా? నీకు రెండు వంతులేల రావలెను?"

"అతిపండితుడ నగుటచేత."

ఇట్లు వారి వివాదము కలహములోనికి పరిణమించెను.

అంతట అతిపండితుడు "దీని కొక యుపాయమున్నది" అని

చింతించి, తన తండ్రిని ఒక చెట్టుతొఱ్ఱలో ప్రవేశపెట్టి "మేము వచ్చి నిన్ను కోరినపుడు అతిపండితుడు రెండు భాగముల కర్హుడు" అని చెప్పవలె నని కోరెను. తరువాత వాడు బోధిసత్త్వుని కడకుబోయి "మిత్రమా, నాకు రెండు భాగములు వచ్చుట యుక్తమో కాదో వృక్షదేవతకు దెలియును. రమ్ము, పోయి యడుగుదము" అని యత నిని గొనిపోయి "ఆర్యా, వృక్షదేవతా, మాతగవు తీర్పుము" అనెను. అప్పుడు వానితండ్రి స్వరముమార్చి "సంగతి తెలుపుడు" అనెను. "ఇతడు పండితుడు, నేను అతి పండితుడను. మేము కలిసి వ్యాపారము చేసినాము. అందు ఎవని కెంత భాగము రావలెను." అని అతిపండితు డనెను. "పండితున కొక భాగము, అతిపండితునకు రెండు భాగములు" అని బదులు పలుకు వినబడెను. ఇట్లు వినిశ్చితార్థమును విని బోధిసత్త్వుడు "దేవతాభావముగాని అదేవతాభావముగాని యిప్పుడు బయటబడును" అని యెండు గడ్డి తెచ్చి, తొఱ్ఱ నింపి, నిప్పు ముట్టించెను. అగ్నిజ్వాలలు వ్యాపించినప్పు డతి పండితుని తండ్రి సగము మాడిపోయి, కొమ్మ పట్టుకొని పైకి వచ్చి నేలపై బడి యీగాథ చెప్పినాడు :

పండితుం డను పేర పరగుట మేలు,
అతిపండితుం డన్న హానికరంబు.
అతిపండితుం డైనయట్టి నాకొడుకు
క్షణములో నగ్నిపాలు కావించె నన్ను.

ఉభయులు నంతట సమభాగములు తీసికొని, కాలక్రమమున యథా కర్మం గతా.

శాస్త జాతకసారాంశము వెలువరించెను. అప్పటి కుటిలవర్తకుడు నేటి కుటిలవర్తకుడు; బుద్ధిమంతు డైనవర్తకుడు నేనే.

# 99 పరోసహస్స జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక అజ్ఞుడు అడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తరముగా చెప్పినది.

## వర్తమాన కథ

ఇందలివస్తువు సరభంగ జాతకమున (522) వచ్చును.

ఒకసారి భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై "ఆయుష్మంతులారా, బుద్ధునిసంక్షిప్త-ఉపదేశములను ధర్మసేనాపతి సారిపుత్రుడు సవిస్తరముగా చెప్పినాడు" అని స్థవిరుని ప్రశంసించుచుండిరి. శాస్త అరుదెంచి "భిక్షువులారా, ఈ సమయమున ఏమి సంభాషించుచున్నా?" రనెను. ఈవిషయము అని వారు తెలిపినపిదప శాస్త "భిక్షువులారా, సారిపుత్రుడు ఇప్పుడే కాదు; పూర్వముకూడ నాసంక్షిప్త కథనము విస్తరించి వాఖ్యానము చేసినవాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఉదీచ్యబ్రాహ్మణ వంశమున బుట్టి, తక్షశిలలో సమస్త విద్యలు పూర్తిచేసి, కామమువిడిచి, ప్రవ్రజించి, పంచాభిజ్ఞలను అష్ట సమాపత్తులను పొంది, హిమవత్ప్రదేశమున నివసించుచుండెను. 500 తాపసు లాయనచుట్టు జేరిరి. ఆయన పెద్దశిష్యుడు సగముమంది తాపసులను వెంటబెట్టుకొని వర్షాకాలమున ఉప్పు చింతపండు కొరకు మానవ నివాసములకు బోయెను. బోధిసత్త్వుని నిర్యాణసమయము వచ్చెను. "మీకు ఏ గుణములు లబ్ధమయినవి?" అని శిష్యు లాయన నడిగిరి.

ఆయన నాస్తి కించిత్ అని పలికి, ఆభాస్వర బ్రహ్మలోకమున జన్మించెను. బోధిసత్త్వులు రూపసమాపత్తి పొందియును అరూప లోకములో జన్మింపరు:

"ఆచార్యున కధిగమము లేదు" అని శిష్యులు దహనసంస్కారములు సరిగా చేయలేదు.

పెద్దశిష్యుడు వచ్చి "ఆచార్యు లెట్లున్నారు?" అని అడిగి, కాలము చేసినా రని విని, అధిగమమును గూర్చి ఆచార్యుల నడిగితిరా యనెను. "నాస్తి కించిత్ అని ఆచార్యులవా రనుటచే మేము విశేష సత్కారము చేయలేదు" అని శిష్యులు చెప్పిరి.

"ఆచార్యులవారి వచనార్థము మీరు గ్రహింపలేదు. నాస్తి కించిత్ అన్నప్పుడు మహాశూన్యతత్త్వమని యర్థము. ఆచార్యులవారు అచింతిత జ్ఞానాయతన ధ్యానలాభము కలవారు" అని వృద్ధశిష్యుడు మాటిమాటికి జెప్పినను వారికి విశ్వాసము కలుగలేదు. వారి యవిశ్వాసమును బోధిసత్త్వుడు గ్రహించి "బుద్ధిహీనులు! నా ప్రధానశిష్యుని వివరణమును మీరు నమ్మలేదు. మీరి కీవిషయము ప్రకటింతును" అని బ్రహ్మలోకమునుండి వచ్చి ప్రభావమువలన ఆశ్రమముమీద ఆకాశమున నిలిచి, ప్రధానశిష్యుని ప్రజ్ఞాభావమును వర్ణించుచు ఈగాథ వలికెను:

ప్రజ్ఞావిహీనులు పదివంద లైన
అరచుటకంటె సహస్రవర్షములు,
ఉత్తమం బగు ప్రజ్ఞ నొప్పెడివాడు
ఆతడు మాటలం దర్థ మెరుంగు!

ఈప్రకారముగా మహాసత్త్వు డాకాశమున నిలిచి, ధర్మ ముపదేశించి, తాపసులను మందలించి, బ్రహ్మలోకమునకు బోయెను. జీవితాంతమున ఆతాపసులుకూడ బ్రహ్మలోకమునకు పోవుట కర్హులైరి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి ప్రధానశిష్యుడు ఇప్పటి సారిపుత్రుడు; మహాబ్రాహ్మణుడు నేనే.

## 100 అసాతరూప జాతకము

శాస్త శాక్యదేశములోని కుండియ నగరమువద్ద కుండధాన వనమున విహారము చేయుచు కోలియ రాజకుమారియు, ఉపాసికయు నగు సుప్పవాసను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆమె ఏడుసంవత్సరముల పాటు గర్భము ధరించి సప్తాహ కాలము గర్భము భగ్నమగుటచే బాధపడుచుండెను. ఆమెకు చాల వేదన కలిగెను. అట్టి బాధ కలిగినను అతడు భగవాన్ సమ్యక్ సంబుద్ధుడు; ఇట్టి దుఃఖవినాశము కొరకు ఉపదేశము చేయుచున్నాడు; ఆభగవానుని శ్రావకసంఘము సుప్రతిపన్నమైనది. ఇట్టి దుఃఖమును తొలగించుటకై ప్రయత్నించుచున్నది. నిర్వాణసుఖమున ఇట్టిదుఃఖము లేదు— అను మూడు ఆలోచనలు చేయుచు, బాధ సహించుచుండెను. ఆమె తన భర్తను పిలిచి శాస్త్రకడకు కొని పోవలసినదనియు ఆయనకు ప్రణామము చేసి స్థితిగతులు తెలుపవలసినదనియు చెప్పెను.

శాస్త్ర ఆతని ప్రణామము చూచి "కోలియకుమారి సుప్పవాస సుఖముగా నుండుగాక. తాను ఆరోగ్యముతో నుండుటయేకాక ఆరోగ్యవంతుడైన కుమారుని కనునుగాక" అని ఆశీర్వదించెను.

భగవానుని నోట మాటలు వెలువడినంతనే కోలియకుమారికి సౌఖ్యము కలిగెను; ఆమె ఆరోగ్యవంతుడైన కుమారుని కనెను. ఆమె భర్త ఇంటికిపోయి ప్రసవమగుట తెలిసికొని "ఆశ్చర్యము! మహాశ్చర్యము! తథాగతుని ప్రతాపముచే అత్యంతాశ్చర్యకరమైన విషయము జరిగినది" అన్నాడు.

సుప్పవాస పుత్రుని కని తన భర్తతో మరల శాస్త్ర కడకు పోయి బుద్ధప్రముఖ భిక్షు సంఘమునకు సప్తాహకాలము దాన నిమంత్రణము చేయుడని చెప్పెను. ఆకాలమున మహా మౌద్గల్యాయనుని ఉపస్థాపకుడు బుద్ధప్రముఖ సంఘమును నిమంత్రించెను. శాస్త్ర సుప్రవాస కొరకు దానప్రదేశము ప్రత్యేకించి స్థవిరుని ఉపస్థాపకుని వెంటపంపి, దానమును తాను సంఘముకొరకు స్వీకరించితినని సూచనచేసెను. ఆమె ఏడవనాడు శీవలే కుమారుని చక్కగా అలంకరించి శాస్త్రకును భిక్షుసంఘమునకును వానిచే ప్రణామము చేయించెను. క్రమముగా వానిని సారిపుత్ర స్థవిరునికడకు గొనిపోయిన పిమ్మట సారిపుత్ర స్థవిరుడు కుశల సమాచారమడిగి "ఏమి శీవలీ, చక్కగా ఉన్నావా?"

అనెను. "భన్తే, నాకు సుఖమెక్కడిది? నేను ఏడుసంవత్సరములపాటు లోహకుంభి నరకమున నుంటిని" అని ఆయనతో సంభాషణ చేసెను.

అతని వాక్కులు విని "ఏడుదినముల పుత్రుడు ధర్మసేనాపతితో ఆలోచన సలుపుచున్నాడు" అనుకొని సుప్పవాస ప్రసన్నచిత్త యయ్యెను. శాస్త "సుప్పవాసా, ఇట్టి పుత్రులమీద ఇంకను కోరిక ఉన్నదా?" అనెను.

"భన్తే, ఇట్టిపుత్రులు ఏడుగురు లభించుచో ఏడుగురును కావలెను." శాస్త ఉదానము చెప్పి అనుమోదము చేసి వెడలిపోయెను. శీవలీకుమారుడు ఏడవఏట బుద్ధశాసనమున అత్యంత శ్రద్ధాపూర్వకముగ ప్రవ్రజించి, ఇరువదిఏండ్లు నిండునప్పటికి ఉపసంపద పొంది, పుణ్యవంతులలో అగ్రగణ్యుడై జగత్ వ్యాప్తముగ అర్హత్వ పదవి పొంది పుణ్యవంతులలో ప్రథమస్థానము నొందెను.

ఒకనాడు ధర్మసభలో కూరుచుండి భిక్షువులు, "ఆయుష్మంతులారా, శీవలీస్థవిరుడు ఇట్టి మహాపుణ్యాత్ముడైనాడు. ఆయన కోర్కె సంపూర్ణమైనది. ఆయన అంతిమ దేహధారి. అట్లయ్యును ఏడుసంవత్సరములపాటు లోహకుంభి నరకమున నుండి, సప్తాహకాలము గర్భములో గడబిడలో నుండెను. అందువలన తల్లికిని బిడ్డకును చాల బాధ కలిగెను. ఇట్లగుటకు వారు ఏమి పాపకర్మము జేసిరి?" అనిరి.

శాస్త అచటికి వచ్చి "భిక్షువులారా, శీవలి మహాపుణ్యవంతుడయ్యును ఏడుసంవత్సరములపాటు లోహకుంభి నరకమున నుండుటకు సప్తాహకాలము గర్భములో గడబిడలో నుండుటకు కారణము అతడు చేసిన కర్మ ఫలితమే. ఇక సుప్పవాస ఏడుసంవత్సరములు గర్భము మోయుచు తిరుగుచు శ్రమపడుచు, ఏడు దినములపాటు గర్భ దుఃఖము పొందుటకు కారణము ఆమె చేసిన కర్మ ఫలమే" అని, భిక్షువులు ప్రార్థించిన మీదట పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వ డాయన యగ్రమహిషి కడుపున బుట్టి పెరిగి పెద్దవాడయి తక్షశిలలో సమస్త విద్య లభ్యసించి, తండ్రి మరణానంతరము రాజయి,

ధర్మపాలనము చేయజొచ్చెను. ఆకాలమున కోసలరాజు మహాసైన్యముతో వారాణసిమీదికి వచ్చి, రాజును సంహరించి, రాజ్యము జయించి, ఆయన పట్టమహిషిని తన పట్టమహిషిని జేసికొనెను.

తండ్రి మరణించినపుడు రాజకుమారుడు చోరమార్గమున పారిపోయి, బలము సమకూర్చుకొని, వారాణసీ సమీపమున విడిసి, "రాజ్య మిమ్ము. అట్లు కాదేని యుద్ధము చేయుము" అని రాజుకు సందేశ మంపెను. యుద్ధము చేయుదునని ఆతడు ప్రతివచన మంపెను. ఆవార్త విని తల్లి రాజకుమారునకు ఇట్లు సందేశము పంపెను. "యుద్ధము వలదు. జనసంహారము జరుగకుండ నగర మన్నిదిక్కుల భేరి వేయింపుము. ఉదకము, ఆహారద్రవ్యములు, కట్టెలు క్షీణించును. జనులు డస్సిపోవుదురు. పోరు లేకుండనే నగరము నీ చేజిక్కును."

తల్లి యుపదేశప్రకారము రాజకుమారు డేడు రోజులు నగరము నరికట్టెను. ఏడవనాడు నగరవాసులు రాజు శిరస్సు ఖండించి తెచ్చి, రాజకుమారున కప్పగించిరి. రాజకుమారుడు నగరము ప్రవేశించి, రాజ్యము గ్రహించి, కాలక్రమమున యథా కర్మం గతో.

శాస్త పూర్వజన్మకథను గ్రహించి, అభిసంబుద్ధు డయినపు డీగాథ పలికినాడు :

అప్రియమ్ము ప్రియమ్ముగా, అమధురము
మధురముగ, దుఃఖముల్ సుఖవిధిని తోచి
అలసు డగువానిని జయించు టబ్బురంబె ?

శాస్త ధర్మోపదేశము చేసి జాతక సారాంశము వెలువరించెను. ఆకాలమున నగరము నరికట్టి రాజ్యము పొందినకుమారుడు నేటి శీవలి; తల్లి సుప్పవాస; వారాణసి రాజు నేనే.

# 101 పరోసత జాతకము

ప్రజ్ఞ లేక నూరువర్షముల్ ధ్యానంబు
సలుపు నూరు నొక్క జనులకంటె,
పల్కులో గభీరభావం బెఱింగెడి
ప్రాజ్ఞు డొకడు చాలు వసుధలోన.

కథాదృష్టిని బట్టి, వ్యాకరణదృష్టిని బట్టి, సారాంశమును బట్టి ఈజాతకకథ పరోసహస్స జాతకమునకు (98) సమానముగా నున్నది. ఝాయేయ్యుం (ధ్యానించినను) అను పదముమాత్రము ఇందు విశిష్టము.

# 102 పణ్ణిక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు దుకాణదారు డగు ఉపాసకుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆయుపాసకుడు శ్రావస్తి నివాసి. కందమూలములు, కూరగాయలు, మొదలగుపదార్థముల నమ్మి కాలము గడపుచుండెను. ఆతనికి ఒక్కతే కూతురు కలదు. ఆమె రూపవతి, ఆచారవంతురాలు, వినయ భయములు కలది. కాని తరచుగా నవ్వుచుండునది. తనకులములో వా రందరును ఆమెను వివాహమాడుటకై వచ్చినపిదప తండ్రి యిట్లు తలపోయ సాగెను : "దీనికి పెండ్లి యగును. ఇది యెల్లప్పుడు నవ్వు చుండును. కుమారీత్వము కోలుపోయి వేరొకకుటుంబములోనికి బోయి నచో తలిదండ్రుల కప్రతిష్ఠ వచ్చుటకు కారణ మగును. దీని కుమారీ త్వము సురక్షితముగ నున్నదో లేదో పరీక్షింతును."

కుమారితచే తట్ట యెత్తించి ఒకనాడతడు ఆకులకొరకు కడవికి గొనిపోయి, ఆమెను పరీక్షించు కోరికతో కాముకునివలె మర్మభాషణములాడి ఆమెచేయి పట్టుకొనెను. తోడనే యామె ఏడ్చుచు, అరచుచు "నాయనా, ఇది అనుచితకార్యము. ఇది నీటిలోనుండి నిప్పు వెలువరించుట వంటిది. ఇట్లు చేయవలదు" అనెను.

"అమ్మా, నేను కేవలము పరీక్షచేయుటకే నీచేయి పట్టుకొంటిని. నీకౌమారము సురక్షితముగా నున్నదా, లేదా చెప్పుము".

"అయ్యో, నాయనా, నేను అనురాగవశవర్తినై ఏపురుషునివైపు చూడలేదు".

ఆతడు పుత్రిక నూరడించి ఇంటికి గొనిపోయి, వివాహము చేసి అత్తవారింటికి బంపెను.

శాస్తను దర్శించు కోరికతో నతడు గంధమాల్యానులేపనములు చేత బట్టుకొని జేతవనమున కేగి శాస్తకు వందనము చేసి పూజాదికము కావించి ఒకప్రక్క గూరుచుండెను. "బహుకాలమునకు వచ్చినావే!" అని శాస్త అన్నపిమ్మట నతడు భగవానున కావిషయము తెలిపెను.

"ఉపాసకా, కుమారి సదాచారిణి. కాని నీవు కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ నామెను పరీక్ష చేసియుంటివి" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడరణ్యములో వృక్షదేవతగా నివసించుచుండెను. వారాణసిలో ఒకానొక కూరగాయల వర్తకుడు ఉపాసకుడయ్యెను. వానికి నిజపుత్రిక విషయమున సందేహము కలిగినది. అంతయు పైకథలో జెప్పినట్లే యయ్యెను. అతడు పరీక్షార్థము చేయి పట్టుకొనగా పుత్రిక ఈగాథ పలికినది :

సహజముగ నార్తయగుపుత్రి సాకి ప్రోచు
తండ్రియే నట్టడివిని ఘాతం బొనర్చె!
ఈవనస్థలి రక్షింప నెవని బిలుతు
త్రాత కాదగువా డిట్లు తలప నెగ్గు!

అంతట తండ్రి యామె నోదార్చి, "అమ్మా, నీవు రక్షితవా (కన్యవా)" అని యడిగెను. అవును నాయనా, అని యామె పలుకగా తండ్రి యామె నింటికి గొనివచ్చి, పండుగ చేసి, వివాహము కావించెను.

శాస్త ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములను వెలువరించునప్పటికి ఉపాసకుడు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. ఆకాలమున తండ్రి ఇప్పటితండ్రియే; కుమరిత ఇప్పటి కుమారిత! వృక్షదేవత నేనే.

## 103 వేరీ జాతకము

శాస్త జేతవనములో విహరించుచు అనాథపిండికుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

అనాథపిండికుడు తన మొఖాసాగ్రామమునుండి మరలివచ్చునప్పుడు త్రోవలో చోరులు కనబడగా "మార్గమున నుండుట మంచిది కాదు. శ్రావస్తికే పోయి ఆగుదును" అనుకొని త్వరితముగా వృషభములను అదలించుచు, శ్రావస్తి చేరి, మరునాడు విహారమునకు బోయి ఈవిషయము శాస్తతో జెప్పెను. "గృహపతీ, పూర్వకాలమునగూడ బుద్ధిమంతులు మార్గమున చోరులను గాంచి, పథములో ఆగక, నిజస్థానమునకే పోయిరి" అని, శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు మహావిభవము కల శ్రేష్ఠియై, ఒకనాడు గ్రామాంతరమునకు బోయి తనకు రావలసిన ధనము రాబట్టుకొని మరలివచ్చు

చుండగా మార్గమధ్యమున చోరులు కానవచ్చిరి. వేగముగా బండి తోలుకొని యాతడు సురక్షితముగా నిజగృహము చేరెను. విందు చేసి యతడు మహాశయనమున గూరుచుండి, "నేను చోరులబారినుండి తప్పించుకొని నిర్భయ మయిన నిజగృహము చేరినాను" అని యుత్సాహమున నీగాథ పలికినాడు:

శత్రు వున్నెడ నివసింప జనదు ప్రాజ్ఞు
డొక్కటియు రెండు రాత్రము లున్న చాలు
వైరిమధ్యాన కష్టాలపాల బడును.

బోధిసత్త్వు డీవిధముగా హర్షధ్వని చేసి దానాది పుణ్యకార్యములు చేయుచు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆసమయమున వారాణసి శ్రేష్ఠి నేనే.

## 104 మిత్తవింద జాతకము

శాస్త జేతవనమున విహరించుచు దుర్భాషి యగు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఇదివరలో వచ్చిన మిత్రవింద జాతకమున కిది సమాన మని గ్రహింప నగును.

### అతీత కథ

ఈకథ కాశ్యప సంబుద్ధుని నాటిది. ఆకాలమున నరకములో యమ యాతన లనుభవించుచున్నవా డొకడు శిరముపై చక్రము ధరించి

బోధిసత్త్వునితో "భన్తే, నే నేమి పాపము చేసినాను?" అనెను. "నీవు ఈయీపాపకర్మములు చేసినావు" అని, బుద్ధుడీగాథ పలికెను:

ఎనిమిదిం గోరె నాల్గున్న, నెనిమి దున్న
పదియు నారును, నవల ముప్పదియు రెండు;
ఇట్లు కోర్కులు నానాట వృద్ధి యగుట
శిరసుపై 'తిర్గుడుం గల్లు' సిద్ధ మయ్యె,
అనవరత లోభ తాడితు డైనజనుని
శిరముపై చక్ర మిట్టులే తిరుగుచుండు.

ఇట్లు చెప్పి నిజదేవలోకమునకు బోయెను.

వాడు నిజపాపక్షయ మగువరకును నరకమున నుండి తరువాత యథా కమ్మం గతో.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున మిత్రవిందకుడు ఇప్పటి దుర్వాభషిభిక్షువు; దేవపుత్రుడు నేనే.

## 105 దుబ్బలకట్ఠ జాతకము

శాస్త జేతవనమున నుండునపుడు భీతభిక్షువు విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఇతడు శ్రావస్తినివాసి యగు తరుణుడు. శాస్త ధర్మోపదేశము విని ప్రవ్రజించి, మరణము కలుగు నను భయము పొందెను. పవలుగాని, రాత్రిగాని గాలి వీచినపిదపను, ఎండుకొమ్మ రాలినను, పక్షులుగాని జంతువులుగాని కొంచెము కూసినను, అతడు మరణ భీతుడై గట్టిగా అరచుచు పరుగెత్తును. నేను గూడ చనిపోవలెను అను విషయముపై నతని దృష్టి నిలవలేదు. నేనుకూడ పోవుదును అనుసంగతి తెలిసినచో

నతనికి మరణభీతి యుండెడిది కాదు. అతడు మరణస్మృతి యోగ-విధి (కర్మస్థానము) అభ్యాసకుడు కాకపోవుటచే భయపడుచుండెను. అతడు మరణభీతి గొన్నాడనుసంగతి భిక్షుసంఘమునకు తెలిసెను. ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై "ఆయుష్మంతులారా, ఫలాని భిక్షువు మరణభీతుడు" అనుచుండిరి. శాస్త అచటికి బోయి "ఏమి మాటాడుచున్నా?" రని యడుగగా వారు ఈవిషయము అని చెప్పిరి. అప్పుడు శాస్త భిక్షువును బిలిచి, "భిక్షూ, నీవు మరణభీతి చెంది యుండుట సత్యమేనా?" అని యడిగెను. "భన్తే, సత్యమే". "భిక్షువులారా, ఈభిక్షువువలన మీారలసంతుష్టచిత్తులు కావలదు. ఇత డిప్పుడే కాదు; పూర్వము కూడ ఇట్లే యుండెడివాడు" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమవంతమున వృక్షదేవతగా నివసించుచుండెను. ఆ సమయమున రాజు భద్ర మాతంగమునకు సుశిక్షణకై హస్తిపాలకుల నియమించెను. వారు భద్రగజమును స్తంభమునకు గట్టివేసి, అంకుశ హస్తులై సుశిక్షణ యిచ్చుచుండిరి. ఏనుగు బాధ భరింపలేక కట్టు కొయ్య పెరికి, హస్తిపాలకులను తరిమి, హిమవంతమునకు పరుగెత్తెను. దానిని పట్టుకొనజాలక వారు మరలి చనిరి.

ఏనుగు మరణభయమున నచ్చట నివసించుచుండెను. గాలిసవ్వడి యయినంతనే కంపము నొందుచు ప్రాణ భయమున ఏనుగు తొండ మిటు నటు ద్రిప్పుచు మహావేగమున పరుగెత్తును. శిక్షణార్థ మాలానమున తన్ను కట్టివేసినట్లే దానికి దోచును. మనశ్శాంతి, దేహ స్వాస్థ్యము లేక, మాతంగము నిరంతర కంపముతో విచరించుచుండెను. దీనిని గమనించి వృక్షదేవత చెట్టు పంగలో నిలిచి యీగాథ పలికెను:

కాననంబున దుర్బల కాష్ఠములను
లీల భంజించి వేయును గాలి వీచి.
వెర్రినాగులు, దీనికి వెరతువేని
తప్పకుండగ దుర్బలతరుడ వగుదు!

ఇట్లు దేవత దాని కుపదేశమిచ్చెను. నాటనుండి యేనుగు నిర్భయముగా నివసింపజొచ్చెను.

శాస్త ధర్మోపదేశము చేసి నాలుగు సత్యములను ప్రకాశింపచేసిన పిదప భిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. అప్పటి ఏనుగు ఇప్పటి భిక్షువు; వృక్షదేవత నేనే.

## 106 ఉదంచని జాతకము

శాస్త జేతవనమున నుండగా ప్రౌఢకుమారియెడ ఆసక్తివిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

మూలకథ పదుమూడవ నిపాతమున చూలనారద జాతకమున (447) వచ్చును. శాస్త ఆభిక్షువుతో "భిక్షూ, నీవు ఆసక్తచిత్తుడవగుట సత్యమేనా?" అనెను.

"భగవన్, సత్యమే."

"నీకు ఎవరియెడ ఆసక్తి కలిగినది?"

"ఒకానొక ప్రౌఢకుమారియెడ."

"భిక్షూ, ఇది నీ కనర్థకము. పూర్వముకూడ నీవు ఈమెవలననే భ్రష్టుడవై వణకుచు, నిరుద్దేశముగా తిరుగుచుండువాడవు. బుద్ధిమంతుల మూలమున సౌఖ్యము పొందినావు" అని బుద్ధుడు పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము పాలించుచుండగా జరిగిన సంఘటనలు క్షుద్ర–నారద – కస్సప జాతకమున చెప్పబడును. కాని అప్పుడు బోధిసత్త్వుడు సాయం సమయమున ఫలము లాశ్రమమునకు గొనివచ్చి, తలుపు తెరచి, అల్పతాపసునితో 'దినము విడిచి దినము నీవు కట్టెలు, వంటసామానులు తెచ్చి, నిప్పు

చేసెడివాడవు. నే డేమియు చేయక దీన వదనముతో కూరుచున్నావు?' అనెను.

'నాయనా, మీరు ఫలాహరణమునకు బోయినప్పుడు స్త్రీ వచ్చి, నన్ను ప్రలోభపెట్టి కొనిపోవ యత్నించెను. మీ సెలవు తీసికొని వత్తు నని నేనాగితిని. ఆమె నొకచో గూరుచుండబెట్టి వచ్చితిని. నాయనా, యిక పోవుదును' అని కుమారుడు పలికెను.

వీనిని మరపింపజాలను, అని బోధిసత్త్వుడు గ్రహించి, "నాయనా, అట్లయిన పొమ్ము. కాని ఈమె మత్స్యమాంసములు, నెయ్యి, ఉప్పు, బియ్యము వలసినప్పుడు ఇది తెమ్ము అది తెమ్ము అని యిటునటు నిన్ను త్రిప్పుచున్నయెడల నీవు నావద్దకు పరుగెత్తుకొని మరలిరమ్ము" అని అనుజ్ఞ యిచ్చెను.

అత డామెతో మానవ నివాసములకు జని ఆమెయింటికి జేరి నప్పుడు 'మాంసము తెమ్ము, మత్స్యములు తెమ్ము' అని యామె తనకు వలసిన యొక్కొక వస్తువు కొరకతనిని తరుముచుండెను. అంత నతడు 'నిజదాసునివలె కర్మకారునివలె నీమె నన్ను వేధించు చున్నది' అని భావించి, పరుగెత్తి పోయి తండ్రి సన్నిధి జేరి, నమస్కరించి, నిలువబడి యీగాథ చెప్పెను:

జలము తోడెడి పాత్రతో సదృశ యైన
దీని భార్యగ గ్రహియించు దినమువరకు
హేలతో నుంటి; ఈదొంగ తైల మనుచు
లవణ మనుచును వేధించు పవలు రేలు!

అంతట బోధిసత్త్వు డతనిని ఓదార్చి 'నాయనా, కానిమ్ము. నీవు కారుణ్యమును భావింపుము' అని నాలుగు బ్రహ్మవిహారములను (కసిణ పరి కమ్మం) తెలిపెను. అచిరకాలముననే యితడు అభిజ్ఞను సమాపత్తిని పొంది, బ్రహ్మవిహారములు భావనచేసి, తండ్రితో బ్రహ్మలోకమున కేగెను.

శాస్త ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములను ప్రకాశింప జేయునప్పటికి ఆభిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. అప్పటి ప్రౌఢకుమారి ఇప్పటి ప్రౌఢ కుమారి; అప్పటి చూలతాపసుడు ఇప్పటి ఆసక్తచిత్త భిక్షువు; తండ్రి నేనే.

# 107 సాలిత్త జాతకము

శాస్త జేతవనమున నుండగా హంసమారకు డగు భిక్షువువిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తి నివాసి యగు కులపుత్రు డొకడు సాలిత్తక శిల్పపారంగతుడు. చిల్లపెంకును విసరుటలో నేర్పును సాలిత్తక శిల్ప మందురు. ఒకనా డతడు ధర్మోపదేశము విని, బుద్ధుని శాసనమున శ్రద్ధాయుక్తుడై ప్రవ్రజించి, ఉపసంపద పొందెను. కాని అతనికి శిక్షమీదగాని, తదనుసారప్రవర్తనమున గాని ఇచ్ఛ లేదు. ఒకనా డతడు చిన్నభిక్షువును వెంటగొని అచిరవతీనదికి పోయెను. అందులో స్నానము చేసి, నిలిచియున్నప్పుడు ఆకాశమార్గమున రెండు శ్వేతహంస లెగురు చుండుట అతనికి కానవచ్చెను. చిన్నభిక్షువుతో నతడు "ఇందులో వెనుక నున్న హంస కంటిపై రాతితో కొట్టి నాకాళ్ళవద్ద పడగొట్టు దును" అని పలికెను.

"ఎట్లు పడగొట్టుదువు? కొట్టనుగూడ కొట్టలేవు."

"కన్ను లిటు లుండును. ఈవైపుకంటిపై గొట్టెదను."

"అసంభావ్య మైనవిషయము చెప్పుచున్నావు!"

అట్లయిన చూడు మని కొంచెము వాడి కలిగినపెంకు తీసి, వ్రేలితో నొక్కి ఆహంస వెనుక విసరెను. పెంకు రుం అని ధ్వని చేసెను. హంసకు అపాయము కలిగియుండు నని యోచించి ఆగి శబ్దము వినజొచ్చెను. వెంటనే యతడు గుండ్రనిరాయి తీసి హంసకు రెండవవైపు కంటిపై విసరెను. దెబ్బ తిని హంస గీపెట్టుచు వచ్చి పాదములపై బడెను.

భిక్షువులు అన్నిప్రక్కలనుండి వచ్చి "నీవు అనుచితకార్యము చేసి నావు" అని నిందించి, అతనిని శాస్తకడకు గొనిపోయి, ఇత డీపని చేసినా డని చెప్పిరి. శాస్త అతనిని మందలించి "భిక్షువులారా, ఇతడు కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ సౌందర్యోత్సాహి" అని, పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ 701

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వు డాయన కమాత్యు డయ్యెను. నాటి రాజ పురోహితుడు మిక్కిలి వాచాలుడు. ఆయన యేదయిన చెప్ప మొదలిడినచో అన్యుల కవకాశముండదు. రాజు యోచించి ఎవ్వడీయన నోరు కట్టి పెట్టింప గలడో యని అట్టివానికై వెదకుచుండెను. ఆకాలమున వారాణసిలో కుంటి వా డొకడు మట్టిగుళికలు విసరుటలో నేర్పరి. బాలకులు వానిని చిన్నిబండిలో గూరుచుండబెట్టి నగరద్వారమునకు లాగుకొని పోయెడివారు. అచ్చటికి సమీపమున వటవృక్షము కలదు. బాలకులు వానిచుట్టుచేరి చేతిలో డబ్బుపెట్టి మఱ్ఱియాకులు మట్టియుండలతో కొట్టి అశ్వాకారమో గజాకారమో చేయు మనెడివారు. వాడు చిన్నగులకరాలు విసరి కోరిన యాకారము పర్ణములకు కలుగువరకును కొట్టెడివాడు. రాలిన పర్ణములు నేలమీద రాశీభూత మయ్యెడివి.

ఉద్యానమునకు బోవుచు రాజు అచ్చటనాగెను. భయపడి బాలకులు పరుగెత్తిరి. కుంటివాడు మాత్ర మచ్చటనే కూరుచుండియుండెను. ఆకులగుట్ట చూచి, కోసినవా రెవరని రథములోనున్న రా జడిగెను. కుంటివా డాపని చేసెనని విని, వా డెచ్చట నని ప్రశ్నించి, తెలిసికొని, తరుమూలమున నున్నవానిని జూపిరి. రాజు వానినిరప్పించి, పరివారము నావలకు బంపి, "ఏమోయీ, మాకడ వదరుబోతు బ్రాహ్మణు డున్నాడు. ఆయననోరు కట్టిపెట్టించగలవా?" యనెను. "దేవా, యెండు మేకపెంటికలు కల నాళిక తెప్పించినచో ఆయన నోరు కట్టించగలను" అని వాడు పలికెను.

రాజు వానిని తనమేడకు గొనిపోయి, తెర అడ్డము వేసిన గదిలో గూరుచుండబెట్టి, తెరలో చిన్న రంధ్రముచేయించి, మేకపెంటికలు నింపిన నాళికలు తెప్పించి, తెరచిల్లి కెదురుగా పురోహితుని పీఠము వేయించెను. బ్రాహ్మణుడు రాగా రాజాయనను పీఠముపై గూరుచుండ జేసి, సంభాషణ మొదలిడెను. తోడనే బ్రాహ్మణు డందుకొని, అన్యుల కవకాశము లేకుండ మాటాడుచుండెను. ఇచ్చట కుంటివాడు

ఒక్కొక్క పెంటికను రంధ్రము వెంట సూటిగా బ్రాహ్మణుని నోటి లోనికి గొట్టుచుండెను. ఒక్కొక్కదాని నాయన తైలబిందువును మ్రింగినట్లు మ్రింగుచుండెను. కొంతతడవునకు పెంటిక లయిపోయినవి. లోనికి బోయిన వానివలన బ్రాహ్మణుని కడుపు ఉబ్బెను. రాజు గ్రహించి "ఆర్యా, వాక్ప్రవాహమున నోటిలోనికి మేక పెంటికలు పోవుట గమనింపక మ్రింగితిరి. ఇంటికి దయచేసి ప్రియంగూదకము త్రాగి, వమనము చేయుడు. స్వస్థత కలుగును" అని చెప్పెను.

నాటినుండి రాజపురోహితుడు నోరు తెరువక, ఇతరులు పలుక రించినను ప్రతివచన మీయక మౌనశీలి యయ్యెను.

"ఈతనివలన శ్రవణములకు సౌఖ్య మేర్పడినది" అని రాజు సంవత్స రమునకు లక్ష ఆదాయము వచ్చు నాలుగు గ్రామములు కుంటివానికి నాలుగు దిక్కులలో నిచ్చెను.

బోధిసత్త్వుడు రాజును సమీపించి "దేవా! లోకులు బుద్ధిమంతు లగుటయే కాక పుణ్యముకూడ చేయవలెను. గురిచూచుటలో నేర్పరి యయిన కుంటివానికి సంపద లభించినది" అని ఈగాథ పలికెను:

ఎటులనే లక్ష్యశుద్ధి నేర్చుటయె మేలు —
చూడు మీగూనివాని యిషుప్రయోగ
చాతురిని- నాల్గుగ్రామముల్ సంగ్రహించె.

శా స్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి హంసమార కుడు ఇప్పటి భిక్షువు; రాజు ఆనందుడు; పండితమంత్రి నేనే.

## 108 బాహియ జాతకము

శా స్త వేశాలి నాశ్రయించియున్న మహావనమున కూటాగారశాలలో నుండుసమయ మున ఒకానొక లిచ్ఛవిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ లిచ్ఛవిరాజు శ్రద్ధాప్రసన్నుడు; భిక్షుసంఘముతో గూడ బుద్ధుని నిమంత్రించి మహాదానము చేసెను.

శాస్త భోజనానంతరము దానానుమోదనము చేసి, విహారమునకు పోయి, భిక్షువుల కుపదేశ మిచ్చి, గంధకుటిలో ప్రవేశించెను. ధర్మ సభలో భిక్షువులు సంభాషించుచు "ఆయుష్మంతులారా, ఆ లిచ్ఛవి-నరేశుడు చక్కనివాడు; కాని ఆమనభార్య స్థూలదేహ. రాజు ఆమెతో నెట్లు ఉండగలుగుచున్నాడు?" అనుచుండిరి.

శాస్త అరుదెంచి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అని యడిగెను. ఈవిషయము అని వారు చెప్పిన పిమ్మట శాస్త "కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ ఈస్థూలశరీరముతో రాజు కలిసియుండువాడు" అని, వారు కోరినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వ డాయన కమాత్యు డయ్యెను. స్థూలశరీరయగు జానపద స్త్రీ సరియగు వస్త్రము లేనిది భృత్తికై పనిచేయుచు రాజాంగణమున కనతి దూరమున జనుచుండ కడుపుబ్బుకొని వచ్చుటచే క్రిందికి వంగి వస్త్రము సరిగా కప్పుకొని పని ముగించి తోడనే లేచి నిలుచుండెను.

రాజు వాతాయణముగుండ నాక్షణమున నంగణము చూచుచుండ నిది కంటబడెను. అప్పుడీతడు యోజించి '...ఈమె ఆరోగ్యవతి యయియుండును. ఇంట నీమె పరిశుభ్రముగా నుండియుండును. పరిశుద్ధగృహమున జన్మించిన పుత్రుడు పరిశుద్ధుడు, పుణ్యాత్ముడు నగును. ఈమెను అగ్రమహిషిని జేయవలెను' అని, ఆమె కన్యయని తెలిసికొని పిలువనంపి, అగ్రమహిషిస్థాన మిచ్చెను. ఆమె రాజున కాప్తురాలు ప్రియురాలు నయ్యెను. అచిరకాలముననే యామెకు పుత్రుడుదయించెను. ఆతడు చక్రవర్తి యయ్యెను.

ఆమె యదృష్టముచూచి బోధిసత్త్వుడు వచనావకాశముపొంది, రాజుతో 'దేవా, నేర్చికో దగిన విద్య ఏల నేర్వరాదు? ఈపుణ్యాత్మ

రాలు సిగ్గు విడవకుండనే వస్త్రము మాటుచేసికొని, శౌచము కావించి, దేవరను ప్రసన్న చిత్తులను చేసి ఇట్టిసంపద పొందెను" అని యీగాథ పలికెను.

నేర్చికో దగ్గవాక్కులు నేర్వవలయు:
విలువ సరికట్టగా జనుల్ కలరు జగతి.
ప్రభుని వశవర్తి జేసె నీపల్లెపడుచు.

ఇట్లు మహాసత్త్వుడు యుక్త నియమములను పాటించువారి గుణ మును ప్రశంసించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పుడు భార్యా భర్తలు ఇప్పటి భార్యాభర్తలే; పండితామాత్యుడను నేనే.

## 109 కుణ్డకపూవ జాతకము

శాస్త శ్రావస్తిలో నుండి ఒకానొక మహాదరిద్రుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో బుద్ధునకు ఆయనసంఘమునకు అప్పుడప్పు డొకే కుటుంబము దాన మిచ్చుచుండెడిది; ఒక్కొకప్పుడు మూడునాలుగు కుటుంబముల వారును, ఒకప్పుడు ఒకగల్లీలోనివారును మరొకప్పుడు ఒకగణములోవారును, ఒకప్పుడు నగరవాసులును కలిసి నిమంత్రణము చేయుచుందురు. ఆసమయమున ఒకగల్లీలోనివారు దానము చేయు చుండిరి. బుద్ధునకు సంఘమునకు జనులు యవాగువు వడ్డించి భుజింపు డనిరి.

ఇతరులకు కూలి చేసి జీవించుచు ఆగల్లీలోనే నివసించు దరిద్రు డొకడు తనలో "నేను యవాగు నీయజాలను, ఖాద్య మిత్తును" అను

కొని సన్నని బియ్యపురవ్వ చేటతో చెరిగి, నీటిలో నానబెట్టి, జిల్లే డాకులలో నుంచి, నిప్పులమీద వండెను. ఆవల బుద్ధునకు సమర్పింతును అనుకొని యతడు వంటకము పట్టుకొని శాస్తసన్నిధి కరిగి నిలుచుండెను. ఖాద్యములు తెండు అని అచ్చటివారు తొలిసారి అన్నంతనే ఆపేదవాడు శాస్త కెదురుగా జని పూరీ లుంచెను. ఇతరులు సమర్పించిన ఖాద్యములు శాస్త స్వీకరింపక అతని పిండివంటనే గ్రహించెను. తోడనే సమ్యక్-సంబుద్ధుడు పేదవాడు తెచ్చిన యాహారమును ఏవగింపు లేక ఆరగించె ననువార్త నగర మంతట వ్యాపించెను.

రాజు, మహామంత్రి మొదలుకొని ద్వారపాలకులవరకును శాస్తకు ప్రణామము చేసి ఆపేదవానితో "ఓయీ, వందతీసికొని, రెండువందలు తీసికొని, పోనీ అయిదువందలు తీసికొని మాకు భాగ ముంచుము" అని కోరిరి. శాస్త నడిగి తెలిసికొందును అనుకొని దరిద్రుడు శాస్త సన్నిధి కరిగి ఆవిషయము విన్నవించెను. "ధనము తీసికొనిగాని, తీసికొనకుండ గాని సమస్త ప్రాణులను భాగస్వాములను చేయుము" అని శాస్త బదులు చెప్పెను. ఆతడు ధనము స్వీకరింప నారంభించెను. జనులు రెండురెట్లు, నాలుగురెట్లు, ఎనిమిదిరెట్లు – ఈవిధముగా ధన మీయగా మొత్తము తొమ్మిదికోట్ల సువర్ణములు సమకూడెను. శాస్త దానానుమోదనము చేసి విహారమునకు జనెను. భిక్షువులు తమతమ కర్తవ్యమును నెరవేర్చిన పిదప శాస్త వారి కుపదేశమిచ్చి గంధకుటి లోనికి బోయెను.

సాయంకాలము రాజు ఆదరిద్రుని బిలువనంపి శ్రేష్ఠిపదవి యిచ్చి సత్కరించెను. ధర్మసభలో భిక్షువులు ఇష్టాగోష్ఠి చేయుచు "ఆయుష్మంతులారా, మహాదరిద్రుడు సమర్పించిన ఖాద్యమును శాస్త ఏవగింపు లేక అమృత మారగించునట్లు స్వీకరించినాడు. పేదవాడు మహాధనవంతు డయి, శ్రేష్ఠిపదవి పొంది విశేషముగా సమ్మానితు డయినాడు" అనుచుండిరి.

శాస్త అచటికి బోయి, భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అని యడుగగా ఈవిషయ మని వారు చెప్పిరి. అప్పుడు శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వము నేను వృక్షదేవతగా నుండగా ఇట్లే చేసితిని". అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఆముదపుచెట్టులో వృక్షదేవత యయినాడు. ఆకాలమున గ్రామవాసులు దేవతలను పూజించువారు. పండుగ వచ్చినప్పుడు ఆ గ్రామవాసులు తమతమ వృక్షదేవతలను పూజించుట చూచి బీదవాడొకడు ఆముదపు మొక్కను పూజింప దలచెను. జనులు తమతమ దేవతలకు నానావిధ మాద్యగంధ విలేపనములు, ఖాద్యములు కొనిపోయిరి. బీదవాడు తవుడు రొట్టె, టెంకాయ చిప్పలో నీరు పట్టుకొనిపోయి, ఆముదపు మొక్కకు సమీపమున నిలిచి "దేవతలు దివ్యఖాద్యము లారగింతురు. నా దేవత యీ తవుడు రొట్టె తినదు. దీనిని పోగొట్టుకొననేల-నేనే తిందు" నని అక్కడనుండి కదల బోయెను. బోధిసత్త్వుడు చెట్టుపంగలో నిలిచి "ఓయీ, నీవు ధనికుడవే యయినచో నాకు మధుర ఖాద్యములు తెచ్చి యుందువు. నీవు పేదవాడవు. నీయపూపమును గాక వేరేమి తిందును ? నా భాగమును హరింపకుము" అని పలికి యీగాథ పలికినాడు :

కొలుచు మానవునకు కూర్చెడి యన్నమే
కొలువు కొనెడివేల్పు కుడుచుచుండు.
నాయపూప మేదో నా కిటు కొనితెమ్ము—
నష్టపెట్ట బోకు నాదుపాలు!

అతడు వెనుదిరిగి, బోధిసత్త్వుని చూచి నైవేద్యము పెట్టినాడు. బోధిసత్త్వుడు దానిని భుజించి "ఓయీ, నీ వేల నన్ను పూజించినావు?" అనెను. "స్వామీ, నేను దుర్గతికుడను. నాదారిద్ర్యము పరిహరించుటకై మీపూజ చేసినాను" అని యతడు పలికెను. "ఇక విచారింపకుము. సత్కార్యములు గ్రహించి, కృతజ్ఞు డగువాని నర్చించినావు. ఈ యాముదపుమొక్క చుట్టు మెడకు మెడ తగులుకొన్న నిధికుంభము లున్నవి. రాజుకు తెలిపి, శకటములలో ధనమును గొనిపోయి రాజాంగణమున దింపుము. సంతుష్టుడై రాజు నిన్ను శ్రేష్ఠిని జేయును" అని చెప్పి బోధిసత్త్వు డంతర్ధాన మాయెను. వాడట్లే చేసెను. రా జతనికి శ్రేష్ఠిపదవి యిచ్చెను. ఇట్లతడు బోధిసత్త్వుని

వలన మహాసంపత్తి పొంది, యథాకమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలమున పేదవాడు ఇప్పటి పేదవాడు; అరణ్యవృక్షదేవత నేనే.

## 110 సబ్బసంహార పన్హ

ఈ సర్వసమాహారక ప్రశ్న వివరముగా ఉమ్మగ్గ జాతకమున వచ్చును.

## 111 గద్రభ పన్హ

గద్రభ ప్రశ్న ఉమ్మగ్గ జాతకమున వివరింపబడును.

## 112 అమరాదేవీ పన్హ

అమరాదేవీ ప్రశ్న ఉమ్మగ్గ జాతకముననే వివృత మగును.

# 113 సిగాల జాతకము

**శాస్త వేళువనమున విహారము చేయుచు దేవదత్తుని విషయమై చెప్పినది.**

## వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు ధర్మసభలో సంభాషించుచు "ఆయుష్మంతులారా, దేవదత్తుడు 500 మంది భిక్షువులను తీసికొని గయాశీర్ష మునకు పోయినాడు. అచ్చటికిపోయి ఆభిక్షువులతో నతడు, "శ్రమణ గౌతము డాచరించునది ధర్మము కాదు. నేను చేయునది ధర్మము" అని తనమతము సృజించి, మిథ్యాచరణము చేయుచు, సంఘములో చీలిక తెచ్చి, ఒకసీమలో రెండు ఉపోసథ గృహములు ఏర్పాటు చేసినాడు" అనుచు దేవదత్తుని నిందించుచుండిరి. భగవాన్ అక్కడకు వచ్చి "ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిమ్మట శాస్త "భిక్షువులారా, దేవదత్తుడు కేవల మిప్పుడే కాదు, పూర్వజన్మమున కూడ అసత్యములు పలుకుచుండెడివాడు" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు శ్మశానమున వృక్షదేవతగా నుండెను. అప్పుడు వారాణసిలో ఉత్సవము జరుగుచుండెను. యక్షులకు పూజాబలులు సమర్పింప జనులు చేపలు, మాంసపుముక్కలు అంగణములలో వీధులలో చల్లి, భాండములలో విశేషముగా సుర నింపిరి. అర్ధరాత్రమున నక్క అగడ్త ద్వారా నగరములో ప్రవేశించి, మత్స్యమాంసములు తిని, సుర త్రాగి, పున్నాగ తరువులలో జేరి నిద్రపోయెను. దానికి మెలకువ వచ్చునప్పటికి తెల్లవారెను. ఇప్పుడు నేను సురక్షితముగా మరలి పోలేను, అని మార్గ సమీపమున నక్కి, జనులు కానవచ్చినపు డావలకు బోవుచు, తుదకు బ్రాహ్మణుడు దంతధావనార్థము తటాకము కడకు బోవుచుండ జూచి "బ్రాహ్మణులకు ధనలోభ ముండును. ఈయనకు లోభము కలిగించి, తన యుత్తరీయమున నన్ను దాచి నగరము

వెలుపలికి గొనిపోవునట్లు చేయుదు" నని తలపోసి, మనుష్యవాక్కున బ్రాహ్మణోత్తమా! యని పిలిచెను.

"ఎవరో నన్ను పిలుచుచున్నారే!" అని బ్రాహ్మణుడు వెనుదిరిగెను. "నేను, బ్రాహ్మణోత్తమా!" "ఎందులకు?" "బ్రాహ్మణోత్తమా, నాకడ రెండువందల కార్షాపణము లున్నవి. నన్ను నీయుత్తరీయములో దాచి, యెవ్వరికిని కనబడనీయక నగరము వెలుపలకు దాటవేసినచో నీ కవి యిచ్చెదను." ధన లోభముచే బ్రాహ్మణు డంగీకరించి నక్కను నగరము వెలుపలికి గొంపోయెను. "బ్రాహ్మణోత్తమా, ఇది యేమి ప్రదేశము?" అని నక్క యడిగెను. "అముక ప్రదేశము" అని బ్రాహ్మణుడు చెప్పెను. "ఇంక కొంచెము దూరము పొమ్ము" అని మాటిమాటికి నక్క వేగిరించుచు, మహాశ్మశానము చేరునప్పటికి "నన్నిక్కడ దింపుము" అనెను. బ్రాహ్మణుడు దానిని దింపగా, "నీ యుత్తరీయము నేలపై బరచుము" అని నక్క పలికెను. బ్రాహ్మణు డట్లే చేసెను. "ఈచెట్టు మొనట త్రవ్వుము" అని పని కల్పించి, బ్రాహ్మణుడు త్రవ్వుచుండగా, నతని యుత్తరీయము పై నిలిచి, నాలుగు చెరగులమీదను మధ్యభాగమునను మలమూత్రములు విడిచి, అడవిలోనికి బరుగెత్తెను.

అప్పుడు బోధిసత్త్వుడు చెట్టునడుమ నిలిచి, యీగాథ చెప్పెను.

మద్య మానిన యీనక్కమాట విశ్వ
సించుచున్నావు బాపడా, చెనటి వగుచు !
దీనికడ చిల్లిగవ్వయు నైన లేదు ,
రెండునూర్ల కార్షాపణా లుండునొక్కొ ?

అని యీపద్యము చెప్పి బోధిసత్త్వుడు బ్రాహ్మణునితో "ఇకపోయి నీయుత్తరీయము నుదికి, స్నానము చేసి, నీపని చేసికొమ్ము" అని పలికి యంతర్ధానము చెందెను. బ్రాహ్మణు డట్లు చేసి, వంచన జరిగినందులకు విషణ్ణ చిత్తముతో నరిగెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము తెలువరించెను. ఆసమయమున నక్క దేవదత్తుడు; వృక్షదేవత నేనే.

# 114 మితచిన్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఇద్దరు వృద్ధస్థవిరులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఉభయులు అడవిలో వర్షాకాలము గడపి, ఇక శాస్త దర్శనార్థము పోవుద మని, ప్రయాణమునకు వలయు సామాగ్రిని సమకూర్చుకొని, నేడు పోవుదము, రేపు పోవుదము అను ఆలోచనలలో మాసము గడపిరి. మరల సామగ్రి సమకూర్చుకొని రెండవమారు, నేడు బయలు దేరుదము, రేపు బయలుదేరుదము అను నాలోచనలలో ఇంకొక నెల దాటిపోయినది. ఈప్రకారముగా వారు మాంద్యముచేతను, నివాస స్థానముమీది మోహముచేతను మరల మూడవమాసము గూడ గడ పిరి. ఆతరువాత ఉభయులు జేతవనమున జేరి తమకు తగినచోట పంచ చీవరము లుంచి బుద్ధదర్శనార్థము చనిరి. భిక్షువులు వారితో "ఆయు ష్మంతులారా, బుద్ధసేవార్థము బహుకాలమునకు వచ్చితిరి. ఇంత ఆలస్య మగుటకు కారణ మేమి?" యనిరి. వారు జరిగినది వివరించిరి. వారి మాంద్యమునకు ఆలస్యమునకు కారణభూత మైనస్వభావము భిక్షువు లందరకును ప్రకట మయ్యెను. భిక్షువులు ధర్మసభలో చేరి వారియలస స్వభావమును గూర్చి చర్చించుచుండిరి. శాస్త అరుదెంచి ఏమి మాటాడుచున్నా రని యడుగగా వారు ఈవిషయ మని చెప్పిరి. బుద్ధుడు భిక్షుద్వయమును పిలువ నంపి "భిక్షువులారా, మీరు అలస స్వభావు లగుట సత్యమేనా?" అనెను. "భన్తే, సత్యమే" అని వా రనగా శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వజన్మమున గూడ మీరు ఆలసించుచు, నివాసస్థానముపై మోహము విడువ లేదు" అని పూర్వజన్మకథ జెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, వారాణసీనదిలో మూడు మత్స్యము లుండెను. బహుచింతకుడు, అల్ప

చింతకుడు, మితచింతకుడు అవి వానిపేర్లు. అవి యరణ్యప్రాంతము నుండి ప్రవాహాముఖమున మానవ నివాసములకడకు జేరెను. మిత చింతకుడు వారితో "ఇది మానవపథము. అనుమానాస్పదము, భయాస్పదము, కైవర్తకులు నానావిధ జాలములను, బుట్టలను, బెట్టి చేపలను బట్టుదురు. మనము అరణ్యములోనికే పోవుదము" అని చెప్పెను. మిగిలిన రెండు చేపలు అలసభావముచేతను, ఆమిషలోభము చేతను, 'నేడు పోవుదము, రేపు పోవుదము' అని మూడుమాసములు గడపినవి. ఒకనాడు కైవర్తకులు నదిలో వలవేసిరి. బహుచింతకుడు, అల్పచింతకుడు ఎర పట్టుకొనుటకై ముందరికి బోయినవి. అవి తమ బుద్ధిహీనతవలన వలలోపలికే పోయినవి. మితచింతకుడు వెనుక వచ్చుచు వలనుచూచి, తక్కిన రెండిటిని జాలకుక్షిలో గనుగొనెను.

"ఈసోమరి బుద్ధిహీనులను రక్షింపవలెను" అని భావించి మిత చింతకుడు వల చుట్టును తిరిగి, వెనుకనుండి వచ్చి నీటిమొగువకు జాలకుక్షిలో నుండి తప్పించుకొని పోయిన దానివలె గంతువేసెను; మరల వెనుకకు బోయి వలనుండి తప్పించుకొని ప్రవాహము వాలున పోయిన దానివలె నీటిలో మరల గంతువేసెను. పల్లెకారులు చూచి వల త్రెంచుకొని చేపలు తప్పించుకొని పోయినవని తలచి, ఒకకోణము నుండి వల లాగిరి. సందు దొరకిన వెంటనే రెండుచేపలును ప్రవాహము లోనికి పోయినవి. ఈవిధముగా మితచింతకుడు వానిని రక్షించెను.

అల్పచింతకుడు నతిచింతకుండును
చిక్కి జాలమందు చెందిరి శ్రమ;
వెతను పొందకుండ మితచింతకు డొకండె
వలలనుండి వారి వెలువరించె.

ఈవిధముగా శాస్త్ర ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను తెలిపి జాతకసారాంశము వెలువరించెను. స్థవిరులిరువురు శ్రోతాపత్తిలో ప్రతిష్ఠితు లయిరి. ఆకాలమున బహుచింతకుడు, అల్ప చింతకుడు ఈస్థవిరులిరువురు; మితచింతకుడు నేనే.

# 115 అనుసాసిక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉపదేశ మిచ్చు భిక్షుకురాలిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆమె శ్రావస్తిలో ఒకానొక కులపుత్రిక. ఆమె ప్రవ్రజించి ఉప సంపన్న యయినప్పటినుండియు శ్రమణధర్మమును పాటింపక పదార్థ ముల యెడ పేరాశ కలిగి, ఇతర భిక్షువులు పోవని భాగములకు భిక్షార్థము పర్యటించుచుండెను. లోకు లామెకు బాగుగా భోజనము పెట్టు చుండిరి. ఆమె తనతృష్ణచే ఇతర భిక్షునులు తాను భిక్షార్థ మరుగు తావులకు బోవుదు రేమో యనియు, అపుడు తనలబ్ధికి లోటు చేకూరు ననియు, తలచి అన్యలు పోవకుండు నట్లు యోజన చేసి భిక్షునుల నివాసస్థానమునకు బోయి "సోదరలారా, ఆప్రదేశమున మదపు టేనుగు కలదు. ఆచోట ప్రచండహయ మున్నది. అచట భయంకర శ్వాన మున్నది. అయ్యవి ఆపత్కరప్రదేశములు. భిక్షార్థ మచటికి జనవలదు, అని బోధించెను. ఒక్కతెయు మెడ యెత్తి ఆప్రదేశముల వైపు చూచెడిది కాదు.

ఒకనా డామె యావైపు భిక్షార్థ మరిగి త్వరితముగా నొక యింటిలో ప్రవేశించుచుండ పందెపు పొట్టేలు ఆమెను మార్కొని తొడయెముక విరగబొడిచెను. రెండుముక్కలుగా విరిగిన యామెతొడ బొమికెకు జనులు కట్టు కట్టి, ఆమెను మంచముపై వేసికొని బిక్షునుల యాశ్రమము నకు గొనిపోయిరి. "ఈమె ఇతర బిక్షునులకు పోవలదని ఉపదేశ మిచ్చెడిది. కాని తానుమాత్రము పోయి ఎముక విరుగగొట్టుకొన్నది." అని బిక్షునులు పరిహాసము చేసిరి. వార్త త్వరలోనే భిక్షుసంఘమునకు బ్రాకెను.

ఒకనాడు ధర్మసభలో గూరుచుండి భిక్షువు లామెను నిందించుచు "ఆయుష్మంతులారా, అన్యల కుపదేశ మిచ్చు భిక్షుని స్వయముగా నచ్చటికి బోయి, పొట్టేలు డీకొనుటచే తొడ విరగగొట్టుకొన్నది" అనిరి:

శాస్త్ర వచ్చి "భిక్షువులారా, ఏమి మాటాడుచున్నారు?" అనెను. వారు ఈవిషయము అని చెప్పినపిదప శాస్త్ర వారితో "భిక్షువులారా, ఇప్పుడే కాదు; పూర్వమున గూడ నీమె ఉపదేశ మిచ్చుచు, తదనుసారముగా నాచరింపకుండుటచే దుఃఖ మనుభవించినది" అని, పూర్వ జన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు పక్షికడుపున పుట్టి, పెరిగి, పక్షిజ్యేష్ఠు డయి, బహుసహస్ర శకుంత పరివృతుడై హిమవంతము జేరెను. ఆయన యచట నివసించు కాలమున నొకానొక చండశకుంతము మహామార్గమున బోయి యాహారము సంపాదించుచుండెను. పోయెడి బండ్లనుండి మార్గమున రాలు బియ్యము, ముద్గ, బీజాదులు ఏరుకొని తినుచు, "ఈ ప్రదేశమున కితరపక్షులు రాకుండునట్లు చేయుదు నని తలచి, పక్షిసంఘముతో 'మహావర్త్మ మనగా భయావహము. ఏనుగులు, గుఱ్ఱములు మొదలగునవియు, భీకర వృషభములు లాగు శకటములును పోవుచుండును. చప్పున నెగురుటకు వీలుండదు. అచ్చటికి పోవకుండుటే మేలు" అని యుపదేశము చేసెను. ఆపిట్టకు శకుంత సంఘము అనుశాసిక అని పేరు పెట్టెను.

ఒకనాడు మార్గమున గింజలు తినుచుండగా మహావేగమున వచ్చుచున్న శకట ధ్వని విని పక్షి వెనుదిరిగి చూచి, 'యింకను దూరమున నున్నది' అని గింజ లేరి తినుచుండెను. శకటము వాయువేగమున వచ్చినది. పిట్ట యెగురలేక చక్రముక్రిందబడి నలిగిపోయినది. తక్కిన పిట్టలతోపాటు ఆ పిట్ట కనబడకపోవుటచే శకుంతజ్యేష్ఠుడు" అనుశాసిక యెక్కడ? వెదకిచూడుడు' అని యానతిచ్చెను. పిట్టలు వెదకి, మహామార్గమున నలిగి చచ్చి పడియుండుటచూచి వచ్చి, చెప్పినవి. 'తక్కిన పిట్టలకు తాను బోధించిన జాగరూకత తానే యనుసరింపక పోవుటచే మృతినొంది యుండును' అని శకుంతజ్యేష్ఠము పలికి, యీగాథ చెప్పెను :

ఇతరులకు నీతు లుపదేశ మిచ్చుపిట్ట
తనకు దాన దురాశకు దాసి యగుచు,
ఇదిగో రథచక్రములక్రింద నిట్టులు పడి
వక్షములు కోలుపోయి జీవములు విడిచె.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలమున ఉపదేశ మిచ్చుపిట్ట ఇప్పటిబిక్షుని; జ్యేష్ఠపక్షి నేనే.

## 116 దుబ్బచ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మాట వినని భిక్షువు విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆకథ నవమ నిపాతములో గిజ్ఝ జాతకమున వచ్చును. శాస్త ఆభిక్షువును పిలువనంపి "భిక్షూ, నీవు కేవల మిప్పుడే మాట వినని వాడవు కావు; పూర్వముకూడ పండితులమాట వినక శక్తి- ఆఘాతముచే ప్రాణములు కోలుపోతివి" అని పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు లంఘననటక కుటుంబమున జన్మించెను. ఆయన పెరిగి పెద్దవాడయి, ప్రజ్ఞావంతుడు, ఉపాయశాలియు నయ్యెను. ఆత డొక లంఘన నటునికడ భల్లనాట్యము నేర్చి, యాచార్యునితోగూడ విద్యాప్రదర్శనము చేయుచు సంచారము చేయుచుండెను. ఆచార్యునకు నాలుగు బల్లెముల నాట్యము తెలియును కాని అయిదుబల్లెముల నాట్యము తెలియదు. ఆత డొకనాడు ఒకానొక గ్రామమున నాట్యా

ప్రదర్శనము చేయుచు, సురామత్తుడై, అయిదుబల్లెములు పాతించి, నాట్యము చేయుదునని ప్రకటించెను.

"మీకు అయిదుబల్లెముల లంఘనశిల్పము తెలియదు ఆచార్యా! ఒకదానిని తొలగింపుడు. తొలగింపనిచో అయిదవబల్లెము గ్రుచ్చుకొని ప్రాణములు విడుతురు" అని బోధిసత్త్వుడు చెప్పెను.

'నే నేమి చేయగలనో నాకే తెలియును" అని మత్తతచే బోధిసత్త్వునిమాట వినక, అతడు నాలుగు దూకి, అయిదవబల్లెము మీద దండకమున మధూకపుష్పమువలె దిగబడి మూలుగుచుండెను. అంతట బోధిసత్త్వుడు "బుద్ధిమంతులమాట వినక ఈవ్యధకు పాల్పడినారు" అని ఈగాథ చెప్పెను:

అరిగినాడ వాచార్య, నేడతిగ నీవు
నాదు గూడ నీమార్గము నచ్చలేదు
నాల్గుదాటి ఐదింటను నీల్గినావు!

ఇట్లు చెప్పి, ఆచార్యుని బల్లెమునుండి తప్పించి, కళేబరమునకు బోధిసత్త్వుడు అంత్యక్రియలు చేసెను.

శాస్త జాతకసారాంశము వెలువరించెను. అప్పటి ఆచార్యుడు ఈభిక్షువు; శిష్యుడు నేనే.

## 117 తిత్తిర జాతకము (2)

శాస్త జేతవనమున విహారము చేయుచు కోకాలికుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఇది పదుమూడవ నిపాతమున తక్కారియ జాతకమున (481) ప్రకట మగును. శాస్త "భిక్షువులారా, కోకాలికుడు తనవాక్కువలన కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ నష్టపడినాడు" అని పూర్వజన్మ కథ చెప్పెను.

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఉదీచ్య బ్రాహ్మణ వంశమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలానగరమున విద్యలు పూర్తి చేసి, కోరికలు విడనాడి, వానప్రస్థుడయ్యెను. ఆయన పంచాభిజ్ఞలను అష్టసమాపత్తులను పొందెను. హిమవత్ప్రదేశమున ఋషులు చేరి, ఆయన నాచార్యునిగా గ్రహించి, యనుసరించుచుండిరి. ఆయన పంచశతఋషిగణమున కాచార్యుడై ధ్యానకేళిలో క్రీడించుచుండెను. ఒకానొక పాండురోగి తాపసుడు కుఠారము పూని కట్టెలు కొట్టుచుండెను. ఒకానొక ముఖర తాపసుడు ఆతని ప్రక్కన గూరుచుండి, ఇక్కడ దెబ్బ కొట్టుము, అని నిర్దేశించుచుండెను. రోగి తాపసుడు కోపోద్రిక్తుడై "దారుదారణము నాకు నీవా బోధింతువు!" వని తీక్ష్ణ కుఠార మెత్తి ఒక్క పెట్టున నతని ప్రాణములు పాపెను. బోధిసత్త్వుడు మృతకళేబరమున కంత్య క్రియలు చేసెను.

ఆయాశ్రమమున కనతిదూరములో వల్మీకము మీద తిత్తిరి నివసించుచుండెను. అది సాయం ప్రాతఃకాలములందు వల్మీకముపై గూయుచుండెను. ఒకానొక లుబ్ధకు డది విని, ధ్వని గురుతించి, పోయి దానిని వధించి, కొంపోయెను. దాని సవ్వడి వినబడనందున బోధిసత్త్వుడు "ఆప్రదేశమున తిత్తిరి యుండెడిది. దాని కంఠధ్వని వినబడుట లేదేమి?" అని తాపసుల నడిగెను. వారు జరిగిన సంగతి చెప్పిరి. రెండు ఘటనలను కలిపి బోధిసత్త్వుడు ఋషిగణ మధ్యమున నీగాథ చెప్పెను:

ఎత్తు కెగసి మింట నెక్కువ వేగాన
దీర్ఘముగను కూయు తీతువు నెటు
చంపివేసి రట్లె చంపిరి దుర్మదు
డతడు పరుషవాక్కు లాడు నపుడు.

ఇట్లు బోధిసత్త్వుడు నాలుగు బ్రహ్మవిహారములను భావించి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి కోకాలికుడు ఇప్పటి దుష్టవచస్కుడైన తాపసుడు; ఋషిగణశాస్త నేనే.

## 118 వర్తక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా ఉత్తరు డను శ్రేష్ఠి పుత్రుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఉత్తరు డను శ్రేష్ఠి మహాధనవంతుడు. ఆయన భార్య కడుపున బాలకుడు పుట్టెను. అతడు పుణ్యాత్ముడు; బ్రహ్మలోకము నుండి జారిపడి ఇక్కడ జన్మ మెత్తినాడు. అతడు పెరిగి పెద్దవాడైన పిమ్మట బ్రహ్మవలెనే సుందరవర్ణముతో కూడి యుండెను.

ఒకనాడు శ్రావస్తిలో కార్తికమహోత్సవము జరుగు నని చాటించిరి. జను లెల్లరు ఉత్సవము జరుపుచు ఉద్రిక్తులై యుండిరి. ఆయువకుని మిత్రులకు, రెండవ శ్రేష్ఠి పుత్రులకు భార్యలుండిరి; ఉత్తరశ్రేష్ఠి పుత్రుడు చాల కాలముగువరకు బ్రహ్మలోక మందు దున్నవా డగుటచే అతనికి కామోపభోగముల యందు ఆసక్తి లేదు.

ఉత్తర శ్రేష్ఠి పుత్రునికి కూడ స్త్రీ నొకతెను తెచ్చి సమర్పించి పండుగ చెయ్య వలె నని అతని మిత్రులు యోచించి అతని కడకు జని "సౌమ్యా, ఈనగరమున కార్తిక రాత్రి మహోత్సవము చాటించి నారు. నీకొరకు గూడ నొకతెను తెచ్చి పండుగ చేసికొందమా?" అనిరి.

నాకు స్త్రీతో పనిలేదు అని ఆతడు చెప్పినను వారు మాటి మాటికిని పట్టు పట్టి అతని నంగీకరింప జేసిరి. ఒకానొక వేశ్యను సమస్తాభరణములతో నలంకరించి ఆతని ఇంటికి గొనిపోయి ఆతడు పండుకొను గది చూపి, నీవు శ్రేష్ఠి పుత్రునికడకు పొమ్ము, అని వారు వెడలి పోయిరి.

వేశ్య శయనాగారములోనికి ప్రవేశించినను శ్రేష్ఠి పుత్రుడు ఆమె వంక చూడలేదు. నోరు మెదల్పలేదు. ఆమె తనలో "నావంటి చక్కని ఉత్తమ విలాసిని వైపు చూడకున్నాడు. పెదవి కదల్ప కున్నాడు. స్త్రీ లీల చూపి ఇతనిని వశము చేసుకొందును," అనుకొని విలాసము చూపుచు ప్రసన్నముఖ యైనట్లు ముందరి దంతములు కనబడునట్లు

వచ్చెను. అది చూచిన శ్రేష్ఠి పుత్రునకు దంతముల యెముకల మీద ధ్యానము నిలిచెను. అందు అస్థికలుపుట్టినవి. అతనికి శరీర మంతయు అస్థిపంజరము వలె తోచసాగెను. ఆమె కతడు డబ్బిచ్చి పంపెను.

ఆమె ఇంటిలో నుండి వెలువడి వీధి నడుమ నిలిచి చూచు నప్పటికి ధనవంతు డొకడు ఆమెకు సొమ్మిచ్చి తన ఇంటిలోనికి కొనిపోయెను. వారముదోజులకు ఉత్సవ సమాప్తి అయ్యెను. వేశ్యమాత తన బిడ్డ ఇంటికి రాకుండుటచే శ్రేష్ఠి పుత్రుల కడకు పోయి, నా బిడ్డ ఎక్కడ నున్నది, అని అడిగెను. ఉత్తర శ్రేష్ఠి పుత్రుని ఇంటికి పోయి వారు వేశ్య ఎక్కడ నున్న దని అడిగిరి. అప్పుడే ధన మిచ్చి ఆమెను పంపి వేసినా నని అతడు చెప్పెను. వేశ్యమాత రోదనము చేయుచు "నాబిడ్డ కానవచ్చుట లేదు. ఆమెను తీసికొని రండు" అనుచు ఉత్తర శ్రేష్ఠి కుమారుని వెంటబెట్టుకొని రాజు కడకు పోయెను.

రాజు అభియోగము విచారించి తీర్పు చెప్పబోవుచు "ఈ శ్రేష్ఠి పుత్రులు నీకు వేశ్యను సమర్పించినారా?" అని శ్రేష్ఠి పుత్రు నడిగెను.

"దేవా, చిత్తము."

"ఆమె ఇప్పు డెక్కడ నున్నది?"

"నాకు తెలియదు. ఆమెకు డబ్బిచ్చి వెంటనే పంపివేసితిని."

ఇప్పుడు నీ వామెను తీసికొని రాగలవా?"

"దేవా, తే జాలను."

"నీవు తీసికొని రాలేని పక్షమున నీకు రాజదండము విధింతుము."

ఆతని చేతులు వెనుకకు విరిచి కట్టి రాజదండ మిచ్చుటకు పట్టు కొని పోయిరి. వేశ్యను తీసికొని రాజాలనందున రాజు శ్రేష్ఠిపుత్రునకు మరణదండనము విధించినా డని విని నగరములో పెద్ద అలజడి బయలుదేరెను. లోకులు రొమ్ముపై చేతులు వేసికొని "స్వామీ, ఇది మీకు తగిన దేనా?" అనుచు దుఃఖింపసాగిరి. శ్రేష్ఠి కూడ ఏడ్చి మొత్తుకొనుచు కుమారుని వెనువెంటనే పోవుచుండెను. శ్రేష్ఠి పుత్రుడు తనలో "నాకు ఈప్రకారముగా కష్టము ప్రాప్తించుటకు ఇంట నుండుటయే. ఈగండము గడచి బయలు పడితి నేని గౌతమ సమ్యక్ సంబుద్ధుని సన్నిధిలో ప్రవ్రజింతును." అనుకొనెను.

వేశ్య ఆగడబిడ ఏమని లోకులను ప్రశ్నించెను. సంగతి తెలిసిన

పిమ్మట ఆమె శీఘ్రముగా మేడదిగి "స్వామీ, ఆగుడు, ఆగుడు!" అని, రాజపురుషులను నేనొకసారి చూడవలెను. అని వారిని సమీపించెను. రాజపురుషు లామెను చూచి తల్లికి సమర్పించి శ్రేష్ఠి పుత్రుని విడిచి పుచ్చిరి.

శ్రేష్ఠిపుత్రుడు మిత్రులతో నదికిపోయి అచ్చట శిరస్స్నానము చేసి, ఇంటికిజని ప్రాతర్భోజనము చేసి, తలిదండ్రులకు ప్రవ్రజ్యావిషయమై చెప్పి, చీవరములను చేకొని జనసమూహముతో కలసి బుద్ధుని సన్నిధికి పోయి ప్రణామము చేసి ప్రవ్రజ్యకొరకు వేడెను. ప్రవ్రజ్యయు ఉప సంపదయు లభించినపిదప శ్రేష్ఠిపుత్రుడు యోగాభ్యాసయుక్తుడై విపశ్య యనను వృద్ధిచేసికొని, త్వరలోనే అర్హత్వము పొందెను.

ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై శ్రేష్ఠిపుత్రుని ప్రశం సించుచు "ఆయుష్మంతులారా, శ్రేష్ఠిపుత్రుడు తనకు సంభవించిన ఆపదచూచి బుద్ధశాసనమున మహిమ గ్రహించి, ఈ గండమునుండి బయట పడినపిమ్మట ప్రవ్రజింతును అనుకొని ఆశుభచింతకు ఫలిత ముగా విముక్తి పొంది, ప్రవ్రజించి అర్హత్వముకూడ పొందినాడు" అను చుండిరి. శాస్త అచటి కరుదెంచి "భిక్షువులారా, ఇప్పుడేమి మాటాడుచున్నారు?" అనెను: ఫలాని విషయము అని వారు చెప్పిన పిమ్మట శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడేకాదు; పూర్వముకూడ శ్రేష్ఠిపుత్రుడు మృత్తి భయమునుండి విముక్తుడైనాడు" అని పూర్వ జన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు జన్మాంతర పరివర్తనమున టిట్టిభము కడుపున బుట్టెను. ఆరోజులలో బోయవా డడవిలో టిట్టిభములను బట్టి యింటికి గొని పోయి మేతపెట్టి, లోకులకు విక్రయించి జీవించు చుండెడివాడు. వా డొకనాడు అనేక టిట్టిభములతో పాటు బోధిసత్త్వునికూడ పట్టుకొని వచ్చెను. బోధిసత్త్వు డిట్లు యోజించెను: "వీ డిచ్చు నాహార పానీయ ములు గ్రహింతునేని నన్ను విక్రయించును. గ్రహింప నేని చిక్కి పోవుదును. అప్పుడు లోకులు నన్ను స్వీకరింపరు. నేను సురక్షితముగా

నుండును. కావున ఈ యుపాయ మవలంబింతును''. ఇట్లు తలచి బోధిసత్త్వుడు ఆహార పానీయములు స్వీకరింపక చిక్కి శల్య మయ్యెను. లోకు లతనిని చూచియు కొనలేదు. లుబ్ధకుడు బోధిసత్త్వుని తప్ప తక్కిన పక్షుల నన్నిటిని విక్రయించి, పంజరములోనుండి అతని నీవలకు దీసి, చేతిపై బెట్టుకొని, ఏల యీపిట్ట యిట్లున్నది, అని పరీక్షింప బోచ్చెను. వాడజాగరూకుడై యుండుట గమనించి బోధిసత్త్వుడు రెక్కలుచాచి, యెగిరి యరణ్యమునకు బోయెను. టిట్టిభము లతనిని జూచి, 'ఇంతకాలము కనబడవైతివి. ఎచ్చట నుంటివి?' అని యడిగినవి. 'లుబ్ధకుడు పట్టుకొన్నాడు.' "ఎట్లు తప్పించుకొంటివి?" "వాడు పెట్టిన మేత, నీరు నేను ముట్టుకొనలేదు. ఈ యుపాయమున తప్పించుకొంటిని'' అని పలికి యీగాథ చెప్పెను:

యోచనము చేయలేని యయోగ్యజనుడు
పారముం గాంచనేర డెప్పటికి గూడ
చూడు, మాలోచనఫలంబు చూచునన్ను
తలగికొంటిని మృత్యుబంధనమునుండి.

ఇట్లు బోధిసత్త్వుడు తాను చేసినకృత్యము తెలిపెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకమును సరిపోల్చెను. ఆసమయమున మరణము నుండి విముక్తి పొందిన శ్రేష్ఠి పుత్రుడు నేనే.

## 119 అకాలరావి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు అసమయమున ధ్వని చేయుభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తి నివాసి యగు నొకతరుణుడు బుద్ధశాసనమున ప్రవ్రజించి, కర్తవ్యమునుగూర్చి శిక్షణ పొందకుండెను. ఈసమయమున నేను నేల

తుడువవలెను, ఈవేళ సేవ చేయవలెను, ఈకాలమున పాఠము చదువవలెను, అని తెలిసికొనలేదు. ప్రథమయామములో, మధ్యయామములో, తుదియామములో కన్నులు తెరపుడు పడినప్పుడెల్ల అతడరచుచుండెడివాడు. భిక్షువులకు నిద్ర పట్టెడిది కాదు. ధర్మసభలో గూరుచుండి భిక్షువు లాతనిని నిందించుచు "ఆయుష్మంతులారా, ఈ భిక్షువు రత్నమువంటి యీశాసనమున ప్రవ్రజించి కర్తవ్యము నెరుగడు, శిక్షణ నెరుగడు, సమయాసమయము లెరుగడు" అనుచుండిరి.

శాస్త యరుదెంచి "భిక్షువులారా, ఇప్పు డేమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిదప, శాస్త "భిక్షువులారా, ఈతడు కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ సమయాసమయము లెరుగక అరచుచుండుటచే మెడ విరిచి చంపిరి" అని, పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు ఉదీచ్యబ్రాహ్మణ కుటుంబమున బుట్టి, సకల విద్యలు నేర్చి, జగద్విఖ్యాతు డైన యాచార్యుడయ్యెను. ఆయనకడ అయిదువందల విద్యార్థులు విద్యల నభ్యసించుచుండిరి. ఆ మాణవకుల కడ సకాలమునకు కూయు కుక్కుటము కలదు. దాని కూత విని లేచి విద్యార్థులు పాఠములు చదువుచుందురు. కొంతకాలమునకు కోడి చనిపోయెను. వేరొక కోడికొరకు వారు వెదకుచుండ, నం దొకరు మహాశ్మశానముకడ కట్టె లేరుచుండ కోడి కానవచ్చెను. దానిని పంజరములో నుంచి, కొనివచ్చిరి. అది శ్మశానమున పెరుగుటచే దానికి కాలజ్ఞానములేదు! ఒక్కొకప్పు డర్ధరాత్రముననను వేరొకప్పు డరుణోదయముననను కూయుచుండెను. అర్ధరాత్రమున కోడి కూతవిని మాణవకులు లేచి, పాఠములు చదివి, ప్రాతఃకాలమునకు బడలికచెంది, సరిగా విద్యలు గ్రహింపలేకుండిరి. పగలది కూయుచున్నపుడు పాఠములు వల్లించుట కవకాశము లేకుండెను. అహోరాత్రములు కూయుచుండుటచే నిద్రావకాశముకూడ లేదాయెను. ఒకనాడు మాణవకులు "ఈ కోడి అర్ధరాత్రమున కూయుచున్నది.

తెల్లవారుజామున కూయుచున్నది. దీనివలన మన చదువు నిలిచిపోవు చున్నది" అని దానిగొంతు నులిమివేసి" అకాలరావియగు కుక్కుటమును మేము సంహరించినాము" అని ఆచార్యునితో చెప్పిరి. ఆచార్యుడు "అవర్ధితభావమున (సుశిక్ష లేక) విని మరణించినది" అని పలికి, వారల కుపదేశ మిచ్చుటకై గాథ చెప్పెను :

తల్లిదండ్రులవద్ద తగినశిక్షణము
నందక, గురుకులమ్మందు వాసమ్ము
సలుపని యీకోడి సమయ మెరుంగ
కారావ మొనరించు నన్నివేళలను.

బోధిసత్త్వు డి ట్లుపదేశించి, జీవితాంతమున యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలిబుచ్చెను. అప్పటి కోడి ఇప్పటి భిక్షువు; శిష్యులు బుద్ధపరిషత్తు; ఆచార్యుడు నేనే.

## 120 బంధనమోక్ష జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా చించమాణవికను గూర్చి చెప్పినది.

ఆకథ పండ్రెండవ నిపాతమున మహాపదుమ జాతకమున (472) వచ్చును. ఆసమయమున శాస్త "భిక్షువులారా, చించమాణవిక ఇప్పుడే కాదు; పూర్వముకూడ నాపై మిథ్యాప్రవాదములు వ్యాప్తము చేసినది" అని పూర్వజన్మకథ చెప్పెను:

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు పురోహితగృహమున పుట్టి, తండ్రి మరణానంతరము రాజపురోహితు డయ్యెను.

కోరిన వర మిత్తునని రాజు అగ్రమహిషికి వాగ్దానము చేసెను. "నేను కోరినవరము సులభమయినదే. నేటినుండి అన్యస్త్రీని మీరు ప్రీతితో జూడగూడదు" అని యామె కోరెను. మొదట రాజామె మాటలు లక్ష్యము చేయలేదు; కాని మాటిమాటికి నామె ప్రార్థించుటచే త్రోసి వేయనేరక యాతడు తుద కంగీకరించెను. అది మొదలు రాజు పదునారు వేల నట్టువకత్తెలలో నొకతెనుగూడ కామ దృష్టితో జూడలేదు.

ఒకసారి ప్రత్యంత గ్రామములో నుపప్లవము బయలుదేరెను. అచ్చటి సైనికులు చోరులతో మూడుసారులు తలపడి పోరి, ఇక మావలన గాదని రాజుకు వార్త నంపిరి. రాజచటికి జనదలచి గొప్ప సేన సమకూర్చుకొని, వెడలబోవుచు భార్యతో "భద్రే, నేను ప్రత్యంత ప్రదేశములకు పోవుచున్నాను. అక్కడ నానావిధయుద్ధములు జరుగును. జయాపజయములు తెలియవు. అట్టి తావులకు స్త్రీలు రారాదు. నీ విచ్చటనే యుండవలెను" అని చెప్పెను. "నే నిచట నుండజాలను" అని యామెపలికి, రాజు దృఢనిశ్చయముతో నుండుటచే గ్రహించి "అట్లయినచో, మీరు యోజనము పోవగానే కష్టసుఖములవార్త నాకు బంపుచుండుడు" అని వేడెను. మంచిదని రాజు బోధిసత్త్వుని నగరరక్షకునిగా నిలిపి, ససైన్యముగా బయలువెడలి యోజనము పోయి "మా యారోగ్యము దేవికి తెలిపి, ఆమె స్థితిగతులు కొనిరమ్ము" అని వార్తావహున కానతిచ్చెను. రాణి వచ్చిన పురుషునితో "రాజు నిన్నేల పంపినాడు?" అని యడిగెను. "తమ యోగక్షేమములు తెలిసికొని పోవుటకు పంపినారు" అని యతడు చెప్పగా, 'అట్లయిన రమ్ము' అని రాణి వానితో అక్రమమార్గమున వర్తించెను. రాజు మొత్తము ముప్పదిరెండు యోజనములు ప్రయాణముచేసి, ముప్పదియిరువురు వార్తావహులను బంపెను. రాణి వారందరితోగూడ అక్రమకేళి సలిపెను.

ఉపద్రవము తొలగించి రాజు అచ్చటివారల సంతోషపరచి జయస్కంధావారమునుండి నిజరాజధానికి మరలుచు, ముప్పదియిద్దరు వార్తావహులను క్రమముగా రాణికడకు బంపెను. ఆమె యందరితోడను వెనుకటివలెనే విహరించెను. క్రమముగా రాజు నిజనగరము

సమీపించి, ససైన్యముగా నగర బాహ్యమున విడిసి, తన నగరప్రవేశ సన్నాహమునకై బోధిసత్త్వునకు వార్తనంపెను. బోధిసత్త్వుడు నగరమున నలంకరణము చేయించి, ప్రాసాదాలంకరణార్థమునగరిలోనికి బోయెను. రాణి బోధిసత్త్వుని రూపమునకు ముగ్ధయై, "రమ్ము, బ్రాహ్మణోత్తమా, శయనము మీదికి రమ్ము" అని ఆహ్వానించెను. "ఇట్లనకుము. రాజగౌరవమును స్మరింపుము. పాపకార్యము చేయ జాలను" అని యతడు పలికెను.

"అరువదినలుగురు వార్తావహులకు లేని భయము నీకెక్కడనుండి వచ్చినది? రాజువలని భయముచే నామాట పాటింపవా?"

"వార్తాహరులు నావలెనే బోధించినయెడల నట్లు ప్రవర్తింపరు. ధర్మమేదియో నాకు తెలియును. ఇట్టి పాపకర్మము చేయను."

"ఎక్కువగా ప్రలాపించుచున్నావు! అంగీకరింపవేని శిరశ్ఛేదము చేయింతును!"

"నా శిరసు ఈ జన్మలోనేగాని లక్ష జన్మలలో కూడ ఛేదింపుము; ఈపని చేయను."

"సరి. చూచెదను" అని రాణి బోధిసత్త్వుని బెదరించి తన గది లోనికి బోయి, ఒడలిపై గోళ్ళతో రక్కుకొని, అవయవములపై నూనె రాచికొని, మాసిన చీరెకట్టి, అనారోగ్యముగా నున్నట్టు నటించి, దాసీజనమును బిలిపించి, "దేవి యెచ్చట నున్నదని రాజు ప్రశ్నించినచో అనారోగ్యముగా నున్నదని చెప్పుడు" అని ఆన తిచ్చెను.

ఇంతలో బోధిసత్త్వుడు రాజున కెదురు పోయెను. రాజు నగర ప్రవేశము చేసి, ప్రాసాదములోనికి జని రాణి కనబడకుండుటచే దేవి యెక్కడ? అని పరిజనులను ప్రశ్నింపగా, అనారోగ్యముగా నున్నదని చెప్పిరి. అంతట రాజు శయనాగారము లోనికి బోయి రాణి వీపు నిమిరి; 'భద్రే, అసుఖమేమి?' అని యడిగెను. ఆమె మాటాడ లేదు. మూడవసారి అడిగినపిమ్మట నామె "మహారాజా, మీరు జీవించి యుండగా మావంటి స్త్రీలకు వేరొక నాథు డుండవలసి వచ్చెను!" అని పలికెను.

"భద్రే, ఏ మంటివి?"

"మీరు నగరరక్షణార్థ ముంచిపోయిన పురోహితుడు రాజప్రాసాదమును పరిశీలించెదనని యిచ్చటికి వచ్చి, నేను తనమాట విననందున బలవంతముగా తనయిచ్చ దీర్చుకొని పోయినాడు."

అగ్నిలో ఉప్పుగాని చక్కెరగాని పడినచో పటపట లాడినట్లు రాజు కోపాగ్నిలో పటపటలాడి, గదినుండి వెలువడి దౌవారికాదులను కేకవేసి, "మీరు పోయి, రాజపురోహితుని చేతులు విరిచి కట్టి, వధ్యస్థానమునకు గొనిపొండు" అని ఆన తిచ్చెను. వారు వెంటనే చని బోధిసత్త్వుని బంధించి వధ్యభేరి మ్రోయించిరి.

"ఆహా, దుష్టరాజ్ఞి రాజమనస్సు విరిచినది. ఆత్మబలముచే నేడీ యాపద తప్పించుకొనవలెను" అనుకొని బోధిసత్త్వుడు రాజపురుషులతో "మీరు నన్ను సంహరింపక పూర్వము రాజసన్నిధికి గొనిపోవలెను" అని యడిగెను. వారు "ఎందుచేత?" అనిరి. నేను రాజసేవలో నుండి బహుకార్యములు నిర్వహించినాను. అనేక నిధి నిక్షేపముల నెరుగుదును. నన్ను రాజుకడకు గొనిపోవనిచో రహస్యము నాతోడనే యంతరించి రాజుకు కనబడకుండ బోవును." నన్ను రాజసన్నిధికి జేర్చినతర్వాత మీ కర్తవ్యము నెరవేర్పవచ్చును" అని బోధిసత్త్వుడు పలికెను. వారట్లే చేసిరి. రా జాయనను జూచి, "ఓయీ, బ్రాహ్మణా, నన్నుజూచి సిగ్గుపడవా? ఏల యిట్టి యకార్యము చేసితివి?" అనెను.

బోధిసత్త్వు డిట్లు చెప్పెను: "మహారాజా, నేను శ్రోత్రియకుల సంజాతుడను. ఇంతవరకు చీమ ప్రాణమయినను తీయలేదు. నాది కానిదానిని తృణము నయినను గ్రహింపలేదు. కామవశమున పరస్త్రీపై నేత్రములు ప్రసారింపలేదు. పరిహాసమునకైనను అసత్యము పలుకలేదు. ఎన్నడును బిందుమాత్ర మయినను మద్యము త్రావలేదు. నేను మీయెడ నపరాధము చేయలేదు. అజ్ఞానముచే, లోలుపత్వముచే రాణి నాచేయి పట్టుకొని, నేను నిరాకరించుటచే నన్ను బెదరించి, తన పాపము నాపై మోపినది. మహారాజా, నే ననపరాధిని. వార్తలు కొనివచ్చిన యరువది నలుగురు పురుషులను బిలిపించి, ఒక్కొక్కరు రాణి మాటచొప్పున ప్రవర్తించిరో లేదో కనుగొనుడు, దేవా!"

రాజు వార్తాహరులను బంధించి కొనిరా నాన తిచ్చి, రాణిని బిలిపించి "నీవు వార్తాహరులతో సకార్య కరణము చేసితివా లేదా?" అని యడిగెను. "చేసితిని దేవా!" అని యామె ప్రత్యుత్తర మిచ్చెను. రాజు వా రందరికిని శిరశ్ఛేద దండనము విధించెను.

అప్పుడు బోధిసత్త్వుడు "మహారాజా, వీరి దోషము లేదు. దేవి వీరిని నిర్బంధించినది. కావున వీరు క్షంతవ్యులు. రాణి దోషముకూడ లేదు. స్త్రీలు కామపరాయణలు. జాతి స్వభావమువలన నీమె యట్లు చేసినది. కావున క్షంతవ్యురాలు" అని పలికెను.

బోధిసత్త్వుడిట్లు ప్రార్థింపగా రాజు శాంతించి, ఎల్లరను విడిచి పుచ్చి, ఒక్కొక్కనికి నివాసము కూడ నిచ్చెను. అనంతరము బోధిసత్త్వుడు రాజును సమీపించి, "మహారాజా, ఇతరుల సత్యవచనముల వలన యోగ్యులుకూడ నిష్కారణముగా బంధనమున బడుచుందురు. అజ్ఞానము వలన బంధనము, జ్ఞానమువలన మోక్షము లభించును" అని పలికి, యీగాథ చెప్పెను:

మూర్ఖులు మాటాడ, ముక్తులు గూడ
పడిపోవుచుందురు బంధనమందు.
పండితుల్ మాటాడ బద్ధులుకూడ
ముమ్మాటికి నిజమ్ము ముక్తిని గనుట.

రాజుకు ధర్మ మీవిధముగా జెప్పి బోధిసత్త్వుడు "మహారాజా, నేను గృహస్థుగా నుండుటచే ఈదుఃఖము సంప్రాప్తించినది. ఇక నేను పరివ్రాజకుడ నగుట కనుజ్ఞ యీయవలెను" అని, అనుజ్ఞ పొంది, అశ్రుముఖులగు జ్ఞాతులను, మహాసంపదను విడిచి, ప్రవ్రజించి, హిమవంతమున నివసించుచు, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశముచేసి కథలు సరిపోల్చెను. అప్పటి దుష్టదేవి ఇప్పటి చించమాణవిక; రాజు ఆనందుడు; పురోహితుడు నేనే.

## 121 కుసనాళి జాతకము

శాస్త జేతవనమున నున్నప్పుడు అనాథపిండికుని దృఢమిత్రమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అనాథపిండికుని మిత్రులు, ఆప్తులు, జ్ఞాతులు గుమిగూడి, ఆయనను మాటిమాటికి ఈవిధముగా వాదించుచుండిరి : మహాశ్రేష్ఠి, జాతిలో, గోత్రములో, ధనధాన్యములలో అతడు నీకు సమానుడు కాడు, నీకంటె మిన్న కాడు. నీ వతనితో మైత్రి ఏల నెరపుదువు? అతనితో మైత్రి వలదు". తనకంటె చిన్నవారితో, సమానులతో, శ్రేష్ఠులతో, అందరితో మైత్రి నెరపవలె నని శ్రేష్ఠియభిమతము. కావుననే ఆయన వారిమాట పాటింపలేదు. ఒకసారి తన జమీందారీ గ్రామమునకు బోవుచు తనసర్వస్వమును కాపాడుభారము ఆమిత్రునిపై నుంచి చనెను. ముందువచ్చుకథ కాలపణ్ణికథతో సమానముగా నుండునని గ్రహింపవలెను. కాని యీకథలో అనాథపిండికుడు వృత్తాంతము తెలిపినపిదప శాస్త యిట్లనెను: "గృహపతీ, మిత్రు డెన్నడును తుచ్ఛుడు కానేరడు. మిత్రధర్మమును రక్షించుశక్తి మొదట నుండవలెను. తనకంటె తక్కువవారితో, సమానులతో, శ్రేష్ఠులతో మైత్రి నెరపవలెను. స్థిరమిత్రునివలన నీవు ధనస్వామివిగా నున్నావు. పూర్వము పరిపూర్ణమిత్రుని వలన విమానస్వామి వైతివి".

ఇట్లు చెప్పి శాస్త పూర్వజన్మకథ తెలిపెను :

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు రాజోద్యానమున దర్భదుబ్బలో వృక్షదేవతగా నివసించుచుండెను. అందులోనే మంగళమంటపపార్శ్వమున ఋజుగతస్కంధవృక్షము విశాలశాఖలతో వర్ధిల్లుచుండెను. ఆ వృక్షమన్న రాజుకు ప్రీతిమెండు. దానిపై వృక్షదేవతగా జన్మించిన దేవరాజునకును, బోధిసత్త్వునకును మైత్రి.

అచ్చటి మంటపమున కొక్కటే స్తంభము, అది కొంచెము పుచ్చి

నది. చేవగల దారు స్తంభమును దెప్పించి గట్టిచేయుడు అని రాజు పరి జనుల కాజ్ఞయిచ్చెను. వడ్రంగులు సూటిబోదె చెట్టుకయి వెదకి వెదకి కానక, తుదకు రాజోద్యానములోని ముక్కక వృక్షమునుగాంచి రాజసన్నిధికి బోయిరి. 'అనువైన చెట్టు దొరకినదా?' అని రాజడు గగా "చిత్తము దేవా! కాని దానిని ఖండించుట మాకు సమ్మతము కాదు" అని వారు పలికిరి. "ఎందుచేత?" "ఎక్కడ వెదకినను తగిన చెట్టు లభింపలేదు. ఉద్యానములో మంగళవృక్షము తప్ప వేరొకటి కానరాదు. దానినిఖండించుట మాకిష్టముకాదు". "పోయి చెట్టుకొట్టి, శీఘ్రముగా నిలువబెట్టుడు. వేరొక మంగళవృక్షము సమకూర్తును".

వారు వెడలి మంగళవృక్షమునకు పూజ చేసి రేపు ఖండించవచ్చు నని చనిరి. వృక్షదేవత యీమాటలు విని "రేపటినుండి నాకు నిలువ నీడలేదు. బిడ్డలను దీసికొని యెక్కడకు బోవుదును?" అని గంతవ్య స్థాన మెరుగక బిడ్డలను బుజముల మీద వేసికొని రోదనము చేసెను. వనదేవతలు వచ్చి సంగతి తెలిసికొని, వడ్రంగుల నాపు నుపాయము కానక ఆలింగనము చేసికొని యేడువసాగెను. వృక్షదేవతను జూడ గోరి సరిగా నాసమయమునకు బోధిసత్త్వు డక్కడకు వచ్చి విషయము తెలిసికొని, "అగుగాక. విచారము వలదు. వృక్షమును నరకకుండ జూచెదను. రేపు వడ్రంగులు వచ్చు నప్పటికి నే నేమి చేయుదునో చూతురుగాని" అని పలికెను.

మరునాడు వడ్రంగులు వచ్చునప్పటికి బోధిసత్త్వుడు తొండరూపము దాల్చి, ముందుగనే చెట్టు మొదటికి బోయి మూలమునుండి కొమ్మల వరకును పడునట్లు చేసి, కొమ్మల నడుమనుండి యిటు నటు తల త్రిప్పుచుండెను. మహావర్ధకుడు తొండను జూచి, చేతితో చెట్టుపైగొట్టి, "ఈవృక్షమునకు చిల్లు లున్నవి. పూజాసమయమున మనము గమనింప లేదు." అని మంగళవృక్షమును గర్హించుచు బోయెను. వృక్షదేవతా నివాసము బోధిసత్త్వుని వలన సురక్షిత మయ్యెను. ఆమెచుట్టములు, బంధువులు సమావేశ మయినప్పుడు నా నివాసము సురక్షిత మయినది అని సంతుష్టచిత్తయై "వనదేవతలారా, మనకు శక్తి యున్నను ఏమి చేయుటకును తోచలేదు. కాని కుశనాళి దేవత తన జ్ఞానసంపద వలన మన నివాసము రక్షించెను. మిత్రుల విషయమున హెచ్చు తగ్గులు

చూడనక్కరలేదు. అవసరము వచ్చినపుడు ఒక్కొక్కడును తమ తమ శక్తి కనుగుణముగా సాయము చేయుదురు. కష్టము తొలగించి సంతోషము సమకూర్తురు" అని మిత్ర ధర్మమును వర్ణించి, ఈగాథ పలికెను:

సలుప వచ్చు మైత్రి, సరివానితో శ్రేష్ఠు
తోడ, చిన్నవానితోడ నేని
కష్టవేళ నన్ను గాచె నీకుశనాళి:
చేయగలరు మేలు చెలిమికాండ్రు.

ఈప్రకారముగా వృక్షదేవత సమావిష్టదేవతల నుద్దేశించి, కష్ట నివారణలో హెచ్చుతగ్గులు గమనింపక, బుద్ధిమంతులు మైత్రి నెరప వలె నని ధర్మము బోధించెను. జీవితాంతమున నామె కుశనాళి దేవతతో గూడ యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. ఆకాలమున వనదేవత ఆనందుడు; కుశనాళిదేవత నేనే.

## 122 దుమ్మేధ జాతకము

బుద్ధుడు వేళువనమున నుండగా దేవదత్తుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ధర్మసభలో గూరుచుండి భిక్షువులు దేవదత్తుని నిందించుచు, ఆయుష్మంతులరా, తథాగతుని ముఖము పూర్ణచంద్రునివలె నుండును. ఆయన ఎనుబది అనువ్యంజనములతోడను ముప్పదిరెండు మహాపురుష లక్షణములతోడను కూడినవాడు. ఆయనకు నల్పుప్రక్కలను వ్యామము పొండు ప్రభ యుండును. ఆయనశరీరమునుండి చుట్టలు చుట్టలుగా బుద్ధ

కాన్పించు గలుపవడుచుండును. ఆయనశరీరపు మహాశోభాసంపన్న మయినది. ఇట్టి సుందరరూపమును జూచి దేవదత్తుని చిత్తము అప్రసన్నమై ఈర్ష్య యుదయించును. బుద్ధునకు ఇట్టిశీలము, ఇట్టిసమాధి ఇట్టిప్రజ్ఞ, ఇట్టివిముక్తి, విమోక్షజ్ఞాన దర్శనము కలవు" అని ప్రశంస చేసి, దేవదత్తుడు బుద్ధప్రశంస సహింపలేక ఈర్ష్యాపరవశు డయినాడు" అనుచుండిరి.

శాస్త అరుదెంచి "భిక్షువులారా, ఇక్కడ గూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అని యడిగెను. ఈవిషయము అని వారు చెప్పినపిదప శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; దేవదత్తుడు పూర్వముకూడ నాప్రశంస జరిగినపిమ్మట ఈర్ష్య చెందెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలము రాజగృహమున మగధరాజు పాలనము చేయుచుండ బోధిసత్త్వుడు ఏనుగు కడుపున బుట్టి ఒడలెల్ల తెల్లనయి, రూపసంపద కలవాడయ్యెను. ఈ గజము లక్షణ సంపన్నమని రాజు తన మంగళ హస్తిని జేసికొనెను.

ఉత్సవమునాడు నగరమునకు, దేవనగరమునకువలె నలంకారము చేయించి, సర్వాలంకారమండిత మగు హస్తిపై నెక్కి, బహు పరివారముతో రాజు నగర ప్రదక్షిణము చేసెను. మహాజనము మార్గమున నచ్చటచ్చట నిలిచి, మంగళహస్తిరూప సౌభాగ్యము చూచి "ఆహా, ఏమి యాకారము, ఏమి నడక, ఏమి విలాసము, ఏమి లక్షణ సంపత్తి!" ఇట్టి శ్వేతభద్రగజము చక్రవర్తికి తగినది" అని వర్ణించుచుండ రాజు ఈర్ష్యాపరవశుడై "నేడే దీనిని పర్వతప్రపాతమునుండి క్రిందికి ద్రోయించి, ప్రాణములు తీసెదను" అనుకొని, గజాచార్యుని బిలిపించి 'ఏమేమి చేసి గజమునకు సుశిక్ష యిచ్చినావు?' అని యడిగెను. "దేవా, ఈ భద్రగజము సుశిక్షితము" అని మావటివాడు పలికినాడు. "సుశిక్షితము కాదు. అశిక్షితము." అన్నాడు రాజు. "సుశిక్షితమే దేవా!" "అటులయిన వేపుల పర్వత శిఖరముమీదికి దీని నెక్కింపగలవా?" "చిత్తము దేవా!" రాజు పర్వతపాదమున

వరకు బోయి, ఏనుగు పైనుండి దిగి, మావటివానిని గజ మధిష్ఠించి, పర్వతము మీాదికి గొని పొమ్మని, తాను పరివారముతో అమాత్యులతో ప్రపాతము జేరెను. ఏను గచ్చటికి వచ్చినతోడనే రాజా మావటీనితో "దీనికి సుశిక్షణ యిచ్చితి నంటివి. ఏనుగును మూడు కాళ్ళమీాద నిలుపుము" అనెను.

మావటీడు భద్రగజమును అంకుశముతో సంజ్ఞార్థము తాకి, మూడుకాళ్ళమీాద నిలిపెను. రాజు "ముందరి రెండుకాళ్ళమీాద నిలుపుము" అనగా వాడు దానిని అట్లే నిలిపెను. వెనుకటి కాళ్ళమీాద నిలుపు మన్నప్పుడు మహాసత్త్వుడు ముందరి కాళ్ళెత్తి, వెనుకకాళ్ళ మీాద నిలుచుండెను. ఒంటికాలిమీాద నిలుపు మనగా గజమట్లే నిలుచుండెను. ఏనుగు జారిపడిపోవదని గ్రహించినరాజు మావటీనితో "నీచేత నయినచో దీని నాకాశమున నిలుపు" మనెను. అప్పుడు గజాచార్యుడు "యావజ్జంబూద్వీపములో దీనితో సమానముగా సుశిక్షిత మైన హస్తిలేదు. గజముప్రపాతమునుండి జారిపడి మడియ వలెనని రాజుకోరిక కానోపును" అని తలచి, గజకర్ణమున మావటీడు "బాబా, ఈరాజు నిన్ను చంపదలచినాడు. ఇతడు నీకు తగడు. నీకు శక్తి కలదేని నాతోగూడ నాకసమునకు లేచి, వారాణసి పురమునకు జనుము" అని దృఢముగా బలికెను.

ఆ మహాసత్త్వుడు పూర్వజన్మకృత పుణ్య మహత్త్వము వలన తత్క్షణమే గగనములోని కెగసెను. గజాచార్యుడు "మహారాజా, నీవంటి మందపుణ్యుడు, దుర్బుద్ధియు నగు వానికడ ఈగజరాజు నిలుచుట యుక్తము కాదు. వివేకి, పుణ్యాత్ముడు నగు ప్రభువే దీనికి తగినవాడు. నీవంటి దౌర్భాగ్యునకు ఇట్టి వాహనము లభించినను గౌరవముతో పాటు అదికూడ నశించును. నీవు గుణగౌరవ మెరుగనివాడవు!" అని పలికి ఏనుగు మెడమీాదికి వచ్చి, యీగాథ పలికెను:

> సంపద లభింపగా మూర్ఖజనుడు జడత
> తనకు చేజేత కావించుకొనును హాని;
> బాధపడు తాను, పరులను బాధపెట్టు.

ఇట్లు చెప్పి, రాజుకు ధర్మ ముపదేశించి, ఇక నీవుండుమని గగన మార్గమున వతడు హస్తితో వారాణసికి జేరి, రాజసౌధాంగణముపై

నాగెను. నగర మంతట కోలాహల ముప్పతిల్లెను. "మన రాజుకొఱకు గగనమార్గమున భద్రగజము వచ్చి నిలిచియున్న" దని జనులు కేకలు వేసిరి. రాజున కీ విషయము వెంటనే తెలిసెను. ఆత డీవలకు వచ్చి "భద్రగజమా, నాకొఱకే వచ్చినచో భూమిమీాది కవతరింపుము" అనగా బోధిసత్త్వుడు నేలమీాది కవతరించెను. గజాచార్యుడు కూడ దిగి, రాజునకు నమస్కరించి 'ఎక్కడనుండి వచ్చినా' వను ప్రశ్నకు రాజగృహమునుండి యని బదులుపలికి, సమస్తము వివరించెను. "బాబా, నీ విచ్చటికి వచ్చుటే మే లయ్యెను" అని రాజు నగరము నలంకరించి భద్రగజమును మంగళహస్తిశాలలో ప్రతిష్ఠించెను. పిమ్మట రాజ్యమును మూడు భాగములు చేసి, ఒకటి బోధిసత్త్వునకు, ఒకటి గజాచార్యునకు నిచ్చి, తాను మూడవభాగము తీసికొనెను. నాటినుండి రాజప్రభావము వృద్ధియై క్రమముగా సమస్త జంబూద్వీప మాయన హస్తగత మయ్యెను. ఆయన రాజాగ్రేసరుడై, దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము సరిపోల్చెను. అప్పటి మగధనరేశుడు దేవదత్తుడు; వారాణసీనరేశుడు సారిపుత్రుడు; హస్తిపకుడు ఆనందుడు; హస్తి నేనే.

## 123 నంగలీస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లాళుదాయి స్థవిరుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

అతడు ధర్మోపదేశము చేయునపుడు యోగ్యము అయోగ్యము అను విషయము గమనింప డని యిచట చెప్పవలసి యున్నది. మంగళవాక్కులు పలుకవలసినపుడు అమంగళవాక్కు లాడి దానానుమోదనము చేయుచుండును, అమంగళానుమోదనము చేయవలసినయెడ,

నతడు మంగళవాక్కులు పలికి "ఈప్రకారముగా మంగళకార్యము వందలకొలది, వేలకొలది చేయు సామర్థ్యము నుత్పాదింపుడు" అనెడి వాడు.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో గూడుచుండి చర్చ చేయుచు ఆయుష్మంతులారా, లాళుదాయి ఉచితానుచితముల నెరుగడు. ఎచ్చట నుపయోగింపరాని వాక్కులను సర్వత్ర వాడుచుండును" అనుచుండిరి. శాస్త్ర అరుదెంచి "భిక్షువులారా, ఏమి సంభాషించుచున్నారు?" అనెను. ఈవిషయ మని వారు చెప్పిరి. అంతట శాస్త్ర "భిక్షువులారా, లాళుదాయి కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ జడిమచే ఉచితానుచితము లెరుగక మాటాడెడివాడు; సదామూర్ఖుడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు సంపన్న బ్రాహ్మణ వంశమునబుట్టి, పెద్దవాడయి, తక్షశిలానగరమున సకలవిద్యల నభ్యసించి, వారాణసికి వచ్చి, జగద్విఖ్యాతాచార్యుడై 500 శిష్యసంఘమునకు విద్యలు బోధించుచుండెను. అందులో నొకమాణవకుడు ధర్మాంతేవాసికుడై చదువుచుండెను. వాడు మందబుద్ధి, విపరీతభావములు కలవాడు, అసంబద్ధప్రత్యుత్తరము లిచ్చువాడు. వానికి చదువబ్బలేదు. వాడు బోధిసత్త్వునియెడ భక్తి కలవాడై, దాసునివలె సమస్త పరిచర్యలు చేయుచుండెను.

ఒకనాడు బోధిసత్త్వుడు సాయంసమయ భోజనానంతరము శయనమున పండుకొనగా ఆమాణవకుడు వచ్చి, కాళ్ళు, చేతులు, వీపు పట్టి, పోవునపుడు నాయనా, మంచముకాళ్ళు సరిగా ఎత్తుపెట్టుము అని చెప్పెను. వాడు ఒకపార్శ్వమున సరిగా ఎత్తుపెట్టెను. కాని రెండవ పార్శ్వమున పెట్టుట కేమియు గానక తనకాలే యెత్తుపెట్టి, రాత్రి యంతయు నట్లే యుండెను. తెల్లవారగా బోధిసత్త్వుడు లేచి, వానిని జూచి, ఏల యిట్లు కూరుచున్నా' వని యడిగెను. 'ఆచార్యా, ఏమియు గానక నాకాలే యెత్తు పెట్టియున్నా' నని వాడు చెప్పెను. ఈమాట విని మనసు కరిగి బోధిసత్త్వుడు తనలో 'వీడు నాకు చాలసేవ చేసి

నాడు. అందరిలో వీడు మందుడు; చదు వబ్బకున్నది. వీనిని విద్యావంతు నెట్లు చేయుదు నని యోజించి, 'వీడు సమిధలు తెచ్చినపిమ్మట, నీవేమి చూచినావు; ఏమి చేసినావు? అని యడిగెదను. వాడు చెప్పిన మాట లను బట్టి ప్రశ్నలు చేయగా ఉపమానములను కారణములను వివరిం చును. ఈవిధముగా వీనికి విద్య చెప్పవచ్చును' అని భావించెను.

అనంతరము వానిని బిలిచి 'నీవు సమిధలు తెచ్చునపుడు చూచి నవి, తిన్నవి, త్రాగినవి ఏవియో చెప్పుచుండుము' అని యాదేశింప, వాడు చిత్త మనెను. ఒకనాడు వాడు తక్కిన శిష్యులతోపాటు సమిధ లకై యడవికి బోయినపుడు పాముకనబడెను. వచ్చి వాడు 'ఆచార్యా, సర్పమును చూచినాను' అని చెప్పెను. "అది యెట్లుండెను?" "నాగలి కఱ్ఱువలె నుండెను". "మంచి యుపమానము. సర్పములు లాంగలీ సదృశ్యములు" అని పలికి బోధిసత్త్వుడు వానికి చదువు చెప్పగల నని ఆశించెను.

వేరొకనాడు అడవిలో ఏనుగును జూచివచ్చి చెప్పెను. "నాయనా, ఏను గెట్లుండెను?" "నాగలికఱ్ఱువలె". "ఏనుగు తొండము నాగలి వలె నుండును. దంతాదులుకూడ నిట్లే యుండును. వీడు బుద్ధి మాంద్యమువలన విభాగము చేసి చెప్పలేక తొండమును గూర్చియే చెప్పియుండును" అనుకొని యేమియు మాటాడలేదు.

మరియొకనాడు వాడు చెఱకు తినివచ్చి, ఆచార్యునితో జెప్పెను. "చెఱకుగడ యెట్లుండెను?" "నాగలికఱ్ఱువలె". "ఏమాత్రము తగిన యుపమానము కాదు" అనుకొని ఆచార్యు డూరకుండెను. ఇంకొక నాడు వాని నెవరో పిలిచి బెల్లము, పెరుగు, పాలు కలిపి యిచ్చిరి. వాడువచ్చి ఆచార్యునితో జెప్పెను. "దధిక్షీరము లెట్లుండెను?" "నాగలి కఱ్ఱువలె." అప్పు డాచార్యు డిట్లు భావించెను: "వీడు పాము లాంగలి వలె నున్నదనుట సముచితము. ఏనుగు తొండము దాని వలెనే యున్నదనుట కొంతవరకు తగును. చెఱకుగడకూడ అంతే. కాని, దధిక్షీరములు తెల్లనివి. పోసినపాత్రాకారము ధరించును. ఇక్కడ వీడు తప్పినాడు. యీ మందునకు చదువు చెప్పుట వట్టిదే" అని ఆచార్యు డీ గాథ చెప్పినాడు :

అన్నియెడల మూర్ఖు డదూకని పలుకులే
పలుకుచుండు నెప్పుడు పాడి వీడి:
ఎరుగ డిద్ది పెరుగు, నిది హాలాగ్రం బని—
దధి హాలాగ్ర మనుచు దలచు నతడు.

శాస్త్ర ధర్మోపదేశము చేసి సారాంశము వెలువరించెను. ఆనాటి మూర్ఖవిద్యార్థి లాళుదాయి; ప్రసిద్ధాచార్యుడు నేనే.

## 124 అమ్బ జాతకము

శాస్త్ర జేతవనమున నుండునపుడు కర్తవ్యనిష్ఠు డగుబ్రాహ్మణుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తి నివాసి యగు నాయువకుడు బుద్ధశాసనమున శ్రద్ధచే ప్రవ్రజించి మిక్కిలి కర్తవ్యపరాయణు డయ్యెను. ఆచార్య- ఉపాధ్యాయుని సేవాకార్యములయందును, త్రాగదగిన నీటివిషయముననుఖాద్యములను సిద్ధము చేయుటలోను, ఉపోసధ గృహమును, జంతాగారమును (అగ్నిశాల) పరిశుభ్రముగా నుంచుటలోను చక్కగా పనిచేయువాడు. విహారమును ఊడ్చెడివాడు. పదునాలుగు మహాకర్తవ్యములను, ఎనుబది చిన్నచిన్న కర్తవ్యములను పరిపూర్ణముగా నిర్వర్తించువాడు. అంగణమును, పచారు చేయుప్రదేశమును, విహారమునకు గొనిపోవుమార్గమును శుభ్రము చేసెడివాడు. లోకులకు త్రాగ నీ రిచ్చెడివాడు.

ఆతని కర్తవ్యనిష్ఠకు జనులు ప్రసన్నులై అతనికి 500 స్థిరనిమంత్రణము లిచ్చిరి. విశేషలాభకర మైన సత్కృతి అతనికి లభించెను. దాని వలన అనేకులకు సౌఖ్యము కలిగెను. ధర్మసభలో సమావిష్టు లైన భిక్షువులలో చర్చ జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, ఆభిక్షువు

తనకర్తవ్య నిష్ఠ వలన మిగుల లాభసత్కారములు పొందినాడు. ఒక్కనివలన అనేకులకు సౌఖ్యము కలిగినది" అని వా రనుచుండిరి.

శాస్త యచటికి బోయి "భిక్షువులారా, కూరుచుండి ఏమి మాటాడుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిదప శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ ఈభిక్షు విట్లే యుండెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వు డుదీచ్య బ్రాహ్మణ కుటుంబమున బుట్టి, పెరిగి, ప్రవ్రజించి, అయిదువందల ఋషులతో పర్వతపాదమున నివసించుచుండెను. ఒక ప్పుడు హిమవంతమున చండనిదాఘము ప్రబలి, అన్నిచోట్లను నీ రెండి పోవ, జంతువులు పానీయము లభింపక మహావ్యథ నొందినవి. అందలి తాపసులలో నొకడు వాని పిపాసాబాధ చూచి, చెట్టునరకి, ద్రోణము (తొట్టి) చేసి, దొరకిన నీరు తెచ్చి దానిలోబోసి వానిని త్రాగనిచ్చు చుండెను. జంతువులు గుంపులుగా వచ్చి త్రాగుచుండ, వానికి నీరు పోయుచు తాపసుడు ఫలాదులు తెచ్చికొనుటకు తీరిక లేదాయెను. ఆయన నిరాహారు డయ్యును జంతువులకు నీరు పోయుచుండెను. అప్పుడు మృగగణము లిట్లు చింతించినవి: "ఈయన మాకు నీరు తెచ్చుచు తనకు ఫలాదులు తెచ్చికొనుట కవకాశము లేక నిరా హారుడై మిక్కిలి శ్రమపడుచున్నాడు, ఇక్కడకు నీటికై వచ్చు ప్రతి జంతువు చేతనయినన్ని ఫలాదులు తాపసునికై తేవలెను" అని నాట నుండి ప్రతిమృగము నిజబలానురూపముగా ఫలములను- మధురము లయిన అమ్రజంబూపనసాదులను గొని తెచ్చుచుండెను. ఫలరాశి రెండువందల యేబదిబండ్లు నిండుచుండెను. అచ్చటి 500 తాపసులు కడుపార భుజించుచుండిరి. అది చూచి బోధిసత్త్వుడు "ఒక్క వ్రత సంపన్నుని వలన ననేక తాపసులకు ఫలాహారము లభించుచున్నది. కర్తవ్యము నెల్లపుడు నిర్వహింపవలెను" అని పలికి, యీగాథ పఠి కెను:

విఫలు డయ్యు మరల విడువక యత్నంబు
పండితుండు పొందు ఫలము తుదిని;
చూడు, మాత డెట్లు కృచ్ఛ్రోపవాసాంత
మందు చూతఫలము లంద గనెనో!

ఇట్లు మహాసత్త్వుడు ఋషిగణమున కుపదేశ మిచ్చెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి తపస్వి ఇప్పటి భిక్షువు; గణశాస్త నేనే.

## 125 కటాహక జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ప్రగల్భములు పలుకు భిక్షువువిషయమై చెప్పినది. ఆకథ పూర్వోక్త భీమసేన జాతకము (207) వలె నుండును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు మహావైభవముగల శ్రేష్ఠిగా జన్మించెను. ఆయనకు కుమారుడు పుట్టిననాడే యింటికి దాసికిగూడ పుత్రుడు పుట్టెను. ఉభయులు కలిసి పెరిగినారు. శ్రేష్ఠి కుమారుడు చదువుకొన బోవునపుడు దాసీ పుత్రు డతనిపలక మోసికొని పోవుచుండును. అతనితో పాటు వాడుకూడ చదువుకొనుచు క్రమముగా రెండుమూడు విద్యలు నేర్చినాడు. మాటనేర్పరి, రూపసంపన్నుడు నగు వాని పేరు కటాహకుడు. శ్రేష్ఠియింట భాండాగారికుడుగా నుండి వా డొకరోజున నిట్లు తలపోసినాడు: "ఈపని నాకెల్లకాల ముండదు. నావలన చిన్ని పొరపాటు జరిగెనా నన్ను కట్టి, కొట్టి, ముద్ర కాల్చివేసి, దాసులకు చేయుతిండి పెట్టుదురు. మా యజమానుడు వ్రాసినట్టు పత్రిక లిఖించి, నేను శ్రేష్ఠి కుమారుడనని చెప్పి, ప్రత్యంత గ్రామములో మా యజ

మానుని మిత్రు డగు శ్రేష్ఠి కిచ్చి, ఆయన పుత్రికను పెండ్లాడి యేల సుఖముగా నుండరాదు?" కటాహకు డా సాయంకాలమే యిట్లు పత్రిక లిఖించెను: "నా కుమారుని నీవద్దకు బంపుచున్నాను. మన రెండు కుటుంబములు సమాన ప్రతిపత్తి కలవి. కొమరిత నితని కిచ్చి పెండ్లి చేసి, ప్రస్తుత మచ్చటనే యుండ నిమ్ము. నాకు తీరిక చిక్కి నంతనే నీకడకు వత్తును."

ఇట్లు లేఖ ముగించి యజమానుని ముద్ర వేసి, మంచిదుస్తులు, సుగంధ ద్రవ్యములు తీసికొని యాగ్రామమునకు బోయి శ్రేష్ఠికి నమస్కరించి నిలుచుండెను. "ఎక్కడనుండి వచ్చుచున్నావు?" "వారాణసినుండి." "ఎవరి కుమారుడవు?" "వారాణసీ శ్రేష్ఠి కుమారుడను." "ఏమి పనిమీాద వచ్చినావు?" "ఈలేఖ సమస్తము తెలుపును" అని కటాహకుడు లేఖ యతనిచేతి కిచ్చెను. శ్రేష్ఠి పత్రిక చదివి "ఇది నాకు ప్రాణము పోయుచున్నది!" అనుకొని, సంతుష్ట చిత్తుడై, వానికి పుత్రిక నిచ్చి పెండ్లిచేసి, తనయింటనే నిలుపుకొనెను. వధూవరులు మహావైభవముతో సుఖముగా కాలము గడపుచుండిరి. వానికడకు ఖాద్యములు సుగంధాది ద్రవ్యములు పరిచారకులు తెచ్చి నప్పుడు "ఇవి సరిగా లేవు. పరిసరగ్రామముల వారికి ఉడుపులు ధరించుట గాని, సుగంధాదిక లేపనము కాని, మాలికా గ్రథనము కాని సరిగా తెలియదు" అని ఆక్షేపించుచుండును.

కటాహకుడు కనబడకుండుటచే బోధిసత్త్వు డొకనాడు "కటాహకుడు కానరాడు. ఎచ్చటికి బోయినాడో. వానిని వెదకి కను గొనుడు" అని అన్నియెడలకు పరిజనులను బంపెను. అందులో నొకడు కటాహకు డున్నగ్రామమునకు బోయి, వానిని గురుతుపట్టి, తన్ను వాడు గమనింపకుండ మరలివచ్చి, యజమానునకు సంగతులు విన్నవించెను. బోధిసత్త్వుడు "వాడు చేసినపని యుక్తము కాదు. పోయి పట్టుకొనివచ్చెదను" అని తలచి, రాజుకడ సెలవు తీసికొని బహుపరివారముతో బయలుదేరెను. మహాశ్రేష్ఠి ప్రత్యంతమునకు బోవుచున్నా డని అన్నియెడల వ్యాపించెను. విని కటాహకు డిట్లు చింతించెను: "ఆయన వచ్చుటకు వేరుకారణము లేదు. నన్ను పట్టు కొని పోవుటకే ఆయన రాక. నేను పలాయనము చేసితినేని మరలి

వచ్చుటకు వీ లుండదు. ఒకయుపాయము తోచుచున్నది. స్వామి కెదురుగా బోయి దాసునివలె ప్రవర్తించి, ఆయనను ప్రసన్నుని జేసి కొనవలెను.”

నాడు మొదలు కటాహకు డందరియెదుట నిట్లు పలుక జొచ్చెను: “ఈ కాలమున పెద్దలయెడ గౌరవము తగ్గుచున్నది. తలిదండ్రులు భోజనమునకు గూరుచున్నపుడు వలయు నుపచారములు చేయుటకు మారుగా బిడ్డలుకూడ వారితో సమముగా కూరుచుందురు. నా తలి దండ్రులు భుజించు నపుడు వారికి భాజనాదిక మందించి, పాద ప్రక్షాళ నానంతరము తమ్మపడిగము మంచము కడ బెట్టి, వీవన లందించు వాడను. అది నాపద్ధతి.”

ఈప్రకారముగా దాసులు యజమానులకు చేయు పరిచర్యల నచటి వారికి కటాహకుడు వివరించి, మామగారితో “మానాయనగారు మీ దర్శనార్థము వచ్చుచున్నారు. వారికై యేర్పాటులు చేయుడు. నేను సబహుమానముగా వారి నెదుర్కొందును” అని చెప్పెను. “మంచిది నాయనా, అట్లే చేయుదును” అని మామ పలికెను.

అంతట కటాహకు డమూల్యాహారములు తీసికొని, భూరిపరివార మును వెంట బెట్టుకొని చని, బోధిసత్త్వునకు నమస్కరించి, బహు మానము లందించెను. ఆయన ప్రసన్నచిత్తముతో వాని నందుకొని, ప్రాతఃకాలమున విడిదినుండి యేకాంతప్రదేశమునకు బోవునపుడు కటాహకుడు పరిజనమును వెనుక నాపి, జలకలశము తానే పట్టుకొని, ప్రక్షాళనవేళ పాదములపై బడి, “స్వామీ, నాపరువు నిలుపుడు. కోరినంత ధన మిచ్చెదను” అని ప్రార్థించెను.

వానివర్తనమునకు ప్రసన్నుడై బోధిసత్త్వుడు “నావలన నీకేమియు భయము లేదు” అని ఓదార్చి, గ్రామప్రవేశము చేసెను. సత్కారము ఘనముగా జరిగెను. కటాహకుడు దాసునివలె నిరంతర మాయన సేవ చేయుచుండెను.

మహాశ్రేష్ఠి సుఖాసీనుడై యుండ ప్రత్యంత శ్రేష్ఠివచ్చి, “మహా శ్రేష్ఠి, తాము నాకు పంపిన లేఖనుబట్టి మీకుమారునకు నాకొమార్తె నిచ్చి వివాహము చేసినాను” అని చెప్పెను. కటాహకుని తన కుమా రునిగానే పలికి మహాశ్రేష్ఠి ప్రియవచనము లాడి, శ్రేష్ఠిని సంతోష

పెట్టెను; కాని కటాహకుని ముఖము చూడజాలక పోయెను.

మరునాడు మహాశ్రేష్ఠి ఆయన పుత్రికను బిలిచి, "అమ్మా, నాతల దువ్వుము" అని ప్రియవచనములు పలికి "అమ్మా, కుమారుడు సుఖ దుఃఖములం దప్రమత్తుడేనా? మీరు రుభయులు నన్యోన్యముగా సంతోషముతో నున్నారా?" అని యడిగెను. "ఆర్యా, కుమారునియందు దోష మేమియు లేదు. కాని భోజన విషయమున మాత్ర మాయన తప్పు పట్టుచుండును" అని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

"అమ్మా, నిరంతర మితడు తప్పులు పట్టుచుండువాడే. కాని వీని ముఖపిధాన మంత్రము చెప్పెదను. భోజన సమయమున వాడు తప్పులు పట్టుచున్నచో ఈమంత్రము పఠింపుము" అని మహాసత్త్వుడు కొన్ని పంక్తులు చెప్పెను. కొలదిరోజు లచట నుండి బోధిసత్త్వుడు వారాణసికి బోయెను.

కటాహకుడు ఆయన వెంట కొంతదూరము చని, అమూల్యా బహుమానము లొసగి, నమస్కరించి అతడు మరలి వచ్చెను. ఆయన వెడలిపోయినది మొదలుగా వాని గర్వ మతిశయించెను. ఒక నాడు భార్య వడ్డించిన రుచ్యభోజనము చూచి, గరిటతో కొంచెము నోట వేసికొని, ప్రథమకబళమునే వాడు గర్హించెను. అతని భార్య బోధిసత్త్వునికడ ఉపదేశము పొందిన గాథ పలికెను:

> అన్యదేశములకు నరిగి ప్రగల్భముల్
> పలికినా డతండు బహువిధాల.
> అన్యదేశవాసు లరుదెంచి నిందింతు!
> రనుభవింపు లబ్ధమైనవాని!

కటాహకుడు విని "అద్ధా! శ్రేష్ఠి నాపేరీమెకు వివరించి యుండును" అనుకొని, నాటినుండి భోజనసమయమున నింద మాని తనకు లభించినది వినయముతో భుజించుచుండెను. జీవితాంతమున యథా కర్మంగ తో.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలపు కటాహకుడు నేటి బహు భాషిభిక్షువు; వారాణసీ శ్రేష్ఠి నేనే.

## 126 అసిలక్షణ జాతకము

శాస్త జేతవనమున నున్నపుడు ఖడ్గలక్షణములు చెప్పు కోసల నరేశుని బ్రాహ్మణుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆబ్రాహ్మణుడు రాజుకడకు లోహకారులు ఖడ్గములు తెచ్చినపుడు కరవాలముల వాసనను బట్టి లక్షణములు చెప్పుచుండెడివాడు. ఎవని కడనుండి కొంతలబ్ధి చేకూరునో వాడు తెచ్చిన ఖడ్గము మంచి దనియు లబ్ధి లేనిచోట ఖడ్గ మమాంగలిక మనియు అతడు నిర్ణయము చేయువాడు.

ఒకానొక శిల్పి ఖడ్గము నిర్మించి దాని యొరలో సన్నని కారపు పొడి నింపి రాజుకడకు తెచ్చెను. రాజు బ్రాహ్మణుని బిలువనంపి "ఖడ్గపరీక్ష చేయుడు" అనెను.

బ్రాహ్మణుడు ఖడ్గమును దీసి వాసన చూచినంతనే కారపుపొడి ముక్కులో దూరెను. తుమ్ము వచ్చెను. ఆతొందరలో నాసిక ఖడ్గధారకు తగిలి రెండు తుండెము లయ్యెను.

ఈవిషయము భిక్షుసంఘమునకు దెలిసెను. వారు ధర్మసభలో కూడి "ఆయుష్మంతులారా, రాజుగారి ఖడ్గపరీక్షకు బ్రాహ్మణుని నాసిక తెగిపోయినది" అనుచుండిరి. శాస్త అచ్చటికరుదెంచి "భిక్షువులారా, ఈసమయమున నేమి మాటాడుచున్నారు?" అనెను. ఈవిషయమని వారు చెప్పినపిదప శాస్త "భిక్షువులారా, ఈబ్రాహ్మణున కిప్పుడే కాదు; పూర్వముకూడ ఇట్లే జరిగినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ అసిలక్షణ పారగు డగు బ్రాహ్మణు డాయనకడ నుండెను. రాజు వైద్యులను బిలిపించి ప్రతినాసిక చేయించి ఆయన నాసికకు తొడిగించెను. రంగు వేయుటచే నది సహజనాసిక వలె నుండెను. రాజుకు కొడుకు లేడు, కొమార్తెయు మేనల్లుడు నుండిరి. వారిని రాజు

ప్రీతితో పెంచుచుండగా వారికి పరస్పరానురాగము కలిగెను. రాజు అమాత్యులతో "నామేనల్లుడు రాజ్యమునకు వారసుడు. నాపుత్రిక నిచ్చి పెండ్లి చేసితినేని అతనికే అభిషేకము జరుగును" అని పలికి మరల యోచించి "నామేనల్లుడు అన్నివిధముల జ్ఞాతివలె నున్నాడు. ఇతనికి వేరొక రాజపుత్రిక నిచ్చి వివాహము చేసి, నాబిడ్డను వేరొక రాజపుత్రున కిచ్చి పెండ్లి చేసినచో బంధువులు సంతతియు వృద్ధి యగును. నావారికి రెండు రాజ్యములు దక్కును" అని చెప్పి పుత్రికను మేనల్లుని విడివిడిగా నుంచెను.

వారికి పదునారు వర్షముల వయసు వచ్చినది. ఉభయులు పరస్పర ప్రతిబద్ధ చిత్తులయి యున్నారు. ఏ యుపాయమున రాజభవనము నుండి ప్రేయసిని తీసికొని పోవగలను అని యతడు యోచించుచు ఒకానొక వృద్ధురాలిని బిలిపించి వేయిముద్ర లిచ్చి, విషయ మామెకు దెలిపెను. 'నే నేమి చేయవలెను?' అని యామె యడుగగా, "నన్ను రాజకుమారికడకు గొనిపోవు నుపాయము చూడు" మని రాజ పుత్రుడనెను. "మంచిది స్వామీ, నేను రాజుకడకు బోయి, దేవా, రాజ కుమారికకు పిశాచము పట్టినది. కొంతకాలమునుండి పిశాచము జాగరూకతతో నుండుట లేదు. ఒకనాడు రాజకుమారిని రథములో నెక్కించుకొని ఆయుధహస్తులైన భటులు వెంటరా శ్మశానమునకు గొనిపోయి, మండలపీఠముపై మంచము మీద నామెను బరుండబెట్టి, అడుగున శవము నుంచి, నూటయెనిమిది సుగంధోదక ఘటములతో స్నానము చేయించి - పిశాచశాంతన మగునట్లు చేసెదను, అని రాజు నొప్పించి యామెను శ్మశానమునకు దీసికొని వచ్చెదను. నీవు మాకంటె ముందుగా నచ్చట బ్రవేశించి, కొంచెము మిరియముపొడి దగ్గర నుంచుకొని, ఆయుధపాణు లయిన పరివారజనులతో రథారూఢుడవై వచ్చి, బండి ద్వారముకడ నిలిపి, పరిజనులను శ్మశాన వనములోనికి బంపి, నీవు మండలపీఠమున మృతుని వలె బండుకొని యుండుము. నే నచ్చటికి వచ్చి, నీ పైభాగమున మంచము వేసి, దానిపై రాజకుమారుని పండుకొబెట్టెదను. అప్పుడు నీవు మిరియము పొడి పీల్చి, రెండు మూడు పర్యాయములు తుమ్మవలెను. నీవు తుమ్మగానే రాజపుత్రిక నచ్చట విడిచి పారిపోవుదుము. అంతట మీ రిద్దఱు

[illegible]
దాని ముసలిది బోధించెను. ఇది మంచి యుపాయ మని యాత డంగీకరించెను.

ఆమె రాజుకడకు జని, చెప్పి యొప్పించి, రాజపుత్రికకు అందలి మర్మము రహస్యముగా దెలుపగా నామె సమ్మతించెను.

రాజకుమారిని శ్మశానమునకు గొనిపోవునాడు ముసలిది ముందుగా రాజకుమారునకు వార్త పంపి, వెంటవచ్చు రక్షకభటులకు భయము కలుగనట్లు "నేను రాజపుత్రికను మంచముపై నుంచెదను. అడుగున శవ ముండును. శవమునకు తుమ్ము వచ్చినంతనే లేచి, ప్రథమమున కనబడిన వారిని పట్టుకొనును. కావున మీ రెల్లరు జాగరూకులై యుండుడు" అని ప్రబోధించెను. రాజకుమారుడు ముందుగానే వచ్చి నిర్ణీతస్థానమున పండుకొనియుండెను. వృద్ధురాలు రాజపుత్రికను మంచముపై గూరుచుండ బెట్టి, భయపడవల దని నెమ్మదిగా జెప్పెను. రాజకుమారుడు మిరియపుపొడి పీల్చి తుమ్ము నారంభించెను. తోడనే వృద్ధురాలు (మహా ఇక్షణిక) రాజకుమారిని విడిచిపెట్టి, పెద్దపెట్టున కేకలు పెట్టుచు మార్గమువెంట బరుగెత్తెను. భటు లాయుధములు జారవిడిచి భయభ్రాంతులై పరుగెత్తిరి. ముందు చెప్పినట్లు చేసి రాజకుమారుడు రాజకుమారిని నిజగృహమునకు గొనిపోయెను. ఇక్షణిక పోయి, జరిగిన సంగతి రాజుకు విన్నవించెను.

"అతనికే పిల్ల నీయ సంకల్పించి యుంటిని. పాయసములో నేయి వలె వీరు కలసి మెలసి యున్నారు" అని తలపోసి రాజు కోపము చెందక మేనల్లునికి కాలక్రమేణ రాజ్యమిచ్చి, కొమార్తె నిచ్చి పెండ్లి చేసెను. అతడు రాజయి, భార్యతో సుఖముగా జీవించుచు, ధర్మ పాలనము చేయుచుండెను.

అసిలక్షణ పాఠకు డగు బ్రాహ్మణుడు నూతన ప్రభువుకడ నుండెను. ఒకనా డాయన సూర్యున కెదురుగా నుండగా తుమ్ము వచ్చినది. పెట్టుడు ముక్కు జారి క్రింద బడినది. లజ్జచే బ్రాహ్మణుడు అవనతవదను డయ్యెను. రాజు పరిహాసముగా "ఆచార్యా, చింతింప వలదు. కొందరకు తుమ్ము మంచిది, కొందరకు చెడ్డది. తుమ్మువలన మీ ముక్కు తెగిపోయినది, తుమ్మువలన నాకు మేనమామ కూతురు,

[illegible]

[illegible] చేకూర్చు [illegible]

కష్టము లొసంగు; కల్యాణకరము లగునె

అన్నియుండగూడ కష్టదాయకము లగునె?

ఇట్లు పలికి, రాజు దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు యథా కమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. అప్పటి అసిలక్షణ వేత్త ఇప్పటి అసిలక్షణవేత్త; భాగినేయరాజు నేనే.

## 127 కలణ్డుక జాతకము

శాస్త జేతవనమున నున్నపుడు వదరుబోతు భిక్షువు విషయమై చెప్పినది. ఇందలి వర్తమాన-అతీతకథలు కటాహక జాతకము (125) నందలి కథలవలె నుండును.

### వర్తమాన కథ

ఈజాతకమున వారాణసీ శ్రేష్ఠి దాసుడు కలణ్డుకుడు. అతడు పలాయనము చేసి సరిహద్దు ప్రాంతమున నున్న శ్రేష్ఠిపుత్రికను పెండ్లియాడి ఆడంబరముతో నివసించుచున్నను, అతని ఆచోకీ తెలియక శ్రేష్ఠి తాను పెంచిన చిలుకపిల్లను పంపుచు, కలందుకుని వెదకి రమ్ము అని పంపగా చిలుక ఇటునటు తిరుగుచు ఆత డున్న నగరము చేరెను.

ఆసమయమున కలందుకుడు జలక్రీడ సలుపు కోరికతో, గంధ మాల్యానులేపనములు, ఖాద్యాదులు, పట్టించుకొని శ్రేష్ఠి పుత్రికతో నౌకలో నెక్కి క్రీడించుచుండెను. ఆప్రదేశములోని ఐశ్వర్యవంతులు జలక్రీడార్థము పోవునపుడు ఏదో మంచి ఔషధము కలిపి పాలు త్రాగుదురు. దానివలన పవ లంతయు నీటిలో నున్నను శీతము

చేయదు. కలండుకుడు ఆపాలు నోటినిండ పోసికొని పుక్కిలించి యుమియుచుండెను. నీటిలో గాక శ్రేష్ఠి కన్యాశిరస్సుపై నుమియుచుండెను.

ఆశుకశాబకము నదియొడ్డున పొదలో నొక కొమ్మమీద వాలి, కలండుకుని గురుతించి శ్రేష్ఠి కన్యశిరసుమీద నుమ్మివేయుచుండుట గమనించెను. "ఓరీ, కలండుకా, దాసీపుత్ర, నీజాతిని పూర్వనివాసస్థానమును జ్ఞప్తికి దెచ్చికొమ్ము. ఉన్నతవంశ సంభూత యైన శ్రేష్ఠిపుత్రిక నెత్తిమీద ఉమియకుము. నీ స్థితిని గమనించుట లేదా?" అని యీగాథ పలికెను.

కలండుకుడు చిలుకను గురుతించి ఇది నాసంగతి బయట పెట్టును అని యోచించి భయము చెంది "స్వామీ, రండు. ఎప్పుడు వచ్చితిరి?" అని యడిగెను. శుకము యోజించి, "వీడు నాహితచింతకుడు కాడు! నామెడ విరిచి నన్ను సంహరించును" అనుకొని నాకు నీతో పని లేదు అని యెగిరిపోయి తాను చూచినది సవిస్తరముగా చెప్పెను.

"వాడు అనుచితకార్యము చేసినాడు" అని శ్రేష్ఠి వానిని వారాణసికి రప్పించి దాసుని జేసియుంచెను.

నీదేశమును జన్మ నే నెరుంగుదును -
విహగమ్మ నడవిలో విచరించుదాన.
బాగుగా గురుతించి పట్టింతు: దగ్గ
మోయి కలండుకా! ఉమియక త్రాగు!

కలండుకుడు కూడ శుకపోతమును గురుతించి నన్ను బయటపెట్టునను భయమున "స్వామీ, రమ్ము, ఎప్పుడు వచ్చితివి?" అనెను. శుకము "హితకాముడై వీడు నన్ను పలుకరింపలేదు, గొంతు నులిమి చంపుటకే" యని భావించి, శుకపోతము ఎగిరి వారాణసికి బోయి, తాను చూచిన దంతయు శ్రేష్ఠికి వివరించెను. "వాడు చేసిన దయుక్తము" అని శ్రేష్ఠి వానిని తెప్పించి యథా పూర్వముగా దాసపదమునం దుంచెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పటి కలండుకుడు ఇప్పటి భిక్షువు; వారాణసి శ్రేష్ఠి నేనే.

# 128 బిలారవత జాతకము

శాస్త జేతవనమున నుండగా కపట భిక్షువు విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆసమయమున ఆభిక్షువు కపటముపై చర్చ జరిగినపిదప శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడేకాదు, పూర్వముకూడ నితడు మోస గాడే". అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు మూషికము కడుపున బుట్టి, బుద్ధివైభవము కలిగి సూకరశాబకమువలె మహాశరీరము కలిగి యనేకశత మూషిక పరివార ముతో నరణ్యమున నివసించుచుండెను. ఒకానొక నక్క యిటు నటు సంచరించుచు, మూషిక సంఘమును జూచి, వీనిని వంచించి, భక్షింతు నని యోజించి, మూషికావాసమునకు సమీపమున సూర్యాభిముఖ ముగా ఒక పాదముపై నిలిచి, వాయువు పీల్చుచుండెను. బోధిసత్త్వు డాహారార్థము తిరుగుచు దానిని గాంచి శీలవంత మని భావించి దగ్గ రకు బోయి "భదంతా, మీనామధేయ మేమి?" అని యడిగెను. "ధార్మిక నాముడను." "ఒంటి కాలిమీదనే నిలువ నేల?" "నాలుగు పాదములు మోపితినేని భూమి భరింపజాలదు." "నోరు తెరచియున్నా వేమి?" "నే నేమియు భుజింపను. వాయుభక్షణము చేయుదును." "సూర్యాభిముఖముగా నిలిచినా వేల?" "సూర్యనమస్కారము చేయు చున్నాను." బోధిసత్త్వు డీ మాటలు విని, యీతడు శీలవంతుడు కానోపు నని భావించి, నాటనుండి మూషిక పరివృతుడై ప్రాత స్సాయం సమయములందు నక్కకు నమస్కరింప బోవుచుండెను. అవి మరలి పోవుసమయమున తుది మూషికమును బట్టి సృగాలము దాని మాంసము భుజించి, మూతి తుడుచుకొని నిలిచియుండునది. క్రమముగా మూషికములు పలుచబడెను. మూషికము లిట్లు చింతించినవి:

"వెనుక మనము సాంద్రముగా నుంటిమి. ఇప్పుడు మన పంక్తి చాల శిథిల మయినది. దీనికి కారణ మేమగును?" ఇట్లు తలపోసి మూషిక ములు బోధిసత్త్వునితో జరిగిన సంగతి చెప్పెను. ఏల మూషికములు పలుచబడిన వని ఆయన చింతించి, నిర్ణయింపనేరక, నక్కపై నను మానము కలిగి, మరునాడు తాము వదలిపోవు కాలమున మూషికము లను ముందుంచి, తాను చివర నుండెను. సృగాలము బోధిసత్త్వుని మీదికి దుమికెను. కనిపెట్టి బోధిసత్త్వుడు తప్పించుకొని "నక్కా, నీ వ్రత మిదియా? పరహింసార్థము ధర్మధ్వజము పట్టి తిరుగుచున్నావా?" అని యీ గాథ పలికెను:

ఎవడు ధర్మధ్వజ మెత్తి ప్రాణులకు
తొలుత విశ్వాసమ్ము కలిగించి యవల
మోసములో పాపములు చేయుచుండు:
తద్ధర్మము బిడాలధర్మము చూవె!

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పటి నక్క ఈకృతిమ భిక్షువు; మూషిక రాజు నేనే.

## 129 అగ్గిక జాతకము

శాస్త జేతవనమున నుండగా కపటభిక్షువు విషయమై చెప్పినది.

### అతీత కథ

పూర్వము బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు మూషిక రాజై యరణ్యమున నివసించుచుండెను. ఒకప్పుడు దవానలము బయలుదేర నక్క యొకటి తప్పించుకొని పోవ నేరక వృక్షమునకు తల మోపి నిలిచి యుండెను. దాని యొడలిమీది

రోమములు కాలిపోయినవి. చెట్టు కానించి యుండుటచే నెత్తిమీది కొలది వెంట్రుకలు మాత్రము మిగిలినవి. ఒకనాడు నక్క పడియలో నీరు త్రాగుచుండగా శిరముమీది శిఖ నీటిలో ప్రతిఫలింప, చూడ్కి మును జూచి "నా కిప్పటికి భాండారము దొరకినది" అని సంతోషించి, అడవిలో తిరుగుచు మూషిక బిలమును గాంచి 'మూషికములను మోసగించి భక్షింపవలెను' అని చింతించి సమీపమున నిలిచెను.

ఆహారార్థము తిరుగుచున్న బోధిసత్త్వుడు నక్కను జూచి శీలవంతుడని భావించి దగ్గరకు బోయి "మీ నామధేయ మేమి?" అని యడిగెను.

"అగ్నిక భారద్వాజ నాముడను".

"ఇచ్చటి కేల వచ్చితిరి?"

"మిమ్మును మీ సర్వస్వమును రక్షించుటకు.

"ఏమి చేసి మమ్ము రక్షింతురు?"

"అంగుష్ఠ గణనము నాకు తెలియును. మీ రందరు ఆహారార్థము బయలుదేరునపుడు మరలివచ్చునపుడును గుణించి అందరు సరిగా నున్నారో లేదో గమనింతును. ఇట్లు ఉదయ సాయంకాలములందు మిమ్ము రక్షించుచుందును."

"అట్లయిన మామా, మమ్ము గాపాడుచుండుము."

"మంచిది" అని సృగాలము ప్రాతఃకాలమున మూషికములు బయలు వెడలుచుండ ఒకటి రెండు మూడు అని లెక్కపెట్టి, సాయంకాలమునగూడ అట్లే లెక్కించుచు వెనుక జిక్కిన యెలుకను బట్టి భక్షించుచుండెను. ఒకనాడు మూషికరాజు వెనుదిరిగి "అగ్నిక భారద్వాజ, నీధర్మబుద్ధివలన శిరసుమీద శిఖ యుంచలేదు. కుక్షిపరాయణత్వము వలన శిఖ స్థాపించినావు" అని యీగాథ పలికినాడు:

పొట్టకూటికి గాని పుణ్యమ్ముకొరకు
కాదు నీశిఖ అగ్గికా, చాలు గణన-
నీ లెక్క వ్రేళ్ళపై నిండుట లేదు.

శాస్త్ర ధర్మోపదేశములు చేసి, జాతకములు సరిపోల్చెను. అప్పటి నక్క ఇప్పటి భిక్షువు; మూషికరాజు నేనే.

## 130 కోసియ జాతకము

శాస్త జేతవనమున నుండగా శ్రావస్తీ నివాసిని యగు నొకానొక స్త్రీ విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రద్ధాళు వగు బ్రాహ్మణునిభార్య యామె; కాని దుశ్చరిత్ర, పాపాత్మురాలు. రాత్రులందు దురాచారమున నుండి, పగ లేమియు చేయక, రోగము నటించుచు, మ్రేలుచు పండుకొనును.

"భద్రే, నీ కేమి బాధ?" అని బ్రాహ్మణు డామె నడిగెను.

"నాకు వాతపు పోట్లు.

"అయినచో నీ కేమి కావలెను?"

"చక్కని, తీయని, స్వాదిష్ఠ మైన యవాగు తైలము మొద లగు నవి కావలెను".

ఆమె కోరినదానిని బ్రాహ్మణుడు తెచ్చి యిచ్చుచుండెను. బ్రాహ్మణు డింట నున్నప్పు డామె పండుకొని యుండును; వెలుపలికి వెళ్ళినప్పుడు జారులతో కాలక్షేపము చేయుచుండును. ఆమెశరీరమున వాతపుపోటులు తగ్గునట్లు బ్రాహ్మణునకు తోచలేదు.

ఒకనా డాయన గంధమాల్యానులేపనములు తీసికొని జేతవనము నకు బోయి, శాస్తకు వందనము, పూజ చేసి, ఒకప్రక్కన గూరు చుండెను. "బ్రాహ్మణా, కనబడుట లే దేమి?" అని శాస్త యడిగెను.

"భన్తే, బ్రాహ్మణిశరీరమున వాతపునొప్పులు. ఆమెకోసము నేను నెయ్యి, తైలము, మంచిమంచి భోజనపదార్థములు తెచ్చు చుందును. ఆమెయొడలు లావెక్కినది; చర్మము నును పెక్కుచున్నది. కాని, వాతరోగము తగ్గుట లేదు. ఆమె కుపచారము చేయుటలోనే కాలము గడచుచున్నది. అందుచేత ఇచ్చటికి వచ్చుట కవకాశము కలుగుట లేదు."

బ్రాహ్మణి దుశ్చరిత్రురా లను విషయము గ్రహించి శాస్త "బ్రాహ్మణా, ఇప్పుడే కాదు; పూర్వజన్మములోకూడ నీవు పండితుల నడిగినావు. వారు చెప్పినది పూర్వజన్మవిషయ మగుటచే నీకు జ్ఞప్తిలో

లేదు” అని, బ్రాహ్మణుడు వేడినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ప్రసిద్ధ బ్రాహ్మణ కుటుంబమున బుట్టి తక్షశిలలో విద్యాపారంగతుడై వచ్చి, జగద్విఖ్యాతుడైన యాచార్యు డయ్యెను. రాజధానులనుండి క్షత్రియ కుమారులు, బ్రాహ్మణ కుమారులు ఔత్సుక్యమున వచ్చి ఆయన సన్నిధిలో విద్య లభ్యసించుచుండిరి. ఒకానొక గ్రామీణ బ్రాహ్మణుడు బోధిసత్త్వుని కడ మూడు వేదములు అష్టాదశ విద్యలు నేర్చినవాడు; వారాణసిలోనే కుటుంబము నుంచి అనుదినము రెండుమూడు పర్యాయములు బోధిసత్త్వునికడకు వచ్చుచుండెను. ఆయనభార్య దుశ్శీల, దుర్మార్గురాలు, అంతయు పై జెప్పినట్లే యయ్యెను. “ఈకారణమున ఉపదేశ శ్రవణమునకు రా వీలు కలుగుట లేదు” అని యతడు చెప్పినప్పుడు బోధిసత్త్వుడు తనలో “భార్య యితనిని వంచించి, లేవకున్నది” అని గ్రహించి ఆమెరోగము కుదుర్చు మందు చెప్పెద నని యోజించి “నాయనా, నీవు నేటినుండి యామెకు పరమాన్నాదులు పెట్టవలదు. గోమూత్రమున పంచఫలములు వేసి, క్రొత్త రాగిపాత్రలో పోసి, చిలు మెక్కువరకు నుంచి త్రాడు కాని, తీగ కాని, కఱ్ఱ గాని పట్టుకొని ‘ఇది నీరోగము కుదుర్చు మందు. దీనిని త్రాగినను సరే, లేచి వంట మొదలయిన పనులు చేసినను సరే’ అని నీ భార్యకీ పంక్తులు చెప్పుము. ఆమె మందు త్రాగదేని, త్రాటితో గాని, పలుపుతో గాని, కఱ్ఱతో గాని కొట్టి, జుట్టు పట్టి యీడ్చి, పిడికిలితో పొడువుము. తక్షణమున నే లేచి యామె పనులు చేయ నారంభించును” అని బోధించెను. బ్రాహ్మణుడు చిత్తముని పోయి చెప్పిన ప్రకార మౌషధము చేసి “భద్రే, ఈమందు త్రాగు” మని భార్యతో జెప్పెను.

“ఎవ్వ రిది చెప్పినారు?”

“ఆచార్యుల వారు.”

“నేను త్రాగను, తీసివేయుడు.

“త్రాగవా?” అని యతడు త్రాడు తీసి “నీ రోగము కుదుర్చు

మందు త్రాగుము, కాదేని లేచి వంటపనులు చేయుము" అని యీ గాథ పలికెను:

చెప్పినట్లుగ నౌషధ సేవ చేసి
తిన్నయట్లు పనుల్ సరి దిద్దవలయు!
ఓసి కోసియ, నీవాడు నుక్కులకును
భోజనాదుల కేమియు పొత్తు లేదు!

ఇట్లాతడు వలుకగా కోసియ బ్రాహ్మణి భయపడి, ఆచార్యుడు ప్రోత్సహించినందున ఈయనను వంచింప శక్యము కాదని గ్రహించి లేచి యింటిలో పనులు చేయ నారంభించెను. "ఆచార్యునకు నాదుశ్శీలము విదిత మయినది: ఇకనుండి వెనుకటి విధమున ప్రవర్తింప వీలు లేదు" అని ఆచార్యునియెడ గారవమున పాపకర్మలు విరమించి, శీలవతి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. అప్పటి భార్యాభర్తలు ఇప్పటి భర్యాభర్తలే; ఆచార్యుడు నేనే.

## 131 అసంపదాన జాతకము

శాస్త వేణువనమున నున్నపుడు దేవదత్తుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు ధర్మసభలో ఇష్టాగోష్ఠి చేయుచు "ఆయుష్మంతులారా, దేవదత్తుడు అకృతజ్ఞుడు; తథాగతుని సద్గుణము తను గ్రహించినవాడు కాడు" అనుచుండిరి. శాస్త అరుదెంచి "భిక్షువులారా, ఏమి మాటాడుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిదప బుద్ధుడు "భిక్షువులారా, దేవదత్తుడు కేవల మిప్పుడే కాడు; పూర్వముకూడ అకృతజ్ఞుడే" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము మగధరాజు రాజ గృహమున పరిపాలనము చేయు చుండ, బోధిసత్త్వు డాయనకు శ్రేష్ఠియై యెనుబది కోటుల సంపద కలిగి, 'కోటీశ్వరు' డను పేరు నొందెను. వారాణసిలో పిలియ శ్రేష్ఠికి కూడ నెనుబది కోటు లుండెను. వారిరువురు మిత్రులు. ఏ కారణమున నో పిలియ శ్రేష్ఠికి మహాపద సంభవించి సమస్తము కోలు పోయెను. అతడు దరిద్రుడై గతిలేక భార్యను వెంటగొని వారాణసి నుండి బయలు దేరి రాజగృహము చేరి కోటీశ్వరుని యింటికి పోయెను. ఇత నిని జూచి కోటీశ్వరుడు మిత్రము వచ్చి నాడని కౌగిలించుకొని ఆదరిం చెను. కొలది రోజుల తరువాత "మిత్రమా, ఏమి పనిమీద వచ్చినా?" వని యడిగెను. "కష్టములు దాపు రించినవి. ధన మంతయు పోయినది. నీ సాయము కావలెను" అని పిలియ శ్రేష్ఠి పలికెను.

"మంచిది, మిత్రమా. భయపడకు" అని కోటీశ్వరుడు భాండా గారము తెరపించి, నలువదికోట్ల హిరణ్య మిచ్చి, మిగిలిన తన సర్వ స్వము రెండు భాగములు చేసి, ఒక భాగము మిత్రున కిచ్చెను. వా డాసంపద గొని వారాణసికి బోయి నివాస మేర్పరచు కొనెను.

తరువాత అనతి కాలమునకు కష్టములు దాపురించి, కోటీశ్వరుడు సమస్తము కోలుపోయెను. దిక్కుకై యోజించుచుండ అతనికి పిలియ శ్రేష్ఠి జ్ఞప్తికి వచ్చినాడు. తన కతడు సాయము చేయు నని యతడు భార్యతో కూడ కాలినడకను వారాణసికి బోయి, భార్యతో 'భద్రే, నీవు నాతో వీధుల వెంట నడచుట యుక్తము కాదు. ఇచ్చట కొలది సేపు వేచి యుండుము. పరివారముతో శకటము పంపి సగౌరవముగా నిన్ను గొనిపోవుదును' అని చెప్పి, నగరద్వార సమీపమున గూరు చుండ బెట్టి, తాను పిలియ శ్రేష్ఠి భవనమునకు బోయెను. రాజ గృహశ్రేష్ఠి వచ్చినాడని లోనికి వార్త పంపి, రావచ్చు నని లోపల నుండి యనుజ్ఞ వచ్చినంతనే శ్రేష్ఠి పిలియ కడకు జనెను. మిత్రుని జూచి పిలియ పీఠము మీదనుండి లేవలేదు, స్వాగత మనలేదు, ఏల వచ్చితి వని మాత్ర మడిగెను.

"మీదర్శనార్థమే వచ్చినాను."

"నివాస మెక్కడ?"

"ఇంతవర కెక్కడను లేదు. భార్యను నగరద్వారమున సత్రము లో నుంచి వచ్చితిని."

"నీ కిచ్చుట గది లేదు. స్వయంపాకమునకు బియ్యము తీసుకొని పోయి వంట చేసికొనుడు. మరల నిచ్చటి కెన్నడు రావలదు" అని పిలియశ్రేష్ఠి సేవకుని బిలిచి, తవ్వెడు బియ్యముత్తరీయము కొంగున మూట కట్టి పంపుమని ఆనతిచ్చెను. ఆనా డతని కోష్ఠములలో దంపిన బియ్యము వేయిబండ్లు నిండునవి యుండెను. పూర్వము నలుబదికోట్లు గ్రహించిన యాధూర్తుడు కృతఘ్నుడై, మిత్రునకు తవ్వెడు బియ్యము మాత్ర మిచ్చెను. సేవకుడు బియ్యము కొలిచినబుట్టతో బోధిసత్త్వుని కడకు వచ్చెను. ఈ సత్పురుషుడు నాకడ నలుబది కోట్లు పుచ్చుకొన్నాడు. ఇప్పుడు తవ్వెడు బియ్య మిచ్చి నాడు. తీసుకొందునా, మానుదునా? అని యోచించి తుదకు "ఇతడు కృతఘ్నుడు, మిత్రద్రోహి. నాతో మైత్రి విడినాడి నాడు. నా దీనావస్థయే దీనికి కారణము. ఈత డిచ్చిన బియ్యమును స్వీకరింప నేని, నేనుగూడ ఈతనితో పాటే యగుదును. స్వీకరించి మైత్రి ప్రతిష్ఠించెదను" అని వస్త్రాంచలమున బియ్యము మూట కట్టుకొని, భవనము వెలువడి, భార్య యున్న తావున కరిగెను.

"ఏమి తెచ్చినారు?" అని భార్య యనెను.

"భద్రే, నామిత్రము పిలియశ్రేష్ఠి బియ్యము పెట్టి, నేటికి విడిచిపెట్టినాడు."

"అయ్యో, దీని నేల స్వీకరించినారు? మన మిచ్చిన నలువదికోట్లకు ప్రతిఫలమా యిది!" అని యామె ఏడువసాగెను.

"భద్రే, అతనితో మైత్రి విడనాడక స్వీకరించినాను. నీవు రోదింప నేల?" అని యీగాథ పలికెను:

తెచ్చియిచ్చిన వస్తువున్ దేనిగూడ
స్వీకరింపని మూర్ఖుని స్నిగ్ధజనులం
నిలువ; రీమాత్రము తవుడు నేను తెచ్చి
నాడ తెగకుండ స్నేహబంధంబు నేడు;
విరతముగ మైత్రి దృఢముగా నిలుచుగాక!

ఇట్లు చెప్పినను ఆమె కన్నీరు విడుచుచుండెను. పూర్వము కోటీశ్వరుడు పిలియశ్రేష్ఠి కిచ్చిన పాలికాపు ఆసమయమున ద్వారము దగ్గర గా బోవుచు నామె యేడుపు విని, సమీపమునకు బోయి, వారిని గురుతించి వారి పాదముల వ్రాలి, తాను కూడ దుఃఖించుచు "సామీ, యేమిటి పనిమీద ఇచ్చటికి దయచేసినారు?" అని యడిగెను. శ్రేష్ఠి సమస్తము వివరించెను. కానిండు సామీ, యని వా రిరువుర నోదార్చి తన యింటికి గొనిపోయి, గంధోదకమున స్నానము చేయించి, భోజనము పెట్టి, తక్కిన కర్మకారులకు జెప్పి, కొలది రోజులకు వారి నందరిని రాజాంగణమునకు దోడుకొని పోయి ఆక్రోశించెను.

విషయ మేమని రా జడుగగా సంగతి యంతయు వారు రాజునకు విన్నవించిరి. రాజు శ్రేష్ఠుల నిరువురను బిలిపించి శంఖ శ్రేష్ఠితో (కోటీశ్వరునితో) "నీవు పిలియశ్రేష్ఠికి నలువది కోటు లిచ్చినమాట నిజమేనా?" అని యడిగెను.

"మహారాజా, మిత్రుడు కష్టదశలో నాకడకు వచ్చి సాయ మడిగి నపుడు ధనమే కాక సమస్తములో సగము భాగముకూడ నిచ్చితిని" అని శంఖశ్రేష్ఠి చెప్పెను.

"ఈమాట సత్యమేనా?" అని రాజు పిలియశ్రేష్ఠి నడిగెను.

"చిత్తము, దేవా!"

"నీ కుపకారి యయిన మిత్రుడు కష్టదశలో నీకడకు వచ్చినపుడు తగిన సమ్మానము చేసి, ఆతిథ్య మిచ్చితివా?"

పిలియశ్రేష్ఠి మౌనము వహించెను.

"నీవు తవ్వెడు బియ్య మీయన యుత్తరీయము కొంగున కట్టించితివా?" అని రా జడిగెను.

అప్పటికిని పిలియశ్రేష్ఠి మౌనము వహించి యుండెను.

ఏమి చేయవలయు నని రాజు అమాత్యులతో యోచన చేసి, "పోండు, పిలియశ్రేష్ఠి సర్వస్వమును శంఖ శ్రేష్ఠి కప్పగింపుడు" అని ఆజ్ఞ చేసెను.

బోధిసత్త్వు డప్పుడు "మహారాజా, పరధనము నా కక్కరలేదు. నే నిచ్చినది నాకు మరల వచ్చిన జాలును" అని పలికెను. రాజు

బోధిసత్త్వుని భాగ మిప్పించెను. తన సంపద తిరుగ లభింపగా శంఖ శ్రేష్ఠి దాసజన పరివృతుడై రాజగృహమునకు బోయి, పనులు చక్క బెట్టుకొని, దానాది పుణ్యకార్యములు చేయుచు తుదకు యథాకర్మంగతో.

శాస్త్ర ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలపు పిలియశ్రేష్ఠి దేవదత్తుడు; శంఖశ్రేష్ఠి నేనే.

## 132 పంచగరుక జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు అజపాల న్యగ్రోధ వృక్షముక్రింద మారుని కుమారితలు ప్రలోభపెట్టు సూత్రమువిషయమై చెప్పినది. భగవాన్ మొదటి నుండియు ని ట్లుండెను :

మారకన్యక లరుదెంచినారు రక్తి
తృష్ణ వెదజల్లుచున్ మహాతీవ్రముగను;
దూదిపింజల వాయువు త్రోయునట్లు
దూరముగ శాస్త వారల ద్రోలినాడు.

ఈప్రకారముగా ఆ సూత్రమును తుదివరకును చెప్పునపుడు ధర్మ సభలో సమావిష్టులైన భిక్షువులు "ఆయుష్మంతులారా, సమ్యక్-సంబుద్ధుని కడకు మారకన్యలు వందలకొలది దివ్యరూపములు ధరించి భగవానుని ప్రలోభపెట్టుటకు వచ్చిరి. కాని ఆయన కన్ను తెరవలేదు. ఓహో, బుద్ధబల మెంతయద్భుతము!" అనుచుండిరి.

శాస్త అచ్చటి కరుదెంచి "భిక్షువులారా, ఇక్కడ కూరుచుండి యేమి మాటాడు చున్నారు?" అనెను. ఈవిషయ మని వారు చెప్పగా శాస్త "భిక్షువులారా, ఈసమయమున ఆశ్రవము లన్నియు నశించి సర్వజ్ఞత్వము లభించినపిదప మారకన్యలు కానరాకుండుటలో నాశ్చర్యము లేదు. పూర్వకాలమున బుద్ధత్వము నన్వేషించునపుడు చిత్తమున మాలిన్య మున్నను, కల్పితదివ్యరూపములను కన్నులు తెరచి

కాముక భావముతో చూడలేదు; మహారాజ్యపదము లభించినది” అని, పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు భ్రాతృశతకమున కనిష్ఠుడై పుట్టెను. (సమస్తము తక్షశిలాజాతకమున వివరింపబడును.) మహాజనము తక్షశిలా నగరము వెలుపల శాలలో బోధిసత్త్వుని సమీపించి ప్రార్థించి రాజ్య మిచ్చిరి. ఆయన కభిషేక కాలమునకు జనులు నగరమును దేవనగరమువలెను ప్రాసాదమును ఇంద్రభవనము వలెను అలంకరించిరి. బోధిసత్త్వుడు నగర ప్రవేశము చేసి, ప్రాసాదములోని మహాతలమున శ్వేతచ్ఛత్రము క్రింది రత్నపల్యంకికపై దేవరాజ విలాసముతో కూరుచుండెను. అమాత్యులు, బ్రాహ్మణులు, గృహపతులు మొదలగువారు, క్షత్రియ కుమారులు సర్వాలంకారమండితులై యుండ, పదునారువేల నట్టువ కత్తెలు అచ్చరలవలె గీతవాద్యములతో నాట్యము చేయుచుండ, రాజభవన మా ధ్వనికి ఉరుముతో గూడిన సముద్రము వలె ప్రతిధ్వనించెను. బోధిసత్త్వుడు తన మహావైభవమును జూచుచు ఇట్లు చింతించెను: “నే నా యక్షిణుల దివ్యరూపమును జూచుచున్న యెడల ప్రాణములు కోలుపోయి యుందును. ఈసిరిసంపదలను జూడను. ప్రత్యేక బుద్ధుల యుపదేశము స్థిరముగా నుండుటచే నిది లభించినది”. ఇట్లు చింతించి, ఉత్సాహావశమున ఈగాథ పలికెను:

సుదృఢముగా నుండుటన్ సదుపదేశంబు
బెదరు లేకుండుటన్ హృద్భయంబులందు
రక్కసి వాతను చిక్కము మేము:
భయభారమున నేనా బ్రతికిపోయితిని!

ఇట్లు మహాసత్త్వుడీ పద్యరూపమున ధర్మమును నిరూపించి, ధర్మమార్గమున రాజ్యము పాలించి, దానాది పుణ్యకార్యములు చేసి, యథా కర్మంగతో.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోర్చెను. తక్షశిలకు పోయి రాజ్యము పొందిన కుమారుడు నేనే.

## 133 ఘతాసన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

ఆభిక్షువు బుద్ధునికడ కర్మస్థానము గ్రహించి సరిహద్దు ప్రాంతమునకు బోయి ఒకానొక గ్రామసమీపమున నివాస మేర్పరచుకొని నివసింప జొచ్చెను. మొదటి మాసములో నతడు భిక్షార్థము పోయినపుడు కుటీరము దగ్ధ మయ్యెను. ఉండుటకు చోటు లేక శ్రమపడుచుండె నత డుపస్థాపకులతో జెప్పెను. వారు "మంచిది, భన్తే, పర్ణశాల నిర్మింతుము. ఇప్పుడుమాత్రము నాగళ్ళు దున్నెడిపని యున్నది. ఇప్పుడే గింజలు చల్లవలెను" అనుచు మూడు నెలలు గడపిరి.

నివాసస్థానమున కానుకూల్యము లేక ఆభిక్షువు కర్మస్థానము పూర్తి చేయ లేకపోయెను. అతడు నిమిత్తమయినను పొందలేదు. వర్షావాస మయినపిదప నతడు జేతవనమునకు బోయి శాస్తకు ప్రణామము చేసి ఒకప్రక్క గూరుచుండెను. శాస్త అతనితో ఇష్టాగోష్ఠి చేయుచు "ఏమి భిక్షూ, కర్మస్థానము సఫల మయినదా?" అనెను. అత డాదినుండియు కలప్రతికూలతను తెలిపినాడు. శాస్త "భిక్షూ, పూర్వముకూడ జంతువులు తమ అనుకూలతా ప్రతికూలతలను గమనించి అనుకూలముగా నున్నప్పు డొకచోట నుండి, ప్రతికూలత తోచినంతనే ఆచోటు విడిచి వేరొకచోటికి బోయెడివి. నీవు స్థితిగతు లేల గ్రహింపలేదు?" అని, పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు పక్షికడుపున పుట్టెను. క్రమముగా పెరిగి సౌభాగ్యవంతమున పక్షి రాజయ్యెను. అడవిలో సరోవరతీరమున బహుశాఖాపత్ర ఫలభరిత మైన మహావృక్షము నాశ్రయించి పక్షిరాజు సపరివారముగా నివసించుచుండెను. శాఖలపై నున్న పక్షులు క్రింది సరోవరజలమున రెట్టలు వేయుచుండెను. సరస్సులో నివసించుచున్న వ్యాఘ్

రాజు చందుడు కుపితుడై, "ఈపిట్టలు రెట్టలు విడిచి నా నివాసమును మలినము చేయుచున్నవి. జలములో అగ్నిని ప్రేరేచి వృక్షమునకు దాకునట్లు చేసి, పిట్టలను పార ద్రోలుదును" అని చింతించి, ఒకరాత్రి వేళ పక్షులు నిద్రించుచుండ, జలము సలసల కాగునట్లు చేసి ధూమము రేపి, తాడిపొడవున మంటలు లేపెను.

జలమునుండి మంటలు లేచుట చూచి బోధిసత్త్వుడు "పక్షులారా, అగ్నిని సలిలము చల్లార్చును. కాని యిచ్చట ఉదకమునుండి యగ్ని యుద్భవించుచున్నది. ఇక్కడ మనము నివసింపజాలము. అన్య ప్రదేశమునకు బోవుదము" అని యీగాథ చెప్పెను:

కల్యాణ మున్నంత కాలమ్ము వైరు
లందయ మొందుచునుండి; రుదకమ్ములోన
జ్వలనమ్ము రేగగా సాగెను; ధాత్రి
జనియించు తరువుపై నునికి యసాధ్య;
మెచటికైనను బోవుటే చాల మేలు!
ఎచ్చోట శరణమ్ము జొచ్చిన నచట
జనియించు చున్నది ఘనముగా భీతి.

ఇట్లు చెప్పి బోధిసత్త్వుడు తన మాట విన్న పక్షులతో నెగిరి వేరొకచోటికి బోయెను. బోధిసత్త్వుని మాట వినక అచ్చట నిలిచిన పక్షులు ప్రాణములు కోలుపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి ఆర్యసత్యమును ప్రకటించి కథలు సరిపోల్చెను. ఆభిక్షువు అర్హత్త్వము పొందెను. అప్పటి పక్షిగణము ఇప్పటి బుద్ధపరిషత్తు; పక్షిరాజు నేనే.

## 134 ఝూవశోధన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు సంకస్స నగరద్వారమున సంక్షేపముగా నడిగిన ప్రశ్నకు ధర్మసేనాపతి సారిపుత్రుడు చేసిన విపులవ్యాఖ్యను గూర్చి చెప్పినది. అతీతకథ యిట్లున్నది.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు అరణ్యాయతనమున మరణించుచు "సంజ్ఞ కాదు, అసంజ్ఞ కాదు" అని పలికెను. తాపసులు జ్యేష్ఠశిష్యుని కథనము విశ్వసింపలేదు. బోధిసత్త్వుడు ఆభాస్వరలోకమునుండి వచ్చి, ఆకాశ మున నిలిచి, యీగాథ పలికినాడు:

> సంజ్ఞ యున్నను దుర్గతి, సంజ్ఞ లేక
> యున్న దుర్గతి, విడనాడి యుభయములను
> ప్రాప్త మగునేని యాసమాపత్తి సుఖము
> దోషరహితముగా నుంట ధ్రువము జనుడు.

ఈప్రకారము బోధిసత్త్వుడు ధర్మమును నిరూపించి, అంతేవాసి గుణములను ప్రశంసించి, బ్రహ్మలోకమునకు జనెను. అప్పుడు మిగిలిన తాపసు లెల్లరు జ్యేష్ఠాంతేవాసి వాక్కును విశ్వసించిరి.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలమున జ్యేష్ఠశిష్యుడు సారి పుత్రుడు; మహాబ్రహ్మ నేనే.

## 135 చందాభ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కంకస్స నగరద్వారమున ప్రశ్నకు స్థవిరుడు చేసిన వ్యాఖ్యానమును గూర్చి చెప్పినది.

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండగా బోధిసత్త్వుడు ఏకాంతముగా వనములో మరణించు సమయ మున శిష్యు లడుగగా చందాభం సురియాభం అనెను. ఆయన మృతి చెంది ఆభాస్వరలోకమున జన్మించెను. తపస్వులకు జ్యేష్ఠశిష్యుని

మాటమీద నమ్మకము కలగలేదు: బోధిసత్త్వు డరుదెంచి, ఆకాశ మున నిలిచి ఈగాథ పలికెను:

సూర్యచంద్రాభలన్ ప్రజ్ఞ సుస్థిరముగ
ఎవ్వ డుండు, వితర్క విహీన మైన
ధ్యానవశవర్తి యగునట్టి మానవుండు
బ్రహ్మలోకమ్మునందు నుత్పన్ను డగును.

ఈ ప్రకారము బోధిసత్త్వుడు తాపసులకు బోధచేసి, ప్రధాన శిష్యుని ప్రశంసించి, బ్రహ్మలోకమునకు జనెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పటి జేష్ఠశిష్యుడు సారిపుత్రుడు; మహాబ్రహ్మ నేనే.

## 136 సువణ్ణహంస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు స్థూల నంద భిక్షునివిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఉపాసకుడు భిక్షునీసంఘమునకు వెల్లుల్లిపాయ లిత్తు నని నిమంత్రించి, భిక్షునులు వచ్చినచో ఒక్కొక్కరికి రెండుమూడు ఉల్లిపాయ లున్నగుత్తి ఈయవలసిన దని తనపొలములోని పనివారి కాజ్ఞ యిచ్చెను. అప్పటినుండి భిక్షునులు ఆతనియింటికి పొలమునకును బోవసాగిరి.

ఒకపండుగ నాడు ఆయుపాసకునియింట వెల్లుల్లిపాయ లయిపోయి నవి. స్థూలనంద మరికొందరు భిక్షునులతో గలిసి ఆతనియింటికి జేరి "ఆయుష్మంతులారా, ఉల్లిపాయలు కావలసి వచ్చినవి" అని చెప్పెను.

"ఆర్యా, ఉల్లిపాయ లయిపోయినవి. తెచ్చుటకూడ ముగిసినది. పొలమునకు బొండు" అని యతడు పలికెను.

ఆమె క్షేత్రమునకు జని లెక్క లేకుండ లశునములు గొనిపోయెను. పొలమువారు "ఏ మిది? బిక్షునులు లెక్క లేకుండ ఉల్లిపాయలు తీసికొనిపోవుచున్నారు" అని మండిపడిరి.

అల్పేచ్ఛవు లగు బిక్షునులు అసంతుష్ట లయిరి; విన్న భిక్షువులుకూడ అసంతుష్టి చెందిరి. వారు బాధపడి, భగవానునితో ఈసంగతి చెప్పిరి. భగవాన్ బిక్షునిని నిందించి "భిక్షువులారా, కన్నతల్లికూడ పేరాశ కలవానిని ఏవగించుకొనును. ఆమెకుకూడ లాలసి అప్రియముగా నుండును. పేరాస అప్రసన్నులను ప్రసన్నులను చేయలేదు; ప్రసన్నులను అధికప్రసన్నులను చేయజాలదు. అల్పేచ్ఛ వగువాడు అప్రసన్నులను ప్రసన్నులను చేయగలడు" అని భిక్షువులకు సౌమ్యముగా ఉపదేశ మిచ్చి, "భిక్షువులారా, ఈమె కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ లోభముతో నుండునది" అని, పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు బ్రాహ్మణ కుటుంబమున బుట్టి, పెరిగి, సమాన రూప యగు కన్యను పెండ్లాడెను. నంద, నందవతి, సుందరినంద, అను మువ్వురు పుత్రికలు కలిగిరి. బోధిసత్త్వుడు కాలము చేసిన తరువాత వారిని సమీపాప్తులు తీసికొని పోయిరి. ఆయన సువర్ణహంస యయి పుట్టి, పూర్వస్మృతితో నుండెను. హంస తన సువర్ణ వర్ణములను సౌందర్యమును జూచుకొని ఎచ్చటనుండియీ జన్మ బడసినానో యని తలపోయుగా మానవలోకము నుండి యని స్మృతికి వచ్చెను. తనభార్యయు బిడ్డలును పరపోషణలో నుండుట జూచి "నాశరీరమున బంగారు పర్ణము లున్నవి గదా, ఒక్కొక్కటి వారల కిచ్చినచో సుఖముగా జీవింతురు" అని తలచి వా రున్నచోటికి బోయి యింటి వడుమ దూలముమీద వ్రాలెను. బ్రాహ్మణియు పుత్రికలును బోధిసత్త్వుని జూచి "స్వామీ, ఎక్కడనుండి వచ్చినావు?" అని యడిగిరి. "నేను మీతండ్రిని, చని పోయి సువర్ణహంసనై పుట్టినాను. మిమ్ము జూడవచ్చినాను. నేటి నుండి మీరు పరసేవ చేసి జీవింపవలసిన పని లేదు. మీకు ఒక్కొక్క

పత్ర మిచ్చుచుందును. దానిని విక్రయించి, సుఖముగా జీవింపుడు" అని చెప్పి, యొక యీక యిచ్చి, వెడలిపోయెను. ఈవిధముగా హంస అప్పుడప్పుడు వచ్చి పర్ణ మిచ్చి పోవుచుండెను. దాని మూల్యమువలన బ్రాహ్మణి బిడ్డలు సుఖజీవనము చేయుచుండిరి. ఒకనాడు తల్లి "బిడ్డలారా, జంతువుల మనస్సు గ్రహింపలేము. మీతండ్రి యిక్కడికి నిర్ణీతకాలము లేకుండవచ్చును. ఈసారి వచ్చి నప్పుడు పర్ణము లన్నిటిని లాగి వేయుదము" అని పలికెను. తండ్రికి బాధ కలుగు నని కొమార్తెలు సమ్మతింప లేదు. ఒకనాడు హంస వచ్చినపుడు స్వామీ, రమ్మని బ్రాహ్మణి పిలిచి, దగ్గరకు వచ్చిన సువర్ణహంసను గట్టిగా రెండు చేతులతో బట్టుకొని పేరాసచే రెక్క లన్నిటిని లాగెను. బోధిసత్త్వున కిష్టము లేనపుడు పర్ణముల నెవరైన లాగినచో అవి సువర్ణత్వము కోల్పోయి, కొంగ రెక్కలవలె నగును. హంస యెగురలేదాయెను. బ్రాహ్మణి హంసను పెద్ద గంపలో (పీపాలో) బడవేసెను. క్రమముగా పర్ణములు మొలిచి శక్తి వచ్చిన తర్వాత హంస యెగిరి నిజనివాసమునకు బోయి, ఎన్నడు బ్రాహ్మణి యింటికి మరలి రాలేదు.

దొరకినదానితో తుష్టి నొందుటయె
యగు సమ్మతము, పేరాస పాపమ్ము.
హస్తగతం బయ్యె హంసరాజమ్ము —
కాని లభింపదే కార్తస్వరమ్ము.

**శాస్త కథలు సరిపోల్చెను. అప్పటి బ్రాహ్మణి ఇప్పటి మూలనంద; ముగ్గు రాడుపిల్లలు ఇప్పటి ముగ్గురు సోదరలు; స్వర్ణరాజహంసము నేనే.**

## 137 బబ్బు జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఏకాక్షిమాత కిచ్చిన శిక్షాపదమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో కాణమాత అని పిలువబడు స్త్రీ శ్రోతాపన్న ఆర్య శ్రావిక. ఆమె తనయేకాక్షిపుత్రికను ఒకానొకపల్లెలో తమకులమువాని కిచ్చి పెండ్లి చేసెను. కూతు రేదోపనిమీద తల్లియింటికి వచ్చెను. కొలదిరోజు లయినపిమ్మట భర్త ఆమె వెంటనే రావలె నని వార్త పంపెను.

దూత తెచ్చినవార్త తల్లికి తెలిపి ఆమె "అమ్మా, పోవుచున్నాను" అనెను.

బిడ్డ నిన్నిరోజు లుంచి ఏమియు పెట్టక వట్టిచేతులతో నెట్లు పంపుదు నని యోచించి, తల్లిరొట్టెలు చేయనారంభించెను.

ఆసమయమున పిండపాతిక భిక్షువు ఆమెయింటికి బోయెను: ఉపాసిక ఆయనను గూరుచుండబెట్టి పాత్రనిండుగా రొట్టె లుంచెను. ఆయన వెడలిపోయి వేరొక భిక్షువుతో చెప్పగా నాతడు వచ్చి వెను కటి వానివలెనే చేసెను. ఈప్రకారముగా వచ్చిన నలుగురు భిక్షువులకును ఆమె రొట్టె లిచ్చెను. అపూపములు పూర్తి యగుటచే కూతురు భర్తకడకు బోవుట సంభవింపలేదు.

ఆమెభర్త రెండవసారి దూతను బంపెను; భార్య వెంటనే రాని పక్షమున తాను వేరొక తెను పెండ్లి యాడుదు నని యాతడు మూడవ దూత ద్వారా వార్త పంపెను. కూతురు మూడవసారికూడ భర్త కడకు బోవుట సంభవింపలేదు. తనభర్త వేరొకతెను తెచ్చి కొన్నా డని విని ఏకాక్షి ఏడువనారంభించెను.

ఈవిషయములు తెలియగానే శాస్త పాత్రచీవరాదులు తీసికొని ఆమెతల్లియింటికివెళ్లి వేసిన పీఠముపై గూరుచుండి "ఈమె ఏల రోదనము చేయుచున్నది?" అనెను. ఇందుచేత అని వృద్ధురాలు చెప్పెను. శాస్త ధర్మకథ చెప్పి, ఆమె కుల్లాసము కలిగించెను. లేచి విహారమునకు పోయెను. ఆనలుగురు భిక్షువులు చేసినపనివలన కలిగిన ఫలితము

భిక్షుసంఘమునకు దెలిపెను. ఒకనాడు భిక్షువులు ధర్మసభలో గూరు చుండి మాటాడుచు "ఆయుష్మంతులారా, భిక్షువులు చేసినపనివలన వృద్ధురాలి కూతురిని భర్త విడిచిపెట్టినాడు. దీని వలన మహో-ఉపాసిక మనస్సుకు చాలవ్యధ కలిగినది" అనుచుండిరి.

శాస్త అరుదెంచి "భిక్షువులారా, ఏమి మాటాడుచున్నారు? అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిదప శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ నిట్లే జరిగెను" అని పూర్వ జన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు పాషాణములు కొట్టు కులమున బుట్టి, పెరిగి పెద్దవాడయి రాతి చెక్కడమున నేర్పరి యయ్యెను. కాశీరాష్ట్రమున నొకానొక గ్రామములో నలువదికోట్ల యజమానుడగు శ్రేష్ఠి యుండెను. ఆతని భార్య కాలము చేసి ధనప్రీతిచే మూషిక మయి పుట్టి, ధనాగారమున నివసించుచుండెను. క్రమక్రమముగా నింటిలో నందరును శ్రేష్ఠియు గతించిరి. గ్రామము కూడ శిథిలమై నిర్జన మయ్యెను. కథాకాలమున బోధిసత్త్వుడా గ్రామప్రదేశమున రాతిపని చేయుచుండెను. తిండికై యిటు నటు దిరుగుచు ఆడయెలుక యతనిని గాంచుచుండెను. తరచుగా ఆయనను చూచుచుండుటచే మూషిక ఉత్పన్నస్నిగ్ధయై నాకున్న యీ మహాధనము నిష్కారణముగా నంతరించును. ఈతనితో గూడ దీని ననుభవింతును.' అని తలచి, యొకనాడు కార్షాపణము నోట గరచుకొని, యతని వద్దకు వచ్చెను. అతడు చూచి ప్రీతి పూర్వకముగా 'అమ్మా. యీ బంగారు నాణెముతో నేల వచ్చినావు?' అనెను. 'నాయనా, దీనిని తీసికొని యుపయోగించుకొనుము. నాకు మాంసము తెచ్చి పెట్టుము' అని యెలుక చెప్పెను. మంచి దని యతడు కార్షాపణము నింటికి గొనిపోయి, మూషికమునకు మాంసము కొని బెట్టెను. అనుదినము నిట్లే జరుగుచుండెను. ఒకనాడు మూషికమును బిడాలము పట్టుకొనెను. "నన్ను చంపవలదు" అని ఎలుక బలికెను. "ఎందుచేత? నాకు ఆకలి మెండుగా నున్నది. ఆకలి బాధ

శమించుటకు నిన్ను జంపి తినక తప్పదు." "ముందు చెప్పుము. నీకెన్నాడేనా, ప్రతిదినము కూడ ఆకలి బాధ యుండునా?" "ప్రతి దినము నుండును. అట్లయిన నీకు మాంసమును ప్రతి దినము తెచ్చి పెట్టుదును. నన్ను పోనిమ్ము." "అట్లయిన అప్రమత్తవు కమ్ము" అని బిడాలము మూషికమును విడిచెను.

నాటనుండి బోధిసత్త్వు డిచ్చిన మాంసమును రెండుభాగములు చేసి తా నొకటి యుంచుకొని రెండవది పిల్లికి మూషిక మిచ్చుచుండెను. మరియొకనాడు మూషికమును మరియొక మార్జాలము పట్టుకొనెను. అదేవిధముగా మూషిక మంగీకరింపజేసెను. ఇప్పుడు మాంసము మూడు భాగములు చేయవలసి వచ్చెను. అనంతరము మూడవ పిల్లి నాలుగవ పిల్లి, మూషికమును పట్టుకొని, పై ప్రకారముగా సమ్మతించి, మాంసభాగములు గొనుచుండెను. అయిదవ వంతుమాంసమే భుజించుటచే మూషికము మిక్కిలి చిక్కిపోయి, యెముకలపోగయ్యెను. బోధిసత్త్వు డొకనాడు చూచి, ఇట్లున్నావే మని యడిగెను. జరిగిన దంతయు మూషికము చెప్పెను.

"ఇదివరలో ఏల చెప్పలేదు? విచారపడకు. ఈకష్టములోనుండి నిన్నుద్ధరించెదను" అని బోధిసత్త్వుడు పలికి, శుద్ధస్ఫటిక పాషాణముతో ఇల్లుచెక్కి, తెచ్చి, యెలుకకిచ్చి, 'అమ్మా, నీవిందు పండుకొనుము. వచ్చిపోవు పిల్లులను పరుషవాక్కులతో బెదరింపుము' అని చెప్పెను. మూషికమా గుహలో ప్రవేశించి పండుకొనెను. అంతలో నొక పిల్లి వచ్చి 'నాకు మాంసము పెట్టు' మనెను. 'ఓరి, బిడాల ధూర్తా, నీకు నేను మాంసము తెచ్చుదాననా? ఇంటికి బోయి నీ బిడ్డలను మ్రింగుము' అని యెలుక పలుకునప్పటికి కోపవశమున పిల్లి యెగిరి యెలుకను కొట్టెను. స్ఫటికశిల తగులుటవలన పిల్లి గుండె ఆగిపోయి, గ్రుడ్లు పైకివచ్చెను. ఈవిధముగానే తక్కిన పిల్లులుకూడ ప్రాణములు కోలుపోయినవి.

ఆవల మూషికము కృతజ్ఞతతో రోజునకు రెండుమూడు నాణెములు తెచ్చి బోధిసత్త్వున కిచ్చుచు, క్రమముగా సమస్తము నిచ్చెను. వారి జీవితాంతమువరకు నుభయులు నభిన్న మైత్రితో నుండి, తుదకు యథా కర్మంగతా.

ఒక్క పిల్లికి మాంస మెక్కడ దొరకు
అక్కడ క్రమముగా నొక్కటి రెండు,
మూడు, నాలుగును తా రాడుచునుండు:
పిల్లి అయ్యది నీదుబిలము, కన్గొనుము.

ఆవిధముగా శాస్త ధర్మోపదేశము చేసి రెండుకథలు సరిపోల్చెను. అప్పటి నాలుగు పిల్లలు ఇప్పటి నలుగురు భిక్షువులు; ఎలుక ఏకాక్షి మాత; రాయి చెక్కుశిల్పి నేనే.

# 138 గోధ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక మోసగాని విషయమై చెప్పినది. వర్తమానకథ ఇదివరలో భీమసేన జాతకమున (80) ఉన్నట్లుండును.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు బల్లికడుపున బుట్టెను. ప్రత్యంతగ్రామమున అరణ్యాయతనమున పర్ణశాలలో పంచాభిజ్ఞలుకల మహాతపస్వి నివాసము చేయుచుండెను. గ్రామవాసులా సత్యతాపసుని గౌరవించుచుండిరి. బోధిసత్త్వుడు సమీపమున పుట్టలో నివసించుచుండెను. అచ్చటికి తాపసి నిత్యము పచారు చేయుచుండును. బోధిసత్త్వుడు అనుదినము మూడుసారులు తాపసివద్దకు బోయి ధర్మోపదేశములు వినుచు ఆయనకు నమస్కరించి, నిజనివాసమునకు బోవుచుండును. కొంతకాలమునకు తాపసి గ్రామవాసులతో జెప్పి, యచ్చటినుండి వెడలి పోయెను. పిమ్మట కూడ తాపసుడు వచ్చి, ఆశ్రమ పదమున నివసింప జొచ్చెను. ఇతడును కూడ శీలవంతుడని భావించి బోధిసత్త్వుడు వెనుకటి తాపసుని యెడ ప్రవర్తించినట్లే ఈతనియెడను ప్రవర్తించుచుండెను.

నిదాఘసమయమున ఒకనాడకాలవర్షము కురిసినది. చీమలు పుట్టలలోనుండి యీవలకు వచ్చినవి. వానిని తినుటకు బల్లులు బయట తిరిగినవి. గ్రామవాసులు బల్లులను బట్టుకొని, బల్లి మాంసమును పోపు పెట్టి తాపసునకు బెట్టిరి. అది తిని తాపసుడు రుచి మరిగి 'యీమాంస మతిమధురముగా నున్నది. ఇది దేని మాంసము?' అని యడిగెను. బల్లిమాంస మని విని 'నావద్దకు పెద్దబల్లి వచ్చి పోవుచుండును. దానిని చంపి తిందును' అని తలచి, వంటపళ్ళెము (బాణలి) నెయ్యి, లవణము మొదలగునవి సంతరించి, ఒకచో నుంచి, తుండు కాషాయముచాటున దాచి, పర్ణశాల వాకిట బోధిసత్త్వుని రాకకై యెదురు చూచుచు కూరుచుండెను. 'సాయాహ్న సమయమున తాపసుని సన్నిధికి బోవుదు' నని బయలుదేరి వచ్చి, తాపసుని యింద్రియ వికారమును జూచి 'ఇతడు రోజువలె లేడు. నన్ను తేరిపార జూచుచున్నాడు. పట్టకొనునేమో' అని తలచి, పర్ణశాలలో నుండి బల్లి మాంసపు వాసనకొట్టగా ననుమానించి వానిదగ్గరకు బోవక దూరముగా తిరుగుచుండెను. తనభావము బల్లి గ్రహించెనని తెలిసికొని తాపసుడు ముద్గరమును దానిమీదికి విసరివేసెను. అది దానితోక చివర తగిలెను. బోధిసత్త్వుడు వేగముగా వల్మీకము లోనికిదూరి, వేరొక బిలద్వారమున తలపైకి పెట్టి, 'ఓయి కూటజటిలా, నీవు శీలవంతుడ వని నీవద్దకు వచ్చుచుంటిని. నేడు నీమోసము బయట బడినది. నీవంటి పెద్దదొంగకు తాపసత్వ మెందులకు?'' అని వానిని నిందించుచు ఈగాథ పలికెను:

జటలవలన ఫలం బేమి కుటిల బుద్ధి!
ఇర్రిచర్మము తాల్చిన నేమి ఫలము?
లోన మలినాత్ము డవు నీవు; కానవత్తు
వమలినాత్ముని పోల్కి బాహ్యంబునందు!

ఇట్లు బోధిసత్త్వుడు కూటతాపసుని గర్హించి, వల్మీకములోనికి పోయెను. వాడును అచ్చటినుండి వెడలిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. అప్పటి కుటిలతపస్వి ఇప్పటి మోసగాడు; అప్పటి శీలవంతు డగుతపస్వి సారిపుత్రుడు; గోధపండితుడు నేనే.

# 139 ఉభతోభట్ఠ జాతకము

శాస్త వేళువనమున విహరించుచుండగా దేవదత్తుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు ధర్మసభలో చేరి "ఆయుష్మంతులారా, శ్మశానములో రెండువైపుల కాలిన కట్టె మధ్యభాగమున మురికి కలది-అడవిలో కలపగా గాని గ్రామములో వంటచెఱకుగా గాని ఉపయోగింపదు. కల్యాణకర మైన శాసనమున ప్రవ్రజితు డయ్యు దేవదత్తుడు ఆకట్టెవలె రెండుమార్గముల భ్రష్టు డయినాడు; గృహస్థ భోగములను స్వీకరింపజాలడు, శ్రమణత్వలక్ష్యము పూర్తిచేయ నేరడు" అనుచుండిరి.

శాస్త యరుదెంచి "భిక్షువులారా, ఏమి సంభాషించుచున్నారు?" అని ప్రశ్నించెను. ఈ విషయము అని వారు చెప్పగా శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ దేవదత్తు డుభయ భ్రష్టుడే" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు వృక్షదేవతగా పుట్టెను. ఒక గ్రామములో పల్లెవాండ్రు నివసించుచుండిరి. అందొకడు తన కుమారుని వెంటగొని పల్లెకాడులు చేపలు పట్టుచోట బడిశము బడవైచెను. అది నీటి మరుగున నున్న స్థాణమునకు తగులుకొనెను. వాడు దానిని లాగజాలక 'ఈ వలలో పెద్దచేప తగులుకొన్నదని పిల్లవాని నింటికి బంపి, తల్లి యిరుగుపొరుగు వారితో కలహము పెట్టుకొనునట్లు చేసెదను. అందువలన నిచ్చటి కెవరును వచ్చి భాగ మడుగరు' అని తలపోసి, కుమారునితో 'నాయనా, పో. మనకు పెద్దచేప దొరకినదని మీయమ్మతో చెప్పు. పొరుగువారితో పోరాటము పెట్టుకొమ్మనుము' అని చెప్పి పంపి, వలత్రాడు తెగునను భీతిచే వల లాగక, ఉత్తరీయ మొద్దునమంచి, ఉదకములో దిగి లోభముచే చేపను పైకెత్తబోయి స్థాణమునకు

(తుండు) గొట్టుకొని రెండు కన్నులు కోలుపోయెను. ఇంతలో దొంగ వాని వస్త్రము హరించెను. వాడు వృథామత్తుడై చేతులతో కన్నులు మూసికొని వణకుతో తీరము జేరి వస్త్రముకై వెదకెను.

అచ్చట వానిభార్య కలహము తెచ్చిపెట్టుకొనుటకై ఒకచెవిలో తాళదళముంచుకొని, ఒకకంటికి కాటుక పూసికొని, కుక్క నక్కున జేర్చికొని, పొరుగింటికి బోయెను. 'నీకు వెఱ్ఱి యెత్తినదా?' అని యొకతె యనెను. 'నాకు వెఱ్ఱి యెత్తలేదు. నన్ను నిష్కారణముగా దూషించుచున్నావు, పద, గ్రామభోజకుని వద్ద నీకు ఎనిమిది కార్షాపణములు జరిమానా వేయించెదను' అని కూటకలహము పెట్టుకొనెను. ఉభయులును గ్రామభోజకుని వద్దకు బోయిరి. తగవును పరీక్షింపగా పల్లెవాని భార్యకే శిక్ష పడెను. జుల్మానా చెల్లింపు మని యామెను వారు దండించిరి.

వృక్షదేవత గ్రామములో నామెకును, అరణ్యములో నామె భర్తకును కలిగిన సంకటములు చూచి, చెట్టునడుమ నిలిచి "ఓయీ, ఉదకములోను నేలమీదను రెంటను భ్రష్టుడ వయినావు అని యీగాథ పలికెను:

చిదికెను కన్నులు, చినిగె వస్త్రంబు,
సఖిమందిరమ్ములో జగడమ్ము జరిగె,
నేలను నీటను నీపని చెడియె!

శాస్త ఈధర్మోపదేశము చేసి కథలు పరిపోల్చెను. అప్పటి చేపలవాడు దేవదత్తుడు; వృక్షదేవత నేనే.

## 146 కాక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు జాతిసేవ విషయమై చెప్పినది. వర్తమానకథ పన్నెండవ నిపాతములోని భద్దసాల జాతకమున వచ్చును.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు కాకి కడుపున పుట్టెను. రాజపురోహితు డొకనాడు నగరము వెలుపలినదిలో స్నానముచేసి, గంధవిలేపనము చేసికొని, మాల్యములు దాల్చి ఉత్తమ వస్త్రధారియై నగరములోనికి బయలుదేరెను. ఆసమయమున, నగరద్వార తోరణము మీద రెండు కాకులు వాలియుండెను. అం దొకటి 'ఈబ్రాహ్మణుని మీద రెట్ట వేయవలె నను కోరిక యున్న' దని రెండవదానితో ననెను. "నీ యభిలాష తగదు. ఈబ్రాహ్మణుడు ప్రభావసంపన్నుడు. ప్రబలులతో వైరము కూడదు. ఈయనకు కోపము వచ్చునేని కాకులకు నాశము సంభవించును" అని రెండవ కాకి పలికెను. ఊరకుండజాలను, అని మొదటి కాకి యనెను. అట్లయిన నీకర్మము! అని రెండవ కాకి యెగిరి పోయెను. బ్రాహ్మణుడు సరిగా తోరణము క్రిందికి వచ్చునప్పటికి కాకి పూలదండ విడిచినట్లు రెట్ట ఆయన శిరముపై విడిచెను. బ్రాహ్మణుడు కోపగించి కాక కులముపై పగబూనెను.

ఆరోజులలో నొక దాసి బియ్యము గృహద్వారముకడ నెండబోసి కనిపెట్టియుండి కొంత తడవునకు కన్నుమూసెను. అది చూచి దీర్ఘరోమములు గల మేక వచ్చి, బియ్యము తినుచుండెను. దాసికి మెలకువ వచ్చునప్పటికి మేక పరుగెత్తెను. దాసి నిదుర పోవునపుడు మేక రెండు మారులు బియ్యము తినెను. మూడవ మారు దాసి దానిని తోలి "ఈమేక మాటిమాటికిని వచ్చి తినుచున్నచో చాలనష్టము కలుగును. ఇది యెన్నటికిని రాకుండునట్లు మరల చేయవలెను," అని యోచించి, కొరవి చేతబట్టుకొని, నిద్ర నటించుచుండెను. మేక వచ్చి బియ్యము ముట్టుకొనగానే దాసి కొరవితో దానిని గొట్టెను. తోడనే రోమములకు నిప్పంటుకొనెను. మేక యొడ లంతయును మండుచుండ, బాధానివారణార్థము పరుగెత్తిపోయి అశ్వశాల ప్రక్కన పాకకు రాచుకొనెను. కుటీరమున మంటలు లేచి హస్తిశాలకు నిప్పంటుకొనెను. వైద్యులు, కుదర్పలేనంతగా గజశరీరములు కాలెను. సేవకులు రాజునకీ విషయము తెలిపిరి. ఆయన రాజపురోహితుని రావించి "ఆచార్యా,

వైద్యులు ఏనుగులకు చికిత్స చేయఁజాలరట. వీనికు తెలిసిన ఔషధ మేమయిన కలదా?" అని యడిగెను.

"తెలియును మహారాజా!"

"అయ్యది లభ్య మగునా?"

"కాక వస కావలయును మహారాజా!"

"అట్లయిన కాకులను జంపి, వస సమకూర్చుడు" అని రాజు సేవకుల కాజ్ఞ యిచ్చెను. పరిజనులు కాకులను చంపి, గుట్టవేయ జొచ్చిరి. కాక జాతికి మహోపద్రవము సంఘటిల్లెను.

బోధిసత్త్వుడు అశీతి సహస్రకాక పరివృతుడై, మహాశ్మశాన తరువుపై వసించుచుండెను. ఒకానొక కాకి పోయి యీ వృత్తాంతము బోధిసత్త్వునకు జెప్పెను. "నేను తప్ప అన్యులు మాజ్ఞాతి సమూహామునకు కలిగిన భయమును తొలగింప సమర్థులుకారు. నేనే తొలగింపవలెను" అని ఆయన భావించి, దశపారమితలను పరిశీలించి, కరుణతో నొక్క పరుగున రాజప్రసాదమున కెగిరిపోయి, వివృతగవాక్షము వెంట లోన ప్రవేశించి, రాజు సింహాసనము క్రిందికి జేరెను. సేవకుడు కాకిని పట్టుకొనబోవగా రాజు గదిలో బ్రవేశించి నివారించెను.

మహాసత్త్వుడు కొంచెము విశ్రమించి మైత్రిపారమితను స్మరించి, పీఠముక్రిందినుండి యీవలకు వచ్చి "మహారాజా, పరిపాలనలో ప్రభువు తన యిచ్చ వచ్చినట్లు ప్రవర్తింపరాదు. కార్యమును సంపూర్ణముగా విమర్శించి చేయవలెను. అట్లు చేయనిచో లోకమునకు మరణ పర్యవసాన మగు మహాభయ ముప్పతిల్లును. పురోహితుడు విరుద్ధ మనస్కుడై యట్లు చెప్పినాడు. కాకులకు వస యుండదు" అని పలికెను. రాజు మాటలు విని ప్రసన్నచిత్తుడై బోధిసత్త్వుని కాంచన భద్ర పీఠముపై నిలిపి, సహస్రపుటములు వేసిన తైలము రెక్కల క్రింద రుద్ది, రాజభోగ్యమగు భోజనము బంగరు పళ్ళెరములోనుంచి, పానీయమిచ్చి, మహాసత్త్వుడు విశ్రాంతి గొన్న పిదప రాజు "పండితోత్తమా, కాకులకు క్రొవ్వు లేదంటిరి. ఏల లేదు?" అని యడిగెను. ఈ కారణముచేత నని మహాసత్త్వుడు భవనము ప్రతిధ్వనించు నట్లు ధర్మము బోధించు నీగాథ పలికెను:

నిత్య ముద్విగ్నహృదయాలు; నిఖిలలోక
భయము కలుగుచు నుంటచే పట్టె దపుడు
కాక జాతికి క్రొవ్వు లోకైకనాథ!

మహాసత్త్వు డీవిధముగా వివరించి "మహారాజా, విషయమును బాగుగా వివేచింపక ప్రభువులు పనిచేయరాదు" అని చెప్పెను. రాజు సంతుష్టచిత్తుడై తన రాజ్యమును బోధిసత్త్వుని పాదములకడ ధార పోసెను. బోధిసత్త్వుడు రాజ్యమును మరల నిచ్చి, రాజును పంచ శీలములందు ప్రతిష్ఠితుని జేసి, సర్వప్రాణుల కభయమిచ్చి, కాకజాతికి ప్రత్యేకదానము చేసెను. అనుదినము అన్నములో మాంసము వేసి, అన్నిరసములు కలిపి, కాకులకు పెట్టునట్లును మహాసత్త్వునకు రాజ భోజనము వడ్డించునట్లును పరిజనమున కాజ్ఞ యిచ్చెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. అప్పుడు వారాణసీ నరేనుడు ఆనందుడు; కాకరాజు నేనే.

## 141 గోధ జాతకము (2)

శాస్త వేళువనమున విహారము చేయుచు ప్రతిపక్ష భిక్షువుతో కలసిమెలసి యుండు భిక్షువును గూర్చి చెప్పినది. వర్తమానకథ మహిలాముఖ జాతకకథవలె (26) నుండును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఉడుమయి పుట్టెను. అతడు పెద్ద యయిన పిమ్మట పందలకొలది యుడుములు పరివేష్టించి యుండ నదీతీరమున మహాబిల మున నివసించుచుండెను. బోధిసత్త్వుని పుత్రుడయిన చిన్న యుడుము తొండతో స్నేహముచేసి, దానిని కౌగలించుకొనుచు, సమ్మోదమున సంచరించుచుండెను. ఈసంగతి గోధరాజునకు దెలియగా, ఆయన కొడుకును బిలిపించి 'నాయనా, అయోగ్యప్రదేశమున నీవు విశ్వాసము ముంచినావు. తొండ నీచజాతిలోనిది. దానిని విశ్వసింపరాదు. నీవట్లు

విడువవేని దానివలన గోధజాతికి ముప్పువచ్చును'. నేటినుండి దానితో నీకు మైత్రివలదు' అని బోధించెను. యువకుడు మాత్రము మైత్రి విడువలేదు. మాటిమాటికిని బోధిసత్త్వుడు కొడుకును మందలించు చుండెను. అతనిని వారింపలేక తండ్రి 'యీ తొండవలన ఉడుము జాతికి ముప్పు వాటిల్లును, అప్పుడు పారిపోవుటకు మార్గము ఏర్పాటు చేయవలసి యున్నది' అని బిలమున కొకపార్శ్వమున సొరంగము త్రవ్వించెను.

క్రమముగా పుత్రుడు మహాశరీరు డయ్యెను. తొండ వెనుకటి తీరుననే యుండెను. గోధయువకుడు కౌగలించుకొనునప్పుడు వ్యథసహింపలేక, యిట్లు కొన్ని దినములు గడచినచో తనకు మరణము తప్పదని భావించి, లుబ్ధకునితో సంప్రతించి గోధకులమును నాశము చేయింప సంకల్పించెను.

వేసవికాలమున నొకనాడు వాన పడినతర్వాత రెక్కలచీమలు పుట్టలలోనుండి వెలువడెను. ఉడుములు బయలుదేరి చీమలను తిన జొచ్చెను. ఇంతలో ఉడుముల వేటకాడు గునపముతో (పారతో) కుక్కలతో అడవిలో ప్రవేశించెను. తొండ వానిని జూచి 'నేడు నామనోరథము పూర్ణ మగును' అని వాని సమీపమునకు బోయి 'ఓయీ, ఏల అడివిలో తిరుగుచున్నా' వని యడిగెను. 'ఉడుముల కొసము' అని వా డన్నాడు. 'వందలకొలది యుడుము లున్నచోటు నే నెరుగుదును. నిప్పు, కట్టెలు కొనిరమ్ము' అని చెప్పి తొండ వానిని గోధబిలమునకు జేర్చి, 'ఇచ్చట తుత్తిరిగడ్డి పేర్చి, నిప్పు ముట్టించి, పొగ పెట్టి, కుక్కల నన్నిప్రక్కల నిలిపి, దుడ్డుకఱ్ఱ దీసికొనియుండుము. ఉడుములు బయటికి వచ్చినంతనే వానిని దుడ్డుతో చావమోదుము. అని చెప్పి, 'నేడు నాశత్రువుల సంహారము చూచెదను' అనుకొని, కొలది దూరమున తలయెత్తి పండుకొని యుండెను. లుబ్ధకుడు పొగ పెట్టెను. పొగ చూరినంతనే ఉడుములు ప్రాణభయమున నటునిటు పరుగెత్తజొచ్చెను. వాడు దొరికిన వానిని చావమోదెను; తప్పించుకొని పోయినవి కుక్కలపాల పడినవి. వానికి మహానాశము సంఘటిల్లెను. తొండవలన భయముప్పతిల్లిన దని బోధిసత్త్వుడు గ్రహించి, 'పాపపురుష సంసర్గ మెంతమాత్రము కూడదు. పాపాత్మునివలనే సుఖము

చేకూరదు. ఒక్క చెడు తొండవలన ఇన్ని యుడుములకు నాశము సంభవించినది' అని పాతబిలము వెంట పారిపోవుచు, యీగాథ పలికి నాడు :

పాపులం గూడి యెవ్వాడు ప్రత్యహమ్ము
తిరుగు, నతనికి సౌఖ్యము స్థిరము కాదు.
ఒక్క తొండమూలమ్మున నుక్కడంగె
బల్లిసంఘము వాడు - వాపగిది జెడును.

శాస్త ధర్మోపదేశము చేసి కథలం సరిపోల్చెను. అప్పటి తొండ దేవదత్తుడు; బోధి సత్త్వుని పుత్రుడు, ఉపదేశము విననివాడు గోధ—పిల్లా ప్రతిపక్షసేవక భిక్షువు గోధరాజు నేనే.

## 142 సిగాల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండ దేవదత్తుడు తథాగతుని పరిమార్చు ప్రయత్నమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ధర్మసభలో భిక్షువులు చేయుసంభాషణ విని తథాగతుడు "భిక్షువులారా, దేవదత్తుడు కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ నిట్లే చేసెను. కాని నన్ను సంహారింపలేక పోయెను. తానే కష్టపడెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు నక్కకడుపున బుట్టి, సృగాలపరివృతుడై, రాజయి, శ్మశానవుతోటలో నివసించు చుండెను. ఆ సమయమున రాజ

గృహమున ఉత్సవము జరుగుచుండెను. ఎల్లరును సురాపానము చేయుచుండిరి. అది సురోత్సవము అనవచ్చును. కొందరు ధూర్తులు సురామాంసములు కొల్లగా సమకూర్చుకొని మంచి దుస్తులు ధరించి, పాడుచు కాలక్షేపము చేయుచుండిరి. అర్ధరాత్రి మగు నప్పటికి సుర మిగిలినను మాంస మయిపోయినది. అందొకడు మాంస మడుగ, లేదని చెప్పిరి. 'నే నుండగా మాంసమునకు కొదవ లేదు. శ్మశాన వాటికకు బోయి, శవములకై వచ్చు నక్క నొకదానిని సంహరించి, మాంసము దీసికొని వత్తును' అని పలికి, దుడ్డుకఱ్ఱ చేతగొని నిర్ధమన ద్వారమున నగరము వెలువడి శ్మశానము చేరి, కఱ్ఱ క్రింద బెట్టి, మృతునివలె పండుకొనెను.

అప్పుడు బోధిసత్త్వుడు సృగాలపరివృతుడై యచ్చటికి వచ్చి, వానిని జూచి 'వీడు మరణింపలేదు. బాగుగా పరిశీలించెదను' అని అధోవాతముగా బోయి, యొడలి వాసన పసిపట్టి, మానవుడు మరణింప లేదని గ్రహించి, వానిని సిగ్గుపరచుటకై, కఱ్ఱ కొసను బట్టి లాగెను. ధూర్తుడు కఱ్ఱను విడువలేదు. సమీపించిన నక్కను చూడ లేదు. గట్టిగా కఱ్ఱను బట్టుకొనెను. బోధిసత్త్వుడు వెనుకకు బోయి, "మహాశయా, నేను దుడ్డుకఱ్ఱను లాగినప్పుడు పట్టు విడువక పోవుటయే గాక మరింత బిగువుగా గ్రహించినావు" అని యీగాథ పలికెను:

గ్రహియించు టెంతయో కష్టమ్ము నీవు
ప్రాణముల్ లేనట్లు పడియుండుటకును.
కాని నీ చేతిలో కఱ్ఱ మాత్రమ్ము
ఏలనో రాకున్న దెంత లాగినను!

ధూర్తుడు 'నక్క నా సంగతి గ్రహించినది' అని లేచి కఱ్ఱ విసిరి వేసినాడు. నక్కకు తగులలేదు. 'పో, నేటికి తప్పించుకొన్నావు!' అని ధూర్తుడుపలికినాడు. 'ఓయీ, నీవు మహానిరయమును, పదునారు ఉపనిరయములను తప్పించుకొనలేవు' అని నక్క వెడలిపోయెను.

ధూర్తుడు శ్మశానమునుండి వెడలి, పరిఖలో స్నానము చేసి, వచ్చినత్రోవనే నగరము ప్రవేశించెను.

శాస్త ధర్మసందేశమిచ్చి కథలు సరిపోల్చెను. అప్పటి ధూర్తుడు దేవదత్తుడు; సృగాలరాజు నేనే.

# 143 విరోచన జాతకము

శాస్త వేళువనమున నుండునప్పుడు దేవదత్తుడు గయాశీర్షమున తథాగతునకు ప్రతి చేయుటను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

దేవదత్తుని ధ్యానబలము పోవుచున్న కొలదిని, లోకులవలన అతనికి రాబడి కట్టుబడి పోవుచున్నకొలదిని, లోకులు అతనిని సత్కరించుట మానినకొలదిని అతడు ఆలోచనాపరుడై ఒకానొక యుపాయము కన్గొనెను. అప్పు డతడు బుద్ధుని ఐదు విషయములు కోరెను; శాస్త వాని కంగీకరింపలేదు. అంతట దేవదత్తుడు ఇరువురు అగ్రశ్రావకులను 500 మంది శిష్యులను గయాశీర్షపర్వతమునకు గొనిపోయి సంఘములో చీలిక పుట్టించి, ఒక సీమలోనె విడివిడిగా వినయకర్మలను చేయజొచ్చెను. శిష్యులలో చాలమంది క్రొత్తగా ప్రవ్రజించి ధర్మవినయములను బాగుగా నెరుగక పెడత్రోవన బడినవారు.

శాస్త ఆశిష్యులను మరల రప్పించు సమయము చూచి అగ్రశ్రావకుల నిరువురను బంపెను. వారిని చూచి దేవదత్తుడు ప్రసన్నుడయ్యెను. రాత్రివేళ ధర్మోపదేశము చేయునపుడు బుద్ధునకు ప్రతిబింబముగ సిద్ధ మగుదునా అని తలపోసి "సారిపుత్రా, భిక్షుసంఘము ఆలస్య రహితమైనది. నీవు భిక్షుసంఘమునకు కొంచెము ధర్మోపదేశము చేయుము. నా వీపుమీద బాధగా నున్నది; నేను కొంచెము రుద్దుకొందును" అని పండుకొనెను.

ఇద్దరు అగ్రశ్రావకులు భిక్షువులకు ధర్మోపదేశ మిచ్చి, ఆర్య సత్యముల ఫలముల నెడల వారు దృష్టి నిలుపునట్లు చేసి, ఎల్లరను వేళువనమునకు కొనిపోయిరి.

కోకాలికుడు విహారము ఖాళీయగుట చూచి, దేవదత్తుని సన్నిధికి పోయి "ఆయుష్మన్, దేవదత్తా, నీఅనుయాయులలో చీలికలు పుట్టించి అగ్రశ్రావకుడు నీ విహారమును ఖాళీచేయించి పోయినాడు. నీవు పండుకొని యుంటివి!" అని చెప్పెను. అతడు ఉత్తరీయము తొలగించి గోడలో మేకు కొట్టినట్లు ఛాతిమీద మడమతో తన్నెను. అప్పు

డాతని నోటివెంట రక్తము కారెను. అక్కడ నతడు రోగగ్రస్థుడయ్యెను.

శాస్త స్థవిరునితో "సారిపుత్రా, నీవు వచ్చునపుడు దేవదత్తుడేమి చేసినాడు?" అన్నాడు.

"భన్తే, బుద్ధునివలె వ్యవహరింతు నని దేవదత్తుడు యోచించినట్లు మేము కనుగొంటిమి. బుద్ధునకు ప్రతిబింబము కల్పింప దలచి అతడు వినాశము పొందినాడు".

"సారిపుత్రా! దేవదత్తుడు కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ అట్లే యైనాడు" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు సింహ మయి, హిమవత్ప్రదేశమున కాంచన గుహలో నివసించుచుండెను. ఒకనాడు సింహము కాంచన గుహనుండి వెలువడి నలుదిక్కులు కలయ జూచి విజృంభించి, సింహనాదము చేసి, ఆహారార్థము పరిక్రమించెను. అంతట మహామహిషము లభింపగా దానిని వధించి, మంచి మాంసము తిని, చెరువులో దిగి నీరు కడుపునిండ ద్రాగి, గుహకు మరలుచుండెను. ఆహారార్థము తిరుగుచున్న నక్కయొకటి తటాలున సింహమును జూచి, పారిపోవుటకు శక్తి చాలక, సింహము పాదములకడ ప్రణమిల్లెను. 'ఏమి నక్కా' యని సింహ మడుగగా, 'స్వామీ, మీ పాదములకడ బ్రదుక దలచినాను' అని నక్క పలికెను. 'మంచిది. నా సేవ చేయుము, నీకు మంచిమాంసము లభించును' అని సింహము పలికి, నక్కను వెంటగొని, కాంచన గుహలో ప్రవేశించెను. నాటనుండి నక్క సింహోచ్ఛిష్టము తినుచుండెను. కొలది రోజులలో దానిశరీరము స్థూల మయ్యెను.

ఒకనాడు సింహము గుహలోనుండి 'జంబుకమా, పో. పర్వత శిఖరముమీదనుండి, పర్వతపాదమున సంచరించు గజాశ్వ మహిషాదులలో నీ కిచ్చవచ్చిన వేమయిన నున్నవేమో జూచి 'ఈజంతువు మాంసము తినగోరుదు' నని నాతో జెప్పి, నమస్కరించి, విరోచన స్వామీ అనుము. దానిని వధించి మాంసము భుజించి, నీకు కూడ

బెట్టుదును' అని చెప్పెను. జంబుకము శిఖర మెక్కి, నానావిధ మృగ ములను జూచి, తనకు నచ్చిన దానిని గుర్తించి వచ్చి, సింహము పాదములకడ వాలి విరోచనస్వామీ యనును. సింహము తోడనే లంఘించి మత్తవారణము నయినను సంహరించి, తాను భుజించి, నక్కకు పెట్టును. సృగాలము కడుపునిండ మెక్కి, గుహలోనికి బోయి నిద్రించును.

కొంతకాలము గడవగా జంబుకమునకు గర్వము హెచ్చెను. 'నాకును నాలుగుకాళ్ళు లేవా? అనుదినము పరపోషణములో నేల జీవించుచున్నాను? నేటినుండి నేనుగూడ గజాదులను సంహరించి మాంసము తినగలను. విరోచనస్వామీ, అనుటచే సింహము వచ్చి వారణములను వధించును'. అని చింతించి సింహమును జేరి 'స్వామీ! మీరు సంహరించిన గజముల మాంసమును బహుకాలమునుండి తిను చున్నాను. నేను సయితము హస్తిని కొట్టి మాంసము భుజింపగోరెదను. మీరు పండుకొను చోటనే నేను పండుకొందును. మీరు శిఖరము మీదికి పోయి వారణాది జంతువులను జూచి వచ్చి, విరోచన జంబుక, అనుడు. ఈ కొంచె మనుగ్రహింపుడు' అని వేడెను.

'జంబుకా, ఏనుగులను జంపుటకు సింహములే జనించినవి. ఏనుగును గొట్టి మాంసము తినగల నక్క ప్రపంచమున లేదు. ఈయభిలాషము ను విడిచి నేను సంహరించిన గజమాంసమును తినుచుండుము' అని సింహము పలికెను. ఎంత చెప్పినను వినక, మాటి మాటికిని వేడు చుండుటచే సింహము దానిని నివారింప నేరక, సమ్మతించి 'అట్లయిన నాచోట పండుకొనుము' అని జంబుకమును కాంచన గుహలో బరుండ బెట్టి, పర్వతపాదమున మత్తవారణమును జూచి, గుహాముఖమునకు వచ్చి 'విరోచన జంబుక' అనెను. సృగాలము కాంచన గుహలోనుండి వచ్చి విజృంభించి, నాలుగుదిక్కులు కలయ జూచి, ముమ్మారు ఊళ పెట్టి, ఏనుగు కుంభస్థలము మీదికి దుముకెద నని యెంచి, యెగిరి, దాని పాదములకడ బడెను. ఏనుగు కుడికా లెత్తి దాని నెత్తిన పెట్టి త్రొక్కెను. జంబుకము పొడిపొడి యయ్యెను. అంతట దాని శరీర మును కాలబెట్టి రాచి, లద్దె వేసి, క్రౌంచనాదము (బృంహితము) చేసి, అరణ్యములోనికి బోయెను.

జరిగినదానిని బోధిసత్త్వుడు జూచి ఈ గాథ పలికినాడు:

> చిలికి మ స్తిష్కమ్ము, చెదర మేదస్సు,
> బాహికలు త్రుటితమై పోయె నన్నియును;
> చూచితి వీనాడు కూరత్వ మౌర!

శాస్త్ర ధర్మోపదేశము చేసి కథలు పరిపోల్చెను. ఆ కాలమున నక్క దేవదత్తుడు; సింహము నేనే.

## 144 నంగుట్ఠ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచుండగా ఆజీవకుల మిథ్యాతపములను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆదినములలో జేతవనమునకు వెనుకవైపున ఆజీవకులు రకరకముల మిథ్యాతపస్సులు చేయుచుండిరి. చాలమంది భిక్షువులు ఆజీవకులు గొంతుకూర్చుండుట, గబ్బిలమువలె నుండుట, ముళ్ళకంపమీద పండుకొనుట, పఞ్చాగ్నిమధ్యమున తపస్సుచేయుట, మొదలగు మిథ్యాతపస్సులు చేయుచుండుట చూచి, భగవానునితో "భన్తే, ఈమిథ్యాతపస్సులవలన ఏమయిన ఉన్నతి యుండునా?" అనిరి.

"భిక్షువులారా, ఇట్టివానివలన కళ్యాణము లేదు, ఉన్నతి లేదు; ఈతపస్సులవలన ఫలము కున్నదా, లేదా యనువిషయము పండితులు పూర్వము తెలియపరచిరి. పుట్టిననాటినుండి రక్షించుచున్న అగ్నులను వెంటగొని కానల కేగి. అచట అగ్ని ఉపాసనాదికము వలన లాభమేమియు లే దని తెలిసికొని విప్పి నీటిలో ముంచి, కసిణాభ్యాసము చేసి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది బ్రహ్మలోకగాములు అయిరి" అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణాసియందు బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఉదీచ్య బ్రాహ్మణవంశమున బుట్టెను. ఆనాడే తల్లి దండ్రులు జాతాగ్నిని నెలకొల్పిరి. అతనికి పదునారేండ్లు వచ్చినపుడు వారు "నాయనా, నీవు పుట్టిననాడే జాతవేదసుని అగ్నిగృహమున ప్రతిష్ఠించినాము. నీవు కుటుంబిగా నుండదలచినచో వేదత్రయము నధ్యయనము చేయుము. బ్రహ్మలోకము చేరగోరుచో అగ్నిని గ్రహించి, అరణ్యము ప్రవేశించి, అగ్ని దేవుని సపర్యలు చేయుచు మహాబ్రహ్మ నారాధించుచు బ్రహ్మలోకపరాయణుడవు కమ్ము" అని చెప్పిరి.

"ఇంటిపైన నాసక్తి లేదు" అని యతడగ్నిని గైకొని యరణ్యమునకు బోయి, ఆశ్రమము నిర్మించుకొని, అగ్ని పరిచర్య చేయుచుండెను. ప్రత్యంత గ్రామమున నొకనాడు గోదక్షిణ లభింపగా నతడు దాని నాశ్రమపదమునకు గొనివచ్చి, అగ్నిభట్టారకునకు గోమాంస హోమము చేయనెంచి, ఆవు నచ్చట కట్టివేసి, లవణమునకయి సమీపగ్రామమునకు జనెను.

ఆతడు లేనపుడు బోయవాండ్ర గుంపువచ్చి, ఆవును వధించి మాంసము వండుకొనితిని, తోక, జంఘలు, చర్మము మాత్ర మచ్చట విడిచిపోయిరి. బ్రాహ్మణుడు మరలి వచ్చి దానిని జూచి, "అగ్నిభగవానుడు తన ద్రవ్యమునే రక్షించుకొనలేక పోయెను. నన్నెట్లు రక్షింపగలడు? ఈయగ్నిపరిచర్యవలన లాభము లేదు, భద్రత లేదు; కేవల మిది నిరర్థకము!" అనుకొని, అగ్నిపరిచర్యపై నాసక్తి విడిచి, "అగ్నిభట్టారకా, నీవస్తువునే నీవు కాపాడుకొనలేక పోతివి. నన్నెట్లు కాపాడగలవు? మాంసము లేదు. మిగిలిన వీనిని గ్రహింపుము" అని తోక మొదలగునవి అగ్నిలో బడవేసి, యీగాథ పల్కికినాడు :

ఓ జాతవేదసా, ఓయి, దుర్బుద్ధీ!
తోక వాలముతో నీపూజ మేము
కావింతుమని నీవు గ్రహియింపు మాయ!

మాంసయోగ్యత యున్నంతవరకుండెను, నీకు
ఇత్తుము మాంసవిహీన మగా తోఁక!

మహాసత్త్వుఁ డిట్లు చెప్పి, నీరు చల్లి, అగ్ని నార్పి, ప్రవ్రజించి, అభిజ్ఞలను, సమాపత్తులను పొంది, బ్రహ్మలోకపరాయణుఁ డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. అగ్ని నార్పిన తపస్వి నేనే.

## 145 రాధ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండ పూర్వభార్యాసక్తిని గూర్చి చెప్పినది. వర్తమానకథ ఇంద్రియజాతకమున (423) వచ్చును.

శాస్త ఆభిక్షువును పిలిపించి "భిక్షూ, స్త్రీల సంరక్షణము వట్టిది. రక్షకు లున్నను జరుగ నేరదు. నీవుకూడ పూర్వము రక్షకు నుంచినను రక్షింపజాలవైతివి. ఇప్పు డెట్లు కాపాడుదువు?" అని పూర్వజన్మకథ చెప్పినాడు.

### అతీత కథ

పూర్వము బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు శుక గర్భమున బుట్టెను. కాశీరాష్ట్రమందలి బ్రాహ్మణు డొకడు ఈచిలుకను, ఈచిలుక తమ్ముని కన్నబిడ్డలవలె జూచుచుండెను. బోధిసత్త్వునకు పోట్ఠపాదు డనియు, తమ్మునికి రాధు డనియు పేర్లు.

ఆ బ్రాహ్మణుని భార్య దుశ్శీల, దుర్మార్గురాలు. ఆయన పనిమీద గ్రామాంతరము పోవుచు చిలుక సోదరులతో "నాయనలారా, మీ తల్లి బ్రాహ్మణి దురాచారమునకు దొరకొనుచో వారింపుడు" అని చెప్పెను. "మంచిది నాయనా, వారింపగల మేని వారింతుము. వారింపజాలనిచో మౌనము వహింతుము" అని బోధిసత్త్వుడు పలికెను. బ్రాహ్మణు డిట్లు శుకముల కానతిచ్చి, పనిమీద బయలుదేరిపోయెను.

నాటినుండి ప్రతిదినము బ్రాహ్మణి దుర్వృత్తి ప్రారంభించెను. వచ్చిపోవు జనప్రవాహమునకు విరామము లేకుండెను. అది చూచి రాధుడు బోధిసత్త్వునితో "అన్నా, మనతండ్రి వెడలిపోవుచు బ్రాహ్మణి దుర్వృత్తిని వారింపు డని యాన తిచ్చినాడు. ఈమె దుష్క్రియలే కాని సత్క్రియలు చేయుట లేదు. వారింతమా?" అనెను. "తమ్ముడా, బాలభావముచే అజ్ఞానివై యిట్లు పలుకుచున్నావు. ఎత్తుకొని తిరుగుచున్నను స్త్రీని రక్షింపలేరు. అసాధ్యము తలపెట్టవలదు" అని, బోధిసత్త్వు డీ గాథ పలికినాడు:

రాధ యెరుగవు నీవర్ధరాత్ర మైన
నిపుడు కాలే దటంచు; నా హేతువున నె
ఫలవిహీనముగా విరావములు చేతు,
నామె కనురక్తియే లేదు స్వామిరొండల.

ఈ విధముగా కారణము చెప్పి బోధిసత్త్వుడు తమ్మునిచేత బ్రాహ్మణిని వారింప నీయలేదు. భర్త రానంత వరకు నామె యథాభిమతముగా చరించినది. బ్రాహ్మణుడు వచ్చి పోట్ఠపాదునితో "బిడ్డా, నీ తల్లి యె ట్లున్నది?" అనెను. బోధిసత్త్వుడు జరిగినది జరిగినట్లుగా బ్రాహ్మణునకు జెప్పి, "నాయనా, దుశ్శీల నీ కెందులకు? తల్లి దుర్మార్గమును నీకు దెలిపినాము: కావున నేటినుండి మే మిక్కడ నుండజాలము" అని బ్రాహ్మణుని పాదములకు నమస్కరించి, రాధునితో నెగిరి, యరణ్యము జేరెను.

శాస్త ధర్మోపదేశము చేసి నాలుగుసత్యములను ప్రకటించినపిదప ఆభిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. అప్పటి భార్యాభర్త లిప్పటి భార్యాభర్తలే; రాధ ఆనందుడు; పోట్ఠపాదుడు నేనే.

## 146 కాక జాతకము

**శాస్త జేతవనమున విహారము చేయునపుడు అందరికన్న ముసలి భిక్షువును గూర్చి చెప్పినది.**

### వర్తమాన కథ

వారు గృహస్థులుగా నున్నపుడు శ్రావస్తిలో ధనవంతులు. ఒకడు రెండవవానికి మిత్రము. ఉభయులు కలసి, మెలసి పుణ్యకార్యములు చేయుచుండిరి. బుద్ధుని ఉపదేశములు విని వారు మనము వృద్ధుల మైతిమి; మనము గృహస్థులముగా నుండుటవలన లాభ మేమి? శాస్తకడకు పోయి రమ్యబుద్ధశాసనమున ప్రవ్రజించి, దుఃఖమునుండి విముక్తుల మగుదుము" అనుకొనిరి.

వారు తమ సర్వసంపత్తిని పుత్రులకు పుత్రికలకు నిచ్చి, జ్ఞాతులను విడిచి శాస్తకడకు బోయి ప్రవ్రజ్య కావలెనని వేడి ప్రవ్రజించిరి. అయినను తదనుకూల శ్రమణధర్మములను పూర్తి కావింపలేదు. వృద్ధు లగుటచే వారు ధర్మముకూడ అభ్యసింప లేకపోయిరి. గృహస్థులుగా నున్నప్పటి వలెనే విహారములో నొకమూల పర్ణశాల నిర్మించుకొని అందు ఇరువురు నివసించుచుండిరి. భిక్షార్థము తిరుగక తమబిడ్డల ఇండ్లకే తరచుగా పోవుచు అచ్చటనే భుజించుచుండిరి.

వారిలో ఒకని భార్య వృద్ధు లందరకు ఉపకారము చేయుచుండెడిది. ఇందుచే మిగిలినవారి వలన లభించిన భిక్షాన్నము ఆమె ఇంటికి కొనిపోయి వృద్ధభిక్షువులు కూరుచుండి భుజించెడివారు. ఆమెకూడ తన ఇంట వండిన సూపవ్యంజనములను పెట్టుచుండెడిది. అట్టి యామె ఏదో జబ్బువలన మరణించెను.

ఆ వృద్ధు లిరువురు విహారమునకు పోయి ఒకరిమెడ ఇంకొకరిని కౌగలించుకొని రోదనము చేయుచు "చేతిలో మధుర రసముకల ఉపాసిక మృతి చెందినది" అనుకొనిరి.

వారి రోదన ధ్వని విని భిక్షువులు అన్నివైపులనుండి వచ్చి, ఆయుష్మంతులారా, ఏల రోదనము చేయుచున్నారు అనిరి. "మా మిత్రుని వెనుకటి భార్య చనిపోయినది. ఆమె చేతివంట చాల మధు

తము. ఆహా మీరు ఎంతో ఉపకారము చేయుచుండెడిది. ఇప్పు డట్టి దూరము ఎక్కడ లభించును? ఇందుచే దుఃఖించుచున్నాము” అని వారు చెప్పిరి.

వారు విలపించుచుండగా చూచి భిక్షువులు ధర్మసభలోనికి పోయి ఇష్టాగోష్ఠి చేయుచు ‘ఆయుష్మంతులారా, ఈ కారణముచే వృద్ధ స్థవిరు లిరువురు మెడలు కౌగలించుకొని రోదనము చేయుచు తిరుగు చున్నారు” అనుకొనిరి.

శాస్త్ర వచ్చి ‘భిక్షువులారా, ఇచట కూర్చుండి ఏమి సంభాషించు చున్నారు?” అనెను ఈ విషయము అని వారు చెప్పగా శాస్త్ర ‘భిక్షువు లారా, కేవల మిప్పుడే కాదు. వీరు పూర్వము కూడ నిట్లే చేసిరి. వెనుక కాకికడుపున పుట్టి సముద్రమున మరగించిన పిమ్మట సముద్రో దకమును తమ రెక్కలతో ఎగజిమ్మి వేయదలచిరి.

కష్టముమీద పరిశ్రమ చేయుచు పండితుల వలన బ్రదికి పోయిరి” అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు సముద్రమున దేవతగా జన్మించెను. ఒకానొక కాకి నిజ భార్యతో ఆహారార్థము తిరుగుచు సముద్రతీరము జేరెను. ఆసమయ మున కొందఱు జనులు పాయస మత్స్యమాంస సురాదులు నాగపూజ చేసి నైవేద్యము పెట్టి వెడలి పోయిరి. కాకదంపతులు వచ్చి, పదార్థ ములు భుజించి, సుర బాగుగా ఆరగించిరి. మత్తెక్కి యవి సముద్ర మున జలక్రీడ చేయుచుండగా నొక తరంగము ఆడుకాకిని సముద్రము లోనికి లాగుకొని పోయెను. మత్స్య మొకటి దానిని మ్రింగెను. “నాభార్య పోయినది” అని కాకి యేడువజొచ్చెను. రోదనము విని అనేక కాకము లచ్చట వ్రాలి ‘ఏల యేడ్చు చున్నా?’ వని యడిగినవి. ‘నాసహాయకురాలు స్నానము చేయుచుండ తరంగము లోనికి లాగి వేసినది’ అని కాకి చెప్ప నప్పటికి కాకులన్నియు నాక్రందనము చేయ సాగెను. ‘ఈసముద్రమునకు మనకంటె బలము కలదా? నీరు పీల్చి పార బోసి, సముద్రమును ఎండగొట్టి కాకిని ఉద్ధరింతము’ అని యవి యాలో

చన చేసి, ముక్కులతో నీరుపీల్చి, యావల విడుచుచుండెను. ఉప్పు నీటివలన గొంతులు మండునప్పుడు నేలమీద వాలి, విశ్రాంతి తీసికొను చుండెను. దౌడలు నొప్పిపుట్టి, నోళ్ళెండి, కన్ను లెఱ్ఱబడి, బడలికచే పడిపోవు నంత వర కవి నీరు పీల్చి యావల విడుచుచున్నంతలో జలము మరల వచ్చి నిండుకొనుచున్నది. సముద్రమును మన మెండ గట్టలేము' అని కాకులీగాథలు పలికినవి:

ఎండిపోయెను మానోరు, తుండములును
పుండుపడియెను; క్రమ్మరనిండు నుదధి.

అంత నవి 'ఆకాకిరూపమును, ఆ ముక్కును, నేత్రములను, మధుర స్వరమును, లావణ్యమును వర్ణించి, వీనిని బట్టియే సముద్రము దానిని హరించినది అని మిక్కిలి విలపించెను. అవి విలాపము చేయుచుండ, సముద్రమున దేవత భైరవరూపమును ప్రదర్శించినది. అవి యెగిరి పోయినవి. ఇట్లవి రక్షణ పొందినవి.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలమున ఆడుకాకి ఇప్పటి పూర్వభార్య; కాకి వృద్ధస్థవిరుడు; మిగిలినకాకులు తక్కిన వృద్ధస్థవిరులు; సముద్ర దేవత నేనే.

## 147 పుప్ఫరత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుసమయమున ఉద్విగ్నచిత్తుడగు భిక్షువునుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

భగవాన్ ఆతనితో "భిక్షూ, నీవు ఉద్విగ్నచిత్తుడ వగుట సత్యమేనా?" అనెను. "భన్తే సత్యమే". "ఎవరు నిన్ను ఉత్తేజితుని చేసి

నారుగా "నాపూర్వభార్య. భర్తా" ఆమె చేతిలో మాధుర్యమున్నది. ఆమె లేకుండ నే నుండలేను.

"భిక్షూ, యీమె నీ కనర్థదాయిని. ఈమెవలననే పూర్వము శూలముమీది కెక్కితివి; రోదనము చేయుచు మృతి నొంది నరకమున పుట్టితివి. ఇప్పు డీమెను మరల ఏల వాంఛింతువు?" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఆకాశమున దేవత యయ్యెను. ఒకనాడు కార్తికమాసమున వారాణసీనగరమున రాత్రివేళ ఉత్సవమునకు జనులు నగరమును దేవనగరము వలె నలంకరించి, వేడుకలలో నుండిరి. ఒకానొక పేద వానికి రెండు ముదుకబట్ట లుండెను. వానిని వాడు ఉదికి, జాడించి, తెలుపు చేయునప్పటి కవి నూరువాలికలు వేయి వాలిక లయ్యెను. వానిభార్య 'స్వామీ, కుసుంభావర్ణముకల చీరెకట్టి, పైన కప్పుకొని మీకంఠమున చేతులు వేసి కార్తికోత్సవములో విహారము చేయవలెనని యున్నది' అని పలికెను. "భద్రే, మనకు కుసుంభము ఎక్కడనుండి వచ్చును? మనము పేదవారము. తెల్లబట్టలు కట్టుకొని వేడుక చూడవచ్చును." "రంగు వేయనిచో ఉత్సవమునకు నేను పోవనే పోవను. మీ వెంట వే రెవరినైన నను తీసికొని పొండు." "ఏల నన్ను వేధింతువు? మనకు కుసుంభ మెక్కడ లభించును?" "స్వామీ, పురుషునకు ఇచ్ఛ కలిగినచో ఏది లభింపదు? రాజుగారి ఉపవనములో కుసుంభ పుష్పములు లేవా?" "భద్రే, రాజోపవనము యక్షగ్రస్తమైన పుష్కరిణి వంటిది. ప్రబల రక్షకు లుందురు; అచ్చటికి పోవుటకే వీలుండదు. ఈకోరిక విడిచి, ఉన్నదానితో తుష్టి నొందుము." "రాత్రి చీకటిలో పురుషుడు పోవలేని తా వుండదు."

ఆమె మాటిమాటికిని వేధించుచుండుట చేత తన భార్యమాట కంగీకరించి, సరే విచారపడకు మని యామె నోదార్చి అతడు రాత్రివేళ గాఢాంధకారమున నగరము వెలువడి, రాజోపవనములో ప్రవేశించి ప్రాణములకు తెగించి, దడి త్రొక్కుటలో చప్పు డయ్యెను.

రక్షకు లలికిడి విని, చోరుని బట్టుకొన వచ్చిరి. వానిని తన్ని, కొట్టి, కట్టి ఉదయమున రాజసన్నిధికి గొనిపోయిరి. వాని చోరతను తెలిసి రాజు శిక్ష విధించెను. వాని చేతులు వెనుకకు కట్టి, భటులు భేరి మ్రోగించుచుండగా నగరము వెలుపలికి గొని చని, శూలారోపము చేసిరి. వాడు మహావ్యథ పొందుచుండ, కాకులు వాని తలపై వ్రాలి, శూలములవంటి ముక్కులతో కన్నులు పొడిచి, లాగివేసినవి. వాడు బాధ సహించుచు, భార్యను స్మరించుచు "నీవు నా మెడపై చేతులు వేసి, కుసుంభారుణ చేలములు ధరించి, కార్తికోత్సవమున నాతో విచరించు వేడుక కోలుపోతిని గదా" యని గొణుగుచు, యా గాథ పలికెను:

గణన సేయను శూలమ్ము; కాకి కనులు
పీకుచుండుట లెక్కింప; ప్రేయసి తన
తనువున లతాంతవర్ణ వస్త్రంబు దాల్చి
కార్తికోత్సవ కేళిలో గలిసి నన్ను
ప్రమద మొందుట లే దని బాధ కలుగు!

వాడు భార్యనుగూర్చి యిట్లు ప్రలపించుచు ప్రాణములు విడిచి, నిరయమునకు బోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున భార్యాభర్తలు నేటి భార్యాభర్తలు; ఆకాశ దేవత నేనే.

## 148 సిగాల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు కాముకతానిగ్రహ విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో మహాధనవంతులైన శ్రేష్ఠుల పుత్రులు 500 మంది [illegible] మిత్రులు. వారు శాస్త చేసిన ధర్మోపదేశము విని శాసన

మన దృష్టి నిలిపి ప్రవచించి, జేతవనమున అనాథపిండికుడు కార్షాపణములు పరచిన భాగములో నివసింపజేసిరి.

ఒకానొక అర్ధరాత్రి సమయమున వారి మనస్సులలో కామోద్రేకము కలుగగా వార ఉద్విగ్నచిత్తు లయిరి.

తనసర్వజ్ఞత్వాముఖలన శాస్త గ్రహించి, జ్ఞానదండప్రదీపము జాజ్వల్యమానము చేసి జేతవనములోని భిక్షువుల మానసికప్రవృత్తులను చూచెను. ఆభిక్షువుల మనస్సులలో కామభావ ముదయించె నని చూడగలిగెను.

బుద్ధుడు తనశిష్యులను రక్షింపగోరి తోడనే ఆదుష్టసంకల్పమును నిగ్రహించి వారలకు అర్హత్వము అనుగ్రహింప నెంచెను.

సుగంధిత గంధకుటినుండి ఈవలకు వచ్చి శాస్త ధర్మభజాంచీ ఆగు ఆనందస్థవిరుని మధురస్వరమున ఆనందా, అని పిలిచెను.

"భన్తే, ఏమి యాజ్ఞ?" అని స్థవిరుడు ప్రణామముచేసి నిలిచెను.

"ఆనందా, అనాథపిండికుడు కోట్లకొలది ధనము పరచిన సీమలో ఉన్న భిక్షువులను గంధకుటీ ప్రాంగణమున చేర్పుము".

500 మంది భిక్షువులను మాత్రము పిలిపించినచో తనకు వారిపై దురభిప్రాయము కలిగె నని వారు బాధపడుదు రనియు, ఉద్విగ్న చిత్తులై ధర్మోపదేశము సరిగా వినక పోవచ్చుననియు శాస్త భావించి అందరను సమకూర్పుమని ఆనందునితో పలికెను.

సమావిష్టులైన భిక్షువు లెల్లరు శాస్తకు ప్రణామము చేసి ఆయన చుట్టును కూరుచుండిరి. బుద్ధుడు బ్రహ్మస్వరములో ధర్మోపదేశము చేసి పూర్వజన్మకథ చెప్పెను :

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు నక్కకడుపున బుట్టి, అరణ్యములో నదీతీరమున నివసించుచుండెను. ఒకానొక వృద్ధగజము గంగాతటమున మరణించెను. నక్క యా కళేబరమును గాంచి 'నాకు విశేషాహారము లబ్ధమయినది, అనుకొని తొండమును కరచెను. అది నాగలికఱ్ఱువలె నుండెను. దీనిని భుజింపలేను అని తలచి దంతము కరచెను. అది బొమికవలె

నుండెను. చెవులు కొరకగా నవి చేటల చుట్టుబుద్ధవలె నుండెను. ఉదరమును కొరకగా నది ధాన్యపుగుట్టవలె నుండెను. పాదములు రోకళ్లవలెను, తోక రోకలివలెను ఉండెను. ఇచ్చట తినుట కేమియు లేదని వెనుకవైపున కరచి చూడగా మెత్తని రొట్టెవలె నుండెను. అంతట నక్క 'ఇందులో మెత్తనిభాగము నాకు తినలభ్యమయినది' అని అది మొదలుకొని కుక్షిలోనికి తినుచుపోయి యకృత్తు, హృదయమ్ము మొదలగునవి భుజించుచు, రక్తము త్రాగి దప్పి తీర్చుకొనుచు, రాత్రివేళ కళేబరములోనే పండుకొనెను. దాని కిట్లు తోచినది: "ఈయేనుగు కళేబరము నాకు నివాససుఖ మిచ్చి, యిల్లువలె నున్నది. భుజించుటకు మిక్కుటముగా నాహార మున్నది. నేను వేరుచోటికి బోవనేల?' ఇట్లు తలపోసి సృగాలము గజశరీరమున నివసించుచుండెను.

కొన్నిరోజులు గడవగా వేసవికాలము వచ్చినది. ఎండ వేడిమి వలన ఆపీనుగు శుష్కించి, చర్మము కుంచితమయ్యెను. నక్క ప్రవేశించిన మార్గము మూసికొనిపోయెను. కటికచీకటివలన సృగాలమునకు లోకాంతరనివాసమువలె నయ్యెను. చర్మము బిగిసిన పిమ్మట మాంసము ఎండెను, రక్తము క్షయించెను. వెలువడు త్రోవ కానక నక్క భయముచెంది, కళేబర కారాగారమున నిటునటు దిరుగుచుండెను. వేడిగిన్నెలో పిండిముద్దవలె ఆకుక్షిలో కొలదిరోజులు తిరుగుచుండ, పెద్ద మబ్బుపట్టి, వర్షము కురిసెను. పీనుగు తడిసి, ఉబ్బినది. నందులో నుండి వెలుతురు తారకవలె ప్రవేశించినది. బ్రదికినా నని నక్క నందును తలతో నెట్టి, యీవల బడెను. దాని యొడలిమీద రోమము లన్నియు నందున జిక్కుకొని, యూడిపోయినవి. తొలుత పరుగెత్తి, పిమ్మట నాగి, కూరుచుండి నిజశరీరమును జూచుకొనెను. నిర్మలమైన దాని శరీరము తాటిబోదెవలె నుండెను. "ఈవ్యథయంతయు అన్యులవలన గాక నావలననే సంభవించినది. లోభమే దీనికి కారణము. పేరాసవలననే యీపని చేసితిని. నేటినుండి మరల నెన్నడు లోభమునకు లోపడను. ఎన్నడు గజకళేబరమున ప్రవేశింపను". అనుకొని, ఉద్విగ్నహృదయమున నక్క యీగాథ పలికెను:—

భయము చెందితి మహాభయము చెందితిని
ఇభగర్భమునను దూర నికెన్నండు!

ఇట్లు చెప్పి అక్కడనుండి వడిగా త్రిప్పక్క చెప్పెన్నడు లోభమునకు లోబడలేదు. గనుక కళేబరమున ప్రవేశింపలేదు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకసారాంశము వెలువరించెను. ఆసమయమున నక్క నేనే.

## 149 ఏకపణ్ణ జాతకము

శాస్త వైశాలికి సమీపమున మహావనములోని కూటాగార శాలలో నుండగా వైశాలిలో దుష్టస్వభావు డగు నొక లిచ్ఛవీ కుమారునివిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆకాలమున వైశాలిలో క్రోశమున కొకటి చొప్పున మూడు ప్రాకారములు కలవు. మూడుచోటులను అట్టాలికలు కోష్ఠములు నిర్మితములై చాలశోభతో నుండెను.

నిత్యమచట నుండి రాజ్యము నడపు రాజులు ఏడువేల ఏడువందల ఏడుగు రుండిరి. అంతమంది ఉపరాజులుకూడ నుండిరి. అందరు సేనాపతులు, అందరు భాండారికులు నుండిరి.

రాజకుమారులలో నొకనికి దుష్ట లిచ్ఛవి కుమారు డనుపేరు కలదు. వాడు కోపి, ప్రచండుడు, కఠోరుడు. తలిదండ్రులు గాని, జ్ఞాతులు గాని ఇష్టురాండ్రు కాని వానియెదుట మాటాడజాలకుండిరి. సమ్యక్-సంబుద్ధుడు తప్ప మరియెవ్వరు కుమారుని వంచలే రని తలచి తలిదండ్రు లొకనాడు వానిని శాస్తకడకు గొనిపోయిరి. శాస్త గంభీరోపదేశము చేసెను.

ఒక్క ధర్మోపదేశముననే వాడు కోపము విడిచి శాంతచిత్తు డయి నాడు. క్రోధము తొలగుటయే కాక అతని చిత్తమున మైత్రి, కోమలత్వము నెలకొన్నవి. అతని నెవరైన తిట్టినను కొట్టినను వారివంక చూచువాడు కాడు.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో అతని విషయము ప్రసంగించుచు "ఆయుష్మంతులారా, దుష్టలిచ్ఛవి కుమారుడు ఎవరు ఎన్నాళ్ళు చెప్పినను వినక, సమ్యక్-సంబుద్ధుడు ఒక్కసారి ధర్మోపదేశము చేసినంతనే మార్పుచెందినాడు. శాస్త అతనిని హస్తిని వంచినట్లు వంచినాడు" అనుచుండిరి.

శాస్త అచటికి వచ్చి కరుదెంచి "భిక్షువులారా, ఏమి మాటాడుచున్నారు?" అనెను. ఈవిషయము అని వారు చెప్పినపిదప శాస్త "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వము కూడ ఇతనిని లొంగదీయవలసి వచ్చినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఉదీచ్య బ్రాహ్మణవంశమున బుట్టి పెరిగి పెద్దవాడయి తక్షశిలానగరమున వేదత్రయమును, సమస్త విద్యలను అభ్యసించి, కొంతకాల మట నుండి, తలిదండ్రులు పోయిన పిమ్మట ప్రవ్రజించి, హిమవంతమున అభిజ్ఞలను సమాపత్తులను సంపాదించి, బహుకాల మచ్చటనే నివసించెను. ఒకసారి ఉప్పు చింతపండు కొరకు మానవ నివాసములకు వచ్చి, క్రమముగా వారాణసి చేరి, రాజోద్యానమున విడిసి, మరునాడు తాపసివేషము దాల్చి భిక్షార్థము నగరములోనికి బోయి రాజద్వారము సమీపించెను. రాజు సింహపంజరము వెంట (కిటికీ) జూచుచుండ తాపసుడు కానబడెను. "ఈతాపసుడు ఇంద్రియములను జయించి శాంతచిత్తుడై, అడుగడుగున వేయినాణెములు విడుచుచున్నవాని వలెను, సింహ విజృంభితములోను వచ్చుచున్నాడు, శాంతి ధర్మము లెచ్చటనైన నున్నచో ఈయన హృదయమున నుండు నని తలచి, రాజు అమాత్యుని బిలిచి తాపసుని గొని రమ్మని చెప్పెను. చిత్తము దేవా, అని అమాత్యుడు పోయి బోధిసత్త్వునకు నమస్కరించి, ఆయన చేతిలోని భిక్షాపాత్రమును తాను కైకొని ఏమి పుణ్యాత్మా అని తాపసి యడుగగా "భదంతా, రాజు తమ్ము నాహ్వానించుచున్నాడు" అని పలికెను.

"రాజకులము నన్నెరుగదు. నేను హిమాలయవాసిని" అని బోధి

సత్త్వుడు పలుకగా అమాత్యుడు రాజుకు జరిగిన మాటలు చెప్పెను. “నాకిక కులూపకు లెవ్వరును లేరు. ఆయనను దోడ్కొని రమ్ము” అని రాజు పలికెను. అమాత్యుడు చని నమస్కారము చేసి, ప్రార్థించి, బోధిసత్త్వుని రాజునివాసమునకు దోడ్కొని వచ్చెను. రాజు బోధిసత్త్వునకు నమస్కరించి, విశాల శ్వేతచ్ఛత్రము క్రింద కాంచన పర్యంకమున గూరుచుండబెట్టి తనకు సిద్ధ మయిన రుచ్యాహారమును తాపసికి బెట్టించి, భోజనానంతరము ‘భదంతా, తమ నివాస మెక్కడ?’ అని యడిగెను.

“హిమవంతము నా నివాసము మహారాజా!”

“తా మిప్పు డెచ్చటికి బోవుచున్నారు?”

“వర్షాకాలము గడపుటకు నివాసము చూచు చున్నాను మహారాజా!”

అట్లయిన, మా యుద్యానములోనే వసింపుడు భదంతా!” అని రా జాయన సమ్మతిబడసి, తానుభుజించి, సాయంకాలము బోధిసత్త్వు నుద్యానమునకు దోడ్కొని పోయి, అచ్చట తగిన పర్ణశాల నిర్మింప పరిజనుల కాజ్ఞ యిచ్చి, పగలు రాత్రి నివసించుట కను వైన గదులు కావలయు నని చెప్పి, పరివ్రాజకునకు వలయు పరికరము లన్నియు సమకూర్చి నగరము జేరెను. నాటినుండి బోధిసత్త్వు డుద్యానమున నివసింపజొచ్చెను. రాజు రోజునకు రెండుమూడుమారు లాయన దర్శనార్థము పోవుచుండెను.

ఆరాజుకు దుష్టకుమారు డను పుత్రు డుండెను. వాడు పరుష స్వభావుడు, చండప్రచండుడు. తండ్రి కూడ వానిని స్వాధీనము చేసి కొనలేక పోయెను. అమాత్యులు, బ్రాహ్మణులు, పెద్దలు వానితో “స్వామీ, యిట్లు చేయుము” అని బోధించినను వాడు వారివాక్కులు పెడచెవిని బెట్టువాడు. ఒకనాడు రాజు యోచించి “శీలవంతు డైన యీతాపసుడు తప్ప మరి యెవ్వడై వ వీనిని లోపరచుకొందు రను మాట కల్ల. ఈయన కడకే పంపుట మేలు” అని కుమారుని స్వయ ముగా బోధిసత్త్వుని కడకు దోడ్కొని పోయి, “భదంతా, వీడు పరుష స్వభావుడు, చండప్రచండుడు. మీరు వీనికి బుద్ధి చెప్పవలె” నని అప్పగించి, వెడలిపోయెను.

రాజకుమారుని వెంట బెట్టుకొని బోధిసత్త్వు డుద్యానమున విచరించుచుండగా వేపమొక్క కానవచ్చెను. అటు నిటు నొక్కొక పర్ణము చొప్పున మొక్క రెండాకులు వేసెను. ఆకు రుచి చూచి యె ట్లున్నదో చెప్పు మని బోధిసత్త్వుడు రాజకుమారు నడిగెను. ఒక పర్ణము కోసి నమలి వాడు కాండ్రించి యుమిసెను.

"ఏమి కుమారా!"

"భదంతా, ఈ మొక్క హాలాహల విషముతో సమానముగా నున్నది. పెద్ద దయినచో ననేకుల ప్రాణములు తీయు." నని రాజకుమారుడు దానిని పెరికి, చేతులతో నలిపి, యీ గాథ పలికెను:

> అవనిపై నాలుగంగుళా లైన లేక
> ఒక్క పర్ణమె విడిచిన మొక్క నింద
> ఇంత విష ముండ, పెరిగిన నెట్లు లుండు!

అంతట బోధిసత్త్వుడు "కుమారా, నీ వీ వేపమొక్కను పీకివేసి, మర్దించి, హాలాహలముతో సమానముగా నున్నది, పెద్ద దయినచో ననేకుల ప్రాణములు తీయు నంటివి. ఈరాజ్యములోని ప్రజలు నీవంటి భయంకరుడు పెద్దవా డయినచో నెంత ప్రచండుడై అనేకుల ప్రాణములు తీయునో యను భీతిచే నీ వీ మొక్కను పీకినట్లే నిన్నుత్పాటించి, కులక్రమాగత మైన రాజ్యమును నీ కీయక, ప్రవాసమునకు బంపుదురు. కావున నేటినుండి శాంతి వహించి కరుణ బూనియుండుము' అని బోధించెను.

రాజకుమారుడు నాటినుండి సమాహిత చిత్తుడై, దయాదాక్షిణ్యములు వహించి, బోధిసత్త్వుని యుపదేశ ప్రకారము ప్రవర్తించుచు తండ్రి తరువాత రాజయి, దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు యథా కర్మం గతో.

శాస్త్ర ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. అప్పటి దుష్టలిచ్ఛవి కుమారుడు ఇప్పటి లిచ్ఛవి కుమారుడు; రాజు ఆనందుడు; ఉపదేశించిన తపస్వి నేనే.

# 150 సంజీవ జాతకము

**శాస్త వేళువనమున విహారము చేయుసమయమున అజాతశత్రు ప్రభువు దుర్మతికి చేయునాదరమును గూర్చి చెప్పినది.**

*వర్తమాన కథ*

బుద్ధవిరోధి యగు దేవదత్తునకు గయాశీర్షమున విహారము కట్టించి యిచ్చి, హెచ్చుగా నాదరించుచున్న అజాతశత్రువునకు ఒక నాడు భయము పట్టుకొనెను. నాటినుండియు అతడు సుఖ మెరుగక తల్లడిల్లుచు, సమ్యక్-సంబుద్ధుని జేరి క్షమాపణ వేడనెంచెను. కాని స్వాయముగా పోవుట కాయనకు ధైర్యము చాలలేదు.

రాజగృహ నగరములో కార్తికోత్సవము జరుగుచుండెను. దేవ నగరమువలె నగర మలంకృత మయ్యెను. సౌధమున అమాత్యగణ పరివేష్టితుడై రాజు కొలువుండ, పార్శ్వమునకే కౌమారభృత్య జీవకుడు కానవచ్చెను. జీవకుని వెంట బెట్టుకొని శాస్తకడకు బోవలె నని రాజుకు సంకల్పము కలిగెను; కాని తోడనే వేరొకభావము కలిగి అన్యాపదేశముగా రాత్రిప్రశంస చేసెను: "ఈవెన్నెలరాత్రి లక్షణ సంపన్నము; ఈవెన్నెలరాత్రి సుందరము; ఈవెన్నెలరేయి దర్శనీయము! ఈవెన్నెలరేయి ప్రసన్నము; ఈవెన్నెలరాత్రి రమణీయము; ఎవరిసాంగత్యమువలన చిత్తము ప్రసన్న మగునో అట్టి శ్రమణుని కడకుగాని, బ్రాహ్మణుని కడకుగాని యీరేయి చనవలెను.

ఒకయమాత్యుడు పూరణ కశ్యపుని ప్రశంసించెను; ఒకడు మక్ఖలి గోశాలుని, ఒకడు అజితకేశకంబలిని, వేరొకడు ప్రబుద్ధ కాత్యాయనుని, మరియొకడు వేలట్ఠిపుత్ర సంజయుని, ఇంకొకడు నిర్గ్రంథనాథ పుత్రుని ప్రశంసించిరి.

మహామాత్య జీవకు డేమైన పలుకు నని రాజు భావించెను; ప్రభు వడిగినప్పుడు చెప్పవచ్చు నని జీవకుడు తలపోసెను. ఇంతలో రాజు "జీవకా, నీ వేమియు మాటాడలే దేమి?" అనెను. జీవకుడు పీఠము మీదినుండి లేచి, బుద్ధభగవానుడు నివసించుచున్నదిశకు చేతులు జోడించి "దేవా, భగవాన్ అర్హంత సమ్యక్-సంబుద్ధుడు మన ఆమ్ర

వనమున వేంచేసి యున్నాడు. ఆయన వెంట 1250 మంది శిష్యు లున్నారు. భగవాన్ గుణములు అనంతములు. ఆయనసన్నిధికి జని, ధర్మోపదేశము విని, సంశయములు తొలగించు కొనవచ్చును” అని విన్నవించెను.

మనోరథసిద్ధి యగుటచే రాజు “సౌమ్యా, జీవకా, ఏనుగులను సిద్ధము చేయింపుము” అనెను. అనంతరము వైభవముతో, రాజు బయలుదేరి ఆమ్రవనము చేరి సువాసితభవనములో బుద్ధునిచుట్టును భిక్షుసంఘము కూర్చుండుట విలోకించెను. అంతయు శాంతముగా నుండెను. రాజు భిక్షుసంఘమునకు ప్రణామము చేసి, స్తుతించి, భగవానునకు ప్రణామముచేసి, ఒకప్రక్క గూరుచుండి, శ్రమణత్వఫలమును గూర్చి ప్రశ్న వేసెను. భగవానుడు రెండుప్రకరణములలో విస్తరించి, సామఞ్ఞఫలసూత్రము ఉపదేశించెను. రాజు విని ప్రసన్నుడై భగవానుని క్షమాపణ వేడి వెడలిపోయెను.

తరువాత కొలదిదినములకు భిక్షువులు ధర్మసభలో జేరి, “దుర్మార్గుడగు దేవదత్తుని ప్రేరణమువలన అజాతశత్రువు పితృహత్య చేసి శ్రోతాపత్తిఫలము కోలుపోయెను. దేవదత్తుడు రాజ్యమును పాడు చేసినాడు” అనుచుండిరి.

శాస్త అచ్చటికిబోయి, “భిక్షువులారా, ఏమి సంభాషించుచున్నారు?” అనెను. యీవిషయము అని వారు చెప్పగా శాస్త “భిక్షువులారా, ఇప్పుడేకాదు, పూర్వముకూడ అజాతశత్రువు దుష్టులకు సమ్మానము చేసి నాశము పొందినాడు” అని పూర్వజన్మకథ చెప్పెను:

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు మహావిభవ సంపన్నమైన బ్రాహ్మణ వంశమున బుట్టి, పెరిగి పెద్దవాడయి, తక్షశిలానగరమునకు బోయి, సకల విద్యల నభ్యసించినాడు. ఆతడు వారాణసికి మరలి వచ్చి, ఆచార్యుడయి జగద్విఖ్యాతి నొందినాడు. ఆతనికడ పంచశత విద్యార్థిగణ ముండెను. వారిలో సంజీవుడను మాణవకుడు కలడు. బోధిసత్త్వుడతనికి మృతోత్థాపన మంత్ర మువదేశించినాడు. కాని వాడు ప్రతిక్రియా మంత్రమును

చెప్పకొనలేదు. ఒకనాడు వాడు తోడి విద్యార్థులతో నరణ్యమునకు జని కాష్ఠము లేరుచుండ మృతవ్యాఘ్రకళేబరము కానవచ్చెను. "చచ్చిన పులిని బ్రతికించెదను" అని సంజీవు డనెను. "నీవల్ల కాదు" అన్నారు విద్యార్థులు. "చూచుడు, దీనిని లేపెదను." "చేతనయినచో బ్రదికింపుము" అని వారు చెల్లెక్కినారు.

సంజీవుడు మంత్ర ముచ్చరించి పులియొడలి మీఁద ఇసుక చల్లెను. వ్యాఘ్రము లేచి, చప్పున లంఘించి, సంజీవుని పీక పట్టుకొని చంపి, యచ్చటనే పడి ప్రాణములు విడిచెను. పులియు, సంజీవుడు నొక్కచోట పడియుండిరి.

మాణవకులు కాష్ఠములు సంగ్రహించి, వృత్తాంత మాచార్యునకు విన్నవించిరి. ఆచార్యుడు వారలను సంబోధించి "నాయనలారా, దుర్మార్గుల ననుగ్రహించి, అయోగ్యస్థానమున సమ్మానము చేయుట వలన నిట్టి యనర్థములు కలుగుచుండును" అని యీగాథ పలికెను :

దుష్టబుద్ధుల కెవ్వడు దొడ్డతనము
గూర్చుచును దురాచారుల గూడియుండు,
ప్రాప్తజీవన మైనవ్యాఘ్రంబు వోలె
వాని వారు పోకార్చుట వాస్తవమ్ము.

బోధిసత్త్వు డీ గాథద్వారా మాణవకులకు ధర్మము బోధించి, జీవితము దానాది పుణ్యకార్యములలో గడపి నిజకర్మానురూప మగు పదవిని బొందెను.

శాస్త ధర్మోపదేశము చేసి కథలు సరిపోల్చెను. ఆకాలమున మృతవ్యాఘ్రమును ఉజ్జీవింప జేసిన విద్యార్థి అజాతశత్రువు; ప్రసిద్ధాచార్యుడు నేనే.

ప్రథమ నిపాతము

# అనుక్రమణిక

## నిపాతము ౧

౧ అపణ్ణక వర్గము

1. అపణ్ణ జాతకము 1
2. వణ్ణుపథ జాతకము 10
3. సేరివాణిజ జాతకము 14
4. చిన్నిసెట్టి జాతకము 17
5. తండుల నాళి జాతకము 29
6. దేవధమ్మ జాతకము 33
7. కట్ఠహారి జాతకము 37
8. గామని జాతకము 39
9. మఖాదేవ జాతకము 40
10. సుఖ విహారి జాతకము 42

౨ సీల వర్గము

11. లక్ఖణ జాతకము 45
12. నిగ్రోధమిగ జాతకము 48
13. కండిన జాతకము 58
14. వాతమిగ జాతకము 60
15. ఖరాదియ జాతకము 64
16. తిపల్లత్థమిగ జాతకము 65
17. మాలుక జాతకము 69
18. మతకభత్త జాతకము 71
19. ఆయాచిత భత్త జాతకము 74
20. నళపాన జాతకము 75

3 కురుంగ వర్గము

21. కురుంగమిగ జాతకము 78
22. కుక్కుర జాతకము 80
23. భోజాజానీయ జాతకము 83
24. ఆజఞ్ఞ జాతకము 86
25. తిత్థ జాతకము 87

| | | |
|---|---|---|
| 26. | మహిళాముఖ జాతకము | 91 |
| 27. | అభిణ్హ జాతకము | 95 |
| 28. | నందివిసాల జాతకము | 97 |
| 29. | కణ్హ జాతకము | 100 |
| 30. | మణిక జాతకము | 102 |

౪ కులావక వర్గము

| | | |
|---|---|---|
| 31. | కులావక జాతకము | 104 |
| 32. | నచ్చ జాతకము | 112 |
| 33. | సమ్మోదమాన జాతకము | 114 |
| 34. | మచ్ఛ జాతకము | 117 |
| 35. | వట్టక జాతకము | 119 |
| 36. | సకుణ జాతకము | 122 |
| 37. | తిత్తిర జాతకము | 124 |
| 38. | బక జాతకము | 127 |
| 39. | నంద జాతకము | 132 |
| 40. | ఖదిరంగార జాతకము | 134 |

౫ అత్థకామ వర్గము

| | | |
|---|---|---|
| 41. | లోసక జాతకము | 143 |
| 42. | కపోత జాతకము | 152 |
| 43. | వేళుక జాతకము | 155 |
| 44. | మకస జాతకము | 157 |
| 45. | రోహిణి జాతకము | 159 |
| 46. | ఆరామదూసక జాతకము | 160 |
| 47. | వారుణి జాతకము | 162 |
| 48. | వేదబ్భ జాతకము | 164 |
| 49. | నక్ఖత్త జాతకము | 168 |
| 50. | దుమ్మేధ జాతకము | 170 |

౬ ఆసింస వర్గము

| | | |
|---|---|---|
| 51. | మహాసీలవ జాతకము | 172 |
| 52. | చూళజనక జాతకము | 179 |
| 53. | పుణ్ణపాతి జాతకము | 179 |
| 54. | ఫల జాతకము | 181 |
| 55. | పంచావుధ జాతకము | 184 |
| 56. | కంచనక్ఖంధ జాతకము | 187 |
| 57. | వానరిన్ద జాతకము | 190 |

58. తయోధమ్మ జాతకము 195
59. భేరీవాద జాతకము 195
60. శంఖధమన జాతకము 196

౭ ఇత్థి వర్గము

61. అసాతమంత జాతకము 197
62. అండభూత జాతకము 201
63. కక్క జాతకము 207
64. దురాజాన జాతకము 211
65 అనభిరత జాతకము 213
66. ముదులక్షణ జాతకము 215
67. ఉచ్ఛంగ జాతకము 219
68. సాకేత జాతకము 221
69. విసవంత జాతకము 223
70. కుద్దాల జాతకము 225

- వరణ వర్గము

71. వరణ జాతకము 229
72. సీలవనాగ జాతకము 233
73. సచ్చంకిర జాతకము 236
74. రుక్ఖధమ్మ జాతకము 241
75. మచ్ఛ జాతకము 243
76. అసంకియ జాతకము 246
77. మహాసుపిన జాతకము 249
78. ఇల్లీస జాతకము 253
79. ఖరస్సర జాతకము 264
80. భీమసేన జాతకము 265

౯ అపాయింహ వర్గము

81. సురాపాన జాతకము 270
82. మిత్తవింద జాతకము 273
83. కాలకణ్ణి జాతకము 274
84. అత్థస్సద్వార జాతకము 276
85 కింపక్క జాతకము 278
86. సీలవీమంస జాతకము 279
87 మంగల జాతకము 283
88. సారంభ జాతకము 286
89. కుహక జాతకము 287
90. అకతఞ్ఞు జాతకము 289

## ౧౦ లిత్త వర్గము


| | |
|---|---|
| 91. లిత్తి జాతకము | 291 |
| 92. మహాసార జాతకము | 292 |
| 93. విస్సాస భోజన | 300 |
| 94. లోమహంస జాతకము | 302 |
| 95. మహాసుదస్సన జాతకము | 304 |
| 96. తేలపత్త జాతకము | 306 |
| 97. నామసిద్ధి జాతకము | 313 |
| 98. కూట వాణిజ జాతకము | 315 |
| 99. పరోసహస్స జాతకము | 318 |
| 100. అసాతరూప జాతకము | 319 |


## ౧౧ పరోసత వర్గము


| | |
|---|---|
| 101. పరోసతి జాతకము | 323 |
| 102. పణ్ణిక జాతకము | 323 |
| 103. వేరీ జాతకము | 325 |
| 104. మిత్తవింద జాతకము | 325 |
| 105. దుబ్బల కట్ఠ జాతకము | 327 |
| 106. ఉదంజని జాతకము | 329 |
| 107. సాలిత్త జాతకము | 331 |
| 108. బాహియ జాతకము | 333 |
| 109. కుణ్డక పూవ జాతకము | 335 |
| 110. సబ్బ సంహార పఞ్హో | 338 |


## ౧౨ హాంసీ వర్గము


| | |
|---|---|
| 111. గద్రభ పఞ్హో | 338 |
| 112. అమరా దేవీ పఞ్హో | 338 |
| 113. సిగాల జాతకము | 339 |
| 114. మితచిన్తీ జాతకము | 341 |
| 115. అనుసాసిక జాతకము | 343 |
| 116. దుబ్బచ జాతకము | 345 |
| 117. తిత్తిర జాతకము | 346 |
| 118. వట్టక జాతకము | 348 |
| 119. అకాలరావి జాతకము | 351 |
| 120. బంధనమోక్ష జాతకము | 352 |

## ౧౩ కుసనాళి వర్గము


| | |
|---|---|
| 121. కుసనాళి జాతకము | 358 |
| 122. దుమ్మేధ జాతకము | 360 |
| 123. నఙ్గలీస జాతకము | 363 |
| 124. అమ్బ జాతకము | 366 |
| 125. కటాహక జాతకము | 368 |
| 126. అసిలక్ఖన జాతకము | 372 |
| 127. కలణ్డుక జాతకము | 376 |
| 128. బిళారవత జాతకము | 377 |
| 129. అగ్గిక జాతకము | 378 |
| 130. కోసియ జాతకము | 380 |


## ౧౪ అసంపదాన వర్గము


| | |
|---|---|
| 131. అసంపదాన జాతకము | 382 |
| 132. పఞ్చగరుక జాతకము | 386 |
| 133. ఘతాసన జాతకము | 388 |
| 134. ఝానసోధన జాతకము | 389 |
| 135. చన్దాభ జాతకము | 390 |
| 136. సువణ్ణ హంస జాతకము | 391 |
| 137. బబ్బు జాతకము | 394 |
| 138. గోధ జాతకము | 397 |
| 139. ఉభతో భట్ఠ జాతకము | 399 |
| 140. కాక జాతకము | 400 |


## ౧౫ కకణ్టక వర్గము


| | |
|---|---|
| 141. గోధ జాతకము (2) | 403 |
| 142 సిగాల జాతకము | 406 |
| 143. విరోచన జాతకము | 407 |
| 144. నఙ్గుట్ఠ జాతకము | 410 |
| 145. రాధ జాతకము | 412 |
| 146. కాక జాతకము | 414 |
| 147. పుప్ఫరత్త జాతకము | 416 |
| 148. సిగాల జాతకము | 418 |
| 149. ఏకపణ్ణ జాతకము | 421 |
| 150. సంజీవ జాతకము | 425 |


ప్రథమ సంపుటి



# జాతక కథలు

పాలి భాషనుండి ఆంధ్రీకరించినది

స్వామి శివ శంకర శాస్త్రి

ద్వితీయ సంపుటి

సాహితీసమితి. రేపల్లె

85377

# పీఠిక

సాహిత్యసమితి సభ్యుల ఉత్తమ గ్రంథములను శతాధికముగా ప్రకటించినది. కావ్యసందోహములు నవలలు కథలు నాటకములు నాటికలు వ్యాసములు ఇత్యాదిగా బహువిధరచనలు వెలువడినవి. అట్లయినను ఈజాతకకథల ప్రచురణము మాకు ప్రత్యేకామోదదాయకముగా నున్నది.

బుద్ధఘోషుడు ఐదవ శతాబ్దమున మొదట పాలిభాషలో ఈ జాతకకథలకు ప్రామాణికస్వరూపము కల్పించెను, ప్రపంచమందలి కథావాఙ్మయ మంతటిలో జాతకకథలు ప్రథమ గణ్యము లని తద్విదుల నిర్ణయము ఇవి బహుదేశములలో బహుభాషలలో బహువిధ రూపాంతరము లందినవి.

కథావాఙ్మయమున నభిరుచి అతిశయించిన ఈ రోజులలో, ఆంధ్రుల దృష్టి బహుకాలము క్రిందటనే జాతకకథలపై ప్రసరించినది. జాతకకథ లను పేరితో ఎన్నో పత్రిక లందును గ్రంథరూపముననను వెలువడినవి. కాని వానిలో ఎక్కువ భాగము మూలగ్రంథస్వరూపము తెలిసి రచించినవి కావు. అందుచే వాని ప్రయోజనము బహుపరిమిత మైనది.

ఇది పాలిభాషలో 547 కథలు గల మహాగ్రంథము. త్రిపిటకములలో నంత ర్భూత మైనది. ఆంధ్రదేశములో పాలిభాష అభ్యసించినవారు విరళముగా నున్నారు, అందును దీని మూలగ్రంథములోని కొన్నికొన్ని భాగములు విద్వాంసులకే దురవగాహములుగా నున్నవి. అట్టివి యథామూలముగా ఉదాత్త మయ్యును బహుజన గ్రాహ్య మగు నాంధ్ర భాషలోనికనువదించుట కష్టసాధ్యము. అనితరసాధ్య మగు నీమహత్కార్యమును, వైదికలౌకిక సంస్కృత, ప్రాకృత పాలిభాషా విశారదులును, గ్రంథరచనలో కృతహస్తులు నైన మా సభాపతులు స్వామి శివశంకర శాస్త్రి సాధించిరి ఇది నిర్దుష్టముగా అధికారికరూపమున వెలువడుచున్న అనువాదము.

ఈ యుద్గ్రంథము మొత్తము ఇట్టివే ఏడుసంపుటములలో సంపూర్ణముగా ప్రచురింప సంకల్పించి యున్నాము.

ఈ గ్రంథావసరము గ్రహించి Central Govt, Ministry of Scientific Research and Cultural Affairs వారు ప్రథమసంపు

టమునకు వలెనే, ద్వితీయ సంపుటప్రచురణమునకును ధనసాహాయ్యము కావించినారు. వారి కందులకు మే మెంతయు కృతజ్ఞులము. ముందుకూడ ప్రభుత్వము వారియు ఆంధ్రపారకలోకముయొక్కయు ఆదరాభిమానములతో తక్కిన ఐదు సంపుటములును త్వరలో ప్రకటింపగలము.

ఈ గ్రంథమును చక్కగా ముద్రించిన Welcome Press (P) Ltd. Guntur వారికి మా యభినందనములు.

ఈ గ్రంథ ముద్రణమున అన్నివిధముల తోడ్పడి విశేషశ్రద్ధ చూపిన సాహిత్యాచార్య, కవిభూషణ, మధురకవి శ్రీ వావిలాల సోమయాజులుగారికి శుభం భూయాత్।

నోరి నరసింహ శాస్త్రి
కార్యదర్శి, సాహితీ సమితి

రేపల్లె
1.6.1961

# అనుక్రమణిక

## నిపాతము ౨

### ౧౬ దళ్హ వర్గము


| | | | |
|---|---|---|---|
| 151 | రాజోవాద | జాతకము | 1 |
| 152. | సిగాల | ,, | 5 |
| 1‸3. | సూకర | ,, | 8 |
| 154. | ఉరగ | ,, | 11 |
| 155 | గగ్గ | ,, | 14 |
| 156 | అలీనచిత్త | ,, | 17 |
| 157. | గుణ | ,, | 23 |
| 158. | సుహాను | ,, | 29 |
| 159. | మోర | ,, | 31 |
| 160. | వినీలక | ,, | 36 |


### ౧౭ సంథ వర్గము


| | | | |
|---|---|---|---|
| 161. | ఇందసమానగోత్ర | ,, | 38 |
| 162 | సంథవ | ,, | 4) |
| 163. | సుసీమ | ,, | 42 |
| 164 | గిజ్ఝ | ,, | 46 |
| 165 | నకుల | ,, | 49 |
| 166. | ఉపసళ్హ | ,, | 50 |
| 167 | సమిద్ధి | ,, | 53 |
| 168 | సకుణగ్ఘి | ,, | 5) |
| 169 | అరక | ,, | 56 |
| 170 | కకంటక | ,, | 58 |


### ౧౮ కల్యాణధమ్మ వర్గము


| | | | |
|---|---|---|---|
| 171 | కల్యాణధమ్మ | జాతకము | 58 |
| 172 | దద్దర | ,, | 61 |
| 173 | మక్కట | ,, | 63 |
| 174 | దూభియమక్కట | ,, | 65 |
| 175 | ఆదిచ్చుపట్ఠాన | ,, | 67 |
| 176 | కలాయముట్ఠి | ,, | 69 |
| 177 | తిందుక | ,, | 71 |
| 178. | కచ్ఛప | ,, | 73 |
| 179. | సతధమ్మ | ,, | 76 |
| 180 | దుద్ద | ,, | 78 |

## ౧౯ అసదిస వర్గము


| | | | |
|---|---|---|---|
| 181. | అసదిస | జాతకము | 80 |
| 182. | సంగామావచర | ,, | 85 |
| 183 | వాలోదక | ,, | 89 |
| 184. | గిరిదత్త | ,, | 91 |
| 185. | అనభిరతి | ,, | 92 |
| 186. | దధివాహన | ,, | 94 |
| 187. | చతుమట్ఠ | ,, | 100 |
| 188 | సీహకోట్ఠుక | ,, | 101 |
| 189 | సీహచమ్మ | ,, | 103 |
| 190 | సీలానిసంస | ,, | 104 |


## ౨౦ రుహక వర్గము


| | | | |
|---|---|---|---|
| 191. | రుహక | జాతకము | 106 |
| 192. | సిరికాళకణ్ణి | ,, | 108 |
| 193 | చుల్లపదుమ | ,, | 109 |
| 194. | మణిచోర | ,, | 114 |
| 195 | పబ్బతూపత్థర | ,, | 117 |
| 196. | వాలాహస్స | ,, | 119 |
| 197. | మిత్తామిత్త | ,, | 122 |
| 198. | రాధ | ,, | 124 |
| 199 | గాహపతి | ,, | 126 |
| 200. | సాధుసీల | ,, | 128 |


## ౨౧ తందల్హా వర్గము


| | | | |
|---|---|---|---|
| 201. | బంధనాగార | జాతకము | 129 |
| 202. | కేళిసీల | ,, | 131 |
| 203. | ఖంధవత్త | ,, | 134 |
| 204 | వీరక | ,, | 137 |
| 205. | గంగేయ్య | ,, | 139 |
| 206. | కురుంగమిగ | ,, | 141 |
| 207. | అస్సక | ,, | 143 |
| 208. | సుంసుమార | ,, | 146 |
| 209. | కక్కార | ,, | 149 |
| 210. | కందగళక | ,, | 150 |


## ౨౨ బీరణత్థంభక వర్గము


| | | | |
|---|---|---|---|
| 211. | సోమదత్త | జాతకము | 152 |
| 212. | ఉచ్ఛిట్ఠభత్త | ,, | 154 |
| 213 | భరు | ,, | 156 |

214 పుణ్ణనదీ ,, 160
215 కచ్ఛప ,, 161
216 మచ్ఛ ,, 163
217. సేగ్గు ,, 165
218. కూటవాణిజ ,, 166
219 గరహిత ,, 169
220. ధమ్మద్ధ ,, 171

౨౩ కాసావ వర్గము

221. కాసావ జాతకము 177
222 చూలనందియ ,, 180
223. పుటభత్త ,, 183
224 కుంభీల ,, 186
225 ఖంతివణ్ణన ,, 187
226 కోసియ ,, 188
227. గూథపాణ ,, 189
228. కామనీత ,, 192
229 పలాసీ ,, 195
230. దుతియపలాయి ,, 197

౨౪ ఉపాస వర్గము

231. ఉపాహన జాతకము 199
232 వీణాథూణ ,, 201
233 వికణ్ణక ,, 203
234. అసితాభు ,, 205
235 వచ్ఛనఖ ,, 207
236. బక ,, 209
237. సాకేత ,, 210
238 ఏకపద ,, 211
239. హరితమాత ,, 212
240. మహాపింగళ ,, 214

౨౫ సిగాల వర్గము

241 సబ్బదాఠ జాతకము 217
242 సునఖ ,, 220
243 గుత్తిల ,, 222
244 వీతిచ్ఛ ,, 230
245. మూలపరియాయ ,, 232
246. తేలోవాద ,, 234
247. పాదంజలి ,, 236

248. కింసుకోపమ జాతకము 237
249. సాలక ,, 239
250. కపి ,, 241

## నిపాతము ౩

### ౨౬ సంకప్ప వర్గము

251. సంకప్ప జాతకము 243
252. తిలముట్ఠి ,, 248
253. మణికంఠ ,, 253
254. కుండకకుచ్ఛిసింధవ 256
255 సుక ,, 261
256. జరూదపాన ,, 263
257. గామణిచండక ,, 265
258. మంధాతు ,, 276
259 తిరీటవచ్ఛ ,, 280
260 దూత ,, 283

### ౨౭ కోసియ వర్గము

261 పదుమ జాతకము 285
262 ముదుపాణి ,, 287
263. చుల్లపలోభన ,, 291
264 మహాపణాద ,, 294
265 ఖురప్ప ,, 297
266 వాతగ్గ ,, 299
267 కక్కట ,, 302
268 ఆరామదూసక ,, 306
269 సుజాత ,, 308
270. ఉలూక ,, 312

### ౨౮ అరఞ్ఞ వర్గము

271 ఉదపానదూసక జాతకము 314
272 వ్యగ్ఘ ,, 315
273 కచ్ఛప ,, 317
274 లోల ,, 319
275. రుచిర ,, 322
276 కురుధమ్మ ,, 322
277 రోమక ,, 337
278. మహింస ,, 339
279 సతపత్త ,, 341
280. పుటదూసక ,, 344

## ౨౯ అబ్భంతర వర్గము


| | | | |
|---|---|---|---|
| 281. | అబ్భంతర | జాతకము | 345 |
| 282 | సేయ్య | „ | 353 |
| 283 | వడ్ఢకిసూకర | „ | 356 |
| 284 | సిరి | „ | 362 |
| 285. | మణిసూకర | „ | 366 |
| 286 | సాలుక | „ | 371 |
| 287. | లాభగరహ | „ | 373 |
| 288 | మచ్ఛుద్దాన | „ | 374 |
| 289. | నానచ్ఛంద | „ | 377 |
| 290. | సీలవీమంస | „ | 380 |


## ౩౦ ఉదకుంభ వర్గము


| | | | |
|---|---|---|---|
| 291 | భద్రఘట | జాతకము | 382 |
| 292 | సుపత్త | „ | 384 |
| 293. | కాయవిచ్ఛింద | „ | 387 |
| 294 | జంబుఖాదక | „ | 389 |
| 295 | అంక | „ | 390 |
| 296 | సముద్ద | „ | 391 |
| 297 | కామవిలాప | „ | 393 |
| 298 | ఉదుంబర | „ | 394 |
| 299 | కోమాయపుత్ర | „ | 397 |
| 300 | వక | „ | 399 |

# 151 రాజోవాద జాతకము

శాస్త్ర జేతవనమున నివసించుచు రాజున కిచ్చు నుపదేశమును గూర్చి చెప్పినది. ఆయుప దేశము తేసకుణ జాతకమున (521) వచ్చును.

## వర్తమాన కథ

ఒకనాడు కోసలనరేశుడు నిర్ణయించుట సులభముకాని ఒకానొక పాపకర్మకు సంబంధించిన అభియోగమున తీర్పు చెప్పి, భోజనము చేయగానే తడిచేతులతోనే రథ మెక్కి శాస్త్రసన్నిధికి జనెను; వికసించిన కమలములవంటి చరణములపై వ్రాలి ప్రణామముచేసి ఒక ప్రక్కన కూరుచుండెను.

"ఓహో, మహారాజా! ఇంత ప్రొద్దెక్కి ఎచ్చటనుండి వచ్చితిరి?" అని శాస్త్ర ప్రశ్నించెను.

"భన్తే, నిర్ణయించుట తేలికగాని ఒకానొక పాపకర్మసంబంధమైన అభియోగమున తీర్పుచెప్పుటలో అవకాశము లభింపలేదు. ఇప్పుడే తీర్పుచెప్పి, భోజనము చేసి తడిచేతులతోనే తమ దర్శనార్థము వచ్చినాను" అని రాజు విన్నవించెను.

"మహారాజా, ధర్మప్రకారముగా న్యాయప్రకారముగా అభియోగమున తీర్పుచెప్పుట శుభకర్మము. అది స్వర్గమునకు మార్గము. కాని మీవంటివారు మావంటి సర్వజ్ఞుల ఉపదేశము గ్రహించి ధర్మప్రకారముగా న్యాయప్రకారముగా అభియోగముల తీర్పులు చెప్పుచుండుట ఆశ్చర్యజనకము కాదు. పూర్వరాజులు సర్వజ్ఞులు కాని పండితులఉపదేశములను విని ధర్మప్రకారముగా న్యాయప్రకారముగా అభియోగములలో తీర్పులు చెప్పుచు, నాలుగు - అగతులనుండి తప్పించుకొని, రాజధర్మములకు విరుద్ధముగాని జనకధర్మానుసారముగా రాజ్యపరిపాలనము చేయుచు స్వర్గమార్గమున చనిరి అనుట ఆశ్చర్యకరము" అని శాస్త్ర రాజు ప్రార్థించిన పిమ్మట పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు 'ఆయన పట్టమహిషికడుపున బడి, గర్భరక్షణ సంస్కారములు జరిగిన పిదప, సకాలమున పుత్త్రుడై పుట్టెను. నామకరణమునా డతనికి బ్రహ్మదత్తకుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగి పెద్దవా డయి, పదునారు సంవత్సరములు వచ్చినపుడు తక్షశిలకు బోయి, సకలవిద్యలలో ప్రావీణ్యము నొంది, తండ్రిమరణానంతరము రాజ్యమునకు వచ్చి, ధర్మపాలనము చేయుచుండెను. తనయిచ్ఛాను సారముగా కాక అతడు ధర్మనిరూఢిని రాజ్యపాలనము చేయుచుండెను. అమాత్త్యులుకూడ ధర్మమార్గముననే వ్యవహారములను నిర్వహించుచుండిరి. అట్లు జరుగుచుండుటచే కూటాభియోగకారకు లను మాటయే లేకుండెను. రాజాంగణమున జనకోలాహలము క్షీణించెను. అమాత్త్యులు పగలెల్ల న్యాయస్థానమున గూరుచున్నను, ఒక్కడుకూడ తీర్పుకొరకు రాకుండుటచే న్యాయస్థానము నిర్మానుష్యమయ్యెను

బోధిసత్త్వు డిట్లు తలపోసెను: "నేను ధర్మానుసారముగా రాజ్యము చేయుచుండ న్యాయనిర్ణయమునకై న్యాయస్థానమునకు వచ్చువారు కానరాకున్నారు. సందడి తగ్గిపోయినది. న్యాయస్థానము నిర్మానుష్య మయినది. నాలోపము పరీక్షించుట కర్తవ్యము. అవగుణ మున్నచో దానిని విసర్జించి, గుణములకై యత్నింతును. నాలోపములను జూపువా రెవరైన కల రేమో చూడవలెను."

నాటినుండి బోధిసత్త్వుడు లోపములజూపువారికై వెదకుచు సమీపవర్తులవలన నిజగుణకథనమే వినుచు, తనవలని భయముచేవారు దుర్గుణములను దెలుపక గుణములనే కీర్తించుచున్నా రని భావించి, అంతఃపురమున కావలనుండువారిని పరీక్షించుచు, ఎవ్వరును లభింపకపోవుటచే నగరములో వెదకజొచ్చెను. నగరమునకు నాలుగు ద్వారముల కావల జానపదులను ప్రశ్నించుచు నిజగుణకథనమునే విని, జనపదములలో నన్వేషింపదలచి అమాత్త్యులపై రాజ్యభారము నిలిపి, వేషముమార్చి, రాజు నగరము వెలువడి, రాజ్యసీమాంతమువరకు

బోయి అచ్చటగూడ తనదోషములు తెలుపువానిని గానక, తన ప్రశస్తినే విని, అచటినుండి రథమున మహామార్గము వెంట నిజనగరాభిముఖుడై బయలుదేరెను.

ఆసమయమున మల్లిక నాముడగు కోసలరాజు న్యాయపరిపాలనము చేయుచు నిజలోపములను జూపువారికొరకు వెదకుచు నచ్చటికి వచ్చెను. ఇరుకుత్రోవలో నిరువురరథములును ఎదుర్కొనెను. తప్పుకొనుటకు ప్రక్కల తగినంత తావు లేదు. మల్లికరాజుసారథి వారాణసిరాజుసారథితో "ఓయీ, నీరథము తొలగింపు" మనెను.

"ఈరథములో వారాణసీప్రభువు బ్రహ్మదత్తకుమారు డుపవిష్టుడైయున్నాడు. నీరథమునే మరల్పుము."

"ఓయిసారథీ, ఈరథములో కోసలరాజ్యప్రభువు మల్లికమహారాజు కూరుచున్నారు. నీరథమును మరలించి, మారాజుగారిరథమున కవకాశ మిమ్ము"

వారాణసీరాజసారథి "ఇతడుకూడ రాజే, కర్తవ్య మేమి?" అని యోచించి, "ఉపాయము తోచినది వయస్సు ప్రశ్నించి, చిన్నవానిరథము తొలగించి పెద్దవానిరథమున కవకాశము కల్పింపవచ్చు" నని నిశ్చయించి, ప్రశ్న వేయగా ఇరువురు రాజులవయస్సు సమానమే అని తేలెను. అనంతర మతడు రాజ్యవిస్తీర్ణము, సైన్యము, సంపద, ప్రశస్తి, కులగోత్రములు, మొదలగు విషయములలోగూడ నుభయులు సమాను లని తెలిసికొని, ఇరువురలో ఎక్కువశీలవంతునకు త్రోవ కల్పింప నెంచి అతడు రెండవవానితో "మీ రాజుగారి సదాచార మెట్టిది?" అనెను.

తనరాజు లోపములనుగూడ గుణములనుగా ప్రశంసించుచు, ఇది గుణము ఇది గుణ మని తెలుపుచు ఈగాథ పలికెను :

కఠినులగువారితోడను కఠినముగను
మార్దవముకల్గువారితో మార్దవమున
వ్యవహరించును మల్లికప్రభువరుండు.
సాధుజనుల జయించును సాధురీతి
సాధువులుం కానివారి నసాధురీతి.
సారథీ, ఈప్రభుం డిట్టి సరణివాడు
మార్గమును వీడవలయును మల్లికునకు.

అంతట వారాణసీరాజసారథి రెండవవానితో "మీ ప్రభు గుణము లివియా?" అనెను. "అవును." "ఇవియే గుణము లగునో అవగుణము లెటు లుండును?" "సరే, ఇవి అవగుణములే కానిమ్ము. ఇక మీ రాజుగారిగుణము లెట్టివి?"

"మంచిది. వినుము" అని వాడు ఈగాథ పలికెను:

శాంతితోడ క్రోధమ్ము, నసాధుజనుల
సాధుసరణి జయించు భూజాని యతడు.
దానమున లోభమును, నసత్యమ్ము నెపుడు
సత్యమే పలికి నిర్జించు సరణివాడు:
ఓయి సారథి, మార్గమ్ము నొసగ వలయు.

వా డిట్లు పలుకగా మల్లికరాజు, అతనిసారథియు రథము దిగి, గుర్రములు విప్పి, రథమును ప్రక్కకు తొలగించి, వారాణసీప్రభువునకు త్రోవ యిచ్చిరి. మల్లికరాజునకు వారాణసీప్రభువు ఇది ఇది చేయ వలయు నని ఉపదేశ మిచ్చి, వారాణసికి జని, దానాదిపుణ్యకార్యములు చేయుచు, జీవితాంతమున స్వర్గమునకు జనెను.

బోధిసత్త్వుని యుపదేశానుసారముగా మల్లికరాజు తనలోపములను జూపువారి నన్వేషింపక, నిజనగరమునకు బోయి, దానాదిపుణ్యకార్యములు చేయుచు, తుదకు స్వర్గమును జేరెను.

శాస్త కోసల నరేశున కుపదేశ మిచ్చుటకై ఈ ధర్మోపదేశము చేసి జాతకములను పరిపోల్చెను.

ఆ కాలమున మల్లిక మహారాజసారథి మొగ్గల్లానుడు. రాజు ఆనందుడు వారాణసీ నరేశునిసారథి సారిపుత్రుడు. రాజు నేనే.

# 152 సిగాల జాతకము

శాస్త కూటాగారశాలలో నివసించు నప్పుడు వైశాలీ నగరములోని ఒకానొక మంగలి కుమారునివిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

వాని తండ్రి రాజులకు రాణులకు రాజకుమారులకు రాజకుమారికలకు కేశప్రసాధనము చేయుచు, అష్టపదము పరుచుచు, అన్ని పనులు చేయుచుండెను. వాడు శ్రద్ధావంతుడు; బుద్ధుని ధర్మమును, సంఘమును శరణుజొచ్చినవాడు. అతడు పంచశీలములను రక్షించుచు, నడుమ నడుమ శాస్త చేయు ధర్మోపదేశములను వినుచు కాలము గడుపుచుండెడివాడు.

ఒకనాడు రాజసేవార్థమై పోవు నాతడు నిజపుత్రుని వెంట గొనిపోయెను. అచ్చరవలె అలంకృతురాలైన లిచ్ఛవికుమారిని అచట చూచి, నాపితునికుమారుడు ఆమెయెడ ఆసక్తచిత్తుడై రాజభవనము నుండి తండ్రివెంట ఇంటికి మరలివచ్చినపిమ్మట "ఈ కుమారి లభించి నచో జీవింతును; కానిచో ఇక్కడనే మరణింతును'' అని అన్నపానములు విసర్జించి మంచము పట్టెను.

తండ్రిమాటలు వాడు వినలేదు. తల్లి, సోదరులు, పినతల్లి, పినతండ్రి, మొదలగు జ్ఞాతులు అందరును, మిత్రులు మొదలగువారు వానికి బోధ చేయుటకై ప్రయత్నించి విఫలులైరి. వాడు అచ్చటనే శుష్కించి శుష్కించి మరణించెను.

వానితండ్రి ఉత్తరక్రియలు చేసి శోక మువశమించినపిమ్మట శాస్తకు వందనము చేయుకోరికతో గంధమాల్యానులేపము లనేకములు కొని మహావనము చేరి శాస్తను పూజించి ప్రణామము చేసి ఒకప్రక్కన కూరుచుండెను.

"ఉపాసకా, ఇన్ని రోజులు ఏల కనబడ వైతివి?'' అని శాస్త ప్రశ్నింపగా వాడు వృత్తాంతము వివరించెను.

"ఉపాసకా, తగని కోరికతో నీ కుమారుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ వినాశము చెందినాడు" అని శాస్త పలికి ఉపాసకుని ప్రార్థనపై పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున సింహగర్భమున బుట్టెను. అతనికి ఆరుగురు తమ్ములు, ఒక చెల్లెలు కలిగిరి. అందరును కాంచన గుహలో నివసించుచుండిరి. ఆగుహ కనతిదూరమున రజతపర్వతమున స్ఫటికగుహ కలదు. అం దొక సృగాలము వసించుచుండెను. కాల క్రమమున సింహము తలిదండ్రులు మరణించిరి. బోధిసత్త్వుడు సింహపోతకములను చెల్లెలిని గుహలో విడిచి ఆహారార్థము బయలు వెడలి, మాంసము తెచ్చి దానికి పెట్టుచుండెను. నక్క సింహిని చూచి ప్రతిబద్ధచిత్త మయ్యెను. తలిదండ్రులు బ్రతికియున్నప్పుడు సింహిని చూచుటకు నక్క కవకాశము లేదాయెను. ఇప్పుడు సోదరు లేడుగురు నాహారార్థము బయటికి పోయినప్పుడు నక్క స్ఫటికగుహనుండి దిగి, కాంచన గుహాద్వారమునకు జని సింహితో లోకసామాన్యరీతిగా గుప్తవిషయము లిట్లు చెప్పుచుండెను "నాకు చతుష్పాదములు, నీకును చతుష్పాదములు. సింహపోతికా, నీవు నాకు పత్నివి కమ్ము, నీకు నేను భర్త నగుదును మనము ప్రసన్నచిత్తములతో సుఖముగానుందము. నేటినుండి నీవు నాప్రియురాలవు కమ్ము"

సింహి యామాటలు విని యిట్లు తలపోసెను. "ఈనక్క చతుష్పాజ్జంతువులలో చండాలునివలె నీచ మయినది. ఉత్తమరాజ కులసమ్మత నగు నాతో వీడు అసభ్యవచనములు అనుచితవాక్కులు పలికినాడు. ఇట్టిమాటలు విని నే నెట్లు జీవింతును? ఊపిరి బిగబట్టి ప్రాణములు విడుతును." అంతలోనే ఆమె కిట్లు స్ఫురించెను. "ఇట్లు నేను మరణించుట అయుక్తము. నాసోదరులు వచ్చుచున్నారు. వారితో జెప్పి మరణింతును."

ఆమె ప్రతివచన మీయనందున నక్క "ఇప్పు డీమె నాసంబంధ మంగీకరింపదు" అని వికలచిత్తముతో స్ఫటికగుహలోనికి బోయి పండుకొనెను.

సింహపోతక మొకటి జంతువును వధించి, తిని, చెల్లెలికి మాంస భాగము తెచ్చి "అమ్మా, మాంసము తిను" మనియెను. "అన్నా,

నేను మాంసము తినను- మరణింతును” అని యామె పలికెను.
“కారణ మేమి?” ఆమె జరిగినసంగతి చెప్పినది.

“ఇప్పు డానక్క యెక్కడ నున్నది?”

స్ఫటికగుహాలో పడియున్న నక్క ఆకాశమున నున్నట్లామె భావించి, “అన్నా, కనబడుట లేదా? ఈ రజతపర్వతముపై ఆకాశమున నున్నది” అని పలికెను.

సింహకిశోరము గ్రహింపనేరక, నక్క ఆకాశమున నున్నట్లు తలపోసి, దీనిని సంహరించెద నని సింహవేగమున నెగిరి స్ఫటికగుహా మీాద రొమ్ముతగులుటచే గుండెలు బ్రద్దలయి యచ్చటనే పడి మరణించెను.

ఆవల రెండవసింహకిశోరము వచ్చెను. చెల్లెలు వెనుకటివలెనే చెప్పెను. రెండవసింహముకూడ మరణము చెంది పర్వతముక్రింద బడెను. ఈప్రకారముగా సోదరు లందరు మృతిచెందిన పిమ్మట బోధిసత్త్వుడు వచ్చెను. చెల్లెలు వెనుకటివలెనే చెప్పెను. నక్క ఆకాశమున నున్నట్లు ఆమె చెప్పిన పిమ్మట బోధిసత్త్వుడు “నక్క ఆకసమున నుండ నేరదు, స్ఫటికగుహాలో నుండవచ్చును” అని భావించి పర్వతపాదము దిగి, సోదరుల కళేబరములు చూచి, తమమూర్ఖత వలన నయ్యవి మృతిచెందె నని గ్రహించెను. ఆలోచన లేకుండ త్వరపడి పనిచేయువారి కార్యము లిట్లే యుండు నని తెలిసికొని ప్రథమ గాథ పలికెను :

చేయకుండ విచారణ శీఘ్రగతిని
పనులు చేసిన నవియె తాపమ్ము గూర్చు
ఆస్యమున వేసికొన్న యుష్ణాన్న మట్లు.

సింహ మీాగాథ పలికి “నాసోదరు లుపాయకుశలురు కారు. జంబుకమును నేను వధింతును” అని ఒక్కొక్కరు మహావేగమున నెగిరి తామే మరణించినారు నేనట్లు చేయక స్ఫటికగుహాలో నున్న జంబుకముగుండెలు బ్రద్దలుచేసెదను” అని నక్క పర్వత మెక్కి దిగు మార్గము గమనించి, గుహ కెదురుగా నిలిచి మూడుమారులు సింహనాదము చేసెను. మిన్నుమన్ను ఏకమై ధ్వనించెను. స్ఫటికగుహాలో

నున్న నక్క గుండెలు భయముచే బ్రద్దలయ్యెను. అచ్చటనే సృగాలము ప్రాణములు విడిచెను.

శాస్త బుద్ధత్వము గాంచిన పిదప ఈగాథ పలికెను:

గవి ప్రతిధ్వను లీనెను గర్జసేయ
సింహ, మాప్రాంతమున నివసించు నక్క
వినుచు భయ మొందె, గుండియల్ ప్రీలిపోయె.

ఈప్రకారముగా సింహము జంబుకమును హతమార్చి సోదరుల నొకచో జేర్చి, వారు చనిపోయినట్లు చెల్లెలికి జెప్పి ఆమె నోదార్చి యావజ్జీవము కాంచనగుహలో నివసించి, యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటించి, జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశన మైనంతనే ఉపాసకుడు శ్రోతాపత్తిఫలము పొందెను.

ఆకాలమున నక్క మంగలికుమారుడు సింహపుత్రిక లిచ్ఛవికుమారి. ఆరుగురు సోదరులు ఆరుగురు స్థవిరులు. జ్యేష్ఠభ్రాత అగు సింహము నేనే.

## 153 సూకర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, ఒకానొక వృద్ధస్థవిరుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఒక రాత్రి శాస్త ధర్మోపదేశము చేసి గంధకుటిద్వారముకడ మణిమయసోపానములపై నిలుచుండి, భిక్షుసంఘమునకు ఉపదేశ మిచ్చి, గంధకుటిలోనికి పోయినంతనే ధర్మసేనాపతి సారిపుత్రుడు శాస్తకు ప్రణామము చేసి తన పరిధిలోనికి పోయెను. మహామొగ్గలానుడుకూడ తన ఆవరణలోనికి పోయి అచట కొలదిసేపు విశ్రాంతి తీసికొని స్థవిరునికడకు చేరి, ప్రశ్నలు వేయజొచ్చెను. అడిగిన ప్రశ్నము

లన్నింటికిని ధర్మసేనాపతి ఆకాశమున చంద్రుడు ఉదయింపగానే ప్రత్యుత్తరము లిచ్చుచుండెను. చతుర్విధపారిషదులు ధర్మము లాకర్ణించుచుండిరి.

ఒకానొక వృద్ధస్థవిరుడు ఇట్లూహించెను. "ఈసభలో నేను సారిపుత్రుని ఏదో ప్రశ్న మడిగి తలక్రిందులు చేయుదునేని నేనుకూడ బహుశ్రుతుడ నని ఈసభవారు గ్రహించి నన్ను సత్కరింతురు." ఆతడు లేచి సారిపుత్రుని సమీపమునకు జని ఒక ప్రక్కన నిలుచుండి "ఆయుష్మన్, సారిపుత్ర, మేముకూడ ప్రశ్న మడుగ కోరుచున్నాము. అడుగుటకై మాకు అనుజ్ఞ నిండు. మెలిబెట్టుటలో, చిక్కువిడదీయుటలో, నిగ్రహించుటలో, ప్రగ్రహించుటలో, విశేషములో, నిర్విశేషములో మా నిశ్చయము చెప్పెదము."

స్థవిరుడు ఆతనిదిక్కు చూచి, "ఈ వృద్ధు కోరికకు లోబడి తుచ్ఛుడైనాడు. ఇతని కేమియు తెలియదు" అనుకొని ముదుసలితో నేమియు పలుకక సిగ్గుపరచి వీవన ఆవల నుంచి పీఠమునుండి లేచి తన యావరణములోనికి వెడలిపోయెను. మొగ్గలానస్థవిరుడుకూడ అట్లే చేసెను.

"ఈ వృద్ధుని పట్టుకొనుడు. ఇతడు మధురధర్మోపదేశము మన లను విననీయ లేదు" అని జనులు అతనిని వెంట నంటిరి. ముదుసలి పరుగిడుచు విహారమునకు మొగదల నున్న అశుద్ధచ్ఛిద్రములో పడి పోయెను. మలము శరీరము నలముకొనెను. జను లతనిని చూచి అసహ్యించుకొని శాస్తసన్నిధికి బోయిరి. వారిని చూచి, "ఉపాసకులారా, అసమయమున వచ్చితి రేల?" అని శాస్త అడిగెను. వారు జరిగినవృత్తాంతము తెలిపిరి.

"ఉపాసకులారా, కేవల మిప్పుడే కాదు. ఆ వృద్ధు పొంగిపోయి నిజబలమును గ్రహింపక మహాబలవంతులతో జగడము పెట్టుకొని మలములో పూర్వముకూడ పడినాడు" అని శాస్త వారిప్రార్థనపై పూర్వజన్మవృత్తాంతము చెప్పినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా

బోధిసత్త్వుడు సింహ మయి, హిమవత్ప్రదేశమున పర్వతగుహలో నివసించుచుండెను. దాని కనతిదూరములో సరస్సుచుట్టుపట్ల సూకరము లనేకము నివసించుచుండెను. ఆతటాకప్రాంతములలో తాపసు లనేకులు పర్ణశాలలలో నివసించుచుండిరి.

ఒకనాడు సింహము మహిషవారణాదులలో నొకదానిని సంహరించి వలసిన మాంసము తిని, ఆసరస్సులోనికి దిగి, నీరు త్రాగి, పైకి వచ్చెను. ఆక్షణములో స్థూలసూకరము ఆతటాకప్రాంతములలో ఆహారార్థము తిరుగుచుండెను. దానిని సింహము చూచి "వేరొకనాడు దీనిని భక్షింతును; ఇప్పు డిది నన్ను జూచినపక్షమున మరల రాదేమో" అని తలచి తటాకమునుండి మరియొకప్రక్కగా బోవ సాగెను. సూకరము చూచి "సింహము నన్ను గాంచి సమీపింప జాలక భయమున పారిపోవుచున్నది. నేడు నేను ఈసింహముతో తల పడుట కర్తవ్యము" అని తల యెత్తి దానితో యుద్ధమునకై కేక వేసి, తొలిగాథ పలికెను.

నే చతుష్పాత్తు నో సఖా, నీకుగూడ
కలవు నాలుగుపాదాలు; కాన రమ్ము
పారిపోవకు సింహమా, భయముచేత!

సింహము దానిపలుకులు విని "మిత్రమా, సూకరా, నేడు నీతో మాకు యుద్ధము లేదు. నేటినుండి యేడవనాడు ఈప్రదేశముననే యుద్ధము" అని వెడలిపోయెను. "సింహముతో పోరాడుదును" అని సంతుష్టి చెంది సూకరము జ్ఞాతులతో జరిగినవిషయము చెప్పెను. దానికథనము విని సూకరములు భయభ్రాంతములై "నీవు మమ్మంద లందరను ఇక నాశము చేయగలవు. నిజబలము నెరుగక సింహముతో పోరాడగోరుచున్నావు. సింహము వచ్చి మనయందరప్రాణములు తీయును. సాహసము చేయకుము" అని చెప్పినవి. సూకరము భయపడి "ఇప్పు డేమి చేయుదును?" అనెను. సూకరము లిట్లు చెప్పినవి: "ఈతాపసులు మలమూత్రములు విసర్జించు తావునకు జని, ఏడురోజు లందులో పొరలి, ఒడ లెండబెట్టుకొని, తుదినాడు తడుపుకొని సింహము వచ్చుత్రోవలో గాలికి వాలుగా పైన నిలుచుండుము. సింహము శుచిజాతిలోని దగుటచే నీయొడలివాసన కొట్టినంతనే నీ వే

జయించితి వని వెడలిపోవును."

ఆప్రకారమే చేసి సూకర మేడవనా డక్కడ నిలిచి యుండెను. దాని యొడలివాసన కొట్టగనే సింహము గ్రహించి, "మిత్రమా, సూకరా, నీవు చక్కని యుపాయ మాలోచించినావు. నీవు పూతిగంధలిప్తుడవు కాకున్నచో ఇచ్చటనే నిన్ను సంహరించియుందును. నిన్ను నోటితో కరవలేను, పాదముతో నైన ప్రహరింపలేను. జయము నీదే" అని రెండవగాథ పలికెను :

ఉండుదానవు పంకమం దోసి సూక
రమ్మ, వీతెంచు నీశరీరమ్మునుండి
దుష్టవాసన ! నీవు నాతోన పోర
నెంచుచో నీదె జయ మని యెంచికొమ్ము.

సింహము మరలిపోయి, ఆహారము భుజించి, సరస్సులో నీరు త్రాగి, పర్వతగుహాలోనికి బోయెను. సింహము పరాజిత మయిన దని సూకరము జ్ఞాతులకు దెలిపెను. అవి భయభ్రాంతములై "వేరొక నాడు సింహమువచ్చి మనయందరప్రాణములు తీయును" అని యచ్చటి నుండి పరుగిడి, స్థలాంతరము జేరకొనెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను అ కాలమున సూకరము ఈ వృద్ధస్థవిరుడు. సింహము నేనే.

## 154 ఉరగ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునప్పుడు (శిల్పి) శ్రేణుల సంఘకలహమునుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కోసలరాజునకు ఇరువురు సేవకులు కలరు; వారు శ్రేణులలో ప్రధానులు. ఆ మహామాత్యులు కనబడినంతనే కలహించుచుండిరి.

వారి వైరవార్త నగరమునం దంతటను వ్యాపించెను. రాజు గాని వారిజ్ఞాతులు కాని, మిత్రులు కాని కలహమును తొలగింప జాలరైరి.

ఒకనాడు ప్రాతఃకాలమున శాస్త వారినిగూర్చి యోజించుచు వారు జ్ఞానులు అగుటకును, ఉభయులు శ్రోతాపన్నులగుటకును అవకాశ మున్నదని గ్రహించెను. ఒకనాడు శ్రావస్తిలో భిక్షాటనము చేయుచు శాస్త వారిలో ఒకని ఇంటిద్వారముకడ నిలిచెను.

అతడు వెలుపలికివచ్చి పాత్రకైకొని శాస్తను లోనికి గొనిపోయి ఆసనము పరచి కూరుచుండబెట్టెను. శాస్త ఉపవేశించినంతనే ఆయున మైత్రీభావనామహిమ స్మరించి వాని చిత్తము కొంత కోమలమగుట చూచి ఆర్యసత్యములను ప్రకాశింపజేసెను పిమ్మట ఆతడు శ్రోతాపత్తిఫలము పొందెను.

అతడు శ్రోతాపన్నుడయినంతనే శాస్త పాత్ర వానిచేతనే ఉండనిచ్చి వానిని వెంట బెట్టుకొని రెండవవాని గృహమునకు బోయెను. ఆతడు వెలుపలికి వచ్చి శాస్తకు ప్రణామము చేసి "భన్తే, లోనికి దయచేయుడు" అని గృహములోనికి గొనిపోయి కూర్చుండబెట్టెను. రెండవపాత్రతో శాస్తతో గూడ ఆతడు లోనికిబోయెను. మైత్రీభావన వలన కలుగు పదునొకండు లాభములను శాస్త అతనికి బోధించెను. అతనిచిత్తము కోమలమైనంతనే ఆర్యసత్యములను ప్రకాశింపజేసి అతనికి శ్రోతాపత్తిఫలము సమకూర్చెను.

వారిరువురు శ్రోతాపన్నులై తమ తమ దోషములను స్వీకరించి క్షమాభిక్ష మడిగి, ఒకరు ఇంకొకరితో కలిసి సంతోషపూర్వకముగా నుండి ఏకాభిప్రాయులైరి. ఆనాడే భగవానునిసమక్షమున కూరుచుండి ఉభయులు భోజనము చేసిరి.

శాస్త భోజనానంతరము విహారమునకు జనెను. వారుకూడ గంధమాల్యానులేపనములు విశేషముగా కొని ఘృతము శర్కర, మధువు మొదలగు వస్తువులతో శాస్తవెంటనే బయలువెడలిరి. భిక్షుసంఘము శాస్తయెడల ఆదరము ప్రదర్శించిరి. బుద్ధుడు ఉపదేశము చేసి గంధకుటిలో ప్రవేశించెను.

భిక్షువులు సాయంకాలము ధర్మసభలో సంభాషించుచుండిరి. "ఆయుష్మంతులారా, శాస్త వినయము లేనివారిని వినయవంతులను

చేయును. ఆ ఇరువురు అమాత్యులను చిరకాలము ప్రయత్నము చేసియు రాజుగాని జ్ఞాతులుకాని మిత్రులుగాని కలుపలేకపోయిరి. తథాగతుడు ఒక్క రోజుననే వారిని వినయవంతులను చేసెను" అనుచుండిరి. శాస్త్ర అరుగుదెంచి "భిక్షువులారా, కూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అని యడిగెను. ఫలానివిషయము అని వారు చెప్పినపిమ్మట తథాగతుడు: "భిక్షువులారా, నేను ఈ ఇరువురను కలుపుట ఇప్పుడే కాదు; పూర్వముకూడ ఇట్లే చేసితిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా వారాణసిలో ఉత్సవము చాటించిరి. మహాజనము సమకూడెను. పలువురు మానవులు, దేవ, నాగ, సుపర్ణాదులు ఉత్సవము చూచుటకై గుమిగూడిరి. అందు నాగుడు, గరుడుడు వేడుక చూచుచు ఒకచో నిలిచియుండిరి. నాగుడు గరుడుని సంగతి యెరుగక బుజముపై చేయి వేసెను. "ఎవరు నా భుజముపై చేయివేసినారు" అని గరుడుడు మరలి చూచి, నాగుని గురుతించెను. నాగుడును గరుడుని గ్రహించి మరణభయతర్జితుడై నగరము వెలువడి నదీమార్గమున పరుగెత్తెను. వానిని బట్టుకొనుటకై గరుడుడుకూడ ననుసరించెను. ఆకాలమున బోధిసత్త్వుడు తాపసి యయి, నదీతీరమున పర్ణశాలలో నివసించుచు పగటిబడలికను నివారించుటకై నీటివద్దకు బోయి వల్కలము నావల నుంచి, నదిలో దిగి స్నానము చేయుచుండెను.

"ఈ తపస్వివలన ప్రాణములు దక్కించుకొందు" నని తలచి నాగుడు నిజరూపమును విడిచి, మణిఖండరూపమును దాల్చి వల్కలములో ప్రవేశించెను. అనుసరించు చున్న గరుడుడు అది యంతయు చూచి, గౌరవముచే వల్కలమును ముట్టుకొనక, బోధిసత్త్వుని సంబోధించి "భదంతా, ఆకలిగానున్నది. మీరు వల్కలము స్వీకరింపుడు. నేను నాగుని భక్షింతును" అను విషయమును ప్రకటీకరించు ని ప్రథమగాథ పలికెను.

రక్షించుకొన నాగరాజు ప్రాణములం
మణికాంతితో నిందు మణగియున్నాడు
ఆకలి గొన్న నే, నతని భక్షింప,
బ్రాహ్మణజాతిపై భక్తివశాన.

బోధిసత్త్వుడు నీటిలోనే నిలిచియుండి, గరుడరాజును స్తుతించి, ద్వితీయగాధ పలికెను .

బ్రహ్మగుప్తుండ వై బహుకాల మీవు
ంపు! మిక నీకు చిక్కెనుగాక
దవ్యభోజనము! భూదేవవర్ణంబు
పైగౌరవంబుచే భక్షింప వైతి
వాకలి గొనియున్న, నా నాగరాజు

బోధిసత్త్వుడిట్లు నీటినుండియే అనుమోదనము చేసి ఈవలకు వచ్చి, వల్కలము ధరించి, ఉభయులను దీసికొని ఆశ్రమపదమునకు జని, మైత్రీభావమును ప్రశంసించి, ఇరువురను కలిపెను. నాటినుండి వా రిరువురును ప్రసన్న భావముతో సుఖముగా నివసించుచుండిరి.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆసమయమున నాగగరుడులు ఈ మహామాత్యులు. తపస్వి నేనే

## 155 గగ్గ జాతకము

శాస్త జేతవన సమీపమున ప్రసేనజిత్తు తయారుచేయించిన రాజకారామమున నివసించుచు తన తుమ్మును గూర్చి (అపశకునము) చెప్పినది

### వర్తమాన కథ

ఒకనాడు శాస్త రాజకారామమున నివసించుచు చతుర్విధపారిషదుల నడుమ కూరుచుండి ధర్మోపదేశము చేయుచుండగా తుమ్ము వచ్చెను. భిక్షువులు బిగ్గరగా గట్టిగా "భన్తే, భగవన్, చిరంజీవయ, సుగతులు చిరం జీవంతు" అనిరి. వారి కేకవలన ధర్మోపదేశమునకు విఘ్నము వాటిల్లగా భగవాన్, "భిక్షువులారా, ఎవరైనను తుమ్మినప్పుడు చిరంజీవ అని పలికినపుడు వాని జీవితమరణములమీాద దాని

ష భావ ముండునా!" అని యడిగెను.

"భన్తే, ఉండదు."

"భిక్షువులారా, తుమ్మిన పిమ్మట చిరంజీవ అనకుండుట ముఖ్యము. అట్లన్నవారికి దోషము పట్టును.

ఆరోజులలో భిక్షువులు తుమ్మినప్పుడు లోకులు చిరంజీవ అను చుండిరి. భిక్షువులకు నచ్చకపోయినను మౌనము వహించుచుండెడి వారు. "ఏమి ఈశ్రమణుడు శాక్యపుత్రుడై భన్తే చిరంజీవ అని మన మన్నను ఏమియు మాటాడడు" అని లోకులు కుపితు లగుచుండిరి. ఈవిషయము విన్నవించినపుడు భగవాన్ "భిక్షువులారా, గృహస్థులు మంగళామంగళములను పాటింతురు. భిక్షువులారా, గృహస్థులు భన్తే చిరంజీవ అన్నప్పుడు చిరంజీవ అని మీరనుటకు అనుజ్ఞ ఇచ్చు చున్నాను" అనెను.

భిక్షువులు భగవానునితో "భన్తే, చిరంజీవ అను విధానము ఎప్పటినుండి ఆరంభమైనది!" అనిరి. శాస్త వారితో "భిక్షువులారా, ఈ ప్రథ పూర్వకాలముననే ఆరంభమైనది" అని అతీతకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో నొకానొక బ్రాహ్మణకుటుంబమున బుట్టెను. అతనితండ్రి వ్యాపారముచే జీవనము చేయుచుండెను. కుమారునకు పదునారేండ్లవయసున తండ్రి మాణిక్యభాండాదికము నెత్తి కెత్తినారు. ఉభయులు గ్రామములు, పట్టణములు తిరిగి తుదకు వారాణసికి జేరి, ద్వారపాలకునియింట వంటచేసికొని భుజించి, తలదాచుకొనుతావు కానక అకాలాగంతుకు లెచ్చట నుండవచ్చు నని వాని నడిగిరి. "నగరము వెలుపల శాల యున్నది. అయ్యది భూతప్రేత పిశాచాదిగ్రస్తము. ఇచ్చ యున్నచో నచ్చట నుండవచ్చు" నని అచ్చటివారు చెప్పిరి. బోధిసత్త్వుడు "నాయనా, రా పోదము. యక్ష భయము లేదు. పిశాచములను లొంగదీసి నీ పాదములపై బడవేసె దను" అని తండ్రిని వెంటబెట్టుకొని యాచోటి కరిగెను. ఆతనితండ్రి

బల్లపై బండుకొనెను. కుమారుడు తండ్రిపాదములు నిమురుచు కూరుచుండెను.

వైశ్రవణునకు పండ్రెండు వర్షములు సేవచేసి, ప్రతిఫలముగా శాలపై నధికారము పొందిన యక్షుడు "ఈశాలలో ప్రవేశించిన వారిలో నెవ్వడైన తుమ్మినపుడు వేరొకడు చిరంజీవ అన్నను, మొదటివాడు ప్రతివచనముగా చిరంజీవ అన్నను వారినిమాత్రము విడిచి, తక్కినవారిని భక్షింపవచ్చును" అని వరముపొందెను. యక్షుడు ద్వారబంధముపై నివసించుచుండెను. బోధిసత్త్వునితండ్రి తుమ్ము నట్లు చేసెదనని యక్షుడు నిజప్రభావమున నొక్కనిపొడి చల్లెను. చూర్ణము బ్రాహ్మణుని నాసాపుటములలో ప్రవేశించెను. బ్రాహ్మణుడు పండుకొనియే తుమ్మెను. బోధిసత్త్వుడు చిరంజీవ అని పలుకలేదు. యక్షుడతనిని భక్షించుటకై క్రిందికి దిగుచుండెను. వాడు దిగుట చూచి బోధిసత్త్వుడు వానివలననె తనతండ్రి తుమ్మెనని యూహించి ,తుమ్మినపుడు ఈవలివారు చిరంజీవ అని పలుకకున్నచో భక్షించెడి యక్షుడు వాడే కావచ్చునని తలచి తండ్రి నుద్దేశించి ఈగాథ పలికెను.

నీవు నూరేడులు జీవింపు గర్గ !
శతముపై నిరువది సమములుకూడ !
కబళింపకుండును గాక పిశాచి !
నీవు నూరేడులు జీవింపు గర్గ !

యక్షుడు బోధిసత్త్వుని వాక్కులు విని, "ఈమాణవకుడు జీవ యనుటచె నితనిని భక్షింపజాలను. ఇతనితండ్రిని భక్షింతును" అని అతనిని సమీపించుచుండెను. వచ్చుచున్న యక్షుని గాంచి యతడు తనలో "ప్రతిజీవ అననివానిని భక్షించు యక్షు డీతడే యగును" అనుకొని, పుత్రు నుద్దేశించి యీగాథ పలికెను

నీవును నూరేండ్లు జీవింపుమోయి,
శతముపై నిరువది సమములుకూడ!
విసము పిశాచములో మెసవును గాక!
నీవు నూరేడులు జీవింపుమోయి!

యక్షు డావాక్కులు విని "ఉభయులను భక్షింపజాలను" అని మరలెను అప్పుడు బోధిసత్త్వుడు "ఓ యక్షా, ఈ శాలలో ప్రవేశించినవారి నేల భక్షింతువు?" అని యడిగెను.

"ద్వాదశవర్షములు వైశ్రవణుని సేవించి, ఈ వరము పొందినాను."
"అట్లయిన అందర నేల భక్షింపవు?"
"తమ్మినపుడు జీవ ప్రతిజీవ శబ్దములు పలికినవారిని భక్షింపను."
"యక్షా. నీవు పూర్వము దుష్కర్మలు చేసి, కఠినపరహింసాత్మక జన్మ మెత్తినావు. ఇప్పుడుకూడ అట్టి కర్మలు చేయుచు అంధపరంపరలో బడిపోవుచున్నావు. కావున నేటినుండి ప్రాణిహింసాదులు మానివేయుము" అని బోధిసత్త్వుడు యక్షునికి బోధించి, నరకభయము చూపి, వానిని లోబరచుకొని, పంచశీలములతో ప్రతిష్ఠించి, చెప్పిన పని చేయువానినిగా జేసెను.

అచ్చట సంచరించు మానవులు మరునాడు యక్షుని గాంచి, బోధిసత్త్వుడు వానిని లోబరచుకొనుట గ్రహించి, రాజుకడకు జని "దేవా, ఒకానొక మాణవకుడు యక్షుని దమించి, సేవకుని జేసికొన్నాడు" అని చెప్పిరి. రాజు బోధిసత్త్వుని బిలిపించి, తన సేనాపతి స్థానమున నిలిపి, అతనితండ్రిని విశేషముగా గౌరవించి, యక్షునికి కరగ్రాహక పదవి యిచ్చి, బోధిసత్త్వునియుపదేశము ననుసరించి దానాదిపుణ్యకార్యములు చేయుచు, తుదకు స్వర్గమునకు జనెను.

ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చి శాస్త "ఆకాలమున రాజు ఆనందుడు. తండ్రి కాశ్యపుడు. కుమారుడు నేనే" అని చెప్పెను

## 156 అలీనచిత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ధైర్యము కోల్పోయిన భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథ పదునొకండవనిపాతమున సంవర జాతకములో (462) వచ్చును.

(3)

శాస్త్ర ఆ భిక్షువుతో "భిక్షూ, నీవు నిజముగా ధైర్యము విడిచి నావా?" అనెను.

"భగవన్, నిజమే."

"భిక్షూ, నీవు పూర్వకాలములో ధైర్యముతో మాంసపిండము వంటి చిన్నికుమారునికి పండ్రెండు యోజనముల వారాణసీ నగర రాజ్యము ఈయలేదా? ఇప్పుడు ఈ ప్రకారముగా శాసనమున ప్రవ్ర జించి ఏల ధైర్యము కోల్పోవుచున్నావు," అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండగా వారాణసి కనతిదూరములో వడ్రంగులగ్రామ ముండెను. అందులో అయిదువందలమంది వడ్రంగులు నివసించుచుండిరి.

వడ్రంగి యొకడు పడవ యెక్కి నదీప్రవాహమున కెదురుగాపోయి, అచ్చటి యడవిలో గృహనిర్మాణమునకు పనికివచ్చు కఱ్ఱలు కోసి అచట ఒకటి రెండు అంతస్థుల నివాసము కట్టి, స్తంభములు మొదలగు దండములమీద గురుతులు పెట్టి, వానిని నదీతీరమునకు గొనిపోయి పడవ కెక్కించి, నీటిజాలున గొనివచ్చును. అక్కడ ఎవ రెట్టియిండ్లు కావలె నన్న నట్టియిండ్లు కట్టియిచ్చును. కార్షాపణములు స్వీకరించి వెనుకటి విధముననే పోయి సామానులు తెచ్చుకొని యిలు సేయు చుండును.

ఒకనాడు వడ్రంగులు డేరా వేసి, కఱ్ఱలు కోయుసమయమున అదూరములో నొక యేనుగుపాదము పాలచెట్టుమోడుపై బడెను. మోడు దిగబడి, పాదము వాచి, చీముపట్టి. చాల బాధ కలిగెను.

వ్యథతోనే యేనుగు కఱ్ఱకోత చప్పుడు విని, ఈవడ్రంగులవలన తనకు మే లగు నని తలచి మూడుకాళ్ళపై నడచుచు పోయి ఆయన కంటబడెను. వడ్రంగి యేనుగుకాలు పరీక్షింపగా అందు దిగబడిన మోడు కనబడెను. వాడిగొడ్డలియంచుతో నతడు మోడుకు నాలుగు ప్రక్కల లోతుగా గీసి, త్రాడు కట్టి, దానిని పైకిలాగి, చీము పిండి వేసి, వేడినీటితో కాలు కడిగెను. అనుకూల మైన వైద్యముచే

గాయము త్వరలోనే నయ మయ్యెను.

ఏను గారోగ్యము పొంది, వ్రడంగివలన తనప్రాణములు దక్కుటచే వ్రడంగులకు సేవచేయ దలచి నాటినుండి ఆయన వెంట జని, కొట్టిన చెట్లు లాగుకొని వచ్చి, వానిని చీల్చునపుడు తిరగవైచుచు ముందుకు ద్రోయుచుండును. గొడ్డలి మొదలగువానిని దెచ్చి యిచ్చును. తొండమున చుట్టి నల్లనిదారముకొనను పట్టుకొని వచ్చును. వర్ధకులు భోజనము చేయునపుడు ఒక్కొక్కరు ఒక్కొక్కముద్ద ఈయగా అయిదు వందల ముద్దలు హస్తికి లభించుచుండును.

ఆ యేనుగునకు కలభము కలదు. అది భద్రజాతికి చెందిన తెల్ల యేనుగుగున్న. తనకు వార్ధకము వచ్చుటచే తనబిడ్డని వ్రడంగుల కప్పజెప్పి తాను కాననములోనికి బోవుట కర్తవ్య మని భావించి పెద్ద యేను గెవరికిని సూచింపక వనములోనికి బోయి తనకొమరుని గొని వచ్చి వర్ధకులతో "ఇతడు నా బిడ్డడు; మీరు నాకు ప్రాణములు పోసినారు. వైద్యమూల్యమునకు బదులుగా మీ కితని నిచ్చు చున్నాను. నేటినుండి యితడు మీసేవ చేయును గాక" అని కుమారునితో "నాయనా, నేను చేయవలసిన కొలది పనులు నీ వికనుండి చేయుచుండవలెను" అని పలికి అడవిలోనికి బోయెను.

అప్పటినుండి హస్తిపోతము వర్ధకులు చెప్పినప్రకారము పనులన్నియు చేయుచుండెను. వారు దాని కయిదువందలముద్దలు పెట్టుచుండిరి ఏనుగుగున్న పనులు పూర్తిచేసి, నదిలో జలక్రీడ లాడి వచ్చుచుండును. వ్రడంగుల బిడ్డలు దానితొండము పట్టుకొని నీటిలోను నేలమీదను క్రీడించుచుందురు. ఏనుగుగాని, అశ్వములుగాని, మానవులుకాని జలములో మలమూత్రములు విడువరు. ఏనుగుగున్న నదియొడ్డుననే మలమూత్రములు విడుచును.

ఒకనాడు వర్షము నదికి పైభాగమున కురిసెను. ఏనుగుగున్న విడిచి సగ మెండిన లద్దె ఆవర్షపునీటిజాలున బడి నదిలోనికి జారి ప్రవాహమున వారాణసి సమీపమున నదిమలుపులో పొదలో చిక్కుకొనెను.

అయిదువందల యేనుగులను రాజహస్తిపాలకులు స్నానార్థము నదికి గొనిపోయిరి. భద్రగజము లద్దెవాసన కొట్టుటచే ఒక్క యేనుగు

కూడ నదిలో దిగుటకు సాహసింప లేదు; పైగా తోకనెత్తి పరుగిడ సాగెను. వారు మావటీంద్రకు వార్త పంపిరి. వారు యోజించి నీటిలో నేదో ప్రమాదమయ్యో నని తలచి అన్వేషించి పొదలో భద్రగజము లద్దె కనుగొని అది కారణ మని గ్రహించి కవ్వము తెప్పించి, లద్దె పాత్రలో వేసి మధించి, ఆకలాపి యేనుగులపై జల్లించెను. శరీరములు పరిమళింపగా గజములు నీటిలో దిగి స్నానము చేసెను.

హస్తిపతు లావృత్తాంతము రాజుకు విన్నవించిరి. "దేవా, ఆ యేనుగును వెదకించి తెప్పింపవలెను" అని చెప్పిరి. రాజు పడవలపై తెప్పలు కట్టించి, నీటి కెగువగా బోవువాని వెంట జని, వడ్రంగుల నివాసము జేరెను. హస్తిపోతము నీటిలో క్రీడించుచు, భేరీశబ్దము విన గానే యేనుగుగున్న లేచి వడ్రంగులకడకు బోయి నిలిచెను. వారు రాజు కెదురుపోయి "దేవా, తమకు దారువులు వలయుచో శ్రమపడి రాకుండ వార్త పంపినచో సరిపోవదా?" అనిరి.

"నేను దారువులకోసము రాలేదు. ఈ యేనుగుకొరకు వచ్చినాను."

"దేవా, తీసికొనిపొండు."

కదలిపోవుట కేనుగుగున్న యిష్టపడలేదు.

"ఏను గేమిపని చేయుచుండును?" అని రాజనెను.

"దేవా, వడ్రంగులకు వేనివలన పోషణ జరుగుచుండునో వానిని గొనివచ్చుచుండును" అని వారు పలికిరి. మంచిదని రాజు ఏనుగుతొండ మునకు, తోకకు, నాలుగుపాదములకు లక్షలక్ష నాణెముల సంచులు కట్టించెను. అప్పటికిని ఏనుగు కదలలేదు. వర్ధకుల కందరకును దుశ్శా లువలు, స్త్రీలకు చీరెలు, ఏనుగుతో క్రీడించుబిడ్డలకు తగిన పోషణ వ్యయము ఏర్పాటు చేసిన పిమ్మట స్త్రీలను బిడ్డలను చూచుచు హస్తి రాజువెంట వెడలిపోయెను.

రాజు దానిని వెంటగొని నగరమును హస్తిశాలను అలంకరింపించి, దానిచే నగరప్రదక్షిణము చేయించి హస్తిశాలలోనికి బంపెను. హస్తి కలంకారములు సమకూర్చి, అభిషేకము కావించి, రాజుకు నిజ యానము చేసిరి. రాజు హస్తి తనకు మిత్రమనియు అర్ధరాజ్య మిచ్చితి ననియు చాటబంచి తనతో నించుమించుగా సమానగౌరవము చూపెను.

హస్తిని గొనివచ్చినప్పటినుండి యావజ్జంబూద్వీపరాజ్యము లతనికి హస్తగతము లయినవి. ఈవిధముగా కాలము గడచుచుండెను.

బోధిసత్త్వు డారాజమహిషికడుపున బడెను. ప్రసవకాలము సమీపించుచుండగా రాజు మృతి నొందెను. రాజుమరణవార్త తెలిపినచో గుండె పగిలి చనిపోవు ననుభయముచే ఏనుగునకు దెలుపక గుప్తముగా నుంచి హస్తిపకులు దానిని సేవించుచుండిరి

వారాణసీప్రభువు మరణించె ననువార్త ప్రక్కనున్న కోసలరాజు విని, నాయకుడు లేకుండుట గ్రహించి, మహాసేనతో నగరమును చుట్టుముట్టెను. నగరవాసులు ద్వారములు మూయించి కోసలరాజు కిట్లు సందేశ మంపిరి. "మా రాజమహిషి గర్భవతి. అంగవిద్యాప్రవీణులు ఏడురోజులలో నామె కుమారుని కను ననిరి. ఆమెకు పుత్రుడు పుట్టినయెడల నేటి కేడవనాడు రాజ్య మీయక మీతో యుద్ధము చేయుదుము. అంతవరకును వేచియుండుడు."

మంచి దని కోసలరాజు వేచియుండెను. రాణి యేడవనాడు కుమారుని గనెను. "మాచిత్తములలోని ఉదాసీనత తొలగించుచు నితడు జన్మించినాడు" అని వారు ఇతనికి అలీనచిత్తు డని పేరిడిరి.

బాలుడు పుట్టిననాడే నగరవాసులు కోసలరాజుతో యుద్ధ మారంభించిరి. సేన పెద్దదయ్యును నాయకుడు లేక యుద్ధములో వెనుకడుగు వేయజొచ్చెను. అమాత్యు లావిషయము రాణికి దెలిపి "ఆర్యా, ఈవిధముగా సేన వెనుకడుగు వేయుచున్నందున మనము గెలువ మని భయము వేయుచున్నది. రాజమిత్ర మైన భద్రగజమునకు రాజ మరణవార్తకాని, పుత్రోత్పత్తివార్త కాని, కోసలరాజుతో యుద్ధము సంగతి కాని మేము తెలుపలేదు. ఇప్పు డిదియంతయు భద్రగజముతో చెప్పుదుమా?" అనిరి.

మంచి దని యామె కుమారున కలంకారము చేసి కోమలవస్త్రము గల పరపుపై పరుండబెట్టి మేడ దిగి, ఆమె అమాత్యులను వెంటగొని హస్తిశాలలోని కరిగి, బోధిసత్త్వుని హస్తిపాదములకడ నుంచి "స్వామీ, మీమిత్రము మరణించినాడు. గుండె పగులు నని మీకావార్త తెలుపలేదు. ఇతడు మీ మిత్రునిపుత్రుడు. కోసలరాజు వచ్చి మననగరము చుట్టుముట్టి ఈశిశువుతో యుద్ధముచేయ గడగి

నాడు. సేన వెనుకడుగు వేయుచున్నది. ఈబిడ్డని నీవు సంహారించినను సరే, రాజ్యము జయించి యిచ్చినను సరే" అని విన్నవించెను.

హస్తి బోధిసత్త్వుని తొండముతో పైకెత్తి తనకుంభస్థలముపై నుంచికొని, దుఃఖించి, క్రిందికి దింపి, తల్లిచేతులలోనుంచి, కోసల నరేంద్రుని బట్టుకొనుటకై హస్తిశాలలోనుండి యావలకు బయలు దేరెను.

అమాత్యులు కవచాదులు వేసి హస్తివెంట బయలువెడలి ద్వారములు తెరచిరి భద్రగజము క్రౌంచనాదము చేసి, సైనికులను భయభ్రాంతులను జేసి పారద్రోలెను. సేనానివహమును భగ్నము చేసి కోసలరాజును జుట్టుపట్టి కొనివచ్చి బోధిసత్త్వునిపాదములకడ బడవైచెను. అతడు చంపుటకై లేచెను. కాని సంబాళించుకొని, "నేటి నుండి జాగరూకతతో నుండుము. ఈబిడ్డడు పసివాడుకదా యని భ్రమపడకుము" అని రాజు కుపదేశ మిచ్చెను.

నాటినుండి యావజ్జంబూద్వీపములోని రాజ్యములు బోధిసత్త్వుని హస్తగతము లయ్యెను ప్రతిఘటించు శత్రువులు లేకుండిరి.

ఏడవయేట బోధిసత్త్వునకు రాజ్యాభిషేకము జరిగెను. అలీనచిత్తుడను పేర న్యాయపరిపాలనము చేయుచు, తుదకు స్వర్గము జేరెను.

శాస్త సమ్యక్సంబుద్ధు డయిన పిమ్మట ఈపూర్వజన్మకథనుగూర్చి, ఈగాథలు పలికెను

ఆయలీనునిమూలాన నధికసైన్య
మయ్యె సుప్రసన్నము; కోసలాధిపతిని
తుష్టిహీనుని ప్రాణాలతోడ బట్టె

అటులె భిక్షువుకూడ యత్నించుచుండ,
తాను నిర్వాణమును పొందుతలపుతోడ,
చేయుచో శుభకర్మలు, క్షీణ మగును
అఖిలబంధాలు సంయోజనాహ్వాయాలు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను ఆకాలమున తల్లి మహామాయ. తండ్రి శుద్ధోధనమహారాజు. రాజ్యమును గ్రహించి ఇచ్చినవాడు ఈ అధీరభిక్షువు. ఏనుగుతండ్రి సారిపుత్రుడు. అలీనచిత్తకుమారుడను నేనే.

# 157 గుణ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆనందస్థవిరునకు వేయి వస్త్రములు లభించిన సందర్భమును గూర్చి చెప్పినది

## వర్తమాన కథ

ఆనందస్థవిరుడు కోసలరాజుని సౌధమున ధర్మోపదేశము చేసిన కథ ఇదివరలో మహాసార జాతకమున (92) వచ్చినది.

స్థవిరుడు రాజప్రాసాదమున ధర్మోపదేశము చేయుచుండగా రాజు కొరకు వేలకొలదిమూల్యములుగల వేయివస్త్రములు వచ్చినవి. వానిలో అయిదువందల వస్త్రములను, ఐదువందల స్త్రీలకు పంపినారు. వారు ఆ వస్త్రముల నన్నిటిని మరునాడు ఆనంద స్థవిరునకు సమర్పించినారు. తాము వెనుకటి చీరలే ధరించి రాజు ఉపాహారము స్వీకరించు ప్రదేశమునకు పోయినారు.

"నేను వేలకొలది విలువ కల వస్త్రములు మీకు పంపినాను. వానిని ధరింపక వచ్చినా రేమి?" అన్నాడు రాజు.

"దేవా, వానిని ఆనందస్థవిరునకు మేము సమర్పించినాము."

"ఆనందస్థవిరుడు అన్నియును గ్రహించినాడా?"

"చిత్తము దేవా!"

కోపము వచ్చి రాజు, "సమ్యక్సంబుద్ధుడు భిక్షువునకు మూడు చీవరముల నుంచికొనుటకు అనుజ్ఞ ఇచ్చినాడు. ఆనందస్థవిరుడు వస్త్రవ్యాపారము చేయునట్లు తోచుచున్నది. ఆయన ఇన్ని వస్త్రములను గ్రహించినాడే" అని ఫలహారము ముగించి విహారమునకు బోయి స్థవిరు డుండు గదిలోనికి జని ప్రణామముచేసి కూరుచుండెను "భన్తే, మా మందిరములోనిస్త్రీలు తమవద్ద ధర్మము విని అభ్యసించుచున్నారా?" అన్నాడు రాజు.

"అవును మహారాజా, గ్రహింపదగినవారు గ్రహించుచున్నారు, వినదగినవారు వినుచున్నారు."

"కేవలము వినుచున్నారా? కాక తమకు వస్త్రాదులు ఇచ్చుచున్నారా?"

"మహారాజా, వేలకొలది విలువగల ఐదువందల వస్త్రము లీనాడు ఇచ్చినారు."

"భన్తే, తాము వానిని గ్రహించినారా?"

"అవును మహారాజా!"

"భన్తే, శాస్త మూడు చీవరములకు మాత్రము అనుజ్ఞ ఇచ్చినారు, కాదా?"

"మహారాజా, అవును. ఒక్కొక్క భిక్షువునకు మూడు చీవరములు మాత్ర ముపయోగమున కనుజ్ఞ ఇచ్చినారు శాస్త. ఎక్కువ వస్త్రములను స్వీకరింపరా దని నిషేధింప లేదు చీవరములు జీర్ణములైన భిక్షువుల కిచ్చుటకై నేను ఐదు వందలు స్వీకరించినాను."

"తమకడ నూతనవస్త్రములు స్వీకరించిన భిక్షువులు పాతవానినేమి చేయుదురు?"

"పాతవస్త్రములను ఉత్తరాసంగములుగా ధరింతురు (ఉత్తరీయములు)."

"ప్రాతవడిన ఉత్తరీయముల నేమి చేయుదురు?"

"అన్తరవాసకములు (ధోవతులు) చేయుదురు."

"ప్రాతవడిన అంతరవాసకముల నేమి చేయుదురు?"

"పడక కుపయోగింతురు."

"ప్రాతవడిన ప్రక్కల నేమి చేయుదురు?"

"నేలపై పరతురు."

"నేలపై తొలుత పరచినవాని నేమి చేయుదురు?"

"పాదములు తుడుచుకొనుట కుపయోగింతురు."

"అవి మిక్కిలి పాతపడిన పిదప నేమి చేయుదురు?"

"మహారాజు శ్రద్ధాపూర్వకముగా నిచ్చిన వస్తువును పారవేయరు కాబట్టి కాళ్ళు తుడుచుకున్న పాతగుడ్డలను చిన్నిగొడ్డలితో నరికి మట్టిలో కలిపి శయనాసనప్రదేశములపై మెత్తుదురు."

"భన్తే, తమకు సమర్పించిన వస్త్రములు కాళ్లు తుడుచుకొని పాతవడిన పిమ్మట పారవేయరా?"

"మహారాజా, మా కిచ్చినవానిని పారవేయము, ఉపయోగింతుము."

రాజు సంతుష్టుడై ప్రసన్నచిత్తముతో ఇంటిలో నుంచిన తక్కిన అయిదువందల వస్త్రములుకూడ తెప్పించి స్థవిరున కొసగెను. స్థవిరుడు దానానుమోదనము చేసెను. రాజు విని ఆయనకు ప్రణామము, ప్రదక్షిణము చేసి వెడలిపోయెను.

చీవరములు ప్రాతవడిన భిక్షుకులకు స్థవిరుడు వెనుకటి అయిదు వందల వస్త్రములు పంచి ఇచ్చెను. ఆయనకు అయిదువందలమంది శిష్యు లుండిరి. వారిలో చిన్న వయసుంగా నున్న భిక్షువులు స్థవిరునకు చాల ఉపచారము చేయుచుండిరి.

ఆవరణము తుడుచును. త్రాగుటకు పనుల కుపయోగించుటకు ఉదకము తెచ్చియుంచును. పలుదోము పుడకలు తెచ్చి ఇచ్చును. ముఖము కడుగుకొనుటకు, స్నానము చేయుటకు జల మిచ్చును. అగ్నిశాల శయనాగారము మొదలగుస్థానములను పరిశుభ్రముగా నుంచును. కాలుసేతులు, వీపు పట్టును. ఇవన్నియు యోచించి స్థవిరుడు ఆయువకునకు తరువాత లభించిన వస్త్రము లిచ్చెను. ఆతడు వానిని గురుసోదరులకు పంచిఇచ్చెను.

వస్త్రములు లభించిన భిక్షువులు వానిని ముక్కముక్కలు చేసి కర్ణికారపుష్పసమాన మగు కాషాయవస్త్రములు ధరించి శాస్తకడకు చని ప్రణామము చేసి ఒకప్రక్క కూరుచుండిరి. ఒక భిక్షువు "భన్తే, శ్రోతాపన్న ఆర్యశ్రావకులు ముఖముచూచి దానముచేయుదురా?" అనెను.

'భిక్షువులారా, ఆర్యశ్రావకులు ముఖముచూసి దానముచేసిరి.'

'భన్తే, మా ఉపాధ్యక్షు ధర్మభాండాగారికస్థవిరుడు వేలకొలది విలువ కల అయిదువందల వస్త్రములు చిన్ని భిక్షువున కిచ్చెను. అతడు వానిని మాకు పంచిపెట్టినాడు."

'భిక్షువులారా, ఆనందుడు మొగము చూసి దాన మిచ్చువాడు కాడు. ఆ చిన్ని భిక్షు వాయనకు ఎంతో సేవచేసినాడు. స్థవిరుడు ఉపకారమునకు ప్రత్యుపకారము చేయవలెనను కోరికతోడను భిక్షువు గుణవంతు డనుభావముతోడను ఉచిత మని ఇచ్చినాడు. పూర్వము పండితులుకూడ ఉపకారము చేసినవారికి ప్రత్యుపకారముచేసిరి.'

భిక్షువులు ప్రార్థించిన పిమ్మట పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సింహముకడుపున బుట్టి పర్వతగుహలో నివసించుచుండెను.

ఒకనాడు సింహము గుహ వెలువడి పర్వతము క్రిందికి జూచెను. కొండకు నాలుగు ప్రక్కల సరస్సు కలదు. దాని కొకవైపున ఉన్నత ప్రదేశమున బురద యెండినచోట పచ్చిక కోమలముగా పెరిగియున్నది. శశములు, హరిణములు మొదలయిన చిన్నజంతువులు దానిపై దిరుగుచు, మేయుచుండెను. ఒకనాడు మృగము తృణములు మేయుచుండగా జూచి సింహము దానిని బట్టుకొనుటకై కొండమీదనుండి దుమికెను. మరణభయముచే నరచుచు మృగము పరుగెత్తెను. సింహము దూకుడు వేగ మాపుకొనలేక బురదలో దిగబడెను. బయటికి రాలేక కాళ్ళు కొయ్యబారిపోవగా సింహము నిరాహారముగా నేడురోజు లట్లే నిలిచియుండెను.

ఆహారార్థము తిరుగుచున్న నక్క సింహమును జూచి పరుగెత్త సాగెను. సింహము గొంతెత్తి "ఓ సృగాలమా. పరుగెత్త వలదు. భయము లేదు. నే నీ బురదలో దిగబడినాను. నా ప్రాణములు రక్షింపుము" అని యరచెను. నక్క సమీపమునకు వచ్చి "నిన్ను పైకి జేర్తును, కాని యీవలకు వచ్చి నన్ను చంపుదువేమో యని భయము వేయుచున్న" దనెను. "భయపడకు. నిన్ను సంహరింపను. నీ కుపకారము చేయుదును. ఏదో యుపాయమున నన్ను వెలువరింపుము" అని పలికిన సింహముచే వాగ్దానము చేయించుకొని నక్క దాని నాలుగుకాళ్ళచుట్టు ఎండినమన్ను తనకాళ్ళతో గీకి, నీటివరకు చిన్నజాలు చేసెను. నీరు వచ్చిపడుటచే మన్ను మెత్తబడెను. నక్క సింహము కడుపుక్రిందికి దూరి పోటేయిచ్చి "స్వామీ, ఎగురవలెను" అని త్రోపు తోసెను. సింహము లంఘించి దిబ్బమీది కెగిరి, అలసట తీర్చుకొని, నీటిలో బురద కడిగి, స్నానము చేసి, మహిషమును వధించి, మాంసము నక్కముం దుంచి, 'మిత్రమా, భుజింపు' మని, నక్క తిన్నపిమ్మట తాను తినెను. సృగాలము మాంసఖండము నోట

కరచుకొనగా సింహము చూచి. 'మిత్రమా, ఇది యెవరికి?' అని యడి గెను. "మీ దాసి యున్నది. దానికొరకు" అని నక్క చెప్పగా సింహము తీసికొను మని, తనభార్యకు మాంసఖండము గ్రహించి, "మిత్రమా, రమ్ము, పర్వతశిఖరముపయికి బోయి, సుఖనివాస్థానమున కేగుదము" అని, యచటికరిగి, నక్క భార్యతో మంచిమాటలాడి, 'నేటినుండి మీసంరక్షణ వహింతు' నని వారిని తన గుహాద్వారమున కావలనున్న వేరొకగుహలో నిలిపెను

ఆడుసింగమును, ఆడునక్కను గుహలో విడచి సింహము నక్కను వెంటగొని ఆహారార్థము పోవుచుండెను. వివిధజంతువులను సంహరించి మాంస మచటనే తిని, ఇంటికిగూడ కొనిపోవుచుండును. ఈవిధముగా కాలము గడచుచుండ సింహికిని సృగాలికిని బిడ్డలు పుట్టెను. అన్నియు నొకచోటనే నివసించుచుండెను.

ఒకనాడు సింహి కిట్లు తోచెను. "సింహమునకు నక్కమీదను ఆడునక్కమీదను, దానిబిడ్డలమీదను మక్కువ యెక్కువ. సృగాలితో సంబంధ ముండవలెను. కావుననే యింత స్నేహము. దీనిని బాధించి భయపెట్టి పారద్రోలెదను."

ఒకనాడు సింహసృగాలములు వేటకు బోయినపుడు ఆడుసింగము ఆడునక్కను బెదరించి భయపెట్టి, "నీ విచట నుండ నేల? ఏల పరుగెత్తిపోవు?" అని, దాని బిడ్డలనుకూడ బెదరించెను.

భర్తతో ఆడునక్క వృత్తాంతము చెప్పి, "సింహము మాట మీదనే సింహి యిట్లు చేయుచున్నదేమో తెలియదు. మన మిచట బహుకాల మున్నాము. సింహి మనప్రాణములు తీయవచ్చును. మన నివాసమునకు బోవుదము" అనెను.

నక్క యామాటలు విని సింహముకడకు జని "స్వామీ, మేము మీసన్నిధిలో బహుకాల మున్నాము. చిరకాలనివాస మప్రియ హేతు వగును. ఆహారార్థము మనము వెడలినపుడు సింహి వానిని బెదరించి, ఏల యిచట నున్నారు? పొం డనును. మీబిడ్డలుకూడ మాబిడ్డలను బెదరింతురు. తమకడ నితరు లున్నపుడు ఇష్టముకానిచో పొమ్మనుట యుక్తము. ఇట్లు భయపెట్టు టేల?" అని యీగాథ పలికెను :

పారద్రోలుదు రోరులను ప్రాభవమ్మ
కలుగువారలు కోరిక కలిగెనేని,
శరణ మగు తావునండి సంజాత మయ్యె
మాకు భయ మని గ్రహియింపుమా, మృగేంద్ర!

సింహము సింహితో "భద్రే, ఒకసారి నేను ఆహారార్థము పోయి ఏడవనాడు ఈసృగాలముతో ఈసృగాలితో మరలివచ్చుట జ్ఞప్తి యున్నదా?" అనెను.

"అవును, జ్ఞాపక మున్నది."

"వారమువరకు నేను రాకుండుటకు కారణము తెలియునా?"

"తెలియదు స్వామీ."

"భద్రే, నేను మృగమును పట్టుకొనబోయి కాలుజారి, బురదలో దిగబడినాను. ఏడురోజులు నిరాహారముగా నుండగా, ఈనక్కవలన ప్రాణములు దక్కినవి. ఈమిత్రము నాప్రాణదాత. మిత్రధర్మము పాటించువారు తన మిత్రము దుర్బలు డని యెంచడు. నేటినుండి నామిత్రుని, అతనిభార్యను బిడ్డలను అవమానింపరాదు" అని సింహము గాథ పలికెను

బలహీను డయ్యును బంధుకార్యమ్ము
నెవ్వడు నెరవేర్చు, హితుడు సఖుండు
జ్ఞాతియు, మిత్రంబు, నాతడే సుమ్మ!
దంతాలు కలదాన, దాని దూరకుము,
నక్క సంరక్షించె నాప్రాణములను.

సింహవాక్కులు విని సింహి సృగాలిని క్షమాపణ వేడి దానితో దానిబిడ్డలతో కలసి మెలసి యుండెను. సింహశాబకములు సృగాల శాబకములతో క్రీడించుచు, తలిదండ్రులు పోయినతరువాతగూడ గాఢ మైత్రితో, ప్రీతితో వర్తించుచుండెను. సప్తపురుషాంతరము లాకుటుంబముల మైత్రి అఖండముగా నుండెనట.

శాస్త్ర ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటింపజేసి జాతకములు సరిపోల్చెను. సత్యములు ప్రకటించినపిదప కొందరు స్రోతాపన్నులు, కొందరు సకృతాగాములు, కొందరు అనాగాములు, కొందరు అర్హంతులు నైరి ఆకాలమున సృగాలము ఆనందుడు, సింహము నేనే.

# 158 సుహను జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఉద్దండస్వభావు లైన ఇరువురు భిక్షువులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆకాలమున జేతవనమున ఉద్దండకఠోరదుస్సాహసికభిక్షు వుండెను. అట్టివాడు మరియొకడు జనపదమునం దుండెను.

ఒకనాడు జనపదములోని భిక్షువు ఏదో పనిమీద జేతవనమునకు బోయెను. శ్రమణుడు చిన్నభిక్షువు ఆతని చెడ్డస్వభావవిషయము ఎరుగుదురు. వారిరువురు ఉద్దండభిక్షువుల జగడము చూడ గోరి ఆ భిక్షువును జేతవనభిక్షునివాసములోనికి పంపిరి.

ఉద్దండభిక్షువులు ఒకరినొకరు చూచినంతనే కలిసిపోయి మిత్రులైరి. ఒకడు రెండవవాని చేతులు వీపు పాదములు పట్టసాగెను.

భిక్షువులు ధర్మసభలో సంభాషించుచు, 'భిక్షువులారా, ఉద్దండ భిక్షువులు అన్యులవిషయములో ఉద్దండులై కఠోరముగా దుస్సాహసికులై ప్రవర్తింతురు; కాని పరస్పరము కలిసి ఏకమై మిత్రు లైనారు.' అని పలికిరి.

శాస్త అరుగుదెంచి, 'భిక్షువులారా, ఈవేళ ఏమి సంభాషించుచున్నారు?' అనెను.

ఫలాని విషయమై.

'భిక్షువులారా, కేవల మిపుడే కాదు. పూర్వముకూడ వీరు ఇట్లే యుండిరి' అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడాయనకు సర్వార్థసాధకు డగు అర్థధర్మానుశాసకామాత్యు డయ్యెను. ఆరాజు కొద్దిగా ధనలోభి. ఆయనకు మహాశోణ మను దుష్టాశ్వము కలదు.

ఒకనాడు ఉత్తరాపథమునుండి అశ్వవణిక్కులు అయిదువందల

గుఱ్ఱములు తెచ్చినట్లు రాజుకు దెలిసెను. అంతకు పూర్వము బోధి సత్త్వుడు అశ్వములకు తగిన వెల కట్టి, మూల్యము తగ్గింపకుండ సరిగా ఇప్పించెడివాడు. రాజున కిది రుచింపక వేరొక యమాత్యుని బిలిచి, "బాబా, అశ్వములకు వెల కట్టుము, కాని ముందుగా మన మహా శోణమును ఆగుఱ్ఱములగుంపులోనికి బంపి, వానిని కరచి, గాయములు చేసి, దౌర్బల్యము కలిగించినప్పుడు ధర తగ్గిపోవును; అంతట వెల కట్టుము" అని చెప్పెను. చిత్త మని యతడు చని అట్లే చేసెను.

అశ్వవర్తకులు అసంతుష్టచిత్తులై వచ్చి బోధిసత్త్వునితో జెప్పు కొనిరి. "మీ నగరములో దుష్టాశ్వము లేదా?" "ఉన్నది స్వామీ!" సుహను నామక మయిన తురంగము పరుషము, ఉగ్రము, దుష్టము నయినది కలదు." 'అట్లయిన, మీరు మరల వచ్చునప్పుడు దానిని గొని రండు.' మంచి దని వారు వెడలిపోయి, సుహనువును దీసికొని వచ్చిరి.

అశ్వవణిక్కులు వచ్చినా రని విని రాజు వాతాయనము తెరచి, గుఱ్ఱములను జూచి, మహాశోణమును వానిసడుమకు తోలించెను. మహాశోణము వచ్చుచుండుట గాంచి, వర్తకులు సుహనువును విడిచి పెట్టిరి. అవి సమీపించి పరస్పరము శరీరములు నాకుచు నిలిచినవి. ప్రక్క నున్న బోధిసత్త్వునితో రాజు 'వయస్యా, ఈ దుష్టాశ్వములు పరస్పరము కరచి గాయములు చేసికొనక, ఒకదాని నొకటి నాకుచు సంతోషముతో నిలిచియున్నవి. ఏ మిది!' అనెను. 'మహారాజా, ఇవి విషమశీలములు కావు, సమశీలములు, సమానధాతుకములు' అని, బోధిసత్త్వ డీగాథలు పలికెను

సుంతయును గోచరింప దీ శోణ సుహను
గుణవిభేదము, వీ రొకకోవవారె.
ఆడుగుఱ్ఱాలమీదికి నరుగుటందు
అదటున లగాములను పీకుటందు నెపుడు
దుష్టకర్మాచరణమందు తుల్యము లివి.

ఇట్లు పలికి, "మహారాజా, రాజు లతిలోభులు కాగూడదు. పరుల సంపద నష్టపరచ రాదు" అని రాజున కుపదేశించి, అశ్వములకు మరల వెల కట్టించి, ఉచితమూల్య మిప్పించెను.

అశ్వవణిక్కులు తగినమూల్యము లభించుటచే సంతోషించిరి. బోధిసత్త్వుని యుపదేశానుసారముగా రాజు ప్రవర్తించి, తుదకు యథాకమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము పరిపోల్చెను. ఆకాలమున రెండుగుర్రములు భిక్షువు లిరువురు. రాజు ఆనందుడు, పండితామాత్యుడు నేనే.

## 159 మోర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్తు డయిన భిక్షువువిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

భిక్షువులు ఆ భిక్షువును శాస్తకడకు గొనిపోయిరి. "భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడ వయితివా?" అని శాస్త ప్రశ్న చేసెను.

'భన్తే, సత్యమే.'

'ఏమి చూచి ఉద్విగ్నత చెందితివి?'

'అలంకృతశరీర యయిన స్త్రీని చూచి.'

'భిక్షూ, స్త్రీ నీవంటివారల చిత్తములనే కల్లోలపరచినదా? పూర్వకాలమున స్త్రీశబ్దమును విని పండితులు ఏడువందలసంవత్సరములపాటు కాముకత్వమునకు దూరముగా నుండి, అవకాశము చిక్కినంతనే క్షణకాలములోనే దుష్కర్మము చేసిరి. పరిశుద్ధప్రాణులుకూడ అపరిశుద్ధులగుదురు. ఉత్తమశ్లోకులుకూడ గౌరవము కోలుపోవుదురు. మలినచిత్తులమాట వేరుగా చెప్పవలెనా?' అని శాస్త పూర్వజన్మవృత్తాంతమిట్లు చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు మయూరము కడుపున బడి, అండముగా నున్నప్పుడే కర్ణికారకలికావర్ణము కలిగి అండము ఛేదించుకొని యీవలకు వచ్చి నప్పుడు సువర్ణవర్ణముతో దర్శనీయుడు చిత్తప్రశాంతిదుడు నయ్యెను; పక్షములనడుమ రక్తకాంతి విరాజితు డాయెను.

జీవనరక్షణోద్దేశముతో బోధిసత్త్వుడు త్రినగములను దాటి, నాల్గవపర్వతపంక్తిలో దండహిరణ్యపర్వతపాదమున నివసింపజొచ్చెను. తెల్లవారగనే బోధిసత్త్వుడు పర్వతశీర్షముపై వ్రాలి, ఉదయించు సూర్యుని దర్శించి, ఆహారార్థము సంచరించు ప్రదేశమున తనను రక్షించుటకై బ్రహ్మమంత్రము నిట్లు పలుకును.

> నిజసువర్ణచ్ఛాయ నిఖిలజగత్తు
> రంజింప జేసెడి రాజముఖ్యుండు,
> ఉదయించుచున్నవా డదిగో! ఆతనికి
> అంజలి ఘటియింతు . ఆతని రక్ష
> గాంచుచు నీ నాడు గడుపుదుగాక!

ఈప్రకారముగా బోధిసత్త్వుడు సూర్యునకు నమస్కరించి, పూర్వము పరినిర్వాణము చెందిన బుద్ధులను, వారిగుణములను ఇట్లు స్మరించు చుండును :

> అఖిలధర్మంబు లెరుగు బ్రాహ్మణుల కేను
> చేయుదు నమస్సు! వారు రక్షింత్రుగాక
> నన్ను! బుద్ధికి, బుద్ధునకు న్నమస్సు!
> మోక్షు చేతులం ముక్తికి ముక్తులకును!

ఇట్లు మయూరము పగలు సంచరించి, సాయంసమయమున పర్వత కూడమున నిలిచి, అస్తమించు సూర్యుని సందర్శించుచు, బుద్ధగుణము లను ధ్యానించుచు, నివాసస్థానరక్షణార్థము బ్రహ్మమంత్రము నిట్లు అనుసంధించి పలుకును :

> నిజసువర్ణచ్ఛాయ నిఖిలజగత్తు
> రజింపజేసెడి రాజముఖ్యుండు
> అస్తంగతుండగు, నదిగో! ఆతనికి

అంజలి ఘటియింతు : ఆతని రక్ష
గాంచుచు నీ రేయి గడుపుదుగాక!

అఖిలధర్మంబు లెరుగు బ్రాహ్మణుల కేను
చేయుదు నమస్సు! వారు రక్షింత్రుగాక
నన్ను! బుద్ధికి, బుద్ధునకు న్నమస్సు!
మోడ్తు చేతులం ముక్తికి, ముక్తులకును!

ఆకాలమున వారాణసికి కొలదిదూరములో నున్న నిషాదగ్రామము నుండి వేటకాడొకడు హిమవత్ప్రదేశమున విచరించుచు, దండక హిరణ్యపర్వతముపై మయూరమును జూచి యింటికి వచ్చి, కుమారునితో జెప్పెను.

వారాణసిరాజుభార్య ఖేమాదేవి. సువర్ణమయూరము కలలో ధర్మోపదేశము చేయగా నామె రాజుతో "దేవా, నేను బంగరు నెమలివలన ధర్మోపదేశము వినగోరుచున్నా" ననెను. రాజమాత్యుల నడుగగా బ్రాహ్మణులకు తెలియునని వారనిరి. బ్రాహ్మణుల నడుగగా "స్వర్ణమయూర మున్నది. కాని నిషాదులకు తెలియు" నని వారనిరి. రాజు నిషాదులను సమావేశ పరచి యడుగగా ఆనిషాదపుత్రుడు "దేవా, దండకహిరణ్యపర్వతముపై స్వర్ణమయూర మున్న" దని విన్నవించెను. "ఆనెమలిని చంపకుండ బంధించి తీసికొని రమ్ము" అని రాజానతిచ్చెను.

వేటకాడు పోయి నెమలి తిరుగు తావున వల పన్నెను. వాడు నెమలికై యేడు సంవత్సరములు తిరుగుచు తుద కాప్రాంతముననే మరణించెను.

ఖేమాదేవికోరిక నెరవేర లేదు. ఆమెకూడ చనిపోయెను. మయూరముమూలమున తనభార్య మరణించె నని రాజుకు కోపము వచ్చెను. అతడు బంగరురేకుపై నిట్లు చెక్కించెను "హిమాలయప్రదేశమున దండకహిరణ్యపర్వతముపై బంగరునెమలి కలదు. దానిమాంసము తినువారు జరామరణములు లేకుందురు."

బంగరురేకును రాజు చందుకాలో పెట్టించినాడు. ఆరాజు మరణించినపిదప నింకొక రాజు వచ్చి, బంగరురేకు చదివి, అజరామరత్వములకై మయూరమును పట్టుకొని రమ్మని వేటకానిని పంపెను. వాడు

పోయి, దానిని పట్టుకొనలేక అచటనే కొంతకాలమునకు ప్రాణములు విడిచెను. ఈ ప్రకారముగా ఆరుగురు రాజులు గతించిరి.

ఏడవరాజు పంపిన వేటకాడు మయూరము సంచరించు ప్రదేశమున వల పన్నుటకు వీలులేదనియు, అది ఆత్మరక్షణ చేసికొనుచున్న దనియు గ్రహించెను. వాడు గ్రామములోనికి బోయి ఆడునెమలిని గొనిచని, దానికి శిక్షణ యిచ్చెను. కరతాళధ్వని కది నాట్యము చేయును. చిటిక వేయగనే అది క్రేంకారము చేయును. ఇట్లు నేర్చిన యాడునెమలిని గొనిపోయి బోధిసత్త్వుడు ఆత్మరక్షణ చేసికొనకముందే ప్రాతఃకాలమున వాడు పాలకర్ర పాతి వలపన్ని, ఆడునెమలిచే క్రేంకారము చేయించెను. మయూర మా యసాధారణశబ్దము విని, కామాసక్తమై పరిత్రాణము మరచి, వలలో బడెను. వేటకాడు దానిని బట్టుకొని పోయి వారాణసీరాజుకు సమర్పించెను.

రాజు దానిసౌందర్యము చూచి ప్రసన్నుడై దానికి పీఠము వేయించెను. బోధిసత్త్వుడు పీఠ మలంకరించి "మహారాజా, న న్నేల పట్టి తెప్పించినారు?" అనెను.

'నీ మాంసము భుజించినవార లజరామరు లగుదు రట. నీ మాంస భోజనాపేక్షతో నిన్ను పట్టి తెప్పించినాను."

"మహారాజా, నా మాంసము తిన్నవారు అజరామరు లగుదురు. నేను మాత్రము మరణింపవలెనా?"

"అవును."

"నేను మరణించునెడల నామాంసము తినువారుమాత్ర మేల మరణింపరాదు?"

"నియది బంగరువన్నె యగుటచే నీ మాంసభోక్తలు అజరామరు లగుదురు."

"మహారాజా, నే ని బంగరువన్నెతో పుట్టలేదు. పూర్వము నే నీ నగరమున చక్రవర్తిని స్వయముగా పంచశీలములను రక్షించుకొని, సకలచక్రవాళవాసులచే శీలరక్షణము చేయించితిని. మరణానంతరము ముప్పదిమూడవలోకమున జన్మించితిని. అక్కడ చేసిన లోపమునకు ఫలితముగా మయూరముకడుపున బుట్టితిని. పూర్వశీలమహిమచే స్వర్ణ వర్ణము సంక్రమించినది."

"నీవు చక్రవర్తివై శీలరక్షణము చేసి తత్ఫలితముగా సువర్ణ వర్ణము పొందినట్లు మే మెట్లు నమ్ముదుము? దీని కేదయిన కొలది సాక్ష్య మున్నదా?"

"ఉన్నది మహారాజా."

"ఎక్కడ?"

"మహారాజా, నేను చక్రవర్తిగా నున్నప్పుడు మణిమయరథములో గూరుచుండి ఆకాశమున విహరించువాడను. ఆనాటిరథము మంగళ పుష్కరిణిలో అడుసులో కూరుకొనిపోయినది. దానిని బయటికి దీయింపుడు. అదియె సాక్ష్య మిచ్చును."

మంచి దని రాజు పుష్కరిణిలో నీరు తీయించి, మన్ను తీయించి, రథమును బయటికి దీయించెను. దానిని జూడగా రాజుకు బోధిసత్త్వుని మాటపై విశ్వాసము కలిగెను.

బోధిసత్త్వుడు రాజుకు ధర్మోపదేశము చేసి "మహారాజా, నిర్వాణ మొక్కటియే అమృతము. తక్కిన సంస్కారధర్మములు పుట్టి, అభావము నొందును. అవి అనిత్యము లయి, క్షయముపొందును" అని, రాజును పంచశీలములందు ప్రతిష్ఠితుని జేసెను.

రాజు ప్రసన్నుడై బోధిసత్త్వుని విశేషముగా సత్కరించి రాజ్య మిచ్చెను. అయన రాజ్యమును మరల రాజుకే యిచ్చి, కొలదిదినము లచట నుండి, అప్రమత్తుడవై యుండు మని రాజుతో జెప్పి, ఆకాశ మార్గమున లేచి, దండకహిరణ్యపర్వతమునకు బోయెను.

రాజు బోధిసత్త్వుని యుపదేశానుసారముగా నడచుచు, దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చి, సత్యము ప్రకటించునప్పటికి ఉద్విగ్నచిత్తుడు అర్హత్వము పొందినాడు.

అప్పటి రాజు ఆనందుడు. బంగరు రంగుగల మయూరము నేనే.

# 160 వినీలక జాతకము

శాస్త వేళువనమున నుండునపుడు దేవదత్తుడు బుద్ధునికి నకలు అగుటను గూర్చి చెప్పినది

## వర్తమాన కథ

గయాశీర్ష పర్వతమున ఇరువురు ముఖ్యశ్రావకుల యెదుట దేవదత్తుడు బుద్ధునిస్థితిని ప్రదర్శించి తిరుగుచుండెను. స్థవిరులును ధర్మోపదేశము చేసి తమశిష్యులతో వేళువనమునకు మరలివచ్చిరి.

శాస్త 'సారిపుత్రా, మమ్ము చూచి దేవదత్తు డేమి చేసినాడు?' అనెను.

'భన్తే, సుగతుని వైఖరి చూపి మహావినాశము నొందినాడు.

'సారిపుత్రా, దేవదత్తుడు నన్ననుకరించి వినాశముపొందుట ఇప్పుడే కాదు; పూర్వముకూడ ఇట్లే చేసెను' అని శాస్త పూర్వజన్మ వృత్తాంతము చెప్పినాడు.

## అతీత కథ

పూర్వము విదేహరాష్ట్రములోని మిథిలానగరమున విదేహరాజు పరిపాలనము చేయుచుండ, బోధిసత్త్వు డాతని పట్టమహిషికడుపున బుట్టి, పెద్దవా డయి, తక్షశిలలో విద్యలన్నియు నేర్చి, తండ్రియనంతరము సింహాసన మెక్కెను.

ఆరోజులలో సువర్ణరాజహంసము ఆహారార్థము తిరుగుతావున కాకితో హంసకు సహవాసము సంభవించెను దానివలన కుమారుడు కలిగెను. ఆబిడ్డనికి తల్లిరూపు లేదు, తండ్రిరూపు లేదు. వానికి వినీలవర్ణ ముండుటచే వినీలక మను పేరు వచ్చినది.

హంసరాజు తరుచుగా కుమారుని జూడబోవుచుండెను. అతనికి మరియిరువురు పుత్రులు హంస లుండెను. తండ్రి తరుచుగా మనుష్యపథమున జనుచుండుట చూచి 'నాయనా, మీరు ఎక్కువగా నగరము వైపు పోవుదు రేల?' అని యువి అడిగెను.

'కాకితో సహవాసమువలన నాకు వినీలకు డను పుత్రుడు కలిగె

నాడు. వానిని జూడబోవుదును.'

'అత డెక్కడ నుండును?'

'విదేహరాష్ట్రమున మిథిలానగరమునకు వెలుపల తాడిచెట్టుమీద నుండును.'

'నాయనా, పట్టణము సంశయాస్పదస్థానము. భయావహ మైన యాచోటికి మీరు పోవలదు. మేము పోయి అతనిని దీసికొనివత్తుము.'

తండ్రి చెప్పిన గురుతుప్రకారము హంసపోతకములు మిథిలకు జని, వినీలకుని గురుతించి, వానిని కర్రపై గూరుచుండబెట్టి, తాము రెండు కొనలు పట్టుకొని మిథిలానగరముమీదుగా పోవుచుండెను.

ఆసమయమున విదేహరాజు తెల్లనినాలుగుగుర్రములు పూన్చిన రథములో గూరుచుండి, నగరసంచారము చేయుచుండెను. అదిచూచి వినీలకము తనలో 'నాకును విదేహరాజునకును అంతర మేమున్నది? ఆయన నాలుగుగుర్రములు కట్టిన రథములో గూరుచుండి నగర సంచారము చేయుచున్నాడు. హంసలు పూన్చిన రథమున నేను పోవుచున్నాను' అనుకొని, గగనమార్గమున పోవుచు ఈగాథ పలికెను

అశ్వరత్నము లావిదేహాధినాథు
నరదమును లాగునట్టు లీయంచజంట
లాగుచున్నది సుమి వినీలకుని నన్ను.

ఈవాక్కులు వినినంతనే హంసపోతకములు కుపితములై దానిని క్రిందబడవేయ నెంచెను; కాని అట్లు చేసినచో తండ్రి యేమనునో యని సంశయించెను. తండ్రి భయముచే వానిని గొనిపోయి యాయన సమక్షమున దింపి, జరిగిన వృత్తాంతము చెప్పెను.

కోపముతో తండ్రి వినీలకముతో "ఏలరా, నీవు కుమారులకన్న మొనగాడవా! క్రింద బోవు రథమునకు గట్టిన గుర్రములతో సమాన ముగా నెంచితివా! నీ యంతర మెరుగుదువా? నీ విచట నుండదగవు. నీతల్లి యున్నచోటికే పో" అని మందలించి, ఈగాథ పలికెను

ఓ వినీలక, దుర్గాన నుంటి వీవు,
కాదు తగుచోటు నీ కిది, గ్రామకంఠ
మందు నిలువుము నీ తల్లియాశ్రయమున.

ఈప్రకారము రాజహంస మందలించి, కొడుకులతో "పొండు. మిథిలానగరములో చెత్త పడవేయు దిబ్బమీద వీనిని దింపి రండు" అని పలికెను. వా రట్లే చేసిరి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వినీలకుడు దేవదత్తుడు. హంసశిశువులు అగ్రశ్రావకులు. తండ్రి ఆనందుడు. విదేహరాజు నేనే

## 161 ఇంద్రసమానగోత్ర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఇతరులమాట వినని భిక్షువును గూర్చి చెప్పినది

### వర్తమాన కథ

వానికథ నవమనిపాతములో గిజ్ఝజాతకమున (427) వచ్చును. ఆ భిక్షువుతో "భిక్షూ, నీవు పూర్వముకూడ ఎవ్వరిమాట లెక్కచేయని వాడవు గా నుండుటచే, పండితులమాట వినకపోవుటచే మత్తగజ పాదములక్రింద నలిగిపోయినావు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున బుట్టి, పెద్దవాడయి, ఇలు విడిచి, ఋషులరీతిని ప్రవ్రజించి, పంచశతఋషిగణమునకు నాయకు డయి, హిమవత్ప్రదేశమున నివసించుచుండెను. వారిలో ఇంద్రసమానగోత్ర నాము డగు తాపసుడు ఒరులమాట లెక్కచేయడు; ఒరులు చెప్పినట్లు వినడు. ఆత డేనుగుగున్నను పెంచుచుండెను. బోధిసత్త్వు డీసంగతి విని, అతనిని బిలిపించి. 'నీవు హస్తిపోతకమును పెంచుచున్నావట.

నిజమేనా?' అని ప్రశ్నచేసెను. 'ఆచార్యా, నిజమే. ఏనుగుగున్నను పెంచుచున్నాను. దానితల్లి చనిపోయినది' అని యాతడు పలికెను.

'మాతంగములు పెద్దవయి, పోషించువానినే సంహరించును. నీవు దానిని పెంచవద్దు.' 'అది లేనిది నే నుండలేను.' 'మంచిది. చూతువు గాని.'

హస్తిపోతము మహాశరీరము కల దాయెను. ఋషు లొకసారి వనమూలఫలాదులు తెచ్చుటకై దూరప్రదేశమునకు జని అచ్చటనే కొలదిరోజు లుండిరి. శ్రేష్ఠదక్షిణవాతమువలన హస్తి ప్రభిన్నమదమయి, అతనిపర్ణశాలను ధ్వంసము చేసి, పానీయఘటములను బగుల గొట్టి, పాషాణఫలకములను చిదుకద్రొక్కి, ఆలంబనఫలకమును విరిచి, తాపసుని సంహరించి పోవుదు నని భావించి, ఒకానొక గహనప్రదేశమును జేరి, తాపసిరాక కెదురు చూచుచుండెను. ఇంద్రసమానగోత్రుడు దాని కాహారము గొని, అందరకన్న ముందువచ్చుచు, ఏనుగును జూచి ప్రకటితసంజ్ఞుడై దానికడకు జనెను.

గజము గహనస్థానము వెలువడి, తొండముతో నతనిని బట్టి యెత్తి నేలపై విసరివైచి, పాదముతో శిరస్సు మెట్టి మర్దించి, ప్రాణములు వాపి, బృంహితము చేసి యడవిలో జొరబడెను. మిగిలిన తాపసు లావృత్తాంతము బోధిసత్త్వునకు దెలిపిరి. కాపురుషసంసర్గము తగదని, బోధిసత్త్వు డీగాథలు పలికెను:

అర్థము, ననర్థము, నెరుంగు నార్యజనుడు
చేయరాదు కాపురుషుతో స్నేహ మెపుడు;
ఖలుండు దృఢమైత్రితో చిరకాల మున్న
సంహరించు నిభము భిక్షు జంపినట్లు.

ఆచారమున, ప్రజ్ఞయందు, జ్ఞానమున,
సదృశుడై యుండెడి సజ్జనుతోడ
సఖ్యంబు నెరపుట సముచిత మగును:
సజ్జనసఖ్యంబు సౌఖ్యదాయకము.

ఇట్లు బోధిసత్త్వు డుపదేశ మిచ్చి, "ఇతరుల సద్వాక్యము విన కుండరాదు. సుశిక్షితులై వర్తింపవలయును" అని బోధించి, ఇంద్ర

సమానగోత్రునకు కర్మలు చేయించి, బ్రహ్మవిహారములను భావించి, బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను ఆకాలమున ఇంద్రసమాన గోత్రుడు ఈ పెంకె భిక్షువు, ఋషిగణమునకు శాస్త నేనే.

## 162 సంథవ జాతకము

శాస్త జేతవనమున నుండునపుడు అగ్నిహవనకర్మమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథ నంగుట్ఠజాతకమున (144) జరిగిన ట్లున్నది. భిక్షువులు వారు అగ్నిహవనము చేయకుండుట గమనించి భగవానునితో "భన్తే, జటిలసాధువులు వివిధవిధముల మిథ్యాతపస్సులు చేయుచున్నారు. వీనివలన ఏమైనను ఉన్నతి ఉండునా?" అని యడిగిరి. శాస్త వారితో "భిక్షువులారా దీనివలన లాభమేమియును లేదు. పూర్వపండితులు అగ్నిహవనకార్యమువలన ఉన్నతి కలుగు నని తలపోసి చిరకాల మాపని చేసిరి. కాని దానివలన హాని కలుగుట చూసి వారు అగ్నులపై నీరు చల్లి ఆర్పి శాఖాదులతో కొట్టి వెడలిపోయిరి. మరల ఆ వంకకు చూడనైన చూడలేదు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున జన్మించెను. అతని తలిదండ్రులు జాతాగ్నిని నెలకొల్పి, అతనికి పదునారువర్షములవయసు వచ్చినప్పుడు 'నాయనా, నీవు జాతాగ్నిని గొనిపోయి అరణ్యములో ఆరాధింతువా? వేదత్రియాధ్యయనము చేసి, గృహస్థు వగుదువా?' అనిరి. 'నాకు

గృహనివాసముతో పనిలేదు. అగ్నిని గొనిపోయి, అరణ్యమున పరిచర్యలు చేసి, బ్రహ్మలోకపరాయణుడ నగుదును' అని యతడు జాతాగ్నిని గ్రహించి, తలిదండ్రులకు నమస్కరించి, అడవిలో బ్రవేశించి, పర్ణశాలలో నివాసము చేయుచు, అగ్నికి సపర్యలు చేయుచుండెను.

ఒకనా డతడు నిమంత్రితప్రదేశమునకు బోయి పాలు, నేయి, లభింపగా 'ఈపాలు మహాబ్రహ్మకు సమర్పింతును' అని నిప్పు చేసి, 'పాలు నేయి కలిపి అగ్నిభట్టారకునకు సమర్పింతు' నని యోచించి, వానిని అగ్నిలో వ్రేల్చెను. ఘృతముతో గూడిన దుగ్ధము అగ్నిలో పడినంతనే, అగ్ని ఉగ్రముగా ప్రజ్వరిల్లి పర్ణశాల నంటుకొనెను. బ్రాహ్మణుడు భీతచిత్తుడై వెలుపలికి పరుగిడిపోయి 'కాపురుషులతో సంయోగము తగదు. ఈ యగ్నివలన నేడు పర్ణశాల అంటుకొన్నది' అని తొలిగాథ పలికెను.

కలదె కాపురుషునిమైత్రికన్న చెరుపు
పాయసము, క్షీరములు బోయ, పావకుండు
కష్టనిర్మితకుటిని దగ్ధమ్ము చేసె!

ఇట్లు పలికి 'అటువంటి మిత్రద్రోహితో నాకు పనిలేదు' అని నీరు చల్లి, నిప్పు చల్లార్చి, కొమ్మలతో కొట్టి అతడు హిమాలయమునకు జనెను. అక్కడ నొక కృష్ణసారము సింహవ్యాఘ్రముల ముఖములు నాకుచుండుట జూచి 'సజ్జనసాంగత్యము మిక్కిలి మే' లని తలచి, రెండవగాథ పలికెను.

సజ్జను లగువారి సఖ్యమ్ముకంటె
నధికశుభప్రద మైనది లేదు.
ప్రీతిమై నాకును కృష్ణసారమ్ము
సింగము, బెబ్బులి, చిఱుత, ముఖాలు.

బోధిసత్త్వు డీప్రకారము పలికి, తుదకు హిమవంతమునకు బోయి, ప్రవ్రజించి, అభిజ్ఞలను, సమాపత్తులను పొంది, జీవితాంతమున బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున తపస్వి నేనే.

# 163 సుసీమ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఛందికదాన విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తిలో బుద్ధుడు ప్రధానుడుగా నున్న భిక్షుసంఘమునకు ఒకప్పుడు ఒక కుటుంబమువారు ఒకప్పుడు కొందరు జనులు సంఘముగా నేర్పడి దానములు చేయుచుండిరి. మరియొకప్పుడు ఒక్కొక్క గల్లీలోనివారు కలిసియు, వేరొకప్పుడు నగరవాసులు అందరను గుమిగూర్చియు దానము లిచ్చుచుండిరి.

ఈ సమయమున నగరవాసు లెల్లరకడనుండి వస్తువులు గుమిగూర్చిరి. పదార్థము లన్నియు సిద్ధముగా నున్నవి. దాతలలో రెండు పక్షము లేర్పడినవి. కొందరు సామగ్రిలను అన్యతైర్థికుల కీయదలచిరి; కొందరు బుద్ధుడు నాయకుడుగా నున్న సంఘమున కీయ నెంచిరి. క్రమముగా బహుమతము లేర్పడెను. తుదకు బుద్ధుని సంఘమునకే సామగ్రు లీయవలె నని పెక్కురు సూచించిరి. వారిమాటయే స్థిరమై అన్యతైర్థికులకు దానము చేయదలచిన శిష్యులు బుద్ధుని విషయమై అడ్డు చెప్పలేకపోయిరి.

నగరవాసులు బుద్ధుని ఆధిపత్యమున భిక్షుసంఘమును నిమంత్రించి మహాదానములు ఏడుదినముల పర్యంతము ఇచ్చుచుండిరి.

శాస్త అనుమోదనము చేసి లోకులకు మార్గమును ఫలమును గూర్చి బోధించి జేతవనవిహారమునకు జని, అచ్చట భిక్షుసంఘము ఆదరప్రదర్శనము చేసినపిదప గంధకుటీసమ్ముఖమున నిలిచి ఉపదేశ మిచ్చి లోనికి జనెను.

సాయంకాలము ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై "ఆయుష్మంతులారా, బుద్ధునకు వచ్చు దానవిషయమై అన్యతైర్థికశ్రావకులు అడ్డుపెట్ట యత్నించిరి. కాని విఫలు లైరి. వస్తుసమూహము బుద్ధుని చరణములకడకే చేరినది. అహా, బుద్ధుని మహిమ!" అనిరి

శాస్త అరుగుదెంచి భిక్షువులారా, ఇపు డేమి సంభాషించుచున్నారు?" అని యడుగగా ఫలాని విషయము అని వారు చెప్పిరి.

అంతట శాస్త్ర భిక్షువులారా, అన్యమతావలంబులు ఇప్పుడే కాదు పూర్వముకూడ దానవిషయమై అడ్డు చెప్పజూచిరి. కాని ఎల్లప్పుడును దానవస్తువులు నాపాదములకడకే వచ్చి చేరెడివి" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో సుసీము డనురా జుండెను. బోధిసత్త్వు డాతని పురోహితునిపుత్రుడుగా పుట్టెను. ఆతనికి పదునారువర్షముల యీడున తండ్రి చనిపోయెను. ఆయన జీవించియున్నపుడు రాజు మంగళహస్తికి ఉత్సవము చేయువాడు. హస్తిమంగళోత్సవము చేయు తావునకు సరకులు, అలంకారములు, ధనము వచ్చెడివి. అవి యన్నియు పురోహితునకే ముట్టెడివి. ఈవిధముగా ఒక్కొకమంగళో త్సవమున కాయనకు మహాధనము లభించెడిది.

ఆసారి హస్తిమంగళోత్సవము సమీపించు నప్పటికి బ్రాహ్మణులు రాజకడకు జని "మహారాజా, హస్తిమంగళోత్సవము దగ్గరకు వచ్చి నది. పురోహితునికుమారుడు చిన్నవాడు. అతనికి వేదత్రయము, హస్తిసూత్రము రావు. కావున ఉత్సవము మేము చేయింతుము'' అని చెప్పిరి. మంచి దని రాజు సమ్మతించెను. బ్రాహ్మణులు సంతుష్టులయి, యిటునటు దిరుగ జొచ్చిరి; తమకు ధనము లభించు నని సంతో షించిరి.

నాలుగవనాడు హస్తిమంగళోత్సవము జరుగు నని బోధిసత్త్వుని తల్లి విని, "సప్తపురుషాంతరములనుండి ఈయుత్సవము చేయు నధి కారము మా వంశమునకే యుండెను. ఇక మావంశము వెనుక బడును. ధనము లభింపదు'' అని దుఃఖింప సాగెను.

'అమ్మా, ఏల విచారించుచున్నా?' వని బోధిసత్త్వు డనెను. ఆమె కారణము తెలిపెను.

'అమ్మా, నేను మంగళోత్సవము చేయుదును.'

'మూడువేదములు, హస్తిసూత్రము నీకు తెలియవు. ఎట్లు చేయ గలవు?'

'అమ్మా, ఉత్సవ మెప్పుడు?'

'నాయనా, నేటికి నాలుగవనాడు.'

'అమ్మా, వేదత్రయము, హస్తిసూత్రము తెలిసిన యాచార్యు లెచట నున్నారు?'

'నాయనా, ఇట్టి యాచార్యుడు ఇచ్చటికి 120 యోజనములదూరమున, గంధారదేశమున, తక్షశిలలో నున్నాడు.'

'అమ్మా, మనవంశగౌరవము పోనీయను. ఉదయమే తక్షశిలకు బోయి, రాత్రివేళ వేదత్రయమును హస్తిసూత్రమును గ్రహించి, ఒక రోజులో మరలివచ్చి, నాలుగవనాడు హస్తిమంగళోత్సవము చేయుదును. విచారింపకుము.'

ఇట్లు తల్లి నోదార్చి బోధిసత్త్వుడు మరునాడు ప్రాతఃకాలమున భోజనము చేసి, ఏకాకిగా బయలుదేరి, ఆనాడే తక్షశిల చేరి, ఆచార్యునకు వందనము చేసి, ఒకప్రక్కన గూరుచుండెను.

'నాయనా, ఎక్కడనుండి వచ్చినావు?' అని ఆచార్యుడనెను.

'వారాణాసినుండి.' 'ఏ యుద్దేశముతో?' 'తమకడ వేదత్రయము, హస్తిమంగళసూత్రము గ్రహించుటకు.' 'మంచిది నాయనా, నేర్చికొనుము.'

'నాపని త్వరితముగా కావలసియున్నది' అని బోధిసత్త్వుడు సర్వము నివేదించి 'ఒక్కనాటిలో 120 యోజనములు వచ్చినాను. ఈ రాత్రియే నాకు విద్యాప్రదానము చేయుడు. నేటికి మూడవనాడు హస్తిమంగళము జరుగును. ఒక్కసారి విన్నచో సర్వము గ్రహింపగలను' అని, ఆచార్యుని సమ్మతి బడసి, ఆయన భుజించిన తరువాత తాను భుజించి, గురుపాదములు కడిగి, వేయినాణెములసంచి ఆయన కడ నుంచెను. అతడు మరల గురువందనము చేసి, ఒకప్రక్కన గూరుచుండి పాఠము ప్రారంభించి, అరుణోదయ మగునప్పటికి ముగించి, 'ఆచార్యా, ఇంకేమయిన మిగిలినదా?' అనెను.

'నాయనా, అంతియు పూర్తిచేసినాను.'

'ఆచార్యా, ఈగ్రంథమున కొంత లోపించినది. పాఠము ఇంత దుష్టముగా నున్నది. ఇకనుండి శిష్యుల కిట్లు చెప్పుడు' అని ఆచార్యుని విద్యలో లోపములు సవరించి, ఉదయమే భోజనము చేసి, గురువుకు నమస్కరించి, ఆనాడే వారాణసి చేరి బోధిసత్త్వుడు తల్లికి వంద

షము చేసెను.

'నాయనా, విద్యలు గ్రహించితివా?'

'అమ్మా, గ్రహించినాను' అని బోధిసత్త్వుడు తల్లిని సంతోష పెట్టెను.

మరునాడు మంగళోత్సవమున కంతయును సిద్ధ మయినది. వంద యేనుగులకు స్వర్ణాలంకారములతో, స్వర్ణ ధ్వజములతో గూడ బంగరు జాలములు కప్పి, నిలిపియుంచిరి. రాజాంగణము నలంకరించిరి. మన మే హస్తిమంగళము చేయువార మని బ్రాహ్మణులు ప్రసన్నచిత్తులై నిలు చుండిరి. సుసీమరాజు ఆభరణములు భాండములు పట్టించుకొని పోయి, మంగళస్థానమున నిలిచియుండెను.

మాణవకున కుచిత మగు నలంకారము చేసికొని, బోధిసత్త్వుడు తనపరివారముతో రాజుకడకు జని, 'మహారాజా, తమరు మాకుటుంబ మునకు గౌరవము తప్పించి, అన్యబ్రాహ్మణులచే హస్తిమంగళము చేయించి, వస్తువులను అలంకారములను వారి కిత్తు రని విన్నాను. సత్యమేనా?' అని యీగాథ పలికెను·

మీ పూర్వజాతుల, మా పూర్వికులను
స్మరియించుచు సుసీమ, శతహస్తిఘటను
శ్వేతదంతాలతో వెలుగొందుదాని
పసిడిజాలకములన్ భాసిల్లుదాని
వాకొనుచున్నావె నా కిత్తు ననుచు?

ఆయనవాక్కులు విని సుసీము డీగాథ పలికెను·

మా పూర్వజాతుల, మీ పూర్వికులను
స్మరియించి, బాలకా, శతహస్తిఘటను
శ్వేతదంతాలతో వెలుగొందుదాని,
పసిడిజాలకములన్ భాసిల్లుదాని
వాకొనుచున్నాను నీ కిత్తు ననుచు

బోధిసత్త్వుడు 'మహారాజా, మీవంశమును మావంశమును స్మరణలో నున్నను తమరు నన్ను విడిచి, అన్యుచేత హస్తిమంగళకార్యము జేయించుచున్నా రేల?' అనెను.

'బాబా, నీవు మూడువేదములు, హస్తిసూత్రము పఠింపలేదని

నాకు దెలియఁవచ్చుటచే అన్యబ్రాహ్మణులచే మంగళకార్యము చేయింపఁ నున్నాను' అని రాజు పలుకగా బోధిసత్త్వుడు సింహామువలె గర్జించి. 'మహారాజా, అట్లయినచో ఇందరు బ్రాహ్మణులలో ఒకడైన వేదములలో, సూత్రములో నేభాగముగాని నాతో సమానముగా జెప్పగలవాడున్నచో లేచి నిలుచుండవచ్చును. మూఁడు వేదములు, హస్తిసూత్రము, మంగళకరణము తెలిసినవారు నేను గాక అన్యుడు జంబూద్వీపములో లేడు' అని పలికెను. ఒక్కడుకూడ ప్రతిపక్షిగా లేచి నిలువజాలక పోయెను. బోధిసత్త్వుడు నిజవంశప్రతిష్ఠ నిలిపి, హస్తిమంగళకార్యము చేసి, బహుధనము నిజనివాసమునకు గొనిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి ఆర్యసత్యముల ప్రకటించి జాతకములు సరిపోల్చెను. కొందరు స్రోతాపన్నులైరి కొందరు సకృదాగాములు, మరికొందరు అనాగాములు, వేరొక కొందరు అర్హతులు ఐరి. ఆకాలమున తల్లి మహామాయ; తండ్రి శుద్ధోదన మహారాజు; సుసీమప్రభువు ఆనందుడు; నలుదిక్కుల ప్రసిద్ధిగాంచిన ఆచార్యుడు సారిపుత్రుడు. మాణవకుడు నేనే

## 164 గిజ్ఝ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు తల్లిదండ్రులను పోషించు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈ కథ సామజాతకమున (540) వచ్చును. శాస్త ఆభిక్షువుతో, "భిక్షూ, నీవు నిజముగా గృహస్థులను పోషించుచున్నావా?" అనెను. సత్యమే నని అతడు చెప్పిన పిమ్మట శాస్త "వారు నీ కేమి కావలెను?" అన్నాడు.

"భన్తే, వారు నా తల్లిదండ్రులు."

"బాగు బాగు" అని శాస్త అన్యభిక్షువుల నుపశమింప జేసి,

"భిక్షువులారా, ఈ భిక్షువుపై కోపింపవలదు. పూర్వకాలమున పండిత జనులు గుణములపై తలపు నిలిపి జ్ఞాతులకు ఉపకారము చేయుచుండిరి. తల్లిదండ్రులకు సేవచేయుట ఈతనికి కర్తవ్యము'' అని పూర్వ జన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు గృధ్రపర్వతముమీద గ్రద్దకడుపున బుట్టి, తల్లిదండ్రులను పోషించుచుండెను. ఒకనాడు జంఝూవాతము చెలరేగగా గ్రద్దలు సహింపజాలక శీతభయమువలన వారాణసికిబోయి ప్రాకారసమీపమున పరిఖకడ వణకుచు గూరుచుండెను. ఆసమయమున వారాణసి శ్రేష్ఠి నగరము వెలువడి స్నానార్థము పోవుచుండెను. గృధ్రములు శ్రమపడుచున్నవని తెలిసికొని, అతడు వానిని వానకు తడిసిపోవని చోటికి జేర్పించి, మంటవేయించి, పశుశ్మశానమునుండి గోమాంసము తెప్పించి, వానికి బెట్టించి, సంరక్షణ చేయించెను. జడివాన ఆగిపోయిన తరువాత గ్రద్దలు స్వస్థశరీరములై పర్వతము చేరినవి. అచ్చట నవి గుమిగూడి, యిట్లు చింతించినవి 'ఉపకారికి ప్రత్యుపకారము చేయవలెను. కావున మనకు ఏ యాభరణముగాని వస్త్రము గాని దొరకగానే వానిని ఆకసమునుండి వారాణసీశ్రేష్ఠిప్రాంగణమున బడవేయవలెను. అది మొదలు లోకులు ఆరవేసినవస్త్రములను, ఈవల నుంచిన యాభరణములను వారి కనుమరగి డేగలు మాంసఖండమును హరించునట్లు తటాలున హరించి శ్రేష్ఠిప్రాంగణమున బడవేయుచుండెను. అతడీవిషయము గ్రహించి, గ్రద్దలు పడవేసిన వస్తువు లన్నిటిని ఒకప్రక్క బెట్టుచుండెను. గ్రద్దలు నగరమును దోపిడి చేయుచున్నవని జనులు రాజునకు విన్నవించిరి. 'మీరు ఒకగ్రద్దను బట్టుకొన్నచో అన్నివస్తువులను తెప్పింపగలను' అని రాజు నగరమున అక్కడక్కడ వలలు పాశములు పన్నెను. తలిదండ్రులను పోషించు గృధ్రము వలలో జిక్కుకొనెను. జనులు దానిని బట్టుకొని రాజుకడకు గొని పోయిరి. రాజ దర్శనార్థము పోవుచున్న శ్రేష్ఠి దానిని జూచి, అది కష్టముపాలగునని తలచి దానివెంటనే పోయెను. రాజు గ్రద్దను చూచి

'మీరు నగరమున దోపిడిజేసి వస్త్రాదులు హరించుచున్నారా?' అని యడిగెను. "అవును మహారాజా!" "ఎవరికిచ్చుచున్నారు?" 'వారాణాసిశ్రేష్ఠికి.' 'ఎందుచేత?' "ఆయన మాప్రాణములు రక్షించినాడు. ఉపకారికి ప్రత్యుపకారము జేయవలెను. కావున ఇచ్చినాము." 'గృధ్రములు శతయోజనదూరమునుండి శవమును చూడగలవే, నీకై ఒడ్డిన పాశమును జూడలేకపోయితి వేమి?' అని యీగాథ పలికెను:

నూరుయోజనాల దూరమునందుండి
గ్రద్ద మృతశవంబు గాంచగలదు
దరికిజేరి కూడ అరయ వేటికి నీవు
పార్శ్వభాగమందు పరచు వలను?

ఆమాటలు విని గృధ్రము ఈగాథపలికెను.

నాశ మాసన్నమై జీవనమున బాధ
సంక్రమించిన ప్రాణికి సవిధమందు
జాల, మరియును నేత్రగోచరము కావు

అంతట రాజు ప్రశ్నింపగా మహాశ్రేష్ఠి జరిగినసంగతి చెప్పి, గృధ్రిమును విడిపించి, ఎవరివస్తువులు వారికి బంపివేసెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకాశింపచేసి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశన మైనంతనే ఆ భిక్షువు శ్రోతాపత్తిఫలమును పొందెను.

ఆకాలమున రాజు ఆనందుడు; వారాణసిశ్రేష్ఠి సారిపుత్రుడు; తల్లిదండ్రులను పోషించెడి గృధ్రము నేనే

# 165 నకుల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు రెండు శ్రేణులకు కల కలహామునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఇందలి కథ పూర్వోక్తమైన ఉరగజాతకములోని కథవలె (154) నుండును. శాస్త "భిక్షువులారా, ఈ మహామంత్రుల కిరువురకు ఇప్పుడే కాదు పూర్వమునకూడ నేను సమ్మేళనము చేయించితిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డొకానొకపల్లెలో బ్రాహ్మణవంశమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలలో సర్వవిద్యలు గ్రహించి, ఇలు విడిచి, పరివ్రాజకుడయి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, మూలములను ఫలములను ఏరికొని తినుచు హిమవత్ప్రదేశమున నివసింపజొచ్చెను.

ఆయన చంక్రమణము చేయు ప్రదేశమున కొకకొనలో వల్మీకమున ముంగిసయు, తత్సమీపముననే చెట్టుతొర్రలో సర్పము నివసించుచుండెను. అవి రెండును ప్రతిదినము పోరాడుచుండెను. బోధిసత్త్వుడు వాని కలహామువలని దుష్పరిణామమును, మైత్రివలని లాభమును తెలిపి, వానిపోరు మాన్పి, రెండిటికిని సమ్మేళనము సముచితమని యుపదేశించి, వానికి పొత్తు సమకూర్చెను.

సర్పము వెలుపలికి చన్న కాలమున నకులము చంక్రమణకోటిలోని వల్మీకబిలమున శిరముంచి నోరు తెరచుకొని ఊపిరిపీల్చుచు విడుచుచు పండుకొనియుండుట గాంచి బోధిసత్త్వుడు 'నీకు దేనివలన భయ?' మని యడుగుచు, ఈగాథ పలికెను:

నీవు సర్పముతో మైత్రి నెరపుచున్న,
నకులమా, యేల తెరచియున్నావు నోరు?
ఏగుదెంచెను భీతి నీ కెచటినుండి?

బోధిసత్త్వు డిట్లు పలుకగా నకులము "ఆర్యా, శత్రువువిషయమున అశ్రద్ధతో నుండక, సాశంకముగానే యుండవలెను" అనుచు నకులము రెండవగాథ పలికెను:

శత్రువు నెప్పుడు శంకింపవలయు,
స్నిగ్ధు డైనను విశ్వసింపంగ రాదు.
అభయప్రదేశమునందుండి పుట్టి,
పెల్లగించును గాదె భీతిమూలమును?

అంతట బోధిసత్త్వుడు "భయము వలదు. ఇక నీయెడ సర్పము ద్వేషము వహింపకుండునట్లు చేసినాను. నేటినుండి నీవు దాని ననుమానింపకుము" అని యుపదేశించి, నాలుగు బ్రహ్మవిహారములను భావించి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను. జంతువులు రెండును వానికర్మమున నవి పోయినవి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి రెండుజాతకములు సరిపోల్చెను. ఆకాలమున సర్పనకులములు ఈ ప్రధానులిద్దరును; తపస్వి నేనే.

## 166 ఉపసాల్హ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉపసాల్హకనామకుడగు బ్రాహ్మణుని విషయమై చెప్పినది ఆతడు శ్మశానశుద్ధిపై విశేషదృష్టి కలవాడు.

### వర్తమాన కథ

ఆబ్రాహ్మణుడు మహాధనవంతుడు; కాని మిథ్యామతవిరోధి. కావున సమీపములో విహారమున నివసించు బుద్ధసేవ చేయువాడు కాడు. ఆతనికుమారుడు పండితుడు, జ్ఞాని.

ఆ బ్రాహ్మణుడు వృద్ధుడై కుమారునితో, 'నాయనా, చండాలుని దహనము చేసియుండెడి శ్మశానమున నాకు దాహకర్మము చేయ

వలదు. అదివరలో ఎవరిని దహనము చేయని శ్మశానమున నన్ను దహనము చేయవలెను'' అని చెప్పెను.

'నాయనా, మిమ్మును ఎచ్చట దహనము చేయవలెనో నాకు తెలియదు. నన్ను వెంటగొనిపోయి ఫలానిస్థల మని మీరు నిర్దేశము చేయుడు.''

'మంచి' దని తండ్రి ఆతనిని వెంటగొని నగరము వెలువడి గృధ్రకూటపర్వత మెక్కి ''నాయనా, ఇచట ఇంతకుముందు చండాలు నెవనిని దహనము చేయలేదు. ఇచట నా దాహకర్మము చేయుము'' అని పర్వతము దిగసాగెను.

శాస్త ఉదయమే జ్ఞానప్రాప్తి ఆనాడు పొందదగినవారివిషయమై యోచించుచుండ, ఆతండ్రికొడుకులు శ్రోతాపత్తిమార్గారూఢు లగు నవకాశము కానిపించెను.

మార్గమువెంట వేటకాండ్రవలె పర్వతపాదమును చేరి శాస్త వారి కొర కెదురుచూచుచు కూరుచుండెను. వారు దిగుచు శాస్తను చూచిరి. శాస్త కుశలప్రశ్నము వేయుచు, "బ్రాహ్మణోత్తమా ఎచటికి పోయితిరి?'' అనెను.

బ్రాహ్మణమాణవకుడు విషయము తెలిపెను. "అగుచో, మీ నాయనగారు నిర్దేశించిన స్థలమునకు పోవుదము'' అని శాస్త వా రిరువురను వెంటగొని పర్వతశిఖర మెక్కి 'ఏ ప్రదేశము' అని యడిగెను.

'భన్తే, ఈమూడు గోతుల నడుమప్రదేశము' అన్నాడు మాణవకుడు.

'మాణవకా! మీ నాయనగారు ప్రస్తుతమే కాదు; పూర్వము కూడ ఇట్లే కోరువారు' అని శాస్త మాణవకుని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము ఈరాజగృహమున నే ఈఉపసాళహబ్రాహ్మణుడు ఈయనపుత్రుడే.

ఆకాలమున బోధిసత్త్వుడు మగధరాష్ట్రమున బ్రాహ్మణవంశమున

పుట్టి సమస్తవిద్య లభ్యసించి ప్రవ్రజించి, అభిజ్ఞులను సమాపత్తులను పొంది, ధ్యానక్రీడలోనుండి హిమవత్ప్రదేశమున నివసించుచు, బహు కాలానంతరము లవణామ్లములకై గృధ్రకూటమున పర్ణశాలలో నుండ జొచ్చెను. అప్పు డాబ్రాహ్మణుడు ఈప్రకారముగా చెప్పి, అట్టిస్థాన మును నాకు జూపు మని యా ప్రదేశమే చూపెను. పుత్రునితోగూడ దిగి బ్రాహ్మణుడు బోధిసత్త్వుని జూచి, ఆయనసన్నిధికి జేరెను.

బోధిసత్త్వు డిట్లు ప్రశ్నించి, మాణవకునిమాటలు విని 'రా, నీ తండ్రిని చూపుదును. పూర్వ మెవరి నైన దహనము చేసిరో లేదో పరీక్షింపుము' అని మరల వానితో పర్వతశిఖర మెక్కెను. మాణ వకుడు 'ఈమూడుశిఖరములనడుమ నెవ్వరిని దహనము చేయలేదు' అని పలుకగా బోధిసత్త్వుడు "మాణవకా, ఇక్కడ దగ్ధులయినవారి లెక్క లేదు. నీ తండ్రియే ఈరాజగృహముననే బ్రాహ్మణవంశమున పుట్టి, ఉపసాళహక నామముతో ఈత్రికూటములనడుమ పదునాలుగు వేలపర్యాయములు దగ్ధమయినాడు. ఈప్రపంచమున ఎవరో యొకరు దగ్ధముకాని తావుకాని, శ్మశానము కానిప్రదేశము గాని, శిరస్సులు తెగని చోటుగాని లభ్యము కాదు' అని పూర్వజన్మజ్ఞాన ముండుటచే ఈగాథలు పలికెను

ఉపసాళహక నామ మున్నట్టివాడు
పదునాల్గువేవురు భస్మమై రిచట
ఒకడైన నాశమ్ము నొందనిచోటు
ఈపృథివిపై గోచరించుట కల్ల.

సంశయాహింసలు సత్యధర్మములు
చెలగుచో టార్యులు సేవించు చుంద్రు
అది యనామయ మైన యట్టిది పృథ్వి.

ఈప్రకారము తండ్రికొడుకులకు బోధిసత్త్వుడు ఉపదేశము చేసి, బ్రహ్మవిహారములను భావించి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటించి జాతకములు సరిపోల్చెను. తోడనే పితాపుత్రులు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు లైరి. ఆకాలమున పితాపుత్రులు నేటి పితాపుత్రులే. తపస్వి నేనే.

# 167 సమిద్ధి జాతకము

శాస్త రాజగృహకపోతారామమున విహరించుచు సమిద్ధిస్థవిరుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు ఆయుష్మాన్ సమిద్ధి రాత్రియంతయును యోగాభ్యాసము చేసి అరుణోదయముననే లేచి స్నానము చేసి తన బంగరు దేహమును తడియార్చుకొనుకొనుచుండెను. అంతరవాసకము ధరించి ఉత్తరాసంగము చేతిపై వేసికొనెను. అతడు సుందరసువర్ణప్రతిమవలె తోచుచుండెను. అతనిశరీరము సమృద్ధమగుటచే అతనికి సమిద్ధి యని పేరు.

అతని శరీరసౌందర్యము విలోకించి ఒకానొక దేవకన్య ఆసక్తచిత్తయై అతనితో, "భిక్షూ, నీవు చిన్నవాడవు. యువానుడవు. నీ కేశములు నీలములు, సుందరములు, నీవు ఉత్తమయౌవనయుక్తుడవు, మనోహరుడవు, దర్శనీయుడవు. నీవు చిత్తము ప్రసన్నము చేయగలవు. నీవంటి శరీరి కామోపభోగములు విసర్జించి ప్రవ్రజించుటవలన లాభ మేమి? నీవు భోగము లనుభవించవలసిన కాల మిదియే. తరువాత నీవు ప్రవ్రజించి శ్రమణధర్మము పాలనము చేయవచ్చును" అన్నది.

ఆమెతో స్థవిరు డిట్లనెను: "దేవకన్యా, ఏ వయసున నేను మరణింతునో తెలియదు. మృత్యువు ఆవరించియే యున్నది. కావున యౌవనములోనే శ్రమణధర్మము ననుష్ఠించి దుఃఖము తొలగించుకొందును."

స్థవిరు డామె నాహ్వానింప లేదు. ఆమె అచటనే అంతర్ధానమయ్యెను.

శాస్తకడకు జని స్థవిరు డీ వృత్తాంతము విన్నవించెను. శాస్త అతనితో, "సమిద్ధీ! దేవకన్య నిన్ను ఇప్పుడే ప్రలోభపెట్ట లేదు; పూర్వముకూడ దేవకన్యలు ప్రవ్రజితులను ప్రలోభపెట్టిరి" అని అతని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో నొకానొక బ్రాహ్మణకుటుంబమున బుట్టి, పెద్దవాడయి, అన్నివిద్యలలోను నిపుణుడై, ప్రవ్రజించి, అభిజ్ఞలు సమాపత్తులు పొంది, హిమవత్ప్రదేశమున సరోవరప్రాంతమున నివసించుచుండెను.

ఆతడు రాత్రియంతయు యోగాభ్యాసపరుడయి, అరుణోదయానంతరము స్నానముచేసి, వల్కలము చేతబట్టుకొని, ఒడలు తుడిచికొనుచుండెను. ఆయన శరీరసౌభాగ్యమును గాంచి ఒకానొక దేవకన్య ప్రతిబద్ధచిత్తయై, బోధిసత్త్వుని ప్రలోభపెట్టుటకై యీ తొలిగాధ పలికెను.

అయినావు భిక్షువు వయిదువిధాల
సుఖభోగముల్ చవి చూడకుండగనె!
సుఖములు ముందు, భిక్షుకవృత్తి యవల:
భోగించు సమయమ్ము పోవనీయకుము!

బోధిసత్త్వుడు దేవకన్యవాక్కులు విని తన యభిప్రాయమును ప్రకటించు నీగాధ పలికెను

ఎరుగరాకున్నది మరణకాలంబు
గోచరించుట లేదు గుప్తకాలమ్ము,
అందుచే భిక్షువునైతి పొందకయె
భోగముల్, కాలమ్ము పోనీయ జాల

దేవకన్య బోధిసత్త్వునిపలుకులు విని, యచ్చటనే అంతర్ధానమొందెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములను మేళవించెను ఆకాలమున దేవకన్య అప్పటి దేవకన్యయే; తపస్వి నేనే.

# 168 సకుణగ్ఘి జాతకము

శాస్త జేతవనమున నివసించుచు తన యాలోచన సూచించు సకుణోవాదసూత్ర విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు శాస్త భిక్షువులను సంబోధించి, "భిక్షువులారా! మీకు యోగ్యమైన వానినే విచారణచేయుచుండుడు. పైతృకవిషయములను యోజించుచుండుడు" అని ఉపదేశ మిచ్చెను. ఇది సంయుక్త నికాయమునకు సంబంధించిన మహావర్గసూత్రము. శాస్త ఉపదేశ మిచ్చుచు "మీరు మాట నిలుపుకొనుడు. పూర్వకాలమున జంతువులు తమ పైతృకవిషయమును విడిచి అయోగ్యస్థానమున విచరించుటచే శత్రువుల చేతిలో చిక్కి తమ బుద్ధిబలముచే కౌశలముచే తప్పించుకొన్నవి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు కౌజుపిట్ట యయి నాగలి నడపుప్రదేశమున మట్టిపెళ్ళల దిబ్బలలో నివసించుచుండెను. ఒకనా డది తన ప్రదేశమున ఆహారము వెదుకక, మేతకై అడవివరకును జనెను. అచ్చట ఆహారము వెతుకుచున్న కౌజుపిట్టను జూచి డేగ ఆకస్మికముగా వచ్చి పట్టుకొనెను. డేగ పట్టుకొని దానిని కొనిపోవనుండగా కౌజు దుఃఖించుచు, 'మేము దురదృష్టవంతులము! మందపుణ్యులము! ఇంకొకరితావునకు బోవక పైతృక స్థానమున మేత మేయుచున్నచో డేగ నాతో పోరాడజాలకుండును' అనెను. 'నీపైతృకస్థాన మెక్కడ?' 'నాగలి ఆడించిన స్థలమున మట్టి దిబ్బలు.'

డేగ తనపట్టు సడలించి దానిని విడిచి 'కౌజుపిట్టా, పో. అక్కడకే వచ్చి నిన్ను పట్టుకొందును' అని పలికెను. కౌజు వెడలిపోయి, పెద్ద దిబ్బ యెక్కి "శ్యేనమా, ఇక రా, అని బిగ్గరగా బిలిచెను.

డేగ రెండురెక్కలు సారించి, ఒక్కసారిగా కౌజుపిట్టపై బడు

బోయెను. డేగ తనను సమీపించినప్పుడు పిట్ట పల్టీకొట్టి పెడ్డలదిబ్బ లోనికి బోయెను. డేగ వేగము నాపుకొనలేక దిబ్బకు గొట్టుకొనెను. దానిగుండె పగిలి, గ్రుడ్లు వెలుపలికి వచ్చి, ప్రాణములు పోయినవి.

శాస్త సమ్యక్సంబుద్ధు డయిన పిమ్మట ఈగాధ పలికెను:

విపినసమీపాన విచరించుచున్న
కోలంకి డేగ కన్గొని, దూకి చచ్చె
అణచుకోజాలక ఆత్మీయజవను.

డేగ మరణించిన పిమ్మట కౌజుపిట్ట, యీవలకు వచ్చి తనశత్రువు వీపు చూచి, సంతోషించి, వెన్నువిరిచి, ఉత్సాహముతో ఈగాధ పలికెను

పైతృకం బైన భూభాగంబునందు
కాంచుచు నిజవృద్ధి కౌశలంబునను
విచరింతు మోదాన; విగతశాత్రవుడ!

శాస్త ధర్మోపదేశము చేసి సత్యములను ప్రకటింపజేసి జాతకములు సరిపోల్చెను. అపుడు చాలమంది భిక్షువులు శ్రోతాపత్తి మొదలగు ఫలములు పొందిరి. అప్పటి డేగ దేవదత్తుడు, నేను కోలంకి పిట్టను

## 169 అరక జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మేత్తసూత్త విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు శాస్త భిక్షువులను సంబోధించి ఇట్లు చెప్పెను. 'భిక్షువు లారా, మైత్రీభావన (చిత్తవిముక్తి సాధన) సేవించుటచే, వృద్ధిచేయు టచే, ప్రచారముచేయుటచే, అభ్యాసముచేయుటచే, అనుష్ఠించుటచే, చక్కగా ఆరంభించుటచే, పదునొకండు లాభములు కలుగు ఆశ యుండవలెను. దేనినుండి పదకొండు? సుఖపూర్వకముగా నిద్రిం

చును, సుఖపూర్వకముగా మేలుకొనును, దుస్స్వప్నములు రావు, ప్రియము కలుగును. మానవేతరులప్రీతి జనియించును. దేవతలు రక్షింతురు. దీనిపై అగ్ని విష శస్త్ర -ఆదుల ఆక్రమణ ముండదు. చిత్తము శీఘ్రముగా శాంతినొందును. ముఖవర్ణము సుందర మగును. స్మృతితోడనే దేహము విడచును. తప్పక బ్రహ్మలోకగామి యగును. భిక్షువులారా, చిత్తమునకు విముక్తిని ప్రసాదించు మైత్రీభావనను సేవించుటచే ఈ పదునొకండు లాభములు కలుగు నవకాశ మున్నది. ...కరుణాభావన, ముదితాభావన, ఉపేక్షాభావన, నాల్గు బ్రహ్మవిహారములు అభ్యాసము చేయవలెను. ఇట్లు చేసినచో మార్గము, ఫలము లభింపకున్నను ప్రాణి బ్రహ్మలోకగామి అగును. పూర్వముకూడ పండితులు ఏడుసంవత్సరములవరకు మైత్రీభావన అవలంబించి సప్తసంవర్త వివర్తకల్పములవరకు బ్రహ్మలోకమునం దుండును" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

అతీతకల్పములలో నొకదానియందు బోధిసత్త్వ డొకానొక బ్రాహ్మణవంశమున బుట్టి పెద్దవా డయి, కామము విడిచి, ప్రవ్రజించి, నాలుగు బ్రహ్మవిహారములను పొంది, అరకు డనుపేర శాస్త యయి, హిమవత్ప్రదేశమున నివసించుచుండెను. అతనికి బహుపరివార మేర్పడెను. అతడు ఋషిగణమున కుపదేశ మిచ్చుచు "ప్రవ్రజితుడు మైత్రిని భావించి అభ్యసింపవలెను. కరుణ, ముదిత, ఉపేక్షలు భావించి అభ్యాసము చేయవలెను. మైత్రితోగూడిన చిత్తము అర్పణసమాధిని, బ్రహ్మలోకపరాయణతనుగూడ పొందగలదు" అని మైత్రీ భావనను ప్రశంసించువాడై యీగాథలు పలికెను:

మైత్రితో గూడిన మనసుతో నెవరు
అపరిమేయం బైన అనుకంపతోడ
ఊర్ధ్వలోకాలలో నున్నవారలను,
మధ్యమాధోలోకమానవావళిని,
విహితచిత్తములతో వీక్షించుచుంద్రు,
శుభకామనలతోన జూతురు, వారి
నిందుకర్మలుకూడ నిశ్శేషమగును.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు తనశిష్యులకు మైత్రీభావమును ప్రశంసించి, అపరిహీనధ్యానుడై బ్రహ్మలోకమున బుట్టి, సప్తసంవర్త వివర్త కల్పములవరకును ఈలోకమున జన్మింప లేదు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పటి ఋషిగణము ఇప్పటి బుద్ధపరిషత్తు. అరకనామకు డైన ఉపదేష్ట నేనే.

## 170 కకంటక జాతకము

ఈ కకంటకజాతకము మహా-ఉమ్మగజాతకమున ( 546 ) గాన వచ్చును.

## 171 కళ్యాణధమ్మ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక అత్తగారినిగూర్చి చెప్పినది

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొక కుటుంబికుడు శ్రద్ధావంతుడు, ప్రసన్న చిత్తుడు. అతడు త్రిశరణములను పంచశీలములను పొందియుండెను.

ఒకనా డతడు ఘృతము మొదలగునవియు పుష్పములు, సుగంధ ద్రవ్యములు, వస్త్రములు, వెంటగొని ధర్మోపదేశము వినుటకై శాస్త సన్నిధికి బోయెను.

అతడు చనినంతనే అత్తగారు ఖాద్యవస్తువులు కొని పుత్రికను చూడబోయెను.

ఆమె కొమార్తెతోకూడ భోజనముచేసి విశ్రాంతి తీసుకొనుచు, పుత్రికతో "అమ్మా, నీభర్త ప్రసన్నుడుగా నుండునా?" ఆయన వివాదము పెట్టుకొనక ప్రీతిపూర్వకముగా నుండునా? అనెను.

"అమ్మా, యేమి చెప్పుదును? మీ అల్లునివంటి శీలవంతుడు, సదాచారసంపన్నుడు ప్రవ్రజితులలోకూడ కానరాడు."

ఆ ఉపాసిక కొమార్తెపలుకులు పూర్తిగా వినక ప్రవ్రజిత శబ్దము మాత్రము గమనించి, "అమ్మా, నీభర్త యేల ప్రవ్రజించినాడు?" అని యేడువ జొచ్చెను.

ఇంటిలోనివా రందరు "మాయజమాని ప్రవ్రజించినాడు" అని యేడువ సాగిరి.

ఆ యేడ్పులు విని ద్వారముకడ గుమికూడిన లోకులు "ఏల ఏడ్చుచున్నారు? ఈ ఇంటియాజమాని ప్రవ్రజించినాడా?" అనిరి.

ఆ కుటుంబికుడు బుద్ధునిఉపదేశములు విని, విహారము వెలువడి, నగరము ప్రవేశించినంతనే ఒక డతనిని మార్గమున చూచి, "సౌమ్యా, మీయింటిలో బిడ్డలు, భార్య, చుట్టములు మీరు ప్రవ్రజించినా రని ఏడ్చుచున్నారు" అనెను.

"నేను ప్రవ్రజింపలేదు. అయినను లోకులు అన్యథా భావించు చున్నారు. నన్ను ప్రశంసించుచున్నారు. ఈ యవకాశమును పోగొట్టు కొనరాదు. నేడే నేను ప్రవ్రజింపవలెను" అని అతడు భావించి అచటనుండియే శాస్తకడకు మరలిపోయెను. "ఉపాసకా! ఇప్పుడే నీవు బుద్ధసేవకై వచ్చి వెడలిపోయి త్వరలోనే మరలి వచ్చితి వేమి?" అని శాస్త అడిగెను. ఆతడు విషయము విన్నవించి, "భన్తే, లోకులు నన్ను ప్రశంసించుచున్నారు. మంచిపేరు పోగొట్టుకొనరాదు. ప్రవ్ర జించు కోరికతో మరలి వచ్చినాను" అనెను.

ఆతడు ప్రవ్రజించి ఉపసంపద పొంది ఉత్తమవిధానమున జీవిత మును గడపుచు శీఘ్రకాలములోనే అర్హాతు డాయెను.

ఈవిషయము భిక్షుసంఘమున వ్యాప్తమయ్యెను. ఒకనాడు ధర్మ సభలో, భిక్షువులు, "ఆయుష్మంతులారా, ఫలానికుటుంబి లోకప్రశంస విని మంచిపేరు పోగొట్టుకొనరా దని యెంచి ప్రవ్రజించి అర్హాతు డైనాడు" అనుకొనిరి.

శాస్త్ర అచటికి కరుదెంచి, "భిక్షువులారా, ఇచట కూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అని యడుగగా వారు ఫలాని విషయము అని చెప్పిరి. అప్పుడు శాస్త్ర, భిక్షువులారా, పూర్వకాలమున పండితులుకూడ ప్రశంస విని మంచిపేరు పోగొట్టుకొనక ప్రవ్రజించిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠికులమున బుట్టి, పెద్దవాడయి, తండ్రియనంతరము శ్రేష్ఠిస్థానమును బొందెను. ఒకనాడతడు ఇలువెడలి రాజదర్శనార్థము చనెను.

తనపుత్రికను జూచుకోరికతో అతనియత్త యింటికి వచ్చెను. ఆమె కొంచెము చెమిటిది యగుటచే ప్రాతవిషయమంతయు వర్తమానకథవలె నుండును.

శ్రేష్ఠి రాజదర్శనము చేసి నిజగృహమునకు మరలివచ్చుచుండగా నొకడు చూచి "మీరు సన్యసించినారని మీయింట నందరు పెద్దపెట్టున రోదనము చేయుచున్నా" రని పలికెను.

'ఉత్పన్నమైన కల్యాణధ్వనిని అణచివేయరాదు' అని భావించి బోధిసత్త్వుడచటినుండియే మరలి, రాజసన్నిధికి బోయెను. 'ఏమి మహాశ్రేష్ఠీ, ఇప్పుడేకదా వెడలిపోతివి. మరల వచ్చినావేమి?' అని రాజు ప్రశ్నించెను.

'దేవా, నేను ప్రవ్రజింపనిదే ప్రవ్రజించినట్లు మాయింట పరిదేవనము చేయుచున్నారట. పుట్టిన కల్యాణవార్తను అణపరాదు. కావున ప్రవ్రజింతును. దేవర నాకనుజ్ఞ దయచేయవలెను' అను భావమును వెలిబుచ్చు నీగాథలు పలికెను.

మంచి పేరుప్రతిష్ఠ లభించునేని
రాజ, లోకాన విడనాడరాదు దాని-
బుద్ధిమంతుండు: భారంబు బూనవలయు
చిట్టచివరకు పెనులజ్జచేత నైన.

నేను నా కట్టికీర్తి జన్మించె రాజ,
మంచిపేరు సైతము లభియించె కాన
ప్రవ్రజించెద: సుఖభోగవాంఛ లేదు.

బోధిసత్త్వు డిట్లు పలికి, రాజుకడ ననుజ్ఞ వడసి, హిమవత్ప్రదేశము నకు బోయి, ప్రవ్రజించి, అభిజ్ఞలను, సమాపత్తులను పొంది, బ్రహ్మ లోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; వారాణసీశ్రేష్ఠి నేనే.

## 172 దద్దర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోకాలిక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆకాలమున బహుశ్రుతు లనేకులు మనశ్శిలాఖండముక్రింద తరుణ సింహము గర్జించునట్లును, ఆకాశమునుండి గంగానది అవతరించు చున్నట్లును భిక్షుసంఘములో పఠనము చేయుచుండిరి.

కోకాలికభిక్షువు తన స్వల్పజ్ఞానమును గమనింపక భిక్షువులు పఠనము చేయునప్పుడు తానుకూడ పఠనముచేయు తలంపుతో భిక్షువులలోనికి పోయి సంఘముపేరును తలపెట్టక 'భిక్షువులు నన్ను పఠింపనిచ్చుట లేదు; పఠింపనిచ్చినచో నేనుకూడ పఠింతును' అనుచు అక్కడక్కడ తిరుగుచుండెను.

అతడాడినమాటలు సంఘమునకు తెలిసెను. భిక్షువు లతనిని పరీక్షింపదలచి, 'ఆయుష్మన్, కోకాలికా, నేడు సంఘసమక్షమున పఠనము చేయుము' అనిరి. అతడు నిజశక్తిని గ్రహింపక స్వీకరించెను.

అంతట నాతడు తనకు అనుకూలించు గంజి త్రాగెను. భోజనము

చేసెను. అనుకూలమగు పప్పు భుజించెను.

సూర్యాస్తమయమైనది. ధర్మమునాకర్ణించు సమయసూచన అయినపిమ్మట భిక్షుసంఘము సమావిష్టమయ్యెను. అతడు కురంటక పుష్పసదృశమగు కాషాయవస్త్రము ధరించి గన్నేరుపువ్వువంటి ఎఱ్ఱని చీవరము కప్పుకొని సంఘమునకుమకు బోయి స్థవిరులకు ప్రణామము చేసి, అలంకృతరత్నమంటపమున పరచిన శ్రేష్ఠాసనముపై గూరుచుండి రంగుల విసనకఱ్ఱ జేతపట్టి పఠింప నారంభించెను. అప్పు డాతనిమేన చమట రాలజొచ్చెను. అతడు సిగ్గుపడి పూర్వగాథలో, ప్రథమపాదముమాత్రము చెప్ప గలిగెను. ఆవల ఏమియు చెప్పలేక పోయెను. అతడు కంపముతో ఆసనమునుండి దిగి సిగ్గుతో సంఘము నడుముగా నడచి తన ఆవరణములోనికి బోయెను.

బహుశ్రుతుడైన ఒకానొక భిక్షువు ఆసమయమున పఠనము చేసెను కోకాలికుడు అజ్ఞాని యని స్పష్టమయ్యెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో మాటాడుచుండిరి. 'ఆయుష్మంతులారా! మొదట కోకాలికుని అజ్ఞానముసంగతి అజ్ఞాతముగా నుండెను. ఇప్పుడు స్వయముగా నతడు అజ్ఞానమును ప్రకటీకరించుకొనెను.'

శాస్త అరుగుదెంచి, 'భిక్షువులారా, ఇప్పుడిచట, గూరుచుండి ఏమి సంభాషించుచున్నారు!' అని యడుగగా ఫలాని విషయమని వారు చెప్పగా 'భిక్షువులారా, కోకాలికుడు ఇప్పుడే కాదు, పూర్వము కూడ స్వయముగా అజ్ఞానమును ప్రకటించుకొన్నాడు' అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున సింహగర్భమున బుట్టి అనేక సింహములకు రాజాయెను. ఆ సింహము బహుపరివారముతో రజత గుహలో వాసము చేయుచుండెను. ఆగుహకనతిదూరమున నొకానొక గుహలో నక్క నివసించుచుండెను.

ఒకనాడు వర్షము కురిసి వెలిసినపిమ్మట సింహములన్నియు మృగరాజగుహాద్వారముకడ గుమిగూడి, సింహనాదములు చేయుచు

క్రీడించుచుండెను. ఆసమయమున నక్కకూడ ఊళపెట్టెను.

సింహము లాధ్వని వినగానే 'ఈసృగాలముకూడ మనతోపాటు నాదము జేయుచున్నది' అని సిగ్గువడి మౌనము వహించెను. అవి గర్జింపకుండుట చూచి బోధిసత్త్వునిపుత్రు డగు సింహపోతము 'నాయనా, ఈసింహములు క్రీడించుచు ఏదోధ్వని విని సిగ్గుపడి యూరకున్నవి. నిజధ్వనిచే ఆత్మప్రకటనము చేసికొన్న యీజంతు వేది?' అని తండ్రి నడుగుభావముతో తొలిగాథ పలికెను:

భూరిరవమున దద్దరభూధరమ్మ
నెద్ది మార్మ్రోగు నట్లు కావించె, నిపుడు
సింహములుకూడ ప్రతిగర్జ చేయలేదు
దేనిమూలాన మృగరాజ, తెలుపవలయు.

-బిడ్డనివాక్కులు విని తండ్రి ఈగాథ పలికెను:

జంతుసంతతియందు నీచంబు నక్క;
తాత, అట్టి సృగాలంబు కూతపెట్టె.
నీచజాతియెడం గల్గు నిరసనమున
సింహసంఘము ప్రతిగర్జ చేయలేదు.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున కోకాలికుడు నక్క; సింహశాబకము రాహులుడు; మృగరాజు నేనే

# 173 మర్కట జాతకము

శాస్త్ర జేతవనమున నివసించుచు ఒకానొక మోసగాని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఈకథ ప్రకీర్ణకనిపాతములోని ఉద్దాలకజాతకమున వచ్చును (487).
ఆసమయమున శాస్త్ర, "భిక్షువులారా, ఈభిక్షువు కేవల మిప్పుడే

కాదు, పూర్వముకూడ మర్కటముగా నుండి అగ్నికై మోసము చేసినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో నొక కుగ్రామమున బ్రాహ్మణవంశమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలలో విద్యలు నేర్చి, గృహస్థయ్యెను. ఆయనకు కుమారుడు కలిగి, కొంచెము పెరిగి గంతులువేయు వయసు వచ్చునప్పటికి వానితల్లి మరణించెను, బోధిసత్త్వుడామెకు కర్మలు చేసి, ఇంక నింటనుండుటకు నాకే మున్నదని కుమారుని దీసికొని, అశ్రుముఖు లయిన జ్ఞాతులతో జెప్పి, హిమవత్ప్రదేశమునకు బోయి ప్రవ్రజించి, కందమూలఫలాదులు తినుచు నివసించుచుండెను. ఒక నాడు వర్షము కురియుచుండగా ఎండుకట్టెలకు నిప్పు ముట్టించి, ఆయన ఫలకముమీద పండుకొనెను. ఆయనపుత్రుడు తాపసకుమారుడు తండ్రిపాదములు నిమురుచు కూరుచుండెను.

ఒకానొక వనమర్కటము చలికి వ్యధచెందుచు, ఆపర్ణశాలలో అగ్ని వెలుగుచుండుట చూచి, "నేను లోనికి బోయితినేని కోతి కోతి యని నన్ను వెడలగొట్టుదురు. చలి కాచుకొనుటకు వీ లుండదు. ఒక ఉపాయము తోచుచున్నది. తాపసవేషము తాల్చి, మోసగించి లోన ప్రవేశింతును" అని తలచి మృతి నొందిన తాపసునివల్కలములు ధరించి, దండకమండలములు తీసికొని, పర్ణశాల కెదురుగా నున్న తాళవృక్షము మొదట ముడుచుకొని కూరుచుండెను. తాపసకుమారుడు దానిని జూచి మర్కట మని గ్రహింపక "ఎవరో వృద్ధతాపసుడు శీతపీడితుడై చలికాచుకొనుటకు వచ్చియుండు నని తలచి, లోని కాహ్వానింప నెంచి, తండ్రితో ఈగాథ పలికెను :

> నాయనా, అదిగో, మాణవకుండు చూడు!
> తాళావనీజంబుదరి నున్నవాడు;
> ఒసగుదమా యింట నొక్కింత చోటు?

బోధిసత్త్వుడు కుమారునిమాటలు విని లేచి, ద్వారము కడకు బోయి చూచి, అది మర్కట మని గ్రహించి "నాయనా, మానవుల

కిట్టిముఖు ముండదు. ఇది మర్కటము. దానిని పిలువరాదు'' అని ఈ గాథ పలికెను :

> దానిని బిలువకు తండ్రి, లోపలికి
> జేరుచో నది పాడుచేయు గృహంబు!
> యోగ్యభూసురముఖం బుండ దీరీతి.

ఇట్లు పలికి కొరవి తీసికొని ఇంకను నిలిచియున్నా వని త్రిప్పి బెదరించి దానిని పారద్రోలెను. మర్కటము వల్కాదులు విడిచి, వృక్షమెక్కి, వనతరుషండములో ప్రవేశించెను. బోధిసత్త్వుడు నాలుగు బ్రహ్మవిహారములను భావించి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మర్కటకము ఈభిక్షువు; తాపసకుమారుడు రాహులుడు; తపస్వి నేనే.

## 174 దూభియ మక్కట జాతకము

శాస్త వేళువనమున నివసించుచు దేవదత్తునిగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై దేవదత్తుని కృతఘ్నతనుగూర్చి, మిత్రద్రోహభావననుగూర్చి చర్చజేయుచుండిరి. శాస్త 'భిక్షువులారా, దేవదత్తు డిపుడే కాదు, పూర్వముకూడ కృతఘ్నుడు, మిత్రద్రోహి' అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముజేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున చిన్నగ్రామములో బ్రాహ్మణవంశమున

బుట్టి, పెద్దవాడయి, గృహస్థాయెను. ఆ కాలమున కాశీరాష్ట్రమున పోవు పెద్దమార్గముప్రక్కన లోతునూయి కలదు. చతుష్పాత్తులకు నీరందదు. కావున త్రోవన జను పుణ్యాత్ములు పొడుగుత్రాటిబొక్కెనతో నీరు తోడి ప్రక్కన తొట్టిలో బోయుదురు. జంతువులు త్రాగుచుండును. దానిచుట్టును అరణ్యము కలదు. అందు మర్కటములనేకము కలవు. మూడురోజులామార్గము వెంట జనుల రాకపోకలు లేవు. జంతువులకు నీరు లేదు. దప్పిగొన్న కోతి యొకటి నీటికై వెదకుచు, నూతిచుట్టుపట్టుల తిరుగుచుండెను.

ఏదో పనిమీద పోవుచున్న బోధిసత్త్వుడు ఆనూతికడకు వచ్చి నీరు తోడి, కాలుసేతులు కడిగికొని, ఉదకము త్రాగి, ఆమర్కటమును జూచి, దప్పిగొన్నదని గ్రహించి, నీరు తోడి తొట్టినిండ బోసెను. అనంతర మాయన విశ్రమింప దలచి చెట్టుక్రింద పండుకొనెను.

మర్కటము నీరు త్రాగి, అనతిదూరమున గూరుచుండి, బోధిసత్త్వుని వెక్కిరించుచు బెదరించెను. ఆయన చూచి 'అరే దుష్ట మర్కటమా, నీవు దప్పిగొని శ్రమపడుచున్నప్పుడు నీకు నీరు పోసితిని. ఇప్పుడు నీవు నన్ను వెక్కిరించుచున్నావు. అహో, పాపాత్ములకు జేసిన యుపకారము నిరర్థకము గదా!' అని యీగాధ పలికెను.

ఆతపతప్తమైనపుడు నీ కేను
తొలగింప దాహమ్ము సలిల మిచ్చితిని;
కన వింత కిలకిలధ్వనులు చేయుదువు!
పరిహరించుటె మేలు పాపసంగతిని

అది విని మిత్రద్రోహి మర్కటము "ఇంతటితో సమాప్తమయ్యెననుకొంటివా?" ఇప్పుడు నీశిరస్సుపై మలమోచనము జేసిపోవుదును" అని యీగాధ పలికెను

వింటివా యెప్పుడైన వీక్షించినావ
మర్కటమ్ములయందు మంచివర్తనము?
మలమోచనము నీదు తలమీద చేయు
వాడ, నియ్యది మాస్వభావమ్ము సుమ్ము!

బోధిసత్త్వుడు లేచి, పోనజొచ్చెను. తక్షణమే మర్కట మొకరి శాఖపై కెక్కి, కర్ర మీదవేయునట్లు ఆయన శిరస్సుపై మలము విడిచి,

కీచుమనుచు అరణ్యములో జొరబడెను. బోధిసత్త్వుడు స్నానము జేసి, వెడలిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మర్కటము దేవదత్తుడు; బ్రాహ్మణుడు నేనే.

## 175 ఆదిచ్చు పట్ఠాన జాతకము

శాస్త జేతవనమున నివసించుచు, ఒకానొక మోసగానివిషయమై చెప్పినది. వర్తమానకథ పూర్వోక్తకథవలెనే ఉండును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున బ్రాహ్మణకుటుంబమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలలో సర్వవిద్యలు నేర్చి, ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, గణనాయకుడయి, బహుపరివారముతో హిమవత్ప్రదేశమున వాసము చేయుచుండెను. అతడచ్చట చిరకాలముండి, లవణాదికమునకై పర్వతము దిగి, ప్రత్యంతగ్రామము చేరి, పర్ణశాలలో నివసించుచుండెను

ఋషులు భిక్షార్థము వెడలిపోయిన కాలమున ఒకానొక లోల మర్కటము ఆశ్రమపదమున ప్రవేశించి, పర్ణశాల పైకప్పు చిందరవందర చేసి, ఘటములలోని జలము విరజల్లి, కుండికలు పగులగొట్టి, అగ్నిశాలలో మలమూత్రములు విడుచుచుండెను.

తాపసులు వర్షాకాలము గ్రామములో గడిపి, "ఇప్పుడు హిమవంతము పుష్పఫలసమృద్ధమై రమణీయముగా నుండును. కావున అచ్చటికే పోవుదము" అని తలచి, గ్రామవాసులతో జెప్పి వీడ్కోలు పొందిరి. "భదంతులారా, రేపు మేము భిక్షలు తీసికొని ఆశ్రమ

పదమునకు వత్తుము. వాని నారగించి మీరు పోవచ్చును” అని గ్రామ వాసులు పలికిరి.

జనులు మరునాడు విశేషముగా ఖాద్యభోజ్యములను బట్టుకొని యచటికి వచ్చిరి. మర్కట మది చూచి “వీరిని వంచించి, నాకు ఖాద్యములు తెచ్చి నన్ను పూజించునట్లు చేయుదు” నని తలపోసి, తపస్సు చేయుదానివలె, శీలము కలదానివలె నటించుచు, తాపసుల కనతి దూరమున సూర్యనమస్కారము చేయుచుండెను. జనులు దానిని జూచి, “శీలవంతులసమీపమున నున్నవారును శీలవంతు లగుదురు” అని యీగాథ పలికిరి

సర్వజంతువులన్ సదాచార ముంచు :
కనుడు సూర్యు నర్చించు శాఖామృగమును.

ఇట్లు వారు దానిగుణములను ప్రశంసించుచుండగా బోధిసత్త్వుడు చూచి “మీ రీ లోలమర్కటశీలాచారాదులు గ్రహింపక అయోగ్య వస్తువునెడల ప్రసన్ను లయినారు” అని యీగాథ పలికెను.

దీనిస్వభావంబు తెలియక మీర
లగ్గించుచున్నా వా; రగ్నిగృహమ్ము
దూషిత మొనరించి దుష్టమర్కటము
రెండుకుండికలను పిండి చేసినది!

మర్కటప్రవంచన గ్రహించి జనులు మట్టిపెడ్డలతో కర్రలతో దానిని తరిమి, ఋషులకు భిక్ష మిచ్చిరి. ఆవల ఋషులు హిమవంత మునకు బోయి అపరిహీనధ్యానమున బ్రహ్మలోకపరాయణు లయిరి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున మర్కటము ఈ మోసగాడు; ఋషిగణము బుద్ధసంఘము; గణశాస్త నేనే.

# 176 కలాయముట్ఠి జాతకము

శాస్త జేతవనమున నివసించునప్పుడు కోసలనరేశునివిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనారి వర్షాకాలమున కోసలనరేశుని రాష్ట్రములో విద్రోహులు చెలరేగిరి. అచట నున్న రాజయోధులు ద్రోహులతో మూడుపర్యాయములు పోరాడి వారిని జయింపలేక రాజసన్నిధికి వార్త పంపిరి.

అసమయమైనను, రాజు వర్షాకాలములోనే బయలుదేరి, జేతవన సమీపమున స్కంధావార మేర్పరచి "గోతులు, గుంటలు నీళ్ళతో నిండియున్నవి. మార్గము దుర్గమ మైనది. ఇప్పుడు నేను శాస్తకడకు పోయి ఆయన ప్రశ్న చేసినచో విషయము వివరింతును. శాస్త కేవలము పారలౌకికవిషయములే కాక ఇహలోకవిషయములగూడ నాకు లాభించునట్లు సూచన చేయగలరు" అనుకొని శాస్త సన్నిధికి జని ప్రణామము చేసి ఒకప్రక్కన కూరుచుండెను.

శాస్త, "మహారాజా, ఇంత ప్రొద్దెక్కి ఎట్లు వచ్చితిరి?" అని అడిగెను.

"భన్తే, నేను రాష్ట్రభాగమున శాంతపరచుటకై బయలువెడలి తమకు ప్రణామము చేయు కోరికతో వచ్చినాను."

శాస్త, "మహారాజా, పూర్వకాలమునకూడ సైన్యము సిద్ధము చేసి పండితులమాట విని రాజులు అసమయ మగుట గ్రహించి దండయాత్ర చేయలేదు" అని, రాజు ప్రార్థించిన పిమ్మట పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అతనికి అర్థధర్మానుశాసకు డయిన సర్వార్థకామాత్యుడయ్యెను. సరిహద్దువారు తిరుగుబాటు చేసి రాజుకు సందేశమంపిరి.

రాజు వర్షాకాలమున బయలుదేరి ఉద్యానవనమున స్కంధావారము నెలకొల్పెను. బోధిసత్త్వుడు రాజుకడనే నిలిచి యుండెను.

ఆక్షణమున అశ్వములకొఱకు బఠాణీలు నానబోసి తెచ్చి, తొట్లలో పోసిరి. ఉద్యానములోని కోతులలో నొకటి చెట్టు దిగి, బఠాణీలు నోట బోసికొని, గుప్పిలినిండ బట్టుకొని, ఎగిరి చెట్టెక్కి, తినసాగెను. తినుచుండగా దాని చేతినుండి గింజయొకటి నేలపై రాలెను. అప్పు డది నోటిలో గుప్పిలిలో నున్న గింజ లన్నిటిని క్రింద పారబోసి, అది వరకు నేల రాలిన గింజకై చెట్టు దిగి వెదుక నారంభించెను. అది కన బడకపోవుటచే మరల వృక్ష మెక్కి, జూదములో వేలనాణెములు కోల్పోయిన వానివలె విచారించుచు, ఏడుపుమొగముతో శాఖపై గూరుచుండెను.

మర్కటము చేసినపని చూచి రాజు బోధిసత్త్వుని సంబోధించి, 'వయస్యా, కోతి యిట్లు చేసిన దేమి?' అని యడిగెను. 'మహారాజా, విశేషమును గమనింపక, అల్పవిషయమును గమనించు దుర్బుద్ధులగు మూఢు లిట్లే చేయుదురు' అని బోధిసత్త్వుడు ఈగాథ పలికెను.

ఈచెట్లపై గంతు లిడు వానరమ్ము
కాదు బుద్ధియు ప్రజ్ఞ కలది నృపాల!
నేలమీద బఠాణి నెమకుటలోన
గుప్పెడు గింజలు కోలుపోయినది.

ఇట్లు పలికి, బోధిసత్త్వుడు రాజును సంబోధించి మరల నీగాథ చెప్పెను

పశులైన మనమైన స్వల్పలాభంబు
కొఱకు విశేషంబు కోలుపోవుదుము
పేరాస యుదయింప నీరీతి రాజ!

రా జామాటలు విని అచ్చటినుండి మరలి, వారాణసికే జేరెను. రాజు చోరమర్దనము చేయుదు నని నగరము వెలువడినట్లు విని చోరులు సరిహద్దులకు పారిపోయిరి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను ఆకాలమున రాజు ఆనందుడు; పండితామాత్యుడు నేనే.

# 177 తిందుక జాతకము

శాస్త జేతవనమున నున్నప్పుడు ప్రజ్ఞాపారమితనుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

మహాబోధిజాతకములో (528), ఉమ్మగ్గజాతకములో (546) వచ్చు వర్ణనమువలెనే శాస్త తన ప్రజ్ఞాప్రశంస ఆకర్ణించి "భిక్షువులారా! తథాగతుడు కేవల మిప్పుడే ప్రజ్ఞావంతుడు కాడు, పూర్వముకూడ ప్రజ్ఞావంతుడు, ఉపాయవంతుడుగా నుండెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు వానర మయి పుట్టి, యెనుబదివేల వానరములతో హిమాలయమున నివసించుచుండెను.

అచటి కనతిదూరములో సరిహద్దుగ్రామము కలదు. ఒకప్పు డందు జనులు నివసించుచుందురు; ఒకప్పుడు గ్రామము నిర్జన మగుచుండును. ఆగ్రామమధ్యమున శాఖాపత్రఫలభరిత మైన తిందుకవృక్షము కలదు. జనులు లేనపుడు వానరములు వచ్చి, ఫలములు తినుచుండును. అనంతరము పండ్ల ఋతువు వచ్చినపుడు గ్రామములోనికి జనులు వచ్చి నివాసములచుట్టును కోరడివేసి, ద్వారముకూడ పెట్టిరి. తిందుకవృక్షశాఖలు ఫలభారముచే వంగియుండెను.

"నిరుడు గ్రామములో మనము పండ్లు తిన్న చెట్టు ఈయేడు కాచి నదా కాయలేదా? గ్రామములో జను లున్నారా లేరా? అని యోచించి చూచివచ్చుటకై వానరము లొక కోతిని బంపెను. అది పోయి చూచివచ్చి వృక్షము ఫలభరితె మనియు, గ్రామము జనభరితె మనియు జెప్పెను. చెట్టునిండ పండ్లు కలవని వినగానే మధురఫలములను భుజింపవచ్చు నని వానరములకు మహోత్సాహము కలిగెను. కోతులు వానరేశుని సన్నిధికి బోయి యీవిషయము తెలిపెను. 'గ్రామములో

జను లున్నారా, లేగా?" అని ఆయన అడిగెను.

"ఉన్నారు దేవా," 'అట్లయిన మరలి రండు. జనులు మిక్కిలి మాయావులు.' 'దేవా, అర్ధరాత్రమున జనులు నిద్రపోవునపుడు మేము పోయి పండ్లు తిందుము.'

అనేకవానరములు పోయి వానరేశుని ఒప్పించి, హిమాలయము నుండి దిగి, ఆగ్రామమునకు నాతిదూరమున పెద్దపాషాణతలముపై బండుకొని, జనుల నిద్రాసమయమునకై ప్రతీక్షించుచుండెను. అర్ధరాత్రమున కోతులు చెట్టెక్కి పండ్లుతినెను. బయటికి పోవుటకై యిలు వెడలిన మానిసి యొకడు కోతులను జూచి గ్రామవాసులకు తెలియపరచెను. తోడనే జను లనేకులు విల్లంబులు, వివిధాయుధములు తీసికొని వచ్చిరి. కొందరు మట్టిపెడ్డలు కఱ్ఱలు పుచ్చుకొని చెట్టు చుట్టు నిలిచి, తెల్లవారినపిదప కోతులను పట్టుకొన వచ్చునని తలచిరి.

మానవులను జూచునప్పటి కన్నికోతులకును మరణభయము కలిగెను. వానరేశుడు తప్ప తమకు వేరొక శరణము లేదని తలచి కొన్నికోతులు బోధిసత్త్వుని సన్నిధికి జని, ఈగాథ పలికెను.

ధనువులు, బాణముల్ తాల్చినవారు,
ఉత్తమనిస్త్రింశయుక్తులౌ వారు
ఆవరించినవార లన్నిదిక్కులను,
మన కింక ముక్తికి మార్గ మెక్కడిది?

వాని వాక్కులు విని బోధిసత్త్వుడు 'భయము వలదు. మానవుల కనేకకార్యము లుండును. మధ్యమయామము మింకను గడువలేదు. మిమ్ము సంహారింప నుద్దేశించిన కార్యమునకు విఘ్నము కలిగించు వేరొకపని కల్పింపుడు" అని వాని నోదార్చి, ఈగాథ పలికెను

జనులకు నెన్నియో పను లుండు కాన
నొక్కప్రయోజన ముదయింపవచ్చు
తిందుకమ్ములు మీరు తినుచుండ నగును

ఈ ప్రకారముగా మహాసత్త్వు డెల్లరకు నుత్సాహము కలిగించెను. 'అన్ని వానరముల నొకచో జేర్పుడు' అని చెప్పెను. అందరును సమావిష్టులై బోధిసత్త్వుని మేనల్లుడు సేనకుడు కనబడలే దని చెప్పిరి. 'సేనకుడు రాకున్నను భయము లేదు. వా డిప్పుడే మంచిపని చేసి

వానరములు వచ్చునప్పటికి సేనకుడు నిద్రపోవుచుండెను. అతనికి మెలకువ వచ్చునప్పటికి అన్నియు వెడలిపోయెను. అతడు లేచి, బయలుదేరిపోవుచు త్రోవలో జనులను జూచి, వానరముల కేదో ప్రమాదము సంభవించె నని తలచి, ఊరివెలుపల నిప్పుమంట వేసి కొనుచున్న స్త్రీని చూచి పొలమునకు బోవు కుర్రవానివలె నటించి, కాగడా వెలిగించి గాలి తోలుచున్న వైపుగా ఊరికి చిచ్చుపెట్టెను.

జనులు వానరములను విడిచి, నిప్పు చల్లార్పుటకు పరుగెత్తిరి. వానరములు సేనకునకు ఒక్కొక్కపండుచొప్పున కోసిపెట్టి పలాయనము చేసెను.

**శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున మేనల్లుడు సేనకమహానామ శాక్యుడు. వానరసమూహము బుద్ధపరిషత్తు. వానరేశుడు నేనే.**

# 178 కచ్ఛప జాతకము

**శాస్త జేతవనమున ఉన్నప్పుడు ప్లేగువ్యాధినుండి విముక్తుడైన జనుని గూర్చి చెప్పినది.**

## వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొకకుటుంబమున అహివాతక రోగము (ప్లేగు) బయలుదేరినది. తల్లిదండ్రులు పుత్రునితో, "నాయనా, ఈ ఇంట నుండవలదు. గోడ బ్రద్దలు కొట్టి పారిపొమ్ము. ఎచ్చటనో ఒకచోట ప్రాణములు రక్షించుకొనుము. అవల మరలి రావచ్చును. ఈ ప్రదేశమున చాలధనము భూస్థాపిత మైనది. దానిని పెకలించి కుటుంబముతో పాటు సుఖముగా నుండువచ్చును" అని చెప్పిరి.

కుమారుడు వారిమాటచొప్పున గోడ బ్రద్దలుచేసి వెడలిపోయి రోగము తొలగిపోయిన పిదప మరలివచ్చి ధనము వెలికితీసి నివాసము చేసెను. ఒకనా డతడు ఘృతము తైలము, వస్త్రాదులు పట్టించుకొని

జేతవనమునకు జని శాస్తకు ప్రణామము చేసి కూరుచుండెను. శాస్త కుశలప్రశ్న మడిగి, "మీ యింట అహివాతకరోగము వ్యాపించిన దని విన్నాను. ఎట్లు నీవు తప్పించుకొని బ్రతికితివి" అనెను.

అతడు నిజవృత్తాంతము తెలిపెను. అపుడు శాస్త "ఉపాసకా, పూర్వకాలమునగూడ ఇట్టి జనులు ఆపద వచ్చినపుడు కోరిక విడిచి అన్యప్రదేశమునకు బోవుటచే ప్రాణములు దక్కించుకొనిరి" అని, అతడు ప్రార్థించినపిమ్మట పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డొకగ్రామములో కుమ్మరిపని చేయుచు ఆలుబిడ్డలను పోషించుచుండెను. ఆకాలమున వారాణసిలో మహానదితో గలిసి యుండు మహాసరస్సు కలదు. నీరు హెచ్చుగా నున్నప్పుడు సరస్సు నదిలో గలసిపోవును. నీరు తగ్గినప్పుడు విడిగా కానబడును. ఈసంవత్సరము అధికవర్షము కురియును, ఈయేడు కురవదు అని మత్స్యములకు, కచ్ఛపములకును ముందే తెలియుచుండును. ఆయేడు సరస్సులో జనించిన మత్స్యకచ్ఛపములు వర్ష మాసంవత్సరము కురియ దని గ్రహించి, ఐదీసరస్సులు కలిసియున్న సమయముననే నదిలోనికి బోయినవి.

ఒక తాబేలు మాత్రము 'నే నిచటనే పుట్టితిని, ఇచటనే పెరిగినాను. నాతలిదండ్రు లిచటనే యున్నారు. నే నీచోటు విడువజాలను' అని నదిలోనికి జనలేదు.

నిదాఘసమయమున సరస్సు ఎండిపోయెను. బోధిసత్త్వుడు నేల త్రవ్వుచున్నచోట కచ్ఛపము భూమిలో దూరి దాగియుండెను. మృత్తికకొరకు బోధిసత్త్వుడు పెద్దగునపముతో నచటికి బోయి, త్రవ్వుచు కచ్ఛపమును మట్టిపెడ్డవలె పొడిచి యెత్తి నేలపై బడవైచెను.

కచ్ఛపము బాధపడుచు 'నివాసస్థానముమీది యాసక్తిచే నే నీచోటు విడవలేక వినాశము పొందుచున్నాను' అని దుఃఖించుచు ఈ గాథలు పలికెను.

ఇచటనే పుట్టితి, ఇచటనే వృద్ధి
గాంచితి ననుచు పంకమ్మును విడువ:
పంకమే నావంటి బలహీను నణచె!
భార్గవా, నే నాడు పలుకులు వినుము.
గ్రామమే యైనను, కానన మైన
జనునకు నెచ్చట సౌఖ్యంబు కలుగు,
బుద్ధిమంతున కదే పుట్టినచోటు.
జీవింప నగుతావు చేరుకోవలెను:
స్వగృహంబున చచ్చువాడవు కాకు.

కచ్ఛప మిట్లు బోధిసత్త్వునితో పలుకుచు ప్రాణములు విడిచెను. బోధిసత్త్వుడు దానిని దీసికొని గ్రామవాసు లెల్లరను సమావేశపరచి, వారల కిట్లుపదేశ మిచ్చెను: 'ఈకచ్ఛపమును జూచుచున్నారా? తక్కిన తాబేళ్ళు, మత్స్యములు మహానదిలోనికి బోవుచున్నప్పు డిది నిజనివాసస్థానముపై నాసక్తి విడువలేక, వానివెంట జనలేదు. మేము మన్నుతీయుచోట పడియుండెను. నేను గునపముతో పెడ్డలు విరచుచు, దీనినిగూడ పెడ్డవలె నెత్తి యీవల బడవైచితిని. తాను చేసిన పని స్మరించి ఈకచ్ఛపము రెండుగాధలు పలికి మరణించెను. తననివాసముమీది యాసక్తిచే నీకచ్ఛపము మృతిగాంచినది. మీరు దీనివలె కాగూడదు. ఈరూపము నా దని, యీ శబ్దము నా దని, యీగంధము నా దని, యీ రసము నా దని, స్పృశింపదగిన యియ్యది నా దని, ఈపుత్రుడు నావా డని, ఈపుత్రిక నాది యని, ఈ దాసీదాసము నా దని, ఈ సువర్ణము నా దని తృష్ణావశవర్తులై మీరు తలపరాదు. ఈజీవి ఏకాకియే. మూడుజన్మలనుండి సుడితిరుగుచున్నాడు.'

ఈప్రకారముగా బోధిసత్త్వుడు బుద్ధలీలనుండి జనసమూహమున కుపదేశ మిచ్చెను. ఆయుపదేశము సమస్తజంబూద్వీపమున వ్యాపించి యేడువందల (సహస్ర) సంవత్సరము లుండెను. జనసమూహము బోధిసత్త్వుని యుపదేశము ననుసరించి దానాదిపుణ్యకార్యములు చేసి, స్వర్గమునకు జనెను. బోధిసత్త్వుడుకూడ పుణ్యకార్యములు చేసి స్వర్గమునకు బోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున కాశ్యపుడు ఆనందుడు; కుమ్మరి నేనే

# 179 సతధమ్మ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఇరువదియొక్క రకముల అనుచితజీవికలను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకప్పుడు భిక్షువులు భిక్షకవృత్తికి బదులుగా ఇరువదియొక్క రకముల జీవికలు గడపుచుండిరి. కొందరు వైద్యము, కొందరు దాత్యము, మరికొందరు సందేశము, కొందరు కాలినడకన ఉత్తరములు కొనిపోవుట మొదలగు పనులు చేయుచుండిరి.

భిక్షువు లావిధముగా జీవితములు గడపుచుండుట తెలిసికొని శాస్త యిట్లు చింతించెను. "భిక్షువులు అనుచితవిధముల జీవనము గడపుచున్నారు. ఇట్లు చేయుచున్నచో వీరు యక్షుల కడుపున పుట్టు దురు, పేనుకడుపున పుట్టి మూర్ఖ లగుదురు; నరకములో జన్మమెత్తు దురు. వీరి హితమునకై సుఖమునకై ధర్మోపదేశము చేయవలెను."

ఇట్లు తలపోసి భగవాన్ భిక్షువులను ఒకచో సమావేశపరచి ఈ విధముగా ఉపదేశించెను. "భిక్షువులారా, ఇరువదియొక్క రకముల అనుచితవిధానములలో జీవితములు గడపరాదు. అనుచితవిధానములో భిక్ష తప్తలోహగోళమువంటిది, హాలాహలమువంటిది, అనుచితవిధాన ములలో జీవితములు గడుపుటను బుద్ధుడు, ప్రత్యేకబుద్ధుడు, శ్రావకులు ఎల్లరును నిందించి నికృష్ట మని నిరూపించినారు. అనుచితవిధానములలో భిక్ష పొందువారి ముఖములపై చిరునవ్వు కానబడదు. వారిమనస్సులు ప్రసన్నములు కావు. అనుచితవిధిలో లభించు భిక్ష నాదృష్టిలో చండాలుని ఉచ్ఛిష్టభోజనము వంటిది. అట్టిది భుజించుట సతధమ్మ మాణావకుడు చండాలుని ఉచ్ఛిష్టభోజనము చేసి నట్లుండును."

ఇట్లు పలికి శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు చండాలుడై పుట్టెను. అతడు పెద్దవాడయిన పిదప

ఏదో పనిమీాద బయలుదేరుచు, బియ్యము ఆహారము మూటకట్టుకొని త్రోవ పట్టెను.

ఆకాలమున వారాణసిలో ఉదీచ్యబ్రాహ్మణవంశోద్భవుడును, మహాధనసంపన్నుడును, సతధమ్మ నామధేయుడు నగు మాణవకుడుండెను. అతడుకూడ ఏదో పనిమీాద బయలుదేరుచు బియ్యము కాని ఖాద్యము కాని వెంట గొనక త్రోవ పట్టెను.

మహామార్గములో నుభయులును కలిసిరి. బోధిసత్త్వుని మాణవకుడు 'నీ జాతి యేది?' అని యడిగెను. 'నేను చండాలుడను. నీ జాతి యేది?' 'నేను ఉదీచ్యబ్రాహ్మణుడను.' మంచి దని యిరువురును త్రోవ బట్టిరి.

ఉదకము బాగుగా నున్నతావున బోధిసత్త్వుడు కాలుసేతులు కడుగుకొని, ప్రాతర్భోజనమునకు గూరుచుండి. మాణవకునితో 'భోజనము చేయుదురా?' అనెను. 'చండాలా, నాకు భోజనముతో పని లేదు' అని మాణవకుడు పలికెను. బోధిసత్త్వుడన్న మెంగిలి చేయక తనకు గావలసినది ఆకులో బెట్టుకొని, తక్కినది మూటకట్టి యొక ప్రక్కగా బెట్టి, భోజనము చేసి, దాహము త్రాగి, కాలుసేతులు కడుగుకొని, మూట తీసికొని, 'బాబా, పోవుద' మని బయలుదేరెను.

వారు పగలెల్ల ప్రయాణము చేసి, వీలుగా నున్న చోట స్నానము చేసిరి. విశ్రాంతిస్థలమున బోధిసత్త్వుడు కూరుచుండి మాణవకుని అడుగకుండగనే భోజనము చేయసాగెను. పగలెల్ల పయనించియుండుటచే మాణవకుడు అలసట జెందియుండెను. అతనికి ఆకలివేయుచుండెను. అతడు బోధిసత్త్వునివైపు చూడసాగి, అతడు భోజనము పెట్టుచో భుజింతును అని తలచెను. కాని బోధిసత్త్వుడు మౌనముగా భుజించుచుండెను. మాణవకుడు తనలో 'ఈచండాలుడు నాకు జెప్పకుండ భుజించుచున్నాడు. బలాత్కారముగా పైయన్నము లాగుకొనవలె' నని తలచి, అట్లే చేసి భుజించెను.

భుజించుచుండగనే మాణవకునకు మిగుల పశ్చాత్తాపము కలిగెను. 'నాకులగోత్రస్థానములకు తగినపని చేయనైతిని. చండాలుని యుచ్ఛిష్టాన్నమును గ్రహించి భుజించితిని' అని యతడు విచారించుచుండగనే రక్తముతోగూడి అన్నము అతనినోటినుండి వెలువడెను.

మాణవకుడు దుఃఖాక్రాంతుడై 'కొంచెము ప్రమత్తుడ నైన కారణమున అనుచితకర్మ చేసినాను' అని పరిదేవించుచు ఈగాథ పలికెను:

అది చాల కొలదియు, నధికకష్టాన
చెజిక్కినదియు, ఉచ్ఛిష్టంబుకూడ;
బ్రాహ్మణకులమున ప్రభవించి నట్టి
యేను భుజించితి; ఇనుడ లే దదియు

ఇట్లు మాణవకుడు పరిదేవనము చేసి 'ఇక నేను జీవించియున్నను ఫల మేమి?' అని యరణ్యములోనికి బోయెను. ఆత డెవ్వరికిని గానబడకుండ తిరిగి తిరిగి అనాధమరణము చెందెను.

శాస్త అభిసంబుద్ధుడై యీగాథ పలికెను

ఈప్రకారమ్ముగా నెవడు ధర్మంబు
విడనాడుచు నధర్మవిధిని జీవించు,
ఆతడు సతధమ్ము నట్లు లాభమ్ము
పొందియు, మోదంబు పొంద నేరండు.

ఈ ప్రకారముగా శాస్త ధర్మోపదేశము చేసి నాలుగు సత్యములు ప్రకటించి జాతకము ల సరిపోల్చెను. అప్పుడు చాలమంది భిక్షువులకు శ్రోతాపత్తి మొదలగు ఫలము లభించినవి. ఆ కాలమున చండాలపుత్రుడను నేనే

## 180 దుద్ద జాతకము

శాస్త జేతవనమున నివసించుచు సామూహిక దానమును గూర్చి చెప్పినది

### వర్తమాన కథ

శ్రావస్తిలో కొన్ని కుటుంబములలోని యువకులు చందాలు ప్రోగు చేసి ఆవశ్యకము లైనవస్తువు లన్నిటిని సమకూర్చుకొని బుద్ధసంఘమును నిమంత్రించి ఏడురోజులు మహాదానము లిచ్చి తుదిరోజున

అవసరమైన వస్తువు లన్నిటి నొసంగిరి.

వారిలో ముఖ్యుడు శాస్తకు ప్రణామము చేసి ఒక ప్రక్కన కూరుచుండి "భన్తే, ఇందులో అధికముగా నిచ్చినవారు కలరు, కొలదిగా ఇచ్చినవారు కలరు, ఎల్లరకును ఈ దానములు ఫలదాయకము లగుగాక!" అని దాన మిచ్చెను.

"ఉపాసకులారా! బుద్ధుని భిక్షుసంఘమునకు మీరు ఇట్లు దానము చేయుట మహాకార్యము. పూర్వకాలమునకూడ పండితు లిట్లే దానము లిచ్చినారు" అని వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున బ్రాహ్మణకుటుంబమున బుట్టి, పెరిగి పెద్దవాడయి, తక్షశిలలో సర్వవిద్యలు గ్రహించి, ఇలు విడిచి, ఋషులవలె ప్రవ్రజించి, గణనాయకుడై హిమవత్ప్రదేశమున చిరకాలము వసించి, ఉప్పు చింతపండు మొదలగువానికై జనపదములకు బోవుచు, వారాణసి చేరి, రాజోద్యానమున విడిసి, మరునాడు సపరివారముగా ద్వారగ్రామమునకు భిక్షార్థము చనెను. జనులు భిక్ష యొసగిరి. మరునాడాయన వారాణసిలో పర్యటించెను. జనులు సంప్రీతులై భిక్షమిచ్చి, సంఘముగాగూడి చందా ప్రోగుచేసి, ఋషిసమూహమునకు మహాదానము నొసంగిరి. దాని పర్యవసానమున గణజ్యేష్ఠుడు ఇట్లిట్లని. ఈ నియమప్రకార మని, వస్తువులను నిర్దేశించెను.

బోధిసత్త్వుడు 'ఆయుష్మంతులారా, చిత్తప్రసాదమున్నచో దానమునకు అల్పత యుండదు' అని అనుమోదించి, ఈగాథ పలికెను:

ఇచ్చుటకు కష్టమైనట్టి విచ్చువారు
చేయుటకు కష్టమైనవి చేయువారు
సజ్జనులు, వారు దుర్జ్ఞేయసరణివారు;
సజ్జనులు కానివా రట్లు సలుప రెపుడు
కాన సజ్జన దుర్జన సరణి వేరు
స్వర్గమున కేగువారలు సత్పురుషులు,
నరకసరణిని దుర్జను లరుగువారు.

ఇట్లు బోధిసత్త్వుడనుమోదము చూపి, వర్షాకాలము నాలుగు మాసములు నచ్చటనే యుండి, వర్షాంతమున హిమవత్ప్రదేశమునకు బోయి, ధ్యానములు నిర్వర్తించి, అపరిహీనధ్యానుడై బ్రహ్మలోక గామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పటి ఋషిగణము ఇప్పటి బుద్ధపరిపత్తు గణనాయకుడు నేనే.

## 181 అసదిస జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మహాభినిష్క్రమణమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకనాడు ధర్మసభలో సమావిష్టులైన భిక్షువులు భగవానుని నైష్క్రమ్యపారమితనుగూర్చి ప్రశంస చేయుచుండిరి. శాస్త అరుగుదెంచి, "భిక్షువులారా, ఇచ్చట కూరుచుండి ఏమి సంభాషించుచున్నారు?" అని, వారు ఫలానివిషయము అని చెప్పినమీదట, "భిక్షువులారా, తథాగతుడు కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ శ్వేతచ్ఛత్రము విసర్జించి అభినిష్క్రమణము చేసినాడు" అని పూర్వ జన్మకథ చెప్పినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు ఆయన రాణికడుపున బుట్టెను. సుఖముగా జన్మించిన యతనికి నామకరణమునాడు అసదృశకుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగి అటునిటు పరుగులెత్తునాటికి దేవికి రెండవకుమారుడు కలిగెను. అతనికి బ్రహ్మదత్తకుమారు డని పేరు పెట్టిరి.

బోధిసత్త్వుడు పదునారేండ్లవయసున తక్షశిలకు జని, అచటి ప్రసిద్ధాచార్యునికడ మూడు వేదములు, అష్టాదశ విద్యలు నేర్చి ధనుర్వేదమున అసదృశుడయి, వారాణసికి మరలి వచ్చెను. రాజు మరణించునపుడు అసదృశకుమారుని రాజుగను, బ్రహ్మదత్తకుమారుని ఉపరాజుగను నిర్ణయించెను.

తనకు రాజ్యాభిషేకము చేయు కాలము వచ్చినపుడు బోధిసత్త్వుడు రాజ్య మక్కరలే దని నిషేధించెను. బ్రహ్మదత్తకుమారునకు పట్టము కట్టిరి. బోధిసత్త్వుడు తనకు కీర్తి వలదనియు, ఏవస్తువు వలదనియు చెప్పెను. తమ్ముడు రాజ్యముచేయుచున్నప్పుడు తాను సామాన్యుని విధముగా నుండెను.

బోధిసత్త్వునకు రాజ్యముపై కాంక్ష యున్న దని రాజుచుట్టునుండు సేవకులు చెప్పి అతనిమనసు విరిచిరి వారిమాటలు నమ్మి, రాజు బోధిసత్త్వుని సందేహించి, ఆయనను బంధింపు డని పరిజనుల కాజ్ఞ యిచ్చెను.

హితైషి యొకడు బోధిసత్త్వున కీసంగతి సూచించెను. కోపమువచ్చి బోధిసత్త్వుడు వేరొకరాష్ట్రమునకు వెడలిపోయెను. ధానుష్కుడు వచ్చినా డని యతడు రాజద్వారమునుండి లోనికి వార్తపంపెను. వేతన మెంత కావలె నని రా జడిగెను. సంవత్సరమునకు లక్ష యని యతడు చెప్పగా సమ్మతించి రాజు అతనిని ర మ్మనెను. అతడు సమీపించి నిలుచుండగా రాజు 'నీవు ధానుష్కుడవా?' అనెను.

"చిత్తము, దేవా."

"మంచిది. నాకొలువులో నుండుము."

అప్పటినుండి యతడు రాజుకొలువులో జేరెను. వేతనము ముట్టుచుండెను. బోధిసత్త్వున కింత వేతనము లభించుచున్న దని వెనుకటి విలుకానికి కోపము వచ్చెను.

ఒకనాడు రా జుద్యానమునకు బోయి, అచ్చటి మంగళశిలాఫలకము మీది శయ్య ప్రక్కగా తెర కట్టించి, మామిడిచెట్టుక్రింద పెద్దశయ్యపై బరుండెను. ఆతడు పైకి చూచునప్పటికి మామిడిపండు కానబడెను. ఎవరైన చెట్టెక్కి కోయుట కది వీలుగా లేదు. కావున రాజు విలుకాండ్రను బిలిపించి, "మామిడిపండు బాణముతో గొట్టి పడ

వేయుదురా?” అని యడిగెను.

“దేవా, మా కిది కష్టమైన పని కాదు. కాని మహారాజా, మా కౌశలమును బహుపర్యాయములు గాంచియున్నారు. నూతన ధానుష్కుడు మాకన్న శక్తిమంతుడు. అతనిచే గొట్టింపుడు” అని వారు విన్నవించిరి.

రాజు బోధిసత్త్వుని బిలిపించి ‘బాబా, ఈపండు పడగొట్టగలరా?’ అని యడిగెను.

‘చిత్తము మహారాజా, అవకాశము కొంచెము దొరకినచో పడ గొట్టగలను.’

‘ఎక్కడ అవకాశము కావలెను?’

‘తమశయ్య యున్నచోట.’

రాజు లేచి శయ్య జరిపించి అవకాశ మిచ్చెను. బోధిసత్త్వుని చేతిలో ధను స్సుండదు; దాని నతడు వస్త్రముక్రింద కప్పియుంచును. కావున తెర కావలెనని యడిగెను. మంచిదని రాజు తెర తెప్పించెను. బోధిసత్త్వుడు మాటునకు జని తెల్లబట్టలు విప్పి ఎర్రబట్టలు కట్టుకొని, కాసె బిగించి, కత్తియెడమప్రక్క బంధించి, బంగరువస్త్రము కప్పు కొని, అమ్ములపొది బిగించి, పొట్టేలుకొమ్ములతో నిర్మించిన ధనుస్సు గైకొని, పగడపువన్నె దారము బిగించి, తలపై పాగా ధరించెను. పదనుగల బాణమును గోటితో ద్రిప్పుచు అతడు తెరమధ్యను చీల్చు కొని, అలంకృతుడైన నాగకుమారుడు భూమిని భేదించుకొని పైకి వచ్చునట్లు వచ్చెను. బాణము విడువవలసినచోటికి బోయి బాణము సంధించి ‘మహారాజా, పైకి బోవు బాణముతో మామిడిపండును కొట్టుదునా? క్రిందికి వచ్చుబాణముతో కొట్టుదునా?’ అని రాజు నడి గెను.

‘బాబా, పైకి బోవు బాణముతో కొట్టి పడవేసిన వాని నెన్ని టినో చూచితిని. కాని క్రిందికి వచ్చు బాణముతో పడగొట్టినవానిని జూడలేదు. క్రిందికి వచ్చు బాణముతో కొట్టుము.’

‘మహారాజా, ఈబాణము బహుదూరము పోవును. చాతుర్మహా రాజికభవనమునకు బోయి స్వయముగా క్రిందికి మరలివచ్చును. అంత వరకును దేవరవారు వేచియుండవలెను.’

'మంచిది.'

మహారాజా,' ఈ బాణము మామిడితొడిమ నడుమగా భేదించుకొని పైకిపోయి, క్రిందికి వచ్చునపుడు వెంద్రుకవాసి యిటునటు జనక, మామిడిపండును గొనివచ్చును. చూడుడు మహారాజా.'

బోధిసత్త్వుడు బలముకొలది బాణము విడిచెను. అది మామిడి తొడిమనడుమగా జని చాతుర్మహారాజికభవనము చేరియుండు నని తోచినప్పుడు అతడు వేరొకబాణమును మరింత సత్తువతో విడిచెను. అది పోయి, మొదటిబాణము వెనుకరెక్కలో గ్రుచ్చుకొని, భవనమునకు జనెను. అక్కడ దానిని దేవతలు పట్టుకొనిరి. మరల వచ్చు బాణధ్వని పిడుగుచప్పుడువలె నుండెను. 'ఈధ్వని యేమి?' అని అచటి జను లనిరి. 'బాణము మరలి వచ్చుచున్న చప్పు డిది' యని బోధిసత్త్వుడు చెప్పెను. తమ శరీరముపై బడునేమో యని వారు భయపడిరి. బాణమును నేలపై బడనీయ నని ఆయన వారి నోదార్చెను. తిరిగి వచ్చు బాణము వెంద్రుకవాసికూడ తప్పక, సూటిగా మామిడిపండు కొట్టితెచ్చెను. బోధిసత్త్వుడు దానిని నేలపై బడనీయక ఒకచేతితో పండును ఒకచేతితో బాణమును బట్టుకొనెను.

అద్భుతకార్యమును జూచి జనమూహాము మహాసత్త్వుని ప్రశంసించిరి. కొందరు కేకలు వేసిరి, కొందరు నెటికలు విరిచిరి, కొందరు వస్త్రముల నెగురవేసిరి. సంతుష్టచిత్తులైన రాజపరిషత్తువారు బోధిసత్త్వునకు కోటిధన మిచ్చిరి. రాజకూడ వర్షము కురిసిన, విశేషముగా గౌరవించెను.

ఈ విధముగా ఆదరసత్కారములు పొంది బోధిసత్త్వుడు ఆరాజు కొలువులో నుండుకాలమున ఏడుగురు రాజులు అసదృశకుమారుడు వారాణసిలో లే డని గ్రహించి నగరమును మహాసేనతో చుట్టుముట్టిరి. రాజ్య మిత్తువా, యుద్ధముచేయుదువా అని వారు పంపిన సందేశమునకు రాజు భీతిల్లి అన్నకడకు దూత నంపెను. "మీరు రానిపక్షమున మా ప్రాణములు దక్కవు" అని రాజు వార్త నంపి, "నాపక్షమున మీ రాయనపాదములకు ప్రణామము చేసి క్షమాపణ వేడి ఆయనను తీసికొనిరావలె" నని చెప్పెను.

వారు పోయి బోధిసత్త్వున కావృత్తాంతము చెప్పిరి. ఆయన

ప్రభువుతో జెప్పి, తమ్మునికడకు బోయి, ఊరడించి భయపడవల దనెను. "అసదృశకుమారుడను వచ్చినాను. ఒక్కబాణము ప్రయోగించి అందరప్రాణములను హరింతును. ప్రాణములపై తీపికలవారు పారిపోండు" అని బాణముపై లిఖించి మేడపై కెక్కి దానిని విడచెను. అది పోయి ఏడుగురురాజులు భోజనము చేయుచున్న బంగరుపళ్ళెముల నడుమ పడెను. ఆయక్షరములు చదివి వారు ప్రాణభయమున పరుగెత్తిరి.

చిన్నయీగనెత్తురుబొట్టుకూడ రాలకుండ బోధిసత్త్వుడీవిధముగా ఏడుగురు రాజులను పారద్రోలి, తమ్ముని కలిసికొని భోగజీవనము విడిచి ప్రవ్రజించి అభిజ్ఞలను సమాపత్తులను పొంది తుదకు బ్రహ్మలోకగామి యయ్యెను.

ఆసదృశుండు ధనుర్ధరుడు, డధికబలుడు,
సప్తకాయ, దూరలక్ష్య, శబ్దవేధి
రాజపుత్రుడు, శరము దూరముగ విడిచె.

శత్రునివహంబు నూత్రము సంహరించి
కలుగ నీక యొరుల కెట్టి కష్టమేని
శుభముగూర్చెను శరము తత్సోదరునకు
అతడు మాత్రము సిన్యాసి యైనవాడు.

శాస్త్ర ఈప్రకారముగా ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున తమ్ముడు ఆనందుడు; అసదృశకుమారుడ నేనే.

# 182 సంగామావచర జాతకము

శాస్త జేతవనమున నందునప్పుడు నందస్థవిరునిగూర్చి చెప్పినది

## వర్తమాన కథ

శాస్త ప్రథమపర్యాయము కపిలపురము (కపిలవస్తు) చని తమ్ముడు నందకుమారుని ప్రవ్రజితుని చేసి, అచ్చటనుండి క్రమముగా శ్రావస్తికి పోవునప్పుడు ఆయుష్మాన్ నందుడు భగవాన్ పాత్ర గైకొని ఆయన వెనువెంటనే నడచెను. జనపదకళ్యాణి (నందునిభార్య) ఈసంగతి విని విరియబోసిన కేశములతో కిటికీలోనుండి చూచి "ఆర్యపుత్రా, శీఘ్రముగా మరలిరండు' అనెను. నందుడు ఈమాటలు స్మరించుచు ఉత్కంఠవలన ధర్మశాసనమువలన మనస్సు నిలుపలేకుండెను. అతని మొడలు వాలిపోయెను. నరములు వెళ్ళుకొని వచ్చినవి.

శాస్త అతనిస్థితి తెలిసికొని, నందుని అర్హత్ పదవిలో ప్రతిష్ఠింప దలచి అతడు నివసించు పరిధిలోనికి బోయి పరచిన ఆసనముపై కూరుచుండి, నందా, ఈ శాసనమున నీమనస్సు లగ్నమైనదా లేదా!" అని యడిగెను.

"భన్తే, జనపదకళ్యాణిపై ఆసక్తి యుండుటచే మనస్సు లగ్నమగుట లేదు.

"నందా, నీవు ఇదివరలో హిమాలయమున పర్యటనము చేసితివా?"

"భన్తే, చేయలేదు."

"అగుచో, రమ్ము, పోవుదము."

"భన్తే, నాకు బుద్ధిబలము లేదు. ఎట్లు పోవుదును."

"నందా, నిన్ను నాబుద్ధిబలముచే కొనిపోవుదును."

శాస్త స్థవిరుని చేతితో పట్టుకొని ఆకాశమార్గమున పోవుచుండగా కింద మండుచున్న పొలము కానవచ్చెను. అచట కాలుచున్న మోడుపై కోతి కూరుచుండి యుండెను. దాని చెవులు, ముక్కు, తోక కోసి యున్నవి. రోమములు కాలినవి. దాని ముఖము బ్రద్దలయి యుండెను. చర్మము మాత్రము మిగిలియున్నది. అందుండి రక్తము కారుచుండెను.

"నందా, ఈకోతిని చూచుచున్నావా?"

"చిత్తము భన్తే!"

"చక్కగా చూడుము."

ఆవల అరువదియోజనముల మనశ్శిలాతలము, ఏడు మహాసరస్సులు, ఐదు మహానదులు, స్వర్ణపర్వతము, రజతపర్వతము, మణిపర్వతము—వీనితోగూడిన వందలకొలది రమణీయస్థానములను, హిమాలయపర్వతమును చూపి శాస్త, "నందా, నీవు తావత్రింసభవనములు (33 దేవతల భవనములు) చూచితివా!" అనెను.

"భన్తే, చూడలేదు.

"నందా, రమ్ము నీకు చూపుదును"

"శాస్త అతని నచ్చటికి గొనిపోయి పాండుకంబళశిలాపీఠముపై కూరుచుండెను. దేవతలతో గూడి శక్రరాజు దేవేంద్రుడు వచ్చి ప్రణామము చేసి ఒకప్రక్కగా కూరుచుండెను. రెండున్నరకోట్ల సేవకులు పావురములపాదములవలె ఎఱ్ఱనిపాదములు గలవారు అయిదు వందల యచ్చరలు వచ్చి ఒక పార్శ్వమున కూరుచుండిరి. నందుడు అచ్చరలపై ఆసక్తు డగునట్లు శాస్త ఏమో చేసెను. నందుడు వారిని మాటిమాటికిని చూడజొచ్చెను.

నందా, పావురములపాదములవంటి పాదములు గల అచ్చరలను చూచుచున్నావా?'

"భన్తే, చిత్తము"

"వీరు నీకు నచ్చినారా? జనపదకళ్యాణి నచ్చినదా?"

"భన్తే, జనపదకళ్యాణి కాలుచేతులు లేని కోతి వంటిది."

"నందా, ఇపు డేమి చేయుదువు?"

"భన్తే, ఏమి చేసినచో ఈ అచ్చరలు లభింతురు."

"శ్రమణధర్మము నీవు పూర్తిచేసినచో."

"అయినచో భన్తే, తమరు వీరిని నాకు ఒసగుటకై బాధ్యత వహించినచో నేను శ్రమణధర్మము పూర్తికావింతును."

"నందా, చేయుము. నేను బాధ్యత వహింతును."

ఈప్రకారముగా దేవసమూహములో స్థవిరుడు తథాగతుడు బాధ్యత వహించునట్లు చేసి "భన్తే, ఆలస్యము వలదు. పోవుదము

దయచేయుడు. నేను శ్రమణధర్మము పాటింతును” అనెను.

శాస్త్ర అతనిని దీసికొని జేతవనమునకు జనెను. స్థవిరుడు శ్రమణ ధర్మము నవలంబించెను.

శాస్త్ర ధర్మసేనాపతి సారిపుత్రుని సంబోధించి “సారిపుత్రా, నా తమ్ముని నందుని దేవలోకమునకు గొనిపోయి దేవసమూహాము నడుమ అచ్చరలను ఇచ్చుటకు బాధ్యత వహించితిని. మహామౌద్గల్యాయన స్థవిరునకు మహాకాశ్యపస్థవిరునకు అనురుద్ధస్థవిరునకు ధర్మభండారి ఆనందస్థవిరుడు ఎనుబదిమంది మహాశ్రావకులకు మిగిలిన భిక్షువు లందరకు ఈ విషయము చెప్పవలెను” అనెను. ధర్మసేనాపతి సారి పుత్రుడు నందస్థవిరునికడకు బోయి, “ఆయుష్మన్, నీవు నిజముగ దేవ సమూహాము నడుమ అచ్చరలు లభించినచో శ్రమణధర్మ మాచరింతు నని దశబలధారిని బాధ్యత వహింపు మంటివా? లేదా? ఇట్లే యగుచో నీ బ్రహ్మచర్యజీవనము స్త్రీలకొరకే, వారిమీది ప్రీతికే అన్నమాట. నీవు స్త్రీలకొరకు శ్రమణధర్మ మాచరించుచో నీకును కూలిచేయు వానికిని అంతర మే మున్నది” అని అతనిని లజ్జితుని విజితుని చేసెను. ఈప్రకారముగా ఎనుబదిమంది మహాశ్రావకులు మిగిలిన భిక్షువులు నందుని లజ్జితుని చేసిరి.

అతడు సిగ్గుచే నిందాభయముచే ధృఢపరాక్రమ మవలంబించి విపశ్యనాభావన వృద్ధిచేసి అర్హతను పొందెను. అనంతరము శాస్త్ర సన్నిధి కరిగెను. “భన్తే, నాయంతట నేను తామ బాధ్యత విడువ వలెనని కోరుచున్నాను” అనెను. “నందా, నీవు అర్హత్వము పొంది నపుడే నా జవాబుదారీ తొలగిపోయినది” అని శాస్త్ర పలికెను.

ఈ సమాచారము విని భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై “ఈ ఆయుష్మంతుడు నందుడు ఉపదేశమున కెంతయో యోగ్యుడు. ఒక్కసారి ఉపదేశముననే సిగ్గుపడి నిందాభయముచే శ్రమణధర్మ మాచరించి అర్హత్వము పొందినాడు అనుచుండిరి. శాస్త్ర వచ్చి ఫలాని విషయ మని తెలిసికొని “భిక్షువులారా, ఇప్పుడే కాదు. పూర్వము కూడ ఉపదేశమున కర్హుడే” అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు గజాచార్యకులమున బుట్టి పెద్దవాడయి, హస్తిశిక్షలో నిపుణత సంపాదించి వారాణసీరాజుకు శత్రు వగు నొకరాజుకడ కొలువులో జేరెను. అతడు రాజమంగళహస్తికి మంచిశిక్ష యిచ్చెను. వారాణసీరాజ్యము పట్టుకొందు నని రాజు బోధిసత్త్వుని వెంటబెట్టుకొని మంగళహస్తి నెక్కి, మహాసైన్యముతో వారాణసికి పోయి చుట్టుముట్టి, 'రాజ్య మీయవలెను, యుద్ధ మయిన చేయవలెను' అని రాజుకు సందేశ మంపెను. యుద్ధము చేయుదు నని బ్రహ్మదత్తుడు ద్వారాట్టాలకగోపురములందు సైనికులను నిలిపి, పోరుసల్పెను. శత్రురాజు మంగళహస్తికి కవచము తొడిగించి, తాను కవచము దాల్చి, ఏనుగుపయి నెక్కి, తీక్ష్ణమైన అంకుశము తీసికొని, 'నగరమును భేదించి, శత్రువు ప్రాణములు తీసి, రాజ్యము హస్తగతము చేసికొందు' నని హస్తిని నగరాభిముఖముగా నడిపెను. పైనుండి వేడినూనె, యంత్రములనుండి పాషాణములు, వివిధాయుధములు వచ్చి పడుచుండుటచే మరణభీతమై హస్తి ద్వారము సమీపింపలేక, వెను దిరిగెను. అంతట గజాచార్యుడు దానిని సమీపించి "బాబా, నీవు శూరుడవు, సంగ్రామవిజయివి. తిరుణమున వెనుదిరుగుట నీకు తగదు" అని ఉపదేశ మిచ్చుచు ఈగాథలు పలికెను.

శౌర్యంబు, బలిమియు, సంగ్రామజయము
కల వని నీకు విఖ్యాతి కుంజరమ!
తోరణసీమకు చేరిన యంత
వెనుకకు మరలితివే, హేతు వేమి?

సర్వావరోధముల్ జవమున ద్రోసి
స్తంభముల్ పెకలించి, ద్వారబంధములు
చూర్ణము కావించి, తూర్ణమ చేయు
నగరప్రవేశంబు నాగరాజంబ!

అది విని నాగము బోధిసత్త్వుని ఒక్కమాటమీద మరలి, తొండము చుట్టి స్తంభములను కుక్కగొడుగులవలె పీకివేసి, తోరణ

ములను త్రొక్కి వేసి, అవరోధములను త్రోసివేసి, నగరద్వారమును ఛేదించి, లోపల ప్రవేశించి రాజుకు రాజ్యము నిచ్చెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున నందుడు ఏనుగు; ఆనందుడు రాజు; నేను గజశిక్షకుడను.

# 183 వాళోదక జాతకము

శాస్త జేతవనమున నుండి ఎంగిలి తిను అయిదువందలమందిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తిలో అయిదువందల శ్రావకులు తమగృహయాజమాన్యము భార్యాబిడ్డల కప్పజెప్పి, శాస్త చేయు ధర్మోపదేశము వినుచు నొకచోటనే యుండిరి. అందు కొందరు స్రోతాపన్నులు, కొందరు సకృదాగాములు, కొందరు అనాగాములు నుండిరి. విడిగా నొక్కరును లేరు. శాస్త నిమంత్రణము చేయవలసినచో ఎల్లరు కలిసి నిమంత్రణము చేయుచుండిరి.

వారికి పలుదోముపుల్ల ముఖము కడుగు కొనుటకు జలము, సుగంధ సలిలము, మాలికలు మొదలగునవి సమకూర్చుచున్న సేవకులు అయిదువందలమంది చలిది యన్నము తిందురు. ఉదయము భోజనము చేసి, పండుకొని లేచి అచిరవతీనదీతటమున కుస్తీపట్లు పట్టుదురు. అయిదువందలమంది యుపాసకులు సవ్వడి చేయక ధ్యానరతులై యుందురు.

చలిదియన్నము తినువారు చేయు గడబిడ విని శాస్త "ఆనందా, ఏ మిది?" అనెను.

"భన్తే, చలిదియన్నము తినువారి గడబిడ."

"ఆనందా, వీ రిప్పుడే కాదు, పూర్వముకూడ గడబిడ చేయుచుం

డెడివారు; ఈయుపాసకులు ఇప్పుడే కాదు, పూర్వముకూడ శాంతముగా నుండెడివారు” అని స్థవిరుడు ప్రార్థించినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అమాత్యకులమున బుట్టి పెద్దవాడయి రాజుకు అర్థధర్మానుశాసకు డయ్యెను. ఒకానొకసమయమున ఒకప్రాంత మెదురు తిరిగిన దని విని రాజు అయిదువందల యశ్వములను చతురంగసైన్యమును సిద్ధము చేయించి, సేనతో జని ఆప్రాంతమును అణచి చక్కపరచి వారాణసికి మరలివచ్చి, “సైంధవములు బడలినవి. మృదుపదార్థములు, ద్రాక్షారసము వీనికి బట్టుడు” అని ఆన తిచ్చెను. సైంధవములు గంధపానీయము త్రాగి అశ్వశాలలో తమతమస్థానములకు బోయి నిలిచినవి. అవి త్రాగగా మిగిలిన రసము కసటువారినది. “దీని నేమి చేయుదు” మని పరివారజనులు రాజు నడిగిరి. “దీనిలో నీరు కలిపి, వడపోసి, సైంధవములమేత మోసికొనివచ్చిన గాడిదల కిండు” అని రాజు చెప్పగా వా రట్లే చేసిరి.

వగరునీరు త్రాగి గార్దభములు మత్తెక్కి ఓండ్రపెట్టుచు రాజాంగణమున గంతులు వేయసాగెను. రాజు పెద్ద వాతాయనము తెరచి చూచి, ప్రక్కనే నిలిచియున్న బోధిసత్త్వునితో “చూడు. ఈగాడిదలు వగరునీరు త్రాగి మత్తిల్లి అరచుచు అంగణమున గంతులువేయుచున్నవి. సింధుజాతిహయములు గంధోదకము త్రాగి గంతులువేయక నిశ్శబ్దముగా నున్నవి. కారణ మేమి?” అని ఈగాథ పలికెను.

> కసటు నీరస జలమును గార్దభములు
> క్రోలి మత్తిలె, ఉత్తమఘోటకమ్ము
> లెంత రస మానినను చలియింప లేదు.

దానికి కారణము తెలుపుచు బోధిసత్త్వు డీగాథ పలికెను.

> నీచకులమున రాజ, జన్మించువాడు
> మద్య మొక్కింత త్రావిన మత్తు చెందు

ఒడలు మరవడు స్థిరచిత్తు, డుత్తమాన్వ
వాయజాతుడు కడు నాసవమ్ముగ్రోలి.

రాజు బోధిసత్త్వునివాక్కులు విని, గార్ధభములను అంగణమునుండి వెడలగొట్టించినాడు. ఆయన యుపదేశప్రకారము రాజు దానాది పుణ్యకార్యములు చేసి, తుదకు యథా కమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుజాతకములు సరిపోల్చెను. అప్పటి అయిదువందల గాడిదలు ఇప్పటి గడచిన వారు; అయిదువందల సుర్రములు ఇప్పటి యుపాసకులు; అమాత్య పండితుడను నేనే

## 184 గిరిదత్త జాతకము

శాస్త వేళువనమున నుండగా విరోధిపక్షమున చేరుచుండు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథ పూర్వము వచ్చిన మహిళాముఖ జాతకములో (136) కథ వలె నుండును. శాస్త "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వము కూడ ఈ భిక్షువు విరోధిపక్షమును సేవించువాడు" అని, పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో సామరాజు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అమాత్యకులమున పుట్టి పెద్దవా డయి, ఆయన కర్థధర్మాను శాసకు డయ్యెను. రాజుకు పాండవనామక మంగళాశ్వము కలదు. దానిశిక్షకు డగు గిరిదంతుడు కుంటివాడు. నోటిత్రాడు పట్టుకొని వాడు ముందు నడచుచుండగా చూచి ఇతడు నా శిక్షకు డని తెలిసికొని అశ్వము వాని ననుసరించుచు క్రమముగా కుంటి దయ్యెను. ఆసంగతి పరిజనులు రాజుకు దెలిపిరి. రాజు వైద్యులను బిలిపించెను.

వారు పోయి అశ్వశరీరమున రోగము లేకుండుట గ్రహించి ఆసంగతి రాజుకు చెప్పిరి.

రాజు బోధిసత్త్వుని బిలిచి "వయస్యా, పోయి దీని సంగతి తెలిసి కొనుము" అని పలికెను. ఆయన చని విషయము గ్రహించి రాజుకు దెలిపి సంసర్గదోషముచే నిట్లయ్యె నని ఈగాథ పలికెను :

చెడెను గిరిదత్తుచే సామి శ్వేతహయము;
ఆదిరీతి విడిచి వాని ననుసరించు.

"ఇప్పుడు వయస్యా, కర్తవ్య మేమి?" అని రాజు పలుకగా బోధిసత్త్వుడు 'చక్కని అశ్వశిక్షకుడు లభించినపక్షమున అశ్వము యథాపూర్వ మగును' అని యీగాథ పలికెను :

అశ్వమ్మునకు తగు నందచందాల
శిక్షకు, దద్దాని జేరి, ముఖమ్ము
పట్టి త్రిప్పుచు నున్న పక్షంబునందు
త్వరితముగా కుంటితనమును విడిచి
అనుకరించును వాని నశ్వరాజమ్ము.

రా జాప్రకారమే చేయించెను. అశ్వము ప్రకృతిభావము పొందెను. "తిర్యగ్జంతువులుకూడ ఆశయమును గ్రహించును" అని రాజు సంతుష్టచిత్తుడై బోధిసత్త్వుని విశేషముగా గౌరవించెను.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున గిరిదత్తుడు దేవదత్తుడు; గుర్రము విరోధిపక్షముతో జేరు భిక్షువు; రాజు ఆనందుడు; అమాత్యపండితుడు నేనే.

## 185 అనభిరతి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, బ్రాహ్మణకుమారుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తినగరమున ఒకానొక బ్రాహ్మణకుమారుడు వేదత్రయము అధ్యయనము చేసి క్షత్రియకుమారులకు, బ్రాహ్మణకుమారులకు

అధ్యాపనము చేయుచుండును. కాలక్రమమున ఆతడు కాపురము పెట్టి నాడు. వస్త్ర, అలంకార, దాసీదాస, క్షేత్ర, వస్తు, గో, పుత్ర, స్త్రీ ప్రభృతులనుగూర్చి యోచించుటచే రాగద్వేష మోహములకు వశీభూతుడై అస్థిరచిత్తుడయ్యెను. మంత్రములు సక్రమముగా పఠింపజాలకుండెను. అక్కడక్కడ మంత్రములు స్ఫురణకు రాకుండెను.

ఒకానాడతడు చాల సుగంధద్రవ్యములను, పుష్పమాలికలను కైకొని జేతవనమునకు జనెను. అచట శాస్తను పూజించి ఒకప్రక్కన గూరుచుండెను. శాస్త కుశలప్రశ్నాదులు అయిన పిమ్మట "మాణవకా, మంత్రములు నేర్చుచున్నావా? మంత్రాభ్యాసము బాగుగా నున్నదా" యని అడిగెను.

"భన్తే, తొలుత నాకు అభ్యాసము బాగుగానుండెడిది. కాని నేను కాపురము పెట్టినది మొదలు నా మనస్సు అస్థిరమైపోయినది. ఇందుచేత మంత్రాభ్యాసము జరుగుట లేదు."

"మాణవకా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ రాగాదులచే అస్థిరుడవైనపుడు నీకు మంత్రములు జ్ఞప్తిలో లేవు" అని, ఆతడు ప్రార్థించిన పిదప శాస్త పూర్వజన్మకథ జెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడొకానొక ప్రధానబ్రాహ్మణవంశమున జన్మించి, పెద్దవాడయి, వేదాధ్యయనము చేసి, విఖ్యాతాచార్యుడయి, వారాణసిలో అనేకబ్రాహ్మణక్షత్రియకుమారులకు వేదాధ్యాపనము చేయుచుండెను.

ఆయనకడ బ్రాహ్మణమాణవకు డొకడు మూడు వేదములలో ప్రవీణుడై, ఒక్కపదమునగూడ సంశయము లేక, ఉపాచార్యుడై, వేదములు చెప్పుచుండెను. కొంతకాలమున కతడు గృహస్థుయి, సంసారచింతచే ఆవిలచిత్తుడయి, మంత్రపాఠము చేయజాలకుండెను.

ఒకనాడతడు తనకడకు రాగా ఆచార్యుడు వానితో 'మాణవకా, నీ వేదాభ్యాస మెట్లున్నది?' అనెను.

'నేను గృహస్థునయినది మొదలు నాచిత్త మావిల మయినది. వేదముపై మనస్సు నిలుపజాలకున్నాను.'

'నాయనా, ఆవిలచిత్తమున వేదము భాసింపదు. అనావిలచిత్తమున అప్రతిభాన మనుమాట యుండదు' అని బోధిసత్త్వు డీగాథలు పలికెను

జటిల పంకిల మైన సలిలమ్మునందు
శంఖముల్, శుక్తులు, శర్కరాదికము
మత్స్యసంఘమ్ములం మాటుపడ్డట్లు
అస్థిరచిత్తమం దాత్మార్థ మేని
అన్యార్థ మేనియు నగపడకుండు.

నిర్మలస్వచ్ఛ మా నీరంబునందు
శంఖముల్, శుక్తులు, శర్కరాదికము
కంకర సైతము కానబడ్డట్లు
స్థిర మైన యుత్తమచిత్తమ్ము నందు
ఆత్మార్థము పరార్థ మగపడుచుండు.

శాస్త్ర ఈ ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రకటించి, జాతకములు సరిపోల్చెను
ఆర్యసత్యములను ప్రకాశింపజేసినంతనే బ్రాహ్మణకుమారుడు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను.
అసుయయమున మాణవకుడు ఈ మాణవకుడే,' ఆచార్యుడు నేనే.

## 186 దధివాహన జాతకము

శాస్త్ర వేళువనమున విహారము చేయుచుండగా విరోధిపక్షముతో కలిసికొనువాని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

పూర్వము వచ్చిన కథవలెనే (184) ఈ కథకూడ ఉండును.

భిక్షువులారా, దుర్మార్గులతో సాంగత్యమువలన చెఱుపు కలిగి, అనర్థకారక మగును. మానవులతో కుసంగతివలన కలుగు పరిణామము గూర్చి ఏమి చెప్పుదును? పూర్వకాలమున నోట పెట్టుకొనుటకు వీలు

కాని చేదువేపచెట్టుతో సాంగత్యమువలన మధురరసము కలిగి రుచ్యమైన మామిడిచెట్టు బండబాంపులు పెక్కి పోయినది'' అని శాస్త పూర్వజన్మకథ జెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా కాశీరాష్ట్రమున నలుగురు బ్రాహ్మణసోదరులు ప్రవ్రజించి హిమవత్ప్రదేశమున వరుసగా పర్ణశాలలు నిర్మించుకొని, నివాసము చేయుచుండిరి. అందులో పెద్దవాడు కాలముచేసి శక్రత్వము నొందెను. విషయము గ్రహించి యతడు ఏడెనిమిది రోజుల కొకసారి వారిసాయమునకు బోవుచు నొకనాడు పెద్ద తాపసికడకు బోయి నమస్కరించి, ఒక పార్శ్వమున గూరుచుండి "భన్తే, మీ కేమి కావలయును?'' అనెను. పాండురోగి యగు తాపసుడు అగ్ని కావలె ననెను. శక్రు డాయనకు పదను గల పరశు వొసగెను. అది దండములో కూర్చువలన క్షుర గాని పరశువు గాని యగుచుండును. 'దీనిని గొని పోయి నా కింధనము లెవరు తెత్తురు?'' అని తాపసు డనగానే శక్రు డిట్లు చెప్పెను. 'మీకు వంటచెరకు కావలసినపుడు ఈపరశువుపై చేతితో తట్టి, నాకు సమిధలు తెచ్చి నిప్పు వెలిగింపు మని మీరు పలికినచో ఇది సమిధలు తెచ్చి నిప్పుచేయును' అని కత్తి గొడ్డలి నిచ్చి, రెండవవాని కడకు బోయి 'ఆర్య, మీ కేమి కావలెను?' అని యడిగెను.

ఆయన "పర్ణశాలకడగా ఏనుగులు పోవు మార్గమున్నది. ఏనుగుల వలన నా కుపద్రవము కలుగుచున్నది, వానిని పారద్రోలవలెను'' అని ఆయనను కోరెను. శక్రు డతనికి భేరి యిచ్చి, "భన్తే, ఇటువైపు కొట్టినచో మీ శత్రువులు పారిపోవుదురు, ఇటువైపు కొట్టినచో మిత్రులయి చతురంగబలములతో మీచుట్టు చేరుదురు'' అని చెప్పి, చిన్నవానికడకు బోయి "భన్తే, మీ కేమి కావలయును?'' అని యడిగెను. అతడుకూడ పాండురోగి యగుటచే 'పెరుగు కావలె' ననెను. శక్రు డతనికి దధిఘట మిచ్చి, 'మీకు వలసినపుడు దధిఘటము తలక్రిందు చేయుడు అందుండి జలము బయలుదేరి వెల్లువ యయి, శత్రువులను ముంచి, రాజ్యమును సంపాదించి యొసగగలదు'' అని చెప్పి వెడలి

పోయెను.

నాటినుండి క్షురాపరశువు జ్యేష్ఠునకు నిష్పాచేయును. రెండవవానికి భేరీవాదనమువలన ఏనుగులరాయిడి తొలగుచుండును. ఘటము వలన కనిష్ఠునకు దధి లభించుచుండును.

ఆకాలమున ఒకానొక పురాతనగ్రామస్థానమున సూకరము తిరుగుచు, మహిమాన్విత మైన మణిఖండమును గాంచి, నోట గరచుకొని. తన్మహిమవలననే తత్క్షణ మాకాశమున కెగసి సముద్ర మధ్యమున ద్వీపమును కనుగొని అచ్చట నివసించుట యుక్త మని తలచి, క్రిందికి దిగి, రమణీయప్రదేశమున ఉదుంబరవృక్షముక్రింద నివాసము ప్రారంభించెను. ఒకనాడు సూకరము మణిఖండమును తన కెదురుగా బెట్టుకొని చెట్టుక్రింద నిద్రించుచుండెను.

కాశీరాష్ట్రములో నొకనిని నిరుపయోగి యని తలిదండ్రు లింటిలో నుండి తరిమివేయగా, వాడు పట్టనగ్రామమునకు (See-port) బోయి, నావికులకు కర్మకారు డయి, నౌకాప్రయాణము చేయుచుండెను. నౌక సముద్రములో పగిలిపోవగా వాడు పలక పట్టుకొని, ఆద్వీపము జేరి, ఫలాదులకై తిరుగుచు, నిద్రించు సూకరమువద్దకు బోయి, మణిఖండమును గైకొని, దాని ప్రభావముచే గగనమున కెగసి, ఉదుంబర వృక్షముపై గూరుచుండి, 'సూకర మీమాణిక్యప్రభావముచే గగనమున చరించుచు, ఇచ్చట దిగిన దని తోచును. మొదట దీనిని సంహరించి, మాంసము భుజించి, అనంతరము పోవచ్చును' అని భావించెను.

వాడు చిన్న మండ విరిచి దాని నెత్తిపై బడవేసెను. మెలకువ వచ్చి లేచి సూకరము మణిఖండమును గానక కంపముతో నిటు నటు పరుగెత్తుచుండెను. చెట్టుపై నున్న వాడు నవ్వెను. వరాహము వానిని జూచి, శిరస్సుతో వృక్షస్కంధమును డీకొనెను. తల పగిలి వరాహ మచటనే పడి చచ్చెను. ఆతడు చెట్టు దిగి, నిప్పు చేసి, వరాహమును వండి, తిని, ఆకాశమార్గమున హిమవత్ప్రదేశమునకు జనుచు, ఆశ్రమపదమును గాంచి రెండుదినము లుండి, పెద్ద తపసికి వివిధోపచారములు చేసి, క్షురాపరశుప్రభావమును కనిపెట్టెను. దానిని సంగ్రహింప దలచి వాడు మాణిక్యఖండప్రభావమును తాపసికి జూపి, 'భన్తే, దీనిని దీసికొని క్షురాపరశువు నా కిందు' అనెను. తాపసి

ఆకాశమున విచరింప గోరి, మణిఖండమును దీసికొని, పరశువు వాని కిచ్చెను. తీసికొని వాడు కొంచెము దూరము పోయి, పరశువును తట్టి 'పరశూ, తాపసుని శిరసు ఖండించి, మణిఖండము గొనిరమ్ము' అని పలికెను. పరశువు పోయి, తపసితల తరిగి, మణిఖండమును దెచ్చి యిచ్చెను. పరశువును రహస్యముగా నొకచో దాచి, రెండవతపస్వి వద్దకు బోయి కొలదిరోజు లుండి, భేరీప్రభావము గ్రహించి, మాణిక్య మిచ్చి, భేరి తీసికొని, వెనుకటివలెనే తపసిశిరసు తలిగించి, కనిష్ఠుని కడకు జనెను. అచట దధిఘటప్రభావము చూచి తపసికి మాణిక్య ఖండ మిచ్చి, దధిఘటమును దీసికొని, పూర్వమువలెనే తాపసిశిరస్సు ఖండించి, మాణిక్యఖండమును, క్షురాపరశువును భేరిని, దధిఘట మును దీసికొని, ఆకసమున కెగసి వారాణసి సమీపించెను.

వా డచట నాగి, వారాణసీరాజుకు 'రాజ్య మిత్తువా, యుద్ధము చేయుదువా?' అని సందేశ మంపెను. రాజు విని, చోరుని బట్టు కొందు నని బయలుదేరెను. భేరిని వా డొకప్రక్క వాయింపగా చతురంగబలము సమకూడెను. రాజు రచించిన సేనావిన్యాసమును జూచి వాడు దధిఘటమును తలక్రిందు చేసెను. వెంటనే వెల్లువ బయలుదేరెను. సైనికులు పెరుగులో మునిగిపోయిరి. వాడు పరశు వును తట్టి, రాజుమస్తకము గొనిర మ్మనగానే పరశువు పోయి రాజు తల తరిగి తెచ్చి వానిపాదములకడ బడవేసెను. సేనలో నొకడుకూడ ఆయుధ మెత్తలేకపోయెను. వాడు మహాసేనాపరివృతుడై నగర ములో బ్రవేశించెను. రాజ్యాభిషేకానంతరము వాడు దధివాహను డను పేరు పెట్టుకొని, న్యాయపరిపాలనము ప్రారంభించెను.

ఒకనా డతడు మహానదిలో వలలు, గంపలు వేసి క్రీడించుచుండగా, కర్ణముండప్రహదమునుండి దేవతోపభోగ్య మగు సహకారఫలము వచ్చి వలలో జిక్కుకొనెను. వల యెత్తువారు చూచి దానిని రాజు కిచ్చిరి. ఘటప్రమాణమున గుండ్రముగా నున్న మామిడిపండు స్వర్ణవర్ణవిరాజ మానము. రాజు చూచి 'ఇది యేచెట్టు పండు?' అని యడుగగా పరి జనులు ఆమ్రఫల మనిరి. రాజు పండు తిని, టెంకి తోటలో నాటించెను. దానికి పాలనీరు పోయుచుండిరి. మొక్క పెరిగి వృక్షమై, మూడవ యేట కాయలు కాచెను. ఆమ్రవృక్షమున కాదరము చూపుచుండిరి.

పాలనీరు పోసి, సుగంధపంచాంగుళిక మిచ్చి, పుష్పమాలికలు చుట్టి పార్శ్వమున సుగంధతైలదీపము వెలిగించి, కాశేయము చుట్టబెట్టి యుండిరి. దానిపండ్లు బంగరురంగు గలిగి, మహామధురముగా నుండెను.

దధివాహను డన్యరాజులకు మామిడిపండ్లు పంపుచుండెను. పంపుటకుముందు కంటకముతో బ్రతిఫలమును పొడిపించెడివాడు. దానివలన టెంకి మొలవదు. రాజులు ఫలములు భక్షించి టెంకలు నాటించినను మొక్కలు మొలిచెడివి కావు. కారణ మేమా యని వారు యోజించెడివారు.

ఒకరాజు తన వనపాలకుని బిలిచి, 'దధివాహనుని మామిడిపండ్లలో మాధుర్యము పోగొట్టి, చేదు సంక్రమింప జేయగలవా?' అని యడిగెను. 'చిత్తము దేవా,' యని వా డనగా అట్లయిన పొమ్ము అని రాజు వానికి వేయినాణెము లిచ్చి పంపెను. వాడు వారాణసికి బోయి, ఉద్యానవనపాలకుడు వచ్చినా డని రాజు చెవిని వేయించి, ఆహ్వానము వచ్చినంతనే రాజదర్శనము జేసి నమస్కరించెను.

'నీ వుద్యానపాలకుడవా?' అని రాజు ప్రశ్నింప వాడు చిత్తము దేవా యని నిజశక్తిని వర్ణించెను. అంతట రాజు 'నీవు పోయి మా వనపాలకునితో నుండుము' అని పలికెను.

అది మొదలు వా డుద్యానపాలకునితో గలిసి, ఉద్యానమును గనిపెట్టి యుండెను. నూతనాగతుడు అకాలమున పుష్పములు ఫలములు కలుగునట్లు చేసి ఆరామమును రమణీయముగా కావించెను. రాజు సంతుష్టచిత్తుడై వెనుకటివనపాలుని తొలగించి, వీనికి తోట యిచ్చెను.

ఉద్యానము తనచేతిలోకి వచ్చుటచే వాడు మామిడిచెట్టుచుట్టును వేపమొక్కలను, చేదుతీగెలను నాటినాడు. అవి క్రమముగా పెరిగినవి. వానివ్రేళ్ళు మామిడివ్రేళ్ళతోను, కొమ్మలు కొమ్మలతోను అల్లిబిల్లిగా అల్లుకొన్నవి. రుచిలేని చేదుచెట్లతో సంసర్గమువలన మామిడిపండ్లు వేపాకువలె చేదు తిరిగినవి. ఆమ్రము తిక్తమైన దని గ్రహించి వనపాలకుడు పారిపోయెను. దధివాహనుడు తోటలోనికి బోయి పండు కొరికి వేపరసమువలె చేదుగా నున్న ఆమ్రరసము త్రాగలేక కాండ్రించి యుమిసెను.

ఆకాలమున తన కర్థధర్మానుశాసకుడుగా నున్న బోధిసత్త్వుని రాజు పిలిపించి "పండితోత్తమా, ఈవృక్షమునకు వెనుకటినుండి తీసికొను జాగరూకతలో లోపము లేదు. అయినను పండ్లు చేదుగా నున్నవి. దీనికి కారణ మేమి?" అని యీగాథ పలికెను:

మామిడి పూర్వము మధురరసంబు
తోడను, వర్ణంబుతోడ నుండెడిది,
ఎప్పటి దోహదమే సాగుచున్న,
దైన మహాకటు వైన దెందులకు?

దీనికి కారణము తెలుపుచు బోధిసత్త్వుడీగాథ పలికెను.

నీ సహకారమున్ నింబంబు రాజ,
క్రమ్మి వేసినది; శాఖలు శాఖికలను
పెనవేసినవి; మూలమును వేరుపట్టె;
కావున ఆమ్రంబు కటువయిపోయె.

రాజు వాక్కులు విని, వేపమొక్కలను చేదు తీగెలను నరికించి, మొదళ్ళు త్రవ్వించి యెత్తివేయించి, చేదుమన్ను అన్నిప్రక్కలనుండి తొలగించి తియ్యని మన్ను చల్లించి, క్షీరోదకము పోయించి, శర్కరోదకము సుగంధోదకము పోయించి, భద్రముగా పెంచెను. మధుర వస్తుసంసర్గముచే సహకారము మరల మధుర మయ్యెను. రాజు వెనుకటి వనపాలకుని బిలిపించి, ఉద్యాన మప్పగించి, జీవితాంతమున యథా కమ్మం గతో.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆసమయమున నేనే పండితామాత్యుడను.

# 187 చతుమట్ఠ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, వృద్ధభిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు ఇరువురు ప్రధానశిష్యులు కూర్చుండి పరస్పరము ప్రశ్నోత్తరములు జరుపుచుండగా వృద్ధుడు వారికడకు బోయిచేరెను. వారు 'భన్తే, మేము తమను ఒకటి అడుగదలచినాము. తాముకూడ సంశయములను మాకడ నివారించుకొననచ్చు' ననిరి.

స్థవిరుడు వారియెడ హేయభావము ప్రకటించుచు లేచి వెడలిపోయెను. స్థవిరులు ధర్మసభనుండి లేచిన పిదప వారు శాస్తసన్నిధికి బోయిరి. బుద్ధుడు "అకాలమున వచ్చితిరేమి?" అనియడుగ జరిగిన వృత్తాంతము తెల్పిరి. శాస్త 'భిక్షువులారా, ఇప్పుడే కాదు, సారిపుత్ర మౌద్గల్యాయనులు వీరి విషయమై జుగుప్స కనబరచి, ఏమియు మాటాడకుండనే పూర్వము కూడ వెడలిపోయిరి' అని పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అరణ్యములో వృక్షదేవతగా నుండెను. చిత్రకూటపర్వతమునుండి రెండుహంసపోతకములు వచ్చి ఆచెట్టుమీద వ్రాలి, మేతకై వెడలి, మరలివచ్చునప్పుడుకూడ ఆవృక్షముమీదనే విశ్రమించి చిత్రకూటమునకు బోవుచుండును. కొంతకాలమునకు బోధిసత్త్వునియెడ వానికి విశ్వాసము కుదిరెను. రాకపోకలలో నవి అన్యోన్యక్షేమమడిగి, ధర్మకథాప్రసంగములు చేయుచుండును. ఒకనాడవి వృక్షముపై బోధిసత్త్వునితో మాటాడుచుండ, చెట్టుక్రిందికి నక్క వచ్చి నిలిచి ఆహంసపోతకములతో యోచనచేయునదయి, ఈగాథ పలికెను:

మంతనం బొంటిగా నిచ్చగింతురేని
ఎక్కియుండుడు తరువుపై నెత్తుగానె,

పలుకు మృగరాజ మాలింప వలతురేని
నిలిచి పలుకగవలయును నేలకు దిగి.

హంసపోతకములు జుగుప్స చెంది చిత్రకూటమునకు బోయినవి. అవి పోయిన పిమ్మట బోధిసత్త్వుడు నక్కతో ఈగాథ పలికెను:

ఇంబుగా సుపర్ణము సుపర్ణంబుతోడ
దైవతముతోడ నిచ్చట దైవతంబు
మంతనం బాడు; నీ కేటి కంత! బోరియ
నక్క మో నాల్గుగుణముల నక్కరేడ!

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. వృద్ధుడు ఆకాలమున నక్క; హంసపోతకములు సారిపుత్ర మౌదల్యాయనులు, వృక్షదేవత నేనే.

## 188 సీహకోట్ఠుక జాతకము

శాస్త జేతవనమున విహారముచేయుచు కోకాలిక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకనాడు బహుశ్రుతులు ధర్మమునుగూర్చి ప్రసంగించుచుండగా కోకాలికునకుగూడ ప్రసంగము చేయవలె నను వాంఛ కలిగినది. కథ పూర్వోక్తప్రకారముగా నడచినది. శాస్త ఆవిషయము తెలిసికొని "ఇప్పుడే కాదు. పూర్వముకూడ కోకాలికుడు తనవాక్కువలన పట్టుబడినాడు" అని, అతీతకథ చెప్పినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున సింహముగా పుట్టెను. సింహమునకు ఒకానొక నక్కతో సంసర్గము కలుగుటవలన బిడ్డడు పుట్టెను. దాని వ్రేళ్ళు, గోళ్ళు, కేసరములు, వర్ణము, ఆకారప్రకారములు

సింహమువలెను, కంఠధ్వని తల్లివలెను ఉండెను.

ఒకనాడు వర్షము కురిసి వెలిసిన తరువాత సింహములు గర్జించుచు క్రీడించుచుండగా ఆసింహముబిడ్డ వానితో కలిసి గర్జింప దలచి ధ్వని చేసెను. అది నక్కకూత. ఆశబ్దము విని సింహములు మిన్నకుండెను. ఆకూత విని బోధిసత్త్వుని సజాతీయపుత్రు డగు వేరొకసింహపోతము "నాయనా, ఈసింహము వర్ణాదులలో మాతో సరిపోలుచున్నది. దీని ధ్వనిమాత్రము ఏదో ధ్వనివలె నున్నది. ఎవ రిది?" అని ప్రశ్న వేయుచు ఈగాథ పలికెను.

సింగంబు వ్రేళులు, సింహనఖాలు,
సింహపాదా లుండి, సింహాలనడుమ
అరచెడి యీతని యారావ మేల
సింహనాదమువోలె చెవి జేర లేదు?

అది విని బోధిసత్త్వుడు "నాయనా, వీడు నీసోదరుడు, నక్కబిడ్డ. రూపములో నన్ను పోలి, కంఠధ్వనిలో తల్లిని పోలినవాడు" అని చెప్పి, సృగాలిపుత్రుని బిలిచి, "నాయనా, నేటినుండి నీ విక్కడ నున్నంతసేపు నోరు తెరవవలదు. నీవు ధ్వనిచేయుదువేని నక్క వను సంగతి బయటబడును" అని బోధించు ఈగాథ పలికెను:

రాజపుత్రా, నీ వరణ్యంబునందు
మాటాడుచుండుము మందమందముగ;
నీతండ్రిగంభీరనినదంబు బోల
దీవు చేసెడి రవం, బెత్తకు గొంతు!

ఈయుపదేశము విన్నతరువాత అది గర్జించుట కెన్నడు నుత్స హింపలేదు.

శాస్త్త ధర్మోపదేశము ఈ ప్రకారముగా చేసి జాతకములు మేళవించినాడు. అసమ యమున కోకాలికుడు నక్క; రాహులుడు స్వజాతీయపుత్రుడు, నేనే మృగరాజును.

# 189 సీహచమ్మ జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా కోకాలికుని గూర్చియే చెప్పినది.

## వర్తమాన కథ

ఆభిక్షువు ఆసమయమున స్వరముతో సూత్రపఠనము చేయ గోరెను. ఆసంగతి విని శాస్త, పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కర్షకవంశమున బుట్టి పెద్దవాడయి, కృషివలన జీవనము చేయుచుండెను. ఆరోజులలో వర్తకు డొకడు గాడిదపై బరువులు వేసి వ్యాపారము చేయుచు తిరుగుచుండెను. ఆతడు పయనము చేయు తావులలో గార్దభము వీపుపైనుండి బరువు దింపి, దానియొడలిపై సింహచర్మము కప్పి, శాలి యవ క్షేత్రములలో విడుచుచుండెను. పొలము కాపరులు దానిని జూచి, సమీపింపలే కుండిరి.

ఒకనా డావర్తకు డొకగ్రామముఖమున విడిసి, ఉదయము వంట చేసికొనుచు, గార్దభమునకు సింహచర్మము కప్పి, యవక్షేత్రమున వదలెను. క్షేత్రరక్షకులు సింహమని భ్రమపడి, గ్రామములోనికి బోయి ఘోషపెట్టిరి. గ్రామవాసు లాయుధములు దాల్చి, శంఖము లూదుచు, భేరి వాయించుచు, క్షేత్రసమీపమునకు బోయి కలకలము చేసిరి. గార్దభము మరణభయముచే ఓండ్రపెట్టెను. దానియరపు గ్రహించి, బోధిసత్త్వు డీగాథ పలికెను

కా దిది పంచాస్యగర్జన; చిఱుత
పులియులి వైన బెబ్బులి బొబ్బరింత
యైనను కాదు; సింహంబుచర్మంబు
దాల్చిన నీచగార్దభనిస్స్వనంబు.

గ్రామవాసులు దాని యోండ్ర విని, ఎముకలు విరగ గొట్టి, సింహ చర్మమును లాగివేసి, వెడలిపోయిరి. ఆవల వర్తకుడు వచ్చి, వ్యథతో

నున్న గాడిదను జూచి, ఈగాథ పలికెను:

సింహచర్మము దాల్చి చిరకాల మీవు
పచ్చని యవసస్యభక్షణ చేయు
చున్నదానవు; నేడో ఓంకారమూలమున
స్వీయముగా చేటు రాసభమ, పొందితివి!

ఆత డిట్లు పలుకుచుండగనే గాడిద అచ్చటనే ప్రాణములు విడి చెను. వర్తకుడు దాని నచటనే విడిచి, వెడలిపోయెను.

శాస్త్ర యీ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను ఆసమయమున కోకాలికుడు గార్ధభము; నేనే పండిత కాశ్యపుడను

## 190 సీలానిసంస జాతకము

శాస్త్ర జేతవనమున విహారము జేయుచు శ్రద్ధావంతు డగు ఒకానొక ఉపాసకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు శ్రద్ధావంతుడు, ప్రసన్నచిత్తుడు అగు ఆర్యశ్రావకుడు. ఒకనా డతడు జేతవనమునకు పోవుచు సాయంసమయమున అచిరవతీ నదీతీరమును చేరెను. నావికులు పడవలలో ధర్మోపదేశము వినుటకు పోయిరని తెలిసికొనెను. అతడు రేవున ఏమియు కానక బుద్ధుని మన స్సులో స్మరించి నీటిలో దిగెను. అతనిపాదములు నీట తడవలేదు. నేలపై నడచుచున్న రీతిని మధ్యభాగమునకు చేరిన పిదప అలలు కాన బడెను. ఆతనిమానసమున బుద్ధునియెడ భక్తి మందగించుటచే పాద ములు మునిగిపోవనాగెను.

ఆతడు బుద్ధభగవానుని యెడ భక్తిభావమును ప్రకోపింపజేసికొని, నీటిపై నడిచి, జేతవనము చేరి శాస్త్రకు ప్రణామము చేసి ఒకప్రక్కన కూర్చుండెను. శాస్త్ర అతనితో సంభాషించుచు "ఉపాసకా! నీవు

మార్గమున వచ్చునపుడు విశేషశ్రమ కలుగలేదా?'' అనెను. "భ న్తే, బుద్ధభగవానుని స్మరించి భక్తితో నుండుటచే భూతలముపై నడిచి నట్లు జలముపై నడిచివచ్చితిని."

''ఉపాసకా, కేవలము నీవే కాక, పూర్వము సముద్రమున మునిగిన పడవలోని ఉపాసకులు బుద్ధగుణములను స్మరించి సంరక్షణ పొందిరి'' అని శాస్త ఆతడు ప్రార్థించిన పిదప పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము కశ్యపసంబుద్ధునికాలమున స్రోతాపన్న, ఆర్యశ్రావకుడు మంగలితో పడవయెక్కెను. మంగలిభార్య 'ఆర్యా, ఈయన కష్టసుఖములభారము (బాధ్యత) మీది' అని తనభర్త నుపాసకున కప్పగించెను. వా రెక్కిన పడవ యేడవనాడు సముద్రమున బ్రద్దలయ్యెను. ఉభయులు చెక్క పట్టుకొని యొకదీవి చేరిరి. అచ్చట మంగలి పిట్టలను గొట్టి వంటచేసి, తాను తిని, ఉపాసకునకు బెట్టబోయెను. ఆయన వలదని, తినక, ఈప్రదేశమున త్రిశరణములకన్న వేరుగతి లేదని తలచి, త్రిరత్నముల ననుగుణములను స్మరించెను. ఆత డిట్లు స్మరించుచుండగా ఆద్వీపమునకు నేత నాగరాజు నిజశరీరమును నావవలె మార్చెను. సముద్రదేవత నియామకు డయ్యెను. నావ సమస్తరత్నములతో నిండియుండెను. ఇంద్రనీలమణిమయములగు మూడు తెరకంబములు, బంగరు లంగరు, రజతమయ రజ్జువులు, కాంచనప్రదరము నున్నవి. సముద్రదేవత పడవమీద నిలిచి, జంబూద్వీపమునకు పోవువారు కలరా? అని ఘోషించెను. మేము పోవుదు మని ఉపాసకుడు పలికెను. అట్లయిన రమ్ము, నావ యెక్కుము అని జలదేవత పలుకగా ఉపాసకుడు నావ యెక్కి మంగలిని రమ్మని పిలిచెను. 'నీవుమాత్ర మెక్కవచ్చును, ఇత డెక్కుటకు వీలు లేదు' అని జలదేవత పలికెను. "ఎందువలన?'' 'వీనికి శీలగుణాచారములు లేవు. నీకొరకే నావ తెచ్చినాను; వీనికొరకు కాదు. 'అటులయినచో, నేను చేసినదానాదికము, రక్షిత మైనశీలము, భావించిన భావన—వీనిలో నీతనికి భాగ మిచ్చుచున్నాను.' 'స్వామీ, నాకు సమ్మతము' అని నావికుడు పలికెను. ఇప్పు

డితనిని కొనిపోవుదు నని జలదేవత నాపితుని నావలో నెక్కించి, ఉభయులను సముద్రము దాటించి, నదీమార్గమున వారాణసికి జేర్చి, నిజప్రభావమున వారియిండ్లలో ధనము సమకూర్చెను "పండితులతో సంసర్గము కర్తవ్యము. ఈ నాపితున కుపాసకునితో సంసర్గము లేనిపక్షమున, నితడు సముద్రములో నశించువాడే!'' అని పండితసంసర్గము వలనిగుణముల నుగ్గడించు నీగాథలు సముద్రదేవత పలికెను:

త్యాగశీలములుం శ్రద్ధయు కల్గువాని
ఫలితంబు చూడు; ముపాసకు నెట్లు
నాగమ్ము కొనిపోయె నౌశకలాన.
సాధుసాంగత్యంబు సాధుసఖ్యంబు
సలుపంగవలయును, సాధుసంగతిని
కల్యాణఫలితమ్ము గాంచె నావికుడు.

సముద్రదేవత ఆకాశమున నిల్చి, యీప్రకారముగా ధర్మముప దేశించి, నాగరాజును వెంటబెట్టుకొని, నిజవిమానమునకు (నివాసమునకు) జనెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటించి జాతకములు సరిపోల్చెను సత్యప్రకటనము కాగానే ఉపాసకుడు సృకదాగామిఫలము పొందెను. అప్పుడు శ్రోతాపన్నుడైన ఉపాసకుడు పరినిర్వాణము పొందెను ఆసనుయమున సారిపుత్రుడు నాగరాజు; నేనే సముద్రదేవతను.

## 191 రుహాక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుసమయమున ప్రథమభార్యపై లోభము వీడనివాని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఈ కథ ఎనిమిదవ నిపాతమున ఇంద్రియజాతకమున (423) వచ్చును. శాస్త ఆభిక్షువుతో 'భిక్షు ఈమె నీకు అనర్థదాయిని. పూర్వముకూడ

ఈమె రాజసభామధ్యమున నిన్ను సిగ్గుపరచి ఇంటినుండి వెలుపలికి వెడలనడచుటకు తగినట్లు చేసినది' అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డాయన పట్టమహిషికడుపున బుట్టి, పెరిగి పెద్దవాడయి, తండ్రితరువాత రాజ్యమునకు వచ్చి, ధర్మపాలనము చేయుచుండెను. ఆయనకు రుహాకు డను పురోహితుడు కలడు. ఆయన భార్యపేరు పురాణి. రాజు పురోహితునకు సర్వాలంకారములతో అశ్వము నిచ్చెను. బ్రాహ్మణుడు అశ్వ మెక్కి రాజదర్శనార్థము పోవుచుండు వాడు. అలంకృతాశ్వముపై గూరుచుండి ఆయన పోవుచున్నప్పుడు దారిలో అచ్చటచ్చట నున్నవారు "ఆహా, ఏమి అశ్వరూపము; ఏమి శోభ" అని అశ్వమును చూచుచుండువారు. బ్రాహ్మణు డింటికి వచ్చి మేడమీదికి బోయి భార్యను బిలిచి 'భద్రే, మనయశ్వము మిక్కిలి శోభించుచున్నది. మార్గమున నిరుప్రక్కలలోనివారు మన యశ్వమునే ప్రశంసించుచున్నారు' అని పలికెను.

బ్రాహ్మణి కొంచెము చమత్కారప్రియ, కొద్దిగా ధూర్తురాలు. ఆమె భర్తతో 'ఆర్యా, అశ్వశోభకు కారణము మీరు గ్రహించినట్టు లేదు. నిజాలంకారములవలన అశ్వము శోభించుచున్నది. మీరుకూడ శోభిల్ల దలతురేని అశ్వాలంకారములను ధరించి వీధిలోనికి దిగి, కాలు సేతులమీద ప్రాకి పోయి రాజదర్శనము చేయుడు. రాజు మిమ్ము ప్రశంసించును, లోకులుగూడ ప్రశంసింతురు' అని చెప్పెను. ఆవెర్రి బ్రాహ్మణు డామెమాటలు విని, యీకారణముచేత ఇట్లు చెప్పిన దని గ్రహింపనేరక, అట్లే చేసెను. చూచినవా రెల్లరును గేలిసేయుచు 'ఆచార్యా, శోభిల్లుచున్నారు' అని పలికిరి. రాజుమాత్రము 'ఆచార్యా, పైత్యము ప్రకోపించినదా? ఉన్మత్తు లయినారు' అని సిగ్గుపరచెను.

అప్పుడు బ్రాహ్మణుడు తనలో 'అయుక్తకార్యము చేసినాను' అని సిగ్గుపడి, బ్రాహ్మణిపై కోపించి, 'భార్యమూలమున రాజసమక్షమున, సేనాసమక్షమున సిగ్గుపాలయితిని. దానిని తన్ని యింటినుండి వెడల

నడచెదను' అని తలచి యింటికి జనెను. ఆయన కోపముతో వచ్చుట గ్రహించి, ఆధూర్త బ్రాహ్మణి ముందుగానే పెరటిగుమ్మము వెంట బయలుదేరి రాజనివేశమునకు బోయి అయిదురోజు లుండెను.

సంగతి తెలిసికొని రాజు పురోహితుని బిలిపించి, 'ఆచార్యా, స్త్రీ వలన లోపము జరుగుచుండును. బ్రాహ్మణిని మీరు క్షమించుట యుక్తము' అని, క్షమాపణార్థ మీగాథ పలికెను:

> తెగినచో వింటినారి సంధింపవచ్చు
> క్రమ్మరఁ; నీదునారిపురాణితోడ
> కలిసియుండుము, క్రోధమ్ము వలదు రుహక!

అది విని రుహకు డీగాథ పలికెను:

> నిపుణు లైన చాపనిర్మాత లుండగా
> సరుకభూరుహంపు బెరడు దొరక
> కార్ముకమ్ము మరల ఘటియించుకొందును:
> ప్రాతనారివలన ఫలము లేదు

ఇట్లు పలికి బ్రాహ్మణు డాభార్యను వెడలగొట్టి, వేరొకభార్యను దెచ్చికొనెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. సత్యప్రకాశన మైన పిదప ఉద్విగ్నచిత్తు డైన భిక్షువు శ్రోతాపత్తిఫలము నందెను.
ఆకాలమున పురాణి పూర్వభార్య; రుహకుడు ఉద్విగ్నచిత్తు డగు భిక్షువు; నేను వారాణసిప్రభువును.

## 192 సిరికాలకణ్ణి జాతకము

ఈ జాతకము మహాఉమ్మగ్గజాతకము (546)లో నుండును.

# 193 చుల్లపదుమ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఉద్విగ్నచిత్తుడగు భిక్షుని గూర్చి చెప్పినది. ఇది 'ఉమ్మదంతి' జాతకములో (527) కానగును.

## వర్తమాన కథ

"భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడ వయితివా?" అని శాస్త అతని నడిగెను.

"భగవన్, నిజముగానే."

"నిన్ను ఎవ్వతె ఉద్విగ్నచిత్తుని చేసినది?"

"భన్తే, అలంకారములు దాల్చి టాకుటీకుగా నున్న ఒకతెను చూచి ఆసక్తుడ నగుటచే ఉద్విగ్నచిత్తుడ నయితిని."

"భిక్షూ, స్త్రీకి కృతజ్ఞత లేదు; మైత్రిలో స్త్రీ ద్రోహము చేయును. హృదయమున కాఠిన్య ముండును. ప్రాచీనపండితులుకూడ ప్రాణము లొడ్డినను స్త్రీచిత్తమును జయింపలేకపోయిరి" అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వు డాతనిరాణికడుపున బుట్టెను. నామకరణమునా డతనికి పద్మకుమారు డని పేరుపెట్టిరి. అతని తరువాత ఆరుగురు మగబిడ్డలు పుట్టిరి. వా రందరు పెరిగి పెద్దవా రయిన పిదప వివాహము లయ్యెను. వారు తండ్రికి మిత్రసమానులుగా నుండిరి.

ఒకనాడు రా జాంగణములో నిలుచుండి, వా రెల్లరు దర్పముతో తనకొలువుకై వచ్చుచుండగా జూచి, వీరు నన్ను సంహరించి రాజ్యము హరింపగల రని సంశయించి, దగ్గరకు బిలిచి, "నాయనలారా, మీ రీనగరమున నుండలేరు. వేరొక తావునకు పొండు నామరణానంతరము వచ్చి, కులక్రమాగత మైన రాజ్యమును పరిగ్రహింపుడు" అని చెప్పెను.

వారు తండ్రిమాటలు విని విచారముతో గృహములకు జని, తమ భార్యలను వెంట బెట్టుకొని, వేరొకతావునకు బోయి జీవనము చేయ నెంచి, నగరము వెలువడి ప్రయాణము చేయుచుండిరి. వారు కొంత దూరము పోగా కాంతారము వచ్చెను. అచ్చట తినుటకు గాని త్రాగుటకు గాని ఏమియు లేదు. వా రాకలిబాధకు తాళలేక బ్రదికి యున్నచో భార్యలు లభింతు రని యోజించి, కనిష్ఠునిభార్యను సంహరించి పదుమూడుముక్కలు చేసి భుజించిరి. బోధిసత్త్వుడు తనకును తనభార్యకును వంతు వచ్చిన రెండుముక్కలలో నొకదానిని దాచి, మిగిలినఖండము నిరువురు తినిరి. ఈవిధముగా ఆరురోజులలో ఆరుగురు స్త్రీలను సంహరించిరి. బోధిసత్త్వుడు దినమున కొకముక్క మిగిల్చి, ఏడవనాడు తనభార్యవంతు వచ్చినప్పుడు మిగిల్చిన మాంసఖండములను వారి కిచ్చి, రేపటిమాట తరువాత నాలోచింపవచ్చు ననెను.

వారు నిద్రపోయిన తర్వాత బోధిసత్త్వుడు నిజభార్యను వెంటగొని పలాయనము చేసెను. కొలదిదూరము పోగ నే యామె "స్వామీ, నేను నడువజాల" ననెను. అతడు భార్యను బుజముపై నెక్కించుకొని, తెల్లవారుసరకి కాంతారము వెలువడెను. సూర్యోదయ మయినంతనే యామె "స్వామీ, నాకు దాహ మగుచున్న" దనెను. "భద్రే, జలము లేదు" అని భర్త చెప్పినను, ఆమె మాటిమాటికిని దాహ మని యడుగుచుండెను. బోధిసత్త్వుడు కత్తితో తన కుడిపిక్క కోసి, "భద్రే, జలము లేదు. నా కుడిపిక్కలోనిరక్తము త్రోలుము" అనెను. ఆమె యట్లే చేసెను.

వారు క్రమముగా మహానదీతీరము చేరి, దాహము త్రాగి, స్నానము చేసి, కందమూలఫలాదులు భుజించి విశ్రాంతికై యొకచో బరుండి, గంగానదిమలుపులో నొకతావున నాశ్రమము నిర్మించుకొని, నివసింపజొచ్చిరి.

అపరాధి యగు చోరుని కాలుచేతులు, ముక్కు కోసి, వానిని గంపలో బెట్టి రాజపురుషులు గంగలో విడిచిరి. ఆక్రందనము చేయుచు వాడు జలప్రవాహమున గొట్టుకొని వచ్చుచుండెను. వాని దీనరోదనము విని బోధిసత్త్వుడు తనలో "నే నుండగా నేప్రాణియు దుఃఖము చెంది నశింపరాదు" అని తలపోసి, వాని నాశ్రమమునకు గొనివచ్చి,

గాయములకు చికిత్స చేసెను. అసహ్యముచే ఆయన భార్య వానివైపు చూచి ఉమ్మివేయుచు మరలుచుండెను. మొండివానికి బోధిసత్త్వు డుపచారము చేయుచుండెను. వాని గాయములు నయమయిన పిదప బోధిసత్త్వు డడవికి బోయి ఫలాదులు తెచ్చి వారిని పోషించు చుండెను.

ఇట్లు కాలము గడచుచుండగా నామె మొండివానిమీఁద మోహము చెంది, యొకనాడు వానితో దుష్ప్రవర్తనము సాగించెను. నిజభర్తను సంహరింపవలె నను కోరిక పుట్టి ఒకనా డామె "స్వామీ, నేను మీభుజములపై గూరుచుండి కాంతారమున ప్రయాణముచేయునపు డీపర్వతమును పర్వతవాసినీదేవీ, నేను భర్తయు ప్రాణములతో బయట బడితిమేని నీకు బలి సమర్పింతును అని మనసులో ప్రార్థించితిని. దేవత బలికై వేచియుండును. కావున బలి సమర్పింతము" అని పలికెను. ఆమె తంత్రము గ్రహింపని బోధిసత్త్వుడు మంచి దని పూజాద్రవ్యములు సిద్ధము చేసి, బలిపాత్రను చేతబట్టుకొని భార్యతోగూడ పర్వత మెక్కెను. ఆమె భర్తతో "స్వామీ, మీరు నాకు దేవతకంటెను ఉత్తమదేవతాస్వరూపులు. కావున మిమ్ము తొలుత వనపుష్పములతో పూజించి, ప్రదక్షిణనమస్కారములు చేసి, పిమ్మట దేవతకు బలి యిత్తును" అని పలికి, ప్రపాతము వైపున భర్తను గూరుచుండ బెట్టి పూజచేసెను. అనంతరము ప్రదక్షిణము చేయుదానివలె వెనుకకు బోయి వీపుమీద తన్ని ఆయనను క్రిందికి ద్రోసెను. పిమ్మట కొండదిగి మొండివానికడకు బోయెను. బోధిసత్త్వుడు ప్రపాతము వెంట దొరలి, నడుమ మేడిచెట్టుపై మెత్తని గుబురులో జిక్కుకొనెను. పర్వతపాదమునకు దిగుట కవకాశము లేక ఆయన చెట్టు కొమ్మలలో గూరుచుండి అత్తిపండ్లు తినుచుండెను.

పెద్ద యుడుము కొండ క్రిందినుండి మేడిచెట్టుమీదికి ప్రాకి అను దినము పండ్లు తినుచుండును. ఉడు మానాడు బోధిసత్త్వుని చూచి, బెదరి పరుగిడెను; మరునాడు వచ్చి, భయము లేకుండుటచే పండ్లు తినిపోయెను. ఇట్లు తరచుగా వచ్చుచు బోధిసత్త్వుని జూచుచుండుటచే విశ్వాస మేర్పడి "మీ రిక్కడి కేల వచ్చినారు?" అని యడిగెను. ఈకారణముచే నని బోధిసత్త్వుడు జరిగిన దంతయు జెప్పెను. భయ

పడ వల దని చెప్పి, ఉడుము బోధిసత్త్వుని తనవీపుపై నెక్కించుకొని, కొండ దిగి, అడవి దాటి రాజమార్గము చేరి, ఈత్రోవను పొండు అని ఆయన కుత్సాహ మిచ్చి, తా నడవి జొచ్చెను.

బోధిసత్త్వుడు కుగ్రామమునకు జని, అచ్చట నివసింప జొచ్చెను. కొన్నాళ్ళకు తండ్రిమరణవార్త విని యాతడు వారాణసికి బోయి, కులక్రమాగత మగు సింహాసన మధిష్ఠించి, పద్మరా జను పేర దశ రాజధర్మములకు ననుకూలముగా పరిపాలన చేయుచుండెను. నగర ద్వారములు నాల్గింటికడను, నగరమధ్యమునను, ప్రాసాదసమీపము నను ఆరుధర్మశాలలు నిర్మించి ప్రతిదినము ఆరువేల నాణెములు దాన మునకు వినియోగించుచుండెను.

ఆ పాపాత్మురాలు మొండివానిని బుజములపై నెక్కించుకొని, అడవి దాటిపోయి, గ్రామములలో ముష్టియెత్తుచు గంజియన్నము సంపాదించి వానిని పోషించుచుండెను. వీడు నీ కేమి కావలయు నని యెవరైన నడిగినచో "నేను ఈయన మామకూతురను. ఈయన నా మేనత్తకుమారుడు. ఈయనకు న న్నిచ్చి పెండ్లి చేసినారు. శిక్ష పడ్డ నాభర్తను బుజములపై నెత్తుకొని తిరుగుచు ముష్టి యెత్తుకొని పోషించుచున్నాను" అని యామె చెప్పెను. లోకు లామె పతివ్రత యని భావించి మరింత యన్నము పెట్టుదురు. ఒకనా డొక రామెతో "నీ విట్లు తిరుగవలదు. వారాణసిలో పద్మరాజు ధర్మపాలన చేయు చున్నారు. యావజ్జంబూద్వీపము దద్దరిల్లునట్లు దానములు చేయు చున్నాడు. మిమ్ము జూచి ప్రసన్నచిత్తుడై విశేషధన మిచ్చును" అని చెప్పి, గంప యిచ్చి 'నీభర్త నిందులో గూరుచుండబెట్టుకొని పొమ్ము' అని బోధించిరి. ఆమె మొండివానిని గంపలో గూరుచుండబెట్టి వారాణసి చేరి, ధర్మశాలలో భుజించి తిరుగుచుండెను.

అలంకరించిన యేనుగు నెక్కి బోధిసత్త్వుడు ధర్మశాలకు బోయి ప్రతిదినము పదిమందికి స్వహస్తములతో దాన మిచ్చిపోవుట అలవాటు. ఆ దుశ్శీల గంపలో మొండివానితో రాజమార్గమున నిలిచి యుండెను. రాజు చూచి 'ఎవ రది?' యనెను. 'దేవా, ఎవరో పతివ్రత' అని ప్రక్కవా రనిరి. దానిని బిలిపించి రాజు గురుతించి 'వీడు నీ కేమి కావలె?' నని యడిగెను.

'దేవా, ఈయన నా మేనత్తకుమారుడు. కులములో పెద్దలు న న్నీయన కిచ్చినారు. ఈయన నా భర్త' అని యామె పలుకగా, అందలి మర్మము గ్రహింపని లోకులు 'ఆహా, ఏమి పతివ్రత, ఆహా!' అని ప్రశంసించిరి. రాజు మరల 'నీకులములో పెద్దలు ని న్నితని కిచ్చి నారా? ఇతడు నీ మగడా?' అనెను. ఆ కులట రాజును గుర్తింపక, ధైర్యముగా "చిత్తము, దేవా" అనెను.

అప్పుడు రా జిట్లనెను: "వీడు వారాణసీరాజపుత్రుడా? నీవు పద్మ కుమారుని భార్యవా? నీవు అముకరాజపుత్రికవా? నా పిక్క నెత్తురు త్రాగినావు. ఈమొండివానిని వలచి నన్ను ప్రపాతమునుండి క్రిందికి ద్రోసినావు. నేను మరణించితి నని యిచ్చటికి వచ్చితివా? నేను జీవించియే యున్నాను.'

రా జిట్లు పలికి అమాత్యులను బిలిచి 'అమాత్యులారా, మీ రడిగిన పిమ్మట ఆరుగురు సహోదరులభార్యల సంగతి చెప్పితిని. నా భార్యను గంగానదీతీరమునకు గొనిపోతిని. అచ్చటి పర్ణశాలలో నుంటిమి. శిక్షపడ్డ మొండివాడు నీట గొట్టుకొని వచ్చుచుండగా రక్షించి పోషించితిని. ఈయాడుది వానిని మరగి, నన్ను పర్వతప్రపాతము నుండి క్రిందికి ద్రోసినది. మైత్రీచిత్తముతో నుండుటచే నాకు మరణము సంభవింపలేదు. నన్ను కొండపై నుండి క్రిందికి నెట్టినది యీ దుర్మార్గు రాలే. శిక్ష పడిన మొండివాడు వీడే' అని యీగాధలు పలికెను.

ఏను కా నన్నుడ; ఈ రాణి యామె;
హస్తముల్ లేని యీహతకుండు వాడె;
వధయింప దగినట్టివారలు స్త్రీలు;
కానరా దవ్వారికడ సత్య మెపుడు

పరదారలుబ్ధుని, పాపిని, నీచు
ముసలాన గట్టిగా మోది చంపుండు
పాపి పతివ్రత బ్రదికి యుండగనె
ఖండించి వేయుడు కర్ణనాసికలు.

కోప మాపుకొనలేక బోధిసత్త్వుడీశిక్ష విధించెను, కాని దండము నిర్వర్తింప లేదు. క్రోధ ముపశమింపగా గంప ఆమె నెత్తిన నొక్కించి

గట్టిగా గట్టించి, అందులోని మొండివానితో గూడ నామెను తన రాజ్యమునుండి వెడలగొట్టించెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటించి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకటనానంతరము ఉద్విగ్నభిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితుడయ్యెను.

ఆకాలమున ఆరుగురు సోదరులు కొందరు స్థవిరులు; భార్య చించామాణవిక; లుబ్ధ దేవదత్తుడు; గోహరాజు ఆనందుడు; పద్మరాజు నేనే.

## 194 మణిచోర జాతకము

శాస్త వేళువనమున విహరించుచు వధోద్యుక్తుడయిన దేవదత్తుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆవార్త విని శాస్త "భిక్షువులారా! నన్ను వధించుప్రయత్నము ఇప్పుడే కాదు, పూర్వముకూడ దేవదత్తుడు ప్రయత్నము చేసి విఫలుడైనాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వారాణసికి సమీపముగా నొకగ్రామములో సంసారుల యింట బుట్టెను. ఆయనకు వయసు వచ్చిన పిమ్మట వివాహార్థము వారాణసినుండి కన్యను గొనివచ్చిరి. ఆమె మంచిది, చక్కనిది, అప్సరసలవంటిది, పూచిన లతిక వంటిది. కిన్నరవలె ఆమె క్రీడాపరాయణ. పతివ్రత యైన ఆసుజాత సదాచారసంపన్న, కర్తవ్యపరాయణ. ఆమె అత్తమామలకు, భర్తకు నిత్య ముపచారములు చేయుచుండెను. ఆమె బోధిసత్త్వున కనుకూలవతి, ప్రియురాలు. ఉభయులు మనసులు కలిసి ప్రసన్నచిత్తములతో నుండిరి.

ఒకనా డామె బోధిసత్త్వునితో తలిదండ్రులను జూచివత్తు ననెను. "మంచిది భద్రే, తగిన పాథేయము సిద్ధము చేయు" మని యతడు వంటకములను ఖాద్యములను బండిపై బెట్టి ముందర గూరుచుండి బండి తోలెను. సుజాత వెనుక గూరుచుండెను. వారు నగరము సమీపించి బండి విప్పి, స్నానాదికము చేసిరి. బోధిసత్త్వుడు బండి కట్టి, ముందరివైపున గూరుచుండెను. సుజాత మంచి చీర కట్టుకొని, అలంకారములు ధరించి వెనుకవైపున గూరుచుండెను. బండి నగరములోనికి జేరునప్పటికి ఏనుగుపై గూరుచుండి నగరప్రదక్షిణము చేయుచున్న వారాణసీరాజు అచ్చటికి వచ్చెను. సుజాత బండి దిగి, దాని వెనుకగా నడచుచుండెను. రా జామెను చూచి రూపసంపదకు ముగ్ధుడై, ప్రతిబద్ధచిత్తుడై, దృష్టి మరల్పజాలక, అమాత్యు నొకని బిలిచి ఆమెకు భర్త యున్నాడో లేడో కనుగొను మని పంపెను. ఆతడు పోయి తెలిసికొని వచ్చి, 'దేవా, ఆమె వివాహిత. బండిలో నున్నవా డామె భర్త' అని విన్నవించెను.

కోర్కి నిరోధింపజాలక రాజు కామాతురుడై 'ఏదో యుపాయమున పురుషుని సంహరించి, స్త్రీని గ్రహింతు' నని తలపోసి రాజపురుషు నొకని బిలిచి, 'ఓరీ నీవు ఈచూడామణిని గొని వీథివెంట జనువానివలె నటించుచు ఆబండిలో బడవేసి రమ్ము' అని యానతిచ్చెను. చిత్తమని వారు పోయి చూడామణిని చాటుగా బండిలో విడిచి, వచ్చి దేవా, పడవేసితి నని విన్నవించెను.

తనచూడామణి పోయిన దని రాజు ప్రకటించెను. తోడనే పరిజనులు కోలాహలము చేసిరి. 'ద్వారములన్నియు మూసి, జనుల రాకపోక లరికట్టి చోరు నన్వేషింపు' డని రా జానతిచ్చెను. రాజపురుషులట్లే చేసిరి. నగరమున ఒకటే సంక్షోభము పుట్టెను. చూడామణిని బండిలో జారవిడిచి వచ్చినవాడు బోధిసత్త్వునికడకు బోయి 'ఓరీ, బండి నిలుపుము. రాజుగారి చూడామణి పోయినది. నీబండి వెదుకవలెను' అని వెదకి, మణిని దీసి, మణిచోరు డని కేకవేసి, కాళ్ళపై గొట్టి, చేతులు వెనుకకు విరిచి కట్టి, రాజసన్నిధికి గొనిపోయి "ఇదుగో మణి నపహరించినవాడు" అని చూపెను. "వీని శిరచ్ఛేదము చేయుడు" అని రా జాజ్ఞ యిచ్చెను. రాజపురుషులు నాలుగుబెత్తములతో గొట్టుచు

దక్షిణద్వారము వెంట వెలుపలికి గొనిపోయిరి.

సుజాత బండి విడిచి, చేతు లెత్తి అంగలార్చుచు "నామూలమున ఈవ్యథకు పాలైతిరి, స్వామీ" అని మొత్తుకొనుచు అతనివెంట బోవు చుండెను. రాజపురుషు లతనిశిరస్సు ఖండించుటకై బోర్ల బరుండ బెట్టిరి. అది చూచి సుజాత నిజశీలమును స్మరించి "ఈలోకములో మహాపాపులు దుస్సాహసికులు సాధువులను బాధింపకుండ ఆపెడి దేవత లేడా?" అని దుఃఖించుచు ఈగాథ పలికెను:

సంయమ మ్మెరుగని సాహసికులను
దుష్కర్మ లొనరించు దుష్టుల నాప
నాకౌకసులు లేరు; లోకపాలకులు
కానరా రాపగాగలవారు వాని.

శీలసంపన్నురా లైన యామె యిట్లు దుఃఖించుచుండ దేవరాజు శక్రునిసింహాసనము వేడి యెక్కెను. ఎవరు నన్ను శక్రసింహాసనము నుండి పడద్రోయ నెంచుచున్నా రని ఆయన యోజింపగా సమస్తము గ్రాహ్యమయ్యెను. "వారాణసిరాజు మహాక్రూరకార్యము చేయు చున్నాడు. సదాచారసంపన్న యైన సుజాతకు మహావ్యథ కలిగించు చున్నాడు. నే నచటికి బోవలెను" అని శక్రుడు నిజప్రభావముచే దేవలోకమునుండి భూమిమీది కవతరించి, పాపాత్ముడగు రాజును ఏనుగుపై నుండి క్రిందికి దించి, వధ్యస్థానమున బోర్ల బరుండబెట్టి, బోధి సత్త్వుని లేవనెత్తి, సర్వాలంకారభూషితుని జేసి రాజవేషము దాల్పించి, ఏనుగుపై గూరుచుండ బెట్టెను. వధ్యస్థానమున గండ్ర గొడ్డలితో రాజశిరస్సు ఖండించి, అనంతరము రా జని అచటివారు గ్రహించిరి.

శక్రుడు ప్రత్యక్షమై బోధిసత్త్వునికడకు బోయి, అతనికి రాజ్యాభి షేకము చేయించి, సుజాతకు పట్టమహిషీపదవి నిప్పించెను. అమా త్యులు బ్రాహ్మణులు గృహపతులు మొదలగువారు దేవరాజు శక్రుని దర్శించి "అధార్మికప్రభువు నిహతుడయినాడు. శక్రదత్తు డైన ధార్మిక ప్రభువు మా కిప్పుడు లభించినాడు" అని ప్రసన్నచిత్తు లయిరి.

శక్రు డాకాశమున నిలిచి "ఇతడు మీకు శక్రదత్తు డను రాజు.

నేటినుండి యితడు న్యాయమార్గమున పరిపాలన చేయును. రా జధార్మికు డగుచో సకాలమున వర్షము లుండవు; అకాలమృత్యుభయము, రోగభయము, శస్త్రపీడ కలుగుచుండును'' అని ఉపదేశ మిచ్చువాడై ఈగాధ పలికెను:

ఆతని రాజ్యాన అసమయమ్మునను
కురియును వానలు, తరుణాన పడవు;
స్వర్గచ్యుతిం జెంది చనిపోయె నతడు.

ఇట్లు శక్రుడు మహాజనమున కుపదేశ మిచ్చి నిజదేవస్థానమున కరిగెను. బోధిసత్త్వుడు ధర్మమార్గమున పరిపాలనము చేసి తుదకు స్వర్గపదము నొందెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున ధర్మహీనుడగు రాజు దేవదత్తుడు; శక్రుడు అనురుద్ధుడు; సుజాత రాహులుని తల్లి; శక్రుడు సృజించిన రాజు నేనే

## 195 పబ్బతూపత్థర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసల నరేశుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కోసలనరేశుని అమాత్యులలో నొకడు అంతఃపురద్రోహము చేసెను. రాజు పరిశీలన చేసి దోషమును సరిగా కనుగొని శాస్తకు విన్నవించు నభిప్రాయముతో జేతవనమునకు జని, శాస్తకు ప్రణామము చేసి 'భన్తే, అమాత్యు డొకడు అంతఃపురద్రోహము చేసినాడు. అందులకు ఏమి చేయవలయును?' అనెను. 'మహారాజా! ఆతడు ఉపకారి; ఆమె ప్రియురాలు.

''భన్తే, అతడు చాల ఉపకారి. రాజకులమునంతను ఆతడు సంరక్షించును. ఆమెగూడ నాకు ఇష్టురాలు.'

'మహారాజా, ఉపకారి యగు అమాత్యునియెడను ఇష్టురాలగు స్త్రీయెడను చెరుపు చేయుటకు వీలులేదు. పూర్వముకూడ రాజులు పండితుల యుపదేశము విని ఉపేక్షవహించిరి' అని శాస్త్ర రాజు ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అమాత్యకులమున బుట్టి పెద్దవాడయిన పిమ్మట రాజుకు అర్థధర్మానుశాసకు డయ్యెను. అమాత్యులలో నొకడు అంతఃపురద్రోహము చేసెను. రాజు నిజము గ్రహించి, "ఈయమాత్యుడు నాకు మిక్కిలి మేలు చేసినవాడు. ఈస్త్రీ నాకు ప్రియురాలు. వీరిరువురను నాశము చేయజాలను. పండితామాత్యు నడిగి, ఆయన సహింపు మన్నచో సహింతును, అననిచో సహింపను" అని తలచి, బోధిసత్త్వుని బిలిపించి "పండితోత్తమా, మి మ్మొకటి యడిగెదను" అనెను. "అడుగుడు మహారాజా, సమాధానము చెప్పుదును" అని బోధిసత్త్వు డనగా ప్రశ్న అడుగువాడై యీగాథ పలికెను

పర్వతరమణీయపాదమ్మునందు
మృగరాజరక్షిత మగు సరోవరము
విలసిల్లుచుండును, తెలిసియే యిద్ది
జంబుకం బందలి సలిలమ్ము గ్రోలు.

బోధిసత్త్వుడు తనలో 'ఆహా, అమాత్యులలో నొకడు అంతఃపురద్రోహి కావచ్చును' అని భావించి ఈగాథ పలికెను

ప్రాణు లన్నియు మహాపగనీరు త్రాగు;
నదికి నద్దాని చే నష్టంబు లేదు;
ఆమె రాజా, ప్రియ యైన క్షమించుము.

ఇట్లు మహాసత్త్వుడు రాజు కుపదేశ మిచ్చెను. రాజు ఆయుపదేశము ననుసరించి "మరల నిట్టి పాపకృత్యము చేయవలదు" అని పలికి, ఉభయులను క్షమించెను. నాటినుండి వారు విరతు లయిరి.

రాజు దానాదిపుణ్యకార్యములు చేయుచు, జీవితాంతమున యథాకర్మం గతో.

శాస్త్ర యీధర్మప్రసంగము చేసి జాతకమును సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; పండితామాత్యుడను నేనే.

## 196 వాలాహస్స జాతకము

శాస్త్ర జేతవనములో విహారము చేయుచుండగా ఉత్కంఠితుడగు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

శాస్త్ర ఆభిక్షువును చూచి 'నీవు నిజముగా ఉత్కంఠితుడ వయితివా' అని అడిగెను.

'సత్యమే'

'ఎందుచేత ఉత్కంఠితుడ వయితివి?'

'అలంకృత మైన ఒకానొక యువతిని చూచి కామమోహితుడ నగుటచే.'

'భిక్షూ, స్త్రీ రూపరసగంధాదులతో హావభావములతో పురుషుని వశపరచుకొని ఆతనిశీలమును సంపదను వినష్టము చేయును. ఇందుచేతనే స్త్రీలను మాయావిను లందురు. పూర్వము యక్షిణులు స్త్రీల హాసవిలాసములను అవలంబించి ఒకానొక యాత్రికబృందమును చేరి వణిక్కులను ఆకర్షించి, వశము చేసికొని అన్యయువకులనుగాంచి తొలివారిని సంహరించి, పెదవులవెంట రక్తము జారుచుండగా మరమరాలవలె భక్షించిరి' అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము తామ్రపర్ణిద్వీపమున సిరిసవత్థు వను పేరు కల యక్షనగర ముండెను. అందు యక్షిణులు నివసించుచుండిరి. పడవలు

మునిగి ప్రాణములతో బయటపడిన వర్తకు లచ్చటికి వచ్చినపుడు యక్షిణులు బాగుగా నలంకరించుకొని, దాసీగణపరివృత లై, బిడ్డలను చంక నెత్తుకొని, భోజనపానీయములతో వారికడకు బోవుదురు. మానవనివాసములకు వచ్చినట్లు జనులు గ్రహించుటకై అచ్చటచ్చట కృషిగోరక్షాదికము చేయుచున్న మానవులను, గోగణములను, శునకములను ప్రదర్శించి, వణిక్కులకడకు బోయి "ఈ జావ త్రాగుడు, అన్నము తినుడు, ఖాద్యములను భుజింపుడు" అని పలుకుదురు. అమాయికు లగు వణిజులు వా రిచ్చినవానిని భుజింతురు. భోజనానంతరము వారు విశ్రమించునపుడు యక్షిణులు ప్రియవాక్యము లాడుదురు. "మీ రేప్రదేశవాసులు? ఎక్కడనుండి వచ్చినారు? ఎక్కడకు బోవుచున్నారు? ఏమి పనిమీద నిచటికి వచ్చినారు?" అని యడుగుదురు. నావ పగిలిపోవగా నిచ్చటికి జేరినా మని వణిజులు చెప్పుదురు. యక్షిణులు "ఆర్యులారా, మంచిది. మాయజమానులు నావలలో బయలుదేరి, మూడుసంవత్సరము లయినది. వారు మృతినొంది యుందురు. మీరుకూడ వణిజులు. మేము మీపాదపరిచారిణుల మగుదుము" అని పలికి, హావభావవిలాసాదులచే వారిని ప్రలోభపెట్టి, యక్షనగరమునకు గొనిపోవుదురు. అదివరలో ఆకృష్టులయినవా రున్నచో వారిని మాంత్రిక శృంఖలములతో బంధించి కారాగారమున బడవేయుదురు. నావలు మునుగగా జలగండము తప్పించుకొని వచ్చినవారు లేని పక్షమున యక్షిణు లటు కల్యాణివరకును, ఇటు నాగద్వీపమువరకును సముద్రతీరమున తిరుగుచుందురు. ఇది వారి యాచారము.

పడవలు పగిలి, బ్రదికివచ్చిన వణిజు లయిదువందలమంది యొకనాడానగరసమీపమున దిగిరి. యక్షిణులు పోయి, వారిని ప్రలోభపెట్టి, తమనగరమునకు గొనిపోయి, తత్పూర్వ మచట నున్నవారిని మంత్రశృంఖలలతో బంధించి చెరసాలలో బడవేసిరి. జ్యేష్ఠయక్షిణి జ్యేష్ఠవణిజుని, తక్కిన యక్షిణులు తక్కిన వణిక్కులను స్వాములను జేసికొనిరి. వర్తకులు నిద్రించుచుండగా రాత్రివేళ జ్యేష్ఠయక్షిణి చెరసాలలోనికి బోయి, అచ్చటివారిని జంపి, మాంసము భుజించి వచ్చెను. తక్కిన యక్షిణులును అటులే చేసిరి. మానవమాంసము తిని వచ్చినప్పుడు జ్యేష్ఠయక్షిణి శరీరము చల్లబడెను. ఆలింగనము చేసిన పెద్ద

వణిజు డామె యక్షిణి యని గ్రహించెను. "అయిదువందలమంది స్త్రీలును యక్షిణులు కావచ్చును. మే మెల్లరమును పారిపోవలెను" అని యతడు తలపోసి, మరునా డుదయము యక్షిణులు ముఖప్రక్షాళనార్థము వెడలిపోయినపుడు తక్కిన వణిజులతో ని ట్లనెను "వీరందరు యక్షిణులు, మానవాంగనలు కారు. నావలు మునుగగా బ్రదికి వచ్చిన జనులను వీరు స్వీకరించి, మనను భక్షింతురు. మనము ఇప్పుడే పలాయనము చేయవలెను." ఆమాటలకు సగముమంది "మేము వీరిని విడువలేము. మీరు పొండు, మేము కదలలేము" అని చెప్పిరి. తనమాట విన్న సగముమందితో జ్యేష్ఠవణిజుడు పలాయనము చేసెను.

ఆకాలమున బోధిసత్త్వుడు శ్వేతాశ్వముకడుపున బుట్టినాడు. శరీరమంతయు తెలుపు, శిరస్సు కాకివలె నలుపు, కేశములు ముంజగడ్డివలె నుండెను. అశ్వము శక్తిమంత మై, ఆకసమున పోగలిగి యుండెను. శ్వేతాశ్వము గగనతలమునకు హిమవంతమునుండి యెగిరి, తామ్రపర్ణి (సింహళ) ద్వీపమందలి సరోవరపల్వలములలో స్వయంజాత మైన శాలిధాన్యము తిని, పోవుచుండును. మరలిపోవునపుడు "జనపదమునకు బోవువా రున్నారా?" అని మూడుమారులు మనుష్యవాణిలో కరుణతో కేక వేయును.

వణిక్కు లశ్వవాక్కులు విని సమీపించి చేతులు జోడించి 'స్వామీ, మేము జనపదమునకు బోవదలచినాము' అని విన్నవించిరి. 'అట్లయిన నావీపుపై నెక్కుడు' అని అశ్వము పలికెను. కొందరు చేతులు జోడించి నిలిచిరి. బోధిసత్త్వుడు నిజప్రభావముచే నెల్లరను—చేతులు జోడించి నిలిచినవారినిగూడ, జనపదమునకు గొనిపోయి, వారి వారి నివాసస్థానములలో ప్రతిష్ఠించి, తన నివాసమునకు జనెను.

అక్కడ యక్షిణులకడకు నూతనవణిజులు వచ్చిరి. తత్పూర్వమచట నున్న రెండువందలయేబదిమందిని యక్షిణులు భక్షించిరి.

బుద్ధమార్గంబున బోవని వార
లగుదు రంతమ్మున ఆపిశాచముల
వాతను బడినట్టి వణిజులవోలె.

బుద్ధమార్గంబున బోయెడివారు
ఆవలాహకముసహాయ్యంబుతోన
పారమ్ము సుఖముగా జేరినయట్టి
వణిజులచందాన వర్ధిల్లు చుంద్రు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మేఘ అశ్వరాజ వాక్కు విని 250 వ్యాపారులు బుద్ధపరిషత్తు అశ్వరాజు నేనే

## 197 మిత్రామిత్ర జాతకము

శాస్త శ్రావస్తిలో విహారము చేయునపుడు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

ఒకానొక భిక్షువు తనలో "నేను తీసికొనిపోయినను నాగురువు తప్పుపట్టుకొనడు" అనుకొని ఉపాధ్యాయునికడ నుండు వస్త్రఖండము గైకొని, పాదరక్ష లుంచు సంచిగా కుట్టి ఆవల ఉపాధ్యాయునితో చెప్పెను.

"ఏల తీసికొంటివి?" అని ఉపాధ్యాయుడు అనెను.

"నేను తీసికొన్నను మీకు కోపము రా దను విశ్వాస ముండుటచే."

ఉపాధ్యాయుడు కోపమున మండిపడి "నీ విశ్వాసముతో నా కేమి?" అని కొట్టెను.

అపని భిక్షుసంఘమున వెల్లడి యయ్యెను. ఒకనాడు భిక్షువులు సమావిష్టులై ధర్మసభలో ఇష్టాగోష్ఠి చేయుచుండగా శాస్త అరుగుదెంచి —

'ఏమి చర్చించుచున్నారు?' అనెను.

'ఫలాసి విషయము' అని వారు చెప్పగా,

శాస్త "భిక్షువులారా, ఈ భిక్షువు ఇప్పుడే కాదు పూర్వము కూడ తనశిష్యునియెడ విశ్వాసము లేనివాడు" అని పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున జన్మించి, పెద్దవాడయి, ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, గణమునకు నాయకుడయి, హిమవంతమున నివసించుచుండెను. అందులో నొక ఋషి బోధిసత్త్వుని మాట వినక తల్లి చనిపోయిన మాతంగపోతకమును పెంచుచుండెను. అది పెరిగి పెద్దదయి, ఋషిని సంహరించి అడవిలోనికి పారిపోయెను. ఋషు లాతని కపరకర్మలు చేసి, బోధిసత్త్వునిచుట్టు చేరి 'భదంతా, మిత్రమునుగాని అమిత్రమునుగాని గురుతించుట యెట్లు?'' అని యడిగిరి. ఈ యీ విధముగా గురుతింపవచ్చు నని బోధిసత్త్వు డీ గాథలు పలికెను:

ఆతడు చూచియు మందహాసమ్ము చేయ
డప్రసన్నుం డగు, నత్తులు కూడ
వాల్పకుండగ పరావర్తనం బొందు.

గ్రహియించి యహితు నాకారాదికమ్ము
తన కమిత్రం బైన జను డెవ్వ డెవడో
ధీమంతు డగువాడు తెలిసికో వలయు.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు మిత్రామిత్రలక్షణములను చెప్పి బ్రహ్మవిహారములు భావించి బ్రహ్మలోకగామి అయ్యెను.

శాస్త యీధర్మప్రసంగము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మావటివాడు తపస్విశిష్యుడు; ఏనుగు ఉపాధ్యాయుడు, ఋషులు బుద్ధపరిషత్తు; గణనేత నేను.

## 198 రాధ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉత్కంఠితచిత్తుడగు ఒకానొక భిక్షుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

'భిక్షూ, నీవు సత్యముగా ఉత్కంఠితుడ వయితివా?' అని శాస్త యడిగెను.

'భన్తే, సత్యముగ.'

'ఎందుచేత?'

'ఆభరణభూషిత యైన అంగనను గాంచి కామమోహితుడ నగుటచే.'

'భిక్షూ, స్త్రీజాతిని కనిపెట్టియుండుట కష్టము. పూర్వకాలమున ద్వారపాలకుని నిలిపియు, స్త్రీ సంరక్షణము జరుగలేదు. నీకు స్త్రీతో నేమి పని? లభించినను నీవు స్త్రీని కనిపెట్టి యుండ జాలవు' అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు చిలుకకడుపున పుట్టి రాధనామము పొందెను. అతని తమ్ముడు ప్రోష్ఠపాదనాముడు. అతిబాల్యముననే వానిని రెంటిని లుబ్ధకుడు పట్టుకొని పోయి, వారాణసిలో నొకబ్రాహ్మణున కిచ్చెను. బ్రాహ్మణుడు వానిని తన బిడ్డలవలె పోషించెను.

ఆయనభార్య దుశ్శీల, అపుటకు వీలులేనిది. ఆయన యేదో పని మీద బోవుచు శుకపోతములను బిలిచి "నాయనలారా, నేను వ్యవహారముమీద పోవుచున్నాను. తల్లి చేయుపనులు మీరు రెండు వేళల కనిపెట్టియుండుడు. పరపురుషుల రాకపోకలు గ్రహింపుడు" అని బ్రాహ్మణిసంరక్షణ వారిల కప్పజెప్పి పోయెను. ఆయన వెడలిపోయి నది మొదలామె దురాచారము మొదలిడెను. రాత్రిగాని పగలుగాని వచ్చిపోవు పురుషుల కంతము లేకుండెను. అది చూచి ప్రోష్ఠపాదుడు

రాధునితో 'బ్రాహ్మణుడు బ్రాహ్మణిని మన కప్పజెప్పి పోయినాడు. ఈమె పాపకృత్యములు చేయుచున్నది. ఈమెను మందలింతమా?' అనెను. రాధుడు వల దనెను. అతనిమాట వినక ప్రోష్ఠపాదుడు "అమ్మా, యేల పాపకర్మము చేయుచున్నా" వని యామె నడిగెను. వానిని చంప నెంచి యామె 'నాయనా, నీవు నాబిడ్డవంటివాడవు. ఇక ముందు పాపకర్మ చేయను. నాయనా, రా' అని యామె ప్రీతి వాక్కులతో వానిని బిలిచెను. వాడు సమీపింపగానే పట్టుకొని యామె 'నీవు నా కుపదేశ మిత్తువా? నీ యంతర మెరుగకున్నావు?' అని గొంతు నులిమి చంపి, విసరి ప్రొయ్యిలో బడవేసెను.

బ్రాహ్మణుడు మరలివచ్చిన తర్వాత విశ్రాంతి తీసికొని, బోధిసత్త్వునితో 'నాయనా, రాధా, నీతల్లి దురాచారము చేసెనా, లేదా?' యని యడుగువాడై యీగాథ పలికెను:

నే ప్రవాసమునుండి నేడె వచ్చితిని
బహుకాలమునకు బాబా, చెప్పవోయి,
చేయునా అన్యులసేవ నీ తల్లి?

రాధుడు 'నాయనా, పండితులగువారు సత్యము కాని అసత్యము కాని కల్యాణకరము కానిదానిని ఎన్నడు పలుకరు' అను నభిప్రాయము తెలుపు నీగాథ పలికెను·

సుఖదాయకము కాదు సూనృతవాక్కు,
ఆడ సత్యమె, వేడిబూడిదలోన
పొట్టపాదునిబోలె పొరలాడవలయు.

ఇట్లు బోధిసత్త్వుడు బ్రాహ్మణునకు ధర్మము నిర్దేశించి, 'నే నిచ్చట నివసించుట అశక్యము' అని తలచి బ్రాహ్మణునికడ సెలవు తీసికొని, అరణ్యమునకు వెడలిపోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున పొట్టపాదుడు ఆనందుడు; రాధుడు నేనే.

# 199 గాహాపతి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక ఉత్కంఠితచిత్తు డగువాని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

స్త్రీజాతిని రక్షించుట అసాధ్య మని స్త్రీలు ఉపాయముచే భర్తలను వంచించి పాపకర్మమునకు సాయపడుదు రనియు శాస్త పలికి పూర్వజన్మ కథ జెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు సంసారులయింట బుట్టి పెద్దవా డయి, కాశీరాష్ట్రమున నివాసము చేయుచుండెను. దుశ్శీల యను నతనిభార్య గ్రామ భోజకునితో దుర్మార్గమున చరించుచుండెను. బోధిసత్త్వుడు గ్రహించి పట్టుకొన యత్నించుచుండెను.

వర్షాకాలమున బీజములు చల్లగా అకాలమయ్యెను. సస్యములు పొట్టలు పోసికొనెను. గ్రామవాసు లొకచో జేరి ఇక రెండునెలల తర్వాత పొలము కోసి ధాన్యము తెత్తుమని నిశ్చయించి, గ్రామభోజకునికడనుండి ముసలియెద్దును దీసికొని, మాంసము భుజించిరి.

ఒకనాడు గ్రామభోజకుడు సమయము కనిపెట్టి బోధిసత్త్వుడు వెలుపలికి బోయినప్పు డింటిలో దూరెను. వారి భోగానంతరక్షణములో బోధిసత్త్వుడు గ్రామద్వారమున బ్రవేశించి గృహాభిముఖుడయ్యెను. అటువైపే చూచుచున్న భార్య ఆత డెవ్వ డగు నని తల పోయుచు, గడపపై నిలిచి విలోకించునప్పటికి భర్త యని గ్రహించి ఆమాట భోజకునితో చెప్పెను. వాడు భయమున గడగడ వడకెను.

ఆమె యి ట్లనెను. 'భయపడకు. ఉపాయ మున్నది. మేము నీ గోమాంసము తిన్నాము. నీవు మాంసమువెల అడుగువానివలె నుండుము. నేను కొట్టుపై నెక్కి నిలుచుండి ధాన్యము లే దందును. నీ వింటినడుమ నిలుచుండి మాటిమాటికిని మాయింటిలోని బిడ్డలు ఆకలి కల్లాడుచున్నా రనుచుండుము. మాంసము వెల యిమ్మనుము." ఇట్లు

చెప్పి యామె కొట్టుపై కెక్కి కూరుచుండెను. గ్రామభోజకుడు గృహ మధ్యమున నిలిచి మాంసమూల్యమి మ్మనుచుండెను. 'ధాన్యము లేదు, చేను కోసినతర్వాత ఇత్తుము, పో' అని యామె యనుచుండెను.

బోధిసత్త్వుడింటిలో ప్రవేశించి వారివ్యవహారము చూచి, ఈ పాపాత్మురాలు పన్నిన పన్నాగ మని గ్రహించి, భోజకునితో 'ఓయి గ్రామభోజకా, నీముసలియెద్దుమాంసము మేము తినునపుడు రెండు నెలలతరువాత దానివిలువ యిత్తు మని చెప్పి తింటిమి. నేటికి పక్షము పూర్తిగా గడవలేదు. నీ విప్పుడే ధాన్య మెట్లు తీసికొనగలవు? నీ వీయుద్దేశముతో గాక వేరొక యుద్దేశముతో వచ్చినావు కావా? నీ ప్రవర్తన నాకు నచ్చలేదు. కొట్టులో ధాన్యము లేదని యీ పాపాత్మురాలికి తెలియును. కొట్టుపై కెక్కి ధాన్యము లే దనుచున్నది. నీవు తెచ్చుమనుచున్నావు. మీయుభయులమాటలును నా కేమియు బాగుగా లేవు" అని, యీ భావమును వివరించు గాధలు పలికెను

నా కివి రెండును నచ్చనే లేదు,
కోష్ఠమ్ముపై కెక్కి కూర్చుండి, ధాన్య
మేమియు లే దను నీమెయుకూడ.

గ్రామణీ, మాది దుర్భరజీవితమ్ము;
వృద్ధబలీవర్ద మిచ్చుచు రెండు
మాసాల గడవును మా కొసంగితివి.
అడిగెదు మూల్యమ్ము నవధికి ముందె
నా కిది యేమియు నచ్చనే లేదు.

ఇట్లు పలికి గ్రామభోజకుని జుట్టుపట్టుకొని లాగి, నేలపై బడవేసి, 'నేను గ్రామభోజకుడ నని అన్యులగు వస్తువులను హరింతువా?' అని తిట్టి, తన్ని మెడబట్టి వెలుపలికి నెట్టివేసి, ధూర్తస్త్రీని సిగ పట్టి క్రిందికి లాగి 'మరల ఇట్లు చేసితివేని తెలియును' అని దండించెను.

అటుతరువాత గ్రామభోజకుడు ఆయింటివైపు కన్నెత్తి చూడలేదు. ఆపాపాత్మురాలు మనసులోగూడ అపమార్గచారిణి కాలేదు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున గ్రామణిని దిద్దు సంసారి నేనే.

## 200 సాధుశీలజాతకము

శాస్త్ర జేతవనమున నివసించుచు ఒకానొక బ్రాహ్మణుని విషయమై చెప్పినది

### వర్తమాన కథ

ఆబ్రాహ్మణికి నలుగురు పుత్రిక లుండిరి. వారు నాలుగువిధముల పురుషులను కోరిరి. అందులో నొకతె సుందరాకారమును ఇంకొకతె దీర్ఘాయుష్మంతుని ఇంకొకతె ఉన్నతవంశమువానిని ఇంకొకతె సదాచారిని కోరిరి. బ్రాహ్మణుడు బిడ్డలను ఎట్టివాని కీయవలెనని తలపోసెను.

ఎంత యోచించినను నిర్ణయింపలేక సంయక్సంబుద్ధున కీవిషయము విన్నవింప నెంచి గంధమాల్యాదులు గైకొని విహారమునకు జని శాస్తకు ప్రణామము చేసి ఒకప్రక్కన గూరుచుండెను. ఆవల వృత్తాంతము వివరించి బ్రాహ్మణుడు "భన్తే, వీరిలో నెవనికి బిడ్డనిచ్చుట ఉచితము?" అనెను.

"పూర్వముకూడ నీప్రశ్నకు పండితులు సమాధాన మిచ్చియుండిరి. కాని, అది పూర్వజన్మవిషయమగుటచే నీవు గ్రహింపజాలవు" అని శాస్త అతని కోరికపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలలో సమస్తవిద్యలు గ్రహించి, మరలి వచ్చి, విఖ్యాతాచార్యుడయ్యెను.
ఒకానొకబ్రాహ్మణునకు నలుగురు పుత్రిక లుండిరి. వారు నలుగురు వరులను కోరుచుండిరి. బ్రాహ్మణు డిది యెరుగక వీరి నెవరి కిచ్చుట యుక్తమో తెలిసికొనుటకై ఆచార్యుని సన్నిధి కేగి, ఈయభిప్రాయమును తెలుపు గాథ పలికెను.

ఒకనికి సౌందర్య మున్నది, వయసు
కల దొక్కనికి, గొప్పకులమువా డొకడు,

శీలవంతు డొకండు; చెప్పుము బ్రాహ్మ
ణోత్తమా, ఇం దెవ్వ డుత్తమవరుడు.

ఇది విని ఆచార్యుడు 'రూపము, సంపద మొదలగునవి యున్నప్పటికిని దుశ్శీల మున్నచో లోకము నిందించును. కావున అట్టివాడు తగడు. మేము శీలవంతునే ఆమోదింతుము' అను నర్థమును ప్రకటించు ఈ గాథ పలికెను:

చారుతయు కులీనత విశిష్టములు సుమ్మ
వందనార్హ మగును పెద్దవయసు; కాని
నాకుమాత్రము శీలమ్మే నచ్చుచుండు.

బ్రాహ్మణు డాయనవాక్యాలు విని శీలవంతులకే తనకొమార్తెల నిచ్చెను.

శాస్త జాతకములు పరిపోల్చెను. ఆకాలమున బ్రాహ్మణుడు ఈ బ్రాహ్మణుడే. ప్రసిద్ధ ఆచార్యుడు నేనే.

## 201 బంధనాగార జాతకము

శాస్త జేతవనమున విహరించుచు బంధనాగారవిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆకాలమున కన్నము వేయువారిని, దారిదోపిడిగాండ్రను మనుష్యఘాతకులను కొందరను పట్టుకొని రాజసమక్షమునకు పంపిరి. రాజు వారిని త్రాళ్ళతోను, బేడీలతోను, గొలుసులతోను బంధింప చేసెను.

పల్లెనుండి 30మంది భిక్షువులు శాస్తను సందర్శింపవచ్చిరి. దర్శనమునకు పూర్వదినమున భిక్షాటనము చేయుచు ఈబంధనాగారము కడకు చేరిరి. వారు భటులను చూచి భిక్షాటనము నుండి మరలివచ్చి

శాస్తను సమీపించి ఇట్లు విన్నవించిరి.

"భన్తే, నేడు మేము భిక్షాటనము చేసి వచ్చునపుడు గొలుసులు, జేడీలు, మొదలగునవి తగిల్చియున్న చారులను చూచితిమి. వారు బంధనమున చిక్కుకొని పారిపోవలేకుండిరి. దానికన్న గురుతర బంధనము కలదా?"

"భిక్షువులారా! ఇది ఏమి బంధనము? ధనధాన్యదారపుత్రాది విషయబంధము తక్కిన అన్ని బంధములకంటె వందరెట్లు వేయిరెట్లు దృఢతర మైనది ఛేదించుటకు వీలుకాని ఇట్టిదృఢబంధమునుకూడ పండితులు పూర్వము ఛేదించి హిమాలయమునకు పోయి ప్రవ్రజించిరి" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు పేదబ్రాహ్మణకుటుంబములో పుట్టెను. ఆయన పెద్దవాడగునప్పటికి తండ్రి కాలముచేసెను. అతడు నౌకరీచేయుచు తల్లిని పోషించుచుండెను. ఆతని కిష్టము లేకపోయినను తల్లి యతనికి పెండ్లి చేసెను. కొన్నాళ్ళ కామె మరణించెను.

భార్య గర్భవతి యన్నసంగతి తెలియక బ్రాహ్మణు డామెతో "భద్రే, నీవు చాకిరీ చేసి జీవనము చేయుము. నేను ప్రవ్రజింతును" అని పలికెను. 'నేను గర్భవతిని. బిడ్డడు పుట్టినపిమ్మట మీరు ప్రవ్రజింపుడు" అని యామె చెప్పెను. మంచి దని బోధిసత్త్వుడు భార్య మగశిశువును ప్రసవించిన తరువాత "భద్రే, బిడ్డని సుఖముగా ప్రసవించినావు. నే నిక పోవుదును" అనెను. "శిశువు స్తన్యము మానిన తరువాత పోవచ్చు" నని యామె పలికెను. అప్పటి కామె మరల గర్భవతి యయ్యెను. 'ఈమెను సమాధానపరచిపోవుట వట్టిది. ఈమెతో చెప్పకుండ బోవలయు' నని యతడు రాత్రివేళ రహస్యముగా ఇలువిడిచి బయలుదేరెను. నగరరక్షకు లతనిని పట్టుకొనిరి. నేను తల్లిని పోషించువాడను. నన్ను విడిచిపెట్టుడు". అని యత డనగా వారు వదలిపెట్టిరి. అంత నతడు ఒకచో కూరుచుండి, ప్రధానద్వారము

వెంటనే నగరము వెలువడి, హిమవంతమునకు బోయి ఋషులరీతిని ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, ధ్యానశీలుడై యుండెను. ఆత డచ్చట నివసించుచు, 'నే నిటు లుండుటచేతనే దారపుత్రరూప మైన బంధనము ఛేదింపగలిగినాను' అని యుత్సాహముతో ఈగాథలు పలికెను:

ధీరు లగువారు దృఢరజ్జు, దారు, లోహ
బంధనమ్ముల దలపరు బంధములుగ;
కోర్కి యున్నను మణిమయకుండలముల,
దారపుత్రులమీద బంధముగ నెంత్రు.

యత్నమున గాని దుర్భేద్య మైన యట్టి
నరకమున కీడ్చు నీబంధనముల ద్రెంచి
ధీరు లాసక్తి విడనాడి తిరుగుచుంద్రు.

బోధిసత్త్వు డిట్లు గానము చేసి, అపరిహీనధ్యానముతో బ్రహ్మ లోకపరాయణు డయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకము లిం సరిపోల్చెను. మాత మహామాయ; తండ్రి శుద్ధోధనమహారాజు; భార్య రాహులుని తల్లి; పుత్రుడు రాహులుడు; ప్రవ్రజించినవాడు నేనే.

## 202 కేళిసీల జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఆయుష్మాన్ లకణ్టక భద్దియావిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

అతడు బుద్ధశాసనమున ప్రసిద్ధి కెక్కినాడు. సమస్తమును గ్రహించినవాడు, మధురస్వరము కలవాడు, మధురముగా ధర్మోపదేశము చేయువాడు. పటిసంభిదాజ్ఞానము పొందినవాడు. మహాక్షీణా

స్రవుడు. అయినను అతడు ఎనుబదిమంది స్థవిరులలో పరిమాణమున పొట్టివాడు. శ్రమణులవలె మఱుగుజ్జు, ఆటలలోని ఆటవస్తువువలె చిన్నవాడు.

ఒకనా డతడు శాస్తకు ప్రణామము చేసి జేతవనద్వారము కడచి పోవునప్పటికి పల్లెనుండి వచ్చిన 30మంది భిక్షువులు బుద్ధునికి ప్రణామము చేయుకోరికతో జేతవనము చేరిరి. వారు విహారద్వారమున స్థవిరుని చూచి అతడు ఎవరో శ్రమణు డనుకొని చీవరముకొంగుపట్టు కొని లాగి అతనిని వేధించి, శాస్తకడకు పోయిరి. అక్కడ శాస్తకు ప్రణామము చేసి కూర్చుండిరి. శాస్త మధురవాక్కులతో వారిని కుశల ప్రశ్న మడిగెను. అంతట వారు– "భన్తే, లకణ్టక భద్దియ అను తమ శిష్యు డొకడు చాల మధురముగ ప్రసంగము చేసెడివాడు. ఆత డిపుడు ఎచ్చట నున్నాడు?" అని యడిగిరి.

"భిక్షువులారా! మీ రాతనిని చూడగోరుచున్నారా!"

"చిత్తము, భన్తే"

"ద్వారప్రకోష్ఠమున మీరు వేధించినవాడే లకణ్టకుడు."

"భన్తే, ఇంత పొట్టివాడు ఎట్లు పుట్టెను?"

"తన పూర్వజన్మమున చేసిన పాపకర్మముచే." వారు ప్రార్థించినపిదప శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు దేవరాజగు శక్రు డయ్యెను. ఆరోజులలో బ్రహ్మదత్తుడు యేనుగు గాని, గుఱ్ఱము గాని, వృషభము గాని ముసలిది కనబడినచో దానివెంట బోయెడువాడు. ప్రాతబండి కానిపించినచో విరుగ గొట్టించును. వృద్ధస్త్రీలు కానవచ్చినచో వారిని బిలిపించి పొట్టమీద కొట్టించును. పడద్రోయించి, లేవ నెత్తించును. వృద్ధులు కనిపించిన చో దొమ్మరివాండ్రవలె వారిచేత తలక్రిందులుగా మొగ్గలు వేయంచును. ఎవ్వరును కనబడనప్పుడు ఏయింట వృద్ధు లున్నారో కనుగొని వారిని పిలిపించి ఆటలాడించును. ఇట్లాతడు కేళిశీలుడై యుండెను. లోకులు

సిగ్గుపడి తమ తమ వృద్ధమాతాపితరులను పరరాష్ట్రములకు బంప నాగిరి. తలిదండ్రులసేవ లోపించెను. రాజసేవకులుకూడ క్రీడాపరా యణులైరి. నరకము నిండిపోవుచుండెను. దేవతలపరిషత్తు తగ్గిపోయెను. నూతన దేవపుత్రులు కానరాకుండుటకు శక్రుడు కారణ మే మని యోచించి తెలిసికొని, వానిని శిక్షింతు నని బయలుదేరెను.

ఉత్సవమునాడు శక్రుడు వృద్ధులరూపములు చేయించి, రెండుతడకల మీద ప్రాతబండిపైనుంచి, బండికి వృద్ధవృషభములను కట్టించి నడి పించుచు, రాజు అలంకృతహస్తిమీద గూరుచుండి, అలంకృతనగర మున విచరించుచుండు సమయమున చినిగిన గుడ్డలు కట్టుకొని బండిని రాజునెదుటికి దోలుకొని వచ్చెను. రాజు ప్రాతబండిని జూచి 'అవలకు తొలగింపుడు' అని యరచెను. 'దేవా, బండి యెక్కడ? మాకు గనబడుట లేదే' అని పరివారజనము పలికెను. శక్రునిప్రభావము వలన శకటము రాజుకుమాత్రము కానవచ్చుచుండెను.

శక్రుడు మాటిమాటికిని తనబండిని రాజురథముమీదికి తోలుచు తుదకు రాజునెత్తిపై చిన్న చట్టి పడవేసెను. రాజుశరీరము తడిసి పోయెను. రెండవచట్టి పడవేయగా మజ్జిగతో నాతని యొడలు తడిసెను. రాజు భయపడి, ఆందోళన చెంది, జుగుప్సతో నుండెను.

రాజు భయభ్రాంతుడైన పిదప శక్రుడు నిజశకటమును అంత ర్ధానము చేసి, నిజరూపము దాల్చి వజ్రహస్తుడై, ఆకసమున నిలిచి "అరె పాపీ, అధార్మికప్రభూ, నీకు వార్ధకము రాదా? నీయొడలిపై జర అడుగుపెట్టదా? కేళిశీలుడవై నీవు వృద్ధులకు వ్యథ కలిగించు చున్నావు. నీయొక్కనిమూలమున అనేకులు నరకమునకు బోవుచు న్నారు. లోకులు తలిదండ్రులకు సేవచేయ వీలు లేకున్నది. ఇట్టిదుష్టత్వ ములనుండి విరమింపవేని వజ్రముతో నీశిరస్సు భేదించెదను. ఇది మొదలుకొని యిట్టిపనులు చేయరాదు" అని బెదరించి, తలిదండ్రుల గుణములను వర్ణించి, వృద్ధులస్నేహమాహాత్మ్యమును ప్రశంసించి, సదుపదేశ మిచ్చి, నిజస్థానమునకు వెడలిపోయెను.

శాస్త అభిసంబుద్ధుడైన పిదప ఈవిషయము నుద్ఘాటించి, యీగాథలు పలికెను.

కాయతుల్యత లేని మృగాలుకూడ
చెందుచుండు మహాభీతి సింహ మన్న-
హంస- బర్హి, నాగ, క్రౌంచ, హరికణములు;
మానవులయందు నిట్లె ధీమంతు డైన
చిన్నవాడు నధికు డౌను; పెద్దతనువు
కలుగువాడు మూర్ఖు డయిన ఘనుడు కాడు.

శాస్త్ర ధర్మప్రసంగము చేసి రెండుజాతకములు సరిపోల్చెను. ఆసమయమున రాజు లకుణ్టకభద్దియ, శక్రుడు నేనే.

## 203 ఖంధవత్త జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచుండగా ఒకానొక భిక్షువు విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆభిక్షువు అగ్నిగృహద్వారమున కట్టెలు పేర్చుచుండగా పురాతనమైన మ్రాను నుండి సర్పము వెడలివచ్చి అతని వ్రేళ్ళపై కాటు వేసెను. ఆతడు అచటనే ప్రాణములు విడిచెను. ఆతని మరణవార్త విహారమం దంతటను వ్యాపించెను.

ధర్మసభలో భిక్షువులు ప్రసంగించుచుండ శాస్త్ర అరుగుదెంచి 'భిక్షువులారా! ఏమి సంభాషించుచున్నారు?' యని అడిగెను. వారు "ఫలాని విషయము" అని చెప్పిన పిమ్మట, "భిక్షువులారా! అతడు నాలుగు సర్పరాజకులములయెడ మైత్రీభావనతో నున్నచో సర్పము కాటువేసెడిది కాదు. ప్రాచీనతపస్వులుకూడ బుద్ధుడు జన్మింపక పూర్వము నాలుగు నాగరాజకులములయెడ మైత్రితో నుండుటచే సర్పభయము లేకుండపోయినది" అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున బ్రాహ్మణవంశమున జన్మించెను. అతడు పెద్దవాడయి, గృహము విడిచి ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, హిమవత్ప్రదేశమున గంగానివర్తనమున ఆశ్రమము నిర్మించుకొని ధ్యానకేళీరతుడై, ఋషిగణపరివృతుడై నివసించుచుండెను.

ఆకాలమున వివిధసర్పములు ఋషులకు బాధాకరముగానుండెను. చాలమంది ఋషులు మరణించుచుండిరి. తపస్వు లీ విషయము బోధిసత్త్వునకు దెలిపిరి. ఆయన తాపసుల నెల్లర నొకచో సమావేశపరచి “మీరు నాలుగు సర్పరాజకులములయెడ మైత్రిని భావించుచో మిమ్ము పాములు కరవవు. నేటినుండి నాలుగుసర్పరాజకులములయెడ ఈ ప్రకారముగా మైత్రిని భావింపు” డని యీగాథ పలికెను.

నాగరాజకులాలు నాల్గింటియెడల
మిత్రభావమ్ముతో మెలగుదు నేను.

ఈప్రకారముగా నాలుగు నాగరాజకులములను దెలిపి, ‘వీనియెడ మీకు మైత్రి భావింప నేర్చితిరేని మిమ్ము సర్పములు కరవవు. శ్రమ కలిగింపవు’’ అని ఆయన ఈగాథ పలికెను.

పాదాలు లేనట్టివానితో మైత్రి
పాదద్వయం బున్నవానితో మైత్రి
పాదాలు నా ల్గున్నవానితో మైత్రి
బహుపాదముల్ కలవానితో మైత్రి.

ఈవిధముగా మైత్రిభావనాక్రమము నుపదేశించి, ప్రార్థనాక్రమము తెలుపుచు ఈగాథ పలికెను:

పదహీనములు నన్ను బాధింపరాదు,
పదయుగ్మ మున్నవి బాధింపరాదు,
పదచతుష్టయములు బాధింపరాదు,
బహుపదా లున్నవి బాధింపరాదు.

ఇప్పుడు సామాన్యరూపమున భావనాక్రమము ప్రకటించు నీగాథ పలికెను.

అఖిలసత్త్వంబుల, కన్నిజీవులకు
కల్యాణ మగుగాక! కష్ట మెవ్వరికి
ఒక్కింతయును కల్గకుండునుగాక!

ఈ విధముగా సామాన్యరూపమున సర్వప్రాణులయెడ మైత్రి భావననుగూర్చి తెలిపి, త్రిరత్నములగుణములను స్మృతిలో నుంచికొనుటకై యిది చెప్పెను.

బుద్ధ ధర్మ సంఘములకు హద్దు లేదు.

సీమితప్రాణులనుగూర్చి యిది పలికెను.

సీమ యున్నది సరీసృప వృశ్చికముల,
ఊర్ణనాభాదుల కున్నది హద్దు.

ఇట్లు బోధిసత్త్వుడు ప్రథమ కర్తవ్యముని ఈగాథ పలికెను.

జాగరూకతతోడ సంచరించెదను,
నిజపరిత్రాణంబు నిర్మించుకొంటి.
చేరగావుత హాని చేయు జంతువులు
ఎక్కడో దూరమ్ము! మ్రొక్కుదు నేను
బుద్ధుని సప్తసంబుద్ధులగూడ.

నాటినుండి ఋషిగణము బోధిసత్త్వుని ఉపదేశానుసారముగా మైత్రీభావన చేయజొచ్చెను, బుద్ధునిగుణములను స్మరింపసాగెను. ఈప్రకారముగా బుద్ధగుణస్మరణము చేసినపిదప సర్పము లన్నియు కదలిచనెను. బోధిసత్త్వుడుకూడ బ్రహ్మవిహారములను భావనచేయుచు బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున ఋషిగణము బుద్ధపరిషత్తు; గణనాయకుడను నేనే

# 204 వీరక జాతకము

శాస్త జేతవనములో విహారము చేయుచు, బుద్ధుని వేషధారణాదికవిషయమై చెప్పినది

## వర్తమాన కథ

దేవదత్తుని పరిషత్తునుండి స్థవిరులు మరలివచ్చినపిదప శాస్త "సారిపుత్రా! దేవదత్తుడు మిమ్ములను చూచి ఏమి చేసినాడు?" అని అడిగెను.

"భన్తే, సుగతుని ఆకారప్రకారములు అవలంబించినాడు."

"సారిపుత్రా! దేవదత్తుడు కేవల మిప్పుడే కాదు. పూర్వము కూడ నన్ను అనుకరించి వినాశము పొందినాడు" అని స్థవిరులు ప్రార్థించినపిదప శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమాలయ ప్రదేశమున నీటికాకి కడుపున బుట్టి సరస్సుకడ వీరకనామమున నివసించుచుండెను. ఆరోజులలో కాశీరాష్ట్రమున దుర్భిక్ష మేర్పడెను. మానవులు కాకపిండము వేయుటగాని, యక్షనాగబలి యిచ్చుట గాని లేదు. దుర్భిక్ష మున్నప్రదేశములనుండి బయలుదేరి కాకు లడవులకు జేరినవి. వారాణసినుండి సవిట్ఠక మను కాకి భార్యతోగూడ వీరకు డున్న సరస్సుకు సమీపములో నివసింప జొచ్చెను.

ఒకనాడు ఆసరస్సులో ఆహారము గ్రహించి ఈవలకు వచ్చి చేపలు తిని ఒడ లెండబెట్టుకొనుచున్న వీరకుని సవిట్ఠకుడు చూచి ఈకాకివలన బహుమత్స్యములు లభింపవచ్చును. ఇతనిని సేవించెద' ననుకొని సమీపమునకు బోయెను. ఏమి మిత్రమా' అని జలకాక మడుగగా, 'స్వామీ, నీసేవ చేయగోరుచున్నాను' అని సవిట్ఠకుడు పలికెను. మంచి దని వీరకుడు సమ్మతింపగా, అప్పటినుండి సవిట్ఠకు డతని నాశ్రయించెను. వీరకుడు తనకు వలసిన మత్స్యములను భుజించి,

మిగిలినవానిని సవిట్ఠకున కిచ్చుచుండెను. అతడు తిని, తక్కినవి భార్య కిచ్చుచుండెను. ఇట్లు కొంతకాలము గడచెను.

ఒకనాడు సవిట్ఠకుడు "ఈనీటికాకి నల్లనిది, నేనుకూడ నలుపే. కన్నులు, ముక్కు, కాళ్ళలో భేద మేమియు లేదు. ఈత డిచ్చు మత్స్యములతో నాకు నేటినుండి పనిలేదు, నేనే చేపలు పట్టుకొందును' అని భావించి, అతనిని సమీపించి, 'మిత్రమా, నేటినుండి నేనే చేపలు పట్టుకొందును' అని పలికెను. 'మిత్రమా, నీటిలో దిగి చేపలు పట్టు నీటికాకిజాతిలో నీవు పుట్టలేదు. అభిమానము వలదు' అని వీరకుని వాక్కులు లక్ష్యము చేయక సవిట్ఠకుడు సరస్సులో దిగి, నీటిలో ప్రవేశించి, పైకి వచ్చునపుడు నాచులో చిక్కుకొని, తప్పించుకొనలేక నోరుతెరచి, నీటిలో మునిగి ప్రాణములు విడిచెను.

అతడు రాకుండుటచే భార్య సమాచారము తెలిసికొనుటకై వీరకునికడ కేగి, స్వామీ, సవిట్ఠకుడు రాలేదు. ఎక్కడికి పోయినాడో?' అని అడుగుననపై యీగాథ పలికెను:

వీక్షించుచున్నావె వీరకా, నాదు
భర్త సవిట్ఠకు, బర్హికంఠంబు
వానిని, మధుర మా వాక్కులవాని?

అది విని వీరకుడు 'నీభర్త పోయినచోటు నాకు దెలియును" అని యీగాథ పలికెను.

జలముపై నేలపై చరియింపగలిగి
పచ్చి చేపల దన్ని భక్షించు పక్షి
విహమునం బోయి సవిట్ఠకు డకట
శైవాలమున జిక్కి- సమసినవాడు.

అది విని కాకి యేడ్చుచు వారాణసికి బోయెను.

శాస్త్ర ధర్మోపదేశము జేసి రెండుజాతకములు సరిపోల్చెను. అప్పుడు సవిట్ఠకు దేవదత్తుడు; వీరకుడు నేనే.

# 205 గంగేయ్య జాతకము

**శాస్త జేతవనములో విహరించుచుండగా ఇరువురు తరుణభిక్షువుల విషయమై చెప్పినది.**

## వర్తమాన కథ

వా రిరువురు శ్రావస్తివాసు లగు కులపుత్రులు. బుద్ధశాసనమున ప్రవ్రజించి, అశోభవభావనలలో చిక్కుకొనక సౌందర్యప్రశంసకులై సౌందర్యోపాసన చేయుచు పర్యటించుచుండిరి. ఒకనాడు వా రిరువుర కును రూపమునుగూర్చి వివాదము బయలువెడలెను. అం దొకడు 'నేను చక్కనివాడను' అనెను. రెండవవాడు 'నీవు కాదు. నేను చక్కనివాడను' అని వక్కాణించెను.

కొలదిదూరములో ఒకానొకవృద్ధస్థవిరుడు కూర్చుండి యుండుట కాంచి, వారు "మనలో ఎవరు కమనీయరూపులో ఆయనకడ దెలిసికొందము" అనుకొని ఆయనసన్నిధికి చని "మాలో ఎవరు సుందర రూపుడు?" అని ప్రశ్నించిరి.

'మీ ఇరువురకంటెను నేను చక్కనివాడను" అని అతడు పలికెను.'

'ఈవృద్ధుడు మన మడిగిన విషయము చెప్పక అడుగనిది చెప్పినాడు' అని ఆయువకులు వృద్ధుని నిందించి వెడలిపోయిరి.

ఆ జరిగినపని భిక్షుసంఘమునకు దెలిసెను. ఒకనాడు ధర్మసభలో సంభాషణ జరుగుచుండెను. శాస్త అచటికరుగుదెంచి 'భిక్షువులారా, ఈయువకులు ఇప్పుడే కాదు పూర్వముకూడ సౌందర్యోపాసకులుగా దిరుగుచుండిరి' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు గంగాతీరమున వృక్షదేవతగా నుండెను. ఆరోజులలో గంగాయమునాసంగమస్థానమున గాంగేయ్యుడు, యామునేయ్యుడు నను రెండు మత్స్యములు 'నే నందముగా నున్నాను. నీ వందముగా లే' వని తగవులాడుచు, సమీపములో గంగాతటమున నున్న కూర్మమును జూచి 'ఈతడు మనసౌందర్యమునుగూర్చి నిర్ణయింప

గలడు' అని దగ్గరకు బోయి, 'మిత్రమా, కచ్ఛపా, గంగేయ్యుడు సుందరుడా, యామునేయ్యుడు సుందరుడా?' అని యడిగెను. 'గంగే య్యుడు సుందరుడు, యామునేయ్యుడును సుందరుడు. కాని మీ యుభ యులకంటె నే నెక్కువ సుందరరూపుడను' అను నభిప్రాయమును ప్రకటించు నీగాథను కచ్ఛపము పలికెను:

గాంగేయు డెంతయు కమనీయమూర్తి
యామునేయుడు గూడ నధికసుందరుడు
కాని నావలె నాల్గు కాళులు కలిగి
న్యగ్రోధమట్లు గోళాకృతి, బండి
పోలం విధమ్మున పొడవైన మెడయు
గలిగిన జీవియే కమనీయతముడు.

మత్స్యములు దానిమాటలు విని 'ఈదుర్మార్గకచ్ఛపము మన మడిగిన విషయము తెలుపక వేరొకవిషయము చెప్పినది. ఆహా' అని ఈగాథ పలికినవి:

అడిగినది చెప్ప, డడగని యన్యవార్త
చెప్పు, నాత్మప్రశంసయే చేసికొనును
ఏమియును నచ్చలేదు మా కితని తీరు.

మత్స్యములు కచ్ఛపముమీద నీరు వెదజల్లి నిజనివాసమునకు వెడలిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుజాతకములు సరిపోల్చెను. ఆకాలమున రెండుచేపలం యీతరుణభిక్షువులు; కచ్ఛపము ఆవృద్ధుడు; వృక్షదేవత నేను.

# 206 కురుంగమిగ జాతకము

శాస్త వేళువనమున విహరించుచు దేవదత్తుని విషయమై చెప్పెనది.

## వర్తమానకథ

ఈసమయమున దేవదత్తుడు వధోద్యుక్తుడై యున్నట్లు విని శాస్త "భిక్షువులారా! దేవదత్తుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఇట్టి ప్రయత్నము చేసినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కురంగమృగ మయి, అరణ్యములో నొకసర స్తీరమున గుల్మములో నివసించుచుండెను. సరస్సున కనతిదూరములో వృక్షాగ్రమున శతపత్రపక్షి వ్రాలుచుండెడిది. సరస్సులో తాబే లుండెను. ముగ్గురును మిత్రు లయి, పరస్పరప్రీతితో నిట్లు నివసించుచుండిరి. ఒక నాడు మృగవ్యాధుడు అడవిలో తిరుగుచు, సర స్తీరమున బోధిసత్త్వుని పదచిహ్నములను జూచి, లోహశృంఖలవంటి తోలువలను పన్ని వెడలి పోయెను. బోధిసత్త్వుడు జలపానార్థము ప్రథమయామమున వెడలి, వలలో జిక్కుకొని ఆక్రందనము చేసెను. ఆ కూయి విని, చెట్టుమీాద నుండి శతపత్రపక్షి, నీటినుండి కచ్ఛపము వచ్చి, కర్తవ్య మే మని ఆలోచన చేసినవి. అపుడు పక్షి తాబేలుతో "సౌమ్యా, నీకు దంతము లున్నవి. నీ వీపాశమును ఛేదింపుము. నేను పోయి వ్యాధుడు రాకుండు నట్లు చేయుదును. ఇట్లు మన మిరువురము చేయు ప్రయత్నమువలన మన మిత్రునిప్రాణములు దక్కును" అనునర్థమును ప్రకాశింపజేయు ఈగాథ పలికెను.

చర్మనిర్మితంబు జాలంబు దంతాల<br>
గొంకి వేయవలయు కూర్మరాజ!<br>
ఏను చూచుచుందు నిటువైపు లుబ్ధకుం<br>
డరుగుదేర కుండు నట్టి విధము.

కచ్ఛపము చర్మపట్టికలు కొరకసాగినది. శతపత్రము పోయి లుబ్ధకునియింట వ్రాలినది. వాడు తెల్లవారుజామున లేచి శక్తి పట్టుకొని బయలుదేరెను. ముందు వాకిలివెంట వాడు వెలుపలికి వచ్చుట పక్షి గ్రహించి, రెక్కలు విప్పి, వానిముఖముపై గొట్టెను. అపశకునము కొట్టిన దని వాడు లోనికిబోయి కొంతవరకు పండుకొని, మరల శక్తిని చేతబట్టుకొని లేచెను. వీడు తొలుత ఎదుటివాకిట బయలుదేరినాడు. ఇప్పుడు వెనుక వాకిట వెలువడు నని గ్రహించి, పక్షి పోయి వెనుకటి ద్వారముమీద వ్రాలి, వాడు వచ్చినతోడనే రెక్కలతో మరల ముఖముపై గొట్టెను. అపశకునము నన్ను బయలువెడలనీయ కున్నదని వాడు మరల పండుకొని, అరుణోదయమున లేచి, శక్తి ధరించి బయలుదేరెను. పక్షి వేగముగా జని, వ్యాధుడు వచ్చుచున్నా డని బోధిసత్త్వునకు దెలిపెను. అప్పటికి కచ్ఛపము తోలుపట్టీలు కొరికివేసినది. ఒక్కటిమాత్రము మిగిలి యుండెను. దానిదంతము రాలిపోవునట్లుండెను. ముఖమున నెత్తురు క్రమ్మినది.

లుబ్ధకుడు వేగముగా వచ్చుచుండుట జూచి, మృగము మిగిలిన పట్టీ (వార) త్రెంచుకొని, అడవిలో జొరబడెను. పక్షి వృక్షాగ్రము మీదికి బోయి వ్రాలెను. దౌర్బల్యముచే కచ్ఛపముమాత్ర మచ్చటనే పడియుండెను. వ్యాధుడు కచ్ఛపమును సంచిలో వేసికొని, కఱ్ఱకు దగిలించెను. బోధిసత్త్వుడు మరలివచ్చి, కచ్ఛపముపట్టువడుట గ్రహించి, మిత్రునిప్రాణములు రక్షింతు నని తాను బలము లేనిదానివలె నటించుచు కానబడెను. ఈమృగము దుర్బలముగా నున్నది. దీనిని సంహరింతు నని వాడు శక్తి పట్టుకొని దానివెంట నంటెను. మృగము నాతిదూరము కాక, నాతిసమీపముకూడ కాక పోవుచు వానిని వనములోని కెలయించుకొని పోయెను. అట్లు పోయి, తాను దూర మరుగుట గమనించి, తనపాదచిహ్నములను మరుగు పరచి, అన్యమార్గమున వాయువేగముతో మరలివచ్చి, కొమ్ములతో సంచి తలక్రిందులు చేసి, కచ్ఛపమును వెలువరించెను. శతపత్రము వృక్షముమీదినుండి నేలమీదికి వ్రాలెను. బోధిసత్త్వు డిరువురకు నుపదేశ మిచ్చువాడై "మీవలన నాప్రాణములు దక్కినవి. మీకు నేను చేయదగినది చేసినాను. ఇప్పుడే లుబ్ధకుడు వచ్చి మిమ్ము పట్టుకొనగలడు. కావున శతపత్రమా,

నీ బిడ్డలను దీసికొని వేరొకచోటికి బొమ్ము. కచ్ఛపమా. నీవు నీటిలో ప్రవేశింపుము'' అని చెప్పెను. అవి రెండును ఆప్రకారమే చేసెను. వ్యాధు డచ్చటికి వచ్చి చూడగా నేమియు కానబడలేదు. చినిగిన సంచితో విచారముతో వాడు నిజగృహమున కేగెను. ఆమిత్రులు ముచ్వురును యావజ్జీవము పరస్పరము గాఢవిశ్వాసముతో నుండి, తుదకు యథా కర్మం గతో.

శాస్త బుద్ధ డయినపిదప ఈగాధ పలికెను.

సలిలములోన కచ్ఛపము చెరినది.
కారడవిని వేగ దూరె మృగంబు;
శతపత్రమో వృక్షశాఖలనుండి
తనబిడ్డలం గొని చనెను దూరముగ.

శాస్త ధర్మోపదేశము చేసి రెండు జాతకములను సరిపోల్చెను. ఆసమయమున వేటకాడు దేవదత్తుడు; చిరుతపక్షి సారిపుత్రుడు; తాబేలు మౌద్గల్యాయనుడు; కురుంగమృగమును నేనే

## 207 అస్సక జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పూర్వభార్యయెడ ప్రలోభమునుగురించి చెప్పినది.

### వర్తమానకథ

శాస్త ఆభిక్షువుతో 'నిజముగా నీవు ఉత్కంఠితు డయితివా' అని అడిగెను.

'చిత్తము. సత్యముగ నే.'

'ఏల ఉత్కంఠ చెందితివి?'

'పూర్వభార్యవలన.'

శాస్త 'భిక్షూ! ఆమెకు నీయెడ ప్రీతి లేదు. పూర్వము ఆమె మూలమున నీవు మహాక్లేశము నొందితివి' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము కాశీరాష్ట్రమున పోతలి యను నగరమున అశ్వకు డనురాజు పరిపాలన చేయుచుండెను. ఆయన పట్టమహిషి పేరు ఉబ్బరి: ఆమె ప్రీతిపాత్రురాలు, మనోజ్ఞరూప, దర్శనీయాకృతి, మానవుల వర్ణమునకు దేవతల వర్ణమునకు నడుమ వన్నెకలది. ఆమె మృతినొందగా రాజు ఆమెకళేబరమును తైలద్రోణిలో భద్రపరచి, మంచముక్రింద నుంచి, తాను మంచముపై బండుకొని, ఆహారనిద్రలు మాని, దుఃఖించుచుండెను. తలిదండ్రులు, జ్ఞాతులు, మిత్రులు అమాత్యులు, బ్రాహ్మణులు, గృహపతులు మొదలగువారు వచ్చి "మహారాజా, దుఃఖింపవలదు. సంసారము లనిత్యములు" ఇత్యాది విషయములు చెప్పి, ఓదార్ప లేరైరి. అట్లాతడు విలపించుచుండ ఏడురోజులు గడచెను.

ఆకాలమున పంచాభిజ్ఞలు అష్టసమాపత్తులును పొంది తపస్వియై హిమాలయమున విచరించుచున్న బోధిసత్త్వుడు జంబూద్వీపముపై దివ్యదృష్టి బరపగా దుఃఖాక్రాంతుడై యున్న రాజు కానవచ్చెను. ఇతనికి తోడ్పడవలెనని బోధిసత్త్వుడు నిజప్రభావముచే ఆకసమున కెగసి వచ్చి రాజోద్యానమున దిగి, మంగళశిలాఫలకముపై బంగరువిగ్రహమువలె గూరుచుండెను. పోతలనగరనివాసి యగు బ్రాహ్మణమాణవకుడొకడు ఉద్యానములోనికి జని, బోధిసత్త్వుని గాంచి నమస్కరించి కూరుచుండెను. బోధిసత్త్వుడు అతనితో సల్లాపము లాడి "మాణవకా, రాజు ధార్మికుడేనా?" అని యడిగెను.

'అవును. రాజు ధార్మికుడే. ఆయనభార్య చనిపోయినది. రాజామెకళేబరమును తైలద్రోణిలో నుంచి, యేడ్చి మొత్తుకొనుచున్నాడు. నేటి కేడురోజులు గడచినవి. రాజుదుఃఖము మీరేల తొలగింపరాదు? మీవంటి శీలవంతు లుండగా రా జిట్లు దుఃఖించుట యుక్తమా?'

'మాణవకా, నేను రాజు నెరుగను. ఆయన వచ్చి అడిగినచో ఆయనభార్య యెచట జన్మించెనో తెలిపి, రాజసమక్షములోనే ఆమెచే మాటాడించెదను.'

'భన్తే, నేను రాజును గొనివచ్చువరకును మీ రిక్కడనే

యుండుడు' అని మాణవకుడు బోధిసత్త్వునిసమ్మతి పొంది రాజుకడకు జని వృత్తాంతము చెప్పి, "ఆదివ్యచక్షుష్మంతునిసన్నిధికి బోవుట ముఖ్య" మని పలికెను. ఉబ్బరిని మరల జూడవచ్చు నని రాజు సంతుష్టుడై రథ మెక్కి, ఉద్యానములోనికి జని బోధిసత్త్వునికి నమస్కరించి, ప్రక్కన గూరుచుండి "తాము దేవి జన్మమెత్తినచోటు సత్యముగా నెరుగుదురా?" అనెను.

"అవును. మహారాజా!"

"ఆమె యెచట నున్నది?"

'మహారాజా, ఆమె రూపగర్విత యగుటచే ప్రమాదమున జిక్కుకొని సత్కార్య మేమియు జేయలేదు. కావున నామె యీయుద్యానములోనే పేడపురుగుకడుపున బుట్టినది.'

'నేను విశ్వసింపను.'

'అట్లయిన మీ కామెను జూపి మాటాడింతును.'

'మంచిది. అటులే చేయుడు.'

బోధిసత్త్వుడు నిజప్రభావముచే రెండుగోమయపిండములు దొరలుచు రాజుకడకు వచ్చునట్లు చేసెను. వానిని జూపుచు 'మహారాజా,ఉబ్బరీదేవి నిన్ను విడిచిపోయి, పేడపురుగువెంట వచ్చుచున్నది. చూడు' మనెను.

'భన్తే, ఉబ్బరీదేవి పేడపురుగుకడుపున బుట్టునని నేను నమ్మను.'

'మహారాజా, ఆమెచేతనే చెప్పింతునా?'

'భన్తే, చెప్పింపుడు.'

బోధిసత్త్వుడు నిజప్రభావముచే ఆమెచే పలికించువాడయి, 'ఉబ్బరీ ఆయనతో మనుష్యవాక్కున మాటాడు' మనెను.

'చిత్తము, భదంతా, ఏమి చెప్పుదును?'

'వెనుకజన్మలో నీ పే రేమి?'

'భన్తే, అస్సకరాజుపట్టమహిషి నై ఉబ్బరి యను పేర నుంటిని.'

"ఇప్పుడు నీవు అస్సకరాజుమహిషివా, పేడపురుగువా?"

"అది నాపూర్వజన్మకథ. ఆకాలమున ఈయుద్యానములోనే ఆయనతో శబ్దస్పర్శరూపరసగంధముల సంతోషముతో విచరించితిని. కాని నూతనజన్మ వచ్చినతరువాత ఆయనతో నా కేమి? ఇప్పుడు అస్సక

రాజుకంఠరక్తముతో నాప్రకృతభర్తపాదములు కడుగగలను" అని జనమధ్యమున మానుషవాక్కుతో ఈగాథలు పలికెను.

భర్తయైనట్టి అశ్వకప్రభునితోడ
తిరిగితిని పూర్వ మేతత్ప్రదేశమందు
ఉండెను పరస్పరప్రీతి యుభయులకును.

నూతనసుఖాలు దుఃఖాలు ప్రాతవాని
పారద్రోలవె అశ్వకప్రభునికన్న
ఇంపుగూర్చును కీటక మిపుడు నాకు.

ఈవాక్కులు వినగానే పశ్చాత్తాపము చెందిరాజు తత్క్షణమే శవమును తీసివేయించి, తలనిండ స్నానము చేసి, బోధిసత్త్వునకు వందనము చేసి, మరల నగరములో ప్రవేశించి, వేరొక యువతిని పట్టమహిషిని జేసికొని, న్యాయపరిపాలనము చేయజొచ్చెను. బోధిసత్త్వుడు రాజు కుపదేశ మిచ్చి, దుఃఖము పోగొట్టి హిమాలయమున కరిగెను

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున ఉబ్బరి పూర్వభార్య; అస్సకరాజు ఉత్కంఠిత భిక్షువు; మాణవకుడు సారిపుత్రుడు; తపస్వి నేనే.

## 208 సుంసుమార జాతకము

శాస్త జేతవనమున విహరించుచూ దేవదత్తుని వధోద్యమ విషయమున చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున దేవదత్తుడు వధోద్యుక్తుడై యున్నాడని శాస్త "భిక్షులారా! దేవదత్తుడు కేవలము ఇప్పుడే కాదు. పూర్వముకూడ ఇట్టిప్రయత్నము చేసినాడు. కాని, కొలదిగా నైన బెదిరింపలేకపోయినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున వానరముకడుపున బుట్టి, నాగబలుడు, స్థేమసంపన్నుడు, మహాశరీరుడు, సౌభాగ్యయుక్తుడు నయి, గంగానివర్తనస్థానమున అడవిలో నివసించుచుండెను. ఆరోజులలో గంగానదిలో నివసించుచున్న మొసలిభార్య బోధిసత్త్వుని దేహము గాంచి, ఆయనగుండెలోని మాంసము తిన నభిలాష పొడమగా భర్తతో "స్వామీ, ఈ కపిరాజహృదయమాంసము భుజింప గోరిక పుట్టినది" అని పలికెను. "భద్రే, మనము జలచరులము. ఈయన స్థలచరుడు. ఇతని నెట్లు పట్టుకొనగలము?" "ఏయుపాయముచేత నైన పట్టుకొనుడు. అతడు లభింపనిపక్షమున నేను జీవింపను." "భయపడవలదు; ఉపాయము కలదు. నీ వతని హృదయమాంసము తినగలవు" అని మొసలి భార్య నోదార్చెను.

బోధిసత్త్వుడు నీరు త్రాగి, గంగయొడ్డున గూరుచున్నసమయమున మొసలి యతని సమీపమునకు జని "వానరేంద్రా, ఈ ప్రదేశమున కసరుగాయలు తినుచు, తిరిగిన తావుననే యేల చరించుచుందువు? గంగ కావలియొడ్డున అంతులేని ఆమ్రలికుచాదిమధురఫలములు కలవు. నీ వచ్చటికి బోయి ఫలాదులు తినగూడదా?" అనెను. 'కుంభీలరాజా, గంగానది నిండుగా మహావిశాలముగా నుండును. అక్కడికి నే నెట్లు పోగలను?' "నీవు పోదలచినచో నావీపుమీద నెక్కించుకొని నిన్నావలి తీరమునకు జేర్పగలను." బోధిసత్త్వుడు విశ్వసించి, మంచి దని యంగీకరించెను. 'రమ్ము, నావీపుమీది కెక్కుము' అని మొసలి పలుకగా వానరము వాని వీపుమీదికి జనెను. మొసలి కొలదిదూరముపోయి, వానరమును నీటిలో ముంపసాగెను. 'సౌమ్యా, నన్ను నీటిలో ముంచుచున్నావు. ఏ మిది?" అని బోధిసత్త్వు డనెను. 'నిన్ను నేను ధర్మబుద్ధితో గొనిపోవుట లేదు. నాభార్యకు నీహృదయమాంసముమీద కోరిక పుట్టుటచే నీగుండెకాయ తినిపింప నెంచినాను. 'సౌమ్యా, ఈసంగతి చెప్పుట మే లాయెను. మా కడుపుననే గుండె యుండునేని మే మిటునటు శాఖలపై దుముకునప్పుడు పొడిపొడి యయిపోవును."

'అట్లయిన దాని నెచ్చట నుంచితివి? సమీపమున తీరమున నున్న ఉదుంబరవృక్షమును పక్వఫలసంపన్న మయినదానిని జూపి, అదిగో, మా గుండెలు మేడిచెట్టున వ్రేలాడుచున్నవి' అనెను. 'నీగుండెకాయ నా కిత్తువేని నిన్ను చంపను.' 'అట్లయిన నన్నచటికి గొనిపొమ్ము. చెట్టున వ్రేలాడు గుండె నీ కిత్తును.'

మొసలి వానరము నచటికి గొనిపోయెను. బోధిసత్త్వుడు దాని వీపుపైనుండి యెగిరి లేచి ఉదుంబరవృక్షముపై కెక్కి, కూరుచుండి *'మూర్ఖమిత్రమా, జంతువులగుండెలు చెట్లపై వ్రేలాడు ననినమ్మితివి. బుద్ధిహీనుడవు నిన్ను వంచించినాను. కాయగసరులు నీకే యుండ నిమ్ము. నీ దేహమో పెద్దది, బుద్ధిమాత్రము లేదు' అను నర్థమును స్పష్టముచేయు ఈగాథలు పలికెను:

నీటి కావల నున్న నేరేడు, మావి,
పనస లేటికి? ఉదుంబరములే చాలు.

తావకీన విశాలతనువు కాదు
సమము నీప్రజ్ఞ వంచన పొందినావు!
ఇక నిచ్చ చొప్పున మకరమా, పొమ్ము.

మకరము జూదమున నోడినదానివలె దుఃఖించుచు, దుర్మనాయిత మయి, చింతించుచు నిజనివాసస్థానమునకు జనెను.

* శాస్తధర్మోపదేశము చేసి రెండుజాతకములు సరిపోల్చెను.
ఆసమయమున మకరము దేవదత్తుడు. ఆడుమొసలి చించామాణవికుడు; కపిరాజు నేనే.

# 209 కక్కర జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ధర్మసేనాపతియగు సారిపుత్రస్థవిరుని శిష్యుడగు తరుణభిక్షుని విషయమై చెప్పినది

## వర్తమాన కథ

అతడు తనశరీరసంరక్షణవిషయమున ఉత్సాహముతో నుండెడి వాడు. శరీరమున ఆరోగ్యము కొరవడు నేమో యను భీతిచే అతడు అత్యుష్ణముగాని అతి శీతముగాని కలిగించు పదార్థములు భుజించెడి వాడు కాడు. చలివలనగాని వేడివలనకాని దేహమునకు క్లేశము కలుగు ననుభయముచే ఇల్లు వెడలెడువాడు కాడు. బాగుగా ఉడికిన పదార్థముగాని మాడినవస్తువుగాని తినెడివాడు కాడు; అతనిశరీర పోషణవార్త సంఘమున వ్యాప్తమయ్యెను. ధర్మసభలో భిక్షువులు సంభాషించుచుండ శాస్త అరుగుదెంచి సంగతి తెలిసికొని, "భిక్షువు లారా, ఈ తరుణు డిప్పుడే కాదు, పూర్వముకూడ శరీరపోషణ వ్యగ్రుడై యుండెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అరణ్యములో వృక్షదేవత యయ్యెను. ఒకానొక పిట్ట వేటకాడు పెంపుడుకౌజుపిట్టను, రోమజాలకమును, యష్టిని బట్టుకొని అడవిలో కౌజుపిట్టలను బట్టుకొనుచు, పరుగెత్తిపోయి అడవిలో జొరబడిన ముసలికౌజుపిట్టమీద వలవేసెను. నేర్పుతో ఆపిట్ట వలలో జిక్కకొనక తప్పించుకొని యెగిరిపోవుచుండెను. వేటకాడు శాఖాపత్రముల మాటున దాగుచు మాటిమాటికి వలను యష్టిని విసరివేయుచుండెను. కౌజుపిట్ట వానిని సిగ్గుపరచు తలపుతో మనుష్యవాక్కులతో ఈగాధ పలికెను :

పెక్కు గాంచితి అశ్వకర్ణ, వి
భీతకాదులం తరువు లీవని;
కాని అయ్యావి నీవిధమ్మున
కదల నేరవు వృక్షమా !

ఇట్లు పలికి కౌజు ఎగిరి వేరొకచోటికి బోయెను. అది పోవునపుడు వేటకాడు ఈగాథ పలికెను :

పంజరము భేదించుకొని యీ
ప్రాతతిత్తిరి యెగిరివచ్చెను,
బంధనాదిరహస్య మెరిగిన
పక్షి కావున నవ్విపోయెను

వా డిట్లు పలికి, అరణ్యములో తిరిగి దొరికిన దానితో నిజగృహమునకు జనెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను అకాలమున వేటకాడు దేవదత్తుడు; పిట్ట తిరుణభిక్షువు వృక్షదేవత నేనే.

## 210 కందగళక జాతకము

శాస్త జేతవనమున విహరించుచు, సుగతుని వేషభాష లనుకరించుటను గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

దేవదత్తుడు సుగతుని వేషభాష లవలంబించుచున్నా డని విని శాస్త "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడే కాదు, పూర్వముకూడ న న్ననుకరించి వినాశము పొందినాడు" అని, పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు పాలగుమ్మిపిట్టకడుపున పుట్టి ఖదిరవనమున మేతమేయుచుండుటచే ఖదిరవనీయ మని పేరువచ్చెను. దానికి కందగళక మను మిత్రము కలదు. అది యొకనాడు ఖదిరవనీయమువద్దకు వచ్చినది. అది "మిత్రమా, వచ్చితివా" అని కందగళకమును వెంటగొని ఖదిర వనములో ప్రవేశించి, ముక్కుతో చంద్రకబోదెలన్నీ పొడిచ్చి, వృక్షము

నుండి కీటకములను తీసియిచ్చెను. అది తియ్యని అపూపములవలె వానిని తినెను. తినుచుండగా దానికి అభిమానము కలిగి "చెట్లు పొడుచుకొని తినుజాతిలో ఇది పుట్టినది. నేనుగూడ అంతే. ఇదీ యిచ్చుచున్న యెర నా కేల? స్వయముగా ఖదిరవనమున ఆహారము సంపాదించుకొని తినెదను" అని భావించి, ఖదిరవనీయముతో 'మిత్రమా, నీకు శ్రమవలదు. నేనే చంద్ర చెట్లలో ఆహారము గ్రహింతు' ననెను.

"మిత్రమా, నీవు బూరుగ, పారిభద్రము మొదలగు మెత్తనిచెక్కలను పొడుచుజాతిలో పుట్టినావు. ఖదిరమో సారవంతము, కఠోరము. నీకోరిక విడిచిపెట్టుము" అని ఖదిరవనీయము పలికెను.

'నేను మాత్రము చెట్లు పొడిచెడు జాతిలో పుట్టలేదా?' అని కందగళకము మిత్రునిమాట వినక, వేగముగా జని, ముక్కుతో చంద్ర బోదెను పొడిచెను. తక్షణమే దానిముక్కు చితికిపోయెను, గ్రుడ్లు వెలికి వచ్చిన ట్లయ్యెను. తల తిరిగిపోయెను. అది చెట్టుపై నిలువలేక నేలపై బడి ఈగాథ పలికెను.

సౌమ్య, నామం బేమొ చెప్పుమి
సన్నయాకుల ముండ్లతరువుకు
ఒకప్రహారము తోడనే నా
యుత్తమాంగము బ్రద్దలాయెను.

అది విని ఖదిరవనీయము ఈగాథ పలికెను.

నేటివరకును ఫులుఁగు మెత్తని
నీరసములౌ చెట్లు ముట్టెను
సారవంతం బైన ఖదిర
స్పర్శచే తల బ్రద్దలాయెను.

ఇట్లు ఖదిరవనీయము పలికి, 'ఓకందగళకా, నీవు దేనిపై తల పగులగొట్టుకొంటివో అదియే సారవంత మైన ఖదిరవృక్ష' మనెను. కందగళక మక్కడనే ప్రాణములు విడిచెను.

శాస్త ధర్మోపదేశము కావించి జాతకములు మేళవించెను. ఆకాలమున కందగళకుడు దేవదత్తుడు, ఖదిరవని నేనే.

# 211 సోమదత్త జాతకము

శాస్త జేతవనమున విహరించుచు లాలుదాయీ స్థవిరుని విషయమై చెప్పినది

## వర్తమాన కథ

ఇరువురు ముగ్గురు నడుమ నైన ఆతడు ఒక్క మాటకూడ పలుక లేదు. లజ్జాశీలు డగుటచే ఒకటి చెప్పబోయి వేరొకటి చెప్పును. ధర్మ సభలో గూరుచుండి భిక్షువు లితనినిగూర్చి చర్చించుచుండిరి. శాస్త అచటి కరుగుదెంచి ప్రశ్నించి, విషయము దెలిసికొని, "భిక్షువులారా! లాలుదాయి ఇప్పుడే కాదు, పూర్వముకూడ అధికలజ్జా శీలుడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో బ్రాహ్మణవంశమున పుట్టెను. అతడు పెద్దవాడయి తక్షశిలకు బోయి విద్య లభ్యసించి, ఇంటికి మరలి వచ్చెను. తలిదండ్రులు దుర్గతిలో నుండుట చూచి చితికిపోయిన వంశము నుద్ధరింతు నని తలచి యతడు వారితో చెప్పి, వారాణసికి బోయి రాజుకొలువులో జేరెను. క్రమముగా రాజుకు ప్రీతిపాత్రు డయ్యెను,

ఆతనితండ్రి రెండెద్దులతో వ్యవసాయము చేయుచు, జీవనము చేయుచుండగా అందులో నొకయెద్దు చనిపోయెను. ఆతడు కుమారుని కడకు బోయి "నాయనా, యెద్దొకటి మరణించినది. వ్యవసాయము సాగుట లేదు. ఎద్దు కావలె నని రాజును యాచింపు" మనెను, నాయనా, రాజు కొలువులో నేను ప్రవేశించి కొలదికాలమే యయి నది. నే నడుగుట అయుక్తము. నీవే అడుగు" మని కుమారుడు చెప్పెను. "నాది సిగ్గుపడు స్వభావ మని నీ వెరుగవా? ఇరువురు ముగ్గురు జనుల సమక్షములోనే మాటాడలేను. అట్టిస్థితిలో రాజసన్ని ధానమున వృషభముకయి యెట్లు యాచింపగలను? అచ్చటికి బోయి నచో ఈవృషభమునుగూడ ఇచ్చివత్తు నేమో" అని తండ్రి పలికెను.

"కావలసినది కాక మానదు. నేను రాజుగారి నడుగలేను. నీవు అడుగుటకై అభ్యాసము చేయింతును." "సరే. అభ్యాసము చేయింపుము." బీరణఘాస మున్న శ్మశానముకడకు తండ్రితో జని బోధిసత్త్వుడు గడ్డి కోసి మోపులు కట్టి, ఇది రాజు, ఇది ఉపరాజు, ఇది సేనాపతి అని పేర్లు పెట్టి, వరుసగా చూపి, "నాయనా, నీవు రాజసన్నిధికి బోయి, మహారాజునకు జయము అని, ఈగాథ పలికి వృషభమును యాచింపు" మని గాథ ఇట్లు నేర్పెను:

కృషి చేయుదును రెండు వృషభాలతోడ
అందులో నొక్కటి అంత మొందినది;
తాము వేరొకదాని దయచేయవలయు.

బ్రాహ్మణు డొక్క వర్ష మీగాథను అభ్యసించి, కుమారునితో 'సోమదత్తా, గాథ నోటికి వచ్చినది. ఎవరియెదుట నయినను దీనిని పలుకగలను. నన్ను కడకు గొనిపొమ్ము' అనెను. సరే అని బోధిసత్త్వుడు తండ్రిని రాజసముఖమునకు దీసికొనిపోయెను. మహారాజునకు జయము అని బ్రాహ్మణుడు కానుక సమర్పించెను. 'సోమదత్తా, ఈ బ్రాహ్మణుడు నీ కే మగును?' అని రా జడిగెను. "మహారాజా, మా నాయన" 'ఏ కోరికతో వచ్చినారు?' ఆక్షణమున బ్రాహ్మణుడు వృషభమును కోరువాడై ఈగాథ పలికెను.

కృషిచేయుదును రెండు వృషబాలతోడ
అందులో నొక్కటి అంతమొందినది;
తాము వేరొకదాని దయచేయవలయు.

అప్రమత్తు డగు చతండు హాయనమ్ము
తోరముగ నభ్యసించెను వీరణతృణ
జటిల మైన శ్మశానాన: సభకు వచ్చి
పలికె తలక్రిందుగా తడబాటువలన
అల్పబుద్ధిని రక్షింప దభ్యసనము.

రాజు వైముఖ్యము చెంది, దానియభిప్రాయము గ్రహించి, మందహాసము చేసి, 'సోమదత్తా, మీయింట అనేకవృషభము లుండు నని తోచుచున్న' దనెను. 'చిత్తము, మహాప్రభూ. తమ రనుగ్రహించిన

పక్షమున' అని బోధిసత్త్వుడనునప్పటికి రాజు ప్రసన్నుడై, అలంకరించిన పదునారు వృషభములను, నివాసమున కగ్రహారమును, విశేష ధనమును ఇచ్చి, బ్రాహ్మణుని గౌరవించి, వీడ్కొలిపెను. బ్రాహ్మణుడు తెల్లని సైంధవములు పూన్చిన రథ మెక్కి బహుపరివారముతో గ్రామము జేరెను. తండ్రివెంట రథములో నున్న బోధిసత్త్వుడు "నాయనా, వత్సరము పూర్తిగా అభ్యాసము చేయించినాను. కాని తుదకు నీవే రాజుకు వృషభము నిచ్చినావు' అని ఈగాథ పలికెను:

అగును లాభ మలాభంబో యాచకునకు
చూడ నీరెండె స్థితిగతుల్ సోమదత్త!
ఎంతకును యాచనాధర్మ మింతె తండ్రి!

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకమును సరిపోల్చెను. ఆసమయమున సోమదత్తునితండ్రి లాలుదాయి. సోమదత్తుడు నేనే.

## 212 ఉచ్ఛిట్ఠభత్త జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు పూర్వభార్యయెడ ఆసక్తుడగువానిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

"భిక్షూ, నీవు నిజముగ ఉత్కంఠితుడ వయితివా?' అని శాస్త్ర అడిగెను.

'నిజముగానే.'

'నిన్ను ఎవరు ఆకర్షించిరి?'

'పూర్వభార్య.'

'భిక్షూ, ఈమె నీకు అపకారము చేయునది. పూర్వముకూడ ఈమె తన జారునితో రహస్యముగ క్రీడించినది.' అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు దరిద్రనటవంశమున బుట్టి భిక్షాటనము చేసి జీవించుచుండెను. ఆరోజులలో కాశీరాష్ట్రమున ఒకానొక కుగ్రామమున ఒక బ్రాహ్మణుని భార్య దుర్మార్గురాలు, అసతి, దుశ్శీలయు, నయియుండెను. ఒకనాడేదో పనిమీద బ్రాహ్మణుడు ఇలు వెడలిపోవగా, ఆమె జారుడు కనిపెట్టి తక్షణమే యింటిలో బ్రవేశించెను. ఆమె యతనితో క్రీడించి, 'భోజనము చేసి పోవుదువుగాని' యని, సూపవ్యంజనసంపన్నమైన వేడియన్నము వడ్డించి, బ్రాహ్మణుని రాకకై యెదురుచూచుచు ద్వారముకడ నిలుచుండెను.

అక్కడ భోజనపిండము లభించునేమో యని బోధిసత్త్వుడు కనిపెట్టుకొని యుండెను. ఇంతలో బ్రాహ్మణుడు గృహాభిముఖుడయి వచ్చుచుండెను. బ్రాహ్మణి భర్తను జూచి వేగముగా లోనికి బోయి, 'లే, బ్రాహ్మణుడు వచ్చుచున్నాడు' అని జారుని కొట్టులోనికి బంపి, భర్త వచ్చి భోజనమునకు గూరుచుండువేళకు పీట వేసి, చేతులు కడుగుకొనుటకు నీరు పెట్టి జారుడు విడిచిపోయిన యన్నముమీద వేడియన్నము పరచి, వడ్డించెను. ఆయన అన్నములో చేయిపెట్టునప్పటికి పైభాగమున వేడిగను, లోపల చల్లగను ఉండెను. అది ఉచ్ఛిష్టాన్నము కానోపు నని బ్రాహ్మణుడు తలచి, భార్య నడుగదలచినవాడై ఈగాథ పలికెను:

నేను ప్రశ్నించుట నిన్నె ఓ బ్రాహ్మ
ణీ, కారణం బేమి నిమ్నభాగమున
అన్నము చల్లగా నున్నది, పైన
నున్నది యెంతయు నుష్ణంబుగాను?

బ్రాహ్మణుడు మాటిమాటికి ప్రశ్నించుచున్నను తనపని బయటపడునన్న భయముచే బ్రాహ్మణి మిన్నకుండెను. అప్పుడు బోధిసత్త్వుడు తనలో 'కొట్టులో కూరుచున్నవాడు జారుడు కానోపును. తాను చేసినపని బయటపడు నని యీామె భర్తకు ప్రతివచన మీాయ లేదు.

ఈమె చేసినపని ప్రకటమగునట్లును, జారుడు గదిలో నున్నట్లును బ్రాహ్మణునకు తెలియునట్లు పలుకుదు' నని తలచి, సమస్తము తెలియ జెప్పి యీగాథ పలికెను.

అరుగుదెంచితిని భిక్షార్థము, నటుడ
నే స్వామి, మీర లన్వేషించు నతడు
కూర్చున్న వాడు పైకోష్ఠంబునందు.

బోధిసత్త్వుడు జారుని జుట్టుపట్టుకొని కొట్టుపోనుండి లాగి బ్రాహ్మణికి బుద్ధి చెప్పి వెడలిపోయెను. బ్రాహ్మణు డిరువురను శిక్షించి భయపెట్టెను. మరల వా రెన్నడును దుష్కార్యము చేయలేదు.

బ్రాహ్మణుడు యథాకర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుజాతకములు సరిపోల్చెను. ఆసమయమున యీ బ్రాహ్మణి పూర్వభార్య; బ్రాహ్మణుడు ఉత్కంఠిత బ్రాహ్మణుడు; నటపుత్రుడను నేనే.

## 213 భరు జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసలరాజుల విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

భగవానుని భిక్షుసంఘమునకు పదార్థములు సత్కారము లభించు చుండెను. కొందరు "శ్రమణ గౌతముడు సమస్తజంబూద్వీపమున ఉత్తమస్థానమున శ్రేష్ఠభూమిపై నున్నారు. కావున ఆయనకు సత్కారాదులు లభించుచున్నవి" అన్నారు. మరి కొందరు, "అవును, ఇదియే కారణము. మనముకూడ జేతవనమున తైర్థికఆశ్రమము నిర్మితము. ఇందువలన మనకుగూడ లాభము కలుగును," అన్నారు.

ఇది ఈలాగునున్న దని వారు నిశ్చయించికొని "రాజుగారితో ముందుగా సూచన చేయుట మంచిది. అచటి భిక్షువులు మనపని నష్టగింప వచ్చును, రాజుగారికి మనము కొంత ముట్టచెప్పినచో స్థలము

లభించును'' అని ఉపస్థాపకులద్వారా ప్రభుప్రునకు లక్ష నాణెములు పంపి ఇట్లు చెప్పించిరి: "మహారాజ, మేము జేతవనమున తైర్థికఆశ్రమము నిర్మించికొందుము. అచటి భిక్షువులు తమతో మమ్ము నివాసము నిర్మింపనీయ మని చెప్పవచ్చును. తాము సమ్మతింపరాదు" అని విన్నవించిరి.

రాజు లక్షనాణెములు ముట్టుటచే సంచిదనెను తైర్థికులు వడ్రంగులను పిలువనంపి పని ప్రారంభించిరి. చాలసందడి యగుచుండుటచే శాస్త ఆనందా, ఈ గడబిడ యేమి? ఈసందడి చేయువా రెవ్వరు! అని యడిగెను.

"భన్తే, అన్యతైర్థికులు జేతవనమున తైర్థికాశ్రమము నిర్మించుచున్నారు. ఇది దానిసందడి."

"ఆనందా, ఈస్థానము తైర్థికులకు తగినది కాదు. వారు కోలాకల ప్రియులు. వారితో మనము కలసియుండజాలము.

శాస్త భిక్షుసంఘమును ఒకచో సమావేశపరచి,'' భిక్షువులారా, తైర్థికులు ఆశ్రమము నిర్మించుచున్నారు. తాము నివారింపవలెను. అని రాజునకు విన్నవింపుడు'' అని చెప్పెను,

భిక్షువులు పోయి ప్రవేశద్వారముకడ నిలచిరి. ఈ వార్త విని రాజు తాను ఇంటిలో లేనట్టు బదులు పంపెను. భిక్షువులు మరలివచ్చి శాస్తకీవిషము విన్నవించిరి. తన ప్రధానశిష్యులను శాస్త రాజుకడకు పంపగా విని రాజు తా నింట లేనట్టు బదులు పంపెను. వారు మరలి వచ్చి ఈవిషయము శాస్తకు విన్నవించిరి.

"సారిపుత్ర, రాజు మందిరములో నుండగా దొరకడు. వెలుపల కలిసికొనవలయును'' అని శాస్త మరునాడు పూర్వాహ్ణమున వస్త్రములు దాల్చి పాత్రపట్టుకుని అయిదువందలమంది భిక్షువులతో రాజుగారి ప్రవేశద్వారముకడ నిలిచెను. విని రాజు మేడదిగి వాత్ర తీసికొని శాస్తను లోనికిగొనిపోయి భిక్షుసంఘమునకు యవాగుఇచ్చి, శాస్తకు ప్రణామముచేసి ఒకప్రక్కకు కూరుచుండెను. శాస్త రాజునకు ఒకవిధముగా ధర్మోపదేశము చేయుచు "మహారాజా, వెనుకటిరాజులు లంచము గైకొని శీలవంతులకు జగడము పెట్టెడివారు. ఆరాజులు ప్రభుత్వమును కోల్పోయి చాల విపత్తు లొందిరి" అని, రాజు ప్రార్థించిన

పిదప పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున భరురాష్ట్రమున భరురాజు పాలనము చేయుచుండెను. ఆసమయమున బోధిసత్త్వుడు పంచాభిజ్ఞలను, అష్టసమాపత్తులను పొందెను. ఆయన తపస్విగణమునకు నాయకుడయి, హిమాలయమున బహుకాల ముండి, లవణామ్లములకొరకు హిమవంతమునుండి అయిదువందలమంది తాపసులతో దిగి, క్రమముగా భరునగరము చేరి భిక్షాటనము చేసి, ఉత్తరమున శాఖాపత్రసంపన్న మైన వటవృక్షముక్రిందికి జేరి, భోజనము చేసి అచ్చటనే నివసించెను. అర్ధమాస మిట్లు గడవగా వేరొక ఋషిగణనాయకుడు పంచశతతాపసపరివృతుడై వచ్చి, నగరమున భిక్షాటనము చేసి, దక్షిణద్వారమున అట్టు వంటి వటవృక్షమూలమున భోజనము చేసి, అచ్చటనే నివసించెను. ఆఋషిగణద్వయము ఇచ్చవచ్చిన ట్లుండి. హిమాలయమునకు వెడలి పోయెను. వారు వెడలిపోయిన తరువాత దక్షిణదిశలోని వటవృక్ష మెండిపోయెను.

దక్షిణద్వారముకడ వటవృక్షముక్రింద మొదట దిగిన ఋషిగణము మరలవచ్చి, చెట్టు శుష్కించుట చూచి, నగరములోనికి బోయి భిక్షాటనము చేసి, ఉత్తరద్వారముకడ వటవృక్షముక్రిందికి బోయి భోజనము చేసి, అచ్చటనే నివసింపజొచ్చెను. రెండవఋషిగణము మరలివచ్చి నగరములో భిక్షాటనము చేసి, తమవృక్షమూలమును జేరి భుజించి, అక్కడనే యుండెను.

ఇది మాచెట్టు ఇది మాచెట్టు అని వారిలో కలహ మంకురించి ప్రబలనుయ్యెను. 'మే మిచ్చట నుంటిమి. కావున మీ కీస్థానముపై నధికారము లేదు' అని ఒకపక్షమువా రనిరి. 'ఈపర్యాయము మే మిచటికి ముందు వచ్చినాము. కావున మీ కధికారము లేదు' అని రెండవపక్షమువా రనిరి. మాది అధికారము, మాది అధికార మని వారు జగడమాడి తుదకు రాజసన్నిధికి బోయిరి. మొదటిసారి అచట ఋషిగణమునకే అధికార మున్నదని రాజు నిర్ధారణ చేసెను.

'మేము ఓడిపోయినట్లు సమ్మతింపక వాదింతుమ' మని రెండవపక్షమువా రని, చక్రవర్తికి తగిన అరదపుచట్టమును దివ్యదృష్టితో గ్రహించి, తెచ్చి రాజునకు లంచ మిచ్చి 'మహారాజా, అధికారము మాకుకూడే నొసగు' మని పలికిరి.

రాజు లంచము తీసికొని రెండుపక్షములకు నధికార మిచ్చెను. మిగిలిన ఋషిగణము ఆరథచక్రమునకు రత్నములు పొదిగి తెచ్చి, "మహారాజా, మాకే అధికార మిమ్ము" అని కోరిరి. రా జాప్రకా రమే చేసెను.

"మనము వస్తువులమీదను భోగములమీదను ప్రీతి విడిచి ప్రవ్ర జించుట మంచిది" అని ఋషులు తలపోసిరి; కాని వృక్షమూలప్రదేశ ములకై మరల కలహించి లంచ మిచ్చుచుండిరి. తుట్టతుదకు పశ్చా త్తాపము చెంది, అందరును హిమాలయముననకే వెడలిపోయిరి.

భరురాష్ట్రమందలి దేవత లెల్లరు సమావేశమై. "శీలవంతు లగు వారికి రాజు జగడము పెట్టుట యుక్తముకా" దని, క్రుద్ధులై భరు రాష్ట్రమున మూడువందల యోజనముల ప్రదేశము సముద్రములో మునిగిపోవునట్లు తుపాను కల్పించిరి. ఒక్క రాజువలన భరురాష్ట్ర ప్రజ లీవిధముగా నాశము పొందిరి.

శాస్త అభిసంబుద్ధు డయినపిదప అతీతమగు నీవిషయమునుగూర్చి యీగాథలు పలికెను :

భరురాజు ఋషులలోపల సంఘటించి
కలహమ్ము, నాశమ్ము గనెనంట మున్ను.
పండితుల్ మెచ్చరు పక్షపాతమును
నిందుచే : ద్వేషవిహీనచిత్తమున
సత్యవాక్కులు పల్క సముచితం బగును.

శాస్త ధర్మోపదేశము చేసి "మహారాజా, పక్షపాతము తగదు. ప్రవ్రజితులకు కల హము కల్పింపరాదు" అని జాతకము లు సరిపోల్చెను. ఆసమయమున నేను జ్యేష్ఠ ఋషిని; తథాగతుడు భోజనము చేసి వెడలినతరువాత రాజు పురజనులను పంపి తైర్థి కుల ఆశ్రమము పడగొట్టించెను.

# 214 వుణ్ణనదీ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ప్రజ్ఞాపారమితవిషయమై చెప్పినది.

## వర్తమానకథ

ఒకనాడు ధర్మసభలో భిక్షువులలో తథాగతుని ప్రజ్ఞాపారమితను గూర్చి చర్చ జరుగుచుండెను.

"ఆయుష్మంతులారా, సంయక్ సంబుద్ధుడు మహాప్రజ్ఞావంతుడు; విస్తృత, ప్రసన్న, శీఘ్ర ప్రజ్ఞావంతుడు; ఉపాయకుశలుడు" అనుచుండిరి శాస్త అచటికి వచ్చి, విషయము తెలిసికొని, "భిక్షువులారా, తథాగతుడు ఇప్పుడే కాదు. పూర్వముకూడ ప్రజ్ఞావంతుడు, ఉపాయకుశలుడు" అని పూర్వవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు పురోహితకులమున పుట్టి పెద్దవాడయి, తక్షశిలకు బోయి, అన్నివిద్యలు నేర్చి, తండ్రిమరణానంతరము రాజుకు అర్థధర్మానుశాసనకుడయ్యెను. కొంతకాలమునకు రాజు కొండెగాండ్ర మాటలు విని క్రుద్ధుడై నాసన్నిధిలో నుండరాదని బోధిసత్త్వుని వారాణసినుండి వెలికిబంపెను. ఆయన భార్యాపుత్రులతో జని కాశీరాష్ట్రములో నొకగ్రామమున నివసించుచుండెను. కొంతకాలము చనగా రాజు బోధిసత్త్వునిగుణములను స్మరించి 'ఆయనకడ కెవ్వరినైన పంపి పిలిపించుట యుక్తముకాదు. గాథ రచించి, పత్రిక లిఖించి, వండిన కాకిమాంసము తెల్లని వస్త్రములో కట్టి, రాజముద్రిక వేయించి పంపెదను. ఆయన పండితుడయినచో పత్రిక చదివి, కాకమాంసాభిప్రాయము గ్రహించి, యిచ్చటికి వచ్చును' అని యీగాథ పత్రికలో లిఖించెను.

ఏది త్రాగుటచేత వాహినికి నిండు
తనము నెంత్రు, యవక్షేత్రమునకు వృద్ధి

పరిగణింతురు దేని గప్పంగ దూర
బంధువార్త దెలియు దేని పలుకువలన—
తెచ్చితిని దాని బ్రాహ్మణా తినవలయును.

ఇట్లు వ్రాసి రాజు బోధిసత్త్వునకు పంపెను. ఆయన పత్రిక చదివి, రాజు నన్ను చూడగోరుచున్నాడని గ్రహించి ఈగాథ పలికెను :

కాకమాంసమె లభియింపగానె నాకు
ప్రభువు పంపెను, క్రౌంచము, బక్షి, హంస
మాంసములు చిక్కిన న్నెట్లు మరువగలడు ?

ఇట్లు పలికి బోధిసత్త్వుడు బండి కట్టించి యెక్కిపోయి, రాజును సందర్శించెను. సంతుష్టచిత్తుడై రాజు మరల పురోహితపదవియం దాయనను నియోగించెను

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను ఆకాలమున రాజు ఆనందుడు; పురోహితుడు నేను.

# 215 కచ్ఛప జాతకము

శాస్త జేతవనమున విహరించుచు కోకాలికుని గురించి చెప్పినది.

## వర్తమాన కథ

ఈకథ మహాతక్కారి జాతకమున వచ్చును. ఆసమయమున శాస్త 'భిక్షువులారా, కోకాలికుడు తన వాక్కుమూలమున ఇప్పుడే కాదు. పూర్వముకూడ దెబ్బలుతినెను' అని చెప్పి పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు అమాత్యకులమున బుట్టి, పెరిగి పెద్దవాడయి, ఆయన కర్థధర్మానుశాసకు డయ్యెను. ఆరాజు అతిభాషి. ఆయన మాటాడుచుండ నన్యుల కొక్కమాటకుగూడ నవకాశము లేదు. ఆతని బహుభాషిత్వమును మానుప దలచి బోధిసత్త్వు డుపాయము యోజించుచుండెను.

ఆకాలమున హిమవత్ప్రదేశమున నొకసరస్సులో కచ్ఛపము నివసించుచుండెను. ఆహారార్థ మచట చరించు హంసపోతకములజంటకును కచ్ఛపమునకును మైత్రి కుదిరెను. దృఢవిశ్వాసము కలవై అవి యొకనాడు కచ్ఛపముతో 'మిత్రమా, చిత్రకూటపర్వతతలమున కాంచనగుహలో మానివాసస్థానము మిగుల రమణీయము. మావెంట నచటికి రమ్ము' అని పలికెను. 'నే నచటి కెట్లు రాగలను?' 'మేము నిన్ను తీసికొనిపోవుదుము. నీ వేమియు మాటాడక నోరు కాపాడుకొనదలచినచో కొనిపోవుట సులభము' 'నోరు మెదల్పను, నన్ను గొనిపోవుడు.' 'మంచిది' అని హంసపోతకములు చిన్నకర్రను కచ్ఛపమును కరచి పట్టుకొమ్మని, రెండుకొనలను ముక్కుల గరచి పట్టుకొని ఆకాశమున బోవుచుండెను. పల్లెటూరిపిల్లలు వానిని జూచి 'రెండంచలు తాబేటిని కర్రకు పట్టించి మోసికొనిపోవుచున్నవి' అని యరచిరి.

కచ్ఛపము 'ఓరి దుష్టబాలకులారా, నన్ను మిత్రులు తీసికొనిపోవుచుండగా మీ రెందులకురా' అన దలచుకొని, హంసలు వేగముగా వారాణసిరాజమందిరనుమీదుగా బోవునపుడు నోరు తెరచి, దండము విడిచి నేలపై బడి రెండుముక్క లయ్యెను. కచ్ఛపము నేలపై బడిన దని కోలాహలము పుట్టెను.

రాజు బోధిసత్త్వుని దీసికొని అమాత్యపరివృతు డై అచ్చటికి వచ్చి దానిని జూచి బోధిసత్త్వునితో "పండితోత్తమా, ఇది యేమి చేసి పడిపోయినదో?" అనెను. బోధిసత్త్వు డిట్లు చింతించెను. "రాజుకు సదుపదేశము చేయ బహుకాలమునుండి ఉపాయము నన్వేషించుచు తిరుగుచున్నాను. ఈకచ్ఛపమునకు హంసలతో మైత్రి కుదిరియుండును.

అవి దీనిని దండమునకు బట్టించి హిమవంతమునకు గొనిపోవుచుండును. ఇది యేదో పలుకబోయి నోటిపట్టు విడిచి నేలపై బడి ప్రాణములు విడిచి యుండును." ఇట్లు తలపోసి ఆయన "మహారాజా, అవును. వదరుబోతులు మాటలకు హద్దులేనివారు ఇట్లే దుఃఖభాజను లగుదురు" అని యీగాథలు పలికెను,

మాటలవలన కూర్మము కాంచె మృతిని;
గట్టి యష్టిని నోట పట్టియుఁగూడ
పలుకులమూలాన ప్రాణముల్ విడిచె

కావున నరవరా! గమనింపవలయు;
తరుణాన భాషింప దగును, విశేష
భాషణం బెన్న డపాయకరంబు;
కచ్ఛపదుర్గతి కంటివి కాదె!

తననుగూర్చియే అతడు పలికినాడని రాజు గ్రహించి, పండితోత్తమా, నన్నుగూర్చియే పలికినావు" అనెను. "మహారాజా, మిమ్ముగూర్చి కానిండు అన్యులనుగూర్చి కానిండు, హద్దుమీరి ప్రసంగించువారు ఇట్లే యగుదురు" అని విస్పష్టముగా జెప్పెను. నాటినుండి రాజు అధికప్రసంగము విరమించి, మితభాషి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున కచ్ఛపము కోకాలికుడు; రెండు హంసపోతకములు ఇరువురు మహాస్థవిరులు, రాజు ఆనందుడు; పండితామాత్యుడు నేనే.

## 216 మచ్ఛ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పూర్వభార్య ఆకర్షణమునుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

"భిక్షూ, నీవు సత్యముగ ఉత్కంఠితుడ వయితివా?" అని శాస్త అడిగెను.

"భన్తే, నిజముగ."

"ఎవరు నిన్ను ఉత్కంఠితుని చేసిరి?"

"పూర్వభార్య."

"భిక్షూ, ఈమె నీకు అనర్థదాయిని. ఈమెవలననే పూర్వముకూడ నీవు గాలము మ్రింగి అగ్నిలో పక్వమై భక్షితుడవు కానుంటివి. పండితుని సహాయమువలన ప్రాణములు దక్కించుకొంటివి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

[సంపుటి 1 · 34]

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడాయనపురోహితు డయ్యెను. ఒకనాడు కైవర్తకులు జాలములో చిక్కుకొన్న మత్స్యమును తీసి, వేడియిసుకపై బడవేసి, "బొగ్గులపై దీనిని వండుదము" అని కొయ్యతో శూలమును చెక్కుచుండిరి. మత్స్యము తక్కిన చేపలనుగూర్చి ఈగాథలు పలికెను :

> అగ్ని, శూలాల భయంబుచే గాదు;
> అన్యకామినికడ కరిగితి నేమొ
> యని సంశయం బొందు ననుచు నాకాంత
> రగులును శోకంబు;
>
> రాగాగ్ని నాదు
> హృదయంబు నెంతయు నెరియించు; కామి
> మరణింపకూడదు; మత్స్యమ్ములార,
> విడిపింపవలయును వేగమే నన్ను.

ఆక్షణమున బోధిసత్త్వుడు నదీతీరమున బోవుచు మత్స్యపరిదేవనము విని కైవర్తులను సమీపించి, ఆచేపను విడిపించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున మత్స్యము పూర్వభార్య; పురుషమత్స్యము ఉత్కంఠితభిక్షువు; పండితుడు నేనే;

# 217 సేగ్గు జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు కూరలు విక్రయించు ఉపాసకుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఈకథ ప్రథమనిపాతమున వచ్చియున్నది. ఈకథలో శాస్త 'ఉపాసకుడా, ఏల ఇంత ఆలస్యముగ వచ్చితివి?' అని ప్రశ్నించెను.

"భన్తే, నాబిడ్డ నిరంతరము మందహాసముతో నుండును. ఆమెను నేను పరీక్షించినపిదప ఒకానొక యువకునికి ఇచ్చితిని? కావున యీపని తొందరలో తమ దర్శనము చేయుట కవకాశము లేకపోయెను."

"ఉపాసకా. నాబిడ్డ ఇప్పుడే కాదు, పూర్వముకూడ సదాచారవంతురాలు, నీ విప్పుడే కాదు, పూర్వముకూడ పరీక్షచేసితివి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

[పణ్ణిక జాతకము సంపుటి 1 102]

పూర్వమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచున్న కాలమున బోధిసత్త్వుడు వృక్షదేవత యయ్యెను. కూరగాయలవర్తకుడైన ఉపాసకుడు తనకొమార్తెను పరీక్షింప గోరి ఆమెను వనములోనికి గొనిపోయి కామవాంఛతో నున్నవానివలె చేయి పట్టుకొనగా నామె రోదనము చేసెను. అపు డత డీగాధ పలికెను.

ఆనందమే కోరు నఖిలలోకంబు
గ్రామ్యధర్మము నీవు కాదు పరిచితము.
నిన్ను బిడ్డా, పట్టుకొన్న నేడ్చెదవు
నీధర్మ మెరుగను సేగ్గు.

కుమారి అది విని "అవును నాయనా, నేను కుమారికనే. మైథునధర్మము నాకు తెలియదు" అని యేడ్చుచు ఈగాధ పలికెను.

సహజముగ నార్త యగు పుత్రి సాకి ప్రోచు
తండ్రియే నట్టడవిని ఘాతం బొనర్చె
ఈవనస్థలి రక్షింప నెవరి బిలుతు
త్రాత కాదగువా డిట్లు తలప నెగ్గు!

ఇట్లాతడు కుమార్తెను పరీక్షించి, ఇంటికి గొనిపోయి, తరుణ వయస్కున కిచ్చి పెండ్లి చేసెను. తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున నున్న బాలిక నేటి బాలికయే; తండ్రి తండ్రియే; ఆవిషయమును ప్రస్ఫుటము చేసిన వృక్షదేవత నేనే.

## 218 కూటవాణిజ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒక కుతంత్రివ్యాపారుని గురించి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో నివసించు వ్యాపారు లిరువురు— ఒకడు మోసగాడు, రెండవవాడు యోగ్యుడు,—ఉమ్మడివ్యాపారము చేయనారంభించి సరకులు 5వందలబండ్ల కెక్కించి, తూర్పుపడమర దిక్కులలో వ్యాపారము చేసి లాభముతీసి శ్రావస్తికి మరలివచ్చిరి. పండితవ్యాపారి మోసగానితో "మిత్రమా! సామానులు పంచికొందము" అనెను.

మోసగాడు తనలో 'ఇతడు బహుదినములు సరియైన భోజనము విశ్రాంతియు లేని కారణమున ఇప్పుడు అన్నివిధములైన ఖాద్యములు భుజించి అనారోగ్యమున చనిపోవును. అప్పుడు సరుకులన్నియు నావే యగును' అని తలచి, ఇందువలన అతడు 'నేడు నక్షత్రము మంచిది కాదు, రేపు చూతము' అనుచు కాలము గడపజొచ్చెను.

యోగ్యుడు విధిలేక సామానులు పంచెను. తరువాత గంధ మాల్యానులేపనములు తీసికొని శాస్తసన్నిధికి జని పూజాప్రణామములు కావించి ఒకప్రక్క గూరుచుండెను.

శాస్త 'ఎప్పుడు వచ్చితిరి?' అని అడిగెను. 'భన్తే, నేను వచ్చి పక్షమురోజు లైనది.'

'అట్లగుచో బుద్ధులసేవకు ఇంత విలంబన మేల?'

అతడు పరిస్థితులను వివరించెను. 'ఉపాసకా, ఇతడు ఇప్పుడే మోసగాడు కాదు, పూర్వముకూడ మోసగాడే అని, అతని ప్రార్థనపై శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు అమాత్యకులమున బుట్టి వినిశ్చయామాత్యు డయ్యెను. ఆరోజులలో గ్రామవాసివణిజుడు, నగరవాసివణిజుడును మిత్రు లయిరి. గ్రామవాసి నగరవాసి కడ అయిదువందల కర్రులు ఉంచెను. వా రవి విక్రయించి సొమ్ముచేసుకొని, కర్రులు ఉంచినచోట ఎలుకపెంటిక లుంచెను. కొన్నాళ్ళకు గ్రామవాసి వచ్చి, నా కర్రులు ఇమ్ము అని యడిగెను. "నీ కర్రులు ఎలుకలు తినివేసిన" వని ధూర్తవర్తకుడు ఎలుకపెంటింకలు చూపెను. రెండవవాడును మూషికములు తినియుండ వచ్చును. మూషికములు తిన్నచో ఏమి చేయగలము!" అనెను. అనం తర మాతడు స్నానమునకు బోవుటచూచి ధూర్తునికుమారుని తన మిత్రునియింట దాచి వీనిని పోనీయవల దని చెప్పి తాను స్నానము చేసి, ధూర్తునియింటికి మరలిపోయెను.

"మాకుర్రవా డేడి!" అని వా డడిగెను "మిత్రమా, నీకుమారుని ఒడ్డుననుంచి నేను నీటిలో దిగినపుడు డేగ వచ్చి వానిని గోళ్ళతో బట్టు కొని ఆకాశమున కెగసిపోయెను. నేను నీరు ఎగజిమ్మి, అరచి, యత్నించినప్పటికిని దానిపట్టు విడిపింపలేకపోతిని."

"అసత్యము. పక్షి పిల్లవానిని ఎత్తుకొనిపోలేదు."

"మిత్రమా, అసంభావ్య మయినను జరిగినదానికి నే నేమి చేయు దును? నీపుత్రుని పక్షి ఎగురదన్నుకొని పోయినది."

"అరే దుష్టచోరా, మనుష్యఘాతుకా, ఇప్పుడే న్యాయస్థానము నకు బోయి బయటికి దీయించెదను, అని బయలుదేరెను. మంచి దని గ్రామవాసి అతని వెంటనే నడచెను. ధూర్తవర్తకుడు బోధిసత్త్వునితో

"స్వామీ, ఇతడు స్నానమునకు బోవుచు నాకుమారుని తనవెంట గొని చని, మరలివచ్చినపిమ్మట పిల్లవాడేడీ అని నే నడుగగా పక్షి తన్నుకొనిపోయిన దన్నాడు. తమరు న్యాయనిర్ణయము చేయవలెను" అని విన్నవించెను.

"నిజము చెప్పుము" అని బోధిసత్త్వుడు రెండవవాని నడిగెను.

"చిత్తము స్వామీ! నే నితనికుమారుని దీసికొనిపోవుట సత్యము. డేగ బాలకుని తన్నుకొనిపోవుటకూడ నిజము."

"లోకములో డేగ బాలకుని ఎత్తుకొనిపోవుట సంభావ్యమా?"

"తమ నడుగగోరుచున్నాను. లోకములో శ్యేనములు బాలకుని తన్నుకొని ఆకాశమున కెగురలేవు, మూషికములు మాత్రము ఇనుప కర్రులు తినగలవు."

"ఏ మిది?"

"నే నీతనియింట అయిదువందల యినుపకర్రులు ఉంచినాను. మరల నడిగినప్పుడు మూషికములు వానిని భక్షించినవి" అని ఎలుక పెంటికలు చూపినాడు. స్వామీ, మూషికములు ఇనుపకర్రులు తిన్నచో డేగలుకూడ బిడ్డలను హరింపగలవు. అవి తిన్నవో తినలేదో తమరు నిర్ణయింపుడు.

బోధిసత్త్వుడు తనలో "శఠునకు ఇతడు ప్రతిశాఠ్యము చూపి, జయింప దలచినట్లు తోచుచున్నది" అనుకొని, గ్రామవాసితో "నిజమే. నీవు బాగుగా యోచించినావు" అని ఈగాథలు పలికెను :

శఠునియెడలను శాఠ్యమ్ము సముచితమ్ము
కుటిలతావాగురయె కట్టె కుటిలచిత్తు
ఫాలముల మ్రింగ మూషికా, లేల బాలు
పుల్లుతండము తన్నుకపోవరాదు?

హాలఫలకమ్ముల నాతని కీవె
అర్పించుపక్షాన ఆతడు మరల
నీపుత్రకుని దెచ్చి నీ కీయవచ్చు.

ఈవిధముగా ధూర్తవణిజునకు కుమారుడును, గ్రామవాసివణిజునకు కర్రులు లభించినవి. వా రుభయులు యథా కర్మ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను ఆకాలమున మోసగాడు ఇప్పటి మోసగాడు; ఉత్తమవ్యాపారి ఇప్పటి ఉత్తమవ్యాపారి; అమాత్యుడు నేనే

# 219 గరహిత జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

ఈ భిక్షువు మనస్సు దేనిమీదను నిలిచెడిది కాదు. అన్యమనస్కుడై కాలము గడపుచున్న యీభిక్షువును శాస్తసన్నిధికి కొనిపోయిరి.

'నీవు నిజముగా ఉత్కంఠితుడ వయితివా?' అని శాస్త అడిగెను.

'చిత్తము. సత్యముగ.'

'ఏకారణమువలన?'

'కామాసక్తిచే.'

'భిక్షూ, పశువులుకూడ కామాసక్తిని నిందించినవి. నీవు బుద్ధశాసనమున ప్రవ్రజితుడ వయ్యును పశువులుకూడ నిందించిన కామమునకు లోబడితివే' అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమవంతమున వానరముకడుపున బుట్టెను. వనేచరుడు కోతిపిల్లను పట్టుకొని పోయి రాజుకు సమర్పించెను. చిరకాలము రాజనివాసమున నుండుటచే మర్కటమునకు సభ్యవర్తన మలవడెను. రాజు దానివర్తనమునకు సంతసించి వనేచరుని పిలిపించి, దీనిని ఎక్కడ పట్టుకొంటివో అక్కడనే విడిచిపెట్టుము అని ఆనతీయగా వాడట్లే చేసెను.

బోధిసత్త్వుడు వచ్చినట్లు వానరములు విని, తద్దర్శనార్థము విశాలపాషాణఫలకముమీద సమావేశము చేసెను. బోధిసత్త్వుని కుశల

మడిగి వానరములు "ఇంతకాల మెక్కడ నుంటివి?" అని ప్రశ్నించెను. "వారాణసిలో రాజనివాసములో" "ఎట్లు ముక్తి పొందితివి?" "రాజు నన్ను కేళీమర్కటమును జేసి, నావర్తనమునకు ప్రసన్నుడై నన్ను విడిపించినాడు." "మానవలోకములోప్రవర్తనము మీకు తెలియును; మాకు తెలియ జెప్పుడు. విన వేడుకపడుచున్నాము." "మనుష్యులవ్యవహారములను గూర్చి న న్నడుగవలదు." "చెప్పుడు. విన గోరిక కలదు."

"మానవులు క్షత్రియులు కాని, బ్రాహ్మణులు కాని అంతయు నాది నాది యనుచుందురు. వస్తువుల అనిత్యత గ్రహింపరు. ఆయంధమూర్ఖులసంగతి "వినుడు" అని బోధిసత్త్వుడు ఈగాథలు పలికెను.

ఆర్యధర్మము లెరుగని యజ్ఞు లెపుడు
ముచ్చటించుదురు సువర్ణమునుగురించి
నాది యిది యనుటయె కాని లేదు లేదు

గృహపతు లిరువురు గృహమునం దుందు;
రుండవు శ్మశ్రువు లొక్కరి కందు;
వ్రేలాడు కుచములు; వేణియు నుండు
శ్రవణరంధ్రము లుండు; చాల ధనంబు
వ్యయముచే గొనివచ్చి నట్టిది సకల
జీవులకు బాధించు సదనంబునందు.

విని వానరము లన్నియు "చెప్పవలదు, చెప్పవలదు! వినగూడని మాటలు వింటిమి!" అని రెండుచేతులతో చెవులు మూసికొని "ఈ ప్రదేశమున అయోగ్యవిషయములు విన్నాము" అని యాస్థానమును గర్హించి, అన్యస్థానమునకు బోయినవి. గర్హితపాషాణఫలక మని దానికి పేరు వచ్చెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వానరగణము బుద్ధపరిషత్తు, వానరేంద్రుడను చేనే.

# 220 ధమ్మద్ధ జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచుండగా వధోద్యమవిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

"భిక్షువులారా, దేవదత్తు డిప్పుడే కాదు. పూర్వముకూడ నన్ను వధించుటకై యత్నము చేసెను. కాని ఎంతమాత్రము బెదరింపలేక పోయెను" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో యశపాణి యనురాజు పరిపాలనము చేయుచుండెను. కాళకు డతనిసేనాపతి. ఆకాలమున బోధిసత్త్వుడు ధర్మధ్వజు డనుపేర పురోహితు డయ్యెను. ఛత్రపాణి రాజుకు తల దువ్వి అలంకరించువాడు. రాజు న్యాయపరిపాలన చేయుచుండెను. సేనాపతి నిర్ణాయకుడై లంచము తినుచు స్వామి కానివానిని స్వామిని చేయుచుండెను.

ఒకనాడు అభియోగములో నోడిపోయినవాడు బాహువులు చాచి ఆక్రందించుచు న్యాయస్థానము వీడి, రాజదర్శనార్థము పోవుచున్న బోధిసత్త్వుని పాదములమీాద వ్రాలి, "మీావంటివారు రాజున కర్థ ధర్మము లనుశాసించుచుండ, కాళక సేనాపతి లంచముతిని అన్యాయము చేయుచున్నాడు" అని తనయోటమి వివరించెను. జాలిపుట్టగా బోధిసత్త్వుడు 'రావోయీా, నీవ్యవహారమును నిర్ణయించెదను' అని వానిని గొనిపోయి న్యాయస్థానమున కేగెను. జనులు గుమిగూడిరి. బోధిసత్త్వు డాయభియోగమును విచారించి, యోగ్యునిపక్షముగా తీర్పు చెప్పెను. మహాజనము సాధుకారము చేసెను. కలకలము విని రాజు "ఏ మాకోలాహలము?" అని ప్రశ్న వేసెను. 'దేవా, ధర్మధ్వజ పండితుడు అపనిర్ణయమును సరిదిద్దినాడు. అది సాధుకారకోలాహలము' అని జనులు విన్నవించిరి. రాజు సంతుష్టచిత్తుడై బోధిసత్త్వుని బిలువనంపి; "ఆచార్యా, మీారు ధర్మనిర్ణయము చేసినారట" అనియెను. 'అవును మహారాజా, కాళకుడు చెప్పిన తప్పుతీర్పును సరి

దిద్దినాను.' 'ఇకనుండి మీరే ధర్మనిర్ణయము చేయుడు. నాకు కర్ణోత్సవము, లోకమునకు వృద్ధియు కలుగును.'

బోధిసత్త్వు డంగీకరింపలేదు. రాజు "సత్త్వములయెడ కరుణతో న్యాయనిర్ణయమునకు కూరుచుండుడు" అని ఆయనను ప్రార్థించి యొడబరచెను. నాటినుండి బోధిసత్త్వుడు ధర్మస్థానమున కూరుచుండి తగినతీర్పులు చెప్పుచుండెను. అప్పటినుంటి కాళకునకు లంచము ముట్ట లేదు. లాభము కోలుపోయి వాడు రాజుతో "దేవా, ధర్మధ్వజపండితునకు రాజ్యాభిలాష కలిగినది" అని కొండెములు చెప్పెను. రాజు విశ్వసింపక అట్లు పలుకవల దని నిషేధించెను. "నామాటలు నమ్మ రేని అతడు వచ్చునపుడు వాతాయనమునుండి చూడుడు. నగరము నతడు తనచేతిలో బెట్టుకొను భావమును గ్రహింపగలరు" అని వాడు మరల చెవికొరికెను. న్యాయస్థానమందలి జనసమూహమును గాంచి రా జది బోధిసత్త్వునిపరివార మని భ్రమించి "సేనాపతీ, ఏమి చేయుదు?" మనెను. "దేవా, వీనిని సంహరించుట యుక్తము" "మహాపరాధము చేయనివానిని ఎట్లు సంహరింపగలము?" "ఉపాయ మున్నది." ఏ మా యుపాయము?" "అసంభావ్య మైనపని చెప్పి, చేయలేనపుడు వానిని సంహరింపవచ్చును." "ఇతని కసాధ్యకార్య మే మున్నది?" "మహారాజా, సారము కల భూమిలో తోటవేసినను మొక్కలు మొలిచి ఫలించుటకు రెండు మూడు వర్షములు పట్టును. మీ రితనిని బిలిపించి ఉద్యానమున రేపు మేము క్రీడింపవలయును. ఉద్యానము నిర్మింపవలెను అని చెప్పుడు. ఇతడు నిర్మాణము చేయలేడు. అది దోషముగా నెంచి వీనిని సంహరింతము."

రాజు బోధిసత్త్వుని బిలిపించి, "పండితోత్తమా. మేము బహుకాలమునుండి ప్రాచీనోద్యానములో విహరించుచున్నాము. ఇప్పుడు నూతనారామములో క్రీడింప గోరిక కలదు, రేపటి కారామము నిర్మింపవేని నీప్రాణములు దక్కవు" అని పలికెను.

బోధిసత్త్వుడు యోజించి "తనకు లంచము లభింపకపోవుటచే కాళకుడు రాజు మనసు విరిచినా డని గ్రహించి "మహారాజా, చేతనైనచో చేసెదను" అని పలికి ఇంటికిబోయి సుష్ఠుగా భుజించి, ఆలోచనామగ్నుడై శయనముపై బండుకొనెను. శక్రునిభవనము వేడిమెక్కెను.

శక్రుడు యోచించి బోధిసత్త్వునివ్యథ గ్రహించి వేగముగా వచ్చి కోష్ఠము ప్రవేశించి, ఆకాశమున నిలిచి "పండితోత్తమా, ఏమి యోచించుచున్నా?" వని యడిగెను. "తమ రెవరు?" "శక్రుడను." "ఉద్యానము నిర్మింపు మని రాజు కోరినాడు. ఆవిషయమే యోజించు చున్నాను." "పండితోత్తమా, విచారింపకుము. నందనవన, చిత్రలతావనములను బోలినయుద్యానము సిద్ధము చేసెదను. ఏప్రదేశమున నిర్మింతును?" "ఆచోట."

శక్రుడు వననిర్మాణము చేసి, దేవలోకమునకు జనెను. మరునాడు బోధిసత్త్వుడు నిర్దిష్టస్థలమున నూతనోద్యానము గాంచి "ఉద్యానము సిద్ధమయినది. పోయి క్రీడింపవచ్చును" అని పలికెను. పదునెనిమిది మూరల యెత్తు, మనశ్శిలావర్ణము కల ప్రాకారములతోను, ద్వారాట్టాలికలతోను, పుష్పఫలభారభరితము లగు వివిధవృక్షములతోను మనోహర మగు నారామమును గాంచి రాజు, కాళకునితో "మనము చెప్పినపని పండితుడు చేసినాడు. ఇప్పుడు మన మేమి చేయవలెను?" అనెను.

"మహారాజా, ఒక్కరాత్రిలో ఇంతటి యారామము నిర్మించిన వాడు రాజ్యము హరింపలేడా?" "ఇపుడు ఏమి చేయుదము?" "ఇంకొక యసాధ్యకార్యము వానికి చెప్పుడు." "ఏమి కార్యము?" "సప్తరత్నమయ మగు పుష్కరిణిని నిర్మింపు మనుడు." "మంచి"దని రాజు బోధిసత్త్వుని బిలిపించి, "ఆచార్యా, ఉద్యానము నిర్మించితివి. దీనికి దగిన సప్తరత్నమయపుష్కరిణిని నిర్మింపుము. అట్లు చేయవేని ప్రాణములు దక్క" వనెను. 'చేతనైనచో చేసెదను మహారాజా!' అని బోధిసత్త్వుడు పలికెను. రాత్రివేళ శక్రుడు నందనపుష్కరిణీసదృశ మగు సరోవరమును నిర్మించెను. అందు నూరుఘట్టములు, వేయివంపులు, పంచవర్ణముల పద్మములు, నిండుగా గలవు. బోధిసత్త్వుడు మరునాడారమణీయసరోవరమును జూచి రాజుకడకు బోయి, 'దేవా పుష్కరిణి సిద్ధమయినది' అని తెలిపెను. రాజు పోయి చూచి కాళకునితో 'ఇప్పు డేమి చేయుద' మనెను. 'దేవా, ఉద్యానమున కుచితమైన మందిరము నిర్మింప నాజ్ఞయిండు' అని వాడు సూచించెను.

రాజు బోధిసత్త్వుని బిలిపించి, 'పండితోత్తమా, యుద్యానమునకు

పుష్కరిణికి ననుగుణ్యమైన మందిరము సంపూర్ణముగా గజదంతముతో నిర్మింపుము అట్లు చేయవేని ప్రాణములు దక్కవు' అనెను. శక్రు డీమందిరమునుగూడ నిర్మించెను. మరునాడు బోధిసత్త్వుడు తెలుపగా రాజు పోయి చూచి 'ఇప్పు డేమి చేయుద' మని కాళకు నడిగెను. 'మందిరమున కనువగు మణిని సిద్ధముచేయు మని యాజ్ఞాపింపుడు.'

రాజు బోధిసత్త్వుని బిలిపించి 'పండితోత్తమా, ఈదంతమయమందిరమున కనువగు మణిని సిద్ధముచేయవలెను. మణికాంతిలో విహరింతుము. అట్లు చేయవేని ప్రాణములు దక్క' వనెను.

శక్రు డామణినికూడ సంతరించెను. మరునాడు బోధిసత్త్వుడు దానిని జూచి రాజుకు దెలుపగా నతడు పోయి చూచి 'ఇప్పు డేమి చేయుద' మని కాళకు నడిగెను. 'మహారాజా, ఈబ్రాహ్మణుడు ధర్మధ్వజునకు ఇష్టదేవత యున్నదని తోచుచున్నది. ఆదేవతగూడ నెరవేర్పజాలని దుర్ఘటకార్యము వీనికి జెప్పుడు. చతుర్గుణసమన్వితు డగు మానవుని దేవతగూడ సృజించుట పట్టిది. కావున అట్టియుద్యానపాలకుని సృజింపు మని యాజ్ఞాపింపుడు' అని వాడు చెప్పగా రాజు బోధిసత్త్వుని రావించి 'ఆచార్యోత్తమా, మాకు ఉద్యానమును, పుష్కరిణిని, దంతప్రాసాదమును దానిలో కాంతికై మణిరత్నమును సిద్ధము చేసినావు. ఉద్యానరక్షణార్థము చతుర్గుణసమన్వితు డగు వనపాలకుని సిద్ధము చేయుము. అట్లు చేయనిచో ప్రాణములు దక్క' వనెను. 'మంచిది. లభించునేమో కనుగొందును' అని బోధిసత్త్వు డింటికి బోయి భోజనము చేసి, పండుకొనెను. ప్రత్యూషమున లేచి యతడు శయనముపై గూరుచుండి యిట్లు తలపోసెను 'దేవరాజు శక్రుడు స్వశక్తిచే సృజింపదగినదానిని సృజించెను. చతుర్గుణసంయుతు డగు వనపాలుని సృజింపజాలడు. నేను పరులచేతులలో మడియుటకన్న వనములో అనాధమరణము చెందుట మేలు!' ఇట్లు తలపోసి యాత డెవరితో జెప్పకుండ ప్రాసాదము దిగి అగ్రద్వారమున నగరము వెలువడి, అరణ్యమునకు జని, చెట్టుమొదట గూరుచుండి, సజ్జనుల ధర్మమునుగూర్చి ధ్యానము చేయుచుండెను. శక్రు డావిషయము గ్రహించి, వనచరవేషమున బోధిసత్త్వుని దగ్గరకు వచ్చి, 'బ్రాహ్మణోత్తమా, సుకుమారుడవు. ఇదివరలో కష్టము లెరుగనివానివలె నున్నావు. అడవిలో

జొచ్చి యేమి చేయఁగోరుచున్నావు?' అను ప్రశ్నాత్మక మగు గాథ పలికెను :

జీవితమ్ము సుఖమ్ముగా నీవు గడపు
వానివలె దోఁచెదవు జనస్థానములను
విడిచి నిర్జనవనములో విటపిక్రింద
ఏమి చింతింతు వొంటిమై కృపణు నట్లు ?

విని బోధిసత్త్వుఁడు ప్రత్యుత్తరముగా నీగాథ పలికెను :

కడపువాఁడ జీవితము సుఖమ్ముగానె;
ఉత్తముల ధర్మము స్మరించి యుర్విజంబు
చాయఁగూర్చుండి ధ్యానంబు చేయువాఁడ

"అట్లయిన బ్రాహ్మణోత్తమా, ఇక్కడ గూరుచుండి యేమి చేయుచున్నావు?" అని శక్రుఁ డడిగెను.

"చతుర్గుణసంయుతుఁ డగు వనపాలుని సృజింపు మని రా జన్నాఁడు. అట్టివానిని తేజాలను. కావున పరులచేతులలో మడియుటకన్న అరణ్యములో అనాధమరణము మంచిదని యిచ్చటికి వచ్చి కూరుచున్నా" నని బోధిసత్త్వుఁ డనెను.

"నేను దేవరాజు శక్రుఁడను. నేనే యుద్యానాదులు నిర్మించినాను. ఉద్యానపాలకుని సృజింపలేను. రాజుకు తలదువ్వి యలంకరించు మంగలి ఛత్రపాణి కలఁడు. అతఁడు చతుర్గుణసంపన్నుఁడు. అతనిని వనపాలకుని జేయు మనుము" అని శక్రుఁ డుపదేశించి, భయపడ వలదని ధైర్యము చెప్పి, నిజనగరమునకు బోయెను.

బోధిసత్త్వుఁ డింటికి వచ్చి, భోజనము చేసి రాజద్వారమునకు బోయి అచ్చట ఛత్రపాణిని జూచి, హస్తము గ్రహించి 'మిత్రమా, ఛత్రపాణీ, నీవు చతుర్గుణసంపన్నుఁడవట. నిజమేనా?' అనెను. నాగుణగణమునుగూర్చి మీ కెవరు చెప్పినారు?' 'దేవరాజు శక్రుఁడు.' 'ఏల చెప్పెను?' 'ఈకారణముచేత' అని బోధిసత్త్వుఁడు సర్వము వివరించెను. 'అవును, నేను చతుర్గుణోపేతుఁడను' అని మంగలి పలుకగా, నతని చేయి పట్టుకొని బోధిసత్త్వుఁడు రాజసన్నిధికి జని 'మహారాజా, ఈ ఛత్రపాణి చతుర్గుణోపేతుఁడు వనపాలకుఁడు, వలయుచో నితనిని నియ

మింపుడు' అని చెప్పెను. అంతట రాజు మంగలితో 'నీవు చతుర్గుణ సంపన్నుడవట. నిజమేనా?' అనెను. 'అవును మహారాజా' 'ఏనాలుగు గుణములు?' ప్రత్యుత్తరముగా నాత డీగాథ పలికెను .

ఈర్ష్య లేదు నాకు నెవరిపై, మద్యంబు
త్రావలేదు, లేదు దేవ. యెపుడు
ఎవరిమీద రాగ మేని ద్వేషం బేని;
కూడియుండు నిట్టి గుణగణమున.

"ఛత్రపాణీ, నీవు ఈర్ష్యారహితుడ నన్నావుకదా?"
'అవును, మహారాజా, ఈర్ష్యారహితుడనే.'
'నీ వేవిషయము చూచి ఈర్ష్య విడిచితివి?'
'వినుడు దేవా!' అని యతడు అసూయారహితత్వమును దెలుపు నీగాథ పలికెను :

స్త్రీకారణమ్మున దేవ, పురోహి
తుని బంధనమ్మున ద్రోయించినాను
కాని నన్ను సద్ధర్మకలితుని జేసె.
హేతువుచే నాకు నీర్ష్యయే లేదు

అనంతరము రాజు "మిత్రమా, ఛత్రపాణీ, ఏమి చూచి అమద్యపాయి వయితివి?" అని యడిగెను. ఆవిషయమును దెలుపు నీగాథ నీతడు పలికెను.

మద్యమ్ము గ్రోలుచు మత్తిల్లియుండి
ఆత్మజు మాంసంబు నారగించితిని
మానితి దుఃఖాన మద్యపానమ్ము

"మిత్రమా, ఏమి చూచి నీవు వీతరాగుడ వయితివి?" అని రాజు ప్రశ్నింపగా నతడు బదులుగా నీగాథ పలికినాడు .

నరపతిన్ కితవాస నాముడ నేను
ప్రత్యేకబుద్ధునిపాత్ర మదీయ
పుత్రుండు భేదించి చనిపోయినాడు.
ఆకారణమున స్నేహము కోలుపోతి.

"మిత్రమా, ఏమి చూచి అక్రోధనుడ వయితివి?" అని రాజడుగగా నాతడు తత్కారణమును దెలుపు నీగాథ పలికెను :

అరకనామ తపస్వి నై మహారాజ,
ఏడేండ్లు మైత్రి భావించుటచేత
గడపినాడను సప్తకల్పముల్ బ్రహ్మ
లోకమ్ము నన్; లేదు నాకు క్రోధమ్ము.

ఇట్లు ఛత్రపాణి తన నాలు గంగములను దెలుపగా రాజు పరివారమునకు సైగ చేసెను. తక్షణమే అమాత్యులు, బ్రాహ్మణులు, గృహపతిప్రభృతులు సరభసముగా లేచి కాళకునితో 'ఓరి లంచగొండీ, దుష్టచోరా, లంచములు లభింపకుండుటచే పండితోత్తమునిపై ప్రభువుతో చాడీలు చెప్పి, ఆయనను సంహరింప నెంచితివి" అని వానికాలుసేతులు కట్టి రాజనివేశమునుండి క్రిందికి దింపి, చేతికి దొరకిన రాళ్ళతో కట్టెలతో మోది వాని శిరసు బ్రద్దలు చేసి, ప్రాణములు బాపి, కాలు పట్టి యీడ్చి పెంటపోగుమీాద బారవేసిరి.

నాటిరాజు ధర్మప్రకారము పాలన చేయుచు తుదకు యథాకర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము సరిపోల్చెను. ఆకాలమున కాళకసేనాపతి దేవదత్తుడు; ఛత్రపాణి అగు మంగలి సారిపుత్రుడు; ధర్మధ్వజుడు నేనే.

## 221 కాసావ జాతకము

ఈధర్మోపదేశము శాస్త జేతవనమున విహరించుచుండగా దేవదత్తునివిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఒకసారి ధర్మసేనాపతి (సారిపుత్రుడు) 500మంది భిక్షువులతో వేళువనమున నివసించుచుండెను. దేవదత్తుడుకూడ తనవంటి దుర్మార్గులచే

పరివేష్టితుడై గయాశీర్షమున నివసించుచుండెను.

ఆసమయమున రాజగృహనివాసులు చందాలు వసూలుచేసి దానము చేయ సిద్ధముగా నుండిరి. వ్యాపారార్థము అరుగుదెంచిన ఒకానొక వర్తకుడు విలువగల సుగంధితకాషాయవస్త్రమును సమర్పించుచు, 'ఈవస్త్రమునుకూడ దానద్రవ్యములో చేర్చి నన్ను ఈ పుణ్యకార్యమున పాలుపంచికొననిండు' అని విన్నపముచేసెను. నాగరకులు మహాదానము ఇచ్చిరి. చందా లన్నియు ఒకచో చేర్చిరి. కార్షాపణములుకూడ నిండుగా లభించినవి. ఈవస్త్రము మిగిలిపోయినది. ఈవస్త్రమెవరి కీయవలెనని ప్రజలు సమావిష్టులై ఆలోచించుచుండిరి. కొందరు సారిపుత్రస్థవిరున కనిరి. వేరొక కొందరు 'సారిపుత్రస్థవిరుడు కొలదికాలమునుండియే ఇచట నున్నాడు. ఇచ్చవచ్చినపుడు వెడలిపోవును. దేవదత్త స్థవిరుడు ఎల్లప్పుడు మన నగరపార్శ్వమున నివసించుచున్నాడు. శుభాశుభములలో మనకు తోడ్పడును. కావున ఆయనకే ఇత్తము' అనిరి. అభిప్రాయము కనుగొన్న పిదప దేవదత్తు నామోదించినవారిసంఖ్య అధికముగ నుండెను. వా రావస్త్రమును దేవదత్తున కర్పించిరి. దేవదత్తుడు దానిని ఖండములు చేయించి, పైన కప్పుకొను వస్త్రముగా కుట్టించి, రంగువేయించి అందమైన పట్టుత్తరీయము చేసి పైన దాల్చెను.

ఆసమయమున 30 మంది భిక్షువులు రాజగృహమునుండి శ్రావస్తి వచ్చి, ప్రణామము చేసి, కుశలప్రశ్నము లయినతరువాత –

'భన్తే, ఈవిధముగ దేవదత్తుడు తనకు తగని చీవరమును ధరించినాడు' అని విన్నవించిరి.

శాస్త 'భిక్షువులారా, దేవదత్తుడు కేవల మిప్పుడేకాదు, పూర్వము కూడ తన కనర్హమైన చీవరమును ధరించినాడు' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున హస్తిజాతిలో పుట్టి, పెరిగి, అసీతిశతసహస్రమత్తవారణపరివృతు డయి, యూథపతి యయి అరణ్య

మున నివసించుచుండెను. ఒకానొక దరిద్రుడు వారాణసిలో దంతపు పనివారలవీధిలో పోవుచు ఏనుగుదంతములతో వలయాదులు చేయు చున్నవారిని జూచి "ఏనుగు దంతములు లభించినచో తీసికొందురా?" అని యడుగగా అవును, తీసికొందు మని వారు చెప్పిరి. వా రాయుధ ములు గ్రహించి, కాషాయవస్త్రములు ప్రత్యేకబుద్ధునివలె (సన్యాసి వలె) ధరించి, ఏనుగు లుండుత్రోవకు జని, ఆయుధములతో మాతంగ మును సంహారించి, దంతములు తెచ్చి, వారాణసిలో విక్రయించి జీవ నము చేయుచుండెను. కొంతకాలమునకు వారు బోధిసత్త్వునిపరివార మాతంగములలో చిట్టచివరి దానిని జంపుచుండెను. ఆనాటి కానాడు వారణములసంఖ్య తగ్గిపోవుచుండుట గమనించి ఏనుగులు బోధిసత్త్వు నితో ఈవిషయము చెప్పినవి.

బోధిసత్త్వుడు బాగుగా యోజించి, "ఒకడు సన్యాసివేషము ధరించి హస్తివీధిమీద నిలుచుండును. అతడు ఏనుగులను చంపుటలేదు కదా? పట్టుకొందును" అని, ఒకనాడు తాను యూథమునకు వెనుక నిలిచెను. వాడు ఆయుధ మెత్తి బోధిసత్త్వునివైపు దుమికెను. బోధి సత్త్వుడు ఆగి, వీనిని నేలపై మట్టము చేయుదు నని తొండము పైకెత్తెను. కాని వానికాషాయాంబరములు చూచి, అర్హతుల ధ్వజ పటమును గౌరవింపవలయును అని తలచి, తొండము ముడిచి, "ఓయీ మానిసీ, ఈఅర్హతులధ్వజపటము నీకు తగదు. ఏల దీనిని ధరింతువు?" అని యీగాథ పలికెను.

మనసులోపలి కాషాయమార్జనంబు
సలుప డెవ్వడు, సత్యంబు సంశయంబు
ఎవని కుండునో అతడు ధరించుగాక
కావివస్త్రము లర్హత కలుగబోదు.

సూనృతము, సంయమము, చిత్తశుద్ధి కల్గి
యుక్తమైన సదాచార మొప్పువాడు
తగినవాడు కాషాయవస్త్రములు దాల్ప.

ఇట్లు పలికి "నేటినుండి యిటు రావలదు. వచ్చితివేని ప్రాణములు దక్కవు" అని వానిని బెదిరించి తరిమివేసెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆసమయమున ఏనుగును కొట్టిన వాడు దేవదత్తుడు; దళపతి నేనే.

## 222 చూలనందియ జాతకము

శాస్త వేళువనమున విహరించుచు దేవదత్తునివిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున ధర్మసభలో భిక్షువులు ఇట్లు చర్చించుచుండిరి : "ఆయుష్మంతులారా! దేవదత్తుడు క్రూరుడు, దుస్సాహసుడు, సంయక్ సంబుద్ధుని సంహరించువారిని నియోగించెను. ఆయన వారిపై అప నిందలు మోపినాడు, నలగిరి అను ఏనుగును మీదికి తోలించినాడు. తథాగతుని విషయమున ఆతనికి శాంతి, మైత్రిభావము, దయ మొదలగున వేమియును లేవు.

శాస్త అరుగుదెంచి విషయము తెలిసికొని 'భిక్షువులారా! దేవదత్తుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ కఠోరుడు, దయాహీనుడు" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను,

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున నందియ నామ వానరమై పుట్టెను. అతనితమ్ముడు చిన్ననందియ. ఉభయులును అశీతిసహస్రవానరపరివృతులై, అంధమాతకు ఉపచారములు చేయుచుండిరి. వారు తల్లిని పొదరింట నుంచి, అరణ్యమునకు బోయి మధురఫలములను కోసి తల్లికి పంపుచుండిరి; కాని వానిని గొనిపోవువారు వృద్ధురాలికి చేరనిచ్చెడివారు కారు. ఆమె ఆకలిబాధచే చిక్కిపోయి చర్మశల్యావశిష్టయయ్యెను. ఒకనాడు బోధిసత్త్వుడామెను జూచి "అమ్మా, నీకు తియ్యనిపండ్లు పంపుచుంటిమి. ఏల నీవు చిక్కిపోయినావు?" అనెను.

"నాయనా, నాకు పండ్లు చేరలేదు" అని యామె పలికెను. 'నేను యూథమునకు పనిచేయుచున్నచో తల్లి చనిపోవును. యూథనాయకత్వము విడిచి తల్లి కుపచారము చేసెదను' అని బోధిసత్త్వుడు తలపోసి చిన్ననందియను పిలిచి 'నాయనా, నీవు యూథమును నడపుము. నేను అమ్మ కుపచారము చేయుచుందు' ననెను. 'అన్నా, నాకు నాయకత్వముతో పనిలేదు. నేనుకూడ అమ్మకు సేవచేయుదును' అని యతడు చెప్పెను. ఇరువురును నొకమాటమీద యూథము విడిచి హిమవంతమునుండి తల్లిని దీసికొని సీమాంతప్రదేశమున మర్రిచెట్టుక్రింద నివసించుచు మాతృపోషణ చేయుచుండిరి.

వారాణసీనివాసి యగు బ్రాహ్మణమాణవకుడు తక్షశిలలో సుప్రసిద్ధాచార్యునికడ సమస్తవిద్యలు గ్రహించి, సెలవువేడెను. విద్యాప్రభావమువలన నతడు కఠినహృదయుడు, పరుషస్వభావుడు, సాహసికుడు నగుట యెరిగి ఆచార్యుడు 'నాయనా, నీవు కఠినముగా నుండుట మంచిది కాదు. అన్నికాలములు అనుకొన్నట్లు జరగవు. చాల కష్టములు నష్టములు సంభవించును. కాఠిన్యము వలదు. పశ్చాత్తాపము పొందవలసినపని చేయవలదు' అని ఉపదేశించెను. అత డాచార్యునకు నమస్కరించి, వారాణసికి జని, కాపురము పెట్టి, ఏ విద్యవలనను జీవిక నడవక, ధనుష్కోటితో జీవనము చేయుదు నని భావించి, వారాణసి వెలువడి, పొలిమేరగ్రామములో నివాసము ప్రారంభించెను. అతడు ధనుర్బాణములు ధరించి, అడవికి బోయి వివిధజంతువులను వధించి, మాంసము విక్రయించి జీవనము చేయుచుండెను.

ఒకనా డతనికి వనములో నేమియు లభింపలేదు. ఇంటికి మరలుచున్నవాడు మైదానముచివర వటవృక్షము జూచి, అచట నేమైన లభించునేమో యని యావైపు చనెను.

ఆసమయమున సోదరు లిరువురు తల్లికి పండ్లు పెట్టి, చెట్టుకొమ్మలలో కూరుచుండియుండిరి. వేటకాడు వచ్చుచుండుట గమనించి, వృద్ధమాతజోలికి బోవడని భావించి వారు కొమ్మలమాటున దాగియుండిరి. వేటకాడు వృక్షమూలమున అంధవృద్ధవానరిని గాంచి, వట్టిచేతులతో బోవ నేల? ఈమర్కటిని వధించి కొనిపోవుదు' నని తలచి విల్లు పైకెత్తెను.

బోధిసత్త్వుడు తమ్మునితో 'నాయనా, వీడు మనతల్లిని చంపునట్లున్నాడు. ఈమెరక్షణకై నా ప్రాణము లొడ్డెదను. నా యనంతరము నీవు తల్లిని పోషింపుము' అని కొమ్మలమాటునుండి యీవలకు వచ్చి, 'ఓయీ, నాతల్లిని సంహరింపవలదు. ఈమె గ్రుడ్డిది, ముసలిది, దుర్బలశరీర. నన్ను సంహరింపుము" అని వాని సమ్మతి బడసి, బాణమునకెదురుగా గూర్చుండెను. ఆక్రూరహృదయుడు బోధిసత్త్వుని బాణముతో గొట్టి, తల్లినిగూడ కొట్టుటకై విల్లెత్తెను. చిన్ననందియ అది చూచి 'వీడు నాతల్లిని చంపదలచినాడు. ఒకనాడయినను నాతల్లి జవింపగలిగినచో ధన్యజీవి నగుదును. నా ప్రాణముల నొడ్డెదను' అని కొమ్మలచాటునుండి యీవలకు వచ్చి, 'ఓయీ, నాతల్లిని కొట్టవలదు. నన్ను సంహరింపుము. మాసోదరు లిరువురను గొనిపోయి. మాతల్లికి ప్రాణదానము చేయుము' అని వానిసమ్మతి బడసి, బాణమున కెదురుగా గూరుచుండెను. నేటకాడతనిని వధించి 'ఇంటిలో బిడ్డలకు సరిపోవు' నని ముసలికోతినిగూడ సంహరించి, యింటివైపు చనుచుండెను.

ఆసమయమున నామహాపాపియింటిపై పిడుగు పడి, వానిభార్యయు ఇరువురుబిడ్డలును ఇంటితోపాటు దగ్ధమయిరి. సిట్టాడిస్తంభము మాత్రము నిలిచియుండెను.

వాడు గ్రామద్వారముకడకు చనునప్పటి కెవరో యెదురుపడి జరిగినవృత్తాంతము తెలిపిరి. వాడు దుఃఖాభిభూతు డై, మాంసపుసంచిని విడిచి యేడ్చుచు నింటికి జనెను. అప్పుడు స్తంభము విరిగి నెత్తిపై బడగా వానిశిరస్సు పగిలెను. భూమి బ్రద్దలయి, ఆవివరములనుండి అవీచిమహానరకజ్వాలలు వెలువడెను. వాడందులో దిగబడినపుడు ఆచార్యుని యుపదేశము జ్ఞప్తికి వచ్చెను పారాశర్యబ్రాహ్మణగురువాక్యములు స్మరించి వాడీగాథలు పలికెను.

పాపమును చేయబోకుము, ప్రతిఫలమ్ము
గాంతు వంచు పారాశర్యఘుని వాక్కు.

పాపకర్మము చేయుచో పాపఫలము
పుణ్యకర్మము చేయుచో పుణ్యఫలము.

పాండుచుండు చేసినదాని పూరుషుండు
ఉప్తబీజము బట్టియే యుండు ఫలము.

వా రీవిధముగా పలికి రోదనము చేయుచు భూవివరములో మునిగి పోయి, అవీచి మహానరకమునకు జేరెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున వేటకాడు దేవదత్తుడు; ఆచార్యుడు సారిపుత్రుడు; క్షుద్రనందియుడు ఆనందుడు; మాత మహాప్రజాపతి గౌతమి; మహానంది నేనే;

## 223 పుటభత్త జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక కుటుంబిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తి నగరనివాసి యగు ఒకగృహస్థుడు, జనపదనివాసి యగు గృహస్థునికగు ఇచ్చిపుచ్చుకొనువాడు. అతడు భార్యతోకూడ ఋణప్రదాత కడకు అరిగెను. ఆతడు 'ఏమియు ఇయ్యజాల' నని చెప్పియీయకుండెను. ఆతడు కోపించి భోజనము చేయక కదలిచనెను.

మార్గమున పోవువారు ఆతడు భుజింపలేదని గమనించి ఆహారపుమూటను ఇచ్చుచు, 'నీభార్యకుకూడ పెట్టి భుజింపుము' అని చెప్పిరి. అతడు దానిని గైకొని ఆమె కిచ్చు తలపులేక 'భద్రే, ఇది దొంగలు కొట్టుచోటు. కావున నీవు ముందుముందు నడచుచుండుము' అని తాను ఆహారమంతయు భుజించి ఖాళీమూట చూపి 'భద్రే, ఆహారములేని వట్టిమూట ఇచ్చినారు' అనెను.

ఆత డొక్కడే ఆహారమంతయు భుజించె నని గ్రహించి, ఆమె విచారపడ్డది.

వా రిరువురు జేతవనవిహారమునకు వెనుకభాగమునుండి నీరుత్రాగ బోవువారివలె లోనికి ప్రవేశించిరి. శాస్త వారిరాకకై ఎదురు చూచుచు మార్గము మలుపుతిరిగి ఎవరో వేటకాడు కూరుచుండునట్లు

గంధకుటీచ్ఛాయలో కూర్చుండియుండెను. వారుభయులు శాస్త్ర నుద్ధరించి ప్రణామము చేసి ఒకప్రక్క గూరుచుండిరి.

శాస్త్ర వారిని కుశలప్రశ్న మడిగి ఆమెతో భద్రే, నీభర్త నీమేలు కోరువాడేనా? నీయెడ ప్రీతి కలిగియుండునా?' అనెను.

భస్తే, నాకు ఈయనయెడ ప్రీతియున్నది. కాని ఈయనకు నాయెడ అనురక్తి లేదు' అని జరిగిన వృత్తాంతము తెలిపెను.

'ఉపాసికా, నీవు ఎల్లప్పుడు ఈతనియెడ అనురక్తురాలుగనే వున్నావు? ఈతడు మాత్రము స్నేహరహితుడు. కాని పండితులనోట నీ సద్గుణములను విన్నచో యీతడు నీ కైశ్వర్య మొసగును' అని. పూర్వజన్మవృత్తాంతము శాస్త్ర చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అమాత్యకులమున బుట్టి పెద్దవాడయి రాజున కర్థధర్మాను శాసకు డయ్యెను. కుమారుడు కుట్ర పన్నుచున్నా డన్నసంశయముచే రా జతనిని నగరమున కావలకు బంపెను. అతడు భార్యాసహితుడై నగరము వెలువడి, కాశీరాష్ట్రములో నొక కుగ్రామమున నివసింప జొచ్చెను కొంతకాలమునకు తండ్రిమరణవార్త విని కులక్రమాగత మైన సింహాసనమధిష్ఠించుటకై అతడు వారాణసికి మరలెను. మార్గ మధ్యమున భార్యకు పెట్టకుండ తానే భోజనము చేసెను. భర్తకఠోర హృదయు డని భార్య దుఃఖించెను.

అతడు సింహాసన మెక్కి భార్యను పట్టమహిషిని జేసి, ఈమె కిది చాలును అని మరియెట్టిగౌరవము చేయలేదు. కాలమెట్లు గడుపుచున్నా వని ఆమె నడుగనే లేదు. బోధిసత్త్వు డిది గ్రహించి "ఈమె రాజుకు మిక్కిలి ఉపకారము చేయుచున్నను, ప్రీతి కలిగియున్నను రాజు మాత్ర మీమె నించుకయు గౌరవింపకున్నాడు. ఈమెకు నేను సమ్మా నము చేయింతును" అని తలపోసి, ఆమెసన్నిధికి జని, ఆదరపూర్వక ముగా నొకప్రక్క నిలిచెను. ఏమి నాయనా. అని యామె యడుగగా బోధిసత్త్వుడు "దేవీ, మేము మీసేవ చేయుచున్నాము. వృద్ధులకు వస్త్రఖండము గాని, భోజనపిండము కాని ఈయగూడదా?" అనెను.

'నాయనా, నా కేమియు లభించుట లేదు. నీ కేమి ఈయగలను? ఇప్పుడు రాజుగారు నా కేమియు నిచ్చుట లేదు. అన్యవస్తువుమాట అటు లుంచుము. రాజ్యస్వీకరణార్థము వచ్చునప్పుడు ప్రభువు త్రోవలో నాకు భోజనము పెట్టక తానే భుజించెను' అని రాణి పలికెను. 'అమ్మా, రాజసముఖమున నిట్లు పలుకగలరా?' 'పలుకగలను, నాయనా!'' ''అట్లయిన ఈవేళ నేను రాజసమక్షములో నిలిచి అడిగినప్పుడు చెప్పవలెను. మీగుణములు నేడే ప్రకటింతును'' అని, బోధిసత్త్వుడు ముందుగా రాజసన్నిధికి జని నిలిచెను. ఆమెకూడ రాజు కడకు బోయి నిలుచుండెను.

'అమ్మా, మీరు కఠినహృదయులు. వృద్ధులకు వస్త్రఖండము గాని, భోజనపిండము గాని ఈయగూడదా?'

'నాయనా, రాజుగారివలన నా కేమియు లభించుట లేదు. నీ కేమి ఈయగలను?' 'తాము పట్టపుదేవి కారా?' 'నాయనా, ఆదర మేమియు లభింపనప్పుడు పట్టపుదేవి అయిన నేమి? నా కిప్పుడు మీరాజుగారు ఏమి యిత్తురు? త్రోవలో భోజనము నాకు పెట్టక తామే భుజించినారు.'

'మహారాజా, ఇంతియేనా?' యని బోధిసత్త్వు డనెను. రాజు నిజమే అనెను. బోధిసత్త్వుడు దేవితో నిట్లనెను. 'దేవీ, రాజుగారికి ఇష్టము లేనపుడు మీ రిచట నున్న నేమి లాభము? లోకములో అప్రియులతోడి సంసర్గము దుఃఖదాయకము. మీ రిచ్చట నుండుట వలన రాజుగారికి అప్రియసంసర్గమయి దుఃఖదాయక మగును. ప్రాణులు తమతో కలియువానితో కలియును, కలియని వారితో కలియవు అని గ్రహించి వేరొకతావునకు జనుట యుక్తము. ప్రపంచము మహావిశాలము.' ఇట్లు చెప్పి యీగాథలు పలికెను:

వినయవంతులయెడ వినయమ్ము, యోగ్య
జనులతో సంగతి, పనియున్నవాని
కార్యంబు నెరపుట కడు నవర్థంబు
తలపెట్టు జనుపని సలుపక యుంట.

వర్జి యింపదగువారి వర్జించుచుంట
కూటమి లేకుంట కుజనులతోడ

వై ముఖ్యముంజాఫువానితో మైత్రి
సలుపకుండుట మేలు : ఫలములు లేని
వృక్షముల్ విడనాడి విహగముల్ చేరు
అన్యవృక్షము : జగం బతివిశాలంబు.

ఇది విన్నతరువాత వారాణసీరాజు దేవికి సమస్తసంపదలను సమకూర్చెను. నాటినుండి వారు సంపూర్ణముగా కలిసి మెలిసి, ప్రసన్నచిత్తులై నివసించిరి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున భార్యాభర్తలం ఈభార్యాభర్తలే; పండితామాత్యుడు నేనే.

## 224 కుంభీల జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు దేవదత్తుని విషయమై చెప్పినది.

[మిగిలినకథ కుంభీలజాతకములో వానరింద జాతకములో [1–57] చెప్పబడినది. ]

ధర్మంబు, ధృతియును, త్యాగమ్ము, సత్య
మున్నయెడ వానరోత్తమా, నీకు
గలయట్లు లాతండు గెలుచు శత్రువుల.
త్యాగమ్ము. ధృతి, సత్య, ధర్మముల్ లేని
వాడు జయింపండు వైరిసంఘమును.

తక్కినవి పూర్వోక్త కుంభీలజాతకము (57) వలె నుండును. జాతకసమ్మేళనము అట్లే యుండును.

# 225 ఖంతివణ్ణన జాతకము

శాస్త జేతవనమున నుండగా కోసలనరేశుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆయనకు మిగుల నుపకారి యగు నమాత్యుడు అంతఃపుర ద్రోహము చేసెను. అతడు తన కుపకారి యని తలచి రాజు సహించి శాస్తకడకు జని విన్నవించెను. "మహారాజా, పూర్వరాజులుకూడ ఈవిధముగానే సహనము పూనిరి" అని, రాజు వేడిన పిదప శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా అమాత్యుడొకడు అంతఃపురదోషము చేసెను. అమాత్యుని సేవకుడు అమాత్యునిగృహము కలుషితము చేసినాడు. వానిదోషమును సహింపనేరక అమాత్యుడు వానిని రాజసన్నిధికి గొనిపోయి 'దేవా, మా యింట అన్నిపనులు చేయు సేవకుడు గృహము కలుషితము చేసినాడు. వాని కేమి శిక్ష?' అనుభావము నీగాథలో పలికెను.

సకల కార్యంబులు సమకూర్చువాడు
కలడు మా యింటిలో; కాని యాతండు
దేవ, దుష్కార్యంబు కావించినాడు
ఏ మాన తిచ్చెద రీ విషయాన.

అది విని రాజు ఈగాథ పలికెను :

ఇట్టివా డొకడు మా యింటను గలడు
అన్నిగుణాలున్న యట్టివా డతడు.

రాజు తననుగూర్చియే పలికె నని గ్రహించి, అమాత్యుడు నాటి నుండి అంతఃపురద్రోహము చేయ సాహసింపలేదు. అది తెలిసికొని సేవకుడుకూడ నాటినుండి దుష్కృత్యము చేయ సాహసింపలేదు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున నేను వారాణసీ నరేశుడను. ఆయమాత్యుడుకూడ శాస్త తనవిషయమై రాజు చెప్పెనని తెలిసికొని, నాటినుండి దుష్కార్యము మానుకొనెను.

## 226 కోసియ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసలనరేశుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

కోసలరాజు సరిహద్దుప్రదేశమును శాంతపరచుటకై ఉచితముకాని సమయమున బయలువెడలెను. ఈకథ 176 జాతకమువలె నుండును.

### అతీత కథ

పూర్వము వారాణసీరాజు అకాలమున బయలుదేరి ఉద్యానమున స్కంధావార మేర్పాటు చేసెను. ఆసమయమున గ్రుడ్లగూబ వెదురు పొదలో దూరి దాగెను. కాకిసేన వచ్చి, దానిని చుట్టుముట్టెను. సూర్యాస్తమయమునకై యెదురుచూడక అకాలములో ఉలూకము ఈవలకు వచ్చి పరుగువార జొచ్చెను. కాకులు దానిని పరివేష్టించి, ముక్కులతో పొడిచి చంపివేసినవి. రాజు బోధిసత్త్వుని బిలిచి, 'పండితోత్తమా, గ్రుడ్లగూబను కాకు లేల పొడిచిచంపివేసినవి?' అని యడిగెను. బోధిసత్త్వుడు 'మహారాజా, అకాలమున నిజనివాసమును విడిచినవారు ఇట్లే దుఃఖముపాలగుదురు' అను నభిప్రాయమును తెలుపు నీగాథలు పలికెను :

మంచి సమయంబునన్ నిష్క్రమించు టొప్పు
అసమయంబున లాభదాయకము కాదు
నిహతు జేయుదు రొక్కని బహుజనములు
గ్రుడ్లగూబను కాకులగుంపువోలె.

వివిధవిధము లెరింగిన వీరు దన్య
సరణి జనశత్రువుల వశపరచికొనుచు,
కౌశికమువోలె సౌఖ్యంబు గాంచుచుంద్రు.

రాజు బోధిసత్త్వునిమాట విని మరలెను.

శాస్త యీధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనం చుడు; పండితామాత్యుడు నేనే.

## 227 గూధపాణ జాతకము

శాస్త జేతవనమున నున్నప్పుడు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున జేతవనమునకు గవ్యూతి (అర్ధయోజన) దూరమున ఒకానొక నిగమగ్రామము కలదు. అచట శలాకాభోజనము విశేష ముగా లభించును. అచట పొట్టివాడొకడు వచ్చినవారిని ప్రశ్నించు చుండును. శలాకాభోజనమునకు పాక్షికభోజనమునకు వచ్చు చిన్న భిక్షువులను, శ్రమణులను 'ఎవరు భుజింతురు? ఎవరు త్రాగుదురు? ఎవరు భోజనము చేయుదురు?' అను నిట్టి ప్రశ్నలు వేయుచుండును. వారు ప్రత్యుత్తరము చెప్పలేక సిగ్గుపడి మరల ఆగ్రామమునకు పోవరు.

ఒకనాడు ఒకానొక భిక్షువు శలాకలు పంచి ఇచ్చుచోటికి బోయి 'భన్తే, ఫలాని గ్రామమున శలాకాభోజనము కాని, పాక్షికభోజనము కాని లభించునా?' అనెను.

'ఆయుష్మన్, లభించును. కాని అచట పొట్టివాడు ప్రశ్నలు కురి పించును. జవాబు చెప్పలేని పక్షములో వారి నతడు దూషించి దుష్ట శబ్దములుకూడ వాడును. అతని భయమువలన అచటి కెవరును పోరు.'

'భన్తే, నే నచట భోజనము చేయగలను. ఆ పొట్టివానిని వంచి నిర్విషనంతుని చేసి మనలను చూచినచో వాడు పారిపోవునట్లు

చేయుదును.'

భిక్షువులు మంచి దని అచటి భోజనమును ఆ భిక్షువునకు నిర్ణయించిరి.

ఆతడు ఆ గ్రామము చేరి చీవరములు ధరించెను. అతనిని జూచి పొట్టివాడు పొట్టేలువలె శీఘ్రముగా వచ్చిపడి 'శ్రమణా నా ప్రశ్నములకు సమాధాన మీయవలెను' అన్నాడు.

'ఉపాసకా, గ్రామములో భిక్షాటనము చేసి యవాగు కొనివచ్చి భోజనశాలకు మరలి రానిమ్ము' అని ఆభిక్షువు కొంతతడవునకు శాలకు మరలివచ్చెను. పొట్టివాడు ప్రశ్నలు వేయుదు ననెను. భిక్షువు యవాగు త్రాగనిమ్ము. ఆసన శాలకు పోవనిమ్ము, శలాకాభోజనము తీసికొనిరమ్ము' అని ఆహారము తెచ్చుకొనె పాత్ర పట్టుకొని 'రమ్ము, నీ ప్రశ్నలకు ప్రత్యుత్తర మిత్తును' అని పొట్టివానిని గ్రామము వెలుపలకు కొనిపోయి చీవరములను కట్టుకట్టి బుజముపై వేసుకొని పాత్ర పుచ్చుకొని నిలుచుండెను. పొట్టివాడు, "శ్రమణా నా ప్రశ్నలకు సమాధాన మిమ్ము" అనెను. శ్రమణుడు "నీ ప్రశ్నలకు ఇదిగో సమాధానము" అని ఒక్క దెబ్బతో క్రింద పడవేసి ఎముకలు విరుగగొట్టి ముఖముపై మురికి చల్లి "జాగ్రత్త, నేటినుండి ఈ గ్రామమునకు వచ్చు ఏ భిక్షువునైనను ప్రశ్నించితివా! నాకు వార్త చేరును" అని బెదరించి వెడలిపోయెను. ఆనాటినుండి పొట్టివాడు ఏ భిక్షువును చూచినను పారిపోవుచుండెను.

అనంతరము ఆ వృత్తాంతము ధర్మసభలో ప్రకటమయ్యెను. శాస్త 'భిక్షువులారా, యిప్పుడే కాదు, ఈ పొట్టివాడు పూర్వముకూడ ఇట్లే పరిభవము పొందినాడు, అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకధ

పూర్వము అంగ మగధ దేశవాసులు అన్యోన్యరాష్ట్రములలో ప్రవేశించుచు, ఒకనాడు రెండురాష్ట్రములకు సరిహద్దులో నున్న యొక తటాకముకడ జేరి, సురాపానము చేసి, మత్స్యమాంసములు తిని, ఉదయకాలమున బండ్లుకట్టుకొని వెడలిపోయిరి. వారు వెడలిపోయిన పిమ్మట మలభక్షణ చేయు కీటక మచ్చటికి వచ్చి, జనులు విడిచిపో

యున మద్యము నీర మనుకొని త్రాగి మత్తిల్లి,
కెక్కెను. కీటకము పైకి ప్రాకగా కుప్ప కొంచెము జారెను.
నాభారము వహింపలేకున్నది' అని కీటకము కేకవేసెను.

ఆసమయమునకు మత్తమాతంగ మచ్చటికి వచ్చి, పురుగుకంపు వలన జుగుప్స చెంది మరలెను. "నా భయమువలన ఏనుగు పరుగెత్తుచున్నది. దీనితో యుద్ధము చేయవలెను" అని తలచి కీటకము కేక వేసి ఈగాథ పలికెను :

ఉన్నయది నీకు శౌర్యమ్ము యుద్ధమందు
సాటి యగు శూరు లుండగా సమ్ముఖమున
పరుగిడెద వేల నాగమా, భయము చెంది.
రమ్ము, కొంచెము నీ నా పరాక్రమములం
జూచెదరుగాక మగధాంగ శూరజనులం.

హస్తి ఆలకించి దానివాక్కులు విని మరలి, దానిదగ్గరకు బోయి అసహ్యించుకొనుచు ఈగాథ పలికెను :

తుండదంతపాదమ్ములతోడ కాదు
నేను పరిమార్తు వేరొకదాన నిన్ను
దుష్టవస్తువు దుష్టవస్తువున మడియు.

ఇట్లు పలికి హస్తి దానిపై లద్దెవేసి, మూత్రోత్సర్జనము చేసి దానిని హతమార్చి, క్రౌంచనాదము చేసి, యరణ్యమునకు జనెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి, జాతకములం సరిపోల్చెను. ఆకాలమున మలభక్షణము చేయు కీటకము పొట్టివాడు; ఏనుగు ఆ భిక్షువు; ఆ విషయము ప్రత్యక్షముగా చూచి, వనఖండమున నున్న దేవత నేనే.

# 228 కామనీత జాతకము

శాస్త జేతవనమున విహరించువేళ కామనీత బ్రాహ్మణినిగూర్చి చెప్పినది

[ 12 భాగములో కామజాతకములో (467) వర్తమానకథయు, అతీతకథయును వచ్చును. ]

ఆరాజపుత్రు లిరువురిలో పెద్దవాడువచ్చి వారాణసికి రాజయ్యెను. కనిష్ఠుడుఎరా జయ్యెను. రాజుకు కామభోగములందును, ధనము నందునుతసివి తీరదాయెను.

ఆకాలమున బోధిసత్త్వుడు దేవరాజగు శక్రుడై యుండి జంబూద్వీపముపైపు చూచుచు రాజుస్థితి గ్రహించి అతనిని నిగ్రహించి సిగ్గు పాలుచేయుదు నని యెంచి, బ్రాహ్మణమాణవకరూపమున వచ్చి రాజుకు కనబడెను. 'బ్రహ్మచారీ, ఏల వచ్చితివి?' వని రాజనెను. 'మహారాజా, నేను మూడుపట్టణములను జూచినాను. అవి శాంతముగా, భద్రముగా, సుభిక్షముగా నున్నవి. అశ్వ హస్తి రథ పదాతులతో సువర్ణాలంకారములతో నిండియున్నవి. కొలదిసేనతో ఆనగరములను జయింపవచ్చును. ఆనగరత్రయమును జయించి నీ కిచ్చుటకై వచ్చినాను" అని మాణవకు డనెను.

'మాణవకా, ఎప్పుడు బయలు దేరుదము ?'

'ఉదయము మహారాజా '

'అట్లయిన నేడు పోయి, రే పుదయము రమ్ము.

"మంచిది మహారాజా, శీఘ్రముగా సైన్యము నాయత్తపరుపుము" అని మాణవకుడు నిజస్థానమునకు జనెను.

మరునాడు రాజు భేరి వేయించి సైన్యమును సిద్ధపరచి అమాత్యులను బిలిపించి 'నిన్న బ్రాహ్మణయువకుడు వచ్చి, ఉత్తరపాంచాల, ఇంద్రప్రస్థ, కేకయ రాజ్యనగరములను జయించియిత్తు నని చెప్పినాడు. ఆమాణవకుని వెంటగొని మూడునగరములను జయింతును. శీఘ్రముగా నతనిని బిలిపింపుడు" అని పలికెను.

"దేవా, అతనినివాసస్థాన మెచట నన్నారు?"

"ఎచట నని నే నడుగలేదు.'

"అతనికి భోజనమున కేమైన నిచ్చితివా?"

"అదియును ఈయలేదు."

"అతని నెక్కడ కనుగొందుము?"

"నగరవీధులలో జూడుడు."

వా రతని నన్వేషించి వచ్చి, కనబడలే దని విన్నవించిరి.

మాణవకుడు కనబడకపోవుటచే రాజు "ఇంతటి మహైశ్వర్యము కోలుపోతి" నని విచారింప జొచ్చెను. అతనిరక్తము డుకెక్కెను. గుండె వేడియెక్కెను. రక్తగ్రహణి పట్టుకొనెను. వైద్యులు చికిత్స చేయలేక పోయిరి.

నాలుగు రోజు లయిన తరువాత శక్రుడు యోచించి రాజుస్థితి గ్రహించి చికిత్స చేయనెంచి, బ్రాహ్మణరూపము ధరించి రాజద్వారముకడ నిలిచి "బ్రాహ్మణవైద్యుడు మీకు చికిత్స చేయవచ్చినా" డని లోనికి వార్త నంపెను.

"గొప్పగొప్ప వైద్యులు వ్యాధి కుదుర్పలేకపోయినారు. ఖర్చు లిచ్చి ఈయనను బంపివేయు" డని రాజు పలికెను.

"నాకు ఖర్చులతో, భోజనముతో పని లేదు. వైద్యలాభముకూడ పుచ్చుకొనను. వ్యాధి నయముచేయుదును. రాజు నన్ను జూచిన చాలును" అని శక్రుడు మరల వార్త నంపెను. రాజు విని "మంచిది. అటులయినచో రావచ్చు" నని అనుజ్ఞ యిచ్చెను.

శక్రుడు ప్రవేశించి జయ మని పలికి, ప్రక్కగా నిలుచుండెను. రాజు చూచి "నీవు నాకు చికిత్స చేయుదువా?" అనెను.

"అవును, దేవా." "అట్లయిన చికిత్స చేయుము." "మంచిది. మహారాజా, వ్యాధిలక్షణములు నాకు దెలుపుడు. ఏకారణముచే వ్యాధి పట్టుకొన్నది? భోజనాదికమువలననా? ఏదయిన చూచుట, వినుట వలననా?" "నాయనా, వినుటవలన" "ఏమి వింటివి?" "నాయనా, బ్రహ్మచారి వచ్చి, మూడురాజ్యములు జయించి నీ కిత్తు నని చెప్పిపోయినాడు. నే నతనినివాసముసంగతి, భోజనముసంగతి అడుగలేదు. నాపై గోపము వచ్చి అతడు వేరొకరాజుకడకు జని యుండును. మహైశ్వర్యము కోలుపోయితి నని విచారించుటచే ఈ వ్యాధి అంకురించినది. కోర్కెవలన కలిగిన రోగము నీ చేతనయి

నచో నయముచేయుము" అను నభిప్రాయము వెలిబుచ్చు నీగాథ రాజు పలికినాడు .

శ్లో॥ కేకయ పాంచాల కురువుల పయి
త్రిపురములం రాజధాను లీదేశములకు
కలదు వేరొక పేరాస: కామ్యరోగి
నైన నాకు చికిత్స చేయంగ వలయు.

అప్పుడు శక్రుడు "మహారాజా, జడము లయిన యౌషధములవలన నీకు చికిత్స కానేరదు. జ్ఞానౌషధముచే కాగలదు" అని యీగాథ పలికెను :

కృష్ణసర్పదష్టులకు చికిత్స, భూత
బాధకు చికిత్స చేసెడివారు కలరు
అధిక కామితరోగార్తు డైనవాని
వ్యథ కుదుర్పగ జాల రెవ్వరునగూడ;
వ్యక్తకుశలధర్మునకు వైద్యమ్ము లేదు.

మహాసత్త్వు డీవిధముగా రాజుకు బోధచేసెను. "మహారాజా, నీ కామూడు నగరములు లభించినచో, నాలుగురాజ్యములు నేలుచు, ఒక్కసారిగా నాలుగువస్త్రములు కట్టుకొందువా? నాలుగు బంగరు పళ్ళెములలో నొక్కసారిగా భోజనము చేయగలవా? పోనీ, ఒక్కమారుగా నాలుగుశయ్యలపై బరుండగలవా? తృష్ణకు వశము కాగూడదు. ఇది విపత్తికి మూలము. వృద్ధియయిన కొలదిని తృష్ణ మానవుని అష్టమహానిరయములలోను, షోడశ – ఉపనిరయములలోను, నానావిధ అపాయములలోను పడవేయును."

మహాసత్త్వు డిట్లు నిరయభీతితో రాజును బెదరించి, ధర్మోపదేశము చేసెను. విని, రాజు శోకరహితు డయ్యెను. అతని వ్యాధి వెంటనే నివర్తించెను. శక్రు డతని కుపదేశ మిచ్చి శీలములందు ప్రతిష్ఠించి, దేవలోకమున కేగెను. నాటినుండి రాజు దానాదిపుణ్యకార్యములు చేయుచు తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజు కామనీత బ్రాహ్మణుడు, శక్రుడు నేనే.

## 229 పలాసీ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పరువెత్తు పరివ్రాజకుని విషయమై చెప్పినది.

### వర్తమాన కధ

ఆతడు శాస్త్రార్థము చేయు వాంఛతో జంబూద్వీప మంతయు పర్యటనము చేసెను. శాస్త్రార్థము చేయువాడు తనకు లభింపలేదు. పర్యటించుచు, ఆతడు శ్రావస్తి చేరెను. లోకులను చూచి "నాతో శాస్త్రార్థము చేయువా రెవరైనను కలరా?" అనెను. వారిల్లు బుద్ధుని గుణములను ప్రశంసించిరి. 'నీవంటివారు వేయినుంది యైనను ఆయనతో శాస్త్రార్థము చేయనేరరు. ఆయన సర్వజ్ఞుడు. పురుషులయందు ఉత్తముడు, ధర్మప్రభువు, అన్యవాదములను ఖండింపగల మహాప్రభువు. సమస్తజంబూద్వీపమున ఉత్పన్న మైన విరోధిమతము లన్నియు భగవానుని జయింపనేరవు. సర్వమతములవారును ఆయనపాదముల చేరినంతనే తరంగములు తీరమున విరిగినట్లు విచ్ఛిన్నమై పోవుదురు."

'ఈ సమయమున వా రెచట నున్నారు?' అని పరివ్రాజకు డడిగెను.

'జేతవనమున.'

'నేడు ఆయనతో శాస్త్రార్థము చేయుదును' అని అతడు తలపోసి జనులవెంట చని, నవకోటినాణెములు వెచ్చించి జేతకుమారుడు నిర్మించిన జేతవనద్వారము వీక్షించెను. 'ఇది శ్రమణగౌతముడు నివసించు ప్రాసాదమా?' యని ప్రశ్నించెను.

'ఇది వెలుపలి' ద్వారము (ధర్షోష్ఠీ)

'ఇది 'బహిర్ద్వారము అగుచో నివాసస్థాన మెచట?'

"ఇట్టి శ్రమణునితో నే నేమి శాస్త్రార్థము చేయగలను" అని తలపోసి ఆతడు పలాయనము చేసెను.

కోలాహలముచేయుచు కొందరు జేతవనమున ప్రవేశించిరి.

'అకాలమున వచ్చితి రేమి?' అని శాస్త అడుగగా వారు అతని వృత్తాంతము దెలిపిరి.

'ఉపాసకులారా, ఈతడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ నానివాస ముఖద్వారముచూచి పలాయనము చేసినాడు' అని వారిప్రార్థనపై పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము గంధారరాష్ట్రమున తక్షశిలానగరమున బోధిసత్త్వుడు రాజ్యము చేయుచుండెను. వారాణసిలో బ్రహ్మదత్తుడు పరిపాలన చేయుచుండెను. తక్షశిలను పట్టుకొందునని బ్రహ్మదత్తుడు మహాసైన్యముతో జని, నగరమున కనతిదూరమున విడిసి "ఈవిధముగా ఏనుగులను, ఈరీతిగా అశ్వములను, ఈప్రకారముగా రథములను, ఈతీరున పదాతులను పంపుడు. ఇట్లు పరుగిడి శస్త్రములతో శత్రువులను ప్రహరింపుడు. మేఘములు ఘనవర్షము కురిసినట్లు, శరవర్షము వర్షింపుడు" అని సైన్యమున కానతిచ్చుచు ఈ గాథలు పలికెను.

హస్తిమేఘాలతో, అశ్వపంక్తులతోడ,
అరదంపుతరగలన్, శరపుంఖవర్షాన,
కరవాలధారివర్గముతోడ వేగమే
నలుదెసలలో తక్షశిల ముట్టడింపుండు

నానాధ్వనులతోడ నాగబృంహితముతో—
ఉరుము మేఘమునుండి మెరుపుతీగవిధాన—
తుములభారముతోడ దుమికి పైకొనవలయు.

ఇట్లు గర్జించి ఆరాజు సైనికుల కానతిచ్చి, నగరద్వారము సమీపమున కరిగి, ద్వారకోష్ఠము చూచి "ఇది రాజనివాసమా?" అని యడిగి, నగరద్వారకోష్ఠక మని తెలిసికొని, "ఇదియే యిట్లుండగా రాజనివాస మింక నెట్లుండునో" యని యడుగగా అచ్చటివారు వైజయంతప్రాసాదమువలె నుండు నని చెప్పిరి. ఇంతటి యైశ్వర్యసంపన్నుడైన రాజుతో యుద్ధము చేయజాల నని ద్వారకోష్ఠముకడనుండియే

మరలిపోయి వారాణసి చేరుకొనెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము లు పరిపోల్చెను. ఆకాలమున వారాణసి నరేశుడు పరువెత్తు పరివ్రాజకుడు; తక్షశిలా ప్రభువు నేనే

## 230 దుతియపలాయి జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పరువెత్తు పరివ్రాజకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథలో ఆపరివ్రాజకుడు జేతవనము ప్రవేశించినాడు. ఆసమయమున జనులు పరివేష్టించియుండగా, మనశ్శిలాతలముపై గర్జసేయు సింహ పోతమువలె అలంకృతధర్మాసనముపై ఉపవిష్టుడై శాస్త ధర్మోపదే శము చేయుచుండెను. బ్రహ్మతేజస్సు కలిగి, చంద్రశోభ కలిగిన ముఖ మును, స్వర్ణపట్టమువంటి లలాటము కేల దశబలధారిని చూచి ఆపరి వ్రాజకుడు "ఇట్టి ఆకారప్రకారము గల ఉత్తమపురుషుని ఎవరు జయింపగలడు?" అని తలపోసి రెండవగుంపులోదూరి పలాయనము చేసెను. జనులు ఆతని వెంట పడి, ఆపి, వృత్తాంతము శాస్తకు నివేదిం చిరి.

"భిక్షువులారా! ఈపరివ్రాజకు డిప్పుడే కాదు పూర్వముకూడ నాస్వర్ణవర్ణవదనమును గాంచి పలాయనము చేసినాడు" అని పూర్వ జన్మవృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము బోధిసత్త్వుడు వారాణసిలో రాజ్యము చేయుచుండ, ఒకానొక గంధారరాజు తక్షశిలను పాలించుచుండెను. వారాణసిని పట్టుకొందు నని గంధారరాజు చతురంగబలముతో వచ్చి నగరమును

పరివేష్టించి, ద్వారముకడ నిలిచి తనసేనను జూచుచు "ఇంతటిసైన్యము నెవరు జయింపగలరు?" అని నిజసేనను వర్ణించుచు, ఈగాథ పలికెను:

> నే నజేయుండను నేడు : పతాక
> లంతు లేనివి, సేన అపరిమేయంబు.
> కాకులు దరియింపగలవె సాగరము?
> పర్వతమ్మును గాలి పడగొట్టగలదే?

పూర్ణచంద్రసదృశ మైన తనముఖము కనబరచుచు బోధిసత్త్వుడాతనితో "మూర్ఖుడా, ప్రతాపములు వలదు. మత్తవారణము నాళవనమును నాశము చేయునట్లు నీబలము నాశము చేయుదును" అని బెదరించి ఈగాథ పలికెను :

> అజ్ఞానవశమున ఆర్భాట మేల?
> ఎదిరి లేదనుకొని ఎగిరెద వేల?
> ఎదు రైతివో యి, నీ వేకాకిహస్తి
> కది నిసుం శరమండ మట్లు మర్దింతు.

ఇట్లు తర్జన చేసిన యాతనివాక్కులు విని గంధారరాజు కాంచనపట్టసంకాశ మగు మహాలలాటమును చూచి, పట్టుపడుదు నని భయపడి, వెనుదిరిగి పలాయనము చేసి, నిజనగరము చేరుకొనెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున గంధారరాజు పలాయనశీలు డగు పరివ్రాజకుడు; వారాణసిరాజు; నేనే.

# 231 ఉపాహన జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా దేవదత్తునివిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ధర్మసంఘమున భిక్షువులు సంభాషించుచుండిరి. "ఆయుష్మంతు లారా! దేవదత్తుడు ఆచార్యుని విడనాడి తథాగతునకు విరోధి యయి, వినాశము చెందినాడు." వా రిట్లనుచుండగ శాస్త అచటికి కరుగు దెంచి సంగతి తెలిసికొని "భిక్షువులారా, దేవదత్తుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఆచార్యుని విడనాడి నాకు విరోధి యయి మహావినా శము పొందినాడు" అని, పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండ, బోధిసత్త్వుడు గజాచార్యకులమున బుట్టి, పెద్దవాడయి, గజ శాస్త్రపారంగతు డయ్యెను కాశీరాష్ట్రములోని యొక కుగ్రామము నుండి మాణవకుడు వచ్చి ఈతనివద్ద హస్తివిద్య అభ్యసించెను. విద్య నేర్పునపుడు బోధిసత్త్వుడు ఆచార్యముష్టిని (విద్యామర్మమును) నిలుపు కొనక, నిరవశేషముగా తనకు తెలిసిన దంతయు నేర్పెను. విద్య యంతయు గ్రహించిన పిదప మాణవకుడు "ఆచార్యా, నేను రాజు కొలువులో చేరుదును" అనెను. మంచిది నాయనా, అని బోధిసత్త్వుడు రాజుతో 'నాశిష్యుడు తమకొలువులో జేరగోరుచున్నాడు' అని విన్న వించెను.

'మంచిది, చేరవచ్చును.' 'అయినచో అతనికి వేతన మెంత? దయ చేయుదురు?' 'మీశిష్యుడు మీకు సమానుడు కాజాలడు. మీకు వంద ముట్టినచో అతనికి ఏబది, మీకు రెండువందలు ముట్టినచో అత నికి వంద.'

అత డింటికి బోయి జరిగినది అంతేవాసికి దెలిపెను. "ఆచార్యా, మీతో సమానముగా విద్య నేర్చినాను. మీ కిచ్చునంత వేతనము నా కిచ్చుచో రాజసేవలో నుందును. అట్లు కానిచో ఉండజాలను"

అని మాణవకుడు పలికెను.

బోధిసత్త్వుడు రాజు కీసంగతి చెప్పెను.

"మీతో సమానముగా అతడు విద్య నేర్చినచో, మీవలె విద్యను ప్రదర్శించినచో మీ వేతనముతో సమానమైన వేతనము అతనికి లభించును" అని రాజు పలికెను. బోధిసత్త్వు డాసంగతి వానికి తెలుపగా వా డంగీకరించినతోడనే రాజుకు విన్నవించెను. 'రేపు విద్యాప్రదర్శనము' అని రాజుపలుక, "చిత్తము. రేపు ప్రదర్శింతము. నగరమున చాటింపబంపుడు" అని శిష్యుడు విన్నవించెను. "రేపు ఆచార్యుడు, శిష్యుడు విద్యాప్రదర్శనము చేయుదురు. చూడగోరు వారు ప్రాసాదాంగణమున సమావేశము కావచ్చును" అని రాజు నగరమున భేరీ వేయించెను.

'నాశిష్యు డుపాయకుశలుడు కా' డని యెంచి ఆచార్యుడు ఒక గజమునకు రాత్రివేళ విలోమశిక్ష యిచ్చెను నడువుము అన్నప్పుడు వెనుకకుబోవుట, వెనుకకుబొమ్ము అన్నప్పుడు ముందరికి బోవుట, ఆగుము అన్నప్పుడు పండుకొనుట, పండుకొమ్ము అన్నప్పుడు నిలుచుట, పట్టుకో అన్నప్పుడు (వస్తువును) ఉంచుట, ఉంచుము అనగా పట్టుకొనుట—ఈప్రకారముగా నేర్పి, మరునా డాచార్యు డాయేనుగు నెక్కి రాజసభకు వచ్చెను. మాణవకుడుగూడ సుందరహస్తిపై నెక్కివచ్చెను. మహాజనము సమావేశ మయ్యెను. ఉభయుల విద్యాప్రదర్శనము సమానముగా నుండెను. ఆచార్యుడు హస్తిని విలోమ మార్గమున నడిపెను. పొమ్ము అన్నప్పు డది వెనుకకు జరిగెను వెనుకకు అనగా ముందరికి, పట్టుకొమ్ము అనగా ఊరకుండి, ఊరకుండు మనగా పట్టుకొని, ఇట్లు తలక్రిందులుగా విద్యా వినోదములు చూపెను. అప్పుడు మహాజనము శిష్యునితో 'దుష్టమాణవకా, నీవు ఆచార్యునితో తగవుపెట్టుకొన్నావా?' నిజసామర్థ్య మెరుగక ఆచార్యు నియంత వాడ ననుకొంటివి' అని మట్టిపెళ్ళలు కఱ్ఱలు విసిరివేసి వాని నచ్చటనే చంపి పారవేసిరి.

బోధిసత్త్వు డేనుగు దిగి రాజసన్నిధికి బోయి 'మహారాజా, విద్యానైపుణివలన నిజసుఖము కలుగును, కాని కొందర కొందరకు వినాశహేతువై వ్యథ గలిగించును' అని ఈగాథ పలికెను:

సుఖముకొరకు కొన్న జోడు వేడెక్కుచు
కాలిక్రింద నలిగి కరచినట్లు
నీచవంశజాతు డాచార్యకడ నేర్చు
చదువు వెలుగు వలన సమసిపోవు

అధమకులజు డైన ఆర్యేతరుని దుష్ట
పాదరక్షక్రింద పరిగణింత్రు.

రాజు సంతుష్టచిత్తు డై బోధిసత్త్వుని ఘనముగా గారవించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము సరిపోల్చెను. ఆకాలమున శిష్యుడు దేవదత్తుడు; ఆచార్యుడు నేనే.

## 232 వీణాథూణ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక కుమారిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆమె శ్రావస్తిలో ఒకానొక శ్రేష్ఠికూతురు. తమఇంట వృషభరాజమునకు సత్కారము జరుగుట చూచి ౹దాదితో, అమ్మా ఇట్లు పూజజరుగుటకు ఈవృషభ మెట్టిది?" అనెను.

"బిడ్డా, ఇది వృషభరాజము."

ఒకనా డాకుమారి ప్రాసాదముపై నిలుచుండి గల్లీ వెంట పోవు గూనివానిని చూచి ఎద్దులలో పెద్ద వానికి వీపున మూపుర ముండును. మానవులలో పెద్దవారల వీపుపై కూడ మూపుర ముండవలెను. ఈతడు మానవులయందు ఉత్తముడు కానోపును. నేను ఈతనికి చరణదాసిని కావలయును" అని తలపోసి దాసిని పిలిచి "శ్రేష్ఠికొమార్తె నీవెంట రా గోరుచున్నది. నీవు ఫలానిప్రదేశమునకు జని వేచియుండుము?'' అని వార్త పంపెను. అనంతర మామె విలువ గల వస్తువులు సమకూర్చుకొని, వేషము మార్చి మేడ దిగి ఆతనివెంట పలాయనము చేసెను.

అటు తరువాత ఆవృత్తాంతము నగరమునను భిక్షుసంఘమునను వ్యాపించెను. ధర్మసభలో సంభాషణ జరుగుచుండగ శాస్త అరుగు దెంచి సంగతి తెలిసికొని "భిక్షువులారా, ఆమె ఇప్పుడే కాదు, పూర్వముకూడ గూనివానినే కోరినది" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు నిగమగ్రామములో శ్రేష్ఠికులమున బుట్టి, పెద్దవాడయి, గృహస్థధర్మము స్వీకరించి, కూతురు కొడుకులతో వర్ధిల్లుచు, తన కుమారునకై వారాణసీశ్రేష్ఠిపుత్రికను మాటాడి, తిథి నిర్ణయించినాడు. తనయింట వృషోత్సర్జనము జరుగుచుండుట చూచి శ్రేష్ఠి కూతురు దాదితో "ఏమిది?" యనెను వృషభ మని ధాత్రి చెప్పెను. కుమారి వీధివెంట బోవుచున్న గూనివానిని జూచి ఇతడు పురుషర్షభుడయియుండు నని తలచి విలువగల వస్తువులు తీసికొని వానివెంట పలాయనము చేసెను.

శ్రేష్ఠికుమార్తెను తనయింటికి గొనివచ్చు తలంపుతో బోధిసత్త్వుడు భూరిపరివారముతో ఆమార్గముననే పోవుచుండెను. వా రుభయులు రేయి యంతయు త్రోవన ప్రయాణము చేయుచుండిరి. గూనివానికి రాత్రివేళ చలిగాలి తగులుటవలన అరుణోదయవేళ శరీరమున వాతము ప్రకోపించి, విశేషముగా వేదన కలిగెను. బాధవలన వాడు త్రోవలోనే ఆగి, వీణాదండమువలె మెలితిరిగి పడియుండెను. శ్రేష్ఠికూతురు వాని పాదములకడ కూర్చుండెను.

బోధిసత్త్వు డామెను చూచి గురుతించి, దగ్గరకు బోయి, సల్లాపము చేయువాడై యీగాథ పలికెను.

ఈ తలపు నీకె కల్గెఁ: దితడు బండ!
పరుల తోడ్పాటు లేనిది జరుగ లేడు
వామనుం డైన యీగూనివానితోడ
అరుగదలచుట యెంతయు ననుచితమ్ము.

ఆమనవాక్కులు విని, శ్రేష్ఠికూతు రీగాథ పలికెను:

పురుషపుంగవ మని యెంచి బుద్ధిలేక
గూనివానిని కామించినాను, కాని
అన్నితంత్రులు తెగిపోయి నట్టి వీణ
పోలికం బడియున్నాడు నేలమీద.

కన్య అజ్ఞానముచే ఇలు వెడలినసంగతి తెలిసికొని, స్నానము చెయించి, అలంకారము చేయించి, రథ మెక్కించి యింటికి గొని పోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున ఈమెయే ఆశ్రేష్ఠికూతురు; నేనే వారాణసిశ్రేష్ఠిని

## 233 వికణ్ణక జాతకము

శాస్త జేతవనమున విహారముచేయుచు ఒకానొక ఉత్కంఠితభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతనిని ధర్మసభకు కొనివచ్చిరి. శాస్త అతనితో 'భిక్షూ! నిజముగా నీవు ఉత్కంఠితు డయితివా.'

ఆత డవునని పలికిన పిదప శాస్త 'ఎందుచేత?' అనెను.

'కాముకతచేత.'

'భిక్షూ, కాముకత్వము చుఱుకైన శల్యమువంటిది. ఒకసారి హృదయమున తగిలెనేని బాణము గ్రుచ్చుకొన్న మొసలి గతిపట్టును' అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము బోధిసత్త్వుడు వారాణసిలో ధర్మపాలనము చేయుచు, ఒకనాడు ఉద్యానములో పుష్కరిణీతీరమునకు బోయినాడు. నృత్యగీతాదికమున కుశలు లగువారు నృత్యగీతములు సాగించిరి. పుష్కరిణిలోని మత్స్యకచ్ఛపాదులు గీతానాదలోలములై గుమిగూడి రాజు సమీపమునకు వచ్చినవి. తాళప్రమాణమున ఏకీభూతము లైన మత్స్యములను జూచి అమాత్యులతో 'ఈచేపలు నాసమీపాన తిరుగుచున్న వేల?' అనెను. 'దేవరవారిసేవార్థము' అని సంతుష్టచిత్తుడై అనుదినము వానికి భోజన మేర్పాటు చేసెను. పాచకులు ప్రతిదినము పదునొకండు ద్రోణముల బియ్యము వండుచుండిరి. భోజనసమయమునకు కొన్ని చేపలు వచ్చుచు, కొన్ని చేపలు రాకుండెను. అన్నము నష్ట మగుచుండెను. ఈవిషయము రాజుకు దెలిసెను. నేటినుండి భోజనవేళ భేరీ వాయించి, మత్స్యములు సమావేశమయినపుడు అన్నము వేయవలెను' అని రాజు చెప్పెను. నాటినుండి వంటవాండ్రు భేరి మ్రోగించి, సమకూడిన చేపలకు అన్నము వేయుచుండిరి. శబ్దము విని అవి గుమిగూడి అన్నము తినుచుండగా, మొసలి యొకటి వచ్చి చేపలను తినుచుండెను. వాచకులు రాజు కీవిషయము తెలిపిరి. అది విని రాజు 'మొసలి వచ్చి చేపలను తినునప్పుడు బాణముతో గొట్టి దానిని పట్టుకొనుడు' అనెను. చిత్తమని వారుపోయి నావలో నిలుచుండి, వచ్చిన మొసలిని బాణముతో గొట్టిరి. బాణము వీపులోనికి దిగబడగా బాధచే మకరము నీటిలోనికి బసుగెత్తెను. బాణము దిగబడినట్లు తెలిసికొని పాచకులు దానిని సంబోధించి ఈగాథ పలికిరి:

> బుద్ధి పుట్టిన యట్లు పోవచ్చు నీవు
> వెరకున గాలమ్ము తిరిగిపోయినది,
> స్వాదిష్టభుక్తి లోభాన మత్స్యాల
> వెన్నాడి, ప్రాణముల్ విడువనున్నావు.

శాస్త అభిసంబుద్ధు డయినపిమ్మట ఈవిషయమునుగూర్చి ఈగాథ పలికెను.

మిగుల లౌకికలాభాలమీఁది ప్రీతి
పరుగువారచు నిద్రింప పరవశు డగు
నతను జ్ఞాతి మిత్రుల మధ్య సంతరించు
మత్స్యముల వెంటఁబంటిన మకరమట్లు

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము బ్రసంపోల్చెను. ఆకాలమున వారాణసిప్రభువు నేనే

## 234 అసితాభు జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు ఒకానొక కుమారుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తినగరమున ఇరువురు ప్రధానశిష్యులకు పరిచర్య సేయుచున్న ఒకానొక కుటుంబములో కుమారి కలదు. ఆమె సౌందర్యవతి, సౌభాగ్యశాలిని. ఆమె పెద్దదయినపిదప తనకు సమానమైన గౌరవ ప్రతిపత్తులు గల కుటుంబమునకు పోయెను. ఆమెభర్త ఆమెను ఏమాత్రము గ్రహింపక అన్యప్రదేశమున మనస్సు నిలిపెను. ఆమె అతని అనాదరమును లక్ష్యము సేయక ఆశ్రావకుల నిరువురను ఆహ్వానించి మహాదాన మిచ్చి, ధర్మోపదేశములు వినుచు, శ్రోతాపత్తిఫలము పొందెను. నాటినుండి ఆమె మార్గసుఖము, ఫలసుఖము ననుభవించుచు తనలో 'స్వామికి నే నక్కరలేదు. గృహస్థజీవనమువలన లాభము లేదు, నేను ప్రవ్రజించెదను' అని తలపోసి తల్లిదండ్రులతో ప్రవ్రజించి, అర్హత్త్వము పొందెను. ఆమె చేసినపని భిక్షువులకు తెలిసెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో గూరుచుండి ఈవిషయము ప్రసంగించుచుండగా శాస్త్ర అరుగుదెంచి సంగతి తెలిసికొనెను. "భిక్షువులారా, ఆమె ఇప్పుడే కాదు, పూర్వముకూడ సదర్థము నన్వేషించునదియే' అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది హిమవత్ప్రదేశమున నివాసము చేయుచుండెను. వారాణసీరాజు తనపుత్రుడు బ్రహ్మదత్తకుమారుని వెంట విశేషపరివార ముండుటచే శంకించి, అతనిని రాష్ట్రము వెలుపలికి బంపివేసెను. అతడు అసితాభు అను భార్యను వెంటబెట్టుకొని హిమవంతమునకు జేరి మత్స్యమాంసఫలాదులు తినుచు, పర్ణశాలలో నివసించుచుండెను. కిన్నరస్త్రీని జూచి యతడు ప్రతిబద్ధచిత్తుడై దీనిని భార్యగా స్వీకరింతు నని తలచి, అసితాభును పరిగణింపక దాని ననుసరించెను. "ఇతడు నన్ను నిర్లక్ష్యము చేసి, కిన్నరివెంట దిరుగుచున్నాడు. ఇతనితో నేల' అని విరక్తి చెంది, అసితాభు బోధిసత్త్వుని సన్నిధిని బోయి నమస్కరించి, తన 'కసిణ' మడిగి. భావన చేసి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, బోధిసత్త్వునకు ప్రణామము చేసి వచ్చి తనపర్ణశాలాద్వారమున కూరుచుండెను. బ్రహ్మదత్తకుమారుడు కిన్నరి ననుసరించి తిరుగుచు, తుదకది చనినత్రోవకూడ కనుగొనలేక, హతాశుడై పర్ణశాలాద్వారమువైపు చనెను. వచ్చుచున్న యతనిని జూచి అసితాభు ఉప్పరమున కెగసి, మణివర్ణితమైన నగరితలమున నిలిచి 'ఆర్యపుత్రా, మీమూలమున నాకీధ్యానసుఖము లభించినది' అని ఈగాథ పలికెను

నీయెడ నా కుండు నిబిడానురక్తి
వదలించివేసినవాడవు నీవె,
చేతింపమున కోసిన యేన్గుదంత
మాపల నేరీతి నదుకును మరల ?

ఇట్లు పలికి అతడు చూచుచుండగనే ఆమె గగనమార్గమున వేరొక చోటికి జనెను. ఆమె పోవగనే అతడు దుఃఖముతో ఈగాథ పలికెను :

ఎల్లతావులయందు నిచ్చమూలమున,
లోభమదమ్మున, లాభమ్ము పోవు
అసితాభు నన్విడనాడినయట్లు

అరణ్యమున నతడు విచారముతో ఏకాకిగా నివసించుచు, తండ్రి మరణించిన పిమ్మట, పోయి సింహాసన మెక్కెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము నిట్లు సరిపోల్చెను. ఆసమయమున రాజపుత్రుడు రాజకన్య వీ రిరువురే; తపస్వి నేనే.

## 235 వచ్ఛనఖ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు రోజమల్లుని గూర్చి చెప్పినది

### వర్తమాన కథ

ఆనందుడు గృహస్థాశ్రమమున నుండగా ఆతడు మిత్రుడు. ఒకనా డతడు స్థవిరుని కొనివచ్చుటకు ఆహ్వానము పంపెను. స్థవిరుడు శాస్త ఆనతి పొంది చనెను. ఆతడు స్థవిరునకు వివిధరసములు కల పెద్దవిందు చేసి, ఒకప్రక్కన కూర్చుండి, కుశలసమాచార మడుగుచు స్థవిరునకు గృహస్థభోగములను, పంచవిషయములనుగూర్చి తెలిపెను. "భన్తే, ఆనంద, నాకు స్థిరచరాస్తులు మెండుగా నున్నవి. వీనిని సమముగా విభజించి మీకు సగము నిత్తును. దయచేయుడు. మన మిరువురము మాయింట నుందము స్థవిరుడు కామభోగముల దుష్పరిణామముగూర్చి దెలిపి పీఠమునుండి లేచి విహారమునకు జనెను.

"ఆనందా, నీవు రోజమల్లుని చూచితివా" అని శాస్త అడిగెను.

"చిత్తము, భన్తే!"

"ఆత డే మనెను?"

"నన్ను గృహస్థు కమ్మని కోరినాడు. నేను గృహస్థజీవనములోని లోపములను చూచితిని."

"ఆనందా, రోజమల్లు ఇప్పుడే కాదు, పూర్వముకూడ ప్రవ్రజితులను గృహస్థులు కండు అని ఆహ్వానించినాడు" అని, శాస్త అతని కోరిపై పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఒకానొక నిగమగ్రామములో బ్రాహ్మణకుటుంబమున బుట్టి, పెద్దవాడయి, ప్రవ్రజించి, హిమాలయమున నివసించుచుండెను. అచ్చట బహుకాలమునుండి, ఉప్పుపులుసుకొరకు వారాణసికి వచ్చి, రాజోద్యానమున విడిసి, మరునాడు వారాణసిలోనికి బోయెను. వారాణసిశ్రేష్ఠి ఆయనపై ఖరికి సంతుష్టుడై, యింటికి గొనిపోయి, భోజనముపెట్టి, అంగీకారము పొంది ఉద్యానములో నిలిపెను. వారి కన్యోన్యము మైత్రి యుత్పన్న మయ్యెను. ఒకనాడు శ్రేష్ఠి బోధిసత్త్వునియెడ ప్రీతివిశ్వాసములు కలుగుటచే నిట్లు చింతించెను 'ప్రవ్రజ్య కష్టదాయకము. నా మిత్రమయిన వజ్రనఖ పరివ్రాజకుని గృహస్థును జేసి, సమస్తధనము నుభయులము సమముగా పంచికొందుము. ఇరువురము కలిసి యుందుము' ఇట్లు తలచి యొకనాడు శ్రేష్ఠి భోజనానంతరము బోధిసత్త్వునితో మధురముగామాటలాడుచు 'భదన్తా వజ్రనఖా, ప్రవ్రజితుడై యుండుట కష్టము. గృహస్థుగా నున్నచో సుఖము. రండు, ఉభయులమును సుఖము లనుభవించుచుందము' అని యీగాథ పలికెను.

సప్తరత్నాలతో సద్వాఖాద్యాలతో
పరిపూర్ణమైన మందిరము సౌఖ్యప్రదము;
భక్ష్యముల్ భుజియించి పానీయములు త్రాగి
నిద్రింపగా వచ్చు నిశ్చింతగా నచట

ఆయనవాక్కులు విని బోధిసత్త్వుడు 'శ్రేష్ఠి, నీవు అజ్ఞానవశమున కామభోగములయెడ నాసక్తి కలవాడ వయి, గృహస్థుని గుణములను పరివ్రాజకుని యవగుణములను చెప్పినావు. నేను చెప్పెదను వినుము. గృహస్థుని దోషములను జూపెదను' అని యీగాథ పలికెను.

ఆడవలయు నసత్యము, లన్యజనుల
మోసగింపగ వలయును, మోదవలయు
ఇలు నడుపనెంచు పక్షాన : ఎవడు కోరు
ఛిద్రకష్టభూయిష్ట మా జీవితంబు?

ఈప్రకారముగా బోధిసత్త్వుడు గృహస్థునిలోపములను దెలిపి, ఉద్యానమునకు వెడలిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములం సరిపోల్చెను. ఆసమయమున వారణాసిశ్రేష్ఠి గోజమల్లు; వచ్చినఖ పరివ్రాజకుడు నేనే.

## 236 బక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒక బకమును గూర్చి చెప్పినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఒకానొక సరస్సులో హిమవత్ప్రదేశమున మత్స్యమయి పుట్టి, మహాపరివారముతో నివసించుచుండెను. మత్స్యములను భుజింతు నని బకము సరస్సుకు సమీపమున తల వాల్చి, రెక్కలు విప్పి, మత్స్యముల యజాగరూకతకై నెమ్మదిగా చూచుచు నిలుచుండెను. ఆసమయమున మత్స్యసమూహపరివృతుడై బోధిసత్త్వుడాహారము గొనబోవుచు నచ్చటికి వచ్చెను. చేపలు కొంగను జూచి ఈగాథ పలికినవి :

ఏతద్విజంబు కుముదము
భాతి శుచిద్యుతులతోడ, బహుమందముగా
ఆతతపక్షంబులతో
నీతలమున చేయు ధ్యాన మేకాగ్రముగన్.

దానిని జూచి బోధిసత్త్వుడీగాథ పలికెను :

ద్విజమును పొగడ రెవడు న
క్కజమును గని నిజ మెరుగకుండ! కావించునె యం

దజమే మన సంరక్షణ ?
నిజపక్షము లార్పకుండ నిలుచుట యేలా ?

ఇట్లు పలికినమీాదట మత్స్యసమూహము నీటిలో కల్లోలము కలిగించి, బకమును పారద్రోలినవి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున బకము ఇప్పటి మోసగాడు; మత్స్యరాజు నేనే.

## 237 సాకేత జాతకము

[అతీతకథయు వర్తమానకథయును ఏకనిపాతములోని సాకేత జాతకమున (68) చెప్పబడినవి.]

తథాగతుడు విహారమునకు బోయిన పిమ్మట భిక్షువు లాయనతో ''భన్తే, ఈస్నేహ మెట్లు సుస్థాపిత మగును!'' అను భావముతో ఈగాథ పలికెను :

కారణం బేమియో! కనుగొన్న మాత్రాన
కొందరగ లోకాన పొందు హృదయము చలువ,
చెందు భగవన్, శాంతి చిత్తమ్ముతోడ నే.

శాస్త్ర ప్రేమకు కారణము వారికి దెలుపువాడై, ఈగాథ పలికెను:

జలములో కమలమ్ము జన్మించెడి విధాన
పుట్టుచుండును ప్రీతి పూర్వజన్మములోని
బంధంబుచేగాని, ప్రకృతజన్మములోని
లాభాదికం బైన లోభంబుచే కాని.

# 238 ఏకపద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక కుటుంబిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆకుటుంబికుడు శ్రావస్తి నివాసి. ఒకనాడు తనయొడిలో కూర్చున్న కుమారుడు అర్థద్వారనామక ప్రశ్న మడిగెను. తండ్రి అది కఠినప్రశ్న యనియు, అన్యు లెవ్వరును సమాధాన మీయజాలరనియు గ్రహించి, పుత్రుని వెంటబెట్టుకొని జేతవనమునకు బోయి శాస్తకు ప్రణామము చేసి, "భన్తే, యీబాలకుడు ఒడిలో కూర్చుండి అర్థద్వారప్రశ్నము అడిగినాడు. అదియేమో నాకు తెలియదు; కావున నిచటికి వచ్చి నాను. భన్తే, ఈప్రశ్నమునకు సమాధాన మనుగ్రహింపుడు" అని విన్నవించెను. శాస్త యిట్లు చెప్పెను. "ఉపాసకా, ఈతడు ఈ ప్రశ్నము ఇప్పుడే అడుగ లేదు. పూర్వముకూడ పండితులను అడిగి నాడు. ప్రాచీనపండితులు దీనికి సమాధానముకూడ చెప్పినారు. కాని జన్మాంతరవిషయ మగుటచే ఈతనికి జ్ఞప్తిలేదు"

ఇట్లు పలికి, ఉపాసకుడు ప్రార్థించినపిమ్మట శాస్త పూర్వజన్మ వృత్తాంతమును చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు శ్రేష్ఠికులమున బుట్టి, పెద్దవాడయి తండ్రియనంతరము శ్రేష్ఠిపదవిని పొందెను. ఆయనకుమారుడు పసితనమున ఒడిలో గూరు చుండి 'నాయనా, నాకు ఒక్కటేమాట అనేకార్థములు కలది చెప్ప వలెను' అనెడి భావముతో ఈగాథ పలికెను.

నాకు దెలుపవలయు నాయనా, బహ్వర్థ
యుక్త మైన యట్టి యొక్కపదము,
నేర్చినంత దాని నిఖిలార్థలాభంబు,
నాకు దెలుపు మట్టి యేకపదము.

తండ్రి ఈగాధ పలికినాడు :

దక్షత అన్ని యర్థము లున్న పదము
చెప్ప నర్హానికి శీలమ్ము బాబు!
మిత్రు లౌవారికి మేలు, వైరులకు
వ్యథయును సమకూరు నర్హానివలన.

ఈప్రకారముగా బోధిసత్త్వుడు కుమారుని ప్రశ్నకు సమాధానము చెప్పినాడు. ఆతడు పితృవాక్యానుసారముగా నిజార్థమును సాధించి యథా కమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రకటించి రెండు జాతకములను సరి పోల్చెను. సత్య ప్రకాశన మైన పిదప పితాపుత్త్రులు శ్రోతాపత్తిఫలము నొందిరి. ఆకాలమున కుమారుడు ఈతడే; వారాణసీశ్రేష్ఠి నేనే

## 239 హరితమాత జాతకము

శాస్త వేళువనమున నివసించుచు, అజాతశత్రువిషయమై చెప్పినది.

### వర్తమాన కధ

కోసలరాజుతండ్రి మహాకోసలుడు బింబిసారప్రభువునకు తనకుమార్తె నిచ్చినపుడు పుత్రికాస్నానమూల్యమునకై కాశీగ్రామము నిచ్చెను. అజాతశత్రువు తండ్రిని సంహరించిన పిదప ఆమె శ్రీఘ్రకాలమున మృతి నొందెను. తల్లి చనిపోయిన పిమ్మటకూడ అజాతశత్రువు ఆగ్రామ మూల్యమును వాడుకొనుచుండెను. తనతండ్రిని సంహరించిన చోరు నకు నిజకులక్రమాగత మగు గ్రామము నుండనీయనని కోసలరాజు ఆత నితో పోటునకు దిగెను. ఒకసారి మామయు, ఇంకొకసారి అల్లుడును యుద్ధమున గెలుచుచుండిరి. అజాతశత్రువు గెలిచినపుడు రథమునకు ధ్వజము కట్టి మహావైభవముతో నగరమున ప్రవేశించువాడు. పరా

జితు డై నప్పుడు విచారముతో మౌనమవలంబించి యెవరికిని తెలియకుండ నగరమున ప్రవేశించువాడు.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో కూర్చుండి సంభాషించుచుండగా శాస్త్ర అచటి కరుగుదెంచి, విషయము తెలుసుకొని, 'భిక్షువులారా, అజాతశత్రువు కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ జయించినపుడు ప్రసన్నచిత్తముతో, పరాజయము పొందినపుడు విచారముతో నుండెడివాడు' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు నీలమండూకమయి పుట్టెను. ఆరోజులలో జనులు నదీకందరాదులలో చేపలు పడుటకై వలలుపన్నిరి అందొకదానిలో చేపలనేకములు పట్టుపడినవి. నీటిపాము చేపలను తినుచు దానిలో బ్రవేశించెను. బహుమత్స్యములు గుమిగూడి దానిని కరచి రక్తమయము చేసినవి. శరణము కానక మరణభయముచే నీటిపాము జాలముఖమునుండి వెలువడి, బాధచె ఉదకపర్యంతము ఎగిరిపడెను. ఆక్షణమున నీలమండూకముకూడ ఎగిరి జాలముఖమును జేరెను. నీటిపామునకు నిర్ణాయకుడు కనబడక, అచ్చట జేరిన నల్లకప్పను జూచి "మిత్రమా, నీలమండూకమా, ఈ మత్స్యములు చేసినపని నీకు నచ్చినదా? అని యడుగుచు ఈగాథ పలికెను :

> సర్పమైన నేను జాలమునం జిక్కి
> సమయమందు మత్స్యసంఘ మెల్ల
> నన్ను పీక జొచ్చె, న్యాయ మందువె దీని?
> కప్పకుర్ర, నీవు చెప్పవోయి!

అంతట హరితమండూకము దానితో "మిత్రమా, నాకు నచ్చినది. కారణము వినుము, నీచోటికి చేపలు వచ్చినచో భక్షింతువు, నీవు చేప లున్నచోటికి వచ్చినప్పుడు నిన్ను చేపలు భక్షించును. తమ తమ ప్రదేశములలోని ఆహారభూతులలో ఎవ్వరును దుర్బలులు కారు" అని యీగాథ పలికెను :

శక్తి యుండగ పరపీడ సలుపుచుండ్రు
పోవ శక్తి తామె వ్యథలు పొందుచుండ్రు

బోధిసత్త్వుడు నిర్ణయము చేయగానే చేపలు జలసర్పముబలహీన తను గ్రహించి, శత్రువును పట్టుకొందుమని జాలముఖమునుండి వెలువడి, దానిప్రాణముల నచ్చటనే తీసి, వెడలిపోయినవి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున నీటిపాము అజాత శత్రువు; నల్లకప్ప నేనే

## 240 మహాపింగళ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు దేవదత్తుని విషయమై చెప్పినది.

### వర్తమానకథ

దేవదత్తుడు శాస్తపై పగతీర్చుకొనుటకు తొమ్మిదిమాసముల క్రిందట జేతవనద్వారముకడ భూమిలో క్రుంగిపోవగా జేతవనవాసులు, నగర నివాసులు 'బుద్ధునిమార్గములో కంటకమువంటి దేవదత్తుడు భూగర్భమున లీనమైనాడు. సంయక్సంబుద్ధునిశత్రువు మరణించినాడు' అని మిక్కిలి సంతోషించిరి. సమస్తజంబూద్వీపవాసులు జనశ్రుతిద్వారా ఈవృత్తాంతము దెలిసికొని సంతసించిరి. యక్షభూత దేవతలుకూడ ఆనందించిరి.

ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై యీవిషయము చర్చించుచుండగా శాస్త అచటికి జని సంగతి గ్రహించి 'భిక్షువులారా! దేవదత్తుని మరణమునకు జనసమూహములు ఇప్పుడే కాదు, పూర్వముకూడ సంతోషించి సుప్రసన్నములైనవి' అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

అతీతకథ

పూర్వము మహాపింగళుఁ డను రాజు వారాణసిలో అధర్మముగా విషమముగా పరిపాలన చేయుచు, ఛందాదులకు వశ్యుఁడై, పాప కర్మలు చేయుచు, దండబలి జంఘుకార్షాపణాదులు హరించుచు గానుక చెరకుగడను పీడించినట్లు లోకులను పీడించుచుండెను. అతఁడు క్రౌద్రస్వభావుఁడు, కఠినుఁడు, సాహసికుఁడు. పరు లన నతనికి లేశమాత్రముకూడ భీతిలేదు. ఇంటిలో స్త్రీలకు, బిడ్డలకు అమాత్యబ్రాహ్మణ గృహపతి ప్రభృతులకు అతనియెడ ప్రీతి లేదు. కంటిలో నలుసువలె, అన్నముముద్దలో ఇసుకవలె, మనసులో దిగబడిన కంటకము వలె పీడాకరుఁడై యుండెను.

ఆసమయమున బోధిసత్త్వుఁడు మహాపింగళునికుమారుఁడై జన్మించి యుండెను. మహాపింగళుఁడు బహుకాలము రాజ్యము చేసి మృతినొందెను. వారాణసీవాసులు మహానందము చెంది, వేయిబండ్లకట్టెలతో రాజుశరీరము దహనము చేసి, వేయికడవల నీటితో చల్లార్పిరి. బోధిసత్త్వుని రాజ్యమున ప్రతిష్ఠించి, 'మాకు ధర్మప్రభువు లభించినా' డని ప్రసన్నచిత్తులై జనులు నగరములో ఉత్సవభేరులు మ్రోయించి, ఉన్నతధ్వజపతాకలతో నగర మలంకరించి ప్రతిద్వారముకడను మండపములు నిర్మాణము చేయించి, లాజలు పుష్పములు చల్లిన మండపములలో కూర్చుండి ఖాదనపానములు చేయఁజొచ్చిరి.

అలంకృతమహాతలమున ఉత్తమాసనమునడుమ, శ్వేతచ్ఛత్రచ్ఛాయలో బోధిసత్త్వుఁడు మహావైభవమున కూరుచుండెను. అమాత్యులు బ్రాహ్మణులు గృహపతులు రాష్ట్రియులు ద్వారపాలకులు మొదలగువారు రాజును పరివేష్టించియుండిరి. ద్వారపాలకు డొకఁడు కొంచెము దూరముగా నిలిచి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు శ్రమతో చేయుచు కన్నీరు విడుచుచుండెను. బోధిసత్త్వుఁడు వానిని జూచి "సౌమ్యా, మానాయనగారు మరణించిన అందరు సంతోషముతో ఉత్సవము చేయుచున్నారు. నీవు మాత్రము దుఃఖించుచున్నావు. మానాయనగారియెడ నీ కిష్టమా?" అని అడుగువాఁడై యీగాథ పలికెను :

పింగళుడు సర్వజనులకు పీడ గూర్చె
అతనిమృతికి హర్షించినా రఖిలజనులు;
ద్వారపాలక, ఏల రోదనము చేసె ని
దతడు నీ కిష్టబాంధవు డగునో యేమొ.

వా డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: "పింగళమహారాజు పోయినా డను దుఃఖముచే నేను కన్నీరు విడుచుట లేదు. నిజముగా నా శిరస్సుకు బాధ తప్పినది. పింగళరాజు ప్రాసాదమునుండి దిగునపుడును ప్రాసాద మెక్కునపుడును చిన్నసమ్మెటతో నాశిరసుమీద ఎనిమిది యెనిమిది దెబ్బలు కొట్టుచుండువాడు. ఆయన పరలోకమునకు బోయినను నా తలమీద కొట్టు నభ్యాసముచే నిరయపాలకులను యమరాజును కొట్టును. ఈయన మనలను మిక్కిలి బాధించుచున్నా డని యమరాజు పింగళరాజును మరల నిచ్చటికిదెచ్చి విడిచిపోవచ్చును. ఆయన మరల నా నెత్తిపై మోదుచుండును. ఈభయముచే దుఃఖించుచున్నాను." అని ఈయర్థము ప్రకటించు నీగాథ పలికినాడు:

కాదు నా కాతడు కంటిలోపాప!
ఆత డిచ్చటనుండి యమసద్మమునకు
నరిగి కష్టముగూర్ప యముడు పింగళుని
బంపు నిచ్చటికని భయపడువాడ

బోధిసత్త్వుడు వాని నిట్లూరడించెను "ఆయనను వేయిబండ్ల కట్టెలతో దహనముచేసినారు. వందలకొలది కడవలనీటితో చితాగ్ని చల్లార్చినారు. కాల్చినచోటు నాలుగుప్రక్కలనుండి త్రవ్వివేసినారు. చనిపోయినవారు వేరొకచోట పుట్టుచుండుట స్వభావసిద్ధము. వెనుకటి శరీరము కాదు. నీవు భయపడవలదు.' ఇట్లు చెప్పి ఈగాథ పలికెను:

బహుకాష్ఠములతోడ భస్మంబు చేసి
చల్లార్ప బహుభాండజలమున చితిని
త్రవ్విరి తద్భూమి : క్రమ్మర రాడు
పింగళు డికమీద భీతి చెందకుము.

అప్పుడు ద్వారపాలకుడు సంతుష్టచిత్తు డాయెను. బోధిసత్త్వుడు

న్యాయపరిపాలన చేయుచు, దానాదిపుణ్యకార్యము లొనర్చుచు, తుదకు యథా కమ్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున దేవదత్తుడు పింగళుడు; నేనే కుమారుడను,

## 241 సబ్బదార జాతకము

శాస్త వేళువనమున విహరించుచు దేవదత్తుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

దేవదత్తుడు అజాతశత్రువును సుప్రసన్నుని చేసికొని పొందిన లాభసత్కారములు బహుకాలము నిలుపుకొనలేకపోయెను. నడగిరి హస్తిని ప్రయోగించినపుడు జరిగిన అద్భుతసంఘటన తరువాత అతనికి లాభములు సత్కారములు తొలగిపోయెను.

ఒకనాడు ధర్మసభలో భిక్షువుకడకు శాస్త చేరి 'భిక్షువులారా, దేవదత్తుడు ఇప్పుడే కాదు. పూర్వముకూడ తనలాభములు, సత్కారములు కోల్పోయినాడు' అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడాయనపురోహితుడై మూడు వేదములలో అష్టాదశ విద్యలలో పారంగతుడయ్యెను. ఆయనకు పృథ్వీజయమంత్రముకూడ తెలియును. దానిని ఆవర్జనమంత్ర మందురు.

ఒకనాడు బోధిసత్త్వుడు తన్మంత్రసిద్ధికొరకు వివిక్తప్రదేశమున శిలాఖండముపై గూరుచుండి జపము చేయజొచ్చెను. నియమహీనుడయినవానికి దానిని వినిపింపగూడదు. కావున ఆయన విజనప్రదేశ

మున గూరుచుండి జపము చేయుచుండెను. ఆసమయమున నక్క కలుగులోనుండి వినుచు ఆమంత్రము నభ్యసింపసాగెను. అది పూర్వ జన్మలో పృథ్వీజయమంత్రమును పురశ్చరణ చేయుచున్న బ్రాహ్మణుడు. బోధిసత్త్వుడు జపము ముగించి, 'నా కీమంత్రము సిద్ధించినది' అనెను. నక్క బిలములోనుండి యీవలకు వచ్చి, 'బ్రాహ్మణోత్తమా, నీకన్న నాకే యెక్కువగా మంత్ర మభ్యస్త మయినది' అని పరుగెత్తెను.

నక్క చాల గడబిడచేయు నని యెంచి బోధిసత్త్వుడు దానిని వెంబడించెను. అది పరుగిడి అడవిలో దూరి, ఆడునక్కయొడిలో నక్కెను. ఆడునక్క "ఏమి స్వామీ?" యనెను. "న న్నెరుగవా?" 'ఎరుగుదును స్వామీ.'

నక్క పృథ్వీజయమంత్రము జపించి అనేకసృగాలములను రావించెను, ఏనుగులు, సింహములు, పులులు, వరాహములు, లేళ్ళు మొదలగు చతుష్పాత్తులను తనకడకు పిలిపించి, తాను సబ్బదార నామము ధరించి రాజై, ఆడునక్కను రాణిని జేసికొనెను. గజద్వయము వీపులపై సింహమును నిలిపి, దానివీపుమీద రాణితోగూడ సబ్బదారుడు కూరుచుండును. మహావైభవము నడచుచుండును.

నక్క ఐశ్వర్యమదమత్తమై వారాణసీరాజ్యమును పట్టుకొనగోరి చతుష్పాత్తులను వెంటగొని నగరమును సమీపించెను. దాని పరివారము పండ్రెండు యోజనములమేర నిండియుండెను. నగరమునకనతిదూరములో ఆగి నక్క "వారాణసీరాజ్య మిత్తువా, యుద్ధము చేయుదువా?" అని రాజుకు సందేశమంపెను. నగరవాసు లెల్లరు విభ్రాంతులై, మరణభీతిచే నగరద్వారములు బంధించిరి.

బోధిసత్త్వుడు రాజుకడకు బోయి "మహారాజా, భయపడవలదు. సబ్బదారసృగాలముతో యుద్ధము చేయు భారము నాయది. నేను తప్ప నితరు లెవ్వరు దానితో పోరాడజాలరు" అని రాజును నగరవాసులను ఊరడించి, సబ్బదారు డేవిధముగా రాజ్యమును జయించునో తెలిసికొనగోరి, నగరద్వారముమీది బురు జెక్కి, "సబ్బదారా, నీవు రాజ్యమెట్లు గెలుతువు?" అని యడిగెను.

"సింహనాదము చేయించి, గర్జారావముచే జనులను భయభ్రాంతులను జేసి, రాజ్యము స్వాధీనము చేసికొందును" అని సబ్బ

దారుడు పలికెను.

"ఓహో యిదియా!" అనుకొని బోధిసత్త్వుడు బురుజు దిగి, ద్వాదశ యోజనపరిమితి కల వారాణసిలోనివా రెల్లరు తడిపిన మినపపిండితో చెవులు మూసికొనవలె నని భేరీ వేయించెను. జనులు ప్రకటన విని, పిల్లులు మొదలగు జంతువుల చెవులుకూడ పిండితో మూతవేసి, ధ్వని వినబడకుండ జేసిరి.

బోధిసత్త్వుడు మరల బురు జెక్కి 'సబ్బదారా!' అని పిలిచెను.

'ఏమి బ్రాహ్మణోత్తమా?'

'ఈరాజ్య మెట్లు గ్రహింతువు?'

'సింహనాదము చేయించి, మానవులను భయపెట్టి, ప్రాణములు వాపి రాజ్యమును గ్రహింతును.'

'సింహనాదము చేయింపనేరవు. జాతిసంపన్నమై స్వచ్ఛరక్తము, హస్తపాదములు కల సింహరాజములు నీవంటి నీచసృగాలముల యానతి నాలకింపవు.'

సృగాల మభిమానపూరిత మై, "ఇతర సింహములమాట అటుండ నిండు. నే నధిష్ఠించిన సింహముచే గర్జ చేయింతు" ననెను.

'చేతనయినచో సింహనాదము చేయింపుము.'

సింహనాదము చేయు మని నక్క సింహమును తనకాలితో స్పృశించెను. ఏనుగు కుంభస్థలముపై ముఖ ముంచి, సింహము మూడు మారులు గర్జించెను. అశ్రుతపూర్వము, అనన్యసామాన్యము నగు తద్గర్జారవము వినినంతనే ఏనుగులు భయపడి నక్కను క్రిందికి బడ ద్రోసి, కాళ్ళతో మట్టించి, శిరసు వ్రక్కలుచేసెను. సబ్బదారు డచ్చటనే చచ్చెను. ఏనుగులు విభ్రాంతి చెంది ఒకదానితో నొకటి తలపడి మరణించెను. సింహములు తప్ప మిగిలిన జంతువు లన్నియు నక్కడనే ప్రాణములు విడిచెను. సింహములు వనములోనికి జొరబడెను. పండ్రెండు యోజనములమేర మాంసరాశి పేరుకొనెను.

బోధిసత్త్వుడు బురుజు దిగి, నగరద్వారములు తెరపించి, చెవులలో నుండి మినపపిండి యెల్లరు తీసివేయవచ్చు ననియు, వలయువారు మాంసము తీసికొని పోవచ్చు ననియు భేరి వేయించెను. జనులు తిన్నంత తిని, మిగిలినమాంసము గొనిపోయి యెండబెట్టుకొనిరి. నాటి

నుండియే మాంసము మెండబెట్టుట ప్రారంభ మయ్యె నని జనశ్రుతి.

తెగని యభిమానమున బిఱ్ఱబిగిసి నక్క
కోరకొని హెచ్చుగా పరివార, మవల
సామి యయ్యె చతుష్పాదజంతువులకు.
ఇట్లె మానవులయం దెవనికి హెచ్చు
పరివార మేర్పడు, ప్రభు వగు నతడు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకమును సరిపోల్చెను. ఆకాలమున నక్క దేవదత్తుడు; రాజు సారిపుత్రుడు; పురోహితుడు నేనే;

## 242 సునఖ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు అంబలికోష్ఠకశాలలో అన్నము తిను కుక్కనుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆకుక్క పుట్టినప్పటినుండియు అచటివారు పెంచుచుండిరి. అది అచట తిండితినుచు, బాగుగా బలిసినది. ఒకనాడు గ్రామవాసి యొకడు అచటికి జనెను. ఆతడు శునకమును చూచి పోషకులకు వస్త్రము, కార్షాపణములు ఇచ్చి కుక్క మెడకు తోలుపట్టా కట్టి దానిని కొనిపోయెను. తీసికొనుపోవుసమయమున అది మొఱగలేదు. పెట్టినదెల్ల తినుచు కుక్క ఆతని వెంట పోయెను.

అప్పు డాతడు తనలో ఈకుక్కకు నామీద ప్రీతి కలదు. అను కొని మెడపట్టా తీసివైచెను. తోడనే శునకము పరుగుపరుగున భోజన శాలకు మరలివచ్చెను. భిక్షువులు దానిని చూచిరి. సాయంకాలము ధర్మసభలో సంభాషణ జరుగుచుండగా శాస్త అచటికి చని విషయము తెలిసికొని "భిక్షువులారా! ఆశునకము ఇప్పుడే కాదు. పూర్వము కూడ బంధనవిముక్తిలో చతురతకలది" అని పూర్వజన్మవృత్తాం

తము చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున నొకానొక ధనికునియింట బుట్టి పెద్దవా. డయి, గృహస్థధర్మము నవలంబించెను.

ఆకాలమున వారాణసిలో నొకనికి కుక్కయుండెను. అది అన్నపు ముద్దలు తిని తిని, బలిసెను. గ్రామవాసి యొక డొకనాడు వారాణసికి వచ్చి, ఆకుక్కను జూచి దాని యజమానునకు వస్త్రము కార్షాపణ ములు నిచ్చి, శునకమును చర్మయోక్త్రమున బంధించి, ఒకచివర పట్టుకొని తీసికొని పోవుచు, అటవీముఖమున నొకచావడిలో జేరి, కుక్కను కట్టివేసి, ఫలకముపై బండుకొని నిద్రించుచుండెను. ఆసమ యమున బోధిసత్త్వు డేదో పనిమీద అడవికి బోవుచు కట్టివేసియున్న కుక్కను జూచి ఈగాథ పలికెను .

కుక్క మందబుద్ధి కొరికివేయదు తన్ను
పట్టియుంచు చర్మపట్టికలను
బంధనములు త్రెంచు పశ్చాన చేరును
నిండు పొట్టతోడ నిజగృహంబు.

ఆవాక్కులు విని శునక మీగాథ పలికెను :

ఇదియే నా సంకల్పము
హృదయాన నిరూఢ మిద్దియే వేచితి నే
నదనునకై, సదనమ్మున
పదుగురు నిద్రించు పిదప పరుగిడిపోదున్.

ఇట్లు పలికి శునకము తోలుపట్టీ కొరికి తిని, కడుపు నింపుకొని, పరుగెత్తి తనయజమానుని యింటికేపోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆనాటిశునకము ఈశునక మే; పండితపురుషుడు నేనే.

# 243 గుత్తిల జాతకము

శాస్త వేళువనమున విహరించుచు దేవదత్తునివిషయమై చెప్పినది

## వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు దేవదత్తునితో "ఆయుష్మంతుడ వగు దేవదత్తుడా, సంయక్సంబుద్ధుడు నీ ఆచార్యుడు. నీవు ఆయనవలననే, త్రిపిటకములను నేర్చి, నాలుగుధ్యానములు పొందితివి. ఇప్పుడు నీవు ఆచార్యునితో వైరము పెట్టికొనుట తగదు" అనిరి. దేవదత్తుడు ఆచార్యుని ప్రత్యాఖ్యానము చేయుచు" ఆయుష్మంతులారా, శ్రమణ గౌతముడు నాకాచార్యు డెట్లగును? స్వబుద్ధిబలముచే నేను త్రిపిటకములు పఠింపలేదా? ధ్యానచతుష్టయమును పొందలేదా?" అనెను.

భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై సంభాషించుచుండగా శాస్త అచటి కరుదెంచి, విషయము గ్రహించి "భిక్షువులారా, దేవదత్తుడు ఇప్పుడే కాదు పూర్వముకూడ ఆచార్యుని ప్రత్యాఖ్యానము చేసి, విరుద్ధభావము వహించి, నష్టపడెను" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు గంధర్వకులమున బుట్టి, గుత్తిలకుమారు డని పేరుపొంది పెరిగి పెద్దవా డయినపిమ్మట గాంధర్వకళలో పారంగతు డయి, యావజ్జంబూద్వీపమున గంధర్వు లందరకంటె మిన్న యయ్యెను. అతడు అంధులగు తనతల్లిదండ్రులను పోషించుచుండెను.

ఆకాలమున వారాణసీనివాసు లగు వర్తకులు వ్యాపారార్థము ఉజ్జయినీనగరము పోయిరి. ఒకనాడు పండుగకై చందాధనము ప్రోగుచేసి విశేషముగా మాలాగంధవిలేపనాదులు ఖాద్యములు గొనిపోయి క్రీడాస్థానమున గుమిగూడిరి. 'వేతన మిచ్చి గంధర్వుని తీసికొనిరం' డని పెద్దవర్తకుడు చెప్పెను. మూసిలుడు అను గాయకుని బిలిపించి పాటకచ్చేరీ చేయించిరి.

మూసిలుడు వీణకూడ వాయించును. అతడు హెచ్చుశ్రుతిలో వాయించెను. గుత్తిలాచార్యునివాదనము విన్న వర్తకులకు అది చాప బరుకుడుగా తోచెను. ఎవ్వరు నేమియు ననలేదు. వారు సాధువాదము చేయలేదని గమనించి మూసిలుడు మధ్యమశ్రుతిలో వాయించెను. అప్పటికిని వా రుపేక్షించియుండుటచే వారల కేమియును తెలియ దనుకొని మూసిలుడు తీగెలు వదులుచేసి వాయించెను. అప్పటికిని వారు మిన్నకుండిరి.

'వణిజులారా, మీకు నావీణావాదనము నచ్చలేదా?'

'నీవు వీణ వాయించుచున్నావా! అభ్యాసము చేయుచున్నా వను కొంటిమి.'

'నాకంటె గొప్ప యాచార్యు నెరుగుదురా? కాక మీకు తెలియక ఆనందింపలేదా?'

'వారాణసిలో గుత్తిలాచార్యుని వీణావాదనము విన్న తరువాత మీవాదనము శిశువులను స్త్రీలను సంతుష్టిపరచు ననిపించును.'

'మంచిది. మీరు నా కిచ్చినధనము మరల నిత్తును. నా కేమియును వలదు. మీరు వారాణసికి బోవునపుడు నన్ను మీ వెంట గొని పొండు.'

వారు సమ్మతించి, ప్రయాణసమయమున నతనిని వెంటదీసికొని పోయి వారాణసిలో గుత్తిలాచార్యునిగృహము చూపి, తమ నివాసములకు జేరిరి.

మూసిలుడు బోధిసత్త్వునియింటిలో బ్రవేశించి, అచ్చట వ్రేలాడ దీసిన యుత్తమవీణను చేబూని వాదనము చేసెను. అతనితల్లిదండ్రులంధు లగుటచే వానిని జూడక, యెలుకలు వీణ కొరకుచున్న వను కొని ఇస్ ఇస్ అనిరి. మూసిలుడు వీణె నచ్చట నుంచి, వారికి నమస్కారము చేసెను.

"ఎక్కడినుండి వచ్చినావు బాబా?" అని వా రతని నడిగిరి.

"ఉజ్జయినినుండి. ఆచార్యునికడ గానకళ నభ్యసింప వచ్చినాను."

"మంచిది."

"ఆచార్యు లెచట నున్నారు?"

'నాయనా, ఎక్కడికో వెళ్ళినారు. త్వరలోనే వచ్చును.'

మూసిలు డచ్చుటనే కూరుచుండెను. గుత్తిలుడు వచ్చినతరువాత నతనిని కుశల మడిగెను. మూసిలుడు తనరాకకు కారణ మెరింగించెను. అంగవిద్యావిశారదు డగు బోధిసత్త్వుడు మూసిలుడు సత్పురుషుడు కా డని గ్రహించి, 'బాబా, నీకు నేను చెప్పునది లేదు' అని పలికెను.

మూసిలుడు ముదుసళ్ళకాళ్ళపై బడి ప్రార్థించి, సేవచే వారిని సంతుష్టచిత్తులను జేసి, ఈసంగతి మాటిమాటికి వారిచే కుమారునకు జెప్పించెను. జననీజనకులమాట తీసివేయలేక, బోధిసత్త్వుడు మూసిలునకు విద్య నేర్పెను. ఆచార్యునివెంట మూసిలుడు దర్బారునకు బోవుచుండును. ఒకనాడు రాజు 'ఆచార్యా, ఇత డెవరు?' అనెను.

'మహారాజా, నాశిష్యుడు.'

క్రమముగా నతడు రాజుకు విశ్వాసపాత్రు డాయెను. బోధిసత్త్వు డేమియు దాపక తనకు దెలిసిన విద్యయంతయు నతనికి నేర్పి, "నాయనా, విద్య పూర్తియయినది" అని చెప్పెను. "వాడు తనలో నేను విద్య పూర్ణముగా నభ్యసించినాను, జంబూద్వీపములో వారాణసి శ్రేష్ఠమైన నగరము. ఆచార్యుడు పెద్దవా డయినాడు. నే నిచటనే యుండవలెను" అని తలపోసి, "ఆచార్యా, నేను రాజును సేవింతు" ననెను. "మంచిది. నేను మహారాజుకు విన్నవింతును" అని బోధిసత్త్వుడు రాజుకడకు బోయి "మహారాజా! నాశిష్యుడు దేవరవారి కొలువులో నుండగోరుచున్నాడు. దేవరవారు అతని కేమి యనుగ్రహింతురో తెలుపుదురుగాక" అనెను.

"మీకు ముట్టెడిదానిలో సగము మీశిష్యునకు ముట్టును" అని రాజు పలికెను. బోధిసత్త్వు డాసంగతి మూసిలునకు జెప్పెను. "మీతో సమానముగా నిచ్చు పక్షమున కొలువులో నుందును. కాని పక్షమున నుండజాలను" అని యతడు పలికెను.

"ఎందుచేత?"

"మీకు తెలిసినంత విద్య నాకును తెలియునుగదా?"

"తెలియును."

"అప్పుడు నాకు సగ మిచ్చు టేల?"

బోధిసత్త్వు డీసంగతి రాజుకు దెలిపెను. "మీతో సమానముగా నతడు విద్యానైపుణి చూపుచో నతనికి సమానవేతనము లభించును."

అని రా జనెను. బోధిసత్త్వు డీమాటలు తెలుపగా మూసిలుడు "మంచిది, నైపుణి చూపగల" ననెను. ఈమాటలు విని రాజు "సరే, నేటి కేడవనాడు పోటీ" అనెను.

రాజు మూసిలుని బిలిపించి "నిజముగా నీవు ఆచార్యునితో పోటీ చేయుదువా?" అనెను.

"నిజమే, దేవా?"

"ఆచార్యునితో స్పర్థ తగదు. పోటీ చేయవలదు."

"మహారాజా, నేటి కేడవనాడు విద్యాస్పర్థ కానతిండు. జ్ఞానము సంగతి తెలియును."

సరే, అని రాజు "నేటి కేడవనాడు అచార్యగుత్తిలునకు ఆయన శిష్యుడు మూసిలునకు సంగీతములో పోటీ. వారు తమతమ నైపుణ్యము చూపుదురు. నగరవాసులు సమావిష్టులై విద్యాప్రదర్శనము చూడవచ్చును" అని భేరీ వేయించెను.

బోధిసత్త్వు డిట్లు తలపోసెను. 'ఈమూసిలుడు వయసునచిన్నవాడు, తరుణవయస్కుడు, నేను పెద్దవాడ నయినాను. శక్తి తగ్గిపోయినది. వృద్ధునివలన పనులు కావు. శిష్యు డోడిపోయినచో నా విశేషము లేదు. అతడు జయించినచో సిగ్గున నే నడవిపా లయి మరణింపవలెను.

ఇట్లు తలపోసి, అత డడవికి బోవును, కాని మరణభయముచే మరలి వచ్చును. లజ్జచే మరల కాననమున కరుగును. ఈవిధముగా ఆరురోజులు గడచెను. త్రోవలో గడ్డి నలిగి యెండిపోయెను. మార్గము పరిష్కృత మయ్యెను.

అప్పుడు శక్రునిసింహాసన ముడు కెక్కెను. బోధిసత్త్వు డడవిలో వ్యథ చెందుచున్నా డని శక్రుడు ధ్యానబలముచే గ్రహించి, తోడ్పడవలె నని శీఘ్రముగా ఆయనకడకు వచ్చి, నిలిచి 'ఆచార్యా, అడవిలో ఏల చేరినా?' రని యడిగెను.

'మీ రెవరు?'

'శక్రుడను.'

'దేవరాజా, శిష్యునివలని భయముచే అడవిపా లయినాను' అని బోధిసత్త్వు డీగాథ పలికెను :

మూసిలు డను శిష్యునకు నేను మున్ను నేర్పి
నాను స ప్తతంత్రీవీణ పైన సకల,
మిపుకు నను రంగమున నెదిరించువాడు ;
నీవు శరణము నా కింక దేవరాజ !

శక్రు డీవాక్కులు విని 'భయపడవలదు, నీకు నేను త్రాణమిత్తును, శరణ మిత్తును' అని ఈగాథ పలికెను :

శరణ మిచ్చువాడ సౌమ్య ! నే గురుపూజ
చేయువాడ సుమ్ము ; శిష్యు డెపుడు
నిన్ను గెలువ లేడు—నీవే జయింతువు
ఎచట నైన గురువుకే జయమ్ము.

ఆవల శక్రు డి ట్లనెను 'మీరు వీణ వాయించునపుడు ఒకతీగె తొలగించి, ఆరుతీగెలమీద వాయింపుడు. స్వాభావికస్వరము వెలువడును. మూసిలుడుకూడ తీగె త్రెంపును. ఆతని వీణ పలుకదు. అతడు తోడనే పరాజితు డగును. గ్రహించి, మీరు రెండవ, మూడవ, నాల్గవ, అయిదవ, ఆరవ, ఏడవ తీగెలు తీసివేసి కేవల వీణాదండము మీద వాయింపుడు. తీగెలు లేని మెట్లనుండి స్వరము వెలువడి, పండ్రెండు యోజనముల వారాణసీనగరము నిండిపోవును.'

ఇట్లు చెప్పి బోధిసత్త్వునకు శక్రుడు మూడు గోలీలు ఇచ్చి 'స్వరము నగరమున నిండినపుడు ఒక గోలీ ఆకాశములోని కెగుర వేయుడు మీ యెదుటికి మూడునందలమంది యచ్చరలు దిగి, నాట్యము చేయుదురు. ఆసమయమున రెండవగోలీ ఎగుర వేయుడు. వీణాదండము చివర మూడువందలమంది యచ్చరలు నాట్యముచేయ నారంభింతురు. అంతట మూడవగోలీ ఎగుర వేయుడు. మూడువందల క్రొత్తయచ్చరలు పిండు వచ్చి, రంగస్థలముపై నాట్యమాడును. నేనుగూడ మీ వెంట నదృశ్యుడనై యుందును. పొండు, భయములేదు' అని బోధించెను.

బోధిసత్త్వుడు పూర్వాహ్ణమున సదనమునకు జనెను. దర్బారులో మంటపము నిర్మించి సింహాసనము నిలిపిరి. రాజు ప్రాసాదమునుండి దిగి, అలంకృతమంటపమున పీఠముపై గూరుచుండెను. అలంకారము చేసికొన్న స్త్రీలు, అమాత్యులు, బ్రాహ్మణులు, రాష్ట్రికాదులు

రాజును పరివేష్టించి యుండిరి. నగరవాసులు సమావిష్టు లయిరి. అంగణమున మంచెలు వరుసగా కట్టిరి.

బోధిసత్త్వుడు స్నానము చేసి, భుజించి, వీణ చేకొని, తనకై పరచిన ఆసనముపై గూరుచుండెను. శక్రుడు వచ్చి, ఆకసమున నదృశ్యుడై యుండెను. బోధిసత్త్వునకు మాత్రము కానబడుచుండెను. మూసిలుడు వచ్చి, నిజాసనముపై గూరుచుండెను. జనము పరివేష్టించి యుండెను.

ఆరంభములో వారు ఒకరికొకరు సమానముగా వీణావాదనము చేసిరి. ఉభయులవాదనములకును జనులు సంతుష్టులై హర్ష ధ్వనులు చేసిరి.

బోధిసత్త్వునకుమాత్రము వినబడునట్లు శక్రుడు 'ఒకతీగె తీసివేయు, మనెను. అతడు భ్రమరతంత్రిని త్రెంచి వేసెను. తెగిన పిమ్మటగూడ తీగెకొననుండి దేవగంధర్వస్వరము వినవచ్చుచుండెను. మూసిలుడు గూడ తీగె త్రెంపెను. స్వరము వెలువడ లేదు. ఆచార్య గుత్తిలుడు వరుసగా ఏడుతీగెలు త్రెంపి, తుదకు దండము మ్రోగించెను. అందుండి వెలువడిన నాదము వారాణసీనగర మంతయును నిండిపోయెను. హర్ష ధ్వనులు మిన్నుముట్టినవి. బోధిసత్త్వు డొక గోలీ నెగురవైచెను. అచ్చర పిండు వచ్చి నాట్యము చేయ జొచ్చెను. క్రమముగా నతడు రెండవ, మూడవ గోలీలు ఎగురవైచెను. శక్రుడు చెప్పినట్లే అచ్చరలు వచ్చి నానావిధనాట్యములు చేసిరి.

అప్పుడు రాజు జనులకు సంజ్ఞ చేసెను వారు లేచి మూసిలునితో "ఆచార్యునితో నీవు పోటీపెట్టుకొందువా? ఆయనతో సమానము కాగలవా? నీ యంతర మెరుగవు?" అని బెదరించి, చేతి కందిన రాలతో, కర్రలతో వానిని గొట్టి, ప్రాణములుతీసి, కాళ్ళుపట్టి యీడ్చి చెత్తదిబ్బపై బారవైచిరి.

రాజు సంతుష్టుడై బోధిసత్త్వునకు మేఘము వర్షించినట్లు ధనము వర్షించెను. నగరవాసులుకూడ ఆప్రకారమే చేసిరి.

శక్రుడు ఆయనకడ సెలవు తీసికొనుచు "పండితోత్తమా, వేయి గుర్రములు పూన్చిన ఆజానీయరథములో మాతలిని నీకై పంపుదును. నీవు ఆశ్రేష్ఠ వైజయంత రథ మెక్కి దేవలోకమునకు రావలెను".

అని చెప్పెను. శక్రుడు దేవలోకమునకు జని పాండుకంబళశిలాతలముపై గూరుచున్న పిదప దేవకన్యలు ఆయనతో "మహారాజా, ఎచ్చటికి వెళ్ళితిరి" అని అనిరి. శక్రుడు జరిగినవృత్తాంతమును వివరించి చెప్పి, బోధిసత్త్వుని సదాచారమును ప్రజ్ఞను ప్రశంసించెను. దేవకన్యలు "మహారాజా, మేము ఆచార్యుని దర్శింపగోరుచున్నాము. వారిని ఇచటికి గొనిరావలెను" అని విన్నవించిరి.

శక్రుడు మాతలిని పిలువనంపి "బాబా, అప్సరసలు గుత్తిలగంధర్వుని చూడగోరుచున్నారు. పోయి ఆయనను వైజయంతరథమున గూరుచుండబెట్టుకొని తోడ్కొనిరమ్ము" అని చెప్పగా 'మంచి' దని మాతలి చని బోధిసత్త్వుని తోడ్కొని వచ్చెను. శక్రుడు బోధిసత్త్వుని కుశలప్రశ్న లడిగి "ఆచార్యోత్తమా, దేవకన్యలు మీగాంధర్వమును వినగోరుచున్నారు" అనెను.

"మహారాజా, గంధర్వులమైన మేము విద్యవలననే జీవిక నడుపుదుము. మూల్యము లభించుచో పాడుదుము." "వాద్యములను ప్రయోగింపుడు, నేను మూల్యమిత్తును." "ఇప్పుడు మూల్యముతో పనిలేదు. దేవకన్యలు తాము చేసిన సత్కృతములను విడివిడిగా వివరించుచో నేను వాదనము చేయుదును."

అప్పుడు దేవకన్యలు "ఆచార్యోత్తమా, మేము చేసిన సత్కార్యములను సంతుష్టచిత్తులమై వివరింతుము. ఇప్పుడు తాము గానమున మమ్ము తనుపుదురుగాక!" అనిరి. బోధిసత్త్వుడు సప్తాహపర్యంతము దేవతలను గానమున ముంచెత్తెను. ఆయనవాదము దేవతలవాదనను మించిపోయినది. ఏడవనా డాయన దేవకన్యలను వారివారి సత్కృతములను వివరింపు డని కోరెను.

కాశ్యపబుద్ధునికాలమున ఒకానొకభిక్షువునకు ఉత్తమవస్త్రమును దానమిచ్చుటచే శక్రుని పరిచారికగా పుట్టి వేలకొలది అచ్చరలు పరివేష్టించియుండ నడుమ నున్న ఉత్తమదేవకన్యను బోధిసత్త్వుడు చూచి 'నీవు పూర్వజన్మమున ఏసత్కార్యము చేయుటచే నిట్లు జన్మించితివి?" అని ప్రశ్నించెను. ఆమె దానికి తగు సమాధాన మిచ్చెను

ఒకతె భిక్షార్థ మేతెంచిన భిక్షువునకు పూజార్థము పూల నిచ్చెను. ఒకతె చైత్యమున పంచాంగుళిచిహ్నములు వేయుటకై సుగంధ

మొసగెను. మరియొక తె మధురఫలముల నిచ్చెను. ఇంకొక తె ఉత్తమ రసవత్పదార్థము లిచ్చెను. వేరొక తె కాశ్యపబుద్ధుని చైత్యమున సుగంధపంచాంగుళీచిహ్నములను ముద్రించెను. ఒక తె మార్గమున పోవు భిక్షువులను, భిక్షుణులను ఇంటికి గొనిపోయి వారివలన ధర్మము లను వినెను. ఒక తె నౌకలో గూరుచుండి భోజనము చేయు భిక్షువు లకు తాను పానీయ మిచ్చెను. ఒక తె సంసారము చేయుచు క్రోధ రహితచిత్తముతో అత్తమామలకు సేవచేసెను. ఒక తె తనకు లభిం చిన భోజ్యపదార్థములనుండి కొంతభాగము విడదీసి శీలవంతురాలై యుండెను. వేరొక తె అన్యగృహమున దాసిగా నుండి క్రోధరహితయు అభిమానరహితయునై తనభాగమును విడదీసి భుజించెను. ఈప్రకార ముగా వీరు శక్రునిపరిచారికలుగా జన్మించిరి.

దేవకన్యలు తమ తమ సత్కార్యములను విన్నవించిరి. బోధి సత్త్వుడు విని "చాల మే లయ్యెను; ఎంతో ప్రీతి కలిగెను, స్వల్పకార్య ములు సలుపుటచే సంప్రాప్త మైన సంపదలనుగూర్చి విన్నాము. ఇక నేను మానవలోకమునకు జని దానాదిపుణ్యకార్యములు చేయుదును" అని పలికెను.

సప్తాహ మైనపిదప శక్రుడు మాతలిని పిలువనంపి "బోధిసత్త్వుని రథమున గూరుచుండ బెట్టుకొని వారాణసిలో దింపు" మని ఆజ్ఞా పించెను. ఆయన వారాణసి చేరి దేవలోకమున తాను కనుగొన్న విశేషములను మానవులకు తెలిపెను. నాటినుండి జనులు ఉత్సాహ పూర్వకముగా పుణ్యకార్యములు చేయుట కంగీకరించిరి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను ఆకాలమున మూసిలుడు దేవ పత్తుడు; శక్రుడు అనురుద్ధుడు రాజు ఆనందుడు, గుత్తిలగంధర్వుడు నేనే.

# 244 వీతిచ్ఛ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పలాయనశీలుఁ డగు పరివ్రాజకునిగురించి చెప్పినది.

## వర్తమాన కథ

సమస్తజంబూద్వీపమున శాస్త్రార్థము తనతో చేయువాఁడు ఎవఁడును లభింపలేదు. అతఁడు శ్రావస్తి చేరి "ఇచట నాతో ఎవరు శాస్త్రార్థము చేయఁగలరు ?" అనెను.

సంయక్సంబుద్ధుఁడు కలఁడని ప్రత్యుత్తరము వచ్చెను. అతఁడు జనులతో కలిసి జేతవనము చేరి చతుర్విధపరిషన్మధ్యమున ధర్మప్రసంగము చేయు శాస్తను చూచి ప్రశ్నింపగా, ఆయన దానికి తగు సమాధానము ఇచ్చి అతనిని మరల ప్రశ్నించెను—

"ఒకే పదార్థ మేది ?" అను ప్రశ్నమునకు ప్రత్యుత్తర మీయఁజాలక ఆతఁడు లేచి పలాయనము చేసెను. సమావిష్టులైన సభ్యులు—

"భన్తే, ఒక్కమాటతో తాము పరివ్రాజకుని పరాజితుని చేసినారు ?" అనిరి.

"ఉపాసకులారా, కేవల మిప్పుడే కాదు. పూర్వముకూడ ఒకే పదముతో ఓడించియున్నాను" అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుఁడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుఁడు కాశీరాష్ట్రములో బ్రాహ్మణకులంబమున జన్మించి, పెద్దవాఁడయి, కామము విడిచి, ప్రవ్రజించి, బహుకాలము హిమవత్ప్రదేశమున నివసించెను. ఒకనాఁ డతఁడు పర్వతము దిగి, ఒకానొకగ్రామనిగమము చేరి, గంగానివర్తనమున పర్ణశాల వేసికొని, నివాసము చేయఁజొచ్చెను.

ఒకానొక పరివ్రాజకుఁడు సకలజంబూద్వీపమున తనకు ప్రతివాది లభింపనివాఁడా గ్రామనిగమము చేరి "ఎవరయినను నాతో వాదింపగలవా రున్నారా ఓహో" అని కేక వేసెను. కలఁడని బోధిసత్త్వుని

ప్రశంస విని, బహుజనపరివృతుడై, ఆయననివాసమునకు బోయి, కుశల మడిగి, కూరుచుండెను. అప్పుడు బోధిసత్త్వుడు "వనగంధపరిభావిత మైన గంగాజలము పుచ్చుకొందురా?" అని యడిగెను.

పరివ్రాజకుడు శాస్త్రార్థము ప్రారంభించువాడై "ఏది గంగ? నాలుక గంగయా? ఉదకము గంగయా? ఆతీరము గంగయా? ఈతీరము గంగయా?" అనెను. బోధిసత్త్వుడాతనితో "పరివ్రాజకా, జలము, నాలుక, ఈతీరము, ఆతీరము కన్న గంగ యెక్కడ లభించును?" అనెను. పరివ్రాజకు డప్రతిభుడై యచటినుండి లేచి వెడలిపోయెను. ఆతడు వెడలిపోయిన పిమ్మట బోధిసత్త్వుడచ్చటి జనసమూహమునకు బోధ చేయువాడై యీగాథలు పలికెను :

అగపడుదానిపై నాసక్తి లేదు,
కనరాని దానిపై కామము మెండు,
ఎంతకాలమొ చను నీప్రకారముగ,
ఏదియు లభియింప కతడు కోరినది.

దొరకిన దాన సంతుష్టుడు కాడు;
అనుకొన్నయది లభ్య మైన పక్షమున
మృగ్యమౌ నాదర; మిచ్ఛావిధాన
పంకము లేనిది; ఆ వాంఛ విడుచు
నతనికి ఘటియింతు మంజలి మనము.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున ఆపరివ్రాజకుడే నేటి యీ పరివ్రాజకుడు తపస్విని నేనే

# 245 మూలపరియాయ జాతకము

శాస్త ఉక్కట్ఠాసమీపమున సుభగివనమున విహరించుచు మూలపరియాయసూత్ర విషయమై చెప్పినది

## వర్తమానకథ

ఆకాలమున వేదత్రయపారంగతు లగు పంచశతబ్రాహ్మణులు బుద్ధశాసనమున ప్రవ్రజితులయి త్రిపిటకములు నేర్చి, అభిమానవశంగతు లయి తమలో 'సంయక్సంబుదుడు త్రిపిటకములు అభ్యసించినాడు. మనము నభ్యసించినాము. అప్పుడు ఆయనకు మనకు నేమి అంతరము?' అని తలపోసి బుద్ధసేవార్థము చనుట మాని, శాస్తతో సమానుల మని ఎంచుకొని తిరుగుట మొదలిడిరి.

ఒకనాడు వారు వచ్చి, పార్శ్వమున కూర్చున్నసమయమున అష్ట భూమికలతో సిద్ధము చేసి మూలపరియాయసూత్ర ముపదేశించెను. వారి కేమియును దెలియ లేదు. అంతట వారు తమలో 'మనకు సాటివా రెవరు లే రని గర్వముతో నున్నాము. కాని ఇప్పుడు ఆయన చెప్పునది మన కేమియును తెలియ లేదు. బుద్ధునివంటి పండితుడు లేడు' అనుకొని నాటినుండి కోరలు పీకిన పామువలె వినమ్రులైరి.

శాస్త ఇచ్చవచ్చి నన్నినాళ్ళు, ఉక్కట్ఠాలోనుండి అనంతరము వైశాలికి చని అచట గోతమకచైత్యమున గౌతమక సుత్త ముపదేశ మిచ్చెను. వేలకొలది లోకధాతువులు కంపించినవి. అది విని, ఆభిక్షువులు అర్హత్వము పొందిరి.

ఉక్కట్ఠాలో శాస్త ఉన్నరోజులలో ఒక్కనాడు భిక్షువులు ధర్మ సభలో గూర్చుండి 'ఓహో, బుద్ధుల ప్రభావ మేమి? ఆబ్రాహ్మణులు ప్రవ్రజితు లయ్యు అభిమానముతో నుండిరి' అనుచుండగా శాస్త అచటికి జేరి సంగతి దెలిసికొని, 'భిక్షువులారా, ఆపరివ్రాజకులు ఇప్పుడే కాదు, పూర్వముకూడ అభిమానమున శిరము లెత్తుకొని, ఆవల వంచి నారు' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి, పెద్దవాడయి, త్రివేదపారగుడయి, జగద్విఖ్యాతుడయిన ఆచార్యుడై, అయిదువందలమాణవకులకు విద్య చెప్పుచుండెను. వారెల్లరు నిష్ఠతో విద్య లభ్యసించి "మన కెంత తెలియునో ఆచార్యునకుగూడ అంతవరకే తెలియును. అంతకన్న విశేషము లేదు" అని యోచించి అభిమానముచే ఆచార్యుని సన్నిధికి పోవుట మానిరి, శుశ్రూషలు మానివేసిరి. ఒకనాడాచార్యుడు రేగుచెట్టుక్రింద ఆసీనుడై యున్నప్పుడు ఆయనను వంచించుటకై బదరీవృక్షమును గోటితో గీరుచు "ఈవృక్షము నిస్సారము" అనిరి. బోధిసత్త్వుడు వారిభావము గ్రహించి, "అంతేవాసులారా, మిమ్మొక ప్రశ్న మడుగుదును" అనియెను. వారు సంతుష్టచిత్తులై "అడుగుడు, ప్రత్యుత్తరమిత్తుము" అనిరి. ఆచార్యుడు ప్రశ్న వేయువాడై యీగాథ పలికెను:

కాలము భూతాల కబళించుచుండు
తనను సైతము; మరి దానిని మ్రింగ
గల ప్రాణి యున్నచో కాల్చు సర్వంబు.

ఈప్రశ్న విన్న మాణవకులలో నొకనికిని సమాధానము తోచలేదు. అప్పుడు బోధిసత్త్వుడు వారితో "ఇది మూడు వేదములలో నున్నదని తలపవలదు. పొండు. మీకు ఏడురోజుల గడు విచ్చుచున్నాను ఈలోపున మీరీప్రశ్నను యోజింపుడు" అని పలికెను.

వారు బోధిసత్త్వునకు నమస్కరించి నిజనివాసములకు బోయిరి. ఏడురోజులు యోచించినను ఆప్రశ్న కాద్యంతములు వారికి తోపలేదు. ఏడవనాడు వా రాచార్యునిసన్నిధికి వచ్చి వందనముచేసి కూరుచుండిరి. "భద్రముఖులారా, ప్రశ్నకు సమాధానము తోచినదా?" అని ఆచార్యు డడుగగా వారు "మాకు తోచలేదు" అని చెప్పిరి. అప్పుడు బోధిసత్త్వుడు వారిని మందలించుచు. ఈ గాథ పలికెను

ఎన్నియో మెడలపై నెన్నియో శిరము
లుండును, వానిపై నుండు కేశములు:
కాని యెన్నింటికి కర్ణంబు లుండు?

ఇట్లు మాణవకులను మందలించి "మీకు చెవులు మాత్రము కుట్టినారు. ప్రశ్న తెలియలేదు. మందబుద్ధులు!" అని గర్హించి ప్రశ్నకు ప్రత్యుత్తరము బోధిసత్త్వుడు వివరింపగా, విని వారలు "ఓహో, ఆచార్యులవారు మహానుభావులు" అని క్షమాపణ వేడి, వినమ్రులయి, బోధిసత్త్వుని సేవించిరి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున ఐదువందల మంది భిక్షువులు, ఈ మాణవకులు, ఆచార్యుడు నేనే.

## 246 తేలోవాద తజాకము

శాస్త వైశాలిలో కూటాగారశాలలో నుండగా సింహసేనాపతినిగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు, బుద్ధుని శరణుజొచ్చి, ఒకనాడు ఆహ్వానించి, మరునాడు మాంసపూరిత మైన ఆహారము వండించెను. నిర్గ్రంధులు ఆవృత్తాంతము విని దూషించిరి. "శ్రమణ గౌతముడు తెలిసియే తనకొరకు వండిన మాంసము తినుచున్నాడు."

ధర్మసభలో భిక్షువులు సంభాషించుచుండ, శాస్త అచటికరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా! ఇప్పుడే కాదు, పూర్వము కూడ అతడు నాకొరకు వండినమాంసమునేను తిన్నానని నిందించినాడు" అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకుటుంబమున బుట్టి వయసు వచ్చిన పిమ్మట ప్రవ్రజించి, హిమవత్ప్రదేశము నుండి లవణామ్లములకై వారాణసికి వచ్చి, మరునాడు భిక్షార్థము నగరములోనికి జనెను. అప్పు డొక కుటుంబి తాపసుని బాధించు తలంపుతో ఇంటిలోని కాహ్వానించి, పరచిన యాసనముపై గూరుచుండబెట్టి, మత్స్యమాంసములు వడ్డించి, భోజనప్రారంభమున ఒకప్రక్కగా గూరుచుండి "ఈమాంసము మీ కొరకే జంతువును సంహరించి సిద్ధము చేయించినది. ఇయ్యది అకార్యము. మాకుమాత్రము కాక మీకుకూడ పాపమే' అని ఈగాథ పలికెను

మర్దించి పీడించి ప్రమందించువాని
సలుపును దాన మసంయతచిత్తు
డిట్టిదానిని భుజియించినవాడు
నైతము పాపాన స్వామ్యభాజను డగు.

బోధిసత్త్వుడది విని ఈగాథ పలికెను:

సంయమహీనుండు చంపి కుమారు
భార్యను వండింప, దానిని తిన్న
ప్రజ్ఞా క్షమాశాలి పాపాన పోడు.

ఇట్లు బోధిసత్త్వుడు వానికి బోధించి, ఆసనమునుండి లేచి, వెడలి పోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున గృహస్థు నిగంఠనాథ పుత్రుడు, తపస్విని నేనే

# 247 పాదంజలి జాతకము

శాస్త జేతవనమున విహరించుచు లాలుదాయి స్థవిరుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు ప్రధానశిష్యు లిరువురు ప్రశ్నలను విచారించుచుండిరి. భిక్షువులు ధర్మసభలో స్థవిరులను ప్రశ్నించుచుండిరి. పరిషత్తులో నున్న లాలుదాయి స్థవిరుడు పెదవులు చప్పరించి వారితో సమానముగ వారి కేమి తెలియును?' అన్నాడు. భిక్షువులు ధర్మసభలో గూర్చుండ శాస్త అరుగుదెంచి, విషయము తెలిసికొని లాలుదాయి యిప్పుడే కాదు, పూర్వముకూడ పెదవులు చప్పరించుట తప్ప మ రేమియు నెరుగడు' అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డాయనకు అర్థధర్మానుశాసకు డగు నమాత్యుడయ్యెను. రాజుకు పాదంజలి యను కుమారుడు మూర్ఖుడు, సోమరి కలడు. కాలక్రమమున రాజు మృతిచెందెను. అమాత్యులు కర్మలు చేయించి పాదంజలికి రాజ్యాభిషేకము చేయుదమా యని ఆలోచించిరి. బోధిసత్త్వుడు వారితో "రాజకుమారుడు మూర్ఖుడు, అలసుడు. కావున నితనిని పరీక్షించినపిమ్మట అభిషేకము చేయుదము" అని పలికెను.

అమాత్యులు న్యాయస్థానము సిద్ధము చేసి, నిర్ణయమునకై రాజకుమారుని సమీపమున గూరుచుండబెట్టుకొని, అభియోగమును విచారించి, తలక్రిందుతీర్పు చెప్పి, కుమారునితో "కుమారా, నిర్ణయ మె ట్లున్నది? సరిగా నున్నదా?" అనిరి. అతడు పెదవులు చప్పరించెను. "కుమారుడు పండితుడు. నిర్ణయము సరిగా లే దని గ్రహించినట్లు తోచుచున్నది" అని తలచి బోధిసత్త్వు డీగాథ పలికెను:

బాలుం డందరకన్న ప్రజ్ఞ కలాడు
అరసియే పెదవిని విరిచినవాడు—
ఈతంత్ర మెల్ల గ్రహించియే యుండు.

అమాత్యులింకొకనాడు వేరొకయభియోగము విచారించి యోగ్యముగా నిర్ణయించి "దేవా, ఎట్లున్నది? నిర్ణయము యుక్తమేనా?" అనిరి. పాదంజలి మరల పెదవులు చప్పరించెను. వాని యజ్ఞానము గ్రహించి బోధిసత్త్వుడు ఈగాథ పలికెను:

ధర్మంబు కాని యధర్మంబు కాని
అర్థంబు కాని యనర్థంబు కాని
ఎరుగడు పెదవిని విరుచుట తప్ప.

అమాత్యులు పాదంజలి కుమారుని మూర్ఖత గ్రహించి, బోధిసత్త్వునికి రాజ్యాభిషేకము చేసిరి.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుజాతకములు సరిపోల్చెను ఆకాలమున పాదంజలి లాలుదాయి; పండితామాత్యుడు నేనే.

## 248 కింసుకోపమ జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండ కింసుకోపమసూత్రవిషయమై చెప్పినది.

### వర్తమానకథ

నలుగురు భిక్షువులు తథాగతుని సన్నిధికి చేరి కర్మస్థానముల తెలిసికొన గోరిరి. శాస్త వారికి కర్మస్థానములు దెలిపినపిదప వారు కర్మస్థానములను గ్రహించి తమనివాసములకు చనిరి. అందులో నొకడు ఆరుస్పర్శాయతనములను పరిగ్రహించి అర్హత్వము పొందెను. ఒకడు పంచస్కంధములను, వేరొకడు చతుర్మహాభూతములను మరియొకడు అష్టాదశధాతువులను గ్రహించి, తమ అర్హత్వప్రాప్తిని తథాగతునికి నివేదించిరి. భిక్షువులలో నొకనికి "ఈకర్మస్థానములు భిన్నభిన్నములుగా నున్నవి; నిర్వాణ మొక్కటే; అందరకు అర్హత్వప్రాప్తి ఎట్లు సిద్ధించినది?" అను సంశయము కలిగెను.

"భిక్షూ, కింసుకము జూచు సోదరులకువలె నీకు భేదము ఎట్లు

కలిగెను ?'' అని, శాస్త్ర వారి ప్రార్థనపై పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండు కాలమున నతనికి నలుగురుపుత్రు లుండిరి. వా రొకనాడు సారథిని బిలిచి "మిత్రమా, మాకు కింశుకవృక్షమును జూచుకోరిక కలిగినది. మాకు చూపుము" అనిరి. మంచిది అని వాడు నలువుర నొకసారి తీసికొనిపోవక, పెద్దవానిని రథమున గూరుచుండబెట్టుకొని, అరణ్యమునకు గొని పోయి అంకురించుచున్న కింశుకమును జూపెను. చిగురుటాకులు దొడుగుకాలమున నొకనిని, పూవులు విడుచుకాలమున నొకనిని, పండ్లు పండుకాలమున నొకనిని గొనిపోయి సారథి కింశుకవృక్షమును జూపెను. కొంతకాలమునకు సోదరు లొకచో జేరి కింశుక మిట్టిది అను విషయము ప్రస్తావించిరి.

అం దొకడు కాలిన మోడువలె నుండు నన్నాడు. రెండవవాడు న్యగ్రోధమువలె నుండు ననెను. మూడవవాడు మాంసపేశికవలె నుండు నని పలికెను. నాలుగవవాడు పలాశమువలె నుండు ననెను. పరస్పరవర్ణనమున నసంతుష్టులై వారు తండ్రికడ కేగి "దేవా, కింశుక మె ట్లుండును?'' అని యడిగిరి.

"మీ రేమనుకొన్నారు?" అని తండ్రి యడుగగా వారు జరిగిన వృత్తాంతము తెలిపిరి.

"మీరు నలుగురు కింశుకము నొక్కసారిగా చూడలేదు. ఏయే కాలమున కింశుక మేవిధముగా నుండు నని విభజించి అడుగలేదు. కావున వివాదము పుట్టినది'' అని రాజు ఈగాథలు పలికెను

ఎల్లరు కింశుక మీక్షించినారు
కాని సంశయ మేల కలిగెను మీకు?
అన్నియవస్థలయందు సారథి నె
ప్రశ్నించుచో నేమి ఫలము లభించు?

ఎల్లధర్మంబుల నెరుగ కెవ్వండు
కింశుకమ్మును గూర్చి సంశయం బొందు

నన్నదమ్ములవోలె ననుమాన మొందు
ధర్మసూక్ష్మములశోధనలోన జనుడు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములం సరిపోల్చెన; ఆసమయమున వారణాసిరాజు నేనే.

# 249 సాలక జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక మహాస్థవిరుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆతడు ఒక కుమారుని ప్రవ్రజితుని చేసి వానికి శ్రమకలిగించుచుండెను. బాధపడలేక అతడు చీవరములు త్యజించెను. స్థవిరుడు పోయి 'కుమారా, నీ చీవరము నీకడనే యుండుగాక; పాత్రకూడ ఉండుగాక; నాకడ నున్న చీవరములు పాత్రయు నీవే యగును. రమ్ము, ప్రవ్రజింపుము' అనెను. నేను ప్రవ్రజింపను. అనుచు, మాటిమాటికి అతడు పట్టుదల పట్టుటచే కుమారుడు ప్రవ్రజించెను.

నాటినుండి స్థవిరుడు అతనిని శ్రమపెట్టసాగెను. అతడు బాధల కోర్వలేక చీవరము త్యజించెను. స్థవిరుడు ఎన్ని పర్యాయములు చెప్పినను ఆతడు ప్రవ్రజింపక 'నీవు నన్ను బ్రదుకనిచ్చుట లేదు. నేను లేకుండ నీ వుండజాలవు. పొమ్ము, నేను ప్రవ్రజింపను' అని పలికెను.

భిక్షువులు ధర్మసభలో ఈవిషయమై సంభాషించుచుండ, శాస్త అచ్చటి కరుగుదెంచి, విషయము తెలిసికొని 'భిక్షువులారా, ఈతడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ సుహృదయుడే. ఒక పర్యాయము ఆతనిదోషము తెలిసికొని మరల పరిగ్రహింపలేదు' అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడొక కుటుంబియింట పుట్టి పెద్దవాడయి ధాన్యవ్యాపారము చేసి జీవనము చేయుచుండెను. ఒకానొక పాములవాడు కోతికి ఆట నేర్పి, ఓషధులు సంగ్రహించి, పాముల నాడించుచు జీవనము చేయు చుండెను. వారాణసిలో ఉత్సవము జరుగు నను ఘోషణ విని, వేడుకలో పాల్గొన దలచి వాడు ధాన్యవిక్రేతకడ తనకోతిని విడిచి కనిపెట్టి యుండు మని చెప్పిపోయి, సప్తాహమునకు మరలివచ్చి 'నాకోతి యేది' అని అడిగినాడు. కోతి తన యజమానుని కంఠధ్వని విని, ధాన్యవిక్రయ శాలనుండి వేగముగా వెలువడెను. వాడు దానివీపుమీద వెదురు బద్దతో కొట్టి దానిని గొనిపోయి ఉద్యానములో నొకమూల కట్టివేసి, తాను పండుకొని నిద్రించెను. వాడు నిద్రించుట గ్రహించి మర్కటము బంధనమునుండి విడిపించుకొని, పారిపోయి, మామిడిచెట్టెక్కి పండు తిని, టెంక పాములవాని యొడలిపై బడవేసెను మెలకువ వచ్చి వాడు చూచి మర్కటమును మధురవాక్కులతో వంచించి చెట్టునుండి దింపగలను అని తలంచి, దానిని ఉపలాలించుచు ఈగాథ పలికెను

ఏక పుత్రునివలె నుండి మాకులమున
పంచికొందువు మాభోగభాగ్యములను
అవతరింపుము భూరుహా, మస్మదీయ
మందిరము సాలకా, చెరకొందమోయి

అది విని మర్కట మీ గాథ పలికెను

నన్ను కోరెద నిందు మనమ్ము తోడ
నీవు. వేణుదండముతోడ చావమోది
నాడ! వింటికి సుఖముగా వడవచ్చు;
ఉందు పక్వామ్రఫలవనమందు నేను.

ఇట్లు పలికి మర్కట మెగిరి వనములో జొరబడెను. అహితుండి కుడు అసంతుష్టచిత్తముతో నిజగృహమున కరిగెను.

శాస్త ధర్మోపదేశము చేసి రెండుజాతకములు సరిపోల్చెను. ఆసమయమున వానరము శ్రమణుడు, పాపులవాడు మహాస్థవిరుడు, ధాన్యవ్యాపారి నేనే.

## 250 కపి జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మోసగాడైన భిక్షువు విషయమై జెప్పినది.

### వర్తమాన కథ

ఆతని మోసము భిక్షువులకు స్పష్టమయ్యెను. వారు ధర్మసభలో కూరుచుండి ఈవిషయమై మాటాడుచుండగా శాస్త అరుగుదెంచి, "భిక్షువులారా, ఈభిక్షువు ఇప్పుడే మోసగాడు కాదు. పూర్వము గూడ మోసగాడే. ఈతడు వానరముగా నున్నప్పుడు కేవలము అగ్నికోసమై మోసము జేసెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో బ్రాహ్మణవంశమున జన్మించెను. ఆయనకు కుమారుడు కలిగి, వాడు గంతులు వేయుచు ఆటలాడు కాలమున బ్రాహ్మణి మృతిపొందగా నతడు పుత్రు నెత్తుకొని హిమాచలమున కరిగి, ప్రవ్రజించి, కుమారునిగూడ తపస్విని జేసి, పర్ణశాలలో నివసించుచుండెను. వర్షఋతువులో ముసలవృష్టి కురియు చుండగా మర్కటమొకటి దంతములు కటకటలాడుచుండ వణకుచు త్రోవ తప్పిపోయెను. బోధిసత్త్వుడు పెద్దపెద్ద దుంగలు తెచ్చి నిప్పు చేసి, మంచెపై బండుకొనెను. కుమారుడు తండ్రిపాదములు పట్టుచు కూరుచుండి యుండెను.

కపి మృతతాపసుని వల్కలాదులు సంగ్రహించి ధరించి, ఒకభుజముపై అజినము వేసికొని, కమండులువు పట్టుకొని ఋషివేషమున పర్ణశాలాద్వారముకడకు బోయి అగ్నికొరకు నిలుచుండెను.

తాపసకుమారుడు దానిని జూచి "నాయనా, ఎవరో తపస్వి శీత పీడితుడై వణకుచు నిలుచున్నాడు. ఇక్కడకు పిలువుడు. చలి కాచుకొనును" అని తండ్రిని వేడువాడయి ఈగాథ పలికెను:

సంయమి నాయనా, చలిచేత బాధ
పడుచున్నవాడు లోపలికి రావించి
ఋషికష్టమును తొలగించి వేయుదము.

బోధిసత్త్వుడు కుమారునివాక్కులు విని, చూచి, అది కపి యని గ్రహించి, ఈగాథ పలికెను·

కాదు సంయమి యితడు; వృక్షములమీద
తిరుగుచుండెడి దుష్టవానరము సుమ్ము,
దీని కెంతయు క్రోధమ్ము లోని కిద్ది
వచ్చునెడ పాడుచేయు నావాస మెల్ల.

ఇట్లు పలికి బోధిసత్త్వుడు మండుచున్నకొరవి తీసి బెదరించెను. మర్కటము గంతువేసి, అడవిలోనికి పరుగెత్తి, మరలిరాలేదు.

బోధిసత్త్వుడు అభిజ్ఞలను సమాపత్తులను పొంది, కుమారునకు 'కసిణ-పరికమ్మ' బోధించెను. అతడుకూడ అభిజ్ఞలను సమాపత్తులను పొందెను. ఉభయులును అపరిహీనధ్యానులై బ్రహ్మలోకపరాయణు లయిరి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వానరము మోసగాడైన భిక్షువు; పుత్రుడు రాహులుడు; తండ్రి నేనే.

# 251 సంకప్ప జాతకము

శాస్త జేతవనమున నుండగా ఒకానొక ఉద్విగ్నచిత్తుడైన భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తినివాసి యగు ఈయువకుడు బౌద్ధధర్మమున విశేషశ్రద్ధాపూర్వకముగ ప్రవ్రజించెను. ఒకనా డతడు నగరమున భిక్షార్థము పర్యటించుచు ఆభరణాలంకృత మైన కామినిని చూచి ఉద్విగ్నచిత్తుడై అన్యాయత్తచిత్తుడై తిరుగజొచ్చెను. అతడు వివరము లన్నియు తెలిసి గృహస్థు కాగోరెను. ఆయుష్మన్, రాగాదిక్లేశపీడితు లయిన వారిని శాస్త క్లేశదూరులను చేసి శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠించును. రమ్ము, శాస్తసన్నిధికి కొనిపోవుదుము" అని వారు అతనిని తీసికొని పోయిరి.

"భిక్షువులారా ? ఇచ్చలేని యీ భిక్షువును ఏల కొనివచ్చితిరి?" అని శాస్త అడిగెను. వారు వృత్తాంతము వివరించిరి.

"భిక్షూ, నీవు నిజముగ ఉద్విగ్నచిత్తుడ వైతివా !" అని శాస్త ప్రశ్నించెను.

"భన్తే, నిజమే"

"ఎందువలన !"

అతడు హేతువును వివరించెను.

"భిక్షూ, పూర్వకాలమునకూడ నీమె ధ్యానబలమున తమ మనోమాలిన్యమును ప్రక్కకు త్రోసివేసిన పవిత్రప్రాణుల చిత్తములనుకూడ కామగ్రస్తములుగ చేసినది. అట్టివారలే ఉద్విగ్నులయినపుడు నీవంటి సామాన్యునివిషయమై చెప్పనేల ? ఉత్తములగువారుకూడ అపకీర్తి చెందుదురన్నచో అపవిత్రులమాట చెప్పనేల ? సుమేరుపర్వతమును ఊపగల వాయువు ఎండుటాకులను ఎగురగొట్టజాలదా ? బోధివృక్షము క్రింద కూరుచుండి సాధనచేయువ్యక్తినికూడ కోర్కె కదలించినపుడు నీవంటివాని సంగతి ప్రత్యేకింప నేల ?" అని శాస్త పలికి, భిక్షువు ప్రార్థనమీాద పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీతకథ

పూర్వము బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల ధనము గల ఉన్నతబ్రాహ్మణ వంశమున పుట్టి, పెరిగి పెద్దవాడయి, తక్షశిలలో సర్వవిద్యలు నేర్చి వారాణసికి మరలివచ్చి, వివాహముచేసికొని, తలిదండ్రులు పోయినపిమ్మట వారికి దహనాది సంస్కారములు చేసి, ధనముమీద ధ్యానముంచెను. ధనము కానబడుచున్నది, కాని ధనమును కేంద్రీకరించినవాడు కనబడుట లేదు అను విషయమును గమనించినప్పు డతనికి ఆవేశము కలిగినది. ఒడలు చెమటలు పోయసాగెను.

చాలకాల మతడు గృహస్థుగా నుండి, భూరిదానములు చేసి, కామభోగములు విడిచి, కన్నుల నీరుకారుచుండ, జ్ఞాతులను విడనాడి, హిమాలయము ప్రవేశించి రమణీయప్రదేశమున పర్ణశాల నిర్మించుకొని, ఉంఛవృత్తి నవలంబించి, కాననములోని కందమూలఫలములను భుజించుచు, జీవనయాత్ర నడపుచుండెను. కొలదికాలములోనే అభిజ్ఞలను, సమాపత్తులను పొంది, ధ్యానరతుడై బహుకాల మచట నివాసము చేసెను. “జను లున్నచోటికి బోయి ఉప్పుపులుసు సేవింతును. శరీరము స్వస్థమగును, ప్రయాణముకూడ చేసిన ట్లగును. నావంటి సదాచారునకు భిక్ష మిచ్చి అభివాదనముచేసి లోకులు స్వర్గగాము లగుదురు” అని ఒకనా డాయన తలపోసెను.

ఆయన హిమాలయమునుండి దిగి, పర్యటనము చేయుచు, వారాణసి చేరి, సూర్యాస్తమయసమయమున రాత్రి నివాసము వెదకుచు, రాజోద్యానమును గాంచెను. ఆప్రదేశము యోగాభ్యాసమున కనుకూల మని, అచట నిలవ దలచి, ఉద్యానమున ప్రవేశించి, ఒకానొక వృక్షమూలమున కూరుచుండి, రాత్రి ధ్యానసుఖమున గడపెను. మరునాడు కాలకృత్యములు నిర్వర్తించి, పూర్వాహ్ణమున అజినవల్కలములు ధరించి, భిక్షాపాత్రము చేతబట్టుకొని, శాంతచిత్తముతో, శాంతిముద్రతో, వర్చస్సుతో, నిజసౌందర్యముతో లోకులనేత్రముల నాకర్షించుచు నగరములో ప్రవేశించి, భిక్ష వేడుచు, రాజనివాసము చేరెను.

పైయంతస్తున నున్న రాజు వాతాయనములనుండి బోధిసత్త్వుని గాంచి, ఆయనపై ఖరికి ప్రసన్నుడై, "శాంతధర్మమున్నచో ఈయనలో నుండును" అని యోచించి, అమాత్యుని బిలిచి, ఆతపస్విని కొని రమ్మని" అని పంపెను. అమాత్యుడు పోయి బోధిసత్త్వునకు ప్రణామము చేసి, భిక్షాపాత్ర చేతబట్టుకొని, "భన్తే, ప్రభువు మిమ్ము ఆహ్వానించుచున్నారు" అని విన్నవించెను. "పుణ్యాత్ముడా, రాజును నే నెరుగను" అని ఆయన చెప్పగా, "అయినచో భదన్తా, నేను వచ్చు వరకును తా మిచ్చటనే యుండుడు" అని అమాత్యుడు రాజుకడకు బోయి సమాచారము తెలిపెను. "రాజకులమునకు విశ్వాసయోగ్యు డగు తాపసి యెవ్వడు లేడు. పోయి ఆయనను తీసికొని రమ్ము" అని రాజు లేచి, కిటికీలోనుంచి చేతులు వెలుపలికి పెట్టి ప్రణామము చేసి "భన్తే, ఇటు దయచేయుడు" అనెను. బోధిసత్త్వుడు భిక్షాపాత్ర నమాత్యుని చేతి కిచ్చి, మేడమీది కెక్కెను.

"మేము హిమాలయనివాసులము మహారాజా, మేము హిమాలయమునుండి వచ్చినాము."

"ఎందువలన?"

"మహారాజా, వర్షాకాలమున నిలుకడగా నుండుటకు చోటు కావలసి.

"అయినచో భన్తే, రాజోద్యానమున నివసింపుడు. మీకు నాలుగు ప్రత్యయములకు లోటుండదు. నన్ను స్వర్గమునకు గొనిపోవు పుణ్యము లభించును."

బోధిసత్త్వునిచే సరే అనిపించి, రాజు భోజనానంతరము ఆయన వెంట ఉద్యానమునకు జని, అచ్చట పర్ణశాలయు, పచారుచేయు చోటును ఏర్పాటుచేయించి, పగటివేళను రాత్రివేళను ఉండుటకు స్థానములు నిర్మాణము చేయించెను. ప్రవ్రజితులకు వలసిన వస్తువుల నిచ్చి, "భన్తే, సుఖముగా నుండుడు" అని, ఆయనను కనిపెట్టి యుండుమని ఉద్యానపాలకునితో చెప్పెను.

బోధిసత్త్వు డక్కడ పండ్రెండు సంవత్సరము లుండెను.

కొన్నాళ్ళకు ఉపరాష్ట్రమున విద్రోహము చెలరేగెను. దాని నణచ గోరిన రాజు పోవునపుడు దేవితో "భద్రే, నీవో నేనో నగరమున

ఆగిపోవలెను'' అని పలికెను.

"దేవా, ఏల ఇట్లనుచున్నారు?"

"భద్రే, సదాచారుడైన తాపసికోసము."

''దేవా, నేను ప్రమాదము జరుగనీయను. ఆర్యుని సేవాభారము నామీద విడిచి, మీరు నిర్విచారముగా చనుడు."

రాజు బయలుదేరిపోయెను. దేవి యథాప్రకారముగా బోధిసత్త్వునికి సేవలు చేయుచుండెను. రాజు వెడలిపోయిననాటినుండి బోధిసత్త్వుడు నియమితసమయములో కాక తన యిచ్ఛ వచ్చినప్పుడు రాజమందిరమునకు బోయి భోజనము చేయుచుండెను.

ఒకనాడు బోధిసత్త్వుడు మిగుల నాలసించుటచే దేవి భోజనపదార్థములు సిద్ధము చేసి, జలకమాడి అలంకారము చేసికొని, చిన్న మంచము వాల్చుకొని, బోధిసత్త్వుని రాక కెదురుచూచుచు బుటేదారీపనితనముగల వస్త్రమును వదులుగా ధరించి పండుకొనియుండెను. బోధిసత్త్వుడు ప్రొద్దుపోవుట చూచి, భిక్షాపాత్రము కైకొని, ఆకాశమార్గమున వచ్చి పెద్దకిటికీవద్ద ద్వారముకగ నిలిచెను. ఆయనవల్కలము చప్పుడు విని, తొందరతో లేచుచున్న రాణి పసుపుపచ్చని వలిపెము జారిపోయెను. బోధిసత్త్వుడు* విపక్ష - ఆలంబనము లగు నింద్రియములను చూచి విచలితుడయినను శుభము భావించి, చూచెను. ధ్యానబలముచే నతెడు శాంతించినను బుట్టలోనుండి పాము పడగ విప్పినట్టు వికారము ప్రకోపించి నిలిచెను. పాలచెట్టుబెరడును బాడిదతో చెక్కినట్టులాయెను. వికార ముత్పన్నమైనతోడనే ధ్యానబలము నశించెను, ఇంద్రియములు మాలిన్యయుక్తము లాయెను. కాకి తనను తాను పొడుచుకొనుచున్నగతి ఆయనకు పట్టెను. యథాప్రకార మాయన భోజనము చేయజాల డయ్యెను. కూరుచుండు మన్నను కూరుచుండలేదు.

భోజనపదార్థము లన్నియు దేవి భిక్షాపాత్రమున నుంచెను. అనుదినము భోజనానంతరము కిటికీవెంట గగనమార్గమున పోవు తాపసి ఆనాడు పోవజాలక, పాత్రను కొని పెద్దమెట్లవరుసవెంట దిగి, ఉద్యానమునకు బోయెను. తనయెడ ఆయన ఆసక్తు డయినాడని దేవి

* స్త్రీకి పురుషుడు, పురుషునకు స్త్రీ విపక్ష ఆలంబనము.

గ్రహించెను. తాపసి ఉద్యానము చేరి, భుజింపక, పాత్రను మంచము క్రింద బడవైచి "దేవిగారి కరసౌందర్య మిట్టిది, పాదశోభ యిట్టిది, నడుము క్రిందిభాగ మిట్టిది, జంఘ లిట్టివి" అను ప్రలాపములు చేయుచు, వారము దినములు పడియుండెను. ఆహారపదార్థములు కుళ్ళి పురుగులు పడెను.

రాజు రాష్ట్రమును శాంతపరచి, అలంకరించిన నగరమునకు ప్రదక్షిణము చేయకుండనే బోధిసత్త్వుని చూచుకోరికతో ఉద్యానము చేరి ఆశ్రమమున కసవు పడియుండుటచే తాపసి వెడలిపోయె ననుకొని, పర్ణశాలాద్వారము తెరచి, లోపల ప్రవేశించిన పిదప ఆయన పండుకొని యుండుట గాంచి, వ్యాధిగ్రస్తుడై యుండు నని భావించి, కుళ్ళినయాహారమును పారవేయించి, పర్ణశాల బాగుచేయించి 'భన్తే, ఏమి రోగము?' అని యడిగెను.

"మహారాజా, బాణవిద్ధుడ నయినాను."

నాశత్రువులు నాకు హాని కలిగించుటకై అవకాశము దొరకక, ఈయనను మర్మస్థలమున కొట్టించి యుందు రని భావించి రాజు, గాయము చూచుటకై తాపసిని ప్రక్కకు దొరలు మని కోరెను. ఆయన గాయము చూపనందున 'భన్తే, గాయ మెక్కడ?' అనెను.

'మహారాజా, నన్ను వే రెవ్వరు గాయపరచ లేదు. నాయంతన నేనే హృదయమును బాణముతో కొట్టుకొన్నా' నని బోధిసత్త్వుడు లేచి, ఆసనమున కూరుచుండి ఈగాథలు పలికెను.

ధానుష్కు డెవ్వడో తనకర్ణమూలంబు
వరకు నాకర్షించి వదలు నలుగునగాని;
పదను వెట్టుచు సానపై, మయూరము పింఛ
పత్రముల్ కట్టిన బాణమ్ముచే గాని
ఘటియిల్ల దీఘాత;

కనరాదు రక్తంబు
స్రవియించు గాయమ్ము; స్వాంతమ్మం బోనిచ్చి
కుపథాన, దుఃఖమ్ము గొనితెచ్చికొన్నాను.

కామాదు లొకనాడు ధ్వాశనం బొనరించి
సంకల్పబలముచే సంతరించిన యెడద

మరల కామమ్మ్మచె మందు ఘాతము పొంది
కాయంబు సర్వంబు కాల్చివేయును సుమీ!

ఈప్రకారముగా బోధిసత్త్వుడు మూడు గాధలు పలికి, రాజుకు ధర్మోపదేశముచేసి, ఆయనను పర్ణశాలవెలుపల కంపి, నష్టమైన ధ్యానమును యోగమున సంతరించుకొని, పర్ణశాలలోపలినుండి యీవలకు వచ్చి, ఆకసమున కెగసి కూరుచుండి రాజు కుపదేశ మిచ్చువాడై 'మహారాజా, నేను హిమాలయమునకు పోవుదు" ననెను. "వీలు లేదు" అన్నాడు రాజు. ఆయన యిట్లు ప్రార్థించినను బోధిసత్త్వుడు "మహారాజా, ఇక్కడ నుండుటచేత నా కీయాందోళనము కలిగినది ఇక నే నిచ్చట నుండలేను" అని గగనమార్గమున హిమాలయము చేరెను.

బోధిసత్త్వు డక్కడ యావజ్జీవితము నివసించి. తుదకు బ్రహ్మలోక గామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకమును సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; తపస్వి నేనే

## 252 తిలముట్ఠి జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక క్రుద్ధచిత్తుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకానొక భిక్షువు క్రోధస్వభావము కలవాడు; మిగుల చంచల చిత్తుడు. కొలదిమాటలతోనే అతనికి ఒడలు మండిపోవును.

భిక్షువులు ధర్మసభలో చేరి ఒకనాడు సంభాషించుచు "ఆయుష్మంతులారా, ఫలాని భిక్షువు క్రోధరహితమైన బుద్ధశాసనమున ప్రవ్రజించియు నాతడు నిప్పుమీాద ఉప్పువేసినట్లు భగ్గున మండిపడుచు కోపము నాపుకొనజాల కున్నాడు'' అనిరి. శాస్త విని, ఆభిక్షువును పిలిపించి-

"ఏమి భిక్షూ, నీవు నిజముగా కోపపరవశుడవా?"

"భ న్తే, సత్యమే."

"భిక్షువులారా, యీతఁ డిప్పుడే కాదు; పూర్వముకూడ కోపనుఁడే" అని శాస్త్ర పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుఁడు రాజ్యము చేయుచుండఁగా ఆయనకు బ్రహ్మదత్తకుమారుఁ డను పుత్రుఁ డుండెను. నగరమున ప్రసిద్ధ విద్వాంసు లున్నను వెనుకటిరాజులు విద్యాసంగ్రహణార్థము తనబిడ్డలను దూరప్రదేశములకు పంపుచుండెడివారు. అందువలన బిడ్డల యహంకారము తొలఁగు ననియు, శీతోష్ణసహిష్ణుత యేర్పడు ననియు, లోకవ్యవహారముకూడ తెలిసికొందు రనియు వారి యభిప్రాయము. ఈరాజుకూడ పదునారువత్సరముల నిజపుత్రుని పిలిచి, జతపాదరక్షలు, గొడుగు, వేయి కార్షాపణములు నిచ్చి, 'నాయనా, నీవు తక్షశిలకు పోయి, విద్య లభ్యసింపుము' అని పంపెను. మంచి దని యతఁడు తలిదండ్రులకు ప్రణామము చేసి, సెలవు తీసికొని, పోయి తక్షశిల చేరెను. చేరి ఆచార్యునిగృహ మడిగి తెలిసికొని, ఆచార్యుఁడు శిష్యులకు పాఠములు చెప్పి, గృహద్వారముకడ నిలిచి యుండఁగా నచటికి పోయెను. ఆచార్యుఁడు కానఁబడినంతనే కాలిజోడు విడిచి, గొడుగు మూసి, ఆయనకు ప్రణామము చేసి నిలుచుండెను. అతఁడు బడలి యుండుట చూచి ఆచార్యు డతని కాతిథ్య మిప్పించెను. భోజనానంతరము రాజకుమారుఁడు కొంచెము విశ్రమించి, గురువుకడకు బోయి ప్రణామము చేసి నిలిచెను.

'నాయనా, ఎక్కడనుండి వచ్చినావు?' "వారాణసినుండి." "ఎవరి కుమారుఁడవు?" "వారాణసిరాజుకుమారుఁడను." "ఏల వచ్చితివి?" "విద్య లభ్యసించుటకు." "ఆచార్యభాగము తెచ్చినావా? ధర్మ శిష్యుఁడవు కాఁగోరుచున్నావా?"

"ఆచార్యభాగము తెచ్చినా" నని యతఁడు వేయి కార్షాపణముల సంచిని ఆచార్యునిపాదసన్నిధిలో నుంచి, ప్రణామము చేసెను.

ధర్మశిష్యులు పగలెల్ల గురువుగారిపనులు చేయుచు రాత్రుల

లందు విద్య లభ్యసింతురు. ఆచార్యభాగ మిచ్చువారు జ్యేష్ఠపుత్రుని వలె నుండి కేవలము విద్యాభ్యాసము చేయుదురు. ఆచార్యుడు మంచినక్షత్రము చూచి, రాజకుమారునకు విద్య ప్రారంభించెను.

విద్యలు నేర్చుచు రాజకుమారు డొకనాడు స్నానార్థ మాచార్యుని వెంట నేగెను. అచట వృద్ధురాలు నువ్వులు బాగుచేసి, ఆరబోసి, కనిపెట్టుకొనియుండెను. రాజకుమారుడు చూచి గుప్పెడు నువ్వులు తీసికొని తినెను. వీడు లోభి యని ముసలిది తలపోసి ఏమియు నన లేదు. మరునాడు రాజకుమారు డటులే చేసెను. ముసలిది ఏమియు ననలేదు. మూడవనాడుకూడ రాజకుమారు డట్లే చేయగా వృద్ధురాలు చేతు లెత్తి యేడ్చుచు "ప్రసిద్ధగురువుగారు శిష్యులచేత దోపిడి చేయించుచున్నారు" అనెను. ఆచార్యుడు ఆగి "అమ్మా, ఏమిది?" అని అడిగెను.

"నేను పరిశుభ్రము చేసిన నువ్వులు తమశిష్యు డీనాడు గుప్పెడు, నిన్న గుప్పెడు, మొన్న గుప్పెడు తిన్నాడు. ఇట్లు చేసినచో నువ్వు లన్నియు నష్టమయిపోవా?" అన్నది వృద్ధురాలు.

"అమ్మా, విచారించకు. వానివెల ఇప్పింతును."

"నాకు వెల వద్దు. ఈకుమారుడు మరల ఇట్లు చేయకుండ శిక్షింపుడు."

"చూడు అమ్మా!" అని ఆచార్యుడు ఇరువురు బాలురచేత రాజకుమారుని పట్టించి, వెదురుకర్ర తీసికొని, "మరల ఇట్లు చేయవుగద" అని మూడుమారులు వాని వీపుమీద కొట్టెను. రాజకుమారుడు క్రుద్ధుడై ఆచార్యుని నఖశిఖపర్యంతము ఆరక్తనేత్రములతో వీక్షించెను. కుమారునకు చాలకోపము వచ్చెనని ఆచార్యుడు గ్రహించెను.

"విద్య పూర్తి అయినతరువాత ఆచార్యుని వారాణసికి బిలిపించి హతమార్చెదను" అనుకొని, రాజకుమారు డాచార్యునిపని మనసున నుంచికొనెను.

వారాణసికి వెడలిపోవునపుడు రాజకుమారుడు ప్రణామము చేసి, సస్నేహముగా "ఆచార్యా, నేను వారాణసిప్రభువు నయినతరువాత మిమ్ము పిలువనంపుదును. మీరు తప్పక దయచేయవలెను" అని, సమ్మతిపొంది చనెను. అతడు వారాణసికి పోయి, తలిదండ్రులకు ప్రణా

మము చేసి, విద్యాప్రదర్శనము కావించెను. "నేను జీవములతో నుండగా కుమారుని చూడగలిగితిని; జీవించియుండగనే ఇతనికి పట్టము కట్టెదను'' అని యోచించి, రాజు కుమారునకు రాజ్య మిచ్చెను.

అతడు రాజ్యము చేయుచు, ఆచార్యుడు తనకు చేసిన శిక్ష జ్ఞప్తికి తెచ్చుకొని ఉత్తేజితుడై "హతమార్తును'' అనుకొని ఆయనను కొని వచ్చుటకై దూతను పంపెను. 'రాజు తరుణావస్థలో నున్నాడు, గ్రహింపజాలడు.' అని తలచి ఆచార్యుడు బయలుదేరి రాలేదు. కొంతకాల మయిన పిమ్మట మధ్యవయస్సులో నున్న రాజు గ్రహింపగల డని యెంచి, ఆచార్యుడు పోయి వారాణసిలో రాజద్వారమున నిలిచి, తక్షశిలనుండి ఆచార్యుడు వచ్చినా డని వార్త పంపెను. రాజు సంతుష్టచిత్తుడై బ్రాహ్మణుని పిలువనంపి, ఆయన తనసన్నిధికి రాగా కోపోద్దీపితుడై ఎఱ్ఱబారిన కన్నులతో అమాత్యులవంక జూచి, ఆచార్యుడు నావీపుమీద గాయము చేసిన చోట నేటికిని నొప్పిగా నున్నది. ఆచార్యుడు మృత్యుగ్రస్తుడై వచ్చినాడు. నేటితో ఈయన బ్రదుకు సమాప్త మగును' అని ఈగాధలు పలికినాడు

జ్ఞప్తి యున్నది యానాటి సంఘటనము;
తిలలం గుప్పెడుమాత్రము తీయు నన్ను
పట్టి ముమ్మారు కర్రతో గొట్టినావు:
వచ్చితివి, జీవితముమీద వాంఛ లేద
నీకు అవనీసురోత్తమా, నిశ్చయముగ?

ఈవిధముగా ఆయనకు మృత్యుభయము చూపినాడు. విని ఆచార్యుడు ఈగాధ పలికినాడు.

అనుచితకార్యంబు నొనరించువాని
దండప్రయోగాన దమియించు నార్యు;
డద్ది వైరమ్ముగా పెద్దవా రనరు.

ఓ ప్రసన్ననేత్ర, ఉత్తమకులమున
పుట్టి ప్రవ్రజించి నట్టు తోచు.
కామభోగములను కాంచనాదికమును
విడిచి యెట్లు గృహము వెడలినాడ.

ఇట్లు తెలిపి ఆచార్యు డీవిధముగా చెప్పెను:

"మహారాజా, ఇట్టి వానిపై వైరము వహింపరాదు. నేను మిమ్ము అట్లు శిక్షింపకపోయినచో మీరు సమయము దొరకినపుడు పూరీలు, తినుబండములు, ఫలాఫలములు అపహరించుచు చౌర్యమున ఆసక్తులై క్రమముగా కన్నములు వేసి దారులుకొట్టి గ్రామాదుల నాక్రమించి యుందురు. మిమ్ము చోరునిగా నెంచి పదార్థములతో పట్టుకొని రాజ సమ్ముఖమున నుంతురు. వీని అపరాధమునకు తగిన దండన మిందు' అని రాజు శిక్ష విధించెడివాడు. మీకు రాజదండనము తగిలియుండెడిది. నేటిసంపత్తి మీకు ఎట్లు లభించెడిది? నావలననే మీ కీయైశ్వర్యము లభించినది.'

ఆయన చుట్టును అమాత్యులు చేరి ఆయనవాక్కులు విని రాజుతో 'దేవా, తమకు లభించిన ఈ యైశ్వర్యము ఆచార్యునివలననే సంప్రాప్తమైనది' అని పలికిరి. రాజు ఆచార్యునిగుణములను జ్ఞప్తికి తెచ్చుకొని 'ఆచార్యా, రాజ్యము, ఐశ్వర్యము తమకు సమర్పించుచున్నాను. స్వీకరింపుడు.' అని విన్నవించెను. 'నాకు రాజ్యముతో పనిలేదు' అని ఆచార్యు డంగీకరింపడయ్యెను.

రాజు భటులను తక్షశిలకు పంపి ఆచార్యునిభార్యను, బిడ్డలను రప్పించి విశేషసంపద వారి కొసంగి ఆచార్యుని నిజపురోహితునిగా చేసికొని తండ్రిస్థానమున నిల్పెను. ఆయన ఉపదేశానుసారముగ ఆచరించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు రాజు తుదకు స్వర్గగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అకాలమున రాజు క్రుద్ధభిక్షువు; ఆచార్యుడు నేనే.

# 253 మణికంఠ జాతకము

శాస్త ఆళవి సమీపమున అగ్గాళవ చైత్యమున విహరించుచు కుటిలకార శిక్షాపద మును గూర్చి చెప్పినది.

## వర్తమానకథ

ఆళవగ్రామమున భిక్షువులు కుటీరనిర్మాణసమయమున తమకు సాయముచేయు డని లోకులను కోరుచు తిరుగుచుండిరి. మనుష్యులు బెదరుచు భిక్షువులను చూచినపుడు వెరపు చెందుచు దూరముగా పోవుచుండెడివారు.

ఆయుష్మాన్ మహాకాశ్యపుడు ఆళవిలో ప్రవేశించి, భిక్షాటనము చేయజొచ్చెను. లోకులు స్థవిరుని చూచి నిజప్రవర్తనమును మానకరైరి. ఆయన భిక్షాటనమునుండి మరలివచ్చి భిక్షువులను సమావేశపరచి— "ఆయుష్మంతులారా! పూర్వము ఈ ఆళవిగ్రామములో భిక్ష సులువుగా దొరకుచుండెడిది. ఇప్పుడు దుర్లభమగుటకు కారణమేమి?" అని ప్రశ్నించి తెలిసికొనెను. భగవాన్ ఆళవిగ్రామమునకు వచ్చి చైత్యమున నివసించునపుడు కశ్యపుడు ఆయనసన్నిధికి జని యీవిష యము విన్నవించెను. శాస్త భిక్షువులందరను సమావేశపరచి, ఆళ్వక నివాసు లగు భిక్షువులతో "భిక్షువులారా, మీరు నిజముగ యాచన చేసి కుటీరము నిర్మాణము చేయించితిరా?" అని అడిగెను.

"సత్యమే" అని వారు పలికినపిమ్మట భగవానుడు వారిని మంద లించి, "భిక్షువులారా, సప్తరత్నములతో నిండిన నాగభవనవాసులకు కూడ యాచన యన్నచో అసహ్యము. మానవులసంగతి చెప్ప నేల? పాషాణమునుండి మాంసమును వెలువరించుట యెట్లో ఒక్క కార్షా పణము వారికడనుండి సంగ్రహించుట అట్లే" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు మహాధనికు డైన బ్రాహ్మణునియింట పుట్టెను. అతడు పెరిగి యిటునటు గంతులు వేయు కాలమున పుణ్యవంతు డొకడు

ఆతని తల్లికడుపున బుట్టెను. వా రిరువురు పెరిగి పెద్దవా రయిరి. తలి దండ్రుల మరణానంతరము వారు వైరాగ్యము చెంది ప్రవ్రజించి, గంగాతటమున పర్ణశాలలు నిర్మించుకొని నివసించుచుండిరి. జ్యేష్ఠుని కుటీరము గంగపై ఎత్తునను, కనిష్ఠుని కుటీరము క్రిందియెత్తునను ఉండెను.

ఒకనాడు మణికంఠు డను నాగరాజు నిజభవనమునుండి బయలు దేరి బ్రహ్మచారివేషముతో గంగయొడ్డున తిరుగుచు కనిష్ఠునికుటీరము దరిసి, ఆయనకు నమస్కరించి, ఒకప్రక్కగా గూరుచుండెను. పరస్పర కుశలప్రశ్నానంతరము వారికి విశ్వాసము జనించెను. ఒకరిని విడిచి ఒకరు విడిగా నుండలేకుండిరి. మణికంఠు డనుదినము కనిష్ఠునికడకు బోయి సల్లాపము లాడి, వెడలిపోవునపుడు ప్రీతిభరమున నిజరూపము దాల్చి ఆతపస్విశరీరమును చుట్టి కౌగిలించుకొని విశాలఫణము ఆయన శిరసుపై విప్పి యుంచుక విశ్రమించి, ప్రణామము చేసి, నిజభవనము నకు కదలిపోవును. భీతిచే తపస్వి కృశింపజొచ్చెను. వివర్ణుడై పాండు వదను డయ్యెను. ఆయననాడులు శరీరముపై కుబికెను.

ఆయన ఒకనాడు జ్యేష్ఠునికడకు జనెను. ఇట్లయితి వే మని అన్న తమ్ము నడిగెను. తమ్ముడు స్థితిగతులు వివరించెను. "ఆనాగుడు వచ్చుట నీ కిష్టమా కాదా?" అని అన్న యడిగెను.

"ఇష్టము లేదు."

"నీవద్దకు వచ్చునపుడు ఆనాగరాజు ఏ యలంకారము ధరించి వచ్చును?"

"మణిరత్న హారము."

"అట్లయిన, నాగరాజు వచ్చి కూరుచుండగానే ముందుగా మణి యిమ్మని అడుగుము. అతడు నిన్ను చుట్టుకొనకుండనే వెడలిపోవును. మరునాడు నాగుడు ఆశ్రమద్వారము చేరగానే మణి అడుగుము. మూడవనాడు నీవు గంగాతీరమున నిలిచి నాగుడు నీటిలోనుండి పైకి వచ్చుచుండగా మణి అడుగుము. ఇక నీకడ కాతడు రాడు."

విని మంచి దని తపస్వి నిజకుటీరమున కరిగెను. మరునాడు నాగ రాజు వచ్చినంతనే నీవు ధరించిన మణి నా కిమ్మనెను. అతడు కూరు చుండక త్వరితముగా వెడలిపోయెను. మరునాడు తపస్వి ఆశ్రమ

ద్వారముకడ నిలిచి నాగుడు రాగానే, నిన్న మణి నీయవైతివి. నే డయిన నిమ్మని అని యడిగెను. ఆశ్రమములోనికి రాకుండనే నాగుడు తిరిగిపోయెను. మూడవనాడు నాగరాజు నీటిలోనుండి పైకి వచ్చు చుండగా తపస్వి, నిన్ను కోరి నేటికి మూడవరోజు. ఈనా డయినను మణి ఈయవలెను అనెను. నాగరాజు నీటిలో నిలిచియే నిషేధిం చుచు ఈగాథలు పలికెను .

నాకు లభియించు నన్నపానమ్మ లెపుడు
మెండుగా దీన; అతియాచకుండ వీవు!
ఈమణి నొసంగ నీకు, నే నింకమీద
అడుగు నైతము పెట్ట నీ యాశ్రమమున!

తరుణు డెవ్వడో పాషాణతలముమీద
పదను పెట్టిన ఖడ్గంబు పట్టి యొరుని
భీతచిత్తుని జేసెడె రీతి, నీవు
కోరి దీనికి త్రాసంబు గూర్చినావు.

ఇట్లు పలికి నాగరాజు నీటిలో మునిగి నిజభవనమునకు బోయి, తిరుగ నెన్నడు ఆశ్రమమునకు రాలేదు. దర్శనీయు డైన యానాగ రాజు కనబడకపోవుటచే తపస్వి పూర్వముకంటెను ఎక్కువగా కృశించి పోయెను. తమ్మునిస్థితిగతులు తెలిసికొనుటకై అన్న వచ్చి చూడగా కనిష్ఠుడు పాండురోగివలె నుండెను. 'వెనుకటికంటె ఎక్కువగా పాలి పోయి యున్నా వేమి?'' అని అన్న అడుగగా తమ్ముడు ''దర్శనీయు డైన ఆనాగరాజు కనబడకుండుటచే'' అని ప్రత్యుత్తరము వచ్చెను. నాగరాజు లేకుండ కనిష్ఠు డుండలే డని గ్రహించి అన్న యీగాథ పలికెను

అన్యునకు ప్రియ మైన వస్తువు
నడుగ నెడ నదయించు ద్వేషము:
భూసురుడు యాచింప మణికై,
పోయె నాగ మదృశ్య మై.

ఇట్లు పలికి ఇకపై నితనినిగూర్చి యోజింపగూడ దని తలచి అన్న నిజాశ్రమమునకు బోయెను. అనంతరము వారు అభిజ్ఞలను సమా

పత్తులను పొంది, బ్రహ్మలోకపరాయణు లయిరి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున తమ్ముడు ఆనందుడు; అన్న నేనే.

## 254 కుండకకుంచ్ఛి సింధవ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు సారిపుత్ర స్థవిరుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఒకప్పుడు సమ్యక్సంబుద్ధుడు శ్రావస్తిలో చాతుర్మాస్యలు గడపి మరలి వచ్చిన పిదప బుద్ధుని భిక్షుసంఘమునకు లోకులు అతిథిసత్కారము చేయుటకై నియమప్రకారమున దానము లిచ్చిరి. విహారమున ధర్మఘోష చేయు భిక్షువును నియమించిరి. భిక్షార్థము వచ్చినవారిని వెంటనే ఎన్నుకొనెడివారు.

ఒకానొక దరిద్రవృద్ధస్త్రీ ఖాద్యవస్తువులు సిద్ధముచేసి భిక్షువుల నెన్నుకొన్న పిమ్మట ప్రొద్దెక్కి ధర్మభిక్షువు కడకు పోయి "నాకు ఒక భిక్షువును అనుగ్రహింపుడు" అనెను.

"నేను భిక్షువులందరను ఎన్నుకొన్నాను. సారిపుత్రస్థవిరుడు విహారమున నున్నాడు. నీవు ఆయనకు దానమిమ్ము" అని ఆతడు చెప్పెను.

ఆమె ప్రసన్నచిత్తురాలై "మంచి" దని జేతవనద్వారసమీపమున నిలిచి స్థవిరుడు వచ్చినంతనే ప్రణామము చేసి చేతిలోని పాత్ర తీసికొని ఇంటికి కొనిపోయి కూర్చుండబెట్టెను. ధర్మసేనాపతిని వృద్ధస్త్రీ ఇంట గూర్చుండబెట్టె నని వార్త వ్యాపించెను. కోసలనరేశు డగు ప్రసేనజిత్తు ఈవార్త వినినంతనే వస్త్రములు, వేయికార్షాపణములు వేసిన సంచి, ఆహారము నింపిన పాత్రలు పంపుచు, ఆర్యునకు భోజనసమయమున నీవస్త్రము కట్టబెట్టి, కార్షాపణములు ఖర్చుచేయవలసిన దని కబురంపెను. రాజువలె అనాథపిండకుడు, చిన్ని అనాథపిండకుడు,

మహోపాసిక విశాఖయు కార్షాపణాదులు పంపిరి. తక్క పరివార ములవారుకూడ యథాశక్తి వంద, రెండువందల కార్షాపణములు పంపిరి. ఈవిధముగ ఆనాడే ఆవృద్ధురాలికి లక్ష, కార్షాపణములు లభించినవి. ఆమె ఇచ్చిన యవాగు త్రాగి ఆమె వండిన వంటకములు భుజించి, దానానుమోదనానంతరము ఆమెను శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠించి స్థవిరుడు విహారమునకే మరలివచ్చెను.

ధర్మసభలో భిక్షువులు స్థవిరుని ప్రశంసించుట ప్రారంభించిరి. "ఆయుష్మంతులారా ధర్మసేనాపతి ముసలిపేదరాలి దారిద్ర్యము తొల గించినాడు; ఆమెకు సహాయుడైనాడు. ఆమె పెట్టిన భోజనము తప్ప ఆయన అన్య విషయమును తల కెక్కించుకొనలేడు అనుచుండ శాస్త్ర అచటికి వేంచేసి విషయము తెలిసికొని "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ సారిపుత్రుడు ఈమె పెట్టిన భోజనము భుజించి, సహాయభూతుడైనాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయు చుండగా బోధిసత్త్వుడు ఉత్తరాపథమున వణిజులయింట జన్మించెను. ఉత్తరాపథజనపదములోని వణిజుడు ఐదువందలగుఱ్ఱముల వ్యాపార మును చేయుచు వారాణసికి తెచ్చి విక్రయించుచుండును. వేఱొక గుఱ్ఱములవ్యాపారి ఐదువందల హయములను వారాణసీమార్గమున తోలుకొనివచ్చుచుండెను. వారాణసి సమీపములో చిన్నగ్రామము కలదు. పూర్వ మచ్చట మహాధనికుడైన వర్తకు డుండెడివాడు. అయనకు గొప్పసౌధ ముండెడిది. కాని కాలక్రమమున నష్టము సంప్రా ప్తించెను. ఇపుడు వృద్ధురాలుమాత్రము ఆయింట నివసించుచున్నది.

ఆ భారీవ్యాపారి నగరము చేరి బాడుగ యిత్తు నని ఆ యింట నివాసము ఏర్పరచుకొని గుఱ్ఱముల నొకప్రక్క నుంచెను. ఆనాడే ఆతని ఉత్తమాశ్వమునకు శిశువు జన్మించెను. అతడు రెండుదినము లచటనుండి రాజదర్శనార్థము గుఱ్ఱముల గొనిపోయెను.

వృద్ధురాలు ఇంటికి అద్దె యిమ్మని యడుగగా "మంచి దమ్మా, ఇచ్చెదను" అని అతడు అనెను. ఈ గుఱ్ఱపుపిల్ల నిచ్చి దానిమూల్యము

నా కీయవలసిన బాడుగకు మినహాయించుకొనుడు" అని ఆమె కోరగా వ్యాపారి యట్లే చేసి చనెను. వృద్ధురాలు ఆ గుఱ్ఱపుపిల్లను పుత్రుని వలె చూచుచు, గడ్డిగాదము వేయుచు, తౌడు మొదలైనవి పెట్టి పెంచుచుండెను.

బోధిసత్త్వుడు ఐదువందలగుఱ్ఱములను వెంటగొని వచ్చి ఆయింటనే మకాము వేసెను. కుండక, ఖాదక, సైంధవ శాబకము నివసించు చోటి వాసనతగిలి ఒక్కగుఱ్ఱముకూడ నింటిలో ప్రవేశింపజాలక పోయెను. అపుడు బోధిసత్త్వుడు వృద్ధురాలితో 'అమ్మా! ఈయింట గుఱ్ఱ మేమైన యున్నదా?' అనెను.

'నాయనా, ఈయింట మ రెవ్వరును లేరు. కాని గుఱ్ఱపుపిల్ల ఉన్నది. దానిని నేను బిడ్డవలె పెంచుకొనుచున్నాను.'

'అమ్మా! అది ఎచ్చట నున్నది?'

'నాయనా, అది మేత మేయుటకు పోయినది.'

'అమ్మా! అది ఎపుడు మరలి వచ్చును?'

'సాయంకాలము వచ్చును.'

బోధిసత్త్వుడు దాని రాకకై ఎదురుచూచుచు తక్కిన గుఱ్ఱములను వెలుపలనే నిలిపి, కూర్చుండెను. అశ్వశాబకము సాయంకాలమున కింటికి మరలి వచ్చెను.

బోధిసత్త్వుడు దానిని చూచి సులక్షణముల గమనించి, అయ్యది అమూల్యమని గ్రహించి, దానిని కొనవలచెను. సైంధవశాబకము ఇంటిలో ప్రవేశించి నిజస్థానమునకు పోయి నిలిచెను. తోడనే గుఱ్ఱములన్నియు లోపల ప్రవేశింపగలిగెను. బోధిసత్త్వుడు రెండు మూడు దినము లచట నుండి గుఱ్ఱములకు విశ్రాంతి యొసగి, వెడలిపోవునపుడు వృద్ధురాలితో 'అమ్మా, దీని విలువ తీసికొని గుఱ్ఱపుపిల్లను నా కిమ్ము' అనెను.

'నాయనా, ఏ మనుచున్నావు? పుత్రుని విక్రయించువా రెచటనైన నుందురా?'

'అమ్మా, నీవు దీనిని ఏమి పెట్టి పోషించుచున్నావు.'

'గంజి, నోకుడు, గడ్డి పెట్టి, కుడితి, యవాగు పోసి పెంచుచున్నాను.'

'అమ్మా, దీని నిచ్చినచో దీనికి మంచి భోజనము, ఉండెడిచోటి పై భాగమున చాందిని క్రిందవస్త్రము ఉంచి దీనిని పోషింతును.'

'నాయనా, ఇన్ని యేర్పాట్లు చేసిన పిమ్మట నా బిడ్డ సుఖముగా నుండును. కొనిపొమ్ము'

అపుడు బోధిసత్త్వుడు సైంధవశాబపాదములకు, తోకకు ముఖమునకు విడివిడిగా వెలకట్టి ఆరువేలనాణెముల సంచి వృద్ధురాలికి నూత్న వస్త్రము నిచ్చి గుఱ్ఱపుపిల్లను ఎదుట నిలువబెట్టెను. అది తల్లిని చూచి అశ్రువులు విడిచెను. వృద్ధురాలు దానివీపు చేతితో తట్టి 'నాయనా, నీ పాలన పోషణములఋణము నాకు లభించినది. నీవు పొమ్ము' అనెను. అది వెడలిపోయెను.

మరునాడు బోధిసత్త్వుడు గుఱ్ఱపుపిల్లకు సరసమైన భోజనము సిద్ధము చేయించి, దీనిబలము దీనికి తెలియునో లేదో నేడు పరీక్షించెద ననుకొని, మట్టితొట్టితో పురుగుపట్టిన అశ్వశాబము ఆయాహారమును స్వీకరింపలేదు దానిని పరీక్షించుటకై బోధిసత్త్వుడు ఈగాథ పలికెను:

ఎండుగడ్డియు నూకలు తిండి మున్న
నీకు హయపోతమా, నేడు తాక వేమి?

ఇది విని పిల్ల ఈగాథలు పలికినది.

జాతి, గుణము నెరుంగని స్థానమందు
నండ బియ్యపుగంజియే మెండు కాదె?
ఓ మహాబ్రహ్మ, ఇపుడు నే నుత్తమహయ
మని యెఱుంగుదు; నీ కిది యవగతంబె,
కాన త్రాగను నీ చేతి గంజి నిపుడు.

బోధిసత్త్వుడు విని "అశ్వరాజమా! నిన్ను పరీక్షించుటకే ఇట్లు చేసితిని. కోపింపవలదు" అని దాని నోదార్చి మంచియాహార మేర్పాటు చేసి దానిని రాజసభకు గొనిపోయి, ఐదువందలగుఱ్ఱముల నొకప్రక్క నిలిపి, రెండవప్రక్కన బొమ్మలు వేసిన తెర కట్టి, క్రింద వస్త్రము పఱచి పైన వస్త్రముతో చాందిని కట్టించి అందు సైంధవ

శాబమును నిలిపెను,

రాజు వచ్చినతోడనే గుఱ్ఱముల జూచుచు "ఈగుఱ్ఱమును ప్రత్యేకముగా నుంచినా రేమి" అన్నాడు.

"మహారాజా! ఈసైంధవము అన్నిగుఱ్ఱములను మీారిపోకలదు.

"ఏమి, ఈగుఱ్ఱము మంచి దేనా?"

"చిత్తము, మహారాజా!"

"అయినచో దీని నడవడి చూచెదను."

బోధిసత్త్వుడు గుఱ్ఱమును సిద్ధము చేసి 'దీనిపై నెక్కి చూడుడు మహారాజా,' యని మనుజులను తొలగించి రాజాంగణములోనికి చేర్చెను. అంగణ మంతయు గుఱ్ఱముల వరుసతో నిండిపోయిన బోధిసత్త్వుడు "మహారాజా! దీనివేగము చూడు" డని గుఱ్ఱమును వదిలెను. ఒకనికి కూడ ఆగుఱ్ఱము కంటబడలేదు. ఆవల వీపుమీాద ఎఱ్ఱని వస్త్రమును కట్టి గుఱ్ఱమును వదలిరి. లోకులకు ఎఱ్ఱని వస్త్రముమాత్ర మగపడినది. నగరములోని ఉద్యానమున తటాకము కలదు. బోధిసత్త్వుడు దానిజలముమీాద గుఱ్ఱమును పరుగెత్తించినాడు. నీటిపై బరుగిడు గుఱ్ఱపుడెక్కల ముందుభాగ మైనను తడియలేదు. రెండవ మారు తామరపత్రములమీాద పరుగెత్తించినాడు. ఒక్క తామరాకయినను నీట మునగలేదు. ఈప్రకారముగా అశ్వరీతిని ప్రదర్శించి, దిగి, చప్పట చరచి, అరచేయి చాపినాడు. గుఱ్ఱము ముందరికి పోయి, నాలుగుకాళ్ళు ఏకత్ర చేర్చి, అరచేతిపై నిలుచుండెను.

అంతట బోధిసత్త్వుడు "మహారాజా, ఈసైంధవపోతము నైపుణి అన్నిరీతుల చూపవలె నన్న సముద్రపర్యంతము కల భూమి చాలదు" అని పలికెను.

రాజు సంతుష్టుడై, బోధిసత్త్వున కర్ధరాజ్య మిచ్చి, సైంధవమును సక్రమముగా మంగళాశ్వముగా ఏర్పాటు చేసెను. అయ్యది రాజున కత్యంతప్రీతికరము, మనోహరము నయ్యెను.

అశ్వమునకు సత్కారముకూడ జరిగెను. అది యుండెడి ప్రదేశమును రాజనివాసముతో సమానముగా సుసజ్జితమై, అలంకృతమయ్యెను. నాలుగు విధముల సుగంధద్రవ్యములతో భూమి నలికిరి. పరిమళపుష్పమాలికలు వ్రేలాడదీసిరి. బంగరు నక్షత్రములు చెక్కిన

చాందినీ పై భాగమున కట్టిరి. నలువైపులను బొమ్మలు వేసిన గుడ్డ తెర కట్టిరి. సుగంధతైలదీపము నిత్యము వెలిగించుచుండిరి. మల మూత్రవిసర్జనలకై బంగారుకడవ లుంచిరి. అనుదినము రాజభోజనము పెట్టుచుండిరి. దానిని కొనివచ్చిన నాటినుండియు రాజుకు సమస్త జంబూద్వీపము నిజరాజ్యమువలె నయ్యెను.

రాజు బోధిసత్త్వుని యుపదేశానుసారము ఆచరించుచు, దానాది పుణ్యకార్యములు చేయుచు, తుదకు స్వర్గగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములం సరిపోల్చెన. ఆకాలమునాటి వృద్ధురాలం ఇప్పటి వృద్ధురాలే; సింధవకుమారుడు సారిపుత్రుడు; రాజు ఆనందుడు; అశ్వ వ్యాపారిని నేనే.

## 255 సుక జాతకము

శాస్త జేతవనమున విహరించుచు, ఎక్కువగా భుజించి అజీర్ణవ్యాధివలన చనిపోయిన ఒక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు ఈవిధముగ మరణించుటవలన ధర్మసభలో భిక్షువులు అతనిని నిందించుచుండగా శాస్త అచటికరుదెంచి సంగతి తెలిసికొని "భిక్షువులారా, ఇప్పుడే కాదు, ఈతడు పూర్వముకూడ విశేష భోజనముచే మృతినొందినాడు" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు హిమవత్ప్రదేశమున చిలుకకడుపున బుట్టి, సముద్రానుగత మగు పర్వతముపై అనేకసహస్రశుకములకు ప్రభు వయ్యెను.

ఆయనకు కుమారుడు కలిగెను. శుకపోతమునకు బలము వచ్చునప్పటికి బోధిసత్త్వునిదృష్టి మందగించినది. చిలుకలు వేగముగా పారును. కావున వానికి వార్ధకమున ముందుగా దృష్టి మందగించును. కుమారుడు తలిదండ్రులను గూటిలో నుంచి, తాను మేత తెచ్చిపెట్టి, వారిని పోషించుచుండెను.

అత డొకనా డాహారార్థము చని, పర్వతశృంగముపై నిలిచి, సముద్రమును విలోకించుచుండగా దీవి కానవచ్చెను. మధురరుచియు, బంగరు వన్నెయు కల మామిడిపండ్లతోపు ద్వీపమున కనబడెను. మరునాడు మేతకు బోయినపుడు శుకము మామామిడితోటపై వ్రాలి, పండ్లరసము త్రాగి, మామిడిపండు ముక్కున గరచుకొనిపోయి తలిదండ్రులకు పెట్టెను. దాని నారగించుచు బోధిసత్త్వుడు రసమును గ్రహించి "నాయనా, ఇది ఆ దీవిలోనిది కాదా?" అనెను. అవు నని కుమారుడు పలుకగా తండ్రి "నాయనా, ఆద్వీపమునకు బోవు చిలుకలు బహుకాలము జీవింపవు. కావున నీ వచటికి పోవలదు" అని చెప్పెను.

అతడు తండ్రిమాటలు వినక అక్కడకే పోవుచు, ఒకనాడు ఫలరసమును బాగుగా గ్రోలి, తలిదండ్రులకొరకు మామిడిపండు ముక్కున గరచుకొని ఆకసమున వచ్చుచుండగా బడలి, మైకమున పండు జారవిడిచెను. అనుదినము వచ్చు మార్గము తప్పిపోయి జలమునకు సమీపముగా నెగిరిపోవుచు సముద్రమున ఒడిపోయెను. చేప శుకమును బట్టుకొని భక్షించెను.

కుమారుడు రావలసిన వేళకు రాకపోవుటచే బోధిసత్త్వుడు సముద్రమున బిడ్డడు పడిపోయి యుండు నని గ్రహించెను. మేత లేకపోవుటచే తలిదండ్రులు మరణించిరి.

శాస్త అభిసంబుద్ధు డయి, ఈ యతీతకథ నుద్ఘాటించి, ఈగాథలు వలికెను :

> ఆపులుంగు గ్రహించి ఆహారపరిమితిన్
> జీవితాధ్వము వెంట పోవుచున్న దినాల
> సంరక్షణము చేయజాలె తలిదండ్రులను.
>
> మితి మీరి యొకసారి మెండుగా భుజియింప
> అచటనే పడిపోయి అవల గనబడదాయె

# 256 జరూదపాన జాతకము

మేలు భోజనములో మితి గ్రహించినయెడల:
ఎరుక కల్గినవాని కెపుడు పతనము లేదు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అతిభోక్తయగు భిక్షువు సుకరాజపుత్రుడు సుకరాజు నేనే

# 256 జరూదపాన జాతకము

శాస్త జేతవనమున విహరించుచు శ్రావస్తివాసు లైన వ్యాపారులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

వారు సామానులు బండ్లనిండ నింపుకొని వ్యాపారమునకై పోవు నపుడు తథాగతుని నిమంత్రించి, మహాదాన మిచ్చి, త్రిశరణములు గ్రహించి, పంచశీలములు వహించి, నమస్కరించి "భన్తే, మేము వ్యాపార్థము బహుదూరము పోవుచున్నాము. సరకులు విక్రయించి, ప్రయాణము పూర్తి అయిన పిదప మరలి వచ్చి. తమకు పునఃప్రణామము చేయుదుము" అని సాగిపోయిరి.

వారు కాంతారమున జలాశయము చూచి "ఈతటాకమున నీరు లేదు. మనము దప్పిగొని యున్నాము. కావున త్రవ్విచూతము" అని యోచన చేసిరి. త్రవ్వుచున్న కొలది వారికి ఇనుము, తగరము, సీసము, రత్నములు, బంగారము, ముత్యములు, స్ఫటికములు మొదలగునవి లభించినవి. వారు ఆవస్తువులతో సంతుష్టులై శకటములు రత్నములతో నింపి కుశలముగా శ్రావస్తికి తిరిగి వచ్చిరి. వారు ధనము లభించుటచే ప్రయాణము సఫలమైనట్లు భావించి దాన మీయ దలచి, తథాగతుని నిమంత్రించి, దాన మిచ్చి, ప్రణామము చేసి ఒక ప్రక్కన కూర్చుండి, తమకు సంపద లభ్యమయిన విధానమును శాస్తకు విన్నవించిరి.

శాస్త వారితో "ఉపాసకులారా, మీరు ఆసంపదతో సంతుష్టి

చెందుటచే సంపత్తితోడను ప్రాణములతోడను మరలివచ్చితిరి. ఇట్లు కాక, పూర్వము పండితులమాటలు వినక కొందరు మృతినొందిరి" అని, వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వారాణసిలో వణిగ్వంశమున పుట్టి, పెరిగి, సార్థవాహజ్యేష్ఠు డయ్యెను. అతడు వారాణసిలో సామగ్రి సమకూర్చుకొని, బండ్ల కెక్కించి, వర్తకు లనేకులను వెంటబెట్టుకొని ఆకాంతారమున ప్రవేశించి, ఆజలాశయమును గాంచెను. అచ్చట నీరు త్రాగదలచి, వణిక్కులు జలాశయమును త్రవ్వుచు, లోహ ధాతు ప్రభృతులను కనుగొనిరి. బహురత్నములు లభించినవి. కాని వానితో సంతుష్టి చెందక, అందు సుందరతరవస్తువు లింకను దొరుక వచ్చు నని ప్రసన్న చిత్తులై ఇంకను త్రవ్వజొచ్చిరి. బోధిసత్త్వుడు 'వణిజులారా, లోభము వినాశమునకు మూలము. మనకు విశేషధనము లభించినది. దీనితో సంతుష్టి చెంది, త్రవ్వుట మానుడు' అని చెప్పినాడు. ఆయన నివారించినను వారు త్రవ్వుచునే యుండిరి.

ఆజలాశయము నాగపరిగృహీతము. అచ్చట నివసించుచున్న నాగ రాజు నిజనివాసము పడిపోయి, దుమ్ము రేగుటచే క్రుద్ధు డయి, బోధిసత్త్వుని తప్ప తక్కినవారిని ఘ్రాతాకారవిషముతో ప్రాణముల బాపి, భవనమునుండి వెలువడి, బండ్లు కట్టించి, ధనముతో నింపి, బోధిసత్త్వుని మంచిబండిలో సుఖాసీనుని జేసి, తన యనుచరులచే బండ్లు లాగించి, ఆయనను వారాణసిలో నిజగృహమునకు జేర్చి, ధన మప్పగించి, తన నివాసమునకు జనెను.

బోధిసత్త్వు డా ధనము స్వాయత్తము చేసికొనక, సకలజంబూ ద్వీపము నిజకీర్తితో మారుమ్రోగునట్లు దానము చేసి, శీలములు గ్రహించి, ఉపోసథకర్మ చేసి, తుదకు స్వర్గపదవి నొందెను.

శాస్త అభిసంబుద్ధు డయిన పిదప ఈగాథలు పలికెను:

కానవచ్చె జలాశయఖననమందు
వారికోసము, కొందరు వర్తకులకు

తామ్ర లోహ సీసమ్ములం, త్రపుసరజత
రత్న మౌక్తిక హాటక రాశి మిగుల.

తనివి తీరక వా రింక త్రవ్వుచుంచ
సర్పముల్ విషార్చుల వారి సంహరించె.

త్రవ్వకముచే లభించెను ధనము, కాని
భూరిఖననమ్ము చే గోలుపోయి రెల్ల.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను ఆకాలమున నాగరాజు సారిపుత్రుడు; యాత్రికులకు ముఖ్యుడను నేనే.

## 257 గామణిచండక జాతకము

శాస్త జేతవనమున నుండగా ప్రజ్ఞను ప్రశంసించు సందర్భమున చెప్పినది.

### వర్తమాన కథ

భిక్షువులు బుద్ధుని ప్రజ్ఞను ప్రశంసించుచు ధర్మసభలో గూర్చుండి యుండిరి. "ఆయుష్మంతులారా, తథాగతుడు బహుప్రజ్ఞావంతుడు; విస్తృతప్రజ్ఞావంతుడు; ప్రసన్నప్రజ్ఞావంతుడు; శీఘ్రప్రజ్ఞావంతుడు; తీక్ష్ణప్రజ్ఞావంతుడు; ఆయనప్రజ్ఞ దేనినైనను ఛేదించుకొని పోవగలది. ఆయన దేవసహితలోకములనుకూడ ప్రజ్ఞచే అతిక్రమించినాడు" అని వా రనుచుండగా శాస్త అచటి కరుగుదెంచి, విషయము తెలిసికొని "భిక్షువులారా, తథాగతుడు పూర్వముకూడ ప్రజ్ఞావంతుడే" అని పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో జనసంధుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డాతని పట్టమహిషి కడుపున పుట్టెను. ఆతని ముఖము చక్కగా తుడిచిన కాంచనదర్పణతలమువలె పరిశుద్ధము, సుభగము

నగుటచే నామకరణమునా డతనికి ఆదర్శముఖకుమారు డని పేరు పెట్టిరి. అతని కేడుసంవత్సరములు వచ్చినప్పుడు తండ్రి యతనికి వేద త్రయమును సర్వసంసారవిధులను నేర్పించి, ఆ యేడే మరణించినాడు. అమాత్యులు రాజుకు ఘనముగా అపరకర్మలుచేయించి, దానాదు లిచ్చి, ఏడవనాడు రాజాంగణమున సన్నివిష్టు లై "కుమారుడు మిక్కిలి చిన్నవాడు. రాజ్యాభిషేకము చేయలేము. పరీక్షించి అభిషే కింతుము" అని నిశ్చయించి, ఒకనాడు నగరము నలంకరించి, న్యాయ స్థాన మేర్పాటుచేసి, పర్యంకము నమర్చి, కుమారునికడకు జని, "దేవా న్యాయస్థానమునకు రావలెను" అని చెప్పిరి. మంచి దని కుమారుడు బహుపరివారముతో జని, పర్యంకమున నిషణ్ణుడయ్యెను. రెండు కాళ్ళపై నడచు మర్కటమునకు వాస్తువిద్యాచార్యవేషము వేసి, అమాత్యులు దానిని న్యాయస్థానమునకు గొనివచ్చి, "దేవా, ఈతడు మీనాయనగారి పాలనమున వాస్తువిద్యాచార్యుడు, మహా ప్రవీణుడు. నేలలో ఏడు మూరల లోతున నున్న దోషమును చూడ గలడు. రాజకులమున కీతడే గృహస్థానము నిరూపించినాడు. దేవర ఈయనకు ఉద్యోగ మిచ్చి జీవనోపాధి కల్పించి అనుగ్రహింపవలెను" అని చెప్పిరి.

కుమారుడు పరికించి చూచి "ఇది మర్కటము" అని గ్రహించి, "అన్యులు చేసిన పనులను మర్కటములు నాశము చేయగలవు. న్యాయముగా మంచిపనులు చేయజాలవు" అని యోచించి, రాజవల్లభు లతో ఈ గాథ పలికెను.

> నేర్పు లేదు దేహ నిర్మాణము చీని;
> కధికచపలశీల మైన కోతి
> ఒరులకార్యనాశ మొనరించు టొక్కటే
> తెలియు, నిదియె కోతికులము తీరు.

చిత్తము దేవా, అని వారు మర్కటమును తొలగించి, మూడు రోజులతరువాత దానినే అలంకరించి, న్యాయస్థానమునకు గొనివచ్చి "దేవా, ఇతడు మీనాయనగారి పరిపాలన కాలములో ధర్మనిర్ణాయకు డై తీర్పులు చెప్పెడివాడు. ఇతని ననుగ్రహించి, ఈతనిచే ధర్మనిర్ణయ

ములు చేయింపుడు" అని విన్నవించిరి. కుమారుడు చూచి "బుద్ధిమంతు డగు పూర్ణమానవునకు రోమము లి ట్లుండవు. మతిలేని యీ వానరము నిర్ణయములు చేయలేదు" అని భావించి ఈగాథ పలికెను.

ఈ బాలు డేమియు నెరుగనివాడు
శాసనకార్యదక్షత లేనివాడు

'చిత్తము దేవా,' అని యమాత్యులు వానరమును గొనిపోయి, మరల నొకనాడు దానినే యలంకరించి, న్యాయస్థానమునకు గొనివచ్చి "దేవా, ఇతడు మీనాయనగారి పాలనములో మీజననీజనకులకు సేవ చేసి, కుటుంబవృద్ధులను గౌరవించినవాడు. దేవర ఇతనిని స్వీకరించి అనుగ్రహింపవలెను" అని చెప్పిరి. కుమారుడు పరిశీలించి "మర్కటములు చపలచిత్తము కలవి. ఇట్టిపనులు చేయుటకు సమర్థములు కావు" అని భావించి, ఈ గాథ పలికెను :

తల్లిదండ్రులను, సోదరులను గాని
పోషింపనేర డీ బుద్ధిహీనుండు.

'చిత్తము దేవా,' యని అమాత్యులు మర్కటమును గొనిపోయి "కుమారుడు బుద్ధిమంతుడు, రాజ్యపాలనము చేయగలడు" అని భావించి, బోధిసత్త్వునకు రాజ్యాభిషేకము చేసి, ఆదర్శముఖరాజాజ్ఞలు శాసనములు అని నగరమున భేరీ వేయించిరి. బోధిసత్త్వుడు ధర్మపాలనము చేయుచు మేధావి యని జంబూద్వీప మంతటను ప్రశస్తి గాంచెను. ఆయన మేధాసంపత్తిని ఉద్దీపింపజేయుటకై బుద్ధిమంతు లీపదునాలుగు ప్రశ్న లిచ్చిరి. అందు క్రమానుసారముగా నిది మొదటి ప్రశ్న

## ప్రసంగ కథ

బోధిసత్త్వుడు పట్టాభిషిక్తు డయినంతనే జనసంధ ప్రభువుపాదసేవకుడు గ్రామణిచండు డనువాడు ఈవిధముగా చింతించెను: "సమవయస్కు లగు వారితో గలిసినచో రాజ్యము శోభించును. నేను వృద్ధుడను. బాలు డగు కుమారప్రభువును సేవింపజాలను. జనపదమున

కృషీవలుడ నై జీవింతును.” ఇట్లుతలచి వాడు నగరము విడిచి మూడు యోజనములదూరము పోయి కుగ్రామమున నివాస మేర్పరచుకొనెను. వ్యవసాయము చేయుటకు వానికి వృషభములు లేవు. వానలు కురిసిన పిదప నొకానొకమిత్రునికడ వృషభద్వయము నడిగి తెచ్చుకొని పగ లంతయు దున్ని, గడ్డి మేపి, ఎద్దులను యజమానున కప్పగించుటకై యింటికి బోయెను. ఆసమయమున భార్యతోగూడ గృహమధ్యమున గూర్చుండి యజమానుడు భోజనము చేయుచుండెను. అలవాటు చొప్పున వృషభము లింటిలో ప్రవేశించినవి. అప్పుడు యజమాని కంచము పైకెత్తినాడు. భార్య కంచము దింపినది. తనను వారు భోజ నమునకు పిలువకుండుటచే గ్రామణిచండు డెద్దుల నప్పగింపకుండనే వెడలిపోయెను. ఆరాత్రి చోరులు కోష్ఠము భేదించి వృషభములను హరించిరి. యజమానుడు ప్రాతఃకాలమున కొట్టములో ప్రవేశింపగా వృషభములు కానరాలేదు. చోరులు హరించియుందు రని గ్రహిం చియు, గ్రామణిచండు డచ్చుకొనునట్లు చేయనెంచి వాడు చండుని కడకు జని “ఓయీ, నావృషభముల నిమ్ము” అని అడిగెను.

“ఎద్దులు ఇంటిలో ప్రవేశింపలేదా?”

“నీవు నాకు వాని నప్పగించితివా?”

“అప్పగింపలేదు.”

“ఇదుగో, రాజదూత. రమ్ము.”

“రాయి కాని, కుండపెంకు గాని చూపి ‘ఇదుగో, రాజభటుడు. రమ్ము’ అన్నచో వెంటనే రానివానికి ఆరోజులలో శిక్షపడును. కావున చండుడు తోడనే బయలుదేరెను.

వానివెంట చండుడు పోవుచుండగా మిత్రుడు వసించుగ్రామము త్రోవలో తగులుటచే ‘నా కాకలి వేయుచున్నది ఊరిలోనికి బోయి భుజించి వచ్చెదను,’ అంతవరకును నీ విచట నుండుము’ అని చెప్పి మిత్రుని యింటికి బోయెను. అప్పు డామిత్రు డింటిలో లేడు. ఆతని భార్య చూచి “అయ్యా, వండిన అన్నము లేదు. శీఘ్రముగా వంట చేసి పెట్టెదను. ముహూర్తమాత్రము విశ్రమింపుడు” అని బియ్యపు కొట్టుమీదికి నిచ్చెన నెక్కుచు కాలుజారి క్రిందబడెను. తోడనే యేడు మాసముల గర్భము స్రవించెను. అంతలో యజమాని వచ్చి, చూచి

"నా భార్యను కొట్టి, గర్భస్రావము చేసినావు. ఇదుగో రాజభటుడు" అని వానిని పట్టుకొని రాజకులమునకు బయలుదేరెను.

మొదటివాడును వీడును చండుని తమ వశముగా గొనిపోవుచుండిరి. మార్గములో నొకగ్రామముఖమున అశ్వపాలకుడు గుర్రమును మరలింప లేకుండెను. అశ్వము వారికి సమీపముగా బోవుచుండెను. అశ్వగోపకుడు గ్రామణిని జూచి "మామా, గుర్రమును కొట్టి మరలింపుము" అని కోరెను. గ్రామణి రాయి తీసి దానిమీదికి విసిరెను. రాయి దానికాలికి తగిలెను. ఆముదపు మొక్కతూడు విరిగినట్లు దానికాలు విరిగెను. 'నీమూలమున నాగుర్రపుకాలు విరిగినది. ఇదుగో రాజదూత' అని అశ్వగోపకుడు వానిని బట్టుకొనెను. ముగ్గురు తనను గొనిపోవు చుండ చండుడు తనలో 'వీరు నాపై రాజసన్నిధిని దోషారోపణము చేయుదురు. నేను వృషభమూల్య మీాజాలను. గర్భస్రావమునకు దండనము తప్పదు. అశ్వమూల్య మెక్కడనుండి తెత్తును? మరణము మంచిది" అని తలపోయుచు నడచుచుండగా మార్గముప్రక్కన అడవియు, సమీపమున నిటారు కొండయు, ప్రపాతము కానబడెను. దానినీడలో తండ్రికొడుకులు మేదరులు చాప అల్లుచుండిరి. "బాహ్యమునకు బోవలెను" అని గ్రామణిచండుడు "కొంచెముతడవు ఇచ్చటనే వేచియుండుడు. త్వరలోనే వచ్చెదను" అని చని, కొండపై కెక్కి ప్రపాతమునుండి దుమికెను; చాప నేయువారిలో తండ్రివీపుమీాద పడగా. ఒక్కదెబ్బన వాడు ప్రాణములు విడిచెను. గ్రామణి లేచి నిలుచుండెను. "నీవు నాతండ్రిని చంపిన చోరుడవు! ఇదుగో, రాజదూత' అని కుమారుడు చండుని పట్టుకొని వనమునుండి యీవలకు లాగుకొని వచ్చెను. ఏ మిది యని వా రడుగగా "వీడు నా పితృహంత" అని కుమారుడు చెప్పెను. అంతట వారు నలుగురు చండుని నడుమ నుంచుకొని నడచుచుండిరి.

వేరొకగ్రామకంఠమున గ్రామభోజకుడు చండుని గాంచి "మామా, ఎచ్చటికి బోవుచున్నావు?" అని యడిగెను. రాజదర్శనార్థ మని వాడు చెప్పెను. 'ఓహో, నీవు రాజును జూతువు. నేను రాజుగారికి సందేశము బంప నెంచినాను. కొనిపోవుదువా?' 'సరే, కొనిపోయెదను.' "నేను సహజముగా రూపవంతుడను, ధనవంతుడను, కీర్తివంతుడను,

ఆరోగ్యవంతుడను, ఇప్పుడో, దుర్గతుడను, పాండురోగిని అయినాను. దీనికి కారణ మేమో రాజు నడుగుము. పండితు డైన ప్రభువు నీకు చెప్పగలడు. ఆయనవాక్కులు నాకు వినిపింతువా?'

'మంచిది.'

అనంతరము వేరొక గ్రామద్వారమున నొకానొక గణిక కానబడి "మామా, చండా, ఎక్కడికి బోవుచున్నావు?" అని యడిగెను. 'రాజదర్శనార్థము.' 'రాజు పండితుడట. నాసందేశము గొనిపొమ్ము. పూర్వము నాకు ధనము బాగుగా లభించెడిది. నేడో, తాంబూలపు విలువ య్యైన దొరుకుట లేదు. నాకడ కొక్కడును రాడు. దీనికి కారణ మేమో రాజు నడిగి నాకు తెలుపుము.' 'మంచిది.'

వా రందరును వేరొకగ్రామకంఠమునకు జనునప్పటికి తరుణి కానబడి సందర్భము తెలిసికొని 'నేను భర్తయింట నుండలేను, పుట్టినింటను ఉండలేను. దీనికి కారణ మేమో రాజు నడిగి నాకు తెలుపుము' అనెను.

అనంతరము మహామార్గసమీపమున పుట్టలో వసించు సర్పము వేచి "చండా, ఎక్కడికి బోవుచున్నావు?" అని యడిగెను. "రాజదర్శనార్థము." "రాజు పండితుడట. నాసందేశము గొనిపొమ్ము. ఆహారార్థము నేను బయలుదేరునపుడు బడలిక చెంది, దప్పిగొని, ఈలావు దేహమును పుట్టలోనుండి యీవల కీడ్చుకొని వచ్చి కష్టము మీద నావలకు బోవుచుంటిని. ఇప్పుడో బాగుగా ఆహారము తిని, శరీరము లావెక్కి, లోనికి బోవునపుడు బిలపార్శ్వములు తగులుటయే లేదు. దీనికి కారణ మేమో రాజు నడిగి, నాకు తెలుపుము" అనెను. చండుడు సమ్మతించెను.

వారు మరికొంతదూరము పోవునప్పటికి మృగ మెదురుగా గానవచ్చి "నే నీవృక్షముక్రింది గడ్డి మాత్రము మేయుచున్నాను. మరి యెచ్చటను మేయజాలకున్నాను. దీనికి కారణ మేమో, రాజు నడిగి నాకు జెప్పుము" అని చండునితో ననెను.

ఆతరువాత మార్గములో తిత్తిరిపక్షి కానబడి "నేను ఒకపుట్టమీదనే నిలిచి గానము చేయగలను. మరి యెచ్చటను గానము చేయలేకున్నాను. దీనికి కారణము రాజు నడిగి చెప్పుము" అనెను.

ఆవల వృక్షదేవత ప్రత్యక్షమై "చండా, ఎచ్చటికి బోవుచు న్నావు?" అని యడిగెను. "రాజదర్శనార్థము." "రాజు పండితుడట. పూర్వము నాకు సత్కారము జరుగుచుండెడిది. ఇప్పుడో గుప్పెడు చిగురాకులుగూడ లభించుట లేదు. కారణ మేమో రాజు నడిగి నాకు చెప్పుము" అనెను.

ఆవల నాగరాజు కానిపించి, అడిగి, "రాజు పండితుడట. ఈ సరస్సులోని నీరు మునుపు ప్రసన్నము, స్ఫటికవర్ణము. ఇప్పుడు మురికియై నురుగులు తేరుచున్నది. దీనికి కారణమేమో రాజు నడిగి నాకు తెలుపుము" అనెను.

అనంతరము నగరసమీపారామములో తాపసులు కానబడి విశేషము లడిగి "రాజు ప్రజ్ఞావంతుడట. పూర్వ మీయారామములో ఫలాదులు మధురముగా నుండెడివి. ఇప్పుడో రుచిలేని కసరుకాయలే. దీనికి కారణమేమో రాజు నడిగి చెప్పుము" అనిరి.

ఆవల నగరద్వారసమీపమున నొకానొకశాలలో బ్రాహ్మణమాణ వకులు కానబడి "ఎచ్చటికి బోవుచున్నా" వని యడిగిరి. "రాజుసన్ని ధికి." అట్లయిన మాసందేశము రాజునకు దెలుపుము. పూర్వము మేము పఠించిన దంతయు జ్ఞప్తియం దుండెడిది. ఇప్పుడు ఛిద్రఘట మున నీరువలె నిలుచుట లేదు; అర్థము తెలియుట లేదు; అంతయు అంధకారముగా నున్నది. దీనికి కారణ మేమో రాజు నడిగి మాకు జెప్పుము."

గ్రామణిచండు డీపదునాలుగు ప్రశ్నలతో రాజసన్నిధికి జేరెను. రాజు న్యాయస్థానమున గూరుచుండి యుండెను. వృషభయజమానుడు చండునితో రాజును సమీపించెను. రాజు చండుని వెంటనే గురుతించి, తనలో "వీడు నన్ను తండ్రిచేతులలోనుండి తీసికొని లాలన చేసెడి వాడు. ఇంతకాల మెచట నున్నాడో" అనుకొని, "ఓయీ, చండా, ఇంతకాల మెచట నుంటివి? బహుకాలమునుండి నీవు కానబడుట లేదే. ఏమి పనిమీద వచ్చినావు?" అనెను.

"దేవా, దేవరవారిజనకులు స్వర్గస్థు లయినప్పటినుండి జనపదము నకు బోయి వ్యవసాయమువలన జీవించుచున్నాను. ఇతడు వృషభము లను గోలుపోయి, రాజదూతను జూపి, తమసన్నిధికి లాగుకొనివచ్చి

నాడ" అని వాడు విన్నవించెను.

"లాగుకొని వచ్చుటచే వచ్చితివి. అటు కానిచో వచ్చెడివాడవు కావు. నిన్నాకర్షించుటయే మే లయ్యెను. ఇప్పుడు నిన్ను చూడ గలిగితిని. ఆపురుషు డేడీ?" అని రాజు పలికెను.

"ఇదిగో దేవా, ఉన్నాను." "నిజముగా నీవు మా చండునకు రాజ దూతను చూపితివా?" "చిత్తము." "కారణము?" "ఇతడు నా యెద్దులజంట నిచ్చినాడు కాడు." "నిజ మేనా చండా?" "దేవా, నావిన్నప మనవధరింపుడు" అని వాడు జరిగినవృత్తాంత మంతయు విన్నవించెను. "ఏమోయీ, వృషభములు కోష్ఠములో ప్రవేశింపగా చూచితివా?" "చూడలేదు దేవా!" "ఏమోయీ, ఆదర్శముఖ మహారాజు పేరు నీ వింతకుముందు వినలేదా? నిజము చెప్పుము" "చిత్తము." "చండా, ఇతనియెద్దుల నీయకుండుటచే నీ వితనికి అప్పుపడితివి. కాని ఇతడు వృషభములను చూడలే దని అసత్యము పలికినాడు. కావున నీవు వీనిగ్రుడ్లు పీకి, గోమూల్యముక్రింద ఇరువదినాలుగు సువర్ణకార్షాపణము లిమ్ము" అని రాజు తీర్పుచెప్పెను. వృషభయజమానిని వెలుపలికి గొనిపోవుచుండ "నాకన్నులు పెరికినపిదప కార్షాపణములతో పని యేమి?" అని వాడు చండునిపాదములపై బడి "స్వామీ, వృషభ మూల్యము నీకడనే యుండనిమ్ము ఇవికూడ స్వీకరింపుము" అని కొన్ని కార్షాపణములు సమర్పించి వెడలిపోయెను.

తరువాత రెండవవాడు వచ్చి "దేవా, ఇతడు నాభార్యను కొట్టి గర్భస్రావ మగునట్లు చేసినాడు" అని విన్నవించెను. "నిజమేనా చండా?" "అవధరింపుడు దేవా!" అని వాడు జరిగినదంతయు వివరించెను. అంతట రాజు "నీ వతని భార్య నేల కొట్టి గర్భస్రావ మగునట్లు చేసినావు?" అని యడిగెను. "నే నేమియు చేయలేదు దేవా!" "గర్భస్రావము సరిచేయగలవా?" "నా చేతకాదు దేవా!" "అటులయినచో చండా, నీవు ఇతనిభార్యను నీయింటికి గొనిపోయి, కుమారుడు కలిగిన తరువాత ఆమె నితనియింటికి పంపుము."

వాడు చండుని పాదములపై బడి "నాయిల్లు, నాసంసారము ఛిన్నాభిన్నము చేయవలదు" అని వేడుకొని వెడలిపోయెను.

మూడవవాడు ముందిరికి వచ్చి "దేవా, ఇతడు నా గుఱ్ఱము కాలు

విరగగొట్టినాడు” అని చెప్పుకొనెను. “నిజమేనా చండా?” అని రాజు ప్రశ్నించునప్పటికి వాడు జరిగినది విస్తరించి చెప్పెను. అశ్వపాలకు నితో రాజు ‘గుఱ్ఱమును కొట్టి వెనుకకు మరల్పు మనలేదా?’ అనెను. ‘అనలేదు.’ రాజు రెండవమారు ప్రశ్నింపగా వాడు ‘చిత్తము, దేవా, అన్నాను’ అనెను. రాజు చండుని సంబోధించి ‘ఇతడసత్యము పలికి నాడు. కావున వీనినాలుక కోసి అశ్వమూల్యము వేయినాణెములు మాకడ తీసికొని వీని కిమ్ము’ అని యాదేశించెను. అశ్వగోపకుడు కొన్ని నాణెములు చండునికే యిచ్చి, తప్పించుకొనిపోయెను.

అంతట మేదరికొడుకు రాజుతో ‘దేవా, ఇతడు నాతండ్రిని చంపిన చోరుడు’ అని చెప్పుకొనెను. ‘నిజమేనా?’ ‘అవధరింపుడు దేవా!’ అని వాడు జరిగినసంగతి చెప్పెను. రాజు మేదరితో ‘ఇప్పుడేమి చేయు దువు?’ అనెను. ‘దేవా, నాకు తండ్రి లభింపవలెను.’ ‘చండా, ఇతనికి తండ్రి కావలెనట. చచ్చిపోయినవానిని మరల కొనిరాలేము గదా? నీ వీతని తల్లిని దీసికొనిపోయి నీయింట నుంచుకొని, యితనికి తండ్రివి కమ్ము.’

వడ్రంగికుమారపుత్రుడు చండునితో ‘స్వామీ, నాతండ్రికుటుంబమును విచ్ఛేదము చేయవలదు’ అని వేడుకొని వానికి కొన్నికార్షాపణము లిచ్చి శీఘ్రముగా వెడలిపోయెను.

గ్రామణిచండు డన్నియభియోగములలో గెలుపొంది సంతుష్టచిత్తుడై రాజుతో ‘దేవా, కొందరు పంపిన ప్రశ్న లున్నవి. మనవి చేయు దునా?’ అనెను. ‘చెప్పు చండా!’ అని ప్రభు వనుజ్ఞ నీయగా వాడు ప్రతిలోమవిధానమున బ్రాహ్మణమాణవకులప్రశ్నముతో ప్రారంభము చేసి, వరుసగా అన్నియు ప్రభువునకు దెలిపెను. రాజు వరుసగా సమాధానములు చెప్పెను. మొదటిప్రశ్నకు సమాధానము బ్రాహ్మణ కుమారుల నివాసస్థానమున మునుపు వేళ తెలుపు పెంపుడుకోడి యుండెను. దానికూత విని వారు లేచి శ్రద్ధతో స్వాధ్యాయాధ్యయనము తెల్లవారుజామువనే చేసెడివారు. అందుచే వారిధారణశక్తి లోపింపలేదు. ఇప్పుడు వారినెలవున అకాలములో కూయు కోడి కలదు. అర్ధరాత్రమున కోడికూత విని మాణవకులు లేచి, నిద్రాభిభూతు లగుచు స్వాధ్యాయాధ్యయనము చేయక పండుకొందురు. తెల్లవారి

నపుడు కోడికూత విని లేచినను పఠించుట కవకాశము లేదు. పఠించి నను నిలువదు, అర్థముకాదు.

రెండవప్రశ్నకు రాజు సమాధానము: వారు శ్రమణధర్మము మునుపు నిర్వర్తించుచుండెడివారు. ఇప్పు డా ధర్మమును విసర్జించి అకార్యములు చేయుచు, ఆరామమున పండిన పండ్లను ఉపజీవుల కిచ్చి, భిక్షాటనము వలన లభించిన పిండము లింటికడ దినుచు, మిథ్యాజీవనము చేయుచు న్నాడు. కావున ఫలాదులు రుచి కోలుపోయినవి. వారు పూర్వమువలె శ్రమణధర్మము నిర్వర్తించినపక్షమున ఫలాదులు మరల మధురము లగును. రాజకులమున ప్రజ్ఞయున్న దని యూతాపసు లెరుగరు. వారు సక్రమముగా ధర్మమును నిర్వర్తింపవలె నని చెప్పుము.

మూడవప్రశ్నమునకు రా జిట్లు సమాధానము చెప్పినాడు. నాగ రాజులు పరస్పరము కలహించుచున్నారు. అందుచే జల మావిల మయినది. పూర్వమువలెనే వారు సమాధానముతో నున్న పక్షమున మరల నీరు ప్రసన్న మగును.

నాలుగవ ప్రశ్నమునకు రాజు సమాధానము· మునుపు వృక్షదేవత వనమార్గమున బడినవారిని రక్షించుచుండెడిది. కావున వివిధప్రకార పూజలు లభించుచుండెను. ఇప్పుడు సంరక్షణము మానుటచే నైవేద్య ములు లభించుటలేదు. వృక్షదేవత పూర్వమువలెనే రక్షణము చేయుచో ఉపహారములు లభించును. రా జున్నా డని గ్రహించినట్లు కానబడదు. అడవిలో జొచ్చిన మానవులను రక్షించుట కర్తవ్య మని చెప్పుము

అయిదవ ప్రశ్నకు రాజు సమాధానము : తిత్తిరిపిట్ట వ్రాలి పాట పాడు వల్మీకము క్రింద గొప్ప నిధికుంభ మున్నది. త్రవ్వి దానిని తీసికొనుము.

ఆరవ ప్రశ్నకు సమాధానము : ఏవృక్షమూలమున మృగము తృణములు మేయుచున్నదో ఆవృక్షముపై గొప్ప మధుకోశ మున్నది. తేనెబొట్లు రాలిన గడ్డిరుచి మరగి వేరొకచోటి తృణములను మేయ కున్నది. నీ వామధుపటలమును తీసి, అగ్రమధువును మాకు బంపి శేష మారగింపుము.

ఏడవ ప్రశ్నకు సమాధానము . సర్పము వసించు వల్మీకముక్రింద

మహానిధికుంభ మున్నది. దానిని రక్షించుచు, నిష్క్రియుణాకాలమున ధనలోభముచే తనువు నీడ్చుకొని పోవుచున్నది. ఆహారము తిని ధన స్నేహాసంసక్తము కాకుండుటచే త్వరితముగా సర్పము లోనికి ప్రవేశించును. త్రవ్వి యెత్తి, నీ వాకుంభమును దీసికొనుము.

ఎనిమిదవ ప్రశ్నకు సమాధానము : ఆమె యత్తవారియూరికిని, పుట్టినింటియూరికిని నడుమ గ్రామములో ఆమెజారుడు నివసించుచుండను. వానియెడ ప్రీతిచే ఆమె అత్తవారింట నుండలేదు. పుట్టింటికి బోవుదు నని జారునిగృహమున కొన్నినాళ్ళుండి, పిమ్మట తలిదండ్రులయింటికి బోయి కొంతకాల ముండి, ఆవల భర్తకడకు బోవుదు నని మరల జారునియింటికే పోవుచుండును. రాజుగా రున్నా రనియు, ఆమె భర్తయింటనే యుండవలె ననియు, అటు చేయనిచో మరణ దండనము సంభవించు ననియు, కావున భద్రముగా నుండవలె ననియు చెప్పుము.

తొమ్మిదవ ప్రశ్నమునకు రాజుసమాధానము : పూర్వ మాగణిక యొకనికడ భృతి తీసికొని వానిని సంతోషపెట్టకుండ వేరొకనికడ నేమియు తీసికొనెడిది కాదు. కావున దానికి చాల లాభమువచ్చెడిది. ఇప్పు డది నిజధర్మమును విసర్జించి, యొకనికడ భృతి గ్రహించి వానిని సంతోషపెట్టకయే వేరొకనికడ ధనమును స్వీకరించుచున్నది. వెనుకటి వాని కన కాశ మీయక యావలివాని కిచ్చుచున్నది. కావున భృతి లభించుట లేదు. నిజధర్మము ననుసరించుట లేదు. వెనుకటివలె తన ధర్మము ననుసరింపు మని చెప్పుము.

పదియవ ప్రశ్నకు సమాధానము: పూర్వ మా గ్రామభోజకుడు నిష్పక్షపాతముగా న్యాయనిర్ణయము చేసెడివాడు. అందుచే జనులకు ప్రీతిపాత్రుడు ఆదరపాత్రుడు నయ్యెను. లోకు లతనికి బహుమానములు కూడ నిచ్చెడివారు. అప్పు డతడు అభిరూపుడు, ధనవంతుడు, యశోవంతుడు నయినాడు. ఇప్పుడో లంచగొండి యయి, అన్యాయముగా తీర్పులు చెప్పుచున్నాడు. కావున దుర్గతి పొంది, కృపణుడు, పాండు రోగగ్రస్తుడు నయినాడు. అతడు న్యాయముగా తీర్పులు చెప్పుచో పూర్వమువలె నుండును. రా జున్నా డని గ్రహించినట్లు లేదు. ధర్మముచొప్పున తీర్పులు చెప్పవలె నని తెలుపుము.

ఇట్లు రాజు గ్రామణిచండుని ప్రశ్నముల కన్నింటికిని నిజప్రజ్ఞచే సర్వజ్ఞబుద్ధునివలె వ్యాఖ్యానించి, వానికి ధన మొసగి, నివాసగ్రామమును మాన్యముగా నిచ్చి పంపివేసెను.

వాడు బయలువెడలి, బోధిసత్త్వుడు చెప్పిన సమాధానములు బ్రాహ్మణమాణవకులకు, తాపసులకు, నాగరాజుకు, వృక్షదేవతకును తెలిపి, తిత్తిరిపక్షి నెలవు క్రింది నిధిని తీసికొని, మృగము తృణములు మేయువృక్షముమీదినుండి మధుకోశమును దీసి, రాజుకు పంపి, సర్పనివాస మగు వల్మీకమును ఛేదించి, నిధిని స్వీకరించి, తరుణి, గణిక, గ్రామభోజకులకు రాజశాసనములు వినిపించి, నిజగ్రామమున కరిగి మహాగౌరవముతో జీవితము గడిపి, తుదకు యథా కర్మం గతో.

ఆ పర్ణముఖరాజు దానాదిపుణ్యకార్యములు చేయుచు జీవితావసానమున స్వర్గపదవికి జనెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున గామణిచండుడు ఆనందుడు; రాజు నేనే.

## 258 మంధాతు జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక ఉద్విగ్నచిత్త భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు భిక్షార్థము పోవుచుండగా అలంకరించుకొన్న స్త్రీని చూచి ఉద్విగ్నచిత్తు డయ్యెను. అతనిని భిక్షువులు సభలోనికి కొనిపోయి శాస్తతో—

"భన్తే, ఈభిక్షువు ఉద్విగ్నచిత్తు డయినాడు" అని విన్నవించిరి.

"నిజమేనా?"

"భన్తే, నిజమే."

"భిక్షూ, నీవు ఇంటిలోనుండి ఎప్పటికి నీవాంఛ పూర్తి చేసికొన గలవు? కామము సముద్రమువంటిది, ఎప్పటికిని నిండదు. పూర్వులు రెండు వేల ద్వీపములనడుమ నున్న నాలుగు మహాద్వీపములలో రాజ్యము చేసి, సశరీరముగ చాతుర్మహారాజిక దేవలోకమును పరిపాలించి, త్రాయస్త్రింశ లోకమున 36 గురు ఇంద్రులస్థానములలో రాజ్యము చేసిరి. అయినను తమ వాంఛలను నెరవేర్చుకొనజాలక ప్రాణములు విడిచిరి. ఎన్నటికి నీకామతృష్ణ తీరును?" అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

అతీతకథ

పూర్వము ప్రథమకల్పమునందు మహాసమ్మతు డను రా జుండెను. ఆయనకుమారుడు రోజుడు, అతనిపుత్రుడు వరరోజుడు, అతని సుతుడు కల్యాణుడు, అతని తనూజుడు వరకల్యాణుడు, అతని తనయుడు ఉపోసథుడు, అతని తనుజన్ముడు మంధాత.

మంధాత సప్తరత్నములను, నాలుగుబుద్ధులను పొంది చక్రవర్తియై రాజ్యము చేసెను. అతడు వామహస్తము ముడిచి దక్షిణహస్తముతో తాళము వేయగా ఆకాశమునుండి దివ్యమేఘమువలె తొడప్రమాణమున సప్తరత్నములు వర్షించును. ఇట్లాతి డత్యద్భుతపురుషుడై యుండెను. ఆతడు 84 వేల వత్సరములు బాల్యక్రీడలతోను, 84 వేల వర్షములు యువరాజుగాను, 84 వేల సంవత్సరములు చక్రవర్తిగాను కాలము గడపెను. అతని యాయుఃప్రమాణ మసంఖ్యేయము.

కోరికలు తీరక ఒకనా డతడు ఉత్కంఠితుడై యుండగా అమాత్యులు 'దేవా, ఏల యి ట్లుద్విగ్నులై యున్నారు?' అని యడిగిరి.

'నా పుణ్యబలము ముందర ఈరాజ్య మెంత? ఇంతకన్న రమణీయ స్థాన మేది?'

'దేవలోకము మహారాజా!'

మంధాత చక్రరత్న మను రథ మెక్కి పారిషదులతోగూడ చాతుర్మహారాజిక దేవలోకమునకు జనెను. దేవగణపరివృతులై నలుగురు మహారాజులు దివ్యమాలికలు గంధానులేపనములు పట్టుకొని ముందుకు వచ్చి, దేవలోకమునకు గొనిపోయి ప్రభుత్వ మిచ్చిరి. నిజపారిషదు

లతో గూడి మంధాత బహుకాలము రాజ్యము చేసినను తృష్ణ తీరక, ఉద్విగ్నచిత్తుడై యుండెను. నలుగురు మహారాజులు నతనితో 'ఏల యుత్కంఠతో నున్నారు మహారాజా?' అనిరి.

'ఈలోకముకంటె రమణీయతరస్థాన మేది?'

'దేవా, మేము అన్యసేవకులవంటివారము. త్రయస్త్రింశద్దేవ లోకము ఇంతకంటె రమణీయము.'

మంధాత చక్రరత్నరథమున నిజపారిషదులతో ముప్పదిమూడవ దేవలోకమునకు జనెను. అప్పుడు దేవరాజు శక్రుడు దేవగణపరివృతుడై, దివ్యమాల్యానులేపనములతో వచ్చి స్వాగతము పలికి, మంధాత చేయిపట్టుకొని, 'మహారాజా, ఇటు రమ్ము' అని పలికెను.

రాజు దేవగణముకడనుండి వెడలిపోవునపుడు పరినాయక చక్రరత్నములను గైకొని, పారిషదులతో మనుష్యపథమున కవతరించి నిజనగరములో ప్రవేశించెను. ఇంద్రుడు మంధాతను ముప్పదిమూడవ భవనమునకు గొనిపోయి దేవతలను రెండు పక్షములుగా విభజించి, తన రాజ్యమునుండి భాగము విభాగించి యిచ్చెను.

నాటినుండి యిరువురు ప్రభుత్వము చేయుచుండిరి. ఇట్లు కాలము గడుచుచుండగా ఇంద్రుడు ముప్పదికోట్ల డెబ్బదివేల సంవత్సరములు జీవించి మరణించెను రెండవ యింద్రుడు జన్మించెను. అతడు రాజ్యము చేసి చనిపోయెను. ఈతీరున ముప్పదిఆరుగురు ఇంద్రులు మరణించిరి. మంధాత మానవదేహముతో దేవరాజ్యపరిపాలన చేయుచుండెను. ఆత డధికోల్లాసముతో నుండుటచే కామతృష్ణ కలిగెను.

"అర్ధరాజ్యమువలన నా కేమి లాభము? ఇంద్రుని సంహరించి, ఏకచ్ఛత్రాధిపత్యము వహింతును" అని తలచి యత డింద్రుని సంహరింప యత్నించి కృతకృత్యుడు కాలేక మందుడై ఆయుస్సు క్షీణింప వార్ధకము శరీరము నాక్రమించెను మానవశరీరము దేవలోకమున నిలువజాలదు. కావున నతడు దేవలోకభ్రష్టుడై నిజోద్యానమున దిగెను. రాజాగమనవార్త ఉద్యానపాలకుడు రాజకులమునకు నివేదించెను. వారెల్లరును వచ్చి అచ్చటనే రాజుకు శయన మేర్పాటు చేసిరి. దానిపై బండుకొని యతడు మరల లేవలేదు.

"దేవా, మీాయనంతరము లోకుల కేమందేశ మిత్తురు?" అని అమాత్యు లనిరి.

"నాయనంతరము మీార లిట్లు చెప్పుడు: మంధాత మహారాజు వేయిదీవులలో విచారించి, నాలుగు మహాద్వీపములకు చక్రవర్తి యై బహుకాలము చాతుర్మహారాజికులలో ప్రభుత్వముచేసి, ముప్పదిఆరుగురు ఇంద్రు లంతరించువరకును దేవలోకమున పరిపాలన నడపెను. కాని తృప్తి తీరకపోవుటచే తుదకు చనిపోయెను.

అనంతర మతడు మరణించి నిజకర్మానురూప మగు లోకమునకు పోయెను.

అభిసంబుద్ధు డైన పిమ్మట శాస్త యీావిషయమునుగూర్చి యీాగాథలు పలికెను.

చంద్రార్క కాంతిప్రసార మున్నంత
వరకును భూమిపై వార లెల్లరును
దాసులే మాంధాతృధరణీశ్వరునకు.

వర్షించిననుకూడ కార్షాపణాలు
భోగవాంఛలు తగ్గిపోవ లేదాయె.

అల్పభోగమ్ముచే నధికదుఃఖమ్ము
కలుగుచుండును; పోవు కామవాసనలు

బుద్ధిమంతుడు దివ్యభోగాలయెడల
కా డనురక్తుడు గ్రహియించుకతన

శ్రీబుద్ధదేవుని శిష్యసంఘమున
కనురక్తి తృష్ణాక్షయమ్ముపై నెపుడు

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను ఆకాలమున మాంధాత మహారాజు నేనే

# 259 తిరీటవచ్ఛ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆనందునకు కోసలరాజకుటుంబమువలన లభించిన వేయి వస్త్రములవిషయమై చెప్పినది.

వర్తమానకథ గుణజాతకమున (157) సవిస్తరముగ చెప్పబడినది.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున బ్రాహ్మణవంశమున పుట్టెను. నామకరణసమయమున నతనికి తిరీటవచ్ఛకుమారు డని పేరుపెట్టిరి. క్రమముగా నతడు పెరిగి పెద్దవా డయి, తక్షశిలకు బోయి విద్యలు నేర్చి వచ్చి, ఇంటిలోనుండి, తలిదండ్రులు మరణించినపిమ్మట విరక్తు డయి, ఇలు వెడలి ప్రవ్రజించి, అరణ్యమున కందమూలఫలాదులతో కాలక్షేపము చేయుచుండెను.

ఆయన అచట నుండుకాలమున వారాణసీరాష్ట్రము సరిహద్దులలో విద్రోహము చెలరేగెను. రా జచటికి బోయి, యుద్ధమున పరాజితుడయి, మరణభీతు డై ఏనుగు నెక్కి, యొకవైపునకు పలాయనము చేసెను. అరణ్యమున తిరుగుచు తిరుగుచు పూర్వాహ్ణసమయమునకు తిరీటవచ్ఛుని యాశ్రమము చేరెను. ఆసమయమున ఆయన కందమూలఫలాదులు కొనివచ్చుటకై అరణ్యములోనికి బోయెను. అది తాపసులయాశ్రమమని గ్రహించి రాజు ఏనుగు దిగి, ఎండకు గాలికి వడలిపోయి పిపాసితు డయి, నీటికొరకు వెదకినాడు; కాని జలము కానరాలేదు. ఇంతలో ఆశ్రమచంక్రమణము సరిహద్దున జలాశయము కానవచ్చెను. నీరు తోడుటకు ఘటము కాని, త్రాడు కాని కానరాలేదు. దప్పికి తాళలేక రాజు ఏనుగునడుమునకు కట్టియున్నత్రాడు విప్పి, హస్తిని జలాశయపుటంచున నిలువబెట్టి, త్రాడు దానికాలికి కట్టి, తాటివెంట జలాశయములోనికి దిగబోయెను. ఆత్రాడు నీటి ఘట్టమునకు చాలలేదు. కావున మరల పైకెక్కి, ఉత్తరీయమును త్రాటికొనకు కట్టి, దానిని గజముకాలికి బంధించి, దిగినను జలము సరిగా నందలేదు. కాలితో నీరు స్పృశించినాడు; దప్పిక కొలదిగా తగ్గినది. అయినను

పిపాస హెచ్చుగా నుండుటచే మృతినొందక తప్పదనుకొనెను. కాని జలాశయమున దుమికి ఇచ్చవచ్చినట్లు నీరు త్రాగినను, పైకి వచ్చు శక్తిలేక, అందేయుండెను. గజము సుశిక్షిత మగుటచే, వేరొకతావున కరుగక, అచ్చటనే నిలిచి రాజుకై ప్రతీక్షించుచుండెను.

బోధిసత్త్వుడు ఫలాదులు కొని సాయంసమయమునకు మరలి వచ్చి, ఏనుగును చూచి, రాజు వచ్చియుండు నని యూహించి, ఏనుగు నలిగిన ట్లుండుటకు కారణ మేమో యని తలచి దాని దగ్గరకు బోయెను. ఏనుగు ప్రక్కకు తప్పుకొనెను.

బోధిసత్త్వుడు జలాశయమునొడ్డుకు బోయి చూచి "మహారాజా, భయము వలదు" అని ఓదార్చి నిచ్చెన కట్టి, రాజును పైకి రప్పించి, ఆయన శరీరమున తైలము, ఔషధము పట్టించి, స్నానము చేయించి, ఫలహారము పెట్టి, ఏనుగుకట్లు విప్పెను. రాజు రెండుమూడురోజులచట విశ్రాంతి తీసికొని, తనకడకు వచ్చునట్లు బోధిసత్త్వుని ఒప్పించి, వెడలిపోయెను.

నగరమునకు కొలది దూరములో డేరాలు పాతి తనకై ప్రతీక్షించుచున్న సైన్యమును రాజు చేరగానే వారు చుట్టును మూగిరి.

ఒకటిన్నర మాసములకు బోధిసత్త్వుడు వారాణసికి బోయి, ఉద్యానమున నిలిచి, మరునాడు భిక్షార్థము పర్యటించుచు రాజద్వారము చేరెను. పెద్దతలుపు తెరచి లోనికి చూడగా రాజు కానబడెను. రాజు బోధిసత్త్వుని గురుతుపట్టి, మేడ దిగి వచ్చి, ప్రణామము చేసి, మహా ప్రాసాదమునకు గొనిపోయి, శ్వేతచ్ఛత్రముక్రింద సింహాసనమున కూరుచుండ బెట్టి, తనకై వండిన యాహారము పెట్టించెను. తాను భుజించి ఆయనను ఉద్యానమునకు గొనిపోయి, చంక్రమణాదికముతో నివాస స్థాన మేర్పాటు చేయించి, ప్రవ్రజితులకు వలయు వస్తువు లన్నియు నిచ్చి, ఉద్యానపాలకునికి కనిపెట్టియుండు మని చెప్పి, ప్రణామము చేసి, రాజు వెడలిపోయెను.

నాటినుండి బోధిసత్త్వుడు రాచదర్బారులో భోజనము చేయ నారంభించెను. ఆయనకు విశేషముగా మర్యాదలు జరుగుచుండెను. అసహిష్ణు లగు అమాత్యులు చేరి "యోధు డెవ్వరైనను ఇట్టి సత్కారము పొందగలుగునా?" అనుకొని, ఉపరాజుకడకు జని 'దేవా, మనప్రభువు

గారికి ఒకానొక తాపసియెడల మమత్వ మేర్పడినది. ఆయనయం దేగుణములు కనబడినవో? తమరు రాజుగారికి సలహా ఈయవలెను' అనిరి. మంచిది అని అంగీకరించి, అమాత్యులను వెంటబెట్టుకొని, ఉప రాజు రాజసన్నిధికి బోయి, ప్రణామము చేసి, ఈగాథ పలికెను:

కాదు విద్యావంతు డీతడు,
కాదు బంధువు, కాదు మిత్రను;
ఈత్రిదండికి శ్రేష్ఠభోజన
మేల పెట్టుదురు?

విని, రాజు పుత్రుని సంబోధించి "నాయనా, నేను సరిహద్దు దాటి పోయి, యుద్ధమున పరాజయ మొందితి. రెండుమూడుదినములు ఇచటికి రాకుండ నుండుట జ్ఞప్తియున్నదా?" అనెను.

"జ్ఞప్తియున్నది"

"ఈతపస్వివలన నాప్రాణములు దక్కినవి" అని రాజు వృత్తాంత మంతయు వినిపించి, "నాయనా, నా ప్రాణదాత, నాకడకు వచ్చిన తరువాత రాజ్య మిచ్చినను ప్రతిఫలము చాలదు" అని ఈగాథలు పలికెను:

ఓడి యుద్ధమునందు, వనమున
నొంటిగా నాపదల జిక్కిన
నాకు నీతడె దయ నొసంగెను
నాడు చేయూతన్.

ఇతని కృపచే నేను ప్రహ్లాదమున
కేవలం బడి జీవలోకము
దరిసినాడ, తిరీటవచ్ఛకు
దాన యోగ్యుండే.

కాన, భోగ్యపదార్థములతో
దానయజ్ఞము చేయవలయును;
మనము తండ్రీ, ఇతనిమేలును
మరవరాదు సుమా!

ఈవిధముగా రాజువలన బోధిసత్త్వుని గుణగణము ఆకసమున

కెక్కుచున్న చంద్రునివలె ప్రకటమయ్యెను. ఆయనకు లబ్ధియు, ఆదర మును హెచ్చినవి. అప్పటినుండి యువరాజు గాని అమాత్యులు గాని రాజుతో నేమియు అనలేకపోయిరి.

బోధిసత్త్వుని యుపదేశానుసారముగా రాజు దానాదిపుణ్యకార్య ములు చేయుచు, తుదకు స్వర్గలోకగామి యయ్యెను.

బోధిసత్త్వుడు అభిజ్ఞలను, సమాపత్తులను పొంది, తుదకు బ్రహ్మ లోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆసమయమున రాజు ఆనందుడు; తపస్వి నేనే.

## 260 దూత జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పిసినిగొట్టు భిక్షువును గురించి చెప్పినది. కథ తొమ్మి దవ నిపాతములో కాక జాతకమున వచ్చును.

### వర్తమాన కథ

శాస్త ఆభిక్షువును పిలిపించి 'భిక్షూ, నీవు ఇప్పుడే కాదు. పూర్వముకూడ మహాలోభి వగుటచే నీశిరస్సు ఖండితమైనది' అని పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డాతనిపుత్రు డయి పుట్టి, వయసు వచ్చిన పిమ్మట తక్ష శిలలో విద్యలు నేర్చి, తండ్రి తరువాత రాజ్యమునకు వచ్చి, భోజన శుద్ధికు డాయెను. అందుచే నితనికి భోజనశుద్ధికరా జనుపేరు వచ్చెను. ఒక్క భక్ష్యవిశేషమునకు శతసహస్రముద్రలు వ్యయము చేయు చుండెను. అంతఃపురములో భుజింపక, తనభోజనవిధానమును జూచు

విధానము ను ధన్యముచేయు కోరికతో రాజద్వారమున రత్నమంట పమును నిర్మించి, భోజనకాలమున దాని నలంకరింపజేసి, కాంచనమయ మగు విశాలశ్వేతచ్ఛత్రముక్రింద రాజపర్యంకమున గూరుచుండి క్షత్రియకన్యలచే పరివృతుడై, అమూల్యస్వర్ణ భోజనమున రసభరిత మగు నాహారము తినుచుండెను.

ఒకనాడు భోజనప్రియు డొకడు రాజభోజనవిధానమును గాంచి, ఆయాహారమును తాను భుజింపదలచి కోరిక నణచుకొనలేక, ఉపాయ మూహించి, ఊర్ధ్వబాహువై 'నేను దూతను, దూతను' అని కేకలు వేయుచు రాజును సమీపించెను. నేను దూత ననువానిని ఆకాలమున నెవ్వరును వారించువారు కారు. కావున మహాజనము రెండుపాయలు విడిపోయి, పోవుటకు వాని కవకాశ మిచ్చెను. అతడు వేగముగా జని, రాజు వదలిపెట్టిన ఖాద్యపిండమును దీసి నోట వేసికొనెను. వాని శిరస్సు ఖండించుటకై అసిగ్రాహకుడు కత్తి దూసెను. కొట్టవల దని రాజు వారించి, భయము వీడి భుజింపు' మని వానితో పలికి చేతులు కడుగుకొని కూరుచుండెను. భోజనానంతరము వానికి తనపానీయ తాంబూలముల నిప్పించి "ఓయీ పురుషా, దూత నంటివి. ఎవరి దూతవు నీవు?" అని ప్రశ్నించెను. "మహారాజా, నేను తృష్ణాదూతను; ఉదరదూతను. తృష్ణ ఆజ్ఞాపించి నన్ను దూతగా బంపినది" అని అత డీపూర్వగాథలు పలికినాడు

ఓమహారాజ, నే నుదరదూతను, సుమ్మ?
ఏతద్వశీభూతు లెంతదూరం బైన,
అరిసీమయే యైన, యాచింప నేగుదురు.

నాపైన కోపంబు జూపబోకుడు దేవ!
ఉదరదూతను! సర్వు లుదయాస్తమయములన్
తద్వశంగతు లౌచు తల్లడిల్లుచు నంద్రు.

అది విని రాజు "నిజము మీరు కుక్షిదూతలు. తృష్ణావశవర్తులై విచ రింతురు. తృష్ణయే ప్రాణులను చలింపజేయుచున్నది. ఈవ్యక్తి నిజము పలికెను" అని వానిని సంతోషపెట్టి, ఈగాథ పలికెను.

వృషభమ్ముతోపాటు వేయి నీకిచ్చెదను
రక్తవర్ణముతోడ రంజిల్లు గోవులను,
నేను తృష్ణాదూత నైనపుడు బ్రాహ్మణా '
ఉదరదూతకు దాన మొసగకుండుట యెట్లు ?

ఇట్లు పలికి రాజు 'ఈమహాపురుషుడు ఇతఃపూర్వ మశ్రుతము నపూర్వము నగు కారణమును తెలిపినాడు' అని సంతుష్టచిత్తుడై వానిని మిక్కిలి ఆదరించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము నిట్లు సరిపోల్చెను. ఆకాలమున నున్న పిసినిగొట్టు ఇప్పటి పిసినిగొట్టే; రాజు నేనే.

## 261 పదుమ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, ఆనందబోధివృక్షమునకు పుష్పమాలికలు వేసి పూజ చేయు భిక్షువును గూర్చి చెప్పినది. కథ కాలింగబోధి జాతకమున (479) వచ్చును

### వర్తమానకథ

ఆనందస్థవిరుడు పెంచుటచే వృక్షమునకు ఆనందబోధి అని పేరు వచ్చెను. స్థవిరుడు జేతవనద్వారము ప్రక్కన బోధివృక్షమును నాటెనను సంగతి సమస్తజంబూద్వీపమున వ్యాపించెను. ఒకనాడి జనపదము నందలి భిక్షువులు ఆనందబోధివృక్షమును పుష్పమాలికలతో పూజింతమని యోచించి జేతవనము చేరి, శాస్తకు ప్రణామము చేసిరి. మరునాడు వారు శ్రావస్తిలో ప్రవేశించి కమలవీధికి పోయి పుష్పమాలలు లభింపక, ఆనందస్థవిరునికడకు వచ్చి నివేదించిరి. 'ఆయుష్మంతులారా, నేను పుష్పమాలికలు కొనివత్తును' అని స్థవిరుడు పలికి కమలవీధికి పోయి నీలోత్పలములు చాల పట్టుకొనివచ్చి వారల కిచ్చెను. వారు పుష్పములతో వృక్షమును పూజించిరి. ఆసంగతి తెలిసి ధర్మసభలో

భిక్షువులు స్థవిరుని గుణగణమును ప్రశంసింపసాగిరి. శాస్త అచటికి అరుదెంచి విషయము తెలిసికొని 'భిక్షువులారా, ఆనందుడు, సంభాషణలో కుశలుడు, కథాకుశలుడు. ఇప్పుడే కాదు పూర్వముకూడ ఇట్టివాడే' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠిపుత్రు డయ్యెను. నగరములోని యొక సరస్సులో పద్మములు పూయుచుండెను. ఛిన్ననాసు డొకడు సరసును కాపాడుచుండెను. ఒకనాడు వారాణసిలో ఉత్సవము ప్రకటించినపుడు 'పుష్పమాలికలు ధరించి సంబరములో క్రీడించుటకై శ్రేష్ఠిపుత్రులు మువ్వురు తలపోసి ఛిన్ననాసుని ఉబ్బవేసి మాలికలు గ్రహింతము' అని, వాడు పద్మములు కోయునప్పుడు సరసుకడకు జని ఒకప్రక్కన నిలిచిరి. అం దొకడు వాని నుద్దేశించి ఈగాథ పలికెను:

విూసముల్ కేశముల్ కోసి వేసినను
ఎదిగిన రీతిగా నెదుగును నీదు
నాసిక: అడిగితి నా కబ్జ మిమ్ము.

దానిపై వాడు కుపితుడై పద్మము లీయలేదు. అంతట రెండవవాడు ఈ రెండవగాథ పలికెను:

ఉర్వి శరత్తున నుప్తబీజములు
మొలచిన రీతిగా మొలచును నీదు
నాసిక: అడిగితి నా కబ్జ మిమ్ము.

వాడు కోపించి పద్మము లీయలేదు. అంతట మూడవవాడు ఈ గాథ పలికెను:

కమల మిత్తు వటన్న కాంక్షతో నుభయు
లాడి రసత్యమ్ము; లౌ నని యన్న,
కా దన్న, మొలవదు ఖండితనాస:
యాచింతు మిత్రమా, అబ్జమ్ము నిమ్ము

అది విని, పద్మసరోవరగోపకుడు 'వీ రిరువురు అసత్యము చెప్పి నారు. నీవు ఉన్నది ఉన్నట్టు చెప్పినావు. నీకే కమలము లిచ్చుట సమంజసము' అని వానికెడు పద్మములు కోసి, ఆతని కిచ్చి, తన తామరకొలనిలోనికి బోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున పుష్పములు సంపాదించిన శ్రేష్ఠిపుత్రుడు నేనే.

## 262 ముదుపాణి జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, ఉద్విగ్నచిత్తుడగు భిక్షువును గూర్చి చెప్పినది

### వర్తమాన కథ

అతనిని ధర్మసభలోనికి గొనివచ్చిన పిదప శాస్త్ర "భిక్షూ, నిజమేనా," అని అడిగెను.

"భన్తే, చిత్తము."

"భిక్షూ, స్త్రీలు కాముకత్వమువైపు మొగ్గి నపుడు ఆపుటకు వీలులేదు. ప్రాచీనపండితులుకూడ తమబిడ్డలను రక్షించుకొనలేక పోయిరి. తండ్రి చేయిపట్టుకొని యుండియు, ఆయనకు వార్త తెలియనీయకుండ కామవశీభూతయై ఆతని పుత్రిక ఒకానొకని వెంట పలాయనము చేసినది" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఆయనపట్టమహిషికడుపున పుట్టి, పెరిగి పెద్దవాడయి, తక్షశిలలో విద్యలు నేర్చి, తండ్రి పోయిన పిమ్మట ధర్మానుసారముగా

రాజ్యము చేయుచుండెను. తనకొమార్తెను మేనల్లుని ఇంటిలో పెంచుచు, ఒకనాడు అమాత్యులతో కలిసి కూరుచుండి 'నాయనంతరము నా మేనల్లుడు రాజగును. నాపుత్రిక అతని పట్టమహిషి యగును' అని పలికెను.

మేనల్లుడు పెద్దవాడయినపిమ్మట నొకనాడు అమాత్యులతో గలిసి కూరుచుండి రాజు 'నామేనల్లునికి వేరొకకన్యను తెచ్చెదను. నాపుత్రికను మరియొక రాజకులమున నిచ్చెదను. ఈవిధముగా బంధువర్గము హెచ్చును' అని పలికెను,

మేనల్లునికి రాజు వెలుపలియిల్లిచ్చెను, అంతఃపురములోనికి బోవకుండ కట్టుదిట్టము చేసెను. వారికి పరస్పరప్రీతి యేర్పడినది. మేనల్లుడు తనలో 'ఏయుపాయమున రాజకుమారిని ఈవలకు లాగుకొని వత్తును. ఉపాయము కలదు' అని యోచించి ఆమె దాదికి లంచ మిచ్చెను. దాది 'ఆర్యపుత్రా, ఏమి చేయవలెను?' అని అడిగినది. 'అమ్మా, రాజకుమారిని ఈవలకు గొనివచ్చుటకు వీ లెట్లగును?'

'రాజకుమారితో మాటాడి తెలిసికొందును.'

'మంచిది.'

ఆమె పోయి రాజకుమారితో 'తల్లీ, నీతలలో పేను ఉన్నది. తీసెదను' అని ఆమెను చిన్నపీటపై గూరుచుండబెట్టి, తాను ఎత్తున గూరుచుండి, శిరసు తన మోకాలిమీద నుంచి పేనును తీయుచు కుమారితలపై గోటితో నొక్కెను. 'ఇది నానోటితో నొక్కుడు పడదు మీనాన్నగారి మేనల్లునిగోటితో నొక్కుడపడగలదు' అని పలుకగా కుమారి 'అమ్మా, నీవు రాజకుమారునివద్దకు పోయినావా?' అనెను.

'అవు నమ్మా!'

'ఆయన ఏమి సందేశము పంపినారు?'

'నిన్నావలకు గొనిపోవు నుపాయము తెలియగోరినాడు.'

'కుమారుడు బుద్ధిమంతు డయినచో తెలిసికొనగలడు' అని రాజకుమారి ఈగాథ పలికె, 'ఈమాటలు నీవు కుమారునితో చెప్పవలెను' అనెను.

చిన్ని కోమలకరము, శిక్షితానేకపం
బంధకారము, వర్ష, మన్ని సమకూడినవి:
నీ యాశయం బింక నెరవేరు ధ్రువముగా.

ఆమె వాక్కులు నేర్చికొని కుమారునికడ కరిగెను.

'అమ్మా, రాజకుమారి ఏ మన్నది?' అన్నాడు కుమారుడు.

'మ రేమియు చెప్పలేదు. ఈగాథమాత్రము పంపినది' అని యామె గాథ చదివెను. కుమారుడు దానియర్థము గ్రహించి 'అమ్మా, నీవు వెళ్ళు' అన్నాడు.

కుమారుడు దీనిభావము బాగుగా గ్రహించి, కోమలహస్తములు, సౌందర్యము కల చిన్నవానిని తయారుచేసి, భద్రగజమును నడపు మావటివానిని లోనికి పెట్టి, ఏనుగకు శిక్షణ యిచ్చి, తగినసమయము నకై యెదురుచూచుచుండెను.

అది అమావాస్య. అర్ధరాత్రము గడచినతరువాత బాగుగా వర్షము కురిసినది. రాజకుమారి నిర్దేశించిన దిన మిది యని కుమారుడు తలపోసి, యేను గెక్కి, కోమలహస్తములు కల చిన్నసేవకుని భద్రగజముపై గూరుచుండ బెట్టి, పోయి రాణివాసమున నెదురుగా నుండు నంగణమున పెద్దగోడకు గజమును ఆనించి యుంచి, కిటికీ సమీపమున వానలో తడియుచు నిలుచుండెను. రాజు కుమారిని రక్షించుచుండెను. తండ్రి యామెను వేరొకచోట పండుకొననీయక, తన దగ్గరలో చిన్నపరుపుమీద పండుకొనబెట్టుచుండెను. నేడు రాజకుమారుడు వచ్చు నని యామె యోచించి, పండుకొనియుండియే "నాయనా వానలో స్నానము చేయవలె నని కోరిక యున్నది" అన్నది. "అమ్మా, సరే" అని రాజు కిటికీవెలుపల డాబామీదికి బంపి, ఆమెచేయి యొకటి పట్టుకొని యుండి స్నానము చేయు మనెను. ఆమె తడియుచు రెండవచేయి కుమారునివైపు చాపెను. ఆమె చేతి నుండి ఆభరణములను తీసి రాజకుమారుడు సేవకుని చేతికి తొడిగి వానిని లేవనెత్తి రాజకుమారిప్రక్కన నిలిపెను. ఆమె వానిచేయి తండ్రిచేతిలో పెట్టెను. రాజు వానిచేయి పట్టుకొని పుత్రిక చేయి విడిచిపెట్టెను. ఆమె రెండవచేతి యాభరణములు వాని రెండవచేతికి పెట్టి, ఆహస్తము తండ్రిచేతిలో బెట్టి, తాను రాజకుమారుని వెంట

వెడలిపోయెను. చీకటిలో రాజు కుర్రవానిని కుమార్తెనుగా భావించి శయనాగారమున పండుకొన బెట్టి, తలుపుమూసి, గొళ్ళెము వేసి, కాంస్యగడియ తగిలించి, తనశయనముమీద పండుకొనెను. ప్రాతః కాలమున రాజు తలుపు తెరచి, కుర్రవానిని చూచి "ఏ మిది?" అని యడిగెను. కుమారి కుమారునితో పలాయనము చేసిన వృత్తాంతము వాడు చెప్పినాడు.

రాజు చింతాక్రాంతుడై "చేయి పట్టుకొని, వెంట నిలుపుకొని యున్నను రాత్రి కాపాడలేకపోతిని. స్త్రీలు రక్షణమున నిలువజాలు వారు కారు" అనుకొని, ఈగాథలు పలికినాడు :

స్త్రీజనమ్మునకు సంతృప్తి లే దెన్నండు;
సరసవాక్కులు; నదుల చందాన దుష్పూర;
లిట్టివారల కాంచి యెవడేని దూరముగ
పారిపోవక యున్న పక్షాన, ముంచుదురు.

స్వర్ణంబుకోర కేని, స్వచ్ఛందముగ నేని
వారు సేవింతు రెవ్వాని, వహ్ని విధాన
దహియించి వేయుదురు త్వరితంబుగా వాని.

ఇట్లు పలికి ఆ మహాసత్త్వుడు తనలో "నేను మేనల్లుని పోషింప వలెను" అనుకొని, విశేషాదరముతో కుమారిని అతని కిచ్చి వివాహము చేసి, అతనిని ఉపరాజును చేసెను. మామమరణానంతర మతడు రాజయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున రాజు నేనే.

# 263 చుల్లపలోభన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్తు డగు నొకానొక భిక్షువును గూర్చి చెప్పినది

## వర్తమాన కథ

భిక్షువు లతనిని ధర్మసభలోనికి గొనిపోయిన పిదప శాస్త అతనితో "భిక్షూ, నిజమేనా?" అనెను. "భన్తే, నిజమే," "భిక్షూ, స్త్రీలు పూర్వము సచ్చరిత్రుల మనస్సులను గూడ కరగించిరి" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండెను. అతనికి పుత్రులు కలుగ లేదు. పుత్రుడు కలుగునట్లు ప్రార్థింపు డని ఆయన భార్యలతో జెప్పెను. వారు ప్రార్థించుచుండిరి. ఇట్లు కాలము గడచుచుండ బ్రహ్మలోకమునుండి బోధిసత్త్వు డవతరించి పట్టపురాణి కడుపున బుట్టెను. అతడు పుట్టగానే స్నానము చేయించి పాలు త్రాగించుటకై దాది చేతి కిచ్చిరి. దాది పాలుత్రాగించి పోవగా బిడ్డడు రోదనము చేయుచుండెను. అంతట వానిని వేరొకరి చేతి కిచ్చిరి. స్త్రీలచేతులలో బిడ్డడు శాంతముగా నుండుట లేదు. అంతట వానిని పరిచారకునిచేతి కిచ్చిరి. వాడు చేతులలోనికి తీసికొనగానే బిడ్డడు శాంతించెను. అప్పటినుండి బిడ్డడు పరిచారకులచేతులలో మెలగుచుండెను. చనుబాలు త్రాగవలసినపుడు పిండి, పిల్లవానికి బోయుచుండిరి. ఒక్కొక్కప్పుడు తెరమరుగునుండి స్తనము పిల్లని నోట బెట్టుచుండిరి. పిల్లడు పెరిగిన పిమ్మటకూడ స్త్రీల నతనికి గన బరచుటకు జంకుచుండిరి. వేరుగా అతనికి శయనాగారము పూజా గృహాము నేర్పాటు చేసిరి. అతనికి పదునారేండ్లవయసు వచ్చినప్పుడు తండ్రి తనలో "నాకు రెండవ బిడ్డడు లేడు. వీనికి కోరికలమీద భోగ ములమీద రాజ్యమందైనను వాంఛ లేదు. ఇతడు కష్టముమీద లభించినాడు" అని యోచించుచుండెను. నృత్య గీత వాద్యములలో

నేర్పరి యై పురుషులను వశీకరింపగల తరుణనటి యొకతె ప్రభుసన్నిధి కరిగి 'దేవా, ఏమో యోచించుచున్నారు' అనెను. ఆయన కారణము చెప్పెను.

"అట్లయిన దేవా, ఆయనను నేను ప్రలోభపెట్టి రాగరసజ్ఞానము కలిగింతును."

"స్త్రీవాసన యెరుగని నాకుమారుని త్రోవకు తెత్తువేని అతడు రాజయినపిదప నీవు పట్టపుదేవి వగుదువు." "ఈవిషయములో బాధ్యత నాది. తమరు చింతింపవలదు." నటి పహరావారలకడకు బోయి "ఉదయము నేను ఆర్యపుత్రునిశయనాగారమునకు వెలుపలి పూజాగృహమున నిలుచుండి పాట పాడుదును. ఆయనకు కోపము వచ్చినచో నాకు దెలుపుడు. నేను వెడలిపోవుదును. ఆలకించెనేని మీరు నాప్రశంస చేయుడు" అని చెప్పెను. వారు సరే అనిరి.

ఆమె ప్రాతఃకాలమున అచట వీణావాదనము చేయుచు మధురముగా పాడుచుండెను. కుమారుడు వినుచు పండుకొనియుండెను. మరునాడు కుమారుడు తన దగ్గరకు వచ్చి, గానము చేయుమని ఆన తిచ్చెను. తరువాతరోజున పూజాగృహమున నుండి గానముచేయుమని ఆజ్ఞాపించెను. అనంతరము తనవద్దకు ర మ్మనెను. ఇట్లు క్రమక్రమముగా రాజకుమారుడు తృష్ణ యుదయింపగా లోకధర్మము ననుసరించి కామరసము నాస్వాదించి, ఈతరుణిని మరియొకరికడకు బోనీయనని ఖడ్గము పట్టుకొని, వీధిని బడి, పురుషులను పారద్రోలుచుండెను.

రాజు అతనిని పట్టించి, కుమారుని నటిని నగరమున వెలుపలికి బంపెను. ఇరువురును అరణ్యమున బ్రవేశించి గంగవెంట జని, గంగకును సముద్రతీరమునకును నడుమ ఆశ్రమము నిర్మించుకొని నివసింప జొచ్చిరి. బోధిసత్త్వుడు అడవికి బోయి కందమూలఫలాదులు తెచ్చుచుండును. కుమారి పర్ణశాలలో గూరుచుండి వంట చేయుచుండును.

ఒకనా డాయన కందమూలఫలాదులకు జనగా, ద్వీపవాసి యగు తపస్వి భిక్షార్థ మాకాశమార్గమున జనుచు, ధూమము చూచి ఆశ్రమపదమున దిగెను. వంట అగువరకును కూరుచుండుడు అని ఆమె చెప్పగా తపస్వి కూరుచుండి, స్త్రీహావభావములచే అతనిని ముగ్ధుని జేసి, ధ్యానచ్యుతుని గావించి, బ్రహ్మచర్యభ్రష్టు నొనర్చెను. రెక్కలు

తెగిన కాకివలె నయి యాతడు స్త్రీని విడువలేక ఆనాడచటనే యుండెను. బోధిసత్త్వుడు వచ్చుట చూచి యతడు సముద్రమువైపు పరుగెత్తెను. అతడు తనకు శత్రువు కానోపు నని బోధిసత్త్వుడు ఖడ్గము తీసికొని ఆతనివెంట జనెను. ఆకాశమున నెగురుటకు యత్నించి తపస్వి సముద్రమున బడెను. బోధిసత్త్వుడు యోచించి, తాపసు డాకాశమార్గమున వచ్చి ధ్యానము నశించుటచే సముద్రమున బడె ననియు, ఆయనకు తాను సాయపడవలె ననియు భావించి సముద్రతీరమున నిలిచి ఈ గాథలు పలికెను:

నీటిమీదుగ గాక నీ బుద్ధిబలముచే
వచ్చి, స్త్రీసంసర్గాన వనధిలో బడినావు.

స్త్రీలు కార్యమునం దాఁతేరి నట్టి
వారలును, బ్రహ్మచర్యవిదారిణులును
మోసగత్తెలు ననియును ముందె యెరిగి
ధీసులగు వార లుందురు దూరముగను

స్వర్ణంబుకొర కేని స్వచ్ఛందముగ నేని
వారు సేవింతు రెవ్వాని, వహ్నివిధాన
దహియించివేయుదురు త్వరితంబుగా వాని.

ఈప్రకారముగా బోధిసత్త్వునివాక్కులు విని, తపస్వి సముద్రమున నిలిచియుండి నష్టమైన ధ్యానము పునర్లబ్ధము కాగా ఆకాశమార్గమున నెగిరిపోయెను.

బోధిసత్త్వుడు తనలో 'ఈ తాపసుడు మహాకాయుడయ్యును బూరుగుదూదివలె గగనమార్గమున నెగిరిపోయినాడు. ఈయనవలెనే నేనుకూడ ధ్యానోత్పత్తివలన ఆకసమున విహరింపవలెను' అని యోచించి, ఆశ్రమమునకు బోయి, స్త్రీని గ్రామమువైపు గొనిపోయి 'నీవు పొమ్ము' అని చెప్పి, మరల అరణ్యమున ప్రవేశించి సుందరస్థానమున ఆశ్రమము నిర్మించుకొని, సన్యసించి, ధ్యానము చేసి, అభిజ్ఞలు సమాపత్తులును పొంది తుదకు బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము జేసి జాతకములం పరిపోల్చెను. ఆకాలమున కుమారుడను నేనే.

# 264 మహాపణాద జాతకము

శాస్త గంగాతీరమున గూరుచుండి భద్దజి స్థవిరుని శక్తి విషయమై చెప్పినది.

## వర్తమానకథ

ఒకప్పుడు శాస్త శ్రావస్తిలో వర్షాకాలము గడిపి, 'భద్దజికుమారుని సంఘములో చేర్తును' అని తలపోసి, భిక్షుసంఘముతో గూడ పర్యటనము చేయుచు భద్దియ నగరము చేరెను. జాతీయవనమున మూడుమాసములదాటు కుమారుని జ్ఞానము పరిపక్వమగుటకు వేచి యుండెను. భద్దజికుమారుడు మహాధనవంతుడు. ఎనుబదికోట్ల సంపద కల శ్రేష్ఠికి ఏకపుత్రుడు. అతనికి మూడుఋతువుల కనుకూల మగు మూడు సౌధములు గలవు. ఒక్కొక్క సౌధమున నాతడు నాలుగు మాసములు నివాసము చేయుచుండును. ఒక సౌధమునుండి నటాదులతో పరివృతుడై మిక్కిలి ఆడంబరముతో రెండవసౌధమునకు పోవుచుండును. ఆక్షణమున కుమారుని వైభవము విలోకించుటకు జనులు వెల్లువగా పోవుచుండిరి. సౌధములకు నడుమ మంచెలపై మంచెలు కట్టుచుండిరి.

శాస్త మూడుమాసము లచట నుండి గ్రామవాసులతో మేము పోవుదు మని చెప్పెను. వా రాయనతో "భన్తే, రేపు దయచేయు" డని ఆయనను మరునాటికి నిమంత్రించిరి. బుద్ధప్రముఖసంఘమునకు మరునాడు మహాదానము సిద్ధము చేసి నగరమధ్యమమున మండపము నిర్మించి అలంకరించి ఆసనములను వేసి తరుణము సూచించిరి. భిక్షుసంఘముతోపాటు శాస్త అచటికి జని కూరుచుండెను. లోకులు మహాదానము చేసిరి. శాస్త భోజనానంతరము మధురస్వరముతో దానాను మోదన మారంభించెను. ఆసమయమున భద్దజికుమారుడు ఒక సౌధమునుండి వేరొక సౌధమునకు బోవుచుండెను. ఆనాడు ఆతని వైభవము వీక్షించుట కెవ్వరును రాలేదు; అతని పరివారము మాత్రము వెంట నుండెను.

భద్దజికుమారుడు తనవారితో ఇట్లనెను. 'ఇదివరలో నేను ఒక సౌధమునుండి మరియొక సౌధమునకు పోవునప్పుడు నగరవాసులు వెల్లు

వగా వచ్చి మంచెపై మంచె నిర్మించెడివారు. ఈనాడు మనవారు తప్ప అన్యు లెవరును లేరు. దీనికి కారణ మేమి?'

'స్వామీ, సమ్యక్ సంబుద్ధుడు ఈనగరసమీపమున మూడుమాసము లుండి, నేడు పోవుచున్నారు. భోజనము కాగానే జనమునకు ధర్మోపదేశము చేయుచున్నారు. నగరవాసు లెల్లరు ఆయుపదేశము ఆకర్ణించుచున్నారు.'

'అట్లగుచో మనముకూడ విందము' అని భద్దజికుమారుడు అలంకారములు తీసి విశేషపరివారముతో సభ చేరి వెనుకవైపు నిలుచుండి ధర్మోపదేశము వినుచుండగా అతని క్లేశములు క్షయము నొంది ఆతనికి అర్హత్త్వము సిద్ధించెను.

శాస్త భద్దియశ్రేష్ఠిని ఆమంత్రించి 'మహాశ్రేష్ఠీ, నీపుత్రుడు అర్హత్త్వము పొందినాడు. ఇందుచే నే డతడు ప్రవ్రజింపవలెను; అట్లు చేయనిచో నిర్వాణము పొందవలసివచ్చును' అని చెప్పెను.

"భన్తే, నాకుమారుడు నిర్వాణము పొందగూడదు. అతనిని ప్రవ్రజింప చేయుడు; కాని అతనిని వెంటపెట్టుకొని మాయింటికి దయచేయవలెను.'

భగవాన్ నిమంత్రణము స్వీకరించి శ్రేష్ఠిపుత్రుని విహారమునకు గొనిపోయి ప్రవ్రజింప చేసి, ఉపసంపద నొసగెను. అతని తలిదండ్రులు సప్తాహకాలము భగవానుని విశేషముగా సత్కరించిరి.

శాస్త సప్తాహకాల మచట నుండి కుమారుని వెంటకొని పర్యటనము చేయుచు కోటిగ్రామము చేరెను. ఆ గ్రామవాసులు బుద్ధప్రముఖసంఘమునకు మహాదానము నిచ్చిరి. శాస్త భోజనానంతరము దానానుమోదనము ప్రారంభించెను. కులపుత్రుడు అనుమోదన సమయమున గ్రామము వెలుపలికి చని 'శాస్త వచ్చునప్పటికి లేతును' అనుకొని గంగాతీరమున ఒకానొక వృక్షచ్ఛాయలో కూరుచుండి ధ్యాననిష్ఠు డయ్యెను. పెద్ద స్థవిరులు వచ్చినను ఆతడు లేవక, శాస్త వచ్చిన పిమ్మటనే లేచినాడు. సామాన్యభిక్షువులు కోపముతో 'ఇతడు ప్రవ్రజితు డయ్యును పూర్వమువలె పెద్ద స్థవిరులు వచ్చినపుడు లేవకున్నాడు.'

కోటిగ్రామవాసులు నావల నొక్కచో కట్టివేసిరి. శాస్త నావలపై

కెక్కి 'భద్దజి ఎచట నున్నాడు?' అనెను.

'భన్తే, ఇచటనే.'

'భద్దజీ, రమ్ము. మా వెంట ఈనావలోనే కూరుచుండుము.

స్థవిరుడు ఎగిరి పడవ ఎక్కికూరుచుండెను.

నావ గంగామధ్యమున చేరిన పిమ్మట శాస్త "భద్దజీ, నీవు మహాపణాద ప్రభువుగా నున్నప్పుడు నీ నివాసస్థాన మెచట?" అనెను.

'భన్తే, ఇచట మునిగిపోయినది.'

సామాన్యభిక్షువులు 'ఇతడు అర్హత్త్వము పొందినట్లు ప్రకటించుచున్నారు' అనిరి.

'భద్దజి, ఈ బ్రహ్మచారుల సంశయము తొలగింపుము' అన్నాడు శాస్త.

ఆక్షణములోనే స్థవిరుడు శాస్తకు ప్రణామము చేసి, బుద్ధిబలముచే జని ప్రాసాదశిఖరము నంగుళితో పట్టి ఇరువదిఅయిదు యోజనముల దూరము గొనిపోయి ఆకసమున కెగిరెను. ఎగురుచున్న ప్రాసాదము క్రింద జనులు అయ్యాది ఉచ్ఛేదము పొందినట్లు గ్రహించిరి. ఆయన ఒక యోజనము, రెండు యోజనములు ఇరువది యోజనములవరకు. ప్రాసాదమును నీటిపై నుండి కొంపోయెను.

పూర్వజన్మములోని ఆయునబంధువులు ప్రాసాదముమీది లోభముచే మత్స్యములుగా, కచ్ఛపములుగా నాగములుగా మండూకములుగా ఆప్రాసాదముననే జన్మించిరి. ప్రాసాదము లేచిన పిమ్మట అవి యన్నియు నెగిరి నీట దుముకుచుండుట చూచి శాస్త "భద్దజీ, నీ సంబంధులు క్లేశము పొందుచున్నారు" అనెను.

శాస్తవాక్కులు విని స్థవిరుడు ప్రాసాదమును విడిచిపెట్టెను. అయ్యాదితోడనే సుప్రతిష్ఠిత మయ్యెను.

శాస్త గంగానది దాటిన పిదప ఆసనము నదీతీరముననే వేసిరి. పరచిన శ్రేష్ఠాసనముపై కూరుచుండి తరుణసూర్యరశ్మి వెలార్చుచు శాస్త కూరుచుండెను. అప్పుడు భిక్షువులు "భన్తే, భద్దజి స్థవిరుడు ఈస్థానమున ఎప్పు డుండెను?" అని యడిగిరి.

"మహాపణాద ప్రభువుగా నున్నప్పుడు" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము విదేహరాష్ట్రమున మిథిలానగరములో సుసుచి యను రా జుండెను. అతనికుమారుడుకూడ సురుచియే. ఆతనికుమారుడు మహాపనాదుడు. అతని కీప్రాసాదము లభించెను. లభించిన పిమ్మట పూర్వజన్మసహాయకుని కై తండ్రికొడుకులు ఉదుంబరకాష్ఠములతో, వెదుళ్ళతో ప్రత్యేకబుద్ధుని నివాసార్థము పర్ణశాల నిర్మించిరి.

శాస్త సమ్యక్సంబుద్ధు డయి ఈకథనుగూర్చి యీగాథలు పలికెను.

ప్రభు పనాదుని పైడిప్రాసాద మిద్ది
వెడలుపు పదునారు పొడవు సహస్ర
ధనువుల పరిమితి; దాన నంతస్తు
లేడు; పతాకము లెగురు పచ్చనివి.

అందులో గంధర్వు లార్వేలవారు
చేయుచుందురు గానచిత్రనాట్యములు.

భద్దజీ, నీ వన్న భాతిసే యుండె,
నేను శక్రుడ నాడు, నీ సేవకుండ.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పుడు మహాపనాదుడు భద్దజి; ఇంద్రుడు నేనే.

## 265 ఖురప్ప జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, విశ్వాసము కోల్పోయిన భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

"భిక్షూ, నీవు నిజముగా విశ్వాసము కోలుపోతివా!" అని శాస్త యడిగెను. "భన్తే, నిజమే." "భిక్షూ, నిర్వాణమువైపు గొనిపోవు శాసనమున ప్రవ్రజించియు, విశ్వాసము విడిచితివా? పూర్వముకూడ

నిర్వాణమునకు సంబంధింపని విషయములకై ప్రయత్నము చేసిరి” అని శాస్త్ర పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడొకానొక ఏనరక్షకుని వంశమున పుట్టి, పెద్దవాడయి రక్షకజ్యేష్ఠుడయ్యెను. పంచశతపరివారసమేతుడై యితడరణ్యముఖమున గ్రామమున నివసించుచు, భృతి గ్రహించి మనుజుల నడవి దాటించుచుండెను. ఒకనాడు వారాణసీనివాసి, వణిక్పుత్రుడు అయిదువందలబండ్లతో ఆగ్రామము చేరి బోధిసత్త్వుని బిలిపించి, “మిత్రమా, వేయి నాణెములు స్వీకరించి, మమ్ముల నడవి దాటింపుము” అని కోరగా అతడంగీకరించి వేయి నాణెములు గ్రహించుచుండగనే అతనికై తన జీవమున దిగదుడుపుచేసెను. అతడు వణిక్పుత్రుని గొనిపోయి అడవిలో ప్రవేశించెను. అటవీమధ్యమున పంచశత చోరదళము వారిచుట్టుముట్టెను. చోరులను చూడగనే తక్కినజనుల గుండెలు జారిపోయెను. రక్షకజ్యేష్ఠుడు అరచుచు, గర్జనము చేయుచు, ప్రహరించుచు చోరులను పారద్రోలి, వణిక్పుత్రుని సురక్షితముగా కాంతారము దాటించెను. ఆవల చేరిన పిమ్మట నతడాగి, జ్యేష్ఠునికి బహురసభరిత మగు భోజనము పెట్టించి, తాను భుజించి, సుఖాలాపములు చేయుచు “మిత్రమా, భయంకరులగు చోరులు శాస్త్రాదులతో చుట్టుముట్టినను నీచిత్తమున ఈషణ్మాత్రభీతికూడ కలుగలేదేమి?” అని ప్రశ్నించెను.

ఈగాథ పలికెను :

చాపముక్తము లైన శరములు వేగ
రాలుచునుండంగ, తైలవిశుద్ధ
కరవాలపంక్తులు కదలుచుండంగ,
నృత్యమాడుచు నుండ మృత్యుదేవతయె
కంప మేటికి మీకు కలుగలేదాయె?

అది విని రక్షకజ్యేష్ఠుడు ఈ గాథలు పలికెను :

సర్వ మట్లున్న ప్రసన్నచిత్తమున
నుంటచే విజయమ్ము గంటిమి మేము;
విడిచితి తొలుత జీవితముపై నాశ.

చేయ శే రెన్నండు జీవితప్రియులు
ధీరులై వీరులై శూరకృత్యములు.

బాణవర్షము కురియుచుండ జీవింపవలె నను తృష్ణ విడిచి, శూర కృత్య మాచరించుట ప్రకటించి వణిక్పుత్రుని వీడుకొల్పి, తనగ్రామము నకు వచ్చి, దానాదిపుణ్యకార్యములు చేయుచు, తుదకు యథా కర్మం గతో.

శాస్త ధర్మోపదేశము చేసి, రెండుజాతకములు పరిపోల్చెను. ఆకాలమున రక్షఃప్రముఖుడు నేనే

## 266 వాతగ్గ సింధవ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఒకానొక గృహస్థు విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొక సుందరి ఒక సుందరగృహస్థుని చూచి అతనియెడ ఆసక్తచిత్త యయ్యెను. ఆమెకు శరీరమున సుఖము కాని మనస్సున శాంతి కాని లేవు. ఆమె నిజపరిచారిక 'నీవు ఏల చంచలచిత్త వైతివి? మంచముపట్టె పట్టుకొని ఏల దొరలు చున్నావు? నీకు వచ్చిన కష్ట మేమి?' అని యడిగెను. ఎన్నిసారులో ఆపరిచారికదూతికలు అడిగినగాని యజమానురాలు నిజస్థితి చెప్ప లేదు. అపుడు వారు ఆమె నోదార్చి, 'నీవు చింతింపవద్దు. మేము ఆయనను తీసికొని వత్తుము' అని చెప్పిపోయి ఆగృహస్థుని పిలిచిరి. అతడు సమ్మతింపలేదు; కాని తరచుగా పిలుచుటచే తుదకు సమ్మతించి 'ఫలాని రోజున, ఫలాని సమయమున వత్తును' అని చెప్పి ప్రమాణము

చేసెను. ఆమె శయనమందిర మలంకరించి తా నలంకరించుకొని శయ్యా సీయముపై కూరుచుండెను. అతడు వచ్చి శయ్యా కొకకొనను కూరు చుండెను. అప్పు డామె తనలో నేను గాంభీర్యము విడిచి వెంటనే ఇతనికి అవకాశ మిత్తునేని నాకు ఘనత తగ్గును. వచ్చిననాడే అవకాశ మిచ్చుట ఉచితము కాదు. నే డితనిని లజ్జితుని చేసి రెండవనాడు ఈతని కవకాశ మిత్తును' అని తలపోసి చేతులు పట్టుకొనుట మొదలైన క్రీడ ప్రారంభించెను. తుద కామె "వెడలిపో, నీతో నా కేమియు పనిలేదు' అనెను.

హతాశుడై, లజ్జితుడై యతడు నిజగృహమునకు వెడలి పోయెను.

ఆ ప్రజనము ఆమె చేసిన పని గ్రహించి, అతడు వెడలిపోయిన పిదప ఆమెతో 'నీవు అతనియెడ ఆసక్తచిత్తవైతివి ఆహారము విడిచి మంచముపై దొరలుచుంటివి. మేము ఎంతో వేడుకొని ఆయనను పిలుచుకొని వచ్చితిమి నీ వాయన కేల అవకాశ మీయవైతివి?' అని అనిరి. ఆమె నిజాభిప్రాయము తెలిపెను. అట్లగుచో తెలియును లే యని వారు వెడలిపోయిరి. ఆగృహస్థు మరల రానేలేదు. అతడు లభింపకుండుటచే ఆమె అన్నపానీయములు విడిచి తుదకు చనిపోయెను.

ఆమె మరణవార్త విని విశేషముగా గంధమాల్యానులేపనములు వెంటగొని జేతవనమునకు జని శాస్తను పూజించి ప్రణామము చేసి ఒకప్రక్క కూరుచుండెను. శాస్త అతనిని జూచి, "ఉపాసకా, కన బడుట లే దేమి?" అనెను.

గృహస్థుస్థితి తెలియపరచి 'భన్తే, ఇంతవరకును లజ్జవలన బుద్ధ సేవకు రాజాలనైతిని' అని విన్నవించినాడు.

'ఉపాసకా, ఆమె ఇప్పుడే కాదు. వెనుకకూడ ఇట్లే చేసినది' అని అతని ప్రార్థనపై శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ సైంధవకులమున బుట్టి వాతగ్గ సైంధవ మనుపేర రాజుకు మంగళాశ్వ మయ్యెను. అశ్వగోపకులు సైంధవమును దీసికొనిపోయి గంగాజల

ములో స్నానము చేయించుచుందురు. కుందలి యను గాడిద గుఱ్ఱమును చూచి మరులుకొని, కామవశమున కంపించుచు తృణభక్షణము మానెను. నీరు త్రాగుట మానెను; శుష్కించి పోయి, అస్థిచర్మావశిష్ట యయ్యెను.

దానిబిడ్డ గార్ధభపోతకము చిక్కిపోవుచున్న తల్లిని చూచి 'అమ్మా, ఏల పచ్చిక మేయవు? నీరు త్రాగవు? శుష్కించిపోవుచు కంపించుచు అచ్చటచ్చట పడియుందువు? నీ కేమి కష్టము దాపురించినది?' అనెను.

అది మొదట ఏమియు పలుకక, కొమరుడు మాటిమాటికిని ప్రశ్నించుటచే విషయము తెలిపెను. కొమరుడు తల్లి నోదార్చి, "అమ్మా, విచారింపకు. అశ్వమును కొనివత్తును" అని చెప్పి, సైంధవము స్నానము చేయుసమయమున సమీపమునకు జని 'నాయనా, నాతల్లి నీయెడ ప్రతిబద్ధచిత్తురా లయినది. ఆహారము విడిచిపెట్టినది. శుష్కించి పోవుచున్నది. ఆమెకు ప్రాణదానము చేయుము' అని పలికెను. 'మంచిది బాబా, అట్లే చేసెదను. అశ్వగోపకులు నాకు స్నానము చేయించి మేత మేయుటకై నన్ను కొంచెము తడవు గంగాతీరమున విడుతురు. అప్పుడు నీవు తల్లితో నచటికి రమ్ము' అని సైంధవము చెప్పెను. కుమారుడు వెడలిపోయి, తల్లిని గొనివచ్చి అచ్చట విడిచి, కొంతదూరమున ప్రచ్ఛన్నముగా నుండెను. అశ్వగోపకులు గుఱ్ఱము నక్కడ విడిచిరి. అశ్వము గర్దభిని జూచి సమీపమునకు వచ్చి దాని శరీరమును వాసన చూచునప్పటికి గార్దభి తనలో 'నేను గాంభీర్యము వహింపక, అశ్వము వచ్చినంతనే దాని కవకాశ మిత్తునేని నా పేరు ప్రతిష్ఠలు పోవును. కోర్కె లేనిదానివలె నుండుట యుక్తము' అని తలపోసి, గుఱ్ఱపు క్రిందిదౌడమీద తన్ని పరుగెత్తెను. అశ్వమునకు దంతము రాలిపోవునంతటి బాధ కలిగెను. గుఱ్ఱము సిగ్గుపడి, అచటి నుండి పలాయనము చేసెను. గాడిద దుఃఖించుచు అచ్చటనే పడియుండెను. అంతట కుమారుడు తల్లిని సమీపించి ప్రశ్నించువాడై ఈగాధ పలికెను.

ఎవనికోసము నీవు కృశించి పాలి
పోతి, వెవ్వనికై నీకు భోజనంబు

కూడ రుచించెడిది కాదో, వాడు వచ్చె:
ఇట్టియెడ నీవు పరుగిడ నేల తల్లి.

పుత్రునిమాటలు విని తల్లి ఈగాథ పలికెను .

అమరు పక్షాన సంబంధ మాది యందె
స్త్రీల యభిమాన మంతయు శిథిల మగును;
ఇందుచే తండ్రి, నే పరుగిడినదాన!

ఈవిధముగా గర్దభి స్త్రీస్వభావమును కుమారునకు దెలిపెను.
శాస్త్ర అభిసంబుద్ధుడై ఈగాథ పలికెను :

వచ్చు నుత్తమవంశజు నిచ్చగింప
కెవ్వతె యుపేక్షచేయు నా జవ్వని కడు
కందవలె చిరకాలము కుందలివలె.

శాస్త్ర సత్యములను ప్రకటించి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున గాడిద ఆస్త్రీ; వాతగ్గ సింధవము నేను.

## 267 కక్కట జాతకము

శాస్త్ర జేతవనమున విహారించుచు ఒకానొక స్త్రీని గురించి చెప్పినది

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొక గృహస్థు గృహిణితో కూడ బయలుదేరి బాకీలు వసూలుచేయుటకై జనపదమునకు బోయి, వసూలు చేసి, మరలి వచ్చుచుండెను. మార్గమున చోరులు వచ్చిపడిరి. ఆయనభార్య చాల చక్కనిది. చోరనాయకుడు ఆమెయెడ ఆసక్తచిత్తుడై గృహస్థును మోదసాగెను. ఆమె శీలవతి, సదాచారసంపన్నురాలు, భర్తను దైవ సమానునిగా భావించెడిది. ఆమె చోరనాయకుని పాదములపై పడి, "స్వామీ! మీరు నామీదికోరికచే నాభర్తను సంహరించుపక్షమున నేను విషము తిని ప్రాణములు కోల్పోవుదును. నేను మీ వెంట రాను;

నాభర్తను నిష్ఫలముగ బాధింపకుము'' అని భర్తను విడిపించుకొన్నది.

వారిరువురు భద్రముగ శ్రావస్తిలో జేతవనవిహారము వెనుకగా పోవుచు, వారు 'విహారములోనికి బోయి శాస్తకు ప్రణామము చేయ దలచి గంధకుటిప్రాంగణము చేరి అఞ్జలి చేసి ఒకప్రక్కన గూర్చుండిరి.

'ఎచ్చటికి పోయితిరి?' అని శాస్త అడిగెను.

'బాకీలు వసూలు చేయుటకు.'

'మార్గమున సుఖముగా నుండెనా?'

'భర్తే, మార్గమున చోరులు మమ్ము పట్టుకొనిరి. చోరులు నన్ను కొట్టుచున్నప్పుడు ఈమె చోరనాయకుని వేడుకొని నన్ను విడిపించినది. అందుచే ప్రాణములు దక్కినవి.'

"ఉపాసకా, ఇప్పుడు ఈమె నీప్రాణములు రక్షించినది; పూర్వము పండితులనుకూడ రక్షించినది'' అని శాస్త వారిప్రార్థనపై పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

అతీతకథ

పూర్వము బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండుకాలమున హిమాలయమున మహాసరోవర ముండెను. అందు సువర్ణవర్ణము కల పెద్ద యెండ్రకాయ యుండుటచే దానికి కుళీరహ్రద మని పేరువచ్చెను. కుళీరము చాలపెద్దది, పెద్ద చక్రమంత ప్రమాణము కలది. ఏనుగును పట్టుకొని అది చంపి తినివేయుచుండెను. కావున మడుగులో దిగుటకు ఏనుగులు భయపడుచుండెను. ఆమడుగు సమీపమున నివసించు గజ యూథనాయకుని సహవాసిని యయిన కరేణువు కడుపున బోధిసత్త్వుడు పడెను. గర్భమును రక్షించుకొను యోజనతో ఆడయేనుగు వేరొక పర్వతప్రదేశమునకు పోయి మగబిడ్డను కనెను.

హస్తిపోతము క్రమముగా పెరిగి మహాశరీరము, మహాశక్తి, మహా సౌందర్యము కలదై అంజనాద్రిని పోలియుండెను. ఒక కరేణువుతో బోధిసత్త్వునకు సహవాస మేర్పడెను. ఎండ్రిని పట్టుకోదలచి ఆయన భార్యను తల్లిని వెంటగొని గజయూథమును జేరి, తండ్రిని గాంచి, 'నేను కుళీరమును పట్టుకొందును' అనెను. 'నాయనా, పట్టుకొన లేవు' అని వారించి, కుమారుడు మాటిమాటికి పట్టుదల పట్టుటచేత

'సరే, నీకే తెలియును' అనెను.

అతడు కుళీరహ్రదమునకు జని అచట నివసించు నేనుగుల నన్నిటిని ఒకచో జేర్చి, వానితో తీరమునకు బోయి 'ఆకుళీరము మనములోనికి బోవునప్పుడు పట్టుకొనునా? వెలుపలికి వచ్చునప్పుడు పట్టుకొనునా?' అనెను.

'వెలుపలికి వచ్చునప్పుడు.'

'మీరు కుళీరహ్రదములో దిగుడు. ఆహారము కొనుడు. ముందుగా వెలుపలికి రండు. నేను చివరకు వత్తును.'

ఏనుగు లట్టులే చేసెను. తుదకు వెలుపలికి జనుచున్న బోధిసత్త్వుని కుళీరము లోహాకారుడు పెద్దపట్టుకారుతో ఇనుపయూచను గట్టిగా పట్టుకొనునట్లు తన గిట్టలతో బట్టుకొనెను. ఆడయేనుగులు సమీపమున నే నిలిచియుండెను. బోధిసత్త్వుడు ఎండ్రిని కదల్చి లాగలేకుండెను. కాని ఎండ్రియే ఆయనను పట్టుకొని తనదగ్గరకు లాగుకొనెను. బోధిసత్త్వుడు మరణభీతిచే బందీవలె అరచెను. ఆడయేనుగులు భయభ్రాంతములై మలమూత్రములు విడుచుచు పరుగెత్తెను. ఆయనభార్యకూడ నిలువజాలక భయమున పరుగెత్తెను. బోధిసత్త్వుడు తన బంధనస్థితిని గూర్చియు, దానిని పరుగెత్తవల దనియు ఈగాథ పలికెను.

స్వర్ణవర్ణంబు, విశాలనేత్రములు
గట్టివౌ గిట్టలు కలిగి, రోమములు
లేని జంతువుచేత లోనైతి నీట;
దయనీయగతి నుండి తప్పింపవలయు;
ప్రియతమా, ఇపుడు నన్ వీడిపోవకుము!

అంతట కరేణు వాగి ఓదార్చి ఈగాథ పలికెను

ఆర్య, యెట్లు విడుతు నరువదేడుల నిన్ను?
ప్రియుడ వీవె నాకు పృథివియందు

ఇట్లు సహాకార మిచ్చి 'ఆర్య, నే నీకుళీరముతో కొంచెము మాటాడి విడిపించెదను' అని కుళీరమును యాచించుచు ఈగాథ పలికెను.

ఉదధిలో గాని, నర్మదానదమునందు
కాని, గంగాపగం గాని, కలకుళీర
నిఖిలకులనాయకుండవు నీవె, విడుము
రోదనము చేయుచున్నట్టి నాదుపతిని.

కుళీరము స్త్రీవాక్కులచే రసానుభవము పొంది, మనసు చలించుచుండగా ఏనుగు కాళ్ళపట్టు విడిచిపెట్టెను.

బోధిసత్త్వుడు పాదము లెత్తి దాని వీపుపై కెక్కెను. దాని యెముకలు విరిగినవి. ఏనుగు సంతోషమున ఘీంకారము చేసెను. దానిలో ఆడేనుగులు గుమిగూడి, ఎండ్రిని నీటినుండి నేలమీాది కీడ్చి, త్రొక్కి, పొడిపొడి చేసెను. దాని రెండుగిట్టలు విరిగి యొకచో బడెను. కుళీరహ్రదమునకు గంగానదితో సంబంధము కలదు. గంగోదకము పొరలి వచ్చినప్పుడు హ్రదము నీటితో నిండిపోవుచుండును. గంగ తగ్గినప్పుడు హ్రదోదకము పోయి దానిలో బడుచుండును. ఎండ్రకాయగిట్టలు రెండును గంగలో కొట్టుకొని పోయెను. అం దొకటి సముద్రములో జేరెను. రెండవది జలక్రీడ చేయుచున్న రాజకుమారదశకమునకు లభింపగా వారు ఆనక మను మృదంగము చేయించిరి. సముద్రములోనికి పోయిన దానిని అసురులు తీసికొని ఆలంబరము అను భేరి చేయించిరి. ఒకప్పుడు వారు ఇంద్రునితో యుద్ధము చేయుచు ఆభేరిని విడిచి పలాయనము చేసిరి. ఇంద్రుడు తనకొరకు దానిని సేకరించెను. ఆలంబరము మేఘముతో సమానముగా ధ్వనిచేయును. కావుననే దాని కాపేరు వచ్చినది.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున ఆడయేనుగు ఈ ఉపాసిక; ఏనుగు నేనే.

## 268 ఆరామదూసక జాతకము

దక్షిణగిరి జనపదమున ఒక ఉద్యానపాలకుని గూర్చి శాస్త చెప్పినది

### వర్తమాన కథ

చాతుర్మాస్యలు గడిపినపిదప శాస్త జేతవనమునుండి బయలుదేరి, దక్షిణగిరి జనపదమున పర్యటన చేసెను. ఒక ఉపాసకుడు బుద్ధభగవానుని, సంఘమును ఆహ్వానించి ఉద్యానమున దింపి, యవాగు ఖాద్యములు సంతృప్తిగా వడ్డించి "ఆర్యా, ఉద్యానమున విహరింపదలచినచో ఉద్యానపాలకుడు వెంటనుండును" అని వచ్చినవారికి ఫలాదులొసగు మని ఉద్యానపాలకునితో చెప్పెను.

భిక్షువులు ఉద్యానమున విచరించుచు, ఒకచో వృక్షాదు లేవియు లేకుండుట గమనించి, తోటమాలిని 'కారణ మే'మని అడిగిరి.

తోటమాలి వారితో "నాబిడ్డ పెంచుచున్న మొక్కలకు నీరు చల్లుచు సమూలముగా మొక్కలు పీకి, వ్రేళ్ళపై నీళ్ళు చల్లినాడు. అందువలన ఆప్రదేశమున వృక్షములు లేకున్నవి." భిక్షువులు శాస్త కడకు చని యీవిషయము విన్నవించిరి.

శాస్త "ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఆబాలుడు (ఆరామదూసకుడు) తోటను ధ్వంసము చేయుచుండెడివాడు" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో విశ్వసేనుడు రాజ్యము చేయుచుండగా ఉత్సవఘోషణ విని తోటమాలి సంబరములో పాల్గొనవలె నని తలచి, ఆరామములోని కోతులను బిలిచి 'ఈయుద్యానము మీాకు మిక్కిలి ఉపయోగకారి. నేను వారముదినములు ఉత్సవమునకు బోవుదును. ఆకుదోడుగు మొక్కలకు మీారు నీరు పోయుడు' అని చెప్పెను. మంచిదని వానరము లంగీకరించెను. వాని కతడు తోలుతిత్తు లిచ్చి వెడలిపోయెను.

పాటమరించు మొక్కలకు కోతులు నీరు పోసెను. మర్కటజ్యేష్ఠ

మిట్లు పలికెను: "కొంచె మీటు రండు. ఉదక మన్ని వేళల లభించునది కాదు. కావున నీరు పారబోయకుడు. మొక్కలు పీకి, వాని వేళ్ళ పరిమాణము తెలిసికొని, దీర్ఘమూలములు కలవానికి నిండుగను, అల్పమూలము లున్నవాని కల్పముగను నీరు చల్లుడు." మంచి దని వానరములు మొలచుచున్న మొక్కలను పీకి, చూచి, మరల పాతి నీరు చల్లెను.

ఆకాలమున బోధిసత్త్వుడు వారాణసిలో నుండి, ఏదో పనిమీద పోవుచు, ఉద్యానము చేరి, కోతులు చేయుచున్న పనిని చూచి "మీచేత ఈపని చేయించుచున్నవా రెవరు?" అని యడిగెను.

'వానరజ్యేష్ఠము.'

'జ్యేష్ఠునకే ఇట్టి బుద్ధి యుండగా మీ కెట్టి దుండును?' అను భావమును స్ఫురింపజేయు ఈగాథ పలికెను:

ఇందు శ్రేష్ఠునిబుద్ధి యిట్లున్నయపుడు
ఇంక నెట్లుండునో యితరులమాట.

ఆపలుకులు విని వానరములు ఈగాథ పలికినవి:

బ్రాహ్మణా, తెలియక పలుకుచున్నావు:
ముందుగా నెరుగక మూలరూపంబు
ఎదిగెడి తరుల గ్రహించుట యెట్లు?

అది విని బోధిసత్త్వుడు ఈగాథ పలికెను:

నిందించుటే లేదు నేను మిమ్ములను,
మిగులు వానరములన్ తెగడుట లేదు,
వృక్షపాలనముకై విస్ససేనుండు
నియమించి మిమ్ములు, నింద్యుడైనాడు.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. వానరులలోని ముఖ్యుడే ఆరామదూసకుడు; పండితుడను నేనే.

# 269 సుజాత జాతకము

శాస్త జేతవనమున నుండగా అనాథపిండకునికోడలును, ధనంజయశ్రేష్ఠిపుత్రికయు, విశాఖకు చెల్లెలును అగు సుజాతను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆమె మహావైభవముతో అనాధపిండికుని గృహములో చేరెను. తాను ఉన్నతవంశములోనిదాన ననుతలంపుతో ఆమె అభిమానముతో కోపముతో, చురుకుగా, కఠినముగా నుండెడిది. అత్తమామలయెడను, భర్తయెడను కర్తవ్యమును సరిగా నిర్వర్తించునది కాదు. ఇంటిలోని వారిని బెదగించుచు బాదుచుండెడిది.

ఒకనాడు శాస్త 500 భిక్షువులతో అనాధపిండికుని గృహమునకు విచ్చేసి, కూరుచుండెను. మహాశ్రేష్ఠి ధర్మప్రసంగము వినుచు, భగవానుని సమీపమున గూరుచుండెను. ఆసమయమున సుజాత పనివారలతో జగడమాడుచుండెను. శాస్త ధర్మప్రసంగము ఆపి "ఏమి యీధ్వని ?" అనెను.

"భన్తే, ఆమె ఇంటికోడలు. గౌరవము లేనిది. అత్తమామలయెడ, భర్తయెడ కర్తవ్యము నెరవేర్పదు; దాన మీయదు; శ్రద్ధావంతురాలు కాదు; అప్రసన్నురాలు; రాత్రింబగళ్లు జగడమాడుచుండును."

"అట్లగుచో పిలిపింపుడు." ఆమె వచ్చి శాస్తకు నమస్కరించి, ఒకప్రక్క నిలుచుండెను.

అప్పుడు శాస్త "సుజాతా, పురుషునకు ఏడురకముల భార్య ఉండవచ్చును; అందు నీవు ఏతరగతికి చెందినదానవు ?" అనెను.

"భన్తే, సంక్షేపముగ చెప్పినమాటల కర్థము నాకు తెలియదు; నాకు సవిస్తరముగ విశదీకరింపుడు."

"అట్లగుచో శ్రద్ధగా వినుము" అని శాస్త యీగాథలు పలికెను.

ఆహితమొనర్చున, దనుకంపలేని,
దన్యానురక్త, కోపాంధయు, భర్త
నవహేళనముచేయునది, దాస
దాసీ జనాదికదండనశీల
అగు భార్య వధకురా లని పేరు పొందు.

శిల్పంబుననుగాని సేద్యానగాని
వాణిజ్యముననగాని స్వామిధనంబు
ఇచ్చిన, దానిలో నెంతయో కొంత
హరియించునది «చోర» యని పేరు పొందు.

అలసస్వభావయు, నధికభోజనయు
కార్యముల్ చేయని కఠినవర్తనయు,
చండస్వభావ, ప్రచండభాషిణియు
దాసదాసీజన దండనశీల
«మొనగత్తె» యనిపించుకొనును లోకమున.

ఎల్లవేళలయందు హితమాచరించు,
దయతోడ పుత్రుని తల్లివిధాన
పతిని పోషించుచు, నత డిచ్చు ధనము
భద్రమ్ము చేసెడి భార్యకు "మాత»
అని వచ్చు మంచిపే రఖిలలోకాన.

ఆదరించెడునట్లు లక్క చెల్లెలిని
భక్తి లజ్జలతోడ పతిని సేవించు
భార్యకు వచ్చును «భగిని» నామంబు.

భర్తను గాంచుచో బహుకాలమునకు
మరలి వచ్చిన మిత్రు తెరగున జూచి
చిత్త ప్రసన్నత చెంద కులీన,
పతిభక్తియుత, శీలవతి యగునట్టి
భార్యకు «సఖి» యను ప్రథ కల్గుచుండు.

స్వామి కోపించిన శాంతితోనుండి,
దండనమ్మునగూడ దమముతోనుండి,
ఉద్ధతి క్రోధమ్ము లుండక, మిగుల
స్వామి సేవావశంవద యైన మంచి
భార్యకు «దాసి» యన ప్రథ కల్గుచుండు.

మంచి గుణమ్ములు, మర్యాద, దయయు
వర్తనమ్మున లేని «వధక», «చోరలు క»
«మొనగత్తె» యనియెడి మువ్వురు భార్య
లంకాన నరకమ్మునందు జేరుదురు

చిర సంయమముచేత, శీలముచేత,
మాతయు, భగినియు, మరి సఖి, దాస
యగువారు పొందుదు రంతాన సుగతి.

"సుజాతా, పురుషునకు ఇట్టి భార్యలు లభింపవచ్చును. ఇందులో వధక, చోర, ఆర్య, – ఈముగ్గురు నరకమున జన్మింతురు. తక్కిన నల్గురు నిర్మాణరతి – దేవలోకమున జన్మింతురు.

ఈవిధముగ శాస్త ఏడువిధముల భార్యలను వర్ణించు సమయమున సుజాత స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితురాలయ్యెను. అంతట శాస్త "ఈయేడుగురు భార్యలలో నీ వెట్టిదానవు?" అనెను.

"దాసీసమానురాలను" అని సుజాత శాస్తకు వందనము చేసి, క్షమాపణ వేడెను.

శాస్త సుజాతను ఒక్కయుపదేశముతోనే శాంతపరచెను. భోజనానంతరము శాస్త జేతవనమునకు జని భిక్షుసంఘము ఆదరప్రదర్శనము చేసిన పిదప గంధకుటిలో ప్రవేశించెను.

ధర్మసభలో భిక్షువులు శాస్తగుణములను చర్చించుచుండిరి. అంతలో ఆయన యచటి కరుదెంచి, విషయము తెలిసికొని, "భిక్షువులారా, ఇప్పుడే కాదు పూర్వముకూడ నేను ఒక్క ఉపదేశముతోనే సుజాతను శాంతపరచితిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడాయన పట్టపుదేవికడుపున బుట్టి పెద్దవాడయి, తక్షశిలానగరమున విద్యలు నేర్చి, తండ్రిమరణానంతరము రాజ్యమునకు వచ్చి, ధర్మానుసారముగా పరిపాలన చేయుచుండెను. ఆతనితల్లి, క్రోధన, పరుషస్వభావ, హేళనశీల. అతడు తల్లికి ఉపదేశ మిచ్చువాడై ఉదాహరణము లేకుండ బుద్ధిచెప్పుట యుక్తము కాదని తలచి, అందులకై యన్వేషించుచుండెను.

ఒకనాడుద్యానమునకు తల్లికొడుకులు చనిరి. మార్గమధ్యమున నెమలి కూసెను. బోధిసత్త్వుని అనుయాయులది విని చెవులు మూసికొని 'అమ్మో, చండవాదినీ, పరుషవాదినీ, ధ్వని చేయకు' మనిపలికిరి.

బోధిసత్త్వుడు నాటక మంటపమునుండి మరలి, జననితో ఉద్యానమున విచరించుచుండగా వికసించిన సాలవృక్షముపైనుండి కోకిల మధురకూజితము చేసెను. జనులు సంతుష్టచిత్తులై అంజలి ఘటించి "కలవాదినీ, మృదుభాషిణీ, పలుకుము పలుకుము" అని మెడలు పైకెత్తి శ్రవణోత్సుకులై! చూచుచు నిలుచుండిరి. బోధిసత్త్వుడా రెండు సందర్భములను గమనించి తల్లికి బోధచేయుదు నని యెంచి "అమ్మా, మార్గమధ్యమున జనులు నెమలికూత విని కూయవల దని చెవులు మూసికొన్నారు. పరుషవాక్కు లెవ్వరికిని ప్రియము కావు" అని ఈగాథలు పలికెను.

లలితవర్ణము, కోమలత్వంబు కలిగి
ప్రియదర్శనత్వంబు పెల్లుగా నున్న
తరుణులు ప్రీతి పాత్రములు కాలేదు
ఇహపరలోకాల నెందైన గాని
కార్కశ్య మున్నచో కంఠస్వరాన.

తిలల మచ్చల దాని, నలుపువర్ణము దాని
దర్శనీయము కానిదాని కోయిల పిట్ట
నీక్షించుచున్నవారే వేళ నెల్లరున్.
కాని విన్నంతనే దాని మధురస్వనము
హాయి జెందును గాదె అఖిలమానవకోటి!

కాన అనుద్ధత కమనీయ లలిత
భాషలాడెడియామె ప్రకటించుచుండు
ధర్మార్థములు; అట్టి తరుణి లోకమున
మధురభాషిణి యని మాన్యత గాంచు.

ఈవిధముగా బోధిసత్త్వుడు తల్లికి ధర్మ ముపదేశించెను. నాటి నుండి యామె శీలసంపన్న యయ్యెను. ఒక్క యుపదేశముతో తల్లిని శాంతపరచి, క్రమముగా యథా కర్మం గతో.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను ఆకాలమున వారాణసీ రాజమాత సుజాత; రాజు నేనే.

# 270 ఉలూక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కాకి - ఉలూకముల కలహమును గూర్చి, చెప్పినది.

## వర్తమాన కథ

ఆకాలమున కాకులు పగటివేళ ఉలూకములను భుజించు చుండెడివి. ఉలూకములు సూర్యాస్తమయ మయినతరువాత నిద్రించు చున్న కాకుల శిరములమీద తన్నులు తన్ని ప్రాణములు తీయుచుండెడివి. జేతవనసమీపమున విహారములో ఒకానొక భిక్షువు కసవూడ్చుచుండగా చెట్టుపైనుండి తెగిపడిన కాకులతలలు చిమ్మవలసి వచ్చెను. ఈవిషయమున ధర్మసభలో చర్చసాగెను." ఆయుష్మంతులారా, అనుదినము ఈవిధముగ కాకులమొండెములు ఊడ్వవలసి వచ్చెను" అనుచుండగా శాస్త అచటి కరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, ప్రథమకల్పమునుండియు నీవైరము సాగుచునే యున్నది" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున ప్రథమకల్పమున జనులు సమావిష్టులై సుందరుడు, శోభాసంపన్నుడు, ప్రజ్ఞావంతుడు, సమస్తవిధములపరిపూర్ణుడు అగు పురుషుని రాజు జేసికొనిరి. చతుష్పాత్తులొకచో జేరి, సింహమును రాజుగా నెన్నుకొన్నవి. మహాసముద్రములోని మత్స్యములు ఆనంద నామకమత్స్యమును ప్రభువును జేసికొన్నవి. పక్షులు హిమాలయమున పెద్దరాతిబండపై గుమిగూడి 'మనుష్యులలో రాజు కానబడుచున్నాడు. అట్లే చతుష్పాత్తులలోను మత్స్యములలోను కానవచ్చుచున్నాడు. మనకు రాజు లేడు. అరాజకముగానుండుట ఉచితముగా తోచుట లేదు. మనకుగూడ రాజుండవలెను. ఎవరినో యొకరిని రాజపదమున నుంచవలసి యున్నది' అని ఆలోచించినవి. అవి తగిన పక్షిని నిర్ణయించుటలో ఉలూకము నెన్నుకొని 'ఉలూకము మాకు నచ్చినది' అని పలికినవి.

ఎల్లరసమ్మతిని తెలిసికొనుటకై ఒకపక్షి మూడుమారులు కేకవేసినది. మూడవమారు ఘోషణచేసినపుడు కాకి లేచి 'కొంచెము ఆగుడు. రాజ్యాభిషేకసమయముననే ఈయనముఖ మిట్లున్నది. కోపము వచ్చినప్పు డెట్లుండునో. ఈయన కోపించి మనలను జూచినపుడు మనము కాలినపెనముమీద నుంచిన తిలలవలె ఉన్నచోటనే వేగిపోవుదుము. కావున ఈయనను రాజునుజేయుట నాకు నచ్చలేదు' అని పలికెను.

పై జెప్పినమాటలు ప్రకటమగుటకీ ఈగాథ చెప్పెను :

బంధువు లందరి ప్రజ్ఞచే నయ్యె
కౌశికుండు ప్రభుండు; కాని యనుజ్ఞ
నొసగుచో పల్కెద నొకమాట నేను.

అది అనుజ్ఞ యీయగా పక్షులు ఈగాథ పలికినవి :

ఓయి సౌమ్య, అనుజ్ఞ నొసగినా మయ్య!
కల యర్థమును మాకు తెలుపుము; బుద్ధి
ప్రజ్ఞయు గల చిన్ని పక్షివి నీవు!

అనుజ్ఞ పొంది కాకి ఈగాథ పలికెను :

భద్రములారా, నాకు బాగుగా లేదు
ఈతని యభిషేక; మిపుడె యీవదన
మిటు లుండ, కోపింప నెటు లుండవచ్చు!

ఇట్లు పలికి కాకి 'నాకు నచ్చలేదు, నాకు నచ్చలేదు' అని యరచుచు ఆకసమున కెగిరిపోయెను. ఉలూకముకూడ లేచి దాని వెంటనంటెను. నాటినుండి వానికి పరస్పరవైర ముద్భవించెను. పక్షులు సువర్ణహంసను రాజుగా నెన్నుకొని అచటినుండి వెడలిపోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. రాజ్యమున అభిషిక్తుడయిన హంసపోతకము నేనే.

# 271 ఉదపానదూసక జాతకము

శాస్త ఋషిపట్టణమున విహారముచేయుచు జలాశయమును మలినము చేయు సృగాలమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

భిక్షువులు నీరు త్రాగు జలాశయమున ఒకానొక జంబుకము మలమూత్రములు విసర్జించి కలుషితముచేసి పరుగిడుచుండెను. ఒకనాడది జలాశయయకడకు వచ్చునప్పటికి శ్రమణులు దానిని బెడ్డలతో కొట్టిరి. నాటినుండి ఆజంబుకము అచ్చోటికి ఎన్నటికి మరలిరాలేదు. భిక్షువులు ఈవిషయము తెలిసికొని ధర్మసభలో చర్చచేయుచుండ, శాస్త అచటి కరుదెంచి, విషయము తెలిసికొని, "భిక్షువులారా, ఈజంబుకము ఇప్పుడే కాదు, పూర్వముకూడ జలాశయమును కలుషితము చేసెడిది" అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో ఈఋషిపట్టణమే, ఈజలాశయమే, యుండెను. అప్పుడు బోధిసత్త్వుడు వారాణసిలో కులీనవంశమున పుట్టి, ఋషులవలె ప్రవ్రజించి ఋషిగణపరివృతుడై ఋషిపట్టణమున నివసించుచుండెను. ఈనక్కయే జలాశయమును మలినము చేసి, పలాయనము చేయుచుండెను. ఒకనాడు తాపసులు సమావిష్టులై ఉపాయముతో నక్కను పట్టుకొని బోధిసత్త్వుని సన్నిధికి గొనిపోయిరి. ఆయన సృగాలముతో సల్లాపము చేయువాడై ఈగాథ పలికెను:

చిరకాల తపోధనులును
అరణ్యవాసులును, ఋషులు నగు వారలచే
గురుకష్టఖాత మగు నీ
సరసిని కలుషితము చేయ సౌమ్యా, తగునా?

అది విని నక్క ఈగాథ పలికెను:

సలిలము త్రాగిన త్రాగును
కలుషిత మొనరించుటే సృగాలవిధానం

బల మాపూర్వులు స్రీక్లే
సలిపిరి, కోపింప మీకు సముచిత మగునే.

అప్పుడు బోధిసత్త్వుడు ఈగాథ పలికెను

అగుచో నియ్యది తావక
సృగాల ధర్మంబె, యెట్టిచెలువున నుండం
దగునో యధర్మం, బిక నవి
యగపడకుండెడును గాక అత్యంతంబున్.

ఇట్లు మహాసత్త్వుడు దాని కుపదేశ మిచ్చి "మరల రావల" దని చెప్పెను. నాటినుండి నక్క తిరిగి చూడనైన చూడలేదు.

శాస్త ధర్మోపదేశమున చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున నక్క యీ నక్కయే, గణశాస్తను నేనే.

## 272 వ్యగ్ఘ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోకాలికభిక్షువును గూర్చి చెప్పినది. కోకాలికుని కథ 13వ నిపాతమున తక్కారియ జాతకము (481)న వచ్చును.

### వర్తమాన కథ

సారిపుత్ర మౌద్గల్యాయనులను కొనిపోవ నెంచి, కోకాలికుడు కోకాలికరాష్ట్రమునుండి జేతవనమునకు వచ్చి, శాస్తకు నమస్కరించి, స్థవిరుల సన్నిధికి చని "ఆయుష్మంతులారా, కోకాలికరాష్ట్రవాసులు మిమ్ములను స్మరించుచున్నారు; రండు. దయచేయుడు" అని విన్నవించెను.

"ఆయుష్మన్, నీవు పొమ్ము; మేము రాము" అని వారు పలికిరి. వారు అసమ్మతి చూపిన పిదప ఆతడు మరలి పోయెను. ఈవిషయమై ధర్మసభలో భిక్షువులు చర్చించుచుండగా, శాస్త అచటి కరుగుదెంచి, విషయము తెలిసి కొని— "భిక్షువులారా, కోకాలికుడు ఇప్పుడే కాదు,

సారిపుత్రమౌద్గల్యాయనులతో కలిసియుండ లేక పోయెను; లేకుండ కూడ నుండలేక పోయెను" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడరణ్యములో వృక్షదేవతగా నుండెను. తత్సమీపమున నొకవనస్పతిపై వేరొకవృక్షదేవత నివసించుచుండెను. ఆవనషండమున సింహవ్యాఘ్రములు వసించుచుండెను. వానిభయముచే లోకు లెవ్వరును అచ్చటిపొలము దున్నుట లేదు, చెట్లుకొట్టుట లేదు, అటువైపు కన్నెత్తి చూచుట లేదు. సింహవ్యాఘ్రములు జంతువులను వేటాడి, మాంసము తిని, మిగిలినదానిని విడిచిపెట్టుచుండెను. కావున వనషండమున దుర్గంధము నిండిపోయెను.

వృక్షదేవత యొకనాడు బోధిసత్త్వునికడకు వచ్చి 'ఈసింహవ్యాఘ్రములమూలమున మన వనఖండమున శవదుర్గంధము నిండిపోయినది. వీని నిచ్చటనుండి వెడలగొట్టుదు' ననెను. 'సౌమ్యా, ఈజంతువులు రెండిటివలన వృక్షషండము సురక్షితముగా నున్నది. ఇవి తొలగినచో జనులు వచ్చి మననివాసవృక్షములను నిర్భయముగా ఖండించి, నేల చదరము చేసి దున్నగలరు. నీపని నాకు రుచింపలేదు' అని బోధిసత్త్వుడీగాథలు పలికెను :

ఏమిత్రువలన యోగ
క్షేమమ్ములు, సద్యశంబు చెందును నష్టం
బామిత్రుని కూటమి విడి,
నేమముతో నుండ్రు భద్రనియతిని విబుధుల్.

ఎట్టి మిత్రుసంపర్కాన వృద్ధి గాంచు
చుండు కల్యాణ మతనితో యోగ్యవృత్తి
ననుసరించును సర్వకార్యముల బుధుడు.

ఇట్లు బోధిసత్త్వుడు చెప్పినను ఆమూర్ఖదేవత గ్రహింపక యొకనాడు భయంకరరూపము జూపి సింహవ్యాఘ్రముల నచటినుండి పారద్రోలెను. వాని పదచిహ్నములు కనబడనందున లోకు లాజంతువులు

స్థలాంతరమునకు బోయిన వని యూహించి, యడవిలో నొకవైపు చెల్లు నరకిరి. అంతట వృక్షదేవత బోధిసత్త్వునికడకు వచ్చి, 'సౌమ్యా నీమాట వినక నే నాజంతువులను పారద్రోలితిని. అవి వెడలిపోవుట గ్రహించి, జనులు చెట్లు కొట్టినారు. ఇప్పు డేమి చేయవలెను?' ననెను.

"ఇప్పు డవి ఆ ప్రదేశమున నున్నవి. పోయి పిలుచుకొని రమ్ము" అని బోధిసత్త్వు డనగా వృక్షదేవత అచటికి బోయి వానియెదుట నిలిచి అంజలి గ్రహించి ఈగాథ పలికెను:

కాననసీమకు క్రమ్మర పులులు,
పోం, డింక మీద లేకుండునుగాక
వ్యాఘ్రవిహీనముల్ వనములు కాని,
వనవిహీనము లైన వ్యాఘ్రముల్ కాని.

ఇట్లు దేవత యాచించినను 'నీవు పొమ్ము, మేము రాము' అని జంతువులు సమ్మతింప లేదు. దేవత ఒంటిగానే మరలి వచ్చెను. జనులు కొలదిరోజులలోనే చెట్లు కొట్టి, భూమి సమతలము చేసి సేద్యము చేసిరి.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకము సరిపోల్చెను. ఆకాలమున కోకాలికుడు మూర్ఖదేవత; సింహము సారిపుత్రుడు; వ్యాఘ్రము మౌద్గల్యాయనుడు; పండిత దేవత నేనే.

## 273 కచ్ఛప జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా కోసలరాజుమహామంత్రు లిరువురు కలహ శాంతిని గూర్చి చెప్పినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో నొకానొక బ్రాహ్మణవంశమున బుట్టి

పెద్దవాడయి, తక్షశిలలో విద్య లభ్యసించి, కామములు విడిచి, ప్రవ్ర జించి, హిమవత్ప్రదేశమున గంగాతీరమున ఆశ్రమము నిర్మించి నివ సించుచు, అభిజ్ఞలను, సమాపత్తులను పొంది, ధ్యానమున క్రీడించు చుండెను. ఈజన్మలో బోధిసత్త్వుడు పరమమధ్యస్థుడుగా నుండి, ఉపేక్షాపారమితను పూర్తిచేసెను. ఆయన పర్ణశాలాద్వారమున కూరుచుండునపుడు దుష్టమర్కటము వచ్చి, ఆయనచెవిలో తనజన నేంద్రియమును దూర్చుచుండును. దానిని వారింపక బోధిసత్త్వుడు ఉపేక్షాభావముతో కూరుచుండి యుండును.

ఒకనాడు కచ్ఛపము గంగాజలమునుండి తీరమునకు వచ్చి, యెండలో నోరు తెరచుకొని పండుకొనెను. దానిని జూచి లోల మర్కటము తన జననేంద్రియమును తాబేలునోటిలో బెట్టెను. మెలకువ వచ్చి, తాబేలు దానిని నొక్కెను. నొప్పిపుట్టి, కోతి తనలో "ఇప్పుడు నన్నెవ రీకష్టమునుండి తప్పింపగలరు? ఎవ్వరికడకు బోవు దును?" అని యోచించి "తాపసునికంటె వే రెవ్వరును ఈబాధనుండి తప్పించువారు లేరు. ఆయనసన్నిధికి బోవలెను" అనుకొని, కచ్ఛప మును రెండుచేతులతో పట్టుకొని లేవనెత్తి బోధిసత్త్వునిసన్నిధికి జనెను. ఆయన దుష్టమర్కటమును ఎగతాళి చేయుచు ఈగాథ పలికెను

హస్తమందు నధికమైన యాహారమే
అమరు వాడ, వెట్టి యవనిసురుడ
వెట్టి భిక్ష వేడి ఎట్టి శ్రద్ధావంతు
సంతికమున కేప్పు డరిగినావొ?

అది విని దుష్టమర్కట మీగాథ పలికెను

నేను మహాదుర్బుద్ధిని
వానరమున, తాకరాని వస్తుస్పర్శన్
బూనితి; భద్రస్తే, విడిచిన
చో నను చేరుదును గిరిని: శుభ మగు మీకున్

బోధిసత్త్వుడు కచ్ఛపముతో సల్లాపము చేయువాడై ఈగాథ పలికెను :

ఉండు వానరములు కౌండిన్యగోత్రజుల్,
కచ్ఛపంబు లెల్ల కాశ్యపములు
కాన కాశ్యపంబ, కౌండిన్య విడువుము
మిాకు కల్గె నిపుడు మేళనంబు.

కచ్ఛపము బోధిసత్త్వునివాక్కులు వినుటచే ప్రసన్నచిత్తము కలదై మర్కటమును విడిచిపెట్టెను. మర్కటము విముక్త మై బోధిసత్త్వునకు వందనము చేసి వెడలిపోయెను. వెనుదిరిగి యాప్రదేశమును కంటితో చూడలేదు. కచ్ఛపము బోధిసత్త్వునకు వందనము చేసి యథాస్థానమునకు జనెను. బోధిసత్త్వుఁడు అపరిహీనధ్యానమనస్కుఁడై, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున కచ్ఛప వానరములు రెండును మహామాత్యులు, తపస్వి నేనే

## 274 లోల జాతకము

శాస్త జేతవనమున విహరించుచు లోభి యగు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతనిని ధర్మసభకు కొనిపోయిన పిదప శాస్త అతనితో "భిక్షూ, నీ విప్పుడే కాదు, పూర్వముకూడ లోభివే. లోభకారణమున మృతి నొందితివి. అందుచే ప్రాచీనపండితులుకూడ తమ వాసస్థానములు వీడవిలసివచ్చినది" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుఁడు రాజ్యము చేయుచుండ వారాణసీశ్రేష్ఠికి వంటచేయువాఁడు పుణ్యాబుద్ధితో పిట్టలు నివసించుటకు ఉట్టి వ్రేలాడదీసెను. బోధిసత్త్వుఁడు కపోతముగా పుట్టి ఆయుట్టిలో

నివసించుచుండెను. ఆవంటయింటిమీదుగా పోవుచున్న కాకి మత్స్య మాంసములు వండియుండుట చూచి నోరూరగా ఎవరితోడ్పాటుతో నా కవకాశము లభించును అని యోచించుచు బోధిసత్త్వుని జూచి 'ఈయనసహాయముతో అవకాశము లభించును' అని నిశ్చయించుకొని ఆపావురము మేతకై అడవికి బయలుదేరినపుడు దానివెంట జనెను.

బోధిసత్త్వుడు దానిని జూచి "నీమార్గము వేరు, నామార్గము వేరు. ఏల నావెంట వచ్చుచున్నావు?" అనెను.

"భన్తే, నీవిధానము నాకు నచ్చినది. నీవెంట మేత తినుచు నీసేవ చేయగోరెదను" అని కాకి పలుకగా బోధిసత్త్వు డంగీకరించెను. కాకి వెంటబోయి ఏకాకివలె మెల్లగా నచటినుండి తొలగిపోయి పేడకుప్ప కదలించి క్రిమికీటకాదులను తిని పొట్ట నింపుకొని, బోధిసత్త్వునికడకు, బోయి "నీ వింకను మేత మేయుచున్నావా! నీకు భోజనప్రమాణము తెలియనక్కరలేదా! రా, చీకటిపడకముందే పోవుద" మనెను. దానితో బోధిసత్త్వుడు నివాసస్థానమునకు జనెను. "ఆపావురము మిత్రుని గొనివచ్చినది" అని వంటవాడు ఉట్టిప్రేలాడదీసెను. కాకి నాలుగైదురోజు లదేపద్ధతిగా నుండెను. ఆనాడు శ్రేష్ఠికోసము మత్స్య మాంసములు హెచ్చుగా వచ్చెను. కాకి చూచి పేరాసకు లొంగి పోయి, ఉదయమే మూలుగుచు పొరలుచుండెను.

"సౌమ్యా, రా, మేతకు పోవుదము" అని పావురము పిలిచెను.

"నీవు పో, నాకు అజీర్ణశంక కలిగినది."

"సౌమ్యా, కాకులకు అజీర్ణ ముండదు. నీవు దీపపువత్తి మ్రింగిన యెడల నీ కడుపులో కొంచెముసేపే ఉండును. నోట బెట్టుకొంటివేని వెంటనే జీర్ణమగును. నామాట విని ఈ మత్స్యమాంసములను జూచి యిట్లు చేయకుము."

"ఏమి స్వామీ, ఇట్లనుచున్నారు? నాకు నిజముగా అజీర్ణము చేసినది."

"అట్లయిన భద్రముగా నుండుము" అని పావురము వెడలి పోయెను.

వంటవాడు మత్స్యమాంసములతో వివిధవ్యంజనములు చేసి, ఒడలి మీది చెమట తుడుచుకొనుటకై గుమ్మముకడకు బోయెను. ఇదే

సమయ మని కాకి లేచి కూరలబానలిపై వ్రాలెను. చప్పుడు విని పాచకుడు మరలివచ్చి, కాకిని జూచి లోనికి బోయి దానిని బట్టుకొని ఈకలు లాగి, అల్లము, జీలకర్ర, మొదలగునవి నూరి మజ్జిగతో కలిపి, 'మా శ్రేష్ఠికోసము తెచ్చిన మత్స్యమాంసములను ఎంగిలి చేయుదువా?' అని దాని యొడలినిండ పూసి, దానిని ఉట్టిలో బడవైచెను. కాకి చాల బాధపడెను. బోధిసత్త్వుడు సాయంకాలము మరలివచ్చి మూలుగుచుండుట చూచి పరిహాసము చేయుచు ఈగాథ పలికెను:

> ఇటువైపు రావలె ఎవ్వరు నీవు?
> పిలకతో బెగ్గురుపిట్టవా నీవు?
> ఇటు రమ్ము. కారణం బే మన, నాదు
> మిత్రంబు కాకంబు మిగుల నుగ్రుండు.

విని కాకి ఈగాథ పలికెను.

> నేను బలాకను కాను, మిత్రంబ!
> లోభి కాకమను, విలోకింపు నన్ను,
> చెవి బెట్టకుండుటచేత నీవాక్కు
> నా రెక్కలం బీకినారలు జనులు.

విని బోధిసత్త్వుడు ఈగాథ పలికెను:

> సౌమ్య, క్రమ్మర నీకు సంప్రాప్త మగును
> దండనం బిట్టిదే: త్వత్ స్వభావంబు
> కూడ నిట్టిదియె; లోకులభోజ్యవస్తు
> సంతతి పక్షికి సముచితం బగునె?

ఇట్లు పలికి బోధిసత్త్వుడు ఇక నే నిచ్చట నుండరాదు అనుకొని, ఎగిరి వేరొకచోటికి బోయెను. కాకి బాధపడుచు అచటనే మరణించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను; ఆకాలమున లోభియైన కాకి యీభిక్షువు; పావురము నేనే.

## 275 రుచిర జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ఒకానొక లోభిభిక్షువును గూర్చి చెప్పినది. వర్తమాన అతీతకథలు వెనుకటికథవలె నుండును. గాథలుకూడ అంతే.

'నే నిచట నుండజాల' నని బోధిసత్త్వుడు తలపోసి, ఎగిరి వేరొక తావునకు పోయెను.

కాకి బుట్టలోన కడు సుందరమ్ముగా
పండుకొన్న యట్టి పక్షి యెవరు?
ఓబలాక మిత్ర యుగ్రస్వభావుండు
ఆతని బుట్ట యిద్ది యని యెఱుగుము.

తృణబీజముల్ ద్విజా, తినుచుండువార
మిరువురముం గూడి; ఎరుగవే నన్ను?
చెవి బెట్టకుండుటచేత నీవాక్కు
నా రెక్కలను పీకినారలు జనులు.

సౌమ్య, క్రమ్మర నీకు సంప్రాప్త మగును
దండనం బిట్టిదే; త్వత్ స్వభావంబు
గూడ నిట్టిదియె; లోకుల భోజ్యవస్తు
సంతతి పక్షికి సముచితం బగునె?

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరపోల్చెను. పిసినిగొట్టు భిక్షువు కాకి; పావురము నేనే.

## 276 కురుధమ్మ జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు హంసను హత్యచేయబోవువాని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో మిత్రు లిరువురు, భిక్షువు లయి ఉపసంపద పొంది, విశేషభాగము ఒకచోటనే నివసించుచుండిరి. ఒకనాడు వారు అచిర

వతీనదికడకు చని, స్నానము చేసి, ఒకతీరమున తడియార్చుకొనుచు యోగక్షేమములు తెలిసికొనుచుండిరి. ఆసమయమున హంసద్వయము వినువీధిలో పోవుచుండెను. వారిలో చిన్నభిక్షువు, రాయి తీసికొని "ఈహంస పోతకము కంటిపై కొట్టెదను" అనెను.

"కొట్టజాలవు!"

"ఈవైపుకన్ను సంగతి అటుంచుము. ఆవలివైపు కంటిపై కొట్టుదును."

'ఇది జరిగెడిపని కాదు.

'కొంచెము నిదానింపుము' అని ఆభిక్షువు మూడుకోణముల రాయి యేరి హంస వెనుకకు విసరెను. హంస రాతిసవ్వడి విని వెనుకకు తిరిగి చూచెను. అప్పు డతడు రెండవ గుండ్రనికంకర రాయి తీసికొని ఆవలి ప్రక్కన నున్న కంటిపై కొట్టి ఈవలి కంట దూరివచ్చునట్లు చేసెను. హంస అరచుచు పల్లటీకొట్టి ఆతనిపాదములపై పడెను. ఆ చుట్టు ప్రక్కల నున్న భిక్షువులు చూచి వచ్చి "ఆయుష్మన్, బుద్ధశాసనమున ప్రవ్రజితుడ వయ్యును అనుచిత మగు ప్రాణిహింస చేసితివి" అని అతనిని తథాగతునికడకు కొనిపోయిరి. శాస్త అతనితో 'భిక్షూ, నీవు నిజముగా ప్రాణిహింస చేసితివా?" అనెను.

"భన్తే, చిత్తము."

"భిక్షూ, కళ్యాణప్రద మైన ఈశాసనమున ప్రవ్రజించియు నీవు ఇట్టిపని చేసితి వేల? పూర్వకాలమున పండితులు బుద్ధుని ఆవిర్భావమునకు పూర్వమే భార్యలతో కాపురము చేయుచు, స్వల్పమైన అనుచితకార్యములు చేయుటకే కిచకిచలాడెడివారు. నీవో, ఏమాత్రము సంశయింపవైతివి. భిక్షువులకు త్రికరణశుద్ధిగా సంయమ ముండవలెను గదా?" అని పూర్వకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున కురురాష్ట్రమున ఇంద్రప్రస్థనగరమున ధనంజయుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డాయన పట్టమహిషి గర్భమున పుట్టెను. అతడు పెరిగి పెద్దవాడయి, తక్షశిలలో విద్యలు నేర్చి వచ్చి, తండ్రివలన యువరాజుపదము పొందెను. పితృమరణా

నంతరము రాజయి, దశరాజధర్మముల ప్రకారము ప్రవర్తించుచు, కురుధర్మ మాచరించుచుండెను. పంచశీలములను కురుధర్మ మందురు. వానిపవిత్రతతో బోధిసత్త్వుడు పాలన చేయుచుండెను. ఆయన ఆచరించినట్లే ఆయనతల్లి, పట్టమహిషి, తమ్ముడు యువరాజు, బ్రాహ్మణ పురోహితుడు సూత్రధారుడైన అమాత్యుడు, సారథి, శ్రేష్ఠి, ద్రోణ మాపక మహామాత్యుడు, ద్వారపాలకుడు, నగరశోభ యను వేశ్యయు చేయుచుండిరి.

రాజు, మాతయు, పట్టపురాణియు, ఉప
రాజును, పురోహితుండును, రజ్జుకుండు
సారథి, శ్రేష్ఠి, ద్రోణి, దౌవారికుడును
వారకాంతయు కురుధర్మవర్తిజనులు.

రాజు నగరము నాలుగుద్వారములకడను, నగరము నడుమను, నివాసముకడను ఆరు ధర్మశాలలను నిర్మించి, ప్రతిదినము ఆరులక్షలు దానము చేయుచు జంబూద్వీపమంతయు మారుమ్రోగునట్లు దాన ధర్మములు చేసెను.

ఆకాలమున కళింగరాష్ట్రమున దంతపురనగరమున కాళింగ రాజు పరిపాలనము చేయుచుండెను. రాష్ట్రమున వర్షము లేదు. వాన లేకపోవుటచే కరవు భయము వ్యాపించెను. తిండి దొరకక, రోగము చెలరేగెను. అనావృష్టిభీతి, కరవు భీతి. రోగభీతి ప్రవృద్ధము లయ్యెను. జనులు ఏమిచేయజాలక బిడ్డలను చేతులమీద వేసికొని తిరుగజొచ్చిరి. రాష్ట్రప్రజ లెల్లరు కలిసి, దంతపురమునకు పోయి రాజద్వారమున ఆక్రోశించిరి.

రాజు ద్వారముకడ నిలిచియుండి, ఆక్రోశము విని, "ఏ మిది ? ఆక్రోశించుచున్నారు ?" అని యడిగెను. "మహారాజా, రాష్ట్ర మంతటను మూడు భయము లుత్పన్నము లయినవి. వర్షము లేదు. భూములు చెడిపోయినవి, కరవు వచ్చినది. సరియైన తిండి లేక లోకులు రోగములపా లయినారు. ఉన్న కొలదివస్తువులను విడిచి, జనులు బిడ్డలను మాత్రము చేతులపై వేసికొని, తిరుగుచున్నారు. మహా రాజా, వానలు కురియవలెను."

'వానలు కురియనపుడు వెనుకటిరాజు లేమి చేసిరి?'

'మహారాజా, వెనుకటిరాజులు దానధర్మములు చేసిరి, వ్రతములు చేసిరి, శీలములు గ్రహించిరి, శయనాగారములో ప్రవేశించి వారము దినములు దర్భశయ్యపై పండుకొనిరి. అప్పుడు వర్షము కురిసెడిది.'

మంచి దని రాజు ఆప్రకారమే చేసెను. అప్పటికిని వర్షము పడ లేదు.

రాజు అమాత్యులతో 'నాధర్మము నెరవేర్చినాను. వర్షము పడ లేదు. ఏమి చేయుదును?' అన్నాడు.

'మహారాజా, ఇంద్రప్రస్థనగరములో కురునరేశుడు ధనంజయునికి అంజనవసభము అనుభద్రగజము కలదు. దానిని తెచ్చినచో వాన కురియును.'

'ఆరాజుకు సైన్యము, వాహనములు కలవు. ఆయనను జయింప వీలు లేదు. ఆయన భద్రగజము నెట్లు తేగలము?'

'మహారాజా, ఆయనతో యుద్ధము చేయ నవసరము లేదు. రాజు మహాదాత. కోరినపిమ్మట అలంకృతమస్తకము నైనను ఖండించుకొని ఈయగలడు. రాజ్యమంతను త్యజింపగలడు. ఏనుగుమాట చెప్ప వలెనా? అడిగినచో తప్పక యిచ్చును.'

'ఆయన నెవరు వేడగలరు?'

'బ్రాహ్మణులు మహారాజా!'

అగ్రహారమునుండి రాజు ఎనిమిదిమంది బ్రాహ్మణులను రప్పించి, సత్కరించి, భద్రగజమును యాచింప బంపెను.

వారు వలయు ధనము గొని, దారికి తగిన వేషములు దాల్చి, రాత్రి వేళనే ఆగుచు, త్వరితముగా పయనము చేసి, కొలదిరోజులలో కురు రాజధాని నగరద్వారముకడ ధర్మశాలలో భోజనము చేసి విశ్రమించి రాజుగారు దానశాలలోని కెప్పుడు వత్తురు?' అని ప్రశ్నించిరి.

'పక్షములో మూడురోజులు చతుర్దశి, పూర్ణిమ, అష్టమితిథులలో. రేపు పూర్ణిమ. రేపు వత్తురు' అని అక్కడివారు చెప్పిరి. బ్రాహ్మ ణులు మరునాడు ప్రాతఃకాలమే పోయి, పూర్వద్వారమున నిలిచిరి.

బోధిసత్త్వుడు ప్రాతఃకాలముననే స్నానము చేసి, చందనాదిలేప నము చేసి, సమస్తాభరణభూషితు డయి, అలంకృత మైన శ్రేష్ఠగజ

ముపై నెక్కి, చాలమంది యనుచరులతో పూర్వద్వారమందలి దానశాల చేరి, ఏనుగు దిగి, స్వహస్తములతో ఎనిమిదియందికి భోజనము పెట్టి, ఈప్రకారముగా చేయు డని, ఏను గెక్కి, దక్షిణద్వారమునకు బోయెను. పూర్వద్వారముకడ సైనికు లెక్కువగా నుండుటచే బ్రాహ్మణులకు రాజుతో మాటాడుపీలు చిక్కలేదు వారు దక్షిణద్వారము చేరి రాజు వచ్చుట చూచి, ద్వారమునకు కొలదిదూరమున ఎత్తయిన ప్రదేశమున నిలిచి, రాజు సమీపింపగనే చేయు లెత్తి జయజయధ్వానములు చేసిరి రాజు వజ్రాంకుశముతో గజము నాపి, వారలకడకు బోయి, "బ్రాహ్మణులారా, ఏమి కావలెను?" అని యడిగెను. బ్రాహ్మణులు బోధిసత్త్వుని గుణానువాదము చేయు నీగాథ పలికిరి :

మే మోజనాధిప, మీదు శీలంబు
శ్రద్ధయుఁ గ్రహియించి చనుదెంచినాము
అంజనవర్ణంబు హస్తి కళింగ
రాజ్యంబునందు స్వర్ణమునకు
వినిమయం బగుగాక వేగ మే రాజ!

భావార్థము : జనాధిపా, మేము నీశీలమును, శ్రద్ధను గ్రహించి, ఇట్టి శ్రద్ధావంతుఁడు, శీలవంతుడు నగు రాజును అడిగినంతనే అంజనవర్ణగజము నిచ్చువా డని భావించి ఇచ్చుటికి వచ్చినాము. నీయేనుగును స్వయముగా నెంచి కళింగరాజుకడకు గొనిపోయి, విశేషధనము-వినిమయముగా నిత్తుము. ఇట్లు యోచించి దేవా, ఇక్కడ కరుదెంచినాము. ఇక కర్తవ్యము నీకే తెలియును.

రెండవ యర్థము మీది శ్రద్ధాశీలమైన వర్ణము. అడిగినవో-జంతువుమాట అటుంచి రాజు తన ప్రాణములనే యిచ్చును, అని విని, కళింగరాజుకడకు అంజనవర్ణహస్తిని కొనిపోయి, ధనము ధాన్యములు వినిమయముగా తెచ్చుకొని పొట్టనింపుకొందు మని యోచించి యిచ్చుటికి వచ్చినాము.

విని బోధిసత్త్వుఁడు "బ్రాహ్మణులారా, ఈ యేనుగునకు వినిమయముగా ధనము స్వీకరించుట సుభోగ మగును. మీరు చింతింపవలదు. నాగమును అలంకరించి యున్నట్లిచ్చెదను" అని ఓదార్చి, ఈగాథలు పలికెను :

అన్యభృత్యులు కాని అన్యులుకాని
ఆశతో నిచటికి నరుదెంచువారి
ఎవరి నేనియు నిషేధింప రా దనుచు
పూర్వము గురువులు బోధించినారు.

రాజార్హ్వం బగుచు, మహా
రాజభోగ్య మైనదాని,
బాగుగా నలంకరించి
భర్మజాలకంబు గప్పి
మంచిపేరు గన్న గజము
మహీసురులం, సారథితో
నిచ్చుచున్నవాడ మీకు:
ఇంక యథేచ్ఛముగ బొండు.

ఈవిధముగా ఏనుగు మెడమీద కూరుచుండి బోధిసత్త్వుడు నోటితో చెప్పి ఏనుగును దానము చేసి, క్రిందికి దిగి, గజమున కలంకార మెచట నైన లేనిచో, అలంకరించెద ననుకొని, మూడుమారులు దానికి ప్రదక్షిణము చేసి చూచెను. అలంకారము లేనిచోటు కానబడ లేదు. అంతట రాజు ఏనుగుతొండము బ్రాహ్మణులచేతిలో బెట్టి, బంగారు ఝారీలోని సుగంధజలము పోసి దానముచేసెను. బ్రాహ్మణులు అనుయాయులతో హస్తిని స్వీకరించి, దానిపై నెక్కి, దంతపురనగరము చేరి, రాజుకు దానిని సమర్పించిరి. ఏనుగు వచ్చినతరువాతకూడ వర్షము పడలేదు. ఏమసి రా జడిగెను.

'కురురాజు ధనంజయుడు కురుధర్మమును పరిపాలించును. ఇందుచే ఆయనరాష్ట్రములో పది పదునైదు దినములకు ,వర్షము కురియుచుండును. ఇది ఆయనగుణప్రభావమువలన. ఈజంతువునకు గుణమున్నను అన్నిగుణములు నుండునా?'

'అట్లయినచో, అలంకృత మైన హస్తిని అనుయాయులతో గొనిపోయి, రాజునకు మరల సమర్పింపుడు. ఆయన నిర్వర్తించు కురుధర్మమును బంగరుపలకపై వ్రాయించి పట్టుకొనిరండు' అని రాజు బ్రాహ్మణులకు అమాత్యులకు సెలవిచ్చెను. వారు పోయి హస్తిని సమర్పించి 'దేవా, ఈయేనుగు వెళ్ళినను మా దేశమున వర్షము కురియలేదు. తమరు కురుధర్మమును పాలించుచున్నారు. మా రాజుకూడ కురు

ధర్మమును పాలింప నెంచుచున్నాడు. ఈబంగారుపట్టికమీద కురుధర్మ మును వ్రాయించి పట్టుకొనిరండు అని మమ్ము బంపినాడు. మాకు కురుధర్మమును ప్రసాదింపుడు' అని పలికిరి.

"బాబులారా, నేను కురుధర్మమును యథార్థముగా అనుష్ఠించు చున్నాను. కాని దానివిషయమున నాకు కొంచెము విచార మున్నది. కురుధర్మ మిపుడు నాచిత్తమును ప్రసన్నము చేయజాల కున్నది. అందువలన కురుధర్మమును మీ కొసగజాలను."

రాజుశీల మాయన కేల ప్రసన్నత కలిగింపజాల కుండెను? మూడేండ్లనుండి కార్తీకమాసములో కార్తికోత్సవము జరుగుచుండెను. ఆయుత్సవమునకు సమాగతు లైన రాజులు అన్నియాభరణములతో నలంకృతు లయి, దేవతల వేషములు దాల్చి, చిత్రరాజ మను యక్షము కడ నిలిచి, పుష్పాలంకృతము లైన బాణములను నలువంకల విడుచు చుండిరి. ఈ రాజకూడ ఉత్సవములో పాల్గొనుచు, తటాకముకడ చిత్రరాజయక్షముదగ్గర నిలిచి చిత్రితబాణములను నలువంకల విడుచు చుండెను. తక్కినమూడుప్రక్కల విడిచిన యమ్ములు కానబడినవి; కాని తటాకతలమున విడిచిన బాణముమాత్రము కానరాలేదు తాను విడిచిన బాణ మొకవేళ మత్స్యశరీరమున జిక్కుకొనె నేమో యని రాజున కనుతాపము కలిగెను ప్రాణిహింస యగుటచే శీలము భంగ మయ్యెను. ఇందుచే శీలము ప్రసన్నము కాలేదు.

'బాబులారా, కురుధర్మము విషయమై నా కనుతాపము కలదు. కాని నాతల్లి కురుధర్మమును బాగుగా నిర్వర్తించినది. ఆమె నడు గుడు' అని రాజు పలికెను.

'మహారాజా, జీవహింస చేయవలె నను తలపు మీకు లేదు. భావము లేకుండ జరిగినది జీవహింస కాదు. మీరు పాలించిన కురు ధర్మమును మాకు ప్రసాదింపుడు' అని వారు కోరగా, 'అట్లయినచో వ్రాసికొనుడు' అని, జీవహింస చేయరాదు; చౌర్యము చేయరాదు; కామభోగసంబంధ మగు మిథ్యాచారము పనికిరాదు; అసత్యము పలుకరాదు; మద్యపానము చేయరాదు అని పలకపై రాజు వ్రాయించెను.

వ్రాయించిన పిదపగూడ 'అయినను నామనస్సునకు సంతుష్టి లేదు.

నాతల్లి కడ స్వీకరింపుడు' అని రాజు చెప్పగా, దూతలు రాజునకు ప్రణామము చేసి, ఆయనతల్లిసన్నిధి కరిగి 'దేవీ, మీరు కురుధర్మమును రక్షించుచున్నారు, మాకు దాని నుపదేశింపుడు' అని కోరిరి.

'బాబులారా, నేను యథార్థముగా కురుధర్మము పాలించుచున్నాను. కాని నేడు దానివిషయమై నామనసులో అనుతాపమున్నది. ఆధర్మము నాయెడ ప్రసన్నముగా లేదు. అందుచే మీకు దానిని తెలుపజాలకున్నాను.'

ఆమె కిరువురు పుత్రులు కలరు. పెద్దకొడుకు రాజు, రెండవవాడు యువరాజు. ఒకరాజు బోధిసత్త్వునికడకు లక్ష విలువగల చందనసారమును, వేయినాణెముల విలువగల బంగారు హారమును పంపెను. ఆయన మాతృపూజచేయుదు నని తలపోసి వానిని తల్లి కిచ్చెను. ఆమె, "నేను చందనలేపము చేసికొనను. హారము ధరింపను. కోడండ్ర కిచ్చెదను" అనుకొనెను. కాని ఆమె పెద్దకోడలు ఐశ్వర్యవంతురాలు, పట్టమహిషి. కావున ఆమెకు సువర్ణహారమిచ్చెదను, చిన్నకోడలు ధనికురాలు కాదు. కావున ఆమెకు చందనసార మిచ్చెదను, అని భావించి, రాణికి కనకహారమును, యువరాణికి చందనసారమును ఇచ్చెను. కాని ఇచ్చిన తరువాత, "నేను కురుధర్మమును పాలించుదానను. ఇరువురిలో ఎవరికి ధన మున్నది, ఎవరికి లేదు, అను విషయము నా కేల? పెద్దదానిని పెద్దగా ఆదరింపవలయును" అనుకొన్నది. ఆప్రకారముగా చేయకపోవుటచే శీలమునకు భంగము కలుగలేదా? ఇట్టి సందేహముత్పన్నమై రాజమాత పై ప్రకారముగా పలికినది.

"మీ వస్తువులను మీ ఇచ్చివచ్చినట్లు చేయవచ్చును. ఇట్టి విషయములో మీరు సందేహించుచున్నారు. మీరు రెండవపాపకర్మ చేయగలరా? ఈవిధముగ శీలము భగ్నము కాదు. మాకు కురుధర్మమును ప్రసాదింపుడు" అని దూతలు కోరి బంగరుపలకపై కురుధర్మములు వ్రాయించిరి.

"నాయనలారా, ఇట్లు చేసినను నామనసు ప్రసన్నము కాలేదు. నాకోడలు కురుధర్మము బాగుగ పాలించుచున్నది. ఆమెకడ ధర్మములను స్వీకరింపుడు," అని రాజమాత చెప్పినది.

వారు పట్టమహిషిసన్నిధి కరిగి పూర్వోక్తప్రకారముగా కురు

ధర్మము యాచించిరి. ఆమెయును పూర్వోక్తప్రకారముగా పలికి, "ఇపుడు శీలము మాయెడ ప్రసన్నముగ లేదు. కావున కురుధర్మ మీయజాలను" అన్నది.

ఆమె ఒకనాడు కిటికీలో కూరుచుండి నగరప్రదక్షిణము చేయుచు ఏనుగపై రాజు ఆయన వెనుక యువరాజును చూచి ఆసక్తచిత్తయై ఈయనతో సహవాసము చేసినచో అన్నగారు పోయిన పిమ్మట ఇతడు రాజ్యమునకు వచ్చి నన్ను గౌరవించును అనుకొన్నది. తోడనే ఆమెకు, "నేను కురుధర్మము పాలించుదాననై భర్త జీవించియుండగా అన్యపురుషుని కుదృష్టితో చూచితినే! శీలము భంగమై యుండును" అనుకొన్నది. అందుచే మనసున సందేహ ముప్పతిల్లి ఆమె అట్లు పలికినది.

"ఆర్యే, మనసులో తలపు కలిగినంత మాత్రమున దురాచారము కానేరదు. ఇట్టివిషయమున మీరు సందేహించుచున్నందున మీరు ధర్మోల్లంఘన మెట్లు చేయుదురు? ఇంత మాత్రమున శీలభంగము కాదు. మాకు కురుధర్మము ప్రసాదింపుడు" అని వారామెకడ ధర్మమును గ్రహించి బంగరుపలకపై లిఖించిరి.

"బాబులారా, ఇప్పటికిని నాకు చిత్తప్రసన్నత లేదు. యువరాజు కురుధర్మమును బాగుగా పరిపాలించును. ఆయనకడ గ్రహింపుడు" అని రాణి పలికినది. వారు యువరాజుకడ కేగి పూర్వోక్తప్రకారముగా కురుధర్మమును యాచించిరి.

ఆయన సాయంకాలము రాజును కొలుచుటకై రథముపై బోయి, రాజాంగణము ప్రవేశించి రాజుతో భోజనము చేసి, అక్కడనే నిద్ర పోవలసి యున్నచో, త్రాడు, కొరడా, కాడి ప్రక్కనే యుంచిపోవును. ఆగురుతువలన పరివారజనము వెడలిపోయి, మరునాడు ప్రాతఃకాలమున మరలి వచ్చి, ఆయనకై వేచియుండును. ఆయన త్వరలో మరలి వచ్చు పక్షమున పగ్గము, కొరడా రథములో నుంచి రాజును కలిసి కొని, వెడలిపోవును. ఆగురుతు గ్రహించి అచటనే ఆయనకై నిలిచి యుందురు. అట్లే ఆయన ఒకనాడు రాజమహాలునకు బోయెను. తోడనే వర్షమారంభమాయెను. వాన కురియుచున్నది అని రాజాయన ను వెడలిపోవనీయలేదు. యువరాజిప్పుడే వచ్చునని పరివారజన

మచటనే నిలిచియుండెను. యువరాజు భోజనము చేసి అచటనే పండుకొనెను. మరునా డుదయ మాయన లేచి వచ్చి చూచుసరికి పరిజనము వానలో తడిసి అట్లే నిలిచియుండెను. ఆయన తనలో "నేను కురుధర్మమును పరిపాలించువాడను. ఇందరను కష్టపెట్టినాను. శీలభంగమయియుండును" అను సందేహముతో దూతలతో "నేను యథార్థముగా కురుధర్మమును పాలింతును. కాని యిపుడు నామనసున సందేహముత్పన్న మయినది. కావున కురుధర్మ ముపదేశింపలేను" అని పలికెను.

"దేవా, వీరికి కష్టము కలుగవలె నని మీయాశయము కాదు. సంకల్పము లేనిది కర్మ కాదు. ఇంత చిన్నవిషయములోనే మీకు సందేహము కలిగినప్పుడు మీరు ధర్మోల్లంఘనము ఎట్లు చేయుదురు?" అని దూతలు పలికిరి.

దూతలు ఆయనకడ ధర్మము గ్రహించి బంగరుపట్టిక మీద వ్రాసిరి. "ఇట్లయ్యును నాచిత్తము ప్రసన్నముగా లేదు. పురోహితుడు బాగుగా ధర్మమును పాలించును. ఆయనకడ గ్రహింపుడు" అని యాతడు చెప్పగా దూతలు పురోహితునిసన్నిధి కరిగి ధర్మమును యాచించిరి.

ఆయన ఒకనాడు రాజసేవార్థము పోవుచుండెను. మార్గములో మధ్యాహ్నసూర్యునివలె ఎర్రనిరథమును ఒకానొక రాజు ప్రభునకు పంపెను. 'ఈరథ మెవ్వరిది?' అని పురోహితు డడుగగా ప్రభువుకోసము వచ్చినది' అని చెప్పిరి. ఆయన తనలో "పెద్దవాడ నయినాను. రాజీరథము నా కిచ్చినచో దీని నెక్కి సుఖముగా తిరుగుదును" అనుకొని, రాజసేవార్థము చనెను. రాజునకు జయమగుగాక అను సమయమునకు రథమును పరిజను లచటికి గొనివచ్చిరి. "ఈరథ మందముగా నున్నది. ఆచార్యున కిండు" అని రాజు పలికెను. పురోహితుడు వలదనెను. మాటిమాటికిని ప్రభువు చెప్పినను ఆయన స్వీకరింపలేదు. ఎందుచే నిట్లాయెను? "నేను కురుధర్మము ననుష్ఠించువాడను. అన్యుని పదార్థముమీద నా కాశ కలిగినది. నాశీలము భంగ మయియుండును" అని తలపోయుట చెప్పి, "బాబులారా, కురుధర్మవిషయమున నాకు సందేహము కలిగినది. నామనస్సు ప్రసన్నముగా లేదు. ఇందుచే ధర్మము

నుపదేశింపజాలను'' అని పలికెను.

"ఆర్యా, కేవలము మనసులో కోరిక కలిగిన మాత్రమున శీల భంగము కానేరదు. దీనికే మీరు సందేహించినపుడు ధర్మోల్లంఘన మెట్లు కాగలదు?" అని దూత లాయనకడ ధర్మమును గ్రహించి, బంగరుపట్టికమీద వ్రాసిరి.

''ఇట్లయ్యును నామనసు ప్రసన్నముగా లేదు. సూత్రధారుడైన అమాత్యుడు ధర్మమును బాగుగా పాలించును. ఆయనవలన గ్రహింపుడు''

ఆయనవద్దకు బోయి దూతలు యాచించిరి.

ఒకనాడాయన యొకగ్రామమున పొలములు కొలుచుచుండగా, కఱ్ఱకు కట్టిన త్రాటికొన క్షేత్రయజమానునిచేతిలో నుండెను. రెండవ కొన తనచేత నుండెను. తాను పట్టుకొన్నకొనకు కట్టిన మానదండము ఎండ్రకాయబొరియమీదికి వచ్చెను. "నేను దండమును బిలములోనికి పోనిచ్చిన వో ఎండ్రి మరణింపవచ్చును. దండము నావలకు జరుపుదు నేని రాజుగారిహక్కు లోపించవచ్చును. ఈవలకు జరిపితినా క్షేత్ర యజమానుడు భాగము కోలుపోవచ్చును. ఏమి చేయవలెను? అని యోచించి, ఎండ్రి బొరియలో నున్నచో ఈవలకు వచ్చును" అని దండమును బిలములో దింపెను. 'కిరి' అను చప్పుడు వినబడెను. దండము ఎండ్రిపీపుమీద గ్రుచ్చుకొని అది చనిపోయియుండును. నేను కురుధర్మమును పాలించుచున్నాను. దీనివలన శీలభంగ మయి యుండును. ఈవిషయములు చెప్పి ఆయన స్వధర్మవిషయమై సందేహ మున్నదనియు, అందుచే ధర్మ ముపదేశింపజాల ననియు పలికెను.

''కుళీరము చనిపోవు ననుతలపు మీకు లేదు. సంకల్పము లేకుండ జరిగినది కార్యము కానేరదు. ఇంతస్వల్పవిషయముననే మీకు సందేహము కలిగినప్పుడు ధర్మోల్లంఘన మెట్లు చేయగలరు?'' అని దూతలు ధర్మమును బంగరుపట్టికపై వ్రాసికొనిరి.

ఇట్లయ్యును నాచిత్తము ప్రసన్నముగా లేదు. సారథి ధర్మమును బాగుగా పాలించును. ఆయనవలన గ్రహింపుడు."

వారు సారథికడకు బోయి యాచించిరి. సారథి ఒకనాడు రాజును రథమున ఉద్యానమునకు గొనిపోయెను. పవ లంతయు రా జచట

క్రీడించి, సాయంకాలము రథముపై బయలుదేరెను. నగరమునకు మరలివచ్చుటకు మున్నే సూర్యాస్తమాన మయి, మేఘము లాకసము నావరించినవి. రాజు వర్షములో తడియు నను భీతిచే సారథి గుఱ్ఱము లకు చబు కంటించెను. సింధుగుఱ్ఱములు వడిగా పరుగెత్తెను. ఉద్యానమునకు పోవునపుడును, మరలి వచ్చునప్పుడును చురుకుగానే పరుగెత్తెను. ఏల? ఇచ్చట నేదో శ్రమ యున్నది; కావున సారథి మమ్ము చబుకతో కొట్టినాడు, అని వానికి తోచియుండును. రాజు తడియకున్నను తడిసినను నాదోషము లేదు. కాని సుశిక్షితసైంధవములను కొరడాతో కొట్టుట పొరపాటు అందుచే వచ్చునప్పుడు పోవునపుడు వానికి శ్రమ కలిగినది. నేను కురుధర్మము పాలించుచున్నాను. ధర్మభంగ మయి యుండనోపును. ఈసంగతి చెప్పి, అతడు ధర్మ మువదేశింపజాల ననెను.

"సైంధవములకు కష్టము కలుగు నని మీరు భావింపలేదు. సంకల్పము లేనిది కర్మ కాదు. చిన్నవిషయమునకే మీరు మనసులో ఆందోళన పడుచున్నారు. ఎట్లు ధర్మోల్లంఘనము చేయగలరు?" అని దూత లాయనకడ ధర్మము గ్రహించి, బంగరుపట్టికపై వ్రాసిరి.

"ఇట్లయ్యును నామనస్సు ప్రసన్నముగా లేదు. శ్రేష్ఠి ధర్మమును బాగుగా పరిపాలించును. ఆయన కడ గ్రహింపుడు."

వారు శ్రేష్ఠికడకు బోయి ధర్మము వేడిరి. ఆయన ఒకనాడు ధాన్యపుబండి బయలుదేరినపుడు తన సస్యక్షేత్రము చేరుకొనెను. అందలి పళ్ళికలోనుండి గుప్పెడుధాన్యము తీసి మూటకట్టెను.

"ఈ భూమిలో (పంటలో) రాజభాగము విడిగా ఉంచవలసినది. పంటలోనుండియే భాగ మావల నుంచక గుప్పెడుధాన్యము తీసితిని. నేను కురుధర్మము పాలించుచున్నాను. ధర్మభంగ మయియుండును" అని తలపోసి ఈసంగతి వారికి తెలిపి శ్రేష్ఠి ధర్మము నీయజాల ననెను. "అపహరింపవలె నను నుద్దేశము మీకు లేదు. సంకల్పము లేనిదే చౌర్యదోషమును పోషింప నక్కరలేదు. ఇంత స్వల్పవిషయమునకే మీరు సందియము చెందియుండ ధర్మోల్లంఘన మెట్లు చేయగలరు?" అని దూతలు ఆయనకడ ధర్మమును గ్రహించి, బంగరు పట్టికమీద వ్రాసిరి.

"ఇట్లయ్యును నాకు చిత్తస్వాస్థ్యము లేదు. ద్రోణమాపక మహామాత్యుడు కురుధర్మమును చక్కగా పాలించును. ఆయనకడ ధర్మము గ్రహింపుడు."

దూత లాయనకడకు బోయి ధర్మము యాచించిరి. ఒకనా డాయన కొట్టువాకిట గూరుచుండి, రాజభాగములో ధాన్యము తూయించుచుండెను. తూకము వేయని ధాన్యము రాశిలోనుండి తీసి అచట గుర్తులు పెట్టెను. ఆసమయమున వర్షము వచ్చెను. మహామాత్యుడు చిహ్నములను లెక్కించి ధాన్యము ఇంత అని పలికి గుర్తు వేసిన ధాన్యమును విడదీసి తూనికవేసిన ధాన్యముమీద పోయించెను. శీఘ్రముగా కొట్టువాకిలి చేరి, నిలిచి "నేను తూచినధాన్యమును పాలములో గుర్తుపెట్టిన ధాన్యములో పోయించవలసినదా? గుర్తుపెట్టిన ధాన్యమును తూచినధాన్యములో పోయించి యుండవలెనా? గుర్తు వేసినధాన్యము తూనికవేసిన ధాన్యముపై వేయించినందున రాజభాగము నెక్కువ చేసి కర్షకభాగమును తగ్గించిన ట్లున్నాను. నేను కురుధర్మమును పాలించుచున్నాను. అది యిప్పుడు భంగమైనది" అని చింతింపసాగెను.

అత డీసంగతి వారికి చెప్పి, "ఈకారణమున నేను కురుధర్మము పాలింపలేదని సందేహించుచున్నాను. కావున మీకు కురుధర్మ మీయజాలను" అని పలికెను.

"చౌర్యము చేయవలెనను తలంపు మీకు లేదు. సంకల్పము లేనిది చౌర్యమును ఘోషించుటకు వీలులేదు. ఇంత చిన్నవిషయములోనే మీకు సందేహము కలిగినపుడు మీరు అన్యులవస్తువుల నెట్లు తీసికొనగలరు" అని దూతలు ఆయనకడ ధర్మమును గ్రహించి బంగరుపట్టిక మీద లిఖించిరి.

"ఇట్లయ్యును నామనస్సు ప్రసన్నముగా లేదు. ద్వారపాలకుడు కురుధర్మమును బాగుగా పాలించును. ఆతనికడ ధర్మమును స్వీకరింపుడు."

వారు ఆయనకడకు చేరి ధర్మమును యాచించిరి. ఆయన ఒకనాడు నగరద్వారము బంధించు సమయమున మూడుపర్యాయములు ఘోషణ చేసెను. ఒకానొక పేదవాడు తన చిన్నచెల్లెలిని వెంటబెట్టు

కొని ఆకులు కట్టెలు ఏరి తెచ్చుకొనుటకు అడవికి పోయెను. మరలి వచ్చునప్పటికి తలుపులు మూయు ప్రకటన విని అతడు చెల్లెలితో త్వరితముగా లోనికి బ్రవేశించెను. ద్వారపాలకుడు "నగరములో రాజున్నాడని నీకు తెలియదా? ఈనగరద్వారము సరిగా వేళకు మూయుదు రని నీకు తెలియదా? నీభార్యను వెంటగొని అడవిలో క్రీడించుచు తిరుగుచుంటివి" అనెను. "స్వామీ! ఈమె నాభార్య కాదు, నా చెల్లెలు" అని వాడు ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు ద్వారపాలకుడు తనలో "చెల్లెలిని భార్య అంటిని. ఇది అనుచితము. నేను కురుధర్మము పాలించువాడను. ధర్మభంగ మైయుండును" అనుకొన్నాడు. ఈకథ వారికి తెలిపి ఈకారణముచే నామనస్సు కురు ధర్మమునెడ సందిగ్ధమై యున్నది. కావున నేను ధర్మోపదేశము చేయ జాల నని చెప్పినాడు.

"మీరు ఏది అనుకొంటిరో అదియే పలికితిరి. దీనివలన శీలభంగము కాదు. ఇంత స్వల్పవిషయమునకే మీరు పరితాపము చెందుచుండగా కురుధర్మము పాలించు మీరు అసత్య మేల పలుకుదురు?" అని వారలు ఆయనకడ ధర్మము గ్రహించి బంగరుపట్టికమీద వ్రాసిరి.

"ఇట్లయ్యును నామనస్సు ప్రసన్నముగా లేదు. నగరవేశ్య కురు ధర్మమును బాగుగా పాలించును ఆమెకడధర్మము స్వీకరింపుడు.

వారు ఆమెను ధర్మము యాచించిరి. పూర్వోక్తప్రకారముగా ఆమె ధర్మము ఉపదేశించుట కంగీకరింపలేదు. ఏల? శక్రుడు ఒకనాడు ఆమె సదాచారమును పరీక్షించుటకై యువకవేషము ధరించి వచ్చి వేయినాణెము లిచ్చి నేను వత్తు నని చెప్పి దేవలోకమునకు సూటిగా పోయెను. మూడుసంవత్సరములవరకును మరల రాలేదు. ఆమె శీల భంగ మగు నను భయముచే ఎవ్వనికడను తములపాకైనను స్వీక రింపలేదు. క్రమముగా ఆమెకు దారిద్ర్యము సంక్రమించినది. అప్పు డామె తనలో "నాకు వెయ్యినాణెముల నిచ్చిన పురుషుడు పోయి మూడుసంవత్సరములైనది నాకు పేదరికము సంభవించినది. జీవ నము గడచుట కష్టముగా నున్నది. ఇప్పుడు న్యాయాధిశులైన అమాత్యులకడకు జని ధనము తీసికొనవలసియున్నది" అనుకొని న్యాయాలయమునకు పోయి "స్వామీ, నాకు ధన మిచ్చి పోయిన

పురుషుడు మూడు సంవత్సరము లైనను మరలి రాలేదు. ఆయన బ్రతికి యున్నాడో లేడో తెలియదు. జీవనము గడచుట లేదు. ఏమి చేయుదును?'' అని విన్నవించెను.

మూడువర్షములవరకును రానిచో ఏమి చేయుదువు? ధనము స్వీకరింపుము'' అని వారు చెప్పిన తీర్పు విని ఆమె న్యాయాలయమునుండి ఈవలకు వచ్చునప్పటికి ఒకానొకడు వేయినాణెముల సంచి చూపెను. ఆమె దానిని స్వీకరించుటకై చేయి చాపునప్పటికి శక్రుడు ప్రత్యక్షమయ్యెను. ఆయనను చూచినంతనే ఆమె చేయి వెనుకకు లాగికొని మూడేండ్లక్రిందట నాకు వేయినాణెము లిచ్చిన పురుషుడు వచ్చినాడు. నీకార్షాపణములతో నాకు పనిలేదు'' అని వానితో ననెను.

శక్రుడు నిజరూపము ధరించి మధ్యాహ్నమార్తాండునివలె ప్రకాశించుచు, ఆకసమున నిలిచెను. నగరజనులందరు గుమిగూడిరి. అపుడు శక్రుడు వారిని సంబోధించి "నే నీమెను పరీక్షించుటకై వేయినాణెములనిచ్చి మూడుసంవత్సరము లయినది. శీలమును రక్షించుకొనవలె నన్న ఈప్రకారముగా రక్షించుకొనవలె'' నని యుపదేశించి ఆమె ఇంట సప్తరత్నముల నిల్పి, నేటినుండి జాగరూకతతో మెలగవలయు నని ఉపదేశ మిచ్చి, దేవలోకమునకు వెడలిపోయెను. ఈకధ చెప్పి మొదటిధనము వినియోగింపక రెండవధనముకొరకు చేయి జాపుటచే నా మనస్సు ప్రశాంతముగా లేదని ధర్మోపదేశము చేయజాల ననెను.

''చేయి చాపినంతనే శీలభంగము కాదు. మీశీలము మిక్కిలి పరిశుద్ధమైన'' దని ఆమెకడ దూతలు ధర్మము స్వీకరించి బంగరుపట్టిక మీద లిఖించిరి.

ఈప్రకారముగా పదునొకండుగురి ద్వారా పరిపాలితమైనశీల విషయములు బంగరుపట్టికమీద వ్రాసి దూతలు దంతపురము చేరి, కళింగనరేశునకు బంగరుపట్టిక నిచ్చి వృత్తాంతమునంతయు నివేదించిరి. రాజు కురుధర్మమున ప్రతిష్ఠితుడై పంచశీలమును పూర్తిచేసెను.

అపుడు కళింగరాష్ట్రమం దంతటను వర్షములు కురిసెను. మూడుభయములు శాంతించెను. రాష్ట్రమునకు కళ్యాణమయ్యెను. పైరులు మొలిచెను.

బోధిసత్త్వుడు జీవనపర్యంతము దానాదిపుణ్యకార్యములు చేయుచు

తుదకు అనుయాయులతో గూడ స్వర్గగామి యయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి, ఆర్యసత్యములను ప్రకటించునప్పటికి అచ్చటివారిలో కొందరు స్రోతాపన్నులు, కొందరు సకృదాగాములు, మరికొందరనాగాములు నయిరి. ఆసమయమున వేశ్య ఉత్పలవర్ణ; ద్వారపాలకుడు పుణ్ణుడు; త్రాడు పట్టుకొనువాడు కచ్చానుడు; గొలిచినవాడు కోలితుడు; శ్రేష్ఠి సారిపుత్రుడు; సారథి అనురుద్ధుడు; బ్రాహ్మణుడు కస్యపస్థవిరుడు; ఉపరాజు నందపండితుడు, పట్టపుదేవి రాహులమాత; తల్లి మాయాదేవి; కురురాజు బోధిసత్త్వుడు. జాతకమును ఈప్రకారముగా గ్రహింపవలెను.

# 277 రోమక జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు, వధప్రయత్నసందర్భమును గూర్చి చెప్పినది. వర్తమానకథ ప్రకటమే.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కపోతమై పుట్టెను. అనేకపారావతములతో గూడి యతడు కాననములో తిరుగుచు పర్వతగుహలో నుండెడివాడు. సదాచారసంపన్నుడైన తపస్వి యొకడు పావురముల నివాసస్థానమునకు సమీపములో ప్రత్యంతగ్రామముకడ ఆశ్రమము నిర్మించుకొని పర్వతగుహలో నుండును. అప్పుడప్పుడు బోధిసత్త్వుడాయనకడకు వచ్చి వినదగినవి వినుచుండువాడు. తపస్వి బహుకాల మచట నుండి తుదకు వెడలిపోయెను.

ఒకనాడు కుటిలజటాధారి యొకడు వచ్చి అచ్చట నివసింపసాగెను. కపోతములతో పాటు బోధిసత్త్వుడుకూడ ఆయనకు ప్రణామము చేసి, కుశలప్రశ్న లడిగి, ఆశ్రమప్రాంతములోను గిరికందరములోను మేతకై తిరిగి సాయంసమయమునకు నిజనివాసమునకు జేరును. కుటిలజటాధారి అచట ఏబదిసంవత్సరములకు పైగా నుండెను. ఒకనాడు ప్రత్యంత

గ్రామవాసులు పావురముమాంసము వండి ఆయనకు బెట్టిరి. రసలోభముచే ఆయన "ఇది దేనిమాంస ?" మని యడిగెను. "కపోతమాంసము" అన్నారు వారు. అంతట ఆయన "నాఆశ్రమమునకు అనేకకపోతములు వచ్చుచున్నవి. వాని మాంసము కావలెను" అనుకొని బియ్యము, నెయ్యి, పెరుగు, జీలకర్ర, మిరపకాయలు మొదలగునవి తెచ్చి ఒకప్రక్కన బెట్టి, దుడ్డుకర్రమీద గుడ్డకప్పి, పావురములకై యెదురుచూచుచు పర్ణకుటీరద్వారమున గూరుచుండెను.

బోధిసత్త్వుడు పావురములతో వచ్చి, ఆకుటిలజటాధారిముఖ్యువై ఖరిగాంచి "నేడిదుష్టతాపసుడు వేరొక తీరున గూరుచున్నాడు. ఒకవేళ మాజాతిపిట్టమాంసము తినలేదు కదా ? వీనిని పరీక్షింతును" అనుకొని గాలివాలున నిలిచి ఆయన యొడలివాసన కనిపెట్టెను. అతని సమీపమునకు పోగూడ దనుకొని మిగిలిన పావురములను మరల్చి మేత మేయసాగెను. అవి తనవద్దకు రాకుండుట చూచి తపస్వి తీయని పలుకులతో వానికి విశ్వాసము కలిగించి చంపి, తినవలె ననుకొని ఈగాథలు పలికెను.

ఏబదేడులనుండి యీకొండగవిలోన
నివసించుచున్నాము : నిశ్శంకముగ మున్ను
అఖిలపక్షులు నాదు హస్తమ్ము మీదుగా
శాంతభావమ్ముతో చరియించుచుండెడివి.

ఇపుడు సంశయ మొంది యేమి హేతువుననో
ఆపిట్టలే పోవు నన్యపర్వతగుహకు.

ఆదిలోవలె నన్ను నాదరించుట లేదు :
చేయునే రోమకా, చిరకాలము ప్రవాస
మాయండజంబు లియ్యవి కావె కావో కో !

విని బోధిసత్త్వుడు మరలివచ్చి నిలుచుండియే ఈగాథ చెప్పెను :

కా మేము మూఢులము, గ్రహియించితిమి నిన్ను
మన మందరము కూడ మును పున్న వారమే
కాని నీచిత్తంబు కలుషితం బయిపోయె :
ఆజీవకా, భీతి అందుచేతనె మాకు!

ఈయన నాసంగతి తెలిసికొన్నా డని గ్రహించి తపస్వి దుడ్డు విసరి వేసెను. అది తప్పిపడిపోయెను. "పో తప్పించుకొని బ్రతికినావు" అని యాత డనగా బోధిసత్త్వుడు "ఇప్పుడు తప్పించుకొన్నావు. కాని నాలుగు నరకములనుండి నీవు తప్పించుకొనలేవు. ఇక నీ విచ్చట నుందువేని ఈసంగతి గ్రామవాసులకు తెలిపి, నీవు చోరుడ వని పట్టించెదను. తక్షణము కదలిపో" అని భయభ్రాంతుని జేసి పార ద్రోలెను. జటాధారి ఆప్రాంతములలో నుండలేకపోయెను.

శాస్త్ర యీధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున తాపసి దేవదత్తుడు; సదాచారతపస్వి సారిపుత్రుడు; జ్యేష్ఠకపోతము నేనే.

## 278 మహింస జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ఒకానొక దుష్టవానరమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొకకుటుంబమున పెంపుడుకోతి యుండెను. అది చాల చెడ్డది. అది హస్తిశాలలోనికి బోయి మంచియేనుగు వీపుమీద మలమూత్రములు విడిచి, యిటు నటు తిరుగుచుండెడిది. ఏనుగు మంచిది, శాంతచిత్తము కలది; కావున ఏమియు చేసెడిది కాదు.

ఒకనా డాహస్తిస్థానమున దుష్టహస్తిపోతకము నిలిచియుండెను. మామూలు గజమే అను భ్రమచే కోతి దానివీపుమీది కెక్కెను. అది కోతిని తొండముతో పట్టుకొని నేలపై బడవేసి, మర్దనము చేసెను. ఈవిషయము భిక్షుసంఘమునకు దెలిసెను. ఒకనాడు వారు ధర్మసభలో ఈవిషయము ముచ్చటించుచుండగా శాస్త్ర అచటికరు దెంచి, విషయము తెలిసికొని, భిక్షువులారా, ఈదుష్టవానర మిప్పుడే కాదు, పూర్వ మకూడ చెడ్డదే" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమాలయప్రదేశమున మహిషీగర్భమున బుట్టెను. ఆయన పెరిగి పెద్దవాడయినపిమ్మట మహాకాయుడు శక్తిసంపన్నుడు నయి కొండలు, గుట్టలు, గహనములు, మహారణ్యములు మొదలగుతావుల విచారించుచుండెను. ఆయనకు సుఖద వృక్షచ్ఛాయ లభించెను. మేత మేసి పగటివేళ ఆవృక్షచ్ఛాయలో నిలుచుండును.

ఒక దుష్టవానరము చెట్టుపైనుండి ఆయనవీపుమీదికి దిగి మలమూత్రములు విడిచెను; కొమ్ములు పట్టుకొని యూగుచు తోకపట్టుకొని వ్రేలాడజొచ్చెను. బోధిసత్త్వుడు శాంతి, మైత్రి, దయాసంపత్తి కలవాడగుటచే దాని దుష్టకార్యములమీద దృష్టి యుంచలేదు. బహుపర్యాయములు కోతి అట్లే చేయుచుండెను. ఆవృక్షదేవత బోదెమీద నిలుచుండి "మహిషరాజా, ఈచెడుకోతి చేయు చెడుచేష్టలెట్లు సహించుచున్నావు? దీనిని నివారింపుము" అని ఈగాథలు పలికెను :

ఈచంచలద్రోహి నేల సహియింతువో
సర్వకామదుడైన సత్పురుషునిబోలె?

పాదాలతో ద్రొక్కి పటుశృంగముల నొక్కి
దమియింపజేసి యీ దౌర్భాగ్యవానరము,
పరిహసించుచు నిన్ను బాలకుల్ వేధింత్రు.

విని బోధిసత్త్వు డి ట్లనెను, "వృక్షదేవతా, నేను దీనికన్న జాతి, గోత్ర, బలములలో నధికుడ నయి దీనిదోషమును సహింపనిచో నామనోరథ మెట్లు సిద్ధించును? కాని ఈమర్కటము నాతో వర్తించి నట్లే మరియొకరితో గూడ వర్తించును. ప్రచండమహిషములతో వర్తించిన అవి వధించును. అన్యులవలన జరుగు వధ నన్ను వ్యధనుండి హింసనుండియు తప్పించును." ఇట్లని ఈగాథ పలికెను :

ఇపుడు నాతో నిద్ది యెట్లు వర్తించు,
అట్లు వర్తించుచో నన్యులతోడ
సంహరింతురు నాకు శాంతి లభించు.

కొలది దినములతరువాత బోధిసత్త్వు డచటినుండి వెడలిపోయెను. ప్రచండమహిషము వచ్చి చెట్టుక్రింద నిలిచెను. దుష్టవానరము వెను కటియట్లే ప్రవర్తించెను. మహిషము దానిని క్రిందికి బడద్రోసి కొమ్ములతో రొమ్ము చీల్చి, కాళ్ళతో త్రొక్కి పిండిపిండిగా జేసెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున దుష్టమహిషము ఇప్పటి దుష్టగజము; దుష్టవానరము ఈదుష్టవానరమే; మహిషరాజు నేను.

## 279 సతపత్త జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు పండుక లోహితకుల విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఆరువర్గములలో, ఇరువురు మైత్రియభుమ్మజకులు- రాజగృహ సమీపమున నివసించుచుండిరి. నిర్ణయమయి పోయినవిషయము లను గూర్చి మాటిమాటికి ప్రస్తావించుచుండిరి. వారికి పరిచితులయిన వారికి సహాయము చేయుచు "ఆయుష్మంతులారా, వీరికంటె కులమున గోత్రమున, శీలమున, మరి యెందునను మీరు తక్కువ కారు. మీరు పట్టుదలను విడుచుపక్షమున, వీరు మిమ్ములను బాగుగా అణగద్రొక్కు దురు" అని వాడి పట్టుదలలను విడనీయకుండిరి. ఈవిధముగ వివాదము పెరిగిపోయినది.

ఈవిషయము దెలిసికొని భగవాన్ పండుక లోహితకులను ధర్మ సభకు రప్పించి, "భిక్షువులారా, మీరు అభిమోగమును స్వయముగానే పెంపొందించుకొనుచున్నారా? కాక అన్యులు మీపట్టుదలను విడువ నీయకున్నారా" అని అడిగెను.

"భన్తే, నిజమే."

"అట్లగుచో, మీపద్ధతి శతపత్రమాణవకుని పద్ధతివలె నున్నది" అని శాస్త్ర పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున నొకగ్రామములో జనియించెను. పెద్దవాడయినపిమ్మట కృషి వాణిజ్యాదు లేవియును చేయక అయిదు వందలదొంగలగుంపునకు సరదారయి దారిదోపిడి చేయుచు కన్నములు వేయుచు జీవించుచుండెను.

ఆసమయమున వారాణసిలో ఒకానొకగృహస్థు దగ్గర పేటలోని వానికి వేయికార్షాపణము లిచ్చి, వసూలు చేయకుండనే చనిపోయెను. ఆయనభార్య మరణశయ్యపై నుండి కుమారుని బిలిచి "నాయనా, నీతండ్రి ఒకనికి వేయి కార్షాపణము లిచ్చి వసూలుచేయకుండనే మృతిచెందినాడు. నేనుకూడ మరణించినచో నీ కాత డీయడు. నేను జీవించియుండగనే నీవు వెళ్ళి తెచ్చుకొమ్ము" అని చెప్పెను. మంచి దని వా డతనికడకు బోయి ధనము తీసికొనెను.

ఇంతలో నతనితల్లి చనిపోయి పుత్రస్నేహముచే వాడు వచ్చు మార్గమున ఆడునక్క యయి నిలిచెను. చోరనాయకుడు పాంథులను దోచుకొనుచు సహచరులతో ఆమార్గముననే యుండెను.

తన కుమారుడు అడవివైపు ముఖముపెట్టగానే నక్క మాటిమాటి కిని మార్గమున కడ్డము పోవుచు, వారించుచు, "నాయనా, నీ వడవి లోనికి బోవలదు. అక్కడ నున్న దొంగలు నిన్ను చంపి, ధనము లాగికొందురు" అని పలికెను. వా డాపలుకులు గ్రహింపని కారణ మున, 'ఈ చెడునక్క నా కడ్డము వచ్చుచున్నది' అని బెడ్డలు విసరి కర్ర త్రిప్పి దానిని పారద్రోలి అడవిలో బ్రవేశించెను. ఆసమయమున పాలపిట్ట చోరుల కెదురుగా నరచుచు "ఈతనివద్ద వేయికార్షాపణ ములు కలవు. వీనిని చంపి ఆధనము తీసికొనుడు" అని కోలాహలము చేయుచుండెను. ఆయువకుడు దానిని గ్రహింపక 'ఇది శుభశకునపక్షి, నాకు మేలు కలుగును' అని భావించి చేతులు జోడించి పలుకు స్వామీ, పలుకు!' అన్నాడు.

బోధిసత్త్వున కన్నిభాషలు తెలియును. ఆయన రెండిటి పలుకులు విని "నక్క ఇతనితల్లి కానోపును, కావుననే ఇతనికి చావు మూడు

నను భయముచే మార్గము నడ్డగించినది. చెట్టుకొట్టు పిట్ట శత్రువు కానోపును. కావుననే ఇతనిని సంహారించి కార్షాపణములు సంగ్ర హింపు డని కలకలము చేసినది. వీడు గ్రహింపక మేలు కోరెడి తల్లిని బెదరించి వెడలగొట్టి, మేలుకోరని పక్షి యెదుట చేతులు జోడించి నాడు. వీడు మూఢుడు. ఓహో!" అని చింతించి, ఆయువకుని చోరులనడుమకు బిలిచినాడు. అంతట ఆయన వానిని పట్టించి "నీ వెచ్చట నుండువాడవు?" అని యడిగెను.

"వారాణసిలో నుండువాడను."

"ఎచ్చటికి బోతివి?"

'ఒకకుగ్రామములో వేయి రావలసియుండగా పోతిని."

"నీకు లభించినవా?"

"లభించినవి."

"ని న్నెవరు పంపినారు?"

"స్వామీ, నాతండ్రి మరణించినాడు. తల్లికి జబ్బుగా నున్నది. తన మరణానంతరము ధనము వసూలు కా దని నేడే నన్ను పంపినది."

"ఇప్పుడు తల్లి యె ట్లున్నదో నీకు తెలియునా?"

"తెలియదు స్వామీ."

"ఇంటినుండి నీవు బయలుదేరిన తర్వాత నీతల్లి మరణించి నీమీది ప్రీతిచేత నక్కయై పుట్టి, నీవు చనిపోవుదు వనుభయముచేత నీత్రోవ అడ్డగించినది. నీ వామెను బెదరించి పారద్రోలినావు. పాలపిట్ట నీకు వైరి. నిన్ను చంపి ధనము లాగుకొమ్మని మాతో జెప్పినది మూర్ఖత వలన నీవు మేలుకోరు తల్లిని అహితచింతకురాలిగాను, అనర్థమును కోరు పక్షిని హితచింతకునిగాను భావించితివి. నీతల్లి మిక్కిలి గుణవం తురాలు. కార్షాపణములు తీసికొని నీవు వెడలిపొమ్ము."

శాస్త ఈవిషయమును సూచించు గాథలు పలికినాడు:

కాననంబున దిరుగు సృగాలము గని
అశుభముగ నెంచి బాలకు లాకసమున
చిరతపిట్టను గనుగొని క్షేమ మనుచు
నెంచుభాతిని, లోకాన హితవరులను
ఎంచుచుందురు కొంద రహితులరీతి;

పొగడువారల, భీతిని పురికొలిపెడి
వారలను మిత్రులవిధాన వక్రరీతి
నెంచి, బాలురవలెనె వర్తించుచుంద్రు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున చోరనాయకు-డను నేనే.

## 280 పుటదూసక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు దొన్నెలు పాడుచేయువానిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొక అమాత్యుడు బుద్ధభగవానుని నాయకత్వమున నున్న సంఘమును ఆహ్వానించి ఆరామమున కూర్చుండబెట్టి, దాన మిచ్చి, భోజనానంతరము "ఉద్యానవనమున విహరింపదలచిన వారు విహరింపవచ్చును" అని విన్నవించెను. భిక్షువులు ఆరామములో విహరింపసాగిరి. ఆసమయమున తోటమాలి ఆకులు చిక్కగా నున్న వృక్షముపై కెక్కి పెద్దపెద్దపర్ణములతో దొన్నెలుచేసి, క్రిందికి జారవిడుచుచుండెను. ఇవి ఫలములకొరకు, ఇవి పుష్పములకొరకు ఉపయోగింపవచ్చును, అని ఆతని యూహ. అతనికొమరుడు కిందపడిన దొన్నెలను చింపివేయుచుండెను. భిక్షువులు ఈవిషయము శాస్తకు విన్నవించిరి. "భిక్షువులారా, ఇతడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ దొన్నెలు నష్టపరచుచుండెడివాడు" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు వారాణసిలో నెవరింటనో పుట్టెను. అతడు పెద్దవాడయి యింటనుండి యొకనాడు ఆరామములోనికి బోయెను. అచ్చట వానరము లనేకము లుండెను. ఉక్తప్రకారముగా తోటమాలి పూల-

పెజ్జలు పడవేయుచుండెను. పడుచున్న పూలబుట్టలను వానరజ్యేష్ఠుడు నష్టపరచుచుండెను. బోధిసత్త్వుడు కోతిని బిలిచి "తోటమాలి పడ వేయు బుట్టలను నీవు నాశము చేయుచు, దానివలన మంచి చేయ దలచుచున్నావు అని తోచుచున్నది" అని ఈగాథ పలికెను :

నిజముగా దోన్నెల నిర్మాణమందు
మృగరాజు నిపుణుడే; అగు గాని, పాడు
చేసెన, క్రొత్తవి చేయించు నేమొ.

అది విని వానర మీగాథ పలికెను :

నాతల్లి యైనను నాతండ్రి యైన
నిర్మాణకార్యాన నేర్పరుల్ కారు,
కుశలురు నాశాన : కులధర్మ మిదియె !

విని బోధిసత్త్వుడు ఈగాథ చెప్పెను :

ధర్మమా యిద్ది ! అధర్మ మె ట్లుండును?
ధర్మేతరంబును ధర్మముంగూడ
కనగొన కుందుము గాక యెన్నండు !

ఇట్లు చెప్పి వానరము నిందించి వెడలిపోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వానరము కుమారుడు, పండితుడు నేనే.

# 281 అబ్భంతర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు బింబాదేవికి ఆమ్రఫలరసము ఇచ్చుటను గూర్చి చెప్పినది

## వర్తమాన కథ

సంమ్యక్సంబుద్ధుడు శ్రేష్ఠధర్మచక్రప్రవర్తనము ప్రారంభించిన పిదప వైశాలీనగరములో కూటాగారశాలలో విహారము చేయుచుండగా

అయిదువందలమంది శాక్యస్త్రీలతో మహాప్రజాపతి గౌతమి ప్రవ్రజ్యకై బుద్ధుని వేడి ప్రవ్రజ్యయు, ఉపసంపదయు పొందినది. అనంతర మామె అయిదువందలమంది భిక్షుణులతో నందకోవాదసూత్రము ఆకర్ణించి అర్హత్వము పొందినది. శాస్త శ్రావస్తిప్రాంతమున విహరించుకాలమున రాహులమాత తనలో "నాస్వామి ప్రవ్రజించి సర్వజ్ఞుడైనాడు. కుమారుడుకూడ ప్రవ్రజించి ఆయనసన్నిధిలోనే యున్నాడు. నేనుకూడ ప్రవ్రజించి, శ్రావస్తి చేరి, సంమ్యక్సంబుద్ధుని, పుత్రుని నిరంతరము చూచుచుందును" అని భావించి, భిక్షుణుల ఆశ్రమమునకు జని ఆచార్య–ఉపాధ్యాయులతో శ్రావస్తికి జని శాస్తను, ప్రియపుత్రుని చూచుచు ఒకానొక భిక్షుణి ఆశ్రయమున నివసింపజొచ్చెను. రాహులుడు అచటికివచ్చి, తల్లిని దర్శించుచుండువాడు.

ఒకనాడు స్థవిరకు కడు పుబ్బరించెను. కుమారుడు చూచి వెడలి పోయిన తరువాత తానాతనికడకు చనలేకపోయెను ఆమె రోగగ్రస్తురాలయ్యెనని అన్యులతనితో చెప్పిరి. ఆతడు తల్లికడకు పోయి "నీ కేమి కావలయును?" అని ప్రశ్నించెను. ఇంట నున్నపుడు పూర్వము నాకు పొట్ట ఉబ్బరించినప్పుడు చక్కెరకలిపిన మామిడిపండ్ల రసము త్రాగిన వెంటనే బాధ తొలగిపోయెడిది. కాని ఇప్పుడు భిక్షాటనము చేసి జీవించుచున్నాను. పండ్లరసము నాకెచట లభించును?" అన్నది.

"దొరకినచో తెత్తును" అని ఆతడు వెడలిపోయెను.

అతనికి ఉపాధ్యాయుడు మొదలుకొని సమ్యక్సంబుద్ధునివరకు అందరు ఆత్మీయులైనను, ఆచార్యునికడకే పోయి ప్రణామము చేసి, ఆలోచనాపరునివలె నిలిచి యుండెను.

అతనిని చూచి స్థవిరుడు "రాహులా, ఏమో యోచించుచున్నట్లున్నావు?" అనెను.

"భన్తే, నాతల్లిగారి కడుపులో నొప్పిగా నున్నది."

"ఏమి కావలయును?"

"చక్కెర కలిపిన ఆమ్రరసము దొరకిన పరిస్థితి బాగుపడును."

"సరి, విచారింపకుము. లభ్యమగును."

వారు మరునాడు శ్రావస్తికి వెళ్ళిరి. శ్రమణుని ఆసనశాలలో

గూర్చుండబెట్టి ఆచార్యుడు రాజద్వారము చేరెను. కోసలనరేశుడు భిక్షువును కూరుచుండబెట్టి, ఉద్యానపాలకుని ద్వారా పండిన మామిడి ఫలముల తెప్పించెను. రాజు పండ్లరసము స్వయముగా తీసి చక్కెర కలిపి పాత్రలోనింపి స్థవిరునిచేతి కిచ్చెను. రాజగృహమునుండి వెడలి ఆసనశాలకు జని శ్రమణునికి ఇచ్చి "తీసికొని వెళ్ళి తల్లిగారికి ఇమ్ము" అని చెప్పెను. అతడు అట్లే చేయగా ఆమె బాధ శమించెను. రాజు పరిజనులను 'స్థవిరుడు ఆమ్రరసము ఎవరికి పంపెనో దెలిసికొనిర' మ్మని పంపెను. పరిజనులు విషయము తెలిసికొని రాజుకు విన్నవించిరి. రాజు ఇట్లు చింతించెను. "శాస్త ఇంటనే యున్న పక్షమున చక్రవర్తి అయ్యెడివాడు. రాహులుడు జ్యేష్ఠపుత్రుడు; స్థవిర ఆయన స్త్రీరత్నము! సమస్తప్రపంచమునకు అధిపతులు వీ రగుదురు. మే మందరము ఈయన కొలువున ఉండెడివారము. ఇప్పుడు అట్టివాడు ప్రవ్రజించి మాయాశ్రయమున నున్నాడు. కావున వీరివిషయమై అశ్రద్ధయుండుట నాకు తగదు"... ఇట్లు తలపోసి రాజు విడువకుండ ఆమ్రఫలరసము అనుదినము పంపుచుండెను. ఈవిషయము భిక్షుసంఘమునకు తెలిసిపోయెను. ఒకనాడు ధర్మసభలో వా రీవిషయము ప్రస్తావించుచుండగా శాస్త అచటికె చని సంగతి తెలిసికొని "భిక్షువులారా, సారిపుత్రుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ రాహులమాతకు ఆమ్రఫలరసము తృప్తి తీర ఇచ్చెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీగ్రామములో బ్రాహ్మణకులమున పుట్టి, పెరిగి, పెద్దవాడయి, తక్షశిలలో విద్యలు నేర్చి, గృహస్థయి, తల్లిదండ్రులు మరణించిన పిదప వానప్రస్థయి, హిమాలయమున నివసించి, అభిజ్ఞలను సమాపత్తులను పొందెను. ఋషిమండలమున కాయన ప్రముఖుడయి, చిరకాలమునకు ఉప్పుపులుసుకొరకు పర్వతము దిగి, దేశాటనచేయుచు వారాణసి చేరి, ఉద్యానములో ప్రవేశించెను.

ఋషిగణసదాచారప్రభావముచే ఇంద్రభవనము కంపింపసాగెను. ధ్యానబలమున శక్రుడు దానికి కారణము గ్రహించి "ఈతాపసులను

ఉద్యానవనమునుండి లాగివేయింప యత్నించెదను. నిలువ నీడ లేన పుడు వీరు శ్రమములకు పాల్పడి, పర్యటనము చేయుచుందురు. అప్పుడు వీరికి చిత్తైకాగ్రత యుండనేరదు. దాన నాపీడ తొలగిపోవును'' అని యోచించి అపాయ మేమి యనుకొనుచుండగా ఉపాయము తోచెను. అర్ధరాత్రమున రాజశయనాగారమున ప్రవేశించి రాజుకు రాణికిని వినబడునట్లు ఆకాశమునుండి "భద్రే, అభ్యంతరమైన ఆమ్రఫలములను భుజించినచో నీకు పుత్రుడు జన్మించును. అతడు చక్రవర్తి యగును అని పలుకుదును. రాజు లేచి వాక్కులు విని, ఉద్యానమునకు ఆమ్ర ఫలముకొరకు పరిచారకులను పంపును. మామిడిపండ్లు అంతర్ధాన మగు నట్లు చేయుదును. తోటలో పండ్లు లే వని చెప్పింతును. ఫలములు ఎవరు తినుచున్నారో కనుగొమ్మని రాజు చెప్పినపుడు తాపసులు తినివేయుచున్నా రని చెప్పింతును. రాజు వారిని వెడలగొట్టివేయించును. ఈవిధముగా వారికి శ్రమ వాటిల్లును.''

ఇట్లు భావించి శక్రుడు అర్ధరాత్రముతరువాత రాజశయనాగారము ప్రవేశించి, ఆకాశమున నిలిచి, తా నింద్రుడ నని తెలియపరచి, ఈ గాధలు పలికెను:

అభ్యంతరం బను అవనీజఫలము:
గర్భంబుతో నున్నకాంత భక్షించు
చో చక్రవర్తి యౌసూనుని కనును.
పట్టంపుదేవివి, పతి కిష్టురాల
వగుటచే భూపు డభ్యంతరఫలము
తెప్పింపగలడు భద్రే, నిశ్చయముగ.

ఈవిధముగా శక్రుడు గాధలు పలికి దేవితో జాగరూకురాల వయి యుండుము. ఆలసింపవలదు. రేపే రాజుకు తెలుపుము అని ఆనతిచ్చి, నిజనివాసమునకు జనెను. మరునాడు దేవి రోగగ్రస్తురాలివిధాన మవ లంబించి, పరిచారికలకు సంజ్ఞ చేసి పండుకొనెను. మేడపైన శ్వేతచ్ఛత్రముక్రింద సింహాసనమున గూరుచుండి రాజు నాటకము చూచుచు, దేవి రాకుండుట గమనించి 'దేవి యెక్కడ?' అని ప్రశ్నచేసెను.

'దేవికి జబ్బుగా నున్నది.' రాజు లేచి, దేవికడకు బోయి కూరు చుండి, ఆమెవీపు నిమురుచు 'భద్రే, ఏమి బాధ?' అని యడిగెను.

'మహారాజా, ఏమి బాధయు లేదు. ఒకకోరిక కలిగినది'.

'దేవీ, ఏమి కావలెను?'

'దేవ, అభ్యంతరఫలము.' 'ఇది యెచ్చట లభించును.'

'దేవా, నాకు తెలియదు. కాని, అది దొరకినచో జీవింతును, దొరకనిచో జీవింపను!' 'విచారింపవద్దు. తెప్పింతును' అని రాజు దేవి నూరడించి. లేచి వెడలి, సింహాసనమున గూర్చుండి, అమాత్యులను పిలువనంపి, 'దేవికి అభ్యంతరామ్రఫలము పై కోరిక పుట్టినది. ఏమి చేయవలెను?' అని ప్రశ్నించెను.

'దేవా, ఆమ్రములనడుమ నున్న అమ్రము అభ్యంతరామ్రము. ఉద్యానములోనికి పరిచారకులను బంపి రెండామ్రముల నడుమ నున్న ఫలమును వెదకించి దేవికి సమర్పింతుము.' 'మంచిది. ఇట్టి సహకార ఫలమును కొనిరండు' అని రాజు ఆదేశించెను.

శక్రుడు నిజప్రభావమున ఉద్యానమున మామిడిపండ్లను అంతర్థానము చేయించెను. పండ్లకోసము చన్న జనులు ఉద్యాన మంతటను తిరిగినను ఒక్క పండుకూడ కనబడకపోవుటచే రాజుకడకు మరలిపోయి 'దేవా, ఉద్యానమున మామిడిపండు లేదు' అని విన్నవించిరి. 'ఆమ్రము లెవరు తినుచున్నారు?' 'దేవా, తాపసులు.' 'తపస్వులను ఉద్యానమునుండి వెడలగొట్టుడు.' చిత్తమని వారు తాపసులను వెడలనడచిరి.

శక్రుని యుద్దేశము నెరవేరెను. దేవి ఆమ్రఫలముకొరకు పట్టుపట్టి యుండెను.

ఏమియును తోచక రాజు అమాత్యులను, బ్రాహ్మణులను సమావేశపరచి అభ్యంతరామ్రమునుగూర్చి మీకు తెలియునా?' అని యడిగెను.

'దేవా, పరంపరయా విన్నాము. అభ్యంతరామ్రఫలము దేవతలకు భోగ్యమైనది. అది హిమాలయమున కాంచనగుహలో దొరకును.

"దాని నెవరు తేగలరు?"

"అక్కడకు మానవుడు పోనేరడు. శుకపోతమును పంపవలెను."

పెద్దశరీరము కల శుకపోతము రాజకులమున నుండెను. శక్తివంతమైన

దానికి బిడ్డ లున్నారు, ఇది ఉపాయమున నేర్పరి. రాజు, దానిని తెప్పించి "బాబా, నీకు చాల మేలు చేయుదును. నీవు బంగారుపంజరమున నుందువు. బంగరుస్థాలినుండి తేనె, పేలాలు తిందువు. శర్కరోదకము త్రాగుదువు నీవు మాపని నొకదానిని నెరవేర్పవలెను" అని చెప్పెను.

"దేవా, సెల విండు"

"బాబా, దేవికి అభ్యంతరామ్రఫలముమీద కోరిక కలిగినది. అది హిమాలయమున కాంచనగుహాలో లభించును. అది దేవతాభోగ్య మైనది. మానవు డెవడును అచ్చటికి బోవలేడు. నీవే అచటికి బోయి ఫలము తేవలెను"

"చిత్తము దేవా, తెచ్చెదను."

రాజు బంగరుస్థాలినుండి శుకపోతమునకు పాయసము పెట్టించి, పంచదారపానకము త్రావించి, నూరురకముల నూనెలు కాచిన తైలము దాని రెక్కలనడుమ పూయించి, రెండుచేతులతో నెత్తుకొని కిటికీకడ నిలిచి, ఆకసమున కెగురవేసెను. శుకపోతము రాజుకు వినమ్రమై గగనమున కెగిరి మానవమార్గమునుండి అదృశ్యమయి, హిమాలయము చేరెను. ప్రధమపంక్తిలో నున్న చిలుకలకడ కరిగి, ఫలమునుకూర్చి అడిగి, 'నా కాచోటు తెలుపుడు' అని పలికెను.

"మాకు తెలియదు. ద్వితీయపంక్తిలోని శుకములకు తెలియ వచ్చును" అని అవి చెప్పగా, శుకపోతము ద్వితీయశ్రేణికి, క్రమముగా తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ శ్రేణులలోనికి బోయెను. అచ్చటి నుండి సప్తమశ్రేణికి బోయి అడుగగా చిలుకలు "ఫలాని ప్రదేశమున కాంచనపర్వతగుహాలో లభించును" అని చెప్పినవి.

'ఆఫలముకొరకే వచ్చినాను. నన్ను కొనిపోయి ఆఫల మిప్పింపుడు.'

'అవి వైశ్రవణమహారాజుగారికి భోగ్యమైనవి. అచటి కెవరును రాకపోకలు చేయలేరు. అన్నివృక్షములకును మూలమునుండి పైవర కును ఏడు చుట్లు యినుపజాలములు చుట్టియున్నవి. రాక్షసు లనేకులు వానిని రక్షించుచున్నారు. వారి కంటబడినచో బ్రదుకుట వట్టిది. అవి కల్పారంభపు నిప్పువలె, అవీచిమహానరకమువలె ఉండుచోటు. అచటికి బోవుకోరిక విడిచిపెట్టు."

"మీరు రానిపక్షమున అచటికి బోవు మార్గము తెలుపుడు."

'ఫలాని ఫలాని త్రోవన పొమ్ము.'

అవి చెప్పినచొప్పున శుకపోతము అచటికి జేరి పగటివేళ గుప్తముగా నుండి, అర్ధరాత్రమున రాక్షసులు నిద్రించువేళ అభ్యంతరామ్రముకడకు బోయి, ఒక వేరుసందుగా మెల్ల మెల్లన పై కెక్కసాగెను. లోహజాలము కిలకిల మని ధ్వని చేసెను. రాక్షసులు నిద్ర లేచి శుకపోతమును చూచి, పట్టుకొని, ఇది మామిడిదొంగ దీని కేమి శిక్ష విధింపవలెను' అని యోచించిరి. ఒకడు 'దీనిని బొర్లపడవేసి పెడలనఱతిము' అనెను. రెండవవాడు 'చేతితో నలిపివేసి, పొడి పెద జల్లుదము' అన్నాడు. మూడవవాడు 'రెండుముక్కలు చేసి, బొగ్గుల మీద కాల్చి తిందము' అన్నాడు.

శుకపోతము వారి దండవిధానము వినియును భయపడక, 'రాక్షసులారా, మీరు ఎవరివారలు?' అని యడిగెను. 'వైశ్రవణమహారాజుగారిసేవకులము.' 'మీరు ఒకరాజుగారి భృత్యులు. నేనుకూడ ఒక రాజుభృత్యుడను, వారాణసిరాజు అభ్యంతరామ్రము తెమ్మని నన్ను పంపినాడు. నా ప్రభువుకొరకు ప్రాణములు త్యజించి వచ్చినాను. తమ తల్లులకోసము తండ్రులకోసము, ప్రభువులకోసము ప్రాణత్యాగము చేయువారు దేవలోకమున జన్మింతురు. ఈజంతుశరీరమునుండి ముక్తి పొంది, దేవలోకమున జన్మింతును" అని ఈగాధ పలికెను;

> స్వామికై యత్నంబు సలిపెడివాడు
> శూరు, డాత్మత్యాగి చొచ్చెడి తావు
> శీఘ్రముగా నేను చేరుకోగలను.

శుకపోత మీగాధద్వారా చేసిన యుపదేశము విని రాక్షసులు తమలో 'ఇతడు ధార్మికుడు, ఇతనిని చంపలేము, విడిచిపెట్టుదము' అని తలపోసి 'శుకపోతమా, నీవు మాచేతులనుండి విముక్తుడ వయినావు. సుఖముగా పొమ్ము' అని వారు చెప్పిరి. 'నా రాక వ్యర్థము చేయ వద్దు. ఒక్కపండు ఇప్పింపుడు.' 'నీకు ఒక్కఫల మిచ్చుటకై నను మా కధికారము లేదు. ఈవృక్షఫలములమీద అంకములు వేసి యున్నవి. ఒక్కటి లోపించినను మా ప్రాణములు దక్కవు. కుబేరుడు కోపించి ఒక్కసారి చూచినచో వేడిపప్పువలె తిలలవలె నూరుకుంభాల

ముక్కవలె నైన పోదుము. కావున ఫల మీయ జాలము; లభించు చోటు తెలుపగలము.'

"ఏదయినను సరే. నాకు మాత్రము ఫలము కావలెను. లభించు చోటు తెలుపుడు."

"ఈ కాంచనపర్వతములోపల జోతిరసనాము డగు తపస్వి అగ్నిలో హోమము చేయుచు కంచన-పత్తి అను పర్ణశాలలో నుండును. ఆయ నకు వైశ్రవణునకు ఆంతర్య మున్నది. నియమప్రకారము వైశ్రవణుడు ఆయనకు నాలుగుపండ్లు పంపుచుండును. ఆయనకడకు పొమ్ము."

మంచి దని శుకము తాపసికడకు బోయి, ప్రణామము చేసి, ఒక ప్రక్క గూరుచుండెను. 'ఎక్కడనుండి వచ్చినావు?' అని తాపసి అడిగెను. 'వారాణసీప్రభువుకడనుండి.' 'ఏల వచ్చినావు?' 'స్వామీ, మారాణిగారికి అభ్యంతరామ్రఫలము భుజింపవలె ననుకోరిక కలిగినది. అందులకై వచ్చితిని. రాక్షసులు స్వయముగా నాకు పండినపండు ఈయజాలక, తమసన్నిధికి పంపినారు.'

'అయినచో కూరుచుండుము. ఫలము లభించును.'

వైశ్రణు డాయనకు నాలుగుపండ్లు పంపినాడు. అందు రెండుపండ్లు తాపసి తిన్నాడు. ఒకటి శుకపోతమును తిను మన్నాడు. ఒకటి సంచిలో వేసి శుకము మెడకు కట్టి, ఇక పొమ్ము అని సెల విచ్చినాడు.

ఆఫలమును కొనిపోయి శుకపోతము దేవి కిచ్చెను. ఫలము భుజించినపిదప ఆమెకోరిక శాంతించెను. అందుచే ఆమెకు పుత్రుడు మాత్రము పుట్టలేదు.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున దేవి రాహులమాత; చిలుక ఆనందుడు; ఫలములు ఇచ్చు తాపసి సారిపుత్రుడు; ఉద్యానవనవాసి యగు తపస్వి నేనే.

# 282 సేయ్యో జాతకము

శాస్త జేతవనమున విహరించుచు కోసలనరేశుని అమాత్యులతో నొకనిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అమాత్యు డొకడు అన్నికార్యములు నిర్వహించుచు రాజున కుప చరించెడివాడు. రాజు ఆతని తనఉపకారిగా భావించి చాలసంపద సమకూర్చినాడు. ఈర్ష్యాపరవశులైన అన్యులు దీనిని సహింపలేక చాడీలు చెప్పి రాజుమనసు విరిచిరి. రాజు వారిమాటలు నమ్మి విచా రింపక ఆఉద్యోగి చేతులకు బేడీలు వేయించి బంధనమున త్రోయిం చెను. అచట నతడు ఒంటరిగా నున్నకారణముచే చిత్తైకాగ్రత పొంది సంస్కారములనుగూర్చి యోచనచేసి శ్రోతాపత్తిఫలము పొందెను. అనంతరము రాజు ఆతడు నిర్దోషి యని తెలిసికొని విడి పించి, వెనుకటికన్న నధికధనము ఇచ్చెను. ఆయుద్యోగి శాస్తకు ప్రణామము చేయు కోరికతో విశేషసుగంధమాల్యానులేపములు తీసి కొని విహారమునకు పోయెను. అచట శాస్తకు పూజాప్రణామములు చేసి, ఒకవైపున గూరుచుండెను. శాస్త కుశలప్రశ్నాదికానంతరము "వింటిని. నీవు చాలకష్టమున పడితి వని వింటిని" అనెను.

"భన్తే, చిత్తము కాని అనర్థమువలన అర్థము లభించినది. కారా గారముననుండి శ్రోతాపత్తిఫలము పొందితిని."

"ఉపాసకా, నీ వొకడవే అనర్థమునుండి ఫలము పొందలేదు. పూర్వము పండితులుకూడ ఫలము పొందినారు" అని వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండ బోధిసత్త్వు డాయన పట్టపుదేవికడుపున బుట్టి, పెద్దవా డయి, తక్షశిలకు జని విద్యలు నేర్చెను. తండ్రియనంతరము రా జయి దశ, రాజధర్మములు నుల్లంఘింపక, దానధర్మములు చేయుచు, శీలము

రక్షించుచు, ఉపవాసము చేయుచుండెను. ఒకానొక యమాత్యు డంతఃపురమున అకార్యము చేసెనని పరిచారకులకు తెలిసినమీదట వారు రాజుకు తెలిపిరి. విచారణ చేసి రాజు వానితో 'నేటినుండి నా కొలువున నుండవలదు' అని వెడలనంపెను. వాడు పోయి ఒకానొక సామంతరాజుకొలువులో జేరెను. తక్కిన దంతయు మహాశీలవజాతకమున (51) జరిగినట్లే జరిగెను.

సామంతరాజు వానిని మూడుమారులు పరీక్షించి, వానిమాట నమ్మి వారాణసీరాజ్యమును గ్రహింప నిచ్ఛగించెను. మహాసైన్యముతో బయలుదేరి సరిహద్దు చేరెను. వారాణసీరాజుకడ నున్న 500 యోధులు ఈవార్త విని 'దేవా, ఆసామంతుడు మనరాజ్యమును హరించుకోరికతో జనపదములను కొల్లగొట్టుచు వచ్చుచున్నాడు. మనము పోయి అతని నచ్చటనే పట్టుకొందము' అని విన్నవించిరి.

'పరపీడనమువలన ప్రాప్తించు రాజ్యముతో నా కవసరము లేదు. మీ రేమియు చేయవలదు.'

చోరరాజు వచ్చి నగరము చుట్టుముట్టెను. 'దేవా, అతనిని పట్టుకొందమా?' అని మంత్రు లడిగిరి. 'ఏమి చేయుటకును ఆజ్ఞ లేదు. నగరద్వారములు తెరువుడు' అని రాజు అమాత్యులతోగూడి పెద్దయంతస్తుమీద సింహాసనముపై గూరుచుండెను. చోరరాజు నాలుగు ద్వారములకడ తనవారిని నిలిపి నగరములో తాను ప్రవేశించి ప్రాసాదముమీదికి బోయి, అమాత్యులతోగూడ రాజును పట్టించి సంకెళ్ళు వేయించి, కారాగారమున బడద్రోయించెను.

రాజు బంధనాగారములో జేరగానే చోరరాజునెడ మైత్రిని భావింపగా మైత్రీధ్యానము లభించెను. ఆయన మైత్రీప్రతాపముచే చోరరాజుశరీరమున మంటలు పుట్టెను. ఒడలంతయు రెండుకాగడాలతో కాల్చినట్లు అయ్యెను. అతడు మహావ్యథ చెందుచు 'దీనికి కారణ మేమి?' అని ప్రక్కవారి నడిగెను.

'సదాచారు డగురాజును మీరు బంధనాగారమున బడవేయించినారు. కావున ఈశ్రమ కలిగియుండును.' చోరరాజు పోయి బోధిసత్త్వుని క్షమింప వేడి, రాజ్య మాయనకు మరలనిచ్చి, 'మీరాజ్యము

మీాకే యుండవలెను. శత్రువులు మి మ్మాక్రమించినచో బాధ్యత నాయది' అని దుష్టామాత్యునకు శిక్ష చెప్పి, నిజరాజధానికి మరలి పోయెను.

బోధిసత్త్వుడు అలంకృతమైన అంతస్తులో శ్వేతచ్ఛత్రముక్రింద సింహాసనముపై గూరుచుండి, యోగ్యాసనాసీనులైన అమాత్యులతో ఇష్టాగోష్ఠి చేయుచు, ఈగాథలను పలికెను:

శ్రేష్ఠకార్యములను చేసెడివారికి
మేలు కలుగు, నొకని మేళనమున
మున్ను నేను బంధమోక్షమ్ము గూర్చితి
బద్ధులైన జనులు పదిపదులకు.

కాన వినుడు సర్వకాశీనివాసులు!
ఒంటివాడె యైన నుర్విలోని
సర్వజనులయెడల సలుప మైత్రీభావ
నమ్ము, చావుపిదప నాక మొందు.

ఈవిధముగా బోధిసత్త్వుడు మైత్రీభావనాలాభమును జనసమూహమునకు జూపి పంౘ్రెండు యోజనముల విస్తీర్ణము కల వారాణసీనగరమును విడిచి, హిమాలయము ప్రవేశించి, ప్రవ్రజించెను.

శాస్త సమ్యక్సంబుద్ధు డయినపిమ్మట ఈగాథ పలికెను:

ఈరీతి కలసుందు వారాణశీశు
డాడుచు పలుకుల నావల నుంచి
చాపతూణీరముల్, సంయమమార్గ
మందు శీఘ్రమ్ముగా నారూఢు డయ్యె.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున చోరరాజు ఆనందుడు; వారాణసిరాజు నేనే.

## 283 వడ్ఢకి సూకర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ధనుగ్గహతిస్స స్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ప్రసేనజిత్తు తండ్రి మహాకోసలప్రభువు తనపుత్రిక యగు కోసల దేవిని బింబిసారనృపాలున కిచ్చి పెండ్లిచేసినపుడు, స్నానవ్యయార్థము కాశీగ్రామ మిచ్చెను. దానిపై సంవత్సరమునకు ఒకలక్షరూపాయిలు ఆదాయము వచ్చును. అజాతశత్రువు తండ్రిని సంహరించినపిదప, కోసల దేవికూడ శోకాభిభూతయై మరణించెను. ప్రసేనజిత్తు ఇట్లు తల పోసెను "అజాతశత్రువు తండ్రిని చంపినాడు. మాసోదరి భర్త్రమరణమునకు దుఃఖించి మృతినొందినది. పితృఘాతి యగు నీదోపిడిగానికి కాశీగ్రామము నుండనీయను." ఇట్లు తలపోసి అతడు అజాతశత్రువునకు కాశీగ్రామ మీయలేదు. ఇది హేతువుగా వా రిరువురకు అప్పుడప్పుడు యుద్ధములు జరుగుచుండెడివి. అజాతశత్రువు యువకుడు, సమర్థుడు; ప్రసేనజిత్తు వృద్ధుడు, మాటిమాటికి పరాజితు డగుచుండెను.

"మనము తరచుగా ఓడిపోవుటకు కారణమేమి?" అని రాజు అమాత్యుల నడిగెను, "దేవా! ఆర్యభిక్షువు ఆలోచనలో గొప్ప వాడు. జేతవనవిహారములో భిక్షువుల సంభాషణ వినవలయును."

రాజు వెంటనే చారులతో "మీరు అప్పు డప్పుడు వారిసంభాషణ వినుచుండ వలయును" అని చెప్పెను. నాటినుండి వా రట్లే చేయ సాగిరి.

ఒకనాడు వృద్ధస్థవిరు లిరువురు విహారసీమలో పర్ణశాలలో గూర్చుండి యుండిరి. వారిలో ధనుగ్గహతిస్స స్థవిరుడు రాత్రితొలి భాగమున, మధ్యమభాగమున నిదురించి, తుదిజామున లేచి, కట్టెలు విరిచి నిప్పుచేయుచు కూర్చుండి యిట్లనెను.

"భన్తే, ఉత్తరస్థవిరా!"

"ఏమి, తిస్స స్థవిరా?"

"ఏమి, మీరు నిదురించుచున్నారా?"

"పండుకొననియెడల ఏమి చేయుదము?"

"లేచి కూర్చుందము."

అతడు లేచి కూర్చుండెను. అతడు ఉత్తర స్థవిరునితో

"భన్తే, మహాలోభి, తిండిపోతు, మీకోసలనరేశుడు గిన్నెడు అన్నముకూడ తిన్నగా పెట్టడు. యుద్ధమునడపుట ఎంతమాత్రము నెరుగడు. పరాజితుడ నయితి' నని ఎప్పుడును ఆక్రోశించుచుండును."

"అట్లయిన ఏమి చేయవలయును ?"

ఆసమయమున చారులు వారి చాటున నిలిచి వారిసంభాషణ వినుచుండిరి.

ధనుగ్గహతిస్స స్థవిరుడు యుద్ధమునుగూర్చి తన అభిప్రాయము తెలిపెను.

"భన్తే, యుద్ధమున మూడురకములు వ్యూహము లున్నవి. పద్మవ్యూహము, చక్రవ్యూహము, శకటవ్యూహము. అజాతశత్రువును పట్టుకోదలచిన పక్షమున ఫలాన పర్వతము నడుమ, రెండుపర్వతముల మరుగున మనుష్యులను గూఢముగా నుంచి, తొలుత దుర్బలసైన్యమును చూపవలయును. పిదప శత్రువు పర్వతముల నడుమ చేరగానే ముందు వెనుకల రెండు మార్గములు బంధింపవలయును. పిదప ముందు వెనుకల రెండు పర్వతములలో నున్నస్థానములనుండి దుమికి కోలాహలము చేయుచు శత్రువులను చుట్టుముట్టవలయును. వలలోని చేపల వలెను, పిడికిలిలోని కప్పరీతిని బంధింపవలయును. ఈప్రకారమున వారిని పట్టగలుగుదురు."

చారులీసంగతి రాజుకు విన్నవించిరి. ఇది విని రాజు సంగ్రామదుందుభి మ్రోయించి, శకటవ్యూహము పన్ని అజాతశత్రువును గెలిచి, పట్టుకొని తీసికొనివచ్చెను. తనపుత్రిక వజ్రకుమారి నిచ్చి, పెండ్లిచేసి కాశీగ్రామము స్థానమూలము క్రిందనిచ్చి పంపెను. ఈవిషయము భిక్షుసంఘమున వ్యాపించెను. ఒకనాడు భిక్షువులు ధర్మసభలో నీవిషయము ప్రస్తావించుచుండగా, శాస్త అచటి కరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, ధనుగ్గహతిస్సుడు ఇప్పుడే కాదు పూర్వముకూడ యుద్ధాలోచనలో ప్రవీణుడు" అని శాస్త పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుఁ డరణ్యములో వృక్షదేవత యయ్యెను. వారాణసికి సమీపములోని యొకగ్రామమున నున్న వడ్రంగి యొకనాడు అడవికి బోయి, గుంటలో పడియున్న వరాహశిశువును గాంచి, ఇంటికి దెచ్చి, పోషించుచుండెను. అది పెద్ద దయి, మహాబలసంపన్నమై వంకరటింకర దయి, సాధువుగా నుండెను. వర్ధకునిపోషణలో నుండుటచే దానికి వర్ధకసూకర మని పేరువచ్చెను. వడ్రంగి వృక్షములను ఛేదించునపుడు సూకరము వానిని ముట్టెతో దొరలించును. కత్తి, గొడ్డలి, బల్లెము, ఉలి, దుక్క మొదలగువానిని నోటకరచుకొని తెచ్చును. కొలచునప్పుడు నల్లదారపుకొనను నోటితో పట్టుకొని యుండును.

ఎవరైనను చంపి తిందురేమో యని భయముతో సూకరమును వడ్రంగి అడవిలో విడిచి వచ్చెను. అరణ్యములో క్షేమకరము, సుఖకరము అగు తావు వెదకుచు ఒకకొండమాటున పెద్దగుహను చూచి, ఆప్రాంతమున బాగుగా కందమూలములు లభించుటచే నివాసము చేయజొచ్చెను. దానిని చూచి వందలకొలది వరాహములు వచ్చి చేరెను. వరాహము వానితో 'నేను మీకొరకే వెదకుచున్నాను. మీ రిచ్చట కలిసినారు. ఇది రమణీయప్రదేశము' అని పలికెను. 'నిజముగా ఈచోటు రమణీయమే. కాని ఇచ్చట ఆపదకూడ కలదు.' 'మిమ్ములను జూచి నేను ఇట్లే తెలిసికొన్నాను. ఆహారమునకు ఇంత మంచి ప్రదేశ మున్నను మీశరీరమున మాంసము సరిగా లేదు. ఇక్కడి బాధ యేమి?' 'పులి యొకటి ఉదయమే వచ్చి కనబడినదానిని ఎత్తుకొని పోవుచుండును.' 'అప్పు డప్పు డెత్తుకొనిపోవునా? అనుదినము కొనిపోవుచుండునా?' 'అనుదినము.' 'పులు లెన్ని?' 'ఒకటే.' 'మీ రింద రున్నారు. ఒక్కదానినుండి తప్పించుకొనజాలరా?' 'మావలన కాదు.' 'నేను దానిని పట్టుకొందును. నేను చెప్పినట్టు మాత్రము మీరు చేయవలెను. పులి యెచట నుండును?' 'ఈపర్వతమున.'

వరాహము రాత్రి తక్కినవి తిండి తిన్నతరువాత యుద్ధనిర్వాహణము విషయమై యోచన చేయుచు, 'పద్మవ్యూహము, చక్రవ్యూ

హము, శకటవ్యూహము అని వ్యూహము మూడువిధములు' అని, పద్మవ్యూహమే నిశ్చయించెను. దాని కాప్రాంతభూమి అంతయు సుపరిచితము. యుద్ధయోజన చేయవలె నని, వానితల్లులను మధ్యమం దుంచెను. వానిచుట్టును వంధ్యవరాహములను, వానిచుట్టు వరాహ స్త్రీశిశువులను, వానిచుట్టును పులిశాబకములను, వానిచుట్టు పొడుగు గడ్డముల వరాహములను, వానిచుట్టును యుద్ధసమర్థములై బలిష్ఠము లైన యువవరాహములను పదులుగా ఇరువదులుగా గుమిగూర్చి యుంచెను. తాను నిలిచి యున్నతావునకు ముందు గుండ్రని గుంట త్రవ్వించెను. వెనుకనుండి యింటికప్పువలె క్రమక్రమముగా ఏట వాలుగా తేలు భూమిమీద అరువది డెబ్బది యోద్ధృవరాహములను అక్కడక్కడ నిలిపి, భయపడ వల దని బోధించి, నియోగించునప్పటికి అరుణోదయ మయ్యెను.

పులి లేచి, తరుణ మయిన దని తలచి, ముందరికి పోయి చూచు నప్పటికి తన కెదురుగా పర్వతతలమున నిలిచియున్న వరాహములు కానబడెను. పులివంక గుడ్లురిమి చూడు డని వరాహము తక్కిన వానికి సంజ్ఞ చేసెను. అవి సూచించినట్లు చేసెను. పులి మూతిముడిచి ఊపిరి విడిచెను. వరాహములును అట్లే చేసెను. పులి మూత్రము విడిచెను. అవియును మూత్రము విడిచెను. పులి చేసిన పనులు వరాహములుకూడ చేసెను. అప్పుడు పులి తనలో "ఇదివరలో సూకరములు నన్ను చూడగానే పరుగెత్తుటకు యత్నించియు పరుగెత్తలేకపోయెడివి. నేడు పరుగెత్తక పోగా ప్రతిస్పర్థులుగా నిలిచి, నేను చేసినట్లు చేయు చున్నవి. ఎత్తయినచోట వీని నాయకుడు నిలిచి యున్నాడు. నేను నేడు వెళ్ళినను జయించు నవకాశము లేదు" అని తలచి, ఆగి, నిజ నివాసస్థానమునకు మరలిపోయెను.

పులి చంపిన జంతువులమాంసము తిను కుటిలతాపసి వ్యాఘ్ర మూరక మరలివచ్చుట చూచి, దానితో సంభాషించుచు ఈగాథ పలికెను:

ఇక్కడనె సూకరమ్ముల నుక్కడంచి
మంచివానిని జంపి భుజించుచుంటి;

ఇప్పు డొకమూల గూర్చుండి యేదొ జపము
నొంటిగా జేసెదవు శక్తి యుడిగి నొక్క.

విని పులి ఈగాథ పలికెను :

బెదరున వరాహములు మున్ను చెదరిపోయి
సకలదిక్కుల బరుగిడి శ్వభ్రములను
చూచుకొనెడివి; ఇప్పు డొకచోట జేరి
నిలుచుచున్నవి ఘుర్ఘురనిస్స్వనమున:
నేను మర్దన మొనరింప లేను వాని.

జడలమానిసి దానిని ప్రోత్సహించుచు 'పొమ్ము. పెడబొబ్బ పెట్టి, లంఘించినచో జంతువులు ఉక్కిరిబిక్కిరి యయి పారిపోవును' అనెను. పులి ధైర్యము తెచ్చుకొనెను. వరాహము రెండుగుంటలకును నడుమ నిలిచియుండెను. 'స్వామీ, పెద్దదొంగ మరల వచ్చినాడు' అని సూకరము లన్నవి.

"భయము వలదు. ఇప్పుడే దానిని పట్టుకొందును."

వ్యాఘ్రము బొబ్బరింతపెట్టి, మహావరాహముపై దుమికెను. పులి తనమీద పడు క్షణమున శీఘ్రముగా పల్టీ కొట్టి, ఎదురుగా నున్న గుంటలో పడెను. పులి తన వేగమును ఆపుకొనజాలక చేటవలె నున్న యెగుదిగుడుగుంటలో పడి, చనిపోయెను. వరాహము గుంటలోనుండి లేచి, మెరపువలె పోయి పులితొడలో తనకోరలతో కొట్టి, నాభివరకును చీల్చివేసెను. ఆవల పంచవిధ మధురమాంసములను కోరలకు చుట్టి, వ్యాఘ్రము మస్తకమును ఛేదించి "ఇదిగో మీశత్రువు" అని కళేబరమును లేవనెత్తి గుంటపైకి నెట్టెను. తొలుత వచ్చిన సూకరములకు మాంసము లభించినది. తరువాత వచ్చిన వరాహములు పులి మాంస మెట్లుండునో యని దానిముఖము వాసన చూచినవి. అప్పటికిని వానికి సంతోషము కలుగ లేదు. వర్ధకవరాహము వానియాకార ప్రకారములు చూచి "ఏమి, ఇంకను సంతుష్టి కలుగలేదా?" అని ప్రశ్నించెను.

"ఈపులి నొకదానిని చంపిన లాభ మేమి వేరొక పదిపులులబృందమును తేగల కుటిలతపస్వి జీవించియున్నాడు."

"ఎవ రతడు?"

"దురాచారు డగు జడలవాడు."

"నేను పులినిగూడ వధించినాను. వానిశక్తి యెంత!" మహావరాహము వానిని వెంటబెట్టుకొని తాపసిని పట్టుటకై బయలుదేరెను.

వ్యాఘ్రము వచ్చుట కాలస్య మయినదని యెంచి ఒకవేళ సూకరములు వ్యాఘ్రమును పట్టుకొన్నవేమో యని భావించి, తాపసి వరాహములు వచ్చుచున్న వైపునకే వెడలెను. అవి కంటబడగానే తాపసి తనసామగ్రులను గొని పరుగెత్తసాగెను. వరాహములు వెంటబడగా నతడు సామగ్రులు విడిచిపెట్టి ప్రక్కనున్న మేడిచెట్టెక్కెను. మహావరాహముతో సూకరములు 'స్వామీ, ఓడిపోయినాము. తాపసి పరుగెత్తి వృక్షముమీది కెక్కినాడు' అని చెప్పినవి.

'ఏవృక్షము?'

'మేడిచెట్టు.'

ఆడుసూకరములు నీరు తేవలె ననియు, బాలసూకరములు చెట్టుచుట్టు నేల త్రవ్వవలె ననియు, గట్టికోరలు కల సూకరములు వ్రేళ్ళు నరకవలె ననియు మహావరాహ మాజ్ఞ యిచ్చెను.

మహావరాహము పెద్దవేరుమీద గొడ్డలితో కొట్టినట్లు తనకోరలతో కొట్టి, చెట్టును పడవైచెను. సూకరములు చుట్టుముట్టి, కుటిల తపస్విని నేలపై బడద్రోసి, ముక్కలు ముక్కలు చేసి, తిని, బొమికలు మాత్రము విడిచిపెట్టినవి; మహావరాహమును మేడిచెట్టు బోదెపై గూరుచుండబెట్టి, ఆతపస్విశంఖమును ఉదకముతో పూరించి, అభిషేకము చేసి, రాజును కావించినవి. ఒకతరుణీవరాహమునకు అభిషేకము చేసి పట్టపురాణిని చేసినవి.

నేటివరకును రాజును మేడిచెక్కపీటపై గూరుచుండబెట్టి, మూడు శంఖములనిండ నీరుపూరించి, అభిషేకము చేయుదురు.

ఆ వనభాగమున నివసించు వృక్షదేవత ఈ యద్భుతసంఘటనము చూచి, సూకరముల కెదురుగా కొండపై నిలిచి, ఈగాథ పలికెను:

సూకరసంఘమ్మున కివి
నా కైమోదుపులు, చూచినాను స్వయముగా
ఏకంబై సూకరములు
భీకరవ్యాఘ్రంబు నిటనె పీచమడంచెన్.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున ధనుగ్గహాతిస్స స్థవిరుడు పెద్ద సూకరము; వృక్ష దేవత నేనే.

## 284 సిరి జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక శ్రీ - చోర బ్రాహ్మణుని విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

ఇందలి వర్తమానకథ ఖదిరంగార జాతకములో వచ్చినది. ఇందు కూడ అనాథపిండికుని నాలుగవద్వారమున మిథ్యారూపిణియైన దేవి నివసించుచుండెను. ఆమె దండకర్మరూప మైన 54కోట్ల ద్రవ్యమును, కొట్లలో నింపి అనాథపిండకునియెడ మైత్రితో నుండెను. అతడు ఆ దేవిని శాస్త సన్నిధికి కొనిపోయెను. శాస్త ఆమెకు ధర్మోపదేశము చేసెను. విని ఆమె స్రోతాపన్న యయ్యెను. నాటినుండి శ్రేష్ఠికి పూర్వమువలెనే ధనము నిండుగా నుండెను.

శ్రావస్తి నివాసి యైన శ్రీలక్షణబ్రాహ్మణుడు తనలో "అనాథ పిండికశ్రేష్ఠి దరిద్రుడు కాబోయి, మరల కోటీశ్వరు డయినాడు. నేను ఆయన ఇంటనున్న శ్రీదేవతను హరింపవలెను" అని యోచించి శ్రేష్ఠి మందిరము చేరెను. శ్రేష్ఠి అతనిని సత్కరించి, కుశలప్రశ్నాది కము అడిగిన పిదప "ఏపనిమీాద వచ్చితిరి" అని ప్రశ్నించెను. శ్రీ ఎచట నున్న దని బ్రాహ్మణుడు వెదుక జొచ్చెను. శంఖమువలెను, సూర్యుని వలెను తెల్లనైన కోడి పంజరము నం దుండెను. దానిరెక్కలలో శ్రీ ప్రతిష్ఠిత మయి యుండెను. బ్రాహ్మణుడు చూచి అచట శ్రీ కలదని గ్రహించి "శ్రేష్ఠీ, నేను 500విద్యార్థులకు అధ్యాపనచేయుచున్నాను. వేళ పాళ లేకుండ కూసెడి కోడివలన, నాకును వారికిని ప్రేమ కలుగు చున్నది. ఈకోడి సకాలమున కూయుదానివలె నున్నది. నేను దీనికై వచ్చితిని. దీనిని నా కిమ్ము" అని పలికెను.

"బ్రాహ్మణోత్తమా, కుక్కుటమును తీసికొమ్ము. ఇచ్చెదను" అని శ్రేష్ఠి అనునప్పటికి శ్రీ కుక్కుటపక్షమునుండి లేచి, తలగడలోనున్న మణిలో చేరెను. బ్రాహ్మణుడు ఇదికూడ గమనించి మణిని ఇమ్మని కోరెను. మణి ఇమ్మని కోరగా చేతిబెత్తమున దూరెను. శ్రీ అందు చేరెనని గ్రహించి దానినిగూడ ఇమ్మనెను. తీసికొమ్మని శ్రేష్ఠి చెప్పు నప్పటికి శ్రీ శ్రేష్ఠి పట్టమహిషి యగు పుణ్యాలక్షణదేవి శిరస్సుమీదికి చేరెను. శ్రీని హరింపదలచిన బ్రాహ్మణుడు, శ్రీ ఆమె శిరస్సున ప్రతి ష్ఠితయయిన దనియు, దాని నిచ్చుటకు వీలులే దనియు అడుగరా దనియు తలపోసి 'మహాశ్రేష్ఠీ, నేను మీ యింట నున్న శ్రీని హరింప వచ్చితిని. నీశ్రీ నీయింటనే యుండునుగాక" అని ఆపీఠమునుండి లేచి వెడలిపోయెను.

ఈవిషయము అనాథపిండికుడు శాస్తకు విన్నవింపగోరి విహారము నకు పోయి శాస్తను పూజించి, వందనము చేసి, ఒకప్రక్కనకూర్చుండి విషయము సవిస్తరముగ విన్నవించెను. శాస్త సమస్తము విని– "గృహపతీ! ఒకరిశ్రీ మరియొకరికడకు పోవగోరదు. పూర్వకాలమున అల్పపుణ్యాత్ములకడనుండి శ్రీ విశేషపుణ్యవంతులకడకు చేరినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున బ్రాహ్మణవంశమున జన్మించి, పెరిగి పెద్దవాడయి, తక్షశిలలో విద్య లభ్యసించి, గృహస్థాయెను. తల్లి దండ్రులు మరణించిన వెనుక వైరాగ్యము కలుగగా గృహము విడిచి, హిమాలయమునకు బోయి వానప్రస్థవృత్తి నవలంబించి, సమాపత్తు లను పొందెను. బహుకాలము గడచిన పిదప చింతపండు ఉప్పుకొరకు జనపదములలో తిరిగి, తుదకు వారాణసీనరేశుని ఉద్యానవనమున నిలిచెను. మొదటినాడు భిక్షాటనము చేయుచు గజాచార్యుని యిల్లు చేరెను. ఆయన బోధిసత్త్వునిచర్యకు వ్యవహారమునకు, సంతసించి భిక్షచేసి ఉద్యానమున నిలిపెను.

ఆసమయమున కట్టెలు కొట్టువారు అడవినుండి సకాలమునకు

నగరమున ప్రవేశింపలేక, రాత్రి దేవాలయమున కట్టెలరాశి పేర్చి పండుకొనెను. వానికి దగ్గరలో నొకచెట్టుమీద చాల కోడిపుంజులు కలవు. వానిలో పైకొమ్మమీద పండుకొన్నకోడి క్రింది కొమ్మమీది కోడిమీద ప్రాతఃకాలమున రెట్ట వేసెను. "నాశరీరముమీద రెట్ట వేసిన దెవరు?' అని ప్రశ్నము రాగా, 'నేను' అని సమాధాన మిచ్చెను. 'ఏల వేసితివి?' 'అజాగ్రత్తవలన.' కాని మరల అది మలము జారవిడిచెను. 'నీ బల మెంత?' 'నీ బల మెంత?' అని వానిలో వివాదము బయలుదేరెను.

"నన్ను చంపి, బొగ్గులమీద పక్వము చేసి, నామాంసము తిన్న వానికి తెల్లవారుసరికి వేయి కార్షాపణములు లభించును" అని క్రింద పక్షి యనెను.

"ఇంతమాత్రముననే నీవు గర్జింప నక్కరలేదు. నా స్థూల మాంసమును తిన్నవాడు రాజగును. వెలుపలిమాంసము తినెడివాడు సేనాపతి యగును. స్త్రీ భుజించినచో పట్టపురాణి యగును. అస్థి మాంసము తినువాడు గృహస్థు అయినచో కోశాధికారి యగును; ప్రవ్రజితు డయినచో రాజకులమున విశ్వసనీయు డగును" అని పైకొమ్మమీదికోడి యనెను.

కాష్ఠహారుడు వానిమాటలు విని తనలో "రాజ్యము లభించి నప్పుడు వేయికార్షాపణములతో పని యేమి?" అనుకొని, నెమ్మదిగా చెట్టెక్కి పైనున్న కోడిని పట్టుకొని, చంపి, తనసంచిలో వేసికొని, రాజు నగుదు నని భావించి, వెడలిపోయి, తెరచియున్న ద్వారము వెంట నగరమున ప్రవేశించి. కోడిచర్మము ఒలిచి, గర్భము బాగు చేసి, తనభార్య కిచ్చి, "ఈకోడిమాంసము చక్కగా వండుము" అని చెప్పెను. ఆమె వంట చేసి, కోడిమాంసముతో సహా తెచ్చి, ముందు పెట్టి "స్వామీ, తినుడు" అనెను.

"భద్రే, ఈమాంసము మహాప్రభావము కలది. దీనిని భుజించి నేను రాజు నగుదును, నీవు రాణివగుదువు. దీనిని కొనిపోయి, గంగలో స్నానము చేసి భక్షింతము."

ఉభయులును భోజనము గిన్నెను తీరమున బెట్టి స్నానార్థము నీటి లోనికి దిగిరి. ఆసమయమున గాలితాకున నీరు కల్లోలమై లేచినది.

గిన్ని నీటిలో కొట్టుకొనిపోయెను. ఏనుగులను నీటిలో స్నానము చేయించుచున్న గజాచార్యుడు చూచి, దానిని లేవనెత్తి మూత తీసి 'ఇందులో నేమున్నది?' అనెను. 'స్వామీ, అన్న మున్నది, కోడి మాంస మున్నది.' ఆచార్యుడు దానిని మూయించి, దానిపైన మొహరు వేసి, తన భార్యకడకు పంపి 'మేము వచ్చువరకును ఈయాహారమును పంచవద్దు' అని ఆదేశించెను. ఆకట్టెలవాడు నోట ఇసుక పడుటచే, నీరు పొట్టనిండుటచే పరుగెత్తెను.

ఆ గజాచార్యుని కులమునకు నమ్మకమైన తపస్వి యొకడు దివ్యదృష్టితో చూచి 'నా సేవకుడు గజస్థానమును విడువ లేదు. వానికి ఎప్పుడు సంపద కలుగును?' అని యోచించి, ముందుగానే గజాచార్యుని యింటికి బోయి కూరుచుండెను. గజాచార్యుడు వచ్చి, ప్రణామము చేసి, ఒకప్రక్కన కూరుచుండి, తపస్వికి భోజనము, మాంసమును వడ్డింపుము' అని భార్యతో చెప్పెను. తాపసి అన్నమును స్వీకరించి, మాంసము నొల్లక 'ఈమాంసమును నేను పంచెదను' అనెను. 'భర్తే, పంచిపెట్టుడు' అని యత డనగా, తాపసి విభాగము చేసి, స్థూలమాంసమును గజాచార్యునకును, వెలుపలి మాంసమును ఆయన భార్యకును ఏర్పరించి తాను మాత్రము అస్థిమాంసమును భుజించెను. వెడలిపోవుచు తాపసి అతనితో 'నేటికి మూడవనాడు నీవు రాజు వగుదువు. భద్రముగా నుండుము' అని పలికెను.

మూడవనాడు సామంతరాజొకడు వచ్చి, వారాణసిని చుట్టుముట్టెను. వారాణసీప్రభువు గజాచార్యునకు రాజవేషము వేయించి, ఏనుగు నెక్కి 'నీవు యుద్ధము చేయుము' అని యాజ్ఞాపించి, తాను మారువేషమున సైన్యమును నడపుచుండగా బాణము వచ్చి తగిలెను. దానితో నతడు మరణించెను.

రాజు మరణించినట్లు తెలిసికొని గజాచార్యుడు అనేక కార్షాపణములు తెప్పించి, ధనము కావలసినవారు ముందరికి పోయి పోరుడు' అని చాటింపించెను. సైన్యము క్షణములోనే శత్రురాజును సంహారించెను. అమాత్యులు రాజున కంత్యక్రియలు చేసి 'ఎవ్వరిని రాజును చేయుదము?' అని యోచనచేసి, 'రాజు జీవించియుండగా గజాచార్యునకు తనవేషము వేయించినాడు. ఈయన యుద్ధమున జయించినాడు.

కావున ఈయననే రాజును చేయుదము' అని నిర్ణయించిరి. అట్లే ఆయనను రాజ్యాభిషిక్తుని చేసిరి ఆయన భార్యను పట్టమహిషిని కావించిరి. బోధిసత్త్వుడు రాజకులమునకు విశ్వాసపాత్రు డాయెను.
ఆయన అభిసంబుద్ధు డైనపిదప ఈగాథ పలికెను:

ధనముకై భాగ్యహీనులు పొనరుచు కృషి
నిష్ఫలం బగు: నిపుణతానిపుణతలను
నెట్లు వశవర్తి కాక ఫలించుచుండు
భాగ్యదేవతావీక్షణభాజనులకు.

అకృతపాపుడు పుణ్యవంతుం
డైనవానికె తామ్రచూడము
రత్నదండంబులును, భార్యా
రత్న ముదయించున్.

శాస్త గాథలు పలికి జాతకములు సరిపోల్చెను; ఆకాలమున రాజు ఆనందస్థవిరుడు;-
కుల - విశ్వాసి తపస్వి సమ్యక్సంబుద్ధుడు.

## 285 మణిసూకర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు సుందరిహత్యను గురించి చెప్పినది.

### వర్తమాన కథ

'భగవానునకు సత్కారము, గౌరవము జరుగుచుండెను'. అను కథ ఇదివరలో వచ్చినది. ఇచ్చట కథ సంక్షిప్త మయినది. భగవానుడు, భిక్షుసంఘము పంచనదప్రదేశమున చేరి విశేషసత్కారములు పొందుచున్నప్పుడు తైర్థికసంఘము పొందుచున్న లాభము సూర్యోదయ మయినపుడు మిణుగురుపురుగులకాంతి నష్ట మైనట్లు లోపించెను. వారు ఒకచో జేరి "శ్రమణగౌతముడు వచ్చినప్పటినుండి మనకు లాభసత్కారములు తగ్గిపోయినవి. మనము ఏ మపుదుమో ఎవరికిని

తెలియదు. ఎవరితో కలసి మనము గౌతమునిపై దోష మారోపించి ఆయనకు వచ్చులాభ సత్కారములు చెడగొట్టగలమా ? సుందరిని కలిసికొని ఈపని నెరవేర్పగలము'' అని నిర్ణయించుకొనిరి.

ఒకనాడు సుందరి ఆరామములో ప్రవేశించి భిక్షువులకు ప్రణామము చేసి నిలిచినది; కాని వా రెవ్వరును ఆమెతో మాటాడలేదు. ఆమె ఎన్నిసారులు మాటాడించినను వారు ప్రతివచన మీయకుండుటచే తుదకు "ఆర్యులకు నేను కష్ట మేమియు కలిగింపలేదు గదా ?" అని ప్రశ్నించెను.

"సోదరీ! నీకు కనబడుట లేదా ? శ్రమణగౌతమునివలన మాలాభ సత్కారములు నష్టమైనవి. ఇట్టికష్టములు కల్గించి యిచ్చవచ్చినట్లు తిరుగుచున్నాడు.''

''ఆవిషయమున నే నేమి చేయగలదానను ?"

''చెల్లాయీ! నీవు చాల చక్కనిదానవు. నీవు శ్రమణగౌతమునకు అపకీర్తి కల్పించి లోకులు నమ్మునట్లు చేసి, ఆయనలాభసత్కారము లకు నష్టము కలిగింపవలెను.''

మంచి దని ఆమె అంగీకరించి వెడలిపోయెను నాటినుండి ప్రతి సాయంకాలము జనులు శాస్త చేయు ధర్మోపదేశములు విని మరలి పోవు సమయమునకు సరిగా గంధమాల్యానులేపనాదులు పట్టించుకొని సుందరి జేతవనమువైపు పోవసాగెను.

'ఎక్కడికి పోవుచున్నావు' అని లోకులు అడిగినపుడు 'శ్రమణ గౌతమునికడకు. నేను గంధకుటిలో ఆయనతో ఏకాంతముగా నుందును' అని సుందరి తైర్థికుల విహారములో ఎచటనో రాత్రి గడపి, తెల్లవారుజామున నే జేతవనమునకు పోవు మార్గ మున చేరి, ఆవల సామాన్యపథమున నడచుచుండెను. ''ఏమి సుందరీ, ఎచ్చటికి పోయి ఉంటివి'' అని జనులు అడిగినపుడు "శ్రమణగౌత మునితో ఏకాంతమున గంధకుటిలో క్రీడాపర్వతమున కాలము గడపి వచ్చుచున్నాను" అని సమాధాన మిచ్చెడిది.

అటుతరువాత కొలదిదినములకు తైర్థికులు ధూర్తులకు కార్షాప ణము లిచ్చి, ''పాండుసుందరిని సంహరించి గౌతమశ్రమణుని కుటీర సమీపమున దిబ్బమీాద శవమును పారవేసి రండు" అని చెప్పిరి.

ధూర్తులు వారు చెప్పినట్లే చేసిరి. అంతట తైర్థికులు కోలాహలము చేసి, సుందరి కనబడుటలే దని రాజుకు నివేదించిరి. రాజు "ఎవరిమీాద సందేహము?" అనెను. 'సుందరి ఈమధ్య జేతవనమునకు పోవుచున్నది. అక్కడ నేమి జరిగెనో తెలియదు" అనిరి.

'అట్లయిన పోయి వెదకుడు' అని రాజానతిచ్చెను. తైర్థికులు భటులను వెంటబెట్టుకొని, దిబ్బకడకు బోయి, సుందరిశవమును మంచముపై వేయించి ఊరిలోనికి గొనివచ్చి రాజుతో "శ్రమణగౌతముని శిష్యులు తమగురువు చేసెడి పాపకార్యములను కప్పిపుచ్చుటకై సుందరిని సంహరించి దిబ్బపై పారవైచినారు" అని చెప్పిరి.

"అట్లయిన పోయి ఈవిషయము నగరమున చాటింపుడు" అని రాజు చెప్పగా, వారు "శ్రమణగౌతముడు చేసిన పని చూడుడు" ఇత్యాది నిందలు ప్రకటించుచు వీధివీధులు తిరిగి, తుదకు రాజద్వారము చేరిరి. రాజు శ్మశానమున మంచె వేయించి దానిపై సుందరి శవమును పెట్టి యుంచ నాజ్ఞ యిచ్చెను. ఆర్యశ్రావకులు తప్ప తక్కిన శ్రావస్తివాసు లందరు నగరము వెలుపలను, ఉపవనము లందును, అరణ్యమునను, అన్ని దేశములలోను భిక్షువులను నిందించుచు తిరుగుచుండిరి. 'శాక్యపుత్రునిశ్రమణులు చేసినపని చూడుడు' అని ఘోషించుచుండిరి. భిక్షువులు తథాగతునికడ కేగి ఈవార్త తెలిపిరి.

'ఆజనులతో ఇట్లు ప్రతివాదము చేయుడు' అని శాస్త ఈగాథ పలికెను:

నిజము చెప్పనివాడు నిరయాన పుట్టు
చేసి లే దనువాడు చేరును నిరయ
మిట్టి కర్మలు చేయునట్టి మానవులు
మరణమ్ము పిమ్మట నరకమ్ము గాంత్రు.

రాజు ఎవరు సుందరిని చంపిరో కనుగొను డని చారులను నియోగించెను. ధూర్తులు మద్యము త్రాగి, కలహించుచుండిరి. అం దొకడు రెండవవానితో, 'నీవు సుందరిని ఒక్క దెబ్బతో చంపి, పుష్పమాలికలు పారవేయు దిబ్బపై శవము పారవైచితివి. అందువలన లభించిన కార్షాపణములతో కల్లు త్రావుచున్నావు. 'మేలు! మేలు!' అనెను. రాజపురుషులు ధూర్తులను బంధించి రాజసన్నిధికి కొనిపోయిరి.

'సుందరిని చంపినారా?' అని రాజు ప్రశ్న వేసెను.

'చిత్తము, దేవా!'

'చంపించినవా రెవరు?'

'రెండవ తైర్థికబృందము వారు దేవా!'

రాజు తైర్థికబృందము వారిని పిలువనంపి, 'పొండు, మీరు సుందరి శవమును వెంటగొని, గౌతమునకు అపకీర్తి తెచ్చుటకై మేము సుందరిని హత్య చేయించితిమి, ఇందు గౌతముని దోషముకాని గౌతమ శ్రావకుల దోషముగాని లేదు, అని ఆక్రోశించుచు నగరమున తిరుగుడు' అని ఆనతిచ్చెను. వారు అట్లే చేసిరి. మూర్ఖులైన లోకులు మనస్సు మార్చుకొని గౌతమునియెడ ఆదరము చూపిరి. హత్య చేయించినందులకు తైర్థికులకు తగినదండన లభించెను. నాటినుండి బుద్ధునకు సత్కారము వృద్ధిఅయ్యెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో గూరుచుండి ఈవిషయమై సంభాషించుచుండ, శాస్త అచటికి జని, విషయము తెలిసికొని, "భిక్షువులారా, బుద్ధుల కెవ్వరును కళంకము నాపాదింపలేరు. మణికి కాలిమ సంక్రమింపజేయుట ఎట్టిదో, బుద్ధులకు కళంకము కల్పించుటగూడ అట్టిదే. పూర్వము మణికి కాలిమ కల్పించుటకై యత్నములు చేసిన వారు విఫలులైరి" అని, వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి పెద్దవాడయి, కామభోగములందు దోషము గ్రహించి, ఇలు వెడలి హిమాలయమునకు జేరి మూడుపర్వతపంక్తులు దాటి, తాపసవృత్తితో పర్ణశాలలో నివసించుచుండెను. దాని కనతిదూరములో మణిగుహ కలదు. అందు ముప్పది సూకరములు నివసించుచుండెను. గుహాసమీపమున సింహము తిరుగుచుండెను. దానినీడ మణిపై పడుచుండుట చూచి గుహలోని సూకరములు భయభ్రాంతము లగుటచే వానిరక్తమాంసములు శుష్కించిపోయెను. "ఈమణి కాంతివంత మగుటచే సింహప్రతిబింబము కాన

బడుచుండును. ఈమణిని మలినము వివర్ణము చేయవలెను" అని భావించి సూకరములు సమీపమున తటాకమునకు జని అచ్చటి బురదలో పొరలి వచ్చి మణిమీద శరీరములు రాచినవి. సూకర రోమములు రాచికొనుటచే మణి మరింత ఉద్దీప్త మయ్యెను. మణిని మలినము చేయుతెరగు కానక సూకరములు తాపసుల నుపాయ మడుగదలచి, బోధిసత్త్వునిసన్నిధికి జని వందనము చేసి, ఒకప్రక్కన నిలిచి, ఈగాథలు పలికినవి:

మణిగుహ ముప్పదిమందిమి మేము
ఏడేండ్లుగా వసియించుచున్నాము
మందగింపగ కాంతి మా రోమములను
వృద్ధియే పొందు రాపిడిచేత కాంతి
ఇపుడు మాక ర్తవ్య మే మని ప్రశ్న.

అంతట వానికి ప్రత్యుత్తరరూపముగా బోధిసత్త్వ డీగాథ పలికెను:

స్ఫటికమే యీమణి, స్వచ్ఛము, స్నిగ్ధ
మధికశుభప్రద మైనదే కాని
కాదు కాచమ్ము; సూకరములు! పొందు
మందగింపగలేరు మణికాంతి మీరు.

అనిబోధిసత్త్వుడు చెప్పినట్లు చేసెను. ఆయన ధ్యానము చేసి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున తపస్వి నేనే.

# 286 సాలుక జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగ ఒకానొక ప్రౌఢకుమారియెడ ఆసక్తినిగూర్చి చెప్పినది. ఈకథ క్షుద్రనారద కస్యప జాతకమున (477) వచ్చును.

## వర్తమాన కథ

శాస్త ఆభిక్షువుతో భిక్షూ, నీవు నిజముగ ఉత్తేజితుడ వైతివా?" అనెను. "భన్తే, చిత్తము." "నిన్ను ఎవరు ఉత్తేజితుని జేసిరి?" "భన్తే, ప్రౌఢకుమారి."

"భిక్షూ, ఇది నీకు అనర్థకారిణి. పూర్వజన్మమునగూడ నీవు ఈమెను వివాహము చేసికొనుటకై వచ్చిన పరిషత్తునకు విందు ఏర్పాటుచేసితివి" అని, భిక్షువుల ప్రార్థనపై శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు మహాలోహిత నామముతో వృషభ మయ్యెను. తత్కనిష్ఠ భ్రాత పేరు క్షుద్రలోహితుడు. రెండువృషభములును కుగ్రామములో నొకరియింట నుండును. వారియింట యుక్తవయస్కురా లగు కన్య కలదు. ఆమె నింకొకయింటివారి కుమారున కిచ్చి పెండ్లి చేయ నిర్ణయము జరిగెను.

ఆయింట సాలుక మను సూకరము కలదు. పెండ్లినాడు విందులో నుపయోగించుటకై యింటివా రాసూకరమునకు అన్నము గంజి పెట్టి బలుపుచుండిరి. అది మంచముక్రింద పండుకొని యుండును. ఒకనాడు క్షుద్రలోహితు డన్నతో 'అన్నా, మన మీయింటి పనులు చేయుచున్నాము. మనసాయమువలననే వీరు జీవించుచున్నారు. కాని వీరు మనకు గడ్డిపొట్టుమాత్రము వేయుచున్నారు. ఈపందికి అన్నము గంజి పెట్టుచున్నారు. దీనిని మంచముక్రింద పండుకొననిచ్చుచున్నారు. ఇది యేమి పని చేయును?' అనెను.

మహాలోహితు డి ట్లనెను: 'నాయనా, దీని తిండిని వాంఛింపకుము.

కుమారికావివాహమునాడు దీనిని వీరు విందులో వండుటకై బలుపు చున్నారు. కొలదిరోజులలో చూడు. దీనిని మంచముక్రిందినుండి ఈవలకుత్రోలి, సంహరించి, ముక్కలుచేసి, వచ్చినవారికి వడ్డింతురు.' ఇట్లని ఈగాథలు పలికెను:

సాలుకుపై నీర్ష్య చాలింపు మోయి!
తినుచున్న దది చావుతిండియే సుమ్మి!
పొట్టు కాంతమ్ముగా భుజియింప దగును:
దీర్ఘాయులక్షణాల్ తిలకింపు మిందు.

అతిథి వచ్చును వివాహమునకు, నపుడు
సూకర దేహంబు చూతువు నీవు.

తరువాత కొలదిదినములకు పెండ్లివారు వచ్చినప్పుడు సాలుకము నింటివారు ఖండించి వండిరి. అది చూచి వృషభములు తమగడ్డిగాదములే ఉత్తమ మయిన వని భావించినవి.

శాస్త అభిసంబుద్ధు డయినపిదప ఈవిషయమును ...టన చేయు ఈగాథ పలికెను:

ముసలమ్మవలె నుండు ముట్టెను కోసి,
కావించి దేహమ్ము ఖండఖండములు
పడవేసి యున్న యాపందిని గాంచి
మనపొట్టు మిక్కిలి మంచి దటంచు
అనుకొన్న దప్పు గా యనడుహద్వయము.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున ప్రౌఢకుమారి నేటి ప్రౌఢకుమారి; సాలుకుడు ఉత్తేజితభిక్షువు; క్షుద్రలోహితుడు ఆనందుడు: మహాలోహితుడు నేనే.

# 287 లాభగరహ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా సారిపుత్రస్థవిరుని శిష్యునివిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

శిష్యుడు స్థవిరునికడకు వచ్చి, ప్రణామము చేసి ఒకప్రక్కన కూర్చుండి, "భన్తే, నాకు లాభమార్గమును నిర్దేశింపుడు. ఏవిధమున నాకు చీవరములు మొదలగునవి లభించును" అని యడిగెను.

"ఆయుష్మన్, నాల్గుశబ్దములతో కూడియున్న యెడల లాభసత్కారములు కలుగుచుండును. లజ్జ విడిచి శ్రమణత్వమువిూద దృష్టి నిలుపక వెర్రి యెత్తినవానివలె నుండవలెను. నటునివలె ప్రవర్తింపవలెను. అడ్డులేకుండ మాటాడుచుండవలెను. సంయమరహితుడు కావలెను." అని స్థవిరుడు బదులుచెప్పెను. అతడు ఆమార్గమును నిందించుచు కూర్చున్న చోటినుండి లేచి వెడలిపోయెను. స్థవిరుడు శాస్తకడకు పోయి సమాచారము తెలిపెను. "సారిపుత్రా, ఈ భిక్షువు కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ లాభమును నిందించినవాడే.?" అని శాస్త పలికి, స్థవిరుడు ప్రార్థించిన పిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున పుట్టి, పెద్దవాడయి, పదునారు వత్సరములవయస్సున మూడు వేదములు, పదునెనిమిదివిద్యలు అభ్యసించి ప్రసిద్ధాచార్యుడయి అయిదువందలమంది శిష్యులకు విద్యలు నేర్పుచుండెను. సదాచారసంపత్తి కల బ్రహ్మచారి యొకడు ఒకనాడాచార్యునికడకు జని, ప్రాణులకు వస్తులాభ మెట్లగును?" అని యడిగెను.

"నాయనా నాలుగు కారణములచే వస్తులాభ మగును" అని ఆచార్యు డీగాథ పలికెను:

ఉన్మత్తు పోలిక నుండని వాడు
కొండెమున్ చెప్పక యుండెడివాడు
నటన చేయక యుండు నరుడు లోకమున
బుద్ధిహీనులవల్ల పొందడు లాభ;
మనుశాసనం బిదే, వినవలె నయ్యా!

ఆచార్యునివాక్కులు విని శిష్యుడు లాభగర్హణము చేయు నీగాథలు పలికెను:

ధర్మేతరం బైన దారిన బోయి
ఆత్మోన్నతికి మహాహాని కలిగించు
జీవిక నడపును చేకూర్చు ధనము
యశ మన్న ధిక్కార! మార, మానవుడు
అయి యనాగారికు డవల ప్రవ్రజ్య
దీక్ష గైకొని చేయు భిక్షాటనంబు
శ్రేయ మధర్మంపు జీవికకన్న

ఈవిధముగా ఆబ్రహ్మచారి ప్రవ్రజ్యను స్తుతించి ఇలు వెడలి వాన ప్రస్థాశ్రమము స్వీకరించి, ధర్మానుసారముగా భిక్షాటనము చేయుచు సమాపత్తులను పొంది బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చెసి, జాతకము లు సరిపోల్చెను ఆకాలమున బ్రహ్మచారి లాభనిందకభిక్షువు; ఆచార్యుడను నేనే

## 288 మచ్ఛుద్దాన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కుటిలవ్యాపారిని గూర్చి చెప్పనది. వర్తమాన కథ ఇదివరలో వచ్చినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండు నపుడు బోధిసత్త్వు డొకానొక కుటుంబమున జన్మించెను. ఆతనికి

తమ్ముడు కలడు. తండ్రి చనిపోయినాడు. తమకు రావలసిన బాకీ వసూలు చేయుట కిరువురు నొకనాడు బయలుదేరినారు ఒకగ్రామము నకు బోయి అచట వేయి కార్షాపణములు వసూలు చేసి తిరిగి వచ్చు నపుడు ఏటిరేవున నావకోస మెదురుచూచుచు, మూటలో తెచ్చు కొన్న అన్నము తినిరి. మిగిలిన అన్నమును బోధిసత్త్వుడు గంగా నదిలో చేపలకు వేసి, నదీదేవతాభాగముకూడ ఇచ్చెను. దేవత ఆపుణ్యకార్య మనుమోదించెను. బోధిసత్త్వుడు ఇసుకపై ఉత్తరీయము పరచుకొని పండుకొని నిద్రించెను.

ఈయన తమ్మునకు కొలదిగా చోరప్రకృతి కలదు. అతడు కార్షా పణములు అన్న కీయక తానే హరింప దలచి కార్షాపణములమూట వలెనే వేరొకటి సిద్ధము చేసి అందు కంకర నింపి, రెండుమూటలను ఒకేచోట నుంచెను. నావ యెక్కి వారు గంగామధ్యమునకు బోయి నప్పుడు తమ్ముడు త్రుళ్ళిపడి మూట నీటిలో బడవైచి అన్నతో 'కార్షాపణములమూట నీటిలో బడిపోయినది. ఏమి చేయవలెను?' అనెను.

"నీటిలో బడిపోయినప్పుడు మన మేమి చేయగలము? చింతింప కుము."

నదీదేవత "ఇతని పుణ్యభాగమును అనుమోదించినాను. ఈతని వస్తువును రక్షింతును" అని తలచి నిజప్రభావముచే ఆమూట పెద్ద చేప మ్రింగునట్లు చేసి, దానిరక్షణకు పూనుకొనెను.

తమ్ముడు గృహము చేరి అన్నను మోసగించితి నని సంతోషించి తనమూట విప్పెను. అందులో కంకర కనబడగా అతనికి కాలుసేతులు చల్లబడెను. అతడు మంచముపై చల్లగా పండుకొనెను.

ఆసమయమున జాలరులు చేపలు పట్టుటకై వల వేసిరి. మూట మ్రింగిన పెద్దచేప దేవతాప్రభావమువలన ఆవలలో జిక్కుకొనెను. దానిని విక్రయించుటకు జాలరులు నగరములోనికి వచ్చిరి. దానిని జూచి జనులు మూల్య మెంత అని యడిగిరి. వేయి కార్షాపణములు, ఏడు మాషకములు ఇచ్చి దీనిని దీసికొనవచ్చు నని వారు చెప్పగా, లోకులు నవ్వి వేయి ఖరీదు చేయు చేపను చూచినాము" అనిరి.

జాలరులు బోధిసత్త్వుని గృహకవాటము చేరి, ఈచేపను తీసికొనుడు

అని పలికిరి.

"దీని మూల్య మెంత ?"

"ఏడుమాషకము లిచ్చి తీసికొనుడు."

"ఇతరుల కెంత కిత్తురు ?"

"వేయికార్షాపణములు, ఏడు మాషకములకు. తమరు ఏడుమాషకము లిచ్చి తీసికొనవచ్చును."

ఆయన ఏడుమాషకము లిచ్చి చేపను భార్యకడకు బంపివేసెను. చేపకడుపు తరుగునపు డామెకు మూట కనబడినది. ఆమె భర్తతో చెప్పినది ఆయన చూచి గురుతుపట్టి మూట తనదే అని గ్రహించి, ఇందులకే కాబోలును ఇతరులకు వేయికార్షాపణముల ఏడు మాషకము లనియు, నాకు ఏడుమాషకము లనియు చెప్పి, వేయికార్షాపణములు నావియగుటచే ఏడుమాషకముల కిచ్చినాడు" అని తలపోసి, ఈ భేదమును గ్రహింపనివాడు శ్రద్ధావంతుడు కాజాలడు అనియోచించి ఈగాధ పలికినాడు .

వేయికార్షాపణాల్ విలువ యన్నపుడు
నరు డెవ్వ డుండడు నమ్మెడివాడు :
ఏడు మాషము లంటి నీచేపగుంపు;
ఇంతకే విలిచితి నీ ప్రోగు నేను.

ఇట్లు పలికి బోధిసత్త్వుడు "ఈ కార్షాపణములు నా కెట్లు లభించెను?" అని తలపోయ జొచ్చెను. అప్పుడు నదీదేవత ఆకాశమునుండి దర్శన మిచ్చి "నేను గంగాదేవతను, మిగిలిన అన్నమును నీవు మత్స్యములకు పెట్టి పుణ్యములో నాకు భాగ మిచ్చినావు. కావున నీసంపదను రక్షించినాను" అని యీగాధ పలికెను .

అపుడు మత్స్యములకు నాహార మిడినావు;
నానుగూడ నిచ్చినావు దక్షి,
కొందుచేత, జ్ఞప్తియుం దుండ నీసుకృ
తమ్ము కాచినాను సుమ్మి, ధనము !

ఇట్లుపలికి కుటిలకార్యము చేసిన తమ్మునిగూర్చి "వీ డిపుడు నిస్సారముగా మంచమున పడియున్నాడు. దుష్టచిత్తునకు ఉన్నతియుండదు.

నీధనము నష్టము కాకుండ నేను తీసికొని వచ్చి యిచ్చినాను. తమ్మునకీయక నీవుమాత్రము దీనిని గ్రహింపుము” అని ఈగాథ చెప్పెను :

పైతృక మైన సంపదలోని భాగ
మీయక సోదరు కేని వంచించి,
ధర్మేతరం బైన దారిని బోవు
నతని కుండదు దేవతాదరం బైన
ఆత్మీయలాభాన అభివృద్ధి యైన.

మిత్రద్రోహి యగువానికి ముట్టకుండుటకై దేవత యిట్లు పలికినది. కాని బోధిసత్త్వుడు ఇట్లు చేయలేక, తమ్మునకు 500 కార్షాపణములు పంపెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము సరిపోల్చెను. ఆకాలమున కటిలవ్యాపారి ఇప్పటి కటిలవ్యాపారియే. అన్న నేనే.

## 289 నానచ్ఛంద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆయుష్మంత ఆనందుడు అష్టవరములను పొందుటను గూర్చి చెప్పినది. (వర్తమాన) కథ పదునొకండవ నిపాతమున జుణ్హజాతకమున (456) వచ్చును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు బోధిసత్త్వుడు ఆయనపట్టపుదేవి కడుపున పుట్టి, పెరిగి పెద్దవాడై, తక్షశిలలో విద్యలు నేర్చి తండ్రితరువాత రాజ్యమునకు వచ్చెను. ఆతనితండ్రికాలమున పురోహితుడుగా నున్న యాతడు పదచ్యుతుడయ్యెను. అతడు దరిద్రుడై ఒకానొకప్రాతయింటిలో నివసించుచుండెను. బోధిసత్త్వు డొకసారి అపరిచితునివేషముతో రాత్రివేళ నగరమున విచరించుచుండెను. దొంగతనముచేసి మరలివచ్చు చోరులు

కల్లుదుకాణములో మద్యపానము చేసి కుండనిండ కొనిపోయిరి. వారు ఆయననుచూచి ఎవరని ప్రశ్నించి కొట్టి ఉత్తరీయము లాగి, వేధించు చుండిరి.

సరిగా ఆసమయమున బ్రాహ్మణుడు వెలుపలికి వచ్చి వీధిలో నిలుచుండి నక్షత్రములు గుణించి రాజు శత్రువులచేత బడెనని గ్రహించెను. ఆతడు బ్రాహ్మణిని పిలిచెను. ఆమె వెంటనే వచ్చి, "ఆర్యా, ఏమి జరిగినది?" అనెను.

"భగవతీ, మనప్రభువు శత్రుహస్తగతు డయినాడు" అనెను.

"ఆర్యా, మీరు రాజసమాచారము ఆయనపురోహితునకు తెలుపుదురా?"

రాజు బ్రాహ్మణునివాక్కులు విని కొంచెము ముందరికి వచ్చి చోరులతో, 'స్వాములారా, నేను చిక్కనబడినాను. నాయుత్తరీయము దీసికొని నన్ను విడిచిపెట్టుడు" అనెను.

మాటిమాటికిని ఆత డట్లు ప్రార్థింపగా చోరులు దయదలచి అతనిని విడిచిపెట్టిరి. ఆతడు వారినివాసస్థానము గ్రహించి ఆగెను. బ్రాహ్మణుడు భార్యతో "భగవతీ, మనప్రభువు శత్రుహస్తములనుండి విముక్తుడై నాడు" అని చెప్పెను.

రాజు ఈవాక్కులుకూడ విన్నవాడై స్వమందిరమునకు పోయెను. రాత్రి గడపి తెల్లవారినంతనే రాజు ఆబ్రాహ్మణులను పిలువనంపి, "ఆచార్యులారా, తాము రాత్రి నక్షత్రములను పరీక్షించుచుండిరా?" అని అడిగెను.

'దేవా, చిత్తము.'

'నక్షత్రములు శుభప్రదములా, అశుభప్రదములా?'

'దేవా, శుభప్రదములు.'

'ఏమైన దుష్టగ్రహ మున్నదా?'

'ఏమియును లేదు.'

'ఫలానా గృహమున నున్న బ్రాహ్మణుని పిలువనంపుడు' అని ఆజ్ఞ ఇచ్చి రాజు ఆయన వచ్చినంతనే, 'ఆచార్యా, తాము రాత్రి నక్షత్రములు పరిశీలించితిరా?' అనెను.

దేవా, చిత్తము.'

'ఏమైనను ఆపద సూచించునా?'

'దేవా, గతరాత్రము తమరు శత్రుహస్తగతులై త్వరలోనే విముక్తులైనారు.'

'నక్షత్రము లెరుగనివారి కింతే కావలెను' అని రాజు బ్రాహ్మణులను వెడలనంపి పూర్వపురోహితునితో 'బ్రాహ్మణోత్తమా, నేను ప్రసన్నుడ నయినాను. వర మడుగుము' అనెను.

'మహారాజా, భార్యాపుత్రులతో సంప్రదించి మనవి చేయుదును.

'మంచిది. పోయి సంప్రదించి రమ్ము.'

బ్రాహ్మణుడు చని భార్యను, పుత్రుని, పుత్రికలను, కోడలిని, దాసీజనమును పిలిచి, 'రాజు నన్ను వరము కోరుకొమ్మన్నాడు. ఏమి కోరుకొందును?' అనెను.

'నాకు నూరావులను కొనిరండు' అని బ్రాహ్మణి చెప్పెను.

ఛత్తమాణవకనాము డగు కుమారుడు, 'నాకు కుముదవర్ణము గల గుర్రములు పూన్చిన మంచిరథము కొనిరండు' అనెను.

'మణికుండలములు మొదలు సమస్తాభరణములను కొనిరండు' అని కోడలు పలికెను.

'నాకు రోలు, రోకలి, చేట కావలెను' అని దాసి పూర్ణ పలికెను.

మంచి గ్రామమును స్వీకరింపవలె నని బ్రాహ్మణునకు కోరిక కలిగెను. అతడు రాజసన్నిధికి చనగా ప్రభువు, 'బ్రాహ్మణోత్తమా, ఇంటిలోవారిని సంప్రదించివచ్చితివా?' అనెను.

'చిత్తము. మహారాజా! కాని అందరిఅభిప్రాయములు కలియుట లేదు' అని ఈగాథ పలికెను.

ఒక్కగృహమ్ములో నున్నను మాకు
వాంఛలలో ప్రభూ, వైరుద్ధ్య మొదవె
అగ్రహారమ్ముపై నాసక్తి నాకు,
బ్రాహ్మణి కావులపైన వాంఛితము
మణికుండలమ్ముల మాసుత కోరు,
శిష్యుండు రథమును, సేవిక పున్న
ముసల ములూఖములు కోరుకొనును.

ఎవ రెవరికి ఏ మేమి కావలెనో అవి ఎల్ల ఇత్తు మని రాజు ఈగాథ పలికెను.

బ్రాహ్మణున కగ్రహారము, బ్రాహ్మణికిని
గోశతము, పుత్రికకు మణికుండలములు,
శిష్యునకు మంచిరథమును, సేవికకును
ముసలము లులూఖలంబుల నొసగవలయు.

ఈవిధముగా బ్రాహ్మణుడు కోరినవెల్ల నిచ్చి, అడిగినవానికన్న నధికముగా నిచ్చి, "నేటినుండి మీరు మాపనులను నేరవేర్చుటకు ఉత్సాహముతో నుండవలెను" అని రాజు ఆబ్రాహ్మణుని తన సన్నిధిలో నుంచుకొనెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున బ్రాహ్మణుడు ఆనందుడు; రాజు నేనే.

## 290 సీలవీమంస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు శీలవిమర్శకబ్రాహ్మణుని గూర్చి చెప్పినది. వర్తమాన - అతీతకథలు ప్రథమనిపాతమున సీలవీమంస జాతకమున (96) సవిస్తరముగా వచ్చినవి

### అతీతకథ

వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ ఆయనపురోహితుడు తన శీలమును పరీక్షించుటకై బంగరుసింహాసనముపుండి రోజున కొక కార్షాపణము చొప్పున రెండు దినములలో రెండు కార్షాపణములు తీసికొనెను. మూడవనా డతనిని చోరు డని రాజు కడకు గొనిపోయిరి. మార్గమధ్యమున నతడు పాములవాడు సర్పము నాడించుచుండగా జూచెను. రాజు పురోహితునితో 'ఇ ట్లేల చేసితి?' వనెను. 'నిజశీలమును పరీక్షించుటకు' అని బ్రాహ్మణు డీగాథలు పలికెను :

శీలము కల్యాణప్రద,
మీలోకమున దాని నెద్దియు మీరం
జాలదు, విషభీకర మగు
వ్యాళము బ్రతికినది శీలవంతముకానక్.

శీలంబు నింక నే పరి
పాలన చేయంగ ప్రతినపట్టినవాడన్
శీలంబు కలుగువానిని
మేలిమి పథగామి యనుచు మెచ్చు జనంబుల్.

జ్ఞాతులకు శీలవంతుం
డాతతప్రీతిప్రదుండు నయి మిత్రులలో
ఖ్యాతిం గాంచును మిక్కిలి;
ఆతడు మరణించు పిదప నందును సుగతిన్.

ఈవిధముగా బోధిసత్త్వుడు సదాచారమాహాత్మ్యమును దెలిపి రాజుతో ని ట్లనెను: "మహారాజా, మాయింటిలో మానాయన గారిది, మాతల్లిగారిది, నేను సంపాదించినది, మీవలన లభించినది, విశేషధన మున్నది. నిజశీలమును పరీక్షించుటకయి బంగారుసింహాసనము నుండి రెండుకార్షాపణములు తీసినాను. లోకములో జాతి, కుల, గోత్రములు సమస్తము నికృష్టము లనియు, శీలముమాత్రము శ్రేష్ఠ మనియు నా కిప్పుడు స్పష్టమయినది. నేను ప్రవ్రజింతును. నా కానతి యిండు."

రాజానుమతిని పొంది, ఇంటివారలు మాటిమాటికిని వేడుకొన్నను వినక యిల్లు వెడలి హిమాలయమునకు బోయి ప్రవ్రజించి, సమాపత్తు లను పొంది యతడు బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున శీలపరీక్షకు డయిన పురోహితబ్రాహ్మణుడు నేనే.

## 291 భద్రఘట జాతకము

శాస్త జేతవనమున నుండగా అనాథపిండికశ్రేష్ఠి మేనల్లుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

తలిదండ్రు లిచ్చిపోయిన నలువదికోట్ల ద్రవ్యము సురాపానాదికమున వ్యయము చేసి, అతడు శ్రేష్ఠికడకు జనెను. అతనికి శ్రేష్ఠి వేయి నాణెము లిచ్చి వ్యాపారము చేసికొనుమనెను. అదియును నష్టము కాగా నతడు మరల వచ్చెను. శ్రేష్ఠి అయిదువంద లిచ్చి పంపెను. అదికూడ నష్ట మయిపోగా యువకుడు మరలి వచ్చి నపుడు శ్రేష్ఠి రెండు ముదుకవస్త్రము లిప్పించెను. వానిని కోల్పోయి వాడు మరల రాగా శ్రేష్ఠి మెడపట్టి నెట్టించెను. వాడు దిక్కులేక మరణించెను. వానిని ఆవలకు ద్రోయించిరి. అనాథపిండికుడు విహారమునకు జని మేనల్లునివృత్తాంతము తథాగతునకు విన్నవించెను. శాస్త 'నీవు వీని నెట్లు సంతుష్టచిత్తుని చేయగలవు? పూర్వజన్మమున వీనికి నేను అన్ని కోర్కెలను తీర్చు భద్రఘటము నిచ్చినను సంతుష్టుని చేయలేకపోతిని' అని, శ్రేష్ఠిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠివంశమున పుట్టి తండ్రిమరణానంతరము శ్రేష్ఠిపదవిని పొందెను. ఆయన యింట భూస్థాపిత మైన ధనమే నలువదికోట్లు. ఈయన కొక్కడే పుత్రుడు. బోధిసత్త్వుడు దానాదిపుణ్యకార్యములు చేసి మరణానంతరము దేవరాజు శక్రు డయ్యెను. కుమారుడు వీధి కడ్డము కట్టించి మండపనిర్మాణము చేసి, మహాజనపరివృతు డయి, సురాపానము ప్రారంభించెను. గంతులు వేయువారు, పరుగు లిడువారు, పాటలు పాడువారు, నాట్యము చేయువారు మొదలగువారలకు వేలకు వే లిచ్చుచుండెను. అతడు మదవతి, మద్యము, మాంసమును మరగి, నృత్త గీత వాద్య లోలుడై ధనవ్యయము చేయుచు శీఘ్రకాలములోనే నలువదికోట్లను, ఉపయుక్తము లగు సామానులను కోలు

పోయి, దరిద్రు డయి, చినిగినబట్టలు కట్టి తిరుగుచుండెను.

దివ్యదృష్టితో శక్రు డీసంగతి గ్రహించి, పుత్రప్రేమవలన కుమారునికడకు వచ్చి సర్వకామదమగు ఘటము నిచ్చి, "నాయనా, ఇయ్యది పగులకుండునట్లు కాపాడుకొనుము. ఈఘట మున్నంతవరకును నీకు ధనలోప ముండదు. అప్రమత్తుడ వై యుండుము" అని ఉపదేశ మిచ్చి, దేవలోకమునకు వెడలిపోయెను.

నాటినుండి వాడు సురాపానము చేయుచు ఘటమును పై కెగుర వేసి క్రిందబడకుండ పట్టుకొనుచు విహారము చేయుచుండెను. ఒకనాడు వాడు సురాపానమత్తు డై ఘటమును పై కెగుర వేసి మరల పట్టుకొను నపు డది జారి నేలపై బడి ముక్క లయ్యెను.

మరల వాడు దరిద్రుడై, చినిగిన బట్టలు కట్టి, చేత భిక్షాపాత్రము పట్టి, ముష్టి యెత్తుకొనుచు తిరుగుచు పరపిండభోజనమున కాలము చేసెను.

శాస్త్ర అభిసంబుద్ధు డయినపిదప ఈసందర్భమును గూర్చి ఈ గాథలు పలికెను:

> కోర్కు లన్నియు దీర్చు కుంభంబు దొరకె
> ధూర్తునకు; వాడు దానితో నార్తిలేక
> కాల మొకకొంత సుఖముగా గడపినాడు.
>
> మత్తుపాగరున వాడు కుంభంబు నొక్క
> నాడు భగ్నము చేసెను; నాటినుండి
> భూరినష్టాలపా లయిపోయినాడు.
> ధనము నిట్టులె యొవడేని తగని వ్యయము
> చేయుచో ధూర్తురీతిని చెడును వాడు.

శాస్త్ర ఈగాథలు పలికి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున ఘటము పగులగొట్టుకొన్న ధూర్తుడు శ్రేష్ఠి మేనల్లుడు; శక్రుడు నేనే.

## 292 సుపత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, సారిపుత్రుడు బింబాదేవికొరకు తెచ్చి యిచ్చిన లోహితమత్స్యసూపమును గూర్చియు, హైయంగవీనమిశ్రితశాల్యన్నమును గూర్చియు చెప్పినది.

### వర్తమాన కథ

ఈ కథ పూర్వోక్తమైన అబ్భంతరజాతకములోని కథవలె నుండును. ఆకాలమున కూట స్థవిరకు ఉదరపీడ యుండెను. రాహులభద్రుడు స్థవిరునితో చెప్పెను. అతడు అతనిని ఆసనశాలలో కూర్చుండబెట్టి, కోసలరేశుని నివాసస్థానమునకు బోయి అచటినుండి రోహితమత్స్యసూపమును, హైయంగవీనమిశ్రితశాల్యన్నమును తెచ్చి, ఆతనికిచ్చెను. అతడు తల్లి స్థవిరకు వాని నిచ్చెను. వానిని భుజించినంతనే ఆమెఉదరపీడ సమసిపోయెను. రాజు చారులను పంపి వార్త తెలిసికొని, నాటినుండి స్థవిరకు అట్టియాహారమునే పంపుచుండెను. ఒకనాడు భిక్షువులు ధర్మసభలో కూరుచుండి ఈవిషయము చర్చించుచుండగా శాస్త అచటికి జని, విషయము తెలిసికొని "భిక్షువులారా, సారిపుత్రుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ రాహులమాతకోర్కి తీర్చెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాకికడుపున పుట్టి, పెరిగి ఎనుబదివేల కాకులకు ప్రధానుడై, సుపత్తు డనుపేర రాజుగా నుండెను. ఆయనపట్టమహిషిపేరు సుఫస్స. సుముఖుడు సేనాపతి. అతడు ఎనుబదివేలకాకులతో పాటు వారాణసీసమీపమున నివసించుచుండెను. ఒకనా డతడు సుఫస్సతో కలిసి వారాణసీప్రభువు వంటయింటిమీదికి బోయి మేతకై చూచుచుండెను. వంటవాండ్రు రాజుకొరకు నానావిధమత్స్యమాంసములను వండియుంచిరి. వంటవాడు గిన్నెలమీది మూతలు తీసి అన్నము వెలుపలికి తీయుచుండెను. సుఫస్సకు మత్స్యమాంసముల వాసన కొట్టగా

రాజభోజనముమీద ఇచ్ఛ పుట్టినది. ఆమె ఆనాడేమియు పలుక లేదు. మరునాడు భర్త ఆమెతో ''భద్రే, రమ్ము. మేతకు బయలు దేరుదము'' అన్నప్పుడు ఆమె, ''మీరు పొండు. నా కొక కోరిక పుట్టినది'' అని పలికెను.

''ఎట్టి కోరిక?''

'వారాణసీనరేశ్వరుని యాహారము నేను తినవలె నను కోరిక.'

'అయినచో నిన్ను కొనిపోవజాలను.'

'అయినచో దేవా, ప్రాణములు విడుతును.'

అప్పుడు బోధిసత్త్వుడు కూరుచుండి యోచింపసాగెను. సుముఖుడు వచ్చి 'మహారాజా, అసంతుష్టు లయిన ట్లున్నారు' అనెను. బోధిసత్త్వుడు విషయము తెలుపగా సేనాపతి 'మహారాజా, విచారింప వలదు' అని ఉభయులను శాంతపరచి, 'నేడు తమ రిచటనే యుండుడు. మేము భోజనము తీసికొనివత్తుము' అని వెడలిపోయెను.

సేనాపతి కాకులను సమావేశపరచి యీసంగతి తెలిపి 'రండు, భోజనము తెత్తము' అని కాకులతో వారాణసి ప్రవేశించెను. రాజు గారివంటశాలకు సమీపములో నతడు కాకులకు గూడెము ఏర్పాటు చేసి, వానిని రక్షణార్థ మున్నచోటనే నిలిపి, ఎనిమిదికాకములతో తాను బయలుదేరి రాజు భోజనసమయమున కెదురుచూచుచు వంట యింటి కప్పుమీద వాలి యుండెను. 'వంటవాడు భోజనము కొని పోవునపుడు నేను గిన్నెలను బోర్లద్రోయుదును. పడద్రోసిన పిమ్మట నాప్రాణములు నిలువవు. మీలో నలుగురు నోటినిండ అన్నమును, తక్కిన నలుగురు మత్స్యమాంసములను నోట కరచుకొని పోయి రాణికి, రాజుకు పెట్టుడు. సేనాపతి యెచట నున్నా డని రాజు ప్రశ్నించినపుడు, వెనుక వచ్చుచున్నా డని చెప్పుడు' అని బోధించెను.

వంటవాడు సమస్తము సిద్ధము చేసి, కావడిలో గిన్నె లుంచి రాజ కులమునకు బయలుదేరెను. వా డంగణములో చేరగానే సేనాపతి కాకులకు సంజ్ఞ చేసి, తా నెగిరిపోయి వంటవానిబుజముపై వ్రాలి, గోళ్ళతో కొట్టి, బల్లెముకొనవంటి ముక్కుతో ముక్కుపై పొడిచి, ఎగిరి, రెండుపక్షములతో వానిముఖము కప్పివేసెను. రాజు పైయంత స్తున పచారుచేయుచు కాకి చేసిన పని చూచి 'వంటవాడా, గిన్నెలు

విడిచిపెట్టి, కాకిని పట్టుకో' అని కేక వేసెను. వాడు గిన్నెలు జార విడిచి, కాకిని గట్టిగా పట్టుకొనెను. 'ఇక్కడికి రా' అని రాజు మరల కేక వేసెను. ఇంతలో కాకులు వచ్చి, తాము తినగలిగినంత తిని, సేనాపతి చెప్పినట్లు చేసెను. మిగిలినకాకులు వచ్చి, ఆహార మంత యును తిన్నవి. ఎనిమిది కాకములుమాత్రము పోయి రాజుకు, రాణికి ఆహారము పెట్టినవి. కోరిక తీరి సుఫస్స శాంతించినది.

రాజు కాకిని చూచి "కాకమా, నీకు నాభయము లేదా? అన్నము తెచ్చువానిని పీకితివి, గిన్నెలు పడిపోయినవి. నీప్రాణము కోల్పోతివి. ఏల యిట్లు చేసితివి?" అని యడిగెను.

"మహారాజా, మారాజు వారాణసికి సమీపమున నున్నాడు. నేను ఆయనసేనాపతిని. ఆయనభార్య సుఫస్సదేవికి మీభోజనముపై ఆసక్తి కలిగినది. అచ్చటనే నేను ఆత్మార్పణము చేసి యిచ్చటికి వచ్చినాను. వారికి భోజనము పంపినాను. నామనోరథము పూర్ణ మయినది." ఈకారణమున ఇట్లు చేసితిని" అని సేనాపతి ఈగాథలు పలికెను:

చేయు వాసంబు వారాణసీపరిసర
మందు నెనుబదివేల వాయసగణంబు
తన్ను గొలువ సుపత్రాభిధానరాజు.

పుట్టె అతనిభార్య సుఫస్స కొక్క
వాంఛ వేధించినది; రసవంతముగను
ప్రభువరేణ్యుమహానసపక్వ మైన
మత్స్యజాతివిశేషసమాజమునత.

ఆప్రభువు పంపుదూత నే, నరుగుదెంచి
నాడ నిటకు మహారాజ! నాసికపయి
దెబ్బతీసితి స్వామియాదేశ మంది.

రా జిట్లు యోచించెను. 'మానవులకు విశేషధన మిచ్చినను వారి సౌహార్దము పొందలేకున్నాము. గ్రామాదుల నొసగినను మాకొరకు ప్రాణత్యాగము చేయువారు లభించుట లేదు. ఇది కాకి యయినను తనప్రభువుకోసము ప్రాణము లిచ్చుచున్నది. ఇది మంచిది, మధుర

వాక్కులు కలది, ధర్మబుద్ధి కలది.' ఇట్లు తలపోసి రాజు ప్రసన్నుడై, శ్వేతచ్ఛత్రముక్రింద దానిని గౌరవించెను. అది అచటినుండియే తన రాజును సంభావించి గుణస్తోత్రము చేసెను. రాజు బోధిసత్త్వుని రావించి, ధర్మోపదేశము విని, వానికి రెండిటికిని తనయాహారమువంటి ఆహార మేర్పాటు చేయించెను. తక్కిన కాకులకు రోజునకు మణుగు బియ్యము వంట ఏర్పరించెను.

తాను బోధిసత్త్వుని యుపదేశానుసారము నడుచుచు, సమస్త ప్రాణులకును అభయ మిచ్చి, పంచశీలములను రక్షించుచుండెను. సుప త్రుని ఉపదేశ మేడువందలసంవత్సరములు ప్రచలిత మయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకము లు పరిపోల్చెను. ఆసమయమున రాజు ఆనందుడు; సేనాపతి సారిపుత్రుడు, సుఫస్స రాహులమాత; సుపత్రుడు నేనే.

## 293 కాయవిచ్ఛింద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొకని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొకడు పాండురోగముతో బాధపడుచుండెను. వైద్యులు నిర్ణయము చేసిరి. ఆతని భార్యాపుత్రులు తమలో ఆయన కుపచారము ఎవ్వరు చేయగలరని యోచింపసాగిరి. తనకు రోగము కుదిరినచో ప్రవ్రజింతు నని ఆతడు తలపోసెను. అనుకూలపథ్యము లభించుటచే ఆతడు కొలదిదినములలోనే నీరోగి యై జేతవనమునచేరి ప్రవ్రజ్యకై ప్రార్థన చేసెను. శాస్తవలన ప్రవ్రజ్య, ఉపసంపద పొంది అతడు త్వరలోనే అర్హంతు డాయెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో ఈవిషయమై చర్చించుచుండగ శాస్త అచటి కరుగుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ పాండురోగపీడితుడై, వ్యాధి

కుదిగినపిదప ప్రవ్రజించి ఉన్నతి పొందినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున బుట్టి, పెరిగి పెద్దవాడయి కుటుంబపోషణము చేయుచుండగా పాండురోగి యయ్యెను. వైద్యులు చికిత్స చేయలేకపోయిరి. దారపుత్రులాసలు విడిచిరి. ఈరోగము కుదిరిన పిమ్మట ప్రవ్రజించెద నని యతడు భావించి ఏదో పథ్యము లభించుటచే నీరోగి యయి హిమవత్ప్రదేశమునకు జని ప్రవ్రజించెను. సమాపత్తులు, అభిజ్ఞలు సంపాదించి ధ్యానసుఖమున విహరించుచు, నేటివరకు నిట్టి సుఖము లభింపలే దని ప్రమోదముతో ఈగాథలు పలికెను.

మండుటెండను పుష్పంబువాడిక్రి రోగ
పీడచే నాశరీరము వాడి క్రుక్కి
చూడ జాలనివాని కసుందరమ్ము
సొగసుగా, నపవిత్రమ్ము మిగుల పూత
ముగను, నానావిధంబుల వెగటు పుట్టు
కాయము మనోహరమ్ముగా గానవచ్చు.

వ్యాధిపీడితమును జుగుప్సాకరంబు
పూతిగంధియు, నపవిత్ర మా తనువును
ధిక్కరింతును : మూర్ఖులు దీనికొరకు
ఉత్తమస్థితిమార్గంబు నజ్జగింత్రు.

ఈవిధముగా మహాసత్త్వుడు నానాప్రకారములైన అపవిత్రతలను, దైనందిన రోగములను విమర్శించి, శరీరమునెడ నభిమానము లేనివాడై, యావజ్జీవము నాలుగుబ్రహ్మవిహారములను భావించుచు, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి, జాతకములు సరిపోల్చెను. అప్పుడనేకులు స్రోతాపత్తిఫలాదులయందు ప్రతిష్ఠితులైరి. ఆకాలమున తపస్వి నేనే.

# 294 జంబుఖాదక జాతకము

శాస్త్ర వేళువనమున నుండగా దేవదత్త కోకాలికుల విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆసమయమున దేవదత్తునికి లాభసత్కారములు లోపించిపోయినవి. కోకాలికుడు గృహస్థులకడకు పోయి దేవదత్తుని గుణగానము చేయుచు "ఆయన మహాసమ్మతపరంపరలో ఓకాక రాజవంశములోనివాడు, లబ్ధధ్యానుడు, మధురభాషి, విశుద్ధక్షత్రియవంశములోనివాడు, త్రిపిటకధారి, ధర్మకధకుడు. ఇట్టి స్థవిరునకు మీరు దానాదికము చేయవలెను" అని చెప్పెను. దేవపుత్రుడు కూటకోకాలికుని పొగడుచుండెను. 'కోకాలికుడు ఉదీచ్యబ్రాహ్మణవంశమున జన్మించి ప్రవ్రజితుడైనాడు. బహుశ్రుతుడు, ధర్మకధకుడు. మీరు దానము చేయుడు" అని పలుకుచుండెను. ఈప్రకారముగ వారిరువురు ఒకరినొకరు పొగడుచు గృహస్థుల ఇండ్లలో భుజించుచు పర్యటించుచుండిరి.

ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై ఈవిషయము చర్చించుచుండ, శాస్త్ర అచటి కరుగుదెంచి విషయము తెలిసికొని, "భిక్షువులారా, ఈ అసత్యప్రశంసలు ఇప్పుడే కాదు, పూర్వముకూడ చేసికొనుచుండెడివారు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడొకానొక జంబూషండమున వృక్షదేవత యయ్యెను. కాకి యొకటి జంబూశాఖపై గూరుచుండి నేరేడుపండ్లు తినుచుండెను. అప్పుడొక నక్క వచ్చి పైనున్న కాకిని చూచి, లేనిపోని పొగడ్తతో కాకి నుబ్బవేసి నేరేడుపండ్లు తిందు ననుకొని, దానిని ప్రశంసించుచు ఈగాధ పలికెను:

కూరుచుండి నేరెటిచెట్టుకొమ్మమీద
బర్హిపోతకమట్టులు పాడుదు రెవ
రతిమనోహర ముత్తమ మైన శ్రుతిని!

కాకి నక్కను ప్రశంసించుచు ఈగాథ పలికెను:

కలపుత్రుల ప్రశంస కులపుత్రులైన
వారికే తెలియును; వ్యాఘ్రశాబకము
రంగులతో మిత్రరత్నంబ! నీవు
ఫలముల నొసగెద, భక్షింపవలయు.

ఇట్లు పలికి కాకి జంబూశాఖను కదిపి పండ్లు రాల్చెను. జంబూ వృక్షముపయి నున్న దేవత అలీకమైనవాని పరస్పరప్రశంస విని, నేరేడుపండ్లు తినుట చూచి ఈగాథ పలికెను:

ఇచ్చటికి నెంతకాలమో వచ్చిపోవు
వారలం జూచుచున్నాను. వమన మోఁడు
శవము నొక్కరు తినుచు, ప్రశంస చేసి
కొనుచునుందు రన్యోన్యము కుహానమతులు

ఇట్లు పలికి వృక్షదేవత వానికి భయంకరరూపము చూపి, అచటి నుండి వెడలిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను ఆకాలమున నక్క దేవదత్తుడు; కాకి కోకాలికుడు; వృక్షదేవత నేనే.

## 295 అంక జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు దేవదత్త కోకాలికులను గూర్చి చెప్పినది. వర్తమానకథ వెనుకటికథలో నున్నట్లుండును

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడొకానొక గ్రామకంఠమున ఆముదపుమొక్కపై దేవతగా నుండెను. గ్రామములో మరణించిన ముసలియెద్దును ఏరండవనమున

పారవైచిరి. నక్క వచ్చి దానిమాంసము తినుచుండెను. కాకి వచ్చి ఏరండముపై నక్కను జూచి "దీనిని ఊరకే పొగడి మాంసము తిన వలెను!" అనుకొని ఈగాధ పలికెను

నీస్కంధముం జూడ నిజముగా నెద్దు
మాపురంబంత; ఆటోపంబు చూడ
కంఠీరవసమమ్ము; కాన నీమనస్సు
మృగరాజ, ఒక్కింత మిగులుచు మయ్య!

అది విని నక్క ఈగాధ పలికెను :

కులపుత్రుని ప్రశంస కులపుత్రుడైన
వా డెరుంగును; శిఖావళి గళసదృశ
కంఠవాయసమ, ఇక్కడకు రావలయు

వానిసందర్భము చూచి వృక్షదేవత ఈగాధ పలికెను :

పశువులలో జంబుకంబు
పక్షులందు వాయసంబు
చెట్లయందు నేరండము
చేర నికృష్టమ్ము లిచట!

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున నక్క దేవదత్తుడు; కాకి కోకాలికుడు; వృక్షదేవత నేనే.

## 296 సముద్ద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉపనంద స్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు గొప్ప తిండిపోతు. అతనికి దాహముకూడ మెండు. బండెడు పదార్థములతోనైన నతడు సంతృప్తి చెందజాలడు. వర్షఋతు ప్రారంభమున నతడు రెండు మూడు విహారములలో నివాస మారం

భించి, ఒకదానిలో పాదరక్షలు, ఒకదానిలో చేతికఱ్ఱ, ఒకదానిలో మంచినీటికడవ ఉంచి, ఒకదానిలో తాను నివసించును. జనపదపర్యటనమునకు బయలుదేరునపుడు మంచివస్త్రము లున్నవారికి ఆర్యవంశకథ వినిపించి, వారికడనుండి చీవరములు స్వీకరించెడివాడు; వారికి మట్టిపాత్ర లిప్పించి, మంచిమంచి పాత్రలు, స్థాలిపాత్రలు బండిలో నింపుకొని జేతవనమునకు మరలివచ్చుచుండువాడు.

ఒకనాడు ధర్మసభలో భిక్షువు లీవిషయము ప్రస్తావించుచుండగా, శాస్త అచటికి జని, విషయము తెలిసికొని, 'భిక్షువులారా, ఉపనందుడన్యులకు ఆర్యవంశకథ ఉపదేశించుట అనుచితము. తొలుత తాను అల్పేచ్ఛు వయి, ఆవల నొరులకు ఆర్యవంశకథోపదేశము చేయవలసి యుండెను' అని ఈగాథ యుపదేశించెను.

తాను ముందుగ నుచిత మాదాని జేసి
ఒరుల కావల బోధించు టుచిత, మట్టి
పండితున కప్పతిల్ల దెన్నండు శ్రమము.

ధర్మపదములోని ఈగాథ నుపదేశించి, ఉపనందుని నిందించి "భిక్షువులారా, ఉపనందు డిప్పుడే కాదు, పూర్వముకూడ పేరాస కలవాడు; మహాసముద్రములోని జలమునుకూడ రక్షింపవలె నను వాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సముద్రదేవతగా జన్మించెను. నీటికాకి యొకనాడు సముద్రముమీదుగా బోవుచు, సముద్రోదకమును హెచ్చుగా త్రాగవలదు, కొలదిగా త్రాగుడు అని చేపలను, పక్షులను హెచ్చరించుచుండెను. అది విని సముద్రదేవత ఈగాథ పలికెను.

చేపలకొ నక్రములను నిషేధ పెట్టి
పాడుచున్ లవణాంబుధిపై నెవండు
అన్నికడల, శ్రమము గాంచుచున్నవాడు?

అది విని నీటికాకి ఈగాధ పలికెను:

అనవరతపాయి యైన విహంగమమును
నాకు సంతృప్తి లే దని లోక మెరుగు.
సకలతటినులపతి యైన జలధి నీరు
త్రాగివేయుట నా వాంఛితమ్మ సుమ్మ!

అది విని సముద్రదేవత ఈగాధ పలికెను:

ఆటు పోటును కలవు మహార్ణవమ్మ
నపన, పానమ్మ చేతను నష్టమొంద
దెపుడు సాగర మని నీకు నెరుక లేదొ?

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములం పరిపోల్చెను. ఆకాలమున సముద్రకాకము ఉపనందుడు; దేవత నేనే.

## 297 కామవిలాప జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు పూర్వభార్యపై ఆసక్తి గలవానిని గూర్చి చెప్పినది. వర్తమానకథ పుష్పరక్తజాతకమున వచ్చును. అతీతకథ ఇంద్రియజాతకమున (423) వచ్చును.

### అతీత కథ

అతడు బ్రతికియుండగానే శూలవేధ చేసిరి. ఆతడు తీవ్రవేదనను లక్ష్యము చేయక ఆకసమున ఎగిరిపోవుచున్న కాకిని చూచి ప్రియభార్యకు సందేశము పంపుటకు కాకిని సంబోధించి ఈగాథలు పలికెను:

గగనతలమున నెత్తుగా నెగురు పులుగ!
నాదు రంభోరుభార్యకు నాప్రవృత్తి
తెలుపవలయును: నావార్త; తెలియకున్న
చెందుచుండు మనోహారి చిరము చింత.

చండి నాస్థితి యెరుగక మండిపడును;
బాధ యద్దాన, నీ శూలవేధ గాదు.

కమలకోమలవస్త్రముల్, కాంచనాంగు
ళీయకము, వారణాసికాశేయకముల
దాచిపెట్టితి నే నుపధానమందు :
ఆధనేచ్ఛువు సంతృప్తి నందుగాక !

ఈప్రకారముగా బాధపడుచు రోదనము చేయుచు మరణించి ఆతడు నరకము చేరెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆనాటిభార్య నేటి భార్య; ఆఘటనము కాంచిన దేవపుత్రుడు నేనే.

## 298 ఉదుంబర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు భిక్షువులను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆయన సరిహద్దుగ్రామమున విహారము కట్టించి నివసించుచుండెను. రమణీయ మైన ఆవిహారము గుట్టపై నిర్మించినారు. ఊడ్చి నీరు చల్ల వలసిన పనులు విశేషముగా లేవు. ఆరామములో ఉదకము కలదు. భిక్షార్థము చనవలసిన గ్రామము సమీపమున కలదు. అచటివారు ప్రీతితో భిక్ష చేయువారు. ఒకానొక భిక్షువు పర్యటనము చేయుచు ఆవిహారము చేరెను. నివాసభిక్షువులు ఆగంతుకభిక్షువునకు చేయ వలసిన సత్కారములు చేసి మరునాడు అతనిని వెంటగొని గ్రామమున భిక్ష వేడిరి. జనులు ఆతనికి భిక్ష మిడ, మరునాడు భోజనార్థ మాహ్వా నింపబడి ఆగంతుకభిక్షువు కొలదిదినములు భోజనము లభించిన పిదప, ఉపాయ మాలోచించి నివాసభిక్షువును మోసగించి వెడలనడచి, విహారము గైకొందు నని నిర్ణయించుకొనెను. స్థవిరునికడ సేవచేయు

టకై వచ్చిన నూతనభిక్షువును ఆయన "ఆయుష్మన్, బుద్ధసేవార్థము నీవు పోలేదా?" అనెను.

భన్తే, ఈవిహారమును సరిగా చూచువారు లేరు. అందుచే నే నింతవరకు పోలేదు.

'నీవు బుద్ధదర్శనార్థము పోయివచ్చువరకును నే నీవిహారమును కని పెట్టియుందును.'

'భన్తే, చిత్తము.'

నివాసభిక్షువు లోకులతో 'నేను వచ్చువరకును స్థవిరునిసేవ చక్కగా చేయుచుండుడు' అని పోవువాడు. ఆనాటినుండి ఆగంతుక భిక్షువు నివాసభిక్షువుపై దోష మారోపించి, లోకులమనస్సు విరిచి నాడు.

నివాసభిక్షువు శాస్తకు ప్రణామము చేసి. మరలివచ్చినపుడు ఆగంతుకభిక్షువు అతనికి నివాసస్థాన మీయలేదు. అతడు ఒకానొక చోట నిలిచి భిక్షార్థము గ్రామమునకు జనెను. లోకు లతనిని ఆదరింప లేదు. ఆతనికి విచారము కలిగినది. జేతవనమునకు జని ఆతడు భిక్షువు లతో ఈసమాచారము చెప్పెను. వారు ధర్మసభలో సమావిష్టులై ఈవిషయము చర్చించుచుండగా శాస్త అచటి కరుగుదెంచి, విషయము తెలిసికొని భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ నివాస స్థానమునుండి ఆభిక్షువును తొలగించినాడు' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు అరణ్యములో వృక్షదేవతగా నుండెను. వర్షాకాలము వచ్చినది. ఏడువారములపాటు వాన కురిసెను. ఎఱ్ఱమోముకోతిపిల్ల ఒక రాతిచూరున కడుగున వానలో తడియని-చోటున రోజంతయు సుఖముగా గూరుచుండెను. నల్లమోముకోతిపిల్ల యచటికి వచ్చినది. అది వర్షములో తడిసి, చలికి బాధపడుచుండెను. సుఖముగా కూరు చున్న యెఱ్ఱకోతిపిల్లను చూచి 'ఉపాయమున దీనిని తప్పించి నే నిచట గూరుచుండవలె' నని యెంచి, కడుపునిండిన రీతిని తనపొట్ట

పట్టుకొని, దానియెదుట నిలిచి ఈగాథ పలికెను:

మద్రిపండులు, మేడిపండ్లును
మంచి వెలగలు పక్వ మైనవి;
వచ్చి వెలుపలి, కారగింపగ
వచ్చు; ఆకలిబాధ యేలా?

ఆమాటలు నమ్మి కోతిపిల్ల కందమూలఫలములు తినదలచి, ఈవలకు వచ్చి, ఆహారమునకై అటునిటు తిరిగి ఏమియు గానక, మరలి వచ్చి, లోపల గూరుచున్న మర్కటమును జూచి మోసపోతి నని యెంచి, దాని కెదురుగా నిలిచి ఈగాథ పలికెను:

పెద్దవారలయెడల నెవ్వడు
ప్రీతిగౌరవములను చూపునో
నిండు నాతని బొజ్జ: నాకును
నేడు నిండిన విధముగా నే.

అది విని మహామర్కటము ఈగాథ పలికెను:

కాననజాత మా కపిని వేరొక
వానర మ్మెరిగి, విశ్వాసము చూప,
దది కోతిపిల్లయే యైనను గాని:
మావంటి వృద్ధులమాట యెందులకు!

కోతిపిల్ల అచటినుండి వెడలిపోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున చిన్నకోతి నివాస భిక్షువు; నల్లని పెద్దకోతి ఆగంతుకభిక్షువు; వృక్షదేవత నేనే.

# 299 కోమాయుపుత్త్రి జాతకము

శాస్త్ర పూర్వారామమున విహరించుచు, క్రీడాప్రియులైన భిక్షువులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ప్రాసాదము పైభాగమున శాస్త్ర నివసించునపుడు భిక్షువులు క్రిందిభాగమున కూరుచుండి సంభాషించుచు, జగడములాడుచు కిల కిలారావములు చేయుచుండిరి. శాస్త్ర మహామౌద్గల్యాయనుని సంబోధించి "భిక్షూ, రమ్ము. కంపనము ఉత్పాదింపుము" అనెను. స్థవిరుడు ఆకాశమునకు కాలిప్రేలిపై ఎగిరి ప్రాసాదముపై స్తంభమున ప్రహారము చేసెను. అడుగున నున్న భిక్షువులు భయభ్రాంతులై బయటికి వెడలిపోయిరి. వారి క్రీడాప్రియత్వము భిక్షువులకు స్పష్టమాయెను. ఒకనాడు భిక్షువులు ధర్మసభలో కూర్చుండి ఈవిషయము చర్చించుచుండగా శాస్త్ర అచటికి జని విషయము తెలిసికొని, "భిక్షువులారా, ఇపుడే కాదు వీరుపూర్వముగూడ క్రీడాప్రియులే" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడొకానొక కుగ్రామమున బ్రాహ్మణకులమున బుట్టి గోమాయుపుత్రుడనుపేరు పొందెను. అతడు ఇల్లు వదలి వానప్రస్థుడై హిమవత్ప్రదేశమున నివసించుచుండెను. క్రీడాశీలియగు వేరొక తాపసుడు హిమవత్ప్రదేశమున ఆశ్రమము నిర్మించుకొని నివసించుచుండెను. అతనికి కసిణకర్మ (యోగాభ్యాసవిధి) కూడ తెలియదు. ఆతడు వనములో కందమూలఫలములు తినుచు క్రీడాశీలుడై తిరుగుచు కాలక్షేపము చేయుచుండెను. అతనికడ కోతి యుండెను. అదికూడ చిలిపిపనులు చేయుచుండెను. అది ముఖవికారాదివివిధచేష్టలతో తాపసులను రంజింపజేయుచుండెను. బహుకాల మచటనుండి తపస్వులు లవణామ్లములకొరకు మానవనివాసములకు జనిరి. వారు వెడలిపోయిన పిమ్మట బోధిసత్త్వుడచటికి వచ్చి నివసింపజొచ్చెను. మర్కటము

తాపసులకడ జేసినట్లు బోధిసత్త్వునికడ గూడ వినోదములు చేయ సాగెను. బోధిసత్త్వుడు చిటికె వేసి, "సుశిక్షితు లైన తాపసుల సన్నిధానమున నుండువారు సదాచారసంపన్నులు కావలెను, మనోవాక్కాయకర్మలతో సంయతులు కాదగును" అని యుపదేశ మిచ్చెను. మర్కట మానాటినుండి శీలవంతము ఆచారసంపన్నము నయ్యెను. బోధిసత్త్వుడన్యప్రదేశమునకు జనెను.

తాపసులు మరలి వచ్చిరి. మర్కటము పూర్వమువలె వినోదములు చూపలేదు. "ఆయుష్మన్, వెనుకటివలె చమత్కారము చేయ వేమి" అని అడుగువారై ఈగాథ పలికిరి:

ఆశ్రమమందు సదాచారు లైన
వారిచెంగట నిదివరలోన నీవు
గంతు లేయుచును మర్కటచేష్ట లెన్నొ
చేసెడివాడవు: శీలవంతుడుగ
నటియించుచున్నావు నచ్చదు మాకు

అది విని మర్కట మీగాథ పలికెను:

నేను బహుశ్రుతు డైన గోమాయు
పుత్రుండు చెప్పగా భూరి "విశుద్ధి"
విన్నాను' వెనుకటి విధమున నన్ను
తలపబోవకు, డింక ధ్యానవిహార
మొనరింప నుంటి ఆయుష్మంతులార!

విని తాపసులు ఈగాథ పలికిరి:

చట్టుపై బీజముల్ చల్లిన యెడల
మొలకలెత్తవు వర్షములవల్ల నైన
"పరమవిశుద్ధిని" బాగుగా విన్న,
వానరమ్మవు కాన ధ్యానింప లేవు

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున క్రీడాప్రియు లైన తపస్వులు ఈతపస్వులే; గోమాయుపుత్రుడు నేనే.

# 300 వక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా పురాణమైత్రిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

వర్తమానకథ సవిస్తరముగా వినయపిటకమున వచ్చియున్నది. ఇచ్చట అది సంక్షిప్తము. రెండువత్సరముల ఆయుష్మాన్ ఉపసేనుడు ఒక వర్షము ఈడుకల సబ్రహ్మచారితో కలిసి శాస్తసన్నిధికి జనెను. (ఉపసంపన్న భిక్షువువయస్సు ఉపసంపద లభించిననాటినుండి లెక్కింతురు.) శాస్తకు ఆలోచన కలిగినది. ఉపసేనుడు ప్రణామము చేసి వచ్చి, విపశ్యనా భావన అభ్యసించి అర్హత్త్వము పొందెను. అల్పేచ్ఛ మొదలగు గుణములతో కూడి మరల పదుమూడు ధుతంగధారణలు చేసి, తన అనుయాయులకుకూడ పదుమూడు ధారణలు కల్పించెను. మూడుమాసము లతడు భగవానుని ధ్యానించుచు, ఆవల అనుచరులతోగూడ శాస్తసేవార్థము చనెను. ప్రథమపర్యాయము అనుయాయు లుండుట వలన నిందితు డయ్యెను. ఈపర్యాయము ప్రశంస పొందెను. శాస్త అనుగ్రహించి నేటినుండి ధుతంగధారులు వీరైనపుడు నన్ను చూడవచ్చును అని ఆనతిచ్చెను. ఆతడు వెలుపలికి వచ్చి భిక్షువుల కీసమాచారము తెల్పెను. అప్పటినుండి భిక్షువులు ధుతంగధారులై శాస్తదర్శనార్థము చని, ఆయనధ్యానావస్థనుండి లేచినపిదప జీర్ణచీవరములను విడిచి తమచీవరములను ధరించి పోయెడివారు. శాస్త ఈవిషయము విని "భిక్షువులారా! ఈభిక్షువులవ్రతము బహుకాల ముండెడిదికాదు. ఈయది బకము చేయు, ఉపవాసవ్రతముతో సమానమైనది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు దేవరాజు శక్రు డయ్యెను. వృక మొకనాడు గంగాతీరమున రాతిబండపై నివసించుచుండెను. గంగానదిలోని చల్లని నీరు పొంగి బండచుట్టును క్రమ్ముకొనెను. తోడేలు లేచి పాషాణముపై కెక్కెను. దాని కాహారము దొరకక లేదు. ఆహారార్థము పోవుటకు

మార్గము కనబడలేదు. నీరు పైకెక్కుచుండగా వృకము తనలో "నా కాహారము లేదు, పోవుటకు త్రోవలేదు. ఊరక పడియుండుట కంటె ఉపవాసము చేయుట మేలు" అని చింతించి, మనసా ఉపవాస వ్రతమును శీలములను పరిగ్రహించి పండుకొని యుండెను. అంతట శక్రుడు ఆలోచన కలిగి దాని దుర్బలవ్రతవిషయము గ్రహించి పొట్టేలు రూపముతో దానికి సమీపమున గానబడెను. తోడేలు దానిని జూచి రేపు వ్రతము పూనుదును అని భావించి దానిని పట్టుకొనుటకై లంఘించెను. పొట్టేలిటు నటు గంతులు వేయుచు తనను పట్టుకొన నీయలేదు. దానిని పట్టుకొన జాలక తోడేలు మరలివచ్చి, పండుకొని వ్రతభంగము కాలేదనుకొనెను. శక్రుడు నిజస్వరూపుతో ఆకసమున నిలిచి "నీవంటి దుర్బలచిత్తులకు ఉపవాసవ్రత మేల? నేను శక్రుడ నను విషయము గ్రహింపక నీవు పొట్టేలుమాంసముతో పొట్టనింపు కొన దలచితివి" అని దానిని మందలించి, నిందించి దేవలోకమునకు బోయెను.

ఈ మూడును అభిసంబుద్ధుని గాథలు

అన్యజంతుప్రాణహరణమ్ము కావించి
రక్తమాంసంబులం ద్రాగి మ్రింగెడి వృకము
ఒకసారి వ్రత మూనె నుపవాస మొనరింప.

వ్రతదుర్బలత్వంబు గ్రహియించి శక్రుండు
అజరూపము దాల్చి అరుదెంచె నచ్చటికి.
తద్రక్తపాయికిం దపము భంగం బయ్యె;
తోడేలజముపైకి దుమికెన్ వ్రతమును మాని.

లోకమ్ములో జనుల్ లేక దృఢనిశ్చయము
చంచలత్వము వృకముచందాన పొందుదురు.

శాస్తధర్మోపదేశమును చేసి జాతకములు సరిపోల్చెను. ఆకా

ద్వితీయ సంపుటి

# జాతక కథలు

పాలి భాషనుండి ఆంధ్రీకరించినది

స్వామి శివశంకరశాస్త్రి

## తృతీయ సంపుటి

3

సాహితీసమితి. తెనాలి

# విజ్ఞప్తి

మా నాయనగారు పాలి భాషనుండి ఆంధ్రీకరించిన జాతక కథల తృతీయ సంపుటి ముద్రించుటకు ధనరూపమున సాయపడిన The Ministry of Scientific Research and Cultural Affairs, New Delhi వారికిని, గ్రంధ ముద్రణమున సర్వవిధముల సహాకరించిన సాహిత్యాచార్య, కవిశేఖర శ్రీ వావిలాల సోమయాజులు గారికిని, శ్రీ జె. యస్. శర్మ గారికిని, వెల్కం ప్రెస్ ప్రైవేటు లిమిటెడ్ వారికిని మా ధన్యవాదములు.

ఈ సంపుటిలో కొన్ని పారిభాషిక పదములకు వివరణము లిచ్చినాము. తుది సంపుటిలో గ్రంథములోని సమస్త పారిభాషికపద వివరణములు, తథాగతుని జీవిత చరిత్ర, జాతక కథల సమీక్షయు నుండును.

సాహితీ సమితి
ఒంగోలు
జులై 31, 1963

కృత్తివాస తీర్థులు

# అనుక్రమణిక

## నిపాతము ౪


౧ వివర వగ్గ

| | | | |
|---|---|---|---|
| 301 | క్షుద్రకాలింగ | జాతకము | 1 |
| 302 | మహా అస్సారోహ | ,, | 7 |
| 303 | ఏకరాజ | ,, | 11 |
| 304 | దద్దర | ,, | 13 |
| 305 | సీల వీమంసన | ,, | 15 |
| 306 | సుజాతా | ,, | 17 |
| 307 | పలాస | ,, | 20 |
| 308 | జవసకుణ | ,, | 22 |
| 309 | ఛవక | ,, | 24 |
| 310 | సయ్హ | ,, | 26 |

౨ పుచిమంద వగ్గ :

| | | | |
|---|---|---|---|
| 311 | పుచిమంద | జాతకము | 29 |
| 312 | కస్సప మందియ | ,, | 31 |
| 313 | ఖాంతివాదీ | ,, | 34 |
| 314 | లోహకుమ్భి | ,, | 37 |
| 315 | మంస | ,, | 43 |
| 316 | సస | ,, | 44 |
| 317 | మతరోదన | ,, | 50 |
| 318 | కణవేర | ,, | 52 |
| 319 | తిత్తిర | ,, | 56 |
| 320 | సుచ్చజ | ,, | 58 |

3 కుటిదూసక వగ్గ

| | | | |
|---|---|---|---|
| 321 | కుటిదూసక | జాతకము | 62 |
| 322 | దద్దభ | ,, | 65 |
| 323 | బ్రహ్మదత్త | ,, | 68 |
| 324 | చమ్మసాటక | ,, | 71 |
| 325 | గోధ | ,, | 73 |
| 326 | కక్కారు | ,, | 75 |
| 327 | కాకాతీ | ,, | 79 |
| 328 | అననుసోచియ | జాతకము | 80 |

329 కాలబాహు ,, 84
330 సీల వీమంస ,, 86

౪ కోకిల వగ్గ
331 కోకాలిక జాతకము 88
332 రథ లట్ఠి ,, 90
333 పక్కగోధ ,, 91
334 రాజోవాద ,, 94
335 జమ్బుక ,, 97
336 బ్రహాఛత్త ,, 99
337 పీఠ ,, 101
338 థుస ,, 104
339 బావేరు ,, 107
340 విసయ్హ ,, 110

౫ చూలకుణాల వగ్గ
341 కిన్నరీ జాతకము 113
342 వానర ,, 113
343 కున్తినీ ,, 114
344 అమ్బ ,, 116
345 గజకుమ్భ ,, 119
346 కేసవ ,, 121
347 అయకూట ,, 124
348 అరఞ్ఞ ,, 126
349 సన్ధిభేద ,, 128
350 దేవతాపఞ్హా ,, 130

నిపాతము ౫

౧ మణికుణ్డల వగ్గ
351 మణికుణ్డల జాతకము 130
352 సుజాత ,, 132
353 ధోనసాఖ ,, 134
354 ఉరగ ,, 138
355 ఘత ,, 143
356 కారణ్డియ ,, 145

# అనుక్రమణిక


| | | | |
|---|---|---|---|
| 357 | లటుకిక | జాతకము | 147 |
| 358 | క్షుద్రధమ్మపాల | ,, | 150 |
| 359 | సువణ్ణమిగ | ,, | 154 |
| 360 | సుసన్ధి | ,, | 158 |

౨ వణ్ణారోహ వగ్గ

| | | | |
|---|---|---|---|
| 361 | వణ్ణారోహ | జాతకము | 161 |
| 362 | సీలవీమంస | ,, | 164 |
| 363 | హిరి | ,, | 166 |
| 364 | ఖజ్జోపనక | ,, | 167 |
| 365 | అహితుణ్డిక | ,, | 168 |
| 366 | గుమ్బియ | ,, | 169 |
| 367 | సాలియ | ,, | 171 |
| 368 | కచసార | ,, | 173 |
| 369 | మిత్తవిందక | ,, | 175 |
| 370 | పలాస | ,, | 177 |

౩ అడ్ఢ వగ్గ

| | | | |
|---|---|---|---|
| 371 | దీధితి | జాతకము | 179 |
| 372 | మిగపోతక | ,, | 181 |
| 373 | మూసిక | ,, | 183 |
| 374 | క్షుద్రధనుగ్గహ | , | 186 |
| 375 | కపోత | ,, | 191 |

## నిపాతము ౬

౧ అవారియ వగ్గ

| | | | |
|---|---|---|---|
| 376 | అవారియ | జాతకము | 193 |
| 377 | సేతకేతు | ,, | 197 |
| 378 | దరీముఖ | ,, | 201 |
| 379 | నేరు | ,, | 207 |
| 380 | ఆశంక | ,, | 209 |
| 381 | మిగాలోప | ,, | 215 |
| 382 | సిరికాలకణ్ణి | ,, | 217 |
| 383 | కుక్కుట | ,, | 223 |
| 384 | ధమ్మద్ధజ | ,, | 225 |
| 385 | నందియ మిగ | ,, | 228 |

## ౨ సేనక వగ్గ


| | | |
|---|---|---|
| 386 ఖరపుత్త | జాతకము | 232 |
| 387 సూచీ | ,, | 237 |
| 388 తుండిల | ,, | 241 |
| 389 సువణ్ణకక్కటక | ,, | 246 |
| 390 మయ్హక | ,, | 250 |
| 391 ధజవిహేఠ | ,, | 253 |
| 392 భిసపుప్ఫ | ,, | 257 |
| 393 విఘాస | ,, | 260 |
| 394 వట్టక | ,, | 262 |
| 395 కాక | ,, | 264 |


## నిపాతము ౭

## ౧ కుక్కు వగ్గ


| | | |
|---|---|---|
| 396 కుక్కు | జాతకము | 265 |
| 397 మనోజ | ,, | 268 |
| 398 సుతను | ,, | 271 |
| 399 గిజ్ఝ | ,, | 276 |
| 400 దబ్భపుప్ఫ | ,, | 278 |
| 401 దసణ్ణక | జాతకము | 282 |
| 402 సత్తుభస్త | ,, | 287 |
| 403 అట్ఠిసేన | ,, | 296 |
| 404 కపి | ,, | 299 |
| 405 బకబ్రహ్మ | ,, | 301 |


## ౨ గంధార వగ్గ


| | | |
|---|---|---|
| 406 గంధార | జాతకము | 304 |
| 407 మహాకపి | ,, | 309 |
| 408 కుంభకార | ,, | 314 |
| 409 దళ్హధమ్మ | ,, | 321 |
| 410 సోమదత్త | ,, | 325 |
| 411 సుసీమ | ,, | 328 |
| 412 కోటిసింబలి | ,, | 332 |
| 413 ధూమకారి | ,, | 334 |
| 414 జాగర | ,, | 337 |
| 415 కుమ్మాసపిండ | ,, | 339 |
| 416 పరంతప | ,, | 345 |

# కొన్ని పారిభాషిక పదములు

ఆక్రోశ వస్తువులు: జాతి, నామ, గోత్ర, కుల, కర్మ, శిల్ప, అబాధ, లింగక్లేశ, ఆపత్తి.

అగతి : ఛంద, దోష, భయ, మూఢతావశీభూతుడయి అకర్మణ్యు డగుట.

అధిగమము : ధ్యాన విశేషము లభించెనో లేదో తెలిసికొను ప్రశ్న.

అనుమోదనములు : మాంగలిక, అమాంగలిక, భిక్షాగ్రహణానంతరోపదేశము.

అభిజ్ఞలు : దివ్యచక్షువు, దివ్యశ్రోత్రము, పూర్వజన్మ స్మృతి, బుద్ధిబలము, పరేంగిత జ్ఞానము.

ఆర్యధనములు : సదాచారము, లజ్జ, నిందాభయము, శ్రుతత్వము, త్యాగము, ప్రజ్ఞ.

అష్టమహానరకములు : సందీప, కాలసూత్ర, సంఘాత, రౌరవ, మహారౌరవ, తపన, ప్రతాపన, అవీచి.

ఉపసంపద  దీని నుండి భిక్షువయస్సును పరిగణింతురు.

కసిణ : యోగాభ్యాసమున నలువది సాధనలలో దేనినైనను సాధారణముగా కర్మస్థాన మందురు. అందు తొలి పదింటిని కసిణ (కృత్స్న) అందురు.

చంక్రమణభూమి : యోగ మభ్యసించుచు పచారుచేయు స్థలము.

చతుర్విధ ఉత్తమఫలములు : స్రోతాపత్తి, సకృదాగామి, అనాగామి, అర్హత్వ ఫలములు.

చతుర్విధదోషములు : దుర్భాషలు, అప్రియములు, అధర్మములు, అసత్యములు.

త్రిభవములు : కామభవము, రూపభవము, అరూపభవము.

త్రిరత్నములు : బుద్ధ, ధర్మ, సంఘములు.

దశశీలములు : పై అయిదు + అకాలభోజనము, నృత్య గీతాది నిషేధము, గంధ మాల్యాది నిషేధము, ఖట్వారూఢనిషేధము, రజత సువర్ణ విసర్జనము.

నిమిత్తము : శారీరక మలినములను క్షాళనముచేసి యోగ మభ్యసించుట.

పంచనీకరణములు : (చిత్తశుద్ధి నావరించునవి) కామచ్ఛందము, క్రోధము, ఆలస్యము, ఔద్ధత్యము, సందేహము.

పంచస్కంధములు : రూప, వేదన, సంజ్ఞా, సంస్కార, విజ్ఞానములు.

పంచశబ్దములు : ఆజీవన వనవాసులు, వృక్షముల క్రింద నివసించువారు, పాంసు పూరితులు, పిండపాతికులు, శాకాహారులు.

పరినిర్వాణము రెండు విధములు: (1) ఉపాధిశేషపరినిర్వాణము (పంచస్కంధములు మిగిలియుండును. జీవన్ముక్తావస్థ) (2) అనుపాధి నిర్వాణము.

# కొన్ని పారిభాషిక పదములు

**పంచశీలములు** : అహింస, అస్తేయము, అకామము, సత్యవాక్కు, మద్యపాననిషేధ

**పవారణ** : వర్షర్తు సమాప్తి.

**బ్రహ్మవిహారములు** : మైత్రీభావన, కరుణభావన, ముదితభావన, ఉపేక్షాభా

**విద్యాత్రయము** : దివ్యచక్షువు, పూర్వజన్మస్మృతి, ఆశ్రవక్షయజ్ఞానము.

**విపశ్యన** : ప్రజ్ఞ.

**సత్యక్రియ** : తన సత్యముమీద ఒట్టుపెట్టుకొని ఎవరికైన శుభమును కోరుట.

**హేతువు** : పూర్వపుణ్యకర్మఫలము.

## 301. క్షుద్రకాళింగ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు, నలువురు పరివ్రాజకుల ప్రవ్రజ్యనుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

వైశాలిలో ఏడువేల, ఏడువందల, ఏడుమంది లిచ్ఛవీరాజులు కలరు. వా రందరును శాస్త్రార్థమునందు నేర్పరులు.

అయిదువందల వాదులలో వైదుష్యము కల నిర్గ్రంథుడు వైశాలీనగరము చేరెను. వా రందరును ఆయనను సత్కరించిరి. అట్టి నిర్గ్రంథి వేరొకతె అచ్చటికి చేరగా రాజులు వారి కిరువురకును శాస్త్ర వాద మేర్పాటు చేసిరి. అం దిరువురు సమానులైరి. అంతట లిచ్ఛవులు యోచించి ఉభయులకు కలుగు పుత్రులు మేధావు లగుదురని భావించి వారికి వివాహము చేసి ఒకచో నుంచిరి. క్రమముగా వారికి నలుగురు పుత్రికలు, ఒకపుత్రుడు కలిగిరి. సచ్చా, లోలా, అవవాదకా, పటాచారా, నామములు పుత్రికలకును, సచ్చకనామము పుత్రునకు పెట్టిరి. వాడు పెరిగి పెద్దవాడైన పిమ్మట తల్లి అయిదువందల వాదములు, తండ్రి అయిదువందల వాదములు వారికి నేర్పి "మీరు ఏగృహస్థుతో నైనను వాదముచేసి ఓడిపోయినచో ఆయనకు దాసులు కండు, ప్రవ్రజితునితో శాస్త్రార్థమున పరాజయము నొందుచో ఆయనకడ ప్రవ్రజింపుడు" అని యుపదేశించిరి.

వారు మరణించినపిదప సచ్చకుడు వైశాలిలోనే ఉండి లిచ్ఛవులకు విద్యలు నేర్పుచుండెను. సహోదరులు నేరేడుకొమ్మ పట్టుకొని శాస్త్రార్థము కొరకు ప్రతి నగరము తిరుగ నారంభించిరి. శ్రావస్తి చేరి వారు నగరద్వారముకడ, ఆచిన్నికొమ్మను పాతి అచట నున్న బాలకులతో, శాస్త్రార్థము చేయగలవారు గృహస్థులు కాని, ప్రవ్రజితులు కాని, యీ యిసుక కాలితో చిమ్మి, ఈ నేరేడుకొమ్మను కాలితో త్రొక్కివేయ వచ్చు" నని చెప్పి భిక్షార్థము నగరములోనికి పోయిరి.

సారిపుత్రుడు ఊడవ వలసినచోటు నూడ్చి కడవలనిండ నీరు నింపి, గోవులకు ఉపచారములు కావించి ప్రొద్దెక్కిన పిదప భిక్షార్థము బయలు వెడలెను త్రోవలో నేరేడుకొమ్మను చూచి అచటి బాలకుల

నడిగి తెలిసికొని వారిచేతనే పడవేయించి, త్రొక్కించి, ఈ శాఖను ఇచట పాతించినవారు భోజనానంతరము జేతవనద్వారమునకు వచ్చినచో నన్ను కలిసికొనవచ్చును" అని చెప్పి భిక్షానంతరము మరలి వచ్చి ద్వారముకడ నుండెను. ఆపరివ్రాజికలుకూడ భిక్షానంతరము మరలివచ్చి నలిగిన శాఖను చూచి "ఎవరు దీనిని త్రొక్కివేసినా" రని ప్రశ్న వేసిరి. "సారిపుత్రస్థవిరులు. శాస్త్రార్థము చేయదలచినచో మీరు విహారద్వారమునకు పొండు."

బాలకుల వలన ఈ మాటలు విని వారు నగరమున ప్రవేశించి కొందరు జనులను వెంటనిడుకొని విహారద్వారము జేరిరి. అచట స్థవిరుని వేయిప్రశ్నలు అడిగిరి. అన్నిటికి సమాధాన మిచ్చి సారిపుత్రుడు "మిమ్మొక నేమైనా అడగవచ్చునా?" అనెను.

"స్వామీ, అడుగవచ్చును. తెలిసినచో సమాధాన మిత్తుము."

"ఒక్కమాట యేది?"

వారికి తెలియలేదు.

స్థవిరుడు దానిని వివరించెను. వారు "స్వామీ, మేము ఓడిపోయినాము. మీరు జయించినారు" అనిరి. "అయినచో ఇప్పు డేమి చేయుదురు?"

"గృహస్థునిచే పరాజయము కలిగినచో ఆయనకు మేము గృహిణులము కావలెను. ప్రవ్రజితునికడ ఓడిపోయినచో ఆయనవద్ద మేము ప్రవ్రజ్య మొందవలెను. ఇది మాతలిదండ్రుల యుపదేశము. కావున తమరు మాకు ప్రవ్రజ్య మనుగ్రహింపుడు." 'మంచి' దని స్థవిరుడు వారిని ఉత్పలవర్ణ స్థవిరకడకు పంపెను. వారు ప్రవ్రజించి త్వరలోనే అర్హత్త్వము పొందిరి.

ధర్మసభలో భిక్షువులు సంభాషించుచు "ఆయుష్మంతులారా, సారిపుత్ర స్థవిరుడు నలుగురు పరివ్రాజికలకు తోడ్పడి వారికి అర్హత్త్వము కూడ సమకూర్చెను" అనుచుండగా శాస్త వచ్చి, విషయము గ్రహించి, భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఇతడు వీరికి తోడ్పడెను. ప్రవ్రజ్యాభిషేకము ఇపుడు చేయించినాడు. కాని పూర్వము పట్టమహిషీపదమున నిలిపినా" డని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము కళింగరాష్ట్రములో దంతపుర నగరమున కాళింగుడు రాజ్యము చేయుచుండగా అశ్వక రాష్ట్రములోని పోతలి నగరమున అశ్వకుడు పరిపాలనము చేయుచుండెను. కాళింగరాజుకడ సైన్యబల ముండెను. ఆతడుకూడ నాగబలసంపన్నుడు. యుద్ధకాముడయిన యాతడు ప్రతియోధులను కానక నిజోద్యోగులను బిలిచి "నేను యుద్ధార్థిని. ప్రతిపక్షులు కానరారు. ఏమి చేయుదును?" అనెను.

"మహారాజా, ఇందుల కుపాయము కలదు. మీపుత్రికలు నలుగురును రూపవతులు. వారి నలంకరించి, తెరలు వేసిన రథమున గూరుచుండబెట్టి, సేనాసహితముగా పల్లెలు పట్టనములు త్రిప్పుడు. ఏ రాజు వారిని తనయింట నిలుపుకొన దలచునో ఆరాజుతో యుద్ధము చేయుడు" అని వారు పలికిరి.

ఆప్రకారమే రాజు పనిజరిపెను. వారు చనిన నగరములలోని రాజులు భయముచే వారిని లోనికి రానిచ్చుట లేదు; కానుకలు పంపి నగరముల వెలుపలనే నిలుపుచుండిరి. ఈప్రకారముగా వారు సమస్త జంబూద్వీపమున పర్యటనము చేసి అశ్వకరాష్ట్రములోని పోతలినగరమును సమీపించిరి. అశ్వకరాజు నగరద్వారములు మూయించి కానుకలు పంపెను. ఆయనమంత్రి నందసేనుడు విద్వాంసుడు, బుద్ధిమంతుడు, ఉపాయకుశలుడు. "ఈ రాజపుత్రికలను యావజ్జంబూద్వీపమున త్రిప్పినను రాజునకు ప్రతిపక్షులు లభింపలేదు. ఇట్లయినచో జంబూద్వీపమునకు అప్రతిష్ఠ ఘటిల్లును. నేను కాళింగునితో యుద్ధము చేసెదను" అని యోచించి, ఆయన నగరద్వారముకడకు జని ద్వారపాలకులను సంబోధించి ద్వారము తెరపించుటకై ఈ తొలిగాథ పలికెను:

> అస్సకప్రభుమంత్రి యౌ నందిసేన
> రక్షితంబైన ద్వారంబును తెరవ,
> వీరు పురంబు ప్రవేశింప గలరు.

ఆయన యిట్లు పలికి ద్వారము తెరపించి, ఆకన్యలను అశ్వకరాజునకు చూపి "మీరు భయపడవలదు. ఈసుందరులు రాజకన్యలు. వీరిని మీరు రాణులుగా పరిగ్రహింపుడు" అని వారి నభిషేకించి, తన వెంట

వచ్చిన రాజపురుషులతో "మీరు పొండు. అశ్వకప్రభువు రాజపుత్రిక లను రాణులుగా స్వీకరించినాడని మీప్రభువుకు విన్నవింపుడు" అని పీడుకొలిపెను. వారు వెడలిపోయి అట్లే చేసిరి. "అశ్వకుడు నా సామర్థ్యమును నిజముగా చవిచూచును" అని కాళింగుడు వెంటనే మహాసైన్యముతో బయలువెడలెను.

ఆయనరాక తెలిసికొని నందిసేనుడు "మీ సరిహద్దులో నిలువుడు. మా సరిహద్దు దాటవలదు. ఉభయరాజ్యముల సరిహద్దు నడుమ యుద్ధము జరుగును" అని సందేశ మంపెను. ఆలేఖావిషయము విని కాళింగుడు హద్దు దాటలేదు; అశ్వకుడుకూడ తనహద్దు దాటలేదు.

ఆకాలమున బోధిసత్త్వుడు ప్రవ్రజించి, ఉభయరాష్ట్రములనడుమ పర్ణకుటీరములో నివసించుచుండెను. "శ్రమణునకు కొంతభవిష్యత్తు తెలియవచ్చును. ఎవరు జయింతురో, ఎవరు పరాజితు లగుదురో నా కెట్లు తెలియును? కావున తాపసు నడిగెదను" అనుకొని, కాళింగుడు అజ్ఞాతవేషము ధరించి, బోధిసత్త్వుని సమీపించి, వందనము చేసి, "భన్తే, కాళింగుడు అశ్వకుడును యుద్ధముచేయు నభిలాషతో తమతమ సీమాంతములందు సంసిద్ధులయి యున్నారు. ఇం దెవరు జయింతురు? ఎవరు పరాజితు లగుదురు?" అని యడిగెను.

"మహాపుణ్యపురుషా, ఇం దెవరు జయింతురో, ఎవరు పరాజితు లగుదురో నాకు తెలియదు. దేవరాజు శక్రు డిచ్చటికి రాగలడు. ఆయన నడిగి, మీకు తెలిపెదను. రేపు రావలెను" అని యాతడు పలికెను.

శక్రుడు బోధిసత్త్వునిసన్నిధికి వచ్చి కూరుచుండెను. అంతట బోధిసత్త్వు డావిషయము శక్రు నడిగెను. "భన్తే, కాళింగుడు జయించును. అశ్వకు డోడిపోవును. దీనికి ముందుగానే చిన్నెలు కానబడును" అని శక్రుడు చెప్పెను.

మరునాడు కాళింగుడు వచ్చి అడుగగా బోధిసత్త్వుడు చెప్పెను. పూర్వలక్షణము లేవి యని కాళింగు డడుగకుండనే సంతోషముతో ఉబ్బిపోయి నిష్క్రమించెను. ఈ వార్త అంతటను వ్యాపించెను. ఇది విని అశ్వకరాజు నందిసేనుని పిలిపించి "కాళింగుడు జయించును; మన మోడిపోవుదుము. ఇప్పు డేమి చేయవలెను?" అని యడిగెను.

"మహారాజా, ఎవ్వరు గెలుతురో, ఎవ్వ రోడుదురో ఎవ్వ రెరుగు దురు? మీరు విచారింపవద్దు" అని యతడు రాజు నోదార్చి, బోధి సత్త్వునికడ కరిగి, వందనము చేసి, ఒకప్రక్కన గూరుచుండి "భన్తే, ఎవరు జయింతురు? ఎవరు పరాజితు లగుదురు?" అని ప్రశ్నించెను.

"కాళింగుడు గెలుచును, అశ్వకు డోడిపోవును."

"భన్తే, విజయికి పూర్వలక్షణము లెవ్వి? పరాజితునకు ముందు చిన్నె లేవి?"

"విజయికి నిండు తెలియెద్దు రక్షకదేవత; పరాజితునకు నిండు కరి యెద్దు రక్షకదేవత. మహాపుణ్యపురుషా, రక్షకదేవతలే ఉభయుల జయపరాజయములను నిర్ణయించును."

అది విని నందిసేనుడు చని రాజభక్తిపరాయణులైన వేయిమంది మహాయోధులను బిలిపించి, సమీపపర్వతాగ్రముమీదికి కొనిపోయి "ఏమి, మీరు మనరాజుకొరకు ప్రాణత్యాగము చేయగలరా?" అనెను. "ఆ, ప్రాణత్యాగము చేయగలము." "అట్లయిన, ఈ ప్రపాతము మీదినుండి దుముకుడు." వారు దుముకుటకు సిద్ధము కాగా ఆతడు వారిని వారించి "దుముకవలదు. రాజుకొరకు ప్రాణ త్యాగము చేయు గుండెదిటవుతో పోరాడుడు" అని పలికెను. వారు సమ్మతించిరి.

యుద్ధము సమీపించుచున్నను నేను జయింతు ననుతలపుతో కాళింగు డశ్రద్ధతో నుండెను. ఆతనిసైనికులుకూడ మాకు విజయము కలుగుననుతలపుతో శ్రద్ధ సడలించిరి. వారు కవచములు తొలగించి, జట్లుజట్లుగా చేరి, ఇచ్ఛ వచ్చినట్లు పరిక్రమించుచుండిరి. విక్రమింపవలసిన సమయమున విశ్రమించుచుండిరి. రాజు లిరువురు అశ్వారూఢులయి యుద్ధార్థము సమీపించిరి. వారి రక్షకదేవతలు ముందే దరిజేరినవి. కాళింగుని రక్షకదేవత సర్వశ్వేతమైన వృషభము; అశ్వకునిది సర్వనీల వృషభము. ఉభయులును యుద్ధసన్నద్ధు లయిరి. ఆ వృషభములు ఆ రాజు లిరువురకు మాత్రము కానబడుచు, అన్యులకు కానవచ్చుట లేదు. నందిసేనుడు అశ్వకరాజుతో "మహారాజా, మీకు రక్షకదేవత కనబడుచున్నదా?" అనెను. "అవును, కానవచ్చుచున్నది." "ఏ రూప ముతో?" "కాళింగుని దేవత శ్వేతవృషభరూపమునను, మనదేవత

నీలవృషభరూపమునను గోచరించుచున్నవి.'' "మహారాజా, మీరు భయపడవలదు. మనము జయింతుము. కాళింగు డోడిపోవును. మీరు గుఱ్ఱమెక్కి, ఈ శక్తిని దీసికొని, సుశిక్షిత సైంధవము కడుపుమీద ఎడమచేతితో గట్టిగానొక్కి ఈ వేయిమంది సైనికులతో త్వరితగతిని జని, కాళింగుని రక్షకదేవతను ఈశక్తితో ప్రహరింపుడు. మన వేయి మంది వేయిశక్తులతో కొట్టుదురు. కాళింగుని రక్షకదేవత నశించును. కాళింగుడు పరాజితు డగును, మనము జయింతుము'' అని చెప్పెను.

'మంచిది' అని రాజు మంత్రి చెప్పినప్రకారముపోయి శక్తితో వృషభమును ప్రహరించెను. రాజపురుషులుకూడ అట్లే యాచరించిరి. రక్షక దేవత అచ్చటనే ప్రాణములు విడిచెను. తోడనే కాళింగుడు పరాజితుడై పలాయనము చేసెను. అతడు పారిపోయినా డని వేయిమంది సైనికులు కోలాహలము చేసిరి. ప్రాణభయమున కాళింగుడు పారిపోవుచు ఆ తపస్విని దూషించుచు ఈ రెండవగాధ పలికెను.

సర్వ మోర్చు కాళింగుల జయము తథ్య,
మాశ్మకేయుల కపజయ మగుట ధ్రువము
అని కదా బ్రహ్మచారి, నీ వన్నవాడ;
వనృత మాడరె ఋజుగాము లైనవారు.

ఈవిధముగా తాపసుని దూషించుచు నతడు నిజనగరము చేరెను. త్రోవలో ఆగి ఎవరిని వెనుదిరిగి చూడనైన చూడలేదు.

తరువాత కొలదిదినములకు శక్రుడు బోధిసత్త్వుని సన్నిధికి వచ్చెను. తపస్వి ఆయనతో సంభాషించుచు, ఈ మూడవగాధ పలికెను.

శక్ర, దేవత లెప్పు డసత్యవాక్కు
పలుకరె! సత్యమే వారి పరమధనమె!
ఏల ఓ దేవరాజ, మహేంద్ర, నీవు
పల్కితివి సూనృతేతర భాషణములు!

ఇది విని శక్రుడు నాలుగవ గాథ పలికెను:

నీవు బ్రాహ్మణ, వినలేద దేవతలకు
ఈర్ష్య యుండదు శూరులయెడల ననుచు?
అస్వకులకు నేకాగ్రతావ్యగ్రతలును
సంయమము, సమయజ్ఞత జయము గూర్చె.

కాళింగరాజు పారిపోవుచు విడిచిపెట్టిన వస్తుసముదాయమును అశ్వక రాజు నిజనగరమునకు పట్టించుకొనిపోయెను. నందిసేనుడు కాళింగ రాజుకు లేఖలో "ఈ నలువురు రాజకన్యలకు కట్నములు పంపవలెను. పంపనిచో ఉచితమైనపని చేయుదుము" అని వ్రాసెను. ఆ సందేశము విని కాళింగుడు ప్రాణభయము చెంది దొరికినంత ధనము పంపెను.

అప్పటినుండి ఉభయులు సుఖముగా కలియికతో నివసించుచుండిరి.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున కళింగరాజకన్యలు తరుణభిక్షుణులు. నందిసేనుడు సారిపుత్రుడు. తపస్వి నేనే.

## 302. మహా-అశ్వారోహ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, ఆనందస్థవిరునిగూర్చి చెప్పినది. వర్తమాన కథ పూర్వమే వచ్చినది (157 గుణజాతకము). "పూర్వకాలమున పండితులు తమ కుపకారముచేసినవారి కుపకారము చేసిరి" అని శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము బోధిసత్త్వుడు వారాణసీరాజయి పుట్టి, ధర్మమార్గమున న్యాయపూర్వకముగా పరిపాలన చేయుచు, దానధర్మములు చేయుచు శీలములు రక్షించుచుండెను.

సీమాంతమున చెలరేగిన విద్రోహుల నణచుటకై యతడు సేనా సమేతముగా బయలుదేరి పోయి పరాజితుడై, సరిహద్దుగ్రామమును అశ్వారోహియై చేరెను. అచ్చట ముప్పదిమంది రాజసేవకు లుండిరి. ప్రాతఃకాలమున వారు గ్రామమధ్యమున చేరి గ్రామకార్యములు నిర్వ ర్తించుచుందురు. సజ్జీకృతమైన అశ్వముమీద రాజు గ్రామ ద్వారమువెంట ఊరిలో ఆసమయమున ప్రవేశించెను. ఏ మిది యని వారు భయభ్రాంతులై పరుగిడి నిజనివాసములలో ప్రవేశించిరి. కాని ఒకడుమాత్రము తనయింటికి వచ్చిన జనకరాజును స్వాగత మడిగి,

"ప్రభువు సరిహద్దుకు వెళ్ళినట్లు వినికిడి. నీవు రాజపురుషుడవా? చోరుడవా?" అని యడిగెను. "స్వామ్యా, నేను రాజపురుషుడను." "అట్లయినరమ్ము" అని యాతడు రాజును ఇంటికి గొనిపోయి తనపీఠముపై గూరుచుండబెట్టి, భార్యను బిలిచి "భద్రే, ఇటురా. ఈమిత్రునిపాదములు కడుగు" అని పాదములు కడిగించి, తన శక్తికొలది భోజనము పెట్టి "కొంచెము విశ్రమింపుడు" అని పక్క వేసెను. రాజు పండుకొనెను. ఇంతలో నాతడు గుర్రముమీదజీను తీసి, ఇటునటు దానిని త్రిప్పి, నీరుపట్టి, వీపుమీద తైలము రాచి, మాలీసుచేసి, గడ్డి వేసెను.

ఈవిధముగా ఆపురుషుడు మూడు నాలుగు దినములు రాజుకు సేవ చేసెను. రాజు వెడలిపోవుదు నన్నరోజునకూడ రాజునకు అశ్వమునకు చేయదగినసేవలు చేసెను. భోజనానంతరము రాజు బయలుదేరుచు "స్వామ్యా, నాపేరు మహాశ్వారోహి. మాయిల్లు నగరమధ్యమున నున్నది. నీ వేపనిమీద నయిన నగరమునకు వచ్చినచో దక్షిణ ద్వారపాలకునితో మహాశ్వారోహియిల్లు చూపు మని యడిగి, వాని వెంట మాయింటికి రావలెను" అని పలికి వెడలిపోయెను.

అక్కడ రాజు కనబడకపోవుటచే సైన్యము నగరమువెలుపలనే శిబిరములో నుండెను. రాజదర్శన మయినంతనే సైన్య మాయనకు స్వాగతము పలికెను. రాజు నగరప్రవేశము చేయునపుడు ద్వారపాలకు నొకని బిలిపించి, దగ్గరనున్న జనము నావలకు బంపి, వానితో "బాబా, సీమాంతగ్రామవాసి యొకడు వచ్చి మహాశ్వారోహిని చూడగోరినచో నీవు వానిని చేయిపుచ్చుకొని నాసన్నిధికి గొని రావలెను. నీకు సహస్రము ముట్టును" అని చెప్పెను.

ఎన్నాళ్ళకును గ్రామీణుడు రాలేదు. రాజు ఆ యూరిపన్ను రెండురెట్లు చేసెను. అప్పటికిని వాడు రాలేదు. రెండవమారు, మూడవమారు కూడ రాజు గ్రామముమీద హెచ్చుపన్ను వేయించెను. కాని వాడు రానేలేదు.

ఒకనా డాగ్రామవాసులు సమావిష్టులై ఆపురుషునితో "నీ అశ్వారోహి వచ్చి పోయినప్పటినుండియు తలబరువు మోయలేనంతగా పన్నులు హెచ్చినవి. నీవు పోయి ఆయనతో చెప్పి పన్నులు తొలగింపుము" అని పలికిరి.

"మంచిది పోవుదును. కాని రిక్తహస్తములతో నెట్లు పోవుదును? నామిత్రుని కిరువురు బిడ్డలు కలరు. వారికి, ఆయన భార్యకు, ఆయనకు వస్త్రములు, ఆభరణములును సిద్ధము చేయుడు."

"సరే, సిద్ధము చేయుదుము" అని వారు కానుకలు సిద్ధముచేసిరి. అత డాకానుకలను, తన యింటి పిండివంటలను వెంటగొని, రాజధానీ దక్షిణద్వారము చేరి ద్వారపాలకునితో "మిత్రమా, మహాశ్వారోహకుని యిల్లెక్కడ ?" అని యడిగెను. 'రా చూపుదును' అని వా డాతని చేయిపట్టుకొని రాజద్వారముకడకు గొని పోయెను. సీమాంతగ్రామ వాసి వచ్చినా డని వినగానే రాజు పీఠమునుండి లేచి నిలిచి 'నా మిత్రుడు, ఆతని వెంట నున్నవాడును రావచ్చును' అని పలికి, అతడు రాగానే స్వాగతము చెప్పి కంఠము కౌగలించుకొని 'నీ భార్యయు, బిడ్డయును క్షేమమేనా ?' అని యడిగి, మరల చేయిపట్టుకొని ఉన్నత మైన అంతస్థు నెక్కించి, శ్వేతచ్ఛత్రముక్రింద గూరుచుండబెట్టి, రాణిని బిలిచి మిత్రునిపాదములు కడిగించెను. రాజు బంగరుకలశముతో నీరు పోసెను. పాదములు తుడిచి దేవి సుగంధతైలము రాచెను. రాజు "మిత్రమా, తినుట కేమయినను తెచ్చినావా ?" అనెను. ఆ అని యతడు సంచిలోనుండి తినుబండములు తీసెను. రాజు వానిని బంగరు పళ్ళెరమున నుంచి "నా మిత్రుడు తెచ్చిన పిండివంటలను తినుడు" అని ఆదరముతో పలికి రాణికిని అమాత్యులకును వానిని పంచి, తాను గూడ భుజించెను.

గ్రామీణుడు తక్కిన కానుకలనుగూడ రాజునెదుట నుంచెను. వాని నాదరించుటకై రాజు కాశీవస్త్రములను విడిచి, అతడు తెచ్చిన వస్త్రములను ధరించెను. రాణికూడ అతడు తెచ్చిన చీరెను, అలంకారములను ధరించి అమాత్యు నొకని బిలిచి యిట్లానతిచ్చెను : "నాకు చేయు అభ్యంజనాదికము ఇతనికి ఏర్పాటు చేయుము. సుగంధజలముతో స్నానము చేయింపవలెను. విలువకల కాశీవస్త్రములను కట్టింపవలెను. రాజాభరణములతో నలంకరింపవలెను." అమాత్యు డట్లే నెరవేర్చెను.

రాజు నగరమున భేరీ వేయించి, రాజోద్యోగులను సమావేశ పరచి, శ్వేతచ్ఛత్రమున మధ్యగా సిందూరవర్ణసూత్రము వేసి అర్ధ

రాజ్యము గ్రామీణునకిచ్చెను. అప్పటి నుండియు వా రిరువురు ఒకటిగానే భోజనముచేయుచు నిద్రించుచుండిరి. అన్యులు భంగము చేయలేనంత దృఢవిశ్వాసముతో నుండిరి. ఆతనిభార్యాపుత్రులను పిలిపించి రాజు వారికి నగరమున నివాస మేర్పాటుచేసెను. ఉభయులును సమోదముతో రాజ్యము చేయుచుండిరి.

క్రోధముతో అమాత్యులు రాజకుమారుని బిలిచి "కుమారా, ఒకగృహస్థునకు రాజు అర్ధరాజ్య మిచ్చి, కలిసిభుజించుచు, నిద్రించుచు వాని చిన్నబిడ్డలకుగూడ పెద్దలచే నమస్కారము చేయించుచున్నాడు. వీడు రాజున కేయుపకారము చేసినాడో తెలియదు. రాజేమి చేయగలడు? మేము సిగ్గుపడుచున్నాము. నీవు రాజుతో మాటాడుము" అని చెప్పిరి.

మంచి దని రాజకుమారు డంగీకరించి, విషయ మంతయును రాజునకు నివేదించి 'మహారాజా, ఇట్లు చేయవలదు' అని ప్రార్థించెను.

"నాయనా, నేను యుద్ధమున ఓడిపోయి, ఎక్కడ నుంటినో తెలియునా?" "తెలియదు దేవా!" "నేను ఈతనియింటనే యుండి స్వస్థుడనై వచ్చి రాజ్యము చేయుచున్నాను. ఎవనివలన నా కింతయుపకారము జరిగెనో అతనికి సంపత్తి ఎట్లీయకుందును?" అని పలికి బోధిసత్త్వుడు "బాబా, ఎవడు అయోగ్యునకు దానము చేయుచు, యోగ్యునకు దానము చేయడో అట్టివాడు కష్టములపా లయినపుడు వాని కేమియు ఉపకారము లభింపదు" అను నర్థము బోధించు నీగాథలను పలికెను:

ఈయ గూడనివారి కిచ్చుచు నున్న
ఈయంగ దగువారి కీయక యున్న
కష్టాల తోడ్పాటు కలుగుట కల్ల!

ఎవ్వ డయోగ్యుల కీయక యుండు
ఎవ్వండు యోగ్యుల కిచ్చుచు నుండు
కష్టాల జిక్కిన కాలమ్మునందు
తోడ్పాటు వానికి దొరకుచునుండు.

శతు దనార్యుం డైన జనునకు మేలు
చేయుచో సఫలతం జెందక సమయు.

ఆర్యులు, శ్రేష్ఠులైనట్టివారలకు
చేసిన యుపకృతి చిన్నదే యైన
కలుగుచుండును మహాఫలితంబు దాన.

ఆదిలో ధూర్తుట మైన కల్యాణ
కార్యంబు నెవ్వడు కావించినాడొ
ఆవల నేమియు కావింపకున్న
నొకడు పూజార్హు డగుట నిశ్చయము.

జ్వలనంబునందు బీజంబు పడ్డపుడ
అంకురింపక భస్మ మైపోవునట్లు
కాపురుషున కుపకారంబు చేయ
సఫలతం జెందక సమసియేపోవు.

ఇది విని, అమాత్యుడు కాని, రాజకుమారుడు కాని మరల మాటాడ లేదు.

శాస్త్ర ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున సరిహద్దు నివాసి ఆనందుడు; వారాణసీప్రభువు నేనే.

## 303 ఏకరాజ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయు సమయమున కోసల నరేశుని సేవకులలో ఒకానొకనిని గూర్చి చెప్పినది. వర్తమాన కథ సేయ్యంసజాతకమున (282) వచ్చెడిది. ఇచట శాస్త్ర "నీవుమాత్రమే కాదు. ప్రాచీన పండితులుగూడ తమకు గలిగిన అనర్థమునుండి అర్థమునే సాధించిరి" అని పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వకాలమున వారాణసీరాజుగారి సన్నిహితామాత్యుడు అంతఃపురద్రోహము చేసినాడు. వానిదోషమును రాజు ప్రత్యక్షముగా చూచి వానిని నిజరాష్ట్రమునుండి వెడలనంపినాడు. వాడు దర్భసేను

డను కోసలరాజుకొలువులో చేరినాడు. ఇది యంతయు మహాసీలవజాత కమున చెప్పబడినది (51).

ఇందులో మేడపై మహామాత్యులనడుమ కూరుచున్న వారాణసీ నరేశ్వరుని పట్టి తెప్పించి, ఉట్టిలోవేసి, ఉత్తరద్వారమున తలక్రిందుగా వ్రేలాడదీయించెను. వారాణసీరాజు దర్భసేనునియెడ మైత్రిభావనతో నుండి యోగమార్గమున ధ్యాననిష్ఠుడై యుండెను. అంతలో బంధనములు తెగిపోయినవి. ఆయన ఆకాశమున పర్యంకమున కూరుచుండెను. దర్భసేనుని శరీరమున మంట చెలరేగెను. మండిపోవుచున్నానని వాడు ఇటునటు పొరలాడజొచ్చెను. ఇందులకు కారణమేమని విచారింపగా "మహారాజా, ధార్మికుని మీరు నిష్కారణముగా తలక్రిందుగా ఉత్తరద్వారమున వ్రేలాడదీయుంచుటవలన కలిగినది" అని సమాధానము వచ్చెను. "అట్లయిన తక్షణమే పోయి ఆయనను విడిపింపుడు" అనగా రాజపురుషులు పోయి గగనస్థితుడయిన రాజును జూచి ఆసంగతి దర్భసేనునకు తెలిపిరి. ఆతడు శీఘ్రముగా వచ్చి నమస్కారము చేసి, క్షమాపణ వేడి, ఈ తొలిగాథ పలికెను:

ఏకరాజా, పూర్వ మీవు సమృద్ధ
భోగమ్ము లెన్నెన్నొ పొందెడివాడ,
విప్పుడు పడినాడ వీ నరకాన!
వెనుకటి వర్ణంబు వీడిపోలేదె?

ఇది విని బోధిసత్త్వుడీ శేషగాథలు పలికినాడు:

తపము శాంతియు పూర్వమే దబ్బసేన
వేడియుంటిని; దానాదివిధుల నెల్ల
సక్రమంబుగ నెరవేర్ప సద్యశంబు
సంఘటిల్లె; శరీరంబు సడలలేదు,
తగ్గిపోలేదు వర్ణంబు దబ్బసేన!
దుఃఖమును, సుఖమ్ము, సమముగా దూరమందె
వదలి, కొందరు శాంతితో వర్తిలుదురు.

విని దర్భసేనుడు క్షమాపణ వేడి, బోధిసత్త్వునితో, "మీరాజ్యము మీ రేలికొనుడు. నారాజ్యము చోరులనుండి కాపాడుదును" అని ఆదుష్టామాత్యునికి రాజ్య మిచ్చి వెడలిపోయెను.

బోధిసత్త్వుడుకూడ నిజామాత్యులకు రాజ్య మిచ్చి పరివ్రజించి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున దబ్బసేనుడు ఆనందుడు; వారాణసీ నరేశుడు నేనే.

## 304 దద్దర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు క్రోధనశీలుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున ఆతని క్రోధశీలమును గూర్చి ధర్మసభలో చర్చ జరుగుచుండగా, శాస్త అరుగుదెంచి "భిక్షువులారా, కూరుచుండి ఏమి సంభాషించుచున్నారు!" అని యడిగెను.

"ఫలాని విషయము."

శాస్త ఆభిక్షువును పిలువనంపి "భిక్షూ, నీవు నిజముగా కోపధారివా?" అని యడిగెను.

"భన్తే, చిత్తము."

"భిక్షువులారా, ఈతడు ఇప్పుడే కాదు, పూర్వజన్మమున గూడ క్రోధశీలుడే. ఇందుచే శుద్ధ నాగరాజకులమున బుట్టిన ప్రాచీనపండితులు గూడ మూడు సంవత్సరముల బాటు మురికితో నిండిన పెంటకుప్పలున్నచోట ఉండవలసి వచ్చెను." అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా హిమాలయప్రదేశమున దద్దరపర్వతప్రాంతమున నాగభవనమున రాజ్యము చేయు దద్దరరాజుకు బోధిసత్త్వుడు మహాదద్దరు డనుపేర పుత్రుడై జన్మించెను. ఆతనితమ్మునిపేరు చిన్నదద్దరుడు. వాడు కఠిన స్వభావుడై నాగకుమారులను దూషించుచు ప్రహారించుచుండెను. నాగ

రాజునకు ఈ విషయము తెలిసినంతనే చిన్నదద్దరుని నాగభవనము నుండి వెడలనడవ నాజ్ఞయిచ్చెను. మహాదద్దరుడు తండ్రిని వేడుకొని ఆజ్ఞ తిరుగ దీయించెను. మరియొకమారు రాజుకు చిన్నకుమారుని మీాద ఆగ్రహాము కలిగెను. మహాదద్దరుడు ఆనతి మరల త్రిప్పించెను. మూడవమారు తండ్రి కుపితుడయి "నీవు ఈనిర్మర్యాదుని నిలుపనెంచు చున్నావు. నీవుకూడ వీనితోపాటు నాగభవనమును విడిచి, వారాణ సిలో పెంటపోగులు పోయుచోట మూడువత్సరము లుండవలెను" అని శాసించెను. ఇరువురు నచటికి పోయి నివసించుచుండిరి.

అవి నీటికై ఆహారమునకై పెంటదిబ్బలమీాద తిరుగుచుండుట చూచి గ్రామబాలకులు మట్టిబెడ్డలు కర్రముక్కలు విసరివేయుచు "పెద్ద పడగ లున్నవి, కాని నీటిపాములు" అని నిందించుచుండిరి. చిన్నదద్దరుడు కుపితుడై ఆయవమానము సహింపలేక "అన్నా, ఈ బాలకులు మనల గేలిచేయుచున్నారు. మనము విషసర్పముల మని వీరికి తెలియదు. ఈ యవమానము సహింపను. ఫూత్కారముతో నాశముచేయుదును" అని సోదరునితో సంభాషించుచు ఈతొలిగాథ పలికెను:

ఓయి దద్దర, లోకదుష్టోక్తులం నను
బాధ పెట్టును; గ్రామీాణబాలకులును
మేటికప్పల దినుటతో, నీటిదరిని
పండుకొని యుండు పురుగని పరిహసింత్రు
గొప్ప యాశీవిషంబునుగూడ నిట్లు.

అతనిపలుకులు విని మహాదద్దరుడు మిగిలిన గాథలు పలికెను:

నిజదేశమం దుండి నిష్కాస మొంది
వేరొకదేశంబు జేరిన యపుడు
ఓపిక వలయు దురుక్తులు వినగ.
పరిచితుల్ కానట్టి నరుల మధ్యమున
నివసించునప్పుడు నిజశీలజాతి
తెలియనివారిపై వలదు కోపంబు.
అగ్నివోలె ప్రచండు డైన ధీమంతు
డన్యప్రదేశమునం దుండువేళ
క్షమియింపవలె దాసజనబిభీషికలం.

ఈవిధముగా వారు మూడుసంవత్సరము లచ్చట నుండిరి. అనంతరము తండ్రి వారిని నిజనివాసమునకు పిలిపించెను. నాటినుండి వారు శాంతచిత్తు లయిరి.

శాస్త ఈధర్మోపదేశము చేసి సత్యములను ప్రకటించి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము కుపితభిక్షువు అనాగామిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. ఆసమయమున క్షుద్ర దద్దరుడు క్రోధశీలు డగు భిక్షువు. మహాదద్దరుడు నేనే.

## 305 సీలవీమంసన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా కాముకత్వనిగ్రహమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథ ఏకాదశనిపాతములోని పాణీయజాతకమున (459) వచ్చును. ఇచ్చట ఇయ్యది సంక్షిప్త వర్ణనము. జేతవననివాసు లగు పంచశత భిక్షువులకు అర్ధరాత్రమైన పిమ్మట కామభోగసంబంధ మగు సంకల్పము కలిగెను. శాస్త దినరాత్రములలో ఆరువేళల భిక్షువులపై దృష్టి నిలిపి యుంచెడివాడు. నాటిరాత్రి ఆయన దివ్యచక్షువు ప్రాసారించి జేతవనమును కనుగొనగా రాజప్రాసాదమున చోరులు దాగినట్లుగా భిక్షువులు ఉన్నట్లు తోచెను. అంతట శాస్త గంధకుటి తెరిపించి ఆనందస్థవిరుని పిలువనంపి, "ఆనందా, భిక్షువులను సమావేశపరచి గంధకుటీ ద్వారమున ఆసనము పరచియుంచుము" అని చెప్పెను. ఆనందు డట్లే చేయించి శాస్త కెరుకపరచెను. అంతట శాస్త పరచిన యాసనముపై కూరుచుండి, భిక్షుసమూహము నుద్దేశించి "భిక్షువులారా, పూర్వకాలమున పండితులు ఈవిషయము యోచించి ఎచటనో రహస్యముండగూడదు అని పాపకర్మము లాచరింపలేదు" అని వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున పుట్టి పెరిగి పెద్దవాడయి, అచ్చటనే ప్రసిద్ధాచార్యునికడ అయిదువందలమంది విద్యార్థులలో ప్రథముడుగా విద్యాభ్యాసము చేయుచుండెను. ఆచార్యునకు వయసు వచ్చిన కూతురు కలదు. విద్యార్థులశీలములను పరీక్షించి సదాచారసంపన్నుడగువానికి ఆయన తనతనయ నీయదలచెను. ఆయన విద్యార్థులను "పిలిచి నాయనలారా, నాపుత్రిక పెద్దదయినది. ఈమెకు వివాహము చేయవలెను. అందులకు వస్త్రములు అలంకారములును కావలెను. మీరు మీబంధువుల కనుబ్రామి ఎవ్వరునుచూడకుండ వస్త్రాలంకారములను అపహరించి తేవలెను" అని చెప్పెను. మంచి దని వారు సమ్మతించి నాటినుండి నిజబంధువుల కనులు మూసి వస్త్రాభరణాదులను దెచ్చి యిచ్చుచుండిరి. వాని నాచార్యుడు విడివిడిగా నుంచుచుండెను. బోధిసత్త్వుడు మాత్ర మేమియు తీసికొనిరాలేదు. ఆచార్యుడాతనితో "నాయనా, నీ వేమియు తెచ్చుట లే దేమి?" అనెను. "తెచ్చుట లేదు." "ఏల? నాయనా!" "ఇతరులు చూచుచుండ తెచ్చిన వస్తువులు మీరు స్వీకరింపరు. పాపకార్యము చేయుటకై రహస్యప్రదేశము నాకు కనబడలేదు" అనెడి భావము వ్యక్తము చేయు నీ రెండుగాథలు పలికెను:

పాపకార్యంబు లొనరించు పట్టులందు
దొరకదు రహఃప్రదేశము దుర్జనులకు,
వన్యజంతుబృందము కనవచ్చుచోటు
తలచుచుండు మూఢుడు రహఃస్థానముగనె.

ఎట్టియు రహఃప్రదేశమం చెంచ లేను;
శూన్య మని చెప్పదగినట్టి చోటు లేదు,
ఒక్కడును లేనితావునం దుండ లేను.

ఆచార్యు డతనియెడ ప్రసన్నుడై "నాయనా, నా యింట ధనము కలదు. సదాచారు డగువానికి నాబిడ్డ నిచ్చుతలపున ఈ విద్యార్థులను పరీక్షించుటకై యిట్లు చేసితిని. నా పుత్రిక నీకు తగినది" అని ఆమె నలంకరించి యతని కిచ్చెను.

అనంతరము విద్యార్థులతో "మీరు తెచ్చిన పన్నియు మీ మీ యిండ్లకు గొనిపొండు" అని ఆచార్యుడు చెప్పెను.

శాస్త్ర యిట్లనెను: "భిక్షుకులారా, వారివారి దుస్స్వభావమువలన వారికి కన్య లభింపలేదు: యోగ్యుడగుట వలన ఆ విద్యార్థికి లభించినది". అని చెప్పి, అభిసంబుద్ధుడైనపిదప ఈ గాథలు పలికెను :

స్త్రీలపై నాసక్తచిత్తులైనట్టి
విద్యార్థు లెందరో విడిచినవారు
ధర్మంబు;
మరి సర్వధర్మ విదుండు,
ధృతిమంతుడును, సత్య దృఢ నైష్ఠికుండు,
ధర్మపాలకు డైన ధరణీసురుండు
ధర్మంబు నే రీతి త్యజియింపగలడు?

శాస్త్ర ఇట్లు ధర్మోపదేశము చేసి, సత్యప్రకాశనము కావించి, రెండు జాతకములు పరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము 500 మంది భిక్షువులు అర్హతులైరి.
ఆ కాలమున ఆచార్యుడు సారిపుత్రుడు. పండిత విద్యార్థులు నేనే.

## 306 సుజాతా జాతకము

జేతవనమున శాస్త్ర విహారము చేయుచు మల్లికాదేవిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఒకనాడు రాజుతో ఆమెకు ప్రణయకలహము సంభవించెను. కుపితుడైనరాజు ఆమెయెడ సంపూర్ణముగ నిర్లక్ష్యముతో నుండెను. మల్లికాదేవి తనలో, "రాజుగారికి నామీద కోపమువచ్చినది అని శాస్త్రకు తెలిసియుండదు" అనుకొనెను. శాస్త్ర ఈ విషయము గ్రహించి, వీ రిరువురకును సమ్మేళనము కలిగింతు నని తలచి పూర్వాహ్ణ సమయమున పాత్ర, చీవరములు పట్టుకుని, ఐదువందల మంది భిక్షువు

లతో బయలువెడలి శ్రావస్తి చేరి రాజద్వారమున ప్రవేశించెను. రాజు వచ్చి తథాగతుని, చేతిలోని పాత్ర నందుకొని లోనికి తోడ్కొని పోయి ఆసనముపై గూర్చుండ బెట్టెను. ఆవల రాజు బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు ప్రణామము చేసి, యవాగు ఖాద్యములు తెప్పించెను. శాస్త్ర పాత్రను చేతితో మూసి, దేవి యెక్కడ? అనెను.

"భన్తే, ఆమెతో నేమి పని? ఆమె నిజయశస్సును అభిమానము వలన పోగొట్టుకొనినది."

"మహారాజా, స్వయముగా నీవు ఆమెకు పెద్ద పేరు తెచ్చి, స్త్రీకి ఉన్నతస్థాన మిచ్చి ఆమె చేసిన పొరపాటు సహింపకుండుట తగదు.

రాజు శాస్త్రవచనములు విని ఆమెను పిలువనంపి ఆమెచేతనే శాస్త్రకు వడ్డన చేయించెను. 'మీరు కలిసియుండవలెను' అని శాస్త్ర ఐక్యరసమును ప్రశంసించి, వెడలిపోయెను. నాటినుండి వారుభయులు కలిసియుండిరి.

ధర్మసభలో భిక్షువులు సంభాషించుచు, "ఆయుష్మంతులారా, శాస్త్ర ఒక్కమాటతోనే రాజదంపతులకు సమ్మేళనము కలిగించెను" అనిరి. ఇంతలో శాస్త్ర అచటి కరుదెంచి విషయము తెలిసికొని, "భిక్షువులారా, కేవలము ఇప్పుడే కాదు. పూర్వము కూడా ఒక్కమాటతోనే వీరికి కలయిక కలిగించితిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వు డాయనకు అర్థధర్మానుశాసకు డైన అమాత్యు డయ్యెను. ఒకనాడు రాజు వాతాయనము తెరచి అంగణములోనికి చూచుచు నిలుచుండెను. అప్పుడు తోటమాలికూతురు చక్కని పడుచుపిల్ల నెత్తిన పండ్లబుట్ట పెట్టుకొని రేగుపండ్లు రేగుపండ్లు అనుచు అంగణములో ప్రవేశించెను. రాజు యువతికంఠధ్వని విని ప్రతిబద్ధచిత్తుడై ఆమె కెవ్వరు లేరని తెలిసికొని పిలిపించి అగ్రమహిషీస్థానమున నిలిపి విశేషాదరము చూపెను. ఆమె రాజుకు మనఃప్రియురాలయ్యెను.

ఒకనాడు రాజు బంగరుపళ్ళెరములోని రేగుపండ్లు తినుచుండెను.

సుజాతాదేవి చూచి 'మహారాజా, ఏమి తినుచున్నారు?' అని యడుగుచు ఈ తొలిగాథ పలికెను:

హాటకకలశంబునం దుంచినట్టి
కమనీయలోహితాండములతో నేమి?
ప్రశ్నించితిని దేవ, పలుకుడు బదులు.

రాజు కుపితుండై "రేగుపండ్లు విక్రయించు మాలికూతురు తనకుల సంపద యగు రేగుపండ్లను గురుతింపజాలకున్నది" అని ఈ రెండు గాథలు పలికెను:

మును నీవు దేవి, మాసినచీర కట్టి
ఒడిలోన ఏఫలాలొనగూర్చినావో
తావకవంశోచితము లాఫలాలు.

ఎవ్వారి యుల్లాస మెచటనో యుండి
యుక్తప్రదేశాన నుండదో మనసు
ఆవ్వారి రాజభోగాదులు విడుచు
బదరీఫలంబులు బాగుగా నేరి
కొనజాలుచోటికి గొని చను డీమె.

ఈమెను నేను తప్ప ఇతరులు సరిచేయజాలరని బోధిసత్త్వుడు భావించి, ఈమెను ఇంటినుండి వెడలనడపకుండ రాజు నాపెదను అనుకొని ఈ నాలుగవ గాథ పలికెను.

ఉత్తమపదవియం దున్నను స్త్రీల
నిట్టిలోపము కానిపించుచు నుండు.
కనుక మహారాజ, కినుకపూనకుడు;
క్షమింపవలెను సుజాతను రాజ!

ఆమెయపరాధము క్షమించి రాజామెను యథాస్థానమున నుంచెను. నాటినుండి యుభయులు కలిసిమెలసి యుండిరి.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వారాణసీ నరేశుడు కోసలరాజు; సుజాత మల్లిక; అమాత్యుడు నేనే.

## 307 పలాస జాతకము

శాస్త పరినిర్వాణశయ్యపై దొరలుచు ఆనందస్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆయుష్మాన్ శోకాభిభూతుడై ఉద్యానములోని వసారాలో కుండీ పట్టుకొని రోదనము చేయుచుండెను. నేటిరాత్రి పడినంతనే శాస్త పరినిర్వాణము చెందెను. నేను ఇప్పటికిని శిక్షణ పొందుచున్నాను; నా జీవితోద్దేశ్య మింకను పూర్ణము కాలేదు. నా శాస్త పరినిర్వాణము చెందును. ఇరువదియైదు సంవత్సరములపాటు నేను చేసిన సేవ యంతయు నిష్ఫలమగును" అని ఆతడు విలపించుచుండెను. శాస్త ఆతనిని చూడక, ఆనందు డెచట నున్నాడు? అని సంగతి తెలిసికొన్నపిదప ఆతనిని పిలువనంపి, "ఆనందా, నీవు పుణ్యార్జనము చేసినావు ఇంకను ప్రయత్నింపుము. త్వరలోనే అనాశ్రయుడ వగుదువు విచారింపకుము. పూర్వజన్మమున నీవు సరాగుడవై యున్నపుడుగూడ నాకు చేసిన సేవ నిష్ఫలము కాలేదు. అట్టిచో ఇప్పుడు నీవు నాకు చేసిన సేవ ఎట్లు నిష్ఫలమగును?" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు తత్సమీపముననే పలాశవృక్షదేవతగా జన్మించెను. ఆకాలమున కాశీవాసులు దేవతాపూజలు చేయుచుండిరి. నిత్యము బలికరణాదికమున నియుక్తు లగుచుండెడివారు. ఒకానొక దరిద్రబ్రాహ్మణుడు "నేనుకూడ ఒక దేవతను పూజింతును" అని తలపోసి, ఉన్నత ప్రదేశమున నున్న పెద్దపలాశవృక్షముక్రింద నేల సమతలము చేసి, గడ్డి పెరికి, నలుప్రక్కల ఇసుక పరచి, ఊడ్చి, వృక్షముమీద పంచాంగుళిచిహ్న ముంచి, ధూపదీపాదులు సమకూర్చి, ప్రదక్షిణము చేసి యింటికి పోవునపుడు "సుఖముగా శయనింపుము" అని వెడలుచుండును. మరునాడు ప్రాతఃకాలమున చని, (సుఖముగా శయనించితివా) అని యడుగుచుండును. ఒకనాడు వృక్షదేవత తనలో "ఈబ్రాహ్మణుడు ప్రతిదినము నాకు మిక్కిలి సేవచేయుచున్నాడు.

పకోరికతో ఇట్లు చేయుచున్నాడో ఆకోరిక ఈడేర్చెదను" అని భావించి మరునా డాతడు నేల యూడ్చుసమయమున వృక్షదేవత బ్రాహ్మణరూపము ధరించి, ప్రక్కన నిలిచి ఈ తొలిగాథ పలికెను:

గ్రహించుంపలేక ఆకర్ణింపలేక
చైతన్యరహితమై జడమైన తరువు
ననుదిన మడిగెద వప్రమత్తుండ
వయి, నీకు సుఖనిద్ర అయెనా యనుచు:
ఇట్టి ప్రశ్నమ్మున కేమి కారణము?

విని బ్రాహ్మణుడు రెండవ గాథ పలికెను:

తోచుచు స్ఫుటముగా దూరభూమికిని
ఉన్నతస్థానాన ఉన్నట్టి తరువు
దేవతావాసంబు కావచ్చు ననుచు,
ధనకాంక్షతోడ ప్రదక్షిణాదికము
తరువునకున్ దేవతకుగూడ చేతు.

ఆకర్ణించి వృక్షదేవత ప్రసన్నచిత్తయై "బ్రాహ్మణుడా, ఈ వృక్షముపై నుండు దేవతను. భయపడవలదు. నీకు ధన మిత్తును" అని చెప్పెను.

ఇట్లాతని నోదార్చి విమానద్వారమున దేవతామహిమతో ఆకాశమున నిలిచి మిగిలిన గాథలు పలికెను:

నీలో కృతజ్ఞత నే గనుగొంటి:
కావున నీకుపకారంబు చేతు
నేను యథాశక్తి: నీప్రయత్నంబు
ఒందక సఫలత యుండుట యెట్లు
సజ్జనసంగతి జరిగిన పిదప?
తిందువృక్షమునకు ముం దున్న జువ్వి
చెట్టుమూలమునకు చుట్టును కలవు
ప్రాచీనయజ్ఞాలఫలరూప మైన
నిధు; లెవ్వరివి కావు; నీ వింక వాని
పైకిదీయుము త్రవ్వి, బ్రాహ్మణశ్రేష్ఠ!

ఇట్లు పలికి వృక్షదేవత మరల "బ్రాహ్మణా, నీవు దీనిని త్రవ్వి

తీయుట చాలకష్టము. నేనే దీనిని నీయింటికి దెచ్చి ఫలానిస్థానమున పాతరవేసెదను. ఈధనమును నీవు తుదివరకును అనుభవింపుము. దానములు చేయుచు, శీలము రక్షించుచుండుము” అని ఉపదేశించి, ఆధనమును తనప్రభావముచే బ్రాహ్మణునియింటికి జేర్చెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున బ్రాహ్మణుడు ఆనందుడు; వృక్షదేవత నేనే.

## 308 జవసకుణ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయు సమయమున దేవదత్తుని కృతఘ్నతను గూర్చి చెప్పినది. “భిక్షువులారా, దేవదత్తు డిప్పుడే కాదు, పూర్వముకూడ అకృతజ్ఞుడే” నిఅ శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసీలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు హిమాలయప్రదేశమున చిరతపక్షికడుపున పుట్టెను. ఒకనాడు ఒకానొక సింహము మాంసము తినునపుడు ఎముక గొంతులో చిక్కుకొనెను. కంఠము వాచిపోయెను. ఆహారము గ్రహింపజాలకుండెను. మిక్కిలి బాధగా నుండెను. మేతకై పోవనుండి పక్షి వృక్షశాఖపై నుంచి “మిత్రమా, ఏమి బాధ?” అని యడిగెను. సింహము వృత్తాంతము తెలిపెను. “మిత్రమా, ఎముక లాగివేయుదును. కాని భయముచే నీనోరుప్రవేశించుటకు సాహసము చాలకున్నది. నన్ను తిని వేయువుకద?” అనెను.

“మిత్రమా, భయపడవలదు. నిన్ను భక్షింపను. నాప్రాణములు కాపాడుము”. ‘మంచి’ దని పక్షి సింహమును ప్రక్కకు పండుకొమ్మనెను. ఇది యేమిచేయునో ఎవ్వ డెరుగు నని తలపోసి, సింహము నోరుమూసికొనకుండునట్టు దాని పై పెదవికిని క్రిందిపెదవికిని నడుమగా

కర్ర నుంచి, దానినోటిలో ప్రవేశించి, కొనను పట్టి, ఎముకను పైకి లాగివేసెను. ఎముక ఈవల పడిపోయెను. సింహాముఖమునుండి ఈవలకు వచ్చునపుడు పక్షి కర్రను లాగివేసి, ఎగిరిపోయి వృక్షశాఖపై వ్రాలెను.

సింహాము స్వాస్థ్యము చెంది, ఒకనాడు వనమహిషమును వధించి తినుచుండెను. సింహామును పరీక్షింపదలచి చిరతపక్షి శాఖపైనుండి దానితో సంభాషించుచు ఈ తొలిగాధ పలికెను:

ఓమృగరాజ, నీ కుపకృతి మేము
కావించితిమి: నమస్కారంబు గొనుము
మాకు మిగుల్పుడు మాంసంబు కొంత.

విని సింహాము రెండవగాథ పలికెను:

అనువాపరమ్ము వేటాడుచు, రక్త
పానమ్ము చేయు నావదనమ్ము జొచ్చి
వెలువడి నీవు జీవించుటే గొప్ప.

ఆకర్ణించి పక్షి మిగిలిన రెండుగాధలు పలికెను:

ఎవ డకృతజ్ఞుడై యేమియు చేయ,
డుపకారమునకు ప్రత్యుపకార మొనర
చేయగా, అవ్వాని సేవ నిష్ఫలము.
చెంది ప్రత్యక్షముగ మేలు, స్నిగ్ధభావ
మెవడు చూపడొ అవ్వాని నేమి యనక,
పొందక యసూయ, ఆతనిపొందు విడిచి
దూరముగ నేగు టుచితమ్ము తూర్ణముగను.

ఇట్లు పలికి పక్షి నిష్క్రమించెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున సింహాము దేవదత్తుడు; పక్షి నేనే.

## 309 ఛవక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, షడ్వర్గీయ భిక్షుకులను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథ వినయపిటకమున (సుత్తవిభంగ, 68,69) సవిస్తరముగా నున్నది. ఇచ్చట సంక్షిప్తము. శాస్త షడ్వర్గీయభిక్షువులను బిలువ నంపి, "భిక్షువులారా, మీరు క్రిందిపీఠములపై గూరుచుండి, ఉన్నతా సనములమీద నున్నవారికి ధర్మోపదేశము చేయుట సత్యమేనా?" అని ప్రశ్నచేసెను.

"భన్తే, చిత్తము."

శాస్త వారిని నిందించుచు, "భిక్షువులారా, మీరు నాధర్మము నిట్లు అవమానించుట తగదు. క్రింది యాసనములపై గూరుచుండి, ఉన్నత పీఠములపై ఉన్నవారికి ధర్మోపదేశము చేసిన వారిని గూడ ప్రాచీన పండితులు నిందిచిరి" అని, పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు చండాలకులమున బుట్టి పెద్దవాడయి, సంసారము నిర్వ హించుచుండెను. మామిడిపండుమీద కోరిక పుట్టి అతనిభార్య 'స్వామీ, మామిడిపండు తినవలె నని కోరిక' అని చెప్పెను. "భద్రే, ఈరోజులలో ఆమ్రఫలములు పండవు. మరియొక పుల్లపండు తెచ్చె దను'. 'స్వామీ, మామిడిపండు దొరకినచో నాప్రాణము లుండును; దొరకదేని ప్రాణము లుండవు."

ఆమెయాసక్తిని గ్రహించి యతడు తనలో "ఆమ్ర మెచ్చట లభించును?" అని యోచింపసాగెను. వారాణాసీనరేశ్వరుని యుద్యాన మున సర్వదా ఆమ్రఫలము లుండు నని జ్ఞప్తికి రాగా, అచటికి బోయి పండిన మంచిపండు తెచ్చి యీామెమనస్సు శాంతపరతు నని యతడు రాత్రివేళ ఉద్యానము జొచ్చి, పండు వెదకుచు శాఖనుండి శాఖాంతరమునకు బోవుచుండ తూరుపు తెల్లవారెను. "ఇప్పుడు నేను క్రిందికి దిగినచో నన్ను జూచి రాజపురుషులు చోరు డని పట్టుకొందురు.

చీకటి పడినతర్వాత పోవుదును" అని తలచి ఒకవృక్షముపై కానబడకుండ గూరుచుండెను.

ప్రభాతమున వారాణసీప్రభువు నిజపురోహితునివలన మంత్రములు వినుచు, ఆవృక్షముక్రింద ఉన్నతాసనముపై గూరుచుండి, ఆచార్యుని చిన్నపీటపై గూరుచుండ నియమించెను. బోధిసత్త్వుడు వృక్షముపై నుండి చూచుచు తనలో "ఈరాజు ధార్మికుడు కాడు; ఉన్నతాసనమున గూరుచుండి మంత్రోపదేశము పొందుచున్నాడు. ఈబ్రాహ్మణుడుగూడ ధార్మికుడు కాడు; చిన్నపీఠముపై గూరుచుండి మంత్రములు చెప్పుచున్నాడు. నేనుకూడ ధార్మికుడను కాను; భార్యవలన ప్రాణములుకూడ లెక్కచేయక ఫలము కోసికొనిపోవ వచ్చినాను" అని భావించి వ్రేలాడుచున్న కొమ్మమీదుగా దిగి వా రిరువురనడుమ నిలిచి 'మహారాజా, నేను భ్రష్టుడను, నీవు మూర్ఖుడవు, ఈబ్రాహ్మణుడు నష్టుడు" అనెను. రాజు ఎందుచేత? ననెను. ఆత డీ తొలిగాథ పలికెను:

ఇరువురిలో ధర్మ మేమియు లేదు;
మంత్రోపదేష్టయు మంత్రశిష్యుండు
భ్రష్టు లిర్వురు ధర్మపథమునందుండి.

ఆలకించి బ్రాహ్మణు డీ రెండవ గాథ పలికెను:

పక్వమాంసంబుతో పాటు శాల్యన్న
మారగించుచునున్న కారణంబునను
త్యజియించితిన్ ఋషిధర్మముల్ నేను.

విని బోధిసత్త్వుడు ఈ రెండు గాథలు పలికెను.

విడిచి దీని చనుము వేరొక చోటికి,
ఇచట ప్రాణిసంఘ మెచ్చిపోయె,
నీయధర్మకర్మ నిన్ను భంజించును
కుండ రాయి బగులగొట్టినట్లు.
దుష్టకర్మలవలనను దొరకు ధనము
తగ, దధర్మమ్ముచే లబ్ధధనము కాని.

రాజు ఆతనిధార్మికభావమునకు ప్రసన్నుడై "నీ వే కులమువాడవు

అని ప్రశ్నించెను. "నేను చండాలుడను". "నీవు ఉన్నతకులమువాడ వైనపక్షమున నిన్ను ప్రభువును చేసియుందును. అయినను, నేటినుండి నేను పగటివేళ రాజును, నీవు రాత్రివేళ రాజువు" అని పలికి రాజు తనమెడలోనుండి ఎఱ్ఱపూవులదండను తీసి, ఆతనికంఠమున నుంచి నగరమునకు కొత్వాలును (గుత్తికుని) చేసెను. అప్పటినుండి ఈనగర గుత్తికులకు మెడలో రక్తకుసుమదామము వేయుట పరిపాటి యయినది. రా జాతనియుపదేశముల నాదరించి, ఆచార్యుని గౌరవించి, చిన్నపీటపై గూరుచుండి మంత్రోపదేశము గ్రహించెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి, జాతకములం పరివోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; చండాలపుత్రుడు నేనే.

## 310 సయ్హా జాతకము

శాస్త జేతవనమున విహరించుచు, ఉద్విగ్నచిత్తు డగు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు శ్రావస్తిలో భిక్షాటనము చేయుచు, ఒకానొక సుందరిని జూచి, ఉద్విగ్నచిత్తు డయ్యెను. అతనికి బుద్ధశాసనమున అరుచి కలిగెను. భిక్షువు లతనిని భగవానునికడకు గొనిపోయిరి. శాస్త అతనితో "భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడ వైతివా ?" అనెను.

"భన్తే, చిత్తము."

"ఏల ఉద్విగ్నచిత్తుడ వయితివి ?"

అతడు జరిగిన వృత్తాంతము చెప్పెను. "కల్యాణకారి యగు శాసనమున ప్రవ్రజితుడ వయ్యును ఇట్లు ఉద్విగ్నచిత్తుడ వయితి వేమి? పూర్వకాలమున పండితునకు పురోహితపదవి లభించినను దానిని విడిచి ప్రవ్రజించెను" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయు కాలమున బోధిసత్త్వుడు పురోహితుని భార్యకడుపున బుట్టినాఁడు. రాజకుమారుడుకూడ ఆసమయముననే జన్మించినాడు. "నాకుమారుడు పుట్టిన రోజుననే పుట్టినబిడ్డ డెవడైన నున్నాడా?" అని రాజు అమాత్యుల నడిగెను. "మహారాజా, పురోహితునిపుత్రు డున్నా" డని వా రనిరి. రాజు ఆబిడ్డని దెప్పించి దాదుల కిచ్చి, తనపుత్రునితో పాటు పెంచునట్లు చేసినాడు. భోజనాదికము, అలంకరణాదికము ఉభయులకు ఒకేతీరున జరుగుచుండెను. పెరిగి పెద్ద అయినతరువాత వారు తక్షశిలకు బోయి, అన్ని విద్యల నభ్యసించి మరలివచ్చిరి. రాజు కుమారుని యువరాజును జేసెను. మహావైభవము చెలగెను.

అప్పటినుండి బోధిసత్త్వుడు యువరాజుతోపాటు ఒకచోటనే భోజనము చేయుచు నిద్రించుచుండెను. వారి విశ్వాసము దృఢమయ్యెను. తండ్రి పోయినతరువాత రాజపుత్రుడు ప్రభు వయి, మహైశ్వర్యము ననుభవింపజొచ్చెను.

బోధిసత్త్వు డిట్లు చింతించెను: "నామిత్రుడు పరిపాలన చేయుచున్నాడు. జ్ఞప్తికి వచ్చినక్షణమున నన్ను పురోహిత పదవియందుంచును. కాని, నాకు గృహనివాసముతో పని యేమి? ప్రవ్రజించి, ఏకాంతసేవనము చేయుదును." ఇట్లు చింతించి యతడు తలిదండ్రులకు ప్రణామము చేసి, ప్రవ్రజనమున కనుజ్ఞ వేడెను. మహాసంపత్తిని విడిచి, ఇలు వెడలి, ఒంటిగా హిమాలయము చేరి, అచ్చట చక్కని చోట కుటీరము నిర్మించి, ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది ధ్యానక్రీడారతు డయి యుండెను.

స్మరణకు తగులగానే రాజు "నామిత్రుడు డేడీ, ఎచట నున్నాడు?", అని అమాత్యుల నడుగగా "ఆయన ప్రవ్రజించినాడు. సుందర వన ఖండములో నివసించుచున్నాడు" అని వారు చెప్పిరి. సహ్యు డను అమాత్యుని బిలిచి, నీవు వెళ్ళి నామిత్రుని గొనిరమ్ము. ఆయనకు పురోహితపదవి నిత్తును" అని రాజు చెప్పెను.

ఆతడు మంచిదని వారాణసి నుండి బయలుదేరి క్రమక్రమముగా

సీమాంతగ్రామము చేరి అక్కడ శిబిరము నిర్మించి, వనచరుని సాయముతో బోధిసత్త్వుని నివాస ప్రదేశము చేరెను. ఆయన కుటీరద్వారమున బంగరుబొమ్మవలె గూరుచుండి యుండెను. సహ్యు డాయనకు ప్రణామము చేసి, ప్రక్కగా కూరుచుండి, కుశలప్రశ్న లడిగి, "భర్తే, రాజు తమకు పురోహితపదవి నొసగ నభిలషించుచున్నాడు. తమరు రావలె నని వాంఛ" అని విన్నవించెను.

బోధిసత్త్వుడు "పురోహితపదవి యెంత? కాశీ, కోసల, జంబూద్వీప ప్రభుత్వము, చక్రవర్తిపై భవము నా కిచ్చినను అక్కడకు రాను. ఒకమారు విసర్జించిన భోగములను పండితులు పరిగ్రహింపరు. ఇది ఉచ్ఛిష్టము వంటిది" అని ఈ గాథలు పలికెను:

చక్రవాళంబుతో, సంద్రాలతోడ,
ఈధరిత్రిని నాకు నిచ్చెద మన్న,
ధిక్కరింతు గ్రహింప, తెలిసికో సహ్యా!

నీచవర్తనమునన్ నింద్యమార్గమున
ధన మైన, యశ మైన నొనగూడు నెడల
ధిక్కరింతు నటంచు తెలిసికో విప్ర!

ధర్మేతరం బైనదారిని బోయి
జీవికనిర్వహించెడుకంటె మేలు
పాత్రతో నిలువీడి ప్రవ్రజింపంగ.

ఇలలోన ఎద్దాని హింసించుకంటె
పాత్ర చేపట్టి, ఆవాసంబు వీడి
ప్రవ్రజించుట మేలు—రాజ్యంబు వలదు.

మాటిమాటికిని ప్రార్థించినను బోధిసత్త్వు డంగీకరింప లేదు. సహ్యుడు ఆయనయంగీకృతి పడయనేరక ప్రణామముచేసి పోయి "ఆయన రాలేదు" అని రాజుకు విన్నవించెను.

ఇట్లు ధర్మోపదేశము చేసి, శాస్త జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; సహ్యుడు సారిపుత్రుడు; పురోహితపుత్రుడు నేనే.

# 311 పుచిమంద జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు మహామౌద్గల్యాయనుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

స్థవిర మహామౌద్గల్యాయనుడు రాజగృహసమీపమున అరణ్యము లోని కుటీరమున వాసము చేయుచుండెను. నగరద్వారముకడ నున్న గ్రామములో ఒక యింట చోరుడు కన్నము వేసి, చేతికి దొరికిన విలువ గల పదార్థములతో పరుగెత్తిపోయి స్థవిరుని కుటీరాంగణము చేరి దాగుకొని "ఇచట నేను సురక్షితముగా నుండవచ్చును" అనుకొని కుటీరమున కెదురుగా పండుకొనెను. స్థవిరుడు వానిని చూచి సశం యించి, చోరసంసర్గ ముచితము కాదు అని వానిని దూరముగా తరిమి, నీ విచట పండుకొనరా దనెను. చోరుడు అచటనుండి బయలుదేరి కాలిగురుతులు చెరుపుచు పలాయనము చేసెను.

గ్రామమునుండి లోకులు దివిటీలతో బయలుదేరి చోరుని పద చిహ్నముల ననుసరించి కుటీరము చేరి వాడు దాగినచోటు, కూరు చున్నచోటు, పండుకొన్నచోటు చూచి, "ఇచట ఆగినాడు, ఇచట కూరుచున్నాడు, ఇచట పండుకొన్నాడు; కాని ఇచటనుండి పారిపోయి నట్లు కానరాదు" అని ఇటునటు వెదకి తుదకు వానిని కానక వెడలి పోయిరి.

మరునాడు స్థవిరుడు పూర్వాహ్ణమున రాజగృహమున భిక్షాటనము చేసి మరలివచ్చి, వేళువనమునకు జని శాస్త కీవిషయము విన్నవిం చెను. "మౌద్గల్యాయనా, కేవల మిప్పుడే కాదు. నీవు పూర్వముకూడ శంకింపలేదు. పురాణపండితులు శంకించిరి" అని శాస్త ఆతనిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు నగరశ్మశానమున నింబవృక్షదేవతగా నుద్భవించెను. ఒకనాడు నగరద్వారగ్రామమున దొంగతనము చేసి చోరు డాచెట్టు క్రిందికి జేరి వస్తువుల నచట నుంచి నిద్రపోయెను. ప్రక్కనే రావిచెట్టు

కలదు. ఆరోజులలో చోరులకు నింబశూలవేధ శిక్షగా నుండెను. నింబవృక్షదేవత తనలో "లోకులు వచ్చి యీచోరుని పట్టుకొన్నచో వేపకొమ్మ నరకి శూలముగా చేసి దానిపై వీని నెక్కింతురు. అప్పుడు వృక్షమునకు హాని కలుగును. కావున వీని నిక్కడనుండి పరుగెత్తింతును" అని తలచి వానితో భాషించుచు ఈ తొలిగాథ పలికెను:

ఓయి తస్కర, నిద్రించుచున్న లాభ
మేమి యొదవును? లెమ్మ, ని న్నెవ్వరేని
గ్రామమున కన్నములు వేయు ఘనుడ వనుచు
పట్టి యీవచ్చుగద రాజభటుల కిపుడు!

ఇట్లు పలికి "రాజపురుషులు వచ్చి నిన్ను పట్టుకొనక ముందే యిచటినుండి పారిపొమ్ము" అని భయపెట్టెను. వాడు వెడలిపోయిన తరువాత అశ్వత్థవృక్షదేవత రెండవ గాథ పలికెను:

ఊర కన్నము వేయుచోరుని రాజ
భటు లెవ్వరో వచ్చి పట్టుకపోవ
విపినసంస్థిత మైన వేపకు నీకు
ఎందులకున్ జోక్య మీవిషయాన?

విని నింబవృక్షదేవత మూడవ గాథ పలికెను:

నాకును తస్కరునకు నున్న భేద
మెరుగవే అశ్వత్థవృక్షరాజంబ!
ఊరితీయుదురు నింబతరువుపై చోరు;
నామనమ్మున కల్గినది సంశయమ్ము.

వృక్షదేవత లిట్లు పరస్పరసంభాష సలుపుచుండగా వస్తుయజమానులు కాగడాలతో బయలుదేరి, వానిపాదచిహ్నములను బట్టి చెట్టుక్రిందికి వచ్చి చూచి "అరే దొంగపారిపోయినాడు. దొరికినచో వానిని నింబశూలమున వేధింతుము, శాఖమీద వ్రేలాడదీయుదుము" అని అటునిటు వెదకి వెడలిపోయిరి. వారివాక్కులు విని అశ్వత్థవృక్షదేవత నాలుగవ గాథ పలికెను :

శంకకు తగుచోట శంకింప వచ్చు:
ఆత్మసంరక్షణ మాచరించుటయు

భావిభయమ్మున భావ్యమే యగును;
ఆత్మరక్షణ చేయునట్టి ధీరుండు
లోకాల రెంటి నాలోకించుచుండు.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి రెండు జాతకములను సరిపోల్చెను. ఆకాలమున రావి చెట్టుమీది దేవత సారిపుత్రుడు, వేపచెట్టుమీది దేవత నేనే.

## 312 కస్సపమందియ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక వృద్ధభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో కులపుత్రు డొకడు కామభోగముల దుష్పరిణామము గ్రహించి శాస్తసన్నిధిలో ప్రవ్రజించి యోగాభ్యాసక్తుడై త్వరలోనే అర్హత్వము పొందెను. కాలక్రమమున ఆతని తల్లి మరణించెను. ఆవల ఆతని తండ్రిని తమ్ముని ఆతడు ప్రవ్రజితులను చేసెను. వారు జేతవనమున నుండిరి. వర్షాకాలమున చీవరములు సులభముగా లభించు నని తెలిసి కొని వారు మువ్వురు ఒకగ్రామమున నివాసముచేసి వర్షాంతమున మరల జేతవనమునకు వచ్చిరి. జేతవనసమీపమునకు వారు వచ్చు సరికి ఒకానొక తరుణభిక్షువు "శ్రమణులారా, స్థవిరుడు విశ్రాంతి పొందిన పిమ్మట వత్తురు గాని. నేను ముందుగా చని ఆవరణము ఊడ్చి నీరు చల్లుదును" అని జేతవనము లోనికి జనెను. వృద్ధస్థవిరుడు మెలమెల్లగా బోవుచుండెను. శ్రమణులు తలనొప్పి వచ్చునట్లు మాటి మాటికిని ఆయనను "భన్తే, నడువుడు. భన్తే నడువుడు" అని తొందర పెట్టుచుండిరి. "నామీద అధికారము చూపుచున్నారు" అని మరల మొదటినుండి పని యారంభించుచుండెను. ఈ విధముగా వారి పరస్పర కలహమువలన సూర్యాస్తమాన మయ్యెను. క్రమముగా చీకటిపడెను. రెండవవాడు ఆవరణము చిమ్మి, ఉదకము తెచ్చిపెట్టి శ్రమణులు

రాకుండుటచే తానే దీపము వెలిగించెను. ఇంతలో వారు రాగా "ఆలస్య మేల యయ్యె" నని అతడు వారి నడిగెను. వృద్ధుడు కారణము తెలిపెను. అతడు వారిని మెల్ల మెల్లగా కొనివచ్చెను. ఆనాడతడు బుద్ధసేవార్థము పోవుట కవకాశము దొరుకలేదు. మరునాడు అతడు బుద్ధసేవార్థము చని ప్రణామము చేసి ఒకప్రక్కన గూరుచుండెను. "ఎప్పుడు వచ్చితి" వని శాస్త అడిగెను. భన్తే "నిన్న." "నిన్న వచ్చినవాడవు ఇప్పుడా బుద్ధసేవకు వచ్చుచున్నావు?" "చిత్తము. భన్తే" అని ఆతడు కారణము తెలిపెను. శాస్త వృద్ధుని నిందించుచు "ఈతడు కేవల మిప్పుడే కాదు. ఇప్పుడు పనిచేయక నిన్ను కష్టపెట్టినట్లే, పూర్వముకూడ కష్టపెట్టినాడు" అని శాస్త, వానిప్రార్థనపై పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు కాశీగ్రామమున బ్రాహ్మణకులమున పుట్టెను. ఆతడు పెద్దవా డయినపిమ్మట తల్లి చనిపోయెను. అమె కంత్యక్రియలు చేసి, మాసము-మాసార్థ మయినంతనే ధనము ధర్మము చేసి, అతడు తండ్రిని, తమ్మునిని వెంటగొని హిమాలయమున కరిగి, దేవదత్తము లైన వల్కలములు ధరించి, ప్రవ్రజించెను. ఉంఛవృత్తి నవలంబించి ఫలములను మూలములను సంగ్రహించి తినుచు, రమణీయవనప్రదేశమున నివసించుచుండెను. వర్షాకాలమున హిమాలయమున ముసలధారలు కురియునపుడు కందమూలములను త్రవ్వుటకు వీలుండదు. ఫలములు దొరకవు. ఆకులుకూడ రాలిపోవును. తాపసులు సామాన్యముగా హిమాలయమునుండి దిగి గ్రామములకు బోవుచుందురు. ఆసమయమున బోధిసత్త్వుడుకూడ తండ్రిని తమ్మునిని వెంటగొనిపోయి ఒకానొక గ్రామము చేరెను. హిమాలయమున మరల పూవులు పూచి కాయలు కాచి పండ్లు పండినప్పుడు వారిని వెంటనిడుకొని నిజాశ్రమమునకు బోయెను. ఆశ్రమము కొలదిదూరమున నుండగా నతడు సూర్యాస్తమయము చూచి "మీరు మెల్లగా రండు. నేను ముందుగా ఆశ్రమము చేరి బాగుచేయుదును" అని వారిని విడిచి వెడలెను. తండ్రి నెమ్మదిగా

నడచుచుండగా చిన్నతాపసి ఆయన కటిప్రదేశమున శిరసుతో తట్టుచుండెను. "నీవు నన్ను నీయిచ్చవచ్చినట్టు లాగుకొనిపోవుచున్నావు" అని వృద్ధుడు వెనుదిరిగి మొదటిచోటికి బోవుచుండెను. ఈవిధముగా వారు కలహించుచుండ చీకటి పడెను.

బోధిసత్త్వుడు కుటీరము నూడ్చి, నీరు తెచ్చి, కరదీపికపట్టుకొని త్రోవలో నెదురుపోయి తండ్రిని చూచి "ఇంత యాలస్య మయిన దేమి?" అని యడిగెను. తండ్రి చేసినపని తమ్ముడు చెప్పెను. బోధిసత్త్వ డుభయులను మెల్లగా గొనిపోయి వస్త్రాదులు భద్రపరచి తండ్రిచే స్నానము చేయించి, పాదములకు తైలమర్దనము చేసి, వీపు పట్టి కుంపటి వెలిగించెను. "నాయనా, కుర్రవాండ్రు మట్టిపాత్రవంటి వారు. క్షణములో భంగముపొందుదురు. సమ్మేళనము చేయుట కవకాశ ముండదు. వాండ్లు దూషింతురు. అయినను పెద్దలు సహింపవలెను" అని బోధిసత్త్వుడు తండ్రికి బోధించి ఈ గాథలు పలికెను:

తిట్టుదురు కొట్టుదురుకూడ తెలివిలేని
పడుచువారలు కాశ్యప, పండితులకు
సహన ముండును. ధీరులు క్షమ వహింత్రు.

ఒదవినంగూడను వివాద మొక్కవేళ
క్రమ్మరక మంచివారలు కలసికొంద్రు
మట్టిచట్టి విధంబున మందమతులు
భేద మొందుచు శాంతి గోల్పోదురుసుమి.

సంధి చెడిపోవకుండను సజ్జనులకు
ఉన్నచో స్వీయదోషమ్ము లొప్పికొంద్రు;
అట్టివారి గూడగలుగునట్టివాడు
ఉత్తముండు ధురంధరు డుర్విమీద.

ఇట్లు బోధిసత్త్వుడు బోధించినపిదప తండ్రి శాంతచిత్తుడై ప్రశాంతి గాంచెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున తండ్రి వృద్ధస్థవిరుడు, చిన్న తాపసుడు శ్రామణుడు; తండ్రికి ఉపదేశ మిచ్చినది నేనే.

## 313. ఖాంతివాది జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక క్రుద్ధభిక్షువునుగూర్చి చెప్పినది. కథ పూర్వమే వచ్చినది. శాస్త ఆభిక్షువుతో "భిక్షూ, క్రోధహీరతమైన బుద్ధశాసనమున ప్రవ్రజించియు, నీవు ఏల కోపనశీలుడవై యున్నావు. పూర్వము పండితులు తమశరీరములపై వేలకొలది ప్రహారములు తగిలినను కాలుసేతులు, ముక్కులు, కన్నులు తెగిపోయినను అన్యులపై కోపింపలేదు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో కలాబువు అను కాశీరాజు పరిపాలన చేయుచుండగా బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల ధనము కలిగిన బ్రాహ్మణకులమున బుట్టి, కుండకకుమారు డనుపేర పెరిగి పెద్దవా డయి, తక్షశిలకు బోయి అన్నివిద్యలు నేర్చి మరలివచ్చి కుటుంబమును నిర్వహించుచుండెను. తల్లిదండ్రులు పోయినతర్వాత నతడు ధనరాశివైపు చూచి "ఈ ధనమును ప్రోగుచేసి మా పూర్వులు ఇచ్చటనే విడిచి పోయిరి. వెంట నేమియు గొనిపోవలేదు. నేను దీనిని గొనిపోవలసి యున్నది" అని భావించి, ఆధన మంతయు నతడు విచేయ్యదానము (ఎవరికి అర్హమైనది వారి కిచ్చి) చేసి, హిమవత్ప్రదేశమునకు బోయి, ప్రవ్రజించి, కందమూలఫలములు తినుచు చిరకాల మచ్చట నివసించెను. అనంతరము లవణామ్లభక్షణకొరకు గ్రామములకు వచ్చి, క్రమక్రమముగా వారాణసి చేరి, రాజోద్యానమున ప్రవేశించెను. మొదటి రోజున భిక్షాటనము చేయుచు సేనాపతి గృహము చేరెను. సేనాపతి ఆయనను పరిచర్యచే సంతృప్తుని జేసి, గృహములోనికి గొనిపోయి తన కొరకు సిద్ధముచేసిన భోజన మాయనకు బెట్టించి, ఉపదేశము విని రాజోద్యానమున ఆయనను దింపెను.

ఒకనాడు కలాబురాజు మద్యపానముచే మైమరచి నటజనపరివృతుడై, మహావిభవముతో ఉద్యానము చేరెను. అచ్చటి మంగళశిలాతలముపై అతనికి శయన మేర్పాటు చేసిరి. అతడు ప్రియమనోహరాంగి యొడిలో తల నిడుకొని పరుండెను. గీతనర్తనకుశల లైన నట్టువకత్తెలు గీతాదికము సలుపజొచ్చిరి. దేవరాజు శక్రునివలె మహావైభవముతో నుండెను. రాజు నిద్రపోయెను.

"ఎవరికోసము మనము ఆడుచు పాడుచున్నామో ఆయన నిద్రించి నారు. ఇక మనయాట పాటలవలన లాభ మేమి?" అనుకొని వారు వీణాదులు తూర్యాదులు ఎక్కడివక్కడే విడిచి ఉద్యానమున విచరించుచుండిరి. ఆసమయమున బోధిసత్త్వుడు పుష్పితసాలవృక్షము క్రింద నీడలో మత్తవారణమువలె ధ్యానసుఖమున నుండెను. ఉద్యానమున విచారించుచున్న స్త్రీలాయనను గాంచి "ఇటు రండు. వృక్షచ్ఛాయలో తాపసి కూరుచున్నాడు. రాజు లేచునంతవరకు మన మిచ్చట గూరుచుండి కొంచె ముపదేశము విందము" అని ఆయనను సమీపించి ప్రణామము చేసి ఆయనచుట్టును ఉపవేశించి "మాకు తగిన యుపదేశ మనుగ్రహింపుడు" అనిరి. బోధిసత్త్వుడు వారికి ధర్మోపదేశము చేసెను.

కదలికవలన రాజుకు మెలకువ వచ్చెను. కనులు తెరచి చూడగా స్త్రీలు కానరాలేదు. "ఆ చండాలిను లెచ్చటికి బోయినారు?" అని రా జడిగెను. ఆమె "మహారాజా, వారు తాపసిచుట్టు గూరుచున్నారు" అని చెప్పెను.

కుపితుడై రాజు ఖడ్గము తీసి, "ఆ దుష్టతాపసునకు బుద్ధిచెప్పెద" నని త్వరితముగా జనెను. రాజు కోపముతో వచ్చుచుండుట చూచి స్త్రీలు పోయి ఆయనచేతిలోని ఖడ్గమును లాగుకొని ఆయనను శాంత పరచిరి. రాజు బోధిసత్త్వునికడకు బోయి "శ్రమణా, నీవాద (మత) మేమి?" అని యడిగెను. "మహారాజా, నాయది క్షాంతివాదము" "ఈ క్షాంతి యెట్టిది?" "దూషించినను, ప్రహరించినను, హేళన చేసినను కోపము లేకుండనుండుట." "నీకు క్షాంతి కలదో లేదో ఇప్పుడే చూచెదను." అని రాజు చోరఘాతకుని బిలిపించెను.

పీతవస్త్రము ధరించి, రక్తకుసుమముల దామము దాల్చి నిజ స్వభావమువంటి పరశువును, కంటకకశను (చబుకు) గొనివచ్చి, రాజుకు నమస్కరించి "ఏమి యాజ్ఞ?" అనెను.

"ఈ దొంగతాపసిని పట్టి భూమిపై బడవైచి, ముండ్లచుబుకుతో ఎడపెడ రెండువేలదెబ్బలు కొట్టుము" అని రాజు పలుక వా డట్లే చేసెను. బోధిసత్త్వుని శరీరము పొట్టు ఊడినది, చర్మము లేచిపోయినది. మాంసము మిగిలినది. రక్తము కారినది. "నీ దేమి వాదము

భిక్షూ?" అన్నాడు రాజు. "మహారాజా, క్షాంతివాదము. నాచర్మములో క్షమ యున్న దనుకొన్నారా? లేదు, హృదయములో నున్నది." 'మహారాజా. ఏమి యాజ్ఞ?' అన్నాడు చండాలుడు. 'ఈ దుష్టతాపసి చేతులు రెండును ఖండింపుము.' వాడు పరశువుతో బోధిసత్త్వుని చేతులు ఖండించెను. అనంతరము రాజాజ్ఞనుబట్టి పాదములు ఖండించెను. 'నీ దే వాదము?' అన్నాడు రాజు. 'మహారాజా, క్షాంతివాదము. నా కాలుసేతులలో క్షాంతి యున్న దని తలచినారా? లేదు. మిక్కిలి గంభీరప్రదేశములో నున్నది.' 'ముక్కు చెవులు కోయుము' అని రా జానతియీయగా చండాలుడు ముక్కు చెవులు కోసెను. శరీరమంతయు రక్తమయ మయ్యెను. 'ఇప్పు డేమి వాదము?" 'మహారాజా, క్షాంతివాదము. క్షాంతి కర్ణనాసికామూలములలో నున్నదని తలచితిరా? లేదు. హృదయాంతరమున గభీర ప్రదేశమున నున్నది.'

రాజు బోధిసత్త్వుని గుండెమీాద కాలితో తన్ని 'దుష్టతాపసా, నీక్షాంతిని నీవే పొగడుకొనుచు పండుకొనుము' అని వెడలిపోయెను.

అతడు వెడలిపోయినతర్వాత సేనాపతి బోధిసత్త్వునిశరీరముమీాది రక్తము తుడిచి కట్టుకట్టి ఆయనను నెమ్మదిగా కూర్చుండబెట్టి ప్రణామము చేసి, పార్శ్వమున గూరుచుండి, 'భన్తే, తమకు క్రోధము కలిగెనేని, తమయెడల అపరాధముచేసిన రాజువిషయముననే యుండ దగును. కాని అన్యులయెడ కోపము వలదు' అని ప్రార్థించుచు ఈ తొలిగాథ పలికెను:

కాలుసేతులు, ముక్కు, కర్ణంబు లెవడు
కోయించె నతనిపై కోపంబు తగును
కాశీమహారాష్ట్రనాశంబు వలదు.

విని బోధిసత్త్వుడు రెండవగాథ పలికెను:

నా కాలుసేతులు నాసిక చెవులు
తఱిగించు రేనికి చిరకాల మాయు
వభివృద్ధి పొందుత; అస్మదాదులకు
నెట్టి క్రోధం బుండ దెవ్వరియెడల.

రాజు ఉద్యానమునుండి బయలువెడలి బోధిసత్త్వుని చూపుమేర దాటిపోయినంతనే, రెండులక్షల నలుబదివేలయోజనములమేర వృషభము వస్త్రమును చీల్చినట్లు పృథ్వీతలము చీలిపోయెను. అవీచీనరకము నుండి జ్వాలలు చెలరేగి రత్నకంబళము కప్పినట్లు కప్పివేసెను. రాజు ఉద్యానద్వారముననే భూవివరములో పడిపోయి అవీచీనిరయమున జేరెను.

బోధిసత్త్వు డానాడే కాలధర్మము నొందెను. రాజపురుషులు, నగరవాసులును గంధపుష్పమాల్యధూపదీపాదులు గొని బోధిసత్త్వునికి అంత్యక్రియలు చేసిరి. బోధిసత్త్వుడు హిమాలయమునకు బోయెనని కొంద రనిరి; లే దని కొంద రనిరి.

ఈ రెండును సంబుద్ధగాధలు:

క్షాంతిశీలుం డైన శ్రమణుండు పూర్వ
ముండెను; కాశీవిభుండు కోయించె
క్షాంతిశీలుని ముక్క కాలుసేతులును;
నరకాన బడిపోయె నరనాయకుండు.

శాస్త ఈధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము క్రుద్ధభిక్షువు అనాగామిఫలము పొందెను. అనేకులు స్రోతాపత్తిప్రభృతులు పొందిరి.

ఆకాలమున రాజు దేవదత్తుడు; సేనాపతి సారిపుత్రుడు; క్షమావాది యగు తపస్వి నేనే.

## 314 లోహకుంభి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసలనరేశుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున కోసలనరేశుడు రాత్రివేళ కలలో యమలోకమున నరకబాధలు పడుచున్నవారి వాక్కులు వినెను. ఒకడు 'దు' అనెను,

ఇంకొకడు 'స' అనెను; మరియొకడు 'న' అనెను. నాల్గవవాడు 'న' అనెను.

వారు పూర్వము శ్రావస్తీనగరమున పరస్త్రీగమనము చేయు రాజపుత్రులు. వారు భద్రముగా దాచియుంచిన పరాంగనలయెడ అపరాధము కావించి రకరకముల క్రీడించుచుండెడివారు. వారు మృత్యుచక్రమునకు గురి అయినపిమ్మట, శ్రావస్తికి సమీపమున నాలుగు లోహకుంభములలో పుట్టి అరువదివేల సంవత్సరము లక్కడనే కాగుచుండిరి. లోహకుంభములు తెరిచి వారు మెడలుపైకెత్తి బిగ్గరగా అరచుచు "మేము ఎప్పుడెందుండి విముక్తి పొందుదుము?" అని అనుచుండిరి. రాజు ఆకంఠధ్వనులు విని భయభ్రాంతుడై లేచి కూరుచుండి రేయియంతయు గడిపెను. అరుణోదయమున బ్రాహ్మణు లరుదెంచి "మహారాజా, సుఖముగా నిద్రపట్టెనా!" అని కుశలప్రశ్నము చేసిరి.

"ఆచార్యోత్తములారా, సుఖనిద్ర ఎక్కడిది? రాత్రి నేను నాలుగు భీకరకంఠధ్వనులు వింటిని.

బ్రాహ్మణులు చేతులు మోదుకొనిరి.

"బ్రాహ్మణోత్తములారా, ఏ మందురు?"

"మహారాజా, అవి అమంగళధ్వనులు.

"వీనికి నివారణ మున్నదా? లేదా?"

"బహుశః నివారణము లేదు. అయినను మనము కుశలముగా నున్నాము."

"దీనినుండి ఎట్లు రక్షింతురు?"

"మహారాజా, దీనికి ప్రతిక్రియ చాల చేయవలసియుండును. కాని మేము సర్వచతుష్కయజ్ఞము చేసి సంరక్షణ చేయుదుము."

"వెంటనే నాలుగు ఏనుగులు, నాలుగు గుఱ్ఱములు, నాలుగు వృషభములు, నలుగురు మనుష్యులు, తీతువులు మొదలు నాలుగు నాలుగు ప్రాణులను తీసికొని, సర్వచతుష్కయజ్ఞము చేయ నన్నుద్ధరింపుడు."

"మంచి" దని వారు వలసిన వన్నియు సమకూర్చి యజ్ఞకుండము సిద్ధపరచిరి. పెక్కుప్రాణులను కొనిపోయి స్తంభము నెదుట నిలిపి విశేషముగా మత్స్యమాంసములు-ధనముకూడ లభించు నని తలపోసి

ఉత్సాహభరితులైరి. "దేవ, ఇవి కావలెను", "దేవా, అవి కావలె" నని బిగ్గరగా కేకలుపెట్టుచు తిరుగుచుండిరి.

మల్లికాదేవి చూచి "మహారాజా, బ్రాహ్మణులు ఇటునటు ఉత్సాహముతో తిరుగుచున్నారు. కారణ మేమి?" అని యడిగెను.

దీనితో నీ కేమి? నీవు సంపదతో సుఖముగా నున్నావు. మేము చిక్కున నున్నాము."

"మహారాజా, ఏ మది?"

"దేవీ, నేను వినగూడని నాలుగు ధ్వనులు విన్నాను. బ్రాహ్మణుల నడిగితిని. వారు మహారాజా, మీ రాజ్యమునకు గాని, జీవితమునకుగాని ఉపద్రవము కలుగవచ్చును. సర్వచతుష్కయజ్ఞము కావించి మీకు కల్యాణము కావింతు మనిరి. నే నంగీకరించినపిదప, వారు యజ్ఞకుండ నిర్మాణముకొరకు, వలసినవస్తువులకొరకు ఇటునటు తిరుగుచున్నారు."

"దేవా, మీకు వినబడినధ్వనులనుగూర్చి దేవతలతోకూడిన అగ్ర బ్రాహ్మణుని అడిగితిరా!"

"దేవీ, అట్టి బ్రాహ్మణు లెవరు?"

"మహాగౌతమ సమ్యక్సంబుద్ధులు"

"దేవీ, సమ్యక్సంబుద్ధునితో నేను చెప్పలేదు."

"అయినచో పోయి అడుగుడు."

రాజు మరునాడు ప్రాతర్భోజనము చేసి, జేతవనము చేరి శాస్తకు ప్రణమిల్లి ఇట్లు విన్నవించెను :

"భన్తే, రాత్రి నాలుగు ధ్వనులు వింటిని - బ్రాహ్మణులకు తెలిపి తిని. వారు సర్వచతుష్కయజ్ఞము చేయుటకు సిద్ధమైనారు. దాని ఫలిత మేమి?"

"మహారాజా, ఏమియును లేదు. యమయాతనల ననుభవించుచున్న ప్రాణు లిట్లు ధ్వనిచేసినారు. ఈధ్వనులు నీ వొక్కడివే కాదు. పూర్వమురాజులుకూడ వినిరి; వారు కూడ బ్రాహ్మణులతో చెప్పి పశుఘాతయజ్ఞములు చేయింపనెంచిరి. పండితుల మాటలు విని యజ్ఞ మాపిరి. ఆపండితులు ఆధ్వనుల అంతరార్థము వివరించి జంతుహింస మాన్పించిరి" అని శాస్త రాజు ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజుగా నుండగా బోధిసత్త్వుడు కాశీజనపదమున ఒకానొక గ్రామములో బ్రాహ్మణకులమున బుట్టి పెరిగి పెద్దవాడయి కామభోగములను విసర్జించి, ప్రవ్రజించి, హిమాలయమున రమణీయవనఖండమున నివసించుచుండెను.

ఆకాలమున వారాణసీరాజు నాలుగుమూలలనుండి యమయాతనలనుభవించువారి కేకలు విని బ్రాహ్మణులతో చెప్పెను. వారు మూడ నిష్టములలో నొకదానినిగూర్చి చెప్పి, సర్వచతుష్కయజ్ఞముద్వారా శాంతి చేయవలెనని చెప్పిరి. రాజు సమ్మతించెను. పురోహితుడు బ్రాహ్మణులచే యజ్ఞకుండము సిద్ధము చేయించెను. అనేకజంతువులను (యజ్ఞ) స్తంభముకడకు గొనిపోయిరి.

ఆయెడ బోధిసత్త్వుడు మైత్రీభావనాప్రేరితుడై దివ్యచక్షువుతో లోకమును చూచెను. యజ్ఞపశువులు కనబడినంతనే "నేనచ్చటికి పోవలెను. అనేకజీవులకు కల్యాణమగును" అనుకొని సిద్ధిబలముచే విహాయసమున కెగసి, వారాణసీరాజోద్యానమున నవతరించి, మంగళశిలాపట్టముపై సువర్ణప్రతిమవలె ఉపవిష్టుడయ్యెను.

అప్పుడు పురోహితునిప్రథమశిష్యుడు ఆచార్యునికడకు జేరి "ఆచార్యా, మనవేదములలో అన్యులను హింసించి స్వకల్యాణము సమకూర్చుకొనుట అసంభవమని చెప్పలేదా?" అని యడిగెను. "నీకు రాజధనము వలయునేని మిన్నకుండుము. మనము మత్స్యమాంసములు బాగుగా భుజింతుము. ధనము లభించును." "ఇందు నేను తోడ్పడను" అని శిష్యుడు లేచి ఉద్యానమునకు బోయెను. అచ్చట బోధిసత్త్వుని గాంచి ప్రణామము చేసి కుశలప్రశ్న లడిగి, ఒకప్రక్క గూరుచుండెను.

"మాణవకా, రాజు ధర్మానుసారముగా పరిపాలన చేయుచున్నాడా?" అని బోధిసత్త్వుడడిగెను.

"భన్తే, రాజు న్యాయానుసారముగా పరిపాలించుచున్నాడు. ఆయనకు రాత్రివేళ నాలుగుధ్వనులు వినబడినవి. ఇది బ్రాహ్మణులతో రాజు చెప్పగా వారు 'యజ్ఞము చేసినచో మంగళము కలుగును'

అనిరి. రాజు పశువులను బలియిచ్చి శుభము నొందగోరుచున్నాడు. అనేకజంతువులను స్తంభములకడకు గొనిపోయినారు. భర్తే, తమవంటి సదాచారనిరతులు ఆ ధ్వనుల యుత్పాదనము నాపి, అనేకులను మృత్యుముఖమునుండి తప్పించుట ఉచితముకదా?"

"మాణవకా, రాజు మమ్ము నెరుగడు, మేము రాజు నెరుగము. ఈ ధ్వనులయుత్పత్తి మాకు తెలియును. రాజు వచ్చి మమ్మడిగినచో మేము ఆయనసందేహమును తొలగింపగలము."

"అట్లయిన తాము ముహూర్తమాత్ర మిచ్చటనే యుండుడు. నేను వెడలి రాజును దీసికొనివత్తును."

"మంచిది, మాణవకా!"

అతడు చని ఈసంగతి చెప్పి, రాజును దోడ్కొనివచ్చెను. రాజు బోధిసత్త్వునకు ప్రణామముచేసి ఒకప్రక్క గూరుచుండి "నాకు వినబడు ధ్వనులకు కారణము తమకు నిజముగా తెలియునా?" అనెను.

"తెలియును మహారాజా!"

"సెలవిండు."

"మహారాజా! పూర్వజన్మములో సురక్షితలైన పొరుగువారి భార్యలతో సాంగత్యము చేసినవారు కాశికి చుట్టుప్రక్కల నాలుగు లోహకుంభీపాకనరకములలో జన్మించిరి. చిక్కనై క్షయింప జేయునట్టిదియు, సలసలకాగుచున్న లోహోదమున ముప్పదివేల సంవత్సరములు వారు హింసలకు లోనగుచు, లోహకటాహపు టధోభాగమున తాడితులగుదాక ఒకసారి మునిగిరి; మరియొకసారి ఫేనబుద్బుదమువలె పైకి తేలిరి. కాని కొన్నిసంవత్సరములతరువాత వారికి లోహకుంభముఖము గోచరించెను. వారు దానియంచును గాంచి నలుగురు నాలుగుగాథలు పూరింప నెంచుచున్నారు. కాని పూరింపలేక ఒక యక్కరము మాత్రము పలికి, మరల లోహకుంభీపాకమున మునుగుచున్నారు. అందులో 'దు' పలికి మునిగిపోవుప్రాణి ఇయ్యది పలకదలచుచున్నాడు.

ఉండియు నొసగక యుండు జీవితము
నిష్ఫలం బగు; నీవు నిఖిలభోగముల
గల్గియు దీపంబు కల్పింప లేదు.

అని బోధిసత్త్వుడు నిజజ్ఞానముచే దానిని పూరించెను. మిగిలిన గాథలుకూడ నిట్లే పూర్తిచేసెను, అందు 'స' పలికినవాడు పూర్తిచేయ నెంచిన గాథ యిది.

ఆరువది వే లేండ్లు నరకమ్మునందు
అఖిలరీతుల బాధ కంత మెన్నండు ?

'సో' పలికినవాడు పూరింప నెంచినగాథ యిది.

అంతమ్ము కానరా దంతము లేదు
మనపాపములు మిత్రమా, అనేకములు.

'న' పలికినవాడు పూర్తిచేయ దలచిన గాథ యిది.

ఇచ్చటనుండి నే నేగి మనుష్య
తనువుగాంచిన వెన్క ధర్మకర్మములు
దయగల్గి చేయుదు, తథ్యమ్ము సుమ్మ.

ఈప్రకారముగా బోధిసత్త్వుం డొక్కొక్కగాథ పలికి, "మహారాజా, ఆయాతనాప్రాణులు ఈగాథలు పూర్తిచేయ నెంచిరి. కాని తమ పాప భారముచే పూరింపజాలరైరి. నిజకర్మఫలము ననుభవించుచు ఆక్రోశము చేయుచున్నారు. మీ రీధ్వనులు వినుటవలన అరిష్ట మేమియును లేదు, మీరు భయపడవలదు" అని చెప్పెను.

రాజు ప్రాణులను విడిచిపుచ్చి, బంగారుభేరి మ్రోయించి, యజ్ఞవాటమును ధ్వంసము చేయించెను.

బోధిసత్త్వుడు మహాజనమునకు శుభము సమకూర్చి కొలదిదినములచట నుండి, ధ్యానావస్థితుడై బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త్ర ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున పురోహిత మాణవకుడు సారిపుత్రుడు; తపస్వి నేనే.

# 315 మంస జాతకము

శాస్త జేతవనమున విహారముచేయునపుడు సరసభోజనము పెట్టుటను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆసమయమున కొలదిమంది భిక్షువులు జేతవనమునకు మధుర ఖాద్యములను తెచ్చిరి. వారు సరసభోజనము వాంఛించినవారు. రోగులకు సేవచేయువారు. "రసపూర్ణమైన ఆహారము గొనివత్తు మని శ్రావస్తి లోనికి, బోయి మిఠాయి చేయువారల వీధిలోనికి బోయి భిక్షాటనము చేసినను, రసవంతమైన ఆహారము లభింపలేదు. వారు మరలివచ్చిరి. సారిపుత్రస్థవిరుడు ప్రొద్దెక్కిన పిమ్మట భిక్షాటనమునకై బయలు వెడలి, వారిని చూచి, "ఆయుష్మంతులారా, వేగముగా మరలి వచ్చు చున్నా రేమి?" అని అడిగెను. వారు జరిగినసంగతి తెలిపిరి. అట్లైన రం డని, స్థవిరుడు వారిని వెంటబెట్టుకొని ఆ వీధిలోనికే గొనిపోయెను. అచ్చటివారు భిక్షువుల పాత్రలనిండ రసవంత మగు ఆహారము నింపిరి. రోగులకు సేవచేయువారు పాత్రలను విహారమునకు గొనివచ్చి రోగులకు బెట్టిరి.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో ఈవిషయము చర్చించుచుండగా శాస్త అచట కరుదెంచి విషయము తెలిసికొని, "భిక్షువులారా, సారి పుత్రునకు ఉత్తమాహారము ఇప్పడేకాదు, పూర్వముకూడ ప్రియవచనములు పలుకజాలిన పండితులకుగూడ మధురాహారము లభించెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠికులమున పుట్టెను. ఒకనాడు ఒకానొక మృగ వ్యాధుడు బండిలో చాలమాంసము వేసికొని, పట్టనములో విక్రయించు టకై వచ్చుచుండెను. ఆసమయమున వారాణసీనివాసులు శ్రేష్ఠి పుత్రులు నలుగురు నగరము వెలుపల కూడలిలో కూరుచుండి సల్లాపము చేయుచుండిరి. అందులో నొకరు బండి చూచి "ఈబోయవానికడ నుండి మాంసఖండము కొందును" అనెను. "పోయి కొని రమ్ము" అని

వారు పలికిరి. వారు పోయి "ఓరీ, నాకు మాంసఖండ మిమ్ము" అని యడిగెను. "ఇతరులను యాచించునపుడు ప్రియభాషణముచేయుట యుక్తము. నీ వాక్కునకు తగిన మాంసపుముక్క లభించును" అని వాడు ఈ తొలిగాథ పలికెను.

నీకు మాంసంబు వలయును, నీదు వాణి
కర్ణగోచర మైనది కఠినముగను
కాన సౌమ్య, పరుషమాంసఖండ మిత్తు.

అని నీరసమాంసఖండము నెత్తి వాని కిచ్చెను.

రెండవ శ్రేష్ఠికుమారుడు "అతని నే మని అడిగినాడు?" అనెను. "ఓరీ అని." "నేనుకూడ అతని నడిగెదను" అని తలచి వానికడకు బోయి "అన్నా! మాంసఖండ మిమ్ము" అనెను. "నీవాక్కుకు తగినట్లు మాంసఖండము లభించును" అని వ్యాధుడు ద్వితీయగాథ పలికెను.

అంగ అందరు సోదరు లైన వాని,
అంగసదృశము భవదీయ మైనవాణిః
అందుచే సౌమ్య, నీకు మాంసాంగ మిత్తు.

అని వాడు మాంసాంగము తీసి యిచ్చెను.

మూడవ శ్రేష్ఠిపుత్రుడు రెండవవానితో "ఏమని మాంసభాగము తెచ్చినావు?" అని యడిగెను. "అన్నా! అని." నేనుకూడ అడిగెద ననుకొని వాడు లుబ్ధునికడకు బోయి "బాబా, నాకు మాంసఖండ మిమ్ము" అనెను. "నీవాక్కున కనురూప మైనది లభించును" అని వాడు మూడవగాథ పలికెను.

పితరుహృదయంబు కంపిల్లు బిడ్డ పిలువ
తండ్రి యని; నీదు వాణి హృదయసదృశము
ఇందుచే సౌమ్య, హృదయంబు నిత్తు నీకు.

ఇట్లని గుండెకాయతోపాటు మధురమాంస మిచ్చెను.

నాల్గవ శ్రేష్ఠికుమారుడు మూడవవానితో "ఏమని అడిగినావు?" అనెను "బాబా అని." నేనుకూడ అడిగెదనని తలచి వాడు వ్యాధుని కడకు బోయి "మిత్రమా, నాకు మాంసఖండ మిత్తువా?" అనెను.

"నీ వాక్కున కనుగుణమగునది లభించును" అని వాడు నాల్గవగాథ పలికెను.

ఒక్క సఖుడైన లేనట్టి యూరు పెద్ద
వనము, నీవాణి ఇపుడు సర్వస్వసదృశ
మిందుచే సౌమ్య, సర్వస్వ మిచ్చువాడ.

అని "మిత్రమా, ఈమాంసపుబండి నీయింటికి తోలుకొనివచ్చెదను" అనెను. శ్రేష్ఠికుమారుడు బండిని తనయింటికి తోలించుకొనిపోయి వ్యాధునకు తగినసమ్మానము చేసెను. ఆతని ఆలుబిడ్డలను పిలిపించి, అతని నావృత్తి మాన్పించి, తనయింట నిలుపుకొని, అతనితో భిన్న భావము లేకుండ జీవితాంతమువరకు ఏకబుద్ధితో మెలగెను.

శాస్త్ర ఈధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున వేటకాడు సారిపుత్రుడు; శ్రేష్ఠిపుత్రుడు నేనే.

## 316 శశ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు అన్నియవసరములకు దాన మిచ్చుటను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొక గృహస్థు బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు అన్ని ఆవశ్యక పదార్థములను దానముచేయుటకై సిద్ధముగానుండెను. సింహద్వార సమీపమున మండపము ఏర్పాటుచేయించి ఆతడు భిక్షుసంఘము నాహ్వానించి, మండపమున ఉత్తమాసనముపై బుద్ధుని కూర్చుండపెట్టి నానావిధ రసపూర్ణ ఆహార పదార్థములు పెట్టించెను. ఈవిధముగా ఆగృహస్థు ఏడురోజులు దానములు చేసెను. ఏడవనాడు బుద్ధప్రముఖ భిక్షువులు ఐదువందలమందికి ఆవశ్యకపదార్థము లన్నిటిని

దానముచేసెను. భోజనానంతరము శాస్త్ర దానానుమోదనము చేయునపుడు "ఉపాసకా, నీవు ప్రసన్నుడవు కావలెను. నీవు చేసిన దానము పురాణపండితపరంపరకు తగియున్నది. ప్రాచీనపండితులు యాచకులు వచ్చినపిమ్మట దమసర్వస్వము నర్పించుటయే కాక నిజ మాంసమునుగూడ కోసియిచ్చిరి" అని పలికి, ఆతడు ప్రార్థించిన పిమ్మట పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు చెవులపిల్లి కడుపున పుట్టి అరణ్యమున నివసించుచుండెను. ఆ యడవి కొకప్రక్కన పర్వతము, మరియొకప్రక్క నది, వేరొక ప్రక్కన సీమాంతగ్రామము కలవు. శశమునకు కోతి, నక్క, మత్స్య ఖాది అను ముగ్గురు మిత్రులు కలరు. ఆ నలుగురు మిత్రులు ఒకే చోట నివసించుచు, ఆహారపదార్థమునకుమాత్ర ముచితప్రదేశములలో విచరించుచు, సాయంకాలమున కొక్కటిగా సమావేశ మగుచుండిరి. శశము ఆ ముగ్గురకును ఉపదేశముచేయుచుండును. దానము చేయవలెను, శీలము రక్షింపవలెను, ఉపవాసవ్రతము ననుష్ఠింపవలెను, అనుధర్మోపదేశమును ఆదరముతో వినుచు, ఆజంతువులు తమతమ నెలవులలో నివసించుచుండును.

ఈవిధముగా కాలము గడచుచుండగా ఒకనాడు బోధిసత్త్వుడు ఆకసమున చంద్రుని జూచి మరునా డుపవాసవ్రతదిన మని గ్రహించి ఆవిషయము ముగ్గురు మిత్రులకును దెలిపి "మీరు శీలధారణము చేసి, ఉపవాసవ్రత మనుష్ఠింపుడు. స్థిరశీలము గలిగి దానము చేయవలెను. అందువలన గొప్ప ఫలము చేకూరును. కావున యాచకు డెవ డైనను వచ్చినచో ఆయన కాహారభాగ మిచ్చి మిగిలినది తినవలెను" అనెను. సరే అని అంగీకరించి, అవి నిజనివాసములకు బోయెను.

మరునాడు మత్స్యఖాది ప్రాతఃకాలముననే ఆహారార్థము బయలు వెడలి, గంగాతీరము చేరెను. ఒకానొక పల్లెవాడు ఏడురోహిత మత్స్యములను పట్టుకొని త్రాట గట్టి గంగయొడ్డున ఇసుకలో బడవేసి, చేపలు పట్టుటకై గంగనీటివెంట బోవుచుండెను. చేపలవాసన తగు

లుటచే మత్స్యఖాది ఆగి, ఇసుకలో చేపలగుంపును జూచి, ఇవి యెవరివి అని మూడుమారులు కేకవేసెను. ఎవ్వరును రానందున త్రాటికొన ముక్కున గరచుకొని, నిజనివాసమునకు బోయి, అవసరము వచ్చి నపుడు తినవచ్చు నని, ఒకచో నుంచెను. వానిని జూచి, నిజశీలమును గూర్చి విచారణ చేయుచు పండుకొనెను.

సృగాలముకూడ ఆహారార్థము బయలువెడలి, తిరుగుచు, ఒకా నొక క్షేత్రపాలకుని కుటీరములో రెండుమాంసశూలములను, ఉడుమును, దధిభాండమును చూచి, యజమాను డెవరు అని మూడు మారులు కేకవేసి, ఎవ్వరు కానరానందున పెరుగుకుండ వ్రేలాడుచున్న ఉట్టిని మెడకు తగిలించుకొని మాంసశూలములను ఉడుమును నోట గరచుకొని నిజనివాసమగు బిలమునకుగొనిపోయి, అవసరము వచ్చి నపుడు తినవచ్చు నని భద్రముగా నుంచెను. నక్క నిజశీలమునుగూర్చి విచారణచేయుచు పండుకొనెను.

మర్కటముకూడ వనఖండమునకుజని మామిడిపండ్లగుత్తి పట్టుకొని తననివాసమునకువచ్చి నిజశీలమునుగూర్చి విచారించుచు పండుకొనెను.

బోధిసత్త్వుడుకూడ సకాలమున లేచి దర్భతృణాదులు మేయుదు నని తలచి తనపొదలోనే పండుకొనియుండి "ఎవరేని నాకడకు వచ్చి యాచింతురేని ఘాస మీయజాలను. తిలతండులాదులు నాకడ లేవు. ఎవరైన యాచించినచో నాశరీరమే యిత్తును" అనుకొనుచుండ ఆయనశీలతేజస్సుచే శక్రుని పాండుకంబళశిలాసనము ఉత్తప్తమయ్యెను. శక్రుడు ధ్యానమున తత్కారణము గ్రహించి, శశరాజును పరీక్షింతు నని యెంచి, తొలుత మత్స్యఖాదినివాసము జేరి, బ్రాహ్మణరూపమున నిలుచుండెను. "బ్రాహ్మణోత్తమా, ఏల నిలిచితివి?" అను ప్రశ్న మునకు బదులుగా నతడు "పండితోత్తమా, తినుట కేమయిన లభిం చినచో ఉపవాసవ్రతినై శ్రమణధర్మము నిర్వర్తింతును" అనెను. "మంచిది, నీ కాహార మిత్తును" అనుచు మత్స్యఖాది ఈ తొలిగాథ పలికెను.

> జలములం దుండి బ్రాహ్మణా, స్థలముపైకి
> తెచ్చినవి యేడు రోహితా లిచ్చట కల,
> వివి భుజించి వనమ్మునందే వసించు.

బ్రాహ్మణుడు "ఇప్పుడే తెల్లవారినది, ఉంచుము. అవల వచ్చెదను" అని, జంబుకము కలుగుకడకు బోయి, "ఏల నిలిచితివి?" అను ప్రశ్నకు బదులుగా పై వాక్కులే పలికెను. "మంచిది, ఇత్తును" అని జంబుకము సంభాషించుచు ఈ రెండవగాథ పలికెను.

పాలము కాపరికై రాత్రిభోజనంబు
రెండు మాంసంపు ముక్కలు, రెం డుడుములు
నాకడం గల వో బ్రాహ్మణా, భుజించి
వీని నన్నిటి, నివసింపు కాననమున.

"ఇప్పుడే తెల్లవారినది. ఉంచుము, ఆవల వత్తు" నని బ్రాహ్మణుడు మర్కటముకడకు బోయెను. "మంచిది, ఇత్తు" నని మర్కటము మూడవగాథ పలికెను.

చల్లని జలంబు, శీతలచ్ఛాయ కలవు;
బ్రాహ్మణా, పక్వసహకారభక్షణంబు
చేసి, కాననమున నివసింపుమయ్యా!

"ఇప్పుడే తెల్లవారినది. ఉంచుము. ఆవల వత్తు" నని బ్రాహ్మణుడు శశపండితునికడకు బోయి, "ఏల నిలిచితివి?" అను ప్రశ్నమునకు బదులుగా పై మాటలే చెప్పెను. విని, బోధిసత్త్వుడు సుప్రసన్నుడై "బ్రాహ్మణోత్తమా, ఆహారముకొరకు నాకడకు వచ్చుటలో మంచి పని చేసితివి. ఇదివర కెవ్వరు నెన్నడు నీయని దాన మిత్తును. నీవు సదాచారసంపన్నుడవు, కావున హింస చేయవు. నీవు పోయి కాష్ఠములు కట్టకట్టి తెచ్చి, నిప్పు ముట్టించి నాకు సూచన చేయుము, నేను శరీరము సమర్పించి అగ్నిలో దుముకుదును. నా దేహము పక్వమయిన పిదప నీవు మాంసము భుజించి, శ్రమణధర్మము నిర్వర్తింపుము" అని చెప్పుచు నాలుగవగాథ పలికెను.

పెసలు లేవు, తిలలు లేవు, బియ్యమైన
శశము కడ లేవు; బ్రాహ్మణా, జ్వలనపక్వ
మైన నను దిని, నివసింపు కాననమున.

శక్రు డాపలుకులు విని, నిజప్రభావమున అంగారరాశిని ఉత్పాదించి, బోధిసత్త్వునకు సూచన చేసెను. శశపండితుడు దర్భశయ్యా

మీాదినుండి లేచి, రోమములలో క్రిము లున్నయెడల మరణించునని మువ్మార్లు తనశరీరమును దులుపుకొని శరీరమును దానముగా నిచ్చి, లంఘించి, పద్మపుంజమున రాజహంసవలె అంగారరాశిపై బడెను. ఆయగ్ని బోధిసత్త్వుని రోమకూపములనైన తపింపజేయలేదు. పైగా హిమగృహమున ప్రవేశించినట్లు చల్లగా నుండ బోధిసత్త్వుడు "బ్రాహ్మణోత్తమా, నీవు ఉత్పాదించిన యగ్ని చల్లగా నున్నది. రోమకూపములకైనను వేడి యెక్కలేదు. ఏ మిది?" యనెను. "పండితోత్తమా, నేను బ్రాహ్మణుడను కాను, శక్రుడను. నిన్ను పరీక్షింప వచ్చితిని" అని శక్రు డనగా, బోధిసత్త్వుడు "శక్రా, నీమాట అటుండనిమ్ము. సమస్తప్రపంచము నా బలిదానమును పరీక్షింప దలచినచో నా యనిచ్ఛను జూడ నేరదు" అని సింహనాదము చేసెను.

"పండితోత్తమా, నీగుణము కల్పాంతమువరకు ప్రసిద్ధము అగుగాక!" అని శక్రుడు పర్వతమును పిండివేసి, రసము తీసి, చంద్రమండలమున శశాకారమును నిర్మించెను. బోధిసత్త్వుని పిలిచి ఆవనఖండమున ఆచెట్లగుబురులోనే నవదూర్వాంకురములపై పండుకొనబెట్టి తాను దేవలోకమునకు బోయెను.

ఆ నలుగురుపండితులు సమ్మోదమానమానసులై శీలమును పూరించి, ఉపవాసవ్రతమును పాలించి, క్రమముగా కర్మానుసారముగా పరలోకమునకు బోయిరి.

శాస్త్ర ఈ ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము భూరిదానము చేసిన గృహస్థులు స్రోతాపత్తి ఫలము నొందిరి.

ఆసమయమున మత్స్యఖాది ఆనందుడు; జంబుకము మోద్గల్యాయనుడు; వానరము శారిపుత్రుడు; శక్రుడు అనిరుద్ధుడు; శశపండితుడు నేనే.

## 317 మతరోదన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు శ్రావస్తినివాసి యగు ఒకానొక గృహస్థును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతని సోదరుడు చనిపోయెను. తమ్ముడు పోవుటచే ఆతడు శోకాభిభూతుడై స్నానము చేయక భుజింపక, చందనాదిలేపనము చేయక, ప్రాతఃకాలముననే శ్మశానమును చేరి దుఃఖించుచుండెను. శాస్త బ్రాహ్మముహూర్తమున లోకపర్యవేక్షణము చేయుచు వానికి శ్రోతాపత్తిఫలప్రాప్తి కాకుండుట గ్రహించి "వీని పూర్వజన్మవిషయము తెలిపి దుఃఖము శాంతింపజేసి శ్రోతాపత్తిఫలము నొసగగలవాడు నాకంటె అన్యుడు లేడు. కావున వీనికి తోడ్పడవలెను" అని తలపోసి, మరునాడు భిక్షాటనమునుండి మరలివచ్చి, భోజనానంతరము అనుగామిశ్రమణులతో వాని గృహద్వారము చేరెను. శాస్త అరుగుదెంచె నని వినగానే గృహస్థు ఆసనము వేయించి లోనికి గొనిపోయెను. లోనికి జని శాస్త ఆసనముపై నుపవిష్టుడై నంత గృహస్థు ఆయనకు ప్రణామముచేసి ఒక ప్రక్క కూరుచుండెను.

అతనినిగూర్చి శాస్త "గృహస్థూ, విచారగ్రస్తుడవై యున్నావే?" అనెను.

"భన్తే, చిత్తము. నా సోదరుడు పోయినప్పటినుండి విచార మేర్పడినది."

"ఆయుష్మన్, అన్నిసంస్కారములు అనిత్యములు. భేదనస్వభావము భిద్యమగుచుండును. ఆ విషయమై చింతింపనక్కరలేదు. పురాణపండితులు సోదరమరణానంతరము భేదనస్వభావము భిద్యమగునని యెంచి విచారము విడిచిరి" అని శాస్త వానిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల ధనాధిపతి యగు శ్రేష్ఠియింట బుట్టెను. అతడు పెద్దవాడయినవెనుక తలిదండ్రులు చనిపోయిరి. అనంతరము

## 317 మతరోదన జాతకము

బోధిసత్త్వుని సోదరు డొకడు కుటుంబపుటాస్తిని సంరక్షించుచుండెను. బోధిసత్త్వుడు వానిపై ఆధారపడి జీవించుచుండెను. ఆసోదరుడుకూడ ఏదోవ్యాధివలన మృతిచెందెను. జ్ఞాతులు, మిత్రులు, సమావేశమై ఏడ్చుచు, చేతులతో మోదుకొనుచు, అం దొక్కరైన వివేకముతో నుండలేకపోయిరి. బోధిసత్త్వుడు రోదనము చేయలేదు, నెత్తిపై మోదుకొనలేదు. లోకు లాయనను నిందించిరి. "చూడుడు. ఈతని సోదరుడు మరణించినాడు. కాని యితనిముఖమున చింతారేఖకూడ కానరాదు. మిక్కిలి కఠినహృదయుడు, తమ్ముడు పోయినచో రెండు భాగములు తానే అనుభవింపవచ్చు నని కోరిన ట్లున్నాడు" అనుచు "సోదరుడు మరణించినను నీవు దుఃఖింపవు" అని చుట్టములుకూడ నిందించిరి. బోధిసత్త్వుడు ఇ ట్లనెను. "మీ గ్రుడ్డితనమువలన, మూర్ఖత వలన అష్టలోకధర్మము లెరుగకపోవుటవలన నాసోదరుడు మరణించినా డని యేడ్చుచున్నారు. నేనుకూడ పోవుదును. మీరుకూడ పోవుదురు. మీలో మీరుకూడ మేము పోయినా మని ఏల యేడువరు ? అన్ని సంస్కారములు అనిత్యములే. ఒక్కటికూడ శాశ్వతముగాదు. మీ గ్రుడ్డితనమువలన, మీమూర్ఖతవలన, అష్టలోకధర్మముల నెరుగక పోవుటవలన మీరు రోదించుచున్నారు. నే నేల దుఃఖింతును?" ఇట్లు చెప్పి, ఈ గాథలు పలికెను:

చచ్చువారల కేడ్చెదు; చావబోవు
నరునికై నుంత యేడ్వ; వెల్లరునుగూడ
కాలధర్మము గాంతురు క్రమముగాను.

విహగముల్, చతుష్పాదులు, విపులభోగ
నాగములనుండి దేవతల్ నరులవరకు—
ఎవ్వరికిగూడ నధికార మేమి లేక
నిజశరీరాలపై, భోగనిష్ఠు లగుచు
ఎల్లరును దేహములు త్యజియించుచుంద్రు.

సుఖము, దుఃఖము, నీ రీతి నఖిలలోక
ముందు చంచల మస్థిరం బగుట చూచి
ఏడ్చినను మొత్తుకొన్నను నేమి ఫలము ?
నీచులును, మద్యపాయులు, నిష్క్రియులును

ధూర్తజనులు, నకోవిదుల్, దుండగీంద్రు
కాంచి ధీరుల, మూఢులుంగా దలంత్రు.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము గృహస్థు శ్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున లోకులకు ధర్మోపదేశము చేసి వారిశోకము తొలగించిన పండితుడను నేనే.

## 318 కణవేర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు పూర్వభార్యాకర్షణమునుగూర్చి చెప్పినది.
వర్తమానకథ ఇంద్రియజాతకమున (423) వచ్చును. శాస్త వానితో "భిక్షూ, ఇందుచేతనే పూర్వజన్మమున నీ శిరస్సు కరవాలమున ఖండితమైనది." అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు కాశీగ్రామకమున ఒకానొక గృహపతియింట చోరనక్షత్రమున బుట్టి, పెద్దవాడయి, చౌర్యమువలన జీవించుచుండెను. అతడు నాగబలుడనియు, ఎవ్వడు నతని బట్టుకొనలేరనియు లోకమున వ్యాపించెను. అత డొకసారి శ్రేష్ఠిగృహమున కన్నము వేసి, బహుధనమును హరించెను. జనులు రాజుసన్నిధికి బోయి "దేవా, గొప్ప చోరు డొకడు నగరమును దోచుకొనుచున్నాడు. వానిని పట్టింపుడు" అని విన్నవించిరి. చోరుని బట్టుకొమ్మని రాజు కొత్వాలు కానతిచ్చెను. అతడు రాత్రివేళ జట్లుగా మనుష్యుల నేర్పాటుచేసి, అచ్చటచ్చట నుంచి, చోరుని ధనసహితముగా పట్టుకొనినట్లు రాజుకు విన్నవించెను. 'వీనిశిరసు ఖండింపుము' అని కొత్వాలుకు రాజు ఆనతిచ్చెను.

అతడు చోరుని రెండుచేతులు వెనుకకు విరిచి కట్టించి ఎఱ్ఱగన్నేరు పూలదండ వానిమెడలో వేయించి, తలమీద ఇటుకపొడి చిలికించి,

శృంగాటకములలో వానిని చబుకుతో కొట్టించి, తప్పెటల మ్రోతతో వధ్యస్థానమునకు గొనిపోవుచుండెను. దొంగ దొరికెనని నగరమున సందడి బయలుదేరెను.

ఆ రోజులలో వారాణసిలో దినమునకు సహస్రము గ్రహించుచు, రాజవల్లభ యై, పంచశతదాసీపరివృత యైన శ్యామ యను వేశ్య యుండెను. ఆమె మేడకిటికీ తెరచి వీథివెంట జూచుచుండెను. చోరుడు రూపవంతుడు, సుభగశరీరుడు, దేవవర్ణి, మానవమణివలె కానబడు చుండెను. అతనిని గొనిపోవుట చూచి శ్యామ ఆతనియెడ ప్రతిబద్ధ చిత్త యై "ఏ యుపాయమున నీతని నా స్వామిని చేసికొనగలను!" అని యోచించి ఉపాయము తోచుటచే తన పరిచారిక చేతికి సహస్ర ముద్ర లిచ్చి కొత్వాలుకు "ఈ చోరుడు శ్యామకు సోదరుడు, ఆమె కన్న ఇతనికి వేరెవ్వరు తోడు లేరు. ఈవేయి గ్రహించి ఇతనిని విడిచి పెట్టుడు" అని వార్తపంపెను. దూతిక చెప్పినట్లు చేసెను. ప్రత్యుత్త రముగా కొత్వాలు "ఇతడు ప్రసిద్ధచోరుడు. ఇట్లు విడిచిపెట్టుటకు వీలు లేదు. ఇతనికి బదులుగా వేరొకడు దొరికినచో ఇతనిని బందిలో పదిల పరచి పంపగలను" అని చెప్పగా దాసి పోయి తెలిపెను.

అప్పుడు శ్యామయెడల ప్రీతికల శ్రేష్ఠిపుత్రుడు ప్రతిదినము వేయి నాణెము లిచ్చుచు, ఆనాడుకూడ సూర్యాస్తమానవేళ సంచిపుచ్చు కొని ఆమెయింటికి జేరెను. సంచి ఒడిలో వేసికొని శ్యామ రోదనము చేయసాగెను. ఏ మిది? అని అత డడుగగాఁ స్వామీ, ఈ చోరుడు నా సోదరుడు, నాది నీచవృత్తి యని నావద్దకు వచ్చెడివాడు కాడు. వేయిముద్ర లిచ్చినచో నతనిని విడిచిపుత్తు నని కొత్వాలు నాకు ప్రతి వచనము పంపినాడు. ఈ ధనమును గొనిపోయి ఆయన కీయగలవారు నాకు లేరు" అని పలికెను. ప్రతిబద్ధచిత్తు డగుటచే నతడు "నేను పోవుదు" ననెను. "అట్లయిన దీనిని గొనిపొమ్ము" అని వేశ్య చెప్పెను.

అతడు కొత్వాలుగృహమునకు బోయెను. వానిని కొత్వాలు రహస్యప్రదేశమున నుంచి, మూతబండిలో చోరు నెక్కించి శ్యామ కడకు బంపి "ఈచోరుడు దేశ మంతట పేరుమ్రోగినవాడు. బాగుగా చీకటి పడనిమ్ము. నెపముపన్ని నాగరికులు నిద్రపోయిన పిమ్మట నూత

నుని సంహారము చేయింతు" అని వార్త చెప్పనంపెను. కొంతతడ వయిన పిదప, నాగరకులు నిద్రపోయినపుడు రక్షకభటసమూహముతో శ్రేష్ఠిపుత్రుని వధ్యస్థానమునకు గొనిపోయి, శిరసు ఖండించి, తల శూలమునకు గ్రుచ్చి, నగరములో ప్రవేశించెను.

నాటినుండి శ్యామ అన్యుని స్వీకరింపక చోరునితోడనే క్రీడించు చుండెను. ఆత డిట్లు భావించెను. "ఈ వేశ్య ఒకనిని చంపించి నన్ను చేపట్టినప్పుడు నన్ను హతమార్చి వేరొకనితో క్రీడింపకుండునా? దీనిది మహాద్రోహబుద్ధి. నే నిచట నుండక పలాయనము చేయవలెను. పోవునపుడు రిక్తహస్తములతో పోవరాదు. దీని నగలసంచి కొనిపో వలెను." ఇట్లు భావించి, అత డొకనాడు "భద్రే, పంజరములో నున్న కోడివలె నిత్యము గృహములోనే యున్నాను. ఉద్యానములో విలాసముగా గడుపుటకై పోవుదము" అని చెప్పగా ఆమె సమ్మతించి ఖాద్యసామగ్రి సిద్ధము చేసి, సర్వాభరణభూషిత యై మూతబండిలో నతనితో బయలుదేరి, ఉద్యానము చేరెను.

అత డామెతో కొంతతడవు కాలము పుచ్చుచు, ఇప్పుడు పారి పోవలెను అని తలపోసి, ఆమెతో క్రీడించువానివలె గన్నేరుపొదలో బ్రవేశించెను. ఆవిహారమిషతో శ్యామ నాతడు వివశురాలిని జేసి పడవేసి, ఆభరణము లన్నియు ఒలిచి, ఆమెఓణిలో కట్టి, బుజముమీద వేసికొని, ఉద్యానపుగోడ దుమికి పలాయితుడయ్యెను.

తెలివి వచ్చినపిమ్మట ఆమె పరిచారికలకడకు జని, ఆర్యపుత్రు డెక్కడ? అని యడిగెను. 'మాకు తెలియదు అమ్మా!' అని వారు చెప్పిరి. ఆమె తనలో "నేను చనిపోతి నను భీతిచేత అతడు పలాయితు డయియుండును" అనుకొని, యిలుచేరి, నేలపై బడియుండెను. స్వామిని చూడగలిగి నప్పుడు లేచి అలంకృతశయ్యపై బండుకొందు ననుకొనెను.

ఆమె మంచివస్త్రములు కట్టుటమానెను. రెండుపూటల భోజనము మానుకొనెను. గంధమాల్యాదులు విసర్జించెను. ఏ విధముగా ఆర్య పుత్రుని బిలిపింపగలను అని యోచించుచు, నటులకు సహస్రధనమిచ్చెను. "అమ్మా, మే మేమి చేయవలెను?" అని వా రడిగిరి. "మీరు పోవ జాలని ప్రదేశము లేదు. నగరములకు, గ్రామములకు, పల్లెలకు బోయి వినోదప్రదర్శనము చేయుసమయమున ప్రేక్షకులు గుమిగూడిన పిమ్మట,

ముందుగా ఈగీతము పాడుడు" అని శ్యామ తొలిగాథనేర్పి, "ఆర్య పుత్రుడు ఆసమాజములో నున్నచో మీతో ప్రసంగించును, ఆయనతో నా యారోగ్యమును గూర్చి చెప్పి, పిలుచుకొనిరండు. ఆయన రాని పక్షమున నాకు వార్త నంపుడు" అని ఖర్చు లిచ్చి పంపెను.

వారు వారాణసినుండి బయలుదేరి అక్కడక్కడ వినోదములు చూపుచు, ఒకానొక సీమాంతగ్రామము చేరిరి. చోరుడు పారిపోయి ఆగ్రామమున నివసించుచుండెను. వా రచ్చట ప్రదర్శనము చేయుచు ఈగీతము పాడిరి.

రక్త కరవీర భూరుహారామమందు
ఎవతెను వసంతఋతువునం దీవు నాడు
భీమముగ నొక్కిపోతి వా శ్యామ చేయు
చున్న దారోగ్యసూచన తన్ను గూర్చి.

చోరు డీ గీతము విని నటుని జేరి "శ్యామ జీవించియున్నదని మీా రనుచున్నారు. నాకు నమ్మకములేదు" అని ప్రతారించుచు, ఈ రెండవ గాథ పలికెను:

కొండను వాయువు కొంపోవు ననుచ
విశ్వసింతునెని ఒక్కవేళ నారీతి
ఘటియిల్ల పృథ్విని గాలి కొంపోవు:
నట్టిదే మృతగణికారోగ్యవార్త.

అది విని నటుడు మూడవగాథ పలికెను:

శ్యామ చనిపోవలే, దన్యజనుని గోర,
దేశభర్తృక! నిన్నె వాంఛించు నామె.

విని చోరుడు "ఆమె జీవించియుండవచ్చును, జీవింపకుండవచ్చును. దానితో నాకు ప్రయోజనము లేదు" అని నాలుగవగాథ పలికెను.

ధ్రువముగా నున్నవానిని త్రోసిపుచ్చి
అధ్రువుండును నూతనుం డైన నన్ను
స్వీకరించెను శ్యామ! చేపట్టవచ్చు
నన్యునిఁ బోవుదు నందుచే నేను
చేరగా మిక్కిలి దూర దేశమ్ము.

"నే నిచటినుండి వెడలిపోయినసంగతి ఆమెతో చెప్పవలెను" అని యతడు వస్త్రము కప్పుకొని పరుగెత్తెను. నటు డీసంగతి శ్యామకు తెలుపగా, ఆమె పశ్చాత్తాపముతో యథాప్రకారము కాలముగడపెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము ఉద్విగ్నచిత్తు డగు భిక్షువు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను.

ఆ కాలమున శ్రేష్ఠిపుత్రుడు ఈ భిక్షువు శ్యామ పూర్వభార్య. చోరుడు నేనే.

## 319 తిత్తిర జాతకము

శాస్త కౌశాంబిలో బదరికారామమున విహారముచేయునపుడు రాహుల స్థవిరునిగూర్చి చెప్పినది. వర్తమానకథ ఇదివరలోనే (16) వచ్చినది.

ధర్మసభలో భిక్షువులు రాహులుని ప్రశంసించుచుండగా శాస్త అరుగుదెంచి సంగతి తెలిసికొని "భిక్షువులారా, రాహులుడు ఇప్పుడేకాదు, పూర్వముకూడ క్రమశిక్షణపై నాసక్తికలవాడు, దుష్కర్మలనుండి మిక్కిలి సంకోచము పొందువాడు, ఉపదేశము పొందువా" డని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి, పెరిగి, తక్షశిలలో సమస్త విద్యలు నేర్చి వచ్చి, హిమాలయమున ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొందెను. ధ్యానమగ్నుడై రమణీయవనఖండమున నివసించుచు ఉప్పుపులుసుకొరకు సీమాంతగ్రామమును జేరెను. ఆయనను జూచి లోకులు భక్తిశ్రద్ధలతో సమీపారణ్యమున కుటీరము నిర్మించి, వలసినవస్తువులు సమకూర్చుచుండిరి.

ఆరోజులలో ఆగ్రామమున బోయవాడు పెంపుడు తీతువపిట్టను పంజరమున నుంచి బాగుగా ధ్వనులు నేర్పి, దానిని అడవిలోనికి గొని

పోయి, దాని కూతలవలన సమీపించు తిత్తిరిపిట్టలను పట్టుకొని జీవించు చుండెను. ఒకనాడు పెంపుడు తిత్తిరి తనలో 'నామూలమున నాజాతి పిట్ట లనేకము చనిపోవుచున్నవి. నేను పాపమున భాగము పంచుకొనక తప్పదు' అనుకొని కూతకూయుట మానెను. పిట్ట మౌనము వహించుట గమనించి, బోయవాడు వెదురుముక్కతో దానినెత్తి మీాద కొట్టసాగెను. తిత్తిరి దుఃఖముతోనే కూసెను. ఈవిధముగా పిట్టలవాడు దాని తోడ్పాటుతో పిట్టలను బట్టుకొని జీవనము చేయు చుండెను.

తీతువపిట్ట యిట్లు తలపోసెను: "నా కిష్టము లేకపోయినను ధ్వని చేయుచో పిట్టలు వచ్చును. నేను ధ్వనిచేయనిచో రావు. వచ్చిన వానిలో ఉరిలో పడినవి చనిపోవుచున్నవి. నా కిందులో పాప మంటునా, అంటదా?" అప్పటినుండి పిట్ట తనసంశయవిచ్ఛేదము చేయు వారికొర కెదురుచూచుచుండెను.

ఒకనాడు బోయవాడు ఎన్నో తీతువులను బట్టుకొని, బుట్టలో బెట్టి, నీరుత్రాగుటకై బోధిసత్త్వుని యాశ్రమమునకు బోయెను. పంజ రమును ఆయనసమీాపమున నుంచి వాడు నీరు త్రాగి, ఇసుకలో పండుకొని నిద్రపోయెను. అది గ్రహించి తీతువు "ఈ తాపసు నడిగి నాసందేహము తీర్చుకొందును. ఈయన సందేహనివారణ చేయగల డని తోచుచున్నది" అనుకొని, పంజరమునుండియే ఈతొలిగాథ పలికెను:

> నేను సుఖముగ నన్నపానీయములను
> పొందుదును; కాని నాజాతిపులుగు లరుగు
> దెంచి ప్రాణాలు కోల్పోవు తెరవునందు
> నుందు; నాగతి యిక నెట్టులుండు సామి?

దాని ప్రశ్నమునకు సమాధానముగా బోధిసత్త్వుడు రెండవగాథ పలికెను.

> పక్షి, నీ చిత్తంబు పాపకర్మంబు
> పక్షాన కొరగని పక్షమ్మునందు
> అంట దఘమ్ము నీవంటి యోగ్యులకు.

విని తిత్తిరి మూాడవగాథ పలికెను:

వీక్షించి నా జాతివిహాగంబు లెన్నొ
వచ్చుచు చచ్చుట వలన, పాపమ్ము
సోకు నేమో యని నాకు సందియము.

ఆకర్ణించి బోధిసత్త్వుడు నాలుగవగాథ పలికెను:

కలుషితంబు మనస్సు కాకున్నయెడల
కర్మఫలంబు సోకదు; దుష్టకార్య
పక్షాన నుత్సాహపడుట యెరుంగ
నట్టివానిని పాప మంటదు సుమ్మి!

ఈ విధముగా బోధిసత్త్వుడు తీతువున కుపదేశము చేసెను. దాని సంశయము సంపూర్ణముగా తొలగిపోయెను. బోయవాడు నిద్రలేచి, బోధిసత్త్వునకు ప్రణామము చేసి, పంజరము తీసికొని పోయెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆసమయమున తీతువు రాహులుడు. తపస్వి నేనే.

## 320 సుచ్చజ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక గృహస్థును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు మస్తా వసూలు చేయుటకు భార్యతోగూడ గ్రామమునకు బోయి వసూలుచేసి ఆవల బండిలో కొనిపోవుదమనని తలచి తాను వసూలుచేసిన సామాను ఒకానొక గృహస్థునిఇంట నుంచి శ్రావస్తి వైపు బయలుదేరెను. మార్గమున అతనికి గుట్టకానబడెను. "స్వామీ, ఈగుట్ట బంగారమైనచో నాకు కొలదిగా నిత్తురా?" యని భార్య ప్రశ్నించెను.

"నీ వెవరు? ఏమియు నీయను!"

అతడు కఠినహృదయుడని గ్రహించి ఆమె అసంతుష్టచిత్త యయ్యెను. వారు జేతవనసమీపము చేరి విహారమునకు చని నీరు త్రాగిరి. శాస్త్ర ప్రాతఃకాలమునుండి వారికొరకు ప్రతీక్షించుచు గంధకుటి వసారాలో కూరుచుండి యుండెను. వారికి శ్రోతాపత్తిఫలము లభింపనున్నదని శాస్త్ర గ్రహించి యుండెను. ఆయన శరీరమునుండి ఆరువర్ణముల కాంతులు బయలువెడలుచుండెను. ఆదంపతులు నీరు త్రాగి శాస్త్ర సన్నిధికి వచ్చి ప్రణామము చేసి కూర్చుండిరి. శాస్త్ర కుశలప్రశ్నానంతరము "ఎచటకు బోయితిరి?" అని వారి నడిగెను.

"భన్తే, గ్రామములో వసూలుకోసము."

"ఉపాసికా, నీ భర్త నీకు మేలు కోరునా? ఉపకారము చేయుచుండునా?"

"భన్తే, నాకు ఈయనయెడ ప్రీతి కలదు. ఈయనకు నాయెడ ప్రీతి లేదు. త్రోవలో కొండ కనబడినప్పుడు ఇది స్వర్ణమయ మైనచో నాకేమైన నిత్తురా యని యడుగ, నీ వెవతెవు, నీ కేమియు నీయను. అని ఈయన అన్నాడు. కఠోరహృదయుడు!"

"ఉపాసికా, ఈయన మాటవరుస కట్లన్నాడు. నీ గుణములు జ్ఞప్తికి వచ్చినచో నీకు సమస్తైశ్వర్యము నొసగును" అని శాస్త్ర వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చెయుచుండగా బోధిసత్త్వ డాతనికి సర్వార్థసాధకు డైన అమాత్యు డయ్యెను. ఒక నాడు రాజకుమారుడు తనసేవకై వచ్చుచుండగా జూచి రాజు తనలో, "వీడు నాకు విరుద్ధముగా కుట్ర పన్నవచ్చును" అనుకొని "నాయనా, నేను జీవించి యున్నంతవరకును నీవు రాజధానిలో నుండవద్దు. వేరొక చోట నుండుము. నా యనంతరము రాజ్యము సంబాళించుకొమ్ము" అని పలికెను.

మంచి దని యాతడు తండ్రికి నమస్కరించి తనపెద్దభార్యను వెంటగొని, నగరము వెలువడి, రాష్ట్రముసరిహద్దు చేరి, అడవిలో పర్ణ

కుటీరము నిర్మించుకొని, నివసింపజొచ్చెను. కొంతకాలమునకు రాజు మరణించెను. రాజకుమారుడు నక్షత్రములను గణించి తనతండ్రి కాలధర్మము నొందె నని గ్రహించి, వారాణసికి బయలుదేరి త్రోవలో పర్వతమును కనుగొనెను.

"దేవా, ఈపర్వతము స్వర్ణమయ మయిన పక్షమున నాకు కొంచె మిత్తురా?" అని భార్య యడిగెను. "ఎవరు నీవు? కొంచెముకూడ ఈయను" అని యత డనగా ఆమె అసంతుష్టచిత్త యై, "ఈయన మీఁది ప్రీతి విడజాలక అడవికికూడ వచ్చితిని ఈయన యిట్లు పలికినాడు. కఠినహృదయుడు. రా జయి నా కేమి మేలు చేకూర్పగలడు?" అనుకొనెను.

అతడు రాజధానికి వచ్చి అభిషిక్తు డై భార్యను పట్టమహిషిని జేసెను. పేరు కామె పెద్దరాణి. సమ్మానము లేదు. బోధిసత్త్వుడు చూచి "ఈ దేవి ఈయన కుపకారము చేసినది. తనశ్రమ లెక్కచేయక, ఈయనవెంట అరణ్యావాసము చేసినది. కాని రా జీమెను లెక్కచేయక వేరొకతెతో క్రీడించుచున్నాడు. ఐశ్వర్యమంతయు ఈమెకు లభ్యమగునట్లు కొంతపని చేసెదను" అనుకొని ఒకనాడు పట్టమహిషివద్దకు బోయి, "మహాదేవీ, మాకు నీవలన భిక్షామాత్రము కూడ లభించుటలేదు. మాయెడ ఇంతయుపేక్ష యేల? నీది గట్టిగుండె" అనెను.

"నాయనా, నాకు దొరకినచో మీకుసైత మిత్తును. ఏమియును దొరకనప్పుడు ఏమి యిత్తును? త్రోవలో పర్వతమును జూచి, ఇది స్వర్ణమయమయినచో నాకు కొంచెమిత్తురా? అంటిని. నీ వెవరు? ఏమియు ఈయను అని రాజు పలికినాడు. రాజు నా కిప్పు డే మిచ్చును?"

"రాజుసముఖమున ఈమాట అనగలవా?"

"నాయనా, ఎందుల కనలేను?"

"అట్లయిన, రా జుండగా అడుగుదును. నీవు చెప్పవలెను."

"మంచిది నాయనా."

దేవి రాజసేవార్థము వచ్చినప్పుడు బోధిసత్త్వుడు "ఆర్యే, మాకు మీవలన ఏమియు లభించుట లేదు" అనెను.

"నాయనా, నాకు లభించినచో మీ కిత్తును. నాకే ఏమియును లభించుట లేదు. రాజు నా కిప్పు డే మిత్తురు? అడవినుండి మేము తిరిగి వచ్చునప్పుడు పర్వతము కనబడినది. ఇది స్వర్ణమయమయినచో నా కేమైన నిత్తురా ? అంటిని. నీ వెవరు ? ఏమియు ఈయను ! అని బదులు పలికినారు. ఇప్పు డేమిత్తురు" అని పట్టమహిషి ఈ తొలిగాథ పలికెను.

త్యాగమే లేదు మాటమాత్రమున నైన
ఏమి లాభము- సులువుగా నీయదగిన
దానినైన నొసంగడు : త్యాగ మెట్లు
సలుపు పర్వతమును మాటసరణికైన.

విని రాజు రెండవగాథ పలికెను;

చేయనట్టివాడు చేయనే చేయడు
చేయునట్టివాడు చేసితీరు
వట్టిమాట లాడువానిని గురుతింత్రు
బుద్ధిమంతు లైన పురుషు లెపుడు.

దేవి చేతులు జోడించి మూడవగాథ పలికెను:

సత్య ధర్మములందు, సంస్థితి నీవు,
పొందినాడవు రాజపుత్ర, నమస్సు!
నిండు చిక్కున బడ్డ నీ మానసంబు.
సంక్రీడనము చేయు సత్యమ్మునందె.

ఈవిధముగా దేవి రాజుగుణానువాదము చేయగా బోధిసత్త్వుడామె గుణప్రకర్షకై నాల్గవగాథ పలికెను.

పేదవా డగు భర్తతో పేదరికము
విత్త మొదవిన యంత సంపత్తి నెవతె
సమముగా జూచు నామె యశస్సు గాంచు;
మీరు ధనవంతు లైనట్టివారి సతులు.

ఇట్లు బోధిసత్త్వుడు దేవి గుణప్రకటన చేసి "మహారాజా, ఈమె మీ యాపత్కాలమున అడవిలో మీ శ్రమ పంచుకొన్నది. ఈమెను సమ్మానించుట కర్తవ్యము" అని విన్నవించెను.

ఆయన చెప్పినపిమ్మట రాజు ఆమెగుణమును స్మరించి "పండితో త్తమా, మీరు చెప్పినతరువాత దేవీగుణము జ్ఞప్తికి వచ్చినది" అని ఆమె కైశ్వర్యమంతయు నిచ్చెను. "మీరు దేవీగుణము జ్ఞాపకము చేసినారు" అని బోధిసత్త్వునకుగూడ చాలసంపద యిచ్చెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. దేవి ఉపాసిక. పండితామాత్యుడు నేనే.

## 321 కుటిదూసక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు మహాకశ్యపస్థవిరుని కుటీరమును కాల్చివేసిన తరుణభిక్షువునుగూర్చి చెప్పినది. ఘటన రాజగృహమున జరిగినది.

### వర్తమాన కథ

ఆసమయమున స్థవిరుడు రాజగృహసమీపమునందలి అడవిలోని కుటీరమున నివాసము చేయుచుండెను. ఇరువురు తరుణభిక్షువు లాయునకు ఉపచారములు చేయుచుండిరి. వారిలో ఒకడు యోగ్యుడు; రెండవవాడు మాటవసనివాడు. ఒకడు చేసినదానిని తానేచేసినట్లు ప్రదర్శించును. యోగ్యభిక్షువు ముఖప్రక్షాళనార్థము జలాదికము తెచ్చి అక్కడ నుంచగా అసహిష్ణువు స్థవిరునికడ కేగి ప్రణామము చేసి 'భన్తే, నేను తమకోస ముదక ముంచినాను. ముఖప్రక్షాళనము చేయుడు' అనెడివాడు. యోగ్యుడు తెల్లవారుజాముననే లేచి కుటీరప్రాంగణము పరిశుభ్రము చేసి వెడలిన పిమ్మట అసహిష్ణువు వచ్చి కొంచె మిటు నటు తుడిచి ప్రాంగణమంతయు తానే తుడిచినట్లు నటించెడివాడు. యోగ్యభిక్షు వొకనాడు తనలో "ఇతడు నేను చేసినదంతయు తానే చేసినట్లు నటించుచున్నాడు. వీని చర్య వెల్లడిచేసెదను" అనుకొని అసహిష్ణువు గ్రామమునకు పోయినపుడు, భోజనము చేసి వచ్చి పండు కొనినపుడు, స్నానార్థము నీరు కాచి గదిలో నుంచి కొద్దినీరు గిన్నెలో

పోసి పొయ్యిమీద నుంచెను. అతడు లేచివచ్చి ఆవిరివచ్చుట చూచి అసహిష్ణువు "ఆయన నీరు కాచి గదిలో నుంచియుండును" అని తలచి స్థవిరుని కడకు బోయి "భన్తే, స్నానాగారమున నీరు ఉంచినాను, స్నానము చేయుడు" అని చెప్పెను. స్థవిరుడు "స్నానము చేయుదు" నని ఆతని వెంటనే వచ్చెను. గదిలో నీరులేకుండుట గమనించి "నీ రెక్కడ నున్నది?" అని ప్రశ్నించి అగ్నిశాలలో ప్రవేశించి ఖాళీగిన్నె చూచెను. ఖాళీగిన్నెపై ఉంచినమూతవలన 'సర్' అనుశబ్దము బయలు దేరెను. అప్పటినుండి అతనికి ఉల్లుఞ్జశబ్దకు డని పేరు వచ్చెను. అపుడు గదిలోనుండి యోగ్యుడు నీరుతెచ్చి "భన్తే, స్నానము చేయు" డనెను. స్థవిరుడు స్నానము చేసి ఉల్లుఞ్జ శబ్దకుని గూర్చి యోచించి ఆతడు చెప్పినపనిని చేయువాడు కాడని గ్రహించి, సాయంకాలము వాడు వచ్చినపుడు వానికి బోధచేసెను. "ఆయుష్మన్, శ్రమణులు తమకర్తవ్యము తప్పక నిర్వహింపవలయును. అట్లు చేయనిచో అసత్యములు చెప్పవలసివచ్చును. నేటినుండి అట్లు చేయవలదు." ఈవాక్కులు విని వాడు మండిపడి మరునాడు స్థవిరుని వెంట భిక్షాటనమునకై గ్రామములోనికి పోలేదు. స్థవిరుడు యోగ్యునివెంట గొనిపోయెను. ఉల్లుఞ్జ శబ్దకుడు స్థవిరుడు చనెడు కుటుంబమునకు పోవగా స్థవిరు డెక్కడ యని అడిగిరి. ఆయన అస్వస్థు లగుటచే విహారముననే ఆగిరి. 'భన్తే, మీ కేమి కావలెను?'

వాడు అది కావలె నిది కావలె నని చిత్తము వచ్చిన వస్తువులు కొనిపోయి విహారము చేరెను. మరునాడు స్థవిరుడు ఆకుటుంబమునకే పోయి కూర్చుండెను. వారు 'తమ కేమి అస్వస్థత? తాము నిన్న విహారముననే ఉంటిరట. మేము ఫలాని యువకుని ద్వారా ఆహారము పంపినాము. తాము భిక్ష స్వీకరించితిరా?' అని యడిగిరి. స్థవిరుడు నిశ్శబ్దముగా భోజనము ముగించి విహారమునకు జని సాయంసమయమున వాడు తన కుపచారార్థము వచ్చినపుడు 'ఆయుష్మన్, ఫలాని కుటుంబమువారికడ అవి కావలె నివికావలె నని యడిగి భుజించి వస్తువులు సంగ్రహించితివి. యాచన మంచిదికాదు. ఇట్టి యనుచితకృత్యము మరల చేయవల" దని మందలించెను. వాని మనసులో స్థవిరునియెడ వైరము వర్ధిల్లి మరునాడు స్థవిరుడు భిక్షాటనమునకు పోయినపుడు

దుష్టశిష్యుడు చేతగాని పనికివచ్చుపాత్రలు మొదలగునవి పగులగొట్టి పర్ణకుటీరమునకు నిప్పు ముట్టించి, పారిపోయెను. వాడు బ్రతికియుండగానే పిశాచమువలె నయి శుష్కించిపోయెను; మరణానంతరము అవీచీనరకమున పడెను. వాని దుష్కార్య మెల్లరకు దెలిసెను. అందరు భిక్షువులు రాజగృహమునుండి శ్రావస్తికి వచ్చి అనుకూలస్థానమున తమ పాత్రలు, చీవరములు నుంచి శాస్తసన్నిధికి జని ప్రణమిల్లి కూరుచుండిరి. శాస్త కుశలప్రశ్నానంతరము "ఎక్కడనుండి వచ్చుచున్నా" రనెను.

'భన్తే, రాజగృహమునుండి.'

'అచట నుపదేశ మిచ్చు ఆచార్యు డెవరు?'

'భన్తే, మహాకాశ్యప స్థవిరులు.'

'భిక్షువులారా, ఆయన కుశలముగా నున్నాడా?'

"చిత్తము భన్తే, స్థవిరులు మాత్రము కుశలము. కాని ఆయన శిష్యులలో నొకడు ఉపదేశమునకు క్రుద్ధుడై స్థవిరుడు భిక్షాటనమునకు పోయినపుడు వస్తువు లన్నియు పగులగొట్టి, కుటీరమునకు నిప్పు ముట్టించి పారిపోయినాడు."

భగవాన్ వారితో "భిక్షువులారా, అతడు ఇప్పుడే కాదు, పూర్వంకూడ ఇట్లే చేసినాడు" అని వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సింగిలపిట్ట కడుపున పుట్టి, పెరిగి, వర్షాకాలమున భద్రముగా నుండుటకై చక్కనికులాయము నిర్మించుకొని హిమవత్ప్రదేశమున నివసించుచుండెను. ఒకనాడు అఖండవర్షము కురియుచుండగా చలిబాధవలన దంతములు కటకటలాడుచుండ మర్కటము వచ్చి బోధిసత్త్వున కనతిదూరమున గూరుచుండెను. కోతి బాధపడుచుండుట చూచి దానితో మాటాడుచు బోధిసత్త్వు డీతొలిగాథ పలికెను:

మర్కటంబా, నీకు మానవుతోడ
సమముగా శిరము, హస్తములు, పాదములు
కల; విల్లు లేమికి కారణం బేమి?

విని మర్కటము రెండవగాథ పలికెను:

నాశిరము హస్తపాదముల్ నరులకువలె
నుండును; ప్రధానమౌ ప్రజ్ఞ యొకటి లేదు.

అలకించి బోధిసత్త్వుడు మిగిలిన రెండుగాథలు పలికెను:

లఘుచేతనుడు, చంచలం బైన మనసు
కలవాడు, శీలంబు గట్టిది కాని
యతడు,
మిత్రద్రోహి యగువాడు సుఖము
కాంచనేరడు; గీము కడగి నిర్మించు;
శీతవాతముల రక్షించును నిన్ను.

తాను సురక్షితస్థానమున నుండుటచే పిట్ట నన్ను పరిహసించుచున్నది. దీనిని గూటిలో గూరుచుండనీయను" అని మర్కటము భావించి, బోధిసత్త్వుని పట్టుకొనుటకై యెగిరి దుమికెను. పిట్ట యెగిరి వేరొకచోటికి బోయెను. కోతి పిట్టగూడు లాగి, ముక్కలు ముక్కలు చేసి, వెడలిపోయెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వానరము ఈ కుటీరదాహకుడు; సింగిల పిట్ట నేనే.

## 322 దద్దభ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక తైర్థికుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

తైర్థికుడు జేతవనసమీపమున ప్రతిప్రదేశమునను పండుకొనుచు పంచాగ్నిహోత్రమధ్యమున తపించుచు వివిధవిధముల వ్యర్థతపస్సులు చేయుచుండెను. భిక్షుకు లనేకులు శ్రావస్తిలో భిక్షాటనము చేసి జేతవనమునకు మరలివచ్చునపుడు మార్గములో నతనిని చూచి శాస్తకడకు

జని "భన్తే, అన్యసంప్రదాయములకు చెందిన శ్రమణబ్రాహ్మణు వ్రతములకు సార మేమి?" అని అడిగిరి. "ఆవ్రతములకు సారముగాని విశేషముగాని లే దని" శాస్త పలికెను.

"భన్తే, దీనిగోల మాకు తెలియదు. మాకు తెలియజెప్పుడు!" అని వారు ప్రార్థింపగా శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసీలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు సింహముకడుపున బుట్టి పెరిగి, అడవియందు నివసించు చుండెను. ఆకాలమున పశ్చిమసముద్రముప్రక్కన మారేడుచెట్లు తాడిచెట్లు గుంపుగా నుండెను. అందులో కుందేలు మారేడుచెట్టు మొదటను తాడిచెట్టునీడలోను నివసించుచుండెను. ఒకనాడు కుందేలు మేత మేసివచ్చి తాడిచెట్టునీడలో పండుకొని, "ఈమహాభూమి తలక్రిందయిన చో ఎచ్చటికి పోవుదును?" అనుకొనుచుండగా పండిన మారేడు తాటియాకుమీద బడెను. ఆధ్వని విని భూమి తలక్రిం దయినదని భావించి కుందేలు అదరిపడి లేచి వెనుదిరిగి చూడకుండ పరుగెత్తు చుండెను. ప్రాణభయమున పరుగెత్తుట చూచి వేరొక కుందేలు "ఏమిది? అమితభీతితో పరుగిడుచున్నా వేమి?"అని యడుగగా అడుగ వద్దు!" అని పోవుచుండెను. రెండవ కుందేలు ఏమిది యని వెంటబరుగిడు చుండ, మొదటి కుందేలు రెండవదానిని ఆగు మని వెనుదిరిగి చూడ కుండ, భూమి తలక్రిం దయిన దనెను. అదికూడ దానివెంట పరుగిడెను. ఈవిధముగా ఒకదానివెంట నొకటిగా వేయికుందేళ్ళగుంపు పరుగిడు చుండెను.

ఒక లేడికూడ వానివెంట జనెను. అడవిపంది, నీలమృగము, అడవి దున్న, ఎద్దు, ఖడ్గమృగము, పెద్దపులి, సింహము, ఏనుగుగూడ వానిని చూచి ఏ మిది అని యడిగి, భూమి తలక్రిందయినది అని విని పరు గెత్తెను. ఈవిధముగా జంతుసమూహము యోజనముమేర వ్యాపించెను.

అప్పుడు బోధిసత్త్వుడు ఆజంతుసమూహము పరుగెత్తుట చూచి, ఏ మిది యని యడుగగా, భూమి తలక్రిం దయినది అని అనెను.

"భూమి యెన్నడు తలక్రిందు కానేరదు. ఇవి యేదో చూచియుండును. నేను కొంచెము యత్నింపనిచో ఇవి యన్నియును నశించును. వీనిని బ్రదికించెదను" అని భావించి, మహావేగముతో ముందు పరుగెత్తి పర్వతముచివర నిలిచి, మూడుమారులు సింహనాదము చేసెను. జంతువులు భయపడి, ఆగి గుమిగూడెను. సింహము వానిమధ్యమునకు బోయి "ఏల పరుగెత్తుచున్నారు?" అని యడిగెను. "భూమి తలక్రిందయినది." "ఎవరు చూచినారు?" "ఏనుగునకు తెలియును." ఏనుగును ప్రశ్నింపగా "నాకు తెలియదు. సింహమునకు తెలియును" అనెను. సింహము నడుగగా పులికి తెలియు ననెను. పులిని ఖడ్గమృగమును, వృషభమును, మహిషమును, నీలమృగమును, వరాహమును, లేడిని, అడుగగా తుదకు కుందేటికి తెలియునని తేలెను. బోధిసత్త్వుడు "సౌమ్యా, భూమి తలక్రిందగుట నీవు చూచితివా?" అని యడిగెను. 'స్వామీ, నేను చూచినాను'. 'ఎచట నుండగా చూచితివి?' 'పశ్చిమ సముద్రముకడ బిల్వతాళవనములో పండుకొనియుండి భూమి తలక్రిందయినచో ఎచ్చటికి బోవుదును అని యోచించితిని. తోడనే పృథివి తలక్రిందయిన శబ్దము విని పరుగెత్తితిని.'

"మారేడుపండు రాలిన చప్పుడు ఈ కుందేలు వినియుండును. యథార్థమును కనుగొందును" అని సింహము యోచించి, జంతువుల నూరడించి, "భూమి సరిగా ఉన్నదో లేదో చూచి వచ్చెదను. అంత వరకును మీరలిచ్చటనే యుండుడు" అని కుందేటిని వీపుపై నెక్కించుకొని, గంతువేసి, మహావేగమున పశ్చిమసముద్రతీరము చేరి, తాళవనమున ఆగి, కుందేటిని దింపి, "రా, నీవు చూచినప్రదేశ మెక్కడ?" అనెను.

"స్వామీ, సాహసము చాలదు." 'రా, భయము లేదు.' కుందేలు మారేడుచెట్టుకడకు బోవజాలక కొంచెము దూరముగా నిలిచి, "స్వామీ, ధప్ అను చప్పుడయినచోటు అదే" అని ఈ తొలిగాథ పలికెను:

నీకు మేలగుగాక! నే నున్నచోట
దబ్బను శబ్ద ముద్భవ మొందుచుండు
ఎవ్వ రాధ్వని చేతు రెరుగను నేను.

సింహము పోయి మారేడుచెట్టుమొదలును, తాడిచెట్టునీడను, తాటియాకుమీాద పడియున్న మారేడుపండును జూచి, యథార్థము తెలిసికొని, కుందేటిని వీపుపై నెక్కించుకొని, మహావేగమున జంతు సంఘమును జేరి, ఊరడించి, భయము లేదని వాని నన్నిటిని బంపి వేసెను.

బోధిసత్త్వుఁ డట్లు చేయకున్నచో జంతువు లన్నియు, సముద్రమున బడిపోయెడివే. ఆయనవలన వానిప్రాణములు దక్కినవి.

ఈమూాడును అభిసంబుద్ధగాథలు:

పొరపడ్డ చప్పుడు విని పరుగువారె
శశము, తద్వాక్య లాలించి పశుగణంబు
భయముచెందెను;
పరజనభాషితముల
వినుచు నెంతయు నమ్మి వివేకహీను
లైనవారు ప్రమాదాల కగ్గమగుట
ధ్రువము; మంచియాచారమ్ముతోడ ప్రజ్ఞ
తోడ చిత్తాగ్ని శమియింప దొడరుచుండు;
రనఘులును ధీరచిత్తులు నైనవారు
అనుకరింపరు గ్రుడ్డిగా నన్యజనుల.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున సింహము నేనే.

## 323 బ్రహ్మదత్త జాతకము

శాస్త ఆళవీసమీాపమున అగ్గాళవ చైత్యమున విహారము చేయుచు కుటీర నిర్మాణ నియమవిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

కథ మణికుండలజాతకమున (253) వచ్చినది. ఇచ్చట భగవాన్

"భిక్షువులారా, మీరు నిజముగా హెచ్చుగా యాచనచేయుచు, హెచ్చుగా కోరుచున్నారా?" అని ప్రశ్నించెను. "చిత్తము, భన్తే" అని వారు పలికిన పిమ్మట భగవాన్ ఆభిక్షువులను నిందించి "భిక్షువులారా, పూర్వకాలము పండితులు రాజును యాచింపగోరియు ఆకుల గొడుగును, కాలిజోడుజతయు, అడుగదలచియు లజ్జాభయములచే లోకులయెదుట అడుగజాలక ఏకాంతమందు యాచించిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము కంపిల రాష్ట్రములోని ఉత్తరపాంచాల నగరమున పాంచాలరాజు పరిపాలనము చేయుచున్నపుడు బోధిసత్త్వుడొకపల్లెలో బ్రాహ్మణకులమున బుట్టి, పెరిగి, తక్షశిలలో సమస్తవిద్యలు నేర్చి, ప్రవ్రజించి హిమాలయమున కందమూల ఫలాదులు తినుచు కాలయాపన చేయుచుండెను. బహుకాల మచట నుండి ఉప్పుపులుపుకొరకు గ్రామమునకు బయలుదేరి, క్రమముగా ఉత్తరపాంచాలనగరము చేరెను. అచ్చటి రాజోద్యానమున నిలిచి, మొదటినాడు భిక్షార్థము నగరములోనికి బోయి, మరల ఉద్యానమున నుండెను.

ఆయనచర్యకు ప్రసన్నుడై రాజు పెద్దపీటపై గూరుచుండబెట్టి రాజభోజనము పెట్టించెను. ప్రతిదినము భోజనమునకు వచ్చునట్లు ప్రతిజ్ఞ చేయించి రాజాయనను ఉద్యానమున నివసింపజేసెను. వర్షాకాలము దాటిపోవగా బోధిసత్త్వుడు హిమాలయమునకు మరలిపోవనెంచి "మార్గమున నడచునపుడు పాదరక్షలజత, ఛత్రము ఉండుట యుక్తము" అని భావించి, రాజు నడుగదలచెను. మరునాడు రాజు ఉద్యానమునకు వచ్చి తనకు ప్రణామము చేసి కూరుచున్నపుడు చెప్పులు, గొడుగు కావలె నని అడుగదలచి, "పరులను యాచించువాడు విచారించును, లేదనువాడు విచారపడును. కావున మే మిరువురము విచారపడునపుడు జనులు చూడరాదు. ఏకాంతప్రదేశము మంచిది." అని భావించి బోధిసత్త్వుడు "మహారాజా, ఏకాంతము కావలెను" అని చెప్పెను. రాజు తోడనే రాజపురుషులను దూరముగా బంపెను. "నేను యాచించినంతనే రాజీయనిచో మా మైత్రి తెగి

పోవును. కావున యాచింపను'' అనుకొని ఏమియు నడుగక ''మహా రాజా, నేడు కాదు. మరియొకనాడు'' అనెను.

అనంతరము రాజు ఉద్యానమునకు, వచ్చినపుడు ఆనాడు కాదనియు, మరియొకనాడు వచ్చినపుడు ఆనాడు కాదనియు బోధిసత్త్వుడు యాచన బహిరంగము చేయక పండ్రెండువత్సరములు గడపెను. ఒకనాడు రాజు తనలో ''ఆర్యుడు ఏకాంతము కోరును. జనమును దూరముగా పంపినతరువాత ఏమియు మాటాడనేరడు. చెప్పదలచియు చెప్పకుండ పండ్రెండుసంవత్సరములు గడచినవి. బ్రహ్మచర్యమున బహుకాలము గడపినాడు. ఉద్విగ్నచిత్తుడై భోగము లనుభవింప రాజ్యము వాంఛించుచున్నట్లు తోచును. ఈనాడు రాజ్యము మొదలు ఏది కోరినను అది ఆర్యున కిత్తును'' అనుకొని ఉద్యానమునకు బోయి, ప్రణామము చేసి, కూరుచుండెను. బోధిసత్త్వుడు ఏకాంతమును కోరి, జను లావలకుబోయినపిదప మిన్నకుండెను. అప్పుడు రాజు, ''ఆర్యా, మీరు ఏకాంతము కోరియు, ఏకాంతము లభించినపిమ్మట ఏమియును చెప్పజాలకున్నారు. పన్నెండువత్సరములు గడచినవి. మీరు కోరినది రాజ్యము మొదలుకొని—అంతయు ఇచ్చుటకు సిద్ధముగా నున్నాను. మీరు నిర్భయముగా అడుగవచ్చును'' అనెను. ''మహారాజా, నేనడిగినది మీ రిత్తురా?'' ''భన్తే, ఇత్తును.'' ''మహారాజా, మార్గమున నడచునపుడు పాదరక్షలు, గొడుగు కావలెను.'' ''భన్తే, పన్నెండేళ్ళు వీని నడుగలేకపోయినారా?'' ''అవును, మహారాజా.'' ''భన్తే, ఇట్లు చేసితి రేల?'' ''మహారాజా, ఎవడు తనకు ఇది కావలెను అని యాచించునో వాడు విచారపడును. నేను యాచించినపిమ్మట మీ రీయనిచో, మన మిరువురము విచారింపవలసివచ్చును. కావున ఏకాంతము కోరుచుంటిని'' ఇట్లని మూడుగాథలు పలికెను:

ఉండు యాచకునకు గతుల్ రెండె బ్రహ్మ
దత్తనృప, ధనప్రాప్తియో, ధనము దొరక
కుండుటో; ఇద్దియే యాచ్ఞకుండు నియతి.

యాచనను రోదనం బంద్రు; యాచనపయి
కేది యొసగమి యగు ప్రతిరోదనంబు.

కాన కోరుచునుంటి నేకాంతసీమ,
అన్యులకు గానబడకుండ నచ్చట మన
రోదనంబులు పాంచాలమేదినీశ!

రాజు బోధిసత్త్వుని యభిమానమునకు ప్రసన్నుడై వర మిచ్చుచు నాలుగవగాథ పలికెను:

బ్రాహ్మణోత్తమ, నే వృషభములతోడ
కపిలగోసహస్రము నీకు కానుకగ నిత్తు.
ఒసగకుండునె నీధర్మయుక్తగాథ
లాలకించిన యార్యు డనార్యునకును?

"మహారాజా, నాకు వస్తువులపై కోరిక లేదు. నేను కోరినవి ఇచ్చిన చాలును" అని పాదరక్షలు, ఛత్రము తీసికొని, "మహారాజా, ప్రమాదము లేకయుండుము. దానము చేయుచుండుము. శీలములను రక్షింపుము. ఉపవాసవ్రత మనుష్ఠింపుము" అని బోధిసత్త్వు డుపదేశించెను. తన నాపవలెనని రాజు పట్టుదల చూపినను బోధిసత్త్వుడు హిమాచలమునకు బోయి, అభిజ్ఞలు, సమాపత్తులు పొంది, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; తపస్వి నేనే.

## 324 చమ్మసాటక జాతకము

శాస్త జేతవనమున విహారము జేయుచు చమ్మసాటక నాయకు డైన పరివ్రాజకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

చర్మమునే అతడు ధరించుచుండెడివాడు. ఒకనా డాతడు పరివ్రాజకారామమునుండి బయలువెడలి భిక్షాటనము చేయుచు పొట్టేళ్లు

పోరాడుచోటు చేరెను. ఒక పొట్టేలు ఆతనిని చూచి వచ్చి ఢీకొనుటకై ముందుగా వెనుకడుగులు వేసెను. తనయెడ ఆ జంతువు గౌరవము ప్రకటించుచున్నదని పరివ్రాజకుడు తలచి అచటినుండి కదలలేదు. పొట్టేలు వేగముగా వచ్చి ఆతనితొడలో క్రుమ్మి అతనిని క్రిందబడవైచెను. ఈ విషయము భిక్షుసంఘమున తెలిసిపోయెను. ఒకనాడు వారు ధర్మసభలో ఈ విషయము చర్చించుచుండగా శాస్త అరుగుదెంచి, సంగతి తెలిసికొని, "భిక్షువులారా. ఈత డిప్పుడే కాదు పూర్వముకూడ చండుని (పొట్టేలు)కడ వినాశము నొందినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వణిక్కులమున బుట్టి, వ్యాపారము చేయుచుండెను. ఆసమయమున చర్మశాటికపరివ్రాజకుడు వారాణసిలో భిక్షాటనము చేయుచు, పొట్టేళ్ళు పోరాడుచున్నచోటు చేరెను. పొట్టేలు వెనుకకు తగ్గుట చూచి "ఇది నాయెడ గారవము చూపుచున్నది. కదలకున్నది" అని తలపోసి, జనులకన్న పొట్టేలే నాగుణములు గ్రహించినది" అని చేతులు జోడించి, నిలుచుండియే ఈగాథ పలికెను:

మంచిజాతిది, కాన మంత్రభూసురుని
యెడ గౌరవము చూపు నీగొర్రెపోతు
భద్ర మైనది చతుష్పాత్తు,-పొట్టేలు
రమ్యమ్మును, ప్రియంకరమ్మునై నదియు.

అప్పుడు తన దుకాణములమీద కూరుచున్న బోధిసత్త్వుడు పరివ్రాజకుని నిషేధించుచు రెండవగాథ పలికెను:

విప్రుడా, క్షణమాత్ర వీక్షణమ్ముననె
నమ్మగూడదు సుమా, నాలుగుకాళ్ళ
జంతువు; వెనుకకు జరిగిపోయినది.
గాఢప్రహారంబు కావించుకొరకు.

ఆయన పలుకుచుండు సమయములో పొట్టేలు వెనుకకు వచ్చి

గట్టిగా తొడమీద తన్ని పరివ్రాజకుని క్రిందబడద్రోసెను. అతడు వేదన ననుభవించుచు ఆక్రోశించుచుండెను.

శాస్త ఆవిషయమును ప్రకటన చేయుచు మూడవగాథ పలికెను:

విప్రు తొడలోని యెముకలు విరిగిపోయె
దేహ మంతయు నుగ్గయ్యె, బాహువులను
పట్టుకొని యేడ్చుచున్నాడు బ్రాహ్మణుండు:
వీడనున్నాడు ప్రాణముల్, వేగ జనుము.

పరివ్రాజకుడు నాలుగవగాథ పలికెను:

పొగడునో యెవ్వ డపూజ్యు లొ వారి
పొలియు వాడు ధ్రువంబు పొట్టేలిదెబ్బ
తిన్నట్టి నావంటి దేబెవిధాన.

ఇట్లతడు పరిదేవనము చేయుచు అచ్చటనే మరణించెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున చమ్మసాటకుడు ఇప్పటి చమ్మసాటకుడే. పండితవ్యాపారి నేనే.

## 325. గోధ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మాయాభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈ కథ పూర్వమే వచ్చినది. ఇచ్చట ఆభిక్షువును శాస్తకడకు కొని వచ్చి భిక్షువులు "భన్తే, ఈతడు మోసగా" డని విన్నవించిరి. "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ మోసగాడే అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బల్లికడుపున బుట్టి, పెరిగి, పెద్దశరీరము కలిగి, అడవిలో నివసించుచుండెను. ఒకానొక దురాచారితపస్వి అచ్చటికి సమీపమున పర్ణకుటీరములో నివసించుచుండెను. బోధిసత్త్వుడు ఆహారము గ్రహించుటకు బోయి, దానిని జూచి, సదాచారసంపన్నుని కుటీర మని తలచి అచటికిబోయి తాపసునకు ప్రణామము చేసి, నిజనివాసమునకు బోయెను.

ఒకనాడు ఆకుటిల తపస్వి సేవకులయింటినుండి వండి తెచ్చిన మధురమాంసము తిని "ఇది దేనిమాంస?" మని యడుగగా "బల్లిమాంస" మని వారు చెప్పిరి. ఆతనికి రసతృష్ణ యేర్పడి "నా యాశ్రమమునకు వచ్చు బల్లిని చంపి, వండి యథాభిమతముగా భుజింతును" అని తలపోసి, నెయ్యి, పెరుగు, మసాలాద్రవ్యములు సమకూర్చుకొని, దుడ్డుకఱ్ఱమీద కాషాయవస్త్రము కప్పి, కుటీరద్వారముకడ బోధిసత్త్వునకై ఎదురుచూచుచు, శాంతునివలె, దాంతునివలె కూరుచుండెను.

బల్లి వచ్చి ద్వేషపూరితమైనవాని యాకృతి చూచి, "వీడు నాజాతి జంతుమాంసము తిని యుండవలెను. నేను వీనిని పరీక్షింతును" అని గాలి కెదురుగా నిలిచి, వానియొడలివాసన గ్రహించెను. అందువలన నిజజాతిజంతుమాంస మీతడు భుజించినట్లు విశదమయ్యెను. బల్లి తాపసికడకు రాక మరలెను. అది రాకుండుట గ్రహించి తాపసి దుడ్డుకఱ్ఱ దానిమీదికి విసరివేసెను. కఱ్ఱ దానియొడలికి తాకక తోకచివర తగిలెను. "పో, తప్పిపోతివి" అని తపస్వి పలుకగా బోధిసత్త్వుడు "ఇక్కడ తప్పిపోతివి. కాని నాలు గపాయములనుండి తప్పిపోనేరవు" అని పరుగిడి, చంక్రమణము చేసి, శిరముతో బిలములో ప్రవేశించి, రెండవరంధ్రమునుండి తల వెలుపల కుంచి రెండుగాథలు పలికెను:

శ్రమణుండ వనుచు, అసంయ్యాతబుద్ధి
వై నట్టి నీకడ కరుగుచెంచితిని.
దండంబుతో నన్ను తాడించినావు

శ్రమణోత్తరునిబోలె; జడలు ధరించి
జింకచర్మము దాల్చి చేసెడి దేమి
లోన మాలిన్యంబు పైన శౌచంబు.

విని తాపసి మూడవగాథ పలికెను:

ఉండు ముండుము, పోవ కుడుమ, నాకడను
లవణశాల్యన్న తైలంబులు కలవు
తిరుగబోతకు చాల దినుసులు కలవు.

అది విని బోధిసత్త్వుడు నాలుగవగాథ పలికెను:

బహురంధ్రబిలములోపల బ్రవేశింతు;
నూనెయు లవణమ్ము కానిమ్ము వృద్ధి
సరిపడకే పోవు సరకులు నాకు.

ఇట్లు పలికి "ఓరీ కుటిలతపస్వీ, నీవు ఇక్కడనే ఉంటివేని, చుట్టు ప్రక్కల నున్న జనులతో వీడు దొంగ అని నిన్ను పట్టించెదను, అవ మానము చేయించెదను. శీఘ్రముగా పారిపొమ్ము" అని బెదరించెను. కుటిలతపస్వి అచటినుండి పలాయితు డయ్యెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున కుటిలజటిలుడు ఈ టక్కరి భిక్షువే, ఉడుమురాజు నేనే.

## 326 కక్కారు జాతకము

శాస్త వేళువనమున విహరించుచు దేవదత్తుని గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

ఆతడు సంఘమున చీలిక పెట్టి అగ్రశ్రావకులతోను పరిషత్తుతోను వెడలిపోయిన పిమ్మట నోటివెంట వేడినెత్తురు గ్రక్కుకొనెను. ధర్మ సభలో భిక్షువులు ఈవిషయమై చర్చించుచుండగా శాస్త అచటి కరు

దెంచి, సంగతి గ్రహించి, "భిక్షువులారా, ఆత డిప్పుడే కాదు, పూర్వము కూడ అనృతవాది; అందుచే ఇప్పుడేకాక పూర్వముకూడ వ్యథ పొంద వలసివచ్చె" నని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ముప్పదిమూడవ భవనమున ఒకదేవపుత్రుడుగా నుండెను. ఆకాలమున వారాణసిలో మహోత్సవము జరిగెను. నాగులు, గరుడులు, 'భుమ్మట్టక' దేవతలు అనేకు లుత్సవమునకు వచ్చిరి. ముప్పది మూడవ భవనమునుండి నలుగురు దేవపుత్రులు 'కక్కారు' అను దివ్యపుష్పమాలను ధరించి, ఉత్సవము జూడవచ్చిరి. ఆపుష్పసుగంధము పన్నెండుయోజనములనగరమంతటను నిండిపోయెను. ఈపుష్పములు ధరించినవా రెవ్వరని లోకులు యోజించుచుండగా, తమకోసమే జనులు వెదకుచున్నా రని చూచి దేవపుత్రులు నిజమహిమచే రాజాంగణము మీద ఆకాశమున నిలిచిరి. జనులు గుమిగూడిరి. రాజు, శ్రేష్ఠి, యువ రాజ ప్రభృతులు వచ్చిరి.

"మీరు ఏ దేవలోకమునుండి వచ్చినారు?" అని లోకు లనిరి.

"ముప్పదిమూడవ దేవలోకమునుండి వచ్చినాము."

"ఏమి పనిమీద?"

"ఉత్సవము చూచుటకు."

"ఈ పుష్పములపే రేమి?"

"ఇవి దివ్యకక్కారు పుష్పములు."

"ఇవి మా కిచ్చి, మీరు దివ్యలోకములో వేరుపుష్పములు దాల్పుడు."

"ఈ దివ్యకుసుమములు మహాశక్తివంతములు. దేవతలకే యోగ్య ములు. మానవలోకమున దుర్మార్గులు, తుచ్ఛులు, మూర్ఖులు, అగు వారికి తగవు. గుణవంతు లగువారు మాత్రము ధరింపవచ్చును."

అందులో జ్యేష్ఠదేవపుత్రుడు తొలిగాథ పలికెను:

అన్యులవస్తువు నపహరింపండు
ఛేతుల; నసృతంబు చెప్పడు నోట,

మత్తుండుకాడు సంపద లబ్ధమైన;
ఆతండు కక్కారు కర్హుండు సుమ్మీ!

కావున ఈగుణములు కలవారు అడిగిన-చో ఇత్తుము.

పురోహితుడు విని యిట్లు తలపోసెను: "ఈగుణములలో ఒకటి కూడ నాకు లేకున్నను, అసత్యము చెప్పి, ఈపుష్పదామములు ధరించెదను. గుణవంతుడ నయినట్లు లోకులు భ్రమించెదరు." ఇట్లు తలపోసి, నా కీగుణము లున్నవి అని పుష్పమాలికకై ప్రథముని నడిగి తీసికొనెను. రెండవ దేవపుత్రుడు రెండవగాథ పలికెను:

ధనమును వెదకుడు ధర్మంబుతోడ,
ధన మాహరింప దధర్మంబుతోడ,
పొందడు మత్తత భోగంబులందు,
ఆతండు కక్కారు కర్హుండు సుమ్మీ.

పురోహితుడు 'నా కీ గుణము లున్నవి' అని అడిగి పూలదండ తీసికొని ధరించి, మూడవ దేవపుత్రుని యాచించెను. ఆతడు మూడవ గాథ పలికెను:

పసపునుబోలు మానసము లేకుండు,
సంతరించును దృఢశ్రద్ధ ఒంటరిగ
తినకుండ నుండు స్వాదిష్ఠ భోజ్యములు,
ఆతండు కక్కారు కర్హుండు సుమ్మీ.

'నా కీ గుణము లున్నవి' అని పురోహితుడు పూలదండ తీసికొని ధరించి, నాలుగవ దేవపుత్రుని దామమునకై యాచించెను. ఆతడు నాలుగవగాథ పలికెను:

సమ్ముఖమం దైన, చాటున నైన,
యోగ్యులం బరిహాస మొనరింపకుండు,
చెప్పిన విధముగా చేసెడివాడు,
ఆతండు కక్కారు కర్హుండు సుమ్మీ.

'నా కీ గుణము లున్నవి' అని పురోహితుడు దండ తీసికొని, ధరించెను.

నలుగురు దేవపుత్రులు తమపుష్పదామములను పురోహితున కిచ్చిన తరువాత దేవపుత్రులు తమలోకమునకు బోయిరి. వారు వెడలి పోయినతరువాత పురోహితునకు మహాశిరోవేదన కలిగెను. ఆబాధ పదునైన కత్తియంచుతో కోయుచున్నట్లును, ఇనుపకమ్మితో రాయుచున్నట్లును ఉండెను. అతడు యాతన ననుభవించుచు ఇటునటు దొరలుచు, కేకలు వేయుచుండెను. ఏ మిది? యని జను లడుగగా "నాకడ లేనిగుణములు ఉన్నట్లు అసత్యము చెప్పి, ఆదేవపుత్రులకడ పుష్పదామములు పరిగ్రహించితిని. వీనిని నాశిరసుపైనుండి లాగివేయుడు" అని యాతడు వేడెను. వారు యత్నించినను దండలు ఊడిరాలేదు; ఇనుపపట్టీలతో బంధించిన ట్లుండెను.

అతనిని లేవనెత్తి యింటికి గొనిపోయిరి. అతడు కేకలువేయుచుండ ఏడుదినములు గడిచెను. అమాత్యులను బిలిచి రాజు "ఈదుశ్చరిత్రుడు చనిపోవునేమో ఏమి చేయుదము?" అనెను. "దేవా, మరల ఉత్సవముచేయింపవలెను. దేవపుత్రులు మరల వత్తురు." రాజు క్రమ్మర ఉత్సవము చేయించెను. దేవపుత్రులు క్రమ్మర వచ్చి రాజాంగణముపై ఆకసమున నిలిచిరి. సువాసనతో నగరమంతయు నిండిపోయెను. లోకు లతనిని బట్టుకొని వచ్చి దేవపుత్రునియెదుట వెల్లకిలగా బడవేసిరి. "నాప్రాణములు రక్షింపుడు" అని యతడు వారిని వేడుకొనెను. దేవపుత్రు లిట్లనిరి: "ఈపుష్పములను దుష్టులు దుశ్శీలురు ధరింపరా దంటిమి. నీవు మోసముచేయ నెంచి నిజకర్మఫల మొందితివి." ఇట్లని జనసమూహాముసెదుట నతనిని నిందించి, శిరసుమీాది పూలదండలు తీసి, జనుల కుపదేశ మిచ్చి నిజస్థానమునకు జనిరి.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆ సమయమున బ్రాహ్మణుడు దేవదత్తుడు; ఆదేవపుత్రులలో ఒకడు కాశ్యపుడు, ఇంకొకడు మహామౌద్గల్యాయనుడు, వేరొకడు సారిపుత్రుడు; జ్యేష్ఠదేవపుత్రుడు నేనే.

# 327 కాకాతి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్తుడగు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అపుడు శాస్త ఆభిక్షువుతో భిక్షూ, నీవు సత్యముగా ఉద్విగ్న చిత్తుడ వైతివా?'' అనెను.

''భన్తే, సత్యమే.''

''ఏల ఉద్విగ్నచిత్తుడ వైతివి?''

''భన్తే, రాగకారణమున.''

''భిక్షూ, స్త్రీలను రక్షించుటకు వలనుపడదు. పూర్వపండితులు స్త్రీలను సముద్రమధ్యమున సేమరవృక్షముమీద కూరుచుండబెట్టినను, వారిని సంరక్షింపలేకపోయిరి'' అని శాస్త పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడాయన పట్టపురాణి కడుపున బుట్టి, పెరిగి, తండ్రిమరణానంతరము రాజ్యపాలనము చేయుచుండెను. ఆయన పట్టపురాణి కాకాతిదేవి అప్సరసలవలె చాల చక్కనిది. ఇక్కడికథ సంక్షిప్తము. విస్తృతముగా కుణాలజాతకమున (536) వచ్చును.

ఆకాలమున గరుడరాజు మనుష్యాకారమున వచ్చి, రాజుతో జూదమాడుచు, కాకాతియెడల ప్రతిబద్ధచిత్తుడై ఆమెను గరుడభవనమునకు గొనిపోయి ఆమెతో క్రీడించుచుండెను. రాణిని గానక రాజు నటకుబేరు డను గంధర్వుని తదన్వేషణార్థము నియోగించెను. ఆమె గరుడరాజుకడ నున్నదనియు, సరోవరతీరమున ఏరకవనమున నున్నదనియు వాడు తెలిపెను. గరుడరాజు మానవలోకమునుండి బయలుదేరునపుడు నటకుబేరుడు గరుడుని రెక్కలలో నొకదానిచాటున దాగి, గరుడభవనము చేరి, మరల గరుడుని రెక్కలలో దాగి, మానవలోకమునకు వచ్చెను. గరుడరాజు వారాణసీరాజుతో జూదమాడుచుండగా నటకుబేరుడు వీణ ధరించి రాజుకడ నిలిచి ఈ తొలిగాథ పలికెను:

ఈ సువాసన వీతెంచు నెచటినుండి,
నామన స్సెంత దూరమ్ము నగ్ర రమించు,
కలను నాప్రియ యైన కాకాతి యచట.

విని గరుడరాజు రెండవగాథ పలికెను:

దాటినాడవు మహోదధి యెట్లు? సప్త,
సాగరంబులు నీవు సంతరించితివి?
తటిని కేబుక మెట్లు దాటగల్గితివి?
ఎట్లు సింబలి వృక్ష మెక్కజాలితివి?

నటకుబేరుడు మూడవగాథ పలికెను:

సంద్రంబు సాగరసప్తకంబు నది
దాటుచు, సింబలితరు వెక్కినాను.
నీదుసాయంబున నే పక్షిరాజ!

అంతట గరుడరాజు నాలుగవగాథ పలికెను:

ఛీ యింత దేహమ్ము! ఛీ యింత జడిమ!
కొనివచ్చుచుంటిని, కొనిపోవుచుంటి
ననుదిన మ్మేను జాయాజారు నవుర!

గరుడరాజు కాకాతిదేవిని గొనివచ్చి, రాజు కిచ్చి, మరల నగరము లోనికి వచ్చుట మానుకొనెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములను పరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము ఉద్విగ్నచిత్తభిక్షువు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున నటకుబేరుడు ఉద్విగ్నచిత్తభిక్షువు. రాజు నేనే.

## 328 అనను సోచియ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు భార్య మరణించిన గృహస్థును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

భార్య మరణింపగా ఆతడు స్నానము చేయక, భుజింపక ఏపనియు

చేయక, కేవలము శ్మశానభూమిలో ఏడ్చుచు మొత్తుకొనుచు తిరుగు చుండెను. అయినను ఘటము క్రింది దీపమువలె ఆతనిలోపల శ్రోతాపత్తిమార్గమునకు ఆధారము వెలుగుచుండెను.

శాస్త ప్రాతఃకాలమున లోకముపై దృష్టిప్రసారించి, ఈతనిసంగతి గ్రహించి, భిక్షాటనానంతరము మరలివచ్చి భోజనానంతరము శ్రమణ సేవకుని వెంటగొని ఆతనిఇంటికి జనెను. గృహస్థు శాస్తకు స్వాగత సత్కారములుచేసి, కూరుచుండబెట్టి తానొకప్రక్క కూరుచుండెను.

"ఉపాసకా, చింతాక్రాంతుడవైనట్టున్నావేః" అని శాస్త పలికెను.

"భన్తే, చిత్తము. నాభార్య చనిపోయినది. ఆవిచారములో నున్నాను."

"ఉపాసకా, దేనిధర్మము విడిపోవుటయో, అది విడిపోవక తప్పదు. దానికై చింతించుట అనుచితము. పూర్వకాలమున పండితుడు భార్యను కోల్పోయినపిదప ఈధర్మమును గ్రహించి విచారము మానుకొనిరి."

ఆతడు ప్రార్థించిన పిమ్మట శాస్త పూర్వజన్మకథ చెప్పెను. ఆకథ దశమనిపాతమున క్షుద్రబోధిజాతకమున వచ్చును. ఇచ్చట సంక్షేప రూపము.

## అతీత కథ

పూర్వము వారాణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి, పెరిగి, తక్షశిలకు బోయి, సమస్తవిద్యలు నేర్చి తలిదండ్రులకడకు మరలివచ్చెను. ఈ జాతకమున బోధిసత్త్వుడు కుమారబ్రహ్మచారి. నీకోసము కన్యను వెదకుచున్నామని తలిదండ్రులు చెప్పిరి. "గృహస్థుగా నుండుట నిష్ఫలము. మీయనంతరము ప్రవ్రజింతును" అని బోధిసత్త్వుడు చెప్పెను. వారు బలవంతము చేయగా అతడు బంగరుప్రతిమ చేయించి "ఇట్టికన్య లభించినచో పెండ్లియాడుదు" నని చెప్పెను.

ఆస్వర్ణప్రతిమ తలిదండ్రులు మూతబండిలో పెట్టించి అనేకానుచరులను బంపి, "జంబూద్వీపము అంతటను తిరుగుచు, ఇట్టి బ్రాహ్మణకుమారి లభించినచో అక్కడ ఈసువర్ణవిగ్రహ మిచ్చి కన్యను కొనిరండు" అని చెప్పిరి. ఆకాలమున పుణ్యవతి బ్రహ్మలోకమునుండి జారి

పడి కాశీరాష్ట్రములోని యొకానొక పల్లెలో ఎనుబదికోట్ల ధనవంతు లయిన బ్రాహ్మణులయింట కన్యగా నవతరించి, పెరుగుచుండెను. ఆమెకు సమ్మిల్లభాషిణి యని పేరుపెట్టిరి.

పదునారు సంవత్సరములు వచ్చునప్పటికి ఆమె సర్వాంగపరిపుష్టి కలిగి, దేవకన్యవలె సుందరియు, మనోహారిణియు నయ్యెను. ఆమెహృదయములో అనురాగ మంకురింపలేదు. ఆమె బ్రహ్మచారిణి. స్వర్ణ ప్రతిమను దీసికొనువారు ఆపల్లె చేరిరి. దానిని చూచినవారు "బ్రాహ్మణకుమారి సమ్మిల్లభాషిణి ఇక్కడికి వచ్చిన దేమి?" అనిరి.

విని వారు ఆబ్రాహ్మణునియింటికి జని, సమ్మిల్లభాషిణిని కోరిరి. "నాకు గృహస్థాశ్రమముతో పనిలేదు. మీ యనంతరము పరివ్రాజిక నయ్యెదను" అని తలిదండ్రులకు ఆకన్య సందేశ మంపెను. ఏమి మాటలు తల్లీ! అని తలిదండ్రులు సువర్ణప్రతిమను దీసికొని, అమెను మహావైభవముతో సాగనంపిరి. బోధిసత్త్వునకు, సమ్మిల్లభాషిణికిని వాంఛ లేకున్నను పెద్దలు వివాహము జరిపిరి. ఉభయులు ఒకయింటనే యుండి ఒకశయ్యమీదనే శయనించుచున్నను ఒకరిమీద నొకరు అను రాగదృష్టి బరపలేదు. వారు ఇరువురు భిక్షుకులవలె, ఇరువురు బ్రాహ్మణులవలె ఒకచోటనే నివసించుచుండిరి.

కొంతకాలమునకు తలిదండ్రులు మరణింపగా బోధిసత్త్వుడు వారికి సంస్కారాదులు చేసి, సమ్మిల్లభాషిణిని బిలిచి, "భద్రే, మా యెను బదికోట్లద్రవ్యము, మీ యెనుబదికోట్లద్రవ్యమును దీసికొని, ఈపరి వారమును పరిపాలింపుము. నేను ప్రవ్రజింతును" అని చెప్పెను.

"ఆర్యపుత్రా, మీరు ప్రవ్రజించిన పిమ్మట నేనుగూడ ప్రవ్రజింతును. "నేను మిమ్ము వీడజాలను." ఉభయులును ధనమంతయు దానము చేసి, సంపత్తిని ఉచ్ఛిష్టమువలె విడిచి హిమాలయమునకు బోయిరి. అచ్చట ఇరువురును ప్రవ్రజించిరి. బహుకాలము అడవిలో ఫలమూల ములు తినుచు ఉప్పు చింతపండుకొరకు హిమాలయమునుండి దిగి, క్రమముగా వారాణసి చేరి, రాజోద్యానమున నుండసాగిరి.

వా రచట నున్నకాలమున సుకుమారి యైన పరివ్రాజికకు రుచిపచి లేని శుష్కభోజనమువలన రక్తవికారరోగము పట్టుకొనెను. తగిన యౌషధము దొరకకపోవుటచే ఆమె బలహీనురా లయ్యెను. బోధి

సత్త్వుడు భిక్షాటనమునకు బోవునపుడు ఆమెను నగరద్వారముకడకు జేర్చి, అచటి సత్రములో నొకబల్లమీద బండుకొనబెట్టి, నగరము లోనికి బోయెడివాడు. ఆయన దగ్గరలేనప్పు డామె మృతిజెందెను. జను లామెసౌందర్యమును గాంచి చుట్టు జేరి యేడ్చి మొత్తుకొనిరి. బోధి సత్త్వుడు తిరిగి వచ్చి ఆమె మరణించుట గాంచెను. "తెగిపోవుస్వభా వము కలది తెగిపోవును. అన్ని సంస్కారములును అనిత్యములు; ఇదియే గతి" అని తలపోసి, ఆమె పండుకొనియున్న పట్టెమీదనే కూరుచుండి భోజనము చేసి, మూతి కడుగుకొనెను. చుట్టు నున్న జన మాయనను "భన్తే, ఈపరివ్రాజిక మీ కేమయి యుండును?" అని యడిగిరి. "గృహస్థాశ్రమమున ఈమె నాచరణసేవిక." భన్తే, మేము భరింపలేక ఏడ్చి మొత్తుకొనుచున్నాము. మీరు దుఃఖింప రేమి?" "ఈమె జీవించియున్న నాతో కొంచెము కలిసియుండెడిది. ఇప్పుడు పరలోకవాసిని యగుటచే నాకు సంబంధము లేదు. అన్యలోక వశ యైనదానికై దుఃఖింప నేల?" అని బోధిసత్త్వుడు జనమునకు ధర్మోపదేశము చేయువా డయి ఈగాథలు పలికెను:

తనవార లైన పెద్దలమధ్య చేరి
నది ప్రియ సమ్మిల్లభాషిణి; యింక
నా కేమి యామెతో? శోకింప నేల?

ప్రత్యక్షముగ లేని వ్యక్తికోసరము
దుఃఖించు నెడల, మృత్యువు చుట్టుముట్టి
యుండగా సర్వదా, యోగ్యము నరుడు
తనకోస మెంతయు తానె శోకింప.

నిలువ, కూర్చుండ, పన్నుండ, నేత్రమీల
నమున, నున్మీలనమ్మున నరునిపయిను
క్షయము గాంచును; నిజమృతిసంశయాస్ప
దమ్మ కానపు, దన్యులం దయ దలిర్ప
కాంచదగు; పోవువారికై కించవలదు.

ఈవిధముగా ఆయన అనిత్యతను స్పష్టముచేయుచు ధర్మోపదేశము చేసెను. లోకు లామెకు దహనసంస్కారాదులు చేసిరి. బోధిసత్త్వుడు

హిమాలయమునకు బోయి, అభిజ్ఞలు పొంది, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మము బోధించి సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. అప్పుడు గృహస్థు స్రోతాపత్తిఫలము నొందెను. ఆసమయమున సమ్మిల్లభాషిణి రాహులమాత; తపస్వి నేనే.

## 329 కాలబాహు జాతకము

శాస్త వెళువనమున విహారము చేయుచు లాభసత్కారములు కోలుపోయిన దేవదత్తుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

దేవదత్తుడు తథాగతునియెడ వైరభావము నిలిపి ఆయనను సంహరించుటకై ధానుష్కులను నియోగించి, నడగిరి యనుహస్తిని ప్రయోగించుటచే ఆతని ద్వేషము స్పష్టమయ్యెను. నియమానుసారముగా ఆయనకు భోజనము పంపెడివారు పంపుట మానిరి. రాజుకూడ ఆయన కడకుపోవుట మానెను. తనకు లాభసత్కారములు పోయినప్పటినుండి యాతడు గృహస్థులను యాచించుచు తిరుగుచుండెను. భిక్షువులు ధర్మ సభలో ఈవిషయము చర్చించుచుండగా విషయము గ్రహించి, "భిక్షువులారా, అతడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ లాభసత్కారములు కోలుపోయినా డని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో ధనంజయుడు రాజ్యము చేయుచున్నప్పుడు బోధిసత్త్వుడు రాధ అను చిలుక యయ్యెను. మహాశరీరము కల ఆచిలుక తమ్ముని పేరు పోట్ఠపాదుడు.

ఒకనాడు వేటకాడు రెండు చిలుకలను పట్టి, వారాణసీరాజుకు

సమర్పించెను. రాజు వానిని బంగరుపంజరమున బంధించి, బంగరుపళ్ళెములో మధుపదార్థములు పెట్టించి మధురజలము త్రాగించుచు పెంచుచుండెను. వానికి మిక్కిలి ఆదరము జరుగుచుండెను.

వనచరు డొకనాడు కాలబాహు వను పేరు కల మహానీలమర్కటమును దెచ్చి రాజుకు సమర్పించెను. తరువాత వచ్చిన దగుటచే మర్కటకమునకు లాభసత్కారములు మెండుగా జరుగుచు, చిలుకలకు తరిగిపోయెను. చిత్తస్థైర్య ముండుటచే బోధిసత్త్వు డేమియు ననలేదు. చిన్నవాడు అంత స్థిరచిత్తుడు కాకపోవుటచే "అన్నా, ఈరాజుకులమున మనకు రుచ్యతమసరసభోజనము లభించుచుండెడిది; ఇప్పుడు కాలబాహువుకు లభించుచున్నది. ధనంజయరాజుకడ మనకు ఆదరము లభింపనప్పుడు ఇక్కడ నేమిచేయుదుము? రా, అడవిలోనికి పోవుదము" అని సంభాషించుచు ఈగాథ పలికెను:

ఎవనివలనను మనకు లభించు నన్న
పానములు నేడు వానిచే ప్రాప్తము లగు
మర్కటమునకు! పోదము మనము వనికి—
రాధ, కలిగె తిరస్కృతి రాజువలన.

విని రాధ రెండవగాథ పలికెను:

హాని కాని, లాభము కాని, యశము కాని
అపయశము, నింద, పొగడిక యైనగాని
సుఖము, దుఃఖము లోకాన సుస్థిరములు
కాని ధర్మాలు, కావున మాను చింత.

ఆకర్ణించి, మర్కటమునెడల ఈర్ష్యవిడువలేని చిన్నచిలుక మూడవగాథ పలికెను:

నిజము! ధీమంతుడవు రాధ, నీవు! భావి
ఘటనలను గూడ గ్రహియింప గలవు, రాజ
కులమునం దుండి, యీచచ్చుకోతి నెపుడొ
వెడలనడవగ జూచెడి విధము గలదె!

రాధ నాలుగవగాథ పలికెను:

కర్ణముల్ రిక్కించి, కనుబొమల్ ముడిచి
బెదరించుచుఁ రాజు బిడ్డల మిగుల
అన్నపానములకు నతిదూర మగును
స్వయముగా తమ్ముడా, శాఖామృగంబు.

కొలదిదినముల తరువాత కాలబాహువు రాజకుమారులయెదుట కర్ణచాలనాదులు చేసి బెదరించెను. వారు భయపడి కేకలు వేసిరి. ఏ మిది? యని రా జడిగెను. కారణము తెలియగా దీనిని వెడల గొట్టుడు అని రాజు ఆనతిచ్చెను.

చిలుకలకు మరల యధాపూర్వకసమ్మానము లభించెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున కాలబాహువు దేవదత్తుడు; పోట్ఠపాదుడు ఆనందుడు రాధుడు నేనే.

## 330 సీలవీమంస జాతకము

శాస్త జేతవనమున విహరించుచు సదాచారపరీక్షకు డైన బ్రాహ్మణుని గూర్చి చెప్పినది.

### అతీతకథ

ఈకథలో బోధిసత్త్వుడు వారాణసీరాజపురోహితుడు. తనసదాచారత్వమును పరీక్ష యిచ్చుటకై మూడు దినములు సువర్ణకార్షాపణములు సువర్ణ ఫలకమునుండి పైకి తీసెను. చోరు డనుకొని అతనిని రాజు నెదుట నుంచిరి. అతడు రాజసన్నిధిలో నిలిచి, శీలమహిమను వర్ణించి, తాను ప్రవ్రజించుటకై రాజునను మతిని కోరుచు ఈగాథ పలికెను:

ఆగు సదాచారంబు జగమున శుభద
మగు సదాచారంబు జగతి నుత్తమము
ఘోరసర్పము 'సదాచారి' యశస్సు
పొందుటచేతనే క్రుందదలే దాయె.

ఇట్లు పలికి యతడు వెడలిపోవుచుండెను. త్రోవలో కసాయిదుకాణమునుండి డేగ మాంసఖండము నెత్తుకొని ఆకసమున కెగిరెను. ఇతర పక్షులు వచ్చి, దానిని చుట్టుముట్టి, గోళ్ళతో ముక్కులతో కొట్ట నారంభించెను. బాధ కోర్వలేక డేగ మాంసఖండమును జారవిడిచెను. వేరొకపిట్ట దానిని గ్రహించెను. తక్కినవి దానిని వేధించుటచే అది కూడ మాంసఖండమును జారవిడిచెను. బోధిసత్త్వు డంతయును జూచి "కామభోగములు ఈమాంసఖండము వంటిది. గ్రహించినవానికి బాధ, విడిచిపెట్టినవానికి సుఖము సంభవించును" అని భావించి రెండవ గాధ పలికెను:

ఒక్కింత తినుబండ మున్నంతవరకు
గృధ్రమున్ వేధించె, ఖేచరాల్ కూడి
ఏమియు నుండదో యెవ్వాని కడను
హింసింప రవ్వాని నెవ్వరు గూడ.

ఆయన మార్గమువెంట జని సాయంకాలమున నొకగ్రామము చేరి, ఒకగియింట పండుకొనెను. వారియింటిదాసి పింగళ ఒకనితో సంకేత మేర్పరచుకొని, యజమానుని కాళ్లు కడిగి, ఆయన నిద్రించినతరువాత వసారాలో కూరుచుండి "అతడు ఇక వచ్చును, ఇక వచ్చును" అనుచు రెండు జాములు గడపెను. తెల్లవారుజాముపరకును వేచియుండి, ఇక రా డని నిరాశ చేసికొని, పండుకొనెను. బోధిసత్త్వుడు చూచి "దాసి ఆశతో అంతవరకును వేచియుండెను. వాడు వచ్చెడి యవకాశము లే దని నిరాశచెంది సుఖముగా పండుకొన్నది. ఆశ లేకుండుటయే సుఖము" అనుకొని మూడవ గాధ పలికెను:

ఆశ లేనప్పుడు హాయిగా నిద్ర:
ఆశ ఫలించుచో హాయి జనించు
ఆశ మూలమున నిరాశను జెంది
సుఖముగా పింగళ సుస్వాప మొందె.

మరునా డాయన గ్రామము విడిచి అడవిలోనికి బోవుచుండగా ధ్యానారూఢు డయిన తాపసి కానవచ్చెను. చూచి ధ్యానముకంటె ఇహపరలోకములలో హెచ్చుసుఖము లేదని తలచి బోధిసత్త్వుడు

నాలుగవ గాథ పలికెను:

ఇహపరలోకాల నెందైన గాని
కలుగబోదు సమాధికంటె సౌఖ్యంబు
స్థిరచిత్తుడైనట్టి పురుషుని వలన
సంభవింపదు సుమీ, స్వపరపీడనము.

ఇట్లు పలికి అరణ్యములో ప్రవేశించి, ప్రవ్రజించి, ధ్యానము, అభిజ్ఞలను ఉత్పన్నము చేసి, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆ కాలమున తపస్వి నేనే.

## 331 కోకాలిక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోకాలికుని గూర్చి చెప్పినది. వర్తమానకథ తక్కార్యజాతకమున (481) విస్తృతముగా కానవచ్చును.

### అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు అతని మంత్రిరత్నముగా నుండెను. రాజు మిక్కిలి వాచాలుడు. బోధిసత్త్వుడు అతని వాచాలత నాపుటకై అవకాశమునకై వెదకుచు తిరుగుచుండెను.

ఒకనాడు రాజు ఉద్యానము చేరి మంగళశిలపై గూరుచుండెను. దానికి పై భాగమున అమ్రవృక్షశాఖలు వ్యాపించినవి. మామిడిచెట్టు మీద కాకి గూటిలో నల్లనికోయిల తన గ్రుడ్డు పెట్టినది. కాకి కోకిల గ్రుడ్డును పొదుగుచుండెను. గ్రుడ్డునుండి కోకిలపిల్ల బయలుదేరెను. అది తనబిడ్డ యనుకొని కాకి ముక్కుతో ఎర తెచ్చి దానిని పోషించుచుండెను. చిన్నిపిట్ట రెక్కలతో బాగుగా ఎగురలేనప్పుడే కోకిలకూజితము చేసెను. "ఇది ఇప్పుడే మరొకవిధముగా కూయుచున్నది. పెద్దది

యగుచో నేమి చేయునో?" అని కాకి దానిని ముక్కుతో పొడిచి చంపి కులాయమునుండి కూలద్రోసెను. అది రాజుపాదములకడ బడెను. రాజు బోధిసత్త్వునితో "మిత్రమా! ఏమిది?" యనెను. బోధిసత్త్వుడు తనలో "నేను రాజుకు నిదర్శనము చూపుటకై యత్నించుచుండగా ఇది లభించినది" అనుకొని "మహారాజా, ఈకోకిలబిడ్డను కాకి పోషించుచుండెను. రెక్కలు రాకముందే ఇది కోకిలకూత కూసినది. తనబిడ్డ కాదని తెలియగానే కాకి దీనిని ముక్కుతో పొడిచి చంపి, కులాయమునుండి క్రిందికి కూలద్రోసినది. మానవులు కాని, పశువులు కాని, పక్షులు కాని, అధికప్రసంగమువలన ఇట్లే దుఃఖభాక్కులు కావచ్చును" అని యీ గాథలు పలికెను:

తరుణమ్మునకు ముందు ధ్వనిచేయువాడు
చచ్చును కోకిలశాబకం బట్లు,
అంతటి తీక్ష్ణంబులైనశస్త్రమ్ము
లైన, హాలాహలంబైనను కాని,
ఆకస్మికమ్ముగా నాడుదుర్భావ
కన్నను చురుకులో మిన్నలు కావు.

ఉచితకాలమున, ననుచితకాలమున
బుద్ధిమంతుడు వాక్కువూన్కి రక్షించు:
తనకు సమాను డౌజనునితోగూడ
అతివేలముగ మాటలాడ డెన్నండు.

అందుచే ధీమంతు డైనట్టివాడు
సమయజ్ఞు డగుచు యోచన చేసి పలుకు:
వశవర్తు లగుదురు వైరు లాతనికి,
అల సుపర్ణునకు సర్పావళులవోలె.

బోధిసత్త్వుని యుపదేశము విన్నప్పటినుండియు రాజు మితభాషి యయ్యెను. ఆతడు బోధిసత్త్వుని విశేషముగా బహూకరించెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున కోకిలపోతము కోకాలికుడు. పండితామాత్యుడు నేనే.

## 332 రథలట్ఠి జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, కోసలరాజపురోహితుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆయనరథములో నెక్కి తన జమీగ్రామమునకు బోవుచుండెను. ఎగుడు ప్రదేశమున రథమునుండి రథమునుండి ధ్వనిచేయుచు బండ్ల వరుస వచ్చుచుండుట చూచి "మీ బండ్లవరుస ఆపుడు" అని రెండు మార్లు కేకవేసెను. శకటము లాగకపోవుటచే కోపించి బ్రాహ్మణుడు తన చేతనున్న కొరడాకర్రతో మొదటిబండి పోలుమీద కొట్టెను. అది విడిపోయి ఆయనశిరస్సుపై తగిలెను. అప్పు డాయన ఆగి రాజుతో "బండ్లవాండ్రు నన్ను కొట్టినా" రని విన్నవించెను. రాజు వారిని పిలిపించి ప్రాడ్వివాకులకు ఆ అభియోగము తెలియపరచెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో కూర్చుండి "ఆయుష్మంతులారా, రాజపురోహితుడు తనను బండ్లవాండ్రు కొట్టి రని అభియోగము తెచ్చి ఓడిపోయినాడు" అనుచుండిరి. శాస్త్ర అచట కరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఇట్లే జరిగెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వ డాయన న్యాయమంత్రిగా నుండెను. అంతయును పూర్వోక్తవిధమే! ఈకథలో మాత్రము రాజు విచారణప్రారంభమున బండివానిని బిలిపించి అభియోగము లేకుండనే వానితో "నీవు మాపురోహితుని కొట్టి, ఆయన నుదుటిపై బొప్పికట్టించినావు" అని వానిఆస్తిని జప్తుచేయవలసిన దని ఆజ్ఞయిచ్చెను. అప్పుడు బోధిసత్త్వుడు "మహారాజా, అభియోగము లేకుండనే మీరు వీని సర్వస్వగ్రహణమున కాజ్ఞ యిచ్చినారు. ఒక్కొక్కరు స్వయముగానే దెబ్బకొట్టుకొని ఇతరులు కొట్టినా రని చెప్పుచుందురు. కావున విచారణ నడపకుండ ఏమియు చేయుట ఉచితము కాదు. రాజ్యపాలన చేయువారు వ్యవహారము విని తీర్పుచెప్పుట యుక్తము" అని ఈ గాథలు పలికెను:

కొందరు కొందరు ముందుగా తామె
కొట్టి, అన్యులు తమ్ము కొట్టిన యట్లు
విజయ మొందియు తామె విజితులైనట్లు
పల్కుచుందురు రాజ,! ప్రథమమ్మునందు
వచ్చి నివేదించువారలవాక్కు
విశ్వాసయోగ్యంబు వెంటనే కాదు
అన్యనివేదనం బాలించి, ఏది
న్యాయమో దానినే చేయుట మేలు.

భోగాలలో బడిపోవుచు, నాల
సించెడి గృహమేధి శ్రేష్ఠుండు కాడు.
సంయమమ్మే లేని సాధువు కాని
న్యాయమ్ము చూడని నరపతి కాని
క్రోధమ్ము విడువని కోవిదుం డేని
మంచివారలు కారు: మనుజనాయకుడు
చేసి విచారణ శిక్షాదికంబు
విధియింపగా కీర్తి వృద్ధిని గాంచు.

రాజు బోధిసత్త్వుని మాటలు విని ధర్మానుసారముగా చేసిన విచారణలో బ్రాహ్మణునిదే దోషమని తేలెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున బ్రాహ్మణుడు నేటి బ్రాహ్మణుడే; పండితామాత్యుడు నేనే.

## 333 పక్కగోధ జాతకము

శాస్త జేతవనమున విహారము జేయుచు ఒకానొక గృహస్థును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

వర్తమానకథ సుచ్చజజాతకమున (320) వచ్చినది. ఆయన మరలి వచ్చు సమయమున త్రోవలో వేటకాడు కానబడి, ఇరువురకు సరిపోవు

నంత వండిన ఉడుము నిచ్చెను. భార్యను నీరు త్రాగ నంపి ఆతడు దానిని సంపూర్ణముగా భక్షించి, ఆమె మరలివచ్చిన పిదప "భద్రే, ఉడుము పారిపోయినది" అని చెప్పెను. "మంచిది స్వామీ, ఉడకబెట్టిన ఉడుము పారిపోయినపుడు మన మేమి చేయగలము" అని యామె పలికెను.

వారు జేతవనము చేరి నీరు త్రాగి, శాస్త సన్నిధి కరిగి కూరుచున్నపుడు శాస్త "ఉపాసికా, ఈనీభర్త హితచింతకుడేనా? నీయెడ ప్రీతి చూపునా? మేలు చేయునా?" అని ప్రశ్నించెను.

"భన్తే, నేను ఈయనకు హితచింతకురాలను; ప్రీతి చూపుదును; మేలు చేయుదును. కాని ఈయన స్నేహరహితుడు."

"ఉండుగాక. ఇప్పు డిట్లున్నాడు, కాని నీగుణములను స్మరించి నపుడు సమస్తము నీకిచ్చెను" అని శాస్త, ఆమెప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

ఈ కథలో వారు మరలి వచ్చుసమయమున మార్గములో లుబ్ధకుడు వారిని జూచి బడలినట్లు గ్రహించి, ఇరువురు భుజించుటకై వండిన ఉడుము నిచ్చెను. రాజకన్య దానిని తీగెతో కట్టి తీసికొనిపోయెను. కొంతదూరము పోగా సరస్సు కనబడినది. త్రోవ విడిచి కొంతదూరమున వారు రావిచెట్టుక్రింద గూరుచుండిరి. "భద్రే, నీవు పోయి, కమలపత్రములతో దొన్నె చేసి, మంచినీరు తెమ్ము. మనము మాంసము భక్షింతము" అని రాజకుమారుడు చెప్పెను. ఆమె ఉడుమును చెట్టుకు వ్రేలాడదీసి, నీరు తెచ్చుటకై సరస్సుకు పోయెను. రాజకుమారుడు ఉడుమును తిని, తోకచివరభాగము చేత బట్టుకొని, పరాఙ్ముఖుడై కూరుచుండెను. ఆమె జలము తెచ్చినంతనే "భద్రే, ఉడుము కొమ్మపైనుండి దుమికి బిలములోనికి పారిపోయినది. నేను పరుగెత్తిపోయి, తోక పట్టుకొంటిని. చేతిలో నున్నభాగము తెగిపోయినది, తక్కినభాగము బిలములో ప్రవేశించినది" అనెను. "దేవా, వండిన ఉడుము పరుగెత్తిపోయినపుడు మన మేమి చేయగలము? పోవుదము" అని రాజకుమారి పలికెను.

వారు నీరు త్రాగి వారాణసి చేరిరి. రాజకుమారునకు రాజ్యము వచ్చినపిమ్మట ఆమెను పట్టపుదేవిని మాత్రము చేసినాడు; సమ్మానాదులు ఏమాత్రము లేవు.

బోధిసత్త్వుడామెకు సమ్మానాదులు చేయించు తలపుతో ఒకనాడు రాజసమ్ముఖమున నిలిచి రాణితో "ఆర్యే, మీవలన మా కేమియు లభించుట లేదు. మీదృష్టి మామీద పడుటలేదు" అనెను.

"నాయనా, ప్రభువువలన నాకే ఏమియు లభింపనప్పుడు మీ కేమి ఈయగలను? అరణ్యములో ఉడకబెట్టిన ఉడుమును సంపూర్ణముగా ఒక్కరే భుజించినవారు ఇప్పుడు మాత్రము నా కేమి యిత్తురు?" అని రాణి పలికెను.

"ఆర్యే, ఇట్లనరాదు. ప్రభువు ఇట్లు చేయరు."

"నాయనా, వారిసంగతి మీకు తెలియదు. నాకు తెలియును" అని రాణి ఈ తొలిగాథ పలికెను:

వల్కలంబులు దాల్చి వనమున రాజు,
కవచంబు, ఖడ్గంబు గ్రహియించు వేళ
అశ్వత్థకోటరమందుండి యుడుము
పారిపోవుట నేను పరికించినాను.

ఈవిధముగా రాజులోపమును నలువురయెదుట ప్రకటించెను.

విని బోధిసత్త్వుడు "ఆర్యే, ప్రభువుకు మీమీద ఇష్టము లేనప్పటి నుండియు ఉభయులకును బాధగా నుండునట్లు మీ రిచ్చట ఏల నిలిచి యున్నారు?" అని ఈ రెండుగాథలు పలికెను:

నమ్రత చూపుచో నమ్రుడ వగుము;
సఖ్యమ్ము చేయుము సంగతి వేడ,
ఉపకార మొనరింప నుపకృతి చేయు,
మపకారికి ననర్థ మాచరింపకుము.

విడిచిపెట్టుము నిన్ను విడనాడువాని,
పేరాసకలవాని జేరబోవకుము.

సాంగత్యము విరక్తజనునితో వలదు;
తరువులు ఫలరహితమ్ముల పిదప

ద్విజములు చనునట్లు వేరొకచోటు
ప్రాపింపుము: జగత్తు బహువిశాలంబు.

బోధిసత్త్వునివాక్కులు వినినంతనే రాజున కామెగుణములు జ్ఞప్తికి వచ్చినవి. "భద్రే, నేటివరకు నీగుణగణమును లెక్కింపకుంటిని; పండితోత్తమునివాక్కులవలన తెలిసికొంటిని. నాయపరాధములను నీవు సహించియుంటివి. నీ కీరాజ్యమంతయును ఇచ్చుచున్నాను" అని రాజు నాలుగవ గాథ పలికెను:

క్షత్త్రియాణీ, కృతజ్ఞతవల్ల నీకు
శక్తికొలందిని సలుపుదు పనులు.
అనుకొమ్ము నీదిగా ఐశ్వర్య మెల్ల:
నీవు కోరినదాని నే నిత్తు నీకు.

ఇట్లు పలికి రాజా మెకు సమస్తసంపదల నొసగి, ఈయన ఈమె గుణగణమును జ్ఞప్తికి తెచ్చినాడు అని బోధిసత్త్వునకు విశేషసంపద యిచ్చెను.

శాస్త ఈధర్మోపదేశము, సత్యప్రకాశనము కావించి, జాతకములు సరిపోల్చెను. అంతట భార్యాభర్తలు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు లయిరి. ఆకాలమున భార్యాభర్తలు ఈకాలపు భార్యాభర్తలే; పండితామాత్యుడు నేనే.

## 334 రాజోవాద జాతకము

శాస్త జేతవనమున విహరించుచు రాజోపదేశవిషయమై చెప్పినది.

### వర్తమాన కథ

వర్తమానకథ సకుణ జాతకమున వచ్చును. ఇచ్చట శాస్త "మహారాజా, ప్రాచీనరాజులు పండితులవాక్కు విని, ధర్మానుసారముగా రాజ్యపరిపాలనము చేసి, స్వర్గము చేరిరి" అని రాజుప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి పెద్దవాడయి సమస్తవిద్యలు నేర్చి, ప్రవ్రజించి, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, రమణీయహిమాలయప్రదేశమున ఫలమూలము లాహారముగా నివసించుచుండెను.

ఆకాలమున రాజు తనలోపములను చూపువారికై వెదకుచుండెను. నగరిలోను, నగరములోను అట్టివాడు లభింపకపోవుటచే వేషము మార్చి జనపదములలో తిరగజొచ్చెను. అప్పటికిని గుణములే వినుచు, లోపములను చెప్పువారు కనబడనందున రాజు హిమాలయప్రదేశమున విచరించు బోధిసత్త్వుని యాశ్రమము జేరి, ఆయనకు ప్రణామము చేసి, ఒకప్రక్కగా గూరుచుండెను. బోధిసత్త్వుడు కుశలప్రశ్నలు వేసి, అడవిలో పండిన మర్రిపండ్లు తినుచుండెను. అవి పంచదారవలె తియ్యగా శక్తిదాయకముగా నుండెను. బోధిసత్త్వుడు రాజుతో "పుణ్యపురుషా, ఈపండ్లు తిని, నీరు త్రాగుము" అని ఫలము లిచ్చి, నీ రొసగెను. తిని రాజు "భన్తే, ఈఫలము లింత తియ్యగా నుండుటకు కారణ మేమి?" అని యడిగెను.

"పుణ్యపురుషా, రాజు న్యాయానుసారముగా పరిపాలించుచుండుటచే ఇవి మధురముగా నున్నవి" అనెను.

"రాజు అధార్మికు డైనచో వీనిలో తీపి తొలగిపోవునా?"

"అవును. రాజులు ధర్మము విడనాడుచో తైలము, మధువు, శర్కర మొదలగువానిరుచి పోయి, అడవిలోని ఫలమూలాదుల మాధుర్యము పోయి, అన్నియు ఓజోరహితములగును, చెడిపోవును. ఇవియే కాదు; సమస్తరాష్ట్రముకూడ ఓజోరహితమై చెడిపోవును. రాజులు ధార్మికు లైనచో అన్నియు మధురము లై, శక్తివర్ధకము లై, రాష్ట్రమంతయు శక్తిమంత మగును."

అవు నని రాజు తా నెవరో తెలుపక బోధిసత్త్వునకు ప్రణామము చేసి, వారాణసికి మరలిపోయెను. తాపసివాక్కులను పరీక్షింపవలె నని బుద్ధిపుట్టి రాజు ధర్మవ్యతిరేకముగా రాజ్యము చేసి చూచెద నని కొద్దికాల మట్లు గడపి, మరల బోధిసత్త్వునికడ కేగి ప్రణామము చేసి

ఒకప్రక్క కూరుచుండెను.

ఆయన రాజుకు పండినమ్రిపండ్లు బెట్టెను. అవి చేదుగా నుండుటచే రాజు ఉమిసి "భదంతా, పండ్లు చేదుగానున్నవి" అనెను.

"పుణ్యపురుషా, రాజు ధర్మము విడనాడియుండును. రాజు లధార్మికు లగుచో అడవిలోని ఫలమూలాదులు ఓజోరహితము లగును" అని ఈ గాథలు పలికెను:

పుంగవము వక్రముగ నదిం బోవు నేని
గోవు లన్నియు తద్రీతి బోవసాగు.

ఉత్తముం డని విఖ్యాతి నొందువాడు
చేయు నేని యధర్మం బశేషజనులు
ఆదిలోనె యధర్మమ్ము నాచరింత్రు.

రా జధార్మికు డైనచో రాష్ట్ర మెల్ల
పొందు నెన్నియొ కష్టముల్; పుంగవంబు
సూటిగా నీదు పక్షాన ఏటియందు
గోవు లన్నియు సూటిగా బోవుచుండు.

ధార్మికుడె యైన యెడల నుత్తముడు, రేడు,
జనము ధార్మిక మగును, రాష్ట్రము సుఖించు.

రాజు బోధిసత్త్వునికడ ధర్మములు విని, తాను రాజు నని ప్రకటించి "భన్తే, నావలననే మొదట పండ్లు తీయగా నుండి పిమ్మట తిక్తము లైనవి. మరల మధురము లగును" అని ఆయనకు ప్రణామము చేసి, నగరమునకు బోయి, ధర్మానుసారముగా పరిపాలించి సర్వము పూర్వ స్థితికి దెచ్చెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; తపస్వి నేనే.

## 335 జంబుక జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు దేవదత్తుడు తథాగతుని అనుకరించుటను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కథ పూర్వమే వచ్చినది. ఇచట సంక్షేపరూపము. ఇచట శాస్త ఆతనితో "సారిపుత్రా, దేవదత్తుడు నిన్ను చూచి ఏమిచేసినాడు" అనెను. "భన్తే, అతడు మిమ్ము అనుకరించుచు నాచేతిలో వీవననుంచి పండుకొనెను. అంతట కోకాలికుడు ఆతని రొమ్ముమీద మోకాలితో పొడిచెను. ఈవిధముగా ఆతడు వ్యథ పొందెను." ఈ విధముగా స్థవిరుడు చెప్పెను. విని శాస్త "సారిపుత్రా, దేవదత్తు డిప్పుడే కాదు. పూర్వముకూడ నన్ననుకరించి వ్యథ చెందెను" అని, ఆతనిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సింహముకడుపున బుట్టి హిమాలయమున గుహలో నివసించుచుండెను. సింహ మొకనాడు వనమహిషమును సంహరించి మాంసము తిని, నీరు త్రాగి, మరలివచ్చుచుండగా నక్క చూచి భయముచే పరుగెత్త నేరక నేలపై బోర్లబండుకొనెను. "జంబుకమా, ఏమిది?" యని సింహ మడుగగా "మహాశయా, నేను మీసేవ చేయుదును" అని నక్క యనెను. "అట్లయిన రమ్ము" అని సింహము జంబుకమును నిజనివాసమునకు గొనిపోయి ప్రతిదినము మాంసము తెచ్చిపెట్టి దానిని పోషించుచుండెను. సింహము కొట్టి తెచ్చిపెట్టు మాంసము తినగా ఒడలు బలిసి, ఒకనాడు జంబుకమునకు అభిమానము పుట్టి "స్వామీ, నా మూలమున ప్రతిదినము మీకు అసౌకర్యము కలుగుచున్నది. అనుదినము మీరు మాంసము తెచ్చి నన్ను పోషించుచున్నారు. నేడు మీ రిచ్చటనే యుండుడు. నేను ఏనుగును చంపి, మాంసము తిని, మీకు గూడ తెచ్చెదను" అని చెప్పెను.

"జంబుకమా, నీ విట్లు కోరకుండుట మంచిది. ఏనుగున్ను వధించి

మాంసము తినుజాతియందు నీవు పుట్టలేదు. నేను వారణమును చంపి నీ కిత్తును. గజశరీరము మహోన్నతము. నామాట వినుము. అన్యథా చేయకుము” అని సింహ మీ తొలిగాథ పలికెను:

తనువు పెద్దది, దీర్ఘదంతములు కలది
ఇభము; నీవు జంబుకము, జన్మింప లేదు
కుంజరమ్మును పట్టెడి కులమునందు.

సింహము నిషేధించినను సృగాలము గుహనుండి బయలుదేరి మూడుమారులు హుక్కా అని నక్కకూత కూసి, పర్వతశిఖర మెక్కి క్రిందిభాగమున నల్లని యేనుగు పోవుచుండుట చూచి, ఎగిరి దాని కుంభస్థలముపై దుముకబోయి పాదముకడ బడెను. వారణము రెండవ పాదము నక్క శిరస్సుపై ఉంచెను. నక్కతల పగిలి చూర్ణము కాగా, అది ఆక్రోశించుచు కుప్పగా కూలిపోయెను. గజము ఘీంకారము చేయుచు వెడలిపోయెను.

బోధిసత్త్వుడు పోయి పర్వతశిఖరముపై నిలిచి, నక్క నాశమగుట చూచి అభిమానకారణమున నక్క నశించినది అని ఈ మూడుగాథలు పలికెను:

సింహమై పుట్టక సింహవిక్రమము
నూరక నటియింప గోరెడి మృగము
భద్రనాగము గాంచి పైకి లంఘించి
నేలపై గూలు సృగాలము ట్లగును
ఉత్తముండు, కులీనుడు, సత్త్వ కల
భూరిదేహునితో సరిపోల్చుకొన్న
యతడు గజహతజంబుక మట్లు కూలు.
తనశక్తి గ్రహియించి, దాని లోపలనె
యోచనతో పను లొనరించువాడు,
జపమున, మంత్రాన, స్వచ్ఛవాక్కునను
సంప్రాప్త నిర్దుష్ట సర్వార్థుడగును.

ఈప్రకారము బోధిసత్త్వుడు మూడుగాథల ద్వారా ఈలోకమున కర్తవ్య మేదో దానిని బోధించెను.

శాస్త్ర ధర్మోపదేశము జేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున సృగాలము దేవదత్తుడు; సింహము నేనే.

# 336 బ్రహాచ్ఛత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, కపటభిక్షువును గూర్చి చెప్పినది. వర్తమాన కథ ఇదివరలోనే వచ్చినది.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు అర్థధర్మానుశాసకమంత్రిగా నుండెను. వారాణసీప్రభువు మహాసైన్యముతో కోసలరాజ్యముపై దాడివెడలి, శ్రావస్తికి జని యుద్ధము చేసి, నగరములో ప్రవేశించి, రాజును పట్టుకొనెను. కోసల రాజుకు ఛత్రుడనుపుత్రు డుండెను. అతడు వేషము మార్చి బయలుదేరి, తక్షశిలకు బోయి, అక్కడ మూడువేదములను పదునెనిమిది విద్యలను నేర్చి, తక్షశిలనుండి బయలువెడలి మార్గమున వివిధవిద్యలు నేర్చుకొనుచు ఒకానొక సీమాంతగ్రామము చేరెను. అచటి యరణ్యములో ఆశ్రమము నిర్మించుకొని, అయిదువందలతపస్వులు నివసించుచుండిరి. కుమారుడు వారికడకు బోయి గ్రహింపదగిన దంతయు వారివలన గ్రహించి, ప్రవ్రజించి, క్రమముగా ఆగణమునకు శాస్త యయ్యెను.

ఆయన ఒకనాడు తపస్వులను సంబోధించి "మిత్రులారా, మీరు మధ్యదేశమున కేల వెళ్ళరు?" అనెను.

"మధ్యదేశములోనివారు పండితులు; ప్రశ్నలు వేయుదురు. పుణ్యానుమోదనము చేయింతురు. మంగళసూత్రపాఠము చేయింతురు. అసమర్థులయినచో నిందింతురు. భయముచే మే మచ్చటికి బోవుట లేదు." "మీకు భయము లేదు. నే నంతయు నెరవేర్చెదను." "అట్లయిన నడువుడు."

తమతమ కుచితవస్తువులతో అందరును వారాణసి చేరిరి. వారాణసీ నరేశుడు కోసలప్రభువును తనయధీనమునం దుంచుకొని, అచ్చట అధికారిని నియోగించి, అక్కడి ధనమును వారాణసికి తెప్పించి ఇనుప కడవలలో నింపి, వానిని ఉద్యానమున పూడ్పించెను. తాను రాజధాని లోనే నివసించుచుండెను.

ఋషులు రాత్రివేళ రాజోద్యానమున నుండి మరునాడు భిక్షార్థము నగరములోనికి బోయి, రాజద్వారమున నిలిచిరి. రాజు వారిచర్యకు

ప్రసన్నుడై వారిని లోనికి బిలిపించి ఉన్నతాసనములపై గూరుచుండ బెట్టి యవాగు, ఖజ్జకములు వడ్డనచేయించెను. భోజనసమయమున అనేకకుశలప్రశ్న లడిగెను. ఛత్రుడు రాజును ప్రసన్నుని చేసి, సమాధానము లిచ్చి, భోజనానంతరము విచిత్రదానానుమోదము చేసెను.

రాజు సుప్రసన్నుడై వారందరు ఉద్యానమున నిలుచునట్లు మాట పుచ్చుకొనెను. నిధినిక్షేపములను గ్రహించుమంత్రము తెలియుటచే ఛత్రుడు తనతండ్రిధన మచ్చట నుండుట తెలిసికొని "ఈధనము గొని పోయి రాజ్యము మరల చేకొందు" నని తలచి తాపసులతో "ఆప్తులారా, నేను కోసలరాజపుత్రుడను. వారాణసీప్రభువు మారాజ్యము గ్రహించినాడు. నేను వేషము మార్చి ఇంతకాలము ప్రాణములు దక్కించుకొంటిని. ఇప్పుడు మాకులధనము లభించినది. దీనిని గొనిపోయి రాజ్యము మరల చేకొందును. మీ రేమి చేయుదురు?" అని యడిగెను. "మేము నీవెంట వత్తుము" అని వారు చెప్పగా మంచి దని రాజకుమారుడు తోలుసంచులు చేయించి, రాత్రివేళ నేల త్రవ్వించి ఇనుపబిందెలలోని ధనమును సంచులలోని కెక్కించెను. అయిదువందల తాపసులును మరికొందరును ధనమును మోసికొనిపోయి శ్రావస్తి చేరిరి. అక్కడి రాజ్యాధికారులను పట్టుకొని, నిజరాజ్యమును మరల చేకొని, ఛత్రుడు ప్రాకారాట్టాలకాదులు బాగుచేయించెను. అంతయు అభేద్యము చేసి తాను రాజధానిలో నివసింపజొచ్చెను.

ఉద్యానములోని ధనమును హరించి తాపసులు పలాయితులయి రని వారాణసీరాజుకు తెలియవచ్చెను. ఆత డుద్యానమునకు జని, ఇనుపకడవలు "తీయించి చూడగా వానిలో చెత్తమాత్రము కానబడెను. ధనము పోవుటచే నతనికి బాధ కలిగెను. ఆతడు చెత్త చెత్త యని యరచుచు నగరమున తిరుగజొచ్చెను. ఎవ్వరును ఆయనదుఃఖమును నివారింపజాలకుండిరి.

బోధిసత్త్వుడు చూచి "రాజువ్యధవిశేషముగా నున్నది. విలపించుచు నగరమున తిరుగుచున్నాడు. ఈతనికి నేను తప్ప ఇతరులు దుఃఖోపశమనము చేయలేరు. నే నీతని దుఃఖము తొలగించెదను" అనుకొనెను. ఒకనాడు ఉభయులును సుఖాసీనులై యుండిరి. రాజు విలాపము ప్రారంభింపగా బోధిసత్త్వుడు తొలిగాథ పలికెను:

తృణము తృణ మని ప్రలపింతు వేల? తృణము
లెవరు కొనిపోయినారు? నీ కేమి ఫలము?
తృణము తృణ మని యరచెద వేల నీవు?

విని రాజు రెండవగాథ పలికెను:

ఛత్రనాముడు బ్రహ్మచారి బహుశ్రు
తుం డిట కరుదెంచి, తోడ్కొనిపోయె
నాదు సంపత్తి, తృణంబులు చల్లి.

విని బోధిసత్త్వుడు మూడవగాథ పలికెను:

కొలదితోడ విశేషమ్ము కోరువాడు
చేయునిట్టులె: తృణభాండసిద్ధి కవల
నేడ్చినను మొత్తుకొన ఫల మేమి యుండు?

ఇది విని రాజు నాలుగవగాథ పలికెను:

శీలవంతు డీరీతిని చేయ డెపుడు;
చేయుదురు మూఢు లిట్లు: దుశ్శీలు డైన
జనుని పాండిత్య మెల్ల నిష్ఫలము సుమ్మ!

ఈప్రకారముగా వానిని నిందించెను. బోధిసత్త్వుని యుపదేశము వలన రాజుదుఃఖము నిశ్శేష మయ్యెను. రాజు ధర్మానుసారముగా పరిపాలన చేసెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములం సరిపోల్చెను. ఆ కాలమున పెద్దఛత్రుడు కపటభిక్షువు; పండితామాత్యుడు నేనే.

## 337. పీఠ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయు సమయమున ఒకానొకభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు జనపదమునుండి జేతవనము చేరి పాత్ర చీవరములు భద్ర పరచి, శాస్తకు ప్రణామము చేసి, తరుణశ్రమణులతో "ఆయుష్మంతు

లారా, అతిథిభిక్షువుల నాదరించువా రెవరు?" అని యడిగెను.

"ఆయుష్మన్, అనాథపిండికుడు అను మహాశ్రేష్ఠియు, విశాఖ అను మహాఉపాసికయు ఆదరింతురు."

మంచి దని యాతడు మరునాడు భిక్షు లెవ్వరును ప్రవేశించుటకు పూర్వము నగరమున ప్రవేశించి, అనాథపిండికుని గృహద్వారము చేరెను. ఆసమయ మగుటచే అతని నెవ్వరును లక్ష్యము చేయలేదు. అచట నేమియు లభింపకపోవుటచే అతడు విశాఖయింటికి బోయెను. చాల పెందలకడ బోవుటచే అచటగూడ నతని కేమియు లభింపలేదు. ఇటు నటు దిరుగుచు మరలివచ్చునప్పటికి యవాగు భోజనము ముగిసి పోయెను. మరల ఇటునటు దిరుగుచు వచ్చునప్పటికి మధ్యాహ్నభోజన మయిపోయినది. అతడు విహారము చేరి రెండుకుటుంబములవారిని నిందించుచు తిరుగుచుండెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో గూరుచుండి ఈ విషయము చర్చించుచుండగా శాస్త అరుదెంచి సంగతి గ్రహించి, భిక్షువును బిలువనంపి "భిక్షూ, ఇది నిజమేనా?" అని యడిగెను. "భన్తే, సత్యమే" అని యాత డన్నపిదప శాస్త 'భిక్షూ, కోపించెద వేల? పూర్వకాలమున బుద్ధోత్పత్తి కాకపూర్వము తపస్వి గృహస్థుల యిండ్ల కేగి, ఏమియు లభింపకున్నను శాంతముగా నుండెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలకు బోయి, సమస్తవిద్యలు నేర్చి, ప్రవ్రజించి, హిమాలయమున నివసింప జొచ్చెను. అచ్చట బహుకాల ముండి, పిమ్మట నగరము చేరి భిక్షాటమునకు బయలుదేరెను. ఆనాటి శ్రేష్ఠి శ్రద్ధావంతుడు, భక్తిసమన్వితుడు. "ఎవరియింట శ్రద్ధావంతులు భక్తులు ఉందు" రని బోధిసత్త్వుడు అడుగగా, శ్రేష్ఠియింట నని సమాధానము వచ్చెను. ఆయన అంతట శ్రేష్ఠి యింటికి బోయెను. ఆసమయమున శ్రేష్ఠి రాజసభలో నుండెను. ఇంటి లోనివా రెవరును బోధిసత్త్వుని చూడలేదు. ఆయన వెనుదిరిగి పోవు

చుండెను. రాజసభనుండి మరలి వచ్చుచున్న శ్రేష్ఠి ఆయనను జూచి ప్రణామము చేసి, భిక్షాపాత్ర కైకొని, నిజగృహమునకు గొంపోయెను. అంతట బోధిసత్త్వుని కూరుచుండబెట్టి, పాదములు కడిగి, వెన్న యవాగు భక్ష్యములును వడ్డించెను. భోజనసమయమున పలుకరింపక, అనంతరము ప్రణామము చేసి, యిట్లు విన్నవించెను:

"భన్తే, మాయింటికి వచ్చి భిక్ష మడిగినవారు కాని, శ్రమణ బ్రాహ్మణులు కాని రిక్తహస్తములతో మరలిపోవుట ఇంతవరకును లేదు. మాబిడ్డలు మిమ్ము జూడలేదు. కావున మీకు పీఠము కాని, కాళ్ళుకడుగుట కాని, భోజనము కాని లభింపలేదు. మీరు ఊరకే మరలిపోవుచుంటిరి. ఇది మాయపరాధము. మమ్ము క్షమింపవలెను" అని శ్రేష్ఠి తొలిగాధ పలికెను:

పీఠ యేనియు నీకునై వేయమైతి
ముదక మేని, భోజన మేని, యొసగలేదు
నీవు మదపరాధమును మన్నింపవలయు.

విని బోధిసత్త్వుడు రెండవగాధ పలికెను:

లేదు నా కెట్టి యాసక్తి, లేదు కోప,
మప్రియపురేఖ మిగులలే దంతరంగ
మందు; నియ్యదియే భవదన్వవాయ
ధర్మ మే మగు నన్న వితర్కమొదవె.

విని శ్రేష్ఠి రెండుగాథలు పలికెను:

ఆర్యులైనవార లరుదేర పీఠంబు
సలిలతైలములను శ్రద్ధతోడ
బంధుజనుల కిచ్చుపగిది నొసంగుట
తొలుతనుండిగూడ కులముతీరు.

ధర్మోపదేశములు చేయుచు బోధిసత్త్వుడు వారాణసీశ్రేష్ఠియింట నుండి, ఆవల హిమాలయమునకు బోయి, అభిజ్ఞలను, సమాపత్తులను పొందెను.

శాస్త్ర ధర్మోపదేశ సత్యప్రకాశనములు కావించి రెండుజాతకములు సరిపోల్చెను. భిక్షువు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున వారాణసీ శ్రేష్ఠి ఆనందుడు; తపస్వి నేనే.

## 338. థుస జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు అజాతశత్రువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆబిడ్డ తల్లికడుపున పడినపిమ్మట తల్లి యగు కోసలరాజపుత్రికి బింబిసారనృపాలుని తొడలోని నెత్తురు త్రాగవలెనని కోరిక గలిగెను. ఆకోరిక దృఢమయ్యెను. పరిచారిక లామెను ప్రశ్నింపగా ఆమె యీ సమాచారము తెలియపరచెను. రాజు ఈవార్త విని లక్షణజ్ఞులను పిలువనంపి దీని తాత్పర్య మేమి అని యడిగెను.

దీని కడుపున నున్న బిడ్డ మిమ్ము సంహరించి మీరాజ్యము చేకొనును'' అని వారు చెప్పిరి.

“నా కుమారుడు నన్ను సంహరించి రాజ్యము చేకొన్నచో అందేమి హాని కలదు'' అని రాజు తనతొడ బంగరుకత్తితో కోసి రక్తము తీసి దేవికి త్రాగనంపెను.

“నా తనుజాతుడు తండ్రినే సంహరించుపక్షమున ఇట్టివానితో నాకేమి పని!'' అనుకొని ఆమె గర్భస్రావముకై కడుపు గుద్దించుకొనెను. ఈవార్త తెలిసినంతనె రాజు ఆమెను పిలువనంపి “భద్రే, నాకుమారుడు నన్ను సంహరించి రాజ్యము గైకొనును. నేను జరామరణములు లేనివాడను కాను. జననాంతరము పుత్రునిముఖము చూడనిమ్ము. ఇట్టిపనులు చేయకుము.” అంతట నామె ఉద్యానములోనికి పోయి పొట్టగుద్దించుకొనెను. రాజు ఈసంగతి తెలిసికొని తోటలోనికి పోయి ఆపని మాన్పించెను. నెలలు నిండినపిదప ఆమె మగశిశువును కనెను. నామకరణమునా డాతనికి అజాతశత్రు డని పేరు పెట్టిరి. జాతుడు కాక మునుపే తండ్రియెడ శత్రుత్వ ముండునని తెలియుటచే అజాతశత్రువని అనిరి. అతడు పెరిగి పెద్దవా డగుచుండెను. ఒకనాడు శాస్త అయిదు వందలమంది భిక్షువులతో రాజమందిరము చేరెను. రాజు ప్రశస్త భోజనము వడ్డనచేయించి శాస్తకు ప్రణామముచేసి ఒకప్రక్కన ధర్మోపదేశము నాలకించుచుండెను. ఇంతలో రాజకుమారుని అలంకరించి తండ్రిచేతుల కిచ్చిరి. రాజు వాత్సల్యముతో బిడ్డను తీసికొని ఒడిలో కూర్చుండబెట్టుకొనెను. రాజు పుత్రప్రేమ వలన వానిని

లాలించుచు ధర్మప్రసంగము సరిగా వినకుండెను; రాజు అశ్రద్ధ గమనించి, శాస్త "మహారాజా, పూర్వము పుత్రునియెడ సంశయము కలిగిన రాజులు, బిడ్డను, యెచ్చటనో గుప్తము చేయించి, తమ మరణాంతరము గద్దె యెక్కింపు డని చెప్పెడివారు" అని రాజు ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసీలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు తక్షశిలలో ప్రసిద్ధాచార్యుడై అనేక రాజకుమారులకు బ్రాహ్మణకుమారులకు విద్యలు నేర్పుచుండెను. వారాణసీ రాజపుత్రుడు పదునారేండ్లవయసున ఆయనకడకు బోయి మూడు వేదములను, సర్వవిద్యలను గ్రహించి, ఆచార్యునికడ సెలవువేడెను. రాజకుమారునకు నిజపుత్రునివలన ఉపద్రవము కలుగు నని ఆచార్యుడు అంగవిద్యవలన గ్రహించి, ఆయుపద్రవమును తొలగింప దలచి నాలుగు గాథలు రచించి యిట్లు చెప్పెను. "నాయనా, నీకుమారుడు పదునారు సంవత్సరముల వయస్సున నీకడ భోజనమునకు గూరుచున్నప్పుడు తొలి గాథను, రెండవది దర్బారులోను, ప్రాసాదము నెక్కునపుడు పైసోపానముమీద ఆగి మూడవ గాథను, శయనాగారములోనికి పోవునపుడు వసారాలో (శ్రీగర్భము) నిలిచి నాలుగవగాథనుపఠింపుము." రాజకుమారుడు సమ్మతించి వానిని గైకొని, ఆచార్యునకు ప్రణామము చేసి, వెడలిపోయెను.

తండ్రి పోయిన పిమ్మట ఆతడు రాజయ్యెను. ఆతని కుమారునకు పదునారేండ్లు వచ్చెను. వాడు రాజవైభవమును చూచి తండ్రిని వధించి రాజ్యము పొందగోరి తనసేవకులతో చెప్పగా, వారు "దేవా, వార్థకములో ఐశ్వర్యము లభించినను ప్రయోజన మేమి? ఏదో ఉపాయమున రాజును సంహరించి, రాజ్యము గ్రహింపవలెను" అని చెప్పిరి. రాజకుమారుడు యోచించి "విషము పెట్టెదను" అని భావించి, భోజనసమయమునకు విషము వెంటగొనిపోయి తండ్రిప్రక్కన గూరుచుండెను. పళ్ళెరములో ఆహారము వడ్డింపగానే రాజు తొలిగాథ పలికెను:

ధాన్యతండులముల తారతమ్యంబు
తెలియును, కావున నెలుక బియ్యము నె
భుజియించు ధాన్యంపుపొట్టును విడిచి.

తనసంగతి తెలిసె నని భయపడి వాడు విషము కలపకుండనే తండ్రికి, ప్రణామము చేసి వెడలిపోయెను. వా డీసంగతి నిజసేవకులకు జెప్పి "నాసంగతి బయటపడినది. ఇప్పు డేమి చేయవలెను?" అని యడిగెను. వా రుద్యానమునకు బోవునపుడు రహస్యముగా కూడి యోచించి "ఉపాయము కలదు. ఖడ్గము సిద్ధముగా నుంచుకొనుడు. రాజు దర్బారుకు బోవునపుడు మీ రమాత్యులనడుమ నిలిచి, రాజు అజాగ్రత్తగా నున్నపుడు ఖడ్గముతో ప్రహరింపుడు" అని చెప్పిరి. మంచి దని వాడు కత్తిధరించి రాజు దర్బారుకుబోవునపుడు ప్రహరించు టకై అదను వేచియుండ రాజు రెండవగాథ పలికెను:

ఆలోచనలు చేతు రడవిలో నెవరు
గ్రామాన గుసగుసల్ కావింతు రెవరు?
అన్వేషణముచేతు రవసరార్థంబు
ఎవ్వార; లిది యెల్ల ఎరుకయే నాకు.

తనసంగతి తండ్రికి తెలిసె నని కుమారుడు భయపడి, పోయి సేవకులతో జెప్పెను. ఏ డెనిమిది దినము లయినపిదప వారు "మీరు విరుద్ధముగా నున్నా రని నాయనగారికి తెలియదు. వైఖరినిబట్టియే గ్రహింపవచ్చును" అని చెప్పిరి.

ఒకనాడు వాడు ఖడ్గము గైకొని సోపానములపైన గదివాకిట నిలిచి యుండెను. రాజు మెట్లపై కెక్కి మూడవగాథ పలికెను:

ధర్మపత్నికి గల్గు తనయుండు, యూథ
పతి యగు నన్నట్టి భయముచే తండ్రి
మర్కటరాజు కుమారు బీజములు
చిన్నతనంబున ఛేదించినాడు.

తండ్రి తనను బంధించు నని కుమారు డనుకొని, భయపడి పారిపోయి సేవకులతో "నాయన నన్ను భయపెట్టినాడు" అని చెప్పెను. మాసార్థ మయిన పిమ్మట వారు "కుమారా, మీసంగతి తెలిసినచో

రాజు ఇన్నిదినము లూరకుండడు. ఆయన వైఖరియే తెలుపుచున్నది. సంహారింపుడు'' అని చెప్పిరి. కుమారు డొకనాడు కత్తి ధరించి మేడలో శయనాగారమున మంచముక్రింద దాగుకొని అదను వేచియుండెను. రాజు రాత్రివేళ భోజనానంతరము పండుకొందు నని సేవకులను బంపివేసి, శయనాగారము ప్రవేశించి, శ్రీగర్భములో నిలిచి నాలుగవ గాథ పలికెను:

అంధమేషము క్షేత్రమందు నల్లనల,
తిరుగాడుచుండెడి తీరున నెవరు
పర్యటించుచు క్రింద బడియుండు తుదకు
సర్వమ్ము నాకును జ్ఞాతమ్ము సుమ్మ!

విని, తండ్రికి తనవ్యవహారము తెలిసినదనియు, ఇక తనను నాశము చేయుననియు కుమారుడు భయపడి, మంచముక్రిందినుండి ఈవలకు వచ్చి, ఖడ్గము తండ్రిపాదములపై నుంచి, సాష్టాంగప్రణామము చేసి "దేవా, క్షమింపవలెను'' అని వేడెను. "నీ నేర్పు ఎవరికిని తెలియ దనుకున్నావా?'' అని రాజు బెదరించి, బేడీలు వేయించి, బందిగమునం దుంచి, కావలి పెట్టించెను. అప్పుడు రాజుకు బోధిసత్త్వునిగుణము తెలిసెను.

రాజు మరణించినపిమ్మట చెరసాలలో నున్న రాజకుమారుని ఈవలకు గొనివచ్చి రాజ్యాభిషేకము చేసిరి.

శాస్త జాతకములను పరిపోల్చెను. ఆ కాలమున తక్షశిలలో ప్రసిద్ధాచార్యుడను నేనే.

## 339. బావేరు జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లాభసత్కారములు కోల్పోయిన తైర్థికుల విషయమై చెప్పినది.

### వర్తమాన కథ

బుద్ధుడు జన్మించుటకు పూర్వము తైర్థికులకు లాభము కీర్తి ప్రాప్తించుచుండెడివి. బుద్ధుడు జన్మించినపిదప ఆయనకు యశోలాభ

ములు ప్రాప్తింప జొచ్చెను. ఈ విషయమును గూర్చి ధర్మసభలో చర్చ జరుగుచుండగా శాస్త అచటికి దయచేసి విషయము గ్రహించి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ గుణవంతుడు జనించువరకును, గుణహీనులకు యశోలాభములు ప్రాప్తించెడివి" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు నెమలికడుపున బుట్టి, పెరిగి, మిక్కిలి చక్కదనముతో వనమున సంచరించుచుండెను. ఆసమయమున కొందరు వణిజులు దిశాకాకమును గొని పడవలో బావేరురాష్ట్రము చేరిరి. ఆకాలమున బావేరురాజ్యమున పక్షులు లేవు. ఆరాష్ట్రప్రజలు వచ్చి పంజరములోని పక్షిని చూచి "దీనిచర్మ వర్ణము చూడుడు. ముక్కు కంఠమువర కున్నది. నేత్రములు మణిగోళములవలె నున్నవి" అని దానిని ప్రశంసించి, వణిక్కులతో "ఆర్యులారా, ఈపులుగును మా కిండు. దీనితో మాకు పనియున్నది. మీ రాష్ట్రములో మీకు వేరుపిట్టలు దొరకును" అనిరి.

"అట్లయిన వెల యిచ్చి తీసికొనుడు."

"అయిదు కార్షాపణములు తీసికొని పిట్ట నిండు."

"ఈయము."

ఈప్రకారముగా వెల పెరిగి తుదకు నూరుకార్షాపణము లయ్యెను. "దీనితో మాకు చాల పనియున్నది. కాని కేవలము మీమైత్రిని బట్టి అంగీకార" మని నూరుకార్షాపణములు తీసికొని వర్తకులు కాకి నిచ్చిరి.

వారు దానిని బంగరుపంజరములో నుంచి రకరకముల మత్స్యమాంసములు ఫలములు పెట్టి పోషించుచుండిరి. వేరొకపిట్ట లేకపోవుటచే ఈదుర్గుణములవాయసమునకే మేలు, ఆదరము లభించుచుండెను.

వేరొకసారి వర్తకులు నెమలిని గొనిపోయిరి. చిటికలు వేయగానే కూయుట, తాళములు వాయించినంతనే నృత్యము నేర్పి మయూరమును వెంటగొనిపోయిరి. జనులు గుమిగూడినంతనే నెమలి పడవ

ముందుభాగమున నిలిచి, రెక్కలు విదల్చి, మధురధ్వని చేయుచు నృత్యము చేసెను. జనులు ప్రసన్నచిత్తులై "ఆర్యులారా, ఈసుశిక్షిత పక్షిరాజమును మా కిండు" అని వణిజుల నడిగిరి.

"మొదట మేము వాయసమును దెచ్చినపుడు దానిని దీసికొంటిరి. ఇప్పుడు మయూరరాజమును తేగా దీనినిగూడ కావలెననుచున్నారు. మీరాష్ట్రమునకు పిట్టను దెచ్చినచో కష్టము."

"ఆర్యులారా, కానిండు. మీరాష్ట్రమున వేరొండు దొరకును. దీనిని మా కొసగుడు."

వెల పెంచి తుదకు వణిక్కులు సహస్రకార్షాపణములకు దాని నిచ్చిరి. కొన్నవారు ఏడుమణులు చెక్కిన బంగరుపంజరమున దాని నుంచి, మత్స్యమాంసములు, ఫలాదులు, తీయని పేలాలు, షర్బత్తు లిచ్చి పోషించుచుండిరి. మయూరరాజమునకు మంచిపేరు, ఆదరము లభించెను. నెమిలి వచ్చినప్పటినుండి కాకిని చూచువారు లేరు. దానికి తిండి దొరకకపోవుటచే కాకా అని యరచుచు పోయి చెత్త చెదరు పారవేయుచోట వాలెను.

శాస్త అభిసంబుద్ధుడైనపిమ్మట ఈ రెండుకథలను జోడించి ఈ గాథలు పలికెను:

క్రమనాదము గల్గు శిఖావళంబు
కానబడనంతవరకును కాకిపొందె
అచట ఫలమాంసములతోడ నాదరంబు.

చేరినంతనె నెమలి బావేరుసీమ
కాకమున కాదరంబెల్ల కట్టువడియె.

ధర్మరాజ ప్రభంకర దశబలధర
బుద్ధదేవుడు లోకాన పుట్టువరకు
జరుగుచుండెను బ్రాహ్మణశ్రమణపూజ.

దివ్యకంఠాన ధర్మోపదేశములను
మొదలిడినయంత బుద్ధుండు, మున్ను జరుగు
పూజలను తైర్థికుల్ కోలుపోయినారు.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమునందు కాకి నిగంఠనాథ పుత్రుడు. మయూరరాజు నేనే.

## 340. విసహ్య జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు అనాథపిండికుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కథ పూర్వోక్త 'ఖదిరంగార' జాతకమున (40) వచ్చినది. ఈ కథలో శాస్త్ర అనాథపిండికుని సంబోధించి "గృహపతీ, పూర్వము శక్రు డాకాశమున నిలిచి దానము చేయవల దని చెప్పినను ప్రాచీన పండితులు దానము లిచ్చిరి" అని శాస్త్ర అతని ప్రార్థనపై పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల ధనమున కీశ్వరుడై విసహ్య నామక శ్రేష్ఠిగా నుండెను. అతనికి పంచశీలములు లభ్యమయినవి. అతడు సహజముగానే దాత. అతడు నాలుగు నగరద్వారములకడను, నగరమధ్యమునను, తన సౌధముకడను ఆరుధర్మశాలలు నిర్మించి దానము లిచ్చుచుండెను. ప్రతిదినము ఆరులక్ష లిచ్చుచుండెను. సమస్తజంబూద్వీపము ఉడికిపోవునట్లు దానము లొసగుచుండుటచే శక్రునిభవనము కంపము నొందెను. దేవేంద్రుని పాండుకంబళశిలాసనము కంపము నొందెను. దేవేంద్రుని పాండుకంబళశిలాసనము వే డెక్కెను.

శక్రు డిట్లు తలపోసెను. "నన్ను స్థానభ్రష్టుని జేయదలచినవా డెవడు? విసహ్యానామకశ్రేష్ఠియా? ఇతడు రెక్కలు మిక్కుటముగా నార్చుచు జంబూద్వీప మంతటను సంచలనము కలుగునట్లు దానధర్మములు చేయుచున్నాడు. దానప్రభావముచే నన్ను పదచ్యుతుని జేసి తాను శక్రత్వము నొందదలచినట్లున్నాడు. ఇత డిక దానము చేయ జాలకుండునట్లు ధనముహరించి ఇతనిని దరిద్రుని జేసెదను." ఇట్లు తలపోసి శక్రు డతనిధనధాన్యములను, తైల మధుశర్కరాదులను, దాసీ దాసమును అంతర్ధానము చేసివేసెను. దాననిర్వాహకులు వచ్చి "స్వామీ, దానశాలలు వట్టిపోయినవి. ఎక్కడివస్తువు లక్కడనే హరించిపోయినవి" అని విన్నవించిరి.

"దానధర్మముల నాపవలదు. ఎక్కడనో తెచ్చి ఖర్చులు నడుపుడు"

అని శ్రేష్ఠి వారల నంపి, భార్యతో "భద్రే, దానము నడుపుము" అని చెప్పెను.

ఆమె యి ల్లంతయు గాలించి, మినపగింజలో సగమైన దొరకక పోవుటచే "ఆర్యా, మన కట్టుబట్టలు తప్ప ఏమియు కానవచ్చుట లేదు. ఇ ల్లంతయు వట్టిపోయినది. స_ప్తరత్నములతో నిండిన కొట్లగదులు తెరచి చూడగా ఏమియు కానరాలేదు" అని చెప్పెను. దాసీదాసము కూడ కానరాలేదు. మహాసత్త్వుడు భార్యతో "భద్రే, దాన మెప్పటి కిని ఆపుటకు వీలులేదు. ఇ ల్లంతయు గాలించి, ఏ దయిన బయటికి దీయవలెను" అని పలికెను.

అప్పుడు గడ్డికోయువా డొకడు కొడవలి, కావడి, త్రాడు ద్వారము లోపల బడవేసి పరుగిడెను. శ్రేష్ఠిభార్య ఆవ_స్తువులు తీసికొని వచ్చి "స్వామీ, ఇవి తప్ప మరి యేవియును కానరావు" అని చెప్పెను. "భద్రే, ఇంతకు పూర్వము నేను గడ్డి కోసియెరుగను. కాని నేడు గడ్డి కోసి తెచ్చి, అమ్మి దానధర్మములు చేయుదును" అని మహాసత్త్వుడు పలికి, దానభంగ మగు నను భయముచే కొడవలి, కావడి, త్రాడు తీసికొని, నగరము వెలువడి, గడ్డి మొలుచు ప్రదేశమునకు బోయెను. అక్కడ గడ్డి కోసి, రెండుమోపులు కట్టి, కావడిలో పెట్టి, ఒకటి అమ్మి తనకును, రెండవది అమ్మి ధర్మముచేయుటకును సంకల్పించి, నగర ద్వారముకడ గడ్డి విక్రయింపగా వచ్చిన వెలలో ఒకభాగము యాచ కుల కిచ్చెను. బిచ్చగాండ్రు హెచ్చుగా నుండిరి. మాకుకూడ ఇండు అని వారు కేకలు వేయగా నతడు మిగిలిన డబ్బుకూడ దానము చేసెను. ఆనాడు భార్యాభ_ర్తలు భోజనము చేయలేదు.

ఈవిధముగా ఆరురోజులు గడచినవి. ఏడవనాడు అతడు గడ్డి తెచ్చి నప్పుడు ఆహారము లేకుండుటచేతను, అతిసుకుమారు డగుటవలనను, నె_త్తి కెండ తగులుటచేతను అతనికన్నులు తిరిగినవి. ఆతనికి శోష వచ్చి, గడ్డిమోపు క్రిందబడినది. ఆవ్యాపారము గమనించుచు తిరుగు చున్న శక్రుడు ఆకసమున నిలిచి తొలిగాథ పలికెను:

దానము లోపంగుచుండ నీధనము కరిగె;
దానధర్మము లికముందు మాని నీవు
స్థిరముగా నున్న సంపద మరల వచ్చు.

మహాసత్త్వు డాయనవాక్కులు విని "నీ వెవరు?" అని యడిగెను.

"నేను శక్రుడను."

"శక్రుడు స్వయముగా దానధర్మములు చేసి, శీలము పరిపాలించి ఉపవాసవ్రత మనుష్ఠించి, సప్తవ్రతములు పూర్తిచేసి, శక్రత్వము పొందినాడు. కాని నీవో నిజప్రభావముచే దానమునకు విఘ్నము ఘటించినావు. ఇది అనార్యకృత్యము" అని మహాసత్త్వు డీ మూడు గాథలు పలికెను:

ఆర్యుండు దారిద్ర్యమందు ననార్య
కార్యంబు చేయుటకాదు ధర్మమ్మ
భోగార్థమై ధనత్యాగంబు మాన
నిలువ దాసంపద నిశ్చయమ్మగను.

ఎట్టి మార్గము వెంట నేగునో రథము
అత్రోవ రెండవయరదంబు చనును.
దేవరాజా, ప్రాతతెరువున సాగు
చుండు దానాపగ ఓసహస్రాక్ష!

ఒసగుచునుందు నా కున్నంతవరకు:
ఏమియు లేనప్డె దే మీయగలను?
ఇత్తును వాసవా, ఈస్థితియందు
తగదు ప్రమాదమ్మ దానమ్మనందు.

శక్రు డాయనను నివారింపజాలక "దాన మెందులకిచ్చుచున్నావు?" అని యడిగెను.

"నాకు శక్రత్వముమీద కాని, బ్రహ్మత్వముమీద కాని ఇచ్ఛ లేదు. సర్వజ్ఞత్వముకొరకు ప్రార్థించుచు దానము చేయుచున్నాను."

ఆమాటలు విని శక్రుడు ప్రసన్నుడై ఆతని వీపుమీద హస్తముంచి నిమిరెను. భోజనము చేసినవాని శరీరమువలె బోధిసత్త్వుని శరీర మాక్షణములో పుష్టినొందెను. శక్రునిప్రభావముచే అతనికి పూర్వైశ్వర్యము మరల లభించెను. ఆతనికి శక్రుడు విశేషధన మొసగి దానధర్మములు చేయ ప్రోత్సహించి, నిజస్థానమునకు జనెను. పోవునపుడు "మహాశ్రేష్ఠీ, నీవు ప్రతిదినము పన్నెండు లక్షలు దానము చేయుచుండు" మని చెప్పెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున శ్రేష్ఠిభార్య రాహులమాత; విసహ్యుడు నేనే.

## 341 కిన్నరీ జాతకము

ఈ జాతకకథ విస్తృతరూపమున కుణాలజాతకమున (536) వచ్చును.

## 342 వానర జాతకము

శాస్త వేళువనమున నుండునపుడు దేవదత్తుడు తలపెట్టిన వధను గూర్చి చెప్పినది. వర్తమానకథ పూర్వమే (57, 208) వచ్చినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండ బోధిసత్త్వుడు కోతికడుపున బుట్టి, పెరిగి గంగాతటమున నివసించు చుండెను.

ఆకాలమున గంగలో నివసించు ఆడ మొసలికి బోధిసత్త్వుని గుండె మాంసముమీద కోరికకలిగి, భర్తతో చెప్పినది. మగ మొసలి వానరము ను నీటిలో ముంచి చంపి, గుండెకాయ భార్య కీయవచ్చు నని తలచి బోధిసత్త్వునితో "మిత్రమా, రా, దీవిలో మామిడిపండ్లు తిని వెళ్ళవచ్చును" అనెను.

"నే నెట్లు పోగలను?"

"నిన్ను నావీపుమీద గూరుచుండ బెట్టుకొని తీసికొనిపోవుదును."

మకరముమనస్సు తెలియక వానర మెగిరి దానివీపుపై గూరు చుండెను. కొంచెము దూరము పోయి మొసలి "నీటిలో మునుగ నారంభించెను. "న న్నేల నీటిలో ముంచుచున్నా?" వని మర్కట మడిగెను. "నిన్ను చంపి, నీగుండె నా భార్య కిత్తును." నీవు మూర్ఖుడవు. నాగుండె రొమ్ములో నుండుననుకొంటివా?" "అయిన, దాని నెచట నుంచితివి?" "ఆమేడిచెట్టుమీద వ్రేలాడుచున్నది యేదో కన బడుచున్నదా?"

"కనబడుచున్నది. దానిని నా కిత్తువా?"

"ఆ, ఇత్తును."

మకరము జడబుద్ధియగుటవలన వానరమును గొనిపోయి మేడిచెట్టు క్రింద దింపెను. బోధిసత్త్వుడు దానివీపుమీదినుండియే యెగిరి, చెట్టెక్కి ఈగాథలు పలికెను:

సలిలమం దుండి మకరమా, స్థలముపైకి
అరుగుదెంచితి, జరిగిన దాత్మరక్ష!
క్రమ్మర నీకు నే వశంగతుడ గాను.

ఆవలం గంగ కున్నట్టి ఆమ్రపనస
జంబువులు వద్దు చాలు నుదుంబరములు;
సంఘటిల్లిన విషయమ్ము సత్వరముగ
తెలిసికొనలేనివాడు వైరులకు జిక్కి
భూరితాపము నావల పొందుచుండు.

సంఘటిల్లిన విషయమ్ము సత్వరముగ
తెలిసికొనజాలువాడు వైరులకు జిక్కి
తప్పుకొని యెట్లొ, పొందడు తాప మవ.

ఈవిధముగా లౌకికకృత్యముల సఫలతాకారణము వివరించి మరల వనఖండమునకు బోయెను.

శాస్త్ర ఇట్లు ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మొసలి దేవదత్తుడు; వానరము నేనే.

## 343 కుంతినీ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు కోసలనరేశుని మందిరమున నుండు క్రౌంచ పక్షిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆపిట్ట రాజులేఖలు గొనిపోయెడిది. దానికి రెండు చిన్నబిడ్డలు కలరు. రాజు సందేశమిచ్చి దానిని వేరొకరాజుకడ కంపెను. అది వెడలి

పోయినపిదప రాజకులమున బిడ్డలు దానిబిడ్డలను గొంతులు పిసికి చంపివేసిరి. అది మరలివచ్చి చూచి "నాబిడలను చంపినవా రెవరు?" అని ప్రశ్నవేసెను.

"ఫలాని ఫలాని వారు."

ఆకాలమున రాజకులమున పెంపుడుపులి బోనులో నుండెను. అది చాలక్రూరస్వభావము కలది. వారు పులిని చూడబోయిరి. పక్షికూడ వారి వెనువెంట నరుగుచు "వీరు నాబిడ్డలను హతమార్చినారు; వీరిని కూడ అట్లే హతమార్చెదను" అని తలపోసి పంజరముకడకు బోయిన బిడ్డలను పులిమీదికి నెట్టెను. తోడనే పెద్దపులి వారిని చీల్చివేసెను. అంతట పక్షి తనమనోరథము సిద్ధించిన దని యెంచి, హిమాలయమున కెగిరిపోయెను.

ఈ విషయమై ధర్మసభలో చర్చ జరుగుచుండగా శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ ఈపక్షి ఇట్లే చేసెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బోధిసత్త్వుడు ధర్మపాలనము చేయుచుండ ఆయనయింట క్రౌంచపక్షి యుండెను. అది సందేశములను గొనిపోవు నది. వ్యాఘ్రముచే బిడ్డలను జంపించిన తరువాత "నే నిచట నుండజాలను. పోవుదును. రాజుతో జెప్పకుండ బోవుదును" అని యోచించి, బుద్ధి మారిన పిమ్మట "రాజుతో జెప్పి పోవుదును" అని తలచి, రాజు సన్నిధికి జని, ఒకప్రక్కన నిలుచుండి "స్వామీ, మీప్రమాదమువలన నాబిడ్డలు చనిపోయిరి. నేను క్రోధవివశనై నీబిడ్డలను చంపించితిని. ఇక నే నిచట నుండరాదు" అని తొలిగాథ పలికెను:

> నీయింటిలో నాకు నిత్యాదరమ్ము;
> గ్రహియించినావు నాకల తెరం గిపుడు
> నే నింక రాజేంద్ర, నిష్క్రమించెదను.

రాజు రెండవగాథ పలికెను:

> దుష్కృతికి మారుదుష్కర్మ జరిగె
> నని గ్రహించినవాని యంతరంగమున
> శమియించు క్రోధంబు! చనకు, క్రౌంచంబ!

"ఆ, ఇత్తును."

మకరము జడబుద్ధియగుటవలన వానరమును గొనిపోయి మేడిచెట్టు క్రింద దింపెను. బోధిసత్త్వుడు దానివీపుమీదినుండియే యెగిరి, చెట్టెక్కి ఈగాథలు పలికెను:

సలిలమం దుండి మకరమా, స్థలముపైకి
అరుగుదెంచితి, జరిగిన దాత్మరక్ష!
క్రమ్మర న్నీకు నే వశంగతుడ కాను.

ఆవలం గంగ కున్నట్టి ఆమ్రపనస
జంబువులు వద్దు చాలు నుదుంబరములు;
సంఘటిల్లిన విషయమ్ము సత్వరముగ
తెలిసికొనలేనివాడు వైరులకు జిక్కి
భూరితాపము నావల పొందుచుండు.

సంఘటిల్లిన విషయమ్ము సత్వరముగ
తెలిసికొనజాలువాడు వైరులకు జిక్కి
తప్పకొని యెట్లొ, పొందడు తాప మవల.

ఈవిధముగా లౌకికకృత్యముల సఫలతాకారణము వివరించి మరల వనఖండమునకు బోయెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున మొసలి దేవదత్తుడు; వానరము నేనే.

## 343 కుంతినీ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసలనరేశుని మందిరమున నుండు క్రౌంచ పక్షిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆపిట్ట రాజులేఖలు గొనిపోయెడిది. దానికి రెండు చిన్నబిడ్డలు కలరు. రాజు సందేశమిచ్చి దానిని వేరొకరాజుకడ కంపెను. అది వెడలి

పోయినపిదప రాజకులమున బిడ్డలు దానిబిడ్డలను గొంతులు పిసికి చంపివేసిరి. అది మరలివచ్చి చూచి "నాబిడ్డలను చంపినవా రెవరు?" అని ప్రశ్న వేసెను.

"ఫలాని ఫలాని వారు."

ఆకాలమున రాజకులమున పెంపుడుపులి బోనులో నుండెను అది చాలక్రూరస్వభావము కలది. వారు పులిని చూడబోయిరి. పక్షికూడ వారి వెనువెంట నరుగుచు "వీరు నాబిడ్డలను హతమార్చినారు; వీరిని కూడ అట్లే హతమార్చెదను" అని తలపోసి పంజరముకడకు బోయిన బిడ్డలను పులిమీదికి నెట్టెను. తోడనే పెద్దపులి వారిని చీల్చివేసెను. అంతట పక్షి తనమనోరథము సిద్ధించిన దని యెంచి, హిమాలయమున కెగిరిపోయెను.

ఈ విషయమై ధర్మసభలో చర్చ జరుగుచుండగా శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ ఈపక్షి ఇట్లే చేసెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బోధిసత్త్వుడు ధర్మపాలనము చేయుచుండ ఆయనయింట క్రౌంచపక్షి యుండెను. అది సందేశములను గొనిపోవునది. వ్యాఘ్రముచే బిడ్డలను జంపించిన తరువాత "నే నిచట నుండజాలను. పోవుదును. రాజుతో జెప్పకుండ బోవుదును" అని యోచించి, బుద్ధి మారిన పిమ్మట "రాజుతో జెప్పి పోవుదును" అని తలచి, రాజు సన్నిధికి జని, ఒకప్రక్కన నిలుచుండి "స్వామీ, మీప్రమాదమువలన నాబిడ్డలు చనిపోయిరి. నేను క్రోధవివశనై నీబిడ్డలను చంపించితిని. ఇక నే నిచట నుండరాదు" అని తొలిగాథ పలికెను:

నీయింటిలో నాకు నిత్యాదరమ్ము;
గ్రహియించినావు నాకల తెరంగిపుడు
నే నింక రాజేంద్ర, నిష్క్రమించెదను.

రాజు రెండవగాథ పలికెను:

దుష్కృతికిఁ మారుదుష్కర్మ జరిగె
నని గ్రహించినవాని యంతరంగమున
శమియించు క్రోధంబుః చనకు, క్రౌంచంబ!

విని క్రౌంచపక్షి మూడవగాథ పలికెను:

దోషి యగువానికిని ప్రతిదోషి యైన,
మనుజునకు సంఘటిల్లదు మైత్రి మరల;
హృదయ మాజ్ఞ యొసంగ దే నిచట నుండ,
కాన రాజేంద్ర, తప్పదు కదలిపోదు.

రాజు నాలుగవగాథ పలికెను:

మరల మూర్ఖులు కలిసెడిమాట కల్ల!
కాని ధీరులు క్రమ్మర కలియుచుంద్రు;
కాన మమ్ముల విడువకు క్రౌంచపక్షి!

ఇట్లన్నను క్రౌంచపక్షి "స్వామీ, నే నిచట నుండజాల" నని రాజుకు ప్రణామము చేసి, ఎగిరి హిమాలయమునకు వెడలిపోయెను.

శాస్త్ర ఈధర్మోపదేశము చేసి, జాతకములను సరిపోల్చెను. ఆకాలమున క్రౌంచపక్షి ఈ క్రౌంచపక్షియే; వారాణసీరాజు నేనే.

## 344 అంబ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆమ్రరక్షకస్థవిరుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆతడు వార్ధకమున ప్రవ్రజించి జేతవనసీమనున్న మామిడితోటలో కుటీరము నిర్మించుకొని తోట కాచుచు, నేలపై రాలినపండ్లు భుజించుచు తనపరిచితులకుగూడ నిచ్చుచుండెను. ఆయన భిక్షాటనమునకు బోయినపుడు కొందరు పండ్లు రాలగొట్టి అపహరించుచుండెడివారు. ఒకనాడు నలుగురు శ్రేష్ఠులపుత్రికలు అచిరవతీనదిలో స్నానము చేసి, ఇటునటు దిరుగుచు ఆమామిడితోటలోనికి బోయిరి. వృద్ధుడు వచ్చి వారిని జూచి "మీరు మామిడిపండ్లు తిన్నారు" అన్నారు.

"భన్తే, మేము ఇప్పుడే వచ్చినాము. మామిడిపండ్లు మేము ముట్టుకొనలేదు."

"అట్లగుచో ప్రమాణము చేయుడు."

"భన్తే, ప్రమాణము చేయుదుము."

ఆతడు వారిచే ప్రమాణములు చేయించి లజ్జితలను జేసి పంపెను. ఈవిషయము విని భిక్షువులు ధర్మసభలో చర్చించుచుండగా శాస్త అచ్చటికి బోయి, విషయము గ్రహించి, "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ ఆమ్రవనపాలకుడుగా నుండి శ్రేష్ఠిపుత్రికలచేత ప్రమాణము చేయించి సిగ్గుపరచి పంపినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు శక్రత్వము పొందెను. ఆసమయమున దుష్టజటాధారి యొకడు వారాణసికి సమీపములో నదియొద్దున మామిడితోటలో పర్ణకుటీరము నిర్మించుకొని, తోట కావలికాయుచుండెను. రాలిపడిన పండ్లు తినుచు, సంబంధముకలవారికి ఫలము లిచ్చుచు, నానావిధ ముల మిథ్యాజీవితము గడపుచుండెను.

దేవలోకమునుండి శక్రుడు మానవలోకమున "తల్లిదండ్రుల కెవరు సేవచేయుచున్నారు, ఎవరు పెద్దలయెడ ఆదరము చూపుచున్నారు, ఎవరు దానధర్మములు చేయుచున్నారు, ఎవరు శీలరక్షణము చేయు చున్నారు, ఎవరు ఉపవాసవ్రతము నెరపుచున్నారు, ఎవరు ప్రవ్రజించి శ్రమణధర్మము పాలించుచున్నారు, ఎవరు దురాచారులు" అని పరికిం చుచు, ఆమ్రపాలకు డగుజటాధారిని జూచెను. "ఈదుష్టుడు యోగా భ్యాసాదిశ్రమణధర్మములను, విడిచి ఆమ్రవనపాలన చేయుచున్నాడు. వీనిని బెదరించెదను" అని భావించి, వాడు భిక్షార్థము గ్రామములోనికి బోయినపుడు నిజప్రభావముచే మామిడిపండ్లను చోరులు పడవేసిరా యన్నట్లు రాల్చి వేసెను.

ఆసమయమున వారాణసిలోని శ్రేష్ఠికొమార్తెలు నలుగురు ఆమ్ర వనమున ప్రవేశించిరి. దుష్టతపస్వి వారిని గాంచి "మీరే మామిడి

పండ్లు హరించినా” రని అడ్డగించెను. “భన్తే, మే మిప్పుడే వచ్చినాము. నీపండ్లు తినలేదు” అని వారు చెప్పిరి. “అట్లయిన ప్రమాణము చేయుడు.” “ప్రమాణము చేసిన పిమ్మట పోవచ్చునా?” “ఆ, పోవచ్చును.” “భన్తే, మంచిది” అని పెద్దది ప్రమాణము చేయుచు తొలిగాథ పలికెను:

నీసహకారముల్ తీసిన యామె
తెలుపు వెండ్రుకలను నలుపు చేయుచును
చిమ్మటతో లాగి శ్వేతకేశములు
పతితోన బాధలు పడుచుండుగాక!

నీ వొకప్రక్క నిలుచుండుము అని తపస్వి రెండవపిల్లచేత ఒట్టు పెట్టించెను. ఆమె రెండవగాథ పలికెను:

నీసహకారముల్ తీసిన యామె
కిరువది, పాతిక, యిరువది తొమ్మి
దేండ్ల కావల లభియించును భర్త!

ఆమె ఒకప్రక్కన నిలిచిన పిదప మూడవ పిల్ల మూడవ గాథ పలికెను:

నీ సహకారముల్ తీసిన యత్తి
యభిసారికకు దూరమందు సంకేత
మొసగిన పతి చిక్కకుండును గాక!

ఆమెచేత శపథము చేయించి ఒకప్రక్క నిలుపగా, నాలుగవ పిల్ల నాలుగవ గాథ పలికెను.

నీసహకారముల్ తీసిన యామె
ధరియించి భూషలు, దాల్చి యంబరము
తాల్చి మాలికలు, చందనచర్చ చేసి,
పడకపై నొంటిగా పవళించుగాక!

“మీరు పెద్దపెద్ద ప్రమాణములు చేసినారు. అన్యు లెవరో ఆమ్ర ఫలములు తినియుందురు. మీ రిక వెళ్ళవచ్చును” అని తపస్వి వారిని విడిచిపుచ్చెను.

శక్రుడు భైరవరూపమున అతనికి గానబడి, అక్కడనుండి కుటిల తాపసుని పరుగెత్తించెను.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున దుష్టతాపసుడు ఈవృద్ధు; శ్రేష్ఠిపుత్రికలు వీరే; దేవరాజు శక్రుడు నేనే.

## 345 గజకుంభ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఒకానొక అలసభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

శ్రావస్తి నివాసి యగు ఆ కులపుత్రుడు బుద్ధశాసనమున మనః పూర్వకముగా ప్రవ్రజించియు శ్రద్ధలేనివాడు బుద్ధవచనపరనమునను, జిజ్ఞాసలోను, సమాలోచలోను, కర్తవ్యపాలనలోను, సీమ కావల నుండెడివాడు. అతడు నీవరణ (చిత్తముల) – అభిభూతుడు; అన్నిటను అలసుడు. ఈవిషయములు ధర్మసభలో భిక్షువులు చర్చించుచుండగా శాస్త అచటి కరుదెంచి, విషయము తెలిసికొని "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ అలసుడే" అని పూర్వ జన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధి సత్త్వు డాయన కమాత్యరత్నముగా నుండెను. వారాణసీప్రభువు ఆల స్యము చేయుస్వభావము కలవాడు. రాజును ప్రబోధించుటకై నిదర్శ నముకొరకు బోధిసత్త్వుడు వెదకుచుండెను.

ఒకనాడు రాజు ఉద్యానమునకు బోయి అమాత్యపరివృతుడయి అచట విచరించుచుండగా గజకుంభ మనుకీటకము కానబడెను. అది దినమంతయు కదలుచున్నను ఒకటిరెండు అంగుళములు పోగలదు.

రాజుదానిని జూచి బోధిసత్త్వునితో "మిత్రమా, ఇది యేమి?" అని యడిగెను.

"మహారాజా, ఇది గజకుంభ మను కీటకము. దిన మంతయు కదలి నను ఒకటి రెండు అంగుళములదూరము పోవును" అని బోధిసత్త్వుడు, "ఓగజకుంభమా, నీ గమనము మహామందమే. ఈవనమున దవానలము చెలరేగినచో ఏమి చేయగలవు?" అని ఈ తొలిగాథ పలికెను:

మందపరాక్రముడవు నీ,
విందు దవానలము రేగ, నెటు పోయెదవో;

ఇది విని గజకుంభము రెండవ గాథ పలికెను.

ధరణీబలంబులు, తరుకోటరములు
మెండుగా నున్నవి; మృతియుండ బోవ
దనలంబు స్పృశియింపనందాక వాని.

విని భోధిసత్త్వుడు మిగిలిన గాథలు పలికెను :

అలసింపగ దగు కాలాన జవము
వేగమ్ము తగినట్టివేళ మాంద్యమ్ము
పలిపెడివారల సంపద నలుగు
అడుగుల క్రింది యెండాకులు వోలె.

అలసింపగ దగునపుడు మాంద్యమ్ము
వేగిరం పడ దగువేళ వేగమ్ము
అవలంబనము చేయు నతని యర్థంబు
పరిపూర్ణమగు శుక్లపక్షేందువోలె.

బోధిసత్త్వునివాక్కులు విని నాటినుండి ఆలస్యాచరణము విడనాడెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సమాపించెను. ఆకాలమున గజకుంభము ఈ మందభిక్షువు; పండితామాత్యుడు నేనే.

## 346 కేశవ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు విశ్వాసభోజనమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అనాథపిండికుని ఇంట అనుదినము 500 మంది భిక్షువులకు భోజన సదుపాయ ముండెను. భిక్షువుల ఇష్టాపూర్తి ప్రవాహము, కాషాయ వస్త్ర కాంతి, ఋషిజన వాయువు ఆయింట దినదినము వర్తిల్లు చుండెను.

ఒకనాడు రాజు నగరప్రదక్షిణము చేయునపుడు శ్రేష్ఠియింట భిక్షుసంఘమును చూచి, నేనుకూడ ఆర్యసంఘమునకు ప్రతిదినము భోజనవసతి చేయుదు ననితలపోసి విహారమునకు జని, శాస్తకు ప్రణామము చేసి 500 మంది భిక్షువులకు దైనందిన భోజన సదుపాయ నిశ్చయము తెలియచేసెను. నాటినుండి రాజసౌధమున ఆప్రకారముగా జరుగుచుండెను. మూడుసంవత్సరములనాటి ప్రాతశాలిధాన్య భోజనము పెట్టెడివారు. కాని, శ్రద్ధతో ప్రీతితో వడ్డించువారు లేరు. రాజోద్యోగులు వడ్డనలు చేయుచుండిరి. భిక్షువులు కూరుచుండి బహువిధ ఖాద్యములను తినుట కిచ్చగించెడివారు కారు; రుచ్యపదార్థములను తమతమ సేవకుల ఇండ్లకు బంపి వారి రుచీపచీ లేని ఖాద్యవస్తువులను తెప్పించి వడ్డన చేయుచుండిరి. ఒకనాడు రాజుకొరకు ఫలములు విశేషముగా వచ్చినవి. భిక్షుసంఘమున కొసగు డని రాజు పలికెను. దానశాలలోనికి బోయి చూడగా భిక్షువొక్కడును కానరాలేదు. ఉద్యోగు లావిషయము రాజునకు విన్నవించిరి.

"వారు వచ్చువేళ కాలేదా ?" అని రాజు ప్రశ్నించెను.

"అయినది. కాని భిక్షువులు ఇచ్చటనుండి భోజనము కొనిపోయి తమతమ విశ్వాసిసేవకులకు ఈ ఆహార మిచ్చి రుచిపచి లేని వారిఆహారము స్వీకరించుచున్నారు." రాజు తనలో "నాభోజనము సమృద్ధిగా నుండును. ఏల వీరు దీనిని గ్రహింపక అన్యభోజనము స్వీకరించుచున్నారు!" అనుకొని శాస్తకడకు బోయి ప్రణామము చేసి ఈ విషయ మడిగెను.

శాస్త ఇట్లు చెప్పెను. "మహారాజా, భోజనవిషయమున విశ్వాస

మనునది ప్రధానము. మీయింట విశ్వాసముతో ప్రీతితో భిక్ష పెట్టెడివారు లేకుండుటచే భిక్షువులు భోజనములు కొనిపోయి విశ్వాస పాత్రు లగు వారియిండ్ల భుజించుచుండిరి. మహారాజా, విశ్వాసముతో సమానమైనది మరి లేదు. శ్రద్ధ లేని యాతడు ఇచ్చు చతుర్విధ మధురపదార్థములు విశ్వాసపాత్రు డగువాడు ఇచ్చు తక్రముతో సమానము కావు. పురాణపండితులు వ్యాధిగ్రస్తులైన పిదప రాజు ఐదు వైద్యకులములవారి ఔషధము లిప్పించినను స్వస్థులు కాలేదు; విశ్వాసజనులకడకు బోయి ఉప్పువేయని శ్యామాకనీవారములను, యవాగువను నీటిలో ఉడికించిన కూరలు తిని స్వాస్థ్యము పొందినారు.”

రాజు ప్రార్థించిన పిదప శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రమున బ్రాహ్మణకులమునందు పుట్టి, కల్పకుమారు డనుపేర పెరిగి పెద్దవాడయి, తక్షశిలకు బోయి, సమస్తవిద్యలు నేర్చి, అనంతరము ప్రవ్రజించెను. ఆకాలమున కేశవనామక తపస్వి అయిదువందుల తాపసులకు శాస్త యయి హిమాలయమున నివసించుచుండెను. బోధిసత్త్వు డాయనకడకు బోయి, ప్రధాన శిష్యు డయ్యెను. కేశవతపస్వి యాశయము స్నిగ్ధత, మైత్రి. వారికి పరస్పరవిశ్వాసము కలిగెను.

కేశవతపస్వి శిష్యులతో గూడి ఉప్పుపులుసుకొరకు గ్రామమునకు వచ్చి క్రమముగా వారాణసి చేరి రాజోద్యానమున విడిసి, మరునాడు భిక్షార్థము నగరములోనికి బోయి, రాజద్వారము చేరెను. రాజు వారిని జూచి, లోనికి గొనిపోయి మేడమీద భోజనము పెట్టించి ఉద్యానమున నుండునట్లు మాట తీసికొనెను. వర్షాకాల మయిపంతనే కేశవతపస్వి రాజుకడ సెలవువేడెను. “భన్తే, తమరు వృద్ధులయినారు. మాకడనే యుండుడు. తరుణతపస్వులను హిమాలయమునకు బంపివేయుడు” అని రాజు చెప్పెను.

మంచి దని కేశవతపస్వి ప్రధానశిష్యుని వెంట తక్కినవారిని

హిమాలయమునకు బంపి తా నొక్కఁడే అచ్చట నిలిచెను. కల్ప కుమారుడు తాపసులను వెంటబెట్టుకొని హిమాలయమున కేగెను. కల్పుడు లేకుండుటచే కేశవు డుద్విగ్నచిత్తు డై అతనిని జూడవలె నను వాంఛచే నిద్రకోలుపోయెను. అందువలన అన్నము సరిగా జీర్ణమగుట మానెను. రక్తగ్రహణి పట్టుకొనెను. బాధ మిక్కుటమయ్యెను

రాజు అయిదుగురు వైద్యుల పరివారముతో ఆయనకు ఉపచారము చేయించెను. రోగము శాంతింపలేదు. కేశవుడు రాజుతో "ఏమి కోరుచున్నారు? నా మరణమా, ఆరోగ్యమా?" అనెను. "భన్తే, ఆరోగ్యము." "అయిన నన్ను హిమాలయమునకు బంపుడు." మంచిదని రాజు నారదుడు అను అమాత్యుని పిలిపించి, "నారదా, భదంతుని తీసికొని వనచరులవెంట హిమాలయమునకు బొమ్ము" అని యానతిచ్చెను.

నారదు డాయన నచట జేర్చి మరలివచ్చెను. కల్పుని జూడగానే కేశవుని మనోరోగము శాంతించెను. కల్పుడు ఉప్పు లేకుండ, తాళింపు లేకుండ, నీటిలో నానిన పర్ణములతోపాటు శ్యామాక, నీవాగ యవాగువు లిచ్చెను. వెంటనే రక్తగ్రహణి కట్టిపోయెను.

కేశవతపస్వి సమాచారము తెలిసికొని రమ్మని రాజు నారదు నంపెను. ఆతడు పోయి "భన్తే, వారాణసీన రేశుడు వైద్యపంచక పరివారముతో శుశ్రూష చేయించినను మీ కారోగ్యము కలుగలేదు. కల్పకతపస్వి మీ కెట్లు సపర్యలు చేయుచున్నాడు?" అని యడిగి తొలిగాథ పలికెను :

కోరిక లన్నియు పూరింపజాలు
క్షితిపతి విడనాడి కేశవ, కల్ప
దేవు నాశ్రమమున తిరిగెద వెట్లని

విని కేశవుడు ద్వితీయగాథ పలికెను :

ఇచ్చట రమణీయవృక్షాలు కలవు;
కల్పుని భాషితక్రమము బాధముగ
నారదా హర్షియించె నా మానసమును?

ఇట్లు పలికి, "కల్పుడు నాకు ఉప్పు పోపు వేయక, కేవలము నీటిలో

నానవేసిన పర్ణములతో శ్యామాకనీవార యవాగువు ఇచ్చి నావ్యాధిని ఉపశమింపజేసినాడు" అని చెప్పెను.

విని నారదుడు మూడవగాథ పలికెను :

శాల్యన్న సహితమా స్వచ్ఛమాంసంబు
పూర్వము తింటి, విప్పుడు చప్పనైన
చారులు, నివ్వారి సరిపడు టెట్లుని?

విని కేశవుడు నాలుగవ గాథ పలికెను :

స్వాదువు కాని అస్వాదువు కాని
కొలదిగా నున్నను గొప్పగా నున్న
నమ్మకమా భోజనమ్మ యుక్తమ్ము:
ప్రముఖరసమ్మ విశ్వాసమ్మ సుమ్మ.

నారదుడు విని రాజుసన్నిధికి జని, కేశవుడు చెప్పిన వాక్కులు పలికెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; నారదుడు సారిపుత్రుడు; కేశవుడు ఒకమహాబ్రహ్మ; కల్పుడు నేనే.

## 347 అయకూట జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లోకోపకారమును గూర్చి చెప్పినది. వర్తమానకథ మహాకణ్హాజాతకమున (469) వచ్చును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఆయనపట్టమహిషి కడుపున బుట్టి పెరిగి పెద్దవాడయి, విద్యలు నేర్చి తండ్రియనంతరము ధర్మముగా న్యాయముగా రాజ్య పాలనము చేయుచుండెను.

ఆసమయమున జనులు దేవపూజకు లగుటచే పొట్టేళ్ళను మేకలను బలియిచ్చుచుండిరి. ప్రాణిహింసచేయరాదని బోధిసత్త్వుడు చాటింపు చేయించెను. తమకు బలి లభింపకుండుటచే యక్షులు బోధిసత్త్వుని యెడ పగ బూనిరి. వారు హిమాలయమున సభ చేసి, బోధిసత్త్వుని సంహరించుటకై యక్షు నొకని బంపిరి. వాడు పడవ తెడ్డు పరిమాణము గల ఇనుపముక్క తీసికొని, అర్ధరాత్రమునకు ముందే బోధిసత్త్వుని శయ్యతలవైపున నిలిచి దానితో కొట్టి చంపదలంచెను. అప్పుడు శక్రునిపీఠము వేడియెక్కెను. ఆయన యోచించి విషయము గ్రహించి వజ్రాయుధముతో వచ్చి యక్షుని పైభాగమున నిలిచియుండెను. బోధిసత్త్వుడు యక్షుని గాంచి, వాడు తనను రక్షింప నిలిచెనో వధింప నిలిచెనో తెలిసికొనుటకై ఈ తొలిగాథ పలికెను :

ఆయసకూటంబు హస్తాన దాల్చి
నీ వాకసమ్మున నిలిచియున్నావు
రక్షించు కొరకొ? మారణము చేయుటకొ?

బోధిసత్త్వునకు యక్షుడు కనబడుచుండెను, కాని శక్రుడు కనబడుట లేదు. శక్రునివలని భయముచే యక్షుడు బోధిసత్త్వుని ప్రహరింపజాల కుండెను. వాడు బోధిసత్త్వునివాక్కులు విని "మహారాజా, నే నీరక్షణకై రాలేదు. కాలుచున్న ఈయినుపకూటముతో కొట్టుటకై వచ్చితిని. శక్రునివలని భయముచే నిన్ను ప్రహరింపలేకున్నాను" అను విషయమును ప్రకటించుచు ఈ రెండవ గాథ పలికెను:

రాక్షసదూతను రాజేంద్ర, నేను:
భవదీయవధకునై పంపిరి నన్ను
ఇంద్రుండు నిన్ను రక్షించుచునుంట
చేయలేనైతి నీశిరసు బ్రద్దలుగ.

విని, బోధిసత్త్వుడు మిగిలిన రెండు గాథలు పలికెను:

రక్షించుచో దేవరాజు న, న్నిపుడు
పలుపుగాత పిశాచసంఘంబు ఘోష!
ఈప్రజవల్ల నా కేభీతి లేదు.

క్రందనం బొనరించుగాక కుంభాండ
పశుపిశాచము లెల్ల: ప్రబలనాదంబు
సలిపియు, యుద్ధదక్షత లేనివాడు.

శక్రుడు యక్షుని పారద్రోలి, మహాసత్త్వునితో "మహారాజా, భయము లేదు. నేటినుండి మిమ్ము రక్షించుభారము నాపై నున్నది" అని చెప్పి, నిజస్థానమునకు జనెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆసమయమున శక్రుడు అనురుద్ధుడు; వారాణసీరాజు నేనే.

## 348 అరణ్య జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ప్రౌఢకుమారియెడల ఆసక్తిని గూర్చి చెప్పినది. వర్తమానకథ క్షుద్రనారద కస్సపజాతకమున (477) వచ్చును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి, పెద్దవాడయి, తక్షశిలలో విద్యలు నేర్చి భార్య పోయినపిమ్మట పుత్రసహితుడై ప్రవ్రజించెను. ఆయన హిమాలయమున నుండునపుడు పుత్రుని ఆశ్రమమున నుంచి, ఫలమూలములకై పోవుచుండును.

ఆదినములలో చోరులు సీమాంతగ్రామములు దోపిడి చేసి, జనులను చెరపట్టుచుండిరి. వారిలోనుండి ఒకానొక కుమారిక పరుగెత్తి వచ్చి ఆశ్రమమును జేరి, తాపసకుమారు నాకర్షించి, ఆతని శీలభ్రంశము చేసి, రా పోవుద మనెను. "మానాయనగారిని రానిమ్ము. ఆయన యనుమతి తీసికొని పోవుదము." "అట్లయిన ఆనతిగొని రమ్ము" అని యామె బయలువెడలి, త్రోవలో గూరుచుండెను.

తండ్రి వచ్చినతరువాత కుమారుడీ తొలిగాథ పలికెను:

అడవిలోనుండి గ్రామాని కరిగి నేను
ఎట్టి శీలము, వ్రతము కలట్టివాని
తోడ సాంగత్య మొనరింపగూడు తండ్రి!

తండ్రి ఉపదేశించుచు ఈ మూడు గాథలు పలికెను:

నీవు నెవ్వని మీద, నీ మీద నెవని
కమరునో విశ్వాస, మాలించు నీవు
పలుకులు, పలుకుల తప్పులు పట్ట డెవ్వండు
అతనితో సాంగత్య మాట యుక్తంబు.

ఎవడు త్రికరణశుద్ధిగా నెట్టిపాప
కార్య మొనరింప, డొరనుకరణి నిన్ను
గాంచు, నాతనితోడ సాంగత్య మీవు
చేయవచ్చును గ్రామంబు చేరుపిదప.

పసుపువలె నస్థిరుడు, కపిభంగి చంచ
లాత్ముడు, విరాగరాగంబు లంతలోనె
చెందుచుండు వాడు లభియించినను నీవు
వానితోడి సాంగత్యము వలదు తండ్రి.

విని, కుమారు డాగి "నాయనా, ఇట్టిగుణములు కలవాడు నా కెక్కడ లభించును. నేను వెళ్ళను. మీకడనే యుందును" అనెను. తండ్రి కుమారునకు యోగవిధి చెప్పెను. ఉభయులును ధ్యానమగ్నులై బ్రహ్మలోకపరాయణు లయిరి.

శాస్త్ర ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున పుత్రుడు, కుమారియు ఇప్పటివారే; తపస్వి నేనే.

## 349 సంధిభేద జాతకము

**శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, చాడీలు చెప్పకుండుటకై శిక్షణను గూర్చి చెప్పినది.**

### వర్తమాన కథ

ఒకప్పుడు షడ్వర్గీయ భిక్షువులు చాడీలు చెప్పుచు తిరుగుచుండి రని తెలిసినపుడు శాస్త్ర వారిని పిలువనంపి "భిక్షువులారా, మీరు నిజముగా జగడమాడుచు, వివాదపడుచు భిక్షువులను నిందించుచు తిరుగుచున్నారా! అందువలన నూతనముగా జగడములు అంకురించును, అదివర కున్న కలహములు వృద్ధినొందును" అనెను.

"చిత్తము, సత్యమే."

భగవాన్ వారిని నిందించి "భిక్షువులారా చాడీలు చెప్పుట పదును గల శస్త్రప్రహారము వంటిది. దానిచే, దృఢవిశ్వాసముగూడ త్వరలో విచ్ఛిన్నమగును. మనుజులు సింహ వృషభములవలె మైత్రి కోల్పోవుదురు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వు డాయన పుత్రుడై జన్మించెను. పెద్దవాడయి తక్షశిల కేగి, విద్యలు నేర్చి వచ్చి, తండ్రియనంతరము ధర్మానుసారముగా రాజ్యము చేయుచుండెను.

ఆకాలమున గొల్లవాడు అడవిలో ఆవులను మేపుచు, ఇంటికి మరలివచ్చునపుడు గర్భవతి యైన యావును తోలుకొని వచ్చుట మరచెను. దానికి సింహముతో మైత్రి కుదిరెను. అవి రెండును గాఢ మైత్రితో ఒకచోటనే నివసించుచుండెను. క్రమముగా ఆవుకు దూడయు సింహికి మగసింహమును పుట్టినవి. అవి రెండును కులక్రమాగత మైత్రినిబట్టి ఒకచోటనే నివాసము చేయుచుండెను.

ఆటవికు డొకడు వానిని జూచినాడు. వాడు అడవిసామానులు తీసికొని రాజుకు సమర్పించినపుడు రాజు వానితో "మిత్రమా, అడవిలో నీవు ఆశ్చర్యకరమైన విషయము చూచితివా?" అనెను.

"దేవా, మరేమియు లేదు. సింహము, వృషభము మైత్రితో మెలగుచుండుట చూచితిని."

"మూడవజంతువు వీనితో కలిసినచో విపత్తు సంభవించును. వేరొక జంతువు దీనితో కలిసినప్పుడు నాకు దెలుపుము." "చిత్తము దేవా."

ఆటవికుడు వారాణసికి జనినపిమ్మట నక్క సింహవృషభముల సేవకు కుదిరెను. ఆటవికుడు వచ్చిన తరువాత వానిని జూచి మూడవ జంతువు చేరియుండుట చూచి, రాజుతో చెప్పదలచి నగరమునకు జనెను.

నక్క యిట్లు తలపోసెను : "సింహవృషభములమాంసము తప్ప తక్కిన యన్ని జంతువులమాంసము భుజించితిని. వీనికి వైరము కల్పించి, వీనిమాంస మారగింతును." "ఇది యిట్లున్నది." అది అట్లున్నది" అని ఉభయులకును వైరము కల్పించి నక్క వాని శీఘ్రమరణమున కెదురుచూచుచుండెను.

ఆటవికుడు పోయి రాజుతో "దేవా, వానితో మూడవజంతువు చేరినది" అని విన్నవించెను.

"అది యే జంతువు." "దేవా, నక్క".

"వానికి కలహము కల్పించి జంబుకము వానిని జంపించును. అవి చనిపోవులోగా మన మక్కడకు చేరుదము" అని రాజు ఆటవికుడు మార్గము చూపుచుండగా నచటికి జేరెను. సరిగా అప్పటికి సింహవృషభములు పోరాడి మరణించినవి. జంబుకము ప్రసన్నచిత్తముతో ఒక మారు సింహమాంసమును వేరొకమారు వృషభమాంసమును దినుచుండెను. జంతువులు రెండును మరణించియుండుట చూచి రాజు రథములోనే యుండి సారథితో సంభాషించుచు ఈ గాథలు పలికెను:

స్త్రీలలోగాని భోజనస్థితిని గాని
వీనిలోన సమానత కానరాదు
కావునను సారథీ, కొండెగాని నేర్పు
చూడు మిందున; కొండెము చురుకుకత్తి
మాద్రి దిగు: సింహవృషభాల మాంస మెట్లు
నీచజంతువు మెక్కెనో నీవు చూడు.
పలికి చాడీలు, భేదము కొలుపువారి
పలుకు వినువారి కీగతి పట్టుచుండు:

అట్టివారి వాక్కులు విననట్టివాడు
స్వర్గగాములవలె సుఖస్వాప మొందు.

ఇట్లు పలికి రాజు, సింహ కేసరములను, చర్మమును, నఖములను కోరలను తీయించి నగరమునకు గొనిపోయెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున రాజు నేనే.

## 350 దేవతాపహ్నా జాతకము

ఈ దేవతాప్రశ్నావళి ఉమ్మగ్గ జాతకమున (546) వచ్చును.

అతీతకథ

దేవతాప్రశ్నావళి ఉమ్మగ్గజాతకమున (546) వచ్చును.

## 351 మణికుండల జాతకము

అతీత కథ

శాస్త జేతవనమున విహారము చేయుచు, కోసలరాజుకు అంతఃపురమున సర్వార్థ సాధకు డగు దుష్టామాత్యుని విషయమై చెప్పినది. వర్తమానకథ ఇదివరలో చెప్పబడినది.

కాని, ఈకథలో బోధిసత్త్వుడు వారాణసీరాజు. దుష్టామాత్యుడు కోసలరాజును గొనివచ్చి, రాజ్యము గెలిపించి వారాణసీనరేశుని బందిగమునం దుంచునట్లు చేసెను. రాజు ధ్యానావస్థితుడై ఆకాశమున పర్యంకముపై గూరుచుండెను. చోరరాజుశరీరము తపింప

జొచ్చెను. అతడు వారాణసీనరేశునికడకు వచ్చి, తొలిగాథ పలికెను:

గుఱ్ఱముల్ రథముల్ మణికుండలములు
దారపుత్రభోగమ్ము లంతమ్ము చెంద
ఏల శోకింపవో దుఃఖకాలమందు?

విని బోధిసత్త్వు డీ రెండు గాథలు పలికెను:

భోగముల్ త్యజియించి పోవును తొలుత,
పురుషుండు మొదటనే భోగముల్ విడుచు
భోక్త లనిత్యులుపో కామకామి!
నాకు దుఃఖము లేదు శోకకాలమున.

శత్రుకా, ఉదయించి చంద్రుండు, వృద్ధి
పొంది, క్షయమ్మును పొందుచునుండు
సంతప్త మొనరించి సర్వలోకమ్ము
అస్తంగతుం డగు నాదిత్యుడైన.
ఈ లోకధర్మంబు లెఱిగియుండుటను
నాకు దుఃఖము లేదు శోకకాలమున.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు చోరరాజుకు ధర్మోపదేశము చేసి, అతనివిధానమును నిందించుచు ఈ గాథలు పలికెను:

అలసుడున్ భోగి యౌనట్టి గృహస్థు,
శమదమమ్ములు లేని సాధుజనుండు,
అవిమృశ్యకారియై నట్టి నృపుండు,
కోవిదుం డయ్యును క్రుద్ధమానసుడు—
కారు సత్పురుషులు వీర లెవ్వారు.

కాగూడ దవిమృశ్యకారి నృపుండు;
యోజించి కార్యము లొనరించు రేని
కతిశయించును కీర్తి అన్నిదిశల.

చోరరాజు బోధిసత్త్వుని క్షమాపణము వేడి రాజ్యము సమర్పించి నిజజనపదమునకు బోయెను.

## 352 సుజాత జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు తండ్రి మరణించిన గృహస్థును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

తండ్రి మరణానంతర మాతడు ఏడ్చుచు, మొత్తుకొనుచు తిరుగుచు, శోక మాపుకొనలేకపోయెను. అతనికి శ్రోతాపత్తి ఫలప్రాప్తిని సంభావించి శాస్త భిక్షార్థము శ్రావస్తిలో పర్యటించుచు శ్రమణుని వెంటబెట్టుకొని ఆతనిఇంటికి బోయి పరచిన ఆసనముపై కూరుచుండెను. ఆ ఉపాసకుడు ప్రణామము చేసి కూరుచున్నపిదప శాస్త "ఉపాసకా, దుఃఖించుచున్నావా?"అనెను. 'చిత్తము భన్తే' యని యాతడు చెప్పిన పిదప శాస్త "ఉపాసకా, పురాణపండితులు అన్యపండితుల వాక్కులు విని పితృమరణానంతరము శోకము విడిచిరి" అని అతనిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడొకానొక గృహస్థుని యింట జన్మించెను. ఆయనకు సుజాతకుమారు డని పేరుపెట్టిరి. ఆయన పెరుగునప్పటికి పితామహుడు మరణించెను. బోధిసత్త్వుని జనకుడు శోకాకులచిత్తు డయ్యెను. ఆయన శ్మశానమునకు బోయి, అస్థికలు తెచ్చి, తనతోటలో నుంచి వానిపై స్తూపము మట్టితోనిర్మించెను. సమయాసమయములందుకూడ స్తూపమును పుష్పములతో పూజించుచు, చైత్యమునకు ప్రదక్షిణములు చేయుచు, ఏడ్చి మొత్తుకొనుచు స్నానచందనాదులు మాని, భోజనము చేయక, భూమిపనికూడ చూడకుండెను.

అది చూచి బోధిసత్త్వుడు తనలో "తాత పోయినప్పటినుండియు నాయన శోకాతురు డయినాడు. నేను తప్ప ఇతరులెవరును ఈయనకు వివేకము కలిగింపజాలరు. ఉపాయముచే ఈయనశోకము తొలగింతును" అనుకొని, గ్రామమువెలుపల మృతవృషభముకడ గడ్డి, నీరు ఉంచి తిను తిను, త్రాగుము త్రాగుము అని వక్కాణింపజొచ్చెను.

అక్కడకు బోయినవారు ఆయనతో "సుజాతా, వెఱ్రివాడ వయితివా ? చచ్చిపోయిన యెద్దునకు గడ్డి నీరు చూపుచున్నావా?" అనుచుండిరి. ఆతడు బదులు పలుకకుండెను. లోకు లాతనితండ్రితో "నీకుమారునకు పిచ్చి యెత్తినది మృతవృషభమునకు గడ్డి నీరు పెట్టుచున్నాడు" అని చెప్పిరి. పితృశోకమునకు మారు ఆగృహస్థునకు పుత్రశోకము కలిగెను. త్వరితముగా ఆయన కుమారుని కడకు వచ్చి "నాయనా, సుజాతా, నీవు తెలిసినవాడవే. చచ్చిన యెద్దునకు ఆహారనీరము లేల ఇచ్చుచున్నావు?" అని రెండు గాథలు పలికెను :

పచ్చి తృణములం దెచ్చి తిను మని
బక్క చిక్కిన ముసలియెద్దును
ఇంత తొందర పెట్టి యరచెడి
యీత డెవ్వండు!

అన్న పానీయ వంచితం బగు వృషభము
బ్రదుక, దరిచెడు మూర్ఖునిభాతి నీవు.

అది విని బోధిసత్త్వుడు రెండు గాథలు పలికెను :

అటులె యున్నది దాని మస్తక
మటులె యున్నవి కాలుసేతులు
అట్లె యున్నవి చెవులు తోకయు
కావునను వృషభంబు లేచును
జీవములతో నని తలంతును.

అయ్య తలయును కాలుసేతులు
అట్లు లేవే; కట్టి యేడ్తువు
స్తూప మాయనమీద మృత్తిక
తోడ, కావా కో దుష్టబుద్ధివి?

అది విని బోధిసత్త్వునితండ్రి తనలో "నాకుమారుడు వివేకముకలవాడు. ఇహపరలోకకృత్యములు తెలిసినవాడు. నాకు వివేకము కలిగించుటకే ఈకార్యము చేసినాడు" అనుకొని, "నాయనా, సుజాత పండితా, నాకు తెలిసిది—సంసారమంతయు అనిత్యము. తండ్రి-శోకమును తొలగించు పుత్రుడు ఇట్లే యుండవలెను" అని కుమారుని ప్రశంసించుచు ఇట్లు పలికెను:

నేయి పోయగ మండెడు నిప్పవోలె
నున్న బాధను తొలగింపు ముదకము వలె
పెరికి హృత్తాపశల్యంబు పితృవిచార
మును తొలగించినాడవు; వినిన యంత
నీదుపలుకులు శమియించె నాదుదుఃఖ
మంతరించెను చాంచల్య, మపగతంబు
హృదయశల్యము, చింతలే దిపుడు నాకు
లేదు మాణవకా, ఇంక రోదనమ్ము
నిజహృదయమందు దయయుండు నెవరి కట్టి
ప్రజ్ఞ కలవార లన్యుల బాధతొలగ
జేతురు పితృశోకమ్ము సుజాతు నట్లు.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి సత్యప్రకాశన మొనరించి జాతకములు సరిపోల్చెను. గృహస్థు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున సుజాతుడు నేనే.

## 353. ధోనసాఖ జాతకము

శాస్త భగ్గజనపదమున సుంసుమారగిరి సమీపమునందలి భేసకలావనమున విహారము చేయునపుడు బోధిరాజకుమారుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆకాలమున ఉదయునపుత్రుడు బోధిరాజకుమారుడు సుంసుమార గిరిపై నివసించుచుండెను. అతడు నేర్పరి యగు వడ్రంగిని బిలువ నంపి, ఏప్రభువునకును లేని ప్రాసాదమును నిర్మాణము చేయించెను. అది కోకనాదనామకము. ప్రాసాదము పూర్తియయినంతనే రాజు వడ్రంగి కన్నులు పెరికించెను. ఈవిషయము భిక్షుసంఘమునకు దెలిసెను. వారు ధర్మసభలో చర్చచేయుచుండగా శాస్త అచటి కరుదెంచి విష యము గ్రహించి, "భిక్షువులారా, ఆత డిప్పుడే కాదు. పూర్వముకూడ కఠినుడు, దుస్సాహసికుడు; అనేకక్షత్రియుల నేత్రములు పెరికించి, వారి

మాంసముకూడ నివేదన చేయించినాడు'' అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు తక్షశిలలో ప్రసిద్ధాచార్యు డయియుండెను. జంబూ ద్వీప మంతటనుండియు క్షత్రియ బ్రాహ్మణ విద్యార్థు లాయనకడ విద్యాభ్యాసము చేయుచుండిరి. వారాణసీరాజపుత్రుడు బ్రహ్మదత్త కుమారుడుకూడ ఆయనకడ మూడువేదములు పఠించెను. బోధిసత్త్వు డాతని శరీరలక్షణములను బట్టి గ్రహించి "నాయనా, నీవు కఠినుడవు, పరుషస్వభావుడవు, దుస్సాహసికుడవు. ఇట్టివానికి లభించిన యైశ్వ ర్యము సుస్థిరముగా నుండదు. ఐశ్వర్యము పోయినపిమ్మట ఆశ్రయము దొరకనట్లు శరణము లభింపదు. కావున నీ విట్టివాడవు కావలదు'' అని రెండు గాథలు పలికెను.

ఉండ వో బ్రహ్మదత్తుడా, ఒక్కచోట
సతము క్షేప నవీనతా సౌఖ్యములను,
పడవ పగిలిన పిమ్మట కడలినడుమ
దిక్కు తోచని మనుజుని తెరగు కాక
నీవు ధననాశ మైనను నిబ్బరముగ
ఉండవలె; మానవుడు చేయుచుండు కార్య
ఫలము నొందును; సత్కర్మఫలము శుభము,
అశుభకర్మమునకు దుఃఖ మగును ఫలము
బీజములు బట్టి ఫలితంబు నోజపొందు.

అతడు ఆచార్యునకు ప్రణామము చేసి, వారాణసికి బోయి తండ్రికి తనవిద్యను జూపి యువరాజపదమున ప్రతిష్ఠితుడయి, పితృ మరణానంతరము రా జయ్యెను, ఆయనకు పింగియనాము డగు పురో హితు డుండెను. ఆయన కఠోరహృదయుడు. ఆత డైశ్వర్యలోభముచే తనలో "నే నీ రాజుద్వారా జంబూద్వీప మందలి రాజుల నెల్లరను పట్టించెదను. అప్పు డీతడు ఏకచ్ఛత్రాధిపతి యగును. నేను ఏకైక పురోహితుడ నగుదును'' అని తలచి ప్రభువునకు తనయభిప్రాయమును తెలిపెను.

రాజు మహాసైన్యముతో బయలుదేరి ఒక్కొక్క రాజు నగరమును ముట్టడించి పట్టుకొనుచుండెను. ఈవిధముగా జంబూద్వీపమందలి రాజులను బట్టుకొని, వారిని వెంటబెట్టుకొని, తక్షశిలారాజ్యమును కబళించుటకై అక్కడకు జేరెను. అన్యు లెవ్వరును ధ్వంసము చేయ నేరకుండునట్లు బోధిసత్త్వుడు తక్షశిలానగరము మరమ్మతు చేయించెను.

వారాణసీరాజు గంగానదీతీరమున, మహావటవృక్షముక్రింద ముదుక గుడ్డ చుట్టించి దానిపైన చాందినీ కట్టించి, క్రింద శయ్య పరపించి పండుకొనెను. జంబూద్వీపములోని రాజసహస్రమును జయించి, తక్షశిల జయింపజాలమికి చింతించుచు రాజు పురోహితునితో "ఆచార్యా ఇందరురాజులతో వచ్చియు, తక్షశిలను పట్టుకొనజాలకున్నాము. కర్తవ్య మేమి?" అనెను.

"మహారాజా, వేయిమంది రాజులకన్నులు పెకలించి, చంపి, కుక్షులు చీల్చి, పంచప్రకారమధురమాంసములనుతీసికొని, ఈవటవృక్షముమీది దేవతకు బలి ఈయవలెను. ప్రేగులు వత్తులవలె వృక్షముచుట్టును చుట్టి రక్తముతో పంచాంగుళీచిహ్నములు వేయవలెను. ఇట్లయిన మనకు శీఘ్రముగా జయము కలుగును" అని పురోహితుడు చెప్పెను.

మంచి దని రాజు మహాయోధులయిన మల్లురను తెరవెనుక నిలిపి, ఒక్కొక్క రాజును బిలిపించి పడగొట్టి, స్మృతి లేకుండజేసి, నేత్రములు పెరికించి, మాంసము తీయించి శవములను గంగానదిలో బార వేయించెను. ఉక్తప్రకారము బలికర్మ నడిపి భేరి వేయించి, యుద్ధమునకు బయలువెడలెను. అంజిసకత నామకు డగు యక్షుడు వచ్చి రాజు కుడికన్ను పెకలించి తీసికొనిపోయెను. రాజు బాధచే వివశుడై వచ్చి వృక్షముక్రింద శయనముపై వెల్లకిలబడిపోయెను.

ఆసమయమున రాబందు సన్ననివెుున కల యెముక నోట గరచుకొని వటవృక్షముమీద వాలి, మాంసము తిని ఎముక జారవిడిచెను. దానియంచున ముక్క విరిగి లోహశలాకవలె రాజువామనేత్రమున గ్రుచ్చుకొనెను. బోధిసత్త్వునివాక్కు లాక్షణమున రాజునకు జ్ఞప్తికి వచ్చెను. "మాయాచార్యు డీవిషయము గ్రహించియే, బీజమునకు అనురూప మైనఫలము లభించు నని చెప్పియుండనోపును. కర్మాను

రూప మైన విపాక మనుభవింపవలెను'' అనుకొని విలపించుచు రాజు ఈ రెండు గాథలు పలికెను:

ఇయ్యది ఆచార్యవాక్కు;
ఇట్లు చెప్పె పారాశర్యు
డవల నిన్ను బాధించెడి
యకార్యంబు చేయవలదు.

పెద్దకొమ్మల మఱిచె ట్టిది
పింగియా, ఇచ్చటనె భూషణ
చందనాలంకారయుతు లగు
క్షత్రియుల్ హతు లైరి; న న్నా
కర్మఫలమే యనుసరించును.

ఇట్లు పలికి యేడ్చి మొత్తుకొనుచు, పట్టపు దేవికి జ్ఞప్తిచేసి, ఈ గాథ పలికెను:

చందనవిలిప్త మై లతచందమునను
చక్కని శరీరమున వెల్గు శ్యామ భార్య,
ఇప్పు డాయుబ్బరిం జూగ నేను పోదు
ననెడి భావమునం కల్గు నధికబాధ.

ఆత డీప్రకారముగా విలపించుచునే మరణించి, నరకమునకు పోయెను. ఐశ్వర్యలోభి యగు పురోహితు డాతనిని రక్షింపజాల డయ్యెను; తన యైశ్వర్యము నైనను రక్షించుకొనలేకపోయెను.

రాజు చనిపోవగనే మహాసైన్యము వికావిక లయ్యెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజా బోధి ఖత్త్వకుమారుడు; పింగియ దేవదత్తుడు; ఆచార్యుడు నేనే.

## 354 ఉరగ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు పుత్రుని కోల్పోయిన గృహస్థుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కథ భార్య, తండ్రి కోల్పోయిన వానికథవలె నున్నది. ఈకథలో శాస్త వెనుకటివలెనే ఆతనియింటికి పోయెను. ఆతడు వచ్చి ప్రణామము చేసి కూరుచుండెను. "ఆయుష్మన్, ఏల నీవు చింతించు చున్నావు?" అని శాస్త ప్రశ్నించెను.

"భన్తే, పుత్రుడు పోయినది మొదలు విచారముతోనున్నాను."

"ఆయుష్మన్, తెగిపోవు స్వభావము గలది తెగిపోవును. నష్టమగు స్వభావము గలది నష్ట మగును. జీవించియుండున దేదియును లేదు. అనంతచక్రవాళములందును, త్రిభువనము లందును మరణము పొందనిది లేదు. అట్టి స్థితిలో శాశ్వతసంస్కార మేదియును లేదు. సర్వప్రాణులకును మరణ మున్నది; సంస్కారము లనిత్యములు. పురాణ పండితు లీతర్కము గ్రహించి విచారము మానుకొనిరి" అని శాస్త ఆతనికి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు వారణసీద్వారమున కావలిగ్రామమున బ్రాహ్మణుల యింట బుట్టి కృషికర్మచే జీవనము చేయుచుండెను. ఆయనకు పుత్రుడు, పుత్రికయు నుండిరి. కొడుకు పెద్దవా డయినపిదప సమానవంశమునుండి కన్యను తెచ్చి కుమారునకు పెండ్లి చేసెను. దాసితోగూడ వారారుగు రయిరి: బోధిసత్త్వుడు భార్య, పుత్రుడు, పుత్రిక, కోడలు, దాసి, వారెల్లరు కలసిమెలసి శాంతచిత్తములతో, ప్రీతితో నుండిరి. "మీవద్దకు వచ్చినవారికి దానధర్మములు చేయుడు. శీలములు రక్షింపుడు. ఉపవాసవ్రత మనుష్ఠింపుడు. మరణము స్మరింపుడు. నిజమరణమును భావింపుడు. ప్రాణులకు మరణము నిశ్చయము, జీవితము అనిశ్చితము. అన్నిసంస్కారములు అనిత్యములు, క్షయించిపోవునవి.

శ్రేయింబవల్లు అప్రమత్తతో చరింపుడు” అని బోధిసత్త్వుడు వారికి ఉపదేశ మిచ్చుచుండును. మంచిదని వారు ఉపదేశము గ్రహించి, అప్రమత్తతో మరణస్మృతిభావనతో నుండిరి.

ఒకనాడు బోధిసత్త్వుడు పుత్రునితో పొలమునకు బోయి నేల దున్నుచుండెను. కుమారుడు మోడులు మొదలగునవి పెరికి, కాల్చి వేయుచుండెను. ఆతనిసమీపమున బిలములో విషసర్ప ముండెను. పొగ పోయి దానికన్నుల నలముకొనెను. కోపించి సర్పము నాలుగు కోరలు దిగబడునట్లు కుఱ్ఱవానిని కరచెను. వాడు క్రిందబడి మరణించెను. బోధిసత్త్వుడు వెనుదిరిగి ఎద్దుల నాపి బాలునికడకు బోయి చూచెను; శవమును గొనిపోయి చెట్టుక్రింద పండుకొనబెట్టి వస్త్రము కప్పెను. ఆయన దుఃఖింపలేదు, కేకలు వేయలేదు. అనిత్యమును గూర్చి తలపోసి, పోయి, నేల దున్నజొచ్చెను.

ఇంతలో పొలముప్రక్కగా విశ్వాసయోగ్యుడు పోవుచుండగా బోధిసత్త్వుడు చూచి “నాయనా, ఇంటికి బోవుచున్నావా?” అని యడిగెను. “ఆఁ”. అట్లయిన మాయింటికి బోయి, రోజువలె ఇరువురకు భోజనము తేవలదు, ఒకరికే తేవలె నని చెప్పుము. ఇదివరలో దాసి యొక్కతెయే భోజనము తెచ్చుచుండెడి. నేడు నలుగురును తెల్లబట్టలు కట్టుకొని పరిమళపుష్పములు తేవలె నని చెప్పుము.”

ఆతడు పోయి బ్రాహ్మణితో ఆప్రకారమే చెప్పెను. “నాయనా, ఈసందేశ మెవ రిచ్చినారు”.

“అమ్మా, బ్రాహ్మణుడు ”

కుమారుడు చనిపోయె నని ఆమెకు తెలిసెను, కాని ఆమె కొంచెమయినను చలింపలేదు. చిత్తస్థైర్యము కలిగిన యామె స్వచ్ఛవస్త్రములు ధరించి, నలువురచేతను కట్టించి భోజనము, పుష్పములు తీసికొని వారిని వెంటబెట్టుకొని పొలముచేరెను. ఒకరును రోదింపలేదు, కేకలు వేయలేదు. కొడుకు పడియున్న చెట్టునీడనే బోధిసత్త్వుడు కూర్చుండి భోజనముచేసెను. అనంతర మందరును కట్టెలు తెచ్చి, చితిపేర్చి, శవమును దానిపై నుంచి, పుష్పములతో పూజ చేసి, నిప్పు ముట్టించిరి. ఎవరి కంటివెంటను బాష్పబిందువు రాలలేదు. అంద

రును మరణస్మృతిని అభ్యసించినవారే.

వారి శీలప్రభావముచే శక్రునిభవనము తాప మొందెను. "నన్ను స్థానచ్యుతుని జేయదలచినవా డెవడు?" అనుకొని శక్రు డాతనిసంగతి తెలిసికొని, అతని ప్రభావమువలననే తనస్థానము ఉత్తప్తమయ్యె నని గ్రహించి, ప్రసన్నుడై ఆతనియొద్దకు బోయి సింహగర్జనము చేసి, అతనియిల్లు సప్తరత్నభరితము చేయదలచెను. శక్రుడు త్వరితముగా జని, దహనము జరుగుచున్న ప్రదేశమున నొకప్రక్కగా నిలిచి "నాయనా, ఏమి చేయుచున్నావు?" అనెను.

"స్వామీ, ఒకనిని దహనము చేయుచున్నాను."

"నీవు మనుష్యుని దహనముచేయుచున్నట్లు కాక, ఏదో జంతువును వండుచున్నట్లున్నావు."

"కాదు స్వామీ, మనుష్యునే దహనము చేయుచున్నాను."

"అట్లయిన శత్రువునా?" "స్వామీ, శత్రువును కాదు — ఔరస పుత్రునే." "ఇష్టము లేనివానినా?" "స్వామీ, అత్యంతప్రియపుత్రునే" "ఏల దుఃఖింపవు?" దుఃఖింపకయుండుటకు కారణమును జెప్పు నీ ప్రథమగాథ పలికెను:

చనునట్లు కుబుసంబు సర్పంబు విడిచి
ప్రాణియు జను శరీరమ్మును విడిచి
ఈరీతి భోగవిహీనమై తనువు
కాలధర్మము చెంది కాలుచున్నపుడు
కర్ణాల జొరబడి జ్ఞాతుల ఏడ్పు
తెలియంబడదు, పరదేవన యేమి
చేయును, నిజగతి చేరినా డతడు.

శక్రుడు బ్రాహ్మణితో "అమ్మా, నీ కితడు ఏమి కావలెను?" అనెను. స్వామీ, పదిమాసములు కడుపున మోసి, స్తన్య మిచ్చి, కాలుసేతులు నిమిరి పెంచిన పుత్రుడు." "అమ్మా, తండ్రి కఠినుడగుటచే రోదింపలేదు. కాని మాతృహృదయము కోమలము కదా, నీ వేల దుఃఖింపవు?" తాను రోదింపకుండుటకు కారణము దెలుపు నీ రెండు గాథ లామె పలికెను:

అరుదెంచె పిలుపులే కచ్చటనుండి,
ఏగినా డచ్చటి కిచ్చటినుండి

అనుమతి పొందకే! అరుదెంచినట్లు
పోయెను; దానికై పొదలగా నేలని

కాలి పోయెడు వేళ జ్ఞాతుల యేడ్పు
వానికి దెలియదు కాన రోదనము
చేయను, నిజగతి చేరినా డతడు.

అప్పుడు శక్రుడు సోదరను జూచి "నీ కత డేమగును?" అని యడిగెను. "స్వామీ, సోదరుడు" "అమ్మా, సోదరులయెడ చెల్లెండ్రకు ప్రీతియుండును. నీ వేల దుఃఖింపవు?" తాను రోదింపకుండుటకు కారణము దెలుపు నీ రెండుగాథ లామె పలికెను :

శోకించు నేనియు శుష్కించిపోదు,
ఫలమేమి యద్దాని బంధుమిత్రాది
జనుల కసహ్యంబు సంజాత మగును.

దందహ్యమాను డాతం డెరుగండు
జ్ఞాతిమిత్రులరోదనమ్ము; శోకింప
నందుచే; నిజగతి నరగినా డతడు.

శక్రు డాతని భార్యతో "అమ్మా, నీ కత డేమి కావలెను?" అనెను. "స్వామీ నా పతి." "పతి పోయినపిదప స్త్రీలు అనాథలగుదురు. నీ వేల దుఃఖింపవు?"

తాను దుఃఖింపకుండుటకు కారణము దెలుపు రెండు గాథల నామె పలికెను :

బాలుండు కనుగొని పయనించు చంద్రు
పట్టనేరక యేడ్చు పగిది నేయుండు
చచ్చువానికి నేడ్చు జనునివర్తనము.

దందహ్యమాను డాతం డెరుంగండు
జ్ఞాతిమిత్రులరోదనమ్ము; శోకింప
నందుచే; నిజగతి కరిగినా డతడు.

శక్రుడు దాసిని జూచి "అతడు నీ కే మగును?" అని యడిగెను. "స్వామీ, నాయజమానులు." "ఆయన నిన్ను కొట్టి బాధించి బలవంతముగా పనులు చేయించి యుండక తప్పదు. కావున అతడు మరణిం

చుట మంచిదే యని యెంచి నీవు దుఃఖింపకున్నావు." "స్వామీ, కాదు. క్షమ మైత్రి దయ కలిగిన యజమానుడు. ఆర్యపుత్రుడు రొమ్మున బెరిగిన పుత్రునివంటివాడు." "అట్లయిన అమ్మా, నీవేల దుఃఖింపవు?" తాను దుఃఖింపకుండుటకు కారణము తెలుపు రెండు గాథల నామె నలికెను :

భగ్నమైన సలిలభాండంబు క్రమ్మర
నదుక వీలుపడని యట్లయుండు
మరణ మొందువాని కొరకు రోదించుట.

దహ్యమానతనువు తనసమీప
బంధుమిత్రజనులపరిదేవనంబును
నెటు గ్రహించుని కాన యేడ్వ నేను.

శక్రుడు ధర్మకథనము విని సుప్రసన్నుడై "మీ రందరు అప్రమత్తు లయి మరణస్మృతిని అభ్యసించినారు మీరు చేతులతో నిక నేపనియు చేయకుడు. నేను దేవరాజు శక్రుడను, మీయింట సప్తరత్నములను నింపెదను. మీరు దానధర్మములు చేయుడు, శీలము రక్షింపుడు, ఉపవాసవ్రత మనుష్ఠింపుడు. అప్రమత్తతతో నుండుడు" అని యుప దేశించి అనంతధన మింట సమకూర్చి వెడలిపోయెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము గృహస్థు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. ఆ కాల మున దాసి ఖుజ్జుత్తర; బాలిక ఉత్పలవర్ణ; కుమారుడు రాహులుడు; తల్లి ఖేమ; బ్రాహ్మణుడు నేనే.

# 355 ఘత జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసలనరేశుని అమాత్యునివిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

తన కుపకారము చేసిన అమాత్యునకు రాజు విశేషసంపద సమకూర్చి, భేదోపాయసమర్థులమాటలు విశ్వసించి, అతనిని కారాగారమున ద్రోయించెను. అమాత్యుడచట ధ్యానమున నుండి, స్రోతాపత్తిమార్గమును గ్రహించెను. రా జాతనిగుణములను స్మరించి బంధనాగారమునుండి విడిపించెను. అమాత్యుడు సుగంధపుష్పమాలికలు చేకొని, శాస్తకడ కరిగి ప్రణామము చేసి, కూరుచుండెను. "నీకు అనర్థముకలిగినది కాదా?" అని శాస్త యనెను. "భన్తే, చిత్తము. కాని అనర్థమునుండి అర్థప్రాప్తియయినది; స్రోతాపత్తిమార్గము లభించినది." "ఉపాసకా, నీకే కాదు, పూర్వము పండితులకు గూడ అనర్థమునుండి అర్థము లభించినది" అని శాస్త ఆతనిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడాయనపట్టపుదేవికడుపున బుట్టినాడు. ఆయనకు ఘృతకుమారుడని పేరుపెట్టిరి. పెరిగి పెద్దవాడయి అతడు తక్షశిలకు బోయి విద్యలు నేర్చి వచ్చి ధర్మానుసారముగా రాజ్యము చేయుచుండెను. ఆయన యమాత్యుడొకడు అంతఃపురద్రోహము చేయగా ప్రత్యక్షముగా చూచి రాజు వానిని దేశమునుండి వెడలగొట్టెను.

ఆ కాలమున ధంకరాజు శ్రావస్తిని పరిపాలించుచుండెను. అమాత్యుడాయనకడకు బోయి కొలువులో కుదిరి క్రమముగా తనసలహాతో వారాణసీరాజ్యమును స్వాధీనము చేయించెను. రాజు బోధిసత్త్వుని శృంఖలాబద్ధుని జేసి, కారాగారమున బడవేయించెను. బోధిసత్త్వుడు ధ్యానావస్థితుడై ఆకాశమున కెగసి, పర్యంకబంధమున గూరుచుండెను. ధంకునిశరీరమున తాపము పుట్టెను. ఆతడుపోయి బోధిసత్త్వునిముఖము వంక జూచెను. సువర్ణదర్పణమువలె, వికసించిన పద్మమువలె వదనము

శోభాయుక్తముగా నుండెను. ధంకుడు బోధిసత్త్వుని ప్రశ్నించువాడై యీ తొలిగాథ పలికెను :

ఒక్కఁ నీవు తప్ప తక్కినవారలు
యేడ్చుచున్నవార లెల్లరి ముఖ
ములను బాష్పబిందువులు కానిపించును;
ఎందుచేత శోక మొంద వీవుని

తాను శోకింపకుండుటకు కారణము తెలుపువాడై బోధిసత్త్వుడు మిగిలిన గాథలు పలికెను.

కడచిన సౌఖ్యంబు కాని భవిష్య
దానందమును గాని తేనేర డెవడు
కావున చింతింప; దానికి లేదు
తోడ్పాటు. శోకమ్మతో వివర్ణతయు
కార్శ్యమ్ము సైతము ఘటియిల్లుచుండు;

చింతాకులునకు రుచింప దన్నమ్ము
శుష్కించువానికి శోకశల్యమును
చూపుదు రరులును సుప్రసన్నతను.

గ్రామము నందైన, గహనమందైన
ఎత్తున, లోతున నెచ్చట నున్న
పాండు వర్ణాదులు ప్రాప్తించవోయి!

ఏకాకిగా నుండి ఎవ్వడు సుఖము
తనకు తానై కూర్చుకొనజాలకుండు,
ఒసగజాలదు వాని కుర్వి సౌఖ్యంబు.

ధంకుడు గాథలు విని బోధిసత్త్వుని క్షమ వేడి రాజ్యము సమర్పించి వెడలిపోయెను. బోధిసత్త్వుడు అమాత్యులకు రాజ్యము సమర్పించి హిమాలయమున కరిగి, ప్రవ్రజించి, ధ్యానావస్థితు డై బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున ధంకరాజు ఆనందుడు; ఘృతరాజు నేనే.

## 356 కారండియ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ధర్మసేనాపతిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

స్థవిరుడు తనకు కానవచ్చినవారికి దీక్ష యిచ్చుచుండెను. వేటగాండ్రు, బెస్తలు మొదలగువారు కనబడగానే దీక్ష గైకొనుడని ఆతడు వారికి దీక్ష యిచ్చుచుండెను. వారు ఆయనయెడ ఆదరముచే ఆయన యానతి నుల్లంఘింపలేక దీక్ష గైకొనుచుండిరి. కాని నిర్వహింపలేక తమతమ వృత్తులనే అనుసరించుచుండిరి. స్థవిరుడు తోడి వారలను పిలిచి, "ఆయుష్మంతులారా, వీరు నాకడ దీక్షగైకొన్నారే గాని, నిర్వర్తించుటలేదు" అని చెప్పెను.

"భన్తే, వారికి ఇష్టము లేకున్నను తాము దీక్ష ఇచ్చుచున్నారు. వారు తమ ఆనతి నుల్లంఘింపనేరక గ్రహించుచున్నారు. ఇకనుండి తాము ఇట్లు దీక్ష ఈయవలదు."

స్థవిరుడు అసంతుష్టుడయ్యెను. ఈసమాచారము విని భిక్షువులు ధర్మసభలో చర్చించుచుండగా శాస్త అచ్చటి కరుదెంచి సంగతి తెలుసుకొని, "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ కానబడినవారికెల్ల — వా రడగకపోయినను దీక్ష యిచ్చుచుండెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున బుట్టి పెద్దవాడయి, తక్షశిలకు బోయి, అచ్చట శిష్యాగ్రేసరు డయ్యెను. అతనిపేరు కారండియుడు. అచటి యాచార్యుడు అడిగినను అడుగకున్నను కనబడినవారి కెల్ల బెస్తవారికిగూడ స్వీకరింపుడు స్వీకరింపుడు అని పంచశీలము లిచ్చుచుండెను. వారు స్వీకరించియు లెక్కచేయకుండిరి. ఆచార్యు డావిషయము శిష్యులతో జెప్పెను. "భన్తే, వారి కిష్టము లేకున్నను మీరు శీలము లిచ్చుచున్నారు. కావున వారు శీలభంగము చేయుచున్నారు. కోరినవారి కిచ్చుచు కోరనివారి కీవలదు" అని శిష్యులు చెప్పిరి. ఆయ

నకు తృప్తి కలగలేదు. కనబడినవారికి శీలము లిచ్చుచునే యుండెను.

ఒకనాడు ఒకానొక గ్రామమునుండి జనులు వచ్చి బ్రాహ్మణుల కొసగు అపూపములలో కొంతభాగము గైకొనుటకై ఉపాధ్యాయుని ఆహ్వానించిరి. ఆయన శిష్యుడు కారండియుని బిలిచి "నాయనా, నే నచటికి బోవలేను. నీవు ఈఅయిదువందల బ్రహ్మచారులను గొనిపోయి అపూపములను గైకొని మనకు రావలసిన భాగము తీసికొనిరమ్ము" అని చెప్పెను. అతడు పోయి, మరలివచ్చునపుడు త్రోవలో గుహను గాంచి తనలో "ఆచార్యుడు కనబడినవారి కెల్ల శీలము లిచ్చుచున్నాడు. అడుగకపోయినను సరియే. ఇక అడిగినవారికే ఇచ్చునట్లు చేసెదను" అని యోచించెను. విద్యార్థులు సుఖాసీనులై యుండ తాను లేచి పెద్ద రాయి యెత్తి గుహలో బడవేసెను. అంతటితో ఆగక రాలు వేయుచుండెను. వారు లేచి అతనని సమీపించి "ఏమిది?" యనిరి. అతడు మాటాడలేదు. అంతట వారు శీఘ్రముగా ఆచార్యుని కడకు జని ఈ విషయము చెప్పగా, ఆయన వచ్చి సల్లాపము చేయుచు ఈ తొలిగాథ పలికెను.

ఓయి కారండియ, ఒంటిగా నీవు
కానన పర్వత కందరంబులను
రాలు రువ్వెదవు, సంభ్రమపడునట్లు;
ఏమి లాభము కల్గు నిందుచే నీకు?

విని, కారండియుడు ఆచార్యునకు బోధ చేయువాడై రెండవ గాథ పలికెను.

అబ్ధి పరీవృత యౌ ధరాస్థలిని
ఇసుకదిబ్బలను మహీధరమ్ములను
విరజిమ్మి వేయుచు నరచేతివోలె
సమతలమ్ముగ జేయ సయకట్టి శిలల
నందుచే రువ్వుదు కందరమ్ములను.

విని, ఆచార్యుడు మూడవగాథ పలికెను.

ఓయి కారండియ, ఉర్విని యెవ్వండు
చేయనేరం డరచేతిసమంబు;

నీ వొక్క లోయనే నింపయత్నింప
తలతును నీజీవితము చాలదనియె.

అది విని శిష్యుడు నాలుగవ గాధ పలికెను.

మానవు డొకడు సమానమ్ము చేయ
నోపనిచో పృథ్వి, ఓ బ్రహ్మవేత్త
వివిధదృష్టులు కల్గు వీరల నొక్క
దృష్టికి నీవును తేజాల వెపుడు.

విని ఆచార్యుడు తనలో "కారండియుడు యుక్తముగా చెప్పినాడు. నేటినుండి మానుకొందును" అనుకొని, పంచమ గాధ పలికెను.

ఏవిధంబుగ మానవు డీధరిత్రి
సమతల మ్మొనరింపగా జాలడో అటె
సర్వజనుల నేకము చేయజాల డొకడు
అనుచు గ్రహియించితిని సంగ్రహముగ నేను.

ఈ విధముగా ఆచార్యుడు బ్రహ్మచారిని ప్రశంసించెను. అత డాచార్యునకు బోధ చేసి, యింటికి గొనిపోయెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున బ్రాహ్మణుడు సారిపుత్రుడు, కారండియ పండితుడు నేనే.

## 357 లటుకిక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, దేవదత్తునిగూర్చి చెప్పినది.

*వర్తమాన కథ*

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో సంభాషించుచు "ఆయుష్మంతులారా, దేవదత్తుడు కఠినుడు, దుస్సాహసికుడు, ప్రాణులయెడ అతనికి దయలేదు" అనుచుండిరి. శాస్త అచటికి జని విషయము గ్రహించి

"భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ నితడు దయారహితుడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు ఏనుగుకడుపున బుట్టి, సుందరమైన మహాశరీరముతో ఎనుబదివేల యేనుగుల కధినేత యై, హిమాలయ ప్రదేశమున నివసించుచుండెను.

ఒకానొక కోలంకి పక్షి ఏనుగులు చరించు ప్రదేశములో గ్రుడ్లు పెట్టెను. అవి పరిణతములై పగిలినవి. అందుండి చిన్నపిట్టలు బయలు వెడలినవి. రెక్కలు వచ్చి అవి యెగురకమునుపే బోధిసత్త్వుడు 80 వేల యేనుగులతో మేత మేయుచు అచ్చటికి వచ్చెను. చూచి పిట్ట తనలో "ఈ హస్తిరాజు నాబిడ్డలను త్రొక్కివేయవచ్చును. వీనిని రక్షించుటకై ఈయనను ప్రార్థించెదను" అనుకొని పిట్ట రెండురెక్కలు చేర్చుకొని ఆయన కెదురుగా నిలిచి ఈ తొలిగాథ పలికెను.

ఓ యరణ్యనివాసి, ఓ యూథనాథ
ఓ షష్టివర్షీయ, ఓహో యశస్వి,
నేరెక్కలను మోడ్చి నీదుసన్నిధిని
వందనం బొనరింతు; వధియింపవలదు,
దుర్బలుల్ నాదుపుత్రులు గజేంద్ర!

"నీ బిడ్డలను రక్షించెదను. విచారింపకుము" అని మహాసత్త్వుడు వానికి పైన నిలిచి, ఎనుబదివేల యేనుగులు వెడలిపోయిన తర్వాత పక్షితో "నా వెనుక ఏకాకిగా ఒక యేనుగు వచ్చుచున్నది. అది మాట వినదు. నీబిడ్డలను రక్షింపు మని దానిని ప్రార్థింపుము" అని చెప్పి వెడలిపోయెను.

ఆయేనుగు వచ్చినంతనే పక్షి రెక్కలు జోడించి, స్వాగతముపలికి, రెండవ గాథ పలికెను.

ఓ పర్వతనివాసి; ఓ వనవాసి,
ఏకచారీ, నీకు నిదె మ్రొక్కుదాన
నేను రెక్కలు మోడ్చి నీదుసన్నిధిని—
దుర్బలుల్ నాదుపుత్రులు గజేంద్ర!

విని, అది మూడవగాథ పలికెను.

ఏమి చేయుదువు నన్నీవు దుర్బలపక్షి,
వామపాదాన నీవంటి లక్షలకొలది
పులుగులన్ మర్దింతు, పుత్రులన్ వధియింతు.

ఇట్లు పలికి అది చిన్నపిట్టలను కాళ్ళతో త్రొక్కి, మూత్రము విడిచి, ఘీంకారము చేసి వెడలిపోయెను.

పక్షి వృక్షమువీాది కెగిరిపోయి వాలి, "ఏనుగా,ఇప్పుడు నీవు ఘీంకారము చేయుచు పోవుచున్నావు. నే నేమి చేయుదునో కొలది దినములలో చూచెదవు. శరీరముకన్న బుద్ధిబలము గొప్పదని నీ వెరుగవు. మంచిది, నీకు తెలియపరచెదను" అని దానిని బెదరించుచు నాలుగవ గాథ పలికెను :

బల మెల్లతావుల పనికిరా దయ్యా,
నాగరాజా! చంపినావు నాసుతుల-
నీ కపకారంబు నే నొనర్చెదను.

కొలది దినములకు పక్షి కాకిసేవ చేసెను. అది ప్రసన్నమయి 'నీ కేమి కావలెను!' అని యడిగెను. "స్వామీా, నాకు వే రేమియు కోరిక లేదు. తమ ముక్కుతో ఏకాకి గజము కన్నులు పొడవవలె నని మాత్రము ఆశ". మంచి దని కాకి అంగీకరించిన పిమ్మట పిట్ట ఈగసేవ చేసెను. అది నీ కేమి కావలెను? అని యడుగగా "ఈ కాకి ఒంటరిగా తిరుగుచున్న యేనుగు కన్నులు పొడిచినతరువాత మీారు వానిలో గ్రుడ్లు పెట్టవలె నని నాకోరిక" అని పిట్ట చెప్పెను. మంచి దని ఈగ అంగీకరించిన పిదప, పిట్ట కప్పకు సేవచేసెను. 'నీ కేమి కావలెను'? అని కప్ప అడుగగా పిట్ట యిట్లు చెప్పెను : "ఒంటిగా తిరుగు గజము గ్రుడ్డిదై నీటికై తిరుగునపుడు మీారు కొండపైకి బోయి బెకబెకలాడవలెను. ఏనుగు పర్వత మెక్కిన పిమ్మట మీారు క్రిందికి వచ్చి ప్రపాతమున బెకబెక లాడవలెను, మిమ్ము నేను కోరునది యిదియే" విని, మండూకము సమ్మతించెను.

ఒకనాడు కాకి ఏనుగు రెండు కన్నులను ముక్కుతో పొడిచెను. ఈగ పోయి అందులో గ్రుడ్లు పెట్టెను. కీటకములు పీకుచుండగా బాధ

కోర్వలేక దాహము పుట్టి నీటికై ఏనుగు తిరుగుచుండెను. ఆసమయమున మండూకము కొండమీదికి బోయి బెకబెకలాడెను. అచ్చట ఉదక ముండు నని తలచి యేనుగు నెమ్మదిగా కొండపై కెక్కెను. ఇంతలో మండూకము క్రిందికి దిగి అరచెను. అచ్చట నీర ముండునని యెంచి ఏనుగు నడచుచు జారి క్రిందిలోయలో పడి మరణించెను. దాని మరణము చూచి, పిట్ట సంతోషించి దాని శరీరముపై గంతులు వేసి. యధా కర్మం గతా.

ఇది అభిసంబుద్ధగాధ !

కాకమ్ము, లటుకమ్ము, కప్పయు, నీల
మక్షికమ్మను గూడి మత్తగజమ్ము
నంత నొందించిన; వప్రియం బైన
వైరంబు పెట్టుకో వలదు; కన్గొనుము
వైరంబుచే గల్గు భూరి దుర్గతిని.

ఆకాలమున ఏకాకిగా చరించు హస్తిదేవదత్తుడు; యూధనాయకుడు నేనే.

## 358 క్షుద్రధర్మపాల జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచుండగా దేవదత్తుడు చేయనెంచిన వధోద్యమమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఇంకొక కథలో భోధిసత్త్వుని బెదరింపలేకపోయెను. కాని ఈకథలో ఏడుమాసముల స్థితిలో బోధిసత్వుని కాలుచేతులు శిరస్సు కోయించి అంత దద్దరజాతకమున (172) గొంతు నులిమిచంపివేసి పొయ్యిమీద మాంసము వండించి తినెను. ఖాంతివాదజాతకమున (313) రెండుకొరడాలతో వేయిదెబ్బలు కొట్టి, కాలుసేతులు ముక్కు చెవులు కోసి, జుట్టు పట్టుకొని లాగి పెలకిల బడవైచి కాలితో రొమ్ముపై తన్ని

పరుగిడెను. ఆనాడే బోధిసత్త్వుడు ప్రాణములు విడిచెను. క్షుద్రవనందియ జాతకమున, (222) మహాకపి జాతకమున (407) గూడ చంపినట్లున్నది. ఈ విధముగా బహుకాలమువరకు వధోద్యోగము చేయుచు ఆయన బుద్ధత్వము పొందువరకును యత్నములు చేయుచుండెను. ఒకనాడు భిక్షువులు ధర్మసభలో ఈవిషయము చర్చించుచుండగా, శాస్త అచటికి కరుదెంచి, విషయము గ్రహించి "భిక్షువులారా, కేవలమిప్పుడే కాదు, దేవదత్తుడు నన్ను సంహరించుటకు యత్నము చేసినాడు; కాని బెదరింపనైనను బెదరింప జాలకపోయెను. కాని పూర్వము ధర్మపాలకుమారుని కాలమున పుత్రసమానుడనైన నన్ను చంపించెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో మహాప్రతాపు డనురాజు పరిపాలన చేయుచుండగా బోధిసత్త్వ డాయనపట్టమహిషి యగు చందాదేవి కడుపున బుట్టెను. ఆయనకు ధర్మపాలుడని పేరు పెట్టిరి. ఏడుమాసముల వయస్సున ఆయనను తల్లి సుగంధజలస్నానము చేయించి, అలంకరించి, ఆడించుచు కూరుచుండెను. రాజామెనివాసమునకు వచ్చెను. ఆమె కుమారునితో ఆడుచు ప్రీతిపరవశ యగుటవలన రాజును చూచియు లేవలేదు. "ఈమె కుమారుని మూలమున ఇప్పుడే గర్వించియున్నది. నన్నేమాత్రము లెక్క చేయుట లేదు. బిడ్డడు పెరిగిన పిమ్మట నన్ను మానిసిగా కూడ గణింపదు. వీని నిప్పుడే సంహారము చేయించెదను" అని తలపోసి రాజు మరలిపోయి సింహాసనముపై గూరుచుండి, తన సాధనములతో రమ్మని ఘాతుకున కానతి పంపెను. వాడు కాషాయ వస్త్రము ధరించి, రక్తపుష్పమాలిక మెడలో దాలిచి, భుజమున గొడ్డలి పెట్టుకొని, ఉపధానఘటమును, కాలుసేతులు బంధించుటకు దండములను గొనివచ్చి రాజుకు నమస్కరించి "దేవ, ఏమి చేయవలెను?" అని యడిగెను.

"దేవిశయనాగారములోనికి బోయి ధర్మపాలుని దీసికొనిరా" అని రాజానతిచ్చెను. రాజు కోపముతో వెడలిపోవుటచూచి రాణి భయపడి, ధర్మపాలుని తనరొమ్మునకు గట్టిగా అదుముకొని కూర్చుండి

యేడ్చుచుండెను. చోరఘాతుకుడు పోయి వీపుమీద కొట్టి, చేయిపట్టు కొని బిడ్డను లాగి రాజుసన్నిధికి దీసికొనిపోయి "దేవా, ఏమి చేయ వలెను?" అనెను. ఒక బల్ల తెచ్చి, ఎదుట వేయుము. దానిమీద వీనిని పండబెట్టుము" అని రాజాజ్ఞ యయినంతనే వాడు అటులే చేసెను. చందాదేవి రోదనము చేయుచు కుమారుని వెంటనే అచటికి వచ్చెను. "దేవా, ఏమి చేయుదును?" అని ఘాతకు డనెను. "ధర్మ పాలుని చేతులు ఖండింపుము" అని రాజు పలికెను. చందాదేవి "దేవా నాపుత్రుడు ఏడునెలలవాడు ఏమియు తెలియనివాడు. వీని దోష మేమియు లేదు. దోష మున్నచో అది నాదే. కావున నా చేతులు నరికింపుడు" అని ఈ విషయమునే ప్రకటించు తొలిగాథ పలికెను :

> తప్పు నాయది దేవ, ధర్మపాలుని విడిచి,
> నాకరద్వయఖండనమున కానతియిండు.

రాజు ఘాతకునివైపు చూచెను. "దేవా, ఏమి చేయుదును?" "ఆలసింపక హస్తములు ఖండింపుము." తక్షణమే వాడు తీక్ష్ణపరశు వెత్తి తరుణవంశకరీరములనువలె బాలుని రెండు చేతులను ఖండించెను; హస్తములను ఖండించువేళ బాలుడు రోదనము చేయలేదు. కేకలు వేయలేదు; శాంతిని, మైత్రిని పురస్కరించుకొని కష్టమును సహించెను.

తెగిన చేతులను చందాదేవి తనయుత్సంగమున జేర్చికొని రక్త సిక్తయై, దుఃఖించుచు తిరుగుచుండెను. "దేవా, ఏమి చేయుదును?" అని ఘాతుకు డడుగగా రాజు కాళ్ళు రెండును ఖండింపు" మనెను. విని చందాదేవి రెండవ గాథ పలికెను :

> తప్పు నాయది దేవ, ధర్మపాలుని విడిచి
> నాపదద్వయఖండనమున కానతియిండు.

రాజు మరల ఘాతుకున కాజ్ఞ యిచ్చెను. బాలుని రెండుకాళ్ళను వాడు ఖండించెను. తెగినకాళ్ళను చందాదేవి తన యుత్సంగమున జేర్చుకొని రోదనము చేయుచు "స్వామీ, మహాప్రతాపా, కాలు చేతులు లేని బిడ్డలను తల్లులు పోషింపవలెను. నేను కూలిచేసి వీనిని పోషింతును. వీనిని నాకు దయచేయుడు" అని వేడెను. ఘాతుకుడు

"దేవా, రాజాజ్ఞ నెరవేర్చినాను. నాకర్తవ్యము పూర్తి అయినదా?" అనెను. "లేదు, ఇంకను కాలేదు." "ఇంకేమి చేయవలెను?" "వీని శిరము ఖండింపవలెను." చందాదేవి మూడవ గాథ పలికెను :

తప్పు నాయది దేవ ధర్మపాలుని విడిచి
నా కరద్వయఖండనమున కానతి యిండు.

ఇట్లు పలికి తన మెడ చాపెను.

"దేవా, ఏమి చేయుదును?" అని ఘాతుకు నడిగెను. "వీని శిరము ఖండింపుము." వాడు శిరసు ఖండించి "రాజాజ్ఞ నెరవేరినదా దేవా!" అనెను. "ఇంకను కాలేదు" "దేవా, ఏమి చేయుదును?" "ఖడ్గాగ్రమున వీనిని 'అసిమాల' చేయుము." వాడు శవమును ఆకసమున కెగురవేసి, కత్తిచివర అందుకొని 'అసిమాల' చేసి, మాంసము మేడ మీాది కెగురవేసెను. చందాదేవి బోధిసత్త్వునిమాంసము ఒడిలోని కెత్తుకొని ఏడ్చుచు ఈ గాథలు పలికెను :

ఘోరంపు డగు పుత్రహనన వారణము
ఈ రాజునకు చెప్ప నెవ్వరు లేరు.

ఆమె రెండుచేతులతో గుండెమాంసము పట్టి మూడవగాథ పలికెను:

ఉత్తరాధికారి ఉర్వికి నీ ధర్మ
పాలుం, డతని హస్తపాదములును
శిరము చందనమున సిక్తంబు లై
వేరు పడియె, చూడ గుండె పగులం దేవ!

మండెడి వేణువనములో వెదురుబ్రద్దలగునట్టు లామె గుండె బ్రద్దలయి అచ్చటనే చనిపోయెను. రాజు సింహాసనమున గూర్చుండలేక వేదికపై పడిపోయెను. భూమి రెండుఖండములు కాగా అగాధ మేర్పడెను. రాజు దానిలో బడెను. అతని దుర్గుణములు సహింపలేక భూమి రెండులక్షల యోజనములమేర బ్రద్దలయి వానికి త్రోవయిచ్చెను. అవీచినరకజ్వాలలు రేగి కులాగతకంబళమువలె వానిని చుట్టివేసి అవీచిలోనికి ద్రోసివేసెను. అమాత్యులు చందాదేవికి బోధిసత్త్వునకు అంత్యక్రియలు చేసిరి.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకమును పరిపోల్చెను. ఆ కాలమున రాజు దేవదత్తుడు; చందాదేవి మహాప్రజాపతి గౌతమి; ధర్మపాలకుమారుడు నేనే.

## 359 సువర్ణ మృగ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు శ్రావస్తిలోని ఒకానొక కులకన్యనుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆమె శ్రావస్తిలో ఇరువురుశ్రావకుల సేవకపరివారములోనిది. ఆమె శ్రద్ధాళువై, ధర్మసంఘముల యెడ ప్రీతి కలదై సదాచారిణియై, విద్యావతియై, దానాదిపుణ్యకార్యములయం దభిలాష కలదై యుండెను. ఆమెను శ్రావస్తిలోనే సమానకక్ష్య కల కుటుంబములోనివాని కిచ్చి పెద్దలు పెండ్లి చేసిరి. ఆ కుటుంబమువారు మిధ్యాధర్మము నవలంబించువారు. ఆమె తలిదండ్రులు "మాబిడ్డ శ్రద్ధాళువు; త్రిరత్నములయెడ ప్రీతికలది. దానాదిపుణ్యకార్యనిరత. మీరు మిథ్యాదృష్టి కలవా రగుటచే ఈమెను అభిమతప్రకారము దానధర్మములు చేయనీయరు. ధర్మము వినుట, విహారమునకు పోవుట, పంచశీలపాలనము చేయుట, ఉపోసథవ్రతము నవలంబించుట మొదలగు పుణ్యకార్యములు చేయనీయరు అందుచే ఈమెను మీకడకు పంపము" అనిరి.

"మీబిడ్డ మాయింటికి వచ్చి ఆమె యిష్టప్రకారము చేయవచ్చును. ఆమెను మేము అడ్డగింపము. కావున పంపుడు."

"అట్లగుచో తీసికొనిపొండు." సుముహూర్తము చూసి వారామెను వారింటికి కొనిపోయిరి. ఆమె కర్తవ్యపరాణయు సదాచారనిరతయు నై, పతిని దేవతాతుల్యముగా భావించుచు, అత్తమామలకు భర్తకు ఉపచారములు చేయుచుండెను. ఒకనాడామె భర్తతో 'ఆర్యపుత్రా, మీకు విశ్వాసము గల స్థవిరులకు దానమీయవలె'నని కోరిక అనెను.

"భద్రే, మంచిది; నీ యిచ్చవచ్చినట్లు చేయుము."

ఆమె స్థవిరులకు ఆహ్వానము పంపి బాగుగా సత్కరించి భోజనాదికము పెట్టి ఒకప్రక్కన కూర్చుండి 'భదంతులారా, ఈ వంశము వారు మిథ్యాదృష్టి కలవారు. శ్రద్ధ లేనివారు. త్రిరత్నములతో పరిచయము లేనివారు. ఆర్యులారా, ఈ కుటుంబమువారికి త్రిరత్నములతో పరిచయము కలుగువరకును ఈ భిక్ష స్వీకరింపుచుండుడు."

అని విన్నవించెను.

స్థవిరులు స్వీకరించి ప్రతిదినము ఆయింటనే భోజనము చేయుచుండిరి. ఒకనాడామె భర్తతో ఆర్యపుత్రా, స్థవిరులు ప్రతిదినము ఇచ్చటికి వచ్చుచున్నారు. మీరు వారి నేల దర్శింపరు” అనెను.

“మంచిది. వారి దర్శనము చేసెదను” అని ఆమె భర్త మరునాడు స్థవిరులు వచ్చి భోజనము చేసినపిదప ఆర్య ప్రబోధించుటచే వారి కడకు జని కుశల మడిగి ఒకప్రక్క గూరుచుండెను. ధర్మసేనాపతి అతనికి ధర్మోపదేశము చేసెను. అతడు ఉపదేశమగు స్థవిరుని చర్యకు ప్రసన్నచిత్తుడై ఆనాటినుండి స్థవిరులు వచ్చినపుడు వారికి ఆసనములు పరచి నీరు వడియకట్టి భోజనానంతరము ధర్మోపదేశము వినజొచ్చెను. క్రమముగా అతని మిథ్యాదృష్టి తొలగిపోయెను. ఒకనాడు స్థవిరుడు వా రిరువురకు ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటించెను. భార్యాభర్తలు శ్రోతాపత్తిఫలము నొందిరి. ఆవల స్థవిరుడు తలిదండ్రులమొదలు పరివారజనమువరకు ఎల్లరు మిథ్యాదృష్టి విడచి, త్రిరత్నములకు భక్తులైరి. ఒకనాడు ఆమె భర్తతో ‘ఆర్యపుత్రా, నేను గృహవ్రత నగుటవలన లాభ మేమి? ప్రవ్రజింప దలచినాను’ అని విన్నవించెను.

“భద్రే, నేనుకూడ ప్రవ్రజింతును” అని అతడు ఆమెను భిక్షుణీ ఉపాశ్రయమునకు గొనిపోయి ప్రవ్రజితను చేయించి తాను శాస్త కడకు జని ప్రవ్రజ్యము వేడెను. శాస్త అతనికి ప్రవ్రజ్యము, ఉపసంపదయు నొసగెను. వా రిరువురు విదర్శనభావన అభ్యసించి అచిరకాలములోనే అర్హత్వమందిరి.

ఒకనాడు ధర్మసభలో “ఆయుష్మంతులారా, ఫలాని తరుణి భిక్షుణి తాను ప్రవ్రజించి భర్తనుకూడ ప్రవ్రజింప చేసి అర్హత్వము పొంది, అతని యర్హత్వమునకు తోడ్పడెను” అనుచుండిరి. శాస్త అరుదెంచి విషయము గ్రహించి “భిక్షువులారా, ఆమె యిప్పుడే కాదు, పూర్వము కూడ పండితులను మరణపాశము నుండి విముక్తులను చేసిన” దని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ

బోధిసత్త్వుడు లేడికడుపున బుట్టి, పెరిగి, దర్శనీయు డయ్యెను. శరీరము బంగరువలె, కాళ్ళు లాక్షారసచిత్రిత మయినట్లు, కొమ్ములు వెండితీగెల వలె, నేత్రములు మణులవలె, ముఖము ఎర్రకంబలముబంతివలె నుండెను. ఆయనభార్య యైన లేడి చాల చక్కనిది. ఉభయులు కలసి మెలసి యుండిరి. 80వేల సుందరమృగములు బోధిసత్త్వుని సేవించు చుండెను. వేటకాండ్రు మృగములను పట్టుటకై వలలు పన్నుచుండిరి.

ఒకనాడు బోధిసత్త్వుడు మృగములకు ముందు నడచుచుండగా పాదము వలలో జిక్కుకొనెను. ఆయన వలను లాగివేయదలచి కాలు లాగుకొనెను. చర్మము చిదికిపోయెను మరింత లాగునప్పటికి మాంసము పిగిలి, నరము తెగి, వలత్రాడు బొమికను పట్టుకొనెను. జాలమును ఛేదింపజాలనని తెలిసినప్పు డాయన మరణభయముచే పెద్దబొబ్బ పెట్టెను. మృగసమూహము భయపడి పరుగెత్తెను. భార్యమాత్రము జంతుబృందములో భర్తను కానక ఆయన కేదో ఆపద సంభవించె నని భావించి, శీఘ్రముగా ఆయనవద్దకు జేరి అశ్రుపూరితనయనము లతో "స్వామీ, మీరు బలాఢ్యులు. వలను సహింపలేరా? కాలు జాడించి లాగివేయుడు" అని ప్రోత్సాహించుచు ఈ గాథ పలికెను.

విక్రమింపుము మహామృగమా!
విక్రమింపుము స్వర్ణపాదా!!
ఒంటిగా నీ కాననంబున
ఉండలేనయ్యా!

బోధిసత్త్వుడు రెండవ గాథ పలికెను :

విక్రమించితి భద్రురాలా!
వేగముగ తన్నితిని నేలను,
చర్మపాశము నేను త్రెంపం
జాలకున్నాను.
చాల గట్టిది చర్మపాశము
కాలిలోనికి కోత కోయును.

అప్పుడు భార్య "స్వామీ, భయము లేదు. నేను వేటకానిని శక్తి కొలది ప్రార్థించి మిమ్ము రక్షించెదను. ప్రార్థన మన్నింపనిచో నాప్రాణ

ముల నిచ్చి మీ ప్రాణములు కాపాడెదను” అని చెప్పి ఊరడించుచు రక్తసిక్తగాత్రుడైన బోధిసత్త్వుని పట్టుకొని నిలిచియుండెను. ఇంతలో వేటకాడు కత్తితో శక్తి యను ఆయుధముతో కల్పాంతవహ్నివలె నేతెంచుచుండెను. వాని రాక చూచి భార్య “స్వామీ, భయము లేదు. నేను యత్నించెదను. వాడు వచ్చుచున్నాడు” అని ఊరడించి వాని కెదురుగా బోయి ప్రక్క కొదిగి నమస్కరించి “ఆర్యా, నాభర్త సువర్ణాకారుడు, 80 వేల మృగముల కధిపతి” అని బోధిసత్త్వుని ప్రశంస చేసి, తనను వధింపు మని యాచించుచు మూడవ గాథ పలికెను :

ఓయి లుబ్ధక! లాగి నీకా
క్షేయ, మాకులు పఱచి నేలను
తొలుత నే వధియింపు మా
వల మహామృగమున్.

విని వేటకాడు తనలో “మానవజాతిలో స్త్రీలు భర్తలకోసము తమప్రాణముల నొసగరు. ఇది మృగజాతి యయినను పతికొరకు ప్రాణములను విడువనున్నది. మనుష్యవాణిలో మధురముగా పలుకు చున్నది. ఈ రెండిటిని వధింపక ప్రాణములతో నుండనిత్తును” అని తలచి, ప్రసన్నచిత్తుడై నాలుగవ గాథ పలికెను :

మనుజవాక్కుల మృగిని భద్రే!
కనుట! వినుటయు లేదు; సౌఖ్యం
బగును గావుత నీకు నేతన్మృగమునకు గూడన్.

బోధిసత్త్వుడు బంధవిముక్తుడై నపిదప, మృగి ప్రసన్నచిత్తయై మృగయుని ప్రశంసించుచు అయిదవ గాథ పలికెను :

బోధిసత్త్వుడు తనలో “ఇతడు నా కుపకారము చేసినాడు, ప్రత్యుపకారము చేయుదును” అనుకొని కాలికడ నున్న మణిఖండమును వాని కిచ్చి “సౌమ్యా, నేటినుండి ప్రాణిహింస చేయవలదు. దీనితో కుటుంబమును పోషించుకొనుచు, దానధర్మప్రభృతి పుణ్యకార్యములు చేయుచుండుము” అని యుపదేశించి అరణ్యములోనికి బోయెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి జాతకములు పరిసోల్చెను. ఆ కాలమున వేటకాడు ఛన్నుడు; లేడి తరుణభిక్షుణి; మృగరాజు నేనే.

## 360 సుసంధి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, ఉద్విగ్నచిత్తు డగు భిక్షువును గూర్చి, చెప్పినది.

### వర్తమానకథ

శాస్త అతనితో 'భిక్షూ, నీవు సత్యముగా ఉద్విగ్నచిత్తుడ వైతివా ?'' అనెను. ''భన్తే, సత్యముగానే.'' ''ఏమి చూచి ఉద్విగ్న చిత్తుడ వైతివి.'' ''అలంకృతస్త్రీని చూచి.'' అంతట శాస్త ''ఈస్త్రీ రక్షించుటకు వీలుకానిది. పురాణపండితులు స్త్రీని గరుడ భవనము నకు పంపి సురక్షితముగా నుంచుటకై యత్నించి విఫలులైరి'' అని వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో తంబరాజు రాజ్యము చేయుచుండెను. అతనికి సుసంధి యను భార్య మహాసుందరి కలదు. ఆకాలమున బోధి సత్త్వుడు గరుడజాతిలో బుట్టి సేరుమద్వీప మను నామాంతరము కల నాగద్వీపమున గరుడభవనమున నివసించుచుండెను. ఒకసారి యతడు యువకునిరూపమున వారాణసి వచ్చి తంబరాజుతో జూదమాడెను. ఆతని సౌందర్యమును జూచి పరిచారికలు సుసంధితో ''మనరాజుగారితో ఇట్టి యువకుడు జూదమాడుచున్నాడు'' అని చెప్పిరి. ఒకనాడామె అతనిని చూచుకోరికతో పాచికలాడుచోటికి బోయి, పరిచారికలనడుమ నిలిచి చూచెను. అతడుకూడ దేవిని జూచెను. ఉభయులకు పరస్పరాకర్షణము కలిగెను. గరుడరాజు నిజప్రభావముచే నగరమున చీకటి గ్రమ్మునట్లు చేసెను. క్రింద బడిపోవుదు మను భయముచే జనులు నివాసములు వీడి యీవలకు వచ్చిరి. గరుడరాజు సుసంధిని నిజప్రభావముచే ఆకాశమార్గమున నాగద్వీపమునకు గొనిపోయి నిజభవనములో బ్రవేశించెను. సుసంధి యెచ్చటికి బోయెనో ఎవరికిని తెలియలేదు. గరుడు డామెతో భోగించుచు, వారాణసికి వచ్చి రాజుతో జూద మాడి పోవుచుండెను.

రాజుకడ అగ్గు డను గంధర్వు డుండెను. రాజు వానిని బిలిచి

"బాబా, దేవి యెచ్చట నున్నదో జాడతీయుము. స్థలమార్గములు జలమార్గముల గ్రుమ్మరుము" అని చెప్పెను. అతడు ధనము వెంటగొని గ్రామములు గ్రుమ్మరుచు భరుకచ్ఛము చేరెను. అప్పుడు భరుకచ్ఛము నుండి వణిక్కులనౌక స్వర్ణభూమికి బయలుదేర నుండెను. అతడు వారి కడకు బోయి "నేను గంధర్వుడను. పడవ కేవు ఇచ్చుటకు బదులు గీతవాద్యములతో మిమ్ము సంతోషపెట్టుదును. నన్ను నౌకలో గొని పొండు" అని యడిగెను. వారు సమ్మతించి, పడవ నడిపిరి. సుఖప్రయాణము చేయుచున్న ఆనౌకమీద సమావిష్టులై వారు గంధర్వుని బిలిచి "పాట పాడి వాద్యములు మ్రోయింపుము" అనిరి.

"నేను పాడి వాద్యములు వాయించిన పిమ్మట మత్స్యములు కల్లోలము చెందును. నౌక భగ్నమగును." "మానవమాత్రుడి గీతవాద్యములకు మత్స్యము లాకులములు కాను. మేళము కానిమ్ము." "అనంతరము నాపై కోకింపరాదు."

అతడు వీణ తీసి తారస్థాయిలో స్వరమేళనము చేసి పాటపాడు నప్పటికి వివశములై మత్స్యములు కల్లోలము పొందెను. మొసలి యొకటి యెగిరివచ్చి నావలో బడెను.

వాయుతరంగానుసారముగా నౌక జలప్రవాహమున గొట్టుకొని పోయి నాగద్వీపములోని గరుడభవనమునకు సమీపమున మర్రిచెట్టు కడకు జేరెను.

గరుడరాజు ద్యూతమునకు బోవగనే సుసంధిదేవి విమానమున సముద్రతటమున విచరించుచుండెను ఆమె గంధర్వుని జూచి గురుతుపట్టి ఎట్లు వచ్చితి వని యడిగెను. అతడు వృత్తాంతమంతయు వివరించెను. 'నీకు భయము లేదు' అని యామె వాని బాహువులు పట్టుకొని, విమాన మెక్కించి తీసికొనిపోయి, శయ్యపై పండబెట్టెను. అతనికి విశ్రాంతి కలిగిన పిమ్మట దివ్యభోజనము పెట్టి, దివ్యవస్త్రము లిచ్చి, దివ్యగంధపుష్పములతో నలంకరించి, రమ్యశయ్యమీదికి గొనిపోయెను.

ఈవిధముగా వానికి సుసంధి ఉపచారములు చేయుచు, గరుడరాజు వచ్చునప్పటికి వానిని దాచిపెట్టుచు, అతడు వారాణసి పోయినవెంటనే వానితో రమించుచుండెను. ఒకటిన్నరమాసములు గడిచినవి. వారాణసీనివాసి యగు వర్తకుడు వంటచెరకు, మంచినీరు కొరకు నిజనౌకను

సువర్ణద్వీపమందలి న్యగ్రోధముకడకు గొనివచ్చెను. గంధర్వు డానౌక యెక్కి వారాణసి చేరి రాజసన్నిధికి బోయెను. ఆసమయమున గరుడ రాజు తంబరాజుతో పాచిక లాడుచుండెను. గంధర్వుడు రాజసన్ని ధిలో గీతవాద్యములు సాగించుచు గరుడునితో ఈగాధ పలికెను :

వీచు నెచ్చట తిమిగవృక్షగంధానిలము
ఘోషపెట్టునో యెట నకూపార మెల్లపుడు
ఓయి తంబ, సుసంధి యుండునో ఎచ్చోట
అచ్చోట కోరికల్ గ్రుచ్చివేయును నన్ను.

విని గరుడరాజు రెండవ గాధ పలికెను.

ఓ యగ్ర, ఏ రీతి నుదధి దాటితి వీవు ?
ఏ రీతి సేరుమం బీక్షించినాడవో ?
ఇర్వురకు సంధాన మే రీతి ఘటియిల్లె ?

అంతట అగ్రుడు మూడు గాధలు పలికెను :

భరుకచ్ఛమునుండి నావ
బయలు వెడలి వణిజులతో
బ్రద్దలయ్యె తిమింగిలపు
ప్రబలతాడనమ్ము వలన.

చేరుకొంటి ఫలకముపై
తీరమునకు; భద్రురాలు
ఆ చందనలిప్తగాత్రి
ఆత్మజాతు తల్లివోలె

పట్టి యుద్ధరించి, అన్న
పానీయము లంబరములు
నేనీయము నిచ్చి నాకు
స్వయముగ సేవించె నన్ను

తంబ, మత్తనేత్ర చేసె
తానే యని తెలిసికొనుము.

గంధర్వుని పలుకులు విని గరుడరాజు పశ్చాత్తాపము నొంది "సుసంధిని గరుడభవనములో నుంచినను రక్షణ లేకపోయెను. ఈ దుశ్శీలతో నా కేల?" అని తలపోసి ఆమెను గొనివచ్చి రాజుకు సమ

ర్పించి, మరల నెన్నడును అచ్చటికి బోవలేదు.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. ఉద్విగ్నచిత్త భిక్షువు స్రుతాపత్తిఫలము నొందెను. ఆకాలమున రాజు ఆనందుడు; గరుడరాజు నేనే.

## 361 వణ్ణారోహ జాతకము

శాస్త శ్రావస్తిసమీపమునందలి జేతవనమున విహారము చేయుచు, ఇరువురు ప్రధాన సేవకులను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఇరువురు మహాస్థవిరులు ఈ వర్షాకాలము అరణ్యమున గడుపుద మని తలచి పాత్రలు, చీవరములు గైకొని జేతవనము వెలువడి ఒకా నొక ప్రత్యంతగ్రామ సమీపమందలి అరణ్యమున నివసించుచుండిరి. ఉచ్ఛిష్టభోజనము చేయువాడు వారికి సపర్యలు చేయుచు ఒకప్రక్కన నివసించుచుండెను. స్థవిరులు కలసిమెలసి యుండుటచూచి "వీరు అన్యోన్యమైత్రితో నున్నారు. వీరిలో చీలిక గల్పింపగలనా" అని తల పోసి సారిపుత్రస్థవిరుని సన్నిధికి జని "భన్తే, తమకు మహామొగ్గల్యాయ నులతో ఏమైన కలహ బీజమున్నదా?" అనెను.

"ఆయుష్మన్, ఎందులకు?"

భన్తే, నేను ఇచటకు వచ్చిన తరువాత ఆయన మిమ్మొ నిందించు చున్నాడు. జాతిలో, గోత్రములో, సూత్రపారములో, జ్ఞానములో నాతో పోటీచేయగలడా?" అన్నాడు. స్థవిరుడు మందహాసము చేసి "ఆయుష్మన్, నీవు నడువుము" అని యానతిచ్చెను. వాడు మరునాడు మహామొగ్గల్యాయనుని కడకు జని ఇట్లే ప్రసంగించెను. ఆయన చిరు నవ్వుతో "ఆయుష్మన్, నీవు నడువుము" అనెను. అనంతరము మహా మొగ్గల్యాయనుడు సారిపుత్రునికడకు బోయి "ఆయుష్మన్, ఉచ్ఛిష్ట

భోక్త నీకడకు వచ్చి ఏమైన చెప్పినాడా?" అని అడిగెను.

"ఆయుష్మన్, అవును నాతో చెప్పినాడు, వీనిని మనము వెడలనంప వలెను."

"ఆయుష్మన్, మంచిది. వీనిని పంపివేయుము" అని "నీవిచట నుండవలదు" అని వానిని గెంటివైచెను. వారిరువురు మరల కలసి యుండిరి. ఆవల వారు శాస్త్రకడ కేగి ప్రణామము చేసి కూరుచుండి, కుశలప్రశ్నములు వేసి "భన్తే, ఉచ్ఛిష్టభోక్త మాలో భేదము కల్పింప యత్నించి విఫలుడై వెడలిపోయెను" అనిరి.

శాస్త్ర "ఉచ్ఛిష్టభోక్త ఇపుడే కాదు. పూర్వముకూడ మీలో చీలిక కల్పింప యత్నించి విఫలుడై వెడలిపోయినాడు" అని వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు అడవిలో వృక్షదేవతగా నుండెను. ఆకాలమున సింహము, వ్యాఘ్రము అడవిలో పర్వతగుహలో నివసించుచుండెను. నక్క వాని సేవలో నుండి ఉచ్ఛిష్టము భుజించుచు, బలిసి, యొకనాడు తనలో "నేను సింహ వ్యాఘ్ర మాంసము లెన్నడును భుజింపలేదు. వీనికి తంత్రము పన్ని వైరము పెట్టవలెను. ఇవి కలహించి మరణించి నపుడు వీని మాంసము మెక్కుదును" అని తలచి సింహముకడకు బోయి "స్వామీ, మీకు పులితో నేమైన వైర మున్నదా?" అనెను.

"సౌమ్యా, ఏమి మాట ?"

"భన్తే, నేను వచ్చునపుడు పెద్దపులి మిమ్ము నిందించుచుండెను. ఒడలిరంగులో గాని శరీరసంఘటనలో గాని, జాతిలో గాని, బలములో గాని, వీర్యములో గాని నాలో ఒక్కవంతయినను లేదన్నది."

"నీవు పో. ఇట్లు పలుకదు."

అపుడు నక్క వ్యాఘ్రముకడకు బోయి పైవిధముగానే చెప్పెను. విని పులి సింహముకడకు బోయి "మిత్రమా, నీవు ఇదిఇది అంటివా?" అని యడుగుచు తొలిగాథ పలికెను :

వర్ణ మందు జాతియందు
బలమునందు విక్రమమున
పదారునకు హెచ్చుకాడు
సుబాహు డని పల్కితివా ?

విని సింహాము నాలుగు గాధలు పలికెను :

ఇట్లె నన్ను నీవు కూడ
హేళన మొనరించినట్లు
నక్క చెప్పి నపుడు తోచె
నాకు నిట్లు: "విద్వేషము
రవులుకొల్ప సృగాలంబు
ప్రయత్నమ్ము చేయు; నింక
పనికిరాదు దీనితోడు"
ఎవ్వడైన నొరులతోడ
ఏవో చెప్పి విశ్వాసము
కలిగించుచు మిత్రభేద
కల్పనమ్ము చేయు నెడల
గాఢ ద్వేషము జనించు
స్వాంతమందు, నెవ్వడేని
సర్వదా విభేదభీతి
అప్రమత్తుడై లోపం
బన్వేషించుచు నుండునో
అతడు మిత్రంబు కాడు
స్నిగ్ధ డతడె మిత్రునకుం
జెరుపు చేయ, కాతనియొడి
తల యుంచుచు పండుకొనునో
తల్లియొడిని బిడ్డవోలె.

ఇట్లు సింహాము తనగుణగణమును ప్రశంసింపగా పులి తన పొర పాటు గ్రహించి సింహామును క్షమాపణ వేడెను. ఉభయులు యథాప్రకారము కలసిమెలసి యుండిరి. కాని, నక్కమాత్రము వేరొకచోటికి పారిపోయెను.

## 362 శీలవీమంస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు సదాచారమును పరీక్షించువానిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

రాజు అయనను అన్యబ్రాహ్మణులకన్న అధికముగా గౌరవించు చుండెను. ఆయన సదాచారి యగుటయే కారణము. బ్రాహ్మణుడు తనలో "నేను సదాచారుడ నని రాజు సమ్మానించుచున్నాడా? బహు శ్రుతుడ నని సమ్మానించుచున్నాడా? ఈ విషయమై పరీక్ష చేసెదను" అనుకొని ఒకనాడు షరాబుదుకాణములో కార్షాపణములు రాసిగా నుండగా ఒకకార్షాపణమును తీసికొనిపోయెను. గౌరవముచే షరాబు ఏమియు ననలేదు. రెండవసారి ఇట్లే జరిగినపుడుకూడ అత డేమియు పలుకలేదు. కాని మూడవసారి ఇట్లే జరిగినపుడు బ్రాహ్మణుని పట్టుకొని షరాబు రాజుకడకు తీసికొనిపోయి "దేవా, ఈయన పచ్చిదొంగ" అని విన్నవించెను. "ఈయన ఏమి చేసినాడు?" అని రాజడిగెను.

"మా కుటుంబసంపదను హరించుచున్నాడు."

"బ్రాహ్మణోత్తమా, నిజమేనా?"

"మహారాజా, ఈయనకుటుంబసంపదను నేను హరించుట లేదు. సదాచార మధికమా బహుశ్రుతి అధికమా అను సందేహము కలిగి పరీక్ష చేయనెంచి మూడుపర్యాయములు కార్షాపణము లెత్తితిని. ఈయన నన్ను కట్టి మీకడకు గొనివచ్చినాడు. బహుశ్రుతత్వము కన్న సదాచారమే అధికమైన దని ఇపుడు తెలిసికొన్నాను. ఇక గృహస్థుగా నుండక ప్రవ్రజింతును."

బ్రాహ్మణుడు ఇంటిగుమ్మమువైపు చూడక జేతవనమునకు బోయి శాస్తను వేడి ప్రవ్రజించెను. ఉపసంపదకూడ లభించినది. ఆవల విపశ్యనాభావన నభ్యసించి అగ్రఫలము (అర్హత్వము) పొందెను.

భిక్షువులు ధర్మసభలో చేరి ఈవిషయము చర్చించుచుండగా, శాస్త అరుదెంచి సంగతిగ్రహించి "భిక్షువులారా, ఇప్పుడే కాదు. పూర్వముకూడ పండితులు తమశీలమును పరీక్షించుకొని ప్రవ్రజించి సుప్రతిష్ఠితు లైరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున బుట్టి, పెరిగి, విద్య లన్నియు నేర్చి, వారాణసికి మరలివచ్చి రాజును కలిసికొనెను. రా జాయనను తన పురోహితునిగా నియమించెను. ఆయన పంచశీలములను రక్షించుచుండెను. ఆయన సదాచారసంపన్ను డని గ్రహించి రాజు ఆదరించుచుండెను. తనను రాజు సదాచారసంపన్నతకో, బహుశ్రుతు డయి యుండుటకో, దేనికి ఆదరించుచున్నాడో యనుకొనెను. వర్తమాన కథతో అంతయు సరిపోవును. కాని ఈకథతో ఆబ్రాహ్మణుడు తనను రాజు గౌరవించుట సదాచారసంపన్నతకే అని గ్రహించి ఈ యయిదు గాథలు పలికెను:

శీలమా మరి బహుశ్రుతియా
శ్రేష్ఠ మెయ్యది యనెడి సందే
హమ్ము పూర్వం బుండె, శీలమె
అధిక మని యిప్పుడు తలంతును.

నిక్కముగ శ్రేష్ఠంబు శీలమె,
నిష్ఫలంబులు జాతివర్ణము;
లెవని కుండునో శీల మతనికి
నేమి కార్యము బహుశ్రుతితో ?

ఎవ రధార్మికు లైన- క్షత్రియు
లేని, వైశ్యులు కాని- వారలు
విడిచి దేవ మనుష్యలోకా
లడిగిపోవుచునుంద్రు దుర్గతి.

ఇటటి ధర్మాచరణమున నే
ఎల్లవారలు దేవతాసము
లగుచునుందురు; వేద మైనను
జాతి యైనను, బంధు వైనను
సౌఖ్య మొసగుట కల్ల పరలో
కమున; సుఖదాయకము నిడు
విమలశీలం బొకటియే సుమి.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు శీలమును ప్రశంసించి, ప్రవ్రజించు

టకై రాజుననుమతి గొని, ఆనాడే హిమాలయమునకు బోయి, ప్రవ్రజించి, అభిజ్ఞులను సమాపత్తులను పొంది, బ్రహ్మలోకపరాయణుడయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు పరిపోల్చెను. ఆకాలమున శీలపరీక్షకుడు నేనే.

## 363 హిరి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు అనాథపిండికుని మిత్రుడు ప్రత్యంతగ్రామ నివాసి యగు శ్రేష్ఠిని గూర్చి చెప్పినది.

### అతీత కథ

రెండుకథలును ప్రథమనిపాతములో నవమవర్గములో తుదిజాతక కథలో సవిస్తరముగా వచ్చినవి. ఈ కథలో మాత్రము సరిహద్దు శ్రేష్ఠి పరిజనులు వారాణసీ శ్రేష్ఠితో "మాసంపత్తి యంతయు కోలుపోయినపిదప పారిపోతిమి" అని చెప్పిరి. అంతట వారణాసీశ్రేష్ఠి తమ కడకు వచ్చినవారి యెడ కర్తవ్యమును "ఎవరు నిర్వహింపరో వారికి ఉపకార మొనర్చువారు ఎచ్చటను లభింపరు" అని చెప్పి ఈక్రింది గాథలు పలికెను.

సిగ్గు విడిచి సత్కార్మలు
చేయకుండ నేను యుష్మ
దీయుడ నని చాటువాడు
తెలిసికొనగవలెను నేను
దీని కిష్ట పడ నటంచు.

చేయుదాని చెప్పవలెను
చెప్పుదాని చేయవలెను
చేయకుండ చేసినట్లు
చెప్పినచో గ్రహియింతురు

ఎరుక గలుగువారు; వైర
మెప్పుడు శంకించుచుండి
అప్రమాదమున మెలగుచు
ఆప్తుని లోపములు వెదకు
నతడు కాడు సుహృత్తముడు.

ప్రమోదంబు సౌఖ్యంబును
ప్రశంసయును ప్రాప్తించు
ననెడి యాశతోడ మైత్రి
అభివృద్ధిని గాంచుచుండు.

శాంతరసము గ్రోలుచు నే
కాంతముగా వసియించుచు
ధర్మప్రీతిరసంబును
త్రావువాని నెన్నండును
తాకవు భీపాపంబులు.

ఈరీతిగా బోధిసత్త్వుడు పాపులైన మిత్రుల సంసర్గమునకు ఉద్విగ్నుడై ఏకాంతవాస మొనర్చి మహానిర్వాణమును జెంది ధర్మాదేశమును పెంపొందించెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశముచేసి జాతకములను సరిపోల్చెను. అప్పటి సరిహద్దు నివాసి ఇప్పటి సరిహద్దు నివాసియే. అప్పటి వారణాసీ శ్రేష్ఠిని నేనే.

## 364 ఖజ్జోపనక జాతకము

-ఈ ఖద్యోపనక - పన్హో మహాఉమ్మగ్గ జాతకమున (546) విస్తరముగా నుండును.

## 365 అహితుండిక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచూ, ఒకానొక వృద్ధుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కథ సాలకజాతకమున (249) వచ్చినది. ఈకథలో కూడ ఆ వృద్ధుడు గ్రామబాలకుని సాధువు చేయుటకై తిట్టుచు కొట్టుచు నుండెను. ఆ బాలుడు పారిపోయి సాధువుకానేలేదు. రెండవసారికూడవానిని సాధువును చేయుటకై వృద్ధుడు యత్నించెను; ప్రయత్నము లాభింప లేదు. వేరొకమారు మాటాడగా వాడు కనబడుటకు గూడ ఇచ్ఛ చూపలేదు. ఈ విషయమై ధర్మసభలో చర్చజరుగుచుండగా శాస్త అరుగుదెంచి విషయము గ్రహించి, "భిక్షువులారా, కేవల మిప్పుడేకాదు, పూర్వము కూడ సహృదయుడై, ఒక్కసారి దోషము చూసిమరల కనబడదల పెట్టలేదు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడు ధాన్యవర్తకునియింట బుట్టిపెరిగి పెద్దవాడయి, ధాన్య వ్యాపారమువలన జీవనముచేయుచుండెను. పాములవాడు కోతినిపెంచి దాని కాటనేర్పి, పాముల నాడించుచుండెను. వారాణసిలో ఉత్సవమునకు వచ్చి, ధాన్యవ్యాపారియింట కోతిని విడిచి తమాషాలు చేయుచు ఏడుదినములు తిరుగుచుండెను. వ్యాపారి కోతికి ఖాద్యములు, భోజ్యములును పెట్టెను. పాములవాడు ఏడవనాడు వచ్చి ఉత్సవములో మత్తెక్కియుండుటచే వెదురుకర్రతో కోతిని మూడుసారులు మోది, ఉద్యానమునకు గొనిపోయి, బంధించి పండుకొనెను. కోతి కట్టు విప్పుకొని మామిడి చెట్టెక్కి పండ్లుతినుచుండెను. వాడు లేచి, చెట్టుమీది కోతిని చూచి, దానిని మోసగించి పట్టుకొన తలచి దానితో మాటాడుచు ఈగాథ పలికెను :

> ద్యూతమున మిత్రంబ సుముఖా,
> ఓడిపోతిని కోయుమా ప
> క్వామ్రఫలములు శక్తికొలదిని
> ఆరగించెదము.

విని కోతి మిగిలిన గాథలు పలికెను :

ఈ యలీకప్రశంసలు
ఏల సౌమ్యా, మర్కటంబుల
సుముఖముల నీ వెచట నేనియు
చూచినాడవొ, విన్నవాడవొ ?

కొట్టితివి ముమ్మారు ధాన్యపు
కొట్టులో నా మూతిమీదను
మత్తులో అహితుండికా, నే
మరవలేదు సుమా.

నేటి ఘటనము తలచుకొన్నను
మేటిభయము జనించు; రాజ్యము
వాకు జూపుచు నీవు వేడిన
నీకు ఫల మొసగక
కిలము, నా గర్భంపుసౌఖ్యము
దెలిసికొని, నిర్మత్సరుం డగు
వానితోడను మైత్త్రి నెరపగ
వలయు ధీరుండు.

ఇట్లు పలికి మర్కటము శీఘ్రముగా అడవిలో జొరబడెను.

శాస్త్ర ఈధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున పాములవాడు వృద్ధస్థవిరుడు; వానరము శ్రమణుడు; ధాన్యవాపారి నేనే.

## 366 గుంబియ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, ఒకానొక ఉద్విగ్నచిత్తు డగు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త్ర అతనితో "భిక్షూ, సత్యముగా నీవు ఉద్విగ్నచిత్తుడ వైతివా?" అనెను. 'భన్తే, సత్యమే.' 'ఏమి చూచి ఉద్విగ్నచిత్తుడ

వైతివి?' 'అలంకృతస్త్రీని చూచి.' "భిక్షూ, ఈ ఐదు కామభోగములు గుంబియ యక్షుడు విషము కలిపి తేనె మార్గమధ్యమునం దుంచిన ట్లున్నవి" అని శాస్త, వాని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వణిక్కులమున బుట్టి పెరిగి పెద్దవాడయి, 500 శకటములలో సామానులు తీసికొని వ్యాపారార్థము వారాణసినుండి బయలుదేరి మార్గమున బోవుచు అరణ్యాముఖమున ఆగి వర్తకులను సమావేశపరచి, "ఈ మార్గమున విషవృక్షములు, ఆకులు ఉన్నవి. ఇదివరలో మీరు తినియుండని పదార్థము కానబడినచో నాతో జెప్పకుండ భుజింపవలదు. అమనుష్యులు (యక్షాదులు) విషము కలిపిన భోజనపుమూటలు, విషము నింపిన తేనెపెరలు, ఫలాదులు మార్గములో నుంచి పోవుదురు. నాకు దెలుపకుండ అట్టివానిని సైతము భుజింపరాదు" అని యుపదేశించి బయలుదేరెను.

గుంబియు డను యక్షుడు అరణ్యములో మార్గముప్రక్క ఆకులు పరచి, విషాక్తమైన మధుపిండము నుంచి సమీపములో తేనె సేకరించుచు చెట్లమాటున తిరుగుచుండెను. పుణ్యముకై ఎవరో వానినక్కడ నుంచిరని యెరుగనివారు తలచి, భుజించి మరణించుచుందురు. యక్షాదులు ఆశవములను తినుచుందురు. బోధిసత్త్వుని బిడారములోని కొందరు లోభులు ఆపుకొనలేక దానిని భుజించిరి. బుద్ధిమంతులు నిలువబడి అడిగిన తరువాత భుజింతు మనుకొనిరి. భోధిసత్త్వు డింతలో వచ్చి మధుపిండములు చేతబట్టుకొన్నవారితో వానిని పారవేయు డని చెప్పెను. తొలుత భుజించినవారు మృతినొందిరి. కొంచెము తిన్నవారికి వమన విరేచనము లగుటకు చతుర్మధువు లిచ్చిరి. వారు బ్రదికిరి.

భోధిసత్త్వుడు కుశలముగా గమ్యస్థానము చేరి, సరకులమ్మి, నిజస్థానమునకు మరలివచ్చెను.

ఈవిషయము చెప్పి, శాస్త అభిసంబుద్ధుడైన పిదప ఈగాథలు పలికెను :

ఆహారార్థము గుంబియు
అన్వేషించుచు వనమున
మధువర్ణము మధురసంబు
మధుగంధము కల్గువిషము
చల్లెను; దానిని మధు వని
చవి చూచినవారు మిగుల
తాప మొంది మరణించిరి.

దానిని విషముగ గ్రహించి
స్పర్శ చేయనట్టివారు
శాంతిసుఖంబుల నుండిరి;
ఇట్లె లోకమందు గూడ.

ఎవ్వరు విషసదృశము లగు
కామభోక్తలామిషభుక్కు-
లా మనుజాలు మృత్యుపాశ
ములకు జిక్కి- అడగుచుంద్రు;
ఇట్లె క్లేశదాసులందు
నే ప్రాజ్ఞులు కామభోగ
వర్జనంబు కావింతురో
వారు సంగవివర్జితులు.

శాస్త సత్యప్రకాశనము చేసి జాతకములు పరిపోల్చెను. ఉద్విగ్నచిత్త భిక్షువు శ్రోతాపత్తిఫలము నొందెను. ఆ కాలమున బిడారునాయకుడు నేనే.

## 367 సాలియ జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు "ఆయుష్మాన్, దేవదత్తుడు త్రాసకారకుడు కాకుండుగాక" అను వచనమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అప్పుడు శాస్త "కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ ఇతడు

నాకు త్రాసకారణము కూడ కాలేకపోయెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడొకానొక గృహస్థునియింట పుట్టి బాల్యములో సాటి బాలకులతో పాటు మర్రిచెట్టుకడ ఆడుచుండెను. రోగులెవ్వరును తనకడకు రాని బడుగువైద్యుడొకడు మర్రితొర్రలోనుండి తల యీవలకు బెట్టి నిద్రించుచున్న సర్పమును జూచి "గ్రామములో నాకేమియు లబ్ధిలేదు. ఈ బాలురను మోసగించి, పాముచే కరపించి, చికిత్స చేసినచో ఏమైన లభించును" అని యోచించి బోధిసత్త్వుని బిలిచి "మైనా దొరకినచో తీసికొందువా?" అనెను.

"ఆఁ".

"అదుగో, తొర్రలో పండుకొన్నది."

అది సర్పమని తెలియక బోధిసత్త్వుడు చెట్టెక్కి దాని మెడ పట్టుకొనెను. పామని తెలియగానే దానిని వంపు తిరుగనీయక గట్టిగా బట్టుకొని సత్తువకొలది విసరిపారవేసెను. పోయి అది వైద్యుని మెడమీదబడి కాటువేసెను. వైద్యుడు దానిని క్రిందికి ద్రోసి పరుగెత్తెను. మనుష్యులు గుమిగూడిరి, సమావిష్టులైన జనులకు బోధిసత్త్వుడు ధర్మోపదేశము చేయువాడై ఈ గాథలు పలికెను :

కలవింకపుశాబక మని
కాలవ్యాళంబు నెవడు
పట్టుకొనియె, దానికాటు
వలన నతడు మరణమొందె.

చంపగోరి యొరుల నెవడు
జంపనేరడో యతండు
ఇతనివలెనె కన్నుమూయు
ఎవ్వడైన గాని గాలి
కెదురుగాను గుప్పెడిసుక
చల్లునేని, వెనుదిరుగుచు
పెల్లుగ నది దెబ్బతీయు

విధమున హరియించు దుష్ట
విధానమ్ము వెనుదిరుగుచు.

సన్నధూళి గాలి కెదురు
చల్లువాని మీదికెతుది
సోకునట్లు వెనుదిరుగుచు,
శుద్ధులు నిర్మలుడు దోష
శూన్యుడైనవాని యెడల
దోషం బాపాదించెడి
దుష్టునకంటును పాపము.

శాస్త ఈధర్మోపదేశముచేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున దుర్బలవైద్యుడు దేవదత్తుడు; బుద్ధిమంతు డగు బాలుడు నేనే.

## 368 కచసార జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, ప్రజ్ఞాపారమితను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త వారితో "భిక్షువులారా, తథాగతుడు ఇప్పుడే కాదు, పూర్వము కూడ ప్రజ్ఞావంతుడు, ఉపాయకుశలుడు నయి యుండెను" లేని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఒకానొక గృహస్థునియింట బుట్టె...(అంతయు వెనుకటి కథవలెనే). వైద్యుడు మరణించిన పిదప గ్రామవాసులు చూచి ఆబాలకులు వానిని హత్య చేసి రని తలచి, వారిని బంధించి, శిక్షించుటకై వారాణసిలో రాజుకడకు గొనిపోయిరి. త్రోవలో బోధిసత్త్వుడు బాలకులతో 'మీరు భయపడవలదు. రాజసన్నిధికి బోయినప్పుడుకూడ

సంతుష్టచిత్తములతో ప్రసన్నవదనములతో నుండుడు. రాజు నాతో తొలుత మాటలాడును. అనంతర మేమి చేయవలెనో నేను తెలుపుదును. వారు సరే అని అటులే చేసిరి. వారు నిర్భీతులుగా ప్రసన్న చిత్తులుగా నుండుట చూచి రాజు తనలో "మనుష్యుని హత్య చేసినారని వీరిని బంధించి తెచ్చినాడు. ఇట్టి కష్టములో నున్నను వీరు నిర్భీకులుగా ప్రసన్నవదనములతో నున్నారు. వీరికి విచారము లేకుండుటకు కారణ మేమో కనుగొందును" అని వారిని ప్రశ్నించువాడై ఈ తొలిగాథ పలికెను:

పట్టుపడియు అమిత్రులకు
కట్టుపడియు బంధనమున
శాంతముఖుడ వైన నీకు
చింత యేల లేకున్నది ?

విని, బోధిసత్త్వుడు మిగిలిన గాథలు పలికెను:

కొలదిలాభ మొదవగలదు
విలపింపక చింతింపక
నున్నయెడల ప్రసన్నముగ
నుందురు శాత్రవుడుకూడ.

అర్థవినిమయమున వేత్త
లైనవార లాపదలందు
సుస్థిరముగ నున్నయెడల
చూచి వికారమ్ము లేని
పూర్వముఖము లరులైనను
పొందగలరు విచారమ్ము
అర్థసిద్ధి కూర్చునుపా
యముల ననుసరింపవలయు;
మంత్రజపమొ, సుభాషితమొ,
మంతనమ్మొ కులక్రమపు
సంబంధము, దానధర్మ
సరణియొ గ్రహియింపవలయు.

స్వయముగానో అన్యజనుల
వలననో ఉద్దిష్టార్థము

ప్రాప్తి శూన్య మని తెలిసిన
పట్టులందు దుఃఖింపక
దృఢము పూర్వకర్మం బని
ఏమి చేయగల ననియు
గ్రహియించిన పిదప నరుడు
సహనము వహియింపవలెను.

బోధిసత్త్వుని ధార్మికకథ విని రాజు విచారణ చేసి, బాలురు నిర్దోషు లని నిరూపించి, బంధనములు తొలగించి, బోధిసత్త్వుని హెచ్చుగా గౌరవించి, అర్థధర్మానుశాసకు డైన అమాత్యరత్నముగా నియమించెను; మిగిలిన బాలురను గూడ బాగుగా నాదరించి ఒక్కొక్కరికి తగిన పదవుల నిచ్చెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, రెండు జాతకములు సరిపోల్చెను. ఆకాలమున వారాణసీనరేశుడు ఆనందుడు; కుర్రవాడు స్థవిరానుస్థవిరుడు; పండితబాలుడు నేనే.

## 369 మిత్తవిందక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఒక్కమాటమీద నిలవని భిక్షువునుగూర్చి చెప్పినది.

### అతీత కథ

మహామిత్రవిందక జాతకమున (439) సవిస్తరముగా నుండును. ఈ కథలో మిత్రవిందకుడు సముద్రమున బడినతరువాత మహాలోభమున ముందరికి జని, నరకగామిప్రాణులను ఉడకబెట్టు 'ఉస్సదనరకము' చూచి, పట్టన మనుకొని ప్రవేశించి, ఖురచక్రబాధ లనుభవించెను. ఆసమయమున బోధిసత్త్వుడు దేవపుత్రరూపమున ఉస్సద-నరకమున విచరించుచుండెను. ఆయనను జూచి ప్రశ్నించువాడై అత డీగాథ పలికెను:

ఏమి యపరాధమ్ము చేసితి
స్వామి! నే దేవతలయెడలనో?
ఏమి పాపము చేసినానో
ఎల్లపుడు నా శిరము చుట్టును
చక్ర మొక్కటి తిరుగు;

బోధిసత్త్వుడు విని రెండవగాధ పలికెను:

రమణక
సదామత్తక దూహాకంబులు
బ్రహ్మోత్తరప్రాసాదంబుల
పరిత్యజించి ఇచటి కేలను
వచ్చినాడవో?

అప్పుడు మిత్రవిందకుడు మూడవగాధ పలికెను:

దానికన్నను
ఇచ్చోట విశేషభోగము
లందవచ్చు నన్న భ్రాంతి
పొంది యనంతదుఃఖ
మందు వచ్చిపడినాడను.

అంతట బోధిసత్త్వుడు మిగిలిన గాధలు పలికెను:

ఆనాలుగునుండి యెనిమి
దష్టమునుండి షోడశంబు!
అచటినుండి ద్వాత్రింశ
త్తాశపడుటచేత చక్ర
మవతరించె తలమీదికి
గిర గిర గిర గిర చక్రము
తిరుగుఁ లోభతాడితజను
శిరముమీద నిరంతరము.

మిత్రవిందకుడు మాటాడుచుండగనే ఆ చక్రము వానిని మెలిబెట్టి గిర్రున తిరిగి అదృశ్యమయ్యెను. అందువలన వా డేమియు పలుకుట కశక్తు డాయెను. దేవపుత్రుడు నిజస్థానమునకు బోయెను.

శాస్త్ర ఈధర్మోపదేశము చేసి, జాతకములు పరిపోల్చెను. ఆకాలమున మిత్రవిందకుడ మాట వినని భిక్షువు; దేవపుత్రుఁడు నేనే.

## 370 పలాస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కాముకత్వనిగ్రహమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త భిక్షువులను పిలువనంపి "కాముకతవలన సందేహముతో నుండుట సంభవించును; వటవృక్షమువలె వినాశకారణ మగును. ప్రాచీనపండితులు శంకింప దగిన విషయములను శంకించుచునే యుండిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సువర్ణహంసకడుపున బుట్టి పెరిగి, చిత్రకూటపర్వతము మీద స్వర్ణగుహాలో నివసించుచు, హిమాలయప్రదేశమున నొకజలాశయమున స్వయముగా మొలుచు ధాన్యమును తిని వచ్చుచుండును. వచ్చి పోవు మార్గమున పెద్దపలాశవృక్షము కలదు. హంస పోవునపుడును వచ్చునపుడును దానిపై విశ్రమించుచుండును. ఆవృక్షదేవతకును హంసకును మైత్రి కుదిరెను. అటుతరువాత ఒకపక్షి మఱ్ఱిపండు తిని వచ్చి, పలాశవృక్షముమీద వాలి, కొమ్మలనడుమ రెట్టవేసెను. దానివలన మఱ్ఱిమొక్క మొలిచెను. అది నాలుగంగుళములు పెరిగినపుడు ఎఱ్ఱనియాకులు వేసి కన్నులపండువుగా నుండెను. అది చూచి హంస రాజువృక్షదేవతను బిలిచి "ఇది యేచెట్టుమీద పెరుగునో దానిని హరించును. దీనిని వెంటనే పీకివేయుము. సంశయాస్పదములగువానిని సంశయింపవలెను. హంస పలాశదేవతకు ఉపదేశమిచ్చుచు తొలిగాథ పలికెను :

అనె పలాశమ్ముతో హంస యీ రీతి;
ఉద్భవించిన వటం బొడిలోనె యుండె
నిక్కంబుగా తీయు నీప్రాణములను.

అంగీకరింపక వృక్షదేవత యిట్లు పలికెను.

అభివృద్ధిని గాంచనిమ్ము !
ఆధారముగా నుండును;

జననీ జనకులవిధాన
సంబంధం బుండుగాక.

హంస మూడవ గాథ పలికెను :

అడుగుదు నీవు తెలియజెప్పి,
అతిభయదము వటవృక్షము
ఒడినిడుకొని పోషించుచు
నున్నావు; నిద్దాని వృద్ధి
ఒప్పుటలేదు నామనసు.

ఇట్లు పలికి హంసరాజు రెక్కలు సారించి చిత్రకూటపర్వతమున కెగసిపోయెను. మరల నెన్నడు పలాశముమీదికి బోవలేదు. మఱ్ఱి పెరిగి, మోదుగును చుట్టివేసెను. శాఖలతో దేవతావిమానముకూడ పడిపోయెను. అప్పుడు వృక్షదేవత బోధిసత్త్వుని మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని, రానున్న ఆపదను గూర్చి ఆయన చెప్పినప్పుడు విననైతిని అని యేడ్చి మొత్తుకొనుచు ఈ గాథ పలికెను :

భయము కలుగు నిపుడు; హంస
భాషితమ్ము గ్రహియింపమి
పర్వతమ్మువంటి మహా
పద సంఘటితం బైనది.

వటవృక్షము పెరిగి మోదుగను మోడుచేసెను. దేవతా విమానము పూర్ణముగా నష్టమాయెను.

అభిసంబుద్ధగాథ :

అభివృద్ధిం గాంచు చెద్ది
ఆత్మీయాధారము నే
భక్షించెడి దానివృద్ధి
ప్రశంసింప రార్యజనులు
ఉత్పన్నము కానుండెడి
యుపరోధము శంకతోడ
ధీరుడు తన్మూలము నే
త్రెంచివేయ యత్నించును.

శాస్త్ర ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి, రెండుజాతకములు సరిపోల్చెను. అయిదువందల భిక్షువులు అర్హత్వ మొందిరి. ఆకాలమున స్వర్ణహంస నేనే.

# 371 దీధితి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోశాంబిలో కలహప్రియునిగూర్చి చెప్పినది.

## వర్తమానకథ

వారు జేతవనమునకు క్షమాపణ వేడుసమయమున శాస్త వారిని సంబోధించి "భిక్షువులారా, మీరు నానోట వెడలిన బిడ్డలు. తండ్రి చెప్పినప్రకారము బిడ్డలు నడచుకొనవలెను. మీరు ఉపదేశానుసారము ప్రవర్తించుట లేదు. పూర్వము తమతలిదండ్రులను బాధించి, రాజ్యమునకు వచ్చినచోరులు అడవిలో తమచేత జిక్కినను ప్రాచీనపండితులు జననీజనకులమాట నుల్లంఘింపక, చోరులను సంహరింపలేదు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

సంఘభేదకజాతకమున ఈ కథ సవిస్తరముగా నుండును. దీర్ఘాయు కుమారుడు అరణ్యములో వారాణసీరాజును జుట్టు పట్టుకొని కత్తి యెత్తి "నా తలిదండ్రులను వధించిన వానిని పదునాలుగు ముక్కలు చేయుదును" అనుకొనెను. కాని తలిదండ్రు లిచ్చిన యుపదేశము జ్ఞప్తికి వచ్చి, ప్రాణముపోయినను వారి యానతి నుల్లఘింపను, ఈయనను బెదరింతును అని తలపోసి, తొలిగాథ పలికెను :

ఇట్లు నాకు చిక్కి రాజ!
ఈ యుపద్రవమ్మునుండి
తప్పించుకొనంగ నీకు
దారి యున్న దని తలంతువ ?

రాజు రెండవ గాథ పలికెను :

ఇట్లు నీకు చిక్కి బాబ,
ఈ యుపద్రవమ్మునుండి
తప్పించుకొనంగ నాకు
దారియున్న దని తలంతువ ?

అంతట బోధిసత్త్వుడు మిగిలిన గాథలు పలికెను :

సుచరితంబు తప్ప రాజ!
సుభాషితంబు తప్ప నన్ను
మిట్టి రణసమయమందు
నేది రక్షచేయు? ధనం
బట్టివేళ నిరర్థకము.

నన్ను తిట్టె, నన్ను కొట్టె
నన్ను గెలిచె ముచ్చిలియెను
అన్య లని తలంచుచుండు
నట్టివారి వైరభావ
మెట్టు లుపశమింప గలదు?

వైర మెపుడు శాంతి గనదు
వైరముచే; అవైరముననె
శాంతి గాంచు; ఇదియె లోక
సనాతనం బగు నియమము.

ఇట్లు పలికి బోధిసత్త్వు డాయన చేతికి ఖడ్గ మిచ్చుచు "మహా రాజా, నాకు మీయెడ ద్వేషము లేదు. నన్ను సంహరింపుడు" అనెను. రాజుకూడ "నాకు నీమీద ద్వేషము లేదు" అని శపథము చేసి, అతనితో నగరము చేరి అమాత్యుల కాతనిపరిచయము చేసి "ఈయన కోసలరాజపుత్రుడు, దీర్ఘాయుకుమారుడు. ఈయన నాకు ప్రాణదానము చేసినాడు. ఈయనకు నేను ప్రత్యుపకారము చేయలే నైతిని" అని తన పుత్రిక నిచ్చి, వివాహము చేసి, పితృసింహాసనమున నతనిని ప్రతిష్ఠించెను. నాటినుండి యుభయులు సఖ్యతతో రాజ్యములు పరిపాలించుచుండిరి.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున తలిదండ్రులు మహారాజకులము వారు; దీర్ఘాయుకుమారుడు నేనే.

# 372 మిగపోతక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఒకానొకవృద్ధుని గూర్చి చెప్పినది.

## వర్తమానకథ

ఆత డొక బాలుని ప్రవ్రజితుని జేసెను. ఆశ్రమణుడు వృద్ధునకు బాగుగా సేవలు చేయుచు, రోగగ్రస్తుడై మరణించెను. వృద్ధుడు శోకాభిభూతుడై గట్టిగా నేడ్చుచు, మొత్తుకొనుచు, ఆక్రందనము చేయుచుండెను. ధర్మసభలో ఈవిషయము శాస్త విని "భిక్షువులారా, వృద్ధు డిప్పుడే కాదు, పూర్వముకూడ వీనికై యిట్లే చేసెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శక్రపదవి నొందెను. ఆసమయమున వారాణసి నివాసి యొకడు హిమాలయమునకు బోయి ప్రవ్రజించెను. అతడు ఫలములు తినుచు ఒకనాడు అరణ్యములో తిరుగుచుండగా తల్లి చనిపోయిన లేడి పిల్ల కనబడెను. ఆయన దాని నాశ్రమమునకు గొనిపోయి మేత వేసి పోషించుచుండెను. లేడిపిల్ల పెరిగి పెద్దదయి, చూడ చక్కగా నుండెను. తాపసి దానిని బిడ్డవలె పెంచుచుండెను. ఒకనా డది తృణములు విశేషముగా దిని అజీర్ణరోగముచే మరణించెను. నాబిడ్డ పోయినా' డని తాపసి యేడ్చి మొత్తుకొనుచుండెను. అపుడు దేవరాజు శక్రుడు లోకమును పరిశీలించుచు తాపసుని జూచి, ఆయన మనస్సున 'సంవేగము' ఉత్పాదన చేయుటకై ఆకాశమున నిలిచి తొలి గాథ పలికెను :

> త్యజించితివి నీవు గృహము,
> అనాగరికుడవు, శ్రమణు
> డైతి; వెవరి మరణమునకొ
> వ్యథనొందుట తగదు నీకు.

విని తపస్వి రెండవగాథ పలికెను :

సహవాసము చేయునపుడు
శక్ర, పశువుతోడ నైన
మనుజుతోడ నైన హృదయ
మునకు ప్రీతి యుద్భవించు
సహజమెకద దానికినై
సంతాపము నే పొందుట ?

శక్రుడు రెండు గాథలు పలికెను :

మరణించిన వారికొరకు
మరణించెడు వారికొరకు
ప్రలాపింత్రు జనులు, ఋషీ
ప్రలపింపకు నీ వాగతి
విలాపంబు నిష్ఫల మని
విజ్ఞు లంద్రు; రోదనమున
శవ ప్రేత వేచునేని
జ్ఞాతిసమూహంబు గూడి
సకలజనులు రోదించుట
సుకరం బగు నొకరి కొకరు.

ఇట్లు శక్రుడు పలుకుచుండగా రోదనము నిరుపయోగ మని గ్రహించి తాపసి శక్రుని స్తుతించుచు మూడు గాథలు పలికెను :

నేయి పడగ భగ్గు మనెడు
నిప్పువోలె నున్న నాదు
హృదయబాధ చల్లార్పుము
ఎడదలోని శోకశల్య
మెడలింపుము.
విని శక్రా, నీ వాక్యాలు
వీతశోకమనస్కుండ
నైతి, తొలగె చాంచల్యము
వదిలిపోయె హృదయశల్య
మిపుడు చింత లేదు నాకు
ఇపుడు నేను రోదింపను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున తపస్వి వృద్ధుడు; శక్రుడు నేనే.

## 373 మూసిక జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు అజాతశత్రువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

కథ పూర్వోక్తము. (థుసజాతకమున 338). రాజు కొంచెముతడవు పుత్రునితో క్రీడించుచు, కొంతతడవు ధర్మము వినుచుండుట గ్రహించి ఈపుత్రునివలన ఇతనికి కలుగు నని యూహించి శాస్త "మహారాజా, పూర్వరాజులు సందేహస్థానములను సందేహించుచు, పుత్రులు తమ మరణానంతరము గద్దె యెక్కుదు రని గ్రహించి, వారిని ఒకప్రక్కకు నెట్టెడివారు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు తక్షశిలలో బ్రాహ్మణకులమున బుట్టి ప్రసిద్ధాచార్యు డయ్యెను. వారాణసీరాజకుమారుడు యవనామకుడు ఆయనవద్ద అన్ని విద్యలు నేర్చి వెడలిపోవుటకై సెలవువేడెను. యవరాజకుమారునకు తత్కుమారునివలన ఆపద సంభవించు నని ఆచార్యుడు అంగవిద్య వలన గ్రహించి, అపాయము తొలగించుటకై దృష్టాంతము నాలోచించుచుండెను. ఆచార్యునికడ అశ్వ ముండెను. దాని కాలికి గాయము తగిలెను. నయమగువరకు దానిని ఇంటిలోనే నిలిపిరి. సమీపమున జలాశయ ముండెను. ఇంటిలోనుండి మూషికము వచ్చి గుర్రముకాలి మీది వ్రణమును నాకు చుండెను. గుర్రము దానిని వారింపజాల కుండెను. ఒకనాడు అశ్వము వేదన సహింపలేక, వ్రణముకొరకుటకు వచ్చిన మూషికమును జలాశయములో పడునట్లు తన్నెను. గుర్రపు వాడు "ప్రతిదినము వచ్చి వ్రణము తిను మూషికము ఈనాడు కనబడ దేమి? ఎచ్చటికి బోయినది?" అనెను.

ప్రత్యక్షముగా నిది యెరిగిన బోధిసత్త్వుడు దీనిసందర్భములో మొదటిగాథ రచించి రాజకుమారున కిచ్చెను. రెండవ దృష్టాంతము కొరకు యోచించుచుండగా, గుర్రమువ్రణము నయమయినది. అంతట దానిని ఇంటినుండి బయటికి తోలిరి. అది యవక్షేత్రములోనికి బోయి

మేతకై పైరులోనికి ముఖము పోనిచ్చుట చూచి బోధిసత్త్వుడు రెండవ గాథ కట్టి రాజకుమారున కిచ్చెను. మూడవ గాథ తనప్రజ్ఞాబలముచే కట్టి రాజకుమారున కిచ్చి "నాయనా, రాజ్యప్రతిష్ఠితుడ వై, సాయంకాలము స్నానపుష్కరిణికి బోయినపుడు చివర మెట్టువరకు తొలిగాథ పలుకుచుపొమ్ము. నీవు నివసించు మేడలో ప్రవేశించునపుడు క్రింది మెట్టువరకును రెండవగాథ పలుకుచు పొమ్ము. మూడవ గాథ పై మెట్టువరకును పలుకుచు పొమ్ము" అని చెప్పి, వీడు కొలిపెను.

ఆతడు పోయి యువరా జయి, తండ్రిమరణానంతరము రాజ్యమునకు వచ్చెను. అతనికి కుమారుడు పుట్టి, పదునారేండ్లప్రాయము కలవాడై, రాజ్యలోభమునకు వశంవదు డై తండ్రిని చంప నెంచెను. 'ఈయన చితారోహణము చేయువరకును నేను వేచియున్నచో జరాజీర్ణుడ నై పోవుదును. అప్పుడు రాజ్యములభించినను ఏమి ప్రయోజనము?' అని తలచి తనసేవకులను బిలిచి చెప్పెను. వారు "దేవా, సీమాంతజనపదములకు బోయి ఉపప్లవము కలిగింపజాలమైతిమి. కావున ఏదోయుపాయమున మీరే తండ్రిని వధించి రాజ్యమునకు రండు" అని చెప్పిరి. అత డంగీకరించెను.

ప్రాసాదమున రాజు సాయంకాలము స్నానముచేయు పుష్కరిణికి సమీపములో రాజకుమారుడు దాగియుండెను. సోపానాదులు శుభ్రము చేయుటకై మూషికయను దాసిని రాజు పంపెను. దాసి పోయి ప్రదేశము శుభ్రముచేయుచుండగా రాజు కుమారుడు చూచి, తనసంగతి బయటపడు నని భయపడి దానిని రెండుతుండెములు చేసి పుష్కరిణిలోనికి విసరివైచెను. దాసి మరలిరాలే దనియు, ఎచ్చటికి బోయినదో తెలియ దనియు పరిజను లనుకొనిరి. రాజు తొలిగాథ పాడుచు పుష్కరిణియొద్దకు చేరెను.

ఎచటికి కేగెను దాసి మూసిక!
ఎట్లుపోయిన దని ప్రలాపము
చేయుచున్నది జనసమూహము.

తనపని తండ్రికి తెలిసె నని కుమారుడు భయపడి, పరుగెత్తిపోయి, తనసేవకుల కీ సంగతి తెలిపెను. ఏ డెనిమిది రోజులు గడచినతరువాత

వారు "దేవా, రాజున కీసంగతి తెలిసినచో ఊరకుండడు. ఊహావలన అట్లు పలికియుండవచ్చును. ఆయనను సంహరింపుడు" అని బోధించిరి. ఒకనాడు వాడు ఖడ్గము ధరించి మెట్లక్రింద నిలిచి రాజు వచ్చునప్పటికి ఇటునటు ప్రహరించు తరుణముకై వేచియుండెను. రాజు రెండవ గాథ పాడుచు వచ్చుచుండెను.

నీవు గాడిదవోలె చూతువు
నిలిచి యటునిటు; జలాశయమున
ద్రోసి మూసిక, యవలు తినగా
నాసపడెదోకో!

కుమారుడు తనలో "నాయన నన్ను చూచియుండును" అనుకొని భయముచే పరుగెత్తెను. అర్ధమాస మయిన తరువాత వాడు తండ్రిని దుడ్డుకర్రతో కొట్టి చంపనెంచి పొడుగాటి కర్రతోడ్పాటుతో నిలుచుండెను. మూడవ గాథ పాడుచు రాజు మెట్లెక్కెను:

నీవు మూర్ఖుడ వాదినుండియు,
నిలిచినాడవు దీర్ఘయష్టిని
పట్టి యిప్పుడు, నేను నీచే
ప్రాణములు విడువను.

నాడు కుమారుడు పారిపోవనేరక రాజుపాదములమీద వ్రాలి "దేవా, నాకు ప్రాణదానము చేయుము" అని ప్రార్థించెను. రాజు వానిని బెదరించి, సంకెలలు వేయించి, బంధనాగారమునందు పడవేయించెను.

రాజు శ్వేతచ్ఛత్రముక్రింద అలంకృతాసనముపై గూరుచుండి, గురువుసంగతి జ్ఞప్తికిరాగా "నలుదిక్కుల ప్రసిద్ధుడైన మదాచార్యుడు నాకు రాబోవునపాయమును ముందుగా గ్రహించి, ఈ గాథలు నాకు చెప్పియుండనోపును" అనుకొని, ప్రసన్నచిత్తుడై, ప్రీతివాక్యములు పలుకువాడై మిగిలిన గాథలు పలికెను:

నేను విమానమ్ము వలన
గాని, అంగసదృశు డైన
పుత్రునువలనగాని రక్ష

పొంద లేదు; విశేషించి
పుత్రు డాక్రమించినాడు
నాకు రక్షకమ్ములయ్యె
శ్లోకములే నిశ్చయముగ.

ఎల్లరు నేర్తురు విద్యల
హీన మధ్య మోత్తములను,
అర్థము గ్రహియింతు రంద,
రైన ప్రయోగింప లేరు.
జ్ఞానం బుపయోగించెడి
కాలం బాపన్నమగును.

కొంతకాలమునకు తండ్రి మరణింపగా, కుమారుడు రాజ్యాభిషిక్తుడయ్యెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున నలుదిక్కుల ప్రసిద్ధిచెందిన ఆచార్యుడు నేనే.

## 374 క్షుద్రధనుగ్గహ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, పూర్వభార్యాసక్తుని గూర్చి చెప్పిన—

### వర్తమాన కథ

పూర్వభార్యవలన తాను ఉద్విగ్నచిత్తుడయినట్లు ఆభిక్షువు చెప్పిన పిదప శాస్త "భిక్షూ, ఈ స్త్రీ నీకిప్పుడే అనర్థకారిణి కాదు, పూర్వము కూడ ఈమెవలన నీతల కరవాలమున ఖండితమయినది" అని భిక్షువుల ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు శక్రు డయ్యెను. ఆకాలమున తక్షశిలలో తరుణబ్రాహ్మ

ణుడు సమస్తవిద్యలు నేర్చి ధనుర్విద్యలో పరిపూర్ణుడై చిన్నధనుర్ధరు డని పేరుపొందెను. అతని యాచార్యుడు చూచి, ఇతడు నాకు తెలిసిన విద్య గ్రహించినాడు అని భావించి, తనపుత్రిక నిచ్చి వివాహము చేసెను. ఆమెను వెంటబెట్టుకొని యతడు వారాణాసీమార్గమున ప్రయాణము చేయుచు అడవియేనుగు జనశూన్యము చేసిన ప్రదేశము చేరెను. అచ్చటికి బోవుట కెవ్వరికిని ధైర్యము లేదు. జనులు వారించినను లెక్కసేయక ధనుర్ధరుడు భార్యతోగూడ అడవిలో బ్రవేశించెను.

ప్రవేశింపగానే ఏనుగు వారి నెదుర్కొనెను. అతడు గజకుంభస్థలములను బాణముతో గొట్టెను. బాణము దూసికొనిపోయి, ఆవలకు వచ్చెను. ఆప్రదేశమును ధనుర్ధరపండితుడు నిష్కంటకము చేసి, రెండవ యడవిలో జొచ్చెను. అచ్చట ఏబదుగురు చోరులు త్రోవలు కొట్టుచుందురు. జనులు పోవలదని వారించినను వినక ధనుర్ధరుడు అడవిలోనికి జనెను. చోరులు మృగమును చంపి, మార్గముప్రక్కనవండుచు, అలంకృతయైన స్త్రీతో గూడివచ్చుచున్న ధనుర్ధరుని జూచి పట్టుకొన నెంచిరి. చోరనాయకుడు పురుషలక్షణవిద్యలో కుశలుడు. అతడు ధనుర్ధరుని ఉత్తమపురుషునిగా నెంచి, తనవారి నెవ్వరిని లేవనీయలేదు. ధనుర్ధరుడు భార్యను వారివద్దకు బంపుచు 'మాకుగూడ మాంసఖండ మిమ్మని యడిగి కొనిరమ్ము' అని చెప్పెను.

ఆమె పోయి మాంసఖండ మిమ్మనియడిగెను. ఈమె ఉన్నతవంశములోని దని గ్రహించి చోరనాయకుడు ఆమెకు మాంసపుముక్క ఇమ్మని ఆనతిచ్చెను. వండినమాంసము మేము తిన్నాము అని చోరులు పచ్చిమాంస మామె కిచ్చిరి. దానిని జూడగానే ధనుర్ధరునకు కోపము వచ్చెను. చోరులుకూడ లేచి నిలిచి 'మేము స్త్రీలమా, అత డొకడే పురుషుడా' అనుకొనిరి.

నలుబది తొమ్మిది బాణములతో ధనుర్ధరుడు నలుబది తొమ్మిది మంది చోరులను పడగొట్టెను. నాయకుని కొట్టుటకై బాణములేదు. ఆయన తూణీరములో ఏబదినారాచములే యుండెను. ఒక బాణముతో గజమును కొట్టెను; నలువది తొమ్మిది నారాచములు నలుబది తొమ్మిది చోరులపై విడిచెను. అంత నతడు చోరనాయకుని బడద్రోసి, రొమ్ముపై గూరుచుండి ఖడ్గ మిమ్మని భార్యతో ననెను. ఆమె

ఆక్షణమున చోరనాయకునిపై మరులుగొని ఒర చోరనాయకునిచేతికి కత్తిపిడిని భర్తచేతికి కత్తియొరను అందిచ్చెను. నాయకుడు ఖడ్గము దూసి, ధనుర్ధరునిశిరము ఖండించెను. అనంతరము వాడామెను వెంట గొని పోవుచు కులగోత్రము లడిగెను. "తక్షశిలలో ప్రసిద్ధాచార్యుని పుత్రికను." "నీ వితనితో నెట్లు కలిసితివి?" "విద్యలో తనయంత టివా డితడయ్యె నని నాతండ్రి యితనియెడ ప్రసన్నుడై నన్నిచ్చి పెండ్లిచేసెను. నీమీఁది యాసక్తిచే కులప్రాప్తుడైన భర్తను చంపిం చితిని."

చోరనాయకుడు తనలో "ఈ స్త్రీ తన భర్తను చంపించినది. ఇం కొకనిని జూచి నన్నుగూడ ఇట్లే చేయించును. దీనిని విడిచిపెట్టవలెను" అని తలచెను. త్రోవలో ఏరు కనబడెను.

"భద్రే, ఇందులో భయంకరమైన మొసళ్ళున్నవి ఏమి చేయు దము?" "స్వామీ, నా నగ లన్నియు నా యుత్తరీయములో మూట కట్టి ఆవలియొడ్డు చేరి మరల వచ్చి నన్ను గొనిపొమ్ము." మంచిదని చోరజ్యేష్ఠుడు నగలుమూట కట్టి, ఈది ఆవలియొడ్డు చేరి, పోవుచుం డెను. చూచి యామె "స్వామీ, ఏమి నన్ను విడిచిపోవుచున్నారా? ఏల ఇట్లు చేయుచున్నారు? రండు నన్నుగూడ తీసికొనిపొండు" అనుచు ఈ తొలిగాథ పలికెను :

నీ వన్ని నగలతో నావలి దరికి
చేరినాడవు స్వామి శీఘ్రమ్ముగాను
అరుదెంచి వెనుకకు నావలిదరికి
దాటవేయుము నన్ను త్వరితమ్ముగాను.

విని చోరజ్యేష్ఠుడు ఆవలియొడ్డున నిలిచి రెండవగాథ పలికెను :

సమ్మదమున నీతో చిర
సంసర్గము గల్గు ధ్రువ
స్వామిని విడనాడి, నన్ను
అతఃపూర్వ మపరిచితు
నధ్రువు చేపట్టినాను;
ఇంక నన్ను విడిచిపెట్టి
ఎవని నైన స్వీకరింప

గలవు; కాన ఇచటినుండి
కడుదూరము పోవువాడ.

"నీ వచటనే యుండుము. నేను చాలదూరము పోవలెను. అని ఆమె యేడ్చుచుండగా నగలమూటతో పరుగెత్తెను. ఆమూర్ఖురాలు ఇచ్ఛాబాహుళ్యముచేత ఈవిధముగా విపత్తులకులోనయి, అనాథ యయి, సమీపమున నున్న ఏలగళకుంజములో గూరుచుండి రోదనము చేయుచుండెను.

ఆసమయమున శక్రుడు ఈప్రపంచమువైపు చూచుచు, ఆదిక్కు చూచెను. దీనిని చీవాట్లుపెట్టి సిగ్గుకాలుచేయవలె నని యెంచి శక్రుడు మాతలిని పంచశిఖుని వెంట బెట్టుకొని ఏటియొడ్డున నిలిచి, నీవు చేపవు కమ్ము అని మాతలితోను, నీవు పిట్టవు కమ్ము అని పంచశిఖునితోను చెప్పి నేను నక్కరూపము దాల్చి మాంసఖండము నోటగరచుకొని, దాని కెదురుగాపోవుదును. నే నచ్చటికి వచ్చినంతనే నీవు నీటిలోనుండి యెగిరి నా కెదురుగా పడవలెను. నోట నున్న మాంసఖండమును జారవిడిచి నేను చేపను బట్టుకొనుటకై దుముకుదును. పంచశిఖుడు మాంసఖండ మెత్తుకొని ఆకాశమున కెగురవలెను అని చెప్పి, మాతలిని నీటిలో దిగు మనెను. "చిత్తము దేవా!" అని యతడు మత్స్యమయ్యెను. పంచశిఖుడు పక్షి యయ్యెను.

శక్రుడు జంబుక మయి, మాంసము నోటకరచుకొని, ఆమె కెదురుగా వచ్చెను. మత్స్యము నీటిలోనుండి ఎగిరి నక్క కెదురుగా పడెను. జంబుకము నోటిలోని మాంసఖండము జారవిడిచి చేపను పట్టుకొనబోయెను. చేప యెగిరి నీటిలో జొచ్చెను. పక్షి మాంసము నెత్తుకొని ఆకాశమున కెగిరిపోయెను. ఏమియుదొరకక నక్క ఏలగళకుంజము వంక జూచుచు విచారముతో గూరుచుండెను.

ఆమె నక్కను జూచి "ఇచ్ఛాబాహుళ్యముచే నక్కకు మాంసము కాని మత్స్యము కాని దక్కలేదు" అనుకొని కుండబ్రద్దలయినట్లు పెద్ద పెట్టున నవ్వెను. విని నక్క మూడవ గాథ పలికెను:

ఏళగజము కుంజములో
నెవరు నవ్వుచున్నవాడు ?
నృత్యగానతాళంబుల

నేది లేదు; సుశ్రోణీ
ఏడ్పువేళ నవ్వే దేల ?

ఆమె నాలుగవ గాథ పలికెను:

దుష్టబుద్ధి, మూర్ఖత్వము
తో్రబుర కలవు నీకు
జంబుకంబ, మత్స్యము మాం
సమ్ము రెండు లేని దీన
సరణిని యోచించెదవే.

అంతట నక్క అయిదవ గాథ పలికెను:

సులువు పరులలోపములను
జూచుట, నిజదోషంబుల
శ్రమము కనలేక పతిని
జారుని చింతాక్రాంతవు.

ఆమె విని యీ గాథ పలికెను :

ఓ జంబుక, మృగరాజా,
యుక్తమె నీ వన్నది
చనుచు నిచటి నుండి యింక
స్వామిని వశవర్తి జేతు.

ఆదురాచారిణీపలుకులు విని దేవరాజు శక్రుడు తుదిగాథ పలికెను:

మట్టి పిడత కలియించెడి
మానవుండు కాంస్యపాత్ర
అపహరించు, పాప కృత్య
మాచరంతు వికమీాదను.

శాస్త్ర ధర్మోపదేశనము, సత్యప్రకాశనము చేసి, జాతకములు సరిపోల్చెను. ఉద్విగ్న చిత్తభిక్షువు శ్రోతాపత్తిఫల మొందెను. ఆ కాలమున ధనుర్ధరుడు ఉద్విగ్నచిత్త భిక్షువు; ఆమె పూర్వభార్య దేవరాజశక్రుడు నేనే.

## 375 కపోత జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక లోభభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

లోభికథ వివిధవిధముల చెప్పబడినది. శాస్త ఆతనితో "భిక్షూ, నీవు సత్యముగా లోభివేనా?" అనెను. "భన్తే, సత్యమే" అని అత డన్న పిదప శాస్త "భిక్షూ, నీ విప్పుడే కాదు, పూర్వము కూడ లోభివే. లోభము చేతనే ప్రాణములు........."అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కపోతము కడుపున బుట్టి, వారాణసీశ్రేష్ఠి వంటయింట పంజరములో నుండెను. మత్స్యమాంసములమీద కోరికతో కాకి యొకటి కపోతముతో మైత్రి చేసి అచ్చటనే నివసింపజొచ్చెను.

ఒకనాడు కాకి విశేషముగా కూర్చిన మత్స్యమాంసములను జూచి తినవలె ననుకోరికతో గొణుగుచు పంజరములోనే యుండెను. "మిత్రమా, ఎర తినుటకై పోవుదము" అని కపోతము పిలిచినప్పుడు తన కజీర్ణము చేసిన దని చెప్పి, పావురము వెడలిపోయినపిదప నా శత్రువు కంటకము విరగడ అయిన దనుకొని, యథేష్టముగా మత్స్య మాంసములు భుజింతు నని భావించి తొలిగాథ పలికెను :

కపోతంబు వెడలిపోవు,
కతన నిపుడు సుఖముగాను
నీరోగముగ నున్నవాడ;
నిష్కంటకముగ నిప్పుడు
మనస్తుష్టి చేసికొందు
మత్స్యమాంసశాకంబుల
మదాకర్షణంబు మెండు.

వంటవాడు మత్స్యమాంసములు వండి, వంటయింటినుండి ఈవలకు వచ్చి చెమట తుడిచికొనుచుండగా కాకి పంజరము వెలువడి డేకిసా

మీాద వాలి కిరికిరీ అని ధ్వని చేసెను. వంటవాడు వేగముగా పోయి కాకిని పట్టుకొని రెక్కలుపీకివేసి, పచ్చి అల్లము, ఆవాలు నూరి, అందులో ఉల్లిపాయలు, పులిమజ్జిగ కలిపి, దానియొడలికి పట్టించి, కర్ర విరిచి ముక్కను త్రాటితో దాని మెడకు గట్టి పంజరములో బడవైచెను.

కపోతము వచ్చి కాకిని జూచి "నామిత్రుని పంజరములోనికి వచ్చి ఇట్లు చేసిన ఆతతాయి యెవడు! వాడు ప్రచండుడు కానోపును. చంపివేయగలడు" అనుచు రెండవ గాథ పలికెను:

మస్తకమున శిఖ కలిగిన
మలిమ్లుగ్బలాక యెవరు ?
మబ్బుపూతతో బలాక,
రమ్మిచటికి; వాయసమ్మ
ప్రచండుండు నా మిత్రము.

విని కాకి మూడవగాథ పలికెను:

ఈ స్థితిలో నన్ను గాంచి
హేళనమ్ము చేయవలదు;
వంటవాడు లాగి ఈక
తొంటినిండ పిండిపూసె.

విని నవ్వి చమత్కారముగా కపోతము నాల్గవ గాథ పలికెను:

మంచిరకము తానమయ్యె,
మంచి లేపనంబుకూడ;
అన్నపానంబులు తుష్టిగ
నయినవి; నీకంఠమందు
స్ఫటికమ ? పోరాని యట్టి
యడవికి జని వచ్చినావ ?

అప్పుడు కాకి అయిదవ గాథ పలికెను:

శత్రువైన మిత్రమైన
చనండు పోరాని యెడకు
రెక్క లూడ్చి చిన్న గుదియ
అక్కట కట్టుదురు మెడకు.

విని కపోతము చివరగాథ పలికెను:

ఇట్లే మరల చేతువు సఖ,
ఇదియె నీదు స్వభావమ్ము
మనుజభోజనమ్ము కాదు
మంచిది ఖగజాతి కెపుడు.

ఈప్రకారముగా ఉపదేశము చేసి, రెక్కలు విప్పి యెగిరి కపోతము వేరొకచోటికి బోయెను. కాకి అందులోనే మరణము చెందెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, సత్యప్రకాశనము కావించి, జాతకమునుసరిపోల్చెను. లోభభిక్షువు అనాగామిఫలము పొందెను. ఆకాలమున కాకి లోభభిక్షువు; కపోతము నేనే.

# 376 అవారియ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు రేవుదాటించువానిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

వాడు అజ్ఞాని, మూర్ఖుడు, బుద్ధుని గాని, తదితరులనుగాని గురుతించువాడు కాడు. ఒకానొక గ్రామీణభిక్షువు బుద్ధదర్శనార్థము బయలుదేరి అచిరవతీనదీఘట్టకము చేరి, "ఉపాసకా, నాకు నావ ఇమ్ము. ఆవలియొడ్డునకు పోయెదను" అని వానితో ననెను. "భన్తే, ఇది సమయము కాదు. మీరు ఇక్కడ ఎక్కడనో నిలువుడు." "ఉపాసకా, ఎక్కడ నుండగలను? నన్ను గొనిపొమ్ము." నావికుడు కుపితుడై "శ్రమణా, తీసికొనిపో." స్థవిరుడు నావ యెక్కెను. నావ సూటిగా పోవక, వాలున పోయినది. నావ ఒరగుచు లేచుచునుండుటచే ఆతనిపాత్రయు, చీవరములు తడిసిపోయినవి. కష్టముమీద చీకటిపడినతరువాత నావ ఒడ్డు చేరినది. ఆయన విహారము చేరినాడు. ఆనాడు బుద్ధసేవార్థము చనుటకవకాశము లభింపకపోవుటచే మరునాడు శాస్త సన్నిధికి జని, ప్రణా

మము చేసి, ఒకప్రక్కన గూరుచుండెను. "ఎప్పుడు వచ్చితివి?" అని శాస్త్ర కుశలప్రశ్నము చేసెను. "భన్తే, నిన్న వచ్చితిని." "నిన్ననే వచ్చినవాడవు ఇప్పటివరకును బుద్ధసేవార్థము ఏల రావైతివి?" అతడు జరిగినవృత్తాంతము తెలుపగా విని శాస్త "భిక్షూ, వాడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ ప్రచండుడు, కఠినుడు. నీకు ఇప్పుడు కష్టము కలిగించినాడు; పూర్వము పండితులను కష్టపెట్టినాడు" అని, అతని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి, పెరిగి తక్షశిలలో సమస్త విద్యలు నేర్చి, ప్రవ్రజించి, చిరకాలము హిమాలయమున నివసించి కందమూలఫలములు తినుచు ఉప్పుపులుసుకొరకు వారాణసి వచ్చెను. అక్కడి రాజోద్యానమున దిగి భిక్షకై వెడలి, రాజప్రాంగణము చేరు నప్పటికి రాజు చూచి, ప్రసన్నుడై అంతఃపురములోనికి గొనిపోయి భోజనము పెట్టించి, రాజోద్యానములో నుండునట్లు ఒప్పించెను. అను దినము ఆయనదర్శనార్థమై రాజు వెడలుచుండెను. భోధిసత్త్వుడు "మహారాజా, రాజానుచితములయిన 'అగకియ – గామి' ధర్మముల ననుసరింప వలదు. అప్రమత్తతతో, క్షమా మైత్రి, దయలతో ధర్మా నుసారముగా రాజ్యము చేయవలెను" అని ఉపదేశమిచ్చుచు రెండు గాథలు పలుకుచుండెను :

కోపింపకు భూమిపతీ,
కోపింపకు రథే సభా,
కోపింపం దగియుకూడ
క్రుద్ధుడు కానట్టి రాజు
అగు పూజ్యుడు రాష్ట్రంబున.

అడవిలోన, పల్లెలోన
ఎత్తుచోట, పల్లంబున
ఎచట నైన నుండు నేను,
ఇద్దియె యనుశాసనమ్ము
వద్దు క్రోధము. రథే సభా!

ఈ విధముగా రాజు వచ్చినప్పు డెల్ల గాథలు పలుకుచుండెను. ప్రసన్న చిత్తుడై రాజు బోధిసత్త్వునకు లక్షఆదాయము వచ్చుగ్రామ మిచ్చెను. బోధిసత్త్వు డంగీకరింపలేదు. ఈవిధముగా పండ్రెండుసంవత్సరములు గడచినతరువాత ఒకనాడు బోధిసత్త్వుడు "బహుకాల మొక్కచోటనే ఉన్నాను. జనపదములలో విచరించి వచ్చెదను" అనుకొని రాజుకు తెలియనీయక ఉద్యానపాలకుని బిలిచి, "బాబా, జనపదములలో విచరింపగోరుచున్నాను. తిరిగి వచ్చెదను. నీవు రాజుతో జెప్పుము" అని గంగాఘట్టమునకు బోయెను. అక్కడ అవారియపిత యను నావికు డుండెను. వాడు మూర్ఖుడు. గుణవంతులను గ్రహింపలేడు, తన కాదాయము వచ్చునుపాయ మెరుగడు. నది దాటువారిని వాడు ముందు దాటవేసి తరువాత కేవు అడుగుచుండువాడు. ఈయని వారితో జగడము పెట్టుకొనును. దానివలన లాభము తక్కువ. మీదుమిక్కిలి చీవాట్లు దెబ్బలు తగులుచుండెడివి. ఇట్టి గ్రుడ్డిమూర్ఖుల విషయమై శాస్త్ర బుద్ధుడైనపిదప ఈ గాథ పలికెను :

నావికుం డవార్యపితృ
నాముడు గంగావాహిని
మొదట జనుల దాటవేసి
పిదప నడుగు వేతనంబు
కలహము తప్పెడిది కాదు
కాన భోగవృద్ధి లేదు.

బోధిసత్త్వుడు ఆనావికునికడకు జని "చిరంజీవి, నన్ను అవలియొడ్డునకు గొనిపొమ్ము" అనెను. "శ్రమణా, నాకు కేవు ఈయగలవా?" "ఆయుష్మన్ భోగాభివృద్ధికి, అర్థాభివృద్ధికి, ధర్మాభివృద్ధికి ఉపాయము తెలిపెదను." నావికుడు యోచించి "ఈయన తప్పక నా కేమైన ఇచ్చు" ననుకొని బోధిసత్త్వుని పడవలో నది దాటించి "నాకు కేవు దయచేయుడు" అనెను.

"మంచిది, ఆయుష్మన్" అని బోధిసత్త్వుడు భోగాభివృద్ధి కుపాయము చెప్పువాడై తొలిగాథ పలికెను :

నావికా, నీ పడుగవలయును
కేవు తొలుతనె; దాట దలచిన

వాని చిత్తము వేరు, దాటిన
వాని చిత్తము వేరగున్.

విని, నావికుడు తనలో "ఉపదేశ మయినది. ఇక నేమైన ఇచ్చును అనుకొనెను. కాని బోధిసత్త్వుడు "ఆయుష్మన్, భోగాభివృద్ధికి ఉపాయము తెలిసినది. ఇక అర్థధర్మాభివృద్ధికి ఉపాయము వినుము" అని ఈ గాథ పలికెను :

అడవిలోనను, పల్లెలోనను
ఎత్తుచోటను, పల్లమందును
ఎచటనైనను నేను నిలుతును
ఇద్ది నా యనుశాసనం బగు
వద్దు క్రోధము నావికా!

ఇట్లు పలికి "నీకర్థధర్మవృద్ధిని ఉపాయము చెప్పితి" ననెను.
"శ్రమణా! నానావకు కేవు ఇచ్చినావా?"
"ఆయుష్మన్, ఇచ్చినాను."
"దీనివలన నాకు లాభము లేదు. కేవు తెమ్ము."
"ఆయుష్మన్, నాకడ ఇంతకన్న వే రేమియు లేదు."
"అట్లయిన ఏల నావ యెక్కితివి?" అని వాడు తాపసిని తీరమునకు నెట్టి పడవేసి, రొమ్ముపై గూరుచుండి, ముఖముమీద మోదుచుండెను. ఇంతలో నావికుని భార్య వానికి అన్నము పట్టుకొని వచ్చి తాపసిని జూచి భర్తతో "స్వామీ, ఈయన రాజసమ్మానితుడు. కొట్టవలదు" అని చెప్పెను. వాడు క్రుద్ధుడై "నీ పీకుటిలతపస్విని దండింపనీయవా!" అని యామెను కొట్టి పడద్రోసెను. అన్నపుచట్టి క్రిందబడిపగిలిపోయెను. పూర్ణగర్భవతి యైన యామెకు గర్భస్రావ మాయెను. మనుష్యహంత యని జనులు వానిని బట్టుకొని బంధించి రాజసన్నిధికి గొనిపోయిరి. విచారణ జరిగి వానికి శిక్షపడెను.

శాస్త అభిసంబుద్ధుడైన పిమ్మట ఈ గాథలు పలికెను:

ఏ యుపదేశమ్ము వినుచు
నిచ్చెను రాజగ్రహార
మా యుపదేశమున రొట్టె
నాస్యముపై నావికుండు.

పగిలె నన్న భాండ మొక్టి
భార్య పడియె మరణ మొందె
పడియె నామె గర్భ మవని.
పండుకొనియు నున్న మృగము
ఫలితములేన ట్లతనికి
ఫల మేమియు లేకపోయె.

శాస్త్ర ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశనము గావించి జాతకములు సరిపోల్చెను. భిక్షువు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున నావికుడు ఇప్పటి నావికుడే; రాజు ఆనందుడు; తపస్వి నేనే.

## 377 సేతకేతు జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు కపటభిక్షువును గూర్చి చెప్పినది. వర్తమానకథ ఉద్దాలజాతకమున (70) వచ్చినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వారాణసిలో ప్రసిద్ధాచార్యుడై 500 బ్రహ్మచారులకు వేదము చెప్పుచుండెను. అందులో ప్రధానశిష్యుని పేరు శ్వేతకేతువు. ఆతడు ఉదీచ్యబ్రాహ్మణకులమున బుట్టినాడు. అతనికి జాత్యభిమానము మెండు. ఒకనా డతడు విద్యార్థులతో గలిసి నగరము వెలుపలికి బోయి తిరిగివచ్చునపుడు నగరద్వారముకడ చండాలుని జూచి 'నీ వెవరు?' అని యడిగెను. "నేను చండాలుడను." వాని శరీరముమీది గాలి వచ్చి తనకు తాకునేమో యను భయముతో శ్వేతకేతువు "చండాలా, అధోవాతముగా పొమ్ము" అని తాను గాలికెదురుగా బోయెను. వాడును శీఘ్రముగా నెగువకు జనెను.

"ఓరి వృషలా, వ్యర్థుడా!" అని శ్వేతకేతువు వానిని దూషించెను. "నీ వెవరు?" అని చండాలు డతని నడిగెను. "నేను బ్రాహ్మణమాణ

వకుడను." "మంచిది. నీవు బ్రాహ్మణుఢవే యగుచో నా ప్రశ్నకు సమాధానము చెప్పగలవా?" "ఆఁ, చెప్పగలను." "చెప్పలేనిచో కాళ్ళసందునుండి దూరిరావలసివచ్చును."

మాణవకుడు తనసామర్థ్యమును ఊహించుకొని 'అడుగు' మనెను. చండాలపుత్రుడు అక్కడివారిని సాక్షులుగా నిర్ణయించి "దిక్కులెన్ని?" అని ప్రశ్నించెను.

"తూరుపు మొదలు నాలుగుదిక్కులు." "వీనిని గూర్చి అడుగుట లేదు. నీ కిదే తెలియదు. నాశరీరముమీదినుండి వచ్చుగాలిని అసహ్యాంతువు" అని వాడు శ్వేతకేతువు మెడ పట్టుకొని, ఊపి, తనకాళ్ళ సందునుండి యీవలకు లాగెను.

బ్రహ్మచారు లీవిషయము ఆచార్యునకు దెలిపిరి. ఆయన విని "నాయనా, శ్వేతకేతూ, చండాలుడు నిన్ను తనకాళ్ళసందునుండి యీవలకు లాగినసంగతి నిజమా?" అని యడిగెను.

"ఆచార్యా, అవును. ఆ చండాలదాస్యాఃపుత్రుడు నీకు దిక్కులే తెలియవు అని నన్ను తనకాళ్ళసందునుండి లాగినాడు. ఇక వాడు దొరకినచో చేయవలసినది చేయుదును" అని శ్వేతకేతువు కోపముతో వానిని దూషించెను. ఆచార్యుడు "నాయనా, శ్వేతకేతూ, వానిపై కోపము వలదు. చండాలపుత్రుడు బుద్ధిమంతుడు. వాడు నిన్ను సామాన్యదిశలవిషయమై అడుగలేదు, అన్యదిశలను గూర్చి అడిగినాడు. నీవు విన్నదానికన్న, చూచినదానికన్న తెలిసికొనవలసినది చాల మెండు" అని ఉపదేశించువాడై. ఈ రెండు గాథలు పలికెను:

క్రోధము వలదు శ్వేతకేతు
కోపించుట మేలు గాదు
కననివి విననివి యెన్నో
కలవు, పూర్వదిక్కు సుమ్మ
తలిదండ్రులు; గురువు శ్రేష్ఠ
దక్షిణదిక్కండ్రు: వేత్త
లాహ్వానించి యిచ్చువారు
అన్నవస్త్రములు, గణింత్రు
శ్రమణ బ్రాహ్మణ దిక్కును;
చాల యుత్తమంబు, దాని

జేరిన దుఃఖితులు సుఖము
శ్వేతకేతు, చెందుచుంద్రు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు బ్రహ్మచారికి దిక్కులను తెలిపెను. మాణవకుడు వారాణసిలో నుండక తక్షశిలకు వెడలిపోయెను. అక్కడ ప్రసిద్ధాచార్యునికడ సర్వవిద్యలు అభ్యసించి, ఆచార్యునికడ సెలవుతీసికొని, తక్షశిల వెలువడి, అన్నిసంప్రదాయములవిద్యలను నేర్చుచు తిరుగజొచ్చెను. క్రమముగా నొకసీమాగ్రామము చేరి, అచ్చోటు నాశ్రయించియున్న 500 తాపసులను జూచి, ప్రవ్రజించి, వారికి దెలిసిన విద్యామంత్రతంత్రాదులు గ్రహించి, వారికి నాయకుడై వారాణసికి వచ్చి ఒకనాడు భిక్షాటనమునకై రాజప్రాంగణము చేరెను.

రాజు తాపసులచర్యకు ప్రసన్నుడై వారిని సౌధమున గూరుచుండబెట్టి భోజనము పెట్టించి, ఉద్యానమున నుండుడని కోరి సాయంకాలము ఉద్యానమునకు వచ్చి ప్రణామము చేయుదు నని చెప్పెను.

అందరును ఉద్యానమునకు జేరినపిదప శ్వేతకేతువు వారితో "మిత్రులారా, సాయంకాల మిచ్చటికి వత్తు నని రాజు చెప్పినాడు. ఒక్కసారి రాజును ప్రసన్నుని జేసికొన్నచో జీవిత మంతయు సుఖముగా గడచును. నేను మీలో కొందరు లంబమాన యోగస్థితిలో నుండుడు; కొందరు కంటకశయ్యపై బండుకొనుడు; కొందరు మడమలపై గూర్చుండి శరీరశోషణము గావించు తపముచేయుడు; కొందరు నీటమునిగి యోగమందుండుడు; కొందరు పవిత్రగ్రంథములను శుకానువాదముచేయుడు" ఈ ప్రకారముగా వారి కాదేశ మిచ్చి, తాను పర్ణకుటీరద్వారమున దిండ్లు పరచిన పీఠముపై గూరుచుండి, పంచవర్ణముల వస్త్రము కప్పినపుస్తకమును విచిత్రవర్ణాధారకముమీదనుంచి, అయిదుగురు సుశిక్షితవిద్యార్థుల ప్రశ్నములకు సమాధానము చెప్పుచున్నట్లు కూరుచుండెను.

రాజు వచ్చి, ఆ మిథ్యాచారులను జూచి, ప్రసన్నుడై శ్వేతకేతువుకడకు బోయి ప్రణామము చేసి, ఒకప్రక్కగూరుచుండి, రాజపురోహితునితో సంభాషించుచు మూడవ గాథ పలికెను:

తలిదండ్రులు పూర్వదిక్కు
దక్షిణది క్కాచార్యుడు;

దారసుతులు పశ్చిమదిక్కు
స్నిగ్ధజనం బుత్తరదిశ
సేవకాదు లధోదిక్కు.

విని పురోహితుడు నాలుగవ గాథ పలికెను:

శ్రమణబ్రాహ్మణులు పైన
ప్రమాదంబు రాకుండగ
ఈ దిక్కులకున్ నమస్సు
గృహస్థు కావింపవలయు.

ఇది వినునప్పటికి రాజుకు తాపసులమీాది శ్రద్ధ పోవజొచ్చెను. శ్వేతకేతువు గ్రహించి తనలో "రాజుకు శ్రద్ధయుండెను. కాని పురోహితుడు కర్రతో కొట్టినట్లు దానిని ముక్కలు ముక్కలు చేసినాడు. అతనితో కొంత మాటాడవలెను" అనుకొని ఆయనతో సంభాషించువాడై, అయిదవ గాథ పలికెను:

తాల్చి యజినజటలు, మలిన
దంతములు వికృతరూప
ధారణమున జపముచేయు
వారు నిఖిలమానవకర్మ
విదు లగుచును సకలాప
ద్విమోచనంబు గాంచగలరె?

విని పురోహితుడు ఆరవ గాథ పలికెను:

బహుశ్రుతుం డయ్యు, రాజ
పాపకర్మ మొనరించుచు
చేయక ధర్మాచరణము
వేయివేదములు పఠించి
ఆచరణము లేక దుఃఖ
మోచనంబు కానేరదు.

ఈ ప్రకారముగా శ్వేతకేతుని సిద్ధాంతమును ఖండించి, తాపసుల నందరను గృహస్థులను జేసి, వారికి డాలులు, ఆయుధములు నిచ్చి మహాంతులను జేసి, రాజసేవలో నియుక్తులను జేసెను. ఇది మహాంతుల ఉత్పత్తికథ.

చేయుచు వేదాధ్యయనము
చేయడేని సత్కర్మము
దుఃఖం బడ్డానివలన
తొలగదేని వేదంబులు
ఫలహీనము లని సంయమ
కలితాచరణము సత్యము;
తలపవచ్చుగద నే నిటు ?

నిష్ఫలంబు కాదు వేద
నిచయము; సంయమ సహితా
చరణమె సత్యమ్మ సుమ్మ,
స్వాధ్యాయమువలన కీర్తి
సంప్రాప్తం బగును; పొందు
సంయత కృత్యుండు శాంతి.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున శ్వేతకేతువు కపటభిక్షువు; చండాలపుత్రుడు సారిపుత్రుడు; పురోహితుడు నేనే.

## 378 దరీముఖ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు మహాభినిష్క్రమణమును గూర్చి చెప్పినది. వర్తమానకథ పూర్వమే వచ్చినది.

### అతీత కథ

పూర్వము రాజగృహములో మగధరాజు పాలనము చేయుచుండగా, బోధిసత్త్వుడాయనపట్టమహిషికడుపున బుట్టెను. శిశువుకు బ్రహ్మదత్తకుమారు డని పేరుపెట్టిరి. అతడు పుట్టినరోజుననే పురోహితునకుగూడ పుత్రుడు పుట్టెను. బిడ్డనిముఖము చాలసుందరముగా నుండుటచే దరీముఖు డని పేరుపెట్టిరి. వారిరువురను రాజకులమునందే పెంచుచుండిరి. ఉభయులకు పరస్పరప్రేమ వృద్ధియయ్యెను. పదు

నారు సంవత్సరములు వచ్చునప్పటికి వారు తక్షశిల కేగి అన్నివిద్యలు నేర్చి, అన్నిమతముల విద్యలను దేశవ్యవహారములను గ్రహించుటకై గ్రామాదులలో విచరించుచు, వారాణసి చేరి, దేవకులమున (ఆలయము) నిలిచి, మరునాడు నగరములోనికి భిక్షార్థము పోయిరి. ఒక యింట పరమాన్నము సిద్ధము చేసి, ఆసనములాయత్తపరచి, బ్రాహ్మణులకు భోజనము పెట్టి, దక్షిణలిత్తు మని యింటివారు ప్రతీక్షించుచుండ వీ రుభయులు నచ్చటికి జేరిరి. బ్రాహ్మణులు భోజనార్థము వచ్చినా రని తలచి వారు మహాసత్త్వుని పీటమీద తెల్లనివస్త్రమును, దరీముఖుని పీటమీద రక్తవస్త్రమును పరచిరి. ఆలక్షణమును బట్టి తనమిత్రుడు వారాణసీప్రభు వగు ననియు, తాను సేనాపతి నగుదు ననియు దరీముఖుడు తలచెను. వా రచ్చట భోజనము చేసి, దక్షిణలు గ్రహించి, ఆశీర్వదించి, రాజోద్యానమునకు బోయిరి.

అచ్చట బోధిసత్త్వుడు మంగళశిలాపట్టముపై శయనించెను. దరీముఖు డతనిపాదములు నొక్కుచు ప్రక్కన గూరుచుండెను. వారాణసీప్రభువు చనిపోయి నాటి కేడుదినములు. పురోహితుడు రాజుకు అంత్యక్రియలు చేయించి, పుత్రశూన్య మైన రాజ్యమున ఏడవనాడు పుణ్యారథమును నడిపించెను. పుణ్యారథకృత్యము మహాజనజాతకమున (539) వచ్చును. చతురంగసేనాపరివృత మై పుణ్యారథము నగరములో బయలుదేరి, అనేకతూర్యధ్వనులతో ఉద్యానద్వారము చేరెను.

తూర్యారావములు విని దరీముఖుడు తనలో "నా మిత్రునికై పుణ్యారథము వచ్చినది. నే డతడు రాజయి నన్నే సేనాపతిని జేయును. కాని నాకు గృహస్థాశ్రమముతో నేమి పని? వెడలిపోయి ప్రవ్రజింతును" అని తలపోసి, బోధిసత్త్వునకు సూచన చేయక పోయి ఒక ప్రక్కన నిలుచుండెను. పురోహితుడు ఉద్యానద్వారమున రథమునాపి, లోనికి బోయి మంగళశిలాఫలకముమీద పండుకొనియున్న బోధిసత్త్వుని జూచి, ఆతనిపాదములలోని రేఖల నుపలక్షించి "ఇతడు పుణ్యాత్ముడు. రెండువేలదీవులతో గూడిన నాలుగుమహాద్వీపములను పరిపాలింపగలవాడు" అని తలచి, ఈతని స్థైర్యమును పరీక్షింపగోరి, అన్నివాద్యములు బలముగా మ్రోయించెను.

బోధిసత్త్వుడు మేలుకొని, ముఖముమీాద వస్త్రము తొలగించి, జన సమూహమును జూచి, మరల వస్త్రము కప్పుకొని, పాలుమాలిక తొలగినపిమ్మట లేచి పర్యంకబంధమున గూరుచుండెను. పురోహితుడు మోకాళ్ళపై గూర్చుండి "దేవా, మీారు రాజ్యాధికారు లయినారు" అని పలికెను. "ఆర్యా, ఈరాజ్య మపుత్రకమా?" "చిత్తము దేవా!" "అట్లయిన మంచిది" అని అత డంగీకరించెను. వా రతని కచ్చటనే ఉద్యానమున పట్టాభిషేకము చేసిరి.

మహావైభవము లభించినపిదప రాజు దరీముఖుని మరచిపోయెను. రథ మెక్కి యాతడు జనము వెంటరాగా నగరములో ప్రవేశించి, రాజద్వారముకడ ఆగి, అమాత్యులకు వారివారిపదవు లిచ్చి, ప్రాసాద మెక్కెను.

ఆసమయమున దరీముఖుడు ఉద్యానము నిర్జనమయిన దని తలచి వచ్చి శిలాఫలకముపై గూరుచుండెను. ఎండిన పచ్చనియాకు ఆతని ముందు రాలెను. ఆపత్రము తీసికొని అతడు క్షయవ్యయముల విచారణచేయుచు (అనిత్య దుఃఖ అనాత్మ) త్రిలక్షములను మననము చేయుచు పృథ్వి ఆనందముఖరితము చేయుచు ప్రత్యేకబోధిని పొందెను. ఆక్షణముననే ఆయనగృహస్థవేష మంతర్థానము చెందెను. ఆకాశము నుండి అద్భుతపాత్రము, చీవరములు దిగి, ఆయనశరీరమును యుక్తముగా నాచ్ఛాదించెను. వెంటనే యతడు అష్టపరిష్కారధారి యై సమ్యక్చర్యాయుక్తు డై శతవర్షస్థవిరునివలె నయి, బుద్ధిబలముచే ఆకసమున కెగసి, హిమాలయప్రదేశమున నందనమూలకప్రపాతమున దిగెను

బోధిసత్త్వుడు ధర్మానుసారముగా రాజ్యము చేయుచుండెను; కాని వైభవాధిక్యమువలన మత్తు డై నలువదిసంవత్సరములవరకు దరీముఖుని విస్మరించెను. నలువదియవసంవత్సరము కడచినంతనే ఆతనిని జూడ గోరిక కలిగెను. దరీముఖు డను నా మిత్రు డెచ్చట నున్నాడు? అని అంతఃపురములోను, సభలోను అనుచుండెను. అతని నివాసస్థానము నాకు దెలుపువారికి లాభము కలుగును అని తరచుగా అనుచుండ పది సంవత్సరములు గడచిపోయెను.

ప్రత్యేకబుద్ధు డైన దరీముఖునకు ఏబది సంవత్సరముల తుదను

మిత్రుడు తనను స్మరించుచున్నా డని గ్రహించి "ఆత డిప్పుడు వృద్ధు డయినాడు. పుత్రపుత్రికాపరివారము పెరిగినది. నేను పోయి ధర్మోప దేశము చేసి, అతనిని ప్రవ్రజితుని చేసెదను" అని యెంచి బుద్ధిబల ముచే ఆకాశమార్గమున రాజోద్యానమున దిగి, శిలాపట్టముమీాద స్వర్ణ ప్రతిమవలె గూరుచుండెను.

ఉద్యానపాలకు డతనిని జూచి పోయి "భన్తే, ఎక్కడినుండి వచ్చి వచ్చినారు?" అని యడిగెను. "నందనమూలకపర్వతమునుండి." "తమ నామధేయము?" 'ఆయుష్మన్, నన్ను దరీముఖప్రత్యేకబుద్ధు డందురు. "భన్తే, తమరు మారాజుగారి నెరుగుదురా?" "అవును, నేను గృహ స్థుగా నున్నప్పుడు ఆయన నా మిత్రుడు." "భన్తే, రాజుగారు తమను దర్శింపగోరుచున్నారు. తమరాక వారికి తెలిపివచ్చెదను." "మంచిది, పోయిరమ్ము."

తనమిత్రము వచ్చినా డనుసమాచారము తెలియగానే రాజు రథ మెక్కి, బహుపరివారముతో ఉద్యానము చేరి, ప్రత్యేకబుద్ధునకు ప్రణామము చేసి, కుశల మడిగి, ఒకప్రక్క గూరుచుండెను.

ప్రత్యేకబుద్ధు డాయనకు ధర్మోపదేశము చేసెను. "బ్రహ్మదత్తా, ఏమిచేయుచున్నావు? ధర్మానుసారముగా రాజ్యము చేయుచున్నావా? దుర్గతికి గొనిపోవు కర్మలు చేయుట లేదుకదా? ధనముకొరకు నీవు జనులను బాధింపక యోగ్యముగా నున్నావుకదా?—— నీవు వృద్ధుడ వయినావు బ్రహ్మదత్తా! భోగములను విసర్జించి ప్రవ్రజింపవలసిన సమయ మాసన్నమైనది" అని యీతొలిగాథ పలికెను:

బ్రహ్మదత్త, కామాదులు
పంకము బోలు నూబి బోలు
అంటి వేని నాపద లని
అంటి ధూళిధూమము లని
బ్రహ్మదత్త, వీని విడిచి
ప్రవ్రజింపవలయు నీవు.

విని, రాజు భోగములలో తాను మునిగి యుండుట ప్రకటించుచు రెండవ గాథ పలికెను:

బ్రాహ్మణ, భోగంబులందు
భయదముగా ననురక్తుడ,
చిక్కుకొన్నవాడ, మూర్ఛ
చెందియున్నవాడ, నాకు
ఆజీవిత మందు కలదు
అనురాగము; కామాదులు
విడువజాల నాచరింతు
వివిధపుణ్యకార్యంబులు.

తాను ప్రవ్రజింపలే నని బోధిసత్త్వుడు చెప్పినను దరీముఖుడు మరల ఉపదేశము చేయువాడై ఈ రెండు గాధలు పలికెను:

హితచింతకు డుపదేశం
బిచ్చినపుడు శుభేచ్ఛుండు
దాని నాచరింపకుండ
తన కార్యమె శ్రేష్ఠ మనుచు
తలచు; మూర్ఖు డెన్నిసార్లొ
తల్లి కడుపునందు బడును.

యోగిజనము లెద్దానిని
యోజింతురొ అశుభం బని
భరితము మలమూత్రంబుల
భయదనరకమందు పడును.
కామభోగముల నెవ్వరు
కడునాసక్తులు, బద్ధులు
తల్లిగర్భ మవ్వారలు
త్యజయింపం జాల రెపుడు.

దరీముఖుడు గర్భప్రవేశ, గర్భనివాసమూలకదుఃఖమును వివరించి గర్భమునుండి యీవలకు వచ్చు దుఃఖమును ప్రకటించుచు ఈ ఒకటిన్నర గాధలు పలికెను:

మలరక్తశ్లేష్మంబుల
మిళితగర్భకుహరంబును
వీడవచ్చుచుందురు; త
ద్వేళ నేది తగిలినను

తోచును ప్రతికూలముగా-
దుఃఖంబే కలుగుచుండు
కావు విన్నమాటలు, నే
కాంచి స్వయముగా వచింతు;
చాలపూర్వజన్మంబుల
సంస్మరణము కలదు నాకు.

శాస్త అభిసంబుద్ధుడై, ప్రత్యేకబుద్ధుడైన దరీముఖుడు ఈ విధముగా రాజుకు ఉపదేశ మిచ్చె నని చెప్పి, ఈ యర్థగాథ పలికెను:

వితతభావపూర్ణసుభా
షిత గాథల ద్వారంబున
తనమాటనె యొప్పించెను
దరీముఖుడు సుమేధునిచే.

ఈప్రకారముగా ప్రత్యేకబుద్ధుడు భోగములయందలి దోషమును జూపి, "మహారాజా, నీవు ప్రవ్రజించు, ప్రవ్రజింపకపో. భోగముల దుష్పరిణామమును గూర్చి, ప్రవ్రజ్యామహాత్మ్యమును గూర్చియు చెప్పినాను. నీవు అప్రమత్తుడవై యుండుము" అని, స్వర్ణ రాజహంసమువలె ఆకసమున కెగిరి, మేఘములపై నడచి నందమూలకపర్వతముకడ దిగెను.

బోధిసత్త్వుడు దశనఖసమ్మేళనముచే ప్రకాశించుచున్న అంజలి శిరసుపై నుంచికొని నమస్కారము చేసెను. దరీముఖుడు కనబడునంత వరకును జూచి, అనంతరము జ్యేష్ఠపుత్రుని బిలిపించి, అతనికి రాజ్యమిచ్చి, జనులు విచారపడుచుండగా హిమాలయమునకు బయలుదేరి పోయి, పర్ణకుటీరము నిర్మాణము చేయించి, ప్రవ్రజించి, కొలదికాలముననే అభిజ్ఞలు, సమాపత్తులు పొంది, జీవితాంతమున బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి సత్యప్రకాశము కావించి జాతకములు పరిపోల్చెను. అనేకులు శ్రోతాపన్నులైరి. ఆకాలమున రాజు నేనే.

## 379 నేరు జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు శాస్తకడ కర్మస్థానము (యోగవిధి) పొంది, సీమాంత గ్రామమునకు బోయెను. అచటివారు ఆయనచర్య కానందించి, భోజనము పెట్టి, పర్ణశాల నిర్మించి, అందు నిలిపిరి. విశేషముగా సత్కరించిరి. అంతట శాశ్వతవాది ఆగ్రామమునకు రాగా, ఆతనిసిద్ధాంతము విని, స్థవిరుని సిద్ధాంతము విడిచి, అతనిని సత్కరించిరి. ఆవల ఉచ్ఛేదవాది రాగా, శాశ్వతవాదిని విడిచి, లోకుల ఉచ్ఛేదవాదిని స్వీకరించిరి. అనంతరము నగ్నతావాది అటచేరగా, జను లతనిని స్వీకరించిరి. స్థవిరుడు గుణావగుణము లెరుగనివారల నడుమ వ్యథతో నివసించుచు, వర్షాకాలము తొలగిపోవగా శాస్తకడకు చేరెను. కుశలప్రశ్నానంతరము శాస్త అతనిని "వర్షాకాల మెక్కడ గడపితివి?" అని యడిగెను, "భన్తే, సీమాంతగ్రామమున." "సుఖముగా నుంటివా?" "భన్తే. గుణావగుణము లెరుగనివారల నడుమ కష్టముతో నుంటిని." "భిక్షూ, పురాణపండితులు పశువులకడుపున పుట్టినను గుణావగుణము లెరుగని వారినడుమ ఒక్కరోజయిన నుండలేదు. నీ వెట్లుంటివి?"

భిక్షువు ప్రార్థించినపిదప శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు స్వర్ణహంసకడుపున బుట్టెను. ఆయనకు తమ్ము డుండెను. వారు చిత్రకూటపర్వతమున నివసించుచు హిమాలయప్రదేశమున స్వయముగా పండు ధాన్యమును తినుచుందురు. ధాన్యము తిని యొకనాడు రెండుపక్షులు చిత్రకూటమునకు మరలివచ్చుచు త్రోవలో నేరు అను కాంచనపర్వతమును జూచి దానిపై వ్రాలెను. ఆ పర్వతముపై నుండు పక్షులు, కుందేళ్ళు, చతుష్పాత్తులు—నానావర్ణములు కలవి—అచ్చట మేత మేయుచుండును; అవి పర్వతముమీదికి వచ్చినపుడు తత్ప్రభావముచే సువర్ణ వర్ణముతో శోభిల్లును. ఈవిషయము తెలియక,

కాంచనవర్ణము చూచి తమ్ముడు అన్నతో "కారణ మేమి" అని యడుగువాడై ఈ రెండుగాథలు పలికెను:

అటవీ సాధారణ వా
యసములం, పక్షిశ్రేష్ఠుల
మైన మేము నీ పర్వత
మందు వాని సమాన మగుదు
మందరమును, వ్యాఘ్రసింహా
నీచసృగాలములతోడ
నిఖిలజంతువులు సమాన
వర్ణ మొందు నిచ్చట, నీ
పర్వతనామం బేమో?

విని, బోధిసత్త్వుడు మూడవ గాథ పలికెను:

ఈ యుత్తమపర్వతంబు
నెల్లజనులు నేరు వందు,
రిట సువర్ణఘనకాంతుల
నెల్లప్రాణు లొందుచుంద్రు.

ఇది విని తమ్ముడు తక్కిన గాథలు పలికెను:

శాంతజనుల కెట మాన్యత
సంభవింప, కవమానము
జరుగునో, హీనుల కెచ్చట
సమాదరము కల్గు, నచట
సలుపరాదు నివాసంబు.

నేరుమీద అలస దీక్ష
శూరభీరు లకారణముగ
సహానముగా గాంచు కతన
సమాదరము, నివాసంబు
సజ్జను లొనరింప రచట.

ఈ నగ ముత్తమ మధ్యమ
హీన భేద మేమి చూప
దెల్లర సమముగ నెంచును:
ఇంక దీని విడువవలయును.

ఇట్లు పలికినపిదప ఉభయులు ఎగిరి చిత్రకూట పర్వతమునకు బోయిరి.

శాస్త ధర్మోపదేశ సత్యప్రకాశములు కావించి జాతకము సమాప్తోచ్చెను. భిక్షువు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున చిన్నహంస ఆనందుడు; పెద్దహంస్సనేనే.

## 380 అసంక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు పూర్వభార్యపై ఆసక్తిని గూర్చి చెప్పినది. వర్తమానకథ ఇంద్రియ జాతకమున (423) వచ్చును.

ఈ కథలో శాస్త "భిక్షూ, నీవు నిజముగా ఉత్కంఠితుడవైతివా?" "భన్తే, చిత్తము" "దేనివలన?" "పూర్వభార్యవలన." "భిక్షూ, ఈమె నీకు అనర్థదాయకురాలు. ఈమె మూలమున పూర్వము కూడ నీవు చతురంగబలము విడనాడి హిమాలయప్రదేశమున మహావ్యథల నొందుచు మూడు సంవత్సరము లుంటివి" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీగ్రామమున బ్రాహ్మణకులమున పుట్టి పెద్దవాడయి, తక్షశిలకు బోయి, విద్య లభ్యసించి, ప్రవ్రజించి, కందమూలఫలములను భుజించుచు, అభిజ్ఞలను సమాపత్తులను పొంది, హిమవత్ప్రదేశమున నివసించుచుండెను.

ఆకాలమున ఒకానొక పుణ్యప్రాణి త్రయస్త్రింశద్భవనమునుండి చ్యుతమై ఆప్రాంతమందలి కమలసరోవరములో ఒకానొక కమలమున స్త్రీశిశువుగా జన్మించెను. మిగిలిన కమలములు వడలి పడిపోయినను ఆకమలము మాత్రము నిండువికాసముతో (పొట్టతో) నుండజొచ్చెను.

ఆతాపసి స్నానార్థము సరోవరమునకు పోయినప్పుడు దృష్టి ఆతామరపై బడి అది యట్లుండుటకు కారణ మేమని యోచించెను. స్నానార్థమాయనవస్త్రము ధరించి, ఈదుచు అచ్చటికి బోయి చూచునప్పటికి కమలగర్భమున స్త్రీశిశువు కానబడెను. బిడ్డను పుత్రికగా నెంచుకొని, తనకుటీరమునకు దీసికొని పోయి పోషింపసాగెను.

కాలక్రమమున ఆమె పదునారేండ్ల తరుణి అయినది. ఆమెరూపము దేవమానుషరూపములకు నడుమనున్నది. ఆరోజులలో శక్రుడు బోధిసత్త్వుని సేవార్థము రాకపోకలు చేయుచుండెను. అత డామెను చూచి "ఈమె యెచటనుండి వచ్చినది?" అని యడిగి ఆమె ప్రాప్తిక్రమమును విని 'ఈమె కేమి కావలెను?' అని ప్రశ్న చేసెను.

"మిత్రమా, ఈమె నివాసార్థము స్ఫటికసౌధము నిర్మింపవలెను. అందు దివ్యశయనము, దివ్యవస్త్రాలంకారములు, దివ్యభోజనాదికము ఉండవలెను" అని తాపసి చెప్పెను. "మంచిది భదన్తా" అని శక్రుడామె నివాసార్థము స్ఫటికప్రాసాదమును, నిర్మింపజేసి, అందు దివ్యశయన వస్త్రాలంకారాదికము ఏర్పాటు చేయించెను.

ఆమె యెక్కవలసివచ్చినపుడు ప్రాసాదము గగనమునుండి క్రిందికి దిగును; అమె యెక్కినపిదప గగనస్థలమునకు బోయి నిలుచును. ఆమె బోధిసత్త్వుని సేవించుచు ప్రాసాదమున నివసించుచుండెను.

ఆటవికు డొక డిది చూచి "భన్తే, ఈమె తమ కేమి కావలెను?" అని యడిగెను. "ఈమె నాబిడ్డ." వా డీవిషయము వారాణసీప్రభువుతో "దేవా, నేను ఇట్టికన్యను ఒకానొక తాపసిపుత్రికను చూచినాను" అని తెలిపెను.

ఈమాటలు చెవిని బడినంతనే రాజు ఆమెయెడ ఆసక్తికలవాడయి, ఆటవికులు మార్గము చూపుచుండ చతురంగబలముతో నచటికి బోయి, దండు విడిసి, ఆటవికుని వెంటబెట్టుకొని, అమాత్యసహితుడయి ఆశ్రమము జొచ్చి, బోధిసత్త్వునకు ప్రణామము చేసి, ఒకప్రక్కన గూరుచుండి, "భన్తే, స్త్రీలు బ్రహ్మచర్యమునకు ప్రతిబంధస్వరూపలు. మీ కొమార్తెను నేను పోషింతును" అనెను.

బోధిసత్త్వుడు "ఈకమలమున ఏ మున్నది" అని అశంకించి పూర్వము నీటిలో దిగి ఈదిపోయి ఆమెను తెచ్చుటచే ఆశంకాకుమారి

అని పేరుపెట్టెను. బిడ్డను కొనిపొమ్మని వెంటనే చెప్పక "ఈమె పేరు తెలిసికొనగలిగినచో ఈమెను తీసికొని పోవచ్చును" అని తాపసి పలికెను.

"భన్తే, మీరు చెప్పినమీద తెలిసికొనవచ్చును."

"నేను తెలుపను. ప్రజ్ఞాబలముచే నీవే గ్రహించి ఈమెను కొనిపోవచ్చును."

మంచి దని యంగీకరించి యాత డప్పటినుండి ఈమె పే రేమి కానోపును" అని మంత్రులతో ఆలోచింపసాగెను. వారు బోధిసత్త్వునితో అసాధారణనామము లెన్నియో చెప్పుచు 'భన్తే, ఈమె పేరు ఫలానా కాదా?' అనుచుండిరి. 'ఈ పేరు కాదు' అని యాత డనుచుండెను. ఈవిధముగా నామధేయములను యోచించుటలో సంవత్సరము గడిచిపోయెను. సింహాదివన్యమృగములు గజాశ్వములను మానవులను చంపివేయుచుండెను. సర్పముల బాధ, కుట్టెడి యీగల బాధ హెచ్చిపోయెను. శీతాకాలబాధవలన మనుజులు మరణింపసాగిరి. దీనితో నా కేల అని క్రుద్ధుడై రాజు బోధిసత్త్వునితో జెప్పి వెడలి పోయెను.

ఆనాడు ఆశంకాకుమారి స్ఫటికవాతాయనము తెరచి నిలిచి యుండెను. రాజామెను చూచి "మాకు నీపేరు తెలియలేదు. నీవు హిమాలయమందే ఉండుము. మేము పోవుచున్నాము" అనెను

"మహారాజా, నావంటిస్త్రీ ఎచ్చటికి బోయిన దొరకును? నా మాటలు వినుడు" త్రయస్త్రింశద్దేవలోకమున, చిత్తలతావనమున, ఆశావతి యను లత కలదు. దాని పండువలన దివ్యపానీయము లభించును. ఆపానీయ మొకసారి త్రాగినచో నాలుగు మాసములు దివ్యశయ్యపై శయనింపవచ్చును. అది వేయిసంవత్సరముల కొకసారి ఫలించును. సురాప్రియులైన దేవపుత్రులు ఫలము లభించు ననునాశతో దాహము సహించుచు వేయి సంవత్సరములు నిరంతరముగా దానివైపు చూచుచుందురు— లత బాగుగా నున్నదో లేదో యని ఒక్కయేటికే మీర లుద్విగ్నులయిపోయినారు. ఆశ ఫలించినపిమ్మటనే సౌఖ్యము. ఉద్విగ్నులు కావలదు" అని, యామె ఈ తొలి గాథ పలికెను:

జనియించెను చిత్తలతా
వనమున ఆశావతి లత,
ఒసగు ఫలము వేయియేండ్ల
కొక్కసారి; దాన సేవ
యొనరింతురు దేవతలును.

ఆమెమాటలకు రాజు వెనుకకు మరలి అమాత్యులను గుమిగూర్చి పదిపది పేర్ల చొప్పున కల్పన చేయింపజొచ్చెను. ఈప్రాకారముగా మరి యొకసంవత్సరము గడిచిపోయెను. పదిపేర్లలోగూడ ఆమెపేరు లేదు. ఫలానిపేరు కాదా అని రాజు చెప్పగా కాదని బోధిసత్త్వుడనెను.

దీనితో నా కేలయని రాజు గుర్ర మెక్కి బయలుదేరెను. ఆశంకా కుమారి స్ఫటికవాతాయనము ప్రక్కన కానబడెను. రాజు చూచి 'నీ వుండుము. మేము పోవుదము" అనెను. "ఏల పోవుచున్నారు మహా రాజా?" "నీపేరు గ్రహింపలేకున్నాను."

"మహారాజా, నామధేయ మేల గ్రహింపలేరు? ఆశ తప్పక ఫలించును. నామాట ఆకర్ణింపుడు. ఒకానొక కొంగ పర్వతశిఖరముమీద వాలియుండెను. దానికోరిక సఫల మయ్యెను. మీకోరిక ఏల ఫలింపదు? మహారాజా, శాంతి వహింపుడు. కొంగ ఒకానొక కమలసరోవరము నుండి చేపను పట్టుకొని యెగిరిపోయి పర్వతశిఖరముమీద వ్రాలెను. అది ఆనాడచ్చటనేయుండెను. మరునాడది యిట్లు యోచించెను. "ఈకొండకొమ్మున సుఖముగా నున్నది. ఎగురకుండ ఇచ్చటనే యుండి చేపలను పట్టుకొని, నీరు త్రాగినచో ఎంతో హాయిగానుండును."

ఆనాడు శక్రుడు అసురులను జయించి, త్రయస్త్రింశద్భవనమున గూరుచుండి "నామనోరథసిద్ధి అయినది. తన మనోరథసిద్ధి కానివాడు కలడా?" అని ధ్యానింపగా కొంగ కానబడెను. దీనికోరిక నెరవేర్చెదను అని శక్రుడు కొంగకు సమీపమున నున్న నదిలో వరదకల్పించి కొండ నెత్తము చేరునట్లు చేసెను. అక్కడనే నిలిచి కొంగ చేపలు తిని నీరు త్రాగి ఆనాడు గడపివేసెను. వరద తగ్గి, నీరు క్రిందికిపోయెను. మహారాజా, ఈప్రకారముగా కొంగకోరిక నెరవేరినప్పుడు మీకోరిక యేల నెరవేరదు?" అని ఆశంకాకుమారి ఈగాథలు పలికెను:

ఆశ విడువబోకు రాజ
ఆశ సఫల మైనపిదప
ప్రమదదాయకం బగు; నా
పక్షి యాశ విడువలేదు;
ఫలిత మెుదవె నిన్నాళ్లకు
ఆశ విడువ వలదు రాజ!

రాజు ఆమాటలు విని, రూపపాశబద్ధుడై, వెడలిపోవక, అమాత్యు లను ఏకత్రచేర్చి, నూరుపేర్ల చొప్పున నామకల్పన చేయింపజొచ్చెను. ఈప్రకారముగా సంవత్సరము గడచెను. రాజు బోధిసత్త్వునకు ప్రణా మము చేసి పోవుచున్నాము అని వెడలిపోయెను.

స్ఫటికవాతాయనము ప్రక్క నిలిచియున్న అశంకాకుమారిని చూచి, రాజు "నీ వుండుము. మేము పోవుచున్నాము" అనెను.

"ఎందులకు మహారాజా?"

"మాటలతోనే నీవు నన్ను సంతుష్టచిత్తుని చేయుచున్నావు. ఉప భోగము లేదు. నీమధురవాక్పాశబద్ధుడ నై యిచ్చట మూడు సంవత్స ములు గడపినాను. ఇక పోవుచున్నాను" అని యీగాథలు పలికెను:

భాషణమాత్రమున తృప్తి
కరపనెంతు క్రియల గాదు.
సువర్ణంబె సేరెయ్యక
సుమదామంబునకుబోలె;

సుగంధంబుమాత్ర మందు
శూన్య; మెవడు మిత్రులతో
శుష్కప్రియవాక్కు లాడి
శూన్యహస్తముం జూపునో
చేయడు త్యాగంబు వాని
స్నేహము పోవుచునుండును.

చేసినదే చెప్పు నెవడు
చేయనిదాని చెప్ప డెవడు
చేయకయే చెప్పు నెవడు
బుద్ధిమంతు లట్టివాని
పోల్చికొనం గలరు సుమా!

ప్రాథేయంబును సేవా
బలమును క్షీణించిపోయె;
శంకాస్పదము జీవితమ్ము,
ఇంక పోవుచున్న వాడ.

రాజువాక్కులు విని ఆమె "మహారాజా, ఇప్పుడు మీరన్నదే నా పేరు పోయి నాతండ్రితో చెప్పి, నన్ను మీవెంట గొనిపొండు" అని ఈ గాథ పలికెను:

ఏ వేదన నుంటి నేను
ఇప్పు డదియె నా నామము
పిలిచెద నన్మజ్జనకుని -
వేచియుండు డిచట రాజ!

రాజు బోధిసత్త్వుని సన్నిధికి బోయి ప్రణామము చేసి "తమపుత్రిక పేరు ఆశంకాదేవి" అనెను. బోధిసత్త్వుడు "పేరు తెలియగానే తీసి కొనిపోవచ్చును" అనియెను. రాజు స్ఫటికప్రాసాదముకడకు బోయి "భద్రే, నేను నీతండ్రియే నిన్ను నా కిచ్చినారు. పోవుదము, రమ్ము" అనగా ఆమె "మహారాజా, వేచియుండుడు. నేను నాయనగారిని చూచివచ్చెదను" అని సౌధము దిగి, తండ్రిని జేరి, ప్రణామము చేసి, క్షమింపు మని ప్రార్థించి, రాజువెంట జనెను. రా జామెను వెంటగొని వారాణసి చేరెను కొడుకు కూతులను గని వృద్ధిపొంది, ప్రేమతో సుఖముగా నుండెను.

బోధిసత్త్వుడు ధ్యానారూఢుడై బ్రహ్మలోకమున జన్మించెను.

శాస్త ధర్మోపదేశసత్యప్రకాశములు కావించి జాతకములు సరిపోల్చెను. ఉద్విగ్న చిత్తుడగు భిక్షువు స్రోతాపత్తిఫలము నందెను. ఆ కాలమున ఆశంకాకుమారి పూర్వ భార్య; రాజు ఉద్విగ్నచిత్తుడు; తపస్వి నేనే.

## 381 మిగాలోప జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు మాట సహింపలేని భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమానకథ

శాస్త ఆభిక్షువును పిలువనంపి "భిక్షూ, నీవు నిజముగా మాట సహింపలేనివాడవా ?" అనెను. "భన్తే, చిత్తము."

"భిక్షూ, నీవు ఇపుడే కాదు, పూర్వము కూడ ఇట్లే యుంటివి. పండితులమాట వినక జంఝూవాతమున జిక్కువడి వ్యధనొందితి" వని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు గృధ్రముకడుపున బుట్టి, అపరణ్ణగృధ్ర మను పేరుతో గృధ్రగణపరివృతుడై, గృధ్రకూటపర్వతమున నివసించుచుండెను. ఆయన పుత్రుడు స్థేమబలసంపన్నుడు, మిగాలోపనాముడు. అన్నిగ్రద్దలు ఎగురుదూరముకంటె ఎక్కువదూర మెగురుచున్నా డని గ్రద్దలు గృధ్రరాజుతో జెప్పగా, కుమారుని బిలిచి ఆయన "నాయనా, నీవు మహోచ్చరేఖకు ఎగురుచున్నావట. అంతయెత్తు పోవుచో ప్రాణములు కోలుపోవుదువు" అని చెప్పి, మూడుగాథలు పలికెను:

మిగాలోప, నీగమనము
మేలుగ తోపదు; బాబా
ఎగురుదు వూర్ధ్వమున నెంతో
గగనమ్మున విహరింతువు;
క్షితితలమ్ము చతుష్కోణ
క్షేత్రముగా గానబడునో
యపుడు నీవు మరలి రమ్ము;
అంతకు మించి పోవలదు.

ఉపదేశము వినినవాడగుటచే వాడు తండ్రిమాట వినక, తండ్రి నిర్దేశించిన సీమ నతిక్రమించి పైకెగిరెను. కాలవాతము దాటి

ఝంఝూవాతమునబడిపోయి వాడు వాయుప్రహారమున ప్రాణములు కోలుపోయి ఖండఖండము లై ఆకాశమార్గముననే అంతర్ధాన మయ్యెను.

ఈ మూడును అభిసంబుద్ధగాథలు:

పక్షయానచారు లైన
పక్షు లుపవ్వరమున కేఁగి
స్థితిపోలెను తాముగూడ
స్థిరమ్ము లని యెంచుననియు
చపేటమ్ము తగిలినట్లు
జడిగాడుపు దెబ్బతినుచు
పడిపోవు నధోగతి నని.

ఆలింపక వృద్ధజనకు
డపణ్ణకని యుపదేశము
అతిక్రమించి కాలవాయు
వాకసమున కెగిఁపోవ,
జంఝూనిలమున గృధ్రము
స్వరూపంబు కోలుపోయె.

వాని నాశ్రయించి యున్న
వారలు, భార్యాపుత్రులు
ఎల్లరు కష్టము పా లై;
రిట్లు వృద్ధజనులవాక్కు
లెవ్వరు లక్ష్యము చేయరో
అభిమానము తోడ సీమ
నతిక్రమించు గద్దవోలె
అవ్వారలు నశియింతురు.

శాస్త్రధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున మాట వినని మిగాలోపుడు భిక్షువు; అపరణ్ణుడు నేనే.

## 382 సిరి కాలకణ్ణి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు అనాథపిండికుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు శ్రోతాపత్తిఫలము నొందిన పిమ్మట పంచశీలములను అఖండముగా పాలించుచుండెను. ఆతని భార్యయు, పుత్రికలు, పుత్రులును పాలించుచుండిరి. దాసజనులును, కూలివాండ్రును అట్లే చేయుచుండిరి. ఒకనాడు ఈ విషయమై ధర్మసభలో చర్చజరుగుచుండగా శాస్త అచటికి కరుదెంచి, "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు. పూర్వము పండితజనులు స్వయముగా పవిత్రులయి, పరివారమును గూడ పవిత్రము చేసెడివారు" అని వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠి యయి, దానధర్మములు చేయుచు శీలములు రక్షించుచు, ఉపవాసవ్రత మనుష్ఠించుచుండెను. ఆయన భార్య కూడ పంచశీలములు రక్షించుచుండెను. బాలురు, బాలికలు, దాసదాసీజనము కూడ అటులే చేయుచుండెను. ఒకనా డతడు తనలో "నా కంటె ఎక్కువ సుచరితశీలుడు వచ్చిన పక్షమున నేను కూరుచుండు పీఠము కాని, నేను పండుకొను శయనము కాని ఆయన కిచ్చుట ఉచితము కాదు. అదివర కుపయోగింపని వస్తువుల నిచ్చుట సమంజసము" అని తలపోసి, తనయింటనే ఉపయోగింపని ఆసనమును, శయనమును ఒకప్రక్క నుంచెను.

ఆసమయమున చాతుర్మహారాజిక దేవలోకమునుండి విరూపాక్ష మహారాజపుత్రిక కాలకణ్ణియు, ధృతరాష్ట్రమహారాజపుత్రిక సిరియు గంధమాల్యములను గొని, అనోతప్తసరోవరము చేరిరి. అక్కడ ఘట్టము లనేకము కలవు. అందు బుద్ధులఘట్టమున బుద్ధులు, ప్రత్యేకబుద్ధుల ఘట్టమున ప్రత్యేకబుద్ధులు, భిక్షులఘట్టమున భిక్షులు, తాపసుల ఘట్టమున తాపసులు, చాతుర్మహారాజికాది షట్స్వర్గములలోని

దేవపుత్రులఘట్టమున దేవకన్యలు స్నానములు చేయుచుందురు.

ఆకన్య లిరువురు నచటికి జేరి, 'నేను ముందు స్నానముచేయుదును, నేను ముందు స్నానము చేయుదును' అని జగడమాడిరి. కాలకణ్ణి "నేను లోకపాలన చేయుచున్నాను, తీర్పు చెప్పుచున్నాను. కావున నేనే ముందు స్నానముచేయుదును" అనెను. సిరి "లోకులకు ఐశ్వర్య దాయకము లైన సర్వకార్యములందు నియుక్తను. కావున నేనే ముందు స్నానము చేయవలెను" అనెను. మనలో నెవరు తొలుత స్నానము చేయవలె ననువిషయము చతుర్మహారాజులు నిర్ణయింప వలె నని నిశ్చయించుకొని వారుభయులు చతుర్మహారాజసన్నిధికి బోయి "మాలో నెవరు ముందుగా అనోతప్తసరోవరములో స్నానము చేయవలెనో చెప్పు" డనిరి.

ధృతరాష్ట్రవిరూపాక్షులు విరూఢకవైశ్రవణుల మీద బాధ్యత నుంచి "మేము నిర్ణయింపజాలకున్నాము" అని చెప్పిరి. "మేమును నిర్ణయింపజాలము. శక్రుని సన్నిధికి పంపుదుము" అని వారు కన్యలను బంపిరి. విని శక్రుడు "నేను నిర్ణయింపలేను. వీ రిరువురు నాకు సంబంధించినవారిబిడ్డలు" అనుకొని "వారాణసిలో శుచిపరివారశ్రేష్ఠి కలడు. ఆయనయింట ఇతఃపూర్వ ముపయోగింపని ఆసనము, శయ్యయు కలవు. మీలో నెవరు ఆసనముమీద గూరుచుండగలరో, శయ్యపై పరుండగలరో వారు తొలుత స్నానముచేయవచ్చును" అని చెప్పెను. విని కాలకణ్ణి తోడనే నీలచేలము ధరించి, నీలలేపనము పూసికొని, నీలమణిభూషలు దాల్చి, ఒడిసెలనుండి విసరినరాయివలె దేవలోకము నుండి దిగి, అర్ధరాత్రమునకు తరువాత శ్రేష్ఠిప్రాసాదమున ఉపస్థాన శాలాద్వారమున శయ్యాసమీపముగా నీలకాంతులు ప్రసారించుచు ఆకసమున నిలిచెను. ఆయనదృష్టి ఆమెమీద పడినది. చూడగానే ఆమె శ్రేష్ఠికి నచ్చలేదు. అతడు సంభాషించుచు ఈతొలిగాథ పలికెను:

ఎవరు నల్లవన్నెదాన ?
వింపు కాదు నీ రూపము,
ఎవరిబిడ్డ నీవు ? నిన్ను
నెట్టులు గుర్తింపగలము ?

విని కాలకణ్ణి రెండవ గాథ పలికెను:

నేను విరూపాక్షు సుతను
నీలవర్ణగాత్రిని, భూరి
కోపనశీల నపుణ్యాత్మ
నందురు నను కాలకణ్ణి
అభ్యర్థించెద నేను మీ
యంతికమున వసియింపగ.

అంతట బోధిసత్త్వుడు మూడవ గాథ పలికెను:

ని న్నడిగెద నో కాళీ,
నీవు నెట్టివారలపై
ఇష్టమొ, దానింబట్టియె
మేము నిన్ను గ్రహియింతుము.

ఆమె ఈ గాథలు పలికెను:

మేలు మరచువాడు, మాట
పాలనచేయలేని వాడు
కలహప్రియు, డీర్ష్యాళువు
కడులుబ్ధుడు, మహాశఠుడు,
చేరినవారి వినాశంబు
చేయువాడు నాకు ప్రియుడు.

క్రోధనుండు, బద్ధవైరి
కొండెగాడు, విభేదకుడు
పరుషవాక్కు, కటుహృదయుడు
పరమప్రియు డగును నాకు.

నేడు కాని రేపు కాని
నిర్వహింప దగు పనులను
తెలిసికొనం జాలక, యుప
దేశంబున మండిపడునో
యోగ్యులకన్నను తానే
యుత్తముండ నని యెంచునో
అభిరుచి దుష్టార్థంబుల
త్యక్తమిత్ర, మధికప్రియు
డట్టివాడు లభియించిన
అధికసుఖము కలుగు నాకు.

ఆమెను నిందించుచు బోధిసత్త్వు డీ గాథ పలికెను:

కాళీ, ఈ గుణములు మా
కడలే, వేదో జనపద
మునకో నిగమమ్మునకో
చనుము రాజధానికైన.

విని కాలకణ్ణి దుఃఖిత యై అనంతరగాథ పలికెను:

మీకడ నేతద్గుణములు
మృగ్యము లని తెలియు నాకు,
ధనము చాల కూడబెట్టు
దౌర్భాగ్యులు కల రెందరొ
దాని నష్టపరతు మేము,
తమ్ముడు దేవుండు నేను.

ఇట్లు పలికి "దేవలోకమున మాకడ దివ్యభోగ్యవస్తువు లనేకము కలవు, దివ్యశయనాసనములు కలవు. వీనితో మాకు ప్రయోజన మేమి?" అని వెడలిపోయెను.

ఆమె వెడలిపోవగానే సిరి స్వర్ణవర్ణానులేపనముతో స్వర్ణాలంకారములతో ఉపస్థానశాలాద్వారముకడ పచ్చనికాంతులు ప్రసారించుచు భూమిపై పాదములమీద నిలిచి, సగౌరవముగా నిలుచుండెను. చూచి బోధిసత్త్వు డీగాథ పలికెను:

దివ్య మైన వర్ణముతో
స్థిరమీదను ప్రతిష్ఠితవు
ఎవరు నీ? వెవ్వరి బిడ్డ?
వెట్లు నిన్ను గుర్తింతుము?

విని సిరి రెండవ గాథ పలికెను:

నే ధృతరాష్ట్రునికన్యను
నిజనామము, సిరియు లక్ష్మి
గాఢప్రజ్ఞావంతులు
గ్రహియింపగలరు నన్ను
అభ్యర్థించెద భవదీ
యాంతికమున నే నిలువగ.

బోధిసత్త్వు డిట్లనెను:

ఏము నిన్ను ప్రశ్నింతుము
ఎట్టి స్వభావము కర్మము
లున్న వానికడను లక్ష్మి,
ఉండగ వాంఛించెదవో
దానివలన నిన్ను మేము
తప్పక గ్రహియింపగలము.

ఆమె యి ట్లనెను:

శీతోష్ణమ్ముల గానీ
వాతాతపముల గానీ
అహిమక్షికముల నైనను
ఆకలి దప్పికల నైన
పరిగణింపకుండ రేలుం
పవళులు స్వీయార్థంబును
వదలక నిర్వర్తించెడు
వాడు నచ్చు! నతనితోడ
వాసము చేయం దలంతు.

త్యాగి, శీలమిత్రవంతు
డక్రోధనుడును, ఋజువ
ర్తనుడును, మృదుభాషణుండు
జనులతోడ కలిసి మెలసి
తిరుగువాడు, విశ్వసనీయ
ధీరవాక్కు, పదవియందు
నుండికూడ నమ్రుడైన
యుత్తముండు లభియించిన
ఉదధితరంగంబువోలె
నుప్పొంగుదు నతనివైపు.

స్నేహితులను శత్రువులను
శ్రేష్ఠ సమాన హీనులను
మేలో కీడో చేయువారి
మేళవింప గలుగువాడు,
పరుషవాక్య మెన్నండును

పలుకనివాడు దొరకినచో
అట్టి యోగ్యపురుషుదాన
నా మరణం బగుదు నేను.

ఏతద్గుణ గణములోన
నేదో యొకదాని వలన
దొరకిన సిరి లెక్కింపని
దురితవర్తనుని, ధూర్తుని
దూరముగా విడిచిపోదు.

భాగ్యవంతు డైనగాని
భాగ్యహీను డైనగాని
స్వయముగనే యగును నరుడు,
పరులు మార్పు చేయలేరు.

సిరిదేవి పలుకులు విని బోధిసత్త్వుడు ఆమె నభినందించుచు "ఇంత వర కెవ్వరు నుపభోగింపని ఈయాసనము, శయ్యయు నీకు తగినవి. నీవు ఆసనముపై గూరుచుండి, శయ్యపై బండుకొనుము" అని చెప్పెను.

సిరిదేవి రాత్రి యచటనుండి, వేకువజామున చతుర్మహారాజిక దేవ లోకము చేరి, అనోతప్తసరోవరమున ముందుగా స్నానము చేసెను. శ్రేష్ఠిశయ్యను సిరిదేవతోపయోగమునకై యుంచుటచే దానికి శ్రీశయ్య యను పేరు వచ్చి, నేటికిని ఆపేరనే ప్రఖ్యాతి వహించి-యున్నది.

శాస్త్ర ధర్మోపదేశము జేసి జాతకములను పరిపోల్చెను. ఆ కాలమున సిరిదేవి ఉత్పల వర్ణ; శ్రేష్ఠి నేనే.

# 383 కుక్కుట జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఉద్విగ్నచిత్తుడగు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ భిక్షువుతో శాస్త "ఏల ఉద్విగ్నచిత్తుడవైతివి?" అనెను. భన్తే, అలంకారములు ధరించిన ఒకానొక స్త్రీని చూచి ఆసక్తినొందుటచే" "భిక్షూ, స్త్రీలు మోసముచేసి టక్కులు చూపి తమవశము చేసికొని పురుషులను నాశము చేయుదురు. లోభియగు పిల్లివలెనే అగును" అని శాస్త ఊరకుండెను. ఆవల ఆతని ప్రార్థనవలన శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు అరణ్యములో కుక్కుటముకడుపున బుట్టి, అనేకశతకుక్కుట పరివృతుడై నివసించుచుండెను. సమీపములో పిల్లి వసించుచు, ఉపాయమున మోసగించి, బోధిసత్త్వునితప్ప తక్కిన కుక్కుటములను భక్షించెను. బోధిసత్త్వుడు దానికి పట్టుబడలేదు. అది యిట్లు తలపోసెను. "ఈకుక్కుటము చాల శరము కలది. నాశాఠ్యమును కౌశలమును గ్రహింపలేదు. నేను నీభార్య నగుదునని మోసగించి, వశపరచుకొన్న పిదప భక్షింపవలెను." ఇట్లు తలపోసి ఆకుక్కుటము కూరుచున్న వృక్షశాఖక్రిందికి జేరి, ప్రశంసాపూర్వకముగా యాచించుచు ఈ గాథ పలికెను:

> చిత్రవర్ణపక్ష, తామ్ర
> శిఖా, దిగుము శాఖనుండి
> స్వీకరింపు పత్నిగ నను.

బోధిసత్త్వుడు విని "ఇది నా బాంధవుల నందరను భక్షించినది. లోభపెట్టి నన్ను తినివేయజూచుచున్నది. దీనిని పంపివేశెదను" అని తలచి, రెండవ గాథ పలికెను:

నేను ద్విపాత్తును కల్యా
ణీ, నీవు చతుష్పాత్తువు,
పశుపక్షుల కెపుడును సరి
పడదు మేళనంబు వేరు
పతిని మనోరమ, వెదకుము.

"ఇతడు మిక్కిలి శఠుడు. ఏదో యుపాయమున నితనిని మోసగించి భక్షింతును" అని భావించి మార్జాల మీ గాథ పలికెను:

నేను సుందరమధురభాషి
ణిని కుమారి నింతపరకు
అగుదును నీదాన, ఇష్ట
మగునెడలం దెలుపవలయు
ఆర్యవిధిని సర్వులకును.

బోధిసత్త్వుడు విని "దీనిని బెదరించి పారద్రోలవలె" నని తలచి నాలుగవ గాథ పలికెను:

కుణపంబుల భక్షించుచు
కుక్కుటముల వధియించుచు
క్రోలుచు రక్తమ్ము, చోర
గతి తిరిగెడుదాన, నీకు
పతి కానని తెలిసికొమ్ము.

అది పారిపోయెను; వెనుదిరిగి చూడనైన చూడలేదు. ఇవి అభిసంబుద్ధగాథలు:

ఈ విధముగ చతురవనిత
వీక్షించుచు వరప్రవరు
మార్జారిణి కుక్కుటంబు
మాడ్కిని వశవర్తిజేసి
మహాయత్న మొనరింతురు.

శీఘ్రముగా నుత్పన్న
స్థితిని గ్రహింపం జాలని
యాతడు శత్రువశంగతు
డై యనుతాపంబు నొందు.

శీఘ్రముగా నుత్పన్న
స్థితిని గ్రహింపంజాలిన
యాతడు బ్రతుకు నీవలబడి
అమిత్రజాలంబు నుండి
కుక్కుటంబు బిడాలంపు
టక్కు తప్పి కొన్నయట్లు.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు పరిపోల్చెను. ఉద్విగ్నచిత్తు డగు భిక్షువు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున కుక్కుట రాజు నేనే.

## 384 ధమ్మద్ధజ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు కపటభిక్షువును గూర్చి చెప్పినది.
ఆసమయమున శాస్త భిక్షువులారా, ఇత డిప్పుడే కాదు, పూర్వము కూడ కపటవృత్తి కలవాడే" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు పక్షికడుపున బుట్టి, పెరిగి పక్షిగణపరివృతు డై సముద్ర మధ్యమున దీవిలో నివసించుచుండెను. వారాణసీనివాసు లగు వ్యాపారులు దిశాకాకముతో పడవ యెక్కి సముద్రయానము చేయుచుండ పడవ బ్రద్దలయ్యెను. ఆ కాకి ద్వీపమున వాలి "ఇక్కడ గొప్ప పక్షి సమూహ మున్నది. ఉపాయము చేసి గ్రుడ్లను పిల్లలను తినుచుండ వలెను" అని తలపోసి, పక్షిసమూహమున వాలి నోరు తెరచి ఒంటి కాలిమీద నేలపై నిలిచెను. "స్వామీ, తమనామధేయ మేమి ?" అని పక్షు లడిగినవి. "నాపేరు ధార్మికుడు." "ఒంటికాలిమీద నిలుతు రేల ?" "రెండవపాద ముంచినచో భూమి నాభారము భరింపలేదు." "ముక్కు తెరచి నిలిచితి రేల ?" "నేను వాయుభక్షణము చేయు

చును. మ రేమియు తినను.”

ఇట్లు చెప్పి కాకి పక్షులను సంభోధించి “మీ కుపదేశ మిత్తును. వినుడు” అని తొలిగాథ పలికెను :

ధర్మాచరణము యుక్తము
దానివలన మేలు కలుగు
ధర్మ మాచరించు నతడు
ఇహపర లోకములయందు
బహుసుఖముగ నిద్రించును.

ఈ కాకి గ్రుడ్లు మ్రింగుటకు వచ్చిన దని యెరుగక పక్షులు దుశ్శీలుని ప్రశంసించుచు రెండవ గాథ పలికెను:

భద్రమైన దీ ఖగంబు
పరమధార్మికంబు ద్విజము
ఒంటికాలిమీద నిలిచి
ఉపదేశించుచున్నది !

పక్షులు దురాచారియెడ శ్రద్ధ చూపుచు “స్వామీ, తమరు మాంసము భుజింపరు, కేవలము వాయుభక్షణ చేయుదురు. మాగ్రుడ్లను పిల్లలను కనిపెట్టియుండుడు” అని చెప్పి మేతకై వెడలిపోయెను. ఆ పాపి పిట్టలులేనపుడు కడుపునిండ అండములను శాబకములను తిని, అవి మరలివచ్చునప్పటికి శాంతాకారముధరించి, నోరు తెరచుకొని, ఒంటి కాలిపై నిలుచుండెను. బిడ్డలుకనబడకపోవుటచే పిట్టలు కూసికూసి అలసి పోయెను. కాకి ధార్మికుడని యెంచి యించుకంతయు అనుమానపడలేదు.

ఒకనాడు బోధిసత్త్వుడు తనలో “ఇక్కడ తొలుత అపాయము లేదు. ఈ కాకి వచ్చినప్పటినుండి ఆరంభమయినది. దీనిని పరిశోధింప వలెను” అని తలచి తక్కినపిట్టలతో మేతకు పోవునట్లు పోయి, త్వరలో మరలివచ్చి రహస్యప్రదేశమున ప్రాలెను.

పిట్టలు వెడలిపోయినతరువాత కాకి లేచి గ్రుడ్లను, బిడ్డలను కడుపు నిండ మేసి వచ్చి, నోరు తెరచుకొని, ఒంటికాలిపై నిలుచుండెను. పిట్టలు మరలివచ్చినపిదప పక్షిరాజు వానిని సమావేశపరచి “ఈపాపి అండములను, శాబకములను మ్రింగుచుండగా నేను చూచినాను. నేను వీనిని పట్టుదు. పారిపోవుచో పట్టి పడవేయుడు” అని యానతిచ్చి,

మిగిలిన గాథలు పలికెను:

దీనిస్వభావం బెరుగము
తెలియకయే పొగడుదురే,
అండంబుల శాబకముల
నారగించుచునే ధర్మ
మనుచున్నది పలుమారులు
చెప్పనొకటి నాలుకతో
చేయనొకటి నోటితోడ.
వాతను ధర్మము స్థిరమే
చేతయందు కానరాదు;
మాట లన్న కోమలములు
మానసంబు చొరరానిది;
కాలభుజంగము వల్మీ
కమ్మునందు దాగియుండు
ఇంత మహాధ్వజు డీతని
నెల్లెడల మహాత్ము డన్న
ఈ వాయసమును నిజముగ
ఎరుగడు సామాన్యజనుడు.
ముక్కులతో బొడిచి దీని
రెక్కలతో గొట్టి కాళ్ల
రక్కి చంపివేయవలయు!
సహవాసమున కయోగ్యము,
చంపవలయు దుష్టమతిని.

ఇట్లు పలికి పక్షిరాజు స్వయముగా ఎగిరి కాకిశిరసుపై తన్నెను. తక్కినపక్షులు కాకిని ముక్కులతో, గోళ్ళతో, కాళ్ళతో, రెక్కలతో పొడిచి, రక్కి, తన్ని, కొట్టెను. అది అచ్చటనే పడి చచ్చెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములం పరిపోల్చెను. ఆకాలమున కపటకాకము ఇప్పటి భిక్షువు; పక్షిరాజు నేనే.

## 385 నందియమిగరాజ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు తల్లిని పోషించుభిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త అతనితో "భిక్షూ, నీవు నిజముగా గృహస్థులను పోషించుచున్నావా? అనెను. భన్తే, చిత్తము. "వారు నీ కేమి కావలెను?" "భన్తే, తలిదండ్రులు." "భిక్షూ, మంచిది! నీవు పురాణపండితుల పరంపరను రక్షించుచున్నావు. ప్రాచీనపండితులు పశువు కడుపున బుట్టినను తలిదండ్రుల ప్రాణములను రక్షించినారు" అని పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము కోసలరాష్ట్రమున సాకేతనగరములో కోసలరాజు పరిపాలనము చేయుచుండగా బోధిసత్త్వుడు మృగముకడుపున పుట్టి, పెరిగి, నందియమృగనామము వహించెను. అతడు సదాచారుడై, తలిదండ్రులను పోషించుచుండెను. ఆకాలమున కోసలరాజు మృగములవెంట బడుచు, కృషి మొదలగు కార్యములు, సరిగా చేయనీయక మనుజులను వెంటబెట్టుకొని ప్రతిదినము వేటలో మునిగి తేలుచుండెను.

లోకు లొకచో జేరి "ఆర్యులారా, ఈరాజు మనపనులు సరిగా చేయనిచ్చుటలేదు. సంసారులు నష్టపడుచున్నారు. మనము అంజనవన ఉద్యానముచుట్టు కంచె వేసి, ద్వారము పెట్టి, కోనేరు త్రవ్వి, గడ్డి నాటుదము. కర్రలు, గునపములు, బరిసెలు చేతబట్టుకొని అరణ్యములో తిరిగి, పొదలు గాలించి, లోనిమృగములను బయటికి ద్రోలి, గోవులు కొట్టములోనికి జేరునట్లు వానిని వనములో జేర్చి, తలుపు వేయుదము. ఇది రాజునకు తెలిపి మనపనులు చేసికొనుచుందము" అని చెప్పిరి. ఏకగ్రీవముగా నెల్లరు ఈయుపాయ మంగీకరించి, ఉద్యానార్థము అరణ్యములో ప్రవేశించి, యోజనభూమిచుట్టు గిరిపెట్టిరి.

ఆసమయమున నందియమృగము తలిదండ్రులతో నొకపొదరింట నుండెను. కొందరు నానావిధశస్త్రములను ధరించి ఒకరిబాహువు లొకరు పట్టుకొని ఆపొదరింటిని చుట్టుముట్టిరి. కొందరు మృగములను

వెదకుచు ఆపొదవైపు వచ్చిరి. నందియమృగము వారిని జూచి "నేడు నాప్రాణముల నర్పించి యైనను తలిదండ్రులను రక్షింపవలెను" అని యెంచి లేచి, ప్రణామపూర్వకముగా "అమ్మా, నాయనా, వీరలు పొదలో ప్రవేశించి మమ్ములను ముగ్గురను చూడగలరు. ఏదో యుపాయమున మీరు జీవింపవలెను. ప్రాణములతో నుండుట ప్రశస్తము. జనులు పొదముందరికి వచ్చి కొట్టి గాలించునపుడు నేను వెలుపలికి పరుగిడుదును. ఈ చిన్నిపొదలో ఒక్క మృగమే ఉన్నదని వారు భావించి లోపలికి పోవరు. మీరు జాగరూకతతో నుండుడు" అని మరల ప్రణామము చేసి బయలువెడలుటకు సిద్ధముగా నుండెను.

మనుష్యులు పొద కొకవైపున నిలిచి, కోలాహలము చేసి, దులుపు చుండగా నందియ బయలుపడెను. ఈ మృగ మొకటే అం దుండె నని వారు తలపోసి లోనికి బోవలేదు. నందియ పోయి యితర మృగములతో గలిసెను. ఆ జంతువులను చుట్టుముట్టి, జనులు ఉద్యానము లోనికి తోలుకొనిపోయి, ద్వారము బంధించి, రాజున కీవృత్తాంతము తెలిపి, తమతమపనులలో నిమగ్నులయిరి.

నాటినుండి రాజు పోయి స్వయముగా నొకమృగముపై బాణము వేసి, దానిని తీసికొని రమ్మని ఎవనినో పంపుచుండును. మృగములు వంతులు వేసికొన్నవి. తనవంతు వచ్చిన మృగము ఒక ప్రక్కకు బోయి నిలుచుండును. దానిపై బాణము ప్రయోగించి తీసికొని పోవుదురు. నందియమృగము గడ్డి మేసి, పుష్కరిణిలోని నీరు త్రాగుచుండును. దానివంతు రాలేదు. బహుకాలము గడచినపిమ్మట తలిదండ్రులకు బిడ్డను చూడవలె ననుకోరిక కలిగెను. "మనకుమారుడు మృగరాజువలెను గజమువలెను బలిష్ఠుడు. జీవించియున్నచో శక్తిమంతుడు. గోడ దుమికి చూచుటకు మనకడకు వచ్చెడివాడే. అయినను మనము వానికి సందేశము పంపుదము" అని అవి మార్గమున నిలిచిపోవుచున్న బ్రాహ్మణుని జూచి మనుష్యవాక్కుతో "ఆర్యా, ఎచ్చటికి పోవుచున్నారు ?" అని అడిగెను. సాకేతమునకు అని ఆయన చెప్పగా అవి ఈ ప్రథమ గాథ పలికినవి :

అరుగు నెడల సాకేతము
నందలి 'అంజన- వనమున'

నో బ్రాహ్మణ నీ, వచ్చట
నున్నా డౌరసపుత్రుడు
“నీ తలిదండ్రులు వృద్ధులు
నీ దివృక్షతోడ నున్న
వారు సుమా నందియ” యని
వానితోడ చెప్పవలయు.

ఆతడు మంచి దని అంగీకరించి సాకేతము చేరిన మొదటినాడే ఉద్యానమునకు బోయి నందియ ఎవ రని యడిగెను. మృగము వచ్చి ఆయనప్రక్కన నిలిచి నేనే అనెను. బ్రాహ్మణుడు సందేశము తెలిపెను. “బ్రాహ్మణోత్తమా, నేను పోవుదును, గోడ దుమికి పోవగలను. కాని నేను రాజు సంతరించిన తృణములు తిని, పానీయము త్రాగుచున్నాను. నే నాయనకు ఋణగ్రస్తుడను. చిరకాలమునుండి యీ మృగములనడుమ నివసించుచున్నాను. రాజుకు, ఈ మృగములకు కల్యాణము కల్పింపక నిజబలము చూపి దుమికిపోవుట సముచితమా ? నా వంతు వచ్చినప్పుడు వీనికి కుశలత కలిగించి వత్తును’ అని నందియ రెండు గాథలు పలికెను:

రా జొసంగు నాహారము
గ్రహించుచున్నాను, రాజ
పిండద్రోహంబును తల
పెట్టను, ప్రభుబాణమునకు
ఎట్ట యెదుట నిలుతు నేనే !
భూసుర, క్షేమముగ ముక్తి
పొందు నెడల, తల్లి గాంతు.

విని బ్రాహ్మణుడు వెడలిపోయెను. తరువాత నందియవంతు వచ్చినప్పుడు రాజు చాలమంది అనుయాయులతో ఉద్యానము చేరెను. బోధిసత్త్వుడు (నందియ) ఒకప్రక్క నిలిచియుండెను. మృగముమీద విడుచుటకై రాజు బాణము లాగెను. మరణభయముచే తక్కిన జంతువులు పారిపోవునట్లు బోధిసత్త్వుడు పరుగిడక నిర్భీతితో, మైత్రి భావనతో తనకోమలపార్శ్వము త్రిప్పి నిలిచియుండెను. రాజు చూచి తన్మైత్రీభావనవలన బాణము విడువజాలకుండెను.

"మహారాజా, బాణ మేల విడువరు? విడువుడు" అని బోధిసత్త్వుడు పలికెను.

"మృగరాజా, విడువజాల కున్నాను."

అట్లయిన మహారాజా, గుణవంతులగుణములను గురితింపుడు."

అపుడు రాజు బోధిసత్త్వునియెడ శ్రద్ధ కలిగి ధనుర్బాణములను విడిచి, ప్రాణము లేని యీ కర్రముక్కగూడ నీ గుణములను గ్రహించినది. మానవుడ నయినను నేను గ్రహింపనైతిని. నన్ను క్షమింపుము. నీ కభయ మిచ్చుచున్నాను" అనెను.

"మహారాజా, నా కేమో అభయ మిచ్చినారు. ఈ యుద్యాన మృగముల నేమి చేయుదురు ?"

"వీనికిగూడ అభయమిచ్చుచున్నాను."

మృగరాజజాతకమున చెప్పబడినట్లు బోధిసత్త్వుడు సమస్తవన మృగములకు, ఖేచరము లగు పక్షులకు, జలచరము లగు మత్స్యములకు అభయ మిప్పించి, రాజును పంచశీలములందు స్థాపించి "మహారాజా, నాలుగు అగతులలో (ఛందాగతి, దోషాగతి, మోహాగతి, భయాగతి) పడవలదు. రాజధర్మదశకమునకు విరుద్ధముగా ప్రవర్తింపక, న్యాయ్యమున రాజ్యపాలన చేయవలెను' అని బోధించి, కొన్ని దినము లాయనకడ నుండెను.

సమస్తప్రాణులకును అభయము లభించినది అను విషయము ప్రకటము చేయుటకై చాటింపించెను.

అంతట నందియ "మహారాజా, అప్రమత్తుడవయి యుండుము" అని చెప్పి, తలిదండ్రులకడకు బోయెను.

ఇవి అభిసంబుద్ధ గాథలు :

ప్రథమమ్మున నే కోసల
రాజభవననికటకాన
నమ్మున సుందరమృగముగ
నందియనామమున నుంటి.

ఆవల కోసల నరేశు
నంజనవనమున నుండగ
ప్రభువు వచ్చి చాపంబున

బాణ మెక్కు పెట్టినాడు.
స్వయముగ బాణమున కేను
చన నెదురుగ, చూచి రేడు
విడిచిపెట్టె క్షేమముగా
వెడలిపోయి తల్లి గంటి.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము జేసి జాతకములు సరిపోల్చెను. భిక్షువు శ్రోతాపత్తిఫలము నందెను. ఆకాలమున తలిదండ్రులు రాజకులములోనివారు; బ్రాహ్మణుడు సారిపుత్రుడు; రాజు ఆనందుడు; నందియమృగనేత నేనే.

## 386 ఖరపుత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు పూర్వభార్యాసక్తిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త ఆ భిక్షువుతో, భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడ వైతివా ?" "భన్తే, చిత్తము" "దేనిచే ఉద్విగ్నచిత్తుడ వైతివి ?" పూర్వభార్యచే. భిక్షూ, ఈమె అనర్థకారిణి. పూర్వము కూడ ఈమె మూలమున నీవు అగ్నిలో బడి చచ్చుచు పండితుల వలన బ్రతికితివి" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకథ

పూర్వము సేనకు డనురాజు వారాణసిలో రాజ్యపాలనము చేయు చుండగా బోధిసత్త్వుడు శక్రపదవి నొందెను. ఆ కాలమున సేనకునకు ఒకానొక నాగరాజుతో మైత్రి సంఘటిల్లెను. నాగభవనమునుండి బయలువెడలి నాగరాజు భూమిపై తిరుగుచు ఆహారము సంపాదించు కొనుచుండెను. గ్రామములోని బాలురు ఇది సర్ప మని దానిపై మట్టి బెడ్డలు వేసి, కర్రలతో కొట్టిరి. క్రీడార్థ ముద్యానమునకు బోవుచున్న రాజు చూచి, ఏ మది యని యడగి, వారు పామును కొట్టుచున్నా

రని విని, కొట్టవద్దు, పామును పోనిండు” అని వారల వెడలనడచెను.
ప్రాణములతో నున్న నాగరాజు నాగభవనమునకు పోయెను. అనేకరత్నములను గొని నాగరాజు అర్ధరాత్రమున రాజశయనాగారమున ప్రవేంచి రత్నము లొసగి “మీావలననే నాప్రాణములు దక్కినవి” అని రాజుతో మైత్రి నెరపెను. నాగరాజు తరచుగా రాజును కలియుచుండువాడు. కామభోగములలో తృప్తినొందని యొక నాగకన్యను రాజసేవార్థము నియోగించి నాగరాజు రాజుకు మంత్ర ముపదేశించి నాగకన్య కనబడనప్పుడు మంత్రమును జపింపు మని చెప్పెను.

ఒకనాడు రాజు నాగకన్యతో ఉద్యానమున ప్రవేశించి పుష్కరిణిలో జలక్రీడ లాడెను. నీటిలో జలసర్పము కనబడగా నాగకన్య రూపము మార్చి సర్పముతో అనుచితముగా ప్రవర్తించెను. ఆమె కానబడక పోగా రాజు యోచించి ఈమె యెచ్చటికి బోయినదో అనుకొని, మంత్రమును జపించి, అనుచితప్రవర్తనమును గాంచి వెదురుకర్రకొనతో దానిని కొట్టెను.

నాగకన్య క్రోధముతో నాగలోకమునకు బోవగా ఏల మరలివచ్చితివి? అని రాజడుగ “నీమిత్రము తనమాట నేను వినలే దని వీపుపై కొట్టినాడు” అని గాయము చూపెను. సత్య మేమో తెలిసికొనకుండనే నాగరాజు నలుగురుయువకులను పిలిపించి “మీారు సేనకుని శయనాగారము ప్రవేశించి ఫూత్కారములతోనే వానిని దగ్ధము చేయుడు” అని ఆనతిచ్చెను. రాజు నిద్రించువేళకు వారు శయనాగారమున ప్రవేశించునప్పటికి రాజు భార్యతో “భద్రే, నాగకన్య యెచట నున్నదో తెలియునా?” అనెను. “దేవా, నాకు తెలియదు.” ఈవేళ మేము జలక్రీడ లాడెడువేళ, నాగకన్య జలసర్పము కనబడగా దానితో అనుచితముగా వర్తించెను. ఇట్లు చేయరా దని శిక్షించుటకై దానిని వెదురుకర్రతో కొట్టితిని. అది నాగభవనమునకు బోయి ఏమేమో చెప్పి నాగరాజుకు నాకు మైత్రి చెడగొట్టునని భయముగా నున్నది.”

ఈ మాటలు విని నాగయువకులు మరలిపోయి నాగరాజుతో జరిగిన వర్తమానము చెప్పిరి. తోడనే ఆవేశము కలిగి నాగరాజు సేనకుని శయనాగారమునకు బోయి సంగతి తెలిపి క్షమాపణము వేడి, అన్నిభాషలు గ్రహింపగల మంత్ర ముపదేశించి” ఇది అనర్ఘమైన

మంత్రము. ఒరులకు చెప్పినచో అగ్నిలో దగ్ధమై మృతి నొందవలసి వచ్చును” అని కట్టడిచేసెను. మంచిది అని రాజు స్వీకరించెను.

నాటినుండి రాజు చీమలభాషకూడ గ్రహింపగలిగెను. ఒకనా డాయన మేడపై యంతస్థున గూరుచుండి, తేనె పంచదారలతో భోజనము చేయుచుండెను. భోజనవేళ మధుబిందువు, పాకము బొట్టు, పూరీముక్క నేలమీద పడినవి. చీమ వానిని చూచి, “రాజుగారి మేడమీద తేనెకుండ బ్రద్దలయినది. పంచదారబండి, పూరీలబండి బోల్తా పడినవి. తేనె, చెక్కెర, పూరీలు తినుటకు రండు” అని కేకలు వేయుచు తిరగజొచ్చెను. రాజు దానివాక్కులు విని నవ్వుకొనెను. ప్రక్కనే యున్న రాణి ఈయన యేమి చూచి నవ్వినాడో అనుకొనెను.

సాయంకాలము రాజు భోజనము చేయుచున్నప్పుడు అన్నకణము నేలపైబడెను. చీమలు చూచి “రాజుగారింట అన్నభాండము బోర్లబడినది. తినుడు” అని కేకలు వేసినవి. విని రాజు మరల నవ్వుకొనెను. రాణి బంగారుగిన్నెతో రాజుకు వడ్డనచేయుచు, తనను జూచి ఆయన నవ్వుకొన్నాడని తలపోసెను. రాత్రి శయ్యపై పండుకొన్నప్పుడు ఆమె రాజుతో “ఏల నవ్వినారు ?” అనెను. “నా నవ్వుతో నీ కేమి పని ?” అని ఆయన అన్నను రాణి పట్టుపట్టుటచే సంగతి వివరించెను.

“మీకు తెలిసిన మంత్రములు నా కుపదేశింపుడు.”

“ఉపదేశింపజాలను” అని రాజు అంగీకరింపకున్నను ఆమె మాటి మాటికి హఠము చేయసాగెను.

“నీ కా మంత్రము నుపదేశించినచో మరణింతును. మరణించినను సరే, నాకు మంత్ర ముపదేశింపుడు దేవా !”

రాజు స్త్రీవశంవదు డై సరే అని “ఈమెకు మంత్ర ముపదేశించి అగ్నిప్రవేశము చేయుదును” అని తలచి రథ మెక్కి ఉద్యానమునకు బోయెను.

ఆసమయమున శక్రుడు భూలోకముపై దృష్టిపరపి యుండుటచే ఈ విషయము గ్రహించి “రాజు మూర్ఖుడు. స్త్రీకొరకు అగ్నిలో మ్రగ్గనున్నాడు. ఇతని ప్రాణములు రక్షింతును” అని తలచి, సుజా అను అసురకన్యను వెంటబెట్టుకొని వారాణసి ప్రవేశించెను. ఆమె మేక

యయ్యెను. శక్రుడు మేకపోతాయెను. శక్రుడిట్లు సంకల్పించి లోకులకు కనబడకుండ రాజు రథము నెదుటికి ఉభయులు చనిరి. రాజుకు గుర్రములకును మాత్రము మేకపోతు కానబడుచుండెను.

పోతు సంభాషణ మారంభించి మైథునక్రియలో నున్నట్లు ఆకారము ధరించెను. రథమునకు పూన్చిన గుర్రములలో నొకటి చూచి "మిత్రమా, మేకలకు బుద్ధిలేదని సిగ్గులేదని వినియున్నాను. ఇప్పుడు కాని చూచియుండలేదు. ఇందరయెదుట నీవు అకృత్యము చేయుచున్నావు. మే ఋదివరలో విన్నదానికిని ఇప్పుడు చూచినదానికిని సరిపోవుచున్నది'' అని ఈ తొలిగాథ పలికెను :

అజము మూర్ఖ మని పండితు
లన్నవా రీకార్యము
రహస్యముగ చేయదగును;
ప్రకటముగా కూడదనియు
గ్రహియింపదు మేక, చూడు.

విని, పోతు రెండు గాథలు పలికెను :

గ్రహియింపుము మూర్ఖుడ వని
గర్దభపుత్రా, నీవును
నిమ్నముఖా, వక్రోష్ఠా
నీవు విముక్తుండ వయ్యు
మూర్ఖా, పరుగిడవు: రాజు
మూర్ఖతరుడు నేనకుండు
మోయుచు లాగుదువు రథము.

రాజు వానిసంభాషణ గ్రహించి, నెమ్మదిగా రథము తోలెను. గుర్రము నాలుగవ గాథ పలికెను :

ఏల నేను మూర్ఖుండనో
ఎరుగుదు వీ వజరాజా!
కాని నిన్ను ప్రశ్నించెద,
నేనకుండు మూర్ఖు డెట్లు?

విని, పోతు అయిదవ గాథ పలికెను :

ఒసగినచో లబ్ధమైన
యుత్తమార్థమును భార్యకు
ఉభయులకును మరణ మెదవు;
ఉండబోదు తదర్థంబు.

రా జామాటలు విని "అజరాజమా, నీవే మాకు మేలు చేయ గలవు. ఇప్పుడు మే మేమి చేయవలెనో నిర్దేశింపుము" అనెను.

"మహారాజా, ప్రాణికి తనప్రాణముకంటె ప్రియతర మేమియు లేదు. ప్రియవస్తువుకొరకు వినాశమునొందుట, కలిగినయశస్సు పోగొట్టుకొనుటయు ఉచితములు కావు" అని ఆరవ గాథ పలికెను:

హే జనింద, యుష్మాదృశు
డిది నా ప్రియవస్తువనుచు
ఆత్మార్పణ చేయునెడల
అద్దానిని సేవింపం
జాలం డాత్మయె శ్రేష్ఠము;
సముచిత మైన యుక్తిచే
ఆవల గూడ ప్రియవస్తు
ప్రాప్తి సంభవించునుగద.

ఈ విధముగా బోధిసత్త్వుడు రాజున కుపదేశించెను. రాజు ప్రసన్నుడై "అజరాజమా, ఎచ్చటినుండి వచ్చినావు?" అని ప్రశ్నించెను.

"మహారాజా, నేను శక్రుడను. నీపై ననుగ్రహము కలిగి, నిన్ను రక్షింపవచ్చినాను."

"దేవరాజా, నేను మంత్ర ముపదేశింతు నని మాట యిచ్చినాను. ఇప్పు డేమి చేయుదును?"

"మహారాజా, నష్టము లేదు. ఈ మంత్రము గ్రహించుటకు సంసిద్ధత కావలెను అని కొన్నిదెబ్బలు కొట్టింపుము. అప్పుడు మంత్ర మక్కరలే దనును."

రాజు సమ్మతించెను. బోధిసత్త్వుడు రాజున కుపదేశ మిచ్చి, నిజ నివాసమున కరిగెను. రాజు ఉద్యానము ప్రవేశించి, రాణిని పిలిపించి "భద్రే, మంత్రము స్వీకరింతువా?" అనెను.

"చిత్తము, దేవా!"

"అయినచో సిద్ధము చేయించెదను."

"ఏమి?"

"వీపుపై నూరుమారులు కొరడా పడినను నోటివెంట ధ్వని రాగూడదు."

మంత్రలోభముచే నామె సరే అనెను. రాజు శూలారోపకుని బిలువనంపి, వానిచే రాణివీపుమీద రెండుదెబ్బలు వేయించెను. నాలుగు దెబ్బలకోర్చి, రాణి "నాకు మంత్రము వలదు" అని అరచెను.

"నేను మరణించినను సరే అని మంత్రము గ్రహింపగోరితివి" అని రాజు ఆమెనడుముమీది చర్మము ఒలిపించి విడిచెను. ఆ తరువాత నామె మరి యేమియు పలుకలేకపోయెను.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు సరిపోల్చెను. ఉద్విగ్నచిత్తభిక్షువు స్రోతాపత్తిఫలము నందెను. ఆకాలమున రాజు ఉద్విగ్నచిత్త భిక్షువు; దేవి పూర్వభార్య; అశ్వము సారిపుత్రుడు; దేవరాజు శక్రుడు నేనే.

## 387 సూచీ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ప్రజ్ఞాపారమితను గూర్చి చెప్పినది. వర్తమాన కథ ఉమ్మగ్గజాతకమున వచ్చును.

ఆసమయమున శాస్త "భిక్షువులారా, తథాగతుడు ఇప్పుడే కాదు, పూర్వము కూడ ప్రజ్ఞావంతుడు, నేర్పరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో కమ్మరయింట పుట్టెను. పెద్దవాడయి తనవిద్యలో నేర్పరి యయ్యెను. ఇతనితలిదండ్రులు పేదవారు. వీరిగ్రామమునకు కొలదిదూరములో నున్న గ్రామమున వేయియిండ్ల

కమ్మరు లుండిరి. వారిలో ప్రధానలోహకారుడు రాజున కిష్టుడు, ధన వంతుడు. ఆతనికి కూతురు కలదు. ఆమె చాల చక్కనిది. అచ్చరల వంటిది. జానపదలక్షణములు కలది. చుట్టుప్రక్కల గ్రామములలోని వారు కత్తులు, గొడ్డళ్ళు, గండ్రగొడ్డళ్ళు మొదలగునవి తయారు చేయించుటకై ఆగ్రామమునకు వచ్చి, కన్యనుగూడ చూచి పోవుచుం దురు. వారు తమతమగ్రామములకు మరలిపోయి రచ్చసావడులలో ఆమె సౌందర్యమును ప్రశంసింతురు. ఆమెనుగూర్చి విన్నతోడనే బోధిసత్త్వుడు ఆసక్తుడయి, ఆమెను తనచరణదాసిని చేసికొందు నని తలచెను. అతడు మేలిరకము ఉక్కు తీసికొని, చిన్న గట్టిసూది తయారు చేసి, దాని నొకప్రక్కన ఛేదించి నీటిలో ముంచెను. అట్టిదే రెండవపొర నిర్మించి దానికిగూడ నొకప్రక్క బెజ్జము చేసెను. ఈ విధ ముగా దానికి ఏడుపొరలు నిర్మాణము చేసెను. ఇది యెట్లు నిర్మిత మయ్యె నని అడుగరాదు. బోధిసత్త్వులజ్ఞానమువలన గొప్పపను లగు చుండును.

ఆత డాసూదిని గొట్టములో నుంచి, దానిని మొలపటకాలో పెట్టు కొని, ఆగ్రామమునకు బోయి, ప్రధానలోహకారు డుండు వీధి యడిగి తెలిసికొని, వానిద్వారమున నిలిచి, సూదిని ప్రశంసించి, ఈ సూది కొనువా రెవరు?'' అనుచు ఈ తొలిగాథ పలికెను:

> అకర్కశము, గోళంబును
> అతిసుందరకషితంబును
> దృఢము, తీక్ష్ణముఖం బగు
> సూదిని కొనువార లెవరు ?

ఇట్లు పలికి, దానిని ప్రశంసించుచు మరియొక గాథ పలికెను:

> దిగునది వస్త్రంబులలో
> దృఢమును, గోళము నగునది
> సుందరవిధాననిర్మిత
> సూచి నెవరు కొననెంతురు ?

ఆసమయమున ఆకన్యతండ్రి భోజనానంతర విశ్రాంతికై చిన్న మంచముమీద పండుకొని యుండెను. కన్య తాళవృంతముతో విసరు చుండెను. బోధిసత్త్వుని మధురకంఠము విన్నతోడనే ఆమెకు తడిసిన

మాంసపిండము హృదయమున కంటుకొన్నట్లును తోచెను. "కమ్మర వారిగ్రామమున సూదిని మధురకంఠరముతో అమ్మజూపిన యాత డెవరు? ఈత డేల వచ్చెనో తెలిసికొనవలెను" అని తలపోసి యామె వీవన క్రింద నుంచి, వసారా వెలువడి, ఆతనితో మాటలాడ జొచ్చెను. బోధి సత్త్వులసంకల్పములు సంపూర్ణము లగుచుండును. ఆయన ఆమెకొరకే వచ్చినాడు; ఆమె ఆయునతో సంభాషించుచున్నది. "తరుణమహాశయా, రాష్ట్రమంతటిలోనుండి సూది మొదలగువానికొరకు జను లీగ్రామము నకు వత్తురు. నీవు మూర్ఖతవలన కమ్మరగ్రామమున (వీధిని) సూది అమ్మగోరుచున్నావు! దిన మంతయు సూదిని పొగడుచున్నను నీ చేతిలోనుండి సూచిని గ్రహించువా రుండరు. దీనికి విలువ కావలె నన్నచో గ్రామాంతరమునకు పొమ్ము" అని యామె రెండు గాథలు పలికినది:

సూదు లన్యలోహనిర్మి
తాదిపదార్థము లిప్పుడు
ఏతద్గ్రామమ్మునుండి
చేయ నన్యదేశములకు
కమ్మర పల్లెను సూదులు
అమ్మ గోరు నీత డెవడు ?

శస్త్రంబులు వివిధవస్తు
సందోహం బిచటినుండి
అవలకు బోవును; సూదులు
అమ్మెదు నని పనికలంచు
కమ్మరి ఈతం డెవ్వడు ?

బోధిసత్త్వుడు విని, "భద్రే, తెలియకపోవుటచే నీ విట్లు అన్నావు" అని రెండు గాథలు పలికెను:

కమ్మరవీథుల సూదుల
నమ్మవలయు ధీపంజాప
ఆచార్యులకా శిష్యుడు;
అందలి గుణదోషంబులు
తెలియగలవు; భద్రదుశాల.

దీనిని చేసినవాడను
నే నని తెలిసినయెడల
నీతండ్రియె ఒసగవచ్చు
నిన్ను నాకు ధనముతోడ.

యజమానుడు వారిమాట లన్నియును విని, "అమ్మా, నీవు ఎవ రితో మాటాడుచున్నావు?" అని యడిగెను.

"సూది అమ్మజూపిన యువకునితో."

"అతనిని పిలువుము."

ఆమె వెళ్ళి యువకుని పిలిచెను. బోధిసత్త్వు డింటిలో ప్రవేశించి లోహకారునకు ప్రణామము చేసి ఒకప్రక్కన నిలిచెను.

"నీవు ఏ గ్రామమున నుందువు?" అని యజమాను డడిగెను.
"నాది ఫలాని గ్రామము; ఫలాని లోహకారుడు మా నాయనగారు."

"నీ విచ్చటి కేల వచ్చితివి? ఏదీ, నీ సూది చూతము."

ఎల్లరయెదుట తనగుణము ప్రకటించుటకై బోధిసత్త్వుడు "ఒక్కరే చూచుట కన్న అందరును చూచుట మేలు కాదా?" అనెను.

మంచి దని యజమానుడు లోహకారుల నందరను రావించి "నాయనా, ఏది నీ సూది, చూతము" అనెను.

"గురూ, ఒకయినుపకడవ, నీరు నింపిన కంచుస్థాలి తెప్పింపుడు."

అవి వచ్చినపిమ్మట బోధిసత్త్వుడు మొలపటకానుండి సూదిగొట్టము తీసి యిచ్చెను. యజమానుడు అందుండి సూదిని తీసి "నాయనా, ఇది సూదియా?" అనెను.

"ఇది సూది కాదు. దాని ఒర."

యజమానుడు ఇటు నటు త్రిప్పిచూచెను. కాని దాని మొద లేదో, తుద యేదో తెలియలేదు. బోధిసత్త్వుడు దానిని తీసికొని గోటితో ఒర తొలగించి ఇది సూది, ఇది ఒర అని లోకులకు చూపి, సూది యజమానునిచేత నుంచి, ఒర పాదములపై నుంచెను. యజ మానుడు "నాయనా, ఇది సూదియా?" అని అడుగగా "ఇదియును సూది కాదు. ఒర" అని బోధిసత్త్వుడు గోటితోతొలగించి, క్రమముగా ఆరు ఒరలు తప్పించి ఆయనపాదములపై నుంచి, సూది చేతిలో బెట్టెను. లోహకారు లాశ్చర్యముతో కరతాళము వేసి, వస్త్రము

తెగురవైచిరి.

"ఈ సూది కెంతశక్తి యున్నది" అని యజమాను డడిగెను.

"బలిష్ఠుడైనవానిచేత ఘట మెత్తించి, దాని క్రింద జలస్థాలి ఉంచి, ఈ సూదిని ఘటమధ్యభాగముతో మోదింపుడు." ఆయన ఆ ప్రకారముగా చేయించెను. సూది ఘటమును భేదించి, నీటిపై వెంట్రుకవాసి యైన కదలక సూటిగా నిలిచెను. లోహకారు లిట్టివా రుందురని మేము వినలేదు" అని వారు కరతాళధ్వనులు చేసి, వస్త్రము లెగురవేసిరి. యజమానుడు పుత్రికను రావించి, ఆ సంఘము నెదుట "నా కుమారి నీకు తగినది" అని కన్యాదానము చేసెను.

కాలక్రమమున యజమానుడు మరణించినపిదప బోధిసత్త్వుడు అగ్రలోహకారు డయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము చేసి జాతకము లిం పరిపోత్చెను. కమ్మర బిడ్డ రాహులమాత; లోహారపుత్రపండితుడు నేనే.

## 388 తుండిల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మృత్యుభయము కల భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలోని ఆకులపుత్రుడు బుద్ధశాసనమున ప్రవ్రజించి మృత్యువును గూర్చి భయపడుచుండెడివాడు. ఆకు కొలదిగా రాలినను, ఏదైనను విరిగిపడినను, పశువు గాని పక్షి గాని ధ్వని చేసినను, ఏ అన్య శబ్దము వినవచ్చినను పొట్టపై బాణము తగిలిన కుందేటివలె మృత్యుభయముతో కంపించెడివాడు. ధర్మసభలో భిక్షువు లీ విషయమై ప్రసంగించుచుండగా శాస్త అరుదెంచి, సంగతి గ్రహించి ఆ భిక్షువును పిలువనంపి "భిక్షూ, నీకు నిజముగా మృత్యుభయ మున్నదా?" అని, ఆత డంగీకరించినపిమ్మట "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వము

కూడ ఈ భిక్షువు మరణభయము చెందెడివా" డని పూర్వజన్మ కథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సూకరీగర్భమున బ్రవేశించెను. సూకరి యిరువురు పుత్రులను గనెను.

వారాణసీద్వార గ్రామవాసిని యగు వృద్ధురాలు ఒకనాడు ప్రత్తి పొలమునుండి గంపతో ప్రత్తి కొనిపోవుచు చేతికర్రతో నేలపై బొడుచుచుండెను. సూకరి ఆధ్వని విని మరణభయముచే బిడ్డలను విడిచి పారిపోయెను. చిన్నపందిపిల్లలను జూచినంతనే ఆమెకు ప్రీతి కలిగెను. తోడనే వానిని గంపలో వేసి ఇంటికి గొనిపోని పెద్దవానికి మహాతుండిలు డనియు, చిన్నవానికి చిన్నతుండిలు డనియు పేర్లుపెట్టి బిడ్డలవలె పోషించుచుండెను.

అవి పెరిగినకొలది లావయ్యెను. ఎవరైనను వానిని విక్రయింతువ అని అడిగినను ఆమె ఇచ్చునవి కావు. ఇవి నాబిడ్డలు అనుచుండెడిది. ఒకానొక సంబరములో ధూర్తులుకొందరు మద్యము త్రాగి మాంసము మెక్కిరి. మాంసము పూర్తిఅయినంతనే వారు మాంస మెక్కడ లభించునో అని యోచించి, వృద్ధురాలియింట పందులున్న వని జ్ఞప్తికి రాగా, అచ్చటికి బోయి, "మూల్యము గ్రహించి, మాకు ఒక పందిని ఇమ్ము అవ్వా!" అని అడిగిరి. "తన బిడ్డలను మాంసము తిను వారికి విక్రయింతువా రెవరు?" అని యామె నిరాకరించెను.

"అమ్మా, సూకరములు మానవులకు బిడ్డలు కావు. వీనిని మా కిమ్ము" అని వారు మాటిమాటికిని అడిగినను ఆమె నిరాకరింపగా ఆమెకు మద్యము పోసి "అమ్మా, పందుల నేమిచేసికొందువు? విలువ తీసుకొని మా కిచ్చివేయుము" అని ఆమెచేతిలో కార్షాపణ ముంచిరి. ఆమె కార్షాపణము తీసికొని, "నాయనలారా, మహాతుండిలుని ఈయజాలను. అల్పతుండిలుని కొనిపొండు" అని పలికెను. "ఆపంది యెక్కడ?" "ఆపొదలో నున్నది." "దానిని పిలువుము."

"పెట్టుటకు తిండి యేమియు కనబడదు."

ధూర్తులు వెళ్ళి ఆహారపుపిడత తెచ్చిరి. వృద్ధురాలు దానిని దీసి కొనిపోయి వాకిట నిలిచెను. ముప్పదుగురు ధూర్తులు పాశహస్తులయి అక్కడనే నిలిచిరి. ముసలిది కేక వేసి 'అల్పతుండిలా, రా' అనెను. మహాతుండిలుడు విని "నేటివరకును అమ్మ అల్పతుండిలుని పిలువలేదు. ముందు నన్నే పిలిచెడిది. నేడు మా కేదో ఆపద సంభవింపనున్నది అనుకొనెను. అంతట మహాతుండిలుడు తమ్ముని బిలిచి "బాబా, అమ్మ నిన్ను బిలిచినది. పో," అనెను. వాడు పోయి, అన్నపుపిడత కడ ధూర్తులుండుట చూచి, భయపడి వణకుచు అన్నకడకు పరుగెత్తుకొని మరలివచ్చి, సంబాళించుకొన లేక వణకుచు నేలపై బడెను. మహాతుండిలుడు చూచి "బాబా, నీవు వణకుచున్నావు, దాగుకొనుటకు చోటు చూచుచున్నావు. ఏమిది?" అనగా అల్పతుండిలుడు తాను చూచినది చెప్పుచు ఈ గాథ పలికెను :

ఇపుడు నూతనాహారము
నిచ్చుచున్నవారు; మరియు
తిండితోడ నున్నది కుండి
నిండుగ; యజమానురాలు
నికటమందు నిలిచియున్న;
దవల నున్నవారు జనులు
హస్తంబుల జాలముతో;
అన్నము నాకు రుచింపదు.

విని బోధిసత్త్వుడు "బాబా, ఈయుద్దేశముతోనే సూకరములను పోషింతురు. అమ్మకూడ ఇట్లే చేసినది. నీవు విచారింపవద్దు" అని మధురస్వరమున బుద్ధలీలనుండి ధర్మోపదేశము చేయుచు ఈ గాథలు పలికెను :

జడిసెద, విటునటు తిరిగెదు
శరణస్థానంబు వెదకె
దెవరు త్రాత? తుండిల, నీ
వెచటికేగె? దౌత్సుక్యము
మాని తినుమ యాహారము.
మవల వారు పోషించుట
మాంసముకొరకు; పంకరహిత

సరోవరమునంథు దిగుము,
స్నాళన మొనరించి మలము;
అక్షీణంబగుగంధము
నలముకొనుము శరీరమున.

దశపారమితలను ధ్యానించి, మైత్రీభావనాపూర్వకముగా మొదటి పదము పండ్రెండు యోజనముల వారాణసిపై వ్యాప్తిచేసెను. అది విన్నవా రందరును వారాణసీరాజు, ఉపరాజులు మొదలు అందరును వచ్చిరి. రాజాలనివారు తమతమగృహములలోనే కూరుచుండి వినిరి. రాజపురుషులు పోదలను తీసివేసి నేల చదునుచేసి, ఇసుక చల్లిరి. ధూర్తులు త్రాగిన మద్యపుమత్తు దిగిపోయెను. వారు వలలు విడిచిపెట్టి, ధర్మోపదేశము వినజొచ్చిరి. వృద్ధురాలిమత్తుకూడ దిగిపోయెను. బోధిసత్త్వుడు జనసమూహమునడుమ నిలిచి, తమ్మునికి ధర్మోపదేశము చేయసాగెను.

విని అల్పతుండిలుడు తనలో "అన్న యిట్లు చెప్పుచున్నాడు. పుష్కరిణిలో దిగి స్నానము చేసి, ఒడలిచెమట తొలగించుకొని, ప్రాచీనలేపము పోనాడి నూతనలేపనము కల్పించుకొనుట ఎన్నడును వంశపరంపరగా లేవు. అన్న యిట్లు చెప్పుట ఎందులకో!" అని తలచి నాలుగవ గాధ పలికెను:

ఏది పంకరహితసరసి !
ఏది స్వేదరూప మలము ?
దేని పరిమళంబు తరుగ ?
దానూతనగంధ మేది ?

విని బోధిసత్త్వుడు జాగరూకతతో వినుము అని వృద్ధునివలె ధర్మోపదేశము చేయువాడై ఈగాథలు పలికెను:

ధర్మము కన పంకరహిత
నిర్మలజల కాసారము;
మహి పాపమె స్వేదరూప
మలినముగా బరగుచుండు;
తరుగని నెత్తావుల నూ
తనవిలేపనము శీలము.

ప్రాణిహత్య సేయువారు
పడయుచుందు రానందము;
మృత్యుభయముచే శరీరి
ఇంపు తరిగి కానుపించు.

గుణపరిపూర్ణుడు నిరతము
కోరినంత తనయసువుల
వెన్నెలలో విహరించెడి
వితముతోప విడిచిపుచ్చు.

ఇట్లు బోధిసత్త్వుడు మధురస్వరమున బుద్ధునివలె ధర్మోపదేశము చేసెను. జనులు ఆశ్చర్యముతో ఉంగరము లెగురవేసి, వస్త్రములను పై కెగురవేసిరి. ఆకాశము సాధుసాధు అను నాదములతో ప్రతిధ్వనించెను.

వారాణసీరాజు బోధిసత్త్వుని పూజించి, వృద్ధురాలికి సంపదయొసగి, సోదరులిరువురను సుగంధజలముల స్నానము చేయించి, వస్త్రము లిచ్చి, కంఠముల మణిరత్నమాలికలు వేసి, నగరములోనికి గొనివచ్చి, పుత్రస్థానమిచ్చెను. వారికి సేవకులనెందరనో నియోగించెను.

బోధిసత్త్వుడు రాజుకు పంచశీలము లిచ్చెను. వారాణసీవాసులు కాశీరాష్ట్రవాసులును శీలరక్షణము చేసిరి. బోధిసత్త్వుడు వారికి పూర్ణిమనాడు, అమావాస్యనాడు ధర్మోపదేశము చేయుచుండెను. ఆయన న్యాయాధీశుడుగా నున్నకాలముల అసత్య—అభియోగము తెచ్చినవారు లేరు.

రాజు మరణించినతరువాత బోధిసత్త్వు డాయన కంత్యక్రియలు చేయించి నిర్ణయములు గ్రంథమున వ్రాయించి, తదనుగుణముగా తీర్పులు చెప్పుకొను డనెను. జనసమూహమునకు ధర్మోపదేశము చేసి, అప్రమత్తులై యుండు డని ప్రబోధించి, ఎల్లరును దుఃఖించుచుండగా తమ్మునితో అరణ్యమున ప్రవేశించెను.

బోధిసత్త్వుని యుపదేశము అరువదివేల సంవత్సరములు ప్రవర్తిల్లెను.

శాస్త ధర్మోపదేశ సత్యప్రకాశములు కావించి జాతకములు సరిపోల్చెను. ఆభిక్షువు స్రోతాపత్తిఫలము నందెను. అకాలమున రాజు ఆనందుడు; క్షుద్రతుండిలుడు ఈ భిక్షువు; పరిషత్తు బుద్ధపరిషత్తు; మహాపండితుడు నేనే.

## 389 సువణ్ణ కక్కటక జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు, ఆనందస్థవిరుని ఆత్మోత్సర్గము గురించి చెప్పినది.

### వర్తమానకథ

ధనుర్ధరులను నియమించునప్పటి కథ ఖండహారకథ జాతకమున (542) వచ్చును. ధనపాల ఘీంకారము క్షుద్రహంసజాతకమున (532) వచ్చును. ఆసమయమున ధర్మసభలో చర్చ జరుగుచుండెను. శాస్త అచటికి కరుదెంచి విషయము గ్రహించి "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వము కూడ నాకోసము ఆత్మోత్సర్గము చేసినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము రాజగృహమునకు పూర్వదిక్కున సాలిందియ మను బ్రాహ్మణాగ్రహార ముండెను. బోధిసత్త్వు డాగ్రామములో వ్యవసాయ దారుల కుటుంబమున బుట్టి, పెద్దవా డయి, కుటుంబి యయి, ఆగ్రామమున కీశాన్యదిశలో మగధరాజ్యక్షేత్రములో సహస్రకరీషముల సేద్యము చేయుచుండెను. ఒకనా డతడు పరిజనుల వెంట క్షేత్రమునకు బోయి, భూమి దున్ను డని కూలీలతో చెప్పి, ముఖము కడుగుకొనుటకై పొలముతల నున్న పెద్దకుంట చేరెను. అందులో బంగరురంగు గల కర్కటక ముండెను. అది చాల చక్కనిది, మనోహర మయినది. బోధిసత్త్వుడు దంతకాష్ఠముతో పళ్ళు తోమి, ముఖము కడుగుకొనుటకు నీటిలోదిగెను. కర్కటక మాసమయమున ఆయనవద్దకు వచ్చెను. ఆయన ఎండ్రకాయను పైకెత్తి తనయుత్తరీయమున తీసికొనిపోయి పొలముపని పూర్తిఅయినపిదప ఇంటికి మరలిపోవునపుడు దానిని పుష్కరిణీజలమున విడిచిపెట్టెను. బోధిసత్త్వు డనుదినము ముందుగా కుంటకు బోయి కర్కటమును దీసి తనయుత్తరీయములో గొనిపోయి పొలముపని చూచెడివాడు. ఆయనకును కర్కటకమునకును పరస్పర విశ్వాసము కుదిరెను.

బోధిసత్త్వుడు నియతప్రకారము పొలమునకు వచ్చుచుండెను.

ఆయన నేత్రములలో పంచప్రసాదములు, త్రిమండలములు సువిశుద్ధముగా గానబడుచుండెను. ఆపొలముతలను తాటిచెట్టుమీద గూటిలో కాకులు నివసించుచుండెను. అందులో ఆడకాకికి బోధిసత్త్వుని నేత్రములను భక్షింపవలె ననుకోరిక పుట్టినది. అది భర్తతో "స్వామీ, నాకు కోరిక పుట్టినది" అన్నది. "ఏమి కోరిక?" "ఈ బ్రాహ్మణుని నేత్రములు తినవలె ననుకోరిక." "చాల కఠిన మైన కోరిక. ఎవరు కన్నులు తీసికొనిరాగలరు?" "నీవు తీసికొనిరాలే వని నాకు తెలియును. ఈతాటిచెట్టుకు కొలదిదూరమున పుట్టలో నున్న కాలసర్పమును సేవింపుము. అది బ్రాహ్మణుని కరచి చంపును. అప్పుడు నీవు పొడిచి ఆయనకన్నులు దీసికొని రావచ్చును." మంచి దని కాకి నాటినుండి కాలసర్పమును సేవించుచుండెను.

బోధిసత్త్వుడు గింజలు చల్లిన క్షేత్రములో మొక్కలు మొలచునప్పటికి కర్కటముకూడ ఎదిగెను.

ఒకనాడు సర్పము కాకితో "మిత్రమా, నీవు నిత్యము నాసేవ చేయుచున్నావు. నీ కేమి చేయుదును?" అని యడిగెను. "స్వామీ, మీసేవకురాలికి ఈ క్షేత్రయజమానుని నేత్రములమీద కోరికి పుట్టినది. మీయనుగ్రహమువలన నేత్రములు లభించు నను ఆశతో మీ సేవకై అనుదినము వచ్చుచున్నాను." "సరే, ఇదియేమంత గొప్పపని కాదు" అని సర్పము కాకి నోదార్చి మరునాడు బ్రాహ్మణుడు వచ్చు కేదారముగట్టుమీద గడ్డిలో దాగి, ఆయనరాక కెదురుచూచుచు పండుకొని యుండెను.

బోధిసత్త్వుడు వచ్చి తొలుత పుష్కరిణికిపోయి, ముఖము కడుగుకొని స్నేహవశమున సువర్ణకర్కటకమును అక్కున జేర్చుకొని, ఉత్తరీయమున బెట్టుకొని క్షేత్రమువైపు నడచెను. ఆయనను చూడగానే పాము వేగముగా దుమికి పిక్కలో కాటువేసెను. ఆయన వెంటనే పడిపోయెను. పాము పుట్టవైపు పరుగెత్తెను. ఆయన పడిపోవుట, కర్కటము ఉత్తరీయమునుండి ఈవలికి వచ్చుట, కాకి ఆయనరొమ్ముమీద వాలుట—ఒకదాని తరువాత నొకటికిగా జరిగెను. కాకి ఆయన నేత్రములవైపు ముక్కుచాచుట చూచి ఎండ్రకాయ తనలో "నా మిత్రునకు ఆపద సంభవించినది. కాకిని పట్టుకొందు నేని సర్పము

వచ్చును" అని తలచి తనగిట్టలతో కాకిగొంతు పట్టుకొని నొక్కి కొంత డీలుపరచెను. కాకి కేకలు వేయుచు "మిత్రమా, నన్ను విడిచి పారిపోతివా? ఈ కర్కటము నాకు వ్యధ కలిగించుచున్నది. నేను చని పోవకముందే రమ్ము" అని సర్పమును పిలుచున దై తొలి గాధ పలికెను:

హాటకాభ, విశాలాక్షు
లస్థిత్వక్కులును కలిగి
జలమున వసియించుచు, కే
శములు లేని దీనిచేత
అభిభూతుడ నై యేడ్చెద
హా సఖా, దేనిచేత
త్యజియించినవాడవు నను ?

సర్పము రాగా పట్టినొక్కెను. "ఎండ్రి కాకిమాంసము తినును, సర్ప మాంసము తినదు" అని తలచి సర్పము ఈ గాధ పలికెను:

సాయపడగ మిత్రమునకు
సర్పము నిజభూరిఫణము
విప్పి కులీరంబుకడకు
వెడలెను ఫూత్కారమునకు;
ఒడిసి పట్టె దాని నెండ్రి.
కాకమ్మును సర్పమ్మును
కాని భక్షణమ్ము సేయ
పట్టలేదు కులీరమ్ము.
నిను ప్రశ్నించెద విశాల
నేత్రంబులదాన, మమ్ము
నిరువుర పట్టితి వేటికి ?

అది విని కర్కటము కాకిని పట్టుకొన్న కారణము వివరించుటకై రెండు గాధలు పలికెను:

ఇతడు నా హితైషి, నన్ను
సరసికి గొనిపోవుచుండె
చనిపోవగ నతడు నాకు
చాలదుఃఖ మొదవినది.

ఇంక నుండ నే వనుచును
ఎదుగు చున్న నా దేహాము
ఎల్లరు కనుగొని కాకియు
హింసింపగ గోరువారె,
మాంసము రుచ్యం బైనది
మందము, కోమలము ననుచు
అందరు నను బాధింతురు.

విని సర్పము తనలో "ఏదో యుపాయమున దీనిని వంచించి, కాక మును తప్పించి నేనుకూడ తప్పించుకొందును" అని తలచి ఈ గాథ పలికెను:

ఏతత్కారణముననే
ఇరువుర బట్టితివ యేని
ఈ పురుషుడు లేచుగాక
ఇతనివిషము లాగివేతు
విడుము నన్ను వాయసమును
వేగమె; జనునది మొదటను
విష మెక్కును తీవ్రముగా.

ఎండ్రి విని "ఏదో తంత్రము పన్ని తప్పించుకొన దలచుచున్నది. నా నేర్పు దీనికి తెలియదు. గిట్టలతో దీనిని నొక్కెదను. కాకినికూడ పోనీయను" అని తలచి ఈ గాథ పలికెను:

వాయసమును విడువ నేను
వ్యాళమ్మును విడుతు, కాకి
ప్రతినిధిగా నుండుగాక
అతడు లేచి నీరోగిగ
హాయిగనుండుట కనుగొని
అపుడు కాకి విడువగలను.

ఇట్లు పలికి కర్కటము సర్పమునకు కొంచెము వీలుకలుగునట్లు గిట్టలు కొలదిగా సడలించెను. సర్పము బోధిసత్త్వుని గాయమునుండి విషము పీల్చివేసి, ఆయనశరీరమును నిర్విషము చేసెను. బోధిసత్త్వుడు సుఖముగా లేచి యథాపూర్వముగా నిలిచెను. కర్కటము తనలో "ఈదుర్మార్గు లిరువురు జీవించియున్నచో నామిత్రునకు శుభము లేదు.

ఉభయులను వధించెదను” అని తలపోసి, కత్తెరతో కమలనాళమును కత్తిరించునట్లు తనగిట్టలతో వాని శిరములు ఖండించి, ప్రాణములు తీసెను. ఆడుకాకి అక్కడనుండి ఎగిరిపోయెను. బోధిసత్త్వుడు సర్పశరీరమును కర్రతో నెత్తి గుబురులో బారవేసి, సువర్ణకర్కటమును కుంటలో విడిచి, స్నానము చేసి, సాలిందియగ్రామమునకు మరలి పోయెను. అప్పటినుండి వారి పరస్పరవిశ్వాసము దృఢతర మయ్యెను.

కాకి దేవదత్తు డపుడు
కాళవ్యాళము మారుడు
ఆనందుడు కర్కటకము
అవనీసురుడను నేనే.

## 390 మయ్హక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆగంతుకశ్రేష్ఠిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తిలో ఆగంతుకశ్రేష్ఠి యనుపేర ధనవంతుడు నివసించుచుండెను. అతడు స్వయముగా నేమియు ననుభవింపడు; అన్యుల కేమియును పెట్టడు. వివిధప్రకారమయిన రుచ్యభోజనపదార్థములు ఎదటికి తెచ్చి పెట్టినను తినక, అతడు గింజలు, నూకలుతినెడివాడు. సువాసనలు వెదజల్లువస్త్రములు తెచ్చినను వాని నావల నుంచి, ముదుగుబట్టలు కట్టెడివాడు. ఆజానేయములను పూన్చి సువర్ణమణిఖచిత మైన రథము తెచ్చినను దాని నాపి, ఆకులు కప్పిన కర్రలబండి ఎక్కెడివాడు.

అతడు దానాదిపుణ్యకార్యములలో ఒకటికూడ జన్మములో చేయలేదు; మరణానంతరము రౌరవనరకములో బడెను. అపుత్రకు డైన యాతనిధనము సేన వారముదినములకు రాజుకోశాగారమునకు చేర్చెను. ఆవల రాజు ప్రాతర్భోజనము చేసి, జేతవనమునకు బోయి

శాస్తకు ప్రణామము చేసి, కూరుచుండెను. "మహారాజా, బుద్ధసేవకు వచ్చుట లేదేమి?" అని యడిగెను. "భన్తే, శ్రావస్తిలో మృతినొందిన ఆగంతుక శ్రేష్ఠి ధనమును వారమురోజులనుండి మాయింటికి చేర్చు చున్నారు అతనికి సంతానము లేదు అంత ధన మున్నను అత డెన్నడు ననుభవింపలేదు. ఇట్టి లోభికి, అపుణ్యవంతునకు అంతధన మెట్లు లభించెను? అతనికి భోగాసక్తి ఏల లేకుండెను?" "మహారాజా, ధనప్రాప్తియు ధనభోగరాహిత్యము కర్మఫలములు" అని శాస్త రాజుప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు అశీతికోటిసంపద కల శ్రేష్ఠియింట పుట్టెను. తలిదండ్రులు పోయినతరువాత అతడు తమ్మునికి ఏర్పాటులు చేసి, పరివారపోషణము చేయుచుండెను. గృహద్వారముకడ ధర్మశాల కట్టించి, విరివిగా దానధర్మములు చేయుచుండెను. ఆయనకు పుత్రు డుండెను.

కుమారునికి నడక వచ్చినపిదప బోధిసత్త్వుడు భోగములలోని దోషము గ్రహించి, యిలు వెడలిపోవుటయే కల్యాణ మని తలచి, తన కుమారుని, సమస్తసంపత్తిని తమ్ముని కప్పగించి, అప్రమత్తుడ వై దాన ధర్మములు చేయుచుండు మని యుపదేశించి, ప్రవ్రజించి, సమాపత్తులను పొంది, హిమాలయమున నివసించుచుండెను.

తమ్మునకు గూడ కుమారు డుండెను. వాడు పెరిగి పెద్దవా డగుచుండగా నొకనాడు తమ్ముడు తనలో "అన్నకుమారుడు బ్రదికియుండగా ఆస్తి రెండు భాగములు చేయవలెను. కావున వానిని సంహరింతును" అనుకొని, నదీజలములో కుర్రవానిని ముంచివేసెను. అతడు స్నానము చేసి యింటికి వచ్చినతరువాత వదిన "పిల్లవా డేడి?" అని యడిగెను. "జలక్రీడ చేసెనాడు. వెదకినను కనబడలేదు" అని చెప్పెను. ఆమె యేడ్చి మిన్నకుండెను.

బోధిసత్త్వు డీవృత్తాంతము విని, దీనికార్యము బయలుపెట్టుదు నని, ఆకాశమార్గమున వచ్చి, వారాణసిలో దిగి, మంచి వస్త్రములు ధరించి, తమ్ముని గృహద్వారముకడ నిలిచి చూడగా ధర్మశాల కన

బడలేదు. దుర్మార్గుడు దానిని నష్టపరచినా డని తలచి నిలిచియుండగా రాక విని, తమ్ముడు వచ్చి, ప్రణామము చేసి, సౌధము మీదికి గొని పోయి, బాగుగా భోజనము పెట్టెను.

భోజనానంతరము సుఖాసీను డై కుశలప్రశ్నలు చేసి బోధిసత్త్వుడు తమ్మునితో "పిల్లవాడు కనబడ డేమి?" అనెను.

"భర్తే, వాడు చనిపోయినాడు."

'ఎట్లు?'

"జలక్రీడాసమయములో. ఏమి చేయ లేకపోతిని."

"దుర్మార్గుడా, నీకు తెలియదా? రాజాదులవలన నష్టము కాదగిన ధనమును రక్షించుట లేదా? నీకును పక్షికిని అంతర మే మున్నది మహ్యాకా!"

బోధిసత్త్వుడు బుద్ధిలీలవలన ఉపదేశ మిచ్చువా డై ఈ గాథలు పలికెను:

కానన గిరి కందరముల
కలయ దిరుగు 'మ్యహోక' పక్షి
పండిన పిప్పలివృక్షము
పైన ప్రాలి నాది నాది
అని యరుచుచు నుండు నపుడు
అన్యపక్షు లరుగుదెంచి
ఆ ఫలములు తినిపోవును;
ఆ విహాగము రోదించును.

ఇట్లే కొందరు మానవు
లెంతో ధనము ప్రోగుచేసి
అనుభవింపలేరు తాము
ఆత్మీయుల కొసగలేరు.

తాము తినరు, ధరియింపరు
తాల్పరుపూయరు స్వబంధు
జనుల కుచితరీతి నొసగ
జాలక నా దని నాదని
అరచి యేడ్చి మొత్తుకొంద్రు
ఆ ధనంబు రాజునకో,

అప్రియులకో, చోరులకో
అందుచుండు తుట్టతుదకు.
యోగ్యుడు భోగ్యపదార్థము
లొక్కచోట జేర్చి యుచిత
భంగిని బంధువులకొసగి
ప్రశస్తిగను, మృతి కావల
స్వర్గపదము గాంచుచుండు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు ధర్మోపదేశము చేసి, మరల దానధర్మములు నడిపించి, హిమాలయమునకు బోయి, ధ్యానావస్థితుడై, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి, జాతకములు పరిషోల్చెను. ఆ కాలమున తమ్ముడు ఆగంతుకశ్రేష్ఠి; అన్న నేనే.

## 391 ధజవిహేఠ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లోకోపకారమును గూర్చి చెప్పినది. వర్తమాన కథ మహాకణ్హ జాతకమున వచ్చును. ఆసమయమున శాస్త "భిక్షువులారా, అప్పుడే కాదు, పూర్వము కూడ తథాగతుడు లోకోపకారము చేసినాడు" అని పూర్వజన్మ కథ చెప్పినాడు.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శక్రపదవియం దుండెను. ఆసమయమున విద్యాధరు డొకడు మంత్రబలముచే అర్ధరాత్రమున ఆకాశమార్గమున పోయి వారాణసిపట్టపురాణిని భంగపరచుచుండెను. ఈవిషయము పరిచారికలకుకూడ తెలిసెను. అంతట రాణి రాజుకడకు బోయి, "దేవా, ఒకానొకడు అర్ధరాత్రివేళ నాశయనాగారము బ్రవేశించి, నన్ను భంగపరచుచున్నా" డని చెప్పెను.

"అతనిగురుతు లేమైన గ్రహింపగలిగితివా?"

"గ్రహింపగలిగితిని దేవా!"

జాతీహింగుళసాళిని తెప్పించి, వాడు వెడలిపోవునపుడు వానివీపు మీద అయిదువ్రేళ్ళును అంటునట్లు అరచేతిముద్ర వేసి ఆమె రాజుతో జెప్పెను. రాజు పరివారముతో "పోయి నాలుగుదిక్కుల వెదకుడు. వీపు మీద పంచాంగుళిముద్ర ఉన్న పురుషుడు కనబడినచో వానిని పట్టుకొనుడు" అని యాదేశించెను.

విద్యాధరుడు రాత్రివేళ అకృత్యము చేయుచు, పగటివేళ సూర్య నమస్కారము చేసి, ఒంటికాలిమీద నిలుచుండును. రాజపురుషులు చూచి వానిని చుట్టుముట్టిరి. తనపని బయలుబడె నని తెలిసికొని వాడు మంత్రబలముచే ఆకసమున కెగసిపోయెను. వానిని జూచి వచ్చిన రాజపురుషులతో రాజు 'కనబడినాడా?' అనెను.

'చిత్తము, దేవా!' 'ఎవరు వాడు?' 'దేవా, సన్యాసి' వాడు రాత్రి వేళ అకృత్యములు చేయుచు, పగలు సాధువేషమున నుండును.'

రాజుకు సాధువులమీద కోపము పుట్టెను. "సాధువులందరును నారాజ్యమునుండి వెడలిపొండు. ఎవ్వడైన కనబడినచో వానికి రాజ దండము తప్పదు" అని రాజు చాటింపు చేయించెను. సాధువులందరును కాశీరాష్ట్రమునుండి పలాయితులై అన్యరాజధానులు చేరిరి. రాష్ట్రప్రజలకు ఉపదేశ మిచ్చుట కొక్కడైన బ్రాహ్మణశ్రమణుడు లేడు. సదుపదేశము చేయువారు లేక లోకులు కఠోరస్వభావు లయిరి. దానశీలములనుండి విముఖు లగుటచే జనులు మరణానంతరము నరక మున నుద్భవించుచుండిరి. స్వర్గమున జన్మించువాడు లేడయ్యెను.

నూతన దేవతలు కానబడకపోవుటచే శక్రుడు ధ్యానము చేసి, విద్యాధరునిమూలమున వారాణసి రాజు క్రుద్ధుడై ప్రవ్రజితులను తన దేశమునుండి తరిమివేయించె నని తెలిసికొని, తాను తప్ప అన్యు లెవ్వరును రాజు కున్న వృథాక్రోధమును తొలగింపలేరని తలచెను. రాజునకును తద్దేశవాసులకును ఉపకారము చేయవలె నని గట్టినిశ్చయము చేసికొని శక్రుడు తక్రమూలపర్వతమందలి ప్రత్యేకబుద్ధాశ్రమమునకు బోయి "భదంతులారా, నాకు వృద్ధప్రత్యేకబుద్ధు నొసగుడు. నేను కాశీరాజును ప్రసన్నుని జేయవలెను" అని కోరెను. ఆయనకు

సంఘుస్థవిరుడు లభించెను.

ఆయన పాత్రము, చీవరము పట్టుకొని, స్థవిరుని తనముందు బెట్టుకొని, తాను వెనుకగా నుండి, శిరసుపై చేతులు జోడించి నమస్కరించుచు శక్రుడు తరుణసుందరరూపమున నగరముపై మూడుమారులు తిరిగి, రాజద్వారముపై ఆకసమున నిలిచెను. "దేవా, ఒకానొక సుందరయువకుడు వృద్ధశ్రమణునితో రాజద్వారముపై ఆకసమున నిలిచి యున్నా" డని పరిజనులు రాజుతో జెప్పిరి.

రాజు పీఠమునుండి లేచి, తలుపులు తెరచి, నిలిచి "మాణవకా, అభిరూపుడ వైన నీవు కురూపి యైన యీవృద్ధశ్రమణునిపాత్రికను, చీవరమును గొని, నమస్కారము చేయుచు నిలిచియున్నా వేమి?" అని అడుగువాడై యీ తొలిగాథ పలికెను:

'హే సుందరరూప, నీవు
ఈ కురూపి కేల ముందు
అంజలి ఘటియింతు? విఠడు
అధికుడా సమానుండ?
అభిధ లంభయు లవియు నెవ్వి?

శక్రుడు "మహారాజా, శ్రమణులు ఆదరాస్పదులు. కావున నేను వీరినామ ముచ్చరింపరాదు. నా పేరు తెలిపెదను" అని శక్రుడు రెండవ గాథ పలికెను:

అధిపా, దేవత్వంబును
అర్హత్వము, నిర్వాణము
చెందినవారల పేరులు
చెప్పరాదు నోటివెంట
తెలుపుదు నా పేరు త్రయ;
త్రింశత్కోటి దేవతలకు
ఇంద్రుండను!

విని రాజు శ్రమణులకు నమస్కరించుటవలని ఫల మేమని ఈ గాథ ద్వారా అడిగెను:

దేవరాజ
ఈవిషయం బడిగెద నిను!

సదాచారు డైన భిక్షు
సమ్ముఖంబునందు నిలిచి
చేతులు జోడించి నమ
స్కృతి యొనరించెడు జను మర
ణానంతర మందు సౌఖ్య
మబ్బునె నిజముగ నతనికి ?

శక్రుడు నాలుగవ గాథ పలికెను:

సదాచారు డైన భిక్షు
సమ్ముఖంబునందు నిలిచి
చేతులు జోడించి నమ
స్కృతి యొనరించెడు నరునకు
యశము కలుగు నిహమున పర
మందు స్వర్గలాభ మగును.

రాజు శక్రునివాక్కులు విని తనమతము విడిచి, ప్రసన్నచిత్తు డై అయిదవ గాథ పలికెను:

నే డింద్రుని భూతపతిని
నేను విలోకించు కతన
కలిగె ప్రజ్ఞ; దేవరాజ,
కనుగొని భిక్షువును పుణ్య
కార్య మొనర్చెదను నేడు.

విని శక్రుడు పండితప్రశంసచేయువా డై, ఆరవ గాథ పలికెను:

బహువిషయ విచారరతులు
బహుశ్రుతులు, ప్రజ్ఞ కలుగు
వారిని సేవింపవలయు
నను భిక్షువు గాంచి సలుపు
నానా పుణ్యకార్యంబులు.

విని రాజు తుదిగాథ పలికెను:

దేవేంద్రా, నే విని భవ
దీయుడు సుభాషితము నేడు
అవిరత ప్రసన్నబుద్ధి

నక్రోధను, డతిథిపూజ
యాచరించినవాడ నగుచు
అహము విడిచి అభినుతింతు.

ఇట్లు పలికి రాజు ప్రాసాదము దిగి, ప్రత్యేకబుద్ధునికి నమస్కరించి, ఒకప్రక్కన గూరుచుండెను. ప్రత్యేకబుద్ధుడు ఆకసమున పర్యంక బంధము వేసి, రాజు కిట్లు ఉపదేశ మిచ్చెను. "మహారాజా, విద్యాధరుడు శ్రమణుడు కాడు. నేటినుండి నీవు ఇవి గమనింపుము. ఎల్లరును ధార్మికశ్రమణబ్రాహ్మణులను ఊరక పంపక ధర్మముచేయవలెను. శీలములు రక్షింపవలెను; ఉపవాసవ్రత మనుష్ఠింపవలెను."

నిజప్రభావముచే శక్రుడుకూడ ఆకసమున నిలిచియుండి, నగరవాసులను అప్రమత్తులై యుండు డని యుపదేశించి, వెడలిపోయిన శ్రమణబ్రాహ్మణులు మరలిరావలసిన దని చాటింపించెను. వా రుభయులును నిజస్థానములకు బోయిరి.

రాజు తదుపదేశానుసారముగా పుణ్యకార్యములు చేసెను.

శాస్త ధర్మోపదేశము, సత్యప్రకారము కావించి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున ప్రత్యేకబుద్ధుడు పరినిర్వాణము చెందెను; రాజు ఆనందుడు; శక్రుడు నేనే.

## 392 భిసపుప్ఫ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు జేతవనమునుండి బయలుదేరి కోసలరాష్ట్రమున ఒకానొక యడవిలో విహారము చేయుచు ఒకనాడు పద్మసరోవరమునదిగి వికసించినకమలమునుచూచి వాయువుప్రసరించుదిక్కునవిలిచివాసనచూచెను. ఆవనఖండమున నుండెడి దేవత అతనిని బెదరించుచు, "మిత్రమా, నీవు గంధచోరుడవు. ఇది నీ చౌర్యమున ఒక యంగము" అనెను. ఆతడు

జేతవనమునకు మరలివచ్చి శాస్తకు ప్రణామము చేసి కూరుచుండెను. "భిక్షూ, ఎచ్చట నుంటివి?" అని శాస్త యడిగెను. భిక్షువు జరిగిన దంతయు తెలిపెను. "భిక్షూ, పుష్పములను వాసనచూచిన పిదప దేవత నిన్నే కాదు పూర్వము పండితులను కూడ బెదరించె" నని శాస్త ఆతని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వు డొకపల్లెలో బ్రాహ్మణులయింట బుట్టి పెద్దవా డయి, తక్షశిలలో విద్యలు నేర్చి, అనంతరము ప్రవ్రజించి, పద్మసరోవర నికటమున నివసించుచుండెను. ఒకనా డాయన సరసులో దిగి వికసించిన పుష్పములకడ నిలిచి వాసనచూచుచుండెను. ప్రక్కనున్న వృక్షస్కంధవివరములో నిలిచి యున్న దేవకన్య బెదరించుచు ఈ తొలి గాథ పలికెను:

ఈయకుండ కమలము నా
కీ వాఘ్రాణించినావు,
ఇది యొక విధమైన చౌర్య
మేమి బంధు, గంధచోర!

అంతట బోధిసత్త్వుడు రెండవ గాథ పలికెను:

త్రుంపలేదు, తీయలేదు,
దూరమునుండియె కేవల
మాఘ్రాణించితి కేవల..
మగుటెట్టులు గంధచోరు
డామాత్రంబునకె నేను?

ఆసమయముననే ఒకడు సరసులో దిగి తామరతూడులు పికుచు కమలములు కోయుచుండెను. బోధిసత్త్వు డది చూచి "దూరముగా నిలిచి వాసన చూచుచు వానిని చోరు డంటివి. ఇతని నేల ప్రశ్నింపవు?" అని దేవకన్యతో సంభాషించుచు, మూడవ గాథ పలికెను:

తామరతూడులు పీకుచు
తామరసంబులను కోసి

అతడు క్రూరకర్మ చేసె,
నతని నేమి యన వేటికి ?

అతనిని ఏమియు అనకుండుటకు కారణము తెలుపుచు దేవకన్య నాలు గయిదు గాథలు పలికెను:

మునిగి లోభమం దెవండు
మురికిగ నుండు పొత్తివోలె
అట్టివాని కేను జెప్ప
నట్టి దేమి లేదు; కాని
శ్రమణున కేమైన జెప్ప
సముచిత మని తలచుదాన.
నిత్యపవిత్రతాసక్తులు
నిర్దోషులు నైనవారి
చిన్నిపాప మైన మహా
జీమూతమువలె తోచును.

దేవకన్యవలన సంవిగ్నహృదయు డై బోధిసత్త్వుడు ఆరవగాథ పలికెను:

దేవత, అనుకంప చూపి
నావు నన్ను నెరిగి యుంట;
ఇకపై నీ కగపడునెడ
ఎట్టిలోప మైనగాని
గట్టిగ పాలింపవలయు.

అంతట దేవకన్య ఏడవ గాథ పలికెను:

మేము యుష్మదాశ్రితులము
కా ముపచారకుల మైన;
తెలిసి కొనిమియే; సుకృతము
వలన గలుగు సుగతి నీవె.

ఈ ప్రకారముగా ఆయన కుపదేశించి దేవకన్య తనవిమానమునకు బోయెను. బోధిసత్త్వుడును ధ్యానమగ్ను డై బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

## 393 విఘాస జాతకము

శాస్త పూర్వారామమున విహారము చేయునపుడు క్రీడాశీలు రైన భిక్షువులను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

మహామౌద్గల్యాయన స్థవిరుడు ప్రాసాదమును పెకలించినపుడు వారి మనసులో ఉద్వేగము కలుగగా భిక్షువులు ధర్మసభలో అతనిని తప్పు పట్టిరి. శాస్త అచటి కరుదెంచి విషయము గ్రహించి "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, పూర్వముకూడ ఈతడు క్రీడాశాలియే.

### అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శక్రపదవియం దుండెను. కాశీరాష్ట్రములోని ఒకానొక గ్రామములో ఏడుగురు సోదరులు కామభోగములు దుష్టము లని గ్రహించి, ఋషులమార్గమున ప్రవ్రజించిరి. వారు పవిత్రవనములో నివసించునపుడు యోగమున మనసు నిలుపక, శరీరపుష్టికై వివిధక్రీడలలో మెలగుచుండిరి. శక్రుడు చూచి వీరిమనసులలో "సంవేగము" కలిగింపదలచి, శుకరూపము దాల్చి వారినివాసస్థానము చేరి, వృక్షము మీద వాలి, సంవేగము నుత్పాదించుచు తొలిగాథ పలికెను:

> ఆరగింతు రెవరు భోజ
> నావశేష మవ్వారికి
> దొరకు కీర్తి ఇహమునందు
> పరలోకమునందు సుఖము.

అందులో నొకడు తక్కినవారిని సంబోధించి రెండవ గాథ పలికెను:

> వినలేదా కీరవాక్కు
> విద్వాంసులు, మీర, లిపుడు ?
> సోదరులారా, వినుడీ
> శుకము మమ్ము ప్రశంసించు.

వానికి విరుద్ధముగా శక్రుడు మూడవ గాథ పలికెను:

మృతదేహాశనులారా,
మిమ్ము నేను ప్రశంసింతు
మీరు తిందు రుచ్ఛిష్టము,
మిగిలినదానిని తినరే!

అది విని అందరును కలిసి నాలుగవ గాథ పలికిరి:

సాధువృత్తి శిఖలం దాల్చి
సప్తహాయనములం పుణ్య
వనవాసము చేసి విడుచు
వానిని తినుచుంటిమి; నింద
మీరు చేయు పక్షమందు
మిమ్ము నెవరు ప్రశంసింత్రు?

వారిని సిగ్గుపరచుచు బోధిసత్త్వుడు అయిదవ గాథ పలికెను:

పంచాస్యము శార్దూల
ప్రముఖవన్యజంతువితతి
తిని విడిచిన మాంసాదులు
తినుచు మీర, లవశేషము
తినిన ట్లెంతురు మేల్ మేల్!

అది విని ఆపరివ్రాజకులు మేము శేషించినవానిని తినువారము కానపుడు ఇంకెవ్వరు? అని ప్రశ్నించిరి.

ఈ విషయము వారికి తెలుపుటకై బోధిసత్త్వుడు ఆరవ గాథ పలికెను:

బ్రాహ్మణులకు శ్రమణులకును
పరయాచకులకు నొసగిన
పిమ్మట భుజియించువారి
విఘాసాదులంద్రు జనులు.

ఇట్లు పలికి వారిని సిగ్గుపాలు చేసి, నిజస్థానమునకు వెడలిపోయెను.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి ధర్మోపదేశము చేసెను. ఆకాలమున ఏడుగురు సోదరులు క్రీడాశీలిభిక్షువులు; శక్రుడు నేనే.

## 394 వట్టక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లోభియగు భిక్షువును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త అతనితో, "భిక్షూ, నీవు సత్యముగా లోభివేనా?" అనెను. "భన్తే, చిత్తము" అని ఆత డన్నపిదప శాస్త "భిక్షూ, కేవల మిప్పుడే కాదు. నీవు పూర్వము కూడ లోభివే. లోభకారణముచే ఏనుగు, వృషభము, అశ్వము, మనుష్యకళేబరములతో సంతృప్తి చెందక, ఇంతకన్నను హెచ్చుగా లభించు నని అరణ్యమున ప్రవేశించితి" వని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు టిట్టిభపక్షి కడుపున బుట్టి అరణ్యములో గరికపచ్చిక బీజములు తినుచుండెను. ఆకాలమున వారాణసిలో నుండు లోభి కాకము ఏనుగు మొదలగువాని శవములవలన సంతృప్తి లేక, ఇంత కంటె మంచివి దొరకునని అరణ్యములోనికి బోయెను. అచ్చట ఫల మూలములు తినుచున్న బోధిసత్త్వుని జూచి "ఈ టిట్టిభము బాగుగా బలిసియున్నది. మధురాహారము తినుచుండవలెను. ఏమితినునో అడిగి తెలిసికొని, అవియే తిని నేనుకూడ బలిసెదను" అని బోధిసత్త్వుని పై భాగమున నున్నశాఖపై వాలి, "ఓ, టిట్టిభా, తమరు ఏమి భుజించుటచే ఇట్లు పుష్టిగా నున్నారు?" అని యడిగెను. బోధిసత్త్వుడు దానితో సంభాషించువాడై యీ గాథ పలికెను:

> నీ వోమామా, తైలము
> నేయియు కలిసిన యన్నము
> తిందువు; బలహీనముగా
> ఎందులకుంటివి కాకమ!

విని, కాకి మూడు గాథలు పలికెను:

> అమిత్రమధ్యముననుండి
> ఆహారము దొంగిలించి

తినుచు నెప్పుడు నుద్విగ్న
మనస్కుమైన కాకమునకు
ఎటులుండును దేహదార్ఢ్య?
మెల్లప్పుడు పాపకర్మ
లొనరించుచు నుండుటచే
ఉద్విగ్నత తప్పకుండు
ప్రాప్తభోజనం బొంటికి
పట్టదు, కాన దౌర్బల్యము
తృణబీజంబులు విహగమ,
తిందువు స్నిగ్ధము కానివి;
ఇట్లయ్యును స్థూలముగా
ఎట్టు లుంటివో తెలుపుమ.

విని, తాను పుష్టిగా నుండుటకు కారణము చెప్పునదై టిట్టిభ మీ మూడు గాథలు పలికెను:

అల్పేచ్ఛయు, అల్పచింత
అధికదూర మరుగకుంట
లభ్యపదార్థంబుల కా—
లక్షేపము చేయుకతన.

అల్పేచ్ఛయు అల్పచింత
ఆహారజ్ఞానంబును
పరిగనున్న, జీవయాత్ర
సౌఖ్యప్రదముగ సాగును.

శాస్త ఈధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు పరిపోల్చి లోభిభిక్షువు స్రోతాపత్తిఫలము నొందెను. ఆకాలమున కాకము లోభిభిక్షువు; తిత్తిరి నేనే.

## 395 కాక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లోభియగు భిక్షువును గూర్చి చెప్పినది. వర్తమానకథ వెనుకటికథ వలెనే నుండును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కపోతముగా పుట్టి వారాణసీ శ్రేష్ఠివంటయింటిలోని ఉట్టిలో నివసించుచుండెను. కాకి దానితో స్నేహము చేసి, అందులో నుండెను. వంటవాడు కాకిరెక్కలు పీకి, పీపుమీద అంటించి, గవ్వల పేరు మెడలో వేసి, ఉట్టిలో బడవేసెను. బోధిసత్త్వుడు అరణ్యము నుండి మరలివచ్చి, దానిని జూచి, పరిహాసముతో తొలిగాధ పలికెను:

చిరకాలమునకు కంటిమి
స్నిగ్ధుని మణిదాల్చువాని
శోభిల్లును నామిత్రము
సుసజ్జితశ్మశ్రువుతో.

విని, కాకి రెండవ గాధ పలికెను:

పనితీరిక లేమి పెరిగె
బాగుగ నఖకేశమ్ములు,
చిరకాలమునకు నేటికి
చిక్కినాడు నాపితుండు,
చేయించితి క్షురకర్మము.

బోధిసత్త్వుడు మూడవ గాధ పలికెను:

క్షౌరము చేయించినావు
కష్టలభ్యనాపితుచే,
కాని, సఖా! నీ గళమున
ఘంటికవలె మ్రోగునేదో.

అంతట కాకి రెండుగాధలు పలికెను:

సుకుమారుల కంఠంబున
శోభిలు మణి వ్రేలాడుచు

అట్టిదాని కీయుది ప్రతి,
అభిమానముగా నెంచకు
మిత్రమ, నా గడ్డము, మణి
మీర నీకు నీర్ష్య యేని
గడ్డము పెట్టించి నీకు
గళమణిసైతం బొసగుదు.

బోధిసత్త్వుడు ఆరవ గాథ పలికెను:

సఖా, నీవు తగుదువోయి
చక్కని గడ్డమ్మునకును
మణికిని యోగ్యుండ వొక్క
మాట చెప్పిపోవువాడ
నీ యదర్శనంబె నాకు
నిక్కమ్ముగ ప్రియమోయీ!

ఇట్లు పలికి వేరొకచోటికి పోయెను. కాకి అక్కడనే మరణించెను.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములను సరిపోల్చెను. లోభిభిక్షువు అనాగామి ఫలమున ప్రతిష్ఠితుడయ్యెను. ఆకాలమున కాకము లుబ్ధభిక్షువు; పారావతము నేనే.

## 396 కుక్కు జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు రాజునకు ఉపదేశ మిచ్చుటను గూర్చి చెప్పినది. వర్తమానకథ తేసగుణ జాతకమున (521) వచ్చును.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడాయనకు అర్థధర్మానుశాసకుడైన అమాత్యుడయ్యెను. రాజు అనుచితమార్గమున బడి, అధర్మముగా రాజ్యపాలనము చేయు

చుండెను. జనపదములకు వ్యథ కలిగించుచు ధనము ప్రోగుచేయు చుండెను. రాజు కుపదేశింపవలెనని బోధిసత్త్వుడు దృష్టాంతముకొరకు వెదకుచుండెను. రాజుకొరకు ఉద్యానములో నివాసము సగము సిద్ధమైనది; పైకప్పు పూర్తికా లేదు. స్తంభములమీద వాసములు నిలిచి యున్నవి. క్రీడార్థము రాజు ఉద్యానమునకు జని, విచరించుచు ఆయింటి లోనికి బోయెను. కాని మీదపడు నను భయముచే వెంటనే యీవలకు వచ్చి, వెలుపల నిలిచి చూచుచు అవి యెట్లు నిలిచియున్నవో యని యోచించి బోధిసత్త్వుని ప్రశ్నించువాడై ఈ తొలిగాథ పలికెను:

ఎనిమిది జేనల వలయము
ఎత్తు మూడు జేనలు గల
శిఖరము, సారము, దృఢమగు
శిరీషయష్టినిర్మితంబు;
శిథిలము కాకెట్లు నిలిచె ?

రాజు కుపదేశ మీయవలె నని బోధిసత్త్వుడు తరుణ మేతెంచె నని యెంచి ఈ గాథలు పలికెను:

త్రింశ ర్బలిష్ట వక్ర శి
రీష యష్టి నిర్మితంబు
వలయితమయి దృఢయష్టుల
నిలిచియున్నయది శిఖరము,
అభేద్యులును, సువృత్తులును
అధికశుచిపరాయణులును
ధీమన్మంత్రిపరీవృత
భూమీశుని రాజ్యశ్రీ
పడదు విరిగి వాసమ్ముల
పట్టున శిఖరమ్మువోలె.

తనపనులసంగతి జ్ఞప్తికి వచ్చి రాజు తనలో "ఈవాసములు, కంబములు అన్యోన్యాశ్రయమువల్ల నిలిచినవి. ఒకటి విడిపోయినచో రెండవది విడిపోయి అన్నియును కూలును. రాజుకూడ అధార్మికుడై తన మిత్ర, అమాత్య, సేనా, బ్రాహ్మణ, గృహపతులతో కలిసియుండక

పోయినచో వారు విడిపోవుదురు. ఐశ్వర్యము నష్ట మగును. కావున రాజు ధార్మికు డై యుండవలెను'' అని యోచించెను.

ఆసమయమున రాజదర్శనార్థమై ఎవరో మాతులంగములు తెచ్చిరి. 'మిత్రమా, ఇది భక్షింపుము' అని రాజు చెప్పగా బోధిసత్త్వుడు దానిని తీసికొని "మహారాజా, తినుట యెరుగనివారు చర్మముతోపాటు దీనిని తినెదరు. తెలిసిన పండితులు చర్మము తీసివైచి దాని రసమును గ్రహించెదరు. ఈ ప్రకారముగా ధనసంగ్రహము చేయునుపాయము సూచించుచు రెండుగాథలు పలికెను:

నిమ్మపై గల గట్టిచర్మము
ఇమ్ముగా దొలగించకుండగ
కత్తితో, భుజియించునెడలును
కటువుగా నుండును నరేశ,
బయటి త్వక్కును తొలగించిన
బాగుగా రుచ్యముగ నుండును
స్వల్పముగ తొలగించిన న
స్వాదుగ నుండెడి విధాన
నిగమ గ్రామమ్ములందు మ
నీషు లొత్తిడి చేయకుండగ
రాజధనమును గూర్చుచును, ధ
ర్మప్రకారము సంచరించును
రాయిడింపక నన్యజనులును
రాజధనమును వృద్ధిచేతురు.

బోధిసత్త్వుడు రాజుతో సంభాషించుచు పుష్కరిణీతటము చేరెను. బాలసూర్యునితో సమానకాంతికల ఉదకమున కంటకుండ వికసించిన కమలమును జూచి రాజు "మిత్రమా, ఈ పుష్పము నీటిలో పుట్టినను జలముచే అలిప్తమై యున్నది'' అనెను. బోధిసత్త్వుడు "మహారాజా, ప్రభువుకూడ ఇట్లే యుండవలెను'' అని యుపదేశ మిచ్చుచు ఈ రెండు గాథలు పలికెను:

పుష్కరిణలో స్వచ్ఛజలముల
బుట్టి పాండురమూలములతో
సూర్యకిరణ ప్రసారముచే

శోభ గాంచెడి సరోజమునకు
పట్టనట్టులు సలిలఘూళీ
పంకములు ధర్మప్రకారము
వ్యవహరించుచు రాయిడింపక
నన్యజనుల, విశుద్ధకర్ముం
డైనవానిని పాపపంకిల
మంట, దాతడు యుక్తసముడు.

రాజు బోధిసత్త్వుని యుపదేశము విని, అప్పటినుండి ధర్మానుసార ముగా పరిపాలన సాగించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు స్వర్గగామి యయ్యెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; పండితామాత్యుడు నేనే.

## 397 మనోజ జాతకము

శాస్త వేళువనమున విహారముచేయుచు విపక్షభిక్షువును గూర్చి చెప్పినది. వర్తమానకథ మహిళాముఖజాతకమున (26) వచ్చినది. ఆసమయమున శాస్త "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు, ఈ భిక్షువు పూర్వము కూడ విపక్షియే" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు సింహముకడుపున బుట్టి పెరిగి, ఆడుసింగముతో పాటు నివసించుచుండగా, మగ ఆడుబిడ్డలు కలిగెను. మగబిడ్డ పేరు మనోజము. అతడుకూడ పెద్దవాడయిన వెనుక సింహిణిని పెట్టుకొనెను. ఈప్రకారము అందరు అయిదుగు రయిరి. మనోజుడు అడవిదున్నలను సంహరించి మాంసము తెచ్చి, తల్లిదండ్రులను సోదరిని, భార్యను పోషించుచుండెను. ఒకనా డతడు వేటకు బోవగా పరుగెత్తుట కసమర్థమయిన

గిరి యను జంబుకము బోర్ల గిలబడి యుండగా చూచి సౌమ్యా, ఏమి?" అనెను. "స్వామీ, మీకొలువులో నుండగోరుచున్నాను." మంచిదని సింహము జంబుకమును గుహలోనికి గొనిపోయెను.

నక్కను చూడగానే బోధిసత్త్వుడు నివారించి "నాయనా, నక్కలు దుశ్శీలములు, పాపబుద్ధులు. అన్యుల ననుచితకృత్యములలోనికి జొనుపును. దీనిని నీకడ నిలుపుకొనవలదు" అని చెప్పెను.

కుమారుడు తండ్రిమాట వినలేదు. ఒకనాడు నక్క మనోజునితో "స్వామీ, గుఱ్ఱపుమాంసముమీద కుతూహలము కలిగినది. తక్కిన వానిలో నేను తినని మాంసము లేదు. గుఱ్ఱమును పట్టుడు" అని పలికెను. "గుఱ్ఱము లెక్కడ నుండును?" "వారాణసిలో నది యొడ్డున."

మనోజుడు దానిమాటలు విని, గుఱ్ఱములు నదిలో స్నానము చేయునపుడు అచ్చటికి బోయి, ఒక గుఱ్ఱమును బట్టి వీపుమీద వేసికొని వేగముగా తనగుహద్వారమును జేరెను. అతనితండ్రి గుఱ్ఱపు మాంసము తిన్నతరువాత "నాయనా, గుఱ్ఱములు రాజభోగ్యములు. రాజుకడ ఉపాయశాలులైన ధనుర్ధరు లుందురు. వారు బాణములు విడుతురు. గుఱ్ఱపుమాంసము తిను సింహమునకు దీర్ఘాయు వుండదు. నేటినుండి గుఱ్ఱమును పట్టవద్దు" అని చెప్పెను.

తండ్రిమాట లెక్కసేయక మనోజుడు గుఱ్ఱములను పట్టుచునే యుండెను. గుఱ్ఱములను సింహ మెత్తుకొనిపోవుచున్న దని విన్నప్పుడు రాజు నగరములోపల అశ్వపుష్కరిణిని నిర్మింపజేసెను. సింహ మక్కడికిగూడ పోయి అశ్వమును లాగుకొని పోవుచుండెను. రాజు అశ్వశాల నిర్మాణము చేయించి, గడ్డి, నీరు లోపల బెట్టునట్లు ఏర్పాటు చేసెను. సింహము చుట్టుగోడ దుమికి గుఱ్ఱపుసాలలోనుండికూడ అశ్వమును ఎత్తుకొనిపోవుచుండెను. లక్ష్యవేధ నిశ్చయముగా చేయగల ధనుర్ధరుని బిలిపించి రాజు వానితో 'బాబా, సింహమును బాణములతో కొట్టి వేయగలవా?" అని యడిగెను. వాడు కొట్టగల ననెను.

సింహము వచ్చుమార్గమున ప్రాకారము పక్కగా మంచె వేయించి ధనుర్ధరుడు దానిపై గూరుచుండెను. నక్కను శ్మశానముకడ విడిచి సింహము నగరములో ప్రవేశించెను. వేగముగా వచ్చునపుడు బాణ

ములు వేయక సింహము గుర్రము నెత్తుకొనిపోవునపుడు భారముచే వేగము మందగించినపుడు వెనుక బాణముతో గొట్టెను. తీక్ష్ణమైన బాణము సింహము కడుపునుండి మెరపువలె దూసుకొని పోయి అంత రాళములోని కెగసెను. చచ్చితి నని సింహ మరచెను. విలుకాడు దానిని కొట్టి, ధనుష్టంకారము చేసెను. నక్క రెండుధ్వనులు విని, తన మిత్రము బాణవిద్ధ మై చచ్చె ననుకొని, "చచ్చినదానితో మైత్రి యేమి? నేను నిజనివాసమునకే పోవుదును" అని రెండుగాథలు పలికెను:

ధనువు వంగినతీరు తన్నారి నిస్స్వనము
మిత్రంబు మృగరాజు మృతి నొందుచున్నట్లు
సూచించు ధ్రువముగా; సుఖముగా జనవచ్చు.
దావంబులో నింక త్రాణ మున్నది నాకు
చనిపోవు వానితో సఖ్య మ్మయుక్తము;
జీవించి యున్నచో స్నేహితుల్ లభియింత్రు.

సింహము మహావేగముగా పరుగెత్తి, గుహాద్వారము చేరి, గుర్రమును క్రిందపడవేసి, తానుగూడ క్రిందబడి చచ్చెను. దానిబంధువులు ఈవలకు వచ్చి చూడగా సింహము రక్తసిక్తమయి యుండెను. గాయమునుండి రక్తము కారుచుండెను. దుస్సాంగత్యమువలన అది మరణించినది. చూచి, తండ్రి, తల్లి, సోదరి, భార్య క్రమముగా నాలుగు గాథలు పలికిరి:

దుర్మార్గు లగువారితోడ సాంగత్యంబు
చేయువానికి లేదు చిరకాలసౌఖ్యంబు
వీక్షింపుడు మనోజు; వీని కేగతి పట్టె
ఆ జంబుకాదేశ మనుసరించుట జేసి.

కుజనసంగతి గల్గు కొమరుచే హర్షంబు
మాత కుండదు; బాణఘాతంబుచే రక్త
పూరమ్మున మనోజు తేరిచూచుట మేలు.

తనహితైషులు జ్ఞానధనులు చెప్పినమాట
విననివా డీరీతి వెతనొంది నశియించు.

పొత్తు కుదిరిన యెడల నుత్తమున కధముతో
మిగుల నష్టము చెందు, మృగరాజ మధముతో
మైత్రిచే శరహతిన్ మరణంబు గాంచినది.

ఇది అంతిమసంబుద్ధగాథ:

నీచసాంగత్యంబు నెరపువానికి వృద్ధి
తఱిగిపోవుచు నుండు, తనసమానునితోడ
సఖ్యంబు చేత హ్రాసంబు చెందదు వృద్ధి
సంఘటిల్లున యేని సఖ్యంబు శ్రేష్ఠుతో
శీఘ్రంబుగా వృద్ధి చెందుచుండును జనుడు
కాన నుత్తముని సాంగత్యంబు చేయవలె.

శాస్త ఈధర్మోపదేశము, సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. విపక్షభిక్షువు శ్రోతాపత్తిఫలము నందెను. ఆకాలమున నక్కు దేవదత్తుడు; మనోజుడు వ్యతిరేకముగా నుండువాడు; సోదరి ఉత్పలవర్ణ; భార్య క్షేమాభిక్షుణి, తల్లిరాహుల మాత; తండ్రి నేనే.

## 398 సుతను జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు తల్లిని పోషించు భిక్షువును గూర్చి చెప్పినది. వర్తమానకథ సామజాతకమున (540) వచ్చును.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు దరిద్రులయింట బుట్టెను. అతనికి సుతనువు అని పేరు పెట్టిరి. ఆయన పెద్దవాడయినపిమ్మట కూలిచేయుచు తల్లిదండ్రులను పోషించుచుండెను. తండ్రి పోయిన పిమ్మట తల్లి పోషణ చేయజొచ్చెను.

ఆసమయమున వారాణసీప్రభువు మృగయాకుతూహలి యగుటచే ఒకనాడు వేటకు బహుపరివారముతో జని, అరణ్యములో రెండు యోజనములమేర జంతువులను తరిమించి, ఎవని కెదురుగా జంతువు తప్పించుకొనిపోవునో దాని మూల్య మత డీయవలసియుండు నని చాటించెను.

రాజుకోస మమాత్యులు నిర్ణీతమార్గమున కోష్ఠము నిర్మాణము

చేయించిరి. మృగనివాసములను చుట్టుముట్టి, జనులు సందడిచేయుట వలన పరుగెత్తుచున్న మృగములలో ఏణ మొకటి రాజు నిలిచి యున్న తావునకు వచ్చెను. దానిని కొట్టి పడవేయుటకై రాజు బాణము విడిచెను. మృగమునకు జిత్తులు తెలియును. బాణము కోమలమైన తన ప్రక్కకు వచ్చుచుండుట గమనించి, నాటుకొన్నట్టు నటించి త్రుళ్ళిపడి నేలకొరగెను. మృగమును కొట్టితి నని తలచి రాజు దానిని పట్టుకొన బోయెను. మృగము లేచి, వాయువేగమున పారిపోయెను. అమాత్యులు రాజునుగూర్చి నవ్వుకొనిరి.

రాజు గుఱ్ఱముపై ఏణము వెంటబడి, అది అలసిపోయినపిదప ఖడ్గముతో దానిని రెండుతుండెములు చేసి, కావడివలె దండముమీద వేసి తీసికొనివచ్చుచు త్రోవలో కొద్దివిశ్రాంతి తీసికొనుటకై మార్గము ప్రక్క నున్న వటవృక్షము క్రిందికి బోయి పండుకొనగా నిద్రపట్టెను. దానిమీద మఖాదేవు డను యక్షుడు నివసించుచుండెను. చెట్టునీడ లోనికి వచ్చువారిని సంహరించి భక్షించునట్లు వాడు కుబేరునివలన అధికారము పొందియుండెను. రాజు నిద్ర లేచి పోబోవుచుండగా వాడాయనను పట్టుకొని "ఆగు, నీవు నా కాహారమ" వనెను. 'నీ వెవరు?' "నే నిచట నుండు యక్షుడను. ఇక్కడకు వచ్చువారిని భుజించుటకు నా కధికార మున్నది." రాజు సంబాళించుకొని "నేడు మాత్రము భుజింతువా, ప్రతిదినము భుజింపగోరుదువా?" అనెను. "దొరకినచో మానవుని ప్రతిదినము భుజింతును." "నేటికి ఈ మృగమును తిని, నన్ను విడిచిపెట్టు. అన్నపుకుండతో పాటు ఒకమానిసిని నీకై రేపటి నుండి పంపుచుందును." "మరచిపోగూడదు. ఏనాడు మానిసిని పంపవో ఆనాడు నిన్నే మ్రింగుదును." "నేను వారాణసీప్రభువును. నాకడ అన్నియు నున్నవి." ప్రతిజ్ఞ చేయించి, రాజును యక్షుడు విడిచి పెట్టెను.

రాజు నగరమున ప్రవేశించి తనమంత్రితో అంతయును చెప్పి "కర్తవ్య మేమి?" మని అడిగెను. "దేవా! ఎన్నాళ్ళకు అవధి యేర్పాటు చేసితిరి?" "అవధి పెట్టలేదు." "అట్లయిన పొరపాటు జరిగినది. అయినను విచారింపకుడు. కారాగారములో అనేకు లున్నారు." "నీవే ఈ పని నెరవేర్చి, నాకు ప్రాణదానము చేయవలెను."

మంచి దని అమాత్యుడు ప్రతిదినము కారాగారమునుండి ఒకనిని రప్పించి, నిజస్థితి తెలుపక, అన్నపుకుండతో వానిని వటవృక్షముకడకు బంపుచుండెను. యక్షుడన్నమును మానిసిని మెసవుచుండెను. క్రమముగా కారాగారము వట్టిపోయెను. భోజనము కొనిపోవువాడు లేనందున రాజునకు మరణభయము కలిగి కంపము పుట్టెను. అమాత్యుడాయన నూరడించుచు "దేవా, లోకములో ప్రాణముమీది ప్రీతికంటె ధనప్రీతి గొప్పది. ఏనుగు మెడలో వేయినాణెములసంచి కట్టి ఈసంచి తీసికొని అన్నపుకుండను యక్షునికడకు గొనిపోవువా డెవరు? అని చాటింపుచేయవలెను" అని చెప్పెను. రాజు అటులే చేయించెను.

బోధిసత్త్వుడు విని "నేను మాసము, అర్ధమాసము కూలిడబ్బు కూడబెట్టి తల్లిని పోషించుచున్నాను. ఈధనమును తల్లి కిచ్చి, యక్షుని కడకు బోయెదను. యక్షుని నిర్జించితినా మంచిది; నిర్జింపజాలనా తల్లి సుఖముగా జీవించును" అని తలచి ఈసంగతి తల్లితో జెప్పెను. ఆమె రెండుమారు లతనిని వారించెను. మూడవమా రతడు తల్లితో జెప్పక "ఆర్యులారా, వేయిముద్రలు తెండు. నేను యక్షున కన్నము గొనిపోవుదును" అనెను. వారు తెచ్చిన ధనమును తల్లి కిచ్చి బోధిసత్త్వుడు ప్రణామము చేసి "అమ్మా, చింతింపకుము. నే నాయక్షుని జయించి, లోకులకు సుఖము కలిగించి, ఏడ్చుచున్న నీవు నవ్వునట్లు మరలివత్తును" అని చెప్పి, రాజపురుషులవెంట రాజుసన్నిధికి జనెను.

"నాయనా, అన్నము తీసికొనిపోవుదువా?" అని రా జడిగెను. "చిత్తము, దేవా! నీ కేమి కావలెను?"

"తమ సువర్ణపాదుకలు, దేవా" 'ఎందులకు?' 'ఆయక్షుడు వృక్షము క్రింద నిలిచినవారిని భక్షింపగలడు. నేను దగ్గిర నేలమీద నిలువక బంగరుపావుకోళ్ళమీద నిలుచుందును." "ఇం కేమి కావలెను?" "దేవా, తమ ఛత్రము." "ఇది యెందులకు?" "దేవా, యక్షుడు తనవృక్షచ్ఛాయలో నిలుచున్నవారిని భుజింపగలడు. నే నాతనిచెట్టు నీడను నిలువక ఛత్రచ్ఛాయలో నిలుతును." "ఇం కేమి కావలెను?" "దేవా, తమ ఖడ్గము." "దీనితో ఏమి పని?" "శస్త్రధారు లన్న అమనుష్యులుకూడ భీతిల్లుదురు." "ఇం కేమి కావలెను?" "సువర్ణస్థాలిలో తమభోజనము" "ఎందులకు బాబా?" "నావంటి పండితుడు

రుచిపచి లేని భోజనమును మట్టిపిడతలో కొనిపోవుట తగదు."

రాజు అన్నిసామానులు సిద్ధము చేయించి, బోధిసత్త్వుని సేవకై తనపరిచారకులను నియోగించెను. బోధిసత్త్వుడు రాజుకు ప్రణామము చేసి "మహారాజా, భయము వలదు. నేడు నేను యక్షుని నిర్జించి, తమకు మంగళము చేకూర్చి మరలివత్తును" అని చెప్పి సామానులు పట్టించుకొని, వృక్షసమీపభూమి చేరి, పరిజనులను దూరముగ నిలిపి తాను సువర్ణపాదుకలు తొడిగి, ఖడ్గము నడుమునకు కట్టుకొని, వెల్ల గొడుగు వేసికొని, బంగరుస్థాలిలో భోజనము తీసికొని, యక్షుని సమీపించెను.

ఎదురు చూచుచున్న యక్షుడు తనలో "అనుదినము వచ్చువాని వలె ఈతడు రాకుండుటకు కారణ మేమి?" అనుకొనెను. బోధిసత్త్వుడు చెట్టునీడ తనమీద పడకుండ చూచుకొని, కొంచె మీవలగా నిలిచి, కత్తిమొనతో అన్నపుస్థాలిని నీడలోనికి నెట్టి ఈ తొలిగాథ పలికెను:

వృక్షముపై నివసించెడి
యక్ష, మఖాదేవ, రాజు
పూతమాంసయు క్తమైన
భోజనమ్ము పంపినాడు,
అరుగుదెంచి నీ వీవల
కారగింపు చేయవలెను.

యక్షుడు విని, వృక్షచ్ఛాయలోనికి ఆయనను పిలిచి మోసగించి భక్షింపదలచి రెండవ గాథ పలికెను:

సూపాహారముతో నీ
వై పున కరుదేరవలయు,
అన్నముతోగూడ నాకు
నాహారం బగుదు నీవు.

అంతట బోధిసత్త్వుడు రెండు గాథలు పలికెను:

అల్పలాభమునకు యక్ష,
అధికలాభ ముజ్జగింతు
విపుడు నన్ను భక్షించిన
యెడల నీవు, మరణభీతి

నింకమీద నాహారము
ఎవ్వరు నీకొరకు తేరు.

పవిత్రంబు రసయుతంబు
పరిపూర్ణం బైన భుక్తి
నీకు వచ్చుచుండు యక్ష,
సత్యము; నను భక్షించిన
యెడల భుక్తి గొని వచ్చుట
కెవ్వడు దొరకడు యక్షా !

మాణవకుడు యుక్తముగా పలికినా డని యెంచి, యక్షుడు రెండు గాథలు పలికెను:

హిత మో మాణవకా, భా
షితము; నీవు కుశలముగా
కనవచ్చును నీ జననిని;
ఖడ్గము, ఛత్రము, స్థాలిని
కైకొని చనవచ్చు తల్లి
కడకు, మీకు కుశల మగుత !

యక్షునిపలుకులు విని బోధిసత్త్వుడు తనలో "నేను వచ్చినపని అయినది. యక్షుని నిర్జించినాను. నాకు విశేషధనము లభించినది. రాజు చెప్పినపని చేసితిని" అనుకొని సంతుష్టచిత్తు డై యక్షుని అనుమోదించుటకై తుది గాథ పలికెను:

యక్షా, సుఖముగ నుండుము
అఖిల బంధువర్గముతో;
దొరికె ధనము నీవలనను,
నెరవేరెను రాజు పనుపు.

ఇట్లని, యక్షుని సంబోధించి మరల ని ట్లనెను: "పూర్వము మిత్రమా, నీ వమంగళకార్యములు చేయుటచేతనే ఈ జన్మ వచ్చినది. నీవు కఠినుడ వయి, మానవరక్తమాంసములు మెసవు యక్షుడ వయితివి. నేటినుండి ప్రాణిహింస చేయవలదు." ఇట్లు దుష్కార్య దుష్పరిణామమును, సత్కార్య సత్పరిణామమును వివరించి, బోధిసత్త్వుడు యక్షునికి పంచశీలము లిచ్చి, "అరణ్యావాసము వలన నీ కేమి

లాభము? రమ్ము, నిన్ను నగరద్వారమున ప్రతిష్ఠించి, శ్రేష్ఠభోజనము ఏర్పాటు చేయింతును" అని, వానిని వెంటగొని, ఖడ్గాదులు యక్షుని చేత మోయించి, వారాణసి చేరెను. సుతను మాణవకుడు యక్షుని జయించి, వెంటగొని వచ్చినాడని రాజుకు వార్త చేరెను. అమాత్య సహితుడై రాజు ఎదురువచ్చి బోధిసత్త్వునకు స్వాగతము పలికెను.

యక్షుని నగరద్వారమున నిలిపి, వానికి మంచి భోజనము లభించునట్లు ఏర్పాటు జరిగెను. రాజు నగరమున ప్రవేశించి జనులను సమావేశపరచి బోధిసత్త్వునిగుణగణమును ప్రశంసించి, ఆయనను సేనాపతిని జేసెను. బోధిసత్త్వుని యుపదేశానుసారముగా నడచుకొనుచు, దానాది పుణ్యకార్యములు చేయుచు రాజు తుదకు స్వర్గలోకగామి యయ్యెను.

శాస్త ఈధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకము లు సమాపించెను: భిక్షువు శ్రోతాపత్తిఫలము నందెను. ఆకాలమున యక్షుడు అంగులిమాల; రాజు ఆనందుడు; మాణవకుడు నేనే.

## 399 గిజ్ఝ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు తల్లిని పోషించు భిక్షువునుగూర్చి చెప్పినది.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు గృధ్రము కడుపున బుట్టి, పెరిగి, అంధులైన మాతాపితరులను గుహాలోనుంచి గోమాంసాదికము తెచ్చిపెట్టి పోషించు చుండెను. అకాలమున వారాణసీశ్మశానభూమిలో నిషాదుడు ఇంచుమించుగా అన్నిప్రదేశములలో రాబందులను పట్టుటకై వలలు పన్నెను. ఒకనాడు బోధిసత్త్వుడు గోమాంసముకై వెదకుచు శ్మశానము చేరెను. తోడనే వలలో కాలు చిక్కుకొనెను. ఆయనకు తనవిషయమై చింత లేదు. కాని వృద్ధులు, అంధులునైన తలిదండ్రులవిషయము జ్ఞప్తికి

వచ్చి "నా తలిదండ్రు లెట్లు జీవింతురు? నేను వలలో జిక్కుకొన్నట్లు తెలియక, నిరాశ్రయులై పర్వతగుహాలో శుష్కించి మరణింతు రను కొందును" అని దుఃఖించుచు బోధిసత్త్వు డీ గాథ పలికెను:

కొండల చరియల వృద్ధులు,
ఉండి యేమి చేయగలరు ?
వ్యాధుడు పన్నినపాశము
నందు జిక్కుకొంటి నేను.

నిషాదపుత్రుడు గృధ్రరాజువిలాపము విని రెండవ గాథ పలికెను:

గృధ్రమ, విలపింతు వేల?
ఏమి నీదు విలాపంబు?
ఇంతకుమును మనుజవాక్చ
యంతము గని విని యెరుగను.

గృధ్ర మి ట్లనెను:

కొండచరియయందు తల్లి
దండ్రుల పోషించువాడ
ఇపుడు పాశమందు జిక్కి
ఇంక నేమి చేయగలను ?

నిషాదకుమారు డి ట్లనెను:

శతయోజనదూరంబున
మృతదేహాదులం గనుగొన
జాలు గ్రద్ద నికటవర్తి
జాలము కనుగొనలేదా ?

గృధ్ర మి ట్లనెను:

క్షీణించని యపుడు స్వీయ
జీవితంబు కనుగొనందు
ప్రాణి నికటమం దుండెడి
పాశంబును జాలంబును.

నిషాదకుమారు డి ట్లనెను:

చరియలోన వసియించెడి
జననీజనకుల బ్రోవుము;
నిను విడిచితి; పోయి చూడు
నీబంధుల కుశలముగా.

గృధ్ర మి ట్లనెను:

నీ వో లుబ్ధక, సుఖముగ
నీబంధుగులం గూడుము;
నే నొనరింతు వృద్ధజన
నీజనకులపోషణంబు.

బోధిసత్త్వుడు మరణదుఃఖవిముక్తు డై, నిషాదునికి సౌఖ్యము వాంఛించుచు, తుది గాథ పలికి, నోటినిండ మాంసము కరచుకొని పోయి తలిదండ్రులకు పెట్టెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. భిక్షువు శ్రోతాపత్తిఫలము పొందెను. ఆసమయమున పక్షిని చంపువాడు ఛన్నుడు; తలిదండ్రులు మహారాజకులము వారు; గృధ్రరాజు నేనే.

## 400 దబ్భపుప్ఫ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ఉపనంద శాక్యపుత్రుని గురించి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు బుద్ధశాసనమున ప్రవ్రజించి శిల్పేచ్ఛ మొదలగు గుణములను విసర్జించి మహాతృష్ణతో నుండెను. వర్షకాలమున రెండు మూడు విహారములలో గడుపుదు నని అంగీకరించి అత డొక దానిలో తనఛత్రమును కాని, పాదరక్షలు కాని యుంచి ఒకదానిలో చేతికర్ర కాని కమండలము గాని ఉంచి తా నొకదానిలో ఉండెడివాడు. ఒక సారి యతడు వర్షఋతువులో ఒకానొక జనపదమునందలి విహారమున నివాసము చేయ సంగీకరించి, భిక్షువులు అల్పేచ్ఛువులు కావలె నని వారుపయోగించు వస్తువులయెడ వైముఖ్యము కలిగించి, వారు విస

ర్జించిన సుందరపాత్రలను చీవరములను తననివాసమున నుంచెడివాడు. వారికి మట్టిపాత్రలు చినిగిన చీవరములు ఇచ్చుచుండెడివాడు. వర్షావాసము సమాప్తమైనంతనే యాతడాపదార్థము లన్నియు బండి నిండ నింపుకొని జేతవనమునకు బయలుదేరెను. త్రోవలో అరణ్య విహార ముండెను. కాలికి తీగచుట్టుకొని వెనుకకు లాగునపుడు నచట తప్పక ఏదో లభించు నని యోచించి విహారమున ప్రవేశించెను. వృద్ధ భిక్షువు లిరువు రా విహారమున వర్షాకాలము గడుపుచుండిరి. వారికి రెండు ముదుకబట్టలు, సన్నని కంబళము లభించినవి. పంపిణీ కుదరక పోవుటచే వారు ఇతనిని చూచి "భన్తే, మాకు దీనిపంపిణీ కుదరలేదు, మాకు వివాద మేర్పడినది, మీరు పంచిపెట్టు" డని కోరిరి. ఆత డంగీకరించి ముదుకబట్టలు చెరి యొక టిచ్చి కంబళము వినయధరుల కుండవలసిన దని దానిని కొని చనెను. ఆస్థవిరులకు కంబళిమీద ప్రీతి మెండగుటచే ఆతనివెంట జేతవనమునకు జని వినయధర భిక్షువులకు ఆవార్త తెలిపి "ఆర్యులారా, వినయధరుడు ఈవిధముగా అపహరణము చేయగలడా?" అనిరి.

ఉపనంద స్థవిరుడు తెచ్చిన పాత్రలు చీవరములపోగు చూచి భిక్షువు లతనితో, "ఆయుష్మన్, నీవు చాల పుణ్యాత్ముడవు. నీకు అనేకపాత్రములు, చీవరములు లభించినవి" అనిరి.

"ఆయుష్మంతులారా, పుణ్యముమాట యేల? ఈఉపాయముచే ఇవి లభించినవి." అని అతడు వృత్తాంత మంతయు వివరించెను. ధర్మ సభలో చర్చ జరుగుచుండెను. శాస్త అచటికి వచ్చి విషయము గ్రహించి "భిక్షువులారా, ఉపనందు డిప్పుడే కాదు, పూర్వముకూడ మహాలోభి; ఇతడు ఇప్పుడేకాదు, పూర్వముకూడ వస్తువులు అపహ రించెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు నదీతటమున వృక్షదేవతగా నుండెను. ఆసమయమున ఒకనక్క మాయావిని యను భార్యతోగూడ నదియొడ్డున నొకచోట నివసించుచుండెను. అది భర్తతో నొకనాడు "స్వామీ, నాకు కోరిక

పుట్టినది. అప్పుడే పట్టిన రోహితమత్స్యమును తినవలెను” అనెను. “వ్యగ్రతవలదు. నీకు తెచ్చి యిచ్చెదను” అని నక్క పలికి నదీతీరమున తిరుగుచుండగా పాదములకు తీగలు చుట్టుకొన్నవి. ఆసమయమున గంభీరచారి, అనుతీరచారి యను రెండు అడవిపిల్లులు చేపల కోసమై నదీతీరమున నిలిచియుండెను. అందులో గంభీరచారి పెద్ద చేపను జూచి, తటాలున నీటిలోనికి దిగి దానితోక పట్టుకొనెను. బలము కలిగిన యాచేప దాని నీడ్చుకొనిపోయెను. గంభీరచారి రెండవ దానితో “వచ్చితోడుపడు. మననిరువురను చేప తప్పించుకొనిపోలేదు.” అని పిలుచుచు ఈ గాథ పలికెను:

అనుతీరచారి, నీ కగును భద్రంబు
అరుదెంచి తోడ్పడు మయ్య నే నిపుడు
పట్టిన పెనుమీను బలిమి నన్ లాగు.

విని, అనుతీరచారి రెండవ గాథ పలికెను:

కల్యాణ మగుత, ఓ గంభీరచారి,
పట్టుకో దానిని గట్టిగా; నేను
ఈవలకుం జేర నీడ్చివై చెదను
నాగమున్ గరుడుండు లాగెడిరీతి.

రెండును కలిసి రోహితమును లాగి నేలమీద బడవేసి దానిని చంపి “నీవు పంచుము, నీవు పంచుము” అని జగడమాడి విభాగము కుదరక కూరుచున్నవి. ఆసమయమునకు నక్క అక్కడికి చేరినది. దానిని జూచి, అవి రెండును స్వాగతము పలికి “మిత్రమా, ఈచేపను మే మిరువురము పట్టుకొన్నాము. విభాగము చేయలేక జగడ మాడినాము. మాకు దీనిని సమానముగా పంచిపెట్టుము” అని మూడవ గాథ పలికినది:

మామాట లాలింపుమా దబ్బపుష్ప!
ఉభయులకును వాద ముద్భవించినది;
తగవు తీర్పు వివాదము శాంతినొంద.

వానివాక్కులు విని నక్క తనశక్తిని ప్రకటించుచు ఈ గాథ పలికెను:

పూర్వము న్యాయాధిపుండ నై యుండి
అభియోగముల నిర్ణయమును చేసితిని
శాంతించునట్లు మీ జగడంబు దీర్తు.

విభాగము చేయుచు నక్క యీ గాథ పలికెను:

అనుతీరచారి తోకను గ్రహియించు,
కైకొను శిరమును గంభీరచారి;
న్యాయాధిపతి గొను నడుమభాగమ్ము.

ఈ విధముగా చేపను విభాగించి, "మీరు దెబ్బలాడవలదు. తోక ఒకరు, తల ఒకరు తినుడు" అని, మధ్యభాగము నోట కరచుకొని అవి చూచుచుండగనే నక్క పారిపోయెను. అవి వేలకొలది ధనము కోలుపోయిన రీతిగా మొగములు వేలవేసి చదికిలబడి ఆరవ గాథ పలికినవి:

జగడ మాడక యున్న చాలకాలంబు
భుజియించి యుందుము; పోవు గైకొనుచు
మత్స్యమధ్యంబు గోమాయువు చూడు.

'నేను భార్యకు రోహితమత్స్య మిచ్చెదను' అని నక్క సంతుష్ట చిత్తముతో ఆమెకడకు బోయెను. ఆమె చూచి స్వాగత మని ఈ గాథ పలికెను:

క్షత్రియప్రభువు రాజ్యంబు లభింప
సుప్రసన్నుం డయి చూపట్టునట్లు,
నిండునోరున భర్త నే డరుదేర
సుప్రసన్నం బయ్యె చూడ నామనసు.

మత్స్య మెట్లు లభించె నని యడుగుచు ఆమె యీ గాథ పలికెను:

జలచరం బైన మత్స్యము నేవిధాన
పట్టినాడవు సౌమ్య, మెట్ట నుండుదువె!
ఏరీతి లభియించె నీ చేప నీకు?

అది యేయుపాయమున లభించెనో వర్ణించుచు, నక్క యీ గాథ పలికెను:

దౌర్బల్య మొందవు వాదముచేత, ధనము
క్షీణించిపోవును, చేపమూలమున

జగడమాడిన రెండు జంతువుల్ చెడియె
మాయావినీ, ఇంక మత్స్యముం దినుము.

ఇది అభిసంబుద్ధగాథ:

మానవులైన నీ మాడ్కిని జగడ
మొదవినయంత నే యురుకుచుందురు
న్యాయాధిపతికడ, కతడు నిర్ణయము
చేయు, తదర్థంబు క్షీణించిపోవు
రాజకోశమునను ప్రాప్తించు వృద్ధి.

శాస్త ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు పరిపోల్చెను. ఆ కాల మున శృగాలము ఉపనందుడు; అడవిపిల్లులు ఇద్దరు వృద్ధులు; వృక్షదేవత నేనే.

## 401 దసణ్ణక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు పూర్వభార్యాకర్షణమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త ఆ భిక్షువుతో "భిక్షూ, నీవు సత్యముగా ఉద్విగ్న చిత్తుడ వైతివా?" అనెను. "భన్తే, సత్యమే." "ఎందువలన?" "పూర్వభార్య వలన?" "భిక్షూ, ఈ స్త్రీ నీకు అనర్థదాయకము. పూర్వము కూడ ఈమెవలన చైతశికరోగమున మరణించుటకు సిద్ధముగా నుండి పండితులవలన బ్రతికితివి?" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వకాలము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున పుట్టెను. అతనికి సేనక కుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగి పెద్దవాడై తక్షశిలకు పోయి

అన్నివిద్యలు నేర్చి,వారాణసికి మరలివచ్చి మద్దవరాజుకడ అర్థధర్మాను శాసకు డగు అమాత్యు డయ్యెను. సేనకపండితు డనగానే నగరమంత టను చంద్రునివలెను, సూర్యునివలెను ప్రసిద్ధికలిగెను.

ఆకాలమున రాజపురోహితునిపుత్రుడు రాజును కొలుచుటకై వచ్చునపుడు ఒకనాడు సర్వాలంకారభూషిత యై మహారూపవతి యైన పట్టమహిషిని చూచి ఆమె యం దాసక్తు డై, ఇంటికి మరలిపోయి అన్నపానీయముల మానెను. మిత్రులు అడుగగా జరిగిన సమాచారము చెప్పెను.

"పురోహితునికుమారుడు కనబడుటలేదు. ఎక్కడ నున్నాడు" అని రాజు ప్రశ్నింపగా ఉన్నస్థితిగతులు ఆయనకు తెలిపిరి. అపుడు రాజు పురోహితపుత్రుని పిలువనంపి "ఈమెను నీకు ఏడురోజులుమాత్ర మిత్తును. ఇంట నుంచుకొమ్ము. ఎనిమిదవనాడు తీసికొనిరావలయును" అని చెప్పగా ఆత డంగీకరించి, ఆమెను వెంటగొనిపోయి క్రీడింపసాగెను. ఇరువురకును పరస్పరానురాగము గాఢము కాగా, ఎవరికిని తెలియ నీయక ఒకనాడు వారు ముఖ్యద్వారము వెంట వెడలిపోయి వేరొక రాజ్యమును చేరిరి వా రెచటికి పోయిరో ఎవరికిని తెలియలేదు. పడ వలో పోయియుందు రని యూహించిరి.

రాజు నగరమున చాటింపించెను. రకరకముల వార్తలు వచ్చినను వా రెచ్చట నున్నారో మాత్రము సరిగా తెలియలేదు. అందుచే రాజు హృదయమున దుఃఖ ముత్పన్నమై వేడి యెక్కి రక్తము పడ జొచ్చెను. పిమ్మట ఆయన నెత్తురు క్రక్కుకొని చాల జబ్బుపడినాడు. పెద్దపెద్ద రాజవైద్యులుగూడ చికిత్స చేయలేకుండిరి.

"రాజుకు రోగము లేదు. భార్య కనపడలేదని మనోవ్యథ చెంది నాడు. ఉపాయముచే దీనికి చికిత్సచేయుదు" నని అనుకొని బోధిసత్త్వుడు మంత్రు లిరువురను— ఆయుస్సు— పుక్కుస— నామధారు లగు బుద్ధిమంతులను పిలిచి ఇట్లు చెప్పెను. "రాణి కానబడనందున రాజుకు మనోవ్యాధి యేర్పడినది. అంతకన్న వేరురోగము లేదు. రాజు మనకు మిక్కిలి యుపకారము చేసినవాడు కావున ఉపాయముచే ఈయన వ్యాధికి చికిత్స చేయుదము. రాజాంగణమున సంబర మేర్పాటు చేయు దము. కత్తులు మ్రింగగలవారిచే కత్తులు మ్రింగు వినోదము చేయిం

తము. రాజును వాతాయనమున కూర్చుండబెట్టి ఆవినోదము చూపింతము. రాజు కత్తిమ్రింగుట చూచి, ఇంతకన్న కఠినమైన పని యున్నదా అని అడుగును. అయ్యా, నీవు— ఇది యిత్తును అని చెప్పుట దీనికన్న కఠినమైన కార్యమని నీవు పలుకవలెను. మిత్రమా పుక్కుస, అంతట రాజు నిన్ను ప్రశ్నించును. అపుడు నీవు, ఇది యిత్తును అనుట దీనికంటె కఠినమైన కార్యము మహారాజా! ఇత్తునని ఈయక ఉన్నచో పలుకు వ్యర్థమగును. అట్టి మాటమాత్రమునకు ఎవరును వానితో కలిసి భుజింపరు, కలిసి పానీయము త్రాగరు, ఆశ్రయించి బ్రతుకరు. కాని మాటప్రకారము నడచువారు ఇత్తుమన్నచో ఇత్తురు. ఈ ఇచ్చుట కత్తి మ్రింగుటకన్నను కష్టమైనది. అని నీవు చెప్పవలెను'' అని నేర్పి వినోదమునకై యేర్పాటు చేయించెను.

అంతట ముప్వురు పండితులు రాజుకడకుపోయి ''మహారాజా! రాజాంగణమున వినోదకార్యక్రమము జరుగుచున్నది. దానిని చూచినచో విచారముండదు, ఉత్సాహము కలుగును దయచేయుడు'' అని రాజును గొనిపోయి వాతాయనము తెరచి అందాయనను కూర్చుండబెట్టిరి. తమకు తెలిసినకళలను అనేకులు ప్రదర్శించిరి. ఒకడు ముప్పది యంగుళముల పొడవుగల తీక్ష్ణఖడ్గమును మ్రింగినాడు. రాజు యోచించి ముప్వురుమంత్రులను చూచి, ఇంతకంటె కఠినకార్య ముండునా యని ప్రశ్నించెను. మంత్రి ఆయుస్సును ఉద్దేశించి ఈ గాథ పలికెను:

దశార్ణనిర్మితము, తీక్ష్ణ
ధార కల్గి పరరక్తము
త్రాగు ఖడ్గ మితడు మ్రింగు;
ప్రశ్నించెద, తెలుపవలయు,
ఇంతకన్న కఠినతరం
బే కార్యం బైన కలదె?

దానికి ప్రత్యుత్తరముగా ఆయన ఈ గాథ పలికెను:

వాడికత్తి నైన మ్రింగ
వచ్చు నతడు లోభముచే,
ఇత్తు ననెడిమాట కఠిన
మింతకన్న; వాక్కుకంటె

ఏ దయినను సులభం బని
ఎరుగవలయు మగధరాజ!

రాజు ఆయుస్సువాక్కులు విని యోచించి "నేను ఇది ఇత్తును అనుట ఖడ్గమును మ్రింగుటకన్న కఠినమైనది. నేను పురోహితపుత్రునకు నారాణి నిత్తు నంటిని కావున మహాదుష్కరకార్యము చేసితిని" అని తలపోసినంతనే మనోవ్యథ కొంత తగ్గినది. అంతట రాజు ఇది ఇత్తును అని వేరొకనికి చెప్పుటకన్న కఠినమైన కార్య మున్నదా లేదా యని తెలిసికొనుటకై మంత్రి పుక్కుసునితో ప్రసంగించుచు ఈ గాథ పలికెను:

అర్థధర్మకోవిదుండు
ఆయువు నాప్రశ్నమ్మను
వ్యాఖ్యానించెను; పుక్కుస
నడిగెద నిక దీనికన్న
నధికకష్టకార్య మేది
యైన నున్న పక్షమందు
అద్దానిని దెలుపవలయు.

మంత్రి పుక్కుసుడు విశదీకరించువాడై ఈ గాథ పలికెను:

వ్యర్థముగా నోట వెడలు
వాణివలన జీవింపరు
జనులు; ఇచ్చి విచారమ్ము
చెందకుంట కఠినకార్య
మన్య మేది యైన సులభ
మని మాగధ, గ్రహియింపుము.

ఈ వాక్కులు విని రాజు ఆలోచనాపరుడై నేను పురోహిత పుత్రునకు రాణి నిత్తు నని మొదట పలికి ఆమాటప్రకారము ఆమె నిచ్చినాను. దుష్కరకార్యము చేసినాను" అనుకొన్నంతనే శోకము ఇంకను తగ్గిపోయెను. అందరకన్న బుద్ధిమంతు డగు సేనకపండితుని అడిగినచో బాగుండు ననుకొని రాజు ఆయనతో ఈ గాథ పలికెను:

అర్థధర్మవేత్త యగు పుక్కుసుడు తెల్పె
ప్రశ్నమునకు తగిన ప్రతివచనము

ఇంతకన్న కఠినమే దని సేనకు
నిప్పు డడుగువాడ; చెప్పుమయ్య!

రాజు బోధిసత్త్వునివాక్కులు విని తనలో "నేను బుద్ధిపూర్వకముగా పురోహితపుత్రునకు రాణి నిచ్చితిని. ఇప్పుడు నేను మనస్సును వశమునం దుంచుకొనజాలకున్నాను. యోచించినకొలది బాధ కలుగుచున్నది. ఇది నాకు తగదు. ఆమెకు నాపై ప్రేమయున్నచో ఇంతయైశ్వర్యమును విడిచి పారిపోవదు. నాపై ప్రీతిని విడిచి పలాయనము చేసినదానితో నా కేమి పని?" అని తలపోయుచుండగా ఆయన దుఃఖమంతయు తామరాకుమీది నీటిబొట్టువలె జారిపోయెను. తోడనే అయన కుక్షి కుదుటబడెను. రాజు నీరోగి యై సుఖము పొంది బోధిసత్త్వుని ప్రశంసించువా డై ఈ గాథ పలికెను:

అల్ప మైన బహుళ మైన దాన మ్మిచ్చి
అవల నతడు బాధ నందకుంట
మిగుల కఠిన మగును మగధేశ, అన్యంబు
దీనికంటె సులువు; తెలిసికొనుము.

తెలిపె నాయురుండు తెల్లంబుగా, పుక్కు-
సుండు పండితుండు తెలిపె;
కాని సేనకుండు కావించు వివరణ
మన్ని భాషితముల కన్న మిన్న.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి, సత్యప్రకాశము కావించి జాతకములం సంపోల్చెను. ఉద్విగ్నచిత్త భిక్షువు శ్రోతాపత్తిఫలము నొందెను. ఆ కాలమున రాజమహిషి పూర్వభార్య; రాజు ఉద్విగ్నచిత్తభిక్షువు; ఆయుర పండితుడు మాద్గల్యాయనుడు; పుక్కుసపండితుడు సారిపుత్రుడు; సేనకపండితుడు నేనే.

# 402 సత్తుభత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు తన ప్రజ్ఞాపారమితను గూర్చి చెప్పినది. వర్త మానకథ ఉమ్మగ్గజాతకమున (546) వచ్చును.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో జనకుడను రాజు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు బ్రాహ్మణవంశమున పుట్టెను. ఆయనకు సేనక కుమారు డని పేరుపెట్టిరి. ఆయన పెరిగి పెద్దవాడైనపిమ్మట తక్షశిలకు పోయి సమస్తవిద్యలు నేర్చి వారాణసికి మరలి వచ్చి రాజును కలిసికొనెను. ఆయనకు రాజు అమాత్యపదవిని, విశేషసంపదను ఇచ్చెను. బోధిసత్త్వుడు రాజుకు ధర్మార్థముల విషయమున ఆలోచలను చెప్పుచుండెడివాడు. మధురభాషియై ధర్మోపదేశము చేయుచు రాజును పంచశీలములలో ప్రతిష్ఠించి దానమునందు, ఉపోసథకర్మమందు, దశ కుశలకర్మములందు కళ్యాణమార్గమున ఆరూఢుని గావించెను. రాష్ట్రమంతటను బుద్ధులు ఉత్పత్తి యగున ట్లయ్యెను. పక్షుదివసములలో రాజు, యువరాజు మొదలగువారు ఒకచో చేరి ధర్మసభ చేయుచుండిరి, సంసిద్ధమైన ధర్మసభలో బోధిసత్త్వుడు శరభాసనము నుండి బుద్ధునివలె ధర్మోపదేశములు చేయుచుండును. ఆయనవాక్కులు బుద్ధునిధర్మవాక్కులవలె నుండును.

ఒకానొక వృద్ధబ్రాహ్మణుడు ధనము యాచించి, యాచించి వేయి కార్షాపణములు ప్రోగుచేసెను. ఆధనము నాతడు ఒకానొక బ్రాహ్మణునియింట నుంచి ధనము యాచించుటకై మరల ప్రయాణమయ్యెను. ఆయన వెడలిపోయినతరువాత ఆబ్రాహ్మణకుటుంబములోనివారు కార్షాపణములు ఖర్చుచేసిరి. బ్రాహ్మణుడు ప్రయాణమునుండి మరలి వచ్చినపిమ్మట కార్షాపణములు కావలయు ననెను. ఆబ్రాహ్మణుడు కార్షాపణము లీయజాలక దానికి బదులుగా తనపుత్రిక నిచ్చెను. బ్రాహ్మణుడు ఆమెను కొనిపోయి వారాణసి కనతిదూరములో నున్న ఒకానొక అగ్రహారములో నివసింపజొచ్చెను.

వృద్ధబ్రాహ్మణునిభార్య యువతి యగుటచే కామభోగములందు ఆమెకు సంతృప్తి తీరదు కావున ఆమె తరుణబ్రాహ్మణు నొకనితో

తగుల మేర్పాటు చేసికొనెను.

ఈ పదునారును ఎన్నడును సంతృప్తి చెందవు. ఏ పదునారు? అన్నినదులు కూడినను సాగరునకు సంతృప్తి లేదు. ఇంధనములవలన అగ్నికి సంతృప్తిలేదు. రాజుకు రాజ్యమువలన సంతృప్తిలేదు. మూర్ఖునకు ఎంతపాపముచేసినను తృప్తిలేదు. స్త్రీలకు సంయోగము, అలంకారములు, సంతానమును ఎంతయున్నను తృప్తిలేదు. బ్రాహ్మణునకు మంత్రములవలన తృప్తిలేదు. ధ్యానికి ధ్యానభావనవలన సంతృప్తి లేదు. శిష్యునకు విద్యాసంగ్రహమున సంతృప్తిలేదు. అల్పేచ్ఛునకు ధుతాంగగుణములవలన సంతృప్తి లేదు. సాధకునకు విక్రమములో తృప్తిలేదు. ధార్మికునకు ధర్మచర్చవలన తృప్తితీరదు. విద్వాంసునకు పరిషత్తువలన సంతృప్తి కలుగదు. శ్రద్ధావంతునకు సంఘసేవలో తృప్తి తీరదు. దాతకు త్యాగములో సంతృప్తి కలుగదు. పండితునకు ధర్మశ్రవణమునందు తనివి తీరదు. చతుర్విధపరిషత్తునకు తథాగతదర్శనము వలన తృప్తి తీరదు.

ఆబ్రాహ్మణికి భోగములో తృప్తి తీరలేదు. భర్త పయనమైపోయినంతనే నిశ్చింతముగా ఆమె పాపకర్మ మాచరించుటకై ఒకనాడు ఉద్యమించి పండుకొనెను. భర్త "భవతి, ఏమైనది" అనెను.

"నేను మీయింట పనిపాటలు చేయజాలకున్నాను. దాసిని కొనిరమ్ము."

"భవతీ, నాకడ ధనములేదు. ఏ మిచ్చి దాసిని కొనివత్తును?"

"యాచించి ధనము ప్రోగుచేసి దాసిని కొనిరమ్ము."

"అట్లైన ప్రయాణములో పాథేయమునకు ఏమైన చేసిపెట్టుము."

బ్రాహ్మణి పిండిని తోలుసంచిలో పోసి మూతికట్టి యిచ్చెను. బ్రాహ్మణుడు పల్లెలు పట్టణములు రాజధాని తిరిగి తిరిగి ఏడువందల కార్షాపణములు సంపాదించెను. దాసీదాసమును కొనివచ్చుటకై ఈధనము చాలు నని ఆతడు భావించి నిజగ్రామమువైపు మరలెను. త్రోవలో మంచినీరు దొరకుచోట అతడు సంచి విప్పి, పిండితిని, మూతి కట్టకుండగనే నీరు త్రాగుటకై దిగుడుబావిలో దిగెను.

ప్రక్కనే చెట్టుతొర్రలో నివసించుచున్న కాలసర్పము పిండివాసన తగులుటచే సంచిలోనికి చేరి పిండి తినుచుండెను. బ్రాహ్మణుడు మరలి

వచ్చి లోపల నేమున్నదో చూడక సంచిమూతి కట్టి దానిని భుజముపై పెట్టికొని ప్రయాణముచేయుచుండెను. త్రోవలో ఒకచెట్టుతొర్రలో నిలిచి వృక్షదేవత "బ్రాహ్మణుడా! నీవు మార్గమున ఆలసించితివేని మరణింతువు; నేడు ఇలుచేరితివా నీభార్య మరణించును" అని పలికి అంతర్ధానమయ్యెను.

బ్రాహ్మణు డిటునటు చూచినను ఎవరును కనబడకుండుటచే భయము చెంది ఏడ్చి మొత్తుకొనుచు ఎట్లో వారాణసీనగరద్వారము చేరెను. ఆనాడు పూర్ణిమ. అలంకృతధర్మాసనముపై బోధిసత్త్వుడు కూర్చుండి ధర్మోపదేశము చేయుచుండెను. జనులు చేతులలో సుగంధ ద్రవ్యములు పట్టుకొని పుష్పములు తాల్చి గుంపులుగా చేరి ధర్మోప దేశము వినుటకై పోవుచుండిరి. వారిని చూచి బ్రాహ్మణుడు "ఎక్కడికి పోవుచున్నారు" అనెను.

"బ్రాహ్మణోత్తమా, నేడు సేనకపండితుడు మధురస్వనముతో బుద్ధునిరీతిని ధర్మోపదేశము చేయును. నీకు తెలియదా?"

బ్రాహ్మణుడు తనలో ఈయన ధర్మముబోధించుపండితుడు. అఖండ దుఃఖమునుకూడతొలగింపగలవాడు. నామృత్యుభయమును తొలగింప గలడు. నేను అచ్చటికి పోయి ధర్మోపదేశము విందును" అని యోచించి వారివెంట చని బోధిసత్త్వునిచుట్టును కూర్చున్నపంక్తి మొగదల ధర్మాసనమునకు సమీపములో నిలిచి మృత్యుభయముచే రోదింపజొచ్చెను. ఆకాశగంగ దిగినదా, అమృతము వర్షించుచున్నదా అనునట్లు బోధిసత్త్వుడు ధర్మము నుపదేశించుచుండెను. జనసమూహము ప్రసన్నచిత్తముతో సాధువాదము చేయుచు నుపదేశము వినుచుండెను. సేనకపండితునిదృష్టి నలువంకల వాలుచుండెను. ఆసమయమున బోధిసత్త్వుడు పంచప్రసాదములతో గూడిన ప్రసన్నవదననేత్రములను నలువంకల పరిమత్తుపై ప్రసారించి ఆబ్రాహ్మణుని చూచి "ఇందరు జనులు ప్రసన్నచిత్తులై సాధువాదములు చేయుచుండగా ఈబ్రాహ్మణుడు శోకముతో నున్నాడు. ఈతనిమనస్సున శోక మెక్కువగా నుండవలయును. చింతపండు తగులుటచే రాగిమైల తొలగిపోయినట్లును తామరాకులనుండి జలబిందువులు జారినట్లును ఇతని మనస్సునుండి శోకము జారి చిత్తము ప్రసన్నమగుటకు ధర్మోపదేశము విని

పింతును" అనుకొని ఆయన "బ్రాహ్మణోత్తమా, నన్ను సేనకపండితు డందురు. నీశోకము నిపుడే తొలగింతును. విశ్వాసముంచి పలుకుము" అని ఈ గాథ పలికెను:

బ్రాహ్మణోత్తమ, నీవు భ్రాంతుడ వైతి,
వరుణాంబకంబుల నశ్రువుల్ రాలు;
కలిగెనా నష్టంబు? రానున్న నేమి
వాంఛింతు? చేటికి వచ్చినా విటకు?

తనశోకమునకు కారణము చెప్పువాడై బ్రాహ్మణు డీ గాథ పలికెను:

ఇంటి కేగుడు నేని ఇల్లాలు చచ్చు,
చనకయున్నను నీవె వచ్చిపోవుదువు,
పలుక యత్నుం డిట్లు భయ ముదయించె,
తెలుపుము సేనకా, దీని హేతువును.

బోధిసత్త్వుడు బ్రాహ్మణునివాక్కులు విని సముద్రముపై వలవేసి నట్లు బుద్ధిరూపమైన జాలమును విసరివేసి చూచెను. 'ప్రాణులు మరణించుటకు అనేక కారణములు తోచెను. సముద్రమున దుమికి కొందరు మరణింతురు. అచట చేపలు పట్టుకొనిపోయినను మరణింతురు. నదిలో దుమికికూడ మరణింతురు. మొసలి మొదలగునవి పట్టుకొనుటచే మరణింతురు. వృక్షముపైనుండి జారిపడి మరణింతురు. ముల్లు గుచ్చుకొనుటచేకూడ మరణింతురు. వివిధశస్త్రములప్రహారములవలనగూడ మరణింతురు. విషముతినిగూడ చనిపోవుదురు. ఉరికంబముపై వ్రేలాడి మరణింతురు. పరాక్రమముచే పతనమొంది గూడ మరణింతురు. అతిశీతమువలన గాని, వివిధరోగములవలనగాని మరణింతురు. వీనిలో ఏదో ఒక దానివలన నే డీబ్రాహ్మణుడు మార్గమున నిలచుటచే మరణింతు ననియు ఇంటికి చేరినచో భార్య మరణించుననియు తలచి యున్నాడు' అని భావించి బోధిసత్త్వుడు బ్రాహ్మణుని భుజముమీద సంచి చూచి ఉపాయకుశలజ్ఞానముచే సంచిలో సర్పమున్నదని గ్రహించెను. బ్రాహ్మణుడు ప్రాతఃకాలమున పిండి తిని సంచి మూతకట్టకుండ నీరు త్రాగుటకు పోయి యుండును; 'అపుడు ఈ

సర్పము పిండివాసనకు సంచిలో ప్రవేశించియుండును. బ్రాహ్మణుడు సంచి మూతికట్టి తెచ్చియుండును. ఇతడు సాయంసమయమునకు మార్గములోనే యున్నయెడల అహారార్థము పిండితినుటకై సంచి తెరచి చేయిపెట్టును. అపుడు సర్పము చేయిమీద కాటువేసి ఇతని ప్రాణములను హరించును. ఆతడు త్రోవలో నున్నచో మృత్యువు సంభవించును. ఇలు చేరునేని సంచి భార్యచేతి కిచ్చును. ఆమె చూడక లోపలిసామాను తీయుటకై సంచిలో చేయిపెట్టును. అపుడు సర్పమామెను కరచి చంపును. ఇత డిల్లు చేరినచో భార్యకు మృత్యువు సంభవించును. ఈ విషయము లన్నియు నూహించి బోధిసత్త్వుడు పాము నల్లగా, తేజస్సుతో నిర్భయముగా నుండును. బ్రాహ్మణుని శరీరసంపర్కమున్నను ఇరుకున కోర్చి సంచిలో కదలక మెదలకున్నది. ఇంత జనసమ్మర్దములోగూడ కదలకున్నది. ఇది కాలసర్పము. ఇది శూరము, భయరహితము, క్రూరము కానోపును అని దివ్యచక్షువుతో చూచినాడు. ఈప్రకారముగా పంక్తిబద్ధమైన పరిషత్తునడుమ నిలిచి యున్న బ్రాహ్మణునకు నిశ్చయముగా విషయము ప్రకటించుటకై సమాధానముగా ఈ గాథ పలికినాడు:

ఎన్నిసంగతులూ యోచించి నే నసెడి
పలుకులు సత్యముల్, బ్రాహ్మణప్రవర !
నీ పిండిసంచిలోనికి రహస్యముగ
అహి ప్రవేశించిన దని నాతలంపు.

"ఇట్లు పలికి" బ్రాహ్మణోత్తమా, ఈ సంచిలో పిండికలదా?" అన్నాడు. "పండితోత్తమా, ఉన్నది." "నేడు ఉదయము పిండి తింటివా?" "చిత్తము." "ఎక్కడ కూర్చుండి?" "అడవిలో ఒకానొక వృక్షముక్రింద." "పిండి తిని నీరుత్రాగుటకు నీవు పోవునపుడు సంచి మూతి కట్టిపోయితివా?" "పండితోత్తమా, కట్టిపోవలేదు." "నీరు త్రాగి వచ్చి సంచిలోనికి చూచి కట్టితివా?" "పండితోత్తమా, చూడకుండనే కట్టితిని." "బ్రాహ్మణోత్తమా, నీవు నీరుత్రాగబోయినపుడు నీకు తెలియకుండనే పిండివాసనకు సర్పము వచ్చి సంచిలో ప్రవేశించిన దని నాయూహ. నీ విట్లే వచ్చితివి. కావున సంచి దింపి జనులయెదుట నుంచి కట్టువిప్పుము. ఆవలిప్రక్క నిలిచి కర్రతో సంచిమీద

కొట్టుము. అందుండి ఫణమువిప్పి ఫూత్కారము చేయుచు కాల సర్పము ఈవలకు వచ్చినపుడు నీవు దానిని చూచి సందేహము విడు తువు” అని బోధిసత్త్వుడు ఈ గాథ పలికెను :

కొనివచ్చి దండంబు కొట్టుము సంచి
పైన, ద్విజిహ్వంబు బయటికి వచ్చు,
సందేహములు వీడి, సంచిని విప్పు
కానంబడును నీకు కాకోదరంబు.

బ్రాహ్మణుడు ఆయనవాక్కులు విన్నంతనే ఒడలు గరిపొడవగా భయభ్రాంతుడై ఆయన చెప్పినట్లు చేసెను. పడగపై కఱ్ఱపడినపుడు పాము వెలుపలికి వచ్చి జనసమూహము నెదుట నిలిచెను. ఈ విషయ మును ప్రకాశముచేయుటకై శాస్త ఈ గాథ పలికెను :

త్రాసముతో సంచి విప్పె
భూసురుండు సభ నడుమను,
భీషణాహి ఫణము విప్పి
వెలువడె నందుండి యపుడు.

సర్పము పడగ విప్పి ఈవలకు వచ్చినంతనే బోధిసత్త్వుని సర్వాధర్మక బుద్ధి భవిష్యద్వాణివలె ప్రతీతమయ్యెను. జనులు వేలకొలది వస్త్ర ముల నెగురవేసి చప్పటలు చరచిరి. ముసలధారలు వర్షించినట్లు రత్న ములు వర్షించిరి. లక్షలకొలది సాధువాదములు చేసిరి. మహీతలము బ్రద్దలగునట్లు దడదడధ్వనులు చేసిరి. బుద్ధునివలె ఈప్రకారముగా ప్రశ్నమునకు సమాధానము జాతిబలముచే గాని గోత్రబలముచే గాని, కులబలముచే గాని, ప్రదేశబలముచే గాని, యశోబలముచే గాని, ధన బలచే గాని రానేరదు. ఇది దేని బలము ? ప్రజ్ఞాబలము, ప్రజ్ఞావం తుడు విపశ్యనాభావనను వృద్ధిచేసికొని, ఆర్యమార్గద్వారమును తెరచి అమృతమహానిర్వాణమున ప్రవేశము నొందును. అతడు శ్రావకపార మితను, ప్రత్యేకబుద్ధపారమితను, సమ్యక్ సంబోధి పారమితను కూడ పొందగలడు. అమృత మహానిర్వాణము వరకును కొనిపోవు ధర్మ ప్రజ్ఞయే ప్రధానము. మిగిలినధర్మము లన్నియు గౌణములు. కావు ననే యిట్లు చెప్పినారు :

ఉత్తమ మని జనులు ప్రజ్ఞ
నుగ్గడింత్రు చుక్కలందు
చంద్రుబోలె; శీలశ్రీ
సజ్జనధర్మములం గూడ
జనుచుండును దాని వెంట.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు సమాధానము చెప్పగానే, పాములవా డొకడు సర్పమును పట్టుకొని మూతి కట్టి, దానిని అడవిలో విడిచిపెట్టెను.

బ్రాహ్మణుడు రాజుకడకు జని, జయశబ్దము పలికి, చేతులు జోడించి, రాజును స్తుతిచేయువా డై యీ గాథ పలికెను :

ప్రజ్ఞావంతుండు సేనక
పండితు సందర్శనమున
జనకమహారాజా కొదవె
సౌభాగ్యము సులభముగా.

రాజును స్తుతించి సంచిలోనుండి యేడువందల కార్షాపణములను తీసికొని, బోధిసత్త్వుని ప్రశంసించి, ఆయనను కలిసికొనదలచి యీ గాథలు పలికెను :

ఉన్మత్తకవాటం బై
యుండునె సతతము బ్రాహ్మణ,
భయంకరము సర్వదర్శి
భవదీయంబైన ప్రజ్ఞ.

కార్షాపణములు నాకడ
కలవు సప్తశతములం, నీ
కిచ్చెద వీనిని గొనుమా!
ఇపుడు దక్కె నీవలననె
ప్రాణంబులు, నాభార్యకు
ప్రాప్తించెను కళ్యాణము.

'నాకడ లక్ష యున్నచో ఇచ్చివేయుదును, నావద్ద ఇంతే యున్నది. ఈ యేడువేలు తీసికొనుడు" అని మాటిమాటికిని బ్రాహ్మణుడు పట్టుపట్టెను. విని బోధిసత్త్వుడు ఈ గాథ పలికెను :

వేతనంబు విబుధజనులు
స్వీకరింప, రందమైన
మధురగాథలకును బదులు;
మహీసురా, లభియించెను
ధనమ్ము నీకు నాకడను;
కాని చనుమా నీఇంటికి.

ఇట్లు పలికి బోధిసత్త్వుడు వేయికార్షాపణములు పూర్తిచేసి బ్రాహ్మణున కిచ్చి, "బ్రాహ్మణోత్తమా, ధనము సంపాదింపు మని నిన్ను పంపిన దెవరు?" అని యడిగెను.

"పండితోత్తమా, నా భార్య." "నీ భార్య వృద్ధురాలా, తరుణియా?" "తరుణి." అట్లయినచో ఆమె వేరొకనితో అధర్మముగా ప్రవర్తించుచున్నది. నిర్భయముగా తనపని సాగించుటకు నిన్ను గ్రామాంతరములకు పంపినది. ఈకార్షాపణములతో— ఇంత కష్టపడి సంపాదించినవానితో— నీవు గృహము చేరినచో వీని నామె జారున కిచ్చును. కావున నీవు సూటిగా ఇంటికి బోవక, గ్రామమువెలుపల నొక చెట్టుక్రింద వాని పాతిపెట్టి, గ్రామములో ప్రవేశింపుము."

బ్రాహ్మణుడు గ్రామమును సమీపించి ఒకానొక చెట్టుక్రింద ధనము పాతిపెట్టి, సాయంసమయమున కింటికి చేరెను. ఆసమయమున ఆయన భార్య జారునితో శయనించియుండెను. బ్రాహ్మణుడు గుమ్మము చేరి "భవతీ" అని పిలిచెను. ఆమె కంఠధ్వని గురుతించి, దీప మార్పి, భర్త యింటిలో ప్రవేశించువేళ జారుని ద్వారములో నిలిపి, యింటిలో ప్రవేశించి సంచి తెరచి చూచి ఏమియు లేకుండుట గమనించి "మీకు యాచనతో ఏమాత్రము ధనము దొరికినది?" అని యడిగెను.

"వేయి కార్షాపణములు."

"అవి యెచ్చట నున్నవి?"

"విచారింపకుము. ఫలానిప్రదేశములో నున్నవి. ఉదయము పట్టుకొని వత్తును."

ఆమె పోయి జారునితో చెప్పెను ఆతడు పోయి వెంటనే దానిని తీసికొనెను.

ప్రాతఃకాలమున బ్రాహ్మణుడు పోయి చూడగా కార్షాపణములు

కనబడలేదు. తోడనే బోధిసత్త్వుని సన్నిధి కరిగెను. ఆయన "బ్రాహ్మణోత్తమా, విశేష మేమి?" అని యడిగెను.

"పండితోత్తమా, కార్షాపణములు కానరాలేదు."

"ఆవిషయము భార్యతో చెప్పితివా?"

"చిత్తము."

బోధిసత్త్వుడు యోచించి, జారుడే ధనమును తీసియుండు నని యూహించి "నీ భార్యకు బాగుగా పరిచితులయిన బ్రాహ్మణు లున్నారా?" అనెను.

"చిత్తము."

"నీకుకూడ పరిచితు లున్నారా?"

"చిత్తము."

ఏడుదినములకు సరిపడు ధన మిచ్చి, బోధిసత్త్వుడు "హోయి, మొదటినాడు నీకు తెలిసిన బ్రాహ్మణుల నేడుగురను, నీ భార్యకు తెలిసినవారల నేడుగురను, మొత్తము పదునలుగురను ఆహ్వానించి, భోజనము పెట్టుము, క్రమముగా దినమున కిరువురను తగ్గించి, భోజనము పెట్టుము. నీభార్యపక్షమున ఏడురోజులు విడువకుండ భోజనమునకు వచ్చుచున్నబ్రాహ్మణుని గమనించి నాకు తెలుపుము" అని చెప్పెను.

బ్రాహ్మణు డాప్రకారముగా చేసి, వెళ్ళి, బోధిసత్త్వునితో "పండితోత్తమా, వారముదినములు విడువక భోజనము చేయు బ్రాహ్మణుని బాగుగా గమనించినాను" అని చెప్పెను.

భోధిసత్త్వు డాతనికడకు పరిజనుని పంపి, పిలిపించి "ఫలాని వృక్షము క్రిందినుండి నీవు వేయికార్షాపణములను తీసితివా ?" అనెను.

"పండితోత్తమా, తీయలేదు."

"నేను సేనకపండితుడ నని నీకు తెలియదా ? ఆ కార్షాపణములు తెమ్ము."

అతడు భయభ్రాంతు డై "తీసికొన్నాను" అనెను.

"ఎక్కడ నున్నవి ?"

"అక్కడనే ఉన్నవి."

బోధిసత్త్వుడు బ్రాహ్మణుని పిలిచి "నీకు ఆ భార్యయేకావలెనా ?

వేరొక భార్య కావలెనా ?" అనెను.

"ఆమెయే."

బోధిసత్త్వుడు పరిజనులకు పంపి, బ్రాహ్మణుని బ్రాహ్మణిని, కార్షాపణములను తెప్పించెను. చోరబ్రాహ్మణునిచేత బ్రాహ్మణునికి కార్షాపణము లిప్పించెను. అతనికి రాజదండనము విధించి, నగరమునుండి వెడలగొట్టించెను. బ్రాహ్మణికికూడ రాజదండనము విధించి, బ్రాహ్మణునకు సంపద యిచ్చి, తనకడ నుంచికొనెను.

శాస్త్ర ఈ ధర్మోపదేశము చేసి, సత్యప్రకాశము కావించి జాతకములు సరిపోల్చెను. అనేకులు శ్రోతాపత్తి మొదలగు ఫలములు పొందిరి. ఆకాలమున బ్రాహ్మణుడు ఆనందుడు; దేవత సారిపుత్రుడు; పరిషత్తు బుద్ధపరిషత్తు; సేనకపండితుడు నేనే.

## 403 అట్ఠిసేన జాతకము

శాస్త్ర ఆలవి లోని అగ్గాలవ చైత్యమున విహారము చేయునపుడు కుటీరనిర్మాణశిక్షణను గూర్చి చెప్పినది. వర్తమానకథ మణికంఠజాతకమున (253) వచ్చినది. శాస్త్ర ఆ భిక్షువులను పిలిచి, "భిక్షువులారా, పూర్వకాలమున బుద్ధుడు ఉత్పన్నము కానప్పుడు అన్యవిధమున ప్రవ్రజించిన వారు రాజులు చెప్పిన మీదట యాచన ఇతరులకు అప్రియ మనియు, బాగుండ దనియు, యాచన చేయకూడ దని గ్రహించిరి" అని చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా బోధిసత్త్వుడొకానొకపల్లెలో బ్రాహ్మణకులమున బుట్టెను. ఆయనకు అట్ఠిసేను డని పేరుపెట్టిరి. పెరిగి పెద్దవా డయి అట్ఠిసేనకుమారుడు తక్షశిలకు బోయి, సమస్త విద్యలు నేర్చి భోగములలోని దోషము గ్రహించి, ప్రవ్రజించి అభిజ్ఞలను సమాపత్తులను పొంది, చిరకాలము హిమవత్ప్రదేశమున నివసించి, ఉప్పు పులుసు కొరకు గ్రామమునకు

వచ్చి, క్రమముగా వారాణసి చేరెను. ఆయన విధానము చూచి రాజు ప్రసన్నచిత్తుడై ఆయనను పిలువనంపి, మేడమీద పీఠముపై గూరుచుండబెట్టి భోజనానంతరము అనుమోదనము విని ప్రసన్నుడయి, బోధిసత్త్వుడు రాజోద్యానమున నుండునట్లు మాటపుచ్చుకొనెను. దినమునకు రా జాయనదర్శనమునకు రెండుమూడుసారులు పోవుచు, ఒకనాడు ధర్మోపదేశము విని సంతుష్టచిత్తుడై "రాజ్యముతో సహా మీ కేమి వస్తువు కావలెనో చెప్పుడు" అని యడిగెను.

'నా కిది కావలె' నని బోధిసత్త్వుడు చెప్పలేదు. ఇతర యాచకు లేమి కావలె నన్నను రాజు వాని నెల్ల నిస్సంకోచముగా నిచ్చెడివాడు.

ఒకనాడు రాజు తనలో "అన్యయాచకులు మా కిది కావలెను. అని వేడుచుందురు. మీ కేమి కావలె నని యడిగినను ఆర్య అట్ఠిసేనుడు ఏమియు కోరలేదు. ఇతడు ప్రజ్ఞావంతుడు, ఉపాయశాలి. ఈయనను ప్రశ్నించి చూచెదను" అనుకొని ప్రాతర్భోజనానంతరము పోయి ప్రణామము చేసి ఒకప్రక్కన కూరుచుండి ఇతరులు యాచించుటకును, బోధిసత్త్వుడు యాచింపకుండుటకును కారణ మడుగువాడై ఈ తొలిగాథ పలికెను :

> నాకడ కరుదెంచి నన్ను యాచింత్రు
> నే నెరుంగనివారు; నీ వెందుచేత
> అట్ఠిసేనా, నన్ను అర్థింపరావు?

ఇది విని బోధిసత్త్వుడు రెండవ గాథ పలికెను :

> అప్రియంబుగ దోచు యాచకు డెపుడు;
> అడిగిన పిమ్మట నిడడేని దాత
> అప్రియంబుగ దోచు; అంతరంగమున
> నయినను నాలోడ నైనను ద్వేష
> ముదయింపగా వచ్చు నొక్కొక్క యెడల
> నను కారణంబుచే నర్థింపనైతి.

ఆయనవాక్కులు విని రా జీ గాథలు పలికెను :

> జీవించునెవడు భిక్షావృత్తి బూని
> ఆతడు తరుణమం దర్థింప డేని

పరుని పుణ్యంబును భగ్నముచేయు
క్షేమముగా తాను జీవింపలేడు.

జీవించు నెవడు భిక్షావృత్తి బూని
ఆతడు తరుణమం దర్థించు నేని
పరునకు పుణ్యలాభంబు చేకూర్చు
క్షేమముగా తాను జీవింపగలుగు.

అరుదేర వీక్షించి యాచకజనులు
ప్రాజ్ఞులు ద్వేషభావము పూన రెపుడు.
ఇష్టుడవే నాకు! ఏమి కోరుదువో
కోరవచ్చును బ్రహ్మచారి, నా ఎదుట.

ఈ ప్రకారముగా రాజ్య మిత్తు నని చెప్పినను బోధిసత్త్వు డేమియు యాచింపలేదు. రాజు తనవిచారమును ప్రకటించినప్పుడు బోధిసత్త్వుడు ప్రవ్రజితులచర్యను స్పష్టముచేయుటకై "మహారాజా, గృహస్థుల కును విషయోపభోగులకును యాచన చెల్లును, పరివ్రాజకులకు చెల్లదు. ప్రవ్రజించినపుడు మేము గృహస్థులకన్న భిన్నమైన జీవనము గడప వలెను" అని ఆరవ గాథ పలికెను :

ప్రాజ్ఞు లర్థింపరు; పండితజనులు
దీని గ్రహింతురు; మౌనమ్ముతోడ
ఆర్యజనంబు భిక్షార్థంబు నిలుచు;
యాచనాచార మియ్యదియె ఆర్యులకు.

బోధిసత్త్వునివాక్కులు విని రాజు "భన్తే, బుద్ధిమంతు డగు సేవ కుడు బుద్ధిబలముచే ఈయదగిన దానిని తనమిత్రున కిచ్చును; నేను కూడ మీ కిది యిత్తును" అని యేడవ గాథ పలికెను :

ఇత్తును నే బ్రాహ్మణోత్తమ, వేయి
కపిలగోవులను పుంగవముతో నీకు.
ధర్మసంయుక్తగాథలు నీవు పలుక
ఆలకించిన ఆర్యు డన్యార్యజనున
కొసగకుండగ నెట్టులుండును విప్ర!

రా జిట్లు పలుకగా బోధిసత్త్వుడు "మహారాజా, నేను అకించను డను, ప్రవ్రజితుడను, నాకు గోవులతో పనిలేదు" అని నిరాకరించెను.

ఆయన యుపదేశానుసారముగా రాజు దానాదిపుణ్యకార్యములు చేయుచు స్వర్గలోకగామి యయ్యెను. బోధిసత్త్వుడును అపరిహీన ధ్యానముతో బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము సత్యప్రకాశము కావించి జాతకములం సరిపోల్చెను. అప్పు డనేకులు స్రోతాపత్తిఫలము నందిరి. ఆ కాలమున రాజు ఆనందుడు; అగ్నిసేనుడు నేనే.

## 404 కపి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు దేవదత్తుడు భూగర్భమున మునిగిపోవుట గూర్చి చెప్పినది. అతడు భూమిలో దిగబడిపోయిన పిదప ధర్మసభలో సంభావణ జరుగుచుండగా శాస్త చని విషయము గ్రహించి "భిక్షువులారా, అతడు అనుయాయు లతో ఇప్పుడే కాదు, పూర్వముకూడ వినాశమందెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కోతికడుపున పుట్టి అయిదువందల యనుచరులతో రాజో ద్యానమున నివసించుచుండెను. దేవదత్తుడుకూడ కోతికడుపున పుట్టి అయిదువందల యనుచరులతో గూడి, ఆతోటలోనే నివసించుచుండెను. ఒకనాడు పురోహితు డుద్యానమునకు బోయి యచటి సరస్సులో స్నానము చేసి, అలంకరించుకొని తోటనుండి బయలుదేరి వెలుప లకు బోవునపుడు ఒకానొక దుష్టకపి ఆయనకు ముందుగా బోయి తోరణముపై కెక్కి పురోహితునిపై మలము విడిచెను. ఆయన పైకి చూచునప్పటికి కోతి మరల మలము ముఖముపై విడిచెను. ఆయన ఆగి "మీపని చూచెదను" అని కోతులను బెదరించి మరల స్నానము చేసి వెడలిపోయెను, బోధిసత్త్వున కీసంగతి తెలిసెను. ఆయన వేయి కోతులను పిలువనంపి "శత్రువున్నచోట మన ముండుట యుక్తము

కాదు. అందర మిచటినుండి వెడలిపోవుదము" అని యుపదేశించెను. ఆయనమాట విననివాడు తనయనుయాయులతో నాలోచింతునని చెప్పి అచటనే యుండెను. బోధిసత్త్వుడు మాత్రము తన పరివారమును వెంటగొని యరణ్యమునకు బోయెను.

ఒకనాడు ధాన్యము దంపుదాసి ఎండలో నారబోసిన వడ్లు తినుచున్న మేకను కొరవితో కొట్టెను. అగ్ని దానిరోమముల కంటుకొనెను. అది పరుగెత్తి హస్తిశాలలో కుటీరముగోడకు ఒడలు రాచుకొనెను. గడ్డికి నిప్పంటుకొనెను. కుటీరమునుండి హస్తిశాలకు నిప్పు ప్రాకెను. అందలి యేనుగుల వీపులు కాలెను. హస్తివైద్యులు వానికి చికిత్స చేయజొచ్చిరి.

కోతులను పట్టింపవలె నన్న పురోహితుడు తన సన్నిధికి వచ్చినప్పుడు రాజాయనతో "ఆచార్యా, ఏనుగులకు గాయము లయినవి. హస్తివైద్యులకు చికిత్స బాగుగా తెలియదు. మీ కౌషధ మేమయిన తెలియునా ?" అని యడిగెను. "మహారాజా, తెలియును." "ఏమది ?" "మహారాజా, మర్కటవస" "అది యెచట దొరకును ?" "ఉద్యానమున కోతు లనేక మున్నవి."

"ఉద్యానములోని కోతులను సంహరించి వానివస కొనిరండు" అని రాజాజ్ఞ కాగానే ధనుర్ధరులు పోయి, బాణములతో అన్నికోతులను కొట్టిరి. ముసలికోతి యొకటి బాణము తగిలినను అచ్చటనే పడిపోవక బోధిసత్త్వ డున్నయెడకు బోయి పడిపోయెను. కోతు లాయన కావిషయము తెలిపిరి. ఆయన వచ్చి వానరముల నడుమ గూరుచుండి "బుద్ధిమంతులమాట వినక, శత్రుమధ్యమున నుండువా రిట్లే నశింతురు" అను విషయము నుపదేశించువాడై యీ గాథలు పలికెను :

పగవానితావున ప్రాజ్ఞుండు నిలువ
రా, దొక్కటో రెండొరాత్రుల కాల
ముండుచో నాపద యొదవును సుమ్మ.

అనుసరించినయెడ నస్థిరచిత్తు,
చంచలచిత్తుండు శాత్రవుం డగును.
ఒక వానరము తెచ్చె యూథనష్టంబు.

అయిన పక్షమున నాయకుడు మూర్ఖుండు
పండితంమన్యుండు ప్రాణముల్ విడుచు
ఇంద్రియవివశుడై ఈ కోతిరీతి.

మతిహీనుడౌ శక్తిమంతుండు యూధ
పరిపాలకుండౌట భద్రంబు కాదు.
జ్ఞాతుల కహితుడౌ చాతకం బట్లు.

బలవంతుడును ధీరవర్తనుండైన
యూధమ్మునకు నేత యొనరించు మేలు
త్రిదివౌకసులకును దేవేంద్రునట్లు.

వీక్షించు విద్యావివేకశీలముల
అన్యులలో నెవ్వడాత డౌనర్చు
తనకు నన్యులకును తగినహితంబు.

అందుచేతను ధీరు డాత్మపరీక్ష
చేసి వివేకంబు శీలంబు విద్య
కలవేని కాదగు గణనాయకుండు
ఒండె ఏకాకిగా నొప్పు చరింప.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి సత్యప్రకాశము కావించి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మాటవినని మర్కటము దేవదత్తుడు; ఆ పరిషత్తు దేవదత్తపరిషత్తు; పండిత కపిరాజు నేనే.

## 405 బకబ్రహ్మ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు బకబ్రహ్మను గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆ బ్రహ్మ మత మిది. ఈ లోకము నిత్యము, ధ్రువము, అచ్యుతము. దీనికంటె వేరొకలోకమునకు ముక్తి కాని, నిర్వాణము కాని లేదు. నిచలలోకమున జన్మించిన బకబ్రహ్మ మొదటిధ్యానములలో ఈ భావన

కలిగెను—ఇందువలన ఆయన ఫలలోకమున జన్మించెను. అచట 64 కల్పములు గడిపి 8 కల్పముల ఆయువు కలవాడై ఆభస్వర లోకమున ఉండెను. అచట ఆయనకు పైజెప్పిన అభిప్రాయములు కలిగెను. బ్రహ్మలోకము కంటె పైన చచ్చుట గాని, పుట్టుట గాని జ్ఞప్తి లేకుండెను. ఆ రెంటిని చూడజాలకపోవుటచేతనే బ్రహ్మకు ఈ అభిప్రాయము కలిగెను.

బ్రహ్మభగవానుడు తనచిత్తమున బ్రహ్మచిత్తములోని వితర్కములను గ్రహించి జేతవనమున అంతర్ధానమై బ్రహ్మలోకమున ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మభగవానుని చూచి "మిత్రమా, రమ్ము. మిత్రమా! స్వాగతము బహుకాలమిత్రము ఇప్పటికి వచ్చినాడు. ఇది నిత్యము, ధృవము, శాశ్వతము, అచ్యుతము, సంపూర్ణము; ఇయ్యది ఉత్పన్నము కాదు, జీర్ణము కాదు, నశించిపోవదు, దీనికి పతనము లేదు. ఇది పుట్టుక లేనిది" అనెను. అప్పుడు భగవానుడు బకబ్రహ్మతో ఇట్లనెను: బకబ్రహ్మా, మీరు అవిద్యాజంజాటములో పడిపోయినారు. ఏది అనిత్యమో దానిని నిత్యమనుచు మీరు...ఇంతకన్న హెచ్చుగా ముక్తియున్నను లేదనుచున్నారు.

ఇది విని బకబ్రహ్మ భగవానునితో "నీవు, ఇట్లనుచున్నావు" అనుకొని భగవానుని నేరారోపణకు జడిసె తన తక్కిన అనుయాయులను పిలుచుచు ఈ గాధ పలికెను:

మనము డెబ్బదిరెండుమంది యున్నాము,
ఆర్యులమున్ పుణ్యకార్యకర్తలము,
జన్మజరాదులు పంతరించితిమి,
వర్తిలు నింద్రియాల్ వశమునం దుండి,
వేదజ్ఞ, గౌతమా, వేలజనంబు
అభినందనము చేతు రస్మదాదులకు,
తుది బ్రహ్మ లాభమా నిది నిశ్చయముగ.

ఈ మాటలు విని శాస్త రెండవ గాధ పలికెను:

హే బకబ్రహ్మ, నీ వెద్దానితలతు
వో, దీర్ఘమైన యాయువు గాగ నద్ది
అల్పమ్ము; శతసహస్రాధికకోటి

హాయనంబుల యమ్మదాయువంతయును
బాగుగా విదితంబు, బకగురు, నాకు.

ఇది విని బకబ్రహ్మ మూడవ గాథ పలికెను :

జన్మజరాదుఃఖ సంతరణంబు
కావించి, అయినచో జ్ఞానిని నేను
పూర్వము నే జేయు పుణ్యకర్మముల
వ్రతసుల స్మృతికి దేవలయును శాస్త!

అప్పుడు భగవానుడు పూర్వజన్మకథలను ఉల్లేఖించుచు నాలుగు గాథలు పలికెను :

ఆతపక్లాంతి దాహము గొన్నవారి
కెందరకో నీర మిచ్చిన నీదు
శీలవ్రతము నాదుస్మృతి కరుదెంచు
స్వప్నవృత్తాంత మాజాగ్రదవస్థ
లోని కేతెంచిన మానిసికట్లు.

ఆయేటియొడ్డున ఆబద్ధు లైన
వారల నెల్లర వదలించు నీదు
శీలవ్రతము నాదు స్మృతి కరుదెంచు,
స్వప్నవృత్తాంతంబు జాగ్రదవస్థ
లోని కేతించిన మానిసికట్లు.

గంగాప్రవాహోదకంబున జిక్కు-
నావలో నున్నట్టి నరుల కెల్లరకు
నాశంబు దలపెట్టునాడు భీకరుని
బారినుండి బలాన వదలించు నీదు
శీలవ్రతము నాదు స్మృతికరుదెంచు
స్వప్నవృత్తాంతంబు జాగ్రదవస్థ
లోని కేతెంచిన మానిసికట్లు.

నేను సంబుద్ధియు నిష్ఠయున్ గలుగు
వనుచు గ్రహించి కప్పాహ్వాయమ్మునను
ఉంటి నీకడను శిష్యుండ నై: నీదు
శీలవ్రతంబు నాస్మృతి కరుదెంచు
స్వప్నవృత్తాంతంబు జాగ్రదవస్థ
లోని కేతెంచిన మానిసికట్లు.

శాస్త ఇట్లు చెప్పగా బకబ్రహ్మ తన పూర్వకృత్యములను తలచుకొని తథాగతుని స్తుతించుచు ఈ తుదిగాథ పలికెను :

ప్రకృతజన్మము పూర్వభవములు నావి
నిస్సంశయమ్ముగా నీ వెరుంగుదువు;
అందుచే బుద్ధుండ వైతివి; నీదు
ప్రభ వెలిగించును బ్రహ్మలోకమును.

ఈ ప్రకారముగా శాస్త తన బ్రహ్మగుణములను స్పష్టీకరించి ధర్మోపదేశము చేసి ఆర్యసత్యములను ప్రకటము చేసెను. అపుడు పదివేలబ్రహ్మల చిత్తము ఆస్రవముక్తమయ్యెను. ఈప్రకారముగా భగవానుడు అనేకబ్రహ్మలకు సహాయకు డై, బ్రహ్మలోకమునుండి జేతవనమునకు వచ్చెను. అచట ఉక్తప్రకారముగా భిక్షువులకు ధర్మకథ చెప్పి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున కేశవతపస్వి బకబ్రహ్మ; కప్ప బ్రహ్మచారి నేనే.

## 406 గంధార జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు భైషజ్యసంగ్రహావిషయ మై శిక్షాపదమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈ సంఘటన రాజగృహమున జరిగినది. "ఆయుష్మాన్ పులింద వచ్ఛుడు విహారముతో మిక్కిలిసంబంధము కలవారిని తోలగించుటకై విహారమునుండి బయలువెడలి బుద్ధిబలముచే రాజప్రాసాదమును స్వర్ణమయము కావించెను. లోకుల కాతనియెడ శ్రద్ధ వృద్ధినందెను. వారు స్థవిరునికడకు అయిదురకముల ఔషధములు పంపిరి. వాని నాయన తన యనుయాయుల కిచ్చెను. బహుసంఖ్యాకు లైనవారు రకరకముల వస్తువులను సమకూర్చి సంగ్రహించియుంచెడివారు. లభించినపదార్థములను గిన్నెలలో, ఘటములలో, పాత్రలలో,సంచులలోనింపి మూసియుం

డెడి వారు. వారినిచూచి లోకులు కపటశ్రమణులని కోపించి వస్తుసంగ్రహము చేయువారనిరి. శాస్త ఈవిషయమువిని భిక్షువులారా! ప్రాచీన కాలమున బుద్ధుని ఆవిర్భావమునకు పూర్వము అన్యవిధానమున ప్రవ్ర జించినవారు పంచశీలమునురక్షించువారుకూడ మరునాటికి ఉండ్రాళ్ళను నిలువయుంచుకొనువారిని నిందించిరి. మీరు శుభప్రదమైన బుద్ధశాసన మున ప్రవ్రజించియు రెండు మూడురోజులకు వస్తువులు నిల్వయుంచుట అనుచితము'' అని శిక్షాపదము ఘోషించి పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము గాంధార రాష్ట్రమున బోధిసత్త్వుడు గాంధారనరేశుని పుత్రుడై తండ్రి తరువాత సింహాసన మెక్కి ధర్మపరిపాలనము చేయు చుండెను. మధ్యప్రదేశమందలి విదేహారాష్ట్రమును విదేహరాజు పాలించుచుండెను. ఆరాజు లొకరి నొక రెరుగరు; కాని పరస్పరమైత్రి విశ్వాసములతో మెలగుచుచుండిరి.

ఒకనాడు గాంధారరాజు పూర్ణిమా ఉపవాసవ్రతమున పంచశీల ములుగ్రహించి ప్రాసాదము మీది యంతస్తున వేసిన సింహాసనముపై గూరుచుండి తెరచియున్న ద్వారమువెంట తూర్పుదిక్కు చూచుచు అమాత్యులతో ధర్మప్రసంగము చేయుచుండెను. అప్పుడు చంద్రుని రాహువు గ్రసించెను. వెన్నెల అంతర్ధాన మయ్యెను. అమాత్యులకు వెన్నెల కనబడలేదు. వారు గ్రహణము సంగతి రాజుతో జెప్పిరి.

రాజు చూచి తనలో ''చంద్రుడు బాహ్యక్లేశమువలన ప్రభాహీను డయినాడు. నాకుగూడ ఈ పరివారము క్లేశకారణ మయినది. రాహు గ్రస్తచంద్రమునివలెనే నేనుగూడ ప్రభాహీనుడ నగుట ఉచితము కాదు. నిర్మలాకాశమున ప్రకాశించు చంద్రునివలె నేను రాజ్యము త్యజించి ప్రవ్రజింతును. ఇతరుల కుపదేశము చేయుటవలన లాభ మేమి? కులమును గుణమును విడిచి ఆత్మోపదేశమున విచరించు చుందును. ఇది నా కనుకూలము'' అనుకొని రాజ్యము నమాత్యుల కప్పగించి మీ యిచ్ఛవచ్చినట్లు చేయుడు అని రాష్ట్రము విడిచి, ప్రవ్ర జించి ధ్యానపరాయణుడై హిమవత్ప్రదేశమున నివసింపజొచ్చెను.

విదేహారాజు తన మిత్రునిక్షేమవార్త వ్యాపారుల నడుగగా

ఆయన ప్రవ్రజించె నని వారు చెప్పిరి. "నా మిత్రుడు ప్రవ్రజించినపుడు నేను రాజ్యము చేయుటవలన ఫల మేమి" అని యోజించి విదేహ రాజు ఏడుయోజనముల మిథిలా నగరమును, మున్నూరు యోజనముల విదేహరాష్ట్రమును పదునారువేల జనపదములను భండారమును పదునారువేల నట్టువకత్తెలను విడిచి, హిమవత్ప్రదేశము చేరి, చెట్ల నుండి రాలినపండ్లు తినుచు సమచర్యాపూర్వకముగా విచరింప జొచ్చెను.

క్రమముగా నిరువురు రాజులును ఒకేప్రదేశమును చేరిరి. కాని ఒకరి నొకరెరుగరు. ప్రసన్నచిత్తములతో నుభయులును ప్రక్కప్రక్కనే నివసింపజొచ్చిరి. విదేహతపస్వి గాంధారతపస్వికి సేవచేయుచుండెను.

పూర్ణిమనా డుభయులును వృక్షముక్రింద జేరి ధార్మికసంభాషణ చేయుచుండిరి. అప్పు డాకసమున ప్రకాశించుచున్న చంద్రుని రాహువు గ్రసించెను. చంద్రుడు ప్రభాహీను డగుటకు కారణ మే మని విదేహ తపస్వి యోచించి, రాహుగ్రస్తు డగుట చూచి "ఆచార్యా, చంద్రుని గ్రసించి ప్రభాహీనుని జేసివేసిన యిది యేమి?" అని అడిగెను. "శిష్యా, ఇది చంద్రునకు ఉపక్లేశము. దీనివలన కాంతి తగ్గిపోవును. నేను రాహుగ్రస్తచంద్రముని జూచి, ఈశుద్ధచంద్రమండలము బాహ్యోపక్లేశమువలన ప్రభాహీన మయినట్లు ఈరాజ్యము నాకు బాహ్యక్లేశమయినది. రాహువు చంద్రుని ప్రభాహీనుని చేసినట్లు నన్నీరాజ్యము ప్రభాహీనుని చేయకపూర్వమే ప్రవ్రజింతు నని గ్రహణవిధానమును జూచి నేను రాజ్యము త్యజించి ప్రవ్రజించితిని." "ఆచార్యా, తాము గాంధారనరేశులా?" "అవును." "ఆచార్యా, నేను మిథిలానగరములోని విదేహనరేశుడను. ఒకరినొకరము పూర్వము చూడకున్నను మనము మిత్రులము కామా?" "నీ కీయభిప్రాయ మెట్లు కలిగెను?" "మీరు ప్రవ్రజించినా రని విన్నప్పుడు అందలిగుణమును గ్రహించి మిమ్ము ధ్యానించి ప్రవ్రజించినాను."

ప్రసన్నచిత్తులై వారు చెట్లనుండి రాలినపండ్లను తినుచు బహుకాల మచట నుండి, ఉప్పు పులుసుకొరకు హిమాలయము దిగి సరిహద్దుగ్రామము చేరిరి. వారిచర్యను జూచి లోకులు ప్రసన్నులై భిక్ష చేయుచు వారిచే ప్రతిజ్ఞ చేయించి, అడవిలో రాత్రివేళ నివసించుటకు

యోగ్యస్థానాదికమును సిద్ధము చేసి వారి నందులో నిలిపిరి. మార్గమున భోజనార్థమై యుదకమునకు వీలగుచోట పర్ణశాల నిర్మించిరి. వారు సరిహద్దుగ్రామములో భిక్షాటనము చేసి, పర్ణశాలలో భోజనము చేసికొని, తమ నివాసమునకు బోవుచుండిరి.

వారికి లోకులు భోజనము పెట్టునపుడు ఒక్కొకప్పుడు ఆకుమీదను మరియొకప్పుడు ఆకుదొన్నెలలోను ఉప్పుపెట్టి యిచ్చుచుండిరి. ఒకప్పుడు ఉప్పు లేకుండనే ఆహార మిచ్చుచుండువారు. ఇను లొకనాడు దొన్నెలో నెక్కువగా ఉప్పుపెట్టియిచ్చిరి. విదేహతపస్వి లవణము తెచ్చి, భోజనసమయమున భోధిసత్త్వునకు ఎక్కువగా నిచ్చి, తాను తక్కువతీసికొని, దొరకనినా డుపయోగించు నని మిగిలినదానిని దొన్నెలో మడిచి గడ్డివెంటిలో దాచిపెట్టెను.

ఒకనాడు వారికి లవణము లభింపలేదు. విదేహతపస్వి గాంధారతపస్వితో తాను దాచియుంచిన లవణము తీసి "ఆచార్యా, లవణము స్వీకరింపుడు" అనెను. "లోకులు నేడు మనకు ఉప్ప ఈయలేదే, నీకిది యెచ్చట లభించినది ?" "ఆచార్యా, ఒకనాడు లోకులు లవణమెక్కువగా నిచ్చినారు. దొరకనినాడు ఇది అక్కరకు వచ్చు నని భద్రపరచితిని."

బోధిసత్త్వుడు గద్దించి "మూర్ఖా, మున్నూరుయోజనముల విస్తీర్ణము కల విదేహరాజ్యమును విసర్జించి, ప్రవ్రజించి అకించనవృత్తి నవలంబించి నేడు ఉప్పురాతిపై ఆశకొంటివా ?" అని ఆతని కుపదేశ మిచ్చువాడై ఈ తొలిగాథ పలికెను :

> విడిచి మున్ పదునారువేల గ్రామములు
> నిండుకోశములతో నీవు, నే డిచట
> ధనసంచయమ్మును దాచుచున్నావు.

గాంధారతపస్వి చేసిన యీ నింద సహింపలేక విదేహతపస్వి విరుద్ధభావము వహించి "ఆచార్యా, మీరు నిజలోపమును గ్రహింపలేకున్నారు. నా లోపమును చూచుచున్నారు. అన్యుల కుపదేశ మిచ్చుటవలన నేమి లాభమో మీరు యోజించినారా ? ఆత్మోపదేశము చేసికొనుటకై ప్రవ్రజింపలేదా ? నేడు మీరు నా కేల ఉపదేశము చేసినారు ?" అని రెండవ గాథ పలికెను :

ధనధాన్య భరిత గాంధార రాష్ట్రంబు
జారవిడిచినావు శాసింపకుండ
ఇప్పుడు నన్ను శాసించుచున్నావు.

విని బోధిసత్త్వుడు మూడవ గాథ పలికెను:

తెలుపుచున్నాను విదేహతపస్వి
ధర్మమధర్మంబు తాకదు నన్ను,
పాప మంటదు నేను పలుకధర్మంబు.

విదేహతపస్వి బోధిసత్త్వునివాక్కులు విని "ఆచార్యా, హితవాక్యములు పలుకునప్పుడు దెబ్బకొట్టి కోపము తెప్పించి అన్యులను నొప్పింపగూడదు. బండమంగలి ముండనము చేసినట్లు మిక్కిలి కర్కశముగా పలికినారు" అని నాలుగవ గాథ పలికెను :

కష్ట మన్యులకును కలిగించు నేని
యెంతయు హితకారి యేని యావాక్కు
ప్రాజ్ఞు డెన్నడు నోట రానీయరాదు.

అప్పుడు బోధిసత్త్వుడు అయిదవ గాథ పలికెను:

కలుగకపోవనీ కలుగనీ బాధ
పెల్లుగా పొల్లును చల్లనీ శ్రోత
పాప మంటదు నేను పలుకధర్మంబు.

ఇట్లు పలికి మరల నుపదేశించువాడై యీ రెండు గాథలు పలికెను :

ఒకనికి బుద్ధిలేకున్నచో, వినయ
యుక్తశిక్షణలు లేకున్నచో నతడు
అంధ మహాకాసర మడవిలో దిరుగు
నట్టులు చరియించు; అందుచే ధీరు
లగువారలు సుశిక్ష నంది వినీత
మార్గాన చరియింత్రు మనుజులు కొంద
రవ్వారి సరణినే యనుసరించెదరు.

విదేహతపస్వి విని "ఆచార్యా, నేటినుండి మీరు నా కుపదేశమిచ్చుచుండుడు. అసహనశీలుడనై నేను మీతో అన్నమాటలు

క్షమింపుడు'' అనెను.

వా రొకచోటనే నివసించుచు మరల హిమాలయమునకు బోయిరి. అచ్చట బోధిసత్త్వుడు విదేహతపస్వికి యోగమున కాధారము చూపెను. అభ్యసించి ఆయన అభిజ్ఞలను సమాపత్తులను పొందెను. వా రిరువురు ధ్యానలబ్ధి కలిగి, క్రమముగా బ్రహ్మలోకపరాయణు లయిరి.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున విదేహతపస్వి ఆనందుడు; గంధారరాజును నేనే.

## 407 మహాకపి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయు సమయమున జాతికి ఉపకారమును గూర్చి చెప్పినది. వర్తమానకథ భద్దసాలజాతకమున వచ్చును. ఆసమయమున ధర్మసభలో సంభాషణ జరుగుచుండగా శాస్త చనుదెంచి సంగతి గ్రహించి, "భిక్షువులారా, తథాగతుడు ఇపుడే కాదు, పూర్వముకూడ జాతికి ఉపకారము చేసినాడు'' అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు మర్కటము కడుపున బుట్టి, మహాశక్తిసంపన్నుడై, అయిదునూర్ల యేనుగులబలము కలిగి, ఎనుబదివేల వానరములతో హిమాలయప్రదేశమున నివసించుచుండెను. గంగాతటమున సన్నని కొమ్మలతో, దట్టమైన పర్ణములతో ఎక్కువనీడతో పర్వతశిఖరము వలె ఉన్నతమైన ఆమ్రవృక్షము కలదు. కొందరు మర్రిచెట్టందురు. దానిమధురఫలములు దివ్యరసమువలె నుండును. ఒకశాఖపండ్లు గంగాజలమున రాలుచుండును; వేరొకశాఖపండ్లు నేలపై రాలుచుండును. రెండుశాఖలనడుమ నున్న పండ్లు వృక్షమూలముల రాలు

చుండును.

వానరసమూహమును వెంటబెట్టుకొని తిరుగుచు, పండ్లు తినుచు బోధిసత్త్వు డొకనాడు నీటిలో పండ్లు రాలుచుండుట చూచి సంకటము సంభవించు నని యోచించి, నాటినుండి నీటిపై వాలినశాఖమీది పండ్లు కాని పుష్పములు కాని తాను ముట్టక పిందెలయినప్పటినుండి వానరములకు వదలుటయో, జంతువులకు పడవేయుటయో చేసెను. కాని యొకపండు నిలువలేక, ఎనుబదివేల వానరముల కగపడకుండ నీటిలో బడి చీమలపుట్ట వెనుక మరుగై నదికెగువను దిగువను వలలు పన్ని, జలక్రీడలాడు వారాణసీనరేశ్వరుని కెగువ నున్న వలలో చిక్కుకొనెను. పవ లంతయు రాజు క్రీడలో గడపి, సాయంకాలము బయలుదేరునపుడు జాలరులు వలపైకి లాగి, పండు చూచి, పేరు తెలియక రాజునకు జూపిరి. "ఈ పండుపేరేమి?" అని రాజు వారి నడిగెను. "దేవా, మాకు తెలియదు." "ఎవరు గుర్తింపగలరు?" "దేవా, అడవిలోని మనుష్యులు."

రా జంతట వనచరులను బిలువనంపి అడుగగా వారు మామిడిపం డని చెప్పిరి. కత్తితో పండు కోసి, తొలుత ఆటవికులను తిను డని చెప్పి, తుదకు రాజు తినెను. పిమ్మట స్త్రీలక, అమాత్యులకు చిన్న ముక్కలు పెట్టించెను. ఆమ్రఫలరసము రాజును మైమరచునట్లు చేసెను.

అతడు రసతృష్ణకు వశుడై ఆమ్రవృక్ష మెచట నున్నదని వనచరుల నడిగెను. హిమాలయప్రదేశమున నదీతీరమున నున్న దని వారు చెప్పిరి. అంతట రాజు నావలు సమకూర్చి, ఆటవికులు చూపు మార్గము వెంట ఏటిదిగువను ప్రయాణము చేసి క్రమముగా వృక్ష మున్న చోటు చేరెను. ఆటవికులు "దేవా, ఇదియే ఆవృక్షము" అని రాజునకు జూపిరి. పడవ లాపి, రాజు పరివారముతో అచ్చోటు చేరెను. వృక్షచ్ఛాయలో రాజుకు శయ్య పరచిరి. పండిన మామిడిపండ్లు తినుచు రసానుభవమున ఆనందించుచు రాజు వృక్షమునకు నలుప్రక్కల రక్షకభటులను నిలిపి, నెగళ్ళు వేయించెను.

జనులు నిద్రించిన పిదప బోధిసత్త్వు డర్ధరాత్రమున నిజానుచరులతో నచ్చటికి వచ్చెను. ఎనుబదివేల వానరములు ఒకశాఖనుండి వేరొక

శాఖపైకి దుముకుచు మామిడిపండ్లు తినజొచ్చెను.

కన్నులు తెరచి రాజు వానరసేనను జూచి అనుచరులను లేపి, ధానుష్కులతో "మీ రీచెట్టుచుట్టును నిలిచి, పండ్లు తినువానరములు పారిపోవకుండునట్లు కొట్టుడు. ఉదయము ఆమ్రఫలములు, వానర మాంసము భుజింతము" అనెను. ధనుర్ధరులు చిత్త మని చెట్టుచుట్టు నిలిచి బాణములు వింటసంధించి నిలిచియుండిరి. పరుగెత్తలేని మర్కటములు వానిని జూచి మరణభయమున బోధిసత్త్వునికడకు బోయి కంపముతో "దేవా, ఏమి చేయుదము? విలుకాండ్రు వృక్షము చుట్టుముట్టి యున్నారు. పరుగెత్తుకోతులను పడగొట్టుదురు" అని విన్నవించెను.

బోధిసత్త్వుడు మర్కటముల నోదార్చి "భయపడవలదు. మిమ్ము రక్షింతును" అని సూటిగా పైకి బోవు కొమ్మమీదికి ప్రాకి, దానిపై నుండి నదివైపు వ్యాపించిన శాఖమీదికి దుమికెను. ధనుర్ధరులు నిండి యున్న స్థానమునకు మీదుగా తీరమున నున్న వేరొక చెట్టుపైకి దుమికెను. మరల మొదటి చెట్టుపైకి దుమికి తా నెంతదూరము లంఘించెనో అంచనా వేసి, పొదనుండి బెత్తము త్రుంచి సాపు చేసి, "ఇంత భాగము వృక్షముచుట్టును కట్టెదను. ఇంతభాగము అంతరాళమున నుండును" అని లెక్క వేసెను. కాని తన నడుముచుట్టును కొట్టుకొను భాగమునుమాత్రము గమనింపలేదు. పిమ్మట బోధిసత్త్వుడు తీగెలు కోసి, గంగయొడ్డున నున్న వృక్షము చుట్టును కట్టి, రెండవకొన తన నడుమునకు కట్టుకొని, విలుకాండ్రు నిండియున్న ప్రదేశముమీదుగా వాతాహతమైన మేఘమువలె దుమికెను. నడుమునకు కట్టుకొన్న లతాభాగముపై దృష్టి లేకపోవుటచే ఆయన వృక్షము చేరలేక, రెండు చేతులుచాపి, ఆమ్రశాఖను గట్టిగా పట్టుకొనెను. త్వరితముగా తనవీపు మీదుగా నడిచిపోయినచో క్షేమముగా నావలకు చేరవచ్చునని మర్కటములకు సంజ్ఞ చేసెను. బోధిసత్త్వునకు నమస్కరించి వానరము లన్నియు ఆయన వీపుమీదుగా నడచిపోయినవి.

దేవదత్తుడుకూడ మర్కటమైయుండి వానరముల వెనుక నడచుచు బోధిసత్త్వునిపై పగతీర్చుకొనదలచి, తరుణ మాసన్న మయ్యెనని యెంచి, పైకొమ్మనుండి బోధిసత్త్వుని వీపుమీదికి దుమికెను. దానితో బోధిసత్త్వునిగుండె బ్రద్దలయ్యెను. పైన గాయ మయ్యెను. బాధ

హెచ్చిపోయెను. వ్యథ కలిగించి దేవదత్తుడు వెడలిపోయెను. బోధిసత్త్వుడొకడే మిగిలియుండెను.

మేల్కాని యున్నరాజు వానరములు బోధిసత్త్వుడును చేసిన దంతయు చూచి "ఈవానరము పశుజాతిలో పుట్టియు తనప్రాణములను లెక్కింపక నిజపరివారమునకు మంగళము చేకూర్చెను" అని తల పోసి, తెల్లవారినపిదప బోధిసత్త్వునియెడ ప్రసన్నుడై, కపిరాజును చావనిచ్చుట ఉచితము కాదని నిశ్చయించి ఉపాయమున క్రిందికి దింపించి, పోషింతు నని భావించి, గంగానదిలో నౌకలను గుమిగూర్చి మెట్లు కట్టించి బోధిసత్త్వుని నెమ్మదిగా క్రిందికి దింపించెను. కపిరాజు వీపుపై కాషాయవస్త్రము కట్టించి, నదీజలమున స్నానము చేయించి, పంచదారపానకము త్రాగించెను. శరీరము నిర్మలమైనపిమ్మట సహస్రపాకతైలముతో మర్దనము చేయించి శయ్యపై గొర్రెతోలు పరిపించి దానిపై బోధిసత్త్వుని పరుండబెట్టించెను. ఆవల రాజు క్రింది భాగమున పీఠముపై గూరుచుండి ఈ తొలిగాథ పలికెను :

మేటిబాధల కోర్చి దాటవేసితి వీవు
ఓ మహాకపి, వీరి క్షేమపూర్వకముగా,
ఏమి సంబంధంబొ ఇవ్వారికిని నీకు ?

విని బోధిసత్త్వుడు రాజున కుపదేశ మిచ్చువాడై శేషించిన గాథలు పలికెను :

ఓ యరిందమ, నేను యూథమ్ము రక్షింతు,
నిన్ను కన్గొని రాజ, నిఖిలవానరగణము
భయముచెందెను; వారిప్రభుడ, నేతను నేను
శతదీర్ఘకోదండమిత మైన దూరమున్
లంఘించితిని గట్టి లత యూరుబంధముగ.
జంఝానిలోద్ధూతజలధరంబువిధాన
ఎగసి అన్యతటాన అగము బట్టితి రాజ!
బలము కోల్పోయితిని; బాహుద్వయము చాపి
పట్టుకొంటిని కొమ్మ నెట్టులో గట్టిగా,
ఆవిధమ్ముగ నుండ నావీపు మీదుగా
క్షేమమ్ముగా కపుల్ చేరె నావలియొడ్డు,
నావశంబున నుండి నడచు కపిసంఘంబు

భద్రంబుగా నుండె; బంధనంబున గాని
మరణంబునంగాని దరి ఏమియును లేదు
నీతిబోధనవాక్య నీకు చెప్పెద రాజ!
సత్యంబు గ్రహియించి శాసించుపక్షాన
రాష్ట్రమ్ము పై ప్రీతి రథతురంగమసైన్య
నగరాలపై ప్రీతి మిగుల నుండుట మేలు.

ఈ ప్రకారముగా ఉపదేశించి, అనుశాసనము చేయుచు బోధిసత్త్వుడు ప్రాణములు విడిచెను. అమాత్యులను బిలువనంపి రాజు "ఈ కపిరాజుకు రాజులకువలెనే అగ్నిసంస్కారము చేయవలెను" అని ఆనతిచ్చి స్త్రీలతో "మీరు రక్తవస్త్రములు ధరించి, తలలు విరియబోసికొని, చేతులలో కాగడాలు పట్టుకొని కపిరాజుశవము వెంట శ్మశానభూమివరకు పొండు" అని ఆదేశించెను.

వందబండ్లకట్టెలతో అమాత్యులు చితి పేర్పించి, రాజోచితముగా బోధిసత్త్వున కగ్నిసంస్కారము చేయించి, కపాలము రాజుకడకు గొనిపోయిరి.

బోధిసత్త్వుని దహనము చేసిన ప్రదేశమున రాజు చైత్యము కట్టించి, దీపములు వెలిగించి, గంధమాల్యాదులతో పూజ చేసెను. కపాలమును బంగారమున పొదిగించి, బల్లెమునకు తగిలించి, ముందర నుంచి, గంధమాల్యాదులతో పూజించుచు వారాణసి చేరెను. రాజద్వారముకడ బల్లెమును నిలిపి, నగర మలంకృతము చేయించి సంపూర్ణముగా సప్తాహము, పూజలు చేయించెను.

అనంతరము ధాతువు తీసి దానిపై చైత్యము నిర్మించి యావజ్జీవము గంధమాల్యాదులతో పూజ చేయించుచు, బోధిసత్త్వుడు ఉపదేశించి నట్లు రాజు ప్రవర్తించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు, న్యాయపరిపాలనము నడుపుచు, తుదకు స్వర్గలోకపరాయణు డయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు సరిపోల్చెను. అప్పుడు రాజు ఆనందుడు; దుష్టకపి దేవదత్తుడు; పరిషత్తు బుద్ధ పరిషత్తు; కపిరాజు నేనే.

## 408 కుంభకార జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కాముకత్వనిగ్రహమును గూర్చి చెప్పినది. వర్తమానకథ పాణీయజాతకమున వచ్చును.

### వర్తమాన కథ

ఆసమయమున 500 మంది మిత్రులు ప్రవ్రజించి, కోటీశ్వరుని విశాల గృహమున నివసించు చుండిరి. వారికి అర్ధరాత్రమున కామసంకల్పము కలిగినది. శాస్త రేయింబవలు ఆరుపర్యాయములు శిష్యులసంరక్షణకై దృష్టి నిలిపెడివాడు. వారికి కామప్రవృత్తి కల్గినప్పు డెల్ల శాస్త నిగ్రహించెడివాడు. ఆనాడు అర్ధరాత్రివేళ జేతవనముపై దృష్టి నిలపగా ఆభిక్షువుల సంకల్పవికల్పములసంగతి తెలిసినది. అప్పుడు శాస్త తనలో "ఈభిక్షువుల సంకల్పములు వృద్ధిచెందిన చో అర్హత్వమార్గము భిన్నమగును. కావున యిప్పుడే ఈ సంకల్పములను తొలగించి వీరిని అర్హతులను చేయుదు" నని తలపోసి గంధకుటి వెలువడి ఆనందస్థవిరుని పిలువనంపి ఆనందా! గృహమున నివసించు భిక్షువులను ఒకచో సమావేశపరచుము" అని సిద్ధపఱచిన ఆసనముపై గూరుచుండెను. వారు రాగానే "భిక్షువులారా, మనసులో పుట్టెడి సంకల్పవికల్పములకు వశీభూతులు కాగూడదు. కాముకత్వము శత్రువువలె వినాశము గూర్చును. భిక్షువులు దానిని గమనింపవలెను. పురాణపండితులు కొలది వికారము కలిగినను నిగ్రహించి ప్రత్యేకబుద్ధత్వము పొందిరి" అని పూర్వజన్మ కథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు వారాణసీనగరద్వారగ్రామమున కుంభకారులయింట పుట్టి పెరిగి పెద్దవాడయి కుటుంబి యయ్యెను. ఆయనకు కుమారుడు, కూతురును కలిగిరి. కుంభకారవృత్తిచే ఆయన కుటుంబమునుపోషించు చుండెను.

ఆ సమయమున కాళింగరాష్ట్రములో దంతపురనగరమున కరండుడను రాజు పరిపాలన చేయుచుండెను. ఆయన ఒకనాడు చాలమంది

యనుచరులతో ఉద్యానమునకు బోయి ఫలభారముచే వంగిన ఆమ్ర వృక్షము చూచి, తాను కూరుచున్న యేనుగుమూపు మీదినుండి యే చేతు లెత్తి, పండ్లుకోసి, మంగళశిలాపట్టమున ఉపవేశించి, యోగ్యులగు వారలకు ఫలము లిచ్చి, తాను తినెను. రాజు తిన్నపిదప మిగిలిన వారు అమాత్యులు, బ్రాహ్మణులు, గృహపతిప్రభృతులు పండ్లు రాల్చితిసిరి. వెనుకవచ్చువారు వృక్షము లెక్కి, పండీపండని కాయలను సమ్మెటలతో కొట్టి రాల్చి భుజించిరి.

రాజు రో జంతయు నుద్యానమున క్రీడించుచు సాయంకాలమున సుసజ్జిత మైన హస్తిపై నెక్కి పోవుచు, ఉదయము తాను పండ్లు కోసిన వృక్షముక్రిందుగా జనునప్పుడు ఇట్లు తలపోసెను: "ప్రాతఃకాలమున ఈ వృక్షము ఫలభారముచే వంగి సుందరముగా నుండెను. కాని యిప్పుడు ఫలరహిత మై సౌందర్యవిహీన మై యున్నది". ఇట్లను కొని రెండవచెట్టుక్రిందికి పోయి చూచి, "ఇదియు ఫలరహిత మై ముండ మణిపర్వతమువలె సుందరముగా నున్నది. కాని ఫలవంత మై యుండుటచే దీప కీదశ ప్రాప్తించినది. ఈ గృహస్థుకూడ ఫలరహిత వృక్షమువలె నున్నాడు. ప్రవ్రజ్య ఫలరహితవృక్షముతో సమాన మైనది. ధనవంతులకే భయము. అకించనులకు భయములేదు. నేనుగూడ ఫలవిహీనవృక్షమువలె కావలెను" అని తలపోసి ఫలవృక్షమును ధ్యానించి, చెట్టుక్రింద నిలిచి త్రిలక్షణములను(అనిత్య, దుఃఖ, అనాత్మ) బాగుగా యోజించి విపశ్యనాభావనయందు వృద్ధిగాంచెను. అచ్చట నిలిచి యుండగనే ప్రత్యేకబోధిజ్ఞానము సంప్రాప్తము కాగా నతడు మాటిమాటికి నిట్లు తలపోసెను: "మాతృగర్భరూప మగు కుటీరమును నాశము చేసితిని. త్రిభవనములందలి జన్మసంభావన ఛిన్నాభిన్న మయినది. సంసారరూప మగు కశ్మలస్థానము శుద్ధమయినది. బాష్పసముద్ర మింకిపోయినది. ఎముకల గోడలు నాలుగును విరిగిపోయినవి. నాకు పునర్జన్మ లేకుండుగాక!"

ఇట్లు తలపోయుచు రాజు సమస్తాలంకారభూషితు డై నిలిచి యుండెను.

"మహారాజా, తాము చాలసేపు నిలిచియున్నారు." "నేను మహారాజును కాను, ప్రత్యేకబుద్ధుడను." "దేవా, తమవంటివారు ప్రత్యేక

బుద్ధులు కానేరరు." "ఎట్లగుదురు?" "వారిముఖము మీది వెంట్రుకలు, శిరముమీది కేశములు క్షురతో తీసివేయింతురు. వారు గాలిచే నష్టమగు మేఘమువలెను, రాహువునుండి ముక్తి నొందిన చంద్రునివలెను ఉందురు. హిమాలయమున నందమూలపర్వతముపై ఉందురు. దేవా, ప్రత్యేకబుద్ధులిట్లుందురు."

తక్షణమే రాజు చేతులెత్తి నిజశిరమును స్పృశించెను. తోడనే గృహస్థరూపము పోయి శ్రమణవేషము గోచరించెను.

యుక్తుడౌ భిక్షువు కుండగవలయు
చీవరత్రయము, సూచియు, పాత్రికయును,
క్షురయును, వడపోతను బట్టతునక.

ఈ విధముగా వర్ణితమైన యాకారము ప్రస్ఫుటమయ్యెను. ఆయన ఉప్పరమున కెగసి నిలిచి, జనసందోహమున కుపదేశమిచ్చి ఆకాశమార్గమున ఉత్తరహిమాలయమున నందమూల పర్వతము చేరెను.

గంధారరాష్ట్రమున తక్కశిలానగరమున నగ్గజీనాముడగు రాజుండెను. ఆయన ప్రాసాదముపై సుందరపీఠమున గూరుచుండి ఒకానొక స్త్రీని వీక్షించెను. ఆమె యొక్కొక చేతికి ఒక్కొక కంకణముండెను. ఆమె కొలదిదూరమున గూరుచుండి మంచిగంధము తీయుచుండెను. ఒకచేతికి ఒకే కంకణ ముండుటచే చిక్కుపడుట గాని, ధ్వనిచేయుట గాని లేదు. కొంతసేపటి కామె కుడిచేతికంకణము తీసి, రెండవ చేతికి తొడిగి, గంధము ప్రోగుచేయుచు, నూరుచుండెను. ఒక చేతికంకణము రెండవచేతి కంకణముతో కలియుటచే చప్పుడు కాజొచ్చెను. ఆ కంకణములు పరస్పర మొరపిడి చేయుట చూచి రాజు తనతో "ఒకేకంకణ మున్నప్పు డొరపిడి లేదు. రెండవదానితో చేరుటచే ఒరపిడి, సవ్వడి కలుగుచున్నవి. ప్రాణి ఒంటిగా నున్నప్పుడు ఒరపిడి గాని ఉలివు గాని యుండదు. ఇరువురు ముగ్గురు కలిసినప్పుడుండును. కశ్మీర గంధారరాజ్యములు రెండిటిలోను నివసించువారికి తీర్పు చెప్పుచున్నాను. నేనిక ఒంటికంకణమువలె నుండి అన్యులకు తీర్పుచెప్పక స్వవిషయమే విచారించుచుందును." ఒరపిడిచేయు కంకణమును ధ్యానించి రాజు కూరుచుండి లక్షణత్రయమును విచారించి, విపశ్యనాభావము వృద్ధిచేసి, ప్రత్యేకబోధిజ్ఞానము పొందెను. తక్కినది

పూర్వోక్త కథవలెనే.

విదేహరాష్ట్రములోని మిథిలానగరమున నిమి యను రాజుండెను. ప్రాతర్భోజనానంతర మాయన మంత్రిగణపరివృతు డై ద్వారమున కెదురుగా నిలిచి ఒక గొందివంక జూచుచుండెను. గ్రద్ద కసాయిదుకాణమునుండి మాంసఖండ మెత్తుకొని ఆకసమున కెగసెను. ఇటు నటు నెగురుగృధ్రాదిపక్షులు దానిని చుట్టుముట్టినవి. అందు కొన్ని దానిని పొడిచినవి కొన్ని రెక్కలతో కొట్టినవి, కొన్ని గోళ్ళతో రక్కినవి. గాయముల కోర్వలేక గ్రద్ద మాంసఖండమును జారవిడిచెను. వేరొక పక్షి దానిని గ్రసించెను. తక్కిన పక్షులు గృధ్రమును విడిచి రెండవ పక్షిని చుట్టుముట్టినవి. అది మాంసఖండము విడువగానే వేరొకపక్షి దానిని గ్రసించెను. తక్కినపిట్టలు దానిని వేధింపజొచ్చినవి. అది చూచి రా జిట్లు చింతించెను: "ఏపక్షికి మాంసఖండము లభించెనో ఆ పక్షి వ్యథ ననుభవించినది; దానిని విడిచినప్పుడు శాంతి సమకూరినది. పంచ కామభోగములను విడిచిపెట్టనివాడు దుఃఖము నొందుచుండును; విడిచి పెట్టినవాడు సుఖించును. అనేకుల కివి కొలదిగా నుండును. నాకు పదు నారువేలస్త్రీ లున్నారు. మాంసఖండమును విడిచిన గ్రద్దలవలెనే నేను కామభోగములను త్యజించి సుఖముగా నుందును." అతడు బాగుగా విచారణ చేసి, నిలిచి యుండియే లక్షణత్రయమును ధ్యానించి, విపశ్యనాభావన వృద్ధిచేసి, ప్రత్యేకబోధిజ్ఞానము పొందెను. మిగిలినకథ పూర్వోక్తకథలవలెనే.

ఉత్తరపాంచాల రాష్ట్రమున కంపిల నగరమున దుర్ముఖనాముడగురా జుండెను. ఆతడు ప్రాతర్భోజనానంతర మమాత్యపరివృతు డై, అలంకారభూషితు డై గవాక్షమునెదుట నిలిచి, అంగణమువైపు చూచుచుండెను. ఆ సమయమున గొల్లలు పశువులశాల తలుపులు తెరచిరి. వృషభములు కొట్టమునుండి వెలువడి కామవశమున ఆవు వెంట బడినవి. మొనలు తేలిన కొమ్ము లున్న మహావృషభము వేరొకటి వచ్చుచుండుటచూచి మాత్సర్యముతో రెండవదిదానితొడలో పొడిచెను. పోటు ప్రబలమగుటచే కొమ్ము లావలకు దూసుకొనిపోయినవి. ఆవృషభము తోడనే ప్రాణములు విడిచెను. రా జది చూచి "పశువులు మొదలు సమస్తప్రాణులు కామవశమున కష్టములపా

లగుచున్నారు. ఈ వృషభము కామముచేతనే ప్రాణములు కోల్పోయినది. ఇతరప్రాణులు కాముకత్వమువలననే కంపించుచున్నారు. ప్రాణులను కల్లోలపరచుచున్న కామభోగములను" అని తలపోసి, నిలిచియుండియే విపశ్యనాభావన వృద్ధిచేసి లక్షణత్రయమును ధ్యానించి ప్రత్యేకబోధిజ్ఞానము పొందెను. మిగిలినకథ పూర్వోక్తకథవలెనే.

ఒకనాడానలుగురు ప్రత్యేకబుద్ధులు భిక్షాటనసమయము స్మరించి నందమూలపర్వతమునుండి వెలువడి, అనోతత్తసరోవరముకడ నాగలతతో పండ్లు తోముకొని మనశ్శిలాతలమున నిలిచి, పంచచీవరములు పట్టుకొని బుద్ధిబలమున ఆకసమున కెగసి, పంచవర్ణ మేఘములను మర్దించుచు పోయి, వారాణసీనగర గ్రామద్వారమునకు కొలది దూరమున దిగి, అచ్చటి యారామమున నొకచోట చీవరములు కట్టుకొని పాత్రలు చేతబట్టుకొని, ద్వారగ్రామము ప్రవేశించి, భిక్షాటనము చేయుచు, బోధిసత్త్వునివాకిలి చేరిరి.

బోధిసత్త్వుడు వారిని జూచి ప్రసన్నుడై, లోనికి గొనిపోయి పీఠముపై గూరుచుండబెట్టి, దక్షిణోదక మిచ్చి పెద్ద విందు చేసి, తానొకప్రక్కన గూరుచుండి, సంఘస్థవిరునకు ప్రణామము చేసి, "తమ ప్రవ్రజ్య సుశోభిత మైనది. ఇంద్రియములు ప్రసన్నము లైనవి. శరీర కాంతి సుందర మైనది. ఏమి ధ్యానించి మీరు భిక్షాటనవృత్తి నవలంబించినారు ?" అని తక్కినవారినిగూడ అడిగెను. ఆ నలుగురును "మేము ఫలానిరాష్ట్రములో ఫలాని రాజులము" అని తమతమ అభినిష్క్రమణకథలు వివరించి క్రమముగా ఒక్కొక్కరు ఒక్కొక్క గాథ పలికిరి :

ఆడవిలో కనుగొంటి నామ్రవృక్షంబు;
నీలకాంతులతోడ నీటుగా నుండె.

చిక్కగ పండ్లతో నిక్కిన తరువు
క్షతవిక్షతం బయ్యె జనములవలన:
వీక్షించిదానిని భిక్షువు నైతి.

చతురకళాదనిర్మిత కంకణములు
విడివిడిగా నుండ వెలదిహస్తముల
నుండె నీరవముగా; ఒకచేత గూర్ప

రాపిడి యయ్యొ నారావంబుతోడ
వీక్షించి దానిని భిక్షువు నైతి.

ఆమిషఖండంబు నాస్యాన గరచి
ఒంటిగా నెగిరెడి యొక శకుంతమును
పడగొట్టె నెన్నియో పక్షులు తాకి;
వీక్షించి దానిని భిక్షువు నైతి.

బలమును వన్నెయు గలిగి యుత్తుంగ
మగు మూపురమ్ముతో ననడుహ మొకటి
గోసంఘమధ్యాన గోచరించినది,
అవల కామవశాన హాత మయిపోయె;
వీక్షించి దానిని భిక్షువు నైతి.

బోధిసత్త్వుడు ఒక్కొకగాధ విని ఒక్కొకప్రత్యేకబుద్ధునితో "భన్తే, ఈ ధ్యానము తమకే యుక్తమైనది" అని స్తుతించెను.

ఉపదేశించిన ధర్మకధనము విని వారు వెడలిపోవగానే ఆతడు ప్రాతర్భోజనము చేసి, సుఖముగా కూర్చుండి భార్యను పిలిచి "భద్రే, ఈ నలుగురు ప్రత్యేకబుద్ధులు రాజ్యత్యాగము చేసి, ప్రవ్రజించినవారు, అకించనులు. బాధవిడనాడి ప్రవ్రజ్యాసుఖ మనుభవించుచున్నారు నేను శ్వవృత్తిచే జీవించుచున్నాను. నాకు సంసారముతో పనియేల? నీవు బిడ్డలను పోషించుచు నింట నుండుము" అని రెండు గాధలు పలికెను :

గాంధారనృపతి మగ్గజి, కళింగ
రాజ్యాధినేత కరండుడు, మిథిల
పరిపాలకుడు నిమి, పాంచాలధరణి
విభుడు దుర్ముఖుడును విడిచి రాజ్యమ్ము
సంపూర్ణముగ నకించను లైనవారు,
ప్రవ్రజించినవారు, పరమపావనులు.

జాజ్జ్వల్యమానాగ్నిచందాన వీరు
దేవతాసము లరుదెంచినవారు
నేగూడ విడనాడి నిఖిలవాంఛలను
భార్గవీ, ఒంటిగా పర్యటించెదను.

ఆయనవాక్కులు విని యామె "స్వామీ, ప్రత్యేకబుద్ధుల ధర్మ కథనము విన్నప్పటినుండియు నా మనస్సుకూడ ఇంటిపైన లేదు" అని యీ గాథ పలికెను.

మంచికాల మ్మిది మరల రాబోదు;
ఉపదేష్ట లావల యోగింపరేము.
చరియింతు భార్గవా, పురుషహస్తంబు
వదలిన విహగంబువలె నొంటిగాను.

బోధిసత్త్వు డామెమాటలు విని, మౌనము వహించెను. ఆయన కాశ్చర్యము గొలుపునట్లు తానే తొలుత ప్రవ్రజింపదలచి యామె "స్వామీ, నీరు తేబోవుచున్నాను. బిడ్డలను కనిపెట్టియుండుడు" అని కడవ తీసికొని పోవుదానివలె వెలువడి, పరుగెత్తి పోయి సరిహద్దు చేరి, తపస్వుల సన్నిధికి బోయి ప్రవ్రజించెను. ఆమె మరలిరా దని తెలిసి కొన్నతరువాత బోధిసత్త్వుడు బిడ్డలను పోషింపసాగెను.

కొంతకాలమునకు బిడ్డలు పెరిగి పెద్దవారు కాగా బోధిసత్త్వుడు స్మృతి కలిగి వారిని పరీక్షింపదలచి వంట చేయుచు ఒకనాడు అన్నము నుడకనీయ లేదు. ఒకనాడు సంకటి చేసెను. ఒకనాడు బాగుగా వండెను. ఒకనాడు ఉప్పు వేయలేదు. ఒకనాడు కూరలో ఉప్పు హెచ్చుగా వేసెను. "నాయనా, ఈ వేళ అన్నము ననువాయగా నున్నది. ఈ వేళ సంకటి అయినది, ఈ నాడు బాగున్నది, ఈ నాడు ఉప్పు తక్కువైనది. నేడు ఉప్పు ఎక్కువైది" అని బిడ్డ లనుచుండిరి. అవును బాబులారా, అని ఆయన బదులుచెప్పుచుండెను. ఇక స్వసామర్థ్యముచే బిడ్డలు జీవింప గల రని బోధిసత్త్వుడు తలచి, ప్రవ్రజింప నెంచెను.

బిడ్డలను బంధువుల కప్పగించి ఆయన "నాయనలారా, అమ్మలారా, ఈబిడ్డలను మీరు బాగుగా పోషింపుడు" అని చెప్పి, వారు దుఃఖించు చుండగా నివాసము వెడలి ప్రవ్రజించి నగరసమీపముననే యుండెను. ఒకనా డతడు వారాణసిలో భిక్షాటనము చేయుచుండగా పరివ్రాజిక కానబడి, అతనికి ప్రణామముచేసి, "ఆర్యా, మీరు బిడ్డలను అంతమొందించినా రని తెలియుచున్నది" అని పలికెను. "నేను బిడ్డలను నష్టపరచలేదు. బిడ్డలు మంచిచెడ్డలను గుర్తించు యోగ్యత కలిగినతరువాత నే నేను ప్రవ్రజించినాను. వారిచింత నీ కక్కరలేదు. నీవు ప్రసన్న

చిత్త వై యుండుము” అని బోధిసత్త్వుడు తుదిగాథ పలికెను:

కనుగొన్నవారలు గాన గ్రహింత్రు
ఉప్పని దేదియొ, చప్పని దేదో,
పక్వ మెయ్యదియొ, అపక్వ మెయ్యదియొ
నీవు భిక్షాచర్యనిరతవు కమ్మ,
నేను భిక్షాచర్యనిరతుడ నగుదు.

ఇట్లు పరివ్రాజిక కుపదేశ మిచ్చి యుత్సాహము పురికొల్పెను. ఆమె యుపదేశము గ్రహించి ఆయనకు ప్రణామము చేసి, ఇచ్చవచ్చిన దారిని బోయెను. మరల వా రెన్నడును కలియలేదు. బోధిసత్త్వుడు ప్రాప్తధ్యాను డై క్రమముగా బ్రహ్మలోకప రాయణు డయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములను పరిపోల్చెను. 500మంది భిక్షువులు అర్హత్త్వ మొందిరి. ఆకాలమున పుత్రిక ఉత్పలవర్ణ; పుత్రుడు రాహులకుమారుడు; పరివ్రాజక రాహులమాత; ప్రవ్రజితుడు నేనే.

## 409 దళహాధమ్మ జాతకము

శాస్త కౌశాంబిలోని ఘోసితారామమున విహారము చేయుచు, ఉదయనప్రభువు ఆడుఏనుగు భద్రవతిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆ ఏనుగును అలంకరించు పరిధానములను గూర్చియు ఉదయన రాజవంశము గూర్చియు మాతంగజాతకమున (497) ప్రకటితమగును. ఒకనాడు భద్రవతి భగవాన్ బుద్ధుడు అనుపమరస్మితో నగరమున భిక్షార్థమై ప్రవేశించుట చూచి, ఆయనచరణములకడ మోకరిల్లి రోదనము చేయుచు “భగవన్, తాము సర్వజ్ఞులు. సర్వలోకములు చలింపచేయగల వారు, నేను తరుణవయసులో నున్నపుడు రాజునకు నా సహాయ్యమున జయము, ప్రాణములు, దేవియు దక్కెను. నాయెడ

ప్రీతితో ఆదరము చూపెడివారు. నన్ను అలంకరించి నే నుండు ప్రదేశము నలంకరించి సుగంధములు చల్లి పైన బంగారు నక్షత్రములు చెక్కిన చక్కని చాందినీ కట్టి సుగంధతైలదీపములను వెలిగించెడివారు. అగరువత్తులు పాత్రలనుంచి, నేను మలవిసర్జనము చేయుచోట బంగరుకుండ ఉంచి, బొమ్మచిత్తరువులు గల ఆస్తరణముపై నిలువ బెట్టెడివారు. నాకు రకరకముల రాజోచితభోజనములు పెట్టించెడివారు. కానీ, నాకు వార్ధకము వచ్చి పనులు చేయలేకుండుటచే వెనుకటి ఆదరము పోయినది. దిక్కులేక, అడవిలో ఆకులలములు తిని బ్రదుకుచున్నాను. ఉదయునునకు నాపై దృష్టి నిలుచునట్లు చేసి వెనుకటి ఆదరము కలిగింపవలె నని ప్రార్థన" అని విన్నవించెను.

శాస్త "నీవు పొమ్ము. నేను రాజుతో చెప్పి నీకు వెనుకటి ఆదరాభిమానములను కలిగించెదను" అని రాజనివాసమునకు జనెను. రాజు తథాగతుని ప్రాసాదములోనికి గొనిపోయి ఆయన భిక్షుసంఘమునకు మహాదాన మొసగెను. భోజనానంతరము దానానుమోదనము చేసి శాస్త "మహారాజా, భద్రవతి ఇప్పు డెక్కడ నున్నది?" "భన్తే, జాడ తెలియదు." "మహారాజా, ఎవరివలన నైనను ఉపకారము చేయునపుడు ఆదరాభిమానములు చూపి, వార్ధకమున వానిని పంపివేయకూడదు. ఉపకారమునకు కృతజ్ఞత చూపవలెను. ఇపుడు భద్రవతి ముసలిదై చిక్కిపోయినది. దిక్కులేక అడవిలో ఆకులలములు తిని బ్రదుకుచున్నది. వార్ధకమున దానిని దిక్కుమాలిన దానిని చేయుట తగదు" అని చెప్పెను.

ఈ ప్రకారముగా భద్రవతి గుణగణములను తెలిపి శాస్త "దానిని వెనుకటివలెనే ఆదరింపు" మని పలికెను. రాజు ఆప్రకారమే చేసెను.

ధర్మసభలో భిక్షువులు ఈ విషయమై చర్చించు చుండగా ఒకనాడు శాస్త వచ్చి విషయము గ్రహించి "భిక్షువులారా, ఇప్పుడే కాదు పూర్వము కూడ తథాగతుడు దీనికి పోయిన ఆదరసత్కారములు మరల కలిగించెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో దశరథమ్ము డనురాజు పాలనము చేయు

చుండెను. ఆసమయమున బోధిసత్త్వు డమాత్యకులమున బుట్టి పెద్దవా డయినపిదప రాజసేవలో చేరెను. రాజువలన బోధిసత్త్వునకు విశేష సంపద లభించెను. క్రమముగా రా జాయన నమాత్యపదవిలో ప్రతిష్ఠించెను. ఆ రోజులలో రాజుకడ ఓట్ఠివ్యాధి అను హస్తిని యుండెను. దానికి మహాబలము, మహాశక్తియు కలవు. దినమునకు నూరుయోజనముల దూరము పోవు ఆహస్తిని వార్తావహన కార్యములు చేయుచు, సంగ్రామమున శత్రుమర్దనము కావించుచుండెను. "నా కిది మిక్కిలి ఉపకారము చేయుచున్నది. ఉదయనప్రభువు భద్రవతీగజమును అలంకరించినట్లు లలంకరించి దీని నాదరింతును" అని రాజు అట్లే చేయించెను. కాలక్రమమున హస్తినికి వార్ధకము వచ్చి, బలము పోగా రాజు దాని పూర్వసత్కారము మానిపించెను. ఏనుగ నాటినుండి దిక్కులేని దై అడవిలో ఆకులు అలములు తిని జీవించుచుండెను.

ఒకనాడు రాజకులమున గిన్నెలు తగ్గిపోయినపుడు రాజు కుంభకారుని బిలువనంపి గిన్నెలు తగ్గిపోయిన వనెను. "దేవా, గోమయము తెచ్చు బండికి కట్టుటకు వృషభము లభింపలేదు" అని వాడు చెప్పగా రాజు "మాయేనుగు ఓట్ఠవ్యాధి ఎచట నున్నదో?" అనెను. దేవా, స్వేచ్ఛగా తిరుగుచున్నది." నేటినుండి దానిని నీబండికి కట్టి గోమయము తోలుకొనుము." "చిత్తము."

ఒకనా డేనుగ నగరము వెడలిపోవుచుండు నెడ బోధిసత్త్వుడు నగరములోనికి ప్రవేశించుచుండెను. ఏనుగు బోధిసత్త్వునిపాదములకడ వాలి "స్వామీ, నాతారుణ్యమున నేను తనకు జేసిన వివిధోపకారములను గమనించి రాజు న న్నాదరించినాడు. ఈ వార్ధకదశలో వెనుకటివి మానిపించి, రాజు నావంక నైన జూడకున్నాడు. దిక్కులేక నేను వనములో ఆకులలములు తిని జీవించుచుంటిని. కష్టపడుచున్న నన్ను బండి కిప్పుడు పూన్చినాడు. మీరు తప్ప నాకు వేరుశరణము లేదు. ప్రభువుకు నేను చేసినసేవ మీకు తెలియునుకదా నాకు తొలగిపోయిన యాదరము పూర్వమువలె దయచేయింపుడు" అని మూడు గాథలు పలికెను.

మును దళ్హధమ్మని మోసెడుదాన,
శస్త్రముల్ రొమ్మున సంధింప, వైరి

సైన్యంబులం దాకి సంగరమందు
పోరి, దూతల గొనిపోవుట రాజు
మరచునే! నిజముగా మత్పరాక్రమము
ఈనాడు బంధువిహీన నై, గతివి
హీన నై ఆసన్నమృత్యువు నైన
నను కుంభకారునకును నృపాలుండు
ఇచ్చినా డకటా; మృత్తు మోయంగ.

బోధిసత్త్వుడు విని, "నీవు చింతింపవలదు. నేను రాజుతో జెప్పి పూర్వమువలె సత్కారము చేయింతును" అని ఓదార్చి నగరము ప్రవేశించి, భోజనానంతరము రాజసన్నిధికి బోయి, సంభాషణలో "ఆ యేనుగు రొమ్మునకు శూలములు కట్టుకొని యుద్ధమున శత్రువులను సంహరింపలేదా? ఆరోజులలో సందేశలేఖలు వీపుమీద మోసికొని వేయియోజనములు పోవుచుండలేదా? మీ రాకాలమున దానినెంతయో ఆదరించుచుంటిరి. ఇప్పు డాయేను గెచట నున్నది?" అనెను. "గోమయము తెచ్చుటకై దానిని కుంభకారున కిచ్చితిని." "మహారాజా, దానిని కుంభకారునిబండికి పూన్చుటకై యిచ్చుట సముచితమేనా?" అని ఉపదేశ మిచ్చువాడై బోధిసత్త్వుడు నాలుగు గాథలు పలికెను:

ఉపయోగ మెందాక నుండునో అంత
వరకును పోషణ జరిపి త్రోయుదురు
ఒట్టివ్యాధిని రేడు నెట్టినయట్లు.

పూర్వకాలము తాను పొందిన మేలు
మరచిపోయినవాడు మమత గొన్నట్టి
పను లన్నియుంగూడ భగ్నంబు లౌను.

పూర్వకాలము తాను పొందిన మేలు
మరచిపోవనివాడు మమత గొన్నట్టి
కార్యంబు లన్నియు గాంచును వృద్ధి.

ఇచ్చట గూడిన యెల్లవారలకు
చెప్పవాడను సుభాషితము; కృతజ్ఞు
లైనపక్షమున మీ రందరుగూడ
స్వర్గాన నివసింత్రు చాలకాలమ్ము.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు రాజు మొదలుకొని అచట నున్న వారి కందరికిని ఉపదేశ మిచ్చెను. విని రాజు హస్తినికి వెనుకటివలె ఆదరసత్కారములు సమకూర్చెను. బోధిసత్త్వుని యుపదేశానుసారముగా రాజు దానాదిపుణ్యకార్యములు చేయుచు తుదకు స్వర్గలోకపరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశముచేసి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమునభట్టివ్యాధి భద్రవతి; రాజు ఆనందుడు; అమాత్యుడు నేనే.

## 410 సోమదత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక వృద్ధుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు ఒకానొక శ్రమణుని ప్రవ్రజితుని చేయుటచే ఆతడు వృద్ధున కుపకారిగా నుండెను. శ్రమణుడు ఏదో వ్యాధివలన చనిపోయెను. వృద్ధుడు ఏడ్చుచు మొత్తుకొనుచు తిరుగుచుండెను. అతనిని గూర్చి ధర్మసభలో సంభాషణ జరుగుచుండగా శాస్త అరుదెంచి విషయము తెలిసికొని, "భిక్షువులారా, ఆత డిప్పుడే కాదు, పూర్వముకూడ ఇట్లే దుఃఖించినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శక్రపదవి నొందెను. కాశీరాష్ట్రమందలి యొకానొక గ్రామములో బ్రాహ్మణశ్రేష్ఠుడు భోగములు విసర్జించి, హిమాలయము చేరి ప్రవ్రజించి, అరణ్యములో కందమూలఫలములు తినుచుండెను. ఒకనా డాయన ఫలమూలములు తెచ్చుటకై వనమునకు బోయినపుడు ఏనుగుగున్న కానవచ్చెను. దాని నాశ్రమమునకు గొని

వచ్చి సోమదత్తు డని పేరు పెట్టి, తనబిడ్డవలె చూచుకొనుచు, ఆకులు, గడ్డి మేత వేయుచు పోషించుచుండెను.

ఏనుగు పెద్దదయినకొలది శరీరము పెచ్చుగా పెరిగెను. ఏను గొక నాడు విశేషముగా మేతమేయుటచే అజీర్ణరోగము పుట్టెను. తాపసి దాని నాశ్రమముననే విడిచి ఫలమూలాదులను గొనివచ్చుటకై అరణ్యమున కేగెను. ఆయన మరలివచ్చులోపుననే హస్తి చనిపోయెను. అనుదిన మెదురుగా వచ్చి స్వాగతము చెప్పు గజ మానాడు రాకుండుటచే అది యెచ్చటికి బోయెనో యని తపస్వి విచారించుచు తొలిగాథ పలికెను:

నాకయి దూరవనమ్మున స్వాగ
తమ్ము పల్కెడి సోమదత్తగజంబు
ఈనాడు కనబడ, దెచట కేగినదో!

ఇట్లు విచారించుచు వచ్చి, తాను పచారు చేయు తొలిపొలము కడ నేలపై బడియున్న యేనుగును జూచి దానిమెడ పట్టుకొని యేడ్చుచు తాపసి రెండవ గాథ పలికెను:

తెగి నేలవాలిన తీగ విధాన
మరణమ్ము గాంచి నా మాతంగ మకట!
పడియున్నయది ధరాభాగమ్ము మీద.

ఆసమయమున శక్రుడు భూలోకముపై దృష్టి పరప, "ఈ తాపసి భార్యాపుత్రులను విడిచి ప్రవ్రజించినాడు. కాని ఏనుగునున్నను బిడ్డవలె నెంచి యేడ్చుచున్నాడు. ఈతని మనస్సున సంవేగము కలిగించి వివేక ముత్పాదించెదను" అని ఆశ్రమమునకు వచ్చి, ఆకసమున నిలిచి, మూడవ గాథ పలికెను:

విగతజీవులకునై తగదు దుఃఖంబు
ఎవ డనాగరికు డెవ్వడు ముక్త
మతి, శ్రమణుం డెవ్వ, డతని కించుకయు
విగతజీవులకయి వగచుట తగదు.

తపస్వి ఆయనవాక్కులు విని నాలవ గాథ పలికెను:

కలిసి నివాసంబు కావించునెడల
జంతువుతోనైన జనునితోనైన
సహజమ్ముగా ప్రీతి జనియించు శక్ర!
దీనికి శోకంబుమానుట యెట్లు?

ఆయన కుపదేశ మిచ్చుచు శక్రుడు రెండు గాధలు పలికెను:

చనిపోవువారితో, చనిపోయినట్టి
వారికోసము జనుల్ వగచుచునుంద్రు,
ఓ ఋషీ, నీ కిది యుక్తంబు కాదు:
పెద్దలు శోకంబు వద్దనినారు.

మన మేడ్చుమాత్రాన మరల జీవింతు
రేని చచ్చినవార లేకత్ర చేరి
దుఃఖింపవచ్చు జ్ఞాతులకయి మనము.

తపస్వి శక్రునివాక్కులు విని సంబాళించుకొని శోకరహితుడై బాష్పములు తుడుచుకొని శక్రుని స్తుతించుచు శేషించిన గాథలు పలికెను:

నేయి పడ్డట్టి యగ్నివిధాన మండు
చుంటిని; నిప్పుపై నుదకంబుపోసి
తొలగించి నావు నా దుఃఖంబు నీవు.

పుత్రశోకంబును పోగొట్టి యతడు
దుఃఖశల్యంబును తొలగించినాడు.

వాసవ, వినగ నీవాక్కులీ యెడను
దుఃఖహృచ్ఛల్యముల్ దూరీకృతములు.

మాలిన్య మెడలెను మనసులోనుండి,
ఏడ్వను మొత్తుకో నికమీద నేను.

ఈ ప్రకారముగా శక్రుడు తపస్వి కుపదేశ మిచ్చి నిజస్థానమున కరిగెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆ కాలమున ఏనుగు గున్న శ్రమణుడు; తపస్వి వృద్ధుడు; శక్రుడు నేనే.

## 411 సుసీమ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు మహాభినిష్క్రమణమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆసమయమున భిక్షువులు ధర్మసభలో గూరుచుండి శాస్త అభినిష్క్రమణము గూర్చి ప్రశంస చేయుచుండిరి. శాస్త చనుదెంచి విషయము గ్రహించి "భిక్షువులారా, ఇం దేమియు ఆశ్చర్యపడ నక్కరలేదు. అనేకకల్పములనుండి కోటిలక్షలసంవత్సరముల వరకు పారమితలను పరిపూర్ణము చేసిన పిమ్మట నేను ఇప్పుడు మహాభినిష్క్రమణము చేసితిని, పూర్వము నేను మూడువందల యోజనముల విస్తీర్ణము గల కాశీరాష్ట్ర ప్రభుత్వమును విడనాడి అభినిష్క్రమణము చేసియుంటి" నని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీతకథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు రాజపురోహితుని అగ్రభార్యకడుపున బుట్టినాడు. ఆ నాడే రాజునకుగూడ కుమారుడు కలిగినాడు. నామకరణోత్సవము నాడు బోధిసత్త్వునకు సుసీమకుమారు డనియు, రాజపుత్రునకు బ్రహ్మదత్తకుమారు డనియు పేరుపెట్టిరి. తనకుమారుడు పుట్టినరోజుననే పురోహితునకుగూడ కుమారుడు జన్మించినా డని ఆబాలుని తెప్పించి దాదికప్పగించెను. ఇరువురు బిడ్డలును ఒకచోటనే పెరుగుచుండిరి. ఇరువురు పెరిగి పెద్దవారై దేవకుమారులవన్నె కలిగి, తక్షశిలానగరమునకు జని, విద్యలు నేర్చి, మరలివచ్చిరి.

రాజపుత్రుడు యువరాజయ్యెను. బోధిసత్త్వుడాయనవెంటనే యుండి భోజనాసననిద్రాదులు సమముగా చేయుచుండెను. యువరాజు తండ్రియనంతరము రాజై బోధిసత్త్వుని పురోహితపదవియందు నియోగించెను.

శక్రుని ఐరావతమువలె నలంకృతమైన భద్రగజము నెక్కి, బోధిసత్త్వుని వెనుక గూరుచుండబెట్టుకొని రాజు అలంకృతనగరవీథుల వెంట ఊరేగెను. రాజమాత కుమారుని జూచుకోరికతో వాతాయన

మున నిల్చి కుమారుడు పురప్రదక్షిణము చేసి మరలివచ్చునప్పటికి ఆతనివెనుక పురోహితుని జూచి ప్రతిబద్ధచిత్తయై శయనాగారమునకు బోయి పండుకొని, అన్నపానములు విసర్జించి, "ఇతడు నాకు లభింపనిచో ఇచటనే ప్రాణములు విడుతును" అని నిశ్చయించుకొనెను.

తల్లి కానరాకుండుటచే అమ్మ యెచ్చట నున్నదని రాజు పరివారమును ప్రశ్నించెను. "జబ్బుతో నున్నారు" అని వారలు చెప్పగా రాజు తల్లికడకు బోయి ప్రణామము చేసి "అమ్మా, జబ్బుగా నున్నదా?" అని యడిగెను. సిగ్గుచే ఆమె బదులుచెప్పలేదు.

అంతట రాజు సింహాసనముపై గూరుచుండి పట్టమహిషిని బిలువనంపి "పోయి అమ్మకు జబ్బేమో కనుగొనిరమ్ము" అనెను. ఆమె వెడలి అత్తగారివీపు నిమురుచు అడిగెను. స్త్రీలు స్త్రీలకడ రహస్యము దాచలేరు. రాజమాత ఉన్నసంగతి చెప్పెను.

రాజమహిషి ఆసంగతి భర్తకు నివేదించెను. నీవు పోయి అమ్మనోదార్చుము అని రాజు భార్యతో జెప్పి, పురోహితుని పిలువనంపి విషయము వివరించి "మిత్రమా, నా తల్లికి ప్రాణదానము చేయుము. నీవు రాజు వగుదువు. ఆమె పెద్దరాణి యగును. నేను ఉపరాజుగా నుందును" అనెను. "ఇది చేయరానిపని" అని బోధిసత్త్వుడు పలికెను. కాని మాటిమాటికిని రాజు బలవంతము చేయుటచే తుద కంగీకరించెను.

రాజు బోధిసత్త్వుని ప్రభువును జేసి తల్లిని రాజమహిషిని జేసి తాను ఉపరాజుగా నుండెను. అందరును కలిసియుండిరి. బోధిసత్త్వుడు క్రమముగా గృహస్థాశ్రమమునెడ నుదాసీనుడై భోగములను విసర్జించి ప్రవ్రజ్యయెడ మొగ్గుచుండెను. ఆతడు భోగములలో లీనుడు కాక ఏకాకిగానే యుండి ఒంటిగా శయనించుచుండెను. కారాగారములో బందివలెను పంజరములో కోడివలెను బోధిసత్త్వుడు రాజప్రాసాదములో నివసించుచుండెను.

"ఇతడు నాతో క్రీడింపడు, ఏకాకిగా నుండును. ఒంటిగా కూరుచుండును. ఒంటిగా శయనించును. ఇతడు పడుచువాడు. బలిష్ఠుడు. నేను పెద్దదాననైతిని. నా శిరసున తెల్లవెండ్రుకలు కానవచ్చుచున్నవి. దేవా, మీ శిరస్సున పలితకేశము కనిపించుచున్నది. అని సత్యము చెప్పి మోసగించి రాజుచే ప్రతిజ్ఞ చేయించి నాతో

క్రీడించునట్లు చేసెదను" అని యామె తలపోసెను.

ఒకనా డామె రాజుశిరస్సు నిమురుచున్నట్లు నటించి, "దేవా, మీరు వృద్ధులయినారు. మీతలమీద తెల్లవెండ్రుక కనవచ్చినది" అని పలికెను. "అట్లయిన ప్రియా, ఆ తెల్లవెండ్రుకను తీసి నాచేతిలో పెట్టుము" అని రాజు పలికెను. ఆమె తనతలలో కేశమును ఆతని తలలో కేశమును లాగి, అది జారవిడిచి, తనపలితకేశ మతని చేతిలో నుంచెను. బోధిసత్త్వుడు చూచి భయపడెను. బంగరుపట్టమువంటి ఫాలభాగమునుండి స్వేదబిందువులు రాలెను. "సుసీమా, నీవు యువకుడవుగా నుండి వృద్ధుడవయినావు. ఇంతవరకును గుహాలో పడియున్న సూకరమువలె కామభోగములవలలో జిక్కుకొని త్రెంచుకొని పోవ లేకున్నావు. భోగములను విడిచి హిమాలయమున కేగి, ప్రవ్రజించి, బ్రహ్మచర్య మనుష్ఠింప వలసిన సమయము రాలేదా?" అని తన్ను తాను ప్రబోధించుకొనువాడై ఈ తొలిగాధ పలికెను :

మున్ను నల్లనికేశములు నేడు చూడ
శ్వేతంబు లయ్యె సుసీమ, యింతటను
ధర్మాచరణమందు తత్పరత్వమ్ము
బ్రహ్మచర్యంబు ప్రారంభింపవలయు.

ఇట్లు పలుకగా పట్టపుదేవి భయపడి తనలో "నే నీతని మనసులో కోరిక పుట్టింప నెంచితిని, కాని వైరాగ్య ముద్భూతమయిన దే" అనుకొని, అతనిమనస్సును ప్రవ్రజ్యనుండి మరలించుటకై శరీరమును సౌందర్యమును వర్ణించు రెండు గాధలు పలికెను :

మీ శిరంబున కాదు, నా శిరంబుననే
పలితకేశంబులు; భయముచే దేవ
వ్యత్యస్తముగనంటి వాస్తవస్థితిని
క్షమియింపవలె నా యసత్యమ్ము రాజ!

తరుణవయస్కులు దర్శనీయముగ
విలసిల్లుదురు లేత వెదురువిధాన
ఏలి రాజ్యము, నన్ను లాలింపవలయు,
దూరార్థమునకు నై తొందరవలదు.

ఆమెవాక్కులు విని బోధిసత్త్వుడు "భద్రే, కానున్న సంగతి చెప్పుచున్నావు. ఆయువు గడచుచున్నకొలది వల్లనివెంట్రుకలు తంగేడుచెక్కవలె తెల్లనివగును. ఉత్పలములవలె సుకుమారలయి కాంచన వర్ణము కల ఉత్తమక్షత్రియకన్యలు ఆయువు గడచు కొలదిని వివర్ణ లగుటయు, పొట్టలు జారుటయు చూచుచున్నాము. భద్రే, ఈ సంసారము పరివర్తనశీలము" అని బుద్ధలీలనుండి ధర్మోపదేశము చేయువాడై యీ గాథలు పలికెను :

చూచుచున్నాడను సుందరయువతి,
నామె పార్శ్వము లెంతో అందములైన,
వామె యాకర్షించు నందరగూడ
తనహావభావ ప్రదర్శనమునను,
శ్యామాలతికవోలె చలియించు నామె.

కానవచ్చిన దామె క్రమ్మర నాకు,
ఎనుబదో తొంబదో యేడుల దయ్యె,
కేలను దండంబు కీలించి యామె
వంగి బొంగుగ లత వాతంబు నందు
చలియించు రీతిని చలియించు నదిగో !

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు రూపవిపరిణామము చూపి గృహ నివాసమునెడ అరుచిని చూపుచు ఈ గాథలు పలికెను :

పండుకొన్నను, నిట్టి భావాలతోడ
నుంటి నొంటిగ నాకు నొకనాడు కలుగు
నిట్టి మార్పని; పోయె ఇంటిపై రక్తి;
ఇక బ్రహ్మచర్యంబునకు తరుణంబు.

ఊతగా రోగుల కుండు రజ్జువును
బోలిన సంసారభోగంబు లెల్ల
తద్రూప మైనట్టి తాడు ఖండించి
అనపేక్షితసుఖమ్ములను విడనాడి
విచారించుచుందురు వీరులౌ వారు.

ఈ విధముగా బోధిసత్త్వుడు కామభోగములరసమును దాని దుష్పరిణామమును తెల్లము చేసి, బుద్ధలీలనుండి ధర్మోపదేశ మిచ్చెను.

ఆవల మిత్రుని బిలిచి, రాజ్య మిచ్చి, అందరును విలపించుచుండగా బంధుమిత్రులు నైశ్వర్యము విడిచి, హిమాలయము ప్రవేశించి, ప్రవ్ర జించి, ధ్యానాభిజ్ఞలకు పొంది, బ్రహ్మలోకపరాయణు డయ్యెను.

శాస్త్ర ధర్మోపదేశము చేసి, సత్యప్రకాశము గావించి అమృతపానము చేయించి జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున పట్టపుదేవి రాహులమాత; మిత్రరాజు ఆనందుడు; సుసీమరాజు నేనే.

## 412 కోటిసింబలి జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు కాముకత్వ నిగ్రహమును గూర్చి చెప్పినది. కథ పాణీయజాతకమున (459) వచ్చును.

ఈ కథలో కూడ శాస్త్ర విహారమున నుండు వారిని సమావేశ పరచి "భిక్షువులారా, అపాయము కలుగనున్న తావును జూచి భయ పడవలెను. కామవితర్కము వృద్ధిచెందినచో వటవృక్షము అన్యవృక్ష ములను నష్టపరచనట్లు నష్టపరచును. అందుచే పూర్వకాలమున కోటి సింబలివృక్షమున నున్న దేవత ఒక పిట్ట మఱ్ఱిపండు తిని కొమ్మమీద రెట్ట వేయుట చూచి "ఇచ్చట నుండి నా నివాసస్థానము ధ్వంస మగు నని భయము చెందినది" అని పూర్వజన్మకథ జెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కోటిసింబలియందు వృక్షదేవతగా జన్మించెను. ఒకానొక గరుడరాజు నూటయేబదియోజనముల శరీరము కల్పించుకొని, తన రెక్కల గాలితో సముద్రోదకమును ద్విధా విభజించి, వేయియామ ముల వెడల్పు గల నాగరాజుతోక పట్టుకొని, అతనినోట నున్న యాహారము కక్కించి, వనముల మీదుగా కోటిసింబలిపై పెగిరెను. నాగరాజు తన్ను విడిపించుకొనుటకై మెల్లమెల్లగా తనపడగతో

మఱ్ఱిచెట్టులో త్రొఱ్ఱ చేసి, గట్టిగా పట్టుకొనెను. గరుడరాజు బలిష్ఠుడగుటచేతను, నాగరాజు శరీరము పెద్దదగుటచేతను మఱ్ఱిచెట్టు మూలము విడిపోయెను. కాని నాగరాజుమాత్రము వృక్షమును విడువలేదు. గరుడరాజు వటవృక్షముతోఁగూడ నాగరాజు నెత్తుకొనిపోయి, కోటిసింబలి చేరి, నాగరాజును వృక్షస్కంధమునకు నొక్కి, పొట్ట చీల్చి, వస భక్షించి మిగిలిన చర్మాదికమును సముద్రములోనికి విసరివైచెను.

ఆవటవృక్షముమీద వాలియున్న యొకపక్షి చెట్టుపడిపోయినపుడు ఎగిరి కోటిసింబలిలో నొకచెట్టుకొమ్మమీద వాలెను. వృక్షదేవత దానిని జూడగనే "ఈ పిట్ట నా చెట్టుమీద రెట్ట వేయగలదు. అప్పుడు నాకు నివాసము లేకుండబోవును" అను భయముచే వణకుచుండెను. దానిచే కోటిసింబలి మూలమువరకును వణకెను. చూచి గరుడరాజు కారణ మడుగువాడై రెండు గాథలు పలికెను :

వేయిబారల యురగంబు వెంట దెచ్చి
వాలితిని; మాదుభారంబువలన నీవు
సుంత జంకవు, చిన్నశకుంత మిపుడు
వాలినంతనె చలియించె దేల నేడు ?
పులుగు నా మేని తోడను బోల్పనెంత !
పొందెదవు బాధ శాల్మలీభూరుహంబ !

దీనికి కారణము తెలుపుచు దేవపుత్రుడు నాలుగు గాథలు పలికెను :

మాంసము భుజింతు వోగరుత్మన్, ఖగేంద్ర,
ఫలము లారగించెడి చిన్నపక్షి ఇద్ది
మ్రింగి మఱ్ఱిఫలంబులో మేడిపండ్లొ
రావికాయలో, నామీద రాల్పవచ్చు
రెట్ట, లపవిత్రమగును శరీర మపుడు.
బీజములు వానగాడ్పుల పెరిగి నాదు
శాఖల సురక్షితముగ వృక్షమ్ము లగుచు
నష్ట మొనరింపవచ్చును నన్ను తుదకు.
పాదపము లెన్నియో మూలబలము కలిగి
తొలుత శాఖలతో బోల్చి, పులుగులం తిని
రాల్చు గింజల మూలాన భ్రష్టతగనె.

బదనికలు మీదబడు వనస్పతులుగూడ
అణగి మునుగును గరుడేంద్ర, అందుచేత
బెదరుచున్నా ననాగతభీతి దలచి.

వృక్షదేవతవాక్కులు విని గరుడుడు తుదిగాథ పలికెను:

భయము రానున్న తావుల భయపడదగు,
భావి భీనుండి రక్షించుకోవలయును,
ప్రకృతభయమును దొలగించు పక్షమందు
రెండులోకాలు చూచును పండితుండు.

ఇట్లు పలికి గరుడరాజు నిజప్రభావముచే ఆ పిట్టను వృక్షముపై నుండి యెగురగొట్టెను.

శాస్త ధర్మోపదేశము, సత్యప్రకాశము కావించి జాతకములు పరిపోల్చెను. భిక్షువు లందరు అర్హత్త్వము పొందిరి. ఆకాలమున గరుడరాజు సారిపుత్రుడు; వృక్షదేవత నేనే.

## 413 ధూమకారి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు కోసలనరేశుని అతిథిసత్కారమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అతడు పరంపరాగతముగా నుండు యోధులను ఆదరింపక నూతనాగతులను ఒకప్పుడు ఆదరింపజొచ్చెను. ఆయన రాష్ట్రమున తిరుగుబాటు చెలరేగినపుడు వెనుకటి యోధులు యోచించి నూతనాగంతుకయోద్ధలు యుద్ధముచేయుదు రని ఊరకుండిరి. విద్రోహులు రాజు నోడించిరి. పరాజయానంతరము నూతనయోధులను సత్కరించుటవలన ఇట్లు జరిగె నని రాజు భావించి దశబలధారి యగు బుద్ధుని అడిగి తెలిసికొందు నని శ్రావస్తికి మరలివచ్చి, ప్రాతఃకాలభోజనము చేసి జేతవనమున కరిగి, శాస్తకు ప్రణమిల్లి "భన్తే, ఇట్లు చేయుటచే

నేనే ఓడిపోయితినా, కాక పూర్వకాలమునకూడ రాజు లిట్లే అయిరా! అని యడిగెను. "మహారాజా, మీరే కాదు, పూర్వరాజులుకూడ నవాగంతుకులను సత్కరించి పరాజయమొంది" రని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము కురురాష్ట్రమున ఇంద్రప్రస్థనగరమున యుధిష్ఠిరగోత్రుడైన ధనంజయు డనురాజు పరిపాలనము చేయుచుండగా బోధిసత్త్వుడాయనపురోహితవంశమున పుట్టెను. అతడు పెరిగి పెద్దవా డయి, తక్షశిల కేగి, అన్నివిద్యలు నేర్చి, ఇంద్రప్రస్థమునకు మరలివచ్చి, తండ్రి పరలోకగతు డైనపిదప పురోహితపదవి నొంది, రాజునకు అర్థధర్మానుశాసకు డయ్యెను. ఆయనపేరు విధురపండితుడు.

ఆరోజులలో ధనంజయరాజు వృద్ధయోధులను పరిగణింపక నూతనాగతుల నాదరించుచుండెను. రాష్ట్రములో విద్రోహులు చెలరేగినపుడు వారితో పోరుటకై రాజు వెడలినపుడు నూతనులు పోరాడుదు రని ప్రాచీనులును, ప్రాచీనులు పోరాడుదు రని నూతనులును ఊరకుండిరి. పరాజితు డై రాజు ఇంద్రప్రస్థమునకు మరలివచ్చి, నూతనాగతుల నాదరించుటచేతనే పరాజయము కలిగిన దని తలపోసి, ఒకనాడీవిషయమును గూర్చి "నూతనాగతులను సత్కరించుటచే పరాజితుడ నైతినా? మాపూర్వులలో నెవ్వరైన పరాజితు లయిరా?" అని నిజసేవార్థమే తెంచిన విధురపండితునితో ననెను.

శాస్త్ర ఈవిషయమై ఈ అర్థగాథ పలికెను :

ధర్మరతుడు యుధిష్ఠిరధరణివిభుడు
విధురు నడిగెను ! "తెలియునా విప్ర, నీకు
భూరిదుఃఖము నొంటిగా పొందువాడు?"

విని బోధిసత్త్వు డి ట్లనెను. "మహారాజా, మీ సంతాపము గొప్పది కాదు, పూర్వము ధూమకారి యను బ్రహ్మణుడు మేకల మంద నడవిలో నుంచి, నిప్పు చేసి పొగలో అజయూథమును పోషించుచు, పాలు మొదలగునవి త్రాగుచు అక్కడనే యుండెను. కొన్నాళ్ళ కచటికి సువర్ణ వర్ణము కల మృగము వచ్చెను. దానిని గాంచి బ్రాహ్మణుడు పూర్వము మేఘములయెడ జూపు నాదరమును సువర్ణ

మృగమునెడ జూపజొచ్చెను. శీతకాలము వచ్చినంతనే సువర్ణ మృగము హిమాలయమునకు పరుగెత్తిపోయెను. చలిబాధకు మేష ములు మరణించెను. మృగము కానరానందున బ్రాహ్మణుడు విచార మున పాండురోగగ్రస్తుడయి మరణించెను. ఆతడు నవాగతమృగము నాదరించి మీకన్న బహుగుణములు కష్టనష్టము లనుభవించెను. దీనిని దృష్టాంతీకరించుటకై బోధిసత్త్వు డీ గాధలు పలికెను :

అటవిలో నొక్క బ్రాహ్మణుం డజగణంబు
తోడ వసియించు నింధనధూమపటలి
రగులుకొలుపుచు పగళుల రాత్రులందు.

వర్ష ఋతువున జేరంగ వచ్చె హరిణ
బృందము, మశక మక్షిక పీడితంబు,
ధూపమునకు నాకృష్టమై తోరముగను.

హరిణములమీది ప్రీతిచే నతనిదృష్టి
మేషములరాకపోకలమీద లేదు;
అందుచే నష్టమైపోయె నజగణంబు.

అడవి మక్షికమశకముల్ విడిచిపోయె,
వాన లాగెను, సీతువు వచ్చినంత
హరిణసంఘంబు చనియె నిర్ఝరములకయి
కందరములకు పర్వతాగ్రములకడకు.

హరిణబృందము చనుటయు, అజగణంబు
పూర్ణనాశన మొందుట, భూసురుండు
బక్కచిక్కుచు నయ్యెను పాండురోగి.

ఆదరము లేక స్వజనమ్ముమీద నెవడు
నూతనాగతజనముపై ప్రీతిజూపు
అట్టిపురుషు డేకాకియై, అధికముగను
నామకారివిధమ్మున దుఃఖమొందు.

ఇట్లు బోధిసత్త్వుడు రాజున కుపదేశ మిచ్చెను. రాజు గ్రహించి ప్రసన్నచిత్తుడై ఆయన నెంతయో గౌరవించెను. నాటినుండి ప్రాచీను లను గౌరవించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు, తుదకు స్వర్గ లోకపరాయణు డయ్యెను.

## 414 జాగర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక యుపాసకుని గూర్చి చెప్పినది.

అతడు స్రోతాపన్నులైన ఆర్యశ్రావకయాత్రికుల బండ్ల వెంట శ్రావస్తినుండి బయలు వెడలి కాంతారమార్గమున ప్రవేశించెను. నీటి సౌకర్యము కలచోట బిడారునాయకుడు బండ్లు విడిపించి గుడారములు వేయించెను. జనులు ఇచ్చవచ్చినచోట పండుకొనిరి. ఉపాసకుడు నాయకునితో ఒకానొక వృక్షముక్రింద నుండెను. ఆసమయమున బిడారు దోచుకొను తలపుతో 500 మంది చోరులు చుట్టుముట్టిరి. ఉపాసకుడు మేల్కొని యుండుట చూచి ఆయన పండుకొన్నపిదప తమపని చేయవచ్చు నని యెంచి అచ్చటచ్చట దాగియుండిరి. ఉపాసకుడు మూడుయామములందును తిరుగుచుండెను. తెల్లవారగానే చోరులు తమకడనున్న రాలను మొద్దులను అచ్చట బడవైచి జాగరూకుడైన ఉపాసకునితో కలిసి యుండుటచే నీసంపద దక్కినది, ప్రాణములు నిలిచినవి అనుచు వెడలిపోయిరి. జనులు సకాలమున మేలుకొని చోరులు విడిచిన రాలను, మొద్దులను చూచి ఉపాసకుని వలన తమప్రాణములు దక్కినవని తెలిసికొని నాయకుని సత్కరించిరి. ఉపాసకుడు తన గమ్యస్థానమునకు బోయి పనిముగించుకొని శ్రావస్తికి మరలివచ్చి జేతవనమునకు జని శాస్తకు ప్రణమిల్లి ఒకప్రక్కను కూరుచుండెను. ఆయనను చూచి శాస్త "ఉపాసకా, ఏల కనబడుటలేదు" అనెను. ఉపాసకుడు జరిగిన దంతయు విన్నవించెను. శాస్త "ఉపాసకా, నీ వొక్కడవే మేలుకొని యుండుటచే ఇట్లు జరుగలేదు; పూర్వము కూడ పండితులు జాగరూకులై యుండుటచే మేలుగలిగెను" అని అతని ప్రార్థనపై పూర్వజన్మకథ జెప్పెను.

### అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా భోధిసత్త్వుడు బ్రాహ్మణకులమున బుట్టి పెరిగి పెద్దవాడయి, తక్షశిలకు జని, సమస్తవిద్యలు నేర్చి, మరలివచ్చి, ఇంట నివసించుచు, కొంత కాలమునకు ఇల్లు విడిచి, ప్రవ్రజించి, శీఘ్రముగనే అభిజ్ఞలను పొంది

హిమవత్ప్రదేశమున నివసించుచు రాత్రులు నిదురలేకుండ పరిక్రమించు చుండెను. ఆయన పచారు చేయుపొలము తుద నున్న వృక్షమునందలి దేవత అతనిని గాంచి ప్రసన్నచిత్తముతో ప్రశ్నచేయు తొలిగాథ పలికెను :

ఎల్లరును మేలుకొనియుండ ఏ జనుండు
పండుకొనియుండు, నెల్లరు పండుకొనగ
ఏ జనుడు మేలుకొనియుండు, నెరుగువాడు
ప్రశ్నకు నొసంగగలుగును ప్రతివచనము.

బోధిసత్త్వుడు తద్వాక్యాలు విని యిట్లనెను :

ఒరులు మేల్కొనియుండ, పన్నుందు నేను,
బరులు నిద్రింప మేల్కొని యుందు నేను,
ప్రశ్నము నెరింగి యొసగుదు ప్రతివచనము.

వృక్షదేవత యిట్లనెను :

ఒరులు మేల్కొనియుండ పన్నుండె దెట్లు ?
ఒరులు పన్నుండ మేల్కొని యుందు వెట్లు ?
ఏ విధమ్మున ప్రశ్న గ్రహింతు వీవు ?
ఏ విధమున ప్రతివచన మిత్తు వీవు ?

బోధిసత్త్వుడుత్తర మిచ్చుచు నిట్లనెను :

ధర్మమును, సంయమంబును దమము నెరుగ
నట్టివారలు నిద్రించు నవసరమున
ఏను దేవతి, మెలకువ బూనియుందు.

రాగములు ద్వేషము లవిద్యరహిత మైన
వారు దేవతా, జాగ్రదవస్థ నుండ
పండుకొందును నే; నిట్లు ప్రశ్న, బదులు
పడక, జాగరణంబును నడుపుచుంటు.

ఇట్లు బోధిసత్త్వుడు ప్రతివచన మిచ్చిన పిమ్మట వృక్షదేవత ప్రసన్న చిత్తముతో ఆయనను స్తుతించుచు తుదిగాథ పలికెను :

ఒరులు నిద్రింప మేల్కొనియుంట నీవు,
ఒరులు మేల్కొనియుండ పన్నుంట నీవు,
ప్రశ్నకుం బదులిచ్చుట బాగు బాగు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుని స్తుతించి వృక్షదేవత నిజవిమానమున కరిగెను :

శాస్త ధర్మోపదేశము అని జాతకములు సరిపోల్చెను. దేవత ఉత్పలవర్ణ; తపస్వి నేనే.

## 415 కుమ్మాసపిండ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మల్లికాదేవిని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఆమె శ్రావస్తిలోని ఒకానొక పెద్దమాలికూతురు. ఆమె రూపవతి, పుణ్యశీల. పదునారువర్షముల వయస్సునప్పుడు తక్కిన కుమారికలతో కలసి పుష్పోద్యానమునకు పోవుచుండెను. పోవునపుడు మూడుమినుపలడ్డువములను బుట్టలో పెట్టుకొనిపోయెను. నగరమునుండి యామె వెలువడు నప్పటికి, నిజదేహమునుండి కాంతి వెలువడుచున్న భగవానుడు భిక్షుసంఘముతో నగరమును ప్రవేశించుట కానబడెను. అప్పుడామె మూడులడ్డువములను కానుకగా ఆయనకు సమర్పించెను. శాస్త చాతుర్మహారాజిక దేవత లిచ్చిన పాత్రలో వానిని స్వీకరించెను. ఆమె తథాగతునిచరణములకు ప్రణమిల్లి, బుద్ధభక్తిప్రముదితయై ఒకపక్క నిలుచుండెను. శాస్త ఆమెను చూచి మందహాసము చేసెను. ఆనందుడు శాస్త ఏల నవ్వెనో యని యోచించి, ఆయన నడిగెను. దానికి కారణము తెలుపుచు శాస్త "ఈలడ్డువము లిచ్చుటచే యీామె ఈనాడే కోసలనరేశుని పట్టపుదేవి కాగల" దనెను. ఆమె ఆరామమునకు పోయెను.

ఆనాడే అజాతశత్రువుతో యుద్ధము చేసి కోసలనరేశుడు ఓడి, గుఱ్ఱముమీాద వచ్చుచున్న అతనికి గానము వినబడెను. తోడనే రాజు ఆమెయెడ ఆసక్తచిత్తుడై గుఱ్ఱమును ఆరామమువైపు నడపెను.

పుణ్యశీల యైన ఆకుమారి రాజును చూచి పలాయనము చేయక ముందరికి వచ్చి లగాముపట్టుకొనెను. రాజు గుర్రముమీద కూర్చుండియే, "నీకు సంరక్షకు డున్నాడా?" అనియడిగెను. ఆమె వృత్తాంతము తెలిసికొనినపిదప రాజు గుర్రముపై నుండి దిగి ఎండకు గాలికి అలసినవాడగుటచే కొలదిసేపు ఆమెయొడిలో పండుకొని విశ్రాంతిచెందెను. ఆవల రాజు గుర్రముమీద కూర్చుండబెట్టుకొని సేనాసహితముగ నగరప్రవేశము చేసెను. ఆవల ఆమెను ఇంటికి పంపి సాయంకాలము సన్నాహముతో సాదరముగా రావించి రత్నములపీఠముపై కూర్చుండబెట్టి అభిషేకము చేసి పట్టపురాణినిగా చేసెను. నాటినుండి ఆమె రాజునకు ప్రీతిపాత్ర యై, మనోరంజకురాలై పంచసద్గుణములతో కూడి పతిని దేవతగా పూజించుచుండెను. ఆమెకు బుద్ధునియెడ ప్రీతి గలదు. ఆమె బుద్ధదేవునకు మూడు లడ్డువములు సమర్పించుటచే ఈ సంపద లభించిన దని నగరమంతటను వ్యాపించెను.

ఒకనాడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై ఈ విషయము చర్చించుచుండగా శాస్త అచటికి పోయి సంగతి గ్రహించి, "భిక్షువులారా! ఇందు ఆశ్చర్యములేదు. ఒక సర్వజ్ఞబుద్ధునకు మూడు లడ్డువములు కానుకగా నిచ్చుటచే మల్లిక కోసలనరేశుని పట్టపుదేవి అయినది ఏల? బుద్ధుని గుణమహాత్మ్యముచే, పురాణపండితులు ప్రత్యేకబుద్ధునకు ఉప్పు గాని, తైలము గాని, చక్కెర గాని లేకుండ లడ్డువము లిచ్చిరి. తత్ఫలితముగా వారు రెండవజన్మలో మూడువందల యోజనముల విస్తీర్ణము గల కాశీరాష్ట్రమునకు ప్రభువు లైరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డొకానొక దరిద్రకుటుంబమున జన్మించి, పెద్దవాడయిన పిదప శ్రేష్ఠికడ కూలిపని చేయుచు పొట్టపోసికొనజొచ్చెను. ఒకనాడాయన బాజారుకు పోయి ప్రాతర్భోజనార్థము నాలుగులడ్డువములు తెచ్చుకొని, పొలమునకు పోవుచుండగా నలుగురు ప్రత్యేకబుద్ధులు భిక్షార్థము వారాణసివైపు చనుచు కానబడిరి. వీరు భిక్షార్థము పోవు

చున్నా రని తలచి తనకడ నున్న నాలుగు లడ్డువములను ఆయన వారి కీయ నెంచి, వారికడకు బోయి ప్రణామము చేసి, "భదంతులారా, నాకడ నాలుగు లడ్డువము లున్నవి. అవి తమ కీయదలచినాను. దయ యుంచి స్వీకరింపుడు. ఈ పుణ్యకార్యము బహుకాలము మేలు చేకూర్పగలదు" అనెను. వారు సమ్మతింపగా నతడు ఇసుకతో నాలుగు కుప్పలు చేసి, వానిపై సన్నరెమ్మలు పరచి, వానిపై ప్రత్యేక బుద్ధులను కూరుచుండబెట్టి దొన్నెలతో ఉదకము తెచ్చి, హస్తోదక మిచ్చి, నాలుగు లడ్డువములు పెట్టి, ప్రణామము చేసి "భదంతులారా, దీనిప్రభావమువలన దరిద్రగృహమున మరల పుట్టకుందును గాక! ఇయ్యది సర్వజ్ఞతాజ్ఞానమునకు కారణమగునుగాక! అని పలికెను.

ప్రత్యేకబుద్ధులు భోజనానంతరము దానానుమోదనము చేసి, లేచి, నందమూలపర్వతమునకు జనిరి. బోధిసత్త్వుడు చేతులు జోడించి, వారు కనుచూపుమేర దాటిపోవువరకును ప్రీతితో చూచుచు క్షేత్రమున నడచుచుండెను. ఆయన జీవించినంతకాలము ఆదానమును స్మరించుచుండెను.

మరణానంతరము ఆ దానప్రభావముచే నతడు వారాణసీనరేశుని పట్టపురాణికడుపున పుట్టినాడు. అతనికి బ్రహ్మదత్తకుమారు డని పేరు పెట్టినారు. అతనికి కాలినడక వచ్చునప్పటికి అద్దములో నిజబింబచ్ఛాయ వలె పూర్వజన్మవిషయము లన్నియు జ్ఞానబలమున గోచరించెను. తాను దరిద్రకుటుంబమున జన్మించుట, కూలి చేయుచు పొలమునకు పోవుట, ప్రత్యేకబుద్ధులకు నాలుగు లడ్డువము లిచ్చుట, ఆదానమునకు ఫలముగా రాజకుటుంబమున జన్మించుట— గోచరించెను.

ఆయన పెద్దవా డయినపిమ్మట తక్షశిలకు బోయి సమస్తవిద్యలు నేర్చి, మరలి వచ్చి, తండ్రిని దర్శించెను. తండ్రి సంతుష్టుడై అతనిని యువరాజును చేసెను. జనకునిమరణానంతరము ఆయన రా జయ్యెను. కోసలనరేశుని ఉత్తమకన్యక, రూపవతి, ఆయనపట్టమహిషి యయ్యెను. ఛత్రధారణసమయమున నగర మంతయు దేవనగరమువలె నలంకృత మాయెను.

రాజు నగరప్రదక్షిణము చేసి అలంకృత ప్రాసాదముపై కెక్కెను. అక్కడ ఎత్తయినప్రదేశమున శ్వేతచ్ఛత్రముక్రింద గూరుచుండి ఎల్ల

రను చూచెను. ఒకప్రక్క అమాత్యులు నిలిచియుండిరి. వేషభూష లతో కూడిన బ్రాహ్మణగృహపతు లొకప్రక్క నిలిచియుండిరి. ఇంకొక ప్రక్క నాగరకులు, అప్సరసలవలె అలంకృత లయిన పదునారువేల నర్తకీగణము నిలిచియుండిరి. అతిమనోహర మైన మహావైభవమును గాంచి ఆయన యిట్లు యోచించెను: "స్వర్ణఖచిత మై, కాంచన మాలాంకృత మైన యీ శ్వేతచ్ఛత్రము, వేలకొలది యీ గజములు, అశ్వములు, రథములు, వాహనములు, మణిముక్తాభరితము లైన భాండాగారములు, నానావిధధాన్యభరిత మైన ఈవిశాలపృథివి, అప్సరసలవంటిస్త్రీలు, ఈమహావైభవము—— వే రెవ్వరికడనుండి సంప్రాప్తింప లేదు; నలుగురు ప్రత్యేకబుద్ధుల కిచ్చిన లడ్డువములవలన కలిగినది." ఆయన ప్రత్యేకబుద్ధుల గుణములను జ్ఞప్తి చేసికొని, తాను చేసినపనిని ప్రకటించెను. పూర్వజన్మస్మృతివలన శరీరము ప్రీతిభరితము కాగా, ఆయన జనసమూహము నెదుట ఉదానగీతము పాడువా డై ఈ గాథలు పలికెను:

ఎవరు ప్రత్యేకబుద్ధుల కెంత చిన్న
దాన మిచ్చిన నైన వ్యర్థంబు కాదు;
ఎండి లవణవిహీనమా పిండిముద్ద
దాన మిచ్చితి, చూడుడు దానిఫలము.

గోవులును, వారువమ్ములు, కుంజరములు
ధనము, ధాన్యము నిండుగా ధరణితలము
అచ్చరలబోలు యువతులు నా యవాగు
ముష్టికిని ప్రతిఫల మని స్పష్టముకద.

తన ఛత్రధారణోత్సవదినమున బోధిసత్త్వుడు ప్రీతిభరితు డై ఉదానగీతరూపమున రెండు గాథలు పాడినాడు అప్పటినుండియు నర్తకీగణము, శేషనృత్తాకారాదులు, అంతఃపురములోనివా రందరు, నగరవాసులు, నానాప్రకారజనులు, పానశాలలకడ నుండువారలు, అమాత్యులు మొదలగువారు ఇది మన నరేశునకు ప్రియగీత మని దీనినే పాడదొడగిరి.

ఇట్లు కాలము గడచుచుండగా పట్టపురాణికి ఈగీతార్థము గ్రహింప వలె ననుకోరిక ఒకనాడు కలిగినది. కాని యామె బోధిసత్త్వుని అడుగు

టకు సాహసింపజాలకుండెను. ఒకనాడు రాజు ఆమెయెడ ప్రసన్నుడై "భద్రే, వరము కోరుము. ఇచ్చెదను" అని పలికెను.

"చిత్తము, దేవా, కోరుకొందును."

"ఏనుగులు, గుర్రములు మొదలగువానిలోనుండి నీ కేది కావలెను"?

"మీ దయవలన నేను ప్రత్యేకముగా కోరవలసిన వస్తువు లేదు. ఇట్టివస్తువులమీాద నాకు ప్రీతి లేదు. మీారు అనుగ్రహింపదలచినచో తమగీతమున కర్థము తెలుపుడు."

"ఈవరమువలన నీ కేమి లాభము? వేరొక వర మడుగుము."

"దేవా, వేరొకవరముతో నాకు పని లేదు. ఈవరమే కోరుకొందును."

"భద్రురాలా, తెలుపుదును. కాని నీ కొక్కతెకు ఏకాంతముగా తెలుపను. పండ్రెండు యోజనముల వారాణసిలో దండోరా వేయించి రాజద్వారమున రత్నమంటపము కట్టించి, రత్నసింహాసనము వేయించి అమాత్యబ్రాహ్మణులు, నాగరకులు, పదునారువేల స్త్రీలు పరివేష్టించియుండ, సింహాసనమునుండి అర్థము తెలుపుదును." చిత్తము దేవా, అని యామె అంగీకరించెను.

రాజు పూర్వోక్తప్రకారముగా సిద్ధము చేయించి జనమునడుమ రత్నసింహాసనమున దేవతలనడుమ ఇంద్రునివలె విరాజిల్లెను. దేవియు సర్వాలంకారవిభూషితయై, స్వర్ణాసనము వేయించి, కనుగొలకుల నుండి చూచి, పీఠముపై గూరుచుండి, "దేవా, మీారు పాడెడి గీతార్థమును ఆకసమున చంద్రునివలె ప్రసన్నులై ప్రకాశించుచు వివరింపుడు" అని ఈ గాథ పలికెను:

రాజకుంజర, ధర్మకర్మా,
రాష్ట్రవర్ధన, నీవు రక్తిని
పలుకు గాథల కర్థ మేమో
ప్రశ్న చేయుదును.

బోధిసత్త్వుడు నిజగాథల కర్థము ప్రకటము చేయువాడయి ఈ నాలుగు గాథలు పలికెను:

పుట్టి యీనగరమ్మున పొట్టపోసి
కొనగ శీలంబుతో నేను గూలిచేయు
చుండి, పోవుచు పొలమున కొక్కనాడు
శ్రమణులన్, నల్వురన్ సదాచారయుతుల
ఆసవవిహీనులను శమితానురాగ
జాతవేదుల గనుగొన శ్రద్ధ పొడమె.

అంత ప్రత్యేకబుద్ధుల కాను లంచు
విడివిడిగ పిండిముద్దలు పెట్టినాను.
నిర్మలమనస్సుతోడ, తత్కర్మఫలము
కలిగె నుత్తమరాజ్యభోగములు నాకు.

ఈ విధముగా బోధిసత్త్వుడు తనకర్మఫలమును విస్తరించి చెప్పగా ప్రసన్నచిత్తురా లయిన దేవి "మహారాజా, మీరు దానఫలమును ఈ ప్రకారము ప్రత్యక్షముగా గ్రహించియున్నారు. నేటినుండి ప్రతి దినము ఒక్కమాషపిండము ధార్మికశ్రమణబ్రాహ్మణులకు పెట్టిన పిమ్మట భోజనము చేయుచుందము" అని బోధిసత్త్వుని స్తుతించునదై ఈ గాథ పలికెను:

ఉత్తమకర్మము లొనరించు నీవు
ఒసగి దానమ్ముల నొందు భోగముల;
చక్రంబు నడపు మీ చందాన రాజ!
ధర్మమార్గ భ్రష్టతన్ జెంద బోకు,
ధర్మపాలన చేయదగు కోసలేశ.

బోధిసత్త్వుడు ఆమెవాక్కు లంగీకరించి ఈ గాథ పలికెను:

అనుసరించినవార లేయధ్వమార్యు
లనుసరించెద శోభనా, ఆసరణినె,
అర్హతుల చూడ కోసలా, ఆప్త నాకు.

ఇట్లు పలికి రాజు దేవీసౌందర్యమును విలోకించుచు "భద్రే, నా పూర్వజన్మములో చేసిన కుశలకర్మను నీకు సవిస్తరముగా తెలిపినాను. ఈ స్త్రీలతో రూపమున గాని, హావభావములలో గాని నీకు సాటి వచ్చునది లేదు. ఈ సంపద నీకు లభించుట కెట్టి సత్కర్మము చేసితివో" అనుచు ఈ గాథ పలికెను:

అచ్చరవిధాన వనితలయందు నీవు
శోభిలెదు భద్రురాల, యేశుభదకర్మ
వలన రూపము కోసలా, కలిగె నీకు ?

ఆమె పూర్వజన్మలో చేసిన కుశలకర్మను వివరించుచు ఈ రెండు గాథలు పలికెను:

అంబష్ఠనామకం బైన క్షత్రియకుటుం
బము వారి దాసిగా పనిపాటలను చేయు
చుంటి; పాపము చేయకుండ శీలమ్ముతో,
చరియించుచున్ ధర్మసరణిలో నెల్లపుడు.

ఒకనాడు భిక్షుకుం డోదనార్థము వచ్చె,
అతని కిచ్చితి మదీయాహారభాగంబు
నే నుంటి సంతుష్ట మానసంబున నపుడు
ఆకర్మఫలముగా నా కియ్యది లభించె.

ఈవిధముగా నుభయులు తమతమ పూర్వజన్మకర్మలను వివరించిరి. నాటినుండి నాలుగు నగరద్వారములకడను, నగరములలోపలను, నివాసద్వారముల దగ్గరను ఆరు రాజశాలలను నిర్మించి జంబూద్వీప మం దంతటను చాటింపించి, మహాదానములు చేసిరి. ఇరువురును సదా చారు లై ఉపోసధకర్మ చేయుచు, తుదకు స్వర్గగాము లయిరి.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున దేవి రాహుల మాత; రాజు నేనే.

## 416 పరంతప జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు దేవదత్తవధోద్యోగమునుగూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

అప్పుడు ధర్మసభలో సంభాషణ జరుగుచుండెను. శాస్త అరుదెంచి విషయము గ్రహించి "భిక్షువులారా, అత డిప్పుడే కాదు, పూర్వము

కూడ నన్ను సంహరించుటకై ప్రయత్నముచేసినాడు. కాని నాలో కంపమైనను కలిగింపలేక తానే దుఃఖముపొందెను" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ.

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఆయనపట్టపు దేవికడుపున బుట్టి పెరిగి పెద్దవాడై తక్షశిలకు బోయి, సమస్తవిద్య లభ్యసించి, సమస్తప్రాణులకంఠధ్వనులను గురుతింపనేర్చెను. ఆతడాచార్యునిబోధను శ్రద్ధతో గ్రహించి, వారాణసికి మరలివచ్చెను. తండ్రి అతనిని యువరాజును జేసెను. అయినను అతడు తండ్రిని సంహరింపనెంచుచుండెను. ఈ కారణముచే నాతడు తండ్రిని చూడనైన తలపెట్టలేదు.

తనబిడ్డలిద్దరిని వెంటగొని ఒకనక్క రాత్రివేళ జనులు పండుకొన్నప్పుడు కూతపెట్టకుండ నగరములో ప్రవేశించెను. బోధిసత్త్వుని సౌధమున శయనాగారముకడ నొకశాలలో ప్రయాణికుడు కాలిజోడు కాళ్ళకడ నేలపై నుంచి బల్లపై పండుకొనెను. ఆతని కింకను నిద్రపట్టలేదు. అప్పుడు నక్కబిడ్డలు ఆకలిచే నరచినవి. తల్లినక్క "బిడ్డలారా, ధ్వనిచేయవలదు. ఈ శాలలో బాటసారి కాలిజోడు నేలపై నుంచి బల్లమీాద పండుకొన్నాడు. అతనికి నిద్ర పట్టినపిమ్మట కాలిజోడు తెచ్చి తినుటకై మీా కిచ్చెదను" అని చెప్పెను.

బోధిసత్త్వుడు మంత్రబలముచే దానివాక్కులు గ్రహించి, శయనగృహము వెలువడి కిటికీ తెరచి 'ఎవ రక్కడ?' అనెను.

"దేవా, నేను బాటసారిని" "నీకాలిజో డెచ్చట నున్నది?"

"దేవా, నేలపై నున్నది." "తీసి, పైన పెట్టుకొమ్ము."

నక్కకు బోధిసత్త్వునిపై కోపము వచ్చెను. నక్క మరల నొకనాడు నగరములో బిడ్డలతో ప్రవేశించెను. తాగి మత్తిల్లినవా డొకడు నీటికై పుష్కరిణికి బోయి, జారి నీటిలో బడిపోయి ఊపిరి తిరుగక చనిపోయెను. వాని రెండవవస్త్రములో వేయి కార్షాపణములు మూటకట్టియున్నవి. వ్రేలికి ఉంగర ముండెను. నక్కబిడ్డ లాకలితో నేడువజొచ్చినవి. "నాయనలారా, చప్పుడు చేయవలదు. ఈపుష్కరిణిలో

మానిసి మునిగి చచ్చినాడు. మెట్లపై బడియున్నాడు. మీరు తినుట కీతనిమాంసము తెచ్చెదను" అని తల్లి పలికెను

బోధిసత్త్వు డీవాక్కులు విని శాలలోనికి వచ్చి, ఎవ రక్కడ అని కేకవేసెను. ఒకడు లేచి "దేవా, నేను" అని పలికెను. "నీవు పోయి ఆపుష్కరిణిలో చచ్చిపడియున్నవాని వస్త్రములో వేయికార్షాపణ ములు, వ్రేలి ఉంగరము తీసికొని శవము పైకి తేలకుండునట్లు నీటిలో ముంచి గమ్ము" అని అత డాన తిచ్చెను. వా డాప్రకారమే చేసెను. మరల కోపము వచ్చి నక్క "నీవు మొదట నాబిడ్డలకు కాలిజోడు దక్కనీయలేదు. ఇప్పుడు శవమును దక్కనీయలేదు. మంచిది! నేటికి మూడవనాడు శత్రురాజు వచ్చి నగరము చుట్టుముట్టును. అప్పుడు తండ్రి నిన్ను యుద్ధమునకు బంపును. అచ్చట శత్రువులు నీశిరస్సు ఖండింతురు. అంతట నీకంఠరక్తము త్రాగి పగతీర్చుకొందును. నీవు నాతో వైరము పెట్టుకొన్నావు. మంచిది! చూచెదను" అని నగరము వెలువడెను.

మూడవనాడు శత్రురాజు వచ్చి నగరము ముట్టడించెను. రాజు కుమారునితో "నాయనా, నీవు పోయి శత్రువుతో యుద్ధము చేయుము" అనెను. "దేవా, నే నొకసంగతి చూచితిని. పోవుటకు ధైర్యము చాలదు. మృత్యుభయము కలుగుచున్నది." నీవు మరణించినను మర ణింపకున్నను నా కేల? నీవు వెళ్ళకతప్పదు." సరే అని బోధిసత్త్వుడు పలికి శత్రువు కెదురుగా నున్న ద్వారము తెరవక వేరొకద్వారము తెరపించి తనయనుయాయులతో వెడలిపోయెను. ఆయన వెలువడి నంతనే నగరమంతయు ఖాళీయయ్యెను. ఎల్లరు నగరము విడిచి వెలు పలికి జనిరి. అనుకూలప్రదేశమున నతడు శిబిర మేర్పాటు చేయించెను.

"యువరాజు నగరము ఖాళీచేయించి సైన్యమును వెంటగొని పోయినాడు. శత్రురాజు నగరము ముట్టడించి యున్నాడు. ఇక ప్రాణ ములు దక్కవు" అని రాజు తలపోసి, రాణిని, పురోహితుని, పరంతపు డను సేవకుని వెంటబెట్టుకొని, వేషము మార్చి, రాత్రివేళ పలాయ నము చేసి, అడవిలో జొరబడెను. తండ్రి పలాయితుడయ్యె నని విని, బోధిసత్త్వుడు నగరములో ప్రవేశించి, శత్రురాజును యుద్ధమున పార ద్రోలి, తాను పట్టాభిషిక్తు డయ్యెను.

ఆతనితండ్రి నదీతటమున కుటీరము నిర్మించి కందమూలఫలములు తినుచు కాలము గడపుచుండెను. రాజును, పురోహితుడును కందమూల ఫలములు తెచ్చుటకై అరణ్యములోనికి బోవుచుందురు. పరంతపుడు కుటీరములో రాణికడ నుండును.

రాణి గర్భవతి యయ్యెను. నిరంతరము సమీపమున నుండుటచే రాణికి పరంతపునితో స్నేహ మయ్యెను. ఒకనా డామె వానితో "మనసంగతి రాజునకు తెలిసినచో మనప్రాణములు దక్కవు. కావున ఆయనను సంహరింపుము" అని చెప్పెను. "ఎట్లు సంహరింతును?" "రాజు నీచేతికి ఖడ్గము వస్త్రము ఇచ్చి, స్నానమునకు గొనిపోవుచుండునుకదా? స్నానముచేయుచోట ఆయన యేమరుపాటున నున్నప్పుడు నీవు ఖడ్గముతో ఆయనశిరస్సు ఖండింపుము. శరీరము ముక్కలు ముక్కలుగా నరికి పాతిపెట్టుము." వా డంగీకరించెను.

ఒకనాడు పురోహితుడు కందమూలఫలములు తెచ్చుటకై బయలుదేరి రాజు స్నానము చేయుప్రదేశమునకు కొలదిదూరములో నొకచెట్టుపై కెక్కి పండ్లుకోయుచుండెను. రాజు పాలుమాలికతో నుండుట గమనించి పరంతపు డాయనమెడ పట్టుకొని కత్తి పైకెత్తెను. మరణభయమున రాజు కేకలు వేసెను. చెట్టుపై నున్న పురోహితుడు రాజసంహారము చూచి భయమున కొమ్మవిడిచి చెట్టు దిగి, దగ్గరపొదలో దూరి కూరుచుండెను. ఆయన చెట్టుదిగునప్పుడు అయినచప్పుడు పరంతపుని చెవిలో బడెను. వాడు రాజును చంపి, నేలలో పూడ్చిపెట్టినపిమ్మట, చప్పుడు బయలుదేరినచోటికి బోయిచూచెను. ఎవ్వరును కానరాలేదు. ఆవల వాడు స్నానము చేసి, కుటీరము చేరెను. వాడు వెడలిపోయినపిమ్మట పురోహితుడు రహస్యప్రదేశమునుండి యీవలకు వచ్చి పరంతపుడు రాజును పాతిపెట్టినట్టు గ్రహించి, పోయి స్నానము చేసి తననుగూడ వాడు చంపునేమో యనుభయముచే గ్రుడ్డివానివలె నటించుచు కుటీరమునకు వచ్చెను. "బ్రాహ్మణా, ఏమి చేసితివి?" అని పరంతపు డనెను. "దేవా, నాదృష్టి చెడిపోయినది. తెలియక అడవిలో విషసర్పమున్న పుట్టకడ నిలిచియుంటిని. సర్పము నాకన్నులపై విష మూదియుండును" అని పురోహితుడు వినయముతో పలికెను. "ఇతడు నన్ను గురితింపలేకున్నాడు. దేవా, యనుచున్నాడు. ఈతని నోదార్చెదను" అని తలచి

వాడు "బ్రాహ్మణోత్తమా, విచారింపకుము. నిన్ను పోషింతును" అని పలికి ఫలమూలాదు లిచ్చి సంతుష్టచిత్తుని జేసెను. నాటినుండి పరంతపుడే ఫలమూలాదులు తెచ్చుచుండెను. రాణి కుమారుని కనెను. పుత్రుడు పెరిగినపిమ్మట ఒకనాడామె సుఖముగా కూర్చుండి పరంతపునితో మెల్లగా "రాజును నీవు చంపునపుడు నీ కెవరైనను కనబడి నారా?" అని యడిగెను. "న న్నెవరును చూడలేదు. కొమ్మరాసు కొన్న చప్పుడు మాత్రము వినబడినది. ఆకొమ్మను మానవుడు లాగెనో జంతువు లాగెనో తెలియదు. ఎన్నడైన నా కాపదకలుగునేని ఆప్రదేశమునుండియే కలుగును" అని వాడు ఈ తొలిగాథ పలికెను:

అలముకొనవచ్చు పాప భయాలు నన్ను;
జంతువో, నరుడో యూపె శాఖ నపుడు.

పురోహితుడు నిద్రించుచుండె నని వారు తలచిరి. కాని ఆయన మేలుకొనియుండియే వారిసంభాషణ వినుచుండెను.

ఒకనాడు పరంతపుడు వనమునకు కందమూలఫలములకై పోయినప్పుడు పురోహితుడు చనిపోయిన తనభార్యను స్మరించి విలపించుచు రెండవ గాథ పలికెను:

అనతిదూరనివాసిని యైన పిరికి
దానిపై కోర్కి దుర్బలత్వమ్ము పొందు
తలు కలుగు శాఖచే పరంతపునికట్లు.

బ్రాహ్మణు డిట్లు గాథ పలుకుచుండెనే కాని అర్థము చెప్పకపోవుటచే రాణి గ్రహింపలేక "బ్రాహ్మణోత్తమా, ఏ మనుచున్నారు?" అని యడిగెను. "ఇట్లే కొంచెము కనబడినది" అని బ్రాహ్మణుడు మూడవ గాథ పలికెను:

గ్రామమున నా యనిందితకాంత కలదు
తద్వియోగాన దుర్బలత్వమును పొందు
తలు కలుగు శాఖచే పరంతపునికట్లు.

మరల నొకనా డాయన నాలుగవ గాథ పలికెను:

నీలనేత్రకోణ, నీ చిరునవ్వులు
కూర్మి భాషణములు కూర్చుచుండు

కార్శ్యపాండుతలను కదలుచుండెడి శాఖ
అపరంతపునకునట్లు నాకు.

కుమారుడు పెరిగి పదునారేండ్లవా డయ్యెను. బ్రాహ్మణునిచే కర్ర పట్టించి కుమారుడు స్నానప్రదేశము చేరగా పురోహితుడు కన్నులు తెరచెను. "బ్రాహ్మణోత్తమా, అంధులు కారా మీరు?" అని రాజకుమారు డడిగెను.

"కాను. ఈ యుపాయ మవలంబించి ప్రాణములు దక్కించుకొన్నాను. నీ తండ్రి నెరుగుదువా?" "పరంతపుడు నాతండ్రి." "కాడు, వీడు నీతండ్రి కాడు. నీతండ్రి వారాణాసీనరేశుడు. పరంతపుడు మీ దాసుడు. వీడు నీతల్లి ని మరగి, తండ్రిని సంహరించి యిచ్చట పాతిపెట్టినాడు" అని నేల త్రవ్వి, ఎముకలు తీసి చూపెను. కుమారుడు మహాక్రోధపరవశుడై "ఇప్పు డేమి చేయుదము?" అనెను. "ఇచ్చట నీతండ్రిని వా డేమి చేసెనో వాని నదే చేయుము." బ్రాహ్మణుడు సమస్తము వివరించి, కొన్ని దినములు కుమారునకు కత్తిసాము నేర్పెను.

ఒకనాడు కుమారుడు పరంతపునితో "నాయనా, స్నానమునకు బోవుదము" అని ఖడ్గము, వస్త్రము తీసికొనెను. మంచి దని వాడు కుమారుని వెంట జనెను. స్నానమునకై వాడు నదిలోనికి దిగుచుండ కుమారు డెడమచేతితో వానిజుట్టు పట్టుకొని, కుడిచేతితో కత్తి పైకెత్తి "ఇక్కడ ఆక్రందనము చేయు నాతండ్రిని జుట్టుపట్టుకొని వధించినావు. నిన్ను గూడ అట్లే చేయుదును" అనెను. వాడు మరణభయమున ఏడ్చి మొత్తుకొనుచు రెండు గాథలు పలికెను:

నిశ్చయముగ చేరె నినదంబు నీ చెవిన్
వాడు నీకు తెలిపినాడు నిజము.

నాదు పూర్వచింత నీ దాక చేరెను:
జరిగినట్టి దెల్ల సాక్షి చెప్పె.

అపుడు శాఖ కదిపి నట్టి వారెవ్వరో
ఎరుగనైతి నేను : నరుడొ, పశువొ.

అప్పుడు కుమారుడు తుదిగాథ పలికెను:

చంపితివి మోసగించి నా జనకు నిట్లు,
మరుగుచేసితి వీవు కొమ్మలకు నడుమ,
తెలిసె నావల కొమ్మలవలన భీతి.

ఇట్లు పలికి కుమారుడు వాని నంతమొందించి, భూమిలో పాతిపెట్టి, కొమ్మలతో కప్పెను. పిమ్మట కత్తికడిగి, స్నానము చేసి, కుటీరమునకు వచ్చి, సేవకుని అంతమొందించినట్లు పురోహితునకు సంజ్ఞచేసి, తల్లిని పరిహాసించెను. ఇక నిక్కడ నేమి చేయుదు మని ముప్వురును వారాణసికి బోయిరి.

బోధిసత్త్వుడు తమ్మునకు రాజ్య మిచ్చి, దానాదిపుణ్యకార్యములు చేయుచు తుదకు స్వర్గలోకపరాయణు డయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము ఆర్యసత్యప్రకాశము కావించి, జాతకములు సరిపోల్చెను. ఆకాలమున తండ్రిరాజు దేవదత్తుడు; పురోహితుడు ఆనందుడు; పుత్రరాజు నేనే.

# జాతక కథలు

చతుర్థ సంపుటి

**4**

పాలీభాషనుండి ఆంధ్రీకరించినది.

స్వామి శివశంకర శాస్త్రి




ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-4

# విజ్ఞాపన

మా తాతగారు ఏబది సంవత్సరములకు పూర్వము పాలి భాష అభ్యసించినప్పుడు బుద్ధజాతక కథలు ఆంధ్రీకరింపదలపలేదు; అభిధమ్మ పిటకములోని కొన్ని ముఖ్యగ్రంథములు ఆంధ్రలోకమునకు అనువాదరూపమున ఎరుకపరచ నెంచిరి. త్రిపిటకాచార్యత్వము వారిఆశయము. కాని, అవకాశములు లేక ఆభావము విడనాడవలసి వచ్చినది.

తరువాత బహుకాలమునకు మేమందరము కథలు చెప్పుడని తరచుగా నిర్బంధించుచుండుటచే జాతకకథలను వారు అనువదింప మొద లిడిరి. బ్రహ్మదేశ, సింహళదేశ, లిపులలోని పాఠము సరి అయినది కాదని, శ్యామదేశ (థాయిలాండ్) ప్రభువు ప్రకటించిన త్రిపిటక సందోహము లభ్యము కాక, తుదకు రోమక లిపిలో prof Vincent Fausboll అను డెన్మార్కు విద్వాంసుడు సంపాదించిన పాలి పాఠము ననుసరించినారు. "జాతకాట్ఠక వణ్ణనా" లోని వ్యాఖ్యానభాగములను మాత్రము విడిచి, మాతృకను యథాతథముగా సరళగ్రాంధికశైలిలో అనువదించినారు.

ఇందలి మూడుసంపుటములు కేంద్రప్రభుత్వమువారి ద్రవ్యసాహాయ్యమున మేమే ప్రకటించినాము. ఇంత మహాకోశమును ప్రకటించుట కష్టసాధ్యము. మా తాతగారి కృషిని గమనించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు చతుర్థ పంచమ సంపుటముల ప్రకటన దయతో స్వీకరించినారు, మహాసంస్థ అయిన అకాడమీకి- విశేషించి, తదధ్యక్షులు మహామాన్య శ్రీ డా. బెజవాడ గోపాల రెడ్డి గారికిని, కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజ రావు గారికిని మా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈ మహాసంకలనము ప్రపంచకథానికా వాఙ్మయములో ప్రథమము. ఈ సందోహమును సమగ్రముగా పఠించుచో ప్రాచీన భరతవర్షమునకు సంబంధించిన నాగరకతాసభ్యతలు గ్రహింపవచ్చును. దీనినిగూర్చి తాతగారు విడిగా విపుల గ్రంథము రచింపదలచి యున్నారు.

సాహితీసమితి, ఒంగోలు.
సౌమ్య మహాశివరాత్రి
మార్చి 6, 1970.

తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి
(M.A., Ph. D.)

## 417 కచ్చాని జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మాతృ సేవాసక్తు డగు ఉపాసకుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తి నగరమున ఒకానొక యువకుడు, మిక్కిలి సదాచారసంపన్నుడు. పితృమరణానంతర మతడు తల్లిని దేవతగా నెంచి సేవించుచుండెను. అతడు తల్లికి పలు దోముకొను సామగ్రియు, స్నానమునకు జలాదికమును సిద్ధము చేయుచు ఒడలు తోముచు యవాగు పానీయ మొసగుచు పోషించుచుండెను. ఒకనాడు తల్లి అతనితో "నాయనా, నీవు ఇంట చేయవలసిన పని వేరొకటికూడ కలదు. నీవు యుక్తమైన వంశమునుండి కన్యను గ్రహింపదగును. ఆమె నాకుగూడ సేవ చేయగలదు. నీవుగూడ నిజకార్యములను నిర్వర్తింప వచ్చును" అని చెప్పెను.

"అమ్మా, నేను శ్రేయఃకాంక్షినై నీకు సేవ చేయుదును. మరి యెవరు చేయగలరు ?"

"వంశాభివృద్ధి చేయవలెను నాయనా !"

"నాకు గార్హస్థ్యముమీద ఇచ్ఛ లేదు. నీసేవ చేయుచు, నీయనంతరము ప్రవ్రజించెదను."

"నీకు సర్వవిధముల యోగ్యురాలగు కన్య లభించినచో వివాహ మాడు" మని తల్లి మాటిమాటికి బోధించెను. అతని కిష్టము లేకున్నను ఆమె తగినకన్యను కొని తెచ్చెను. అతడు తల్లియెడల ఔదాసీన్యము వహింపక ఆమెతో కలిసియుండెను. ఆయువతి తనలో "నా భర్త మిగుల నుత్సాహముతో మాతృసేవ చేయుచున్నాడు. నేనుగూడ ఇట్లే చేయునెడల ఆమెకు ఇష్టురాలి నగుదును" అని తలపోసి అత్తగారికి బాగుగా సేవ చేయుచుండెను. భార్య తనతల్లికి సేవ చేయుచుండుట గమనించి అతడు కానవచ్చిన మధురఖాద్యములను తెచ్చి యిచ్చుచుండెను. కొంతకాలమున కామె తనలో "ఇతడు మధుర పదార్థములను నాకిచ్చుచున్నాడు. ఒకవేళ తల్లిని సాగనంప దలచియుండును. ఆమెను గెంటివేయు మార్గము చూచెదను" అనుకొని

ఒకనాడు అనుచితరీతితో “స్వామీ మీరు వెలుపలికి అరిగినపిమ్మట మీఅమ్మగారు నన్ను దూషింతురు” అని పలుకగా అతడు మిన్నకుండెను.

అనంతర మామె అత్తగారికి ఉత్తేజనము కలిగింపవలె ననియు, దానివలన తల్లి కుమారునితో జగడ మాగు ననియు తలపోసెను. నాటినుండి వ్యంజనము వడ్డించినపుడు వేడిగా నుండవలసినప్పుడు చల్లబడిన పదార్థమును, చల్లగా నుండ వలసినప్పుడు వేడిపదార్థమును వడ్డించుచు, పదార్థములలో ఉప్పు ఎక్కువగా గాని, తక్కువగా గాని వేయుచుండెను. పదార్థము చల్లారిన దని గాని ఉడుక లే దనిగాని పక్వము లే దని గాని, ఆమె అన్నపుడు అరచుచు “ఇపుడు బాల వేడిగా నున్నది. ఉప్పు ఎక్కువగా నున్నది అందువు. నిన్ను ఎవరు సంతోష పెట్టగలరు ?” అనెడిది. నీరు మరగబెట్టి వీపుమీద పోసెడిది. “అమ్మో, వీపు కాలినది.” అని ఆమె అనుచో, చల్లని నీరు తెచ్చి కుమ్మరించెడిది. నీరు మిగుల చల్లగా నున్న దన్నప్పుడు చుట్టుపక్కలవారితో చెప్పెడిది. వేడిగా నున్న దన్నచో “నిముషమున కొకమాట ! ఎవ్వ రీఅవమానము సహింప గలరు ?” అనియెడిది.

వృద్ధురాలిని మాటలతో వేధించుటయే గాక కోడలు నేల ఊడ్చి దుమ్ము రేపును. “ఇల్లంతయు ఎవ్వరు గలీజు చేయుచున్నారు ?” అని భర్త అన్నపుడు మీ అమ్మగా రని భార్య బదులు చెప్పెడిది. “ఇట్టిసోమరితో నిష్ప్రయోజన మగు గృహమున నివసించుట దుస్సహము. ఈమెను కాని నన్ను గాని ఎవరో ఒకరిని ఉండనిచ్చుట మంచిది” అనుమాటలు విన్నపుడు అతడు “భద్రే ! నీవు చిన్నదానవు. నీ వెచ్చటి కైనను పోయి పొట్ట పోసికొన గలవు. కాని నాతల్లి ముసలిది. నేనే ఈమెకు అండ. నీవు బయలుదేరి నీపుట్టింటికి పొమ్ము” అనెడువాడు. ఆ మాటలు విన్నపుడు ఆమె బెదరుచుండెడిది. ‘ఇతడు తల్లితో పోరాడ లేడు. ఏటు చూచినను ఇతడు తల్లి మీద ప్రీతి కలవాడు. నేను పుట్టింటికి పోవుచో అనాథవలె బాధ పడుచుండ వలెను. నేను మొదటివలెనే అత్తగారిని ప్రసన్నురాలిని చేసికొని ఉపచారములు చేయుచుందును” అని తలపోసి ఆమె పూర్వము వలెనే సేవలు చేయుచుండెను.

ఆ యుపాసకుడు ఒకనాడు ధర్మోపదేశము వినుట కొరకు జేతవనమునకు జని, శాస్తకు ప్రణమిల్లి, ఒక ప్రక్కగా కూరుచుండెను. శాస్త అతనిని చూచి “ఉపాసకా, పుణ్యకర్మలు చేయుటవలన హాని కలుగదు. మాతృసేవ జరుగు చున్నదా ?” అనెను.

"భర్తా! నా కిచ్చ లేకున్నను నాతల్లి ఒకానొక కుటుంబమునుండి కన్యను గొనివచ్చినది. ఆమె పొరపాటు చేసినది. ఆమెకు నాతల్లితోను నాతోను సరిపడ లేదు. ఇప్పుడు బాగుగా సేవలు చేయుచున్నది" అని విన్నవించెను. శాస్త విని "ఇప్పుడే కాదు నీ వామెతో చెప్పకుండుట. పూర్వము భార్యమాటలు విని తల్లిని వెడల గొట్టితివి. ఆవల నా వాక్కులు విని మరల ఆమెను ఇంటికి గొనివచ్చి సేవలు చేసితివి" అని, ఉపాసకుడు ప్రార్థింపగా పూర్వకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఒకానొక కులపుత్రుడు తండ్రి మరణానంతరము తల్లిని దేవతగా భావించి సేవ చేయుచుండెను. "నే నీ విధముగా కాలకణ్ణితో గలిసి నివసింపలేను. ఈమెను గాని నన్ను గాని ఇంట నుండ నిమ్ము" అని భార్య పలుకగా తల్లిదే దోష మని తలచి కుమారుడు "అమ్మా, నీవు సదా జగడ మాడుచున్నావు. ఇచ్చటినుండి బయలుదేరి నీ యిచ్చ వచ్చినచోటికి పొమ్ము" అని చెప్పెను. సరే అని ఆమె గోడ్చుచు ఇలు వెడలి మిత్రగృహమున జేరి కూలిచేయుచు బాల కష్టము మీద కాలము గడుపుచుండెను. అత్త వెడలిపోయిన తర్వాత కోడలికి గర్భము నిలిచెను. ఆమె భర్త తోడను ప్రక్కయింటి వారితోడను ఆ కాలకణ్ణి ఇంట నున్నపుడు నాగర్భము నిలువ లేదు. ఇప్పుడు నిలిచినది" అని చెప్పెను. క్రమముగా ఆమెకు కుమారుడు కలిగెను. "మీతల్లి యింట నున్నపుడు నాగర్భము నిలవలేదు. ఇపుడు కుమారుడు పుట్టినాడు. దీనిని బట్టి చూడ మీతల్లి కాలకణ్ణి" అని భార్య పలికెను.

ఈ సంగతి తెలిసి తల్లి కుమారుడు తనను వెడలగొట్టినను వానికి పుత్రుడు పుట్టుట విని "లోకములో నిజముగా ధర్మము నశించినది. ధర్మము నశింపనిచో తల్లిని వెడలగొట్టిన వారికి పుత్రులు పుట్టరు. వాడు సుఖముగా నుండడు. నేను ధర్మమున కంత్యక్రియలు చేయుదును" అనుకొని ఒకనాడు తిలపిష్టము, తండులములు, వంట చేయుటకు గిన్నె గరిటెయు తీసికొని శ్మశానమునకు బోయి మూడు శవముల తలలు పొయ్యివలె నేర్పరచి, నిప్పు చేసి, నీటికోసముపోయి తలనిండ స్నానము చేసి, పొయ్యివద్దకు వచ్చి జుట్టు విరియబోసికొని తిలలు కడుగ జొచ్చెను.

అప్పుడు బోధిసత్త్వుడు శక్రపదవియందుండెను. ఆయన లోకమువైపు దృష్టి సారింపగా ఈమె కానవచ్చెను. శక్రుడు తన ప్రభావము చూప నెంచి బ్రాహ్మణ వేషము ధరించి మార్గమున బోవువానివలె నామెను జూచి ప్రక్కకు వచ్చి "అమ్మా, శ్మశానములో నీ వంట చేయుట, ఉడికిన ఈ పదార్థములతో నేమి చేయుదువు?" అని యడుగుచు ఈ తొలిగాథ పలికెను.

ధౌతవస్త్రమ్ముతో తడివెంట్రుకలతోడ
కాత్యాయనీ, ఏమి కారణం, బెక్కించి
కడవను ప్రోయ్యిపై కడిగదు నువ్వులన్
తండులంబుల తిలోదన మేరికోసమో ?

ప్రత్యుత్తరముగా ఆమె రెండవగాథ పలికెను.

భూసుర, ఈవంట భుజియింపగాదు
ధర్మమ్ము నశియించె దానికి శ్రాద్ధ
మీశ్మశానమ్మునందే నొనరింతు
బాగుగా నుడికిన యోగిర మిచ్చి.

శక్రుడు మూడవగాథ పలికెను.

నీతోడ కాత్యాయనీ, ధర్మనాశ
వార్తను చెప్పినవార లెవ్వారు ?
ఎంటి గానని మహాశక్తితో గూడి
వేయికన్నులతోడ వెలయుచున్నాను.
సత్యధర్మమ్ము నాశము చెంద దెపుడు.

ఆమె రెండుగాథలు పలికెను.

ధర్మము నసించె ననుమాట తథ్య మార్య !
దాని కున్నది ప్రబలనిదర్శనమ్ము :
ఎంపు లగువారు సౌఖ్యముల్ వడసినారు.
నన్ను కొట్టెడికోడలు నున్న వంధ్య,
పుట్టెనామె కిప్పుడు పుత్రుడు, డాపె

అఖిలవంశానికి ప్రథమురాలు నేడు !
అనద నేకాకినిం గూడ నైతి నేను.

శక్రుడు ఆరవగాథ పలికెను.

ఏను శాశ్వతముగ నుందు, నిపుడు నేను
అరుగుదెంచితి నీకయి త్వరితముగను
నిన్ను మోదుచు మును, పుత్రు గన్నదాని
పుత్రసహితంబుగా నేడు బూది సేతు.

విని యామె తనను నిందించుకొని కోడలు సుఖముగా నుండుటకై యేడవ గాథ పలికెను.

సాకోరక ఇచ్చటికి వచ్చినాడవేని,
అగునేకల దేవరాజ, నీకభిమతంబు,
కోడలును, పౌత్రుడును, నేను, కొడుకు గూడ
ఒక్కయింట సుఖనివాస ముండవలయు.

అంతట శక్రుడు ఎనిమిదవగాథ పల్కెను :

నీకు నగునేని కాత్యాయనీ, యభిమత
మొందియును బాధ ధర్మమ్ము నుజ్జగింప
కుందువేనియు సమ్మోద మొదవుగాక
కొడుకు కోడలు మనుమని గూడి యుంట.

ఇట్లు పలికి శక్రు డాభరణభూషితుడై నిజప్రభావమున ఆకసమున నిలిచి "కాత్యాయనీ, భయము లేదు. నాప్రభావముచే త్రోవలోనే నీకుమారుడు, నీకోడలు క్షమాపణ వేడి నిన్ను గృహమునకు గొనిపోవునట్లు చేయుదును. అప్రమత్తురాలవై యుండుము" అని చెప్పి నిజస్థానమునకు బోయెను. శక్రప్రభావమువలన వారామెను స్మరించి గ్రామము చేరి మాతల్లి యెచట నున్నదనిరి. శ్మశానమువైపు వెడలినదని గ్రామీణులు చెప్పిరి. అంతట వారు 'అమ్మా, అమ్మా' యనుచు శ్మశానము వైపు పరుగెత్తి పోయి ఆమెకాళ్ళపై బడి "మాదోషములు క్షమింపు" మని యడిగిరి. అందరు సంతుష్టచిత్తులై యిలు చేరి, నాటినుండి కలసి మెలసి నివసింప జొచ్చిరి.

ఇది అభిసంబుద్ధ గాథ :

కోడలితో కాత్యాయని
కూర్మిమీరగ నివసించెను.
సేవ జేయగ జొచ్చినారు
దేవరాజు ప్రభావంబు
కతన కొడుకు కోడలును
కాత్యాయని కది మొదలుగ.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి సత్యప్రకాశము కావించి రెండుజాతకములు సరిపోల్చెను. ఆ కాలమున మాతృపోషపరాయణుడు, ఈ కాలమున మాతృపోషపరాయణుడే. అప్పటి అతనిభార్య ఇప్పటి యితనిభార్యయే. శక్రుడు నేనే.

X

# 418 అట్ఠసద్ద జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా అర్ధరాత్రమున కోసల నరేశునికి వినబడు భయంకర ధ్వనులనుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఈ కథ పూర్వోక్తమగు లోహకుంభి (314) జాతకముతో సమానమైనది. ఈ కథలో రాజు శాస్తతో "భన్తే, నేను ఆ ధ్వనులు వినుటవలన ఏ కెట్టి ఫలము కలుగును?" అని విన్నవింపగా శాస్త, "మహారాజా భయము చెంద వలదు. ఈ ధ్వనులు వినుటవలన నీ కేమియు హాని కలుగదు. మహారాజా ఇట్టి అస్పష్టధ్వనులు నీవారే కాదు, పూర్వము కూడ రాజులు విని బ్రాహ్మణుల ఉపదేశ ప్రకారము చతుష్పథములలో యజ్ఞములు చేయించుటకు సంసిద్ధులైరి. కాని యజ్ఞమున బలి యిచ్చుటకై కొనివచ్చిన జంతువులను విడిచిపుచ్చి ఎవరును ఎట్టి ప్రాణి వధమును చేయరాదని చాటించిరి" అని, ఆయన ప్రార్థింపగా పూర్వజన్మ కథ పలికెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల ధనము గల బ్రాహ్మణగృహమున బుట్టి పెరిగి పెద్దవాడయిన పిమ్మట తక్షశిలకు పోయి విద్యలు నేర్చి మరల వచ్చెను. తలిదండ్రులు చనిపోయిన పిమ్మట సంపద దానము చేసి కామభోగములను విడిచి హిమాలయమునకు పోయి తాపసవృత్తి యవలంబించెను. అచ్చట ఆయనకు ధ్యానాభిజ్ఞలు లభించెను. కొంతకాల మయిన పిదప ఉప్పు, పులుసు, నేయికై బస్తీవైపు వచ్చి వారాణసి చేరి లయన ఉద్యానమున నివసింప జొచ్చెను.

ఆ సమయమున అర్ధరాత్రమున తన శయనాగారమున కూరుచుండి యుండగా వారాణసీ నరేశునకు ఎనిమిది శబ్దములు వినవచ్చెను. రాజభవనమున కెదురుగా ఉద్యానమునుండి కొంగకూత తొలుత వినబడెను. ఆ చప్పుడాగిన తరువాత

హ స్తిశాలా ద్వారమున నుండి కాకి కూసెను. పిమ్మట రాజభవన శిఖరముపై నున్న ఘుణకీటము కీచు మనెను. అవల రాజభవనమున పెరుగుచున్న కోకిల కూసెను. అచ్చటనే పెరుగుచున్న హరిణము ధ్వని చేసెను. ఆ తరువాత అచటి వానరము కిచకిచ లాడెను. అంతట అచటనే పెరుగు కిన్నరి శబ్దము చేసెను. ఆ చప్పు డాగెనో లేదో ఆకాశమార్గమున రాజభవనము మీదుగా ఉద్యానమునకు చనుచున్న ప్రత్యేక బుద్ధుడు ఉదానగీతము పాడెను.

రాజు ఈ యెనిమిది శబ్దములను విని భయపడి మరునాడు బ్రాహ్మణుల నడిగెను. "మహారాజా! మీ కేదో ఆపద రానున్నది. చతుష్పాజ్జంతువులను యజ్ఞమున హోమము చేయవలెను" అని వారు చెప్పిరి. "ఎట్లు శుభము కలుగునో అటులే చేయుడు" అని రాజు పలుకగా బ్రాహ్మణులు ప్రసన్నులై రాజమందిరమునుండి బయలువెడలి యజ్ఞసన్నాహము చేయజొచ్చిరి.

జ్యేష్ఠయాజ్ఞకుని శిష్యుడు పండితుడు, మేధావి. అతడు 'ఆచార్యా, ఇట్టి కఠోరకర్మ – బహుజంతువులను బలి గొనునిర్దయకర్మ చేయరాదు" అని పలికెను.

"నాయనా, నీ కేమి తెలియును ? మరి యేమియు కాకున్నను తినుటకు మత్స్యమాంసములు విశేషముగా లభించును".

"ఆచార్యా, పొట్టకోసమై ఇట్టికర్మ చేయవలదు. దీనివలన నరకము ప్రాప్తించును.

ఈ వాక్కులు విని మిగిలిన బ్రాహ్మణులు కుపితులై "మాకు వచ్చులాభము నకు ఇతడు అడ్డుపడుచున్నాడు" అనిరి.

ఆ శిష్యుడు భయపడి "మంచిది, మీకు మత్స్యమాంసములు లభించు నుపాయము చూచుకొనుడు" అని, నగరము వెలువడి రాజును నివారింపగల ధార్మికశ్రమణునికై వెదుకసాగెను. రాజోద్యానమున బోధిసత్త్వుడు కనబడగా నతడు ప్రణామము చేసి "భన్తే, ప్రాణులయెడ నీహృదయమున దయ లేదా ? అనేకజంతువులను వధించి ఆహుతి చేయుయజ్ఞమును రాజు జరుపబోవుచున్నాడు. జంతువులను బంధనమునుండి విడిపించుట ఉచితము కాదా ?" అని పలికెను.

"బ్రహ్మచారీ. మేము రాజు నెరుగము. రాజు మ మ్మెరుగడు".

"భన్తే! రాజు విన్నశబ్దములకు ఫలము మీకు తెలియును గదా ?"

"అవును, తెలియును."

"తెలిసినచో ఏల చెప్పరు ?"

"బ్రహ్మచారీ, నాకు తెలియును. కాని మెడలో బూరా కట్టుకొని తిరుగ గలనా ? ఆయన ఇక్కడికి వచ్చినచో తెలుపుదును."

శిష్యుడు రాజకులమునకు శీఘ్రముగా చేరెను. రాజు చూచి "నాయనా, ఏమి సంగతి ?" అని యడిగినపిదప "మహారాజా ! మీరు విన్నశబ్దములకు ఫలము తెలుపగల తపస్వి మాయుద్యానములో మంగళ శిలాఫలకముపై గూరుచుని యున్నారు. అడిగినచో తెలుపగల నన్నారు. పోయి ఆయన నడుగ దగును." అని చెప్పెను. రాజు శీఘ్రముగా ఆ ప్రదేశము చేరి తపస్వికి ప్రణామము చేసి కుశల మడిగి తెలిసికొని ఒక ప్రక్క కూరుచుండి "నేను విన్నశబ్దములకు ఫలము తమకు తెలియునా ?" అనెను. "తెలియును." "అయినచో నాకు తెలుపుడు."

"మహారాజా, ఆ శబ్దములు వినబడుటచే మీ కేమియు ఆపద లేదు. మీ పాతతోటలో కొంగ యున్నది. దాని కాహారము దొరకక ఆకలిచే శబ్దము చేసినది అది మొదటిధ్వని." బోధిసత్త్వుడు నిజజ్ఞానముచే దానిసంగతి గ్రహించి ఈ గాథ పలికెను.

నీరంబు మత్స్యముల్ నిండుగా నుండె మున్
ఈ సరోవరములో ఇచట బకరా జుండె
అస్మదీయము పైతృకావాసముంగూడ
మండూకములతోడ మాకు కాలము గడుచు
నే డీనివాసమ్ము వీడలే కున్నాను.

"మహారాజా, ఈ విధముగా కొంగ ఆకలిచే అరవ సాగినది. దానియాకలి తొలగింప దలచిన యెడల ఆ యుద్యానమును బాగుచేయించి పుష్కరిణి నిండ నీరు పెట్టవలెను." అట్లే చేయవలసిన దని రాజు అమాత్యున కొకనికి ఆన తిచ్చెను.

"హస్తిశాలా ద్వారమున నున్న కాకి పుత్రశోకము వలన రెండవధ్వని చేసినది. దానివలనగూడ మీకు నష్టము లేదు." అని తపస్వి యీగాథ పలికెను.

దుర్మార్గుడైన బంగురుని రెండవకన్ను
ఎవడు పీకగనేర్చు ? నెవ్వారు బిడ్డలన్
నను నాకులాయమున్ మనుప గలిగినవారు ?

ఇట్లు పలికి "మహారాజా, మీగజశాలలో మావటీ డెవడు ?" అని ప్రశ్నించెను. "భర్తే, వానిపేరు బంగురుడు." "మహారాజా, వాని కొకకన్ను లేదా ?"

"లేదు."

"మహారాజా ! మీహస్తిశాలలో కాకి గూడుకట్టి గ్రుడ్లు పెట్టినది. అవి పక్వ మయినవి. వానిలోనుండి నల్లకాకులు బయటికి వచ్చినవి. మావటీడు ఏనుగుపై నెక్కి బయటికి పోవునపుడును లోనికి వచ్చునపుడును వానిఅంకుశము తాకి దానికిని దాని బిడ్డలకు చిన్నగాయములు తగులుటయే గాక గూటికి కూడ దెబ్బ తగులు చుండును. ఈ బాధలకు కాకి శోకించుచు, మావటీడు గ్రుడ్డివా డగుగాక అని కోరు చున్నది. కాకిమీద కరుణ యున్నచో బంగురుని పిలిపించి గూటికి దెబ్బ తగుల కుండు నట్లు ఆజ్ఞాపింపుడు" రాజు తోడనే బంగురుని పిలువ నంపి మందలించి ఏనుగును వేరొకని కప్పగించెను.

"మహారాజా, మీసౌధశిఖరమ్ముపై నున్న ఘుణాకీటము సారవంత మైన పదార్థమును తినజాలదు. తినుట కేమియు దొరకనప్పుడు వెలుపలికి రాలేక బాధతో కీచు మన్నది. దానివలన మీకు హానిలేదు." అని దానివిధానము తెలిపి యీగాథ పలికెను.

తనకు బల మున్నయంతదాక తినియె ఘుణము
దొరకినది మెల్లి; నిప్పుడు దొరక దెద్ది
గట్టిచెక్కను తొలచుట కష్ట మగును.

ఇట్లు పలికి "ఆ కీటమును నీవలకు తీయింపుడు" అనెను.

రాజు తోడనే పరిజనుల కానతిచ్చి, ఉపాయమున కీటము నీవలకు తీయించెను.

"మహారాజా, మీసౌధములో పెంపుడుకోయిల కలదా ?"

"భర్తే, ఉన్నది."

"మహారాజా, తాను మొదట నివసించెడి వనభాగము జ్ఞప్తికి వచ్చినప్పుడు ఉత్కంఠతో మరల తొలుతటి ప్రదేశమునకు బోవలెనని కోకిల కూసినది. దీని వలనకూడ మీకు హానిలేదు" అని బోధిసత్త్వుడు ఈ గాథ పలికెను.

ఎపుడు రాజగృహమునుండి యెట్లు ముక్తి
పొంది నాదునివాస మేభూజశాఖ
నందు జేరిన నెంతో ఆనంద మొదవు.

"మహారాజా, ఈ కోకిలను విడిచి పుచ్చుడు." రాజు ఆ ప్రకారమే చేసెను.

"మహారాజా, మీ భవనములో పెంపుడు మృగము కలదా ?"

"భన్తే, ఉన్నది."

"అది ఒకజట్టునకు నాయకమృగము. అది నిజమృగిని స్మరించి కామాతురతతో ఉత్కంఠితమై ధ్వని చేసినది. దానివలనగూడ మీకు నష్టము లేదు" అని బోధిసత్త్వుడీ గాథ పలికెను.

ఇపుడు రాజగృహమునుండి యెట్లు ముక్తి
గాంచి మృగయూథమున కగ్రగామి నగుచు
త్రాగుదును గాక నిర్మలోదకము నేను.

బోధిసత్త్వుడా మృగమును విడిపించి "మహారాజా, తమ భవనములో పెంపుడు కోతి కలదా ?" అనెను. "భన్తే, ఉన్నది" అని రాజు పలికిన పిమ్మట బోధిసత్త్వుడు "మహారాజా, ఆ కోతి వానర నాయకుడు. అక్కడ కామాసక్తచిత్తముతో ఆడకోతులవెంట తిరుగుచుండెడిది. భరతుడనువేటకాడు దాని నిచటికి గొనివచ్చినాడు. మర్కటము మరల పోవలె ననునుత్కంఠతో కిచకిచలాడినది. దీనివలనగూడ మీకు ఆపద లేదు" అని ఈ గాథ పలికెను.

కామభోగాలలో మూర్ఛ గాంచు నన్ను
ఇచ్చటికి లుబ్ధకుడు కొనివచ్చినాడు
బాహికా, భరతా, నీకు భద్ర మగుత !

బోధిసత్త్వుడు వానరమునుగూడ విడిపించి "మహారాజా, తమభవనములో పెంపుడు కిన్నర మున్నదా ?" అని యడిగెను. ఉన్నదని రాజు చెప్పగా అది తన కిన్నరిపై

మనసు తిరిగి ఆ విధముగా కూసినది. ఒకనాడది తుంగపర్వత శిఖరముపై కెక్కినది. అచట నానావర్ణ నానాప్రకార పరిమళపుష్పములను కోసి ధరించుచు సూర్యాస్తమయ మగుచున్న దన్న ధ్యానము లేకుండెను. కొండ దిగబోవు నప్పటికి చీకటి పడ్డది. అప్పుడు కిన్నరి "స్వామీ, చీకటి పడినది. జారిపడకుండ భద్రముగా పట్టుకొని దిగుదము" అన్నమాటలు జ్ఞప్తికి వచ్చి కిన్నరము అట్లు ధ్వని చేసెను. దానివలనగూడ మీకు నష్టము లేదు" అని ఈ గాథ పలికెను.

కటికచీకటి భూధరాగ్రమ్మునందు
స్నిగ్ధమృదు సుస్వరంబున చెప్పె నామె
పదను జారికి తగులుగా పడవల దని.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు కిన్నరధ్వనికి కారణము తెలిపి దానిని విడిపించి ఎనిమిదవధ్వనికి కారణ మిట్లు తెలిపెను. "మహారాజా, నందమూల పర్వతము మీద ప్రత్యేకబుద్ధుడు తనఆయుస్సంస్కారము చూచినాడు. బస్తీకి పోయి వారాణసీ నరేశుని ఉద్యానమున శరీరము విడుతును. అప్పుడు లోకులు కర్మచేసి ఉత్సవము కావించి ధాతుపూజ చేసి స్వర్గగాము లగుదురు" అని తలచి తనబుద్ధి బలముచే చనుదెంచుచు మీప్రాసాదముమీదికి చేరినంతనే భుజముమీది బరువు దింపి నిర్వాణరూప మగు నగరమున ప్రవేశించుచున్నాడై ఉదానగానము చేసినా"డని, ప్రత్యేకబుద్ధుని గీతము నిట్లు పలికినాడు.

నేను జన్మాంతమును గాంచినాను, లేదు
సంశయం, బింకపై గర్భశయ్య లేదు.
ఇదియె యాతుదిజన్మ, క్షయించిపోయె
క్రమ్మర నేను జన్మించుకారణంబు.

ఉదానము పాడి ఉద్యానమునకు వచ్చి పుష్పించిన సాలవృక్షము క్రింద పరినిర్వాణము పొందెను (మరణించెను). ఆయన దేహక్రియలు చేయింపుడు" అని ఆయనను వృక్షముకడకు గొనిపోయి ప్రత్యేకబుద్ధుని శరీరమును చూపెను.

రాజు శరీరము చూచి, సేనాసహితు డయి, గంధమాల్యాదులతో పూజించి, బోధిసత్త్వునియానతి చొప్పున యజ్ఞము చేయించుట మాని, సమస్తప్రాణులకు అభయ మిచ్చెను. పిమ్మట నగరమున చాటింపించి సప్తాహముపాటు ఉత్సవము

చేయించెను. అన్నివిధముల సుగంధద్రవ్యములతో గూడిన ప్రత్యేకబుద్ధుని శరీర భాగములపై నాలుగుమహాపథములయందు స్తూపములు నిర్మించెను. బోధిసత్త్వుడు రాజుకు ధర్మోపదేశము చేసి అప్రమత్తుడవై యుండుమని చెప్పి హిమాలయమునకు బోయి బ్రహ్మవిహారముల, నభ్యసించి, ధ్యానలాభము పొంది, బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి "మహారాజా, ఈ శబ్దములవలన ఏమియు హాని లేదు" అని యజ్ఞము మాన్పించి జంతువులకు ప్రాణదానము చేయించి నగరమున చాటింపు చేయించి, జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున రాజు ఆనందుడు. బ్రహ్మచారి సారిపుత్రుడు. తపస్విని నేనే.

— — o — —

# 41౯ సులసా జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా అనాథపిండికుని దాసిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆమె ఒకనాడు దాసీలవెంట ఉద్యానమునకు పోవునపుడు తన యజమానురాలగు పూర్ణలక్షణాదేవిని నగ లిమ్మని కోరెను. ఆమె ఆభరణములు తీసి యిచ్చెను. దాసి వానిని ధరించి దాసీజనముతో ఉద్యానమునకు జనెను.

ఒకానొక చోరుడు నగలను చూచి పేరాస చెంది దీనిని చంపి ఆభరణములు హరింతునని తలచి ఆమెతో వలు కాడుచు ఉద్యానము చేరెను. అచ్చట వా డామెకు మత్స్యమాంసములు పెట్టి, ఆమెచే సురాపానము చేయించెను. ఆమె అతని యాశను గ్రహించెను. ఉద్యానక్రీడ లయి సందె పడునప్పటికి దాసీజనము విశ్రాంతికొరకు తిరిగి పోవుచుండెను. వాడు లేచి ఆమెకడకు జని "భద్రే, ఈ స్థానము నిర్జన మైనది. మనము కొంచె మావలకు పోవుదము" అనెను.

ఆమె తనలో "వీ డేదో రహస్యముగా చేయదలచినాడు. నిస్సందేహముగా వీడు నన్ను సంహరించి ఆభరణములు కొనిపోవ నెంచి యుండును. మంచిది, వీనికి బుద్ధి చెప్పెదను." అనుకొని బహిరంగముగా "స్వామీ, సురాపాన మాంద్యమువలన నాశరీరము పీకుకొని పోవుచున్నది. నాకు కొంచెము నీరు తెచ్చి పెట్టుడు" అని వానిని నూతికడకు కొనిపోయి త్రాటిని కుండను చూపి నీరు తోడి పెట్టుమని కోరెను. చోరుడు నూతిలో చేద వేసి వంగి నీరు తోడుచున్నపుడు బలిష్ఠురాలైన దాసి రెండుచేతులతో గట్టిగా వానిని నూతిలోనికి త్రోసివేసెను. దీనితో చావ డని తలచి ఆమె పెద్దరాయి వాని తలపై వేసెను. అంతట ఆమె యింటికి పోయి నగలు యజమానురాలి కిచ్చి ఆభరణముల వలననే చోరుడు చనిపోయె నని భావించి ఆమెకు సమస్తము వివరించెను. ఆమె అనాథపిండికునకు ఈ సంఘటన తెలిపెను. ఆయన తథాగతుని సన్నిధికి జని విన్నవించెను. విని శాస్త "గృహపతీ, దాసి సమయస్ఫూర్తి కల్గి యుండుట ఇపుడే కాదు, పూర్వము

కూడ కలిగియుండెను. ఆమె ఇతని నిప్పుడె కాదు, పూర్వముకూడ సంహరించెను" అని, అనాథపిండికుని కోరికపై పూర్వజన్మ వృత్తాంతము వివరించెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయు సమయమున సులస యను గణికకు ఐదువందల దాసీజన ముండెను. ఒక్కరాత్రికి సులస వేయినాణములు తీసికొనుచుండెను. ఆ నగరమున సత్తుకు డను చోరుడు నాగబలము గల వాడు. రాత్రులందు ధనికులయిండ్లు దోచుకొనుచుండెను. నాగరకులు సమావిష్టులై రాజున కీ విషయము విన్నవించిరి. రాజు నగరగుప్తికుని (కొత్వాలు) పిలిపించి "ప్రతిముఖ్య ప్రదేశమునను ఆరక్షకభటులను నిలిపి, చోరుని పట్టించి శిరసు తీసి వేయవలెను" అని ఆనతిచ్చెను. వానిని పట్టుకొని చేతులు వెనకకు కట్టి శృంగాటకములలో త్రిప్పి భటులు వధ్యస్థానమునకు గొని పోవుచుండిరి. చోరుడు పట్టుపడె నని నగరమున వార్త వ్యాపించెను. ఆ సమయమున సులస వాతాయనమున నిలిచి వీధివెంట జూచుచుండెను. చోరుడు కనబడెను. ఆమె ప్రతిబద్ధచిత్తయై "ఈ యోగ్యుని, ఈ మహాసత్త్వుని విడిపింప గలిగినచో ఈ వేశ్యావృత్తి విసర్జించి ఇతనితోనే కాలము గడుపుదును" అని తలచి, (318) కణవేర జాతకమున చెప్పిన చొప్పున కొత్వాలుకు ధనము పంపి, చోరుని తప్పించి వానితో కాలము గడుపుచుండెను. మూడునాలుగు మాసము లయిన పిదప చోరు డొకనాడు తనలో "ఇక నే నిచ్చట నుండజాలను. ఇచటినుండి వట్టిచేతులతో పోవజాలను. సులస నగలు లక్షల మూల్యము కలవి. దీనిని చంపి నగలు హరింపవలెను" అనుకొని, "భద్రే, నన్ను రాజపురుషులు పట్టుకొని పోవుసమయమున పర్వతముమీది వృక్షదేవతకు బలి మ్రొక్కుకొంటిని. ఇంతవరకును మ్రొక్కు చెల్లింపకుండుటచే మనసు బాగుగా లేదు. మనము పోయి మ్రొక్కు చెల్లింతము" అని చెప్పెను. "స్వామీ, మంచిది. వస్తువులు సిద్ధము చేయించి పంపుదము." "భద్రే, పంపుట యుక్తము కాదు. మన మిరువురమును అలంకరించుకొని సపరివారముగా బోవుదము." "స్వామీ, మంచిది. అటులే చేయుము." అత డామెచే ఆ ప్రకారము చేయించెను. పర్వతము దగ్గరకు చేరగానే వాడు "భద్రే, జనసమూహము కనబడుచుండగా దేవత బలి స్వీకరింపదు. మన మిరువురము మాత్రము అగ్రభాగమునకు బోయి బలి యిచ్చి వత్తము" అనెను. ఆమె సరే అన్నది. ఆమెచే బలి స్థాలి యెత్తించి వాడు పంచాయుధములు ధరించెను. ఉభయులును పర్వత మెక్కిరి.

మనుజునకు నూరింతలు ఎత్తు గల పర్వతాగ్రమున మొలిచిన చెట్టు క్రింద స్థాపించి చోరుడు "భద్రే, నేను బలి యిచ్చుట కిక్కడకు రాలేదు. నిన్ను సంహరించి నీ యాభరణములు హరించుటకు వచ్చినాను. నీ నగ లొలిచి ఉత్తరీయమున మూట కట్టు"మనెను.

"స్వామీ, నన్నేల చంపెదరు ?"

"ధనము కొరకు"

"స్వామీ, నేను చేసినమేలు జ్ఞప్తికి తెచ్చుకొనుము. నిన్ను రాజపురుషులు బంధించి కొనిపోవునపుడు శ్రేష్ఠి పుత్రుని నీస్థానమునకు మార్పుచేయించి బహు ధనము పంపి నిన్ను విడిపించితిని. ప్రతిరాత్రి వేయిసువర్ణములు సంపాదింప గలిగియు నీకై మరియొకనిని దగ్గరకు రాకుండ చేసితిని. ఇట్లు నీకు మేలు చేసిన దానను. నన్ను చంపవలదు. నీకు బహుధన మిచ్చెదను. నీకు దాసి నయ్యెదను" అని వేడుచు ఆమె తొలిగాథ పలికెను.

ఇద్ది బంగరు కంఠి, ఇవి ముత్యముల్ పచ్చ
లివి స్వీకరించి నన హింసింపకుము స్వామి !
ప్రకటమ్ముగా నన్ను పాదదాసిగ గొనుడు.

అంతట చోరు డిట్లనెను.

కైకొమ్ము నగ లెల్ల కల్యాణి, హెచ్చుగా
ఏడ్చి మొత్తుకొనంగ నేమిటికి, మానుకో !
నిను వధింపక యుందునేని నీ సర్వస్వ
మేలాగు లభియించు నెరుకపడుటయె లేదు.

విని ఆమె స్వాసోచిత జ్ఞానము పొంది "ఈ చోరుడు నన్ను బ్రదుకనీయడు ప్రపాతమునుండి వీడే ముందుగా క్రింద బడునట్లు ఉపాయము చేయుదును" అని యోచించి రెండుగాథలు పలికెను.

స్మరణ మున్నది మొదలు జ్ఞాన మున్నది మొదలు
స్మృతికి రాలే డెవడు నాకంటె ప్రియతముడు
అరుదెంచు మదిసారి ఆలింగనార్థమై

చేయుచున్నను ప్రదక్షిణము, సమ్మేళనము
సంఘటిల్లుట కల్ల, జన్మంబులో కెల్ల.

చోరు డామె యభిప్రాయమును గ్రహింపనేరక "భద్రే, రమ్ము మూడుమారులు నన్ను కౌగలించుకొమ్ము" అనెను. ఆమె మూడుసారులు ప్రదక్షిణముచేసి కంఠము కౌగిలించుకొని "స్వామీ, నాలుగు దిక్కులకు ప్రణామము చేసెదను" అని వాని పాదములమీద శిర ముంచి, రెండు దిక్కులకు ప్రణామము చేసి వెనుకకు పోయి మూడవదిక్కునకు ప్రణామము చేయుచున్నట్లు నటించి నాగబలము కలిగిన యాగణిక చోరుని వెనుకవైపున పట్టుకొని తల క్రిందుగా, మనుష్యునకు నూరింతలు ప్రమాణము గల ప్రపాతమునకు నెట్టెను. వాడు పడిపోవుచూ ఖండఖండములై మరణించెను. పర్వతము మీది వృక్షదేవత ఇది చూచి ఈ గాథలు పలికెను.

ఎల్ల తావుల మగవారికే వివేక
ముండ, నంగనలకుగూడ నుండు కొన్ని
యెడలను, వివేక మధిక సూక్ష్మాత్మిక లగు
పడతులకు నెల్లతావుల ప్రజ్ఞ కలుగు.
శీఘ్రముగ నేర్పుతోడ యోజించి సులస
చాపమున నెక్కు వెట్టిన శరముతోడ
హరిణమును వ్యాఘ్రువలెను తస్కరుని జంపె
స్థితిగతులవల్ల కల్గు విశేషములను
శీఘ్రముగ నెవ్వ డెరుగడో చెడును వాడు
గిరితటమునుండి పడిన తస్కరుని బోలె
స్థితిగతులవల్ల కల్గు విశేషములను
తోడనే గ్రహియించినవాడు కాంచు
సులువుగా సంకట విముక్తి సులసవోలె.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. అప్పటి ఇరువురు ఇప్పటి ఇద్దరే–వృక్షదేవతను నేనే.

X

# 420 సుమంగళ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు రాజోవాదసూత్రమునుగూర్చి చెప్పినది. అపుడు రాజు ప్రార్థించినపిమ్మట శాస్త పూర్వజన్మగాథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వు డాయనపట్టమహిషి కడుపున బుట్టి, తండ్రి తరువాత రాజ్యమునకు వచ్చి మహాదానములు చేసెను. ఆయనకు సుమంగళు డను తోటమాలి యుండెను.

ప్రత్యేకబుద్ధు డొకడు నందమూల పర్వతమునుండి బయలుదేరి పర్యటనము చేయుచు వారాణసి చేరెను. మొదటినాడు ఉద్యానమున నుండి, మరునాడు భిక్షార్థము నగరములోనికి బోయెను. ఆయనను చూడగానే రాజు ప్రాసాదముమీదికి గొని పోయి రాజపీఠమున గూర్చుండ బెట్టి ఉత్తమభోజనము పెట్టించి, భోజనానంతరము దానానుమోదనము విని ప్రసన్నచిత్తుడై నిజోద్యానమున నిలుచునట్లు మాట పుచ్చుకొనెను. రాజాయన కనుకూల స్థితిగతు లేర్పరిచి తనతోటమాలి సుమంగళుని ఆయనసేవకు నియోగించెను. ప్రత్యేకబుద్ధుడు నాటినుండి అనుదినము రాజకులమునకు పోయి భుజించి, ఉద్యానమునకు మరల వచ్చుచుండెను. మాలి సుమంగళు డాయనకు బాగుగా సేవలు చేయుచుండెను.

ఒకనాడు ప్రత్యేకబుద్ధుడు సుమంగళుని బిలిచి "నే నొక గ్రామమునకు బోయి కొన్నిదినము లుండి వత్తు నని రాజుతో చెప్పుము" అనెను. తోటమాలి అటులే చేసెను. ప్రత్యేకబుద్ధుడు కొన్నిదినములు గ్రామాంతరమున నుండి ఒకనాడు ప్రొద్దు గ్రుంకిన పిమ్మట ఉద్యానమునకు మరలి వచ్చెను. ఆయన మరలి వచ్చినట్లు సుమంగళునకు తెలియదు. వా డింటికి బోయియుండెను. ప్రత్యేకబుద్ధుడు పాత్రము వల్కలములు సర్దుకొని కొంచె మటు నిటు పచారు చేసి పాషాణఫలకము మీద కూర్చుండెను. నాడు తోటమాలియింటి కతిథులు వచ్చియుండిరి. వారికొరకు సూపము వ్యంజనములు చేయించుటకై మాలి విల్లు చేబూని తోటలోని వన్యమృగ

మును కొట్టి కొనిపోవుటకై వచ్చెను. చీకటిలో వాడు మృగమును వెదకుచు ప్రత్యేకబుద్ధుడు మహామృగ మనుకొని బాణముతో కొట్టెను. ఆయన తల వాల్చి 'సుమంగళా' యనెను. మాలి ఆయనను చూచి మర్మహతు డైనట్లు గ్రహించి "భన్తే, తమరు వచ్చినట్లు తెలియదు. మృగ మనుకొని బాణము విడిచితిని. క్షమింపుడు" అని వేడెను. "మంచిది. అయిన దేమో అయినది. ఇప్పు డేమి చేయుదువు? వచ్చి బాణము లాగివేయుము" అని పలికెను. వాడు ప్రణామము చేసి బాణము లాగివేసెను. వేదన హెచ్చి ఆయన మహాపరినిర్వాణము చెందెను. "ఈ విషయము తెలిసినచో రాజు నన్ను విడిచిపెట్టడు" అని భయపడి తోటమాలి భార్యాపుత్రసహితముగా పారిపోయెను. ఆ సమయమున దేవతా ప్రభావముచే ప్రత్యేక బుద్ధుడు పరినిర్వాణము చెందె నని కోలాహలము పుట్టెను. మరునాడు జను లుద్యానమునకు పోయి చూచి ''మాలి ప్రత్యేకబుద్ధుని చంపి పారిపోయె''నని రాజుకు విన్నవించిరి. బహుపరివారముతో రాజచటికి జని ప్రత్యేకబుద్ధుని దహన క్రియలు చేయించి ఏడుదినములపాటు విశేషాదరమున పూజలు చేయించి ధాతువులు తీయించి స్తూపము కట్టించెను. రాజు చైత్యమునకు పూజలు చేయుచు ధర్మను సారముగా పాలనము చేయుచుండెను.

సంవత్సరా నంతరము సుమంగళుడు తిరిగి వచ్చి ఒకానొక అమాత్యుని సమీపించి రాజహృదయ మెట్లున్నదో తెలుపు డని వేడెను. ఆయన రాజుకడ సుమంగళుని ప్రశంస చేసెను. రాజు వినిపించుకొన లేదు. అమాత్యుడు వచ్చి రాజు అసంతుష్టుడై యున్నా డని మాత్రమే చెప్పెను. సుమంగళుడు పోయి మరుసటి సంవత్సరము వచ్చెను. మూడవ సంవత్సరము భార్యాపుత్రులతో వచ్చెను. రాజు కొంత మెత్తపడినట్లు గ్రహించి అమాత్యుడు వానిని రాజద్వారముకడ నిలిపి రాజునకు తెలియపరచెను. రాజు వానిని పిలిపించి ఆదరించి ''సుమంగళా, నాకు పుణ్యక్షేత్ర మైన ప్రత్యేకబుద్ధుని ఏల చంపితివి?'' అని అడిగెను. ''దేవా, తెలిసి చంపలేదు. ఈ కారణముచేత'' అని వాడు యావద్వృత్తాంతమూ వివరించెను. ''నీకు భయము లేదు'' అని రాజు వాని కభయ మిచ్చి వానిని తోటమాలిగా నియమించెను.

అమాత్యుడు రాజుతో ''దేవా, రెండుమారులు తమరు సుమంగళుని ప్రసంస వినియు మౌనము వహించితిరి. మూడవమారు వానిని పిలిపించి అనుగ్రహించితిరి. ఏలనో'' అనెను.

"క్రోధవివశుడై రాజు త్వరపడి యేమియు చేయరాదు. కావున నేను ప్రథమపర్యాయము ఊరకుంటిని. మనసు మెత్తపడుటచే మూడవమారు వానిని పిలువ నంపితిని" అని చెప్పి రాజు రాజ ధర్మములు వినిపించువాడై యీ గాథలు పలికెను.

కోపమ్ము గల్గినన్ భూపతి అవిచారి
తముగ చేయగరాదు దండనమ్ము;
అట్లు చేసినయెడ నన్యుల కతిదుఃఖ
మొదవింపు, తనకును ముదము లేదు.

తనచిత్తము ప్రసన్నతం గన్న నన్యదో
ష విచారణంబును సలుపవలయు
తగువిచారణ చేసి దండనమ్ము విధింప
జాలు, న ట్లగునేని జనవిభుండు.

స్థిరచిత్తమున మంచిచెడ్డలన్ గమనించి
చెప్పుచో తీరుపు చెలపు గాదు.
నిజగుణంబులచేత ప్రజలకు తనకును
అధిపుడు సమకూర్చు నభ్యుదయము.

అభిమానపూరితు లౌ క్షత్రియులు శిక్ష
విధియించుపక్షాన వేగిరముగ
అపకీర్తిపాలౌదు రవనితో, నావల
నిధనమ్ము నొందిన నిరయమె గతి.

ఆర్యోపదిష్టంబు లౌ ధర్మములయందు
త్రికరణశుద్ధిగా దీక్ష కలిగి
శాంతిశీలసమాధి సంభృతులై యుంట
నుత్తమజన్మంబు లొందుదుంద్రు.

అస్మత్ప్రజలు వీర లని యెంచి కృపతోడ
దండనమ్ము విధింపు తరుణమందు
అపరాధముల బాపు నాశయంబే గాని
కాదు క్రోధం బని క్ష్మావిభుండు

క్షాంతితో అపరాధిజన సమూహములకు
దండనమ్ము విధించుచుండవలయు.

రాజువాక్కులు విని సమస్త రాజ్య పరిషత్సభ్యులును సంతుష్టులై ఈ సదాచారములు ఈ గుణములు తమకే తగియున్న వనిరి. సభ్యులవాక్యము లైన తరువాత సుమంగళుడు లేచి రాజుకు నమస్కరించి అంజలి ఘటించి రాజును స్తుతించుచు మూడు గాథలు పలికెను.

విడువ కెన్నడు నిన్ను విభవంబు లక్ష్మియున్
శతవర్షముల్ ప్రజాహితము చేయు
అక్రోధనుండవై అవిరతంబు ప్రసన్న
చిత్తాన పాలన చేయు మయ్యా!

ఏతన్మహాగుణోపేతుండవై రాజ,
దశహితమౌ రాజధర్మ యుక్తి
ఓపరో అక్రోధనా, ఓసుభాషీ, అన్యు
లెవ్వారి పీడింపకే సుఖముగ
పరిపాలనము చేసి పరలోకగతుడవై
సుఖపూర్వకమ్ముగా సుగతి గనుము.

నీతితో ప్రేమతో నేర్పుతో తెలివితో
ధర్మపాలన చేయు ధరణి విభుడు
క్షామస్థలిన్ మేలిపోదకమ్ము రీతిని క్షుద్ర
జనముల చిత్తముల్ శాంతపరచు.

శాస్త కోసలనరేశున కుపదేశము చేయువాడై ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆ సమయమున ప్రత్యేకబుద్ధుడు పరినిర్వాణము పొందెను. సుమంగళుడు ఆనందుడు, రాజు నేనే.

X

# ౪౨౧. గంగమాల జాతకము

శాస్త జేతవనమున విహరించుచుండగా ఉపోసథ కర్మనుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు శాస్త ఉపోసథ కర్మానుష్ఠానరతు లైన ఉపాసకులనుగూర్చి "ఉపాసకులారా, మంచిది. ఉపోసథ కర్మనిరతులకు దాన మీయవలసి యుండును. సదాచారమును రక్షింపవలెను. ఉపోసథ వ్రతము ఆచరింప వలయును, పూర్వ కాలమున సజ్జనులు ఉపోసథ వ్రతమున ఒక్క ఖండము ననుసరించుటచేతనే విశేష కీర్తి లభించెను" అని, వారి ప్రార్థనపై పూర్వజన్మగాథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఆ నగరములోనే శుచిపరివారు డను శ్రేష్ఠి యుండెను. అతడు ఎనుబదికోట్ల ధనమున కధిపతియై దానధర్మాది పుణ్యకార్యములు చేయుచుండెను. ఆయనభార్యాపుత్రులు, సంబంధులు ఇంటిలో గోరక్షణ చేయువారు. మాసమున కారురోజులు ఉపవాస (ఉపోసథ) వ్రత మనుష్ఠించుచుండిరి.

ఆ కాలమున బోధిసత్త్వుడు దరిద్రకుటుంబమునపుట్టి కూలి చేయుచు, బహు కష్టముమీద జీవయాత్ర చేయుచుండెను. ఒకనాడు అతడు శ్రేష్ఠికడకు పోయి ప్రణామము చేసి ఒకప్రక్క నిలిచియుండగా శ్రేష్ఠి "యేల వచ్చితివి?" అని యడిగెను. "మీయింట కొలువు చేయుటకు."

క్రొత్తపరిచారకులు వచ్చినరోజున శ్రేష్ఠి వారలతో "ఈ యింట పనిచేయువారలు శీలములు రక్షించుకొనుచు పనులు చేయుచుండవలెను," అని చెప్పెడివాడు. బోధిసత్త్వునితో ఈ మాటలు చెప్పక "మంచిది, బాబా, కూలి తెలిసికొని పని చేయుము" అనెను. అప్పటినుండి బోధిసత్త్వుడు పర్యవేక్షకుడై శ్రమ లక్ష్యము చేయక, అన్నిపనులు చేయసాగెను. ఉదయవేళ పొలమునకు పోయి సాయం సమయమునకు మరలి వచ్చుచుండెను.

ఒకనాడు నగరమున ఉత్సవము చాటించిరి. పెద్దశ్రేష్ఠి దాసిని పిలచి "నేడు ఉపవాస వ్రతదినము. ఉదయమే వంట చేసి పనివారల కందరికిని భోజనము పెట్టుము. వేళకు భుజించి వ్రతము ననుష్ఠింతురు" అని చెప్పెను. బోధిసత్త్వుడు వేకువజాముననే లేచి పొలము పోయెను. ఆనాడు ఉపవాసవ్రత మని ఆయన కెవ్వరు చెప్పలేదు. తక్కిన పనివా రందరు ప్రాతఃకాలముననే భుజించి ఉపవాస వ్రతము సలిపిరి. శ్రేష్ఠి తనభార్యాపుత్రులతో, బంధువులతో సహా ఉపవాసము చేసెను. ఉపవాసవ్రతము నెరపువారు దానిని గూర్చి యోచించుచు తమతమ నివాసములు చేరిరి. బోధిసత్త్వుడు పగ లంతయు పని చేసి సూర్యాస్తమయమునకు మరలి వచ్చెను.

వంట చేయువనిత చేతులు కడిగికొని పళ్ళెములో భోజనము పెట్టి తెచ్చెను. అనుదినము ఆ సమయమునకు బాల కోలాహల మయ్యెడిది. అప్పుడు శాంతముగా నుండుట జూచి బోధిసత్త్వుడు "అందరు నెచటికి పోయిరి?" అని ప్రశ్న చేసెను. "ఎల్లరును ఉపవాసవ్రతము నెరపి తమతమ నివాసములకు పోయి" రని ప్రత్యుత్తరము, ఇందరు శీలవంతులనడుమ నేను శీలవంతుడను కాకుండ నుండను అని యాతడు తలపోసి శ్రేష్ఠిసన్నిధి కరిగి "ఇపుడు ఉపవాసవ్రతము సంకల్పము చేయుచో వ్రతము సఫల మగునా కాదా?" అని యడిగెను. "ప్రాతఃకాలమే సంకల్పము చేయకుండుటచే వ్రతము పూర్ణము గాక అర్ధవ్రతమే యగును" అని శ్రేష్ఠి చెప్పెను.

కానిమ్మని యాతడు శ్రేష్ఠికడ శీలగ్రహణము చేసి ఉపవాసవ్రతము సంకల్పించి నిజనివాసమునకు జని పండుకొని శీలమునుగూర్చి చింతన చేయుచుండెను. దిన మంతయు ఏమియు భుజింపకుండుటచే తలనొప్పి యారంభ మయ్యెను. రకరకముల ఔషధములు తెప్పించి శ్రేష్ఠి యాతనిచే తినిపించుచుండెను. "ప్రాణము లుండగా వ్రతభంగము చేయ సంకల్పింపను. కావున ఔషధము పుచ్చుకొనను" అని యాతడు పలికెను. బాధ తీవ్ర మయ్యెను. తెలతెలవారుచుండగా అతనికి స్మృతి తప్పిపోయెను. ఇక మరణించు నని అతనిని లేవనెత్తి వసారాలో పరుండ బెట్టిరి.

ఆ సమయమున వారాణసీ నరేశుడు సర్వసన్నాహముతో రథ మెక్కి నగర ప్రదక్షిణము చేయువాడై ఆ ప్రదేశమునకు వచ్చెను. బోధిసత్త్వు డాయన వైభవమును గాంచి కోరిక కలవాడై నేను రాజు నైన బాగుండు నని తలచెను.

అతడు మరణింపగానే అర్ధవ్రత ప్రభావముచే రాజమహిషికడుపున బడి జన్మ మెత్తెను. పదిమాసములు గడచిన పిమ్మట రాణికి పుత్రుడు కలిగెను. అతనికి ఉదయకుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగి పెద్దవాడై సమస్తవిద్యలలో ఆరితేరి పూర్వజన్మజ్ఞాన ముండుటచే స్వల్పకర్మమునకు ఇంతటిఫలము కలిగిన దని సంతోషమున కేకలు వేయుచుండెను. తండ్రిమరణానంతరము రాజ్యము లభింపగా అతడు తనవైభవము చూచుకొని సంతోషవాక్యమే పలుకుచుండెను.

ఒకనాడు పట్టణమున ఉత్సవము సంసిద్ధ మయ్యెను. లోకులు ఆనందమున గంతులు వేయసాగిరి. ఆ సమయమున వారాణసీ నగరికి ఉత్తరద్వారమున నుండి తోలుతిత్తితో నీరు పోయువాడు కూలి చేయుచుండెను. అతనికి అర్ధమాషము (నాణెము) లభింపగా దానిని కోటగోడలో ఇటుకలనడుమ దాచిపెట్టెను. అచటనే తిత్తులతో నీరు తెచ్చుస్త్రీ యొకతె నివసించుచుండెను. ఉభయులకును సహవాస మేర్పడినది. "స్వామీ, నగరములో ఉత్సవము జరుగుచున్నది. నీదగ్గర ఏమైన ఉన్నచో మన మిద్దరము ఉత్సవములో సులభముగా గడుపగలము" అని యామె పలికెను.

"ఆ, ఉన్నది." "స్వామీ, ఎంత ఉన్నది?" "అర్ధమాష మున్నది." "ఎచ్చట నున్నది?" "ఉత్తరద్వారమున ఇటుకలనడుమ పెట్టినాను." "నాఖజానా ఇక్కడికి పన్నెండుయోజనముల దూరములో నున్నది. నీచేతులలో ఏమైన ఉన్నదా?" "ఆ, ఉన్నది." "ఎంత?" "అర్ధమాష మున్నది."

"నీఅర్ధమాషము నాఅర్ధమాషము కలిసి మాష మగును. అందొకభాగముతో సుగంధద్రవ్యములను ఇంకొకభాగముతో సురను కొనివచ్చి ఆనందింతము. పోయి మీరు దాచియుంచిన అర్ధమాషము కొని రండు."

అతడు ప్రసన్నచిత్తుడై భార్యతో తనమనసులోని మాట చెప్పి "భద్రే, చింతింపకుము, దానిని కొనివత్తును" అని వెడలి పోయెను. వానికి ఏనుగుబల ముండెను. ఆరుయోజనములు పోవునప్పటికి మధ్యాహ్న మయ్యెను. మండుటిసుక నిప్పువలె నున్నను అతడు దానిని త్రొక్కు కొనుచు పోవుచుండెను. ధనవాంఛచే ప్రసన్నుడై కాషాయవస్త్రఖండము దాల్చి, చెవులలో తాళపత్రములు ధరించి, వివశుడై గీతము నాలాపించుచు, వాడు రాజాంగణము చేరెను.

ఉదయరాజుగారి కిటికీ తెరచి యున్నది. ఈ విధముగా ఎండగాలులు లెక్కింపక ప్రసన్నవదనముతో పాట పాడుచు వీడు వచ్చుచుండుటకు కారణ మేమై యుండు నని యోజించి ప్రశ్నింప దలచి రాజు పరిజనుని పంపెను. వాడు రాజుగారు నిన్ను ర మ్మనినారు. అని చెప్పగా "రాజుగారికి నాతో నేమి పని? రాజును నే నెరుగను" అని వాడు పలికెను. పరిజనుడు బలవంతముగా వానిని గొనిపోయి ఒక ప్రక్క నిలువబెట్టెను. రాజు వానిని ప్రశ్నించువాడై రెండుగాథలు పలికెను.

అగ్గిపోలిక నున్న దవనీతలంబు
మండు బొగ్గులు పేర్చు మాడ్కి నుండంగ
ఆలపింతువు గీత మాతపం బేమి
బాధింపదా నిన్ను ? పైన సూర్యుండు,
ధరణిపై వాలుక దహియించుచుండ,
పాడెదు నీ కెండ బాధయేలేద !

వాడు రాజువచనమును విని రెండు గాథ పలికెను;

పీడింప లే దెండ వేడిమి నన్ను;
నను గాల్చుకోర్కులే జననాథ, నాకు
ఎన్నియో కోరిక లున్నవి సుమ్ము.—
కాల్చు నయ్యవి కాని, కా దాతపంబు.

"నీ వేమి పని చేయుదువు?" అని రాజు ప్రశ్నింపగా వా డిట్లు చెప్పెను. "దేవా, దక్షిణద్వారమున నుండు దరిద్రస్త్రీతో సహవాసము చేసినాను. ఆమె నాతో స్వామీ, నావద్ద కొద్దిగా పైసా ఉన్నది. పండుగ చేసికొందము అన్నది. నా పైకము ఉత్తరద్వారమున ఖజానాలో దాచిపెట్టినాను అంటిని. పోయి అది కొని ర మ్మని ఆమె నన్ను పంపినది. ఉభయులము పండుగ చేసికొందుము, ఆమె చెప్పిన పలుకు నా హృదయమును వీడకున్నది. అది స్మరించుచున్నాను. మదనాగ్ని తపించుచున్నది. ఇది నా పని".

"ఎండ గాలి లక్ష్యము చేయక ఈ విధముగా పాడుచు పోవుచున్నావు. దేనివలన ?"

"దేవా, ఆ ఖజానా తెచ్చి ఆమెతో క్రీడింతును. ఇందుచే ప్రసన్నచిత్తుడనై పోవుచున్నాను".

"ఓయీ, ఉత్తరద్వారమున నీ వుంచిన ఖజానా లక్ష ఉండునా ?"

"దేవా, లేదు,"

"అయినచో ఏబదివేలు, నలుబదివేలు, ముప్పదివేలు, ఇరువదివేలు, అయిదు వేలు. వేయి, అయిదువందలు, నాలుగు వందలు, మూడు వందలు, రెండు వందలు, వంద, ఏబది, నలుబది, ముప్పది, ఇరువది, పది, అయిదు, నాలుగు, మూడు, రెండు. ఒక కార్షాపణము, అర్ధకార్షాపణము, పాదకార్షాపణము, నాలుగు మాషములు, మూడుమాషములు, రెండుమాషములు. ఒకమాషము"

"దేవా, కాదు"

"అర్ధమాషమా?"

"దేవా, ఇంతే సాధనము. దానిని తెచ్చి ఆమెతో క్రీడింతును. ఇందులకే పోవుచున్నాను. ఈ ప్రసన్నత వలన, ఈ సౌమనస్యమువలన ఎండగాలులు బాధగా లేవు."

"ఓయీ, ఈ యెండ గాలులలో పోవద్దు. నీకు అర్ధమాషము నే నిత్తును".

"దేవా, తమమాట శిరసావహించి అర్ధమాషము తీసికొందును. కాని ఆ అర్ధమాషమును విడిచిపెట్టను" "ఓయీ, ఆగుము. నీకు మాష మిత్తును" అని వాని నాపుటకై రాజు రెండుమాషములు మొదలుకొని క్రమముగా హెచ్చించుచు, కోటి, నూరుకోట్ల వరకును ఇత్తు నని చెప్పినను వాడు "దేవా, ఇది స్వీకరింతును. కాని ఆ అర్ధమాషమును కూడ తీసికొందును" అని చెప్పుచుండెను. నీకు శ్రేష్ఠి పదవి ఇత్తు నని రాజు ప్రలోభ పెట్టెను. యువరాజును చేయుదు ననెను. అర్ధ రాజ్య మిత్తు నను నప్పటికి వాడు సమ్మతించెను.

రాజు మంత్రులను పిలిపించి, 'నా మిత్రునకు క్షురకర్మ, స్నానముచేయించి, అలంకరింపుడు' అని చెప్పగా, వా రటులే చేసిరి. రాజు రాజ్యమును రెండుభాగములు చేసి అతని కర్ధరాజ్య మిచ్చెను. అర్ధమాషము మీది ప్రీతిచే అర్ధరాజ్యము పొంది ఉత్తరదిక్కునకు పోయెను. అతనికి అర్ధమాషరాజు అని పేరువచ్చెను.

వా రిరువురు కలిసి మెలిసి ప్రసన్నతతో రాజ్యము చేయుచు, నొకనాడు ఉద్యానమునకు పోయిరి. అచట క్రీడానంతరము, ఉదయరాజు అర్ధమాషరాజు నొడిలో తల పెట్టుకొని పండుకొనెను. అతడు నిద్ర పోయినపిమ్మట పరిజనులు క్రీడార్థ మిటు నటు పోయిరి. అర్ధమాషరాజు తనలో "నే నెల్లవుడును అర్ధరాజ్యాధిపతిగా ఏల యుండవలెను? ఇతనిని సంహరించి నే నేల రాజును కాగూడదు?" అనుకొని మరల యోచించి "దరిద్రుడ నైన నన్ను ఈ రాజు తనతో సమానుని చేసినాడు. మహైశ్వర్య మిచ్చినాడు. ఇట్టివానిని సంహరించు కోరిక గలిగినది. ఇది అనుచితము" అని ఎత్తినకత్తి మరల ఒరలో పెట్టెను.

కాని రెండవమారు అతని కదేసంకల్పము కలిగెను. అప్పు డతడు యోచన చేసి 'చిత్తము మాటిమాటికిని పాపకర్మ చేయింప నెంచుచున్న' దనుకొని ఖడ్గమును క్రింద బెట్టి రాజును లేపి అతనిపాదములపై బడి 'క్షమియింపు' మనెను.

"మిత్రమా, నీ నా నడుమ ద్వేషము లేదు కాదా ?"

"మహారాజా, ఉన్నది. నే నిట్లు చేసితిని."

"అటు లగుచో మిత్రమా, క్షమించుచున్నాను. కోర్కె కలదేని రాజ్యము చేయుము. నేను యువరాజుగా నుండి నీసేవ చేయుదును."

"దేవా, నాకు రాజ్యము వలదు. ఈ తృష్ణ నన్ను నరకములో త్రోయ గలదు. మీరాజ్యము మీరే తీసికొనుడు. నేను ప్రవ్రజింతును. కోర్కెకి మూలము చూచితిని. సంకల్పములచే వాంఛ వృద్ధి చెందును. ఇక నేను సంకల్పవికల్పములను కలుగ నీయను" అని యతడు ఉదానవాక్యము పలుకువాడై ఈ గాథ అనెను.

గ్రహియించితిని కోరికా, మూల మేను-
సంకల్పమున నీవు జన్మ మొందుదువు.
కనుక సంకల్పవికల్పంబు లెత్త
నటు చేయకోర్కె జన్మింప లే దింక.

అని కామభోగములలో మగ్నమై యున్నలోకమునకు ధర్మోపదేశము చేయువాడై ఈ గాథ పలికెను.

బాలవు భోగముల్ సంతృప్తి లేదు,
ఆశ పెద్దది యైన, అజ్ఞత మాని
అప్రమత్తత తృష్ణ త్యజియింపవలయు.

ఈ ప్రకారముగా నతడు జనులకు ధర్మోపదేశ మిచ్చి ఉదయరాజుకు రాజ్యము సమర్పించి కన్నీరు కార్చుచున్న జనులను విడిచి హిమాలయమునకు పోయి ప్రవ్రజించి ధ్యానాభిజ్ఞలను పొందెను. ఉదయరాజు ప్రీతితో వాక్యమును పూర్తిచేయుచు ఈ గాథ పలికెను.

స్వల్పకర్మకు మహైశ్వర్యంబు కలిగె
ఉచితఫలంబుగా ఉదయరాజునకు
కామభోగాది మార్గములను మాని
పడసెను మిత్రంబు ప్రవ్రజ్యఫలము.

ఈ గాథలోని యర్థ మెవ్వరికిని తెలియ లేదు.

ఒకనా డాయనపట్టపుదేవి ఈ గాథార్థ మేమని యడిగెను. రాజు తెలుపలేదు. రాజుమంగలి గంగమాలు డనువాడు కలడు. వాడు రాజుకు క్షురకర్మ చేయునపుడు ముందు కత్తితో చెక్కి పిమ్మట చిమ్మటతో వెండ్రుకలు లాగెడు వాడు. కత్తితో క్షురకర్మ చేయునపుడు రాజునకు సుఖముగా నుండెడిది. చిమ్మటతో లాగునపుడు కష్టముగా నుండెడిది. తొలుత రాజు వానికి వర మీయ నెంచును. ఆవల శిరస్సు ఖండింప నెంచును. ఒకనాడు రాజు భార్యతో 'భద్రే, మంగలి మూర్ఖుడు సుమా' అని పలికినాడు. 'ఏమి చేయవలెను దేవా?' 'ముందు వెండ్రుకలు లాగి ఆవల కత్తితో క్షౌరము చేయవలెను.' రాణి మంగలిని పిలిపించి 'బాబూ, ఈసారి రాజు గారికి క్షురకర్మ చేయునపుడు ముందు వెండ్రుకలు లాగి, ఆవల కత్తితో క్షౌరము చేయుము. రాజుగారు నీ కేమి కావలె నని యడిగినచో, దేవా, వేరొకవరము వలదు. తమ ఉదానగాథకు భావార్థము తెలుపుడు అని వేడుము. నీకు బాలధన మిత్తును' అన్నది.

వాడు సమ్మతించి క్షౌరమునాడు ముందు చిమ్మట చేతితో పట్టుకొనెను. రాజు చూచి 'గంగమాలా, ఏమిది? క్రొత్తపని చేయుచున్నావు?' అనెను.

'దేవా, మంగలులు క్రొత్తపనులు చేయగలరు' అని వాడు ముందు వెండ్రుకలు లాగి ఆవల క్షురకర్మ చేసెను. రాజు 'నీ కేమి కావలెను?' అనెను. 'దేవా,

నాకు వేరేమియు నక్కర లేదు. ఉదానగాథకు భావార్థమును గ్రహింపుడు' "బాబా, ఈ వరమువలన నీ కేమి లాభము? వేరొకటి కోరుకొనుము." "దేవా, నాకు ఈ వరమే కావలెను."

అసత్యభయముచే రాజు సమ్మతించెను. (415) జాతకములోవలెనే సిద్ధము చేయించి రాజు రత్నసింహాసనముపై గూరుచుండి ఉదానగాథకు భావార్థమిట్లు చెప్పెను. "గంగమాలా, నేను పూర్వజన్మములో........" ఇత్యాది వృత్తాంత మంతయు వివరించి, "ఇందుచే గాథకు పూర్వభాగము పలుకుచుంటిని, నామిత్రము ప్రవ్రజించెను. ప్రమాదమునకు నేను వశంవదుడనై రాజ్యము చేయుచున్నాను. ఈ కారణమున ఉత్తరభాగార్థము చెప్పినాను" అని పలికెను.

గంగమాలుడు తనలో "అర్ధోపవాసవ్రతము చేయుటచే ఇంతసంపద లభించినది. కావున కుశలకర్మ చేయవలెను. నేను ప్రవ్రజించి స్థైర్యము సంపాదింతును" అనుకొని బంధువులను విడిచి రాజుననుజ్ఞ పొంది హిమాలయమునకు పోయి వానప్రస్థుడై అనిత్యదుఃఖ అనాత్మ పదార్థములనుగూర్చి యోచన చేసి విపశ్యనాభావన నభ్యసించెను. ఈ విధముగా నతడు ప్రత్యేకబుద్ధత్వము నంది పాత్రచీవరాదులు ధరించి గంధమాదన పర్వతముమీద అయిదు సంవత్సరములు గడిపి వారాణసీ నరేశుని కలిసికొనుటకై ఆకాశమార్గమున వచ్చి ఉద్యానమున మంగళశిలాపట్టము మీద కూరుచుండెను. తోటమాలి గుర్తించి రాజుకడకు పోయి "దేవా, గంగమాలుడు ప్రత్యేకబుద్ధుడై ఆకాశమార్గమున వచ్చి ఉద్యానమున కూరుచున్నాడు" అని నివేదించెను.

విన్నంతనే రాజు ప్రత్యేకబుద్ధునకు ప్రణామము చేయుకోరికతో శీఘ్రముగా నచటికి జనెను. రాజమాతయు పుత్రునివెంట నరిగెను. రాజు ప్రత్యేకబుద్ధునకు ప్రణామము చేసి ఒకప్రక్కన నిలిచెను. రాజ్యపరిషదులును, అటులే చేసిరి. ఆయన రాజును సంబోధించి కుశలప్రశ్న లడిగి 'బ్రహ్మదత్తా, ప్రమాదరహితుడవై ధర్మానుసారముగా రాజ్యము చేయుచున్నావా? దానాది పుణ్యకార్యములు నెరపుచున్నావా?' అని అడిగెను. విన్నంతనే రాజమాత కుపితురాలై హీనకులమున జన్మించి మురికిని శుభ్రముచేయు మంగలిబిడ్డడు తనయంతరము గ్రహింపక పృథివీపతి యగు రాకుమారుని, క్షత్రియుని పేరున పిలిచినాడు అని ఈ గాథ పలికెను.

దుష్టకార్యఫలమ్ములు తొలగి చనును
తపముచే పోవునే సాపితత్వ మైన
కుంభకారత్వమైన? నాకొమరు నేగు
గంగమాల, తపంబుచే, గండుమీరి
పిలిచితివి బ్రహ్మదత్త యన్ పేరుతోడ.

రాజు తల్లిని నివారించి ప్రత్యేకబుద్ధుని గుణములను ప్రకటించువాడై ఈ గాథ పలికెను.

క్షమకు శాంతికి ఫలము లీజన్మమందె
తోచుచున్నవి సర్వవంద్యునకు మేము
సలుపుచున్నార ముద్యోగి జనముతోడ
సర్వపరిషత్తుతో నమస్కార మిపుడు.

రాజు తల్లిని నివారించిన పిమ్మట జను లందరును లేచి 'దేవా, ఇది అనుచితము. ఈ ప్రకారముగా తక్కువజాతివాడు నిన్ను పేరు బెట్టి పిలచినాడు' అనిరి. రాజు జనమును నివారించి ఆయనగుణానువాదము చేయువాడై ఈ గాథ పలికెను.

మేలి పథసాధకుని గంగమాల మునిని
ఏమి యనబోవ, మితడు తరించినాడు
శోకసింధువు విచరించు సుఖముతోడ.

ఇట్లు పలికి రాజు ప్రత్యేకబుద్ధునకు ప్రణామము చేసి "భన్తే, మాఅమ్మగారిని క్షమింపు" డనెను.

"మహారాజా, క్షమించుచున్నాను." రాజు పరిషదులుకూడ క్షమాపణ వేడిరి. అక్కడనే నిలువు మని రాజువేడినను ప్రత్యేకబుద్ధుడు వినక అందరును చూచుచుండగా ఆకాశగమనమున గంధమాదన పర్వతమునకు పోయెను.

శాస్త ఉపాసకునకు ఈ విధముగా ధర్మోపదేశము చేసి, ఉపోసథ వ్రతము నిర్వర్తింపవలెను అని చెప్పి, జాతకములు సరిపోల్చెను. ఆ సమయములో ప్రత్యేకబుద్ధుడు పరినిర్వాణము పొందెను. శ్రద్ధావంతు డగురాజు ఆనందుడు. తల్లి మహామాయ. పట్టపురాణి రాహులునితల్లి. ఉదయరాజు నేనే.

o

# 422. చేతియ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు, దేవదత్తుడు భూగర్భమున లీనమగుటనుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆనాడు భిక్షువులు ధర్మసభలో ఇష్టాగోష్ఠి చేయుచుండిరి. "ఆయుష్మంతులారా, దేవదత్తుడు అసత్యమాడి భూమిలోనికి క్రుంగిపోయి నరకము చేరెను" అనుచుండిరి. శాస్త అరుగుదెంచి సంగతి గ్రహించి, "కేవల మిప్పుడే గాదు. పూర్వముకూడ దేవదత్తుడు అనృత మాడి, భూగర్భమున లీన మయ్యెను" అని పూర్వవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున ప్రథమకల్పమునందు అసంఖ్యేయ ఆయువు, మహాసమ్మత నామము దగు రాజుండెను. అతనికి రోజు అను పుత్రు డుండెను. రోజు కుమారుడు వరరోజు. ఆయనకుమారుడు కల్యాణుడు. ఆయన కుమారుడు వరకల్యాణుడు. ఆయనపుత్రుడు ఉపోసథుడు. ఆయనపుత్రుడు వరఉపోసథుడు. ఆయనసూనుడు మాంధాత. ఆయనతనూజుడు వరమాంధాత. ఆయనకుమారుడు చరుడు. ఆయన కుమారుడు ఉపచరుడు. అతనికి అపచరు డనుపేరుగూడ ఉండెను.

అతడు చేతియరాష్ట్రమున సొత్థియకీ నగరమున రాజ్యము చేయుచుండెను. అతడు నాలుగు బుద్ధులతో కూడినవాడు, ఆకాశసంచారము చేయగలవాడు. నాలుగుదిక్కులు నలుగురుదేవతలు (దైత్యులు) ఖడ్గహస్తులై అతనిని రక్షించుచుండుదురు. అతని శరీరమునుండి చందనపరిమళము, నోటినుండి ఉత్పలసుగంధము వెలువడుచుండును. కపిలు డను బ్రాహ్మణుడు కలడు. ఆయన పురోహితుడు. ఆయనతమ్ముడు కోరకలంబుడు రాజుతోగూడ ఒకే ఉపాధ్యాయునికడ చదువుచు, సహాధ్యాయిగా కాలము గడపెను.

రాజకుమారస్థితిలోనే మిత్రునితో, “రాజు నయినప్పుడు నేను, నిన్ను పురోహితుని చేయుదు” నని యతడు మాట యిచ్చినాడు.

అతడు రాజయినంతనే కపిలుని పురోహిత పదవినుండి తొలగింపలేక ఆయన తనకొలువునకు వచ్చినపుడు ప్రతిగౌరవము చేయుచుండెను. కపిలుడు గ్రహించి సమవయస్కులవలననే రాజ్యపాలనము బాగుగా నడచు నని అనుజ్ఞ పొంది ప్రవ్రజింతు నని యోచించి రాజుతో 'దేవా, నేను వృద్ధుడ నైనాను. ఇంటిలో కుమారు డున్నాడు. అతనిని పురోహితుని చేయుడు. నేను ప్రవ్రజింతును' అని విన్నవించెను. అతడు రాజానుమతి పొంది పుత్రునకు పురోహిత పదవి ఇప్పించి రాజోద్యానమున ప్రవేశించి వానప్రస్థుడై ధ్యానాభిజ్ఞలను పొంది పుత్రునియాశ్రయమున అచటనే యుండెను.

“ఈయన ప్రవ్రజించునపుడు నాకు పురోహిత పదవి ఇప్పింపలేదు” అని తలపోయగా, కోరకలంబుని మనసులో ఈర్ష్య యుద్భవించెను. ఒకనా డతడును రాజును ఇష్టాగోష్ఠి చేయుచుండ రాజు “కోరకలంబా, నీవు పురోహిత పదవిలో లేవా”? అనెను.

“దేవా, లేను. నాసోదరు డున్నాడు.”

“నీసోదరుడు ప్రవ్రజించెనా?”

“అవును. ఆ పదవి తనకుమారుని కిప్పించినాడు.”

“అటులైనచో నీ వీపదవిని తీసికొమ్ము.”

“దేవా, పరంపరాప్రాప్త మగుపదవినుండి సోదరుని తప్పింపజాలను.”

“అగుచో నిన్ను జ్యేష్ఠుని చేసి, నీసోదరుని రెండవవానిని చేయుదును.”

“ఎట్లు దేవా?”.

“అనృతము పలికి.”

“దేవా, నాసోదరుడు మంత్రవేత్త యని యెరుగరా? అనృతమువలన అతడు మిమ్ము మోసగించును. ఇట్లు చేయు ననుకొందును. నలుగురు దైత్యులను అంతర్ధానము చేయును. శరీరమునుండి సుగంధమునకు మారుగా దుర్వాసన తెప్పించును. మిమ్ము ఆకాశమునుండి భూమిమీదికి దింపివేయును. భూగర్భమున ప్రవిష్టులను చేయును. అపుడు మీరు మాటమీద నిలువబడలేరు”.

"ఇట్లు తలప వలదు. నేను ఏర్పాటు చేయగలను"

"అగుచో దేవా, ఎప్పు డేర్పాటు చేయగలరు ?"

"నేటినుండి ఏడవనాడు".

ఈ విషయము నగరమంతట చాటిరి. రాజు అనృతము పలికి పెద్దవానిని చిన్నవా డనియు చిన్నవానిని పెద్దవా డనియు చెప్పి, పురోహితపదవి ఇచ్చు నని ఈయన అనృత మెట్లు చెప్పును ?

జనులలో ఈ చర్చ వ్యాపించెను.

అతడు యుగసత్యము పలుకువాడు. అసత్యము పలుకుట యెట్టు లుండు నని యెవ్వడు నెరుగడు. ఈ విషయము వినగానే పురోహిత పుత్రుడు, తండ్రితో "నాయనా, రాజు అనృతము పలికి మిమ్ము చిన్నవానిగా పేర్కొని పురోహిత పదవి పినతండ్రి కిచ్చునట" అని చెప్పెను.

"బాబూ, మృషావాదముచే మనపదవి ఆతని కీయలేడు. రాజు ఏరోజున మృషావాదము చేయును ?"

"నేటి కేడవనాడు"

"అగుచో ఆసమయము నాకు తెలుపుము."

మృషావాదము వినుటకై జనులు రాజాంగణమున గుమిగూడిరి. వారు మంచెలు కట్టి వానిపై నెక్కి కూరుచుండిరి. కుమారుడు వెళ్ళి తండ్రికి సూచన చేసెను.

అలంకరించుకొని రాజు బయలుదేరి వచ్చి జనసమూహముపైగా ఆకాశమున నిలిచెను. తాపసి ఆకాశమార్గమున వచ్చి రాజున కెదురుగా కృష్ణాజినము పరచు కొని పద్మాసనము వేసి కూరుచుండి 'మహారాజా, మీరు మృషావాదము చేసి చిన్న వానిని పెద్దగా పేర్కొని అతనికి పదవి ఈయగోరుచున్నారా?" అనెను.

"అవును, ఆచార్యా, అట్లే చెప్పితిని".

ఆయన రాజున కుపదేశ మిచ్చువాడై "మహారాజా, మృషావాదము గుణము లకు హానికరము. నాలుగు నరకములకు లాగికొని పోవును. మృషావాది యాగు

రాజు ధర్మమును నాశనము చేయును దానివలన స్వయముగా నష్టము పొందును" అని చెప్పి ఈగాథ పలికెను.

నాశ మొందించు ధర్మము నష్ట మైన,
చెరుపు చేయదు ధర్మమ్ము చెడకయున్న,
నాశ మైనధర్మము నిన్ను నష్టపరప
కుండ ధర్మమ్ము నెరపుచు నుండవలయు.

"మహారాజా. మృషావాదము చేయుచో నాలుగు బుద్ధు లంతర్ధాన మగు"నని తాపసి ఈగాథ పలికెను.

పలుకు నెవ్వ డసత్యంబు, ప్రశ్నమునకు
బదు లెరింగియు నన్యథా పలుకు నెవడు
వాని పాలక దేవతల్ వదలిపోదు
రతని నోటను దుర్గంధ మవతరించు,
నేలబడు నాత డున్నది కోలుపోయి.

విని రాజు భయపడి కోరకలంబునివైపు చూచెను. అతడు "భయపడ వద్దు. నేను తొలుతనే మీకు చెప్పలేదా?" అనెను. రాజు కపిలునిమాట వినగానే తనమాటలు జ్ఞప్తికి తెచ్చుకొని "భన్తే, మీరు చిన్నవారు. కోరకలంబుడు పెద్ద వాడు" అని పలికెను. అత డసత్యము పలికినంతనే (రక్షక) దైత్యులు నలుగురు ఖడ్గములను పాదములమీద పడవేసి ఇట్టి మృషావాదిని రక్షింప మని అంతర్ధాన మయిరి. కుళ్ళిన కోడిగ్రుడ్డునుండి వచ్చినట్లు నోటినుండియు, మురుగు దొడ్డిలో నుండి వచ్చినట్లు అతని శరీరము నుండియు కంపు కొట్టసాగెను. రాజు ఆకసము నుండి నేలకు జారెను, నాలుగు బుద్ధులును పోవుచుండెను. అప్పుడు మహాపురో హితుడు "మహారాజా, భయము వలదు. సత్యము పలుకుచో అంతయు పూర్వము వలె నుండునట్లు చేయుదును" అని ఈగాథ పలికెను.

సత్యము వచించుచో రాజ, చనెద వీవు
పూర్వవిధమున; ఉందువు భూమిమీద.
చెప్పెదవయేని యనృతంబు చేతియ నృప!

ఇట్లు పలికి పురోహితుడు "మహారాజా, మొదటిసారి అసత్యముచే నీ బుద్ధులు అంతరించినవి. ఇప్పటి కయినను పూర్వమువలె నుండునట్లు చేయగలను"

అనెను. "నీవు మోసము చేయ నెంచుచున్నావు" అని రాజు మరల ననృతము పలికినంతనే చీలమండల వరకును భూమిలో దిగబడి పోయెను. మరల బ్రాహ్మణుడు "మహారాజా, యోచింపుము" అని ఈ గాథ పలికెను :

ప్రశ్న మెరిగియు నన్యథా పలుకు నెవడు
వాని రాష్ట్రము లోపల వాన కురియు
నసమయమునందు, కురవదు సుసమయాన.

మరల "మహారాజా, అసత్యము పలుకుటచేత భూమిలో పిక్కలవరకు మునిగి పోవుదువు" అని ఈ గాథ పలికెను :

సత్యము వచించుచో రాజ, చనెద వీవు
పూర్వవిధమున; ఉందువు భూమిలోన
చెప్పెదవయేని యనృతంబు చేతియనృప !

అతడు మూడవ పర్యాయముగూడ "భన్తే, మీరు చిన్నవారు. కోరకలంబుడు పెద్దవాడు" అని అసత్యమునే పలికెను. తోడనే రాజు పిక్కలవరకు నేలలో దిగబడిపోయెను. పురోహితుడు "మహారాజా, మరల యోజింపుడు. ఇప్పటికైనను మిమ్ము పూర్వమువలె నుండునట్లు చేయగలను" అనుచు ఈగాథ పలికెను.

ప్రశ్న మెరిగియు నన్యథా పలుకువాని
జిహ్వ పాముచాలికవోలె చీలిపోవు.

రాజు ఆయనమాటలు విశ్వసింపక నాల్గవ పర్యాయముగూడ "భన్తే, మీరు చిన్నవారు. కోరకలంబుడు పెద్దవాడు" అని అసత్యమే పలికెను. తోడనే, అతడు నడుమువరకు భూమిలో దిగబడిపోయెను. బ్రాహ్మణుడు "మహారాజా, ఇప్పుడైన యోజింపుడు" అని మరల ఈగాథ పలికెను.

చేతియనృపాల, రెండుగా చెప్పుదేని
సత్యమే పూర్వవిధమున జనెదవీవు.
మృష నటించినచో భూమిమీద నునికి.

రాజు ఐదవ పర్యాయము "భన్తే, మీరు చిన్నవారు. కోరకలంబుడు పెద్దవాడు" అని అసత్యమే పలికెను. తోడనే రాజు నాభివరకును భూమిలో దిగబడి

పోయెను. బ్రాహ్మణుడు "మహారాజా, ఇప్పుడైన యోజింపుడు" అని ఈ గాథ పలికెను.

ప్రశ్న నెరిగియు నన్యథా పలుకువాని
జిహ్వ యుండును మత్స్య పుచ్ఛికయు వోలె.

రాజు విశ్వసింపక ఆరవపర్యాయముగూడ వెనుకటివలెనే అసత్యము పలికెను. తోడనే రాజు రొమ్మువరకు భూమిలో దిగబడెను. బ్రాహ్మణుడు "మహారాజా, ఇప్పుడైనను యోచింపు" డని ఈగాథలు పలికెను.

ప్రశ్న నెరిగియు నన్యథా పలుకువాని
కులమునం దుద్భవింపరు కొడుకు లెపుడు,
పుత్రికాతతి మాత్రమే పుట్టుచుండు.

దుస్సాంగత్యమువలన రాజు బ్రాహ్మణునిమాటలు విశ్వసింపక ఏడవపర్యాయముగూడ అట్లే అసత్యము పలికెను. తోడనే భూమి బ్రద్దలయ్యెను. అవీచీ నరకమునుండి జ్వాలలు చెలరేగి అతనిని హరించి వేసినవి.

ఈ రెండును అభిసంబుద్ధగాథలు.

ఆదిలో చేతియ నరేశు డంతరిక్ష
గమనమును చేయుచుండెను; కాని ఒక్క
తపసి శాపాన ఆయువు తగ్గిపోయి
బాలపీనస్థితిం గాంచి నేల జొచ్చె

ఇంద్రియాలకు లోనయి స్వేచ్ఛతోడ
జరుగునడవడి బుధులు ప్రశంస చేయ,
రంగుచేత నక్రోధను లయి మనుజులు
స్వేచ్ఛయొక్కన పలుకంగ వలెను నిజము.

చేతియ రాజు ఋషితో అసత్యము పలికినందున భూమిలో లీనమైపోయె నని జనులు భయపడిరి. రాజు కొడుకు లైదుగురు వచ్చి బ్రాహ్మణుని శరణు జొచ్చిరి. ఆయన "బాలులారా, మీనాయన ధర్మమును నాశనము చేసి అసత్యము పలికినాడు. ఋషితో అసత్యము పలుకుటచే అవీచీ నరకముపాలైనాడు. ధర్మమును నాశనము చేయువారు తామే నాశము చెందుదురు. మీరు ఇచ్చట నుండలేరు"

అని పెద్దవానిని పిలిచి "నాయనా, నీవు తూర్పుద్వారమువెంట సూటిగా పోయిన సప్త ప్రతిష్ఠలు కల సర్వశ్వేత గజరత్నమును చూడగలవు. ఆ గురుతునుబట్టి అచట నగరము నిర్మించి నివసింపుము. ఆ నగరమునకు హస్తిపుర మనుపేరు వచ్చును" అనెను. రెండవవానిని పిలిచి "బాబూ, దక్షిణద్వారమువెంట బయలు వెడలి సూటిగా పోయినచో సర్వశ్వేతాశ్వము కానబడును. ఆ చిహ్నమును బట్టి అచ్చట నగరము నిర్మించి నివసింపుము. దానికి అశ్వపుర మని పేరు వచ్చును" అనెను. మూడవవానిని పిలచి "నాయనా, నీవు పశ్చిమద్వారమువెంట బయలు వెడలి సూటిగా పొమ్ము. సింహము కానబడును. అక్కడ నగరము నిర్మించి నివసింపుము. దానికి సింహపురము అని పేరు వచ్చును" అనెను. నాల్గవవానిని పిలిచి "నాయనా, నీవు ఉత్తర ద్వారమున బయలు వెడలి సూటిగా పొమ్ము. సర్వరత్నమయ మగు చక్రపంజరము కానబడును. ఆ గురుతునుబట్టి అచ్చట నగరము నిర్మించి నివసింపుము. దానికి ఉత్తరపాంచాల మని పేరు వచ్చును" అనెను. ఐదవవానిని పిలిచి "బాబూ, నీ విచ్చట నుండలేవు. ఈ నగరమున మహాస్తూప నిర్మాణము చేయించి ఇచ్చటనుండి పశ్చిమోత్తరముగా సూటిగా పోయినచో రెండు పర్వతములు పరస్పరము శబ్దము చేయుచుండును. ఆ గుర్తు కనిపెట్టి అచట నగరమును నిర్మించి నివసింపుము. దానికి దద్దరపుర మని పేరు వచ్చును" అనెను.

వా రైదుగురును ఆయా చిహ్నములనుబట్టి ఆయాస్థానములందు నగరములు నిర్మాణము చేసి నివసింప జొచ్చిరి.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు. పూర్వము కూడ దేవదత్తుడు అనృత మాడి భూగర్భమున లీన మయ్యెను" అని జాతకములు సరిపోల్చెను. "ఆ కాలమున చేతియరాజు దేవదత్తుడు. కపిల బ్రాహ్మణుడు నేనే".

X

# ౪౨౩ ఇంద్రియ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా పూర్వభార్యాకర్షణను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకానొక కులపుత్రుడు శాస్త ధర్మోపదేశమును విని "గృహమున నుండగా సంపూర్ణముగా పరిశుద్ధముగా బ్రహ్మచర్యము జరుపుట సులభము కాదు. నేను కల్యాణప్రద మగు ధర్మ ప్రకారము ప్రవ్రజించి దుఃఖమును తుద ముట్టింతును," అని తలపోసి ఇల్లు వాకిలి సంపత్తి భార్యాపుత్రుల కప్పగించి, తనకు ప్రవ్రజ్యా అనుగ్రహింపు మని శాస్తను కోరెను. శాస్త అతనికి ప్రవ్రజ్య ఇప్పించెను. ఆచార్యునితో అతడు భిక్షకు జనునపుడు, నూతనముగా సంఘు వగుటచేతను, భిక్షువులసంఖ్య అధిక మగుటచేతను, అతనికి ఇండ్లలో, భోజనశాలలో స్థానము లభింపకుండెను. సంఘములో నవీను డగుటచే అతనికి పీట కాని చెక్క కాని దొరకుచుండెను. దొన్నెలో యవాగు పానీయము, మాగినపేళీ, కూరముక్కలు ఎండినవో మాడినవో వానికి భిక్షతో దొరకుచుండెడివి. ఏదియు బాగునది కాదు. దొరికిన ఆహారము నతడు పూర్వభార్యకడకు కొనిపోయెడివాడు. ఆమె అతనిపాత్ర గ్గె కొని ప్రణమిల్లి పాత్రనుండి అన్నమును పైకి తీసి, బాగుగా వండిన ఆహారపదార్థములు పెట్టు చుండెడిది. అతనికి జిహ్వాచాపల్యము వదలకుండుటచే అమెను విడువజాల కుండెను. అతనికి తనయందు అసక్తి యున్నదో లేదో పరీక్షింతు నని తలచి ఆమె ఒకనాడు అ జనపదమునందలి ఒకానొకనికి తెల్లని మన్నుపూసి ఇంట గూర్చుండ బెట్టెను. మరికొందరను పిలిచి అన్నపానము లిప్పించెను. వాకిలియెదుట బండి నిలిపి తాను ఇంటిలోపల కూర్చుండి పిండివంట చేయుచుండెను. స్థవిరుడు వచ్చి వాకిట నిలిచెను. అది చూచి ఒకడు "అమ్మా, స్థవిరుడు వచ్చి ద్వారముకడ నిలిచి యున్నాడు" అని తెలిపెను. "ప్రణామము చేసి క్షమింపు మని తెలుపుము." మాటిమాటికిని దయ చేయ మని చెప్పినను వెడలకుండుట గమనించి "అమ్మా, స్థవిరుడు వెళ్ళకున్నాడు." అని అతడు చెప్పెను. ఆమె తెర తొలగించి చూచి 'ఈయన నాకుమారుని తండ్రియే' అని వెలుపలికి జని ప్రణామము చేసి చేతిలోని పాత్ర గ్గె కొని ఆయనను

లోనికి గొనిపోయెను. భోజనానంతరము నమస్కరించి "భన్తే, ఈ యింట మీకు శాంతి కల్గునుగాక! మే మింతవరకును వేరొకయింటికి వెళ్ళలేదు. స్వామి లేని యింట గృహనిర్వహణము సాగదు. ఇక మేము ఈ యిల్లు విడిచి దూర గ్రామమునకు పోవుచున్నాము. తమరు భద్రముగా నుండుడు. నావలన అపరాధ మున్నచో క్షమింపుడు" అనెను. వృద్ధునకు గుండె బ్రద్ద లగునట్లాయెను. "నిన్ను నేను విడువజాలను. పోవలదు. నేను గృహస్థు నయ్యెదను. ఫలాని ప్రదేశమునకు వస్త్రములు పంపుము. నేను పాత్రను చీవరములను సంఘమునకు సమర్పించి మరలి వచ్చెదను ఆమె 'మంచి' దని అంగీకరించెను. స్థవిరుడు విహారము చేరి ఆచార్యునకు పాత్ర చీవరము సమర్పించగా ఆయన "నీవేమి చేసితివి?" అనెను. పూర్వభార్యమీది ఆసక్తిచే మరల గృహస్థుడ నయ్యెదను" అనెను. అత డంగీకరింపకున్నను శాస్తకడకు గొని పోయిరి. "ఇచ్ఛలేని ఈ భిక్షుకు నేల కొనివచ్చితిరి?" అని శాస్త అడుగగా, వారు "భన్తే, ఇతడు ఉద్విగ్నచిత్తుడై మరల గృహస్థుడాగోరుచున్నాడు" అని విన్నవించిరి. "నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడవా?" అని శాస్త అడుగగా "భన్తే, నిజమే" అనెను. "ఎందుచేత"? "పూర్వభార్యమీది ఆసక్తిచేత" "ఆమె నీ కనర్థదాయకురాలు. పూర్వజన్మమునందు కూడ ఆమె వలననే ధ్యానభ్రష్టుడవై బాల కష్టముల పాలైతివి. నాసాయమువలన మరల ఆ దుఃఖమునుండి విముక్తి గాంచి క్రమ్మర జ్ఞానము పొందితివి." అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు పురోహితునివలన ఆయనభార్య గర్భమున పుట్టెను. ఆయన పుట్టిన నాడు నగర మంతటను శస్త్రకాంతి బయలువెడలుటచే జ్యోతిపాలకుమారు డని వానికి పేరు పెట్టిరి. అతడు పెరిగి తక్షశిల కేగి అన్నివిద్య లభ్యసించి వచ్చి రాజుకడ విద్యలు ప్రదర్శించి సంపద విడిచి ఎవరికిని తెలుపకుండ అగ్రహారము వెలువడి అరణ్యమునకు పోయి శక్రు డిచ్చిన కవిష్ఠ ఆశ్రమమున వానప్రస్థవృత్తి నవలంబించి ధ్యానాభిజ్ఞలు పొందెను. ఆయన అచట నుండునపుడు ఆయనచుట్టును వందలకొలది ఋషులు సమావిష్టులైరి. సంఘము పెరిగెను. పెద్దశిష్యు లేడుగురుండిరి. సాలస్సరనాము డనుఋషి కవిష్ఠ ఆశ్రమమునుండి వెడలి సురట్ఠ (సౌరాష్ట్ర) జనపదమున సాతోదకీ నదీతీరమున వేలకొలది ఋషులతో నివసింప

జొచ్చెను. మేండిప్పర నామక ఋషి సజకరాజు దేశమున లంబమూలకదేశ మాధారముగా జేసికొని వేలకొలది ఋషులతో నివసింపజొచ్చెను. కాళదేవల నామక ఋషి అవంతి దక్షిణాపథమున ఘనశైలాశ్రమమున వేలకొలది ఋషులతో నుండసాగెను. కిసవచ్ఛ నామక ఋషి ఒంటిగా దండిక రాజునగర మగు కుంభవత్ ఆశ్రయముగ ఉద్యానమున నివాసము చేయసాగెను. అనుసస్సనాముడు బోధిసత్త్వుని సేవకుడు ఆయనకడ నుండెను. కాళదేవుని తమ్ము డగు నారద నామఋషి మధ్యమ ప్రదేశమున అరంజర పర్వత శ్రేణిలో నొకగుహలో ఒంటిగా నివసించు చుండెను. పెద్ద గ్రామము నఘుమగా పెద్దమేడ కలదు. చాలమంది ఆమేడ దాటి పోగలరు. ఆ నదీతీరమున గూరుచుండి సురూపవతులగు వేశ్యలు జనుల నాకర్షింతురు. నారదు డొకవేశ్యయెడ ననురక్తుడై ధ్యానము మాని నిరాహారుడై శుష్కించుచు రాగవశంవదుడై వారము రోజులపాటు పడియుండెను. ఆయన సోదరుడు కాళదేవలుడు ధ్యానింపగా ఈ స్థితి తెలిసెను. తోడనే ఆయన ఆకాశ మార్గమున వచ్చి గుహలో ప్రవేశించెను. నారదుడు చూచి "ఏల వచ్చితి" రని అడిగెను. "నీవు చిక్కులో పడినావు. ఉపకారము చేయవచ్చినాను." "అవాస్తవిక వాక్కు పల్కుచున్నారు" అని ఆయనపై అనృతదోష మాపాదించెను. "నీవు విగువలేకున్నావు" అని ఆయన సావిస్సరుని, మేందిస్సరుని వచ్ఛితిస్సరుని పిలిపించెను. వారిముగ్గురిపై గూడ నారదుడు మృషావాద మారోపించెను. కాలదేవలఋషి ఆకాశమార్గమున జని సరభంగశాస్తను గొనివచ్చెను. ఆయన వచ్చి చూచి నారదుడు ఇంద్రియములకు వశీభూతు డయ్యె నని తెలిసికొని "నారదా, ఇంద్రియములకు లోబడిపోవలేదా?" అనెను. నారదుడు లేచి ప్రణామము చేసి "అవును, ఆచార్యా!" యనెను. "ఇంద్రియములకు వశీభూతు డగువాడు ఈజన్మలో శుష్కించి దుఃఖము ననుభవించి పరజన్మలో నరకమున బడును" అని శాస్త ఈ గాథ పలికెను :

ఇంద్రియములకు లోబడి యెవడు కోర్కె
తోడ దిరుగును నారద, వాడు పొందు
రెండులోకాలు కోల్పోయి మెండుబాధ.

విని నారదుడు "ఆచార్యా, కామభోగమే సుఖము. అట్టి సుఖమును దుఃఖ మందు రేమి?" అనెను.

"అగుచో వినుము" అని సరభంగు డీ గాథ పలికెను ;

సుఖమునకు నావలం దోచుచుండు దుఃఖ,
మవల దుఃఖమ్మునకు సౌఖ్య మవతరించు.
నారదుడు వీడి సుఖ మొందినాడు బాధ :
సౌఖ్యకాంక్షయె యుక్త మీసమయమందు.

నారదుడు "ఇది దుస్సహ మైనదుఃఖము. దీనిని సహింపజాలను" అనెను. బోధిసత్త్వుడు "నారదా, దుఃఖము కలిగినపిమ్మట సహింపక తప్పదు" అని ఈ గాథ పలికెను :

వ్యథలు పొందుచు నుండి యెవ్వండు కోలు
కోవడో ధీరతను వాడు పొందు సుఖము.

అతడు "ఆచార్యా, కామభోగమే ఉత్తమసుఖము. దానిని విడువజాలను" అనెను. బోధిసత్త్వుడు "ఎన్నడును ధర్మహాని చేయరాదు" అని ఈ గాథపలికెను :

కామభోగార్థ మైనను కాక అర్థ
వాంఛచే నైన నష్టనివారణార్థ
మైన ధర్మమార్గచ్యుతి అనుచితంబు.

ఈ ప్రకారముగా సరభంగుడు నాలుగుగాథలద్వారా ఉపదేశ మిచ్చెను. కాళదేవలుడు తన తమ్మునికి ఉపదేశ మిచ్చువాడై ఈ గాథ పలికెను :

తాలుత సంసారమున మేలు దుఃఖపడుట,
భోజనవిభాగమున బాధ పొంద మేలు,
అర్థలాభమ్ము గని వినయమ్ముతోడ
నడచుకొనుచుంట మంచిది నష్ట మయ్యు ;
ఉన్న సంపద, శాంతితో నుంట మేలు.

దేవలుడు నారదుని కుపదేశించినమాటలు తెలిసికొని అభిసంబుద్ధు డైనపిమ్మట శాస్త ఈ గాథ పలికెను :

అనిత దేవల విజ్ఞాని అనియె నిట్లు :
ఇంద్రియములకు వశవ రి యెవడు, వాని
కంటె నధమతరం బేది గాన రాదు.

అప్పుడు సరభంగుడు "ఓరయా, ఈ సంగతి వినుము. తనకర్తవ్యమును తొలుత నిర్వర్తింపనివాడు అడవిలో జొచ్చిన మాణవకునివలె విచారించి యేడ్చిమొత్తుకొనును" అని పూర్వజన్మకథ యిట్లు చెప్పెను :

పూర్వ మొకానొక కాశీనిగమములో బ్రాహ్మణయువకుడు, చక్కనివాడు, ఏనుగు బలమువాడు నివసించుచుండెను. వా డిట్లు తలపోసెను : "కృషికర్మాదులు చేసి తలిదండ్రులను పోషించుటవలన లాభ మేమి ? నే నెవ్వరిని పోషింపక ఏపుణ్యకర్మను చేయక అరణ్యమునకు పోయి మృగములను చంపి తిని నన్ను నేనే పోషించుకొందును." పిమ్మట వాడు పంచాయుధములను చేకొని హిమాలయమున అనేకమృగములను వధించి తినుచు, హిమాలయములలో విధవా నదీతీరమున కొండలు చుట్టుకొని యున్న పెద్దపర్వతజాలమున ప్రవేశించి అక్కడి జంతువులను చంపి నిప్పుమీద కాల్చుకొని తినుచుండెను. "నే నెల్లకాలము శక్తిగల్గి యుండను. దుర్బలుడ నయిపోయినపుడు వనములో తిరుగజాలను. ఇప్పుడే నానావర్ణమృగములను పర్వతజాలమున చేర్చి, ద్వార మేర్పాటు చేసి అరణ్యమున ప్రవేశింపకుండనే అభిమతమునుబట్టి మృగమును సంహరించి తినుచుందును" అని వాడొకనాడు యోజించి ఆ ప్రకారమే చేసెను. కాలక్రమమున వాని కర్మ పరిపక్వమై ఫలము కుడిపి కట్టెను. వాని కాలుసేతులు పడిపోయినవి. ఇటునటు తిరుగుశక్తి నశించినది. ఆహార పానీయములు దొరకుట లేదు. శరీరము వడలి పోయినది. వాడు మనుష్య ప్రేతమువలె నయినాడు. వేసవికాలమున నేల నెర్రెలు విచ్చునట్లు వాని శరీరమున పగుళ్ళు (రేఖలు) ఏర్పడినవి. వాడు కురూపియై అచటనే బాల కష్ట మనుభవించుచుండెను.

అరణ్యములో జంతువుల మాంసము నిప్పులమీద కాల్చి తినవలెనని శిబిరాజుకు బుద్ధి పుట్టెను. రాజ్యము నమాత్యుల కప్పగించి పంచాయుధములను గొని యతడరణ్యము ప్రవేశించి జంతువులను చంపి మాంసము తినుచు ఒకచోటికి జేరి మానవుని గాంచి శిబిరాజు భయపడి యెట్లో సంబాళించుకొని "ఓయీ, నీ వెవరు ?" అనెను.

"ఎవ్వనిరా, నేను మానవప్రేతమును. చేసిన కర్మలకు ప్రతిఫల మనుభవించుచున్నాను. కాని నీ వెవరు ?"

"నేను శిబిరాజును" "ఇచటి కేల వచ్చితివి ?"

"మృగమాంసము తినుటకు".

"మహారాజా, నేను ఈ కోరికతోనే ఇచటికి వచ్చితిని. ఇపుడు మానవ ప్రేతము నయినాను." వాడు తన కష్టస్థితిని సవివరముగా వర్ణించువాడై ఈ గాథలు పలికినాడు.

శత్రుపాస్త్రములం బడుసరణి నాది
కృషిని దక్షత విద్యలు గృహము రాజ
శీలమును మృదువాక్కుల కోలుపోయి
కాంచినా నీయవస్థ దుష్కర్మ కలన.

వేయి మడుగుల గోల్పోవు విధిని నేను
ఆర్య ధర్మ చ్యుతిం బొంది అగతికుండ.
బంధుగులు లేక ప్రేతమ్ము భాతి నైతి.

సుఖము కోరెడి జనులను క్షోభ పెట్టు
కతన పట్టెను నాకు నీగతి కృశాను
మధ్యమున నున్న మనుజునిమాడ్కి నిపుడు
లవము సైతము సౌఖ్యానుభవము లేదు !

ఇట్లు పలికి "మహారాజా, నేను సుఖవాంఛతో అన్యులకు కష్టము కలిగించినాను. కావున ఈ జన్మములోనే మనుష్య ప్రేతము నయినాను. నీవు ఏపకార్యము చేయకుము. నీ నగరమునకు మరలిపోయి దానాదిపుణ్య కార్యములు చేయుము" అని బోధించెను. రాజు ఆ ప్రకారమే చేయుచు తుదకు స్వర్గగామి యయ్యెను.

సరభంగఋషి ఈ విషయము వివరించి తపస్వికి చైతన్యము కలుగునట్లు చేసెను. నారదు డాయన వాక్కులకు ప్రభావితు డయి, ఆయనకు ప్రణామము చేసి క్షమాపణ వేడి కసిణాభ్యాసముచేసి కోల్పోయిన ధ్యానమును సంపాదించెను. సరభంగఋషి నారదు నచ్చట నుండనీయక తనయాశ్రమమునకే కొనిపోయెను.

శాస్త ధర్మోపదేశము చేసి సత్యప్రకాశము గావించి జాతకములను సరిపోల్చెను. ఉద్విగ్నచిత్తు డగుభిక్షువు స్రోతాపత్తి ఫలము పొందెను. "ఆ కాలమున ఉద్విగ్నచిత్త భిక్షువు నారదుడు; సావిస్సరుడు, సారిపుత్రుడు; మేండిస్సరుడు కశ్యపుడు; పబ్బతుడు, అనురుద్ధుడు; కాళదేవళుడు, కాత్యాయనుడు; అనుసిస్సు ఆనందుడు; కిసవచ్ఛుడు మొగ్గలాయనుడు; సరభంగుడు నేనే.

# 424. ఆదిత్త జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు అసమాన దానమునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

మహాగోవింద సూత్రములలోని వర్ణనమునుబట్టి విస్తారముగా గ్రహించునది. దానమిచ్చినమరునాడు ధర్మసభలో దానినిగూర్చి చర్చ జరిగెను. "ఆయుష్మంతులారా, కోసల నరేశుడు విచారించి క్షేత్రము చూచియే బుద్ధప్రముఖ మైనసంఘమునకు భూరిదానము నిచ్చెను." ఇంతలో శాస్త అచటికి వచ్చి "భిక్షువులారా, ఏమి చేయుచున్నారు ? అని అడుగగా ఫలానివిషయ మని వారు చెప్పినపిమ్మట "భిక్షువులారా, ఇం దాశ్చర్య మేమియు లేదు. రాజు యోచించి ఉత్తమపుణ్యక్షేత్రమున దానము చేసినాడు. పూర్వము సజ్జనులు విచారించియే దానము చేసిరి" అని పూర్వ జన్మగాథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము సౌవీరరాష్ట్రములో రోరుక నగరమున భరతమహారాజు దశరాజ ధర్మముల కవిరుద్ధముగ నడచుచు చతుస్సంగ్రహవస్తువులను జనమునకు నింపుచు లోకులకు తలిదండ్రులతో సమానుడై దరిద్రులకు దుఃఖితులకు యాచకులకు భూరి దానములు చేయుచుండెను. పట్టపుదేవి, పేరు సముద్రవిజయ. ఆమె విద్యావతి, వివేకవతి. ఒకనాడు రాజు ధర్మశాలవైపు చూచి "దుశ్శీలురు లోభులు దానము పొందుచున్నారు. నాకు మనశ్శాంతిలేదు. దక్షిణ గ్రహించుటకు యోగ్యు లయిన ప్రత్యేకబుద్ధులకే ప్రథమతః దానము చేయవలెను. వారు హిమాలయమునం దుందురు. వారి నెవ్వరాహ్వానింతురు ? ఎవరిని పంపుదును?" అని తలపోసి ఈ విషయము దేవితో చెప్పెను. ఆమె "మహారాజా, చింతింపకుడు. మనదానబలముచే శీలబలముచే సత్యబలముచే పుష్పములు పంపి (చల్లి) ప్రత్యేకబుద్ధులను నిమంత్రింతము. వారు వచ్చినపిమ్మట సర్వపరిష్కారదానములు చేయుదము" అనెను. రాజు మంచి దని నగరవాసు లెల్లరును శీలగ్రహణము చేయవలె నని చాటింపించెను.

పరిజనసహితముగా ఉపసాదనాంగములను గ్రహించి మహాదానములు ప్రారంభించి ఆయన పుష్పములతో కూడిన బంగరు సముద్గకము పట్టుకొని ప్రాసాదము దిగి అంగణము చేరి భూమిపై అయిదంగముల నుంచి తూర్పుగా తిరిగి ప్రణామము చేసి "తూర్పుదిక్కున నున్న అర్హతులకు ప్రణామము చేయుచున్నాను. మాయం దేద్దైన గుణ మున్నచో అనుగ్రహించి మాభిక్ష స్వీకరింపుడు" అని ఏడుగుప్పిళ్ళ పూవులు చల్లెను. తూర్పున ప్రత్యేకబుద్ధు లెవ్వరును లేకుండుటచే తొలినా డెవ్వరును రాలేదు. రెండవనాడు రాజు దక్షిణదిక్కునకు ప్రణామము చేసెను. అటునుండి యెవరును రాలేదు. మూడవనాడు రాజు ఉత్తరదిక్కునకు నమస్కారము చేసి "ఉత్తరహిమాలయ ప్రదేశమున నుండు ప్రత్యేకబుద్ధులు మాభిక్ష గ్రహింతురు గాక" అని ఏడుమారులు పుష్పములు చల్లెను. ఆ పుష్పములు నందమూల పర్వతముమీది 500 ప్రత్యేకబుద్ధులపై బడెను. తమ్ము రాజు నిమంత్రించె నని వారు ధ్యానబలమున గ్రహించిరి. మరునాడు వారు తమలో ఏడుగురను పిలిపించి "మిత్రులారా, రాజు మనలను నిమంత్రించినాడు. అందరను సమకూర్పుడు" అని చెప్పిరి. ప్రత్యేకబుద్ధు లాకాశమార్గమున వచ్చి రాజద్వారముకడ నిలిచిరి.

రాజు వారిని చూచి ప్రసన్నచిత్తుడై వారికి ప్రణామము చేసి ప్రాసాదము మీదికి గొనిపోయి విశేషసత్కారములు చేసి దానము లిచ్చెను. భోజనానంతరము వారిని అయిదురోజులవరకును నిమంత్రించెను. ఆరవనాడు భోజనానంతరము ఏడవనాటికై సమస్తపరిష్కారములతో గూడినదానములు సిద్ధము చేసి స్వర్ణఖచితములైన పీఠములు చేయించి త్రిచీవరాది సంపూర్ణ శ్రమణ పరిష్కారములను ఏడుగురు ప్రత్యేకబుద్ధుల సన్నిధియం దుంచెను. భోజనము లైనపిమ్మట రాజు రాణియు వారికి నమస్కారములు చేసి నిలిచి "ఈ పరిష్కారములను తమకు సమర్పించుచున్నాము" అనిరి. అంతట సంఘస్థవిరుడు దాని ననుమోదించుచు రెండుగాథలు పలికెను :

మండుచుండెడి గృహములోనుండి తీయు
భాజనాదిక ముపయోగపడును, కాని
కాలినట్టి సామగ్రి అక్కరకు రాదు.

జరయు మరణంబు గాల్చు సంసారమందు
దాన మొనరించినాడవో దేని మున్ను
అద్ది మాత్రము రక్షిత మగును సుమ్ము.

ఈ ప్రకారముగా సంఘస్థవిరుడు దానానుమోదనము చేసి "మహారాజా, అప్రమత్తుడవై యుండు" మని ఉపదేశించి ఉప్పరమున కెగసి ప్రాసాదకర్ణికను ఛేదించుకొనిపోయి నందమూల పర్వతము చేరెను. రాజును రాణియు సంపూర్ణానందభరితు లైరి. స్థవిరుడు వెడలిపోయినపిమ్మట ప్రత్యేకబుద్ధు లొక్క రొక్కరుగా ఒక్కొక్కగాధ పలికి పరిష్కారముల గైకొని నందమూల పర్వతమున కేగిరి.

దాన మెవ డిచ్చునో లబ్ధధరునకును
దాటి యాతడు యమునిపై తరణి పొంద
జాలు దివ్యంబు లైనను నములను.

దాన రణములు రెండు సమాన మండ్రు
కొలదిమంది జయింతురు గొప్పగుంపు.
శ్రద్ధతో నిచ్చుదానము స్వల్ప మైన
అమరు నతనికి పరలోకమందు సుఖము.

శోధించి యిచ్చెడు యోగ్యదానమ్ము
సుప్రకాశిత మయ్యె సుగతునిచేత
ఈ జీవలోకమం దీయగా దగిన
జనులకు దానంబు సత్ఫల మొసగు
సత్క్షేత్రపతిత బీజమ్ము పోలికను.

ప్రాణుల నెవ్వారు బాధింపకుండ
చరియించుచుందురో జనభీతివలన
పాపమ్ము చేయరో, ప్రస్తుతి కంద్రు.
పాపహాసుల కెట్టి ప్రస్తుతిలేదు
భయముచే యోగ్యుండు పాపి కాబోడు.

క్షీణమౌ బ్రహ్మచర్యముచేత వచ్చు
మనుజునకు క్షత్రియత్వము మధ్యమమున
పొందు దేవత్వ ముత్తమమ్మునను శుద్ధి.

సందియము లేక ప్రస్తుతి నొందె దాన
మట్టి లయమ్మును, ధర్మమే అంతకన్న

శ్రేష్ఠమైనది : మును శాంతచిత్తులైన
వారలును ప్రాజ్ఞులును నైనవారు ధర్మ
మాచరించుచు నిర్వాణ మందినారు.

ఈ ప్రకారముగా ఏడుగురు ప్రత్యేకబుద్ధులు దానానుమోదనముచే రాజున కమృత నిర్వాణమహిమను తెలిపి అప్రమత్తుడవై యుండుమని యుపదేశించి, ఉక్త ప్రకారము తమతమ నివాసస్థానములకు పోయిరి.

రాజు, రాణియు, యావజ్జీవము దానధర్మములు చేయుచుండిరి. తుదకు రాజు స్వర్గలోక పరాయణు డయ్యెను.

ఈ విధముగా పండితులు పూర్వముయోజించి, దానము చేసిరి, అని శాస్త జాతకములు సరిపోల్చెను. "ఆ సమయమున ప్రత్యేకబుద్ధులు పరినిర్వాణమొందిరి. సముద్రవిజయ రాహులునితల్లి. భరతరాజు నేనే."

o

# 425. అట్ఠాన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఉద్విగ్నచిత్తుడగు ఒకానొక భిక్షువునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శాస్త అతనితో "భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడవైతివా" అనెను.

"చిత్తము, భన్తే!"

"ఎందుచేత?"

"కామవశమున."

"భిక్షూ, స్త్రీలకు కృతజ్ఞత లేదు. వారు మిత్రద్రోహము చేయుదురు; విశ్వాసయోగ్యులు కారు. పూర్వము చదువుకొన్నవారు దినమునకు వేయిపణము లిచ్చియు స్త్రీని సంతుష్టచిత్తగా ఉంచజాలరైరి. ఒకనాడు వేయిపణములు లభింపక పోగా వారిని ఆమె మెడ పట్టి నెట్టించినది. స్త్రీలు ఇట్లు అకృతజ్ఞ లగుదురు. కావున నీవు కామవశంవదుడవు కాబోకుము" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండునపుడు ఆయనపుత్రుడు బ్రహ్మదత్తకుమారుడును, వారాణసీ శ్రేష్ఠిపుత్రుడు మహాధన కుమారుడును మిత్రులు. వారు ఒకేగురుకులమున విద్య నభ్యసించిరి. కుమారుడు తండ్రితరువాత రాజయ్యెను. శ్రేష్ఠికుమారుడు ఆయనయొద్దనే యుండెను. వారాణసిలో సుందరాంగి యను వర్ణదాసి (వేశ్య) యుండెను. శ్రేష్ఠికుమారు డామెకు ప్రతిదినము వేయిపణము లిచ్చి ఆమెతో క్రీడించుచుండెను. తండ్రి పోయిన తరువాత అతనికి శ్రేష్ఠిపదవి లభించెను. కాని అతడు దానిని విడిచిపెట్టక ప్రతి దినము వేయిముద్ర లిచ్చుచునే యుండెను. అతడు ప్రతిదినము మూడుమారులు రాజసేవార్థము పోవుచుండెను. ఒకనాడు సంధ్యాసమయమున నతడు రాజుకొలువు

నకు పోయి సంభాషించుచుండ సూర్యాస్తమయ మయి సందెచీకటులు వ్యాపింప జొచ్చెను. అతడు రాజకులమును విడిచి "ఇపు డింటికి పోయి మరలివచ్చు నవకాశము లేదు. వేశ్యయింటికి పోవుదు"నని తలపోసి సేవకులకు సెల విచ్చి ఆ నొకడే ఆమెయింటికి పోయెను. అతనిని చూడగానే ఆమె "ఆర్యపుత్రా, సహస్రము తెచ్చితివా?" అనెను.

"భద్రే, నేడు చీకటిపడినది. ఇంటికి బోవక ఇచటికి వచ్చినాను. సేవకులను పంపివేసినాను. రేపు రెండువే లిచ్చెదను" అని శ్రేష్ఠిపుత్రుడు చెప్పెను. ఆమె తనలో "ఈనాడు నే నితని కవకాశ మిచ్చినేని మఱునాడు గూడ వట్టిచేతులతో వచ్చును. ఈ విధముగా నాకు ధనహాని కల్గును. ఇప్పు డీతని కవకాశ మీయను" అనుకొని "స్వామీ, మేము వేశ్యలము. వేయినాణెము లన్న మాకు లీలాప్రాయము కాదు. పోయి తీసికొని రండు" అని పలికెను. "భద్రే, రేపు రెండింతలు తెచ్చెదను" అని అతడు మాటిమాటికిని చెప్పినను వేశ్య తనదాసీజనముతో "వీ డిచ్చట నిలిచి నన్ను చూడకుండ జేయుడు. మెడ పట్టి బయటకు నెట్టి ద్వారము మూసివేయుడు" అని చెప్పెను. వా రట్లే చేసిరి. శ్రేష్ఠిపుత్రుడు తనలో "ఇది ఎనుబదికోట్ల ధనము మ్రింగినది. ఒక్కసారి వట్టిచేతులతో వచ్చినా నని నన్ను మెడ పట్టి నెట్టించినది. ఆహా, స్త్రీ లెంత పాపాత్ములు! వీరికి సిగ్గు గాని కృతజ్ఞత గాని లేదు. వీరు మిత్రద్రోహము చేయుదురు" అని స్త్రీలదుర్గుణములను గూర్చి తలపోయుచుండగా నతనికి వైరాగ్యము కలిగెను. ప్రతికూలసంజ్ఞ ఉత్పన్న మయ్యెను. గృహస్థాశ్రమమునెడ ఉదాసీనత కలిగెను. "ఇక గృహస్థుగా నుండి ప్రయోజన మేమి? నేడే పోయి ప్రవ్రజింతును" అని భావించి ఇంటికి బోవక రాజుతో జెప్పక నగరము వెలువడి అరణ్యము చేరి అచటి గంగాతీరమున ఆశ్రమము నిర్మించుకొని ప్రవ్రజించి ధ్యానాభిజ్ఞలు పొంది కందమూలఫలములు తినుచు అచటనే యుండెను.

శ్రేష్ఠిపుత్రుడు కనబడకుండుటచే రాజు నామిత్ర మెచట నున్నా డని ప్రశ్న చేయగా, వేశ్యావిషయము నగరమున వ్యాపించుటచే పరివారజనులు ప్రభువుతో "దేవా, సిగ్గున నింటికి పోవక అరణ్యమునకు పోయి ప్రవ్రజించినాడు" అని చెప్పినారు. రాజు వేశ్యను పిలువనంపి "వేయిముద్ర లీయకుండుటచే నామిత్రుని నీవు మెడ పట్టి నెట్టించినమాట సత్యమేనా?" అని యడిగెను. "సత్యమే దేవా!" "పాపినీ, దుష్టాత్మురాలా! నామిత్రు డెచ్చట నున్నాడో వెంటనే పోయి వెదకి కనుగొని ఆయనను వెంట బెట్టుకొని రావేని నీప్రాణములు దక్కవు" అని రాజు

పలికెను. వేశ్య భయపడి పరివారమును వెంటగొని బండి యెక్కి వెదకుచు పోయి జనుల నడుగుచు తుద కాయనసన్నిధి చేరి ప్రణామము చేసి "ఆర్యా, మూర్ఖతచే నేను చేసినతప్పు క్షమింపుడు" అని ప్రార్థించెను. "మంచిది, క్షమించినాను. నామనసులో నీయెడ వైరభావము లేదు." "క్షమించినయెడల నాతో నగరమునకు బండిలో రండు. ఇంటికి పోవగనే నాకడ నున్నధన మంతయు నిచ్చెదను." "భద్రే, నేను నీవెంట రాజాలను. ఈ లోకములో ఏది అసంభావ్యమో అది సంభవించినపుడు వత్తును" అని యతడు తాలిగాథ పలికెను :

తెల్లనిగంగ యెపుడు కుముద
దీర్ఘికవలె శాంత మగునో,
స్వచ్ఛముగా కోకిలమ్మ
శంఖవర్ణ మొందు నెపుడు,
తాళఫలంబులు జంబూ
తరువుమీద పండు నెపుడో
తప్పక నాగమన మపుడు.

కచ్ఛప రోమములతోడ
కంబళంబు ముప్పేటల
దానిని హేమంతమందు
ధరియించిన సమయమందు-
తప్పక నాగమన మొదవు.

గట్టిగ నట్టాలకంబు
కదలకుండ గట్టినపుడు
మశక దంత పంక్తితోడ
మామక గమనంబు జరుగు.

శశవిషాణ పంక్తితోన
స్వర్గారోహణము కొరకు
నిశ్శ్రేణిక ధృఢతమముగ
నిర్మించిన సమయమందు
నిశ్చయముగ నాగమనము.

మరల నామె పోవుద మనెను. "పోవుదము." "ఎప్పుడు?". అప్పుడు–అని యతడు శేషించినగాథలు పలికెను :

మై లెక్కుచు మూషికములు
మింటి చందమామ మ్రింగి
రాహువు గ్రిందికి త్రోసిన
రావచ్చును నే నప్పుడు.

కుండల నిండుగ మద్యము
క్రోలుచు మగు కుక్కకములు
కణకణ లాడెడి బాగ్గుల
గమిమీదను గుమిగూడిన
కలుగజాలు నాగమనము.

గర్దభంబు బింబోష్ఠము
కలిగి సుముఖ మగుచు మిగుల
నృత్య గీత వాద్యంబుల
నేర్పు గలుగుసమయంబున
నిశ్చయముగ నాగమనము.

ఉలూకములు వాయసంబు
లొక్కచోట నాలోచన
కావించుచు పరస్పరము
కామించుచు నుండునపుడు
కావచ్చును నాగమనము.

జడివానకు రక్షకముగ
గొడుగుగాను పలాశముల
పత్రంబులు దక్కము లగు
పక్షమందు నాగమనము.

గంధమాదనాద్రి నెపుడు
కలవింకము చంచువులం
గరచికొనుచు నెగిరిపోవ
గలిగినపుడు నాగమనము.

నాగరమున పయనమునకై
సజ్జీకృత మౌ నౌకను
గ్రామజాలకుండు లాగ
గలుగు నెపుడు చేతితోడ-
గమన మగును మదీయంబు.

ఈ విధముగా బోధిసత్త్వుడు అసంభావ్య విషయములను నిరూపించుచు పదునొకండు గాథలు పలికెను. విని వేశ్య క్షమింపు మని బోధిసత్త్వుని వేడి నగరమునకు జని రాజుతో ఈ విషయము చెప్పి క్షమింపు మని ప్రార్థించెను.

శాస్త ఉపదేశము చేసి "భిక్షూ, ఈ విధముగా స్త్రీ కృతఘ్నురాలు, మిత్రద్రోహిని అగును," అని సత్యప్రకాశనము చేసి జాతకములు సరిపోల్చెను. ఉద్విగ్న చిత్త భిక్షువు శ్రోతాపత్తిఫలము నొందెను. "ఆ సమయమున రాజానందుడు. తపస్వి నేనే."

X ———

# 426. దీపి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒక పొట్టేలును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకానొకప్పుడు మొగ్గలాయన స్థవిరుడు గిరివ్రజ శయనాసనమున విహరించుచుండెను. దాని కొకే ద్వారము కలదు. చుట్టును పర్వతములు గలవు.

పచారు చేయుచోటు ద్వారసమీపమున నుండెను. అప్పుడు గొర్రెల కాపరులు గొర్రెలను గిరివ్రజమున విడిచి ఆడుచు తిరుగుచుండిరి. ఒక రోకనాటి సాయంకాలమున గొర్రెలను తోలుకొని పోవుచుండిరి. దూరముగా పోయిన పొటేలు మంద సాగిపోవుచుండుట గమనింప లేదు. కావున అది వెనుక బడి పోయెను. చిరుతపులి దానిని చూచి పట్టుకొనదలచి గిరివ్రజద్వారము కడకు వచ్చి నిలిచెను. గొర్రె ఇటు నటు చూచి చిరుతపులిని గాంచి "ఇది నన్ను చంపు కోరికతో నిలిచి యున్నది. నేను ఆగి పరుగెత్తు పక్షమున నా ప్రాణములు దక్కవు. నేడు నేను పౌరుషము చూపవలసి యున్నది" అని తలపోసి కొమ్ము లెత్తి చిరుతసమీపమునకు దుమికెను. ఇక్కడనుండి పట్టుకొందు నని యోజించి చిరుతపులి పొంచి యుండెను. అది పట్టుపడక వేగముగా పరుగెత్తి మందలో దూరెను. స్థవిరుడు ఈ సంఘటన చూచి మరునాడు తథాగతునితో "భన్తే, ఈ ప్రకారముగా పొట్టేలు పౌరుషము చూపి ఉపాయకుశలతచే చిరుతపులి బాతనుండి తప్పించుకొనెను." అని నివేదించెను. శాస్త "మౌద్గల్యాయనా, ఈ పర్యాయము చిరుతపులి పట్టుకొన లేకపోయెను. కాని పూర్వము అరుచుచున్న పొట్టేలును పట్టుకొని చంపి తినెను" అని, స్థవిరుని ప్రార్థనపై పూర్వజన్మ వృత్తాంత మిట్లు చెప్పెను.

## అతీత కథ

పూర్వము మగధ రాష్ట్రమున ఒకానొక గ్రామములో బోధిసత్త్వుడు మహాధనికుల యింట బుట్టి పెద్దవాడయి భోగములు విసర్జించి ప్రవ్రజించి ధ్యానాభిజ్ఞలు పొంది చిరకాలము హిమాలయమున నుండి ఉప్పు-పులుసు కొఱకు రాజగృహము

చేరి గిరివ్రజమున పర్ణశాల నిర్మించుకొని నివసించుచుండెను. అచ్చట మేయుచున్న గొర్రెల మందలో వెనుకబడిన గొర్రె పిల్లను చిరుతపులి చూచి దానిని భక్షింపదలచి ద్వారముకడ నిలుచుచుండెను. గొర్రె పిల్ల దానిని చూచి "నేడు నా ప్రాణములు దక్కవు. ఉపాయముచే దీనితో మధురసల్లాపము చేసి దీని హృదయమున కోమలభావసంచార మగునట్లు చేసి తప్పించుకొందును" అని యోచించి దానితో సంభాషణమునకు దిగి తొలిగాధ పలికెను :

ఉన్నావె సుఖముగా ఓయి మామయ్య!
అమ్మ నీక్షేమమ్ము నడుగుచు నున్న,
దందరు నీక్షేమ మాసించువారె.

విని చిరుతపులి "ఈ ధూర్త నన్ను మోసగించుటకై మామా అనుచున్నది. నా హృదయములోని కాఠిన్యము దీనికి తెలియదు" అనుకొని రెండవగాధ పలికెను.

నాతోక త్రొక్కుచు వీకతో నీవు
కుప్పించి పోతివి గొర్రె, యేలాగ!
మామగా నిపుడు నన్ మన్నన చేసి
తప్పించుకొనిపోవ దలచుచున్నావె?

"మామా, ఇట్లనగూడ" దని గొర్రెపిల్ల మూడవగాధ పలికెను :

నామోముసుఖముగా గూర్చుచున్నావు
ఏతెంచినాను నీకెదురుగా నేను
నీ వెనుక నున్నది నీదు వాలంబు—
తోక నేలాగున త్రొక్కగల్గితిని?

"ఓసి గొర్రెపిల్లా, ఏ మనుచున్నావు? నాతోక లేని ప్రదేశము లేదు" అని చిరుతపులి నాలుగవగాధ పలికెను :

అచలంబులం గూడి అబ్ధుల గూడి
దిగ్దికీశ్వలయిక నాతోక వెలయు
నీవు దానిని త్రొక్క కెట్లు పోగలవు?

"ఈ పాపి మధురవాక్కుల వలన శాంతింపదు" అని గ్రహించి గొర్రెపిల్ల శత్రువు వలె సాహసమున అయిదవగాధ పలికెను :

నా తల్లి దండ్రులు నా సహోదరులు
తొలుతనే చెప్పిరి దుష్టకాలంబు
అధికి దీర్ఘం బని అందుచే నేను
ఆకాశ మార్గాన అరుదెంచినాను.

అంతట చిరుతపులి "నీవు ఆకాశమున వచ్చితి వని నాకు తెలియును. ఇట్లు వచ్చిన నీవలన నాభోజనము నాశన మయినది" అని అరవగాథ పలికెను :

ఆకాశ మార్గాన అరుగుచుండంగ
పరుగిడె నిను గాంచి హరిణసంఘంబు
నాతిండి నీవల్ల నష్ట మై పోయె.

ఇది విని ఎవరును రెండవమాట పలుక నందున ఆ గొర్రెపిల్ల మృత్యుభయమున విలపించుచు "మామా, ఇట్టి దారుణకార్యము చేయవలదు. నాకు ప్రాణదానము చేయుము" అని ప్రార్థించెను. శోకించుచున్న గొర్రెపిల్ల మెడ పట్టుకొని చంపి చిరుత తినివేసెను.

ఈ రెండును అభిసంబుద్ధ గాథలు :

విలపించుచుండ నీవిధముగా గొర్రె
అద్దానికంఠంబు ఆర క్షపాయి
కోరికి చంపెను; మహాక్రూరుల యెడల
సరసవచస్సులు నిరుపయోగములు.

న్యాయ మైనను ధర్మ మైనను లేదు
దొడ్డమాటలు లేవు దుష్టకర్ములకు
సద్వ్యవహార ప్రసన్నుగా కాడు
అట్టి దుష్టునకు శౌర్యమె చూపవలయు.

తపస్వి ఈ వ్యవహార మంతయు చూచెను.

శాస్త ఈ యుపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. "అప్పటి పొట్టేలు ఇప్పటి పొట్టేలు, అప్పటి చిరుతపులి ఇప్పటిదే. తాపసిని నేనే."

# 427 గిజ్ఝ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు చెప్పినమాట వినని భిక్షువునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ కులపుత్రుడు కల్యాణప్రద మయిన శాసనమున ప్రవ్రజించియు ఇతరులు తన కేమియు చెప్పకుండునట్లు సంసిద్ధు డయ్యెను. హితచింతకులైన ఆచార్య ఉపాధ్యాయులు సబ్రహ్మచారులును "ఇట్లు పోవలెను, ఇట్లు రావలెను, ఇట్లు చూడవలెను, ఇట్లు వర్తింపవలెను, ఈ విధముగా ముడుచుకొనవలెను, ఈ విధముగా చాపుకొనవలెను, ఇట్లు ధరింపవలెను, ఇట్లు పాత్ర కైకొనవలెను, ఎంమగ్రి సమకూర్చుకొని పరీక్షించి భుజింపవలెను, ఇంద్రియ సంయమనము, భోజనపరిమితి గ్రహించి జాగరూకతతో నుండవలెను, అతిథి వ్యవహారము గ్రహింపవలెను. ఇయ్యది ఎరిగి యున్నవారికి కర్తవ్యము గ్రహింపవలెను, పదునాలుగు అనుకర్తవ్యములు, ఎనుబది మహాకర్తవ్యములు బాగుగా గ్రహింపవలెను, పదుమూడు ధుతంగ గుణములను ధారణ చేయవలెను," అని చెప్పినపుడు అతడు వినెడివాడు కాడు. పైగా అసహిష్ణువయి, అను శాసనమును పాటింపక "నేను మీకు ఉపదేశ మిచ్చుట లేదు. మీరేల నా కేల యిత్తురు? నా మంచిచెడ్డలు నేనే చూచుకొందును" అనుచుండువాడు. ఏమి చెప్పినను అతడు పాటింపడని స్పష్ట మయినపుడు భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై నింద జేయసాగిరి. శాస్త అచ్చటి కరుదెంచి విషయము తెలిసికొని ఆ భిక్షువును పిలువనంపి, "భిక్షూ, నీవు నిజముగా మాట పాటింపని వాడవేనా?" అని యడుగగా "భదన్తే, నిజమే" అని యతడు చెప్పిన పిదప, "భిక్షూ, కల్యాణదాయక మైన యీ శాసనప్రకారము ప్రవ్రజించియు నీవు హితైషుల వాక్యములు వినవేమి. పూర్వముకూడ నీవు పండితులమాట పాటింపక ఝంఝావాతమున చిక్కుకొని ప్రాణములు కోల్పోయినావు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము గృధ్రకూటపర్వతమున గ్రద్దకడుపున బోధిసత్త్వుడు పుట్టి సుపత్రనామమున గృధ్రరాజయి, అనేక సహస్ర గృధ్ర పరివృతుడై, మహా బలవంతుడుగా నుండి, తలిదండ్రులను పోషించుచుండెను. ఆతడు సత్త్వ కలవాడగుటచే నాకసమున చాలయెత్తు ఎగురుచుండెను. ఒకనాడు తండ్రి కుమారునితో "నాయనా, ఒకహద్దు దాటి పైకెగురవలదు" అని యుపదేశ మిచ్చెను. సరే అని, యతడొకనాడు తనవెంట నున్న గ్రద్దల నతిక్రమించి మిక్కిలియె త్తెగిరెను. అది వర్షాకాలము కావున తుఫానులలో చిక్కువడి గృధ్రరాజు ముక్కలు ముక్కలై నాశ మొందెను.

శాస్త యీ విషయము నుపదేశించువాడై అభిసంబుద్ధుడయినపిదప ఈ గాథలు పలికెను :

క్లిష్టమార్గము ప్రాచీనగృధ్ర పథము :
అచట తలిదండ్రులన్ వృద్ధులై నవారి
సేవ చేసెడిగ్రద్ద వసించుచుండు.

వారికై తెచ్చు వివిధసర్పముల క్రొవ్వు
పుత్రుడు సుపత్రనాముడు భూరిబలుడు,
పక్షములశక్తి నెత్తుగా బారువాడు.
జనకు డొకనాడు వానితో ననియె నిట్లు :

అబ్ధిపరివృత మైన యీపృథ్వి-
చక్ర ముత్పలపత్ర సమముగా దోచు
నెపు డింక నెత్తున కెగురకు తండ్రి!

బలవంతు డైన యాపక్షిరా జవల
పరికించుచున్ నదుల్ పర్వతంబులును
వినువీధి కెగసెను వేగముతోడ.

తండ్రిమాటకు్కలయట్లు ధారుణి తోచె
సాగరపరివృత చక్రంబువోలె.

ఖగము సీమను దాటి యెగిరెను దూర
మంత జంఝామాత మలమి, బలిష్ఠ
నీడ్చుచు నెచటికో యొత్తుకపోయె.

మాట యాలింపమి మరలి రాలేదు
ప్రాణాలతో పక్షి : ప్రబల మారుతము
నందు జిక్కుకపోయి యాపద నొందె.

తనయుండు భార్యయు తక్కినబంధు
తతియును దుఃఖాభిత ప్తులై నారు.

వృద్ధులవాక్కులు విననట్టివాడు,
చెవి జేర్చియును పనుల్ చేయనివాడు
దల్పైన సీమను దాటినయట్టి
పులుగట్లు దుఃఖంబు పొందును మందు.

"కావున భిక్షూ, నీవు గృధ్రమువలె కావలదు. హితైషులు చెప్పినట్లు చేయుము" అని శాస్త యుపదేశ మిచ్చిన పిదప ఆ భిక్షువు చెప్పినమాట వినువా డయ్యెను.

శాస్త యిట్లుపదేశించి, జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున భిక్షువు ఇప్పటిభిక్షువే ; గృధ్రపిత నేనే.

X

# 428 కోసంబీ జాతకము

శాస్త కోసంబి నాశ్రయించిన ఘోషితారామమున విహారము చేయుచు కోసంబిలో జగడ మాడువారిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

కథ కోసంబీ స్కంధమున వచ్చినది. ఇచ్చట ఇది సంక్షిప్తరూపము. ఆ కాలమున ఇరువురు భిక్షుకులు ఒకే నివాసమున నుండిరి. అందొకడు వినయధరుడు, రెండవవాడు సూత్రాంతికుడు. అందు సూత్రాంతికు డొకనాడు శౌచార్థము చని చెంబులో నీరు విడిచి వెలుపలికి వచ్చినాడు. ఆవల వినయధరుడు పోయి చూచి ఈవలకు వచ్చి, "నీరు నీవే ఉంచినావా?" అనెను. "ఆయుష్మన్, నేనే." "ఇది నిషిద్ధమని నీకు తెలియదా?" "తెలియదు." "ఆయుష్మన్, ఇందు ఆపత్తి కలదు." "అగుచో ప్రాయశ్చిత్తము చేసికొందును." "కాని ఆయుష్మన్, తెలియక కాని, విస్మృతి వలన గాని జరిగినచో ఆపత్తి లేదు." ఆతని దృష్టి ఆపత్తినుండి అనాపత్తి మీదకు పోయినది. వినయధరుడు తన్నాశ్రయించిన వారితో "ఈ సూత్రాంతికుడు ఆపత్తి తెలిపినను గ్రహింప లేకున్నాడు" అని పలికెను. వారు సూత్రాంతికుని అనుయాయులను చూచినపుడు "మీ యుపాధ్యాయుడు ఆపత్తి (చెప్పినను) గ్రహింపలేకున్నాడు." అనిరి. వారు పోయి ఈ విషయము తమ యుపాధ్యాయునకు విన్నవించిరి. "వినయధరుడు తానుగా ఆపత్తి లేదని పలికి ఆవల ఉన్నదన్నాడు. ఈతడు మృషావాది" యని సూత్రాంతికు డనగా, అనుయాయులు పోయి తమ యుపాధ్యాయున కిది తెలిపిరి. ఈ ప్రకారముగా కలహము వృద్ధిగొనది. అంతట వినయధరుడు ఆనతి పొంది తద్విరుద్ధముగా ఆపత్తి కానబడకుండుటచే ఉచ్ఛేపనీయ కర్మ చేసెను. నాటినుండి ఆయనను నమ్ము ఉపాసకులలో రెండు పక్షము లేర్పడినవి. ఉపదేశము గ్రహించు భిక్షుణీ భిక్షులలోను రక్షకదేవతలలోను విభాగ మేర్పడెను. అప్పు డప్పుడు కలిసికొన్న వారిలోను, పరిచితులలోను, ఆకాశమున నుండు దేవతలలోను బ్రహ్మలోకము వరకును రెండు పక్షము లేర్పడినవి. ఈ కోలాహలము అకనిష్ఠ భవనము వరకు వ్యాపించినది.

అంతట ఒకానొక భిక్షువు తథాగతుని సన్నిధికిచేరి "ఉచ్ఛేపకర్మ చేయువారు ధర్మానుసారముగా చేసినా మన్నారు. తద్విరోధులు ఉచ్ఛేపకర్మ అధర్మానుసారముగా జరిగినది అన్నారు. నిషేధము తెలిసియు రెండుపక్షముల వారు కలిసిమెలిసి తిరుగుచున్నా"రని విన్నవించెను. అప్పుడు భగవాన్ "భిక్షుసంఘమున భేద మేర్పడినది. దీనివలన దుష్పరిణామము కలుగును" అని వెడలిపోయెను.

మరల వారు ఒకానొక సీమలో ఉపోసథ కర్మాదులు కావించి భోజనశాలలో పీట విడిచి పీటమీద కూర్చుండు నియమము చేసిరి. కాని ఇంకను జగడము జరుగుచున్న దని విని శాస్త అచటికి బోయి "జగడము వలదు, కలహము తగదు" అనెను. భగవానునకు కష్టము తోచరా దను ధర్మవాది భిక్షువు "భన్తే, భగవన్, ధర్మస్వామీ, తాము విలోకింపుడు. భన్తే, భగవన్, తాము విచారము విడిచి విశ్రాంతితో నుండుడు. ఈ జగడమును, ఈ కలహమును, ఈ వివాదమును మేము పరిష్కారము చేయుదుము." అని విన్నవించెను.

అప్పుడు శాస్త "భిక్షువులారా, పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజు.... బ్రహ్మదత్తుడు దీఘతిస్సకోసల ప్రభునిరాజ్యము హరించి ఆరాజు గూఢముగా తిరుగుచున్న కాలమున అతనిని సంహరించెను.... దీఘాయు కుమారుడు ప్రాణదానము చేసెను.... అప్పటి నుండి ఇరువురకు మేళనము కలిగినది.... .... .... .... భిక్షువులారా, దండధారులు, శస్త్రధారులు అగు ఆ రాజుల నడుమ క్షమ, మైత్రి ఏర్పడినవి.... భిక్షువులారా, మీరు ఇట్టి స్పష్టధర్మ వినయమున ప్రవ్రజితులై క్షమాశీలురు మైత్రీయుక్తులు కానుండుట శోభాకరము........ భిక్షువులారా, కలహము వలదు," అని మూడవమారు నిషేధించినను, వారు వినకుండుట చూచి వారు మూర్ఖు లనియు వారికి తెలియ జెప్పుట సుకరము కా దనియుతలచి మరలిపోయెను. మరునాడు శాస్త పిండపాతానంతరము గంధ కుటిలో కొంచెము విశ్రాంతి తీసికొని, శయనాసనాదులు ఏర్పాటుచేసి, చీవరములు పాత్రయు స్వయముగా పట్టుకొని, సంఘమధ్యమునకు సూటిగా ఆకసమున నిలిచి యీగాథలు పలికెను :

సమముగా నెల్లరు సందడి చేయ
రోకగు మూర్ఖుం డని యొప్పుకో డెవడు
సంఘాన భేదము జనియించి నంత
ఘనముగా నన్యుని గణియింప డెవడు.

పండితం మన్యులు బహు గర్వితులును
వదరుబోతులు నైనవారు మూర్ఖముగ
కలహాన ముఖ్యుల గ్రహియింప లేరు.

తిట్టినా డీతండు కొట్టె నీతండు
అణచినా డీతండు, హరియించె నితడు
అనియెడు తలపులు మనసులో నున్న
వానికి సమయదు వైర మెన్నండు.

తిట్ట డీతడు నన్ను, కొట్ట డీతండు,
అణచివేయ డితండు, హరియింప డితడు
అనియెడి తలుపులు మనసులో నున్న
వానికి శమియించు వైరభావంబు.

పగ శమియింపదు పగచేత నెపుడు,
పగ యడంగు నవైరభావమ్ముతోడ :
తథ్య మియ్యది సనాతన నియమంబు.

నాశమ్ము తమ కొక్కనాడు ఘటిల్లు
నని యెంచ రెందరో; అట్లు తలంప
నగుదురు మేధావు లతిశాంతయుతులు.

ఎముకలం బాడి చేసి బాధించువాడు,
ప్రాణహారులు, తురగ గో ద్రవ్యహారులు.
రాష్ట్రములు కొల్లగొట్టెడి రాక్షసులును
కూడుదు రొకప్డు, మీ రేల కూడరాదు ?

ధీయుతుండును సాధువు ధీరుడు నగు
చెలిమికాడు లభించుచో తెలివి కలుగు
నతడు నిజబాధ లన్నియు నణచుకొనుచు
మిక్కిలి ప్రసన్నతాయుక్తి మెలగవలయు.

అట్టి సఖుడును లభింపని యపుడు జనుడు
రాజ్యమునం దోడిపోయిన రాజువోలె
రాష్ట్రమును వీడిపోయి అరణ్యసీమ
సింధురమురీతి నొంటి వసింప వలయు.

ఒంటిగా నుండుట యుక్తంబు మూర్ఖ
మతితోడ సఖ్యంబు మంచిది కాదు.
ఏకాకిగా నివసించుచు, పాప
కార్యముల్ సలుపక గంధగజంబు
సరణి నల్పేచ్ఛతో చరియింప వలయు.

శాస్త ఇవి యన్నియు చెప్పినను భిక్షుసమ్మేళనము కాలేదు. అంతట శాస్త బాలకలోణకారుని గ్రామమున కేగి, అచట భగ్గు స్థవిరునకు ఏకత్వమహిమను ప్రదర్శించెను. అచటినుండి ముప్పురు కులపుత్రుల నివాసస్థానముల కేగి సరస సల్లాపములతో కాలక్షేపము చేసెను. అక్కడనుండి పారిలేయ్యక వనఖండమునకు జని, మూడుమాసము లుండి, కౌశాంబికి రాక, శ్రావస్తికి బోయెను. కౌశాంబివాసు లగు ఉపాసకులు కూడ "ఆర్య కౌశాంబీ భిక్షువులు మనకు మిగుల ననర్థదాయకులు; వీరి మూలమున ఆయాసము చెంది భగవానుడు వెడలి పోయినాడు" అని తలచి, పరస్పర సమాలోచనము చేసి, "మన మిక వీరిని సత్కరింపరాదు. వచ్చినను భిక్షపెట్టరాదు. ఇట్లు చేయుచో కొంద రిచటినుండి వెడలి పోవచ్చును, కొందరు గృహస్థులు కావచ్చును, భగవానుని ఆదరింపవచ్చును" అని నిర్ణయించిరి. ఈ దండనమువలన భిక్షువులు బాధ చెంది, శ్రావస్తి చేరి భగవానుని క్షమాపణ వేడిరి.

శాస్త జాతకమును సరిపోల్చెను : "పిత శుద్ధోదన మహారాజు; మాత మహామాయ; దీఘాయు కుమారుడు నేనే."

# 429. మహాశుక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శాస్త సన్నిధిలో అతడు కర్మస్థానము గ్రహించి కోసల జనపదమున సీమాంత గ్రామ సమీప మందలి యరణ్యములో నివసింప జొచ్చెను. ఆయనకై రేయింబవళ్ళకు తగిన తావులు సంసిద్ధము చేసి వచ్చిపోవుటకు వీలగుచోట శయనాసనాదులు నిర్మించి యువకులు చక్కగా సేవలు చేయుచుండిరి.

వర్షాకాల ప్రథమమాసమున ఆయన నివసించు గ్రామమున నిప్పంటుకొనెను. జనులు తినుటకు గింజలు కూడ లేకుండ పోయినవి. ఆయనకు వారు తగిన భోజనము పెట్టలేకుండిరి. భోజన సదుపాయము లేకున్నను శయనాసనములకు ఆనుకూల్య మున్నను మార్గముగాని ఫలితము గాని కానబడలేదు.

మూడు నెలలు గడచిన పిదప అతడు శాస్త సన్నిధి కరిగి ప్రణామము చేసి నపుడు శాస్త యోగక్షేమము ప్రశ్నించి "భోజనసదుపాయము లేకున్నను శయనాసన సౌకర్యముండెనా?" అని యడిగెను. అతడు స్థితిగతులు వివరించిన పిదప శాస్త "భిక్షూ, శయనాసన-ఆనుకూల్య మున్నను శ్రమణుడు పేరాస విడువవలెను; దొరకినది తినుచు సంతుష్ట చిత్తముతో నుండుట శ్రమణధర్మము. పూర్వము పండితులు పక్షిజాతిలో జన్మించియు తమనివాసస్థానమున వృక్షములు చూర్ణములైనను లోభము విడిచి సంతుష్ట చిత్తములతో మైత్రీ ధర్మములు పాలనచేయుచు అన్య ప్రదేశములకు బోవలేరు. భోజన సదుపాయము క్షీణించినను శయనాసన సౌకర్యము ఏల నీవు విడువలేదు?" అని అతని ప్రార్థనపై పూర్వకాల కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున హిమాలయమున గంగాతీరమున మేడివనములో వేలకొలది చిలుకలు నివసించుచుండెను. శుకరాజు నివసించు వృక్షమున ఫలములు లేకున్నను,

అంకురములు గాని బెరడు గాని తినుచు గంగాజలము త్రాగుచు అల్పేచ్ఛుడై అన్య ప్రదేశమునకు పోవకుండెను. శుకరాజు గుణములవలన శక్రుని భవనము కంపించెను. శక్రుడు ధ్యానబలమున ఈ విషయము గ్రహించి పరీక్ష చేయదలచి వృక్షమెండునట్లు చేసెను. తుదకు చెట్టు మోడై చిల్లులతో నిండి గాలిదెబ్బ తినుచూ పిట్టపోటులు సహించుచుండెను. ఆ మోడునుండి స్రవించు పొడి తినుచూ శుకరాజు గంగాజలము త్రాగుచు ఎండగాలులు లక్ష్యము చేయక మేడిమోడుపై నుండెను. శుకరాజు సత్యముగా అల్పేచ్ఛు డను భావము దృఢమైనప్పుడు శక్రు డాయనతో మిత్రధర్మను నెరపి మేడిచెట్టున ఉత్తమ ఫలములు కలుగునట్లు చేయనెంచి తాను హంసరాజ రూపము ధరించి సుజా అను అసుర కన్యను ముందు పెట్టుకొని ఆ మేడి యడవిలో ప్రవేశించి మోడుకు సమీపమున నున్న చెట్టుకొమ్మపై వ్రాలి సంభాషించుచుండె ఈ గాథ పలికెను :

ఫలవృక్షములమీద పక్షులు వ్రాలి
పండ్లను తినుచుండు, ఫలములు లేని
నా డేగుచుండును నలుకెలంకులకు.

ఇట్లని దానికి మరింత యుత్సాహ మిచ్చుటకై యీ గాథ పలికెను :

ఈ శుష్కతరువుపై పేరక్క తుండ,
ఏమి ధ్యానింతు వోనా, వ్రాలియుండి ?
శుక, వసంతోపమా, శుష్కవృక్షంబు
విడువకున్నా వేలో వివరింప గలవె ?

అంతట శుకరాజు "హంసమా, కృతజ్ఞతవలన ఈ వృక్షమును వీడజాలకున్నాను" అని రెండు గాథలు పలికెను :

కష్టసుఖములందు, వృద్ధి
క్షయములందు, ప్రాణనాశ-
వేళయందు సన్మిత్రులు
విడువరు సఖులను. హంసమ !
సత్పురుషాదిష్టమైన
సద్ధర్మము ననుసరింతు.

హంసమా, అందు నే నన్యతముండ :
ఈతరువే నాకు జ్ఞాతి, చుట్టంబు.
క్షీణించినది యని జీవిక కొరకు
త్యజియింప దీనిని, ధర్మంబు కాదు.

శక్రు డిదివిని సంతుష్టచిత్తుడై ప్రశంసించి వరమిచ్చువాడై యీ గాధలు పలికెను:

సఖ్యమును మైత్రియును పరిషత్తు నెడల
నిలిపియుండుట మంచిది : నీకు మైత్రి
న్యాయ మని తోచుపక్షాన, జ్ఞాను లైన
జనములు ప్రశంసలకును భాజనమ వీవు.

వక్రకంఠా, నీకు వర మొసంగుదును
అభిలషితం బేదో యడుగుము దాని.
అంబరచారి విహంగమరాజ!

విని శుకరాజు వర మడుగువాడై యీ గాధ పలికెను :

నీ వొసంగెదవేని నే కోరువరము,
రా నిమేషమునందె హేశక్రరాజ,
రా ఎందపమ్ము నే నీక్షింపవలయు
పత్రపూర్ణమ్ముగా ఫలయు క్తముగను.

ఆతడు తరువుపై నమృతంబు చల్లె :
శీఘ్రమే సుందర శీతలచ్ఛాయ
వెదజల్లు శాఖిక లుదయ మందినవి.

అంతట శుకరాజ మీగాధ పలికెను :

వీక్షించి ఫలయుయి వృక్షంబు నేను
సంతోష మొందెడి సరణిని శక్ర!
బంధువర్గంబుతో బడయుము సుఖము!

[5]

వర మిచ్చి శక్రుండు, ధరణీపు నాత్మ
ఫలవంత మొనరించి భార్యతో కూడి
అరిగె దైవత నందనారామమునకు.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి "ఈ ప్రకారముగా భిక్షూ, పురాణపండితులు పక్షికడుపున బుట్టియు నిర్లోభులై యుండిరి. ఉత్తమశాసనమున ప్రవ్రజించియు నీ వేల లోభిగా నున్నావు? పోయి అచటనే యుండుము" అని, అతనికి కర్మస్థాన మిచ్చి, జాతకములు సరిపోల్చెను. ఆ భిక్షు వచటికి జని, విపశ్యనాభ్యాసము చేసి, అర్హత్తు డయ్యెను. ఆ సమయమున శక్రుడు అనురుద్ధుడు; శుకరాజు నేనే.

---X---

# 430 క్షుద్ర శుక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు వేరంజకండ విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

వేరంజమున శాస్త వర్షాకాలము గడపి క్రమముగా శ్రావస్తి చేరినపుడు భిక్షువులు ధర్మసభలో సంభాషణ చేయుచు, "ఆయుష్మంతులారా, తథాగతుడు సుకుమార క్షత్రియుడు, బుద్ధుడు సుకుమారుడు, మహాబుద్ధి మంతుడు. అయినను వేరంజ బ్రాహ్మణుడు నిమంత్రణ చేయుటచే మూడుమాసములు ఆయన గృహమున నుండి, పథ్యవస్తువులు, పిండి, నీరు- వీనితో కాలము గడపుచు అన్య ప్రదేశము నకు బోవలేదు. ఆహా! తథాగతుని అల్పేచ్ఛయు, సంతోష విశేషమును ఎంత గొప్పవి! మారుని ప్రభావమువలన భిక్ష లభింపకున్నను, నిర్లోభిగా నుండెను," అనుచుండిరి. శాస్త అచ్చటికి వచ్చి "భిక్షువులారా, కూరుచుండి ఏమి సంభాషించు చున్నారు?" అని అడుగగా, ఫలాని విషయము అని వారు చెప్పిరి. అంతట శాస్త "భిక్షువులారా, ఈ సమయమున తథాగతుడు లోభరహితుడుగా ఉండుట ఆశ్చర్య జనకము కాదు, తథాగతుడు పూర్వజన్మలో పక్షికడుపున పుట్టియు, లోభరహితు డుగా నుండెను," అని పూర్వ జన్మకథ చెప్పెను. పూర్వోక్త విధానమున ఇది విస్తారరూపమున గ్రహింపవలెను.

"పచ్చని ఫలవృక్ష పాళి యుండంగ
శుకరాజ, నేల యీశుష్క-వర్ణముల-
ధరణీరుహాముమీద దగిలె నీమనసు?"

"ఇద్దాని ఫలముల నెన్నివర్షములో
భుజియించినాడ; ఈభూమిరుహంబు
ఇప్పుడు శుష్కమం చెరిగియు, మనసు
తొలినాటి మైత్రితో నలరారుచుండు."

"అవనీజ మెండిన, ఆకులు రాలె
ఫలవిహీనం బాట తెలిసిన యన్ని

విహగముల్ చన్నవి వేరొకచోటి,
కిందులో శుకరాజ, యేమి దోషంబు?"

"ఫలములకోసమే నిలిచినవారు,
ఫలములు లేనిచో నిలువని వారు.
అగుదురు దుర్బుద్ధు లాత్మార్థపరులు."

"పరిశుష్కునెడ సఖ్యభావము, మైత్రి
నిలిపెడివారలు నిజముగా యోగ్యు;
లిట్టిధర్మము నీకు నిష్టమే యైన
నీవు పొందుదువు జ్ఞాని ప్రశంసలను.

"ఆకాశసంచారి, నీ కిత్తు వరము—
అభిమతం బైనది యడుగుము శుకమ!"

"రసపాదపమ్ము నే నీక్షింపవలయు
పత్రపూర్ణమ్ముగా ఫలయుక్తముగను;
పెన్నిధి గనుగొన్న పేదవిధాన
ఎరెఎరెకు నే ప్రసన్నత గందు."

[ఆతడు తరువుపై నమృతంబు చల్లె:
శీఘ్రమే సుందర శీతల ఛాయ
లొదవింగ శాఖిక లుద్భూత మయ్యె.]

"వీక్షించి ఫలదాయివృక్షంబు నేను
సంతోష మొందెడి సరణిని శక్ర,
బంధువర్గంబుతో బడయుము సుఖము."

వర మిచ్చి శక్రుండు, ధరణీ రుహమ్ము
ఫలవంత మొనరించి, భార్యతో గూడి
అరిగె దైవత నందనారామమునకు.

శాస్త యిట్లుపదేశ మిచ్చి, జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున శక్రుడు అనురుద్ధుడు; శుకరాజు నేనే.

-o-

# ౪౩౧. హారిత జాతకము

శాస్త జేతవనమున విహరించుచు ఉద్విగ్నచిత్త భిక్షువునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అలంకరించుకొన్న స్త్రీ నొకతెను చూచినంతనే యొకత డుద్విగ్న చిత్తుడై గృహస్థు కాదలచెను. ఆచార్యుడు బలవంతముగా భిక్షువును శాస్త సన్నిధికి గొని పోయెను. "నీవు నిజముగా ఉద్విగ్న చిత్తుడ వైతివా?" అని శాస్త అడుగగా భిక్షువు "భన్తే, నిజమే" అనెను. "కారణ మేమి?" "భన్తే, అలంకరించుకొన్న స్త్రీని చూచి కామవివశుడ నైతిని." "భిక్షూ, కాముకత్వము సద్గుణములను నశింపచేయును. కాముకత్వమున స్వారస్యము స్వల్పము. అయ్యది కాముకుని నరకమున బడద్రోయును. అయ్యది నిన్ను ఏల పీడింపదు? సుమేరుపర్వతముపై బోధిజ్ఞానానుసారము ప్రవర్తించువారు పంచాభిజ్ఞులు. అష్టసమాపత్తులు పొందిన విశుద్ధ సప్త ఋషులు గూడ తనుపూర్వ స్మృతులను సంబాళించుకొన జాలకుండిరి, వారు ధ్యానబలము కోల్పోవుచుండిరి" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడొకానొక గ్రామములో ఎనుబదికోట్ల ధనవంతులైన బ్రాహ్మణుల యింట బుట్టి కాంచన వర్ణము గలవాడగుటచే హారితత్వచ కుమారుడని పేరు పొందెను. ఆయన పెరిగి పెద్దవాడయిన పిమ్మట తక్షశిల కేగి సమస్త విద్యలు నేర్చి మరలి వచ్చి కుటుంబపాలన చేయుచుండెను. తలిదండ్రులు మరణించిన పిమ్మట అతడు ధనము వంక జూచి "ధనము మాత్రమే కనబడుచున్నది. ద్రవ్యోత్పత్తి చేయువారు మాత్రము కనబడరు. ఎప్పుడో నేను గూడ మరణముఖమున బడి పొడి పొడియై పోవుదును" అని తలచి మరణభీతుడై విశేషముగా దానములు చేసి హిమవత్ప్రదేశమునకు బోయి ప్రవ్రజించి ఏడు రోజులలో అభిజ్ఞలను సమాపత్తులను పొందెను. బహుకాల మతడు కందమూల ఫలములతో కాలక్షేపము చేసి

ఉప్పు, చింతపండు కొరకు పర్వతము దిగి క్రమముగా వారాణసి చేరి రాజోద్యానమున విడిసి మరునాడు భిక్షాటనము చేయుచు రాజద్వారము చేరెను. రాజాయనను చూచి ప్రసన్నచిత్తుడై పిలిపించి శ్వేతచ్ఛత్రము క్రింద రాజపర్యంకముపై గూరుచుండ బెట్టి రససంభృతమైన భోజనము పెట్టించి దానానుమోదమున అధిక ప్రసన్నుడై "భదన్తే, ఎక్కడికి పోవుచున్నారు?" అని యడిగెను. "మహారాజా, వర్షాకాలమున నివాసమునకై వెదకుచున్నాను." రాజు ఆయన నుద్యానము లోనికి గొనిపోయి పగటివేళ నుండుట కొకటియు, రాత్రివేళ ఉండుటకు వేరొకటియూ నివాసము లేర్పాటు చేయించి బోధిసత్త్వునకు సేవ జేయుమని ఉద్యానపాలకునకాన తిచ్చి ఆయనకు ప్రణామము చేసి వెడలిపోయెను. నాడు మొదలు పండ్రెండు సంవత్సరములు బోధిసత్త్వు డచటనే యుండి రాజభోజనము చేయుచుండెను.

ఒకనాడు రాజు ఎదురు తిరిగిన సీమాంత ప్రదేశమును శాంతిపరుచుటకై బయలుదేరుచు దేవికి బోధిసత్త్వుని సమర్పించుచు "మన పుణ్యక్షేత్రము న[illegible] అప్రమత్తురాలవై యుండుము" అని ఆదేశించెను. నాటి నుండి యామె స్వహస్తములతో మహాసత్త్వునకు వడ్డన చేయుచుండెను. ఒకనా డామె భోజనము సిద్ధము చేసి, బోధిసత్త్వు డాలసించుట వలన సుగంధజలమున స్నానము చేసి నిగనిగలాడు పట్టుబట్ట కట్టుకొని, తలుపు తెరచి ఒడలికి గాలి తగులుటకై చిన్న నిష[illegible]కముపై గూర్చుండెను. మహాసత్త్వుడు బహుదినములకు మంచి వస్త్రము[illegible] భిక్షాపాత్రము చేత గొని ఆకాశమార్గమున గుమ్మముకడ దిగెను. ఆయన వల్కలముల సవ్వడి విని రాణి త్వరగా లేచెను. త్వరితగతి వలన ఆమె పట్టుచీర జారిపోయెను.

ప్రతికూలాలంబనము బోధిసత్త్వుని నేత్రములపై కొట్టినట్లయ్యెను. లక్షలకొలది వర్షములనుండి ఆయనలో అణగియున్న రాగము బుట్టలోనుండి పామువలె లేచి ఆయన ధ్యానబలము నంతర్ధానము చేసెను. స్మృతివిహీను డగుటచే మహాసత్త్వుడు సంబాళించుకొననేరక, పోయి దేవి చేయి పట్టుకొనెను. ఆ సమయమున వస్త్రము కప్పి ఆమెతో లోకధర్మము నెరపి భోజనము చేసి ఉద్యానమునకు బోయెను. అనంతరము ప్రతిదిన మిట్లే జరుగుచుండెను. ఈ సందర్భవార్త నగర మంతటను వ్యాపించెను. పతిత తపస్వి ఇట్లు చేయుచున్నా డని అమాత్యులు రాజునకు వార్త నంపిరి. తనమనస్సు విరుగుటకై వారిట్టివార్త నంపినారని రాజు వారిమాట విశ్వసింపలేదు. ఉద్ధత దేశమును శాంతపరచి రాజు వారాణసికి వచ్చి నగర ప్రదక్షి

ణము చేసి దేవికడకు జని "హారితతపస్వితో లోకధర్మము నెరపినమాట నిజమేనా?" అని ప్రశ్నించెను. "దేవా, నిజమే". అత డామెమాటలు నమ్మక బోధిసత్త్వునే అడుగుద మని ఉద్యానమునకు బోయి, ఆయనకు ప్రణామము చేసి ఒక ప్రక్కన కూరుచుండి, ప్రశ్నించువాడై ఈ తొలిగాథ పలికెను :

హారితుండు కామోపభోగాధికమున
ఓ మహాబ్రహ్మ, మగ్నుడై యుండునట్లు
లోకు లను టది సత్యమా? కాక నీదు
వర్తనము నిక్కమున శుద్ధవర్తనంబ?

విని మహాసత్త్వుడు తనలో "నేను భోగముల నందలే దని చెప్పినచో రాజు నామాట నమ్మును. లోకములో సత్యమున కున్న ప్రతిష్ఠ దేనికిని లేదు. ఎవడు సత్యదూరు డగునో వాడు బోధివృక్షము క్రింద కూరుచుండి సంబుద్ధి నందలేడు. కావున నేను సత్యమునే చెప్పెదను" అని తలపోసెను. బోధిసత్త్వులు గూడ అప్పు డప్పుడు హింస, చౌర్యము, వ్యభిచారము, సురాపానము చేయుచుందురు. కాని అనర్థదాయక మగు ననృత మను మంత్ర మెన్నడు నుచ్చరింపరు. అందుచే బోధిసత్త్వుడు సత్యభాషణము చేయువాడై రెండవగాథ పలికెను :

శ్రవణగోచర మగుభాష సత్యమె యగు :
ఓ మహారాజ, నేను కామోపభోగ
మూర్ఛితుడ నాచు దుర్మార్గమున బడితిని!

విని రాజు మూడవగాథ పలికెను :

అట్లగాన నిష్ప్రయోజన మగును గాదె
సాధు చింతన చేయు ప్రజ్ఞానిపుణత
కలుగు రాగము దమియింప వలనుపడదె?

విని హారితుడు రాగబలమును నిర్దేశించువాడై నాలుగవగాథ పలికెను :

ఓ మహారాజ, లోకాన నుండునాల్గు
ప్రబల మైనవి ద్వేషమ్ము, రాగ తరుణ
మదము విధి దుస్తరమ్ములు కద ఎరుకకు

విని రాజు అయిదవగాథ పలికెను :

పారిశుడు శీలసంపన్ను డరహాసుండు
నిరుపమాన వర్ణనుడు మనీషి మిగుల
పండితుం డని నాయభిప్రాయ మార్య !

విని పారిశుడు ఆరవగాథ పలికెను :

రాజఋషి కైన ధర్మానురక్తు కైన
మిగులమేధావి కైనను మేటిహాని
ఏడు రాగవితర్కంబు వలన గలుగు

రాగక్షయమును ప్రోత్సహించుటకై యతడు ఏడవగాథ పలికెను :

వర్ణనాశకరాగ ముత్పన్న మయ్యె
ఒడలినుండి దీనిని నీవు విడువవలయు
నీకు కల్యాణ మగుత ! మనీషి వనుచు
నిన్ను నేగులు భావించుచున్నవారు.

అంతట బోధిసత్త్వుడు స్మృతిలాభము వలన భోగముల దుష్పరిణామమును గ్రహించి ఎనిమిదవ గాథ పలికెను :

కామభోగము లంధునిగా నొనర్చి
జనుని విషమఫలంబు లొసంగుచుండు
వాని మూలమ్ము కనుకాని నేను బంధ
నమ్ముతో కూడుంరాగమ్ము నరకివేతు.

ఇట్లు పలికి మహాసత్త్వుడు "మహారాజా, నా కనుజ్ఞ యిండు" అని ఆనతి పొంది పర్ణశాలలో ప్రవేశించి కసినమండల భావన చేసి మరల ధ్యానబలము పొంది ఆవల పర్ణశాల వెలువడి ఆకాశమున పర్యంక బంధమున గూర్చుండి "మహారాజా, నే నిచ్చట చెప్పిన కారణముల వలన లోకములో నిందకు ఎంత్రుడ నైతిని. నీ వప్ర మత్తుడవు కమ్ము. ఇక స్త్రీవాసనగూడ తగులని వనభాగమునకు బోయి నివసింతును" అని చెప్పెను. రాజు దుఃఖాక్రాంతు డయ్యెను. ఋషి హిమవత్ప్రదేశమునకు బోయి అపరిహీణధ్యాన నిరతు డయి బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

శాస్త ఇది గ్రహించి ఇట్లు పలికెను :
అనుచు సత్యపరాక్రమ మాచరించి
కామరాగంబు మొదలంట కర్తరించి
హారితుడు బ్రహ్మలోకంబు చేరుకొనియె.

అభిసంబుద్ధుడయినపిదప శాస్త ఈగాథ పలికి సత్య ప్రకాశనము కావించి, జాతకములు సరిపోల్చెను. ఉద్విగ్నచిత్తుడగు భిక్షువు అనంతరము అర్హత్త్వము పొందెను. ఆ కాలమున రాజు ఆనందుడు. హారితుడు నేనే.

X

# ౪౩౨ పదకుసల మాణవ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచున్న సమయమున ఒకానొక బాలకుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తీ నగరమున ఒకానొక గృహస్థుని యింట బుట్టిన బాలుడు ఐదేండ్ల వయస్సుననే ఆకార ప్రకారములలో కుశలుడు. తండ్రి వాని తెలివి కనుగొనుటకై ముందు చెప్పకుండనే మిత్రుని యింటికి జనెను. నాయనగారు ఎక్కడికి పోయినారని అడుగకుండగనే పాదచిహ్నములను బట్టి మిత్రుని యింటికి జని తండ్రికడ నిల్చెను. ఒకనాడు తండ్రి "నాయనా, నేను నీకు సూచింపకుండగనే అచ్చటి కెట్లు పోగలిగితివి?" అనెను. "నాయనా! నేను నీ పాదచిహ్నముల గుర్తించుటలో నేర్పరిని" అని వాడనెను.

తండ్రి మరియొక పరీక్ష చేయదలచి పూర్వాహ్ణమున భోజనము చేసి యింట వెడలి పొరుగిల్లు చేరి వేరొకయింటిలోనికి పోయి పిమ్మట మూడవ యింటిలోని జొచ్చి అచటినుండి మరల తనయిల్లు చేరి, అక్కడినుండి ఉత్తరద్వారము బయలు వెడలి నగరమునకు వామపార్శ్వమున నడిచి, జేతవనమున చేరి శాస్తకి ప్రణమిల్లి ఒకప్రక్కన గూర్చుండి ధర్మోపదేశము విన జొచ్చెను. "నాయన ఎక్కడ?" అని బాలకు డడుగగా 'తెలియ'దని ప్రత్యుత్తర మిచ్చిరి. "తెలియదా?" అని మాణవకుడు తండ్రి పదచిహ్నముల ననుసరించి ప్రక్క యింటికి జని, తండ్రి యేయే ఇండ్లకు ఏయే మార్గముల జనెనో కనుగొని తుదకు జేతవనము చేరి శాస్తకు ప్రణమిల్లి తండ్రికడ నిల్చెను. "నే నిక్కడ నున్నట్లు నీ కెట్లు తెలిసెను?" అని తండ్రి కుమారుని అడిగెను.

"పాదచిహ్నములను బట్టి నడిచి వచ్చితిని". అపుడు శాస్త "ఉపాసకా ఏ మనుచున్నావు?" అని యడుగగా గృహస్థు "భన్తే. ఈ బాలుడు పదచిహ్నముల పసిగట్టుటయందు నేర్పరి. వీనిని పరీక్షించుటకై వివిధమార్గముల నిచ్చటికి వచ్చితిని. నే నింట కనబడకపోవుటచే బాలుడు నా కాలి యడుగు జాడలను బట్టి యిచ్చ

టికి వచ్చినాడు'' అని విన్నవించెను. "ఉపాసకా, నేలమీంది కాలిజాడలు గుర్తించుట యాశ్చర్యము కాదు. పూర్వకాలమున ఆకాశమార్గమునందలి కాలిజాడలను గుర్తించిరి'' అని, గృహస్థు ప్రార్థించిన పిమ్మట శాస్త పూర్వజన్మ వృత్తాంతము తెల్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఆయన పట్టపురాణి తప్పుత్రోవన పడెను. రాజు ప్రశ్నింపగా ఆమె శపథము చేసి "నేను మీ విషయమై అనుచితము చేసియుంటినేని అశ్వముఖసదృశయాన యక్షిణి నయి పుట్టుదును'' అనెను. ఆమె చనిపోయిన తర్వాత పర్వత ప్రదేశమున అశ్వముఖ సదృశయక్షిణి యయి గుహలో నివసించుచు, మహారణ్యమున తూర్పునుండి పశ్చిమమునకు రాకపోకలు చేయు జనులను పట్టుకొని తినుచుండెను. ఆమె మూడు సంవత్సరములపాటు కుబేరుని సేవ చేసి మూడు యోజనముల వెడలుపు, అయిదు యోజనముల పొడవు గల ప్రదేశమున తిరుగు మనుజులను భక్షించు నధికారము పొందెను.

సంపత్తిశాలి, మహాధనికుడు, సుందరాకారుడగు బ్రాహ్మణుడు విశేష పరివారముతో ఒకనాడు ఆమార్గమున ప్రయాణము చేయుచుండెను, యక్షిణి వారిని చూచి అట్టహాసము చేసి ఆక్రమించెను. ఆయన వెంట నున్నవారు పరుగెత్తిరి. ఆమె వాయువేగమున బ్రాహ్మణుని పట్టుకొని తన వీపుపై పెట్టుకొని గుహలోనికి తీసికొనిపోయినది. పురుషశరీర స్పర్శవలన ఆమె హృదయమున నను రాగ ముద్భవింపగా స్నేహవశమున నతనిని భక్షింపక భర్తను చేసికొనెను. ఉభయులు కలిసి నివసింప జొచ్చిరి.

యక్షిణి త్రోవన బోవుమానవులను పట్టుకొన్నప్పుడు వారికడ నున్న వస్త్రములు, బియ్యము, నూనె మొదలైనవి సంగ్రహించి, భర్తకు పుష్టి నిచ్చు భోజనము సిద్ధము చేసి తాను మాత్రము మనుష్యమాంసము తినుచుండెను. తాను వెలుపలికి పోయినపుడు, భర్త పారిపోవునేమో, యన్న భయముచే బరువుగల పద్ద శిలను మహాద్వారమున కడ్డము వేయుచుండెను.

ఈ విధముగా నామె ప్రసన్నచిత్తముతో నుండగా బోధిసత్త్వుడు ఉత్పన్న స్థానమున మరణించి ఆమెకడుపున పడి, పదినెలలకు జన్మించెను. బాలుని

భర్తను అతిస్నేహముతో ఆమె పోషించుచుండెను. క్రమముగా బాలుడు పెరిగి పెద్దవాడయ్యెను. ఆమె వా రిరువురను గుహలో బంధించి వెలుపలికి పోవుచుండెడిది.

ఒకనా డామె వెడలిపోయిన దని తెలిసికొని కుమారుడు పాషాణము తొల గించి తండ్రిని వెలుపలికి తీసికొనిపోయెను. ఆమె మరల వచ్చిన తరువాత శిలా ఖండ మెవరు తొలగించి రని అడిగినది.

“అమ్మా, నేను తొలగించితిని. చీకటిలో కూరుచుండుట పడదు.” పుత్ర స్నేహముచే ఆమె యేమియు పలుక జాలకపోయెను.

ఒకనాడు బోధిసత్త్వుడు తండ్రితో “నాయనా, అమ్మచేష్ట లొకవిధముగాను, మీ చేష్ట లింకొక విధముగాను కనబడుటకు కారణ మేమి? అని అడిగెను.

“నాయనా, మీతల్లి మనుష్యమాంసము తిను యక్షిణి. మన మిరువురమును మనుష్యులము.”

“అటులైనచో ఇట నుండ నేల? మానవు లుండు నివాసములకు పోవుదము.”

“మనము పరుగెత్తితి మేని నీతల్లి మనల నిరువురను పట్టిమ్రింగును!”

బోధిసత్త్వుని తండ్రి నోదార్చి “నాయనా భయపడవద్దు. నిన్ను మానవ నివాసములకు చేర్చు బాధ్యత నాది” అని చెప్పి మరునాడు తల్లి యెచటికో వడలి పోయిన తర్వాత తండ్రిని వెంట గొని పలాయనము చేసెను. యక్షిణి ఇంటికి వచ్చి వారిని కానక వాయువేగమున పోయి వారిని కనిపెట్టి పట్టుకొని “బ్రాహ్మణా, ఏల పరుగెత్తితివి? ఇచ్చట నీ కేమియును లభించుటలేదా?” అని అడిగెను.

“భద్రే, నాపై కోపము వలదు. నీ పుత్రుడు నన్ను వెంటగొని పరుగెత్తుచున్నాడు.”

ఆమె పుత్రవాత్సల్యముచే నేమియు ననక వారి నూరడించి, నిజనివాసము నకు గొనిపోయెను.

“నా తల్లికి ఏదో సరిహద్దు ఉండవలెను. ఆమె ప్రభావము ఎంతదూరము వ్యాపించునో అడిగి తెలిసికొందును. ఆ సీమ దాటిపోవుదము” అని బోధిసత్త్వుడు భావించి ఒకనాడు “అమ్మా, తల్లి సంపద పుత్రునకు రావలెను. నీ యధికారమున

నున్న భూమికి హద్దు తెలుపుము" అని యడిగెను. అన్ని దిక్కుల పర్వతాది చిహ్నములు చూపి మూడు యోజనముల వెడల్పు, అయిదు యోజనముల పొడవు గల భూమి నిర్ణయించి ఆమె "నాయనా, ఈ ప్రదేశమును గ్రహింపుము" అని చెప్పెను. రెండు మూడు రోజులు పోనిచ్చి తల్లి అడవిలోనికి పోయినపుడు కుమారుడు తండ్రిని భుజముపై నెక్కించుకొని తల్లి మున్ను చూపినచోటు వాయువేగమున దాటి సరిహద్దు కావల నున్న యేటియొడ్డు చేరెను. ఆమె యింటికి వచ్చి వారిని గానక పరుగెత్తి పోయెను. బోధిసత్త్వుడు తండ్రిని ఏటినడుమకు చేర్చెను. ఇంతలో నామె యేటిదరికి జేరి చూడగా వారు సీమ దాటి ఆవలికి జేరియుండిరి. ఆమె అచటనే నిలిచి "తండ్రిని తీసికొని మరలి రమ్ము, నావలన అపరాధమేమి? నావల్ల మీకు లభ్యము కానివస్తు వేదైన ఉన్నదా?" అనెను. బ్రాహ్మణుడు ఏరు దాటి పోయినాడు. ఆమె కొడుకును "నాయనా, ఇట్లు చేయకుము. మరలి రమ్ము" అని బతిమాలెను.

"అమ్మా, మేము మానవులము. నీవు యక్షిణివి. నీకడ సదా ఉండజాలము." "నాయనా, మరల రానే రావా? రానిచో మానవలోకమున జీవితము కష్టముగా నుండును. చదువు లేనివాడు జీవయాపనము చేయలేడు. చింతామణి యను విద్య యొకటి నాకు తెలియును. దాని ప్రభావము వలన పండ్రెండేండ్లనాటి మనుష్య పదచిహ్నము ననుసరింప వచ్చును. ఇది నీకు జీవిక కాగలదు. నాయనా, యీ యమూల్య మంత్రమును గ్రహింపుము!"

ఆమె దుఃఖాభిభూత యయ్యును పుత్రవాత్సల్యముచే మంత్ర ముపదేశించెను. బోధిసత్త్వుడు నదీతీరముననే యుండి తల్లికి ప్రణామము చేసి, కూర్మపాస్థముద్రతో మంత్రమును గ్రహించెను; మరల మాతకు నమస్కరించి "అమ్మా, పోనమ్మా" అనెను.

"నాయనా, నీవు మరలి రానిచో నా ప్రాణములు నిలువవు" అని యక్షిణి గుండెలమీద కొట్టుకొనెను. పుత్రశోకముచే ఆమె గుండెలు బ్రద్ద లయ్యెను. ఆమె మృతి చెంది అచటనే పడెను. ఆమె మరణించినదని గ్రహించినపుడు బోధిసత్త్వుడు తండ్రిని పిలిచి తల్లిని సమీపించి చితి పేర్చి అంటించెను. ఆవల నానావిధ పుష్పములతో నామెను పూజించి దుఃఖించి తండ్రిని వెంటగొని వారణాసి కరిగెను. అరిగి, పదకుశలమాణవకుడు వచ్చి ద్వారమున నున్నాడని రాజునకు తెలియ పరచెను. తీసికొని రమ్మని రాజు చెప్పెను. పోయి యతడు రాజుకు ప్రణామము చేసి "నీ

కేవిద్యలు తెలియును ?" అని రాజు ప్రశ్నింపగా "దేవా, పండ్రెండు వత్సరముల నాడు పోయిన వస్తువులను పదచిహ్నములబట్టి తీసికొని రాగలను" అని విన్నవించెను.

"అయినచో నాకొలువున నుండుము"

"ప్రతిదినము వేయినాణెములు లభించుచో కొలువున నుందును."

"మంచిది, నాయనా, ఉండుము" అని రాజు ప్రతిదిన మాతనికి వేయినాణెము లిప్పించుచుండెను. రాజుతో పురోహితు డొకనాడు "మహారాజా, ఆ మాణవకుడు తనవిద్యా ప్రభావమును ఏ మాత్రము చూపలేదు. అందుచేత ఆతనికి విద్య ఉన్నదో లేదో మాకు తెలియుటలేదు" అని పలికెను.

మంచి దని రాజు వివిధరత్నములను కాపాడు నిరువురు పరిజనులకు సంజ్ఞ చేసెను. వారు ప్రాసాదముదిగి మహారాజ సౌధమునకు ముమ్మారు ప్రదక్షిణము చేసి నిచ్చెన వేసి ప్రాకారము మీదుగా వెలుపలికి దిగి అక్కడి వినిశ్చయశాలలో చేరి కూడనుండి, మరల నిచ్చెన వేసి ప్రాకారము మీదుగా దిగి నగరములోని పుష్కరిణిగొయ్యు చేరి ముమ్మారు ప్రదక్షిణము చేసి, లోనికి దిగి, వస్తువులను నీటిలో దాచి ప్రాసాద మెక్కిరి. రాజభవనములో రత్నముల చౌర్యము జరిగె నని మహానాదు కలకలము పుట్టెను. ఎరుగని వానివలె రాజు బోధిసత్త్వుని పిలిచి "నాయనా, రాజభవనమునుండి చాల రత్నములు పోయినవి. అవి ఆచూకి తీయవలెను" అని చెప్పెను.

"మహారాజా, పన్నెండేళ్ళనాడు పోయిన వస్తువులను చోరుల పదచిహ్నముల బట్టి తేగలిగిన నాకు నిన్నరాత్రి పోయిన వస్తువుల జాడ తీయుటలో ఆశ్చర్యము లేదు. మీరు చింతింప వలదు. నేను వానిని తెత్తును."

"అయినచో, బాబూ, తెమ్ము."

బోధిసత్త్వుడు మంచి దని మనసులో మాతకు ప్రణామము చేసి మంత్రము జపించి పై యంతస్థు మీద నిలిచి "మహారాజా, ఇరువురు చోరుల అడుగుజాడలు కానవచ్చుచున్నవి" అని, రాజ,రాజపురోహితుల పదచిహ్నముల ననుసరించి శ్రీభవనమునకు పోయెను. అచటినుండి వెలువడి రాజభవనముచుట్టు మూడుమారులు తిరిగి అడుగు జాడలవెంట ప్రాకారము చేరి అచట నాగి, "మహారాజా, ఇక్కడ అడుగు

జాడలు ఆగిపోయి ఆకాశమున కానబడుచున్నవి. నిచ్చెన వేయింపుడు" అని, నిచ్చెన వేయించి దానిమీదుగా ప్రాకారముపై నుండి దిగి వినిశ్చయశాలకు పోయి మరల రాజమహలుకు వచ్చి నిచ్చెన వేయించి ప్రాకారముమీదుగా దిగి పుష్కరిణిచేరి ముమ్మారు చుట్టు తిరిగి "మహారాజా, చోరు లీపుష్కరిణిలోనికి దిగినారు" అని దిగి, అక్కడ పెట్టిన సామానుతెచ్చి రాజున కిచ్చి "మహారాజా, ఉభయులు మహా ప్రసిద్ధ చోరులు. ఈ మార్గమున రాజసౌధ మెక్కినారు" అని వివరించెను. జనులు సంతుష్టులై కరతాళ ధ్వనులు చేసి వస్త్రముల నెగుర వైచిరి.

"ఈ మాణవకుడు చోరుల పదచిహ్నముల ననుసరించి వస్తువులు దాచిన ప్రదేశముగూడ కనుగొన గల్గుచున్నాడు. కాని చోరులను పట్టుకొన లేడని తోచుచున్నది" అని తలపోసి రాజు "చోరులు వస్తువులు కొనిపోయిన తావునకు గాని పోయినావు. వారిని పట్టుకొన గలవా?" అని అడిగెను.

"మహారాజా, చోరు లిచటనే యున్నారు. దూరమున లేరు." "ఎవరెవరు?" "మీ వస్తువులు దొరకినపుడు చోరుల ప్రసక్తి ఏల? అడుగవలదు." "బాబూ, నీకు ప్రతిదినము వేయి ముట్టుచున్నవి కదా! నాకు చోరులను పట్టిఇమ్ము". "ధనము లభించినపుడు చోరులతో పని ఏమి?" "బాబా, ధనముకంటెను మాకు చోరులు కావలెను". "అయినచో మహారాజా, చోరులను చోరులని చెప్పను. పూర్వకాలపు ఘటనను వివరింతును. దానిని బట్టి మీరు గ్రహింపవలెను." అని పూర్వకాలపు ఘటన యిట్లు బోధిసత్త్వుడు వివరించెను.

"మహారాజా, పూర్వకాలమున వారాణసికి కొలది దూరములో నున్న నదీతీర గ్రామమున పాటలు డను నటు డుండెను. అత డొకనాడు భార్యను వెంట బెట్టుకొని పోయి వారాణసి చేరి నృత్యము చేసి పాడి ధనము ప్రోగుచేసి ఉత్సవానంతరము చాల మద్యమును ఖాద్యములను తీసికొని నిజగ్రామమునకు పోవుచుండెను. నదీతీరమునకు పోవునప్పటికి క్రొత్తనీరు వచ్చుచుండుట గమనించి మద్యము త్రాగుచు కూరుచుండెను. కైపెక్కిన పిమ్మట నిజబలము గ్రహింపక పెద్దవీణ మెడకు కట్టుకొని ఈది పోవుటకు సిద్ధమాయెను. భార్య చేయి బట్టుకొని అతడు నదిలో దిగెను. రంధ్రముల నుండి నీరు వీణలోనికి బోయినది. ఆ వీణ అతనిని నీట ముంపసాగెను. భార్య ఈదిపోయి ఒడ్డున నిలిచెను. పాటలు ఒకసారి మునుగుచు నొకసారి తేలుచు పోవుచుండ, నీరు పోసికొని వాని పొట్ట నిండిపోయెను.

"నా భర్త మునిగిపోవుచున్నాడు. ఈయన వలన గీతము విని దానివలన పొట్ట పోసి కొందును" అని యోచించి "స్వామీ, మీరు నీటిలో మునిగిపోవుచున్నారు. నాకు గీతము నేర్పుడు. దానివలన పొట్ట పోసికొందును" అని ఈ గాథ పలికెను :

పటలు బహుశ్రుతు నటు చిత్రకథకు
తేల్చును భాగీరథీ ప్రవాహంబు
నీకు కల్యాణమా గాక నాకోరకు
ఎండలేవా చిన్నిపాట ఓ పటల !

నీట పాటలుడు "భద్రే, నీకు గీత మెట్లు నేర్పుదును ? లోకకల్యాణము చేయు జలమే ఇపుడు నన్ను చంపి వేయుచున్నది" అని ఇది పాడెను :

సర్వ తాపంబులం బాపు జలమునందె
చచ్చిపోవగ నున్నాను ! శరణ పదము
నుండియే నాకు భయ మిప్పు గుప్పతిల్లె.

బోధిసత్త్వు డీగాథ వినిపించి "మహారాజా, జలము జనుల నెట్లు రక్షించునో అట్లే రాజుగూడ రక్షించును. కాని భయకారణ మగుచో నెవడు రక్షించును?" అని, "మహారాజా, ఈ విషయము గుప్తము, కాని పండితుడు గ్రహించు నట్లు చేసితిని. మహారాజా, గ్రహింతురుగాక" అనెను.

"బాబా, ఇట్టి గూఢ విషయము నాకు తెలియుటలేదు. దొంగను పట్టి ఈయ వలెను" అని రాజనెను.

"ఇది విన్నచో గ్రహింతురు" అని వేరొక సంఘటనను బోధిసత్త్వుడు తెలిపెను. "దేవా, పూర్వము ఈ వారాణసీ ద్వార గ్రామమున కుమ్మరి గిన్నెలు (పిడతలు) చేయుటకై మట్టి తీసికొని పోవుచుండెను. ప్రతిదిన మాతడు పర్వతములో నొకచోట గొయ్యి త్రవ్వుచుండెను. ఒకనా డాతడు మన్ను తెచ్చుచుండగా ఆకసమున మేఘములు వ్యాపించి పెద్దవర్షము కురిసెను. జల ప్రవాహము వలన గొయ్యి అంచు విరిగిపడెను. దానిచే నతని శిరస్సు బ్రద్ద లయ్యెను. అతడు రోదించుచు ఈ గాథ పలికెను :

మొలచు నెద్దానిపై బీజములు విశేష
జీవు లెద్దానిపై ప్రతిష్ఠితులు, అట్టి

ధరణియే బాధకం బయ్యె, శరణపదము
నుండియే నాకు భయ మిప్పు డుప్పతిల్లె.

"దేవా, మహావసుంధర జనుల కాధారము. కాని కుంభకారుని తల దాని వలన బ్రద్ద లయ్యెను. అట్లే అందరకును శరణస్థాన మగు రాజే చౌర్యము మొద లిడుచో ఆయన నెవ్వా రాపగలరు? ఇట్లు నేను గుప్తపరచి చెప్పిన చోరుని రాజు గ్రహింప గలడు."

"బాబూ, గుప్తవాక్యముల వలన ప్రయోజనము లేదు. ఇతడు చోరు డని పట్టుకొని నాకు సమర్పింపవలెను."

రాజగౌరవమును రక్షించుట కతడు నీవే చోరుడ వని చెప్పక ఉదాహరణ మిచ్చెను.

"మహారాజా, పూర్వకాలమున ఈ నగరములోనే ఒకానొక యింటికి నిప్పంటుకొనెను. వాడు వేరొకనితో లోనికి పోయి సామానులు తరలించుకొని, రమ్మని ఆనతిగా పలికెను. వాడు లోనికి పోయి మరల వెలువడునప్పటికి ద్వారము మూతపడెను. పొగలో వాడు దృష్టి కోల్పోయి యావలకు వచ్చు తెన్ను గానక అగ్నిబాధ కోర్వలేక దుఃఖించుచు ఈ గాధ పలికెను:

దేనిచే పక్వ మన్నము, దేనివలన
అపహృతం బగు శీతము- అదియె నేడు
బాల నన్నేర్చుచున్నది, శరణపదము
నుండియే నాకు భీతి సముద్భవించె!

"మహారాజా, అగ్నివలె అభయదాత యైనవాడు రత్నములను గొనిపోయెను. చోరుని గూర్చి నన్నడుగవలదు."

"బాబూ, నాకు చోరుని పట్టి యిమ్ము."

నీవే చోరుడవని చెప్పక బోధిసత్త్వుడు వేరొక యుదాహరణ మిచ్చెను. "దేవా పూర్వకాలమున ఈ నగరములోనే ఒకానొకడు అత్యధికముగా భుజించి జీర్ణము చేసికొన జాలక బాధపడుచుండెను.

బ్రాహ్మణుల్ క్షత్రియుల్ భక్షింప నెద్ది
జీవింతు రద్దానిచేత నా కిపుడు

జనియించినది బాధ, శరణాపదమ్ము
నుండియే భీతి సముద్భవించినది.

అన్నమువలె మనుష్యులకు ఆశ్రయ మైనవాడు రత్నభాండము గొనిపోయెను. అది దొరకిన తరువాత చోరునితో పని ఏమి ?"

"బాబా, చేతనైనచో చోరుని పట్టి యిమ్ము"

బోధిసత్త్వ డావిషయమును తెలియపరుచుటకై మరియొక యుదాహరణ మిచ్చెను. "దేవా పూర్వకాలమున ఈ మహానగరములోనే వాయువువలన నొకడు కొట్టుకొని పోయినాడు. వాని శరీరము చిదికి పోయినది. ఏడ్చుచు వా డిట్లు పలికినాడు :

నాతినుంతు రెల్ల గ్రీష్మర్తువు కడను
వాంఛింతు రెద్ది ఆవాతంబె నన్ను
బాల వేధించెను, శరణ పదమ్ము
నుండియే భయ మిప్పు డుద్భూత మయ్యె.

"మహారాజా, శరణస్థానము నుండియే భయ ముత్పన్న మయినది. ఈ విషయము గ్రహింపుడు."

"బాబా, చోరుని పట్టి ఇమ్ము."

ఆ విషయము బోధించుటకై బోధిసత్త్వుడు వేరొక యుదాహరణము తెలిపెను. "దేవా, పూర్వము హిమాలయ ప్రదేశమున ఆకులతో గూడిన మహావృక్షముండెను. దానిమీద కొన్ని పక్షులు నివసించుచుండెను. దాని శాఖలు రెండును రాచుకొనసాగినవి. అగ్గి బయలు వెడలి బూడిద రాలుచుండ, జ్యేష్ఠ పక్షి జూచి యిట్లు పలికినది.

విహగాశ్రయం బైన వృక్షంబునుండి
అగ్ని లేచుచున్న దన్ని దిక్కులకు
చనుడు విహంగముల్, శరణ పదమ్ము
నుండియే భయ మిప్పు డుత్పత్తిల్లినది.

"దేవా, వృక్షము పక్షులకు శరణస్థానము అయినట్లే రాజుగూడ జనులకు శరణము. అతడే చౌర్యము చేయుచో ఎవ్వ రాపగలరు ? గ్రహించితిరా ?"

"బాబా, నాకు చోరుని పట్టియిమ్ము"

బోధిసత్త్వుడు మరియొక యుదాహరణము చెప్పెను : "మహారాజా, కాశీ గ్రామమున ఒకానొక గృహస్థుని యింటికి పడమర మొసళ్ళతో నిండిన మడుగు గలదు. అతని కుమారుడు పితృ మరణానంతరము తల్లికి సేవ చేయుచుండెను. అతని కిష్టము లేకున్నను కన్యను తెచ్చి పెండ్లి చేసిరి. ఆమె తొలుత అత్తగారిని ప్రీతితో చూచుచుండెడిది. బిడ్డలు పుట్టి పెరిగిన తరువాత ఆమె అత్తను వెడల గొట్ట దలచెను. ఆమె తల్లియు తన యింటనే యుండెను. భర్తతో భార్య అత్తపై వివిధ దోషముల నారోపించి అతని మనస్సు చెడగొట్టి 'మీ తల్లికి ఉపచారములు చేయలేను! ఆమెను మీరు జంపివేయుడు' అని చెప్పెను.

"మానవహత్య తేలిక కాదు. ఎట్లు చంపగలము?"

"ఆమె నిద్రించునపుడు మంచముతో సహా ఆమెను తీసికొనిపోయి మొసళ్ళ మడుగులో పడవేయుదము. మొసళ్ళు ఆమెను సంహరించును".

"మీ అమ్మగారెచట నున్నది?"

"ఆమె ప్రక్కనే పండుకొన్నది."

"అయిన యెడల ఆమె పండుకొన్న మంచమునకు గురుతుగా త్రాడు కట్టెదను."

అతడా ప్రకారమే చేసి "కొంచెముసేపు ఆగుము. జనులు కొంచెము నిద్ర పోవుదురు." అని నిద్రపోవు వానివలె పండుకొని ఆ త్రాడు తన అత్తగారి మంచమునకు కట్టి కొంతసేపటికి భార్యను లేపెను. ఇరువురును త్రాడుగట్టిన మంచమును ఎత్తుకొని మడుగులో విసరివైచిరి. అచ్చటి మొసళ్ళు ఆమెను పూర్తిగా మ్రింగివేసెను. మరునాడు ఆమె తనతల్లి మారుట గ్రహించి భర్తతో "స్వామీ, నా తల్లి చనిపోయినది. ఇక మీతల్లిని చంపుదము" అన్నది.

"అగుచో మంచిది. ఆమెను చితిమీద పడవైచి చంపుదము." అని మంచమును శ్మశానమునకు గొనిపోయిరి. అచ్చట భర్త భార్యతో "నిప్పు తెచ్చితివా?" అనెను.

"స్వామీ, మరచినాను."

"అగుచో పోయి తెమ్ము."

"స్వామీ, పోవలేను. మీరు వెడలిన తరువాత ఒంటిగా ఉండలేను. ఇరువురము కలిసిపోవుదము."

వారు వెడలిపోయిన తరువాత చల్లనిగాలి తగులుటచే మెలకువ వచ్చి వృద్ధురాలు లేచి శ్మశానమును చూచి "నన్ను వీరు చంపదలచి నిప్పు తెచ్చుటకై వెడలియుందురు. నా శక్తి సామర్థ్యములు వీరికి తెలియవు" అనుకొని అచటి శవమును మంచముపై పరుండబెట్టి వస్త్రము కప్పి తాను పలాయనము చేసి గుహలో చేరి దాగెను. ఇంతలో భార్యా భర్తలు అగ్ని తెచ్చి శవము వృద్ధురాలిదని, తలచి చితిపై బెట్టి నిప్పు ముట్టించి పోయిరి.

చోరు డొకడు ఆ గుహలో తన సామాను లుంచి వానిని గొనిపోవుటకై మరలివచ్చి "ఈమె యక్షిణీ కానోపును. నా వస్తువులు మానవులు కానివారి చేతిలోనికి పోయినవి" అని తలపోసి మంత్రవేత్తను గొని వచ్చెను. అతడు మంత్రము పఠించి గుహలోనికి ప్రవేశింపగా ముదుసలి "నేను యక్షిణిని కాను. రమ్మా, మన మిరువురము ధనము ననుభవింతము" అనెను.

"నే నెట్లు విశ్వసింతును ?"

"నీ నాలుక నా నాలుకపై నుంచుము," అని ఆమె పలుకగా ఆయన అట్లే చేసెను. వృద్ధురాలాతని నాలుకను కొరికి వేసెను. మంత్రవేత్త దానివలన ఆమె యక్షిణియే అని భావించెను. అతడు నాలుకనుండి రక్తము స్రవించుచుండగా పలాయనము చేసెను. ముసలిది మరునాడు పట్టుబట్ట కట్టుకొని వివిధరత్నములు పట్టుకొని ఇంటికి మరలి వచ్చెను. కోడలు చూచి "ఇవి యెక్కడ లభించినవి ?" అనెను.

"బిడ్డా, శ్మశానములో కాష్ఠములలో కాలినవారికి ఇవి లభించును."

"నాకు గూడ ఇవి లభింపగలవా?"

"నేను చేసినట్లే చేసినచో నీకును లభింపగలవు."

కోడలు ఆభరణములపై లోభముచే భర్తకు చెప్పకుండ చితిపై తన్ను దహించుకొనెను. మరునాడు భర్త ఆమెను గానక తల్లితో "అమ్మా, ఈవేళ నీకోడలు కనబడుట లేదేమి ?" అని అడుగగా ఆమె "ఓరి పాపీ, చచ్చినది మరల వచ్చునా?" అని బెదరించి ఈ గాథ పలికెను.

శిరమున మాసికల్ ధరియించి మేన
చందనం బలదిన సుందరి నేను
కొనివచ్చితి ప్రసన్నమనమున నిపుడు
ఇంటిలోనుండి నన్ గెంటివేసినది.

"మహారాజా, అత్తకు కోడలు శరణస్థాన మైనట్లు రాజు జనులకు శరణము. దేవా, అచటి నుండియే భయముత్పన్న మగుచో ఏమిచేయుటకు వీలగును? గ్రహింపుడు."

"నీమాటలు నాకు తెలియుట లేదు. చోరుని పట్టి నా కిమ్ము"

బోధిసత్త్వుడు రాజును బ్రతిమాలి పెట్టి నను ఇంకొక సంఘటనము తెలిపెను. "దేవా, ఈ నగరములోనే ఒకానొకడు ప్రార్థన చేసి పుత్రుని బడసెను. వాడు పుట్టిన నాటి నుండియు నాకు పుత్రుడు లభించె నని అతడు ప్రసన్న చిత్తుడై వానిని పెంచి పెద్దవానినిచేసి వివాహముగూడ చేసెను. తాను వృద్ధుడై పొలములో పనిచేయ నశక్తుడగ నపుడు కొడుకు "నీవు పొలము పనిచేయలేవు. ఇంటి నుండి వెడలిపొమ్ము" అని తండ్రిని వెడలగొట్టెను. వృద్ధుడు మిగుల శ్రమపడుచు ముష్టి యెత్తుకొని జీవింప జొచ్చెను. ఒకనాడతడు విచారముతో ఈ గాథ పలికెను.

ఎవ్వని పుట్టుక కెదురు చూచితినో
ఎవ్వని యభివృద్ధి నిచ్ఛగించితినో
ఆ సుపుత్రుండె యీ వానరమ్ముగను
ఇంటిలోపల నుండి గెంటిన వాడు

"మహారాజా, సమర్థుడైన పుత్రుడు తండ్రి నెట్లు రక్షింపవలెనో అట్లే రాజు సమస్త జానపదులను రక్షింపవలయును. సమస్త ప్రాణులను రక్షింపవలసిన రాజుకడనుండి భయముత్పన్న మైనది. కావున దేవా, ఇతడు చోరు డని గ్రహింపుడు".

రాజు మాటిమాటికి బోధిసత్త్వుని బలవంత పెట్టి "బాబా. నాకు కారణములు, అకారణములు, రహస్యములు తెలియవు నీవు చోరుని చూపింతువా ? నీవే చోరుడవని అంగీకరింతువా ?" అనెను.

అపుడు బోధిసత్త్వుడు "రాజా స్పష్టముగా చోరుని తెలిసికొన గోరుచున్నావా ?" అనను.

"బాబా, అవును."

"అగుచో పరిషన్మధ్యమున ఇతడు చోరు డని చోరుని నిర్దేశింతును."

"బాబా. అట్లే చేయుము."

బోధిసత్త్వుడు తనలో "ఈ రాజు తన గౌరవము దక్కించ నీయకున్నాడు. చోరుని నిర్దేశింతును" అనుకొని సమావిష్టులైన జనులను సంబోధించి ఇట్లు పలికెను :

వివిధ ప్రాంతముల నుండి
విచ్చేసిన జనులారా!
ఆలకింపు డీవాక్కులు
అగ్ని పుట్టె జలములోన
కల్యాణమునందు పాప
కాండ సముద్భూత మయ్యె.
రాజు తత్పురోహితుండు
రాజ్యము దోచుచున్నా
రధిక జాగరూకతతో
ఆలోచన చేయవలయు
శరణ మైన పదము నుండి
సముద్భూతమయ్యె భీతి.

లోకులు బోధిసత్త్వుని కథనము విని "ఈ రాజు రక్షకుడయ్యును వేరొకని దోషిగా ముందరికి నెట్టి తన ధనము తానే పుష్కరిణిలో నుంచి, చోరునికై వెదకింపు చున్నాడు. పాపాత్ము డగు ఈ రాజును సంహరింతము. మరల వీడు దొంగ తనము చేయడు" అని దండములు, ముద్గరములు మొదలగునవి ఎత్తి రాజును, పురోహితుని కొట్టి చంపిరి. వారే బోధిసత్త్వుని అభిషేకించి రాజును చేసిరి.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము గావించి జాతకములు సరిపోల్చెను. అనంతరము ఉపాసకుడును బాలకుడును స్రోతాపత్తి ఫలము నొందిరి. ఆ కాలమున తండ్రి కాశ్యపుడు; కుమారుడు నేనే."

రాజా, సమస్త జంబూద్వీపమునకు ఏకచ్ఛత్రాధిపతివై ఏలింప దలచితివా ? లేదా ?'' "ఏల తలపను ?'' "అటులైన లోమకాశ్యపుని పట్టి తెప్పించి యజ్ఞములో పశువుగా బంధింపుము. శక్రునివలె అజరామరత్వము కలిగి జంబూద్వీపమును ఏలింపగల" వని శక్రుడు తాలిగాథ పలికెను :

లోమకశ్యపఋషిచే మహారాజ
జన్నంబు చేయింప జాలిన యెడల
అజరామరుడ వౌదు వమరేంద్రు నట్లు.

విని రాజు మంచి దని యంగీకరించెను. శక్రుడు పోవుచు "అటులైన ఆలసింపకుము'' అనెను. మరునాడు రాజు సయ్యుడను అమాత్యుని పిలిపించి "సౌమ్యా, నా ప్రియమిత్రమగు లోమకాశ్యపుని కడ కేగి నామాటలుగా రాజు నీచే యజ్ఞము చేయించి తాను సమస్త జంబూద్వీపమునకు నేకచ్ఛత్రాధిపతి యగును. నీవు కోరినంత ప్రదేశ మిచ్చును. యజ్ఞము చేయుటకై నావెంట రమ్ము అని చెప్పు'' మని ఆన తిచ్చెను.

"చిత్తము దేవా'' అని యతడు బయలుదేరెను. లోమకశ్యప తపస్వి నివాస మెవ్వరికి తెలియు నని రాజు నగరమున చాటింపించెను. నాకు తెలియు నని యొకానొక వనచరుడు చెప్పెను. వానిని వెంట బెట్టుకొని బహుపరివారముతో సయ్యుడు లోమకశ్యపునికడ కేగి ప్రణామము చేసి ఒకప్రక్క గూర్చుండి సందేశను తెలిపెను. "సయ్యా ! ఏమిది ? ఇట్లనుచున్నా రేమి ?'' అని తాపసి విచారించుచు నాలుగు గాథలు పలికెను.

అబ్ధి పరీవృతం బైనట్టి పృథ్వి
కూడ గర్హ్యము, నాకు కోరిక లేదు
జ్ఞప్తియం దుంచుకో సయ్యా, రామాట.

నరకమ్మునకు నీడ్చు దురిత కర్మమ్ము
తో మిశ్రితం బైన రాజ మహైశ్వర్య
మైనను ధనలాభ మైన తుచ్ఛంబు.

వగుపుకంటెను జీవన మధర్మమైన
సదనంబు విడచి భిక్షాపాత్ర పట్టి,
వరము కాదే పరివ్రాజక వృత్తి ?

# ౪౩౩. లోమకస్సప జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్త భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శాస్త ఆ భిక్షువును చూచి "నీవు నిజముగా ఉద్విగ్న చిత్తుడవైతివా?" అనెను. "నిజమే" అని అతడు పలికిన పిదప శాస్త "నీవు మంచిపేరు కలవాడ వయ్యును చెడ్డపేరు పొందుచున్నావు. ఈ సంకటము పరిశుద్ధ ప్రాణులను గూడ మతిహీనులను చేయును. నీవంటివారి విషయమై చెప్ప నేల ?" అని పూర్వజన్మ గాథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసీ రాజకుమారుడు బ్రహ్మదత్త కుమారుడు, రాజపురోహితుని కుమారుడు కశ్యపుడును మిత్రులు. వా రిరువురును నొకే ఆచార్యునికడ సమస్త విద్యలను నేర్చిరి. తండ్రి తరువాత బ్రహ్మదత్త కుమారుడు రాజయ్యెను. కాశ్యపుడు తనలో "నామిత్రుడు రా జయినాడు. ఇప్పుడు మహైశ్వర్యము సమకూర్పగలడు. సంపదతో నా కేమిపని ? తలిదండ్రులను రాజును అడిగి ప్రవ్రజించెదను" అనుకొని వారి యనుజ్ఞ పొంది హిమాలయమునకు పోయి ప్రవ్రజించి, ఏడుదినములలో అభిజ్ఞలను సమాపత్తులను పొంది ఉంఛవృత్తి నవలంబించి కాలక్షేపము చేయుచుండెను. ప్రవ్రజించిన పిమ్మట నతనికి లోమకశ్యపుడను పేరు వచ్చెను. అత డింద్రియములను జయించి ఘోరతపస్సు చేసెను. అతని తపస్తేజము వలన శక్రభవనము కంపించెను. ధ్యానమున శక్రుడు సమస్తము గ్రహించి "ఈ తపస్వి మహాతేజస్వి. శక్రభవనము నుండి నన్ను బడద్రోయగలడు. వారాణసీ ప్రభువుతో గలిసి ఇతని తపస్సు భంగము చేయుదును" అని తలపోసి నిజప్రభావమున రాజశయనాగారము ప్రవేశించి నిజశరీర ప్రభలతో ఆగారము ప్రకాశించుచుండ రాజుకడ నిలిచి అతనిని లేపి "మహారాజా, లెమ్మ" అనెను. "ఎవరు నీవు ?" "నేను శక్రుడను" "ఎందులకు వచ్చితివి?" "మహా

ఎవ్వారలను గూడ హింసింపకుండి
సదనంబు వీడి భిక్షాపాత్ర బట్టి
గ్రహియించుచో పరివ్రాజక వృత్తి
రాజ్యపాలనకన్న పూజ్యంబు సుమ్మి.

అమాత్యుడు వెడలిపోయి రాజున కీవిషయము తెలిపెను. అతడు రాని పక్షమున మన మేమి చేయుద మని రాజు మౌనము వహించెను. అర్ధరాత్రమున శక్రుడు వచ్చి "మహారాజా, లోమకాశ్యపుని పిలపించి యజ్ఞ మేల మీరు ప్రారంభింప లేదు?" అని యడిగెను. "పిలువ నంపినను అతడు రాలేదు." అని రాజు చెప్పెను. "మహారాజా, మీ పుత్రిక చంద్రావతి నలంకరించి సహ్యుని వెంట నచటికి బంపి, 'నీవు వచ్చి యజ్ఞము చేసిన యెడల రాజీమెను నీ కిచ్చును' అని చెప్పి పంపుము. ఆమెను చూచి అతడు ఒకవేళ రావచ్చును" అని శక్రుడు పలికెను.

మంచి దని రాజు సమ్మతించి మరునాడు తన కొమార్తెను సహ్యానివెంట బంపెను. సహ్యు డామెను తోడుకొని యాశ్రమము చేరి ఋషికి ప్రణామము చేసి కుశల ప్రశ్నలడిగి దేవకన్యక వంటి యా రాజకుమారిని జూపి యొక ప్రక్క నిలుచుండెను. ఋషి ఇంద్రియ సంయమనము విడిచి ఆమెను జూచిన వెంటనే అశక్తు డయ్యెను. అతని ధ్యానబలము పోవజొచ్చెను. అమాత్యు డతని ప్రతిబద్ధ చిత్తము గ్రహించి "భన్తే, తాము యజ్ఞము చేయుపక్షములో మీకు పాద పరిచారికగా రాజీమెను మీ కొసంగును," అని విన్నవించెను. "మంచిది రాజీమెను నా కిచ్చునా?" "ఆ, యజ్ఞము చేయునెడల ఇచ్చును" "మంచిది, ఈమె లభించు పక్షమున యజ్ఞము చేయుదును" అని ఆ జడధారి అలంకృత రథము నెక్కి వారాణసి చేరెను. ఆతడు వచ్చుచున్నా డని విని రాజు యజ్ఞవాటిక నిర్మాణము చేయ నాజ్ఞ యిచ్చెను. ఋషి వచ్చిన పిమ్మట రాజు "యజ్ఞము చేసిన పక్షమున నేను శక్రసమానుడ నగుదును. యజ్ఞానంతరము బిడ్డను నీ కిత్తును" అని చెప్పెను. కాశ్యపు డంగీకరించెను. మరునాడు రాజు చంద్రావతిని తోడ్కొని అగ్నికుండము సమీపించెను. అచ్చట ఏనుగులు గుర్రములు వృషభములు మొదలగు జంతువులు వరుసగా నిలచియుండెను. అక్కడ సమావిష్టులైనవారు "లోమకాశ్యపా, ఇది నీకు తగదు; అనుచితకార్య మేల చేయుచున్నావు?" అని పరిదేవనము చేయుచు రెండు గాథలు పలికిరి.

బలవంతు లిందు ప్రభాకరు లెంతో
బ్రాహ్మణ శ్రమణులుంగు బలవంతు లెంతో
సాగరోర్మిలు బలిష్ఠంబులు సుమ్ము,
అంతకంటెను స్త్రీల కధిక బలమ్ము.

అధిక తపస్వి మహాశాంతమూర్తి
అయినట్టి లోమ కాశ్యప ఋషిచేత
పితృర్థమై వాజపేయ యాగంబు
కావించె కాదె చంద్రావతీ దేవి !

ఆ సమయమున కాశ్యపుడు యజ్ఞార్థము మంగళహస్తి కంఠము ఖండింతు నని ఖడ్గ మెత్తెను. ఏనుగు చూచి, మరణభయమున ఘీంకారము చేసెను. ఆ ధ్వని విని మిగిలిన ఏనుగులు గుర్రములు వృషభములు మరణభయమున పెద్దపెట్టున అరచినవి. జనసమూహముకూడ ఆక్రందనము చేసెను. ఆ కోలాహలము విని కాశ్యపు డుద్విగ్నచిత్తు డయి తన జడలవైపు చూచుకొనెను. అతని యొడలిమీది రోమములు నిక్కబొడుచుకొన్నవి. అతడు పశ్చాత్తాపము చెంది "అనుచిత మైన పాపకర్మము చేసితిని" అని ఎనిమిదవ గాథ పలికెను :

కామమూలకమును లోభ కారణమ్ము
నైనకర్మ మొనర్చితి దీని ఫలము
బాల కటు వగు, నిర్దానిమూల మరసి
బంధ సహితానుసంగంబు పట్టి త్రెంతు.

అంతట రాజతనితో "మిత్రమా, భయపడవలదు. నేను నీకు చంద్రావతీ కుమారిని రథమును సప్తరత్నరాశిని ఇప్పుడే ఇచ్చెదను. యజ్ఞము చేయుము" అని కోరెను. "మహారాజా, నాకు భోగములమీద కోరిక లేదు" అని కశ్యపుడు తుదిగాథ పలికెను :

గర్హ్యములు లోకమందలి కామభోగ
తతులు నృప, వాని కన్నను తపమె మేలు
వాని విడనాడ ఒనరించువాడ తపము
నీవె రాష్ట్రము చంద్రను, నిలుపుకొమ్ము.

ఇట్లు పలికి నష్టధ్యానబలము నతడు యోగాబంధచే మరల పొంది ఆకాశమున పర్యంక బంధమున గూరుచుండి అప్రమత్తుడవై యుండు మని రాజున కుపదేశించి, యజ్ఞవాటికను ధ్వంసము చేయు డని జంతువుల కభయ మిచ్చెను. రాజు ప్రార్థించుచున్నను వినక బోధిసత్త్వుడు గగనమార్గమున నిజనివాస స్థానమునకు బోయి, యావజ్జీవము బ్రహ్మవిహారమును భావించుచు, తుదకు బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి సత్య ప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. ఆవల ఉద్విగ్న చిత్తు డర్హత్త్వము పొందెను. అప్పుడు రాజు మహామాత్యుడు సారిపుత్రుడు ; లోమకశ్యపుడు నేనే.

—o—

# 421 చక్రవాక జాతకము

శాస్త జేతవనమున విహరించుచూ ఒకానొక లోభిభిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు లోభి. ఆచార్యునకు తగిన సపర్యలు చేయక ప్రాతఃకాలముననే లేచి శ్రావస్తిలో విశాఖ యింటికి జని అనేక ఖాద్యములుతిని మంచి యవాగు త్రాగి మధ్యాహ్నమున మాంసముతో కూడిన శాల్యోదనము కడుపార తినుచుండును. అంతటితో తనివి తీరక చిన్న-అనాధ పిండకుని యింటికిని, కోసలనరేశుడు మొద లగు వారి సౌధములకు జనెడువాడు. ఒకనాడు ధర్మసభలో ఆ లోభి భిక్షువును గూర్చి చర్చ జరుగుచుండెను. శాస్త అచటి కరుదెంచి విషయము గ్రహించి ఆ భిక్షువును పిలువనంపి "భిక్షూ, నీవు నిజముగా లోభివేనా ?" అనెను. "భన్తే, నిజమే" "భిక్షూ, పూర్వము కూడ నీవు లోభి వగుటచే వారాణసిలో ఏనుగు శవము మొద లగువానితో సంతుష్టి నొందక అచ్చటనుండి బయలువెడలి గంగాతీరమున తిరుగుచు హిమాలయ ప్రాంతమున ప్రవేశించితివి" అని, శాస్త పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా లోభి యైన కాకము గజశవములు మొదలగునవి తినుచు తృప్తి లేక గంగానదీతటమున మత్స్యములు క్రొవ్వును తిందు నని అచ్చట చచ్చిన చేపలు తినుచు, కొన్ని దినములు గడి పెను. అనంతరము కాకి హిమాలయమున కేగి, ఫలాదులు తిని విశేష మత్స్య కచ్ఛపములు గల మహాపద్మసరస్సు చేరి, అచ్చట సువర్ణ వర్ణము కల రెండు చక్రవాకములు శైవాలము తినుచుండగా చూచి "ఇవి వర్ణ సంపన్నములై మనో హరముగా నున్నవి. ఇవి ఏమి తినుచున్నవో తెలిసికొని నేనుగూడ అదియే భుజించి స్వర్ణవర్ణము సంపాదింతును" అని తలచి, వానికడకు బోయి కుశలప్రశ్న లడిగి వృక్షశాఖమీద వ్రాలి వానిని ప్రశంసించుచు ఈ గాధ పలికెను :

సంతుష్ట స్వాంతంబుల
జంటగ విహరించుచుండ
స్వర్ణవర్ణ విహంగములు,
వచియింపుడు లోకమందు
పక్షిజాతియందు లేని
ప్రశంస సంభూత మగును.

విని చక్రవాకము రెండవగాథ పలికెను :

కాకమ్మా, మమ్ముగూర్చి
లోకంబున నిట్టు లంద్రు-
చక్కని అన్యోన్యత గల
చక్రవాక విహగములే
శ్రేష్ఠము లని పక్షులందు.
శ్రేయస్సూచకములు మే
మగుట సర్వసమ్మతంబు.
విగతభీతితోడ మేము
విచరింతుము సరసులలో.

విని కాకము మూడవగాథ పలికెను :

మీకీ సలిలమున చక్ర
వాకమ్మలు, ఫలమాంసము
లేవిధమున లభియించుట ?
ఇట్టివర్ణ మిట్టిబలము
ఏమి తినుట చేత కలిగె ?

అంతట చక్రవాకము నాలుగవగాథ పలికెను.

ఫలము లెట్లు దొరకు సరో
జలములందు, మాంసమ్మో
మా కెచ్చటినుండి దొరకు
కాకమ్మా, శైవాలము

భుజియింతుము నీరు త్రాగి
పొట్ట నింపుకొనుటకున్నె
చెట్టు చేయు మెప్పుడు మేము.

అంతట కాకి రెండుగాథలు పలికెను :

నచ్చు లేదు పక్షులార,
నా కిది, రాభవము నందు
ఆహారము నెడ వెనుకటి
అభిప్రాయ మిప్పుడు నూరె.

ఫలములు మాంసములు నేను
భక్షింతును తైలలవణ
సమ్మిశ్రిత పక్వాన్నము.
సంగరంబు నుండి వచ్చుశూర
సైనికులట్లు లోకమ్మున.
అయినను మీ కున్న వర్ణ
మబ్బ లేదు మాయొడలికి.

కాకికి రంగు లేకుండుటకును తనకు వర్ణ ముండుటకును కారణము తెలుపునద్ద చక్రవాకము శేషించినగాథలు పలికెను :

కావు కావు శుద్ధాహార
ఖాదివి వాయసమ, నీవు
ప్రమాదాన క్షణములోన
పతన ముండవచ్చు నీకు
అధిక శ్రమమీద దొరకు
నాహారము చెట్లపండ్లు
శ్మశాన మాంసంబు తోడ
సంతృప్తిం గనకుండుదువు.

సాహసించి యెవ్వడేని
క్షణభంగుర సౌఖ్య మొంది

అంతరంగ పీడ గాంచు
సంతాపముచేత వర్ణ
బలములు జనియించి నిలుచు
అధికస్నేహమ్ము లేక
అన్యపీడ చేయకుండ
శాంతితోడ నుండువాని
శరీర వర్ణ బలము లబ్బె
పుష్టాధీనమ్ము కాదు
వర్ణం బాహారమునకు.

ఈ విధముగా చక్రవాకము బహురీతుల కాకిని గర్హించెను. కాకి నింద పొంది "నీవర్ణమునకు నిదాన మేమో నాకుతెలియలేదు" అని పలికి కా కా యని అరచుచు నెగిరిపోయెను.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి సత్యప్రకాశము గావించి జాతకములు సరిపోల్చెను. అనంతరము లోభికి అనాగామిఫలము లభించెను. ఆ సమయమున కాకి ఈ భిక్షువు; చక్రవాకి రాహులమాత. చక్రవాకము నేనే.

— X —

# 435. హాలిద్దిరాగ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు స్థూలకుమారీ లోభనమును గూర్చి చెప్పినది.

## అతీత కథ

పూర్వకథలో ఆ కన్య తాపసకుమారుని శీలభ్రంశము చేసి అతడు తనవశవర్తి యగుట వానిని నగరమునకు గొనిపోవుకోర్కెతో "సౌందర్యము భోగము లేని యడవిలో సురక్షితమగు సదాచారమునకు అధికఫల ముండదు. నావెంట రమ్ము. పోయి పంచశీల రక్షణను చేసికొన వచ్చును. అడవిలో నీ కేమి పని?" అని ఈ తొలిగాథ పలికెను :

వనమునందు తితిక్ష వహించు టెంతో
సరళమే ఏకాంత శయనాసనమును
గ్రామమందున తితిక్ష కలిగినవాడు.
నీకన్న నధికుండు నిశ్చయంబుగను.

తాపసకుమారుడు విని "మా నాయన అడవిలోనికి బోయినాడు. ఆయన మరలివచ్చిన పిమ్మట నీవెంటవచ్చెదను" అనెను. ఆమె తనలో "ఇతనికి తండ్రి కూడ ఉన్నాడు. నన్ను చూచిన పక్షమున కావడిబద్ద తీసి నెత్తిపై గొట్టి అంతము చేయును. కావున నేను ముందుగా పోవలెను" అనుకొని, "నేను తొలుత మార్గము వెంట గురుతు లుంచుచు పోవుదును. నీ వావల రమ్ము" అని చెప్పెను.

ఆమె వెడలిపోయిన పిమ్మట తాపసకుమారుడు వంట చెరకు గొని, జలము గాని కొనిరాక కూరుచుండి యేమో చింతించుచు తండ్రి వచ్చినను ప్రత్యుత్థానము చేయలేదు. ఇది గ్రహించియు తండ్రి "నాయనా, నీవు వంట చెరకు గొని, ఉదకము గొని, భోజనసామగ్రి కొని తేవైతివి. కూరుచుండి ఏమో ఆలోచించు చున్నావు." అనెను. "నాయనా, అరణ్యములో రక్షించెడు సదాచారమునకు విశేషఫలము లేదు. నగరములో నుందును. నా సహచారిణి ముందు పోవుచు, నన్ను వెనుక రమ్మన్నది.

నే నామెవెంటనే పోయెదను. నే నచట నున్నపుడు ఎట్టివారితో సాంగత్యము చేయవలెను?" అని అడుగుచు రెండవగాథ పలికెను :

కాననంబును వీడి గ్రామమ్ము నేను
చేరుపిమ్మట నెట్టి శీలంబువారి
ఎట్టి శ్రుతంబుల దిట్టలతోడ
కలియుట యుక్తమో తెలుపుము తండ్రి!

తండ్రి ప్రత్యుత్తర మొసగుచు శేషించిన గాథలు పలికెను :

ఎవ్వారలు ధర్మసరణి
నెట్టి ప్రమాదంబు లేక
అనుసరించుచుండు వారో,

ఎవరు విశుద్ధాచరణులు
ఎవ్వరు ప్రజ్ఞావంతులో,
అట్టివారి సాంగత్యం
బాచరణీయంబు తండ్రి!

స్థిరచిత్తము లేనివారి
ద్వేషముతో రాగముతో
కూడినట్టి వారితోడ
కూటమి వర్జ్యంబు తండ్రి!

సారథి కర్దమ సరణికి
జనులు కుపిత సర్పమునకు
పోవునట్లు దూరముగా
బుద్ధిహీను లగువారికి
పోవలయును దూరముగా.

కీడు దెచ్చు మూర్ఖ జనుల
తోడిమైత్రి కానతండ్రి,
వినవలయును సాపెక్కులు
విడువు మూర్ఖు శత్రునట్లు.

ఈ విధముగా తండ్రి ఉపదేశ మిచ్చిన పిదప కుమారుడు "నాయనా, నేను మానవపథమునకు పోయిన పక్షమున అచ్చట నీవంటి విద్వాంసులు లభింపరు. అచటికి పోవుటకు నాకు భయ మగుచున్నది. ఇచ్చట నీకడనే యుందును" అని చెప్పెను. అంతట తండ్రి వానికి విశేషోపదేశము చేసి యోగవిధికూడ నేర్పెను. కుమారుడు త్వరలోనే అభిజ్ఞలను సమాపత్తులను పొంది తండ్రితోడనే బ్రహ్మలోక పరాయణు డయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము గావించి జాతకములు సరి పోల్చెను. ఉద్విగ్నచిత్తుడు స్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. కుమారి కుమారియే, తండ్రిని నేనే.

X

# 436 సముగ్గ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్న చిత్తుడగు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శాస్త అతనితో "భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడవైతివా?" అనెను. "భన్తే, నిజముగానే" అని అతడు పలుక శాస్త "భిక్షూ, నీకు స్త్రీపై నిచ్ఛయేల? స్త్రీ సహ్యులు కాదు, కృతజ్ఞులు కాదు. పూర్వకాలమున దానవులు స్త్రీని కడుపున దాచుకున్నను, స్త్రీసంరక్షణము జరగలేదు. ఒక్క పురుషునితో ఆమె సంతుష్టయై యుండలేదు. నీ వెట్లు నిలుపగలవు?" అని పూర్వజన్మ వృత్తాంతమును చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు కామముల విసర్జించి హిమవంతము ప్రవేశించి ప్రవ్రజించి అభిజ్ఞలు సమాపత్తులు పొంది కందమూలఫలములు తినుచు కాలక్షేపము చేయుచుండెను. ఆయన పర్ణశాలకు సమీపముగా దానవరాక్షసుడు నివసించుచు అప్పు డప్పుడు మహాసత్త్వుని కడకు వచ్చి ధర్మము వినుచుండును. కాని జనులు వచ్చిపోవుమార్గమున నిలిచి వారిని పట్టుకొని భక్షించుచుండెను.

ఒకనాడు కాశీరాష్ట్రములోని ఉత్తమకుల వధువు తలిదండ్రులను జూచి మరలి వచ్చుచుండగా ఆమె వెంట నున్న వారిపై రాక్షసుడు భయంకరాకారముతో కవిసెను. చేత నున్న ఆయుధములను విడిచి వారు పరుగెత్తిరి. బండిలో గూరుచున్న సుందరాంగిని చూచి వాడు ముగ్ధుడై ఆమెను తన మహలులోనికి గొని పోయి భార్యను చేసికొనెను. నాటినుండి నెయ్యి, బియ్యము, మత్స్య మాంసములు మధురఫలాదులు తెచ్చి యామె కిచ్చుచుండెను. ఆమెను వస్త్రములతో ఆభరణములతో నలంకరించి దానిని మరల కరండములో భద్రముగా నుంచి దానిని భుజమున తగిలించుకొనుచుండును.

ఆమె యొకనాడు స్నానము చేయుకోరికతో సరస్సు కడకు పోయి కరండి కను తెరచి అందులోని వస్త్రాదులు తీసికొని స్నానము చేసి విలేపనము చేసికొని ఆభరణములు ధరించెను. "ఒడలికి కొంచెము గాలి తగులనిమ్ము" అని పలికి పెట్టెకు సమీపమున నామెను కూరుచుండు మని వాడు స్నానార్థము కొంచెము దూరము పోయి నీటిలో దిగెను.

ఆ సమయమున వాయుపుత్రు డను విద్యాధరుడు ఖడ్గధారియై యాకాశమున బోవుచుండ ఆమె యతనిని జూచి సంజ్ఞ చేసెను. విద్యాధరుడు వెంటనే క్రిందికి దిగి రాగా ఆమె వానిని పెట్టెలో నుంచి దానవునిరాక కెదురు చూచుచు పెట్టెపై కూరుచుండెను. వాడు వచ్చుచుండుట చూచి తాను వానికి గానబడి, మూత తెరచి ఆమె విద్యాధరునిమీద పండుకొని తనచీర కప్పుకొనెను, దానవుడు వచ్చి పెట్టెను పరీక్షింపక తన భార్యయే అం దున్న దని తలచి గుహకు మోసికొని పోవుచు మార్గములో తాపసుని దర్శింప కోరిక పుట్టగా ఆయన సన్నిధికి బోయెను. తాపసి దూరమునుండి చూచి పెట్టెలో బగు వుండుట గ్రహించి సంభాషించుచు తొలిగాధ పలికెను,

విచ్చేయుచున్నవా రెచ్చోటనుండి
మువ్వురు ? ఈపీఠములమీద సరిగ
కూరుచుండుడు మీకు కుశలమే కాద ?
చిరకాలమున కిట కరుదెంచినారు.

దానవుడు విని "నే నీతాపసునికడ కొక్కడనే వచ్చినాను. ఈయన మువ్వు రనుచున్నాడు. ఏ మిది ? ఏ స్వవము గ్రహించి పలికినాడా ? కాక ఉన్మత్త ప్రలాపమా ?" అనుకొని సమీపించి ప్రణామము చేసి ఒక ప్రక్కన కూరుచుండి మాటాడుచు రెండవగాధ పలికెను.

నే డరుగుదెంచితి నే నొక్కరుండ
లేరు రెండవవారు నేడు నాచెంత
వచ్చితి రిచ్చటి కెచ్చోటినుండి
మువు, రనుప్రశ్నకు, ముని, హేతువేమి ?

"ఆయుష్మన్, స్పష్టముగా వినగోరుచున్నావా ?"

"చిత్రము."

"అట్లయిన విను" మని తాపసి మూడవగాథ పలికెను.

నీ వొక్కడవు రెండు నీదుగర్భమున
నిక్షిప్త మైనట్టి నీ ప్రియభార్య
అయమ రమియించు వాయుపుత్రుండు.

అప్పుడు దానవుడు తనలో "విద్యాధరులు మాయావులు. వీడు ఖడ్గముతో వచ్చియున్నచో నాపొట్ట చీల్చివేగలడు" అనుకొని భయపడి తాపసియెదుట పెట్టె తెరచెను.

శాస్త అభిసంబుద్ధుడై నపిదప ఈవృత్తాంతము ప్రకటించుచు ఈగాథ పలికెను.

తపసి స్పష్టముచేయ దానవు డంత
నడికట్టు పట్టంబు విడదీసినాడు
పెనుదండలం దాల్చు వనితయు నామె
కాముకుం డందులో గనబడినారు.

పెట్టె తెరవగానే విద్యాధరుడు మంత్రము పఠించి ఖడ్గముతో ఆకాశమున కెగసెను. చూచి దానవుడు తాపసియెడ ప్రసన్నచిత్తుడై మిగిలినగాథలు పలికెను.

అతివకు వశవర్తి యగువాడు తపసి
మానవాధము డనుమాట నీవలన
స్పష్టమయ్యె; తపస్వి ప్రాణపదముగ
నిరతంబు రక్షణ నే చేయుచున్న
ఒకనితో రమియించుచున్నది యామె.

అడవిలో నివసించునట్టి తపస్వి
అగ్నిని సేవించునట్లు సపర్య
సలిపినాడ నహర్నిశల్ దాని కేను,
అయిన నామె యధర్మ మాచరించినది
స్త్రీలతో సఖ్యంబు చేయుట తగదు.

కాపుపున దాచిన కారణమ్మునను
నాయది యిది అని నమ్మికతోడ
భ్రాంతినై యుంటిని పాపాత్మురాలు
ధర్మమ్ము విడనాడి తప్పు చేసినది
స్త్రీలతో సఖ్యంబు చేయుట తగదు.

ఇది సురక్షిత నాన మదీయ యనుచు
తగగా విశ్వాస ముంచు చేపగిది నైన.
తనుజ పాతాళలోకమ్మునాక జనుని
ద్రోయునట్టి ప్రపాతమ్ముతో సమాన!
వనితనెడల ప్రమత్తుండు వ్యథలు చెందు.

కావున స్త్రీలను కామింపకుండ
చరియించువానికి శ్రమ ముండబోదు
కాంక్షను సుఖ మిట్టి కల్యాణగుణము
వాంఛింప దగినది వనితలతోడ
సఖ్యంబు లేకుండ చరియించు టొప్పు.

ఈప్రకారముగా మానవుడు బోధిసత్వుని చరణములమీద పడి ఆయనను స్తుతించి "భన్తే, తమవలన నా ప్రాణములు దక్కినవి. కానిచో ఈ పాపాత్మురాలి వలన విద్యాధరునివేషములో నాకు మరణము సంభవించెడిది" అని పలికెను. బోధిసత్వుడు వానికి ధర్మము బోధించి "ఈమె కేమియును అహితము చేయవలదు, శీలములు గ్రహింపుము" అని పంచశీలదీక్ష యిచ్చెను.

"ఈమెను పెట్టెమిద మోసియు రక్షణ చేయలేకపోతిని. ఇం కెవరు రక్షింపగలరు!" అని యామెను విడిచిపుచ్చి మానవు డరణ్యమునకు పోయెను.

శాస్త ఇట్లు బోధించి సత్యప్రకాశనము కావించి జాతకములను సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము ఉద్విగ్నచిత్తభిక్షువు స్రోతాపత్తి ఫలము నొందెను. ఆ కాలమున దివ్యచక్షు డగుతపస్వి నేనే.

# 437 పూతిమంస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఇంద్రియ సంయమమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకానొకప్పుడు భిక్షువులు ఇంద్రియసంయమము లేకుండిరి. ఆభిక్షువులకు ఉపదేశ మీయ దలచినవాడై శాస్త ఆనందస్థవిరునితో చెప్పి భిక్షువులను ఒకచోట చేర్పించెను. ఆవల అలంకృత మైన ఉత్తమపీఠముపై కూరుచుండి శాస్త వారలతో "భిక్షువులారా, నామరూపాత్మక మైన జగత్తును సౌందర్యదృష్టితో చూడ దగదు. ఆసమయమున భ్రష్ట స్మృతి నొందునేని నరకమున నుద్భవించును. కావున రూపాదికము సుందర మనుదృష్టితో చూడరాదు. నామరూపాదిక మగుచక్రమున భిక్షువులు పడరాదు. అట్లు పడువారు ఆజన్మమున వినాశము పొందుదురు. ఇంత కన్న భిక్షువులు వేడిలోహశలాకలతో నేత్రములను దహించుకొనుట మంచిది. విశేషించి రూపమును విలోకింప దగినసమయ మున్నది. విలోకింప దగనిసమయ మున్నది. చూచునప్పుడు మంచిదని తలపోసి, చూడక దుష్టమనియే తలపోసి చూడవలెను. ఈవిధముగా నిజక్షేత్రమును మీరిపోవ కుండవలెను. మీక్షేత్రమేది? నాలుగుస్మృత్యుపస్థానములు, ఆర్యాష్టాంగమార్గము, తొమ్మిది ఏకోత్తరధర్మములు. ఈక్షేత్రమున ఉన్నపుడు మారునకు అవకాశము లేదు. కోరికకు లోబడి సుందర దృష్టితో చూచునెడల క్రుళ్ళినమాంసమును తినునక్కవలె నిజస్థానరేఖనుండి భ్రష్టు లగుదురు" అని పలికి పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా హిమాలయ పార్శ్వమున నొకానొకయడవిలోని పర్వతగుహలో వేలకొలది గొర్రె లుండెను, అచ్చటికి కొలదిదూరములో పూతిమంసు డనునక్క వేణి యనుభార్యతో నివసించు చుండెను. ఒకనాడు నక్క భార్యతో గూడి విహరించుచు, ఉపాయమున గొర్రె మాంసము తిన నిచ్చగించెను. నక్క ప్రతిదిన మొకగొర్రెను జంపుచుండెను. ఆ

నక్కలు గొర్రెమాంసము మెక్కి మెక్కి బలిసి స్థూలములు కాజొచ్చెను. క్రమముగా గొర్రెలసంఖ్య తగ్గుచుండెను. ఏళకమాత యను తెలివి గలగొర్రెను చంప జాలక నక్క యొకనాడు భార్యతో "భద్రే, గొర్రెలు తగ్గుచున్నవి. ఏళకమాతను తినవలెను. ఇందుకు ఉపాయము నాలోచింపవలెను. నీ వొకతెవు పోయి ఉపాయముతో దానిసఖ్యము చేయుము. దానికి నీమీద నమ్మకము బాగుగా కుదిరిన తరువాత, నేను మరణావస్థలో నున్నట్లు పండుకొందును. దానికడకు నీవు పోయి నా స్వామి మృతి చెందినాడు. నే ననాథను. నీవు తప్ప నాకు బంధువులు లేరు. నీవు రావలెను. అని రోదనము చేసి అంత్యకర్మలు చేయుట కని ఏళకమాతను వెంట బెట్టుకొని రమ్ము. గొర్రె వచ్చినంతనే ఎగిరి నేను దానిగొంతు పట్టుకొని కొరికి చంపెదను." అని ఆలోచన చెప్పెను. మంచి దని వేణి గొర్రెతో మైత్రి చేసి, దానికి నమ్మకము కుదిరినపిమ్మట భర్త చెప్పినట్లు చేసెను, "సఖీ, నీభర్త నా జ్ఞాతుల నందరను సంహరించినాడు. నాకు భయమగుచున్నది. నేను రాజాలను." "సఖీ, భయము వలదు. చనిపోయినవాడు ఇతరుల నెట్లు చంపును?" "నీభర్త మాయావిగా మరణించినవాడు కాడు, నాకు భయముగానే ఉన్నది." వేణి మాటి మాటికిని పట్టు పట్టుటచే, నక్క మరణించి యుండవచ్చు నని యెంచి ఏళకమాత దానివెంట జనును, ఏ మగునో ఎవరు చెప్ప గల రని వేణిని ముందు పెట్టుకొని తాను వెనుక నడచుచు జాగరూకతతో నుండెను. కాలిసవ్వడినిబట్టి గొర్రె వచ్చినదని తెలిసి సృగాలము తల యెత్తి కన్నులు తెరచి చూచెను. ఏళకమాత గమనించి "ఈపాపి మోసగాడు. నన్ను వంచించుటకు వచ్చినట్లు పడియున్నాడు" అని తల చేసి పరుగెత్త సాగెను. అది పరుగెత్తుట చూచి సృగాలి "ఏల పరు గిడుచున్నావు?" అనెను. ప్రత్యుత్తరముగా ఏళకమాత ఈగాథ పలికెను.

నా కెవ్వియుంగూడ నచ్చనే లేదు
ఖాతిమంతుని జూడ; పోవుచున్నాను
ఆం, దానికి దూరమం దుంటమేలు.

గొర్రె ఇట్లు పలికి ఆగక నిజవాసస్థానమునకు పోయెను. వేణి దాని నాపలేక, కోపించి భర్తవద్దకు వచ్చి మొగము వాలిచి కూరుచుండెను. దానిని నిందించుచు సృగాలము రెండవగాథ పలికెను.

వెర్రిది మున్ను యీవేణి, ప్రశంస
చేయును పతితోడ చెలిక త్తెగూర్చి

మరలిపోయిన యేళమాతనుగూర్చి
బాల విచారించు చంచలచిత్త.

సృగాలి మూడవగాథ పలికెను :

ఓయి స్వామీ, నీవు నున్మత్తబుద్ధి
వవిచక్షణుండవు నవిమలమతివి
మరణమ్ము చెందినమాడ్కి నుండియును
అక్షులు తెరచితి వసమయంబునను.

ఇది అభిసంబుద్ధగాథ :

సమయాన చూచుట సముచిత మగును
తరుణమ్ము చూచుట తగు పండితునకు
అసమయమ్మున జూచు నతడు మిగుల
పూతిమంసునివలె పొందు వంచనము.

"స్వామీ, చింతింపకుము. ఏదో ఉపాయమున నరల దాని నిటకు గొని వత్తును. నీవు జాగరూకతతో పట్టుకొనవలెను," అని సృగాలి భర్త నూరడించెను. ఆవల వేణి ఏళికమాతకడకు బోయి "ఏళీ, నీవు వచ్చుటచే మాకు మేలయ్యెను. నీవు వచ్చినప్పటికి నాభర్తకు ఊపిరి వచ్చెను. ఇప్పుడాయన జీవించి యున్నాడు. రా, ఆయనతో సంభాషింతువు గాని" అని అయిదవగాథ పలికెను.

నా కీయవలయును నాపయి ప్రీతి
పూర్ణపాత్రను; ప్రియప్రచ్ఛికారమ్ము
ప్రాణాలతోడ నాభర్త యున్నాడు.

ఏళిమాత తనలో "ఈ పాపాత్ములాలు నన్ను వంచింప నెంచుచున్నది. దీనితో విరోధించుట మంచిది కాదు. యుక్తి చేసి మోసగింపవలెను" అనుకొని ఆరవగాథ పలికెను :

అగుగాక ప్రియము నీ! కాళి యిచ్చెదను
పరిపూర్ణపాత్రంబు: బహుపరివార
సహితంబుగా వత్తు- చక్కనివిందు
సమకూర్ప వలయును సంతసమ్మునను.

అనుయాయులను గూర్చి ప్రశ్నించుచున్నదై వేణి యేడవగాథ పలికెను :

ఎట్టిది పరివార మే విందుచేయ
వలసినయది? నీవు వారి నామములు
విడివిడిగా దెల్పు, వేడెద నిన్ను!

పేశకమాత ఎనిమిదవగాథ పలికెను :

**చతురక్ష, పింగియ. జంబుక, మాలి,**
అనువారు పరివారమందు శ్వానములు
వారికి చేయగావలయును విందు.

ఒక్కొక్క కుక్కవెంట అయిదువందల కుక్కలుండును. ఈవిధముగా మొత్తము రెండువేల శునకములతో వత్తును. వారికి మీరు భోజనము పెట్టజాలరేని అవి మిమ్మే భక్షించును.''

విని వేణి భయపడి "ఇది లేకుండుటే మేలు. ఇది లేకుండ నుపాయము చూడవలెను." అని తలచి తొమ్మిదవగాథ పలికెను.

విడువకు మాయిల్లు విడుచుపక్షమున
అంతరింపగవచ్చు నఖిలభాండార
మిచటనే యుండుమా, ఎటకు బోవలదు
తెలుపుము నీదుసందేశంబు పతికి.

సృగాలి ఇట్లు పలికి మరణభయముచే పరుగెత్తి, స్వామికడ కేగి, దానితో గూడి యెచటికో పారిపోయెను. మరల నెన్నడును నక్క అచటికి రాలేదు.

శాస్త యి ట్లుపదేశించి, జాతకమును సరిపోల్చెను. ఆకాలమున నచటి వనములో జ్యేష్ఠ (అగ్ర) వృక్షమున నుత్పన్నమైనదేవత నేనే.

——— o

# 438. తిత్తిర జాతకము

శాస్త గృధ్రకూటమున విహారము చేయుచు వధప్రయత్నమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆసమయమున ధర్మసభలలో ఇష్టాగోష్ఠి జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, దేవదత్తుడు సిగ్గుమాలినవాడు. అనార్యుడు, అజాతశత్రువుతో గూడి, ఉత్తమగుణవంతుడైన సమ్యక్సంబుద్ధుని ధనుర్బాణములతో కొట్టించుట, రాయి రువ్వించుట, మత్తగజము నడగిరిని మీదికి త్రోలించుట మొదలగు మారణయత్నములు చేయించెను." అనుచుండిరి. ఇంతలో శాస్త అచటికి చనుదేరి "భిక్షువులారా, ఏమి చేయుచున్నారు?" అని అడుగ వారు విషయము వివరించిరి. అంతట శాస్త, "భిక్షువులారా, దేవదత్తుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ నన్ను వధింప ప్రయత్నము చేసినాడు. రాపన్యాయము బెదరింపనైన బెదరింప లేకపోయినాడు." అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ ఒక ప్రసిద్ధాచార్యునికడ 500 మంది విద్యార్థులు విద్యలు నేర్చుచుండిరి. ఒకనాడాయన "ఇచట నుండుటవలన సౌకర్యము లేదు. విద్యార్థుల యధ్యయనము కూడ సమాప్తి నొందలేదు. హిమాలయ ప్రదేశమున వనములో నివసించుచు వీరికి విద్యలు నేర్పుదును," అని తలచి, వారితో జెప్పి తిలతండులాదులు తీసికొని అరణ్యమున ప్రవేశించి, మార్గముప్రక్కన పర్ణశాల నిర్మించి అందునివసింప జొచ్చెను. విద్యార్థులు కూడ పర్ణశాలలు నిర్మించుకొనిరి. వారియభిమానులు తండులాదులు పంపుచుండిరి. "అరణ్యములో ఆ ప్రదేశమున ప్రసిద్ధాచార్యుడు విద్యార్థులకు చదువు చెప్పుచున్నాడు," అని దేశవాసులు బియ్యము మొదలగునవి పంపుచుండిరి. వారికి పాలకై యొకరు దూడతోగూడ ఆవును పంపిరి. ఆచార్యుని పర్ణశాల ప్రక్కన తన యిరువురుబిడ్డలతో ఉడుము నివసించుచుండెను. సింహవ్యాఘ్రములు కూడ ఆయనను సేవించుటకై వచ్చుచుండెను. ఒకానొక తిత్తిరిపిట్ట నికటశాఖపై నివసించుచు ఆచార్యుడు విద్యార్థుల కధ్యాపనము చేయునప్పుడు

వినుచు మూడువేదములను గ్రహించెను. విద్యార్థులకును తిత్తిరికిని గాఢమైత్రి యేర్పడెను. విద్యలు పూర్తిచేయకుండనే ఆచార్యుడు మృతి నొందెను. ఆయన కళేబరమున కగ్నిసంస్కారము చేసి వాలుకాస్తూపము నిర్మించి పుష్పములతో పూజించి విద్యార్థులు దుఃఖించిరి. ఏల దుఃఖించుచున్నారని వారిని తిత్తిరి యడిగెను. ఆచార్య డధ్యాపనము మధ్యమముననే మమ్ము విడిచి పోయినాడు. కావున విచారించుచున్నాము." "అట్లయినచో దుఃఖింపకుడు. నేను విద్యలు నేర్పుదును." "నీ కెట్లు విద్య లలవడినవి?" "ఆచార్యుడు మీకు చెప్పునప్పుడు నేను విని మూడువేదములను అభ్యసించినాను." "అయినచో నీశక్తిని ప్రకటింపుము." "వినుడు" అని తిత్తిరి కఠినభాగములను పర్వతమునుండి యేరు ప్రవహించురీతిని వినిపించెను. వారు సంతుష్టచిత్తులై తిత్తిరిపండితునికడ వేదాభ్యాసము చేయసాగిరి. తిత్తిరి ప్రధానాచార్యుని స్థానము నాక్రమించి వారికి సమస్తవిద్యలు నేర్పుచుండెను. తిత్తిరిపండితునకై వారు సువర్ణపంజరము నిర్మించి దానిపై వితానము గట్టి మధువు మొదలగునవి తెచ్చి నానావిధపుష్పములతో పూజించి సత్కారించుచుండిరి. అరణ్యములో తిత్తిరి 500 విద్యార్థులకు చదువులు చెప్పుచుండె ననువార్త జంబూద్వీపమున వ్యాపించెను.

ఆ కాలమున జంబూద్వీపమున గిరాగ్రఉత్సవముతో సమాన మైనమహోత్సవము ప్రకటిత మయ్యెను. చూడ రం డని మాణవకులకు వారితలిదండ్రులు వార్త పంపిరి. వారు తిత్తిరిపండితునితోను, ఉడుముతోను చెప్పి తమతమప్రదేశములకు పోయిరి. నిర్గ్రంథుడైన దుష్టతాపసు డొకడు దేశమున తిరుగుచు ఆ ప్రదేశము చేరెను. ఉడుము (గోధ) వానిని చూచి ప్రత్యుత్థానము చేసి "అచట బియ్యమున్నవి. ఇచట తిలలున్నవి. అన్నము వండుకొని తినుము" అని చెప్పి ఆహారార్థము వెడలిపోయెను. వాడు ప్రాతఃకాలముననే ఉడుముబిడ్డలను చంపి, మాంసము వండెను. మధ్యాహ్నము తిత్తిరపండితుని వత్సకమును వధించి భక్షించెను. సాయంకాలము ధేనువు వచ్చుట చూచి దానిని చంపి, మాంసము తిని గుర్రుపెట్టుచు చెట్టుక్రింద నిద్రించెను. ఉడుము సాయంకాల మింటికి వచ్చి బిడ్డలను గానక విచారముతో తిరగజొచ్చెను. దానిని చూచి వృక్షదేవత స్కంధవరమున నిజప్రభావముతో నిలిచి దానితో సంభాషించుచు "విచారింపకుము. ఈ పాపాత్ముడు నీబిడ్డలను, తిత్తిరపండితుని, దూడను, గోవును వధించినాడు. వీనికంఠమును కొరుకుము. వీనిని నుద మొట్టింపుము." అని తాలిగోధ పలికెను.

ఎవనికి తండులా లిచ్చితో వాడె
నీబిడ్డలను పొట్ట నింపుకొన్నాడు

వానిని కాటేయ వలయును, నిన్ను
బ్రదుకనీయడు తాను బ్రదికియుండంగ !

అంతట గోధ రెండు గాథలు పలికెను :

మంత్రసాధుల చీరెమాడ్కిని మలిను
డెంతయు లోభాత్ము డీకృతఘ్నుండు
కాటు వేయగ వీనిగాత్రాన శుభ్ర
భాగ మేమియు కానబడ దింతకైన.
ఈలాటి దోషైకదృక్కున కెల్ల
భూమి యొసంగిన బొందడు తృప్తి.

గోధ యిట్లు పలికి "వీడు లేచి నన్ను గూడ ఎప్పుడో చంపి తినగల" డని తలపోసి, ప్రాణములు రక్షించుకొనుటకై పారిపోయెను.

మిత్రము లగుటచే సింహ వ్యాఘ్రములు తిత్తిరపండితుని చూచుటకై అప్పు డప్పుడు వచ్చుచుండెడివి. తిత్తిరపండితు డప్పుడప్పుడు పోయి వానికి ధర్మోప దేశము చేయుచుండును. ఒకనాడు సింహము వ్యాఘ్రముతో "మిత్రమా, మనము తిత్తిరపండితుని చూచి సప్తాహ మయినది. నీవు పోయి వార్త కనుగొని రమ్ము" అనెను. మంచి దని వ్యాఘ్రము బయలుదేరి, ఉడుము పరుగెత్తు సమయమున కచట చేరి నిద్రించుచున్న దుర్మార్గుని చూచెను. వానిజడలలో తిత్తిరపండితుని రోమములు, తక్కినవాని యెముకలు కనబడెను, వ్యాఘ్రరాజ మది చూచి అను దినము నివసించుచుండు బంగరుపంజరమున తిత్తిరపండితుని కానక, ఆ పాపా త్ముడే వానిని భక్షించియుండు నని తలచి పాదముతో తన్ని లేపెను. భయభ్రాంతు డైన వానితో పులి "నీవు వీని నన్నిటిని చంపితివి" అనెను, "నేను చంపలేదు, తిన లేదు," అని వా డనెను. "పాపచారీ, నీవు చంపనిచో నెవరు చంపిరి ? చెప్పవేని నీ ప్రాణములు దక్కవు !" అని వ్యాఘ్రము బెదిరింపగా వాడు మరణభీతుడై "స్వామీ, అవును. గోధకపోతములను, వత్సక ధేనువులను వధించి భక్షించితిని. తిత్తిరినిమాత్రము చంపలేదు," అని యెంత చెప్పినను నమ్మక "నీ వెచటనుండి వచ్చితివి ?" అని పులి ప్రశ్నించెను. "స్వామీ, కళింగరాష్ట్రమున వర్తకుల సర కులు మోయుచు జీవనార్థ మీయా పనులు చేయుచు ఇచ్చటికి వచ్చితిని." అని సమస్తము వాడు వివరించెను. పులి బెదరించి వానిని సింహముకడకు గొనిపోయి

“నేను తిత్తిరిని వధింపకున్నచో మరి యెవరు వధింతురు?” అనెను. వారిని చూచి సింహము ప్రశ్నించునదై నాలుగవగాధ పలికెను.

ఈనాకోపకుతోదనేల సుబాహూ
పనుచేంచియంత విప్పటికి వేగముగ ?

చెప్పుము పని యేమొ శీఘ్రమ్ముగాను.

విని వ్యాఘ్ర మయిదవగాధ పలికెను.

సఖుడైన తిత్తిరి బా వీడిన
శంకింపుచున్నా నసత్కార్యమ్మ దైన
వినియున్నవాని గూర్చి విని తిత్తిరికిని
పథము లే దని మనఃక్షోభ కల్గినది.

అంతట సింహ మారవగాధ పలికెను.

జీవికకై వీడు చేసినపనులు
ఇతనివాసస్థాన మెచటనో చెప్పుము.
తిత్తిరిమృత్యుసందేహంబు నీకు
కలుగ నీ దేనైన పలికినా వాక్కొ ?

ప్రశ్నకు సమాధానముగా వ్యాఘ్రరాజము శేషించిన గాధలు పలికెను;

తిరిగెను చిల్లరసరుకు లమ్మినను
కాశింగమున వీడు కర్ర చే పట్టి
తిరిగెను గహనప్రదేశంబులందు,

సంచరించెను నటజనులను గూడి;
సంబరంబుల కర్రసాములు చేసి:
పులుగులం బట్టెను కాలిచె ధ్యానంబు
ద్రోణంబు చే పట్టె; ద్యూతంబు లాడె,

మీరెను నియమాల మేరను గూడ;
తనువున గాయంబు తగులగా కాపె
రే క్షపించువు లర్ధరాత్రంబు నందు;
కరదీపకశంబును కాల్చుకొన్నాడు

వీ డారగించుచు వేడియన్నంబు,
జీవికకై ఇన్ని చేసినా డితడు :
రాతనిజటలలో రాకలు కలవు.
చచ్చియున్నది గోవు సందేహమేల ?

సింహ మాపురుషునితో "నీవు తిత్తిరపండితుని సంహరించితివా ?" అనెను. "చిత్తము స్వామీ !" అని వాడు పలికెను. వాడు సత్యము పలుకుటచే సింహము వానిని విడిచిపెట్ట గోరెను. కాని వ్యాఘ్రరాజము "రాపాపి వధార్హుడు" అని తోడనే వానిని కోరలతో చీల్చి, గుంటలోనికి విసరివేసెను.

మాణవకులు మరలివచ్చి తిత్తిరపండితుని కానక దుఃఖించి వెడలిపోయిరి.

శాస్త ఇట్లు బోధచేసి "భిక్షువులారా, రాప్రకారము దేవదత్తుడు పూర్వము కూడ నన్ను వధించుటకై ప్రయత్నము చేసినాడు" అని జాతకములు సరిపోల్చెను. ఆకాలమున జడదారి దేవదత్తుడు, ఉడుము కృష్ణాగౌతమి, వ్యాఘ్రము మౌద్గల్యాయనుడు; సింహము సారిపుత్రుడు, ప్రసిద్ధాచార్యుడు కాశ్యపుడు; తిత్తిరపండితుడు నేనే."

—o—

# 439 చతుర్ద్వార జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా మాట వినని ఒకానొక భిక్షువును గూర్చి చెప్పినకథ.

## వర్తమాన కథ

ఈకథ నవనిపాతములోని ప్రథమకథలో విస్తృతిపూర్వకముగా వచ్చినది. ఈకథలో శాస్త ఆభిక్షువుతో "భిక్షువూ, నీవు నిజముగా మాట విననివాడవా ?" అనెను. "భన్తే, నిజమే" అని అత డన్నపిదప శాస్త "భిక్షువూ, పూర్వముకూడ నీవు చెప్పినమాట విననివాడ వగుటచే ఖురచక్రమువలన బాధ నొందితివి" అని పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున కాశ్యపబుద్ధుని సమయమున వారాణసిలో ఎనుబదికోట్ల ధనమున కధిపతి యగు శ్రేష్ఠికి మిత్రవిందు డను పుత్రు డుండెను. అతని తల్లిదండ్రులు స్రోతాపన్నులు. కాని అతడు దుశ్శీలుడు, శ్రద్ధారహితుడు. కొంతకాలమునకు అతనితండ్రి మృతి చెందగా తల్లి కుటుంబమును నిర్వహించుచున్నదై "నాయనా, దుర్లభ మగు మానవత్వము నీకు లభించినది. దానము చేయుము; సదాచారమును పాటింపుము. ఉపోసథధర్మ మాచరింపుము. ధర్మము నాకర్ణింపుము," అని చెప్పెను.

"అమ్మా! ధర్మముతో నాకు ప్రయోజనము లేదు. నా కేమియును చెప్పవలదు. నేను కర్మమునుబట్టి పరలోకమునకు పోవుదును," అని అతడు పలికినను తల్లి ఒకానొక పూర్ణిమనాడు అతనితో "నాయనా, నేడు గొప్ప ఉపోసథ వాసరము. ఈనాడు నీవు ఉపోసథవ్రత మాచరించి, విహారమునకు జని, రేయి అంతయు ధర్మప్రసంగము విని రమ్ము. నీకు వేయినాణెము లిచ్చెదను," అని చెప్పెను.

అతడు ధనలోభముచే ఉపోసథవ్రతము నాచరించి, ప్రాతఃకాల భోజనము చేసి విహారమును చేరి, పగ లంతయు అచట నుండి ఒక్క ధర్మవాక్యముకూడ

చెవిలో పడకుండుఆవున విశ్రమించెను. అచట నాతడు నిద్రపోయి మరునాడుదయమున లేచి దంతధావనాదులు చేసి కూర్చుండెను. ఇంటికడ తల్లి "నేడు నా పుత్రుడు ధర్మములు విని, ధర్మోపదేశికు లగు స్థవిరులను వెంటగొని వచ్చును" అని తలపోసి యవాగు పానీయము ఖాద్యభోజ్యములను సిద్ధముచేసి, చిత్రాసనము పరిచి ఎదురు చూచుచుండెను. కుమారుడు ఒంటరిగా వచ్చుట చూచి "నాయనా! ధర్మకథకుని ఏల వెంటగొని రాలేదు ?" అని తల్లి అనెను,

"ఆతనితో నాకేమియు పనిలేదు."

"అట్లయిన యవాగు త్రాగుము."

"నీవు నాకు వేయినాణెము లిత్తు నంటివి. వానినిమ్ము. పిదప యవాగు త్రాగెదను."

"నాయనా, పానీయము పుచ్చుకొమ్ము. ఆవల నాణెములు లభింపగలవు."

"ముందు నాణెములు లభించినచో పిదప పానీయము పుచ్చుకొందును."

తల్లి వేయినాణెముల సంచిని ఆతని యెదుట పెట్టెను, ఆతడు పానీయము త్రాగి, సంచి పుచ్చుకొని వ్యాపారము చేసి, త్వరలోనే లక్షలు గణించి, ఓడ వ్యాపారము చేయుదు ననుకొని, నౌక సిద్ధము చేసి, తల్లితో ఈ విషయము చెప్పగా "నాయనా, నీవు నా కొక్కడవే కుమారుడవు. మనయింట ధనము విశేషముగా ఉన్నది, సముద్రయానమున ఎన్నో కష్టములు దాపురించును. పోవలదు" అని నివారించెను.

"నేను పోవక తప్పదు. నన్నడ్డగింప లేవు." అతని చేయి పట్టుకొని "నిన్ను పోవనీయ" ననుచుండు తల్లి చేయి నెట్టి ఆమెను పడద్రోసెను. ఆవల మిత్రవిందకుడు నౌకాయానమున సముద్రమున ప్రవేశించెను. ఏడవనాడు ఆతని కర్మఫలమునుబట్టి నావ సముద్రమున కదలలేదు. నష్టదాయకు నన్వేషించు శలాక ముమ్మారు త్రిప్పినను అది మిత్రవిందకునే సూచించెను.

ఒక్కనివలన అనేకులకు నష్టము రాగూడ దని తలచి నావికులు వానిని పలకపై కట్టి సముద్రమున విడిచిరి.

తోడనే నౌకలు సముద్రమున వేగముగా పోవసాగినవి.

వాడు నీట మునుగుచు, తేలుచు క్రమముగా ఒకానొక దీవి చేరెను. అచట స్ఫటికవిమానమున నలువురు ప్రేతలు కానబడిరి. వారు ఒకవారము దుఃఖ మనుభవించుచు వేరొకవారము సుఖము ననుభవించుచుండిరి. అతడు వారితో దివ్యానందము చూరగొనెను. వారు దుఃఖ మనుభవింపబోవు సమయమున "స్వామీ! మేము ఏడుదినములలో తిరిగి వత్తుము. మేము వచ్చువరకును ఉద్విగ్నచిత్తుడవు కాక ఇచటనే యుండవలయును" అని చెప్పిరి. వాడు అశచే పలకపై నెక్కి సముద్రమున పయనము చేయుచు ఒకానొక ద్వీపము చేరెను. అచట రజతవిమానమున అష్టప్రేతలను గాంచెను. ఈవిధముగనే ఆవలిద్వీపమున మణివిమానమున పదునాలుగురును, వేరొక స్వర్ణవిమానమున ముప్పదియిరువురు ప్రేతలను గాంచి వారితో దివ్యానందము పొంది, వారు దుఃఖ మనుభవింప బోయినపిదప, అతడు సముద్రమున పయనించి నాలుగు ప్రక్కల నాలుగు ద్వారములు కల నగరమును కనుగొనెను. అది ఉస్సదనరకము. అందు యాతనాశరీరులు తమతమ కర్మను నిరంతరముగా ఫల మనుభవింపవలయును. మిత్రవిందకుడు అలంకృత మైన నగరమును చూచెను. అందు ప్రవేశించినతోడనే ప్రభువు నగుదు నని యోచించి అత డందు ప్రవేశించెను. అచట వక్షఃచక్రమును దాల్చి మంటలలో ఉరుకుచున్న నరకవాసులను వీక్షించెను. వారి రొమ్ములపై ఐదుదశముల బంధనములు అలంకారరూపమున గానవచ్చెను. శరీరములనుండి కారుచున్న రక్తచందన విలేపనములతో ఏడ్చి మొత్తుకొనుచున్న ధ్వనులు మధురగీతములవలె నుండెను. అతడు వారి కడకుబోయి "ఓయి పురుషులారా! ఈపద్మమును మీరు చాలతడవులనుండి ధరించి యున్నారు. ఇక నాకిండు," అని పలికెను.

"మిత్రమా! ఇది పద్మముకాదు, క్షురచక్రము."

"నీవు దాయదలపక ఇట్లనుచున్నావు." నరకవాసి తనలో "నాకర్మము క్షీణించి ఉండవచ్చును. ఇతడు నావలెనే తల్లిని కొట్టి వచ్చియుండవచ్చును. వీనికి క్షురచక్ర మిచ్చెదను," అనుకొని "ఓయీ! రమ్ము, పద్మమును కొనుము" అని వాని శిరముపై క్షురచక్రము తగిల్చెను.

అప్పుడు మిత్రవిందకునకు అయ్యది క్షురచక్ర మని తెలిసెను. అతడు బాధతో కేకలు వేయ నారంభించెను. క్షురచక్రమును ధరించినంతనే ఆవలివా డంతర్ధాన మయ్యెను. బోధిసత్వుడు చాలామంది అనుయాయులతో ప్రచారము చేయుచువాడై ఆసమయమున నచ్చటకు వచ్చెను. వారిని చూచి మిత్రవిందకుడు

"దేవరాజా ! ఈచక్రము నువ్వుగింజలను గాను గాడినట్లు బాధ పెట్టుచున్నది. నే నేమి పాపకర్మము చేసితినో ? అని రాగాథలు పలికెను.

నాలు గినుపకవాటముల్ నాలు గినుప
గట్టికుడ్యాలతో గొట్టినట్టి నగర !
మిందు తిరుగాడుచున్నాడ; నేల పాప
కార్యము లొనర్చినాడనో: కాని అన్ని
వాకిళులు బద్ధములు; పక్షివలెను చిక్కు
కొన్నవాడను దీనిలో; నన్ను చక్ర
మేమి యపరాధమున బెదరించు యక్ష !

దానికి కారణము తెలుపువాడై దేవరాజు రాగాథలు పలికెను ;

హేసౌమ్య. పొందియు నిరువదిలక్ష,
లా ప్తబంధువులు దయాళువు లెంత
చెప్పినన్ విన కల్పసిద్ధికై యబ్ధి
యందు దూకినవాడ; వచ్చట నాల్గు
నుండి యెన్మిది, దానినుండి పదారు,
ప్రాప్తించె నవల ముప్పదిరెండు నీకు.

ఈవిధంబుగ కోర్కి పెచ్చినకాలది
చక్రంబు క్రమముగా సంప్రాప్త మయ్యె

అశాప్రకాశితు డైన మానవుని
శిరముపై చక్రంబు తిరుగుచునుండు.

ఉత్తరోత్తర వృద్ధి నొంది పూర్ణంబు
కానితృష్ణకు వశగాము లౌవారు
చక్రంబు ధరియింత్రు; నరకు లెన్నైనాప్రి
విడనాడి మార్గవివేకంబు లేక
ఆత్మీయగేహంబు త్యజియించినావు.

చరియింతు రెవరు విచారమ్ము లేక
ఇట్లు చక్రంబు ధరియింతురు తలను.

తనచేయుకార్యముల్ తత్ఫలితంబు
లాలోచనము చేయ నగును మెండుగను.

కోర్కిని సేవింపగూడ దనర్థ
మిచ్చు; కృపాళుల హితవచనాల
ననుసరింపం దగు; నటు చేయునట్టి
జనునకు గలుగదు చక్రభయంబు.

విని మిత్రవిందకుడు తనలో "నేను చేసినపను లీదేవపుత్రుడు యథార్థముగా గ్రహించినాడు. నేను నరకబాధలో నుండునవధి కూడ గ్రహించియుండును" అనుకొని యీగాథ పలికెను :

"హే యక్ష! యీచక్ర మెంతకాలంబు
శిరముపై నుండునో చెప్పుమీ యింక
విడువక యుండును వేయేండ్లుకూడ ?"

"ఇట మిత్రవింద! నీ వెంతకాలంబు
వసియింతువో చెప్ప వశము కాదోయి !
ఉత్తమాంగముమీద నున్నచక్రంబు
విడువదు నీవు జీవించియుండంగ."

ఇట్లు పలికి దేవపుత్రుడు నిజనివాసమునకు చనెను. రెండవవాడు కూడ మహాయాతన అనుభవించెను.

శాస్తయిట్లు ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున మిత్రవిందకుడు తల్లిమాట విననివాడు. దేవరాజు నేనే !

## 440 కణ్హ జాతకము

శాస్త కపిలవస్తు సమీపమున న్యగ్రోధారామమున విహరించుచుండగా నవ్వును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శాస్త న్యగ్రోధారామమున సాయంకాలము భిక్షువులతో గూడి పచారుచేయుచు ఒకచో నవ్వెను. "భగవాన్ హాసము చేయుటకు కారణ మేమై యుండును ? తథాగతుడు అకారణముగా మందహాసము చేయడు. అడుగుదును గాక," అని ఆనంద స్థవిరుడు యోచించి చేతులు జోడించి హాసమునకు కారణ మడిగెను. "ఆనందా ! ఇచ్చట పూర్వకాలమున కృష్ణు డను ఋషి యుండెను. ఆయన శీలతేజముచే శక్ర భవనము కంపించెను. "అని శాస్త ఆకథను స్థవిరుని ప్రార్థనపై ప్రకటీకరించెను.

### అతీతకథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండ ఎనుబదికోట్ల ధనమున కధిపతియై అపుత్రకు డైన బ్రాహ్మణు డుండెను. అతడు శీల గ్రహణము చేసి పుత్రార్థియై ప్రార్థన చేయగా బోధిసత్త్వుడు బ్రాహ్మణి కడుపున పుట్టెను. నామకరణమునాడు బిడ్డనికి "కృష్ణకుమారు" డని పేరు పెట్టిరి. పదునా రేండ్లు వచ్చునప్పటి కాతడు మణిప్రతిమవలె మనోహరముగా నుండెను. విద్యా గ్రహణార్థము కుమారుని తండ్రి తక్షశిలకు పంపగా, పుత్రుడు అన్నివిద్యలు నేర్చు కొని మరలివచ్చెను. తండ్రి అతనికి తగిన కన్య నిప్పించి వివాహము చేసెను. కాలక్రమమున ఆతడు తలిదండ్రులసంపద నంతను పొందెను.

ఒకనా డతడు రత్నభండారము కనుగొని మంచముపై కూరుచుండి బంగరు వస్తువుల పట్టిక తెప్పించెను. అందు ఆతని పూర్వపురుషులు లిఖించిన అక్షరములు ఫలానివారు ఇంతధనము సంపాదించిరి అని యుండెను. చూచి బోధిసత్త్వుడు తనలో "ఇంతధనము సంపాదించినవారు ఎవరును కానరారు. ధనముమాత్రము కానవచ్చుచున్నది. ఒకరుకూడ ఈధనమును పరలోకమునకు కొనిపోవరు. పంచ

విభగతులకై అపారమైన ధనమును దానముచేయుటయే సారము. బహురోగములకు నిలయమగు నిస్సారశరీరము శీలవంతులగువారికి ప్రణామము చేయుటకు వినియోగించుటయే సారము. అనిత్యాదిభూత మగు నిస్సారజీవితమునకు అనిత్యాదికమును గూర్చి విపశ్యనాభావన చేయుటయే సారము. కావున అసారభోగములనుండి సారము గ్రహించుటకై దానము లిత్తును'' అనుకొని పీఠమునుండి లేచి రాజసన్నిధికేగి ఆయననుమతి వడసి మహాదానములు చేసెను. ఏడురోజులకుగూడ ధనము నిశ్శేషము కాకుండుట చూచి అతడు "నాకు ధనముతో నేమి పని ? [illegible] అనేకపూర్వమే ప్రవ్రజించి అభిజ్ఞలను సమాపత్తులను పొంది బ్రహ్మలోకపరాయణుడ నయ్యెదను.'' అనుకొని ద్వారము తెరచి, కావలసినవి పుచ్చుకొని పొండు అని చాటింపించెను. ఆవల సమస్తము త్యజించి లోకులు నెత్తి మొత్తుకొని యేడ్చుచుండగా అతడు నగరము వెలువడి హిమాలయము ప్రవేశించెను. ఋషులవలె ప్రవ్రజించి తాను నివసించుటకై రమణీయ భూభాగమును వెదకుచు ఇచ్చట నుండుదు నని ఒకచో నిర్ణయించుకొనెను. ఇంద్రయవారిణీవృత్తము గల గ్రామమును ఆశ్రయించుదు నని ఆయన ఒకానొక చెట్టుమొదట నివసింపజొచ్చెను. క్రమముగా గ్రామమును విడిచి అరణ్యవాసియై, పర్ణశాల నిర్మింపక, వృక్షమూలమున నివసించుచుండెను. ఇచ్చ వచ్చినప్పుడు ఆకాశవీథిలో విహరించుచు, కూర్చుండుచు. ఒక్కొక్కప్పుడు నేలమీద పండుకొనుచుండువాడు.

నిప్పులో కాల్చిన వస్తువునే తినెడివాడు. దినమున కొకమారే భోజనము చేయుచుండెడివాడు. ఆసనమునపై ఒంటిగా నుండెడివాడు. ఓర్పుతో సమస్తవ్రతములను ఆచరించుచు, ఈలోకమున బోధిసత్త్వుడై అల్పేచ్ఛుడై కొలదికాలములోనే అభిజ్ఞాసమాపత్తులను పొంది, ధ్యానక్రీడాసక్తుడై అచటనే నివసింపజొచ్చెను. కందమూలఫలములకై అన్యప్రదేశమునకు పోయెడివాడు కాడు. వృక్షమునుండి పండ్లు రాలినచో తినుచు, ఆకులు రాలినచో వానినే తినుచు, ఆకులు లేనప్పుడు బెరడు తినుచుండెడివాడు. ఈప్రకారముగా బహుకాలము అచట సంతుష్టితో వసించుచుండెను. ఇదే కాలమున ఆచెట్టుపండ్లు తినుచుండగా లోభప్రేరితుడై వేరొక చోటికి పోయి, అచ్చటిపండ్లు తినెడివాడు కాడు. కూర్చుండియే చేయి చాపినంతనే లభించుపండ్లనే గుర్తుకార్చి అందు పండ్లను గాలింపక చేతికి వచ్చినవి తినెడివాడు. ఆయన ఈప్రకారముగా, శీలముతో, తేజముతో, నుండగా శక్రునిసింహాసనము వేడి యెక్కెను, ప్రాణి పీఠమును వాంఛించినప్పుడు వేడెక్కును. ఇంద్రుడు

ధ్యానబలముతో తన్ను పడదోయదలచినవా డెవడా యని యోచించి, అరణ్యమున ఘోరతపస్సు చేయు కృష్ణఋషిని పండ్లు తినుచున్నవానిని గమనించెను. నేను ధర్మకథ గంభీరముగా పలికి, ఈవృక్షమును నిత్యము ఫలప్రదానము చేయుదానిని కావింతుననుకొని మహాద్వైభవముతో త్వరితముగా, భూమిపై కవతరించి, ఆచెట్టు వెనుక నిల్చి, ఈఋషి నిజనింద ఆలించినచో కుపితు డగునోకాడో పరీక్షింపదలచి ఈగాధ పలికెను.

> వీడు నల్లనివాడు, వీనిభోజనము
> నల్లగా నుండును, నల్లని నేల
> నే వసియించు, నా కిది నచ్చలేదు.

కృష్ణముని దివ్యనేత్రముతో చూచి నాతో సంభాషించువా డెవ డని పరికించి శక్రు డని గ్రహించి లేవక అయనవైపుచూడక ఈగాధ పలికెను.

> తలపకు నలు పని త్వఙ్మాత్రముననె;
> అంతరంగము నిర్మలమైన బ్రాహ్మణుడు;
> ఓసురపతీ! చేయు నెవ్వాడు పాప
> కృత్యంబు లవ్వాడె కృష్ణవర్ణుండు.

ఇట్లు పలికి ఈప్రాణులకు మృత్యువు సమకూర్చు పాపకర్మవిశేషమును విస్తరించు సమస్తపాపకర్మములను నిందించి శీలములను ప్రశంసించి, ఆకసమున చంద్రునివలె వెలుగుచు, శక్రునకు ధర్మోపదేశము చేసెను. శక్రుడు ధర్మకథ నాలకించి, సంతుష్టచిత్తుడై బోధిసత్త్వునకు వరమిచ్చువాడై ఈగాధ పలికెను :

> నీసుభాషితముల నీమనోహారి
> వాక్కుల కలరి నే వర మిచ్చువాడ
> అడుగుము బ్రాహ్మణా అభిలషితంబు.

విని బోధిసత్త్వుడు తనలో ''నిజనింద విని నేను కుపితుడ నగుదునో కానో అని ఈయన పరీక్ష చేయుచున్న ట్లున్నది. తొలుత నాకృష్ణాజినమును, భోజనమును, నివాసస్థానమును నిందించి నేను క్రుద్ధుడను కాకుండుట గమనించి శక్రుడు ప్రసన్నుడై వర మిచ్చిన ట్లున్నాడు. నేను శక్రునిసంపదగాని, బ్రహ్మైశ్వర్యముగాని కోరుచున్నా నేమో యని భావించియుండనోపును. కావున ఈసంశయము తొలగించుటకై నేను నాలుగువరములు వేడవలసియున్నది. నాకు నెవరి

ఉద్భూతమగు యానినుండి ఆపంబు
నచ్చదు స్నేహంబు నా కందువలన.

ప్రశ్నోత్తరములు విని శక్రుడు "కృష్ణపండితోత్తమా ! నీవు ఈ ప్రశ్నముల కిచ్చినసమాధానములు బుద్ధభగవానుడే ఇచ్చినంత మేలుగా నున్నవి. నీయెడ నేను మిగుల ప్రసన్నుడ నైతిని. ఇంకను వరము వేడుము." అనుచు ఈగాథ పలికెను:

నీసుభాషితముల నీమనోహారి
వాక్కుల కలరి నే వర మిచ్చువాడ
అడుగుము బ్రాహ్మణా, అభిలషితంబు.

అంతట బోధిసత్త్వుడు ఈగాథ పలికెను :

సర్వభూతేశ్వరా, శక్ర. వరమ్ము
దయచేయుదేని యిద్దాని నొసంగు;
మాయరణ్యమునందు నేకాకిగాను
నిత్యవిహారంబు నెరపుచు రోగ
బాధ లేకుండంగ బ్రదుకుదు గాక !

విని శక్రుడు తనలో "కృష్ణపండితుడు సంసారసంబంధ మగు విషయములను కోరుట లేదు. తపస్సంబంధ మగువిషయములనే కోరుచున్నాడు" అనుకొని మరింత ప్రసన్నచిత్తుడై మరియొకవర మీయదలచి ఈగాథ పలికెను :

నీసుభాషితముల నీమనోహారి
వాక్కుల కలరి నే వర మిచ్చువాడ
అడుగును బ్రాహ్మణా, అభిలషితంబు.

బోధిసత్త్వుడు వర గ్రహణానంతరము ధర్మోపదేశము చేయుచు ఈగాథ పలికెను :

సర్వభూతేశ్వరా, శక్ర, వరమ్ము
ఒసగుచో నావల్ల ఒకరికిగూడ
మనసునందైనను తనువుననైన
కలుగరాదేలాటి కష్ట మెన్నండు
ఏను వేడెడి వర మిదె దేవరాజ !

బోధిసత్త్వుడు ఆరుసార్లు వరము వేడినను త్యాగసంబంధ మగువరములే కోరెను. రోగము శరీరసంబంధి యనియు ఇంద్రుడు రోగవిముక్తుని చేయలేడనియు ప్రాణుల శరీరము యొక్క మనఃశుద్ధి శక్రునిచేతిలో లే వనియు కృష్ణ ఋషి గ్రహించినను ధర్మోపదేశము ఇచ్చుటకై వరమును గ్రహించినాడు. శక్రుడు ఆవృక్షమును నిత్యఫలదాయి కావించి, బోధిసత్త్వునకు ప్రణామము చేసి, అంజలి మస్తకమున ఘటించి, ఇచ్చటనే ఆరోగ్యముతో నుండు మని నిజస్థానమునకు జనెను.

బోధిసత్త్వుడును ధ్యానావస్థితుడై బ్రహ్మలోకమునకు జనెను.

శాస్త ఈధర్మోపదేశము చేసి, "ఆనందా, ఇచ్చటనే నే పూర్వము అంటిని" అని జాతకములు సరిపోల్చెను. ఆకాలమున ఈఅనురుద్ధుడు శక్రుడు. కృష్ణపండితుడు నేనే !

—o—

# 442. సంఖ జాతకము

## వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకానొక ఉపాసకుడు తథాగతుని ధర్మోపదేశము విని మరునాటికి నిమంత్రణము చేసెను. అతడు ఇంటిలో మండపము నిర్మించి, అలంకరించి తరుణమున తథాగతునకు ఆహ్వానము పంపెను. 500 మంది భిక్షువులతో గూడి శాస్త అచటికి జని, తనకై పరచిన ఆసనముపై గూరుచుండెను. ఉపాసకుడు బుద్ధప్రముఖ భిక్షుసంఘమును వరుసగా ఏడుదినములు ఆహ్వానించి మహాదానములు చేసెను. ఏడవనాడు సమస్తపరిష్కారములతో దాన మిచ్చెను. అప్పుడు పాదరక్షలు ఇచ్చుట విశేషము. తథాగతుని కర్పించిన పాదరక్షలజత విలువ వేయినాణెములు. అగ్రశ్రావకుల కిరువురకు 500 నాణెముల విలువగల జతలు సమర్పించెను. మిగిలిన భిక్షువు లందరకును జత 100 నాణెముల విలువ కలవి ఒసంగినాడు. ఈ ప్రకారముగా సమస్తపరిష్కారములతో గూడిన దానము లిచ్చి భగవానునిపార్శ్వమున అతడు కూర్చుండెను. శాస్త దానానుమోదనము చేయుచు మధురస్వరమున "ఉపాసకా, నీవు సమస్తపరిష్కారములతో చేసినదానము శ్రేష్ఠమైనది. పూర్వకాలమున బుద్ధుడు జన్మింపక పూర్వము నీవు ప్రత్యేకబుద్ధునకు పాదరక్షలు దానమిచ్చినావు. అవల నౌకాప్రయాణము చేయుచు పడవ పగిలినపిదప సముద్రమున దిక్కు లేక పోయినను పాదరక్షాప్రదాన ఫలితముగా తీరము చేరగలిగినావు, ఇప్పుడు బుద్ధప్రముఖభిక్షుసంఘమునకు మహాదానములిచ్చినావు. నీవుచేసిన పాదరక్షాదానము నీకు సహాయకారి ఏలకాదు ?" అని ఉపాసకుని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను,

## అతీత కథ

పూర్వకాలమున వారాణసికి మోలిని అని పేరు. మోలినీనగరమును బ్రహ్మదత్తుడు పరిపాలన చేయుకాలమున సంఖ నామకు డగు ధనిక బ్రాహ్మణు డుండెను. అతడు నగరద్వారములు నాల్గింటికడను, నగరమధ్యముననూ, రాజద్వారముకడను ఆరు దానశాలలు స్థాపించెను. అనుదినము ఆరులక్షల నాణెములు వెచ్చించుచు దుఃఖితులకు దరిద్రపీడితులకు భూరిదానములు చేయుచుండెను. ఒకనాడాతడు తనలో "ఇకధనము లేకున్నచో నేను దానధర్మములు చేయజాలను. ధన

మున్ననే దానము చేయగలను. ఇందులకై నౌకాప్రయాణము చేసి సువర్ణభూమికి పోయి, ధనము తెచ్చెదను.'' అనుకొని నౌక ఏర్పాటు చేసి దానిని వస్తుసముదాయముతో నింపి, భార్యను, పుత్రులను పిలువనంపి, ''నేను వచ్చునంతవరకు అనుదినము దానధర్మములు నడుపుచుండవలెను.'' అని చెప్పి, ఛత్రము గైకొని పాదరక్షలు తొడుగుకొని మధ్యాహ్న సమయమునకు సమీపగ్రామము వెళ్ళెను.

ఆసమయమున గంధమాదన పర్వతముపై ఒకానొక ప్రత్యేకబుద్ధుడు ధ్యానబలముచే విషయము గ్రహించి తనలో ''ఈమహాపురుషుడు ధనము కొని వచ్చుటకై పోవుచున్నాడు. సముద్రమున యేమైన ఆపద కలుగవచ్చునో కలుగదో పరిశీలించెదను'' అనుకొని ఈతడు నన్ను గాంచి ఛత్రము, పాదరక్షలు, మొదలగునవి నాకు దాన మిచ్చును. దానివలన సముద్రమున ఒకవేళ పడవ పగిలినచో ఈ వస్తువుల సాహాయ్యము ఈతనికి లభింపవచ్చును. కావున ఈతనిని కనికరించెదను. అనుకొని ఆకాశమార్గమున వచ్చి బ్రాహ్మణునకు కొలదిదూరమున నిలిచి వాయువుచే అగ్నివలె మండుచున్న తప్తవాలుకపయి ఆతనియెదుటకు వచ్చెను. బ్రాహ్మణుడాతని చూచినంతనే తన పుణ్యక్షేత్ర మెదుటికి వచ్చినట్లు భావించి, నేడు దానబీజములు చల్లవలెను. అనుకొని సంతుష్టచిత్తుడై వేగముగా ప్రణామము చేసి, ''నన్ను కరుణించి ఈమార్గమునుండి కొంచెము ప్రక్కకు తొలగి ఈవృక్షచ్ఛాయలోనికి దయచేయుడు.'' అని వేడెను. ఆయన అచటికి చేరినంతనే బ్రాహ్మణుడు ఇసుకతో అరుగు నేర్పరచి. దానిపై తన యుత్తరీయము పరచి ప్రత్యేకబుద్ధుని దానిపై కూర్చుండబెట్టి సుగంధిల సుపానీయముతో పాదప్రక్షాళనము చేసి సుగంధద్రవ్యము పాదములకు పూసి ఆయనపాదరక్షలెత్తి సుగంధద్రవ్యము పూసి ప్రత్యేకబుద్ధుని పాదములకు తొడిగెను. ఆవల తనఛత్రమును, పాదరక్షలను ఆయన కర్పించి ''ఈజోడు లను తొడుగుకొని ఈఛత్రమును ధరింపుడు'' అని విన్నవించెను. ప్రత్యేకబుద్ధుడు ఆయన ననుగ్రహించుటకై దానిని స్వీకరించి. తనప్రసన్నభావము వెలిబుచ్చుటకై చూచుచుండగనే ఉత్తరమున కెగసి గంధమాదన పర్వతమునకు జనెను. బోధిసత్త్వుడు సంతుష్టస్వాంతుడై రేవుపట్టణమునకు జని నౌక నెక్కెను. సముద్రయానము చేయుచుండగా ఏడవనాడు నౌక భగ్నమయినది. నీరు తోడివేయుటకు వీలుకాలేదు. భయభ్రాంతమై జనసమూహము అరచుచు తమతమ ఇష్టదేవతలను స్మరించుచు, ఆక్రోశము చేయజొచ్చెను. బోధిసత్త్వుడు ఒకానొకసేవకునిచే తైలమర్దనము చేయించుకొనెను. ఘృతము చక్కెర తినగలిగినంత తిని సేవకునకుకూడ పెట్టెను. కూపయష్టి పడినట్లు ఇటు మానగర

మున్న దని నిశ్చయించుకొని సముద్రజంతువులనుండి అన్యోన్యము రక్షింపు కొనుచు నీట పోవుచుండిరి. నౌకలోని జను లందరు నశించిరి. బోధిసత్త్వుడు ఆతని సేవకుడు ప్రక్కప్రక్కలనే ఈదుచుండిరి. వారు అట్లు ఈదుచుండగా ఏడు రోజులు గడచినవి. ఉప్పునీటిలో నున్ననూ ఆతడు ఉపోసథ వ్రతము నవలంబించెను.

ఆసమయమున లోకపాలకులు మణిమేఖల అను దేవిని సముద్రరక్షణార్థము నియోగించిరి. నౌకలు భగ్నమైనచో త్రికరణములు గ్రహించినవారిని సదాచార సంపన్నులను తుదకు తల్లిదండ్రులమాట వినువారిని, సంకటమునుండి కాపాడుట సంభవించును. అతనికి వారముదినములవరకు సంపన్నత సంభృతముగా నుండెను. దేవి ఏడవరోజు సముద్రమువైపు చూడగా శంఖ బ్రాహ్మణుడు కానబడగా "ఇతడు సముద్రమున బడి వార మగుచున్నది. మరణించినయెడల నాకు మాట వచ్చును." అనుకొని ఆమె వివిధవిధములైన భోజ్యపదార్థములను, బంగరుపళ్ళెరమున పెట్టుకొని వాయువేగముతో అతనిసమీపమునకు జని ఎదురుగా ఆకాశమున నిలిచి "బ్రాహ్మణోత్తమా, నీవు వారమురోజులనుండి ఆహారము లేకున్నావు, ఈదివ్య భోజన మారగింపుము." అని పలుకగా, బ్రాహ్మణుడు ఆమెను చూచి. 'నీభోజనము దూరముగా నుంచుము. నేను ఉపోసథ వ్రతధారిని." అనెను. వెనుక నున్న ఆతని సేవకుడు దేవిని చూడక, ధ్వనిమాత్రము విని బ్రాహ్మణునకు మనసు మొత్తగిల్లి పోయున దనుకొనెను. వారము దినములపాటు భోజనము లభింపకుండుటచే, దుఃఖితుడై మృత్యుభయముచే ప్రలాపము చేయుచున్నా డని కూడా తలచెను. బ్రాహ్మణు నోదార్చుటకై ఆతడీగాథ పలికెను :

ఓసంఖ, నీవుబహుశ్రుతుడవు సుమ్మ
కాక విన్నాడవు కడుధర్మములను
శ్రమణు లో బ్రాహ్మణ జనులను కంటి
అయిన విలాపించి తసమయంబునను
నీతోడ మాటాడు నెవడు నే గాక ?

ఆయన వానివాక్కులు విని వీడు దేవిని చూడక పలికినాడు అనుకొని "మిత్రమా ! నాకు మృత్యుభయము లేదు! మృత్యువునకు భయపడి మాటాడు వారులేరు" అని యీగాథ పలికెను :

సముఖి, సువర్ణయు, సుందరమూర్తి
బంగరునగలతో భాసిల్లు దేవి

భోజనంబు సువర్ణభాజనమందు
తెచ్చి నాకోసమై తిను మన్నయపుడు
శ్రద్ధాకువైన యీసంతుష్టచిత్త
నేను నిషేధింప నేరకున్నాను.

అంతట అతడీగాథ పలికెను :

ఈరీతి యక్షిణి నీక్షించి సుఖము
నభిలషించెడియత డడుగంగ వలయు
హస్తముల్ జోడించి యాయువ నిట్లు
దేవివో కాకున్న నీవు మానుషివో ?

బోధిసత్వుడు సరిగా పలికినాడు అనుకొని అతడు ఈగాథ పలికెను :

ప్రియచక్షువులతోడ వీక్షించి భోజ
నార్థమై పిలిచెద; వడిగెద నిన్ను
తెలియుటకోసమై దేవివో కాక
మహనీయ విగ్రహా, మానవాంగనవో ?

అంతట దేవి ఈగాథలు పలికెను :

చనుదెంచితిని సింధుసలిలంబునుండి
దేవిని, నీమీద ద్వేషంబు లేదు
అనుకంపయే కల; నాగమనంబు
హితచింతచే, శంభ, ఈసాగరమున
అన్నపానీయంబు లఖిలప్రకార
శయనాసనంబులు శంభ, వాహనము
లున్నవి నీకోసు నన్నియు నిత్య.

ఇది విని బోధిసత్వుడు తనలో "ఈదేవి సముద్రతలమున లేచి, వీనిని నాకిచ్చు చున్నది. నాసౌభాగ్యకర్మవలన దేవి వీనిని నాకిచ్చుచున్నదా ? నాశక్తిని బట్టి ఇచ్చుచున్నదా ? ఈమె నడిగెదను" అనుకొని ఈగాథ పలికెను :

నాచేసినట్టి దానములు యజ్ఞములు
ఏకొంచెములు గాని యెరుకయే నీకు

సుశ్రోణి, సుభ్రువు, సుందరగాత్రి
ఏనాడు కర్మకు నీనాటి ఫలము.

విని దేవి "ఈ బ్రాహ్మణుడు తనకుశలకర్మల వలనా, కాక తనసమర్థత వలననా అని భావించుచున్నాడు- నా కేమియు తెలియదు కావున అడిగెదను" అనుకొని యీగాథ పలికెను :

పండు త్రోవను కాళ్ళు మాడుచునుండ
శ్రమతోడ దప్పితో చనుచుండ గాంచి
ప్రత్యేకబుద్ధుని పాదరక్షలను
దానమీయగ కామధేనువే యయ్యె.

బోధిసత్త్వుడు సంతుష్టచిత్తుడై ఇట్టిసముద్రమున గూడ నాకోరిక తీర్చువారు కలరుకదా! ఓహో! ప్రత్యేకబుద్ధున కిచ్చినదానము సఫల మయినది, అని ఈ గాథ పలికెను;

ఇట నన్యవాహన మేటికి నాకు ?
ఛిద్రముల్ లేకుండ సింహాసనముల
తోడి నౌకను దేవి వేడుచున్నాను
అనుకూలపవనాల నానౌక నేడె
నను మోలినీపట్టనము జేర్పవలయు.

దేవి ప్రసన్నచిత్తయై సప్తరత్నములనౌక నిర్మించెను. అందు ఇంద్రనీలమణుల కూపములు మూడు, స్వర్ణమయములైన పలుపులు రజతమయములయిన తెరచాపలు. బంగరుతెడ్లును కలవు. దేవి నౌకను సప్తరత్నములతో నింపి బ్రాహ్మణుని నౌకపై నెక్కించెను. సేవకునియెడ దృష్టి ప్రసారింపలేదు. బ్రాహ్మణుడు తనకుశలకర్మలో భాగము సేవకున కిచ్చెను. సేవకు డనుమోదించెను. అంతట దేవి వానినిగూడ నౌకపై నెక్కించి వానిని మోలినీనగరమునకు గొనిపోయి, బ్రాహ్మణునియింట ధనము నుంచి నిజనివాసమునకు బోయెను,

[శాస్త అభిసంబుద్ధుడయినపిదప ఈగాథ పలికెను :

సుప్రసన్నతతోడ సుందరనౌక
సిద్ధము చేయించి సేవకసహితు
శంఖు జేర్చెను దేవి చక్కనిపురికి.]

బ్రాహ్మణుడు యావజ్జీవము సంపదతో తుల తూగుచు, దానధర్మములు చేయుచు, పంచశీలములు రక్షించుచు. కాలము తీరినంతనే అనుచరునితో కూడ దేవనగరము చేరెను.

శాస్త ధర్మోపదేశము చేసి, సత్యక్రియ కావించి జాతకములు సరిపోల్చెను. సత్యక్రియానంతరము ఉపాసకుడు స్రోతాపత్తిఫల ప్రతిష్ఠితు డాయెను, ఆ కాలమున దేవి ఉత్పలవర్ణ, సేవకుడు ఆనందుడు, శంఖ బ్రాహ్మణుడు నేనే.

★

# 443 క్షుద్రబోధి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచూ కోపగ్రస్తుడైన ఒకానొకనిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు కల్యాణకారి యగు శాసన ప్రకారము ప్రవ్రజించియు కోపమును జయింప లేకుండెను; అతడు కోపియగుటయే గాక చంచలమనస్కుడు. ఇతరు లేది చెప్పినను మండిపడెడివాడు. కోపము రాగానే మూతి ముడుచుకొనెడివాడు. అతడు కోపిష్టి యని విని శాస్త వానిని పిలువ నంపి "నీవు నిజముగా కోపిష్టివేనా?" అని ప్రశ్నించి, భిక్షువు నిజమే నని అంగీకరించిన పిదప "భిక్షూ, నీవు కోపము విడువ వలెను. ఇహపరలోకములలో కోపము వంటిఅనర్థకారి మరియొకటి లేదు. నీవు క్రోధము లేని బుద్ధశాసన ప్రకారము ప్రవ్రజించియు కోపము నేల విడువవు? పూర్వము పండితులు బుద్ధశాసనమున ప్రవ్రజింపకున్నను కోపము లేకుండిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండగా, కాశీగ్రామములో మహాసంపత్తిశాలి యగు ధనిక బ్రాహ్మణు డుండెను. ఆయనకు సంతానము లేదు. పుత్రసంతానముకొరకు బ్రాహ్మణి దైవతమునకు మొక్కుచుండెను. బ్రహ్మలోకమునుండి బోధిసత్త్వుడు అవతరించి ఆమెగర్భమున ప్రవేశించెను. నామకరణమునాడు బాలునకు బోధికుమారు డని పేరు పెట్టిరి.

ఆతడు పెరిగి పెద్దవాడై తక్షశిలకు జని సమస్తవిద్యాలు నేర్చి ఇంటికి తిరిగివచ్చెను. ఆతనికి ఇచ్ఛలేకున్నను. తల్లిదండ్రులు ఆక్షేయపారుషేయములలో సమాన మగు కన్యను తెచ్చిరి. ఉభయులకు ఇష్టము లేకున్నను పెద్దలు వివాహము జరిపిరి. వారిలో ఎవరికిని కామము లేదు. స్వప్నములో కూడా కామవాసన లేకుండ పెరిగిన పరిశుద్ధశీలురు. కాలక్రమమున తల్లిదండ్రులు కాలధర్మము చెందగా బోధిసత్త్వుడు వారికి అంత్యక్రియలు చేసి భార్యను పిలిచి "భద్రే, నీవు రఈకోలది సంపదను స్వీకరించి సుఖముగా నుండుము" అనెను.

"ఆర్యపుత్రా, మీా రేమి చేయుదురు ?"

"నాకు ధనముతో పని లేదు. నేను హిమాలయమునకు జని ప్రవ్రజించి ఆత్మోద్ధరణ చేసికొందును."

"ఆర్యపుత్రా, పురుషులేనా ప్రవ్రజింతురు ?"

"భద్రే, స్త్రీలకు కూడ పొక్కున్నది." "నేను మీావలెనే త్యాగిని నయి ఎందదెబ్బ లక్ష్యము చేయను. నాకుకూడ ధనముతో పని లేదు. నేనుకూడా ప్రవ్రజింతును."

"భద్రే, మిక్కిలి యోగ్యము."

ఉభయులును భూరిదానము చేసి ఇల్లు వెడలి రమణీయ ప్రదేశమున ఆశ్రమము నిర్మించుకొని ప్రవ్రజించి, కందమూలఫలములు భుజించుచు, పదిసంవత్సరము లక్కడనే నివసించిరి. అప్పటివరకును వారికి ధ్యానలబ్ధి కాలేదు. ఆవల వారు ఉప్పు, పులుసు కొరకు జనపదమునకుపోయి, విహరించుచు క్రమముగా వారాణసి చేరి రాజోద్యానమున నుండజొచ్చిరి.

ఒకనాడు తోటమాలి రాజదర్శనార్థము పోయినప్పుడు రాజు వానితో "నేను ఉద్యానమున క్రీడింతును. ఆరామమంతయు పరిష్కరింపుము." అని ఆదేశించెను. వాడు ఉపవనమున పరిశుద్ధము చేసినపిదప రాజు చాలమంది అనుచరులతో అచ్చట దిగెను. బ్రాహ్మణీ బ్రాహ్మణు లుద్యానములో ఒకవైపున కూర్చుండి, ప్రవ్రజ్యా సుఖము అనుభవించుచుండిరి. రాజు ఇటు నటు పచారు చేయుచు ఆసుందరపరివ్రాజకద్వయమును కనుగొని వారియెడల సంతుష్టచిత్తుడాయెను. కావున ఆయన కాంచెనని తడబడుచు, వారిని ప్రశ్నింత మనుకొని బోధిసత్త్వుని సమీాపించి, "ప్రవ్రజించిన మీాకిచట నేమి కావలెను ?" అనెను.

"మహారాజా, ఏమియును వలదు. నే మిరువుర మొక్కనాడిరిగా ప్రవ్రజించినాము. తత్పూర్వము రామె నాచరణసేవిక." విని రాజు "వీరి కేమియును పని లేదు. నేను ఐశ్వర్యబలముచే రామెను కొనిపోయినచో రాతడు నన్నేమి చేయగలడు ? కావున పట్టుకొందును." అని ఆతనికడకుపోయి రాగాథ పలికెను ;

రాసుహాసిని ప్రియ నీవిశాలాక్షి
బ్రాహ్మణా, ఎవ్వరైన బలపూర్వకము
ఎత్తుకపోవుచో నేమి చేయుదువు ?

విని బోధిసత్త్వుడీగాథ పలికెను :

నాయంతరంగంబునందు క్రోధంబు
సంభూత మైనచో చచ్చునంటాక
విడువదు నను, కాన విపులవర్షంబు
ధరణీపరాగంబు దమియించురీతి
ఏను దానిని శమియింప జేయుదును.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు సింహనాదము చేసినట్లు పలికెను. రాజు ఆవాక్యములు వినియు అజ్ఞానముచే, మూర్ఖతచే అంధీభూతు డగుటవలన మనస్సును వశమున నుంచికొనలేక ఒకయుద్యోగిని పిలిచి "ఈపరివ్రాజికను రాజభవనమునకు కొనిపొమ్ము" అని ఆజ్ఞ ఇచ్చెను. ఏడ్చి మొత్తుకొనుచు "లోకమున ధర్మము లేదు" అని వాపోవుచున్న పరివ్రాజికను వాడు కొనిపోయెను. బోధిసత్త్వుడు ఆమె యేడ్పు విని ఒక్కసారి ఆవలికి చూచి, దృష్టి మరల్చుకొనెను. రాజుద్యానము విడిచి రాజభవనమునకు జనెను. ఆపరివ్రాజికను పిలువ నంపి సౌఖ్యమును భోగములను గూర్చి ఆమెకు తెలిపెను. ఆమె ఐహిక భోగమును నిందించి ప్రవ్రజ్యను ప్రశంసించెను. ఎంతకును మనస్సు స్వాధీనము కాకుండుటచే రాజు గదిలో బంధించి తనలో "ఈపరివ్రాజిక భోగజీవితము నపేక్షించుట లేదు. స్త్రీని తీసికొనిపోవుచున్నను తపస్వి కోపము చెంది ఒక్కసారియు ఇటువైపు చూడ లేదు. ఈతడు గొప్పమోసగాడు. ఏమైనను నాకు అనర్థము కావింపవచ్చును. పోయి అత డేమి చేయుచున్నాడో చూచెదను" అనుకొని ఉద్యానము ప్రవేశించెను.

బోధిసత్త్వుడు కూర్చుండి చీవరము కుట్టుచుండెను. రాజు కొలది పరివారమువెంటబెట్టుకొని ఆర్భటము లేకుండ, నిదానముగా ఆయనకడ కరిగెను. బోధిసత్త్వుడు రాజువంక చూడక అంబరమును కుట్టుచుండెను. రాజు తనలో "ఈతడు క్రోధముచే నాతో మాటాడకున్నాడు. ఈదుష్టతపస్వి సింహగర్జన చేసినచో నాకు కోపము వచ్చును. అణచుకొని పైకి తెలియనీయను" అనుకొని ఈగాథ పలికెను :

ఆత్మప్రతాపంబు నాదిలో చూపు
నట్టి ప్రగల్భంబు లాడినవాడు
బండపోలిక నిప్పు డుండు మౌనమున.

బోధిసత్త్వుడు కోపము లేకుండ రాజునకు సమాధానము చెప్పుదు ననుకొని ఈగాథ పలికెను :

పుట్టినచో వశీభూతంబు కాదు
క్రోధంబు కావున క్షోణీపాలాగ
శమనంబు భూరివర్షము చేయునట్లు
ఏను దానిని శమియింప జేసితిని.

రాజు తనలో, అవును వేరొక విద్యనుగూర్చి ఆయనను ప్రశ్నింతును అను కొని, ఈగాథ పలికెను :

పుట్టిన దేది నీబుద్ధిలోపలను ?
కాని దేనికి వశగామివి కావు ?
ఎద్దాని నీవు శమింప జేసితివి
అధికవర్షము ధూళి నణచినయట్లు ?

విని బోధిసత్త్వుడు "మహారాజా, క్రోధమువలన నెన్నోదోషము లుండును. ఇది బాలకీడు కలిగించును. తొలుత నామనస్సున క్రోధ ముత్పన్న మైనది. కాని మైత్రీభావనతో దానిని నిరోధించినాను" అని క్రోధదుష్టపరిణామమును నిందించువాడై ఈగాథ పలికెను :

పుట్టియు నెయ్యది పొడచూప కుండు ?
పుట్టక బాగుగా పొడచూపు నేది ?
అట్టిక్రోధము మదిం బుట్టెను కాని
కానైతి వశవర్తి దానికి నేను
క్రోధమ్మునకును మూర్ఖుండు లోబడును

ఏది జన్మింప నహితకాము లైన
శత్రువుల్ కూడ ప్రసన్నులౌ అట్టి
క్రోధంబు నామనఃకుహరాన బుట్టె
కానైతి వశవర్తి దానికి నేను
క్రోధమ్మునకును మూర్ఖుండు లోబడును.

ఏది జన్మింపగా నే సదర్థములు
నైతము బుద్ధికి చక్కగా రావో
అట్టిక్రోధము మదిం బుట్టెను కాని

దానికి వశవర్తి గానైతి నేను
క్రోధమ్మునకును మూర్ఖుండు లోబడును.

దేనికి వశవర్తియైన జనుండు
కుశలకర్మంబులు గూడ త్యజించు
విపులార్థములు గూడ విడుచుచునుండు
భయదమనర్థకమును బలవంతమైన
యా క్రోధమునకు మహారాజ, నేను
వశవర్తి గాలేదు వాస్తవమ్ముగను,

కర్రలాపిడిచేత కలుగును నిప్పు
ఎవ్వానిచేత జన్మించెనో తాను
అట్టి కాష్ఠంబుల నగ్నిదహించు
అజ్ఞాని మూర్ఖుంగునో మందబుద్ధి
సంఘర్షణంబున జనియించు క్రోధ
మావల నాతడే అద్దాన నుండు.

గడ్డిలో కట్టెలం బడ్డట్టి వహ్ని
పోలిక క్రోధ ప్రభూతి యెవ్వనికి
వర్ధించునుండు నవ్వాని యశంబు
బహుళ పక్షాన క్షీణంకరునట్లు

ఇంధనరహిత వహ్ని ప్రకాశమున
ఎవని క్రోధము శమియించుచునుండు
నవ్వాని కీరితి యభివృద్ధి నొందు
శుక్ల పక్షంబున సోమునిరీతి.

రాజు బోధిసత్త్వునివాక్కులు విని ప్రసన్నచిత్తుడై అమాత్యుని బిలిచి పరివ్రాజికను కొని రమ్మనియు, క్షమాపణ వేడవలె ననియు నాన తిచ్చెను. "క్రోధరహితులై మీ రిరువురు ముద్యానమున ప్రవ్రజ్యాసుఖము ననుభవించుచు, నివసింపుడు. నేను నీధర్మసంరక్షణవిషయమై కనుగొనుచుందును." అని ప్రణామముచేసి

వెడలిపోయెను. ఉభయులు నచటనే నివసింపజొచ్చిరి. కాలక్రమమున పరివ్రాజిక కాలధర్మము నొందెను. ఆవల నతడు హిమాలయమునకు జని, అభిజ్ఞలను సమాపత్తులను పొంది బ్రహ్మవిహార మభ్యసించి తుదకు బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశనము చేసి జాతకములు సరిపోల్చెను సత్యప్రకాశనానంతరము కుపితభిక్షు వనాగామి ఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. ఆసమయమున పరివ్రాజిక రాహులమాత; రాజు ఆనందుడు; పరివ్రాజకుడు నేనే.

X

# 444. కణ్హదీపాయన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్తుడను భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఈకథ కుసజాతకము (-) లో వచ్చును. శాస్త భిక్షువుతో "నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడ వైతివా ?" అనెను.

"భన్తే, నిజమే," "భిక్షూ, పూర్వకాలమున బుద్ధుడు జన్మింపకపూర్వము పండితులు అన్యవిధానమున ప్రవ్రజించి, 50 సంవత్సరములకు పైగా కామభోగముల నాశ్రయింపక బ్రహ్మచర్యము నవలంబించిరి. లజ్జాభయములచే తాము ఉద్విగ్నచిత్తులైనవిషయము ఎవరితోడను చెప్పరైరి. కాని నీవు కల్యాణప్రద మగుశాసన ప్రకారము ప్రవ్రజించియు, నావంటిగౌరవార్హ బుద్ధుని సమక్షమున నిలిచి పరిషన్మధ్యమున ఇట్లేల పలుకుచున్నావు ? నీవు లజ్జ నేల రక్షించుకొనలేదు ?" అని శాస్త పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వంకరాష్ట్రమున కౌశాంబీనగరమున కౌశాంబీకు డనురాజు రాజ్యము చేయుచుండెను. ఆసమయమున ఒకానొక గ్రామమున ఎనుబదికోట్లకు అధిపతు లగు బ్రాహ్మణమిత్రు లిరువు రుండిరి. ఇరువురును కామభోగములు దోషభూయిష్టములని యెంచి, భూరిదానములు చేసి, భోగములన్నిటిని త్యజించి, జనులు దుఃఖముచే ఏడ్చి మొత్తుకొనుచుండగా, హిమాలయమునకు బయలుదేరిరి, అక్కడ ఆశ్రమము నిర్మించికొని ప్రవ్రజించి, కందమూలఫలాదులు తినుచుండి యేబది సంవత్సరములు నివసించిరి. అయినను వారికి ధ్యానలబ్ధి కాలేదు. అవల ఉప్పు, చింతపండుకొరకు, హిమాలయము దిగి, జనపదములు తిరుగుచు కాశీరాజ్యము చేరిరి. అచ్చట ఒకానొకనిగమగ్రామమున, ఒకగృహస్థునకు మిత్రులైరి. ఆయన వారిని చూచినంతనే ప్రసన్నచిత్తుడై, పర్ణశాల నిర్మించి వారికి కావలసిన నాలుగు వస్తువులు సమకూర్చినాడు. అచ్చట వారు రమారమి 4 సంవత్సరము లుండిరి.

ఆవల పరివ్రాజనము చేయుటకై బయలు వెడలి వారాణసి చేరి శ్మశానములో నివసింపజొచ్చిరి. వారిలో ద్వైపాయనతపస్వి కాలదికాలము శ్మశానమున నుండి గృహ సమిత్రునికొరకు పోయెను. మాండవ్యతపస్వి అచ్చటనే యుండెను. ఒక రాత్రి వేళ చోరుడు విశేషముగా ధన మపహరించి పోవుచుండెను. ఇంటిలోనివారు నిదుర లేచి, కాపలావారిని వెంట బెట్టుకొని చోరునివెంటబడిరి. చోరుడు శీఘ్రముగా శ్మశానము చేరి మాండవ్యునిపర్ణశాలకడ సరుకులు వదలి పారిపోయెను. యజమానులు వానిని కనుగొని మాండవ్యునితో "ఓరిదుష్టతపస్వీ, నీవు రాత్రివేళ చౌర్యము చేయుదువు. పగటివేళ తపస్సు నటింతువు" అని అతనిని తన్ని, కొట్టి. రాజుసన్నిధికి కొనిపోయిరి. రాజు విచారించకుండానే "ఇతనిని కొనిపోయి శూలారోపణము చేయుడు" అని ఆజ్ఞ యిచ్చెను. మొదట వేపకొయ్యతో చెక్కిన శూలమునకు ఆయనను దిగవేసిరి. అది దిగలేదు. తుదకు ఇనుపశూలమునకు తపస్విని దిగవేసిననూ దిగబడలేదు. అపుడు తాపసి తనపూర్వకర్మనుగూర్చి యోచించినాడు. ఆయనకు పూర్వజన్మజ్ఞానము కలిగి, కర్మవిధానము గోచరించినది. వెనుకటి జన్మములో కలవారియింటి బిడ్డ. ఒకనాడాతడు తండ్రివెంట నేదో చెట్టు కొట్టుటకై పోయెను. ఈగను కోవిదారముకర్రతో గ్రుచ్చెను. తాను చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొన నెంచి తాపసి తనప్రకృతస్థితి గమనించి శూలారోపకులను పిలిచి, "మీరు నన్ను శూలారోపము చేయదలచినచో కోవిదార కాష్ఠముతో చేసినశూలమును తెప్పింపుడు" అని చెప్పగా వారు అట్లే దానిని కొని వచ్చి తపస్విని దానిపై కెక్కించి, కాపలావారి నుంచి చనిరి. వారు చాటున దాగి మునికడకు వచ్చుపోవువారిని చూడజొచ్చిరి. అప్పుడు ద్వీపాయనుడు తన మిత్రుని చూచి చాలరోజు లయిన దని తలచి మాండవ్యుని కడకు బయలువెడలెను. మిత్రుడు శూలవేధ పొందినవా డని మార్గమధ్యమున విని, మాండవ్యుని సమీపించి, ఒక ప్రక్క నిలిచి, "మిత్రమా! నీవుచేసిన అపరాధ మేమి?" అని అడిగెను. "నేనేమియు అపరాధము చేయ లేదు." "నీకెవరిమీదను కోపము లేదా?" "నాకు రాజుమీదగాని, నన్ను బంధించిన శూలారోపకులమీద గాని కోపము లేదు." "ఇట్లయినచో సదాచారవర్తి చ్ఛాయ నాకు సౌఖ్యదాయకము" అని ద్వీపాయనుడు శూలమున కెదురుగా కూరుచుండెను. మాండవ్యుని శరీరమునుండి రక్తబిందువులు ద్వైపాయనుని నుదుటిపై బడెను. అతని బంగారుశరీరము ఆబిందుపాతముచే కొంచెము నల్లబడెను. దానివలన ఆయనకు కృష్ణద్వైపాయనుడనుపేరు వచ్చెను. ఆరేయియంతయు అత డచటనే కూరుచుండెను. ఈసమాచారము కావలివారు గ్రు

రాజునకు మరునాడు నివేదించిరి. తాను విచారణ చేయకుండ ఇట్లు చేసితినే అని తట్టగా రాజు వెంటనే లేచి శీఘ్రముగా ద్వైపాయనునికడకు జని "తపస్వీ, ఎదురుగా ఏల కూరుచున్నావు?" అని అడిగెను. "మహారాజా, ఈతపస్వి సంరక్షణకై కూరుచున్నాను. మీరు విచారణ చేసి దోషి యని నిరూపించి ఈశిక్ష వేసినారా? కాక విచారణ చేయకుండనే చేసినారా?" అనెను. అవు నని రాజు అంగీకరించెను, తపస్వి సమస్తము వివరించెను రాజు సత్యము గ్రహించి మాండవ్యుడు నిర్దోషి యని గ్రహించి శూలము విడదీయుడని శూలారోపకున కానతి యిచ్చెను. అపుడు మాండవ్యుడు "మహారాజా, నేను పూర్వజన్మమున చేసినకర్మమునకు ప్రతిఫలముగా ఈశూలారోపము సంప్రాప్తమయ్యెను. దీనిని నాశరీరమునుండి తొలగించుటకు వీలు పడదు. మీరు నన్ను బ్రతికింప దలచుచో రంపము తెప్పించి ఈశూలమును నాచర్మముతో కలిపి కోయింపుడు" అని చెప్పెను.

రాజు అట్లే చేయించెను. శూలము శరీరములోపలనే యుండెను. మాండవ్యుడు మక్షికగుదస్థానమున పొడిచిన శలాకమొన దానిలోనే యుండెను. మక్షికము మరణింప లేదు. కావున అతడు కూడ మరణింపక జీవించియుండెను.

రాజు తపస్వులకు ప్రణామముచేసి క్షమింప వేడి వారిని ఉద్యానమున నిలిపి ఉపచారములు చేయ సాగెను. అప్పటినుండి ఆతపస్వికి అణిమాండవ్యు డనుపేరు వచ్చెను. ఆయన రాజాశ్రయమున నచ్చటనే యుండెను. అంతట ద్వీపాయనుని గాయము మాన్పి గృహస్థమిత్రము మాండవ్యునికడకు పోయెను. అతడు పర్ణశాలలో ప్రవేశించుట గాంచి మిత్రునకు సూచన చేసెను. ఆతడు విని ప్రసన్నచిత్తుడై భార్యాపుత్రసహితముగా బాల పరిమళము గల పుష్పమాలికలు, సుగంధతైలము, ఖండశర్కర మొదలగునవి పట్టించుకొని పర్ణశాల చేరి ద్వీపాయనునకు ప్రణామము చేసి పాదములు కడిగి సుగంధతైలము రాచి మధురపానీయ మిచ్చి కూర్చుండి అణిమాండవ్యుడు చెప్పుమాటలు విననారంభించెను. అతనికుమారుడు పచారు చేయు తావుచివర బంతి ఆడుచుండెను. అచట కలుగులో విషసర్ప ముండెను. బాలుడు కొట్టినబంతి పోయి పుట్టలోని విషసర్పమునెత్తిపై బడెను. బాలుడు తెలియక బంతికొరకు బిలములో చేయి పెట్టగా, కృష్ణసర్పము వాని చేతిపై కాటు వేసెను. బాలుడు విషవేగమువలన మూర్ఛితుడై అచటనే పడిపోయెను. తల్లిదండ్రులు ఈవిషయము గ్రహించి బాలుని లేవనెత్తి కొనివచ్చి తపస్విచరణములపై బడవేసిరి. "భన్తే, ప్రవ్రజితులకు ఔషధముల ప్రభావము తెలియును, మాబాలుని

రక్షింపుడు" అనిరి, "నాకు ఓషధులసంగతి తెలియదు; నేను వైద్యము చేయను." "భద్రే, అట్లయినచో తాము మైత్రీభావన నెరపి సత్యక్రియ చేసి సంరక్షింపుడు." "మంచిది, సత్యక్రియ గావింతును" అని యజ్ఞదత్తునిశిరస్సుపై కర ముంచి ఈ గాథ పలికెను :

పుణ్యాకాంక్ష, ప్రసన్నభావపూర్వకముగ
నిండు సప్తాహకాలమ్ము నెరపినాను
బ్రహ్మచర్యము; పూర్వ మేబదిసమాల
సమయ మెల్ల నిచ్ఛతో జరపినాను.

పాలనము; నేటి సత్యప్రభావమునను
సంఘటిల్లుత శుభము విషమ్ముగుండ
అగుత నిర్వీర్య, మిప్పుడే యజ్ఞదత్తు
డసువులం బొంది యుపవిష్టు డగును గాత!

సత్యక్రియ గావించినంతనే యజ్ఞదత్తుని గాయమునుండి విషము పైకి పొంగి నేలపై జాలువారెను. బాలుడు కన్నులు తెరచి తల్లితండ్రులను గాంచి "అమ్మా" అని కేకవేసి పండుకొనెను. అపుడు కణ్హదీపాయనుడు బాలునితండ్రితో "నాశక్తికొలది పాటుపడినాను. నీశక్తికొలది కూడ ప్రయత్నింపుము" అనెను. సత్యక్రియ గావింతును. అని బ్రాహ్మణుడు కుమారుని రొమ్ముపై హస్తముంచి ఈ గాథ పలికెను :

నానివాసమ్మునకు వచ్చునతిథుల గని
ఎన్నడుంగూడ దాన మే నీయలేదు.
శ్రమణులకును బహుశ్రుతు లగు బ్రాహ్మణులకు
ఇచ్చువాడను దాన మనిచ్ఛతోడ.
నేటి సత్యక్రియామహత్పాటవమున
విషము నిర్వీర్య మగుత, జీవించుగాక
యజ్ఞదత్తుడు కల్యాణ మగును గాక!

ఇట్లాతడు సత్యక్రియ గావించినంతనే కటిప్రదేశమునుండి విషము నేలపై జాలువారెను. కుమారుడు లేచి కూరుచుండెను. కాని, నిలువజాలక పోయెను. అపుడు తండ్రి వానితల్లితో "భద్రురాలా, నేను చేయగలిగినది చేసినాను. నీవుకూడ

సత్యక్రియ గావింపుము. కుమారుడు లేచునట్లు చేయు" మనెను. "నాకడ సత్య క్రియ యొకటి కలదు. కాని దానిని మీయెదుట చెప్పలేను." "భద్రురాలా, ఎట్లైనను కుమారునకు ఆరోగ్యము కలుగునట్లు చేయుము." ఆమె యంగీకరించి సత్యక్రియ గావించుచు ఈగాథ పలికెను :

భుజగమ్మ తండ్రి, ప్రభూతతేజము
కలయది పాషాణతలమ్ముపై నుండి
ఎగురుచు నిన్ను కాటేసినదాని
యెడ గాని, నీతండ్రి యెడగాని లేదు
అప్రియత్వంబునం దంతర మేమి.

నేటిసత్యక్రియా పాటవంబునను
విరిగి విషమ్ము జీవించును గాక
యజ్ఞదత్తుం డింక నగు గాక శుభము.

తోడనే విషమంతయు నేలపై జాలువారెను. యజ్ఞదత్తుడు విషరహితుడై ఆరోగ్యవంతుడై లేచెను. ఇట్లు కుమారుడు లేచినంతనే మాండవ్యుడు తపస్వి యభిప్రాయము తెలిసికొనుటకై ఈగాథ పలికెను :

సకలమానవులును శాంతచిత్తులును
దమనశీలురును కా దగుదురు, పిదప
గ్రహియింప నగు పరివ్రాజక వృత్తి,

బ్రహ్మచర్యంబు దీపాయనా, యెవరు
నెరప రనిచ్ఛతో నీవిధానమున.
పాయ మాకార్యంబు నేల చేసితివి ?

అతడు దానిమూలము తెలుపుచు ఈగాథ పలికెను :

ప్రథమమున శ్రద్ధతోడనే ప్రవ్రజించి
మరలినాడ గృహస్థాశ్రమమున కవల
గోరెచందాన మూకమూర్ఖుండు వీడు
అనడి లోకాపవాదాని కడలిపోయి
నెరపితిని బ్రహ్మచర్యంబు నే నసిచ్ఛ.

ఇద్ది విజ్ఞులు మెచ్చినా, రిద్ది సాధు
జనులకును జీవనం బగుచుండ నగుట
పుణ్యమును నేను సైతము పొందగలను.

ద్వీపాయనుడు తనయభిప్రాయము నెరింగించి మాండవ్యుని ప్రశ్నించుచోడ ఈగాథ పలికెను :

శ్రమణులును, విప్రులును, బాటసారు లైన
భిక్షకై వచ్చినంత సంప్రీతి గూర్చు
నన్నపానీయముల నిచ్చి; అందరకును
ఆవకీనగృహంబు సాధారణంబు,

ఎట్టియపవాద భయమున నిచ్చ లేక
పోయినను, పుణ్యకార్యముల్ చేయు దీవు ?

అంతట మాండవ్యుడు తనమతమును వివరించుచోడై ఈగాథ పలికెను :

తండ్రియును తాతయును దానధర్మములను
చేయుచును శ్రద్ధతోడ ప్రసిద్ధి నంది;
ఆ పరంపర రక్షింప నాన యొకటి,
అద్ది నాతోడ నుచ్ఛిన్న మైన జనులు
హేయముగ జూతు రనుభీతి, హేతువులుగ
ఇచ్చుచుంటిని దానమ్ము నిచ్చ లేకె.

ఆవల మాండవ్యుడు తనభార్యను ప్రశ్నించుచోడై ఈగాథ పలికెను :

ఎరుక లేనికుమారిని హే సుగాత్రి
చిన్నదానిని నిన్ను తెచ్చితిని నీదు
వంశమందుండి, లేకున్న వాంఛ నీకు.
నాకు సేవలు చేయుచున్నావు మిగుల :
గోచరింప దప్రియచర్యకొంచెమేని !
సంగతిలె ట్లొ మననివాసంబు దేవి.

ఆమె ఈగాథ పలికెను :

మాపరంపరలో లేదు మగని విడిచి
పోయినది; అపరంపర పోవనీక

నడుపుకోరిక, విచ్చి త్రి సావలననె
వచ్చునో యనులోకాపవాద భీతి
కారణముగ నీతోడ కలిసియుంటి
ఇచ్చ యేమియు లేకపోయినను గూడ.

ఇట్లు పలికి ఆమె తనలో "నేను స్వామియెదుట ఇదివరలో నెన్నడును పలుకనిమాటలు పలికితిని. ఆయనకు నాపై కోపము వచ్చినను రావచ్చును. కాబట్టి మాట విశ్వాసము గల తపస్వియెదుట క్షమాపణ వేడెదను." అనుకొని క్షమ వేడునదై గాథ పలికెను :

పలుక దగనట్టి వాక్యాలు పలికినాను
నీదుసుతుకయి క్షమియింపు నేడు నన్ను.

ఇహమునందు సుతప్రేమ నేది మీరు ?
ఓయి మండవ్య జీవించియున్నవాడు
యజ్ఞదత్తుండు మామకీనాత్మజుండు.

అపుడు మాండవ్యుడు "భద్రే, లెమ్ము నిన్ను క్షమించుచున్నాను. నేటినుండి నీచిత్తమున కాఠిన్య ముండరాదు. నేనుకూడ నీయెడ అప్రియము చేయను." అనెను. బోధిసత్త్వుడు మాండవ్యునితో "ఆయుష్మన్, నీవు శ్రమ చేసి ప్రోగు చేసిన ధనము సత్కర్మల యెడ అశ్రద్ధ వహించి చేసిన దానధర్మములు యుక్తము కాదు. నేటినుండి శ్రద్ధాపూర్వకముగా దానధర్మములు చేయుచుండుము." అని ఉపదేశ మిచ్చెను. అతడు సమ్మతించి బోధిసత్త్వునితో "భన్తే, "మీరు మా దానములకు క్షేత్రమై ఇష్టము లేకున్నను చేసిన బ్రహ్మచర్యపాలనము సరిగా లేదు. నేటినుండి ప్రసన్నచిత్తముతో బ్రహ్మచర్యపాలనము చేయవలెను." అనెను. వారు బోధిసత్త్వునకు ప్రమాణము చేసి వెడలిపోయిరి. అప్పటినుండి భార్య భర్తయెడ స్నేహభావముతో నుండెను. మాండవ్యుడు ప్రసన్నచిత్తుడయి శ్రద్ధాళువై దాన ధర్మములు చేయజొచ్చెను. క్రమముగా ధ్యానాభిజ్ఞలను పొంది బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి సత్యప్రకాశము కావించి జాతకముల సరి పోల్చెను. ఉద్విగ్నచిత్తుడై నభిక్షువు స్రోతాపత్తిఫల మొందెను. ఆకాలమున మాండవ్యుడు ఆనందుడు; భార్యవిశాఖ: పుత్రుడు రాహులుడు: అణిమాండవ్యుడు సారిపుత్రుడు; కణ్హదీపాయనుడు నేనే.

# 445. నిగ్రోధ జాతకము

శాస్త వేళువనమున విహరించుచు దేవదత్తునిగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు భిక్షువులు దేవదత్తునితో "ఆయుష్మన్, శాస్త నీకు మిక్కిలి ఉపకారము చేసినాడు. నీకు శాస్త వలననే ప్రవ్రజ్య ఉపసంపద లభించినవి, శాస్తవలననే నీకు ధ్యానము లభించెను. నీకు రాబడియు, గౌరవము ఆబలధారి వలననే లభించినవి," అనిరి. దేవదత్తుడు అక్కడవాలి పడియున్న గడ్డిపరకను లేవనెత్తి "నేను శ్రమణగౌతమునివలన రవమాత్రము ఉపకారము లభించినట్లు భావించుట లేదు" అనెను. అత డిట్లు పలికిన పిదప ధర్మసభలో చర్చలు జరిగెను. శాస్త అరుదెంచి "భిక్షువులారా, కూర్చుండి ఏమి సంభాషించుచున్నారు?" అనెను. "ఫలాని విషయము" "భిక్షువులారా, దేవదత్త డకృతజ్ఞుడు. మిత్రద్రోహియు ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఇట్లే యుండె" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున రాజగృహమున మగధరాజు రాజ్యము చేయుచుండెను. అప్పుడు రాజగృహశ్రేష్ఠి తనకుమారునకై ఒకానొక జనపదశ్రేష్ఠి పుత్రికను తీసుకొని వచ్చెను. వంధ్య యగుటచే క్రమముగా నామె కాదరము తగ్గిపోయెను. నీవు వ్యంధ్యవు. మావంశాభివృద్ధి యెట్లగును అని యామెను ప్రతిదినము దెప్పుచుండిరి. "సరి. గర్భవతినని వారిని మోసగించెదను" అని తలపోసి యామె తనకు నచ్చినదాదిని "అమ్మా, గర్భవతు లేమేపనులు చేయుదురు" అని యడిగి తెలిసికొని, ఋతుకాలము వచ్చినప్పుడు లేచి చింతపండు మొదలగునవి తినెను. కాలు చేతులు కడుగుకొనునప్పుడు వానిని బాగుగా పిసికి లావెక్కునట్లు చేసెను. అనుదినము వస్త్రముమీద వస్త్రము కట్టి పొట్ట లావుగా నుండునట్టు చేసెను. చూచుకములు నలు పెక్కునట్లు కావించెను. శరీరకృత్యములు చేయునప్పు డాదాదిని తప్ప మరియెవ్వరిని దగ్గరకు రానిచ్చెడిది కాదు. ఆమె గర్భవతి యని భర్త నిర్ణయించెను. ఆమె యీవిధముగా నవమాసములుండి "జనపదమున మాపుట్టినింటికి

కానుపునకై పోవుదును" అని అత్తమామల యనుజ్ఞ పొంది రథ మెక్కి అడంబర ముతో రాజగృహము వెలువడి రాజమార్గము ప్రవేశించెను. ఆమెకు ముందు బిడారము పోవుచుండెను. ఒకనాడామె ప్రయాణము చేయుచుండ దరిద్రవనిత యొకతె మార్గము ప్రక్క మర్రిచెట్టు క్రింద మగశిశువును కనెను. ఆమె ప్రాతఃకాలమున బిడారు బయలువెడలునపుడు తనలో "నేను వీరివెంట పోవజాలను, వీరు లేకుండ పోవజాలను. పోవుదునేని కుమారుడు లభింపడు" అనుకొని మర్రిచెట్టు మొదట ఆమము చల్లి పుత్రుని విడిచి వెడలిపోయెను. దేవతలు ఆశిశువును రక్షించిరి. బోధిసత్త్వుడే ఆరూపమున జన్మించెను. ప్రాతఃకాలమున ఆమె మర్రిచెట్టుకడకు పోవగా బంగరువన్నె గలఆబాలుడు కానబడెను. చూచి ఆమె నాయత్నము సఫల మయ్యెను. అనుకొని వస్త్రము ప్రక్కకు నెట్టి పిక్కపై నెత్తురు ఆమము రాచుకొని జనన కాలమును సూచించెను. ఆమె కప్పుకొన్న వస్త్రము జారిపడెను. ప్రసన్నచిత్తులైన ఆమె యనుయాయులు రాజగృహమునకు రాయబారపంపిరి. ఆమె మామగారు పరిజనులతో "కుమారుడు కలిగినపిదప పుట్టింటికి పోయి ఏమి చేయును? ఆమె ఇచ్చటకే మరలి రాదగును" అని వార్త పంపగా ఆమె రాజగృహమునకు మరలి వచ్చెను. ఆమె కింటివారు స్వాగతము చెప్పి, బాలుడు న్యగ్రోధ వృక్షము క్రింద జన్మించుటచే నామకరణ సందర్భమున న్యగ్రోధ కుమారు డని పేరు పెట్టిరి. ఆనాడే శ్రేష్ఠికోడలు కానుపుకై పుట్టింటికి పోవుచు మార్గమధ్యమున చెట్టుకొమ్మ క్రింద పుత్రుని గనెను. వానికి శాఖాకుమారు డని పేరు పెట్టిరి. శ్రేష్ఠి నాశ్రయించి యున్నతంతువాయునిభార్యకు ఆనాడే వస్త్రములలో బిడ్డడు పుట్టెను. వానికి పోత్తికు డని పేరిడిరి. న్యగ్రోధకుమారుడు పుట్టిననాడే వారు జన్మించినారని తెలిసికొని మహాశ్రేష్ఠి వారిని రావించి ఒకచోటనే అందరిపోషణకును ఏర్పాటు చేసెను. వారందరు పెరిగి పెద్దవారైనపిదప తక్షశిల కేగి విద్య లభ్యసించిరి. శ్రేష్ఠిపుత్రు లిరువురు ఆచార్యునకు చెరియొక ౪౦౦౦ యిచ్చిరి. పోత్తికకుమారుని విద్యాభారము న్యగ్రోధుడు తనపై బెట్టుకొనెను. విద్య ముగించిన పిదప వారు ఆచార్యునికడ సెలవు గైకొని బయలు వెడలి దేశసభ్యతను గమనించుచు క్రమక్రమముగా వారాణసి చేరి చెట్టు క్రింద దిగిరి. అప్పటికి వారాణసి ప్రభువు చనిపోయి యేడురోజు లాయెను. మరునాడు పుష్పరథము బయలుదేరు నని చాటింపు జరిగెను. తెల్లవారుసరికి పోత్తకుమారుడు ముందుగా లేచి న్యగ్రోధకుమారుని పాదములు పట్టుచుండెను. ఆచెట్టుపై నున్నకోడి క్రిందికొమ్మపై నున్నకోడిపై రెట్ట వేసెను. "ఎవరిట్లు చేసిరి ?"

"మిత్రమా, నేనే పొరపాటున చేసితిని."

"ఓరీ, నీవు రెట్ట వేయుటకు నా శరీరమే స్థానమనుకొంటివా? నా సత్త్వము నీకు తెలియదు." "ఓరీ నేను పొరబడితినిఅని చెప్పినను నీవు ఎగిరిపడుచున్నావు. నీ సామర్థ్యమెంత?" "నన్ను చంపి తినువారికి తెల్లవారుసరికి 1000 నాణెములు లభించును. అందుచేత నేను గర్వపడను?" "ఓరీ దీనికే యెగిరి పడుచున్నావా? నన్ను చంపి పైమాంసము తినువాడు తెల్లవారుసరికి రాజగును; నడిమిమాంసము తినువాడు సేనాధిపతి యగును: బొమికలు నమలువాడు ఖజాంచీ యగును." పోతకుడు ఆమాటలు విని తనలో "వేయినాణెములవలన నాకు లాభమేమి? రాజగుటయే మంచి" దనుకొని మెల్లగా చెట్టుపై కెక్కి పైన పండుకొనియున్నకోడిని చంపి, దిగి నిప్పులలో కాల్చి పైమాంసము నిగ్రోధకుమారునకు, మధ్యమాంసము శాఖకుమారునకు పెట్టి బొమికల కంటుకొన్నమాంసము తాను తినెను. ఆహారానంతరము "నిగ్రోధకుమారా, నేడు నీవు రాజగుదువు; శాఖకుమారుడు సేనాధిపతి యగును. నేను ఖజాంచీ నగుదును." "నీకెట్లు తెలియును" అని వారడిగినపిమ్మట జరిగినవృత్తాంతము తెలిపెను. మారుదయముననే వారు జనికి పోయి ఒకానొక బ్రాహ్మణునియింట నేయి, చక్కెర, క్షీరము పుచ్చుకొని నగరము వెలువడి ఉద్యానవనము ప్రవేశించిరి. నిగ్రోధకుమారుడు శిలాలయ మండపముపై పండుకొనెను, తక్కినయిరువురు బయట పండుకొనిరి.

అప్పుడు పంచరాజ చిహ్నములు లోపలనుంచి చిత్రించిన రథము ఉద్యానము చేరి ముందరికి కదలక ఆగిపోయెను. పురోహితుడు తనలో "ఉద్యానమున నెవరో పుణ్యాత్ము లుండవలెను" అనుకొని లోనికి జని కుమారుని గాంచి అతని కాలిపై నున్న దుప్పటి తొలగించి చూడగా పాదమున చక్రవర్తిలక్షణములు కానబడెను. వారణాసిమాట యేమి, సమస్త జంబూద్వీపమునకు చక్రవర్తి యగుటకు తగినవాడనుకొని పురోహితు డతనిశరీరము పరీక్షించెను. నిగ్రోధకుమారునకు మెలకువ వచ్చెను. ముఖముపై దుప్పటి తొలగించి జనసమూహమును గాంచి ప్రక్కకు తిరిగి పండుకొనెను. కొలదిక్షణములలో లేచి శిలాఫలకముపై కూర్చుండెను. బ్రాహ్మణు డభివాదనము చేసి "రాజ్యముపై అధికారము మీది" అని, అతను మంచి దనిన పిదప రత్నఖచిత సింహాసనముపై గూర్చుండ బెట్టి అభిషేకము చేసెను. కుమారుడు రాజైనపిదప శాఖకుమారుని సేనాధిపతిని చేసి వైభవముతో నగరమున ప్రవేశించెను. పోత్తియకుమారుడు కూడ ఆతనివెంట

నగరములోని కరిగెను. అప్పటినుండి బోధిసత్త్వుడు ధర్మానుసారముగా రాజ్య మేలుచుండెను.

ఒకనాడు తలిదండ్రులమాట జ్ఞప్తికి వచ్చి శాఖకుమారునితో "తలిదండ్రులు లేక నే నుండజాలను. నీవు సముచితపరివారముతో చని జననీజనకులను తోడ్కొని రమ్ము" అనెను.

శాఖకుమారుడు అంగీకరింపక "అచట నాకేమియు పనిలేదు." అనెను. అంతట బోధిసత్త్వుడు పోత్తియునితో చెప్పెను. ఆతడు మంచి దని బయలుదేరి తలిదండ్రులను సమీపించి "మీకుమారుడు రాజయినాడు. రండు పోవుదము" అనెను. వా రంగీకరింపక "నాయనా, మాకడ కావలసినంత ధన మున్నది. అక్కడకు వచ్చుట మాకు రుచించుట లేదు," అనిరి. శాఖకుమారుని తలిదండ్రులతో రాజవిషయము చెప్పగా వారుకూడ సమ్మతింప లేదు. తనతల్లిదండ్రులతో గూడ రాజవిషయము ప్రసంగింపగా వారుకూడ సమ్మతింపక "పోనిమ్ము. మే మిచ్చటనే నివసించుచు వస్త్రములు తయారు చేసి కాలము గడుపుకొనగలము" అనిరి. వారల యంగీకారము పొందలేక ఆతడు వారణాసికి తిరిగెను. అతడు తనలో "త్రోవలో సేనాధిపతియింట విశ్రాంతి తీసుకొని పిదప నిగ్రోధకుమారుని కలిసికొందును" అనుకొని సేనాధిపతి సౌధద్వారముకడ నిలిచి లోనికి "నీమిత్రుడు పోత్తియకుమారుడు వచ్చినాడు" అని వార్త నంపెను. ద్వారపాలకుని మాటలు విని శాఖకుమారుడు "వీడు రాజ్యము నాకీయక నిగ్రోధకుమారున కిచ్చినాడు" అనెడి వైరభావముతో నుండి వార్త విని మండిపడి లేచి వచ్చి "ఎవడు వీనికి మిత్రుడు! దాసీపుత్రుని- పిచ్చివానిని- పట్టుకొనుడు" అని మెడ పట్టి నెట్టించెను. అతడు తనలో "శాఖకుమారునకు సేనాపతిపదవి నే నిప్పించినదే. వీడు కృతఘ్నుడు, మిత్రద్రోహి నన్ను కొట్టి నెట్టించినాడు. నిగ్రోధుడు విజ్ఞుడు కృతజ్ఞుడు, సత్పురుషుడు, అతనిసన్నిధికి పోయెదను" అనుకొని రాజద్వారమున నిలిచి లోనికి వార్త పంపెను. రాజు అనుజ్ఞ నిచ్చి ఆతడు లోనికి వచ్చినంతనే పీఠమునుండి లేచి స్వాగతము పలికి, కుశల మడిగి అతనికి క్షురకర్మాదిక మేర్పాటు చేసెను.

ఆవల వివిధాభరణములతో అలంకరించి, రుచ్యపదార్థములతో విందు చేసి, అతని ప్రక్కన సుఖాసీను డయ్యెను. ఆవల తలిదండ్రులను గూర్చి కుశలప్రశ్న లడిగెను. వారు రాలే మని చెప్పినవిషయము తెలిసికొనెను.

అక్కడ శంఖకుమారుడు తనలో "ఈపోత్రియ నాకు విరుద్ధముగా రాజుతో నామీద నింద మోపజాలడు; నేనుండగా నేమియు వ్యతిరేకముగా పలుకలేడు" అనుకొని రాజసముఖమునకు పోయెను. పోత్రియకుమారుడు శంఖకుమారుని యెదుటనే రాజును సంబోధించి "దేవా, తాము నమ్మెదరో నమ్మరో నాకు మార్గమున బడలిక కలుగుటచే త్రోవలో నున్న శంఖకుమారుని యింట విశ్రాంతి గైకొని పిదప తమసన్నిధికి రాదలచి ఇతని యింటికి పోయి యిచటికి వచ్చితిని. శంఖకుమారుడు నన్ను గుర్తింపక నన్ను మెడ బట్టి గెంటినాడు" అని మూడు గాథలు పలికెను :

ఏ నెరుంగను వీని, నీత డెవ్వాండు ?
ఎవరివా డని శంఖు డెరుగనియట్లు
న న్నన్నమాటలు న్యగ్రోధ, గణన
చేయుదువా ? శంఖుసేవకగణము
కొట్టి మోమున, మెడ పట్టి నెట్టినది.

ద్రోహి, కృతఘ్నుండు, దుర్మతి నీదు
సఖు డైన శంఖుండు సలిపినా డయ్యె
హే జనాధిప, యిట్టి హేయకార్యమ్ము!

విని న్యగ్రోధకుమారుడు ఈ గాథ పలికెను :

ఈ సంఘటనము నే నెరుగను, నాకు
నెవ్వరు చెప్పలే దిప్పుడు శంఖు
వృత్తాంతమును నాకు విన్నవించితివి
నీవు మిత్రమ, నాకు జీవనదాత
విప్రుడవు మా కహీనసంపత్తు.

నీమూలమున గల్గె నిజముగా బుద్ధి
ఇందులో సందియ మేమియు లేదు.
అంకురింపక మాడునట్లు బీజంబు
వహ్నిలో బడి, దుష్టవర్తను డైన
జనునకుం జేసినసత్కృతి కూడ
సత్ఫలం బొసగక సమసియే పోవు!

శీలవంతుండును, చేసిన మేలు
విస్మరింపక, ఆర్యవృత్తంబు కల్గు
నుత్తమునకు జేయు నుపకార మెపుడు
సత్‌క్షేత్రపతిత బీజమువోలె వెలగు.

ఈ విధమున న్యగ్రోధుడు పలుకునపుడు శాఖకుమారుడు అచటనే నిలిచి యుండెను. రాజు "శాఖ, ఈపోత్తికుని గుర్తింపగలవా ?" అనెను. ఆతడు ఊర కుండెను. రాజు ఆనతి ఇచ్చుచు ఈ గాథ పలికెను :

వంచకుడితండు దుర్మార్గవర్తనుండు
బలిమి హరియింపవలె వీని ప్రాణములను
వీడు జీవముతో నుండ చూడగోర !

విని పోత్తికుడు తనలో "ఈ మూర్ఖుడు నాముందున మరణింప రాదు." అనుకొని ఈ గాథ పలికెను :

ఇతనిని మహాప్రభూ, క్షమియింప దగును
మరణ మొందిన ప్రాణముల్ తిరిగి రావు !
ఇతడు దుష్టుడైనను క్షమింప దగును
కోర నే దేవ, ఈతని మారణంబు.

రాజాతనిమాటలు విని శాఖకుమారుని క్షమించెను. ఆతడు పోత్తియకుమారునే సైన్యాధిపతిని చేయవలె ననుకొనెను. కాని ఆతడిష్టపడలేదు. అన్ని అభియోగములను విచారించు భాండాగారికపదవి యాతనికిచ్చెను, పూర్వ మీ పదవిలేదు; అప్పటినుండియే ఆరంభమయినది.

కొంతకాలమునకు పోత్తియకుమారుడు బిడ్డలతో కాలముగడిపి వృద్ధుడయ్యెను. తన సంతానమున కుపదేశ మిచ్చువాడై ఈ గాథ పలికెను :

ఆచరింపం దగు న్యగ్రోధసేవ,
చనరాదు శాఖుని సవిధమ్మునకును
శాఖునికడ జీవసంపదకన్న
న్యగ్రోధుకడ మరణమ్మె శ్రేయమ్ము.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి భిక్షువులారా, "ఇప్పుడే కాదు పూర్వము కూడ దేవదత్తుడు కృతఘ్నుడు" అని జాతకమును సరిపోల్చెను: ఆ కాలమున శాఖకుమారుడు దేవదత్తుడు; పోత్తియకుమారుడు ఆనందుడు; న్యగ్రోధకుమారుడు నేనే.

0

# ౪౪౬. తక్కళ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు పితృపోషకు డగు ఉపాసకుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఆతడు పేదకుటుంబమున పుట్టెను. తల్లి పోయిన పిమ్మట ఆతడు ప్రాతః కాలముననే లేచి తండ్రికి దంతధావనాదికములకై వస్తువులు సమకూర్చెడివాడు. కూలి గాని, పొలము పని గాని చేసి దానివలన వచ్చు ద్రవ్యముతో తండ్రికి ఆహారము సిద్ధము చేసెడివాడు. తండ్రి కుమారునితో "నాయనా, నీ వొక్కడవే యింటి పనులు, పొలము పనులు చేయుచున్నావు. నీకు వివాహార్థము కన్యను కొని తెత్తును. అది గృహకృత్యములు నిర్వహించును" అనెను.

"నాయనా, స్త్రీ యింటిలోనికి వచ్చినపిమ్మట నీకు గాని, నాకు గాని చిత్త శాంతి యుండదు. ఇట్టి మాటలు చెప్పవద్దు, నీజీవితాంతము వరకును నేను సేవ చేయుచుందును. అనంతరము చూచెదను," అనెను.

కుమారుని అంగీకారము కొనకున్నను తండ్రి ఒకానొక వధువును తీసికొని వచ్చెను. ఆమె మిగుల నమ్రతతో భర్తకును, మామగారికిని సపర్యలు చేయుచుండెను. కొంతకాలము గడచినపిదప ఆమె తనలో "నాభర్త దొరికినదానిని తండ్రికి ఈయక నా కిచ్చుచున్నాడు. నిజముగా తండ్రియెడల ఆయనకు ప్రీతి లేదు. ఒక ఉపాయము నవలంబించి ఈ ముసలివానిని ఇంటినుండి ఆవలకు బంపెదను." అనుకొని, అప్పటినుండి ఆయనకు కోపమువచ్చు మాటలు పలుక జొచ్చెను. స్నానమునకు చాల చల్లని నీరు గాని, చాల వేడినీరు గాని పెట్టుచు, వంటలో ఉప్పు ఏమాత్రమును వేయక గాని, ఎక్కువ వేసిగాని వడ్డించుచు, ఉడికీఉడకని బియ్యము గాని మాడు గాని పెట్టుచుండెను. ఆయనకు కోపము వచ్చినప్పుడు "ఈ ముదుసలికి సపర్యలు ఎవరు చేయగలరు?" మొదలగుకఠినవాక్యాలు పలుకుచు, జగడము పెట్టుకొనెడిది; ఎట్టెట్లో భర్తను నిందించి కోపము తెప్పించెడిది. "చూడు, మీ నాయనగారి పని! ఇట్లు చేయవల దన్నమీదట కోపించును. ఈ యింట నన్నో,

మామాయనగారిని ఉండనిండు" అనును. ఆత డిట్లనెను. "భద్రే, నీవు చిన్న దానవు. ఎప్పటికయినను బ్రోయి ఉండగలవు. మామాయన పెద్దవాడు. నీవు ఇది సహింపని పక్షమున రీ యింటినుండి వెడలుము." ఆమె భయపడి వృద్ధుని పాదములపై బడి క్షమింపు మని కోరి "ఇది మొదలు ఇట్లుచేయను" అనెను, అప్పటినుండి ఆమె వెనుకటి తీరునే సేవలు చేయజొచ్చెను.

ఆ రోజులలో ఇంటిలోని పోరువలన ఉపాసకుడు శాస్త కడకు ధర్మోప దేశము వినుటకు పోజాలకుండెను. మరల ఇంటిలో స్వస్థత ఏర్పడినపిదప చనెను. శాస్త అతనిని చూచి "ఉపాసకా, నీవు ఏడెనిమిది రోజులనుండి ధర్మోపదేశము వినుటకు వచ్చుట లే దేమి ?" అనెను. ఉపాసకుడు స్థితిగతులు విన్నవించినపిదప "ఇప్పుడు మాత్రము నీవు భార్యమాట వినక తండ్రిని వెళ్ళగొట్టకుంటివి. కాని పూర్వజన్మలో ఆమె మాట విని తండ్రిని శ్మశానములోనికి గొనిపోయి గోతిలోనికి త్రోసితివి. అప్పుడు నేను తలిదండ్రులయెడల ఆచరింపవలసిన ధర్మములను బోధించి నిన్ను పితృహత్యనుండి నివారించితిని. అప్పటి నాయుపదేశములు విని జీవితాంతము వరకును తండ్రికి సేవలు చేయుచు స్వర్గము చేరితివి. జన్మాంతరమున కూడ నాఉపదేశములు విస్మరింప లేదు. అందుచే నిప్పు డామెమాట విననైతివి" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఒకానొక వంశమున జన్మించిన బాలునకు వశిష్ఠకు డని పేరు పెట్టిరి. అతడు తల్లిదండ్రు లకు ఉపకారము చేయుచు తల్లిమరణానంతరము తండ్రికి ఉపకారము చేయు చుండెను. అతనిభార్య "స్వామీ, మామాయనగారి చేష్టలు చూడుడు, ఆయన కఠి నుడు, కలహశీలి, వృద్ధుడు, రోగి, త్వరలోనే మరణింపగలడు. నేను రీ యింట నుండజాలను." అని మాటిమాటికిని చెప్పినపిదప భర్త "భద్రే, మానవుని చంపుట సులువు కాదు, ఆయనను చంపుట యెట్లు ?" అనెను. "అట్లయిన మీకు ఉపా యము చెప్పెదను." "అయినచో తెలుపుము." "స్వామీ, మీరు వేకువజాము ననే లేచి మామాయనగారి మంచముకడకు జని అందరకు వినబడునట్లు పెద్ద గొంతుతో ఫలానా గ్రామమున మనకు ధన మీయవలసినవాడు ఉన్నాడు. నేను వెళ్ళినను రీయకున్నాడు. మీతగువాతకూడ రీయడు. ఉదయము బండిలో బయలు దేరుదము అనుడు. ఆయన లేచునప్పటికి మీరు బండి కట్టుడు, అందులో ఆయన

కూర్చున్నపిదప శ్మశానమునకు గొనిపొండు, దొంగలు దోచుకున్నారని కేకవైచి నెత్తిపై గొట్టుడు" అని ఆమె చెప్పినది. బాగున్న దని తలచి యతడు బండి సిద్ధము చేసెను. అతనివెంట ఏడేళ్ళబాలు డుండెను. బాలుడు చదువుకొన్నవాడు. మేధావి. బాలుడు తల్లిమాటలు ఆలకించి తనలో "నాతల్లి దుర్మార్గురాలు. మా నాయనచే తండ్రిని చంపింపనున్నది. ఇట్టిపని కానీయకుండ చూచెదను" అనుకొని నెమ్మదిగా తండ్రికడకు జని పండుకొనెను. వశిష్ఠకుడు నిర్ణీతసమయమునకు బండి సిద్ధముచేసి తండ్రికడకు జని "నాయనా మనకు కావలసిన ధనము దెచ్చుకొందము" అని తండ్రిని బండిలో గూరుచుండ బెట్టుకొనెను. బాలుడు ముందుగనే పోయి బండి యెక్కెను. తండ్రి వానిని నివారింపలేక తుదకు వెంట రానిచ్చెను. తండ్రి కుమారుని బండిలో నొక ప్రక్క గూరుచుండ బెట్టి పలుగు, పార పట్టుకొని పోయి మారుమూల త్రవ్వ నారంభించెను. బండి దిగి బాలుడు నెమ్మదిగా జనకునికడకు జని, ఏమియు నెరుగనివానివలె సంభాషణ మారంభించి యీగాథ పలికెను :

అడవిలోన శ్మశానమ్మునందు తండ్రి
కానబడవు కదంబమున్ గడ్డలేని;
త్రవ్వుచున్నాడ వింక గర్తమ్ము నేల ?

తండ్రి యీగాథ పలికెను ;

బాధ పడుచున్నవాడు దుర్బలతవలన
తాత, వ్యాధులు పీడింప సతతముగ.
తాత జీవించి యుంట యుక్తమ్ము కాదు
కాన పూడ్చెద నతని నీగర్తమందు.

విని, కుమారుడు ఈ గాథ పలికెను :

నీదు సంకల్పంబు నింపుపాపంబు
తోడ గూడిన, దిట్టి దుష్టభీకరము
కృత్యంబు చేసెద వేటికి తండ్రి ?

ఇట్లు పలికి తండ్రిచేతిలోని పలుగు తీసుకొని సమీపములో నేల త్రవ్వ జొచ్చెను. తండ్రి వచ్చి "నాయనా, ఏల త్రవ్వుచున్నావు ?" అనెను. అతడు ప్రత్యుత్తర మిచ్చువాడై ఈ గాథ పలికెను;

జరుగుట నిజ మిట్టి సంఘటనమ్ము
నాయనా నీకును, నామూలమునను
వచ్చినయంతనే వార్ధకదశయె.

వంశపారంపర్య వర్తనంబునకు
తగినట్లు నిన్ను గర్తంబున పూడ్తు.

ఆతని తండ్రి యీ గాథ పలికెను :

కఠినపాక్కులతోడ గాయంబు చేసి
నను బాధపెట్టుచున్నావు కుమార !
ఔరసుండవె కాని అహితచిత్తుడవు.

ఇట్లాతడు పలికినపిదప బుద్ధిమంతుడైన బాలుడు ప్రత్యుత్తరముగా నొకగాథ, ఉల్లాసముగా నొకగాథయు పలికెను :

హితచింతకుడ నే నహితచింతకుండ
కాను నాయన, పాపకార్యంబునుండి
మరలింప సంకల్ప, మంతియే సుమ్ము.

చంపు నేపాపి నిర్దోషిజనకు నైన
తల్లి నైనను నరకమ్ము తప్పకుండ
చెందు నవ్వాడు మరణమ్ము పొందుపిదప.

అన్నపానాదుల నొసంగి కన్నతల్లి
దండ్రులకు సేవ చేయునాతండు మరణ
మొందిన యనంతరంబునం దోవసిష్ఠ
సద్గతిం జెందు ననుట నిస్సంశయంబు.

పుత్రుడు చెప్పిన ధర్మోపదేశము విని తండ్రి ఈ గాథ పలికెను ;

కా వహితచింతకుండవు నీవు పుత్ర
అగుదువు హితైషివే, భవదీయజనని
పలుకుచే క్రూరకర్మంబు సలుపనుంటి.

ఇది విని బాలుడు ''నాయనా, స్త్రీలదోష మెరిగియు ఎంతకును నిగ్రహింపకున్నచో పాపకర్మము జరుగును. మరల నాతల్లి ఇట్లు చేయకుండునట్లు నివారింప వలెను.'' అని ఈ గాథ పలికెను :

జన్మకారణ మైనట్టి జనని నాకు
నీకు నర్ధాంగి యైనయా నింద్యచరిత
గెంటివేయుము తోడనే యింటినుండి
కానియెడ నామె కూర్చు ననూనబాధ.

తండ్రి కుమారుని మాటలు విని ప్రసన్నచిత్తుడై "నాయనా, రమ్ము పోవుదము అనెను" అనెను. తండ్రి కుమారులతో కూర్చుండి ఆమె కూడ బండితో కదలెను. ఇంటికి పోయి, దౌర్భాగ్యురాలిని వెడలగొట్టినట్లు తలచి ఇల్లు అలికి పాలు కాచి యుంచెను. అపుడు వారందరును వచ్చుట చూచి వెడలగొట్టిన దానిని మరల కొని వచ్చినాడని యెంచికోపించి, ఓరిదుర్మార్గుడా, వెడలిపోవు నిర్భాగ్యురాలిని మరల తీసికొని వచ్చినావా, అని నిందించెను. వసిష్ఠుడు మౌనముగా బండితలుపు తెరచి "దురాచారిణీ ఏమనుచున్నావు!" అని బాగుగా కొట్టి కాలుపట్టి యీడ్చి "నేటినుండి నాయింట మసలవలదు" అని వెలుపలికి నెట్టివేసెను.

మువ్వురును క్షీరము త్రాగిరి. ఆదుర్మార్గురాలు కొలదిదినములపాటు వేరొక యింట నుండెను. అపుడు బాలుడు తండ్రితో "నాయనా, నాతల్లి ఇప్పటికి తెలివి తెచ్చుకొన్నది. ఫలాని గ్రామమున నామామకూతు రున్నది. ఆమె వచ్చి మా నాయనకు కుమారునకు ఉపకారము చేయును. ఆమెను తీసికొని వచ్చెదను అని చెప్పి గంధమాల్యాదులు తీసుకొని బండి నెక్కి బయలువెడలుము. పగలు పొలమున నుండి సాయంకాలమునకు మరలి రమ్ము" అని చెప్పెను. అత డట్లే చేసెను. ఇరుగుపొరుగు అమ్మలక్కలు నీవద్ద "వేరొక భార్యను తెచ్చుకొనుటకై వేరొక గ్రామము చనినాడు" అని చెప్పినారు. ఆమె భయపడి "ఇక అవకాశము లేదు. నాకుమారుని వేడికొందును" అనుకొని నెమ్మదిగా వానికడకు జని వాని పాదములపై బడి "నాకు తోడ్పడువారు లేరు. నేటినుండి మీ కందరకును స్వాపమును అలంకరించునట్లు ఉపకారములు చేసెదను. మరల నన్ను ఇంటికి జేర్పింపుము" అని వేడుకొనగా. బాలుడు "మంచిది. మరల నీ వట్లు చేయవలదు, అప్రమత్తతతో నుండుము." అని తండ్రి వచ్చుసమయమున ఈగాథ పలికెను :

అనె వశీభూత యైనది, శాంత
మానస హస్తినిమాడ్కి నియ్యెడను
ఇంటికి గ్రమ్మర నేతేరవచ్చు,

అతడు తండ్రితో ఇట్లు పలికి తల్లిని తీసుకొనివచ్చెను. ఆమె భర్తను, మామను క్షమింపుడని వేడి ధర్మమార్గమున ఇంట సేవలు చేయుచుండెను. వారు కుమారుని యుపదేశానుసారముగా దానాదిపుణ్యకార్యములు చేయుచు స్వర్గగాములయిరి.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి సత్యక్రియ కావించి జాతకములు సరిపోల్చెను. పితృపోషకుడు శ్రోతాపత్తిఫలము నందెను. ఆకాలమున తండ్రి కొడుకులు నీరే: కుమారుడను నేనే.

-o-

# 447. మహాధర్మపాల జాతకము

శాస్త ప్రథమపర్యాయము కపిలవస్తుకు జని, తండ్రినివాసస్థానమైన న్యగ్రోధారామమున విహరించు సమయమున రాజు నవిశ్వాసమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శుద్ధోదనమహారాజు ఇరువదివేలభిక్షువులతో కూడియున్న బుద్ధుని నిజగృహమునకు ఆహ్వానించి యవాగుపానీయము నిచ్చి భోజనానంతరము కుశలాదికము అడిగి "భన్తే, మీరు యోగాభ్యాసము చేయుకాలమున దేవత అరుదెంచి ఆకసమున నిలిచి "నీకుమారుడు ఆహారము లేక మరణించినాడు" అని తెల్పెను. శాస్త "మహారాజా, మీరు నమ్మితిరా?" అని అడిగెను.

"భన్తే. నమ్మలేదు. ఆకసమున నిలిచి పలికినదేవతమాటలు స్వీకరింపక నాకుమారుడు బోధివృక్షముక్రింద గూర్చుండి బుద్ధత్వమును పొందువరకును పరినిర్వాణము చెందడు అంటిని".

"మహారాజా. మీరు పూర్వము మహాధర్మపాలుడై జన్మించినప్పుడు కూడ ప్రసిద్ధాచార్యుడు ఇవి నీకుమారుని యెముకలని చూపినను మీరు నమ్మలేదు. ఇప్పుడు ఎట్లు విశ్వసింతురు?" అని, శాస్త తండ్రి కోరిన పిమ్మట పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా కాశీరాష్ట్రమున ధర్మపాలగ్రామ ముండెను. అందు ధర్మపాలవంశ ముండుటచే గ్రామమునకు ఆపేరు వచ్చెను. అచట దశకుశలకర్మ లాచరించు బ్రాహ్మణునకు ధర్మపాలుడని పేరు వచ్చెను. వారి పరిపాలనములో పరిచారికలు, పరిజనులుకూడ దానధర్మములు చేయుచు, శీలములు రక్షించుచు ఉపోసథవ్రత మాచరించుచుండిరి. బోధిసత్త్వుడు ఆసమయమున వారియింట పుట్టెను. అతనికి ధర్మపాలకుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగి పెద్దవాడైనపిదప తండ్రి 1000 నాణెము లిచ్చి విద్యలు నేర్చుకొనుటకై తక్షశిలానగరమునకు పంపెను. యువకు డచ్చటికి చేరి.

ప్రసిద్ధాచార్యునివద్ద విద్యాభ్యాసము చేసెను. అచట 500 మంది శిష్యులతో ఆతడు జ్యేష్ఠశిష్యపదవి నొందెను.

ఆసమయమున ఆచార్యుని జ్యేష్ఠపుత్రుడు మరణించినాడు. తనచుట్టును, శిష్యులు, జ్ఞాతులు పరివేష్టించి యుండగా ఆచార్యుడు దుఃఖించుచు పొదకు శ్మశానమునకు కళేబరము గొనిపోయి అంత్యక్రియలు కావించెను. అప్పుడెల్లరు నేడ్చి మొత్తుకొనుచుండిరి. ధర్మపాలకుమారుడు మాత్రము శాంతముగా నుండెను. ఐదు వందలమంది శిష్యులు మరలి వచ్చి ఆచార్యునికడ కూర్చుండి "అయ్యో! ఆచారవంతుడు, తరుణవయస్కుడు అగు కుమారుడు తల్లిదండ్రులను విడనాడి మరణించినాడు." అనిరి. ధర్మపాలుడు వారితో "మిత్రులారా, అతడు తరుణ వయస్సుననే పోయినాడని మీ రన్నారు. చిన్నతనముననే ఏల మరణించెను? యౌవనమున పోవుట సముచితము కాదు" అనెను,

"మిత్రమా, ప్రాణు లెల్లరు మరణింప వలసిన వా రని తెలియదా?" "తెలియును, కాని ప్రాణి తారుణ్య ముండగా చనిపోవదు. వార్ధకము వచ్చినంతనే మృతి సంభవించును." "సంస్కారము లన్నియు అనిత్యములు. నిత్యముండు వారు లేరా?" "అనిత్య మగుట సత్యమే. అయినను ప్రాణి బాల్యముననే మరణింపదు, వృద్ధుడైన పిదపనే అనిత్యమును పొందును." "మిత్రమా, ధర్మపాలా, మీయింట నెవరును చనిపోవుట లేదా?" "చిన్నతనమున మరణించుట లేదు, వార్ధకముననే మరణము సంభవించును,"

"ఇది మీకులక్రమాగత మగు నాచారమా?"

"అవును, కులపరంపరాగతమే."

విద్యార్థులు చని ఆతనిమాట లాచార్యునకు నివేదించిరి. ఆచార్యుడు అతనిని బిలువ నంపి "నాయనా, ధర్మపాలా, నిజముగా మీయింట చిన్నతనమున నెవ్వరును చనిపోవుట లేదా?" అనెను, "ఆచార్యా, సత్యమే." గురువాతనిమాటలు విని తనలో "ఇతడు మిగుల ఆశ్చర్యకర మగు వార్త చెప్పుచున్నాడు. పోయి ఇతనితండ్రి నడిగి యీతనిమాటలు సత్య మగునేని నేనుగూడ ఆ ధర్మమునే అనుష్ఠింతును" అనుకొని చేయవలసిన కర్మ లన్నియు జేసి, తరువాత కొలదిదినములకు ధర్మపాలుని పిలిపించి "నాయనా, నేను బయటకు పోవలెను. నేను మరలి వచ్చువరకు విద్యార్థులకు పాఠములు చెప్పుచుండుము" అనెను. మేకబొమికలు తెప్పించి

అందు రెండు సుగంధతైలములు వేసి సంచిలో నుంచి, చిన్న సేవకుని వెంట పెట్టుకొని తక్షశిలనుండి బయలుదేరి క్రమముగా ఆ గ్రామము చేరెను." ధర్మపాలుని గృహమేది" అని అడిగి తెలిసికొని ద్వారము చేరి నిలిచెను. అక్కడి పరిచారకులలో ఆచార్యుని తాలుత చూచినవారిలో నొకడు చేతినుండి గొడుగును, ఒకడు పాదములనుండి పాదరక్షలును, ఇంకొకడు చేతినుండి సంచిని తీసికొనిరి. "ధర్మపాలకుమారునియాచార్యుడు వచ్చి ద్వారముకడ నిలిచినాడని యజమానునకు తెలుపుడు" అని గురువు పలికినపిదప మంచి దని వారట్లే చేసిరి. ధర్మపాలుడు త్వరితముగా వచ్చి ఆచార్యుని లోనికి గొనిపోయి మంచముపై కూరుచుండబెట్టి ఆవల పాదములు కడిగి పూజించెను. భోజనానంతరము సుఖాసీనుడై "బ్రాహ్మణోత్తమా, నీకుమారుడు మిక్కిలి ప్రజ్ఞ గలవాడు. మూడువేదములందును అష్టాదశవిద్యలందును ఉత్తీర్ణుడైనాడు. కాని, ఏదో వ్యాధివలన అతనికి మరణము ప్రాప్తించినది. అన్ని సంస్కారములు అనిత్యములు" అని చెప్పెను. బ్రాహ్మణుడు చప్పట్లు కొట్టి గట్టిగా నవ్వెను.

"బ్రాహ్మణోత్తమా, నవ్వెద రేల?" "నాకుమారుడు మరణింపడు. వేరొకడు మరణించి యుండును." "నీకుమారుడే పోయినాడు. బొమికలు చూచి నమ్ముము," అని ఆచార్యుడు సంచిలోనుండి బొమికలను చూపి "ఇవి నీకుమారుని అస్థికలు" అని పలికెను, "ఇవి మేకవో, కుక్కవో కావచ్చును. నాకుమారుడు పోలేడు. సప్తపురుషాంతరములనుండి మావంశమున తరుణవయస్సున నెవరును పోలేదు. నీవు చెప్పునది సత్యము కాదు" అని విప్రుడనెను.

అప్పు డెల్లరును కరతాళధ్వనులు చేసి, పెద్దపెట్టున నవ్విరి. ఆచార్యుడు విస్మితుడై, ప్రసన్నచిత్తుడై "బ్రాహ్మణోత్తమా, మీవంశమున నిష్కారణముగా తరుణవయస్కులు మరణించుట సంభవింపదు, యువజనులు మరణింపకుండుటకు కారణ మేమి?" అని గాథ పలికెను:

నీవ్రతం బెట్టిది? నీ శ్రేష్ఠచర్య
యెద్ది? ఏసత్కార్య హేతువుచేత
బ్రాహ్మణా, నీకిట్టిఫలితమ్ము కలిగె?
మృతి చెందకుందురు మీవంశమందు
తరుణవయస్కు లెద్దాననో చెపుమ!

ఆయన విని యేగుణములవలన తరుణవయస్కులకు మృత్యువు సంభవింపదో యని యిట్లు ఉగ్గడించెను :

పలుక రసత్యంబు, పాపకృత్యముల
కడకు బోవ, రనార్యకార్యంబు లెవ్వి
నలుప రెన్నడు ధర్మసరణి జరింత్రు
యువకు లద్దానిచే నొందరు మృతిని.

ద్వివిధధర్మంబులు విని యసద్ధర్మ
పరులను విడిచి, సత్పురుషుల నెంత్రు
యువకు లద్దానిచే నొందరు మృతిని.

దాన మిచ్చెడువేళ, తత్పూర్వమందు
సైత ముండుదుము ప్రసన్నతతోడ
లేదు పశ్చాత్తాపలేశంబు కూడ;
యువకు లద్దానిచే నొందరు మృతిని,

శ్రమణుల, విప్రుల, సర్వయాచకుల
కన్నపానీయముల్ మున్నుగా నిచ్చి
సంతుష్టచిత్తుల నలుపుచుండుదుము
యువకు లద్దానిచే నొందరు మృతిని,

పరులభార్యలయెడ బ్రహ్మచర్యంబు
నిజపత్నియెడ గాక నెరపుచుండుదుము
యువకు లద్దానిచే నొందరు మృతిని.

ఇట్టి యుత్తమాంగనలందు బుట్టినట్టి
సుతులు వేదజ్ఞులును బహుశ్రుతులె గాక
అధికమేధాంచితులును ప్రజ్ఞాన్వితులును
అందుచేత వయఃస్థులు పొందరు మృతి.

తల్లి తండ్రియు సోదరుల్ తనయు లతివ
లెల్లరుం గూడ పరలోకపీఠమున కయి

ఆచరింతురు ధర్మకార్యంబు లెపుడు
అందుచేత వయస్థులు చెందరు మృతి.

ఆచరింతురు ధర్మకార్యములు కర్మ
కారు, లుపజీవులును, పరిచారకులును
పారలౌకికసౌఖ్యమే ప్రతిఫలముగ
అందుచేత వయస్థులు చెందరు మృతి.

తుదకు ధర్మచారులగుణములను రెండుగాథలద్వారమున పలికెను :

ధర్మచారిని రక్షించు ధర్మ మెపుడు
అధికసౌఖ్యము నొసగు ధర్మాచరణము-
అట్టివానికి దుర్గతి పట్టబోదు,

ధర్మచారిని రక్షించు ధర్మమెపుడు
జనుని వానకాలంబున ఛత్రమట్లు
ధర్మరక్షితు డగును మాధర్మపాలు
డుండు సుఖముగ. నస్థిక లొరుల వగును.

ఇది విని ఆచార్యుడు "నేను వచ్చుట మేలాయెను. నారాక సఫల మయ్యెను నిష్ఫలమూ కాలేదు." అని ధర్మపాలుని తండ్రిని క్షమింపవేడెను. "నేను వచ్చునపుడు మిమ్ము పరీక్షచేయుటకు రెండస్థికలు తెచ్చితిని. నీకుమారుడు ఆరోగ్యముతో నున్నాడు. నీవు పరిపాలన చేయుధర్మము నాకు గూడ అనుగ్ర హింపుము." అని కొలదిదినము లచట నుండి ఆవల తక్షశిలకు మరలిపోయెను. ధర్మపాలకుమారునకు విద్యలు పూర్తిగా నేర్పి బాలమంది యనుచరులతో నాచార్యు డతనిని స్వగ్రామమునకు పంపెను.

శాస్త శుద్ధోదనున కుపదేశము చేసి, రెండుధర్మ ప్రకాశమున సత్యక్రియ జరిపి జాతకములు సరిపోల్చెను. సత్యక్రియానంతరము రాజు అనాగామిఫలము నందెను. ఆకాలమున ఆచార్యుడు సారిపుత్రుడు, ధర్మపాలకుమారుడు నేనే.



## 448. కుక్కుట జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు, వధ ప్రయత్నమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ధర్మసభలో దేవదత్తుని దుర్గుణములను గూర్చి చర్చ జరుగుచుండెను. శాస్త అచ్చటి కరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, కేవలము ఇప్పుడే కాదు పూర్వము కూడ ఇతడు నన్ను వధించుటకై ప్రయత్నము చేసియుండెను." అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వకాలమున కోశాంబిలో కాశంభకనామకుడను రాజు పరిపాలన చేయుచుండెను. ఆకాలమున బోధిసత్వుడు కోడికి జనించి వందలకొలది కోళ్ళతో అడవిలో నివసించుచుండెను. అక్కడనే కొలదిదూరములో డేగ యుండెను. అది నేర్పుతో ఒక్కొక్క కోడిపిల్లనే క్రమముగా చంపి తినుచుండెను. బోధిసత్వుడు ఒక్కడే ఉండి మేతమేసి వెదురుపొదలో పండుకొనుచుండెను. డేగ కోడిని పట్టుకొనలేనని తెలిసికొని తనలో "దీనిని కడునేర్పుతో పట్టుకొందును" అనుకొనెను. అతిసమీపమున నున్న చెట్టుకొమ్మపై నక్కి "మిత్రమా, కుక్కుటరాజమా, నీవు నన్ను చూచి ఏల భయపడెదవు? నేను నీతో స్నేహము చేయ గోరుచున్నాను. ఫలాని ప్రదేశమున మేత బాగుగా దొరకును. అక్కడ మనము అన్యోన్య ప్రేమతో ఆహారము తినుచూ నివసింతము" అని పలికెను. బోధిసత్వుడు అతనితో "నాకు నీయెడ విశ్వాసము లేదు. పొమ్ము" అని చెప్పెను.

"మిత్రమా, నేను పూర్వము చేసిన దుష్కార్యముల వలన నీవు నన్ను నమ్మజాలకున్నావు. ఇప్పుడు నే నట్లు చేయుట లేదు."

"నాకు అట్టిమిత్రునిమీద విశ్వాసము లేదు. నీవు వెడలిపోవలెను." అని బోధిసత్వుడు మూడుసార్లు నిషేధించి, వన మంతయు ప్రతిధ్వనించునట్లు వన దేవతలకు ధర్మకథ ప్రకటించి ఈ గాథలు పలికెను:

పాపాత్ముల నసత్యవాదుల నమ్మ
రాదు, స్వార్థమ్ముకై ప్రజ్ఞా ప్రయోగ
పరులను నమ్మకు పరమశాంతులను,

కొందరు పురుషులు గోపిపాసకులు
వాక్కులచేతనే వారు మిత్రులను
తమవారనుందురు పనులచే గాక.

హా స్నేహముల్ శూన్యమ్ము లయ్యెను, వాక్కు
లైశ్వర్యభరితమ్ము లట్టినిస్సార
నరుల, కృతఘ్నుల నమ్మంగరాదు.

భిన్నచిత్తమ్ముతో నున్నట్టివారి
బహువిధ సంసర్గపరులను గూడ
నరుడైన స్త్రీయైన నమ్మగారాదు.

అస్థిరుం డగును నకార్యకర్మములు
చేయుచు నుండును సిద్ధమ్ముగాను
ఒరులపై ఘాతకై; ఒరలోన దూర్చ
క త్తిపోలిక నుండు ఖలు నమ్మరాదు.

కొందరు మృదువచస్కులు, కాని కఠిన
మానసుల్ మిత్రులై నానావిధాల
చేయువారిని విశ్వసింపగా రాదు.

ఎచ్చటైనను ధనం బేని ద్రవ్యమ్ము
కాని దృగ్గోచర మైనచో వాడు
చాటుగా హరియించి స్వామిని జంపు.

శత్రువు లెందరో మిత్రరూపమున
గనబడ, ఆనీచజనుల నెరింగి
కోడి డేగనుబోలె వీడగావలయు.

ఎవ్వ డుత్పన్నార్థ మెరుగజాలండో
శీఘ్రమే, శత్రులచేతుల బడుచు
అధికమ్ముగా బొందు ననుతాప మతడు.

ఎవ్వ డుత్పన్నార్థ మిట్టె గ్రహించు
నాతండు వైరులపాశాలనుండి
శీఘ్రమ్ముగా ముక్తి చెందును డేగ
వాడిగోళ్ళనుండి కోడివిధాన.

ధ్వంసకారియు నిత్యకుధార్మికుండు
నైన నవానిని దూరమునందె విడువ
వలయు, వేణువనంబున వలను దాటి
కోడి డేగను దూరాన వీడునట్లు.

ఈ గాథలు పలికి "నీవు ఇచ్చట నున్నపక్షమున నిన్ను ఏమి చేయవలెనో నాకు తెలియును." అని డేగను బెదిరించెను. అచటనుండి డేగ వేరొకచోటికి పారి పోయెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, దేవదత్తుడు పూర్వము కూడ ఇట్లే నన్ను చంపుటకు యత్నించెను." అని బోధిసత్త్వుడు జాతకములు సరిపోల్చెను. అపుడు డేగ దేవదత్తుడు; కోడి నేనే.

--- o ---

# ౪౪౯. మట్ఠకుణ్డలి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుసమయమున ఇట్టి గృహస్థుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తిలో బుద్ధ సేవకు డగు గృహస్థునిపుత్రుడు మరణించెను. పుత్ర శోకాభిభూతుడైన ఆతడు స్నానము మాని, భోజనము మాని, పనులు చూడక బుద్ధ సేవకు కూడ చనకుండెను. "నా ప్రియపుత్రుడు నన్ను విడిచి నాకంటె ముందు పోయినాడు!" అని విలపించుచుండెను.

శాస్త బ్రాహ్మీముహూర్తమున లేచి, లోకముపై దృష్టి పరపి, ఈ గృహస్థు శీఘ్రముగా శ్రోతాపత్తిఫలము పొందనున్నా డని గ్రహించి, మరునాడు శ్రావస్తిలో భిక్షుసంఘముతో భిక్షువులకర్తవ్యమును ప్రబోధించి, ఆనందస్థవిరునితో ఆయింటికి జనెను. శాస్త అరుదెంచినట్లు ఆగృహస్థునకు సూచన చేసిరి. ఆయింటివారు ఆసనముపరచి శాస్తను కూర్చుండ బెట్టి, గృహస్థును పట్టుకొని శాస్త సన్నిధికి గొనివచ్చిరి. ప్రణమిల్లి ఒకప్రక్కన కూర్చున్న గృహస్థుతో దయార్ద్ర వచనములతో, "ఉపాసకా, నీవేకపుత్రుని విషయమై చింతించుచున్నావా?" అనెను.

"భన్తే, చిత్తము," అని అతడన్న పిదప శాస్త "పూర్వము పుత్రుడు పోయినపిమ్మట పండితుడు తిరుగుచుండెను. వివేకవంతులవాక్కులు విని, పోయిన వాడు మరల రాడు అనుతత్త్వమును గ్రహించి శోకము మానుకొనెను" అని, అతనిప్రార్థనపై పూర్వజన్మ వృత్తాంతము చెప్పెను.

## అతీతకథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండగా మహా వైభవశాలి యగుబ్రాహ్మణుని పుత్రుడు, పదునైదు పదునారువత్సరములవాడు ఏదో వ్యాధివలన చనిపోయి దేవలోకమున జన్మించెను. బాలుడు మరణించిన పిదప బ్రాహ్మణుడు శ్మశానమునకు పోయి బూడిదప్రోగు విరజిమ్ముచు, ఏడ్చుచు, అన్ని పనులు విడిచి శోకాకులచిత్తుడై తిరుగుచుండెను. దేవపుత్రుడు విహరించుచు అది చూచి ఉపాయముచే ఈ దుఃఖము దూరము చేయుదును అని తలపోసి తండ్రి

శ్మశానమునకు బోయి దుఃఖించుసమయమున ఆయనకుమారుని రూపము ధరించి సమస్తాభరణములు ఆల్చి ఒక ప్రక్కన నిలిచి, నెత్తిన చేతులు పెట్టుకొని గట్టిగా నేడువజొచ్చెను. బ్రాహ్మణుడు రోదనధ్వని విని అవ్వైపు చూచెను. తోడనే పుత్ర ప్రేమ జనింపగా ఆతడు కుమారునికడకు పోయి నిలిచి "నాయనా, నీవు ఈ శ్మశానమున ఏల రోదించుచున్నావు?" అని ప్రశ్నించుచు ఈగాధ పలికెను :

మేన హరిచందనంబుతో మెడను పూల
దండలును, శ్రవణంబుల కుండలములు
దాలిచి, అలంకృతం బైన తనువుతోడ,
ఏల రోదించుచున్నాడ వీవనమున ?
చేతులం గట్టుకొన్నావు హేతు వేమి ?

దానికి ప్రత్యుత్తర మిచ్చువాడై యువకు డీగాధ పలికెను :

పైడికాంతులతో రథపంజరమ్ము
దొరకినది కాని దానికి తొడుగుట కయి
చక్రములు చిక్కకున్న విచారమునను
ప్రాణములు వీడు గతికూడ పట్టె నాకు !

బ్రాహ్మణు డంగీకరించుచు ఈగాధ పలికెను :

నీకు నిర్మించి యిచ్చెద నే సువర్ణ
రజత లోహ మణీమయ రథము చక్ర
సహితముగ, చెప్పవలయును న్వభిమతము.

విని. తరుణుడు పలికినగాధలో ప్రథమపంక్తి శాస్త అభినంబుద్ధుడె పలికెను :

తన్మాణవకు డీవిధంబున పలికెను :

సోదరు లైనట్టి సూర్యచంద్రములు
చక్రయుగ్మమ్ముగా స్వర్ణరథంబు
పడయంగ జాలును పరిపూర్ణశోభ.

బ్రాహ్మణు డిట్లు పలికెను :

నీకోరికంబట్టి నీవు మూర్ఖుండ
వని తోచుచున్నది; అంతియే గాక
చూడలే వొక్కట సూర్యచంద్రులను
నిశ్చితం బని తోచు నీమరణంబు.

తరుణు డిట్లు పలికెను :

వచ్చుట పోవుట వర్ణధాతువుల
గనునవిధానంబు కనబడు, వైప
రీత్య మెన్నడు గోచరింప, దెవండు
పెద్దమూర్ఖుం డేడ్చు నిద్దరిలోన ?

ఇట్లు తరుణుడు పలుకగా బ్రాహ్మణు డాలోచించి యిట్లు పలికెను ;

నిక్కంబు లెంతయు నీభాషితములు
ఏడ్చు నిర్వురయందు నే మూర్ఖతరుడ !
విధునికై బాలుండు విలపించుసరణి
దలపింతు శవమ్ముకై తలరు నారీతి.

తరుణుని యుపదేశముచే నిశ్శోకు డయి, బ్రాహ్మణుడు అతనిని ప్రశంసించు
వాడై యీగాథలు పలికెను :

ఘృత సేచనముచేత కెరలెడు వహ్ని
సలిలసేకముచేత చల్లబడ్డట్లు
దుఃఖము చల్లారి తొలగె దూరముగ !

లగ్న మైయున్న శల్యంబును లాగి
నంతనే హృదయమ్ము శాంతి గన్నట్లు
చీకాకు పడిన నాచిత్తమ్మునుండి
పుత్రశోకము వీడిపోయె దూరముగ !

మాణవకా, నీదుమాటలు వింటి;
ఇంతట చింతింప, నింక రోదింప;

జారిపోయెను మనశ్శల్యంబు, వదలె
శోకంబు, వెలయును సుస్థిరత్వంబె.

యువకు డిట్లు పలికెను. "బ్రాహ్మణోత్తమా, నీవు పుత్రునికొరకై ఏడ్చుచున్నావు, నేను దేవలోకమున జన్మించినాను. నేటినుండి నాకొరకు రోదింపగూడదు. దానధర్మములు చేయవలెను. శీలరక్షణము కావింపుము. ఉపోసథ వ్రతము నాచరింపుము" అని చెప్పి నిజస్థానమునకు కదలిపోయెను. చెప్పిన ప్రకారము బ్రాహ్మణుడు దానధర్మాదులు చేయుచుండెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి జాతకములు పరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము గృహస్థు శ్రోతాపత్తిఫలము పొందెను. ఆ కాలమున ధర్మోపదేశకు డగు దేవపుత్రుడు నేనే.

— o —

# (౪౫౦) బిళ్ళారి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా దానముచేయు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు బుద్ధశాసనమున ప్రవ్రజించి దాత అయ్యెను. భిక్షాపాత్రలోని కొంత వచ్చినను అందులోని కొంత అన్యులకు పెట్టకుండ భుజించెడివాడు కాడు. నీరము గూడ అన్యుల కొసంగకుండ త్రాగెడువాడు కాడు. ధర్మసభలో అతనిగుణములను గూర్చి ప్రశంస జరుగుచుండెను. శాస్త అచటి కరుదెంచి, విషయ మడిగి తెలిసికొని ఆభిక్షువును పిలువ నంపి "నీవు నిజముగా దాతవేనా? దానశీలుడవేనా?" అనెను, "భన్తే, నిజమే" అని ఆత డన్న పిదప శాస్త "భిక్షువులారా, ఇతడు పూర్వము శ్రద్ధావంతుడు కాడు. పైగా అప్రసన్నచిత్తుడు. గడ్డిపరకకొనమీది తైలబిందువుకూడ ఇతరుల కిచ్చెడివాడు కాడు. నేను ఇతనిని త్రోవకు దెచ్చి వినయవంతుని చేసితిని. దానఫలస్వరూపమును చూపితిని. ఆ దానశీలత్వము నీతడు ఈజన్మమున కూడ విడువలేదు." అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు శ్రేష్ఠికులమున జన్మించి పెద్దవాడై నతరువాత కుటుంబపోషణకై తండ్రి మరణానంతరము శ్రేష్ఠిపదవి నొందెను. ఒకనా డతడు ధనరాసులవైపు చూచుచు తనలో "ధనము కానవచ్చుచున్నది, కాని ఈధనము సమకూర్చినవారు కానవచ్చుట లేదు. నేనీధనమును విడనాడి దానధర్మములు చేయవలెను." అనుకొని ధర్మశాలలు నిర్మింపజేసి జీవితాంతమువరకు దానధర్మములు చేయుచుండెను. మరణకాలమున పుత్రున కాత డీదానపరంపరను నిర్వహించుచుండు మని యుపదేశ మిచ్చి త్రయస్త్రింశభవనమున శక్రుడై జన్మించెను. ఆయనపుత్రుడు తండ్రిచెప్పినచొప్పున దానధర్మములు చేయుచు తనకుమారునకు సదుపదేశ మిచ్చి చంద్రదేవపుత్రుడై జన్మించెను. ఆతనికుమారుడు సూర్యు డయ్యెను. ఆతనికుమారుడు మాతలి

సంగ్రాహకు డయ్యెను. ఆతనితనయుడు పంచశిఖ గంధర్వుడై పుట్టెను. కానివాని కుమారుడు శ్రద్ధాళువు కాలేదు. కఠోరచిత్తుడు, మాత్సర్యయుక్తుడు నయ్యెను. ఆతడు దానశాలలు పడగొట్టించి యాచకులను మెడబట్టి గెంటించెను. అత డెవరికిని తలమీంద నూనెబొట్టయినను ఇచ్చెడివాడు కాడు.

అప్పుడు దేవరాజు శక్రుడు తన పూర్వజన్మమును గూర్చి విచారించి దాన ధర్మములు జరుగుచున్నవో లేదో యని తలపోసి తనపుత్రుడు చంద్రలోకమున జన్మించినట్లు కనుగొనెను. తుదకు తనముదిమనుమడు దానపరంపరను నిర్మూలించినట్లు కాంచెను. ఆ పాపాత్ముని ధర్మమార్గమున పెట్టవలె ననుకొని చంద్ర, సూర్య, మాతలి, పంచశిఖులను పిలిచి, "సౌమ్యులారా, మనవంశమున తుదివాడు దానపరంపరను భ్రష్టము చేసి దానశీలమునకు నిప్పు పెట్టినాడు. యాచకులను వెడలనడచినాడు. వా డెవరికి నేమియు నీయడు, రండు, వానిని త్రోవలోనికి త్రిప్పుదము" అని వారితో కలిసి వారాణసికి పోయెను. ఆసమయమున శ్రేష్ఠి రాజుకొలువునుండి మరలి వచ్చుచు ఏడవద్వారముకడ వీధివెంట జనుచుండెను. శక్రుడు వారితో "నేను ప్రవేశించిన పిదప మీరు క్రమముగా రావలెను" అని శ్రేష్ఠికడకు జని నిలిచి "శ్రేష్ఠీ, నాకు భోజనము పెట్టించు" అనెను.

"బ్రాహ్మణోత్తమా, నీకు భోజనము లేదు" అని యత డనెను.

బ్రాహ్మణు డడిగినమీదట శ్రేష్ఠి భోజనము పెట్టింపవలసి యుండెను. కాని యతడు "బ్రాహ్మణోత్తమా మా యింట వండినయన్నము లేదు, పొమ్ము" అనెను.

"శ్రేష్ఠీ, నీ కొకశ్లోకము వినిపింతును."

"నీశ్లోకముతో నాకు పనిలేదు. పొమ్ము. ఇక్కడ నిలచి యుండకుము."

శక్రుడు శ్రేష్ఠిమాటలు వినక రెండుగాథలు పలికెను:

వంట చేయుట యెరుగనివారు యోగ్యు
లొసగుదురు లభ్యమైనది యొరుల, కీవు
పాకనిపుణుడ వొసగవే పరుల కకట!

మాత్సర్యమునను, ప్రమాదంబుచేత
నైనను జరుగదు దానంబు; కాని
పుణ్యము కాంక్షించు పురుషుండు యోగ్యు
డగువాడు దానమ్ము తగును చేయంగ.

శక్రుని వాక్కులు విని "నీవు ఇంటిలోనికి రమ్ము. ఏదో కొంచెము దొరకును" అని పలికెను. శక్రుడు లోనికి జని కూరుచుండి ఆశ్లోకములు చదువుచుండెను. అంతట చంద్రుడు లోనికి ప్రవేశించి భోజనము కావలెనని అడిగెను. "పొమ్ము, నీకు భోజనము లేదు." చంద్రుడు "లోపల బ్రాహ్మణుడు కూరుచుండి శ్లోకము పఠించుచున్నాడు. నేనుకూడ నిలుతును" అనెను.

"బ్రాహ్మణోత్తమా పఠనము వలదు నడువుము." అని శ్రేష్ఠి పలికిన పిదప "శ్రేష్ఠీ, వినుము" అని అతడు రెండుగాథలు పలికెను ;

ఏభయంబున దాన మీకుండు లోభి,
దాన మీకున్నను తప్పదా భయము
ఆకలి దప్పిక లన్నభయంబు
పొందుచునుండు నే బుద్ధిహీనుండు
ఇహమున పరమున నెందైన గాని
వానికి తప్ప దవ్వాని భయంబు.

అందుచే మాత్సర్య మణచుట మేలు;
మాత్సర్యరూప మా మలమును కడుగు
దానంబు చేయుట తగినకార్యంబు
ప్రాణిజాతమునకు పరలోకమందు
పుణ్య మొసంగును భూరిహితంబు.

శ్రేష్ఠి ఆకర్ణించి "సరి, రమ్ము ఏదో కొంచెము దొరకును" అని చెప్పెను. ఆతడు లోని కరిగి శక్రునికడ కూర్చుండెను. ఆవల అచిరకాలములోనే సూర్యుడు వచ్చి భోజనము యాచించుచు రెండుగాథలు పలికెను ;

ఇచ్చెడివారల కిచ్చుట కష్ట
మిచ్చువారికి దానమే దుష్కరమ్ము
దానంబు యోగ్యులు కానట్టివారు
సలుపనే సలుపరు; సన్మార్గపరులు
చేయుధర్మంబు దుర్జ్ఞేయంబు కాదె !

సజ్జనాసజ్జన సరణి భిన్నంబు
సజ్జనుల్ పోదురు స్వర్గంబు చేర
నడతు రసజ్జనుల్ నరకమార్గమున.

"సరి, లోనికి జని బ్రాహ్మణులకడ గూర్చుండుము. ఏదో కొంచెము లభించును" అనెను. ఆవల కొలదిసేపటికి మాతలి వచ్చి భోజన మడిగెను. లే దని ప్రత్యుత్తరము రాగా ఆతడీగాథ పలికెను.

కొంద రిచ్చుచునుందురు కొంచె మున్న
రాయకుందురు మరికొంద రెంత యున్న;
స్వల్పముగ నున్నయప్పు డొసంగునట్టి
దక్షిణ సహస్రగుణముగా తలపబడును.

శ్రేష్ఠి విని "లోనికి పొమ్ము. ఏదో కొంచెము లభించు" ననెను. పంచశిఖుడు వచ్చి భోజన మడిగెను. శ్రేష్ఠి "దొరకదు, పొమ్ము" అనెను. "నేనెక్కడికి పోవుదును! ఇచ్చట శ్లోకపఠనము జరుగును" అని పంచశిఖుడు రాగాథ పలికెను:

ఉంఛవృత్తిని బానియున్నను కొంద
రనుసరింతురు ధర్మ; మల్పమే యున్న
పోషించుచును దారపుత్రాదిజనుల,
నారులకు దానంబు లొసగుచు నుంద్రు
భూరియజ్ఞంబులు భూరిదానములు
సలుపువారికి వీరిసామ్యమే లేదు!

శ్రేష్ఠి పంచశిఖుని వాక్యాలు విని ఆలోచనాపరు డయి అనర్ఘతను గూర్చి రాగాథ పలికెను:

యజ్ఞ మనర్థదాయకము, దానమ్ము-
తోడ నేగతి నగు తుల్య? మనేక
నవనక ర్థలుకూడ సరిరారు లవము
యోగ్యదాతతో నొకనితో నైన.

పంచశిఖు డాతని కుపదేశింపుచు నీ రాగాథ పలికెను:

కొందరు దుష్కర్మయందు నివిష్టు
లయి కొట్టి చంపుచు యజ్ఞమ్ములందు

దక్షిణ లిత్తు; నాద్రవ్యంబు నాశము
వగును, సదండంబు నగును; నద్దాన
సమము గా దది; అట్టిసజ్జనుతోడ
లవమైన పోలరు లక్షలకొలది
యజ్ఞమ్ము లొనరించి నట్టివారైన.

అతడు పంచశిఖునిబోధ విని "పోయి లోపల కూర్చుండుము. ఏదో లభించును" అనెను. ఆతడు లోపలికిపోయి కూర్చుండెను. శ్రేష్ఠి దాసిని పిలిచి "ఈ బ్రాహ్మణులకొక్కొక్కరికి తవుడు ఇమ్ము" అనెను. ఆమె ధాన్యాదికముతో బ్రాహ్మణులను సమీపించి "దీనిని గొనిపోయి ఎచటనైన వంట చేసికొనుడు" అనెను. "మేము దీనిని భుజింపము" అని వారు అన్నప్పటికి "అయినచో బియ్యమి"మ్మని శ్రేష్ఠి చెప్పెను. ఆమె బియ్యము తెచ్చి ఈయ బోవగా వలదనిరి. "అట్లయిన వండినఅన్నము గిన్నెలతో నిమ్ము" అని శ్రేష్ఠి పలుక, ఆమె పశువులకు వండిన యాహారము తెచ్చి బ్రాహ్మణులయెదుట పెట్టెను. వారు దానిని నోటిలో వేసికొని కన్నులు తేలవైచి మూర్ఛపోయినట్లు చనిపోయినట్లు నేలపైబడిరి. దాసి చూచి భయపడి శ్రేష్ఠికడకు జని "అయ్యా, బ్రాహ్మణులు ముద్ద మింగుడు పడక చనిపోయినా" రని చెప్పెను. అతడు యోచించి "లోకులు నన్ను నిందింతురు. సుకుమార బ్రాహ్మణులకు పశువులకు వేయు నాహారము పెట్టించినాను. గొంతు దిగక వారు చనిపోయిరి" అనుకొని దాసితో "పోయి వివిధపదార్థములను పాత్రలలో నుంచి శాల్యన్నము రసవంతము లైన వ్యంజనములును తెచ్చి వడ్డింపుము" అనెను. ఆమె ఆవిధముగనే చేసెను, వీధివెంట పోవులోకులను ఆపి శ్రేష్ఠి వారితో "నేను తిను నాహారమునే బ్రాహ్మణులకు పెట్టించితిని. కాని వారు పేరాశచే పెద్దపెద్దముద్దలు మ్రింగి గొంతు దిగక ప్రాణములు విడిచినారు. ఇందు నా దోష మేమియు లేదు" అనెను. గుమిగూడిన జనులను గాంచి బ్రాహ్మణులు లేచి "చూచితిరా, మీ శ్రేష్ఠి అబద్ధ మాడుచున్నాడు. తాను తినునాహారము మాకు పెట్టించినట్లు చెప్పుచున్నాడు. కాని పశువులకు పెట్టునాహారము మాకు పెట్టించినాడు. మేము మృతులవలె పడిపోవుటచూచి భయము చెంది ఆవల మంచియన్నము తెప్పించినాడు." అని నేలపై బడవైచిన భోజనము వారికి చూపిరి. లోకులు శ్రేష్ఠిని నిందించి వంశగౌరవము బాడిదపాలు చేసినాడు అని మెడ పట్టి నెట్టిరి. అప్పుడు శక్రుడు వారితో "ఈయింట నెంత ధనమున్నది? అది యెవరిది? మీకు తెలియునా? తెలిసినట్లు లేదు; మునుపు ఈయింట వారాణసిమహా శ్రేష్ఠి

దానధర్మములు విశేషముగా చేసెడివాడు" అనెను. "అవును విన్నాము." "ఆతడు "విశేషదానధర్మములు చేయుటచే శక్రుడై పుట్టినాడు. ఇంటిబిడ్డలు ఆదానపరంపరను బాగుగా నెరపినారు; ఒకడు చంద్రుడైనాడు, ఒకడు సూర్యుడైనాడు, ఇంకొకడు మాతలి అయినాడు, వేరొకడు పంచశిఖు డయినాడు. వారిలో ఇతడు చంద్రుడు, ఇతడు సూర్యుడు, ఇతడు మాతలి, ఇతడు పంచశిఖుడు. ఈ ప్రకారముగా వీ రందరు మహా సంపన్నులు అని తెలిసికొనవలెను." అని పలికెను. లోకులసంశయము నివారించుటకై వా రందరు నాకాశమున కెగరి మహావైభవముతో సపరివారముగా తేజరిల్లుచు నిలిచిరి. ఈవిషయము నగర మంతట ప్రాకెను. శక్రుడు జనుల నుద్దేశించి "మేమందరము ఈవంశమున బుట్టి ధనముపై ఆసక్తి విడిచి దానధర్మములు చేసినాము. ఈదుర్మార్గుడు కులక్రమాగత మగుదానశాల దహించి యాచకులను మెడ బట్టి నెట్టించినాడు. ఈ ప్రకారముగా ఈతడు మావంశాచారమును వమ్ము చేసినాడు. ఇతడు చెడిపోయి నరకమున బడకుండ రక్షించుటకై మేము వచ్చినాము" అని దానమహిమను వర్ణించి ధర్మోపదేశము చేసిరి. బిళారి చేతులు జోడించి "ఇకనుండి వంశపరంపరాగతం బగు దానము చేయుచుందును. నేటి నుండి అన్యుల కొసగకుండ జల మైనను త్రాగను" అని విన్నవించెను. శక్రు డాతనిమందలించి పంచశీలములందు ప్రతిష్ఠించి నలుగురు దేవపుత్రులను వెంట బెట్టుకొని నిజనివాసమునకు జనెను.

అతడు జీవితాంతమువరకు దానధర్మములు చేయుచు మరణించిన పిదప త్రయఃత్రింశ భవనమున జన్మించెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి జాతకములను సరిపోల్చెను. ఆకాలమున చంద్రుడు సారిపుత్రుడు, సూర్యుడు మౌద్గల్యాయనుడు, మాతలి కాశ్యపుడు, పంచశిఖుడు, ఆనందుడు శక్రుడు నేనే.

# 451 చక్రవాక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక లోభిభిక్షువును గూర్చి తెల్పినది.

## వర్తమాన కథ

చీవరాదులవలన తృప్తినొందక ఆభిక్షువు సంఘదాన మెక్కడ జరుగును ? నిమంత్రణ మెక్కడ జరుగును? అని వస్తువులమీదనే దృష్టి నిలిపెడివాడు. సదాచారి యగుభిక్షు వొకడు కనికరించి శాస్తతో నితనినిగూర్చి చెప్పెను. శాస్త యతనిని పిలువ నంపి "భిక్షూ, నీవు నిజముగా లోభివేనా ?" అని అడిగెను. "సత్యము భన్తే!" అని అత డంగీకరించిన పిదప శాస్త అతనితో "భిక్షూ, కల్యాణకారి యగు బుద్ధశాసనమున ప్రవ్రజించియు ఏల లోభిగా నున్నావు? లోభము మంచిదికాదు. పూర్వమునుకూడ నీవు లోభము వలననే వారాణసిలో గజకళేబరాదులతో సంతుష్టి నొందక అడవిలోని కరిగితివి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా లోభి యగు కాకి ఏనుగుకళేబరము మొదలగువానితో తుష్టిచెందక అడవిలో నెట్లుండునో చూతవలె నని అరణ్యమునకు పోయి అచ్చటిపండ్లతో తనివి నొందక గంగాతీరము చేరెను. అచ్చట విచరించుచు చక్రవాకదంపతులను చూచి "ఈపక్షులు చాల చక్కగా కానబడుచున్నవి. ఈగంగాతీరమున ఈపిట్టలు మాంసము తినుచుండ వచ్చును. నేను వీని నడిగి ఏవి తినుటచే చక్కదనము వచ్చునో అవియే తిని సుందరరూపము నొందవలెను." అనుకొని అనతిదూరమున ఆగి ఈగాథలు పలికెను:

నీవందగాడవు, నిండుదేహమ్ము
కరగిన బంగారు కాంతుల నీను
నీయంగకమ్ములు నీవదనంబు
సుప్రసన్నములు; తోచును గంగదరిని

వసియించుచును చక్రవాక, రకాల
చేపల నీవు భక్షించుచున్నట్లు.

చక్రవాకము వానిని నిషేధించుచూ ఈగాథ పలికెను :

మిత్రమా శైవాలపత్రముల్ తక్క
నీటిలోనైన ఈకాటిలోనైన
సంభవంబైనమాంసము ముట్టుకొనను
పత్రశైవాలముల్ మాత్రము తిందు.

అంతట కాకి రెండుగాథలు పలికెను :

చక్రవాకముల భోజన మింతె యనుచు
మిత్రమా, నమ్మను; మొసవుదు నేను
పల్లెలలోనైతె లపక్వంబు చేయు
మాంసముతో గూడు మంచిభోజనము
చక్రవాకా అట్లు సలిపినగాడ
నీదేహవర్ణంబు రాదాయె నాకు !

కాకికి అట్టిరంగు వచ్చుటకు కారణము తెలుపుచు ధర్మోపదేశము చేయునదై చక్రవాకదంపతులు ఈగాథ పలికెను :

ఒరులయెడ నీకు నుండు వైరంబు
కానంబడుచునుండు; హాని చేయుదువు
పెరవారి, కేద్దైన బెదరుతో తిందు —
విట్లుండు నీవన్నొ యాకారణముల.

కాకమా, నీ వెల్లలోకమ్మునకును
వైరివైతివి పాపవర్తనమునను
సమకూడు పిండాన సంతృప్తిలేదు —
ఇట్లుండు నీవన్నె యాకారణముల.

సౌమ్య. యెల్లరయెడ శాంతంబుతోడ
నుందును నే, శంక యుత్సుకత్వంబు
శోకమ్ము భీతియు లేక భుజింతు.

అంగుచే చేయుము యత్న; మహింస
తో చరింపుము స్వీయదుశ్శీల ముడిగి
యున్నచో నావలె నొందజాలుదువు
లోక ప్రియత్వమ్ము కాకమా నీవు.

హింస చేయ డెవండు, హింస చేయింప,
డెవగు హాని యొనర్చ, డెవ్వడు హాని
చేయింపడో సర్వజీవులయెడల
మైత్రిభావనతోన మసలుచునుండు
వాని కెవ్వారితో వైరంబు లేదు.

నీవు లోకములో అందరకును ఇష్టుడవు కాదలచినచో సమస్తవైరభావములు విసర్జింపుము.'' అని చక్రవాకము లుపదేశించెను. ''మీరు నాకు మీ యాహారసాధనము తెలుపలేదు అనుచు కాకి కాకా అని అరచుచు ఎగిరిపోయి వారాణసిలో పెంటప్రోగుపై వ్రాలెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించెను. అపుడు లోభిభిక్షువు అనాగామిఫలము పొందెను. ఆకాలమున కాకి లోభి యగుభిక్షువు; చక్రవాకి రాహులుని తల్లి; చక్రవాకము నేనే.

---X

## 452. భూరిప్రశ్న జాతకము

ఈ జాతకము ఉమ్మగ్గ జాతకములో వచ్చును.

# ౪౫౩. మహామఙ్గల జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మహామంగళ సూత్రమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

రాజగృహమున ఏదోపనిమీద సమావిష్టులైన జనులలో ఒకడు "నేడు నే నేదో మంగళకార్యము చేయవలెను," అని లేచివెళ్ళెను. ఇంకొకడు ఈమాటలు విని "ఇతడు మంగళకార్యము చేయబోవడు" మంగళమునకు విధానమేమి ?" అనెను. దానికి మరొకడు ఇట్లు చెప్పెను. "మంగళరూపములను చూచుట మంగళము. ఎవడైనను ప్రాతఃకాలమున లేచి శ్వేతవృషభమును గర్భిణీస్త్రీని, రోహిత మత్స్యమును, పూర్ణఘటమును, కపిలగోవును, నూతనవస్త్రమును, కానిచో దుగ్ధమును చూచును. ఇంతకన్న నెక్కువమంగళము లేదు." కొందరతని నభినందించిరి. అతడు బాగుగా పలికినాడనిరి. కాని అందులో నొకడు వేరొకనితో "ఇవి మంగళకరములు కావు" అనెను. కొందరతనిని గూడ నభినందించిరి. ఒకడు ప్రాతఃకాలమున లేచి పృథ్విని, పచ్చికను, గోమయమును, శుద్ధవస్త్రమును రోహితమత్స్యమును, వెండిబంగారములను, ఆహారపదార్థములను స్పృశించుటకన్న వేరొకమంగళము లేదు," అని చెప్పగా కొందరతనినిగూడ అభినందించిరి. ఈ విధముగా త్రివిధమంగళములను గూర్చి జనులు భిన్నాభిప్రాయులై ఏకాభిప్రాయమును సమకూర్చుకొనరైరి. భూదేవతలు మొదలుకొని బ్రహ్మలోకమువరకును ఎవడును ఇది నిజముగా మంగళవస్తువని గ్రహింపలేదు. శక్రుడది చూచి "సదేవలోకములో నున్న బుద్ధభగవానుడుతప్ప ఈమంగళప్రశ్నమును వివరింపగలవారు లేరు. బుద్ధభగవానునికడకు జని అడుగుదును గాక" అనుకొని రాత్రి వేళ తథాగతుని సన్నిధికి జని, చేతులు జోడించి, ప్రణామము చేసి ప్రశ్న వేసెను. శాస్త 12 గాథలలో 38 మంగళములను వివరించెను. మంగళసూత్రమునకు వ్యాఖ్యానము జరుగుచుండగా వేలకోట్లదేవతలకు అర్హత్త్వము కలిగెను. స్రోతాపత్తి ఫలము లెన్ని దక్కెనో లెక్క లేదు. శక్రుడు మాంగలికము విని నిజస్థానమున కరిగెను. శాస్త మంగళమును వివరించిన పిదప సదేవలోకములో నెల్లరును బాగున్నదని అభినందించిరి. ఆసమయమున ధర్మసభలో తథాగతుని గుణ ప్రశంస

జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, అన్యు లెవ్వరును సమాధానము చెప్పలేని మంగళప్రశ్నమును భగవానుడు సదేవలోకమువారి చిత్తములను రంజించి సందేహములను తొలగించెను. ఆకాశమున చంద్రోదయమువలె భగవానుడు సమస్తము విస్పష్టము చేసెను." శాస్త అరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, ఇం దాశ్చర్య మేమియు లేదు. నేను బుద్ధత్వము పొందిన పిదప మంగళప్రశ్నమును తెలిపితిని. అయినను బోధిసత్త్వచర్యలో నుండగా దేవతలకు మానవులకు నీవిషయమై సందేహము నివారించితిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలము బోధిసత్త్వుడు ఒకానొక గ్రామమున వైభవశాలి యగు బ్రాహ్మణుని యింట జన్మించెను. బాలునకు రక్షితకుమారు డని పేరు పెట్టిరి. ఆతడు పెరిగి పెద్దవాడై నపిదప తక్షశిల కేగి విద్యలు నేర్చి వివాహము చేసికొని తలిదండ్రులు మరణించిన పిదప ధనమునెడల విరక్తి చెందెను. ఆతడు సమస్తము దానము చేసి భోగములను త్యజించి హిమాలయమునకు జని ప్రవ్రజించి ధ్యానాభిజ్ఞలు పొంది కందమూలఫలాదులు తినుచు ఒకచో నివసించుచుండెను. క్రమక్రమముగా పరివారము పెరిగి 500 మంది శిష్యులు చేరిరి. ఒకనాడు తాపసులు బోధిసత్త్వునితో చెప్పి వర్షఋతువున హిమాలయమునకు ఉత్తరదిక్కుగా దిగి ఉప్పు, చింతపండు కొరకు జనపదము చేరిరి. వారు బయలుదేరుటకు ముందు ఆచార్యునితో "ఉప్పు, పులుసు తిన్నపక్షమున మనశరీరములు దృఢము లగును. ప్రయాణముకూడ బాగుగా సాగును. అని చెప్పినను ఆచార్యుడు "మీరు పొండు, నేను మాత్రము ఇచటనే ఉందును" అనెను. వారాయనకు ప్రణామముచేసి బయలు వెడలిరి. క్రమముగా వారు వారాణసి చేరి రాజోద్యానమున ప్రవేశించిరి. వారికి గొప్ప సన్మానము జరిగెను. ఒకనాడు వారాణసిలో జను లొకచో జేరి మంగళప్రశ్నము చేసి నిలచిరి. ఆకాలమున జనులకు సంశయములను తొలగింప గలవారు వచ్చినా డనువార్త వ్యాపించుటచే లోకులు ఉద్యానము చేరి రాజును గూర్చి "మహారాజా, మే మిచ్చట సమాధానము చెప్పలేము. కాని మాఆచార్యదేవుడు రక్షిత తపస్వి మహాప్రజ్ఞావంతుడు హిమాలయమున నివసించుచున్నాడు, ఆయన చక్కని సమాధానము చెప్పును." అనిరి. రాజు "భదన్తే, హిమాలయము దూరము, దుర్గమము. మేము పోజాలము. మీ ఆచార్యునికడకు జని ఆయనతో జెప్పి మరలి వచ్చి మాకు తెలుపుడు" అని కోరెను. వారు సరే నని సమ్మతించి ఆచార్యుని

కడకు జనిరి. ఆచార్యుడు వారికుశలమును, రాజుధార్మికబుద్ధిని, జనపదములోని ఆచారములను గూర్చి అడిగెను. అవల మంగళ ప్రశ్నాదికములను గూర్చి వారు తెలిపిరి. ప్రధానశిష్యుడు ఆచార్యుని ప్రశ్నించుచు నీగాథ పలికెను :

నరుడు ప్రార్థన చేయుతరుణమ్మునందు
ఏవేదము పఠించు, నేమి జపించు
ఏశాస్త్రముం బల్కు, ఇహపరంబులను
కల్యాణరక్షకై కావించు నెద్ది ?

బోధిసత్త్వుడు దేవతలకు, మానవులకు సందేహము విడిపోవునట్లు ఇది మంగళము అని స్పష్టీకరించుచు బుద్ధలీలనుండి ఈవిధముగా పలికెను :

నిత్యపూజితు లగుచుండ్రు నిఖిలదేవ
తలును, పితరులు, జంతుసంతతులు, నన్ని
ప్రాణు లెవ్వాని మైత్రిభావనమువలన
అద్దియే మైత్రిమంగళ, మవచు వాని.

ఈవిధముగా బోధిసత్త్వుడు ప్రథమమంగళము తెలిపి మిగిలినమంగళము లను ఈ గాథలలో పలికెను :

మిగుల నమ్రతతోడ మెలగుచు స్త్రీలు,
బాలురు, పురుషులు పరుషముల్ పల్క
సహియించి ప్రతికూలచర్య లేకుండు
నతనిదౌ సహనశీలత మంగళంబు
అతని కీమంగళ మవచునుండు.

ఆ ప్తమిత్రులయెడల నాదరంబు
నెవడు చూపడౌ ధన విద్య లెంత యున్న
నాభిజాత్యంబుచేత; ప్రజ్ఞాన్వితుండు
తరుణమున స్మృతిమంతుడౌ నరుని యాద
రంబు మంగళ మాతని రక్ష చేయు.

ఏయనిందితు మిత్రు లహీనశాంతు
లధిక విశ్వాసపాత్రులో, అట్టివారి

మిత్రుల ద్రోహము తలపెట్టడెవడు, ధనము
పంచు సమముగ, సతతసద్భావ మగును
మంగళము వాని కద్దియే మనుజులందు.

ఎవనిభార్య పతివ్రత, యేకచిత్త,
కులవతి, సుశీలవతి, అనుకూలవతియు
సమవయస్క, ధర్మరత, ప్రజావతి యగు —
అద్ది స్త్రీమంగళం బయి యవచు వాని.

తేజసు పరాక్రమధనుండు ద్వైతభావ
రహితుడు, పవిత్రుడైనమిత్రం బటంచు
ఎరుగునే యశస్వి భూపతి యెవనిగూర్చి
అద్ది రాజమంగళ మయి, యొసగు వాని.

శాంత సంతుష్టబుద్ధితో శ్రద్ధతోడ
అన్నపానీయ గంధమాల్యానులేప
నాదుల నొసంగు నతిథుల కనిశ మెవడు
అయ్యదియె స్వర్గమంగళ మగు వాని.

ఎవడు పూజించు సజ్జన వృద్ధ శీల
వంతులను, బహుశ్రుతు లగువారి ఋషుల
ఆర్యమార్గాన పూర్ణచర్యాన్వితముగ
అద్ది అర్హతమంగళ, మవను వాని.

బోధిసత్త్వుడు అర్హత్వమునుగురించి అష్టగాథలు పలికి ఆమంగళములను స్తుతించుచు అంతిమగాథ పలికెను :

ఇవియె మంగళస్థానము లిహమునందు
సత్యముగ, విజ్ఞజనులు ప్రశంస చేయు
వీని, నింద్రియసుఖ మబ్బు వీనివలన;
ప్రాజ్ఞు డగువాడు పాలింపవలయు వీని
ఇతరమంగళముల సత్య మేల లేదు!

ఋషులు వారముదినముల తరువాత ఆచార్యుని కడ సెలవు గైకొని మరలి వచ్చిరి. రాజు వారి సన్నిధికి వెడలి దిగెను. ఆచార్యునిఉపదేశము రాజునకు తెలిపి వారు హిమాలయమునకు వెళ్ళిరి. నాటినుండి లోకమున మంగళము ప్రకటీకృత మయ్యెను. తదనుసారముగా నడచుజనులు మరణానంతరము స్వర్గపథము ననుసరించిరి. బోధిసత్త్వుడు బ్రహ్మవిహారము కావించి ఋషిగణమును గొని బ్రహ్మలోకమున జన్మించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. పూర్వఋషిగణము బుద్ధపరిషత్తు; ప్రధాన ప్రాశ్నికుడు సారిపుత్రుడు; ఆచార్యుడు నేనే,

o

## 454. ఘట జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మృతపుత్రుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

ఈకథ మట్టకుండలి జాతకములో (454) కథవలె నుండును. ఈకథలో శాస్త ఉపాసకునితో "ఉపాసకా, నీవు చింతించుచున్నావా ?" అనెను. "చిత్తము, భన్తే!" అని అతడు చెప్పిన పిదప శాస్త "పూర్వము పండితులు వివేకవంతుల వాక్కులు విని మృతపుత్రుని విషయమై విచారము మానిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

### అతీత కథ

పూర్వకాలమున ఉత్తరాపథమున కంసభోగమున అసితంజన నగరమున మహాకంస నామకు డనురాజు రాజ్యము చేయుచుండెను. అతనికి కంసుడు, ఉపకంసుడు అను నిరువురుపుత్రులును, దేవగర్భ అనుపుత్రికయు నుండిరి. ఆమె పుట్టిననాడు జ్యోతిష్కబ్రాహ్మణులు భవిష్యత్తునుగూర్చి చెప్పిరి; ఆమెకడుపున జన్మించెడి కుమారుడు కంసగోత్రమును, కంసవంశమును నాశము చేయు నని వారి జోస్యము, రాజు పుత్రికపై విశేషప్రీతి వలన ఆమెను సంహరింప లేకపోయెను. కుమారు లీవిషయము నూతు రని రాజు యోచించి ఊరకుండెను. కాలక్రమమున రాజు చనిపోయినపిదప కంసుడు ప్రభువు, ఉపకంసుడు ఉపరాజు నైరి. "మేము సోదరిని సంహరించినచో నింద పాలౌదుము. ఆమెకు వివాహము చేయకుండ రక్షించుచుందుము" అని యోచించి వారు ఒంటికంబము మేడ నిర్మాణము చేసి ఆమె నందులో నుంచిరి. ఆమెకు నందగోప అను పరిచారికయు, దానిభర్త అంధకవేణు డను దాసుడును పహరా ఇచ్చుచుండిరి.

ఆకాలమున ఉత్తరమధురలో మహాసాగర నాముడగురాజు పరిపాలన చేయుచుండెను. అతనికి సాగరుడు, ఉపసాగరుడు అనుపుత్రు లిరువు రుండిరి. తండ్రిమరణానంతరము సాగరుడు రాజు, ఉపసాగరుడు ఉపరాజు నైరి. ఉపసాగరుడు ఉపకంసునకు మిత్రుడు. ఇరువురును ఒకేఆచార్యకులమున సహపాఠు

లుగ నుండిరి. ఉపసాగరుడు అన్నగారి అంతఃపురమున అవినయాచరణమున పట్టుబడుదు నను భయమువలన కంసభోగ మందలి ఉపకంసునికడకు జనెను. ఉపకంసు డతనిని కంసరాజుసన్నిధికి గొనిపోయెను. రాజు అతనిని మహావైభవోపేతుని జేసెను. అత డొకనాడు రాజుకొలువునకు పోవుచు ఒంటికంబపుమేడ నుంచి అది ఎవరి నివాస మైయుండు నని యోచించి, వృత్తాంతము తెలిసికొని దేవగర్భ యెడ ఆసక్తు డైయుండెను. ఉపసాగరు డొకనాడు ఉపకంసుని వెంట రాజు కొలువునకు పోవుచున్నప్పుడు దేవగర్భ ఆతనిని గాంచి నందగోపునితో "ఈత డెవ" రని అడిగెను. దానివలన ఆతడు ఉపసాగరు డనియు మహాసాగరునిపుత్రు డనియు తెలిసికొని ఆమె ఆసక్తచిత్త అయ్యెను. ఉపసాగరుడు నందగోపకు లంచ మిచ్చి "చెల్లాయీ, నీవు దేవగర్భను నాకు చూపగలవా?" అని అడిగెను. ఆమె "స్వామీ, ఈపని కఠినమైనది గాదు" అని చెప్పి దేవగర్భకడకు పోయి ఈవార్త తెలిపెను. ఆమె స్వాభావికరీతిని ఆతనియెడ ఆసక్తచిత్తయై అంగీకరించెను. నందగోప ఉపసాగరునకు ఇంగితము చేసి రాత్రివేళ అతనిని మేడమీదికి గొని పోయెను. ఆతడు దేవగర్భతో సహవాసము ప్రారంభించెను. తరచుగా ఆతనితో సహవాసమువలన దేవగర్భ గర్భము ధరించెను. కాలక్రమమున ఆవార్త ప్రకట మయ్యెను. రాజసోదరులు నందగోపను ప్రశ్నించిరి. అమె వారి నభయము వేడి, రహస్యము బయలు పెట్టెను. "సోదరిని చంపజాలము. స్త్రీశిశువును కన్నచో దానినికూడ చంపజాలము. పుత్రుడు పుట్టినయెడల వానిని సంహరింతము" అని యోచించి వారు దేవగర్భను ఉపసాగరుని కిచ్చి పెండ్లి చేసిరి. నెలలు నిండిన పిదప ఆమె స్త్రీశిశువును కనెను. సోదరులు ప్రసన్నచిత్తులై బిడ్డకు అంజనాదేవి యని పేరు పెట్టి, తల్లిబిడ్డలను గోవర్ధమాన భోగగ్రామమునకు పంపివేసిరి. ఉపసాగరు డామెవెంట ఆగ్రామమునకు బోయి ఆమెతో నివాసము చేయసాగెను. ఆవల దేవగర్భకు మరల గర్భము నిలిచెను. నందగోప కూడ నాడే గర్భము దాల్చెను. మాసములు నిండిన పిదప ఉభయులు ఒకనాడే ప్రసవ మైరి. దేవగర్భకు పుత్రుడును, నందగోపకు పుత్రికయును పుట్టిరి. తనబిడ్డడు మృతి నొందు ననుభయముచే దేవగర్భ తనశిశువును నందగోపకడకు బంపి, దానిస్త్రీశిశువును తెప్పించుకొనెను. సోదరి ప్రసవించిన దనువార్త రాజసోదరులకు తెలిసెను. పుట్టినది పుత్రుడా పుత్రికయా అని వారు ప్రశ్నించిరి. ఆడు బిడ్డ యని విని వారు దానిని పోషింపు డని చెప్పిరి. ఈ ప్రకారముగా దేవగర్భ పదిమంది పుత్రులను, నందగోప పదిమంది పుత్రికలను కనిరి, మగబిడ్డలు నందగోపకకడను, ఆడుబిడ్డలు దేవగర్భ కడను

పెరుగుచుండిరి. ఈవిషయము మనుష్యులకు తెలియదు. దేవగర్భ పెద్దకుమారునకు వాసుదేవుడు. రెండవవానికి బలదేవుడు, మూడవవానికి చంద్రదేవుడు, నాల్గవవానికి సూర్యదేవుడు ఐదవవానికి అగ్నిదేవుడు, ఆరవవానికి వరుణదేవుడు, ఏడవ వానికి అర్జునుడు, ఎనిమిదవవానికి ప్రద్యుమ్నుడు, తొమ్మిదవవానికి శతపండితుడు, పదవవానికి అంకురుడు అనిపేర్లు పెట్టిరి. వీరందరు అంధకవేణుదాస పుత్రులనియు, దుష్ట సోదరదశక మనియు పేరుపడిరి.

కాలక్రమమున వారు పెరిగి బలశక్తియుతులై కఠోరస్వభావు లైరి. వారు రాజుకొరకు కానుకలు గ్రహించి అపహరించుచుండిరి. జనులు రాజాంగణమున గుమిగూడి అంధకవేణుదాస పుత్రులు పదిమంది సోదరులు దోపిడి చేయుచున్నారని ఫిర్యాదు చేసిరి, రాజు అంధకవేణువును పిలువనంపి, నీకుమారులచే ఏల దోపిడి చేయించుచున్నా వని బెదరించెను. ఈవిధముగా రెండుమూడుసారులు రాజుకడ జనులు మొర పెట్టుకొనిరి. అంధకవేణువు మరణభీతుడై రాజు నభయము వేడి "దేవా, వారు నాపుత్రులు కారు. ఉపసాగరుని పుత్రులు" అని రహస్యము బయలు పెట్టెను. రాజు భయపడి అమాత్యులతో వీరిని ఏయుపాయమున పట్టుకొనగల మనెను. "దేవా, వీరు మల్లురు, మల్లయుద్ధ మని నగరమున చాట బంచి, వీరు మల్లమండపమునకు వచ్చినంతనే పట్టి సంహరింతము," అని సలహా చెప్పిరి. చాణూరుడు, ముష్టికుడు అను మల్లుర పిలువ నంపి నగరమున నాటికి ఏడవనాడు మల్లయుద్ధము జరుగు నని రాజు చాటింపించెను. రాజద్వారముకడ మల్లమండపము నిర్మించి రంగస్థలము సిద్ధము చేయించి మండపము నలంకరించి జయపతాకలు కట్టించెను. నగర మంతయు మహోత్సాహపూర్ణ మయ్యెను. మంచెలు, మండలములు నిర్మితము లయ్యెను. చాణూరముష్టికులు మండపమునకు వచ్చి దుముకుచు, గర్జించుచు తొడలు చరచుచు ఆస్ఫాటనము చేయుచుండిరి. పదుగురు సోదరులు రజకునికడ లాగికొన్న సుందరవస్త్రములను ధరించి దుకాణముమీది సుగంధద్రవ్యములు, మాలాకారుల అంగళ్లనుండి పుష్పమాలికలు లాగుకొని శరీరములనిండ చందనములు పూసికొని హారములు ధరించి చెవులలో పుష్పములు తురుముకొని, దుముకుచు గర్జించుచు, తొడలు చరచుచు మల్లమండపము ప్రవేశించిరి; ఆసమయమున చాణూరుడు తొడ చరచుచు విహారము చేయుచుండెను. బలదేవుడు వానిని చూచి "చేతితో వీనిని తాకను" అని సంకల్పించి హస్తిశాలనుండి పెద్ద త్రాడు కొని వచ్చి ఎగిరి గర్జించి త్రాడు విసిరి చాణూరుని కడుపుమీదుగా చుట్టివైచి, త్రాటికొనలు రెంటిని పట్టుకొని వానిని లేవనెత్తి తలచుట్టును త్రిప్పి నేలపై నొక్కి

పట్టి ఆవల మల్లరంగమునకు వెలుపల విసరివైచెను. చాణూరుడు మరణించిన పిదప రాజు ముష్టికున కాజ్ఞ యిచ్చెను. వాడు లేచి ఎగిరి గర్జించి తొడ చరిచెను. బలదేవుడు వానిని గట్టిగా పిసికి ఎముకలు పొడిపొడి చేసెను. వాడు "నేను మల్లుడను కాను, మల్లుడను కాను" అని అనుచున్నను నీవు మల్లుడవో కావో నాకు తెలియ దనుచు బలదేవుడు వానిని పట్టుకొని నేలపై గొట్టి ప్రాణములు పాపి మల్లరంగమున కావల విసరివైచెను. చనిపోవునపుడు వాడు "యక్షుడనై వీనిని భక్షించెద" నని సంకల్పించెను. కాలక్రమమున ముష్టికుడు కాలమత్తి వనమున యక్షుడై పుట్టెను. రాజు లేచి "దుష్టదాసపుత్రులను పట్టుకొం" డని ఆజ్ఞ యిచ్చెను. ఆసమయమున వాసుదేవుడు చక్రమువిసిరెను. తోడనే రాజసోదరు లిరువురి శిరములు ఎగిరి పడినవి. జనులు భయభ్రాంతులై మమ్ము రక్షింపు డని బలదేవ వాసుదేవుల పాదములపై బడిరి.

సోదరు లిరువురు మేనమామ మరణించినపిదప అసితంజన నగర రాజ్యమును చేకొని తలిదండ్రుల నచట నుంచిరి. సోదరదశకము సమస్తజంబూద్వీప రాజ్యమును గైకొందు మని సంకల్పించి బయలుదేరి కాలసేన రాజు నివాసస్థాన మగు అయోధ్యానగరము చేరి, చుట్టుముట్టి వనమును నాశము చేసి రాజును పట్టుకొని రాజ్యమును స్వాధీనము చేసికొని, అచటినుండి ద్వారవతికి బోయిరి. ఆనగరమున కొకప్రక్క సముద్రము, వేరొకప్రక్క పర్వతము గలవు. ఆనగరముపై యక్షుని కధికారము గలదు. దానిని సంరక్షించుయక్షుడు శత్రువును గాంచి, గార్దభరూపము ధరించి ఓండ్ర పెట్టసాగెను; తోడనే యక్షప్రభావముచే నగరము పైకి లేచి సముద్రములోని ద్వీపముమీదికి చేరును. శత్రువులు వెడలిపోయిన పిదప యక్షుడు నిజరూపము ధరించి, యథాస్థానమునకు వచ్చు నగరమున నివసించును. సోదరదశకము వచ్చుట తెలిసికొని యక్షుడు గార్దభస్వరము చేసెను. నగరము లేచి ద్వీపముమీదికి బోయి, శత్రువులు పోయినంతనే నిజస్థానమునకు చేరెను; వారు రెండుమూడుపర్యాయములు దండయాత్రలు చేసినను రాజ్యము లభింప లేదు. అపుడు వారు కృష్ణద్వైపాయనునికడకు బోయి "భన్తే, మేము ద్వారవతీరాజ్యమును పట్టుకొనలేకున్నాము. దీని కేదైన ఉపాయము మాకు సెలవిండు" అనిరి.

"కందకమున కావల ఫలానిస్థానమున గార్దభము తిరుగుచుండును. అది శత్రురాక కనుగొని ఓండ్రపెట్టును- తక్షణమే నగరము పైకి లేచిపోవును. మీరు దానికాలు పట్టుకొనుడు, ఫలప్రాప్తికి ఇదే ఉపాయము" అని ఆయన చెప్పెను.

వారు ఆ తపసికి నమస్కరించి వెడలిపోయి గార్దభముకాళ్ళు పట్టుకొని "స్వామీ, మీరుతప్ప మాకు వేరు ఆధారము లేదు, మేము నగరమును పట్టుకొనిన బోవు నపుడు మీరు ధ్వని చేయరాదు" అని విన్నవించిరి.

"నేను మౌనముగా నుందు నని చెప్పజాలను, కాని మీరు ముందుగా వచ్చి నలుగురు పెద్దయినుప నాగళ్ళు తెచ్చి నగరద్వారములు నాలుగింటికడను భూమిలో ఇనుపకంబములు పెద్దవి ఎత్తుడు. నగరము పైకి లేచునపుడు నాగళ్ళు పట్టుకొని వానికి కట్టియున్న యినుపగొళ్ళెములు కంబములకు తగిలింపుడు, నగరము ఎగిరిపోవ జాలదు" అని వాడు తెలిపెను,

వారు మంచి దని అర్ధరాత్రమున నాగళ్ళు వెంట గొని నగరద్వారములు నాల్గింటికడను భూమిలో ఇనుపకంబములు ఎత్తి నిలిచియుండిరి. ఇంతలో గార్దభము కూత పెట్టినది. నగరము పైకి లేవ మొదలిడెను. ద్వారములకడ నున్న నలుగురును నాగళ్ళకు కట్టియున్న గొళ్ళెములను స్తంభములకు తగిలించిరి. నగరము లేవజాలక పోయెను. అంతట సోదరులు పదుగురు నగరమున దూరి రాజును సంహరించి రాజ్యము స్వాధీనము చేసికొనిరి. ఈవిధముగా జంబూద్వీపమునందలి ముప్పదియారువేల నగరముల రాజులను వారు చక్రములతో సంహరించి ద్వారవతిని చేరి భాగములు పంచుకొనిరి. ఆసమయమున సోదరి అంజనాదేవి మాట మరచిరి. అప్పుడు పదకొండవ భాగము చేయవలె నని వారికి తోచినపుడు, అంకురుడు "నాభాగ మామె కిచ్చి నేను వ్యాపారము చేసి జీవింతును, మీరు మీమీ జానపదములలో నాకడనుండి పన్ను వసూలు చేయరాదు" అనెను. మంచి దని వారు ఆతనిభాగము సోదరి కిచ్చి ఆమెతోగూడ ద్వారవతిలో నివసింప జొచ్చిరి. అంకురుడు వ్యాపారము చేయజొచ్చెను.

వంశము వృద్ధి పొందెను. ఆడుబిడ్డలు మగపిల్లలు కలిగిరి. తలిదండ్రులు కాలధర్మము చెందిరి. వాసుదేవమహారాజు ప్రియపుత్రుడు మృతి నొందెను. శోకాకులచిత్తుడై రాజు మంచము పట్టె పట్టుకొని కూర్చుండి ఏడ్చుచూ అన్ని పనులు మాని యుండెను. ఆసమయమున ఘతపండితుడు ఈవిషయము గ్రహించి తనలో, "సోదరునిశోకము దూరీకరించుటకు నాకన్న వే రెవరునులేరు, కాని కౌశలముగా నతనిశోకము తొలగింతు నని తలపోసి పిచ్చివానివలె నటించుచు నగర మంతట తిరుగుచూ నాకు కుందేలు కావలె, కుందేలు కావలె నని యరచుచు, ఆకసము నంతయు చూచుచు విచరించుచుండెను. నగరవాసులు చూచి ఘతపండితుడు పిచ్చివాడై నా

డని ఆకులత పొందిరి, అప్పుడు రోహిణేయు డను అమాత్యుడు వాసుదేవునికడకు బోయి విలాపములు చేయుచు ఈగాథ పలికెను :

పండుకొన్నావు కృష్ణ, లాభమ్ము లేదు
త్వరితముగ లెమ్ము నీ ప్రియ భ్రాతయసువు
లల్లకల్లోల మైనవి; అత డిపుడు
కేశవా. ప్రలపించు నావేశమునను.

ఇట్లు అమాత్యుడు పలికినపిదప, శాస్త అభిసంబుద్ధుడై ఈగాథ పలికెను :

ఆ రోహిణేయుని యాలాపములను
విని విని కేశవుడు; నిదురనిబాధ కెంతొ
కుందుచు వేగమే యందుండిలేచె.

రాజు లేచి శీఘ్రముగా ప్రాసాదము దిగి ఘతపండితునికడకు జని రెండు చేతులతో అతనిని గట్టిగా పట్టుకొని సంభాషణ చేయుచు ఈగాథ పలికెను :

శశము శశ మ్మంచు సంభ్రాంతచిత్తు
విధమున ద్వారకావీధుల దిరిగె
దెవ్వడు నీశశం బెత్తుకపోయె ?

రాజు ఇట్లు పలికినను అతడు మాటిమాటికిని వెనుకటిమాటలే అనుచుండెను. రాజు మరల ఈగాథలు పలికెను :

స్వర్ణ రజత మణీ లోహ శంఖ మయము
కాని ద్రావ ప్రవాళాదికమ్ము గాని
ఏది కోరిన దాని చేయించి యిత్తు.

అడవిలో చరియించు నట్టికుందేళ్ళ
బట్టి తెప్పింతు, నీ కెట్టిది వలయు ?

రాజువాక్కులు విని పండితు డీగాథ పలికెను :

ఈ నేలశశకమ్ము లేటికి నాకు ?
జాబిల్లిలో నున్నశశము కావలయు:
కేశవా, దింపించు క్రిందికి దాని.

రాజు తనమాటలు విని విచారగ్రస్తుడై నిశ్చయముగా నాసోదరుడు పిచ్చివాడైనా డని యీగాథ పలికెను :

ఓయి, కోల్పోదువు తీయనియాసువు,
లిప్పుడింత యపథ్య మేదో యద్దాని
కోరుదే జాబిల్లికుందేటి నవుర !

ఘతపండితుడు రాజువాక్యములు విని నిలిచి, "సోదరా, నీకే సంగతి తెలియును ? చంద్రునియందుండు కుందేలు లభింపవలె నను నిచ్ఛ కలిగి అది లభింపక పోవుటచే చనిపోవలెనా ? నీమృతపుత్రుని కొరకు ఏల శోకించుచున్నావు ?" అని అడుగుచువాడై యీగాథ పలికెను :

ఇతరుల కుపదేశమిచ్చు జ్ఞానంబు
నీ కున్నదో కృష్ణ, నేటికి గూడ
పోయిన సుతునికై పొగిలెద వేల ?

ఈవిధముగా అతడు వీథినడుమ నిలిచియే "సోదరా, నేను కానబడు వస్తువునే కోరుచున్నాను, నీవో, ఆలోచించినను కానబడనిదానిని కోరుచున్నా" వని ధర్మోపదేశము చేయువాడై యీగాథలు పలికెను :

పుట్టిన పుత్రుండు పోవరా దనెడి
సంగతి మానవజాతికి నైన
అమనుష్యజాతికి నైనను లేదు
ఏవిధంబుగ నీకు నిది సంభవించు ?

ఎట్టిమంత్రములచే నెట్టియోషధుల
చే నైనను, ధనమ్ముచే నైన గాని
ప్రాణమ్ము లేకకళేబరములోపలికి
ఎంత దుఃఖించిన నెట్టులు వచ్చు ?

రాజు విని "బాబూ, చక్కగా చెప్పినావు. నాదుఃఖమును దూరము చేయుటకై నీ విది యంతయు చేసినా" వని ఘతపండితుని ప్రశంసించువాడై యీ గాథలు పలికెను :

ఘృతసేచనముచేత కెరలెడువహ్ని
సలిలసేకముచేత చల్లబడ్డట్లు
దుఃఖము చల్లారి తొలగె దూరముగ.
లగ్నమై యున్న శల్యంబును లాగి
నంతనే హృదయమ్ము శాంతి గన్నట్లు
చీకాకు పడిన నాచిత్తమ్ము నుండి
పుత్రశోకము వీడిపోయె దూరముగ.
మాణవకా, నీదుమాటలు వింటి;
ఇంతట చింతింప, నింక రోదింప:
జారిపోయెను మనశ్శల్యంబు, వదలె
శోకంబు వెలయును సుస్థిరత్వంబె.

అంతమున ఇది సంబుద్ధగాథ.

ఎవరు ప్రజ్ఞావంతు, లెవ్వరు కరుణ
కలవారొ వారు శోకమ్ము తరింత్రు
అల ఘృతపండితు డన్న విధాన.

ఈ ప్రకారముగా ఘృతకుమారునివలన శోకరహితుడై కేశవుడు చాలకాలము రాజ్యపాలనము చేసెను. ఆవల దశసోదరపుత్రులు ఒకనాడు "కృష్ణద్వైపాయనుడు దివ్యదృష్టి కలవా డని ప్రతీతి. అయనను పరీక్షింతము" అని తరుణాంత్రి కుమారునకు గర్భిణీస్త్రీ వేషము వేసి కడుపుమీంద తలగడ కట్టి, కృష్ణద్వైపాయనుని కడకు గొనిపోయి "భన్తే, ఈకుమారి ఏమి కనును?" అని అడిగిరి. తాపసి చూచి దశసోదర రాజుల వినాశము సమీపించిన దని, ఇంకను ఎంత ఆయుర్దాయ మున్న దని యోచించి ఆనాడే తనకు మరణ మని గ్రహించి "కుమారా, నీవేమి చేయుచున్నావో, తెలియునా?" అనెను. "మాకు తెలుపుడు" అని వారు పట్టు పట్టగా తాపసి "ఇతడు నేటినుండి ఏడవనాడు కాష్ఠఖండము కనును. దానివలన వాసుదేవకులమునకు నాశ మేర్పడును. మీరు కాష్ఠఖండమును కాల్చి దానిబూడిద నదిలో చల్లివేయవలెను" అని చెప్పెను. "దుష్టతపస్వీ, నీవు ఎదుటివారిని గమనింపవు!" అని వారు వింటినరముల త్రాటితో తాపసిని కొట్టి చంపిరి.

రాజు కుమారులను పిలువ నంపి "తపస్వి నేల చంపితి?" రని యడిగి వృత్తాంతము తెలిసికొని భయభ్రాంతుడై కుమారునిపై కాపలా ఉంచి. ఏడవనాడు

వానియుదరమునుండి వెలువడిన కాష్ఠఖండమును తగులబెట్టించి, భస్మము నదిలో చల్లించెను. అది ప్రవాహమున బడి ముఖద్వారమున ఒక ప్రక్కకు చేరెను. అచట ఆముదపుమొక్క మొలిచెను.

ఒకనాడు రాజు జలక్రీడ చేయుకోరికతో నదీముఖద్వారము చేరెను. పరివారమచట మహామండల మేర్పాటు చేసి చక్కని మంటపమున, తిని, త్రాగి ఆటపాటలలో ఒకరినొకరు కాలుచేతులు పట్టుకుని రెండుదళములుగా విడివడి జగడ మాడజొచ్చిరి. అందులో నొకడు మల్లెపూవులు చేత నిలువకపోవుటచే ఆముదపు చెట్టునుండి ఆకుకోసి తెచ్చెను. అది చేతిలోనికి వచ్చినంతనే కొయ్యరోకలి యయ్యెను. వాడు దానితో తక్కినవారిని కొట్టెను. ఒక్కొక్కడు ఆకు కోయగానే అది ముసలమగుచుండెను. అంతట వారు ఒకరి నొకరు మోదుకొని ఎల్లరును వినాశ మొందిరి. వారు నష్ట మగుట గాంచి వాసుదేవుడు, బలదేవుడు, అంజనదేవి, పురోహితుడు, రథమెక్కి పలాయనము చేసిరి. మిగిలినవా రందరును మరణించిరి. వారు నలుగురును కాలమత్తిక వనము చేరిరి. ముష్టికమల్లుడు తుదిసంకల్ప ప్రకారము యక్షుడై అచట నివసించుచు బలదేవుడు వచ్చుట చూచి తక్షణమే గ్రామము నిర్మించి మల్లవేషము ధరించి "ఎవరు మల్లయుద్ధము చేయుదు ?" రని గర్జించుచు, ఎగురుచు, తొడ చరచుచు విహరింప సాగెను. బలదేవుడు వానిని చూడగానే వానితో మల్లయుద్ధము చేయుదు నని వాసుదేవుడు నిషేధించుచున్నను వినక రథము దిగి ముష్టికుని సమీపించి తొడ చరిచెను. బలదేవుడు చేయి చాపినంతనే యక్షుడు అతనిని పట్టుకొని ముల్లంగిగడ్డను మ్రింగినట్టు మ్రింగెను. వాసుదేవుడు ఆసంగతి గ్రహించి సోదరిని, పురోహితుని వెంట బెట్టుకొని రాత్రి యంతయు ప్రయాణము చేసి సూర్యోదయ మగునప్పటికి సరిహద్దు గ్రామమును చేరెను. అచట సోదరిని, పురోహితుని వంటపనికి నియమించి, తాను చెట్టుక్రింద పండుకొనెను. అప్పుడు జరానామకు డగు వేటకాడు చెట్టుక్రింద ఏదో కదలుట చూచి అడవిపంది అనుకొని శక్తిని విసరి, ఆతనికాలిపై గాయము చేసెను. "ఎవరు నన్ను గాయపరచినాడు" అను మనుష్యవాక్కు విని వేటకాడు పారిపోయెను. రాజు శక్తిని (ఆయుధము) ఊడబెరికి "మామా, భయపడక రమ్ము" అని వేటకానిని పిలిచి వాడు వచ్చిన పిదప నీపే రేమని యడిగెను. "స్వామీ నాపేరు జర."

"జర బాణముతో కొట్టిన పిదప నేను మృతి నొందుదు నని పురాణపండితులు చెప్పినారు. నేడు మరణము నిశ్చయ" మని గ్రహించి "మామా, భయ

పడకు. గాయముమీద పట్టీ వేయు" మని వాడు పట్టీవేసినపిదప వానిని వీడుకొల్పెను. బాధ హెచ్చినది. అన్యులు తెచ్చిన ఆహారపదార్థములు తినలేక సోదరిని పిలువ నంపి" నేడు నేను మరణింతును, నీవు సుకుమారివి. ఏపనియును చేసి జీవనము నిర్వహింపజాలవు. ఈమంత్రము ఉపదేశము పొందుము" అని ఆమెకు మంత్రము చెప్పి తాను ప్రాణము లచటనే విడిచెను. ఈవిధముగా అంజనదేవి తప్ప తక్కినవా రెల్లరు మరణించిరి.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి, "ఉపాసకా, ఈవిధముగా పురాణపండితుల వాక్కు విని పుత్రశోకము మాని చింత విడువుము" అని సత్యప్రకాశనము చేసి జాతకములు సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము ఉపాసకుడు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. "ఆకాలమున రోహిణేయుడు ఆనందుడు: వాసుదేవుడు సారిపుత్రుడు; పరిషత్తు బుద్ధపరిషత్తు: ఘతపండితుడు నేనే."

o

# 455. మాతృపోషక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచున్నప్పుడు మాతృపోషకుడను స్థవిరుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఈకథ సామజాతకమున (540) వచ్చును. కథ దానివలెనే యుండును. శాస్త వారిని జూచి "భిక్షువులారా, ఈతనిపై కోపింప వలదు. పూర్వము పండితులు పశుగర్భమున పుట్టినను మాతృవియోగ గ్లానపిదప సప్తాహముల మాహారము స్వీకరింపక, శుష్కించిపోవుచు, ఆవలరాజభోగములు లభించినను తల్లి ఆహారము స్వీకరింపనిదే తాము మేత మేయక, తల్లిని చూచినపిమ్మటనే ఆహారము స్వీకరించిరి." అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ బోధిసత్త్వుడు హిమాలయ ప్రదేశమున ఏనుగుకడుపున పుట్టెను. ఆయన తెల్లని వర్ణముతో సుందరగాత్రుడై ఎనుబదివేల ఏనుగులకు నాయకుడయ్యెను. ఆయన తల్లి గ్రుడ్డిది. ఆయన ఏనుగుద్వారా తల్లికి తియ్యనిపండ్లు పంపుచుండెడివాడు. అయ్యది ఆమెకొసగక వాళ్ళు తామే తినుచుండెను. పరీక్షించి, ఉన్నస్థితి కనుగొని బోధిసత్త్వుడు యూథము విడిచి తల్లికి సేవ చేయదలచి, రెండవ ఏనుగునకు తననివాసము తెలుపకుండ రాత్రివేళ తల్లిని వెంట గొని చండోర్ణపర్వతము చేరి అచటి సరస్తీరమున నున్న కొండగవిలో ఆమె నునిచి పోషణ చేయజొచ్చెను.

వారాణసీనివాసి యగు వనచరుడొకడు త్రోవతప్పి దిక్కు తెలియక గట్టిగా రోదనము చేయుచుండెను. బోధిసత్త్వుడా వాక్కు విని "ఈతడనాథుడు, నేనుండగా ఈతడు చనిపోవుట తగదు" అని తలచి వానికడకు జనెను. వాడు భయముచే పరుగెత్తబోవుట గాంచి "ఓయీ నన్ను గాంచి నీవు భయపడవలసిన కారణ మేమియును లేదు. భీతి చెందకుము. నీవు ఏడ్చుచు త్రోవ ఏల తప్పిపోయితివి ?" అని బోధిసత్త్వుడడిగెను.

"స్వామీ, నేను దోవ తప్పి ఏడురోజు లైనది."

"ఓయీ, భయపడకుము. నిన్ను జనమార్గము వరకు కొనిపోయి విడిచెదను."

బోధిసత్త్వుడు వానిని తనవీపుపై కూరుచుండ బెట్టుకొని అడవి వెలుపలకు గొనిపోయి మరలి వచ్చెను. నగరము చేరినపిదప ప్రభువునకు సూచన చేయవలెనను తలపు ఆపాపాత్మునకు కలిగినది, వాడు వృక్షములను, గుట్టను గురుతుంచుకుని చనెను. ఆసమయమున రాజుగారిభద్రగజము చనిపోయెను. నే నధిరోహింప దగినగజము ఎవనికేని కానబడినచో నాకు తెలుపవలెను అని రాజు చాట బంచెను. వాడు రాజసన్నిధికి జని "దేవా, ఆ మారోహింపదగినది సర్వశ్వేతము, యోగ్యము అగుభద్రగజమును చూచితిని. మార్గము చూపుదును. నావెంట హస్తికులను పంపినచో దానిని పట్టించెదను" అని విన్నవింపగా, రాజు మంచిదని ఆవనచరుని వెంట పరివారమును, మావటివాండ్రను పంపెను. వారిని వెంట గొని సరస్తీరమున భద్రగజము చరించుచుండుట నతడు చూచెను. బోధిసత్త్వుడు మావటివాండ్రను చూచి ఇట్లు తలపోసెను. "ఈసంకటమెచ్చటనుండియో వచ్చినది గాదు. వీనివల్లనే కలిగి ఉండవలెను, మహాబలిష్ఠుడ నగు నేను వేయియేనుగులనైనను ధ్వంసము చేయగలను. కోపించితినేని రాష్ట్రములోని సైన్యము నంతను నాశము చేయగలను. కుపితుడ నైతి నేని శీలభ్రంశ మగును. కావున నేడు శక్తి నణచుకొని కోపము రానీయను." ఇట్లు సంకల్పించి బోధిసత్త్వుడు శిరసు వంచి నిలిచెను. మావటివాడు పద్మసరోవరము లోనికి దిగి హస్తిలక్షణసంపత్తి కనుగొని నాయనా రమ్మా అని అహ్వానించెను. వెంటిగొట్టమువంటి తొండము పట్టుకుని ఏడవనాటికి నగరము చేరెను. కుమారుడు రాకుండుట గమనించి బోధిసత్త్వునితల్లి తనలో "నాకుమారుని రాజుగారి మహామాత్యులు కొనిపోయి యుందురు. అతడు వెడలిపోవుటచే ఇచ్చట అడవి పెరిగిపోవును" అని తలపోసి దుఃఖించుచు ఈగాథలు పలికెను :

భద్రనాగము చనుటచే పల్లవించు
సాల కురువింద కరవీర సల్లకు లిట
మెండగు నివాతభూమిలో కొండగోగు.

పసిడి కేయూరముల్ దాల్చి పాలకుండొ
రాజపుత్రుడో మాయిభరాజమునకు
ముద్ర వేయింపనోపును; మూపుమీద

కురుచుండి నిర్భీతిగా నైరివీర
కవచములు చేయనోపును ఖండములుగ.

మావటీడు మార్గమునుండియే రాజునకు వార్త పంపెను. రాజు నగరము నలంకరింప జేసెను. మావటీడు అలంకృతమై సువాసితమైన హస్తిశాలలోనికి బోధిసత్త్వుని కొనిపోయి రత్నకంబళము కప్పి రాజునకు నివేదించెను. ప్రభువు వివిధములైన ఆహారములు బోధిసత్త్వునకు పెట్టించెను. తల్లి భుజింపకుండ నేను ఆహారమును గైకొన నని తలచి బోధిసత్త్వుడు ఏమియు భుజింపలేదు. రాజు ప్రార్థించుచుండగా ఈగాథ పలికెను:

కబళంబు నాగమా, గ్రహియింపవలెను;
చేయ నక్కర లేదు సేద్యంబు నీవు
కల వెన్నియో రాజకార్యముల్ సలుప.

ఇదివిని బోధిసత్త్వుడీగాథ పలికెను:

దృష్టిలేనిది బాలకృపణురాలామె,
త్రోవ చూపెడివాడు దొరకని దామె,
చండోరణం బను కొండపై నామె
పాదఘట్టన చేయు వ్యాకులంబుగను.

ప్రభువు బోధిసత్త్వుని ప్రశ్నించుచుండగా ఈగాథ పలికెను;

దృష్టి లేనట్టిది, కృపణురాలెంతొ,
త్రోవ చూపెడివాడు దొరక నట్టిదియు
చండోరణం బను కొండపై నునను
ఘట్టించునది యేమి కావలె నీకు ?

బోధిసత్త్వుడీగాథ పలికెను;

నాపు నాతల్లికి లోపంబు దేవ,
త్రోవ చూపెడివాడు దొరక రాయమకు
చండోరణం బను కొండపై నామె
పాదఘట్టన చేయు వ్యాకులంబుగను.

బోధిసత్త్వుని విడిపించునప్పుడె రాజీకథ పలికెను :

జననికి సేవలు చేసెడి యిట్టి
ద్విపరాజు నిప్పుడే విడిపింప వలయు,
జ్ఞాతులన్ మాతను కలిసికొనగలడు.

ఇవి సంబుద్ధ గాథలు :

బంధముక్తం బయ్యె సింగుర మ్మపుడు,
గొలుసులు విడిపోయి కుంజరమ్మునకు,
అచ్చట విశ్రాంతి నంది ముపశాలార్థ
మాత్రము, చేరెను ధాత్రీధరంబు

శీతలంబును పక్షిసేవిత మగుచు
రమ్యమైనసరోవరమ్ములో దిగుచు
నిండుగా తొండాన నీరంబు గొనుచు
నభిషేక మొనరించె నిభము తల్లికిని.

దేవుడు వాన కురియుచున్నా డని తలచి బోధిసత్త్వునితల్లి యీగాథ పలికెను:

అతివృష్టి నెవ రీయనార్యదేవుండు
చేయు నకాలాన! సేవలు నాకు
కావించు కొమరుండు కాన రా డిపుడు.

ఆమె నోదార్చుచు బోధిసత్త్వు డీగాథ పలికెను ;

అమ్మ పన్నుంటివా ? లెమ్ము లే లెమ్ము .
నీకుమారుండను నే వచ్చినాను
జ్ఞాని, యశస్వి యా కాశీవిభుండు
అనుకంపతో విముక్తుని జేసె నన్ను.

ఆమె రాజు నను మోదించుచు నీగాథ పలికెను :

వృద్ధజనంబుల కెప్పుడు సేవ
లొనరించుచుండెడి తనయుని విడిచి
పుచ్చు కాశీరాష్ట్ర భూపాలకుండు
చెందు గావుత చిరంజీవిగా జయము!

బోధిసత్త్వుని గుణములకు రాజు ప్రసన్నచిత్తుడై సరోవరసమీపముననే గ్రామనిర్మాణము గావించి, ఆతనితల్లికి ఎడతెగకుండ సపర్యల నేర్పాటు చేసెను.

కాలక్రమమున తల్లి మరణింపగా నామెకు భౌతికకర్మలు చేయించి ఆయన కరండక నామముతో ఆశ్రమమునకు జనెను. హిమాలయమునకు ఉత్తరదిక్కున 500 ఋషు లుండిరి. రాజు బోధిసత్త్వుని బోలిన ప్రతిమ చేయించి విశేషముగా నాదరించెను. జంబూద్వీపవాసులు సమావిష్టులై హస్తిపూజ యనునుత్సవము చేసెడివారు.

శాస్త ధర్మోపదేశము చేసి, సత్యప్రకాశనము గావించి, జాతకములను సరిపోల్చెను. అప్పుడు రాజు ఆనందుడు; హస్తిమాత మహామాయాదేవి; తల్లిని పోషించు నాగము నేనే.

# 456. జుణ్హ జాతకము

శాస్త ఆనందుని వర ప్రాప్తి విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

బోధిధర్మ ప్రథమావస్థలో మొదటి ఇరువదేండ్లువరకును తథాగతునకు సేవకు డెవడును నిలకడగా లేడు. స్థవిర నాగసమాల, నాగిత, ఉపవాణ, సునక్షత్ర, చున్ద, సాగల, మేఘియ వీరు అప్పు డప్పుడు ఉపచారములు చేయుచుండిరి. ఒకనాడు భగవానుడు భిక్షువులను పిలిచి "ఇప్పుడు నేను వృద్ధుడ నైనాను. ఈమార్గమున పోవుచు ఒక్కొక్కభిక్షువు చెప్పిన పిమ్మట రెండవవానివెంట జనును. ఒక్కొక్కడు పాత్రను, చీవరములను నేలపై నుంచి పోవును. నాకొరకు నిలకడగా నుండు వానిని చూడుడు" అనెను.

"భన్తే, నేను సేవచేయుదును. నేను సేవ చేయుదును" అని సారిపుత్ర స్థవిరాదులు విన్నవించినపుడు శిరసుపై చేతులు జోడించి భగవానుడు "మీ ప్రార్థనలు అంగీకరించుటకు వీలులేదు" అని పలికి నపుడు భిక్షువు లానందస్థవిరునితో "ఆయుష్మన్, నీవు సేవకపదవికై ప్రార్థింపుము" అనిరి. స్థవిరుడు 8 వరములను—4 ఆజ్ఞలను 4 ప్రతిక్షేపములను—ప్రార్థించెను, 1. భగవానుడు నాకు చీవరము లీయకుందురు గాక. 2. నాకు కబళము లీయకుందురు గాక. 3. గంధకుటిలో తమసన్నిధిలో నన్ను ఉండనీ కుందురు గాక. 4. నన్ను ఏ నిమంత్రణకు వెంట గొనిపోకుందురు గాక. 5. అంగీకరించిన నిమంత్రణమునకు భగవానుడే వెడలును గాక, 6. దూర ప్రదేశమునుండి దర్శనార్థము జనులను నేను కొనివచ్చినప్పుడు భగవానుడు వారికి దర్శన మిచ్చును గాక. 7. నాకు సందేహము కలిగినపుడు భగవానునిసన్నిధికి బోయి నివేదించుట కవకాశ ముండును గాక. 8. భగవానుడు నేను లేనపుడు ఎవరి కైనను ధర్మోపదేశము చేసినచో ఆవల నాకది వినిపించును గాక!

భగవానుడు ఈవరము లాతని కనుమతించెను. అది మొదలు ఆతడు 25 వర్షములవరకును స్థిరముగా సేవలు చేయుచుండెను. ఆతడు పంచశబ్దములలో అందరికన్న మొదటివాడయి ధర్మసంపత్తి, అనుభూతిసంపత్తి, పూర్వకర్మ

సంపత్తి, అర్థార్థచర్యాసంపత్తి. తీర్థయాససంపత్తి చిత్తైకాగ్రతాసంపత్తి, పొంది బుద్ధుని వలన 8 వరములు పొంది ఆకాశమున చంద్రునివలె ప్రస్ఫుటముగా నుండెను. ఒకనాడు ధర్మసభలో సంభాషణలు జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, తథాగతు డానందునకు 8 వరము లను గ్రహించి సంతుష్టచిత్తుని జేసినారు." "శాస్త అరుదెంచి విషయము గ్రహించి, "భిక్షువులారా, నేను కేవల మిప్పుడే కాదు, పూర్వముగూడ ఆనందునకు వరము లిచ్చి సంతోష పరచితిని. పూర్వము రాతడు అడిగినవాని నెల్ల నిచ్చితిని." అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా, జుణ్హకుమారు డను తత్పుత్రుడు తక్షశిలలో విద్యలు అభ్యసించి ఆచార్యునికడ సలవు తీసికొని, రాత్రి, చీకటివేళ ఆచార్యగృహమునుండి వెలువడెను. అతడు వడివడిగా ఇంటికి బోవునపుడు మార్గమున చేయి తగిలి బ్రాహ్మణుని ఆహారము జారిపడెను. భిక్షాటనానంతరము బ్రాహ్మణుడు గృహమునకు మరలుచుండెను. బ్రాహ్మణుడు నేల బడి రోదనము చేయసాగెను. కుమారుడు కనికరమున బ్రాహ్మణుని చేయి పట్టుకొని కూర్చుండ బెట్టెను. "నాయనా, నీవు నా ఆహారపాత్రను పడద్రోసినావు. ఆహారపువిలువ నా కిమ్ము" అని బ్రాహ్మణుడనగా, కుమారుడు "బ్రాహ్మణోత్తమా, ఇపుడు నీకు నేను ఆహారము విలువ నీయ జాలను. నేను కోసలనరేశుని పుత్రుడను, జుణ్హకుమారుడను. నేను సింహాసనము నారోహించినపుడు నీవు వచ్చి ధనమడుగుము" అని పలికెను.

రాజకుమారుడు వారాణసికి జని తండ్రియెదుట విద్యాప్రదర్శనము చేసెను. "నేను జీవించి ఉండగా కుమారుని చూడగలిగితిని; ఇక నితడు పట్టాభిషిక్తు డగుట కూడ చూతును గాక!" అని రాజు తలపోసి కుమారునకు పట్టాభిషేకము చేసెను. జుణ్హకుమారుడు రాజై ధర్మానుసారముగా పరిపాలనము చేయసాగెను. బ్రాహ్మణు డీసమాచారము విని "ఇపుడు నేను భోజనమూల్యమును అడిగి తీసికొందును గాక." అని తలపోసి వారాణసి చేరి, రాజు నగర ప్రదక్షిణము చేయుసమయమున ఉన్నతస్థానమున నెక్కి 'జయజయ' ధ్వానము చేసెను. రాజు బ్రాహ్మణుని చూడక ముందరికి సాగిపోయెను. రాజు తనను చూడలే దను సంగతి గ్రహించినపుడు బ్రాహ్మణు సంప్రశ్నము చేయువాడై ఈ గాథను పలికెను;

జుణ్హరాజేంద్ర, నీచెవి జేరగ నిమ్ము
సాధువాక్కులు, నే పనిమీద నిటకు
వచ్చితిని, బ్రాహ్మణుండేని, ఏరంగుడేని
పల్కునది విన కేగుట పాడియగునె ?

రాజు విని భద్రగజమును అంకుశముతో ఆపి ఈగాథ పలికెను :

ఆగితిని, చెప్పు బ్రాహ్మణా, ఆలకింతు
అరుగుదెంచితి వేటికి ? అట్లు కాక
నన్ను నే గ్గన కోరగా నున్న దొక్కొ ?
బ్రాహ్మణోత్తమ, విందును పలుకవలయు.

ఆవలి గాథలలో రాజబ్రాహ్మణుల ఉత్తరప్రత్యుత్తరములు గలవు.

సప్తశతగోవులన్, దాసిశతను దేవ
స్వర్ణనిష్కసహస్రంబు, సదృశ భార్య
లిర్వురన్, గ్రామపంచక మీయ వలయు.

బ్రాహ్మణోత్తమ, ఉగ్రతపస్వి వొక్కొ ?
కలవొకో చిత్రమంత్రముల్ ? కాక నీదు
మానసుల్ నెరవేర్చెడి యక్షులుండ్రొ ?
తొలుత నా పని యేదైన సలిపినావొ ?

తాపసిని కాను, నాకు మంత్రములు లేవు.
యక్షులును లేరు నెరవేర్ప మానసులను
తొలుత నీపని యేదియు సలుప లేదు
నేడె తొలిమేళనంబు నీతోడ నాకు.

ఇదియె తొలిదర్శనంబైన నింతకు మును
జరిగినది యేదియు నాకు జ్ఞప్తి లేదు
ఎన్నడేని ఇంతఃపూర్వ మెచటనేని
కలిసికొన్నమొ బ్రాహ్మణా, తెలుపవలయు.

రమ్య తక్షశిలా నగరమ్మునందు
దేవ, గాంధార రాష్ట్రాన నీవు నేను

కటికచీకటిరాత్రి దర్గరగనిలిచి
స్మరణయోగ్యంబులైన భాషణము లచట
నాడితిమి; మననేళన మప్పుడె: దాని
కవల నైనను మున్నైన కలుగ లేదు.

అప్పు డప్పుడు సుజన సమాగమంబు
బ్రాహ్మణా, సంభవించును పండితజన
సంగతులు నష్టపడ నీవు సఖ్యనులను
మున్ను చేసినయుపకారములను గాని.

మూర్ఖసంగతి నైత్రిని, మున్ను చేసి
నట్టి యుపకృతులను గూడ నష్టపరచు
తథ్య మాను మూర్ఖుంగు కృతఘ్ను డనుట.

మున్ను చేసినయుపకారమును లవంబు
కూడ ధీరులసంగతి కోలుపోవ
నీదు, వారు కృతజ్ఞులే యెల్లవేళ.

అగ్రహారము లిచ్చెద నైదు నీకు,
సప్తశతగోవులును పరిచారికలను
శతమితంబుగ, స్వర్ణనిష్కములు వేయి,
యోగ్యదారద్వయంబు నీ కొసగుదుండ.

చంద్రునకు తారకులకును సంగతివలె
అలరుచుండును సుజనసమాగమంబు
చేసితివి పూర్ణు నన్ను కాశీనరేశ
నిక్కముగ మనసంగతి నేడె జరిగె.

బోధిసత్త్వ డాతనికి విశేషసంపద నొసంగెను. శాస్త రిః ధర్మోపదేశనము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వమునుకూడ నేను ఆనందునకు ఎనిమిది వరము లిచ్చి సంతుష్టచిత్తుని జేసితిని" అని జాతకములు సరిపోల్చెను. ఆనమయమున బ్రాహ్మణుడు ఆనందుడు; రాజు నేనే.

::

# ౪౫౮. ధమ్మ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు దేవదత్తుడు పృథ్వీ ప్రవేశము చేయుటను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ధర్మసభలో సంభాషణ జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, దేవదత్తుడు తథాగతునియెడల వైరముపూని రసాతలమును పాలయ్యెను." శాస్త అరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, ఇప్పుడు దేవదత్తుడు జినచక్రమున్గుప ప్రహరించుటచే అడుగంటిపోయినాడు. కాని పూర్వము ధర్మచక్రమునే ప్రహరించుటచే అవీచీనరకమున పడినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కామావచరలోకమున ధర్మ నామక దేవపుత్రుడై జన్మించెను. దేవదత్తునిపేరధర్ముడు. ధర్ముడు దివ్యాలంకారభూషితుడై దివ్యరథ మెక్కి అప్సరోగణసమన్వితుడై లోకులు సాయంసమయమున భోజనముచేసి తమతమ మందిరములపై సుఖాసీనులై ఉన్నపుడు, పూర్ణిమాది ఉపవాసదినములందు గ్రామములకు, నిగమములకు పోయి ఆకసమున నిలిచి "ప్రాణాతిపాతము మొదలగు అకుశల కర్మలు చేయవలదు. మాతృసేవాధర్మము, పితృసేవాధర్మము, త్రివిధసుచరిత ధర్మములను నిర్వర్తింపుడు. స్వర్గగాములై మహావైభవములు పొందుడు" అని లోకులను దశకుశలకర్మములయందు ప్రేరేపించుచు జంబూద్వీపమునకు ప్రదక్షిణము చేయుచుండెను.

"ప్రాణులను హింసింపుడు" అను అకుశల కర్మములందు లోకులను ప్రేరేపించుచు అధర్ముడు జంబూద్వీపమును వామమార్గమున తిరుగుచుండెను. ఆకసమున ఉభయుల రథములును ఎదురుపడినవి. "మీరు దేనికి? మీరు దేని" కని పరిషత్తు ప్రశ్నింపగా, "మేము ధర్మమునకు" "మే మధర్మమున" కని మార్గమున నిలిచి వారు రెండు భాగములైరి. ధర్ము డధర్ముని సంబోధించి "నీవు

అధర్ముడవు, నీవు అధర్ముడవు, నా మార్గము ఋజువైనది, నీరథము ఆపి నాకు త్రోవ ఇమ్ము" అని రణగాథ పలికెను ;

శ్రమణులును బ్రాహ్మణులును ప్రశంస చేసి
వారు నను, దేవతలును మానవులు కూడ
అర్చ చేతురు, ధర్ముడ; అధ్వమునకు
యోగ్యుడ, అధర్మ, తెరువు నా కొసగవలయు.

ఇక ముందు వచ్చుగాథలు వారి ఉత్తర ప్రత్యుత్తరములు ;

గట్టిగ నధర్మమార్గంబు పట్టినాను
నిర్భయుడ, బలవంతుడ నేను ధర్మ !
ఎవ్వరికిగూడ తెరు వీయ నింతకు మును
ఇప్పు డేటికి మార్గమ్ము నీయవలయు ?

ధర్మమే పూర్వమందు అధర్మ మవల;
ధర్మమే జ్యేష్ఠమును సనాతనము గూడ;
కావునన్ జ్యేష్ఠునకును మార్గమ్ము నిమ్ము.

సరణి యొసగుట లేదు యాచనను బట్టి,
అట్లు చేయుటయుం గూడ ననుచితంబు.
యుద్ధ మగు గాక ఇప్పుడే యుభయులకును
జయము గాంచినవానికి సరణి దొరకు.

యశము వ్యాపించినది నాల్గుదిశలయందు
నేను బలవంతుడను సాటి లేనివాడ:
అఖిల సద్గుణయుక్తుండ నైన నన్ను
ఏవిధమ్ముగ గెల్వ వోయెదు అధర్మ !

పాటకము దెబ్బ తినును లోహమ్ముచేత;
ఆయసపదార్థమును దెబ్బ తీయ లేదు
దర్శనీయసువర్ణ, సుధర్మమునకు
నేటికాలాన విజయము నిక్కువముగ !

యుద్ధబల మున్నచో నీకు ఓయధర్మ
నీకు జ్యేష్ఠులు, పూజ్యులు లేక యున్న
ప్రీతితో మార్గ మిత్తు న ప్రియము లీవు
మెండుగా బల్కినావు క్షమించినాను.

బోధిసత్త్వు డీగాథలు పలుకుచుండ అధర్ముడు రథమున గూరుచుండ లేక పోయెను. అతడు తల క్రిందుగా నేల గూలెను. భూమి వానికి త్రోవ యిచ్చెను. వాడు అవీచీనరకమున పడెను.

ఇయ్యది గ్రహించి భగవానుడు సమ్యక్సంబుద్ధుడై నతరువాత మిగిలిన గాథలు పలికెను :

అపు డధర్ముండు తల క్రిందు లగుచు పడియె
యుద్ధకాముడ నేను, నాకోడు కూడ
చిక్కడే పోరికై యేమి చేతు నన్న
మాటతోడ నధర్ముండు మరణ మొందె.

ఓడగొట్టి యధర్ముని యుద్ధబలము
మాత్ర మున్నట్టి వానిని మహికి ద్రోసి
రథముపై జనె సత్యపరాక్రముండు
ధర్ము డత్యంతతుష్టు డాతతబలుండు.

జనని జనకుడు, బ్రాహ్మణ శ్రమణు లెవని
మందిరంబున సమ్మాన మొందుచుంద్రొ
తనువు దొరగిన పిదప నాతండు ధర్ము
పోల్కి నరదంబునం జని పొందు సుగతి.

శాస్త ఈవిధముగా ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, దేవదత్తుడు పూర్వముకూడ నాతో విరోధించి నరకమునకు పోయెను." అని జాతకములు సరిపోల్చెను.

ఆ కాలమున అధర్ముడు దేవదత్తుడు; ఈపరిషత్తు దేవదత్తునిపరిషత్తే; ధర్ముడు నేనే; ఈ పరిషత్తు బుద్ధపరిషత్తే.

# 458. ఉదయ జాతకము

శాస్త ౘేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్తుడగు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఈకథ కశ జాతకములో (531) వచ్చును. శాస్త ఆ భిక్షువును పిలువనంపి "భిక్షూ, నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడవైతివా?" అనెను. "భన్తే, నిజమే," అని యతడన్నపిదప శాస్త "కల్యాణకారి యగు శాసనమున ప్రవ్రజించియు ఏల కాముకత్వమునకు వశీభూతుడవైతివి? పండితులు సమృద్ధమై 12 యోజనముల విస్తీర్ణము గల సురంధన నగరమున రాజ్యము చేయుచు అచ్చరవంటిస్త్రీతో 7 సంవత్సరములపాటు ఒకకక్ష్యలో నున్నను ఇంద్రియలౌల్యమునకు లోను గాక ఆమె వంక కూడ చూడ లేదు," అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము కాశీరాష్ట్రములోని సురంధన నగరమున కాశీరాజు రాజ్యము చేయుచుండెను. ఆయనకు పుత్రిక గాని పుత్రుడు గాని లేరు. "పుత్రునికై దేవతలను ప్రార్థింపు" మని రాజు భార్యతో చెప్పెను. ఆసమయమున బోధిసత్త్వుడు బ్రహ్మలోకమునుండి జారి ఆతనిపట్టపుదేవి కడుపున బుట్టెను. లోకుల హృదయము లుప్పొంగజేయుటచే బిడ్డనికి ఉదయభద్రు డని పేరు పెట్టిరి. కుమారుడు ఎలాడునాటికి వేరొకవ్యక్తి బ్రహ్మలోకమునుండి జారి వేరొకరాణిగర్భమున కుమారిగా జన్మించెను. ఆమెకు ఉదయభద్ర యని పేరిడిరి. కుమారుడు పెరిగి పెద్దవాడై సమస్తవిద్య లభ్యసించెను. ఆతడు జన్మమాదిగా బ్రహ్మచారియై స్వప్నమున కూడ మిథునసమాగమ విషయములను గ్రహింపకుండెను. ఆయన చిత్తమున కామవాసనకూడ లేదు. కుమారునకు పట్టాభిషేకము చేసి నాటకము చూపెద నని రాజు వార్తపంపెను. బోధిసత్త్వుడు వలదనియు, తనకు రాజ్యాభిలాష లేదనియు, తన చిత్తము భోగాసక్తము కా దనియు విన్నవించెను. మాటిమాటికిని తండ్రి వార్తపంపుటచే కుమారుడు జంబూనదిలోని బంగారముతో స్త్రీమూర్తిని చేయించి, ఇట్టి

స్త్రీమూర్తి లభించినచో రాజ్యము స్వీకరింతు నని తల్లిదండ్రులకు వార్తపంపెను. వారు స్వర్ణప్రతిమను జంబూద్వీపమంతటను త్రిప్ప పంపిరి. కాని అట్టి స్త్రీ మూర్తి లభింప లేదు. ఆవల ఉదయ భద్రను అలంకరించి ప్రతిమ ప్రక్కన నిలిపిరి. ఆమె స్వర్ణప్రతిమకన్న మిన్నగా నుండెను. వా రిరువురికోర్కెలకు విరుద్ధముగ వేలు విడిచిన చెల్లెలు ఉదయభద్రను కుమారున కిచ్చి పెండ్లి చేసి అతనిని రాజ్యాభిషిక్తుని గావించిరి, వా రిరువురు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించిరి. ఆవల జననీజనకుల మరణానంతరము కుమారుడు రాజ్యపాలన చేయ నారంభించెను. వా రొక గదిలో నున్నను ఇంద్రియములకు లోబడకుండిరి. కాని తమలో ముందు చనిపోయినవారు ఉత్పన్నస్థానమునుండి వచ్చి, నేను ఫలానితావున జన్మించితి నని వచ్చి చెప్పవలె నని వారు నిర్ణయము చేసికొనిరి.

రాజ్యాభిషేకానంతరము నూరుసంవత్సరముల కతడు దేహము చాలించెను. వేరెవరినీ రాజును చేయలేదు. ఉదయభద్ర ఆనతియే కొనసాగుచుండెను. అమాత్యులు పరిపాలనము నెరపుచుండిరి. త్రయస్త్రింశభవనమున ఉదయభద్రుడు జనన మొంది శక్రు డయ్యెను. వైభవవిశేషమువలన సప్తాహమువరకు ఏమియును జ్ఞప్తియం దుండలేదు. మానవగణనప్రకారము ఏడువందల సంవత్సరములు గడిచిన తరువాత ఉదయభద్రుడు యోచించి రాజకుమారి ఉదయభద్రను ధనమూలమున పరీక్షించి, ధర్మోపదేశమిచ్చి, జ్ఞానము కలిగించి ముక్తురాలిని చేసెద నని నిశ్చయించుకొనెను.

ఆకాలమున మానవాయుస్సు 200 సంవత్సరములు. ఆరాత్రి రాజకుమారి ద్వారములు బాగుగా మూసి రక్షకులు పహారా ఇచ్చుచున్న ఏడవఅంతస్తులో అలంకృతశయనగృహమున ఒంటిగా శయనమున నిశ్చలముగా కూరుచుండి తన శీలమును పరిశీలించుకొనుచుండెను. శక్రుడు స్వర్ణమాషములతో నిండిన సువర్ణస్థాలి గైకొని శయనగృహమున ప్రత్యక్షమై ఒకప్రక్కన నిలుచుండి ఆమెతో ప్రసంగించువాడై ఈగాథ పలికెను:

ఓయనిందితగాత్రి, ఓశుభ్రవసన,
కమనీయజంఘులు కలిగినదాన !
ఎక్కి ప్రాసాదంబు నేకాకినిగను
కిన్నరీనేత్ర, కూర్చున్నట్టి దాన !
ఉభయుల మిట రేయి నుండ వేడుదును.

అప్పుడు రాజకుమారి ఈగాథలు పలికెను :

నగరమ్మునకు చుట్టు నాల్గు ప్రక్కలను
కలవు లోతైన యగడ్తలు, దృఢము
లైనవి కోష్ఠమ్ము లట్టాలికలును
ఖడ్గధారులు కాని గాయుచు నుంద్రు
సులభంబు కాదిందు జొచ్చుట యన్న
వాలేరు లోనికి బాలురు యువకు
లెట్లు నాతో గూడ నిచ్చగించెదవు ?

శక్రు డీగాథ పలికెను :

నీయంతికమునకు నే వచ్చినాను
యక్షుండ, కల్యాణి, అగుగాక శుభము
సంతుష్ట నన్ జేయు స్వర్ణసంపూర్ణ
మైనట్టి స్థాలి నీ కర్పించువాడ.

విని రాజకుమారి ఈగాథ పలికెను :

ఉదయుని దప్ప నే నొరుల గాంక్షింప
మర్త్యులనైన నమర్త్యులనైన
పోవలె వెంటనే భూరి ప్రతాప,
యక్ష, క్రమ్మర నిట కడదేరవలదు.

ఆమె ఆయన సింహనాదము విని నిలువలేక వెడలిపోవు బానివలెకాగా, ఆతడు అచటనే అంతర్ధాన మయ్యెను. మరునాడు శక్రుడు స్వర్ణమాషములతో నిండిన రజతస్థాలి గొని ఆమెతో సంభాషించుచు ఈగాథ పలికెను :

పాపకర్మంబులు ప్రాణి యొనర్చు.
లక్ష్య మెయ్యది భోగు లగువారి కెల్ల
ఓసుహాసుని, అట్టి యుత్తమరతిని
విడనాడబోకుము; వెండితో జేసి
నట్టి స్థాలిని నీకు నర్పించువాడ.

"రాతడు నాతో సంభాషించుటకై వచ్చుచున్నాడు. ఇప్పు డీతనితో సంభాషింప" నని తలచి రాజకుమారి ప్రత్యుత్తర మీయలేదు. ఆమె ఏమియు పలుక కుండుట గమనించి ఆత డచట నిలువక అంతర్ధాన మొందెను. మరునాటివేళకే కార్షాపణములతో నింపిన లోహపాత్ర గొని వచ్చి "భద్రే, నీవు నన్ను భోగములతో సంతృప్తి పరచినచో కార్షాపణములతో నింపిన రాన్థాలిని నీకిత్తును" అని శక్రు డనగా, రాజకుమారి రాగాథ పలికెను ;

నరుడు ధనమ్ముతో నారిని లోభ
పెట్టుచు ద్రవ్యంబు వృద్ధి యొనర్చు
తల క్రిందుగా దేవధర్మంబు మారె
విలువను తగ్గించి వేసితి వీవు.

విని యతడు "భద్రే, నేను నిపుణవ్యాపారిని. నేను నిరర్థకముగా ధనము పంచిపెట్టను. నీవు అయువులో, వన్నెలో నానాటికి వృద్ధి గాందువేని నేను నీతో సమాగమము పెంచ్చుచేసి ధనము కానివత్తును. నీవు ఆదరము తగ్గించుచో నేనుగూడ ధనము తగ్గింతును" అని రాగాథలు పలికెను ;

ఓసుగాత్రి, క్షయంబు పొందుచునుండు
ఆయువు వన్నెయు; క్రమంబుననె
ధన మనుదినమును తరుగుచునుండు
నేడు జీర్ణత పెంచ్చు నిన్నటికన్న

ఓయశస్విని, చూడు మోరాజపుత్రి,
రేయింబవళ్ళు నీరీతిని నేను
నిన్ను గాంచుచునుండ వన్నియు తగ్గు.

రాజన్మమున నీవు పేరాజపుత్రి,
బ్రహ్మచర్యవ్రత పాలన చేయు
చున్నచో నగుదువు సుందరతరవు.

అంతట రాజకుమారి రాగాథ పలికెను :

తనువు చెందదు జీర్ణతను మానవులకట్లు
దేవతాగణములో; దేహాల్లపై ముడత

లెంతమాత్రము పడవు హేమహాతేజస్వి!
అడిగెదం జెప్పుమా యక్ష, ఏటికి పడవొ?

శక్రుడామెకు ప్రత్యుత్తర మిచ్చుచుండగె రీగాథ పలికెను:

దివ్యవర్ణము హెచ్చు దేవతాదేహాల
భోగసామగ్రియుం బొందుచుండును వృద్ధి.

ఆమె దేవలోక ప్రశంస విని, మార్గ మడుగునదియై రీగాథ పలికెను:

బహుమర్త్యు లిచ్చటం బరలోక భీతులే,
పరలోకముల కెన్నొ పథములం జూపుదురు
ఏయు పరలోకంబుభయ మేడ నున్నచో?

శక్రుడు ప్రత్యుత్తర మిచ్చుచుండగె రీగాథ పలికెను,

కావింపరో పాపకార్యంబు లెవరు
త్రికరణశుద్ధుడె, సకలాతిథులును
అదరించునుండు నన్నపానముల,
శ్రద్ధయు దానంబు చత్వారదాన
సంగ్రహా సామగ్రిసంయతుం డెవడు
మృదుభాషి, ప్రియభాషి, మృదులస్వభావు
డెవ్వడో వానికి నీభీతి లేదు.

అప్పుడు రాజకుమారి అతనిమాటలు విని స్తుతించుచు రీగాథ పలికెను:

ఒసగినావు నాకు నుపదేశమును యక్ష,
జనని జనకు డిచ్చుచందమునను.
ఓమహార్ఘవర్ణ, ఓమహాబలదేహ,
ఏను పృచ్ఛ చేతు, నెవరు నీవు?

అప్పుడు బోధిసత్త్వ డీగాథ పలికెను:

ఉదయుండ నే సుమీ ఓసికల్యాణి
వచ్చినాడను మాట యిచ్చుట చేత
కావించి సూచన కదలిపోవుదును
ఇచ్చుపాశ్చాలనుండి యింక విముక్తి.

రాజకుమారి నిట్టూర్పు విడిచి అశ్రుధారలు పడుచుండగా "స్వామీ, మీరు ఉదయభద్ర ప్రభువులు. మీరు లేకుండ నేను నిలువజాలను. మీకడకు నేను రాగలుగు మార్గమును చూపుడు," అని ఈగాథ పలికెను :

నీ వుదయుడవేని నేరవేర్ప ప్రతిన
నిటకు వచ్చితివేని, హే రాజపుత్ర,
మరల సమావేశ మగువిధంబునను
ఉపదేశమును నాకు నొసగ వేడెదను.

ఆమె కుపదేశము చేయుచు శక్రు డీగాథలు పలికెను :

ఆయువు క్షీణించు ననునిమేషమ్ము
స్థిరమ మేది లేదు; అధ్రువశరీరంబు
శీర్ణమై ప్రాణి త్యజించును తనువు,
ఉదయా, ప్రమాదంబు నొందగా రాదు.

ఒకని యధీనమం దుంచిన యెడల
సర్వంసహా, నతండు చనిపోవునపుడు
వీడు ననంతుష్టితోడనే పృథివి;
ఆచరింపుము ధర్మ మప్రమాదముగ.

తల్లిదండ్రులును సోదరులును క్రీత
దార పరస్పరత్యాగ మొనర్తు;
ఆచరింపు ధర్మ మప్రమాదముగ.

అగు నీకళేబర మన్యభోజనము
క్షణభంగురములు దుర్గతియును సుగతి
ఉదయా, ప్రమాదంబు నొందకుండంగ
నాచరింపుము ధర్మ మనవరతమ్ము.

బోధిసత్త్వ డీప్రకారముగా ఆమె కుపదేశ మిచ్చెను :

ఆమె ధర్మకథ విని ప్రసన్నచిత్తయై ఆయనను స్తుతించుచు ఈ గాథ పలికెను :

యక్షుండు పల్కి న దంతయు నిజము
సీమితంబు నరజీవిత మల్ప

మెంతయు దుఃఖభూయిష్టంబు కాన
కాశీ సురంధసాల్ గ్రక్కున విడిచి
ఏకాకినిగ ప్రవ్రజించెదు దాన.

బోధిసత్త్వు డామె కుపదేశ మిచ్చి నిజనివాసమునకు జనెను. ఆమె మరునాడు అమాత్యులను పిలువనంపి నిజనగరమునందలి ఉద్యానమున ఋషి ప్రవ్రజ్యకావించి ధర్మానుసారముగా జీవించుచుండెను. మరణానంతరము త్రయస్త్రింశభవనమున జన్మించి ఆమె బోధిసత్త్వుని పాదసేవకురా లయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి సత్యప్రకాశనము కావించి, జాతకములు సరి పోల్చెను. సత్యప్రకాశనానంతరము ఉద్విగ్నచిత్తభిక్షువు స్రోతాపత్తిఫల మొందెను. ఆసమయమున రాజకన్య రాహులజనని; శక్రుడు నేనే.

# 459. పానీయ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కాముకతా నిగ్రహమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకానొక సమయమున మిత్రు లయిన 500 మంది గృహస్థులు శ్రావస్తిలో తథాగతుని ఉపదేశము విని ప్రవ్రజించి ఉపసంపద పొందిరి. కోటిశాయన భవనమునుండి అర్ధరాత్రిసమయమున కామభోగసంకల్పముల గూర్చి చర్చింప సాగిరి. కథ అంతయు పూర్వమువలెనే విస్తరించి చెప్పవలెను. భగవానుని ఆదేశానుసారముగా ఆనందుడు భిక్షువులను సమావేశపరచిన పిదప శాస్త అరుదెంచి పరచినఆసనముపై ఉపవిష్టుడై ఎవరిని ప్రత్యేకముగా నుద్దేశింపక "కామభోగములనుగూర్చి వితర్కింపకుడు. భిక్షువులారా, భిక్షువునకు శ్రమ తక్కువ ఉండదు. కామమును గూర్చినవితర్కము బయలుదేరినపుడు భిక్షువు దానిని నిగ్రహింపవలెను. పూర్వము పండితులు బుద్ధుడు జన్మింపకపూర్వము కామవితర్కాదికము నిగ్రహించి ప్రత్యేకబుద్ధత్వమును పొందిరి" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా కాశీరాష్ట్రమున ఒకానొక గ్రామమున ఇరువురు మిత్రులు నివసించుచుండిరి. వారు జలకుండికలు కొనిపోయి పొలములో నొకమూల నుంచి, పొలముపని చేసి దాహమైనపుడు అందలిజలములు త్రావుచుందురు. ఒకనా డందులో నొకడు వచ్చి తనకుండికలోని నీరు త్రాగక రెండవవానినీరు త్రాగి పోయెను. సాయంకాల మడవి వెలువడి అతడు స్నానము చేసి ఇట్లు తలపోయ దొడగెను. "నేను శారీరకముగా ఎట్టి పాపకర్మము చేయలేదు. కానబడిన కమండలమునుండి నోరు నీరు త్రాగినది." ఇంతలో వానికి సంవేగము జనించినది. "తృష్ణ హెచ్చినచో నేను నరకమున పడుదును. ఈతృష్ణను దమింతునుగాక" అని తలచి ఆతడు అపహరించిన సలిలము మీదనే ధ్యాన ముంచి విదర్శనభావన ద్వారమున బోధిజ్ఞానమును పొంది దానిని మననము చేయుచు

నిలిచియుండెను. రెండవవాడు స్నానముచేసి వచ్చి "మిత్రమా, రమ్మ ఇంటికి పోవుదము" అనెను.

"నీవు పొమ్ము. నా కింటితో పనిలేదు. నేను ప్రత్యేకబుద్ధుడను."

"నీవంటివాడు ప్రత్యేకబుద్ధు డెట్లగును ?"

"ఎవ డైన నెట్లగును ?"

"వెండ్రుకలు పెరిగి, కాషాయాంబరములు ధరించినవారు ఉత్తరహిమాలయమున నందమూలపర్వతమున కలరు" అని అతడు శిరస్సుపై చేతులు మోడ్చెను. ఆక్షణముననే వాని గృహస్థవేషము తొలగిపోయి, మంచిమెరుపురంగు కల ద్వివటమును, ధరించినవా డయ్యెను. విద్యుద్వేగమున కాయబంధము ఏర్పడెను. రక్తవర్ణము కల ఉత్తరీయము చీవరము మెడమీదకు వచ్చిపడెను. మేఘవర్ణము గల చీవరము శరీరముపై నుండెను. భ్రమరవర్ణము గల మట్టిపాత్ర ఎడమ భుజమునకు తగిలించి యుండెను. అత డాకసమున కెగసి నిలిచి, ధర్మోపదేశ మిచ్చి, నందమూలపర్వతమునకు జనెను.

రెండవవాడు కాశీలోని గ్రామమున గృహస్థధర్మము నవలంబించి అంగడి పెట్టుకొనెను. తనభార్యను వెంట బెట్టుకొని పోవుచున్నపురుషు నొకనిని చూచెను. చక్కనిరూపము గల ఆ స్త్రీని గాంచినంతనే ఇంద్రియములు చంచలములు కాగా, "ఈ లోభము పెచ్చి నన్ను నరకమున త్రోయగలదు" అని తలపోయుచుగా వానికి విదర్శనాభావము కలిగి, ప్రత్యేకబోధిజ్ఞానము లభింప, ఆకసమున నిలిచి ధర్మోప దేశము చేసి, నందమూలపర్వతమునకే చేరెను.

కాశీగ్రామవాసులగు పితాపుత్రులిరువురు మార్గమువెంట చనుచుండిరి. అరణ్యాముఖమున చోరులు నిలిచి యుండిరి. తండ్రికొడుకులు కనబడినపుడు వారు కుమారుని పట్టుకొని, ధనము తెచ్చి నీకుమారుని విడిపించుకొనుమని తండ్రితో చెప్పి పంపెడివారు. ఇరువురు సోదరులు కానబడినపుడు చిన్నవానిని పట్టుకొని పెద్ద వానిని విడచి పుచ్చెడివారు. గురుశిష్యులు లభించినపుడు గురువును పట్టుకొని శిష్యుని విడిచెడివారు. శిష్యుడు విద్యమీంది ప్రీతిచే ధనము కొనివచ్చి గురువును విడిపించుకొనెడివాడు. ఆ తండ్రికొడుకులు చోరులు నిలిచినారని తెలుసుకొనినంతనే యోచించి "నన్ను తండ్రి నని" చెప్ప వలదు "నీవుకుమారుని వని" చెప్ప నని

నిశ్చయించుకొనిరి. చోరులు వారిని పట్టుకొని "మీరు ఒకరి కొక రేమగుదు ?" రని ప్రశ్నింపగా "ఏమియు కా" మని అసత్యము చెప్పిరి.

సాయంకాలము అడవి వెలువడి వారు స్నానముచేసినపిదప కుమారుడు నిజశీలమును పరీక్షించుకొని తాను అసత్యవాది అయినట్లు నిశ్చయించుకొని "ఈ అసత్యము పెరిగి నన్ను నరకమున కూలద్రోయగలదు. ఈ చిత్తమాలిన్యమును తొలగించుకొందును," అని తలపోసి, విదర్శనభావన పెంపొందించుకొని ప్రత్యేక బోధిజ్ఞానము పొంది, ఆకసమున నిలిచి, తండ్రికి ధర్మోపదేశము చేసి, నంద మూలకపర్వతమునకే పోయెను.

కాశీగ్రామనివాసి యగు ఒకానొక భోజకుడు పశుబలిని నివారించెను. బలి ఈయవలసిన సమయమునకు జనులు గుమి గూడి "స్వామీ, మేము లేళ్ళను, పందులను యక్షులకు బలి యిత్తుము. బలి ఈయవలసిన సమయ మాసన్నమైనది" అనిరి.

"మీయిష్టప్రకారమే చేయుడు."

జనులు ఎన్నో జంతువులను బలి యిచ్చిరి. మత్స్యమాంసముల గుట్టలు చూచునప్పటికి భోజకునకు పశ్చాత్తాపము జనించెను. "నే నొక్కమాట అనుటచే వీరు ఇన్ని జంతువులను బలి ఇచ్చినారు" అనుకొని అతడు ద్వారముకడకు పోయి, విదర్శనాభావము పెంపొందించుకొని ప్రత్యేకబోధిజ్ఞానము పొంది, ఆకసమున నిలిచి, ధర్మోపదేశము చేసి, నందమూలక పర్వతమునకే చేరెను.

కాశీగ్రామనివాసి యగు వేరొకభోజకుడు మద్యవిక్రయము మాన్పినాడు. "స్వామీ, ఈసమయమున పూర్వకాలమునుండియు పానోత్సవము జరుగుచుండెడిది. ఏమి చేయుదుము ?" అని లోకు లడుగగా, అతడు "ప్రాచీనాచారము ననుసరింపుడు" అనెను. జను లుత్సవము చేసి సురాపానము కావించి దెబ్బలాడిరి. కొందరి కాలుచేతులు విరిగినవి, తలలు పగిలినవి. చెవులు తెగినవి. ఎముకలు విరిగినవి. గ్రామభోజకు డది చూచి తనలో "నేను ఆనతి ఈయనిచో ఇంత కష్ట నష్టములు కలిగెడివి కావు" అనుకొని అతడు పశ్చాత్తాపము పొంది, విదర్శన భావన పెంపొందించుకొని ప్రత్యేకబోధిజ్ఞానము పొంది, ఆకసమున కెగసి "అప్రమత్తులు కం" డని చెప్పి నందమూలపర్వతమునకే పోయెను.

కొంతకాలమునకు ఐదుగురు ప్రత్యేకబుద్ధులు వారాణసీద్వారముకడ దిగి ఉత్తమరీతిని వస్త్రధారణ చేసికొని, చిత్తశాంతి కలిగించుతీరున భిక్షాటనము చేయుచు రాజద్వారము చేరిరి. వారిని చూచినంతనే రాజు శ్రద్ధాన్వితుడై లేచి వారలను లోనికి గొనిపోయి, పాదములు కడిగి సుగంధతైలముపూసి పావ్వగు భోజనము పెట్టించి ఒకప్రక్కన కూరుచుండి ఇట్లడిగెను; "భన్తే, చిన్నతనముననే మీరు ప్రవ్రజ్యా శోభతో కానవచ్చుచున్నారు. కామభోగాదుల దుష్పరిణామమును మీరు గ్రహించి యుందురు. మీ మనసులలో ఏమున్నది ?"

వారు ప్రత్యుత్తర మిచ్చువారై క్రమముగా ఐదుగాథలు పలికిరి ;

మిత్రుడనై యుండి, మిత్రుని నీరు
చాటుగా త్రాగి, పశ్చాత్తాప మొంది
నేను; పాపమూ చేసినట్లు భావించి
క్రమ్మర నేపాపకార్యంబు చేయ
రాహేతువున ప్రవ్రజించినవాడ.

పరదార గనుగొన, ప్రభవించె కోర్కె
అధికపశ్చాత్తాప మావిర్భవించె
క్రమ్మర నేపాపకార్యంబు చేయ
రాహేతువున ప్రవ్రజించినవాడ.

నాజనకుని కాననమ్మున పట్టు
కొనిరి చోరు, లెరింగికూడ నసత్య
మాడి, పశ్చాత్తాప మందినవాడ
క్రమ్మర నేపాపకార్యంబు చేయ
రాహేతువున ప్రవ్రజించినవాడ.

ఆసోమయాగంబునందు ప్రాణాతి
పాత మాయెను, నేను వాని కనుజ్ఞ
నొసగి, పశ్చాత్తాప మొందినవాడ
క్రమ్మర నేపాపకార్యంబు చేయ
రాహేతువున ప్రవ్రజించినవాడ.

మగువు క్రోలినయట్లు మద్యపానంబు
కావించిరి అనర్థకారికార్యంబు
అట్టి జనంబుల కనుమతి నేను
ఒసగి పశ్చాత్తాప మొందినవాఁడ;
ఈ హేతువున ప్రవ్రజించినవాఁడ.

రాజు వ్యాఖ్యానము విని ఒక్కొక్కరిని స్తుతించి, "భన్తే, ప్రవ్రజ్య మీకు తగినది" అనెను.

అంతట రాజు వారి ధర్మోపదేశము విని ప్రసన్నుఁడై, చీవరములు, వస్త్రములు, ఔషధములు ఇచ్చి ప్రత్యేకబుద్ధులకడ సెలవు గైకొనెను. వారు దానాను మోదనము చేసి అచటికే చేరిరి. నాటినుండి రాజు భోగములయెడ విరక్తుఁడై కోర్కులు విడనాడి, వివిధరుచిరఖాద్యములను తినుటమాని, స్త్రీలతో సంభాషణ త్యజించి, వారివైపు చూడక, విరాగియై, లేచి శయనగృహములోనికి బోయి, తెల్లనిగోడ నానుకొని యోగాభ్యాసము చేయుచుండెడివాఁడు. అతడు లబ్ధధ్యానుఁడై, కామభోగాదులను నిందించువాఁడై ఈగాథ పలికెను :

కంటకాకీర్ణముల్ గాఢదుర్గంధ
పూర్ణంబు లౌ కామభోగముల్ మిగుల
హేయము, లవ్వాని నేను సేవించు
నప్పు డేతత్సౌఖ్య మబ్బనే లేదు.

అతని పట్టపురాణి "ప్రత్యేకబుద్ధుల ఉపదేశము విని రాజు ఉద్విగ్నచిత్తుఁడైనాఁడు. మాతో మాటలాడకుండ శయ్యాగారములోనికి పోయినాఁడు. ఈతనిని పట్టుకొనవలెను," అని తలపోసి, శయనాగార ద్వారము చేరి రాజు కామభోగములను నిందించుచుండగా వానిని ప్రీతితో ప్రశంసించునదై ఈ గాథ పలికెను :

కామభోగంబుల గాఢసారస్య
మున్నది, కామమ్ముకన్న సుఖంబు
వేరుగా నేముండు? వీని భోగించు
వారు జన్మింతురు స్వర్గంబునందు.

విని బోధిసత్త్వుడు "దుర్మార్గులారా, నీవు నశింతువు! భోగములందు సుఖ మెక్కడిది? దీనిపరిణామము దుఃఖమే" అని నిందించుచు ఈ గాథలు పలికెను :

స్వారస్య మెంతయు స్వల్పంబు కామ
భోగమ్ములందును, భూరిదుఃఖంబు
పీడమును, వీనిని పొందువారలకు
నరకమ్ములోనె జన్మమ్ము ధ్రువమ్ము!

తీక్ష్ణ మైనట్టి నిస్త్రింశమ్ము గ్రుచ్చ
గుండెలోపల బాధ మెండుగా నుండు
హెచ్చు భోగవ్యథ యుద్దానికన్న.

కణకణ మండు నంగారగ ర్తంబు
వాసరం బంతయు వహ్నిలో మండు
సాగేటి కోర్కెన భోగాలకన్న
నీయగా నేరవు హెచ్చుబాధలను.

హాలాహలము, పొంగు తైలంబు కాని
కరగిపోసెడిరాగి కాని యొసంగు
వ్యథకన్న భోగాలబాధయే మిన్న.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు ధర్మోపదేశము చేసి అమాత్యులను సమావేశపరచి "అమాత్యులారా, మీరు రాజ్యపాలనము చేయుడు. నేను ప్రవ్రజించెదను" అనెను. జనులు ఏడ్చి మొత్తుకొనిరి. బోధిసత్త్వుడు లేచి ఆకసమున నిలిచి, ఉపదేశ మిచ్చి, తన్మార్గముననే ఉత్తరహిమాలయము చేరెను. అచట రమణీయ ప్రదేశమున ఆశ్రమము నిర్మించుకొని. ఋషివిధానమున ప్రవ్రజించి, కాలాంతమున బ్రహ్మలోకగామి అయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, చిత్తమున కల్మషము కొలదిగ నను బుద్ధిమంతులు దానిని దూరీకరింపవలెను" అని చెప్పి, సత్య ప్రకాశనము చేసి జాతకములు సరిపోల్చెను. సత్యక్రియానంతరము 500 భిక్షువులు అర్హత్త్వము పొందిరి.

"ఆసమయమున ప్రత్యేకబుద్ధులు పరినిర్వాణము పొందిరి. దేవి రాహులమాత; రాజు నేనే."

# 460. యువంజయ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు మహాభినిష్క్రమణమునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై శాస్తగుణగణములను ప్రశంసించుచుండిరి. "ఆయుష్మంతులారా, దశబలధారి యింటనే యున్నచో సమస్త ప్రపంచమునకు చక్రవర్తియై, సప్తరత్నములతో నాలుగుబుద్ధులతో, సహస్రాధికముగా పుత్రకళత్రములను గూడి యుండెడివాడు. ఆయన యిట్టి వైభవములను త్యజించి, కామభోగములు దుష్టములని భావించి అర్ధరాత్రమున ఛన్నుని సాయముతో కంటకహయము నెక్కి వెడలిపోయెను. ఆనోనదీతీరమున ప్రవ్రజించి ఆరు సంవత్సరములు ఘోరతపస్సుచేసి సమ్యక్సంబుద్ధిని పొందినాడు." అనుచుండగా శాస్త అచటి కరుదెంచి, విషయము గ్రహించి "భిక్షువులారా, తథాగతుడు కేవలము ఇప్పుడే కాదు పూర్వముకూడ మహాభినిష్క్రమణము కావించెను. పన్నెండు యోజనముల విస్తీర్ణము గల వారాణసీ నగరరాజ్యమును విసర్జించి వెడలిపోయెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున రంభనగరమున సబ్బదత్తుడను రాజుండెను. (ఇది ఉదయ జాతకమున సురంధనమనియు, క్షుద్రసుతసోమజాతకమున సుదర్శన మనియు, శోణనంద జాతకమున బ్రహ్మవడన మనియు, ఖండహాల జాతకమున పుష్కవతి యనియు, పేర్లు పొందెను. ఈ విధముగా కాలానుగుణముగా ఈనగరము పేరు మారుచుండెను.) సబ్బదత్త ప్రభువునకు వేయిమంది పుత్రులుండిరి. అందు యువంజయుడను జ్యేష్ఠపుత్రుని తండ్రి యువరాజును చేసెను. అతడొక నాడు ప్రాతఃకాలమున రథ మెక్కి మహావైభవముతో క్రీడార్థము ఉద్యానమునకు పోవుచుండెను. గడ్డికొనలమీదను, వృక్షశాఖలమీదను, వృక్షాగ్రములమీదను సాలెపట్టురీతిగ ముత్యముల జాలగుల వలెను మంచుబిందువులు వ్రేలాడుచుండుట కనుగొనెను.

"వయస్యా, సారథీ, ఇది ఏమి" అని ప్రశ్నించెను.

"దేవా, మంచు పడినపుడు మిగిలిన హిమబిందువు లివి" అని సారథి బదులు పలికెను. యువరాజు దినమంతయు ఉద్యానమున క్రీడించుచుండెను. సాయం సమయమున ఆతడు రాజమందిరమునకు మరలి పోవునపుడు హిమబిందువులను కానక, "వయస్యా. సారథీ, హిమబిందువులు కనబడ వేమి ?" అని అడిగెను.

"దేవా, సూర్యోదయ మైనపిదప మంచుబిందువులు కరగి భూమిలో కలసి పోవును."

ఈమాటలు విననప్పటికి యువంజయునకు సంవేగము పుట్టెను. "ప్రాణి కోటుల జీవములు హిమబిందువులవలె నుండును. వ్యాధిగాని, ముదిమి గాని ప్రారంభింపక ముందే నేను తల్లిదండ్రుల నడిగి ప్రవ్రజింప వలెను" అని యోచించి ఆతడు హిమబిందువులనే ధ్యానించుచు ముజ్జగములు మండుచుండుట గాంచి, నిజమందిరమునకు జనక, అలంకృతమైన న్యాయశాలలో కూరుచున్న తండ్రికడకు జని, ప్రణామము చేసి ఒక ప్రక్కన నిలిచి ప్రవ్రజ్యకై అనుమతి వేడెను.

సఖులతోడ నమాత్యసంఘంబుతోడ
పరివృతుడా మహాప్రభువునకు నేను
ఒనరింతు వందనం ; భూమిపాలా !
ఇమ్ము సమ్మతి ప్రవ్రజింపగా నాకు.

రాజు అతనిని నివారించుచు ఈగాథ పలికెను :

భోగాల లోటున్న పూర్తి చేయుంతు
ఎవ్వడేనియు శ్రమ యిచ్చునయేని
వాని నిరోధింతు: వద్దు ప్రవ్రజ్య.

విని కుమారు డీగాథ పలికెను ;

కలుగదు నాకు భోగముల లోపంబు
కష్ట మిచ్చెడివాడు కానరా డెవడు
జర ముంచివేయగా జాలని ద్వీప
మొక్కటి నిర్మింప నూహించినాను.

ఆతడీమాటలు పలుకుచుండగనే శాస్త రాణి అర్ధగాథ పలికెను :

తండ్రిని యాచించు తనయుండు తొలుత
తనయుని యాచించు తండ్రి యావలను.

రాజు మిగిలిన భాగము పలికెను :

నిగమవాసిజనంబు నీదు ప్రవ్రజ్య
ప్రార్థించుచున్నాడు పరిహరింపంగ.

కుమారుడు మరల నిట్లు విన్నవించెను :

ప్రవ్రజ్యను నరేశ, వారింపవలదు
భోగాలలో మునిగిపోవుచు జరకు
వశవర్తి నగుట అవాంఛనీయంబు.

విని రాజు అప్రతిభు డయ్యెను. రాణి వార్త తెలిసి దేవి నిట్టూర్పులు విడుచుచు బంగరుపల్లకి యెక్కి వ్యాయశాల చేరి కుమారుని వేడుకొనున్నద రాణి గాథ పలికెను :

నాయనా, వినవలె నా ప్రార్థనమ్ము-
నే నిషేధింతును నీదు ప్రవ్రజ్య
నిన్ను వీక్షింపగా నిత్యంబు కోర్కి ;
వలదు యువంజయా, వలదు ప్రవ్రజ్య.

విని రాజకుమారు డీగాథ పలికెను ;

నిలువదు తృణమ్ముపై నీహారకణము
ఆదిత్యు డుదయించు నంతటిలోనె
మానవాయువు నట్టిమాదిరి నుండు.

ఇట్లు చెప్పినను ఆమె పట్టుదల విడవలేదు. అప్పుడు బోధిసత్త్వుడు తండ్రిని సంబోధించి యీగాథ పలికెను :

పల్లకి యెక్కించి తల్లిని పంపు,
ఆమె నాతీర్ణత కడ్డు రాకుండ.

రాజు పుత్రునిమాటలు విన్నపిదప పట్టపుదేవితో “భద్రే, పల్లకి నెక్కి రతివర్ధనసౌధమునకు పోయి కూరుచుండుము” అనెను. ఆమె రాజుమాటలు విని నిలువనేరక స్త్రీపరివారముతో జని ప్రాసాద మెక్కి నిలిచి వ్యాయశాలా ద్వారము

మీద చూపుల్ని నిలిపి యోచించుచుండెను. తల్లి వెడలిపోయిన పిదప బోధిసత్త్వుడు తండ్రి యనుమతి వేడెను. ఆపలేక పోవుటచే రాజు కుమారునకు సమ్మతి నిచ్చుచు "నాయనా, అట్లయినచో నీయిచ్ఛ నెరవేర్చుకొమ్ము, ప్రవ్రజింపుము" అనెను. తండ్రిసమ్మతించు సమయమున కనిష్ఠసోదరుడు యుధిష్ఠిరుడు కూడ ప్రవ్రజ్యకై తండ్రిని ప్రార్థించెను. సోదరు లిరువురును తండ్రికి ప్రణమిల్లి భోగములమీది తృష్ణ విడనాడి జనసమూహముతో న్యాయశాల వెలువడిరి. "నాకుమారులు ప్రవ్రజింపగా రమ్యమైనఈనగరము శూన్యమగును" అని రాణి విలపించుచు ఈగాథ పలికెను ;

అగుగాక భద్ర, మా వరుగుము వేగ !
రమ్యకనగరంబు రాణింప దింక
సమ్మతించెను యువంజయ కుమారుండు
ప్రవ్రజించుటకునై ప్రభువు దక్షుండు.
స్వర్ణసమానుండు సర్వోత్తముండు
చను యువంజయుడు కాషాయధరుండు
ప్రవ్రజింపగ మహాబలవంతు డదిగో !

బోధిసత్త్వుడు వెంటనే ప్రవ్రజింప లేదు. తలిదండ్రులకు ప్రణామము చేసి యాతడు తమ్ముడు యుధిష్ఠిరుని వెంట గొని నగరము వెలువడెను. జనసమూహమును మరలించి వా రిరువురు హిమాలయము ప్రవేశించి రమణీయప్రదేశమున ఆశ్రమము నిర్మించుకొని ఋషివలె ప్రవ్రజించెను. ధ్యానమును అభిజ్ఞలను పొంది జీవితకాల మంతయు కందమూలఫలములు తినుచు తుదకు బ్రహ్మలోకగామి అయ్యెను. ఈవిషయమును తుదిలో అభిసంబుద్ధగాథ వ్యక్తీకరించుచున్నది :

తల్లిని తండ్రిని త్యజియించి, కోసి
మారపాశమును కుమార యువంజ
యుండు, యుధిష్ఠిరుం డుభయులు గూడ
ప్రవ్రజించినవారు పరిపూర్ణముగను.

శాస్త ఈధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వము కూడ తథాగతుడు రాజ్యమును విడిచి ప్రవ్రజితు డయ్యెను" అని జాతకములు సరిపోల్చెను. "ఆసమయమున తలిదండ్రులు రాజకులములోని వారు. యుధిష్ఠిర కుమారు డానందుడు, యువంజయుడు నేనే.

# 461. దశరథ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు తండ్రి చనిపోయిన గృహస్థును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు తండ్రిమరణించినపిదప దుఃఖాభిభూతుడై పను లన్నియు విడనాడి శోకముచే వెర్రివాడయ్యెను. శాస్త ప్రాతఃకాలముననే లోకమును గూర్చి యోచించి నపుడు త్వరలోనే అతడు స్రోతాపత్తి పొంద గలడని తోచినది. మరునాడు శాస్త శ్రావస్తిలో భిక్షాటనము చేసి భోజనానంతరము భిక్షువులను పోగ నంపి, ఒక్క భిక్షువును వెంట నిడుకొని ఆతనియింటి కరిగెను. గృహస్థు శాస్తకు ప్రణమిల్లి కూర్చున్న పిదప శాస్త మృదుమధుర స్వరముతో "ఉపాసకా, దుఃఖించు చున్నావా?" అనెను. "భన్తే, చిత్తము, పితృశోకము నన్ను వేధించుచున్నది." "ఉపాసకా, పూర్వము పండితులు అష్టలోక ధర్మములను (అష్టాంగయోగములు) స్వరూపతః గ్రహించి తండ్రి మరణించినను లేశమాత్రముకూడ దుఃఖింపరైరి." అని శాస్త అతని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో దశరథరాజు నాలుగ గతులకును గురి కాక ధర్మప్రకారము రాజ్యము చేయుచుండెను. ఆయన కున్న 16,000 మంది భార్యలలో పట్టపురాణికి ఇరువురు కొమరులును ఒకకుమారియును జన్మించిరి. జ్యేష్ఠ పుత్రునిపేరు రామపండితుడు, రెండవవానిపేరు లక్ష్మణకుమారుడు, పుత్రిక సీతాదేవి. కొంతకాలమునకు పట్టపుదేవి కాలధర్మము చెందెను. ఆమె పోయిన తరువాత చాలసేపటివరకును రాజు శోకాభిభూతుడై యుండెను. అమాత్యులు బోధించినమీదట రాజు తెలివి తెచ్చుకొని అపరకర్మలు చేయించి వేరొకతెను పట్టపురాణిని చేసుకొనెను. ఆమె రాజున కిష్టురాలును, మనోరంజకురాలును లయెను. ఆవల ఆమె గర్భవతియై దోహదములు పొంది తుదకు పుత్రుని గనెను. బిడ్డనికి భరతకుమారు డని పేరు పెట్టిరి. పుత్రస్నేహమున రాజు ఆమెతో

"భద్రే, నీకు వరమిత్తును కోరుకొనుము" అనెను. ఆమె వరము గైకొని కుమారుని కేడుసంవత్సరములు వచ్చినప్పటికి రాజసన్నిధి కరిగి "దేవా, నాకుమారుని కై వరము దయచేసితిరి. ఇప్పుడు దానిని ప్రసాదింపుడు" అని విన్నవించెను.

"భద్రే, కైకొనుము."

"దేవా, నాపుత్రునకు రాజ్యము దయచేయుము."

రాజు వేలితో బెదరించుచు "దుర్మార్గురాలా, నీవు నశింతువు! నాకుమారులిరువురు అగ్నిస్కంధములవలె ప్రకాశించుచున్నారు. వారిని వలదని నీకుమారునికి రాజ్యము యాచించుచున్నావా ?" అనెను. ఆమె చెదరి శయనాగారమునకు చేరి పండుకొనెను. ఆవల నామె మాటిమాటికిని కుమారునకు రాజ్యము కావలె నని యాచించుచుండెను. ఆమెకు వరమీయక రాజు తనలో "స్త్రీలకు కృతజ్ఞత లేదు. వారు ద్రోహము తలపెట్టుదురు. మోసమున రాజముద్రిక వేసి నాకుమారులను సంహరింపకుందురుగాక" అని తలచి కొడుకులను రావించి విషయము వివరించి "మీ రిచట నున్నయెడల అపాయము సంభవింప వచ్చును. మీరు ఏదో సామంత రాజ్యమున గాని అరణ్యమున గాని నివసింపుడు. నాయనంతరము మీరు మరలి వచ్చి వంశపరంపరాగత మగురాజ్యము కైకొనుడు" అనెను.

ఆవల రాజు జ్యోతిష్కులను రావించి తన ఆయుఃపరిమాణము గూర్చి అడిగెను. "పండ్రెండుసంవత్సరము" లని వారు చెప్పిరి. అపుడు రాజు కుమారులతో "నాయనలారా, మీరు నేటినుండి పండ్రెండు సంవత్సరముల తర్వాత మరలి వచ్చి ఛత్రధారణము చేయుడు" అని చెప్పగా, వారు మంచి దని తండ్రికి ప్రణమిల్లి రాజభవనములోనివారు కన్నీరు కార్చుచుండగా నగరి వెలువడిరి. "నేను కూడ సోదరులవెంట పోవుదు" నని సీతాదేవి తండ్రికి ప్రణమిల్లి కన్నీటితో బయలు వెడలెను. తమవెంట వచ్చుజనమును వారు వెనుకకు మరల్చి హిమాలయమునకు జనిరి. జలము ఫలములు మొదలగునవి సులువుగా లభించుచోట వారు ఆశ్రమమును నిర్మించుకొని కందమూలఫలాదులతో జీవనము చేయుచుండిరి. లక్ష్మణపండితుడు సీతాదేవియును రామపండితునితో "నీవు మాకు పితృస్థానీయుడవు. కావున ఆశ్రమమం దుండుము. మేము కందమూల ఫలాదులు తెచ్చి నిన్ను పోషింతుము" అనగా రామపండితు డాశ్రమముననే యుండసాగెను. వార లిరువురు కందమూల ఫలాదులు తెచ్చి ఇచ్చుచు ఆయనకు సేవ చేయుచుండిరి.

అక్కడ దశరథ మహారాజు పుత్రశోకముతో తొమ్మిదవయేటనే మరణించెను. అపరకర్మలు జరిగిన పిమ్మట భరతకుమారుని అభిషేకమునకు అమాత్యులు అడ్డంకులు పెట్టిరి. "రాజ్యచ్ఛత్రాధిపతి అరణ్యమున నివసించుచున్నాడు." అని వారనగా భరతకుమారుడు "రామపండితుని వనమునుండి కొనివచ్చి ఛత్రధారణము చేయింతుము" అని యోచించి పంచ రాజలాంఛనములతో, చతురంగ బలముతో బయలు వెడలి రామపండితునివాసము చేరుకొని, కొలదిదూరములో శిబిరము నేర్పాటు చేసెను. లక్ష్మణపండితుడు, సీతయు కాననములోనికి పోయిన సమయమున భరతకుమారుడు రామపండితుని ఆశ్రమము చేరి సుప్రతిష్ఠితమైన సువర్ణవిగ్రహమువలె నిశ్చింతముగా ఉపవిష్టుడై ఉన్న రామపండితుని చూచెను. అవల సన్నిధికి పోయి, ప్రణామము చేసి ఒక ప్రక్క నిలిచి, రాజుమరణ వృత్తాంతము తెలిపి అమాత్యులతో కూడ రామునిపాదముల వాలి రోదనము చేయసాగెను. రామపండితుడు చింతింపలేదు. రోదింపలేదు. ఆయన అకృతిలో వికారము తోపలేదు. సాయంకాలమునకు సీతాలక్ష్మణులు కందమూల ఫలాదులు కొని తెచ్చిరి. "రాముడు తనలో ఇతడు చిన్నవాడు. నాకు ఉన్నంత ద్రఢిమ కలవాడు కాడు. తండ్రిమరణవార్త సూటిగా తెలిపినచో శోకావేగము కలిగి గుండెలాగినను ఆగవచ్చును. వీరిరువురను జలాశయములోనికి పంపి యీవృత్తాంతము తెలిపెదను" అని తలపోసి, ఎదుట నున్ననీటిపట్టు చూపి "మీరు చాల ఆలస్యముగా వచ్చిరి. నీటిలో స్నానము చేయుడు" అని ఈగాథ పలికెను :

లక్ష్మణా, సీత, జలంబులందిగుడు !

వారు జలములోనికి జని నిలిచిరి, అవల రామపండితుడు వృత్తాంతము వివరించుచు శేషగాథ పలికెను ;

మనతండ్రి దశరథ క్ష్మామహారాజు
మరణవార్తను దెల్పు భరతుండు నేడు.

తండ్రిమరణవార్త విని వారు తెలివి కోలుపోయిరి. రెండవపర్యాయము వార్త విని మరల తెలివి కోలుపోయిరి. మూడవసారికూడ వారు స్పృహ తప్పుటచే అమాత్యులు వారిని నీటిలోనుండి యీవలకు గొనివచ్చి, కూరుచుండ బెట్టిరి. భరతకుమారుడు 'జనకుని మరణవార్త విని, సోదరుడు లక్ష్మణుడు, చెల్లెలు సీతయును దుఃఖము సహింపలేకుండిరి. రామపండితుడు మాత్రము విచారపడ లేదు.

దుఃఖింపలేదు. ఈయన శోకరహితుడై యుండుటకు కారణ మేమో అడిగెదను' అనుకొని ఈగాథ పలికెను :

శోకింప దగినను నీకు దుఃఖంబు
లే దే ప్రభావాన లేమ, తెల్పుదువ ?
తండ్రి గతించువృత్తాంతంబు వినియు
లే కున్న దేటికి నీకు దుఃఖంబు ?

తాను శోకరహితుడై యుండుటకు కారణము తెలుపుచు, అనిత్యతా స్వరూపమును వివరించుచు ఆయన యీగాథలు పలికెను :

ఎంత విలపించినగూడ నెవని జీవి
తమ్ము నిలువదో వాన్నికై తనకు తాను
బుద్ధిమంతుడు పీడలు పొందనేల ?
పడుచువారలు, వృద్ధులు, పండితులును
నిండుమూర్ఖులు, ధనికులు, నిర్ధనులును
అందరును మృత్యువొందుదు రనుట నిజము.

అవనిజమునుండి పడిపోదు ననుభయంబు
ఫలమునకు నుండు నిత్యము; ప్రభవ మొందు
మనుజునకు నిత్య ముండును మరణభయము.

ఉదయమున చాల గనబడుచుంద్రు జనులు
సందెవేళకు నుండరు కొంద రందు;
సందెవేళను గనబడు జనమునందు
ఒక్కడుండగూడ గనబడ డుదయవేళ.

మూర్ఖు లగువార లేడ్చుచు మొత్తుకొనుచు
కష్టపడ లాభలేశము కలుగునేని
ఉత్తములుగూడ నేడ్చుచు మొత్తుకొంద్రు.

తనకు దా హింసించుకొనుచు నెంతయును
దుఃఖించు నాతండు దుర్వర్ణు డగును
పొగులుచు నున్నచో పోషణం బగునె
మృతునకు ? ఏడుపు వితథమ్ము సుమ్ము.

ముట్టుకొన్నంతనే గృహమునకు నిప్పు
సలిలముల నార్పివేసెడి చందమునను
దూదిపింజను వాయువు తోలునట్లు
తోడనే జ్ఞాని దుఃఖమున్ దోలవలయు,

ప్రాణి యేకాకిగా ప్రభవించుచుండు
ఒక్కకుటుంబాన నుదయించుచుండు;
సంయోగపరములు సర్వభోగములు.

ఇహపరలోకాల నెవడు ధ్యానించు
అష్టజగద్ధర్మ మవగత మెవని
కాబహుశ్రుతు, ధీరు, నధికశోకంబు
సైతము బాధింపజాలదు సుమ్ము !

యోగ్యులౌ వారల కొసగుచునుండు
భోగవైభవములన్; పోషించుచుండు
బంధువులన్; పెరవారిపాలింతు
కరణీయ మిదె బోధ కల్గువారలకు.

అక్కడ సమావిష్టులైనజనులు అనిత్యతా ప్రకాశనమును, ధర్మోపదేశమును గ్రహించి శోకవిరహితులైరి. అప్పుడు భరతకుమారుడు రామపండితునకు ప్రణామము చేసి "వారణాసీరాజ్య పరిపాలనము నిర్వహింపుడు" అని వేడెను.

"లక్ష్మణ కుమారుని సీతాదేవిని కొనిపోయి రాజ్యపాలనము చేయుము" అని రాముడనగా,

"దేవా, మరి తామో, అని భరతు డడిగెను.

"నాయనా, పండ్రెండుసంవత్సరముల తర్వాత నీవు రాజ్యము చేయవలయునని నాయనగారన్నారు. నే నిప్పుడే అచటికి పోయినపక్షమున ఆజ్ఞాపాలనము కానేరదు. మిగిలిన మూడుసంవత్సరములు గడచినపిదప వత్తును."

"అంతవర కెవరు రాజ్యము నెరపుదురు ?"

"నీవు చేయుము."

"నేను నడపలేను."

"నేను రానంవరకును ఈపాదుకలు రాజ్యము నడుపును" అని రామ పండితుడు తృణపాదుకలను తీసి యిచ్చెను. వారు ముగ్గురును పాదుకలను గైకొని రామపండితునకు ప్రణామము చేసి, పరివారముతో వారాణసి చేరిరి. మూడు సంవత్సరముల కాలము పాదుకలను ప్రతినిధిగా నుంచి రాజ్యపాలనము చేసిరి. అమాత్యులు తృణపాదుకలను సింహాసనముపై నిలిపి అచట అభియోగములకు తీర్పు నిచ్చెడివారు. తీర్పు సరిగా ఉండనిచో పాదుకలు పరస్పరము కొట్లాడు కొనునవి. అవల నిర్ణయము సరిగా జరిగినచో పాదుకలు శాంతముగా నుండెడివి. రామపండితుడు మూడు సంవత్సరముల తరువాత అడవి వెలువడి వారాణసి చేరి ఉద్యానమున ప్రవేశించెను. ఆయన యాగమన సూచన తెలిసికొన్న అమాత్యులతో కుమారుడు సీతను పట్టపురాణిని చేసి ఇరువురకును రాజ్య మప్పగించెను. ఇట్లు పట్టాభిషిక్తుడైన బోధిసత్త్వుడు అలంకృతమైన రథమెక్కి అనుయాయు లనేకులతో నగర ప్రదక్షిణము కావించి సుచంద్ర ప్రాసాదమున పై అంతస్తుచేరి 16000 వత్సరములు ధర్మానుసారముగా రాజ్యము చేసి తుదకు స్వర్గగామి అయ్యెను.

[అభిసంబుద్ధగాథ ఈవిషయము స్పష్టపరచుచున్నది.

పరిపాలనము మహాబాహువు కంబు=
కంఠుండగు రాముండు కావించినాడు
పదునారువేల సంవత్సర మితిని.]

శాస్త ఈధర్మోపదేశము చేసి జాతకములు రెంటిని సరిపోల్చెను. సత్య ప్రకాశనానంతరము గృహస్థు స్రోతాపత్తిఫలము నందెను.

"ఆకాలమున దశరథ మహారాజు శుద్ధోధనుడు; మాత మహామాయ; సీత రాహులమాత; భరతు డానందుడు; లక్ష్మణుడు సారిపుత్రుడు, పరిషత్తు బుద్ధపరిషత్తు; రామపండితుడు నేనే."

# 462. సంవర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు విశ్వాసము కోల్పోయినభిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తినివాసి యగు ఒక కులపుత్రుడు శాస్త ధర్మోపదేశము విని ప్రవ్రజించి, ఆచార్యోపాధ్యాయుని సేవలు చేయుచు, రెండు ప్రాతిమోక్షముల నభ్యసించి, ఐదు సంవత్సరములు నిండిన తరువాత ఆచార్యునితో "కర్మస్థాన గ్రహణము చేసి అరణ్యమున నివసింతును" అని విన్నవించి కోసలరాష్ట్రమున సరిహద్దు గ్రామము చేరెను. అచ్చట అతని రాకపోకల తీరును శయనాసన విధానమును గమనించి అచటిజనులు సంతుష్టచిత్తులై పర్ణశాలలు నిర్మించి ఆయనకు సేవలు చేయ జొచ్చిరి. అచట వర్షాకాలమున నుండుట కంగీకరించి ఉత్సాహముతో మూడు నెలల వరకు కర్మస్థానమును భావించి ఇంచుకైనను అవి కనబడకుండుటచే తనలో "నిజముగా శాస్త వలన ఉపదేశము పొందిన నలువురు అయోగ్యులలో ఒకడను, అరణ్యవాసమన్న నా కేమి భయము? నేను జేతవనమునకు జని తథాగతుని దర్శనము చేయుచు, ఆయన చేయు మధుర ధర్మోపదేశములను వినుచుందును" అనుకొని ప్రయత్నమును విడిచి, వనము వెడలి క్రమముగా జేతవనము చేరెను. ఆచార్యోపాధ్యాయుడును, అచ్చట కలిసిమెలిసి యుండువారును, తనపునరాగమనమునకు కారణ మడుగగా, అతడు సర్వము వివరించెను. వా రతనిని ఇట్లేల చేసితి వని నిందించి శాస్తకడకు గొనిపోయిరి. శాస్త వారితో "భిక్షువులారా, ఇచ్ఛ లేనిభిక్షువు నేల కొనివచ్చితిరి?" అనెను. "భన్తే, ఈతడు సాధన మానుకొని వచ్చినాడు." శాస్త "నిజమేనా?" అని, "భన్తే, నిజమే" యని అత డన్న పిదప "భిక్షూ, ప్రయత్నమేల విడనాడితివి? ఈ బుద్ధశాసనమున నిర్వీర్యులు అలసులు, అగువారు శ్రేష్ఠఫల మగు అర్హత్వము పొందజాలరు. శ్రద్ధావంతులు దీనిసాక్షాత్కారము పొందుదురు. నీవు పూర్వజన్మమున శ్రద్ధావంతుడవు. ఉపదేశమును వినెడివాడవు. ఈకారణమున నీవు వారాణసీనరేశుని కనిష్ఠపుత్రుడ వయ్యును పండితులయుపదేశమును మన్నించి శ్వేత ఛత్రము ధరించినావు," అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునప్పుడు ఆయనకు నూరుగురు పుత్రు లుండిరి. అందు సంవరకుమారుడు కనిష్ఠుడు. విద్యాశిక్షకై ఒక్కొక్కరాజకుమారుని కొక్కొక్కఅమాత్యుని నియమించెను. సంవరకుమారుని శిక్షకుడు అమాత్యబోధిసత్త్వుడు, విద్వాంసుడు, మేధావి. రాజపుత్రునకు బోధిసత్త్వుడు పితృస్థానీయుడుగా నుండెను. రాజపుత్రులశిక్షణము పూర్తి అయినంతనే అమాత్యు లతనితండ్రిసన్నిధికి గొనిపోయిరి. రాజు వారలకు జనపదము లిచ్చెను. సమస్తవిద్యలలో నిష్ణాతుడైన సంవరకుమారుడు బోధిసత్త్వునితో నిట్లనెను.

“బాబా, నాయనగారు నన్ను జనపదమునకు పంపుచో నే నేమి చేయుదును?”

“ప్రభువు జనపద మిత్తు నన్నప్పుడే నీవు నిరాకరింప వలసి యుండెను; దేవా, నేను కనిష్ఠుడను, నేనుకూడ వెడలిపోయినచో తమచరణసన్నిధిలో నెవరు నుండరు.”

ఒకనాడు సంవరకుమారుడు తండ్రికి ప్రణామము చేసి ఒకప్రక్కన నిలిచి యుండగా, రాజు “నాయనా, నీవిద్యాశిక్షణము పూర్తి అయినదా?” అనెను.

“చిత్తము దేవా!”

“నీకు జనపదము నిచ్చెదను.”

“నేను వెడలిపోవుచో తమసన్నిధిలో నెవరు నుండరు. నేను తమ చరణసన్నిధానములోనే ఉందును.”

రాజు సంతుష్టచిత్తుడై మంచి దని అంగీకరించెను. అప్పటినుండి తండ్రి సన్నిధానమున సేవలు చేయుచు ప్రాచీనోద్యానమును రాజు నడిగి తీసికొని అచ్చట పూచెడి పూవులు, పళ్లు మొదలగునవి పట్టించుకొని పురవాసారిని కలుసుకొనెను. “బాబా ఇం కేమి కావలెను” అని అడిగి రాజు “నగరములో ఆహారవేతనములు నీవే యిచ్చుచుండుము” అనెను. అట్టియానతి పొంది, నగరములో ఎవరికిని ఏమియును ఇచ్చుటమాని కూలిమాత్ర మిచ్చుచుండెను. బోధిసత్త్వు నడిగి మరల రాజాజ్ఞ గొని నగరములోని పరిచారకులను గుర్రములను సైన్యమును దేనిని విడువకుండ స్వాధీనము చేసికొనెను. అన్యజనపదములనుండి అరుదెంచు దూతలు

మొదలగువారికొరకు నివాసస్థానాదులను, వణిక్కులకడనుండి సుంకము వసూలు చేయు పనులను స్వయముగా చేసెడివాడు. బోధిసత్త్వుని యుపదేశానుసారముగా ప్రవర్తించుచు నగరములోనివారిని బైటివారిని, రాష్ట్రవాసులను అతిథులను ఇనుప సంకెళ్ళు తగిలించినట్లు తనవారిని చేసికొనెను. అతనియెడ నెల్లరకు ప్రీతి; ఆతడన్న అందరికీ నచ్చును.

కాలక్రమమున మరణశయ్యపై నున్న రాజుతో అమాత్యులు, "దేవా, మీ యనంతరము శ్వేతచ్ఛత్ర మెవ్వరి కిత్తురు ?" అనిరి.

"బాబులారా, నాకుమారు లందరును శ్వేతచ్ఛత్రాధికారులు. కాని మీకు నచ్చినవానిని స్వీకరింపుడు."

ఆయన చనిపోయిన ఏడవనాడు సమావిష్టులై "ప్రభువు చెప్పినట్లు రాజకుమారులలో మన యిచ్చవచ్చినవారిని ఎన్నుకొందుము. సంవరకుమారుడు బాగుగా నచ్చినాడు," అని వారనుకొని సంవరకుమారుని ముఖమున బంగారుపట్టము కట్టిరి. సంవరమహారాజు బోధిసత్త్వుని ఉపదేశానుసారముగా రాజ్యపాలన మారంభించెను. "మనజనకుడు గతించినాడు. సంవరకుమారున కమాత్యులు రాజ్యమిచ్చిరి. అతడందరికన్న చిన్నవాడు. కావున అతనికి ఛత్ర మిచ్చుట తగదు. అందరిలో జ్యేష్ఠునకు రాజ్యాభిషేకము చేయుద" మని రాజకుమారులు యోచించి, ఒకచో జేరి, నగరముచుట్టు ముట్టి "మాకు శ్వేతచ్ఛత్రమిమ్ము; ఈయనిచో యుద్ధము చేయుదుము" అని సందేశము పంపిరి. ఈవిషయము బోధిసత్త్వునకు నివేదించి సంవరకుమారుడు "ఇప్పు డేమి చేయవలె ?" ననెను.

"మహారాజా, సోదరులతో యుద్ధము చేయరాదు. పైతృకధనమును నూరు భాగములు చేసి పంపుము. ఇవి మీవంతులు, గైకొనుడు. నేను మీతో యుద్ధము చేయను," అని బోధిసత్త్వు డుపదేశించినరీతిగా చేసెను. అంతట అందరిలో జ్యేష్ఠుడగు ఉపోసథకుమారు డందరను రావించి "నాయనలారా, రాజు నెవరును జయింప లేరు. మనతమ్ముడు శత్రువు కాడు. ఇతడు పైతృకధనమును మనకు పంపి మనతో యుద్ధము చేయ నని ప్రత్యుత్తర మంపినాడు. మన మందర మొక్కసారిగా ఛత్రధారణము చేయజాలము. ఒకనిశిరముపైనే ఛత్రము నిలుచును. పంపిన ధనభాగములను ఆతనికి త్రిప్పి పంపి మనమన జనపదములకు పోవుదము" అని చెప్పెను. ఆ రాజకుమారులు వైరము విడిచి నగరము ప్రవేశించిరి. అమాత్యుల

స్వామి రాజు వారలకు స్వాగతము పలికి సమాదరము చేయించెను. రాజకుమారులు పరివారములతో కాలినడకను వచ్చి రాజభవనము మీదికి జని, సంవరమహారాజు నెడ సమాదరము చూపి నిమ్నస్థానమున నున్న పీఠములపై కూరుచుండిరి. సంవర మహారాజు శ్వేతచ్ఛత్రము క్రింద మహావైభవముతో సింహాసనముపై కూరుచుండెను. ఆయన దృష్టిపడిన ప్రదేశము కంపించుచుండెను. ఉపోసథకుమారుడు సంవరుని ఐశ్వర్యముచూచి "తండ్రిగారు సంవరకుమారుడు రాజగు నని యెంచి మాకు జనపదము లిచ్చి ఇతనికి వేరేమియు నీయకుండనోపు" నని తలపోసి, సంభాషించుచు ఈగాథలు పలికెను :

నీదుశీలంబును నీభవిష్యత్తు
జనకుండు గ్రహియించి జనపదంబులను
ఇచ్చి కుమారుల, కే మీడు నీకు.

నిను రాజు చేసెనే నిజహితకామి
బంధుసంఘము తండ్రి బ్రతికియున్నపుడె ?
కాక ఆయన దివంగతు డైనపిదప ?

తొంబదితొమ్మిదితోడ నేశక్తి
సంవరా, ప్రతినలో జయ మొందినావు
జ్ఞాతులు నిన్నధిగమియింప రేల ?

విని, సంవరకుమారుడు తనగుణములంగూర్చి యీగాథలు పలికెను :

నా కీర్ష్య లేదు, మనఃపూర్వకముగ
శ్రమణ, మహర్షి, నిశ్చలచిత్తులకును
అంజలి ఘటియింతు; అంతియే కాక
తత్పాదములకు వందనము లొనర్తు.

ధర్మాత్ము లగువారు ధర్మసంయుతుడ
నగు నన్ను శాసింప నర్హులు కాన
పాలింతు నే తనువను పని యెరిగి
శాసింపుచుందు రాసజ్జనుల్ నన్ను.

ఆ శ్రమణాది మహర్షుల ధర్మ
వాక్కుల నాలించి, వానిలో నొకటి
యైన నుల్లంఘింప కాచరించెదను.

ఆశ్వికుల్, రథికులు, నన్య సైనికులు
కలరు వారలకు సక్రమముగా నెపుడు
ఒనగూర్చువాడ భోజనవేతనములు.

మంత్రి సేవక మహామాత్యులున్నారు;
వారు శాంసము, సువ్యవహారములను
చేతురు వారాణసీ నగరాన.

ఓడపోసథ, ఇది జ్ఞప్తి యుంచుకొనుము
నిఖిలదేశాగత మహావణిక్కులకును
సలుపుచున్నాను రక్షణ సద్వ్యవస్థ.

తద్గుణము లాకర్ణించి ఉపోసథకుమారు డీ గాథలు పలికెను :

సంవరా, నీవు ధర్మానుసారముగను
జ్ఞాతిరాజ్యంపు పాలన సలుపుచున్న
వాడవు, మహామనీషివి, పండితుడవు,
జ్ఞాతిహితమును కోరెడి సజ్జనుడవు.

వివిధబాంధవ సంయుతు విభవయుక్తు
నిన్నహితులేమి చేయగా నేరరు సుమి
శక్రు నసురులు బాధింప జాలనట్లు.

సంవరమహారాజు సహోదరులకు విశేషసంపద లొసగెను. వారు అతని కడ రెండు పక్షములపాటుండి, తమతమ జనపదములలో తిరుగుబాటు చెలరేగుటచే తమనివాసములకు జనిరి. మహారాజు బోధిసత్త్వుని ఉపదేశానుసారముగా ధర్మపాలనము చేయుచు తుదకు దేవలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి "భిక్షూ, పూర్వము నీ విట్టిఉపదేశము వినడివాడవు, ఇప్పుడు వినుటకై యత్నింప వేమి ?" అని, సత్యప్రకాశనము కావించి జాతకములను సరిపోల్చెను. అనంతరము భిక్షువు శ్రోతాప త్తిఫలము నందెను.

ఆ కాలమున సంవరమహారాజు జీభిక్షువే; ఉపోసథకుమారుడు సారిపుత్రుడు; మిగిలిన సోదరులు స్థవిరులు. అనుస్థవిరులు; ఆ పరిషత్తు ఇప్పటి బుద్ధపరిషత్తు; ఉపదేశము నిచ్చెడిఅమాత్యుడు నేనే."

— o —

# 463. సుప్పారక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ప్రజ్ఞాపారమితనుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాటి సాయంకాలము భిక్షువు లందరు, ధర్మోపదేశార్థము బయలు వెడలిన తథాగతునికై యెదురు చూచుచు ధర్మసభలో కూరుచుండి దశబలధారికి గల ప్రజ్ఞాపారమితను ప్రశంసించుచుండిరి. "ఆయుష్మంతులారా, మన శాస్త మహాప్రజ్ఞావంతుడు. విస్తృత ప్రజ్ఞావంతుడు, ప్రసన్న ప్రజ్ఞావంతుడు, శీఘ్ర ప్రజ్ఞావంతుడు, తీక్ష్ణ ప్రజ్ఞావంతుడు. ఆయన ప్రజ్ఞ సర్వమును చీల్చుకొని పోవునది. ఆయన సమస్తస్థానములలో ఉపాయవంతుడు. పృథ్వివలె విశాలము, మహాసముద్రమువలె గాంభీర్యము, ఆకాశమువలె వైపుల్యము గలవాడు. సమస్త జంబూద్వీపములోని ఎల్లరి ప్రజ్ఞ ఆయన ప్రజ్ఞను మీర లేదు. మహాసముద్రతరంగములు తీరము దాటి యెట్లు పోవలేవో, ఒడ్డు తాకి యెట్లు ఛిన్నాభిన్నమైపోవునో, అట్లే యెవ్వరి ప్రజ్ఞయు శాస్తపై నెగ్గలేదు. అని శాస్త చరణములను తాకి చూర్ణములై పోవును." శాస్త అరుదెంచి విషయము తెలిసికొని "భిక్షువులారా, తథాగతుడు ఇప్పుడే కాదు, పూర్వకాలము జ్ఞానము పరిపాకము నొందనప్పుడు గూడ పరిపూర్ణ ప్రజ్ఞావంతుడై యుండెను. అంధుడైనను నిట్టి ఆకువలన సముద్రమున ఇది రత్నమని గ్రహించెను" అని పూర్వజన్మవృత్తాంతను చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున భరుకచ్ఛ ప్రదేశమును భరురాజు పరిపాలించుచుండెను. అచట భరుకచ్ఛమను పట్టన గ్రామ ముండెను. ఆ కాలమున బోధిసత్త్వుడు జ్యేష్ఠ నావికునకు సుందర సువర్ణ రూపమున జన్మించెను. అతనికి సుప్పారక కుమారుడని పే రుంచిరి. ఆతడు పదునారు సంవత్సరముల వయసు వచ్చునప్పటికి నావిక విద్యలో కుశలుడయ్యెను. పితృమరణానంతర మతడు జ్యేష్ఠనావికుడై వృత్తి నిర్వహించుచుండెను. పండితుడు. జ్ఞాని అయినయాతడు ఏపడవపైనుండునో ఆ పడవకు అపాయ ముండునది కాదు. ఉప్పునీరు తగులుచుండుటచే ఆతనినేత్ర

ములు చెడిపోయినవని తాను జ్యేష్ఠుడనైనను ఆయుద్యోగము విడిచి రాజు నాశ్రయించి జీవింపవలె నను సంకల్పముతో ప్రభువుసన్నిధి కరిగెను. రాజతనికి మూల్యనిర్ధారకపదవి నిచ్చెను. నాటినుండి బోధిసత్త్వుడు ఉత్తమగజములకు, ఉత్తమాశ్వములకు, ముక్తామణులకు వెల కట్టుచుండెను.

"ఇయ్యది రాజునకు భద్రగజ మగును." చూచి రాజు "సుప్పారక పండితు నకు చూపుడు" అని చెప్పగా దానిని మూల్యనిర్ధారకునికడకు గొనిపోయిరి. ఆయన దానిని చేతితో నిమురుచు "ఇది భద్రగజ మగుటకు తగినది కాదు. దీనిపృష్ఠ భాగము చిన్నది. దీనితల్లి దీనిని కని సముదాయింప లేకపోవుటచే ఏనుగు గున్న నేలపై బడెను; కావున పృష్ఠభాగము పొట్టిదైనది" అనెను. ఏనుగును తెచ్చినవారి నడుగగా "పండితోత్తముడు సరిగా చెప్పినాడు" అనిరి. రాజు ప్రసన్నచిత్తుడై ఎనిమిది కార్షాపణము లిప్పించెను.

వేరొకనాడు ఎవరో అశ్వమును గొనివచ్చి ఇది ప్రభువునకు మంగళాశ్వ మగునని పలికిరి. రాజు దానినికూడ పండితునికడకు పంపెను. ఆయన దానిని చేతితో నిమురుచూ, "ఇది మంగళాశ్వ మగుటకు తగినదికాదు. ఇది జన్మించిన దినముననే దీనితల్లి చనిపోయినది. తల్లిపాలు లభింపని కారణమున ఇయ్యది ఎదుగలేదు" అనెను. ఆయన వాక్కులు సత్యము లని అశ్వమును తెచ్చిన వా రనిరి. రాజు విని ప్రసన్నచిత్తుడై ఎనిమిది కార్షాపణము లిప్పించెను.

ఒకనాడు రథము నెవరో కొని వచ్చి ఇది మంగళ మగు నని పలికిరి. రాజు దానిని మూల్యనిర్ధారకుని కడకు బంపెను. ఆయన దానిని చేతితో తాకి "ఇది వృక్షముతో చేసిన రథము కాదు. ఇందు వలన ఇది రాజార్హము కాదు" అనెను. ఆయన చెప్పినవాక్కులు సత్యము లని తేలెను. ఈవాక్కులు విని రాజు ఎనిమిది కార్షాపణములు పంపెను.

బోధిసత్త్వునికడకు మహామూల్యవంతమైన కంబళమును తెచ్చిరి. ఆయన దానిని చేతితో నిమిరి "దీనిలో ఒకచోట ఎలుకలు కొట్టినవి," అనెను. పరిశీలించిన పిదప, రాజున కీవిషయము తెలుపగా సంతసించి ఎనిమిది కార్షాపణములు పంపెను.

బోధిసత్త్వుడు తనలో రాజు ఇట్టి అద్భుతవిషయములు వినియును తడవకు ఎనిమిది కార్షాపణములే పంపుచున్నాడు. ఇది మంగలిదానముగా నున్నది. ఈతడు మంగలికి పుట్టియుండును. ఇట్టి రాజును సేవించుచుండిన నా కేమి లాభము గలు

గును? నేను నిజనివాసమునకే వెడలిపోయెదను" అని తలపోసి భీరుకచ్ఛపట్టణమునకు మరలిపోయెను.

ఆయన అచ్చట నివసించుకాలమున వణిక్కులు నౌకానిర్మాణము చేయించి ఎవనిని నావికునిగా నియమింతమని యోచించి "సుప్పారకపండితు డేనావపై నిలుచునో ఆనావకు విపత్తుండదు. ఆయన పండితుడు, కుశలుడు, అంధుడైనను ఆయనయే యోగ్యుడు" అనుకొని ఆయనకడకు జని "మా నౌకా నిర్దేశకుడుగా నుండవలె" నని అతనిని కోరిరి.

"బాబులారా, అంధుడను నావకు దిక్కు లెట్లు నిర్దేశింపగలను?" అని బోధిసత్త్వుడు పలుకగా,

"స్వామీ నీ వంధుడ వైనను శ్రేష్ఠుడవని మానమ్మకము" అని వారు చెప్పిరి.

మాటిమాటికిని వారు బలవంత పెట్టుటచే తుదకు సుప్పారక పండితుడు "మంచిది మీరు సూచించిన ప్రకారము నిర్దేశకుడుగా నుందు" నని నావపై కెక్కెను. పడవ మహోదధికి చేరెను. నౌక యేడు రోజులవరకు మహార్ణవములో నిరాటంకముగా పయనించెను, ఒకనాడు అకాలవాయువు చెలరేగెను. వారు నాలుగు నెలలపాటు ప్రాకృతిక సముద్రమున క్రిందుమీదులు పడుచు ఖురమాల సముద్రము చేరిరి. అచ్చట మనుష్యశరీరముతో సమానముగను మంగలికత్తి వంటి నాసికలు గల మత్స్యములు నీటిలో నెగురుచు కనుపించెను. వర్తకు లది చూచి సముద్రముపే రేమి యని అడుగువారై ఈగాథ పలికిరి.

కత్తివాయికి సరి నాసికల జనంబు
నీరమున దేలి మున్గుచున్నారు చూడు,
ఓయి సుప్పారకా, ఏతదుదధి యెద్ది?

అప్పుడు బోధిసత్త్వుడు దిశానిర్ధారణ సూత్రమును మేళవించు చీగాథ పలికెను:

బయలుదేరి కచ్ఛమ్మున బహుధనాప్తి
కొరకు దిరిగెడియా వర్తకులకు త్రోవ
మళ్ళపెట్టెడి ల ఖురమాలి యుదధి.

ఆ సముద్రమున రత్నములు కలవు. బోధిసత్త్వుడిట్లు తలపోసెను. "ఇచట రత్నము లున్నవని నేను చెప్పిన పక్షమున వీరు రత్నలోభముచే అనేక రత్నములను పడవలో చేర్తురు, దానివలన పడవ మునుగును." ఆయన ఈ విషయము వారికి తెలుపక పడవ నాపి; ఆడు తీసి చేపను పట్టునెపమున నేర్పుతో వలవేసెను. ఈవిధముగా సేకరించినరత్నములను పడవలోవేసి సామాన్య మూల్యము కల ఇతరవస్తువులను వేయించెను. పడవలు ఆ సముద్రమును దాటి ఆవలి అగ్నిమాల సముద్రమును చేరినవి. అగ్నిస్కంధమధ్యమున వెలుగుచున్న సూర్యునివలె దాని కాంతి మెదలెను. వర్తకులు ప్రశ్నించుచున్నా రీగాథ పలికిరి :

వహ్నివలె, సూర్యువలె గానవచ్చుచున్న
ఆబ్ధిపే రేమి సుప్పారకా, వచింపు.

బోధిసత్త్వుడు తరువాతిగాథతో ప్రత్యుత్తర మిచ్చెను :

బయలుదేరి కచ్ఛంబున బహుధనా ప్తి
కొరకు దిరిగెడి యావర్తకులకు త్రోవ
మధ్యపెట్టెడి ఆ యగ్నిమాలి యుదధి.

ఆ సముద్రమున బంగారము కలదు. బోధిసత్త్వుడు పూర్వము చేసినట్లే సముద్రమునందుండి బంగారమును తీసి పడివలో వైచెను. నాక పాలవలెను, పెరుగువలెను తళతళలాడు దధిమాలక సముద్రమున ప్రవేశించెను. వ్యాపారులు గాథమూలమున సముద్రముపే రడిగిరి;

దుగ్ధమట్టులు దధివోలె తోచుచున్న
ఆర్ణవముపేరు సుప్పారకా వచింపు.

బోధిసత్త్వు డీగాథతో ప్రత్యుత్తర మిచ్చెను :

బయలుదేరి కచ్ఛంబున బహుధనా ప్తి
కొరకు దిరిగెడి యావర్తకులకు త్రోవ
మధ్యపెట్టెడి ఆ దధిమాలి యుదధి.

ఆసముద్రమున వెండి కలదు. బోధిసత్త్వుడు ఉపాయమున కొంతవెండి లేవనెత్తి పడవలో వేసెను. నాక ఆ సముద్రముకూడ దాటి పచ్చనిగడ్డివలెను మొలచు

చున్న వరిమొక్కలవలెను కాంతి లీను నీలవర్ణకుశమాల సముద్రము చేరెను. వ్యాపారులు గాథాద్వారమున దానిపై రడిగిరి.

కుశలవలె సస్యమట్టులు గోచరించు
అబ్ధి పేరేమి సుప్పారకా, వచింపు.

ఆయన రీ గాథ పలికెను:

బయలుదేరి కచ్ఛంబున బహుధనాప్తి
కొరకు దిరిగెడి యావర్తకులకు త్రోవ
మళ్ళపెట్టెడి ఆ కుశమాలి యుదధి.

ఆ సముద్రమున నీలమణు లుండెను. ఆయన నేర్పుతో కొన్నిమణులను కూడ తీసి పడవలో నుంచెను.

పడవపిమ్మట వేణువువలెతోచు నలమాల సముద్రము చేరెను.

వణిక్కులు గాథద్వారా దానిపై రడిగిరి.

నలముపోలిక వేణువువలెను దోచు
అబ్ధిపై రేమి సుప్పారకా, వచింపు.

బోధిసత్త్వ డీగాథ మూలమున ప్రత్యుత్తర మిచ్చెను:

బయలుదేరి కచ్ఛంబున బహుధనాప్తి
కొరకు దిరిగెడి యావర్తకులకు త్రోవ
మళ్ళపెట్టెడి ఆ నలమాలి యుదధి.

ఆయన అక్కడి ప్రియమైన వస్తుజాతులును నేర్పుతో పడవలోనికి వేసెను. నలమాలి సముద్రము దాటి నలమాముఖ నామక సముద్రమున ప్రవేశించిరి. అచ్చట నీరు ఉబికి పైబడుచు నలువంకల ప్రవహించుచుండెను. నూడగా తటము తెగి పెద్ద గుంట పడి, తరంగములు పై బడి జలప్రపాత మేర్పడినట్లు తోచుచుండెను. అచట బయలుదేరిన భీకరధ్వని కర్ణపుటములను విదారించి, గుండె లవియజేయున ట్లుండెను. దానిని గమనించి ఎనుబదిమంది వర్తకులు భీతి చెంది రీగాథతో సముద్రముపై రడిగిరి:

భయదము నమానుషంబు ప్రపాతమట్లు
కానబడునబ్ధి సుప్పారకా, యిదేమి ?

బోధిసత్త్వుడు గాథారూపమున ప్రత్యుత్తర మిచ్చెను. "ఈబడబాముఖ సముద్రమున చేరినవారు తిరిగి పోనేరరు. ఇందు ప్రవేశించు పడవలను సముద్రము ముంచి నాశనము చేయును." ఆనౌకలో ఏడువందలు జనులెక్కియుండిరి. అందరును మృత్యుభయము చెంది ఒక్కదెబ్బన అవీచీనరకమున పడినవారివలె రోదనము చేయజొచ్చిరి. "నేను తప్ప అన్యు లెవరును వీరిని బ్రదికింప లేరు. సత్యక్రియామూలమున వీరిని రక్షింతును." అని యోచించి, వారిని సంబోధించి బోధిసత్త్వుడు 'నన్ను సుగంధజలమున స్నానము చేయించి నాకు శుభ్రవస్త్రము లిచ్చి, సువర్ణస్థాలి నా చేతి కిచ్చి నౌక ముందరిభాగమునకు కొనిపొండు.' వారు త్వరలో అటులే చేసిరి. బంగరుస్థాలిని రెండు చేతులతో పట్టుకొని నౌకాశిరమున నిలిచి బోధిసత్త్వుడు సత్యక్రియ చేయువాడై ఈగాథ పలికెను :

నాకు స్మృతి యున్నదాదిగా నాకు బుద్ధి
వచ్చినది యాదిగా నొక్క ప్రాణినైన
చంప లేదను సత్యవచస్సువలన
క్షమ్మరిలు గాక నౌక సుఖమ్ముగాను.

నాలుగు మాసముల పాటు అన్యప్రదేశముల ప్రయాణము చేసి నౌకలు, బుద్ధిబలము పొందిన వానివలె ఒకనాడు భరుకచ్ఛ పట్టణము చేరినవి. నావికులు తమగృహములు చేరి వాకిళ్ళకు ఎదురుగా ఎనిమిది వృషభముల నాపిరి. బోధిసత్త్వుడు వణిక్కులకు బంగారము, వెండి, మణులు, రత్నములు పంచిపెట్టి "వీనితో సంతుష్టి చెందుడు, ఇక మరల సముద్రమున ప్రవేశింపకుడు" అని ఉపదేశ మిచ్చి యావజ్జీవము దానాదిపుణ్యకార్యములు చేయుచు స్వర్గగామి యయ్యెను.

శాస్తర ఈ ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, పూర్వముకూడ తథాగతుడు మహాప్రజ్ఞావంతుడై యుండెను" అని జాతకములు సరిపోల్చెను.

ఆ కాలమున పరిషత్తు బుద్ధపరిషత్తు, సుప్పారక పండితుడు నేనే.

O

## 464. క్షుద్ర కుణాల జాతకము

ఈ జాతకము కుణాల జాతకమున (536) వచ్చును.

X

## ౪౬౫. భద్దసాల జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు జ్ఞాతులకుపకారము చేయుసందర్భమును గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తీ నగరమున అనాథపిండికుని యింట అనుదినము 500 మంది భిక్షుకులకు నియమానుసారముగా భోజనము పెట్టుచుండిరి. అట్లే విశాఖ యింటను, కోసలనరేశుని యింటను జరుగుచుండెను. కాని కోసలనరేశుని భవనమున ఎక్కువగా భోజనములు పెట్టుచున్నను అచట భిక్షువులకు విశ్వాసపాత్రు లెవ్వరు లేరు. అందుచే భిక్షువులు రాజభవనమున భుజింపక భోజనము వెంటగొని అనాథపిండకుని యింటనో, విశాఖ యింటనో అథవా విశ్వాసపాత్రుడగు వేరొకని యింటనో భుజించుచుండిరి. రాజుకడ కొకసారి కానుకల సమూహము వచ్చెను. భిక్షువుల కిచ్చివేయుడని రాజు పలికెను. భోజనశాలాధ్యక్షుడు అచట భిక్షువులు లేరని ప్రత్యుత్తరము పంపెను. “ఎచటికి పోయిరి?” అని రాజు ప్రశ్నించినపిదప భిక్షువులు తమవిశ్వాసపాత్రుల యింట భుజించుటకు పోయిరి అని సమాధానము వచ్చెను. రాజు విని, ప్రాతఃకాల భోజనానంతరము శాస్తసన్నిధి కరిగి “భన్తే, భోజనమున శ్రేష్ఠతమమైన దేమి?” అని అడిగెను, “మహారాజా, విశ్వాసము. విశ్వాసపాత్రు డిచ్చు గంజికూడ మధురముగా నుండును” అని శాస్త చెప్పెను.

“భన్తే, భిక్షువు లెవరిని విశ్వసింతురు?”

“మహారాజా, జ్ఞాతులను గాని శాక్యకులమును గాని.”

రాజు తనలో “శాక్యకుమారిని పెండ్లియాడి పట్టపుదేవిని చేసెదను. అపుడు నన్ను భిక్షువులు జ్ఞాతులవలె విశ్వసింతురు.” అనుకొని పీఠమునుండి లేచి రాజభవనముచేరి కపిలవస్తు నగరమునకు దూతను పంపుచు “నాకు కుమారి నొసగుడు. నేను మీకు జ్ఞాతిని కాగోరుచున్నాను” అని వార్త పంపెను. శాక్యులు రాయబారము విని ఒకచో సమావిష్టులై “మనము కోసల నరేశుని రాజ్యసీమాంతమున నున్నాము. పిల్లనీయమేని వైరము సంఘటిల్లును. ఇచ్చితిమేని మనకుల పరంపర

నష్ట మగును. ఏమి చేయుదము'' అని విచారింపసాగిరి. మహానాముడు ''చింతింప కుడు. నాగముండాదాసి కడుపున పుట్టినది వాసవ ఖత్తియ అనుకన్య. పదునారు వర్షములు దాటినది. ఆమెరూపము మంచిది. తండ్రివైపునుండి ఆ సౌభాగ్యవతి క్షత్రియ కన్య. ఆమె క్షత్రియకన్య అని మనము రాజసన్నిధికి పంపు దము'' అని చెప్పెను. శాక్యులు మంచి దనిరి. అపుడు మహానాముడు దూతలను పిలువ నంపి ''మంచిది బిడ్డ నిత్తుము. మీ రామెను కొనిపొండు'' అని పలికిరి. దూతలు ''ఈ శాక్యులు మిగులకులాభిమానము కలవారు. తగనిదాని నయినను తగిన దని చెప్పగలవారు. ఈమెతోపాటు కూర్చుండి భోజనము చేయువారినే కొనిపోవుద'' మనిరి. శాక్యులు దూతలకు నివాసములు చూపి, ఏమి చేయుదుము అని యోచింప సాగిరి. మహానాముడు ''మీరు చింతింపకుడు నేను ఉపాయము యోచించినాను. నాభోజనసమయమునకు వాసవఖత్తియను అలంకరించి కొని వచ్చి, నేను మొదటి ముద్ద తిన్నపిదప, మీరు ''దేవా, ఫలానిరాజు సందేశ మంపినాడు. ఈసందేశ మును వినుడు అని పత్రము చూపుడు'' అని చెప్పెను, మంచి దని వారు వెడలి పోయి, ఆయన భోజనము చేయుసమయమునకు కుమారి నలంకరించిరి. మహా నాముడు వారితో ''నాకన్యను కొని రండు. నాతోపాటు భోజనము చేయగలదు'' అనెను. దూతలు త్వరలోనే ఆమెను తీసుకొనివచ్చిరి. ఆమె నాయనగారితోపాటు భోజనము చేయుదునని తలచి గిన్నెలో చేయి పెట్టెను. మహానాముడు ఆమెతో పాటు ఒకముద్ద తీసికొని నోటవేసికొనెను. రెండవముద్ద తీసికొనుటకై చేయి చాపగా వారు ''దేవా, ఫలాని రాజుగారు పత్రిక పంపినారు. శాసనము చిత్తగిం పుడు'' అని పత్రిక నిచ్చిరి. మహానాముడు ''బిడ్డా, నీవు భుజింపు'' మని కుడిచేయి భోజనములోనే ఉంచి ఎడమచేతితో పత్రిక పట్టుకొని చూడసాగెను. మహానాము డాసందేశమును గూర్చి యోచింపుచుండగా కన్య భోజనము ముగించి చేతులు, నోరు కడుగుకొనెను. దూతలు అకిటుకు కనుగొన లేకపోయిరి. ఆమె ఆయన కన్యకయే అని విశ్వసించిరి.

మహానాముడు ఆడంబరముతో పుత్రికను వీడుకొల్పెను. దూత లామెను శ్రావస్తీనగరమునకు గొనిపోయి ''దేవా, ఈకుమారి ఉన్నతవంశోద్భవ; మహా నాములవారి పుత్రిక'' అని విన్నవించిరి. రాజు ప్రసన్నచిత్తుడై నగరమంతయు అలంకారము చేయించి రత్నమందిరమున ఆమె నుంచి పట్టమహిషిని చేసెను. ఆమె ప్రభువునకు అనుకూలవతి యయ్యెను. కొలదికాలములోనే ఆమె గర్భము

ధరించి పదిమాసములలోపుననే బంగరువన్నె గల పసిబాలుని కనెను. నామకరణ మహోత్సవము నాడు రాజు తనతాయనమ్మగారికి వార్త పంపుచు శాక్యరాజపుత్రిక వాసవఖత్తియ కుమారుని కన్నది. అతని కేమి పేరు పెట్టవలయు నని ప్రశ్న వేయించెను. ఆ సందేశము కొనిపోవు అమాత్యుడు కొలదిగా చెవిటివాడు. ఆతడు చని ఆమెకు సందేశము తెలిపెను. ఆమె "వాసవఖత్తియకు పుత్రుడు కలగనప్పుడు కూడ ఆమె అందరను మించి యుండెను. ఇప్పుడు రాజునకు అత్యంత వల్లభ కాగలదు" అని పలికెను. బధిరుడైన అమాత్యుడు వల్లభశబ్దము సరిగా వినబడ నందున 'విడూడభ' శబ్దమనుకొని మరలివచ్చి రాజుతో "దేవా, కుమారునకు విడూడభనామ ముంచుడు" అని విన్నవించెను. ఆనామము కులక్రమాగతమైన ప్రాచీన నామమనుకొని రాజు కుమారున కాపేరే పెట్టెను

బాలుడు తక్కినరాజకుమారుల వలెనే పెరిగి ఏడు సంవత్సరముల ఈడు వచ్చి, తక్కినరాజకుమారుల మాతామహులు ఏనుగులు, గుర్రములు ఆడుకొనుటకు పంపుచుండగా చూచి తల్లితో "అమ్మా తక్కినరాజపుత్రుల కడకు మాతామహులు వచ్చిపోవుచున్నారు. నాతాతగారు నాకేమియు పంపుట లేదు. నీకు తలిదండ్రులు లేరా," అని ప్రశ్నించెను.

ఆమె "నాయనా, నీతాత శాక్యప్రభువు. కాని ఆయన దూరమం దుండుటచే నీకేమియు పంపుట లే" దని సత్యము కప్పి పుచ్చెను. బాలుడు షోడశవర్షప్రాయుడైనప్పుడు తల్లితో "అమ్మా, తాతగారిని చూడవలె నని కోరిక" అన్నాడు.

"నాయనా, పోనిచ్చినచో అచటి కరిగి ఏమి చేయుదువు ?"

తల్లి నిషేధించినను కుమారుడు పట్టుదల విడువకుండుటచే అంగీకరించి ఆమె "పొమ్మునాయనా" అనెను. బాలుడు తండ్రియనుజ్ఞ గైకొని వైభవముతో బయలుదేరెను. వాసవఖత్తియ ముందుగనే ఉత్తరమున "ఇచట నేను సుఖముగా నున్నాను. మీరు ఈతని విషయమున భిన్నభావము ప్రకటింప వల" దని వ్రాసెను. విడూడభ రాజకుమారుడు వచ్చుచున్నా డని విన్నంతనే శాక్యుడు ప్రణామము చేయుటకు వీలు లేదుగావున ఆతని ఈడు గల కుమారుల నెదురు పంపిరి. కుమారుడు కపిలవస్తుపురము చేరినంతనే శాక్యులు స్కంధాగారమున సమావిష్టులైరి కుమారుడచటికిపోయి నిలిచెను. "బాబూ ఈయన నీపితామహుడు, ఈయన మాతామహు" డని చెప్పిరి. కుమారు డెల్లరకును ప్రణామము చేయుచు తిరుగుచుండెను. నడుమునొప్పి వచ్చువరకు ప్రణామములు చేయుచున్నను అతని కెవ్వరు

నమస్కరింప లేదు. "నాకు నమస్కారము చేయువా రెవరును లేరా ?" యని కుమారుడడుగ శాక్యులు "నాయనా, కుమారులు వెలుపలికి వెడలిరి" రని అతనికి సత్కారము చేసిరి. కొలది దినము లచటనే యుండి అతడు మహావైభవముతో బయలుదేరెను. సంస్థాగారమున రాజకుమారులు కూరుచున్న పీఠమును ఒకానొక దాసి పాలతో కడిగి, నీరు చల్లుచు "ఈ పీఠముపై వాసవఖత్తియ పుత్రుడు కూరు చున్నా" డని నిందించెను. తనశస్త్రము మరచిపోయి లోనికరిగి దానిని తెచ్చుకొను చున్న పురుషు డొకడు ఆ దాసి చేయు నింద వినెను. అతడు మహానామునకు దాసివలన వాసవఖత్తియ జన్మించినదని తెలిసినవాడు. అతడు సేనతో వాసవఖత్తియ దాసీపుత్రిక అని ఘోషించెను. పెద్దఆందోళన బయలుదేరెను. రాజకుమారుడు తనలో "నేను కూర్చున్నపీఠమును కడిగిన దాని రక్తముతో కడిగించెదను; నేను రాజునైన పిదప" అని దృఢనిశ్చయము చేసికొనెను.

అతడు శ్రావస్తి చేరినంతనే అమాత్యులు రాజునకు వృత్తాంత మంతయు తెలిపిరి. తనకు దాసీపుత్రిక నిచ్చినందుకు శాక్యులపై కోపించి అదివరలో వాసవ ఖత్తియకు, కుమారునకు ఇచ్చుభరణము తగ్గించి సామాన్యదాసీదాసమున కిచ్చు భరణమీయసాగెను.

తరువాత కొలదిరోజులకు శాస్త ఒకనాడు రాజభవనము చేరి ఉపవిష్టుడయ్యెను. రాజు వచ్చి ప్రణామము చేసి, "భన్తే, తమజ్ఞాతులు నాకు దాసీపుత్రిక నిచ్చినారు. నేను వెనుకటిగౌరవములు మాన్పించి తల్లికిని, కుమారునకును దాస యోగ్యమైనదాని నిప్పించుచున్నాను," అని నివేదించెను. "మహారాజా, శాక్యులు చేసిన దనుచితము. ఇచ్చినచో సమానమైనవాయ గలకన్నె నీయ వలసినది, అయినను ఈవిషయమై ఒకటి చెప్పెదను. వాసవఖత్తియ రాజపుత్రి. క్షత్రియ రాజమందిరమున అభిషిక్తురాలయినది. విదూడభ కుమారుడు క్షత్రియకుమారుడు. తల్లిగోత్రముతో నేమి, పితృగోత్రమే ముఖ్యమైనది. పూర్వము ఎరుకగలవారు దరిద్రకన్యలను గొని వచ్చి పట్టపురాండ్రను చేసి వారికడుపున బుట్టినవారిని ప్రభువులను చేసిరి. ఉదాహరణార్థము ఖడ్గవాహనుడు పండ్రెండుయోజనముల వారాణసికి రాజాయె" నని శాస్త కట్ఠహారిజాతకము చెప్పెను (1-1-7). రాజు ధర్మకథ విని యోచించి తండ్రి గోత్రమే ముఖ్యమని సంతుష్టుడై తల్లికొడుకులకు మరల పూర్వవ్యవస్థ చేయించెను.

బంధుల నామకుడగు రాజసేనాపతి మల్లిక యను తనభార్య వంధ్య యగుటచే ఆమెను పుట్టింటికి పంపివేసెను. ఆమె కుసీనగరమునకు పోవుచు త్రోవలో

శాస్తదర్శనము చేయుదునని తలపోసి జేతవనమునకు జని శాస్తకు ప్రణమిల్లి ఒక ప్రక్కన నిలుచుండెను. శాస్త ఆమెను చూచి "ఎచటికి బోవుచున్నావు ?" అనెను.

"భన్తే, పుట్టింటికి నన్ను పంపుచున్నారు."

"ఏమి ?"

"వంధ్యను, పుత్రులు లేనిదాన నని,"

"ఇట్లగుచో నీవు పోనక్కరలేదు. ఆగుము."

ఆమె సంతుష్టచిత్తయై శాస్తకు ప్రణమిల్లి ఇంటికి జనెను. భర్త చూచి మరల వచ్చితి వే మనెను. "స్వామీ దశబలధారి (శాస్త) నన్ను ఆపినారు." "తథాగతునకు విషయము తెలిసియుండును." అని సేనాపతి పలికెను. ఆమె "నాకు కోరిక కలిగినది" అన్నది. "కోరికా!"

"వైశాలీనగరమున గణరాజుల అభిషేక మంగళపుష్కరిణిలో దిగి స్నానమాడి అందలి సలిలము క్రోలవలె నని కోరిక" యని భార్య చెప్పగా సేనాపతి మంచి దని వేయిమంది ధానుష్కులను సమకూర్చి ఆమెను రథమెక్కించి శ్రావస్తి వెలువడి వైశాలి చేర్చెను.

కోసలనరేశుని సేనాపతి బంగులునితో పాటు ఒకేఆచార్యకులమున చదువుకొన్న మహాలి అను అంధలిచ్ఛవి ఆకాలమున లిచ్ఛవులకు ధర్మాధర్మముల విషయమై ఉపదేశ మిచ్చుచుండెడివాడు. అతడు ద్వారముకడ నుండి రథధ్వని విని "ఇది బంగులమల్లుని రథధ్వని. నేడు నిశ్చయముగా ఆపద రానున్నది" అని తలచెను. పుష్కరిణికి వెలుపలను లోపలను చాలమంది రక్షకభటు లుండిరి. పైన లోహజాలకము కట్టియున్నది. పక్షులు సైతము ప్రవేశించుటకు వీలు లేదు. సేనాపతి రథము దిగి రక్షకభటులను కత్తితో బెదరించి పారద్రోలెను. అతడు లోహజాలకమును నరికి, భార్యను పుష్కరిణిలో జలకమాడించి, తానుగూడ స్నానము చేసి, మల్లికను రథమెక్కించి, నగరము వెలువడి, వచ్చినత్రోవనే మరలిపోయెను. ఆవల కావలివారు పోయి జరిగినవృత్తాంతము లిచ్ఛవులకు తెలిపిరి. లిచ్ఛవీ ప్రభువులకు కోపము వచ్చెను. అయిదువందల మంది అరదము లెక్కి బంగుల మల్లుని పట్టుకొనుటకై వెంటనంటిరి. ఈవార్త మహాలికి తెలిసెను. "పోవలదు బంగులమల్లుడు అందరను సంహరించును" అని అతడు చెప్పినను వినక వారు "మేము పోవక తప్పదు" అనిరి.

"రథచక్రములు నాభివరకు భూమిలో దిగబడుచోటునుండి మరలి రండు. అట్లు కానిచో, పిడుగుపాటువంటి చప్పుడు వినబడినప్పుడైన మరలి రండు. అప్పటి కిని మరలనిచో మీఅరదనుల కాడిలో పగులుచూపినప్పుడు మరలి రావలెను. ముందరికి పోరాదు" అని మహాలి చెప్పెను. ఆతడు చెప్పినట్లు చేయక వారు మల్లునివెంట నడచిరి. పయనించుచున్న మల్లిక భర్తతో "స్వామీ, రథములు కానవచ్చుచున్నవి" అనెను. "అన్నిరథములు ఒకేఅరదనువలె కనబడినపుడు నాకు తెలుపుము" అని యత డనెను. కొంతతడవున కామె "స్వామీ, ఒక్కరథ శిఖరము మాత్రము కానవచ్చుచున్న" దని పలుకగా, మల్లుడు రథ మాపి, పగ్గములు సడలించి, రథముననేనిలిచి విల్లు ఎక్కు పెట్టెను. రథచక్రములు నాభివర కును భూమిలోనికి దిగినవి. చూచియు లిచ్ఛవులు వెను దిరుగ లేదు. ఆవల ధనుష్టంకారము పిడుగువలె వినబడినను వారు వెనుదిరగక వెంట నంటుచుండిరి. బంధులుడు రథమున నిలిచియే బాణము విడిచెను. అది అయిదువందల రథశిఖరములను భేదించుకొని పోయి, ప్రభువుల నడికట్టులనుండి దూరి భూమిలో జొరబడెను. వా రీసంగతి గ్రహింపక పోవుచు "ఆగుము రా!" అని యరచిరి. ఆతడు రథ మాపి "మీరు మృతి నందినవారు. ఇట్టివారితో యుద్ధము చేయను" అనెను.

"మేము చనిపోయినచో ఈ విధముగా నెటు లున్నాము ?"

"అట్లయిన, అందరికన్న ముం దున్నవాని నడికట్టు విప్పుడు."

కట్టు విప్పినంతనే యాతడు మరణించెను. మల్లుడు వారితో "మీ రందరు గూడ ఈ విధముగానే యున్నారు. మీ రందరును మీమీయిండ్లకు బోయి, భార్యా పుత్రాదులతో చెప్పవలసినమాటలు చెప్పి, చేయవలసిన పనులు చేసి నడికట్లు విప్పు కొనుడు" అని బోధించెను. ఆవల వా రా ప్రకారమే చేసి ప్రాణములు కోల్పోయిరి.

బంధులుడు మల్లికను శ్రావస్తికి గొనివచ్చెను. ఆమె క్రమముగా పదునారు పర్యాయములు కవలపిల్లలను కనెను. అందరును బలవంతులు శూరులు నయి, సకల విద్యలు నేర్చిరి. ఒక్కొక్కనికి వేయిమంది పరిజను లుండిరి. తండ్రితో వారు రాజభవనమునకు బోయినపుడు ప్రాంగణ మంతయు వారిపరివారముతో నిండియుండెడిది.

తమవ్యాజ్యెము సరిగా నిర్ణయము కా లే దని యొకనాడు కొందరు వచ్చు చున్న బంధులుని జూచి ఆక్రోశించి, న్యాయస్థానీయుడు తమకు తిన్ననితీర్పు

చెప్ప లే దని విన్నవించిరి. బంధులుడు న్యాయస్థానమునకు జని అభియోగము విని తీర్పు చెప్పెను. జనులు ఉచ్చైస్స్వరమున సాధువాదము చేసిరి. రాజు విని ఏమిటి యని ప్రశ్నించి, వృత్తాంతము తెలిసికొని సంతుష్టచిత్తుడై ఉద్యోగు లందరి కంటె మీదిన్యాయాధీశస్థానమున బంధులుని నియోగించెను. అప్పటినుండి యతడు తీర్పులు సరిగా చెప్పుచుండెను. వెనుకటి న్యాయాధీశులకు భూరిద్రవ్యము దొరకక అల్పద్రవ్యము లభించుచుండుటచే వారు కుపితులై, బంధులుడు రాజు కాగోరుచున్నా డని రాజపరివారములో వాదు వేసి, వైరభావము కలిగించిరి. రాజాసంగతి విని తట్టుకొన లేక, బంధులుని అక్కడనే సంహరించినచో నిందపాలు కావలసి వచ్చు నని తలచి, తనవారిని సరిహద్దుసీమకు పంపి తిరుగుబాటు చేయించెను. ఆవల బంధులుని పిలిపించి "సరిహద్దుసీమలో తిరుగుబాటును నీవు సపుత్రకుడవై పోయి అణచివేయవలెను. విద్రోహిజనులను పట్టుకొనవలెను" అని ఆనతిచ్చి, శక్తిమంతులైనకొందరు యోధులను వారివెంట బంపుచు, "బంధులుని శిరస్సు, అతని పుత్రులశిరస్సులను ఖండించి యిచటికి గొనిరావలెను" అని చాటుగా చెప్పెను.

సరిహద్దుసీమకు సేనాపతి వచ్చుచున్నా డని వినగానే విద్రోహిజనులు పలాయనము చేసిరి. అతడా ప్రదేశమును స్వాధీన పరచుకొని జనులను శాంత పరచిన పిమ్మట మరలి వచ్చెను. బంధులుడు నగరమునకు కొలదిదూరమున నుండగా వెంటనున్నయోధులు అతనిశిరసు, అతనిపుత్రులశిరస్సులను ఖండించిరి.

ఆనాడు మల్లిక 500 మంది భిక్షువులను, ఇరువురు అగ్రశ్రావకులను ఆహ్వానించి యుండెను. పుత్రసహితముగా భర్తశిరస్సును ఖండించినారనువార్త పూర్వాహ్ణమే లేఖామూలమున నామెకు తెలిసెను. ఆమె ఆవిషయ మెవ్వరికిని చెప్పక, లేఖను రైకలో దాచి భిక్షువుల కందరకును భోజనము పెట్టి నేతిచట్టి తెచ్చునపుడు స్థవిరులయెదుట అదిజారిపడి పగిలిపోయెను. ధర్మసేనాపతి చూచి, "దేనికి పగిలెడి స్వభావము కలదో అది పగిలిపోయినది. చింతింపకుము" అనెను. మల్లిక లేఖ పైకి తీసి "ముప్పదియిరువురు పుత్రులతోగూడ తండ్రిశిరస్సు ఖండించినట్లు లేఖలో నున్నది. భన్తే, దీనికి నేను చింతింపలేదు. నేతిచట్టి పగిలినందులకు చింతింతునా ?" అనెను. ధర్మసేనాపతి అనిమిత్తం ఇత్యాది పఠించి, ధర్మోపదేశము చేసి, లేచి, విహారమునకు జనెను. ఆమె తనముప్పదియిద్దరు కోడండ్రను పిలిచి, "నిర్దోషులైనమీభర్తలు తమతమకర్మఫలము పొందినారు. మీరు చింతింప

వలదు. రాజువిషయమై మీరు మనస్సున ద్వేషము పెట్టుకొనరాదు" అని చెప్పెను. గూఢచారు లీమాటలు విని, వారు నిర్దోషు లని రాజుతో జెప్పిరి. రాజు విచారించి వారి యింటికి జని, వా రందరి క్షమాపణ వేడి మల్లికకు వరమిచ్చెను. ఆమె సరే అని రాజు వెడలిపోయిన పిదప శ్రాద్ధకర్మలు చేయించి, స్నానము చేసి, రాజ సన్నిధి కరిగి "దేవా, మీరు నాకు వర మిచ్చినారు. నాకు దానితో ప్రయోజనము లేదు. అయినను, కోడండ్రును నేనును మాపుట్టినిండ్లకు బోవ ననుజ్ఞ దయచేయుడు" అని వేడెను. రాజు సమ్మతించెను. ఆమె కోడండ్రను వారివారిపుట్టినిండ్లకు బంపి, తానుకూడ పుట్టినింటికి బోయెను. రాజు బంధులమల్లుని మేనల్లుడు దీఘాకారయానునకు సేనాపతిపదవి యిచ్చెను. రారాజు నామేనమామను నిష్కారణముగా చంపించినా డని సేనాపతి మనసులో పగ పూని యుండెను. అనపరాధియైనబంధులుని సంహరించినందులకు రాజు పశ్చాత్తప్తుడై భోగముల ననుభవింప లేకుండెను.

ఆసమయమున శాస్త శాక్యుల ఉలుంప నిగమమున విహారము చేయుచుండెను. రాజచ్చటికి పోయి, ఆరామమునకు కొలదిదూరమున డేరాలో విడిసి, కొద్దిమంది అనుయాయులతో చని, శాస్తకు ప్రణామము చేయుకోరికతో విహారమునకు బోయి, పంచరాజచిహ్నములను కారయానున కిచ్చి, తా నొకడే గంధకుటిలో ప్రవేశించెను. [ధర్మచేతియ సుత్తమున వర్ణించినవిధము నిచట గ్రహింపవలెను.] రాజు గంధకుటిలో నున్నప్పుడు కారయానుడు ఆరాజచిహ్నములతో విదూడభుని రాజును చేసి, ఒక్కగుర్రమును ఒక్కపరిచారికను విహారముకడ విడిచి, శ్రావస్తికి బోయెను. రాజు శాస్తతో ప్రియాలాపము లాడి, యీవలకు వచ్చి చూడగా సేన కనబడలేదు. అక్కడి పరిచారిక నడుగగా జరిగిన వృత్తాంత మామె తెలిపెను. మేనల్లుని పంపి విదూడభుని పట్టింప నెంచి, రాజు రాజగృహమునకు బోవునప్పటికి సాయంకాల మయ్యెను. నగరద్వారములు బంధించి యుండుటచే నతడు వెలుపలి శాలలో పండుకొనెను. పగటివేళ తగిలినయెండ, గాలి, దుమ్ము వలన నతడు బడలిక చెంది, రాత్రి శాలలోనే మరణించెను.

తెల్లవారినపిదప కోసలనరేశుడు మృతినందినా డని పరిచారిక చేసినయాక్రోశము విని, జనులు రాజున కీవార్త తెలిపిరి. విదూడభుడు పరివారముతో పెద్ద పట్టున వచ్చి మామకు శ్రాద్ధకర్మలు చేసెను.

రాజ్యము లభించిన పిదప విడూడభునకు వెనుకటి వైరము జ్ఞప్తికి వచ్చెను. శాక్యుల నందరను సంహరించుతలపుతో నతడు మహాసైన్యము సాయత్తము చేసి కొని బయలువెడలెను. ఆనాడు శాస్త ప్రాతఃకాలమున ప్రపంచము విషయమై యోచింపగా, తనజాతికి ముప్పు కలుగవచ్చు నని తోచెను. తనజాతికి క్షేమము కలిగింప నెంచి శాస్త ఆనాడు పూర్వాహ్ణమునసే భిక్షాటనమునుండి మరలి వచ్చి గంధకుటిలో సింహశయ్యపై బండుకొని, సాయంకాల మాకాశమార్గమున చని, కపిలవస్తు సరిహద్దున నున్న చిత్రవర్ణవృక్షముక్రింద గూర్చుండెను. దానిచెంగ టనే యావలిహద్దున శీతలచ్ఛాయతో కూడిన మేడిచెట్టుండెను. విడూడభుడు శాస్తను కనుగొని ప్రణామము చేసి "భన్తే, ఈవేసవిలో విరళచ్ఛాయ కలవృక్షము క్రింద కూరుచున్నా రేల ? భన్తే, శీతలచ్ఛాయ కల యీమేడిచెట్టుక్రింద గూరుచుం డుడు" అనెను.

"మహారాజా, మంచిమాటే. కాని స్వజాతియారి వృక్షచ్ఛాయ మిక్కిలి శీతల ముగా నుండును కదా."

స్వజాతిజనులను రక్షించుకోరికతో శాస్త అచటికి వచ్చినా డని గ్రహించి రాజు ససైన్యముగా శ్రావస్తికి మరలి పోయెను. శాస్తకూడ ఆకాశమార్గమున జేత వనమునకు మరలి చనెను.

రాజు శాక్యులనేరమును స్మరించి సైన్యముతో బయలుదేరి వెనుకటి వృక్షము క్రిందనే శాస్తను చూచి తిరిగి పోయెను. మూడవపర్యాయము కూడ నట్లే జరిగెను. నాల్గవసారి రాజు దండయాత్రకు బయలుదేరినపుడు శాస్త శాక్యుల పూర్వకర్మను గ్రహించెను. పూర్వము వారు నదీజలములో విషము చల్లిన పాప కర్మకు ప్రతిఫల మనుభవింపక తప్ప దనియు, వారిని రక్షించుట వీలుపడ దనియు తలచి శాస్త వృక్షముక్రిందికి పోలేదు రాజు దండయాత్ర చేసి, పాలు త్రాగుపిల్లలు మొదలుకొని శాక్యుల నందరను సంహరించి, రక్తముతో మేజా కడిగించి, నిజ రాజధానికి మరలెను.

శాస్త మూడవసారి మరలి వచ్చిన మరునాడు భిక్షానంతరము భుజించి గంధ కుటిలో విశ్రాంతి తీసుకొనుచుండగా, నలుదిక్కులనుండి వచ్చినభిక్షువులు ధర్మ సభలో కూరుచుండి శాస్తను ప్రశంసించుచు "ఆయుష్మంతులారా, శాస్త రాజునకు గానబడి, నివారించి, స్వజాతిజనులను సంరక్షించినాడు. ఈప్రకారముగా వారికి

మేలు చేసినాడు" అనుచుండిరి. శాస్త యచటకి జని, ఏమి సంభాషించుచున్నా రని యడిగి, తెలిసికొని, భిక్షువులారా, ఇప్పుడే కాదు; పూర్వము కూడ తథాగతుడు స్వజాతిజనులకు ఉపకారము చేసినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచు దశరాజ ధర్మముల ననుసరించుచు నొకనాడు తనలో "జంబూద్వీపములో రాజులు బహు స్తంభములమీద కట్టిన మేడలలో నివసించుచున్నారు. బహు స్తంభములపై నిర్మించినసౌధములలో విశేషము లేదు. నేను ఒంటికంబము మేడ కట్టింతును, దీనివలన నేను రాజులయందు దగ్రేసరుడ నగుదును" అనుకొని వడ్రంగులను పిలువ నంపి "నాకొరకు అందమైన ఒంటికంబము మేడ కట్టవలెను" అని చెప్పెను. వారు సమ్మతించి అరణ్యములోనికి జని, మేడ కుపయుక్త మగుకంబము సిద్ధము చేయుటకు తగినవృక్షములు చూచి "ఇవి తగినవే. కాని త్రోవ వంకరటింకరగా నున్నది. వృక్షములను క్రిందికి గొనివచ్చుటకు వీలు లేదు" అని భావించి, రాజుతో నీవృత్తాంతము చెప్పిరి.

"ఏయుపాయముచే నైనను వృక్షములను క్రిందికి గొనిరండు."

"దేవా, క్రిందికి దెచ్చునుపాయము లేదు."

"అట్లయిన మాయుద్యానములో తగినవృక్షమును నిర్ణయింపుడు."

వడ్రంగు లారామములోనికి బోయి, పరిశీలించి మంగళ సాలవృక్షమును చూచిరి. అది చక్కగా సూటిగా పెరిగినది. గ్రామ నిగమ జనులు దానిని పూజింతురు. రాజకులముకూడ దానికి ప్రదానాదులు చేయుచుండును. వడ్రంగులు రాజునకు రీవృక్షముసంగతి నిన్నవించిరి. 'రీ వృక్షము నాది. పోయి మీరు దానిని కొట్టివేయుడు" అని రాజు చెప్పగా, మంచి దని వారు గంధ మాల్యాదులు గైకొని యుద్యానమునకు బోయి సుగంధ పంచాంగుళ చిహ్నము నుంచి, త్రాడు చుట్టి, పూమొగ్గలదండ వ్రేలాడ దీసి, దీపారాధన చేసి, అర్చన గావించి. "నేటికి ఏడవనాడు వచ్చి వృక్షము ఖండింతుము. రాజుగారి యానతి. ఇందు మాదోషము లేదు" అని పలికిరి.

వృక్షమున నివసించు దేవత యీమాటలు విని యిట్లు తలపోసెను. "వడ్రంగులు తప్పక వృక్షమును కొట్టివేయుదురు. నానివాసస్థానము పోవును. అంత వరకే నాజీవనము. దీనిచుట్టును ఎన్నో తరుణశాలవృక్షములపై నివసించు నాజాతి దేవతల నివాసములు నష్టమగును. నానివాసము పోవుటకు చింతింపను. కాని స్వజాతివారి నివాసములు నష్టమయినచో కష్టముగా నుండును. కావున వారిజీవనములు రక్షింపవలెను.'' ఇట్లు తలపోసి వృక్షదేవత అర్ధరాత్రమున దివ్యాలంకారములు ధరించి, రాజశయనాగారమున ప్రవేశించి, గది దీప్తిమంతము చేయుచు రాజు శిరసుకడ నిలిచి రోదింపసాగెను. చూచి రాజు ఉలికిపడి, ఆవల దేవతతో ఆలాపము లాడుచు ఈ గాథ పలికెను :

ఆకాశచారి, శుక్లాంబరధారి
ప్రవహించుచున్నవి బాష్పంబు లేల ?
ఆపద యెటనుండి ఆవిర్భవించె ?

విని దేవరాజు ఈ గాథలు పలికెను :

ఇట నరువదివేల యేడులు దేవ;
కడచిపోయెను నాకు కడుసాదరమున
భద్రసాలాభిఖ్య పడసినవాడ.

నగరాలు నిర్మించునప్పుడు వివిధ
మందిర నిర్మాణమందున గాని
ప్రాసాదనిర్మాణ భవ్యకాలముల
గాని ఘటిల్లదు కష్టమ్ము నాకు
పూర్వరాజులవల్ల; పూజింపవలయు
దేవ, నీవును వారితెరగును బూని.

అంతట రాజీగాథలు పలికెను ;

నీవృక్షమంతటి లావైన తరువు
ఒడ్డును పొడవును నున్నట్టి దాని
సుందరంబగుదాని జూడనే లేదు.
కమనీయమగు నొంటి కంబపు మేడ

నిర్మింతు, నచటికి నిం గొనిపోరు
చిరకాల మయ్యెడ జీవించు యక్ష.

ఆకర్ణించి దేవత యీగాథలు పలికెను :

నను వేరుచేయగా తరువునందుండి
కలిగిన యెడల సంకల్పంబు నీకు
కావింపవలె నన్ను ఖండ ఖండములుగ

తొలుత ప్రశాఖ, లావల మధ్యభాగ
మంతమ్మునందు మూలాదులు నరక,
మెండుగా నుండదు మృత్యుపీడనము,

పిమ్మట రాజు ఈ గాథలు పలికెను :

జీవింపగానిని చేతులు కాళ్ళు
చెవులను నాసిక చివరకు తలయు
ఖండింపుచో మహాకష్టంబు కలుగు.

ఓవనస్పతి, నీకు నాదవునే సుఖము
కావింపుచో నిన్ను ఖండఖండములు ?
ఏలనో ఓభద్రసాల, యీకోర్కి ?

భద్రసాలదేవత ప్రత్యుత్తర మిచ్చుచు ఈ గాథలు పలికెను :

వినుమోమహారాజ, నను ముక్కముక్క
లొనరింపు మనుకోర్కి యుండుకారణము
ధార్మికం బగును; నా చుట్టుపున జ్ఞాతి
ధరణీరుహమ్ము లాతపవాయువులకు
నున్నవి సుఖముగా; ఒక్కమారుగనె
నన్ను ఖండింపుచో నావారిమీద
పడి వారి కెంతయో బాధ కల్పింతు.

రాజు విని సంతుష్టుడై "ఈ దేవపుత్రుడు ధార్మికుడు. తననివాసము పోయినను విచారింపడు. తనజాతిబారి నివాసములు పోవుట కిచ్చగింపడు స్వజాతి కుపకారము చేయును. ఈతని కభయ మిత్తును" అని తలపోసి ప్రీతితో ఈగాథ పలికెను :

భద్రసాల వనస్పతీ, భవ్యచింత !
బంధుహితచింతకా, నీకు భయము లేదు !

దేవరాజు రాజునకు ధర్మోపదేశ మిచ్చి వెడలిపోయెను. రాజాతని యుపదేశానుసారముగా ప్రవర్తించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు క్రమముగా స్వర్గలోకగామి యయ్యెను.

శాస్త యీవిధముగా ధర్మోపదేశము చేసి, "భిక్షువులారా, తథాగతుడు పూర్వముకూడ జ్ఞాతుల కుపకారము చేసియుండెను" అని జాతకములు సరిపోల్చెను. ఆకాలమున రాజు ఆనందుడు; సాలవృక్షదేవ గణము బుద్ధపరిషత్తు; భద్రసాల వృక్షరాజు నేనే.

o——

# ౪౬౬. సముద్ద వాణిజ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు దేవదత్తుడు 500 మందితో నరకమున బడుటగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు అగ్రశ్రావక పరిషత్తును కొనిచనిన పిదప శోకమును సహింపలేకుండెను. ఆతని నోటివెంట వేడిరక్తము పడెను. ఆతనిని పెద్దరోగము పట్టుకొనెను. ఆతడు తథాగతుని గుణగణములను జ్ఞప్తికి తెచ్చుకొని "నేను నవమాసములపాటు తథాగతుని వేధించితిని. శాస్త మనస్సులో నాయెడ వికారము లేదు. ఎనుబదిమంది మహాస్థవిరుల మానసములయెడ కూడ నెట్టిద్వేషము లేదు. నేను చేసిన కృత్యము వలననే అనర్థమనుభవించుచున్నాను. శాస్త కూడ నన్ను విడనాడినాడు. మహాస్థవిరుడు, ఉత్తమబంధువు రాహులస్థవిరుడును, శాక్యరాజ్య వంశములును నన్ను త్యజించినవి. పోయి శాస్తను క్షమాపణ వేడుకొందును" అని తలపోసి తనసంఘమునకు సూచన చేసి మంచ మెత్తించి రాత్రివేళనే పయనము చేసి కోసల నగరము చేరెను. ఆనందస్థవిరుడు శాస్తకు నివేదించెను. "భన్తే, దేవదత్తుడు మిమ్ము క్షమాపణ వేడుటకై వచ్చుచున్నాడు."

"ఆనందా, దేవదత్తునకు నాదర్శనము లభింపదు." దేవదత్తుడు శ్రావస్తి చేరిన పిదప స్థవిరుడు మరల విన్నవించెను. భగవానుడు వెనుకటివలెనే పలికెను. దేవదత్తుడు జేతవన ద్వారము చేరి, పుష్కరిణి సమీపము చేరునప్పటికి ఆతని పాపము ప్రబద్ధ మయ్యెను. ఒడలిపై మంటలు లేచెను. స్నానము చేసి దాహము త్రాగవలయు ననుకోరికతో "ఆయుష్మంతులారా, మంచము దింపుడు. నీరు త్రాగెదను" అని యాతడనగా వారు మంచము దించునప్పటికి ఆతనికి మనశ్శాంతి లేదు. నేల ప్రబద్ధ మైనది. అప్పుడే అవీచీనరకమునుండి జ్వాలలు రేగి అతనిని చుట్టుముట్టినవి. అతడు "నాపాపఘటము పగిలినది" అని తథాగతుని గుణగణములను స్మరించి ఈ గాథ పలుకుచు తథాగతుని శరణు జొచ్చెను.

"ఇమేహి అట్ఠీహి తం అగ్గపుగ్గలం
దేవాతిదేవం నరదమ్మసారథిం
సమన్తచక్ఖుం సతపుఞ్ఞలక్ఖణం
పాణేహి బుద్ధం సరణం ఉపేమి."

అతడు శరణగ్రహణము చేయుచుండగనే అవీచీనరకమున బడెను. అతని 500 మంది పరివారము కూడ అతని పక్ష మవలంబించి తథాగతుని నిందించుచు అవమానించెడివారు. అందుచే వారుకూడ అవీచీనరకమును పొందిరి. ఈ ప్రకారముగా అతడు 500 పరివారముతో అవీచీనరకమున ప్రతిష్ఠితు డయ్యెను.

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై సంభాషించుచు "ఆయుష్మంతులారా, మహాపాపి దేవదత్తుడు లాభమునెడ లోభ ముండుటచే అకారణముగా సమ్యక్ సంబుద్ధుని యెడ ద్వేషము వహించి, భవిష్యత్తులో భయమువంక చూడలేదు. అతడు 500 మంది పరివారముతో అవీచీనరకగామి అయినాడు" అనుచుండిరి. శాస్త అచటి కరుదెంచి సంగతి తెలిసికొని "భిక్షువులారా, దేవదత్తుడు లాభము మీద లోభముచేత భవిష్యద్భయమును గుర్చి యోచింప లేదు. పూర్వజన్మమున కూడ ఇట్లే చేసి వర్తమాన సుఖముపై పేరాసతో పరిషత్తులో కూడ మహావినాశము పొందెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున బ్రహ్మదత్తుడు వారాణసిలో రాజ్యము చేయుచుండగా వారాణసికి కొలదిదూరములో వేయిమంది వడ్రంగులు కల పెద్ద గ్రామ ముండెను. మీకు మంచములు, మీకు పీటలు చేయుదుమని కొందరు, మీకు గృహములు నిర్మింతుమని కొందరు లోకులవద్ద ఋణము చేసి, తీర్పలేక పోయిరి. అప్పులిచ్చినవారు వారిపై దోషారోపణ చేసి శ్రమ పెట్టసాగిరి. వడ్రంగు లా గ్రామమున నిలువలేమని తలచి; విదేశములకు పోయి నివసింప నిర్ణయించుకొని, అరణ్యములోనికి పోయి, చెట్లు కొట్టి, పెద్దపెద్దనావలు కట్టి, నీటిపై నచటికి రమారమి యోజనము దూరములో ఆపి, అర్ధరాత్రమున గ్రామములో ప్రవేశించి, స్త్రీలను బిడ్డలను సామగ్రులను నావలకడకు గొనిపోయి ఆవల నందరు వానిలో నెక్కి క్రమముగా మహాసముద్రమున పయనించి, గాలివాలున నొకానొకదీవి చేరిరి. అచట పండినధాన్యము చెరకు, అరటి, మామిడి, జేమ, కొబ్బరి మొదలగువృక్షములు కూడ కలవు.

అదివరలో నౌకాయానము చేయుచు తనపడవ పగిలిపోవుటచే ఆదీవిచేరిన మానవుడొకడు శాలిధాన్యము, చెరకు మొదలగునవి తినుచుండెను. అతడు స్థూలకాయుడు, నగ్నదేహుడు, దీర్ఘకేశములు గడ్డము మీసములు కలవాడు. వడ్రంగులు ఈదీవి రాక్షసాధీనమైనచో ఎల్లరు నశింతురని భావించి, పరీక్షింప దలచిరి. వారిలో బలిష్ఠులు శూరులు నగు ఏడుగురు పంచాయుధములు ధరించి నావలు దిగి, ద్వీపము చుట్టును తిరిగిరి. ద్వీపవాసియైన మోటుమానిసి ఉదయభోజనము చేసి, ఇక్షురసము త్రాగి, రమణీయ ప్రదేశమున వెండిబిళ్ళవలె నున్న యిసుకతిన్నెపై శీతల వృక్షచ్ఛాయలో పండుకొని "జంబూద్వీపమున జనులు నేల నాగలితో దున్నుదురు, విత్తనములు చల్లుదురు. అయినను ఇట్టిసుఖము పొందలేకున్నారు. దానికంటె నాకు ఈదీవియే బాగున్నది" అని యుల్లాసవాక్యాలు పలుకుచు, పాటలు పాడుచుండెను,

శాస్త భిక్షువులను సంబోధించి "భిక్షువులారా, ఆతడు తనయుల్లాసమును ప్రకటించుచు ఈగాథ పలికినాడు :

వారు కర్మఫలానుసార జీవనులు
దున్ని నేలను చల్లుదురు విత్తనములు
వారు జంబూద్వీపవాసు లిచ్చటనా
కా దట్టు లీదీవి కావున గొప్ప.

దీవిచుట్టు తిరుగుచున్నవారు ఈయాలాపములు విని, మానవకంఠధ్వని యని గ్రహించి దాని ననుసరించి పోయి చూచి అతడు రాక్షసుడు కావచ్చునని యెంచి ధనుస్సు లెక్కు పెట్టిరి. అతడు వారిని చూచి మరణభీతుడై "స్వాములారా, నేను రాక్షసుడను కాను, మానవుడను" అని యెలుగెత్తి పలికి, మానవత్వమును మాటిమాటికిని ప్రకటించెను. పిదప వా రాతనికడ కరిగి యోగక్షేమము లడిగి, అత డచటి కెట్లు వచ్చెనో ప్రశ్నించిరి. వారి కాతడంతయు వివరించి, "మీరు పుణ్యవశమున నిచటికి వచ్చినారు. ఇది మంచి దీవి. ఇక్కడ చేలతో కష్టపడి పనిచేసి జీవింప నవసరము లేదు. సహజముగా నిచట పండు ఫలాదులకు ధాన్యమునకు అంతము లేదు. నిర్విచారముగా నిచట నుండుడు" అని చెప్పెను.

"ఇచ్చట నున్నచో మా కాపద లేదు కదా ?"

“కాదు. ఇక్కడ మానవులు లేరు. దేవతలున్నారు, మీ మలమూత్రములు కనబడినచో వారికి కోపము రావచ్చును. వానిని మీరు ఇసుకతో కప్పుచుండవలెను. ఇక్కడి భయ మింతే. ఎల్లప్పుడు జాగరూకతతో నుండుడు.”

వా రందరు నచటనే నివసింప జొచ్చిరి.

వారు దీవిలో నివసింపసాగిరి. వారిలో 500 కుటుంబముల కొకరు చొప్పున వేయికి ఇరువురు జ్యేష్ఠు లుండిరి. అందొకరు మూర్ఖుడు, కోరికలకు లోబడినవాడు; రెండవవాడు పండితుడు కోర్కెలకు లోబడనివాడు. వా రందరును సుఖముగా నివసించుచు కాలక్రమమున నొకనాడు చెరకుమద్యము సిద్ధము చేసి త్రాగిరి. దానివలన కైపెక్కి ఆడుచు పాడుచు ఇచ్ఛ వచ్చినచోట మలమూత్రములు విసర్జించిరి. ఆ మలములలో ఇసుక చల్ల లేదు. ద్వీపమును జుగుప్సాకరము చేసిరి. “వీరు మా క్రీడాస్థలములను పాడు చేసినారు” అని దేవతలు కోపించి, జనులను సముద్రమున ద్రోసి, ద్వీపమును ముంచివేయ నిశ్చయించిరి. తిథి నిర్ణయించు విషయమై “ఇది కృష్ణపక్షము. సభకూడ ముగిసినది. నేటికి పదునైదవరోజు పూర్ణిమ. ఉపోసథ వ్రతము చేయవలసిన రోజు. చంద్రు డుదయింపగనే వీరి నందరిని సముద్రమున ద్రోసి సంహరింతము” అనుకొనిరి వారిలో ధార్మికుడైన దేవపుత్రుడు కలడు, అతడు దయదలచి నేను చూచుచుండగా వీరు నశింపరాదు అనుకొనెను. సాయంకాలము వడ్రంగులు భోజనములు చేసి, గృహద్వారముల గూరుచుండి సుఖసల్లాపములు చేయుచున్నపుడు, ఆదేవపుత్రుడు సమస్తాలంకారభూషితుడై సమస్తజంబూద్వీపమును దేదీప్యమానము చేయుచు, ఉత్తరదిక్కున నాకసమున నిలిచి, “వర్ధకులారా, దేవతలకు మీమీద కోపము వచ్చినది. నేటికి పదునైదవ నాడు మి మ్మందరను సముద్రమున ముంచి చంపగలరు. మీరిచట నుండరాదు. పలాయనము చేయవలెను” అని యీగాథ పలికెను :

సోముండు పదునైదుయామిమల్ తిరుగ
అబ్ధివేగము వృద్ధి నందును మిగుల
దేవతాగణము లీదీవిని ముంచి
సంహరింపకమున్నె చనుడన్యదిశకు.

అతడీ ప్రకారముగా వారి కుపదేశ మిచ్చి నిజస్థానమునకు జనెను. అతడు వెడలి పోయినంతనే అతని సహచరు డగు వేరొక దేవపుత్రుడు, కఠినప్రాద

యుడు తనలో "ఈతనిమాటలు విని వడ్రంగులు పారిపోవ గలరు. వీరిపోక నిరో ధించి, అందరను నాశము చేయవలెను" అనుకొని, సమస్తాభరణములు ధరించి గ్రామమును వెలిగించుచు దక్షిణదిక్కున నాకసమున నిలిచి, ఇచ్చటికి దేవపుత్రు డెవ్వడైనను వచ్చెనా అని వారి నడిగెను. వారు వచ్చెనా డనగా, ఆయన మీతో ఏమి చెప్పెను డని యడిగెను ఇట్లు చెప్పెనా డని వా రనిరి "మీరిచట నుండుట ఆయన కిష్టము లేదు. ఆయన కోపమున పలికినమాటలు వినక మీ రిచటనే యుండుడు," అని యీ గాథలు పలికెను ;

బహులక్షణాలచే బాగుగా దెలియ
నీసింగుజలవేగ మీపెద్దదీవి
ముంప నేర దటంచు: మోదంబు గనుగు
ఏమి యోచించెద ? రేటికి భయము ?

భోజనవస్తువుల్ భూరిసామగ్రి
స్థానముల్ నివసింప దగినవి దొరకె
కానంబడదు భయకారణం బేమి
పొందుడు సౌఖ్య మాపుత్రపౌత్రముగ.

ఈ ప్రకారముగా వారి నూరడించి, ఆతడు వెడలిపోయిన పిదప ధార్మిక దేవపుత్రుని మాటలు వినక మూర్ఖుడైన వడ్రంగి ఎల్లరను పిలువ నంపి మీరు నామాట వినుడు అని యీగాథ పలికెను :

క్షేమమార్గ మెవండు దక్షిణమునందు
నిలిచి వచియించెనో అదే నిజము; కాని
ఎరుగడు భయాభయంబు లుత్తరమువాడు
ఏమి యోచింతు ? సుఖముండు, దేమి భీతి ?

విని మూర్ఖులైన వడ్రంగులు 500 నుంది మూర్ఖుని పలుకులు విశ్వసించిరి, ధార్మికవర్గక జ్యేష్ఠుడు వానిని నమ్మక తనవారిని బిలువ నంపి ఈ గాథలు పలికెను :

భయము నొక్కడు, క్షేమమ్ము పరుడు తెలుపు
వారివి పరస్పర విరుద్ధవాక్కులు కద !

మనము నాశము పొంద మహాంతముగను:
ఇందు మీరలు నామాటలే వినుండు.

ఎల్లరము యంత్రయుక్తమౌ దృఢములైన
ద్రోణములతోడి నావనిర్మాణకృతిని
చేయుదము; దక్షిణముఖాని క్షేమయాత్ర
నిజమయేని, ఉత్తరయాత్ర నిష్ఫలంబు.

విడువ మాపత్తి గానిచో ద్వీప మెపుడు
ఉత్తరముఖాని యాత్రలే ఒక్కవేళ
సత్య మగునేని నావలో సర్వజనము
చేరి కుశలమ్ముగా దరి జేరవచ్చు.

ఆదిలో పల్కినది సత్య మనుట తగదు
ఆవల వచియించినది సత్యమనుట తగదు
చెవిని బడుపల్కులను విమర్శించి సత్య
మరయుచో శ్రేష్ఠపదవి లభ్యంబు సుమ్ము.

ఈ ప్రకారముగా పలికి అతడు "సౌమ్యులారా, ఇరువురు దేవపుత్రుల మాటలు మీరు వినినారు. వారు చెప్పినట్లు చేయుదము. నావలు సిద్ధము చేయవలెను. మొదటిదేవపుత్రుని మాట సత్యమగుచో నావలలోని కెక్కి శీఘ్రముగా పోవుదము. రెండవవానిమాట సత్యమగుచో నావల నొకప్రక్క నుంచి ఇచ్చటనే నివసింతము" అని చెప్పెను. దానికి మూర్ఖవర్ధకి యిట్లనెను: "ఓయీ, నీవు నీటి చెంబులో మొసలిని చూచుచున్నావు! నీవు దూరదర్శివి. ప్రథమదేవపుత్రుడు చెప్పిన మాటలు మనపై కోపముతో చెప్పినవి. రెండవయాతడు చెప్పినవి మనమీది స్నేహముచేతనే. ఇట్టి శ్రేష్ఠద్వీపమును విడిచి యెచ్చటికి పోవుదము? నీవు పోవ దలచినచో నీమండలివారిని గొనిపొమ్ము: నావలు సిద్ధము చేసికొనుము. మాకు నావలతో పని లేదు."

వివేకియైన వడ్రంగి తనవారిని గొనిపోయి నౌకలు సిద్ధము చేయించి సామానులు వానిలో పెట్టించి వానిలో విడిసెను.

పూర్ణిమనాడు చంద్రోదయ మగునంతనే సముద్రమున తరంగములు లేచి, ద్వీపమును మోకాలిలోతు ముంచెను. వివేకి సముద్రము పొంగుట గమనించి నావ

లను సముద్రములోనికి విడిచెను. మూర్ఖుడు, అతనిమండలివారును చూచుచు కూరు చుండిరి: ఆవల తరంగములు నడుము వరకును, క్రమముగా పురుష ప్రమాణమునను, పిమ్మట తాళ ప్రమాణమునను, పిదప సప్తతాళ ప్రమాణమునను లేచి ద్వీపమును ముంచివేసెను. మూర్ఖవర్ధకి స్వజనముతో గూడ సలిలమున నాశ మొందెను.

ఇందు మొదటిమూడును ఉపదేశ పరములైన సంబుద్ధ గాథలు.

సింగుజలముల వర్తకుల్ క్షేమముగను
స్వీయకర్మనుసారము పోయినట్లు
ప్రజ్ఞ కలవాడు యోచించి భావిగతిని
తనకు నింసుక హానియు తగులనీడు.

మోహమున కోర్కెలకు జిక్కి మూఢజనుడు
భావ్యనర్థము నెరుగక ప్రస్తుతమున
మనల విషయాలలోపల మగ్నుడగును
మూర్ఖు లబ్ధిజలంబుల మునిగినట్లు.

కల్యాణకారులౌ కార్యముల్ భావి
సమయంబు తలచుతో సలుపు నెవ్వండు
వానికి నేబాధ వాటిల్ల దెపుడు.

శాస్త ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ దేవదత్తుడు తాత్కాలిక సుఖము నపేక్షించి,రానున్న విషయము గమనింపక, నిజ బృందముతో గూడ నష్టుడయ్యెను." అని చెప్పి జాతకమును సరిపోల్చెను. ఆ కాలమున మూర్ఖవర్ధకి దేవదత్తుడు; దక్షిణదిక్కున నిలిచిన అధార్మిక దేవపుత్రుడు కోకాలికుడు; ఉత్తరదిక్కున నిలిచిన దేవపుత్రుడు సారిపుత్రుడు; వివేకివర్ధకి నేనే.

— o —

## ౪౬౭. కామ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక బ్రాహ్మణుని గూర్చి చెప్పినది.

### వర్తమాన కథ

శ్రావస్తినివాసి యగు బ్రాహ్మణు డొకడు అజిరవతీ నదీతీరమున క్షేత్రము సిద్ధపరచుటకై అడవి కొట్టుచుండెను. ఆతనికి మార్గఫలప్రాప్తి యగు నని శాస్తకు తోచగా శ్రావస్తిలో భోజనార్థము పోవు మార్గమున ఆగి ఆతని కుశల మడుగువాడై "బ్రాహ్మణోత్తమా, ఏమి చేయుచున్నావు?" అని శాస్త అనెను.

"గౌతమా, పొలము కొరకై భూమి బాగు చేయుచున్నాను."

"మంచిది, బ్రాహ్మణోత్తమా, పని చేయుము" అని శాస్త నడిచెను.

ఈవిధముగా చెట్లు కొట్టునప్పుడు, నేల బాగుచేయునప్పుడును, దున్ను నపుడును, విత్తులు చల్లునపుడును, శాస్త ఆతని కుశల మడుగుచుండెను. విత్తులు చల్లునాడు బ్రాహ్మణుడు "గౌతమా, ఇది విత్తులు చల్లుశుభదినము. ఈపంట వచ్చిన తరువాత బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు మహాదాన మిత్తును" అనగా శాస్త అంగీకరించి వెడలిపోయెను. ఆవల ఒకనాడు శాస్త బ్రాహ్మణుని చూచి "బ్రాహ్మణోత్తమా, ఏమిచేయుచున్నావు?" అనెను. "గౌతమా, పొలము కాయుచున్నాను" అని అతడనగా శాస్త మంచి దని వెడలి పోయెను. అప్పుడు బ్రాహ్మణుడు తనలో "శ్రమణగౌతముడు తరచుగా వచ్చుచున్నాడు ఆహారార్థి కానోపును. ఈయన కాహార మిడుదును" అనుకొని అతడింటికి వెళ్లిననాడు శాస్తకూడ అచ్చటికి చేరెను. ఆ బ్రాహ్మణుని మానసమున విశేషవిశ్వాసము జనించెను. ఆవల పైరు కోతకు వచ్చినపుడు, బ్రాహ్మణుడు రేపు పైరు కోయుదు నని నిశ్చయించుకొనెను. ఆరాత్రి అజిరవతీ ప్రాంతమున వర్షము ధారాపాతముగా కురిసెను. వరద వచ్చి నలుసు మిగులనీయక పంట అంతయు కొనిపోయి సముద్రమున కలిపెను. అది చూచి బ్రాహ్మణుడు సంబాళించుకొనలేక శోకాకులచిత్తుడై రొమ్ము బాదుకొనుచు ఏడ్చి, మొత్తుకొనుచు ఇంటికి చేరెను. శాస్త మరునాడు దుఃఖాకులచిత్తుడైన బ్రాహ్మణుని చూచి ఆయనకు తోడ్పడుటకై భిక్షాటనమునుండి తిరిగి వచ్చి భిక్షువులను విహారము

లకు పంపి, వెంట నొకభిక్షువు నిడుకొని బ్రాహ్మణుని గృహద్వారము కడ నిలిచెను. "స్వామి త్రము కుశల మడుగుటకై వచ్చెను" దని తలచి అతడు సంతోషముతో ఆసనము పరచెను. శాస్త లోనికి ప్రవేశించి కూరుచుండి "బ్రాహ్మణా, ఏల బాగా సీన్యము వహించియున్నావు ? నీకేమి శ్రమ గలిగినది ?" అనెను. "గౌతమా, అజరవతీ నదీతీరమున నేను చెట్లు కొట్టుట మొదలు చేసినపను లన్నియు తమకు తెలిసినవే. పంట వచ్చిన పిదప తమకు దాన మీయ దలచితిని. ఆ సాపంట వరద వలన సముద్రమున కలిసెను. ఏమియును మిగులలేదు. నూరుబండ్ల ధాన్యము నష్ట మైనది. ఇందువలన మనసు దుఃఖాక్రాంత మైనది" అనెను.

"బ్రాహ్మణా, దుఃఖించుట వలన పోయినది తిరిగి వచ్చునా ?"

"గౌతమా, రాదు."

"అని చింతించుచున్నావా? ప్రాణులకు ధనధాన్యములు వచ్చునపుడు వచ్చును, పోవునపుడు పోవును. సంస్కార మేదియును అనశ్వరము కాదు. చింతింపకుము" అని శాస్త అతని నోదార్చి ఉచిత ధర్మోపదేశము చేసి కామసూత్రము (కోరిక) ప్రవచించెను. సూత్రాంతమున బ్రాహ్మణుడు యోచన చేసి స్రోతాపత్తిఫలము పొందెను. శాస్త అతని దుఃఖమును పోగొట్టి పీఠమునుండి లేచి, విహారమునకు జనెను.

శోకాకులచిత్తు డైన బ్రాహ్మణుని విచారము శాస్త తొలగించె ననువార్త నగరమున వ్యాపించెను. భిక్షువులు ధర్మసభలో గూరుచుండి "ఆయుష్మంతులారా, దశబలధారి బ్రాహ్మణునియెడ మైత్రిచూపి, అతనిని శ్రద్ధావంతుని గావించి. ఒక తీరున ధర్మోపదేశము చేసి శోకరహితుని కావించి స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠించెను" అనుచుండిరి. ఇంతలో శాస్త అచటి కరుదెంచి సంగతి తెలిసికొని, "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ నేనతనిని శోకరహితుని చేసితిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసీప్రభు వైన బ్రహ్మదత్తున కిరువురు పుత్రు లుండిరి. ఆయన తనపెద్దకుమారుని ఉపరాజును చేసి, రెండవవానిని సేనాపతిని చేసెను. కాలక్రమమున బ్రహ్మదత్తుడు చనిపోయినపిదప అమాత్యులు జ్యేష్ఠునికి పట్టాభిషేకము చేయ సిద్ధపడిరి. "నాకు రాజ్యముతో పనిలేదు. నాతమ్మునకు

రాజ్యాభిషేకము చేయుడు" అని యతడు చెప్పెను. వా రెన్నిమారులు పట్టుపట్టి చెప్పినను అతడు వినలేదు. కనిష్ఠుడు రాజయిన పిదప నతడు తనకు ఐశ్వర్యముతో గాని అధికారముతో గాని పని లే దని చెప్పెను. అటు లయిన రుచ్యపదార్థములు భుజించుచు ఇక్కడనేయుండవలసిన దని వారు కోరిరి. ఈ నగరమున నా కేమియు పని లేదు అని యతడు వారాణసి విడిచి సరిహద్దు సీమలో గ్రామమునకు పోయి ఒకానొక శ్రేష్ఠిపరివారమున చేరి, స్వహస్తములతో పనిపాటులు చేయుచుండెను. అతడు రాజకుమారు డని వారికి కాలక్రమమున తెలిసెను. పని చేయనీక వా రతనిని రాజకుమారునివలె చూచుచు పోషించుచుండిరి.

కొంతకాలమునకు రాజోద్యోగులు భూములు కొలుచుటకై వచ్చిరి. శ్రేష్ఠి రాజకుమారునితో "స్వామీ, మీరు మాయింట నున్నారు. మీసోదరునకు వ్రాసి, మేము చెల్లింపవలసిన పన్నులు కొట్టివేయింపుడు" అని కోరెను. మంచి దని యతడు సోదరునకు జాబులో "నేను ఫలాని శ్రేష్ఠియింట నున్నాను. నన్నుబట్టి ఈయనపన్నులు తొలగింపవలెను" అని వ్రాసెను. రాజు మంచి దని అటులే చేసెను. అంతట గ్రామవాసులు జనపదవాసులును వచ్చి అతనితో "స్వామీ మేము తమకే పన్నులు చెల్లింతుము. రాజుగారికి కట్టవలసిన పన్నులు తొలగించి వేయుడు" అని విన్నవించిరి. ఆయన రాజునకు లేఖ వ్రాసి, అటులే చేయించెను. ఆయనకు లాభసత్కారములు హెచ్చుచున్న కొలదిని తృష్ణకూడ అతిశయించెను. గ్రామము, జనపదము, ఉపరాజపదవి కావలె నని క్రమముగా నతడు కోరెను. రాజు వాని నన్నింటిని అతని కొసగెను. తృష్ణ యింకను పెచ్చుటచే నతడు రాజ్యము గై కొన దలచి జనపదవాసులను వెంట బెట్టుకొని పోయి నగరద్వారము కడ నిలిచి "రాజ్యమిమ్ము; లేనిచో యుద్ధము చేయుము" అని సందేశమంపెను. రాజు యోచించి "ఈ మూర్ఖుడు తొలుత రాజ్యము వల దన్నాడు; ఆవల ఉపరాజపదవి వల దన్నాడు. ఇప్పుడు యుద్ధము చేసి రాజ్యము గై కొందు ననుచున్నాడు. యుద్ధములో వీనిని సంహరించితినేని నేను నిందపా లగుదును. నాకు రాజ్యముతో పనియేమి?" అనుకొని, "యుద్ధమనవసరము. రాజ్యము గైకొమ్ము" అని లేఖ వ్రాసి పంపెను. అతడు రాజ్యము స్వీకరించి తమ్ముని ఉపరాజును చేసెను. నాటినుండి అతనితృష్ణ మరింత హెచ్చిపోయెను. ఒకరాజ్యముతో తృప్తి నొందక అతడు రెండుమూడు రాజ్యములు కావలె నని తలపోయుచుండెను. ఆతని తృష్ణకు హద్దు లేకుండెను.

లోకమున నెవడు తలిదండ్రుల కుపచారములు చేయుచున్నారో, ఎవరు దానాదిపుణ్యకార్యము లొనరించుచున్నారో, ఎవరు తృష్ణకు వశీభూతు లగుచున్నారో కనుగొనదలచి, దేవరాజు శక్రుడు ఈ రాజును విలోకించెను. వీడు వారాణసీ రాజ్యముతో సంతృప్తి నొందకున్నాడు. వీనికి పాఠము నేర్పవలెను అనుకొని శక్రుడు విద్యార్థిరూపము ధరించి రాజద్వారముకడ నిలిచి, "ఉపాయకుశలు డగు బ్రహ్మచారి ద్వారముకడ నున్నా" డని లోనికి వార్త పంపెను. ప్రవేశపెట్టు డని రాజు ఆన తిచ్చినంతనే పరివార మతనిని ప్రవేశపెట్టిరి. మహారాజునకు జయ మని అత డన్నంతనే ఎందులకు వచ్చినావు అని రాజు ప్రశ్నించెను. "మహారాజా, మీతో కొంచెము విన్నవింపవలసి యున్నది. ఏకాంతము కావలెను" అని బ్రహ్మచారి పలికెను.

శక్రుని ప్రభావముచే జను లటనుండి వెడలిపోయిరి. "ధనధాన్యాదులతో, పౌరులతో, రథసైన్యాదులతో పరిపూర్ణము లయిన మూడు నగరములు నాకు గనబడుచున్నవి. నా ప్రభావముచే ఆ రాజ్యములను కైకొని సమర్పింతును. ఆలసింపక సైన్య మాయత్తము చేసి బయలుదేరవలెను" అని యాతడు పలికినంతనే లోభమునకు వశవర్తి యయినరాజు మంచి దనెను. నీ వెవరు, ఎక్కడనుండి వచ్చినావు, నీ కేమి కావలెను అని రా జాతని నడుగ లేదు. శక్రుడు త్రయస్త్రింశ భవనమునకు జనెను. అమాత్యులను బిలువనంపి రాజు వారితో "బ్రహ్మచారి నాకు మూడురాజ్యము లిత్తు నని చెప్పినాడు. మీరు అతనిని బిలిపించి, నగరమున దండోరా వేయించి, సైన్యము నాయత్తము చేయుడు. ఆలసింపక మూడురాజ్యములను కైకొందును" అని చెప్పెను.

"మహారాజా, తమ రా బ్రహ్మచారికి సత్కారము చేసితిరా? ఆయన నివాసమును గూర్చి అడిగితిరా?"

"సత్కరింప లేదు. నివాస మడుగ లేదు. మీరు పోయి ఆయనను కనుగొనుడు."

ఎంత వెదకినను ఆయన కనబడ లేదు. వా రీవార్త రాజునకు తెలిపిరి. ఆయన విచారము చెంది "మూడునగరముల రాజ్యములు పోవుచున్నవి. ఐశ్వర్యము నష్ట మగుచున్నది. తనను సత్కరింప లే దని ఆయన కోపించి వెడలిపోయి యుండును" అని తలపోయుచున్న రాజునకు విచారము హెచ్చెను. తృష్ణ వలన ఆతనియొడలు మండిపోవుచుండెను. తిన్నయన్నము ఒంట పట్టుట లేదు.

వైద్యులు చికిత్స చేయలేకుండిరి రాజునకు పీడ హెచ్చెను. ఈ వార్త నగరమున వ్యాపించెను.

ఆ సమయమున బోధిసత్త్వుడు సమస్తవిద్యలు నేర్చి తక్షశిలనుండి వారాణసిలో తలిదండ్రులకడకు వచ్చి, రాజువ్యాధినిగూర్చి విని, రాజద్వారము కడ కేగి, నేను వైద్యుడనని వార్త పంపెను. పరిజనులు "దేవా, బ్రహ్మచారి వచ్చి తమకు చికిత్స చేయుదు ననుచున్నాడు" అని విన్నవించిరి. "గొప్పగొప్పవైద్యులు చికిత్స చేయలేకున్నారు. ఈ తరుణ బ్రహ్మచారి యేమి చేయగలడు ? ఖర్చు లిచ్చి అతనిని పంపివేయుడు" అన్న రాజువాక్యాలు తెలిసికొని బ్రహ్మచారి "వైద్యము చేసినందులకు నాకు ధన మక్కరలేదు. మందులవెల యిచ్చిన చాలును" అని బదులు పంపెను. మంచి దని రాజాతనిని లోనికి బిలువనంపెను. బ్రహ్మచారి వచ్చి నమస్కరించి "మహారాజా, భయము లేదు. నేను చికిత్స చేయుదును. కాని మీరు నాకు రోగకారణము తెలుపవలెను" అనెను. రాజు సంకోచముతో "రోగ కారణ మేల ? ఔషధ మిమ్ము" అనెను. "మహారాజా, ఈ రోగ మీవిధముగా ప్రారంభ మయినది అని తెలిసికొని, దీని కిట్లు చికిత్స చేయవలెను అని వైద్యులు నిర్ణయించి తగినచికిత్స చేయుదురు" అని బ్రహ్మచారి వివరింపగా రాజు "మంచిది బాబా !" అని సమస్తము విశదము చేసి "రోగము తృష్ణవలన కలిగినది. చేతనైనచో చికిత్స చేయుము" అనెను.

"మహారాజా, చింతవలన నగరములు లభించునా ?" "లభింపవు బాబా !" "అట్లగుచో మహారాజా, యేల విచారపడుచున్నావు ? మీరు శరీరమును, సమస్త సజీవ నిర్జీవపదార్థములను విడిచి పోవలసియుండును. నాలుగునగరముల రాజ్యములు లభించినను, ఒక్కసారిగా నాలుగుపళ్ళెములు (ఆహారము) తినలేరు: ఒక్కసారిగా నాలుగు విడివిడి పక్కలమీద పండుకొనలేరు; ఒక్కసారిగా నాలుగుజతల వస్త్రములు కట్టుకొనలేరు; మీరు తృష్ణకు వశీభూతులు కారాదు. ఈ తృష్ణ వృద్ధి నొందినచో చతుర్విధ నరకములనుండి మిమ్ము విముక్తులను కానీయదు" అని బోధిసత్త్వుడు ధర్మోపదేశము చేసి ఈ గాథలు పలికెను :

భోగవాంఛలు కల యట్టిపురుషునకు
కోరినవి యన్నియును సమకూరునేని
మనవలయు శాంతవృత్తి సామానవుండు.

కోరినవి భోగికిన్ సమకూరునేని
ఆతపమునందు భూరిదాహమ్ము వోలె
కామవాంఛలు సర్వదా గాంచు వృద్ధి.

గోవునకైనను కొమ్ములు గలుగు
పశువునకైనను ప్రభవించినంత
తనువుతో శృంగముల్ పెను పొందురీతి
మూఢబుద్ధికి తృష్ణ ముమ్మరమ్మగును.

ధరణి నిండుగ శాలిధాన్యంబు యవలు
గోవులు మెండుగా ఘోటకంబులును
దాసీజనంబును దాసుల నొసగ
నేమాత్రమును తృప్తి యెవనికి లేదో,
తృష్ణాస్వరూపంబు తెలిసి యాతండు
సముచితవృత్తంబు సలుపంగవలయు.

బలిమిన్నె నిర్జించి ప్రభువు ధారుణిని
చేయుచుం బాలన సింధువుదాక
తృప్తి లే కావలితీరంబు గూడ
ఆక్రమించుటకున్నె ఆశింపగలడు.

ఎవడు భోగమ్ము స్మరించుచు నుండు
తృప్తి వానికి లభియింప దెన్నండు
గ్రహియించి ప్రాజ్ఞుండు కామాదిదుష్ట
విపరిణామంబున విరతిని బొంది
ప్రజ్ఞచే సంతృప్తి పడును నిక్కముగ.

ప్రజ్ఞచే తృప్తుండు పరమోత్తముండు
కామాదితప్తుండు కానేర డతడు,
ప్రాజ్ఞుండు తృష్ణకు వశవర్తి కాడు.
అల్పేచ్ఛువు నలోభి యగువాడు తుడుచు
వాంఛలన్నింటిని వార్ధి విశాలు
డైనను సుఖతృప్తి నందనే లేడు

ఖండించి చర్మంబు కాలిజోడులను
కల్పింగ ఆ చర్మకారునిభంగి,
వర్జించుకొలదిని వాంఛలు, సుఖము
జనియించు, పరిపూర్ణసౌఖ్యంబు గోర.
వాంఛ లన్నింటిని వర్జింపవలయు.

బోధిసత్త్వ డీగాథలు పలుకుచున్నపుడు రాజుదృష్టి శ్వేతచ్ఛత్రముపై కేంద్రీకృత మగుటచే శ్వేత - కసిణ - ధ్యాన ముత్పన్న మయ్యెను. రాజువ్యాధి తొలగిపోయెను. అతడు సంతుష్టచిత్తుడై శయ్యమీదినుండి లేచి "ఎందరో వైద్యులు చికిత్స చేయలేక పోయిరి. కాని పండితబ్రహ్మచారి తనజ్ఞానౌషధిచే నన్ను రోగవిముక్తుని చేసినాడు" అని ప్రియాలాపము లాడుచు ఈ గాథ పలికెను :

వేనకు వేలుగా విలువ కల్గినవి
పల్కుగాథలు మహాబ్రహ్మ యెన్మిదియు:
అష్టసహస్రమ్ము లంగీకరించు
భవదీయవాక్కు శుభప్రద మగును.

విని బోధిసత్త్వ డీగాథ పలికెను :

వేయితోడను పదివేలతో నైన
పని యేమియును లేదు : ప్రబలకామములు
నంతిమగాథతో నంత మొందినవి.

రాజు మిక్కిలి ప్రసన్నుడై బోధిసత్త్వుని ప్రశంసించి ఈగాథ పలికెను :

ఈమాణవకముని యెరిగినవాడు
సర్వంబు, శ్రేష్ఠుండు, సకలదుఃఖముల
కారణం బగు తృష్ణ కనుగొన్నవాడు.

"మహారాజా, అప్రమత్తుడవై ప్రవర్తింపుము" అని బోధిసత్త్వుడు ధర్మోపదేశము చేసి, ఆకాశమార్గమున హిమాలయము చేరి ఋషిప్రవ్రజ్య గావించి యావజ్జీవము బ్రహ్మవిహారములను భావించుచు తుదకు బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, పూర్వముకూడ నేను ఈవిధముగా ధర్మోపదేశము చేసి ఈ బ్రాహ్మణుని విగతశోకుని గావించితిని" అని జాతకము నరిపోల్చెను. ఆ కాలమున రాజు ఈ బ్రాహ్మణుడే: పండితబ్రహ్మచారి నేనే.

X

# 468. జనసంగ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోసలనరేశునకు ఉపదేశమిచ్చుటకై చెప్పినది.

## వర్తమాన కథ

ఒకప్పుడు రాజు ఐశ్వర్యమదమత్తుడై, కామభోగాసక్తుడై, న్యాయవిచారణము చేయక బుద్ధసేవకుకూడ పోవకుండెను; ఆయన కొకనాడు దశబలధారి జ్ఞప్తికి వచ్చెను; శాస్తకు ప్రణమిల్లుటకై రాజు పెందలకడనే భోజనము చేసి ఉత్తమరథమెక్కి విహారమునకు జని శాస్తకు ప్రణమిల్లి ఒక ప్రక్కన తిరుగుచుండెను.

"మహారాజా, ఏర్ద మేమి? కనబడి చాలకాల మయినది" అని శాస్త పలికెను. "భన్తే, కార్యభారముచేత బుద్ధసేవకై వచ్చుటకు అవకాశము లేకపోయినది."

"మహారాజా, ఉపదేశకుడు సర్వజ్ఞుడగు బుద్ధుడు స్థిరరూపమున విహారమున నివసించుచుండగా నీవు ప్రమత్తుడవగుట ఉచితము. రాజు రాజ్యములందు అప్రమత్తుడై యుండవలెను. రాష్ట్రములోని ప్రజలకు రాజు తల్లివలె తండ్రివలె నుండవలెను. నాలుగు అగతులలో పడక, దశరాజధర్మములకు విరుద్ధముగా ప్రవర్తింపక, పరిపాలన చేయవలెను. రాజు ధార్మికు డయినపిదప ఆతనిపరిషత్తుకూడ ధార్మిక మగును. నీవు నాయనుశాసనమున ధర్మానుసారముగా పరిపాలన చేయు పక్షమున ఆశ్చర్య ముండదు. పూర్వకాలమున అనుశాసకులగు నాచార్యులు లేకున్నను పండితులు స్వబుద్ధిచే త్రివిధ సుచరిత్ర ధర్మమునందు ప్రతిష్ఠితులై లోకులకు ధర్మోపదేశములు చేయుచు పరిషత్తులోకూడ స్వర్గము చేరిరి" అని, అతని ప్రార్థనపై శాస్త పూర్వజన్మకథ చెప్పెను :

## అతీతకథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు బోధిసత్త్వుడు పట్టపుదేవి కడుపున పుట్టినాడు. అతనికి జనసంధకుమారు డని పేరు

పెట్టిరి. ఆతడు పెరిగి పెద్దవాడై తక్షశిలకు జని సమస్తవిద్య లభ్యసించి మరలి వచ్చిన పిదప రాజు చెరసాలలనుండి ఎల్లరను విడిపించి కుమారుని ఉపరాజును చేసెను. కాలక్రమమున తండ్రి గతించినపిదప ఆతడు ప్రభువై నగరద్వారముల నాల్గింటికడను, నగరమధ్యమునను, రాజద్వారముకడను ఆరుదానశాలలు నిర్మించి ప్రతిదినము ఆరులక్షలమందికి దానము లిచ్చి, సమస్త జంబూద్వీపము మారు మ్రోగునట్లు మహాదానము ప్రారంభించెను. ఆతడు చెరసాలల నన్నిటిని ఒక్కమారుగా తెరపించి పశువధ చేయు ప్రదేశములను నిర్మూలనము కావించెను. ఆతడు చారులు గ్రహించువిషయముల ద్వారా లోకులతో వ్యవహరించుచు పంచశీలముల పాలనము చేయుచు ఉపోసథవ్రతము పాటించుచు ధర్మానుసారముగా రాజ్యము చేయ జొచ్చెను. నడుమనడుమ ఆతడు రాష్ట్ర ప్రజలను సమావేశ పరచుచు, వారి కుపదేశము లిచ్చుచు లోకమును శీలవంతము చేయుచుండెను. "దానధర్మములు చేయుడు, సదాచారులు కండు, ధర్మానుసారముగా మీమీపనులను, వ్యాపారములను నడపుడు; చిన్నతనమునుండియు విద్య లభ్యసింపుడు; ధనార్జనము చేయుడు; అనృత సాక్ష్యము మొదలగుపనులు చేయవలదు. కుక్కలు కావలదు, ప్రచండస్వభావులు కఠోరులు కావలదు. తలిదండ్రులసేవలు చేయుడు, పెద్దల నాదరింపుడు" అని ఆతనియుపదేశములు. ఒకపూర్ణిమనాడు ఉపోసథవ్రతధారణ చేసి లోకులకు అధికతర కల్యాణము సమకూర్ప నెంచి వారల నప్రమత్తులచేయ నెంచి ధర్మోపదేశము చేయుకోర్కెతో నగరమున చాట బంచి, రాజివాసము మొదలు నగరవాసులను సమావేశ పరచెను. రాజప్రాంగణమున రత్ననిర్మితమై అలంకృతమైనమంటపము క్రింద ఏర్పరచిన పీఠముపై కూరుచుండి "నగరవాసులారా, బాధించు ధర్మములను, బాధింపని ధర్మములను మీ కుపదేశింతును. అప్రమత్తులై చెవి యొగ్గి శ్రద్ధతో వినుడు" అని ప్రారంభించెను.

శాస్త సత్యపూత మగు ముఖరత్నమును తెరిచి కోసలనరేశుని సూచనపై మధురస్వరమున ఈ గాథలు పలికెను :

ప్రభు జనసంఘుండు పలికినా డిట్లు
ప్రథమమ్మునందు ఈ పది చేయకున్న
తప్పుగుపో అనుతాపంబు మిగుల.

ఆదిలో ధనసంగ్రహంబు కావింప
కుంటచే లేవడి నొందుచు తుదకు
బహుళపశ్చాత్తాప భరితు డౌ నరుడు,

ఆదిలో శక్తియున్నప్పుడే విద్య
నభ్యసింపక యెట్టిదైనను తుదకు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

త్రాసువాడను నేను దొంగతూనికను
బాడీలు చెప్పెడివాడను నేను
చండకఠోర భావుండ నే ననుచు
బహుళపశ్చాత్తాపభరితుడౌ నరుడు.

ఆదిలో నే ప్రాణిహంతను, దుష్ట
మానసుండను, దయాహీనుండ ననుచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

అపరిగృహీత లైనట్టిభామినులు
ఉన్నను నా కెంద, రుచితము మాని
పరభామినులవెంట బడినాడ ననుచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

అన్నోదకములు నా కధికంబు గానె
యున్నను దానంబు లొసగలే దనుచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

నాకు విశేషధనంబు కల్గియును
తల్లిదండ్రులను నెంతయు వృద్ధులైన
వారిని పోషింప నేర నటంచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

అనుశాసకుండు, నాకాచార్యు, డన్ని
వాంఛలు నెరవేర్చువాడు నాతండ్రి:
ఇట్టివానిని గౌరవింప నటంచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

శ్రమణులు బ్రాహ్మణుల్ సద్వర్తనులను
పండితజనుల నుపాసింప ననుచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

శాంతులు తాపసుల్ సజ్జనుల్, వారి
సేవలు కల్యాణసిద్ధి దాయకము
లవ్వారిసేవ చేయగ న్నైతి నడుచు
బహుళపశ్చాత్తాప భరితుడౌ నరుడు.

సలుపుచుండు నెవండు శ్రద్ధతో వీని
నాతండు కృతకృత్యు డగు యథార్థముగ
ఆతని కుండబో దనుతాపబాధ.

ఈ విధముగా పక్షమువరకును ఉపదేశ మిచ్చెను. లోకు లాయుపదేశాను సారముగా ప్రవర్తించుచు తుదకు స్వర్గగాము లయిరి.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి, "మహారాజా, ఈ ప్రకారముగా పూర్వ కాలమున పండితులు ఆచార్య రహిత మైనను తమబుద్ధిబలముచే ధర్మోపదేశ మిచ్చిలోకులను స్వర్గగాములుగా సిద్ధము చేసిరి" అని జాతకములు సరిపోల్చెను.

"ఆ కాలమున పండితపరిషత్తు, ఇప్పటిబుద్ధపరిషత్తు; జనసంధరాజు నేనే.

o

# 463. సుపారక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు లోకకల్యాణమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు భిక్షువులు ధర్మసభలో గూరుచుండి దశబలధారికి గల పరోపకార తత్పరత్వమును కొనియాడుచుండిరి. "ఆయుష్మంతులారా, శాస్త లోకహితములో మగ్నులై, తమవిశ్రాంతిని గూడ విడిచి స్వయముగా సమ్యక్సంబుద్ధి పొందియు పాత్రలు చీవరములు పట్టుకొని 18 యోజనములు దూరము చని, పంచవర్గీయ స్థవిరులకు ధర్మోపదేశము చేసి పక్షమున పంచమినాడు అనాత్మలక్షణము నుపదేశించి ఎల్లరకు అర్హత్వము కలిగించి, ఉరువేలవనమునకు జని 3500 మంది జటిలతపస్వులకు ప్రాతిహార్యము చూపి ప్రవ్రజింప జేసి గయాశీర్ష పర్వతమున "ఆదిత్యపర్యాయ" సూత్రము నుపదేశించి, 1000 మంది జటిలులకు అర్హత్వ మొసగి మూడగవ్యూతు లెదురు పోయి మహాకాశ్యపునకు స్వాగతము పలికి, అతనికి మూడు ఉపదేశము లిచ్చి భోజనానంతరము ఒంటిగా 45 యోజనములు వెళ్ళి పుక్కుసాతోడి కులపుత్రునకు అనాగామిఫల మొసగి, మహాకప్పిననకు 120 యోజనములు చని - అర్హత్వ మొసగి, భోజనానంతరము ఒంటిగా 30 యోజనములు చని మహాచండు డయిన అంగుళిమాలకు అర్హత్వ మొసగి, 30 యోజనములు చని ఆలవకునకు స్రోతాపత్తిఫల మొసగి, కుమారునకు కల్యాణ మొసగి, త్రయస్త్రింశ భవనమున 3 మాసము లున్నప్పుడు 80 కోట్ల దేవతలకు ధర్మజ్ఞానము కరపి, బ్రహ్మలోకము చని బ్రహ్మకు మిథ్యాదృష్టి తొలగించి 10,000 మంది బ్రాహ్మణులకు అర్హత్వ మొసగెను. ఆయన ప్రతివత్సరము మూడుమండలములుగ పర్యటనము చేయుచు తగినజనులకు శరణములు, శీలములు, మార్గ ఫలము నిచ్చుచున్నారు. ఆయన నాగ, గరుడ ప్రభృతులకు వివిధోపకారములు చేయుచున్నారు" అనుచుండిరి. శాస్త అచ్చటి కరుదెంచి, విషయము గ్రహించి "భిక్షువులారా, ఇందులో నాశ్చర్యము లేదు. ఇప్పుడు నేను బుద్ధత్వమును పొంది, లోక కల్యాణము చేయుచున్న నన్నుటలో ఆశ్చర్య మేమియు లేదు. నేను పూర్వ

జన్మమున రాగముక్తుడనై ఉన్నపుడుకూడ లోకకల్యాణము చేయుచుంటిని" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము కాశ్యప సమ్యక్ సంబుద్ధుని కాలమున కుశీనరు డను రాజు పరిపాలనచేయుచుండెను. కాశ్యపుని చతుస్సత్యోపదేశముచే జనులు బంధనవిముక్తులై నిర్వాణనగరమున ప్రవేశించిన తరువాత బహుకాలమునకు బుద్ధశాసనపతన మేర్పడెను. భిక్షువులు ఇరువదియొక్క విధముల అనుచితోపాయము లవలంబించి జీవనార్థము సంపాదన చేయజొచ్చిరి. భిక్షుణులకు సంసర్గము చేసి పుత్రీపుత్రులను పోషింపజొచ్చిరి. భిక్షువులు భిక్షుధర్మమును, భిక్షుణులు భిక్షుణీధర్మమును, ఉపాసకులు ఉపాసకధర్మమును, ఉపాసికలు ఉపాసికాధర్మమును, బ్రాహ్మణులు బ్రాహ్మణధర్మమును విడనాడి లోకులలో ననేకులు 'దశఅకుశల' కర్మలు చేయసాగిరి. మృతి నొందినవారు నరకగాము లైరి. నూతనదేవపుత్రులను గానక దేవరాజు శక్రుడు మానవలోకము వైపు దృష్టి మరల్పగా జనులు నరకమున నుద్భవించుచున్నట్లు గోచరించెను. శాస్త్రశాసనము పతన మయ్యె నని తెలిసికొని శక్రుడు తనలో "ఏమి చేయుదును?" అనుకొనగా ఉపాయము తోచినది. లోకులను బెదరించి భయపెట్టి వారు భయభ్రాంతు లైనట్లు తోచిన పిదప వారల నూరడించుచు ధర్మోపదేశము చేయవలెను. అధఃపతన మైనబుద్ధశాసనమును వేయిసంవత్సరముల వరకు ప్రచారములో నుండునట్లు పైకెత్తవలెను. ఇట్లు నిశ్చయించుకొని ఆయన మాతలిని నల్లని కుక్కగా మార్చెను. దానికి నాలుగుపెద్దకోరలనుండి కాంతులు వెలువడుచుండెను. దానిని చూచినంతనే గర్భిణులకు గర్భపాత మగునంతభయంకరముగా, మంచివంగనము గల గుర్రమంత యెత్తుగా నుండెను. అతడు దాని శరీరమున ఐదుచోట్ల ఐదుకట్లు కట్టి ఎర్రనిపూదండలు వేసి త్రాటికొన తనచేత పట్టుకొని రెండు కాషాయవస్త్రములను వెంట్రుకలవెనుక కట్టి రక్తపుష్పమాలికలు ధరించి, ప్రవాళవర్ణము గల త్రాడు కట్టిన ధనుస్సు పట్టుకొని, వజ్రమువలె కొనలు గల బాణములను వేళ్ళపై త్రిప్పుచు వ్యాధవేషమున నగరమునకు యోజనదూరమున నేలపై దిగెను. "లోకము నశించిపోవుచున్నది" అని మూడుసార్లు కేకవేయగా లోకులు భయభ్రాంతు లైరి. ఆవల నాతడు నగరము చేరి వెనుకటివలె కేక వేసెను. జనులు శునకమును చూచి భీతి చెంది రాజున కీసమాచారము తెలిపిరి. రాజు శీఘ్రముగా నగర ద్వారములను మూయించెను. శక్రుడు వదునెనిమిదిమూరల యెత్తు

గల గోడ కుక్కతో గూడ భూమికి నగరమున ప్రవేశించెను. జనులు ప్రాణభీతిచే పరుగెత్తి తమతమయిళ్ళలో దూరి తలుపులు మూసికొనిరి. మార్గమున కానబడిన వారి నెల్ల కృష్ణశునకము వెంట నంటి భయపెట్ట సాగెను. ఈ విధముగా వారు రాజ భవనము చేరిరి. ప్రాంగణమున నున్నవారు ప్రాణభయముచే రాజభవనములోనికి పరుగెత్తి తలుపులు మూసిరి. ఉశీనర ప్రభువు గూడ రాణివాసమును వెంట గొని మేడయెక్కెను. మహాకృష్ణశునకము ముందుకాలు పైకెత్తి తలుపురెక్కపై నుంచి గట్టిగా మొరగెను. ఆ ధ్వని క్రింది అవీచీనరకము వరకును, పైన భవాగ్రమువరకును వ్యాపించెను. చక్రవాళ మంతయు ఒకేధ్వని అయ్యెను. (పున్నకజాతకములో పున్నక రాజధ్వనియు, భూరిదత్తజాతకమున సుదస్సన నాగరాజ శబ్దమును ఈ మహాకృష్ణజాతకమున శునకశబ్దము ఈ మూడుధ్వనులు జంబూద్వీపమున మహాశబ్దముగా పరిణమించినవి.) జనులు శక్రునితో మాటాడుటకుగూడ శక్తి లేనంత భయభ్రాంతులైరి. రాజుమాత్రము స్థైర్యమువహించి శాంతముగా ద్వారము తెరచి శక్రుని సంబోధించి "వ్యాధా, నీకుక్క ఏల మొరిగినది ?" అనెను.

"ఆకలి గొనుటచే."

"అట్లైన దీనికి భోజనము పెట్టించెద" నని రాజు తనకును, భవనములోని వారికిని వండిన యాహారపదార్థములను తెప్పించి పెట్టించెను. కుక్క ఒక్కపట్టున వాటిని భక్షించి మరల మొరగసాగెను. రాజు మరల ప్రశ్నింపగా "నాకుక్కకు ఆకలి తీరలే" దని వ్యాధుడు సమాధాన మిచ్చినంతనే రాజు హస్తి మొదలగు వానికి సిద్ధము చేయించిన ఆహారపదార్థములను కుక్కకు పెట్టించెను. శునకము వానిని ఒక్కపట్టున భక్షింపగా, నగరమున వండిన యాహార మంతయు తెప్పించి కుక్కకు పెట్టించెను. దానిని గూడ శునకము ఒక్కపట్టున భక్షించి 'భౌభౌ' ధ్వని చేయసాగెను. రాజు చూచి "ఇది కుక్క కాదు, యక్షుడు. దీనిని కొనివచ్చుటకు కారణ మడిగెద" ననుకొని బెదరుతో ప్రశ్నించువాడై ఈ గాథ పలికెను:

కాలవర్ణంబుతో కడుభీకరంబు,
పంచప్రదేశాలబద్ధంబు ప్రాట,
తెల్లదంతాలతో ధీర, యీకుక్క
బహుళతేజశ్శాలి భవదీయ మగున ?

విని శక్రు డీగాథ పలికెను :

ఇది జంతువులకోసమె యుదయింపలేదు
జనములకును హాని జరుగుచున్నపుడు
ఓడసీనర, కృష్ణ ఉన్మత్త మగును

అంతట రాజు "వ్యాఘ్రా, రణ నీకుక్క అందరిమాంసము తినునా ? లేక నీశత్రువుల మాంసమే తినునా ?" అనెను.

"మహారాజా, శత్రువుల మాంసమే."

"నీశత్రువు లెవరు ?"

"మహారాజా, అధర్మనిరతు లగువారు, అధర్మచరణులు."

"వారిని మాకు చూపగలవా ?"

దేవరాజు అట్టివారిని చూపువాడై యీ గాథలు పలికెను :

తల ముండితము చేసి, ఆల్చి చీవరము
కేల భిక్షాపాత్ర గీలించునట్టి
శ్రమణుండు హలముతో కృషి చేయుచున్నపుడు
ఓడసీనర, కృష్ణ ఉన్మత్త మగును.

తల ముండితము చేసి ఆల్చి చీవరము
కేల భిక్షాపాత్ర గీలించునట్టి
శ్రమణతపస్వి సంసారి యైనపుడు
ఓడసీనర, కృష్ణ ఉన్మత్త మగును.

జడలలో పొడవైన శ్మశ్రువుతోడ
మలినమ్ములౌ దంతములతోడ శఠుడు
వడ్డితో అప్పుపై బ్రదుకుచున్నపుడు
ఓడసీనర, కృష్ణ ఉన్మత్త మగును.

వేదంబు శ్రోతంబు విప్రుడు నేర్చి
గ్రహియించి భృతి యజ్ఞకార్యంబు చేయ
ఓడసీనర, కృష్ణ ఉన్మత్త మగును.

ధన మున్నమనుజుండు తలిదండ్రు లైన
వృద్ధులయెడల నశ్రద్ధ వహించి

ఎట్టిపోషణ తలపెట్టని యపుడు
ఓడసీనర, కృష్ణ డున్మక్త యగును.

మూర్ఖులు మీ రని ముదుసలితల్లి
దండ్రుల దూషించు తరుణమ్మునందు
ఓఉసీనర, కృష్ణ ఉన్మక్త యగును.

మేనత్తకడకును, మిత్రునిభార్య
కడకును, గురుపత్నికడకును నరుడు
సద్బుద్ధి కోల్పోయి చనుచున్నయపుడు
ఓఉసీనర, కృష్ణ ఉన్మక్త యగును.

డాలును ఖడ్గంబు దాలిచి, జన్ని
గట్టు త్రోవలు దోచుకాలంబునందు
ఓడసీనర, కృష్ణ ఉన్మక్త మగును.

లావుచేతులు కోమలం బగుచర్మ
మున్నట్టి ధనికు డయోగ్యనారులను
గూడి యావల విడనాడెడి వేళ
ఓఉసీనర, కృష్ణ ఉన్మక్త యగును.

అశుభచింతకులు మాయావులు మిగుల
వంచకుల్ లోకాన వర్తించు నపుడు
ఓడసీనర, కృష్ణ ఉన్మక్త యగును.

ఇట్లు పలికి అతడు "మహారాజా, వీరు నాశత్రువులు" కుక్కా అధర్మ మాచరించువానిని మ్రింగివేయు" నని సూచించెను. ఆవల జనసమూహము భయభ్రాంతమైనపిదప మెడ నున్న త్రాటిని లాగి కుక్కను కూర్చుండబెట్టి, వేటగాని వేషమును వీడి నిజశక్తిచే ఆకసమునకు తళుక్కు మని ఎగిరి "మహారాజా, నేను దేవేంద్ర శక్రుడను. ఈ లోకము చెడిపోవు నని తెలియవచ్చినది. ఇపుడు చనిపోయిన వారు అధర్మాచరణు లగుటచే నరకమునకు పోవుచున్నారు. దేవలోకము ఇంచుమించుగా ఖాళీ అయినది. ఇకనుండి అధర్మచారుల వర్తన మెట్లుండునో చూచెదను. నీవు అప్రమత్తుడవై యుండుము." అని జ్ఞప్తియందుంచుకొన దగిన నాలుగు త్తమగాథలద్వారా ధర్మోపదేశము చేసి, మానవులకు ధర్మశీలము ప్రతి

ష్ఠించి, పతనోన్ముఖ మగుబుద్ధశాసనమును మరి వేయిసంవత్సరముల వరకు నిలిచి యుండునట్లు ప్రతిష్ఠించి, మాతలిని వెంట గొని నిజనివాసస్థానమునకు జనెను.

శాస్త ఈ ధర్మోపదేశము గావించి "భిక్షువులారా, నేను పూర్వమే లోక కల్యాణము చేసితిని." అని జాతకమును సరిపోల్చెను. ఆ కాలమున మాతలి ఆనందుడు; శక్రుడు నేనే.

—o—

## 470. కోసియ జాతకము

ఈ జాతకము సుధాభోజన జాతకమున (535) వచ్చును.

## 471. మెండక జాతకము

ఈ జాతకము పంచ-ఉమ్మగ్గ జాతక (546) మున వచ్చును.

—o—

# 472. మహాపదుమ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు చించా మాణవికను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

తథాగతుడు ప్రప్రథమమున బుద్ధత్వము పొందినపుడు ఆర్యభూములలో దేవమానవ శిష్యు లనేకులు లభించిరి. ఆయనగుణఖ్యాతి వ్యాపించుటచే సత్కారాదులు వృద్ధి పొందినవి. సూర్యోదయ మయినంతనే మిణుగురుల కాంతి మందగించి నట్లు తైర్థికులస్థితి మందగించెను. తమకు లాభసత్కారములు నష్ట మయినపుడు వారు గల్లీలలో గుమి గూడి పౌరజనులను సంబోధించి, "శ్రమణగౌతముడే బుద్ధుడా, మేము కామా? ఆయనకు దానాదులు చేసినంతనే మహాఫలము కలుగునా, మా కిచ్చిన కలుగదా? కావున మాకుగూడ దానధర్మములు చేయుడు" అని చెప్ప సాగిరి. వా రెంత యాచించినను ఎవ్వరును దానము చేయరైరి. అప్పుడు వారు రహస్యముగా నొకచో జేరి, శ్రమణగౌతమునకు చెడ్డపేరు వచ్చుటకును, ఆయన లాభసత్కారములు నష్ట మగుటకును ఏమి చేయవలెనని యోజించిరి.

ఆ కాలమున శ్రావస్తిలో చించా మాణవిక అను పరివ్రాజిక యుండెను. ఆమె చాలచక్కనిది. దేవస్త్రీలతో సమానమైనది. ఆమెశరీరమునుండి లావణ్యము వెలువడుచుండును. ఒకానొక వజ్రహృదయుడు ఇట్లాలోచన చెప్పెను: "శ్రమణ గౌతమునకును మాణవికకును సంబంధము కలదని నింద మోపి, ఆయనలాభ సత్కారములను పోగొట్టుదము." ఇది మంచియుపాయ మని అందరు నంగీకరించిరి. మాణవిక తైర్థికుల విహారమునకు వచ్చి ప్రణామము చేసి నిలుచుండెను. వా రామెతో మాటలాడలేదు. ఆమె వారితో "ఆర్యులారా, నేను ముమ్మారు ప్రణామము చేసినను మీరు నాతో మాటాడ లేదు. నావలన దోష మేమి?" అని యడిగెను.

"సోదరీ, శ్రమణగౌతముడు మాకు శ్రమ యిచ్చుచున్నాడు. మాలాభసత్కారములు నష్టపరచుచు విహరించుచున్నాడు. నీకు తెలియదా?"

"ఆర్యులారా, తెలియదు. అయినను ఈ విషయమున నే నేమి చేయగలను?"

"సోదరీ, మేము సుఖముగా నుండుట నీవు చూడ దలచితివేని, శ్రమణ గౌతమునితో నీకు సంబంధము కలదని నింద మోపి, అతనిలాభసత్కారములు నాశము చేయవలెను."

"ఆర్యులారా, మంచిది. ఇక భారము నాది. మీరు విచారింప వలదు" అని చెప్పి మాణవిక వెడలెను.

మాణవిక స్త్రీమాయలలో నేర్పరి. శ్రావస్తీవాసులు జేతవనమున ధర్మోపదేశము విని, వెలువడు సమయమునకు మాణవిక రంగులవస్త్రము ధరించి, గంధమాల్యాదులు పట్టుకొని జేతవనమువైపు పోవుచుండెడిది. ఎవ రైనను "ఈ వేళ ఎచ్చటికి పోవుచున్నావు" అని అడిగినచో "మీ కెందులకు ? నాయిచ్చ వచ్చిన చోటికి పోవుదును" అనెడిది. ఆమె జేతవనసమీపమున తైర్థికారామమున రాత్రియంతయు గడిపి, ప్రాతఃకాలమున 'ఉత్తమవందనీయునకు వందనముచేసి వత్తము' అని నగరమునుండి బయలుదేరు ఉపాసకులకు ఎదురుపడి, జేతవనమున రేయి గడపి వచ్చుదానివలె కనబడెడిది. "నీ వెచ్చట నున్నావు ?" అని ఎవరైన అడిగినచో "నా నివాసముతో మీ కేమి పని ?" అనుచుండెడిది. ఈ విధముగా రమారమి మాసమునపైగా ప్రవర్తించుచు, జనులు తన్ను ప్రశ్నించునప్పుడు "జేతవనమున శ్రమణగౌతమునితో గంధకుటిలో ఒంటిగా నుందును" అని చెప్పసాగినది. ఈ విషయము సత్యమా, అసత్యమా అనుసందేహము సామాన్యజనులకు కలుగ జేసినది. ఆవల మూడునాలుగు మాసములపాటు పాతగుడ్డపేలికలు కడుపుమీద కట్టుకొని గర్భవతివలె నటించుచు పైన ఎర్రనివస్త్రము కప్పుకొనెడిది. తనకు శ్రమణగౌతముని వలన గర్భము వచ్చినట్లు మూర్ఖులకు విశ్వాసము కలిగించెడిది. ఇట్లు తొమ్మిదిమాసములు గడచినపిదప మాణవిక కడుపుమీద కొయ్యచట్టము కట్టుకొని పైన ఎర్రనివస్త్రము కప్పుకొని మిక్కిలి బడలినదానివలె నడచుచు సాయంకాలము జేతవనములో ధర్మసభకు పోయెను. అచట అలంకృత ధర్మాసనమున గూరుచుండి తథాగతుడు ధర్మోపదేశము చేయుచుండెను. మాణవిక అచ్చటికి పోయి చంద్రునిపై బురద చల్లురీతిని మెలగుచు, పరిషన్మధ్యమున నున్న తథాగతుని యెదుటికి పోయి నిందించుచు, "మహాశ్రమణా, నీవు లోకుల కుపదేశముమాత్ర మిత్తువు. నీవాక్కు మధుర మైనది. దంతములు మిలమిలలాడుచుండును. నేను నీవలన గర్భము ధరించి నిండుచూలాల నైతిని. నీవు నాకొరకు ప్రసూతిగృహాదులు ఏర్పాటు చేయదలచితివో తలపవో తెలియదు. స్వయముగా చేయవేని నీపరి

జనునిచేతనో, కోసల నరేశునిచేతనో, అనాథ పిండకునిచేతనో, మహాఉపాసిక విశాఖచేతనో యీ బాలకు కావలసిన యేర్పాటు చేయింపుము. నీకు రమించుట తెలియును. కాని పురుడు పోయించుట తెలియదు!" అనెను.

తథాగతుడు ధర్మసభ నాపి, "సోదరీ, నీవు పలికినది సత్యమో అసత్యమో నాకును నీకును తెలియును" అని సింహగర్జనము చేసెను.

"అవును శ్రమణా, నీతెలివితో నాతెలివితో ఇది జరిగినది."

ఆ సమయమున శక్రునిపీఠము వేడి యెక్కెను. చించామాణవిక తథాగతునిపై అసత్యారోపణము చేసినదని గ్రహించి దానిని పరీక్షించుటకై నలుగురు దేవపుత్రులతో శక్రుడు ధర్మసభకు వచ్చెను. వారు నలుగురు నాలుగు చుంచుపిల్లల రూపములు ధరించిరి. మాణవిక పొట్టపై కట్టిన కొయ్యచట్టపు త్రాడు నాలుగువైపులను చుంచులు కటకటన కొరికినవి. గాలివలన ఆమె కప్పుకొన్న వస్త్రము తొలగెను. తోడనే కొయ్యచట్ట మామెపాదములపై బడగా, కాలివ్రేళ్ళు తెగిపోయినవి. జను లామెనెత్తిపై నుమిసి, మట్టిబెడ్డలు విసిరి, కర్రతో కొట్టుచు, జేతవనమునుండి యావలకు నెట్టుచు "దౌర్భాగ్యురాలా, సమ్యక్ సంబుద్ధునిపై దోషారోపణము చేయుచున్నావా?" అని తిట్టిరి. ఆమె తథాగతుని చూపుమేర దాటి పోయినంతనే పాదముల క్రింది భూమి విచ్చుకొని, అవీచీనరకమునుండి అగ్నిజ్వాలలు బయలుదేరెను, ఆమె వానితో గూడి అవీచీనరకమున బడెను.

అన్యతైర్థికులకు లాభసత్కారములు కట్టుపడిపోయినవి. దశబలధారికి లాభసత్కారములు హెచ్చెను. మరునాడు ధర్మసభలో భిక్షువులు "ఆయుష్మంతులారా, మహాగుణవంతుడై అగ్రపూజ్యుడైన సమ్యక్ సంబుద్ధునిపై చించామాణవిక మిథ్యావాదము మోపి వినాశము పొందినది" అనుచుండగా శాస్త అచటికి జని ఏమి సంభాషించుచున్నారని యడిగెను. వారు ఫలాని విషయమని చెప్పిరి. అప్పుడు శాస్త "భిక్షువులారా, ఈమె ఇప్పుడే కాదు, పూర్వముకూడ నాపై దోషారోపణము చేసి, వినాశము చెందినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండ, బోధిసత్త్వుడాయన పట్టపురాణి కడుపున పుట్టెను. శిశువుముఖకాంతి పద్మకాంతితో సమాన

ముగా నుండుటచే నతనికి పద్మకుమారు డని పేరు పెట్టిరి. అతడు పెరిగి పెద్దవా డయినపిదప, అన్నివిద్యలు నేర్చెను. అవల నతనితల్లి చనిపోయెను. రాజు మరల పెండ్లి చేసికొని, ఆమెను పట్టపురాణిని చేసి, కుమారుని ఉపరాజును చేసెను.

కొంతకాలమునకు రాష్ట్రములో నుప్పతిల్లిన తిరుగుబాటు నణచుటకు బయలు దేరుచు, "భద్రే, నీ విచట నుండుము. నేను పోయి తిరుగుబాటు నణచి వచ్చెదను" అని పలికెను. రాణి "దేవా, నేను ఒంటిగా నిచట నుండజాలను. మీవెంట వత్తు" ననెను. యుద్ధప్రాంతములోని యాపదలను వివరించి రాజు "నేను వచ్చువరకును నీవు నిశ్చింతముగా నుండుము. ఆలసింపక నీకు ఉపచారములు చేయుటకై పద్మకుమారుని నియోగించి పోవుచున్నాను" అని వెడలెను.

దండయాత్ర చేసి రాజు శత్రులను పారద్రోలి జనపదమును శాంతపరచి మరలి వచ్చి నగరమువెలుపల విడిసెను. తండ్రి మరలి వచ్చినవార్త తెలియగానే బోధిసత్త్వుడు నగరమలంకరింప జేసి, రాజభవనము పరిష్కృతము కావించుటకై రాణికడకు జనెను. ఆమె యతనిరూపమునకు ముగ్ధురా లయ్యెను. బోధిసత్త్వు డామెకు నమస్కరించి "అమ్మా, నీకు నే నేమి సేవ చేయుదును?" అనగా రాణి "నీవు నన్ను అమ్మా అనుచున్నావా!" అని అతనిని చేతితో పట్టుకొని "శయ్యమీదికి రమ్ము" అనెను. "ఏమి చేయుదును!" "రాజు వచ్చువరకును మనము క్రీడింతము." "నీవు నాకు తల్లివి. స్వామినివి. పెండ్లి యయిన వనితను నేను కన్నెత్తి చూడలేదు. నీతో నికృష్టకార్య మెట్లు చేయుదును?" ఆమె రెండుమూడు సారులు కోరినను ఆతడు వినలేదు. అప్పు డామె "నామాట వినవా?" అనెను. "వినను." "అయినచో రాజుతో జెప్పి నీశిరస్సు ఖండింపజేసెదను" అని యామె బెదరించెను. "నీ యిష్టము వచ్చినది చేయింపవచ్చును" అని బోధిసత్త్వు డామెను సిగ్గుపాలు చేసి వెడలిపోయెను.

అవల నామె "ఇతడు ముందుగా పోయి యీసంగతి రాజుతో చెప్పినచో నాప్రాణములు దక్కవు. నేనే ముందుగా జెప్పెదను" అనుకొని భోజనము మాని మాసినపాతబట్టలు కట్టుకొని గోళ్ళతో నొడలిపై గీరుకొని, రాణి యెక్కడ అని రాజు ప్రశ్నించినచో జబ్బుగా నున్నదని చెప్పవలె నని పరిచారికల కాన తిచ్చి రోగగ్రస్తురాలివలె పండుకొనెను. రాజు నగరప్రదక్షిణము చేసి, అంతఃపురములోనికి వచ్చి రాణి యెక్కడ అని విచారింపగా, జబ్బుగా నున్న దని సమాధానము వచ్చెను. అంతట రాజు శయనాగారమునకు పోయి రాణిని రెండుమూడుసారులు

"దేవీ, జబ్బుగా నున్నావా ?" అని ప్రశ్నింపగా, "చెప్పుట కేమున్నది ? మౌన మవలంబింపవలెను. ప్రాభవము కల నావంటిస్త్రీకే ఇట్లయినప్పుడు ఇతరులసంగతి యేమనవలెను ?" "ఎవనివలన నీకీబాధ కలిగెను ? చెప్పుము, వానిశిరస్సు ఖండించెదను !" "మహారాజా, మీరు నగర మెవరికి సమర్పించి పోయినారు ?" "పద్మకుమారునకు." "అతడు నానివాసమునకు వచ్చినాడు. నేను నీకు తల్లిని, ఇట్లు చేయరాదు అని చెప్పినాను. నాకంటె రాజెవడు ? శయనాగారముననే నీతో రమింతును అన్నాడు. నేను వలదనుచున్నాను. నాశిరసు పట్టుకొని ఇటు నటు లాగినాడు. తనమాట వినకపోవుటచే నన్ను మోదినాడు"

రాజు విషసర్పమువలె బుస కొట్టుచు విచారణ చేయకుండనే పద్మకుమారుని బంధించి తీసికొని రండు అని భటుల కాన తిచ్చెను. నగరము వెలుపల విడిసి యున్న యతనిని బంధించి మెడలో ఎఱ్ఱగన్నేరు పూలదండ వేసి వధ్యవేషమున నతనిని తన్నుకొని వచ్చిరి. ఇది యంతయును రాణి చేయించిన దని బోధిసత్త్వుడు గ్రహించి త్రోవలో "పురుషులారా, నేను దోషము చేయలేదు. అనపరాధిని" అని విలపించుచు నడచుచుండెను. నగరమున కల్లోలము బయలుదేరెను. రాణిమాట విని రాజు పద్మకుమారుని సంహరింపనున్నా డని జనులు దుఃఖించుచు, కుమారుని పాదములపై బడి "స్వామీ, ఈ దండకర్మ మీవంటివారికి తగినది కాదు !" అని ఆక్రోశించిరి. రాజు చూచి కోప మాపుకొన లేక "వీడు రాజు కాకపూర్వమే రాజువలె సిద్ధ మయినాడు. వీడు నాకుమారుడే యయినను పట్టపురాణిని కలుషితను చేసినాడు. వీనిని చోర ప్రపాతమునుండి క్రిందికి ద్రోయుడు" అని భటుల కాన తిచ్చెను. బోధిసత్త్వుడు రాజుతో "నాయనా, నే నపరాధిని కాను. నన్ను సంప-రింపవలదు" అన్నను రాజు పెడచెవిని బెట్టెను. అంతఃపురములోని పదునారువేల స్త్రీలు "నాయనా, పద్మకుమారా, నీకు రాగూడనిది వచ్చినది !" అని విలపించిరి. క్షత్రియమహాశాలురు అమాత్యులు మొద లగువారు రాజుతో "దేవా, శీలవంతుడు, వంశపోషకుడు, రాజ్యాధికారి. స్త్రీమాటలువిని మీరు విచారణ చేయకుండ కుమారుని సంహరింపదగదు. ప్రభువు విచారశీలుడు కావలెను." అని యీ గాథలు పలికిరి :

అల్పమో అధికమో అన్యదోషంబు
స్వయముగా రాజు విచారణసల్ప
కుండగా జేయుచో దండవ్యవస్థ;

ఏ క్షత్రియుడు పరీక్షింపక దండ
న మ్మొసంగిన నిజాన్నంబులోపలను
కంటకమ్మునో మక్షికమ్మునో మ్రింగు
పుట్టంధు డానగు బోలునా డగును.
దండ్యు శిక్షింప, కదండ్యు శిక్షింప
పథముతో మిట్టలు పల్లా లెరుంగ
జాలని జాత్యంధు బోలు నాతండు.

చిన్నవో పెద్దవో అన్నిసంగతులు
చర్చించి బాగుగా శాసించునతడు
పాలన చేయగా జాలినవాడు.

ఉన్నతస్థానంబు నొందడు జనుడు
కేవల మార్దవ భావంబుతోడ
గాని, కేవలముగా కఠినతం గాని
ఉభయానుసరణమ్ము యుక్తమ్ము సుమ్ము.

ఆర్ద్రత గలనేత అభిభూతు డగును,
పరశేతరుం డైన శాత్రవవృద్ధి
కావున మధ్యమార్గంబున జనుట
యుక్తమ్ము నృపతికి యోచించునెడల.

రాగపూరితు డైన వాడును వ్యక్తి
ద్వేషపూరితు డైన భాషించు మిగుల
కావున రాజ, స్త్రీకారణంబుగను
తగ దెంతమాత్రము తనయు జంపింప.

ఈ విధముగా రకరకముల బోధించినను రాజు గ్రహింపలేదు; బోధిసత్త్వుడు ప్రార్థించినను అతనివేడికోలు వినలేదు. కన్ను గానని రాజు మూర్ఖుడై కుమారుని చోర ప్రపాతమునకు గొనిపోయి క్రిందికి ద్రోయుడని భటుల కానతిచ్చుచు ఈ గాథ పలికెను ;

ఒకవైపె యెల్లవా రొక్కటై యుండె;
కాన ఈయనమాట గణియింపవాడ

పదుడాయి, చోర ప్రపాతంబు నుండి
వేగమే క్రిందికి వీని ద్రోయుండు.

ఇట్లు రాజు పలుకగా పదునారువేల మంది స్త్రీలలో నొకర్తె నను సహింప లేకపోయిరి. నగరనివాసులు జుట్టు విరియబోసికొని, బాహువులు పైకెత్తి విలపింప నారిరి. వీరు శిక్ష మాపివేయగల రని భావించి రాజు తనయనుచరులవెంట జని, పద్మకుమారుని తల క్రిందులుగా బంధించి, ప్రపాతమునుండి క్రిందికి ద్రోయించెను.

ఆతని మైత్రీభావనా బలమువలన పర్వతదేవత భయపడ వల దని అతనిని రెండుచేతులలో నెత్తుకొని రొమ్మున హత్తుకొని దివ్యస్పర్శ నిచ్చి కొండలోయలో నున్న నాగభవనమునకు గొనిపోయి నాగరాజు ఫణముకడ నిలిపెను. నాగరాజు బోధిసత్త్వుని నాగభవనమునకు దీసికొని పోయి తన సంపదలో అర్ధభాగ మిచ్చెను.

అత డచ్చట సంవత్సరకాల మున్నతరువాత మానవనివాసమునకు బోవుదు ననెను. ఎక్కడ కని నాగరా జడుగగా "హిమాలయమునకు బోయి ప్రవ్రజించెదను" అని బోధిసత్త్వుడు చెప్పెను. మంచి దని నాగరా జతనిని మానవలోకమునకు గొనిపోయి, ప్రవ్రజ్యకు వలసినవస్తువులు సమకూర్చి నిజనివాసమునకు మరలి పోయెను.

బోధిసత్త్వుడు హిమాలయమున ఋషిప్రవ్రజ్య స్వీకరించి కందమూల ఫలాదులు భుజించుచు అరణ్యమున నివసించుచుండెను.

వారాణసీనివాసి యగువనచరు డొకనా డచటికి జేరి ఆయనను గుర్తించి "దేవా, తమరు మహాపద్మకుమారులు కారా ?" అనెను. "అవును సౌమ్యా !" వనచరుడు ప్రణామము చేసి కొలదిదినము లచట నుండి, వారాణసికి పోయి రాజుతో "దేవా, మహాపద్మ కుమారులు ప్రవ్రజించి హిమాలయమున పర్ణకుటీరములో నున్నారు నేను వారిసన్నిధిలో కొలదిదినము లుండి వచ్చినాను" అని విన్నవించెను. "నీవు ప్రత్యక్షముగా చూచినావా ?" అను రాజు ప్రశ్నకు అవు నని వనచరుడు ప్రత్యుత్తర మిచ్చెను.

ఆవల రాజు ససైన్యముగా బయలువెడలి హిమాలయము చేరి, దండు విడిసి, అమాత్యసహితుడై పోయి, పర్ణశాలవాకిట బంగరువిగ్రహమువలె నున్న బోధిసత్త్వుని జూచి ప్రణామము చేసి, ఒక ప్రక్కన గూరుచుండెను. అమాత్యులు

కూడ ప్రణామము చేసి, కుశల మడిగి కూరుచుండిరి. బోధిసత్త్వుడు రాజుకు కంద మూల ఫలము లిచ్చి కుశల మడిగెను. రాజతనితో "స్వామీ. నిన్ను లోయ లోనికి ద్రోయించినపుడు ఎట్లు జీవించితివి?" అని ఈ గాథ పలికెను :

బహుతాళములలోతు పర్వతంబుల లోయ,
బైటి కేతెంచుట భావ్య మైనది కాదు
చోర ప్రపాతాన వారు నిను ద్రోసిరే
బ్రదికియున్నా వెట్లు ప్రాణముల్ కోల్పోక ?

అత డిట్లు సమాధాన మిచ్చెను.

ఆవిర్భవించుచు ఆ పర్వతమునందు
బలవంతుడును శక్తి కలవాడు నాగుండు
కానిపోని యాతండు తనఫణంబున నన్ను
ప్రాణముల్ కోల్పోక బ్రతికినా నందుచే.

రాజి ట్లనెను :

రాజపుత్రా, ఇంక రమ్మి, నిను గొనిపోదు
రాజధానికి, నీవు రాజ్యపరిపాలనము
చేయవచ్చును నీకు క్షేమం బగునుగాక !
కాననాంతరమునం గావించునది యేమి ?

బోధిసత్త్వ డిట్లు పలికెను ;

న న్నుద్ధరించుకొన్నాను మత్స్యంబు
గాలంబు మ్రింగగా జాలరి రక్త
బడిశంబు మెల్లగా విడిపించునట్లు.

రాజి ట్లనెను :

దేని గాలంబుగా దెలిపెద వీవు ?
తలతువు దేని రక్తప్రయుక్తముగ ?
బయటకి లాగు పేళావంబొ తెలుపు
యోచించి బాగుగా నుత్తర మిమ్ము.

బోధిసత్త్వు డిట్లు పలికెను :

కామభోగము లన్న గాలమ్మె సుమ్మ,
రక్తసంయుక్తి తురంగ నాగములు
త్యాగమే బడిశంపు తప్పించివేత
గ్రహియింపవలయు నీ క్రమమును రాజ.

బోధిసత్త్వుడు రాజుతో "మహారాజా, నాకు రాజ్యముతో పని లేదు. నీవు రాజధర్మముల కవిరుద్ధముగా, అగతిగమనము చేయక ధర్మానుసారముగా రాజ్యము చేయుము" అనెను.

రాజు దుఃఖించుచు నగరమునకు మరలిపోవునపుడు అమాత్యులతో "ఇట్టి సదాచారు డగుపుత్రునితో వియోగ మేకారణమున సంభవించినది?" అనెను.

"పట్టపుదేవి కారణమున."

రాజు పట్టపురాణిని తల క్రిందులుగా కట్టించి చోర ప్రపాతమునుండి క్రిందికి ద్రోయించినపిదప నగరమున ప్రవేశించి, ధర్మానుసారముగా రాజ్యము చేసెను.

శాస్త ఈ ప్రకారముగా ధర్మోపదేశము చేసి, "భిక్షువులారా, ఈమె పూర్వము కూడ అన్యాయము చేసి వినాశము పొందినది" అని ఈ గాథ పలికెను ;

తల్లి చించా, దేవదత్తుండు తండ్రి,
నాగుండు పండితానందుండు, సారి
పుత్రుండు దేవత, భూపాలతనయు
డేను; జాతకము గ్రహింపు డీరీతి.

ఇట్లు శాస్త రెండుజాతకములు సరిపోల్చెను.

# 473. మిత్రామిత్ర జాతకము

ఇది శాస్త కోసలనరేశున కుపకారము చేయు అమాత్యుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

అతడు రాజునకు విశేషముగా నుపకారము చేయుచుండెడి వాడు. రాజు నాతనిని విశేషముగా ఆదరించుచుండెడివాడు. అన్యులసహిష్ణులై అతనిమనసును విరిచిరి. "దేవా, ఆ అమాత్యుడు తమహితచింతకుడు కాడు" అనిరి. రాజు అతనిని పరీక్షించి, ఆతనియెడ దోషము లేదని గ్రహించి, తనలో "ఈతనియందు నా కేమియు దోషము కానబడుట లేదు ఇతడు మిత్రమో శత్రువో తెలియు టెట్లు?" అనుకొని, దీనికి సమాధానము తథాగతునికన్న అన్యులెవరును చెప్పజాల రని నిశ్చయించుకొని, ప్రాతఃకాలముననే భోజనము చేసి, శాస్తసన్నిధి కరిగి "భన్తే, ఒకడు మిత్రమో, శత్రువో తెలియు టెట్లు?" అని యడిగెను, "మహారాజా, పూర్వకాలమున పండితులు వివేకవంతులను ఈ ప్రశ్న మడిగి, వారు చూపిన మార్గమున జని శత్రువులను విడదీసి, మిత్రులతో సాంగత్యము చేసిరి." అని, రాజు ప్రార్థనపై పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు అయనకు అర్థధర్మానుశాసకు డగు అమాత్యు గుండెను, ఉపకారి యగు అమాత్యునకు విరుద్ధముగా కొందరు రాజుమనసు విరిచిరి. రాజు ఆతనియందు దోషము కానక "మిత్రుని గాని, శత్రువును గాని, ఎట్లు గుర్తింపనగును?" అని ప్రశ్నించువాడై ఈ గాథ పలికెను ;

ఎట్టి కర్మలు చేయునట్టివారలను
కాంచి జ్ఞానము నాలకించియు నైన
మిత్రులు కా రని గ్రహియించుట కెట్లు
ధీయుతుం డగువాడు చేయు యత్నంబు ?

బోధిసత్త్వుడు అమిత్రలక్షణములను సూచించుచు రీ గాథలు పలికెను :

కాంచ దుల్లాసంబు కనుగొనినపుడు
అభినందనము చేయ డంతికమందు
చూడుడు కంటిలో సూటిగా నతడు
కూడు నీశత్రులతోడ నాతండు
నీమిత్రజనముల నికటంబు చనడు
వారి ప్రశంసించువారి రోధించు
నిందించువారలనే ప్రశంసించు
నిజరహస్యమ్మును నీకు జెప్పండు
అన్యరహస్యంబు లంతటం దెలుపు
సత్కార్యములను ప్రశంస చేయండు
కొనియాడ డెంతటి గొప్పగుణమ్ము
అభివృద్ధి గనుగొన్న నప్రసన్నుండు
సుప్రసన్నుడు నష్టసూచన యున్న
సంభవించినవేళ సంతర్పణంబు
నిను విస్మరించును నిస్సంశయముగ.
పదునారు గుణములం బట్టి యమిత్రు
గాంచి యైనను, నాలకించియు నైన
ధీమంతు డగువాడు తెలిసికో గలడు.

మిత్రుని లక్షణము రీ గాథలో అడిగిరి :

ఎట్టికర్మలు చేయునట్టి వారలను
గాంచియైనను నాలకించియు నైన
హితులు వీరని గ్రహియించుట కెట్లు
యత్నింపు మేధావి యగుపండితుండు ?

అంతట బోధిసత్త్వ డీగాథలు పలికెను :

చను నీకు నెదురుగా, సవిధంబు చేర
అభినందనము చేయు, ఆనంద మొందు,
పలుకుచో చేయును ప్రతినందనమ్ము.

హితుఁ డన్యదేశాల కేగినయపుడు
వానిని స్మరియించు; వచ్చినపిదప
అభినందనము చేయు, ఆనంద మొందు,
ప్రీతి చూపును, మాట ప్రియముగా బల్కు
సఖుని ప్రజ్ఞాది ప్రశంస కావించు
అభివర్ణనము చేయు నాతని పనులు.
తనకు విందు లభించుతరుణమ్మునందు
సఖుడు లే కున్న విషాదంబు చెందు
ఇత్యాదిలక్షణాల్ హితునందు దోచు,
కాంచి ధ్యానమున నాలకించియు నైన
మిత్ర మెవ్వండో అమిత్ర మెవ్వండో
ధీమంతు డగువాడు తెలిసికో వచ్చు.

రాజు బోధిసత్త్వునితో సంభాషించిన పిదప ప్రసన్నుడై ఆయనను విశేష ధనముతో బహూకరించెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి, "మహారాజా, ఈ విధముగా పూర్వము కూడ ఈ ప్రశ్న ముద్భవించెను. ఈ ముప్పదిరెండు లక్షణములతో మిత్రామిత్రులను గురుతింపవచ్చు నని పండితులు చెప్పినారు" అని జాతకములు సరిపోల్చెను.

"ఆకాలమున రాజు ఆనందుడు; పండితామాత్యుడు నేనే."

# 474. ఆంబ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు దేవదత్తుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

"నేను బుద్ధుడ నగుదును. శ్రమణగౌతముడు నా కుపాధ్యాయుడు కాడు, ఆచార్యుడు కాడు." అని దేవదత్తు డాచార్యుని ప్రత్యాఖ్యానము చేసి, ధ్యానభ్రష్టుడై సంఘములో చీలిక కల్పించి క్రమముగా శ్రావస్తి చేరి జేతవనము వెలుపల నేల నెరియ విచ్చగా అవీచీనరకము చేరెను. అప్పుడు ధర్మసభలో సంభాషణ జరుగుచుండగా, శాస్త అచటి కరుదెంచి విషయము గ్రహించి "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడే కాదు, పూర్వముకూడ అచార్యుని ప్రత్యాఖ్యానించి మహావినాశము పొందెను" అని పూర్వజన్మకథ చెప్పెను,

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు ఆయన పురోహిత కులము అహివాతక రోగమువలన నష్టమైపోయెను. అందలి బాలు డొకడు మాత్రము గోడ బ్రద్దలు చేసి పారిపోయి ప్రాణములు దక్కించుకొనెను. అతడు తక్షశిలానగరము చేరి ప్రసిద్ధాచార్యునికడ వేదములు, తక్కిన విద్యలు అభ్యసించి గురువునకు నమస్కరించి దేశభ్రమణము చేయుటకై అనుజ్ఞ గైకొని బయలుదేరెను. అతగు పర్యటనము చేయుచు ఒకానొక ప్రత్యంతనగరము చేరెను. దానికి సమీపమున చండాలగ్రామము గలదు. ఆసమయమున బోధిసత్త్వుడు అందు నివసించుచుండెను అతడు పండితుగు, మేధావి. ఆకాలమున పండ్లు పండించు మంత్రము ఆయనకు తెలియును. ప్రాతఃకాలముననే అతడు కావడి తీసికొని గ్రామము వెలువడి అరణ్యమున ఏదో మామిడిచెట్టుకు ఏడగుగుల దూరమున నిలిచి మంత్రము జపించి వృక్షముపై నీరు చల్లును. తోడనే చెట్టునుండి ప్రాత యాకులు రాలును; క్రొత్తయాకులు లేచును. పుష్పములు పూచి నేల రాలును. మామిడి కాయలు మొలిచి వెంటనే పండి చెట్టునుండి రాలును. ఆపండ్లు కండగలవై

రుచ్యములై దివ్యఫలములవలె నుండును. బోధిసత్త్వుడు వానినేరి ఇష్టము వచ్చినన్ని తిని, కావడిని ంపుకొని ఇంటికి కొనివచ్చి విక్రయించి ఆలుబిడ్డలను పోషించును.

అ బ్రాహ్మణ కుమారుడు అకాలమున ఆమ్రఫలములు బోధిసత్త్వుడు తెచ్చి, విక్రయించుట చూచి "నిస్సందేహముగా ఇతడు మంత్రబలముచే అకాలమున పండ్లు పండించుచున్నాడు. ఈతనికడనుండి ఈ అమూల్యమంత్రమును గ్రహింపవలె" నని తలచి బోధిసత్త్వుడు పండ్లు తెచ్చు క్రమము బాగుగా తెలిసికొని అత డడవి నుండి ఇంటికి రాకపూర్వమే అతనిగృహమునకు జని ఎరుగనివానివలె ఆయన భార్యతో "ఆచార్యు డెక్కడ?" అనెను. "అరణ్యమునకు బోయినాడు."

బ్రాహ్మణుడు ఆతనికొఱకై ప్రతీక్షించి, ఆయన వచ్చినంతనే ముందరికి పోయి చేతులతో కావడి పట్టుకుని తెచ్చి ఇంటిలో పెట్టెను. బోధిసత్త్వు డతనిని చూచి భార్యతో "భద్రే, ఈతడు మంత్రగ్రహణమునకై వచ్చినాడు. కాని ఈతని కడ మంత్రము నిలువదు. ఈతడసత్యవాది" అనెను. ఆచార్యునకు సేవ చేసి మంత్రము గ్రహింపదలచి బ్రాహ్మణుడు నాటినుండి అచట సేవచేయ జొచ్చెను. ఆతడు వడ్లుదంచుచు, కట్టెలు తెచ్చుచు, వంటచేయుచు, ముఖప్రక్షాళనార్థము జలము తెచ్చుచు గురుపాదములు కడుగుచుండును. ఒకనాడు బోధిసత్త్వుడు "బాబా, నా మంచపుకోళ్ళ అడుగున ఎత్తు పెట్టుము" అని చెప్పెను. ఇంట నేమియు లభింపక పోవుటచే నతడు తనతొడలమీదనే మంచపుకోళ్ళు పెట్టి రేయి అంతయు కూరుచుండి యుండెను. కాలక్రమమున బోధిసత్త్వుని భార్య పుంశిశువును కనెను. బ్రాహ్మణమాణవకుడు ఆమె ప్రసూతికి సర్వవిధముల తోడ్పడెను. ఒకనా డామె భర్తతో "స్వామీ, ఈ బ్రహ్మచారి ఉత్తమకులమున జన్మించినవాడైనను మనకు సమస్తసేవలు చేయుచున్నాడు. ఈతనికి మంత్ర ముపదేశింపుడు, నిలువనిండు, నిలువక పోనిండు, ఈతనికి మంత్రదీక్ష నిండు" అని యామె చెప్పగా బోధిసత్త్వు డాతనికి మంత్రోపదేశము చేయువాడై "బాబా, ఈ మంత్ర మమూల్యమైనది. దీనివలన నీకు విశేషముగా లాభసత్కారములు సంభవించును. రాజుగాని మహామాత్యుడు గాని నీగురు వెవ రని అడిగినచో నాపేరు దాచిపెట్టవలదు, నేను చండాలునికడ మంత్రోపదేశము పొందినా నని సిగ్గుపడి, నాగురువు బ్రాహ్మణమహాశాలి యని చెప్పితివేని మంత్రము ఫలింపదు." అని బోధించెను. "మీనామ మేల మరుగుపరతును? ఎవరైన అడిగినచో మీనామధేయమే తెలిపెదను" అని బ్రహ్మచారి పలికి ఆచార్యునకు ప్రణామము చేసి, చండాలగ్రామము వదలి,

మంత్రము జపించి, క్రమముగా వారాణసి చేరి, ఆమ్రఫలములు విక్రయించి ధనము సంపాదించెను.

ఒకనాడు తోటమాలి బ్రహ్మచారికడనుండి మామిడిపండ్లు గ్రైకొని రాజునకు సమర్పించెను. ఆయన వాని నారగించి, "ఇట్టి ఆమ్రఫలము నీ కెక్కడనుండి లభించినది ?" అనెను,

"దేవా, అకాలమున పండిన మామిడిపండ్లను ఒకానొక పురుషుడు అమ్ముచుండగా అతనికడనుండి తెచ్చితిని."

"నేటినుండి ఇట్టిపండ్లు తెచ్చుచుండవలె నని ఆతనితో చెప్పుము."

తోటమాలి అటులే చెప్పెను. బ్రాహ్మణయువకుడు రాజకులమునకు నాటి నుండి ఫలములు కొనిపోవుచుండెను. "నీవు నాకొలువులోనే యుండుము" అని రాజు నియోగింపగా ఆతడు రాజసేవ చేయుచు ధనము సంపాదించుచు క్రమముగా విశ్వాసపాత్రు డయ్యెను. ఒకనాడు రాజు అతనితో "ఇట్టిరంగు, సువాసన, రసముతో కూడిన ఆమ్రఫలములు నీ కెక్కడ లభించుచున్నవి ? నీవు నాగుడవా, గరుడుడవా, దేవుడవా? ఎవ రైన ఇచ్చుచున్నారా, కాక మంత్రబలమా ?" అనెను.

"దేవా, అర్యులు నా కిచ్చుట లేదు. నాకడ అమూల్యమంత్ర మున్నది. దాని ప్రభావము."

"అ ట్లైన నీమంత్ర ప్రభావము మే మొకనాడు చూచెదము."

"చిత్తము దేవా, చూతురుగాక !"

మరునాడు రాజు అతనిని వెంట బెట్టుకొని ఉద్యానమునకు బోయి మంత్ర ప్రభావము చూపు మనెను. చిత్తమని ఆతడు సహకారవృక్షమున కేడగుగుల దూరమున నిలిచి మంత్రము జపించి ఉదకము దానిపై జల్లెను. తోడనే పూర్వోక్త ప్రకారముగా పండ్లు పండి భూపాతముగా నేల రాలెను. జనులు సాధువాదము చేసి తలపాగా లెగురవైచిరి. రాజు ఫల మారగించి అతనికి బహుమానమిచ్చి "బ్రహ్మచారీ, ఇట్టి ఆశ్చర్యకర మైనమంత్ర మెవరికడ ఉపదేశము పొందినావు ? అని అడిగెను.

"నేను చండాలునికడ ఉపదేశము పొందితి నన్నచో లజ్జాకరము. లోకులు నింద చేయుదురు. మంత్రము నాకు బాగుగా అభ్యస్త మైనది. నష్టము కాదు.

ప్రసిద్ధాచార్యుని పేరు చెప్పెదను" అనుకొని బ్రహ్మచారి అసత్యము పలుకువాడై "తక్షశిలలో ప్రసిద్ధాచార్యునివలన నాకీమంత్రము లభ్యమైనది" అని చెప్పెను. యథార్థగురునామము గుప్తము చేసి ప్రత్యాఖ్యానము కావించుటచే మంత్ర మంతర్ధాన మయ్యెను. ఈ విషయము తెలియక రాజు ప్రసన్నచిత్తుడై ఆతనిని నగరమునకు గొనిపోయెను. అవల నొకనాడు రాజు సహకారఫలములు ఆరగింపకోరికతో అతనిని ఉద్యానమునకు గొనిపోయి మంగళశిలాతలముపై గూరుచుండి "యువకా, ఆమ్రఫలములు తెమ్ము" అని పలికెను. చిత్తమని అతడు ఆమ్రవృక్షముకడ ఏడడుగుల దూరమున నిలిచి మంత్రజపము చేయగోరెను. మంత్రము జ్ఞప్తికి రాలేదు. కావున అది అంతర్ధాన మయ్యె నని అతడు గ్రహించి సిగ్గుతో తల వంచి నిలుచుండెను. "ఇదివరలో ఈతడు లోకులయెదుట పండ్లు పండించి నాకు తెచ్చి ఇచ్చినాడు. ఇప్పుడు జడీభూతుడై నిలిచియుండుటకు కారణ మేమి?" అని యడుగువాడై రాజు ఈ గాథ పలికెను :

తొలుత పటిష్ఠముల్ స్థూలమ్ములైన
సహకారములు బ్రహ్మచారి తెచ్చితివి
ఇప్పు డామంత్రంబులే వృక్షమందు
ఉదయింపగా నీయకున్నవి పండ్లు.

విని బ్రహ్మచారి "ఆమ్రములు పండకుండుటకు కారణము చెప్పితినేని రాజు కోపించును" అని తలచి బ్రహ్మచారి అసత్యము పలికి మోసము చేయనెంచి ఈ గాథ పలికెను :

నక్షత్రయోగమ్మునకు ప్రతీక్షింతు
నామీద దయ లేదు నక్షత్రమునకు
నమ్మహార్ఘమునకు సముచితక్షణము
వచ్చినంతనె తెత్తు హెచ్చుగా పండ్లు.

ఇతడు వెనుకనక్షత్రయోగ ప్రశంస చేయలేదు. ఇప్పుడు చేయుటకు కారణ మడిగెద ననుకొని రాజు ఈ గాథలు పలికెను :

నక్షత్రయోగ శుభక్షణ మార్గ
బ్రహ్మచారీ మున్ను పలుకకుండగనె
పరిమళ రసవర్ణ భరితమ్ములైన
చూతంబులం దెచ్చుచుందువు కాదె ?

అవనీజములనిండ నామ్రఫలాలు
మును మంత్రజపముచే మొలిచెడి, విపుడు
సలుప లేవే మంత్రజపమ్ము నేతమ్ము !
ఈనాడు నీధర్మ మెట్టిది బ్రహ్మ ?

"అసత్యము పలికి రాజును మోసగింప లేకపోయితిని. సత్యము చెప్పుదు నేని రాజు దండింప వచ్చును. కానిమ్ము, సత్యమే చెప్పెద" ననుకొని ఆతడు ఈ గాథలు పలికెను :

మర్మమ్ము లేకుండ మంత్రంబు నాకు
చండాలపుత్రుం డొసంగినవాడు
కోరినప్పుడు దాచగూడదు గురుని
కుల గోత్ర నామముల్: గుప్తి చేసినను
త్యజియింపరాదు మంత్రంబు నెన్నండు,

ప్రభువు ప్రశ్నింపగా భయముచే నేను
పలికినా ననృతంబు; బ్రాహ్మణువలన
దత్తంబు కాదు మంత్రంబు; నశింపు
వల్ల కృపణురీతి యాపోవుచుంటి.

రాజు విని "ఈ పాపి ఇట్టిరత్నముపై ధ్యాన ముంచక, ఈ యుత్తమ రత్నము లభించినపిదప కుల మేమి చేయు" నని తలచి కుపితుడై ఈ గాథలు పలికెను :

ఏరండమే నైన, నేతరు వైన
మధువు శోధించెడి మనుజున కొసగు
అవనీరుహశ్రేష్ఠ మగు వాని కదియె.

నాల్గువర్ణంబుల నరులలో నైన
చండాల పుల్కస జాతులం దైన
ధర్మవివేకంబు దత్త మెవ్వాని
చేత నాతడె నరశ్రేష్ఠుండు సుమ్ము.

ఉత్తమార్థము వీని కొదవె కష్టమున
దానిని గోల్పోయె మానభారమున!
దుష్టుని మెడ బట్టి త్రోసివేయుండు.

రాజు పరిజనులచే నట్లు చేయించి అతనికి దేశాంతరవాసశిక్ష నిచ్చువాడై "నీ ఆచార్యుని కడకు బోయి ఆయనను ప్రసన్నుని చేసికొని మంత్రము లభించి నచో ఇచటికి రమ్ము; లభింపనిచో ఇక్కడ కనబడరాదు" అని యానతిచ్చెను. బ్రహ్మచారి అగతికుడై "ఆచార్యునికన్న నాకు వేరొక శరణస్థానము లేదు; ఆయన సన్నిధికే చని ప్రసన్నుని చేసికొని మరల మంత్రముకొరకు ప్రార్థింతు" ననుకొని దుఃఖముతో ఆ గ్రామమునకు జనెను. ఆతనినింక కనుగొని బోధిసత్త్వుడు భార్యను పిలిచి "భద్రే, ఆ పాపి మంత్రహీనుడై మరల వచ్చుచున్నాడు" అనెను. బ్రహ్మచారి బోధిసత్త్వుని సన్నిధికి జని ప్రణామము చేసి ఒక ప్రక్కన నిలుచుండెను. "ఏల వచ్చితి" వని ఆయన అడుగగా "ఆచార్యా, నేను అసత్యము చెప్పి మిమ్ము ప్రత్యాఖ్యానము చేసి నష్టపడితిని" అని దోషము నొప్పుకొని మరల మంత్రము కొరకు యాచించుచు ఈ గాథలు పలికెను ;

సమతల భావన జను డెవ్వడైన
గుంటలో లోయలో గూలినయట్లు,
త్రాడని కాలాహి దాటినయట్లు,
అంగుండు వహ్నిలో నడు గిడినట్లు
నష్ట మొందితి నేను; నామీద మీరు
క్రమ్మర ప్రజ్ఞతో కరుణింపవలయు.

ఆచార్యుడు "బాబూ, ఏమనుచున్నావు? అంగునకు గురుతులు చెప్పి ముందే భద్రముగా నున్నచో గుంటలు మొదలగువానినుండి తప్పించుకొన గలరు. నీకు నేను తొలుతనే చెప్పియుంటిని ఇప్పుడు నీవు ఏల నాకడకు వచ్చితివి ?" అని ఈ గాథలు పలికెను :

ధర్మభావమ్ముతోడ మంత్రంబు దత్త
మైనయది; నీవు నట్టులే దాని పొంది
నావు, తెలిపితి దాని స్వభావమైన
పలికినాడ వసత్యంబు బలము లేక

భూరిదుర్లభ జీవనాధార భూత
మైన మంత్రము నాశన మైనది కద!

సంయమము లేనివాని, కసత్యవాది
కధికమూర్ఖున. కకృతజ్ఞుడై నవాని
కట్టిమంత్రోపదేశము నాచరింప,
మింక చాలును! వెడలి పొమ్మిచటినుండి.

ఈ విధముగా ఆచార్యునివలన ధిక్కారము పొంది వెడలిపోయి తాను జీవించి ఏమి చేయవలె ననుకొని అడవిని బడి దిక్కులేనిచావు చచ్చెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు. పూర్వము కూడ దేవదత్తుడు ఆచార్యుని ప్రత్యాఖ్యానము చేసి మహావినాశము పొందెను" అని రెండు జాతకములు సరిపోల్చెను.

"ఆ సమయమున కృతఘ్నుడగు బ్రహ్మచారి దేవదత్తుడు; రాజు ఆనందుడు: చండాలపుత్రుడు నేనే."

o

# 475. స్పందన జాతకము

శాస్త రోహిణీ నదీతీరమున జ్ఞాతుల జగడమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఇది కుణాలజాతకమున (536) వచ్చును. అప్పుడు శాస్త జ్ఞాతులను పిలువ నంపి....

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా నగరమునకు వెలుపల వడ్రంగుల గ్రామ ముండెను. అచ్చట ఒకానొక బ్రాహ్మణ వర్ధకి అడవినుండి కలప తెచ్చి రథములు నిర్మించి జీవనము చేయుచుండెను. ఆ సమయమున హిమాలయ ప్రదేశమున మహాస్పందన మనువృక్షము గలదు. కాల సింహము ఒకజంతువును వెదకుచువెదకుచు వచ్చి అవృక్షమూలమున పండుకొనెను. గాలివీచినమీద ఒకనాడు ఎండురెమ్మ మెడపై బడెను. భుజము నొప్పిపుట్టుటచే అది భయపడి పరుగెత్తి ఆగి వెనుక నెవ్వరు లేకుండుట చూచి "సింహము గాని, వ్యాఘ్రము గాని, నన్ను వెంట నంటుట లేదు. ఈ వృక్షము మీది దేవతకు నే నిచట నుండుట సమ్మతము కానట్లు తోచుచున్నది. చూచెదను" అనుకొని నిష్కారణముగా కోపము చెంది వృక్షముపై దెబ్బకొట్టి వృక్షదేవతను బెదరించుచు, నీ చెట్టుమీది ఆకులు తినుట లేదు, రెమ్మలు విరుచుట లేదు; జంతువు ఇచట నుండుట సహింతువు. నే నుండుట నీకు గిట్టదు. నావల్ల దోష మేమి ? కొలది రోజులు వేచియుండుము. వ్రేళ్ళతోసహా వృక్షమును పెకలించి ముక్కలు ముక్కలు చేసెద" ననెను.

అప్పుడు పురుషునికొరకు సింహము వెదకుచు తిరుగుచుండెను. బ్రాహ్మణుడు ముగ్గురను వెంట బెట్టుకొని రథము కలపకై వెదకుచు, బండిపై నచటికి వచ్చెను. ఆయన బండి నొక ప్రక్క నాపి. బాడిత, గొడ్డలి పట్టుకొని చెట్లు వెదకుచు స్పందన వృక్షము వద్దకు చేరెను. కాలసింహము చూచి, "నేడు నా శత్రువునకు శృంగ

భంగము చూడవలె" ననుకొని పోయి, వృక్షముకడ నిలుచుండెను. బ్రాహ్మణుడు ఇటు నటు చూచుచు స్పందనవృక్షము చేరినంతనే కాలసింహుడు ముందుగా పలుకరింప నెంచి ఈ గాథ పలికెను :

అరుగుదెంచి కుఠారధారీ,
అడవిలోపల నిలిచినాడవు
దారుఖండనకొరకు సౌమ్యా,
తలచుచున్నావా ?

ఆయన దాని మాటలు విని, "ఆశ్చర్యము . ఇంతకు మున్ను జంతు వేదియు మనుష్యులాక్కన మాటాడుట వినలేదు. ఈ వృక్షము రథనిర్మాణమునకు యోగ్యమైన దారువువలె నున్నది. దీని నడిగెదను" అని ఈ గాథ పలికెను :

సంచరింతువు సింహరాజా,
సమ విషమ గహన స్థలంబుల
నేమి కనుకూలించు దారువు
నీవు చూచితివా ?

సింహము విని నేడు నా కోరిక నెరవేరు నని యెంచి ఈ గాథ పలికెను :

అశ్వకర్ణము, ఖరిద, సాలము
లనుకూలము, లెక్క స్పందన
తరువుదారువు చక్రమునకై
తగినది సౌమ్యా .

బ్రాహ్మణుడు సంతోషించి ఈ మంచిరోజున నేను అరణ్యమునకు వచ్చినాను. జంతువుకూడ నా రథమునకు తగినదారువును చూపుచున్నది. ఎంత శుభము. అనుకొని ప్రశ్న వేయువాడై ఈ గాథ పలికెను :

ఎట్టు లుండును దానివర్ణము ?
ఎట్టు లుండును తరుస్కంధము ?

సౌమ్యా, ఎట్టులు గురుతు పట్టగ
జాలుదువు దానిన్ ?

ప్రత్యుత్తర మిచ్చునదై సింహ మీ గాథలు పలికెను :

కామ్మ లెంతయు పాడవు లయ్యును
కొట్టుకొనుచుండియును గాలికి
విరిగిపోవవు; నిలిచినా నా
తరువు క్రిందుగనే.

దారు వుపయు క్తంబు నరదము
దండములకును, చక్రనాభికి,
అరదములకును, చుట్టుబద్దికి
నన్నిటికి గూడన్.

ఈ ప్రకారముగా పలికి సింహము సంతుష్ట చిత్తముతో ఒకప్రక్కన తిరుగుచుండెను. బ్రాహ్మణుడు వృక్షమును కోయ నారంభించెను. వృక్షదేవత తనలో "నే నీతనిపై నేమియు పడవేయ లేదు. కాని ఇతడు అనుచితముగా నా నివాస స్థానము చెడగొట్టనున్నాడు. నేను నష్టపడుదును. ఒకానొక నుపాయము నవలంబించి ఈ సింహరాజమును గూడ నాశము చేయింతు" ననుకాని అరణ్యమున పని చేయువాని రూపము ధరించి బ్రాహ్మణునికడకు వచ్చి "ఏమయ్యా నీకు మంచిచెట్టు దొరికినది. దీనిని కోసి ఏమి చేయుదు ?" వనెను,

"రథచక్రములకు ఆకులు చేయుదును."

"ఈ వృక్షమునుండి రథము తయారుచేయు మని నీ కెవరు చెప్పినారు ?"

"ఒకానొక నల్లని సింహము"

"మంచిది, బాగుగా చెప్పినది. ఈ చెట్టు కలపతో రథము చక్కగా చేయుదువు, కాని కాలసింహము మెడచర్మము తీసి నాలుగు అంగుళముల తావున ఇనుప పట్టీ వలె చక్రము చట్టమున చుట్టి కట్టినచో చాల సొగసుగా నుండి ఎక్కువ ధనము లభించును."

"కాలసింహ చర్మ మెక్కడ దొరకును ?"

"మూర్ఖునివలె నున్నావు. నీచెట్టు ఉన్నవనములో సింహము కూడ ఉన్నది. పారిపోవదు. ఈ వృక్షమును నీకు చూపిన దానికడకు పోయి రేడా, నీవు నాకు చూపిన వృక్షమును ఏతావునుండి ఖండింతు నని దానిని మోసగించి ఇచటికి కొని రమ్ము. అది సంశయము లేకుండ వచ్చి మెడ ముందుకు చాపి ఇక్కడ డిక్కడి నుండి ఖండింపు మని చూపునప్పుడు మీ పదనుగొడ్డలితో మెడ నరికి చంపి చర్మ మొలిచి మాంసములో మంచిభాగము భుజించి వృక్షమును ఖండింపుము" అని అరణ్యవాసి బ్రాహ్మణునిమనస్సున వైర ముత్పాదించెను.

ఈ యర్థమునే ప్రకాశింపజేయుటకై శాస్త ఈ గాథలు పలికెను :

ఆతరుణంబునం దనియె నాతరువు !
ఓయి భారద్వాజ, ఒక్కింత వినుము
సింహాభుజంబును చీల్చి చర్మంబు
నాలుగంగుళముల చాలు చక్రంబు
చుట్టును బాగగు చుట్టిన యెడల
ఆతరుణంబునం దామహీజంబు
వైరంబు ప్రజ్వలింపగ జేసె నిట్లు.
కష్టకారణ మాయె కంఠీరవాల,
కుత్పన్నములకు ననుత్పన్నములకు.

వడ్రంగి వృక్షదేవత మాటలు విని నేడు శుభదినము అనుకొని, కాలసింహమును సంహరించి వృక్షమును ఖండించి వెడలిపోయెను.

ఈ యర్థమును ప్రకాశింపజేయుటకై శాస్త ఈ గాథలు పలికెను :

జనియించి సింహవృక్షములకు కలహ
మవనాన మన్యో నన్యోన్యనాశమున
కలహ మీగతిని లోకమునందు గలుగు
పక్షంబునన్, సింహవృక్షంబు లట్లు
వర్ధిల్లుచుండును బర్హి నాట్యంబు.

అందుచే జెప్పెద అగుగాక శుభము!
ఎపుడేని మీ రిట కేతంచునెడల
కలహింప కుండగా కలిసియుండుటకు
ప్రయత్నించి ఆనంద మందుట మేలు,
ఇద్దాని మెచ్చిరా రెంతయు వృద్ధు
లెవ్వారు ధర్మాన నిట్లున్నవారి
క్షేమాన నష్టంబు చేకూర దెపుడు.

రాజసమూహము ధర్మకథ విని కలసి మెలసి వర్తింపసాగెను. శాస్త ఈ ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను." ఆ సమయమున ఆ వనఖండములో సంఘటన చూచిన వనదేవత నేనే."

# 476. జవనహంస జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు "దళహకమ్మ సుత్తంతమును" గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

భగవానుడిట్లనెను: "భిక్షువులారా, దృఢకాయులు, సిద్ధహస్తులు అగు నలుగురు ధానుష్కులు నాలుగుదిక్కులకు తిరిగి నిలిచి యుందురు. ఈ నలుగురు విలుకాండ్రు విడిచిన బాణములు నేలమీద పడుటకు పూర్వమే వానిని కైకొని పోవుదును" అని ఒకానొకడు వచ్చి చెప్పినా డనుకొనుడు. భిక్షువులారా, అతడు గతి కలవాడు, అగతికుడు కానివాడు అని చెప్పుట అనావశ్యకము కాదందురా?" "భన్తే, చిత్తము." "భిక్షువులారా. అతనికి గల గమనము సూర్యచంద్రుల గతికన్న శీఘ్రతరము. భిక్షువులారా, అతనిగతి దేవతలగతికన్న శీఘ్రతరము. ఈ గతుల కన్న ఆయుస్సంస్కారముల క్షయగతి శీఘ్రతరము. కావున భిక్షువులారా, అప్రమత్తులై యీ విషయము గ్రహింపవలెను."

దీనినిగూర్చి మరునాడు ధర్మసభలో సంభాషణ జరుగుచుండెను. "ఓహో! బుద్ధులమహిమ. ఆయుష్మంతులారా, శాస్త తన బుద్ధభూమికపై నిలిచి ఈ ప్రాణుల ఆయుస్సంస్కారములు తుచ్ఛములు, దుర్బలము లనియు నిరూపించినాడు. పృథగ్జను లయిన భిక్షువు లదరిపోయినారు" అనుచుండిరి. శాస్త యచటికి పోయి, విషయము తెలిసికొని, "భిక్షువులారా, యిం దాశ్చర్యము లేదు. సర్వజ్ఞుడ నయి నేను ఆయుస్సంస్కారముల తుచ్ఛత్వమును తెలిపి భిక్షువులను సంవేగయుక్తులను జేసి, ధర్మోపదేశము కావించుట యిప్పుడే కాదు, పూర్వకాలమునగూడ అహేతుక హంసయోనిలో జన్మించి ఆయుస్సంస్కారముల తుచ్ఛతను వారాణసీ నరేశుడు మొదలుకొని సమస్తరాజ్యపరిషత్తునకును తెలిపి సంవేగయుక్తము చేసి ధర్మోపదేశము కావించితిని" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీతకథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు జవనహంస కడుపున బుట్టి తొంబదివేల హంసలతో చిత్రకూట పర్వతముమీద నివసించుచుండెను. ఒకనాడు తక్కినహంసలతో కూడి జంబూద్వీపమున ఒకానొకసరోవర తీరమున స్వయముగా పడి మొలిచిన శాలిధాన్యము తిని రెక్కలు విప్పి ఆర్భాటముతో వారాణసీ నగరము మీదుగా మందగతితో ఆనందపూర్వకముగా చిత్రకూటమునకు ఆ హంసము పోవుచుండగా వారాణసీ ప్రభువు ఆ హంసను చూచి "ఇదియును నావలెనే రాజు కానోపును," అని యోచించి మంత్రులతో చెప్పి దానియెడ స్నేహముత్పన్నము కాగా గంధమాల్య విలేపనాదులు తెప్పించి ఆకసమున బోధిసత్త్వుడు కానవచ్చినంతనే వాద్యములు అన్నియు మ్రోగింప నాన తిచ్చెను. బోధిసత్త్వుడు తనకు సత్కారము జరుగుట చూచి తన హంసలతో "రాజు ఈ విధముగా నన్ను సత్కరించి, నావలన ఏమి కోరునో ?" అనెను.

"దేవా, ఆయన మీతో మైత్రి నెరప గోరుచున్నాడు."

"అగుచో రాజుతో మనము మైత్రి నెరపుదముగాక !"

ఈ విధముగా హంస రాజుతో స్నేహము చేసి వెడలిపోయెను. ఆవల నొకనాడు రాజు ఉద్యానమునకు పోయినప్పుడు హంస అనూతప్త సరోవరమునకు బోయి ఒకరెక్కతో నీరు రెండవ రెక్కతో చందనచూర్ణము తెచ్చి రాజుపై నీరము పోసి చందనచూర్ణము చల్లి అందరు చూచుచుండగా తన సహచరులతో లేచి ఆకాశ మార్గమున చిత్రకూటమునకు బోయెను. నాటినుండి రాజు బోధిసత్త్వుని చూచు కోరికతో నేడు నామిత్ర మరుదెంచు నని ప్రతీక్ష చేయుచుండెను రెండు హంస బాలకములు సూర్యునివెంట పరుగెత్తుటకై యోచించి బోధిసత్త్వునికడకు వచ్చి "తాతా, మేము సూర్యుని వెంట పరుగువారుదుము, యోచన చెప్పు" మనెను.

"బాబూ, సూర్యగతి చురుకైనది. సూర్యునివెంట పరుగువార లేరు. త్రోవలో మరణింతురు. కావున పోవలదు" అని చెప్పినను, రెండుమూడు సారులు అవి ఆనతి వేడినను, ఆయన నిషేధించినాడు. అవి అభిమానము త్తములై నిజబల మెరుగక బోధిసత్త్వునితో చెప్పకుండగనే సూర్యునివెంట పరుగువార నిశ్చయించి తెల్లవారకముందే యుగంధరపర్వతము మీదికి చేరినవి. బోధిసత్త్వుడు వానిని కానక అవి యెచటికి పోయిన వని ప్రశ్న చేసెను. వానివృత్తాంతము తెలిసినపిదప

ఆయన "అవి సూర్యుని వెంట పరుగుపార నేరవు. మార్గమధ్యమున వినాశము పొందును. కావున వానిని రక్షింపవలె" ననుకొని తానుకూడ యుగంధర పర్వతముమీది శిఖరమున కూరుచుండెను. సూర్యోదయ మైనంతనే హంసపోతకము లెగిరి సూర్యునివెంట పరుగుపార నారంభించెను. బోధిసత్త్వుడు కూడ వారివెంట నెగురుచుండెను. చిన్నది పూర్వాహ్ణమున అలసట చెందెను. ఆ పిట్ట రెక్కలు వేడెక్కి అగ్ని పెట్టిన ట్లుండెను. అది బోధిసత్త్వునితో, ఎగురలే కున్నా ననెను. బోధిసత్త్వుడు నవ్వుచు 'భయపడ వలదు. నీకు ప్రాణభయము లేదు' అని తన రెక్కలు కప్పి ఓదార్చి చిత్రకూటమునకు గొనిపోయి హంసలనడుమ చేర్చెను. బోధిసత్త్వుడు మరల నెగిరి రెండవ హంసపోతకమువెంట జనెను. అది ఇంచుమించు మధ్యాహ్నమువరకు సూర్యునివెంట నెగురుచు అలసిపోయెను. దాని రెక్కలలో చిచ్చు పెట్టిన ట్లుండెను. అది నే నెగురలే నని చెప్పగా బోధిసత్త్వుడు వెనుకటివలెనే పలికి ఓదార్చి రెక్కలు కప్పి చిత్రకూటపర్వతమున దింపెను. అప్పుడు సూర్యుడు ఆకాశమధ్యమున చేరియుండెను. నేడు నా శరీరబలము పరీక్షించుకొనవలె నని యోచించి బోధిసత్త్వుడు ఒక్కయెగురున యుగంధర పర్వతశిఖరము చేరి అక్కడనుండి ఒక్కయెగురున సూర్యుని సమీపించి కొద్దితడవు ముందు కొద్దితడవు వెనుకను ఎగిరి "సూర్యుని వెంట పరుగుచారుట నిష్ప్రయోజనము. ఇయ్యది అవిచార పరిణామము, దీనివలన నాకేమి లాభము ? నేను వారాణసి చేరి నామిత్రమైనరాజుకు అర్థధర్మయుక్త మగుకథ చెప్పెద" ననుకొని సూర్యుడు ఆకాశమధ్యమునం దుండగనే చక్రవాకము రాకొననుండి ఆ కొనవరకు నెగిరి వేగము తగ్గించి జంబూద్వీపముపై ఒక్కుమ్మడి ప్రదక్షిణము చేసి వారాణసి చేరెను. నగర మంతయు హంసములన్నియు పం డ్రెండు యోజనములవరకు సందు లేకుండ వ్యాపించిన ట్లుండెను. బోధిసత్త్వుడు క్రమముగా వేగము తగ్గింపగా ఆకసమున సందులు కనబడ జొచ్చెను. బోధిసత్త్వుడు వేగము తగ్గించి ఆకసమునుండి క్రిందికి మరలి వచ్చి గవాక్షముకడ నిలిచెను. రాజు నా మిత్రుడు వచ్చినా డని గ్రహించి ప్రసన్నచిత్తుడై హంస కూరుచుండుటకై బంగరు పీఠము వేసి "మిత్రమా, రమ్ము ఇచట కూర్చుండు" మని రాగాథ పలికెను :

హంసమా, యిటు కూరుచుండుము,
హర్ష మాయెను నిన్ను జూడగ
స్వామి, ఆజ్ఞాపింపు మిచ్చటి
సంభృతార్థములన్.

బోధిసత్త్వుడు స్వర్ణపీఠముపై కూరుచుండెను. శతపాక సహస్రపాకములు వేసిననూనె హంసరెక్కలకు రాయించి స్వర్ణస్థాలిలో తేనె, పేలాలు వేసి, షర్బతుతోపాటు రాజు హంసకు త్రాగ నిచ్చి మధురముగా సత్కరించి "మిత్రమా, నీవు ఒంటిగా వచ్చినావు? ఎచ్చటినుండి రాక?" అనెను. హంస సవిస్తరముగా సమాచారము తెలిపెను. రాజు "మిత్రమా, నన్నుగూడ సూర్యునివెంట పరుగు తీయింపుము" అని రా జడిగెను.

"మహారాజా, సూర్యునిగతి చూడ వీలుపడదు."

"సూర్యునితో కలిసి పరుగు చూపగలవా?"

"మంచిది. మహారాజా, చూపగలను. గురితప్పని విలుకాండ్రను సమావేశపరపుము."

రాజు అట్లే చేయించెను. బోధిసత్త్వుడు నలుగురు విలుకాండ్రను తీసికొని రాజభవనమునుండి దిగి ప్రాంగణమున రాతికంబమును పాతించి తనమెడకు ఘంట కట్టించి స్తంభముమీద కూరుచుండెను. నలువురు విలుకాండ్రను రాతికంబములు అవలంబనములుగా నాలుగువైపుల ముఖములు త్రిప్పించి నిలిపి, "మహారాజా, ఈ నలుగురు ధానుష్కులు ఒక్కసారిగా నలుదిక్కులకు బాణములు విడువవలెను. అవి నేలపై రాలుటకు పూర్వమే వానిని నేను తెచ్చి వారిచరణములకడ నుంతును. నేను బాణములు కొనివచ్చు విషయము ఘంటానాదమువలన తెలిసికొందురు గాక. నేను మాత్రము కనబడను" అని పలికెను. వారు ఒక్కమారుగా విడిచిన బాణములను హంస కొనివచ్చి వారిచరణములకడ నుంచి పోయి, రాతికంబముపై కూరుచుండి "మహారాజా, నా వేగము చూచితివా? ఈ వేగము ఉత్తమము కాదు, మధ్యమము కాదు, సామాన్యశ్రేణిలోనిది. మహారాజా, మా వేగము ఈ గతిలో నుండును" అని పలికెను.

"మిత్రమా, నీవేగము కంటె శీఘ్రతర వేగముకూడ గలదా?"

"కలదు మహారాజా, నా శ్రేష్ఠవేగముకంటె లక్షగుణముల వేగముతో ఈ ప్రాణుల ఆయుః ప్రమాణము క్షయము నొందుచున్నది, తరిగిపోవుచున్నది, వినాశము పొందుచున్నది."

ఈ ప్రకారముగా ఆయన రూపధర్మముల క్షణికనిరోధము వివరించెను. రాజు బోధిసత్త్వునిమాటలు విన్నంతనే మరణభయముచెంది, సంబాళించుకొనలేక

నేలపై బడెను. జనులు బెదరిపోయిరి. రాజుముఖముపై నీరు చల్లి ఆయనకు చైతన్యము తెప్పించిరి. బోధిసత్త్వుడు ఆయన కుపదేశ మిచ్చుచు "మహారాజా, భయపడవలదు. మరణానుస్మృతిని భావింపుము. ధర్మాచరణము చేయుము. దానములిచ్చుచు పుణ్యకర్మలు చేయుచు అప్రమత్తుడవు కమ్ము" అనెను. రాజు "స్వామీ, మీవంటిజ్ఞాని, ఆచార్యుడు లేకుండ నే నుండజాలను. చిత్రకూట పర్వతము విడిచి నాకు ధర్మోపదేశ మిచ్చుచు ఉపదేశాచార్యులుగా నిచటనే నిలువు" డని ప్రార్థించుచు ఈ గాథలు పలికెను :

వినుటచే ప్రియు లగుదు రెందరో
వీక్షణంబున ప్రీతి వోవును
వీక్షణ శ్రవణముల కొందరు
ప్రీతిభాజనులు.

నీకు నాపై ప్రీతి కలదా
నిజముగా ననుగాంచు పిమ్మట
కలదు నీయెడ నాకు మాత్రము
గాటముగ ప్రీతి.

నిలవవలె ప్రియదర్శనా, నా
నికటమున నిక హంసరాజా !

బోధిసత్త్వుడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను ;

నిత్యసత్కారాల నీమందిరమున
నిలుతునే, నైనను నీ వొక్కనాడు
మద్యపానమ్మున మత్తుడ వగుచు
హంసరాజును వండు డనవచ్చు సుమ్మి.

అపుడు రాజు మద్యపానము చేయనని ప్రతిజ్ఞ చేయువాడై ఈ గాథ పలికెను ;

నీకన్న నన్నపానీయమ్ము లెవ్వి
ప్రియతరంబులో వాని విడిచి పెట్టెదను
ప్రతిన సుమీ ! సురాపానంబు చేయ
కుండెడి యందాక నుండుమీ యిచట.

అంతట బోధిసత్త్వుడీగాథలు పలికెను :

గ్రహియింపవచ్చు సృగాలయాక్కులను,
తెలిసికోవచ్చును పులుగులయాక్కు
కాని దుర్జ్ఞేయంబు మానవయాక్కు

తొలుత మంచిమనస్సుతో నన్యజనుని
జ్ఞాతిగా మిత్రుగా సఖునిగా జూచు
వాడె యావల మారి వైరి యైపోవు.

మనసు కలిసినట్టి మానిసి దూర
వర్తియైన సమీపవర్తిగా నుండు;
మనసు కలియనట్టి మానిసి నికట
వర్తియైనను దూరవర్తియే యగును.

సన్నిధియందు ప్రసన్నచిత్తుండు
ఉదధి కావల గూడ నుండు నారీతి
సన్నిధియందప్రసన్నచిత్తుండు
ఉదధి కావలగుండ నుండు నారీతి.

శత్రువు లగువారు సవిధమందున్న
వాస్తవమ్ముగ దూరవర్తులు రాజ!
దూరమందున్న మిత్రులుగూడ రాజ,
మనసులో దగ్గర మసలిన వారె.

అంజలి ఘటియించి యాచించుచున్న
పరిజనతుల్యుల ప్రార్థనగూడ
విననిపక్షంబున నిన్నపం బాకసె
ఎడ నెడ దర్శన మీయంగ వలయు.

అప్పుడు రాజిట్లనెను ;

చిరకాలసన్నిధి చేతను ప్రియులు
అప్రియు లయిపోవు టబ్బురం బగునె ?

నీకు న ప్రియులను కాకపూర్వంబె
ఆమంత్రణము చేసి అడుగుచున్నాము.

బోధిసత్త్వు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను :

రాజ, యిట్టులు విహారము చేయునెడల
ఉభయుల కాపద యొదవద యేని
దివసంబు రేయియు తిరిగినయంత
అగును గాక పరస్పరాలోకనంబు.

ఈ విధముగా బోధిసత్త్వుడు రాజు కుపదేశ మిచ్చి చిత్రకూటమునకే పోయెను.

శాస్త ధర్మము తెలిపి "భిక్షువులారా, ఈ ప్రకారముగా పూర్వకాలము పక్షిజాతిలో పుట్టియు నేను ఆయుస్సంస్కారముల దౌర్బల్యమును నిర్దేశించి ధర్మోపదేశ మిచ్చితి" నని జాతకమును సరిపోల్చెను.

"ఆ సమయమున రాజు ఆనందుడు; చిన్నహంసపోతము మౌద్గల్యాయనుడు; విచలుడు సారిపుత్రుడు: శేషహంససమూహము బుద్ధపరిషత్తు; జవనహంస నేనే."

O

# 477. స్ధసాగద జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచున్నపుడు 'స్థూలకుమారి' పై ఆసక్తుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తిలో ఒకకుటుంబి ఇంటిలో పదునారు సంవత్సరముల చక్కని ఆడ పిల్ల కలదు. ఎవరును ఆమెను పెండ్లియాడుటకు ఇచ్ఛగించలేదు. ఆమె తల్లి "నా బిడ్డ పెద్దదియగుచున్నది. ఈమె నెవరును పెండ్లి యాడుట లేదు, మాంసపు ముక్కతో (ఎర) చేప గాలమున పడునట్లు శాక్యభిక్షువు నెవరినైన దీనిద్వారా ప్రలోభపెట్టి అతనిని గృహస్థును చేసి అతని తోడ్పాటుతో జీవిక గడపదను" అని తలపోసెను. ఆ సమయమున శ్రావస్తి నివాసి యగు నొకయువకుడు బుద్ధశాసనమునెడ భక్తితో ప్రవ్రజించి యుండెను. అతడు ఉపసంపదనుండి నియమపాలన చేయుకోరిక వీడి అలసుడై విలాసపురుషుడుగా నుండ జొచ్చెను.

మహా ఉపాసిక ఇంటిలో యవాగు, అన్యఖాద్య పదార్థములు కూడ సిద్ధము చేసి ద్వారమున నిలుచుండి సందువెంట వచ్చు భిక్షువులలో ఎవడైన నోటితీపికి వశీభూతు డగునేమో అని చూచుచుండెను. అందు చాలమంది అనుయాయులతో పోవుచున్నను త్రిపిటక అభిధమ్మ వినయధరులలో ఒకడును ఇందులకు పనికి వచ్చువాడు కానబడ లేదు. వారివెనుక పోవుచు మధుర ధర్మ కథకులు, నిర్మలాకాశసదృశులు, పిండపాతికులు అగుభిక్షువులలో గూడ తనకు తగినవాడు లభింప లేదు. ఆవల ఒకానొకవ్యక్తి కానవచ్చినాడు. అతడు కన్నులకు బైట కూడ అంజనము పూసికొని యున్నాడు. అతని వెంట్రుకలు చిక్కనివి. పట్టుబట్ట కప్పుకొని యున్నాడు. చీవరము పిక్కలవరకు కట్టినాడు. మణివర్ణపాత్రిక పట్టుకొని యున్నాడు. మనోహర మైనఛత్రము ధరించినాడు. అతనిశరీరము దృఢముగా నున్నది. ఆమె అతనిని చూచి తనలో "ఇతనిని వలలో వేసికొనవచ్చు" నని తలచి అతని భిక్షాపాత్ర తీసికొని "భన్తే, దయచేయుము" డని అతనిని ఇంటిలోనికి గొనిపోయి కూర్చుండ బెట్టి యవాగు మొదలగునవి వడ్డించి, భోజనానంతరము "భన్తే,

ఇక ఇక్కడికే వచ్చునుండుడు" అని అర్థించెను. నాటినుండి అతడచ్చటికే పోవుచు క్రమముగా విశ్వాసపాత్రు డయ్యెను.

ఒకనాడు మహా-ఉపాసిక ఇతనితో "ఈ యింట అనుభవించుటకు ధన మున్నది. కాని నిర్వహించుటకు తగినపుత్రుడు గాని, యువకుడు గాని లేడు" అనెను. ఈమె ఇట్లు పలుకుచున్న దేమని ఆతనిమనసులో జిజ్ఞాస జనిగెను. తల్లి కుమారితో "నీవు ఇతనిని ప్రలోభపెట్టి వశవర్తిని చేసికొ" మ్మని చెప్పగా ఆబాల వేషధారణము చేసి స్త్రీల కుండు హావభావములు చూపుచు ప్రలోభ పెట్టసాగెను. స్థూలకుమారి లావుగా నున్నదా, సన్నగా నున్నదా అను ప్రశ్న లేదు. పంచకామ భోగముల స్థూలత్వము వలన ఆమెకు స్థూలకుమారి యనుపేరు వచ్చెను. ఆయువ కుడు కామమునకు వశీభూతుడై "ఇపుడు నేను బుద్ధశాసనమున ప్రతిష్ఠితుడను కాలే కున్నా" నని యెంచి విహారము చేరి పాత్రము చీవరము అచట సమర్పించి ఆచార్య - ఉపాధ్యాయులతో "నేను ఉద్విగ్నచిత్తుడనై నాను" అని చెప్పగా వా రతనిని శాస్తకడకు గొనిపోయి, "భన్తే, ఈత డుద్విగ్నచిత్తుడై నాడు" అని విన్నవించిరి. "భిక్షూ, నీవు సత్యముగా ఉద్విగ్న చిత్తుడవై నావా ?" అని భగ వాను డడుగగా అతడు "భన్తే, సత్యమే" అనెను.

"ఎవరివలన ?"

"భన్తే, స్థూలకుమారివలన."

"భిక్షూ, పూర్వజన్మములో కూడ నీవు అరణ్యవాసము చేయుచున్నపు డామె నీబ్రహ్మచర్యము నాశనము చేసి అనర్థము కలిగించినది నీవు మరల ఆమెకై ఏల ఉద్విగ్నచిత్తుడ వైదువు ?"

భిక్షువులు ప్రార్థించినపిదప భగవాన్ పూర్వజన్మకథ చెప్పెను :

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు కాశీరాష్ట్రములో ఐశ్వర్యవంతుడైన ఒకానొక బ్రాహ్మణుని యింట పుట్టి, విద్యలు నేర్చి కుటుంబమును పోషించుచుండెను. ఆతనిభార్య పుత్రుని కని మరణింపగా ఆతడు "నా ప్రియభార్య కడకు మృత్యువు వచ్చుటకు లజ్జింప లేదు. నాకడకు వచ్చుటకు కూడ లజ్జింపదు. ఇంటనుండి నే నేమి చేయుదును ! ప్రవ

జింపును" అని చింతించి కామభోగ జీవనము విడనాడి, కుమారుని గైకొని హిమాలయమునకు జని ఋషిప్రవ్రజ్య చేసి ధ్యాన - అభిజ్ఞా లాభము పొంది, అరణ్యమున కందమూలాదులు భుజించుచు నివసింప జొచ్చెను.

ఆ సమయమున సీమాంతమున నున్న జనపదమునకు చోరులువచ్చి గ్రామము దోచుకొని, జనులను దాసులను చేసికొని, వారలనెత్తిపై సామాను లెత్తి వెడలి పోయిరి. వారిలో మోసము చేయ గల సుందరకుమారి ఒకతె యుండెను. ఆమె ఏదోవిధముగా తప్పించుకొని పోదలచి, "స్వామీ, శౌచము చేయవలెను" అని కొంచెము వెనుకకు తగ్గి ఆవల చోరులను మోసగించి పలాయనము చేసెను. అమె అడవిలో తిరుగుచు, పూర్వాహ్ణ సమయమున బోధిసత్త్వుడు తనకుమారుని ఆశ్రమమున విడిచి కందమూల ఫలాదులు కొనివచ్చుటకు పోయినపుడు ఆశ్రమముచేరి ఋషికుమారుని ప్రలోభ పెట్టి వశవర్తిని చేసికొనెను. "నీవు అరణ్యమున నుండుటచే లాభ మేమి? పట్టణమునకు పోవుదము రమ్ము. అక్కడ సుఖపడుటకు అన్ని వస్తువు లుండును" అని ఆమె చెప్పగా ఆతడు మంచి దని "మా నాయన కంద మూల ఫలాదులు తెచ్చుటకు అడవిలోనికి పోయినాడు. ఆయనను కలుసుకొని అవల మనముకలసి వెడలుదము" అనిపలికెను. "ఈకుర్రవానికి ఏమియు తెలియదు. ఈతనితండ్రి వార్ధకమున ప్రవ్రజించి యుండును. ఆయన వచ్చి నీ విచ్చట ఏమి చేయుచున్నావు? అని నన్ను తన్ని కాలుపట్టి ఈడ్చి అడవిలో త్రోసివేయ వచ్చును. ఆయన రాకపూర్వమే పలాయనము చేయవలెను" అనుకొని "నేను ముందుముందు నడుచుచుందును. నీవు వెనువెంటనే వచ్చుచుండు" మని చెప్పి, త్రోవగురుతులు తెలిపి ఆమె వెడలిపోయెను. ఆమె చనినతరువాత యువకుని చిత్తము అస్వస్థ మైపోయెను. వెనుకటివలె ఏపనియు చేయజాలక తల పట్టుకొని పర్ణశాలలో విచారముతో పండుకొనెను. బోధిసత్త్వుడు పర్ణశాలకు మరలివచ్చి అడుగుజాడ కనుగొని స్త్రీపాదచిహ్నము లని గ్రహించి ఇవి ఆడుదాని అడుగులు. కుమారుని భ్రష్టుని చేసి యుండనోపు నని లోన ప్రవేశించి తెచ్చినవస్తువులు దింపి కుమారుని ప్రశ్నించుచుండగా, ఈ గాథ పలికెను :

కట్టియల్ కొట్టవు, పట్టవు జలము
నిప్పు చేయవు, మరి నింగిచూచుచును
ఎందో తలంతువు మందుని భంగి.

అతడు తండ్రివాక్కులు విని లేచి ప్రణామము చేసి అరణ్యమున నివసింప తన కిచ్ఛ లే దని నివేదించుచు ఈ గాథ పలికెను :

వననివాసమువిూద వాంఛ పోయినది,
కాశ్యపా. యిచ్చట కష్టంబు మిగుల;
జననివాసమునకు జన బుద్ధి పుట్టె.

ఏజనపదమున కేగుదు నచటి
యాచారముల్ నేర్చునట్టులు నేను
ధర్మోపదేశంబు దయచేయ వలయు.

బోధిసత్త్వుడు నీకు మంచి దేశాచారము చూపెద నని ఈ గాథలు పలికెను:

కందమూలఫలాదికమ్ము కాననము,
వదలి గ్రామనివాస వాంఛయే యున్న
అనుసరించెడి ధర్మ మచటిది వినుము.

చేయగూడదు విషసేవన మెపుడు
వర్జింపవలెను ప్రపాతసన్నిధిని
పంకములో జిక్కువడ రాదు, మెలగు
జాగరూకతతోడ సర్పంబువోలె.

తపస్వికుమారుడు ఈ సంక్షిప్త కథనములోని [redacted]యర్థము గ్రహింపక పోవుటను కారణ మి ట్లడిగెను :

విషమువోలె, ప్రపాతవిధమున పంక
మట్లు లాశీవిషమట్టులు వేని
బ్రహ్మచారి గ్రహింపవలయునో చెపుమ.

అతడు దానికి వ్యాఖ్య ఇట్లు పలికెను :

వారటా, సుర యను నామంబు కలుగు
నాసవంబు మనోజ్ఞ మైనది మిగుల
పరిమళ సుందర స్వాదిష్ఠ రసము
బ్రహ్మచర్యమునకు ప్రబలవిషంబు.

స్త్రీమత్తు దగుపాని జేయు ప్రమత్తు,
ఊపివేయుచునుండు యువకచిత్తముల
వాతూలపుంజమున్ వాయువుపోలె
బ్రహ్మచర్యమున ప్రపాత మయ్యెదియె.

నారదా, లాభసత్కారముల్ యశము
అన్యదేహములయం దాదరణంబు
బ్రహ్మచర్యమునకు పంకతుల్యములు.

రాజు లున్నారు నారద, లోకమందు
శస్త్రధారులు మహైశ్వర్యంబు గల్గు
వారి కీవు సమీపవర్తి కారాదు;
బ్రహ్మచర్యమున కవ్వారుసర్పములు.

భోజనమ్మునకునై పోయెడివేళ
సముచితస్థానముల్ చక్కగా దెలిసి
భిక్షాటనమునకు వెడలుట మేలు.

పరకులంబున నన్నపానీయములను
మెండుగా సేవింపకుండుట మేలు;
తలపరా దచ్చటి తరుణులరూపు.

పానగోష్ఠికి, దుష్టపరిషత్తునకును
వెండిబంగారాల విక్రయశాల
లకును దూరముగా మెలంగుట మేలు
శకటమ్ము విషమదేశములకు బోలె.

తండ్రి చెప్పకుండగనే కుమారునకు తెలివి వచ్చి "నాయనా, నేను పత్నీజనమున్నై పోవను" అనెను. తండ్రి యువకునకు మైత్రీభావనాదికము ఉపదేశించెను. కుమారుడు ఉపదేశానుసారముగా నడుచుకొనుచు త్వరలోనే ధ్యాన - అభిజ్ఞాదులు పొందెను. ఆవల ఉభయులును ధ్యానారూఢులై బ్రహ్మలోకమున జన్మించిరి.

శాస్త ఇట్లు చెప్పి జాతకములు సరిపోల్చెను; "ఆనాటికుమారి ఇప్పటి స్థూల కుమారి; ఆ వనకుమారుడు ఉద్విగ్నచిత్త భిక్షువు; తండ్రి నేనే."

X

# 478. దూత్య జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు తన ప్రజ్ఞాప్రశంస విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ధర్మసభలో సంభాషణ జరుగుచుండెను. "ఆయుష్మంతులారా. దశబలధారి ఉపాయకుశలత కనుగొనుడు. నందకులపుత్రులకు అచ్చరలను చూపి అర్హత్వ మొసగెను. క్షుద్రపన్థకునకు వస్త్రఖండ మిచ్చి ప్రతిసంవిత్తుతో పాటు అర్హత్త్వము కూడ అనుగ్రహించెను. కుమారపుత్రునకు పద్మము చూపి అర్హతుని చేసెను. ఈ ప్రకారముగా వివిధోపాయములచే ప్రాణుల కుపదేశము చేసెను" అనుచుండిరి. శాస్త అచ్చటి కరుదెంచి విషయము గ్రహించి "భిక్షువులారా, తథాగతుడు ఇప్పుడే కాదు. పూర్వముకూడ ఉపాయకుశలుడై యుండెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యముచేయుచుండగా జనపదము జనరహితమై పోయెను. రాజు పీడించి జనపదమునుండి ధనము లాగి యుండెను. ఆ సమయమున బోధిసత్త్వుడు కాశీగ్రామమున బ్రాహ్మణకులమున బుట్టి పెరిగి పెద్దవాడైనపిమ్మట తక్షశిల చేరి, ఆవల ధర్మానుసారముగా భిక్షాటనము చేసి ఆచార్యునకు ధనము తెచ్చియిత్తు నని సంకల్పించి విద్యారంభము చేసెను. విద్యసమాప్తి అయినపిదప ఆతడు భక్తితో "ఆచార్యదేవా, గురుదక్షిణ తెచ్చియిత్తు" నని సెలవు పుచ్చుకొని జనపదమున పర్యటించి ధర్మానుసారముగా ఏడునిష్కములు సంపాదించి ఆచార్యునకు ఇత్తునని తలపెట్టెను. ఆతడు ప్రయాణము చేయుచు త్రోవలో గంగ అడ్డురాగా దాటుటకై నౌక ఎక్కెను. నౌక ఇటు నటు ఊగుచుండుటచే అతనిచేతిలోని బంగారునాణెములు నీట బడిపోయెను. "జనపదమున స్వర్ణము లభించుట మహాకష్టము. గురుదక్షిణ మరల సంపాదించుట కష్టము. నేను గంగాతటమున కూరుచుండి ఉపవసించెదను. నే నిట్లు నిరాహార దీక్షలో నున్నట్లు క్రమముగా రాజునకు తెలియును. అప్పుడు రాజు అమాత్యులను పంపును. నేను వారితో మాటాడను. అప్పుడు రాజు రానే వచ్చును. ఈ విధముగా

రాజు వలన గురుదక్షిణ లభించును" అని యతడు యోచించి గంగాతటమున ఉత్తరీయము దాల్చి, యజ్ఞోపవీతము కనబడునట్లు చేసి, వెండిఫలకము వంటి ఇసుకలో బంగరుప్రతిమవలె కూరుచుండెను. ఆతడు నిరాహారదీక్షలో నుండుట లోకులు గమనించి ఏల కూర్చుంటి వని యడిగినను సమాధాన మతడు చెప్పలేదు. మరునాడు ద్వార గ్రామవాసులు ఈ వార్త విని అచటికి పోయి ప్రశ్నించినను ఆతడు బదులు పలుకలేదు. వారాతనికష్టము చూచి విచారముతో వెడలి పోయిరి. మూడవనాడు నగరవాసులును, నాల్గవనాడు నగరములోని ఐశ్వర్యవంతులును, ఐదవనాడు రాజ్యపరిషదులును, ఆరవనాడు రాజు పంపిన అమాత్యులును వచ్చిరి. ఆతడు వారితో మాటాడలేదు. ఏడవనాడు రాజు భయముతో ఆతని కడకు పోయి ప్రశ్నించువాడై ఈ గాథలు పలికెను :

ధ్యానములు చేయుచు గంగా
తటమున గూర్చున్న విప్ర,
నేను పంపినట్టి దూత
ని న్నడిగిన యపుడు గూడ
బదులు చెప్పవైతివి, నీ
బాధ గుప్తమని తలంతు.

బోధిసత్త్వుడు విని "మహారాజా, నాకష్టమును దూరీకరింప గలవారితో చెప్పవలె నను కోరికతో అన్యులకు చెప్పలే" దని ఈ గాథలు పలికెను :

కాశీనరేశ్వరా, కష్ట మెవ్వండు
తొలగించునో వానితో చెప్పవచ్చు
వచ్చిన, బాధానివారణోపాయ
మెవ్వండు సూచించు నవ్వానితోడ
తప్పక నిజపీడ చెప్పుకోవచ్చు
గ్రహియింప వచ్చు సృగాల వాక్కులను
తెలిసికోవచ్చును పులుగులవాక్కు :
కాని దుర్జ్ఞేయంబు మానవ వాక్కు,
తొలుత మంచిమనస్సుతో నన్యజనుని
జ్ఞాతిగా మిత్రుగా సఖునిగా జూచు
వాడె యావల మారి వైరి యైపోవు.

అడుగ కున్నను నెవ్వ, రసమయంబునను
ఎవ్వండు నిజబాధ నెరిగించు వాడని
కాతని శత్రువుల్ హర్ష మొందుదురు
కాని హితైషులు కష్ట మొందుదురు.

అది మంచిసమయమే యైనచో నెదుటి
నరుడు సమానమనస్కుడు, బుద్ధి
మంతుడే యైనచో, మధురార్థవంత
వాక్కులు రానీయ వచ్చును నోట.

ఇది యయుక్తము లోకహితమున కనుచు
తెలిసికొన్నప్పుడు ధీరుండు స్వీయ
బాధను సహియింప వలయు నొంటరిగ.
హ్రీ భయ సత్యంబు నెడదలో నిలిపి.

ఈ ప్రకారముగా రాజున కుపదేశ మిచ్చి తనగురుదక్షిణ విషయమై వ్యక్తీక
రించువాడై బోధిసత్త్వు డీగాథలు పలికెను:

గురుదక్షిణార్థినై క్రమ్మరినాను
నేను మహారాజ, నిగమమ్ములందు,
రాజధానీ నగరమ్ముల, వివిధ
రాష్ట్రమ్ములందును; రాజపురుషులు
సంసారులును, మహాశాల విప్రులును
ఇచ్చిన వన్నియు నాకు బంగారు
నికషమ్ము లవి లేవు నేడు నరేశ !
అదియె చింతాహేతు వైనది నాకు.

మీ రంపుదూత మహారాజ, నన్ను
చింతావిముక్తుని చేయలే డన్న
భావాన నతనితో భాషింపనైతి.

చింతావిముక్తుని చేయంగ నేర్తు
వీవు న న్నని తోచు హేతువువలన
భాషించితిని మహాప్రభువ, నీతోన.

రాజు ఆయనధార్మిక వాక్కులు విని "బ్రాహ్మణోత్తమా; చింతింపకుము. నీగురుదక్షిణ నే నిత్తును" అని ద్విగుణముగా ధన మిచ్చెను.

ఈ యభిప్రాయము వ్యక్తీకరించుగాథ శాస్త పలికెను:

విప్రునియెడలను సుప్రసన్నతను
గాంచుచు నంతట కాశీవిభుండు
బంగారునిష్కముల్ పదునాలు గిచ్చె.

బోధిసత్త్వుడు రాజున కుపదేశ మిచ్చి, ఆచార్యునకు గురుదక్షిణ యిచ్చి దానాదిపుణ్యకార్యములు చేసెను. రాజు ఆయన ఉపదేశానుసారముగా ప్రవర్తించుచు ధర్మపాలనము చేయుచుండెను. కాలక్రమమున ఇరువురును కర్మానుసారముగా గతించిరి.

శాస్త ధర్మబోధ చేసి, "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ తథాగతుడు ఉపాయకుశలుడై యుండెను" అని జాతకములు సరిపోల్చెను. "ఆ కాలమున రాజు ఆనందుడు; ఆచార్యుడు సారిపుత్రుడు; బ్రాహ్మణ యువకుడు నేనే."

::

# 479. కళింగబోధి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు ఆనందస్థవిరుని మూలమున మహాబోధికి జరిగినపూజను గురించి చెప్పినది.

## వర్తమాన కథ

తథాగతుడు శిక్షణకోరు సంఘహితమునకై జనపదములలో పర్యటనార్థము వెడలిపోయిన పిదప శ్రావస్తివాసులు జేతవనమునకు పోయి వేరొక పూజాస్థానము కానక తాము కొనిపోయిన గంధమాల్యాదులను గంధకుటీద్వారమున పడవైచి పోవుచుండిరి. వారికి దీనివలన ప్రసన్నత కలుగుచుండెను. ఈ విషయము తెలిసి అనాథపిండికుడు తథాగతుని పునరాగమనానంతరము ఆనందస్థవిరుని కడకు పోయి "భన్తే, తథాగతుడు పర్యటనార్థము పోయినపిదప ఈ విహారమునెడ శ్రద్ధ తగ్గినది. లోకులు గంధమాల్యాదులుంచుటకు పూజాస్థానము తెలియలేదు; భన్తే, మీరు తథాగతునితో ఈ విషయము చెప్పి పూజాస్థానమునకు అవకాశ ముండునో ఉండదో కనుగొనుడు" అని విన్నవించెను. ఆయన మంచిదని తథాగతుడు వచ్చిన పిదప "భన్తే, చైత్యము లెన్ని ?" అనెను.

"ఆనందా, మూడు,"

"భన్తే, ఏ వేవి ?"

"శారీరకము, పారిభోగికము, ఉద్దేశికము."

"భన్తే, తాము సజీవులై యుండగా చైత్యము నిర్మింపవచ్చునా ?"

"ఆనందా, శారీరకచైత్యము నిర్మించుటకు వీలు లేదు. అది బుద్ధులు పరినిర్వాణము పొందినపిమ్మటనే నిర్మింప వీలుండును. ఉద్దేశికచైత్య మవాస్తవికము కేవలము మానసికము. కాని పారిభోగికచైత్యము బుద్ధులు సజీవులై యున్నపుడును, పరినిర్వాణము పొందినపుడును చైత్య మగును.

"భన్తే, తాము పర్యటనమునకు వెడలినపిదప జేతవనవిహారము నిరాధారమై పోయినది. లోకులకు పూజాస్థానము తెలియలేదు. భన్తే, మహాబోధి వృక్షము నుండి బీజములు కొనివచ్చి జేతవన ద్వారముకడ నాటెదను."

"మంచిది ఆనందా, ఇట్లు చేసినచో జేతవనమున స్థిరనివాసము ఏర్పడినట్లుండును."

స్థవిరుడు అనాథపిండికునకు, విశాఖకు, రాజునకు చెప్పి జేతవన ద్వారముకడ బోధివృక్షస్థాపనకై గుంట త్రవ్వించి, మహామొగ్గలాన స్థవిరునితో "భన్తే, నేను జేతవనద్వార సమీపమున బోధికి స్థాన మేర్పాటు చేయుదును. మహాబోధి నుండి ఫలములు కొనిరండు" అని చెప్పగా, ఆయన మంచిదని ఆకాశమార్గమున బోధిస్థానము చేరి, కత్తెరతో కొట్టకుండ, నేలపై స్వయముగా రాలిన పండ్లు చీవరమున మూట గట్టుకొని తెచ్చి యిచ్చెను. ఆనందస్థవిరుడు నేడు బోధిబీజములు నాటునని కోసలనరేశునకు వార్త పంపెను. రాజు సాయంసమయమున వైభవముతో సమస్తసామగ్రులతో వచ్చెను. అనాథపిండికుడు, విశాఖ, అన్యసాంఘుజనులు కూడ విచ్చేసిరి. స్థవిరుడు మహాబోధి బీజారోపము చేయుతావున పెద్ద సువర్ణకటాహము నిలిపి అడుగున రంధ్రము చేయించి సుగంధమృత్తిక కటాహమున నింపి, గింజలు రాజు చేతి కిచ్చుచుండె "మహారాజా, బోధిబీజములు మీరు చల్లు" డని చెప్పెను. రాజు "రాజ్య మెల్లపుడును మా చేతులలో నుండదు. అనాథపిండికుని చేత, ఈ కార్యము చేయింప వలె" నని తలచి బీజములు మహాశ్రేష్ఠిచేతిలో నుంచెను. అనాథపిండికుడు సుగంధమృత్తికను కదిలించి అందు గింజల నుంచెను. అతడు బీజారోపణము చేయుచుండగనే అందరు చూచుచుండ బోధివృక్షము నాగలి కొనవలె సూటిగా ఏబదిమూరలు పైకిలేచి నిలిచెను. నాలుగువైపులను అగ్రమునను ఏబదిమూరల మహాశాఖలు ఐదు వ్యాపించినవి. అది జ్యేష్ఠవృక్ష మయ్యెను. ఎల్లరకు మహాశ్చర్య మయ్యెను. రాజు సుగంధజలముతో నిండిన ఏడువందల వెండిబంగరు ఘటములపంక్తి మహాబోధికి నలుప్రక్కల పెట్టించెను. పూర్ణకుంభములలో నీలోత్పలము లుంచిరి, రత్నమయవేదికలు ఏడు నిర్మించిరి. బంగరుపొడి కలిపినఇసుక చల్లిరి. నలుప్రక్కల ప్రాకారము లేచినది. సప్తరత్నమయ ద్వార కోష్టకము నిర్మించిరి. గొప్పపూజ జరిగినది. ఆనందస్థవిరుడు తథాగతుని సమీపించి "భన్తే, తాము బోధివృక్షముక్రింద ఏధ్యానము చేసితిరో లోకహితార్థము ఈ మహాబోధివృక్షముక్రింద ఆ ధ్యానము చేయు" డని విన్నవించెను.

“ఆనందా, ఏమంటివి! నేను మహాబోధి వృక్షము క్రింద చేసినధ్యానము మరియొకచోటు సహింపనేరదు.”

“భన్తే, లోకహితార్థము ఈ ప్రదేశసామర్థ్యానుసారముగా ఈ బోధివృక్షము క్రింద తాము ధ్యానముచేతురుగాక!”

శాస్త అచట ధ్యానసుఖమున ఒకరాత్రి గడపెను.

స్థవిరుడు. కోసలనరేశుడు మొదలగువారికి చెప్పి, బోధిపూజ చేయించెను. ఆనందస్థవిరునివలన ఉద్భూతమైన బోధివృక్షమునకు ఆనందబోధి యను ప్రసిద్ధ నామ మేర్పడెను. ధర్మసభలో భిక్షువులు “ఆయుష్మంతులారా, ఆయుష్మాన్ ఆనందుడు తథాగతుడు సజీవుడై యుండగనే బోధి స్థాపించి మహాపూజలు చేయించెను. ఆహా, మహాస్థవిరు డెంత గుణవంతుడు!” అనుచుండగా శాస్త అచటి కరుదెంచి “భిక్షువులారా, ఆనందుడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఉపద్వీపములతో కూడిన నాలుగు మహాద్వీపములకు లోకులను గొనిపోయి బహుసుగంధ మాల్యాదులు తెప్పించి మహాబోధి మంటపమున పూజ చేయించినా” డని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున కళింగరాష్ట్రమున దంతపురమున కాళింగరాజు పరిపాలన చేయుచుండెను. ఆయనకు పెద్దకాళింగుడు, చిన్నకాళింగుడు అను ఇరువురుపుత్రు లుండిరి. పెద్దకాళింగుని విషయములో జనకుని మరణానంతర మతడు రాజగుననియు, చిన్నవాడు ఋషిప్రవ్రజ్య స్వీకరించి భిక్షాటనము చేసినను ఆయనపుత్రుడు చక్రవర్తి యగు ననియు దైవజ్ఞులు చెప్పియుండిరి. కాలక్రమమున తండ్రి మరణానంతరము పెద్దవాడు రాజు, చిన్నవాడు ఉపరాజు నయిరి. తనకుమారుడు చక్రవర్తి యగు నని, చిన్నవాడు విశేషాభిమానము వహించెను. రాజు సహనము కోల్పోయి చిన్న కాళింగుని బంధింపు మని ఒకానొకహితైషికి ఆజ్ఞ ఇచ్చెను. ఆతడు చని చిన్నవానితో “మిమ్ము బంధింపు మని రాజు నా కాన తిచ్చినాడు. ప్రాణములు దక్కించుకొనవలె” నని చెప్పెను. చిన్నకాళింగుడు తనముద్రను సూక్ష్మకంబళమును ఖడ్గమును హితైషియగు అమాత్యునకు చూపి “ఈ మూడువస్తువులను చూపిన నా కుమారునకు రాజ్య మీయవలెను” అని, అరణ్యమునకు జని ఋషిప్రవ్రజ్య గైకొని నదీతీరమున రమణీయస్థానమున ఆశ్రమము నిర్మించుకొని నివసింపజొచ్చెను.

మద్రరాష్ట్రమున సాగల నగరమున మద్రనరేశునికి కుమారి జన్మించెను. ఆమెవిషయమున జ్యోతిష్కులు "ఈమె భిక్షాటనము చేసి జీవించును. కాని ఈమె పుత్రుడు చక్రవర్తి కాగలడు" అని భావిఫలితము చెప్పిరి. అవల జంబూద్వీపము లోని రాజులు ఈ వృత్తాంతము విని గుమిగూడి వచ్చి నగరము చుట్టు ముట్టిరి. మద్రరాజు తనలో "ఈమెను ఒకని కిచ్చితినేని తక్కినవారికి క్రోధము కలుగును" అనుకొని భార్యను, పుత్రికను వెంట బెట్టుకొని వేషములు మార్చి అరణ్యమునకు పలాయనము చేసెను. వనములో కాళింగ కుమారుని ఆశ్రమమునకు పైభాగమున ఆశ్రమము నిర్మించుకొని ప్రవ్రజించి ఉంఛవృత్తితో జీవనము చేయుచు నివసించు చుండెను. కుమారికకు కష్టము కలుగ కుండ ఆశ్రమమున విడిచి తలిదండ్రులు ఫలమూలాదులు తెచ్చుటకై అడవిలోనికి బోవుచుందురు. వారు లేనపుడు కుమారి వివిధ పుష్పములు ప్రోగు చేసి దండ గ్రుచ్చుచుండును. అచట గంగ యొడ్డున ఆమ్రవృక్షము కలదు. వృక్షశిరము బాగుగా పెరిగి చెట్టెక్కుటకు మెట్లవలె వీలేర్పడెను. ఆమె చెట్టెక్కి ఆట లాడి పూదండలు నీటిలో విడుచుచుండెడిది. ఒక నాడు కాళింగుడు నదిలో స్నానము చేయుచుండ పుష్పదామము అతని తలకు చుట్టుకొనెను. దానిని జూచి అతడు దండ ఎట్టి స్త్రీ కట్టినది ? యువతియా, వృద్ధాంగనయా ? వృద్ధాంగన కాదు, యువతి కట్టినదే; ఈ విషయము పరీక్షింప వలె నని ఆసక్తచిత్తుడై గంగాతీరము పైభాగము చేరి అచటి ఆమ్రవృక్షముపై గీత మాలాపించు యువతిని గాంచి "భద్రే, నీపే రేమి ?" అని ప్రశ్నించెను.

"స్వామీ, నేను మానవస్త్రీని."

"అయినచో దిగుము."

"స్వామీ, దిగజాలను. నేను క్షత్రియస్త్రీని."

"భద్రే, నేను కూడ క్షత్రియుడను. దిగుము."

"స్వామీ, అన్నంతమాత్రమున ఎవరును క్షత్రియులు కాలేరు. మీరు క్షత్రియు లైనచో క్షత్రియమాయ చెప్పుడు."

వారు అన్యోన్యము క్షత్రియమాయ చెప్పుకొనిరి. రాజకన్య క్రిందికి దిగినది. అంతట వారికి సహభోగ మేర్పడెను.

తలిదండ్రులు ఆశ్రమమునకు తిరిగివచ్చినపిదప ఆమె వారితో కాళింగ రాజపుత్రునితో సమావేశమునుగూర్చి విపులముగా తెలిపెను. 'వారు మంచి దని

స్వీకరించి ఆమె నాతని కిచ్చిరి. దంపతులు ప్రేమపూర్వకముగా సహవాసము చేయుచుండుటవలన రాజకన్య గర్భము ధరించెను. పదిమాసములు నిండినపిమ్మట ధాన్య, పుణ్య, లక్షణోపేతు డైన పుత్రుడు కలిగెను. బిడ్డనికి కాళింగు డని పేరు పెట్టిరి.

ఆతడు పెరిగిన పిదప తండ్రికడను, తాతకడను విద్యలు నేర్చెను. ఒక నాడు కాళింగుడు నక్షత్రయోగమును బట్టి తనసోదరుడు మరణించె నని తెలిసికొని కుమారునితో "నీ పెదతండ్రి పెద్దకాళింగుడు మరణించినాడు. నీవు దంతపురమున కరిగి పరంపరాగత మగురాజ్యమును గైకొమ్ము" అని ముద్రిక, కంబళము, ఖడ్గము నాతని కిచ్చి "బాబూ, దంతపుర నగరములో ఫలానివీధిలో మనహితైషి యగు అమాత్యు డున్నాడు. సంధ్యానంతరము నీవు పోయి ఈ మూడు వస్తువులాయనకు చూపి నా పుత్రుడ వనువిషయము తెలియపరచుము. ని న్నాతడు సింహాసనమున ప్రతిష్ఠించు" నని పలికెను. కుమారుడు తలిదండ్రులకు, మాతామహికి, పితామహులకు ప్రణామము చేసి బుద్ధిబలముచే ఆకాశమార్గమున జని అమాత్యుని మంచము కడ దిగెను. "ఎవరు నీ?" వని యాతడు ప్రశ్నింపగా, చిన్న కాళింగుని పుత్రుడ నని మూడు వస్తువులను చూపెను. అమాత్యుడు రాజ్యపరిషత్తునకు తెలియజేసి నగరము నలంకరించి కుమారునిశిరముపై ఛత్రము పట్టించెను.

కాళింగ భారద్వాజు డను పురోహితుడు ఆతనికి చక్రవర్తిధర్మములు ఏడింటిని వివరించెను. రాజు వానిని పాలించుచుండెను. పూర్ణిమ ఉపవాస దినమున చక్రసరోవరమునుండి చక్రరత్నము, ఉపోసథకులమునుండి హస్తిరత్నము, వలాహక కులమునుండి అశ్వరత్నము, వైపుల్యమునుండి మణిరత్నము వచ్చినవి. స్త్రీ, గృహపతి, పరిణాయక రత్నములు ప్రకటము లయ్యెను. సమస్త చక్రవాళము నడుమ నున్న రాజ్యము పొంది ఒకనా డతడు ముప్పదియారు యోజనముల పొడవున నిలిచిన అనుయాయులను వెంట గొని కైలాసకూట సదృశ మగు శ్వేత గజము నెక్కి సంరంభముతో తలిదండ్రులకడకు జనెను. సర్వబుద్ధ సమాధిస్థాన మగు భూమధ్యబిందువు మహాబోధిమంటపము పైకి ఏనుగు పోవజాల దయ్యెను. రాజు మాటిమాటికిని ప్రేరించినను హస్తి పోవలేకుండెను.

ఈ యభిప్రాయమును ప్రకటించువాడై శాస్త ఈ గాథ పలికెను :

ధారుణి ధర్మమునాధారంబు గాను
పరిపాలనము చేయు ప్రభువు కాళింగ

చక్రవర్తి మదేభసహితుడై బోధి
మంటప నవిధంపు మహి జేరినాడు.

రాజువెంట బోవుచున్న రాజపురోహితుడు తనలో "ఆకసమున ఆతంక మేమియును కానబడదు. కారణ మేమి ? రాజు ఏనుగును ముందరికి నడుపలే కున్నాడు. నేను విషయమును కనుగొందును" అనుకొని ఆకసమునుండి దిగి సర్వ బుద్ధ ధ్యానస్థాన మగు భూమధ్యబిందు మహాబోధి మంటపము గాంచెను. ఆసమయ మున అచట కరీషమాత్రస్థలమున కుందేటిమీసమంత తృణము మొలవ లేదు. వెన్నెలవలె నున్నఇసుక వ్యాపించి యున్నది. తృణలతలు వనస్పతులు బోధి మంటపమునకు ప్రదక్షిణ చేయుచున్నటుల నాలుప్రక్కల చుట్టుకొని యుండి మంటపమున కెదురుగా నున్నవి. బ్రాహ్మణుడు ఆ ప్రదేశము చూచినంతనే "ఇది సర్వబుద్ధస్థానము, సర్వక్లేశ నాశనస్థానము. శక్రాదులు కూడ దీనిమీదుగా పోజా లరు," అని భావించి కాళింగనరేశుని కడకు బోయి బోధిమండప మాహాత్మ్య మును వినిపించి చేతులు పట్టుకొని క్రిందికి దిగు మని చెప్పెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త ఈ గాథలు పలికెను ;

శ్రమణపుత్రుడు కాళింగ చక్రవర్తి
నిలుచు నేల పరీక్షించి నిజకరముల
నంజలించి "మహారాజ, హస్తి దిగుడు,
భూమిభాగము మిక్కిలి పూజ్య మిద్ది
బుద్ధు లీధారుణి నభిసంబుద్ధు లగుచు
దీప్తి గాల్చిరి; తృణలతల్ దీనిచుట్టు
కొన్నవి ప్రదక్షిణము చేయుచున్నమాడ్కి.

మేదినీమండపం బని మీరు వినరొ ?
సాగరముదాక వ్యాపించి సర్వజంతు
తతిని భరియించుచున్నట్టి ధారుణి కిది
మండపము; డిగ్గి దీని నమస్కరించు.

కులము గల్గినగజము లీస్థలికి రావు,
ఆభిజాత్యము కల్గినహస్తి నీది.
ఎంత ప్రేరేచువా యిభ మంతవరకె
రా గలుగు" నంచు పలికెను.

రాజు లక్ష
ణజ్ఞు డౌ విప్రువాక్కు గుణంబు చూడ
దలచి వజ్రాంకుశంబుతో దాని బొడిచె.

పోటుతిన్న మదేభము భూరిభార
సహనశక్తి గోల్పోయిన చందమునను
క్రింద నుపవేశనము చేసె ఘీంకరించి.

మాటిమాటికిని అంకుశముపోటు తగులుటచే ఏనుగు బాధ సహింపనేరక ప్రాణములు విడిచెను. ఈ సంగతి తెలియక రాజటులే కూరుచుండి యుండెను. కాళింగ భారద్వాజుడు "మహారాజా, హస్తి చనిపోయినది. వేరొకయేనుగుపై నెక్కు" డని చెప్పెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త ఈ గాథలు పలికెను ;

కుంభి ప్రాణమ్ములు కోల్పోయినట్టు
కాళింగ విప్రుండు కనుగొన్నయంత
రయమున బల్కెను: "రాజ ఈ గజము
మృతము, వేరొకహస్తి నెక్కగా వలయు.

పుణ్య బుద్ధిబలమువలన ఉపోసథ కులమునుండి వేరొకయేనుగు వచ్చి రాజసముఖమున పీఠభాగము వంచెను. రాజు దానిపై నెక్కి కూరుచుండెను. ప్రాణములు పోయినయేనుగు ఆ క్షణమున నేలపై బడెను.

ఈ యర్థమును ప్రకటించుటకై ఈ గాథ పలికెను :

వినుచు కాళింగుడు వెంటనే అన్య
హస్తిసమీపాన కరిగినంతటనె
మృతమైననాగము మేదిని బడియె,
లక్షణజ్ఞుల వాక్కుల ప్రకారముగ.

అంతట రాజు ఆకసమునుండి దిగి బోధిసత్త్వమంటపము చూచి ఆశ్చర్యముతో భారద్వాజుని ప్రశంస చేయుచు ఇట్లనెను :

రాజు కాళింగ భారద్వాజులతోడ
"సంబుద్ధ సర్వజ్ఞ సర్వసందష్ట
వీ" వని పల్కె సహీనాదరమున.

బ్రాహ్మణుడు ప్రశంసకు ఆశలేక తనను నిమ్నస్థానమున నిలుపుకొని బుద్ధులను ఉచ్చస్థానమున నుంచి వారిగుణవర్ణనము కావించెను.

ఈ యర్థమును ప్రకటించుటకై శాస్త ఈ గాథలు పలికెను :

ఆభూషణమ్ముల నంగీకరింప
కిట్లు కాళింగ మహీసురుం డనియె:
"ఏము లక్షణముల నెరుగుదు మంతె
శాస్త సర్వజ్ఞుండు సర్వవేత్తయును
సర్వంబు నెరుగు లక్షణములంబట్టి
తెలిసికొందుము శాస్త్రబలముచే మేము."

రాజు బుద్ధగుణముల నాకర్ణించి ప్రసన్నుడై చక్రవాళనివాసులకడనుండి సుగంధమాల్యములు తెప్పించి సప్తాహకాలము మహాబోధిమంటపమున పూజలు చేయించెను.

ఈ యర్థమును ప్రకటించుచు శాస్త ఈ గాథలు పలికెను :

మంగళవాద్యముల్ మార్మ్రోగుచుండ
పూజించి సంబోధి, పుష్పమాలికలు
వివిధగంధమ్ములు, వివిధానులేప
నాగులు తెప్పించి యవనీశ్వరుండు
ప్రాకారనిర్మాణ పరిధి కావించె.

ఆవల కాళింగు డరువదివేల
బుట్టల పూవులు గుట్ట కావించి
బోధివృక్షమ్మును పూజించినాడు.

ఈ విధముగా మహాబోధిని పూజించి రాజు తలిదండ్రులను వెంట గొని దంతపురము చేరి దానాదిపుణ్యకార్యములు చేసి త్రయస్త్రింశభవనమున జన్మించెను.

శాస్త ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఆనందుడు ఇప్పుడే కాదు, పూర్వము కూడ బోధిపూజ చేసియుండెను." అని చెప్పి జాతకములు సరిపోల్చెను. "ఆ కాలమున కాళింగుడు ఆనందుడు; కాళింగ భారద్వాజుడు నేనే."

# 480. అకిత్తి జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు శ్రావస్తినివాసి యగు దానశీలుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు శాస్తను నిమంత్రించి సప్తాహముపాటు బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు మహాదానములు చేసెను. తుదిని ఆర్యసంఘమునకు ఆవశ్యకపదార్థములన్నియు ఇచ్చెను. శాస్త పరిషన్మధ్యమున కూరుచుండి దానానుమోదనము చేయుచు "ఉపాసకా, నీవు గొప్పత్యాగము చేసినావు, నీవు చేసినది దుర్ఘటకార్యము. ఈ దానపరంపర ప్రాచీనపండితుల దానపరంపర. గృహస్థు, ప్రవ్రజితుడు కూడ చేయ తగినదే. పూర్వకాలపు పండితులు అడవిలో నివసించుచు కందమూలములను అకులలములు తినుచు, అన్యయాచకులకు అన్నియు నొసగుచుండిరి" అనెను.

"భన్తే, ఇది యంతయు లోకమునకు తెలిసెను. కాని ఆము సెల విచ్చినది మాత్రము తెలియదు. నాకు దానిని తెలుపుడు" అని వారు ప్రార్థింపగా, శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల ధనము గల బ్రాహ్మణుని కుటుంబమున జన్మించెను. అతనికి అకీర్తి అని పేరు పెట్టిరి. బాలునికి కాలినడక వచ్చునప్పటికి చెల్లెలు పుట్టినది. ఆమెకు యశోవతి అని పేరు పెట్టిరి. బోధిసత్త్వుడు పదునారేండ్ల వయసున తక్షశిలకు పోయి సమస్తవిద్యలు నేర్చి మరలి వచ్చెను. తలిదండ్రులు గతించిరి. అతడు శ్రాద్ధకర్మలు చేసినపిమ్మట ధనవిషయమై లెక్కలు చూచెను. ఫలాని లెక్కన ఇంత యని ఫలాని లెక్కన ఇంతయని ధన మున్నట్లు తేలెను. అతనికి వైరాగ్యము కలిగి ధనము మాత్రము కానబడుచున్నది, ధనము సంగ్రహించినవారు మాత్రము కానబడుట లేదు, ఎల్లరును ధనము విడిచి పోయినారు. దీనితో

నేనేమి చేయుదును? అనుకొని, చెల్లెలిని పిలిచి "నీవు ఈ సంపదను నిర్వహింపు" మనెను.

"నీయభిప్రాయ మేమి?"

"నేను ప్రవ్రజింప దలచినాను."

"అన్నా, నీవు త్యజించినదాని నెట్లు గైకొందును?"

"దీనితో నాకు పని లేదు."

"నేనుగూడ ప్రవ్రజింతును."

అతడు రాజాజ్ఞ గైకొని ధనార్థు లగుపండితులు మాయింటికి వత్తురు గాక అని చాటబంచెను. ఆతడు సప్తాహకాలను మహాదానములు చేయుచున్నను ధనము తరగలేదు. అప్పు డతడు "ఆయుస్సంస్కారములు క్షయ మైపోవుచున్నవి. ఈ ధనక్రీడతో నా కేమి పని? అర్థార్థులు వచ్చి స్వయముగా తీసికొని పోవచ్చును" అని ద్వారము తెరచి చాటింపించెను. ఈ విధముగా స్వర్ణముతో నిండినధనము వదలి జ్ఞాతులు దుఃఖించుచుండగా ఆతడు సోదరిని వెంట బెట్టుకొని ఆకీర్తి ద్వారమని అవల తనపేర వచ్చిన ద్వారము వెంట వారాణసి వదలి బయలుదేరెను. అతడు దాటిన నదీతటమునకు అకీర్తితీర్థ మని పేరు వచ్చెను. వారిరువురును మూడుయోజనములు నడచిన పిమ్మట ఒకానొక రమణీయస్థానమున కుటీరము నిర్మించుకొని ప్రవ్రజించిరి. ఆవల గ్రామ, నిగమ రాజధానీ నివాసులలో చాలమంది ప్రవ్రజించిరి. సమూహము పెరిగిపోయెను. లాభసత్కారములు విశేషముగా లభించుచుండెను. బుద్ధుని జన్మ సమయమువలె నయ్యెను.

అప్పుడు బోధిసత్త్వుడు తనలో "లాభసత్కారములు పెరిగిపోయినవి. మండలికూడ పెరిగినది. నేను ఒంటరిగా నుండవలెను" అనుకొని చెల్లెలికికూడ చెప్పకుండ ఏకాకిగా బయలుదేరి తమిళరాష్ట్రము చేరెను. అచట కావీర పట్టణము కడ ఉద్యానమున నివసించుచు లబ్ధధ్యాను డయ్యెను, అచ్చటకూడ ఆతనికి లాభ సత్కారములు జరుగజొచ్చెను. విరక్తిచే నాతడు తత్ప్రదేశము విడిచిపెట్టి ఆకాశ మార్గమున నాగద్వీపమునకు సమీపమున కారద్వీపమున దిగెను, అచ్చట నతడు చాలపెద్ద ఆశవృక్షముకడ పర్ణశాల నిర్మించి నివసింప జొచ్చెను. అత డచట నుండెనని ఎవరికి తెలియదు. ఆతని సోదరి అతని నన్వేషించుచు తుదకు తమిళ

రాష్ట్రము ప్రవేశించెను. ఆత డచట కానబడనందున ఆమె ఆతనిపూర్వనివాస స్థానమున నిలిచిపోయెను. ఆమెకు ధ్యానలాభము కలుగలేదు. బోధిసత్త్వుడు అల్పేచ్ఛువు అగుటచే ఎక్కడికిని పోవువాడు కాడు. ఆ చెట్టున పండ్లు పండినపుడు ఫలములు తినెడివాడు. ఆకులు వేయునపుడు ఆ పత్రములను నీటిలో ఉడకబెట్టి తినెడివాడు. ఆయన సదాచారతేజస్సువలన పాండుకంబళవర్ణము కల శక్రుని శిలాసనము వేడి యెక్కెను. "ఎవడు నన్ను ఈస్థానమునుండి దిగలాగ దలచుచున్నాడు?" అని యోచించి ఈ పండితు డని తెలిసికొని, ఈ తపస్వియుద్దేశ్యము శీలరక్షణమా, శక్రపదవీ వాంఛయా, కాక అన్యమా. అని తలపోసి ఆతనిని పరీక్షింప నెంచెను. శక్రుడు బ్రాహ్మణవేషము ధరించి "ఈతడు చాల శ్రమ కోర్చి జీవిక నడుపుచున్నాడు. నీటిలో ఉడకబెట్టిన ఆకులు తినుచున్నాడు. ఇతడు శక్రత్వమును కోరుచున్నపక్షమున నీట దడిపినపర్ణములు నా కీయడు. పదవిని వాంఛింపనిచో నా కిచ్చును" అని నిర్ణయించుకొని శక్రుడు బ్రాహ్మణరూపమున అతనికడకు జనెను.

బోధిసత్త్వుడు కారవృక్షపర్ణములను ఉడకబెట్టి చల్లారినతరువాత భుజింప నెంచి కుటీరద్వారమున కూరుచుండెను. శక్రు డాతనియెదుట నిలువగా బోధిసత్త్వునకు సంతోషము కలిగెను. "ఈతడు యాచనార్థము వచ్చినాడు; నా మనోరథపూర్తి యగునట్లు దాన మిత్తును. ఈ దానము సర్వజ్ఞతాజ్ఞానమునకు ప్రత్యయ మగుగాక" అనుకొని గిన్నె తీసి తన కేమియు మిగుల్చుకొనక యాచకుని భిక్షాపాత్రమున ఆకు నుంచెను. బ్రాహ్మణుడు దానము స్వీకరించి కొలదిదూరము పోయి అంతర్ధాన మయ్యెను. బోధిసత్త్వుడు మరల వండక ప్రీతితో కాలము గడపెను. మరునాడుకూడ ఆకులు వండి పర్ణశాలద్వారమున గూరుచుండియుండ శక్రుడు బాహ్మణరూపమున వచ్చెను. మరల దాన మిచ్చి బోధిసత్త్వుడు వెనుకటివలెనే సుఖముగా రోజు గడపెను. మూడవనాడు గూడ అట్లే జరిగెను. బోధిసత్త్వుడు "ఓహో నా కెంతలాభము కలిగినది ? కారవృక్ష పర్ణములవల్ల నా కెంతో పుణ్యము లభించినది" అనుకొని ప్రసన్నచిత్తముతో నుండెను. నిరాహారుడగుట వలన ఆతడు దుర్బలుడై మధ్యాహ్నసమయమున ఆకులు తెచ్చుటకు పోలేక పర్ణకుటీరద్వారమున కూరుచుండెను, శక్రుడు వచ్చి చూచి, "ఈ బ్రాహ్మణుడు మూడురోజులనుండి ఆహారము లేకున్నను ప్రసన్నచిత్తముతో దానమిచ్చినాడు. ఈతనిమనసున లేశమైనను వికారము లేదు. ఈత డేయుద్దేశ్యమున దాన మిచ్చుచున్నాడు ? తెలియుట లేదు. అడిగి తెలిసికొందు" నని యోచించి రెండుజాములు గడిచిన

పిమ్మట బాలసూర్యునివలె వెలుగుచు దర్పముతో బోధిసత్త్వునియెదుట నిలిచి "తపస్వీ, వేడిగాలి తోలుచున్నది. ఈ అడవిలో ఉప్పునీరే లభించును. ఇట్టిచోట నుండి ఏల తపస్సు చేయుచున్నా ?" వని యడిగెను.

ఈ యభిప్రాయమును వెల్లడించుచు శాస్త ఈ గాథలు పలికెను :

ఇంద్రుడు తపస్వి గన్గొని యిట్టు లనియె:
ఓమహా బ్రహ్మ, ఎండలో నొంటరిగను
తపము చేయుటలోని తాత్పర్య మేమి ?

బోధిసత్త్వుడు విని అతడు శక్రుడని తెలిసికొని ఈయన సంపత్తి నాకు వలదు, సర్వజ్ఞత్వము పొందుటకై చేయుచున్నానని తెలుపుటకై ఈ గాథ పలికెను:

జన్మ మెత్తుట పలుసార్లు శ్రమము శక్ర !
దేహనాశము బాధ, సమ్మోహమృతియు
వ్యథ నొసంగును నాసవ, అందుచేత
ఒంటిగ తపస్సు చేయుచు నున్నవాడ.

విని శక్రుడు ప్రసన్నుడై తనలో "ఈతడు సర్వప్రపంచ విషయమై వైరాగ్యయుక్తుడై నిర్వాణముకొరకు అడవిలో నివసించుచున్నాడు. ఇతనికి వర మిత్తు" అనుకొని, వరముకోరు మని ఈ గాథ పలికెను :

ఓయి కాశ్యప, నీసుందరోచితహిత
భాషితమ్ముకు నురూపవరము నీయ
దలచినా, నిచ్చ వచ్చిన దాని నడుగు.

బోధిసత్త్వుడు వరము కోరుచు ఈ గాథ పలికెను :

సర్వభూతేశ్వరుండవు శక్ర, నాకు
వరము నీయంగ దలచినవాడ వేని
దార, సంతతి, ధాన్యము, ధనము, వస్తు
జాత ముండియు సంతుష్టి జనుడు కాంచె
నైన పొందడో దేనిచే, నట్టిలోభ
గుణము నాలోన లేకుండ గోరుకొందు.

శక్రుడు ప్రసన్నుడై ఇంకను వరమీయ దలచెను, బోధిసత్త్వుడు వరము గ్రహించుచున్నాడై ఈ గాథలు పలికెను :

సర్వభూతేశ్వరుండవు శక్ర ! నాకు,
వరము నీయంగ దలచినవాడ వేని,
క్షీణతం బొందు కనకంబు క్షేత్రములును
వస్తువులు జంతువులు పరివారజనము
అంకురింపగ నెయ్యది, అట్టిద్వేష
గుణము నాలోన లేకుండ గోరుకొందు.

సర్వభూతేశ్వరుండవు స్వామి, శక్ర,
వరము నీయగ దలచినవాడ వేని
భాషణము, దర్శనము, సహవాస సంగ
తులును, ప్రీతియు మూర్ఖునితోడ నాకు
నెన్నడుం గల్గకుండగా నిమ్ము వరము.

శక్రుడు :

కాశ్యపా, నీ కపకారము చేసె
నాకొక్కమూర్ఖుడు ? వానిదిక్కు వీక్షింప
గోరవు, తెలుపుమా కారణం బేమొ.

కశ్యపుడు ;

అడుగు మూర్ఖుండు వ్యత్య స్తమార్గమున
ఆచరించుచునుండు ననుచితకర్మ,
దుష్కర్మ మేలుగా దోచు నాతనికి.
తోచు సద్వాక్కులు దుష్టవాక్కులుగ
ఎరుగడు నిగ్రహం బేమాత్ర మతడు,
శుభ మగు వానిని జూడకుండుటయే.

సర్వజీవేశ్వరా, శక్ర, వరంబు
దయచేయగా నీకు తల పున్నయెడల
ధీరదర్శనమును, ధీరసంగతియు

ధీరసల్లాపంబు, ధీమానురక్తి
సతతంబు నాకు ప్రసాదింపవలయు.

శక్రుడు :

ఒనరించెనా ధీరు డుపకృతి నీకు ?
ధీమానురక్తికి కారణం బేమి ?

కశ్యపుడు :

ధీరుండు యుక్తమౌ తెరవున జనును,
ఉచితకర్మంబుల నాచరింపుచుండు,
సల్లాపనము చేయు సత్యవాక్కులనె
తద్దర్శనము శుభదాయకం బగును.

సర్వభూతేశ్వర స్వామి, ఓ శక్ర,
సూర్యోదయం బగుచుండగా దివ్య
భోజనం బమరుత ! పుణ్యాత్ములైన
యాచకజనులు నా కమరగా వలయు.

కావింపుచుందును గాక దానములు,
ద్రవ్య మక్షయముగా తనరుచు గాక,
దానవేళ ప్రసన్నతయె యుండు గాక,
నా కనుతాపంబు లేకుండు గాక !

సర్వభూతేశ్వరా, శక్ర, నీ వింక
నా కడ కెన్నండు రాకుండ వలయు.

శక్రుడు :

సాదర్శనార్థము నరులు సాధులును
ధర్మకార్యాలు వ్రతాలు చేయుదురు:
వెర పేల నీకు నావీక్షణ మున్న ?

కాశ్యపుడు :

నిఖిలవాంఛితములు నెరవేర్చు తావ
కీనవర్ణము విలోకించుచు నున్న,
తపసులోనను ప్రమాదము సంఘటిల్లు
ననుభీతి కలదు నీయాలోచనమున.

శక్రుడు "మంచిది భన్తే, నేటినుండి నేను నీ కడకు రాను" అని ఆయనకు ప్రణామము చేసి, క్షమింపు మని వేడి వెడలిపోయెను. బోధిసత్త్వుడు జీవితాంతము వరకు అచటనే యుండి బ్రహ్మవిహారములను భావించి బ్రహ్మలోకమున జన్మించెను.

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. "ఆ కాలమున శక్రుడు అనురుద్ధ పండితుడు; అకీర్తిపండితుడు నేనే."

---

# ౪౮౧. తక్కారియ జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు కోకాలిక భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకానొక వర్షాకాలమున ఇద్దరు అగ్రశ్రావకులు భిక్షుమండలినుండి విడివడి ఏకాంతవాసము చేయుకోరికతో శాస్త అనుజ్ఞబడసి కోకాలిక రాష్ట్రమున నున్న కోకాలిక భిక్షుస్థానము చేరి "ఆయుష్మన్ కోకాలికా, నీవలన మేము, మావలన నీవును సుఖపడ గలము. ఈ మూడుమాసముల పాటు మేము ఇచట నుందుము" అని చెప్పిరి,

"ఆయుష్మంతులారా, నావలన మీ కేమి సుఖము లభింపగలదు ?"

"ఆయుష్మన్, అగ్రశ్రావకు లిరువురు నిచట నున్నారని నీ వెవ్వరికిని చెప్పనిచో మే మిచట నుందుము. ఇదియే మాకు నీవలన లభించు సుఖము."

"మీవలన నా కేమి సుఖము లభించును ?"

"మేము నీకు మూడు మాసములపాటు ధర్మకథలు వినిపింతుము. ఇది మావలన లభించు సుఖము."

"ఆయుష్మంతులారా, మీయిచ్చవచ్చినట్లు నివసింపు" డని కోకాలికుడు వారికి ఉత్తమ శయనాసనము లిచ్చెను. వారు ధ్యానమగ్నులై సుఖముగా నుండిరి. వారచ్చట నున్నట్లు ఎవరికిని తెలియదు. వర్షావాసము సమాప్తమైనపిదప వారు ఆయుష్మన్, మేము మీ అండన నిలిచితిమి. ఇప్పుడు ఇక మేము శాస్తకు ప్రణామము చేయుటకై పోవుచున్నామని అనుజ్ఞ పొందిరి, మంచి దని కోకాలికుడు వారిని వెంట బెట్టుకొని ప్రక్క గ్రామములో భిక్షాటనము చేసెను. భోజనానంతరము స్థవిరు లిరువురు గ్రామము వెలువడిరి. కోకాలికుడు వారిని వీడుకొని తాను వెనుకకు తగ్గి, "ఉపాసకులారా, మీరు పశుసమానులు. అగ్రశ్రావకు లిరువురు ప్రక్క గ్రామములో విహారమున మూడుమాసము లుండగా మీరు తెలిసికొన లేకపోతిరి. ఇప్పుడు వారు వెడలిపోయినారు" అనెను.

“భన్తే, మీరు మా కేల తెలుపలేదు?” అని లోకులు హెచ్చుగా ఘృతము, తైలము, ఔషధవర్గము, వస్త్రములు పట్టుకొని స్థవిరులను చేరి, ప్రణామము చేసి “భన్తే, క్షమింపుడు, తమ రగ్రశ్రావకు లని మాకు తెలియలేదు. నేడు భదంత కోకాలికుడు చెప్పుటచే తెలిసినది. మమ్ము కరుణించి రీ వస్తువులను స్వీకరింపు” డని విన్నవించిరి. స్థవిరు లల్పేచ్ఛువు లగుటచే సంతుష్టచిత్తు లనియు వస్త్రములు వారు గ్రహింపక తన కిత్తు రనియు కోకాలికుడు తలచి జనులతోపాటు స్థవిరులకడ కేగెను. వారు కోకాలికుని మూలమున వస్త్రములు తమకు లభించుచున్నవని తెలిసికొని వానిని స్వీకరింప లేదు; ఆతని కిప్పింపనూ లేదు. ఉపాసకులు “భన్తే, ఇపుడు స్వీకరింపకున్నారు. పోనిండు. మమ్మనుగ్రహించి వేరొకసారి ఇక్కడికి దయచేయు” డని విన్నవించిరి. మంచి దని వారు శాస్తసన్నిధికి బయలు దేరిరి.

రీ స్థవిరులు వస్తువులు తీసుకొనలేదు, నా కిప్పింపనూ లేదు, అనుకొని కోకాలికుడు వైరము వహించెను: స్థవిరులు త్వరలోనే శాస్త సన్నిధిలోనుండి తమమండలినుండి ఐదు ఐదు వందలమంది భిక్షువులతో అనగా వేయిమంది భిక్షువులతో పర్యటనార్థము బయలువెడలి కోకాలిక రాష్ట్రము చేరిరి. వెనుకటిఉపాసకులు స్వాగతపూర్వకముగా స్థవిరులను విహారమున చేర్చి ప్రతిదినము సత్కారము చేయుచుండిరి. విశేషముగా ఔషధవర్గము, వస్త్రములు లభింపజొచ్చెను. స్థవిరుల వెంట వచ్చిన భిక్షువులు చీవరములను పంచునపుడు అచటికి వచ్చుభిక్షువులకు వస్త్రము లిచ్చుచుండిరి, కాని కోకాలికున కిచ్చుట లేదు; స్థవిరులు కూడ ఇప్పించుట లేదు. తనకు చీవరములు లభింపకుడుంటచే సారిపుత్ర మౌద్గల్యాయన స్థవిరులు పాపాత్ములని కోకాలికుడు నిందింప నారంభించెను. తొలుత వారు వస్తువులను స్వీకరింప లేదు. కాని ఇప్పుడు స్వీకరింప జొచ్చిరి. తనమూలమున కోకాలికుని మనస్సు మలిన మైన దని గ్రహించి స్థవిరులు భిక్షుమండలితో అచటినుండి లేచిరి. లోకులు “భన్తే మరికొన్ని రోజులు ఇచట నుండుడు” అని పట్టుపట్టినను వా రంగీకరింపలేదు.

“ఉపాసకులారా, స్థవిరు లెట్లు నిలుతురు? మీకు విశ్వాసపాత్రు డగు స్థవిరునకు వా రిచట నుండుట నచ్చలే” దని ఒకానొక యువభిక్షువు చెప్పెను. వారు కోకాలికుని కడకు జని “భన్తే, మీ మూలమున స్థవిరులు ఇచట నుండుట దుస్సహ మయ్యెను. కదలుడు, మనము పోయి క్షమాపణ వేడి వారి నాపుదము.

అట్లు చేయనిచో మీ రిచటనుండి వేరొకచోటి కేగుడు" అని చెప్పగా, అతడు వారి వలన భయముచే స్థవిరులకడకు పోయి ప్రార్థించెను. "ఆయుష్మన్, పొమ్ము, మేములగునది లేదు" అని వారు వెడలిపోయిరి. ఆతడు విహారమునకు మరలి వచ్చిన పిదప ఉపాసకులు "భన్తే, మీరు స్థవిరులను వెనుకకుకొనివచ్చితిరా ?" అని యడిగిరి.

"లేదు నావలన కాలేదు."

"అగుచో ఆయుష్మన్, ఇదియేమి ?"

"పాపాత్ముడైన ఈ భిక్షువు ఇచట నుండగా సదాచారు లగుభిక్షువు లిచట నుండరాదు. ఇతనిని వెడల గొట్టుదము" అనుకొని కోకాలికునితో "భన్తే, మీ కిచట నేమియు లభింపదు" అని చెప్పిరి. వారిచే తిరస్కృతుడై భిక్షువు పాత్రము చీవరములు తీసుకొని జేతవనముచేరి శాస్త సన్నిధి కరిగి "భన్తే, సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు దుర్మార్గులు. వారు పాపేచ్ఛలకు లోనయినారు" అని చెప్ప సాగెను.

"కోకాలికా, ఇట్లనరాదు. సారిపుత్ర మౌద్గల్యాయనుల యెడ శ్రద్ధ గలిగి యుండవలెను. వారు సదాచారు లని తెలిసికొమ్ము."

"భన్తే, తాము తమఅగ్రశ్రావకులను విశ్వసించుచున్నారు. నేను ప్రత్యక్షముగా చూచినాను. వారు పాపాత్ములు. రహస్యముగా పాపకర్మలు చేయువారు."

శాస్త నిషేధించినను కోకాలికుడు మూడవసారి ఇట్లే పలికి ఆసనమునుండి లేచి వెడలిపోయెను. తోడనే ఆతనియొడలిపై ఆవగింజ లంతకురుపులు బయలు దేరినవి. క్రమముగా నవి పెరిగి మారేడుకాయ లంత పెద్ద వాయెను. చితికి అందుండి చీము నెత్తురు ఓడసాగెను. అతడు బాధచే మూలుగుచు అరచుచు జేతవన ద్వారముకడ పడెను. కోకాలికుడు ఇరువురు అగ్రశ్రావకులపై అపనింద మోపినా డనుకోలాహలము బ్రహ్మలోకమువరకు వ్యాపించెను. ఆతనియుపాధ్యాయుడు ప్రస్తుతము శుద్ధావాసక బ్రహ్మ తెలిసికొని పోయి కోకాలికునిచే స్థవిరులను క్షమాపణ వేడింతు ననుకొని అరుగుదెంచి ఆకసముననిలిచి "కోకాలికా! నీవు చాల గొప్ప అపరాధము చేసినావు అగ్రశ్రావకులను ప్రసన్నులను చేసికొనుము" అని పలికెను.

"ఆయుష్మన్, ఎవరు నీవు ?"

"నేను తుదుసామక బ్రహ్మను."

"ఆయుష్మన్, భగవానుడు నీవు అనాగామి వగుదు వనియు, ఆ లోకము నుండి మరలి రా వనియు చెప్పలేదా? నీవు పెంటకుప్పమీద యక్షుడవు కమ్ము." అత డీ ప్రకారము మహాబ్రహ్మను గూడ కినియునట్లు చేసెను. తనమాట ఆతడు వినలేదని, బ్రహ్మ "నీమాటకు నీవే ప్రతిఫలము పొందు" మని శుద్ధావాసమునకు మరలిపోయెను. కోకాలికుడు మృతి నొంది పద్మనామక నరకమున పుట్టెను. ఆత డచట జన్మించినవార్త సహాంపతిమహాబ్రహ్మ తథాగతునితో చెప్పెను. శాస్త భిక్షువులకు తెలిపెను. భిక్షువులు ధర్మసభలో చేరి వానిని నిందింప సాగిరి. శాస్త "ఆయుష్మంతులారా, కోకాలికుడు సారిపుత్ర మౌద్గల్యాయనులను నిందించి తన పలుకుల ప్రకారమే పద్మనరకమున ఇప్పుడే గాదు, పూర్వముకూడ వ్యధ నొందెను. పూర్వజన్మమున గూడ నోటిమాటలవలన పీడ ననుభవించె" నని పూర్వజన్మ కథ చెప్పెను,

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఆయన పురోహితుడు పింగళవర్ణు డుండెను. ఆతనిపళ్ళు వెళ్ళుకొని వచ్చియుండెను. ఆతనిభార్య వేరొక బ్రాహ్మణుని మరిగెను. వాడుకూడ ఇట్టివాడే. పురోహితుడు తనభార్యను చాలసార్లు వారించెను. ఇక లాభము లే దని యెంచి "స్వయముగా విరోధిని సంహరింపలేను. ఉపాయము పన్ని మారణము చేయింతు" నని తల పోసి రాజుకడకు జని "మహారాజా, తమనగరము జంబూద్వీపమున ప్రధాననగరము, మీరు రాజు లందరికన్న మిన్న, అయినను మీనగర దక్షిణద్వారము సరిగా సంతరించ లేదు. కావున అమాంగలిక మైనది" అనెను.

"ఆచార్యా, ఇప్పు డేమి చేయుదము ?"

"మంగళకార్యము చేయవలసి యుండును."

"ఏవ వస్తువులు కావలసి యుండును ?

"పాతద్వారా లాగివేసి శుభప్రదమైన కలప తెప్పించి నగరరక్షక భూతమునకు బలిక్రియ కావించి శుభనక్షత్రమున క్రొత్తద్వారా బిగింపవలెను,"

"అయినచో అట్లే చేయింపుడు."

ఆ సమయమున బోధిసత్త్వుడు తక్కారియ నామకుడగు బ్రహ్మచారిరూప మున అయనకడ విద్య లభ్యసించుచుండెను. పురోహితుడు ప్రాచీనకవాటము తొల గించి నూతనద్వారము సిద్ధము చేయించి రాజుతో, "దేవా, ద్వారము సిద్ధ మైనది. రేపు మంచి నక్షత్రము. ముహూర్తము తొలగిపోకుండ బలికర్మ చేయించి నూతన ద్వారము బిగింపవలెను."

"ఆచార్యా, బలికర్మకు ఏఏపదార్థములు కావలెను ?"

"దేవా, ఉన్నతద్వారమున గొప్పదేవత లుందురు. పండ్లు వెలికి వచ్చిన పింగళవర్ణ బ్రాహ్మణుని, తలిదండ్రుల పవిత్రరక్తము గలవానిని సంహరించి అతని రక్తమాంసములు బలి ఇచ్చి అడుగున గుంటలో వానిని పాతిపెట్టి దాన్నిపై దర్వాజా బిగింపవలెను. అట్లు చేసినచో మీకును, నగరమునకును కల్యాణ మగును."

"మంచిది ఆచార్యా, అట్లే చేయింపుడు."

బ్రాహ్మణుడు సంతుష్టచిత్తుడై రేపు శత్రువు నంతము చూచెద ననుకొని ఉత్సాహముతో ఇంటికి జని నోరు కట్టుకొనలేక సత్వరముగా బ్రాహ్మణికడకు బోయి "పాపినీ, చండాలినీ, ఇక నెవ్వరితో రమింతువు ? రేపు నీజారునిమార ణము చేయించి బలికర్మ నిర్వర్తించెద" ననెను.

"అనపరాధి నేల సంహరింతురు ?"

"పింగళబ్రాహ్మణుని రక్తమాంసములు బలి ఇచ్చి నగరద్వార ప్రతిష్ఠాపన చేయింపు మని రాజు ఆజ్ఞ ఇచ్చినాడు. నీ జారుడు పింగళవర్ణుడు రేపు వానిని బలి ఇత్తుము".

"రాజు పింగళవర్ణ బ్రాహ్మణులను బలి చేయగోరుచున్నాడు. నీవు బ్రదుక దలచినచో నీవంటి బ్రాహ్మణుని కూడ వెంట బెట్టుకొని రేపు తరుణము మించక మునుపే పలాయనము చేయు" మని బ్రాహ్మణి జారునకు సందేశము పంపెను.

ఈ వార్త నగరమంతయు వ్యాపించెను. నగరములోని పింగళవర్ణ బ్రాహ్మణు లెల్లరు పలాయనము చేసిరి. తనశత్రువు తప్పించుకొని పోయినా డని పురోహితునికి తెలియదు. అతడు ప్రాతఃకాలముననే రాజసన్నిధి కరిగి "దేవా, ఫలాని తావున పింగళబ్రాహ్మణు డున్నాడు. అతనిని పట్టి తెప్పింపు" డని చెప్పగా, రాజు భటులను పంపెను. అతడు కనబడక పోవుటచే వారు మరలి వచ్చి బ్రాహ్మ

ణుడు పారిపోయినా డని విన్నవించిరి. "వేరొకచోట వెదకుడు." నగర మంతట వెదకినను అతడు కానరాలేదు. శీఘ్రముగా వెదకు డని రాజు ఆనతిచ్చిన పిదప వారు "దేవా, తమపురోహితునకు తప్ప ఇట్టి బ్రాహ్మణు లిం కెవరును లేరు" అని విన్నవించిరి.

"పురోహితుని బలి ఇచ్చుటకు వీలు లేదు."

"దేవా, ఏమి చేయుచున్నారు ? పురోహితుని మూలమున నేడు ద్వారము సమకూర్పనిచో నగరము అరక్షితముగా నుండును. నేడు ముహూర్తము దాటి పోయినచో సంవత్సరము వరకును శుభనక్షత్రము లభింపదు, అని ఆచార్యు డని నాడు. సంవత్సరకాలము నగరమునకు ద్వారము లేనిచో శత్రువు లాక్రమింప వచ్చును. ఈయనను బలి ఇచ్చి వేరొక పండిత బ్రాహ్మణునిచే పూజ చేయించి ద్వారమును బిగియింపుడు."

"ఆచార్యునికి సమాను డగు పండిత బ్రాహ్మణు డెవరు ?"

"దేవా, ఆయనశిష్యుడు తక్కారియ నాముకు డగు యువకుడు గలడు. ఆయనకు పురోహిత పదవి నిచ్చి, మంగళకార్యము నిర్వహింపుడు."

రాజు ఆయనను పిలువ నంపి ఆదరించి పురోహితపదవి నిచ్చెను, నగర ద్వారము కడ కతగు పరిహారముతో జనెను. పురోహితుడు రాజాజ్ఞచే బద్ధుడయ్యెను. బోధిసత్త్వుడు దర్వాజా నిలుపవలసిన చోట గుంట త్రవ్వించి వస్త్రముతెర వేయించి ఆచార్యునితో తెరనురుగున నిలిచెను. గుంట చూచినతోడనే తనకు క్షేమము లేదని ఆచార్యుడు గ్రహించి తనలో, "నా మేలునే తలపెట్టినాను, కాని మూర్ఖతవలన నోరు కట్టుకొనలేకపోవుటచే ఆ పాపాత్ములు వానికి వెంటనేమార్గ పంపియుండును. నేను త్రవ్వించిన గుంటలో నేనే పడుచున్నా" ననుకొని, బోధిసత్త్వునితో నీ గాథ పలికెను :

నేను మూర్ఖుడ నై తెల్పరాని పలుకు
లంటి; మండూకము విపినమందు కంత
రావమున తన్ను మ్రింగుసర్పంబు బిలుచు.
నేను తక్కారియా, గుంటలోన నేడు
పడక తప్పదు: హెచ్చుగా బలుక నేల ?

బోధిసత్త్వుడాచార్యునితో ఈ గాథ పలికెను :

అంగు శోకంబు, నాశంబు నధికభాషి
యుల్లై, దోషంబు మీ దని యెంచవలయు.

ఇట్లు పలికి బోధిసత్త్వుడు ఆచార్యా, వాఙ్నియమము లేకపోవుటచే మీరు కష్టము నొందుచున్నారు. మీరే కాక ఇతరులు కూడ ఇట్లే కష్టములపాలైనా'' రని పూర్వజన్మకథ చెప్పెను.

అతీతకథ

పూర్వకాలమున వారాణసిలో కాళి యను వేశ్య కలదు. దానికి తుండిలు డను సోదరు డుండెను. కాళి తడవకు వేయిముద్రలు తీసికొనెడిది. తుండిలునకు స్త్రీవ్యసనము, మద్యపానవ్యసనము, జూదవ్యసనము ఉండెను. కాళి తనకు ధన మిచ్చుచున్నను వాడు పాడుచేయుచుండెడి వాడు. ఆమె వానివ్యసనములను మాన్ప యత్నించెను. కాని ఫలితము లేకపోయెను. ఒకనాడు వాడు జూదములో వస్త్రము లతో సహా సర్వము కోలుపోయి గోవంచా చుట్టుకొని ఆమెకడకు వచ్చెను. ఆమె దాసీజనముతో ''తుండిలుడు ఇచటికి వచ్చినచో వాని కేమియు నీయవలదు. మెడ పట్టి నెట్టివేయు'' డని చెప్పెను. వా రంతనిని నెట్టినను ద్వారము విడువక ఏడ్చు చుండెను,

శ్రేష్ఠిపుత్రుడు అనుదినము వేయినాణెములు తెచ్చి ఆమె కిచ్చువాడు; అత నిని చూచి ''తుండిలా ఏల దుఃఖించుచున్నా ?'' వనెను.

''జూదములో ఓడిపోయి మా సోదరి వద్దకు వచ్చినాను. ఆమె దాసీజనము చేత నన్ను మెడపట్టి నెట్టించినది.''

''ఆగు, నీ సోదరితో నేను చెప్పెద'' నని అతడు లోనికి పోయి వేశ్యతో ''నీ సోదరుడు గోవంచా మాత్రము చుట్టుకొని నిలిచియున్నాడు. వానికి వస్త్రము లేల ఈయవు ?'' అనెను.

''నే నీయను, ప్రీతియున్నచో మీ రీయవచ్చును.'' ఆ వేశ్యయింట నొక ఆచార మున్నది. తెచ్చినవారి వేయినాణెములలో ఐదువందలు వేశ్యకు ముట్టును. తక్కినవి వస్త్రగంధ మాల్యాదులకు వ్యయ మగును. విటుడు ఆమెయింటిలోని వస్త్రములు ధరించి రాత్రి గడపి మరునాడు మరలిపోవునపుడు తనవస్త్రములు

కట్టుకొని పోవలెను. శ్రేష్ఠిపుత్రుడు తనవస్త్రములు తుండిలున కిచ్చినాడు. వాడు వానిని ధరించి ఆక్రోశించుచు పానశాలకు బోయెను కాళి దాసీజనముతో "శ్రేష్ఠి పుత్రుడు పోవునపుడు అతనివస్త్రములు చింపివేయు" డని ఆన తిచ్చెను. వారు ఆటాటీ చేయువారి వలె ఇటు నటు పరువెత్తి ఆతనివస్త్రములు లాగిచింపివేసి నగ్నుని చేసిరి; కుమారా! పొమ్మని వారు పరిహసింపగా ఆతడు అట్లై వెలుపలికి బోయెను. గాంచి లోకులు నవ్విరి. వాడు సిగ్గుతో "నేను నోరు కాచుకొన లేక పలికినపలుకులు నాకే తగిలినవి" అనుకొనుచు విచారముతో వెడలెను.

ఈ భావము ప్రకటించుచు బోధిసత్త్వు డీ గాథ పలికెను :

కాళిక చేసిన కార్యంబు నెట్లు
తుండిలుతో జెప్పుదును ? వస్త్రములను
చించి వారలు నగ్ను చేసిరి నన్ను:
ఈరీతి జరిగిన దీసంఘటనము !

ఇంకొకకథ. వారాణసిలో గొర్రెలకాపరుల నిర్లక్ష్యమువలన మేత మేయు చోట రెండుపొట్టేళ్ళు ఢీకొన్నవి. ఒకానొక పక్షి చూచి వీనిశిరస్సులు పగులును, వీని నాపెద ననుకొని, "మామా, పోరాడ వద్దు" అని చెప్పెను. దాని మాట వినక అవి పోరాడుచుండగా పక్షి వానివీపుమీదను శిరస్సుమీదను వాలుచు నిషేధించుచుండెను. అవి లక్ష్యము చేయకుండుటచే "నన్ను చంపి మీరు పోరాడుకొనుడు" అని రెండు పొట్టేళ్ళ తలలనడుమ నిలిచెను. అవి పరస్పరము ఢీకొన్నవి, పక్షి సన్నని ముక్కలకింద చితికి తనకార్యమువలన వినాశము పొందెను.

ఈ కథాభిప్రాయము ప్రకటించుటకై బోధిసత్త్వు డీగాథ పలికెను :

స్వయముగా పోరాడ జాలని పిట్ట
పోరాడుచుండగా పొట్టేళ్ళు రెండు,
నడుమకుం జేరుచు నలిగిపోయినది:
ఈ రీతి నడచిన దీసంఘటనము.

ఇంకొకకథ : వారాణసిలో కొందరు గొల్లల అధీనములో తాడిచెట్టు కలదు. దానిని జూచి కొందరొకనాడు పండ్లు కోయింపదలచి యొకనిని చెట్టెక్కించిరి. వాడు పండ్లుకోసి క్రిందికి గిరవాటు వేయునపుడు పుట్టలోనుండి కృష్ణసర్పము వెలువడి, చెట్టుపై కెగబ్రాక సాగెను. క్రింద నున్నవారు దానిపై కర్రలు మోద లగు

నవి విసరినను అది పైకెగబ్రాకుచుండెను. క్రిందివారు ఏమి పైకి ప్రాకుచున్నదనిరి. చెట్టుమీదివాడు భయపడి ఆక్రోశించెను. క్రిందివారిలో నలుగురు మొద్దు దుప్పటి చెంగులు నాలుగు గట్టిగా పట్టుకొని పైవానిని దానినడుమ పడు మనిరి. వాడు పడినప్పుడు దూకుడు హెచ్చుగా నుండుటచే వారు తట్టుకొన లేకపోయిరి. ఒకరితల మరియొకరికి గట్టిగా తగులుటచే తలలు పగిలి, అందరును మరణించిరి.

ఈ విషయము ప్రకటించుటకై బోధిసత్త్వు డీగాథ పలికెను :

బ్రదికింప నొకనిని పట్టుకొన్నారు
నలువురు దుప్పటి నాల్గుచెంగులను
చిదికిపోయెను వారిశిరసులే తుదకు:
ఈరీతి నడచిన దీసంఘటనము.

వేరొకకథ : వారాణసిలో కొందరు గొర్రెలను హరించుచుండిరి. ఒకనాడు వారు మేక నపహరించి, అరవకుండ దానినోరు కట్టి, మరునాడు వనములో తిన వచ్చునని రాత్రివేళ వెదుళ్ళ నడుమ కట్టివేసి, మరునాడు వచ్చిరి. అందరును ఆయుధము మరచిపోయినట్లు తెలిసికొని, ఆయుధము లేకుండ దానిని ఖండించుట వీలులే దనుకొని, "దీనియదృష్టము బాగున్నది" అని మేకను విడిచిపెట్టిరి.

ఆ రోజులలో వెదుళ్ళు కోయువారు పగటివేళ పనిచేసి, వెదుళ్ళు కోసి, కత్తి రాత్రివేళ పొదలో పెట్టి మరునాడు వచ్చి, మరల దానితో పనిచేయుచుండెడి వారు. తనకు విముక్తి కలిగిన దనుసంతోషముతో మేక గంతులు వేయజొచ్చెను. దాని వెనుకకాలు తగులుటచే పొదలో నున్నకత్తి క్రిందికి దొరలిపడెను. కత్తిపడిన చప్పుడు విని చోరులు వెదకి, కత్తి తీసికొని మేకను ఖండించి సంతుష్టచిత్తమున మాంసము భుజించిరి. తాను చేసిన పనివలన మేక ముప్పు తెచ్చుకొన్నదని ప్రకటించుటకై బోధిసత్త్వు డీగాథ పలికెను :

బంధమోక్షం బైన ప్రమదహేతువున
వేయగా గంతులు వేణుకుంజమున
మేకకాల్ తగులు నిమేషమ్మునందె
కత్తిపడ్డది క్రింద; ఖండించినారు
దొంగలు మేకకుత్తుక దానితోనె:
ఈరీతి నడచిన దీసంఘటనము.

ఇట్లు పలికి "తమనోరు కట్టుకొని, అల్పభాషణము చేయువారు మృత్యువు నుండి తప్పించుకొందురు" అని కిన్నరులకథ చెప్పెను.

వారాణసిలో ఒకానొక వేటకాడు కిన్నర దంపతులను పట్టి తెచ్చి, రాజునకు సమర్పించెను. అంతకు పూర్వము రాజు కిన్నరులను చూడలేదు. కావున రాజు "వేటకాడా, వీనివిశేష మేమి?" అనెను. "దేవా, ఇవి మధురముగా పాడును, ఆడును, మానవులు వీనివలె పాడలేరు, ఆడలేరు" అని వాడు విన్నవించెను. వేటకానికి ధన మిచ్చి రాజు కిన్నరులను జూచి "పాడుడు, నాట్యము చేయుడు" అనెను. అవి తమలో "మేము పాడునపుడు వ్యంజనములను పూర్తిగా వ్యక్తము చేయలేనిచో పాట చెడును. మాకు నింద వచ్చును. మృతికూడ కలుగవచ్చును. విశేషముగా పలికితిమేని అసత్యము దొరల వచ్చును" అనుకొని మిన్నకుండెను. మాటిమాటికిని రాజు ప్రబోధించినను అవి పాడలేదు. నాట్యము చేయలేదు. తుదకు ప్రభువు కుపితుడై, "వీనిని సంహరించి మాంసము వండి తీసికొని రండు" అని ఆనతిచ్చువాడై ఈ గాథ పలికెను:

చేరదు దేవతా శ్రేణిలో వీరు
గంధర్వపుత్రులు కారు, జంతువులు
కానోపుదురు; ధనకారణంబునను
నాసన్నిధికి దెచ్చినాడు వ్యాధుండు
మాపటి కొకదాని, రేపటి కొక్క
దానిని భోజనార్థము వండవలయు.

"రాజు కుపితుడై నాడు. నిస్సందేహముగా మనను సంహరించును. ఇది నోరు విప్పవలసిన సమయము" అనుకొని కిన్నరి ఈ గాథ పలికెను:

తుల దూగవే లక్షగుంభష లొక్క
సత్యంబుతోడ; దుష్టప్రలాపంబు
సంఘటిల్లునా యన్న సంభ్రాంతిచేత
కిమ్మనకున్నాడు కింపురుషుండు
కాని, కారణము మూర్ఖత కాదు దేవ!

రాజు విని ప్రసన్నచిత్తుడై ఈ గాథ పలికెను:

దీనిని, పలు కాగుడానిని విడిచి
చేర్పుడు హిమగిరిసీమకు; మిగులు
దీనిని ఏకమందిరమున కంపు,
గుడదయభోజనమున కిది సిద్ధ మగును.

కిన్నరుడు రాజువాక్యాలు విని "నేను మౌనముగా నున్నచో మరణము తప్పదు. ఇది నోరు విప్పవలసిన తరుణము" అని యీ గాథ పలికెను :

అంబుదంబులమీద సాధార పడును
జంతువుల్, వానిపై జనుల కాధార,
మన్మదాదులకు మీ రాధార. మింక
దారకు నేనె యాధారంబు దేవ!

ఇట్లు పలికి కిన్నరుడు "మహారాజా, మేము మౌనముగా నుండుట మీ యానతి తిరస్కరించుటకు గాదు. పలుకునపుడు దోషములు దొరలు నేమో యను భయముచే నూరకుంటిమి" అనువిషయము ప్రకటించుటకై యీ గాథలు పలికెను :

నానావిధాల జనంబులతోడ
సందర్భ మొదవును, నిందతో బ్రదుకు
సులభంబు కా; దొక్కపలుకు ప్రశంస
యగుచుండు, నన్యున కద్దియే నింద.

వేరు వేరుగ నుండు వివిధమానవుల
చిత్తంబు; లన్యుని చిత్తవృత్తులకు
వశవర్తి గాయె యుండవలదు జనుండు.

రాజు యోచించి "యీ కిన్నరునకు వివేకము కలదు. పలికినది యథార్థము" అని ప్రసన్నచిత్తుడై యీ గాథ పలికెను ;

ఏకిన్నరుడు భయహేతువుచేత
దారతోడను తాను దాల్చె మౌనంబు
ఆత డిప్పుడు ముక్తుడై నాడు, సుఖియు,
నారోగ్యవంతుండు నయ్యె: సద్వాక్య-
కల్యాణకారి యీ గద మానవునకు.

రాజు కిన్నరులను బంగరుపంజరమున పెట్టించి, వేటకానిని పిలువనంపి, వీనిని ఎచ్చటినుండి తెచ్చితివో అచ్చటనే విడిచిపెట్టుము" అని యానతిచ్చెను.

బోధిసత్త్వుడు "ఆచార్యా, కిన్నరులు వాఙ్నియమము కలిగియుండుటచే రాజు పలుక మన్నను అవి పలుకలేదు. కావున ముక్తి పొందినవి. నీవో దుర్భాషలవలన మహావిపత్తునకు లోనయితివి. భయపడ వలదు! నీ ప్రాణములు రక్షించెదను" అని యోదార్చెను. నీవే నన్ను రక్షింపవలెను అని ఆచార్యు డన్న పిదప బోధిసత్త్వుడు "ఇపుడు నక్షత్రయోగము సరిగాలేదు" అని కాలము గడపి, అపరాహ్ణమున చచ్చినగొఱ్ఱెను తెప్పించి, "ఆచార్యా, నీ వెచ్చటకైనను కనబడకుండ పొమ్ము" అని యెవ్వరికిని తెలుపకుండ ఆయనను పంపివేసి, గొఱ్ఱెమాంసమును బలి యిచ్చి, ద్వారస్థాపనము చేయించెను.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి, "భిక్షువులారా, కోకాలికు డిప్పుడేకాదు, పూర్వముకూడ నోరు కట్టుకొనలేక మృతి నొందెను" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున ప్రోదపింగళుడు కోకాలికుడు; తక్కారియపండితుడు నేనే.

:: -

# 482. రురు జాతకము

శాస్త శాస్త వేళువనమున విహారము చేయుచు దేవదత్తుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

"ఆయుష్మన్, దేవదత్తా, నీకు శాస్త వలన ఉపకారము జరిగినది. శాస్త వలన నీకు ప్రవ్రజ్య లభించినది. త్రిపిటకములు అభ్యసించితివి. నీకు లాభము, సత్కారము కలిగినవి" అని అతనితో ఎవరో అన్నపుడు అతడు "ఆయుష్మంతులారా, శాస్త వలన నాకేమియు ఉపకారము జరుగ లేదు. నేను స్వయముగా ప్రవ్రజించినాను, త్రిపిటకములు స్వయముగా అభ్యసించినాను; స్వయముగానే సత్కారాది లాభములను పొందినాను" అనెను,

భిక్షువులు ధర్మసభలో కూరుచుండి ఈ విషయము సంభాషించుచుండిరి.

"ఆయుష్మంతులారా, దేవదత్తుడు కృతజ్ఞుడు కాడు" అనుచుండిరి. శాస్త అచటి కరుదెంచి, సంగతి గ్రహించి "భిక్షువులారా, దేవదత్తుడు కేవల మిప్పుడే కాదు, పూర్వము కూడ అకృతజ్ఞుడు. పూర్వము నేను ఇతనికి ప్రాణదానము చేసినను ఇతడు ఏమియును ఉపకారము నంగీకరింప లేదు.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా ఎనుబదికోట్ల ధనపతి యగు ఒకానొక శ్రేష్ఠికి పుత్రుడు కలిగెను. శిశువునకు మహాధనకుడని పేరు పెట్టిరి. కుమారునకు చదువు చెప్పించినచో వాడు కష్టపడు నని తలచి చదువు చెప్పించ లేదు. వాడు ఆటపాటలలో, ఆగుడులో ఆరితేరి వేరొకసంగతి ఎరుగకుండెను. వానికి వయసు వచ్చినపిదప తలిదండ్రులు తగినకన్య నిచ్చి వివాహము చేసిరి. వారుకాలక్రమమున చనిపోయిరి. అవల కుమారుడు స్త్రీపాన ద్యూతలోలుడై పోయెను. క్రమముగా నానావ్యసనములకు లోనై తనధన మంతయు పాడు చేసెను. ఋణము హెచ్చి ఋణదాతలు త్వరపెట్టుచుండగా అప్పు దొరకనిస్థితి ఏర్పడినప్పుడు వాడు, నేను జీవించి ఏమి చేయుదును? ఈ జన్మలో

నే నిట్లయిపోతిని, మరణించుటయే శ్రేయస్కరము" అని తలచి ఋణదాతలతో "మీమీ ఋణపత్రములు కొనిరండు. గంగాతటమున నాకు పరంపరాగతమైన ధనము పాతిపెట్టియున్నది. అచట మీ కిచ్చెదను" అని చెప్పెను. వారు తనివెంట జనిరి. ధన మచట నున్నది, అచట నున్న దని నేల చూపుచు వాడు గంగలో దుమికెను. ప్రవాహము వేగముగా నుండుటచే వాడు కొట్టుకొనిపోవుచు దీనముగా ఆక్రోశించెను.

ఆ సమయమున బోధిసత్త్వుడు రురుమృగమై జన్మించెను. మృగము తన పొంద విడిచి ఒంటిగా గంగగట్టున సాలమిశ్రిత సుపుష్పిత సహకారవనమున పెరుగుచుండెను. మృగశరీరము బంగరుపూత పూసినట్లుండెను. పాదములు లక్క పూసినట్లుండెను. శృంగములు రజతమాలికవలెను నేత్రములు స్నిగ్ధమణి గోళికలవలెను, ముఖము తిరగవైచిన రక్తకంబళము చుట్టవలె నుండెను. రురుమృగము నదిలో ఆక్రోశము విని మానవ కంఠధ్వనివలె వినవచ్చుచున్నది. వీనిని రక్షింతు నని తలచి, తనబంగరు పొదలోనుండి ఈవలకు వచ్చి నదీతీరము చేరి "ఓయీ, భయ పడవలదు. నీప్రాణములు దక్కింతును" అని ప్రవాహములోనికి బోయి, వానిని వీపుపై నెక్కించుకొని ఒడ్డు చేర్చి, తననివాసస్థానమునకు గొనిపోయి ఫలాదిక మిచ్చి మూడురోజుల తరువాత "ఓయీ, నిన్ను ఈ అడవి దాటించి వారాణసీ మార్గమున విడిచిపెట్టెదను. నీవు సుఖముగా వెడలవచ్చును. కాని ధనలోభముచే రాజునకుగాని అమాత్యునకు గాని ఫలానిప్రదేశమున స్వర్ణమృగ మున్న దని తెలుపరా" దని చెప్పెను. "స్వామీ, మంచి" దని వాడు బోధిసత్త్వుని యెదుట ప్రమాణము చేసెను; రురుమృగము వానిని వీపుపై కూర్చుండ బెట్టుకొని వారాణసీ పథముపై విడిచి వచ్చెను. వాడు వారాణసిలో ప్రవేశించిన నాటి ప్రాతఃకాలమున రాజమహిషి ఖేమాదేవి నిద్రలో తనకు స్వర్ణమృగము ధర్మోపదేశము చేసినట్లు కల గాంచెను. "ఇట్టి మృగము లేనిచో స్వప్నమున కానరాదు. నిజముగా మృగ ముండును. రాజుతో చెప్పెద" నని ఆమె రాజసన్నిధి కరిగి "మహారాజా, స్వర్ణ మృగము ధర్మోపదేశము చేయగా వినవలె నని కుతూహలము. అట్టిది లభించినచో జీవింతును; లభింపనిచో జీవింపను" అని చెప్పగా అయన పట్టమహిషి నోదార్చి "మానవలోకమున ఆమృగ మున్నచో నీకు లభించు" నని బ్రాహ్మణులను పిలువ నంపి స్వర్ణమృగము లుండునా" యని ప్రశ్నించెను.

"దేవా, ఉండును,"

“సజ్జీకృత మైనఏనుగుపై బంగరుపెట్టెలో వేయిసువర్ణములసంచి నుంచి రాజు “ఎవ రైనను స్వర్ణమృగస్థానము తెలుపుచో వారికి బంగరుపళ్లెముతో పాటు వేయిసువర్ణముద్రల సంచియు, ఏనుగును, కానిచో అంతకన్న అధికముగా ఇచ్చెద” మని బంగరు పలకపై గాథ చెక్కించి అమాత్యునితో “బాబా, ఇక్కడికి వచ్చి నాపక్షమున ఈ గాథ నగరవాసులకు వినిపింపుము” అని ఈ జాతకములోని తొలిగాథ పలికెను :

ఎవని కిచ్చెద నలంకృత సుందరులను
గ్రామవరంబు ? మృగంబులలోన
శ్రేష్ఠజంతువు నివసించెడి చోటు
స్పష్టీకరింపగా జాలు నెవ్వాండు ?

అమాత్యుడు బంగరుఫలకముమీది గాథ నగరవీధులలో చదివించెను. వారాణసిలో దాగుకొన్న శ్రేష్ఠిపుత్రుడు విని, అమాత్యునికడకు బోయి, “నన్ను రాజుసన్నిధికి గొనిపొండు. ఇట్టిమృగమును నేనెరుగుదును; రాజునకు చూపెదను” అనెను. అమాత్యు డేనుగు దిగి శ్రేష్ఠిపుత్రుని రాజసన్నిధికి గొనిపోయి, ఎదుట నిలువబెట్టి “దేవా, ఈతడు తమకు మృగమును చూపగలడు” అని విన్నవించెను. “ఏమోయీ, సత్యముగానే?” అని రాజు ప్రశ్నింపగా వాడు “మహారాజా, సత్యముగానే చూపగలను. ఈ ధనము నాకు దయచేయవలెను” అని యీ గాథ పలికెను :

నాకు నలంకృత నారీజనంబు
నుత్తమ గ్రామంబు నొసగుడు దేవ !
శ్రేష్ఠమృగము నివసించెడిచోటు
స్పష్టీకరింపగా జాలుదు దేవ !

విని రాజు ఆ మిత్రద్రోహియెడ ప్రసన్నుడై “ఓయీ, ఆ మృగ మెచట నుండును ?” అనెను. ఫలానిచోట అని వాడు చెప్పగా, రాజు వానినే మార్గదర్శకునిగా నియమించి విశేషపరివారముతో ఆతావు చేరెను. “దేవా సైన్యము నిచట నాపుడు” అని వాడు చెప్పగా సైన్య మాగెను. “దేవా, స్వర్ణమృగ మెచట నుండు నని చేతితో చూపుచు వా డీగాథ పలికెను :

మెండుగా నీవనషండమందు ద్రుమ
సాలముల్ పుష్పించె, నేలయంతటను

సాంద్రమ్ముగా క్రమ్మె ఇంద్రగోపములు;
ఆవాస మిచటనే ఆమృగమ్మునకు.

రాజు విని, మృగము పారిపోవకుండ చుట్టు ముట్టుడు అని ఆనతి యిచ్చెను. వా రట్లే చేసి కోలాహలము కావించిరి. కొలదిమందిని వెంట బెట్టుకొని రాజు ఒక చోట నిలిచి యుండెను. శ్రేష్ఠిపుత్రుడు కూడ రాజుకడనే నిలువబడెను. మృగము చప్పుడు విని "ఇది సేనసందడివలె నున్నది. శ్రేష్ఠిపుత్రుడు నాకై యీభయ ముత్పాదన చేసియుండును" అనుకొని లేచి, జనసమూహమును గాంచి రాజు నిలిచి యున్నచోటు చూచి, అదియే తనకు క్షేమస్థానమని తలచి రాజసమ్ముఖము చేరెను. మృగము వచ్చుచుండుట చూచి రాజు విల్లు ఎక్కు పెట్టి, "గజబలము కలమృగము వచ్చుచున్నది. దీనిని బెదరించెదను. పారిపోవుచో బాణము విడిచి దుర్బలము కావించి పట్టుకొందును" అని తలచెను,

ఈ విషయము ప్రకటీకరించుటకై శాస్త యీ గాథ పలికెను :

విభు డెక్కు పెట్టిన వింటితో వచ్చు
చుండగా దూరమ్మునుండి మృగమ్ము
వీక్షించి యి ట్లనె: వేయకు బాణ
మొక్కింత పట్టుమీ ఓపిక రాజ !
ఇట నుందు నే నని యెవ్వడు తెల్పె ?

దాని మధురవాక్కులకు రాజు ముగ్ధుడై విల్లు పైకెత్తి ఆదరపూర్వకముగా పిలిచెను. మృగ మొక ప్రక్క నిలువబడెను. పరిజనులు శస్త్రములు విడిచి రాజు చుట్టును చేరిరి, అప్పుడు మృగము మధురస్వరముతో "మృగ మిచట నుండు నని మీతో నెవరు చెప్పిరి ? మార్గము చూపినవా రెవరు ?" అని రాజు నడిగెను. ఆ సమయమున ఆ పాపాత్ము డచటికి వచ్చెను. "వీడు నాకు నీతావు చూపినవా" డని రాజు ఈ గాథ పలికెను :

సౌమ్యా, దూరంబున చాటుగా నిల్చి
పాపి నీనిలయంబు చూపినవాడు.

విని బోధిసత్త్వు డామిత్రద్రోహిని నిందించి, రాజుతో సంభాషించుచు ఈ గాథ పలికెను :

ఉదకాన మునుగుచు నున్నకొందరను
కాపాడుకొంటెను కాష్ఠంబుతోడ
మునుగ నిచ్చుట శ్రేయ మనువారి వాక్కు-
యుక్తంబుగా దోచు యోచించు కాలది.

విని రాజీగాథ పలికెను:

పశువులలో దేని గాని
పక్షులలో దేని గాని
నరులయందు నెవని గాని
గురువర! నిందించితివా ?
నీమానవవాక్కు విన్న
నిందుభయం బగును నాకు.

అంతట బోధిసత్త్వుడు "మహారాజా, నేను ఏజంతువును గాని, పక్షిని గాని, నిందింపలేదు; కాని మానవుని నిందించుచున్నాను" అని ప్రకటీకరించుచు ఈ గాథ పలికెను:

సత్వరంబున బారు సలిల ప్రవాహ
సరణిని మున్గుచు బోవగా నున్న
వానిని రక్షింప, వాడె యావలను
భయహేతు వయినాడు ప్రభు, అసత్పురుష
తోడి సంగాతము కూడ దన్నండ్రు.

విన్నంతనే కుపితుడై రాజు "ఈ దుర్మార్గుని సంహరింతును. ఇంతయుపకారము పొందియు వీడు మోసము చేసినాడు" అనుకొని, యీ గాథ పలికెను:

నభమున జరియించు దాని
నాలుగుపాదములు కలుగు
మృగము విడిచి పెట్టి, యిపుడు
మిత్రద్రోహిని పాపిని
మేలు చేయ మరచువాని
కోలతోడ గుండెలోన
కొట్టి సంహరింతువాడ.

అంతట బోధిసత్త్వుడు "వీడు నా మూలమున మరణింపరాదు" అని తలచి యీ గాథ పలికెను :

వీడు మూర్ఖుడు రాజ, వీనితో నేమి!
బుధు లుగ్గడింపరు వధ నెట్టి వేళ,
ఇంటికి జనుగాక నీపాపకర్ము
డితని కిచ్చెడి దేదో యిచ్చి వేయుండు:
నేను నీకోర్కెల నెరవేర్చుచుందు.

అంతట రాజు సంతుష్టచిత్తుడై బోధిసత్త్వుని ప్రశంసించుచు నీ గాథ పలికెను :

నిశ్చయమ్ముగ రురు, నీవు యోగ్యుడవు.
ద్వేషించు మానవు ద్వేషింప వీవు!
ఈపకారి గృహంబు ప్రాపించుగాక.
ఇచ్చు నన్నది యేదో యిచ్చివేయుదును.
అభయ మిచ్చెద నీకు: అంతియే కాక
చరియింపవచ్చు నిచ్చకొలంది నీవు.

"మహారాజా, మానవుడు నోట పలుకున దొకటి, చేయునది యింకొకటి" అని బోధిసత్త్వుడు వానిని పరీక్షించుటకు నీ గాథలు పలికెను :

గ్రహియింప వచ్చు సృగాలయొక్కలను,
తెలిసికోవచ్చును పులుగులయొక్క,
కాని దుర్జ్ఞేయంబు మానవయొక్క.

తొలుత మంచిమనస్సుతో నన్యజనుని
జ్ఞాతిగా మిత్రుగా సఖునిగా చూచు
వాడె యావల మారి వైరి యైపోవు.

విని రాజు "మృగరాజా, నా కిట్లు చెప్పవలదు. రాజ్యము నైన విడుతును, కాని నీ కిచ్చిన వరమును వ్యర్థము చేయను. నన్ను విశ్వసింపుము" అని చెప్పి తొలుత బోధిసత్త్వునకును, అవల సమస్త ప్రాణులకును అభయ మిచ్చి, బోధిసత్త్వుని వెంట గొనిపోయి నగరాలంకరణానంతరము తనదేవికి ఆయనచే ధర్మోప

దేశము చేయించెను. దేవికిని, రాజునకును, రాజ్యపరిషత్తునకును మనుష్యవాక్కులతో మధురముగా ధర్మోపదేశము చేసి, రాజునకు దశరాజధర్మములు తెలిపి, జనమున కనుశాసనము చేసి బోధిసత్త్వు డరణ్యమునకు పోయి మృగములనడుమ నివసింపసాగెను. సమస్త ప్రాణులకును అభయమిచ్చితి నని రాజు నగరమున చాటవించెను. అప్పటినుండియు నెవ్వరును పశుపక్ష్యాదులమీద చేయిచేసికొన లేకుండిరి. మృగములు వచ్చి పొలములలో మేసిపోవుచుండెను. ఎవ్వరును వాని నాపజాల కుండిరి. జనులు పోయి రాజుతో చెప్పుకొనిరి,

ఈ యర్థమును ప్రకటించుటకై శాస్త ఈ గాథ పలికెను :

జనపదమ్ములవారు చనుదెంచినారు,
నిగమజనమ్ములు నిలిచియున్నారు.
తినివేయుచున్నవి దేవ, మృగాలు
ధాన్యాలు, వానిని దమియింపవలయు.

రాజు విని యీ గాథలు పలికెను :

జనపదమ్ములు పోయినను పోవుగాక,
నష్టమై చనుగాక రాష్ట్రంబు కూడ.
అభయదక్షిణ యిచ్చినట్టి మృగంబు
నేను ద్వేషింపగా నేరకున్నాను.

ఏమైన నగు గాక, ఈరురు కిచ్చి
వర, మనృతంబును పలుకుట యెట్లు ?

రాజువాక్కులు విని జను లేమియు పలుకలేక వెనుదిరిగి పోయిరి. ఈవార్త యెల్లెడ వ్యాపించెను. విని బోధిసత్త్వుడు మృగములను సమావేశపరచి "నేటినుండి మీరు జనుల పొలములలో మేయరాదు'' అని యుపదేశ మిచ్చి, "మీమీ క్షేత్రములకు పత్రచిహ్నములు తగిలింపుడు" అని లోకులకు వార్త పంపెను. వా రాప్రకారమే చేసిరి. నాటినుండి నేటివరకును మృగములు పొలములలోనికి పోవుటలేదు,

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి, "భిక్షువులారా, ఈత డకృతజ్ఞు డిప్పుడే కాదు" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున శ్రేష్ఠిపుత్రుడు దేవదత్తుడు: రాజు ఆనందుడు; రురు మృగము నేనే.

X

# ౪౮౩. సరభమిగ జాతకము

శాస్త వేసిన సంక్షిప్త ప్రశ్నమునకు సమాధానముగా ధర్మసేనాపతి చేసిన సవిస్తర వ్యాఖ్యానమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున శాస్త సంక్షేపరూపమున ప్రశ్నవేసెను. దేవారోహణ సంబంధమున నిది సంక్షిప్తకథ. రాజగృహశ్రేష్ఠికడ ఆయుష్మాన్ పిండోల భారద్వాజుడు తనబుద్ధిబలముచే నేలనుండి చందనపాత్రను పైకి లేవనెత్తినపుడు శాస్త బుద్ధిబల ప్రదర్శనము చేయ వద్దని భిక్షువులను నిషేధించెను. ఇట్లు నిషేధించుటచే శాస్త బుద్ధిబలప్రదర్శనము చేయడని తైర్థికులు తలంచిరి. శిష్యులలో శక్తిహీనులు శాస్తతో "భన్తే, బుద్ధిబలము వలన పాత్ర యేల లేవలేదు?" అనగా ఆయన "ఆయుష్మంతులారా, నా కిది కఠినకార్యము కాదు. కాని తుచ్ఛమైన దారుపాత్రను లేవనెత్తుటకు గృహస్థులయెదుట సూక్ష్మగుణము నెవరు ప్రదర్శింతు రనువిషయము నేల గ్రహింపరు?" అనెను. కాని శాక్యపుత్రులు, శ్రమణులు లోభమువలన బుద్ధిబలప్రదర్శనము చేసిరి. "ప్రదర్శనము చేయుట మాకు కష్టమని తలపవలదు. తలచుకొంటిమేని శ్రమణ గౌతముని యెదుట చేయగలమని ఆయనశిష్యులతో చెప్పుడు. ఆయన ఒక్కబుద్ధి చూపినచో మేము రెండుచూపగలము" అని వారు పలుకగా, శిష్యులు భగవానునికడకు పోయి "భన్తే, తైర్థికులు బుద్ధిబలప్రదర్శనము చేయుదురు" అని చెప్పిరి. "వారు చేసినచో నేనుగూడ చేయుదును" అని భగవానుడు పలికెను. ఈవార్త విని, బింబిసార నృపాలుడు భగవానునికడకు వచ్చి భన్తే, బుద్ధిబలప్రదర్శనము చేయుదురా?" అనెను.

"మహారాజా, అవును."

"భన్తే, నియమ మేర్పరింపలేదా?"

"మహారాజా, శిష్యులకై నియమములు చేసితిని. బుద్ధులకు నియమములు లేవు, మహారాజా, మీతోటలో పుష్పఫల విషయమై అన్యులకు నియమము లున్నవి. మీయెడ నియమము లేదు. అట్లే మాకుగూడ."

"భన్తే, బుద్ధి యెచ్చట ప్రదర్శింతురు ?"

"శ్రావస్తీనగరమున, గండంబ వృక్షము క్రింద."

"భన్తే. మే మచ్చట నేమి చేయవలసి యుండును ?"

"మహారాజా, ఏమియు చేయనక్కరలేదు."

మరునాడు శాస్త కరణీయములు నిర్వర్తించి, పర్యటనమునకై బయలు వెడలెను. లోకులు చూచి "శాస్త యెచ్చటికి పోవుచున్నాడు ?" అని శిష్యుల నడిగిరి. "శ్రావస్తీ నగరద్వారమున నున్న గండంబ వృక్షము క్రింద, తైర్థికుల మానమర్దనము చేయుటకై బుద్ధి ప్రదర్శింపబోవుచున్నాడు" అని వారు చెప్పిరి. ఇళ్ళు వాకిళ్ళు విడిచి జను లాయాశ్చర్యమును చూడ బయలుదేరిరి. "శ్రమణ గౌతముడు ప్రదర్శించు తావుననే మేముగూడ ప్రదర్శింతుము" అని తైర్థికులు శిష్యసహితముగా శాస్తవెనువెంటనే చనిరి. క్రమక్రమముగా శాస్త శ్రావస్తి చేరగా రాజు వచ్చి "భన్తే, బుద్ధిప్రదర్శనము చేయుదురా ?" అని యడిగెను.

"మహారాజా, అవును."

"భన్తే, ఎప్పుడు ?"

"నేటి కేడవరోజున, ఆషాఢపూర్ణిమనాడు."

"భన్తే, మంటపనిర్మాణము చేయింతును."

"మహారాజా, వలదు. నేను ప్రదర్శనము చేయుచోట శక్రుడు పండ్రెండు యోజనముల రత్నమంటప నిర్మాణము చేయించును."

"భన్తే, ఈ వృత్తాంతము నగరమున చాట బంచెదను."

"మహారాజా, మంచిది."

రాజు ధర్మఘోషకుని అలంకృతహస్తిపై గూరుచుండ బెట్టి "నేటి కేడవనాడు శాస్త శ్రావస్తి నగరద్వారముకడ నున్న గండంబ వృక్షము క్రింద, తైర్థికుల మానమర్దనార్థము బుద్ధిబలప్రదర్శనము చేయును" అని నగరమున చాట బంచెను. తైర్థికు లిది తెలిసికొని తోటమాలులకు ధన మిచ్చి, శ్రావస్తికి చుట్టుప్రక్కల నున్న మామిడిచెట్ల నన్నింటిని నరికించిరి. ధర్మఘోషకుడు పూర్ణిమనాడు "నేటి ప్రాతఃకాలమున బుద్ధిప్రదర్శనము జరుగు" నని చాటించెను. దేవతల ప్రభావము

వలన ఆ చాటింపు సమస్తజంబూ ద్వీపమున ప్రతిగృహమునకు వ్యాపించెను. శ్రావస్తి చేరదలచినవారు చేరుకొనిరి. పరిషత్తు పండ్రెండు యోజనములమేర వ్యాపించెను.

శాస్త ప్రాతఃకాలముననే భిక్షాటనార్థము బయలుదేరెను. రాజుగారి తోటమాలి గండుడు ఆకస్మికముగా పండిన మామిడిపండు కడవపరిమాణము కలది పట్టుకొని రాజుకొరకు కొనిపోవును, ద్వారముకడ శాస్త నిలిచియుండుట చూచి "ఈ ఫలము వీరికే తగినది" అని చూతఫలమును శాస్తకు సమర్పించెను. ఆయన దానిని స్వీకరించి అచటనే యొకప్రక్కన కూరుచుండి భక్షించి, ఆనందుని పిలిచి "ఆనందా, ఈ టెంక మాలిచేతి కిచ్చి ఇచ్చటనే నాటుమని చెప్పుము. ఇది గండంబ వృక్షము కాగలదు" అనెను. స్థవిరు డటులే చేసెను. మాలి గుంట చేసి మన్ను తొలగించి టెంక నాటెను. అది బ్రద్దలయి, తోడనే భూమిలోనికి వేరు తన్నెను. నాగేటి కర్రు కొనవంటి రక్తవర్ణాంకురము బయలుదేరెను. జనము చూచుచుండగనే ఏబదిమూరల బోదెయు, ఏబదిమూరల శాఖలును, నూరుమూరల యెత్తును కల సహకారవృక్షము పైకి లేచెను అపుడే వృక్షమున పూలు పూచినవి. పండ్లు పండినవి. స్వర్ణవర్ణ ఫలములు వ్రేలాడుచున్న మహావృక్ష మాకాశమును కప్పివేసెను. గాలి తోలుటచే పండ్లు నేల రాలినవి. వెనుక వచ్చుచున్న భిక్షువులు వానిని భక్షించి వచ్చిరి.

సాయంకాలము శక్రు డాలోచింపగా సప్తరత్నయుక్తమైనమంటపము నిర్మించుభారము తనపై బడెనని గ్రహించి, విశ్వకర్మను బిలువ నంపి, నీలకమలములు కప్పిన సప్తరత్నమంటప నిర్మాణము చేయించెను. ఈ విధముగా పదివేల చక్రవాళములనడుమ దేవతలు సమావిష్టులైరి. శాస్త శిష్యులకసంభావ్యమును, తైర్థికుల మానమర్దనకరము నగు యమకబుద్ధి చూపెను. ఈ విధముగా జనసమూహము ప్రసన్నముగా నుండుట గ్రహించి, ఆకసమున కెగసి, బుద్ధాసనముపై గూరుచుండి శాస్త ధర్మోపదేశము చేసెను. ఇరువదికోట్ల ప్రాణులు అమృతపానముచేసిరి.

పూర్వబుద్ధుడు బుద్ధి చూపినపిదప నెచటికి పోయి యుండు నని శాస్త తలపోయగా త్రయస్త్రింశద్భవనమునకని ధ్యానబలమున గోచరించెను. ఆయన బుద్ధాసనమునుండి లేచి, కుడికాలు యుగంధర పర్వతశిఖరముపై నుంచి, వామపాదమున సుమేరు పర్వతము దాటి, పారిచ్ఛద వృక్షము క్రింద పాండుకంబలవర్ణము గల శిలాతలముపై గూరుచుండి వర్షాకాలము మూడు మాసములపాటు దేవతలకభిధర్మము ఉపదేశించుచుండెను. శాస్త యెచ్చట నున్నది యెవ్వరికిని తెలియలేదు. "పవారణ" సమీపమున నుండుటచే మహామౌద్గల్యాయనుడు వచ్చి, శాస్తతో మాటాడెను. "ఇప్పుడు సారిపుత్రు డెచట నున్నాడు?" అని శాస్త యడుగగా, నతడు "భన్తే, బుద్ధిప్రభావముచే ప్రవ్రజించిన పంచశతశిష్య సమూహముతో

గూడి సంకాశయ నగరమున నున్నా" డని చెప్పెను. "మౌద్గల్యాయనా, నేటికి ఏడవనాగు నేను సంకాశయ నగరద్వారమున నవతరింతును, చూడ దలచినవారు అచ్చట సమావిష్టులు కావచ్చును." అని శాస్త పలికెను.

స్థవిరుడు మంచి దని యీవార్త జనులకు దెలిపెను. శ్రావస్తినుండి ముప్పది యోజనముల దూరమున నున్న సంకాశయ నగరమునకు ప్రజాసమూహము చేరెను. వర్షావాసము సమాప్త మయినంతనే శాస్త "ప్రవారణ" చేసి శక్రునితో "మహారాజా, మానవలోకమునకు బోవుదును" అనెను. శక్రుడు విశ్వకర్మను బిలిపించి దశబలధారి మానవలోకమునకు బోవుటకు సోపానములు నిర్మింపుము అని యాన తిచ్చెను. ఆయన సుమేరు పర్వతశిఖరముపై సోపానశ్రేణి ప్రారంభించి, సంకాశయనగర ద్వారమువరకును ఎడతెగకుండ మెట్లు నిర్మించెను. మధ్యభాగమున మణిమయములు, ఒకవంక రజతమయములు, ఇంకొకవైపున స్వర్ణమయములుగా త్రివిధసోపానములు నిర్మించెను. అవి సప్తరత్నవేదిక చుట్టును తిరిగినవి. శాస్త లోకవివరణనామకబుద్ధి చూపి, నగుమ నున్న మణిమయ సోపానశ్రేణివెంట దిగెను. శక్రుడు పాత్ర, చీవరములు; సుయాముడు చామరములు, సహంపతిబ్రహ్మ ఛత్రము, పట్టుకొనిరి. దశచక్రవాళముల నడుమ నున్న దేవతలు దివ్యగంధ మాల్యాదులతో పూజ చేసిరి. శాస్త క్రిందిమెట్టు చేరినంతనే సారిపుత్రుడు ప్రణామము చేసెను; ఆవల జను లెల్లను వందనము చేసిరి. వారిని జూచి శాస్త తనలో "మౌద్గల్యాయనుడు బుద్ధిమంతు డని ప్రసిద్ధి చెందినాడు. ఉపాలి వినయధరుడు, సారిపుత్రుడు మహాప్రజ్ఞావంతు డని ప్రకటము కాలేదు. ఇతనితో సమానుడు నన్నువిడిచి వేరొకడు లేడు, ఈ విషయము ప్రకటీకరింతును" అనుకొని, తొలుత పృథక్‌జన ప్రశ్న వేసెను. దానికి పృథక్‌జనులే సమాధాన మిచ్చిరి. పిదప శాస్త స్రోతాపన్నుల కుచిత మగుప్రశ్న వేసెను. దానికి సమాధానము స్రోతాపన్నులు చెప్పిరి పృథక్‌జనులు దానిని గ్రహింపనే లేదు, అంతట సకృదాగామి, అనాగామి, క్షీణాస్రవ, మహాశ్రావకులకు యోగ్య మగుప్రశ్న వేసెనిను. మ్నాశ్రేణి లోని వారికి తెలియలేదు; ఉన్నతశ్రేణులలోని వారికి తెలిసినది: అగ్రశ్రావకులకు యోగ్యము లగుప్రశ్నములకు అగ్రశ్రావకులే సమాధానములు చెప్పిరి. అన్యులవి గ్రహింపలేదు. అంతట శాస్త సారిపుత్రునియోగ్యతకు తగినప్రశ్న వేసెను. దానికి సమాధానము సారిపుత్రుడే చెప్పెను. అన్యులు దానిని గ్రహింపలేదు. "ఈ శ్రావకు డెవడు? శాస్తతో సంభాషించుచున్నాడు!" అని జనులు తలపోసి, ఆయన ధర్మసేనాపతి సారిపుత్ర శ్రావకు డని తెలిసికొని, మహాప్రజ్ఞావంతు డను కొనిరి. అప్పటినుండి దేవతలలోను మానవులలోను ఆయనకీర్తి వ్యాపించెను. అంతట శాస్త ఆయనను బుద్ధవిషయక ప్రశ్న నడిగి, "సారిపుత్రా, ఈసంక్షిప్త కథనమునకు విస్తృతవ్యాఖ్య యే మగును?" అనెను. ఆ గాథ ఇట్లున్నది :

జాతధర్ముల బహుశైక్ష్యుల చర్య
లేవిధంబుగ నుండు, నెరిగి ప్రశ్నంబు
పై బుద్ధిమన్ వివరింపగా వలయు.

స్థవిరు డా ప్రశ్నపై మనసు నిలిపినంతనే అది శైక్ష, భిక్షువుల ప్రతిపత్తిని గూర్చిన ప్రశ్న మని అసందిగ్ధరూపమున గ్రహించెను. కాని, ప్రతిపత్తి స్కంధాది ప్రకారముగా వివిధవిధముల నడుగవచ్చు నను సందేహము కలిగెను. ఏవిధముగా చెప్పిన యెడల శాస్త్రవిచారధార కనుగుణముగా నుండునో, ఆయనకు తెలియలేదు. చూచి శాస్త తనలో "సారిపుత్రుడు ప్రశ్న మసందిగ్ధముగా గ్రహించినాడు; కాని ఆశయవిషయమున సందిగ్ధచిత్తుడై ఉన్నాడు. ఇతనికి కొంచెము ఇంగిత మీయ నిచో సమాధాన మీయజాలడు" అనుకొని, బహిరంగముగా "సారిపుత్రా, ఇది సత్యము" అనెను. తనయాశయమును గ్రహించి సారిపుత్రుడు స్కంధముల కనుగుణముగా ప్రత్యుత్తర మిచ్చునని ఆయనయాశయము. ఇంగితము వలన స్థవిరునకు ప్రశ్న నూరువిధముల, వేయివిధముల నుపస్థిత మయ్యెను. అది బుద్ధులకు సంబంధించినవిషయ మని ఆయన సమాధాన మిచ్చెను. పండ్రెండు యోజనముల దూరము వ్యాపించి యున్న పరిషత్తున కాయన ధర్మోపదేశము చేసెను. ముప్పది కోట్ల జీవు లమృతపానము చేసిరి.

శాస్త పరిషత్తుకు సెల విచ్చి, పర్యటనము చేయుచు క్రమముగా శ్రావస్తి చేరి మరునాడు భిక్షాటనము చేసి, మరలి వచ్చి, గంధకుటిలో ప్రవేశించెను. భిక్షువులు తమతమ కార్యములను ముగించి, సాయంసమయమున ధర్మసభలో సమావిష్టులై, స్థవిరుని గుణగణములను ప్రశంసించుచుండిరి. శాస్త అచటి కరిగి, విషయము తెలిసికొని "భిక్షువులారా, ఇతఁ డిప్పుడేకాదు, పూర్వముకూడ సంక్షిప్త ప్రశ్నమునకు విస్తృతసమాధాన మిచ్చినాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు బోధిసత్త్వుడు శరభమృగముకడుపున పుట్టి, అడవిలో నివసించు చుండెను. వేటలో కుతూహలము కలరాజు ఎంతబలవంతు నైనను లక్ష్యము చేయడు. ఒకనా డాతడు వేటకు పోయి అమాత్యులతో "ఎవని ప్రక్కగా మృగము తప్పించుకొని పోవునో ఆతనికి దండనము తప్పదు" అని పలికెను. "అప్పు డప్పుడు ఇంటిలో నిలిచి యున్నప్పుడుకూడ మంచిగది....లభింపదు. మృగము వచ్చుచో రాజుకడకే దానిని చేర్పవలెను." ఇట్లు యోచన చేసి, వారు రాజుకడనే నిలిచిరి. కొందరు పెద్దపొద చుట్టు ముట్టి ముద్గరాదులతో నేలపై గొట్టసాగిరి. శరభమృగము లేచి మొదట మూడుసారులు పొదలోపల గిర్రున తిరిగి ఎక్కడ సందు కలదో యని చూచెను.

జనులు బుజము బుజము, ధనుస్సు ధనుస్సు తగులునట్లు నిలిచియుండుట కనుగొని, రాజు నిలచియున్న చోటికే పరుగిడి పోవుట యుక్తమని తలచి, కనులలో నిసుక చల్లినట్లు తటాలున మృగము ప్రభువునెదుటికి చేరెను. తనకడకు శరభము వచ్చుచుండుట గమనించి రాజు గట్టిగా లాగి బాణము విడిచెను. బాణపాతమునుండి తప్పించుకొనుటలో శరభములకు నేర్పు కలదు. బాణ మెదురుగా వచ్చుచో మృగము వేగము తగ్గించును; వెనుకనుండి వచ్చుచో వేగముగా ముందరికి పరుగెత్తును; పైనుండి వచ్చుచో వంగును; ఒక ప్రక్కనుండి వచ్చుచో కొలదిగా ఒరగును; పొట్టకు తగులునట్లు వచ్చుచో తల క్రిందుగా పండుకొనును. బాణము తగులుచో వాయుచ్ఛిన్న మేఘరీతిని పరుగెత్తును. శరభమృగము తల క్రిందుగా పండుకొనగా, తాను జంతువును కొట్టినట్టు రాజు కేకవేసెను. ఇంతలో శరభము లేచి, తనచుట్టు నున్నవారిలో సందు చేసికొని వాయువేగమున పరుగెత్తెను.

రెండువైపుల నున్నవారు శరభము పరుగిడుట గమనించి, మృగ మెవరి ప్రక్కగా పరుగెత్తిన దని యోచించి, రాజు ప్రక్కనుండి పోయిన దని నిర్ణయించి, "రాజు మృగమును బాణముతో కొట్టితి నన్నాడు. మనరాజుగారిగురి తప్పదు. కాని బాణము మృగమునకు తగులక నేలలో దూరినది!" అని వివిధవిధముల పరిహాసము చేయుచు వచ్చిరి. "వీరు నన్ను పరిహసించుచున్నారు. నా శక్తి యెరుగరు" అనుకొని రాజు వస్త్రము విరిచి కట్టి, కత్తి తీసికొని కాలినడకతో వేగముగా జని మూడుయోజనముల వరకును దానివెంట నంటెను. మృగ మడవిలో దాగుకొనెను. రాజుకూడ దాగుకొన్నాడు. మృగము పరుగిడు మార్గమున ఏడుమూరల గుంట కలదు. అందు ముప్పదియడుగులలోతు నీరు నిండుగా నుండును. పైన పచ్చిగడ్డి ఆవరించియుండును. మృగము పసిపట్టి ప్రక్కగా పరుగిడెను. రాజు త్వరితగతిలో సూటిగా పోయి దానిలో పడెను.

రాజుపాదధ్వని వినబడక పోవుటచే మృగమాగి వెను దిరిగి చూచి, రాజు గుంటలో పడిపోయె నని దగ్గరకు పోయెను. అతడు దిక్కు లేక నీటిలో కొట్టుకొనుచుండెను. అతనియపరాధముమీద దృష్టి నిలుపక మృగము దయతో "నేను చూచుచుండగా రాజు నశింపరాదు. ఇతనిని విముక్తుని చేయుదును" అని తలచి గట్టున నిలిచి "మహారాజా భయము లేదు. ఆపదనుండి నిన్ను తప్పించెదను" అని పలికి, ప్రియపుత్రుని రక్షించురీతిని ఒకగడ్డ నాధారము చేసికొని, ఏడుమూరల నరకమునుండి అతనిని తీరమునకు చేర్చెను; అవల నతని నోదార్చి, మూపున గూరుచుండ బెట్టుకొని, అడవి వెలువడి. రాజసైన్య మున్నతావునకు కొలది దూరములో దింపి, ధర్మోపదేశము చేసెను. రాజు మృగమును విడువలేక, "స్వామీ, శరభరాజా, నావెంట వారాణసికి రమ్ము. నీకు పండ్రెండు యోజనముల రాజ్యము నిచ్చెదను. అచ్చట నీవు పరిపాలన చేయవచ్చును" అని వేడెను.

"మహారాజా, మేము జంతువులము. మాకు రాజ్యముతో పని లేదు. నాయెడ స్నేహము కలదేని, నే నిచ్చిన పంచశీలమును నీవు పాలించుటయే కాక రాష్ట్రవాసులచేత పాలనము చేయింప వలయును" అని శరభమృగ ముపదేశ మిచ్చి, అరణ్యములోనికి బోయెను. కనుచూపు మేర దాటిపోవువరకును రాజు మృగము మీద దృష్టి నిలిపి, ఆవల నిజసైన్యమును జేరి, నగరమునకు బోయెను. "నేటి నుండి రాష్ట్రవాసు లెల్లరును పంచశీలములను పరిరక్షింపవలెను" అని రాజు ధర్మ డార వేయించెను. బోధిసత్త్వుడు తనకు జేసిన యుపకారమును రా జెవ్వరికిని తెలుపలేదు. వివిధరుచ్య పదార్థములతో గూడినయాహార మారగించి, అలంకరించిన శయనముపై బండుకొని, ప్రాతఃకాలమున లేచి, బోధిసత్త్వుని యుపకారమును స్మరించి, ప్రసన్నచిత్తుడై శయ్యపై గూరుచుండి ఉల్లాసముతో ఈ గాథలు ప్రకటించెను:

పురుషు డాశను కోలుపోవగా రాదు;
ఆశ గోల్పోవు విద్యావంతు డైన
కారాదు; నన్నె నే గనుగొనుచుందు.
ఎట్టు లాసించితి, నట్టు లైనాను.
పురుషు డాశను కోలుపోవగా రాదు
విద్వాంసు డాశను విడువగా రాదు
ఎట్టు లాశించితి నట్టు లైనాను
చేరితి స్థలమును నీరంబునుండి.

జనుడు ప్రయత్నంబు సలుపగా వలయు,
విద్వాంసు డాశను విడువగా రాదు
ఎట్టు లాసించితి నట్టు లైనాను
జతనంబు పురుషుండు సలుపగా వలయు.

చుట్టుకొన్నను వ్యథల్ సుఖముపై నాశ
తగదు ప్రజ్ఞావంతు డనుమాడు విడువ.
దాపురించుచునుండు తలపకుండగనె
పలుదుఃఖములు సుఖములు మరణంబు.

తలపకున్నను గల్గు తలచిన గూడ
సంభవింపవు ప్రపంచాన భోగములు
అయ్యవి కావు వాంఛానుసారములు.

రా జీవిధముగా నుల్లాసము ప్రకటించుచుండగా పురోహి
శయన మయ్యేనా అని అడుగువాడై ఉదానగాథలు వినుచు ద్వారవ

"రాజు నిన్న వేటకు వెళ్ళినాడు. శరభమృగము తప్పించుకొని పోయి యుండును. అమాత్యులు నవ్వియుండవచ్చును. రాజు అభిమానము చెంది, మృగమువెంట బడి, త్రోవలో గుంటలో పడియుండును. దయాళువగు శరభము దోష మెన్నక రాజు నుద్ధరించి యుండును. అందుచేతనే రాజు ఉల్లాసవాక్కులు పలుకుచున్నాడు" అనుకొని, నెమ్మదిగా గోళ్ళతో తలుపుపై దట్టెను. ఎవ రని రాజడుగగా, "దేవా, నేను పురోహితుడను" అని యాతడు విన్నవింపగా "ఆచార్యా, ఇచటికి రండు" అని రాజు తలుపు తీయించెను. పురోహితుడు లోని కరిగి జయ మని పలికి ఒకచో నిలిచి, అరణ్యమున జరిగిన వృత్తాంతము చెప్పి, ఈ గాథలు పలికెను ;

ఈవు వెన్నాడితి వేశరభంబు
దుర్గమ పర్వత మార్గంబులందు,
దాని యసాన క్రమానస యత్న
హేతువుచేత జీవించి యున్నావు.

నిరుపమవ్యథ నున్న ని న్నేమృగంబు
నరకసమాన మైనట్టి గర్తంబు
నుండి రాయూతతో నుద్ధరించినదా
తదసాన క్ర ధర్మగుణంబు
లధికమ్ముగా నీవె యగ్గించినావు.

"ఇతడు నావెంట రాలేదు. అన్నివిషయము లెట్లు తెలిసికొన్నాడో అడిగెద గాక" యని తలపోసి రాజీగాథ పలికెను :

అచ్చోట నుంటివా ఆసమయాన ?
కాక చెప్పిరా దీని నీ కవ్వ రైన ?
ఉన్మ క్త మైయున్నదో సర్వదర్శి.
నీకమాటమ్ము, జ్ఞానివి నీవుమిగుల !

బ్రాహ్మణుడు దీనిని ప్రకటీకరించి "మహారాజా, నేను సర్వజ్ఞబుద్ధుడనుకాను. మీవాక్కులలోని యర్థమును బట్టి సంగతులు గ్రహించితిని" అని యీగాథపలికెను;

అపుడు మహారాజ, అచట నే లేను
ఈమా ర్గ తెలుపలే దెవ్వరు నాకు
పండితజనుల సుభాషితంబులును
గాథలు నర్థాల కల్పన చేయు.

ఆతనియెడ ప్రసన్నుడై రాజు బ్రాహ్మణునకు బాలధన మిచ్చెను. నాటినుండి ఆతడు పుణ్యకార్యములు చేయజొచ్చెను. లోకు లతనిని పుణ్యాత్ము డనిరి. మరణా నంతర మాతడు స్వర్గము చేరెను.

ఒకనాడు రాజు పురోహితుని వెంట బెట్టుకొని పోయి "గురుకు కొట్టుటకై" ఉద్యానము చేరెను. అప్పుడు శక్రుడు బాలమంది నూతనదేవతలను కన్యలను చూచి కారణ మేమని యడిగెను. శరభమృగము రాజును నరకమునుండి యుద్ధరించి, పంచశీలప్రతిష్ఠ చేసె ననియు, రాజు ప్రభావమువలన ప్రజలు స్వర్గమున నిండిపోవుచున్నా రనియు ధ్యానబలమువలన శక్రుడు గ్రహించెను.

అప్పు డాతడు "నేను సింహనాదము చేయుదును. మృగము చేసిన యుపకారము తెలుపుదును. నా శక్రత్వమును ప్రకటము చేయుదును. ఆకాశమున నిలిచి ధర్మోపదేశము చేయుదును. మైత్రి, పంచశీలముల మహిమను తెలిపివత్తును'' అని నిర్ణయించుకొనెను. లక్ష్యవేధకై రాజు ధనుస్సున బాణము తొడిగెను. ఆ సమయమున శక్రుడు నిజప్రతాపముచే రాజునకును లక్ష్యమునకును నడుమ శరభమృగము కనబడునట్లు కావించెను. చూచి రాజు బాణము విడవలేదు, శక్రుడు పురోహితుని శరీరమున ప్రవేశించి రాజును రెండు గాథలతో సంబోధించెను.

అన్యవీర్యము హరియించు నమ్మ వింటి
తొడిగి, యెట్టిసంశయమున పడితి వీవు ?
తీక్ష్ణబాణము వేగ వధించు మృగము
నిద్ది రాజభోజన మని యెరుగవలయు.

అప్పుడు రాజి ట్లనెను :

ఎరుగుదును బ్రాహ్మణోత్తమా, యీమృగంబు
క్షత్రియాహార మని నేను; కాని పూర్వ
మందు పొందినయుపకార మర్చుచేతు
శరభమృగము నద్దానిచే సంహరింప.

అప్పుడు శక్రుడు రెండుగాథలు పలికెను :

ఇది మృగము కాదు రాజ దేవేంద్రు డితడు
ఇతని హరియింప నీవె దేవేంద్రపదవి
నందుదువు! కాక నామిత్ర మనుతలపున
శరభమును సంహరింపక సంశయించు
పక్షమందు వీర్యశ్రేష్ఠ, భార్యతోడ
తనయుతో జేరవలయు వైతరణి నీవు.

అంతట రాజీగాథలు పలికెను :

యమునివైతరణిం జేర నరుగ మేలు
పుత్రభార్యా సహాయక పూర్వకముగ

జానపదసంఘముం గూడి: దానినుండి
ప్రాణ మగు నన్ను గూడ, మృగంబు జంప,

ఒంటిగా నేను బాధలో నున్నయపుడు
భీకరారణ్య గర్తాన, నాకు మృగము
ఓమపో బ్రహ్మ, చేసినయుపకృతి మది
మెలగ నేగతి వధియింపగలను దీని ?

ఆవల శక్రుడు పురోహితుని శరీరమునుండి వెలువడి నిజరూపము ధరించి ఆకసమున నిలిచి రాజగుణములను ప్రకటించుచు ౨ గాథలు పలికెను ;

వర్ధిల్లు మోమిత్రపాలకా, చిరము
ధారుణి నేలుము ధర్మవిధాన
పరిచర్య బొందుచు తరుణులచేత
స్వర్గాన వాసవుసరణి సుఖించు!

అక్రోధనుండవై , అనవరతంబు
శాంతచిత్తంబుతో సకలాతిథులకు
భిక్షుకజనులకు బెట్టుచు నీవు,
ఉచితభోగంబుల నొందుచు, నింద
పొందక స్వర్గంబు నొందుము రాజ!

ఇట్లు పలికి దేవరాజ శక్రుడు "మహారాజా, నిన్ను పట్టుటకై వచ్చినాను, కాని నీవు పట్టుపడలేదు. అప్రమత్తుడవై యుండుము" అని యుపదేశ మిచ్చి నిజనివాసమునకు జనెను.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, సారిపుత్రు డిప్పుడే కాదు, పూర్వజన్మమున కూడ సంక్షిప్తోపదేశమున విస్తృతార్థమును గ్రహించినవాడు" అని జాతకమును సరిపోల్చెను.

ఆ కాలమున రాజు ఆనందుడు; శరభమృగము నేనే,

o

చతుర్థ సంపుటి

# జాతక కథలు

అయిదవ సంపుటి

## 5

పాలీభాషనుండి ఆంధ్రీకరించినది

స్వామి శివశంకర శాస్త్రి




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్ - హైదరాబాదు - 4

# వి జ్ఞా ప న

బుద్ధుని జాతక కథా సందోహమున 547 కథలు కలవు.

సాహిత్యసృష్టి, సాహిత్యదోహదము, సాహిత్యప్రచారము చేయుచు, ఉత్తమగ్రంథ ముద్రణకు ధనసాహాయ్యముచేయు మహాసంస్థ ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ. ఈ యున్నత పరిషత్తు దీనిముద్రణ, ప్రకటన భారము వహించినందులకు సంస్థకు - విశేషించి, ఏతదధ్యక్షులు మహామాన్యశ్రీ, సాహిత్యాచార్య, బెజవాడ గోపాల రెడ్డి గారికినీ, కార్యదర్శి పూజ్యశ్రీ దేవులపల్లి రామానుజ రావుగారికిని ధన్యవాదములు.

పాలి భాషలోని ఈ కథాసందోహము మాతృక ననుసరించి మూలాతి క్రమణము కాకుండ ఆంధ్రీకరించినాను. పాలిభాషలోని గాథలలో ఛందస్సు ఋజుమార్గమున నడువదు. ఆఛందస్సుల ననుసరించి పద్యరచన చేయుటకు వలను పడదు; చేసినను ఆంధ్ర సాహిత్య సరణికి సరిపడదు. కావున దీర్ఘ ములు కాని ఆటవెలది, తేటగీతి, మంజరీ ద్విపది, భామినీ షట్పది(ముత్యాల సరము) పంక్తులలో అనువాదము కావించినాను. చెప్పినదే తరుచుగా చెప్పుచుండుట గద్యములోకాని, పద్యములోకాని చమత్కార హేతువగును. ప్రాచీన కథన ధోరణి ఇట్టిది. దేశీయ గీతములలో కూడ ఈవిధానమే గోచ రించును. పునరుక్తి అతివేల మయినప్పుడు సందర్భోచితముగా సంగ్రహించి నాను. ప్రధానాశయ మేమాత్రము తొలగి పోవకుండ జాగరూకత వహించి నాను.

ఆంధ్రప్రదేశములోని అన్నిమండలముల వారికిని నాతిశ్రమతో సుబో ధము అగునట్లు సరళగ్రాంధిక భాషను. సరళశైలిని అవలంబించినాను. ఈ విధానము శిష్టవ్యావహారిక భాషాశైలికి సన్నిహితముగా నుండునని విజ్ఞుల యాశయము.

సాహితీ సమితి,
ఒంగోలు: జూన్ 21, 1971

స్వామి శివశంకరస్వామి

# విషయానుక్రమణిక

## సంపుటి 5 :   484—521

---

పకిణ్ణక వర్గ :  పుట


| | | |
|---|---|---|
| 484 | సాలికేదార జాతకము | 1 |
| 485 | చండ కిన్నర జాతకము | 8 |
| 486 | మహా-ఉక్కుస జాతకము | 14 |
| 487 | ఉద్దాలక జాతకము | 22 |
| 488 | భిస జాతకము | 29 |
| 489 | సురుచి జాతకము | 37 |
| 490 | పఞ్చుపోసథ జాతకము | 48 |
| 491 | మహామోర జాతకము | 55 |
| 492 | తచ్ఛసూకర జాతకము | 65 |
| 491 | మహావాణిజ జాతకము | 74 |
| 493 | సాధీన జాతకము | 80 |
| 495 | దస బ్రాహ్మణ జాతకము | 87 |
| 496 | భిక్షాపరంపర జాతకము | 94 |
| 497 | మాతంగ జాతకము | 99 |
| 498 | చిత్తసంభూత జాతకము | 113 |
| 499 | శిబి జాతకము | 123 |
| 500 | సిరిమంద జాతకము | 133 |
| 501 | రోహంత మిగ జాతకము | 134 |
| 502 | హంస జాతకము | 144 |

| | | |
|---|---|---|
| 503 | సత్తిగుంబ జాతకము | 150 |
| 504 | భల్లాటియ జాతకము | 157 |
| 505 | సోమనస్స జాతకము | 163 |
| 506 | చంపేయ్య జాతకము | 172 |
| 507 | మహాపలోభన జాతకము | 186 |
| 508 | పంచపండిత జాతకము | 190 |
| 509 | హత్థిపాల జాతకము | 191 |
| 510 | అయోఘర జాతకము | 207 |
| 511 | కింఛంద జాతకము | 214 |
| 512 | కుంభ జాతకము | 224 |
| 513 | జయద్దిస జాతకము | 231 |
| 514 | ఛద్దంత జాతకము | 244 |
| 516 | మహాకపి జాతకము | 270 |
| 517 | దకరక్ఖస జాతకము | 276 |
| 518 | పండర జాతకము | 277 |
| 519 | సంబుల జాతకము | 287 |
| 520 | గండతిందు జాతకము | 297 |
| 521 | తేసకుణ జాతకము | 306 |

# 484. సాలి కేదార జాతకము

శాస్త్ర జేతవనములో విహారము చేయుచు, మాతృ సేవ చేయు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఈ కథ సామజాతకమున, ( 540 ) వచ్చును. శాస్త్ర ఆ భిక్షువును పిలిపించి "భిక్షూ, నీవు నిజముగా గృహస్థులను పోషించుచున్నావా ?" అని యడిగెను."భన్తే, సత్యమే"."వారు నీ కేమగుదురు?""భన్తే,తలిదండ్రులు". "భిక్షూ, మంచిది, పురాణపండితులు చిలుకకడుపున పుట్టినను వృద్ధమాతా పితలను గూటిలో పరుండబెట్టి ముక్కున ఎర కరచుకొని వచ్చి పెట్టుచుండెడి వారు" అని, శాస్త్ర పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున రాజగృహమున మగధరాజు రాజ్యము చేయు చుండెను. ఆకాలమున నగరమున కీశాన్యదిశలో సాలిందియ మను అగ్ర హారము కలదు. దానికి ఈశాన్యమున మగధదేశ భూములు కలవు. అచట కోసియగోత్ర నామక బ్రాహ్మణుడు, సాలిందియ నివాసి, వేయి కరీషముల భూమి కైకొని, అందు సాలిధాన్యబీజములు చల్లెను. గింజలు మొలక లెత్తగానే గనుములు వేసి ఒకానొకనికి ఏబదికరీషములు, వేరొకనికి అరువది కరీషములు, తనవారికి మొత్తము 500 కరీషముల భూమి అమరకమున కిచ్చి, మిగిలిన 500 కరీషముల భూమి ఒకనికి మక్తా కిచ్చెను. అచట బ్రాహ్మణుడు కుటీరము నిర్మించుకొని నివసింపజొచ్చెను. పొలమున కీశాన్యదిశలో గుట్ట ప్రక్కన పెద్ద శాల్మలీ వృక్ష మున్నది. అందు చిలుక లనేకములు నివసించు చుండును. ఆ కాలమున బోధిసత్త్వుడు ఆశుకమండలికి రాజగువానికి పుత్రు డై పుట్టి, పెరిగి పెద్దవా డైనపిదప సుందరుడు, శక్తిమంతుడు నయ్యెను. అతనిశరీరము బండిచక్రపు కుం డంత పరిమాణమున నుండెను.

ఆతనితండ్రి వార్ధకము వచ్చినపిదప "ఇప్పుడు నేను దూరము పోజా లను నీవు ఈ మండలికి నాయకత్వము వహింపుము" అని కుమారునకు ప్రభుత్వము సమర్పించెను. నాటినుండి బోధిసత్త్వుడు తలిదండ్రులను ఆహార మునకై పోవవల దనెను. శుకసమూహముతో హిమాలయమునకు జని అచట స్వయముగా శాలికేదారములలో యథేచ్ఛముగా ధాన్య మారగించి మరలి వచ్చునపుడు తలిదండ్రులకు సరిపోవునంత మేత కొనివచ్చి పోషించు చుండెను. ఒకనా డాతడు చిలుకలతో "ఇదివరలో ఈఋతువున మగధ భూములలో ధాన్యము పంటకు వచ్చెడిది. ఇప్పు డెట్లున్నది ? పోయి వివర ములు కనుగొని రండు" అని రెండుచిలుకలను పంపెను. అవి పోయి మగధ దేశభూమిపై దిగునపుడు బ్రాహ్మణుడు మక్తా కిచ్చినపొలముపై వాలి, శాలిధాన్యము తిని, ఒక్కగింజ కరచుకొని పోయి బోధిసత్త్వుని చరణ సన్నిధిలో నుంచి, అచటి ధాన్య మిట్లుండు నని విన్నవించినవి. బోధి సత్త్వుడు మరునాడు శుకసమూహముతో ఆ క్షేత్రమునకు పోయి వాలెను. చిలుకలు ధాన్యము తిన నారంభింపగానే యెచటినుండియో జనులు చిలుక లను తరిమిరి; అయినను వాని నాప లేకపోయిరి. చివరిచిలుక గూడ ధాన్యము తిని వట్టినోటితోడనే చనెను. కాని శుకరాజు తలిదండ్రులకై వలసి నన్నిగింజలు చిలుకలచే పట్టించుకొని పోయెను. మరునాటినుండియు చిలుక లచటి ధాన్యమునే తినజొచ్చినవి.

అప్పుడు పొలముకాపరి తనలో "ఇవి ఈ ప్రకారముగా తినుచో కొలదిరోజులతో పొలమున ధాన్య మేమియు మిగులదు. బ్రాహ్మణుడు ధాన్యముఖరీదు కట్టి నాపై వేయగలడు. పోయి ఆతని కీవిషయము తెలిపె దను," అనుకొని గుప్పెడుధాన్యము పట్టుకొని తగినకానుక కొని, బ్రాహ్మ ణుని సమీపించి, ప్రణామము చేసెను.

"ఏమయ్యా, పొలమున ధాన్యము బాగుగా పండినదా ?" అని బ్రాహ్మణు డడిగెను.

అతడు "చిత్తము, బ్రాహ్మణోత్తమా !" అని రెండు గాథలు పలికెను :

సంవన్న మైనట్టి శాలిధాన్యమును
చిలుకలపిండు భక్షించును విప్ర!
చెప్పెద నీకు కోసియ, ఒక్కమాట-
వాని నివారించు వాంఛయే లేదు!

అన్నిపిట్టలకన్న నందమౌ శుకము
తిని యథేచ్ఛగ ధాన్యమును, ముక్కునిండ
గొనిపోవుచున్నది కొన్నిగింజలను.

బ్రాహ్మణు డాతనివాక్కులు విని చిలుకయెడ ప్రీతి కలవాడై కాప రితో "ఓయీ, నీకు వల పన్నుట తెలియునా?" అని వాని నడిగెను.

"చిత్తము, తెలియును" అని వాడు పలికెను.

బ్రాహ్మణు డీగాథ పలికెను :

కేశనిర్మిత మైనపాశంబు వేయ
చిక్కును విహగంబు; జీవంబుతోడ
పట్టి యద్దాని నాపజ్జకు తెమ్ము.

విని కాపరి ప్రసన్నచిత్తుడై, భూమివిలువ లెక్కించి, నెత్తిపై ఋణము పడు ననుభయము లేకుండెను. చని ఆతడు గుర్రపుతోకలో వెండ్రు కలు లెక్కించి, నాడు శుకరాజు దిగుతావు గ్రహించి అచట వల పన్నెను. మరునాడు ప్రాతఃకాలమున నాతడు గొయ్యి త్రవ్వి దానిపై వల పన్ని, కుటీరపుగడపపై కూర్చుండి చిలుకలరాక కెదురు చూడజొచ్చెను. శుకరాజు జిహ్వాచాపల్యము లేనివా డగుటచే వెనుకటిరోజున ధాన్యము తిన్నచోట పన్నినవలలో తెలియక చిక్కుకొనెను. తనపాదమున కురి తగులుకొన్న దని తెలిసికొని ఆతడు తనలో "నేను వలలో తగులుకొన్నట్లు ధ్వని చేసినచో నాసంబంధులు మేత మేయక భయమున పరుగువారుదురు. శుకములు మేత మేయునంతవరకు సహించెదను" అనుకొని చిలుకలు ధాన్యము తిన్నతరు వాత వలలో తాను చిక్కుకొని మరణభీతి నొందినట్లు మూడుమారులు కుయ్యి పెట్టెను. పిట్ట లన్నియు నెగిరిపోయినవి. అంతట శుకరాజు తనలో

"నావార లింద రున్నను ఒక్కడుకూడ ఆగి నావైపు చూడలేదు. నే నేమి పాపము చేసితిని!" అని విలపించుచు ఈగాథ పలికెను :

విహాగంబు లన్నియు వెడలి పోయినవి
తిని, త్రాగి; నే జిక్కితిని జాలమందు
నొక్కడ- నేపాప మొనరించినానో !

కాపరి శుకరాజు విలాపము విని, ఆకసమున నెగిరిపోవుచున్న చిలుకలచప్పుడు విని 'యే మిది' యని వెరగు చెంది, కుటీరము వెలువడి వల పన్నినచోటు చేరి, శుకరాజు చిక్కువడియుండుటకు సంతసించి, వలలో నుండి చిలుకను వెలువరించి రెండుపాదములు బంధించి శాలిందియ గ్రామము చేరి, దానిని బ్రాహ్మణున కిచ్చెను. బ్రాహ్మణుడు మిక్కిలి ప్రీతి కలవాడగుటచే బోధిసత్త్వుని రెండుచేతులతో బాగుగా పట్టుకొని ఒడిలోనికి చేర్చుకొని సంభాషించుచు ఈగాథలు పలికెను :

ఉదర మన్యులదైన ఉదరంబు, నీదో
అత్యుదరం బగు ననిపించు శుకమ !
మ్రింగి ధాన్యం బిచ్చమేరకు, గింజ
లెన్నో ముక్కున బట్టి యేగుచున్నావు.

నిజముగా నాతోడ నీకు వైరంబు :
ఏప్రదేశమునకు నీగింజ లెల్ల
కొనిపోయి నింపెదు కొట్టునింపగను ?

విని శుకరాజు మనుష్యవాక్కున మధురముగా ఈగాథ పలికెను :

లేదు విరోధంబు, లేదు కోపంబు;
ఋణవిముక్తుడ నయి, ఋణ మిచ్చువాడ,
సేమరవనము జేరి యచ్చోట
చేకూర్తు నిధిని కోసియ, గ్రహింపు !

అప్పుడు బ్రాహ్మణు డిట్లనెను :

ఎట్టిది నీ విచ్చుఋణము శుకంబ ?
ఋణవిముక్తి ఘటిల్లు టెట్లు ? లేరీతి

నిధి సమకూర్తువో నీవు సూచింప,
పాశవిముక్తిలాభము కల్గు నీకు.

ఈ ప్రకారముగా బ్రాహ్మణుడు ప్రశ్నించినంత శుకరాజు ఆయన కెరుక చేయువాడై ఈ గాథలు పలికెను :

ఉన్నారు పరిపుష్టి నొందని చిన్ని
బిడ్డలు కోసియా, పెరిగిన పిదప
నన్ను పోషింప ఋణం బిత్తు నిపుడు.

నాతలిదండ్రులు లైనారు ముసళ్ళు,
కొనిపోయి వారలకోసమై నేను
చంచూపుటంబున శాలిధాన్యంబు
పూర్వపు ఋణముక్తి పొంద గల్గుదును.

అచ్చోట కలవు విహంగము లెన్నో
క్షీణపక్షంబులు జీర్ణశక్తులును
ఇత్తు వానికిగూడ నేను పుణ్యాశ-
నిధి యని దాని పండితులు పల్కుదురు.

ఎరుగుము కోసియా, యిదె ఋణదాన,
మిద్దియే ఋణముక్తి, యిద్దియే నిధిగ.

బ్రాహ్మణుడు బోధిసత్త్వుని ధర్మకథనము విని ప్రసన్నచిత్తుడై ఈ గాథలు పలికెను :

ఎంతయు ధార్మిక మీద్విజోత్తమము !
కొందరు మానవులం దైన నిట్టి
పరమధర్మము కానబడ దెన్నడేని.

నీజాతి సంబంధి నిఖిలంబుతోడ
ధాన్యంబు తినుము యథారుచి శుకమ !
మరల ఘటిల్లును మనసమాగమము-
మెండుగ ప్రియదర్శనుండవు నీవు !

ఆయన ఈ విధముగా బోధిసత్త్వుని ప్రార్థించి తన ప్రియపుత్రుని చూచినట్లు శుకరాజును చూచుచు పాదబంధము విడిపించి, నూరుపుటములు వేసిన తైలమును పాదములకు మర్దనము చేసి, అందమయిన పీటపై కూర్చుండబెట్టి బంగరుస్థాలిలో మధువు త్రాగించెను. అంతట శుకరాజు "బ్రాహ్మణోత్తమా, అప్రమత్తుడవై యుండుము" అని ఉపదేశ మిచ్చువాడై ఈ గాథ పలికెను :

అన్నపానీయము లారగించితిమి
నీయింట కోసియా, నీయెడప్రీతి !
దాన మొసంగుము త్యక్తదండులకు,
పితరుల వృద్ధుల ప్రీతి బోషించు.

ఆలకించి బ్రాహ్మణుడు ప్రసన్నుడై, యుల్లాసము వెలిబుచ్చుచు ఈ గాథ పలికెను :

ద్విజముల శ్రేష్ఠమున్ వీక్షించినాను,
ఈనాడు లక్ష్మి ప్రాప్తించెను నాకు
శుక సుభాషితములు శ్రోత్రముల్ నిండ
రకరక పుణ్యకార్యంబు లొనర్తు.

బోధిసత్త్వుడు బ్రాహ్మణు డిచ్చిన వేయి కరీషములు స్వీకరింపక కేవలము ఎనిమిది కరీషములు స్వీకరించెను. బ్రాహ్మణుడు ఆయనకు భూమి సమర్పించి చేతులు జోడించి "స్వామీ. దయ చేయుడు. విలపించుచున్న తలిదండ్రులను ఓదార్పుడు" అని సెలవు తీసికొనెను. శుకరాజు ప్రసన్నచిత్తుడై గింజలు కొనిపోయి తలిదండ్రులసన్నిధిలో నుంచి "అమ్మా, నాయనా, లెండు" అని పలికెను. వారు ఊరడిలి ప్రసన్నవదనులైరి. ఆ సమయమున చిలుకలు ఒకచో చేరి "దేవా, ఎట్లు విముక్తి పొందితిరి ?" అని అడిగినవి. శుకరాజు వృత్తాంతము సవిస్తరముగా తెలిపెను.

కోసియ బ్రాహ్మణుడు శుకరాజు చేసిన ఉపదేశప్రకారము నడచుకొనుచు, నాటినుండి ధార్మికశ్రమణ బ్రాహ్మణులకు భూరిదానము లిచ్చుచుండెను.

ఈ యభిప్రాయమును ప్రకటించుటకై శాస్త ఈ గాథ పలికెను :

ఔదార్యము వహించి ఆక్రోసియుండు
శాంతచిత్తంబుతో శ్రమణ విప్రులను
సంతృప్తహృదయులన్ సలిపినవాడు
అన్నపానము లిచ్చి అధికంబుగాను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఈ విధముగా తలిదండ్రుల పోషణ పండితపరంపరకు సంప్రదాయము" అని ఆర్యసత్యములను ప్రకటించి, జాతకములు సరిపోల్చెను. సత్యప్రకాశనానంతరము ఆ భిక్షువు శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను.

ఆ కాలమున శుకమండలి బుద్ధపరిషత్తు; తలిదండ్రులు మహారాజ కులము; కాపరి ఛన్నుడు; బ్రాహ్మణుడు ఆనందుడు; శుకరాజు నేనే.

—):(—

# 485. చంద కిన్నర జాతకము

శాస్త కపిలపుర- ఆశ్రమమునుండి న్యగ్రోధ- ఆరామమున విహారము చేయుచు, రాజభవనమున రాహులమాతవిషయమై చెప్పినది.

## వర్తమాన కథ

ఈ జాతకము "నిదానము"నుండి ఆరంభించి ఈయవలసినది. నిదాన కథ లట్ఠివనమున ఊరువేల కస్సపుని సింహనాదము అపణ్ణక జాతకమున చెప్పబడినది. దానికి ముందు కపిలవస్తుగమనము వేస్సంతర జాతకమున వచ్చును శాస్త తండ్రియింట భోజనమునకు పూర్వము మహాధమ్మపాల జాతకము చెప్పెను. భోజనానంతరము రాహులమాత నివాసమందిరమునకు బోయి చందకిన్నర జాతకము చెప్పదలచుకొని, రాజుచేతిలోనిపాత్ర తీసికొని, అగ్రశ్రావకు లిరువురను వెంటనిడుకొని ఆమెనివాసమందిరము చేరెను. ఆ సమయమున నామెయధీనములో నలుబదివేల నర్తకీజన ముండెను. వారిలో వేయిమంది క్షత్రియకన్యలు. తథాగతుడు వచ్చు నని విన్నంతనే ఆమె వారి నందరిని కాషాయాంబరములు ధరింప నాన తిచ్చెను. వా రటులే చేసిరి. శాస్త చనుదెంచి పరచిన కంబళముపై గూరుచుండెను. వా రెల్లరు నొక్కపెట్టున విలపింప సాగిరి. ఆమెను రా జిట్లు ప్రశంసించెను : "భన్తే, మీరు కాషాయము ధరించినట్లు విన్నంతనే మాకోడలు కాషాయవస్త్రములు ధరించినది. మీరు మాల్యాదులు విడనాడి, నేలపై శయనించు చున్నట్లు విన్నంతనే ఈమె మాల్యాదులు తాల్పక, భూశయనము చేయు చున్నది. మీరు ప్రవ్రజించినపిదప ఈమె వితంతువువలె నుండి, అన్యరాజులు సందేశము లంపుచున్నను స్వీకరింపలేదు. ఈమెకు మీయెడ నింతటి దృఢ భక్తి!"

ఈ విధముగా రాజు రకరకముల ప్రశంస చేసెను. అప్పుడు శాస్త ఆయనతో "మహారాజా, ఇం దాశ్చర్య మేమియు లేదు. నాతుదిజన్మలో ఈమె నాయెడ ననురక్తియు, దృఢభక్తియు, అన్యాక్రాంతము కాని

చిత్తములో నుండుట వింత కాదు. మున్ను పక్షికడుపున పుట్టియు నిట్లే యుండెను" అని, రాజు ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు హిమాలయ ప్రదేశమున కిన్నరికడుపున పుట్టెను. ఆయనభార్య చంద. వా రిరువురు చందనామక రజతపర్వతమున నివసించుచుండిరి.

ఆ సమయమున వారాణసీ నరేశ్వరు డమాత్యులకు రాజ్య మర్పించి, కాషాయవస్త్రములు ధరించి పంచాయుధములతో ఏకాకిగా హిమాలయమునకు పోయెను. మృగమాంసము తినుచు నదివెంట పోవుచు కొంతదూరమున ఉన్నతప్రదేశము చేరెను చందపర్వతమున నివసించు కిన్నరులు వర్షాకాలమున క్రిందికి దిగరు; వేసవికాలమున దిగుదురు. ఆ సమయమున కిన్నరుడు భార్యతో కూడ క్రిందికి దిగి, పరిమళము వెదజల్లు పుష్పరేణువుల మూచూచుచు, పుష్పవస్త్రములు ధరించుచు లతాడోలికలలో నూగుచు మధురస్వరమున పాటలు పాడుచు. ఆ చిన్ననదిని చేరిరి. పచారు చేయుటకు వీలగుచోటికి దిగి నీటిలో పుష్పములు చల్లుచు జలక్రీడ చేసిరి. అవల వారు పూలబట్టలు కట్టుకొని వెండివలె తళతళలాడు నిసుకదిబ్బపై పుష్పశయ్య సిద్ధము చేసి కణుపుల వేణువు తీసికొని పుష్పశయ్యపై గూర్చుండిరి. అపుడు చందకిన్నరుడు పిల్లనగ్రోవిపై మధురస్వరమున పాడెను చంద్రకిన్నరి కోమలహస్తములు చరచుచు ఆతనియెదుట నాట్యము చేయుచు పాడెను. రాజు ఆ మధురధ్వనులు విని తనకాలి యడుగుల సవ్వడి కాకుండ మెల మెల్లన చాటు చాటుగా వచ్చి కిన్నరులను చూచెను తోడనే ఆతనికి కిన్నరిపై ఆసక్తి కలిగెను. "ఈ కిన్నరుని బాణముతో కొట్టి చంపి ఈమెతో వసింతును" అనుకొని బాణముతో కిన్నరుని కొట్టెను కిన్నరుడు వ్యథాభిభూతుడై విలపించుచు ఈ గాథలు పలికెను :

ప్రాణముల్ పోయెడి పగిదిని దోచు,
తోచును నెత్తుట దోగుట మూర్ఛ

క్రమ్ము రీతిని చంద్ర ! కంఠరోధమ్ము
ప్రబలుచున్నది- ఎందో పడుచున్న వాడ !

కుమిలిపోవుచు నున్నది మనస్సు తృణము
వలె, నరణ్యముపోల్కి, వాహినిబోలె
శుష్కించు తలప నీశోకవిధమ్ము !

పర్వతానికి నిమ్నభాగాన నున్న
సరసిలోనికి వర్ష జలమట్లు నాదు
బాష్పముల్ ప్రవహించు ప్రబలదుఃఖంబు
కలుగును నీశోక భావనచేత !

బోధిసత్త్వుడు విలపించి పుష్పశయ్యపై బడి స్మృతికోల్పోయెను. రాజుకూడ నిలిచిపోయెను. బోధిసత్త్వుడు విలాపము చేసి నను కిన్నరి ఆనందప్రమత్తతలో అతనికి బాణము తగిలినట్లుకూడ గ్రహింపలేదు. కాని అతడు స్మృతి తప్పి తల క్రిందులుగా పడియుండుట చూచి "నా భర్తకు ఏమివ్యాధి ?" అనుకొని గాయమునుండి రక్తము స్రవించుట చూచి ప్రియ భర్త బాధను సహింప లేక ఆమె బిగ్గరగా విలపింపసాగెను. కిన్నరుడు మృతి చెందియుండు నని నిశ్చయించుకొన్నపిదప రాజు స్వయముగా బయలు పడెను. ఆతనిని చూచినంత నే యామె ఆ చోరుడు నా ప్రియభర్తను బాణముతో కొట్టినవా డని గ్రహించి కంపము నొంది, పరుగెత్తి పర్వతశిఖరముపై నిలిచి, రాజునకు శాపమిచ్చునదై ఈ గాథలు పలికెను :

రాజపుత్రుడు, పాపి, నారాచ మేసి
నాప్రియుని దీను బడగొట్టినాడు విపిన
మూలమున ! ఆత డున్నాడు నేలమీద !

నాహృదయశోక మిపుడు కిన్నరుని చూడ
నుటుకునట్టిది నీతల్లి కొదవుగాక !

చూడ కిన్నరు నుబికెడి శోక మట్టి
బాధ యోరాజపుత్ర, నీభార్య కగుత !

వల్లభుని దోష మెరుగనివాని నకట !
కూల్చితివి రాజపుత్ర, నాకోర్కి మడిసె !

జననియును భార్యయును కనుగొనక యుంద్రు
గాత ని న్నని యిపుడు నాగాఢవాంచ !

రాజు ఈ గాథ పలికెను :

వన తిమిర సన్నిభము లగు కనులదాన !
ఏడ్పు మానవె చంద్ర ! మదీయపత్ని,
పూజ్యతను రాజకులమున పొందగలవు.

చంద్ర ఆతనివాక్కు వినగానే "నీవు నాతో ఏమనుచున్నావు !" అని సింహానాదము చేసి ఈ గాథ పలికెను :

దోష మెరుగని నాపతిం ద్రుంచినావు
రాజపుత్ర, నాయెడ ననురాగమునను !
నేను మరణింతు ననుమాట నిక్కువంబు :
నీకు దక్కదు ననుమాట నిజము కాదు !

ఆమె మాటలు విని నంతనే రాజు రాగరహితుడై ఈ గాథ పలికెను:

పిరికిదాన, ఓజీవన ప్రియ, హిమాల
యమ్మునకె ఓసి కిన్నరీ, అరుగవచ్చు-
మృగసమూహమ్ము నీతో రమించు గాక !

ఇట్లు పలికి ఆతడు కోరిక విడనాడి వెడలిపోయెను. కిన్నరుడు చని పోయినట్లు తెలిసికొన్నంతనే ఆమె బోధిసత్త్వుని కౌగిలించుకొని పర్వతశిఖర మునకు కొనిపోయి సమతలమున పరుండబెట్టి ఆతనిశిరము తనయొడిలో నుంచి మిక్కిలి విలపించుచు ఈ గాథలు పలికెను :

అవె పర్వతమ్ములు, నవియె కందరము,
లవె గిరిగహ్వరా, లందులో నీవు
కనబడనపు డేమి కామింపగలను ?

మిగుల నపాయాన; మృగరాజు వీవు—
ఈ తరి మా సుఖదాతవు కమ్ము.

విని సింహ మీ గాథ పలికెను :

నీ పని గృధ్రమా, నే నొనరింతు
నిర్మూలనము చేయ నీ శత్రువులను
పోవుద; మెవ్వండు బుద్ధిమంతుండో
ధర్మజ్ఞుడో వాడు తనవంటివారి
కొరకు ప్రయత్నింపకుండుట యెట్లు?

"నీవు పోయి బిడ్డల నోదార్పుము" అని సింహము దానిని వీడ్కొనెను. సింహము మణివర్ణము కల నీటిని చెదరగొట్టుచు పోయెను. అడవి మానిసులు సింహము వచ్చుట చూచి "ఉక్కుసము మన కాగడా ఆర్పి వేసినది. కచ్ఛపము మన గుడ్డపేలికలను లాగివేసినది. ఇప్పుడో సింహము మన ప్రాణములను కూడ హరించును" అని మరణ భయముచే చెల్లా చెదరుగా పారిపోయిరి. సింహము వచ్చి చూచునప్పటికి వృక్షముక్రింద నెవరును లేరు. ఇంతలో ఉక్కుసరాజు, కచ్ఛపము, గృధ్రము వచ్చి ప్రణామము చేయగా సింహము వారిమైత్రి మహత్త్వమును చూచి, "నేటినుండి అప్రమత్తులై మైత్రిధర్మము నఖండరూపమున నిర్వహింపుడు" అని నిజ నివాసమునకు వెడలిపోయెను. అవి యన్నియు తమతమ నెలవులకు వెడలి నవి. ఆడుగ్రద్ద తనబిడ్డలను చూచుకొని 'మిత్రులవలన నాబిడ్డలు దక్కినారు' అనుకొని సంతుష్టచిత్తముతో నివసించుచుండెను. ఒకనాడు ఆడుగ్రద్ద భర్తతో ఇష్టాలాపము లాడుచు మిత్రధర్మమును ప్రకాశింప జేయునదై ఈ గాథలు పలికెను.

ఆర్యుండు మిత్ర సహాయుల గూర్చు
కొనదగు; ఆర్యులం గూర్చుట మేలు
కవచంబు దాల్చిన గాత్ర వంతుండు
బాణంబునుండి సంత్రాణంబు నొందు
భంగి నున్నారము భద్రంబుగాను.

కలకూజితంబులు కావించుచున్న
వండజంబులు, పలాయనము కావింప
నట్టి సన్మిత్ర శౌర్యప్రభావమున.

మిత్ర సహాయ్య సంప్రాప్తిచే గలుగు
బుద్ధిమంతునకును పుత్ర ధనాదు
లీ మిత్రుదయచేతనే సుతుల్ పతియు
నే గూడ నొక్కచో నిలిచి యున్నాము.

ఏలికయు తూరు డెవ్వాని కుండు
నట్టి మానవునకు నర్థసంసిద్ధి.
సంపద, మైత్రి, యశం బున్నవాడు
బహుళసౌఖ్యము నొందు నిహలోకమందు.

మిత్రుల గూర్చుట మేలగు పేద
వానికైనను, మిత్రవాత్సల్యముననె
ఉన్నవారము మన మొక్కతావునను.

బలవంతుడును శౌర్యవంతు డౌవాని
తో మైత్రి నెరప సంతుష్టి చెలంగు
మన కిర్వురకు నున్న మైత్రి విధాన.

వారందరు అఖండరూపమున యావజ్జీవము మిత్రధర్మపాలన చేసి తుదకు యథా కర్మం గతి (పరలోకమున) కేగిరి.

శాస్త ఈ ధర్మోపదేశనము చేసి "భిక్షువులారా! అతడు భార్యవలన సుఖము పొందుట ఇప్పుడే కాదు; పూర్వజన్మలో కూడ సౌఖ్యము పొంది నాడు" అని జాతకములు పరిపోల్చెను ఆ కాలమున గృధ్రములు భార్యాభర్తలు, కచ్ఛపపుత్రుపు రాహులుడు, తండ్రి మౌద్గల్యాయనుడు, ఉక్కుస రాజు సారిపుత్రుడు, సింహము నేనే.

# 487. ఉద్దాలక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఒకానొక మోసగానిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఇట్టి కళ్యాణప్రదమైన శాసనమున ఆతడు ప్రవ్రజించియు నాలుగవసరములకై మూడు విధముల మోసము చేయుచుండెను. ధర్మసభలో భిక్షువులు వానిని నిందించుచుండిరి. శాస్త అచటికి జని విషయము తెలిసికొని "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వముకూడ మోసము చేయుచుండెడివాడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునప్పుడు బోధిసత్త్వుడు ఆయన పురోహితుడుగా నుండి మేధావి, పండితుడు నయ్యెను. ఒక నా డాయన ఉద్యానవనమునకు క్రీడార్థమై వెడలి నపుడు అచ్చట అందమైన గణిక కానబడగా ఆమె యెడ ఆసక్తచిత్తుడై సహవాసము చేసెను. తాను గర్భవతి యైనట్లు తెలిసికొని నంత నే గణిక "స్వామీ నేను శిశువును, ప్రసవించినపిదప బిడ్డనికి అర్యాకు డని పేరు పెట్టదలచినాను" అనెను. బ్రాహ్మణుడు తనలో "గణికాగర్భమున జన్మించు వానికి కులగోత్రము లుండజాలవు" అనుకొని, "భద్రే గాలిదెబ్బ తిన్న వృక్ష మిచ్చట కలదు. దీనికి ఉద్దాలక మని పేరు. శిశు విచట కడుపున బడుటచే ఉద్దాలకు డని పేరు పెట్టవగును. ఒకవేళ పుట్టెడి శిశువు ఆడబిడ్డ యగుచో దానిని పోషింపవలెను. పుత్రుడు పుట్టుచో ఆతడు పెరిగి పెద్దవాడైనపిదప నా కడకు బంపుము" అని అంగుళీయక మిచ్చెను. కాలక్రమమున ఆమె పుతుని గని వానికి ఉద్దాలకు డని పేరు పెట్టెను. బిడ్డడు పెద్దవాడై ఒకనాడు తల్లితో "నా తండ్రి యెవరు ?" అనెను. "నాయనా, రాజపురోహితుడు"

"అట్లగుచో వేదాధ్యయనము చేసెదను" అని ఉద్దాలకుడు ఆచార్యభాగమును (గురుదక్షిణ), అంగుళీయకమును గ్రహించి, తక్షశిలకు బోయి అచటి ప్రసిద్ధాచార్యునికడ విద్యాభ్యాసము చేయుచుండగా తాపసుల తండము ఒకనా డచటికి వచ్చెను. ఉద్దాలకుడు వారికడ గొప్పవిద్య లుండునని తలచి వారిసన్నిధిలో విద్యలు గ్రహింప గోరి విద్యాలోభముచే ప్రవ్రజించి వారిని సేవించుచు "ఆచార్యులారా, మీకు తెలిసినవిద్య లన్నియు నాకు నేర్పుడు" అని వేడెను. వారు తమకు తెలిసిన వన్నియు నేర్పిరి. అచటి ఐదువందల తాపసులలో ఈతనికన్న ప్రజ్ఞావంతు డొకడును లేడు; ఈతడే అధికప్రజ్ఞావంతుడు. వా రందరు సమావిష్టులై ఇతనినే ఆచార్యపదమున నియోగించిరి. ఒకనా డితడు వారితో "మిత్రులారా! మీరు కందమూల ఫలాదులు తినుచు, ఎల్లపుడును అడవిలో నివసించుచున్నారు. పట్టణముల కేల పోవరు ?'' అనెను.

"మారిషా, లోకులు దాన మిచ్చి దానానుమోదనము చేయింతురు, ధర్మకథలు చెప్పింతురు, ప్రశ్నలడుగుదురు. ఈ భయముచే మే మచటికి పోవము."

"మిత్రులారా ! మీరు నన్ను ముందిడుకొని చక్రవర్తి యెదుటకైనను పోవుడు. ఆయనతో సంభాషించు బాధ్యత నాపై విడువుడు. మీరు భయపడవలదు'' అని ఉద్దాలకుడు వారిని వెంట బెట్టుకొని పర్యటనము చేయుచు క్రమముగా వారాణసి చేరెను. తొలిరోజున రాజోద్యానమున విడిసి, మరునాడు వా రందరిని వెంటబెట్టుకొని యతడు ద్వారగ్రామమున భిక్షాటనము చేసెను. జనులు బాగుగా దానము లిచ్చిరి. తాపసులు మరునాడు నగరమున ప్రవేశించిరి. లోకులు భూరిదానములు చేసిరి. "ఉద్దాలక తపస్వి దానానుమోదనము చేయును, మంగళప్రవచనము చేయును, ప్రశ్నములకు సమాధాన మిచ్చును అని జనులు శ్రద్ధా భక్తులతో పదార్థముల నొసంగిరి. నగరమంతయు సంచలన మొందెను. పండితులు, గణశాసకులు ధార్మికులు అగు తపస్వులు వచ్చినారని రాజుకు గూడ వార్త చేరెను. 'వా రెచ్చట నుందురు' అని రా జడుగగా 'ఉద్యానమున' అని తెలిపిరి. 'మంచిది, నేడు వారి దర్శనార్థము వత్తును' అని రాజు పలుక లోకులు చని ఉద్దాల

కునితో "రాజు మిమ్ము జూడ వచ్చుచున్నాడు" అని చెప్పిరి. ఉద్దాలకుడు తాపసులను పిలువ నంపి, "రాజు వచ్చుచున్నాడు. ఐశ్వర్యవంతులను ఒక్క రోజు ప్రసన్నచిత్తులను చేయుచో మన జీవితపర్యంతము సంపద లభించును" అని తెలిపెను.

"ఆచార్యా, ఏమి చేయవలెను ?"

"మీలో కొందరు తల క్రిందులుగా వ్రేలాడవలెను. కొందరు గొంతు కూర్చుండవలెను. కొందరు కంటకశయ్యలపై పరుండవలెను. కొందరు పంచాగ్నులనడుమ ఉండవలెను. కొందరు నీటిలో గొంతువరకు మునిగి యుండవలెను. కొందరు అచ్చటచ్చట కూర్చుండి జపము చేయుచుండ వలెను."

తాపసు లటులే చేసిరి. ఉద్దాలకుడు పదుగురు వాడిపండితులను వెంట గొని గుర్రముపై పుస్తకముల కట్ట లుంచి శిష్యపరివృతుడై ఎల్లరు ప్రశం సించుచుండ పీఠముపై కూరుచుండెను. ఆ సమయముననే రాజు పురోహిత సహితముగ వైభవముతో వచ్చి దొంగజపములు చేయు వారిని చూచి సంతుష్టచిత్తుడై ప్రజలకు నరకభయ ముండ దని తలచి ఉద్దాలకుని సమీ పించి యోగక్షేమ మడిగి ఒక ప్రక్కన కూర్చుండెను. రాజు ప్రసన్న చిత్తుడై పురోహితునితో సంభాషించుచు ఈ గాథ పలికెను :

తాల్చి ముడిచర్మములు జటాధారు లగుచు
మైల దంతాలతో మోటు వాలకముల
జపము చేసెడివారలు జ్ఞాన మొంది
ముక్తు లగుదురె కర్తవ్యముల నొనర్చి.

విని పురోహితుడు తనలో "ఈ రాజు అయోగ్యస్థానమున శ్రద్ధ చూపుచున్నాడు. మౌనము వహించుట సరి కాదు" అనుకొని బహిరంగ ముగా ఈ గాథ పలికెను :

రాజ, వేదజ్ఞు డైన ధర్మంబు గనక
పాపకార్యాచరణకునై పాలు పడిన,
దుర్లభం బగు వానికి దుఃఖ ముక్తి.

ఉద్దాలకుడు విని తనలో "ఈ రాజు ఎట్లో తాపసులయెడ శ్రద్ధ కలగియున్నాడు. కాని ఈ బ్రాహ్మణుడు ప్రచండునివలె నున్నాడు. కావున నేను ఈతనితో సంభాషింతును" అనుకొని ఈ గాథ పలికెను :

ఆచరించి విశేషవేదాధ్యయనము
నెరపనపుడు ధర్మంబు, నిష్ఫలంబు
అఖిల విద్యాదికమ్ము; సంయమముతోడ
ఆచరణ మొక్కటే సత్య మని తలంతు.

అంతట పురోహితు డీగాథ పలికెను :

వేదములు నిష్ఫలము కావు; వేదవేత్త
యశము నొందును: కాని సంయమముతోడ
నెరపుచో ధర్మకార్యముల్ నిండుశాంతి.

ఆలకించి ఉద్దాలకుడు తనలో "ఇతనితో నేను విరోధము పెట్టుకొని నిలువజాలను. నేను నీ కుమారుడను అను వాక్కులు విన్నప్పుడు ఎవ్వని చిత్త మయినను మెత్తబడును. కావున నేను నీ పుత్రుడను అను సూచన చేసెదను" అనుకొని ఈ గాథ పలికెను :

తలిదండ్రులను బంధువులను పోషింప
వలయును; జన్మంబు వారిచే గలిగె
ఓ మహారాజ, నే నుద్దాలకుడను,
యుష్మదీయ శ్రోత్రియుండను సుమ్ము.

"నీవు నిశ్చయముగ ఉద్దాలకుడవా?"

"అవును."

"నేను నీ తల్లికి గురుతుగా ఉంగర మిచ్చినాను అది యేది?"

"బ్రాహ్మణోత్తమా, ఇదిగో" అని ఉద్దాలకు డాతని చేతిలో ఉంగర ముంచెను. బ్రాహ్మణు డంగుళీయకమును గురుతుపట్టి "నిశ్చయముగా నీవు

బ్రాహ్మణుడవు; బ్రాహ్మణధర్మము నీకు తెలియునా ?" అని ఈ గాథ పలికెను :

ఎట్లగు బ్రాహ్మణుం ? డెట్లు కేవలియు
నగును ? నిర్వాణంబు నందుట యెట్లు ?
అంద్రు ధర్మస్థితుం డది యెట్టివాని ?

ఉద్దాలకుడు ప్రత్యుత్తరముగా ఈ గాథ పలికెను :

బ్రాహ్మణుం డగ్ని సంపాదించి, నిరత
మభిషేచనములతో యజ్ఞముల్ చేసి
యూపంబు లెత్తుచునుండు; నాతనికి
కల్యాణ సౌఖ్యముల్ కలుగుచునుండు
ధర్మస్థితుం డని తలతు రవ్వాని.

ఆతడు నిరూపించిన బ్రాహ్మణ ధర్మమును నిందించుచు పురోహితు డీ గాథ పలికెను :

అభిషేచనము చేయ నగునె సంశుద్ధి ?
పారు డైనంత కేవలి యగుట యెట్లు ?
సంయమం బుండదు, క్షమ యుండబోదు—
అతడు నిర్వృతుం డనుట యేలాగు ?

ఇట్లు బ్రాహ్మణుడు కానిచో మరియెట్లగును అని అడుగువాడై ఉద్దాలకు డీ గాథ పలికెను :

ఆతండు బ్రాహ్మణుం డగుట యేలాగు ?
ఆతండు కేవలి యగుట యేలాగు ?
అతనికి నిర్వాణ మబ్బుట యెట్లు ?
అతని ధర్మస్థితుం డనుట యేలాగు ?

పురోహితు డీ గాథ పలికెను :

క్షేత్రముల్ కోరికల్ మిత్రబాంధవులు
సంసారబంధముల్ క్షయ మొందువాని

బ్రాహ్మణోత్తమునిగా భావింత్రు జనులు,
ధర్మస్థితుం డని తలతు రవ్వాని.

అంతట ఉద్దాలకు డీగాథ పలికెను :

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును
చండాల పుల్కసుల్ సర్వమానవులు
అయి సంయముల్, దాంతు లగుచు నిర్వాణ
మందుచో కల్యాణ మగునె యెల్లరకు ?
ఒక్కరికైన కీడొదవక యున్నె ?

అర్హత్వప్రాప్తి యయినపిదప నరుడు మరల క్రిందికి రాడు అనునభి-
ప్రాయము వెలిబుచ్చువాడయి బ్రాహ్మణు డీగాథ పలికెను :

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును
చండాల పుల్కసుల్ సర్వమానవులు
అయి సంయుతుల్ దాంతు లగుచు నిర్వాణ
మందుచు, శాంతి సౌఖ్యంబుల నుండ
కల్యాణమే కాని కష్టమ్ములేదు,

దానిని నిందించుచు ఉద్దాలకు డీగాథ పలికెను :

అట్లగుచో శ్రోత్రియత్వమ్మునకును
బ్రాహ్మణత్వమునకు భంగంబు కలుగు.

ఉపమానరూపమున నాతనికి బోధ చేయువాడై పురోహితు డీ-
గాథలు పలికెను :

పలురకంబుల వస్త్రములతోడ గలుగు
మంటపంబున నీడ; మరి నీడలోన
వస్త్రంబులకు నుండు వర్ణంబు కనము.

జనులందు సర్వదా సంశుద్ధు లుంద్రు ;
గ్రహించి ధర్మముల్ కడుసంయమమున
వరలువా రడుగరు వారి జాతులను.

ఉద్దాలకుడు హతప్రతిభు డై కూర్చుండెను. అంతట బ్రాహ్మణుడు రాజుతో "మహారాజా, వీ రందరు మోసగాండ్రు. వీరు సమస్త జంబూ ద్వీపమును మోసమున నాశనము చేయగలరు. ఉద్దాలకుని గృహస్థుని చేసి ఉపపురోహితపదవి యొసగుడు. మిగిలినవారికి డాలు, ఆయుధము లిచ్చి గృహస్థులను చేసి మీసేవలో నిలుపుకొనుడు" అని విన్నవించెను. 'మంచిది, ఆచార్య' అని రాజు ఆయన చెప్పినట్లు చేసెను. వా రందరు ఆజన్మాంతము రాజసేవలో నుండి తుదకు పరలోకమున కేగిరి.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఈత డిప్పుడే కాదు, పూర్వము కూడ మాయావిగా నుండెను" అని జాతకములు సరి పోల్చెను ఆ కాలమున మాయావి భిక్షుకుడు ఉదాలకుడు, రాజు ఆనం దుడు, పురోహితుడు నేనే.

——:():——

# 488. భిస జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ఉద్విగ్నచిత్తు డగు భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

కథావస్తువు కుస జాతకమున (531) వచ్చును. శాస్త అప్పుడు "భిక్షూ నీవు నిజముగా ఉద్విగ్నచిత్తుడ వైతివా ?" అనెను. "భన్తే, సత్యమే" "ఏ హేతువున ?" "భన్తే, కామమువలన" "భిక్షూ, కళ్యాణకర మైన యిట్టి శాసనమున ప్రవజించియు ఏల కామవశమున ఉద్విగచిత్తుడ వైతివి ? కాలమున పండితులు, బుద్ధుడు ఉదయింపక పూర్వము బాహ్యప్రవ్రజ్య గ్రహించి కామ, లోభవశమున ఉత్పన్న మగు వికారములను ప్రతిజ్ఞా పూర్వకముగా దూరీకరించినారు" అని శాస్త పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండగా బోధిసత్త్వుడు ఎనుబదికోట్ల కధిపతి యగు బ్రాహ్మణునకు కుమా రుడై జన్మించెను. మహాకాంచన కుమారు డని అతనికి పేరు పెట్టిరి. ఆతనికి నడక వచ్చునప్పటికి తమ్ముడు పుట్టినాడు. వానికి ఉపకాంచన కుమారు డని పేరు పెట్టిరి. ఈ విధముగా కాలక్రమమున బ్రాహ్మణున కేడుగురు పుత్రులును. అందరికన్న చిన్నది ఆడుపిల్లయు పుట్టిరి. ఆమెకు కాంచన (కుమారి) దేవి యని పేరు పెట్టిరి. మహాకాంచన కుమారుడు పెద్దవాడై తక్షశిలకు బోయి విద్యలు నేర్చి మరలివచ్చెను. తలిదండ్రు లతనిని గృహస్థును జేయ నెంచి "నీకు కులగౌరవాదులలో సరిసమానమరాలగు కన్యను తెత్తుము. నీవు యింటనుండుము" అని చెప్పిరి.

"అమ్మా, నాన్నా, నేను గృహస్థును కారాదు. భార్యా సంయో గము వలదు. మీకు వేరు పుత్రు లున్నారు. వారు సంసారు లగునట్లు తెలియజెప్పుడు."

తలిదండ్రులు ఎన్నోసారులు చెప్పిరి; కాని ఆత డంగీకరింపలేదు. ఆతనిమిత్రులు "నీ వేపదార్థముపై ఆశ పెట్టుకొని భోగములను ఇచ్చగింప కున్నావు ?" అని అడిగిరి. ఆతడు నిష్క్రమణమును గూర్చి పలికెను. విని తలిదండ్రులు తక్కినపుత్రులను పిలువనంపి విషయము చెప్పగా, వారుకూడ అంగీకరింపలేదు. కాంచన దేవి సయితము సమ్మతింపలేదు. కాలక్రమమున వృద్ధులు చనిపోయిరి. మహాకాంచన పండితుడు తలిదండ్రులకు సముచిత క్రియలు గావించి తన యెనుబదికోట్ల ధనమును పేదలకు, బాటసారులకు నొసంగి, ఆరుగురు సోదరులను, సోదరిని, దాసుని, పరిచారికను, మిత్రుని వెంట గొని మహాభినిష్క్రమణము చేసి, హిమాలయము ప్రవేశించెను. వా రచటి కమలసరోవర రమణీయప్రదేశమున ఆశ్రమము నిర్మించి ప్రవ్ర జించి అరణ్యములోని కందమూల ఫలములతో కాలము గడుపజొచ్చిరి.

వా రడవిలోనికి బోవునపుడు కలిసి పోవుచుండిరి. ఫలము గాని, మూలము గాని కానబడినపుడు ఒకరు రెండవవారిని పిలిచెడివారు. ఎల్లరును ఉల్లాసముతో సంభాషించుచు, ఆహారము భుజించెడివారు. వారు తెచ్చు పదార్థములను జూడ గ్రామములోని కూరగాయల అంగడివలె నుండెడివి. ఒకనాడు మహాకాంచనాచార్య తపస్వి తనలో "ఇట్లు చేయుట ఉచితముగా లేదు ఎనుబదికోట్ల ధనము విసర్జించి ప్రవ్రజించిన మేము లోభులవలె సంచరించుచున్నాము. నేటినుండి నేనే ఫలాదులు తెచ్చెదను" అనుకొని ఆశ్రమమునకు మరలి వచ్చి, తక్కినవారితో ఈ విషయము చెప్పి "మీ రిచ టనే యుండి శ్రమణధర్మము నెరనేర్పుడు. నేనే కందమూలమును తెత్తును" అని తెలిపెను. అంతట ఉపకాంచనాదులు "ఆచార్యా, మే మెల్లరము తమ మూలమున ప్రవ్రజించినాము. తాము ఇచ్చటనే యుండి శ్రమణధర్మము నిర్వహింపుడు మన చెల్లెలు కూడ ఇచటనే యుండును దాసికూడ ఈమె కడనే యుండును మన మెనమండుగురము విడివిడిగా ఫలాదులు తెత్తము. మువ్వురము వంతుచొప్పున పోవుచుందుము" అని చెప్పిరి. ఈ విధానము నకు ఎల్లరు నంగీకరించిరి. ఒక్కొక్కరు వంతుప్రకారము ఫలాదులు తెచ్చుచు, తక్కినవారికి భాగము లిచ్చుచు తమ నివాసస్థానములకు బోవు చుండిరి. అకారణమున వారు ఒక్కచో చేరుటకు వీలు పడెడిదికాదు. ఫలా దులు తెచ్చినవారు అచ్చటి ప్రాకారముప్రక్క పాషాణముపై నుంచి

పం[డెండుభాగములు చేయుదురు. అపుడు గంట కొట్టుదురు అందరును వచ్చి యెవరిభాగము వారు తీసికొని తమతమ నివాసస్థానములకు పోవుదురు. కాల[క్రమమున బిసకాండము తెచ్చి తినుచు ఘోరతపస్సు చేయుచుండిరి. ఇం[ద్రియములను ని[గ్రహించి వారు యోగాభ్యాసనిరతులైరి.

వారి సదాభ్యాసము వలని తేజస్సుచే శ[క్రునిభవనము కంపించెను. వీరు కోరికలు విడిచినఋషులా ? అను సంశయము కలిగి శ[క్రుడు వీరిని పరీక్షింప దలచెను. తన శక్తిచే శ[క్రుడు బోధిసత్త్వభాగము మూడు రోజులు కనబడకుండ జేసెను. [ప్రథమ దినమున తనవంతు కనబడనపుడు వారు మరచిరేమో యని బోధిసత్త్వ డనుకొనెను. రెండవనాడు భాగము కనబడనప్పుడు తనలోపముచే వా రట్లు చేసియుందు రనుకొనెను. మూడవనాడు సాయంకాలము గంట [మోగినది. పోయి చూడగా తనవంతు కనబడలేదు. 'నావలన దోష మేమైన నున్నచో క్షమింపవేడుదును' అనుకొనెను. ఇంతలో అందరు నచ్చటికి వచ్చి యెవరు గంట కొట్టిరని యడుగగా 'నేనే' అని ఆచార్యుడు చెప్పెను. "ఆచార్యా, కారణ మేమి ?" "మూడవనాడు ఫలము లెవరు తెచ్చిరి ?" "ఆచార్యా, నేను తెచ్చినాను" అని ఒకడు [ప్రణామము చేసి నిలిచెను.

"నీవు విభాగములు చేసినపుడు నా భాగము విడిగా నుంచితివా ?"

"ఆచార్యా, నేనే పెద్దభాగ ముంచితిని."

"నిన్న తెచ్చిన దెవరు ?"

వేరొకడు లేచి [ప్రణామము చేసి నిలిచెను. "విభాగము చేయునపుడు నామాట జ్ఞప్తి యున్నదా ?" అని ఆచార్యు డడిగెను.

"తమకోసము పెద్ద భాగ ముంచినాను."

"నాయనా, మూడురోజులనుండి నావంతు ముట్టుట లేదు. మొదటినాడు భాగము కానబడనపుడు పంపిణీ చేయువాడు నన్ను మరచియుండునని తలచితిని. రెండవనాడు కానబడనపుడు నావల్ల ఏదోలోప ముండు ననుకొంటిని. మూడవనాడు నాయపరాధ మున్నచో క్షమాపణ వేడదలచి గంటకొట్టి మిమ్ము సమావేశ పరచితిని. మీరు ఆహారభాగము విడిగా పెట్టినా

మన్నారు; కాని నాకు లభింపలేదు. ఎవ్వరు భాగమును హరించుచున్నారో తెలిసికొనవలయును. కోర్కులను, భోగములను విసర్జించి, ప్రవ్రజించియు ఆహారమును హరించుట ఉచితము కాదు '' ఈ వాక్కులు విన్నంతనే అందరును మహాసాహస మని ఆవేగము చెందిరి. ఆ యాశ్రమమున జ్యేష్ఠవృక్షముపై నివసించు దేవతకూడ దిగి వచ్చి వారికడ గూర్చుండెను. అప్పుడొక ఏనుగు ఋషిమండలి సన్నిధికి వచ్చి నమస్కారము చేయునది కూడ ఒకప్రక్క నిలిచెను. సర్పముతో ఆటలాడు వానరముకూడ వచ్చి కూర్చుండెను. శక్రుడు కూడ ఋషులను పరీక్షించుటకై వచ్చి అదృశ్యరూపమున ఒకయోరగ నిలిచెను. అప్పుడు చిన్నతమ్ముడు ఉపకాంచన ఋషి బోధిసత్త్వునకు వందనము చేసి, తక్కినవారియెడ ఆదరము చూపి "ఆచార్యా, ఇతరుల విషయ మెత్తక కేవలము నా నిర్దోషిత్వమును ప్రమాణీకరించు కొనవచ్చునా ?'' అనెను. "ఆ !'' అతడు ఋషులయెదుట నిలిచి "నేను భాగమును తినియున్నచో ఇట్లగుదును'' అని శపథము చేసి ఈ గాథ పలికెను :

బ్రాహ్మణోత్తమ, నీదుభాగంబు గొన్న
వానికి గోవులు వారువంబులును
పైడియు, వెండియు, భార్యయు నబ్బు
సంతతితో వాడు సంయుక్తు డగును.

విని ఋషులు చెవులు మూసికొని "మారిషా, ఇట్లనవలదు. నీ శపథము మహాఘోరము'' అని వా రనిరి. బోధిసత్త్వుడుకూడ "నాయనా, నీ శపథము మిక్కిలి ఘోరము నీవా భాగము తినలేదు. నీకై పరచిన ఆసనముపై కూర్చుండుము''అనెను. రెండవసోదరుడుకూడ లేని బోధిసత్త్వునకు ప్రణామము చేసి శపథపూర్వకముగా తన నిర్దోషిత్వమును ప్రమాణీకరించుటకై ఈ గాథ పలికెను :

భాగంబు హరియించు వానికి కాశి
మాలికల్, చందన మబ్బును గాత !
బహుసంతతిని వాడు పడయును గాత !
భోగకాంక్షలు హెచ్చిపోవును గాత !

ఆతడు కూరుచున్న పిదప తక్కినవారు క్రమక్రమముగా ప్రణామములు చేసి ఒక్కొక్కగాథ పలికిరి :

భాగమ్ము హరియించువానికి ధనము
క్షేత్ర, మైశ్వర్యంబు, పుత్రసంతతియు,
సర్వభోగాలలో సదనాన నతడు
నిలుచుత ఆయువుం దలపోయకుండ.

భాగమ్ము హరియించువాడు క్షత్త్రియుడు
బలవంతుడై యశోవంతుడై మిగుల,
పలిక యగుఁగాత నాలుగు దెసల !

భాగమ్ము హరియించువాడు ముహూర్త
నక్షత్రగణనమ్మునందు యశమ్ము
పొందుచు కడు రాజపూజితుం డగుత !

భాగమ్ము హరియించువాని దలంచి
అఖిలవేదజ్ఞు నధ్యాపకుగాను
జనపదంబులు పూజ సలుపును గాత !

భాగమ్ము హరియించువాడు రాగమున
సర్వసంపదలతో సంభృత మైన
గ్రామమ్ము భోగించుగాక ! మృత్యువును
పొందు గావుత భోగమందె యాతండు !

భాగమ్ము హరియించువాడు నితాంత
నృత్యగీతాలతో నిఖిలసౌఖ్యముల
తోడను మిత్రులతోడ గ్రామణిగ
రాజ్యబాధలు లేక రంజిల్లు గాక !

ఆహారభాగంబు హరియించునామె
సకలలోకవిజేత సార్వభౌమునకు

పదునారువేలలో ప్రథమరా లగుచు
సీమంతినులలోన శ్రేష్ఠురా లగుత !

ఆహారభాగంబు హరియించువాడు
ఆగత దాసీ జనాంతరమందు
విచలింపకుండంగ, రుచిరాన్నభుక్తి
చేయుచు, నెంతయు స్వీయలాభంబు
కోసము కోతలు కోయును గాక !

ఆహారభాగంబు హరియించువాడు
ఆవాసికుండు మహావిహారమున
నగుత ! కజంగల నగరాన నూత్న
కార్మిక భిక్షు వౌగాక యాతండు !

ఆహారభాగంబు హరియించువాని
బంధించి దృఢముగా పలుతావులందు
రమణీయవనినుండి రాజధానికిని
గొనిపోయి కంటకాంకుశ శస్త్రమునను
నిర్దయతోడను మర్దింత్రు గాత !

పొడిచి చెవులు శలాకతో, పుష్పమాల
కంఠమున వేసి, కొట్టుచు కట్టెతోడ,
దృఢముగా రజ్జువున గట్టి, తిప్పి త్రిప్పి
సందులం, జేర్పవలయును సర్పముఖము.

ఈ ప్రకారముగా అందరును శపథములు చేసినపిదప బోధిసత్త్వుడు తనలో "నాయెడ కూడ సందేహ మెచ్చటను కలుగరాదు. నేను భుజించియు భుజింపలేదు అను మాట పుట్టరాదు. కావున నేను కూడ శపథము చేయుదును" అనుకొని ప్రమాణము చేసి ఈ గాథ పలికెను :

నష్ట మనునది లేకున్న నష్ట మనుచు
ఎవడు శంకించు మీలోన నెవనినైన

వాడు సంస్కారియై భూరివాంఛతోడ
భోగముల నందు చందులో పొలియుక !

ఋషులీ ప్రకారముగా ప్రమాణములు చేసినపిదప శక్రుడు "భయము వలదు. వీరిని పరీక్ష చేయుటకై నేనే భాగములను అంతర్ధానము చేసినాను. ఈయన ఉచ్ఛిష్టమును నిందించినట్లు భోగములను నిందించినాడు. ఈయన భోగములను నిందించుటకు కారణ మే మని అడుగుచున్నాను" అని ఈగాథ పలికెను :

వేనికోసము లోకము వెదకుచుండు,
ఏవి యెందరు జనులకో యిష్ట మగును,
అగును మధురమనోజ్ఞము లట్టిభోగ
ముల ప్రశంసింప దేటికి మునిజనంబు ?

ఆయనప్రశ్నమునకు ప్రత్యుత్తర మిచ్చువాడై బోధిసత్త్వుడు ఈ గాథలు పలికెను :

భోగములచేత బద్ధుడై పొలియు నరుడు,
భోగములచేత కలుగును భూరిభయము,
శక్ర, మత్తత నొనరింతు రక్రమములు.

పాపములు పండి మరణించు పాపకర్ము
లవల నరకమ్మునన్ జన్మ మందుచుంద్రు,
వాని దుష్పరిణామంపు జ్ఞానమునను
ఎన్నడు ప్రశంస చేయదు ఋషిగణంబు.

బోధిసత్త్వునివాక్కులు విని శక్రుడు సంవేగయుక్తుడై ఈ గాథ పలికెను :

ఏను ఋషుల పరీక్షించు నిచ్ఛతోడ
తీరమున నిల్పి దాచితి దిగువ బిసము,
లిపుడు గ్రహియించినాడను ఋషులు శుద్ధు
లనుచు ; బ్రాహ్మణ, బిసముల నందుకొనుము.

శక్రుని వాక్కులు విని బోధిసత్త్వు డిట్లు పలికెను :

ఓ నహస్రాక్ష, నీక్రీడ కుపకరించు
సాధనములము, నటులము, స్వజనులమును
కాము; మిత్రుల మైనను కాము, శక్ర,
ఏల నీకు వినోదమ్ము ఋషులతోడ ?

అంతట శక్రుడు క్షమాపణ వేడువాడై ఈ గాథ పలికెను :

ఆచార్యుడవు, తండ్రియట్టి వాడవును
అగుదువు బ్రాహ్మణా ! అపరాధమునకు
ఊత యియ్యదె; నాది ఒక్క దోషంబె
కాన భూరిప్రజ్ఞ, క్షమియింపవలయు !
క్రోధబలుల్ కారు కోవిదు లెప్పుడు.

బోధిసత్త్వుడు దేవరాజ శక్రుని క్షమించి ఋషిమండలిని క్షమాపణ వేడి ఈ గాథ పలికెను :

భూతపతిన్ వాసవుని కనుంగొంటి
ఒకరాత్రి ఋషు లెల్ల నుండుట నిచట
మేలు ! ప్రసన్నులు మీ రెల్ల కండు !
పడసె నాహారంబు బ్రాహ్మణుం డితడు.

శక్రుడు ఋషులకు ప్రణామము చేసి, దేవలోకమున కరిగెను. ఋషిమండలి ధ్యానాభిజ్ఞలు పొంది, బ్రహ్మలోకగామి యయ్యెను.

శాస్త ఈ విధముగా ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఈ ప్రకారముగా పూర్వము పండితులు శపథములు చేసి కోర్కులు విడిచినారు" అని సత్యప్రకాశనము చేసెను. తోడనే ఉద్విగ్నచిత్తభిక్షువు శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు డయ్యెను. జాతకములు సరిపోల్చి శాస్త ఇట్లు పలికెను :

ఆ కాలమున నేను, సారిపుత్రుడును, మౌద్గల్యాయనుడు, కాశ్యపుడు, అనురుద్ధుడు, పూర్ణ-ఆనందుడు సోదరులము; ఉత్పలవర్ణ చెల్లెలు; ఖుజ్జతర దాసి; చిత్తుడు గృహాతిదాసుడు; సాతాగిరి యక్షుడు; పారిలేయ్యకము ఏనుగు; మధువా శ్రేష్ఠవానరము; కాలుదాయి శక్రుడు. ఈ ప్రకారముగా జాతకమును గ్రహింపుడు."

---

# 489. సురుచి జాతకము

శాస్త్ర శ్రావస్తిలో మిగార మాత ప్రాసాదమున విహారము చేయుచు మహా-ఉపాసిక విశాఖకు లభించిన యెనిమిది వరములను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆమె ఒకనాడు జేతనమున ధర్మకథ విని భిక్షుసంఘముతో సహా బుద్ధ భగవానుని మరునాడు భోజనమునకు నిమంత్రించి చనెను ఆ రాత్రి గడచు లోగా కుంభవర్షము కురిసెను. భగవాన్ భిక్షువులను సంబోధించి "భిక్షువులారా, జేతవనమున వర్షము కురిసినట్లు నాలుగు ద్వీపములలోను వర్షము కురిసి యుండును. ఇది తుదివర్షము" అని పలికెను. తడిసిన భిక్షువులను గొని తథాగతుడు జేతవనమున అంతర్ధానమై విశాఖయింట ప్రత్యక్షమయ్యెను. ఉపాసిక చూచి "ఆశ్చర్యము! అద్భుతము! తథాగతుడు బుద్ధిమంతుడు! ఎంత ప్రతాపవంతుడు! వర్షము కురియుచున్నను ఒక భిక్షువు కాలు గాని చీవరము కాని తడియలేదు." అనుకొని సంతోషించి ఉద్విగ్నచిత్తయై బుద్ధప్రముఖ భిక్షుసంఘమునకు వడ్డనలు చేసి, భగవాన్ కరణీయము లాచరెంచినపిదప "భన్తే నేను భగవానుని వరము లడగ వేడుచున్నాను" అని విన్నవింపగా, "విశాఖా, తథాగతులు వరముల కతీతులు," అని భగవానుడు పలికెను.

"భన్తే, యోగ్యములు, నిర్దోషములు అయిన వరములు." "విశాఖా, చెప్పుము" "భన్తే, జీవితాంతమువరకు భిక్షు సంఘమునకు వర్షాకాలమున వస్త్రము లీయవలెను. అతిథులకు భోజనములు పెట్టవలెను. పాంథులకు, రోగులకు భోజనములు పెట్టవలెను. రోగుల కౌషధము లిచ్చి రోగి సేవకులకు భోజనములు పెట్టవలెను. ఎల్లరకును నిత్యము యవాగు పానీయ

మీయవలెను. భిక్షుణీ సంఘమునకు స్నానార్థము వస్త్రము లీయవలెను. ఇవి నేను వేడువరములు.''

''విశాఖా, నీ వేమి యోచించి తథాగతుని ఎనిమిది వరము లడుగుచున్నావు ?''

విశాఖ వరముల మహత్త్వము తెలిపెను. ''విశాఖా, సాధు ! సాధు ! నీవు ప్రయోజన మాలోచించి తథాగతుని ఎనిమిదివరము లడుగుట మేలయ్యెను. విశాఖా, ఎనిమిదివరము లడుగుటకు అనుజ్ఞ ఇచ్చుచున్నాను.'' అని తథాగతుడు వరము లిచ్చి, దానానుమోదనము చేసి చనెను.

ఒకనాడు శాస్త పూర్వారామమున విహారము చేయునపుడు ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై ''ఆయుష్మంతులారా మహా - ఉపాసిక విశాఖ స్త్రీ అయ్యును బుద్ధునివలన అష్టవరములు పొందినది. ఎంత గుణవంతురాలు !'' అనుచుండిరి. శాస్త అచటికి జని అడిగి విషయము తెలిసికొని ''భిక్షువులారా, విశాఖ ఇప్పుడే కాదు, పూర్వము కూడ నా వలన వరములు పొందినది.'' అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున మిథిలలో సురుచి యను రాజు పాలన చేయుచుండెను. ఆయనకు పుత్రుడు కలుగగా అతనికి సురుచికుమారు డని పేరు పెట్టిరి. ఆతడు పెద్దవాడై తక్షశిలా నగరమున విద్యలు నేర్చికొనుటకై బయలుదేరి నగరద్వారముకడ నున్నశాలలో కూర్చుండెను. వారాణసీ నరేశుని పుత్రుడు బ్రహ్మదత్తకుమారుడు కూడ తక్షశిలకు బయలుదేరి సురుచికుమారుడు ఉపవేశించిన శాలలో తానుకూడ కూరుచుండెను. వారు పరస్పరము సంభాషించిన పిదప అన్యోన్య విశ్వాసము గలిగి విద్యాభ్యాసార్థము ఒకే ఆచార్యునికడకు బోయిరి. గురుదక్షిణ యొసగి విద్య లభ్యసించి అచిరకాలములోనే ఆచార్యునికడ సెలవు గైకొని బయలు వెడలిరి. కొంత దూరము ప్రయాణము చేసి మార్గములు చీలుచోట ఆగి పరస్పరము ఆలింగనము చేసికొని మిత్రధర్మము రక్షింప నిశ్చయించి ''నాకు కుమారుడు కలిగి నీకు కుమార్తె కలిగి, ఒకవేళ నీకు కుమారుడు కలిగి, నాకు పుత్రిక పుట్టినయెడల వారికి వివాహము చేయుదము,'' అనుకొనిరి.

వారు రాజ్య పరిపాలన మారంభించిన పిదప సురుచికి కుమారుడు పుట్టెను. వానికి సురుచికుమారు డని పెట్టిరి. బ్రహ్మదత్త కుమారునకు పుత్రిక పుట్టెను. సుమేధ యని పేరుపెట్టిరి. సురుచికుమారుడు పెద్దవాడై తక్షశిలకు బోయి విద్యాభ్యాసము చేసి వచ్చెను తండ్రి అతనికి రాజ్యాభిషేకము చేయదలచి తనలో "నా మిత్రుడు వారాణసీ నరేశునకు కూతురున్నది. ఆమెను నా కుమారుని పట్టపుదేవిని చేసెదను," అని యోచనలు చేసి మంత్రులను పంపెను. వారు రాకపూర్వమే వారాణసీ నరేశుడు తన భార్యతో "భద్రే, స్త్రీకి పురుషునివలన విశేషబాధ ఎట్లు కలుగును ?" అనెను. "దేవా, సవతికోపమువలన దుఃఖము కలుగును. "భద్రే, అట్లగుచో మన సుమేధాదేవికి సవతి దుఃఖము లేకుండ చేయుదము. ఎవడు ఈమె నొక్కతెను మాత్రము పెండ్లి యాడుట కంగీకరించునో అతనికే ఇత్తము." అమాత్యులు వచ్చి తమ రాక నివేదింపగా రా జిట్లనెను: "మంచిది నా మిత్రునితో పూర్వమే చెప్పినాను. నా కుమార్తెను అతని కొడుకున కిత్తు నని. కాని ఈమెను స్త్రీజనమునడుమ పడవేయ దలపలేదు. ఎవరు ఈమె నొక్కతెను మాత్రమే పెండ్లి యాడునో ఆతనికే ఈమె నిత్తును." మంత్రులు పోయి తమ ప్రభువున కా సందేశము విన్నవించిరి. రాజు అంగీకరింపలేదు. 'మా రాజ్యము పెద్దది. మిథిలానగరము ఏడు యోజనముల విస్తీర్ణము. మా రాష్ట్రము సరిహద్దు మూడువందల యోజనములు. ఎంత తగ్గించినను పదునాలుగువేల మంది స్త్రీలు కావలయును.' కాని సురుచికుమారుడు సుమేధాదేవి రూపసౌందర్యముల సంగతి విన్నంతనే ఆసక్తచిత్తుడై, నే నామె నొక్కతెనే పెండ్లియాడుదును అని తలిదండ్రులకు కబురంపినాడు, 'ఆడువారల గుంపుతో నాకు పని లేదు. ఆమెనే కొనిరండు.' వా రాతనిని వేధింపక విశేషధనము పంపి మహావైభవముతో ఆమెను కొనివచ్చి వివాహము చేసి రాజ్యాభిషేకము చేసిరి. సురుచి మహారాజు ధర్మానుసారముగా రాజ్యము చేయుచు ఆమెయెడ ప్రీతితో నుండెను. పదివేల సంవత్సరములు కాపురము చేసినను ఆమెవలన పుత్రుడుకాని పుత్రిక కాని కలుగలేదు. అప్పుడు నగరవాసులు రాజాంగణమున చేరి కోలాహలము చేసిరి. ఏమిదియని రా జడుగగా వారు "మరి యేమియు లేదు. మీ వంశము నిలుపుటకు పుత్రుడు లేడు. తమకు దేవి ఒక్కతెయే. ఎంత తగ్గించి

నను రాజకులమున పదునారువేలమంది స్త్రీ లుండవలెను. కావున దేవా, తాము బహుస్త్రీగ్రహణము చేయవలెను. ఎవరో ఒక పుణ్యశాలికి పుత్రుడు పుట్టవచ్చును'' అని విన్నవించిరి.

"ఏమనుచున్నారు. నేను ద్వితీయ స్త్రీని పరిగ్రహింప నని మాట యిచ్చినాను. అసత్య మాడజాలను స్త్రీ సమూహము నాకు వలదు."

అని రాజు నిరాకరించిన పిదప వారు వెడలిపోయిరి. వారి వాక్కులు విని సుమేధ తనలో "రాజు సత్యవాది యగుటచే అన్యస్త్రీని కైకొనడు. నేనే స్త్రీలను ఆయన కొరకు తెప్పించెదను' అనుకొని తనకు నచ్చిన వేయి మంది రాజకన్యలను, వేయిమంది అమాత్యకన్యలను, వేయిమంది సరిసారుల కన్యలను ఎల్లవేళల నృత్యము చేయుటకు వేయిమంది స్త్రీలను మొత్తము నాలుగువేల మందిని తెప్పించినది. వారుకూడ పదివేల సంవత్సరములు రాజకులమున నివాసము చేసిరి; కాని వారికి సంతానము కలుగలేదు. ఈ ప్రకారముగ రాణి మూడు పర్యాయములు నాలుగువేల మందిని తెప్పించెను. అం దెవ్వరికిని సంతానము కలుగలేదు. మొత్తము పదునారు వేల స్త్రీలను కైకొనివచ్చిరి. ఇట్లు నలుబది వేల సంవత్సరములు గడిచెను. మొత్తముమీద ఏబదివేల సంవత్సరములు గడచినవి.

నగరవాసులు సమావిష్టులై మరల ఆందోళన చేసిరి. ఏ మిది యని రా జడుగగా "దేవా, తమదేవేరులు పుత్రులను కనుటకై ప్రార్థనలు చేయ నాజ్ఞాపింపుడు'' అని విన్నవించిరి. మంచి దని రాజు పలికి "దేవేరులారా, పుత్రుల కొరకు ప్రార్థనలు చేయుడు'' అనెను. వారు ప్రార్థనలు చేయుచు నానావిధ దేవతలకు నమస్కారములు చేయుచు, రకరకముల వ్రతము లాచరించుచుండిరి. సంతానము కలుగలేదు. అంతట రాజు సుమేధతో "భద్రే పుత్రునికై ప్రార్థింపుము" అనెను. మంచిదని ఆమె అంగీకరించి పూర్ణిమ నాడు ఉపోసథవ్రతమునకై అష్టాంగిక శీలము గ్రహించి శయనగృహమున శీలవిచారణ చేయుచు ఉచితాసనముపై గూరుచుండెను. మిగిలిన స్త్రీలు మేషవ్రతమును, గోవ్రతమును సంకల్పించి ఉద్యానమునకు జనిరి. సుమేధా దేవి ధారణ చేసిన శీలమునలని తేజస్సుచే శక్రుని భవనము కంపించెను.

ఆయన ధ్యానబలమున సుమేధాదేవి సంగతి గ్రహించి ఈమెకు పుత్రు నను గ్రహించెదను అని నిశ్చయించెను. కాని యెట్టివానినో ఒకని నిచ్చుట కిష్టము లేక తగిన కుమారునికై యోచించెను. అంత శక్రుడు నడకార దేవపుత్రునివైపు చూచెను, ఆ పుణ్యపాణి పూర్వజన్మములో వారాణసీ నగరమున నివసించుచు పొలములో విత్తులు చల్లు కాలమున క్షేత్రమునకు పోవుచు ప్రత్యేక బుద్ధుడు దారివెంట చను చుండుట చూచి పాలేర్లతో నాట్లు వేయు డని చెప్పి పంపి, ప్రత్యేక బుద్ధుని తన యింటికి గొనిపోయి భోజనము పెట్టి గంగాతటమునకు దీసికొనిపోయెను. తన పుత్రుని సాయ ముతో కుటీరము నిర్మించి దానికి తలుపు పెట్టి పచారు చేయుటకు కొంత ప్రాంగణము విడిచి ప్రత్యేక బుద్ధుని అందు మూడు మాసములు నిలిపెను. వర్షాకాలము గడచినపిదప పితా పుత్రులు ప్రత్యేక బుద్ధునకు మూడు చీవ రము లిచ్చి వీడుకొల్పిరి. ఈ విధముగా ఏడుగురు ప్రత్యేకబుద్ధులను మూడు మూడు మాసముల చొప్పున కుటీరమున నిలిపి వస్త్రము లిచ్చిరి. రెండు వెదురు గడలతో పని చేయు పితాపుత్రులు ప్రత్యేక బుద్ధుని చూచినంతనే అట్టిపుణ్యకార్యముచేసి వారు తనువులు విడిచినపిదప త్రయః-త్రింశభవన మున జన్మించిరి. అచట ఆరు కామలోకములతో పైనుండి క్రిందికి, క్రింది నుండి పైకి దేవైశ్వర్యముల ననుభవించుచు విచరించుచు అచటినుండి పై దేవలోకములలో జనన మొందగోరిరి. వారిలో నొకడు తథాగతు డగు నని శక్రుడు తెలిసికొని, ఆతని విమాన ద్వారమునకు జని, ఆతడు వచ్చి నమస్క రించినంత "మారిషా. నీవు మర్త్యలోకమునకు పోవలయును" అనెను.

"మహారాజా, మానవలోకము గర్హింపదగినది, నాకు వ్యతిరేక మయినది. అచట నుండువారు దానాది పుణ్యకార్యములు చేసి దేవ లోక మును వాంఛింతురు. నే నచటికి బోయి ఏమి చేయుదును?"

"మారిషా, దేవలోకములోని భోగము లన్ని మనుష్యలోకమున లభించును ఇరువది యైదు యోజనముల యెత్తు కల రత్నప్రాసాదమున నివసింప వలెను. అంగీకరింపుము."

ఆత డంగీకరించెను. శక్రు డాతనిచే ప్రతిజ్ఞ చేయించెను. ఆవల ఋషి వేషము దాల్చి రాజోద్యానము చేరి ఆకాశమార్గమున నిలిచి "ఎవరికి పుత్ర వర మిత్తును? ఎవరికి పుత్రవరము కావలెను" అనెను.

ఒక్కుమ్మడిని వేఁకొలది చేతులు పైకి లేచినవి: "భన్తే, నాకు, నాకు, నాకు," అను కేకలు వినబడినవి. "నేను శీలవతి యగునామెకు వర మిత్తును. మీ శీలము లెట్టివి? సదాచారము లెట్టివి?" అనెను. వారు ఎత్తిన చేతులు జోడించి "శీలవతి యగు నామెకు వరమీయ దలచినచో సుమేధా దేవికడకు పొండు" అనిరి. తోడనే యతడు ఆకాశమార్గమున చని ఆమెద్వారముకడ నిలువ "దేవీ, రమ్ము. దేవరాజు నీకు పుత్రవరమిచ్చు టకై ఆకాశమార్గమున నరుదెంచి ద్వారముకడ నిలిచియున్నాడు" అని యెవరో చెప్పిరి. ఆమె లేచి గంభీరముగా నడచి ద్వారము తెరచి "భన్తే సత్యముగా మీరు శీలవతికి పుత్రవర మిత్తురా?" యనెను. "ఔను, ఇత్తును." "అట్లగుచో నా కిందు." "నీ శీలము లెట్టివో తెలుపుము, నాకు నచ్చినచో నీకు పుత్రవర మిత్తును." ఆ వాక్కులు విన్నంతనే ఆమె వినుడు అని తన సదాచార వర్ణనము చేయునదై ఈ గాథ పలికెను :

ప్రథమురాలను శ్రీమహారాజ సురుచి
దేవ వనితల పట్టంపుదేవి నేను.
నన్ను పతి కొనివచ్చిన నాటినుండి
త్రికరణ విశుద్ధిగా నే నతిక్రమింప
లేదు బ్రాహ్మణ, ధర్మము నే దినాన
స్పష్టముగ గాని కడు రహస్యముగ గాని.

సంభవించుత సుతుడు నాసత్యవచన
కారణమ్మున; సత్యమ్ము కాని యెడల
మచ్చిరము సప్తధా భిన్న మగు తపస్వి!

అత్తమామలు జీవించి నన్నినాళ్లు
వారిముందర నమ్రతతోడ వర్తిలితిని.

అలసింపక పవలును రేయి వారి
సేవలను ధర్మమార్గాన జేసినాను,
నేను మెలగితి నెపు డహింసానురక్తి.

ప్రభువునకు పట్టమహిషినై పదియు నారు
వేల వనితలతోడ నేవేళ గాని
మెలగినా నీర్ష్యయును క్రోధ మేని లేక

అందు నప్రియ యొక్కతె యైన లేదు
అందరు సపత్ను లన్న నా కధిక కృపయె;
వారిహితమున ప్రీతితో వర్తిలితిని.

దాసులను కర్మకారుల తక్కినట్టి
యాశ్రితుల పోషణము చేసి తాదరమున.

శ్రమణులను బ్రాహ్మణోత్తమ జనుల యాచ
కాళి బోషించితిని ముక్తహస్తములను
అన్న పానీయము లొసంగి యన్నియెడల.

అష్టములలో చతుర్దశులందు, పూర్ణి
మా తిథులయందును, విశేష మగుదినాల
పూని శీలము నష్టాంగపూర్వకముగ
శ్రద్ధతోడ సల్పితి నుపోసథము వ్రతము.

సంభవించుత సుతుడు నాసత్యవాక్య
కారణమ్మున ! సత్యమ్ము కానియెడల
మచ్చిరము సప్తధా భిన్న మగును గాత !

వేయిగాథలలో నైనను వర్ణనము పూర్తి కాని గుణముల నామె పదునైదుగాథలలో పలుకునప్పటికి, కార్యభార ముండుటచే శక్రుడు ఆమె వాక్కుల కడ్డువచ్చి, నీగుణము లనేకములు, అద్భుతములు అని ఆమెను ప్రశంసించువాడై ఈ గాథ పలికెను :

నీవు తెలిపిన గుణములు నిక్కువముగ
కల్గును యశస్విని, రాజకాంత ! నీకు
పుట్టును కులీనుడు, విదేహపుత్రు, డధిక
ధార్మికుడు, కీర్తివంతు, డుదారమూర్తి

ఆమె ఆతని వాక్కులు విని ప్రసన్నచిత్తురాలై రెండు గాథలు పలికెను :

నీవు ధూసరితం బగు నింగి నిలిచి
పల్కితివి చాల చక్కని భాషణములు.
నాకు హృదయంగమమ్ములు ! నాకదూత
వగుదువో, బుద్ధి కల్గు మహర్షి వగుదొ
తెలుపు మాగంతుకా ! నీదు తెరగు నాకు.

ప్రత్యుత్తర మిచ్చువాడై ఆత డీ గాథలు పలికెను :

అందురు సహస్రలోచను, డతడె నేను-
శక్రుడను వచ్చినాడ నీ సవిధమునకు.

మర్త్యలోకాన నెవ్వతె మానవతియొ
బుద్ధిమతి చేయుచుండునో పుణ్యకర్మ
లత్తమామలకును సేవ లాచరించు
నట్టిసతి జూడ దేవత లరుగు దెంత్రు.

పూర్వజన్మ సుకృతంబున బుట్టి రాజ
కులములో భద్రురాల, నీకోర్కు లెల్ల
తీర్చికొన జాలినట్టి సుకేసమేత !

రాజపుత్రిక, రెండు కరమ్ములందు
కలవు మంచి ద్రవ్యంబు, లఖండకీర్తి
భూతలంబున వెలయు నీపుట్టువంటె,
కలుగు భావిని దేవలోకమున జన్మ !

సుఖము పొందుము చిరము ! విశుద్ధధర్మ
పాలనము చేయుచు సుమేధ ! మేలు కలిగె
నాకు నిను జూడ ! పోయెద నాకమునకు !

"దేవలోకములో నాకు పని యున్నది, పోవుచున్నాను. నీవు అప్రమత్తురాలవై యుండుము" అని శక్రు డుపదేశ మిచ్చి వెడలిపోయెను.

నడకార దేవుడు బ్రహ్మముహూర్తమున దేవలోకమునుండి చ్యుతుడై రాణి కడుపున బడెను. రాణికి గర్భధారణ మయినట్లు తోచినంతనే రాజుకు సూచించెను. గర్భరక్షణార్థము ఆవశ్యకములైన పను లన్నియు రాజు చేయించెను. పది మాసములు గడిచినంతనే బిడ్డడు పుట్టెను. అతనికి మహాపణాదు డని పేరు పెట్టిరి. రెండు రాష్ట్రముల వారును రాజాంగణమున చేరి. "స్వామీ, పుత్రుని పాలకొరకు ఇది మా కానుక" అని ఒక్కొకరు ఒక్కొక కార్షాపణము తెచ్చిరి. అవి యన్నియు పెద్ద గుట్ట యైనది. రాజు స్వీకరింపకపోయినను వారు "స్వామీ, కుమారుడు పెద్దవాడైనపిదప అతని వ్యయమునకు ఉపకరించును" అని వారు నాణెము లచ్చటనే విడిచి వెడలి పోయిరి. కుమారుడు మహావైభవముతో పెరుగుచుండెను. పదునారు వత్సరములు వచ్చునప్పటి కాతడు సమస్తవిద్యా పారంగతు డయ్యెను. రాజు గమనించి దేవితో "భద్రే, నీ కుమారునకు రాజ్యాభిషేకము చేయదగిన సమయము వచ్చినది. కావున రమణీయప్రాసాదము నిర్మింప జేసి అం దాతని కభిషేకము చేయుదము" అనెను. మంచి దని ఆమె చెప్పగా, రాజు వాస్తుకలాకుశలు రగు ఆచార్యులను పిలువ నంపి "బాబులారా, వడ్రంగులను కొనిపోయి మా నివాస స్థానములకు ఎక్కువదూరము కాకుండా కుమారునికై ప్రాసాదము నిర్మింపుడు. అందు రాజ్యాభిషేకము చేయవలెను" అనెను. మంచి దని వారు స్థలము వెదుకపోయిరి. ఆసమయమున శక్రుని పీఠము వేడెక్కెను. శక్రుడు దానికి హేతువు గ్రహించి విశ్వకర్మను పిలువ నంపి "బాబా! పోయి మహాపణాద కుమారుని కొరకు రత్నప్రాసాదము నిర్మింపుము. దాని పొడుగు వెడలుపు అర్ధయోజన ముండవలెను. కాని యెత్తు మాత్రము ఇరువదియైదు యోజనము లుండవలయును" అని చెప్పెను. విశ్వకర్మ వడ్రంగి వేషము దాల్చి వండ్రుంగులకడకు జని "మీరు ప్రాతఃకాలభోజనము చేసి రండు" అని వారిని పంపి, తన చేతిదండముతో భూమిపై కొట్టెను. తోడనే అతడు పలికినట్లు ఏడంతస్తులమేడ పైకి లేచెను. మహాపణాదుని ప్రాసాదమంగళము, ఛత్రధారణ మంగళము, వివాహ మంగళము ఒక్కమారుగా జరిగినవి. రెండు రాష్ట్రములవారును మంగళ

స్థానమున సమావిష్టులై యేడు సంవత్సరములపాటు మంగళోత్సవములలో పాల్గొనిరి. రాజు వారిని పొమ్మనక వస్త్రములు, అలంకారములు, భోజనములు, పానీయములు అన్నియును వారికి అందజేసెను. ఏడు సంవత్సరముల తరువాత వారు కోలాహలము చేసిరి. సురుచి దానికి కారణమేమని యడిగెను వారు "మహారాజా, మేము ఏడు సంవత్సరముల పాటు మంగళోత్సవములలో పాల్గొన్నాము ఇది యెప్పటికి ముగియును" అని అడిగిరి. రాజు "బాబా! నా కుమారు డింతవరకును నవ్వలేదు. ఇత డెప్పుడు నవ్వునో అప్పుడు మీరు పోవచ్చును" అని రాజు పలికెను. వారు నగరమున చాటింపించి నటులను సమావేశపరచిరి. వేయిమంది నటులు ఏడు గుంపులుగా నేర్పడి నాట్యము చేసిరి. కాని చిన్నరాజుకు నవ్వు తెప్పింపజాలరైరి. దివ్య నాటకమాడినను అతనికి వారి నృత్యము నచ్చలేదు చతురులైన నటు లిరువురు— ఖండుకర్ణ, పండుకర్ణ నామధారులు యోచించి రాజకుమారుని నవ్వింప నెంచిరి. ఖండుకర్ణుడు రాజద్వారమున సాటిలేని ఆమ్రవృక్షము నిర్మించెను. ఆవల దానిపైకి దారపుటుండ విసరివైచి, వల పన్ని దారము మీదుగా అతుల వృక్షము (మామిడి)పై కెక్కెను. అది కుబేరుని ఆమ్ర వృక్షము, కుబేరుని పరిచారకులు వానిని పట్టుకొని ముక్కలు ముక్కలుగా నరకిరి. రెండవ నటుడు ఆ ముక్కలను ప్రోగు చేసి వానిపై నీరు చల్లెను. ఆతడు పుష్ప వస్త్రములు ధరించి నాట్యము చేయుచు లేచి నిలిచెను. ఇది చూచియు మహాపణాదుడు నవ్వనేలేదు. పండుకర్ణుడు రాజాంగణమున కట్టెలు పేరిపించి తన పరివారముతో అగ్నిప్రవేశము చేసెను. అది చల్లారిన పిదప దానిపై నీరు చల్లిరి. పండుకర్ణుడు తన పరివారముతో కూడ పుష్ప వస్త్రములు ధరించి నృత్యము చేయుచు లేచెను. మహాపణాదుడు దీనికిని నవ్వలేదు. రాజకుమారుని నవ్వింపజాలక మానవులు వెరపు చెందిరి. శక్రుడు చూచి దేవనటులను పంపుచు మీరు పోయి మహాపణాదుని నవ్వించి రండు. అని ఆన తిచ్చెను. వారు రాజాంగణమున చేరి అర్ధాంగనృత్యము చేసిరి. అందు ఒకచెయ్యి ఒకకాలు, ఒకకన్ను మొద లగునవి నృత్యము చేయును; మిగిలిన యంగములు నిశ్చలములుగా నుండును. అది చూచి మహాపణాదుడు చిరునవ్వు నవ్వెను. జనులు నవ్వి నవ్వి ఆపుకొనలేక రాజాంగణమున పడిరి, అంతట మంగళోత్సవము సమాప్త మయ్యెను.

మహోపణాద జాతకానుసారముగా కథ నడచును. ఆతడు దానాది పుణ్యకార్యములు చేయుచు, మరణానంతరము దేవలోకమునకు చనెను.

శాస్త ఈ ధర్మ నిర్దేశము చేసి "భిక్షువులారా ! ఈ విధముగా విశాఖ పూర్వముకూడ నావలన వరములు పొందెను" అని జాతకములు సరి పోల్చెను. ఆ కాలమున మహోపణాదుడు పథకీ; సుమేధ దేవీ విశాఖ; విశ్వ కర్మ ఆనందుడు; శక్రుడు నేనే.

# 490. పఞ్చుపోసథ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు ఉపోసథవ్రత మాచరించు ఉపాసకు లైదువందలమందిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున శాస్త ధర్మసభలో చతుర్విధపరిషన్మధ్యమున అలంకృత బుద్ధాసనముపై కూరుచుండి మృదుచిత్తమున పరిషత్తువంక చూచి ఉపాసకులనుగూర్చి ధర్మోపదేశము జరుగుచున్న దని గ్రహించి "ఉపాసకులారా, మీరు ఉపోసథ వ్రతధారణ చేసితిరా ?" అనెను. "భన్తే, చిత్త"మని వారు విన్నవింపగా, శాస్త "మంచిపని చేసితిరి. ఉపోసథవ్రతము పురాణ పండితుల పరంపరలోనిది. వారు రాగాది చిత్తమలములను దూరీకరించుటకై ఉపోసథవ్రతము నెరపెడివారు" అని వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున మగధరాష్ట్రాది రాష్ట్రత్రయము నడుమ అరణ్యముండెను. బోధిసత్త్వుడు ఆ కాలమున మహైశ్వర్యము కల బ్రాహ్మణకులమున జన్మించి, పెరిగి పెద్దవాడై భోగములు విడిచి యా యరణ్యమునకు జని ఆశ్రమము నిర్మించుకొని నివాసము చేయజొచ్చెను. దానికి సమీప ప్రదేశమున వేణువనములో తన భార్యతో పావుర ముండెను. అచట పుట్టలో పాము, తుప్పలో నక్క, వేరొకతుప్పలో ఎలుగుబంటియు కలవు. ఆ నాలుగును అప్పు డప్పుడు ఋషిసన్నిధి కరిగి ధర్మములు వినుచుండెడివి.

ఒకనాడు పావురములు రెండును గూటినుండి వెలువడి మేతకై పోయినవి. అవల నవి గూటికి మరలి వచ్చునపుడు ఆడుపావురమును డేగ తన్నుకొని పోయెను. దాని యాక్రందనము విని మగపావురము అగి

చూచునప్పటికి డేగ దానిని తన్నుకొని పోవుచుండెను. అరచుచుండగనే పావురమును డేగ చంపి తినెను. భార్యావియోగమున పావురము బాధ పడుచు "ఈ రాగాగ్ని నన్ను మిగుల పీడించుచున్నది. దీనిని దమింపకుండ మేతకు పోవను" అనుకొని మేతకు పోవుమార్గము విడిచి తపస్విసన్నిధి కరిగి రాగాగ్నిని శాంతింప జేయుటకై ఉపోసథవ్రతము పూని ఒకప్రక్క పడియుండెను.

సర్పముకూడ ఆహారము వెదకుటకై నివాసస్థానము వెలువడి సమీప గ్రామమున ఆవులు మేత మేయుతావున ఎరకొరకు తిరుగుచుండెను. అప్పుడు గ్రామాధికారి వృషభము- మంగళకరము, సర్వశ్వేతము నగునది మేత మేసి మరలి వచ్చుచుండెను. అది పుట్టపై పాద ముంచి కొమ్ములతో మన్ను ఎగజిమ్ముచు క్రీడించుచుండెను.

వృషభ పాదఘట్టనము విని సర్పము భయపడి పుట్టలోనికి దూర జొచ్చెను. దానిపై ఎద్దుగిట్ట పడినది. కోపించి పాము వృషభమును కాటం దెను. ఎద్దు అచటనే పడి మరణించెను. ఈ వార్త తెలిసినంతనే గ్రామవాసు లచ్చటికి జని విలపించి, గంధమాల్యాదులతో పూజించి, గుంట త్రవ్వి దానిని పూడ్చి వెడలిపోయిరి. ఆవల పుట్టలోనుండి పాము ఈవలకు వచ్చి, 'నా క్రోధమువలన వృషభ ప్రాణములు తీసి జనులను శోకాకులచిత్తులను చేసితిని. ఈ క్రోధమును దమింపక నేను ఆహారము తీసికొనను' అనుకొని ఆశ్రమమునకు జని ఉపోసథవ్రతము బూని ఒక ప్రక్కన పడియుండెను.

నక్క వేటకు పోయి చచ్చిన యేనుగును చూచి సంతోషించి పేరా సచే హస్తికళేబరమున ప్రవేశించి బయటికి రాలేక చాల శ్రమపడి చచ్చిచెడి తుద కెట్లో ఈవల బడెను. చర్మముమీది రోమము లూడిపోయినవి. 'లోభ ముచే నాకీగతి పట్టినది. లోభమును జయింపక ఇక వేటకు పోవను' అని నక్క నిశ్చయించుకొని ఉపోసథవ్రత మాచరించుటకై ఆశ్రమము చేరి ఒక ప్రక్కన పడియుండెను.

ఎలుగుబంటి కూడ పేరాసకు లోనై అడవినుండి వెలువడి సరిహద్దు గ్రామములో ప్రవేశించెను. ఈ సంగతి తెలిసికొని గ్రామవాసులు విల్లంబులు,

కర్రలు పట్టుకొని యెలుగుబంటి దాగిన పొద చుట్టు ముట్టిరి. గ్రహించి యెలుగుబంటి పొద వెలువడి పరుగిడసాగెను. జనులు దానిపై అలుగులు, కర్రలు విసరిరి. తలపై దెబ్బ తగిలి రక్తము కారుచుండ నిజనివాసమునకు పరుగెత్తి యెలుగుబంటి తనలో "పేరాసవలన నాకీబాధ కలిగినది. ఆశను గెలువక ఇక వేటకు పోవను" అనుకొని ఆశ్రమమునకు జేరి ఉపోసథవ్రత మవలంబించి ఒక ప్రక్క పడియుండెను.

తాపసి ఉన్నత కులాభిమానముచే ధ్యాననిష్ఠుడు కాజాలకుండెను. ఇంతలో ఒకానొక ప్రత్యేకబుద్ధుడు తాపసి అభిమానవంతు డగుట గ్రహించి "ఇతడు నీచప్రాణి కాడు, బుద్ధంకరుడు. ఈ కల్పములోనే సర్వజ్ఞత్వము పొందగలడు. ఈతని యభిమానము తొలగించి ఇతనికి సమాపత్తిలాభము కలిగించెదను" అనుకొని, తాపసి పర్ణకుటీరములో కూరుచుండి యున్నప్పుడే దిగి వచ్చి ఆతని రాతిపలకపై కూరుచుండెను. తన పీఠముపై వేరొకడు కూరుచుండుట చూచి అభిమానము చెలరేగి అప్రసన్నుడై, చిటిక వేసి "ఓరి చండాలుడా, పాడుమొగమువాడా, ముండితముండకా, శ్రమణకా, నీవు నశించిపోవుదువుగాక ! నేను కూర్చుండుతావున ఏల కూర్చున్నావు?" అనెను. "సత్పురుషా, నీకింత అభిమాన మేమి ? నాకు ప్రత్యేకబోధి జ్ఞానము కలగినది. నీవు ఈ కల్పముననే సర్వజ్ఞ బుద్ధుడ వగుదువు. నీవు బుద్ధంకరుడవు. దశపారమితలను పూర్తి చేయుచు వచ్చుచున్నావు. కొంత కాలము గడచిన పిదప నీవు బుద్ధుడ వగుదువు బుద్ధత్వము లభించిన జన్మమున సిద్ధార్థనామము పొందుదువు" అని యిట్లు నామకుల గోత్రములు, అగ్రశ్రావకత్వ విశేషములు తెలిపి "నీవు అభిమానమున కఠీనుడవై కఠోర వాక్కులేల పలుకుదువు ? ఇది నీకు తగదు" అని ఉపదేశించెను. ఆత డిట్లు పలికినను తాపసి ప్రణామము చేయలేదు; నే నెప్పుడు బుద్ధుడ నగుదును అని కూడ అడుగలేదు. అంతట "నీ ఉన్నతజాతికన్న నా గుణములే గొప్ప వని తెలిసికొనుము. నీకు శక్తి యున్నచో నావలె ఆకాశమున విచలింపుము" అని ఆకసమున కెగిరి తన పాదధూళి తాపసి జడలపై రాల్చి, ఉత్తరహిమాలయమునకు వెడలిచనెను. ఆతడు చనినపిదప తాపసి సంవిగ్నచిత్తుడై తనలో "ఈ శ్రమణుడు ఇంతవలుద శరీరము కలవాడైనను గాలిలో తేలి పోవు దూదిపింజవలె ఆకసమున కెగిరినాడు. జాత్యభిమానముచే నేను ఇట్టి

ప్రత్యేక బుద్ధునకు నమస్కారము కూడ చేయలేకపోతిని. నే నెప్పుడు బుద్ధుడ నగుదు నని యడుగనై తిని. జాతి యేమి చేయును ? ఈ లోకమున సదాచారమే గొప్పది. ఈ యభిమానము వృద్ధి నొందినచో నన్ను నరకమునకు గూడ కొనిపోవగలదు. ఈ యభిమానమును జయింపక, నేను కందమూల ఫలములు ముట్టుకొనను'' అనుకొని, కుటీరములోనికి బోయి ఉపోసథ వ్రతము బూని, కాష్ఠశయ్యపై గూరుచుండెను. మహాజ్ఞానియు, కులపుత్రుడు నగునాతాపసి అభిమానమును జయించి, యోగవిధాన మవలంబించి అభిజ్ఞలు, సమాపత్తులు పొంది ఈవలకు వచ్చి చంక్రమణ భూమిలో శిలాసనముపై గూరుచుండెను. అంతట పావురము మొదలగునవి ఆయనకడకు వచ్చి ప్రణామము చేసి ఒకప్రక్క నిలిచినవి. బోధిసత్త్వుడు పావురముతో ''నీవు రెండవనాడు ఈవేళకు రాలేదు. మేతకు పోవలేదా ? ఒకవేళ నేడు ఉపోసథవ్రతము పూనినావా ?'' అనెను. ''భన్తే, చిత్తము.'' ఎందుచేత ?'' అని ప్రశ్నించువాడై బోధిసత్త్వుడు ఈ గాథ పలికెను :

ఒకపోతమ, యిప్పు డున్నావు నీవు
నిష్క్రియమ్ముగ; చెప్పు నీకు భోజనము
వలదొకో ? దప్పి యాకలి సహించుచును
ఊనితి వేటికో ఉపవాసనిష్ఠ ?

విని కపోతము ఈ గాథలు పలికెను :

మును కపోతికయెడ ముగ్ధచిత్తుండ-
ఈ ప్రదేశమునందె యిరువురి కేళి.
దానిని శ్యేనంబు తన్నుక పోయె,
ఏది రుచించుట లేదు నా కిపుడు.

దాని వియోగాన మానసికంబు
లగు బాధ లెన్నియో అనుభవించుచును
క్రమ్మర ననురక్తి కలుగనీకుండ
ఉపవాస మొనరించుచున్నాను నిష్ఠ.

కపోతము తన ఉపోసథవ్రత విషయము చెప్పగా, బోధిసత్త్వుడు సర్పాదుల నొక్కొకదానినే ప్రశ్నించెను :

"చనలేవు ఋజువుగా సర్పమా, నీవు
నీకు నాల్కలు రెండు; నీకాయుధములు
కోరలు; నీ నోట ఘోరవిషమ్ము !
లెక్క సేయక ఆకలియు దప్పికయును
ఇట్లుపవాసమ్ము నేల చేయుదువు ?"

"గ్రామణివృషభంబు కడుశక్తి కలది
బలమును వన్నెయె బాగుగా కలది.
పాదంబు వేయ నాపైన పుంగవము
కరచితి కోపాన; కాలధర్మంబు
గాంచిన దయ్యది గాఢవేదనను.

ఆవల గ్రామీణు లరుదెంచి చూచి
దుఃఖభారమ్ముతో తొలగి చన్నారు
క్రమ్మర కోపంబు రాకుండ నాకు
ఉపవాసమును పూని యున్నాను నేను."

"మెండు శ్మశానాన మృతశరీరముల
మాంసంబు నీకు గోమాయువా, రుచ్య
మాకలిదప్పులు త్యజియించియిట్లు
ఉపవాసనిష్ఠలో నుందు వెందులకు ?"

"మాంసలోభంబుచే మాతంగకుక్షి
జొచ్చితి, ఎండకు శుష్కించి యపుడె
బిగుసుక పోయెను మిగుల కరీష
సరణి పూర్ణమ్ముగా; వెడదారి లేదు !
కురిసిన దంతలో కుంభవర్షమ్ము
తనువు మెత్తగ నయ్యె తడిసినకొలది.
అపుడు రాహువునోటియం దుండి శశి
తాను డీవలకును బడినట్లు నేను
ద్విపకళేబరమును వీడి వచ్చితిని.

క్రమ్మర లోభంబు కలుగకుండంగ
పూని యున్నాడ ఉపోసథ వ్రతము."

"పుట్టలపై చెదపురుగులు మున్ను
భల్లూకరాజమా, భక్షించుచుండు
వాఁడ, వుపోసథవ్రతము పూనితివి
త్యజియించి ఆకలి దప్పిక లేల ?"

"నిజనికేతనముపై నిర్లక్ష్యవశత
చనినాఁడ మలయరాష్ట్రమునకు నన్ను
కర్రలం గొట్టుచు గ్రామమ్ముమండి
బయటికి ద్రోసిరి బలిమిమై జనులు.

స్రవియించుచుండగా రక్తంబు, వగులు
శిరముతో నిజసీమ చేరుకొన్నాను.
అంకురింపకయుండ నధికాశ మరల
పూనితి ఉపవాస పుణ్యవ్రతంబు."

ఈ విధముగా ఆ నాలుగు జంతువులు తమతమ ఉపోసథకర్మలను గూర్చి చెప్పి బోధిసత్త్వునకు ప్రణామము చేసి "భన్తే! అనుదినము తాము ఈ వేళకు కందమూలాదులకై పోవుచుండెడివారు. నేడు పోవలే దేమి? ఏల ఉపోసథవ్రతము పట్టినారు ?" అని యడుగునవై ఈ గాథ పలికినవి :

నీవు భదన్త, ప్రశ్నించిన వెల్ల
తెలియ బల్కితిమి; నీ తెరగు ప్రశ్నింతు-
మీవ్రత మూనితి వేకారణమున ?

ఆయన వాని కిట్లు చెప్పెను :

అతడు జీవన్ముక్తుడా శ్రమమ్మునకు
ఏతెంచినట్టి ప్రత్యేక బుద్ధుండు.

కొలది కాలముపాటు కూర్చుండి యవల
నాకు గత్యాదులు నామ గోత్రముల
ఆచరణంబుతో నన్నియు దెలిసె.

అభిమానవశమున ఆయన కేను
ప్రణమిల్ల లే, దేమి ప్రశ్నింప లేదు,
మరల నాలో నభిమానాంకురంబు
పుట్టకుండుటకై పూనితి వ్రతము.

ఈ విధముగా బోధిసత్త్వుడు తన ఉపోసథవ్రతకారణము తెలిపి వాని కుపదేశ మిచ్చి, పర్ణకుటీరములోనికి బోయెను. తక్కిన జంతువులు కూడ యథాస్థానములకు పోయినవి. బోధిసత్త్వుడు ప్రాప్తధ్యానుడై బ్రహ్మలోక గామియయ్యెను.

శాస్త ఇట్లు ధర్మదేశన చేసి "ఉపాసకులారా, ఉపోసథవ్రతము పురాణపండితుల పరంపర. ఉపవాసము చేయవలెను" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున కపోతము అనురుద్ధుడు, ఎలుగుబంటి కాశ్యపుడు, నక్క మౌద్గల్యాయనుడు, సర్పము సారిపుత్రుడు, తపస్వి నేనే.

—: o :—

# 491. మహామోర జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, ఉద్విగ్నచిత్తుడగు నొకానొక భిక్షువును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ భిక్షువును పిలువ నంపి శాస్త "భిక్షూ, నీవు సత్యముగా ఉద్విగ్న చిత్తుడ వైతివా ?" అనెను. భన్తే, సత్యమే" అని ఆతడు బదులు పలుకగా శాస్త "భిక్షూ, ఈ నందీరాగము మీవంటివాని నెందులకు కలవర పరుపదు ? సుమేరుపర్వతమును పెరికివేయ గల మహావాయువు చుట్టుప్రక్కల నున్న పురాణ పత్రములకు భయపడునా ? పూర్వకాలమున ఆతనివెంట నూరు వత్సరముల వరకు రాగముతో జీవించియుండ గల ప్రాణులను కూడ చలింపజేసెను" అని శాస్త పూర్వజన్మకథ చెప్పెను :

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు నప్పుడు బోధిసత్త్వుడు సరిహద్దుసీమలో నెమలికడుపున పడెను. ఒకనాడు నెమిలి మేత మేయుచోట గ్రుడ్డు విడిచిపెట్టి వెడలిపోయెను. తల్లికి స్వాస్థ్య మున్నను, సర్పాదులవలన హాని కలుగకున్నను అండము నష్టమైపోవదు. ఇందుచే ఆ గ్రుడ్డు కర్ణికారపుష్పము మొగ్గవలె బంగరువన్నె కలిగి పక్వమై ప్రకృతి నియమప్రకారము విచ్చుకొనెను. అందుండి బంగరువన్నె కల నెమలి పిల్ల ఈవలకు వచ్చెను. దాని రెండుకన్నులు జింజు ఫలములవలెను, ముక్కు పగడమువలెను ఉండెను. ఎర్రని మూడుగీతలు మెడమీదినుండి వీపు నడుమగా సాగిపోయినవి. పెరిగినపిదప సామాను వేసినబండివలె నెమిలి శరీర ముండెను. నీలవర్ణమయూరము లన్నియు సమావిష్టములై అతనిని రాజును చేసినవి. ఒకనాడు మయూరరాజు సరోవరములో జలపానము చేయుచు నీటిలో తన సౌందర్యమును చూచుకొని తనలో "నేను మయూరము లన్నిటికంటె

నెక్కువసౌందర్యము కలవాడను. వీరితోపాటు నే నున్నచో జనులు వచ్చి పోవుటావున నాకు ఆపద సంభవింపవచ్చును. కావున హిమాలయమునకు పోయి ఒంటిగా సుఖప్రదేశమున నివాసము చేయుదును'' అనుకొని రాత్రి వేళ తక్కినమయూరములు నిద్రించుచుండగా ఎట్టిసూచన చేయక హిమాలయయనకు జని, మూడు పర్వత పంక్తులు లంఘించి నాలుగవ దానిలో అరణ్యమున కమలములు విరిసియున్న సరోవర సమీపమున కొండ నానుకొనియున్న పెద్ద మర్రిచెట్టు కొమ్మమీదికి పోయి వాలెను. ఆ కొండనడుమ అంద మయినగుహ కలదు. అచట నుండ కోరిక కలిగి దాని కెదురుగా నున్నపర్వత తలముపై నివసింపసాగెను. క్రింది నుండి దానిమీది కెవ్వరు నెక్కజాలరు; పైనుండియు దానిమీది కెవ్వరును దిగలేదు. కావున మయూరమునకు పక్షుల వలనను, పిల్లుల వలనను, సర్పాదుల వలనను, మనుష్యుల వలనను భయయ లేకుండెను. ఇది నాకుసుఖస్థానము అనుకొని ఆనాడచటనే యుండెను. మరునాడు కొండగుహ వెలువడి మయూరము పర్వత శిఖరముపై తూర్పుదిక్కుగా కూర్చుండెను. ఉదయ మైనంతనే ఆది సూర్యుని వీక్షించి పగ లంతయు తన సంరక్షణకై "ఉదేతయం, చక్షుమా, ఏకరాజా'' అని పరిత్రాణ ధర్మదేశనము పఠించును. ఆవల మేత మేయు చోటికి పోవును. సాయం సమయమున మరలి వచ్చి పర్వతశిఖరముపై కూరుచుండి అస్తమించు సూర్యుని విలోకించి రాత్రివేళ తాను సురక్షితముగా నుండుటకై "అపేతయం, చక్షుమా, ఏకరాజా'' అను పరిత్రాణ ధర్మదేశము పఠించును. ఈ విధముగా మయూర మచట నివసించుచుండెను.

ఒకనాడు వ్యాధయువకుడు అరణ్యమున తిరుగుచు పర్వతముపై కూరుచున్న మయూరమును చూచి యావల నింటికి మరలివచ్చెను. చనిపోవు సమయమున నతడు తన కుమారునితో "నాయనా, నాల్గవ పర్వతపంక్తి మీది అరణ్యములో బంగరునెమిలి కలదు. రాజు ప్రశ్నించిన పక్షమున యథార్థము చెప్పుము'' అనెను. ఒకనాడు వారాణసీ నరేశుని పట్టపుదేవి క్షేమ తెల్లవారుజామున కల కనెను. అందులో బంగరునెమిలి ధర్మోపదేశము చేయుచుండెను. తాను 'సాధు, సాధు' అనుచు వినుచుండెను. ధర్మోపదేశానంతరము మయూరము వెడలిపోయెను. రాణి ఈ మాటలు పలుకుచు, కన్నులు తెరచి, "మయూరరాజు పోవుచున్నాడు, పట్టుకొనుడు'' అను

నప్పటికి మెలకువ వచ్చి, అయ్యది స్వప్న మని తెలిసికొనినది. ఆవల 'అయ్యది స్వప్న మని చెప్పినచో రాజు నమ్మడు. గర్భవతి నైతి నని చెప్పినచో ఆదరించును' అని తలపోసి రాణి నటన చేయుచు పండుకొనెను. రాజు ఆమెకడకు జని "భద్రే, యేమి శ్రమ" యని అడిగెను. ఆమె' నాకు గర్భ మేర్పడ్డది' అని చెప్పగా రాజు 'భద్రే, నీ కేమి కోరిక కలదు' అనెను. "దేవా, బంగరు నెమిలి ధర్మోపదేశము చేయగా వినవలతును." "భద్రే, ఇట్టినెమిలి యెచ్చట లభించును." "దేవా, అది లభింపనిచో నా ప్రాణములు నిలువవు" "భద్రే, చింతింపకుము. నెమిలి యెచ్చట నున్నను దొరకితీరును" అని రాజు ఆమె నోదార్చి సింహాసన మెక్కి అమాత్యులతో "అమాత్యులారా, దేవి బంగరునెమిలి యుపదేశమును వినగోరుచున్నది. బంగరువన్నె గల మయూరము లుండునా ?" అనెను.

"దేవా, బ్రాహ్మణులకు తెలియును." రాజు బ్రాహ్మణులను పిలువ నంపి ప్రశ్నించెను. వారు "మహారాజా, మా లక్షణము ప్రకారము జల జంతువులలో చేపలు, తాబేళ్ళు, కర్కటములు, బంగరువన్నె కలవి. స్థల జంతువులలో కొన్ని మృగములు, హంసలు, మయూరములు, తీతువుపిట్టలు బంగరువన్నె కలవి యుండును. పశువులలో, మనుష్యులలో బంగరువన్నె యుండును" అని విన్నవించిరి. రాజు తన రాష్ట్రములోని వేటకాండ్రను పిలువ నంపి "మీలో నెవరైనను బంగరునెమలిని చూచినారా ?" అనెను. మే మెవరమును చూడలే దని వారు విన్నవించిరి. తండ్రివలన మయూర వృత్తాంతము విన్నవాడు తాను చూడ లే దనియు, ఐనను ఫలానిస్థానమున బంగరునెమలి కలదు అని మా నాయన చెప్పినా డనియు విన్నవించెను. రాజు వానికి విశేషధన మిచ్చి "సౌమ్యా, నీవు పోయి దానిని కట్టి తెమ్ము. అయ్యది దేవికిని నాకును ప్రాణదాతతో సమ మగును" అని వీడ్కొనెను. వాడు తనభార్యకు బిడ్డలకు ధన మిచ్చి పర్వతశ్రేణికి చేరి బోధిసత్త్వుని కాంచి వల పన్నెను. నేడు వలలో చిక్కును, ఈనాడు వలలో పడును అని వాడు కొంతకాల మెదురు చూచి తుదకు మృతి చెందెను. బోధిసత్త్వుడు జాలములో చిక్కుకొన లేదు. దేవికూడ తనకోరిక నెరవేరకముందే చని పోయెను. రాజుకు క్రోధము కలిగెను. ఆ నెమిలిమూలమున తన ప్రియ భార్య మరణించినది అను వైరమునకు వశీభూతుడై రాజు "హిమాలయ

మున నాలుగవ శ్రేణిలో బంగరునెమలియున్నది. దాని మాంసము తిన్నవారు అజరామరు లగుదురు" అని బంగరుపట్టముపై వ్రాయించి దానిని గట్టి చందువా పెట్టెలో నిబద్ధము చేయించెను. తరువాత కొంతకాలమున కాతడు చనిపోయెను. పిదప వేరొకరాజు వచ్చెను. ఆతడు బంగరు పలకమీది యక్షరములు చదివి అజరామరత్వము పొంద దలచి మయూరమును పట్టించుటకై వేటకానిని పంపెను. వాడచట కొంతకాల ముండి తుదకు చనిపోయెను. ఈ ప్రకారముగా ఆరుగురు రాజులు పరిపాలన చేసి గతించిరి. ఆరుగురు వేటగాండ్రుకూడ పర్వతశ్రేణిలో చనిపోయిరి. ఏడవరాజు ఏడవ వేటగానిని నెమిలికై పంపెను. వాడు ఏడుసంవత్సరములపాటు వల పన్ని ఈనాడు పడును, ఆనాడు పడును అనుకొనుచు కాలము గడచుట చూచి "ఈ మయూరరాజు పాదమునకు బంధము పడకపోవుటకు కారణమేమి ?" అని యోచించి ప్రయత్నము చేయుచు, నెమిలి ప్రాతః సాయం కాలములందు త్రాణధర్మదేశనము పఠించుచుండుట వలన నని గ్రహించి "ఇది సామాన్య మయూరము కాదు. ఈయది బ్రహ్మచారి కానోపును. బ్రహ్మచర్య ప్రభావముచేతను, పరిత్రాణ ధర్మపఠన ప్రభావముచేతను ఈ మయూర పాదమునకు ఉచ్చు తగులుకొనుట లేదు" అని నిర్ణయించుకొని, ఆవల బాగుగా వేచియుండి, సరిహద్దులోని జనపదమునకు జని వల పన్ని ఆడనెమిలిని పట్టి దానికి చక్కని శిక్ష యొసగెను. చిటికలు వేసినంతనే ఆడునెమిలి కూత మొదలు పెట్టి, తాళములు వాయింపగా నృత్యము చేయును. వాడు దానిని బోధిసత్త్వుని కడకు కొనిపోయి, బోధిసత్త్వుడు పరిత్రాణ ధర్మదేశనము పఠింపకపూర్వమే వల పన్ని చిటికలు వేయగా ఆడునెమిలి కూత మొదలు పెట్టెను. ఆ ధ్వని విని యేడు వందల సంవత్సరములనుండి నెమిలిలో అణగియున్న రాగము తోక త్రొక్కిన పామువడగవలె నిలిచెను. అతడు రాగాభిభూతుడై పరిత్రాణ ధర్మమంత్రము పఠింపనేరక వేగముగా ఆడునెమిలికడకు జని దాని కాలికి తగిల్చియున్న పాశమున పడెను. ఏడువందల సంవత్సరములపాటు పాశము తగుల్కొనని మయూరము ఆ క్షణములో పాశమున చిక్కుకొనెను. వేటకాడు నెమిలినెత్తిపై వల చుట్టపుకొయ్య చూచి "ఈ మయూరరాజును ఇంతకు ముందు ఆరుగురు వేటకాండ్రు పట్టుకొనలేకపోయిరి. ఏడేండ్లు గడుచువరకును నాకు

గూడ సాధ్యము కాలేదు. ఈనాడు ఆడునెమిలిమూలమున రాగమునకు వశీభూతమై పరిత్రాణధర్మ దేశనము పఠింపజాలక వచ్చి ఈ మయూరము వలలో చిక్కుకొన్నది. ఇట్టి సదాచారము గలపిట్టకు కష్టము కలిగించినాను. ఇట్టిపక్షిని మరి యెవ్వరికడకును కొంపోవరాదు. రాజు నా కిచ్చు బహుమతి వలన ప్రయోజన మేమి ? దీనిని విడిచిపెట్టెదను'' అనుకొని ''ఈ పిట్టకు ఏనుగుబల మున్నది, సామర్థ్య మున్నది. నేను తనకడకు బోవుచో తన్ను సంహారింతు నని తలచి మృత్యుభయముచే ఆందోళన చెంది కాలు విరుగ గొట్టుకొన వచ్చును. కావున దగ్గరకు పోవకుండగనే మాటున నుండి బాణ ముతో బంధమును ఛేదింతును. అప్పుడు పిట్ట స్వయముగా తన యిచ్చ వచ్చి నట్లు ఎగిరిపోవచ్చును'' అనుకొని ధనుస్సున బాణము సంధించి నారి లాగ నుండెను. నెమిలి చూచి ''ఈ వేటకాడు కామాతురుడనై బంధమున పడిన నన్ను చూచి నిశ్చింతముగా నుండనేరడు. ఈత డెచట నున్నాడు ?'' అని ఇటు నటు చూడగా ఎక్కు పెట్టినవిల్లు కానబడినది. తనను వాడు సంహ రింప దలచియుండు నని మరణభయముచే జీవనప్రదానము వేడువాడై బోధిసత్త్వుడు ఈ గాథ పలికెను :

ధనముకోసమె నీవు నను బట్టితేని
సంహరింపక రాజసన్నిధానమ్ము
చేరుచుపజ్ఞాన పారితోషికము
నధిపుడు నీ కిచ్చు నని విశ్వసింతు.

వేటకాడు విని తనలో ''నన్ను చంపుటకై వేటకాడు బాణ మెక్కు పెట్టియున్నా డని మయూరరాజు భావింప నోపును. ఈతని నోదార్ప వలెను'' అనుకొని సాంత్వన మిచ్చువాడై ఈ గాథ పలికెను :

నిన్ను వధింపగా నేడు బాణమ్ము
సంధింపలేదు నే చాపమ్మునందు
నీబంధనంబు ఖండింతు, సుఖాన
ఇచ్చ వచ్చినచోటి కేగుము కేకి !

మయూరరాజు అంతట ఈ గాథలు పలికెను :

సప్తవర్షమ్ములు సహించి యెట్లొ
ఆకలి దప్పి. వెంటాడుచు నన్ను
పాశాన నేటికి బంధించినావు!
తలతు వేమిటికి బంధనము ఖండింప ?

ఈనాటినుండి త్యజించితి వొక్కొ
ప్రాణిహింసను ? నాకు పాశవిముక్తి
చేయ నెంతువు, సర్వజీవుల కిప్పు
డభయప్రదానంబు నాచరించెదవొ ?

ఆవల ప్రశ్నోత్తరములు. వేటకాడు ఇట్లనెను :

అభయం బొసంగుచు నఖిలజీవులకు
ప్రాణిహింసను మాని, పరలోకమునకు
నేగినవానికి నేమి సౌఖ్యమ్ము
లో మయూరప్రభూ, ఒదవునో చెపుమ !

మయూరరాజు :

అఖిల జీవులకును నభయం బొసంగి
హింస మానినవాని కీలోకమందు
సత్కీర్తి, ఆవల స్వర్గంబు నొదవు.

వేటకా డిట్లనెను :

వాదించుచుంద్రు దేవతలు లే రనుచు,
జీవు డిచ్చోటనే చెందు నాశంబు
నందురు, ఫలితంబు నందును ప్రాణి
సుకృత దుష్కృతముల చొప్పున నంద్రు,
దానంబు బుద్ధివిహీను లౌ వారి

కల్పనం బందురు; కాన పట్టుదును
ఆవాక్కులం బట్టి యచడజంబులను.

విని బోధిసత్త్వుడు పరలోకము కల దని తెలుపుటకై వలలోనుండి తల కర్ర క్రిందికి వంచి ఈ గాథ పలికెను :

ఆదిత్యుడును చంద్రు డంతరిక్షమున
నరుగుచు కాంతితో నగపడుచుంద్రు
వారి నీలోకమువా రని యంద్రో ?
అన్యలోకమువార లందురో జనులు ?

వేటకాడు ఈ గాథ పలికెను :

ఇహలోకవాసుల కిరువురి యెడల
పరలోక దేవతాభావన కలదు.

బోధిసత్త్వుడీగాథ పలికెను :

ఏహీనమానసు లెంతురో దుష్ట
సుకృత కార్యఫలంబు శూన్యం బటంచు;
దానవ్మ్ము మతి లేనిమానవ భ్రమము
అని యెవ్వ రందురో అవ్వారి వాద
మయ్యో పరాస్త మీ యాభాషణమున.

బోధిసత్త్వుని వాక్కులోని సత్యమును విచారించి, అత డీగాథలు పలికెను :

నీ వన్న మాటలు నిక్కంబు; దాన
సత్కార్య దుష్కార్యజాత మెట్లగును
ఫల విహీనము ? మూర్ఖభాషితం బెట్లు
కాగల్గు దానాదికంబు, వచింపు.

ఏ మాచరించిన, ఎట్టు లొనర్ప,
ఎట్టియభ్యాసంబు, నెట్టితపస్సు

నే జేయవలయును ? నిరయంబునుండి
రక్షణకై కేకిరాజ, వచింపు !

విని బోధిసత్త్వుడు ''నే నీప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చినచో ఈ మానవ లోకమున ఉత్తర మీయ గలవా డుండడు. బ్రాహ్మణశ్రమణులకు తగిన మాటలు ఈతనికి చెప్పెదను'' అనుకొని ఈ గాథలు పలికెను :

తాల్చి కాషాయవస్త్రము, లనాగారి
యాశ్రమణాళి కాలానుసారముగ
భిక్షాటనార్థము వెడలుచునుండు
ఆలసింపరు శాంతు లగువారు చర్య.

శాంతుల దరి యుక్తసమయాన చేరి
మనసులో నున్నట్టిమాట ప్రశ్నించు
ఇహపరసత్యంబు లెరిగిన రీతి
నీకు వారలు తెల్ప నేర్తురు సుమ్ము.

ఇట్లు పలికి వానికి నరకభయము చూపెను. అతడో పారమితలను పూర్తిచేసి ప్రత్యేకబుద్ధుడైన ప్రాణి. సూర్యరశ్మిస్పర్శ అయినంతనే వికసించు పద్మమువలె పరిపూర్ణజ్ఞానియై ఆతడు చరించుచుండెను. నిలుచున్న పాళమున ధర్మకథలు వినుచుండును; అట్లే సంస్కారములను గూర్చి విచారణ సల్పి వానియనిత్యత్వమును దుఃఖము అనాత్మస్వరూపమగుటయును గ్రహించి ప్రత్యేకబోధిజ్ఞానము పొందియున్నాడు. అతనికి జ్ఞానప్రాప్తియు బోధిసత్త్వునకు బంధన విముక్తియు ఒక్కసారిగా సంఘటిల్లినవి. ప్రత్యేక బుద్ధుడు సమస్తచిత్త మాలిన్యములను క్షాళన చేసి సంసారసాగర తీరమున నిలిచి, ఈ గాథ పలికినాడు :

ఉజ్జగించెడిరీతి నురగంబు కుబుస,
మహీరుహము పండుటాకులు రాల్చు
నట్లు లోభము విడనాడితి నేను.

ఆత డుల్లాసవాక్కులు పలికి "నేను సమస్తక్లేశ బంధనములనుండి విముక్తుడనైనాను. కాని మా యింట అనేకపక్షులు బంధనములలో నున్నవి. వాని నెట్లు విడిపింతును?" అనుకొని "మయూరరాజా, మా యింటిలో నెన్నోపక్షులు బంధనములో నున్నవి, వాని నెట్లు విడిపింతును? ప్రత్యేక బుద్ధులకన్న హెచ్చుగా సర్వజ్ఞబోధిసత్త్వులకు ఉపాయశక్తి యుండును" అనుకొని, ఆయనతో "ఏ యుపాయముచే సమస్తచిత్త మాలిన్యములు క్షాళన చేసి ప్రత్యేకబోధిజ్ఞానము పొందితిరో దానితో సత్యక్రియ కావింపుడు. జంబూద్వీప మంతట నే ప్రాణియు బంధమున లేకుండుగాక" అనెను. బోధిసత్త్వు డిచ్చిన యుపదేశానుసారముగా నాతడు సత్యక్రియ కావించువాడై ఈ గాథ పలికెను :

ఇంట పంజరముల నెన్నియో పులుగు
లున్నవి, విడిచెద నన్నింటిగూడ.
ప్రాణదానము చేతు వానికి, పిట్ట
లిచ్చ వచ్చినచోటి కెగిరి పోవచ్చు.

ఆతని సత్యక్రియవలన ఆ సమయములోనే పక్షు లన్నియు బంధవిముక్తములై ప్రసన్నచిత్తములతో కలకలము చేయుచు తమతమ తావులకు వెడలిపోయినవి. ఆ సమయముననే పిల్లులు మొదలు చిల్లర జంతువు లన్నియు బంధనవిముక్తము లైనవి. ప్రత్యేకబుద్ధుడు చేయి యెత్తి శిరసుపై నిమిరెను. తోడనే గృహస్థవేష మంతర్ధాన మయ్యెను; ప్రవ్రజిత వేషము ప్రకట మయ్యెను. అరువది సంవత్సరముల స్థవిరునివలె ఆచ్ఛాదితుడై, అష్ట పరిష్కారధారణ చేసి "నీవు నాకు మిక్కిలి ఉపకారము చేసితివి" అని చేతులు జోడించి, ఆకసమున కెగిరి నందమూల పర్వతమునకు జనెను. మయూరరాజు కఱ్ఱపై నుండి యెగిరి ఆహారము కైకొని నిజనివాసస్థానమునకు బోయెను.

వేటకాడు ఏడుసంవత్సరముల పాటు వల చేత పుచ్చుకొని తిరిగినను మయూరరాజు వలననే వాడు బాధావిముక్తుడైనవిషయము ప్రకటీకరించుచు శాస్త ఈ గాథ పలికెను :

చేత పాశముతో ప్రసిద్ధమయూర
రాజు బంధింప నరణ్యాల దిరిగి
వ్యాధు, డావల శిఖావళమును విడిచి
దుఃఖంబు నావలె తొలగించుకొనియె.

శాస్త ఈ ధర్మోదేశనము చేసి సత్యక్రియ కావించి జాతకములు సరి పోల్చెను సత్యక్రియానంతరము ఉద్విగ్నిచిత్తభిక్షువు అర్హత్వము పొందెను. ఆ కాలమున మయూరరాజు నేనే.

—[o]—

# 492. తచ్ఛసూకర జాతకము

శాస్త జేతవనమున విహారము చేయు నపుడు వృద్ధస్థవిరులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

మహాకోసల నరేశుడు బింబిసార నృపాలునకు పిల్ల నిచ్చుచు, ఆమె స్నానసామగ్రి ఖర్చులకై కాశీగ్రామ మిచ్చెను. అజాతశత్రువుచే తండ్రిని హత్య చేయించిన పిదప ప్రసేనజిత్తు ఆ గ్రామము హరించెను. దానికై వారికి యుద్ధము జరిగినది. అజాతశత్రువు జయించెను. కోసల నరేశుడు పరాజితుడై అమాత్యులతో "అజాశత్రువు నెట్లు పట్టుకొనగలము?" అనెను.

"మహారాజా, భిక్షువులు రహస్యాలోచనలో నిపుణులు. గుప్తచారులను పంపి విహారములో భిక్షువుల సంభాషణలను విని వచ్చునట్లు చేయవలెను."

రాజు చారులను పిలువ నంపి "మీరు విహార దేశమునకు జని దాగియుండి భదన్తుల రహస్యభాషణలు విని రండు" అని ఆన తిచ్చెను. జేతవనముననే రాజపురుషు లెందరో ప్రవ్రజించియుండిరి. అందు ఇరువురు వృద్ధస్థవిరులు విహారపు పొలిమేరలో పర్ణకుటీరమున నివసించుచుండిరి. ఒకని పేరు ధనుగహ తిస్సస్థవిరుడు, రెండవయాతడు మంతిదత్త స్థవిరుడు. వారు రాత్రి యంతయు నిద్రించి తెల్లవారుజామున నే లేచిరి. ధనుగహస్థవిరుడు నిప్పు రాజేసి "భన్తే దత్తస్థవిరా!" అనెను.

"భన్తే, యేమి?"

"పండుకొనియున్నారా?"

"లేదు, ఏమి చేయవలెను?"

"భన్తే. ఈ కోసలరాజు మహామూర్ఖుడు. కేవలము పాత్రనిండ ఆహారము నింపుకొని భుజించుట తెలిసినవాడు."

"భన్తే, దానివలన నేమి?"

"అతడు అజాతశత్రువుచే పరాజితు డైనాడు."

"భన్తే, ఆయన యేమి చేయవలెను?"

"భన్తే, దత్తస్థవిరా, యుద్ధమున శకటవ్యూహము, చక్రవ్యూహము పద్మవ్యూహము అని మూడు తెరగులు. అజాతశత్రువును పట్ట దలచు వారు శకటవ్యూహము పన్నవలెను. ఫలానిపర్వతఖండముపై ఇరుపార్శ్వము లందు శూరులను నిలిపి యెదురుగా సేన నిలిపి, శత్రువు లోనికి చొచ్చుకొని వచ్చునట్లు తెలియగనే జాలమున చిక్కుపోవు చేపవలె వానిని పిడికిట పట్టుటకు వీలగును."

గూఢచారులు ఈ వాక్కులు విని పోయి రాజుతో చెప్పిరి. రాజు మహాసైన్యము గొనిపోయి ఆ వాక్కులప్రకారమే చేసి అజాతశత్రువును పట్టి సంకెళ్ళు తగిలించెను కొలదిరోజులలో ఈ విధముగా నాతని గర్వ మణచి, 'మరల నెప్పుడు నిట్లు చేయవలదు' అని విముక్తుని చేసెను. అతడు రాజుకు వజ్రకుమారి యను కన్య నిచ్చి వైభవముతో వీడుకొలిపెను.

ధర్మసభలో భిక్షువులు సమావిష్టులై ఈ విషయము చర్చించుచుండగా శాస్త అచటికి జని విషయ మడిగి తెలిసికొని, "భిక్షువులారా, ఇప్పుడేకాదు, ధనుగహ తిస్సస్థవిరుడు పూర్వముకూడ యుద్ధ సంచాలనములో చతురుడు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసీ నగర ద్వార సమీపమందలి గ్రామమున వడ్రంగి నివసించుచుండెను. ఆత డొకనాడు కర్రకొరకు అడవిలోనికి పోయెను. అచట గుంటలో పడియున్న అడివి పందిపిల్లను చూచి, దానిని కొనివచ్చి తచ్ఛక సూకర మని పేరిడి పోషించుచుండెను. అది వాని కెన్నో

పనులు చేయుచుండెను. ముట్టెతో చిన్నచెట్లను దొర్లించుచుండును. దంతమునకు కట్టిన నల్లని దారమును లాగును; నోట పట్టుకొని గొడ్డలి, సుత్తె మొదలగునవి తెచ్చుచుండును. సూకరము పెరిగిన కొలది మహాకాయముతో, మహాబలముతో వానికి తోడ్పడుచుండెను. వడ్రంగి దానిని పుత్రునివలె ప్రీతితో చూచుచుండెను. తనకడ నున్నచో దాని నెవరైన చంపుదు రేమో యను తలపున వడ్రంగి దాని నడవిలోనికి బంపెను. అది అడవిలో నొంటిగా నుండలేననియు, తనవర్గమువారు దొరికినచో వారితో కలిసి యుందు ననియు తలపోసి కారడివిలోనికి బోయి అనేక వరాహములను గనుగొని సంతుష్టచిత్తముతో ఈ గాథలు పలికెను.

జ్ఞాతుల కోసమై చరియించుచుండ
గా పర్వతంబుల కాననంబులను
తుదకు వారలు నాకు దొరికినారు.

కందమూలాదులు కలవు మెండుగను,
భోజన సామగ్రి పుష్కల మిచట
ఈశైల వాహిను లింపుగా నున్న,
విచట సుఖమ్ముగా విహరింపవచ్చు.

లేక యుద్వేగంబు. లేక సంశయము,
భీతి యేమియు లేక జ్ఞాతులతోడ
నిచట సుఖమ్ముగా విచరింపవచ్చు.

విని సూకరము లీగాథ పలికినవి :

వేరొక గుహ నీవు వెదకుట మేలు
వైరు లిచ్చోటికి వచ్చుచు, మంచి
మంచి సూకరముల మడియించు చుంద్రు.

తచ్ఛక సూకర మి ట్లనెను :

జ్ఞాతులారా, మన శత్రు లెవ్వారు ?
మన మూరకున్నను మన వినాశంబు
చేయు వైరి యెవండొ చెప్పుడు మీరు.

సూకరము లి ట్లన్నవి :

తన కోరలే యాయుధమ్ముగా గలిగి
భూరిబలం బున్న పులి వచ్చి, మంచి
మంచి సూకరముల ద్రుంచుచుండు.

తచ్ఛక సూకర మి ట్లనెను :

మనకు కోరలు లేవ ? మన శరీరములు
హీనంబులా ? ఏకాకి యైన,
వైరిని మన మెట్లు వధియింపగలము ?

సూకరము లి ట్లన్నవి :

నీ హృదయంగమ నిస్తుల మధుర
వాక్కులు నిక్కముల్; వధియింత మవల
పోరితంబుమ వీడి పోయెడిదాని.

తచ్ఛక సూకరము సూకరము లన్నిటిని ఏకాభిప్రాయములను చేసి వ్యాఘ్ర మెప్పుడు వచ్చును అని యడిగెను. "నేటి యుదయము పులి వచ్చి పంది నొకదానిని ఎత్తుకొని పోయినది. మరల రేపు ప్రాతఃకాలమున వచ్చును" అని ప్రత్యుత్తరము వచ్చెను. వర్ధకసూకరము యుద్ధ నైపుణి కలది. ఎచట నిలిచినచో జయమున కవకాశ ముండునో ఆ యా ప్రదేశ ములు దానికి తెలియును. కావున యుక్త ప్రదేశము నిర్ణయించి సూకర ములు రాత్రి తిండి తిన్నపిదప తచ్ఛకసూకరము శకటవ్యూహాదులగూర్చి చెప్పి 'పద్మవ్యూహము పన్నవలె' ననెను. "నడుమ పాలుత్రాగు పిల్లలనునిలుపుడు. వాని చుట్టును వానితల్లులు నిలువవలెను. వానిచుట్టును పిల్లలులేని సూకర ములు, ఆవల సూకరశాబకములు, చిన్నచిన్న కోరలుకల తరుణసూకరములు, వానికావల పెద్దపెద్దకోరలుకలవియు, వానికావల వృద్ధసూకరములు నిలువ వలెను. వానికావల అక్కడక్కడ పది, పది, యిరువది, యిరువది, ముప్పది. ముప్పది చొప్పున సేనామండలి స్థాపింపవలెను." అని చెప్పి తనకొరకు గుంటయు, పులి పడుటకై గడ్డమువలె నేటవాలుగా నుండు గుంటయు

త్రవ్వించెను. రెండు గుంటలకు నడుమ తాను నిలుచుటకై అరుగు వేయించెను. బలిష్ఠములైన సూకరములను వెంట బెట్టుకొని తక్కినవానికి ధైర్యము పురికొల్పుటకై అచ్చ టచ్చట తిరుగుచుండెను. ఇట్లు చేయుచుండగనే సూర్యోదయ మయ్యెను.

అంతట వ్యాఘ్రరాజము కుటిల తపస్వి కుటీరమునుండి వెలువడి పర్వతతలముపై నిలువబడెను. "భర్తే, మన వైరి వచ్చినది" అని సూకరములు పలుకగా బోధిసత్త్వుడు "భయపడవలదు. అది యేమి చేసిన మీరు కూడ అదియే చేయుడు" అని బోధించెను. వ్యాఘ్రము ఒడలు విరుచుకొని వెనుక కడుగు వేసి మూత్రము విడిచెను. సూకరములు కూడ అట్లే చేసినవి. పులి వానిని చూచి పెద్ద బొబ్బ పెట్టెను. అవికూడ అట్లే చేసెను. అంతట పులి తనలో "ఇవి పూర్వమువలె లేవు. నేడు నాకు విరుద్ధముగా మండలిగా నిలువబడినవి. ఈ యేర్పాటు చేసినవాడు సేనానాయకు డని తోచుచున్నది. నేడు నేను వీని కడకు పోరాదు" అనుకొని మరణభయముచే కుటిలతపస్వి కడకు పరిగెత్తెను. పులి వట్టిచేతులతో వచ్చుచుండుట చూచి ఆత డీ గాథ పలికెను :

శార్దూలమా, నేడు చాలించి నావో
జీవహింస ? సమస్త జీవుల కభయ
దాన మిచ్చితి వోకో ? దంతముల్ శక్తి
కోలుపోయినవో ? మా గుంపు జేరియును
ఏల యోచింతువు కృపణుని రీతి ?

అప్పుడు వ్యాఘ్ర మీ గాథలు పలికెను :

తరిగిపోయినది నా దంతపాటవము,
తనువున దార్ఢ్యము తగ్గిపోయినది,
కనబడు నేడు సూకరముల గుంపు.
కావున చింతతో కాననంబునను
ఏకాకిగా విచరించుచున్నాను.

త్రాసముచే మున్ను తమతమ గుహల
కొంటిగా పరుగిడుచుండు సూకరము
లేక ప్రదేశాన ఈ నాడు చేరి
నినదముల్ చేయును నిర్భయమ్ముగను.
ఎచ్చోట గుమి గూడె నియ్యవి నేడు.
ఆక్రమింపగజాల నచ్చోట వీని.

వీనికి నాయకుల్ వీనికి నేక
మతము, సంఘీభావ మహిమయు కలవు
ఇయ్యవి నను సంహరింపగా జాలు-
ఇక్కారణముచేత నివి నేడు, వలదు.

విని కుటిలతపస్వి యి ట్లనెనును :

ఇంద్రు డొక్కడె సంహరించు రక్కసుల,
ఖగములన్ డేగ యొక్కటె కొట్టివేయు,
పులి యొంటిదే మృగముల గాంచి, మంచి
వాని గొట్టును; శక్తి వాని కట్టిదియె.

ఆవల వ్యాఘ్రము మి ట్లనెను :

ఇంద్ర శార్దూలము లేని శ్యేనంబు
ఏకత్ర చేరిన సూకరంబులను
పులివంటి వానితో పోరాడ లేరు.

మరల తపస్వి దానిని ప్రోత్సహించుచు ఈ గాథలు పలికెను :

గుంపులై శ్రేణులై కుంభీలకములు
ఎగురుచు నుండును ఖగము లొక్కటిగ
ఆకాశ మార్గాన హ్లాదంబుతోడ.

ఎగురుచు నుండెడి ఖగములందుండి
వెనుకం బడిన యొంటి విహాగంబు బట్టి

చీల్చి వేయుచునుండు శ్యేనరాజంబు :
వ్యాఘ్రరాజమునకు వరుస అయ్యదియె,

ఇట్లు పలికి దాని కుత్సాహము కలిగించి "వ్యాఘ్రరాజమా, నీ బలము నీ వెరుగవు. భయము లేదు. నీవు గంతు వేసి గర్జ చేయుము. ఒక్క సారిగా ఈ రెండు పనులు చేయువారు లేరు" అని కుటిల తపస్వి చెప్పగా పులి అట్లే చేసెను.

ఈ భావమును ప్రకటీకరించుటకై ఈ గాథ చెప్పబడినది :

మెండు లోభియు లౌకికుం డగు తబిసి
పలుకుల నుత్సాహపర మైన ద్వీపి
వెనుకటివలె నున్న వని సూకరములు
తలపోసి, వానిని దాకె ఘోరముగ.

పులి పర్వతతలము నుండి క్రిందికి దిగెను. సూకరములు చూచి తచ్ఛక సూకరముతో "స్వామీ, దొంగ మరల వచ్చెను" అని విన్నవించినవి. బోధిసత్త్వుడు భయపడవలదని రెండు గుంటల నడుమ అరుగుమీద నిలిచెను. పులి తీవ్రతతో బోధిసత్త్వునిపైకి దూకెను. తచ్ఛకసూకరము గిరి వెనుకటి గుంటలో పడెను. పులి వేగము నాపుకొనలేక బురద గుంటలో కుప్పవలె కూలబడెను. తచ్ఛకసూకరము వేగముగా దుమికి దాని మోకాళ్ళ నడుమగా కోరలతో చీల్చి గుండె లాగి పారవైచెను; అవల మాంసము తిని పులిని దంతములతో గుంటపైకి లాగి తెచ్చి 'ఈ తొత్తుకొడుకును తినుడు' అనెను. తొలుత వచ్చినవి నోటినిండ మాంసము తిన్నవి. ఆవల వచ్చిన సూకరములు పులిమాంస మెట్లుండును అన్నవి. గుంటలోనుండి వెలువడి బోధిసత్త్వుడు వానిని చూచి "మీకు బాగుగా సంతుష్టి కలిగినదా?" అనెను. "స్వామీ, ఇప్పుడు ఒక్క పులిని తిన్నాము. ఇంకొక చచ్చుపులి కూడ బ్రతికియున్నది!" "ఏ దాపులి?"

"వ్యాఘ్రము మాంసము తెచ్చి పెట్టుచుండగా తినెడి కుటిల తపస్వి!"

'అట్లగు చో వానిని పట్టుకొనుడు' అని వాని వెంట బోధిసత్త్వుడు వేగముగా చనెను. అక్కడ తపస్వి 'పులి ఆలసించుచున్నదేమి?' అని యోచించుచు దానికై యెదురు చూచుచుండెను; కాని సూకరములు వచ్చుచుండుట కాంచి "ఇవి పులిని సంహరించి నన్నుకూడ సంహరించుటకై వచ్చుచున్నట్లు తోచుచున్నది" అనుకొని పరుగెత్తి మేడిచెట్టుపైకెక్కెను. అతడు చెట్టెక్కినాడని సూకరము లన్నవి. "ఏ చెట్టు ?" "మేడిచెట్టు." "అట్లయిన విచారము లేదు. ఇప్పుడే వీనిని పట్టుదము" అని బోధిసత్త్వుడు తరుణ సూకరములను పిలిచి చెట్టుమొదట నున్న మన్ను వానిచే తొలగింపజేసెను. అంతట ఆడు పందులు నోళ్ళనిండ నీరు తెచ్చి చల్లినవి. ఈ విధముగా నవి చెట్టుచుట్టును కోరలతో త్రవ్వగా తల్లి వేరు మాత్రము మిగిలినది. తక్కినవి కూడి దంతములతో దానిని కూడ త్రవ్వి వేసినవి. గొడ్డలితో నరకినట్లు వేరు తెగి వృక్షము నేలపై బడెను. కుటిలతపస్వి దానితోపాటు నేల కూలగా సూకరములు వానిని త్రొక్కి, వాని మాంసము తిన్నవి. ఆశ్చర్యకరమైన ఈ ఘటన చూచి వృక్షదేవత ఈ గాథ పలికెను :

కలిసి యుండుట మేలు జ్ఞాతి సంఘంబు-
కాకున్న వృక్షముల్ కారాదె వనిని ?
కలిసి యున్నట్టి సూకరములు పులిని
ఉక్కడగించిన వొక దెబ్బతోనె.

పులియు, తాపసియు మరణించుట ప్రకటీకరించుచు శాస్త ఈ గాథ పలికెను :

బ్రాహ్మణున్ వ్యాఘ్రమున్ పరిమార్చి సూక
రములు హర్షంబున రావంబు చేసె.

మరల తక్షక సూకర మిట్లనెను ? "మీకు ఇంకను శత్రు వెవరైన ఉన్నాడా ?"

"స్వామీ, లేడు" అని సూకరములు బోధిసత్త్వునకు అభిషేకము చేసి రాజును చేయుటకై నీరు తేబోయినవి. తాపసి నీరు త్రాగు శంఖము చూచి ఆ దక్షిణావర్తశంఖ రత్నము నిండ నీరము కొని వచ్చి బోధిసత్త్వుని మేడి

చెట్టుక్రింద గూరుచుండ బెట్టి సూకరము లభిషేకము చేసినవి. అభిషేకానంతరము ఆయనకు సూకరిని పట్టపురాణిని చేసినవి. అంతట వారిని మేడిచెట్టు బోదెపై గూరుచుండ బెట్టి ఉభయులకును దక్షిణావర్త శంఖ జలముతో అభిషేకము చేసినవి !

ఈ భావమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథ పలికెను :

అత్తి నీడను వాని కా సూకరములు
అభిషేక మొనరించి అన్నవి యిట్లు :
మా ప్రభుండవు నీవు, మా దైవతమవు !

శాస్త ఈ ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ధనుగహాస్థవిరుడు ఇప్పుడేకాదు, పూర్వము కూడ యుద్ధ నిపుణుడు" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున కుటిలతపస్వి దేవదత్తుడు; తక్షక సూకరము ధనుగహా తిస్సస్థవిరుడు; వృక్ష దేవత నేనే.

———:():———

# 493. మహావాణిజ జాతకము

శాస్త జేతనమున విహారము చేయుచు శ్రావస్తినివాసు లగు వ్యాపారులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

వారు వ్యాపారార్థము పోవునపుడు శాస్తకు మహాదాన మిచ్చి, త్రికరణములను పంచశీలములను. గ్రహించి "భన్తే, కుశలముగా మేము మరల వచ్చినచో తమచరణసన్నిధిలో ప్రణామము చేయుదుము" అని విన్నవించి, అయిదువందల బండ్లతో ప్రయాణ మయిరి. వారు కాంతారము చేరి త్రోవపై దృష్టి యుంచక పోవుటచే త్రోవ తప్పి ఆహారము కాని, ఉదకము కాని లభింపని యడవిలో ప్రవేశించిరి. అచట తిరుగుచు మేడిచెట్టు చూచిరి. ఆ వృక్షము ఒకానొక నాగునియధీనమున నుండెను. వారు బండ్లు విప్పి మేడిచెట్టు నీడలో గూరుచుండి యుండగా ఆకులు తడిగా నుండుటయు కొమ్మలు నీటితో తడిసియుండుటయు కానవచ్చెను. 'ఈ వృక్షమున నీర మున్నట్లు తోచుచున్నది. దీని తూర్పుకొమ్మనరకిన నుదకము మనకు లభించును' అనుకొనిరి.

అంత నొకడు చెట్టెక్కి కొమ్మ కొట్టెను. తాళప్రమాణమున జలధార లేచెను. వా రందరు అందు స్నానము చేసి నీరు త్రాగిరి. ఆవల దక్షిణదిక్కుకొమ్మ కొట్టిరి. అందుండి రకరకముల రుచ్యాహారము లభించెను. భోజనానంతరము పడమటిదిక్కు కొమ్మకొట్టిరి. అందుండి అలంకృతలగు కామినులు బయలువెడలిరి. ఆవల ఉత్తరదిక్కుకొమ్మ కొట్టిరి. అందుండి సప్తవిధ రత్నరాసులు బయల్వెడలినవి. వానిని అయిదువందల బండ్లలో నింపి వర్తకులు శ్రావస్తి నగరమునకు మరలి వచ్చి వానిని గుప్తపరచి, ధూపమాల్యాదులు కైకొని జేతవనమునకు బోయిరి. అంతట శాస్తకు ప్రణామము చేసి పూజ కావించి ఒకప్రక్కగా కూరుచుండి ధర్మోపదేశము వినిరి. మరునాడు శాస్తకు మహాదాన మిచ్చి "భన్తే, ధనదాతృదేవత లైన

తమను ఈ దానమున భాగస్వాములను చేయుచున్నాము" అని విన్నవించిరి. శాస్త భోజనానంతరము "మీరు ఏ వృక్షదేవతను భాగస్వామిని చేయుచున్నారు ?" అనెను. మేడిచెట్టువలన తమకు సంపద లభించిన కథ వారు విన్నవింపగా శాస్త "మీరు మంత్రజ్ఞులగుటచే, తృష్ణకు లోను కాకుండుటచే, ధనము లభించినది. కాని పూర్వకాలమున కొందరు మంత్రజ్ఞులు కాక తృష్ణకు లోనగుటచే ధనప్రాణములు కోల్పోయిరి" అని వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసీ నగరమున.... ఆ కాంతారమున... అదే మేడిచెట్టు. వ్యాపారులు త్రోవ తప్పి ఆ మేడిచెట్టును చూచిరి. ఆ విషయము శాస్త అభిసంబుద్ధుడై నపిదప చెప్పుచు ఈ గాథలు పలికెను :

చనుదెంచి వివిధరాష్ట్రములనుండి
వర్తకుల్ సమితి స్థాపన చేసి, యొకని
గ్రామణిం గావించి కదలి చన్నారు
సంపద సమకూర్చు సంకల్పమునను.

ఆ యరణ్యంబున నాహారవస్తు
సముదయం బేనియు సలిల మేనియును
చిక్కవు, వారలు శీతలచ్ఛాయ
వెలయించు సుందర వృక్షంబుక్రింద
ఉపగతమోహులై ఉపవిష్టు లయిరి.

జలమయం బీచెట్టు, సలిలంబు జాలు
వారు నిద్దాన, వ్యాపారుల మిపుడు
తూరుపుశాఖను త్రుంచి వేయుదము.

శాఖను ఖండింప స్వచ్ఛోదకంబు
ప్రవహింప సాగెను; వ్యాపారి జనులు
స్నానపానాదులు సలిపినా రందు.

ఆ మూర్ఖ జనులకు నావల దోచె
తరువు దక్షిణశాఖ నరకి వేయంగ.

శాఖను ఖండింప స్వచ్ఛమూపములు
వెసరవ ప్పార్ద్రిక విహితంబు, మాంస
సంయుక్త మైనట్టి శాల్యన్న, మల్ప
జలము లభించె నా సమయంబునందు.

వారు యథేచ్ఛగా వ్యంజనాన్నములు
ఉదక మాస్వాదించు పిదప తోచినది
పశ్చిమశాఖను పట్టి ఖండింప

ఆ మూఢమానసు లట్లె కావింప
వెలువడె నందుండి వివిధభూషలను
తాల్చిన సుందర తరుణీ జనంబు.

తాల్చి విచిత్రవస్త్రమ్ములు మేలి
భూషణమ్ములు, మణిపూర్ణ కుండలము,
లొక్కొక్కవణిజున కొకతె లభించె.

ఆ తరుచ్ఛాయలో నన్నివైపులను
ఆక్రాంతులై వార లందరుగూడ
స్వేచ్ఛావిహారముల్ చేసినవారు.

ఆలోచనలు చేసి రామూర్ఖ జనులు
నరకివేయంగ నుత్తరదిక్కు శాఖ.

ఆ శాఖ నరకినయంత వెల్వడియె
వైడూర్యములు, వెండి, వస్త్రముల్, శ్వేత
కంబళమ్ములు, మౌక్తికములు, హాటకము.

కాశివస్త్రంబు, లుద్యానకంబళము
లెన్నొ మూటలు కట్టి రిచ్చకోలంది.

ఆవల తలచినా రా మూర్ఖజనులు
తరువుమూలమ్మును తరిగినయెడల
భూరిలాభమ్మును పొందుదు మనుచు.

సార్ధవాహుండు హస్తములను మోడ్చి,
మీకు వణిక్కులు, మే లగుగాక !
ఏ యపరాధంబు నీయత్తి చేసె ?

ఒసగెను తూరుపుకొమ్మ యుదకంబు మీకు
తగినయాహారంబు దక్షిణశాఖ
సమకూర్చె, పశ్చిమశాఖ యొసంగె
ఉత్తమవనితల, ఉత్తరశాఖ
నెరవేర్చినది కదా నిఖిలవాంఛలను !
మే లగుం గావుత మీకు వణిక్కు !
లే యపరాధంబు నీయత్తి చేసె ?

విశ్రమించితిరి యీ వృక్షంబునీడ,
తరుగుదురేని యీ తరువుమూలము
అగును మిత్రద్రోహ, మధికపాపమ్ము !

లెక్కచేయక వార లొక్కనిమాట
వాడిగొడ్డలితోడ మేడివృక్షంబు
దునియలు చేయగా దొరకొనినారు.

వారు వృక్షమును ఖండించుటకై క్రిందికి చేరునప్పటికి నాగరాజు తనలో 'వీరికి దప్పి తీర్ప నీరిచ్చితిని, దివ్యభోగ మొసగితిని, శయనాసన శుశ్రూషలకు వనితల నిచ్చితిని, ఐదువందల బండ్లు నిండు రత్నముల

నిచ్చితిని. ఇప్పుడు వీరు నా వృత్తమును సమూలముగా నాశము చేయ గోరుచున్నారు" అనుకొని నిజసేన కాజ్ఞ యిచ్చెను. తోడనే శస్త్రధారులు- ధనుస్సు, ఖడ్గములు, డాలులు ధరించినవారు- బయలువెడలిరి.

ఈ విషయము ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథ పలికెను :

వెడలినారలు పంచవింశతి నాగ
వీరులు. మున్నూరు విలుకాండ్రు, నారు
వేల కత్తులవారు డాలులతోడ.

అంతట నాగరాజు ఇట్లాజ్ఞాపించెను :

బంధించి వీరిని పరిమార్ప వలయు-
వదలగారాదు జీవముతో నెవని
సార్థవాహునితప్పః సర్వజనంబు
జేయంగవలయు భస్మీపటలమ్ము.

నాగులు ఆ ప్రకారమే చేసిరి. ఐదువందల బండ్లలో ఆస్తరణములు వేసి సార్థవాహుని వెంట గొని బండ్లు స్వయముగా తోలుకొనిపోయి వారాణసి చేర్చి ధన మాతనియింట భద్రపరచి నాగరాజ భవనమునకు మరలి వచ్చిరి.

ఈ యర్థము గ్రహించి శాస్త ఉపదేశ మిచ్చువాడై ఈ గాథలు పలికెను :

నిజహితముమీదనే దృష్టి నిలుపవలయు,
లోబడగరాదు యోగ్యుండు లోభమునకు
ఆత్మలోభి మన స్సను నట్టి ఘోర
వైరివిదళనమును జేయవలసి యుండు.

సంభవించును తృష్ణచే సకలదుఃఖ
జాల మనుమాట గ్రహియించి సజ్జనుండు

విడిచి యాసక్తి తృష్ణను వీడి, పొంది
స్మృతిని, భిక్షువుగా ప్రవ్రజింపవలయు.

శాస్త ఇట్లు ధర్మదేశనముచేసి "ఉపాసకులారా, ఈ విధముగా పూర్వ కాలమున వ్యాపారులు లోభమునకు వశీభూతులై మహావినాశము బొందిరి. కావున లోభమునకు లోబడరాదు" అని సత్యప్రకాశనము కావించి జాతకములు సరిపోల్చెను. సత్యక్రియానంతరము ఆ వ్యాపారులు శ్రోతాపత్తి ఫలమున ప్రతిష్ఠితులైరి. ఆ కాలమున నాగరాజు సారిపుత్రుడు; సార్థవాహుడో నేనే.

———:():———

# 494. సాధీన జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు ఉపోసథవ్రతము పూను ఉపాసకులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున శాస్త "ఉపాసకులారా, ఉపోసథ వ్రతకారణమున పురాణపండితులు మానవదేహములతోనే దేవలోకము చేరి, చిరకాలమచట నుండి, ......" అని వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను

## అతీత కథ

పూర్వము మిథిలలో సాధీననాము డగురాజు ధర్మానుసారముగా రాజ్యము చేయుచుండెను నగరద్వారములు నాలిగింటికడను, నగరమధ్యమునను, రాజభవనద్వారముకడను ఆరు ధర్మశాలలు నిర్మించి, జంబూద్వీపము చలించునట్లు భూరిదానములు చేయుచుండెను. దినమున కారులక్షల ధనము వ్యయ మగుచుండెను. ఆయన పంచశీలములు రక్షించుచు, ఉపోసథ వ్రత మాచరించుచుండెను. రాష్ట్రవాసులు ఆయన యుపదేశానుసారముగా ప్రవర్తించుచు, దానాదిపుణ్యకార్యములు చేయుచు, మరణానంతరము దేవలోకముల జన్మించుచుండిరి. దేవరాజు సుదర్శనసభలో నుపవిష్టుడై సదాచారాది గుణములనుగూర్చి ప్రశంస చేయుచుండెను. విని దేవతలు సాధీన రాజును జూడగోరిరి. దేవరాజు శక్రుడు వారి మనసులలోని మాటను గ్రహించి "మీరు సాధీనరాజును జాడ నభిలషించుచున్నారా!" అని యడిగెను.

"చిత్తము దేవా!"

శక్రుడు మాతలిని పిలువనంపి "నీవు పోయి వైజయన్తిరథములో సాధీనరాజును గొని రమ్ము" అని యానతిచ్చెను. చిత్తమని మాతలి రథ

ముతో విదేహరాష్ట్రమునకు బయలుదేరెను. ఆనాడు పూర్ణిమ. జనులు రాత్రిభోజనము చేసి తమతమ వాకిళులందు విశ్రాంతి చెందుచు చంద్ర మండలమువైపు చూచుచుండువేళ మాతలి రథమును చంద్రమండలము వెంట నడపుచుండెను. జనులు చూచి రెండవచంద్రమండల ముదయించె ననుకొనిరి. కాని, మాతలి మండలమును విడిచి ఈవలకు వచ్చుచుండుట గమనించి "ఇది చంద్రుడు కాదు— రథమున వచ్చువాడు దేవపుత్రు డని తోచుచున్నది. మనోమయ సైంధవయుక్త మయినరథము ఎవరికై వచ్చు చున్నదో! మరెవ్వరికి కాదు, మన రాజుకొరకే కానోపును. మనరాజు ధార్మికుడు— ధర్మరాజు" అని వారు ప్రసన్నచిత్తములతో చేతులు జోడించి ఈ గాథ పఠికిరి :

> అద్భుతము రోమహర్షణ మైనవార్త
> వెలువడె విదేహ విఖ్యాతవిభునికొరకు
> దేవరాజ శక్రుడు పంపె దివ్యరథము.

మాతలి రథము కొనివచ్చెను. జనులు గంధమాల్యాదులు చేత గొని ఆయనను సత్కరించిరి. మాతలి నగరమునకు ముమ్మారు ప్రదక్షిణము చేసి రాజద్వారము చేరి అచట రథ మాపి వెనుకవైపు రహస్యద్వారముకడ వసారాలో నిలిచి రాజు రథ మెక్కుటకై యేర్పాటు చేసెను. ఆనాడు రాజు కూడ దానశాలను చూచువాడై ఈ విధముగా దానము చేయుడు అని ఆన తిచ్చి, ఉపోసథవ్రతము పూని రోజు గడపుచు అమాత్యపరివేష్టితుడై అలంకృతమహాసనముపై పూర్వద్వారమువైపు ముఖము పెట్టి కూరుచుండి ధర్మప్రసంగములు చేయుచుండెను. మాతలి ఆయన నాహ్వానించి రథ మెక్కించుకొని వెడలిపోయెను.

ఈ యభిప్రాయమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథలు పలికెను:

> దేవపుత్రుడు, బుద్ధిమంతుడు,
> దేవసారథి యైన మాతలి
> అరుగుదెంచి విదేహవిభుతో
> ననియె నీరీతిన్ :

ఓహో దిశాంపతి, ఓ రాజసింహా,
అరుగుదేరగదయ్యా! అరదంబు నెక్కి
ఎదురు చూచుచు నుందు రింద్రునితోడ
అఖిలదేవతలు, త్రయఃత్రింశ జనులు
నిండు సుధర్మలో నీ దర్శనేచ్ఛ !''

గుర్రాలు వేయింటి గూర్చినయట్టి
రథమునం దెక్కి యారాజముఖ్యుండు
చనె శీర దేవతాసన్నిధానంబు.

నరపతిరాక కానందించి వారు
"అరుదెంచినావు మహారాజ, మాదు
సన్నిధానమునకు : స్వాగతం బార్య !
ఇంక గూర్చుండుమీ యింద్రుసన్నిధిని.''

ఆలోకనము చేసి యామిధిలేశు
నానందమున శక్రు డర్ధాసనమున
గూరుచుండగ బిల్చి, కోర్కుల నెల్ల
తీర్చుకొమ్మని యాన తిచ్చినవాడు.

"వశవర్తు లగువారి వాసమ్మునకును
నీరాక మే లయ్యె! నిఖిలమ్ములైన
దేవలోకాలలో దివ్యసౌఖ్యముల
ననుభవించుచు పొందు మానందగరిమ !''

దేవరాజ శక్రుడు పదివేల యోజనముల దేవనగరము, రెండున్నర కోట్ల అప్సరసలను, అర్ధమైన జయంత ప్రాసాదమును నడుమగా విభజించి ఆతని కిచ్చెను. ఈ ప్రకారముగా ఆ సంపదల ననుభవించుచు మానవమాన ప్రకారము ఏడువందల సంవత్సరములు ఆతడు గడిపెను. మానవదేహముతో దేవలోకమున నున్నపుడు ఆతనిపుణ్యము క్షీణించెను, అరతి జనించెను. అంత నాతడు శక్రునితో సల్లాపము లాడుచు ఈ గాథ పలికెను :

83

ప్రప్రథమమునందు నేను
స్వర్గమ్మును జేరినపుడు
నృత్యగీతవాద్యమ్ముల
నిజముగ మోదంబు గంటి !

స్వర్గమున న్నేడు నాకు
స్వారస్యము కానరాదు.
క్షీణించినదా ఆయువు ?
చేరుచున్నదా మృత్యువు ?
అట్లు కానియెడల ఇంద్ర,
అయితిన మూఢాత్మకుండ ?

అంతట శక్రు డిట్లనెను :

కాలే దాయుక్షయమ్ము,
కలదు మృతియు దూరమందె.
కావు నీవు మూఢుండవు,
భోగంబున తరిగెను నీ
పుణ్యకర్మఫలం బిచట.

దేవతానుభావముతో
నీవు త్రయస్త్రింశ లోక
దివ్యభోగ పరంపరను
దిశాంపతీ, అనుభవించు !

బోధిసత్త్వుడు అంగీకరింపక ఇట్లనెను :

పరుల కుద్దిష్ట మైనట్టి బండివోలె
అన్యజనులకు దలపెట్టి నట్టిధనము
సరణి, నొరులకు దాన మొసంగుదాని
చందమున దోచుచున్న దిచ్చటిది నాకు !

ఒరులు దానస్వరూపాన నొసగునట్టి
దేదియును నాకు వలదు; నిజేచ్ఛనల్పు
నట్టి పుణ్యపరంపర యగును ధనము.

ఇందులకె మర్త్యలోకాని కేగువాడ,
నిండుగా పుణ్యకర్మలు నెరపువాడ,
సౌఖ్య మొందుచు ననుతాపరణి జనక
సంయమముతోడ యత్నముల్ సలుపువాడ.

ఆయన వాక్కులు విని శక్రుడు మాతలితో "నీవు సాధీనరాజును మిథిలా నగరమునకు గొనిపోయి ఉద్యానవనమున దింపుము" అని ఆనతి యీయగా, ఆత డటులే చేసెను.

రాజు ఉద్యానమున పచారు చేయుచుండగా తోటమాలి చూచి నారదరాజున కీవార్త తెలిపెను. ఆతడు మాలితో "నీవు ముందుగా పోయి మా కుభయులకును ఆసనములు రెండు పరపుము" అనగా వా డట్లే చేసెను. రాజు చూచి "యెవరికోసము రెండాసనములు పరచినావు" అనెను.

"ఒకటి తమకొరకు, ఒకటి రాజుకొరకు."

"నా ప్రక్కన ఆసనముపై కూరుచుండ గల రెండవ్యక్తి యెవరు ?" అని రాజు ఒకదానిపై కూరుచుండి, రెండవదానిపై పాదములు పెట్టెను. నారదరాజు వచ్చి ఆయన చరణములకు ప్రణామము చేసి ఒకప్రక్క నిలిచెను. అతడు ఏడుతరములలో ఆయన బంధువుగా నుండి ఇప్పటి కేడువందల సంవత్సరముల వా డయ్యెను. తన పుణ్యప్రభావముచే ఇంతకాలము గడపెను. రాజు నారదుని చేయి పట్టుకొని ఉద్యానమున విహరించుచు ఈ గాథలు పలికెను :

ఇవ్వి యాశేత్రంబు, లివ్విగోళాకార
జలనాళికలు, రెంచు చక్కులం బచ్చ నౌ
పొలములున్, బ్రవహించు సలిలవాహిను లివ్వి.

చక్రవాకములు పుష్కరిణుల మీద
మధురమ్ముగా కూయు, మందాలకములు
పద్మమ్ము లిందు సంభవ మొందుచుండు,
ఆప్రియవస్తువు లన్ని యేమాయె ?

ఇవ్వి యా క్షేత్రంబు, లివ్వి యాభూము,
లస్మదీయ మనోహరారామములును,
మామకీన విహారసీమలు నివియు.
అయినను నారదా, ఆనాజనంబు
లో నొక్కడుంగూడ కానరాకుండ
శూన్యంబుగా దోచుచున్నవి దిశలు !

అప్పుడు నారదు డిట్లనెను : "దేవా, తాము దేవలోకమునకు జని యేడువందల సంవత్సరములు గడచినవి. నేను ఏడవతరము బంధువును. తమ సేవకు లెల్లరు మృతి నొందిరి. ఇది తమరాజ్యము. దీని ననుభవింపుడు."

రాజు "నాయనా, నారదా, రాజ్యపరిపాలనమునకై నే నిచటికి రాలేదు. పుణ్యకార్యములు చేయుటకై వచ్చినాను. అట్టి కార్యములే చేయుదును" అని ఈ గాథలు పలికెను :

కాంచినాను నల్వంకల
కాంతు లీనువిమానముల
సమ్ముఖమున దేవేంద్రుని
సకలదేవతలను గంటి.

నా కొదవెను త్రయఃత్రింశ
లోకంబున దివ్యభవన
నివాసంబుతోడ దివ్య
నిఖిలభోగానుభవము.

చనుదెంచితి నిటకు నేను
సత్కార్యము లొనరింపగ

ఇంక నాకు వలదు రాజ్య,
మిచట ధర్మ మనుష్ఠింతు.

సర్వబుద్ధు లరిగినట్టి
సమ్యక్ సంబుద్ధుం డుప
దేశించిన- అష్టాంగ-
స్థిరమార్గం బనుసరింతు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు సర్వజ్ఞజ్ఞానముచే ఈ గాథలను సంక్షేపించి పలికెను. నారదుడు మరల "దేవా, రాజ్యపాలనము చేయుడు" అని విన్నవించెను. "నాయనా, నాకు రాజ్యముతో పని లేదు. ఎడువందల సంవత్సరములలో పూర్తి చేయదగిన దానధర్మములు ఏడు రోజులలో ముగించెదను" అని రాజు పలుక నారదరాజు సమ్మతించి ఆయన కోరినట్లు మహాదానములు చేయించెను. ఏడవనాడు రాజు దేహము చాలించి త్రయస్త్రింశభవనమున జన్మించెను.

శాస్త ఈ ధర్మోపదేశనము కావించి, ఈ విధముగా ఉపోసథవ్రత మాచరించుట యుక్తము అని నిర్దేశించి సత్యప్రకటనము చేసి జాతకములు సరిపోల్చెను. సత్యక్రియానంతరము ఉపాసకులలో కొందరు స్రోతాపన్నులు; కొందరు సకృదాగాములు నైరి. ఆ కాలమున నారదరాజు ఆనందుడు; శక్రుడు అనురుద్ధుడు; సాధీనరాజు నేనే.

--(౦)--

# 495. దస బ్రాహ్మణ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు అసదృశదానమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఈ కథ యెనిమిదవ నిపాతములోని సుచిర జాతకమున సవిస్తరముగా వచ్చినది. రాజు దానమిచ్చుచు శాస్త్ర ప్రముఖముగా ఐదువందల మంది భిక్షువులను ఎన్నుకొని, మహాక్షీణాసవులకే దానము చేసెను. ఆయన గుణములను గూర్చి ధర్మసభలో భిక్షువులు చర్చ చేయుచు "ఆయుష్మంతులారా, రాజు అశదృశదాన మిచ్చువాడై తగినవారి నెన్నుకొని, మహాఫల ప్రాప్తికే స్థాన మిచ్చెను" అనుచుండిరి. శాస్త్ర అచటికి జని విషయ మడిగి తెలిసికొని "భిక్షువులారా, ఇందాశ్చర్య మేమియు లేదు. కోసల నరేశుడు నాకు తుల్యుడగు బుద్ధుని సేవించి వివేకముతో దాన మిచ్చుచున్నాడు. పురాణ పండితులు బుద్ధుడు లేకున్నను వివేకపూర్వకమైన దానము లిచ్చినారు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున కురురాష్ట్రము నందలి ఇంద్రప్రస్థ నగరమున యుధిష్ఠిర గోత్రములోని కురురాజు రాజ్యము చేయుచుండెను. అతనికి విధురుడను పేరుగల అమాత్యుడు ధర్మార్థములలో అనుశాసనము చేయుచుండెను. సమస్త జంబూద్వీపమున కోలాహలము పుట్టునట్లు రాజు దానధర్మములు చేయుచుండెను. ఆ దానములు పొందువారిలో పంచశీలములను రక్షించువారలు లేకపోవగా దుశ్శీలురే యుండిరి. తాను చేయు దాన ధర్మముల వలన రాజుకు సంతుష్టి కలుగలేదు. రాజు యోచించి సదాచారపరులకే దాన మీయదలచి ఆలోచనచేసి విధురపండితునితో సంప్రదింప నెంచెను.

అమాత్యుడు తనను జూడవచ్చినప్పుడు రాజు అతనిని పీఠముపై కూరుచుండ బెట్టి ప్రశ్నించెను. ఈ విషయమును ప్రకటీకరించుటకై శాస్త అర్ధగాధ పలికెను. ఇక రాజు, విధురుడు జరిపిన ప్రశ్నోత్తరములు :

ధర్మకామి యుధిష్ఠిర ధరణిపుండు
విధురునిం గాంచి యిట్లనె: "వెదకు శీల
వంతులను, బహుశ్రుతులను, బ్రాహ్మణులను.

మిధున కృత్యములను విరమించువారి
కేను భోజన దక్షిణ లిచ్చువాఁడ,
అట్టి దక్షిణ ఫలవంత మగును కాదె !"

"అట్టివారు లభించుట అరుదు దేవ !
బ్రాహ్మణుల యందు కనవచ్చు పది తెరగులు,
విస్తరంబుగ దెలిపెద వినుడు దేవ !

నిండుగా మూలమూలికల్ నింపి సంచి
మందు పొట్లము లిత్తురు మానవులకు.
స్నానము లొనర్చి జపములు సలుపుచుంద్రు
వైద్య తుల్యులు నిజముగా వారు దేవ !
అట్టివారలు బ్రాహ్మణు లనబడుదురు.
వర్తమానము చేసితి వారి గూర్చి,
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

"వారు బ్రాహ్మణ్యదూరు, లవ్వారి విప్రు
లనము విధుర, మహాయోగ్యులైనవారి
బిలువు, మిచ్చెద దక్షిణ ప్రీతితోడ"

ముందరికి చిరుగంటల మ్రోతతోడ
నరుగుచుందురు సందేశ హారులగుచు,

అరదముల దోలగా నేర్తు; రట్టివారు
సేవక సమాను లగుదురు దేవ ! కాని

అట్టివారలు బ్రాహ్మణు లనబడుదురు.
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

వారు బ్రాహ్మణ్యదూరు, లవ్వారి విప్రు
లనము విధుర ...."

"కొందరు కమండలములను, కొంకి కర్ర
లను గ్రహించుచు ప్రభుసేవ లాచరింత్రు
పల్లె గ్రామాల; బాసెన పట్టు వేసి
పణము లిచ్చిననే లేతు మనెడివారు-
అరయ వారు కరగ్రాహు లట్టివారు
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

"వారు బ్రాహ్మణ్యదూరు, లవ్వారి విప్రు
లనము విధుర ! ........"

"నఖములన్ కేశముల బెంచి, నల్ల కప్పు
నేసి దంతములకు, ధూళి బూసికొనుచు
దేహమున, నెత్తిమీసను, తిరుగుచుంద్రు
ముష్టి యెత్తుచు కొందరు : మోడులు గద !
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

"వారు బ్రాహ్మణదూరు, లవ్వారి విప్రు
లనము విధుర ! ........ "

"రకరకము లైన యడవి కర్రలును, చెరకు,
తేనె మొదలగు వస్తువుల్ తెచ్చి, చాల
హెచ్చు చౌకలుగా విక్రయించుచుంద్రు :
వారు దేవ, వణిక్కుల వంటివారు.
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

"వారు బ్రాహ్మణ్యదూరు, లవ్వారి విప్రు
లనము విధుర ! ........ "

"కావించుచున్ వర్తకమ్మును, కృషియు.
పోషణ జేయుచు మేషాలికముల.
ధనికుల కొసగుచు తమ పుత్రికలను
పెండ్లి పేరంటాలు ప్రీతి జేయింత్రు :
సంసారులకు దేవ, సదృశులు వారు
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ "

"వారు బ్రాహ్మణ్యదూరు లవ్వారివిప్రు
లనము విధుర ! ........ "

"తింద్రు పురోహితుల్ తినరానివాని
కొందరు గ్రామమ్ములందున దేవ !
వారి జేరుచు తిధి వార నక్షత్ర
ఫలములు పృచ్ఛింత్రు పశుఘాతి జనము.
లవ్వారితో సములా బ్రాహ్మణులును.
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

"వారు బ్రాహ్మణ్య దూరు ........"

"ఖడ్గముల్ డాలులు గ్రహియించివారు
గహన మార్గంబులకడ నిల్చియుండి,
యాత్రికులంజేర్చి యావలివైపు
సమకూర్తు్రి ధనము; నిషాదులతోడ
యాదవ జనముతో నవ్వారు సములు
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !"

"వారు బ్రాహ్మణ్య దూరు ........ "

"వని కుటీరాలు నిర్మించి, వలులు పన్ని,
బల్లు, లుడుములు, కుందేళ్ళు పట్టుకొంద్రు
సలిలముల, తాబేళ్ళ, మత్స్యముల గూడ-

వారు లుబ్ధ సంకాశులు వాస్తవముగ,
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !''

''వారు బ్రాహ్మణ్య దూరు ...... ''

''బ్రాహ్మణులు కొంద రర్థ లోభమ్ముచేత
ఎత్తు మంచెలక్రింద వర్తించుచుంద్రు.
సోమ యజ్ఞావసరమున భూమిపతులు
స్నానములు చేయుచుందురు వానిపైన
మంచెలకు క్రిందనున్న బ్రాహ్మణులుదేవ,
మైల తానాలు చేసిన మనుజులె కద ?
అరుగుదున తన్నిమంత్రణ కొరకు దేవ !''

''వారు బ్రాహ్మణ్య దూరు ...... ''

విధురపండితుడు సద్బ్రాహ్మణుల విషయము ప్రకాశింప జేయువాడై యీ గాథలు పలికెను :

''మిధున కార్యంబులను విరమించు శీల
వంతులు, బహుశ్రుతులు నగు బ్రాహ్మణోత్త
ములు, కలరు, వారు మద్యము ముట్టుకొనరు
ఏక భుక్తము చేయుదు రిట్టివారి
వార్త గనుగొన బంపితి; వారి నిపుడు
దేవ, పోవుదునా నిమంత్రించు కొరకు ?''

రాజు ఆతని వాక్కులు విని ''మిత్రమా, విధురా ! ఇట్టి బ్రాహ్మణోత్తములు అగ్రదక్షిణ పొందదగినవారు. ఎచ్చట నుందురు ? అనెను.

''మహారాజా, ఉత్తర హిమాలయమున నందమూల పర్వతముపై నున్నారు.''

"అట్లయినచో పండితోత్తమా, నీ సామర్థ్యముతో నా కొరకు బ్రాహ్మణుల నన్వేషింపుము," అని రాజు ప్రసన్నచిత్తుడై ఈ గాథ పలికెను :

విధుర, నీవు నిమంత్రింప వేగము చని
బ్రాహ్మణోత్తములం గొని రావలయును.

బోధిసత్త్వుడు మంచిదని అంగీకరించి "మహారాజా, నగరమంతయు అలంకరింపజేసి నగరవాసులెల్లరు దానములిచ్చి, ఉపోసథవ్రత మవలంబించి శీలగ్రహణము గావింపవలయును" అని చాటబంపుడు. "తాముకూడ పరిజనముతో పాటు ఉపోసథవ్రతధారులు కండు," అని విన్నవించి స్వయముగా ఉషఃకాలముననే భోజనపానీయములు ముగించి ఉపోసథవ్రతము పూని చమేలీ పుష్పముల గంప తెప్పించి ఐదంగముల భూమిపై ప్రతిష్ఠించి నమస్కారము చేసెను. రాజుకూడా అట్లే చేసెను. ఆవల విధురుడు ప్రత్యేకబుద్ధుల గుణానుస్మరణము చేసి ప్రణామము కావించి యెనిమిది గుప్పెళ్ళ పూలు ఆకసమున చల్లి "ఉత్తర హిమాలయమున నందమూలక పర్వతమున నివసించు ఐదువందల ప్రత్యేకబుద్ధులు రేపు మా నిమంత్రణమును గ్రహింతురుగాక !" అని పలికెను. ఆ సమయమున పర్వతమున సరిగా ఐదువందల మంది ప్రత్యేకబుద్ధు లుండిరి. ఆకసమున చల్లిన ఈ పుష్పములు పోయి వారిపై బడినవి. వారు ధ్యానబలమున నిమంత్రణము సంగతి గ్రహించి "మిత్రులారా, మనలను విధురపండితుడు నిమంత్రించినాడు. ఈతడు సామాన్యప్రాణి కాదు. బుద్ధాంకురుడు, యీ కల్పముననే యితడు బుద్ధుడగును. మన మంగీకరింతము" అని స్వీకరించిరి. పుష్పములు తిరిగి రాకుండుటచే నిమంత్రణము అంగీకృత మయ్యెనని బోధిసత్త్వుడు గ్రహించి "మహారాజా, రేపు ప్రత్యేకబుద్ధులు దయచేయుదురు, సత్కార సామగ్రులు సంసిద్ధము చేయుదురుగాక" అని చెప్పెను. మరునాడు సమ్మానమేర్పాటు చేసి, రాజు ఉన్నతస్థానమున అమూల్యాసనములు నిలిపించెను. ప్రత్యేక బుద్ధులు అనోతప్తసరోవరమున స్నానాదులు ముగించి సమయమగుట గ్రహించి ఆకాశమార్గమున నరుదెంచి రాజాంగణమున దిగిరి. రాజు, బోధిసత్త్వుడు ప్రసనచిత్తములతో వారి చేతులనుండి భిక్షాపాత్రలు గ్రహించి

ప్రాసాదమునకు గొనిపోయి కూరుచుండబెట్టి హస్తోదకమిచ్చి ఉత్తమ భోజనము వడ్డించిరి. ఇట్లే యేడురోజులు మహాదానములిచ్చి సర్వ పరిష్కారములు కావించిరి. వారు దానానుమోదనము చేసి ఆకాశమార్గమున యథాస్థానమునకు పోయిరి. పరిష్కారములు కూడ వారివెంటనే వెడలినవి.

శాస్త ఈ ధర్మోపదేశనముచేసి "భిక్షువులారా, ఇందాశ్చర్య మేమియును లేదు. నన్ను సేవించు కోసలనరేశుడు వివేకపూర్ణము లగు దానము లిచ్చినాడు. పూర్వము బుద్ధుడు జన్మింపకముందు పురాణ పండితులు ఇట్టి దానము లిచ్చినారు," అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున రాజు ఆనందుడు; విధురపండితుడు నేనే.

———:():———

# 496. భిక్షా పరంపరా జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు ఒకానొక గృహస్థుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతడు శ్రద్ధావంతుడు, భక్తుడు. తథాగతునకు సంఘమునకు నియమ ప్రకారము విశేషముగా ఆతిథ్య మిచ్చుచుండెను. ఒకనాడతడు తనలో "బుద్ధరత్న సంఘరత్నములకు ప్రతిదినము యుక్తభోజనము, హెచ్చుగా వస్త్రములును ఇచ్చి భూరి సత్కారము చేయుచున్నాను. ఇక ధర్మరత్న మునకు సత్కారము చేయుదును. ధర్మరత్నమునకు సత్కారము చేయువా డేమి చేయవలెను" అనుకొని సుగంధద్రవ్యములు, మాల్యములు కైకొని జేతవనమునకు జని తథాగతునకు ప్రణామముచేసి "భన్తే, నేను ధర్మరత్న సత్కారము చేయగోరుచున్నాను. ధర్మరత్న సత్కారము చేయువాడు ఏమి చేయవలెను?" అని యడిగెను. "ధర్మరత్న సత్కారము చేయగోరు వాడు ధర్మ భాండారియగు ఆనందుని సత్కరింపవలెను." అని శాస్త్ర చెప్పగా ఆతడు చిత్తమని, స్థవిరుని నిమంత్రించి మరునాడు భూరి సత్కార మునకు తన యింటికి గొనిపోయెను. బహు మూల్యముగల ఆసనముపై కూరుచుండబెట్టి సుగంధము, మాల్యాదులు నొసగి పూజించి వివిధ ప్రకార ముల రుచ్య భోజనము పెట్టెను. బహుమూల్యముగల మూడు చీవరముల నిచ్చెను స్థవిరుడు తనలో "ఈ సత్కారము ధర్మరత్నముకొరకు చేసినది, ఇది నాకొరకు కాదు. ఇది అగ్రస్థానీయుడైన ధర్మసేనాపతి సారిపుత్రున కీయదగినది." అనుకొని భిక్షయు, వస్త్రములును విహారమునకు గొనిపోయి సారిపుత్రున కొసగెను. ఆయన కూడ తనలో "ఇది నిశ్చయముగా ధర్మ రత్నముకొరకే. కావున ధర్మస్వామియగు సమ్యక్ సంబుద్ధునకే యోగ్యము" అనుకొని దానిని బుద్ధునకొసగెను. తనకన్న అధికుడు లేకుండుటచే శాస్త్ర భిక్షను, చీవరములను స్వీకరించెను. భిక్షువులు ధర్మసభలో సమావిష్టులై ఈ

విషయము చర్చించుచుండగా అచ్చటికి శాస్తి చని విషయమడిగి తెలిసికొని "భిక్షువులారా. ఇప్పుడే కాదు, పూర్వముకూడ సత్కారము క్రమముగ యోగ్యులకడకు నడచినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు నాలుగు అగతులలో పడక, దశరాజధర్మములకు విరుద్ధముగా జనక, న్యాయానుసారముగా రాజ్య పాలన చేయుచుండెను. ఇట్లున్నను ఆతని న్యాయశాల ఇంచుమించు శూన్య ముగా నుండెను. అంతట రాజు తన దుర్గుణములను వెదకుటకై బయలు వెడలెను. ఆయన తన ప్రాసాదము, నగరము, గ్రామము, మొదలగు ప్రదేశములలో తన దుర్గుణములను గూర్చి పలికెడివారు దొరకకపోవుటచే జన పదములలో అట్టివారిని వెదకుటకై రాజ్యపాలనము అమాత్యుల కప్పగించి వేషము మార్చి పురోహితుని వెంటబెట్టుకొని బయలుదేరెను. కాశీ రాష్ట్రి మంతట తిరిగినను దుర్గుణఘోష చేయువాడు లభింపక, రాజు సరిహద్దు దేశములోని ఒకానొక నిగమము చేరి గ్రామద్వారము వెలుపలి శాలలో చుండెను. సరిగా ఆ వేళకు అచ్చటి బ్రాహ్మణ గృహస్థు- ఎనుబదికోట్ల కధి కారి-సన్నాహముతో స్నానార్థము చనుచుండెను. అప్పుడు సువర్ణవర్ణము కలిగిన సుకుమారదేహుడగు రాజు కానబడగా బ్రాహ్మణుని హృదయమున స్నేహ ముదయించెను. ఆతడు లోనికి జని రాజు నక్కడనే యుండుమని చెప్పి, ఇంటికి జని వివిధరుచ్య పదార్థములు వంటచేయ నాజ్ఞాపించి వైభవ ముతో భోజనపాత్రలను తెప్పించెను. ఆ సమయమున హిమాలయ నివా సులు ప్రాప్త పంచాభిజ్ఞులు నగు తాపసులు 500 ల మంది వచ్చి కూరు చుండిరి. నందమూలక పర్వతమునుండి ప్రత్యేకబుద్ధులుకూడ వచ్చియుండిరి. గృహస్థు రాజుచేతులు కడిగించి వివిధభోజనపదార్థములును, సూపవ్యంజనము లతోనిండిన పాత్రలును తెప్పించి రాజునకొసగెను. రాజు స్వీకరించి పురోహిత బ్రాహ్మణునకిచ్చెను బ్రాహ్మణుడు తాపసునకిచ్చెను. తపస్వి ప్రత్యేకబుద్ధుని కడకుజని కుడిచేత కమండలువుపట్టుకొని హస్తోదకమిచ్చి భిక్షాపాత్ర లొసగెను. అతడెవ్వరిని నిమంత్రింపక, ప్రశ్నింపక, భోజనము చేసెను. అతని భోజనానంత రము గృహస్థు తనలో "నేను రాజుకిచ్చితిని; రాజు బ్రాహ్మణున కిచ్చినాడు;

బ్రాహ్మణుడు తాపసికిని, తపస్వి ప్రత్యేక బుద్ధునకును ఇచ్చినారు. ప్రత్యేక బుద్ధుడు యెవ్వరి నడుగకుండ భుజించినాడు. వీరందరికన్న ఈయనకే ముట్టుటకు కారణమేమి? ఈయన యెవ్వరిని ప్రశ్నింపక భుజించుటకు హేతువేమి? క్రమముగా నడిగి తెలుసుకొందును'' అనుకొని, గృహస్థు ఒక్కొక్కరి కడకుపోయి ప్రణామముచేసి అడిగెను. వారు ఇట్లు ప్రత్యుత్తరము లిచ్చిరి :

''నీవు సుకుమారమూర్తివి, నిజనగరము
విడిచి యరుదెంచినాడవు విజనమునకు
కూరుచుండెడి వాడవు గొప్ప సౌధ
మందమూల్యమహాశయనాసనమున
ప్రీతి నీ యెడ గల్గుట చేత నీకు
ఉత్తమంబైన భోజన మొసగినాను.
శుద్ధ శాల్యన్నమది, పరిశుద్ధమాంస
కలిత మద్దాని భుజియింపక యొసగితివి
నీవు విప్రున, కెట్టిది నీదు ధర్మ
సరణి వివరింపవలె, నమస్కారమయ్య!''

''ఇతడు సద్బ్రాహ్మణుడు, మదీయ గురువు
మంచి చెడ్డలు తెలిపెడి మాన్యమూర్తి,
యోగ్యుడితడు, నిమంత్రణ కుచిత మగును
ఇతని కాహారపాత్రిక నిచ్చునెడల.''

''అడిగెదను రాజపూజితుడైనవాని
బ్రాహ్మణుని గోతముని, నీకు ప్రభువొసంగు
నుత్తమాహారమును ఋషి కొసగినావు
దాన పాత్రత నెరుగని ధర్మమార్గ
శైలి యెట్టిదియో నమస్కారమార్య!''

''పోషణము చేయుదును దారపుత్రకులను,
కలదు గార్హస్థ్యమున నాకు కాంక్ష, మనుజ

భోగములతోడ, శాసింతు భూమిపాలు,
వృద్ధు, డారణ్యకుండైన యీ తపస్వి
కొసగు పత్రాన నాహార, ముత్తమంబు,"

"చిక్కి యెముకలగూడయి, శిరము మీద
వెండ్రుకలు, వ్రేళ్ళ నఖములు పెరిగిపోయి,
దంతములు నల్లబడి, ధూళి దట్టముగను
శిరసుపైనున్న ఋషిని ప్రశ్నించువాడ !
కాననంబున నొంటిగా గడపు నీకు
జీవనాపేక్ష లేదొకో ? నీ వెవనికి
పెట్టితివొ భోజనంబు, తద్భిక్షు వెట్లు
శ్రేష్ఠతరు డయ్యె నీకన్న, చెప్పు మార్య, !"

"చామలన్, నివ్వరిన్, బిసశాకములను.
ఆరగింతును మధుమాంస మాదిగాగ.
సర్వము పరిగ్రహింతును, సంచనయనము
పాకము; నకించనులకు నపాలకులకును
నప్రతి గ్రహీతలకును నాదు భోజ
నమ్ము నొసగుట మిగుల యుక్తమ్ము సుమ్ము !"

"సువ్రతుడు మౌని యైన భిక్షువును ప్రశ్న
చేయువాడ నియ్యెడను: ఋషిప్రదత్త
భుక్తి గ్రహించి, మౌనమ్ము బూని తిందు
నొంటిగా పిల్వకుండనే యొరుల, నీకు
నలుపుదు నమస్సు, నీ ధర్మసరణి దెలుప !"

"ఏను వండ, పాకమ్ము చేయింప, తరగ,
తరగనీయ నకించన ధర్మపరుడ
నని యెరింగిన ఋషి వామహస్తమునను
పాత్రికన్, కుడిచేత పవిత్రమైన
సత్కమండులువు గొని యొసంగినారు

సంగ్రహ పరిగ్రహమ్ముల శక్తి యుండ,
నాకు నద్దాని నిచ్చుట న్యాయమె యగు-
అన్నదాతను పాల్గొను మనుట తగదు."

ఆయన వాక్కులు విని, గృహస్థు ప్రసన్నచిత్తుడై యీ గాథలు పలికెను :

ఇటకు చనుదెంచినారు మదీయ శుభము
కొరకు భూపుడితఃపూర్వ మెరుగ నేను
ఎచట దానము చేసిన హెచ్చుఫలమొ.

రాజునకు నుండు నాసక్తి రాష్ట్రిముపయి,
మంచి చెడ్డల యెడల బ్రాహ్మణుల దృష్టి,
కందమూల ఫలాలపై కాంక్ష ఋషికి,
భిక్షువగువాని కెదాన ప్రీతి లేదు.

ప్రత్యేకబుద్ధు డాతని కుపదేశమిచ్చి, నిజ నివాసస్థానమున కరిగెను. రాజుమాత్రము కొలదికాల మాయనకడనే యుండి, యావల వారాణసి కేగెను.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, యిప్పుడేకాదు, పూర్వముకూడ నతడు క్రమముగా యోగ్యస్థానము జేరెను" అని చెప్పి, జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున ధర్మరత్న సత్కారముచేసిన గృహస్థు ఇప్పటిగృహస్థే. రాజు ఆనందుడు; పురోహితుడు సారిపుత్రుడు; హిమాలయతపస్వి నేనే.

———:():———

# 497. మాతంగ జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయునపుడు ఉదయనవంశ రాజులనుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున ఆయుష్మాన్ పిండోలభారద్వాజుడు జేతవనము నుండి ఆకాశమార్గమున తరచుగా కోశాంబీనగరములోని ఉదయన నరేశుని ఉద్యానమున పగటివేళ గడపుటకై పోవుచుండును పూర్వజన్మమున స్థవిరుడు రాజ్యము చేయుచు బహుకాలము ఆ యుద్యానముననే భోగము లనుభవించుచుండెను. పూర్వజన్మ పరిచయముచే ఉద్యానమున పగలు గడపుటకై ఫలసమాపత్తి సుఖమున ఆతడు సపరివారముగా కాలక్షేపము చేయుచుండును. ఒకనా డాతడు పూచిన సాలవృక్షముక్రింద కూరుచున్నప్పుడు ఉదయన నరేశుడు సప్తాహకాలము పానగోష్ఠిలో గడిపి ఉద్యానమున క్రీడించుటకై విశేషపరివారముతో అచటికి జేరి మంగళశిలాఫలకముపై ఒకానొకతె యొడిలో దొరలుచు మద్యపుమత్తుచే నిద్రించెను. సమీపమున కూరుచుండి పాటలు పాడుచున్న స్త్రీలు వాద్యములు విడిచి ఆరామము లోనికి పోయి పుష్పములు ఫలములు సంగ్రహింపజొచ్చిరి. అంతలో స్థవిరుడు కానబడగా వారాయనకడకు పోయి ప్రణామము చేసి ఒకప్రక్క కూరుచుండిరి. స్థవిరుడు ధర్మకథ చెప్పుచుండెను. తనయొడిలో తల పెట్టుకొని రాజు నిద్రించుచున్న సంగతి మరచి ఆ స్త్రీ కదలుటచే మెలకువ వచ్చి రాజు లేచి "దౌర్భాగ్యురాండ్రు ఎచటికి పోయినారు?" అనెను. "ఒకానొక శ్రమణునిచుట్టును జేరినారు" అని ఆమె పలుకగా, రాజు కోపముతో లేచి పోయి స్థవిరునితో ఇచ్చవచ్చినట్లు మాటలాడి, "మంచిది, శ్రమణుని యొడలినిండ ఎఱ్ఱచీమలు పట్టించెదను" అని ఎఱ్ఱచీమలను దొన్నెలనిండ నింపించి ఆతని శరీరముపై కెక్కించెను.

స్థవిరుడు ఆకాశమున కెగసి నిలిచి రాజున కుపదేశ మిచ్చి జేతవనము లోని గంధకుటీద్వారముకడ దిగెను. తథాగతుడు చూచి యెచటినుండి

వచ్చుచున్నావు అని అడుగగా స్థవిరుడు వృత్తాంతము వివరించెను. "భార ద్వాజా, ఉదయను డిప్పుడే కాదు, పూర్వముకూడ ప్రవ్రజితులకు శ్రమ ఇచ్చుచుండెను" అని, శాస్త అతని ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు సమయమున బోధిసత్త్వుడు నగరమువెలుపలి చండాలకులమున నుద్భ వించెను. అతనికి మాతంగు డని పేరు పెట్టిరి. పెరిగి పెద్దవాడైన పిదప అతడు మాతంగపండితు డని ప్రసిద్ధి చెందెను.

ఆ కాలమున వారాణసీ శ్రేష్ఠి పుత్రిక శకునములను పాటించునది. ఒకనా డామె విశేషపరివారముతో ఉద్యానమునకు పోయి క్రీడించు చుండెను. బోధిసత్త్వ డానా డేదోపనిమీద నగరములోనికి పోవుచుండగా నగరద్వారములోపల దిట్ఠమాంగలికకు కానబడెను. అత డొక ప్రక్కకు పోయి నిలిచెను. ఆమె ముసుగులోనుండి చూచి "ఇత డెవడు?" అనెను. "అమ్మా, చండాలుడు."

"చూడ దగనిదృశ్యము కానబడుచున్నది" అని ఆమె సుగంధజల ముతో నేత్రములు తుడుచుకొని మరలిపోయెను. ఆమెవెంట వచ్చుపరి జనులు కోపముతో "ఒరి దుష్టచండాలా, నీ మూలమున నేడు ఊరకే మాకు లభించుమద్యము, ఆహారము లేకుండపోయినవి" అని మాతంగపండి తుని కాలుసేతులతో తన్ని, కొట్టి స్మృతి కోలుపోవునట్లు చేసిరి. కొలది సేపటిలో తెలివి వచ్చి ఆయన "దిట్ఠమాంగలికపరిజనులు నిర్దోషి నైననన్ను నిష్కారణముగా కొట్టినారు. ఆమె ఇప్పు డిచటికి వచ్చినచో లేచెదను; రానిచో లేవను" అనుకొని దృఢనిశ్చయము చేసికొని అత డామె తండ్రి నివాసమునకు జని ద్వారముకడ పడియుండెను. ఆమెతండ్రి చూచి "యేల పడియున్నావు?" అని అతని నడిగెను.

"మరేకారణము లేదు. నాకు దిట్ఠమాంగలికతో పనియున్నది." ఒకరోజు గడచినది; రెండు, మూడు, నాలుగు, ఐదు, తుదకు ఆరవరోజు

కూడ గడచినది. బోధిసత్త్వుల సంకల్పము నెరవేరితీరును. కావున నేడవ నాడు ఆమె ఈవలకు వచ్చి ఆయనకు కానబడి "స్వామీ, లెండు. తమ యింటికి దయచేయుడు" అని పలికెను

"భద్రే, నీ పరిజనులు నన్ను బాగుగా కొట్టినారు. బలము పోయినది. నన్ను లేవనెత్తి వీపున వేసికొని చనుము" అని బోధిసత్త్వుడు పలికెను. ఆమె అటులే చేసి, నగరవాసుల సమక్షమున నగరము వెలువడి చండాల గ్రామము చేరెను. బోధిసత్త్వుడు జాతిభేదమర్యాదలను అక్షుణ్ణముగా నిర్వహించుచు కొలదిదినములు లామెను తనయింట నిలిపి తనలో "నేను ప్రవ్రజించి ఈమెకు లాభము యశము సమకూర్పగలను. వేరొకయుపాయము లేదు" అనుకొని ఆమెను పిలిచి "భద్రే, నేను అడవినుండి యేమైనను తీసికొని రాకున్నచో మనకు గడవదు. నేను వచ్చువరకు భయపడవలదు. నేను అడవికి బోవుదును" అని యింటిలోని వారితో ఆమెను కనిపెట్టియుండు డని చెప్పి అడవికి బోయి శ్రమణప్రవ్రజ్య గ్రహించి అప్రమత్తుడై యేడవనాడు అష్ట సమాపత్తులను, పంచ-అభిజ్ఞలను పొంది "ఇక మాంగలికకు తోడ్పడగలను" అని తలచి బుద్ధిబలముచే చని చండాలగ్రామ ద్వారమున దిగి ఆమెవాకిట నిలువబడెను ఆతడు వచ్చినవార్త విని ఆమె వెలుపలికి వచ్చి యేడ్చి మొత్తుకొనుచు "స్వామీ, నన్ను అనాధను చేసి ప్రవ్రజించితిరా?" అనెను.

"భద్రే, చింతింపకుము. నీ పూర్వసంపదకన్న అధికసంపద కలుగునట్లు చేసెదను. కాని నీవు పరిషన్మధ్యమున నా భర్త మాతంగుడు కాడు, మహా బ్రహ్మ అని చెప్పగలవా?" అనెను.

"స్వామీ, చిత్తము, చెప్పగలను."

"ఇప్పుడెవ రైనను నీ స్వామి యెచటనున్నాడని అడిగినచో బ్రహ్మ లోకమునకు వెళ్ళినా డని చెప్పవలయును. ఎప్పుడు వచ్చును అని యడిగినచో నేటి కేడవనాడు పున్నమిచంద్రుని భేదించుకొని వచ్చును అని చెప్పవలెను." ఆమె కిట్లు చెప్పి ఆతడు హిమాలయమునకు జనెను. మంగళిక వారాణసిలో పరిషన్మధ్యమున స్వామి చెప్పినట్లే చెప్పెను. లోకులు విశ్వసించి "ఆయన మహాబ్రహ్మ, ఇందుచేతనే మాంగలికకడకు పోవడు. ఇది

ఇట్లే'' అనిరి. బోధిసత్త్వుడు పున్నమినాడు చంద్రుడు ఆకాశమధ్యమున నున్నపుడు బ్రహ్మరూపము ధరించి కాశీరాష్ట్రమెల్లెడను వెలుపల పండ్రెండు యోజనముల వరకును ఒక్క వెలుగు వెలిగి చంద్రబింబమును భేదించుకొని దిగి వారాణసిపై ముమ్మారు ప్రదక్షిణము చేసెను. లోకులు తనను గంధ మాల్యాదులతో పూజించిన పిదప చండాలగ్రామమువైపున కరిగెను. బ్రహ్మ భక్తులు గుమిగూడి ఆ గ్రామము చేరిరి. మాంగలికగృహము శుద్ధవస్త్రము ఖతో కప్పబడెను. చతుర్విధ సుగంధద్రవ్యములతో నేల అలికిరి. పుష్పములు చల్లియున్నవి. నెగళ్ళు వేసిరి. వస్త్రములతో చాందినీ కట్టి, క్రింద మహా శయనము పరచిరి. సుగంధతైలములతో దీపములు వెలిగించి వెండివలె తళ తళలాడు నిసుక ద్వారముకడ చల్లిరి. పుష్పమాలికలు వేసి జండాలు కట్టిరి. ఇట్లలంకృత మయిన గృహమున బోధిసత్త్వుడు దిగి లోనికి పోయి కొంలది సేపు శయ్యపై కూరుచుండెను. ఆ సమయమున మంగళిక ఋతుమతి, బోధిసత్త్వుడు అంగుళితో ఆమె నాభి స్పృశించెను. దాన ఆమె గర్భమున శిశువు చేరెను. అంత నాత డామెను సంబోధించి "భద్రే, నీ కడుపున శిశువు పడినది. అది పుత్రు డగును. నీవును, నీ కొమరుడును విశేషలాభము, యశము పొందుదురు. నీ పాదోదకము సమస్త జంబూద్వీపములోని రాజుల కభిషేక జలము కాగలదు. నీవు జలకమాడిన నీరు అమృతౌషధము కాగలదు. ఈ యుదకమును శిరములపై చల్లుకొనినవారు సర్వదా రోగరహితులై యుందురు; మృతులు జీవింతురు. నీ పాదములపై శిరసులుంచి ప్రణామము చేయువారు వేలకొలది కానుక లిత్తురు. అల్లే కూతవేటుదూరములో నిలుచు వారు నాణెము లిచ్చి ప్రణామము చేయుదురు. కనుచూపుమేరలో నిలిచి ప్రణామము చేయువారు కార్షాపణ మిత్తురు. నీవు అప్రమత్తురాలవై యుండుము'' అని యుపదేశ మిచ్చి, ఇలు వెడలి, యెల్లరు చూచుచుండ గనే పై కెగసి చంద్రమండలమున ప్రవేశించెను. బ్రహ్మభక్తులు నిలిచినవారు నిలిచినట్లే రాత్రి గడిపిరి. ప్రాతఃకాలమున మంగళికను బంగరు పల్లకిలో కూరుచుండబెట్టి నగరమున నూరేగించిరి. మహాబ్రహ్మకు భార్యయని గ్రహించి లోకులు సుగంధమాల్యాదులతో ఆమెను పూజించిరి. ఆమె పాద ములపై శిర ముంచి ప్రణామము చేసెడి యవకాశము దొరికినవారు వేయి నాణెము లిచ్చిరి; కూతవేటుదూరములోని వారు వేయినాణెము లిచ్చిరి;

చూపు మేరలోని వారు ఒక్కొక్క కార్షాపణము చొప్పున నిచ్చిరి. ఈవిధముగా ఆమెను పంద్రెండు యోజనముల విస్తీర్ణముకల వారాణసిలో త్రిప్పగా పదునెనిమిదికోట్ల ధనము సమకూడెను.

ప్రదక్షిణముచేసి వారు నగరమధ్యమున మహామంటపము నేర్పాటు చేసి, చాందినీ కట్టి మహావైభవముతో ఆమెను మంటపమున కూరుచుండ బెట్టిరి. దానిపార్శ్వమున నేడువాకిళ్ళ కోష్ఠములు, ఏడంతస్తుల మేడయు నిర్మింప నిందుప్రయత్న మారంభ మయ్యెను. మంగళిక మంటపముననే పుత్రుని కనెను. నామకరణమునాడు బ్రాహ్మణులు సమావిష్టులై మండప మున పుట్టుటచే మండవ్యు డని పేరు పెట్టిరి. ప్రాసాదము పదిమాసములలో సమాప్త మయ్యెను. నాటినుండి వా రిరువురు మహైశ్వర్య మనుభవించు చుండిరి. మండవ్యకుమారుడు ఎనిమిదేండ్లవా డయినప్పుడు జంబూద్వీపము లోని ఉత్తమాచార్యులను కొనివచ్చిరి. వా రాతనికి మూడు వేదములు చెప్పిరి. పదునారేళ్ళవయసున బ్రాహ్మణభోజన మేర్పాటు చేసిరి. ఆనాడు పదునారువేల బ్రాహ్మణులకు విందు జరిగెను. నాల్గవ ద్వారకోష్ఠమున బ్రాహ్మణసంభావన జరిగినది.

ఒకనాడు మహోత్సవము జరుగుచుండ విశేషముగా పాలు కాచిరి. పదునారువేలమంది బ్రాహ్మణులు నాల్గవద్వారకోష్ఠమున కూరుచుండి బంగరువన్నె నెయ్యి, తేనె, ఖండశర్కర కలిపినపాలు ఆరగించుచుండిరి. కుమారుడు సర్వాలంకారభూషితుడై బంగరుపాదుకలు తొడుగుకొని, చేత బంగరుదండము పట్టుకొని ఇక్కడ నేయి, ఇక్కడ తేనె వడ్డింపుడు, అనుచు ఇటు నటు తిరుగుచుండెను. ఆ సమయమున మాతంగపండితుడు హిమా లయమున నిజాశ్రమమున గూరుచుండి మంగళికాపుత్రుడు ఎట్లున్నాడో యని యోచించెను. ఆకాశమార్గమున అనోతప్తసరోవరముచేరి ముఖప్రక్షాళ నాదికము కావించి మనశ్శిలాఫలకముపై నిలిచి, యెఱ్ఱనివస్త్రములు దాల్చి, మృణ్మయపాత్ర చేబూని ఆకాశమార్గమున జని చతుర్ద్వారకోష్ఠ దాన శాలలో దిగి ఒకప్రక్క నిలిచెను. మండవ్యుడు ఇటు నటు చూచుచు బోధి సత్త్వుని కనుగొని ఇంతచక్కని యతుడు ఎట్లు ప్రవ్రజించెనో అనుకొని 'ఇచ్చటి కెచ్చట నుండి వచ్చితివి' అని అడుగువాడై ఈ గాథ పలికెను :

ఎవ్వడవు నీవు ? వచ్చితి వెచటినుండి ?
బూడిదన్ బొర్లు దయ్యముపోల్కి తోడ,
తాల్చి మెడమీద మలినవస్త్రమ్ము తునుక.

విని బోధిసత్త్వుడు కోమలచిత్తముతో సంభాషించుచుచు ఈ గాథ పలికెను :

జనుల కోయి యశస్వి నీసదనమునను
అన్నపానీయముల లబ్ధి యనుచునున్న;
దన్యదత్తాన్నజీవుల మగుట మేము
ఈ వెరింగినవిషయమే; ఇంక లెమ్మ,
పిండముల్ శ్వపాకునకు లభించు గాక !

అంతట మండవ్యుడు ఈగాథ పలికెను :

అవనిసురులకొరకె అన్నంబు మాయింట,
ఆత్మహితముకొరకె యగును శ్రద్ధ
ఇచటినుండి కదలు, మేల నిల్తువు దుష్ట !
నీకు దాన మీరు మాకొలదులు.

అప్పుడు బోధిసత్త్వ డీగాథ పలికెను :

చల్లుచుండు ఫలాశఁ గర్షకుడు బీజ
ముల ననూపము, లున్నతములును, నిమ్న
ములు నగుపొలంబులన్ : దానములను మీరు
శ్రద్ధతో జేయవచ్చును సర్వులకును.

నిక్కముగ దానయోగ్యుల నొక్కొకతరి
సత్కరింపగవచ్చును శ్రద్ధతోడ.

అవల మండవ్య డీగాథ పలికెను :

నే నెరుంగుదు క్షేత్రముల్, వానిలోనె
చల్లుచుందును బీజముల్; జాతి, మంత్ర
సంయుతబ్రాహ్మణుల్ క్షేత్రసత్తమములు.

పిదప బోధిసత్త్వుడీగాథలు పలికెను :

జాతిమదము, లోభమ్ము, ద్వేషమ్ము, మూర్ఖ
తయును, నతిమానితయు. నిల్చుతావు లెల్ల
కానె కావు సత్‌క్షేత్రముల్ దానమునకు.

ఇట్టి యవగుణములు లేనియట్టి మంచి
తావు లగును సత్‌క్షేత్రముల్ దానమునకు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వుడు మాటిమాటికిని పలుకుచుండుటచే కోపము వచ్చి మండవ్యుడు "ఇతడు మిక్కిలి బకవాదము చేయుచున్నాడు. ద్వారపాలకు లెచటికి పోయిరి? ఈ చండాలుని వెలువరింప లేరా?" అనుచు ఈ గాథ పలికెను :

ఎచటి కేగినార లీతిండిపోతులు ?
వీని చావగొట్టి వేయు డోరి !

వా రాతని మాటలు విని వేగముగా చేరి "దేవా, యేమి చేయుదుము?" అని విన్నవించిరి.

"ఈ దుష్టచండాలుని మీరు చూచుచున్నారా?"

"దేవా, కానబడుట లేదు. ఎక్కడనుండి వచ్చినాడో తెలియదు. ఇతడు మాయావియో మాంత్రికుడో కావచ్చును."

"నిలుచున్నారేమి?"

"దేవా, యేమి చేయుదుము?"

"మెడ పట్టి యిచటనుండి వెడల నడుపుడు."

అంతవరకును వారు బోధిసత్త్వుని సమీపమునకు రాలేదు. ఆయన ఆకసమున నిలిచి ఈ గాథ పలికెను :

ఎవని నిందింత్రు మీర లాఋషివరుండు
త్రవ్వివేయును గోళ్ళతో ధరణిధరము,

కరకులోహంబు దంతాల గోరికివేయు,
పితిహోత్రుని కబళించి వేయగలడు.

ఈ గాథ పలుకుచు బోధిసత్త్వుడు ఆ మానవకుడు, బ్రాహ్మణులు చూచుచుండగనే ఆకసమున కెగసెను.

ఈ యర్థమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథ పలికెను :

ఈ క్రమంబున సత్యపరాక్రముండు
పలికి మాతంగు, డచ్చటి బ్రాహ్మణంబు
కనులయెదుటనె చేరెను గగనమునకు.

బోధిసత్త్వుడు తూర్పుదిక్కుగా పోయి ఒకానొక చిన్నివీధిలో దిగి, తనపాదచిహ్నములు కనబడునట్లు చేయ దృఢసంకల్పము చేసికొని, పూర్వ ద్వారముకడ నున్న భోజనశాలకు బోయి, నలుగురితో కలిసి మెలిసి భోజనము చేసినాడు. ఆర్యునకు రాజు బాధ కలిగించినట్లు తెలియగానే నగర దేవతలు వచ్చినారు. పెద్దయతుడు రాజుమెడ పట్టి పిసికినారు. తక్కిన దేవతలు మిగిలిన బ్రాహ్మణుల మెడలు నులిమినారు. బోధిసత్త్వుని చిత్తము కోమల మగుటచే వారు రాజును సంహరింపక బోధిసత్త్వుని పుత్రు డని దయదలచి వేధించినారు. మండవ్యుని శిరము తిరిగిపోయి వీపున వాలెను; కాలుసేతులు కొయ్యబారెను; నేత్రములు వెలికివచ్చెను. అతడు మృతునివలె నయ్యెను. నోట చొంగ కారుచుండ బ్రాహ్మణులు ఇటు నటు దొరలుచుండిరి. నీ పుత్రున కేమో జరిగినదని దిట్టమంగలిక కెవరో సూచించిరి. తోడనే యామె వచ్చి, పుత్రుని జూచి, ఏమిది యని యీ గాథ పలికెను :

వీపుమీదికి వ్రేలాడు వీని శిరసు,
తిరుగు బాహువు లూరకే, తెల్లబడియె
నయనములు మృతుకనులట్లు, నా కొమరున
కెవడు కల్గించినాడొకో యిట్టిగతిని :

అచటనే నిలిచియున్న జను లామెకు వృత్తాంతము తెలుపుటకై యీ గాథ పలికిరి :

మలినవస్త్రంబు దాల్చు శ్రమణు డిచటికి
వచ్చె బూడిదదయ్యంబువాలకమున
పిలికం జుట్టి మెడను; నీ బిడ్డకిట్టి
దుర్గతిం గలిగించినదుష్టు డతడె.

విని యామె తనలో "మరి యెవ్వరికిని ఇట్టి సామర్థ్యము లేదు. నిస్సందేహముగా మాతంగపండితుడే, ఆయన ధీరుడు, మైత్రీభావనా సంయుతుడు. ఇందరు జనులకు వ్యథ కలిగించి పోవడు. ఆయన యెటు వైపు చనెనో" అనుకొని ఈ గాథ పలికెను :

మాణవకులార, తెలుపు డామహితశక్తి
సంయుతుం డెటు పోయెనో! చని తదీయ
సన్నిధికి, వేడుకొందుము క్షమ యతనిని!
పుత్రునకు జీవనప్రాప్తి పొసగవచ్చు.

అచ్చట నున్నయువకు లిట్లనిరి :

అరిగినాడు మహాప్రజ్ఞు డాకసమున
పూర్వదిక్కున, కాతండు పూర్ణ చంద్రు
వడువున విహాయసమునకు నడుమగాను.

వాక్కులు విని యామె నిజభర్త నన్వేషింప నిశ్చయించుకొనెను. బంగరుకలశమును, బంగరు పళ్ళెమును పట్టుకొని దాసీజనమును వెంటబెట్టుకొని, తన పాదచిహ్నములను ప్రదర్శింప బోధిసత్త్వుడు దృఢసంకల్పము చేసిన చోటికి జేరి, తదనుసారముగా నామె చని బోధిసత్త్వుని కనుగొనెను. ఆ సమయమున నాతడు పీఠముపై గూరుచుండి భోజనము చేయుచుండెను. ఆమె యతనిని సమీపించి, ప్రణామము చేసి, యొకప్రక్క నిలిచెను, ఆత డామెను చూచి, పాత్రలో కొంత యుచ్ఛిష్టము విడిచెను. మంగలిక బంగరు కలశముతో ఆయనకు నీర మిచ్చెను. ఆతడు చేతు లందులో కడిగికొని ముఖప్రక్షాళనము కూడ చేసెను. నా పుత్రుని యాకృతిని విరూపము చేసినవా రెవరని యమె యాతని నడుగునదై యీ గాథ పలికెను :

వీపుమీదికి వ్రేలాడు వీని శిరము,
తిరుగు బాహువు లూరకే, తెల్లబడియె
నయనములు మృతుకనులట్లు; నా కొమరున
కెవడు కల్పించినాడొకో యిట్టిగతిని !

ఇకమీద వచ్చుగాథలు వారల ప్రశ్నోత్తములు :

సాధుబుషులను గన్గొని శక్తిమంతు
లైనయతులు వారల ననుసరించి
చేసినా రిట్టి లీ దుష్టచిత్తు, క్రోధ
పూరితస్వాంతు భవదీయపుత్రు గాంచి.

యతులకు నా కుమారుపై నాగ్రహంబు
కలిగిన, నీవు కోపింపవలదు భిక్షు !
పుత్రశోకాన శరణమ్ము పొందుదాన.

అప్పుడైన నామనసున నిప్పుడైన
లేదు ద్వేష మించుకయేని; వేదమత్తు
డగుచు నెరుగడు నీ సుతు డర్థ మేమి.

క్షణములో మోహ మొందును జనునిబుద్ధి;
వానిదోషము క్షమియింపవలయు భిక్షు !
పండితులు లోకమున క్రోధబలులు కారు.

ఈ విధముగా నామె క్షమాపణ వేడగా బోధిసత్త్వుడు "అగుచో యతులను నివారించుటకు అమృతౌషధము చూపుదును" అని ఈ గాథ పలికెను :

ఈ మూఢ మండవ్యు డిపుడు మదీయ
భోజనోచ్ఛిష్టంబు భుజియించునేని
వ్యథపాలు చేయరు యక్షు లితనిని—
సితనూజాతుండు నీరోగి యగును

విని యామె బంగరుపళ్ళెము ముందరికి చాపి, "స్వామీ! అమృతౌషధము నొసంగుడు" అని వేడెను బోధిసత్త్వుడు ఎంగిలిగంజి అందులో బోసి, "ప్రథమమున నిందులో సగము నీ పుత్రునినోట బోసి, తక్కినదానిలో నీరు కలిపి బ్రాహ్మణులపై జల్లుము. ఎల్లరును నీరోగు లగుదురు" అని చెప్పి, ఆకసమున కెగసి, హిమాలయమునకు బోయెను ఆమె యా పళ్ళెము నెత్తిపై బెట్టుకొని "నాకు అమృతౌషధము లభించినది" అనుచు గృహమున కేగి తొలుత పుత్రునినోట బోయగా యక్షుడు తొలగిపోయెను. కుమారుడు డొడలు దులుపుకొనుచు లేచి అమ్మా, యే లది యనెను. "నాయనా, నీవు చేసినది నీకే తెలియును. నీ దక్షిణలు పుచ్చుకొన్నవారిస్థితి యెట్లున్నదో చూడు" మని తల్లి చెప్పగా, నాతడు వారిని విలోకించి పశ్చాత్తాపము చెందెను.

అంతట తల్లి కుమారునితో "నాయనా, నీవు మూర్ఖుడవు. దాన మిచ్చినచో మహాఫలము కలుగుతావు గుర్తింప వైతివి. ఇట్టి జనులు దానము పొంద నర్హులు కారు. నేటినుండి యీ దుశ్శీలురకు దానమీయ వలదు; శీలవంతులకే యొసగుము" అని యీ గాథలు పలికెను :

అరయగా లేవు పుణ్యక్షేత్రములను
మండవ్య, నీ వల్పమతివి కావునను
ఇత్తు వసంయుతచిత్తు లౌవారి,
కత్యంతదుష్టుల కధిక దానములు.

కొందరు కేశముల్, కొందరు జడలు,
మరికొంద రజినముల్ ధరియించువారు;
మలినాంబరుల జూడుమా! అల్పశక్తు
లగువారలకు జడ, లజినాంబరములు
అగునె మోక్షప్రదాయకములు చెపుమ!

ద్వేషమ్ము, రాగమ్ము, విడిచినవారు,
క్షీణాసవు, లవిద్య చెందనివారు,
అర్హతు లగువారికర్పించునట్టి
దానంబు బహుఫలదాయి మండవ్య!

"కావున నాయనా, నేటినుండి యిట్టివారికి దాన మీయక, అష్ట సమాపత్తులను, పంచాభిజ్ఞలను పొందిన ధార్మికశ్రమణ బ్రాహ్మణులకును, ప్రత్యేకబుద్ధులకును దానము లిమ్ము. నాయనా, రమ్ము. వీరందరికిని అమృత మిచ్చి నీరోగులను చేయు"మని యామె యెంగిలి గంజి తెప్పించి అందు నీరు కలిపి పదునారువేలమంది బ్రాహ్మణుల ముఖములపై చల్లించెను. ఒక్కొక్కడే దుమ్ము దులుపుకొనుచు లేచి నిలబడెను.

చండాలుని యుచ్ఛిష్టమువలన అబ్రాహ్మణుల మయితి మని వారు సిగ్గుపడి వారాణసి విడిచి మేదరాష్ట్రమునకు బోయి నివసింపజొచ్చిరి. మండవ్యుడు అచటనే యుండెను.

ఆ కాలమున వేత్రవతీనగరి ప్రక్కగా ప్రవహించు వేత్రవతీనదీ తీరమున జాతిమంతు డను పేరు గల బ్రాహ్మణు డొకడు ప్రవ్రజించి యుండెను. అతనికి జాత్యభిమానము మెండు. బోధిసత్త్వు డతని యభిమానమును విదళింప దలచి అచ్చటికి బోయి నదీతీరముపైన నివసింపసాగెను. ఒకనాడు బోధిసత్త్వుడు పండ్లు తోమికొని పుడక నీట వైచుచు అది పోయి బ్రాహ్మణునిజటలలో చిక్కుకొనునట్లు సంకల్పించెను. బ్రాహ్మణుడు నదిలో స్నానము చేసి ఆచమనము చేయువేళకు పలుదోముపుల్ల సూటిగా పోయి, ఆయనజడలలో చిక్కుకొనెను. అతడు చూచి "నీ మొగము మండ! ఈ పిశాచము ఎచటినుండి వచ్చినది! దీని సంగతి కనుగొందును" అనుకొని నదీతీరమున పై యెత్తున కరిగెను. అచట బోధసత్త్వుడు కానబడగా బ్రాహ్మణు డతనితో "నీ వేజాతివాడవు?" అనెను. "చండాలుడను." "నదిలో పలుదోము పుల్ల పడవైచినది నీవేనా?" "అవును, "నేనే పడ వేసినాను." "నీ మొగము మండ! చండాలపిశాచమా, నీ విచట నుండ వలదు. ప్రవాహముక్రిందికి పోయి యుండుము."

బోధిసత్త్వుడు నది దిగువభాగమునకు పోయి నివసించుచున్నను ఆయన పడవేయు దంతకాష్ఠము ఎటి కెదురీది బ్రాహ్మణుని జటలలో చిక్కుకొనుచుండెను. బ్రాహ్మణుడు కోపించి "నీ మొగము మండ! నీ విచటనే యున్నచో నేడవనాడు నీ తల యేడుముక్కలగును" అని శపించెను. బోధిసత్త్వుడు తనలో "నేను ఈతనిపై కోపించితినేని నాశీలము వ్యయమగును.

ఉపాయముచే ఈతని యభిమానమును విదళింతును" అనుకొని యేడవనాడు సూర్యోదయము కాకుండ నిలిపెను. లోకులు కుపితులై జాతిమంతునికడకు బోయి "భన్తే, సూర్యోదయము మీరు కానీయరా ?" అనిరి. "ఇది నాపని కాదు. నదీతీరము దిగువను చండాలుడున్నాడు, ఇది వాడు చేసినపని కావచ్చును" అని తపస్వి పలుకగా, వారు బోధిసత్త్వుని చేరి "భన్తే, మీరు సూర్యోదయము కానీయరా ?" అనిరి. "ఆయుష్మంతులారా, ఔను" "ఎందుచేత ?" "మీ విశ్వాసపాత్రుడైన తపస్వి అపరాధము చేయని నాకు శాప మిచ్చినాడు. ఆయన వచ్చి నా పాదములపై బడి క్షమాపణ వేడిననే కాని సూర్యోదయము కానీయను." వారు పోయి అతనిని లాగుకొని వచ్చి బోధిసత్త్వుని పాదములపై పడవైచి, క్షమాపణ వేడించి "భన్తే, సూర్యోదయము కానిండు" అని ప్రార్థించిరి.

"నేను సూర్యోదయము కానీయ జాలను. కానిచ్చినచో ఆయన శిరసు ఏడుముక్క లగును."

"భన్తే, యేమి చేయుదుము ?"

పెద్దమట్టిగడ్డ తెమ్మని చెప్పి "ఇది తాపసితలపై పెట్టి ఆయనను నీటిలోనికి దింపు" డని పలికి బోధిసత్త్వుడు సూర్యోదయము కానిచ్చెను. సూర్యరశ్మి తగులగానే మట్టిగడ్డ యేడుముక్కలై పడెను. బ్రాహ్మణుడు నీట మునిగెను. బోధిసత్త్వ డాతనిని పట్టుకొని "పదునారువేలమంది బ్రాహ్మణు లెక్కడ నున్నారు ?" అనెను. వారు మేదరాష్ట్రమున నున్నారని తెలిసికొని వారి గర్వము నణచుటకై బుద్ధిబలమున నచటికి చని నగరములోనికి దిగి భిక్షాపాత్ర చే బూని భిక్షార్థము బయలువెడలెను. బ్రాహ్మణులు తమలో "ఈతడు ఒక్కపూట ఇచట నున్నను మనపరువు దక్కనీయడు" అనుకొని రాజుకడకు బోయి "దేవా, ఒకానొకమాయావి, ఇంద్రజాలికుడు వచ్చి నాడు. వానిని పట్టింపుడు" అని విన్నవించిరి. మంచి దని రాజు స్వీకరించెను. బోధిసత్త్వుడు గోడప్రక్కన అరుగుమీద కూర్చుండి భోజనము చేయుచుండెను. ఆయన పరధ్యానములోనున్న సమయమున రాజపురుషులు వచ్చి ఖడ్గముతో కొట్టిరి. బోధిసత్త్వుడు మృతి నొంది బ్రహ్మలోకమున బుట్టెను.

ఈ జాతకములో బోధిసత్త్వుడు కోండును దమించు వాడయ్యెను. వాడు ఈ విశ్వాసముతో మృతి నొందెను. కోపము వచ్చి దేవతలు మేద రాష్ట్రముపై వేడిబురద వర్షించి నాశము చేసిరి. ఇందుచేతనే యిట్లు చెప్ప బడినది :

ఆ యశస్విని మాతంగు నడచుకతన
నమసె మేదరాజ్యము పరిషత్తుతోడ.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి "ఇప్పుడే కాదు, పూర్వముకూడ ఉదయనుడు ప్రవ్రజితులకు బాధ కలిగించినాడు" అని జాతకములు సరి పోల్చెను. ఆ కాలమున మండవ్యుడు ఉదయనుడు; మాతంగ పండితుడు నేనే.

—[ ]—

# 498. చిత్త సంభూత జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచు ఆయుష్మాన్ మహాకాశ్యపుని వెంట ప్రీతితో నుండు నిరువురు భిక్షువులను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

వారి పరంపర విశ్వాసముతో కూడినది. ఉన్నది కొంచెము అందరును సమానముగా పంచుకొనుచుండిరి. ఎల్లరును కలిసియే భిక్షాటనమునకు పోవుచుండిరి; కలిసియే మరలి వచ్చుచుండిరి. విడివిడిగా నుండెడివారు కారు. వారల పరస్పర విశ్వాసమును గూర్చి ధర్మసభలో చర్చ జరుగుచుండెను. శాస్త యచటికి జని విషయము తెలిసికొని "భిక్షువులారా! ఇందాశ్చర్య మేమియులేదు. ఇది ఒక్క జన్మపరంపరలోని విశ్వాసము; పూర్వకాల పండితులు మూడు నాలుగు జన్మలలో కూడ మిత్రభావము విడనాడలేదు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున అవంతిరాష్ట్రములోని ఉజ్జయినీ నగరమున అవంతి మహారాజు పాలనము చేయుచుండెను. ఆ కాలమున నగరము వెలుపల చండాలగ్రామ ముండెను. బోధిసత్త్వుడు అచట జన్మించెను. వేరొక ప్రాణి కూడ అతని పినతల్లి కడుపున పడెను. ఒకని పేరు చిత్తుడు. రెండవవాడు సంభూతుడు. ఇరువురును పెరిగి పెద్దవారైన పిదప చండాల కులమునకు తగిన విద్య నేర్చికొనిరి. ఒకనాడు ఉజ్జయినీ నగరమున తమ విద్య చూప దలచి ఒకడు ఉత్తరద్వారముకడను, రెండవాడు తూర్పు వాకిటను తమ నేర్పును ప్రదర్శించిరి.

ఆ నగరమున నిరువురు దుష్టమాంగళికలు కలరు: ఒకతె శ్రేష్ఠి కూతురు, రెండవది పురోహితుని పుత్రిక. ఒకనాడు వారు ఖాద్యములు

వెంటగొని ఉద్యానమున క్రీడించు కోర్కె కలుగగా ఒకతె ఉత్తరద్వారమునను, రెండవది తూర్పువాకిటను బయిల్వెడలిరి. ఉభయులును చండాలపుత్రుల కళాప్రదర్శనము చూచి, వీ రెవరని యడిగిరి. "చండాలపుత్రులు." వెంటనే వారు సుగంధజలముతో కన్నులు తుడుచుకొని, చూడగూడనిది చూచినాము అని వెనుకకు మరలిపోయిరి. లోకులు వారిని చూచి కొట్టి తన్ని "ఓరి దౌర్భాగ్య చండాలులారా! మాకు ఊరకే లభించు నాహారము, మద్యము మీ మూలమున పోయినవి" అని నిందించి పోయిరి. తెలివి వచ్చిన పిదప నుభయు లొకచోటికి చేరి కష్టసుఖములు చెప్పుకొని, "ఏమి చేయుదము? ఈ వ్యధ మన జాతిమూలమున వచ్చినది. మనము చండాల కుల కర్మలు చేయజాలము. జాతిని మరుగుపరచి బ్రాహ్మణ విద్యార్థులమని తక్షశిలకు పోయి అచ్చట విద్యలు నేర్చికొందము" అని నిశ్చయించుకొనిరి. ఆవల వారు తక్షశిలా నగరమునకు చని గురుదక్షిణ ఈయజాలని ధర్మ శిష్యులుగా ప్రసిద్ధాచార్యుని కడచేరి విద్యాభ్యాసము చేయజొచ్చిరి. 'ఎవరో యిరువురు చండాలురు జాతిని కప్పిపుచ్చి విద్య లభ్యసించుచున్నారు' అను జనశ్రుతి జంబూద్వీపమున వ్యాపించెను. అందులో చిత్తపండితుడు విద్యాభ్యాసము ముగించెను; సంభూత పండితుని చదువు ఇంకను పూర్తి కాలేదు.

ఒకనాడు ఒకానొక గ్రామవాసి పాఠము కొరకు ఆ యాచార్యుని నిమంత్రించెను. ఆ రాత్రియే పెద్ద వర్షము కురిసి మార్గములోని గుంటలన్నియు నిండిపోయినవి. ఆచార్యుడు ప్రాతఃకాలముననే చిత్తపండితుని పిలువనంపి "బాబా, నే నచటికి పోజాలను నీవు విద్యార్థులతో చని అచట మంగళపాఠము జేసి నీ భాగము భుజించి నా భాగము కొనిరమ్ము" అని చెప్పెను. అతడు చిత్తమని విద్యార్థులను వెంటగొని అచటికి పోయెను. బ్రహ్మచారులు స్నానములు చేయునంతలో పాలు చల్లారుటకై విభాగములు చేసిరి. అవి చల్లారకముందే బ్రహ్మచారులు వచ్చి కూరుచుండిరి. గృహస్థులు వారికి హస్తోదకమిచ్చి క్షీరస్థాళులు వారి యెదుట నుంచిరి. పాలకోవా చల్లారినదని తలచి సంభూతపండితుడు దానిని ఒక్కమారుగా నోటవేసికొనెను మండుచున్న లోహగోళము లోనికి బోయినట్లుండెను. అతలు కంపము పొందుచు స్మృతి కోలుపోవునట్లయి చిత్తపండితునివైపు

చూచి చండాలభాషలో అయ్యో యిట్లయినది అనెను. అతడు పరధ్యాన ములోనుండి చండాలభాషలో ప్రత్యుత్తర మిచ్చెను. బ్రహ్మచారులు ఒకరి మొగము ఒకరు చూచుకొనిరి. చిత్తపండితుడు మంగళపాఠము కావించెను. బ్రహ్మచారులు ఆవలకు జని విడివిడిగా యోచించి అది చండాల భాషయని తెలిసికొని "ఓరి దుష్టచండాలురారా, యిన్నినాళ్లును మేము బ్రాహ్మణుల మని మమ్ము మోసగించితిరి!" అని ఉభయులను కొట్టిరి. అంతలో నొక సత్పురుషుడు అగుడని ఆపి వారిని బ్రతికించి "ఇది మీ జాతిదోషము. మీ రెచ్చటికయినను పోయి ప్రవ్రజింపుడు" అని ఉపదేశించెను. పిదప బ్రహ్మ చారులు ఆచార్యుని కడకు బోయి ఈ విషయము తెలిపిరి. వా రిరువురు అరణ్యమునకు జని ఋషుల రీతిని ప్రవ్రజించిరి. ఆవల కొలది కాలమునకే మృతినొంది నీరంజరా నదీతీరమున లేడి కడుపున బుట్టిరి. పుట్టినదాది రెండు నెల్లపుడు నొకటిగా నుండెడివి.

ఒకనాడు మేతమేసిన పిదప అవి దగ్గరగా నిలుచుండి ఒడళ్లు రాచు కొనుచుండ వేటకాడు శక్తిని ప్రయోగించి ఒక్క దెబ్బతో రెండిటి ప్రాణ ములు హరించెను. అనంతరమవి నర్మదాతీరమున పక్షులై పుట్టినవి. అవి పెరిగిన వెనుక ఒకనాడు మేత మేయుచు ముక్కు ముక్కు కలియునట్లు దగ్గర దగ్గరగా నుండెను. అప్పుడు పిట్టలు పట్టువాడు వానిని జూచి ఒక్క యూపున పట్టి వానిని చంపెను. అయినను అచ్చట చ్యుతికెంది చిత్తపండి తుడు కౌశాంబీ నగరమున పురోహిత పుత్రుడై పుట్టెను. సంభూత పండి తుడు ఉత్తర పాంచాల రాజకుమారుడై పుట్టెను. నామకరణము నాడు సంభూత పండితునకు జన్మాంతరములో చండాల జన్మము మాత్రము జ్ఞప్తికి వచ్చెను. చిత్తపండితునకు క్రమముగా నాలుగు జన్మలు జ్ఞప్తికి వచ్చినవి. అతడు పదునారేండ్ల వయసున నిలు వెడలి ఋషి ప్రవ్రజ్య గ్రహించి ధ్యాన అభిజ్ఞలు పొంది ధ్యానానందము నొందుచు కాలము గడుపుచుండెను. సంభూతపండితుడు పితృ మరణానంతరము ఛత్రధారణము చేసెను. ఆనాడు మంగళగీతా రూపమున ఉల్లాసవాక్య ఫణితిలో రెండు గాథలు పలికెను. విని యిది మన రాజుగారి మంగళగీతము అని రాణివాసములోని స్త్రీలు, గంధర్వులు నా గీతము పాడసాగిరి. క్రమక్రమముగా నగర వాసులు ఇది మన మహారాజుగారి ప్రియగీతమని గ్రహించి పాడజొచ్చిరి.

చిత్త పండితుడు హిమాలయమున నివసించుచు సోదరుని సంగతి తలపోయగా ఆతడు ఛత్రధారణము చేసినట్లు తోచెను. అంతట నాతడు తనలో "రాజ్యము నూతనము. ఇప్పుడే ఉపదేశింపలేను. ఆతడు వృద్ధుడైన పిదప అచటికి పోయి నేను ధర్మోపదేశము చేసి, అతనిని ప్రవ్రజితుని కావించెదను" అనుకొని యేబదిసంవత్సరముల తరువాత రాజు కొడుకులు, కూతుళ్లు పెద్దవారైన పిదప బుద్ధిబలమున అచటికరిగి, ఉద్యానమున దిగి మంగళశిలా తలముపై స్వర్ణప్రతిమవలె కూరుచుండెను.

ఆ సమయమున ఒకానొక బాలుడు ఆ గీతము పాడుచు కర్రలు పేర్చుచుండెను. చిత్తపండితుడు వానిని పిలిచెను. వాడు వచ్చి ప్రణామము చేసి నిలువగా "నీవు ఉదయముననే పాట పాడుచున్నావు. ఇది కాక వేరొక పాట రాదా ?" అని చిత్తపండితుడు ప్రశ్నించెను.

"భన్తే, నాకు ఇంకను ఎన్నో పాటలు వచ్చును. ఈ గీతము మా రాజుగారి ప్రియగీతమగుటచే నిదియే పాడుచున్నాను."

"రాజుగారి గీతముకాక వేరు గీతములు పాడువారు లేరా ?"

"భన్తే, లేరు."

"నీవు రాజుగారి గీతము కాక వేరొకటి పాడగలవా ?"

"తెలిసినచో పాడుదును."

"అగుచో నీవు రాజుగారి గీతములు రెండు పాడిన పిదప నిది మూడవగీతముగా పాడవలెను. రాజసన్నిధికి పోయి పాడవలెను. ప్రభువు ప్రసన్నుడై నీకు సంపద లిచ్చును." అని ఆయన వానికి గీతము చెప్పి పంపెను. వాడు వేగముగా తల్లికడకు జని శుభ్రవస్త్రములు ధరించి రాజ ద్వారము చేరి "ఒకానొక బాలుడు తమతోపాటు ప్రతిగీతము పాడును" అని రాజుకు విన్నప మంపెను. ప్రభు వనుమతి యిచ్చిన పిదప వాడు చని ప్రణామము చేసెను. వానిని చూచి రాజు "బాబా, నీవు ప్రతి గీతము పాడుదువా ?" అనెను.

"చిత్తము దేవా, రాజ్యపరిషత్తు సమావేశము చేయింపుడు."

పరిషత్తుసమావేశమైన పిదప బాలుడు రాజుతో "దేవా, తాము తమ గీతము పాడుడు. నేను ప్రతిగీతము పాడుదును" అని విన్నవించెను.

రాజు రెండు గాథలు పలికెను :

ఫలము లొందవును చేసెడి పనుల వలన,
కాదు వ్యర్థము చేసినకర్మ మెపుడు,
కానవచ్చుచు నుండు మహానుభావ
భూత నిజకర్మచే గల్గు పుణ్యఫలము.

జనములకు నన్నికర్మ లొసంగుచుండు
ఫలము, లొనరించు కర్మ నిష్ఫలము కాదు.
మన్మనమ్మట్లు చిత్తుని మానసంబు
ఒక్కొకప్పుడు స్మృతి నందుచుండుగాక !

రాజు గీతిక తరువాత బాలుడు ఈ గాథ పలికెను :

జనములకు నన్నికర్మ లొసంగుచుండు
ఫలము; లొనరించు కర్మ నిష్ఫలము కాదు,
దేవ, మీ మానసమ్మట్లు తెలిసికొనుడు
చిత్తుని మనస్సు వెలయును స్నిగ్ధముగను.

విని రా జీ గాథ పలికెను :

చిత్తుడవొ నీవు. కాకున్న చిత్తభావ
మున్నవాని కడను వింటి వొక్కొ గాథ ?
కానిచో చిత్తు గనుగొన్న వాని వలన
నాలకించితివో ? గాథ అచ్చ మనుట
నాకు సంశయమే లేదు— నీకు నేను
ఉత్తమ గ్రామ శతకంబు నొసగువాడ.

అంతట బాలు డీ కథ పలికెను :

దీని నన్యత్ర వింటిని దేవ, నేను
చిత్తుడంగాను; ఋషి నాకు చెప్పినాడు
పాడుమా యని గాథను ప్రభువునికడ :
ఆత డొసగును సంతుష్టుడయి వరములు.

విని రాజు తనలో "ఇతడు నా సోదరుడు చిత్తపండితుడు కానో పును. ఇప్పుడే పోయి ఇతనిని జూచెదను" అనుకొని పరిజనుల కానతిచ్చు వాడై యీ గాథలు పలికెను :

సురచిర పతాకములతోడ నరదములను,
కుధములన్, పూలదండలన్, కుంజరముల
వేగ సజ్జీకరింపుడు :
ప్రమోగవలయు
శంఖముల్, మృదంగములును :
సాగవలయు
తోడనే యానముల్ కూడ :
చూడవలయు
ఋషివరుని యాశ్రమమ్మున కేగి నేడె.

ఇట్లు పలికి రాజు శ్రేష్ఠరథ మెక్కి, శీఘ్రముగా జని, యుద్యాన వనముకడ నరదము నాపి, చిత్తపండితుని కడకు బోయి, ప్రణామము చేసి, యొక ప్రక్క నిలిచి, ప్రసన్నచిత్తముతో ఈ గాథ పలికెను :

పరిషత్తు నడుమను పలికిన గాథ
వలనను లాభంబు కలిగెను నేడు.
ఋషిని, శీలవ్రతు నీనాడు చూచి
సంప్రీతుడను సుప్రసన్నుడ నైతి.

చిత్తపండితుని జూచినంతనే రాజు ప్రసన్నమనస్కుడై నా సోదరునికి మంచము వేయుడు అని యానతిచ్చువాడై యీ గాథ పలికెను :

ఆసనంబును, పాద్య మంగీకరింపు,
డర్ఘ్యము విషయమై యడుగుచున్నాను-
గ్రహియింత్రుగాక అర్ఘ్యమ్మును మీరు.

ఈ విధముగా మధురస్వాగతము పలికి, రాజు రాజ్యమును రెండు భాగములు చేయువాడై యీ గాథ పలికెను :

నిర్మితంబగు మీకునై నిరుపమాన
రమ్య సౌధమ్ము, చేయును రమణి గణము
సేవ, లా జ్ఞప్తులను దయచేయవలయు :
ఇచట రాజ్యము చేయుద మిరువురమును.

ఈ వాక్కులు విని చిత్తపండితుడు ధర్మోపదేశము చేయువాడై యీ గాథలు పలికెను :

కర్మల ఫలాఫలంబుల గాంచి, రాజ,
అగుదు సంయుత చిత్తుండ : ఆత్మజులును
పశుగణంబులు, ధనరాశి వలదు నాకు.
... ...

జీవితమ్మున పదిదిశల్ చేరకమును,
విరిగి నేలను బడినట్టి వెదురువోలె
జీవలోకము శుష్కించి పోవుచుండు.
... ... ... ...

ఇట్టి స్థితిలోన ఆనంద మేమి యుండు ?
ఏటికి మీసములు, క్రీడ లేల ? ధనము
భార్య, పుత్రులతోడ లాభమ్ము లేదు :
బంధమోచన మయ్యెను ప్రభువ, నాకు,

మరవదని మృత్యుదేవత యెరిగినాను;
నెత్తిపై నాడుచుండగా మిత్తి యెపుడు :
ఏమిటికి రతి! ధనకాంక్ష ! యెందుకొరకు !

మానవులకును చండాలయోని యన్న
అతి నికృష్టము, నధమంబు; నస్మదీయ
పూర్వకర్మలచే నందు పుట్టు వొ్దవె,

తొలుత చండాల జన్మ మావలను మృగము,
అవల డేగయు, నిపుడు బ్రాహ్మణము, క్షత్రి
యమ్ము జన్మ; మవంతిలో. ఆ నిరంజ-
రా తటిని గట్టునను, నర్మదా తటమున.

ఈ విధముగా పూర్వకాలము నందలి నికృష్ట జన్మలను ప్రకటీకరించి, యీ జన్మలో కూడ ఆయుస్సంస్కారముల పరిధినిగూర్చి చెప్పి, పుణ్యకార్య ప్రేరణ చేయువాడై యీ గాథలు పలికెను :

జీవులను మృత్యు సన్నిధి జేర్చుచుండు
నల్పమాయువు; వార్ధక మందుటకయి
లేదు త్రాణమ్ము, వినవలె నాదువాక్కు-
దుఃఖఫల మిచ్చు కర్మకై తొడర వలదు.

... .... .... ...
దుఃఖఫల మిచ్చుకర్మకై తొడర వలదు.

... ... .... ....
చేయకు రజశ్శిరంబగు చెడ్డ పనిని.

... .... ... ....
నరకమున ద్రోయు కర్మ యొనర్ప వలదు.

బోధిసత్త్వుడిట్లు పలుకగా రాజు ప్రసన్నచిత్తుడై యీ గాథలు పలికెను :

నిశ్చయమ్ముగ సత్యముల్ నీవు పల్కు-
వాక్కు; లైనను భిక్షువు వదలలేని
కామములు, భోగ సాధనల్ కలవు నాకు.

కర్దమమ్మున జిక్కిన గజము, మంచి
నేల జూపిన గ్రహియింప జాలనట్లు
భోగ పంకమ్ములో దిగి పోయినట్టి
నేను నీ త్రోవ గ్రహియింపలేను భిక్షు !

తనయు సౌఖ్యమ్ము గోరుచు తల్లిదండ్రు
లెట్లు పుత్రుని శాసింతు, రట్లె నాదు
మేలు కొరకె శాసింపుడు మీరు నన్ను,

అంతట బోధిసత్త్వు డిట్లు పలికెను :

నీకు భోగాలు విడనాడ నేరలేని
ధర్మము సమాచరింపు, మధర్మ మెద్ది
రాజ! జరుగగరాదు నీ రాష్ట్రమందు.

అన్ని దిశలకు దూతల నంపి, శ్రమణ
విప్రులను పెల్లుగా బిలిపింపవలయు,
అన్నపానీయ శయనాసనాదికమ్ము
సిద్ధమొనరించి, సేవలు చేయవలయు.

శ్రద్ధ నన్నాదిక మొసంగి శ్రమణులకును
బ్రాహ్మణులకు యథాశక్తి భక్తి యుక్తి
దానమిచ్చెదు వారు నిందారహితులు
గా జరించుచు స్వర్గమ్ము గాంచగలరు.

స్త్రీ గణమ్ము నీ చుట్టును జేరి యుండ,
ప్రభు మదమ్మావరించిన పక్షమందు
స్మరణకుం దెచ్చికొని నీవు సకల పారి
షదుల యెదటను తద్గాథ చదువవలయు.

ఈ ప్రకారముగా బోధిసత్త్వు డాయన కుపదేశించి "నీకు నే నుప దేశమిచ్చినాను. ఇపుడు నీ విచ్ఛవచ్చినచో ప్రవ్రజింపవచ్చును. నా కర్మ ఫలము నే ననుభవింతును" అని, ఆకసమున కెగసి, యాతని శిరముపై ధూళి

చల్లుచు హిమాలయమునకు జనెను. ఇది చూడగా రాజునకు వైరాగ్యము కలిగెను. జ్యేష్ఠపుత్రునకు రాజ్యము సమర్పించి. సైన్యమున కెరుకపరచి, హిమాలయమునకు జనెను. బోధిసత్త్వున కీతనిరాక తెలిసినంతనే ఋషిగణముతో నెదురువచ్చి రాజును గొనిపోయి ప్రవ్రజితుని గావించి యోగవిధి బోధించెను. ఆతడు ధ్యానలాభము పొందినాడు. ఈ విధముగా నుభయులును క్రమముగా బ్రహ్మలోకగాము లయిరి.

శాస్త యిట్లు ధర్మదేశన చేసి, "భిక్షువులారా, యిట్లు పురాణ పండితులు మూడు జన్మల వరకును పరస్పర ధృఢవిశ్వాసముతో నుండిరి" అని చెప్పి, జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున సంభూతపండితుడు, ఆనందుడు; చిత్తపండితుడు నేనే.

—: o :—

# 499. శిబి జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయుచు, అసదృశ దానమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

(ఇది ఎనిమిదవ నిపాతములోని సౌవీర జాతకమున వచ్చియున్నది.) ఆ సమయమున రాజు ఏడవనాడు సమస్త పరిష్కారము లిచ్చి, దానాను మోదమునకు ప్రార్థన చేసెను. శాస్త్ర దానాను మోదనము చేయకుండనే వెడలిపోయెను. రాజు ప్రాతఃకాల భోజనముచేసి, విహారమునకు బోయి "భన్తే, అనుమోదన మేల చేయలేదు?" అని యడిగెను. "మహారాజా, పరిషత్తు శుద్ధముగా లేదు." "నవే కదరియా దేవలోకం వజన్తి" అను గాథాద్వారమున శాస్త్ర ధర్మోపదేశముచేసెను. రాజు ప్రసన్నుడై, సహస్ర ముద్రల విలువ గలిగి శిబి దేశమున నేసిన వస్త్రములతో తథాగతుని పూజించి నగర ప్రవేశము కావించెను.

మరునాడు ధర్మసభలో సంభాషణ జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, కోసల నరేశుడు అసదృశమైన దానము చేసినాడు. కాని, అట్టి దానమువలన కూడ ఆయనకు సంతుష్టి కలుగలేదు. దశబలధారి ధర్మోపదేశము చేసిన పిదప ఆయన మరల లక్షలకొలది మూల్యము కల శిబిదేశ వస్త్రములిచ్చెను. ఆయుష్మంతులారా, రాజుచేసిన దానములచే సంతోషము కలుగలేదు" అని వారు చెప్పుకొనుచుండగా శాస్త్ర అచటికి జని విషయము గ్రహించి "భిక్షువులారా, వెలుపలివస్తువులను దానముచేయుట తేలిక. పూర్వకాలమున పండితులు జంబూద్వీప మంతయు ఆందోళన చెందునట్లు దానములు చేసినారు. కాని బాహ్య వస్తుప్రదానముచే అసంతుష్టులై, ప్రియవస్తువు నొసంగిన వానికి ప్రియవస్తువు ప్రాప్తియగును అని గ్రహించి వచ్చిన యాచకులకు తమ నేత్రములను పెకల్చి యిచ్చినారు," అని పూర్వ జన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున శివిరాష్ట్రములోని అరిష్ఠపురమున శివిమహారాజు పాలన చేయుచుండెను. ఆ సమయమున బోధిసత్త్వుడు ఆయన పుత్రుడై పుట్టెను. ఆతనికి శివికుమారుడని పేరుపెట్టిరి. ఆతడు పెద్దవాడై తక్షశిలకు జని విద్య లభ్యసించి వచ్చి తండ్రికి విద్యాప్రదర్శనముచేసి ఉపరాజయ్యెను. తండ్రి మరణానంతరము తాను రాజై నాలుగగతులలో పడక, దశ రాజ ధర్మములకు విరుద్ధముగా కాక న్యాయానుసారముగా పరిపాలనము చేయ జొచ్చెను. అతడు నాలుగు నగరద్వారముల కడను, నగర మధ్యమునను రాజభవన ద్వారము కడను మొత్తము ఆరు ధర్మశాలలు నిర్మించెను. ప్రతి దినము వానిలో నేడువేలు ఖర్చు చేయించి దానధర్మములు కావించు చుండెను. అష్టమి, చతుర్దశి, పూర్ణిమలలో రాజు దానశాలలకు స్వయ ముగా పోయి చూచుచుండువాడు. ఒకసారి యాతడు పూర్ణిమనాడు ప్రాతఃకాలమున శ్వేతచ్ఛత్రముక్రింద సింహాసనముపై కూరుచుండి తాను చేయు దానములను గూర్చి తలపోయుచు "నేను దానము చేయని బాహ్య వస్తువు లేదు. అయినను అట్టివాని నొసగుటవలన సంతుష్టి కలుగుటలేదు నేత్రదానము చేయవలెనని నా కోరిక. ఈనాడు నేను ధర్మశాలకు బోయి నపుడు ఎవరైనను బాహ్య పదార్థము కానిది యడిగినచో బాగుండును. ఎవడైనను గుండెలోని మాంసము నడిగినచో నేను చురకత్తితో ఉరము కోసి స్వచ్ఛ జలమునుండి నాళముతో కూడ కమలమును పెకలించిన రీతిని రక్త బిందువులు కారుచుండగా నా హృదయ మాంసఖండమును పెకలించి వానికిత్తును. ఎవరైనను శరీరమాంసము కోరుచో అక్షరములు చెక్కినట్లు శరీరము చెక్కి, మాంసము వెలికిదీసి యిత్తును. ఎవడయినను నా రక్త మును కోరినచో నోటిలోనికి గిన్నెదూర్చి గిన్నె నిండుగా రక్తము తీసి యిత్తును ఎవడైనను తనయింటిలో పనులు సాగుటలేదు అన్నచో, రాజ వేషము తొలగించి వానియి టికి బోయి దాసునివలె ఇంటిపనులు చేసి పెట్టు దును ఎవడయినను నా నేత్రములు కోరినచో వానిని పెలించి యిత్తు" ననుకొనెను

నే నొసగలేని మానవ దాన మేది
యుండ, దొకవేళ నాకన్ను లొడలు వేడు
పక్షమున నిత్తు వాని కంపమ్ము లేక.

అతడు పదునారు సుగంధ జలఘటముల నీరు స్నానము చేసి, సమస్తా భరణములు ధరించి, నానావిధ రుచిర భోజనముల చేసి, అలంకృతహస్తి నెక్కి దానశాలకేగెను.

శక్రున కీ సంగతి తోచి, 'శిబిరాజు నేడు వచ్చిన యతిథికి నిజముగా నేత్రములు పెకలించి యిచ్చునా యీయడా' యని పరీక్ష చేయగోరి, అంధబ్రాహ్మణుని వలె దానశాల చేరి ఉన్నతస్థానమున నిలిచి, చేతులెత్తి రాజును దీవించెను. ఏనుగును రాజాయన కడకు గొని పోయి "బ్రాహ్మణోత్తమా, ఏమి కావలెను?" అని యడిగెను. "మహా రాజా, మీ దానసంకల్పము సమస్త లోకములకు వ్యాపించినది. నేను అంధు డను. మీకు రెండు నేత్రములు కలవు" అని నేత్రము యాచించువాడై బ్రాహ్మణు డీ గాథపలికెను.

దూరదేశస్థుడైన వృద్ధుండు వచ్చి
నాడు నేత్రము నొకదాని వేడు కొరకు
దయ నొసంగిన క, న్నట్టి దాత యున్న
నేక నేత్రులమే మౌదు మిరువురమును.

విని బోధిసత్త్వుడు తనలో "ఈవేళనే ప్రాసాదమున గూరుచున్న ప్పుడు నేత్రవిషయమై తలపోసితిని ఏమి యదృష్టము! నేడు నా మనో రథము నెరవేరును. ఇంతకుమున్ను నే నీయని దానము నే డిత్తును" అను కొని ప్రసన్నచిత్తుడై యీ గాథ పలికెను :

ఎవరు చెప్పుటచే వచ్చి తిటకు నేత్ర
మడుగ యాచక, ఉత్తమమైన యింద్రి
యమ్ము, నతికష్ట దేయమ్ము నైనదాని ?

యాచకు డీ గాథ పలికెను :

అందు రెవరు సుజంపతి నాకమందు,
మనుజ లోకాన నెవ్వని మఘవు డంద్రు,
తెలుప నాతండు, నే నరుదెంచినాను.

అన్నిటన్ భూరి కష్టదమైన యట్టి
యుత్తమోత్తమ దానంబు నొసగవలయు.

అప్పుడు రా జీ గాథ పలికెను :

నీ కోర్కు లన్నియు నెరవేరు గాక
బ్రాహ్మణా, నేత్ర సంప్రాప్తియా నీకు
నీ వాక్కులే వేడ నేను రెండిత్తు
నేత్రవంతుడ వౌదు నిఖిల లోకులకు.

ఇట్లు పనికి రాజు "నా నేత్రము లిక్కడ పెకలించి యిచ్చుట సరి కాదు" అనుకొని, బ్రాహ్మణుని వెంట బెట్టుకొని రాణివాసమునకు జని, సింహాసనమున గూరుచుండి, సీవకుడను వైద్యుని బిలువనంపి యాత డరుదెంచిన పిదప "నా నేత్రములు సేకరింపుము" అనెను. ఈ వార్త నగరమున తోడనే వ్యాపింపగా కల్లోలము పుట్టెను రాణులు, సేనాపతి, నాగరకులు, రాజాంగణమున సమావిష్టులై, రోదించుచు రాజుతో నీ గాథలు పలికిరి :

ఈయవలదు నేత్రంబుల; నెల్లర మము
వీడవలదు మహారాజ, వీని కొసగు
డధిక ధనమైన, రత్నముక్తాదికమ్ము
లైన, రథములనైన. హయాదులైన,
ఏనుగులనైన సజ్జీకరించి మిగుల.

అరదముల, శకటాల మే మందరమును
శిబినివాసులు మీ చుట్టు జేరియుండ
సర్వులను రాజ ! దాన మొసంగవచ్చు,

అంతట రాజీ గాథలు పలికెను :

ఇత్తునని పలికి యావల నీయ దలపు
విడిచిపెట్టిన మానిసి వేసికొనును
నేలపై నున్న నిగళంబు నిజగళమున.

ఇత్తుననిపల్కి తొలుదొల్త, నీయదలపు
నవల విడిచినవాడు పాపాత్మకుండు
అగుటయే గాక, చేరును యమసదనము.

అడుగుదానినె యావలె, అడుగనట్టి
దాని నీయగ రాదంద్రు : దాని నిత్తు
నన్ను విప్రుడు యాచించినాడొ దేని.

అమాత్యులంతట రాజుతో“ ఏ పదార్థమడుగగా మీరు నేత్రము లీయనున్నారు ?” అనువారై యీ గాథ పలికిరి :

వర్ణ, మాయువు, సౌఖ్యము, బలము- వీని
లోన నెద్దాని గోరగా లోచనముల
నిచ్చుచున్నావు పరలోక హేతువునను.

రాజు వారితో నీ గాథ పలికెను :

కాదు సుత ధన రాజ్యాధి కాంక్షచేత,
పూని కీర్తికి గాదు, సత్పురుష ధర్మ
మగుట, ఈ దానమున నాకు హర్ష మొదవు.

సమ్యక్ సంబుద్ధుడు కూడ ధర్మసేనాపతి సారిపుత్రునకు చర్యాపిటకోపదేశ మిచ్చుచు, “నా రెండు నేత్రములకన్న సర్వజ్ఞతా జ్ఞానము ప్రియతర” మని ప్రకటించుటకై ఈ గాథ పలికెను :

ద్వేషమే లేదు నేత్రాల, స్వీయ దేహ
మప్రియము కాదు, సర్వజ్ఞ తఖిలషితము,
కాన చేయుదు నే నేత్ర దాన మిపుడు.

బోధిసత్త్వుని వాక్కులు విని యమాత్యు లప్రతిభులయినంతనే ఆయన వైద్య సీవకునితో నీ గాథ పలికెను :

సీవకా, వైద్యమున సుశిక్షితుడ నీవు.
మత్సఖుండవు, వినుము నా మాట : పెరికి
కనుల నుంచుము యాచకు కరమునందు.

అంతట సీవకుడు "దేవా, నేత్రదానము చేయుట మిగుల గొప్ప విషయము. యోచింపుడు" అని విన్నవించెను.

"నేను యోచించియే యున్నాను. నీ వాలసింపకుము. నాతో నెక్కువ మాటలాడవలదు."

"నావంటి వైద్యునకు ఈ పని ఉచితముకాదు. రాజునేత్రములను శస్త్రముతో తీయజాలను" అనుకొని నానావిధౌషధములు నూరి చూర్ణము చేసి, దానిని నీలకమలమున నింపి దక్షిణ నేత్రమున నూదెను. కన్ను తిరిగెను. బాధ ఆరంభమయ్యెను. "రాజా, యోచింపుడు, నేత్రమును సరి చేయగలనను విశ్వాసమున్నది"

"బాబా, ఆలసింపకుము" వైద్యుడు కమలమున చూర్ణము నింపి మరల నూదెను. కంటిలో పోటు ప్రారంభించెను. వేదన హెచ్చెను. "మహారాజా, యోచింపుడు. నేత్రమును పూర్వమువలె మండునట్లు చేయగలను" "ఆలసింపవలదు" అని రాజు పలికెను. బాధ హెచ్చెను. రక్తము కారజొచ్చెను. కట్టుకొన్న బట్ట నెత్తుట తడిసెను. రాణులును అమాత్యులును ఆయన పాదములపై బడి ఏడ్చి మొత్తుకొనుచు "దేవా, నేత్రము తీయవలదు" అని విన్నవించిరి. రాజు వేదన భరించుచు వైద్యునితో "బాబా, ఆలసింపకుము" అనెను. అతడు చిత్తమని యెడమ చేతితో కన్ను పట్టుకొని కుడిచేత శస్త్రము దాల్చి నేత్రసూత్రమును కోసి గ్రుడ్డురాజుచేత బెట్టెను. రాజు ఎడమకంటితో కుడికన్ను చూచి బాధ సహించుచు, బ్రాహ్మణుని పిలువనంపి "బ్రాహ్మణోత్తమా, రమ్ము ఈ కంటి కన్న నూరు రెట్లు, వెయ్యిరెట్లు సర్వజ్ఞతారూపమగు నేత్రము నాకు ప్రియము. అందుచే ఈ నేత్రము నీ కిచ్చుచున్నాను" అనెను. బ్రాహ్మణుడు దానిని కైకొని తన

నేత్రకోటరములో సంధించుకొనెను. నిజప్రభావముచే ఆ నేత్రము వికసించిన నీలోత్పలమువలె నయ్యెను. బోధిసత్వుడు ఎడమకంటితో ఆ నేత్రము చూచి "ఓహో! నా నేత్రదానము సఫలమయ్యెను" అనుకొని ఆంతరిక ప్రీతిచే సంప్రహృష్టుడై రెండవ కన్ను కూడా తీసి యిచ్చెను. శక్రుడు దానిని కూడా తన నేత్రకోటరమున సంధించుకొని రాజభవనము వెలువడి జన సమూహము చూచుచుండ నగరము దాటి దేవలోకమున కరిగెను.

ఈ యర్ధమును ప్రకాశింప జేయుటకై శాస్త ఈ గాథ పలికెను :

శిబి నరేశుని నేత్రముల్ శివకు డూడ్చి
యిచ్చె, బ్రాహ్మణునకు చూపు వచ్చె, కాని
ఆ నిమేషంబులో శిబి అంధుడయ్యె!

కన్నులు బొత్తలవలె నుండక చుట్టు కుదురువలె మాంసపిండముతో నిండినట్లుండెను. బాధ తగ్గెను. బోధిసత్వుడు కొలది దినములు ప్రాసాదముననుండి "అంధునకు రాజ్యమేల? అమాత్యులకు రాజ్యమిచ్చి ఉద్యానమునకు పోయి ప్రవ్రజించి శ్రమణధర్మ మాచరింతును" అనుకొని అమాత్యులను పిలువనంపి తన యభిప్రాయము తెలిపి "ముఖము కడుగుకొనుట నీరు తెచ్చి, పనులు చేసిపెట్టు సేవకు డొకడు నావద్ద నుండుగాక. దొడ్డిలోనికి బోవుటకు త్రాడు కట్టుడు." అని సారథిని పిలువనంపి రథము సంసిద్ధముచేయ నానతిచ్చెను. అమాత్యులు ఆయనను రథ మెక్కనీయక బంగరు పల్లకిలో నెక్కించి చెరువుగట్టున కూరుచుండబెట్టి నలుప్రక్కల సంరక్షణ కేర్పాటు చేసిరి. రాజు శరీరదానమును గూర్చి యోచింపజొచ్చెను. అప్పుడు శక్రుని పీఠము వేడియెక్కెను. శక్రుడు యోచించి చూడ కారణము బోధపడెను. "మహారాజునకు వరమిచ్చి పూర్వమువలె కన్ను లుండునట్లు చేసెదను" అనుకొని శక్రుడు బోధిసత్వునికడకు బోయి యిటు నటు తిరుగజొచ్చెను.

ఈ యర్థమునే ప్రకాశింప జేయుటకై శాస్త యీ గాథ పలికెను :

అవల కతిపయ దినముల కక్షియుగ్మ

ముదయ మొందగ శిబినరేశో త్తముండు
ప్రియుని విశ్వాసి సారథి బిలువ నంపె.

చేయు మరదము సారథీ ! సిద్ధ, మేను
పోదు నుద్యాన భూమికి, పుష్కరిణికి
వనమునకు నని సూచన వలయు చేయ,

అంత పుష్కరణీ తీరమందు కూరు
చుండ దేవరా జాతని దండ నిలిచె.

బోధిసత్త్వుడు శక్రుని పదధ్వని విని, ఇది యేమి యని యడిగెను. శక్రుడు గాథాద్వారమున ప్రత్యుత్తర మిచ్చెను :

నేను శక్రుడ రాజర్షి ! నీ సముఖము
జేరవచ్చితి, తెలుపు నీ కోరికలను.

ఇట్లాతడు పలికినమీద రాజీ గాథ పలికెను :

కలవు శక్ర, మదీయాంతికమ్మునందు
ధనము, బహుసేన, ఈ గ్రుడ్డితనము నందు
పోవు మృతిమీదికే బుద్ధి దేవరాజ !

అప్పుడు శక్రుడు "శిబిరాజా, నీవు మరణము కోరియే మరణింప దలచుచున్నావా ? అంధుడ నగుదునను భీతిచేతనా ?" అనెను. "దేవా, అంధుడ నగుదునను కారణమున." "మహారాజా, దానము కేవలము పర లోకము కొరకే కాదు. ఇహ జన్మమున కూడ దానిఫలిత ముండును. కన్నడిగినంతనే నీవు ఇచ్చివేసినావు. ఇందుచేత సత్యక్రియ కావింపుము" అని శక్రు డీ గాథ పలికెను :

ఓయి క్షత్రియ, పలుకుమీ ఉన్నవరకు
నీదు సత్యమ్ములన్, వచ్చు నేత్రయుగళి.

విని బోధిసత్త్వుడు "శక్రదేవా, నీవు నాకు నేత్రము ప్రసాదింప దలచినచో మరి యే యుపాయ మవలంబింపవలదు. నా దానమునకు ప్రతి

ఫలముగా నేత్రము నాకు లభించుగాక !'' అనెను. అప్పుడు శక్రుడు "మహా రాజా, నేను శక్రుడను, దేవరాజును. అన్యుల నేత్రము తెచ్చి యీయ నేరను. నీదానమునకు ప్రతిఫలముగా నీకు నేత్రము లభించును" అనెను. "అట్లగుచో, నా దానము సఫలమగుగాక !'' అని బోధిసత్త్వుడు సత్యక్రియ చేయువాడై ఈ గాథ పలికెను :

ఎందరో యాచకుల్ వచ్చుచుందు, రెవ్వొ
గోత్రములవారు మత్ప్రీతి పాత్రులెల్ల :
చక్కబడుగాక నయన మీ సత్యమునకు !

ఇట్లు పలికినంతనే మొదటి నేత్రము సరియయ్యెను. అంతట ద్వితీయ నేత్రోత్పత్తికై యాత డీ గాథలు పలికెను :

అతులం గోరు బ్రాహ్మణ యాచకునకు
నయనముల నిచ్చువేళ మానసమునందు
అంకురించెను సౌమనస్యంబు, ప్రీతి :

ఆ క్షణముననే ద్వితీయనేత్ర ముత్పన్నమాయెను. ఆ రెండు నేత్రములు స్వాభావికముగా లేవు, దివ్యముగాను లేవు. బ్రాహ్మణున కిచ్చిన కన్నులు మరల తెచ్చుటకు శక్యము కాలేదు. ఉపహత వస్తువులపై దివ్య చక్షువు లుదయింపవు. ఆ నేత్రములు సత్యపారమితా చక్షువులని పేర్కొనబడినవి. నేత్రములు వచ్చినంతనే శక్రుని ప్రభావముచే రాజ్యపరిషత్తు సమావిష్టమయ్యెను. శక్రుడు జనసమూహ సమక్షమున రాజును ప్రశంసించువాడై యీ గాథలు పలికెను :

శిబి నరేశ్వర, నీవు వచించుగాథ
లధిక ధర్మానుసారమ్ము లగుటవలన
అమరు చున్నవి దివ్యనేత్రములు నీకు.

కుడ్యముల, ప్రస్తరంబుల, కుధరములను
నాల్గు వంకల శతయోజనముల వరకు
జొచ్చుకొని పోవగలవు నీ చూపులు శిబి !

శక్రు డాకసమున నిల్చి, అప్రమత్తుడవై యుండుమని బోధిసత్త్వున కుపదేశించి, దేవలోకమునకు చనెను. జనులు పరివేష్టించి యుండ రాజు వైభవముతో కదలి, చందన ప్రాసాద మెక్కెను. రాజుకు నేత్రములు మరల వచ్చిన వనువార్త శిబిరాష్ట్రమునం దంతటను వ్యాపించెను. రాష్ట్రవాసు లాయన దర్శనమునకై గుంపులు గుంపులుగా వచ్చిరి. అంతటి జనసమూహామునకు దానమహిమనుగూర్చి చెప్పదలచి, రాజు రాజద్వారము కడ గొప్ప మండపము వేయించి శ్వేతచ్ఛత్రము క్రింద సింహాసనముపై గూరుచుండి, నగరమున చాటబంపి సర్వశ్రేణులవారిని సమకూర్చెను. అప్పుడు వారితో "శిబి రాష్ట్రవాసులారా, నా దివ్యనేత్రములను గాంచి నారు కదా ! నేటినుండి దానము చేయకుండ భుజింప వలదు." అని ధర్మోప దేశము చేయువాడై ఈ గాథలు పలికెను :

వేడినం గూడ నీయగా వీలు కాని
ధనము ప్రియము కాకుండునే తనకు మిగుల ?
శిబి నివాసులు నే డిట జేరినట్టి
సర్వు లీక్షింపు డీ, దివ్య చక్షువులను !

కుడ్యముల, ప్రస్తరంబుల, కుధరముసను
నలుకెలంకుల శత యోజనముల దాక
చొచ్చుకొని పోయి నా కనుల్ చూచు నిపుడు.

త్యాగమును మించి యీ జీవితమున నేది
యుండు ? నాచర్మ చక్షువు లొసగుకతన
దివ్య నేత్రద్వయంబు పొందితిని నేను.

రాష్ట్ర జనులార, ఓ శిబిరాజ, కాంచి
దీని, దానము లొసగుచు తిని తిరుగుచు
ఆర్యమార్గాన స్వర్గంబు నంద గలరు.

రాజావల ప్రతిపక్షముననను పదునైదవనాడు జనమును సమకూర్చి యీ గాథలద్వారా ధర్మోపదేశము చేయుచుండెను. విని జనులు దానాది పుణ్యకార్యములు చేయుచు తుదకు పరలోకమున కరిగిరి.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి," భిక్షువులారా, పురాణ పండితులు బాహ్యవస్తుదానమున సంతుష్టులు కాక, యాచకులకు తమ నేత్రములను పెకలించి యిచ్చిరి" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున సీవకవైద్యుడు ఆనందుడు శక్రుడు అనురుద్ధుడు; పరిషత్తు బుద్ధపరిషత్తు; శిబిరాజు నేనే.

---

# 500. సిరిమంద జాతకము

సిరిమంద ప్రశ్న మహా - ఉమ్మగ (546)

జాతకమున వచ్చును.

———:():———

# 501. రోహంత మిగ జాతకము

శాస్త వేళువనమున విహారము చేయుచు, ఆయుష్మాన్ ఆనందుని జీవన పరిత్యాగమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

అతనిజీవన పరిత్యాగకథ ఋద్ర హంస జాతకమున (533) ధనపాలుని దమనమున వచ్చును. ఈ విధముగా శాస్తకొరకు ఆయుష్మంతుడు ప్రాణ త్యాగము చేసిన పిదప ధర్మసభలో "ఆయుష్మంతులారా, ఆయుష్మాన్ ఆనందుడు శైక్షజ్ఞానము పొంది తథాగతునికొరకు జీవములు విడచినాడు" అనుచుండిరి. శాస్త అచటికి జని, సంగతి తెలిసికొని "భిక్షువులారా, ఇప్పుడే కాదు, ఈతడు పూర్వజన్మమున కూడ నా కొరకు జీవము లర్పించినాడు" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు నపుడు ఆయన పట్టపుదేవి క్షేమ. ఆ సమయమున బోధిసత్త్వుడు హిమా లయమున మృగమై పుట్టి, స్వర్ణవర్ణముతో సుందరముగా నుండెను. అతని తమ్ముడు చిత్తమృగము కూడ సువర్ణ వర్ణముతో నుండెను. చెల్లెలు సుతనా మృగము కూడ బంగరువన్నె కలది. బోధిసత్త్వుడు రోహంతనామమున మృగములకు రాజయ్యెను. అతడు హిమాలయములోని పర్వతపంక్తులను లంఘించి రోహంతసరస్సుకడ ఎనుబదివేల మృగములకు నేతయై వృద్ధులు, అంధులు నైన తలిదండ్రులకు సేవలు చేయుచుండెను.

వారాణసికి కొలదిదూరములో నున్న నిషాదగ్రామమున నిషాద పుత్రు డొకడు హిమాలయమున బోధిసత్త్వుని కనుగొని నిజగ్రామమునకు

మరలి వచ్చి కాలక్రమమున తన మరణసయమున కుమారుని పిలిచి "నాయనా, మన కర్మభూమిలో సలానిప్రదేశమున స్వర్ణ వర్ణమృగ మున్నది. రాజు ప్రశ్నించినచో ఈ సంగతి చెప్పుము" అని పలికెను.

ఒకనాడు క్షేమాదేవి, తెల్లవారుజామున కల కనెను. స్వర్ణమృగము బంగరుపీఠముపై కూరుచుండి బంగరుమువ్వల నాదమువంటి మధురస్వర మున దేవికి ధర్మోపదేశము చేయుచుండెను. ఆమె సాధు, సాధు అనుచు ఉపదేశము వినుచుండెను. ధర్మకథ సమాప్తము చేయకుండగనే స్వర్ణమృగము లేచి వెడలిపోయెను, ఆమె మృగమును పట్టుకొనుడు అనుచు నిద్ర లేచెను. ఆ కేక విని పరిచారికలు నవ్వుచు 'ద్వారములు, కిటికీలు బాగుగా మూసి యున్నవి. గాలి వచ్చుటకు కూడ వీలులేదు. దేవి యిట్టి సమయమున మృగ మును పట్టుకొమ్మనుచున్నది.' అది స్వప్నమని తెలిసికొని రాణి తనలో "స్వప్నమని చెప్పినచో రాజుగారు ఆదరింపరు. నాకు కోరిక పుట్టినది అవి చెప్పినచో ఆదరించి మృగముకై అన్వేషింతురు. అప్పుడు స్వర్ణమృగము వలన ధర్మకథ వినగలను" అనుకొని ఆరోగ్యము లేని విధముగా నటించుచు పండుకొనెను. రాజు వచ్చి చూచి "భద్రే, నీ కేమి బాధ ?" అని యడిగెను.

"దేవా, మరి యేమియును లేదు. కాని కోరిక ఉత్పన్న మయినది?"

"ఏమికావలెను ?"

"దేవా, స్వర్ణవర్ణమృగము చేయు నుపదేశము వినవలె నని కోరిక."

"భద్రే, లేనిదానిపై నీకు కోరిక పుట్టినది, స్వర్ణవర్ణ నామక మగు మృగము లేనే లేదు."

ఆమె రాజువైపు వీపుపెట్టి 'లభింపనిచో నా మరణ మిచ్చుటనే' అనెను. రాజు యోచించి "ఉన్నచో లభించును" అని పలికి, పరిషత్తునకు జని మోర జాతకమున చెప్పినట్లు అమాత్యులను బ్రాహ్మణులను ప్రశ్నించెను. వేట కాండ్రను పిలువనంపి, 'అట్టిమృగ మెవరికైన గనబడినదా' యని యడిగెను. ఆ నిషాదపుత్రుడు తన తండ్రికడ విన్న వాక్కులు వివరింపగా రాజు

"మిత్రమా, నీవు చెప్పినమృగమును గొనివచ్చినచో నీకు మిగుల బహుమానము లభించును. పోయి పట్టుకొని రమ్ము" అని ధన మిచ్చి పంపెను. వాడు "దేవా, నేను దానిని పట్టుకొని రాలేనిచో దాని చర్మము నైన తెత్తును; అదికూడ లభింపనిచో దాని రోమములు తెత్తును. చింతింపవలదు" అని యింటికి బోయి, భార్యాపుత్రులకు ధన మిచ్చి, హిమాలయమునకు వెడలిపోయెను. ఆవల వారు స్వర్ణమృగమును గాంచి, యెచట వల పన్నినచో నది పట్టుపడునో యని యోచింపగా నీరు త్రాగుచోటు మంచి దని తోచి, చర్మముతో దృఢముగా త్రాడల్లి బోధిసత్త్వుడు జలపానము చేయుచోట మేకులతో వల పన్నెను. మరునాడు ఎనుబదివేల మృగములతో పాటు బోధిసత్త్వుడు మేతకై వచ్చి ,నిత్యము నీరు త్రాగుచోట దిగినంతనే ఉచ్చున బడిపోయెను. ఇప్పుడు నే నరచితినేని మృగములు నీరు త్రాగక భయమున బరుగెత్తును, అని తలపోసి నీరు త్రాగుచున్నట్లు నటించుచుండెను. మృగము లన్నియు జలపానము చేసి, పైకి బోయినంతనే, బోధిసత్త్వుడు బంధనము త్రెంచుటకై ముమ్మారు యత్నించెను. తొలిసారి చర్మము పిగిలెను, రెండవమారు మాంసము కోసుకొని పోయెను; మూడవ మారు నరములు పిగికి యెముకలలోనికి బంధనము దిగబొచ్చెను. జాలము తెగకపోవుటచే తాను పట్టుబడినట్లు ఆక్రోశించెను. మృగములు మూడు గుంపులై పరుగెత్తినవి. ఆ మూడు గుంపులలో బోధిసత్త్వుడు కనబడ నందున చిత్తామృగము తన సోదరుని యాక్రోశమే యని తలచి యా తావునకు వచ్చి బందెమున నున్న సోదరుని గాంచెను. బోధిసత్త్వుడు "సోదరా, నీ విచ్చట నాగవలదు. ఇది యపాయస్థానము" అని అతనిని బంపివేయుటకై యీ గాథ పలికెను :

ఓయి చిత్తక, మృగయూథంబు మరణ
భీతిచే పరుగెత్తు; వీతశంకముగ
నీవు పో, జీవించు నీ తోడ నివ్వి.

ఇవి వారి సంవాద గాథలు :

నిను విడనాడను నేను రోహన్త!
రోహన్త, లాగును నా హృదయమ్ము

నేను పోవుట లేదు ని న్విడనాడి—
ఇదె నిజ జీవితం బిచ్చుచున్నాను !

సేవకాభావంబుచే నాదు తల్లి
దండ్రులు మరణింత్రు తప్పకుండంగ
విడు శంక, వారు జీవింత్రు నీతోడ.

ఓయి చిత్తక, మృగయూథంబు మరణ
భీతిచే బరుగెత్తు : వీతశంకముగ
నీవు పో, జీవించు నీతోడ నివ్వి.

అతడు బోధిసత్త్వుని దక్షిణపార్శ్వమున తోడు నిలిచెను. అంతనా మృగము గుంపులలో తన సోదరులను గానక వారి కపాయమొదవి యుండు నని తలచి వెనుదిరిగి వా రున్నచోటికి వచ్చెను. ఆమె వచ్చినంతనే బోధిసత్త్వ డీ గాథ పలికెను :

పట్టువడితి లోహబంధాన నేను—
సత్వరమ్ముగ బొమ్ము శంకలేకుండ,
వా రెల్ల జీవించువారు నీతోడ.

అట్లు పారిపోవుట కామె యంగీకరింపక, వాని వామపార్శ్వమున తోడుగా నిలిచి, ఓదార్చుచుండెను. మృగములు పరుగెత్తుట చూచి స్వర్ణ మృగము పాశమున తగుల్కొనుట గ్రహించి వేటకాడు కాసె బిగించి శస్త్రము ధరించి శీఘ్రముగా నచటకి జేరెను. వానిరాక చూచి బోధి సత్త్వ డీ గాథ పలికెను :

అదె వచ్చు లుబ్ధకు డాయుధసహితు
డై రుద్రరూపాన, నలుగులతోడ
శక్తితో మనలను జంపును నేడు.

వానిని చూచియు చిత్తమృగము పరిగెత్త లేదు, కాని సుతనా మృగము సంబాళించుకొన లేక మరణభీతిచే కొలదిదూరము పరుగిడి, తన

సోదరు లిరువురను విడిచి తా నెచ్చటికి పోగల నని యెంచి ప్రాణములమీది ఆశ విడిచి వచ్చి సోదరుని యెడమవైపున నిలిచెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త ఈ గాథ పలికెను :

భయముచే నించుక పరుగెత్తి మృగము
అవల దుష్కరకార్య మాచరించినది-
నిధనంబు కోసమే నిలిచిపోయినది.

వేటకాడు ఏకగర్భజనితు లైనముమ్వురను ఒకచో గాంచి మైత్రీభావ ముతో "స్వర్ణమృగము పట్టుబడినది. ఈ రెండు మృగములును లజ్జాభయ బంధనముల కట్టువడినవి. ఇతనికి వీ రేమి కావలెను ?" అనుకొని వారి నిట్లు ప్రశ్నించెను :

ఈ మృగమ్ములు నీకు నేమి కావలెను ?
స్వేచ్ఛ కల్గియు బద్ధు జేరి నిల్చినవి
ఆత్మరక్షణకైన యత్నింపకుండ !

బోధిసత్త్వ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను :

ఓయి లుబ్ధక, వీర లుభయులు నాకు
అగుదురు సోదరు, లాత్మరక్షణము
కైనను నను విడనాడకున్నారు.

విని వేటకాడు సౌమనస్యమున మరింత మెత్తబడెను. చిత్రమృగము వానికోమలత్వము గ్రహించి "మిత్రమా, ఈ స్వర్ణమృగమును కేవలము మృగ మని భావింప వలదు. ఈతడు ఎనుబదివేల మృగములకు ప్రభువు; సదాచారసంపన్నుడు, సమస్తప్రాణులయెడ దయకలవాడు, మహాప్రజ్ఞా వంతుడు. అంధులు, వృద్ధులు నగు తలిదండ్రులను పోషించువాడు. ఇట్టి ధార్మికుని నీవు సంహరించినచో తలిదండ్రులను నన్ను, మా చెల్లెలిని సంహ రించినవాడ వగుదువు. నా సోదరునకు ప్రాణదాన మిమ్ము, మాయయి దుగురకు ప్రాణదాన మిచ్చినవాడ వగుదువు" అని ఈ గాథ పలికెను :

సంరక్షకులు లేక చచ్చిపోవుదురు
అంధులు, సోదరు బంధవిముక్తు
జేసి యైదుగుర రక్షింపుము బోయ !

వేటకాడు ఆ ధర్మకథనము విని ప్రసన్నచిత్తుడై "స్వామీ, భయపడ వలదు" అని ఈ గాథ పలికెను :

జననీజనకరక్ష చేయు మృగంబు
విడిచెద, బంధంబు విడిపోవు లెరిగి
హర్ష మొందును గాక అంధజనమ్ము !

"రాజు నా కిచ్చుసంపద యెందులకు? ఈ స్వర్ణమృగమును సంహరించితినేని నా పాదముల క్రింద భూమి బ్రద్దలగును, నెత్తిపై పిడుగైన పడును. ఈ మృగమును విడిచి పెట్టుదును" అనుకొని వేటకాడు బోధిసత్త్వుని సమీపించి మేకులు లాగి చర్మపుత్రాడు కోసెను; పిదప స్వర్ణమృగమును లేవనెత్తి నీటికడకు కొనిపోయి పరుండబెట్టి బంధము విప్పి నరములు నిమిరి నీటితో రక్తము కడిగి మైత్రితో మాటిమాటికిని శరీరము నిమిరెను. వాని మైత్రీభావము చేతను బోధిసత్త్వుని పారమితాప్రభావము చేతను నరములు, మాంసము, చర్మము బాగుపడినవి. పాదమున రోమములు క్రమ్ముకొన్నవి. ఆ తావున కట్టుగీటుకూడ లేకుండ పోయి కాంతి యొదవెను. కాంచి చిత్తమృగము ప్రసన్నమై వేటకాని ననుమోదించు నదై ఈ గాథ పలికెను :

ఈ మహామృగము నే నీక్షించి నేడు
సంతసించెడిరీతి జ్ఞాతులం గూడి
నీవు పొందెదవోయి, నిండుహర్షమ్ము.

అప్పుడు బోధిసత్త్వుడు తనలో "ఈ వేటకాడు నన్ను బంధించుట తన కొరకా, అన్యుని యాదేశమువలననా?" అనుకొని వాని నీ విషయమై ప్రశ్నించెను. "స్వామీ, నాకు మీతో ప్రయోజనము లేదు. రాజుగారి పట్టపురాణి క్షేమాదేవి మీవలన ధర్మప్రసంగము వినగోరుచున్నది. ఆమె కొరకు రాజాజ్ఞవలన మిమ్ము పట్టినాను" అని చెప్పెను.

"మిత్రమా. యిట్లగుచో నన్ను విముక్తిని చేసి గొప్పకార్యము చేసితివి. రమ్ము, నన్ను రాజసన్నిధికి కొనిపొమ్ము దేవికి ధర్మోపదేశమిత్తును."

"స్వామీ, రాజులు కఠోరచిత్తులు. ఏమగునో యెవరు చెప్పగలరు? రాజొసగు సంపదతో నాకు పనిలేదు. మీరు యథాసుఖముగా పొండు."

బోధిసత్వుడు తనలో "వేటకాడు నన్ను విడిచి పెట్టుట ఘనకార్యము. ఈతని కైశ్వర్యము లభించు నుపాయము చూచెదను" అనుకొని "మిత్రమా, నా వీపు నీ చేతితో నిమురుము" అని పలికెను. అత డట్లే చేయగా, చేతి నిండుగా బంగరురోమములు లభించెను. "స్వామీ, ఈ రోమను లేమి చేయుదును ?"

"ఈ రోమములు కొనిపోయి, యివి స్వర్ణమృగరోమములు అని చెప్పి రాజునకు దేవికిని చూపి నా బదులచట నీవు నిలిచి ఈ గాథలతో దేవికి ధర్మోపదేశము చేయుము. వినినంతనే ఆమె కోరిక తీరును."

వేటకాడు "ధమ్మం చర మహారాజా" ఇత్యాది దశధర్మాచరణ గాథలు నేర్చికొని, పంచశీలములు పొంది అప్రమత్తుడై యుండుటకు ఉపదేశము పొంది సెలవు తీసికొనెను. వ్యాధకుమారుడు బోధిసత్వుని ఆచార్యునిగా స్వీకరించి ముమ్మారు ప్రదక్షిణము చేసి, నాలుగుతావుల నమస్కరించి, స్వర్ణకేశములను కమలపత్రమున నిడుకొని బయలుదేరెను. ఆ మూడు మృగములును కొలదిదూరము వానివెంట నరిగి మేత మేసి నీరు త్రాగి తలితండ్రులకడ కరిగినవి. తలిదండ్రులు "నాయనా, రోహంతా, నీవు బందెమున బడితివి గదా, యెట్లు విముక్తుడవైతివి" అని యడుగువారై ఈ గాథ పలికిరి :

దరిసితి మృత్యుసన్నిధి తండ్రి, యెట్లు
లబ్ధ మయ్యె విముక్తి? ఆ లుబ్ధకుండు
ఎట్లు కూటబంధంబు తప్పించినాడు ?

విని బోధిసత్త్వుడు ఈ గాథలు పలికెను :

ఇచ్చి కర్ణసుఖంబు హృదయోద్భవంబు
హృదయంగమం బైన మృదుభాషణమ్ము
లాడి, చిత్రకుడు నన్ వీడి చన్నాడు.

ఇచ్చి కర్ణసుఖంబు హృదయోద్భవంబు
హృదయంగమం బైన మృదుభాషణమ్ము
లాడుచు సుతను నన్ వీడిపోయినది.

ఇచ్చి కర్ణసుఖంబు హృదయోద్భవంబు
హృదయంగమం బైన మృదుభాషణమ్ము
విని లుబ్ధకుడు నన్ను వీడి చన్నాడు.

తలిదండ్రులు అనుమోదించుచు ఈ గాథ పలికిరి :

వేంచేయు రోహంతు వీక్షించి మేము
సంతసించెడురీతి జ్ఞాతులతోడ
వ్యాధుండు సంతోష మందును గాక !

వేటకాడు అడవి వెలువడి రాజకులము చేరి, రాజుకు ప్రణమిల్లి ఒక ప్రక్క నిలిచెను. వానిని చూచి రా జిట్లనెను :

కొనివత్తు మృగచర్మ మనలేద వ్యాధ ?
మరి, కొనిరావు చర్మమ్ము నెందులకు ?

వేటకా డిట్లనెను :

చిక్కిపోయినది నా చేతిలో మృగము
పట్టుపడ్డది కూటబంధంబునందు.
బంధములో నున్న ప్రభునిపార్శ్వంబు
చేరి నిలబడినవి స్వేచ్ఛమృగాలు.
వీక్షించినంత సంవేగమ్ము కలిగె,
పొటమరించెను మేను; పోవు ప్రాణమ్ము
లనిపించె మృగమును దునిమెడునెడల.

ఆశ్చర్యముతో రాజు మాటిమాటికి నిట్లడుగసాగెను :

మృగములన్ మిక్కిలి మెచ్చుకొన్నావు,
వానివర్ణంబులు వానిధర్మములు
వానిశీలము లెట్టివో నిరూపించు !

వేటకాడు బోధిసత్త్వుని స్వర్ణకేశములు రాజుహస్తమున నుంచి ఆ మృగశరీరవర్ణమును ప్రకటీకరించుచు నిట్లనెను :

శ్వేతశృగంబులు శ్వేతరోమములు
చంద్రసమం బైన చర్మంబు, శోణ
చరణముల్, మంజులచక్షువుల్ కలవి
ఆ మృగమ్ములు దేవ ! అట్టివి ! మిగుల
ధర్మము పాలించి, తల్లిదండ్రులను
రక్షించుచుండు కారణమున నేను
తేలేదు వానిని దేవ, యిచ్చటికి,

ఇట్లు వాడు బోధిసత్త్వ, చిత్తమృగ, సుతవామృగీ గుణవర్ణనము కావించి "మహారాజా, ఆ స్వర్ణమృగము తన కాంచనకేశములు నాకిచ్చి, బదులుగా దేవికి ధర్మాచరణగాథ లుపదేశింపవలె నని ఆజ్ఞ యయినది" అని స్వర్ణపీఠముపై గూరుచుండి, యా గాథలు పలికెను. కోరిక నెరవేరి, దేవి శాంతించెను. రాజు ప్రసన్నుడై, వ్యాధకుమారునకు బహుధన మొసగు వాడై యీ గాథలు పలికెను :

నీకు లుబ్ధక! శతనిష్కంబు లిత్తు,
మరి, యమూల్యము లైన మణికుండలములు
ఉమ్మపుష్పాభతో నొప్పుచు నాల్గు
పాదాలు కలిగిన పర్యంక మిత్తు.

సరిసమానం బైన జాయాద్వయంబు
వందగోవులు, బలీవర్దముల్ వంద
ఇచ్చెద : ఉపకృతి యెంతో చేసితివి.

పాపకర్మంబు లీపైన చేయకయె
కృషియొ, వాణిజ్యంబో, ఋణదాన, ముంఛ
చర్య, గుటుంబపోషణ చేసికొమ్ము.

వాడు రాజువాక్కులు విని "దేవా, నేను గృహస్థుగా నున్న లాభము లేదు. ప్రవ్రజింతును. ఆజ్ఞ యొసగుడు" అని అనుమతి వడసి రాజిచ్చినధనము కొనిపోయి భార్యాపుత్రుల కొసగి హిమాలయమునకు జని ఋషి ప్రవ్రజ్య స్వీకరించి అష్టసమాపత్తులు పొంది తుదకు బ్రహ్మలోకగామి యయ్యెను. రాజు బోధిసత్త్వుని యుపదేశానుసారముగా ప్రవర్తించుచు తుదకు స్వర్గగామి యయ్యెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఆనందుడు పూర్వము కూడ నా కొరకు జీవనపరిత్యాగము చేసినాడు" అని జాతకములు సరి పోల్చెను. ఆ కాలమున వేటకాడు ఛన్నుడు; రాజు సారిపుత్రుడు; దేవి ఖేమాభిక్కుని; తలిదండ్రులు మహారాజకులమువారు; సుతన ఉత్పలవర్ణ; చిత్రమృగము ఆనందుడు; ఎనుబవేల మృగసమూహము శాక్యగణము; రోహంతమృగము నేనే.

———:():———

# 502. హంస జాతకము

శాస్త్ర వేళువనమున విహరించుచు, ఆనందస్థవిరుని జీవనపరిత్యాగమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున ధర్మసభలో స్థవిరుని గుణములను గూర్చి చర్చ జరుగుచుండెను. శాస్త్ర యచటికి జేరి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వము కూడ ఆనందుడు జీవనత్యాగము చేసెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బహుపుత్రకు డను రాజు పరిపాలన చేయుచుండగా ఖేమ ఆయనకు పట్టపుదేవిగా నుండెను. ఆ సమయమున బోధిసత్త్వుడు స్వర్ణ హంస కడుపున బుట్టి, తొంబ్బదివేల హంసలకు నేతయై చిత్రకూటమున నివసించుచుండెను. ఉక్త ప్రకారము దేవి కల గాంచి, స్వర్ణ హంసమువలన ధర్మోపదేశము వినవలెనను కుతూహలము రాజుకు తెలిపెను. రాజు ప్రయత్నింపగా స్వర్ణహంసము చిత్రకూటపర్వతమున నున్నట్లు తెలిసెను. రాజు ఖేమ యను సరోవరము నిర్మించి, అచ్చట వివిధ ధాన్యబీజములు చల్లించెను; ప్రతిదినము నలుమూలల అభయఘోషణ చేయించెను. హంసలను పట్టుకొమ్మని వేటకాని కానతి యయ్యెను. తక్కిన విషయములన్నియు మహాహంస జాతకమున (534) వచ్చును. ఇందుగూడ బోధిసత్త్వుడు మేకులు దింపిన వలలో జిక్కుకొని, మెడసారించి, హంసలుపోయిన వైపు చూచెను. హంససేనాపతి సుముఖుడు వచ్చి కానబడినంతనే యతనిని పరీక్షించుటకై బోధిసత్త్వ డీగాథలు పలికెను :

పారిపోవును హంసలు భయవశాన
వక్రతనువులు. హే హేమవర్ణ, హరిత
చర్మ, తల పున్న నీవును చనుము సుముఖ !

నాదు జ్ఞాతిజనంబు బంధమున నున్న
ఒంటివారిని యోచింప కుజ్జగించి
ఎగిరి చనె, నీ వొక్కడ వేల పోవు ?

మే లగుం బారిపోవుచో, జాలమందు
సుముఖ, తోడ్పాటు దొరకదు, సుఖముకొరకు
జతనమున్ మాన కెగిరి పో సత్వరముగ.

అప్పుడు సుముఖుడు పంకముపై గూరుచుండి యీ గాథ పలికెను :

నే విడనాడను నిన్ ధృతరాష్ట్ర !
దుఃఖాన నున్న నీ తోడనే సాగు
మజ్జీవితము కాని, మరణమ్ము కాని.

సుముఖు డిట్లు సింహనాదము చేసినపిదప, ధృతరాష్ట్రు డిట్లనెను :

ఇపుడు నీ వన్నవి యెల్ల ఆర్యునకు
శుభదాయకం బగు సుముఖ, పొమ్మనుచు
నే నన్నమాటలు నిను పరీక్షింప.

ఈ విధముగా వారు సంభాషించుచుండ వేటకాని కొమరుడు కఱ్ఱ పట్టుకొని వచ్చెను. సుముఖుడు ధృతరాష్ట్రు నోదార్చి, వేటకానియెదుటకు పోయి, ఆదరము ప్రకటించి, హంసరాజు గుణములను వివరించెను. తోడనే వానిమనసు మెత్తపడెను. ఇది గ్రహించి సుముఖుడు హంసరాజునెదుటకు పోయి నిలిచెను. వేటకాడు కూడ హంసరాజుకడకు బోయి యీ గాథ పలికెను:

పదములు లేకుండ పయనించునట్లు
పక్షు లాకాశాన పారుచునుండు
అవుదు హంసశ్రేష్ఠుడవు నీవు, కాని
అరయ లేదా దూరమందుండి వలను ?

బోధిసత్త్వుడి ట్లనియె :

జీవిత సంశయస్థితియందు జనుడు
అవనతి కల్గిన నరయంగ జాల
డాసన్నపాశ జాలాదికంబులను !

హంసరాజువాక్కుల నభినందించి కిరాతుడు సుముఖునితో సంభాషించువాడై యీ గాథలు పలికెను :

పారిపోవును హంసలు భయవశాన
వక్రతనువులు- హే హేమవర్ణ, హారిత
చర్మ, నిలిచితి వొకడవే చనకయిచట.

పతు లన్నియు తిని, త్రాగి పరుగువారె
నీవు యోజింప కన్యము, నిలిచినావు !

ఈ విహంగము నీకు నేమి కావలెను ?
పులుగు లన్నియు వీడిపోవుచునున్న,
స్వేచ్ఛ పొందియు రుద్దుచెంత నిల్చితివి ?

సుముఖు డిట్లనెను :

అస్మదాదుల రాజు హంసమ్ము, ప్రాణ
మిత్రమ్ము, సఖుడు, నామేని ప్రాణములు
విడువనందాక నే వీడ నీతనిని.

విని కిరాతుడు ప్రసన్నచిత్తుడై తనలో "ఇట్టి శీలవంతుని విషయమున పాపము తలపెట్టినయెడల నన్ను భూదేవి కబళించును. రాజువలన వచ్చు ధనము నా కేల ? ఈయనను విడిచిపెట్టెదను" అనుకొని ఈ గాథ పలికెను :

ఈతడు సఖుడైన హేతువుచేత
త్యజియింప జీవముల్ తలపెట్టినావు !
విడుతు నీ సఖు, వచ్చు వెంట నీతండు.

ఇట్లు పలికి ధృతరాష్ట్రుని వలలోనుండి లేవనెత్తి, కరుణతో నీటి యొద్దునకు గొనిపోయి, రక్తము కడిగి, నరములు సరిచేసెను. పారమితా ప్రభావముచే హంసపాదములపై చర్మము చక్కబడెను. కట్టువడిన తావున గురుతు లేకుండ పోయెను. సుముఖుడు బోధిసత్త్వుని గాంచి, ప్రసన్న చిత్తముతో అనుమోదనము చేయువాడై యీ గాథ పలికెను :

బంధన ముక్తు డౌ ప్రభువును గాంచి
హంస లన్నియు నేడు హర్షమ్ము నొందు
కరణిని లుబ్ధకా, జ్ఞాతులం గూడి
నీ వందెదవు గాక నిండుముదమ్ము !

విని వేటకాడు "స్వామీ, దయచేయుడు" అనెను. బోధిసత్త్వుడు "మిత్రమా, నీకొరకా, కాక అన్యులయానతి చొప్పుననా వల పన్నినావు?" అని యతని నడిగెను. వాడు జరిగిన సంగతి చెప్పగా బోధిసత్త్వుడు తనలో "నేను చిత్రకూటమునకు బోవుట మంచిదా, నగరమున కరుగుట మంచిదా? నగరమున కేగినచో వ్యాధకుమారునకు ధనము లభించును, దేవికోరిక తీరును, సుముఖుని మిత్రధర్మము ప్రకట మగును. నేను జ్ఞానబలముచే ఖేమ సరోవర ప్రాంతమును భయవిముక్తము చేయవచ్చును. కావున నగరము నకే పోవుట మంచిది" అని నిర్ణయించుకొని "వ్యాధకుమారా, మమ్ము కావడిలో పెట్టుకొని రాజసన్నిధికి గొనిపొమ్ము. ఇచ్ఛ వచ్చినచో రాజు మమ్ము విడుచును" అని చెప్పెను.

"స్వామీ, రాజులు కఠినస్వభావులు. మీ రచటికి పోవలదు."

"మిత్రమా మమ్ము జూచి నీవంటివాడు మెత్తబడినాడు. రాజును ప్రసన్నుని జేయుట కష్టమా? కావున మమ్మచటికే కొనిపొమ్ము."

ఆత డట్లే చేసెను. రెండు హంసలను జూచి నంతనే రాజు ప్రసన్న చిత్తుడై వానిని బంగరుపీటలపై గూరుచుండ బెట్టి మధురక్షీర మిచ్చి మధురజలము త్రాగించెను. అవల చేతులు జోడించి ధర్మోపదేశముకొరకు ప్రార్థించెను. హంసరాజు తొలుత కుశలప్రశ్న మడిగెను. ఇవి వారి ప్రశ్నోత్తరములు :

"కుశలమా ! మీకు ? లోకులకును సుఖమె ?
ధర్మపాలితమె విస్తారరాష్ట్రంబు ?"

"కుశలమే నాకు, లోకులకును సుఖమె
ధర్మపాలితమె విస్తారరాష్ట్రంబు."

"ద్రోహి లేడొక్కొ యమాత్యులయందు నొకడు?
దక్షిణచ్ఛాయావిధంబున నీదు
వైరులు దూరమై వర్ధిలకుంద్రె?"

"ద్రోహియే లేడమాత్యులయందు నొకడు;
దక్షిణచ్ఛాయా విధంబున నాదు
వైరులు దూరమై వర్ధిల్లకుంద్రు."

"నీకు సమానయే నీ భార్య రూప
వతి, పుత్రవతి, ప్రియభాషిణి యగునె?
అనుసరించునె ప్రీతి నాదేశములను?"

"నాకు సమానయే నా భార్య రూప
వతి, పుత్రవతి, ప్రియభాషిణి యగును :
అనుసరించును ప్రీతి నాదేశములను."

"బహుపుత్రు లున్నారె? ప్రజ్ఞలు కలిగి
శాంతముగా నెట్లొ చరియించువారు?"

"నా తనూజాతులున్నారు నూరుగురు :
వారి కర్తవ్యమ్ము వచియింతురేని
వ్యతిరేకముగ నీకు వర్తింపబోరు."

బోధిసత్త్వుడు రాజునకుపదేశమిచ్చువాడై ఈ గాథలు పలికెను :

జాతియు వినయంబు సంభృతంబైన,
వార్ధకంబున యత్నవంతుడౌ వాడు
ఆపత్తిలోన తథ్యమ్ముగా మున్గు.

అస్థిరచిత్తున కగు నుపద్రవము-
బాగుగా రాత్ర్యంధరోగి యౌవాడు
సూక్ష్మవస్తువులను చూడలేనట్లు
తెలియంగనేర డస్థిరుడు సూక్ష్మముల.

సారవంతమును నిస్సారమౌదాని
తలపోయు నెవ్వ డాతని బుద్ధిజారు,
దుర్గమం బగు కొండత్రోవను బోవు
శరభంబు నడుమనే స్రస్త మౌనట్లు.

హీనజన్ముం డగు మానవుం డయ్యు
ఉత్సాహధృతులతో నొప్పునయేని
ఆచారగుణవంతు డైన సిమ్మటను
రాత్రివహ్నివిధాన రాజిల్లుచుండు.

ఈ యుపమానంబు లెల్ల గ్రహించి
పుత్రులకున్ విద్య బోధింపవలయు.
పెరిగెడు రీతిని బీజముల్ వాన
కారున, మేధావి కడువృద్ధి నొందు.

ఈ విధముగా బోధిసత్వుడు రాత్రి యంతయు ధర్మోపదేశము చేయుచుండెను. దేవికోరిక శాంతించెను. అరుణోదయముననే రాజును ప్రతిష్ఠితశీలుని జేసి, అప్రమత్తుడవై యుండు మని యుపదేశ మిచ్చి, బోధిసత్వుడు సుముఖుని వెంటబెట్టుకొని ద్వారమువెంట నీవలకు వచ్చి, చిత్రకూటమునకు జనెను.

శాస్త యిట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, పూర్వజన్మమున గూడ నీతడు ప్రాణపరిత్యాగము చేసెను" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున వ్యాధుడు ఛన్నుడు, రాజు సారిపుత్రుడు, దేవి క్షేమాభిక్షుణి, హంసపరిషత్తు శాక్యగణము, సుముఖుడు ఆనందుడు, హంసరాజు నేనే.

———

# 503. సత్తిగుంబ జాతకము

శాస్త ముద్దకుచ్చిలో మృగప్రదాయమున దేవదత్తుని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

దేవదత్తుడు శిలాఖండమును దొరలించిన పిదప పెంచిక యెగిరి భగవానుని పాదమున గ్రుచ్చుకొనెను. దానివలన చాలబాధ కలిగెను. చూడ వచ్చిన భిక్షువులు గుమిగూడిరి. చూచి భగవానుడు "భిక్షువులారా, ఇచట శయనాసనములకు సౌకర్యము లేదు. గుంపు చేరినది, నన్ను మేనాలో ముద్దకుచ్చికి గొనిపొండు" అనెను. వారు చెప్పినట్లు చేసిరి. జీవకుడు తథాగతుని పాదము నయము చేసెను. భిక్షువులు శాస్తసన్నిధిని గూరుచుండగనే ప్రసంగము ప్రారంభ మాయెను. "ఆయుష్మంతులారా, దేవదత్తుడు స్వయముగా దుష్టుడు; అతని సంఘము కూడ దుష్టము. ఈ విధముగా నతడు దుష్టులతో గలిసి తిరుగువాడు" అనుచుండిరి. శాస్త విషయము తెలిసికొని, "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడేకాదు. పూర్వముకూడ దుష్టు; అతని సంఘముకూడ దుష్టము" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున పాంచాలనామక ప్రభువు ఉత్తరపాంచాల నగరమున రాజ్యము చేయుచుండెను. ఆ సమయమున బోధిసత్త్వుడు అరణ్యములో పర్వతముపై సేమరవృక్షమున శుకరాజపుత్రుడై పుట్టెను. అతనికి సోదరు డుండెను. ఆ పర్వతోపరిభాగమున ఐదువందలమంది చోరులకు నివాసస్థాన మైనగ్రామ ముండెను. క్రిందివైపున 500 మంది ఋషులకు నివాసస్థాన మగు ఆశ్రమ ముండెను. ఆ శుకశాబకములు బయటి కెగురువేళ సుడిగాలి చెలరేగినది. ఆయాఘాతమువలన ఒక చిలుకపిల్ల చోరగ్రామమున పడెను. శస్త్రములనడుమ పడుటచే దానికి గుంబశుక మని పేరు వచ్చెను. రెండవ చిలుక ఆశ్రమములో పుష్పముల నడుమ పడుటచే పుష్పకశుక మని

పేరు వచ్చెను. శక్తిగుంబశుకము చోరులనడుమను పుష్పకశుకము ఋషుల నడుమను పెరుగుచుండెను.

ఒకనాడు రాజు సర్వాలంకార భూషితుడై ఉత్తమరథ మెక్కి చాల మంది పరిజనులతో వేటకై బయలువెడలి నగరమునకు కొలదిదూరముననే ఉన్న పుష్పఫల రమణీయ వనములోనికి బోయి "ఎవని ప్రక్కగా మృగము పారిపోవునో వానిదే బాధ్యత" అని రథము దిగి, తనకొరకు నిర్ణయించి యున్నమాటున ధనుర్ధరుడై నిలువబడెను. జంతువులను లేపుటకై జనులు కోలాహలము చేసినప్పుడు ఒకానొకమృగము పారిపోవుటకు దారి లేక రాజు నిలిచియున్నతావున కొంచెము సందు దొరకుటచే నెగిరిదుమికి పరుగెత్తి పోయెను. ఎవరిప్రక్కగా మృగము పరుగిడినది అని అమాత్యులు పరిశీలింపగా రాజు ప్రక్కనుండి పోయిన దని తెలిసికొని నవ్వసాగిరి. అభిమానవంతు డగుటచే రాజు సహింపలేక, ఇప్పుడే ఆ మృగమును పట్టెద నని రథ మెక్కి శీఘ్రముగా నడుపు మని ఆనతిచ్చి మృగము వెంటనంటెను. అరదము శీఘ్ర ముగా పరుగిడుచుండుటచే పరిజనులు వెనుకబడిపోయిరి.

సారథిసమేతుడై రాజు మధ్యాహ్నమువరకును పోవుచుండెను. మృగము కానబడకుండ పోయినంతనే రథ మాపి, రమణీయకందరము కన బడగా అరద మటు పోనిచ్చి ఆగెను. అది చోరగ్రామమునకు సమీపమున నున్నది. రాజు క్రిందికి పోయి స్నానము చేసి నీరు త్రాగి పైకి వచ్చి, సారథి రథకంబళము తీసి వృక్షచ్ఛాయలో పరవగా దానిపై పండుకొనెను. సారథి ప్రక్కన కూరుచుండి రాజుపాదములు పట్టుచుండెను. రాజుకు నడుమ నడుమ నిద్ర పట్టుచు మెలకువ వచ్చుచుండెను. చోరులు అడవిలోకి పోయిరి. చోరగ్రామమున శక్తిగుంబశుకము, వంట చేయు పటికోలంబుడు మాత్రము మిగిలిరి. సత్తిగుంబుడు గ్రామము వెడలి రాజును చూచినంతనే "ఈతడు నిద్రించుచున్నపుడే ఇతనిని సంహరించి ఆభరణములు గైకొందును" అను కొని పటికోలంబునితో ఈ విషయము చెప్పెను.

ఈ విషయము ప్రకాశింప జేయుటకై శాస్త యీ గాథలు పలికెను:

ఆఖేటలోలుపుం డైన పాంచాల
రాజు సైన్యముతో నరణ్యంబు జొచ్చి
త్రిమ్మరి యొంటిగా దిగబడిపోయె.

చోరకుటీరంబు జూచె, నందుండి
వెలువడి కటువుగా చిలుక యిట్లనియె :
పగటివేళను సూర్యుపగిది వెల్గొందు
రౌతు, వయస్థుడు, రక్తవర్ణంపు
తలపాగ, కుండలాల్ తాల్చినవాడు.

ప్రభువు సారథియును పండుకొన్నారు
మధ్యాహ్నవేళను : మనము వీరలను
ఆక్రమించి, గ్రహింత మాభరణాలు.

శూన్యంబు రాతిరిచొప్పున నిపుడు,
శయనించియున్నారు సారథి, రాజు
వధియించి, హరియించి వస్త్రముల్ కుండ
లమ్ములు, కప్పుము కొమ్మలతోడ.

ఈవలకు వచ్చి చూడగా రాజని తెలిసెను. అతడు తోడనే భయముతో నిట్లు పలికెను :

ఓ సత్తిగుంబ, నీ వున్మత్తువలెను
పలికెదు; జ్వలదగ్నిపార్శ్వముకైన,
జనపతినికటమైనను చేరలేదు !

శుక మాయనతో నిట్లు పలికెను :

ఓ పటికోలంబ, ఉన్మత్తువలెను
గర్జించితివి తొల్త ! కాని నగ్నముగ
ఇప్పు డున్నది తల్లి; ఏవగింపుదువె ?

రాజు కన్నులు తెరచెను. శుక మాతనితో మనుష్యవాక్కున సంభాషించుచుండుట గ్రహించి, అది అపాయస్థాన మని యెంచి, సారథిని లేపి, యిట్లు పలికెను :

సత్వరమ్ముగ లెమ్ము, సారథీ, బండి
కట్టుము; నచ్చ దీపిట్ట : వేగముగ
వేరొకచోటికి వెడలిపోవుదము.

అతడు శీఘ్రముగా లేచి, రథ మాయత్త పరచి యిట్లు పలికెను :

జతచేసినాడను శకటిహయాలు,
బండి యెక్కుడు మహాప్రభు, శీఘ్రముగను
వేరొకచోటికి వెడలిపోవుదము.

రాజు రథ మెక్కగానే సైంధవములు వాయువేగమున పరుగెత్తెను. రథము పోవుచుండుట చూచి సత్తిగుంబశుకము విభ్రాంతి చెంది, యిట్లు పలికెను :

ఎచటి కేగినవార లీయాశ్రమమున
వసియించు నాదు సేవకులు ? పాంచాల
భూపతి పయనించి పోయినవాడు
కనుచూపుమేరలో కానరాకుండ.

చాత, తోమరములు, శక్తులు కొండు :
విడవరా దతడు జీవించియుండంగ.

ఈ ప్రకారముగా శుక మిటు నటు పరుగెత్తుచు అరచుచుండగా రాజు ఋష్యాశ్రమము చేరెను. ఆ సమయమున ఋషులు కందమూలఫలములు తేబోయిరి. పుప్పకశుకము మాత్ర మాశ్రమమున నుండెను. రాజును చూచి శుకము ముందరికి పోయి, స్వాగతము పలికెను.

ఈ యర్థమును ప్రకటీకరించుటకై శాస్త యీ గాథలు పలికెను :

శోణచంచువు కల్గు శుకము వీక్షించి
సంతుష్టచిత్తాన స్వాగతం బనుచు,
మేలు మహారాజ, మీర లిచ్చటికి
నరుదేర 'ఈశ్వరు' లందరి కిచ్చ

తిందుకపుటములో తీయనిపండ్లు
గాలించి తిందువు గాని రాజేంద్ర !
శిఖరి కందరములో శీతలజలము
గ్రోలంగ వచ్చును కోరినయెడల.

ఆశ్రమసేవకు లడవికి జనిరి
కందమూలఫలాలకై ; స్వీకరింపు
మీవె, నాకు కరాలు లేవు కావునను.

స్వాగతమునకు ప్రసన్నుడై రాజు ఈ గాథలు పలికెను :

ఎంతయు ధార్మికం బీవిహంగమ్ము;
పల్కిన దెన్నియో పరుషవాక్యములు
పూర్వస్థలంబున పులుగు; కావునను
అరుగుదెంచితి నిట కచ్చోటినుండి.

రాజువాక్కులు విని పుష్పశుకము ఈ గాథలు పలికెను :

ఉభయులముగూడ నొకమాతృగర్భ
జాతుల, మొక్కవృక్షముమీద పెరిగి
నార, మిర్వురము నానావిధక్షేత్ర
సీమల మేత మేసితిమి! సోదరుడు
సత్తిగుంబడు చోరజనముల గూడె.
ఇటకు వచ్చితి నేను ఋషులసన్నిధికి :
నిజధర్మమును వాడు నెరపుచునుండు.

అంతట ఆ ధర్మమును వ్యాఖ్యానించుచు ఈ గాథలు పలికెను :

వధలు, బంధనములు, వంచనమ్ములును
మోసముల్, గ్రామసంత్రాసనమ్ములును
నేర్చుటయే వాని నిత్యధర్మమ్ము.

ఆసనం బతిధికి వేసెడివాడు
సలిల మిచ్చెడివారు సాకిరి నన్ను.

సంయమాహింసలు సత్యంబు ధర్మ
మెసగును భారత, ఈ యాశ్రమమున.

రాజుకు ధర్మోపదేశము చేయునదై యీ గాథలు పలికెను :

ఎట్టిసంగతి కల్గ అట్టివా డగును,
సత్పురుషుం జేర సజ్జనుం డగును
దుర్జనుం జేరిన దుష్టుడౌ నరుడు.

జను డెట్టివానితో సఖ్యంబు చేయు
అట్టివాడుగ మార్పు నందుట నిజము.

దుర్విషదిగ్ధంబు తూణీర మెల్ల
కలుషితం బొనరించు కరణిని దుష్ట
సేవ్యుండు చెరచును సేవించువారి.

కా దగు ధీరుండు : కాలుష్యభీతి
పాపిసంగతి యొనర్పండు మానవుడు
క్రుళ్ళిన మత్స్యంబు కుశలలో జిక్కి
వ్యాపించునట్టి దుర్వాసనవోలె
కుజనసంసర్గ జుగుప్సాకరంబు.

తగరు పలాశపత్రమునందు బెట్ట
పర్ణంబు పరిమళ భరిత మైనట్లు
ఉత్తమసంసర్గ మొప్పారుచుండు.

కావున భేదంబు గ్రహియించి నరుడు
సజ్జనసంగతి సలుపగా వలయు,
సజ్జనసంగతి స్వర్గదాయకము,
దుర్జనసంగతి దుఃఖదాయకము.

ధర్మోపదేశము విని రాజు ప్రసన్నచిత్తు డాయెను. ఇంతలో ఋషు లరుదెంచిరి. రాజు వారికి ప్రణామము చేసి "పూజ్యులారా, నన్ననుగ్రహించి, నే నుండుతావునకు దయచేయుడు" అని ప్రార్థించి, వారి వాగ్దానము పొంది, నిజనగరమున కరిగి, శుకములను విడిచిపుచ్చెను.

ఋషులుకూడ నగరమున కరిగిరి. రాజు వారి నుద్యానమున దింపి, యావజ్జీవము సపర్యలు చేయించి తుదకు స్వర్గగామి యయ్యెను. ఛత్రము ధరించిన పిదప ఆయన పుత్రుడు కూడ వారికి సేవలు చేసెను. ఆ వంశపరంపరలో ఏడుగురు రాజులు దానధర్మములు చేసిరి. బోధిసత్త్వు డరణ్యావాసము చేయుచు, తుదకు కర్మానుసారముగా పరలోకమునకు జనెను.

శాస్త ఈ ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, ఈ ప్రకారముగా పూర్వముకూడ దేవదత్తుడు దుష్టుడు; అతని సంఘముకూడ దుష్టము" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున సత్తిగుంబశుకము దేవదత్తుడు; చోరులు దేవదత్తుని సంఘము; రాజు ఆనందుడు; ఋషిగణము బుద్ధపరిషత్తు; పుష్పకశుకము నేనే.

# 504. భల్లాటియ జాతకము

శాస్త్ర జేతవనమున విహారించుచు మల్లికాదేవిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శయనవిషయమై యామె యొకనాడు రాజుతో జగడ మాడెను. కోపమున రాజు ఆమెపైపునుండి ముఖము వెనుకకు త్రిప్పుకొనెను. (పెడ మొగము పెట్టెను). రాజు నాయెడ కోపము పూనినాడనుసంగతి శాస్త్రకు తెలియదా అని యామె అనుకొనెను. ఈ విషయము గ్రహించిన శాస్త్ర మరునాడు నిజసంఘముతో భిక్షాటనము చేసి వచ్చినపిదప రాజద్వారము చేరెను. రాజు స్వాగతము పలికి భిక్షాపాత్రము చేత నందుకొని, ప్రాసాదమునకు గొనిపోయెను. భిక్షువులను వరుసగా గూరుచుండ బెట్టి శ్రేష్ఠభోజనము పెట్టించెను. వారిభోజనానంతరము తా నొకప్రక్క గూరుచుండెను "మహారాజా, వార్త లేమి ? మల్లికాదేవి కానబడదేల ?" అని శాస్త్ర యనెను. "నిజసుఖమున మైమరచుటచే" అని రాజు పలికెను. "మహారాజా, పూర్వజన్మములో నీవు కిన్నరగర్భమున బుట్టి, ఒకరాత్రి నీ భార్య విడిగా నుండుటచే ఏడుసంవత్సరములపాటు వ్యధ చెంది దుఃఖించుచుండ లేదా ?" అని, శాస్త్ర రాజుప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలము వారాణసిలో భల్లాటియ నామక ప్రభువు రాజ్యము చేయుచుండగా, అంగారముపై నుడకబెట్టిన మృగమాంసము తినవలె నని యొకనాడు కోరిక కలిగెను. రాజు ప్రభుత్వ మమాత్యుల చేతులలో బెట్టి, పంచాయుధములు ధరించి, సుశిక్షితములైన జాతికుక్కలను వెంటగొనెను. నగరము విడిచి యాతడు క్రమముగా హిమాలయము చేరి, గంగాతీరము వెంట బోవసాగెను. ఆవల పైకి బోవజాలక గంగలో సంగమించు నొకానొక యుపనదివెంట జనుచు, మృగములను అడవిపందులను జంపి మాంసము

వండించి తినుచు, క్రమముగా నొకానొక యున్నతప్రదేశము చేరుకొనెను. రమణీయ మైన ఆ నది నిండుగా నున్నప్పుడు రొమ్మువరకు నీరు వచ్చును; తక్కినవేళల మోకాటిబంటి లోతుండును. దానిలో రకరకముల చేపలు, తాబేళ్ళు తిరుగుచుండును నీటి కీవల తెల్లనివస్త్రమువంటి యిసుక, రెండు తీరములందును రకరకముల పుష్పఫలజాతులు కలవు. పుష్పఫలరసములతో మత్తెక్కిన నానావిధమృగములు, పక్షులు గుమిగూడుచుండును. ఇట్టి రమణీయమైన హేమవతీ నదీతీరమున కిన్నరీకిన్నరులు పరస్పరాలింగనములు, చుంబనములు చేయుచు నానాప్రకార విలాసములలో మునిగి తేలుచుండిరి. రాజు ఆ నదీతీరమువెంట గంధమాదన పర్వతము నెక్కి కిన్నర ద్వయమును చూచెను. వారు రోదనము చేయుచుండుట గమనించి రాజు కుక్క లున్నవైపు కరతాళధ్వని చేసెను. సుశిక్షితము లైన మేలిజాతి కుక్కలు పొదలో పండుకొనియున్నవి. అవి పరధ్యానముగా నున్నట్లు గ్రహించి రాజు ధనుస్సు, ఆయుధములు నిటారుగా నున్నచెట్టు కానించి, కాలిసవ్వడి కానీయక మెల్ల మెల్లన వానికడకు జేరి "యేల మీరు రోదనము చేయుచున్నారు" అని యడిగెను.

ఈ విషయము ప్రకటీకరించుటకై శాస్త యీ గాథలు పలికెను :

భల్లాటియుం డను పార్థివేశ్వరుడు
విడిచి రాజ్యంబును వేటకై వెడలి
దరిసెను గంధమాదన పర్వతంబు
కింపురుషావాస గిరి నిండుగాను
పుష్పముల్ ఫలములున్ పొలుపారుచుండు.

సారమేయగణంబు, చాప బాణములు
వెనుకనే దిగబెట్టి జననాయకుండు
కిన్నరసంఘంబు లున్నట్టి తావు
ప్రాపించె వారితో భాషించుకొరకు.

చలినెలల్ నాలుగు చనినంత హేమ
వతినది యొడ్డున వర్తిలు చేదొ

అన్యోన్యమును మాటలాడుచున్నారు
తెలుపుడు మానవదేహధారులగు
మా మానవులు మిమ్ము నే మని యంద్రు ?

రాజువాక్కులు విని కిన్నరము మాటాడ లేదు. కిన్నర రాజుతో సంభాషించెను :

మసలు దేము త్రికూటాన మల్లగిరిని
పండరం బను హ్రాదినీ పార్శ్వములను
శీతలోదకమే యుండు నీతటినుల
మమ్ము నెంచును మృగములు మనుజులట్లు,
అయిన కిన్నరు లంద్రు వేటాడువాడు.

రా జిట్లనెను :

ఉండి గాటముగనె యుపగూహనంబుల
పడ్చి మొత్తుకొందు రేల ప్రియులు ?
ఆడుగువాడ మిమ్ము నడవిలో ని ట్లసం
తుష్టితోడ నేల దుఃఖ మొంద ?

ఇకముందు వచ్చు గాథలు వారిసల్లాపములు :

ఒక్కరాత్రి యంత సుఖయుల మిచ్ఛ లే
కున్న విడిగ విడిగనుండవలసె.
ఆట్టిరాత్రి మరల నరుదేరు నేమొ యన్
భీతివలన నిపుడు బెగ్గిలుదుము.

మిమ్ము నడిగెద మానిసిమేనివారి
ఒంటిగా చింతలో మీర లుందు రేని
తల్లిదండ్రులు సోదరుల్, ధనము పోవు.

సకలప్రకార వృక్షచ్ఛన్న మైన,
భూధరద్వయ మధ్యభూరిప్రవాహ

యైన యీనది దాటి యావలిగట్టు
ప్రియుడు చేరెను. తనపృష్ఠభాగమున
నేనును జనుచున్నదాననన్ మతిని.

దామముం గట్టి నాస్వామికి వేతు
నను నాశయంబుతో అంకోలకములు
అతిముక్తకము యూథికాది పుష్పనుల
నీవలితీరాన నేరుచునుంటి.

మరియు నుదాలక కురకవమ్ములును
పాటలమ్ములు, సిందువార పుష్పములు
ఈవలితీరాన ఏరుచునుంటి
దామమ్ము కట్టి నాస్వామికి వేయ.

స్వామికి వేయగా దామమ్ము వికచ
సాలిపుష్పంబులు నంతరించితిని.

నేటిరాత్రికి శయనీయ మౌనట్లు
దానిపై విహరింప దగినట్లు మేము
కుప్పవోసితి సాలికుసుమముల్ దెచ్చి.

శుక్ల చందనమును శోణచందనము
అశ్మాన నూరితి నంగరాగంబు
రమియింపగా నిర్వురము చర్చ చేసి.

అపుడు వచ్చెను ప్రవాహమ్ము శీఘ్రముగ,
కుసుమమ్ము లన్నియు కొట్టుకుపోయె.
తటిని నిండెను, నేను దాట లే నైతి.

ఒడ్డున నిల్చితి మొకరి నొక్కరము
వీక్షించుకొనుచు నావేళ నిర్వురము,
ఒకసారి యేడ్చుచు, నొకసారి నగుచు,
గడపితి మారాత్రి కష్టమ్ముతోడ.

ఉదయింప సూర్యుండు నది దాటిపోయి
ఉపగూహనము చేసి, ఉభయుల మొక్క
సారి యేడ్చి మరొక్కసారి నవ్వుదుము.

విడివిడిగా నున్నవేళ భూపాల,
ఏడువందల యేండ్లు మూడు తక్కువగ
ఒక్కరో జిచోట్చట నున్నపక్షమున
పట్టు జీవితమె ! ఎవ్వండు నిల్వంగ
జాలు నిక్కడ ప్రియురాలు లేకుండ ?

“విన్నచో నో సౌమ్య, వృద్ధులవలన
నైన జనశ్రుతినైనను గాని
నిష్కంపముగ జెప్పు నీవయ స్సెంత?”

“అస్మదాయువు వేయిహాయనాల్, పాడు
రోగమ్ము లుండవు; భోగంబు మెండు,
దుఃఖమ్ము స్వల్పమ్ము, తుదిదాక ప్రేమ.

విని రా జిట్లు తలపోసెను : “ఇవి పశుజాతియందు పుట్టియు, ఒక్క రాత్రి వియోగపరిణామ స్వరూపమున ఏడుసంవత్సరములు విలపించు చున్నవి. నేను మూడువందల యోజనముల రాష్ట్రమునకు ప్రభువు నైనను, రాజ్యసంపదలు విడిచి అరణ్యమున వ్యర్థముగా తిరుగుచున్నాను. ఓహో ! నా జీవితము నిష్ఫలము !” ఇట్లనుకొని వారాణసికి మరలిపోయెను. అమాత్యులు చూచి “మహారాజా, హిమాలయమున తాము చూచిన వింత లేమి ?” అని యడిగినపుడు రాజు సమస్తము వివరించి, దానాదిపుణ్యకార్యములు చేయుచు భోగము లనుభవించుచుండెను.

ఈ యర్థమును ప్రకటించుటకై శాస్త యీ గాథలు పలికెను :

విని ఖల్లాటియ విభుడు శీఘ్రముగ
వెనుకకు దిరిగెను వేటాడకుండ
అనుభవించుచు పురి నఖిలభోగములు
అంతమ్మువరకు దానాదిక మిచ్చె.

కలహించకుండ సుఖంబుగ నుండు,
డాత్మదోషముచేత ననుతాప మొంద
వలదు, కింపురుషులవలె నొక్కరాత్రి
దోషకారణమున దుఃఖించునట్లు.

మోదాన నుండుడు వాదముల్ లేక-
ఆత్మదోషముచేత ననుతాప మొంద
వలదు కింపురుషులవలె నొక్కరాత్రి
దోషకారణమున దుఃఖించునట్లు.

మల్లికాదేవి తథాగతుని ధర్మోపదేశము విని, పీఠమునుండి లేచి, తథాగతుని స్తుతి చేయునదై యీ గాథ పలికెను :

వింటిని భవదీయ వివిధార్థభరిత
వాక్కులు శ్రద్ధతో, వ్యర్థ పోవునట్లు
ఒసగుమా శ్రమణ ! నా కుపదేశ, మీవు
అగుము చిరంజీవి వానందదాత !

అప్పటినుండి కోసలనరేశుడు ఆమెతో కలసి మెలసి యుండెను.

శాస్త యీ ధర్మోపదేశనము చేసి, రెండు జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున కిన్నరుడు కోసలనరేశుడు, కిన్నరి మల్లికాదేవి, భల్లాటియ రాజు నేనే.

— ౧ —

# 505. సోమనస్స జాతకము

శాస్త జేతవనమున విహరించునపుడు దేవదత్తుడు చేసిన హత్యాప్రయత్నమునుగూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున శాస్త "భిక్షువులారా, ఇతడు ఇప్పుడే కాదు, పూర్వముకూడ నన్ను వధించుటకై ప్రయత్నము చేసినాడు" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున కురుదేశమున ఉత్తరపాంచాలనగరములో రేణు నామకప్రభువు పరిపాలన చేయుచుండెను. ఆ సమయమున మహారక్షితు డను తపస్వి 500 మంది తాపసులతో హిమాలయమున నివసించుచు ఉప్పుపులుసు కొరకు విచరించుచు పాంచాలనగరము చేరెను. అచటి రాజోద్యానమున విడిసి అనుయాయులతో భిక్షాటనార్థము బయలువెడలి రాజ ద్వారముకడ నిలిచెను. ఋషిమండలిని చూచి వారి చర్యలను చూచి రాజు ప్రసన్నుడై వారిని కొనిపోయి అలంకృతమైన ఉన్నతస్థానమున కూరుచుండ బెట్టి సష్టుగా భోజనము పెట్టించి "పూజ్యులారా, ఈ వర్షాకాలమున మా యుద్యానములో ఉండుడు" అని ప్రార్థించెను. ఆవల ఉద్యానమునకు జని నివాసము లేర్పరచి ప్రవ్రజితులకు వలసిన వస్తువులు సమకూర్చి ప్రణామము చేసి వెడలిపోయెను. నాటినుండి తాపసులు రాజభవనముననే భోజనములు చేయుచుండిరి.

రాజునకు సంతానము లేదు. పుత్రేచ్ఛ యెంత యున్నను కుమారుడు కలుగలేదు. వర్షాకాలము సమాప్తినొంది నంతనే మహారక్షితుడు రాజుతో "మహారాజా, ఇప్పుడు హిమాలయము రమణీయముగా నుండును. అచటికి

పోవుదుము'' అని సెలవు వేడెను. రాజు సన్మానపూర్వకముగా వారికి వీడుకోలిచ్చెను. మార్గమున పోవుచుండగా మధ్యాహ్నమగుటచే మహారక్షితుడు మహావృక్షముక్రింద శీతలచ్ఛాయలో అనుయాయులతో సహా కూరుచుండెను. తాపసులు ఇష్టాగోష్ఠిచేయు చుండిరి. 'రాజవంశమును రక్షించు పుత్రుడు లేడు; సుపుత్రుడు కలిగినచో పరంపర విచ్ఛిన్నము కాకుండును' అనుచుండిరి. మహారక్షితుడు విని రాజుకు పుత్రుడు కలుగునో కలుగడో యని ధ్యానింపగా కలుగు నని తోచినది. తోడనే వారితో ''మీరు చింతింపవలదు. నేటి తెల్లవారుజామున దేవపుత్రు డొకడు ఆ లోకమునుండి జారి పట్టపు రాణి కడుపున పడును'' అని పలికెను. ఈ మాటలు విన్న కుటిలతపస్వి యొకడు తనలో ''ఈ విషయము తెలిపి రాజపరివారమునకు విశ్వాసపాత్రుడ నగుదును'' అనుకొని తపస్వు లందరు ప్రయాణ మైనపుడు తనకు జబ్బుగా నున్నట్లు నటించి పండుకొనియుండెను. లేచి రమ్మని పిలుపు రాగా 'రాజాలను' అని అతడు పలికెను. మహారక్షితుడు తత్కారణము గ్రహించి రాగలిగి నప్పుడే రమ్ము అని ఋషిగణమును తోడ్కొని హిమాలయమున కరిగెను.

ఆ మాయావి క్రమముగా రాజద్వారము చేరి మహారక్షితుని సేవక తపస్వి వచ్చినా డని వార్త పంపెను. రాజు తోడనే అతనిని ప్రాసాదము మీదికి పిలువనంపి వచ్చినపిదప, పరచిన ఆసనముపై కూరుచుండ బెట్టి, ఆ మోసగానికి ప్రణామము చేసి ఒకప్రక్క నిలిచి ఋషుల యోగక్షేమ మడిగి ''భన్తే, మిగుల శీఘ్రముగా మరలి వచ్చినారే ! కారణ మేమి ?'' అని యడిగెను.

''అవును మహారాజా, ఋషులు సుఖముగా కూర్చుండి ఇష్టాగోష్ఠి చేయుచు తమవంశ పరంపరాభివృద్ధి చేయుటకు పుత్రుడు కలుగునా కలగడా ? అని విచారించుచుండిరి. ఆ మాటలు విని నేను ధ్యానము వహించి యోచింపగా మహాప్రతాపవంతు డగు దేవపుత్రు డొకడు ఆ లోకమునుండి చ్యుతుడై సుధర్మాదేవి గర్భమున ప్రవేశించును అని నా దివ్యచక్షువునకు కానవచ్చినది. అజ్ఞానవశమున గర్భము నష్ట మగునేమో యని జాగరూకత కొరకు మీకు సూచన లిచ్చుటకై వచ్చినాను. మంచిది. మహారాజా, ఇక నేను పోవుదును'' అని పలికెను. ''భన్తే, పోవుటకు వీలు లేదు'' అని రాజు

ప్రసన్నచిత్తముతో ఆ మాయావిని ఉద్యానమునకు గొనిపోయి నివాసస్థాన మేర్పాటు చేసెను. నాటినుండి ఆతడు రాజకులముననే భోజనము చేయు చుండెను. అతనికి దివ్యచక్షువు అని పేరు వచ్చెను.

ఆ సమయమున త్రయస్త్రింశభవనమునుండి చ్యుతుడై దేవపుత్రుడు రాణిగర్భమున బడెను. బిడ్డడు పుట్టి నామకరణమునాడు సోమనస్స కుమారుడు అని పేరు పొందెను. ఉద్యానములో కుటిలతపస్వి ఒకమూల కాయ గూరలు పండించుచు వ్యాపారులకు అమ్మకము చేసి ధనము సమకూర్చు కొనుచుండెను. బోధిసత్త్వునకు ఏడుసంవత్సరముల ఈడు వచ్చినపుడు రాష్ట్రములో నొకచోట తిరుగుబాటు రేగెను. దివ్యచక్షుతపస్వియెడల ఔదాసీన్యము కలుగకుండునట్లు హితము చెప్పి రాజు సరిహద్దు ప్రదేశమును శాంతపరచుటకై బయలుదేరెను.

రాజకుమారు డొకనాడు దివ్యచక్షువును చూచుటకై ఉద్యానమునకు బోవగా కుటిలతపస్వి నడుము కట్టి రెండు చేతులలో నీళ్ళకుండలు పట్టుకొని పోయి కూరగాయమడులపై చల్లుచుండుట కానవచ్చెను. శ్రమణధర్మమును మాని ఈ దుష్టుడు తోటమాలి పని చేయుచున్నా డని యేవగించుకొని "ఓయిగృహస్థూ, తోటమాలి యేమి చేయుచున్నాడు" అని వానిని సిగ్గుపరచి ప్రణామము చేయకుండనే వెడలిపోయెను. దుష్టతపస్వి తనలో "ఈ రాజకుమారుడు ఇప్పుడే వైరము పూనినాడు ముందుముందు ఏమి చేయునో! కావున వీనిని ఇప్పుడే సంహరింప జేయవలెను" అనుకొని, రాజు వచ్చినతరువాత రాతిముక్కతో జలఘటము పగులగొట్టి పర్ణకుటీరములో పచ్చగడ్డి యిటునటు విరజిమ్మి ఒడలిపై నూనె పూసికొని ముసుగు తన్ని బాధాగ్రస్తుడైనట్టు మంచముపై పండుకొనెను. రాజు నగరప్రదక్షిణము చేసి రాజభవనములోనికి జనకుండనే దివ్యచక్షుసందర్శనార్థము కుటీరద్వారము చేరెను అచట గందరగోళముగా నుండుటచే నేమిది యని లోనికి బోయి తపస్వి పండుకొని యుండుట గమనించి ఆయనపాదములు నొక్కుచు ఈ గాథ పలికెను :

నిను బాధపెట్టుచు నిందించె నెవడు ?
కత మేమి యప్రసన్నతకు ? ఈనాడు

ఎవ్వని తలిదండ్రులు లేడ్వంగ వలయు
క్షితిమీద శయనించు మృతు డయి యెవడు ?

విని దుష్టతపస్వి ప్రేలుచు లేచి, యీ గాథ పలికెను :

సంతుష్టి దేవ, నీ సందర్శనమున !
బహుకాలమునకు భూపాల, దర్శనము !
నీతనూజాతుండు నిష్కారణముగ
దండించె నను రేణుధారుణీనాథ !

ఇక ముందు వచ్చుగాథల క్రమము స్పష్టము :

ద్వారపాలురు ఖడ్గధారు లేతెండు !
అంతఃపురములోని కరిగి ఘాతుకుడు
సౌమనస్య కుమారు సంహారింపుండు—
ఖండించి తన్మస్తకము కొని రండు !

అన నిట్లు, దూతలు చని, "రాజపుత్ర!
నిను త్యజించినవాడు నీ జనకుండు,
సంఘటిల్లును నీదు సంహారమిపుడు".

జోడించి చేతులు సోమనస్సుండు
పరిదేవనముతోడ పలికెను : "రాజ
సందర్శనము చేతు, చంపకుండంగ
నను గొనిపొండు భూనాయకుకడకు."

రాజకుమారుని రాజుసన్నిధికి
వారలు కొని పోయినారు; దూరంబు
నుండియే యిట్లనె : "ఓ మహారాజ,
ఖడ్గధారులు చోరఘాతకుల్ నన్ను
ఖండింప వచ్చును; కాని యీనాడు
ఏయపరాధాని కీశిక్ష నాకు ?"

రాజు "భవాగ్రుడు నీచుడు; నీదోషము వానిదోషముకన్న గొప్పది" అని అతని యపరాధమును జూపువాడై యీ గాథ పలికెను :

ఉభయవేళలయందు– ఉదయాన, సందె
నాచరించుచునుండు నగ్నికార్యంబు,
సలిలంబు గొని వచ్చు సంయమి, బ్రహ్మ
చారిని దూషింతె సంసారి వనుచు ?

అప్పుడు రాజకుమారుడు "దేవా, గృహస్థునే గృహస్థు అన్నాను. ఇందు నా దోష మేది ?" అని యీ గాథ పలికెను :

కందమూలఫలాదికము సంతరించి
సంయమి కుటిలోన చాటున దాచు,
పారు డైనాడు సంసారి యీ రీతి !

"నేనుగూడ ఇతనిని గృహస్థు అన్నాను. విశ్వాసము లేనియెడల నాలుగుద్వారములకడ నుండు తోటమాలుల నడిగింపుడు."

రాజు వారిని ప్రశ్నించెను. వారు "చిత్తము, మేము ఈయనకడ పత్రపుష్పఫలములు కొన్నా" మని విన్నవించిరి. తాము కొన్నసామగ్రులు తెచ్చి రాజు నెదుట బెట్టిరి. వస్తువుల నమ్ముటచే వచ్చినధనమును పర్ణశాలలో దాచిపెట్టిన దానిని సంచితో దెచ్చి జనులు రాజునకు జూపిరి. అందు కార్షాపణములు, మాషములు కలవు. బోధిసత్త్వుని నిర్దోషిత్వమును గ్రహించి రా జీగాథ పలికెను :

నిజమె పల్కితి వోయి నీవు కుమార !
బహువస్తు సంగ్రహ పాపంబువలన
సంసారి యైనాడు సంయమీంద్రుడు.

అపుడు బోధిసత్త్వుడు తనలో "మూర్ఖు డగు నిట్టి రాజుకడ నుండుట కంటె హిమాలయమునకు బోయి ప్రవ్రజించుట మేలు. జనులయెదుటనే యితని దోషము బహిరంగ పరచి, అనతి వడసి, నేడే పోయి ప్రవ్రజింతును" అనుకొని, జనులకు నమస్కారము చేసి, యిట్లు నివేదించెను :

జనపదంబులనుండి చనుదెంచినట్టి
జనులార! వినవలె : జనపతి మూర్ఖు
మాటలు విని నాకు మరణదండనము
విధియించినాడు వివేచనలేక.

ఇట్లు పలికి, రాజానుజ్ఞ వడయువాడై యీ గాథ పలికెను :

జనియించినాడ విశాలంబు, దృఢము
ప్రణదుర్ఘటం బగు వంశశాఖికను.
పాదాభివందన మోదేవ, యిందు
భవదనుజ్ఞను నేను ప్రవ్రజింపంగ.

ముందు వచ్చుగాథలు రాజుకు, కుమారునకు నడిచిన ప్రశ్నోత్తరములు:

అనుభవింపు కుమార, అన్నిభోగములు,
నిఖిలసంలిదలను నీ కొసంగెదను
రాజు జేతును కురు రాష్ట్రీని కిపుడె
ప్రవ్రజ్యవల, దది బాధాకరంబు.

ఇచ్చట మీకడ నేమి భోగములు ?
దేవ, కంటిని మున్నె దేవలోకమున
పంచేంద్రియానంద పారవశ్యంబు !

దేవలోకమునందు దేవ, పూర్వంబె
అఖిలభోగమ్ముల ననుభవించితిని
అచ్చట నాచుట్టు నప్సరోంగనలె,
బుద్ధులు మార్చు ప్రబుద్ధులే యిచట :
ఈ రాజకులమునం దే నుండజాల !

బోధిసత్త్వుడు రాజున కుపదేశ మిచ్చువాడై యీ గాథలు పలికెను:

అవిచారితమ్ముగా నైన కార్యంబు
అనుచిత భైషజ్యమట్టు లొసంగు
దుష్టవిపాకంబు తుది తప్పకుండ.

యోజించి చేసిన యుక్త కార్యంబు
ఉచిత వైద్యం బట్టు లొసగు సత్ఫలము.

యోజించి కార్యంబు లొనరింపదగును
క్షత్రియుం డైన, విశాంపతు లైన
అట్లు చేసిన యశం బభివృద్ధి యగును.

యుక్తదండన మిచ్చు టొప్పును రాజు :
త్వరపడి చేసిన దండనవలన
అవల పశ్చాత్తప్తు డగుట నిజంబు.

అనుతాప మొందగా నక్కర లేని
కార్యంబు చేయ విజ్ఞానులు మెత్తు,
రగు సుఖదాయకం బట్టికృత్యంబు-
బుద్ధానుమోదంబు పొందును కూడ.

కాషాయవస్త్రముల్ ఖడ్గముల్ దాల్చి
ద్వారపాలురు దేవ, తాపకీనాజ్ఞ
బడసి నన్ జనయిత్రి పార్శ్వంబునుండి
హేరాజ, బల్మిమై నీడ్చినవారు.

మరణభీతిని చవి చూచి మధురజీవి
తమ్ము బడిసితి, భూరికష్టమ్ముమీద
ఈ దినమ్మున వధ తప్పె : ఇంక నేను
పూనువాడను ప్రవ్రజ్య భూమిపాల !

తరుణవయస్కుండు కరుణాళు లితడు :
ఇతని సుధర్మ, నే నెంత వేడినను
నిష్ప్రయోజన మాయె : నీ వొకసారి
అరుగుము సముచితం బని తోచునెడల.

ప్రవ్రజ్య ప్రోత్సహించునదై యామె యీ గాథ పలికెను :

నాయనా, భిక్షాటనంబు చేయుచును
ధర్మప్రకారము తలపోసి మిగుల,
ప్రవ్రజ్య కావించి, పర్యటనంబు
సలుపుచుండుము బిడ్డ! సర్వజీవముల
యెడ దండనము మాను నెడ ననిందితుడ
వై, బ్రహ్మలోకంబు నందుకో గలవు.

అంతట రా జిట్లనెను :

ఏమి వింత సుధర్మ, యిది! నన్ను మిగుల
వ్యథితు జేసితివి, ప్రవ్రజ్య నూనుండు
మానునట్లుగ జేయుమా, అంటి; నీవొ
పుత్రుని మిక్కిలి ప్రోత్సహించితివి.

బోధిసత్త్వుని ధర్మోపదేశానంతరము రాజు దేవిని బిలువ నంపి,
ఈ గాథ పలికెను :

దేవి మరల నిట్లనెను :

ఎవ్వ రనవద్యు లౌభోక్త, లెవరు ముక్తు
లట్టివారలు లోకమం దనుసరించు
నార్యమార్గము జేరిన యాత్మజాతు
వారణము చేయగా లేదు వాంఛ నాకు.

ఆమె వాక్కులు విని రాజీగాథ పలికెను :

ఎవరు బహుశ్రుతు, లెవ్వరు ప్రజ్ఞ
కలవారు, యోజనాకలితులు, వారి
సంసర్గ మెంతయు సముచితం బగును.
అట్టివారలవాక్కు లాలించి యితడు
స్వల్పేచ్ఛువును శోకవర్జితుం డయ్యె.

బోధిసత్త్వుడు తలిదండ్రులకు నమస్కరించి, తనవలన అపరాధ మే మయిన జరిగినచో క్షమింపవేడి, జనులకు నమస్కరించి, హిమాలయాభిముఖు డయ్యెను. లోకులు వెడలిపోయిన పిమ్మట దేవత మానవ రూపమున వచ్చి యతనిని సప్తపర్వతశ్రేణులను దాటించి, హిమాలయమునకు గొనిపోయెను. అచ్చట విశ్వకర్మ నిర్మించిన పర్ణశాలలో జేరి యతడు ఋషిప్రవ్రజ్య పరిగ్రహించెను. దేవతామండలి పదునారేండ్ల రాజకులపరిచారికారూపమున నతనికి పరిచర్యాపరమై యుండెను.

దష్టతపస్విని జనులు కొట్టి చంపివేసిరి. బోధిసత్త్వుడు ప్రాప్తధ్యానుడై క్రమముగా బ్రహ్మలోకగామి యయ్యెను.

బోధిసత్త్వ డీ ధర్మోపదేశనము చేసి "భిక్షువులారా, ఈ ప్రకారముగా నితడు పూర్వజన్మమున కూడ నన్ను వధింప యత్నించెను" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున మాయావితపస్వి దేవదత్తుడు; మాత మహామాయ, రక్షితుడు సారిపుత్రుడు, సోమనస్సకుమారుడు నేనే.

———:():———

# 506. చంపేయ్య జాతకము

శాస్త జేతవనమున విహరించునపుడు ఉపోసథకర్మను గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ సమయమున శాస్త "ఉపాసకులారా, ఉపోసథ వ్రతముపూనుట మంచిపని. పురాణపండితులు నాగసంపత్తిని కూడ విడిచి, ఉపోసథవాసము చేసిరి" అని వారి కోరికపై పూర్వజన్మవృత్తాంతము చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున అంగరాష్ట్రమును అంగరాజు, మగధరాష్ట్రమును మగధరాజు పరిపాలన చేయుచుండిరి. ఆ రెండు రాష్ట్రములకును నడుమగా చంపానది కలదు. అచట నాగభవనమును చంపేయ్యనామక నాగరాజు పాలించుచుండెను. అంగరాజ్య మగధరాజ్యములు అప్పుడప్పు డొకదాని నొకటి జయించుచుండెను.

ఒకనాడు మగధరాజు అంగరాజుతో యుద్ధమున నోడిపోయి, గుర్ర మెక్కి పరుగిడుచుండ, అంగరాజు సైనికు లాతని వెన్నంటినట్లు తెలియు ఉచే నిండుగా నున్న చంపానదిని జూచి "శత్రువుల చేత బడి మరణించుట కన్న నదీజలమున మరణించుట మంచిది" అనుకొని, గుర్రముతో నదిలోనికి దిగెను. ఆ సమయమున చంపేయ్య నాగరాజు సలిలములో నిర్మించుకొన్న రత్నమంటపమున పరివార మధ్యమున గూరుచుండి, పానగోష్ఠి చేయు చుండెను. రాజుతో గుర్రము నీట మునిగి, నాగరాజు సన్నిధిలో నిలిచెను. నిండు దుస్తులతో నున్న రాజును గాంచినంతనే స్నేహముప్పతిల్లి నాగరాజు "రాజన్, భయపడవలదు" అని పీఠమునుండి లేచి, నిజపీఠమున నాతనిని గూరుచుండబెట్టుకొని, జల ప్రవేశమునకు కారణమడిగెను. అప్పుడు రాజు జరిగిన దంతయు చెప్పెను. నాగరాజు ఆయన నూరడించి "రాజా, భయము

వలదు. నీకు నేను రెండు రాజ్యములను వశపరచెదను" అని చెప్పి సప్తాహము పాటు అచ్చట వివిధభోగములతో కాలము గడిపి ఆవల రాజును వెంట గొనిపోయెను. నాగరాజ ప్రభావముచే మగధరాజు అంగరాజును పట్టి సంహరించి రెండు రాజ్యములను తానే పరిపాలింప సాగెను. నాటినుండి వారి కిరువురకు మైత్రి గాఢ మయ్యెను. ప్రతి సంవత్సరము రాజు చంపానదీతీరమున రత్నమంటపము వేయించి బహుధనము వెచ్చించి నాగరాజుకు బలి పూజ చేయించెడివాడు. నాగరాజు చాలమంది అనుయాయులతో నాగభవనము వెలువడి బలి స్వీకరించు చుండెడివాడు. జనసమూహము నాగరాజు సంపదను విలోకించు చుండెడిది.

ఆ సమయమున బోధిసత్త్వుడు పేదకుటుంబమున పుట్టి పెరిగి రాజ పరివారమువెంట ఆనాడు నదీతీరమునకు బోయి నాగరాజు వైభవము చూచి లోభగ్రస్తుడై ఆ సంపదపై కోరిక పెట్టుకొనెను. బోధిసత్త్వుడు దాన మిచ్చి శీలరక్షణము చేసి చంపేయ నాగరాజు చనిపోయిన యేడవ నాడు చ్యుతుడై నాగరాజు నివసించు ప్రాసాదమున శయ్యాస్థానముపై జన్మించెను. అతని శరీరము పుష్పమాలికవలె వికసించియుండెను. చూచి పశ్చాత్తాపము చెంది మరణింపదలచి "నేను చేసిన కుశలకర్మ ప్రభావము వలన ఆరుకామలోకములలో గదులలో నింపిన ధాన్యమువలె సంపద నిండి యున్నది. నేను ఈ కీటకముగా జన్మించి బ్రతికియున్నను లాభ మేమి!" అనుకొనెను. సుమన అను నాగకన్య అతనిని జూచినంతనే శక్రుం డిట్లు పుట్టె నని భావించి మిగిలిన నాగకన్యలకు సంకేతము చేసి వివిధవాద్యములతో ఆతనియెదుట గుమి గూర్చెను. అతనికొరకు నాగభవనము శక్రభవనముగా మారెను. ఆతడు సర్పశరీరము విడనాడి సమస్తాలంకారభూషితుడై శయ్యపై కూరుచుండెను. ఆతనికి మహైశ్వర్య మబ్బెను. ఆతడు నాగలోకమును పరిపాలించుచు ఒకనాడు పశ్చాత్తాపము చెందెను. "నే నీకీటక శరీరమున నున్న లాభ మేమి. ఉపోసథవ్రత మవలంబించి ఈ లోకమునుండి విముక్తుడనై మానవలోకమునకుజని ఆర్యసత్యజ్ఞానలాభ మొంది దుఃఖము నంత మొందింతును" అనుకొని ఆ ప్రాసాదముననే యుండి నాటినుండి ఉపోసథవ్రతము ప్రారంభించెను. అలంకృతనాగకన్యలు ఆతనిప్రక్కగా జనుచుండిరి. శీలరక్షణ మించుమించు భ్రష్ట మైన ట్లయ్యెను. అప్పు డతడు ప్రాసా

దము వెలువడి ఉద్యానమునకు పోవజొచ్చెను. నాగకన్యలు అచ్చటికిగూడ వచ్చుచుండిరి. ఉపోసథవ్రతము భ్రష్ట మయ్యెను. "ఈ నాగభవనము వెలువడి మానవలోకమునకు జని వ్రత మాచరించుట అవశ్యకము" అని తలపోసి వ్రతదినములలో ఆతడు నాగభవనము వెలువడి మానవలోకమున ఒకానొక సరిహద్దుగ్రామ సమీప మహామార్గమున పెద్దపుట్టలో దూరి ఉపవాసథవ్రత మాచరించుచు "ఎవరైనను నా చర్మమును కోరినచో కోసికొని పోవచ్చును. ఎవరైనను నన్ను క్రీడాసర్పముగా కొనిపో దలచినచో అట్లే చేయవచ్చును" అనుకొని తన శరీరము దానము చేయువాడై పడగవాల్చి పండుకొనెను. మహామార్గమున పోవువారు నాగము కనపడినంతనె గంధ మాల్యాదులతో పూజ చేసి పోయెడివారు. సరిహద్దు గ్రామవాసులు అది సామాన్యసర్పము కాదనియు మహావ్రతాపవంతు డగు నాగరాజనియు గ్రహించి మండపము కట్టించి నాలుగుప్రక్కల ఇసుక చల్లి గంధాదులతో పూజించెడివారు. జనసామాన్యము బోధిసత్త్వుని యెడల శ్రద్ధాభక్తులు కలిగి పూజలు చేయుచు పుత్రసంతానము కొరకు ప్రార్థనలు చేయుచుండిరి. చతుర్దశి పూర్ణిమా తిధులలో బోధిసత్త్వుడు ఉపవాసవ్రత మాచరించుచు పుట్టమీదికి వచ్చి క్రమముగా నాగభవనమునకు బోయెడివాడు. ఈ విధముగా కాలము గడచుచుండెను.

ఒకనాడు సుమన పట్టపుదేవి "దేవా, తాము మానవలోకమునకు బోయి వ్రతమాచరించుచున్నారు. అది భయశంకలకు తావు. మీకు ఏదైన అపద కలిగినచో మా కెట్లు తెలియగలదు ?" అనెను. ఆత డామెను మంగళ పుష్కరిణి యొద్దునకు గొనిపోయి "భద్రే, యెవరైనను నన్ను కొట్టి కష్ట పెట్టినచో ఈ పుష్కరిణీ జలము మలిన మగును. గరుడుడు నన్ను పట్టుకొని పోయినచో నీరు ఇగిరిపోవును. పాములవాడు నన్ను పట్టుకొనిపోయినచో నీరము రక్తవర్ణము దాల్చును" అని సూచనచేసి చతుర్దశి ఉపోసథవ్రతము పట్టి నాగభవనము వెలువడి పుట్టపైకి పోయి పండుకొనెను. నాగశరీర కాంతిచే వల్మీకము సుశోభిత మయ్యెను. వెండిగొలుసువలె ఆయన దేహము తెల్లగాను, శిరస్సు రక్తకంబళపు చుట్టవలెను ప్రకాశించుచుండెను.

అప్పుడు వారాణసీనివాసి తక్షశిలలో విద్యలు నేర్చి మంత్రవిద్య కూడ అభ్యసించి ఇంటికి తిరిగి వచ్చుచు మార్గముప్రక్క పుట్టపై బోధి

సత్త్వుని చూచి "ఈ సర్పమును పట్టుకొని గ్రామ, నిగమ నగరాదులలో ప్రదర్శించుచో ధనము సంపాదింప వచ్చును" అనుకొని దివ్యౌషధి కొని దివ్యమంత్రము జపించి సర్పముకడకు జనెను. దివ్యమంత్రము చెవి బడినంతనే బోధిసత్త్వునకు చెవులలో తప్తశలాక దూర్చినట్లయ్యెను, శిరస్సుపై నొక్కినట్లయ్యెను. అంత నాగము శిరసు పైకెత్తి యెవరని చూచి, పాములవాడని గ్రహించినంతనే తనలో "నా విషము మహాభయంకరము! నేను శీత్కారము చేసినచో నితని శరీరము భస్మీభూతమై గుప్పెడు ధూళిగా చెదరి పోవును. ఇట్లగుచో నా శీలము కొంత కుంటుపడును. కావున వీనివైపు చూడను" అనుకొని, శరీరము చుట్టచుట్టి, పడగ వాల్చి పండుకొనెను. అహితుండిక బ్రాహ్మణుడు ఓషధి మ్రింగి, మంత్రము జపించి, బోధిసత్త్వునిపై నుమిసెను. వాని ప్రభావమువలన ఉమ్మిపడినచోట బొబ్బలు లేచినట్లాయెను. బ్రాహ్మణుడు సర్పమును తోకపట్టి లాగి, పొడవుగా సాగదీసి, మేకపాదమువంటి కట్టెతో కొట్టి, దుర్బల మగునట్లు చేసెను; శిరము గట్టిగా నొక్కెను. బోధిసత్త్వుని నోరు తెరపుపడెను. బ్రాహ్మణుడు సర్పము నోట నుమిసి, మంత్రము జపించి కోరలు లాగెను నోట రక్తము నిండెను. శీలభంగ మగునను భీతిచే బోధిసత్త్వుడు బాధలు సహించుచు వానివంక చూడనైన చూడలేదు. అహితుండికుడు సర్పమును మిగుల దుర్బలము చేయుటకై తోక మొదలు తలవరకును మర్దించి పట్టివలె చుట్టి, వింటినారినివలె మడతపెట్టి, తోక పట్టుకొని, కుస్తీలో దెబ్బకొట్టినట్టు కొట్టి నేలపై బడవైచెను. బోధిసత్త్వుడు మిగుల వ్యథ నొందుచు రక్తసిక్త శరీరుడై దుర్బలుడై యుండుట గ్రహించి బ్రాహ్మణుడు తీగలతో బుట్ట అల్లి, సర్పము నందులో నుంచెను.

ఆవల నతడు బయలుదేరి, సీమ దాటి, గ్రామములో లోకులయెదుట సర్పము నాడించెను. అహితుండికుడు కోరినరీతిని సర్పము వివిధనాట్యములు చేసెను. ఆనాడు వానికి వేయి కార్షాపణముల ధనము, అంతమూల్యముకల వస్తుసామగ్రి లభించెను. వేయి లభించినంతనే సర్పమును విడిచిపెట్టవలె నని తొలుత నత డనుకొనెను; కాని ధనము లభించుటచే ఆసపుట్టి, "సీమాంత గ్రామముననే యింత లభించినది. రాజధానికి బోయి అమాత్యుల యెదుట ప్రభువుల యెదుట నాగనాట్యము చేయించినచో విశేషధనము లభించును"

అనుకొని శకటమును రథమును సిద్ధము చేయించెను. సామానులు బండిలో మూటలు కట్టివేసి, తాను రథమెక్కి బ్రాహ్మణుడు గ్రామ నిగమములు తిరుగుచు నాగక్రీడ చేయించుచు తుదకు వారాణసి చేరెను. వారాణసీ ప్రభువగు ఉగ్రసేన మహారాజునకు నాగక్రీడ చూపి, సర్పమును విడిచిపెట్ట దలచెను. అతడు మండూకములను చంపి నాగరాజు కాహారముగా చేయు చుండెను. "ఇతడు నా కొరకు కప్పలను జంపుచున్నాడు" అని తలపోసి నాగరాజు వానిని ముట్టుకొనలేదు. అంతట తేనె మొదలగునవి తెచ్చిపెట్టెను. "ఈ యాహారము తినుచో ఈ బుట్టలోనే నాకు మరణము సంభవించును" అని తలచి నాగరాజు వానినిగూడ ముట్టుకొనలేదు. బ్రాహ్మణుడు వారాణసి చేరునప్పటికి మాసము పట్టెను, త్రోవలో చాల ధనము సంపాదించెను. రా జతనిని బిలువనంపి "మాకుగూడ వేడుక చూపు" మనెను.

"చిత్తము దేవా, రేపు పూర్ణిమనాడు తమకు వేడుక చూపెదను" అని యతడు విన్నవించెను. "రేపు నాగరాజు రాజాంగణమున నాట్యము చేయును. ఎల్లరును వచ్చి చూడవచ్చును" అని రాజు నగరమున చాట బంచెను. మరునాడు అంగణ మలంకరింపజేసి రాజు బ్రాహ్మణునకు వార్త పంపెను. ఆతడు రత్నపేటికలో బోధిసత్త్వుని గొనిపోయి రత్నకంబళముపై పేటిక నుంచి, కూరుచుండెను ప్రాసాదము దిగి వచ్చి రాజు సింహాసనముపై గూరుచుండెను బ్రాహ్మణుడు నాగరాజును వెలికి దీసి, నృత్యము చేయించెను జనులు సంతోష మణచుకొనలేక ఉత్తరీయము నెగురవేసిరి. బోధిసత్త్వునిపై సప్తరత్నవర్షము కురిసెను. నాగరాజు పట్టుపడి నెలరోజు లయినది; కాని యింతవరకును ఆహారము ముట్టలేదు.

అక్కడ సుమన తనలో "నా ప్రియస్వామి వెడలిపోయి నెలరోజులు కడచినది. ఇంకను రాకుండుటకు కారణమేమో" యని తలపోసి, పుష్కరిణికి బోయి చూచెను. నీరము రక్తవర్ణము దాల్చెను. నాగరాజు పాముల వాని చేత బడెనని గ్రహించి ఆమె నాగభవనము వెడలి, పుట్టకడకు బోయి, చూచి యేడ్చెను. ఆవల నామె సీమాంతగ్రామమునకు జని అడిగి తెలిసికొని, వారాణసి చేరి పరిషన్మధ్యముగా నాకసమున నిలిచెను. బోధిసత్త్వుడు ఆడుచు, ఆకసమువైపు చూచి, ఆమెను కనుగొని సిగ్గున తలవంచి పేటికలో

దూరెను. రాజు చూచి, కారణమేమో యనుకొని పైకిచూచి, ఆమెను గనుకొని యీ గాథ పలికెను :

చపలపోలిక, ఓషధిచందమునను
తారవలె భాసిలెదవు గంధర్వవనిత
వగుదువా, కాక దేవత వగుదు వొక్కొ !
మానవస్త్రీవి కా వని మదికి దోచు.

ఇక ముందు వచ్చుగాథలు ఉత్తర ప్రత్యుత్తరములు :

"కాను దేవిని, గంధర్వకాంత కాను,
కాను మానవి, నే నాగకాంత దేవ
ఇచ్చటికి కార్య మర్థించి వచ్చినాను"

"చెందితివి నీవు విభ్రాంతి, చిత్త మెంతో
ఆకులం బయి యున్నది, అశ్రులందు
బాష్పములు జారుచున్నవి, బాధ యేమి ?
ఏమి యాచించి వచ్చితి విటకు నీవు ?"

"ఉగ్రతేజస్వి యగువాని ఉరగు డంద్రు
నాగు డని కూడ నంద్రు, నానాథు డతడు.
వాని నెవ్వరో పట్టినవారు, మీరు
బంధనమునుండి విడిపింప ప్రార్థనమ్ము."

"అంత బలవంతుడును వీర్యవంతు డైన
నాగు డెటు చిక్కె నిర్భాగ్యనరునిచేత ?
నమ్మిక మ్మెట్లు కల్గును నాకు చెపుమ !"

"అధికబలవీర్యవంతుడే యతడు, తలప
నగర మంతయు భస్మ మొనర్పగలడు.
అయిన నాగుడు ధర్మము నాచరింప
చేయుచున్నాడు తపము విచిత్రమూర్తి.

"ఇతడు దీని నెచట పట్టినాడు ?" అని రాజు ప్రశ్నింపగా నామె తద్విషయము తెలుపునదై యీ గాథ పలికెను :

పూని చతుర్దశీ పూర్ణిమా తిథుల
నిత డుపోసథ వ్రతము, చతుష్ప
థము ప్రక్క వల్మీకధామమ్మునందు
శయనించియుండ, నీజనుడు జీవికకు
పట్టుకొన్నా; డింక బంధవిముక్తి
జేయింపవలె నాదు జీవితేశ్వరుని.

ఇట్లు పలికి మరల యాచించునదై యీ గాథలు పలికెను :

మహిళలు మౌక్తిక మణికుండలములు
దాలిచి, నీరము ధామమ్ము గాగ
కొలుచుచుందురు వేలకొలది నాగేశు.

తలపెట్ట కేలాటి బలవంత మైన
ధర్మమార్గమున నీతనికి విముక్తి
ఘటియింపవలయును; గ్రామమ్ము గాని
కొన్ని నిష్కము లైన, గోశత మైన
దాన మొసంగుచు ధర్మాత్ము డైన
నాగుడు స్వేచ్ఛగా నడయాడు గాక !

రా జాతనితో నిట్లనెను :

ధర్మానుసార మీతని ముక్తు జేతు,
గ్రామమ్ము గాని, నిష్కమ్ములు గాని
గోశతమ్మును గాని కూర్మి నొసంగి.
పుణ్యాత్మునకు చెర పోవును గాక,
నాగుడు స్వేచ్ఛగా నడయాడు గాక !

నీకు మణికుండలమ్ములు నిష్కశతము
శయనమును లుబ్ధకా, నే నొసంగువాడ.

సమరూప లావణ్య జాయ లిర్వురను
గోవులు వృషభమ్ముగూడ నిచ్చెదను.
నాగుడు స్వేచ్ఛగా నడయాడు గాక,
పుణ్యాత్మునకు చెర పోవును గాక !

అహితుండిట్లు బదులు పలికెను :

జననాథ, యేల కై కొనకుండ, మీదు
వాక్కునుబట్టియే వదలుదు మితని
నాగుడు స్వేచ్ఛమై నడయాడు గాక,
పుణ్యాత్మునకు చెర పోవును గాక !

ఇట్లు పలికి అతడు బోధిసత్త్వుని బుట్టలోనుండి వెలువరించెను. నాగరాజు వెలువడి, పుష్పములలో దూరి, సర్పశరీరము విడిచి, బ్రాహ్మణకుమారుని వేషము దాల్చి, నేల బ్రద్దకొట్టి వచ్చినట్లు వచ్చెను. సుమనకూడ ఆకాశమునుండి దిగి, యాతనికడకు వచ్చి నిలిచెను. నాగరాజు చేతులు జోడించి, రాజుకు నమస్కరించుచు నిలిచెను.

ఈ యభిప్రాయమును ప్రకటీకరించుటకై శాస్త యీ గాథలు పలికెను :

చంపేయ్య నామక సర్పనాయకుడు
ఇటు విన్నవించెను : "హేకాశిరాజ !
చేతులు జోడించి చేయుచున్నాను
మీకు నమస్కృతి ! మీరొక్కసారి
అస్మద్గృహంబున కరుదేర వలయు."

"మనుజుండు కానివానిని మానవుండు
విశ్వసించిన, దుష్టవిశ్వాస మంద్రు.
అయినను నీవు నన్నడుగుటచేత
అరుదెంతు నీయింటి" కనె కాశిరాజు.

విశ్వాసము కలిగించుటకై బోధిసత్త్వు డీగాథలు పలికెను :

భూధరంబుల నూడ్చుక పోవుగాక
వాత, మర్త్యమ సోములు భూతలమున
జారి పడిపోవుదురు గాక, సకలనదులు
గూడ ప్రవహించినను ప్రతికూలముగను
పలుకజాల నసత్యంబు ప్రభువరేణ్య !

బ్రద్ధలైనను నభము, సంద్రంబు లెండి
పోయినను, భూమి ముడుచుక పోవుగాక,
కుదుటితో గూడ మేరువు కూలు గాక—
పలుకజాల నసత్యంబు ప్రభువరేణ్య !

బోధిసత్త్వు డిట్లు పలికినను రాజుకు విశ్వాసము కలుగలేదు. అత డిట్లు పలికెను :

మనుజుండు కానివానిని మానవుండు
విశ్వసించిన, దుష్టవిశ్వాస మంద్రు
అయినను నీవు న న్నడుగుటచేత
చనుదెంచువాడ నీ సదన మీక్షింప.

భూరిఘోర విషాగ్నిధారివి నీవు
తీవ్రకోపనుడవు, నప్రతిమాన
తేజస్వి వీవు; ముక్తిని బొందినావు
మరవకుండుట లేని మంచిది మమ్ము.

రాజుకు విశ్వాసము కలిగించుటకై బోధిసత్త్వు డిట్లనెను :

పరచు నెవ్వడు పొందుపంచిని వాడు
ఘోర మౌనరకాన కూలును; చెంద
లేడు కాయికసుఖలేశంబు గాని
చిక్కి కరండాన జీవముల్ విడుచు.

రాజు విశ్వసించి, ఆయన నిట్లు స్తుతించెను :

నీవు చేయుప్రతిజ్ఞ నిక్కమ్ము సుమ్ము
అక్రోధనుండవు; నద్వేష్ట వీవు,
గ్రీష్మమునం దగ్నికిని నరుండట్లు
గరుడుడు దూరమ్ముగా నుండు గాక
సకలనాగకులంబు స్పర్శ లేకుండ.

బోధిసత్త్వుడుకూడ రాజును స్తుతించువాడై యిట్లు పలికెను :

దయ యుండునట్లు మాతకు నేకపుత్రు
నెడల నాగకులంబు నెడ నీకు రాజ !
కల దనుకంప; నాగకులంబుతోడ
నేను చేయుదు సేవ నిండుగా నీకు.

విని, రాజు నాగభవనమునకు బోవ కోర్కి కలిగి, సైన్యము సంసిద్ధము చేయింప నిట్లు పలికెను :

కట్టుడు శిక్షిత కంబోజ తురగ
ములను కాంచనరథమ్మునకు శీఘ్రముగ.
సజ్జీకరింపుడు స్వర్ణవర్ణంపు
కుథములతో భద్రకుంజరమ్ములను—
కనుగొన బోదు నాగనివేశమునకు.

ఇది అభిసంబుద్ధ గాథ :

మ్రోగసాగిన వుగ్రసేనుని
మ్రోల భేరులు మృదంగంబులు.
వెడలె స్త్రీజన పరివృతుం డయి
విభవమున నరపాలు డంతట.

రాజు నగరము వెలువడునప్పటికి బోధిసత్త్వుని ప్రభావమువలన నాగభవనముచుట్టును సర్వరత్నమయ ప్రాకారము, ద్వారప్రకోష్ఠములు సృష్టములై, భవనముకు బోవుమార్గముకూడ సిద్ధమాయెను. అనుయాయు

లతోగూడ ఆ మార్గముగ జని, రాజు రమణీయప్రదేశమును ప్రాసాదమును గనుగొనెను.

ఈ యభిప్రాయము ప్రకటీకరించుటకై శాస్త్ర యీ గాథలు పలికెను:

కాశీవిభుడు స్వర్ణ ఖచిత భూతలము,
కాంచన సౌధమ్ము కనుగొనినాడు.
మిహిరవిద్యుత్ప్రభల్ మిళిత మైనట్లు
జాజ్జ్వల్యమాన మౌ చంపేయ్య నాగ
భవనప్రదేశంబు ప్రాపించినాడు.
వివిధవిధంబుల వృక్షాలతోడ
బహువిధ పరిమళ భరిత మైనట్టి
సౌధంబు గాంచె; ఆ సమయంబునందు
వాద్యముల్ మ్రోగె దివ్యంబులు, నాగ
కన్యక లాడిరి కమనీయనాట్య:
మారోహణము చేసె నంతట రాజు
చందనలిప్త, పార్శ్వస్వర్ణ ఖచిత
పీఠంబుమీద ! సంప్రీతచిత్తమున.

ఆయన కూరుచున్నంత నే పదునారువేల స్త్రీలకును పరివారమునకును ఉత్తమభోజన మాయత్త మయ్యెను. రాజు పరిషత్తుతో సప్తాహముపాటు దివ్యభోజ్యపానీయము లారగించి, సుఖాసనశయనము లనుభవించి మహా సత్త్వుని గుణములు స్తుతించి “నాగరాజా ! ఇట్టి సంపత్తి విడనాడి నీవు మానవలోకమున పుట్టలో పడియుండి, ఉపోసథవ్రత మేల పట్టినావు ?” అని యడుగ నాత డిట్లు ప్రతివచన మిచ్చెను :

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త్ర యిట్లు పలికెను :

అచట భుజియించి క్రీడించి యనియె కాశి
రాజు చంపేయ్యుతో : “నాగరాజ, లేదు
మాకు నాదిత్యవర్ణ విమానరాజి
ఇచట నీ కున్నయట్టిది : ఎందుచేత
చేయుచున్నాడవు తపస్సు చెప్పు మయ్య !

కాంచనాభరణముల్ కౌశేయములును
దాలిచి, శోణహస్తములు పాదములు
గోళాంగుళులు కల్గు వ్యాళకన్యకలు
సుర యిచ్చుచున్నారు సుందరీమణులు–
మానవలోకాన మాకు లే వివ్వి–
చేసెదు తప సేల చెపుము నాగేంద్ర !

స్రోతస్వినుల్ మహాశుభదాయకములు,
కల వందు పెద్దతోకల రోహితములు,
ఆదర్శనామ విహంగముల్ నదుల
యొద్దులన్ కూజించుచుండు మెండుగను.
మానవలోకాన మాకు లే వివ్వి–
చేసేదు తప సేల చెపుము నాగేంద్ర !

క్రౌంచమయూరముల్ కలహంసములును
కోకిల లొక్కచో గూడు నిచ్చోట
మనుజలోకమునందు గన మిట్టివాని
చేసెదు తపమేల చెపుము నాగేంద్ర !

సాలముల్ తిలకముల్ జంబువు లామ్ర
పాటలోద్దాలక ప్రముఖవృక్షములు
మెండు వికసించి యుండు నిచ్చోట,
మనుజలోకమునందు గన మిట్టివాని–
చేసెదు తప మేల చెపుము నాగేంద్ర !

కుసుమసంభరిత మౌ కుజములనుండి
పరిమళం బెల్లెడ బర్వుచునుండు
మానవలోకాన మా కిట్టి వేవి ?
చేసెదు తప మేల చెపుము నాగేంద్ర !

చంపేయ్యు డిట్లనెను :

తనయులకొరకును ధనముకోసరము
ఆచరింపను తపం బాయుస్సుకొరకు.

ఉద్భవింప మనుష్యయోనియం దేను
ఆగ్రహంబున తపం బాచరించెదను.

రా జిట్లనెను :

నాగరాజా, నీదు నయనంబులెరుపు,
అరుణచందనలిప్త మైనది తనువు,
గంధర్వరా జట్లు కడల నన్నిటిని
కావించుచున్నావు కాంతిమంతములు.

దేవర్ధి పొందితి వీవు మహాను
భావుండవు ప్రతాపవంతుడ వయ్య !
మీలోకమునకన్న మాలోక మెట్లు
శ్రేష్ఠతరం బగు చెవుము నాగేంద్ర !

నాగరా జిట్లు ప్రతివచన మిచ్చెను :

మానవలోకాన మాత్రము శుద్ధి
సంయమమ్ములు కడు సంభృత మగును
మనుజగర్భంబున జనియించి నేను
జాతంబు మరణంబు సమయింప జేతు.

విని రా జిట్లనెను :

ఎవరు బహుశ్రుతు, లెవ్వ రాలోచ
నాపరుల్, మిగుల ప్రజ్ఞాసమన్వితులు
అట్టివారలు సేవ్యు లగుట సత్యంబు,
నిన్నును నీనాగకన్నెలం గాంచి
ఎంచితి బహుపుణ్య కృతు లొనరింప.

అంతట నాగరా జిట్లు పలికెను :

ఎవరు బహుశ్రుతు లెవ్వ రాలోచ
నాపరుల్, మిగుల ప్రజ్ఞాసమన్వితులు
అట్టివారలు సేవ్యు లనుట సత్యంబు,

నన్నును నానాగ కన్నెలం గాంచి
పుణ్యకార్యము లొనర్పుము మెండుగాను.

అపుడు రాజు "నాగరాజా, మే మెంత కాల మిట నుందుము ? నేడు పోవుదుము" అనునప్పటికి నాగరాజు "మహారాజా, మీకు వలసినంత ధనము గ్రహింపుడు" అనుచు, ధన మొసగు కోరిక కలవాడై యిట్లనెను :

ఇచట నున్నవి తాలవృక్షాలయెత్తు
పసిడి రాసులు, వాని బట్టుకు పోయి
కట్టించుకో రాజ, కాంచనమంది
రములు, చుట్టును వెండి ప్రాకారములును.

పంచసహస్రంపు ఘారమ్ము కలుగు
ముత్తెముల్ స్ఫటికమ్ము లెత్తించుకొమ్ము
పరపింపు మీయంతిపురి భూతలాన
నీరమ్ము పంకమ్ము నిలవకుండంగ.

రాజేంద్ర, మీదు వారాణసిలోన
అనుపమసుందర మౌ విమానంబు
నిర్మాణ మొనరించి, నిరుపమానమ్ము
కాశీరాష్ట్రిమ్మును కావింప వలయు.

విని రాజు సమ్మతించెను అంతట నాగరాజు "తమకు వలసినంత ధనము, సువర్ణము రాజపురుషులు తీసికొనవచ్చును" అని నాగభవనమున చాటబంచెను. పిదప వందలకొలది బండ్లలో రొక్కము మూటలు వేయించి రాజుకడకు బంపెను రాజు మహావైభవముతో నాగభవనము వెలువడి వారాణసి చేరెను. అప్పటినుండి జంబూద్వీపమునకు సువర్ణభూమి యని పేరు వచ్చినది.

శాస్త యీ ధర్మోపదేశనము కావించి "ఈ ప్రకారముగా పురాణ పండితులు నాగసంపద నుపేక్షించి, ఉపోసథవ్రత మాచరించిరి. ఆ కాలమున పాములవాడు దేవదత్తుడు, సుమన రాహులమాత, ఉగ్రసేనుడు సారి పుత్రుడు, చంపేయ్యనాగరాజు నేనే.

———:(◌):———

# 507. మహా పలోభన జాతకము

శాస్త జేతవనమున విహారము చేయునపుడు విశుద్ధ ప్రాణులకు గూడ మాలిన్య మంటుటను గూర్చి చెప్పినది. కథ యిదివరలోనే వచ్చినది. ఇందు శాస్త "భిక్షువులారా, స్త్రీలు పరిశుద్ధులను గూడ మలినపరతురు" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో...... చూళ పలోభన జాతకమున చెప్పినట్లు గ్రహింపవలెను. ఆ సమయమున బోధిసత్త్వుడు బ్రహ్మలోక చ్యుతుడై కాశీనరేశుని పుత్రుడుగా పుట్టెను. అతనికి స్త్రీవాసన గిట్టదు. బిడ్డడు స్త్రీలచేతులలో నుండెడివాడు కాడు. పురుషవేషము ధరించియే స్త్రీలు వానికి స్తన్య మీయవలసి వచ్చెడిది. అతడు ధ్యానభావనలో నుండ, స్త్రీలను చూచెడివాడు కాడు. ఈ యర్థమును ప్రకాశింప చేయుటకై శాస్త యీ గాధను పలికెను :

ఒంది విచ్యుతి యొకానొక బుద్ధిమంతు
డా బ్రహ్మలోకమునందుండి, దేవ
పుత్రుండు నృపతి పుత్రుడై పుట్టె.

కామ వికల్ప సంకల్పంబు లచట
కలుగ, వచ్చో బుట్టు కారణంబునను
అవ్వానియెడల నత్యంతజుగుప్స.

అంతఃపురాన ధ్యానాగారమందు
అత డేకాంతాన ధ్యానంబు చేయు.

తన కొక్కపుత్రు, డాతనికి భోగాల
యెడ కాంక్ష లేదని యేడ్చెను రాజు.

ఇది రాజు విచారగాథ :

దీని కుపాయంబు తెలిపినవారు
ఎవ్వరే నితనికి నిచ్చ కల్గింప
జాలుదు రని రాజు చాల చింతించె.

ఇవి అభిసంబుద్ధ గాథలు :

నృత్యగానాదుల నేర్పరి యైన
వరవర్ణిని కుమారి వర్తిలు నచట.

అరుదెంచి, రాజుతో నామె యిట్లనియె :

"అవల నాభర్త యాట కాతండు
సమ్మతించున యేని సర్వభోగముల
నభిముఖు జేయుదు నాతని నేను."

విని యామె పల్కులు విభు డనె నిట్లు :
"గట్టిగాను ప్రలోభ పెట్టెదవేని
అవల కాగలడు నీ కాతడు భర్త."

ఇట్లు పలికి రాజు దీనికి చోటిమ్మని కుమారుని సేవకై పంపెను. ఆమె ప్రాతఃకాలముననే వీణ చేబూని, కుమారుని శయనగృహముకడ నిలిచి, గోటితీగతో వీణ మీటుచు, మధురస్వరమున పాడుచు, నతనిని ప్రలోభ పెట్ట సాగెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త యిట్లు పలికెను :

అంతిపురంబున కరిగి యా కన్య
హృదయంగమంబులు నెంతయు కామ
భరితంబు లుద్వేగకరములు నైన
యనురాగగాథల నతనికి జెప్పె.
అచటివారల నాత డడిగె నీరీతి :
"ఇట్టిగాథలు చెప్పునీమె యెవ్వతెయొ ?"

"క్రీడకు యోగ్య యా స్త్రీ యీమె దేవ !
మీరు భోగమ్ములు కోరుపక్షమున
అంత కంతకు ప్రియ యగును మీ కీమె."

"అటులైన చెంతకు నరుదెంచి యామె
ఆశ్రమ మధ్యంబు, నస్మదంతికము
చేరుచు గానమ్ము చేయును గాక."

అతని నివాసగృహమ్ము, కుడ్యంబు
దరిసి క్రమమ్ముగా తరుణి తదీయ
ధ్యాన నిర్మల కక్ష్యలోనికి జొచ్చె,
వెంట నంటెడురీతి విపినాన హస్తి
అతనిని క్రమముగా నంటి చరించె.

తామరసంబును గ్రహియించునతని
కీర్ష్య జనించిన; దీమె నెవ్వరును
స్పృశియింప రాదను పీడ జనించె.

ఖడ్గముం జేపట్టి క్రమముగా నతడు
బెదరింప జొచ్చెను పెరవార లామె
తోడ భోగించుచో త్రుంతు నటంచు.

జనులు నృపాలునిసన్నిధి కరిగి
"నిష్కారణము దేవ, నీ కుమారుండు
మనుజుల బాధించు" నని చెప్పుకొనిరి.

క్షత్త్రియప్రభువు రాజ్యంబులోపలను
తనయుడు నిల్వరా దని యాన తిచ్చె

అతడు భార్యాన్వితుం డై యబ్ధితటము
ప్రాపించి నిర్మించి వర్ణకూటమ్ము
కందమూలాలకై కానలో జొచ్చె.

అబ్ధిపై పైనుండి యరుదెంచి తపసి
భోజనవేళ కాపూరిల్లు జొచ్చె.

వనిత ఋషీశ్వరు వశవర్తి జేసి
కొనగ నాతడు బుద్ధి కోల్పోయినాడు—
బ్రహ్మచర్యాశ్రమ పతన హేతువున.

ఆశ్రమవాటిక కా రాజసుతుడు
కావడి నిండుగా కందమూలాది
కములతోడ సందెకు క్రమ్మరి వచ్చె.

ఋషి క్షత్త్రియకుమారు నీక్షించినంత
పరుగెత్తినా డకూపారమ్మువైపు:
గగనతలమ్మున నెగురంగ నెంచె,
పడె సముద్రలోన ప్రజ్ఞ కోల్పోయి.

ముని సముద్రములోన మునుగుచుండగ
కరుణ కుమారు డీగాథలు పలికె:
"నీటిలో తడియక నింగి మార్గమున
బుద్ధి బలంబున ఋషి యరుదెంచి
స్త్రీసంగమంబున చెడి యబ్ధి బడియె.

"బ్రహ్మచర్యం బన్న పడదు వీరలకు
మగవారి ముంచెడి మాంత్రికల్ వీరు,
మాయావినులు స్త్రీలు; మగవా రెరింగి
వీరి నుంచుట మేలు దూరమ్ముగానె.

"తీపిమాటలవారు, తృప్తిలేనట్టి
వార, లన్యుల ముంచువారలు స్త్రీలు
ఎంతకు పూర్ణత నెరుగనివారు
ఏటిపోలిక; నరుం డీసత్య మెరిగి
వీరి నుంచుట మేలు దూరమ్ముగానె.

విత్తంబు గాని యుద్వేగంబు గాని
లలనల వశవర్తినుల జేయుచుండు.
సేవింతు రప్పుడు స్త్రీ లెట్టివాని
నైనను దహియింతు రగ్నివిధాన."

ఆలకించినయంత నారాజపుత్రు
వాక్కు, లాతనికి వైరాగ్యంబు కలిగె,
వెనుకటిరీతిని వినువీధి జనియె.

ఆకసంబున జను నాఋషీశ్వరుని
వీక్షించుచుండ సంవేదంబు కలిగె,
ప్రవ్రజింపగ నిచ్ఛ ప్రభవించె నపుడె
రాజతనూజు ధీరం బైనమదిని.

అతండు త్యజియించి యఖిలకామములు
ప్రవ్రజ్య గ్రహియించి, బ్రహ్మలోకంబు-
బంధవిముక్తు డై ప్రాపించినాడు.

శాస్త "భిక్షువులారా, ఈ విధముగా స్త్రీలవలన విశుద్ధప్రాణులు కూడ మలినులై పోవుదురు" అని సత్యప్రకాశనము చేసి, జాతకములు సరి పోల్చెను. సత్యప్రకాశనానంతరము ఉద్విగ్నచిత్తభిక్షువు అర్హత్వము నొందెను. ఆ కాలమున స్త్రీ గంధము గిట్టని కుమారుడు నేనే.

—: o :—

# 508. పంచ పండిత జాతకము

పంచపండితజాతకము మహా ఉమ్మగ జాతకమున (546) వచ్చును.

———

# 509. హత్థిపాల జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు నిష్క్రమణమును గూర్చి చెప్పినది. అప్పుడు శాస్త "భిక్షువులారా, తథాగతు డిప్పుడే కాదు, పూర్వము కూడ నిష్క్రమణము చేసియుండెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో ఏసుకారి యనురాజు పాలనము చేయుచుండెను. పురోహితుడును రాజును చిన్నతనమునుండి మిత్రులు. ఉభయులు అపుత్రకులు. ఒకనాడు వారు ఇష్టాగోష్ఠిలో "మనకు ఐశ్వర్యమున్నది. పుత్రులు లేరు; పోనీ పుత్రియును లేదు. ఏమి చేయదగును" అనుకొనిరి. అప్పుడు రాజు పురోహితునితో "మీ యింట పిల్లవాడు పుట్టినచో నా రాజ్యమునకు స్వామి యగును; మా యింట పుత్రుడు పుట్టినచో మీ సంపద కధికారి యగును'' అని ఒప్పందము చేసికొనిరి.

ఒకనాడు పురోహితుడు తన జమీగ్రామమునకు బోయి అక్కడినుండి మరలి వచ్చుచు దక్షిణద్వార ప్రవేశసమయమున నగరమువెలుపల బహుపుత్రులు కల దరిద్రస్త్రీని గనుగొనెను. ఆమెకు ఏడుగురు పుత్రులు; అందరును ఆరోగ్యవంతులే. ఒకనిచేతిలో వంటచట్టియు, ఇంకొకనిచేతిలో చాపయు కలవు. ఒకడు ముందు, వేరొకడు వెనుకను నడచుచుండిరి. ఒకడు తల్లివ్రేలు పట్టుకొని నడచుచుండెను; ఒక డామె చంకలోను మరియొకడు బుజముపైనను ఉండిరి.

పురోహితు డామెతో "భద్రే, ఈ పిల్లలతండ్రి యెచట?" అనెను. "స్వామీ, వీరికి ఒక్కతండ్రి నిశ్చితముగా లేదు." "ఇట్టి పుత్రులు నీ కెట్లు లభించినారు?'' ఆమె యితరాధారములు చూపలేక, నగరద్వారమున నున్న మర్రిచెట్టు చూపి, "స్వామీ, ఈ వృక్షముపై నున్న దేవతను ప్రార్థింపగా లభించినారు. ఈ దేవతవలననే పుత్రలబ్ధి'' అని చెప్పెను. "మంచిది.

నీవు పొమ్ము'' అని పురోహితుడు రథము దిగి మర్రిచెట్టుక్రిందికి జేరి, కొమ్మ పట్టుకొని ఊపి, "హే దేవపుత్ర, రాజువలన నీ కేమియు ముట్టలేదా ? రాజు ప్రతివత్సరము వేయిముద్రలు వెచ్చించి నీకు బలిపూజాదులు చేయు చున్నాడే. నీ వాయనకు పుత్రునొసగలేదు. ఆ దరిద్రవనిత నీ కేమి యుప కారము చేసిన దని ఏడుగురు పుత్రుల నిచ్చినావు ? మా రాజుకు పుత్రు నొసగవేని ఏడవనాడు సమూలముగా వృక్షమును పెరికించి, ముక్క ముక్కలు చేయించెదను'' అని వృక్షదేవతను బెదరించి వెడలిపోయెను. ఆతడు మరునాడు, ఆ మరునాడు వరుసగా ఆరురోజులు వృక్షముకడకు బోయి బెదరించెను. ఆరవనాడు బ్రాహ్మణుడు చెట్టుకొమ్మ పట్టుకొని "వృక్షదేవతా, ఇక ఒక్కరాత్రిమాత్రము మిగిలియున్నది. మా రాజుకు పుత్రు నొసగవేని రేపు నీ పని పూర్తి చేసెదను'' అనెను. వృక్షదేవత యోచించి దీనిలోని తోతు గ్రహించి "ఈ బ్రాహ్మణుడు నా విమానమును నాశము చేయును. ఇతనికి ఏవిధముగ పుత్రు నీయవచ్చును'' అనుకొని నలుగురు మహారాజుల కడకు బోయి ఈ విషయము చెప్పగా, మావలన కాదు అని వారు పలికిరి. అంతట వృక్షదేవత యక్షసేనాపతులకడకు బోయెను. వారును పై విధముగనే సమాధానము చెప్పిరి. అంతట దేవరాజ శక్రునికడకు బోయి చెప్పగా ఆయన యోగ్యపుత్రు డితనికి లభించునా అని విచారించుచు నలుగురుదేవపుత్రులను కాంచెను. వారు పూర్వజన్మలో వారాణసిలో సాలీలు. వారు తమకు లభించినదానిని ఐదుభాగములు చేసి నాలుగుభాగములు తా మనుభవించి ఐదవభాగము దానము చేయుచుండిరి. ఆవల వారు త్రయఃత్రింశభవనమున జన్మించిరి; ఆవల యామభవనమున ఈ ప్రకారముగా వారు క్రిందినుండి పైకి, పైనుండి క్రిందికి ఆరు దేవ లోకముల భోగము లనుభవించుచు విచరించుచుండిరి. ఆ సమయమున త్రయఃత్రింశభవనమునుండి చ్యుతులై యామభవనమునకు బోవనుండిరి. శక్రుడు వారిని సమీపించి "మిత్రులారా, మీరు మానవలోకమునకు బోవలసి యున్నది. అచటి ఏసుకారి ప్రభువు పట్టపుదేవి కడుపున పుట్టవలెను'' అని ఆనతిచ్చెను. వారు "దేవా, చిత్తము. కాని మావలన రాజకులమునకు ప్రయోజనములేదు. మేము పురోహితునియింట పుట్టుదుము. చిన్నతనముననే ప్రవ్రజింతుము'' అనిరి. శక్రుడు మంచి దని ప్రతిజ్ఞ చేయించికొని వృక్ష

దేవతకడకు వచ్చి ఆ విషయము తెలిపెను. దేవత సంతుష్టచిత్తముతో శక్రునకు నమస్కారము చేసి నిజవిమానమునకు జనెను.

మరునాడు పురోహితుడు కొందరు పనివాండ్రను వెంటబెట్టుకొని గొడ్డలి మొదలగు పనిముట్లతో వృక్షము క్రిందికి చేరి, కొమ్మ పట్టుకొని "దేవతా, నేను నిన్ను ప్రార్థించుటలో వారము గడచినది. ఇపుడు నీయంతము ఆసన్నమైనది" అనెను. అప్పుడు వృక్షదేవత వృక్షకోటరమునుండి మహావైభవముతో బయలు వెడలి మధురస్వరమున పలుకరించి "బ్రాహ్మణోత్తమా, ఒక్కపుత్రునిమాట అటుంచుము. నీకు నలుగురు పుత్రులను ఇచ్చెదను" అనెను. "నాకు పుత్రులు వలదు. మా రాజుకు పుత్రుల నిమ్ము." "నీకే పుత్రులు లభింతురు "అట్లయినచో నాకు ఇరువురను రాజు కిరువురను ఇమ్ము." "రాజుకు లేరు, నీకు మాత్రమే నలుగురుపుత్రులు లభింతురు. వారు సంసారమున నుండక చిన్నతనముననే ప్రవ్రజింతురు." "నీవు పుత్రుల నిమ్ము. వారు ప్రవ్రజింపకుండ చూచుభారము మాది."

వృక్షదేవత వర మిచ్చి విమానమున ప్రవేశించెను. ఆవల వృక్షదేవతకు ఆదరసత్కారములు హెచ్చెను. జ్యేష్ఠ దేవపుత్రుడు పురోహితుని భార్యకడుపున బడెను. నామకరణమునాడు అతనికి హస్తిపాలు డని పేరు పెట్టి ఆతడు ప్రవ్రజింపకుండుటకై మావటీల కప్పగించెను. వా రతనిని తమపద్ధతులపై పోషింపసాగిరి. రెండవ దేవపుత్రుడు పట్టపురాణికడుపున బడెను. నామకరణము నాడు అశ్వపాలకు డని పేరు పెట్టి ఆ కులమువారి కిచ్చి పెంచు మనిరి. మూడవవాడు పుట్టినపిదప గోపాలు డని పేరు పెట్టి వానిని గొల్లల కిచ్చి పెంచు మనిరి. నాల్గవవాడు పుట్టినపిదప అజపాలకు డని పేరు పెట్టి గొర్రెలు మేపువాని కిచ్చి పెంచు మనిరి. వా రందరు పెరిగినపిదప సౌభాగ్యవంతులైరి.

బాలురు ప్రవ్రజింతు రనుభయముచే రాజు ప్రవ్రజితుల నెల్లరను రాజ్యసీమలో నుండి అవలకు పంపివేసెను. సమస్త కాశీరాష్ట్రమున ప్రవజితుని ఒక్కనిని గూడ నిలువనీయ లేదు ఆ కుమారులు కఠోరస్వభావులు. వారి నెటుకొనిపోయినను అటుపోవువారిని దోచుకొనజొచ్చిరి. పదునారు సంవత్సరముల వయసు వచ్చిన హస్తిపాలకుని జూచి రాజు, పురోహితు

డును "కుమారులు పెద్దవారైనారు. వారికి అభిషేకము చేయదగిన సమయము ఆసన్నమైనది. ఇప్పుడేమి చేయవలెను?" అని యోచించి "అభిషేకము చేసిన పిదప వీరు మరింత ఉద్దండులగుదురు. అప్పుడు ప్రవ్రజితులు వచ్చినచో చూచి వీరుకూడ ప్రవ్రజింతురు. ఆవల జనసమూహము చెలరేగిపోవును. ఇప్పుడే బాగుగా యోచించి ఆవల అభిషేకము చేయుదము" అని తలపోసిరి.

ఇట్లు యోచించి ఉభయులును ఋషివేషములు దాల్చి భిక్షాటనము చేయుచు హస్తిపాల కుమారుని స్థానమున కేగిరి. అతడు సంతుష్టచిత్తుడై వారిసన్నిధికి వచ్చి ప్రణామము చేసి ఈ గాథలు పలికెను :

పంకదంత, జటాధర, భారవాహి
దైవతుల్య, భూమీసురదర్శనంబు
కల్గిన దదృష్టమున నింతకాలమునకు !

ధర్మనిరతులు కాషాయధారులైన
ఋషుల సందర్శనంబు ఘటియిల్లె నేడు.

ఒసగినా మాసనములు పాదోదకములు
ఈ పవిత్ర పదార్థంబు లెల్ల మీకు :
స్వీకరింపగ వినిని వేడువాడ.

ఈ ప్రకారముగా అతడు వారిని మాటిమాటికి నడిగెను. అప్పుడు పురోహితుడు "బాబా, మేము ఎవ్వర మని నీవు ఇట్లు చేయుచున్నావు?" అని యడిగెను.

"హిమాలయవాసు లగు ఋషులని."

"బాబా, మేము ఋషులము కాము. ఈయన ఏసుకారి ప్రభువు, నేను మీ తండ్రి పురోహితుడను."

"అట్లగుచో ఋషివేషము లేల తాల్చినారు ?

"నిన్ను పరీక్షించుటకై."

"నన్నేమి పరీక్ష చేయుదురు ?"

"నీవు మమ్ము గాంచి ప్రవజితుడవు కానిచో నీకు రాజ్యాభిషేకము చేయుటకై వచ్చినాము."

"బాబా, నాకు రాజ్య మక్కర లేదు. నేను ప్రవ్రజించెదను."

అంతట తండ్రి "నాయనా, హస్తిపాలా, ఇది ప్రవ్రజింపదగిన సమయము కాదు" అని రాజు తన యాశయానుసారముగా ఉపదేశ మిచ్చువాడై ఈ గాథ పలికెను :

వేద మభ్యసించి, విత్తంబు సమకూర్చి
సుతుల రాజ్యమందు సుస్థిరులను
జేసి, కాననంబు చేరుట యుక్తంబు :
సాధుజనులు దీని సమ్మతింత్రు.

అంతట హస్తిపాలు డిట్లనెను :

అవి యేల నాకు ? గంధాదిభోగములు
మూర్ఛాప్రదము లంచు మునుల నిర్ణయము
స్వీయకృత్యంబుచే సిద్ధించు ఫలము.

కుమారునివాక్కులు విని రా జిట్లనెను :

అవును, స్వయంకృత మైనయద్దాన
నే ఫలం బొదవును; నీతలిదండ్రు
లైరి వృద్ధులు, నూరుహాయనంబులకు
నిను జూడ వాంఛింత్రు నీరోగిగాను.

విని కుమారుడు "దేవా, ఇట్లనుచున్నా రేమి ?" అని యీ గాథలు పలికెను :

మరణముతో మైత్రి, జరతోడి చెల్మి
తనకు లే దని మృతి తలచెడివాని
నీరోగి యనవచ్చు నూరేండ్లదాక.

నావను నీటిలో నడిపెడివాడు
కూలము ప్రక్కగా గొనిపోవునట్లు
జరయును వ్యాధియు జనులను బట్టి
కొని, మిత్తివద్దకే కొనిపోవుచుండు.

అని యిట్లు జీవులసంసారము తుచ్ఛత ప్రకటించి "మహారాజా, తాము నిలువుడు. నేను మీతో మాటలాడుచుండగనే జరారోగములు, మృత్యువు సమీపించుచున్నవి. అప్రమత్తులై యుండుడు" అని రాజుకు తండ్రికి నమస్కరించి, తనపరిచారకులను వెంట నిడుకొని. ప్రవ్రజించు నుద్దేశముతో వారాణసీరాజ్యము వెలువడెను. ఈ ప్రవ్రజ్య సుందరము అని తలచి జనులు అతని ననుసరించిరి. యోజనముమేర పూర్తిగా ఊరేగింపు సాగెను. వారితో నాతడు గంగాతటము చేరి, జలము గాంచి యోగ మభ్య సించి, ధ్యానలబ్ధి యయినపిదప, "ఇచట జనులు గుమి గూడుదురు. నా సోద రులు ముప్వురు, తల్లిదండ్రులు, రాజు, దేవియు ప్రవ్రజింతురు. అను యాయులతోగూడ వారాణసి ఖాళీ యగును. వీర లందరు వచ్చువరకును నే నిచ్చటనే యుందును" అనుకొని జనసంఘమున కుపదేశ మిచ్చుచు నచ్చటనే యుండెను.

ఆవల నొకనాడు రాజు, పురోహితుడును కలిసి "హస్తిపాలకుమా రుడు రాజ్యము విడిచి, జనులను వెంట గొని, ప్రవ్రజించుతలపున గంగా తటమున నివసించుచున్నాడు. మనము అశ్వపాలుని పరీక్షించి, అభిషేకిం తము" అనుకొని, ఋషివేషములు ధరించి, ఆతని గృహద్వారముకడ నిలి చిరి. వారిని జూచి ఆతడు ప్రణామము చేసి, దగ్గరకు బోయి, ప్రసన్న చిత్తముతో "చిరస్సం వత" ఆదిగాథలు పలికెను అనంతరము హస్తిపాలు నితో సంభాషణ జరిగినట్లే ఇతనితోగూడ జరిగెను. అశ్వపాలుడు వారితో "నా సోదరుడు హస్తిపాలు డుండగా శ్వేతచ్ఛత్రమునకు ముందుగా నే నెట్లధికారి నగుదును?" అనెను. "బాబా, నీయన్న నాకు రాజ్య మక్కరలేదు, నేను ప్రవ్రజింతును అని వెడలిపోయినాడు." "ఇప్పుడాయన యెచట నున్నాడు?" "గంగాతటమున". "బాబా, నా యన్న విడిచిపోయిన యుచ్ఛిష్టముతో నాకు పనిలేదు. మూర్ఖుడగు తుచ్ఛప్రాణి యిట్టి క్లేశమును

విడువలేదు. నేను దీనిని విసర్జింతును" అని అశ్వపాలుడు వారల కుపదేశ మిచ్చువాడై యీ గాథలు పలికెను :

బురదవంటివి కామభోగాలు దుస్త
రములును సుమనోహరమ్ములు, మరణ
సౌఖ్యమ్ము నొసగును జనునకు తుదిని.

అనుభవింతును నేను వెనుకజన్మమున
గావించు భీకరకర్మఫలంబు
దాన మోక్షము లేదు, దమియించువాడ
నిప్పుడు వాక్కు, కర్మేంద్రియమ్ములను,
క్రమ్మర దుష్కృతుల్ కావింపకుండ.

"మీరు నిలువుడు. నేను మీతో మాటాడుచుండగనే జరారోగములు, మృత్యువు సమీపించుచున్నవి" అని వారి కుపదేశ మిచ్చి, యోజనప్రదేశము నిండు జనమును వెంట గొని, బయలుదేరి హస్తిపాలకుమారునికడకె బోయెను. అత డాకసమున గూరుచుండి ధర్మోపదేశ మిచ్చుచు "సోదరా, ఇచట జనము పెద్దగుంపుగా గూడుదురు. ఇక్కడనే మనము ప్రస్తుత ముందము" అనెను. అశ్వపాలు డంగీకరించెను.

ఆవల నొకనాడు రాజు, పురోహితుడును గోపాలకుమారుని యింటికి బోయిరి. ఆతడు స్వాగతము చెప్పినపిదప, తాము వచ్చినపని తెలిపిరి. ఆతడు అశ్వపాలకుమారునివలెనే నిరాకరించి, పోయిన వృషభమును వెదకువాని వలె "నేను చాలరోజులనుండి ప్రవ్రజ్యకై అన్వేషించుచున్నాను. వృషభ పాదచిహ్నములవలె నాకును సోదరులు చన్నమార్గము గోచరించుచున్నది. నే నిప్పు డాత్రోవనే పోవుదును" అని యత డీగాథ పలికెను :

కనబడకుండంగ జను వృషభంబు
కై వెదకెడునట్లు కాటను జనుడు,
నాదు ప్రవ్రజ్యా ధనంబు గోల్పోవ
దాని నన్వేషింప కే నెట్టు లుందు ?

"నాయనా, గోపాలా, ఒకటి రెండు దినములు వేచియుండుము. మేము కుదుటబడిన పిదప నీవు ప్రవ్రజింపవచ్చును" అని వారు చెప్పగా గోపాలుడు "మహారాజా, నేడు చేయదగినపని రేపు చేయుదునని చెప్ప రాదు. శుభకర్మ నేడే చేయదగును'' అని యీ గాథ పలికెను :

కర్తవ్యమును వేగ కావింపకుండ
తామసించెడివాడు తప్పక చెడును.
భావికాలము తీరు బాగుగా నెరిగి
ఆలసింపడు ధీరు డాచరణాన.

ఇట్లు ధర్మోపదేశము చేసి, "మీరు నిలువుడు. నేను మీతో మాట లాడుచుండగనే జరావ్యాధులు, మరణము సమీపించుచున్నవి'' అని యతడు యోజనము మేర నిండిన జనమును వెంటగొని, బయలుదేరి, ఇరువురు సోద రులకడకు బోయెను. అశ్వపాలు డాకసమున నుపవిష్టుడై అతనికి ధర్మోప దేశము చేసెను.

ఆవల రాజు, పురోహితుడును అజపాల కుమారుని గృహమునకు జని స్వాగతానంతరము తాము వచ్చిన కారణముతెలిపి, ఛత్రధారణము చేయు మనిరి. అతడు "నా సోదరు లెచటనున్నారు'' అని యడిగెను. "వారు మాకు రాజ్యముతో పనిలేదు, అని శ్వేతచ్ఛత్రము విడిచిపెట్టి మూడు యోజన ములవరకును జనులు తమ్ము ననుసరించుచుండ బయలుదేరి గంగాతటము నకు బోయి నివసించుచున్నారు'' అనిరి. "అట్లయిన నా సోదరులు ఉచ్ఛిష్టము వలె విసర్జించి పోయినదానిని నేను వహించి తిరుగుదునా? నేనుకూడ ప్రవ్రజింతును" అనెను. "బాబా, ఇంకను నీవు చిన్నవాడవు. మా తోడ్పాటు నీకుండును. పెద్దవాడవైన పిదప ప్రవ్రజింప వచ్చును.'' "ఏమను చున్నారు? ప్రాణులు చిన్నతనములోను పెద్దతనములోను చనిపోవుట లేదా? ఇతడు చిన్నతనమున పోవును, ఇతడు వార్ధకమున పోవును అని చేతులలో నైనను కాలిలో నైనను ప్రమాణములులేవు. నా మరణకాలము నాకు తెలియదు. కావున నిప్పుడే ప్రవ్రజించెదను" అని ఆతడు ఈ గాథలు పలికెను :

భోగ మెరుగక, కేతకీ పుష్పవాస
కలిగి హాసవిలాస సంకలిత యగుచు
మత్తయైన కుమారిని మిత్తి మొదటి
వయసునం దెత్తుకొనిపోవు నయములేక.

సుందరుండు, కులీనుండు, కుందనంపు
రంగుమేనివాడును, కేసరములు వోలె
ధాడి వ్యాపించి యున్నట్టి తరుణు మిత్తి
ఎత్తుకొనిపోవు చెప్పక యెప్పుడైన-
కావునం ద్యజియించి భోగములు నేను
ప్రవ్రజింపగ దయచేయవలె ననుజ్ఞ.

ఇట్లని "మీరు నిలువుడు, నేను మీతో సంభాషించుచుండగనే జరా వ్యాధులు, మరణము సమీపించుచున్నవి" అని వారికి ప్రణామము చేసి, యోజనమువరకు జనులు తన ననుసరించుచుండగా బయలు వెడలి గంగా తటము చేరెను. హస్తిపాలుడు ఆకసమున గూరుచుండి ధర్మోపదేశము చేసి ఇక్కడ జనసమూహము కూడుననగా విని అచటనే నిలిచిపోయెను.

మరునాడు పురోహితుడు సుఖాసీనుడై "నా పుత్రులు ప్రవ్రజించి నారు. ఇప్పుడు నేను మానవరూపమున నున్న మ్రోడువలె నైనాను. నేను కూడ ప్రవ్రజింతును" అనుకొని బ్రాహ్మణితో ఈ విషయము విమర్శిం చుచు ఈ గాథ పలికెను :

శాఖాసహితమైన సమయమ్మునందె
అగును వృక్షము వృక్ష, మటు కానిదాని
బోదె యందురు, నాకు పుత్రులు లేమి
నే ప్రవ్రజించుట నేడె యుక్తంబు.

ఇట్లని ఆతడు బ్రాహ్మణులను పిలువనంపెను. అరువదివేల మంది బ్రాహ్మణులు గుమి గూడిరి, ఆతడు వారితో "మీ రేమి చేయుదురు?" అనెను. "ఆచార్యా, మీ రేమి చేయుదురు?" "నేను పుత్రుల కడ ప్రవ్ర

జించెదను.'' ''కేవలము మీకే నరకము వేడి యెక్కలేదు. మేముకూడ ప్రవ్రజింతుము.'' బ్రాహ్మణు డెనిమిదికోట్ల ధనమును బ్రాహ్మణికిచ్చి, యోజనము మేర బ్రాహ్మణులు వెంటవచ్చుచుండగా పుత్రుల సమీపము నకు జనెను. హస్తిపాలుడు ఆ జనసమూహమును చూచి ఆకాశమున నిలిచి ధర్మోపదేశము చేసెను.

మరువాడు బ్రాహ్మణి "నా పుత్రులు నలుగురు శ్వేతచ్ఛత్రమును విడిచి ప్రవ్రజింపబోయినారు. ''బ్రాహ్మణుడు కూడ రాజపురోహిత పదవిని వదలి యెనుబదికోట్ల ద్రవ్యము విడిచి కొడుకులకడకు జనినాడు. ఇచట నే నేమి చేయుదును? నేను కూడ పుత్రుల ననుగమించెదను" అను కొని వెనుకటి యుదాహరణములు స్మరించుచు ఉల్లాస గాథ పలికెను :

గగన సీమను క్రౌంచంబు లెగురునట్లు
మంచు రాలెడి వేళల నంచగములు
జాలములు త్రెంచికొని పోవు చందమునను
నాడు పుత్రులు పతియును నన్ను విడిచి
చనిన వా, రేను వారల ననుసరింతు.

"నేనెట్లు తలపోయుచున్నదాన నైనను ప్రవ్రజింపగూడదా" అను కొని నిర్ణయించుకొని బ్రాహ్మణస్త్రీలను పిలువనంపి "మీ రేమి చేయుదురు" అనెను. "ఆర్యా, మీరేమిచేయుదురు. ?" "నేను ప్రవ్రజింతును." ''మేము కూడ ప్రవ్రజింతుము". ఆమె మహాసంపదను విసర్జించి యోజనము మేర నిండు వారు వెంట వచ్చుచుండగా పుత్రులకడకు జనెను. హస్తిపాలుడు ఆ సంఘమును చూచి ఆకసమున కూరుచుండి ధర్మోపదేశము చేసెను.

మరునాడు రాజు ''పురోహితు డెక్కడ'' అనెను? ''దేవా, పురో హితుడు, ఆయన భార్య సమస్తధనమును విడిచి రెండు మూడు యోజన ములు వ్యాపించు జనమును వెంటగొని పుత్రులకడకు పోయినారు'' అని అచటివారు విన్నవించిరి. 'యజమానుడు లేని ధనము రాజుకు చెందును' అనుకొని రాజు వారి యింటనుండి ధనము తెప్పించెను.

పట్టపుదేవి, 'రాజుగారు ఏమిచేయుచున్నా' రనెను. "పురోహితుని ఇంటినుండి ధనము తెప్పించుచున్నారు" "పురోహితు డెక్కడ ?" "భార్యతోగూడ ప్రవ్రజ్యకై బయలువెడలినారు."

ఈ మాటలు విన్నతోడనే పట్టపుదేవి తనలో బ్రాహ్మణుడు, బ్రాహ్మణి, నలువురు పుత్రులు విడిచిపోయిన మలమువంటి ధనమును మోహమున తన యింటికి రాజు తెప్పించుకొనుచున్నాడు. రాజాంగణమున ధనరాసులు పోయుచున్నారు. ఈయన ఋజుమార్గమును విడిచి వల పన్నినాడు. దూరమునుండి చూచి గ్రద్ద మాంసముకొరకు లేచును. బుద్ధిగలిగిన గ్రద్దలు వల పన్నియుండుటకని తమ భారమును గమనించి యెగురలేక తిన్న మాంసమునుకూడ విడిచి వలలో చిక్కుకొనక సూటిగా నెగిరిపోయినవి. కాని అంధులు, మూర్ఖులు నగువారు ఉచ్ఛిష్టమును తిని బరువెక్కి సూటిగా నెగురలేకున్నారు. వారు పోయి వలలో చిక్కుకున్నారు." అని నిదర్శనముగా ఒక గ్రద్దను తెప్పించి పట్టపురాణి రాజుకడకు పోయి "మహారాజా, దయచేయుడు. రాజాంగణమున వినోదము చూతురుగాని" అని పంజరము తెరచి "మహారాజా, ఈ గ్రద్దలను చూడుడు" అని ఈ గాథలు పలికెను.

తిని యెర, వాంతి చేసిన విహంగములు
ఎగిరిపోవుచు నున్న వెర క్రక్క నట్టి
పక్కి లెతెంచుచు చిక్కె నా చేత.

భూమీసుర త్యక్త భోగముల్ రాజ,
అనుభవించెదవు; వాంతాశన మెవడు
భుజియించు, వానిని పొగడుదు రెవరు ?

విని రాజు పశ్చాత్తాపము చెంది మూడు జన్మల వ్యథ గ్రహించి నేడే రాజ్యము విడిచి ప్రవ్రజింపవలయును అనుకొని, వైరాగ్య ముదయించుటచే దేవిని ప్రశంసించుచు ఈ గాథ పలికెను :

పంకంబునన్ జారిపడ్డ దుర్బలుని
బలవంతు డుద్ధరింపగ జాలినట్లె
పాంచాలి, నీదు సుభాషిత గాథ
లుద్ధరించినవి నన్నూబిలోనుండి.

ఇట్లని అమాత్యుల పిలువనంపి "మీ రేమి చేయుదురు?" అనెను. "దేవా! తామో?" "నేను హస్తిపాలునికడ ప్రవ్రజింతును." "దేవా, మేముకూడ ప్రవ్రజింతుము."

రాజు వారాణసీ రాజ్యము విడిచి 'కావలసినవారు శ్వేతచ్ఛత్రము ధరింపవచ్చును' అని చాట బంచెను. ఆవల మూడు యోజనముల వరకు అనుయాయులు వెంట వచ్చుచుండ కుమారునికడకు జనెను. ఆతడు పరిషత్తును చూచి అకసమున కూరుచుండి ధర్మోపదేశము చేసెను.

రాజు ప్రవ్రజించిన విషయము ప్రకటించుచు శాస్త ఈ గాథ పలికెను :

ఇట్లు పలికి దిశాంపతి యేసుకారి
ప్రభువు రాజ్యంబు విడనాడి ప్రవ్రజించె
బంధనము త్రెంపుకొని హస్తి పరచునట్లు.

మరల నొకనాడు నగరములో మిగిలినజనులు సమావిష్టులై రాజద్వారముచేరి దేవికెరుకపరచి రాజభవనమున ప్రవేశించి దేవికి నమస్కరించి ఒక ప్రక్క నిలిచి ఈ గాథ పలికిరి :

సరిపడె ప్రవ్రజ్య జనపతి, కరిగె
వీరుండు రాజ్యంబు విడనాడి; ఇంక
మా 'రాజువై' నీవు మా రక్షణమున
శాసింపు రాజ్యమ్ము జనసమ్మతముగ.

ఆమె జనుల వాక్కులు విని ఈ గాథలు పలికెను :

సరిపడె ప్రవ్రజ్య జనపతి, కరిగె
వీరు డుత్తమభూమి విడనాడి : నేను
విడిచి మనోహర వివిధ భోగముల
నేకాకినిగ చరియింతు లోకమున.

వివిధ భోగంబుల విడనాడి నేను
ఏకాకినిగ చరియింతు లోకమున.

కడచుచున్నది కాలమ్ము, రాత్రు
లెన్నియో చనుచున్న వెరుక లేకుండ,
ఆయుస్సు క్రమముగా వ్యయ మగుచున్న,
దేకాకినిగ చరియింతు లోకమున.

సంగమ్ము విడనాడి శాంత చిత్తమున
ఏకాకినిగ చరియింతు లోకమున

ఈ విధముగా ఆమె జనులకు ధర్మోపదేశమిచ్చి అమాత్యుల భార్యలను పిలువనంపి 'మీ రేమి చేయుదురు' అనెను. "ఆర్యా, తా మేమి చేయుదురు ?" "నేను ప్రవ్రజింతును." "మేముకూడ ప్రవ్రజింతుము" మంచిదని ఆమె రాజభవనములోని సువర్ణాగారాదులు తెరపించి ఫలాని స్థానమున పెద్ద ఖజానా పాతిపెట్టియున్నది అని బంగరు పట్టామీద చెక్కించి, కావలసినవారు వచ్చి తీసుకొనుడు అని నగరమున చాట బంచి, యెత్తయిన కంబముపై బంగరు పట్టిక బంధించి, సంపదలు విడిచి నగరము వెలువడెను. నగరమున కోలాహలము చెలరేగెను. రాజు, దేవియు రాజ్యము విడిచి ప్రవ్రజించుటకై వెడలిపోయిరి. ఇప్పుడు మనమేమి చేయుదము ? అని లోకులు భవనములు విడిచి బిడ్డలను చంకనెత్తికొని బయలుదేరిరి. తెరచిన దుకాణములన్నియు తెరచినట్లేయుండెను. వెనుకు వచ్చి చూచినవారు లేరు. నగరమంతయు నిర్మానుష్యమయ్యెను. దేవియు మూడు యోజనములు నిండు జనములను వెంట గొని హస్తిపాలకుమారుని కడకు జనెను. ఆతడు ఆకసమున గూరుచుండి ధర్మోపదేశము చేసి పండ్రెండు యోజనముల పొడవున అనుయాయులను వెంటగొని హిమవంతమువైపు చనెను. హస్తిపాలకుమారుడు పండ్రెండు యోజనముల వారాణసి ఖాళీ చేయించి జనమును హిమాచలమువైపు కొనిపోవుచున్నాడు మన దొక లెక్కయా" అనుకొని కాశీరాష్ట్రమంతటను కలకలము చెలరేగెను. క్రమముగా

ముప్పది యోజనముల పొడవున అనుయాయులు వచ్చుచుండి అతడు హిమాలయమున ప్రవేశించెను.

శక్రుడు ధ్యానదృష్టితో జూడగా హస్తిపాల కుమారుడు అభినిష్క్రమణము చేసి బయలు వెడలె నని తోచెను. జనసమూహము మెండగు ననియు నివాసస్థానము సమకూర్పవలెననియు తలచి శక్రుడు విశ్వకర్మను బిలువనంపి "పోయి ముప్పదియారు యోజనముల పొడవు, పదునారు యోజనముల వెడల్పు కల యాశ్రమము నిర్మించి, వలయు సామగ్రు లన్నియు సమకూర్పుము" అని ఆనతిచ్చెను. అతడు చిత్తమని, చని గంగా తటమున తత్ప్రమాణములు కల యాశ్రమము రమణీయస్థానమున నిర్మించెను. ఆశ్రమము లన్నింటను వలసిన వస్తువులు సమకూర్చెను. ప్రతి కుటీరమునకు చంక్రమణ ప్రదేశము, మొగదల ఫలవృక్షము, మంచినీటి బావి, వివిధ సుగంధి పుష్పలతలు ఏర్పరించెను. ఆ కాలమున గూడ దేవతా ప్రభావముచే వృక్షములు ఫలములతోను, లతలు పుష్పములతోను నిండి యుండును. ఆశ్రమ నిర్మాణానంతరము విశ్వకర్మ ప్రతి పర్ణశాలలో ప్రవ్రజితులకు వలసిన వస్తుసముదాయము సమకూర్చెను. గోడపై "ప్రవ్రజింప దలచువారు ఈ యీ ముఖ్యవస్తువులను గొనిపోవచ్చును" అని లిఖించి, మృగ, పక్షి, అమనుష్యప్రభృతికి దుర్దర్శనీయ జీవులను భయంకర నాదముతో, గర్జతో, దూరీకరించి, వెడలిపోయెను.

హస్తిపాలకుమారుడు దండధారియై ఆశ్రమములోనికి జని అక్షరములు చూచి "శక్రుడు నా మహాభినిష్క్రమణము గ్రహించియుండును" అనుకొని, ద్వారము తెరచి, పర్ణశాలలోని కరిగి, ఋషిప్రవ్రజ్యకు వలయు వస్తువులు గొని యీవలకు వచ్చి చంక్రమణ స్థానమున దిగి, కొన్నిసారు లిటు నటు పచారు చేసి, అందరను ప్రవ్రజితులను కావించి, ఆశ్రమ విషయము యోచించెను. చిన్నబిడ్డలకు స్త్రీలకు నడుమనున్న పర్ణశాల లిచ్చి ఆవల వృద్ధ స్త్రీలకు, తరువాత వంధ్యలకు, అనంతరము నాలుగు వైపులను పురుషులకు పర్ణశాల లిచ్చెను.

వారాణసిలో రాజు లేడని యొకానొక రాజు విని, యచటికి వచ్చి అలంకృత రాజభవనమున ప్రవేశించి, ఎటు చూచినను రత్నరాసులను గమ

నించి, "ఇట్టి గొప్పనగరమును విడిచిపోయి జరిపిన ప్రవ్రజ్య గొప్పదయి యుండును" అని తలచి, ఒకానొక త్రాగుబోతు నడిగి, మార్గము తెలిసికొని హస్తిపాలకుమారునికడ కరిగెను. రాజు వనము మొగదలకు వచ్చినట్లు విని హస్తిపాలకుమారుడు స్వాగతము పలికి, ఆకాశమున గూరుచుండి, ధర్మోపదేశము చేసి, ఆశ్రమమునకు గొనివచ్చి, ఎల్లరను ప్రవ్రజితులను జేసెను. ఈ విధముగా మరి యారుగురు రాజులను ప్రవ్రజితులను జేసెను. ఏడుగురు రాజులు సంపదలు విడిచిపెట్టిరి. ముప్పదియారు యోజనముల యాశ్రమము నిండిపోయెను కామాది సంకల్పములచే తర్కవితర్కములలో పడినవారికి మహాపురుషుడు ధర్మోపదేశమిచ్చి, బ్రహ్మవిహారమును యోగ విధిని జూపుచుండెను. వారిలో ననేకులు ధ్యానాభిజ్ఞలు పొంది, మూడు వంతులలో రెండు వంతులమంది బ్రహ్మలోకమున బుట్టుచుండిరి. మరల మూడవ వంతులోనుండి ఒక భాగము బ్రహ్మలోకమునను, ఒక వంతు ఆరు కామలోకములలోను, ఒకవంతు ఋషిసేవ చేసి మానవలోకమునను, ఒక వంతు కుశల సంపత్తులలోను జన్మించుచుండిరి. హస్తిపాలుని శాసనమున ఒకరును నరకమున జన్మింపలేదు, పశు జన్మ మెత్తలేదు, అసుర ప్రేత జన్మము లెత్తలేదు.

ఈ తామ్రపర్ణీ ద్వీపమున పృథ్వీచాలక ధర్మగుప్తస్థవిరుడు, కటకన్ధ కారవాసి పుష్యదేవస్థవిరుడు, ఉపరిమండల కమలవాసి మహా సంఘరక్షిత స్థవిరుడు, మతిమహాదేవస్థవిరుడు, భగ్గిరివాసి మహాదేవస్థవిరుడు వామంత పచ్చారవాసి మహాసీవస్థవిరుడు, కాళవల్లి మండపవాసి మహానాగస్థవిరుడు, కుదాల సమాగమమున, మూగపక్ష సమాగమమున, చూళసుతసోమ సమాగమమున, అయోఘరపండిత సమాగమమున, హస్తిపాల సమాగమమున అందరకంటె వెనుక వెలువడిన పురుషులు. ఇందుచేతనే భగవాన్ ఇట్లు చెప్పినాడు :

శీఘ్రు శీఘ్రుంబుగా చేయంగ వలయు
మంచి కార్యము, లాలసించుట తగదు.

శాస్త యీ ధర్మోపదేశనము చేసి, "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వముకూడ తథాగతుడు అభినిష్క్రమణము చేసినాడు" అని జాతకములు సరి పోల్చెను.

ఆకాలమున ఏసుకారి శుద్ధోదనమహారాజు; దేవి మహామాయ; పురోహితుడు కాశ్యపుడు; బ్రాహ్మణి భద్రకాపిలాని; అజపాలుడు అనురుద్ధుడు; గోపాలుడు మౌద్గల్యాయనుడు; అశ్వపాలుడు సారిపుత్రుడు; శేష పరిషత్తు బుద్ధపరిషత్తు; హస్తిపాలుడు నేనే.

———:():———

# 510. అయోఘర జాతకము

శాస్త్ర జేతవనమున విహారము చేయు నపుడు మహాభినిష్క్రమణమును గూర్చి చెప్పినది. "భిక్షువులారా, కేవలమిప్పుడేకాదు, పూర్వముకూడ తథాగతుడు మహాభినిష్క్రమణము చేసి యుండెను" అని, శాస్త పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు చుండగా ఆయన పట్టపుదేవి గర్భము ధరించి ఒకానొక ప్రాతఃకాలమున పుత్రుని కనెను. వెనుక జన్మలో ఆమెసవతి వంధ్య యగుటచే పుత్రవతి యగు నామె బిడ్డలను మ్రింగ ప్రతిన చేసెను. మరణానంతర మామె యక్షిణి యయ్యెను. తెండవయామె రాజుకు పట్టపుదేవియై పుట్టి పుత్రుని గనెను. అదను చూచి ఆ యక్షిణి బీభత్సాకారముతో వచ్చి, దేవి చూచు చుండగనే శిశువు నెత్తికొని పరుగెత్త సాగెను. దేవి ఎలుగెత్తి "యక్షిణి నా శిశువు నెత్తికొని పరుగెత్తుచున్నది" అని యరచెను. యక్షిణి శిశువును ముల్లంగి దుంపను నమలునట్లు నమిలి తిని, చేతులతో దేవిని బెదరించి వెడలి పోయెను. రాజు విని, యక్షిణి నేమి చేయవలెనో తోచక మిన్నకుండెను.

రెండవ మారు దేవి ప్రసవించు కాల మాసన్న మయినపుడు గట్టి రక్షక దళము నియుక్తమయ్యెను. దేవి పుత్రుని ప్రసవించెను. యక్షిణి వచ్చి శిశువును భక్షించెను. మూడవ మారు మహాసత్త్వ డామె కడుపున బడెను రాజు జనులను బిలిచి "దేవి సంతానమును యక్షిణి భక్షించు చున్నది. ఏమి చేయవలెను?" అనెను "యక్షిణి తాటియాకు లన్న బెద రును. దేవి చేతులకు, పాదములకు తాటియాకులు కట్టవలెను" అని యొక రనిరి. వేరొకరు "యక్షిణి ఇనుపయిల్లు చూచిన భయపడును అయో గృహము నిర్మింపవలెను" అనిరి. రాజు మంచిదని లోహ మందిరము

నిర్మింప జేసెను. నగరములో రమణీయస్థలమున నిర్మాణము జరిగెను. స్తంభములు మొదలు మందిరములోని వస్తువులన్నియు అయోమయములే. తొమ్మిది నెలలలో పెద్ద చతుష్కోణ భవనము సిద్ధమయ్యెను. అది నిత్య ప్రజ్వలిత దీపమువలె నుండెను.

దేవికి నెలలు నిండినవని తెలిసినంతనే రాజామెను సుసజ్జిత లోహ మందిరమున జేర్చెను. సౌభాగ్య పుణ్య లక్షణములు గల కుమారుడు పుట్టెను. శిశువునకు లోహగృహకుమారుడని పేరు పెట్టిరి. శిశువును దాదుల కప్పగించి, గట్టి పహరా యేర్పాటుచేసి, రాజు దేవిని వెంటగొని నగర ప్రదక్షిణముచేసి, సుసజ్జిత ప్రాసాదములోని కేగెను. యక్షిణికి నీరు కొనిపోవు వంతు వచ్చెను. ఆమె కుబేరునకు నీరు కొనిపోవుచుండగా మృత్యువు వాత బడెను.

బోధిసత్త్వుడు లోహగృహములోనే పెరిగి పెద్దవాడై, బుద్ధి వచ్చి, సమస్త విద్యలు నేర్చెను. అమాత్యులతో రాజు "నా పుత్రు డెప్పుడు యుక్తవయస్కు డగును?" అనెను. వారు "దేవా, పదునారు వర్షములవా డయినపుడు శూరుడు, శక్తిశాలియు నగును. వేయిమంది యక్షులను సైత మాపగలుగును" అని విన్నవించిరి రాజు కుమారునకు రాజ్య మీయ దలచి నగరమంతయు నలంకరించి, కుమారుని అయోగృహమునుండి తోడ్కొని రండని ఆనతిచ్చెను. చిత్తమని వారు పన్నెండు యోజనముల వారాణసి నలంకరించి, సర్వాభరణ భూషితమైన మంగళహస్తిని గొనివచ్చి, కుమారు నలంకరించి, భద్రగజముపై గూరుచుండబెట్టి, "కులప్రాప్త నగగమునకు ప్రదక్షిణము చేయుడు, కాశీరాజగు తమ తండ్రికి నమస్కరింపుడు, నేడే తాము శ్వేతచ్ఛత్రము ధరింతురు" అని విన్నవించిరి. బోధిసత్త్వుడు నగర ప్రదక్షిణము చేయు సమయమున రమణీయారామములను, పుష్కరిణులను, రమ్యప్రాసాదాదులను జూచి, అమాత్యులతో "మా నాయనగారు నన్నింత కాలము కారాగారమున నుంచి, ఇట్టి చక్కని నగరమును జూడనీయలేదు. నా యపరాధమేమి?" అనెను. వారు "దేవా, మీ యపరాధ మేమియు లేదు. మీ సోదరుల నిరువుర నొకానొక యక్షిణి యెత్తుకొనిపోయి భక్షించి నది. అందుచే మిమ్ము నాయనగారు లోహగృహమున నుంచిరి. దీనివలన

మీ ప్రాణరక్షణ జరిగినది" అని వివరించిరి. అంతట బోధిసత్త్వుడు తనలో "పదిమాసములు లోహకుంబనరకమున నున్నట్లు, మలనరకమున నున్నట్లు తల్లికడుపున నుంటిని, మాతృగర్భము వెడలినది మొదలు పదునారు వర్షముల పాటు ఈ కారాగారమున నుంటిని. బాహ్య ప్రపంచము చూచుటకు వీలు కలుగలేదు. నేడు యక్షిణినుండి రక్షితుడనైనను అజరామరత్వము లేదు. రాజ్యము గైకొని యేమిచేయుదును? అభిషిక్తుడనైన వెనుక రాజ్యము విడుచుట కష్టము. నేడే నాయనగారికడ ననుజ్ఞ గైకొని, హిమాలయమునకు బోయి ప్రవ్రజింతును" అనుకొని, నగర ప్రదక్షిణముచేసి, రాజభవనమున ప్రవేశించి, తండ్రికి నమస్కరించి ఒక ప్రక్క నిలిచెను. రాజాతని శరీరశోభ గాంచి, ప్రీతితో నమాత్యులవంక జూచెను. "దేవా, ఏమి యాజ్ఞ ?" అని వా రడిగిరి. "నా కుమారుని రత్నసింహాసనముపై గూరుచుండబెట్టి, మూడు శంఖోదకములతో నభిషేకించి, స్వర్ణహారము వేసి, శ్వేతచ్ఛత్రము పట్టుడు" అని రాజానతిచ్చెను. బోధిసత్త్వుడు తండ్రికి నమస్కరించి "నాకు రాజ్యము వలదు. ప్రవ్రజింతును. అనుజ్ఞ దయచేయుడు" అని విన్నవించెను.

"నాయనా, రాజ్యము విడిచి, యేల ప్రవ్రజింతువు ?"

"దేవా, నేను తల్లికడుపున పదిమాసము లుంటిని. పుట్టినది మొదలు యక్షిణీభయముచే పదునారు వర్షములు లోహ కారాగారమున నుంటిని. ఆ కాలమున బాహ్యప్రపంచమును తొంగిచూడనే లేదు. యక్షిణినుండి తప్పించుకొన్నను నాకు అజరామరత్వములు లభింపలేదు. మృత్యువు నెవ్వరు జయింపలేరు. నేను మూడు పుట్టువులనుండి విరక్తుడను. వార్ధకము, మృత్యువు రాకముందే ధర్మ మనుసరింతును. నాకు రాజ్యము వలదు. అనుజ్ఞ యిండు" అని యాతడు తండ్రికి ధర్మోపదేశము చేయువాడై యీ గాథలు పలికెను :

ఒక్కరాత్రి తల్లి యుదరంబులోని
మానవుండు నుదియమానాభ్రమట్లు
చను ముందరికె. కాని వెనకకు రాదు.

బలవంతు లైనను బలు యోధులైన
జరకు లోనౌదురు, చచ్చిపోవుదురు,
జర కధీనము సర్వ జాతియం చెంతు :
నెరవుదు ధర్మంబు నే నిందుచేత.

అన్నివైపుల శత్రు వాక్రమించినను
ఘావు డొక్కొక్కడు పొందును జయము.
దమయింప మృత్యువున్ దలపోయలేదు;
నెరవుదు ధర్మంబునే నిందుచేత.

బ్రదుకు నొక్కొక్కడు పరచతురంగ
బలము చుట్టిన నన్ని పార్శ్వంబులందు :
దమియింపు మృత్యువుం దలపోయలేదు.

వైరిపక్షంబును ధ్వంసము చేయు
చతురంగ బలముతో సాహసికుండు,
తలచునే మృత్యు విధ్వంస మాతండు ?

మదము స్రవించెడి మత్తగజంబు
నగరమున్ మర్దించు, నరులను జంపు
మరి మిత్తి నాహస్తి మర్దింపగలదె ?

ధీరుండు, కుశలుండు. దూరలక్ష్యంబు
వేధింప గలిగిన విలుకాడు కూడ
గురి పెట్టి మృత్యువున్ కొట్టంగలేదు.

సరసులు, విపినముల్, శైలముల్ పొందు
క్షయమెప్పుడో యొక సమయంబు నందు
అన్నియుంగూడ కాలాధీన మగును.

స్త్రీ పురుషాదుల జీవముల్ చంచ
లమ్ములు మత్తుచేలమ్ము విధాన,
తటిని యంచున నున్న తరువు చందమున.

బిడ్డలు, మధ్యముల్, పెద్దలు సర్వ
జనులు మృత్యువునోట జారిపోవుదురు,
ఫలము వృక్షమునుండి పడిపోవునట్లు.

వృద్ధి నొంద దీ యాయువు విధువువోలె :
గతము గతమౌను, మరి వార్ధకమ్మునందు
సమసిపోవును కాంతులు సౌఖ్యములును.

ఊర్పునను మానవుల జంపు నేర్పు కలదు
ప్రేత యక్ష పిశాచాది భూతములకు
క్రోధ ముదయించుచో నవి గూడ మిత్తి
నుత్సహింపవు హరియింప నూర్పుతోడ.

క్రుద్ధ యక్షపిశాచముల్ గూడ శాంతి
గాంచు బలికర్మచే, మిత్తి కనదు శాంతి.

దోషులను నిందితుల నన్య దుష్టజనుల
క్షితిపులు విచారణమున శిక్షింపగలరు.
కాని మిత్తిని దండింపగలరె వారు ?

దోషులును, నిందితులు, నన్య దుష్టజనులు
వేడవచ్చు క్షమాపణ విభుని కడను :
మృత్యుదేవత యెపుడు క్షమింపదెవని.

క్షత్రియు చేతను బ్రాహ్మణు చేత
బలవంతుచేతను బహుధని చేత
మిత్తి రాజునకు నాపత్తి లేదెందు.

సింహముల్, వ్యాఘ్రముల్, చిరుతలు కాని
బల్మిని మృగములం బట్టి భక్షించు;
కాని మిత్తిని బట్టి కబళింపలేవు.

జనుల కన్నులు కట్ట జాలుదు రైంద్ర
జాలికుల్ రంగాన : సమ్మోహ పెట్ట
నేరరు మృత్యువున్ వారలు కూడ.

క్రుద్ధ సర్పములు లోకులను కాటందు,
చంపు నొక్కొకయెడ సత్వరంబుగనె :
కాని మృత్యువు నవి కాటందలేవు.

క్రుద్ధ సర్పవిషంబు గూడ దింపుదురు
జాంగలికులు, మృత్యు సర్పవిషంబు
నిర్వీర్య మొనరింప నేర రెన్నండు.

ధన్వంతరియును, వేతరణియు, భోజ
నామ జాంగలికులు నష్టంబు చేసి
విషవీర్యమును, తుదిన్ విష నష్టులైరి.

ఘోర విద్యల నెట్లొ నేరిచి, ఓష
ధీ మహత్త్వమున నదృశ్యుడై నరుడు
శత్రుల గికురింప జాలును; కాని
మృత్యువుకడ కృతకృత్యుండు కాడు.

ధర్మచారిని రక్షించు ధర్మమెపుడు,
ధర్మ మాచరితము సుఖదాయకంబు
యుక్తముగ ధర్మమార్గాను సక్త జనుని
దుర్గతికి ధర్మ ముంచును దూరముగను.

ఫలము ధర్మాధర్మములకు భిన్నంబు,
నడపు నధర్మమ్ము నరకమ్ము దెసకు,
సద్గతికిం గొని చనును ధర్మంబు.

బోధిసత్త్వు డీవిధముగా తండ్రి కుపదేశమిచ్చి "మహారాజా, తమ రాజ్యము తమకే ఉండనిండు. నాకు దీనిపై మక్కువ లేదు. మీతో నేను

సంభాషించుచుండగనే జరావ్యాధులు, మృత్యువు సమీపించు చున్నవి. తాము నిలువుడు'' అని, ఇనుపగొలుసులు త్రెంపివేయు మదేభమువలె బంగరువన్నె పంజరము భేదించుకొనిపోవు సింహ శాబకమువలె కామాదులను భేదించి, తలిదండ్రులకు సమస్కరించి, కదలి పోయెను.

రాజుకూడ తనకు రాజ్య మక్కర లేదని రాజ్యము విడిచి, అతని వెంట జనెను. రాజు బయులుదేరిన పిదప దేవి, అమాత్యులు, బ్రాహ్మణులు, సంసారులు, అఖిల ప్రజలును ఇళ్లువదలి, బయలుదేరిరి. గుంపు పెద్దది యయ్యెను. అనుయాయులు పన్నెండు యోజనముల పొడవున నుండిరి. బోధిసత్త్వుడు వారితో హిమాలయమున ప్రవేశించెను.

శక్రుడీ విషయము గ్రహించి, విశ్వకర్మను బిలువనంపి, ''పన్నెండు యోజనముల పొడవు, ఏడు యోజనముల వెడల్పుకల యాశ్రమము నిర్మింపుము'' అని యానతిచ్చెను. ఆశ్రమమునకు వలయు సదుపాయములు సమకూర్పబడెను. బోధిసత్త్వుని ప్రవ్రజ్య, ప్రవచనము, బ్రహ్మలోక గమనము, నరకలోకమునుండి పరిష్కరక్షణము, మొదలగునవి పూర్వమువలెనే జరిగినవి.

శాస్త యిట్లు ధర్మదేశము చేసి, ''భిక్షువులారా, తథాగతుడు పూర్వము కూడ మహాభినిష్క్రమణము చేసెను'' అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున మాతా పితలు రాజకులములోని వారే; పరిషత్తు బుద్ధపరిషత్తు; అయోఘర పండితుడు నేనే.

——:()：——

# 511. కింఛంద జాతకము

శాస్త జేతవనమున ఉపోసథ వ్రతమును గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఒకనాడు చాలమంది ఉపాసకులు, ఉపాసికలు, ఉపోసథ వ్రత ధారులు, ధర్మము వినుటకై వచ్చి కూరుచున్నప్పుడు శాస్త "ఉపాసకురాలా, ఉపోసథవ్రత మవలంబించితిరా?" అనెను. "భన్తే, చిత్తము" అని వారనగా, శాస్త "మంచిపని చేసితిరి. పురాణపండితులు, అర్ధోపోసథ వ్రతము పూనినందులకే యశము నొందిరి.'' అని వారి ప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు శ్రద్ధావంతుడు, దానశీలుడు. ఉపోసథవ్రతమున అప్రమత్తుడు నగు పురుషుడుండెను. ఆత డమాత్యాదుల చేతగూడ దానానుమోదనము చేయించెను. కాని అతని పురోహితుడు కొండెగాడు, లంచగొండి, అభియోగములలో తప్పు తీర్పు లిచ్చెడివాడు. ఉపోసథవ్రత దినమున రాజు అమాత్యాదులను బిలువనంపి, వ్రతము పూనుడని చెప్పెను. పురోహితుడు వ్రతము పూనలేదు. ఆ నా డతడు లంచములు పుచ్చుకొని, తప్పు తీర్పులు చెప్పెను. అందరును దర్శనార్థము వచ్చినపుడు అమాత్యుల నడిగినట్లే రాజు పురోహితుని గూడ "ఆచార్యా, తాము ఉపోసథవ్రత మవలంబించితిరా?" అని అడిగినప్పుడు చిత్తమని యాత డసత్యము పలికి, ప్రాసాదమునుండి దిగెను.

అమాత్యు డొకరు తనపై దోషారోపణ చేయగా పురోహితుడు "నేను వేళకు భోజనము చేసినాను. ఇప్పు డింటికి బోయి ముఖము కడుగుకొని, వ్రతమూని, రాత్రిభోజనము చేయుదును. రాత్రి శీలరక్షణము చేయ

దును. ఈ విధముగా అర్థవ్రతపాలన మగును" అనెను. అమాత్యుడు మంచి దనెను. పురోహితు డింటికి జని ఆ ప్రకారమే చేసెను.

ఒకనా డాతడు న్యాయాధీశ స్థానమున నున్నపుడు ఆచారవతి యగు స్త్రీ అభియోగమున జిక్కుకొని యుండుటచే నింటికి బోజాలకుండెను. వ్రతభంగము కాకుండవలె నని యామె సమయ మాసన్న మయినంతనే ముఖప్రక్షాళనాదిక మారంభించెను. బ్రాహ్మణునికడ నున్న మామిడి పండ్లలో నొకటి యామెకు జేరెను. దీనిని భక్షించి వ్రతము నిలుపుకొను మని బ్రాహ్మణు డనగా, నామె యటులే చేసెను. బ్రాహ్మణుడు చేసిన యుత్తమ కర్మ మిదియే.

కాలక్రమమున నాతడు మరణించి, హిమాలయ ప్రదేశమున, కౌశికీ నదీతీరమున, మూడు యోజనముల సహకారవనమున, రమణీయస్థానమున సౌభాగ్య స్థలమున, సువర్ణ వర్ణ విమానమున, అలంకృత శయనాగార మున పండుకొని లేచినట్లు జన్మించెను. ఆతడు బాగుగా నలంకృతుడై, ఉత్తమ రూపము కలిగి, పదునారువేలమంది దేవకన్యకలచే పరివేష్టితుడై యుండెను. రాత్రివేళనే యీ శారీరక వైభవ మనుభవించుచుండెను. వైమానిక ప్రేతభావమున కనుగుణముగా ప్రతిఫల మనుభవించుచుండెను. అందుచే అరుణోదయ మయినంతనే యతడు ఆమ్రవనమున ప్రవేశించును. తోడనే ఆతని దివ్య జన్మ మంతర్ధానమగును. శరీరము ఎనుబది తాడిచెట్ల యెత్తున పెరుగును. ఒడలంతయు మోదుగు పూలు పూచినట్లు వెలుగు చుండును. చేతికి ఒక్క వ్రేలుమాత్ర ముండును. కుద్దాలములవలె నుండు నఖములు మొలుచును. ఆత డా గోళ్ళతో వీపు గోకుకొని, కండలు లాగి తినుచు, వెను బాధచే నిటు నటు తిరుగుచు పెద్ద పెట్టున రోదనము చేయు చుండును. సూర్యు డస్తమింపగనే యా దేహ మంతర్ధాన మగును. తోడనే దివ్యదేహ ముద్భూత మగును. అలంకృత దేవకన్య లతనిని పరివేష్టించి, వివిధ వాద్యములతో నాట్య మాడుదురు. మహా విభవముతో నతడు దివ్యామ్ర వనమున, దివ్య ప్రాసాద మెక్కును.

ఉపోసథ వ్రత మవలంబించిన స్త్రీకి మామిడి పండిచ్చుటచే మూడు యోజనముల ఆమ్ర వనము లభించినది. లంచము పట్టి, తప్పు తీర్పు చెప్పు

టచే నిజమాంసమును పీకి తినవలసి వచ్చెను. అర్ధవ్రత మవలంబించుటచే నర్తకి జన పరివేష్టనము, రాత్రి భోగము సమకూరెను.

ఆ సమయమున వారాణసీ నరేశుడు కామభోగాదుల సేవగించి, ఋషి ప్రవ్రజ్య నవలంబించి గంగాతటమునకు దిగువ రమణీయ ప్రదేశమున పర్ణశాల నిర్మించుకొని, గింజ లేరి తినుచు, కాలక్షేపము చేయుండెను.

ఒకనా డాయామ్రము శాఖనుండి ఘట పరిమాణమున పండిన మామిడి పండు నదిలో పడి, ప్రవాహమున తేలిపోవుచు, ఆ తపస్వికి పీ లగు తట మును చేరెను. ముఖ ప్రక్షాళనము చేసికొని ఆయన నీటిలోనికి దిగి, యీది పోయి మామిడి పండును పట్టుకొని తెచ్చి, అగ్ని గృహమున నుంచెను. అవసరము వచ్చినప్పుడు కోసి తినుచు, మిగిలినది అరటి యాకులో చుట్టి దాచుచుండెను. అది సమాప్తమైన పిదప ఆయనకు మరి యే పండు రుచింప లేదు. రస తృష్ణకు వశీభూతుడై యాతడు నదీతటమునకు బోయి చూచుచు ఫలము లభించువరకు నచ్చటనే కూరుచుండ నిశ్చయించు కొనెను. ఆత డచటనే నిరాహారుడై ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు రోజులు జలమువైపు చూచుచుండెను. ఏడవనాడు నదీదేవత యోచించి గ్రహించి "ఇతడు తృష్ణావశవర్తియై సప్తాహము పాటు నిరాహార దీక్ష పూని జలము వంక జూచుచు కూరుచున్నాడు. ఈ తపస్వికి ఫలమీయకుండు టనుచితము. ఫలము లభింపనిచో మరణించును. నే నతనికి ఫల మొసంగు దును" అనుకొని, వచ్చి, నదీతటముపై నాకసమున నిలిచి, ఆయనతో సంభా షించుచనదై యీ గాథ పలికెను :

ఏమి తలచెదు బ్రాహ్మణా, ఇంటిలోన
ఒంటిగా నేల నిటు పడియున్న వాడ ?
వేమి కోరెదు నీమతం బేమి చెపుము !

విని తపస్వి యీ గాథలు పలికెను :

కమ్ర నిర్మిత జలపూర్ణ కులశమట్లు
ఒప్పి, వన్నియ, రసగంధయుక్తమైన
ఆమ్ర ఫలమును నేను రత్నాకరమున

కొట్టుకొని పోవు దాని జేపట్టి తెచ్చి
అరటి యాకులలో నుంచి, అవల దాని
దినుచు, నాకలి దప్పికల్ తీర్చుకొంటి.

వ్యథ తొలగిపోయె, ఫలము సమాప్తి నొందె,
చింత హెచ్చిన దేది రుచింప దయ్యె !

సలిలమున గొట్టుకొని పోవు స్వాదు మధుర
ఫలము దెచ్చితి; అయ్యది ప్రకృతమందు
నాదు శుష్కతకుం గారణంబు, నన్ను
నిశ్చయంబుగ మృత్యు సన్నిధికి లాగు.

నిండి మత్స్యాలతో రమణీయ మైన
యీ విశాల నదీతటి నేను కూరు
చుండు హేతువులం దెల్పియున్నవాడ.

దేవి ! యెవ్వరో నీవు తెలుపగదవె !
ఇచ్చటికి నీదు రాకకు హేతు వేమి ?

పైడి బొమ్మను, వ్యాఘ్రుని, పర్వతాత్మ
జాత బోలెదు దాన ! ఆ స్వర్గమందు
మర్త్యలోకమునందు సమస్త రూప
వతులలో నొక్కతేని నీవంటి దేది ?

అడిగితిని నిన్ను నే సుందరాంగి, యింక
నాకు జెప్పుము నీ గోత్ర నామములను.

అంతట దేవి యీ గాథలు పలికెను :

రమణీయ కోసి తీరమ్మున నీవు
ఉపవిష్టుడవు బ్రాహ్మణోత్తమా, నాదు
వాసమ్ము భూరి ప్రవాహిని నదిని.

వివిధ భూరుహా పరివృత కందరముల,
ఎంచుచు, ప్రముఖగా నేతెంచు దరికి
వనములలో నుండి వచ్చుచు, నీల
నీరముల్ గొనితెచ్చు నేరులు, నాగ
సుప్రసన్నములు చొచ్చు నాలోన.

ఆమ్ర జంబూ పనసౌదుంబరాది
ఫలములం దెచ్చు నా పజ్జకు నెపుడు.

ఉభయ తటంబుల నున్న వృక్షముల
ఫలములు నీటిలో బడి, తప్పకుండ
కొన్ని ప్రవాహాన కొట్టుకపోవు.

రాజోత్తమా, బహు ప్రజ్ఞ, మేధావి,
ఇచ్ఛ నెపుడు నిగ్రహించుట మేలు.

ఆమ్ర ఫలార్థివై అసువులు బాయ
తలపెట్టు నీ చిన్నతనము గ్రహించి
ఆలోచనా శీలు డని యెంచ నిన్ను
రాజ్య వర్ధనుడవు; రాజర్షి వగుము.

గ్రహియింత్రు పితరులు గంధర్వ దేవ
తలు, సంయతాత్ములు, తాపసుల్, తప్ప
కుండంగ విజితేంద్రియుం డైన వాని.

అంతట తపస్వి యిట్లనెను :

జీవహింసను గూర్చి యోచింపనట్టి
నరుడు సర్వ ధర్మంబుల నెరిగి కూడ
కనుగొనడు పాపవృద్ధికి కారణంబు.

కాంచి ఋషిగణకీర్తి లోకమున నట్టి
యశము పొంది, అశోభన మైన నుడుల
పాప మారోపణము చేయ భావ్య మగునె ?

ఓ సుమధ్యమ, నేను యుష్మత్తటాన
మరణించుచో "అసినరకంబు" నాకు
సంప్రాప్త మగును నిస్సందేహముగను.

విని, దేవకన్య యీ గాథలు పలికెను :

సహించువాడ దుస్సహ మైనదాని!
విదిత మైనది భవద్విషయంబు నాకు.
ఆమ్ర ఫలమ్ముతో నాత్మార్పణమ్ము
నే జేయుచున్నాను నీకునై రాజ!

త్యాగమ్ము చేతను భోగముల్ విడిచి
శాంతి నొందగ వచ్చు, సద్ధర్మమందు
పూర్వ బంధవిముక్తి పొందినవాడు
మరల వాంఛా బద్ధమతి యగునేని
అతం డధర్మ కార్యమ్ములు చేయ,
ఆతని పాపమ్ము లభివృద్ధి నొందు.

రావోయి, ఉత్సుకరహితుండ వగుచు,
శీతల స్థలికి నే జేర్చెద నిన్ను
విడిచి యౌత్సుక్యంబు విహరింపవచ్చు

కుసు మాసవంబులు గ్రోలి మత్తెక్కు
ఖగ నివాసం బడి క్రౌంచ మయూర
కోయష్టికాదులు కూజితాల్ చేయు,
కూయును హంసలు, కోకిలల్ పాడు.

అచటి శాఖలు వంగు నామ్ర ఫలాల
భారమ్ముచే, తాళఫల సమానములు
మామిడి పండ్లు కొమ్మల వ్రేలుచుండు.

ఈ ప్రకారముగా ఆమ్రవన ప్రశంస చేసి, తపస్విని దింపెను. దింపి "ఈ తోటలో మామిడి పండ్లు తిని మీ కోర్కి నెరవేర్చుకొనుడు" అని పలికి

వెడలిపోయెను. తాపసి పండ్లు తిని సంతృప్తి చెంది అచటనే విశ్రమించెను. అచట ప్రేతము దుఃఖము నొందుచుండుట చూచి యేమియు చేయజాలకుండెను. కాని సూర్యాస్తమయ మయినంతనే ప్రేతము నటీపరివృతమై దివ్యభోగ మనుభవించుట గాంచి తాపసి యీ గాథలు పలికెను :

దివ్య భూషణముల దివ్యాంబరముల
దివ్య మాలికలను దివ్యాంగ రాగ
మాదిగా దాల్చి, యామినులందు
విహరించుచున్నావు వివిధ భోగముల.

అయినను వాసరంబందు పొందుదువు
వేదన; పదునారు వేలు స్త్రీలున్న
తోడనే భయదంపు పీడ తప్పనిదె.

బాధల పెట్టగా పరుల నెందరనో
పూర్వ జన్మమున, నిప్పుడు తప్ప దాయె
నిజమాంస భక్షణ, నీకు విప్రుండ !

ప్రేత మాతని గురుతించి "మీరు నన్ను గురుతించుట లేదు. నేను మీ పురోహితుడను. మీ యాశ్రమమున నేను చేసిన అర్థ–ఉపోసథ వ్రత ఫల పరిణామముగా ఈ రాత్రి మీరు చూచిన నా సుఖానుభూతి. పగటివేళ నా దుఃఖానుభూతి నా పాపకర్మము వలననే. మీరు నన్ను న్యాయాధీశ పదవి యందు నియోగించిన పిదప లంచము తీసికొని, అసత్య నిర్ణయము చేసినాను. ఆనాడు చేసిన పాపమునకు ప్రతిఫలముగా ఈ దుఃఖ మనుభవించుచున్నాను" అని యీ గాథలు పలికెను :

చేసి అధ్యయనంబు, చిక్కి కామాది
విషయోప భోగాల విహితంబు కాని
పనులు చేయుచునుంటి పరజనంబులకు.

కొండెముల్ చెప్పెడి కుజనుండు తినును
పృష్ట మాంసమ్మును పీకి ముక్కలుగ
ప్రకృతమ్ము నే వ్యథ పడుచున్నయట్లు,

ఇట్లు పలికి "తమ రేల యిచటికి వచ్చినారు ?" అని తాపసి నడిగెను. అతడు జరిగిన దంతయు సవిస్తరముగా తెలిపెను.

"భన్తే, తాము ఇటనే యుండుడు, పోవలదు."

"ఉండను. ఆశ్రమమునకే పోవుదును."

"భన్తే, మంచిది నేను తమకు పక్వామ్ర ఫలములను నిరంతరము చేర్చుచుందును" అని ప్రేతము నిజప్రభావమున తాపసిని గొనిపోయి ఆశ్రమమున దింపెను. దింపి, ఉత్కంఠ లేకుండునట్లు ఆయన ప్రతిజ్ఞ గైకొని వెడలిపోయి, నియమ పూర్వకముగా మామిడిపండ్లు తెచ్చి యిచ్చుచుండెను. తపస్వి వానిని తినుచు, యోగవిధి సాహాయ్యమున లబ్ధధ్యానుడై క్రమముగా బ్రహ్మలోకగామి యయ్యెను.

ఉపాసకులకు శాస్త యీ ధర్మోపదేశనము చేసి, ఆర్య సత్యాదులను ప్రకాశింపజేసి, జాతకములు సరిపోల్చెను. అపుడు కొందరు స్రోతాపన్నులు కొందరు సకృదాగాములు, కొందరు అనాగాములు నయిరి.

ఆ సమయమున దేవత ఉత్పలవర్ణ, తపస్వి నేనే.

—·—

# 512. కుంభ జాతకము

శాస్త జేతవనమున విహరించునపుడు సురాపానము చేయు నయిదువందల విశాఖ చెలికత్తెల విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తిలో సురాపానోత్సవము ప్రకటించిన పిదప యజమానులతో క్రీడోత్సవము ముగిసినపిదప ఆ 500 మంది స్త్రీలు ఘాటుగల సుర సిద్ధము చేసి ఉత్సవము సంకల్పించి విశాఖకడకు జని "సఖి, మనము ఉత్సవము చేయుదము" అనిరి. ఆమె "యిది సురాపానోత్సవము. నేను సుర త్రాగను" అనెను. చెలికత్తెలు "మీరు సమ్యక్- సంబుద్ధునకు దాన మొసగుడు. మేము ఉత్సవమున పాల్గొందుము" అనగా, ఆమె మంచి దని, వారిని ప్రోత్సహించి, శాస్తను నిమంత్రించి మహాదాన మిచ్చి విశేషగంధమాల్యాదులు కైకొని, సాయంకాలమున ధర్మకథ వినుటకై చెలికత్తెలతో జేతవనము చేరెను. వారు సురాపానము చేసి ఆమెవెంట జనిరి. ద్వారప్రకోష్ఠమున నిలిచి సురత్రాగి, విశాఖవెంట వారు శాస్తసన్నిధికి చేరిరి. విశాఖ శాస్తకు నమస్కరించి ఒకప్రక్క గూరుచుండెను. ఆమెచెలికత్తెలలో కొందరు శాస్తయెదుట నృత్యము చేయసాగిరి; కొందరు పాడజొచ్చిరి. కొందరు కాలుచేతులు ఆడింప దొడగిరి. మరికొందరు జగడ మాడసాగిరి. వారిమనసులలో భీతి గొల్పుటకై శాస్త తన కనుబొమ వెంట్రుకలలోనుండి ఒక్క కిరణము ప్రసారించెను. తోడనే గాఢాంధకారము వ్యాపించెను. వారు బెదరి మరణభయముకూడ చెందిరి. త్రాగిన మద్యపుమత్తు దిగిపోయెను. తాను కూర్చున్నపీఠమున అంతర్ధానము నొంది శాస్త సుమేరు పర్వతముపై నిలిచి ఊర్ణలోమమునుండి కిరణము ప్రసారించెను. వేయి చంద్రులు వెలిగిన ట్లయ్యెను. శాస్త అచటనే నిలిచి వారలమనసులలో త్రాసము పురికొల్పుటకై ఈ గాథ పలికెను :

అగ్ని మందు నిత్య మానంద మేటికి ?
హాస మేల ? చుట్టి యన్ని యెడల
నంధకార ముండ నధికమ్ముగా; నరుల్
దీపమునకు వెదక నోప రేమి ?

తోడనే 500 స్త్రీలు స్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితు లయిరి. శాస్త వచ్చి గంధకుటిచ్ఛాయలో బుద్ధాసనముపై నుపవిష్టు డయ్యెను. చూచి "భక్తే, సిగ్గు, భయము, పోగొట్టు ఈ సురాపానము ఎప్పటినుండి ప్రారంభ మైనది ?" అనెను. శాస్త ఆమె ప్రశ్నమునకు ప్రత్యుత్తర మిచ్చువాడై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయు నప్పుడు సుర నామకు డగు అడవిమానిసి సామగ్రులు తెచ్చుకొనుటకై హిమాలయమువైపు పోయెను. అక్కడ ఒకానొకవృక్షము నాలుగైదు మూరలయెత్తు పెరిగి మూడువైపుల విభక్తమయ్యెను. ఆ మూడిటినడుమ భాండమంత గుంటలో దైవవశమున వాన పడుటచే నీరు నిండెను. ఆ గుంట చుట్టును మామిడిచెట్టు మిరప మొక్కలు కలవు. అవి పండినపిదప గుంటలో రాలుచుండెను. గోతి కనతిదూరమున స్వయముగా మొలిచిన ధాన్యపు మొక్క లున్నవి. చిలుక లందుండి గింజలు తెచ్చి చెట్టుమీద వాలి తిను చుండునపుడు కొన్నిగింజలు తండులములు గుంటలో రాలుచుండెను. సూర్య రశ్మి పడుటచే వేడియెక్కి పక్వమై నీర మెరుపారెను. ఎండవేళ దాహము తీర్చుకొనుటకై పిట్టలు వచ్చి నీరు త్రాగి, మత్తిల్లి పడిపోయి, త్వరలోనే తెలివి వచ్చి కలకిలలాడుచు ఎగిరిపోవుచుండెను. కోతులకు గూడ ఈ స్థితియే పట్టుచుండెను. అడవివాడు చూచి "ఇది విషమైనచో ఇవి యన్నియు మర ణింపవలెను. కాని కొంతసేపు పండుకొని, ఆవల సుఖముగా పోవుచున్నవి. కావున ఇది విషపానీయము కాదు" అని యోచించి, కొంచెము నీరు త్రాగి మత్తిల్లి, కొలదిసేపటికి మాంసము మీదికి మనసు పోవగా, చెట్టుక్రింద బడిన తిత్తువులను, కోళ్ళు మొద లగువానిని చంపి నిప్పుచేసి, కాల్చి, ఒకచేతితో

నాట్యభంగి ప్రదర్శించుచు, రెండవచేతితో మాంసము పట్టుకొని కొరికి తినుచు, రెండురోజు లచనే యుండెను.

అచటికి కొలది దూరములో వరుణ నాము డగుతపస్వి యుండెను. అడవిమానిసి అప్పు డప్పు డాయనకడకు బోయెడివాడు ఆయనకీ పదార్థము సమర్పింపవలె నని అడవివానికి తోచినది. వాడు వెదురుగొట్టమునిండ పానీయము నింపి, వండినమాంసమును గూడ పట్టుకొని, పర్ణశాలకు బోయి, "భన్తే, ఈ పదార్థమును స్వీకరింపుడు" అనెను. ఉభయులును మాంసము తిని, పానీయ మారగించిరి సుర నాముడును, వరుణ నాముడును కను గొనుటచే దానికి సుర యనియు, వారుణి యనియు పేర్లు వచ్చెను. ఈ పదార్థము బ్రదుకుదెరువున కాధార మని వారు గ్రహించి, వెదురు గొట్టములలో పానీయము నింపి, కావడిలో పెట్టుకొని, సరిహద్దునగరము చేరి, యీ విషయము రాజున కెరుకపరచిరి. వారిని బిలువ నంపి రాజు మూడుసారు లది యాస్వాదించునప్పటికి మత్తు తలకెక్కెను. రెండురోజులకు మత్తు దిగగా రాజు వారితో "ఇంకను పానీయము కలదా ?" యనెను. "చిత్తము. దేవా !" "ఎక్కడ నున్నది ?" "హిమాలయమున నున్నది." "అగుచో కొనిరండు."

వారు పోయి రెండుమారులు తెచ్చిరి. విడువకుండ తెచ్చుటకు వీలు కాక, అందలి వస్తుసామగ్రులను గూర్చి విచారణ చేసి, ఆ చెట్టు బెరడు మొదలు తక్కినవస్తువులను సమకూర్చుకొని వచ్చి, నగరమున సుర కాచిరి. నాగరకులు సురాపానము చేసి, మత్తెక్కి నశించిరి. నగర మించుమించుగా శూన్య మయ్యెను.

సురాపాచకులు పారిపోయి, వారాణసి చేరి, రాజుకు పానీయ విషయము తెలియపరచిరి. రాజు వారిని పిలువ నంపి, ధన మిచ్చెను. వారు మద్యము సిద్ధముచేసి, నాగరకుల కిచ్చిరి. నగరము నష్ట మయ్యెను.

అచటినుండి వా రిరువురు సాకేతమునకు, సాకేతమునుండి శ్రావస్తికి జనిరి. ఆ సమయమున సర్వమిత్రనాము డగు రాజు అచట పరిపాలనము చేయుచుండెను. "మీ కేల కావలెను ?" అని రాజు వారి నడిగెను. "సామ

గ్రీకి మూల్యము, బియ్యపుపిండి, అయిదువందల ఘటములు" అని వారు చెప్పగా రాజు వలసినవన్నియు నిప్పించెను. వారు సుర కాచి, ప్రతిఘటము కడను పిల్లిని రక్షార్థము కట్టివేసిరి. సుర పొంగి క్రిందికి కారగా దగ్గర తోనే కట్టివేసియున్న ప్రతి మార్జాలము దానిని నాకి మత్తిల్లి పడిపోయెను. ఎలుకలు వచ్చి వానిచెవులును, ముక్కులు, మీసములు, తోకలు కరచి పోయినవి. రక్షకభటులు పోయి, పిల్లులు సురాపానము చేసి మృతి నొందిన వని రాజుకు విన్నవించిరి. సుర కాచువారు విషము తయారు చేసిరని భావించి, రాజు వారికి శిరశ్ఛేద శిక్ష విధించెను. వారు "సుర కావలెను, అమృతము కావలెను'' అని యరచుచు ప్రాణములు విడిచిరి.

ఆ ఘటములు పగుల గొట్టుడని రాజాజ్ఞ యయ్యెను. మత్తు తగ్గిన పిదప పిల్లులు లేచి గంతులు వేయుచు నిటు నటు పరుగెత్త జొచ్చెను. ఈ విషయము తెలియగా రాజు "అది విషమైనయెడల పిల్లులు చనిపోయె డివి. నిజముగా అది మధురపేయపదార్థమే త్రాగుదును" అనుకొని నగర మలంకరింపజేసి, రాజాంగణమున మండపము నిర్మించి, అందు శ్వేతచ్ఛ త్రముక్రింద రాజసింహాసనమున గూరుచుండి, అమాత్యులు పరివేష్టించి యుండ సురాపానము చేయ నుద్యమించెను.

లోకములో మాతృసేవాది సుకృతకార్యత్రయ మెవ్వరెవ్వరాచ రించుచున్నారో చూడ దలచి, దేవేంద్రశక్రుడు వచ్చి, రాజు సురాపానో ద్యుక్తు డగుట గమనించి "ఈతడు సురత్రాగుచో సమస్త జంబూద్వీపము నష్ట మగును. కావున నితడు త్రాగకుండ వారించెదను" అనుకొని, బ్రాహ్మణవేషము ధరించి, సురాభాండము నరచేత దాల్చి, రాజున కెదురుగా నాకసమున నిలిచి "ఈ ఘటము గొనుడు, ఈ ఘటము గొనుడు" అని యెలుగెత్తి పలికెను. సర్వమిత్ర ప్రభువు చూచి "నీ వెచటనుండి వచ్చి నావు ?'' అని ప్రశ్నించువాడై యీ గాథలు పలికెను :

త్రిదివమందుండి క్రిందికి దిగినవాడ !
ఇందుపోలిక నిశి వెలిగించువాడ !
వెడలును 'సతేరతా' నామ విద్యుదాభ
తావకాంగమునుండి నాతమ్ముతోడు

లేక నిలుతువు, తిరుగుదు వాకసమున
దేవతల బుద్ధిబలము పొందితివో నీవు !

ఘటము గొను మంచు పలికెదు గగనతలము
నందు నిలిచియె, ఏ ముండు నిందు ? నాకు
నెవ్వరవో నీవు బ్రాహ్మణా, యెరుకపరచు.

అంతట శక్రుడు 'అట్లయిన వినుము' అని దోషములు చూపువాడై యీ గాథలు పలికెను :

శర్కర ఘృతంబు తైలంబు సర్పి మధువు
కాని నింపినఘట మిది కానె కాదు :
ఎన్నొదోషాలు నింపిన దీఘటమ్ము !

త్రాటిలును దేని త్రాగిన దొరలిపడును
గుంటలోన తటాకాన గోతిలోన
మానవుడు, తినగూడనివాని దినును
అట్టిసురతోడ నిండిన యట్టిఘటము.

క్రోలగా దేని చిత్తంబు కోలుపోవు
స్థైర్య మంతయు, మనుజుడు సంచరించు
పసరమట్టులు దేనినో మెసపుచుండి,
వివశు డై పాడు, గంతులు వేయు, అట్టి
మద్యపరిపూర్ణ మైనకుంభంబు గొనుమ !

త్రాగి దేనిని నరుడు వస్త్రంబు జార
నగ్నుడై సందుగొందుల నాట్య మాడు,
మెండు నిద్దుర పోవును బండవారి,
అట్టి మద్యముతో నిండినట్టి ఘటము.

పాన మొనరించి దేని కంపమ్ముతోడ
కాలుసేతులు కడుపును కాష్ఠపుత్రి

పోల్కి, నట్టిసురారస పూర్ణ మైన
కుంభ మియ్యది, దీనిని గొనుమ నీవు !

దేని గ్రోలిన నరుడు నదీజలాన
గాంచు మరణమ్ము. తినును సృగాలవితతి,
బంధనమ్మున ద్రోయు, సంపద హరించు,
అట్టి సురతోడ నిండిన మట్టికడవ.

దేని ద్రాగిన, సభలోన మానవుండు
స్రస్తచేలు డగుచు నవాచ్యములు పలుకు,
చెందు తబ్బిబ్బు, నిష్ఠీవమందు దొరలి,
అట్టి సురతోడ నిండిన మట్టికడవ.

క్రోలి యెద్దాని నభిమాన ఘూర్ణమాన
రక్తనేత్రాలతోడ ధరాతలంబు
సర్వమును స్వీయ మని యెంచి, చక్రవర్తి
తనకు తుల్యుడు కా డని తలచు నరుడు,
అట్టి మద్యముతో నిండి నట్టిఘటము.

పెంచు నభిమాన కలహముల్, పిశునవృత్తి
కారణంబు, వివర్ణత కలుగజేయు,
చోరధూర్తులకుం గతి, సురను నింపు
కుంభ మియ్యది, దీనిని గొనుము నీవు.

భూరిసంపత్తి కలిగినవారి కోట్ల
కొలది హరియించె నెయ్యది, కులము వెలయు
వారి నాశము చేసిన వారుణి యిది !

నాశ మొనరించు నేది, ధాన్యంబు, ధనము,
పసిడి, రజతము, క్షేత్రముల్, పశుగణముల,
నట్టి మద్యముతో నిండి నట్టిఘటము.

త్రాగి మానవు డెదాని. తండ్రి, తల్లి
దిట్టు, పట్టును వావి కానట్టిస్త్రీల,
అట్టి మద్యముతో నిండి నట్టిఘటము.

త్రాగి దేనిని, తిట్టు దుర్మార్గురాలు
పతిని మామను పెద్దల, పట్టుకొనును
అధమపరిచారకుల దుష్టహస్త మైన,
అట్టి వారుణితో నిండి నట్టిఘటము.

త్రాగి మానవు డెద్దాని, శ్రమణు గాని
బ్రాహ్మణుని గాని జంపగా బాలుపడునొ,
ప్రతిఫలమ్ముగ జేరునో భయదనరక,
మట్టి వారుణితో నిండి నట్టిఘటము.

దేని ద్రాగిన చేయును త్రికరణముల
నరుడు దుష్కర్మముల, దుది నరక మొందు
నట్టి సురతోడ నిండిన యట్టిఘటము.

అన్నృత మెవ్వనిచేత నాడింపలేదొ
బండనిద్దుర పుచ్చి, పలుక, నాతండు
అనృతవాక్కులు దేని నాస్వదించుచును
అట్టి సురాపూర్ణ మౌ ఘట మిద్ది.

ఆవశ్యకం బైనయట్టికార్యంబు
చేయ బంపినవాడు చేసి యద్దాని
స్మరియింప డెద్ది యాస్వాదన చేసి,
అట్టిసురాపూర్ణ మౌ ఘట మిద్ది.

క్రోలి దేనిని లజ్జగూడ త్యజించు,
దేనిమైకంబున ధీరుండు కూడ
అధికమ్ముగా మాటలాడచు నుండు
అట్టివారుణి నిండి నట్టిఘటమ్ము.

దేని ద్రావుచు నన్నపానీయములను
త్యజియించి పురుషుండు స్థండిలశయను
డగును, వైవర్ణ్యంబు నయశంబు నొందు
అట్టి వారుణి నిండి నట్టిఘటమ్ము.

దేనిని సేవించి మానవుం డిలను
గళలోహశృంఖల గల పశువట్లు
తిండి లేక, శిరంబు తిరిగి పరుండు,
తట్టుకోజాల డెద్దాని తీవ్రతను
అట్టి సురాపూర్ణ మైనకుంభంబు.

తోచినంతనె యెది దూరదూరముగ
సర్వముం గాంచిన సరణి నేగుదురో
తొడరి యెవ్వడు విషతుల్య మైనట్టి
ద్రవపదార్థంబును ద్రావగా నేర్చు?

దేని ద్రావి సముద్రతీరమ్మునందు
విచరించు చంధక వృష్ణిపుత్రకులు
అన్యోన్యముసల ప్రహారాల మడసి
రట్టి సురాపూర్ణ మైనట్టిఘటము.

ఎది యాస్వదింపంగ మదమత్తు లగుచు
పోయిరో భ్రష్టు లై పూర్వదేవతలు
త్రిదివంబునందుండి, తెలిసి యెవ్వండు
బహునిరర్థక మద్యపానంబు చేయు?

ఇందు దధి మధువులలేమి నెరిగి, కొనుము
సర్వమిత్రమ, ఘట్టగత సకలగుణ వి-
శేషములు నీకు విశదము చేసినాను.

విని, రాజు సురాదోషములు గ్రహించి ప్రసన్నచిత్తు డై శక్రుని స్తుతించువా డయి యీ గాథలు పలికెను:

లేడు జనకుండు, తల్లియు లేదు నాకు
నీవలె హితంబు కోరగా నెవరు లేరు.
ఆచరించెద నీచెప్పినట్లు నేడు.

ఉత్తమ గ్రామపంచక మొసగువాడ,
శతము దాసీగణంబును, సప్తశతము
గోగణము, నుత్తమము లైనఘోటకముల
తోడ పదియరదంబులగూడ నిత్తు.

విని శక్రుడు తన దేవత్వమును ప్రకటించువాడై, ఆకసమున నిలిచి యీ గాథలు పలికెను :

రాజ, దాసీశతమ్మును, గ్రామములను,
గోవులను, శ్రేష్ఠహయములు గూర్చునట్టి
యరదములగూడ నుండనిమ్ము :

అమరవిభుడ

శక్రుడను నేను; నీవు మాంసమ్ముతోడ
ఓదనము నారగింపుమీ మోదమునను !
దుగ్ధమును, ఘృతము, మధువుతో నపూప
ములను, త్రాగుచు భక్షింపుము నృప, యిట్లు
రతుడ వై ధర్మమం దనిందితుడ వగుచు
మున్నవహాన స్వర్గంబు నొందగలవు.

ఈ విధముగా శక్రు డుపదేశ మిచ్చి నిజనివాసస్థానమున కరిగెను. అతడు కూడ సురాపానము చేయక, సురాభాండములను తొలగించి, శీల ప్రతిష్ఠితుడై, దానాదు లిచ్చి, స్వర్గపరాయణు డయ్యెను. జంబూద్వీపమున క్రమముగా సురాపానము పెరిగిపోయెను.

శాస్త యీ ధర్మోపదేశనము చేసి, జాతకములు సరిపోల్చెను. ఆ సమయమున రాజు ఆనందుడు; శక్రుడు నేనే.

—[o]—

# 513. జయద్దిస జాతకము

శాస్త జేతవనమున విహరించునపుడు మాతృసేవాపరాయణుడగు భిక్షువును గూర్చి చెప్పినది. వర్తమానకథ సామజాతకముతో (540) సరిపోలును. ఆ సమయమున శాస్త "పురాణపండితులు బంగరుజాలరు కల శ్వేతచ్ఛత్రమును విడిచియు తలిదండ్రుల సేవచేసిరి"అని వారిప్రార్థనపై పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున కాంపిల్యరాజ్యమున ఉత్తరపాంచాల నామకుడగు రాజు పరిపాలన చేయుచుండెను. ఆయనపట్టపురాణి కుమారుని కనెను. పూర్వజన్మమున ఆమె సవతులతో నొకతె సవతికయ్యమున ఈమెకు పుట్టిన బిడ్డలను మ్రింగుదు నని వాంఛించి చనిపోయిన పిదప యక్షిణిగా పుట్టెను. ఇప్పు డామె పట్టపురాణి చూచుచుండగనే వచ్చి మాంసపు ముద్దవలె నున్న శిశువును ఎత్తుకొనిపోయి కరకర నమిలి మ్రింగెను. రెండవపర్యాయముకూడ అట్లే జరిగెను. మూడవమారు ప్రసూతిగృహము చుట్టును రక్షకులను కట్టుదిట్టముగా కావలా ఉంచిరి. శిశువు జన్మించిననాడు యక్షిణి వచ్చి బిడ్డను లేవనెత్తెను. యక్షిణి అని రాణి బిగ్గరగా కేకలు వేసెను. రాణిచూపిన త్రోవన మావటీలు యక్షిణివెంట పరుగెత్తిరి. బిడ్డను తినుటకు యక్షిణికి అవకాశము లేదు. అది పరుగెత్తి చిన్నవాగులో దాగుకొనెను. శిశువు మాత యనుకొని దాని స్తనము నోట బెట్టుకొనెను. యక్షిణిమనసున పుత్రస్నేహ ముదయించెను. అది అచటినుండి పరుగిడి శ్మశానము చేరి అచ్చటి కొండగుహలో శిశువును దాచి పోషించుచుండెను.

బాలుడు క్రమముగా పెరిగి తల్లి తెచ్చిన మనుష్యమాంసము తినసాగెను. ఇరువురును మానవమాంసము తినుచు అచటనే నివసించుచుండిరి. తాను మానవసంతాన మని వానికి తెలియదు; తాను యక్షిణీపుత్రు డనియే

వానివిశ్వాసము. శాలునకు నిజరూపము విడిచి అంతర్ధాన మగుశక్తి లేదు. యక్షిణి అందులకై వానికి మూలిక ఇచ్చెను. వాడు మూలికాప్రభావముచే పరులకు కనబడకుండ మానవమాంసము తినుచు తిరుగుచుండెను. వైశ్రవణ మహారాజు సేవ చేయుయక్షిణి ఒకసారి ఆయనసేవకై పోయి అచటనే మరణించెను.

పట్టపురాణి నాల్గవమారు పుత్రుని కనెను. యక్షిణి లేకుండుటచే శిశువు ఆరోగ్యముతో నుండెను. శత్రుయక్షిణిని జయించి పుట్టుటచే అతనికి జయద్దిశ నామ ముంచిరి. అతడు పెరిగి పెద్దవాడైనపిదప సమస్తవిద్యలు నేర్చి ఛత్రధారణము చేసి రాజ్యపాలన మారంభించెను.

ఆ సమయము బోధిసత్త్వుడు జయద్దిసుని పట్టపుదేవికడుపున జన్మించెను. వానికి అలీనశత్రుకుమారు డని పేరుపెట్టిరి. అతడు పెద్దవాడై విద్యలు నేర్చి ఉపరాజయ్యెను.

ఆ యక్షిణీకుమారుడు కాలక్రమమున అజాగ్రత్తవలన మూలిక పోగొట్టుకొనెను; కావున అంతర్ధానశక్తి నశించెను. వాడు నలుగురు చూచు చుండగనే శ్మశానమున మనుష్యమాంసము తినసాగెను. జనులు చూచి భయపడి రాజుకడకు వచ్చి "దేవా, యక్షు డొకడు నలుగురు చూచుచుండ గనే శ్మశానమున మానవమాంసము తినుచున్నాడు. క్రమముగా వాడు నగరములో ప్రవేశించి జనులను చంపవచ్చును కావున వానిని పట్టించుట ఆవసరము" అని విన్నవించిరి.

రాజు మంచి దని వానిని పట్టుటకై ఆన తిచ్చెను. సైన్యము పోయి శ్మశానము చుట్టు ముట్టెను. యక్షిణీపుత్రుడు దిగంబరుడై సేనను చూచి భయపడి మృత్యుభయముచే కేకలు వేయుచు జనులనడుమ దూరెను. వాడు యక్షు డని తెలిసికొని సేన రెండు పాయలయ్యెను. వాడు కూడ పరుగెత్తి అడవిలో దూరెను. ఆవల వాడు బస్తీవైపు రాక, పెద్ద తెరువువెంట అడవికడ తిరుగుమానవులలో ఒక్కొక్కనిని పట్టుకొని అడవిలోని కీడ్చుకొని పోయి అచట సంహరించి తినుచు పెద్ద మర్రిచెట్టుక్రింద నివసించుచుండెను.

సార్థవాహ బ్రాహ్మణుడు అరణ్యరక్షకులకు వేయినాణెము లిచ్చి, 500 బండ్ల బిడారుతో ఆ మార్గమున బోవుచుండెను. మానవయక్షుడు ఘీంకారము చేయుచు అచటికి దుమికెను.

వాడు బ్రాహ్మణుని బట్టుకొని పరుగెత్తెను.

వనరక్షకులు వాని వెంట నంటిరి. వాడు బ్రాహ్మణుని విడిచిపెట్టి, తాను వసించుచెట్టుకడకు బరుగెత్తెను. అచట వాడు ఏడుదినములు పడి యుండెను.

ఆనాడు జయద్దిస నరేశుడు వేట కాన తిచ్చి నగరము వెలువడెను. తక్షశిలానగరవాసి, మాతృపోషక నందనామక బ్రాహ్మణుడు ప్రాణులకు కల్యాణప్రదము లగు నాలుగు గాథలు తెచ్చి, రాజు బయలుదేరునప్పటి కెదురు వచ్చెను జయద్దిస ప్రభువు తిరిగి వచ్చినతరువాత విందునని చెప్పి, అతనికి నివాసస్థాన మేర్పాటు చేయించి వేటకై వెడలిపోయెను. వేటపొలము చేరి, ఏ మృగమైనను ఎవరికడగా తప్పించుకొని పరుగెత్తునో దానికి వారు బాధ్యు లగుదురు అని ఆనతిచ్చెను. వన్నెవన్నెల మృగము లేచి, రాజు కెదురుగా పారిపోయెను అమాత్యులు మందహాసము చేసిరి. రాజు ఖడ్గము గైకొని దాని వెన్నంటి మూడు యోజనములు పోయి కత్తితో దానిని తుండెములు చేసి, కావడిలో కొనివచ్చుచు యక్షు డున్నచెట్టుక్రిందికి జేరి, దర్భలపై కొంచెముసేపు విశ్రమించి, మరల నడువసాగెను. మానవ యక్షుడు లేచి "ఆగు. ఎచటికి బోవుదువు ? నీవు నాఖాద్యపదార్థమవు" అని అతనిని చేతితో బట్టుకొని, యీ గాథ పలికెను :

ఏడుదినములు గడవగా నేడు నాకు
నొదవె భోజనసామగ్రి యుత్తమమ్ము.
వత్తు వెచ్చోటనుండి ? యెవ్వడవు నీవు ?
ఎట్టిదో చెప్పుమా, భవదీయజాతి.

రాజు యక్షుని గాంచి భీతిల్లెను, కాని ఒడలు గరిపొడుచుటచే పరుగెత్త లేదు. ధైర్యము చిక్కబట్టి రాజు ఈ గాథ పలికెను :

నా పేరు వినియుండ నోపుదు వీవు :
పాంచాల దేశంబు పాలించువాడ,
పేరు జయద్దిశుం డారణ్యభూమి
నాఖేటమున దిరుగాడుచున్నాను-
నను విడనాడుము తిని యీ మృగమ్ము.

యక్షు డిట్లనెను :

ఆడుదువ బేర మీవు నాతోడ ? భోజ
నేచ్ఛ గలిగినపిమ్మట నీ మృగమును
స్వీకరింతు, నిద్ది విలాపవేళ కాదు :

నంద బ్రాహ్మణుని జ్ఞప్తికి తెచ్చుకొని రా జిట్లనెను :

వినిమయమ్మున కొప్పవేని నీకడకు
మరలి వచ్చెద నన్నమాట గ్రహించు.
బ్రాహ్మణోత్తమునకు ప్రతిన చేసితిని,
నీకడ కరుదెంతు నెరవేర్చి దాని.

విని యక్షు డిట్లు పలికెను :

పట్ట నున్నను మృత్యువు ప్రతిన యేదొ
తీర్చి వచ్చెద నందువు, తెలుపు మద్ది :
ఒక్కవేళ ననుజ్ఞ నీ కొసగవచ్చు.

ఈ ప్రశ్నమునకు ప్రత్యుత్తర మిచ్చువాడై రా జిట్లు పలికెను :

చూపినాడ ధనాశ భూసురునకు మును
మాట దక్కించుకొని నేను మరలివత్తు.

యక్షు డిట్లనెను :

నీవు చేసినప్రతినను నిర్వహించి,
భూసురోత్తముకడ ముక్తి పొంది రమ్ము.

ఇట్లు పలికి వాడు రాజును వీడ్కొనెను. రాజు వాని నోదార్చి, చింతింపకు మని, ఉదయమే వత్తు ననెను. అని, శ్రోవగురుతులు కనబడగా నిజసైన్యమును చేరుకొనెను. సేనాపరివృతుడై రాజు నిజనగరమున ప్రవేశించి, నందబ్రాహ్మణుని బిలువ నంపి, ఉత్తమాసనమున గూరుచుండ బెట్టి గాథలు విని, నాలుగువేల నాణెము లిచ్చెను; అవల నతనిని బండి యెక్కించి తక్షశిల చేర్పుడని పరిజనుల కాన తిచ్చి వీడు కో లిచ్చెను.

రాజు మరునాడు వెడలిపోవు కోరికతో పుత్రుని బిలిచి, అనుశాసించెను. ఈ యర్థమును విశదపరచుటకై శాస్త్ర యీ గాథలు పలికెను :

యక్షహస్తవిముక్తుడై యతడు రాజ
భవనముం జేరి వెనుకటి బ్రాహ్మణునకు
ఇచ్చిధనమును, మాట దక్కించుకొనియె
భూపతి అలీనశత్రుని పుత్రు నవల
బిలువనంపి యీరీతిని పలికినాడు :
"నీకు రాజ్యాభిషేకంబు నేడె జరుగు;
అన్నినగరాల ధర్మమ్ము నాచరింపు.
పొందకుము బాబ, రాష్ట్రమ్మునం దధర్మ
చారి యనియెడి పేరు; నే జనవలయును
నేడె పూరుషయక్షుని నికటమునకు.

విని కుమారు డిట్లనెను :

తెలుపవలయును నే నేమి సలుపు కతన
పొందితివొ అప్రసన్నత ? ఎందువలన
నాకు రాజ్యమ్ము నొసగుచున్నారు నేడు ?
మీరె కావలె, రాజ్య మేమిటికి నాకు !

విని రా జిట్లనెను :

మాటలందున గాని కర్మముల గాని
ఎట్టిదోషము చేసినయట్టు లేదు

ఎన్నడును నీవు బాబ ! నే నేగవలయు
నిలుపుకొన మాట, యక్షునినికటమునకు.

విని కుమారు డిట్లనెను :

ఇచట నుండుడు మీరు, నే నేగువాడ;
అరుగుచో ప్రాణములతోడ తిరిగిరాము !
దేవ, మీరలు పోవక తీరదేని
అచ్చటికి, నేను సైతము వచ్చువాడ :
మిగుల మిర్వురముంగూడ మేదిని పయి !

విని రా జిట్లనెను :

నిశ్చయమ్ముగ నాయనా, నీ పలుకులు
సజ్జనవిధానమున ధర్మసమ్మతములు.
భీకరము కాదు మరణమ్ము నాకు; తీక్ష్ణ
యష్టిశూలమ్ముతోడ నీ యవయవములు
చీల్చి, యక్షుడు వండి భక్షించు నన్న
భావ ముదయించుచో మహాబాధ కలుగు.

కుమారు డిట్లనెను :

నీకు బదులుగ పోవుదు నేను యక్షు
సన్నిధికి, నీవు పోవద్దు : చావె శ్రేష్ఠ
తరము జీవముక న్నని తలచువాడ.

విని రాజు కుమారునిబలము తెలిసికొని, మంచిదని, నాయనా, పొమ్మనెను. అతడు తలిదండ్రులకు నమస్కరించి, నగరము వెలువడెను. ఈ విషయమును విశదీకరించుటకై శాస్త్ర యీ గాథ పలికెను :

అవలం దల్లిదండ్రి పాదాభివంద
నము చేసెను రాజతనయుడు ధృతిని

అతనివెంట తల్లి, తండ్రి, సోదరి, భార్య, అమాత్యులు, సేవకులును చనిరి. కుమారుడు తండ్రిని త్రోవచొప్పు అడిగి తెలిసికొని, తలిదండ్రులకు నమస్కరించి, తక్కినవారికి ఉపదేశ మిచ్చి, ఎవరు లేని సింహకిశోరమువలె మార్గారూఢుడై, యక్షుని నివాసస్థానము చేరెను. అతడు చన్నపిదప తల్లి సంబాళించుకొన లేక నేలపై వ్రాలెను. తండ్రిచేతులలో తల పెట్టుకొని తీవ్రముగా నాక్రందనము చేయసాగెను. ఈ యర్థమును వెలువరించువాడై శాస్త ఈ గాథ పలికెను :

తల్లి దుఃఖించుచును వ్రాలె ధరణి, తండ్రి
బాహువులు పట్టుకొని విలాపమ్ము చేసె.

కుమారునికి తండ్రియిచ్చిన యాశీర్వచనము, తల్లి, సోదరి, భార్య చేసిన సత్యక్రియను ప్రకటించుటకై శాస్త యీ గాథలు పలికెను :

పరునివాతను తప్పక పడును పుత్రు
డని యెరిగి తండ్రి ఘటియించి హస్తయుగళి
సోమ వరుణ ప్రజాపతి సూర్యులకును.

"రమ్మ, నాయన. దేవతారక!" ననియె.

దండకారణ్యమున కేగు తనయు రాము
జనని యాశీర్వదించిన సరణి, తల్లి
మంగళము గోరు దేవతల్ మరవకుండ్రు
గాత నీ సత్యమును ! అనుజ్ఞాతుడ వయి
అడిగి బిడ్డడ, సుఖముగా మరలి రమ్ము !

స్పష్టముగా గాని చాటున గాని
నేను క్రోధము చెందనేలే దలీన
సత్యవాక్కునియెడ; స్మరియించి దీని
దయచేయుచో దేవతలు నీకనుజ్ఞ
అరిగి సోదర, నీవు తిరుగ రావలయు.

స్వామి, పతివ్రతశ్రద్ధపై నీకు
ప్రీతి యున్నది; నాదుచేతమ్మునందు
ఎన్నండు నప్రియం బన్నది లేదు.
దేవతల్ స్మరియించి దీని, ననుజ్ఞ
దయచేయ మరల భద్రమ్ముగ రమ్ము !

తండ్రి చెప్పినమార్గమువెంట జని రాజకుమారుడు యక్షుని నివాసము చేరెను. "క్షత్రియులు మాయావులు, ఏమి జరుగునో యెవ రెరుగును" అనుకొని యక్షుడు చెట్టెక్కి రాజురాకకై యెదురు చూచుచు కుమారుని రాక కనుగొని, తండ్రి నాపి. కుమారుడు వచ్చినా డనుకొని, తనకు ఎట్టి భయము లేదని భావించి, వృక్షము దిగి, రాజకుమారునివైపు వీపు పెట్టి కూరుచుండెను. కుమారు డాతని కెదురుగా బోయి నిలిచెను. యక్షు డిట్లనెను :

ఏగుదెంచుచున్నాడ వెచటినుండి ?
ఉన్నతంబును, ఋజువైనయొడలివాడ,
ఎంతొ సుందరవదనుండ, వీవనమున
తిరుగు రౌద్రుని నరభక్షాది నెరుగవొక్కొ !
వచ్చునే మేలుకోరెడివా డిచటికి ?

కుమారు డిట్లనెను :

నీవు నరభక్షకుడ వని నే నెరుగుదు :
ఓయి రౌద్ర, యెరుంగుదు నుందు విచట
ననియు, నేను జయద్దిస తనయుడ జుమి,
నన్ను భక్షించి విడువుము నాజనకుని.

యక్షు డీగాధ పలికెను :

తనయుడవు జయద్దిసున కీ వని తెలియును :
ఉభయముఖవై ఖరులు గూడ నొక్కరకమె.

జనకు రక్షించి, స్వయముగా చావ నెంచు
దుష్కరం బైనకర్మకు తొడరినావు.

కుమారు డిట్లనెను :

జనకుముక్తికి స్వీయ జీవనము విడుచు
చేత దుష్కరకర్మగా చింత సేయ.
తల్లిదండ్రులకై బలిదాన మొసగు
వానికి సుఖమ్ముగా నగు స్వర్గలబ్ధి.

అప్పుడు యక్షుడు "కుమారా, మృత్యువన్న భయపడని ప్రాణి లేదు, నీకు భయ మేల లేదు ?" అనగా అతనికి ప్రత్యుత్తర మిచ్చువాడై కుమారు డీగాథలు పలికెను :

నిశ్చయమ్ముగ బహిరంగ నిభృతపాప
కర్మ లొనరించినట్టులు జ్ఞప్తి లేదు.
జనన మొందినవానికి చావు తప్ప :
దిచట నా కున్నయట్టులే యచట నుండు.

ఉపకరించును గాక ఈయొడలు నీకు :
నీవు కోరినపక్షాన నీసమక్ష
మందు, వృక్షమునుండి మహానుభావ,
అవనిపై బడి నీకు ఖాద్యమ్ము నగుదు.

"భయభ్రాంత చిత్తమున ఈతనిమాంసము తిననేర కున్నాను, కావున ఉపాయముచే నితనిని పారద్రోలెదను" అనుకొని యక్షు డిట్లనెను :

తండ్రి బ్రతికింపగా నిజతనువు విడుచు
ధర్మమే నచ్చునెడల, సత్వరమ నీవు
నిప్పు ముట్టింపవలె పేర్చి కట్టియలను.

అట్లు చేసి రాజకుమారుడు యక్షునికడకు వచ్చెను. ఈ విషయము ప్రకాశింప జేయుటకై శాస్త యీ గాథ పలికెను :

అవల, ధృతిమంతు డైన రాజాత్మజుండు
ప్రోగుచేయుచు కాష్ఠముల్ భూరివహ్ని
వెలుగజేసి యక్షునకును దెలిపె వార్త.

రాజకుమారుడు నిప్పు వెలిగించి తనదగ్గరకు వచ్చినపుడు యక్షుడు తనలో "ఇతనికి మరణభయములేదు. ఇతడు సింహము వంటివాడు. ఇట్టి నిర్భీకుని నే నింతవరకును చూడలేదు" అనుకొని, తనకు ఒడలు గగుర్పొడువగా కూరుచుండి, రాజకుమారుని మాటిమాటికిని చూడసాగెను. కుమారుడది గ్రహించి యీ గాథ పలికెను :

వోయి దుస్సాహసిక, చూచుచుంటి వేమి
నిండురోమహర్షమ్మున ? నేడు నీవు
ఆన తిచ్చిన దంతయు నాచరింతు :
సరసముగ మాంసభక్షణ సలుపవచ్చు.

యక్షు డీ గాథ పలికెను :

ఎవడు భక్షింపగా నేర్చు నిట్టిధర్మ
సంస్థితుని, సత్యవాదిని, సత్పురుషుని ?
ఇంతటివరేణ్యుని భక్షించు నెవడు, వాని
శిరసు సప్తఖండము లయి చిదికిపోవు !

విని కుమారుడు యక్షునితో "నీవు నన్ను భక్షింప దలవనిచో, కట్టెలు తెప్పించి, యేల నిప్పు చేయించినావు ?" అనెను.

"నీవు పరుగెత్తుదువో పరుగెత్తవో చూచుటకు."

"నేను శశువుకడుపున బుట్టినపుడు దేవేంద్ర శక్రుడు సైతము నన్ను పరీక్ష చేయలేక పోయినపుడు, ఇపుడు నీవు నన్ను ఏమి పరీక్ష చేయగలవు?" అని కుమారు డీగాథ పలికెను :

అతని బ్రాహ్మణుగా నెంచి యాత్మతమువు
శశము దానము చేయ నచ్చటనె నిలిపె.

దేవపుత్రుడు చంద్రుడు దీనివలన
యక్ష, ప్రియరూపు డై కీర్తి నందినాడు.

యక్షుడు కుమారుని విడిచిపెట్టుచు ఈ గాథలు పలికెను :

పూర్ణిమానిశి చంద్రుని పోల్కి గాని,
రవివిధంబున నైనను రాహుముక్తి
నంది వెలిగెడిరీతి మహానుభావ,
పెల్లుగా వెల్గు మీవు కాంపిల్యమందు.

అతని వినమ్రముని కావించి, పంచశీలము లిచ్చి, రాజకుమారుడు తనలో "ఇతడు నిజముగా యక్షు డగునా కాడా? యక్షుల నేత్రములు ఎర్రగా నుండును, కనుపాపలు ప్రకాశింపవు, నీడపడదు, ఒడలు గగుర్పాటు చెందదు... ఇతడు యక్షుడు కాడు, మానవుడే... మా నాయనగారి ముగ్గురుసోదరులను యక్షిణి పట్టుకొని, ఇం దిరువురను భక్షించి, మూడ వానిని పుత్రస్నేహముచే పోషించి యుండవచ్చును. ఇత డాతడు కానో పును. ఈయనను కొనిపోయి నాయనగారికి చెప్పి రాజ్యమున ప్రతిష్ఠింప జేతును" అనుకొనిరి. "రా, నీవు యక్షుడవు కావు. మా నాయనగారి జ్యేష్ఠ సోదరుడవు. నావెంట వచ్చి కులక్రమాగత మగురాజచ్ఛత్రము ధరింపుము" అనెను.

"నేను మానవుడను కాను."

"నీవు నా మాటలు విశ్వసింపనిచో విశ్వసింపదగినవా డెవ డైన ఉన్నాడా?"

"ఫలానిచోట దివ్యచక్షువు కల తపస్వి ఉన్నాడు"

రాజకుమారుని అత డచటికి గొనిపోయెను. తపస్వి వారిని చూచి "తండ్రికొడుకులు ఏమి చేయుచు అడవిలో తిరుగుచున్నారు?" అని వారి సంబంధము ప్రకటించెను. యక్షుడు తాపసిమాటలు నమ్మి కుమారునితో "బాబా, నీవు పొమ్ము. ఒక జన్మములోనే నాకు రెండుపుట్టుకలు వచ్చినవి.

నాకీ రాజ్యము వలదు. నేను ప్రవ్రజింతును" అనెను. తపస్వి ఆతనికి ఋషి ప్రవ్రజ్య అనుగ్రహించెను. కుమారుడు ప్రణామము చేసి నగరమునకు వెడలిపోయెను. ఈ విషయమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథ పలికెను :

అంత, ధృతిమంతుడైన రాజాత్మజుండు
యతునికి వందనము చేసి, యతనివలన
సమ్మతిం బొంది సుఖముగా జనె అలీన
శత్రు రాజపుత్రుండు పాంచాలమునకు.

ఈ గాథ పలికి, నగర నిగమాది జనులకు కర్తృత్వము ప్రకటించుటకై యీ గాథ పలికెను :

అఖిల జనపదవాసులు నఖిలనిగమ
వాసులుంగూడ రథ హస్తి వాహనులయి,
అంజలి ఘటించి, ఆతనియంతికమ్ము
దరిసి "దుష్కరికారి, మాదండ" మనిరి.

కుమారుడు వచ్చినట్లు విని రాజు ఎదురుపోయి స్వాగతము చెప్పెను. జనపరివేష్టితుడైన కుమారుడు తండ్రికి నమస్కారము చేసెను. రాజు ఆతనితో "బాబా, మానవభక్షకుడైన యతునివలన నెట్లు విముక్తి పొందితివి ?" అనెను.

"అతడు యతుడు కాడు, మీ పెద్దన్నగారు, నాపెత్తండ్రిగారు." అని కుమారుడు సమస్తవృత్తాంతము వివరించి, "మీరు బాబయ్యగారిని కలిసికొనవలెను" అనెను.

రాజు నగరమున చాట బంచి అనేకులు వెంటరా తాపసి కడకు జనెను. యక్షిణి తనను కొనివచ్చుట, చంపక పోషించుట మొదలగు విషయము లన్నియు తాపసి తెలిపెను. రాజు "వచ్చి రాజ్యము చేయుము" అనెను.

"వలదు." "అట్లగుచో ఉద్యానమున నుండుము. అన్నియుపచార ములు చేయుదును."

"వలదు."

అతనియాశ్రమమునకు కొలదిదూరములో కొండమాటున శిబిరము నెలకొల్పి రాజు పెద్దతటాకము త్రవ్వించి, పొలములు ఏర్పరచి వేయిమంది జనులను రప్పించి గ్రామము నిర్మించెను. అచట తాపసులకొరకు భిక్షావ్యవస్థ చేసెను. ఆ గ్రామమునకు చిన్న కమ్మాస దమ్మ నిగమము అని పేరు పెట్టిరి. సుతసోమబోధిసత్త్వుడు యక్షుని దమనము చేసినపిదప ఇట్టిప్రదేశ మేర్పడుటచే "మహాకంభా దంభ నిగమ" మని గ్రహింపవలెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశనము చేసి సత్యక్రియ కావించి జాతకములు సరిపోల్చెను తోడనే మాతృపోషక స్థవిరుడు శ్రోతాపత్తిఫలమున ప్రతిష్ఠితుడయ్యెను. ఆ కాలమున మాతాపితలు మహారాజకులము; తపస్వి సారిపుత్రుడు; మనుష్య భక్షకుడు అంగుళిమాల; చెల్లెలు ఉత్పలవర్ణ; పట్టపుదేవి రాహులమాత; అలీనసత్త్వ కుమారుడు నేనే.

———:():———

# 514. ఛద్దంత జాతకము

శాస్త జేతవనమున విహరించు సమయమున తరుణ భిక్షుణిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

శ్రావస్తీ నివాసిని యగు కులపుత్రిక గృహస్థ జీవనము నెడ హేయ భావము కలిగి బుద్ధశాసనమున ప్రవ్రజించినది. ఒకనా డామె భిక్షునులతో పాటు ధర్మ ప్రసంగము వినబోయెను. ధర్మాసనముపై కూరుచుండి ప్రసంగము చేయుచున్న దశబలధారి గాంచి అనంతపుణ్య ప్రభావయుక్తము, ఉత్తమ సౌందర్య సంయుతము నగు ముక్తస్వరూపము గనుగొని ఆమె తనలో "సంసారమున తిరుగుచు నెన్నడయిన పూర్వజన్మమున నేను ఈ మహాపురుషునకు పాదదాసిగా నుంటినా, ఉండలేదా ?" అనుకొనునప్పటికి పూర్వజన్మ సంబంధ మగు జ్ఞాన మామెకు లభించెను. ఛద్దంతగజజన్మ సమయమున తా నీ మహాపురుషునకు పాదదాసిగా నున్నట్లు జ్ఞప్తికి వచ్చి మిగుల సంతసించెను. ఈ ఆనంద ప్రభావమున ఆమె బిగ్గరగా నవ్వినది. అంత ఆమె మనసులో "కొలది మంది స్త్రీలు మాత్రము స్వామికి హితము కోరుదురు. చాలమంది అహితము కోరుదురు. ఇందు నేను హితచింతకురాలనా, అహిత చింతకురాలనా ?" అనుకొను నప్పటికి "నేను కొలదిగా కోపము కలుగుటచే ఛద్దంతమహాగజేశ్వరుని సోనత్తరనాము డగు వేటగానిని పంపి విషములో ముంచిన శల్యముతో కొట్టి చంపించితిని" అను విషయము జ్ఞప్తికి రాగా శోక ముత్పన్నమై గుండె వేడి యెక్కి దుఃఖము నాపుకొనలేక నిట్టూర్పు విడిచి బిగ్గరగా రోదనము చేసెను. చూచి శాస్త మందహాసము చేసెను. దానికి కారణ మేమని భిక్షుసంఘము అడుగగా శాస్త "భిక్షువులారా, ఈ తరుణభిక్కుని పూర్వజన్మమున నాయెడ చేసిన అపరాధము జ్ఞప్తికి తెచ్చుకొని రోదనము చేయుచున్నది" అని పూర్వజన్మ కథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున హిమాలయ ప్రదేశమున ఛద్దంత సరోవరము కడ ఎనిమిదివేల యేనుగు లుండెను. అవి బుద్ధిమంతములు; ఆకాశమార్గమున విహారము చేయగలవి. ఆ సమయమున బోధిసత్త్వుడు జ్యేష్ఠగజమునకు పుత్రుడై పుట్టెను. ఒడలు తెలుపు-ముఖము, పాదములు ఎరుపు. పెరిగిన తరువాత ఎనుబది యెనిమిది మూళ్ళ యెత్తు నూట యిరువది మూళ్ళ వెడల్పు. వెండిదండతో సమానమైన 58 మూరల తుండము. దంతముల చుట్టు కొలత 15 మూరలు, పొడవు 30 మూరలు, వానినుండి ఆరు రంగుల కాంతులు వెలువడుచుండెను. 8 వేల యేనుగులకు ఆహస్తి నాయకుడు; 500 మంది ప్రత్యేక బుద్ధులకు పూజచేయుచుండును. ఆ గజరాజమునకు రెండు పట్టపు టేనుగులు కలవు; చిన్న సుభద్ర, పెద్ద సుభద్ర. గజరాజము పరివారములో కాంచన గుహలో నివసించుచుండెను.

ఆ ఛద్దంతసరోవర వైశాల్యము ఏబది యోజనములు. దాని నడుమ 2 యోజనముల స్థలమున నాచు గాని, బురద కాని లేదు. అందలి నీరు మణి వర్ణముతో సమానము. దాని కావల ఆ జలములో నలువైపుల యోజనముమేర సుందరవనము కలదు. దాని కావల నలువంకల యోజనముమేర నీలోత్పల వనము కలదు. దాని కావల రక్తపద్మములు, దాని కావల శ్వేతపద్మములు, దానికావల కుముదవనము చుట్టుకొని యున్నవి. ఈ సప్తవనముల కావల వీని నన్నిటిని యోజనము యోజనముమేర మిశ్రమవనములు చుట్టుకొని యున్నవి. దాని కావల ఏనుగుల నడుము వరకు నీటిలో యోజనముమేర ఎర్రని శాలివనము కలదు. దాని కావల నీటి సరిహద్దున నీల, హరిత, రక్త, శ్వేత వర్ణములు కలిగి పరిమళముతో కూడిన చిన్ని, చిన్ని పూవుల చెట్ల వనము కలదు. ఈ ప్రకారముగా ఈ పదివనములు యోజనము యోజనముమేర నున్నవి. దాని కావల చిన్న చిన్న పెసర పొలములు కలవు. దాని కావల ఆనపకాయ, గుమ్మడికాయల తీగలు, బూడిద గుమ్మడి తీగలు కలవు. దాని కనంతరము పోకచెట్లంత ఎత్తుగల చెరుకుతోటలు కలవు. దానికావల ఏనుగుదంతము లంత పెద్దపెద్ద అరటి తోటలు కలవు. దానికి పిమ్మట సాలవనము దాని కవతల కుంభము

లంతటి కాయలు గల పనసతోట. దాని కావల తీయని కాయలు గల చింత చెట్లు, ఆవల వెలగతోట, ఆవల కలగలుపుగా నున్న మహావనఖండము, దాని కావల వేణువనము. ఆ సమయమున ఇంత పుష్పఫల సంపద కలదు. "సంయుక్త నికాయ"ము లోని అర్థకథలో కేవల మిప్పటి సంపద మాత్రము ఉల్లేఖింపబడినది. వేణు వనమునకు నలుప్రక్కల ఏడు పర్వత ములు కలవు. వెలుపలినుండి చూచుచో మొదటి పర్వతమునకు క్షుద్రకాల మనియు, రెండవ దానికి మహాకాల మనియు నామములు. దాని కావల నున్నది ఉదకపశ్య పర్వతము, తరువాతిది చంద్రపశ్యము, ఆ తరువాతిది సూర్యపశ్యము, అనంతరము మణిపశ్యము, ఏడవ పర్వతము స్వర్ణపశ్యము. దీని యెత్తు ఏడు యోజనములు, ఛద్దంత సరోవరమునకు నలువైపుల గిన్నె పెట్టిన ట్లుండెను. దాని లోపలి భాగము బంగరు కాంతితో నుండెను. అందుండి వెలువడు కాంతులచే ఛద్దంతసరోవరము ఉదితబాలసూర్యుని వలె నుండెను. వెలుపలి పర్వతములలో ఒకదాని యెత్తు ఆరు యోజనములు, ఇంకొకదానియెత్తు ఐదుయోజనములు, వేరొకదానియెత్తు నాలుగు యోజ నములు, మరియొక దానియెత్తు మూడు యోజనములు. ఒకదానియెత్తు రెండు యోజనములు, ఇంకొకదానియెత్తు ఒక యోజనము. ఈ విధముగా ఏడు పర్వతముల చుట్టును గల ఛద్దంత సరోవరమునకు పూర్వోత్తర కోణ మున నీరు గాలి తగులుచోట పెద్ద మర్రిచెట్టు కలదు. దాని బోదె చుట్టు కొలత ఐదు యోజనములు, ఎత్తు ఏడు యోజనములు. నలు దిక్కుల వ్యాపించిన నాలుగు కొమ్మలు, ఆరు యోజనములపైకి వెలువడుశాఖ కూడ ఆరు యోజనములు. ఈ విధముగా వేరు మొదలు దాని యెత్తు పద మూడు యోజనములు, శాఖల నుండి పైకి నలువైపుల 12 యోజనములు. ఎనిమిదివేల చిన్నకొమ్మలతోకూడిన ఆ మర్రిచెట్టు పర్వతము శిఖరమున మణి వలె వెలుగుచుండెను. ఛద్దంతసరోవరమునకు పశ్చిమదిక్కున స్వర్ణపశ్య పర్వ తమున పన్నెండు యోజనముల కాంచనగుహ కలదు. వర్షాకాలమున ఎనిమిదివేల యేనుగులతో కూడి ఛద్దంతనాగరాజు ఆ కాంచన గుహలో నివసించుచుండును. గ్రీష్మకాలమున నీరు, గాలులకు ఆనందించుచు ఆ పెద్ద మర్రిచెట్టు నీడలో శాఖల క్రింద నివసించుచుండును.

సాలవనము పుష్పించినదని ఒకనాడు నాగరాజుకు తెలిపిరి. అనుచరు లందరతో నాగరాజు క్రీడార్థము సాలవనము చేరెను. చిన్నసుభద్ర గాలి కెదురుగా నిలుచుండెను. దాని శరీరమున ఎండు రెమ్మలతో నిండిన పురా పర్ణములనుండి ఎర్రచీమలు రాలినవి. పెద్దసుభద్ర గాలివాలున నుండెను. దాని శరీరముపై పుప్పొడి, కేసరములు, చిగురుటాకులు రాలినవి— చూచి సుభద్ర తనలో ఈ గజరాజు తన ముద్దులభార్య శిరసుమీద పుప్పొడి, కేసరములు చిగురాకులు రాల్చినాడు; నా నెత్తిమీద ఎండు రెమ్మలు, పండుటాకులు, ఎర్రచీమలు రాల్చుచున్నాడు. మంచిది, ఏమి చేయుదునో చూతము" అనుకొని బోధిసత్త్వునియెడ మనసులో వైరము పూనెను.

మరునాడు కూడ గజమండలితో గజరాజు స్నానార్థము ఛద్దంత సరోవరమున దిగెను. రెండు గున్నయేనుగులు తొండములతో నీరు పట్టి కైలాస శిఖరమును పరిశుభ్రము చేసినట్లు గజరాజును స్నానము చేయించినవి.

ఆవల ఆడయేనుగులు రెండు స్నానము చేయించి, ఈవలకు వచ్చి బోధిసత్త్వుని ప్రక్కన నిలిచినవి. ఆవల ఎనిమిదివేల యేనుగులు జలక్రీడ చేసి సరోవరమునుండి నానావిధ పుష్పములు తెచ్చి అలంకరించి ఆడ యేనుగులను కూడ అలంకరించి ఆడయేనుగులను కూడ అలంకరించినవి. అప్పుడొక యేనుగు సరోవరములో తిరుగుచు సత్త్వోదయ మను మహాపద్మము లభింపగా దానినితెచ్చి బోధిసత్త్వున కిచ్చెను. ఆయన కేసరములు శిరముపై చల్లుకొని పెద్దసుభద్ర కిచ్చెను. చిన్నసుభద్రచూచి 'ఈ సత్త్వోదయ పత్రము తన ముద్దుల పెద్దభార్య కిచ్చుకొన్నాడు: నా కీయలేదు.' అనుకొని మరింత వైరము వహించెను. ఒకనాడు బోధిసత్త్వుడు మధురఫలములు, బిసకాండములు, కమల పత్రములలో నుంచి 500 మంది ప్రత్యేక బుద్ధులకు వడ్డించుచుండెను. చిన్నసుభద్ర తనకు లభించిన పండ్లు మొదలగునవి ప్రత్యేకబుద్ధులకు పెట్టుచు తనలో "ఇచటనుండి మృతినొంది మద్రరాజకులమున సుభద్ర అను పేరరాజకన్యకనై పుట్టవలెను. ఆవల పెద్దదాననైన పిదప వారాణసీ నరేశునకు పట్టపుదేవినై ప్రియపత్నినై మనసునకు నచ్చుదానను

కావలెను. ఆయన నా మాట బాగుగా వినునప్పుడు వేటకానిని పంపి విష ములో ముంచిన బాణముతో ఈ గజేంద్రుని కొట్టి చంపించి షడ్దంతములను తెప్పించుకొనవలెను'' అని కోరుకొనెను.

ఆ తరువాత గుహ వదలి చిన్నసుభద్ర శుష్కించిపోవుచు అచిరకాల మున మృతినొందెను. తరువాత మద్రదేశనరేశుని పట్టపుదేవి కడుపున పుట్టెను. శిశువుకును భద్ర అని పేరు పెట్టి ఆమె పెరిగి పెద్దదయిన పిదప వారాణసీ నరేశునకు ఇచ్చి పెండ్లి చేసిరి. ఆమె రాజుకు ఇష్టురాలై, మనసు నకు నచ్చినదై ౧౬ వేల మంది స్త్రీలకు జ్యేష్ఠురాలై యుండెను. ఒక నా డామెకు పూర్వజన్మ జ్ఞానము కలిగి ''నా సంకల్పము కొంతవరకు నెరవేరి నది. ఇక ఆ యేనుగు దంతముల జత కావలె నందును'' అనుకొని ఒడలికి నూనె పూసికొని మలిన వస్త్రము ధరించి రోగివలె మంచముపై పండు కొనెను.

''సుభద్ర యెక్కడ ?'' అని రాజడిగెను.

''ఆమెకు జబ్బుగా నున్నది''

ఆతడు శయనాగారమునకు జని, మంచముపై గూరుచుండి వీపు నిమురుచు, యీ గాథ పలికెను :

ఓసి వరవర్ణినీ, యిట్టు లుంటి వేమి
పాండురోగి విధమ్మున పాలిపోయి ?
ఓ విశాలాక్షి, యేమిటి కుంటి విట్లు
మర్దితంబైన పుష్పదామమ్మువోలె ?

విని యామె యీ గాథ పలికెను :

ఓ మహారాజ, స్వప్నమం దుప్పతిల్లె
కోర్కి యొక్కటి, శ్రమతోడ గూడినట్టి
దగును నిక్కముగా నది ధారుణీశ !

రాజు గాథ పలికెను :

లోకమున భోగ్యవస్తువుల్ నాకడ గడు
హెచ్చుగా నున్నయవి ప్రియా, యేదో కోర్కి
విశద మొనరించుచో నెరవేర్చువాడ.

విని దేవి "మహారాజా, నా కోరిక నెరవేరునది కాదు. అది యేదో యిప్పుడు చెప్పలేను. తమ రాజ్యములో నున్న వేటకాండ్ర నందరను సమావేశ పరపుడు. వారినడుమ తెలిపెదను" అని చెప్పునదయి యీ గాథ పలికెను :

మీరు నేల్బడిలో నున్న మేటిమగల
వేటకాండ్రను నిట సమావేశ పరుప,
వారియెదుటను వివరింతు వాంఛ రీతి.

రాజు మంచిదని, శయనాగారము వెలువడి మూడువందల యోజనముల కాశీరాష్ట్రమున నున్న వేటకాండ్రందరును ఇచ్చట సమావేశమగునట్లు చాటింపు చేయ మంత్రుల కానతిచ్చెను. వారటులే చేసిరి. అచిర కాలములోనే వేటకాండ్రు సమావిష్టులై రాజునకు తెలియపరచిరి. విని, రాజు కిటికీ తెరచి, చేతులు తట్టి, రాణికి వారి రాక తెలియ జేయువాడై యీ గాథ పలికెను :

వేటలో దేవి, నిపుణులు వివిధ విపిన
దేశమందలి మృగముల తెర గెరిగిన
వీర, లసువులు నాకునై విడువగలరు.

దేవి విని, వారిని సంబోధించునదై యీ గాథ పలికెను :

వేటకాండ్రెల్ల శ్రద్ధతో వినవలయును :
ఆరు వన్నెల దంతము లమరియున్న
శుక్లహస్తిని స్వప్నాన చూచినాను,
కావలయు దానిదంతముల్ ; జీవితంబు
దుర్ఘటం బగు నయ్యవి దొరకవేని !

విని, వేటకాం డ్రిట్లనిరి :

మాదు పితరులు మా పితామహులు కాని
ఎన్నడుం గూడ జూడలే దిట్టి హస్తి;
స్వప్నగత గజవర్ణన సలుపు దేవి!

ఈ తరువాతి గాథ కూడ వారు పలికినదే :

అన్నియుం గూడి దశదిశ, లందులోన
ఏదిశ న్నిల్చియుండె నా యిభవిభుండు ?

సుభద్రాదేవి వా రంపరను శ్రద్ధతో చూచెను. అందు సోణుత్తరుడు కానవచ్చెను. అతని పాదములు బాగున్నవి, పిక్కలు స్థాలివలె నున్నవి; మోకాళ్ళు పెద్దవి; రొమ్ము విశాలము, గడ్డము మీసము నల్లనివి; నేత్రము లెర్రనివి. చూడగానే వాడు బోధిసత్త్వునకు పూర్వశత్రువువలె దోచును. రాణి వానిని గనుగొని తాను చెప్పిన పని చేయువా డని తలచి, రాజాజ్ఞ పొంది, ఏడంతస్తుల మేడ మీదికి వానిని రప్పించి, ఉత్తరపు వైపు కిటికీ తెరచి, ఉత్తర, హిమాలయము వైపు చేయి చాపి, యీ గాథలు పలికెను :

ఇచ్చటికి నుత్తరమ్మున నేడు కొండ
లగపడును సూటిగా, వాని కప్పటి దెస
స్వర్ణపార్శ్వనామకము, పుష్పములతోడ
నిండియుండెడి యొక పెనుగొండ కలదు.

కిన్నర నివాసమైన యా గిరి చివరకు
నేగి వీక్షించుచో నిమ్న భాగమందు
మేఘవర్ణములో నెనిమిది సహస్ర
సంఖ్య కలిగిన యూడలన్ సాంద్ర మగుచు
గొప్ప వటవృక్ష మొక్కటి గోచరించు.

ఆరు వన్నెల దంతాల హస్తి యచట
నుండు తెల్లని, దద్దాని నోరు లభీన

పరుచుకొనజాల రశ్రమ భంగి; దాని
అష్ట సాహస్రిక గజమ్ము, లరదధురుల
వంటి దంతాలు కలవియు, వాయువేగ
ఘట్టనమ్ములు కలవియు కాచుచుండు.

మానవుం డెవ్వడేనియు గానబడిన
ఫూత్కరించుచు నవి వాని బూది చేయు!
పవన వశమున మిగులదు భస్మ మైన.

వివి సోణత్తరుడు మరణభీతి చెంది యీ గాథ వలికెను :

రాజకులమున గలవు స్వర్ణంపు నగలు,
మణిమయ విభూషణంబులు మౌక్తికములు
ఏస్గుదంతాలతో దేవి, యేమి చేతు?
విభమునా, మమ్మునా చంప నెంచినావు!

దేవి యిట్లు బదులు పలికెను :

ఎప్పటి విరోధముననొ నే నీర్ష్య చేత
పీడ నొందుచు శుష్కించి పోవుదాన!
చెప్పుపని చేయుదువయేని శ్రేష్ఠ మైన
గ్రామముల నై దిటిని నీకు కానుకయిత్తు.

ఇట్లు పలికి "ఓయి వేటకాడా, నేను పూర్వ జన్మములో ప్రత్యేక బుద్ధులకు దానము లిచ్చుచు, ఆరురంగుల దంతములుకల యేనుగును సంహరించి దాని దంతములు రెండును తెప్పించుటకై ప్రార్థన చేసినాను. నేను కలవరింపలేదు. నా సంకల్పము నెరవేరవలెను. నీవు భయపడక పొమ్ము" అని వాని నూరడించెను. చిత్త మని నాడు సమ్మతించి "ఆర్యే, దాని నివాసస్థానము స్పష్టముగా తెలుపవలెను" అని యిట్లు పలికెను :

ఉండు నెచ్చట: తిరుగుచునుండు నెచట?
తాన మెచ్చట నాడు దంతావళంబు?
దీనిగతి మాకు నేరీతి దెలియగలదు?

ఆమె పూర్వజన్మ వృత్తాంతము జ్ఞప్తికి తెచ్చుకొన గలుగుటచే తనకు స్పష్టముగా కనబడుచున్న తావు వర్ణించునదై యిట్లు పలికెను :

అనతి దూరాన రమ్య జలాశయమ్ము,
భ్రమరములు వాలు పుష్పిత పాదపములు
అన్ని దిక్కుల, నద్దాని నావరించు :
నాగరాజందులోనె స్నానమ్ము చేయు,

పుండరీకము బోలు వేదండరాజు
జలక మాడిన పిమ్మట సరసిజములు
మస్తకమ్మున దాలిచి మహిషి సర్వ
భద్ర ముందిడుకొని మహావైభవమున
తాము నివసించు చోటికి తరలిపోవు.

సోణుత్తరుడు విని "చిత్తము ! ఆ హస్తిని సంహరించి దాని దంతములు తమకు సమర్పింతును" అని విన్నవించెను. ఆమె సంతుష్టచిత్తయై వానికి వేయి నాణెము లిచ్చి "నీ యింటికి పొమ్ము. నేటి కేడవనాడు దాటకుండగనే అచటికి బయలుదేరుము" అని ప్రోత్సహించెను. ఆవల రాణి కర్మకారులను పిలువనంపి "కత్తి, గొడ్డలి, పలుగు, గునపము, చిన్నసుత్తె కొడవలి, ఖడ్గము, ఇనుపసండము, రంపము, గూటము, ఇనుపచక్రము కావలెను. త్వరలో కొని రావలెను" అని శిల్పులను, చర్మకారులను బిలువనంపి చర్మముతో జేసిన కొన్ని వస్తువులకై ఆనతిచ్చెను. వారా వస్తువులు శీఘ్రముగా గొనివచ్చిరి. వేటకానికి వలయు సామగ్రి యంతయు పాథేయము, నిప్పు తరచెడి కర్రలు మొదలు, తినెడి పిండి మొదలగు భోజన పదార్థములవరకు— తోలుసంచిలో వేసిరి.

సోణుత్తరుడు సంసిద్ధుడై, యేడవనాడు వచ్చి దేవికి ప్రణామము చేసి నిలిచెను.

"సౌమ్యా, నీ ప్రయాణమునకు కావలసిన వస్తువు లన్నియు ఈ పెద్ద సంచిలో నున్నవి, తీసికొనుము."

వేటకాడు అయిదు ఏనుగులబలము కలవాడు. అంతబరువు గలసంచిని పూరీలబుట్ట నెత్తిన కెత్తి చంకను తగిలించుకొని నిలుచుండెను. వాని కుటుంబమునకు కావలసిన ధన మిచ్చి, రాజుతో చెప్పి, రాణి వారికి సెల విచ్చెను. రాజుకు రాణికి నమస్కరించి వాడు రాజమహాలు దిగి, రథములు విడిచి, అనేకులు వెంట రా నగరము వెలువడి, సరిహద్దుసీమ చేరి, జానపదు లను ఆపి, సీమాంతజనముతో అరణ్యమున ప్రవేశించెను. ఆవల వారినికూడ వెనుకకు బంపి వా డొకడే పయనము చేసెను. ఇట్లు ముప్పదియోజనములు దాటి, దర్భలవనము, కాశవనము, తృణగహనము, తులసీవనము, శరగహ నము, దంతివృతుకాననము, మొద లగు ఆరు కంటకగహనములు, కుంజవన ములు దాటెను. ఆవల వేత్రవనము, మిశ్రితగహనము, నల (గడ్డి)వనము, శరవణగహనము, పొట్టపై ప్రాకిపోవుటకును శక్యము కాని కాననము, చెట్లయడవి, వెదుళ్ళయడవి, చిత్తడినేల, పర్వతారణ్యములు క్రమముగా నెదు రయ్యెను. వాడుదర్భలు కత్తితో కోసి, తులసి మొదలగునవి కొడ వలితో నరకెను; చెట్లు గొడ్డలితో కొట్టెను. ఈ విధముగా త్రోవ చేసికొనుచు పయనము సాగించెను. వెదురుబొంగులతో మెట్లు కట్టి, వెదురు పొదలపై కెక్కి, వానిని కోసి, వేరుకుంజములపై బార వేయుచు, వెదుళ్ళపై నుండియే బురదనేలలపై కఱ్ఱబల్ల వేయుచు, వెనుకబల్లను ముందరికి వేయుచు దాటు చుండెను. ఆవల చిన్న నావ సిద్ధము చేసి, జలమయప్రదేశము దాటుచుండెను. ఆవల పర్వత మెదు రయినపుడు మొగదల నిలిచి, లోహముతో చేసిన చతు ష్కోణమునకు త్రాడు కట్టి పైకి విసరెను. పోయి అది పర్వతమునకు పట్టు కొనెను. దానిపట్టువలన త్రాటిమీదుగా వాడు కొండమీది కెగబ్రాకెను. అచట గట్టిమొన గల యినుపగూటముతో పర్వతమును భేదించి, అచట గట్టిమేకు కొట్టి దానిపై నిలిచి, ఆలోహచతుష్కోణమును వదలించి పైకి లాగి మరల మీదికి విసరివేయగా అది మరల ఒకచోట గట్టిగా పట్టుకొనెను. దానికి వ్రేలాడుచున్న తోలుపట్టీ తొడ్పాటుతో నెక్కెను; ఆ పట్టీని క్రింది మేకుకు కట్టి ఎడమచేతి వైపున నున్న పట్టీ పట్టుకొని కుడిచేతితో ముద్గ రము పట్టుకొని పట్టీపై కొట్టెను ఈ విధముగా మేకు ఊడ బెరుకుచు మరల పై కెక్కెను. ఈ విధముగా వాడు కొండకొన కెక్కి క్రమముగా రెండవవైపు దిగెను. మరల పూర్వక్రమానుసారముగా పర్వతము లెక్కి

దిగుచు కొంతమేర సాలెపురుగు దారము విడిచిపోవునట్లు పోవుచు చర్మము పట్టా ఎత్తుచు దింపుచు ప్రయాణము చేసెను.

సుభద్రాదేవి చెప్పినట్లు వేటకాడు నగరము వెలువడినది మొదలు పదునేడుగహనములు దాటి తుదకు పర్వత గహనప్రదేశము చేరుకొనెను. అచటినుండి కూడ ఆరుపర్వతములు గడచి వాడు స్వర్ణపర్వతముపైకి ఎక్కిన విషయము ప్రకటీకరించుచు శాస్త ఇట్లు చెప్పెను :

వేటకా డమ్ముల పొదిని వీంటి దాల్చి
పర్వతమ్ముల దరియుచు, స్వర్ణపార్శ్వ
భూధరం బేదో యని తలపోయ సాగె.

కిన్నరావాస మైన యాగిరిశిఖరము
నెక్కి క్రిందికి జూడగా నిమ్నభూమి,
నీలమేఘంపుచాయతో వేలకొలది
ఊడలం గూడిన మహావటోర్వీరుహము-

ఆరువన్నెల దంతాల హస్తిరాజు
మహితగజయూధ మండలమధ్యమందు
వానికిం గానబడియె నావటముకడను.

తోచె దానికి నించుక దూరమందు
హస్తివిభుడు జలకమాడు నట్టిసరసి.

ఇభరహస్యములు గ్రహించిన వేట
కాడు కుస్తుమ్మగా త్రవ్వె కందకమ్ము.

క్రమానుకూల మగు కథ యిట్లున్నది. వేటకాడు ఏడుసంవత్సరముల, యేడుమాసముల, యేడుదినములకు బోధిసత్త్వుని నివాసస్థానము చేరి, ఆలోచించి, యిచ్చట గుంట త్రవ్వి నిలిచి, హస్తిరాజమును బాణముతో కొట్టి సంహారింపవచ్చు నని నిర్ణయించుకొనెను. ఆవల వాడు అడవిలో జొచ్చి, స్తంభాదులకై చెట్లు కొట్టి, వలయువస్తువులు సమకూర్చుకొని,

ఏనుగులు స్నానము చేయబోయినపుడు పెద్దపలుగుతో వాని స్థావరమున గుంట త్రవ్వెను. ఆవల బీజములు చల్లునట్లు త్రవ్వినభూమిపై నీరు చల్లెను; బోలురాళ్ళమీద స్తంభములునిలిపి, వానిపై వాసములు కర్రచెక్కలు నుంచి, నడుమ బాణియంతటి బెజ్జము విడిచి, దానిపై మన్ను, చెత్త చెదారము చల్లెను. తాను దాగియుండుట కొకప్రక్కన తావర మేర్పరచుకొనెను. ఈ ప్రకారముగా సిద్ధమయిన పిదప, వాడు ప్రాతఃకాలముననే వస్త్రముతో శిరస్సు, ముఖము కనబడకుండ కప్పుకొని, కాషాయాంబరము ధరించి, విషములో ముంచిన బాణము, విల్లు పట్టుకొని, గుంటలోనికి దిగి, నిలుచుండెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త యిట్లు పలికెను :

కందకమ్మును పలకలం గప్పి, లోన
దాగి విలుకాడు పార్శ్వాన నేగుదంతి
నిడివిబాణమ్ముతో గొట్టె నిష్ఠురముగ-

నాటుకొన్నంత బాణమ్ము నాగరాజు
ఘోరఘీంకార మొనరించె; కుంజరములు
బొబ్బపెట్టుచు పరుగిడి పోయె దెసల.

దాయను మారింప నెంచిన తరుణమందు
కరికి కాషాయవస్త్రంబు కానవచ్చె.

అర్హత్ధ్వజ ధారి సంహారయోగ్యు
డెట్టు లగు నని బాధలో నెంచె హస్తి.

అత డాతనితో సంభాషించువాడై యీ గాథలు పలికెను :

చిత్తకాషాయ మెవడు త్యజింపలేడో
అతడు కాషాయధారణ మాచరించె,
సత్యసంయమములకును చాలదూర
మయినవాడు తద్ధారణ కర్హు డగునె?

చిత్తకాషాయముక్తుడై శీలమందు
సుప్రతిష్ఠితుడై సత్వశోధతోడ
సంయమముతోడ గూడినసజ్జనుండు
అందు కాషాయధారణార్హత నిజమున

ఇట్లు పలికి బోధిసత్త్వుడు తన మనస్సులో వానియెడ ఎట్టి వైర భావము రానీయక, "మిత్రమా, నీవు నన్ను బాణముతో ఏల కొట్టితివి ? నీ కొరకా ? కాక అన్యప్రేరణ చేతనా ?" అనెను.

ఈ యర్థమును స్పష్టముచేయుటకై శాస్త యిట్లనెను :

పొడమనీయక క్రోధమ్ము భూరిబాధ
నిభవిభుడు విలుకానితో నిట్లు పలికె :
"నన్ను బాణముతో గొట్టినావు సౌమ్య !
కారణం బేమి ? ఎవ్వరిప్రేరణమ్ము ?"

ప్రత్యుత్తర మిచ్చువాడై వేటకా డిట్లనెను :

కనుగొనె భదన్త, నన్ను ఆకాశిరాజ
పట్టమహిషి సుభద్ర స్వప్నమ్మునందు
ఆమె నీదు దంతాలకై యానతిచ్చె.

విని బోధిసత్త్వుడు ఇది చిన్న సుభద్రపని యనుకొని, బాధ సహించుచు ప్రకటము కానీయక "ఆమెకు నాదంతములతో పని లేదు. నన్ను సంహారించుటకే యితనిని పంపినది" అని తలపోసి యీ గాథలు పలికెను :

అవగతంబె సుభద్రకు నస్మదీయ
పితృపితామహ దంతముల్ వెల్గిచ టని
కాని క్రోధవశమ్మున పూనె పగను
మూర్ఖురాలు నా జీవితమును హరింప

నేను మరణించుటకు మున్నె నీవు రంప
మునను దంతములం గోసి మోసికొనుచు

క్రుద్ధురాలికి జెప్పుము కుంజరమ్మ
అంత మొందిన, దివి దానిదంతము లని.

వా డావాక్కులు విని, అక్కడనుండి లేచి, దంతములు కోయుటకై రంపము చేకొని, గజమువద్దకు పోయెను. ఏనుగు 88 మూరలయెత్తు. పర్వతాకారమున నున్న యీ మహాగజదంతములు వాని కందలేదు. అందుచే హస్తి శరీరము, శిరసు వంచి పండుకొనెను. రజతదండము వలె నున్న గజతుండము త్రొక్కుచు, వాడు కైలాసశిఖరసదృశమైన తలపై కెక్కి, పెదవులలో మోకాళ్ళు పెట్టి, దిగి, రంపము నోటిలో దూర్చెను. నోటి వెంట రక్తము కారి, గజమునకు బాధ పుట్టెను. ఇటు నటు లాగినను రంపము తెగలేదు. హస్తి బాధ సహించుచు "మిత్రమా, కోయలేకున్నావా?" అనెను. "చిత్తము స్వామీ!" చిత్తము గట్టి చేసికొని మహాగజము వానితో "మిత్రమా, తొండ మెత్తి రంపము కొనతో పట్టియుంచుము. నాయంత నేను తొండ మెత్తజాలకున్నాను" అనెను. వాడు అటులే చేసెను. హస్తి తుండముతో రంపము పట్టుకొని యిటునటు లాగెను. దంతములు చిగురుటాకుల వలె తెగెను.

"మిత్రమా, దంతములు నా కప్రియములై నీ కిచ్చుట కాదు. శక్రత్వము, మారత్వము, బ్రహ్మత్వము కోరి యిచ్చుట లేదు. సర్వజ్ఞతా జ్ఞానరూప దంతములు ఈ దంతములకన్న లక్ష గుణములు గొప్పవి. వాని కొరకై వీనిని నీ కిచ్చుచున్నాను. మిత్రమా, నీ విచ్చటి కెంతకాలమునకు రాగలిగితివి?" అనెను.

"ఏడు సంవత్సరముల, యేడు మాసముల, యేడు దినములకు."

"పొమ్ము. ఈ దంతముల ప్రభావమున నీ వచటికి ఏడు రోజులకు ముందే చేరగలవు."

అని బోధిసత్త్వుడు వాని సంరక్షణార్థము ప్రార్థన చేసి సెలవిచ్చెను. అవల సుభద్రతో గూడ తక్కిన యేనుగులు రాకపూర్వమే మృతి నొందెను :

ఈ యర్థమును ప్రకటీకరించువాడయి శాస్త యిట్లనెను :

కుంజరశ్రేష్ఠు దంతముల్ గొని ముదమున
అతులనీయ సుందరికడ కరిగినాడు
వేగిరమ్ముగ నాశమేటి వేటకాడు.

వేటకాడు వెడలిపోయిన పిమ్మట శత్రువు కానబడకుండుటచే తక్కిన గజములు వెనుదిరిగి వచ్చినవి.

ఈ యర్థమును ప్రకటించువాడయి శాస్త యిట్లనెను :

నాగరాజుకు దిగ్గంబు నాటుకొన్న
యపుడు ఘీంకార మొనరించు చన్నిదెసల
కెంతయును భీతి బరుగిడు నేన్గు లెల్ల
క్రమ్మరిల్లిన వట వైరి కానరామి.

ఆయన వెంట సుభద్రకూడ వచ్చెను. అందరును ఏడ్చి మొత్తుకొని, బోధిసత్త్వునకు విశ్వాసపాత్రులైన ప్రత్యేక బుద్ధులకడ కేగి "పూజ్యులారా, మీ యక్కరలను తీర్చుదాత విషాత్తమైన బాణముచే మరణించినాడు. కళే బరమును చూచుటకు రావలెను" అని చెప్పిరి. అప్పుడు 500 మంది ప్రత్యేక బుద్ధులు ఆకాశమార్గమున వచ్చి అంగణమున దిగిరి. ఆ సమయముననే రెండు గున్నయేనుగులు గజరాజ శరీరమును దంతములతో నెత్తి, ప్రత్యేక బుద్ధులకు వందనము చేయించినవి. కళేబరమును చితిపైనుంచి అగ్ని యంటిం చిరి. చితి ప్రక్కన రాత్రి యంతయు ప్రత్యేకబుద్ధులు సూత్రపాఠము చేయుచుండిరి. ఎనిమిదివేల యేనుగులు చితి నార్పి, స్నానములు చేసి, సుభద్రను ముందు పెట్టుకొని, బయలుదేరి, తమ తమ నివాసములకు జేరినవి.

ఈ యర్థమును ప్రకటించుటకై శాస్త యిట్లు పలికెను :

మొత్తుకొను చేడ్చుచును ధూళి నెత్తిమీద
జల్లుకొనుచు దంతావళసంఘు మెల్ల

గజవిభునిరాణి యగ్రభాగమున నడువ
నిజ నివాసమ్ములకు జేరె నెగులు తోడ.

సోణుత్తరుడు ఏడవనాటికి ముందే దంతములతో వారాణసి చేరెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త యిట్లు పలికెను:

కాంచనద్యుతి దిశల వ్యాపించుచుండ
కరివిభుని దంతములతోడ కాశి జేరి
రాజపుత్రికి వాని నర్పణము చేసి
వృత్తమంతయు జెప్పెను వేటకాడు.

వీనిని గొనిపోయి, నేను పోయినట్లు తెలిపి, "ఆర్యే, నీ మనసులో నున్న స్వల్ప ద్వేషము వలన నేను హస్తిని సంహరించితిని అని చెప్పుము" అనెను.

వాడు రాణి కాదంతముల నిచ్చి "గజము చనిపోయెను, ఇవి దంతములు" అనెను. బోధిసత్త్వుని షడ్వర్ణ కాంతుల దంతముల నామె మణుల వీవనపై గొనిపోయి, తన రొమ్ముపై బెట్టుకొని, పూర్వజన్మములలో తన ప్రియస్వామి దంతములను విలోకింపసాగెను. "ఇట్టి సౌభాగ్యశీలి యగు గజేంద్రుని విషాక్త బాణముతో కొట్టించి, ప్రాణములు తీయించి దంతములు కోయించి తెప్పించితిని" అని బాధపడెను. బోధిసత్త్వుని జ్ఞప్తికి తెచ్చుకొని, ఉత్పన్న శోకమును సహింపజాలక, గుండె బ్రద్దలు కాగా నామె యానాడే మృతి నొందెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త యిట్లు పలికెను:

వెనుక జన్మమునం బ్రియ విభు గజేంద్రు
దంతముల గాంచినంతనే తరుణి యటనె
గుండె లవియగ ప్రాణముల్ కోలుపోయె.

చెంది సంబుద్ధి బుద్ధుడు చేసినాడు
మందహాసము పరిషత్తు మధ్యమందు.

చేయరెన్నడు బుద్ధులు స్మిత మహేతు
కముగ నని ముక్త భిక్షు సంఘమ్ము పలికె.

కాషాయ వస్త్రంబు గట్టించి యెవతె
కనదారికావృత్తి నబ్బజేసితివో,
వివిధ ప్రదేశాల విచరించె నెవతె
యా సమయంబునం దామె రాకన్నె.
ఆ కాలమున నెను హస్తినాథుండ.

కాశి జేరుచు శ్రేష్ఠ గజ దంతములను
అనుపమ సుందరి కర్పించినట్టి
యా విలుకాం డల దేవదత్తుండు

గత జన్మమున బహుకాలాన జేసి
నట్టి కర్మలు- మంచి వైనను గాని,
చెడ్డ వైనను గాని- స్మృతికి దెచ్చుకొని
పలుకును బుద్ధుండు, బాధలు వ్యథలు
వివిధ మనశ్శల్య వితతి వర్జించి.

ఆ కాలమున నేను హస్తినాథుండ :
మీరు భిక్షువులార, ధారణ చేయు
డీ ప్రకారమ్ముగా నీ జాతకమును.

ఈ గాథలను దశబలధారి బుద్ధుని గుణానువాదము చేయువారును, ధర్మ గానము చేయువారును అగు స్థవిరులు భద్రము చేసినారు.

ఇట్లు ధర్మోపదేశనము విని యనేకులు స్రోతాపన్నాది ఫలములందు ప్రతిష్ఠితు లయిరి. భిక్షుణి క్రమముగా విదర్శన-భావన అభ్యాసము చేసి అర్హత్వము పొందెను.

—:o:—

# 515. సంభవ జాతకము

పూర్వకాలమున కురురాష్ట్రమున ఇంద్రప్రస్థనగరమున ధనంజయ కౌరవ్యుడు అను రాజు పరిపాలన చేయుచుండెను. ఆయనకు సుచరితుడు అను బ్రాహ్మణ పురోహితుడు అర్థ ధర్మానుశాసకుడు. రాజు దానాది పుణ్యకార్యములు చేయుచు ధర్మమార్గమున రాజ్యము నడపు చుండెను. ఒక నాడాతడు ధర్మయజ్ఞమను ప్రశ్న ఉదయింపగా సుచరితుని పీఠముపై కూర్చుండబెట్టి సత్కరించి ప్రశ్న మడువాడై ఈ గాథలు పలికెను :

రాజ్యము లభించినది : కురురాష్ట్రమందు
పలుబడి చిక్కినది నాకు; ఇంకమీద
మహి సమస్తము గెలిచెడి మహిమ కొరకు
సలుప గోర్కి సుచీరతా, జతనములను.

ధర్మ పూర్వకముగ జేయ దలతు కార్య
ముల, అధర్మంబు నచ్చదు మొదలె నాకు,
నిఖిల జనులకు ననుకరణీయ మగును
ధరణిపతి యాచరించెడి ధర్మకర్మ.

నేడు, ముందునుగూడ ననింద్య మగుచు
అమరులందును, మానవులందు యశము
గొలుపు కార్యమె బ్రాహ్మణా, సలుప నెంతు.

కావునను బ్రాహ్మణోత్తమా, నీవు నాకు
తెలుపవలయును ధర్మార్థములను గూర్చి.

ఈ ప్రశ్నయు గంభీరము, బుద్ధవిషయము. ఈ ప్రశ్న కేవలము సర్వజ్ఞ బుద్ధుని అడుగవలసినది. తనకు లేకుండుటచే సర్వజ్ఞత్వము నన్వేషించి నపుడు బోధిసత్త్వుడు జ్ఞప్తికి వచ్చెను. సుచీరతుడు బోధిసత్త్వుడు

కాకుండుటచే ప్రత్యుత్తర మీయజాలకుండెను. ఆయన పాండిత్యాభిమానము నటింపక తనయశక్తిని వెల్లడించువాడై ఈ గాథ పలికెను :

క్షత్రియ నృపాల, నీ యాప్సితమ్ము లైన
కార్యముల నొక్క విదురుండు కాక పరుడు
సత్యముగ నిర్వహింపగా జాలడు సుమి !

అతని వాక్కులు విని రాజు "బ్రాహ్మణోత్తమా, నీవు శీఘ్రముగా ఆయన కడకు పొమ్ము" అని అతనిని పంపువాడై ఈ గాథ పలికెను :

పంపుచున్నాను విదురుని పజ్జకు నిను :
అర్థ ధర్మాను శాసకు నంతికమున
ఉంచుము సువర్ణ నిష్కంబు నుడుగరగను-
వెడలు మింక సుచీరకా, విదురు కడకు.

ఆ ప్రశ్నమునకు సమాధానము వ్రాయుటకై లక్షవిలువ గల బంగరు పట్టము, పోవుటకై శకటము, తోడుగా సైన్యము ఇచ్చి రాజతనిని తక్షణమే పంపెను. ఆతడు ఇంద్రప్రస్థ నగరము వెలువడి సూటిగా వారాణసికి చనక, పండితులున్న తావుల నాగుచు జంబూద్వీప మెల్లెడల పర్యటించి ఈ ప్రశ్నమునకు సమాధానము చెప్పువారెవ్వరును లభింపక పోవుటచే క్రమముగా వారాణసి చేరి ఒకచోట నివసింపజొచ్చెను. ఒకనాడు ప్రాతర్ భోజనము చేయువేళకు విదురుని యింటికి జని తనరాక నెరింగించెను. తిరిగి వార్త వచ్చునప్పటికి యజమానుడు భోజనము చేయుచుండెను.

ఈ విషయమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథ పలికెను :

అవల సుచీరకుడు విదురాంతికమున
కరిగె : విదురుడు స్వీయ గృహమ్మునందు
భోజనం బయ్యెడం జేయ బోవుచుండె.

అత డాయనకు చిన్ననాటి చెలిమికాడు. ఇరువురును ఒకే ఆచార్యుని కడ విద్యాభ్యాసము చేసినవారు. అందుచే ఇరువురును ఒక పంక్తినే భోజ

నము చేసినారు. భోజనానంతరము విశ్రాంతి తీసికొనుచు కూరుచున్న పిదప "మిత్రమా, యేల వచ్చితివి ?" అని ఆయన అడుగగా సుచీరతుడు కారణము వివరించువాడై ఈ గాథ పలికెను :

నన్ను దూతగ కౌరవ్యనాథు డంపె :
అతడు ధర్మార్థములగూర్చి యడిగినాడు
చెప్పు మవ్వాని, నిన్ను ప్రశ్నించువాడ.

ఆ సమయమున బ్రాహ్మణుడు లోకుల మనస్సులను ప్రసన్నము చేయుటకై అభియోగములు విచారణ చేయుచుండెను. ప్రశ్నమునకు సమాధానము చెప్పు నవకాశము లభింపక పోవుటచే ఆ విషయమును ప్రకటించుటకై ఈ గాథ పలికెను :

జనులు చిత్తము వచ్చిన సరణి నన్ను
ప్రశ్నరూప గంగానదీ ప్రబలవారి
గప్పివేయుదు; రింక నాకడలిలోని
ధర్మమర్మమ్ములను విప్ప దరము కాదు.

"నా కుమారుడు పండితుడు, నాకన్న అధికజ్ఞాని- అతడు నీకు విశదము చేయగలడు. అతని కడకు బొమ్ము" అని బ్రాహ్మణుడు డీ గాథ పలికెను :

ఔరసుం డుత్తముడు భద్రకారు, డెరుగు
నద్ధర్మములంగూర్చి యడుగు మతని.

విని సుచీరతుడు విదురుని యిలు వెడలి భోజనము చేసి, భద్రకారుడు నిజమండలి మధ్యమున కూరుచున్న సమయమున నాతనికడకు జనెను.

ఈ భావమును ప్రకటించుటకు శాస్త్ర ఈ గాథ పలికెను :

భద్రకారునికడ కేగె బ్రాహ్మణుండు :
అతడు కూర్చుండి యుండె గృహమ్మునందు.

సుచీరతు డచటికి చేరి భద్రకారమాణవకుడు తన్ను పీఠమున గూరు చుండబెట్టి సత్కరించిన పిదప ఆగమనకారణ మడుగగా ఈ గాథ పలికెను :

నను యశస్వి కౌరవ్య భూనాయకుండు
అంపి, దూతగ, నిన్ను ధర్మార్థములను
గూర్చి ప్రశ్నించి తెలిసికో గోరినాడు—
అందుచే భద్రకార, ని న్నడుగువాడ.

అప్పుడు భద్రకారుడు "నాయనా యిన్నాళ్ళును వేరొక స్త్రీతో కూడియున్నాను. కావున నా చిత్తము వ్యాకులముగా నున్నది. నీకు సమాధానము చెప్పజాలను. నా తమ్ముడు సంజయకుమారుడు నాకంటెను అధికజ్ఞాని. ఆతని నడుగుము. నీ ప్రశ్నమున కాతడు సమాధానము చెప్పును" అని సుచీరతుని పంపువాడై ఈ గాథలు పలికెను :

ఇంట నున్నట్టి స్త్రీ నుజ్జగించి యన్య
వనిత వెంటను బడిపోవువాని వలెను.
విడిచి యచ్చంపు మృగమాంస ముడుము వెంట
చన్నవాని విధమ్మున నున్నవాడ :
అర్థ ధర్మాలు దెల్ప ననర్హుడ జుమి !
ఓ సుచీరత, సంజయు డున్నవాడు
అవరజుండు, ధర్మాదిక మడుగు మతని.

తోడనే యతడు సంజయుని యింటికి బోయి సత్కృతుడై రాకకు కారణ మడిగిన పిదప వివరించెను.

ఆ విషయమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథలు పలికెను :

అంత సంజయుకడ కేగె : నాతడపుడు
స్వీయ పరిషత్తు నడుమ నాసీను డయ్యె

నను యశస్వి కౌరవ్య భూనాయకుండు
అంపె దూతగ, నిన్ను, ధరార్థములను

గూర్చి ప్రశ్నించి తెలిసికో గోరినాడు :
అందుచే సంజయా, నిన్ను నడుగువాడ.

ఆ సమయమున వేరొక స్త్రీతో కూడియున్న సంజయకుమారు డాతనితో "బాబా, నేను ఆమెకొరకు గంగానది దాటి ఆవలియొడ్డునకు బోయి మరలి వచ్చుచుందును. రెండువేళల మరణ మాసన్నమై యుండుటచే నా చిత్తము వ్యాకులముగా నున్నది. కావున నీకు సమాధానము చెప్పజాలను. నా చిన్నతమ్ముడు సంభవకుమారుడు ఏడేండ్ల వయసువాడైనను నా కంటె వేయిరెట్లు అధికజ్ఞాని. ఆతడు నీకు సమాధానము చెప్పగలడు. పోయి ఆతని నడుగుము" అనెను.

ఈ భావమును ప్రకటీకరించుటకై శాస్త ఈ గాథలు పలికెను :

మృత్యు వుదయాన సంధ్యను మ్రింగుచుండు
నన్ను : ప్రశ్నించినంగూడ నర్థ ధర్మ
వివరణము చేయజాలను, వెడలి పొమ్ము
సంజయుడు తమ్ము, డాతని సవిధమునకు :
అర్థ ధర్మములం గూర్చి యడుగు మతని.

విని సుచీరతుడు తనలో "ఈ లోకములో ఈ ప్రశ్నము బహుశః అద్భుతము కావచ్చును. దీనికి సమాధానము చెప్పగలవాడు లేడనిపించుచున్నది" అనుకొని ఈ గాథలు పలికెను :

పెద్దవాడైన సోదరుల్ పితయు గూడ
దేని నాత్మీయ శక్తిచే తెలిసి కొనగ
వలను పడలేదొ,- నే చిన్నవాడ- దాని
నడిగినం గూడ దెల్పగా నగునె నాకు ?
ఇట్టి ధర్మ మద్భుతము నా కెంతయేని.

విని సంజయకుమారుడు "బాబా, సంభవకుమారుడు బాలకు డని తలపవలదు. మరి యెవడైనను దీనికి సమాధానము చెప్పలేనిచో ఆతనికడ కరిగి అడుగుము" అనెను.

ఈ యభిప్రాయమును వ్యక్తముచేయు నుపమానముల ద్వారా కుమారుని గుణగానము కావించువాడై ఈ గాథలు పలికెను :

బాలకుండని తలపకు ప్రశ్న వేయ
కుండ సంభవు : నాతని కోరనంత
అర్థ ధర్మ విజ్ఞానంబు లబ్బును సుమి !

అంబరంబున నరుగు హిమాంశువు తన
కాంతిచే సర్వతారకా గుణముల రుచి
నతకరించెడి రీతి నా యర్భకుండు
సంభవుడు మించు నాత్మీయ శక్తిచేత.

చైత్ర మేరీతి నన్ని మాసములకంటె
అందగించునో గీష్మర్తువందు మిగుల
ప్రసవ శోభల చేతను, బాలుడయ్యు
సంభవుం డెల్లరను మీరజాలువాడు.

వివిధ వృక్ష సంఛన్నమై వివిధ జీవ
వాసమౌ గంధమాదన పర్వతంబు
ఓషధీకాంతులన్ దిక్కు లుజ్వలములు
చేయునటు సంభవుడు కూడ కాయు రుచుల.

పరుగుచే నుత్తమాశ్వంబు, భారవహన
శక్తిచే బలీవర్దము, యుక్తదోహ
దమ్మునను ధేనువును, భాషణమ్ము వలన
పండితోత్తము గ్రహింప వలను పడును :
ఇట్టులే సంభవుని గ్రహియింప వచ్చు,

చనె సుచీరతు డంతట సంభవుకడ-
కతడు నగరమ్ము వెలుపల నాడుచుండె.

ఈ ప్రకారముగా సంభవకుమారుని గుణగానము విని సుచీరతు డాతనిని ప్రశ్నింప దలచి, "మీ తమ్ము డెక్కడ ?" అనెను. అతడు గవా

షము తెరచి చేతితో జూపుచు "స్వర్ణవర్ణ సౌధద్వారముకడ సందులో బాలకులతో నాడుచున్నాడు. పోయి వానిని ప్రశ్నింపుము. బుద్ధ లీలలనుండి వాడు నీకు సమాధానమిచ్చును" అనెను. సుచీరతుడు మేడ దిగి, కుమారునికడకు జనెను. ఏ సమయమున? కుమారుడు తన వస్త్రములు నెత్తికి చుట్టి, రెండు చేతులలో ఇసుక పట్టుకొన్న సమయమున—

ఈ భావమును స్పష్టీకరించుటకై శాస్త్ర పలికిన గాథ:

నను యశస్వి కౌరవ్య భూనాయకుండు
అంపి దూతగ, నిన్ను ధర్మార్థములను
గూర్చి ప్రశ్నించి తెలిసికో గోరినాడు—
అందుచే సంభవా, నిన్ను నడుగువాడ.

బ్రాహ్మణుడు వచ్చి యెదుట నిలవగా బోధిసత్త్వుడు, "తాతా, ఏల వచ్చితివి?" అనెను.

"జంబూద్వీపము పర్యటించినను నా ప్రశ్నమున కెవరును సమాధానము చెప్పలేకపోవుటచే, నీ కడకు వచ్చినాను."

కుమారుడు సిగ్గుపూని చేతులలోని యిసుక క్రిందికి విడిచి, తలపైనున్న వస్త్రములు కట్టుకొని, సర్వజ్ఞునివలె నిమంత్రించి "బ్రాహ్మణోత్తమా, అడుగుము. బుద్ధలీలనుండి నీకు సమాధాన మిత్తును" అనెను.

అంతట బ్రాహ్మణు డీగాథ పలికెను:

నను యశస్వి కౌరవ్య భూనాయకుండు
అంపె దూతగ, నిన్ను ధర్మార్థములను
గూర్చి ప్రశ్నించి, తెలిసికో గోరినాడు:
అందుచే సంభవా, నిన్ను నడుగువాడ.

గగన మండలమున పూర్ణచంద్రుడు కానబడినట్లు సంభవ పండితునకు సమాధానము స్పష్టముగా గోచరించెను. అటు లయిన విను మని సంభవ

పండితుడు ధర్మజ్ఞ సంబంధ ప్రశ్నమునకు సమాధాన మిచ్చువాడై యీ గాథ పలికెను :

నిశ్చయమ్ముగ పల్కెద నేను గూడ
బుద్ధదేవుడు చెప్పిన పోల్కి ; మీదు
ప్రభువు గ్రహించు రీతిని పలుకువాడ :
తదనుసరణమ్ముగా భవద్ధరణీపుండు
చేయునో చేయడో యాతడే యెరుంగు.

సందులో నిలుచుండి బాలుడు చేసిన ధర్మోపదేశము వారాణసి నగరమున పండ్రెండు యోజనములు మధురముగా వ్యాపించెను. రాజు, ఉపరాజు మొదలగువారు సమావిష్టులయిరి. బోధిసత్త్వుడు జనసమూహమున ధర్మదేశనము స్థాపించెను.

ఇట్లు గాథారూపమున ప్రశ్నవిషయమై చెప్పి యాతడు, ధర్మయజ్ఞ వర్ణనము చేయుచు నిట్లు పలికెను :

అడిగిన సుచీరతా, తన నపుడు చేయ
వలయు కార్యము మరునాడు సలుపుమనుచు
నెవ్వడేనియు నుపదేశ మిచ్చునెడల
తెలిసికోవలె నిజము యుధిష్ఠిరుండు.

ఎవ్వడేనియు నుపదేశ మిచ్చినపుడు
అడిగినంతనె, నరపాలు డనుసరింప
వచ్చు దానిని, మూఢునివలె కుమార్గ
వర్తి కారాదు యోజన వదలిపెట్టి.

దాటగూడదు హద్దు, నధర్మకార్య
మాచరింపగ రాదు, స్నానాదికమ్ము
చేయగూడ దతీర్థంపు సీమలందు,
కలుగగూడ దనర్థ సంగతులు తనకు.

వీని కనుగుణముగ నే వివేకవంతు
డాచరించునో క్షత్రియుం, డాకసమున

శుక్ల పక్షాన చంద్రుని శోభవోలె
ఆత డెంతయు నభివృద్ధి నందుచుండు.

బంధు జనులకు గడు ప్రీతిపాత్ర మగుచు
మిత్రులందు ప్రకాశించి, మృత్యువు గని
స్వర్గలోకాన నాత డుత్పన్ను డగును.

ఈ విధముగా బోధిసత్త్వుడు బుద్ధలీలనుండి సమానధానము చెప్పెను. జనసమూహాము సంతోషించి సాధువాదములు చేసి, ఉత్తరీయము లెగుర వైచి, అంగుళీయకములను చేతుల నున్న యాభరణములను విసిరివేసి కోలాహలము చేసెను. విసరివేసినవాని విలువ కోటికోలది యుండును. రాజు ప్రసన్నుడై బోధిసత్త్వునికి విశేషధన మొసగెను. సుచీరతుడు కూడ వేయి నికషములతో పూజించి బంగరు పట్టాపై ప్రశ్నోత్తరములు సిందూరముతో లిఖించి ఇంద్రప్రస్థమునకు జని, రాజుకు సమాధానము చెప్పెను. ఆ ధర్మముల ననుసరించి రాజు పరిపాలన చేసి, తుదకు స్వర్గలాభ మొందెను.

శాస్త యీ ధర్మదేశనము చేసి "భిక్షులారా, తథాగతు డిప్పుడే కాదు, పూర్వము కూడ మహాప్రజ్ఞావంతుడు" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున ధనంజయరాజు ఆనందుడు; సుచీరతుడు అనురుద్ధుడు; విదురుడు కాశ్యపుడు; భద్రకారుడు మౌద్గల్యాయనుడు; సంజయ మాణవకుడు సారిపుత్రుడు; సంభవ పండితుడు నేనే.

—(o)—

# 516. మహాకపి జాతకము

శాస్త్ర జేతవనమున విహరించు దేవదత్తుని విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

దేవదత్తుడు ధానుష్కులను బంపి, ముందుగా పోయి శిలా ఖండము విసరించెను. భిక్షువులు దేవదత్తుని నిందించుచుండిరి. శాస్త్ర "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడేకాదు, పూర్వముకూడ నాపై రాయి వేయించెను" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుని పరిపాలనమున నొకానొక బ్రాహ్మణుడు కృషి చేయుచు, ఎద్దులను విడిచి పొలముపని చూచుచుండెను. అవి పొదలలో ఆకులు మేయుచు క్రమముగా నడవిలో దూరి సాగిపోయినవి. క్రత్యకము ముగించి బ్రాహ్మణుడు చూచునప్పటికి ఎద్దులు కానరాలేదు. విచారముతో నతడు వానిని వెదకుచు క్రమముగా హిమాలయము చేరి, త్రోవ తప్పి యేడురోజు లాహారము లేకుండ తిరిగి తిరిగి తుదకు తిందుకవృక్షమును చూచి, దానిపై కెక్కి పండ్లు తినుచుండగా కాలుజారి యేడు మూరల గోతిలో పడి, పది దినము లచటనే యుండెను.

ఆ సమయమున బోధిసత్త్వుడు కోతి కడుపున పుట్టి, ఫలాదులకై తిరుగుచు బ్రాహ్మణుని గాంచి, రాళ్ళు పేర్చి ఉద్ధరించెను. వానరము నిద్రించుచుండ నాతడు దాని నెత్తిపై రాయి విసరెను తనకు కష్టము కలుగునని తెలిసినంతనే వానర మెగిరి చెట్టుకొమ్మపై కెక్కి కూరుచుండి, "ఓయీ, నీవు నేలపై నడచుచుండుము. నేను తరుశాఖల మీదుగా వచ్చుచు త్రోవ చూపుదును" అని అతనిని అరణ్యము దాటించి, మంచి మార్గమున బెట్టి, తాను కొండ మీదికి బోయెను. బోధిసత్త్వునెడ నపరాధము చేయు

టచే నతడు కుష్ఠురోగియై మానవప్రేతమువలె నయ్యెను. బాధతో నేడు సంవత్సరముల కాలము దేశమున దిరుగుచు, వారాణసిలో మృగోద్యానము చేరి, గోడమాటున అరటాకులు పరచుకొని వ్యథతో పండుకొనెను. అవేళ వారాణసీనరేశు డుద్యానమునకు జని, పడియున్నవానిని జూచి, "ఎవరు నీవు ? ఏల ఈ స్థితికి వచ్చినావు ?" అని యడుగగా, నతడు యావద్వృత్తాంతము తెలిపెను.

ఈ విషయము ప్రకాశింప జేయుటకై శాస్త పలికిన గాథలు :

కల డొకానొక నరపతి కాశిరాష్ట్ర
వర్ధనుండు వారాణసీ పత్తనమున,
ఒక్కనాడు మిత్రామాత్య యుక్తు డగుచు
దరిసె నతడు మృగాచిర దానసీమ.

బ్రాహ్మణుం గాంచె నచ్చట- పాండుదేహు,
శబలితుని, కుష్ఠరోగిని, శక్తిహీను.
సన్న యెమ్ముల పోగుగా నున్నవాని.

అచ్చెరువుతోడ. దయతోడ, ననియె రేడు :

యతులం దెవ్వడవు నీవు ? హస్తపాద
ములును, శిరమును పాండురమ్ములు, శరీర
మెంతయుం జిత్రితము, కుష్ఠ మెనసియున్న (ది)-

అంగకమ్ములు నలుపు, నీయట్టివాని
నెన్నడుం జూడలేదు.
నిన్ గన్నతల్లి
యెవ్వరో ? ఆమెనైన మీఱింపలేదు
నీ భయంకర రూపమ్ము !
నీదు పూర్వ
కర్మచే నిట్టి యాకృతి కలుగనోపు.
చెప్పు మెచ్చోటి నుండి వచ్చితివో కాని !

అప్పుడు బ్రాహ్మణు డిట్లనెను :

పలికెదను బుద్ధ భగవానువలె నిజమ్ము
నిశ్చయమ్ముగ : పండితుల్ నిఖిల జగతి
సత్యవాది ప్రశంసయే సలుపుచుంద్రు.

వృషభాల వెదకుచు విపినంబు జేరి
ఏకాకిగా అట నెన్నొ రకాల
మత్తగజా లుండు, మానవుల్ లేరు.

పోవుచు నందులో త్రోవ కోల్పోయి
ఆకలి దప్పుల వ్యధతోడ, ఏడు
దినము లెట్టెట్టులో తిరుగుచునుంటి.

ఒక్క ప్రపాతంబు ప్రక్కగా గంటి
ఫల భర తిందుక పాదపం బొకటి.

గాలిచే నేలపై రాలిన పండ్లు
భక్షించినా, నవి బాగుగా నుండె.

తృప్తి తీరక నేను తిందుకం బెక్కి
కడుపు నిండగ తిన కాంక్షించినాను.

చెట్టెక్కి యొకపండు మెక్కి, రెండవది
కోయు తలంపుతో చేయి చాపితిని.
గొడ్డలి పెట్టున గూలిన రీతి
ఆకస్మికమ్ముగా నా కొమ్మ విరిగె.

ఆలంబనము లేక యాశాఖ పడియె
కొండల లోయలో నిండు జలాన :
తల క్రిందులుగ నేను దానిలో బడితి.

గాయముల్ తగులవు గాత్రమ్మునందు-
పది రాత్రు లచటనే పడియుంటి నెట్లో.

కాననచారి మర్కటము వచ్చినది;
ఎద్దు తోకంతటి పెద్దది దాని
వాలంబు, దూకుచు వానర మవల
కొమ్మ కొమ్మను పండ్లు కూరిమిం దినియె.

చిక్కి శల్యంబైన శ్వేతదేహుడను
నను గాంచి యిట్లనె ననుకంపతోడ :

"ఓయి, యిచ్చట వ్యథ నొందెడి నీవు
నరుడవా, కావ ? నీనామధేయంబో ?
వివరింప వలయు నీ వృత్తాంత మెల్ల."

చేతులు జోడించి చెప్పితి నిట్లు :
"దురదృష్టవంతుడ, నరుడను నేను
నిస్తార రహితుడ : నీక, మే లగుత !
ఇందుండి నన్నుద్ధరింపగా వలయు !"

అచలంబు మీదను విచరించి తెచ్చి
కపి శిలాఖండముల్, క్రమవిధానమున
నిర్మించి సోపానశ్రేణి, యనియె;

ఏతెమ్ము ; నావీపు నెక్కి, బాహువుల
గట్టిగా నామెడ పట్టుకోవలయు :
ఉద్ధరింతును నిన్ను నొక్క దాటునను."

ధీరుడా వానరాధీశుని మెడను
పట్టి బాహుల, వీపుపై నెక్కినాను.

తేజస్వి వానరాధీశుండు నన్ను
గిరి లోయలో నుండి క్లేశమ్ముతోడ
ఉద్ధరింపగ జాలె నొక్క దాటునను.

అవల మహాకపి యనియె నాతోడ ;
"ఓ చెలికాడ, ముహూర్త మాత్రమ్ము
కన్ను మూసెద, నన్ను కనిపెట్టియుండు.

సింహముల్, వ్యాఘ్రముల్, చిరుతలు, నెలుగు
బంట్లు నే నిద్రించు పట్టున నాకు
హాని చేయగ వచ్చు ; నందుచే చూచి
వాని నిరోధింపవలయును సుమి !"

కావించి రక్షకు కపిరాజు నన్ను,
శయనించె; కొంచెము సమయమ్ము గడవ
పొడమె నా మనసులో చెడుతలం పొకటి.

"ఖాద్యంబె యగు గద కపికూడ నితర
జంతువు లట్టులు జనులకు; కాన
దీని జంపి బుభుక్ష తీర్చుకోవచ్చు.

మాంసమ్ము భక్షించి మరల బలమ్ము
చేకూర్చుకొని, కొంత చేత బట్టుకొని
పాథేయముగ, వన పారంబు గాంతు."

ఆవల రాతితో నా కపిరాజు
తలమీద గొట్టితి, బలము లేకుంట
హాస్త్రాల, పెద్దగాయంబు కాలేదు.

తోడనే లేచి యా దొడ్డ మృగమ్ము-
శిరమున రక్తమ్ము చిందుచుండంగ
నేత్రాల బాష్పముల్ నిండుచుండంగ
వీక్షించి నన్ను, ఈ విధముగా బలికె :

"ఆర్య, నా యెడ నిట్టు లాచరించితివె !
అడ్డుకొందువు నీవె అన్య మృగాల

నని తలంచితి; నిట్టి యాచరణంబు
ఇంచుక యైన నూహింపనే లేదు !
నీకు మేలగుగాక ! నీవు నూరేండ్లు
బ్రదికి యుండుపు గాక ! పరలోక వాసు
పైకి లాగినయట్లు భయద ప్రపాత
తలమునందుండి నిన్ వెలువరించితిని.

పాపకార్యమ్మును భావించినాడ
వో యధార్మిక, దుఃఖ మొందకు నీవు !
పాపకృత్యము నిన్ను పరిమార్చకుండు."

కపి యిట్టులనియెను క్షమ వేడినంత
"నమ్మకమ్మిక లేదు నాకు నీ యెడల
పయనింతు కొమ్మల పై భాగమునను
నడచుచుండుము నేల నా వెనువెంట.

వనమృగమ్ముల భీతి గన వింక నీవు
గ్రామోప కంఠంబుకడకు జేరితివి.
అదె త్రోవ, సుఖముగా నరుగుము పాపి !"

అచటి సరోవరమందు వానరము
రక్తసిక్తమ్ము శీర్షమ్మును కడిగి
నేత్రాల నశ్రువుల్ నిండు చుండగ
ఆరోహణము చేసె నచ్చటి గిరిని.

దాహపీడితుడై తాపమ్ముచేత
నా తటాకము చేర, నందలి జలము
నిండిపోయినట్లు నెత్తుటి తోడ
అగ్నిచే తప్త మైనట్టులు తోచె.

నా శరీరంబు పైనను బడ్డ నీటి
కణముల మూలాన గాయంబు లయ్యె
చీము, నెత్తురు, నందు చేరె నిండుగను.

నేను గ్రామంబుల నిగమంబులందు
సంచరించెడివేళ జనులు దండములు
గైకొని దూరమ్ముగా దోలువారు
పూతిగంధమువాడ, పొమ్ము శీఘ్రముగ
చను మటువైపుగా ననియెడివారు,

చేసినదానికి శిక్షాస్వరూప
ఫలితమ్ముగా బాధ పడుచున్నవాడ
పదేండ్లనుండి నే నీ విధమ్ముగను.

తగదెన్నడును జనుల్, తగదు మిత్రద్రోహ,
మది మహాపాతకం బాపాపి దేహమ్ము
కుష్ఠ రోగమ్ముతో క్రుళ్ళిపోవుట నిజము.
నానావ్యథల్ చెంది, నరకాన బడువాడు-
ఎవ్వారు కనిపింప, నిది బోధ చేయుదున్.

రాజుతో నాతడు మాట లాడుచుండగనే భూమి నెర్ర వారెను. తోడనే యాతడు విగతజీవు డయి, అవీచీనరకమున జన్మించెను. అతడు భూమిలో మునిగిపోయిన పిదప రా జుద్యానము వెలువడి నగరమున ప్రవేశించెను.

శాస్త యీ ధర్మోపదేశనముచేసి, "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడే కాదు, పూర్వము కూడ రాతితో గొట్టినాడు" అని జాతకములు సరిపోల్చెను. ఆ సమయమున మిత్రద్రోహి దేవదత్తుడు, కపిరాజు నేనే.

---

# 517. దకరక్ష జాతకము

ఇది యంతయు మహా ఉమ్మగ్గ జాతకమున (546) వచ్చును.

# 518. పండర జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు, దేవదత్తు డసత్యము పలికి భూమిలో దిగబడిపోయిన విషయమును గూర్చి చెప్పినది. అప్పుడు భిక్షువులు దేవదత్తుని నిందించుచుండిరి. శాస్త్ర వారితో "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడేకాదు, పూర్వముకూడ ననృతము పలుకగా భూమి వానిని మ్రింగివేసినది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయునపుడు 500 ల మంది వ్యాపారులు పడవలెక్కి, సముద్రమున బయలుదేరిరి. ఏడవనాడుకూడ వారికి తీరమెచ్చటను కానరాలేదు. నౌకలు బ్రద్దలయి పోయినవి. ఒక్కడు తప్ప తక్కినవారు మత్స్యముల వాత బడిరి. వాయువశమున నాతడు కరింబియ పట్టణముదరికి కొట్టుకొని పోయెను. ఆతడు నగ్నముగానే నగరములోనికి భిక్షార్థము పోయినపుడు లోకులు చూచి, ఆతడు శ్రమణుడనియు, అల్పేచ్ఛువు, సంతుష్టచిత్తుడు ననియు భావించి సత్కరించిరి. తనకు జీవిక దొరికినట్టు లతడు తలచి లోకులిచ్చిన వస్త్రములు పుచ్చుకొనలేదు. ఇంతకన్నను కోరిక లేనివాడెవ్వడును లేడని వారు ప్రసన్నులై అతని కాశ్రమము నిర్మించి అతని నచట నిలిపిరి. కరంబియ-అచేలు డని అతనికి ప్రసిద్ధి వచ్చినది. అచట నాతనికి లాభ సత్కారములు హెచ్చినవి. ఒక నాగరాజు, ఒక గరుడరాజు అతనిని సేవింపవచ్చుచుండిరి.

ఒకనాడు గరుడరాజు అతనిని సమీపించి ప్రణామము చేసి, ఒక ప్రక్క నిలిచి "భన్తే, మా సంబంధులు చాలమంది నాగులను పట్టుకవచ్చి, నాశము పొందుచున్నారు. వీనిని పట్టుకొను పద్ధతి మాకు తెలియలేదు. తాము వానిపై ప్రేమ ప్రకటించుచు, ఆ రహస్యము గ్రహింపగలరా ?" యనెను.

ఆతడు మంచిదని యంగీకరించెను. గరుడ రాజు ప్రణామము చేసి వెడలి పోయెను.

నాగరాజు వచ్చి ప్రణామము చేసి, కూరుచున్నంతనే అచేలకుడు "నాగరాజా, మిమ్ములను పట్టుకోవచ్చిన గరుడులు వినాశము చెందుచున్నారేల ? వారు మిమ్మెట్లు పట్టుకొనగలరు ?" అని ప్రశ్న చేసెను.

"భన్తే, అది చాల గుహ్యమైన మారహస్యము, అది బయలు చేసినచో మా జ్ఞాతి వర్గమువారు మృత్యువు నాహ్వానించిన వా రగుదురు."

"ఆయుష్మన్, ఈ విషయ మెవరితో నైనను చెప్పుదు నను భయమా ? ఎవరికిని తెలుపను. కేవలము నేను తెలిసికోవలె నను కోరికతో నడుగుచున్నాను. నన్ను నమ్మి నీవు నిర్భయముగా చెప్పవచ్చును."

"భన్తే, చెప్పుదును" అని నాగరాజు వెడలిపోయెను. మరునా డచేలకుడు ప్రశ్నించినను నాగరాజు చెప్పలేదు. మూడవనాడు నాగరాజు వచ్చి కూరుచున్నప్పుడు శ్రమణుడు "నాగరాజా, ప్రశ్న మడుగుట మూడవ సారి, సమాధానము చెప్పవేమి ?" అనెను.

"భన్తే, తమరు మరి యెవ్వరితో నైన అందురేమో యన్న భయముచేత."

"చెప్పను. నిర్భయముగా పలుకుము."

"అటులయిన భన్తే, మరెవ్వరితోడను అనగూడదు" అని ఒట్టుపెట్టి "భన్తే. మేము రాలు మ్రింగుటచే బరువెక్కి పండుకొందుము. గరుడులువచ్చి మమ్ము పట్టనెంచినపుడు శిరములు ముందరికి జాపి, కోరలు తెరచి కరవ బోవుదుము. వారు మా శిరసులు పట్టుకొందురు. భారముగా నుండుటచే మమ్ము ఈడ్చుకొని పోవ యత్నింతురు; కాని లాగలేరు. మేమే వారిని పట్టి నీటిలోని కీడ్చుకొని పోవుదుము. వా రక్కడనే మరణింతురు. ఇందు వలన గరుడు లనేకులు మృతి నొందుచున్నారు. మూర్ఖులగుటచే వారు మా తలలు పట్టుకొందురు. తోకలు పట్టి మమ్ము తలక్రిందులు చేసినచో కడుపులోని రాలు రాలిపోవును; శరీరములు తేలిక యగును" అని నాగరాజు రహస్యమా దుర్మార్గునకు వెలువరించెను.

అతడు వెడలపోయినంతనే గరుడరాజు వచ్చి నమస్కరించి "భన్తే, నాగరాజును రహస్యమును గూర్చి యడిగితిరా?" అనెను. అవునని అచేలకుడు అంతయు వివరించెను. నాగరాజు చేసిన దనుచితమని గరుడు డనుకొని, నిజజాతికి అపకారము కలుగు నుపాయమును వెల్లడింపరాదని తలచి, గరుడవాయువు వీచి తొలుత నాగరాజునే పట్టుకొనుట యుక్తమని, అట్లే చేసి, తోకపట్టి పైకెత్తి కడుపులోని రాలు రాల్చి, ఆకసమున కరిగెను. శిరము వాల్చి ఆకసమున వేలాడుచు నాగరాజ పండరుడు "స్వయముగా వ్యధ నాహ్వానించితిని" అని విలపించుచు నిట్లు పలికెను:

సంయుతుడు కానివాడు, రహస్యగుప్తి
చేయనేరని తెరపెడు వాయి వాడు,
దేనినైన పరీక్షింప లేనివాడు,-
అట్టి మూఢుని భీతి వెన్నంటి యుండు
పండరక నాగపతికి సుపర్ణు నట్లు.

చెప్పు వాక్కును, రక్షణ చేయదగిన
దాని నెవ్వడు ప్రకటించు; దాని నింద
చేయువానిని భీతి గ్రసించియుండు
పండరకనాగు గరుడుని పగిది నెపుడు.

పైపైని మైత్రితో వర్తించువాడు
సుహృదుడే యయ్యును శుద్ధమూర్ఖుండు
స్నిగ్ధధీమంతుడై చెడు చేయువాడు-
అర్హులు కారు రహస్యంబు వినగ.

ఎంచి యచేలకు మంచివానినిగ
చాల పేర్వడ్డట్టి శ్రమణునిగాను
బయలు పెట్టితి గుప్త భాషణమ్ములను;
కోల్పోయి యర్థంబు కుందుచున్నాను.
దాచలేనైతి నాతనికడ మంత్ర
మావైపునుండియే హాని కల్గినది:
కోల్పోయి యర్థంబు కుందుచున్నాను.

వశవర్తియై ద్వేష భయరాగములకు
నీచు లౌ వారల నికటమ్మునందు
ప్రకటించును రహస్య భాషణ మ్మెవడు
అమ్మనుజుని పతనమ్ము నిశ్చయము !

ఎవడు మంత్రము గ్రహించి కాపురుష
సంగతి దాని బ్రచారమ్ము సేయు,
తుల్యుండు పాముతో, దుష్టముఖుండు
అని పేరు పడిపోవు, నట్టి దుష్టునకు
దూర దూరమ్ముగా తొలగి పోవలయు.

ఖాద్యములు, పేయములు, మాలికలును, కాశీ
చందనము, వస్త్రములు, మేలి యందగత్తె
లాదిగా గల్గు సర్వ భోగ్యములు విడిచి
అరుగుచున్నార; మింక నీ హస్తగతము
లస్మదీయ జీవములు విహంగరాజ !

గరుడు డతని విలాప వాక్కులు విని, నిందించి "నాగరాజా, అచేల కునకు నీ రహస్యము వెలి బుచ్చి, యిప్పు డేల విలపింతువు" అని యీ గాథ పలికెను :

అస్మదాదుల ముప్వురయందు నింద్యు
డెవడు ? శ్రమణుడో, గరుడుడో, యీవో ? చెప్పు
పండరక, నాగపతి, యెట్లు పట్టుబడితో !

విని పండరకు డీ గాథ పలికెను :

శ్రమణు డెంతయు హితుడని సజ్జనుడని
తలచి నాదు రహస్యంబు తెలిపినాను.
కాని నాకు లభించిన హాని చేత
నిపుడు వ్యథ జెంది కడు విలపించువాడ.

అంతట గరుడు డీ గాథలు పలికెను :

మహిని నరు డెవ్వడైన నమర్త్యు డగునె ?
కాదు నింద్యుడు ప్రజ్ఞలు కలుగువాడు.
సత్యమున, ధర్మమున, బుద్ధి సంయమముల
లబ్ధమగు దుర్లభము లైన లాభములును.

జనని జనకుండు నుత్తముల్ జ్ఞాతులందు
వీరలను మీరి దయజూపువాడు లేరు.
తన రహస్యము భేదిల్లు ననెడు శంక
వారికేని రహస్యంబు వలదు తెలుప.

తల్లియైన జనకుడైన చెల్లె లయిన
సోదరుండైన నత్యంతసుహృదు డయిన
స్వీయపక్షమువాడైన చెప్పరాదు
నిజ రహస్యంబు శంకచే నెవ్వరికిని.

ప్రియము పల్కు కుమారితో ప్రియతనూజు
తోడ, రూపయశస్సులతోడ, బంధు
బాంధవుల బృంద మున్నట్టి భార్యతోడ
వెల్లడింప రహస్యంబు వీలు కాదు.

ఇక ముందరి గాథలు ఉమ్మగ్గ జాతకమున, పంచపండిత ప్రశ్నలలో గూడ గానవచ్చును :

నిధిని గాపాడు చుండెడి విధి రహస్య
రక్షణము చేయవలయును ప్రాజ్ఞ జనుడు-
ప్రకటనము చేయ మంత్రంబు పాడికాదు.

స్త్రీకి, పుత్రుడు కానివానికిని, లోభి
యైన వానికి, నమ్మగా రానివాని
కిని రహస్యము ప్రకటించు టనుచితంబు.

ఆదిలో మూర్ఖునకు రహస్యంబు తెలిపి,
వెల్లడించును వా డను వెరపు తోడ
తిరుగు మానిసి కానిస తీరువాడు.

గుట్టు పరజనముల కెంతవట్టు తెలియు,
నంత యుద్వేగ మొదవును; సుంతయేని
అన్యులకు ప్రకటించుట యనుచితంబు.

పగటి వేళల నేకాంత భాషణంబు
తగు, విభావరివేళను తగ, దసమయ
మద్ది, గుప్తిభేదనచణు లట్లు నిట్లు
సంచరించుచు నుండుటచే సత్వరముగ
లోకమందు రహస్యంబు ప్రాకుచుండు,

భద్రశాలలతో గూడి, బహుళ లోహ
నిర్మితంబయి, పరిఖచే నిఖల దిశల
పరివృతంబగు నగరంబు పగిదినుండు
నిజరహస్యంపు గోపన నెరపువాడు.

పండరక, మంత్రమున్ గుప్త పరచువారి
భద్రవాక్కులను, సవర్థపటుల గాంచి
సర్పమున కట్లు దూరాన జనుడు మెలగు

ఇట్లు గరుడుడు ధర్మోపదేశము చేసిన పిదప పండరకు డిట్లనెను :

ఇతడు ప్రవ్రజ్య పూని ముండితుడు నగ్ను
డయి యనాగరికుడు భిక్షాటనంబు
సలుపుచుండుటచే రహస్యంబు చెప్పి
నాడ ప్రశ్నింప, ధర్మార్థహాని యయ్యె.

ఎట్టి శీలము వ్రతము చేపట్టు నెడ
శ్రమణుడు మమత్వమును వీడి సంచరించు ?
సలుపగా నెద్ది యొదవును స్వర్గలబ్ధి ?

గరుడు డిట్లనెను :

శాంతి సహనము లజ్జయు సంయమంబు
తోడ నుండి, క్రోధము విడనాడి, మమత
వీడి, భిక్షువు పైశునవృత్తి లేక
తిరుగుచుండును; వానికి త్రిదివ మబ్బు.

ఇట్లు గరుడుని వలన ధర్మోపదేశము విని, పండరకుడు ప్రాణభిక్ష వేడువాడయి యీ గాథ పలికెను :

జనని యౌరసు గాంచి ప్రసన్నయైన
విధమునన్ నీవు ప్రాదుర్భవించినావు
నాకొరకు; తల్లివలె నీవు సాకవలయు.

గరుడు డతనికి ప్రాణదానము చేయువాడై యీ గాథ పలికెను :

పండరక, తప్పినది నీకు ప్రాణభయము !
ఔరసుడు, దత్తుడును శిష్యు, డనగ బరగు
వారు ముువ్వురు పుత్రులు : వారిలోన
శిష్యపుత్రుడ; విక సంతసింపవచ్చు.

గరుడు డిట్లు పలికి పండరకుని ఆకసమునుండి నేలమీదికి దింపెను :

ఈ విషయమును ప్రకటించుటకై శాస్త యీ గాథలు పలికెను :

పండరకు నుంచి ధరణిపై పలికె గరుడు
డిట్లు : భయముక్తు డైనాడ వీవు నేడు :
నీవు మద్రక్షితుండవు నీట, నేల

దాహ పీడితునకు శీతల తటాక
మట్లు, రోగికి వైద్యునియట్లు, శిశిర
శీత పీడితునకు గిముభాతి, నేను
నాగరాజ, శరణ మయినాను నీకు,

ఇట్లు పలికి నీవు పొమ్మని వీడుకోలిచ్చెను. అతడు నాగభవనమునకు జనెను. రెండవనాడు గరుడభవనమునకు బోయి "నేను పండరక నాగుని ప్రతిజ్ఞ చేయించి, శ్రద్ధాళువును జేసి విడిచితిని. అతని చిత్తము నా యెడ నెట్లున్నదో పరీక్ష చేయుదును" అనుకొని నాగభవనముచేరి గరుడవాయువు విడిచెను. తనను పట్టుకొనుటకై గరుడరాజు వచ్చెనని నాగరాజు తలచి, తన శరీరము వేయిరెట్లు పెంచి రాలు యిసుక మ్రింగి భారము దాల్చి, తోక వాల్చి ఫణము పైకెత్తి, మీద పడి గరుడరాజును కరచువాని వలె నుండెను :

చూచి గరుడ రాజీ గాథ పలికెను :

అండజంబులతో సంధి యయ్యె నీకు,
కోరలను దెరచియె పండుకొంటి వేల ?
భయము నీ కెటనుండి సంప్రాప్త మయ్యె ?

విని నాగరాజీ గాథలు నలికెను :

శంకలో నుండవలయును శత్రులయెడ,
స్నిగ్ధులను గూడ గడు విశ్వసింపరాదు.
నిర్భయ స్థానమందుండి నెగులు పుట్టి
జీవనపు వేరు నాశము చేసివేయు.

జగడమాడిన వానిని శంక విడిచి
నమ్ముటెట్టులు ? వైరిని నమ్మ దగునె ?
వైరి ? సాశంకముగ నుండి తీరవలెనె ?

పరునకుం దాను విశ్వాస పాత్రుడగుచు
తాను వానిని నమ్ముట తగదు సుమ్ము.
ఒదులు నిజభావము గ్రహింప కుండునట్లు
ప్రాజ్ఞుడగువాడు వర్తింపవలయు నెపుడు.

ఇరువురును పంభాషించుచు, కలసిమెలసి శాంత చిత్తములతో అచేలకుని యాశ్రమమున కేగిరి. దీనిని ప్రకటించుచు శాస్త యిట్లనెను :

ఇరువురును పుణ్యవంతులు నేకశరీరు,
లధిక సుకుమార రూపులు, సమరవర్ణు,
లశ్వము, రథమ్మువలె నొక్కటైన వారు,
ఆ యచేలకు పొంతకు నరిగినారు.

అంత నచేలకు నంతికమ్మునకు
పండరకుం డేగి పలికె నీ రీతి :
"అఖిల భీమ క్తుడ నైతి నీనాడు,
ఇంక నీ యెడ స్నిగ్ధమే నాయెడంద !"

అంతట నగ్నసాధు విట్లనెను :

గరుడుండు నాకు పండరకుని కంటె
అధికముగా నిష్టుడౌట సత్యమ్ము.
అనురాగ వశమున నాచరించితిని
తెలిసియే, దుష్కర్మ తెలియక కాదు.

విని నాగరాజీ గాథలు పలికెను :

ఇహ పరలోకాల యీ ఋణమ్మునను
ప్రియముగా గాని, అప్రియముగా గాని
కనిపింప దేదియు; కాని సంయతుని
వేషమ్ము ధరియించి విచరించు చున్న
వాడ వసంయుతువలె లోకమందు.

ఆర్య వేషాన అనార్యుడ వీవు,
సంయుత రూపి, వసంయుతుండవును.
కృష్ణస్వభావుడ వీ వనార్యుడవు !
చేసియున్నావు విశేష పాపములు !

ఇటు నిందించి శాపమిచ్చువాడై యీ గాథ పలికెను :

నిర్దోషి యగు వాని నీవు ద్వేషించి
కొండెముల్ చెప్పిన కూశవు, దుష్ట

జనుడవు, సత్యవజ్ర ప్రభావమున
పడుగా నీ తల యెరియును గాక !

ఈ విధముగా నాగరాజు సమక్షముననే నగ్నసాధువు శిరము నూరు ప్రక్కలయ్యెను. ఆతడు కూరుచున్న చోట భూమి నెర్రె విచ్చెను. అతడు నేలలో దిగబడి అవీచీనరకమునకు బోయెను. గరుడరాజు, నాగరాజు తమ తమ నివాసములకు బోయిరి.

సాధువు భూ ప్రవేశము పొందుటను ప్రకటించుచు శాస్త ఈ గాథ పలికెను :

అందుచే మిత్రు నెడల ద్రోహమ్ము తగదు;
లేదు దానిని మించు కిల్బిషమె : ఇంద్రు
వాక్యమును బట్టి కాదె సంకరుడు మడిసె !

శాస్త యీ ధర్మోపదేశము చేసి, "భిక్షువులారా, దేవదత్తు డిప్పుడే కాదు, పూర్వము కూడ అసత్యము పలికి భూ ప్రవేశము చేసెను" అని జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున అచేలకుడు దేవదత్తుడు; నాగరాజు సారిపుత్రుడు; గరుడరాజు నేనే.

———:():———

# 519. సంబుల జాతకము

శాస్త జేతవనమున విహరించుచు మల్లికాదేవి విషయమై చెప్పినది.

## వర్తమాన కథ

కథావస్తువు కుమ్మాసపిండ జాతకమున వచ్చినది. ఆమె మూడు కూష్మాండములు దానము చేసిన ప్రభావమువలన ఆనాడు రాజుకు పట్టపు దేవి యయినది. ఆమె పతిభక్తి నగర మంతటను వ్యాపించెను. ఒకనాడు ధర్మసభలో ఇష్టాగోష్ఠి జరుగుచుండెను. "ఆయుష్మంతులారా, మల్లికాదేవి వ్రతనిష్ఠయు, పతిభక్తియు కలది" అనుచుండిరి. అప్పుడు శాస్త యచటికి వచ్చి సంగతి తెలిసికొని, "భిక్షువులారా, కేవల మిప్పుడే కాదు; పూర్వము కూడ మల్లిక పతిభక్తిపరాయణ" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తనరేశునకు సోత్థిసేను డను పుత్రు డుండెను. అతనికి వయసు వచ్చినంతనే రాజు వానిని ఉప రాజును జేసెను. అతనిభార్య సంబుల పట్టపుదేవి. ఆమె రూపవతి. ఆమెశరీర ప్రభ గొప్పది. వాయురహిత ప్రదేశమున వెలుగు దీపశిఖవలె సంబులాదేవి కానవచ్చుచుండెడిది.

కొంతకాలమునకు సోత్థియసేనుడు కుష్ఠరోగి యయ్యెను. వైద్యులు చికిత్స చేయ లేకపోయిరి. వ్యాధివలన శరీరమున వగుళ్ళు చూపినపు డతనికి విచారము కలిగినది. "రాజ్యము చేకొని నే నేమి చేయుదును? అరణ్యము నకు బోయి అనాథునివలె మృతి నొందెదను'. అనుకొని యతడు రాజుకు సూచన చేసి, రాణివాసమును విడిచెను. సంబులను వివిధవిధముల నాప జూచెను; కాని యామె వినక "అరణ్యమున నా స్వామికి సేవ చెసెదను" అని అతనివెంటనే చనెను. వా రడవికి బోయి, కందమూలఫలములు సులభ

ముగా లభించునట్టియు, జలము, వృక్షచ్ఛాయయు బాగుగా నున్నట్టియు తావున పర్ణశాల నిర్మించుకొని నివసింపజొచ్చిరి. రాజకుమారి యాతనికి సేవలు చేయుచుండెను. ఎట్లు ? ఆమె ప్రాతఃకాలముననే ఆశ్రమ మూడ్చి, స్నానపానములకు తగు నీరు తెచ్చిపెట్టి, పల్లు దోముపుల్ల యిచ్చి. దంత ధావనానంతరము నానావిధౌషధులు నూరి గాయములమీద పూయును. అతడు మధురఫలాదు లారగించినపిదప ప్రక్షాళనోదక మిచ్చి "స్వామీ, అప్రమత్తులై యుండుడు" అని చెప్పి, బుట్టయు, పలుగును బట్టుకొని కంద మూలాదులు త్రవ్వి తెచ్చి, ఒకమూల నుంచును. మరల నీరు తెచ్చి నానా విధ చూర్ణములతో, మృత్తికలతో నతనిని స్నానము చేయించి, మధురఫలా దుల నెదుట బెట్టును. భోజనానంతరము సుగంధజల మిచ్చును. కర్ర బెరళ్ళు తెచ్చి శయన మమర్చి, అతడు పండుకొన్నపిదప కాళ్ళు కడిగి ఒడలు పట్టి, నొక ప్రక్కగా పరుండును. ఈ విధముగా నామె పతికి ఉపచారములు చేయు చుండెను.

ఒకనా డామె ఫలములు తెచ్చుచు గిరికందరము చూచి నెత్తిపై బుట్ట క్రిందికి దింపి, స్నానము చేయదలచి దిగి, శరీరమున పసుపు రాచుకొని స్నానము చేసి, పైకి వచ్చి వల్కలములు ధరించి కందరతటమున నిలిచి యుండెను. ఆమె శరీరకాంతి కాననమున వ్యాపించెను. ఆ సమయమున నొకానొక దానవుడు ఆహారము నన్వేషించుచు నామెను చూచి ఆసక్త చిత్తుడై యీ గాథలు పలికెను :

ఓసి, చక్కనిపిక్కల యువతి, నిలిచి
కందరపుటంచునన్ గడుకంపమునను
నీట పాదంబు పెట్టగా నేర, వదుగు
దేమి నీపేరు ? బందుగు లెవరు నీకు ?

సింహ శార్దూల వనమృగ సేవిత మగు
కాననంబున కెంతయు కాంతి నొసగు
మధ్యమాకార, యెవ్వనిమహిళ వీవు ?
దానవుడ నేను, కల్యాణి, దండ మిడుదు !

ఆమె వానివాక్కులు విని యీ గాథలు పలికెను ;

సోత్థిసేనుని భార్యను, సూను డతడు
కాశిరాజునకున్, ఖ్యాతి కలుగువాడు,
సంబులను, నీకు నానమస్కార మయ్య !

శుభ మగుత నీకు ! వైదేహసుతుడు రోగి
కాననంబున నుండు నొక్కండె, నేను
సైత మొకతనె, పరిచర్య సలుపుదాన.

వెదకి తెత్తును కందముల్, వేళ్ళు, పండ్లు,
మధువు, వ్యాఘ్రాదికము వీడు మాంసఖండ
ములను, భుజియించు నాతడు మోదమునను
నేడు మ్లానిమ గాంచుట నిక్కువంబు.

దానవు డిట్లనెను :

రాజసుతునకు, రోగి, కరణ్యమందు
సంబులా, ఫల ముండునె సలుప సేవ ?
నీకు పతి నయ్యెదను, నన్ను స్వీకరించు.

సంబుల యిట్లనెను :

దుఃఖితకు, శోకతప్తకు, దొడ్డరూప
మమరు టెట్టులు ? నాకన్న నధికరూప
వంతురాలి నన్వేషింప వలదొ నీవు ?
ఓయి దానవ, శుభము నీకొదవు గాక !

దానవు డిట్లనెను :

పర్వతము నెక్కి రమ్మ నాపార్శ్వమునకు,
నాల్గువందల భార్య లున్నారు నాకు.
సర్వవాంఛలు తీర్పగ జాలుదాన !
ఎల్లరకు తలమానిక మీ వగుదువు.

పసిడి వన్నియదాన, మానసమునందు
మెలగుకోర్కుల దీరుప గలను నేను.
కలదు వస్తుసంభార మఖండముగను
నేడు రమియింపవలయు నాతోడ నీవు.

పట్టమహిషీత్వ మొల్లని పక్షమందు
సంబులా, అయ్యెదవు నాకు చలిదిముద్ద.

శాస్త్ర యిట్లనెను :

మిట్టవన్నులు గల్గు నట్టి రాక్షసుడు,
సప్తజటలవాడు, సంబుల నపుడు
పాపపాశంబుల బట్టుకొన్నాడు-
కానలో రక్షకుల్ లేనట్టిదాని.

లుబ్ధకుండు, పిశాచి, లోలుపుండైన
పరునిపాపాల జిక్కుపడినదే యయ్యు
సంబుల భర్తనే స్మరియించుచుండె.

నను రక్కసుడు మ్రింగు ననెడిదుఃఖమ్ము
లేశమాత్రంబైన లేదు నా, కైన
ఆర్యపుత్రునిమన స్సన్యథా పోవు
ననెడిదుఃఖము మాత్ర మత్యధికంబు.

ఈమె శీలమున శక్రభవనము కంపించెను. పాండుకంబళ శిలాసనము వేడి యెక్కెను. శక్రుడు ధ్యానమున తత్కారణము గ్రహించి, వజ్రము చేబూని, శీఘ్రముగా వచ్చి దానవుని శిరముపై నిలిచి యీ గాథ పలికెను :

శాంతురాలు, యశస్విని, జ్వలనతుల్య,
అతివమిన్న, పతివ్రత యైన యీమె
నీవు రాక్షస, భక్షింతువేని యిపుడె
నిక్కముగ నీశిరం బేడు వ్రక్క లగును!
అడ్డగింపక విడువు మీ దొడ్డసతిని.

విని దానవుడు సంబులను విడిచిపెట్టెను. వాడు మరల వచ్చి ఈమెను బాధించు నేమో యని శక్రుడు దానవుని దేవబంధనమున బంధించి, మూడు పర్వతములు దాటించి విడిచెను. అప్రమత్తురాల నై యుండు మని రాజకన్య కుపదేశ మిచ్చి, నిజస్థానమున కరిగెను. రాజకన్యయు సూర్యాస్తమానము పిదప చంద్రునివలె ప్రకాశించుచు ఆశ్రమము చేరెను.

ఈ యర్థమును ప్రకాశింప జేయుటకై శాస్త ఈ గాథలు పలికెను :

ముక్తురా లయి యాశ్రమమునకు జేరె
దూడకై గోవు గోష్ఠంబు దూరునట్లు
ఫలినము కులాయముం జేరుపగిది నామె.

రక్షణ కాన కరణ్యంబునందు
సంబుల విలపించెను : "శ్రమణ విప్రులకు
ఆచార్యఋషులకు నాచరించెదను
వందనంబులు!- రాజవల్లభుం డిచట
లేకుండుటచే మీరలే శరణంబు !

తృణలతాదులకును, వనశైలములకు
వందనంబులు ! రాజవల్లభుం డిచట
లేకుంటచే మీరలే శరణంబు.

నదులను గ్రహించు నట్టి గంగమ్మ
వందనంబులు !.......

తృణలతాదులకును వనశైలములకు
వందనంబులు !......

ఇందీవరంబుల చందాన శ్యామ,
తారకామాలికాధారిణి, రాత్రి,
వందనంబులు !.......

సకలపర్వతముల సార్వభౌముండు
ఎత్తునె త్తము కల్గు హిమవంతునకును
వందనంబులు !......

ఆమె విలపించుట విని సోత్థిసేనుడు తనలో "ఈమె మిగుల విలపించుచున్నది. ఈమెభావ మేమో తెలియదు. నాయెడ స్నేహభావముతో నిటు చేయుచున్నచో ఈమె గుండె లవియును. ఈమెను పరీక్షింతును" అనుకొని, పోయి పర్ణశాలాద్వారమున గూరుచుండెను. ఆమె యేడ్చి మొత్తుకొనుచు పర్ణశాలాద్వారము చేరి, ఆతని పాదములు పట్టుకొని "దేవా, యెచటికి పోతిరి ?" అని యడిగెను. "భద్రే, అనుదినము నీ వింత యాలసించెడిదానవు కావు. నేడు ఇంత చీకటి పడినతరువాత వచ్చినావు" అని ప్రశ్నించువాడై యీ గాధ పలికెను :

రాజపుత్రి యశస్విని, రాత్రి యెంతొ
ప్రొద్దుపోయెను ! కారణ మెద్ది ? భర్త
కన్న ప్రియతము డెవ రేని కానబడెనె ?

"దేవా, నేను కందమూలఫలాదులు తెచ్చుచుంటిని. దానవుడు చూచి ఆసక్తచిత్తుడై నాచేయి పట్టుకొని తనమాట విననిపక్షమున నన్ను మ్రింగుదు ననెను. ఆ క్షణము జ్ఞప్తికి రాగా ఇట్లు విలపించుచున్నాను" అని యామె ఈ గాధ పలికెను :

నన్ను శత్రువు పట్టుకొన్నపుడు గూడ
తలచుచుంటిని నిట్టు లీదానవుండు
భక్షణము చేయు ననియెడి బాధ లేదు :
మీర లే మందురో యని మెండుబాధ.

ఆమె మిగిలిన విషయ మంతయు నివేదింప దలచి యిట్లనెను : "దేవా, ఆ దానవుడు నన్ను పట్టుకొన్నపుడు విడిపించుకొన లేకపోతిని. అంతట నేను దేవతలను నిందింప సాగితిని. అపుడు శక్రుడు వజ్రహస్తుడై ఆకాశమున నిలిచి దానవుని బెదరించి నన్ను విడిపించి, వానిని దేవబంధమున బంధించి మూడవపర్వతమున కావల విసరివైచి వెడలిపోయెను. ఇట్లు శక్రుని

దయవలన నా ప్రాణములు దక్కినవి.'' విని సోత్థిసేనుడు "భద్రే, కావచ్చును. స్త్రీలు సత్యవాదిను లగుట దుర్ఘటము. హిమాలయమున చాల మంది వనచారులు, తాపసులు, విద్యాధరులు మొదలగువా రుందురు. నిన్ను విశ్వసించువా రెవరు ?'' అని ఈ గాథ పలికెను :

నీట జొచ్చిన మత్స్యంబువాట మట్లు
మరగి చౌర్యము, తెలివితో దిరుగు వనిత
భావమున్ గ్రహియించుట బహుకఠినము :
అందు సత్యము దుర్లభం బగును సుమ్ము !

ఆ వాక్కులు విని రాజకన్య "ఆర్యపుత్రా, నీవు నన్ను నమ్ముట లేదు. నా సత్యబలముచే నీకు చికిత్స కావింతును'' అని ఘటమునిండ సలిలము గొనివచ్చి, యాతనిశిరముపై నీరు చిలుకుచు ఈ గాథ పలికెను :

నీకన్న ప్రియతము నే జూడలేదు
నా సత్యవాక్కులు నన్ను రక్షించు !
వ్యథపెట్టురోగమ్ము వదలుత నిన్ను
మత్సత్యవాక్కుల మహిమమూలమున !

ఈ విధముగా నామె సత్యక్రియ చేసి, నీరు చిలికినంతనే యతని కుష్ఠురోగము చింతపండుతో తోమిన రాగిచెంబు చిలుము పోయినట్లు అదృశ్యమయ్యెను. వారచట కొలదిదినము లుండి, యావల నడవి విడిచి, వారాణసి చేరి, యుద్యానవనమున ప్రవేశించిరి. ఈ వార్త తెలిసినంతనే రాజుద్యానమునకు జని సోత్థిసేనుని శిరముపై రాజచ్ఛత్రము పట్టి సంబులాదేవిని పట్టపుదేవిని చేసెను. ఆవల వారిని నగరమునకు గొనిపోయి రాజ్యమిచ్చి తాను ఋషిప్రవ్రజ్య గ్రహించి ఉద్యానమున నివసింపజొచ్చెను. నియమప్రకారముగా రాజభవనమునుండి వచ్చుభోజనము గ్రహించుచుండెను. సోత్థిసేనుడు సంబులను నామమాత్రముగా పట్టపుదేవిగా పరిగ్రహించెను కాని ఆమెకు ఆదరసత్కారములు ఏమాత్రములేవు.ఆమె కున్నను,

లేకున్నను ఒకటే. కాని రాజు అన్యస్త్రీలతో కలిసియుండుట వల్ల ఆమెకు సవతికోపము కలిగి, పాలిపోయి అస్థిపంజరమువలె నుండెను. ఒకనా డామె వినోదార్థము వచ్చిన శ్వశురతపస్వికడకు జని ఆయన భోజనము చేసినపిదప ప్రణామము చేసి ఒకప్రక్క నిలుచుండెను. ఆమె మ్లానముఖము గాంచి మామ ఈ గాథ పలికెను :

పదువందల యేన్గు లెల్ల వేళలను
పదునారు నూర్ల చాపమ్ముల వారు
రక్షించుచుండ వారాణసి, యెట్టి
వైరి గన్గొని మ్లానవదన వైనావు ?

విని "దేవా, తమపుత్రుని వ్యవహారము పూర్వమువలె లేదు" అని ఈ గాథలు పలికెను :

సరసీరుహమువంటి చర్మంబు కలుగు
వారిని, హంసరవంబుల వారి
అతుల భూషణ విభూషితలైనవారి
కామినీజనులను గాంచు నాథుడు
వారలగీతముల్ వాక్కులు వినుచు
వెనుకటివలె నన్ను నీక్షింప డిపుడు.

అచ్చరలకునుండు నంగసౌష్ఠవము
చక్కదనంబును, సకలభూషలును
కలిగిన క్షత్రియకన్యకా మణులు
చాలమంది లభింత్రు శయనీయమునకు.

వెనుకటివలె నేను విపినమ్మునందు
కందమూలఫలాదికంబుతో నతని
కుపచర్య చేయుచు నున్నపక్షాన
ఆదరంబైన ననాదరంబైన
గణియింపక ఈస్థితికన్న మేలదియె.

నిండుగా నన్నపానీయంబు లున్న.
ధరియింప నెన్నొ యాభరణము లున్న,
పతికి నప్రియ యైనపజూన యువతి
శ్రేష్ఠంబు మరణంబు జీవించుకంటె.

ధనము లేనిది యైన, దయనీయ యైన
అతినీల యైనను పతియనురక్తి
పాత్రురా లైనచో, పతిరక్తి లేని
సౌందర్యపతికన్న చాల శ్రేష్ఠంబు.

తపస్వి ఆమెమాటలు విని రాజును పిలువనంపి "నాయనా, సోత్థి సేనా, నీవు కుష్ఠురోగముతో బాధ పడుచు అడవిలో నున్నపుడు ఈమె నీవెంట వచ్చి నీకు పరిచర్యలు చేసి, సత్యబలముచే నీవ్యాధి నయము చేసి మరల రాజ్యప్రతిష్ఠితుని చేసినది. ఇప్పుడు నీవు ఈమె యెక్కడనుండునో కనుగొన నైన కనుగొనవు. నీవు చేసినది అనుచితము, మిత్రద్రోహము, పాపకర్మ" అని పుత్రున కుపదేశ మిచ్చువాడై ఈ గాథ పలికెను :

పురుషహితైషిణి తరుణియె యరుదు,
తరుణీహితైషియౌనరుడు దుర్లభుడు.
నీమేలు కోరెడి నిర్మలచరిత
సంబుల నీభార్య, జననాథ, నీదు
ధర్మప్రవర్తన తగు నామెయెడల.

తపస్వి ఈ విధముగ పుత్రున కుపదేశ మిచ్చి లేచి వెడలిపోయెను. తండ్రి వెడలిన పిదప రాజు సంబులను పిలువనంపి "భద్రే, నేటివరకు నేను చేసిన అపరాధముక్షమింపుము. నేటినుండి సమస్తైశ్వర్యములు నీకు సమర్పించు చున్నాను" అని ఈ గాథ పలికెను :

ఇంతసంపద పొంది యీర్ష్య లేకుండ
వర్తించుచో నీవు, వనితలతోడ
నే నెరవేర్తును నీయానతులను.

నాటినుండి యిరువురును కలిసి మెలిసి దానాది పుణ్యకార్యములు చేయుచు కర్మానుసారముగా కాలక్రమమున పరలోకమున కేగిరి. తపస్వి ధ్యానాదులు పొంది బ్రహ్మలోకమునకు జనెను.

శాస్త ఈ ధర్మదేశనము చేసి "భిక్షువులారా, ఇప్పుడే కాదు, పూర్వముకూడ మల్లిక పతిని దేవతగా భావించెడిది" అని జాతకములు సరి పోల్చెను. ఆ కాలమున సంబుల మల్లిక; సోత్థిసేనుడు కోసలనరేశుడు; రాజ తపస్వి నేనే.

—[o]—

# 520. గండతిందు జాతకము

శాస్త్ర జేతవనమున విహరించుచు, "రజోవాదము"ను గూర్చి చెప్పినది. దీని వర్ణనము పూర్వమే వచ్చినది.

## అతీత కథ

పూర్వకాలమున కంపిల్ల రాష్ట్రమున ఉత్తర పాంచాల నగరమున పాంచాల నామకుడగు రాజు అనుచితమార్గము ననుసరించి అధర్మము వలన ప్రమత్తుడై రాజ్యపాలనము చేయుచుండెను. అమాత్యాదులు గూడ అధార్మికులైరి. పన్నులబాధ పడలేక రాష్ట్రవాసులు కుటుంబములతో కూడ అడవులలో వన్యమృగములవలె నివసించుచుండిరి. పశువులు ఉండవలసిన తావులలో నుండుటలేదు. జనులు రాజపురుషుల వలని భయముచే పగటివేళ గృహములలో నుండక, ఇండ్లచుట్టును ముండ్లకంపలు వేసి సూర్యోదయ మైనంతనే అడవిలోకి పోయి దాగుకొనుచుండిరి. పగటివేళ రాజపురుషులును, రాత్రివేళ చోరులును ఇండ్లు దోచుచుండిరి.

ఆ కాలమున బోధిసత్త్వుడు నగరము వెలుపల గండతిందుక వృక్షదేవత యయ్యెను. రాజు ప్రతి సంవత్సరము వేయి నాణెములు వెచ్చించి వృక్షదేవతకు బలిపూజాదులు చేయుచుండెను. వృక్షదేవత తనలో ఈ "రాజు అపమార్గమున పరిపాలన చేయుచున్నాడు. రాష్ట్రమంతయు నష్టమగుచున్నది. రాజును సక్రమ మార్గమున పెట్టగలవారు నాకన్న వేరుగా లేరు. ఈతడు ప్రతి వత్సరము వేయి ముద్రలు వెచ్చించి బలి పూజాదులు చేయుచున్నాడు. కావున ఈతడు నా కుపకారి. ఈతని కుపదేశ మిత్తును" అనుకొనెను.

ఆవల వృక్షదేవత రాత్రివేళ రాజు శయనాగారమునకు బోయి అతని తలవైపున నిలిచి కాంతి వెదజల్లుచు ఆకసమున నిలిచి యుండెను. బాలసూర్యునివలె వెలుగుచున్న దేవతను చూచి రాజు "నీ వెవరవు ? ఏల వచ్చి

తివి ?'' అనెను. ''మహారాజా, నేను గండతిందుక వృక్షదేవతను. నీ కుప దేశమిచ్చుటకై వచ్చినాను" ''ఏమి యుపదేశ మిత్తువు ?" ''మహారాజా, నీవు ప్రమత్తతతో పరిపాలనము చేయుచున్నావు. కావున రాజ్యము నష్ట మగుచున్నది. రాజు ప్రమత్తతతో పరిపాలనము చేయునెడ రాష్ట్రమున కంతకును స్వామియుండడు. అట్టి రాజు ఈ జన్మమున వినాశము పొంది, మరణానంతరము మహానరకమున పుట్టును. అతడు ప్రమత్తుడైనచో ఆతని అంతరంగికులు, లోకులు, ప్రమత్తులై పోదురు. కావున రాజు విశేషముగా అప్రమత్తుడై యుండవలయును'' అని వృక్షదేవత ధర్మోపదేశ స్థాపన చేయుచు ఈ గాథలు పలికెను :

అమృత పదంబగు నప్రమాదంబు,
ఇంక ప్రమాదంబో మృత్యుపదంబు.
మరణంబు లే దప్రమత్తులౌ వారి,
కిక ప్రమత్తు లనంగ మృత్యులతో సములు.

మదమూలముననె ప్రమాదంబు పుట్టు
దానిచే గల్గును హాని, తద్దాన
కలుగును దోషముల్ : కాన ప్రమాద
పతనంబు భరతర్షభా, అయుక్తంబు.

ఎందరో కోలుపోయిరి రాష్ట్రములను
ధనసంచయము ప్రమాదమున క్షత్రియులు,
గ్రామముల్ పోయెను గ్రామముఖ్యులకు
నష్టము పొంది రనాగారికులును.

అఖిలభోగ వినష్టి యగును ప్రమత్త
ధరణీధవునకు; అధర్మాత్మ డంద్రు
రాజ్యవర్ధన, అన్యరాజులు వాని.

రాజ, కా దిద్ది పురాతన ధర్మ,
మెంతో ప్రమాదాని కీవు లోబడితి,

విట్టి రాష్ట్రింబున నెగబడి చోరు
లున్న దంతయు నాశ మొనరించినారు.

ధనధాన్యములు గాని, తనయులు గాని
మిగుల రప్పుడు. రాష్ట్రమే క్షయ మొంద,
సమసి పోవును సుమీ సర్వభోగములు !

క్షీణభోగుండైన క్షితిపాలు నప్పు
డాదరింపరు జ్ఞాతు లైనను, మిత్రు
లైన సుహృద్రాజు లైన నృపాల !

ఆశ్రితు లైనను- హస్తిపాలకులు,
రథిక పదాతులు, రక్షక భటులు—
క్షత్రియుగా వాని గణియింప లేరు.

దుర్మంత్రి సహితుండు, దుర్మేధసుండు
సంశయ హీనుండు, జడు, డైన వాని
జీర్ణనిర్మోక మాశీవిషం బట్లు
తప్పకుండగ సిరి త్యజియించి పోవు.

విహిత కర్ముని, కాలవేత్త, సతంద్రి
తుని, సర్వ భోగముల్ తుందిల మగును
ఉత్తమ వృషభ సంయుత గోవు లట్లు.

జ్ఞానాభివృద్ధికై జనపదంబునను
సంచరింపుము రాజ, సముచిత సరణి,
ననుసరింపుము కాంచు, చందందు వినుచు.

ఇట్లుపదేశ మిచ్చి "శీఘ్రముగా పోయి రాజ్యము సంబాళించు కొనుము. నాశము కానీయకుము" అని నిజస్థానము కరిగెను. వృక్షదేవత వాక్కులు విన్నంతనే రాజుకు వైరాగ్యము కలిగెను.

ఆతడు మరునాడు రాజ్యము అమాత్యుల కప్పగించి, పురోహితుని వెంటబెట్టుకొని, యుక్త సమయమున నగరపు తూర్పు వాకిట వెలువడి, యోజన దూరము పయనించెను. గ్రామవాసి వృద్ధుడు ముండ్లకంప తెచ్చి మూసిన గృహద్వారమున కడ్డువేసి, సకుటుంబముగా నెచటికో పోయి, సాయంకాలము రాజపురుషులు వెడలిపోవగా మరలి వచ్చెను. అతడు గొంతు కూర్చుండి కాలిలో దిగిన ముల్లు తీయుచు నిట్లనెను :

సంగ్రామమందు పాంచాలుండు బాణ
ఘాతమ్ముచే వ్యధ గాంచును గాక !
నేను కంటకముచే నేడు విద్ధుండ
నగుచు మహాపీడ నందుచున్నట్లు.

ఈ విధముగా నాతడు బోధిసత్త్వుని ప్రభావముచే రాజును దూషించెను. బోధిసత్త్వ గృహీతు డగుటచేతనే యాత డిట్లు చేసెను. మారువేషములతో రాజు, పురోహితుడును బయలు పడక ఆ సమయమున వానికడనే నిలిచియుండిరి. వాని వాక్కులు విని పురోహితు డీ గాథ పలికెను :

వృద్ధుండ వయినావు, వీక్షింప లేవు
బాగుగా రూపముల్, బలహీన మయ్యె
చూపు, కంటకము గ్రుచ్చుకొనిన యప్పుడు
తప్పేమిటో బ్రహ్మదత్తుని యందు ?

విని వృద్ధు డీ గాథలు పలికెను :

కంటకము గ్రుచ్చుకొనుట మార్గమ్మునందు
బ్రహ్మదత్తుని లోపమ్ము బయలు పెట్టె.
జనపదమ్ము లరక్షిత స్థానము లయి
దుష్ట బల పీడితమ్ములై నష్టమొందె.

మ్రింగుదురు రాత్రి చోరులు, మ్రింగుచుంద్రు
పన్నులం గుంజువారలు పగటివేళ,
మెండు రాష్ట్రమ్మునం దధార్మిక జనమ్ము.

భయము చెంగటనుండ, భయభీతులై
వారు కంపలు తెచ్చి వనములో నుండి
గుప్త కుటుల్ వేసికొనుచున్నారు.

విని రాజు పురోహితుని సంబోధించి "ముసలివాడు సరిగా పలికినాడు. దోషము మనదే. మరలిపోయి ధర్మానుసారముగా పరిపాలన చేయుదము" అనెను బోధిసత్త్వుడు పురోహితునిలో ప్రవేశించి ముందు నిలిచి "మహారాజా, ఇంకను చూత" మనెను. వా రన్యగ్రామము పోవుచు త్రోవలో వృద్ధురాలి గొంతు వినిరి. ఆమె పేదది, తన కన్యల సంరక్షణ భావముతో వారి నడవికి బోవవీక తానే పోయి కూరలు, కట్టెలు తెచ్చుచుండును. ఒకనా డామె చెట్టెక్కి చిగురు కోయుచు తల క్రిందులై క్రింద పడుచు, రాజు నిట్లు దూషించెను :

ఎప్పుడు మృతినొందు నీ బ్రహ్మదత్తు ;
డీతని రాష్ట్రాన నెల్ల కన్యకలు
భర్తలు లేకుండ బ్రదుకంగ వలయు !

పురోహితుడు నిషేధించుచు ఈ గాథ పలికెను :

ఓసి దుర్మార్గురాల, నీ యుక్తులెల్ల
ననుచితంబు లనర్థదాయకము, లెచట
వరుల కన్యలకుం గొనివచ్చు రాజు ?

విని వృద్ధురా లీ గాథలు పలికెను :

పలుక నేను దుర్భాషలు బ్రాహ్మణుండ,
పదపదార్థము లెరుగుదు బాగుగానె-
జనపదంబు లరక్షిత స్థానము లయి
దుష్ట బలపీడితమ్ములై నష్టమొందె.

వివిధ కష్ట భూయిష్ఠ జీవితమునందు
దారపోషణమే యెంతొ భారమయ్యె:
వరులు కన్నెల కెచ్చట దొరకగలరు ?

విని వారు 'సరిగా చెప్పుచున్నది' అని ముందరికి పోవగా, రైతు గొంతు వినబడెను. నాగలితో నేల దున్నుచున్న రైతు వృషభము చురుకైన ములికి దెబ్బ తగులుటచే భూమిపై కొరగుచుండెను. దానిపేరు శాలీయము. రైతు రాజును దూషించుచు ఈ గాధ పలికెను :

శక్తిచే నాహతుండయి సంగరమున
పడును గావుత నేలపై పుడమిరేడు-
తగుల గూడని చోటను తగిలి ములికి
పాప మీ యెద్దు పుడమిపై బడినయట్లు.

పురోహితుడు నిషేధించుచు నిట్లనెను :

క్రుద్ధు డయ్యెద వేల దుర్బుద్ధి, బ్రహ్మ
దత్తునెడ కారణము లేక ? తప్పు నీది !
ఐన దూషించుచున్నావు మానవేంద్రు.

విని యాత డీ గాధలు పలికెను :

కోపము యుక్తమే భూపతి యెడల !
జనపదంబులయందు సంరక్ష లేదు
బలిమిమై పన్నులు పట్టెడివారికి
పీడయు, చోరుల భీతి రాతిరుల-
వండి నాకై తిండి రెండవసారి
ఆడుది కొనివచ్చునంతలో, మర్మ
మున ఘాత ఘటియిల్లె ననరుహాంబునకు.

ఆవల వా రొకానొక గ్రామమున నిలిచిరి. మరునాడు ప్రాతఃకాలముననే దెబ్బతిన్న గోవు పాలవానిని తాపు తన్ని పాలతో గూడ పడవైచెను. వాడు బ్రహ్మదత్తుని దూషించుచు నిట్లనెను :

సంగరమందు పాంచాలుండు ఖడ్గ
హతిచేత తలక్రిందులై పడుగాక

ఈ దుగ్ధ పాత్రిక యీ దినమ్మునను
తలక్రిందు లైనట్లు తగిలి పాదంబు.

విని బ్రాహ్మణు డిట్లనెను :

పాల్పడ హింసకు పాలిచ్చు పశువె,
దీన నేమున్నది మానవేశ్వరుని
దోష ? మూరకె జేని దూరుచున్నావు.

బ్రాహ్మణు డిట్లు పలికిన పిదప నతడు మరల నీ గాథలు పలికెను :

బ్రాహ్మణా, నింద్యుండు బ్రహ్మదత్తుండు ;

చండ స్వభావాన మెండుగా పరుగు
వారు గోవుల పిండువారము కాము
బ్రాహ్మణా, పూర్వము, ప్రస్తుత మట్టి
యాలను బంధించి పాలు పిండుదుము
గోక్షీరముల బల్మి గోరువారలకు.

వారు సరిగా పలుకుచున్నారని వారు గ్రామము వీడి రాజ మార్గమున నగరమువైపు చనిరి. ఒక గ్రామములో పన్నులు వసూలు చేయువారు కత్తియొరలకై చిత్రవర్ణము కల ఆవు దూడను చంపి చర్మ మొలిచిరి. పుత్రశోకమున తల్లిగోవు గడ్డితినక, నీరు త్రాగక విలపించుచు నిటునటు తిరుగుచుండెను. దానిని జూచి గ్రామములోని పిల్లలు రాజును దూషించిరి :

కోల్పోయి బిడ్డను, కుందుచు నెండి
యిటు నటు దిరుగాడు నీ యావు వోలె
కోల్పోయి పుత్రుని కుందును గాక
పాంచాల రాజు శుష్కించి పోవుచును.

అప్పుడు పురోహితు డిట్లనెను :

ఎవ్వడి పశువైన నిటు నటు తిరుగు

చున్నను, వాపోవుచున్నను, బ్రహ్మ
దత్త మహీపాలు తప్పేమి దాన ?

అంతట గ్రామములోని పిల్ల లీ గాథలు పలికిరి :

బ్రాహ్మణా, అపరాధి బ్రహ్మదత్తుండు :

... ...

... ...

మెండు సుమ్మీ యధార్మికులు రాష్ట్రమున,
కాని పక్షమునందు ఖడ్గధారకును,
బలి యెట్టులయ్యెను పాల్ ద్రాగు దూడ ?

చక్కగా పలుకుచున్నారని వారు బయలు వెడలిరి. త్రోవలో ఎండిన చెరువులో కాకులు మండూకములను ముక్కులతో బొడిచి చంపి తినుచుండెను, బోధిసత్త్వుడొకానొక కప్పలో ప్రవేశించి, దానిచే రాజును నిందింప జేసెను :

పుత్రులతో యుద్ధభూమీ స్థలాన
పాంచాల నరపతి పడిపోవుగాక.
అటవీ నివాసుడనైన నన్నిపుడు
గ్రామ కాకమ్ములు కబళించునట్లు
తినుగాత పులుగు లాతని కళేబరము.

విని పురోహితుడు మండూకముతో సంభాషించుచు ఈ గాథ పలికెను :

సర్వ భూతములకు సంరక్ష రాజు
లీ లోకమున ఘటియింపనే లేరు,
నీవంటి వారల జీవముల్ పోవ,
మేదినీపతి యధార్మికుడు కాబోడు.

విని మండూక మీ గాథలు పలికెను :

నీవు ధార్మికుడవు కావోయి, క్షత్రి
యానుకూలమ్ముగా నాడితి విపుడు—

క్రొల్ల గొట్టెడివాని నెల్ల లోకులను
జననిందితు ప్రశంస సలుపుచున్నారు.

బ్రాహ్మణా, యిచట సత్వరి పాలనమ్ము
... ...

సాగి. రాష్ట్రమునందు శాంతి, సమృద్ధి
వరలెడు పథాన వాయస మగ్ర
పిండాలు బలులును మెండుగా దినుచు
ముట్టకేయుండు మాయట్టి ప్రాణులను.

రాజ పురోహితులు ఈ వాక్కులు విని 'అడవి జంతువులు కప్పవరకును మనను దూషించు చున్నవి' అనుకొని నగరమునకు బోయిరి. నాటి నుండి ధర్మమార్గమున పరిపాలన చేయుచు, బోధిసత్త్వుడు చెప్పినట్లు నడచుకొనుచు వారు దానాది పుణ్యకార్యములు చేయ జొచ్చిరి.

శాస్త్ర కోసల నరేశునకు ఈ ధర్మోపదేశనము చేసి, "మహారాజా రాజు అగతులపాలు కాక, ధర్మానుసారముగా రాజ్యము చేయవలెను" అని జాతకములు సరిపోల్చెను. ఆ సమయమున గండతిందుక వృక్ష దేవత నేనే.

———:():———

# 521. తేసకుణ జాతకము

శాస్త జేతవనమున విహరించుచు కోసల నరేశున కుపదేశించు రీతిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

ఆ రాజు ధర్మోపదేశము వినుటకై వచ్చినపుడు శాస్త అతనితో "మహారాజా, ధర్మానుసారముగా రాజు పరిపాలనము చేయవలెను. రాజులు అధార్మికులైనపుడు రాజపురుషులు కూడ అధార్మికు లగుదురు" అని నాలుగవనిపాతమున చెప్పినట్లు ఉపదేశ మిచ్చి, అగతిగమన దోషమును, అగత్యగమన లాభమును గూర్చి తెలిపి కామభోగములకు స్వప్నాదికము నుండి విస్తరపూర్వకముగా నిదర్శనము లిచ్చి ఇట్లు పలికెను :

మృత్యువునకు లంచ మిచ్చుట యైన
పెనగుట యేనియు, అనిసేత యేని
విజయ మేనియు లేదు; విధివిధానమున
పడకతప్పదు మిత్తివాత నెల్లరును.

ఇట్లు పలికి శాస్త పరలోకమునకు పోవువారికై తమ శుభకర్మల కన్న వేరేమియు ఆధారములు లేవనియు, క్షణభంగుర మగుసంసారము నెడ ఆసక్తి విడువవలె ననియు స్పష్టీకరించి, విభవము పొందుటకు అప్రమత్తులై యుండవలె ననియు నిరూపించి "బుద్ధుడు ప్రాదుర్భవింపకపూర్వము ప్రాచీనరాజులు పండితుల యుపదేశానుసారముగా నడచుచు ధర్మానుగుణముగా రాజ్యము చేసి దేవలోకమున కేగిరి" అని ప్రార్థించినపిదప పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వకాలమున వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండెను. రాజు ప్రార్థించినను కొడుకు కాని, కూతురు కాని కలుగలేదు.

ఒకనా డాయన చాలమంది యనుచరులతో ఉద్యానమునకు జని పగ లంతయు వేడుకలతో గడిపి మంగళసాలవృక్షము క్రింద ప్రక్క పరపించి కొలదిసేపు దానిపై బండుకొనెను. లేచినపుడు ఆతనిదృష్టి సాలవృక్షముపై బడెను. అందు పిట్టగూడు కానవచ్చెను. చూచినంతనే ఆయనకు ప్రీతి జనించెను. తోడనే రాజొకనిని బిలిచి "ఈ చెట్టెక్కి గూటిలో ఏమైన నున్నవో లేవో చూడు" అనెను. వాడు వృక్ష మెక్కి గూటిలో మూడుగ్రుడ్లున్నవని తెలియజేసెను. తోడనే బుట్టలో దూది పరచి అందు గ్రుడ్ల నుంచి మెల్లగా దిగి రమ్మని చెప్పెను. ఆ ప్రకారమే చేసి వాడు దిగినంతనే రాజు అమాత్యులతో ఇవి వేనిగ్రుడ్లు అనెను. "దేవా, మాకు తెలియదు. వేటకాండ్రకు తెలియును" అని వారు బదులు చెప్పగా ప్రభువు వెంటనే పిట్టలవాండ్రను పిలిపించి అడిగెను. "దేవా, ఒకటి గుడ్లగూబగ్రుడ్డు, రెండవది గోరువంకది, మూడవది చిలుకది" అని వారు విన్నవించిరి. "ఒకగూటిలో మూడురకముల పిట్టల యండము లుండునా?" "దేవా, చిత్తము! అపాయము లేనపుడు పెట్టిన అండములు సురక్షితముగా నుండును." రాజు సంతుష్టచిత్తుడై ఈ మూడు అండములు నా బిడ్డలే అనుకొందును అని తల పోసి వానిని ముగ్గు రమాత్యులకిచ్చి "ఇవి నా సంతాన మగును. వీనిని మీరు బాగుగా పెంచవలెను. గ్రుడ్లు చితికి పిట్టలు పైకి వచ్చినపుడు నాకు తెలుపవలెను" అని రాజు ఆనతిచ్చెను.

వారు వానిని చక్కగా కాపాడుచుండిరి. మొదట గ్రుడ్డు చితికెను. తోడనే అమాత్యుడు పిట్టలవానిని పిలిపించి. 'ఇది మగదా యాడుదా' అని యడిగెను. వాడు బాగుగా పరిశీలించి మగది అని చెప్పగా, అమాత్యుడు రాజసన్నిధి కరిగి "దేవా, తమకు పుత్రుడు లభించినాడు" అని విన్నవించెను. రాజు సంతుష్టచిత్తుడై ఆతనికి బహుధన మొసగి పుత్రుని బాగుగా పెంచి వేస్సంతరుడు అని పేరు పెట్టుమని సెలవిచ్చెను. ఆత డాప్రకారమే చేసెను.

తరువాత కొలదిరోజులకు గోరువంకగ్రుడ్డు చితికెను. అమాత్యుడు పిట్టలవానిని పిలువనంపి, వాడు ఆడుది అని చెప్పగా రాజసన్నిధికి పోయి "దేవా, తమకు పుత్రిక లభించినది" అని విన్నవించెను. రాజు సంతుష్ట

చిత్తుడై ఆయనకు ధన మొసగి నా పుత్రికను బాగుగా పెంచి కుండలిని అని పేరు పెట్టుమని వీడ్కొనెను. రాజు చెప్పినట్లే ఆతడు చేసెను.

కొలదిరోజులకు చిలుకగ్రుడ్డు చితికెను. అమాత్యుడు వేటకానిచే పరీక్ష చేయించి, అది మగ దని నిర్ధారణ అయినపిదప రాజసన్నిధి కరిగి "దేవా, తమకు పుత్రుడు లభించినాడు" అని విన్నవించెను. సంతుష్టచిత్తుడై రాజు ఆయనకు ధన మొసగి, నా కుమారునకు వైభవముతో పోషణ జరుపుము, జంబుకు డని పేరు పెట్టుము అని వీడ్కొలిచ్చెను. అమాత్యు డట్లే కావించెను. ఆ మూడుపిట్టలు ముప్వు రమాత్యుల మందిరములలో రాజ కుమారులవలె పెరుగుచుండెను. రాజు వారిని నా పుత్రులు, నా పుత్రిక అనుచుండెను. అమాత్యులు పరస్పరము నవ్వుకొనుచు "రాజుగారి చర్య చూడుడు. పక్షులను తనబిడ్డ లనుచు తిరుగుచున్నాడు!" అనుకొనుచుండిరి. రాజు తనతో "అమాత్యులకు వీని బుద్ధికుశలత తెలియదు. నేను ప్రకటీక రింతును" అనుకొనెను.

ఒకనాడు రాజు అమాత్యు నొకనిని వేస్సంతరునికడకు బంపి, "మీ నాయనగారు నిన్ను ఏవో అడుగగోరుచున్నారు. ఎప్పుడు రావొచ్చునో కనుగొని రమ్ము' అని పంపెను. అమాత్యుడు వేస్సంతరునికడ కరిగి నమస్కరించి, సందేశము తెలిపెను. నిజపోషకు డగు అమాత్యుని సంబోధించి వేస్సంతరుడు "మా నాయనగారు నన్నేవో అడుగదలచినారు. వా రిక్కడికి వచ్చినప్పుడు సమాదరింపవలెను. ఎప్పుడు రావచ్చు నని వారు కోరినారు" అనెను. "నేటి కేడవనాడు" అను మాటలు విని వేస్సంతరుడు వచ్చిన అమాత్యునకు ఇట్లు విన్నవించి వీడ్కొలిచ్చెను. ఆతడు చని ప్రభువునకు విన్నవించెను. ఏడవనాడు రాజు నగరమున చాటబంచి పుత్రుని నివాసమున కరిగి ఆతనిసత్కార మందుకొని అతనియింటనే భోజనము చేసి, మహానంద ముతో నిజనివాసమునకు మరలి వచ్చి, రాజాంగణమున పెద్దమంటపము సిద్ధము చేయించి, నగరమున మరల చాటబంచి, అలంకృత మంటపమునబహు జనమధ్యమున కూరుచుండి, వేస్సంతరుని కొనిరావలయు నని అమాత్యునకు సందేశ మంపెను. అమాత్యుడు బంగరుపీఠముపై వేస్సంతరుని కొనివచ్చెను. పిట్ట తండ్రియొడిలోనికి జేరి కొంచెము తడవు క్రీడించి మరల స్వర్ణాసన

ముపై వాలి కూరుచుండెను. ప్రభువు మహాజనసమ్ముఖమున పిట్టను రాజ ధర్మము లడుగువాడై ఈ గాథ పలికెను :

వేస్సంతరా, ప్రశ్న వేయుదు : నీకు
భద్రమయ్యెడుగాక ! పరిపాలనేచ్ఛు
లెట్టి కార్యము లాచరించుట మేలు ?

విని వేస్సంతరుడు ప్రశ్నమునకు సమాధానము చెప్పక, రాజు ప్రమత్తుడు కావచ్చు నను దోషారోపణము చేయువాడై యీ గాథ పలికెను !

కంసుతండ్రి ప్రమత్తుండు కాశిరాజు
ఎన్నడో పూర్వమం దడిగించినాడు
సూనుచే అప్రమత్తుండ నైన నన్ను.

ఇట్లు దోషారోపణము చేసి, "మహారాజా, మూడుధర్మములలో స్థిరుడై రాజు పరిపాలనము చేయవలెను" అని రాజధర్మము ఉపదేశించువాడై వేస్సంతరు డీగాథలు పలికెను :

అనృతమును, క్రోధమును, పరిహాస మాది
లో నివారించి కార్యముల్ పూనవలయు-
క్షత్రియా, దీని వ్రత మండ్రు జ్ఞానిభులకు.

తాను మును జేయుపని కనుతాప ముందు
తప్పకుండగ నన్నచో, దాని మరల
రాగమున, ద్వేషమున జేయరాదు బాబ !

రాజ్యవర్ధన, మత్తునిరాష్ట్రమందు
తొలగు భోగము, లాతని దుష్టు డండ్రు.

ఎవ్వ డుత్థానవీర్యుడో యెవ డసూయ
నెరుగడో, వానికడ నుండు మిర్వురమును
అనిరి శ్రీయును లక్ష్మియు నడిగినపుడు.

దుష్టహృదయు, డీర్ష్యాళువు, దుష్టకర్ము
డైనవానిని పెద్దమ్మ ఆశ్రయించు
సకలకల్యాణ భంజనశక్తి, రాజ !

సకల హితచింతకుండవు, సహృదయుడవు
నగుచు లక్ష్మీనివాసుడ వగుము రాజ !
పారద్రోలి అలక్ష్మిని దూరముగను.

శ్రీయుతుండును, సముదారచిత్తుడు, ధృతి
మంతుడగువాడు నిజశత్రుమండలమును
కాశీరాజ, సమూలమ్ము పెకల్చు.

శక్రు డైన, పరాక్రమశాలియెడల
నెట్టికష్టము తలపెట్ట, డిద్ధవీర్య
వంతు డగువాడు శుభకర్మ సంతరించు
చున్నయెడ ననురక్తుడై యుండు రాజ !

స్థిరచిత్తు డగురాజు దేవగంధర్వ
పితరుల రక్షలో విహితు డై యుండు.
అప్రమత్తుండు వీర్యాన్వితుం డైన
రాజును దేవతల్ రక్షింతు రెపుడు.

కాన, ననిందితకార్యముల్ చేయు
మప్రమత్తతతోడ : అలసప్రయత్న
కారికిసౌఖ్యముల్ కలుగవు రాజ !

ఇదె యనుశాసన, మిదియే వ్రతంబు
సఖులకు భద్రంబు, శత్రుసంతతికి
సంతాప మొసగగా జాలు నియ్యదియె.

బుద్ధునివలె వేస్సంతరు డిట్లు పలుకగా జనసమూహ మాశ్చర్యచకితమై బహువిధముల సాధువాదము చేసెను. రాజు ప్రసన్నుడై మంత్రులను పిలుపనంపి "అమాత్యులారా, నా కుమారుడు వేస్సంతరుడు చెప్పినది యెవరి

కాచరణీయము ?" అనెను. "దేవా, మహాసేనరక్షకునకు యోగ్యమైనది." "అగుచో ఇతనిని మహాసేన రక్షకపదవియందు నియోగింతును" అని రాజు అటులే కావించెను. వేస్సంతరుడు తంత్రిపనులు నెరవేర్చుచుండెను.

[ వేస్సంతర ప్రశ్న సంపూర్ణము ]

కొలదిదినముల కావల వెనుకటివలెనే కుండలినికడకు దూత నంపి, పడవనా డచటికి జని, మరలి వచ్చి, రాజు ఆ మంటపముననే గూరుచుండి కుండలినిని బిలిపించెను. బంగరుపీఠమున నాసీన యైన కుండలినిని రాజ ధర్మము లడుగువాడై రాజు ఈ గాథ పలికెను :

ప్రశ్నకు ప్రత్యుత్తరంబు నీయంత
ఈయ గల్గినశక్తియే యున్న, కుండ
లిని, క్షత్రియసహోదరీ, రాజ్యపాల
నేచ్ఛవు చేయుట యేవనుల్ మేలు ?

కుండలిని "నాయనగారూ, స్త్రీజాతి ప్రత్యుత్తరము చెప్పగలుగునా యని తమరు యోచించియుందురు. సమస్త రాజధర్మములను రెండుశబ్ద ములలో అంతర్గతము చేసి చెప్పుదును" అని యీ గాథలు పలికెను :

అప్రాప్తవస్తుసంప్రాప్తియు, ప్రాప్త
వస్తురక్షణ యనువాని రెండింటి
నాధారముగ నుండు నఖలప్రతిష్ఠ.

నీయమాత్యులయందు నేరుపుతోడ
పానము, ద్యూతము, వంచనలేని
వారల, యోగ్యుల, ధీరుల, నర్థ
కోవిదులను నేరికోవలె బాబ !

రథహయంబులను సంరక్షణ చేయు
నట్టిసూతుల బోలు నర్థరక్షకుల
చేతనే కార్యముల్ చేయింపవలయు.

ఆంతరంగికులనే అంతికమందు
నిలుపుకోవలయును; నిధిలోన ధనము
వేయుట, తీయుట స్వీయకార్యములు-
అన్యవాక్కులబట్టి యాచరింపకుము.

ఆదాయమును, వ్యయం, బాదరణీయ
సంభావనము, దండ్యజన దండనమ్ము
స్వయముగా నొనరింపవలయు కృత్యములు.

స్వయముగా జనపదవాసుల కీవు
ధనమార్గదర్శకత్వము వహింప
నప్పు, డధార్మికు లౌ కరగ్రాహు
లర్థ, రాష్ట్రవినాశ మాచరించెదరు.

త్వరపడగూడదు తాను కృత్యముల,
పెరవారలం ద్వరపెట్టగా రాదు;
శీఘ్రమ్ముగా పనుల్ చేయుమూర్ఖుండు
ఆవల పరితాప మందగా వలయు.

కావల దెన్నండు నీవు క్రుద్ధుడవు
ఒడలుపై నెరుగక; చెడిపోయినారు
కులవంతు లౌవారె క్రోధవశాన.

సర్వాధికారినన్ సంభ్రమమ్మునను
కాబోకుమి అనర్థకారి వస్త్యులకు,
నారీజనులకైన నరులకునైన
ఘటియిల్లరాదు దుఃఖమ్ము నీవలన.

కామానుసారి యాభూమీశుభోగ
సంజాత మంతయు నమసియెపోవు
అన్యరాజులు వాని నందురు పాపి.

కావున నిది నీకు కర్తవ్య మగును,
అనుశాసనముగూడ నగును నీ కిద్ధి.
కావించుచును పుణ్యకార్యంబు లింత,
దక్షుండ వగుచు. బాధలుపెట్ట కొరుల,
మానుచు మద్యంబు, మంచియాచార
ముల ననుష్ఠింపుము; మూర్ఖుండు పోవు
నరకమ్మునకు దురాచరణవశాన.

రాజు సంతుష్టచిత్తుడై అమాత్యులను బిలిచి "అమాత్యులారా, నా పుత్రిక కుండలిని చెప్పినది ఎవరికర్తవ్యము ?" అని యడిగెను. "దేవా, ఖజాంచీ కర్తవ్యము" అని వారు చెప్పగా రాజు "అట్లయినచో ఆమెను అర్థమంత్రిపదవియందు నియోగింతును" అని ఆ పదవి యామె కిచ్చెను. నాటినుండి యామె తండ్రిపనుపు నెరవేర్చుచుండెను.

[కుండలినీ ప్రశ్న సంపూర్ణము]

ఆ తరువాత కొలదిరోజులకు రాజు వెనుకటివలెనే జంబుక పండితుని కడకు దూతను బంపి, యేడవనాడు అచటికి బోయి, ఆనంద మనుభవించి వచ్చి, మంటపమధ్యమున గూరుచుండెను. అమాత్యుడు జంబుకపండితుని బంగరుపీఠమున నునిచి శిరముపై మోసి తెచ్చెను. జంబుకపండితుడు తండ్రి యొడిలో వ్రాలి, క్రీడించి, మరల స్వర్ణపీఠమున జేరెను. అతనిని ప్రశ్నించువాడై రాజు ఈ గాథ పలికెను :

వేస్సంతరుని ప్రశ్న వేసినవాడ,
అట్లు కుండలినిని అడిగినవాడ,
బలములం దుత్తమబల మేదో యిపుడు
జంబుకా, వివరింపు చక్కగా మాకు.

సామాన్యులవలె గాక విశేషరూపమున రాజు తనను ప్రశ్నించె నని తలచి జంబుక పండితుడు "అట్లయినచో ప్రభూ, సావధానముగా వినుము. అంతయు వివరింతును" అని చాపినచేతిపై వేలకొలది నాణెముల సంచిని నిలువువిధమున ధర్మోపదేశము ప్రారంభించెను :

బలము లోకంబున పంచవిధంబు :
భూరినిమ్నంబు శారీరకబలము,
అగును రెండవది భోగ్యద్రవ్యబలము
ప్రభువరేణ్యా, అమాత్యబలము మూడవది
ఆభిజాత్యం బగు నావలిబలము
విబుధులు గ్రహియింత్రువీని నన్నిటిని.

ప్రథమగణ్యం బగు ప్రజ్ఞాబలంబు
ప్రజ్ఞాబలాన్విత పండితోత్తముడు
సకలార్థసంగ్రహ శక్తిమంతుండు.

ఒకవేళ మందబుద్ధికి ధనధాన్య
పరిపూర్ణ మౌభూమి ప్రాప్తించె నేని
ఆయనిచ్ఛకు బట్టి, అభిభూతు జేసి
ప్రజ్ఞ కల్గినవాడు బల్మి హరించు.

ఆభిజాత్యము కల్గి నట్టిక్షత్రియుడు
వంశపరంపరా ప్రాప్త రాజ్యంబు
నైనను ప్రజ్ఞావిహీను డైనపుడు
కనుగొనలేడు యోగక్షేమములను.

ప్రజ్ఞచే వినబడువాక్కు నిర్ణయము,
ప్రజ్ఞచే కీర్తి ప్రపంచిత మగును.
బాధాపరంపర పైకొనువేళ
నైతము ప్రాజ్ఞుండు శాంతితో నుండు.

ప్రజ్ఞ బహుశ్రుత పరిచర్య చేయ
కెవ్వని కేనియు నెట్లు లభించు ?
మరి ధర్మబోధ మే తెరగున నగును ?

ఎవడు ధర్మవిభాగ మెరిగి సకాల
మందు లేచుచు నిద్ర ఆలసింపకయ
చేయు కర్మలు, వాడు సిద్ధిని గాంచు.

ఎవడు దురాచారు లవువారితోడ
సాంగత్య మొనరించి, స్వయముగ మంచి
యాచారముల నెన్న డనుసరింపండో
వానికర్మలు ఫలప్రదములు కావు.

అధ్యాత్మచింతనమందు మనస్సు
నిల్పి, పొందుచును తన్నిష్ఠాత్ము లైన
వారి సంగతి, సదాచారు లైనట్టి
వారికర్మలు ఫలవంతంబు లగును.

కరణీయశక్తి, సంగ్రహణసంరక్ష-
పాలించుచుండుమీ బాబ, యీ జంట
అడగు దుర్కర్మల నఖిలవైభవము,
కూలిపోవును గడ్డికొంప విధాన.

ఈ విధముగా బోధిసత్త్వుడు పంచబలముల వర్ణనము చేయువాడై ప్రజ్ఞాబలమును చంద్రమండలమువర కెత్తుచు ఈ గాథలద్వారా రాజున కుపదేశ మిచ్చెను :

తల్లిదండ్రులయెడ ధర్మంబు నెరప,
క్షత్రియా, లభియించు స్వర్గపదమ్ము.

దారపుత్రులయెడ ధర్మంబు నెరప
క్షత్రియా, లభియించు స్వర్గపదమ్ము.

నీదు మిత్రామాత్య నివహంబునెడల
భవదీయ వాహనబలముల యెడల
నీదుగ్రామంబుల నిగమాలయెడల
శ్రమణ భూమీసుర సంఘాలయెడల
పశువులయెడలను పక్షులయెడల
కరణీయముల నెల్ల కావించునెడల
క్షత్రియా, లభియించు స్వర్గపదమ్ము.

అగు సుఖదాయి ధర్మాచరణమ్ము
స్వర్గమునకు జేరువాడ వద్దాన.
ధర్మముచేతనే ధాత, శక్రుండు,
దేవతల్ పొందిరి దివ్యలోకములు.

ఇట్లు పలికి ఇంకను ఉపదేశ మిచ్చువాడై జంబుక పండితు డీగాథ పలికెను :

ఇదె యనుశాసన, మిదియే వ్రతంబు
శుభకర్మలను చేయుచుండుము, కమ్ము
సర్వవేత్తవు ప్రాజ్ఞసాంగత్యమునను.

ఇట్లు బోధిసత్త్వుడు ఆకాశగంగను అవతరింపజేయు బుద్ధునివలె ఉపదేశ మిచ్చిన పిదప జను లాయనను సత్కరించి బహువిధముల సాధువాదము చేసిరి. రాజు సంతుష్టచిత్తుడై అమాత్యులను పిలిచి "అమాత్యులారా, ఎఱ్ఱని నేరేడుపండు వంటిముక్కు గల నా పుత్రుడు జంబుక పండితుడు చెప్పినది ఎవరికర్తవ్య మగును ?" అనెను. "దేవా, సేనాపతిది." "అగుచో ఈతనికి సేనాపతిపదవి నిత్తును" అని రాజు జంబుక పండితుని సేనాపతిపదవిలో నియోగించెను. నాటనుండి అతడు తండ్రిపనుపు నెరవేర్ప సాగెను. మూడు పిట్టలకును సమాదరము కలిగెను. ముగ్గురును ధర్మార్థములను అనుశాసించిరి. బోధిసత్త్వుని యుపదేశానుసారముగా రాజు ప్రవర్తించుచు దానాది పుణ్యకార్యములు చేయుచు తుదకు స్వర్గగామి యయ్యెను. అమాత్యులు రాజునకు అపరకర్మలు చేసి పక్షులను పిలిచి, "స్వామీ, జంబుకపండితోత్తమా ! రాజు మీకు రాజ్యాధికారము ఈయవలసిన దని చెప్పినారు" అని విన్నవించిరి. బోధిసత్త్వుడు "నాకు రాజ్యముతో పనిలేదు. మీరు అప్రమత్తులై యుండి పరిపాలనము చేయుడు" అని, లోకులను శీలముల యందు ప్రతిష్ఠించి, ఇట్లు న్యాయముగా నడుచుకొనుడు అని, న్యాయధర్మములు బంగారుపట్టికపై వ్రాయించి అడవిలోని కెగిరిపోయెను. ఆయన యుపదేశము 40 వేల సంవత్సరముల వరకును నడచెను.

శాస్త రాజు కుపదేశము చేయు రీతిపై ఈ ధర్మోపదేశనము చేసి రెండు జాతకములు సరిపోల్చెను. ఆ కాలమున రాజు ఆనందుడు; కుండలిని ఉత్పలవర్ణ; వేస్సంతరుడు సారిపుత్రుడు; జంబుకపక్షి నేనే.

— (o) —